# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com.
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

### Scriptures, Slokas and Stotras

Adi Sankaracharya
Aditya
Adwaitam
Ayyappa
Bhagavad Geetha
Bammera Pothana
Bhagavatam
Brahma Sutras
Durga
Dattatreya
Ganesh
Gayatri
Guru
Hanuman
Hindu Marriage System
Krishna
Lakshmi
Mahabharat
Mantrapushpam
Narada Bhakti Sootralu
Nava Grahas
Patanjali Yoga Sootralu
Raghavendra
Rama
Ramayanam
Rama Geeta
Saraswathi
Sandharbha
Satya Sai
Shirdi Sai
Siva
Slokas with meaning
Subrahmanya
Suktas
Sundara Kanda
Venkatesa
Vishnu
Vratas
Upanishads
Rigveda
Samhitaanuvadam
(Yoga Paranga)
Vyasa Bhagavatam

### General

Appeal and Objectives
Bala Basha
Bhakti Celebrities
Bhakti Classicals
Bhakti Links
Book Reviews
Jeji Mamayya Patalu
Chatuvulu
Dasa Mudrani
Divine Guidance of Satya Sai
Kavitha Kadambam
Keerthanalu
Koonalamma Padalu
Prasnalu - Javaabulu
Naturopathy
Rishi Vani
Sai Krishna's Art
Satakalu
Swamiji
Tatvalu
Telugu Special
Useful Links
Value Education
Web Hunt
Hindu Cultural
Questions & Answers
Yoga
Yoga Mudralu Bandhalu
Yogasanas (Detailed)

### Downloads

Audio Downloads
Bhakti Screen Savers
Printer Friendly Page

**Pravachanaalu**

Bhaja Govindam
Bhasmo Dhulita Vigrahaya
Karma Siddhantam
Class Prayers
Kenopanishad
Sri Narasimha Charitram
Soundarya Lahari
Ramana Saranagathi
Vivekachoodamani

**Specials**

Annamayya Pada Visleshana
Monthly
Satsang
Chinna Kathalu
Class Prayers
Human Relations
Nadiche Devudu
Stories of Alwars
Stories of Bhaktas
Stories of Indian Sages
Stories of Nayanars
Sankara Vangmayamu
Special Articles
Hinduism and Mantras
Personality Development

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# Vyasa Bhagavatam

in Telugu by



Sri. M.V.Subrahmanyam,B.A.,B.G.L.,
Former Registrar AP High Court,
2-31 Chaitanyapuri Colony,
Hyderabad 500060
South India
Phone No.24048104
Mobile: 9866140619

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

## భగవాన్ శ్రీ వేదవ్యాసమహర్షి

సరళమైన తెలుగు వ్యాఖ్య

యం.వి.సుబ్రహ్మణ్యం
రిటైర్డు హైకోర్టు రిజిస్ట్రార్
2-31, సత్యనారాయణపురం,
చైతన్యపురి కాలనీ, హైదరాబాద్ 500060
ఫోను:040-24048104 సెల్: 9391134792

# ముందు మాట.

•••

మహాభాగవత పురాణము అత్యంత ప్రాచీనమైనది. భాగవతము భక్తి రస ప్రధానమైన కావ్యము. ఇందులో భక్తి గురించి, విష్ణుమూర్తి అవతారముల గురించి, హిందూ సంస్కృతీ సంప్రదాయములలో ఉన్న అనేక రాజుల కథల గురించి చెప్పబడింది. ప్రధానంగా శ్రీ కృష్ణుని అవతార విశేషములు అన్నీ దశమస్కంధములో వివరంగా చెప్పబడ్డాయి.

సంస్కృతములో ఈ పురాణ మును భగవాన్ వేదవ్యాసుడు రచించాడు. ఇందులో 18,000 శ్లోకములు 12 స్కంధములుగా విభజించబడ్డాయి. ఈ పురాణము 19 వశతాబ్దములో ఇంగ్లీషు ఫ్రెంచి భాషలలోకి తర్జుమా చేయబడింది.

భాగవతము రాయబడిన కాలము గురించి తెలుసుకోవడం అంత సులభం కాదు. ఇది మహాఋషులనుండి గురుశిష్యపరంపరగా శతాబ్దముల పాటు అభివృద్ధి చెందింది. కాని కొంతమంది పరిశోధకులు భాగవతము రాసిన కాలమును క్రీ.పూ.3072 గా నిర్ణయించారు. కాని మనకు ప్రస్తుతము లభ్యము అవుతున్న భాగవతము క్రీ.శ.9,10 శతాబ్దములలో రాయబడినది అని పండితుల అభిప్రాయము. కాలక్రమేణా ఎన్ని మార్పులు చేర్పులు జరిగినా మూల భాగవతము మాత్రము వేదవ్యాసుని చే రాయబడినది అని ప్రతీతి.

భగవంతుని అవతారములలో శ్రీ కృష్ణావతారము విశిష్టమైనది. ఆ కృష్ణావతారము గురించి దశమస్కంధములో విపులంగా చెప్పబడింది. భాగవత గ్రంథములో ఈ భాగము దాదాపు నాలుగవ వంతు ఉంటుంది.

ఈ భాగవత కథను వ్యాసుని కుమారుడైన శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెప్పాడు. ఒక ముని శాపవశమున అర్జునుని మనుమడు, అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తు మహారాజు ఏడు దినములలో మరణిస్తాడు. ఆ ఏడుదినములు సత్కథా కాలక్షేపములో గడపవలెనని నిశ్చయించుకుంటాడు పరీక్షిత్తు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన శుక మహర్షిని తనకు విష్ణుకథలను గూర్చి చెప్పమంటాడు. అప్పుడు శుక మహర్షి తనకు తన తండ్రి వేదవ్యాసుడు బోధించిన భాగవత కథామృతమును పరీక్షిత్తుకు వినిపించాడు.

నైమిశారణ్యంలో శౌనకుడు మొదలగు మహర్షులు సత్ర యాగము చేసారు. ఆ సందర్భంలో ఉగ్రశ్రవసుడు అనే సూత పౌరాణికుడు భాగవతమును శౌనకుడు మొదలగు మహాఋషులకు చెప్పాడు. ఆ ప్రకారంగా భాగవతము జనబాహుళ్యానికి పరిచయం అయింది.

కాబట్టి మహాభారతము మాదిరి భాగవతము కూడా మూడు దశలలో విస్తరించింది. మొదటికి వేదవ్యాసునిచే రాయబడింది. తరువాత శుకయోగీంద్రులచే పరీక్షిత్తుకు చెప్పబడింది. తరువాత సూతపౌరాణికుని చేత శౌనకాది మహామునులకు చెప్పబడింది.

భాగవతము కేవలం భక్తి ప్రాధాన్యమైన గ్రంథము. ఇందులో వివిధరకాల వ్యక్తులు, వివిధ రకాల భక్తిమార్గాలను అనుసరించారు. వాటిని విపులీకరించాడు వ్యాసుడు. ప్రస్తుతము మనందరి దృష్టిలో భక్తి అంటే ప్రతి రోజూ దేవాలయమునకు వెళ్లడం, రోజుకో దేవుడికి పూజలు చెయ్యడం, కొబ్బరికాయకొట్టడం, మహానివేదన చెయ్యడం, అడ్డ బొట్టు నిలువు బొట్టు ప్రస్ఫుటంగా పెట్టడం, స్వామికి నగలు, కిరీటాలు చేయించడం, బిందెల కొద్దీ పాలు అభిషేకాలు

చెయ్యడం, మైకులు పెట్టి పెద్దగా పూజలు భజనలు చెయ్యడం, మేమే ఫలానా పూజలు చేస్తున్నాము అని పత్రికలలో, ఛానళ్లలో ప్రచారం చేసుకోడం. ఇంకా ఇలాంటివి ఎన్నో ఉన్నాయి. ఇటీవల ఒక పత్రికలో చదివాను. మనదేశంలో కొన్ని వేల కోట్లరూపాయల వ్యాపారం భక్తిపేరుమీద జరుగుతూ ఉంది అని. అంటే భక్తిని వ్యాపారానికి ముడి సరుకును చేసారు మన భక్తులు.

భక్తి అంటే ఇది కాదు. పైన చెప్పినవి అన్నీ మన గురించి మన భక్తి గురించి ఇతరులకు తెలియచెప్పడానికి మనం పడే ఆరాటమే కాని వేరు కాదు. అసలు భక్తి అంటే ఏమిటి అనే విషయం కొన్ని వేల ఏళ్ల కిందట వ్యాసుడు విపులంగా చెప్పాడు. మనకు భాగవతము చదవడానికి కానీ, వినడానికి కానీ ఓపిక తీరిక లేవు. మనకు తెలిసిందే వేదము అనుకుంటూ ఉంటాము. అసలైన భక్తి అంటే ఏమిటో వ్యాసుడు భాగవతము ద్వారా మనకు తెలియపరిచాడు.

భక్తికి కావాల్సింది నిర్మలమైన మనస్సు, స్వచ్ఛమైన అంతఃకరణ. తాను నమ్మిన దేవుడి మీద అచంచల విశ్వాసము. నీవే తప్ప ఇతఃపరంబెరుగ అనే రీతిలో దేవుడికి పూర్తిగా అధీనమైపోవడం.. ఇదీ భక్తి అంటే. ఈ భక్తి మన మనసు అట్టడుగు పొరలలో నుండి రావాలే గానీ, పైన చెప్పిన ఆడంబరాల వల్ల రాదు. ఈ భక్తికి ధనం అవసరం లేదు. ఆర్భాటము అంతకన్నా అవసరం లేదు. కటిక పేదవాడి దగ్గరనుండి సంపన్నుడి వరకూ ఆచరించతగినది ఈ భక్తి.

భక్తి మనుషులలోనే కాదు, జంతువులలో కూడా ఉంటుంది అని స్పష్టంగా తెలియజేసాడు వ్యాసుడు. అదే గజేంద్రమోక్షము కథ. ఒక ఏనుగు తన కాలును మొసలి పట్టుకొని నీటిలోకి లాగుతుంటే తన శాయశక్తులా పోరాడింది. కాని లాభం లేకపోయింది. అప్పుడు నిర్మల మైన మనస్సుతో భగవంతుని ప్రార్థించింది. అప్పుడు భగవంతుడు వైకుంఠమునుండి భార్యకు

కూడా చెప్పకుండా దిగివచ్చాడు. ఏనుగును కాపాడాడు. కాబట్టి దైవభక్తి అనేది కేవలం మానవులకే కాదు జంతువులకు కూడా ఉంటుంది అని చెప్పడమే భాగవతము లోని గజేంద్రమోక్షము కథ.

మనలో కొంతమంది అంటుంటారు. "అప్పుడే నీకు ఈ దేవుడు, భక్తి, గుళ్లు, గోపురాలు ఏంట్రా హాయిగా లైఫ్ ఎంజాయి చెయ్యక. ఈ భక్తి అంతా రిటయిర్ అయిన తరువాత ఒలకపోద్దువుగానిలే" అని అంటూ హేళన చేస్తూ ఉంటారు. అప్పుడు మనకు ఒక సందేహము కలుగుతుంది. భగవద్భక్తి అనేది 60 ఏళ్లు దాటాక అవలంబించాలా లేక చిన్నప్పటినుండే భక్తి తత్పరత ఉండాలా అని. దానికి చక్కని సమాధానం మనకు భాగవతంలో ధృవుని కథలో కనిపిస్తుంది.

ధృవుడు ఒక రాకుమారుడు. 5 ఏళ్ల బాలుడు. తండ్రి తొడమీద కూర్చోనివ్వలేదని తల్లి అనుమతితో భగవంతుని మీద భక్తితో తపస్సు చేస్తాడు. తుదకు ధృవనక్షత్రమై నేటికీ ఆకాశంలో వెలుగుతున్నాడు. దీనివలన మనకు తెలిసిందేమిటంటే, భక్తికి వయో పరిమితి లేదు. ఏ వయసువారైనా భగవంతుని మీద భక్తి కలిగి ఉండవచ్చు అని. ఇదే విషయాన్ని భాగవతము కథారూపంగా తెలియ చెపుతుంది.

మనకు ఒక జాఢ్యము ఉంది. అదే కులవ్యవస్థ. ఒకే కులము వారు మాత్రమే పూజలు చెయ్యాలా లేక అన్ని కులముల వారూ పూజలు చెయ్యవచ్చా. కింది కులములవారు దేవుని మీద భక్తి కలిగి ఉంటే పాపమా. వారు పూజలు చేస్తే పాపమా. ఇవన్నీ మనకు మామూలుగా కలిగే సందేహాలు. దైవభక్తికి ఏ కులమూ జాతీ అడ్డురాదు. అందరూ దైవభక్తికి అర్హులు అని భాగవతము ప్రహ్లాదుని కథలో చాటి చెబుతుంది.

ప్రహ్లాదుడు రాక్షస రాజు హిరణ్యకశిపుని కొడుకు. కాని దైవభక్తి కలవాడు. ప్రహ్లాదుని తండ్రి హిరణ్యకశిపుడు రాక్షసుడు. దైవద్వేషి. తానే కాదు ఎవరూ దైవభక్తి కలిగి ఉండకూడదు అని శాసించాడు. కాని బాలుడైన ప్రహ్లాదుడు తండ్రి మాటను ధిక్కరించి దైవభక్తిను బాహాటంగా ప్రదర్శించాడు. ఎన్నో బాధలు పడ్డాడు. ఆఖరుకు ప్రహ్లాదుని రక్షించడానికి ఆ దైవము స్తంభము చీల్చుకొని వచ్చి ఆ రాక్షసుని చంపి, ప్రహ్లాదుని రక్షించింది. కాబట్టి దైవభక్తికి కులము, జాతి అడ్డుకావు అని భాగవతము మనకు బోధిస్తుంది.

తరువాత భాగవతములో చెప్పుకోదగ్గది ద్రేపల్లెలో ఉన్న గొల్ల పడుచుల మూఢభక్తి. వారికి కృష్ణుని మీద అచంచల మైన భక్తి ఉంది. ఎవరినీ లెక్కచెయ్యని భక్తి. సర్వం అర్పించుకున్న స్వార్ధరహిత భక్తి.

ఇంత వరకూ బాగానే ఉంది. కాని భాగవతంలో ఉన్న రాసలీలలు వర్ణన చూస్తే కొన్ని సందేహాలు కలగకమానవు. ఎందుకంటే శ్రీ కృష్ణుడు మధురా నగరికి వెళ్లేటప్పటికి ఆయన వయసు 10,11 ఏళ్లు. శ్రీకృష్ణుడు మధురానగరికి వెళ్లి, కంసుని చంపి, తల్లి తండ్రులను చెర విడిపించాడు. తరువాత ఉపనయనం చేసుకొని సాందీపుని వద్దకు విద్యాభ్యాసానికి వెళ్లాడు.

అంటే 10 ఏళ్ల వయసులో మధురకు వెళ్లిన కృష్ణుడు మరలా ద్రేపల్లెకు తిరిగి రాలేదు. ఈ రాసలీలలన్నీ 10 ఏళ్ల వయసులోనే జరిగాయి. 10 ఏళ్ల బాలుడు తన కన్నా వయసులో పెద్దవాళ్లు అయిన గోప కాంతలతో రాసలీలలు, రతికేళీ విలాసాలు సాగించడం సాధ్యమా! అన్న విషయం మన మనసులో మెదలక మానదు. కాని దీనికి గోపకాంతల భక్తి అని చెప్పడం తప్ప, శ్రీ కృష్ణుడు అవతార పురుషుడు కనుక ఏమైనా చెయ్యగలడు అని అనుకోడం తప్ప మరో

మార్గంలేదు.

కాని ఒక విధంగా ఆలోచిస్తే దీనికి పరిష్కారం దొరుకుతుంది. ఆనాడు కంసుడు రాజ్యపాలన చేస్తున్నాడు. తన చెల్లెలు దేవకీదేవికి పుట్టబోయే అష్టమ గర్భ సంజాతుడు తన మరణానికి కారకుడు అన్న విషయం ఆకాశవాణి చెప్పింది. అప్పటి నుండి కంసుడు వికల మనస్కుడు అయ్యాడు. ఇంతలో దేవకీదేవికి  అష్టమ గర్భం వచ్చింది. ఆడ పిల్ల పుట్టింది. నీ మారకుడు పుట్టి పెరుగుతున్నాడు అని చెప్పింది ఆకాశవాణి. దాంతో కంసుడి అహం దెబ్బతింది. అప్పటిదాకా పుట్టిన శిశువులందర్నీ చంపమని ఆదేశించాడు. ఆ పరిణామంతో శ్రీ కృష్ణుడితో ఆడుకోడానికి  సమవయస్కులు లేరు. అందరూ అతని కన్నా పెద్దవాళ్లే.

8,9 ఏళ్లప్పుడు శ్రీ కృష్ణుడు పగలంతా ఆవులను మేపడానికి వెళ్ళేవాడు. సాయంకాలానికి తిరిగి వచ్చే వాడు. వాళ్ల అమ్మ కృష్ణుడికి చక్కగా స్నానం చేయించి వేడి వేడిగా బువ్వ పెట్టి, చక్కగా అలంకరించేది. పట్టు బట్టలు కట్టుకొని తలలో పింఛము పెట్టుకొని ముద్దుగా తయారయ్యేవాడు.  ఆరోజుల్లో వెన్నెల మల్లెపూలు పూసినంత స్వచ్ఛంగా ఉండేది. ఆ వెన్నెలలో  కృష్ణుడి కన్నా వయసులో పెద్దవాళ్లు అయిన గోప కాంతలు, కృష్ణుడితో ఆడుకొనే వాళ్లు. వెన్నెల కుప్పలు, దొంగాట, మిట్టా పల్లాలు, చేతులు పట్టుకొని గిరా గిరా తిరగడం ఇలా ఎన్నో ఆటలు. కృష్ణుడు వ్రేపల్లె రాజు, నందుడి  కొడుకు. అందంగా ముద్దుగా ఉండేవాడు. కృష్ణుడు అంటే అందరికీ ముద్దు.  మా కన్నయ్య మా కృష్ణయ్య అంటూ ఆడుకొనే వారు. కృష్ణుని మధ్యలో నిలబెట్టి అమ్మాయిలు చుట్టు చేరి గొబ్బి తట్టడం, చప్పట్లు చరుస్తూ  చుట్టూ తిరగడం, కృష్ణుడు పారిపోబోతుంటే పరుగెత్తి పట్టుకోడం, ముద్దులు పెట్టుకోడం, కృ ష్ణుడు నావాడు అంటే నావాడు అంటూ ఒకరి నుండి ఒకరు లాక్కోవడం

చేసేవారు.  ఈ ఆటల్లో పసితనపు అమాయకత్వం, ఆటపాటలు తప్ప కామవాంఛలకు తావు లేదు.

కాని భాగవతము ఈ రూపంలో రావటానికి కొన్ని శతాబ్దాలు పట్టిందని చెప్పుకున్నాము కదా. ఈ మధ్య కాలంలో కొంతమంది శృంగార పిపాసకులకు భాగవతంలో కాస్త శృంగార రసం కూడా జొప్పించాలని అనిపించిందేమో. గోపికలు కృష్ణుడు ఆడుకునే ఘట్టాలను రాసలీలలుగా మార్చి ఉండవచ్చు. ఎందుకంటే  భాగవతంలో ఇంకెక్కడా  భారీ ఎత్తున శృంగార రసాన్ని జొప్పించడానికి అవకాశం లేదు కాబట్టి.  శతాబ్దాల కాలం పాటు అనేక మార్పులకు చేర్పులకు లోనైన భాగవతంలో ఇలా జరగడానికి అవకాశం లేదు అని చెప్పలేము కదా.

ఇంకొక విషయం. జయదేవుని గీతా గోవిందంలో, లీలాశుకుని కృ ష్ణకర్ణామృతంలో రాధ ప్రముఖ పాత్ర వహించింది. కానీ కృష్ణచరిత్రను లోకానికి తెలియజేసిన భాగవతంలో అసలు రాధ అనే పేరుగాని, అలాంటి వ్యక్తి గానీ లేరు.  కాని రాధాకృష్ణుల రాసలీలలు మనకు సుపరిచితము. కాబట్టి భాగవతంలో ఈ శృంగార రస పోషణ తరువాతి పరిణామము అని చెప్పుకోవచ్చు.

నాడు, నేడు,  సమస్యాత్మకంగా మారిన సామాజిక విషయాలను భాగవతంలో చిన్ని చిన్ని కథల రూపంలో తెలియజేసారు. అందులో కాళీయ మర్దనం, గోవర్ధన పర్వత ఉద్ధరణ ఉన్నాయి. కాళీయమర్దన కథ తీసుకుంటే, కాళీయుడు ఒక సర్పము. యమునా నదిలో  ఉన్న మడుగులో నివాసం ఉండేవాడు. సర్పము కాబట్టి విషం చిమ్ముతూ ఉండేవాడు. ఆ విషంతో కలుషితమయిన నీటిని తాగి పశువులు చనిపోయేవి. పశుల కాపరులు అస్వస్థత

పాలయ్యేవారు. అందుకని కాళీయుని తలమీద ఎక్కి మర్దించి శిక్షించాడు కృష్ణుడు. "ఇక్కడ ఉండవద్దు, నీవలన నీరు కలుషితం అవుతూ ఉంది. వెంటనే సముద్రానికి వెళ్లు" అని ఆదేశించాడు.

ఈ కథనే నేటికి అన్వయించుకోవచ్చు, కాళీయుడు అనే సర్పాన్ని నేడు విషవాయువులను విరజిమ్మే కర్మాగారాలతో, విషవ్యర్థాలను చెరువులలోకి, కుంటలలోకి వదిలే రసాయన పరిశ్రమలతో పోల్చవచ్చు. దానివలన భూగర్భ జలాలు కలుషితం అవుతున్నాయి. ప్రభుత్వాలు (అంటే కృష్ణుడు) ఆ పరిశ్రమలను మూసివెయ్యాలని ఆదేశాలిచ్చాయి. కొస మెరుపు ఏమంటే ఆనాడు కృష్ణుని ఆజ్ఞ పాలించి కాళీయుడు సముద్రానికి వెళ్లాడు. కానీ ఈ నాడు ప్రభుత్వం ఇచ్చిన ఆదేశాలను కాళీయుడి లాంటి పరిశ్రమలు పట్టించుకోడం లేదు. ఈ వాతావరణ కాలుష్యం అంతం కావాలంటే మరలా కృష్ణుడు పుట్టాలేమో అని పిస్తూ ఉంది.

అలాగే గోవర్ధన పర్వతము ఎత్తిన కథ. యాదవులు అందరూ ఇంద్రుడికి ఉత్సవాలు చెయ్యాలని నిశ్చయించుకుంటారు. కృష్ణుడు అడ్డు తగిలాడు. మనకు రోజూ పండ్లు, కాయలు ఆకులు ఇచ్చేది, ఎన్నో చెట్లకు ఆలవాలమయినది గోవర్ధన పర్వతము. దానిని పూజించాలి గానీ ఎక్కడో ఉన్న ఇంద్రుని పూజించడం దేనికి దండగ.అని అంటాడు. ఈ ఘట్టము మనకు ప్రకృతి ని పూజించాలి. ప్రకృతిని కాపాడుకోవాలి, చెట్లు మనకు ప్రాణదాతలు, వాటిని నరకకూడదు. అని ప్రబోధిస్తూ ఉంది. అందమైన గృహాల నిర్మాణానికి కలపకోసం మనం అడవులను నరుకుతున్నాము. సెజ్ ల పేరు మీదుగా పచ్చని పంటపొలాలను పొగలు వెదజల్లే కర్మాగారాలుగా మారుస్తున్నాము. అభివృద్ధి పేరుతో మన వినాశనాన్ని మనమే కొని తెచ్చుకుంటున్నాము. తుదకు స్వచ్ఛమైన గాలీ, నీరూ దొరకని పరిస్థితులను ఆహ్వానిస్తున్నాము. 5000 వేల ఏళ్ల క్రితం కృ

ష్ణుడు బోధించిన ప్రకృతి పూజను మనం ఆచరించగలిగితే, ఆ ప్రకృతి మనలను సదా రక్షిస్తుంది.

అలాగే భాగవతంలో పూతన పాత్ర. పూతన తన గుండెల నిండా విషాన్ని నింపుకొని ఆ విషంతో నిండిన పాలను కృష్ణుడికి ఇవ్వాలని వస్తుంది. కృష్ణుడు పూతన స్తన్యము కుడిచి ఆమె పాలతో పాటు ప్రాణాలు సైతం హరిస్తాడు. గుండెల నిండా విషాన్ని నింపుకొని పైకి చిరునవ్వు నవ్వుతూ సమయం చూసి కాటేసేవాళ్లు మనలో ఎంతోమంది ఉన్నారు. వారందరూ పూతనలే. తియ్యటి మాటలతో దగ్గర చేరి, పుట్టిన బిడ్డలను పురిటిలోనే మాయం చేసే పూతనలకు కొదవ లేదు ఈ రోజుల్లో. ఆ పూతనల మాయలలో పడకుండా కృష్ణుని మాదిరి తెలివిగా వారి గుట్టు బట్టబయలు చెయ్యాలి కానీ వారి తియ్యటి మాటలకు లోబడి నష్టపోకూడదు, కాపురాలు నాశనం చేసుకోకూడదు.

అలాంటిదే కంసుని పాత్ర. కంసుడికి తెలివి లేదు. ఆలోచన అసలే లేదు. చెప్పుడు మాటలు వినే రకం. చెల్లికి పెళ్లిచేసి, చెల్లిని బావను అత్తారింటికి తీసుకెళుతున్నాడు. ఇంతలో ఆకాశవాణి నీ చెల్లికి పుట్టబోయే ఎనిమిదవ వాడు నీ మరణకారకుడు అని చెబుతుంది. అంతే చెల్లిని కిందికి లాగి చంపబోతాడు. పెళ్లి అయింది. శోభనం కూడా అయిందోలేదో తెలీదు. అయినా, ఏడుగురు పుట్టాలి. ఆ తరువాత పుట్టిన ఎనిమిదవ వాడు తనను చంపుతాడు. అంటే ఎప్పుడో ఎనిమిదేళ్లనాటి మాట. ఆ ఆలోచన అస్సలే లేదు కంసుడికి. వెంటనే చెల్లిని చంపబోయాడు. ఇలాంటి వాళ్లు మనకు కోకొల్లలు. "ఏంబ్రదర్! మీ ఆవిడ ఎవరి వెనకో బైక్ మీద వెళుతుంటే చూచాను" అని అంటే వెంటనే భార్యను అనుమానించి తన్ని తగలేసే పురుష పుంగవులు ఎంతో మంది మనలో ఉన్నారు. వీరంతా చెప్పుడు మాటలు విని చెడిపోయే కంసుడి లాంటి వాళ్లు. ఎవడో ఏదో చెప్పిన వెంటనే నిర్ణయాలు తీసేసుకొని కాపురాలు కూలగొట్టు

కుంటారు.

ఇలా భాగవతంలో ప్రతి పాత్రా మన దైనందిన జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు మనకు తారసపడుతూ మనకు నీతిని బోధిస్తుంటుంది.

భాగవత పురాణము మనకు భక్తి తత్వమును, నీతిని బోధించినట్టు శాస్త్రవిషయములను కూడా అంతర్గతంగా బోధించింది అని కూడా చెప్పవచ్చును. శాస్త్ర విజ్ఞానం బాగా అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో కూడా కొంత మంది భూమి చదునుగా ఉందని నమ్ముతున్నారు. అలాగే మొట్ట మొదట మానవులు యదాతథంగా పుట్టారు అని, వారే మొదటి మానవులు అనీ వారి నుంచి మానవాళి ఆవిర్భవించింది అనీ నమ్ముతున్నారు. డార్విన్ మహాశయుడు ప్రతిపాదించిన పరిణామ సిద్ధాంతాన్ని కూడా వీరు నమ్మరు. కాని వేల సంత్సరాల కింధట రాయబడ్డ భాగవతములో ఈ పరిణామ సిద్ధాంతం సూత్ర ప్రాయంగా చెప్పబడింది, అదీ కథల రూపంలో చెప్పబడింది అంటే అతిశయోక్తి కాదు.

ఎలాగంటే.... ఈ అనంత విశ్వంలో ఎన్నో నక్షత్రాలు, పాలపుంతలు, గ్రహాలు, ఉపగ్రహాలు, ఉల్కలు, తోకచుక్కలు, ( ఇవే మనకు తెలిసినవి. తెలియనివి ఇంకా ఎన్ని ఉన్నాయో) లెక్కకు అందనివి ఎన్నో ఉన్నాయి. అలాగే విశ్వంలో ధూళి కూడా అపరిమితంగా ఉంది. ఆ ధూళి అంతా గిరా గిరా తిరుగుతూ ఘనీభవించి భూమిగా పరిణామం చెందింది. కొన్ని లక్షల సంవత్సరాలు గడిచిన తరువాత కొన్ని రసాయనిక చర్యల వలన భూమి మీద జలం ఆవిర్భవించింది. భూమి మీద మూడు వంతులు జలంతో నిండి పోయింది. అవే మహాసముద్రాలు, అఖాతాలు, నదులు మొదలగునవి.

ఆ నీటిలో మొట్టమొదటగా ఏకకణజీవి ఆవిర్భవించిది. అదే మొదటి జీవి. అది వృద్ధిచెంది, కోటాను కోట్ల జలచరాలుగా వృద్ధిచెందాయి. ఆ జలచరముల ఆవిర్భావమే మత్స్యావతారము. మనకు సులభంగా అర్థం కావడానికి దానికి ఒక కథ చెప్పారు.

కోట్లసంవత్సరాలు అలా జలములో ఉన్న జలచరాలు నెమ్మదిగా భూమి మీదికి రాసాగాయి. కొంచెం సేపు భూమి మీద అటూ ఇటూ తిరిగి, తరువాత జలాల్లోకి పోతూ ఉన్నాయి. ఇలా నీటిలో పుట్టిన జలచరం కాస్తా ఉభయ చరము అయింది. అదే కూర్మావ తారము. అప్పుడే ప్రకృతి భూచరములకు స్వీయ రక్షణ కల్పించింది. అదే తాబేలు మీద ఉన్న డిప్ప. తాబేళ్లకు శత్రువులనుండి రక్షణ కల్పిస్తుంది.

ఈ ఉభయ చరాలు కోటాను కోట్లు ఉన్నాయి. అలా భూమి మీధ, నీటిలోనూ నివసించిన ఉభయ చరాలు, భూమి మీదనే నివసించడం మొదలెట్టాయి. నీటిలోకి పోవడం మానేసాయి. అదే వరహావతారము. భూచరమునకు ప్రతీక వరాహము. నాలుగు కాళ్ల జీవి.

ఆ భూచరములు గా మారిన జీవులు ఆహారం గా ఆకులు అలములు తినసాగాయి. కింద ఉన్న ఆకులు అయి పోయాయి. ఎత్తుగా ఉన్న చెట్ల ఆకులు అందుకోడానికి తమ ముందు కాళ్లు పైకెత్తి అందుకోసాగాయి. అలా అలా వేలకొద్దీ సంవత్సరాలు ముందు కాళ్లు పైకెత్తి ఆకులను, కాయలను పండ్లను కోయడం తినడం అలవాటు చేసుకున్నాయి. క్రమేణా వెనక కాళ్ల తో నడవడం, ముందు కాళ్లను చేతులుగా ఉపయోగిస్తూ పనులు చేసుకోడం మొదలెట్టాయి. కాని తల మాత్రం మృగ లక్షణాలు కోల్పోలేదు. తల దాకా మానవాకృతి, తల మాత్రం మృగం. ఇదే నారశింహావతారము. దానికి ఒక కథ.

కాల క్రమేణా తల కూడా మానవత్వాన్ని సంతరించుకుంది. తరువాత మానవుడు ఎన్నో విషయాలు కనుక్కున్నాడు. జీవితం సుఖమయం చేసుకున్నాడు. కాని కొంతమంది తమ తెలివి తేటలను వినియోగించుకోకుండా మూఢులుగానే మిగిలిపోయారు. మానవుడు శిశు ప్రాయంనుండి సంపూర్ణ మానవుడిగా మారాలి అనే సందేశాన్ని మనకు ఇచ్చింది వామనావతారము. మొదట భూమికి మూడు అడుగుల ఎత్తులో ఉన్న బుడతడు, తరువాత త్రివిక్రముడయ్యాడు. మానవుడు అలా పరిణామం చెందాడు అని వామనావతారము మనకు చాటి చెప్పింది.

తరువాత మనకు మూడు అవతారాలు...మనిషి అవతారాలుగా కనిపిస్తాయి. అవే పరుశురామావతారము,రామావతారము,కృష్ణావతారము.

ప్రతి మానవునికి మూడు గుణాలు ఉంటాయి. అవే సత్వగుణము. రజోగుణము, తమోగుణము. ఈ గుణాలే ఈ అవతారాలుగా మూర్తీభవించాయి.

సత్వగుణ ప్రధానము రామావతారము. రాముడు సాత్వికుడు. సకలగుణాభిరాముడు. కాని పరశురాముడు రజోగుణ ప్రధానుడు. పుట్టుకతో బ్రాహ్మణుడయ్యు, అస్త్ర శస్త్రములను పట్టి, క్షత్రియజాతిని సమూలంగా నాశనం చేసాడు. తరువాత ఉన్నది తమోగుణము. కాని కృష్ణుడు తమోగుణ ప్రధానుడు కాదు. సత్వ,రజస్, తమోగుణముల కలయిక. పరిపూర్ణ మానవుడు. మానవుడు అంటే ఇలా ఉండాలి అని లోకానికి చాటిచెప్పినవాడు. కృష్ణుడు సాత్వికుడు. ఎవరితోనూ పరుషంగా మాట్లాడడు. రజోగుణం కలవాడు. అవసరం అయితే చక్రాయుధంతో శిశుపాలుడిని, ఇంకా నరకుని, కంసుని వధించినట్టు వధించగలడు. బాల్యంలోనే అనేక మంది రాక్షసులను

నిర్దాక్షిణ్యంగా వధించాడు. రజోగుణము కృష్ణునిలో అలా ప్రకటితమయింది. తరువాత తమోగుణము. శృంగార రస ప్రధానము. ఎనిమిది మందిభార్యలు, పదహారు వేల మంది ఇతర భార్యలు, వారికి కుమారులు, మనుమలు, ముని మనుమలు.

ఇంకా కృష్ణుడు వేదములను ఉపనిషత్తులను ఔపోసన బట్టినవాడు. అనితర సాధ్యమైన గీతను లోకానికి అందించాడు. అదీ కాకుండా గొప్ప రాజనీతిజ్ఞుడు. ఈ ప్రకారంగా మానవుడు పరిపూర్ణమానవుడుగా పరిణామం చెందాడు అని మనకు భాగవతము అంతర్లీనంగా పరిణామ సిద్ధాంతాన్ని లోకానికి తెలియజేసింది అని అనడంలో అతిశయోక్తి లేదేమో.

అర్థం చేసుకోవాలే గాని భాగవతంలో ఏ విషయం తీసుకున్నా అది సందేశాత్మకమే కాని వృధాగా ఏ విషయమూ చెప్పబడలేదు. ఆఖరుగా ఒక్క విషయం చెప్పి సెలవు తీసుకుంటాను.

గజేంద్రమోక్షము ఘట్టంలో, వ్యాసుల వారు చెప్పిన శ్లోకములను ఒక అద్భుతమైన పద్యంగా రాసారు పోతన గారు. ఆ పద్యమే మాకు రెండవ తరగతినుండి ఐదవ తరగతి వరకూ ఉదయం ప్రార్థనా పద్యంగా ఉండింది.

మామూలుగా మనకు ఎమ్సెట్ పరీక్షలు నిర్వహిస్తారు. పరీక్షలు అయిన తరువాత దానికి కీ ఇస్తారు. అలాగే పోతన గారు తన పద్యంలో ఏడు ప్రశ్నలు మానవాళికి సంధించారు. ఏనాటికీ దానికి సమాధానాలు ఈ మానవులకు తెలియవని, దానికి కీ కింద ఇచ్చాడు.

అదేమిటో ఇప్పుడు చూద్దాం.
1.ఎవ్వని చే జనించు జగము?

2.ఎవ్వని లోపల నుండు లీనమై?

3.ఎవ్వని యందు డిందు?
( డిందుఅంటే లయం కావడం అంటే ఈ జగత్తు ఎవనితో లయం అవుతుంది?)

4.పరమేశ్వరుడెవ్వడు?

5.మూలకారణంబెవ్వడు?

6.అనాది,మధ్యలయు డెవ్వడు?

7.సర్వము తాను అయిన వాడెవ్వడు?

ఇవి ఏడు ప్రశ్నలు. సులభంగా అర్ధం అయ్యే ప్రశ్నలు. వీటిలో అర్ధంకాని పదం ఒక్కటి కూడా లేదు. కాని, ఈ ప్రశ్నపత్రమునకు ఇప్పటి దాకా ఎవరూ సక్రమంగా సమాధానాలు రాసిన వాడు లేడు. ఎన్ని యుగాలు గడిచినా ఈ మానవులకు సరియైన సమాధానము దొరకదని తెలిసీ పోతన గారు దాని కిందనే కీ ఇచ్చారు.

వానిన్.........

# ఆత్మభవున్, ఈశ్వరున్

శరణంబు వేడెదన్.

పరమాత్మ స్వరూపాన్ని, స్వభావాన్ని మనకు కళ్లకు కట్టినట్టు విశధీకరించారు వ్యాసుడు, పోతన. ఈశ్వరుడు ప్రతిమనిషిలోనూ ఆత్మ స్వరూపుడుగా ఉన్నాడు. దేవుడిని వెతుక్కుంటూ మనం ఎక్కడికీ పోవాల్సిన అవసరం లేదు. ఆ దేవుడు గొప్ప ఈ దేవుడు ఇంకా గొప్ప అని దేవుళ్లలో తరతమబేధాలు కల్పించడం మన అవివేకము. మనలో ఉన్న ఈశ్వరుడు...(ఆత్మ) పరిమిత చైతన్యము. పరమేశ్వరుడు విశ్వ చైతన్యము. అందరిలో ఉండే చైతన్యమే మనలో ఉంది. అందరి హృదయాలలో ఈశ్వరుడు ఆత్మభవుడై ఉన్నాడు. మనము ఇతరులను ద్వేషిస్తున్నాము అంటే వారిలో ఉన్న ఈశ్వరుడిని ద్వేషించడమే. ఈ పరమార్థము ఇంకా కొన్ని యుగాలు గడిచినా మానవులకు అర్థం కాదు. అర్థం అయితే, ఒకరి మీద ఒకరికి ద్వేషము, కోపము, ఒకరిని ఒకరు మోసగించుకోడం, చంపుకోడం, హింసించుకోడం, మచ్చుకైనా కనపడవు. సర్వమానవ సౌభ్రాతృత్వము వర్ధిల్లుతుంది.

భాగవతము చదివి అందరూ అలా పరిణామం చెందాలని మనసారా ఆకాంక్షిస్తూ............

భవదీయుడు

మొదలి వెంకట సుబ్రహ్మణ్యం.

# శ్రీమద్భాగవతమహాత్మ్యము

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

## మొదటి అధ్యాయము

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు భాగవత మహాత్మ్యమును ఈ విధంగా వర్ణిస్తున్నాడు.

శౌనకుడు సూత పౌరాణికుని ఇలా అడిగాడు. "భక్తితోనూ, జ్ఞానము తోనూ, వైరాగ్యముతోనూ మానవునిలో వివేకము ఏ విధంగా వృద్ధి చెందుతుంది వివరించండి. లోకంలో సత్వ,రజస్తమోగుణము లతో కూడిన విష్ణుమాయ ఆవరించి ఉంది కదా! విష్ణుభక్తులు ఏ ప్రకారంగా ఈ మాయను దానివలన కలిగే మోహమును అధిగమిస్తారు. పైగా ఈ కలికాలంలో మానవులు ఎక్కువగా అసుర స్వభావము, రాక్షస ప్రవృత్తి కలిగి ఉంటారు. నానా రకములైన బాధలతో దు:ఖములతో కుంగి పోతుంటారు. వాటిని దాటే ఉపాయమే లేదా! ఈ జీవుల మనసులను పరిశుద్ధము చేసే ఉపాయము ఏదైనా ఉందా! ఆ పరమాత్మ అయిన శ్రీకృష్ణుని పాదములను పొందడానికి అన్నిటి కంటే సుఖమైన, పవిత్రమైన, శాశ్వతమైన ఉపాయము ఒకటి నాకు తెలియజేయండి. మీరు మాకు గురువులు. చింతామణి అనే మణి కోరుకున్నసుఖాలు ఇస్తుంది. కల్పవృక్షము స్వర్గసుఖాలను ఇస్తుంది. కాని మీ వంటి గురువు మాకుమోక్షమును మార్గము సుగమం చేస్తాడు." అని అడిగాడు.

అప్పుడు సూతుడు ఇలా చెప్పసాగాడు. సూతుడు శౌనకునితో ఇలా అన్నాడు. "బ్రాహ్మణోత్తమా! నీ హృదయములో భగవంతుని మీద అపారమైన ప్రేమ ఉంది. ఆ కారణంగానే ఇటువంటి ప్రశ్నలు అడుగుతున్నావు. నాకు చాలా ఆనందంగా ఉంది. మానవులకు జననము, మరణము ఇవే ఎక్కువ భయాన్ని కలిగిస్తాయి. ఆ భయాన్ని పోగొట్టే మార్గమును నీకు వివరిస్తాను. మానవునిలో భక్తి భావమును వృద్ధి చేసి, పరమాత్మను చేరుకొనే ఉపాయము నీకు చెబుతాను సావధానంగా విను.

పూర్వము వ్యాసుడు భాగవత పురాణమును రచించాడు. దానిని తన కుమారుడు అయిన శుక మహర్షికి చెప్పాడు. శుక మహర్షి వలన భాగవత పురాణము లోకములో వ్యాప్తి చెందింది. మనస్సు శుద్ధి కావాలంటే ఈ భాగవతపురాణము కంటే మంచి సాధనము మరొకటి లేదు. కేవలం పూర్వజన్మ పుణ్యము ఉంటేనే భాగవత పురాణము వినే భాగ్యము కలుగుతుంది.

వ్యాసుని కుమారుడైన శుకుడు ఈ భాగవత పురాణమును పరీక్షిత్ మహారాజుకు వినిపించడానికి సిద్ధంగా ఉండగా, దేవతలు అమృత కలశముతో అక్కడకు వచ్చారు. వారు శుక మహర్షితో ఇలా అన్నారు.

"మహాత్మా! ఈ అమృత కలశమును తీసుకొని మాకు ఆ భాగవత కథామృతమును మాకు ఇవ్వండి. ఈ అమృతమును పరీక్షిత్ మహారాజుకు ఇవ్వండి. ఆయన మృత్యువును జయిస్తాడు. తక్షకుడు

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

కాటు వేసినా ఆయన చావడు." అని అన్నారు.

శుకుడు తనలో తాను ఇలా ఆలోచించాడు. "భాగవతము మణి లాంటిది. దేవతలు తెచ్చిన అమృతము గాజుపూస. వీటికి రెండింటికీ సామ్యము ఎక్కడ!" అని అనుకున్నాడు. దేవతలతో ఇలా అన్నాడు.

"మీరు కేవలము అహంకారతో ఇక్కడకు వచ్చారు. మీకు భక్తి లేదు. కాబట్టి మీకు భాగవత కథను ఇవ్వను." అని అన్నాడు. ఆ కారణం చేత భాగవత కథ కేవలం మానవ లోకానికే పరిమితం అయింది. దేవతలకు అందుబాటులో లేదు.

తరువాత పరీక్షిత్ మహారాజు శుకుని వలన భాగవత కథను విని ముక్తి పొందాడు. అది విని బ్రహ్మదేవుడు ఆశ్చర్యపోయాడు. వెంటనే ఒక త్రాసును తెప్పించాడు. భాగవతమును ఒక పక్క, ఇతర మోక్ష సాధనములను ఒక పక్క వేసి తూచాడు. భాగవతము బరువుకు అవి వెలవెలబోయాయి. ఇది చూచి అక్కడ ఉన్న ఋషులు అందరూ ఆశ్చర్యపోయారు. ఈకలియుగంలో కేవలం భాగవతమును చదివినంత మాత్రమున మోక్షము వస్తుంది అని వారిలోవారు అనుకున్నారు. ఈ భాగవతమును సప్తాహము గా అంటే ఏడు రోజులపాటు వింటే మోక్షము వెంటనే వస్తుంది అని నమ్మారు.

పూర్వము ఈ భాగవత పురాణమును సనకుడు మొదలగు ఋషులు దేవర్షి నారదునికి చెప్పారు. అప్పటికే బ్రహ్మగారు నారదునికి భాగవత పురాణమును వినిపించాడు. కాని సప్తాహవిధిలో

సనకాదులు నారదునికి చెప్పారు." అని సూతి చెప్పగా, శౌనకుడు ఇలా అడిగాడు.

"భాగవతోత్తమా! నారదునికి, సనకాదులకు ఎలా కలిసింది. వారు ఎక్కడ కలుసుకున్నారు. భాగవతపురాణమును మరలావినాలనే కోరిక నారదునికి ఎలా కలిగింది. వివరంగా తెలియజేయండి." అని అడిగాడు. అప్పుడు సూతపౌరాణికుడు ఇలా చెప్పసాగాడు.

"ఒకనాడు విశాల పురి అనే ప్రదేశములో నలుగురు ఋషులు సత్సంగము చేస్తున్నారు. అప్పుడు నారదుడు అక్కడే ఉన్నాడు. నారదుని చూచి ఆ ఋషులు ఇలా అడిగారు.

"నారదా! నీ ముఖం ఎందుకో చింతాక్రాంతమై ఉంది. కారణం ఏమిటి? నీవు ఎక్కడి నుండి వస్తున్నావు? ఎక్కడికి ఇంత త్వరగా వెళుతున్నావు? నీ ముఖం చూస్తుంటే ఎంతో ధనం పోగొట్టుకున్న వాడి మాదిరి వెలవెలబోతూ ఉంది. నీ మనస్సు బాగా వికలమైనట్టు ఉంది. నీ వంటి వాడికి ఇలా ఉండటం ఉచితము కాదు. అసలు కారణం ఏమిటో చెప్పు?"అని అడిగారు. అప్పుడు నారదుడు వారితో ఇలా అన్నాడు.

"అన్ని లోకముల కంటే భూలోకము సర్వోత్తమము అని తలంచి నేను ఇక్కడకు వచ్చాను. ఎన్నో తీర్థములను దర్శించాను. పుష్కరము, ప్రయాగ, కాశి, నాసిక్, హరిద్వారము, కురుక్షేత్రము, శ్రీరంగము, సేతువు, మొదలగు తీర్థములలో తిరిగాను. కాని ఎక్కడా

నా మనసుకు శాంతి కలుగలేదు. ఎందుకంటే ఈ కలియుగంలో అధర్మం పెచ్చరిల్లి ధర్మానికి నిలువనీడలేకుండా పోయింది. ఈ కలియుగంలో సత్యము, తపస్సు, శౌచము (పరిశుభ్రంగా ఉండటం) దయ, దానము ఇవన్నీ మచ్చుకైనా కనపడటం లేదు. మానవులు అందరూ కేవలం తమ పొట్ట నింపుకోడానికే ప్రయత్నిస్తున్నారు. అబద్ధాలు చెబుతున్నారు. ఏ పనీ చేయకుండా సోమరులుగా ఉన్నారు.

వీళ్లకు బుద్ధి అసలు పనిచేయడం లేదు. వీరి మొహాన అదృష్టం అసలు రాయబడలేదు. వీరిని అన్నిరకాల కష్టాలు చుట్టుముడుతున్నాయి. పేరుకు సాధువులుగా, వైరాగ్యం పొందిన వారిగా  చెప్పుకుంటున్న వారు,  అనేక అకృత్యాలు, దుర్మార్గాలు చేస్తున్నారు.  ఆడవారి వద్ద నుండి ధనము అపహరిస్తున్నారు. ఇళ్లలో ఆడువారిదే పెత్తనంగా సాగుతూ ఉంది. వారి అన్నదమ్ములు అంటే యజమాని బావమరుదులే సలహాలు ఇస్తున్నారు.

కలియుగంలో మానవులు స్త్రీలను ధనానికి అమ్ముకుంటున్నారు. స్త్రీలు పురుషులు అకారణంగా తగవులాడుకుంటున్నారు. మహాత్ములు ఉండే ఆశ్రమములు, తీర్థములు, పుణ్యక్షేత్రములు దుర్మార్గుల అధీనంలో ఉన్నాయి. కొంత మంది దుర్మార్గులు ధనం కోసం దేవాలయములను ధ్వంసం చేసారు. కొల్లగొట్టారు. కలియుగంలో యోగులు, సిద్ధులు, జ్ఞానులు, మంచి పనులు చేసేవారు మచ్చుకైనా కనిపించడం లేదు. ఆత్మజ్ఞానము గురించి ఎవరూ సాధన చేయడం లేదు. పైగా ఈ భూమి మీద అందరూ అన్నము అమ్ముకుంటున్నారు. బ్రాహ్మణులు తాము నేర్చుకున్న వేదవిద్యను అమ్ముకుంటున్నారు. స్త్రీలు వేశ్యావృత్తిలో జీవిస్తున్నారు.

కలియుగంలో ఈ ఘోరాలు అన్నీ చూస్తూ నేను యమునా నదీతీరం చేరుకున్నాను. అక్కడ ఒక స్త్రీ విషాదంతో కూర్చుని ఉంది. ఆమె పక్కన ఇద్దరు వృద్ధులు నేలమీద పడుకొని ఉన్నారు. వారి ఒంటి మీద స్పృహ లేదు. వారి శ్వాస బరువుగా వస్తోంది. ఆ స్త్రీ ఏడుస్తూ వారికి సేవలు చేస్తూ ఉంది. వారికి స్పృహ తెప్పించడానికి శతవిధాలా ప్రయత్నం చేస్తూ ఉంది. ఎవరైనా వచ్చి తనకు సాయం చేస్తారా అని దిక్కులు చూస్తూ ఉంది. ఆమె చుట్టు కొంత మంది స్త్రీలు నిలబడి ఆమెకు విసన కర్రలతో విసురుతున్నారు. ఆమెను ఊరడిస్తున్నారు.

ఈ విషయం అంతా నేను దూరంనుండి చూచాను. వెంటనే ఆమె దగ్గరకు వెళ్లాను. నన్ను చూడగానే ఆమె లేచి నిలబడింది. నాతో ఇలా చెప్పింది.

“ఓ మహాత్మా! ఒక్క క్షణం ఆగండి. నా దు:ఖమును తొలగించండి. మీ దర్శనభాగ్యంతోనే లోకంలో ఉన్న అన్ని చింతలు నాశనం అవుతాయి అని అంటారు. మీ మాటలు నాకు కొంత ఉ పశమనమును కలిగిస్తాయి.” అని పలికింది.

అప్పుడు నారదుడు ఆమెతో ఇలా అన్నాడు. “ఓ దేవీ! నీవు ఎవరు? ఈ ఇద్దరు నీకు ఏమవుతారు. నీకు వింజామరలు వేస్తున్న ఈ స్త్రీలు ఎవరు? నీవు ఈ ప్రకారంగా దు:ఖించడానికి కారణం ఏమి? అన్ని వివరములునాకు సవిస్తరంగా చెప్పు.” అని అడిగాడు. అప్పుడు ఆ స్త్రీ నారదునితో ఇలా చెప్పసాగింది.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

"మహాత్మా! నా పేరు భక్తి. ఈ ఇరువురు వృద్ధులు నా కుమారులు. వీరి పేర్లు జ్ఞానము, వైరాగ్యము. కాల మహిమ చేత వీరికి ముసలి తనం ఆవహించింది. ఈ స్త్రీలు గంగ, యమున మొదలగు పుణ్యనదులు. నన్ను సేవించడానికి వచ్చారు. నాకు సుఖము శాంతి కరువయ్యాయి. నా గురించి చెబుతాను వినండి. నాకథ మీ అందరికీ తెలిసిందే. కాని మీరు వింటే నాకు మనశ్శాంతిగా ఉంటుంది.

నేను ద్రవిడదేశంలో పుట్టాను. కర్నాటకలో పెరిగాను. అన్ని ప్రదేశములలో గౌరవింపబడ్డాను. నాకు వృద్ధాప్యము వచ్చింది. ఇంతలో కలి యుగము ప్రవేశించింది. ఈ కలియుగంలో దుర్మార్గులు నన్ను ఛిన్నాభిన్నం చేసారు. నాకుమారులు నేను ఏ మాత్రం బలం లేని వాళ్లము అయ్యాము. శ్రీకృష్ణుడు సంచరించిన ఈ బృందావనములో ప్రవేశించిన తరువాత నాకు మరలా జవసత్వములు వచ్చాయి. కాని నా కుమారులు మాత్రము అలాగే ఉన్నారు. నేను ఇక్కడి నుండి మరొక ప్రదేశమునకు పోవాలని అనుకుంటున్నాను. కాని నా కుమారులు వృద్ధులు. వారిని విడిచి ఎక్కడకు పోలేకపోతున్నాను.

ఇప్పటిదాకా నేను, నా కుమారులు అందరము కలిసి మెలిసి ఉంటున్నాము. సాధారణంగా తల్లి వృద్ధురాలుగానూ, కుమారులు వయసులోనూ ఉంటారు. కాని మా విషయంలో అది విరుద్ధంగా ఉంది. మీరు చాలా వివేకులు, జ్ఞానులు. మాకు ఈ దుస్థితి దాపురించడానికి కారణం ఏమిటో తమరే తెలపాలి." అని అడిగింది. నారదుడు ఆమెతో ఇలా అన్నాడు.

"తల్లీ! నా దివ్యదృష్టిని ఉపయోగించి నీ దు:ఖమునకు కారణం తెలుసుకున్నాను. నీకు అన్నీశుభములు కలుగుతాయి. ఓ తల్లీ! నీ దు:ఖమునకు కారణం తెలిసింది. ఇది కలియుగము. కలియుగంలో సదాచారము, యోగము, తపస్సు, మొదలగునవి అన్నీ నశించి పోయాయి. మానవులు ఒకరిని ఒకరు మోసం చేసుకుంటున్నారు. కపటబుద్ధితో ఉన్నారు. మంచివారికి స్థానం లేదు. దుర్మార్గులు సుఖపడుతున్నారు. బుద్ధిమంతుడే ధైర్యంగా ఉంటున్నాడు. అతడే జ్ఞాని. భూభారము క్రమక్రమంగా పెరిగిపోతూ ఉంది. శుభములు అసలు కనపడటం లేదు. నీ కుమారులు కూడా దుర్బలులు అయ్యారు. నీ గురించి పట్టించుకోవడం లేదు. మానవులందరూ విషయవాంఛలతో గుడ్డివాళ్లయ్యారు. నీగురించి ఎవరూ తలచుకోవడం లేదు. ఆ కారణం చేత నీవు దినదినము క్షీణించిపోతున్నావు.

ఈ బృందావనములో శ్రీకృష్ణుడు సంచరించాడు. ఆ కారణం చేత నీవు ఈ బృందావనములో ప్రవేశించగానే, నీకు పూర్వపు యవ్వనము, జవసత్వములు వచ్చాయి. నీ రాకతో ఈ బృందావనములో భక్తి ప్రమత్తులు వృద్ధి చెందాయి. నీవు ఇక్కడ ఉండటం వలన ఈ బృందావనమే ధన్యం అయింది. మానవులలో భక్తి పెరుగుతూ ఉందే కానీ, జ్ఞానము వైరాగ్యము పెరగడంలేదు. అందుకే నీ కుమారులు ఈ ప్రకారంగా వృధ్యాప్యంతో బాధపడుతున్నారు. కాని వీరు నీ తోపాటు ఈ బృందావనములో ప్రవేశించడం వలన వీరి మనసుకు కొంచెం శాంతికలిగింది. అందుకే సుఖంగా నిద్రపోతున్నారు." అని అన్నాడు. అప్పుడు భక్తి అనే ఆ స్త్రీ ఇలా పలికింది.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

"దేవా! పరీక్షిత్ మహారాజు కలిని ఈ లోకంలో ఎందుకు ఉండనిచ్చాడు. ఈ కలియుగ ప్రవేశంతో మానవలోకం సర్వనాశనం అయింది. పైగా ఆ శ్రీహరి కూడా ఈ కలియుగంలో జరిగే అక్రమాలను అనర్థాలను చూస్తూ ఉన్నాడు కానీ ఏమీ చేయడం లేదు. దీనికి కారణం ఏమిటో నీవే చెప్పాలి." అని అడిగింది భక్తి. దానికి నారదుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"తల్లీ! ఎప్పుడైతే శ్రీకృష్ణుడు ద్వారకను వదిలిపెట్టి వైకుంఠమునకు వెళ్లిపోయాడో అప్పుడే కలియుగము ప్రవేశించింది. వెంటనే పరీక్షిత్ మహారాజు కలిని వెడలగొట్టడానికి ప్రయత్నించాడు కానీ కలి ఆయన శరణు వేడుకుంది. ఆ కారణంగా పరీక్షిత్ కలిని చంపకుండా వదిలిపెట్టాడు. కలియుగంలో జరిగే దుర్మార్గాలకు విరుగుడు శ్రీహరిని కీర్తించడమే. తపస్సు, యోగము, సమాధి వీటివలన వచ్చే ఫలములు అన్నీకేవలం శ్రీహరి సంకీర్తనము వలననే లభిస్తాయి. ఈ కలియుగము సారహీనమైనప్పటికీ, పరమాత్మ శ్రీహరి సంకీర్తనమును మానవులకు ప్రసాదించాడు. శ్రీహరి సంకీర్తనముతో ప్రజలు సుఖంగా ఉంటారు.

కాని ఈ మానవులు అందరూ చెడు కర్మలు చేస్తున్నారు. ప్రాపంచిక సుఖముల కొరకు పాకులాడుతున్నారు. ఈ భూమి మీద ప్రతి వస్తువు సారమును కోల్పోయింది. బ్రాహ్మణులు కేవలము ధనం సంపాదించడానికి భాగవత కథను అందరికీ వినిపిస్తున్నారు. ఆ కారణం చేత భాగవత మహాత్మ్యముకూడా అంతరించింది. ప్రతి దినము కామము, క్రోధము, లోభము, ఆశ, మొదలగు దుర్గుణములను ఆశ్రయిస్తూ, మానవులు నిలకడలేని మనసుతో

తపస్సులు చేస్తున్నారు. ఆ కారణం చేత తపస్సుకూడా తన ప్రభావాన్ని కోల్పోయింది.

మానవులకు వారి వారి మనస్సు వారి స్వాధీనంలో ఉండటం లేదు. ఎంత ధనం ఉన్నా లోభత్వము వారిని వదలడం లేదు. వారు డాంబికమును వదలడంలేదు. ఎవరూ శాస్త్రములను చదవడం లేదు. ధ్యానం చేయడం లేదు. ఆ కారణం చేత ధ్యానయోగ మహిమ కూడా అంతరించింది. పండితులు, జ్ఞానులు అని పిలువబడే వారు కూడా, కేవలము శారీరక సుఖమును ఆశించి, పశువుల మాదిరి ప్రతి దినము తమ తమ భార్యలతో రతికేళిలో మునిగితేలుతున్నారు. దాని మూలంగా సంతానము అపరిమితంగా వృద్ధిచెందుతూ ఉంది. కామవాంఛలు తీర్చుకోడంలో ఉన్న సామర్థ్యము మానవులు మోక్షమును సాధించడం లో చూపడం లేదు. దీనికి ఒకరిని నిందించి ప్రయోజనము లేదు. ఈ కలియుగ ప్రభావమే అంత. అందరూ కలి ప్రభావానికి లోబడి ప్రవర్తిస్తున్నారు. ఆ కారణం చేతనే పరమాత్మ కూడా చూస్తూ ఊరుకున్నాడు." అని నారదుడు అన్నాడు.

ఆ మాటలకు భక్తి ఆశ్చర్యపడింది. నారదునితో ఇలా అంది. "మహాత్మా! నా అదృష్టవశాత్తు తమరి దర్శన భాగ్యం నాకు లభించింది. తమరి ఉపదేశముతోనే కదా ప్రహ్లాదుడు ఈ మాయను జయించి శ్రీహరి కరుణను పొందాడు. బాలుడైన ధృవుడు కూడా తమరి ఉపదేశముతోనే కొలదికాలములోనే శ్రీహరి దర్శనభాగ్యమును పొందాడు. బ్రహ్మమానస పుత్రుడవైన నీకునమస్కారము." అని భక్తి నారదునికి నమస్కరించింది."

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

అని సూత పౌరాణికకుడు శౌనకాది మహామునులకు భాగవత మహాత్మ్యమును వివరించాడు.

పద్మపురాణము, ఉత్తరాఖండము

భాగవతమహాత్మ్యము మొదటిఅధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

పద్మపురాణము, ఉత్తరాఖండము

భాగవతమహాత్మ్యము

రెండవ మరియు మూడవ  అధ్యాయములు.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు భాగవత మహాత్మ్యమును వివరిస్తున్నాడు.

నారదుడు భక్తితో ఇలా అన్నాడు. "బాలా! నీవు అనవసరంగా దు:ఖపడుతున్నావు. నీవు దు:ఖించనవసరం లేదు. శ్రీకృష్ణభగవానుని పాదములు సేవించు. నీ దు:ఖము పోతుంది. శ్రీకృష్ణుడు వస్త్రాపహరణ సమయంలో ద్రౌపదిని రక్షించాడు. నిన్ను మాత్రం రక్షించడా! ప్రస్తుతము శ్రీకృష్ణుడు తన నిజనివాసము అయిన వైకుంఠమునకు వెళ్లాడు. నీవు భక్తివి. శ్రీకృష్ణుడు నిన్ను తన ప్రాణముల కంటే ఎక్కువగా ప్రేమిస్తాడు. నీవు పిలిస్తే భగవానుడు ఎక్కడికైనా వస్తాడు.

బాలా! కృతయుగము, త్రేతాయుగము, ద్వాపర యుగములలో జ్ఞానము, వైరాగ్యము ముక్తికి సాధనములుగా ఉండేవి. కాని కలియుగంలో కేవలం భక్తి మాత్రమే మోక్ష సాధనము అయింది. కలియుగంలో భక్తి ప్రాధాన్యతను తెలిసిన భగవానుడు తన శుద్ధసత్వస్వరూపముతో భక్తిని సృష్టించాడు. ఆ కారణం చేత నీవు శ్రీకృష్ణునికి అత్యంత ప్రియమైన దానవు.

నీకు గుర్తుందో లేదో! ఒకసారి నీవు చేతులు జోడించి "నేను ఏమి చెయ్యాలి?" అని నీవు అడిగినపుడు "నా భక్తులను పోషించు" అని భగవానుడు నిన్ను ఆజ్ఞాపించాడు. నీవు భగవానుడి ఆజ్ఞను స్వీకరించావు. ముక్తి కాంతను నీకు దాసిగా చేసాడు. జ్ఞానము, వైరాగ్యమును నీకు పుత్రులుగా ఇచ్చాడు. నీవు వైకుంఠము నుండి ఎల్లప్పుడూ నీ భక్తులను పోషిస్తున్నావు. తరువాత నీవు ముక్తిని, జ్ఞానము, వైరాగ్యములను వెంటబెట్టుకొని భూలోకమునకు వచ్చావు. నీ భక్తులను కరుణించడానికి భూలోకములో నీవు కేవలం ఛాయామాత్రంగా తిరుగుతున్నావు.

కృతయుగము నుండి ద్వాపర యుగము వరకు నీవు నిశ్చింతగా, సంతోషంగా ఉన్నావు. కలియుగము వచ్చింది. నీ దాసి అయిన ముక్తి కాంతను పాషండము అనే రోగము ఆవరించింది. ఆమె క్షీణించిపోయింది. ముక్తికాంత ఇక్కడ ఉండలేక నీ అనుమతితో వైకుంఠము వెళ్లిపోయింది. భూలోకంలో ఉన్న మానవులు నిన్ను స్మరిస్తేనే ముక్తి కాంత వారిని కరుణిస్తుంది. మరలా వైకుంఠము వెళ్లిపోతుంది. జ్ఞానము, వైరాగ్యము అనే నీ కుమారులు నీ వెంటనే ఉ న్నారు.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

కలియుగంలో ఎవరూ జ్ఞాన వైరాగ్యములను పట్టించుకోవడం లేదు. అందుకని వారు బలహీనులు అయ్యారు. వారిలో ఉత్సాహం నశించింది. దీని గురించి నీవు దిగులు పడవద్దు. వీరు మరలా ఉత్సాహం, బలం పుంజుకోవడానికి తగిన ఉపాయము నేను ఆలోచిస్తున్నాను.

ఓ బాలా! యుగములలో కలియుగముతో సమానమైన యుగము మరొకటి లేదు. నేను ఈ యుగములో అందరి ఇళ్లలో ప్రవేశించి వారిలో భక్తిభావాన్ని నింపుతాను. ఇతర పాషండ ధర్మములను అన్నిటినీ అణిచి వేసి, ప్రజలలో భక్తి భావాన్ని, కృష్ణ తత్వాన్ని నింపి, కలియుగములో నీకు (భక్తికి) ప్రాచుర్యము కల్పించకపోతే, నేను శ్రీహరి దాసుడనే కాను అని ప్రతిజ్ఞచేస్తున్నాను. అంతే కాదు ఈ కలియుగంలో ఎంతటి పాపాత్ములైనా సరే, భక్తిభావాన్ని కలిగి ఉంటే, వారిని శ్రీకృష్ణుడు అభయము ఇచ్చి,  కటాక్షిస్తాడు. ఎవరి హృదయములలో నిరంతరము శ్రీహరి మీద భక్తి ఉంటుందో, అటువంటి వారికి యమధర్మరాజు కలలో కూడా కనిపించడు. శ్రీహరి మీద భక్తి ప్రమత్తులు కలిగిన వారిని రాక్షసులు, భూత, ప్రేత, పిశాచములు,దైత్యులు కనీసం తాకనుకూడా తాకలేరు.

భగవానుడు తపస్సు చేత, వేదాధ్యనము చేతా, జ్ఞానము చేతా, సత్కర్మలచేతా వశుడవుతాడు. కాని మానవులకు ఎన్నోజన్మల సంస్కారం ఉంటేనే గానీ పరమాత్మ మీద భక్తికలుగదు. ఈ కలియుగంలో భక్తిని మించిన మోక్ష సాధనము మరొకటి లేదు. భక్తితో సేవిస్తే ఆ శ్రీహరి ప్రతివాడి మనసులో ఉంటాడు. కాని కపట భక్తిని ప్రదర్శించి ప్రజలకు ద్రోహం చేసేవారు, ఈ లోకంలోనే కాదు

పరలోకంలో కూడా అమితమైన దు:ఖమును పొందుతారు. పూర్వకాలంలో శ్రీహరి భక్తుడు అయిన అంబరీషుని అకారణంగా నిందించిన దుర్వాసుడు అనే ఋషి ఎన్నో కష్టములు అనుభవించాడు.

ముక్తిని సంపాదించడానికి వ్రతములు, తీర్థయాత్రలు, యోగనిష్టలు, యజ్ఞయాగములు, జ్ఞానము కొరకు చర్చలు, ఏవీ అవసరం లేదు. ముక్తి నీ దాసి కాబట్టి ప్రజలు నిన్ను అనుసరిస్తే ముక్తి వారిని సేవిస్తుంది. కాబట్టి నీవు సంతోషంగా ఉండు." అని పలికాడు నారదుడు. నారదుని ఉపశమనమైన మాటలు విన్న భక్తి సంతోషంతో పరిపుష్టమయింది. నారదునితో ఇలా అంది.

"దేవర్షీ! నీకు నా మీద ఉన్న ప్రేమకు, అభిమానానికి ముగ్ధురాలనయ్యాను. నేను నిన్ను విడిచి పెట్టి ఉండను. ఎల్లప్పుడు నీ హృదయములోనే నివసిస్తుంటాను. నారదా! నీవు దయామయుడవు. ఒక్క క్షణంలో నాలో ఉన్న దు:ఖమును పోగొట్టావు. కాని నీమాటలు విన్న తరువాత కూడా నా కుమారులైన జ్ఞాన, వైరాగ్యములలో ఏమీ చలనము కలగలేదు. నా యందు దయయుంచి వీరిని కూడా చైతన్యవంతులను చెయ్యి." అని అడిగింది భక్తి.

అప్పుడు నారదుడు అచేనంగా పడిఉన్న జ్ఞాన, వైరాగ్యములను చేతితో తట్టి లేపసాగాడు. నారదుడు వారి చెవుల దగ్గర నోరు పెట్టి "ఓ జ్ఞానమా! మేలుకో! లే! ఓ వైరాగ్యమా! చైతన్యవంతం కా! లే" అని అరిచాడు. కాని వారు చైతన్య వంతులు కాలేదు. అప్పుడు నారదుడు వేదఘోషను వినిపించాడు.

వేదాంతమును వినిపించాడు. భగవద్గీతను గానం చేసాడు. వేదములను, ఉపనిషత్తులను, గీతాపాఠమును విన్నతరువాత, జ్ఞానము, వైరాగ్యము మేలుకొన్నారు. అప్పటి వరకు సోమరి తనం ఆవరించిన వాళ్లు నెమ్మదిగా ఆవులించారు. కళ్లు తెరవాలనుకున్నారు. కాని వారి కళ్లు తెరవబడలేదు. వారి శరీరాలు ఎండిన కట్టెల మాదిరి చలనం లేకుండా పడి ఉన్నాయి.

వారిని చూచిన నారదుడు ఇప్పుడు ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్నాడు. జ్ఞాన, వైరాగ్యములకు వారి ముసలి తనము వలన కలిగిన నిద్ర, సోమరితనము, ఎలా పోగొట్టాలా అని ఆలోచిస్తూ పరమాత్మను మనసులో తలచుకున్నాడు. అప్పుడు ఆకాశము నుండి ఈ మాటలు వినిపించాయి.

"నారదా! చింతించకు. సందేహించకు. ఇంకా ఇంకా ప్రయత్నం చెయ్యి. నీ శ్రమ ఫలిస్తుంది. కాని నీవు ఒక మంచి పని చేయాలి. ఆ పని ఏదో నీకు పెద్దలు, సత్పురుషులు చెబుతారు. ఆ విధంగా ఆచరించు. నీవు ఆ మంచి పని చేస్తే జ్ఞాన, వైరాగ్యముల నిద్రావస్థ తొలగి పోతుంది." అని వినిపించాయి.

నారదుడికి ఏమీ అర్థం కాలేదు. "ఇదేమిటి! ఆకాశ వాణి ఇలా పలికింది. అసలు విషయం రహస్యంగా ఉంచింది. నేను ఏం చెయ్యాలో చెప్పనేలేదు. ఆ సత్పురుషులు, సాధువులు ఎవరో! ఎక్కడ ఉన్నారో! ఏం చెబుతారో! అసలు ఇప్పుడు నేను ఏంచేయాలి." అనే సందిగ్ధంలో పడ్డాడు.

ఇలా ఆలోచిస్తే లాభం లేదని, నారదుడు జ్ఞాన, వైరాగ్యములను అక్కడే వదిలి శ్రీహరి నామ సంకీర్తన చేసుకుంటూ అన్ని తీర్థములు, పుణ్యస్థలములు తిరుగుతూ కనిపించిన సాధువులను అందరినీ ఆకాశవాణి చెప్పిన సత్కార్యము గురించి అడుగసాగాడు. నారదుడు చెప్పింది అందరూ విన్నారు కానీ ఎవరూ దానికి సమాధానం చెప్పలేకపోయారు. తమకు ఏమీ తెలియదని అన్నారు.

మరి కొందరు "అబ్బే దీనికి సమాధానం అసలు దొరకనే దొరకదు" అని పెదవి విరిచారు. మరి కొందరు "దీని గురించి తెలుసుకోవడం చాలా కష్టం. నీ శ్రమ వృధా కావడం తప్ప ఏమీ ప్రయోజనం ఉండదు." అని అన్నారు. మరి కొందరు నారదునికి ఏమి చెబితే ఏమవుతుందో అని సమాధానం చెప్పకుండా తప్పుకున్నారు. మరి కొందరు "నారదా! వేదఘోష, వేదాంత చర్చ, గీతాగానము వీటికి కూడా చైతన్య వంతులు కాని వారు ఇంక దేనికీ చైతన్యవంతులు కారు. దీనికి మరో ఉపాయం ఏదీ లేదు." అని తెగేసి చెప్పారు. "దేవర్షి నారదునికే తెలియని విషయం మనకేం తెలుస్తుంది" అని మరి కొందరు తెల్లమొహం వేసారు.

నారదుడు అడిగిన ఋషులు అందరూ ఆకాశ వాణి చెప్పినది కనుక్కోవడం అసాధ్యం అని తేల్చేశారు. నారదుడికి ఏమీ తోచలేదు. ఆలోచిస్తూ బదరికావనమునకు వెళ్లాడు. ఎవరి వల్లా కాని పని తానే చేద్దామని, ఆఖరి ప్రయత్నంగా తపస్సు చేయడానికి కూర్చున్నాడు. ఆ సమయంలో సనకాదిమహామునులు అక్కడకు వచ్చారు. నారదుడు వారికి నమస్కరించి, అర్ఘ్యపాద్యములు ఇచ్చి

సత్కరించాడు. నారదుడు జరిగినది అంతా చెప్పి వారితో ఇలా అన్నాడు.

"మహాత్ములారా! నేను ఏజన్మలోచేసుకున్నపుణ్యమో ఈ నాడు నాకు మీ దర్శనభాగ్యం లభించింది. మీరు గొప్ప యోగులు. విద్వాంసులు, సమ బుద్ధికలవారు. మీరు కేవలము సర్వకాల సర్వావస్థలయందు ఐదు సంవత్సరముల బాలుర మాదిరి కనిపిస్తున్నా, మీరు మీ పూర్వులకు కూడా పూర్వము నుండి ఉన్నవారు. ఆత్మజ్ఞాన సంపన్నులు. మీరు నిరంతరము హరి నామ సంకీర్తనము చేస్తూ వైకుంఠములో నివసిస్తుంటారు. మీకు అన్నపానీయాలు ఆ శ్రీహరి సుధామృతమే. శ్రీహరి నామ స్మరణమే. "హరి: శరణమ్" అనే పదాలు ఎల్లప్పుడూ మీ నాలుకల మీద తాండవిస్తుంటాయి. మీకు వార్ధక్యము, రోగము, మరణము ఏవీ లేవు. నిత్య బాలురు.

పూర్వమున మిమ్ములను అడ్డగించి అవమానించిన జయవిజయులు అనే విష్ణుమూర్తి ద్వారపాలకులు మూడు జన్మలు అసురప్రవృత్తికలవారుగా జన్మించారు. (వారే హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాల దంత వక్త్రులు). వారికోసమే శ్రీహరి భూలోకములో అవతరించి వారికి ముక్తిని ప్రసాదించి వారిని తిరిగి వైకుంఠమునకు చేర్చాడు. అటువంటి మహానుభావులైన మీరు నా వద్దకు రావడం నాకు మీ దర్శనభాగ్యం కల్పించడం మా మహద్భాగ్యంగా భావిస్తున్నాను.

ఈ సమయంలో మీరు నాకు మార్గము చూపాలి. ఆకాశవాణి నన్ను ఒక సత్కర్మ ఆచరించమనీ దానిని నాకు

సత్పురుషులు ఆదేశిస్తారనీ పలికింది. ఇప్పటి వరకూ నాకు ముల్లోకములలో ఆ సత్పురుషుల దర్శనము లభించలేదు. ఆ సత్కార్యము ఏమిటో తెలియలేదు. ఆ సాధన ఏమిటో తెలియదు! దానిని ఎలా అనుష్ఠించాలో తెలియదు.  మీరే ఆకాశవాణి పలికిన సత్పురుషులు అని నేను అనుకుంటున్నాను. ఈ దీనుని మీద దయయుంచి నాకు మార్గనిర్దేశము చేయవలసినది. భక్తి, ఆమె కుమారులు అయిన  జ్ఞానము, వైరాగ్యము నిరంతర దు:ఖమును అనుభవిస్తున్నారు. భూలోకములో ఉన్న సకల వర్ణములు, జాతులు, కులముల వారిలో భక్తి, జ్ఞాన, వైరాగ్యముల బీజములను ఎలా ప్రతిష్ఠించాలి. దయచేసి నాకు తెలియజేయండి." అని నారదుడు సనకాది మునులను వేడుకున్నాడు. అప్పుడు వారు నారదునితో ఇలా అన్నారు.

"దేవర్షీ! దీని గురించి నీవు చింతించవలసిన పని లేదు. దీనికి ఉపాయము పూర్వకాలము నుండి ఉన్నది. కాకపోతే మనకు తెలియదు. నీవు శ్రీకృష్ణదాసులకు మార్గదర్శకుడవు. నీకు రాగద్వేషములు లేవు. విరక్తుడవు. భక్తియోగమునకు నీవు సూర్యుని వంటి వాడవు. భక్తి కిరణములు నీ నుండి బయటకు ప్రసరిస్తున్నాయి. ఆ కారణం చేతనే భక్తి యొక్క కోరికలు తీర్చడానికి నీవు తాపత్రయపడుతున్నావు. నీవు భగవంతునికి అనన్య భక్తుడవు. అందుకే నీకు భక్తిని అందరిలోనూ ప్రతిష్ఠించవలెనని బుద్ధిపుట్టింది.

ఋషులు వేదములలో అనేక మార్గములు గురించి చెప్పారు. ఆ మార్గములు అన్నీ కేవలము స్వర్గసుఖములు పొందడానికే

పరిమితం అయ్యాయి. అంతకన్నా ముందుకు పోలేదు. భగవంతుని పొందే మార్గము నేటి వరకు చాలా నిగూఢంగా, గుప్తంగా ఉంది. ఆ మార్గమును ఇతరులకు ఉపదేశించడానికి కానీ, తెలుసుకోడానికి ఎవరూ ప్రయత్నించలేదు. ఈ కారణం చేత ఆకాశవాణి నీకు చెప్పిన ఆ సన్మార్గము గురించి మేము నీకు ఉపదేశిస్తాము. జాగ్రత్తగా విను.

నారదా! లోకములో నాలుగు రకములైన యజ్ఞముల గురించి చెప్పారు. అవి ద్రవ్యయజ్ఞము, యోగ యజ్ఞము, తపో యజ్ఞము, స్వాధ్యాయ యజ్ఞము. దీనినే జ్ఞాన యజ్ఞము అని కూడా అంటారు. ఈ యజ్ఞములన్నీ స్వర్గసుఖములు పొందడానికే పనికివస్తున్నాయి.

కాని పైన చెప్పబడిన జ్ఞాన యజ్ఞములో ఒక అంశము ఇమిడి ఉంది. అదే సత్కర్మ. అదే నీకు ఆకాశవాణి చెప్పింది. ఆ సత్కర్మయే భాగవత పురాణ పారాయణము. దీనిని పూర్వము శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు బోధించి ఆయనకు ముక్తి మార్గము చూపాడు. ఈ భాగవతమును చదవడం చేతా, వినడం చేతా, భక్తి, జ్ఞానము, వైరాగ్యము ఈ మూడింటికీ బలము, జవసత్వాలు తిరిగి లభిస్తాయి. భాగవత పారాయణము వలన భక్తి, జ్ఞాన, వైరాగ్యములను ఆవరించిన అన్ని కష్టములు తొలగి పోతాయి. అవి వాటి పూర్వవైభవమును పొందుతాయి. సింహగర్జన విని తోడేళ్లు పారిపోయినట్టు, భాగవతమును వినినంతనే కలియుగంలో ఉన్న దోషాలు పటాపంచలయి పారిపోతాయి. భాగవతము ప్రతి ఇంటిలోనూ చదవబడితే, భక్తి, తన కుమారులు అయిన జ్ఞాన వైరాగ్యములతో ప్రతి ఇంటిలోనూ, ఆ ఇంటిలోని వారి మనుసులలోనూ తిష్ఠవేసుకొని

కూర్చుంటుంది." అని ఉపదేశించారు సనకాదులు. ఆ మాటలు విన్న నారదుడు వారితో ఇలా అన్నాడు.

"మహాత్ములారా! నేను ఇంతవరకు భక్తి, జ్ఞాన, వైరాగ్యములను వేదాంత చర్చలతోనూ, గీతాగానముతోనూ మేలుకొలపడానికి ప్రయత్నించాను. కానీ వారిలో భక్తి, జ్ఞాన,వైరాగ్యములు కలగలేదు. వేదముల చేతా, ఉపనిషత్తుల సారమైన భగవద్గీతా గానము చేత మేలుకోని భక్తి, జ్ఞాన, వైరాగ్యములు కేవలము భాగవత పురాణ పఠనంతో మేలుకుంటాయా! ఎందుకంటే భాగవతములో కూడా వేదములలో ఉన్న విషయములు, వేదములలో సారం అంతా చెప్పబడింది కదా! కొత్త విషయములు ఏమున్నాయి? అటువంటప్పుడు వేదములు, గీతాశాస్త్రము చేయలేని పని భాగవత పఠనము ఎలా చేయగలదు? దయచేసి నా సందేహమును తీర్చండి." అని అడిగాడు నారదుడు. అప్పుడు సనకాదులు నారదునితో ఈ విధంగా అన్నారు.

"దేవర్షీ! భాగవతము అంటే వేదముల, ఉపనిషత్తుల సారముకంటే ఎక్కువ. వేదములు చదివితే కొంత జ్ఞానమే లభిస్తుంది. ఉపనిషత్తుల వలన మరి కొంత జ్ఞానము వస్తుంది. కాని భాగవతము చదివితే పరిపూర్ణజ్ఞానము లభిస్తుంది. ఒక చూతవృక్షము(మామిడి చెట్టు) ఉందనుకో. దాని రసము వేళ్ల దగ్గర నుండి కాండము, కొమ్మలు, ఆకులు, పూలు వీటి అన్నిటి యందు నిక్షిప్తమై ఉంటుంది. కాని అవి అన్నీ ఆ రసం ఆస్వాదించడానికి పనికిరావు. దాని రసమును ఆస్వాదించాలంటే, దాని ఫలములు మాత్రమే యోగ్యములు.

కాండము, కొమ్మలు ఆకులు తింటే రసాన్ని ఆస్వాదించలేము. అలాగే పాలలో నెయ్యి ఉంటుంది. కాని పాలు తాగితే నేతి రుచి తెలియదు. పాలను మథించి, అగ్నిలో కాచితేనే, నేతి రుచి తెలుస్తుంది. అలాగే భాగవత కథ కూడా వేదముల, ఉపనిషత్తుల, సకల పురాణముల సారము.

భాగవత పురాణము వేదములతో సమానమైనది. ఆకారణం చేతనే వేదవ్యాసుడు కలియుగములో ఉన్న మానవులలో భక్తిని, జ్ఞాన, వైరాగ్యములను స్థాపించడానికి, భాగవతపురాణమును రచించాడు. అంతకు ముందు వేదవ్యాసుడు మహాభారతమును రచించాడు. అందులో 18 అధ్యాయముల గీతను పొందుపరిచాడు. కాని ఆయనకు తృప్తి కలుగలేదు. ఏదో వెలితి. ఏదో అజ్ఞానము ఆయనను ఆవహించింది. ఆ సమయంలో నీవే కదా వ్యాసుల వారిని భక్తిని ప్రబోధించే భాగవతమును రాయమని ప్రోత్సహించావు. ఇప్పుడు నీవే భాగవత మహాత్మ్యమును గురించి అడుగుతున్నావు. కాబట్టి భాగవతము ఒక్కటే జ్ఞాన భక్తి వైరాగ్యముల శోకమును పోగొట్టే ఉత్తమమైన మార్గము." అని సనకాదులు నారదునికి ఉపదేశించారు. ఆమాటలు విన్న నారదుడు వారికి మరొకసారి నమస్కరించి ఇలా అన్నాడు.

"మహర్షులారా! మీరు చెప్పినట్టే చేస్తాను. మీరు మహానుభావులు. మీ దర్శనభాగ్యం చేతనే జీవుల సమస్తపాపములు పటాపంచలవుతాయి. వారిని సంసారము అనే దు:ఖము నుండి విముక్తులను చేస్తాయి. మానవుడు అనేక జన్మ సంస్కారముల చేతనే వారికి ఈ జన్మలో సత్సాంగత్యము కలుగుతుంది. ఆ సత్సాంగత్యమే

మానవులలోని అజ్ఞానమును, అవివేకమును, వాటి వలన కలిగే మదము అనే అహంకారమును, మోహమును సర్వం నాశనం చేస్తుంది. వారిలో వివేకము పుడుతుంది. కాబట్టి నేను మీరు చెప్పినట్టు భాగవతపురాణము అనే జ్ఞాన యజ్ఞము చేస్తాను. భక్తి, జ్ఞాన, వైరాగ్యములను ఈ లోకంలో నిలబెడతాను. కాని ఈ భాగవత యజ్ఞము ఎక్కడ చేయాలి? ఎలాచేయాలి? ఎన్నిదినములు చేయాలి? దానిని వినే విధానము ఏమిటి? దానికి తగిన  ప్రదేశమును మీరే నిర్ణయించండి." అని అడిగాడు నారదుడు. దానికి సనకాదులు ఇలా అన్నారు.

"నారదకుమారా! నీవు విద్య వినయ సంపన్నుడవు. నీవు అడిగిన విషయములు అన్నీ నీకు సవిస్తరంగా చెబుతాము. శ్రద్ధగా విను. హరిద్వారము సమీపంలో గంగానదీ తీరంలో ఆనంద తటము అనే ప్రదేశము ఉంది. అక్కడు ఎంతో మంది ఋషులు నివసిస్తున్నారు. దేవతలు, సిద్ధులు వారి వద్దకు వచ్చి వారిని సేవిస్తుంటారు. ఆ ప్రదేశములో రకరకాలైనఫలవృక్షములు, పుష్పములతో నిండిన లతలు, ఉన్నాయి. ఆ ప్రదేశము చాలా ప్రశాంతంగా ఉంటుంది. అక్కడ ఉన్న క్రూర జంతువులు కూడా తమ తమ వైరములు మరిచి పోయి ప్రశాంత జీవనము గడుపుతుంటాయి. ఆ సుందర ప్రదేశమే నీ జ్ఞానయజ్ఞమునకు తగినది. భక్తి కూడా తన కుమారులైన జ్ఞానము, వైరాగ్యములతో అక్కడకు వస్తుంది. భాగవత కథామృతము వారి చెవిని పడగానే భక్తి, జ్ఞాన, వైరాగ్యములు తిరిగి యౌవనవంతులు అవుతారు. శ్రీమద్భాగవతము చెప్పే ప్రదేశమునకు భక్తులు వారంతట వారే తరలి వస్తారు.." అని పలికారు.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

తరువాత సనకాదులు నారదునితో కూడా హరి ద్వారము సమీపములో గంగానదీ తీరమున ఉన్న ఆనంద తటమునకు వెళ్లారు. సనకాదులు ఈ విషయమును నారదునికి తెలిపిన విషయము భూలోకము, భువర్లోకము, దేవలోకము, బ్రహ్మలోకములలో పాకి పోయింది. అక్కడ కోలాహలము మొదలయింది. భగవత్కథలను వినవలెనని కోరిక గల భక్తులందరూ భాగవత కథా శ్రవణం కోసం కోలాహలంగా ఆనంద తటమునకు పరుగులెత్తారు. భృగువు, వసిష్ఠుడు, చ్యవనుడు, గౌతముడు మేధాతిథి, దేవలుడు, దేవరాతుడు, పరశు రాముడు, విశ్వామిత్రుడు, శాకలుడు, మార్కండేయుడు, దత్తాత్రేయుడు, పిప్పలుడు మొదలగువారు, యోగేశ్వరుడు, వ్యాసుడు, పరాశరుడు, ఛాయాశుకుడు, జాబలి, జుహ్నువు మొదలగు మహాఋషులు తమతమ పుత్రులతోనూ, శిష్యులతోనూ అక్కడకు చేరుకున్నారు. వేదములు, ఉపనిషత్తులు, మంత్ర తంత్రములు, పురాణములు, ఆరుశాస్త్రములు మానవ రూపం ధరించి అక్కడకు వచ్చాయి. గంగ, యమున,సరస్వతి మొదలగు పుణ్యనదులు, పుష్కరము మొదలగు సరోవరములు, కురుక్షేత్రము మొదలగు క్షేత్రములు, దండకారణ్యముమొదలగు అడవులు, హిమాలయము మొదలగు పర్వతములు, దేవతలు, గంధర్వులు, దానవులు అందరూ భాగవత కథాశ్రవణం కోసం ఆనంద తటమునకు చేరుకున్నారు. కొంత మంది “తమను ఎవరూ పిలువలేదు తాము రాము!” అన్న వారందరినీ కూడా భృగు మహర్షి నచ్చజెప్పి అక్కడకు తీసుకొని వచ్చాడు.

భాగవత కథను స్వయంగా చెప్పడానికి సనకాదులు ఒక ఉన్నతమైన ఆసనము మీద కూర్చున్నారు. భాగవత కథను వినడానికి

వచ్చిన వారంతా లేచి సనకాదులకు నమస్కరించారు. ముందు వరసలో విష్ణుభక్తులు, వైరాగ్యము చెందిన వారు, సంన్యాసులు, బ్రహ్మచారులు వారితో పాటు నారదుడు కూర్చున్నారు. మరొకపక్క ఋషులు కూర్చున్నారు. వారి పక్కన దేవతలు కూర్చున్నారు. మరొక పక్కన స్త్రీలు కూర్చున్నారు. వేదములు, ఉపనిషత్తులు, శాస్త్రములు, తీర్థములు అదృశ్యరూపంలో ఆ ప్రదేశములో ఆవహించాయి. కొంత మంది ఉత్సాహవంతులైన దేవతలు విమానముల మీది నుండి ఆ ప్రదేశములో పూలవానకురిపించారు.

ఈ విధంగా పూజలు, పురస్కారములు అయిన తరువాత అక్కడ అంతా నిశ్శబ్దం ఆవరించింది. సనకాదులు భాగవత పురాణమును స్పష్టంగా చెప్పసాగారు. అక్కడ చేరిన వారందరూ సనకాదులు చెబుతున్న భాగవత పురాణమును శ్రద్ధగా వింటున్నారు. అప్పుడు ముందు మాటగా సనకాదులు సభాసదులతో ఇలా అన్నారు.

"ఇప్పుడు మేము ఈ భాగవత మహిమను వివరిస్తున్నాము. దీనిని విన్న వారికి ముక్తి లభిస్తుంది. భాగవత కథను నిరంతరము పఠించాలి. వినాలి. ఆస్వాదించాలి. భాగవత కథను వింటున్న వారి హృదయములలో శ్రీహరి కొలువుంటాడు.

ఈ భాగవత పురాణములో 18,000 శ్లోకములు ఉన్నాయి. అవి పన్నెండు స్కంధములుగా విభజింపబడ్డాయి. ఈ భాగవతము శుక మహర్షి పరీక్షిత్ మహారాజు సంవాద రూపంలో ఉంది. మీరు ఈ భాగవతపురాణమును శ్రద్ధగా వినండి. ఈ భాగవత కథను వినకపోతే,

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

వారిలో అజ్ఞానము పెరిగి సంసారము అనే చక్రంలో పడి కొట్టుకుంటుంటారు. ఎన్ని శాస్త్రములు, పురాణములు వినిన ఏమి లాభము? అనవసరంగా భ్రమలు పెంచుకోడానికి తప్ప ఇంక ఎందుకూ పనికి రావు. ముక్తిని కోరుకునేవారికి భాగవత పురాణమే ఏకైక మార్గము. ప్రతినిత్యము భాగవత పురాణము ప్రవచనం చేయబడుతున్న ఇల్లు ఒక పవిత్ర తీర్థము వంటిది. అందులో నివసిస్తున్న వారి పాపములు అన్నీ నశించిపోతాయి. వేయి అశ్వమేధయాగములు, వందల కొలదీ వాజపేయములు చేసిన ఫలము ఒకసారి భాగవత పురాణమును చదివితే వచ్చే ఫలమునకు సాటి రావు.

సభాసదులారా! భాగవత పురాణమును విననంత వరకు, మానవుల శరీరములలో ఉన్న పాపములు నశించిపోవు. ఈ భాగవత కథ వింటే గంగ, గయ, కాశి, పుష్కరము, ప్రయాగ క్షేత్రములు దర్శించినంత పుణ్యం వస్తుంది. పరమ గతిని పొందవలెననే కోరిక ఉన్న వారికి రోజుకు ఒక శ్లోకము గానీ, ఆ శ్లోకములో ఒక పాదము గానీ నిత్యం నియమంగా, స్వయంగా చదవితేచాలు. వారి జన్మ తరిస్తుంది.  రేయింబగళ్లు అర్థంతో సహా శ్రీమద్భాగవత పురాణమును చదివితే, వారి యొక్క పూర్వజన్మపాపములు అన్నీ నశించిపోతాయి అనడంలో ఏ మాత్రం సందేహము లేదు.

ఓంకారము, గాయత్రి మంత్రము, పురుష సూక్తము, మూడు వేదములు, శ్రీమద్భాగవతము, ఓం నమోభగవతే వాసుదేవాయ అనే ద్వాదశాక్షరీ మంత్రము, పన్నెండు మూర్తులు గల సూర్యభగవానుడు,(సూర్యుడు ఒక్కొక్క నెలలో ఒక్కొక్క రూపంలో ఉ ంటాడు.) ప్రయాగ క్షేత్రము, బ్రాహ్మణులు, అగ్నిహెూత్రము, గోవులు,

ద్వాదశీతిథి, తులసీమాత, వసంత ఋతువు, సాక్షాత్తు భగవానుడు వీరందరిలో తేడాను బుద్ధిమంతులు గమనిస్తారు. భాగవత పఠనము ఉత్తమోత్తమముఅనుటలో సందేహము లేదు.

ప్రతిదినము భాగవతములోని శ్లోకములను, వాటి అర్థములను, శ్లోకపాదమును చదివే వారు రాజసూయయాగము, అశ్వమేధయాగము చేసిన ఫలితమును పొందుతారు. అనునిత్యము భాగవతమును చదవడం, భగవంతుని ధ్యానించడం, తులసిని పెంచి పూజించడం, గోవునుసేవించడం ఈ నాలుగూ సమానములే. అంత్యకాలములో శ్రీమద్భాగవతమును వింటే, అతని పట్ల పరమాత్మ ప్రసన్నుడై అతనికి వైకుంఠప్రాప్తి కలుగజేస్తాడు.

శ్రీమద్భాగవత గ్రంథమును ఎవరైనా భక్తునికి దానం చేస్తే వారికి విష్ణుసాయుజ్యము లభిస్తుంది. తనజీవిత కాలంలో కేవలం కొద్ది సమయమైనా భగవంతుని మీద మనసు నిలిపి ధ్యానం చేయని వాడు, వాడి జన్మ వ్యర్థము. వాడు కేవలము వాడి తల్లికి ప్రసవవేదన కలిగించడానికే పుట్టినవాడు కానీ ఇంక దేనికీ పనికిరాడు. భాగవతపురాణములోని కొద్ది మాటలు కూడా వినని వాడు పాపాత్ముడు. వాడు జీవించి ఉండటం వ్యర్థం. వాడు శవముతో సమానము. భూమికి భారము. పశువులు వీడి కన్నా ఎంతో మేలు. ఈ మానవ ప్రపంచములో భాగవత కథా శ్రవణము లభించడం ఎంతో కష్టం. ఎన్నో జన్మల పుణ్యం చేసుకుంటే గానీ అది లభించదు.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

ఈ భాగవత కథ వినడానికి నియమ నిష్ఠలు ఏమీ లేవు. ఎవరైనా ఎక్కడైనా వినవచ్చును. ప్రతిరోజూ కూడా వినవచ్చును. కానీ ఈ భాగవత కథను వినే వారు ఎల్లప్పుడూ సత్యమునే పలకాలి. బ్రహ్మచర్యము అవలంబించాలి. కాని కలియుగంలో ఈ నియమాలు ఆచరించడం చాలా కష్టము. ఈ కలియుగంలో ఇంద్రియములను మనసును నిగ్రహించడం, యమ, నియమములను ఆచరించడం, పుణ్యకార్యములు చేయడానికి దీక్షలుపట్టడం చాలా కష్టము. అందుకని కలియుగంలో భాగవత సప్తాహ శ్రవణము అనిఏర్పాటు చేయబడినది.

మాఘ మాసములో ఈ భాగవతమును వినడం వలన వచ్చే ఫలమును శుకమహర్షి పరీక్షిత్ కు ఇలా చెప్పాడు. “మనసును నిగ్రహించలేకపోవడం, వ్యాధులు, ఆయుష్షు తక్కువగా ఉండటం, ఈ కారణముల చేత కలియుగములో భాగవత సప్తాహ శ్రవణము ఏర్పాటు చేయబడినది. తపస్సు చేసినందువలన, యోగమార్గము ఆచరించినందువలన, సమాధినిష్ఠలో ఉన్నందువలన కలిగే ఫలితములు భాగవత సప్తాహము చేస్తే కలుగుతాయి. ఈ భాగవత సప్తాహ శ్రవణము యజ్ఞములు, వ్రతములు, తపస్సు, తీర్థసేవనము, యోగాభ్యాసము, ధ్యానము, జ్ఞానము వీటి అన్నింటి కంటే గొప్పది.” అని చెప్పాడు.” అని సనకసనందులు ఆనందతటము వద్ద చేరిన సభాసదులకు వినిపించారు అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు చెప్పగానే శౌనకుడు ఇలా అడిగాడు.

“మహానుభావా! తమరుచెప్పినది అంటా వింటుంటే చాలా ఆశ్చర్యంగా ఉంది. మీరు భాగవత పురాణ శ్రవణమును జ్ఞానము మొదలగు సాధనముల కంటే గొప్పది అని అన్నారు. భాగవతము

జ్ఞానము కంటే ఎలా గొప్పది అయింది వివరించండి." అని అడిగాడు. అప్పుడు సూతి ఇలా చెప్పసాగాడు.

"మహామునులారా! శ్రీకృష్ణ పరమాత్మ ఈ లోకమును విడిచి వైకుంఠమునకు వెళ్లే సమయంలో ఉద్ధవునికి ఎన్నోవిషయాలు చెప్పాడు. అప్పుడు ఉద్ధవుడు కృష్ణుని ఇలా అడిగాడు. "గోవిందా! ఇప్పుడు నీవు భూలోకములో నీవు వచ్చిన కార్యములు అన్నీ పూర్తి చేసుకొని వైకుంఠమునకు పోతున్నావు. అది నాకు చాలా బాధగా ఉంది. నా బాధను తీర్చు. నీవు వైకుంఠమునకు పోగానే కలి ప్రవేశిస్తాడు. ఆకారణం చేత మరలా వేనకువేలు దుష్టులు ఈ లోకంలో జన్మిస్తారు. ఆ దుష్టుల సహవాస దోషముచేత మంచి వారు కూడా దుష్టులుగా మారిపోతారు. ఆ సమయంలో భూమికి మరింత భారం కలుగుతుంది. ఆ సమయంలో భూమాత ఎవరి శరణు కోరుతుంది. నాకు తెలియజేయండి. మరలా నీవు దుష్టశిక్షణ కొరకు భూమి మీద అవతరిస్తావా! దానికి బదులు నీవు ఇక్కడే ఉండి దుష్టశిక్షణ చేయవచ్చు కదా! నీవు నిరాకారుడవు అయినా నీ భక్తులను రక్షించడానికి సగుణ రూపంలో కృష్ణుడిగా పుట్టావు. ఇప్పుడు నీ పాటికి నీవు వైకుంఠానికి వెళ్లిపోతే ఈ భక్తులగతి ఏం కావాలి? వాళ్లను ఎవరు కాపాడతారు? పోనీ నిన్నుతల్చుకుంటూ ఉంటారా అంటే సగుణో పాసన కన్నా నిర్గుణోపాసన చాలా కష్టము. కాబట్టి నా మనవి ఆలకించి ఇక్కడే ఉండిపో." అని అన్నాడు.

ఇప్పుడు కృష్ణుడు ఆలోచనలో పడ్డాడు. "నిజమే నేను ఇలా వెళ్లిపోతే నా భక్తుల గతి ఏంకావాలి. వారికి ఏదో ఒక ఏర్పాటు

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

చెయ్యాలి కదా!" అని ఆలోచించసాగాడు. అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మ తన శక్తులను అన్నిటినీ భాగవత పురాణములో నిలిపాడు. తరువాత సముద్రములో ప్రవేశించి వైకుంఠము చేరుకున్నాడు.

కాబట్టి ఓ మునులారా! భాగవత పురాణములో సాక్షాత్తు శ్రీమహావిష్ణువు నిండి ఉన్నాడు. భాగవతమును చదవడం చేత, వినడం చేత సకలపాపములు నశించిపోతాయి. అందులోనూ భాగవత సప్తాహ శ్రవణము చాలా గొప్పది. కలియుగంలో అన్ని సాధనముల కంటే ఈ భాగవత సప్తాహ శ్రవణము చాలా గొప్పది అని చెప్పబడింది. కలియుగంలో కామక్రోధములను, దు:ఖమును, దారిద్ర్యమును, దౌర్భాగ్యమును, పాపములను పోగొట్టే ఏకైక సాధనము భాగవత సప్తాహ శ్రవణము. కలియుగంలో మాయను దాటడం చాలా కష్టం. కేవలం భాగవత సప్తాహ శ్రవణము ఒక్కటే దీనికి మార్గము." అని సూతుడు చెబుతూ ఇంకా ఇలా అన్నాడు. "ఓ మహామునులారా! హరిద్వారము వద్ద ఆనంద తటములో సనకసనందులు భాగవత పురాణమును దేవతలు,మునులు, మొదలగు వారికి చెప్పాడు అని చెప్పాను కదా! ఆ సమయంలో ఒక విచిత్రం జరిగింది. భక్తి, తన కుమారులు అయిన జ్ఞానము, వైరాగ్యములతో కృష్ణ నామమును పెద్దగా చెబుతూ శ్రీకృష్ణ, గోవింద, హరే, మురారే, నాథా, నారాయణా, వాసుదేవా! అని నామాలు జపిస్తూ అక్కడకు వచ్చింది.

"ఈమె ఎవరు? ఇక్కడకు ఎలా వచ్చింది?" అని అక్కడ ఉన్న వారందరూ తర్కించుకోసాగారు. అప్పుడు సనకసనందులు సభలో ఉన్న వారితో ఇలా అన్నారు. "సభాసదులారా! ఆశ్చర్యపోకండి. వీరు భక్తి, జ్ఞానము, వైరాగ్యము. భాగవత పురాణమును వినడానికి వచ్చాయి."

అని అన్నాడు. అప్పుడు భక్తి తన కుమారులైన జ్ఞాన,వైరాగ్యములతో కలిసి అక్కడ చేరిన సభాసదులకు నమస్కరించి ఇలా పలికింది.

"మహానుభావులారా! కలియుగంలో నా గురించి పట్టించుకొనే వారే లేరు. నన్ను మానవులు పూర్తిగా మరిచిపోయారు. సనకసనందుల చేత భాగవతపురాణమును విని మాకు పూర్తిగా జవసత్వములు వచ్చాయి. మహానుభావులారా! ఇప్పుడు మేము ఎక్కడ ఉండాలో చెప్పండి." అని సనకసనందులను అడిగారు. అప్పుడు ఆమహాఋషులు భక్తితో ఇలా అన్నారు.

" ఓ భక్తి మాతా! నీ లక్షణములు మాకు తెలుసు. నీవు పరమాత్మయందు భక్తి కలిగి ఉన్న వారి మనసులలో భగవంతుని సాక్షాత్కరింపజేస్తావు. పరమాత్మ పట్ల ప్రేమను కలుగచేస్తావు. ప్రాపంచిక విషయముల వలన కలిగే దుష్టఆలోచలను నాశనం చేస్తావు. కాబట్టి నీవు ఎల్లప్పుడు పరమాత్మ భక్తుల హృదయములలో శాశ్వతంగా నివసించు. కలి పురుషుడు నీ మీద తన ప్రభావమును చూపలేడు." అని ఆదేశించారు. సనకసనందుల ఆదేశము ప్రకారము భక్తి తన కుమారులైన జ్ఞాన వైరాగ్యములతో పరమాత్మ ఎడల అనన్య భక్తి కలవారి హృదయములలో ప్రవేశించింది.

కాబట్టి ఓ మహామునులారా! హృదయము నందు పరమాత్మ ఎడల భక్తి కలిగి ఉన్న వారు ఈ లోకంలో ధనం లేకపోయినా, వారు ధనవంతులే. ఎందుకంటే భక్తి కలవారి హృదయములలో భగవానుడు నిరంతరము కొలువై ఉంటాడు.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

వారికష్టములు తన కష్టములుగా భావించి వాటిని తీరుస్తాడు. ఈ లోకంలో భాగవత పురాణము అంటే సాక్షాత్తు పరబ్రహ్మమే. దీని మహిమను వర్ణించడం ఎవరి తరమూకాదు. ఈ భాగవతమును కలిగి ఉన్న వాడు, దానిని చదివిన వాడు, దానిని వినినవాడు, శ్రీకృష్ణునితో సమానంగా వైకుంఠములో నివసిస్తారు. అన్ని ధర్మముల కంటే భాగవత ధర్మము చాలా గొప్పది" అని సూతుడు శౌనకాది మహామునులకు భాగవత పురాణ మహాత్మ్యమును వివరించాడు.

పద్మపురాణము,

ఉత్తరాఖండము భాగవతమహాత్మ్యము

రెండు మరియు మూడవ అధ్యాయములు సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

పద్మపురాణము,

ఉత్తరాఖండము భాగవతమహాత్మ్యము

నాలుగవ అధ్యాయము.

సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు భాగవత మహాత్మ్యమును ఈ విధంగా చెప్పాడు. భూలోకంలో మానవులు భాగవత పురాణమును పఠించడం, వినడం, భక్తి పెంపొందించుకోవడం గమనించిన శ్రీమహావిష్ణువు వైకుంఠమును విడిచి భూలోకమునకు వచ్చాడు.

శ్రీమహావిష్ణువు వనమాలతో, శ్యామలవర్ణముతో, పీతాంబరమును ధరించి, కిరీటముతో, కౌస్తుభమణితో, హరిచందనములతో, సుందరమైన ముఖముతో, పరమానంద చితానందమూర్తి, మధురాతిమధురుడు, అయిన భగవానుడు భాగవతపురాణమునుపఠిస్తున్న, వింటున్న తన భక్తుల యొక్క హృదయములలో ప్రవేశించాడు. వారి మనోఫలకముల భక్తి, జ్ఞాన, వైరాగ్యము మీద సాక్షాత్కరించాడు.

విష్ణువు లేని వైకుంఠములో మనం మాత్రం ఎందుకని వైకుంఠవాసులు కూడా, భాగవతము పఠించు ప్రదేశమునకు వచ్చి భాగవత ప్రవచనములను వింటున్నారు. ఎప్పుడైతే భగవానుడు భాగవతప్రవచనములు జరిగే స్థలమునకు వచ్చాడో, అక్కడ జయజయధ్వానములు వినిపించాయి. శంఖధ్వనులు మారుమోగాయి. భాగవతము వింటున్న భక్తుల హృదయములలో తమ తమ శరీరముల గురించి గానీ, గృహముల గురించి గానీ స్పృహ లేకుండా పోయింది. అంతా తన్మయత్వంతో విష్ణుభావనలో మునిగిపోయారు.

ఇది అంతా గమనించిన నారద మహర్షి సనకాదులతో ఇలా అన్నాడు. "మహాత్ములారా! భాగవత మహాత్మ్యము ఎలా ఉంటుందో కళ్లారా చూచాను. భాగవతము వింటున్న సకల జనుల పాపములు పటాపంచలయ్యాయి. కలికాలంలో తాము చేసిన పాపముల నుండి విముక్తి చెందాలంటే భాగవత ఒక్కటే తరుణోపాయము. మానవ లోకంలో పాపములను నాశనం చేసే సాధనము భాగవతము తప్ప

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

మరొకటి లేదు. ఇందులో ఎటువంటి సందేహము లేదు. మునీశ్వరులారా! మీరు చాలా దయ గలవారు. మీరు కలియుగములో ఉన్న మానవులకు, వారి యొక్క బాగు కోరి, ఒక కొత్త మార్గమును కనుక్కున్నారు. కలియుగములో ఉన్న మానవులు ఎంత దుష్టులైనా, మలినమైన హృదయము కలవారైనా, భాగవత సప్తాహము చేత పవిత్రులౌతారు." అని అన్నాడు. ఆ మాటలు విన్న సనకాదులు నారదునితో ఇలా అన్నారు.

"నారద మహర్షీ! భూలోకంలో అందులోనూ కలియుగంలో పాపములు చేయడం సహజం. మానవులు వివిధములైన పాపములు, దురాచారములు చేస్తుంటారు. దుర్మార్గంగా ప్రవర్తిస్తుంటారు. ఎల్లప్పుడూ కోపంతో రగలిపోతుంటారు. కుటిలత్వంతో ఇతరులను మోసంచేస్తుంటారు. కామ కోరికలతో సతమతమౌతుంటారు. వీరందరి కొరకు భగవానుడు మరలా మానవునిగా అవతరించనవసరం లేదు. ఆయన తన శక్తిని భాగవతములో నిక్షిప్తం చేసాడు. భాగవత సప్తాహము యజ్ఞముతో పైన చెప్పిన వారందరూ పవిత్రులు అవుతారు. ఇంకా వివరంగా చెప్పాలంటే

ఈ కింది పాపములు చేసేవారు అంటే...... అబద్ధాలు చెప్పేవారు, తల్లితండ్రులను నిందించేవారు, ఎల్లప్పుడు దురాశ చేత మనసు నిలకడలేని వారు, వర్ణాశ్రమ ధర్మములను వదిలిపెట్టి ప్రవర్తించేవారు, డాంబికులు, ఇతరులు బాగుపడితే చూడలేని వారు, అసూయాపరులు, ఎల్లప్పుడు ఇతరులను బాధపెట్టి ఆనందించేవారు, ఇటువంటి వారుకూడా భాగవత ప్రవచనములను విని పవిత్రులౌతారు.

నారదా! ఇంకా హీనమైన పాపములు చేసేవారు అనగా మద్యముసేవించేవారు, బ్రాహ్మణులను హత్య చేసినవారు, దొంగలు, గురువుగారి భార్యతో వ్యభిచరించేవారు, నమ్మించి మోసం చేసే విశ్వాసఘాతకులు, ఎల్లప్పుడూ కపటంతో ఇతరులను మోసం చేసేవారు, క్రూరస్వభావము కలవారు, దయాదాక్షిణ్యములు లేని వారు, బ్రాహ్మణుల ధనమును, దేవుడి ఆస్తిని అపహరించి తాము ధనవంతులు ఆస్తిపరులు అయ్యేవాళ్లు, ఇతరుల భార్యలతో వ్యభిచరించేవారు, మొదలగు పాపాత్ములు భాగవత సప్తాహ యజ్ఞముతో పవిత్రులౌతారు.

(బ్రాహ్మణులు సాధారణంగా పిరికివాళ్లు. ఇతరుల విషయాలలో జోక్యం చేసుకోరు. ఈ రోజుల్లో బ్రాహ్మణులకు ఇచ్చిన మాన్యములు కాజేసినవాళ్లు, అర్చకుల స్వాధీనములో ఉన్న దేవుడిమాన్యములను లాక్కున్న వాళ్లు కోకొల్లలు. అందుకనే బ్రాహ్మణ హత్యలు, బ్రాహ్మణుల ధనము, ఆస్తులు లాక్కున్నవాళ్లు అని వాడారు. ఇతర వర్ణముల వారు కనీసం ప్రతిఘటిస్తారు కాని బ్రాహ్మణులు ఆ మాత్రం కూడా చేయలేరు. పోతేపోనీ వాడిపాపాన వాడే పోతాడు అని ఊరుకుంటారు. దానికి బ్రాహ్మణుడనైన నేనే ప్రత్యక్ష ఉదాహరణ).

నారదా! ఈ సందర్భంగా నీకు ఒక ప్రాచీనమైన కథ ఒకటి వినిపిస్తాను. పూర్వకాలంలో తుంగభద్రానదీ తీరంలో ఒక పట్టణం ఉంది. అక్కడ అన్ని వర్ణముల వారు వారి వారి వర్ణాశ్రమ ధర్మములను ఆచరిస్తూ సుఖంగా బతికేవారు. ఎల్లప్పుడూ సత్యమునే పలికేవారు. మంచి పనులు చేసేవారు. ఆ నగరంలో వేదములు చదువుకున్నవాడు,

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

శ్రౌత, స్మార్త కర్మలు చేయించడంలో దిట్ట అయిన ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన పేరు ఆత్మదేవుడు. ఆయనకు కావలసినంత ధనం ఉంది. కాని ప్రతిరోజూ భిక్షాటన చేసి జీవించేవాడు.

ఆయన భార్యపేరు దుంధుభి. ఆమెకు ఎల్లప్పుడూ తన మాట నెగ్గవలెనని మొండి పట్టుదల. ఆమెకు ఇతరుల విషయముల గురించి మాట్లాడటం అంటే ఎంతో ఇష్టం. ఎల్లప్పుడూ గడా గడా మాట్లాడుతూ ఉంటుంది. ఇతరులతో ఎప్పుడూ పోట్లాడుతుంటుంది. దయ అనేది ఆమెకు తెలియదు. క్రూరురాలు. వారి వద్ద ధనము, భోగ సామగ్రి పుష్కలంగా ఉంది. కాని  పైసా ఖర్చుపెట్టదు. పరమ లోభి. మొగుడు భిక్షాటన చేసి తెస్తేనే వండి పెడుతుంది.

అన్నీ ఉన్నా వారికి సుఖం లేదు. ఎందుకంటే వారికి సంతానము లేదు. వారికి వయసు మీరి పోతున్నా సంతానము కలగలేదు. తుదకు వారు తమ లోభత్వము సడలించుకొని, వ్రతములు, దాన ధర్మములు చేయసాగారు. ఆవులను, భూమిని, బంగారమును దానం చేయసాగారు. ఈ ప్రకారంగా వారి వద్ద ఉన్న ధనము, బంగారము, ఆస్తి సగభాగము హరించుకుపోయింది కానీ వారికి సంతానము కలగలేదు. వారి చింతకు అంతులేకుండా పోయింది.

ఒక రోజు ఆ బ్రాహ్మణుడు తనకు సంతానము లేదనే చింతతో ఊరి బయట ఉన్న చెరువు వద్దకు వెళ్లాడు. అతనికి దాహం వేసింది. ఆ చెరువులోని నీరు తాగాడు. అక్కడకు ఒక సన్యాసి వచ్చాడు. ఈ బ్రాహ్మణుడు ఆ సన్యాసి పాదములకు నమస్కరించి ఆయన ఎదుట చేతులు కట్టుకొని నిలబడ్డాడు. ఆ సన్యాసి ఆ బ్రాహ్మణుని

ఇలాఅడిగాడు.

"ఓ బ్రాహ్మణుడా! నీ ముఖం దు:ఖంతో నిండి ఉంది. ఎందుకు ఏడుస్తున్నావు. నీ దు:ఖమునకు కారణం ఏమిటి?"అని అడిగాడు. అప్పుడు బ్రాహ్మణుడు ఇలా అన్నాడు.

"మహాత్మా! నేను నా పూర్వజన్మలో ఏం పాపం చేసానో ఏమో ఈ జన్మలో నాకు సంతాన భాగ్యం కలగలేదు. నా పితృదేవతలు తర్పణములు విడిచేవారు లేక, నేను కార్చే కన్నీటిని తాగుతున్నారు. నాకు సంతానము లేరు కాబట్టి దేవతలు, బ్రాహ్మణులు కూడా నేను ఇచ్చే హవిస్సులను, దానములను స్వీకరించడం లేదు. సంతానము లేని ఈ లోకం నాకు శూన్యంగా కనపడుతూ ఉంది. నాకు బతకడం వృథా అనిపించింది. ఈ చెరువులో దూకి చచ్చిపోదామని ఇక్కడకు వచ్చాను. ఎందుకంటే సంతానము లేని జీవితము వ్యర్థము కదా! పిల్లలు లేని ఇల్లు శ్మశానము వంటిది. నాకు ఎంత ధనము, ఆస్తి ఉంటే ఏమి లాభము. సంతానము లేకపోతే అవి అన్నీ వృథా కదా! నాకు సంతానము లేదు సరి కదా!మా ఇంట్లో పెరిగిన ఆవులు కూడా దూడలను ఈనడం లేదు. పూలమొక్కలు కూడా పూలు పూయడం లేదు. మా ఇంట్లో ఉన్న  చెట్లు కాయలు కాయడం లేదు. బయట నుండి పండ్లు కొనుక్కొని వస్తే అవి వెంటనే కుళ్లిపోతున్నాయి. సంతాన హీనుడికి ఇంతటి దౌర్భాగ్యము పడుతుందని అనుకోలేదు. ఈ దుర్భర జీవితం గడిపే దానికంటే చావడం నయమని ఇక్కడకు వచ్చాను." అని వెక్కి వెక్కి ఏడుస్తూ చెప్పాడు ఆ బ్రాహ్మణుడు.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

దు:ఖముతో కుమిలిపోతున్న ఆ బ్రాహ్మణుని చూచిన ఆ సన్యాసి హృదయం ద్రవించింది. ఆ సన్యాసి బ్రాహ్మణునితో ఇలా అన్నాడు.

"ఓ బ్రాహ్మణుడా! నీకు ఉన్నంతలో తృప్తిగా జీవించు. లేని సంతానం కోసం తాపత్రయ పడకు. ఈ మోహమును వదిలిపెట్టు. నీ పూర్వ జన్మలో చేసిన కర్మఫలం అలా ఉంది. కాబట్టి వివేకవంతుడవై ఈ సంసారము అనే బంధనములు వదిలిపెట్టు. నీకో విషయం తెలియదు. నీవు పూర్వజన్మలో చేసిన పాపఫలములు బలీయంగా ఉన్నాయి. నీకు రాబోయే ఏడు జన్మల వరకు సంతానం కలిగేయోగం లేదు. కాబట్టి నీవు ఈ సంసార దు:ఖమును వదిలిపెట్టి సన్యసించు. ఇందులోనే సుఖము, పరమ శాంతి ఉన్నాయి." అని అన్నాడు.

ఆ మాటలు విన్న ఆ బ్రాహ్మణుడు ఇలా అన్నాడు. "మహాత్మా! ఈ జ్ఞానము, వివేకము సంపాదిస్తే నాకేం ఒరుగుతుంది. నాకు కావాల్సింది సంతానము, సన్యాసము కాదు. సంతానం కోసం వస్తే సన్యాసం పుచ్చుకోమంటారేమిటి? ఇస్తే సంతానం ఇవ్వండి. లేకపోతే నా దారికి అడ్డురాకండి. నేను ఈ చెరువులో దూకి చస్తాను. ఎందుకంటే జీవితానికిపరమార్ధము భార్య, బిడ్డలు. సంసార సుఖం లేని సన్యాసము ఎందుకు దండగ. ఎంచక్కా భార్య, కొడుకులు, కూతుళ్లు, మనుమలు, మనుమరాళ్లు వీళ్లతో జీవితం అనుభవించక, సన్యాసం తీసుకోమంటారేమిటి స్వామీ!" అని అన్నాడు ఆ బ్రాహ్మణుడు.

వీడిని మార్చడం తన తరం కాదనుకున్నాడు సన్యాసి. " విధివ్రాతను నేను మార్చలేను కదా! నీకు సంతానము కావాలి. కాని

నీకు సంతాన యోగం లేదు. చెబితే వినవు. ఇదిగో ఈ పండు తీసుకో. దీనిని నీ భార్యకు ఇవ్వు. నీకు ఒక కుమారుడు కలుగుతాడు. కాని నీ భార్య ఒక సంవత్సరము పాటు శుచి, శౌచము పాటించాలి. ఇతరుల ఎడల దయ కలిగి ఉండాలి. శక్తికొలది దానధర్మాలు చేయాలి. రోజుకు ఒంటి పూట భోజనం చేయాలి. ఇలా చేస్తే నీకు పుట్టబోయే కుమారుడు శుద్ధసత్వగుణ సంపన్నుడు అవుతాడు." అని అన్నాడు.

బ్రాహ్మణుడు ఆ పండును తీసుకొని వచ్చి భార్యకు ఇచ్చి, సన్యాసి చెప్పిన మాటలు అన్నీ చెప్పాడు. తరువాత ధన సంపాదనము బయటకు వెళ్లాడు. భర్త మాటలు విన్న ఆమెకు కోపం వచ్చింది. దు:ఖంకూడా వచ్చింది. ఆ పండును ఎదురుగా పెట్టుకొని తన ఆంతరంగిక స్నేహితురాలితో ఇలా అంది. "చూడవే! నేను ఈపండు తినాలట. ఒంటి పూట భోజనం చేయాలట. అందరిపట్ల దయకలిగి ఉండాలట. ఇవన్నీ నాకు సాధ్యమేనా! పైగా పండు తింటే గర్భం వస్తుంది. పొట్ట పెరుగుతుంది. అసహ్యంగా తయారవుతాను. ఏమీ తినడానికి వీలు లేదు. ఒంట్లో నీరసం రాదా! ఇంట్లో పనులన్నీ ఎవరు చేస్తారు. నా మొగుడు చేస్తాడా! ఒక వేళ మా ఇంట్లో దొంగలుపడ్డారనుకో! అంత పొట్ట వేసుకొని నేను ఎలా పరుగెడతాను. ఎంతకూ ప్రసవం కాకపోతే ఎలాగ! నా గతేంటి! ప్రసవం జరిగేటప్పుడు బిడ్డ అడ్డంతిరిగితే నేను చస్తాను కదా! పైగా ప్రసవం అంటే మాటలా! ఎంత బాధ, నొప్పులు పడాలి. నేనా చాలా సుకుమారంగా పెరిగాను. ఇన్ని బాధలు తట్టుకోగలనా!

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

ఇదంతా ఒక ఎత్తు! మా ఆడపడుచు ఒట్టి దొంగ. నేను పురిటిలో ఉంటే ఆమె వచ్చి ఇంట్లో ఉన్నవి అన్నీ దోచుకొని పోతుంది. అప్పుడు నా గతేంటి. అదిసరే! నాకు బిడ్డ పుట్టింది. దాని ఆలనా పాలనా చూడాలా! పెంచాలా పెద్ద చెయ్యాలా! అది ఎంత కష్టం. ఇదంతా అవసరమంటావా! ఇన్ని బాధలు పడేకంటే పిల్లలు లేకపోవడమే ఉత్తమము. మొగుడు లేని పెళ్లాం, పిల్లలు లేని ఇల్లాలు జీవితంలో సుఖపడతారు అని నా అభిప్రాయం. ఏమంటావు." అని అడిగింది. ఈమె కుతర్కానికి ఆ స్నేహితురాలు ఆశ్చర్యపోయింది. ఏమీ అనలేక తల ఊపింది.

వెంటనే ఆ బ్రాహ్మణస్త్రీ సన్యాసి ఇచ్చిన ఆ పండును తన ఇంట్లో ఉన్న గోవుకు పెట్టింది. గోవు ఆ ఫలమును తృప్తిగా ఆరగించింది. భర్త ఇంటికి వచ్చాడు. పండు తిన్నావా అని అడిగాడు. ఓ తిన్నాను అని సమాధానం చెప్పింది ఆ బ్రాహ్మణ వనిత.అప్పటికి సర్ది చెప్పింది కానీ తనకు గర్భం ఎలా వస్తుంది. ఎలా బిడ్డను ప్రసవిస్తుంది. దీనికి మార్గం ఏమిటి? అని ఆలోచించసాగింది. ఇంతలో ఆమె అక్కగారు వాళ్ల ఇంటికి వచ్చింది. బ్రాహ్మణ స్త్రీ తన అక్కగారికి జరిగిన వృత్తాంతము అంతా పూసగుచ్చినట్టు వివరంగా చెప్పింది. మంచి ఉపాయము చెప్పమని అడిగింది.

అప్పటికే ఆమె అక్కగారు గర్భవతి. ఆ అక్కగారు ఆమెతో ఇలా అంది. "ఇప్పటికే నాకు వల్లమాలిన సంతానం. మరలా గర్భం. ఇంక నేను ఈ సంతానాన్ని పెంచలేను. నాకు బిడ్డపుట్టగానే నీకు ఇస్తాను. నీకే పుట్టింది అని నీ భర్తకు చెప్పి ఆ బిడ్డను నీవు పెంచుకో. నాకు ప్రసవం అయి బిడ్డ పుట్టే వరకు నీవు గర్భవతిగా నటించు." అని

ఉపాయం చెప్పింది.

ఇప్పుడు ఆ బ్రాహ్మణ స్త్రీకి ఒక సందేహం కలిగింది. "మరి బిడ్డకు పాలు కావాలి కదా! నాకు పాలు రావు కదా! ఎలాగ!" అంది. "దాందేముంది. నీకు సేవలు చెయ్యడానికి నన్ను పిలిపించుకో. నేను వచ్చి రోజూ బిడ్డకు పాలిస్తాను." అంది ఆమె అక్కగారు. ఆ ప్రకారంగా నిశ్చయించుకున్నారు. బ్రాహ్మణ వనిత తనకు గర్భం వచ్చినట్టు నెలలు పెరుగుతున్నట్టు నటించసాగింది. పురిటికి అక్కగారి ఇంటికి వెళ్లింది. ఆమె అక్క గారికి ప్రసవం అయింది. మగపిల్లవాడు కలిగాడు. పురిటిలోని బిడ్డను బ్రాహ్మణ స్త్రీకి ఇచ్చింది. తనకు బిడ్డ పుట్టగానే మరణించాడు అని తన భర్తకు అబద్ధం చెప్పింది. బ్రాహ్మణ స్త్రీ ఆ బిడ్డను భర్తకు చూపించి తనకు కలిగిన బిడ్డ అని చెప్పింది.

ఆ బ్రాహ్మణుడు నమ్మాడు. కుమారుడికి జాతక కర్మలు జరిపించాడు. మంగళ వాద్యాలు మోగాయి. లేక లేక కలిగిన బిడ్డకు ఘనంగా దానధర్మాలు చేసాడు. బిడ్డకు పాలు ఇవ్వడానికి అక్కను తన వద్దనే ఉంచుకుంది ఆ బ్రాహ్మణ స్త్రీ. తన కుమారునికి ధుంధుకారుడు అనే పేరుపెట్టాడు.

ఇది అలా ఉండగా, సన్యాసి ఇచ్చిన పండు తిన్న గోవు కూడా ఈనింది. కాని గోవుకు మగబిడ్డ పుట్టింది. జంతువుకు మనిషి పుట్టడం చూచి అంతా ఆశ్చర్యపోయారు. అన్నీ మానవ అవయవాలు ఉన్నాయి కానీ చెవులు మాత్రం ఆవు చెవులు. కాబట్టి గోవుకుపుట్టిన ఆ బాలునికి గోకర్ణుడు అని పేరు పెట్టారు. దుంధుకారుడు గోకర్ణుడు ఆ బ్రాహ్మణుని

ఇంట్లో పెరుగుతున్నారు.

గోకర్ణుడు సకల శాస్త్రములు చదివి పండితుడు అయ్యాడు. దుంధుకారుడు చెడు అలవాట్లకు బానిస అయి పరమ దుర్మార్గుడు అయ్యాడు. వాడికి స్నానము, శౌచము మొదలగు బ్రాహ్మణులకు ఉచితమైన లక్షణములు ఒకటీ లేవు. పైగా కోపం ఎక్కువ. డబ్బుకోసం శవాలు కూడా మోసేవాడు. ఇతరులను దోచుకొనే వాడు, కత్తులు, ధనుర్బాణములు ధరించేవాడు. ఇతరులను భయపెట్టి బాధించేవాడు. జంతువులను వేటాడేవాడు. మాంసము తినేవాడు. వేశ్యల వలలో చిక్కుకొని తండ్రి కష్టపడి సంపాదించి కూడబెట్టిన ఆస్తి అంతా సర్వనాశనం చేసాడు.  తల్లిని తండ్రిని కొట్టి ఇంట్లో ఉన్న వస్తువులను ఎత్తుకొని పోయి అమ్ముకునేవాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడికి తెలిసి వచ్చింది. “ఇటువంటి పరమ దుర్మార్గులు అయిన బిడ్డలు పుట్టేకంటే, సంతానం లేకపోవడమే మేలు. అని అనుకున్నాడు. ఇప్పుడు నేను నా భార్య ఎక్కడకు పోవాలి. ఏమి చెయ్యాలి. ఎలా బతకాలి. నాకు చావు తప్ప మరో మార్గం లేదు.” అని అనుకున్నాడు. ఆ సమయంలో గోకర్ణుడు ఆ బ్రాహ్మణునకు ఈ ప్రకారంగా హితోపదేశము చేసాడు.

“తండ్రీ! మీరు చింతించవలదు. ఈ సంసారమే సారము లేనిది. సంసారము దు:ఖము మయము. ప్రాపంచిక విషయములు మీలో మోహాన్నికలిగిస్తాయి. అయినా ఈ కుమారుడు ఎవరు? ఈ ధనం ఎవరిది? మీరు పుట్టక ముందు వీరు లేరు కదా! మధ్యలో వచ్చారు. మధ్యలో పోతారు. దీనికి చింతించడం దేనికి. కోరికలు లేని

వాడు నిరంతరం సుఖమునుపొందుతాడు. చక్రవర్తి కూడా కంటినిండా నిద్రపోడు. వాడికి సుఖం లేదు. కేవలము విరక్తి కలవాడు మాత్రమే సుఖంగా జీవిస్తాడు. కాబట్టి మీరు "ఇతడు నా కుమారుడు" అనే భావన వదిలిపెట్టండి. అప్పుడు వాడు ఎలా ఉన్నా మీకు చింత లేదు. ఈ శరీరము నశించేదే. కాబట్టి శరీరము మీద అభిమానము వదిలిపెట్టి వనములకు వెళ్లి తపస్సు చేసుకోండి."అని చెప్పాడు గోకర్ణుడు.

ఆ బ్రాహ్మణునకు జ్ఞానోదయం కలిగింది. "కుమారా! నేను మూర్ఖుడను. సన్యాసి మాటలు వినకుండా ఈ సంసార బంధనములలో చిక్కుకున్నాను. ఇదంతానా పూర్వజన్మ కర్మ ఫలము. నీవు చెప్పినట్టు నేను అడవులకు వెళతాను. అక్కడ ఏం చేయాలో చెప్పు." అని అడిగాడు. అప్పుడు గోకర్ణుడుఇలా అన్నాడు.

"తండ్రీ! ఈ శరీరము ఎముకలు, మాంసము, చర్మము మొదలగు వాటితో నిండినది. ఈ శరీరము నాది అనే భావన విడిచిపెట్టు. ఈ శరీరమే నీది కానపుడు దీనికి సంబంధించిన భార్య బిడ్డలు నీ వారు ఎలా అవుతారు. కాబట్టి ఎవరూ శాశ్వతము కారు. అన్నిటికంటే భాగవత ధర్మమే పరమ ధర్మము. ఇతర ధర్మములను విడిచిపెట్టు. భాగవత ధర్మమును ఆశ్రయించు. ధనమును, దాని వలన కలిగే భోగములను విడిచిపెట్టు. సత్‌సాంగత్యంలో గడుపు. సాధువులను సేవించు. ఎల్లప్పుడు భగవంతుని గురించి చింతించు. భాగవతమును పఠించు. అందలి రసమును ఆస్వాదించు." అని హితబోధ చేసాడు గోకర్ణుడు.

గోకర్ణుని మాటలు ఆ బ్రాహ్మణుని చెవులలో అమృతం పోసినట్టు అయింది. వెంటనే భార్యను, కుమారుని వదిలి అరణ్యములకు వెళ్లాడు. అక్కడ కుటీరము నిర్మించుకొని భగవంతుని సేవలో కాలంగడిపాడు. భాగవతములో దశమస్కంధము చదవసాగాడు. తుదకు కృష్ణునిలో ఐక్యం అయ్యాడు." అని సూత పౌరాణికకుడు శౌనకాది మహామునులకు వినిపించాడు.

పద్మపురాణము
ఉత్తరాఖండము భాగవత మహాత్త్యము
నాలుగవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

పద్మపురాణము
ఉత్తరాఖండము
భాగవత మహాత్త్యము ఐదవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూతి శౌనకాది మహామునులకు భాగవత మహాత్మ్యమును ఇలావినిపిస్తున్నాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! తండ్రి విరక్తితో అడవులకు వెళ్లిన తరువాత, అతని కుమారుడు అయిన దుంధుకారి ఒక రోజు తన తల్లిని తీవ్రంగా కొట్టాడు. ధనము ఎక్కడ దాచావో చెప్పు లేకపోతే చంపుతాను అనిబెదిరించాడు. కుమారుడు పెట్టే బాధలు తట్టుకోలేక ఆమె బావిలో దూకి మరణించింది. గోవుకు పుట్టిన గోకర్ణుడు తన

వారు అంటూ ఎవరూ లేకపోవడంతో తీర్థయాత్రలకు వెళ్లిపోయాడు. తనకు అడ్డు అంటూ ఎవరూ లేకపోవడంతో దుంధుకారి వేశ్యలను ఇంటికి తీసుకొని వచ్చాడు. వేశ్యలతో ఇంట్లోనే ఉండసాగాడు. వారిని పోషించడానికి కావలసిన ధనం సంపాదించడానికి, ఎన్నోరకములైన దుర్మార్గములను చేయసాగాడు.

వాడు సంపాదించే ధనముతో ఆ వేశ్యలకు తృప్తి కలుగ లేదు. బంగారు ఆభరణములు కావాలని వాడిని పీడించసాగారు. దుంధుకారి దొంగతనములు చేసి, ఆ ధనముతో వారికి ఆభరణములు చేయించాడు. కాని వారికి తృప్తి కలుగ లేదు. వాడి వద్ద ఉన్న ధనమును కాజేయడానికి వాడిని చంపాలని నిశ్చయించుకున్నారు. ఒక రోజు రాత్రివాడిని తాళ్లతో కట్టి గొంతుకు తాడు బిగించి చంపాలని ప్రయత్నించారు. కాని వాడు ఎంతకూ చావలేదు. వాడిని బతికి ఉండగానే తగుల పెట్టారు. ఆ మంటలలో పడి వాడు మరణించాడు. కాలిన శరీరమును ఆ వేశ్యలు పూడ్చిపెట్టారు. తమ దారిన తాము వెళ్లాపోయారు.

బలవంతంగా చంపబడిన దుంధుమారి ప్రేతాత్మ అయ్యాడు. తనకు తగిన శరీరాన్ని వెతుక్కుంటూ గాలి రూపంలో తిరుగుతున్నాడు. అప్పుడు దేవుడు గుర్తుకొచ్చాడు దుంధుమారికి. ఎవరూ తనకు తర్పణములు వదలకపోవడంతో దాహంతో, పిండం పెట్టక పోవడం తో ఆకలితో నకనకలాడుతూ “దేవుడా నాకేమిటి ఈ శిక్ష” అంటూ ఏడవసాగాడు.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

కొంత కాలము తరువాత గోకర్ణుడు తన గ్రామమునకు తిరిగి వచ్చాడు. దుంధుకారి అకాల మరణం గురించి విన్నాడు. వాడికి యధావిధిగా శ్రాద్ధకర్మలు నిర్వర్తించాడు. గయలో కూడా శ్రాద్ధము పెట్టాడు. అయినా దుంధుమారికి ప్రేతరూపము నుండి విముక్తి కలుగ లేదు. ఒక రోజు దుంధుమారి గోకర్ణుడికి తన భయంకరమైన ప్రేత రూపం చూపించాడు. నిర్వికారంగా ఉన్న గోకర్ణుడు ఆ ప్రేతమును చూచి ఇలా అన్నాడు.

“ఓ ప్రేతమా! నీవు ఎవరు? నీకు ఎవరు కావాలి? నాకు ఎందుకు నీ భయంకర రూపాన్ని చూపిస్తున్నావు. అసలు నీకు ఈ ప్రేతశరీరం ఎందుకు వచ్చింది.” అని అడిగాడు.

అప్పుడు దుంధుకారికి ఏడుపు వచ్చింది. పెద్దగా ఏడవ సాగాడు. మాట్లాడటానికి నోరు లేదు కాబట్టి సైగలతో తన గురించి చెప్పాడు. గోకర్ణుడికి అర్థం అయింది. వెంటనే తాను నేర్చిన మంత్ర విద్యతో నీటిని అభిమంత్రించి ప్రేతము మీద చల్లాడు. ప్రేతము శాంతించింది. దానికి వాక్కు వచ్చింది. గోకర్ణుడితో ఇలా చెప్పసాగింది.

“నేను నీ సోదరుడను. నా పేరు దుంధుకారి. నేను చెడు తిరుగుళ్లు తిరిగి బ్రాహ్మణత్వమునకు అపకీర్తి కలిగించాను. అజ్ఞానంలో ఎన్నో చేయరాని పనులు చేసాను. వేశ్యాసంగమంలో సుఖాలు అనుభవించాను. తుదకు ఆ వేశ్యలచేతిలో దుర్మరణం పాలయ్యాను. అకాల మరణం వలన ఈ ప్రేతత్వము పొందాను. కేవలం గాలిలో తిరుగుతున్నాను. సోదరా! నా మీద దయయుంచి నాకు ఈ ప్రేతత్వము నుండి విముక్తి కలిగించు.” అని వేడుకున్నాడు.

అప్పుడు గోకర్ణుడు ఇలా అన్నాడు.

"నేను నీకు గయలో కూడా శ్రాద్ధం పెట్టి పిండప్రదానం చేసాను. కానీ నీకు ఈ ప్రేతాత్మ నుండి విముక్తి ఎందుకుకలుగలేదో అర్థం కావడం లేదు. కాబట్టి దీనికి మరొక ఉపాయం ఆలోచించాలి. నీవు నిశ్చింతగా ఉండు. నీకు ప్రేతాత్మనుండి విముక్తి కలిగే ఉపాయం నేను ఆలోచిస్తాను." అని అన్నాడు. తరువాత దుంధుకారి అక్కడ నుండి వెళ్లిపోయాడు.

గోకర్ణుడు ఈ విషయాన్ని ఎంతో మంది పండితులతో, విద్వాంసులతో చర్చించాడు. కానీ వారు కూడా ఏ విధమైన పరిష్కారం చూపలేకపోయారు. అప్పుడు గోకర్ణుడు సూర్యుని ఉపాసించి ఆయనను ఇలా ప్రార్థించాడు. "ఓ దేవా! నీకు సకలము తెలుసు. నా సోదరుడు దుంధుకారి ప్రేతాత్మ నుండి విముక్తి పొందే మార్గము తెలియజెయ్యి." అని అడిగాడు.

దానికి సూర్యభగవానుడు ఇలా చెప్పాడు. "గోకర్ణా! ఇతడు భాగవత సప్తాహములో పాల్గొని భాగవతపురాణమును శ్రద్ధతో వింటే ఇతనికి ప్రేతాత్మనుండి విముక్తి లభిస్తుంది." అని చెప్పాడు.

సూర్యుని ఆదేశము ప్రకారము గోకర్ణుడు భాగవత సప్తాహమును ఏర్పాటు చేసాడు. భాగవత పురాణమును వినడానికి ఎంతో మంది జనులు వచ్చారు. కుంటివాళ్లు, గుడ్డివాళ్లు, ముసలివాళ్లు తమ తమ పాపవిముక్తి కొరకు అక్కడకు చేరుకున్నారు. గోకర్ణుడు తన

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

స్థానములో కూర్చుని భాగవత పురాణమును చెప్పసాగాడు. ఇంతలో దుంధుకారి ప్రేతము కూడా అక్కడకు వచ్చింది.

కాని దానికి కూర్చోడానికి స్థలం దొరకలేదు. ఆ ప్రేతానికి ఒక మూల నిలబెట్టబడి ఉన్న ఏడు గణుపులతో ఉన్న ఒక వెదురు కర్ర కనపడింది. ఆ ప్రేతము బోలుగా ఉన్న ఆ వెదురు గడ కింది నుండి లోపలకు దూరింది. అక్కడ నుండి భాగవత పురాణమును వినసాగింది. గోకర్ణుడు భాగవత కథను వినిపించసాగాడు.

ఒక రోజు గడిచింది. దుంధుమారుని ప్రేతము మొదటి గణుపును ఛేదించుకొని రెండవ గణుపులోనికి ప్రవేశించింది. ఆవిధంగా రెండవ రోజు సాయంత్రానికి రెండవ గణుపు, మూడవ రోజు సాయంత్రం మూడవగణుపు,ఈ విధంగా ఏడురోజులు పన్నెండు స్కంధముల భాగవత సప్తాహము పూర్తి అయ్యేసరికి ఆ ప్రేతము ఏడుగణుపు ఛేదించుకొని బయటకు వచ్చింది. దుంధుకారికి ప్రేతత్వము పోయి దివ్యత్వము వచ్చింది.

మేఘశ్యామల వర్ణముతో, పీతాంబరమును కట్టుకొని తులసి మాలలు ధరించి అందరి ముందు నిలబడ్డాడు దుంధుకారి. వెంటనే పోయి తన సోదరుడు గోకర్ణుని పాదముల మీద పడ్డాడు. "సోదరా! నీ మేలు ఎన్నటికీ మరిచిపోలేను. నాకు ఈ ప్రేతత్వము నుండి విముక్తి కలిగించావు. నీవు చెప్పిన భాగవత కథ వినడం వలన నా ప్రేతత్వము నశించింది. నేను శ్రీకృష్ణునిలో సాయుజ్యము పొందాను. అగ్ని కర్రను మండించునట్లు, భాగవత కథా శ్రవణము అన్ని పాపములను నాశనం చేస్తుంది. ఈ కలియుగంలో భాగవత కథను

వినని వారి జన్మ వృధా అని చెప్పవచ్చును. పుట్టినప్పటి నుండి ఆహారము, నీరు, ఆభరణములు, విలువైన బట్టలు, సువాసన ద్రవ్యములతో పోషించిన ఈ శరీరము శాశ్వతము కాదు. కాని అదే శరీరములో ఉన్న చెవులతో భాగవత కథ అనే అమృతమును తాగితే, అతనికి అమృతత్వము కలుగుతుంది. నాకు ఇప్పుడు తెలిసి వచ్చింది.

ఈ శరీరము ఎముకలు, మాంసము, నాడులు, రక్తము మొదలగు దుర్గంధ పూరితమైన వాటితో నిండి ఉంది. కాని ఈ చర్మము మాత్రము బయట ప్రపంచానికి వాటిని అందంగా చూపిస్తూ ఉంది. అంతే కాదు ఈ శరీరమునకు రోగములు, వార్ధక్యము బాధలను కలిగిస్తాయి. పుట్టినప్పటి నుండి ఈ శరీరము అడ్డమైన కోరికలతో సతమతమౌతూ ఉంటుంది. దీనికి శాంతి లేదు. మనసంతా కల్మషంతో నిండి ఉంటుంది.

ప్రాణములు పోయిన తరువాత ఈ శరీరాన్ని కాల్చి బూడిద చేస్తారు లేకపోతే పాతి పెడతారు. బతికి ఉన్నప్పుడు మాత్రమే ఈ అశాశ్వతమైన శరీరంతో శాశ్వతమైన సుఖాన్ని ఎందుకుపొందకూడదో ఈ మానవులు ఆలోచించరు. ఉదయం వండిన పదార్థము రాత్రికి చెడి పోతుంది. అటువంటి పదార్థములను తిన్న మానవుడు నేను శాశ్వతంగా ఉంటానంటాడు. ఎంత అవివేకము. అటువంటి అశాశ్వతమైన శరీరంతో భాగవత కథా శ్రవణం చేస్తే, భగవంతునితో సాయుజ్యం కలుగుతుంది కదా! సకల దోషములు నివారించే దివ్యమైన ఔషధము ఇదే కదా!

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

ప్రతి మనిషి చావడానికే పుడుతున్నాడు. పుట్టి చస్తున్నాడు. ఆ మధ్య కాలంలో భాగవత కథా శ్రవణం చేస్తే వెదురు గణుపులు పగిలినట్టు వాడి పాపములు పగిలిపోతాయి. వాడిలో ఉన్న సందేహములు నశిస్తాయి. వైరాగ్యము కలుగుతుంది. మనసులోని మాలిన్యము కడిగి వేయడానికి భాగవత కథను మించిన వస్తువు మరొకటి లేదు. భాగవత కథను విన్న వారికి ముక్తి తప్పక లభిస్తుందని పెద్దలు చెబుతారు కదా!" అని దుంధుకారి భాగవత కథను అనేక విధములుగా ప్రశంసిస్తుంటే ఆకాశం నుండి ఒక విమానము వచ్చింది. అందులో విష్ణుసేవకులు ఉన్నారు. దుంధుకారుని విమానం ఎక్కమని ప్రార్థించారు.  వారిని చూచి గోకర్ణుడు ఇలా అన్నాడు.

"ఇక్కడ నిర్మలమైన మనసుతో భాగవత కథను వింటున్నవారు ఎంతో మంది ఉన్నారు. మీరు ఈ దుంధుమారునికే ఒక విమానము తీసుకొని వచ్చారు. వీరందరికీ విమానములు ఎందుకు తీసుకొని రాలేదు. మీకుకూడా ఈ భేదబుద్ధి ఉందా! తెలియజేయండి." అని సూటిగా ప్రశ్నించాడు.

అప్పుడు విష్ణు సేవకులు ఇలా అన్నారు. "భాగవతోత్తమా! నీవు చెప్పినట్టు వీరందరూ భాగవత కథను విన్నారు. కాని వినడంలోనే భేదం ఉంది. కాని ఇతడు విన్న కథను మననం చేసాడు. వీరందరూ కేవలం విన్నారు. వదిలేసారు. ఇంకొక విషయం. దుంధుకారుని ప్రేతము, ఈ ఏడురోజులు ఉపవాసము చేసింది. భాగవత కథను శ్రద్ధగా భక్తితో స్థిరమైన చిత్తముతో విన్నది. విన్న కథను మననం చేసింది. వీరందరూ అలా చేయలేదు. వీరి చెవులు ఇక్కడ భాగవత కథను వింటున్నా, వీరి మనసులు వేరే చోట తిరుగుతున్నాయి. అందుకని వీరికి భాగవత కథా

ఫలము దక్కలేదు. వీరందరూ భక్తి శ్రద్ధలతో, నమ్మకంతో, ఆర్తితో, ఏకాగ్రమైన మనసుతో, నిశ్చలమైన బుద్ధితో, భాగవత కథను వింటే, వీరికి కూడా తప్పకుండా విష్ణుసామీప్యము కలుగుతుంది." అని చెప్పి విష్ణు సేవకులు దుంధుమారుని విమానము ఎక్కించుకొని వెళ్లిపోయారు.

ఇది అంతా విన్న వారు గోకర్ణుని మరలా భాగవత కథా సప్తాహమును చేయమని కోరారు. ఇప్పుడు అక్కడ ఉన్న వారు భాగవత కథను భక్తిశ్రద్ధలతో నియమ నిష్ఠలతో విన్నారు. సాక్షాత్తు శ్రీమన్నారాయణ మూర్తి అనేక విమానములతో అక్కడ ప్రత్యక్షం అయ్యాడు. అందరినీ విమానములను ఎక్కించాడు. గోకర్ణుని ఆలింగనము చేసుకొని తనలో ఐక్యం చేసుకున్నాడు. తనతో గోలోకమునకు తీసుకొని వెళ్లాడు. విమానములు ఎక్కిన వారంతా వైకుంఠము చేరుకున్నారు.

నారదా! ఈ గోకర్ణుని చరిత్రను చదివినా, విన్నా, వారికి అధికమైన ఫలములు చేకూరుతాయి. తిరిగి వారికిజన్మ ఉండదు. మునులు, యోగులు, సిద్ధులు తాము ఎన్నో సంవత్సరములు సాధన, తపస్సు చేసి పొందిన ఫలములను, సామాన్య మానవులు కేవలము భాగవత కథా శ్రవణం చేసి పొందుతారు. వారి పాపములు నాశనం అవుతాయి. ఈ గోకర్ణుని కథను శ్రాద్ధకాలంలో చదివితే పితృదేవతలకు మోక్షం కలుగుతుంది." అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు గోకర్ణుని వృత్తాంతమును వినిపించాడు. పద్మపురాణము, ఉత్తరఖండము, భాగవత మహాత్మ్యము ఐదవ అధ్యాయము సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

పద్మపురాణము,

ఉత్తరఖండము భాగవత మహాత్మ్యము

ఆరవ అధ్యాయము.

సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహా మునులకు పద్మ పురాణము లోని భాగవత మహాత్మ్యమును ఈ విధంగా వినిపిస్తున్నాడు.

"మహా మునులారా! తరువాత సనకాది మునులు నారదునితో ఇలా అన్నారు.

"నారదా! ఇప్పుడు మేము నీకు భాగవత సప్తాహము ఏ విధంగా చేయాలో చెబుతాము. ఈ భాగవత సప్తాహము ఒక్కరి వల్ల అయ్యేపని కాదు. అందరూ కలిసి, ధనము పోగు చేసి, సామూహికంగా చేయవలసిన పని. మొట్ట మొదట భాగవత సప్తాహము చేయడానికి మంచి ముహూర్తము నిర్ణయించాలి. ఈ భాగవత సప్తాహమునకు ఒక వివాహము చేసినంత వ్యయము అవుతుంది. దాని తగ్గ ధనము సమకూర్చుకోవాలి.

భాగవత సప్తాహమునకు ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తీకము, మార్గశీర్షము నెలలు ఉత్తమమైనవి. ఈ నెలలలో భాగవతము వింటే మోక్షము వస్తుంది. ఈ నెలలలో త్యాజ్యములు అనగా కర్తరిలు, మౌఢ్యములు ఉన్న రోజులు

విడిచి, మంచి ముహూర్తము నిర్ణయించాలి. ఈ కార్యనిర్వహణకు ఉత్సాహవంతులైన ఇతరుల సహాయము తీసుకోవాలి. తరువాత ఈ భాగవత సప్తాహము జరుగుతుంది, మీరందరూ సపరివారంగా రావలెను అని దేశదేశములలో ఉన్న అందరికీ తెలియపరచాలి. స్త్రీలు, శూద్రులు, నిమ్నకులముల వారు కూడా వచ్చివినడానికి తగిన ఏర్పాట్లు చేయాలి. ఆహ్వానము ఈ విధంగా ఉండాలి.

"సమస్తమైన జనులకు తెలియజేయునది ఏమనగా.... ఇక్కడ ఏడు దినముల వరకు భాగవత సప్తాహము జరుపబడును. సత్పురుషులు అందరూ వస్తారు. భాగవత కథను వినడానికి భగవద్భక్తులు అయిన మీరందరూ రావలసినది. మీకు అన్ని రోజులు రావడానికి వీలుకాకపోతే కనీసం కొన్ని రోజులైనా, లేక ఒక్కరోజైనా రావలసినది. ఇక్కడ ప్రతినిమిషం కూడా విలువైనది." అని అందరికీ ఆహ్వానములు పంపాలి.

వచ్చినవారికి భోజన, వసతి ఏర్పాటు చేయాలి. ఈ కథాశ్రవణము ఇంట్లో కానీ, ఆరుబయట కానీ, బహిరంగ ప్రదేశములో కానీ ఏర్పాటు చేయవచ్చును. అక్కడ భూమిని చిమ్మి, అలికి, ముగ్గులుపెట్టి అందంగా అలంకరించాలి. కూర్చోడానికి తగిన ఆసనములను, చాపలను ఏర్పాటు చేయాలి. మధ్యలో ఎత్తైన ఒక వేదికను ఏర్పాటు చేయాలి. దానిని అరటి స్తంభములతో, మామిడి తోరణములతో అలంకరించాలి. దాని మీద పౌరాణికుడు కూర్చోడానికి ఒక దివ్యమైన ఆసనము ఏర్పాటు చేయాలి. పురాణము చెప్పే పౌరాణికుడు తూర్పువైపు తిరిగి కూర్చుంటే, వినేవారు ఉత్తరదిక్కు

ముఖం పెట్టి కూర్చోవాలి. పౌరాణికుడు ఉత్తరము వైపు ముఖం పెట్టి కూర్చుంటే, వినేవారు తూర్పువైపు ముఖం పెట్టి కూర్చోవాలి.

ఇంకా భాగవత పురాణమును చెప్పే వక్త, వేదములు, శాస్త్రములు స్పష్టంగా వ్యాఖ్యానించ కలిగే వాడు, వివిధములైన ఉ పమానములతో చెప్పగలిగిన వాడు, వివేకము కలవాడు, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి లేని వాడు, భగవద్భక్తి కలవాడు, అయిన బ్రాహ్మణుడు అయి ఉండాలి. అంతే కానీ, స్త్రీలోలుడు, వివాదాస్పదుడు, వితండంగా వాదించేవాడు, అయిన బ్రాహ్మనుడు పనికిరాడు.

పురాణము చెప్పే వక్తకు సహాయకునిగా మరొక విద్వాంసుని నియమించాలి. అతడు కూడా శ్రోతలకు కలిగే అన్ని సందేహములను తీర్చగల సమర్థుడు, జనులు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పగల నేర్పరి అయి ఉండాలి. కథాప్రారంభము రోజు పౌరాణికుడు పొద్దుటే లేచి కాలకృత్యములు తీర్చుకొని, స్నాన సంధ్యలు ఆచరించి, ముందు విఘ్నేశ్వరపూజ చేయాలి. తరువాత ఒక మంటపమును ఏర్పరచి అందులో శ్రీహరిని ప్రతిష్ఠించాలి. తరువాత శ్రీహరికి షోడశ ఉపచారములతో పూజాదికములు నిర్వర్తించాలి. భగవంతుని సంసారసాగరము నుండి ఉద్ధరించమని ప్రార్థించాలి. ' తరువాత భాగవత గ్రంథమును యధావిధిగా పూజించాలి. నివేదన సమర్పించాలి. భాగవత కథా శ్రవణమునిర్విఘ్నంగా సాగాలని ప్రార్థించాలి.

తరువాత భాగవత కథను చెప్పే వక్తను పూజించాలి. నూతన వస్త్రములు, భూషణములు ఇచ్చి సత్కరించాలి. తరువాత భాగవ కథా సప్తాహ దీక్షను యజమాని స్వీకరించాలి. ఏడు దినముల వరకు దీక్షలో ఉండాలి. కథాగానము ఏ ఆటంకము లేకుండా జరగడానికి ఐదుగురు బ్రాహ్మణులచేత నిరంతరము ఓం నమోభగవతే వాసుదేవాయ అనే ద్వాదశాక్షరీ మంత్రమును ఏడు రోజులు నిరాఘాటంగా జపం చేయించాలి.

తరువాత యజమాని, ఆహూతులైన ప్రేక్షకులకు, వక్తకు, ఇతరులకు నమస్కరించి తన ఆసనము మీద కూర్చోవాలి. భాగవత కథను వినే సమయంలో ఇతర విషయముల గురించి అంటే భార్యా, బిడ్డలు, ధనము, ఆస్తులు, వ్యాపారములు, ప్రాపంచిక విషయములు వీటి గురించి ఆలోచించరాదు. మనసు నిర్మలంగా ఉంచుకోవాలి.

భాగవత కథను ఉదయం మొదలు పెట్టి మూడున్నరజాములు అనగా పదిన్నర గంటల కాలము ప్రవచనం చేయాలి. మధ్యలో రెండు జాముల తరువాత భోజన విరామం ఇవ్వాలి. కథను వినేటప్పుడు అందరూ మౌనంగా ఉండాలి. ఏ విషయముల గురించి మాట్లాడకూడదు. వక్త భోజనము చేయకుండా అల్పాహారము కానీ, ఫలములను కానీ ఆహారంగా తీసుకోవడం మంచిది. వినే వాళ్లు కూడా ఒంటిపూజ భోజనం చేయడం మంచిది. ఉండగలిగితే ఏడు రోజులు ఉపవాసం చేయవచ్చును. నేతిని, పాలను ఆహారంగా తీసుకోవచ్చును. ఉండలేని వారు ఫలములను కానీ, భోజనమును కానీ స్వీకరించవచ్చును. ఏది సుఖంగా ఉంటుందో దానిని

పాటించాలి. కడుపులో ఆకలిగా ఉంటే భాగవతం వినడానికి ఏకాగ్రత కుదరదు అని భావించిన వారు ఉపవాసము చేయకుండా మితంగా భోజనం చేయడం మంచిది.

భాగవత కథను వినేవారికి శ్రీహరి మీద భక్తి, శ్రద్ధ ఉండాలి. భక్తి లేని వారు వినకూడదు. ఈ ఏడురోజులు వినేవారు, చెప్పేవారు బ్రహ్మచర్యము పాటించాలి. నేల మీదపడుకోవాలి. కథాశ్రవణం పూర్తి అయిన తరువాత అరటి ఆకులలో భోజనం చేయాలి. చెప్పేవారు, వినేవారు కోపమును, ద్వేషమును, కోరికలను, గర్వమును అభిమానమును మాత్సర్యమును, లోభమును, డాంబికమును, వదిలిపెట్టాలి. వేదములను, బ్రాహ్మణులను, గురువులను, స్త్రీలను, నిందించకూడదు. ఏడు రోజులు దీక్ష వహించి కథాశ్రవణం చేసేవారు రజస్వల అయిన స్త్రీలకు దూరంగా ఉండాలి.

భాగవత కథను చెప్పేవారు, వినేవారు సత్యము పలకాలి, శు చిగా ఉండాలి. ఇతర విషయములు మాట్లాడకూడదు. వినయంగా ఉ ండాలి.ముఖ్యంగా దారిద్ర్యంతో బాధపడేవాడు, క్షయరోగముతో బాధ పడేవాడు, ఇతర రోగములతో బాధపడేవాడు, అదృష్టము లేని వాడు, పాపములు చేసిన వాడు, సంతానము లేని వాడు, మోక్షము కొరకు ప్రయత్నము చేసేవాడు భాగవతకథను తప్పకుండా వినాలి.

వయసు వచ్చినా రజస్వల కాని వనిత, సంతానము లేనివారు, ఒకే సంతానము కలవారు, సంతానము పుట్టి పోతున్న వారు, ప్రతి సారీ గర్భస్రావము కలుగుతున్న స్త్రీలు, భాగవతకథను వింటే

సంతానవతులౌతారు. పైన చెప్పబడిన బాధలు కలవారు భాగవత కథను వింటే అత్యధికమైన ఫలములనుపొందుతారు అనడంలో సందేహము లేదు.

భాగవత కథ పూర్తి కాగానే ఉద్యాపనము చేయాలి. ముఖ్యంగా శ్రీకృష్ణజన్మాష్టమి నాడు ఉద్యోపన చేస్తే మంచి ఫలితము ఉంటుంది. అంటే శ్రావణ బహుళ పాడ్యమి నాడు మొదలు పెట్టి సప్తమితో కథను ముగించి, కృష్ణాష్టమి నాడు ఉద్యాపన చేయాలి. కాని ఉద్యాపన చేయాలి అన్న నియమం ఏమీ లేదు. భాగవత కథను శ్రద్ధగా వినడమే ముఖ్యము.

ఉద్యాపన అంటే ఏమీ లేదు. భాగవతమును చెప్పిన వారిని, భాగవత గ్రంథమును భక్తితో పూజించాలి. భాగవత కథను విన్న వారికి ప్రసాదంగా తులసిదళములను, తులసి మాలలను ప్రసాదంగా ఇవ్వాలి. తరువాత బ్రాహ్మణులకు, పేద వారికి వస్త్రదానము, అన్నదానము చేయాలి.  తరువాత అందరూ గీతాపఠనం చేయాలి. గృహస్థులు హోమ కార్యము చేయాలి. ఆ హోమములో దశమస్కంధములోని శ్లోకములు చదువుతూ పాయసము, తేనె, నెయ్యి, నువ్వులు మొదలగు వాటితో ఆహుతులు ఇవ్వాలి. లేకపోతే ఏకాగ్రచిత్తంతో గాయత్రి మంత్రం చదువుతూ హోమంలో ఆహుతులు ఇవ్వాలి. ఎందుకంటే భాగవత పురాణము సాక్షాత్తు గాయత్రి స్వరూపము. గృహస్థ హోమము చేయడానికి శక్తి లేకపోతే హోమ సామగ్రిని ఒక బ్రాహ్మణునికి ఇచ్చి ఆయనతో హోమం చేయించాలి.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

ఇంత వరకు చేసిన కార్యములలో ఏవైనా దోషములు ఉన్నట్లయితే ఆ దోషములు పోవడానికి విష్ణుసహస్రనామ పారాయణ చేయాలి. దీని వలన అన్ని కర్మలు ఫలితం ఇస్తాయి. తరువాత 12 మంది బ్రాహ్మణులకు పాయసము, తేనె మొదలగు ప్రసాదములను ఇవ్వాలి. వ్రతం పూర్తి కావడానికి గోవులను, బంగారమును దానంగా ఇవ్వాలి.

భాగవత పురాణ శ్రవణము అనే వ్రతం చేసే వారికి శక్తి ఉంటే మూడు తులముల బంగారముతో ఒక బంగారుసింహాసనము చేయించి అందులో భాగవత గ్రంథమును పెట్టి, దానిని యదావిధిగా ఉపచారములు చేసి పూజించాలి. తరువాత జితేంద్రియుడు ఉత్తముడు అయిన బ్రాహ్మణునికి దానంగా ఇవ్వాలి. ఈ ప్రకారంగా చేస్తే ఆ దాత జనన మరణ చక్రము నుండి విముక్తుడు అవుతాడు." అనిసనకసనందులు నారదునికి భాగవత మహాత్మ్యమును వినిపించారు. అని సూతుడు శౌనకుడు మొదలగు మహామునులకు చెప్పిఇంకా ఇలా అంటున్నాడు.

"శౌనకాది మహామునులారా! ఈవిధంగా చెప్పిన తరువాత సనకుడు మొదలగు మహామునులు భాగవత కథను ప్రవచనం చేసారు. సకల ప్రాణకోటి ఆ భాగవత కథను విన్నారు. భాగవత కథ పూర్తిగా విన్న తరువాత భక్తికి, దాని కుమారులైన జ్ఞాన వైరాగ్యములకు, శక్తి, పుష్టి కలిగాయి. వారు మరలా యవ్వనవంతులయ్యారు. భక్తి, జ్ఞానము, వైరాగ్యములు సకల ప్రాణుల మనసులలో ప్రవేశించి, వారి మనసులను భక్తి,.. జ్ఞాన వైరాగ్యములతో నింపాయి. తన కోరిక నెరవేరడంతో నారదుడు పరమానంద భరితుడు అయ్యాడు. తన

కోరిక మేరకు భాగవత కథను ప్రవచనం చేసిన సనకాదులకు నారదుడు చేతులు జోడించి నమస్కరించాడు. వారితో ఇలా అన్నాడు.

"మహా మునులారా! నేను ధన్యుడను అయ్యాను. తమరు దయతో భాగవత పురాణమును ప్రవచనము చేసి భక్తి, జ్ఞాన వైరాగ్యములకు పరిపుష్టిని కలిగించారు. ఈ భాగవత కథా శ్రవణము అన్ని ధర్మముల కంటే శ్రేష్టమైనది." అని స్తుతించాడు.

ఇంతలో వ్యాసుని కుమారుడైన శుక మహర్షి అక్కడకు వచ్చాడు. నారదుడు మొదలగు వారు శుకునికి నమస్కరించి అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించారు. ఒక ఉన్నత ఆసనము మీద కూర్చోబెట్టారు. అప్పుడు శుకుడు వారితో ఇలా అన్నాడు.

"మహానుభావులారా! ఈ భాగవత పురాణము వేదము అనే కల్పవృక్షమునకు కాచిన పండు. శుకుడు అనే నేను ఈ ఫలమును నా తండ్రి వ్యాసుని ముఖతా మొదట ఆస్వాదించాను. ఈ ఫలము మొత్తము ఆస్వాదించతగ్గదే. మానవుని శరీరంలో చైతన్యం ఉన్నంత వరకూ ఈ ఫలము ఆస్వాదించతగ్గదే. వ్యాసముని రచించిన ఈ భాగవతములో నిష్కామ కర్మ అనే పరమ ధర్మము గురించి చెప్పబడింది. సత్యము గురించి చెప్పబడింది. దీని వలన తాపత్రయములు నశించి పోతాయి. భాగవతమును చదివితే ఇతర శాస్త్రములను చదవనవసరము లేదు. దీనిని వినిన వారి మనసులలో భగవంతుడు కొలువై ఉంటాడు.

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

ఈ భాగవతము 18 పురాణములలో తిలకము లాంటిది. ఇందులో జ్ఞానము, విజ్ఞానము గురించి విపులంగా చెప్పబడింది. దీనిని చదివితే భక్తి, జ్ఞానము, వైరాగ్యము కలుగుతాయి. అత్యంత భక్తి శ్రద్ధలతో భాగవత పురాణమును చదివిన వారు, విన్న వారు, ముక్తిని పొందుతారు. ఈ భాగవతము స్వర్గలోకములో గానీ, వైకుంఠములో గానీ, సత్యలోకములో గానీ, కైలాసములో గానీ లభించదు. కేవలము మానవులకు లభించిన పెన్నిధి భాగవతము."అని శుకుడు చెప్పాడు.

శుకుడు ఈ విధంగా చెబుతూ ఉండగానే ఆ సభలోకి ప్రహ్లాదుడు, బలి చక్రవర్తి, ఉద్ధవుడు, అర్జునుడు వారితో పాటు శ్రీహరి అక్కడకు వచ్చారు. నారదుడు వారందరినీ అర్ఘ్యపాద్యములతో పూజించి ఉచితాసనములను సమర్పించాడు. ఈ వింత చూడటానికి కైలాసము నుండి పార్వతీసమేతంగా మహాశివుడు, సరస్వతీ సమేతంగా సత్యలోకమునుండి బ్రహ్మ అక్కడకు వచ్చాడు. అందరూ కలిసి శ్రీహరిని కీర్తించడం మొదలు పెట్టారు.

భక్తి, జ్ఞానము, వైరాగ్యము ఆనందంతో నృత్యం చేసాయి. వారి సంకీర్తనములకు సంతసించిన శ్రీహరివారికి ఏం కావాలో కోరుకోమన్నాడు. వారంతా ముక్తకంఠంతో శ్రీహరితో ఇలా అన్నారు.

"దేవా!మాకు ఒకే ఒక కోరిక ఉంది. దానిని నీవు తీర్చాలి. అదేమిటంటే, భవిష్యత్తులోఎక్కడ భాగవత సప్తాహము జరుగుతుంటే అక్కడికి నీవు తప్పకుండా రావాలి. ఇదే మేము నిన్ను కోరుకునేది." అని అడిగారు.

దానికి శ్రీహరి సంతసించి "అలాగే జరుగుతుంది." అని వరం ఇచ్చి వెళ్లిపోయాడు. తరువాత నారదుడు అక్కడకు వచ్చిన వారికి అందరికీ సాష్టాంగ ప్రణామం చేసాడు. తరువాత ఎవరి లోకములకు వారు వెళ్లిపోయారు.

శౌనకాది మహామునులారా! శుకయోగీంద్రుడు భాగవతపురాణములో భక్తిని, జ్ఞాన వైరాగ్యములను నిక్షిప్తం చేసాడు. ఆ కారణం చేత భాగవతము ఎవరు చదివితే వారి హృదయములలో భక్తి, జ్ఞాన, వైరాగ్యములు ప్రవేశిస్తాయి. సంసార సాగరము నుండి విముక్తి పొందుతారు." అని సూతి శౌనకాది మహామునులకు భాగవత మహాత్మ్యమును వివరించాడు.

అప్పుడు శౌనకుడు ఇలా అడిగాడు. "తమరు చెప్పిన ప్రకారము ఈ భాగవత పురాణము శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు, సనకాదులు నారదుడు మొదలగు మహామునులకు, గోకర్ణుడు దుంధుమారి మొదలగు భక్తులకు వినిపించాడు అని చెప్పారు కదా! దీనిని ఏసమయములలో వినిపించారో చెప్పగలరా!" అని అడిగాడు. దానికి సూతి ఇలా సమాధానం చెప్పాడు.

"బ్రాహ్మణోత్తములారా! శ్రీకృష్ణభగవానుడు తన అవతారమును పరిసమాప్తి చేసి వైకుంఠమునకు వెళ్లిన తరువాత, కలియుగము ప్రవేశించింది. తరువాత ముప్పది సంవత్సరములకు, భాద్రపద శుద్ధ నవమి నాడు శుకుడు భాగవత కథను పరీక్షిత్తుకు వినిపించడం మొదలు పెట్టాడు. తరువాత కలియుగములో రెండు

(సేకరణ: పద్మపురాణము ఉత్తర ఖండము).

వందల సంవత్సరములు గడిచాయి. ఆషాఢ శుద్ధనవమి నాడు గోకర్ణుడు ఈ కథను దుంధుమారికి వినిపించాడు. తరువాత ముప్పది సంవత్సరముల తరువాత కార్తీక శుద్ధ నవమి నుండి సనకాదులు నారదునికి మొదలగు భాగవతోత్తములకు ఈ కధను చెప్పడం మొదలు పెట్టారు. ఈవిధంగా భాగవత కథ కలియుగంలో వ్యాప్తి చెందింది.

ఈ కలియుగములో భాగవత కథ ప్రాపంచిక విషయములనుండి విముక్తిని ప్రసాదిస్తుంది. మీరందరూ ఎల్లప్పుడూ భాగవత కధామృతమును తాగుతూ ఉండండి. ఎక్కడ భాగవత కథను చదువుతారో అక్కడ శ్రీకృష్ణుడు ఉంటాడు. ఈ కథ సకల పాపములు నాశనం చేస్తుంది. ముక్తిని ప్రసాదిస్తుంది. మానవులలో భక్తి, జ్ఞాన,వైరాగ్యములను కలుగజేస్తుంది. భాగవత శ్రవణము ముందు ఇతర గ్రంధములు, తీర్థసేవనములు ఎందుకూ పనికిరావు.

ఒకసారి యమధర్మరాజు తన భటులతో ఇలా అన్నాడు. “మీరు ఎవరి వద్దకన్నా వెళ్లండి కానీ భాగవతము చదువుతున్న చోటికి, భాగవతము వింటున్న వారి వద్దకు వెళ్లకండి. మనం పాపులను మాత్రమే శిక్షించాలి కానీ భాగవతము వినేవారిని కాదు.” అని అన్నాడట. దీనిని బట్టి భాగవత మహాత్మ్యము ఎటువంటిదో అర్థం చేసుకోవచ్చు.

కాబట్టి ఓ మహామునులారా! బ్రాహ్మణోత్తములారా! మీరుకూడా ఎల్లప్పుడు భాగవత కథను గానం చేయండి. వినండి.

తరించండి. ఇతర కథల జోలికి వెళ్లకండి. ఈ కథామృతము చెవిలో పడితే చాలు ముక్తి దానంతట అదే కలుగుతుంది. దీనికి సాక్షి పరీక్షిత్ మహారాజే!

ఈ భాగవతము సర్వశాస్త్ర సిద్ధాంతముల సారము. ఇంతకంటే పవిత్రగ్రంధము మరొకటి లేదు. అందువలన మీరందరూ నిరంతరము భాగవత కథను పఠించండి. నియమంగా ఈ భాగవత కథను భక్తితో విన్నవాడు, నిర్మలమైనఅంత:కరణతో ఇతరులకు చెప్పువాడు, అధికమైన ఫలములను పొందుతారు. వీరికి మూడులోకములలో పొందదగినది అంటే వేరే ఏది ఉండదు." అని సూతపౌరాణికుడు శౌనకాది మహామునులకు భాగవత మహాత్మ్యమును,భాగవత సప్తాహ విధానమును వినిపించాడు.

పద్మపురాణము,

ఉత్తర ఖండము,

భారత సప్తాహ విధానము అను ఆరవ అధ్యాయము సంపూర్ణము.

భాగవతపురాణ మహాత్మ్యము సర్వం సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్:9866140619 ఫోన్:040-24048104

## శ్రీమద్భాగవతము గురించి ముందు మాట.

వ్యాసమహర్షి భాగవత పురాణాన్ని సంస్కృతములో రచించాడు. ఇది మహాభారతము తరువాత రచింపబడిన గ్రంథము. ఇందులో ప్రముఖంగా శ్రీకృష్ణుని అవతార లీలలు దశమస్కంధములో మనోహరంగా వర్ణించబడ్డాయి. శ్రీహరి మిగిలిన అవతారముల విశేషములు కూడా తొమ్మిది స్కంధముల వరకూ వర్ణించబడ్డాయి.

అవే కాకుండా ఈ సృష్టి ఎలా ఏర్పడింది. సృష్టికి మూలం ఏమిటి. కాలం అంటే ఏమిటి. కాలస్వరూపుడు ఎవరు. కాల స్వరూపము ఏమిటి. లోకములు, వాటి వివరణ. వ్యక్తము, అవ్యక్తము అంటే ఏమిటి. ప్రకృతి, పురుషుడు. పరమాత్మ. చైతన్యము. విశ్వచైతన్యము. బ్రహ్మపుట్టుక. ప్రజాపతులు,దేవతా గణముల పుట్టుక. ఇవన్నీ కూడా సూక్ష్మంగానూ స్థూలంగానూ భాగవతంలో వివరించబడ్డాయి.

వీటిని అర్థం చేసుకోవాలంటే మనకు కొన్ని విషయాలు తెలియాలి. ఈ విషయాలే మనకు అక్కడక్కడా వస్తుంటాయి. వాటి గురించి తెలియకపోతే అంతా అయోమయంగా ఉంటుంది. కాబట్టి ముందుగా ఆ విషయాలను మీకు పరిచయం చేస్తాను. అప్పుడు మీరు చదువుకొనేటప్పుడు సులభంగా అర్థం కావడానికి వీలుకలుగుతుంది.

## ప్రథమస్కంధము.

ఈ నాడు మనకు అందుబాటులో ఉన్న శాస్త్రపరి జ్ఞానమును బట్టి ఈ విశ్వం గురించి చర్చించుకుందాము. ఉదాహరణకు నేను 2.31 చైతన్యపురిలో ఉన్నాను. ఇటువంటి చైతన్యపురి అనే ప్రాంతాలు హైదరాబాదులో కొన్ని వందలు ఉన్నాయి. ఇటువంటి హైదరాబాదులు ఈ భారతదేశంలో కొన్ని వందలు ఉన్నాయి. ఇటువంటి భారత దేశాలు మన ప్రపంచంలో కొన్ని వందలు ఉన్నాయి. ఇంతా చేస్తే ఈ భూగోళం మీద భూమి ఉండే ప్రాంతం నాలుగవ వంతుమాత్రమే. మిగిలిన మూడు వంతులూ జలమయం అంటే మహాసముద్రాలతో నిండి ఉంది.

ఈ భూమి ఒక గ్రహం. దీనికి మరొక ఉపగ్రహం కూడా ఉంది అదే చంద్రుడు. ఈ చంద్రుడు భూమి చుట్టు తిరుగుతుంటాడు. ఈ భూమి చంద్రుడితో సహా సూర్యుడి చుట్టు తిరుగుతూ ఉంటుంది. ఈ అనంత విశ్వంలో సూర్యుడు ఒక చిన్న నక్షత్రం. భూమి మాదిరి సూర్యుడి చుట్టు ఇంకా ఎనిమిది గ్రహాలు తిరుగుతున్నాయి. వాటికి కూడా చంద్రుడి మాదిరి ఉపగ్రహాలు ఉన్నాయి. సూర్యుడు, 8 గ్రహాలు, వాటి ఉప గ్రహాలు కలిపి సూర్యమండలం అంటారు.

ఈ అనంత విశ్వంలో ఇటువంటి నక్షత్ర మండలాలు 5,500 ఉన్నాయి. ఈ నక్షత్ర మండలాలు మన భూమి నుండి 1300 కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నాయి. కాంతి సంవత్సరమంటే సెకనుకు 3 లక్షల కిలోమీటర్ల వేగంతో కాంతి ఒక సంవత్సరం పాటు ప్రయాణించే దూరము. ఇప్పుడు చూడండి ఈ విశ్వం ఎంతగా విస్తరించి ఉందో, ఈ విశ్వం ఎంత పెద్దదో విశాలమైనదో ఊహించండి.

ఈ విశ్వం ఇంతటితో ఆగలేదు. నిరంతరం పెరుగుతూనే ఉంది. ఈవిశ్వంపెరగ కుండా ఆగడానికి డార్కు మాటర్ కావాలి. ఈ డార్క్ మాటర్ నక్షత్ర మండలాల మధ్య ఉంది. నక్షత్ర మండలాల కదలికల వలన ఈ డార్క్‌మాటర్ పుడుతుంది. ఈ అనంత విశ్వంలో ఉన్న నక్షత్రమండలాల మధ్య ఉత్పన్నమయిన డార్క్‌మాటర్ అంతా కలిపినా, ఈ విశ్వం నిరంతరం పెరగడాన్ని అరికట్టడానికి  కావాల్సిన శక్తిలో పదవ వంతు కూడా లేదు. కాబట్టి ఈ విశ్వం పెరగడం ఇప్పట్లో ఆగే ప్రసక్తి లేదు. నిరంతరం పెరుగుతూనే ఉంటుంది. (అందుకే పరమాత్మను అనంతుడు, సర్వవ్యాపి, ఆది మధ్యాంత రహితుడు అన్నారు).

మరి ఈ అనంత విశ్వం ఎప్పుడు లయం అవుతుంది అనే దాని మీద శాస్త్రజ్ఞులు భిన్నాభిప్రాయాలు వెలుబుచ్చుతున్నారు. ఎందుకంటే ఈ విశ్వం విస్తరించడం మొదలు పెట్టినప్పటి నుండి పదివేల మిలియన్ సంవత్సరాలు పెరిగింది. మరలా ఈ విశ్వం తన పూర్వస్థితికి రావాలంటే మరొక పదివేల మిలియన్ సంవత్సరాలు పడుతుంది.

అసలు ఈ విశ్వంఎలా ఆవిర్భవించింది. ఒకప్పుడు ఈ అనంత విశ్వం అంతా చిన్న రావిగింజ పరిమాణంలో ఉండేది. అత్యంత చిన్నదిగాఉండేది. (దానినే విష్ణునాభి అంటారు). అప్పుడు ఒక విస్ఫోటం జరిగింది. (ఒక్కటిగా ఉన్న పరమాత్మ తాను అనేకం కావాలి అనుకున్నాడు. ఇవన్నీ మనకు భాగవతంలో కనిపిస్తాయి). దీనినే బిగ్‌బాంగ్ థియరీ అంటారు. అప్పుడు ఈ అనంత విశ్వం

ఆవిర్భవించింది. అప్పటినుండీ విస్తరిస్తూ ఉంది.

ఇంక మన భూమి సంగతికి వస్తే, మొదట్లో భూమి చాలా వేడిగాఉండేది. వాతావరణం అసలు ఉండేది కాదు. క్రమక్రమంగా భూమి చల్లబడింది. గట్టి పడింది. గట్టి పడ్డ రాళ్లలోనుండి వెలువడిన వాయువులతో వాతారవణం ఏర్పడింది. ఆ వాతావరణంలో ప్రాణులు నివసించే అవకాశం లేదు. ఎందుకంటే ఆ వాతావరణంలో ప్రాణవాయువు లేదు. కాని ఇతర హానికరమైన వాయువులు ఉండేవి. అప్పుడు ప్రాణవాయువు అవసరం లేని జీవులు సముద్రాల అంతర్భాగంలో ఉద్భవించాయి. (అదే పరమాత్మ మొట్టమొదటి అవతారము మత్స్యావతారము. అంటే జలచరము.)ఆ జీవులు హైడ్రోజన్ సల్ఫైడ్ అనే వాయువును పీల్చుకొని ఆక్సిజన్ను వదిలిపెట్టేవి. అలా ఆక్సిజన్ వాతావరణంలో భాగం అయింది. వాతావరణంలో వచ్చిన ఈ మార్పుతో పరిణామ క్రమంలో జీవజాలము ఉత్పత్తి అయింది. మొట్టమొదట జలచరాలు, ఉభయచరాలు, తరువాత నరసింహ్ములు, వామనులు, అలా అలా మానవ జాతి పరిణామ క్రమంలో వృద్ధిచెందింది. ఈ పరిణామం అంతా మనకు కథల రూపంలో భాగవతం బోధించింది.

ఈ అనంత విశ్వాన్ని ఒక మహా చైతన్య శక్తి నడిపిస్తూ ఉంది. ఈ మహా చైతన్యము, విశ్వ చైతన్యమే మనము పిలుచుకొనే విష్ణువు. విష్ణువు అంటే వ్యాపించినది అని అర్థము. సర్వవ్యాపి అని విష్ణువుకు పేరు. ఆయననే పరమాత్మఅని కూడా అంటాము. ఇంకా పరమేశ్వరుడు అనికూడా పిలుస్తారు. ఏ పేరుతో పిలిచినా అది ఒక విశ్వచైతన్యము.

అది విశ్వ చైతన్యము అయితే మనం చూసే ప్రకృతి కూటస్థ చైతన్యము. ఆ కూటస్థ చైతన్యములో మనం ఉన్నాము. మనలో ఉన్నది పరిమిత చైతన్యము. దానినే ఆత్మ అని కూడా అంటారు. ఈ ఆత్మ విశ్వచైతన్యంలో భాగమే. అందుకే అందరిలో పరమాత్మ ఉన్నాడు. అందరూ పరమాత్మలో ఉన్నారు అని మన పెద్దలు చెబుతూ ఉంటారు. కాని ఆత్మ దేహధారి. పరమాత్మకు దేహం లేదు. ఆయన నిర్గుణుడు, నిరాకారుడు. ఆత్మదేహంలో ఉండటం వలన, సత్వ, రజస్, తమో గుణాలతో ప్రభావితమై కొన్ని పనులు చేస్తూ ఉంటుంది. ఆ పనుల వలన కొన్ని వాసనలు ఆత్మకు అంటుకుంటాయి. వాసనలతో కూడిన ఆత్మ జీవాత్మ అని పిలువబడుతుంది.

సత్వ, రజస్ తమో గుణాలకు లోబడి, ప్రాపంచిక విషయాలలో లీనమై కర్మలు చేసేది జీవాత్మ అయితే, ఈ ప్రాపంచిక విషయాల నుండి విడివడి కేవలం పరమాత్మ వైపు ప్రయాణించేది ఆత్మ. ఆత్మ పరిశుద్ధమైనది. జీవాత్మ వాసనల మకిల అంటుకున్నది. ఈ వాసనల ప్రభావంతో జీవుడు జననమరణాల చక్రంలో చిక్కుకుంటాడు. గిర గిరా తిరుగుతూ ఉంటాడు. ఈ వాసనల నుండి ముక్తి లభించిననాడు ఆత్మ పరమాత్మలో ఐక్యం అవుతుంది. ఇదీ సూక్ష్మంగా మన జీవన విధానం.

అలా జీవుడు వాసనలనుండి విడివడి పరమాత్మను చేరుకోడానికి సాధనంగా భాగవతంలో భక్తి తత్వాన్ని ప్రబోధించాడు వ్యాసుడు. పరమాత్మ ఎడల భక్తి కలిగి ఉండటం, రాగద్వేషాలు వదిలిపెట్టడం,  ఫలితాన్ని ఆశించకుండా కర్మలు చేయడం, కర్మ

ఫలితాలను భగదర్పణ చేయడం,  వీటిని పరమాత్మను చేరుకోడానికి ప్రధానమార్గాలుగా చెప్పాడు వ్యాసుడు. భక్తియోగాన్ని ప్రముఖంగా ప్రబోధించినది భాగవత పురాణము. అంతే కాకుండా స్థూల విశ్వము, సూక్ష్మ విశ్వము ఎలా ఆవిర్భవించింది కూడా వివరంగా భాగవతంలో తెలియజేసారు. ఈ కింది ఛార్టు చూస్తే మీకు విపులంగా అర్థం అవుతుంది.

పరమాత్మ ......... మొదట ఒకటిగా ఉన్నాడు. తరువాత తాను అనేకం కావాలనుకున్నాడు. కాని తన మాదిరి కాదు. రకరకాల సృష్టి చేయాలని సంకల్పించాడు. అప్పుడు పరమాత్మలో నుండి ప్రకృతి వెలువడింది. దానినే మాయ అని కూడా అంటారు. ఆ ప్రకృతి అంటేనే సత్వ, రజస్, తమోగుణముల కలయిక. ఆ మూడు గుణాలు మొదట్లో సరి సమానంగా సామ్యావస్థలో ఉన్నాయి. నిర్లిప్తంగా ఉన్నాయి. అదే అవ్యక్త స్థితి.

పరమాత్మ కాల శక్తిని ఉపయోగించి ఆ మూడు గుణములలో క్షోభ కలిగించాడు. అంటే కదలిక కలిగించాడు. ఆ మూడు గుణములలో హెచ్చుతగ్గులు ఏర్పడ్డాయి. పరమాత్మ తన స్వభావ శక్తితో ఆ హెచ్చు తగ్గులుగా ఉన్న ఆ గుణములలో  మార్పు తీసుకొని వచ్చాడు. మూడు గుణములలో కలిగిన క్షోభ, పరిణామము కలిసి మహతత్త్వముగా ఏర్పడింది. ఆ మహత్తత్వమే కర్మ శక్తి అనగా సృష్టి. ఆ మహత్తత్వములో రజోగుణము ఎక్కువ కావడం వలన మరలా రక రకాల మార్పులు వచ్చాయి. రజస్సు,  సత్త్వము ఎక్కువ కావడం వలన, తమస్సు ప్రధానంగా ఉన్న అహంకారము పుట్టింది. ఈ అహంకారము జ్ఞాన,క్రియ,ద్రవ్యాత్మకము.

ఈ అహంకారము మూడు విధములుగా మార్పు చెందింది.

1. రజోగుణము తక్కువ + సత్త్వము ఎక్కువ= వైకారిక(సాత్త్విక) అహంకారము. అది జ్ఞానాత్మకము. అనగా జ్ఞా న శక్తి. అందులో నుండి మనస్సు పుట్టింది. మనసులో నుండి దిక్కులు, వాయువు,సూర్యుడు, వరుణుడు,అశ్వినులు, అగ్ని, ఇంద్రుడు,విష్ణువు, మిత్రుడు, ప్రజాపతి ఆవిర్భవించారు.

2. రజోగుణము ఎక్కువ= తైజసాహంకారము. ఇది క్రియాత్మకము. తైజసాహంకారము అంటే క్రియా శక్తి. ఈ క్రియాశక్తి నుండి  బుద్ధి, ప్రాణము వచ్చాయి. వాటిలో నుండి జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు పుట్టాయి.

3.రజోగుణము తక్కువ+తామసము ఎక్కువ= తామసిక అహంకారము.  తామసాహంకారము అంటే ద్రవ్యశక్తి. అందులో నుండి ఆకాశము పుట్టింది. ఆకాశము యొక్క గుణము శబ్దము. ద్రష్టకూ దృశ్యానికీ శబ్దమే గుర్తుగా అయింది.

ఆకాశము లో నుండి స్పర్శ పుట్టింది. అందులో నుండి వాయువు వచ్చింది. వాయువు గుణాలు శబ్దము, ఓజస్సు, జీవశక్తి. బలము. వాయువు లో నుండి రూపంపుట్టింది. అందులో నుండి తేజస్సు. ఆ తేజస్సు గుణాలు శబ్ద,రూప,స్పర్శలు.తేజస్సు లో నుండి రసం ఉద్భవించింది. రసమునకు మూలము జలము. జలము యొక్క గుణాలు....శబ్ద,రూప,స్పర్శ,రసాలు. జలము లో నుండి ఘ్రాణశక్తి

(వాసన) ఉద్భవించింది. ఘ్రాణశక్తికి మూలము పృథివి.
పృథివి గుణాలు...... శబ్ద,రూప,స్పర్శ,రస, గంధాలు.

భాగవతం చదువుతుంటే ఈ పదాలు, విషయాలు మనకు పదే పదే వస్తుంటాయి. ఆ పదాలు అర్థం కావడానికే వీటిని మీకు పరిచయం చేసాను. ఇంక చదవండి.

# శ్రీమద్భాగవతము

## ప్రథమస్కంధము.

## మొదటి అధ్యాయము

### ప్రార్థనా శ్లోకములు

1.జన్మాద్యస్యయతో2న్వయాదితరత శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే ముహ్యన్తి యత్సూరయః।
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గో2మృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి॥

పోతనగారి పద్యం:

సీ. విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని వలన నేర్పడు నను వర్తనమున
వ్యావర్తనమున గార్యములం దభిజ్ఞుడై తాన రా జగుచు జిత్తమున జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వడు బుధులు మోహింతురెవ్వ
నికి నెండమావుల నీళ్ల గాచాదుల నన్యోన్యబుద్ధి దా నడరునట్లు
ఆ. త్రిగుణ సృష్టి యెందు దీపించి సత్యము భంగి దోచు స్వప్రభానిరస్త
కుహకు డెవ్వడతని గోరి చింతించెద ననఘు సత్యు బరుని ననుదినంబు.

మారని తత్వాన్ని గ్రహిస్తూ, దానికంటే ఇతరమైనదైన మారిపోయే తత్వాన్ని విడిచిపెడుతూ కొనసాగించే తార్కిక పద్ధతి ద్వారా, ఎదురుగా ఉన్న ఈ జగత్తుపుట్టుకా మొదలైనవన్నీ ఎవరి వలన జరుగుతున్నాయని తెలుస్తూ ఉందో, సృష్టిలోని పుట్టుపూర్వోత్తరాలన్నీ ఎవరికి పూర్తిగా అవగతమై ఉంటాయో, ఏదైతే స్వయం ప్రకాశమై ఇతరముల నన్నింటినీ ప్రకాశింపజేస్తోందో, సృష్టికర్త అయిన బ్రహ్మకు లోపలనుంచే అవసరమైన జ్ఞానవిజ్ఞానాన్ని ఏది విస్తరింపజేస్తోందో, ఏదైతే పెద్ద పెద్ద పండితులకే ఎంత ఆలోచించినా అవగతం కాదో, తేజస్సూ, నీరూ, నేలా (అన్నం) అనే మూడింటి మార్పిడుల వల్ల ఫలించిన సత్వ రజస్తమో గుణాల విషమ మిశ్రమాలతో ఏర్పడిన సృష్టి, దేని ఉనికివలన మిథ్యే నిజమనిపిస్తూ ఉందో, ఏది తన స్వయం ప్రభాసంతో అన్ని విధాలా మాయ కల్పించే భ్రమనుంచీ ఎల్లప్పుడూ విముక్తమై ఉంటుందో, ఆ పరమ సత్య స్వరూపమైన పరమాత్మని మేము ఏకాగ్రతతో ధ్యానం చేస్తాము.

2.ధర్మ:ప్రోజ్ఝితకైతవో2త్ర పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్।
శ్రీమద్భాగవతే మహామునికృతే కిం వా పరైరీశ్వర:
సద్యో హృద్యవరుధ్యతే2త్ర కృతిభి: శుశ్రూషుభిస్తత్ క్షణాత్॥

సీ. శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ
విన గోరువారల విమల చిత్తంబుల జెచ్చెర నీశుండు చిక్కు గాక;
యితర శాస్త్రంబుల నీశుడు చిక్కునే మంచి వారలకు నిర్మత్సరులకు
గపట నిర్ముక్తులై కాంక్ష సేయకయును దగిలియుండుట మహాతత్త్వబుద్ధి
తే.బరగ నాధ్యాత్మికాది తాపత్రయంబు, నడచి పరమార్థభూతమై యధికసుఖద
మై సమస్తంబు గాకయు నయ్యు నుండు, వస్తు వెఱుగంగ దగు భాగవతంబునందు.

ఈ మహాభాగవత గ్రంథంలో వంచనా, అనృతము అనేవి ఏ కోశానా లేని పరమ ధర్మం ప్రతిపాదితమయింది. ఈసూ, అసూయా, స్వార్థమూ, హింసా ప్రవృత్తీ పూర్తిగాలేని సాధు మహాశయులు తెలుసుకోదగినదీ, వాస్తవమైనదీ, పరమ సుఖాన్ని ప్రదానం చేసేదీ, తాపత్రయాలను సమూలంగా నాశనం చేసేదీ, అయిన కథావస్తువు దీనిలో ఉంది. వ్యాసమహాముని ప్రోక్తమైన అటువంటి పవిత్రగ్రంథం భాగవతము ఉండగా, ఇతర శాస్త్రాలతోగానీ, రకరకాల సాధనాలతో గానీ, ఇంక మనకేం పని. కర్తవ్య కర్మలను దక్షతతోనూ, శ్రద్ధతోనూ చేస్తూ, సుభద్ర వస్తువును వినాలనే అభిలాష ఉన్నవాళ్లు దీనిని చదవడమే ఆలస్యం, వినడమే ఆలస్యం ఈశ్వరుడు తక్షణమే వాళ్ల హృదయాలలో ప్రవేశించి బందీ అయిపోతాడు.

శ్లో: నిగమకల్పతరోర్గళితం ఫలం శుకముఖాదమృత ద్రవసంయుతమ్
పిబత భాగవతం రసమాలయం ముహురహో రసికా భువి భావుకాః॥

ఆ: వేదకల్పవృక్షవిగళితమై శుక, ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన, పదవి గనుడు రసిక భావవిదులు.

వేదములు ఒక కల్పవృక్షము అయితే శ్రీమద్భాగవత పురాణము ఆ చెట్టుకు కాచి పండిన రసవంతమైనపండు. ఆ పండును శుకమహర్షి అనే చిలుక తాను ముందు రుచిచూసి తరువాత మనకు అందించింది. ఆ శుకమహర్షి నోటి ద్వారా స్రవించిన వాక్యామృతంతో కలిసి ఉంది ఆపండు.  ఓ ప్రేమరస భావజ్ఞులారా!  ఈభూమిమీద ఈశరీరము ఉన్నంతవరకూ ఈ

పండురసాన్ని మాటిమాటికీ ఆరగిస్తూ ఉండండి.

భగవాన్ శ్రీవ్యాసమహర్షికీ,

సహజపాండితీప్రకర్షకుడు బమ్మెర  పోతనామాత్యులకూ,

పై ప్రార్థనా పద్యములకు వ్యాఖ్యను రాసినటువంటి,

ఈ భాగవత రచనలో నాకు మార్గదర్శకులైనటువంటి

మా గురువుగారు శ్రీ ముంజులూరి నరసింహ్మారావుగారికీ,

సవినయంగా పాదాభి వందనం చేస్తూ

భాగవతకథా ప్రారంభం చేస్తున్నాను.

# శ్రీమద్భాగవతము

## ప్రథమస్కంధము

### మొదటిఅధ్యాయము.

ఈ జగత్తులో సృష్టిస్థితి లయములకు కారకుడు, వ్యతిరేకుడు ఎవరో, ఈ సమస్త జగత్తునకు కర్త ఎవరో, తన స్వతస్సిద్ధజ్ఞానముతో విరాజిల్లువాడు ఎవరో, బ్రహ్మదేవునికి కూడా జ్ఞానమును ప్రసాదించిన వాడు ఎవరో, తన మనస్సు ద్వారా తత్త్వజ్ఞానమును ప్రబోధించిన వాడు ఎవరో, ఇంద్రాది దేవతలను కూడా తన మోహముతో పరవశింప చేసినవాడు ఎవరో, తన యందు సత్వగుణము, రజోగుణము, తమో గుణము ఉన్నప్పటికినీ

వాటిలో లీనం కాని వాడు, ప్రవర్తిల్లని వాడు ఎవరో, ఎవనిలో కపటము లేదో, అట్టి సత్యస్వరూపుడు అయిన పరమేశ్వరుని నేను ధ్యానిస్తున్నాను.

ఈ భాగవత పురాణం ఏ మాత్రమూ మత్సరము లేని సత్పురుషుల యొక్క పరమ పవిత్రమైన భక్తిరూపంలో కనపడే ధర్మమును ఆవిష్కరించింది. భాగవత పురాణంలో మన దైనందిన జీవితంలో కలిగే అన్ని తాపత్రయాలను నిర్మూలించే తత్వము, సమస్త మానవాళికి శుభాలను కలిగించే తత్వము, సత్యము, నిత్యము అయిన నాశనము లేని తత్వము నిరూపింపబడింది. ఈ భాగవత గ్రంధము అందుబాటులో ఉండగా ఇతర గ్రంధములతో పని ఏముంటుంది? భాగవతము చదవడం వలన, వినడం వలన, అర్ధం చేసుకోవడం వలన, పరమాత్ముడగు శ్రీహరి కరుణా కటాక్షములు సిద్ధిస్తాయి అనడంలో సందేహము లేదు. అటువంటి వారి హృదయాలలో శ్రీమహావిష్ణువు స్థిరంగా కొలువై ఉంటాడు.

ఈ భాగవత పురాణము మొట్టమొదటగా శుకమహర్షి ముఖము నుండి వెలువడింది. తరువాత ఆయన శిష్య ప్రశిష్యుల ద్వారా లోకంలో వ్యాప్తిచెందింది. అటువంటి భాగవత పురాణము వేదములు అనే కల్పవృక్షమునకు కాసి, బాగా పండిన ఫలము. ఆ ఫలములో పై చెక్కు గానీ, గింజలు గానీ, ఆ మాటకొస్తే, ఏదీ విడువదగినది కాదు. అన్ని భాగములు అమృతోపమానములే! ఆస్వాదించతగ్గవే. అనుభవించదగ్గవే. ఆనందించతగ్గవే. అన్ని వేదముల సారము భాగవత పురాణము. ఈ భాగవత పురాణము అనే ఫలము, పామరులే కాదు పండితులు కూడా మాటి మాటికీ తినతగ్గ ఫలము. ఈ భాగవత ఫల ఆస్వాదనకు స్వర్గ సుఖములు కూడా సాటి రావు.

అట్టి భాగవత పురాణమును, గంగాతీరంలో, వ్యాసుని కుమారుడు, శుకుడు పరీక్షిత్తు మహారాజుకు చెప్పగా విన్న సూతి అనే పౌరాణికుడు శౌనకాది మహామునులకు నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో చెప్పాడు.

దేవతలకు ఆవాసమైన నైమిశారణ్య క్షేత్రంలో, స్వర్గలోకము తమకు ప్రాప్తించడం కోసరం, మహామునులందరూ కలిసి వేయి సంవత్సరములు సాగే యాగాన్ని సంకల్పించారు.

ఉదయం పూజలు, యజ్ఞకార్యక్రమములు, అగ్ని హెూత్రములు జరుగుతాయి. సాయంత్రము పురాణకాలక్షేపములు జరుగుతాయి. ఈ సందర్భంలో ఒకనాటి ఉదయము, మహర్షులు అందరూ అగ్నిహెూత్రము మొదలగు కార్యములు నిర్వర్తించిన తరువాత, ఒక చెట్టు కింద కూర్చున్నారు. ఆ మహా మునులందరూ సూతపౌరాణికుని సాదరంగా ఆహ్వానించి, ఉచితాసనముమీద కూర్చోబెట్టి, ఆయనను ఇలా అడిగారు.

"ఓ సూతపౌరాణిగా! నీవు మహాభారతము మొదలగు ఇతిహాసములను, 18 పురాణములను, ఇతర గ్రంధములను, నీ గురువుల వద్ద అధ్యయనం చేసావు. వాటిని చక్కగా వ్యాఖ్యానం చేసావు.

ఓ సూత మహర్షీ! వేదములను బాగా తెలిసిన వాడు, బ్రహ్మస్వరూపమును చక్కగా తెలుసుకున్న వాడు అయిన వ్యాసభగవానుడు ఇంకా ఇతర మహామునుల దయతో నీవు వారి నుండి ఇతిహాసములను,

పురాణములను ఇంకా ఎన్నో విషయములను అవగాహన చేసుకున్నావు. నీవు వారికి ప్రియశిష్యుడవు కాబట్టి వారు నీకు అన్ని విషయములను బోధించి ఉంటారు.

నీవు వారి వలన తెలుసుకున్న విషయములను, ఆ ఇతిహాసములలో పురాణములలో మానవులకు శ్రేయస్సును కలిగించే విషయాలు, రహస్యాలు, అన్నీ మాకు చెప్పడానికి నీవే తగిన వాడవు.

ఓ పౌరాణికుడా! ప్రస్తుతము కలియుగము జరుగుతూ ఉంది. ఈ కలియుగములో మానవులకు ఆయుష్షు తక్కువ. పైగా వారికి సోమరితనము, బుద్ధిమాంద్యము బాగా అలవడింది. వారికి ఆలోచనా శక్తి సన్నగిల్లింది. అదీ కాకుండా వారు సగం జీవితం రోగాలతో బాధపడు తున్నారు. అందువలన వారికి ఆధ్యాత్మిక విషయాలు తెలుసుకొనే శక్తి లేదు.

ఈ ప్రపంచంలో చేయతగ్గ పనులు వివిధములుగా అధికంగా ఉన్నాయి. వినతగ్గ శాస్త్రములు, పురాణములు ఎన్నో ఉన్నాయి. వాటిని అన్నీ చదవడానికి, అధ్యయనం చేయడానికి, వినడానికి మానవునికి జీవిత కాలము సరిపోదు. అందువలన, నీవు అధ్యయనం చేసిన ఇతి హాసములలో పురాణములలో అత్యంత శ్రేష్ఠము అయిన విషయములను ఏర్చి, కూర్చి, మాకు వినిపించు. వివిధ శాస్త్రములను క్లుప్తంగా మాకు వివరించు. దీనివలన మానవుల బుద్ధి వికసిస్తుంది అని, మానవాళికి శ్రేయస్సు కలుగుతుందని మా నమ్మకం.

ఓ సూత పౌరాణికుడా! ఈ లోకంలో ధర్మసంస్థాపన చేయడానికి, విష్ణు భక్తులను, యదువంశములో పుట్టిన వారిని రక్షించడానికి, శ్రీకృష్ణుడు దేవకీ గర్భవాసంలో జన్మించిన విషయం నీకు బాగా తెలుసు

మానవుల క్షేమం కోసరం అవతరించిన ఆ వాసుదేవుని జన్మవృత్తాంతమును, ఆయన లీలలను వినవలెనని మాకు కోరికగా ఉంది. వాటిని మాకు వినిపించు. శ్రీకృష్ణ లీలలను మాకు చెప్పడానికి నీవే సమర్థుడివి అని మేము నమ్ముతున్నాము.

ఈ ప్రపంచంలో ఉన్న మానవులు సంసార సాగరంలో పడి కొట్టుమిట్టాడుతున్నారు. వారు కేవలం ఆ వాసుదేవుని నామస్మరణ వలననే ఈ సంసార సాగరం నుండి తరింపబడుతున్నారు. వాసుదేవుని నామస్మరణ చేయు వారి దగ్గరకు మృత్యుదేవత రావడానికి భయపడుతుంది.

ఆ వాసుదేవుని పాదములను ఆశ్రయించిన మానవులు, శుకుడు మొదలగు మహామునులను సేవించినచో, వారి దర్శన మాత్రం చేతనే పునీతులు అవుతున్నారు.

వాసుదేవుని కీర్తించే కథలను వినడానికి ఎవరు ఉత్సాహం చూపరు. అదీ కాకుండా శ్రీమన్నారాయణుడు ఎన్నో అవతారాలు ధరించాడు. నారదుడు మొదలగు మహామునులు నారాయణ నామాన్ని, నారాయణుని అవతార విశేషములను మృదుమధురంగా గానం చేసారు. ఆ అవతార విశేషములను మేము భక్తి శ్రద్ధలతో వినగోరుతున్నాము.

ఓ సూతపౌరాణికుడా! ఆ వాసుదేవుడు భూభారమును తగ్గించడం కోసరం, జగత్కల్యాణం కోసరం ఈ భూమి మీద తనకు తానుగా అవతరించాడు. ఆ శ్రీకృష్ణుని అవతార విశేషములను మాకు సవిస్తరంగా తెలుపండి.

ఆ భగవానుని లీలలు ఎన్ని సార్లు విన్నా ఎంత సేపు విన్నా తనివితీరదు కదా! ఎందుకంటే శ్రీకృష్ణలీలలు ఎంత విన్నా ఇంకా వినాలని ఉంటుంది కదా! వినేకొద్దీ కొత్త కొత్త రసానుభూతి కలుగుతుంది కదా!

ఆ భగవంతుడు నిర్గుణుడు, నిరాకారుడు, నిర్వికల్పుడు అయినప్పటికీ, ఈ ప్రపంచములో ఉన్న మానవులకు తన దర్శనభాగ్యం కలిగించడం కోసరం మానవునిగా అవతరించాడు. ఎన్నో లీలలను ప్రదర్శించాడు. ఆ లీలలు అన్నీ మాకు వివరంగా చెప్పవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

కలియుగము ప్రవేశించినది అని తెలుసుకొని మేము సుదీర్ఘమైన యాగం చెయ్యడానికి ఈ నైమిశారణ్యంలో సమావేశం అయ్యాము. మా అదృష్ట వశాత్తు భగవంతుడు మిమ్ములను మాకు చూపించాడు. మీ వలన మాకు శ్రీహరి కథలను వినే అద్భుతమైన అవకాశం కలిగింది.

ఈ కలికాలము మానవులయొక్క బుద్ధిబలమును, శారీరక బలమును నాశనం చేస్తూ ఉంది. ఈ కలి కాలము అనే భయంకరమైన సముద్రమును దాటడానికి మేము వాసుదేవుని కథలను వినడానికి

సంకల్పించాము. ఆ పరమాత్ముడు మాకు నిన్ను కలికాలము అనే సముద్రమును దాటడానికి ఒక నావికుడిగా చూపించాడు.

ఓ సూతపౌరాణికుడా! యోగేశ్వరుడు, ధర్మరక్షకుడు అయిన శ్రీకృష్ణ పరమాత్మ ఈ లోకంలో తన అవతారం చాలించి వైకుంఠమునకు వెళ్లిన తరువాత ఈ లోకంలో సనాతన ధర్మము ఎవరిని ఆశ్రయించింది మాకు వివరంగా చెప్పండి." అని శౌనకాది మహామునులు సూత పౌరాణికుని అడిగారు

. శ్రీమద్భాగవతము
ప్రథమస్కంధము ప్రథమ అధ్యాయము సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# . శ్రీమద్భాగవతము

# ప్రథమస్కంధము

## రెండవ అధ్యాయము

శౌనకుడు మొదలగు మహామునులు పైవిధంగా అడుగగా, రోమహర్షణుని పుత్రుడగు సూత పౌరాణికుడు ఈ విధంగా చెప్పాడు.

" బ్రాహ్మణోత్తములారా! వ్యాసునికుమారుడు శుకుడు, తండ్రిని వదిలిపెట్టి వనములకు వెళ్లిపోతున్నాడు. కుమారుని ఎడబాటును భరించలేని వ్యాసుడు పెద్దగా ఎలుగెత్తి కుమారా! కుమారా! అని పిలిచాడు. వ్యాసుని కంఠస్వరము ఆ అడవిలో ఉన్న వృక్షములకు, పర్వతములకు తగిలి ప్రతిధ్వనించింది. ఆ శుకయోగీంద్రుడు ఈ ప్రకృతి అంతా నిండి నిబిడీకృతము అయి ఉన్నాడా అని భ్రమకలిగింది. అటువంటి శుక యోగీంద్రులకు భక్తితో నమస్కరిస్తున్నాను.

నిరంతరము ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి ఉన్న మానవులను, ఈ సంసార సాగరము నుండి తరింప జేయడానికి, వేద వేదాంగముల సారము, అనుపమము, అత్మతత్వమును బోధించునదీ, అజ్ఞానము అనే అంధకారంలో కొట్టుమిట్టాడుతున్నవారికి దీపకళికలాంటిది, సర్వపురాణ రహస్యములను కలిగి ఉన్నది అయిన భాగవత పురాణమును ఈ లోకానికి అందించిన ఆ శుకమహర్షికి ముందుగా భక్తితో నమస్క రిస్తున్నాను.

ఈ భాగవత పురాణమునకు అధిదేవత శ్రీమన్నారాయణుడు. ఆయన సఖుడు నరుడు. ఆ నరనారాయణులకు నమస్కరిస్తున్నాను. చదువులతల్లి సరస్వతికి, వ్యాసభగవానుడికి నమస్కరిస్తున్నాను. మీ కందరికీ జయము కలగాలని కోరుకుంటూ భాగవత పురాణమును చెప్పడానికి ఉపక్రమిస్తున్నాను.

బ్రాహ్మణోత్తములారా! మీరు నన్ను లోకములకు మంగళకరమైన గొప్ప ప్రశ్నలు అడిగారు. మీరు కోరుకున్న శ్రీకృష్ణకథామృతమును వింటే బుద్ధి ప్రసన్నమవుతుంది అనడంలో అతిశయోక్తిలేదు.

శ్రీకృష్ణుని యందు, ఏవిధమైన ఫలాపేక్షలేకుండా, ఏకాగ్రతతో కూడిన స్వభావ సిద్ధమైన భక్తి కలిగి ఉండటం ధర్మములలో కెల్లా చాలా గొప్పధర్మము. ఆ భక్తిభావము చేతనే మానవులకు సర్వఅనర్థములు తొలగిపోయి మనస్సుకు శాంతి చేకూరుతుంది. ఆత్మసాక్షాత్కారము జరుగుతుంది.

భగవంతుడగు వాసుదేవునియందు నిరంతరము భక్తి కలిగి ఉంటే, అది జ్ఞానమును, వైరాగ్యమును పెంపొందిస్తుంది.

మానవులు వారికి తోచిన ఏయే ధర్మములను ఎంత గొప్పగా ఆచరించినా, భగవంతుని కథలయందు ఆసక్తి లేకపోతే, ఆ ధర్మాచరణము నిష్ప్రయోజనము. కేవలం శ్రమ మాత్రమే మిగులుతుంది. కాబట్టి మానవులు భగవంతుని కథలను చదవడంలో, వినడంలో, భగవంతుని కీర్తించడంలో శ్రద్ధచూపాలి.

పురుషార్థములలో ఉన్న అర్థము, మోక్ష ధర్మమునకు యోగ్యము కాదు. ఎన్ని భోగములు అనుభవించినను ఇంద్రియములు తృప్తిచెందవు. ఇంకా కావాలని అంటాయి. కామమునకు అంతం లేదు. కాబట్టి జీవితమునకు అవసరమైనంత మేరకే కోరికలను పరిమితం చేసుకోవాలి. మానవులు జీవించేది అర్థము సంపాదించడానికి, కామములు (కోరికలు) అనుభవించ డానికే కాదు. భగవంతుని తత్వమునందు ఆసక్తి కలిగి ఉండటం కూడా ముఖ్యము. తత్వజిజ్ఞాసలేని జీవితము

వ్యర్థము. యజ్ఞములు, యాగములు చేసి స్వర్గసుఖములు పొందడం వలన ప్రయోజనం లేదు.

పరమాత్మను గురించి తెలుసుకొనే అద్వైతజ్ఞానము ఒక్కటే సత్యమైనది. అదే పరమార్థము. ఆ నిత్యము, సత్యము అయిన జ్ఞానమే బ్రహ్మము, పరమాత్మ, భగవానుడు అని చెప్పబడుతూ ఉంది.

భగవంతుని యందు అపారమైన విశ్వాసము కల మునులు, తాము శాస్త్రములు చదివి, విని సంపాదించిన జ్ఞానంతోనూ, వారు చేసిన మంచి పనులతోనూ, ప్రాపంచిక విషయములందు ఆసక్తి లేకపోవడం వలన కలిగిన భక్తితోనూ తమ హృదయములందు ఆ పరమాత్మ తత్వమును దర్శించగలుగుతున్నారు.

కాబట్టి ఓ మహామునులారా! మానవులు ఏ వర్ణమునకు చెందినవారైననూ, ఏ ధర్మమును అనుష్టించిననూ, దానికి ఆఖరి ఫలము ఆ వాసుదేవునికి ప్రీతి కలిగించడమే. ఆ శ్రీహరి తప్ప వేరు దైవము లేదు.

కాబట్టి అంకిత భావముతో శ్రీ హరిని గురించిన కథలు వినడం, శ్రీహరిని కీర్తించడం, స్మరించడం, గానం చేయడం. పూజించడం మానవులు చేయతగ్గ పని.

బుద్ధిమంతులైన వారు శ్రీహరి నామస్మరణము అనే కత్తితో, అహంకారముతోనూ భోగాసక్తితోనూ కర్మలు చేయడం వలన వచ్చే ఫలములను నరికివేస్తారు. అటువంటి శ్రీహరి నామస్మరణ యందు, కథల

యందు ఎవరికి ఆసక్తి ఉండదు చెప్పండి.

ఓ బ్రాహ్మణోత్తములారా! శ్రీహరి కొలువై ఉన్న తీర్థములను దర్శించడం వల్ల కానీ, మంచి గురువులను సేవించడం వల్ల కానీ, కృష్ణభక్తుల ఎడల భక్తి కలిగి ఉండటం వలన గానీ, శాస్త్రములను అధ్యయనం చేయడం వలన కానీ, వాటి మీద నమ్మకం ఉంచడం వలన కానీ, భగవంతుని కథలను వినడంలో కానీ, కోరిక, ఆసక్తి ఉన్న మానవులకు శ్రీహరి కథలను వినడంలో కూడా ఆసక్తి ఉంటుంది.

శ్రీహరి కథలను నిరంతరమూ శ్రవణం చేసే భక్తుల హృదయాలలో ఆ కృష్ణుడు ఎప్పుడూ తిష్ట వేసుకొని కూర్చుని ఉంటాడు, వారి పాపములను నాశనం చేస్తూ ఉంటాడు అనడంలో అతిశయోక్తి లేదు.

భాగవత పురాణము చదడవం వలన, వినడం వలన, భగవద్భక్తులైన భాగవతులను సేవించడం వలన సర్వపాపములు నశిస్తాయి. ఆ శ్రీకృష్ణుని యందు అఖండమైన, అచంచలమైన భక్తి కలుగుతుంది.

అటువంటి నిర్మలమైన, అచంచల మైన, ఏకాగ్రతతో కూడిన భక్తి మనసులో పుడితే, మానవుల మనస్సు రజోగుణము, తమో గుణము వలన పుట్టిన కామమునకు, క్రోధమునకు లోను కాకుండా సత్వగుణముతో నిండి ప్రసన్నంగా ఉంటుంది.

శ్రీకృష్ణుని మీద ఉన్న అచంచలమైన భక్తి భావంచేత

మానవుడు కామము, క్రోధము, మోహము మొదలగు వాసనలకు దూరంగా ఉంటాడు. అప్పుడు అతని మనసులో భగవంతుని తత్వము గురించిన జ్ఞానము వర్ధిల్లుతుంది.

అప్పుడు అతనిలోని అనుమానాలన్నీ తొలగిపోతాయి. ఫలాసక్తి నశిస్తుంది. అహంకార రూపంలో ఉన్న బంధనాలు (ఇది నాది, అది నీది, అంతా నేనే, నన్ను మించిన వాడు లేడు, అనే భావనలు) తొలగిపోతాయి.

అందుకనే సాధకులు అనునిత్యమూ శ్రీహరి సేవ చేస్తూ, శ్రీహరిని స్మరిస్తూ శ్రీహరిని కీర్తిస్తూ, ఆత్మానందాన్ని పొందుతూ ఉంటారు.

సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము అనే మూడూ ప్రకృతి గుణములు. ఈ మూడు గుణములకు అతీతుడు, అధీశుడు ఆ శ్రీమన్నారాయణుడు. ఆ శ్రీమన్నారాయణుడే సృష్టించే టప్పుడు బ్రహ్మగానూ, పోషించేటప్పుడు విష్ణువు గానూ, లయం చేసేటప్పుడు శివుడు గానూ మూడు రూపములలో ప్రవర్తిస్తూ ఉంటాడు. ఈ మూడు రూపములలో శ్రీమన్నారాయణరూపము మాత్రమే విశిష్టమైనది. సమస్తఫలములను ఇస్తుంది.

భూమి నుండి పుట్టిన కట్టెలు మంచివి. ఆ కట్టెల కన్నా అవి కాలుతున్నప్పుడు వచ్చే పొగ మంచిది. ఆ పొగ కన్నా ఆ కట్టెలను కాలుస్తున్న అగ్ని మంచిది. ఎందుకంటే ఆ అగ్ని యజ్ఞయాగములను చెయ్యడానికి ఉపయోగపడుతుంది. అలాగే తమోగుణము కన్నా రజోగుణము, రజోగుణము కన్నా సత్త్వగుణము శ్రేష్టమైనవి. ఎందుకంటే సత్త్వగుణము ద్వారానే బ్రహ్మపదమును పొందగలము.

సత్త్వగుణ ప్రధానులైన మహాఋషులు ఎల్లప్పుడూ సత్వగుణ స్వరూపుడు, వైకుంఠాధీశుడు అయిన శ్రీ మహా విష్ణువునే సేవిస్తూ ఉంటారు. భక్తి తత్పరులైన మానవులు ఆ మహాఋషులను అనుసరిస్తూ వారిని సేవిస్తూ తరిస్తుంటారు.

ముముక్షువులు, అసూయ, ద్వేషములు లేని వారు, శాంతి కాముకులు అయిన మునులు ఇతర దేవతలను సేవింపక, కేవలము శ్రీమన్నారాయణుని, ఆయన అవతారములను సేవిస్తూ ఉంటారు.

కాని చాలా మంది మానవులు రజోగుణమును, తమో గుణమును ఆశ్రయించి, ధనము కొరకు, భోగముల కొరకు, ఐశ్వర్యము కొరకు, సంతానము కొరకు పితృదేవతలను, భూతములను, ప్రజాపతులను, ఇతర దేవతలను ఆశ్రయిస్తూ ఉంటారు.

కర్మకాండలు, జ్ఞానకాండలు, భక్తి కాండలు బోధించు వేదములు అన్నీ వాసుదేవ స్వరూపాలే. అలాగే మానవులు చేసే యజ్ఞములు, యాగములు అన్నీ వాసుదేవ స్వరూపాలే. ఇంతెందుకు సర్వకర్మలు విష్ణుమయాలే.

మానవులు సముపార్జించే జ్ఞానము, చేసే తపస్సు, ఆచరించే ధర్మము, వైరాగ్యము, చేసే దానములు, ధర్మములు, వ్రతములు, అన్నీ వాసుదేవుని పరంగానే చేయబడుతున్నాయి. స్వర్గసుఖములను కోరి చేసే యజ్ఞయాగములు, అశాశ్వతమైన ఇహలోక సుఖములను కోరి చేసే

పూజలు, వ్రతాలు అన్నీ కూడా ఆ వాసుదేవునికే చెందుతాయి.

ఆ వాసుదేవుడు, తాను ఏ గుణములు అంటని వాడై ఉండి కూడా, త్రిగుణములతో కూడిన తన మాయతో ఈ విశాల విశ్వాన్ని సృష్టించాడు.

వాసుదేవుడు తాను నిర్గుణుడు, స్వతంత్రుడు, ఎలాంటి అతిశయము లేని వాడూ, సర్వాధికారి అయి ఉండి కూడా, తన మాయతో ఉద్భవించిన ఆకాశాది పంచభూతములలో ప్రవేశించి, అన్నీ తానే అయి సగుణుడిగా ప్రకాశిస్తున్నాడు.

అన్ని కట్టెలలో ఒకేరకమైన అగ్ని దాగిఉంటుంది. కాని ఆ అగ్ని మండేటప్పుడు వివిధ రకాలుగా ప్రకాశిస్తుంది. అలాగే, ఈ విశాల విశ్వంలో ఉన్న సమస్తప్రాణులలో ఆ శ్రీమహా విష్ణువు అంతర్యామిగా ఉండి, వివిధ రూపములలో ప్రకాశిస్తున్నాడు.

విశ్వమంతటా విస్తరించిన ఆ శ్రీమహావిష్ణువు తాను సృష్టించిన సమస్త ప్రాణులలో ఆత్మగానూ, ఇంద్రియములుగానూ, విషయములు గానూ, సత్త్వ, రజస్, తమోగుణలతో కూడిన భావములు గానూ ప్రవేశించి, వాటిని లీలా మాత్రంగా అనుభవిస్తున్నాడు.

అంతే కాదు, ఆ శ్రీమహావిష్ణువు తాను సృష్టించిన వివిధప్రాణుల ద్వారానే ఈ భూమి మీద సత్త్వగుణ ప్రధానుడై అవతరించాడు. ప్రకటిత మయ్యాడు. పరి పాలించాడు.

శ్రీమద్భాగవతము
ప్రథమస్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# ప్రథమస్కంధము

## మూడవ అధ్యాయము.

ఓ మహామునులారా! భగవంతుడగు శ్రీహరి ఈ విశ్వమును సృష్టించడానికి అనువుగా 16 కళలతో కూడిన విరాట్ స్వరూపమును ధరించాడు. ఆ విరాట్ స్వరూపము పంచభూతములు ఐదు, జ్ఞానేంద్రియ ములు ఐదు, కర్మేంద్రియములు ఐదు, మనస్సు మొత్తము పదహారు పదార్థములతో నిండి ఉంది.

యోగ నిద్రలో ఉన్న ఆ పరమాత్మ నాభి నుండి ఒక కమలము పుట్టింది. ఆ పద్మములో నుండి బ్రహ్మ జన్మించాడు.

ఆ పరమాత్మ యొక్క శిరస్సు నుండి పాదముల వరకు ఉన్న అన్ని అవయవములనుండి సమస్త లోకములు సృష్టించ బడ్డాయి. ఆ

భగవానుని రూపము రజోగుణము, తమోగుణము లేని శుద్ధ సత్త్వగుణ ప్రధానము.

ఆత్మసాక్షాత్కారము పొందిన యోగులు ఈ శుద్ధసత్త్వగుణ ప్రధానమైన, అనేక ముఖములు, అసంఖ్యాకములైన హస్తములు, పాదములు, తలలు, వాటిని అలంకరించిన కిరీటములు, చెవులు, కళ్లు, ముక్కులతో శోభిల్లుచున్న విరాట్ రూపమును తమ జ్ఞాన నేత్రంతో దర్శిస్తూ ఉంటారు.

అన్నింటి కన్నా ముందు నుంచీ ఉన్న ఈ ఆదినారాయణ స్వరూపమే అన్ని అవతారములకు మూలము. ఆ ఆదినారాయణ అంశతోనే బ్రహ్మ, బ్రహ్మ అంశతోనే మరీచి మొదలగు వారు, వారి అంశల నుండి దేవతలు, జంతువులు, నరులు, మొదలగు వారు సృష్టింపబడ్డారు.

శ్రీమహావిష్ణువు మొట్టమొదట సనక, సనాతన, సనందన, సనత్కుమార రూపములతో ఉద్భవించాడు. జీవితాంతము అస్ఖలిత బ్రహ్మచర్యము అవలంబించాడు. ఇది మొదటి అవతారము.

రసాతలమునకు తీసుకుపోబడిన భూమిని తిరిగి తీసుకొని వచ్చుటకు యజ్ఞవరాహ అవతారమును ధరించాడు. ఇది రెండవ అవతారము.

మూడవ అవతారంగా పరమాత్మ దేవర్షి అయిన నారద మహర్షి అవతారం ధరించాడు. ఇది ఋషుల అవతారము. నారదావతారములో పరమాత్మ లోకానికి సాత్వత తంత్రమును

బోధించాడు. దాని వలన మానవులకు భక్తి భావము పెంపొంది సంసారబంధనముల నుండి, ప్రాపంచిక విషయ వాసనల నుండి విముక్తి కలుగుతుంది.

నాలుగవ అవతారంగా శ్రీమహావిష్ణువు, ధర్మునికి, మూర్తికి నర నారాయణులు అనే ఋషుల రూపంలో జన్మించాడు. ఈ అవతారములో ఆత్మను ప్రసన్నం చేసుకొనే విధానము అయిన తపస్సును నర నారాయణులు అనుష్ఠించారు.

పరమాత్మ తన ఐదవ అవతారంగా సిద్ధులలో శ్రేష్టుడు అయిన కపిల మహర్షిగా జన్మించాడు. ఆ అవతారంలో, కాలవశమున అంతరించిన తత్త్వములను నిర్ణయించే సాంఖ్య దర్శనమును ఆసురి అనే బ్రాహ్మణునికి ఉపదేశించాడు.

అత్రి మహాముని భార్య అనసూయ. ఆమె శ్రీ హరిని తన కుమారునిగా పుట్టమని కోరింది ఆమె కోరికను మన్నించి పరమాత్మ ఆదంపతులకు దత్తాత్రేయుడుగా జన్మించాడు. ఇది ఆరవ అవతారము ఈ అవతారంలో అర్కుడు అనే బ్రాహ్మణునకు ప్రహ్లాదునకు, హైహయవంశీయులైన రాజులకు ఆత్మవిద్య ఉపదేశించాడు.

ఋచి అనే బ్రాహ్మణుని భార్య ఆకూతి. ఆ పుణ్యదంపతులకు యజ్ఞరూపంగా శ్రీహరి అవతరించాడు. ఇది ఏడవ అవతారము. ఈ అవతారంలో దేవతల తోడ్పాటుతో స్వాయంభువ మన్వంతర మును

రక్షించాడు.

ఎనిమిదవ అవతారంగా శ్రీహరి, నాభికి, మేరుదేవికి కుమారుడుగా జన్మించాడు. ఆకుమారుని పేరు ఋషభుడు. ఈ అవతారంలో శ్రీహరి సర్వాశ్రమపూజ్యమైన సన్యాసాశ్రమమును తాను ఆచరించి, సత్పురుషులకు చూపించాడు.

తన తొమ్మిదవ అవతారంగా శ్రీహరి ఈ భూమి యందు ఓషధులుగా అవతరించాడు.(మనం వేసుకొనే మందులను, అవి ఇచ్చే వైద్యుడిని(పన్నెండవ అవతారము ధన్వంతరి) నారాయణస్వరూపంగా భావిస్తు న్నాము. వైద్యోనారాయణోహరి:)

చాక్షుష మన్వంతరంలో సముద్రంపొంగి పోయింది. అప్పుడు మానవ జాతిని, ఓషధులను రక్షించడానికి శ్రీహరి తన పదవ అవతారంగా మత్స్యావతారంగా ఉద్భవించాడు. ఈ అవతారంలో శ్రీహరి, వైవస్వత మనువును, ఋషులను, ఓషధులను ఒక నావలో కూర్చుండ బెట్టుకొని రక్షించాడు.

తన పదకొండవ అవతారంగా శ్రీహరి కూర్మావతారం ధరించాడు. దేవతలు దానవులు మంథర పర్వతము తో క్షీరసాగరమును మథిస్తుంటే ఆ పర్వతము సముద్రములో మునిగి పోకుండా, తన వీపు మీద ధరించాడు.

శ్రీహరి తన పన్నెండవ అవతారంగా క్షీరసాగరము నుండి అమృత కలశంతో ధన్వంతరిగా అవతరించాడు.

శ్రీ హరి, తన పదమూడవ అవతారంలో మోహినీ రూపంలో అవతరించి, తాను ధన్వంతరిగా తీసుకువచ్చిన అమృతమును దేవదానవులకు సమానంగా పంచిపెట్టే మిషతో అమృతమును, అసురులకు ఇవ్వకుండా, దేవతలకే పూర్తిగా ఇచ్చాడు.

తన పదునాలుగవ అవతారంగా శ్రీహరి నరసింహావతారము దాల్చి హిరణ్యకశిపుని తన గోళ్లతో చీల్చి సంహరించాడు. తన భక్తుడు ప్రహ్లాదుని కాపాడాడు.

తన పదునైదవ అవతారంగా శ్రీహరి వామనావతారము ధరించాడు. ఈ అవతారంలో శ్రీహరి, దేవతలకు స్వర్గాధిపత్యమును ఇవ్వడానికి గాను, బలిచక్రవర్తి యజ్ఞం చేస్తున్న ప్రదేశమునకుపోయి, బలిని మూడు అడుగుల భూమి ఇమ్మని దానంగా అడిగి, ఒక పాదంతో భూమిని, మరొక పాదంతో ఆకాశాన్ని ఆక్రమించి, తన మూడవ పాదాన్ని బలి చక్రవర్తి తల మీదపెట్టి, బలిని పాతాళానికి అణగదొక్కాడు. దేవతలకు స్వర్గాధిపత్యాన్ని ఇచ్చాడు.

శ్రీహరి తన పదునారవ అవతారంగా పరశురాముడుగా అవతరించాడు. ఆ సమయంలో క్షత్రియులు దేవతలను, బ్రాహ్మణులను ద్వేషిస్తూ ఉండేవాళ్లు. ఆ పరిణామాలకు కోపించిన పరశురాముడు, క్షత్రియుల మీద ఇరవై ఒక్కసార్లు దండెత్తి, క్షత్రియకులమును సమూలంగా నిర్మూలించాడు.

తరువాతి కాలంలో మానవులు అల్ప మేధస్సులు గానూ, జ్ఞాన హీనులుగా ఉన్నారు. వేదములను చదివి అర్థం చేసుకొనే శక్తిలేకపోయింది.

ఆ సమయంలో శ్రీహరి తన పదునేడవ అవతారంగా, పరాశరునికి సత్యవతికి వ్యాసుని రూపంలో అవతరించాడు. వేదములను నాలుగు భాగములుగా విభజించి వేదవ్యాసుడుగా ప్రసిద్ధిచెందాడు. ఒక్కొక్క వేదమును తన శిష్యులకు బోధించి, వారి ద్వారా వేదములను శాఖోపశాఖలుగా విస్తరింపజేసాడు. ఆ ప్రకారంగా వేదములు మానవులకు చేరువ అయ్యాయి. మానవ కల్యాణం జరిగింది.

త్రేతాయుగంలో అయోధ్య మహారాజు దశరథునికి, కౌసల్యకు శ్రీరామునిగా జన్మించి, సముద్రము మీద సేతువును నిర్మించి, తన బలపరాక్రమాలతో, వానరుల సాయంతో లోక కంటకులైన రావణ కుంభకర్ణులను సంహరించి దుష్టశిక్షణ చేసాడు. అది శ్రీహరి పదునెనిమిదవ అవతారము.

ద్వాపర యుగంలో, యదువంశంలో దేవకీ వసుదేవులకు శ్రీకృష్ణుడుగా జన్మించాడు. అలాగే బలరాముడుగా కూడా అవతరించాడు. ఇది శ్రీహరి పంతొమ్మిది, ఇరువది అవతారములు. ఈ అవతారములలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసాడు. భూభారాన్ని తగ్గించాడు.

కలియుగ ప్రవేశము తరువాత మానవులు దైవద్వేషులుగా మారారు. తామస గుణ ప్రధానులు అయ్యారు. కామాతురులు అయ్యారు. ఆసమయంలో శ్రీహరి బుద్ధుడు అనే పేరుతో అవతరించాడు. బౌద్ధ మతమును స్థాపించి, మానవులను సన్మార్గంలో నడిపించాడు. ఇది శ్రీహరి ఇరువది ఒకటవ అవతారము.

కలియుగాంతంలో, యుగసంధి కాలంలో, రాజులందరూ అమిత క్రూరులుగా, రాక్షసులుగా మారి పోతారు. అధర్మం వృద్ధి చెందుతుంది. ఆ సమయంలో శ్రీహరి కల్కి అనే పేరుతో విష్ణుయశుడు అనే బ్రాహ్మణుని గృహములో జన్మిస్తాడు. ఇది శ్రీహరి ఇరువది రెండవ అవతారము.

ఓ శౌనకాది మహామునులారా! బ్రాహ్మణోత్తములారా, ఒక పెద్ద జీవ నది నుండి అనేక ఉపనదులు, కాలువలు వచ్చినట్టు, సత్వగుణ ప్రధానుడగు శ్రీహరి నుండి అనేక అవతారములు వెలువడ్డాయి

ప్రజాపతులు, తపోధనులైన మహాఋషులు, మునులు, మనువులు, దేవతలు, సమస్త మానవులు, అందరూ శ్రీహరి అంశనుండి వచ్చిన వారే.

బ్రహ్మ మొదలగు వారు శ్రీహరి యొక్క అంశకళలు. బ్రహ్మాది దేవతలు, ప్రతి యుగములోనూ ఈ జగత్తును దైత్యులనుండి తమ తమ అంశలతో కాపాడు తుంటారు. ద్వాపరంలో శ్రీహరి స్వయంగా శ్రీకృష్ణుడు గా అవతరించాడు.

మానవులు ప్రతిరోజూ, ఉదయము, సాయంత్రము, నిర్మలమైన మనస్సుతో, శ్రీహరి అవతార విశేషములను స్మరించుకుంటే ఈ సంసార సాగరము నుండి సత్వరమే విముక్తికలుగుతుంది.

నిజానికి పరమాత్ముడైన శ్రీహరికి ఏ రూపమూ లేదు. నిర్గుణుడు. నిరాకారుడు. తన మాయా విశేషము చేత అనేక రూపము

లలో, అనేక దేహములు ధరించి  అవతరిస్తూ ఉంటాడు.

కాని మూఢులు  అయిన మానవులు ఆకాశంలో ఆవరించిన మేఘములను చూచి అదే ఆకాశము అనుకుంటూ ఉంటారు. అలాగే నిరాకారుడు, నిర్గుణుడు అయిన శ్రీహరికి అనేకరూపములు ఆపాదించి ఆరూపములనే కొలుస్తూ ఉంటారు. అజ్ఞానంలో పడిపోతూ ఉంటారు.

స్థూలశరీరంలో జీవుడు అదృశ్యరూపంలో ఉంటాడు. అది ఎవరికీ కనపడదు. వినపడదు. ఆ జీవునిలో పూర్వజన్మవాసనలు, కర్మఫలాలు సూక్ష్మరూపంలో ఉంటాయి. వాటి ఫలితంగా జీవుడు పలుజన్మలు ఎత్తుతూ ఉంటాడు.

మానవులు తమ అజ్ఞానము చేత  పరమాత్మకు ఒక స్థూల దేహమును, రూపమును కల్పించి, వివిధ రూపములతో పూజిస్తూ ఉంటారు. ఆ మానవులే తాము అంటే ఈ దేహము కాదనీ, తాము ఆ పరమాత్మ స్వరూపమనీ తెలుసుకొని, విజ్ఞాన వంతులై, జ్ఞాన స్వరూపమగు ఆ పరబ్రహ్మపదమును పొందుతారు.

అవిద్య అనే మాయలో పడి మానవులు కర్మలు చేస్తుంటారు. ఆ కర్మల వలన వచ్చిన  ఫలములను అనుభవిస్తుంటారు. ఆ  కర్మఫలములు అన్నీ  అనుభవించడం  పూర్తి కాగానే, మానవుని ఆవరించిన మాయ తొలగిపోగానే,  జీవుడు  జన్మరాహిత్యం పొంది నిరాకారుడు నిర్గుణుడు అయిన పరమాత్మలో లీనమైపోతాడు.  జీవాత్మ చిదానంద స్వరూపమైన పరమాత్మగా విరాజిల్లుతాడు. ఈ విషయాన్ని తత్త్వవేత్తలు అందరూ ఎరుగుదురు.

ఏ వికారములు లేని వాడు, జనన మరణములు లేని వాడు, అంతటా తానే అయి ఉన్న వాడు అయిన ఆ పరమాత్మ యొక్క అవతారములను, లీలా విశేషములను పండితులు, జ్ఞానులు కీర్తిస్తూ ఉంటారు.

శ్రీమహావిష్ణువు ఈ అనంత విశ్వమును సృష్టించి పాలించి లయం చేస్తున్నాడు. ఈ విశ్వంలో ఉన్న అన్ని ప్రాణులు తానే అయి ఉన్నాడు. పరమాత్మ అన్ని ప్రాణులలో జీవాత్మగా ఉండి, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములకు లోబడి ఇంద్రియముల ద్వారా ఎన్నో కార్యములను చేస్తున్నాడు. కానీ ఏ కార్యములలోనూ ఆసక్తిని చూపడు. నిర్లిప్తంగా ఉంటాడు. ఎలాగంటే, మనం మంచి పని చేస్తున్నా, చెడ్డ పనిచేస్తున్నా, లోపల ఉన్న అంతర్యామి, ఈపని చెయ్యి, ఆ పని వద్దు, అని అనడు. కాని చేసిన కర్మలకు మంచి ఫలితములు, చెడు ఫలితములు ఇస్తుంటాడు. ఆ ఫలితములను మనం అనుభవిస్తుంటాము.

కాని ఈ మూర్ఖ మానవులు ఈ జగన్నాటకము గురించి, జగన్నాటక సూత్రధారి గురించి తెలుసుకొనలేక, ఆ పరమాత్మకు నామములు, రూపములు కల్పించి పూజిస్తుంటారు. పరమాత్మ లీలలను తెలుసుకోలేకపోతున్నారు.

నిర్మలమైన మనస్సుతో ఎల్లప్పుడూ శ్రీహరి పాదపద్మములను సేవించు వాడు, ఆ శ్రీహరి తత్త్వమును తెలుసుకోగలడు.

ఓ మహాఋషులారా! మీరందరూ కృతార్థులు. మీరు నన్ను ఎన్నో ప్రశ్నలు అడిగి, శ్రీహరి యందు మీకు గల ఏకాగ్ర బుద్ధి, భక్తిప్రమత్తులు చాటుకున్నారు. మీరు ఇదే నిశ్చలభావంతో ఉంటే, మీకు మాటి మాటికీ పుట్టడం చావడం అనే జనన మరణ చక్రము నుండి విముక్తి కలుగుతుంది. దానినే జన్మరాహిత్యము అంటారు.

. వేదవ్యాసుడు, చతుర్వేదసారము, భగవంతుని లీలావిశేషము లతో నిండినది, అందరికీ శ్రేయస్సును కలిగించేది అయిన భాగవత పురాణమును లోకకల్యాణము నిమిత్తము రచించి మనకు అందించాడు.

మొదట వ్యాసుడు ఆ భాగవత పురాణాన్ని తన కుమారుడు శుకునికి బోధించాడు. తన తండ్రి నుండి తాను నేర్చుకున్న భాగవత పురాణమును, శుకుడు, శాపగ్రస్తుడై, వైరాగ్యంతో ప్రాయోపవేశం చేస్తూ, మరణం కోసం ఎదురుచూస్తున్న పరీక్షిత్ మహారాజుకు, ఏడురోజులపాటు వినిపించాడు. ఆ ప్రకారంగా భాగవతపురాణము లోకంలో వ్యాప్తిచెందింది

. లీలామానుషవిగ్రహుడగు శ్రీకృష్ణుడు తన అవతారమును చాలించి వైకుంఠమునకు వెళ్లిన తరువాత, కలియుగము ప్రవేశించింది. జనులు అజ్ఞానాంధకారంలో మునిగిపోయారు. అజ్ఞానమనే చీకట్లో మునిగి పోయిన ఈ లోకానికి దివ్యజ్ఞానదీపం లాగా భాగవతపురాణము అనే సూర్యుడు ఉదయించాడు.

ఓ మహామునులారా! శుకమహర్షి పరీక్షిత్తుకు భాగవత పురాణమును వినిపించేటప్పుడు నేను అక్కడే ఉండి విన్నాను.

శ్రీ శుకమహర్షి ముఖతా విన్న భాగవతపురాణమును ఇప్పుడు నేను మీకు వినిపిస్తాను. సావధానంగా వినండి.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము

మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# ప్రథమస్కంధము

## నాలుగవ అధ్యాయము.

ఆ విధంగా పలికిన సూతపౌరాణికుని చూచి దీర్ఘసత్ర యాగము చేయుచున్న మునులలో కెల్లా శ్రేష్టుడు అయిన శౌనక మహాముని సూతపౌరాణికునితో ఇలా అన్నాడు.

" ఓ సూత మహాభాగా! నీవు పురాణములను చెప్పడంలో గొప్పవాడివి. శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పిన భాగవత పురాణమును మాకు కూడా వినిపించు.

ఈ భాగవత కథను వ్యాసుడు రచించాడు అని చెప్పారు కదా! వ్యాసుడు ఈ భాగవత కథను ఏ కాలంలో, ఏ ప్రదేశంలో, ఏ కారణం

చేత, ఎవరి ప్రోద్బలంతో రచించాడు.

వ్యాసుని కుమారుడు శుకమహర్షి మహాయోగి. అందరి ఎడల సమదృష్టి కలవాడు. ఎప్పుడూ ఏకాంతంలో ఉంటూ ఆ పరమాత్మను ధ్యానం చేసుకుంటూ ఉంటాడు. ఈ లౌకిక ప్రపంచానికి ఒక జడుడి మాదిరి కనపడుతుంటాడు.

చిన్న వయసులోనే శుకుడు సన్యాసాశ్రమము స్వీకరించి ఇంటి నుండి వెళ్లిపోయాడు. ముందు శుకుడు వెళుతుంటే వెనక నుండి వ్యాసుడు "కుమారా! కుమారా!" అని శుకుడిని పిలుస్తూ వెళుతున్నాడు. దారిలో కొంత మంది దేవతా స్త్రీలు బట్టలన్నీ విప్పి గట్టున పెట్టి ఒక జలాశయంలో దిగి స్నానాలు చేస్తున్నారు. ఆ దారి వెంట వెళుతున్న శుకుని చూచి వారు ఏ మాత్రం సిగ్గుపడకుండా తమ స్నానాల కార్యక్రమం కొనసాగించారు. కాని వెనక వస్తున్న వ్యాసుని చూచి గబగబా ఒడ్డుకు వచ్చి బట్టలు కట్టుకున్నారు. ఇది చూచి వ్యాసుడు ఆశ్చర్యపోయాడు. యువకుడైన శుకుని చూచి సిగ్గుపడకుండా, జ్ఞానవృద్ధుడు, వయో వృద్ధుడు అయిన తనను చూచి సిగ్గుపడి బట్టలు కట్టుకోడానికి కారణ మేమి అని వారిని అడిగాడు. అప్పుడు ఆ దేవతాస్త్రీలు ఇలా అన్నారు. "ఓ మహాత్మా! నీ కుమారుడు శుకునికి స్త్రీపురుష భేదములేదు. అతనిది పవిత్రదృష్టి. సమదృష్టి. కాని నీకు స్త్రీపురుష భేదము ఉంది. అందుకని నిన్ను చూచి బట్టలు ధరించాము" అని చెప్పారు. అటువంటి మహాత్ముడు శుకుడు.

అంతే కాకుండా శుకుడు ఒక పిచ్చివాడిలాగా, మూగవాడి లాగా, మూర్ఖుడి లాగా తిరుగుతూ ఉంటాడు కదా! అటువంటి శుకుని

హస్తినాపుర వాసులు ఎలా గుర్తించారు. పరీక్షిత్తు మహారాజు శుకుని ఎలా కలిసాడు. వారు ఏం మాట్లాడుకున్నారు?

శుక మహర్షి భిక్ష కోసరం గృహస్థుల ఇళ్లకు వెళ్లినపుడు, వారి ఇళ్ల దగ్గర గోవు నుండి పాలు పితికే సమయం కన్నా ఎక్కువ సేపు నిలువడు కదా! మరి హస్తినాపురంలో ఏడురోజులు ఎలా ఉన్నాడు. భాగవత కథను ఎలా చెప్పాడు.

అర్జునుని కుమారుడైన పరీక్షిత్తు మహాభాగవతుడు అని లోక ప్రసిద్ధి గదా! ఆయన గురించి, ఆయన జన్మను గురించి మాకు వివరించండి. రాజాధి రాజుగా ఉండి, లక్షణంగా రాజ్యము చేసుకొనేవాడు, రాజ్యాన్ని వదిలిపెట్టి ప్రాయోపవేశము ఎందుకు చేసాడు. ఆయనకు వచ్చిన కష్టం ఏమిటి?

శత్రువుల నుండి కూడా కానుకలు కప్పములు కట్టించుకొనే ధర్మాత్ముడు అయిన పరీక్షిత్ మహారాజుకు నిండు యౌవనంలోనే రాజ్యమును విడిచిపెట్టి ప్రాణత్యాగము చేయవలెనని కోరిక ఎందుకు పుట్టింది. ?

ఈ లోకంలో భగవద్భక్తులు తమ స్వార్థపరత్వమును వదిలిపెట్టి, జనుల సుఖం కోసరం వారి క్షేమం కోసరం జీవిస్తూ ఉంటారు కదా! అటువంటి పరీక్షిత్తు మహారాజు, తన స్వార్ధమును విడిచిపెట్టి నిరంతరము ప్రజాక్షేమం కోసరం, ప్రజల అభ్యుదయము కొరకు పాటుపడే పరీక్షిత్తు మహారాజు, ప్రాయోపవేశం ఎందుకు చేసాడు. తన దేహాన్ని ఎందుకు విడిచిపెట్టాలని నిర్ణయించుకున్నాడు.

ఈ విషయాలన్నీ మీకు తెలిసినంతవరకూ మాకు తెలియ జేయండి. ఇటువంటి విషయములను, వేదములకు, శాస్త్రములకు సంబంధించిన విషయములను, చెప్పడంలో నీవు నిష్ణాతుడవు కదా! "అని అడిగాడు శౌనక మహర్షి.

శౌనకుడు అడిగిన ప్రశ్నలకు సూతపౌరాణికుడు ఇలా బదులు చెప్పాడు. "ఓ బ్రాహ్మణోత్తములారా! త్రేతాయుగము ముగిసి మూడవ యుగమైన ద్వాపర యుగము ప్రవేశించింది. ఒకానొక శుభ ముహూర్త మున, ఉపరిచర వసువు వీర్యం విధివశాత్తు చేపనోట్లో పడగా, ఆ వీర్యం చేపకడుపులో శిశువుగా రూపొంది, దాశరాజు ఇంటికి చేరి, ఆయన ఇంట్లో సత్యవతి అనే పేరుతో పెరిగి పెద్దది అయింది. యౌవనంలో ఉన్న సత్యవతికి, పరాశర మహర్షికి, వ్యాసుడు జన్మించాడు. పుట్టీ పుట్టగానే వ్యాసుడు బదరికాశ్రమమునకు వెళ్లిపోయాడు. సరస్వతీ నదీ తీరంలో ఆశ్రమము నిర్మించుకొని తపస్సు చేసుకుంటూ ఉన్నాడు.

ఒకరోజు వ్యాసుడు సరస్వతీ నదీ జలములలో స్నానం చేసి, ఆ నది ఒడ్డును కూర్చుని ఆలోచిస్తున్నాడు.

వ్యాసుడికి అన్ని కాలములతో జరిగే విషయములు తెలుస్తూ ఉంటాయి. యుగాలు గడిచే కొద్దీ కాలవశమున, దేహధారులైన మానవులలో శక్తి, సామర్థ్యములు నశించిపోతూ ఉండటం, మానవులకు తాము చేసే పనుల మీద శ్రద్ధ లేకపోవడం, ధైర్యము కోల్పోవడం, దుర్బలులు అవడం, బుద్ధిసరిగా ఉండకపోవడం, మందమతులుగా తయారవడం, తన యోగదృష్టి ద్వారా గమనించాడు వ్యాసుడు. యుగాలు గడిచేకొద్దీ మానవులకు ఆయు:ప్రమాణము తగ్గిపోతూ

ఉండటం, వారికి అదృష్టము కూడా అంతంత మాత్రంగానే ఉండటం చూచాడు. ఈ పరిస్థితులలో అన్ని వర్ణముల వారికీ, అన్ని జాతుల వారికీ, అన్ని ఆశ్రమముల వారికీ, శుభం కలుగచేయాలని అనుకున్నాడు వ్యాసుడు.

ఆ కాలంలో వేదములు అన్నీ ఒకటిగా ఒకే వేదంగా ఉండేవి. ఏ విషయం ఎక్కడ ఉన్నదో తెలుసుకోవడం కష్టంగా ఉండేది. కాబట్టి సామాన్యులు కూడా వైదిక కర్మలను సులభంగా ఆచరించడానికీ, యజ్ఞయాగాదులు చెయ్యగలగడానికీ, వీలుగా ఉండేటట్టు, సామాన్య మానవులు కూడా వేదములను అభ్యసించడానికి వీలుగా, వ్యాసుడు వేదములను నాలుగు భాగాలుగా విభజించాడు.

వాటికి ఋగ్వేదము, యజుర్వేదము, సామ వేదము, అథర్వణ వేదము అని పేర్లు పెట్టాడు. తాను రచించిన ఇతిహాసములు, పురాణములు అన్నీ కలిపి పంచమ వేదంగా అభివర్ణించాడు వ్యాసుడు.

తాను విభజించిన నాలుగు వేదములను లోకంలో ప్రచారం చెయ్యడానికి తన శిష్యులను నియమించాడు. ఋగ్వేదమును పైలునకు, జైమినికి సామవేదము, వైశంపాయనునకు యజుర్వేదము, సుమంతునికి అథర్వణ వేదము అప్పగించాడు. తాను రచించిన ఇతిహాసములు, పురాణములను మా తండ్రి గారైన రోమహర్షణుడు ఇతిహాస పురాణాలలో నిష్ణాతుడు.

పైలుడు, జైమిని, వైశంపాయనుడు, సుమంతుడు తమకు అప్పగించిన వేదములను అనేక విభాగములుగా జేసి లోకములో వ్యాప్తి

చేసారు. వారి నుండి వారి శిష్యులకు, వారి ప్రశిష్యులకు అందచేసారు. ఆ ప్రకారంగా శిష్యపరంపరను అనుసరించి, వేదములు శాఖోపశాఖలుగా విభజింపబడి, లోకంలో విస్తరించాయి.

అల్పబుద్ధులు, బుద్ధిహీనులు అయిన మానవులు నేర్చుకోడానికి వీలుగా వేదమును నాలుగు భాగములుగా విభజించి అందరికీ అందుబాటులోకి తీసుకువచ్చాడు వ్యాసుడు.

కానీ, ఆనాటి యుగధర్మము ప్రకారము స్త్రీలకూ, శూద్రులకూ, కేవలం పుట్టుకతో బ్రాహ్మణులు అయిఉండీ, ఏ మాత్రమూ బ్రాహ్మణుల లక్షణములు లేని వారికీ, వేదము అధ్యయనము చెయ్యడానికి కానీ, వినడానికి అర్హతలేదు. అటువంటి వారికి కూడా శ్రేయస్సు కలిగించాలని అనుకున్నాడు వ్యాసుడు. అటువంటి అజ్ఞానులకు వేదములలో చెప్పబడిన యజ్ఞయాగాదులు చేయడం వలన ఏ ప్రకారంగా శ్రేయస్సు కలుగుతుంది అని ఆలోచించి, వారి కోసరం భారతము అనే ఇతిహాసమును రచించాడు.

ఆ భారతములో నాలుగువేదములలో ఉన్న అన్ని విషయము లను పొందుపరిచాడు. ఎల్లప్పుడూ మానవ జాతికి ఏదోవిధంగా శ్రేయస్సు కలుగజేద్దామని నిరంతరం తాపత్రయపడే వ్యాసునికి, ఇతిహాసములు, పురాణములు రచించినా, ఆయన మనస్సుకు తృప్తి కలుగ లేదు. ఏదో అసంతృప్తి. ఇంకా చెయ్యాల్సింది ఏదో ఉందని వెలితి వ్యాసుని మనస్సును కలిచివేస్తూ ఉంది. అందుకే సరస్వతీ నదీతీరంలో కూర్చుని ఈ ప్రకారంగా ఆలోచిస్తున్నాడు.

“నేను ఎంతో నిష్టగా బ్రహ్మచర్యము మొదలగు వ్రతములను

ఆచరించాను. నిత్యము అగ్నిహెూత్రము చేసాను. గురువులను పూజించాను. గురువుల ఆజ్ఞ ప్రకారము నడుచుకున్నాను.

మహాభారతము అనే పేరు మీద నాలుగు వేదములలో ఉన్న సారమును కథల రూపంలో లోకానికి వెల్లడి చేసాను. దాని వలన వేదములను చదవడానికి వినడానికి అర్హతలేని స్త్రీలకు, శూద్రులకు వేదాలను అందుబాటులోకి తెచ్చాను. వారు తమ తమ ధర్మములను, వారు చేయవలసిన కర్మలను తెలుసుకునేటట్టు చేసాను.

వేదములను విభజించినా, మహాభారత రచన చేసినా, ఇంకా నేను చేసిన పనులకు పరిపూర్ణత చేకూరలేదని నాకు మనసులో బాధగా ఉంది. నా ఆత్మ బ్రహ్మతేజస్సుతో కూడినది అయినను, ఇంకా అపరిపూర్ణంగానే ఉంది.

నేను రచించిన మహాభారతములో వేదములలో ఉన్న విషయములను వివరించాను కానీ, భగవంతుని చేరుకొనే ఉపాయమును ఎక్కడా వివరించలేదు. భగవంతునికి, భగవంతుని చేరుకోవాలని పరితపించేవారికీ, ప్రియమైన అంశములను నేను వివరించలేదు. అందుకనే నేను చేసిన రచనలన్నీ అసంపూర్ణంగా మిగిలిపోయాయి." అని ఆవేదన చెందుతున్నాడు వ్యాసభగవానుడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ప్రథమ స్కంధము

ఐదవ అధ్యాయము.

ఆ సమయంలో నారద మహర్షి వ్యాసుని వద్దకు వచ్చాడు. నారదుని రాకను చూచి వ్యాసుడు లేచి ఆయనను ఆహ్వానించి అతిథి సత్కారములు చేసాడు. ఆ దేవర్షిని యథావిధిగా పూజించాడు.

. వ్యాసుని వద్దకు వచ్చిన నారద మహర్షి వ్యాసునితో ఇలా అన్నాడు. "ఓ పరాశరనందనా! ఎలా ఉన్నారు? నీ ఆత్మ, నీ మనసు చేసే ఆలోచనల చేతా, నీ శరీరము చేసే పనుల చేతా, సంతుష్టి పొందుతూ ఉందా!

నీవు ఒక జిజ్ఞాసువు. నీకు తెలియని విషయము, తెలుసుకోదగిన ధర్మం లేదు. నీకు అన్ని ధర్మాలు తెలుసు. నీకు తెలిసిన ధర్మములను చక్కగా ఆచరించావు. వేదములు విభజించావు. . ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే నాలుగు పురుషార్థములను పరిపూర్ణంగా మహాభారత రచనలో పొందుపరిచావు.

అదీకాకుండా నీవు సనాతనమైన బ్రహ్మ తత్త్వమును బాగా తెలుసుకున్నావు. కాని నీ మొహం చూస్తుంటే ఏదో చింత కనిపిస్తూ ఉంది. ఇన్ని చేసినవాడివి ఇంకా దేనికోసం చింతిస్తున్నావు. నీవు ఇంకా కృతార్థుడవు కాలేదని నీ సంశయమా!" అని అడిగాడు నారదుడు.

దానికి వ్యాసుడు ఇలా చెప్పాడు. “ఓ నారద మహర్షీ! తమరు చెప్పినది అంతా నిజమే. నేను లోకకల్యాణార్థము ఎన్నో పనులు చేసాను. కానీ ఎందుకో నా శరీరము, నా మనస్సు తృప్తి చెందలేదు. ఇంకా ఏదో చెయ్యాలని తపన. నేను ఏది చెయ్యాలో తెలియడం లేదు. నీవు స్వయంభువు అయిన బ్రహ్మ మానస పుత్రుడవు. నీ జ్ఞానము పరిపూర్ణము. నీకు తెలియని విషయములు లేవు. అందుకని తమరిని అడుగుతున్నాను. నా అసంతృప్తికి, అప్రసన్నతకు కారణమేమిటి? నేను ఇంకా ఏమి చెయ్యాలి? ఏం చేస్తే నా శరీరానికి మనసుకు తృప్తి కలుగుతుంది. దయచేసి చెప్పండి.

ఎందు కంటే నీవు త్రిలోక సంచారివి. ఈ అనంత విశ్వమునకు సర్వాధికారి, నిరాకారుడు, సంకల్ప మాత్రం చేత సత్త్వ, రజస్, తమోగుణముల ద్వారా ఈ జగత్తుకు సృష్టి, స్థితి, లయకారకుడైన ఆ శ్రీమహావిష్ణువును నిరంతరము ఉపాసిస్తుంటావు, భజిస్తుంటావు. నీకు విష్ణుతత్త్వము, ఆయన గురించిన సర్వరహస్యములు బాగా తెలుసు.

నీవు నిరంతరము లోకసంచారము చేస్తుంటావు. నీ యశస్సు మూడులోకములలో సూర్యతేజము వలె వ్యాపించి ఉంది. నీ యోగశక్తి చేత ఈ జగత్తులోని మానవుల యొక్క మనోగతములను అవగాహన చేసుకున్న సమర్థుడవు. నేను అనుదినము వేదాధ్యయనము చేస్తున్నాను. నియమ నిష్టలతో జీవితం గడుపుతున్నాను. కాని నాలో ఏదో వెలితి కనపడుతూ ఉంది. అదేదో నాకు తెలియజేయండి.” అని అడిగాడు వ్యాసుడు.

దానికి నారద మహర్షి ఇలా బదులు చెప్పాడు. “ఓ వ్యాస మునీంద్రా! నువ్వు మహాభారత రచన చేసావు. అందులో లౌకిక విషయాలు

మాత్రమే చెప్పగలిగావు. కానీ శ్రీహరి యొక్క పవిత్రమైనయశస్సును గురించి వివరంగా చెప్పలేదు. నీవు ఏమి చెప్పినా, ఎంత చెప్పినా శ్రీహరి మహిమను గురించి చెప్పక పోతే అది అసంపూర్ణమే అవుతుంది కదా! కాబట్టి శ్రీహరి మహిమను కీర్తించని గ్రంధములు చదివితే కలిగే జ్ఞానము ఎందుకూ పనికిరాదు.

నీవు రాసిన గ్రంధములలో కేవలము ధర్మము, అర్థము, కామము గురించి ప్రధానంగా చెప్పావు. కానీ వాసుదేవుని మహిమలను, వాసుదేవుని గురించిన కథలను గురించి ప్రధానంగా చెప్పలేదు.

నీవు రాసిన గ్రంధములు రసపుష్టిని కలిగి ఉండవచ్చు. అవి ఎంతో భావస్ఫోరకంగానూ ఉండి ఉండవచ్చు. కానీ పవిత్రమైన శ్రీహరి యశస్సును గురించి తెలుపకపోతే, అది నిష్ప్రయోజనమే కదా! ఎల్లప్పుడూ పరబ్రహ్మను గురించి విచారించువారు, భగవంతుని పాదపద్మములను ఆశ్రయించిన వారు, నీవు రాసిన గ్రంథముల గురించి ఆలోచించరు. అవి చదవడానికి ఆసక్తి చూపరు, అధ్యయనము చెయ్యరు.

ఏదయినా గ్రంధము అపశబ్దములతో కూడినది అయినప్ప టికినీ, ఛందోబద్ధము కానప్పటికినీ, అందులో శ్రీహరి గానామృతము నిండి ఉంటే, అందులో శ్రీహరి యశస్సు కీర్తింపబడి ఉంటే, అది పరమపవిత్ర గ్రంధము అవుతుంది. ఆ గ్రంధములో ఉన్న అంశములనే భక్తులు వింటారు, పాడుకుంటారు, కీర్తిస్తారు అనడంలో సందేహము లేదు. ఎందుకంటే శ్రీహరి భక్తులకు కేవలము ఆ గ్రంధములో చెప్పబడిన భగవద్భక్తి, భగవంతుని లీలల మీదనే ఆసక్తి కానీ, అందులో ఉన్న అపశబ్దములు, అలంకార విశేషములు కాదు.

మానవులు నిష్కామ కర్మలు ఆచరించినప్పటికీ, అవి అచ్యుతుని మీద భక్తిభావంతో చెయ్యక పోతే, నిరర్థకములు అవుతాయి. ఆ నిష్కామ కర్మలు సాధించేటప్పుడు దు:ఖము కలుగుతుంది కానీ మనశ్శాంతి కలగదు. మానవులు ఏ విధములైన కర్మలు ఆచరించినప్పటికీ, అవి భగవంతుని మీద భక్తితో విశ్వాసంతో ఆచరించకపోతే, భగవంతునికి అర్పించకపోతే, వాటికి శోభచేకూరదు.

ఓ వ్యాసమునీంద్రా! నీ జ్ఞానదృష్టి అమోఘము. నీబుద్ధి బలము అద్వితీయము. అందులో సందేహము లేదు. నీకు శ్రీహరి కథలను వినడం లోనూ రాయడం లోనూ ఆసక్తి మెండుగా ఉంది. నీవు నియమ నిష్ఠలను చక్కగా పాటిస్తావు. ఎల్లప్పుడూ సత్యమునే పలుకుతావు. కాబట్టి నీవు మానవులు ముక్తిచెందే మార్గమును గురించి వివరించు. శ్రీహరి లీలలను ఏకాగ్రమైన మనస్సుతో విపులంగా వర్ణించు.

ఎందుకంటే, శ్రీహరి లీలలను కాకుండా, ఇతరములను ఇష్టపడువాడు, భగవంతునికి రకరకాల రూపములు, పేర్లు కల్పించి, ఆ రూపములను సేవిస్తూ, ఆ నామములను కీర్తిస్తూ, కేవలము ప్రాపంచిక సంబంధములైన కోరికలను కోరుతూ, ఆ కోరికలను తీర్చుకుంటూ కాలం గడుపుతాడు. వాడి బుద్ధి ఎప్పుడూ ఒక రూపానికి మరొక రూపానికీ ఉన్న బేధభావముతో నిండి పోతుంది. వాడి మనస్సు నడిసముద్రంలో ఉన్న నావ లాగా కొట్టుమిట్టాడుతూ ఉంటుంది. వాడి బుద్ధి, మనస్సు ఎక్కడా ఏ దేవుడి మీదా స్థిరంగా ఉండదు. నిరంతరమూ చంచలంగా ఉంటుంది. (కొంత కాలం పాటు ఆంజనేయస్వామి చుట్టు ప్రదక్షిణాలు చేస్తాడు. తరువాత "ఆంజనేయస్వామి ఏం లాభం లేదండీ. అనుకున్నది అనుకున్నట్టు జరగడం లేదు. సాయిబాబా బెటర్. అన్ని కోరికలు తీరుస్తాడు." అంటూ

షిర్డి5సాయి బాబా చుట్టు తిరుగుతాడు. కొంత కాలం తరువాత ఆయనా నచ్చడు. మరోదేవుడు. ఎక్కడా, ఎవరిమీద నిశ్చలంగా మనసు పెట్టలేడు. మానవుని ఈ స్వభావాన్ని నారదుడు ఆ నాడే గ్రహించాడు.)

మానవులు సహజంగా ప్రాపంచిక విషయముల మీద ఆసక్తులై

#### ఉంటారు. నీవు రాసిన గ్రంథములలో మానవులకు, ధర్మం కోసరంగా, కోరికలతో కూడిన కర్మలను చేయమని ప్రోత్సహించావు. అదే ఆచరించ వలసిన ధర్మము అని తెలిపావు. అది చాలా అన్యాయము, జుగుప్సాకరమైనది కదా! ఈ తెలివితక్కువ మానవులు నీవు చెప్పినదే ధర్మము అని భావించి, కోరికలతో కూడిన కర్మలనే ఆచరిస్తున్నారు. అదే ధర్మము అనుకుంటున్నారు. ఇప్పుడు అది ధర్మం కాదు అని చెప్పినా వినే పరిస్థితిలో లేరు ఈ మానవులు.

బుద్ధిమంతులు అయిన మానవులు ఆచరించ వలసిన ధర్మం ఏమిటంటే అన్ని కర్మలను చేయడం విడిచి పెట్టి, దేశమునకు, కాలమునకు అతీతుడు, సర్వత్రా వ్యాపించి ఉన్నవాడు అయిన శ్రీహరి సేవలో తరించడం, అందులోనే ఆనందం పొందడం, ఆ ఆనందంలోనే శ్రీహరి స్వస్వరూపం తెలుసుకోవడం. కానీ నీవు చెప్పిన కోరికలతో కూడిన కర్మలను చేసే అవివేకి అయిన మానవుడికి ఇది ఎన్నటికీ సాధ్యం కాదు. వాడు శ్రీహరిని గురించి తెలుసుకోలేడు. కనీసం తెలుసుకోడానికి కూడా ప్రయత్నించడు. కాబట్టి ఓ వ్యాసమహర్షీ! సత్త్వ, రజస్, తమోగుణములతో కర్మలను ఆచరిస్తున్న మానవులకు, కేవలం దేహం మీద అభిమానం చేతనే జీవిస్తున్న మానవులకు, శ్రీహరి లీలల గురించి తెలియచెయ్యి.

స్వధర్మమును విడిచి పెట్టినప్పటికినీ, నిరంతరమూ శ్రీహరి పాదపద్మములను సేవించే వాడికి, శ్రీహరి నామమును కీర్తించేవాడికి,

తరువాతి కాలంలో వాడు పతితుడైనా, మృతి చెందినా, వాడికి ఎలాంటి అమంగళం కలుగదు. కాని, స్వధర్మాన్ని ఆచరిస్తూ, నియమ నిష్ఠలతో జీవితం గడిపే మానవులకు, శ్రీహరి మీద భక్తి లేకపోతే, ఆ స్వధర్మానుష్ఠానము వలన, ఎలాంటి ప్రయోజనము సిద్ధించదు.

బ్రహ్మలోకము నుండి మానవ లోకము వరకూ సంచరించినప్పటికీ ఏ సుఖము లభించదో ఆ పరమమైన సుఖము కొరకు, అలౌకికానందము కొరకు, బుద్ధిమంతులు, వివేకులు అయిన వాళ్లు నిరంతరమూ ప్రయత్నిస్తూ ఉంటారు. కాని విషయ సుఖములు, ప్రాపంచిక సుఖములు మాత్రం ఎట్టి ప్రయత్నం చెయ్యకుండానే అన్ని కాలములలోనూ, అన్ని లోకములోనూ లభిస్తూ ఉంటాయి.

ఎల్లప్పుడూ భగవంతుని ఉపాసించే మానవుడు, ఏ కారణం చేతనైన పాపపు జన్మ ఎత్తినా, అందులో లీనం కాడు. ఆ పాపపు జన్మలో కూడా భగవన్నామ్మ స్మరణను వదిలిపెట్టడు. ఎల్లప్పుడూ భగవంతుని పాదములను సేవిస్తూ ఉంటాడు.

ఓ వ్యాసమునీంద్రా! ఇవన్నీ నీకు తెలియని విషయములు కావు. ఈ చరాచర జగత్తులో ఆ భగవానుడు సర్వత్రా నిండి నిబిడీకృతమై ఉన్నాడు. అన్నీ తానే అయి ఉన్నాడు. కాని తాను ఎందులోనూ ప్రవర్తించడు. సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడు. ఈ విషయం కూడా నీకు తెలుసు కాని కేవలం సూచన ప్రాయంగా నీకు చెప్పాను.

ఓ వ్యాసమహర్షీ! నీవు కూడా ఆ పరమాత్మ అంశలో

జన్మించావు. నిజానికి నీవు జన్మరాహిత్యము పొందావు. నీకు జన్మ ఎత్తవలసిన అవసరం లేకపోయినా, లోక కల్యాణము కొరకు మరలా వ్యాసుడుగా జన్మించావు. అది కూడా నీకు తెలుసు. అందు వలన ఆ శ్రీహరి గురించి, శ్రీహరి లీలా విశేషముల గురించీ, నీ కన్నా బాగా చెప్పగలిగిన వాళ్లు వేరెవరూ లేరు. కాబట్టి శ్రీహరి లీలలను మనోహరంగా వర్ణించు.

మానవుడు తపస్సు చేసినా, వేదములు చదివినా, నియమ నిష్టలతో జీవితం గడిపినా, జ్ఞానము సముపార్జించినా, దానధర్మములు చేసినా, వాటివలన కలిగే ప్రయోజనము శ్రీహరియందు భక్తి ప్రమత్తులు కలిగిఉండడమే. శ్రీహరిని కీర్తించడమే. ఇది పండితులు చెప్పిన మాట.
.

ఓ వ్యాసమహర్షీ! ఇంతకు ముందు కల్పంలో, నా పూర్వ జన్మలో నేను ఒక దాసీ పుత్రుడను. మా తల్లిగారు వేదవేదాంగపారంగతులైన కొంతమంది బ్రాహ్మణుల వద్ద దాసీగా పనిచేస్తూ ఉండేది. ఆ బ్రాహ్మణ యోగులు చాతుర్మాస్య వ్రతమును ప్రారంభించారు. మా తల్లితో పాటు నేను కూడా బాల్యమునుండి వారికి సేవచేస్తున్నాను.

నేను నా బాల్యమును తోటి బాలకులతో ఆడుకుంటూ కాలం గడపకుండా, ఎక్కువగా మాట్లాడకుండా, వారు చెప్పిన పనులు చేస్తూ వారి సేవ చేసుకుంటూ ఉండేవాడిని. నేను చేసిన సేవలకు ఆ యోగులు నన్ను చాలా బాగా మెచ్చుకున్నారు.

ఒకసారి నేను వారు తిన్న తరువాత భిక్షాపాత్రలో మిగిలిన ఆహారమును తిన్నాను.. అందువలన నా పురాకృత పాపములు అన్నీ

తొలగిపోయాయి. నా మనస్సు పరిశుద్ధము అయింది. నాకు  ఈశ్వర సేవలో ఆసక్తి ఎక్కువ అయింది.

ఆ ఋషులు సాయంత్రము వేళలలో విష్ణుకథలను గానం చేసేవారు. నేను వారి పక్కనే నిలబడి ఆ కథలను ఆసక్తిగా శ్రద్ధగా వినేవాడిని. ఆ కథలను వినడం వలన నాకు శ్రీహరి యందు భక్తి కుదిరింది.

శ్రీహరి కథలను వినడం వలన నాకు శ్రీహరి మీద ప్రేమ ఎక్కువ అయింది. దానితో  నా బుద్ధి నిశ్చలం అయింది. దాని ప్రభావం వలన నేను అంతర్ముఖుడనై నా ఈ స్థూల శరీరములో  ఉన్న పరమాత్మను దర్శించగలిగాను.

ఇంతలో వర్ష శరదృతువులు పూర్తి అయ్యాయి. ఆ నాలుగు నెలల పాటు నేను విష్ణుకథలను శ్రద్ధగా విన్నాను. అప్పుడు నాలో ఉన్న రజోగుణము, తమోగుణమును నాశనం చేయు భక్తి ఏర్పడింది.

తరువాత ఆ యోగులు ఆ చోటు విడిచి వెళ్లడానికి ప్రయాణ మయ్యారు. వారు నాకు అత్యంత గుహ్యమైన ఈశ్వరజ్ఞానము ఉపదేశించారు.

వారి ఉపదేశ ఫలితంగా నేను పరమాత్మయొక్క అసలైన స్వరూపమును తెలుసుకోగలిగాను. ఆ జ్ఞానము చేతనే కదా జీవులు పరమాత్మను చేరుకోగలుగుతున్నారు. ఆ అదృష్టము నాకు కూడ లభించింది.

మానవులు చేసే కర్మలు అన్నింటినీ ఆ పరమాత్మకు అర్పిస్తే, ఆ కర్మల వలన కలిగే తాపత్రయములు మనలను అంటవు.

ఓ వ్యాసమహర్షీ! ఏ పదార్థములను తింటే రోగములు వస్తాయో, అవే పదార్థములను తింటే ఆ రోగము తగ్గిపోదుకదా! కాని, ఏ పదార్థములను తింటే మనకు రోగము వచ్చిందో ఆ పదార్థములకు ఓషధులు కలిపి సేవిస్తే, రోగము తగ్గిపోతుంది.

అలాగే, మానవులు శాస్త్ర ప్రకారము రోజూ చేసే కర్మలు, వారిని సంసార బంధములలోకి నెడుతుంటాయి. కాని అవే కర్మలను ఈశ్వరార్పణము చేస్తే, మనలో ఉన్న అహంకారము నశించి పోతుంది. ఆ కర్మల ఫలములు మనలను అంటవు.

కాబట్టి మనము ఏ కర్మలు చేసినా దానిని భగవంతుని ప్రీతికొరకు చెయ్యాలి. ఆ కర్మల ఫలమును భగవంతునికి అర్పించాలి. ఇదంతా కేవలం భక్తియోగము వలననే సాధ్యము అవుతుంది.

కాబట్టి మానవులు ఏ కర్మలను చేయ తలపెట్టినా, ఆ సమయంలో వారు కృష్ణనామ సంకీర్తనము చేస్తూ కర్మలను ఆచరించాలి.

ఓ శ్రీకృష్ణా! నీవు  వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, సంకర్షణుడు అనే నాలుగు వ్యూహములు కలిగిన వాడివి. నిన్న నా మన:పూర్వకముగా ధ్యానిస్తున్నాను. నమస్కరిస్తున్నాను.

అట్టి శ్రీకృష్ణ పరమాత్మను నిరంతరము ధ్యానించే వ్యక్తి, పూజించే వ్యక్తి అందరిలోనూ పరమాత్మను చూడగలడు. అందరి ఎడల సమదృష్టి కలిగి ఉంటాడు.

నాకు ఆ యోగులు ఉపదేశించిన ఈ ఈశ్వరజ్ఞానాన్ని చక్కగా అనుష్ఠించాను. దాని ఫలితంగా నాకు ఆ కృష్ణపరమాత్మ తన ఎడల అచంచలమైన భక్తి అనే ఐశ్వర్యాన్ని ప్రసాదించాడు.

కాబట్టి ఓ వ్యాసమహర్షీ! నీవు కూడా ఆ విష్ణుమూర్తిని, ఆయన అవతార విశేషములను కీర్తించు. భక్తి మార్గమును బోధించు. ఈ ఈశ్వరజ్ఞానాన్ని తెలుసుకుంటే, సమస్తమూ తెలిసినట్టే. దీనిని తెలుసుకున్న విద్వాంసులు కూడా తరిస్తారు. నిరంతరమూ సంసారసాగరంలో పడి కొట్టుకుంటున్న ఈ మానవుల బాధలు తొలగించడానికి భక్తి మార్గము కంటే వేరు ఉపాయము లేదు." అని నారద మహర్షి వ్యాసునికి తాను విష్ణుభక్తుడు ఎలా అయిందీ వివరించాడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ప్రథమస్కంధము
ఆరవ అధ్యాయము.

సూత పౌరాణికుడు శౌనకాది మహామునులను చూచి ఇలా అన్నాడు. "ఓ మహామునులారా! నారదుడు చెప్పిన మాటలను విన్న వ్యాసుడు నారదుని ఇలా అడిగాడు.

"నారద మునీంద్రా! నీకు జ్ఞానభిక్షను పెట్టిన ఆ సన్యాసులు వెళ్లిపోయిన తరువాత నీ బాల్యము ఎలా గడిచింది. తరువాత జీవితము ఎలా గడిచింది. వార్ధక్యములో ఏమి చేసారు? కాలం గడిచేకొద్దీ ముసలి తనం వస్తుంది కదా. ఆ తరువాత దాసీగర్భమునుండి జన్మించిన ఈస్థూల శరీరమును ఏ ప్రకారంగావిడిచిపెట్టావు? కాలం గడిచేకొద్దీ అన్నీ మరిచిపోతాము కదా! మానవుడు ఒక శరీరం విడిచి మరొక శరీరం ధరించగానే పూర్వజన్మ స్మృతి ఉండదు కదా. అదేమాదిరి నీ పూర్వజన్మ స్మృతి కూడా ఎందుకు నాశనం కాలేదు. నాకు తెలుపండి." అని అడిగాడు.

నారదుడు ఇలా చెప్పసాగాడు. "ఓ వ్యాసమహర్షీ! నాకు బ్రహ్మజ్ఞానమును ఉపదేశించిన సన్యాసులు వెళ్లిపోయిన తరువాత, నేను నా తల్లి సంరక్షణలో పెరుగుతున్నాను. నా తల్లి ఒక దాసి. స్వతంత్రురాలు కాదు. ఆమెకు అంతగా తెలివితేటలు లేవు. ఆమెకు నేను ఒక్కడినే కుమారుడను. అందుకని మా అమ్మకు నేను అంటే ఎక్కువ ప్రేమ. ఇంతకూ అప్పుడు నాకు 5 సంవత్సరములు. నాకు ప్రపంచ జ్ఞానము

అంతగా లేదు. నా తల్లి ఏం చెబితే అది చేసేవాడిని. ఆ ప్రకారంగా నేను, నా తల్లి, బ్రాహ్మణుల ఇంట్లో వాళ్లు చెప్పిన పనులు చేస్తూ కాలం గడుపుతున్నాము.

ఒక రోజు రాత్రి మా అమ్మ పాలు పితకడానికి బయటకు వెళ్లింది. దారిలో ఆమెను ఒక తాచు పాము కరిచింది. విషం తలకు ఎక్కి మా అమ్మ మరణించింది. నాకు ఈ లోకంలో ఉన్న ఆ ఒక్క బంధం కూడా తెగిపోయింది. ఏకాకిగా మిగిలాను. నా తల్లి మరణం కూడా ఒక విధంగా భగవంతుడు నాకు చేసిన మేలు అని అనుకున్నాను.

తరువాత నేను ఆ ఊరు విడిచి పెట్టి, ఉత్తర దిశగా ప్రయాణం సాగించాను. ఎన్నో దేశాలు తిరిగాను. అడవులు, నదులు, జనపదాలు దాటాను. ఒక మహారణ్యములో ప్రయాణం చేస్తున్నాను. నాకు ఆకలి వేస్తూ ఉంది. దాహంగా కూడా ఉంది. శరీరం బాగా అలసిపోయింది. నాకు ఒక నది కనిపించింది. నేను ఆ నదిలో స్నానం చేసి స్వచ్ఛమైన ఆ నదీజలములతో నా దాహము తీర్చుకున్నాను. నా శారీరక బడలిక తీరిపోయింది.

నేను ఒక రావి చెట్టు కింద కూర్చున్నాను. భగవంతుడిని ధ్యానం చేస్తున్నాను. బాహ్య ఇంద్రియములను నియంత్రించి మనసును అంతర్ముఖం చేసాను. సమాధిలో మునిగిపోయాను. పరమాత్మను సందర్శించవలెనని కోరిక గాఢంగా కలిగింది. నేను తదేకంగా పరమాత్మను ధ్యానిస్తున్నాను.

నా హృదయంలో ఒక మెరుపు మెరిసి నట్టయింది. నా హృదయంలో ఆ సర్వాంతర్యామి అగు శ్రీహరి సాక్షాత్కరించాడు. అంతలోనే

మాయం అయ్యాడు. మరలా కనపడలేదు. నేను కళ్లు తెరిచాను. అయ్యో ఆ పరమాత్మను కనులారా చూడలేకపోయానే అని ఏడిచాను. మరలా కళ్లు మూసుకున్నాను. మనస్సును ఏకాగ్రం చేసాను. అంతర్ముఖుడను అయ్యాను కానీ పరమాత్మ నాకు సాక్షాత్కారం కాలేదు. కాని నేను నా పట్టు విడువ లేదు. మాటి మాటికీ ప్రయత్నించాను.

అప్పుడు వాక్కుకు, మనసుకు అందని ఆ పరమాత్మ నాతో ప్రేమగా ఇలా అన్నాడు. “బాలకా! కేవలం నా మీద నీకు భక్తి కలగడం కోసమే నీ మనసులో తళుక్కున మెరిసాను. మరలా నీకు ఈ జన్మలో నా దర్శనం కాదు. నా యందు భక్తి కలిగిన భక్తుడు కామ, క్రోధ, మోహాము లను త్యజించి నా కోసం పరితపిస్తాడు.

నీవు సత్పురుషులకు చేసిన సేవ కొద్ది కాలమే అయినను అది నీకు నా యందు స్థిరమైన బుద్ధికలిగేటట్టు చేసింది. నీవు ఈ జన్మను వదిలిన తరువాత, మరుజన్మలో నన్ను చేరుకుంటావు. నీకు నా యందు ఉన్న భక్తి కాలము గడిచే కొద్ది వృద్ధిపొందుతుందే కానీ, తరిగిపోదు. నీవు ఎన్ని జన్మలు ఎత్తినను నీకు నా యందు ఉన్న భక్తి వలన, నీ పూర్వజన్మ స్మృతి తొలగి పోదు.” అని నాతో చెప్పిన పరమాత్మ తరువాత ఊరకుండి పోయాడు.

ఆ మాటలతో నాలో ఉన్న సందేహాలు తొలగి పోయాయి. ఆ పరమాత్మకు తలవంచి భక్తితో నమస్కరించాను. ఆ తరువాత నాకు భగవన్నామ స్మరణ తప్ప వేరే ధ్యాసలేదు. భగవంతుని లీలలను గురించి తెలుసుకోవడం తప్ప వేరే పని లేదు. అలా నేను ఈ భూమి అంతా తిరిగాను.

కోరికలను వదిలిపెట్టాను. ఇది కావాలి అది కావాలి అనే తాపత్రయాన్ని పూర్తిగా త్యజించాను. అహంకారాన్ని పూర్తిగా నాలో నుండి తొలగించాను. కాలాంతరమున నాకు మృత్యువు సమీపించింది. నాకు శ్రీహరి చెప్పిన మాటలను నేను అనుసరించాను. భగవంతుని మీదనే మనసు కేంద్రీకరించాను. భగవన్నామాన్ని సతతం స్మరించాను. నేను భగవంతుని కృపకు పాత్రుడను అయ్యాను. నా భౌతిక శరీరం పతనమయింది.

కల్పాంతంలో ఈ జగములన్నీ జలమయం కాగా, శ్రీమన్నారాయణుడు వటపత్రశాయిగా శయనించి ఉన్నాడు. బ్రహ్మదేవుడు నిద్రపోవడానికి ఉపక్రమించాడు. అప్పుడు నేను బ్రహ్మదేవుడు తీసుకున్న శ్వాస గుండా, పరమాత్మ కడుపులోకి ప్రవేశించాను. తరువాత వేయి మహాయుగములు గడిచాయి.

శ్రీమన్నారాయణుడు నిద్రనుండి మేలుకొన్నాడు. మరలా సృష్టి మొదలయింది. ఆ సమయంలో పరమాత్మ ఇంద్రియముల నుండి నేను, మరుత్తులు, ఋషులు పుట్టాము. నాకు ఆ పరమాత్మ కటాక్షము పరిపూర్ణంగా లభించింది. నేను బ్రహ్మచర్యము అవలంబించాను. ముల్లోకములలో ఎక్కడికైనా వెళ్లగల గమన శక్తిని సంపాదించాను. శ్రీహరి నామ సంకీర్తనము చేస్తూ ముల్లోకములలో సంచరిస్తున్నాను. నాకు బ్రహ్మ దేవుడు ప్రసాదించిన ఈ వీణను శృతి చేసి, భగవంతుని లీలలను గానం చేస్తున్నాను.

ఈ జన్మలో నాకు శ్రీహరి ఎప్పుడు నేను తలచుకుంటే అప్పుడు నా హృదయాకాశంలో దర్శనం ఇస్తుంటాడు. నేను కేవలం భగవన్నామ

స్మరణతో,. భగవంతుని మీద భక్తితో తరించాను. నిరంతరమూ ప్రాపంచిక విషయములలో మునిగితేలు మానవులు కూడా భగవన్నామ స్మరణతో, భగవంతుని మీద అచంచలమైన భక్తి విశ్వాసాలతో తరించగలరు.

మానవ జీవితంలో కామము, క్రోధము, మోహము, లోభము మదము, మాత్సర్యము, పట్టి పీడిస్తుంటాయి. వాటికి వశులయిన మానవులకు శాంతి కరువవుతుంది. ఎన్ని నియమాలు అనుసరించినా, ఎన్ని యోగములు ఆచరించినా వారికి శాంతి లభ్యము కాదు. కేవలము భగవంతుని సేవ, భగవన్నామ స్మరణ, భగవంతుని మీద భక్తి తోనే వారి మనసులకు శాంతి కలుగుతుంది.

ఓ వ్యాసమునీంద్రా! నా పూర్వజన్మవిశేషములను నీకు సవిస్తరంగా తెలియజేసాను." అని నారదుడు వ్యాసునికి తన పూర్వజన్మవృత్తాంతమును చెప్పాడు. తరువాత నారదుడు వీణను మ్రోగిస్తూ హరికథా గానం చేస్తూ అక్కడినుండి వెళ్లిపోయాడు." అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులతో చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## ప్రథమస్కంధము
## ఏడవ అధ్యాయము.

శౌనకుడు మొదలగు మహామునులు సూతపౌరాణికుని ఇలా అడిగారు.

"మహాత్మా! ఆ ప్రకారంగా నారదుడు వెడలిపోయిన తరువాత నారదుని అభిప్రాయము తెలుసుకున్న వ్యాసుడు ఏమి చేసాడు. మాకు చెప్పండి." అని అడిగారు. దానికి సూతుడు ఇలా చెప్పసాగాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! సరస్వతీ నదీతీరంలో పడమటి ప్రాంతంలో బ్రాహ్మణులు నివశించే శమ్యాప్రాస అనే ఆశ్రమము ఉంది. ఆ ఆశ్రమము యజ్ఞములు యాగములు చేసుకోడానికి అనుకూలంగా ఉండేది. ఆ ఆశ్రమ ప్రాంతంలో నేరేడు చెట్లు సమృద్ధిగా ఉండేవి. వ్యాసుడు ఆ ఆశ్రమంలో ఉండేవాడు. నారదుడు వెళ్లిపోయిన తరువాత, వ్యాసుడు మనస్సును స్థిరపరచుకొని ధ్యానంలో నిమగ్నం అయ్యాడు.

భక్తి యోగముతో వ్యాసుని మనస్సు నిర్మలము అయింది. ఇప్పుడు ఆయన మనసులో సందేహాలు లేవు. ఆయన మనసు నిశ్చలంగా ఉంది. ఆయన తన హృదయంలో శ్రీకృష్ణుని ఆయనను ఆశ్రయించుకున్న మాయను దర్శింపగలిగాడు.

ప్రతి జీవిలోనూ పరమాత్మ ఉంటాడు. ఆ పరమాత్మను మాయ

ఆవరించి నపుడు జీవాత్మ అవుతాడు. పరమాత్మ సత్త్వ రజస్తమో గుణములకు అతీతుడు. కాని జీవాత్మ ఆ గుణములను తనకు ఆపాదించు కుంటాడు. ఆ మూడు గుణములు తనే అనుకుంటాడు. ఈ శరీరమే తాను అనుకుంటాడు. దేహాభిమానము పెంచుకుంటాడు. అతనిలో అహంకారము అంకురిస్తుంది. దానివలన కలిగే అనర్థాలను అనుభవిస్తాడు.

దీనికి విరుగుడు శ్రీహరి యందు భక్తి కలిగి ఉండటమే. భక్తి మార్గమే అన్ని అనర్థములను పోగొడుతుంది. వ్యాసుడు ధ్యానం చేస్తుంటే ఈ భావాలు అతని మనసులో మెదిలాయి. భగవద్భక్తి భావము తెలియని పామరులైన ప్రజల కోసరము భాగవతము రచించాడు. ఈ భాగవత మును విన్న వారికి శోకము, మోహము, భయము ఉండవు. కేవలము కృష్ణుని యందు భక్తి మాత్రం ఉంటుంది.

భాగవత రచన పూర్తి చేసిన తరువాత వ్యాసుడు, ఆ భాగవత పురాణమును, భోగముల యందు, ప్రాపంచిక విషయములయందు ఏ మాత్రము ఆసక్తి లేనివాడు, నిరంతరమూ భగవంతుని స్మరించువాడు, అయిన తన కుమారుడు శుకునికి బోధించాడు." అని అన్నాడు సూతుడు.

అప్పుడు శౌనకుమొదలగు ఋషులను ఒక సందేహము కలిగింది. "ఓ సూత పౌరాణికా! వ్యాసుని కుమారుడు శుకుడు ఏ మాత్రం భోగముల మీద ఆసక్తి లేనివాడు. ఏ సంకల్పమూ లేని వాడు. ఎప్పుడూ ఆ పరమాత్మను సందర్శిస్తూ బ్రహ్మానందాన్ని పొందుతూ ఉంటాడు అని చెప్పారు కదా! ఎల్లప్పుడూ ఆ పరమాత్మనే మనసులో ధ్యానిస్తూ ఉంటాడు కదా! మరి ఆయనకు ఈ భాగవతమును విసే అవసరము ఏమి వచ్చింది?"

అనే సందేహము వెలిబుచ్చారు.

అప్పుడు సూతుడు ఇలా చెప్పసాగాడు. "ఓ బ్రాహ్మణోత్తములారా! భాగవతము శ్రీహరి కథలతో శ్రీహరి లీలలతో, అవతార విశేషములతో, నిండి ఉంది! మీరు చెప్పినట్టు ఎల్లప్పుడూ బ్రహ్మానందములో తేలియాడేవారు, పరబ్రహ్మను గురించి ధ్యానించేవారు, తమలో ఉన్న క్రోధమును, మోహమును, అహంకారమును విడిచిపెట్టినవారు, ఎటువంటి ఫలాన్ని ఆశించకుండా శ్రీహరిని సేవిస్తూ ఉంటారు. అటువంటి వారు, శ్రీహరి అవతార విశేషములను, శ్రీహరి కథలను వినడంలో కూడా ఆసక్తి చూపుతారు కదా! అటువంటి వారిని శ్రీహరి తన వైపు ఆకర్షించు కుంటాడు కదా!

ఆ ప్రకారంగానే మహాయోగి, సర్వసంగపరిత్యాగి, విష్ణుజన ప్రియుడు అయిన శుకుడు, శ్రీహరి అవతార విశేషములకు, కథలకు ఆకర్షితుడై, తన తండ్రి వ్యాసుని ముఖతా భాగవతమును అధ్యయనం చేసాడు. ఆ ప్రకారంగా వ్యాసుడు రాసిన భాగవతము శుకుడు అధ్యయనం చేసాడు. తరువాత పరీక్షిత్తు మహారాజు పుట్టాడు. ఏడు రోజులలో మరణిస్తాడని ఆయనకు ఒక ముని శాపం తగిలింది. ఆ ఏడురోజులలో పరీక్షిత్తు మహారాజు శుకుని ముఖతా భాగవతమును విన్నాడు. ఆ కథను వివరిస్తాను శ్రద్ధగా వినండి.

కురు పాండవులకు రాజ్యం కోసరం యుద్ధం జరిగింది. ఇరుపక్షములలో ఎంతో మంది వీరులు వీర స్వర్గమును అలంకరించారు. భీముడు సుయోధనులకు గదాయుద్ధము జరిగింది. ఆ గదాయుద్ధములో

భీముడు సుయోధనుని తొడలు విరుగగొట్టాడు. సుయోధనుడు తొడలు విరిగి కదలలేక పడిఉన్నాడు. అప్పుడు అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ సుయోధనుని కలుసుకున్నారు. సుయోధనుడు అశ్వత్థామను పాండవుల వంశమును నిర్వంశము చెయ్యమని కోరాడు. అంటే పాండవుల వంశంలో ఒక్కడు కూడా మిగలకుండా చంపమని కోరాడు. సుయోధనుని ఆదేశము ప్రకారము బ్రాహ్మణుడైన అశ్వత్థామ క్షాత్రమును అవలంబించి ఆ రోజు అర్ధరాత్రి నిద్రించుచున్న ద్రౌపదీ కుమారుల శిరస్సులను నిర్దాక్షిణ్యంగా నరికాడు. ఆ విషయం సుయోధనునికి చెప్పినపుడు సుయోధనుడు కూడా అశ్వత్థామను నిందించాడు. అశ్వత్థామ చేసిన పనికి అందరూ అతనిని నిందించారు.

కుమారుల మరణ వార్త విని ద్రౌపది శోకసముద్రంలో మునిగి పోయింది. ఎంత మంది ఓదార్చినా ద్రౌపది శోకము తగ్గలేదు. అప్పుడు అర్జునుడు ద్రౌపదిని ఓదారుస్తూ ఇలా అన్నాడు.

“నీ కుమారులను అశ్వత్థామ నిర్దాక్షిణ్యంగా చంపాడు. అందుకని నేను ఇప్పుడే వెళ్లి ఆ బ్రాహ్మణాధముని నా బాణములకు బలి చేస్తాను. అతని శిరస్సును తెచ్చి నీకు కానుకగా సమర్పిస్తాను. నీ కుమారుల దహన సంస్కారములు అయిన తరువాత, నీవు అశ్వత్థామ తలమీద కూర్చుని, తలారా స్నానం చెయ్యి. అప్పుడు వచ్చి నేను నీ కళ్లలో నుండి జాలువారు కన్నీటిని తుడుస్తాను. ” అని ద్రౌపదిని ఓదార్చాడు.

తరువాత అర్జునుడు, తన రథము మీద ఎక్కి, శ్రీకృష్ణుడు సారథిగా రథము తోలుతూ తనకు తోడు రాగా, అశ్వత్థామను వెతుకుతూ బయలుదేరాడు. అర్జునుడు తనను తరుముకుంటూ రావడం అశ్వత్థామ

చూచాడు. భయంతో వణికిపోయాడు. ప్రాణభయంతో పరుగెత్తాడు.

(ఇక్కడ ఒక శ్లోకం ఉంది. అశ్వత్థామ ఎలా పరుగెడుతున్నాడు అన్న దానికి ఒక ఉపమానం రాసాడు వ్యాసుడు. బ్రహ్మ తన కూతురిని మోహించి, ఆమెతో రతిక్రీడలు సలిపాడట. అది తెలిసి ఈశ్వరుడు బ్రహ్మను తరుముకున్నాడట. అప్పుడు బ్రహ్మ ఒక మృగ రూపం ధరించి పరుగెత్తాడట. అలా అశ్వత్థామ పరుగెడుతున్నాడు అని ఆ శ్లోకం అర్థం. నిజానికి ఈ సంఘటనకు ఈ ఉపమానానికి ఎలాంటి పొంతన లేదు, బ్రహ్మదేవుని గురించి చెడుగా చెప్పడం తప్ప. ఇది వ్యాసుడు రాసాడో, లేక మధ్యలో ఎవరైనా రసికశిఖామణులు రాసి జొప్పించారో తెలియదు. బ్రహ్మకైనను పుట్టు రిమ్మతెగులు అనే సామెత సార్థకం చెయ్యడానికి రాసారేమో!)

అలా పరుగెత్తి పరుగెత్తి అలసిపోయాడు అశ్వత్థామ. గత్యంతరం లేక తనకు తన తండ్రి ఉపదేశించిన బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించడానికి ఉద్యుక్తుడయ్యాడు. అశ్వత్థామకు ఆ అస్త్రాన్ని ప్రయోగించడం మాత్రమే తెలుసు, ఉపసంహరించడం తెలీదు. అయినా అశ్వత్థామ తన ప్రాణములు రక్షించుకోడానికి అర్జునుడి మీద బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించాడు.

ఆ బ్రహ్మాస్త్ర ప్రభావంతో లోకాలన్నీ భయంకరమైన తేజస్సుతో నిండిపోయాయి. దానివలన ముల్లోకములకు ప్రాణాపాయము కలుగుతుందని అనుకున్నాడు అర్జునుడు. శ్రీకృష్ణుని చూచి ఇలా అన్నాడు. అప్పటికే అర్జునుడు కృష్ణుని వలన గీతోప దేశము పొంది ఉన్నాడు. కాబట్టి శ్రీకృష్ణుని పరమాత్మ స్వరూపంగా తలచి ఇలా అంటున్నాడు.

"ఓ శ్రీకృష్ణా! భక్తులకు సదా అభయప్రదాతా! ఈ సంసారంలో పడి కొట్టుమిట్టాడుతున్న ప్రజలను ఒడ్డుకు చేర్చే మహానుభావుడవు. నీవు గుణములకు అతీతుడవు. నీవు సాక్షాత్తు ఈశ్వరుడవు. స్వస్వరూపములో ఉన్న నిన్ను ఏ మాయా అంటదు. నీకు అవిద్య అంటదు. మాయకు అతీతుడవు అయిన నీవు, మాయామోహితులైన మానవులకు శుభాన్ని శ్రేయస్సును కలుగజేస్తుంటావు. భూభారాన్ని తగ్గించడానికీ, నీ భక్తులను ఉద్ధరించడానికీ నీవు ఈ కృష్ణావతారంగా ప్రకటితమవుతున్నావు.

ఓ దేవదేవా! ఈ అగ్ని ఎక్కడి నుండి వచ్చిందో, ఎలా వచ్చిందో అర్థం కావడం లేదు. దయచేసి తెలుపవలసింది" అని వినయంగా ప్రార్థించాడు అర్జునుడు.

అప్పుడు భగవానుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు. "ద్రోణుని కుమారుడైన అశ్వత్థామ బ్రహ్మాస్త్రమును ప్రయోగించాడు. దాని ప్రభావం చేతనే ఈ అగ్ని పుట్టింది. నీవలన తన ప్రాణములకు హాని కలుగుతుందని తెలిసి బ్రహ్మాస్త్ర ప్రయోగం చేసాడు అశ్వత్థామ. కాని అతనికి దీనిని ఎలా ఉపసంహరించాలో తెలియదు. నీకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించడం, ఉపసంహరించడం రెండూ తెలుసు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రము మరియొక బ్రహ్మాస్త్రము చేతనే ఉపసంహరింపబడుతుంది కానీ వేరే ఏ అస్త్రమూ బ్రహ్మాస్త్రమును ఉపసంహరించలేదు. నీకు బ్రహ్మాస్త్రము ప్రయోగము ఉపసంహారమూ తెలుసు కాబట్టి నీవు కూడా బ్రహ్మాస్త్రము ప్రయోగించి అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రమును ఉపసంహరించు." అని అన్నాడు కృష్ణుడు.

తరువాత అర్జునుడు శ్రీకృష్ణునికి ప్రదక్షిణ నమస్కారము చేసి, బ్రహ్మాస్త్రమును మనసులో స్మరించి ప్రయోగించాడు. రెండు బ్రహ్మాస్త్ర ములు ఒకదానితో ఒకటి ఢీకొన్నాయి. ముల్లోకములు ప్రళయకాలము నందు పుట్టిన అగ్ని వలె ప్రకాశించాయి. లోకాలు దగ్ధం అవుతున్నాయి. జీవరాసులు అన్నీ నశించిపోతున్నాయి. వెంటనే శ్రీకృష్ణుడు ఆ రెండు బ్రహ్మాస్త్రములను ఉపసంహరించమని అర్జునుని ఆదేశించాడు. శ్రీకృష్ణుని ఆజ్ఞ మేరకు అర్జునుడు రెండు బ్రహ్మాస్త్రములను ఉపసంహరించాడు. లోకాలు అన్నీ శాంతించాయి.

అశ్వత్థామ నిస్సహాయంగా నిలబడి పోయాడు. అర్జునుడు కోపంతో చెలరేగిపోయాడు. అశ్వత్థామను పశువును కట్టినట్టు తాళ్లతో కట్టిపడేశాడు. పాండవ శిబిరమునకు తీసుకొని పోవడానికి అశ్వత్థామను రథంలో పడేశాడు. అప్పుడు కృష్ణుడు అర్జునుని చూచి ఇలా అన్నాడు.

"అర్జునా! నీకు తెలుసు కదా! ఈ అశ్వత్థామ ఏ పాపమూ ఎరుగని ద్రౌపదీ కుమారులను అర్థరాత్రి నిద్రపోయే సమయంలో అతి దారుణంగా చంపాడు. ఇతని పాపము క్షమించరానిది. ముందు ఇతనిని చంపు. ధర్మరక్షణ గావించు.

కానీ, మద్యము సేవించి ఆ మత్తులో ఉన్న వాడినీ, తన మనస్సు తన అధీనంలో లేని వాడినీ, గ్రహముల చేత, గాలి మొదలగు వాటి చేత పీడింపబడేవాడినీ, నిద్రిస్తున్న వాడినీ, ఆశ్చర్యకరమైన, వినకూడని వార్త విన్నప్పుడు నిశ్చేష్టుడుగా ఉన్న వాడిని, శరణు పొందిన వాడినీ, రథము విరిగిన వాడినీ, భయంతో వణికిపోయేవాడినీ, స్త్రీలను, వారు పరమ

శత్రువులైనా, వారిని చంపకూడదు అని ధర్మశాస్త్రము.

ఇంక చంపదగినవారు ఎవరంటే....... తన ప్రాణాలను కాపాడుకోడానికి మరొకరి ప్రాణాలు తీసే దయాదాక్షిణ్యములు లేని వాడినీ, , పాపాత్ముని, క్రూరుని చంపడమే మంచిది. లేకపోతే, ఈ పాపాత్ముని చంపకుండా వదిలిపెట్టిన నేరానికి నీకు పాపం చుట్టుకుంటుంది. నరకానికి పోతావు.

అదీ కాకుండా నీవు ద్రౌపదితో ఏమని ప్రతిజ్ఞచేసావు. ఈ అశ్వత్థామను చంపి ఇతని తలను ద్రౌపదికి కానుకగా ఇస్తానని అన్నావు కదా! మరి ఆ ప్రతిజ్ఞను చెల్లించవా!

పోనీ, ఇతడు తన ప్రభువు ఆజ్ఞమేరకు ఈ పని చేసాడని అనుకుందామా అంటే ఇతడు చేసిన మారణహోమము, ఇతని ప్రభువు సుయోధనునికి కూడా ఇష్టం లేదు. కాబట్టి ఇతడు క్షమార్హుడు కాడు. ఇతనిని చంపడమే యుక్తము." అని అర్జునుని అశ్వత్థామను చంపమని ప్రేరేపించాడు.

కాని అర్జునుడు అందుకు ఒప్పుకోలేదు. అశ్వత్థామను తన రథంలో పడవేసి, రథాన్ని పాండవ శిబిరానికి పోనిచ్చాడు. ద్రౌపది ముందు అశ్వత్థామను పడవేసాడు. పశువు మాదిరి కట్టబడి తన ఎదురుగా దీనంగా నిలబడి ఉన్న అశ్వత్థామను చూచి ద్రౌపది అతనికి నమస్కరించింది. వెంటనే అక్కడ ఉన్న భటులతో " ఇతడు బ్రాహ్మణుడు మనకందరికీ పూజనీయుడు వెంటనే ఇతని కట్లు విప్పండి." అని ఆజ్ఞాపించింది. భటులు అశ్వత్థామ కట్లు విప్పారు.

అప్పుడు ద్రౌపది అర్జునునితో ఇలా అంది. “నాథా! ఈ అశ్వత్థామ తండ్రి ద్రోణుడు మీకందరికీ గురువు. ఆయన వద్ద మీరు అస్త్ర, శస్త్ర విద్యలు నేర్చుకున్నారు. ప్రస్తుతము మన ఎదుట దోషిగా నిలబడి ఉన్న అశ్వత్థామ ఆయన తండ్రి ద్రోణాచార్యులకు ప్రతిరూపము. ద్రోణుని భార్య కృపి, బ్రాహ్మణ స్త్రీ అవడం చేత పతితో సహగమనం చేయలేదు.

నా కుమారులను పోగొట్టుకొని నేను అపారమైన దు:ఖములో మునిగి ఉన్నాను. ఇప్పుడు ఈ అశ్వత్థామను చంపి మీ గురుపత్ని కృపిని కూడా నా మాదిరి పుత్రశోకం అనుభవించమంటారా! అది భావ్యమా!

నా మాదిరి మరొక తల్లి పుత్రశోకము అనుభవించడం నాకు ఇష్టం లేదు. మీరు మనో నిగ్రహం లేకుండా, క్షణికావేశంతో ఈ అశ్వతామను చంపితే, బ్రాహ్మణ వంశం అంతా మనలను శపిస్తుంది. ఒక బ్రాహ్మణుని చంపిన పాపానికి క్షత్రియ వంశం పూర్తిగా నాశనమవుతుంది.” అని పలికింది ద్రౌపది.

దయతోనూ, నిర్మలమైన మనస్సుతోనూ. న్యాయంగా, ధర్మంగా, ఉదారంగా ద్రౌపది పలికిన పలుకులను ధర్మరాజు మనస్ఫూర్తిగా ఆమోదించాడు. ఆయనే కాదు, నకుల సహదేవులు, సాత్యకి, అర్జునుడు, కృష్ణుడు, ఇంకా అక్కడ చేరిన స్త్రీలు పురుషులు ఆమోదించారు.

కాని భీముడు మాత్రము ఆమోదించలేదు. కోపంతో కళ్లు ఎర్రచేసి ఇలా అన్నాడు. “ఈ దుర్మార్గుడు, తనకు కానీ, తన ప్రభువైన

సుయోధనునికి కానీ ఏ మాత్రం ప్రయోజనం లేకపోయినా, అకారణ కోపంతో ద్రౌపదీ పుత్రులను దారుణంగా వధించాడు. ఇతనిని క్షమించ రాదు. వీడిని చంపడమే మంచిది. లేకపోతే మనం అందరం నరకానికి పోతాము." అని పలికాడు భీముడు.

ఆ మాటలకు కృష్ణుడు అర్జునుని వంక చూచి ఇలా అన్నాడు. "అర్జునా! ధర్మశాస్త్రము ప్రకారము బ్రాహ్మణుడు ఎంతటి అధముడైనా, ఏ తప్పుచేసినా చంపకూడదు. కానీ, ఈతడు బ్రాహ్మణుడు అయి ఉండీ కూడా, బ్రాహ్మణులకు ఉచితము అయిన ధర్మమును మరిచి, ఆయుధములను ధరించి, ద్రౌపదీ పుత్రులను వధించి నందుకు ఇతడుచంపదగిన వాడు అని నీకు చెప్పాను. ఒకదానికి ఒకటి వ్యతిరేకంగా నేను చెప్పిన మాటలను నీవు ధర్మశాస్త్రము ప్రకారము పరిశీలించు. అదీ కాకుండా, ఈ అశ్వత్థామ తలను తెచ్చి కానుకగా ఇస్తాను అని ద్రౌపదికి మాట ఇచ్చావు. మరి ఆ మాటకూడా నెరవేర్చాలి కదా. అదే కదా క్షత్రియ ధర్మము. కాబట్టి, బ్రాహ్మణుని చంపకుండా, భీముని మాట నిలబెడుతూ, ద్రౌపదికి ఇచ్చిన మాట నెరవేరుస్తూ, ఒక నిర్ణయం తీసుకో." అని నర్మగర్భంగా మాట్లాడాడు కృష్ణుడు.

కృష్ణుని మాటలలో ఆంతర్యం గ్రహించాడు అర్జునుడు. కొంచెం సేపు ఆలోచించాడు. ఒక కత్తి తీసుకున్నాడు. అశ్వత్థామ వద్దకు వెళ్లాడు. అశ్వత్థామ పుట్టుకతోనే తలలో ఒక మణితో పుట్టాడు. అర్జునుడు కత్తి తీసుకొని అశ్వత్థామ తలమీద ఉన్న మణిని, దానికి అంటుకున్న వెంట్రుకలతో సహా కోసేసాడు. అది తీసుకు వచ్చి ద్రౌపదికి ఇచ్చాడు. వెంటనే భటులను పిలిపించి అశ్వత్థామను శిబిరము నుండి వెళ్లగొట్టాడు.

అర్జునుడు అందరిని చూచి ఇలా అన్నాడు. "కృష్ణుడు చెప్పినట్టు బ్రాహ్మణుడు ఎంత అధముడైనా, హంతకుడైనా చంపడం తగదు. చంపడానికి ప్రత్యామ్నాయంగా, తల గొరిగించడం, అతని వద్ద ఉన్న ధనమును తీసుకోవడం, అతనిని దేశం నుండి బహిష్కరించడం చేయవచ్చును. ఇవి బ్రాహ్మణులకు శారీరక దండన అనగా మరణశిక్ష విధించకుండా చేయదగ్గ పనులు. కాబట్టి నేను అతని వెంట్రుకలు గొరిగాను. అతని వద్ద ఉన్న మణిని తీసుకున్నాను. అతనిని దేశంనుండి వెళ్లగొట్టాను. ఇతనికి ప్రత్యామ్నాయ శిక్షలు అన్నీ విధించాను." అని పలికాడు అర్జునుడు.

అర్జునుని బుద్ధికుశలతకు అందరూ అతనిని శ్లాఘించారు. తరువాత పాండవులు, ద్రౌపది యుద్ధములో చనిపోయిన బంధు మిత్రులకు దహనం కాండలు ఉత్తర క్రియలు శాస్త్రోక్తంగా నిర్వర్తించారు.

శ్రీమద్భాగవతము

ప్రథమ స్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# ప్రథమస్కంధము
# ఎనిమిదవ అధ్యాయము.

పాండవులు యుద్ధములో మరణించిన బంధువులకు స్నేహితులకు ఉత్తర క్రియలు శాస్త్రోక్తంగా నిర్వహించిన తరువాత, పాండవులు ద్రౌపది, మిగిలిన స్త్రీలతో కలిసి గంగాతీరమునకు వెళ్లారు. అందరూ పవిత్ర గంగాజలములలో స్నానాలు చేసారు. జల తర్పణాలు వదిలారు. మరలా గంగా స్నానం చేసారు.

ధర్మరాజు తన తమ్ములతోనూ తల్లి కుంతి తోనూ, భార్య ద్రౌపదితోనూ ఇతర భార్యలతోనూ, ధృతరాష్ట్రుడు తన భార్య గాంధారి, ఇతర భార్యలతోనూ గంగాతీరంలో కూర్చుండి జరిగిన మారణహోమానికి శోకిస్తున్నారు. చనిపోయిన వారిని పేరు పేరునా తలచుకొని ఏడుస్తున్నారు. శ్రీకృష్ణుడు కాలమహిమను గురించి చెప్పి వారిని ఓదారుస్తున్నాడు. కాలమును అతిక్రమించడం ఎవరి తరమూ కాదనీ, కాస్త ముందూ వెనకగా అందరూ కాలధర్మం చెందవలసిన వారే అనీ వారి శోకమును ఉపశమింపజేసాడు. తరువాత అందరూ హస్తినా పురానికి చేరుకున్నారు.

శ్రీకృష్ణుడు పాండవుల చేత మూడు అశ్వమేధ యాగములు చేయించాడు. ధర్మరాజు కీర్తి నలుదిక్కులా వ్యాపింపజేసాడు. వచ్చిన పని పూర్తి అయింది. ఇంక ద్వారకకు వెళతాను అని బయలుదేరాడు కృష్ణుడు. శ్రీకృష్ణుని ప్రయాణానికి సన్నాహాలు పూర్తి అయ్యాయి. రథము సిద్ధంగా ఉంది. శ్రీకృష్ణుడు, సాత్యకి, ఉద్ధవునితో సహా రథం ఎక్కడానికి వచ్చాడు.

అప్పుడు విరాటరాజు కుమార్తె, అర్జునుని కోడలు, పద్మ వ్యూహంలో మరణించిన అభిమన్యుని భార్య అయిన ఉత్తర అరుస్తూ పరుగెత్తుకుంటూ శ్రీకృష్ణుని వద్దకు వచ్చింది.

"దేవదేవా! ఈ జగత్తును శాసించేవాడా! నన్ను రక్షించు. నన్ను కాపాడు.  ఈ లోకంలో ఉండే వాళ్లంతా ఒకరిని ఒకరు చంపుకోడానికి ఆసక్తి చూపిస్తున్నారు. శాంత మూర్తివి, నాకు అభయం ఇచ్చేవాడివి నువ్వు ఒక్కడివే కనపడుతున్నావు. శ్రీకృష్ణా! నన్ను రక్షించు. ఈ ఆపద నుండి నన్ను కాపాడు. ఓకృష్ణా! బాగా మండుతున్న ఒక లోహబాణము నా వైపుకు దూసుకు వస్తూ ఉంది. ఆ బాణము నన్ను కాల్చివేస్తుందేమో అని భయంగా ఉంది. నేను ఏమైనా పర్వాలేదు. పాండవ వంశాంకురము, అభిమన్యుని తేజము నా గర్భంలో పెరుగుతూ ఉంది. దానిని రక్షించు. పాండవ వంశమును కాపాడు." అని ప్రార్థించింది ఉత్తర.

ఉత్తర పలుకులను విన్నాడు కృష్ణుడు. అది అశ్వత్థామ పని అని అర్థం అయింది. ఎందుకంటే పాండవ వంశమును నాశనం చెయ్యడానికి, అపాండవం చెయ్యడానికి అశ్వత్థామ బ్రహ్మాస్త్రమును ప్రయోగించాడు. అర్జునుడు దానిని ఉపసంహరించాడు కానీ దాని ప్రభావము పోలేదు.

పాండవ వినాశము కొరకు సంధించిన బ్రహ్మాస్త్రము, ఐదు అస్త్రములుగా విభజింపబడి,  పాండవుల వైపుకు దూసుకు వస్తూ ఉంది. తమ వైపుకు దూసుకుంటూ వస్తున్న బ్రహ్మాస్త్రమును నిలువరించడానికి పాండవులు తమ అస్త్రములు చేత బట్టారు. ఇంతలో కృష్ణుడు తన సుదర్శన

చక్రమును ప్రయోగించి బ్రహ్మాస్త్రమును నిలువరించాడు. అప్పటికి పాండవులు రక్షింపబడ్డారు. తరువాత ఆ బ్రహ్మాస్త్రము ఉత్తర గర్భంలోకి ప్రవేశించింది. గర్భంలో ఉన్న ఉత్తరకు పుట్టబోయే శిశువును నాశనం చేయ సంకల్పించింది. ఇది గ్రహించిన కృష్ణుడు తన మాయ చేత ఉత్తర గర్భంలోకి ప్రవేశించాడు. ఉత్తర గర్భంలో ఉన్న శిశువును, తన యోగమాయతో కప్పివేసాడు.

ఉత్తర గర్భములోకి ప్రవేశించిన బ్రహ్మతేజము శిశువును కప్పిన విష్ణుతేజమును చూచి శాంతించింది. వెనుదిరిగి పోయింది. ఆ ప్రకారంగా ఉత్తర గర్భంలో ఉన్న శిశువును రక్షించాడు కృష్ణుడు.

సృష్టిస్థితిలయకారుడైన విష్ణువు తన మాయాశక్తి ద్వారా ఈ విశ్వమును సృష్టించి పాలించి లయం చేస్తున్నాడు. అటువంటి విష్ణుతేజము ముందు బ్రహ్మతేజము శాంతి పొందుట ఆశ్చర్యము ఏమీ లేదు కదా! తరువాత ద్వారకకు పోవడానికి సిద్ధం అయిన కృష్ణుని చూచి పాండవుల తల్లి కుంతి కృష్ణునితో ఇలా అంది.

" ఓ కృష్ణా! నీకు నమస్కారము. నీవు ఆది దేవుడవు. ప్రకృతి కంటే వేరు అయిన వాడివి. మాయకు అతీతుడవు. నీవు ప్రాణుల లోపలా ఉన్నావు. బయట ప్రపంచంలో కూడా ఉన్నావు. నీవు బాహ్య ఇంద్రియము లకు కనపడవు. అట్టి సర్వాంతర్యామివి అయిన నీకు నమస్కారము.

నాకు భక్తి అంటే ఏమిటో తెలియదు. మాయచేత కప్పబడి ఉన్నాను. అందుచేత నీవు మాకు కనిపించవు. నువ్వు ఇంద్రియ

జ్ఞానమునకు అతీతుడవు. ఈ జగన్నాటకములో తెర వెనుక ఉండి ఈ నాటకమును నడిపిస్తున్నావు. నీకు నాశము లేదు. అట్టి నీకు నమస్కరించుచున్నాను. ఈ దేహమే ప్రధానమని తలచి, దేహము మీద అభిమానము పెంచుకున్న ఈ మానవులు నిన్ను చూడలేరు.

ఎల్లప్పుడూ నిన్నే స్తుతిస్తూ, రాగద్వేషములను వదిలిపెట్టి, ఆత్మవిచారము చేయు మహాపురుషులకు భక్తి యోగము అలవర్చడానికి అవతరించిన నిన్ను నా లాంటి స్త్రీలు ఎలా చూడగలరు?

మా కోసం అవతరించిన యశోదా నందనా, దేవకీ పుత్రా, కృష్ణా, వాసుదేవా, నందనందనా, గోవిందా నీకు నమస్కారము.

ఓ పంకజనాభా! ఓ పంకజమాలినే! ఓ పంకజనేత్రా! పాదముల యందు పద్మముల గుర్తులు కల ఓ మహావిష్ణూ! నీకు నమస్కారము.

నీ తల్లి దేవకీ దేవి, తన వివాహము అయినది మొదలు కంసుని కారాగారములో బంధింపబడి ఉంది. ఎన్నో బాధలు పడింది. అటువంటి నీ తల్లి దేవకీదేవిని చెరనుండి విడిపించావు. అదేమాదిరి పాండవుల తల్లి నైన నాకూ, నాకుమారులకూ రక్షకుడిగా ఉండి మమ్ములను రక్షించావు.

నీవు మాకు చేసిన మేళ్లు అన్నీ ఇన్నీ కావు. విషము కలపబడిన ఆహారము తిన్నా, లక్క ఇంటిలో పెట్టి దహించినా, హిడింబుడు, బకాసురుడు మొదలగు రాక్షసులు మా మీదికి వచ్చినా, జూదమాడి ఓడిపోయినా, అత్యంత క్లిష్టమైన వనవాసము అనుభవిస్తున్నా, కౌరవులతో ఎన్ని యుద్ధ

ములు చేసినా, నా కుమారులను వెన్నంటి కాపాడావు. భీష్మ,ద్రోణ,కర్ణుల దివ్యాస్త్రముల బారి నుండి పాండవులను రక్షించావు. ఇప్పుడు కూడా పాండవ వంశ నాశనానికి ఉద్దేశింపబడిన బ్రహ్మాస్త్రము బారి నుండి పాండవులను, పాండవ వంశాంకురమును రక్షించావు.

కృష్ణా! మాకు ఇన్ని ఆపదలు కలుగ బట్టి కదా నీవు మా వెంట ఉండి రక్షించావు. నీవు మా వెంట అనుక్షణం ఉండాలంటే మాకు ఆపదలు అనుక్షణం వెన్నంటి ఉండాలేమో కదా! మాకు ఆపదలు కలుగుతూ ఉంటే నువ్వు మా వెంటనే ఉండి మమ్ములను రక్షిస్తూ ఉంటావు గదా!

ఉన్నత కులంలో పుట్టాను అన్న అహంకారంతో గానీ, ధనము, పదవితో వచ్చిన అహంకారంతో గానీ, ఉన్నత విద్య, అందచందాలతో వచ్చిన అహంకారంతో కానీ విర్రవీగే వాడికి, ఏ మాత్రము అహంకారము, దేహాభిమానము, కోరికలు లేకుండా ఉండే భక్తునకు లభించే నీ కరుణా కటాక్ష వీక్షణములు, నీ నామ స్మరణ, లభ్యము కావు కదా! అటువంటి గర్విష్ఠి అయిన మానవుడు పరిశుద్ధమైన నీనామములను ఎప్పుడూ కీర్తించడు. అసలు అటువంటివాడికి ఆ బుద్ధికూడా కలగదు.

ఓ కృష్ణా! ధనం లేని వాడికి నీ మీద భక్తియే పరమ ధనము. నీకు ధర్మము, అర్థము, కామము, మోక్షముల యందు ఆసక్తి లేదు. నీవు సచ్చితానంద స్వరూపుడవు. నీకు రాగద్వేషములు లేవు. అందరికీ మోక్షమును ప్రసాదించేవాడివి నీవే! అట్టి నీకు నమస్కారము.

ఓ కృష్ణా! నీవు ఆది, మధ్యము, అంతము లేని వాడివి. ఈ

జగమును పరిపాలించే వాడివి. అంతటా వ్యాపించిన వాడివి. నీవే కాలస్వరూపుడవు. అన్నీ తెలిసికూడా, ఈ ప్రపంచంలో ఉండే ప్రజలు నిన్ను రకరకాల రూపాలతో పూజిస్తూ, ఒక రూపం కంటే మరొక రూపం గొప్ప అని వారిలో వారే కలహించుకుంటున్నారు. అది వారి అజ్ఞానము. కాని నీలో ఎట్టి వైషమ్యములేదు.

ఈ విశాల విశ్వం అంతా నీచేత సృష్టింపబడినది కాబట్టి నీకు అందరూ ఇష్టమైన వారే. నీకు ఇష్టం లేని వారు అంటూ ఎవరూ లేరు. కానీ, నీవు ఈ జగత్తును పరిపాలిస్తున్నపుడు ఎప్పుడు ఏమి చేస్తావో ఎవరికీ తెలియదు. కాని మానవులు తమకు కష్టములు కలిగి నపుడు నిన్ను దూషిస్తూ, సుఖములు కలిగినపుడు నిన్ను పొగుడుతూ ఉంటారు. వారి వారి బుద్ధికి తోచినట్టు చేస్తుంటారు. అది వారి అజ్ఞానము తప్ప వేరు కాదు.

ఓ కృష్ణా! నీవు మాకోసరము మానవయోనులందు జన్మిస్తున్నట్టు అనిపిస్తావు కానీ, నిజానికి నీకు జన్మఅంటూ లేదు. నీకు పుట్టుక, చావు రెండు లేవు. నీవు చెయ్యాల్సిన పని అంటూ ఏమీ లేదు. మా కోసరం, మమ్ములను నీ దారిలో నడిపించడానికి, సత్కర్మలు చేస్తుంటావు. నీవు పరమాత్ముడవు కాబట్టి, ఇటు జలచరములలో మత్స్యము, కూర్మముగానూ, పశువులలో వరాహము, నరసింహము మొదలగు రూపములలోనూ, అవతరించావు, మానవులలో వామన, రామ, కృష్ణులుగా అవతరించావు. అంతేకాకుండా ఋషులుగా నర,నారాయణులుగా అవతరించావు. ఆ అవతారములలో నీవు చేసిన లీలలు అద్భుతములు. అసమాన్యములు. ముఖ్యముగా కృష్ణుడిగా నీ లీలలు సమ్మోహనకరములు.

నీ చిన్నతనంలో ఒక సారి నీవు పెరుగు కుండను పగుల గొడితో మీ అమ్మ యశోద కోపించి నిన్ను కట్టడానికి తాడును తెచ్చి నిన్ను కట్టబోతే, నీ కాటుక కళ్లలోనుండి నీళ్లు ఉబుకుతూ నీ చెక్కిళ్ల మీదికి జారుతుంటే, నీవు నీ కళ్లను అల్లరిగా అల్లల్లాడిస్తుంటే, నీవు భయపడ్డట్టు నటిస్తూ నేల చూపులు చూస్తుంటే, ఎవరికీ భయపడని నీవు నీ తల్లి యశోదకు భయపడుతుంటే, అబ్బా! ఆ దృశ్యము నయనానందకరము, జగన్మోహనకరంగా ఉంటుంది కృష్ణా!

నీకు జన్మఅనేది లేకపోయినా, యదువంశమును ఉద్ధరించ డానికి ఆ వంశములో జన్మించావని నీ భక్తులు చెప్పుకుంటారు కానీ, నీవు మా కురు వంశమును కూడా ఉద్ధరించడానికి మాకు బంధువు అయ్యావు.

కృష్ణా! నీ తల్లి దేవకీదేవి, నీ తండ్రి, వారి పూర్వ జన్మలో నిన్ను తమ కుమారుడిగా జన్మించమని కోరగా, వారి కోరిక మేరకు ఈ జన్మలో వారు దేవకీ వసుదేవులుగా పుట్టి, నిన్ను వారి పుత్రుడుగా కన్నారు. వారు ఎంత అదృష్టవంతులోకదా!

నీకు మానవునిగా జన్మించే అవసరము లేకపోయినా, జగత్కల్యాణము కొరకు, దుష్టసంహారము కొరకు నీవు దేవకీ వసుదేవులకు పుత్రుడుగా జన్మించి, ఈ లోకమును ఉద్ధరించావు. భూభారము ఎక్కువైనపుడు, భూదేవి ప్రార్థించగా, ఆమె కోరిక మేరకు, దుష్ట శిక్షణ, శిక్షణ చేయడానికి తద్వారా భూభారము తగ్గించడానికి బ్రహ్మదేవుడు నిన్ను కృష్ణునిగా అవతరింపజేసాడు అని పెద్దలు చెబుతారు.

కాని మరి కొందరు ఏమంటారంటే, మానవులు దేహాభి మానంతో, అజ్ఞానంతో, సంసారసాగరంలో పడి కొట్టుమిట్టాడుతుంటే, వారిని ఉద్ధరించడానికి, వారి దు:ఖములను నివృత్తి చేయడానికి, వారిలో భక్తి మార్గాన్ని పెంపొందించి వారికి మోక్షం ప్రసాదించడానికి నీవు అవతరించావని అంటారు.

ఓ కృష్ణా! నీవు భక్తసులభుడవు. నిన్ను కీర్తించేవారికి, నీ కథలు వినేవారికి, గానం చేసేవారికీ, నీవు దర్శనం ఇస్తుంటావు. వారు మాత్రమే నీ పాదపద్మములను చూడగలుగుతున్నారు.

ఓ భక్తవత్సలా! నా కుమారులైన పాండవులకు నీవే దిక్కు. నీవే శరణు. వారికి నీ పాదపద్మములు ఆశ్రయించడం తప్ప వేరు మార్గము లేదు. సదా నీ పాద సేవ చేసుకుంటూ, నిన్ను మా కన్నుల ముందు ఉంచుకొని చూస్తూ తృప్తిపడాలనుకొనే మాకు నీ దర్శనభాగ్యం కలిగించకుండా ద్వారకకు పోవడం భావ్యమా కృష్ణా!

రోజూ నిన్ను చూడకుండా పాండవులు, యాదవులు జీవించి ఉన్నా ప్రయోజనము లేదు కదా! ఎందుకంటే, మానవునిలోని ఇంద్రియ ములను అతనిలోనిజీవాత్మ శాసిస్తూ ఉంటుంది. ఆ జీవాత్మ లేనపుడు ఆ ఇంద్రియములు జడపదార్థములు అవుతాయి. చైతన్య రహితము అవుతాయి. అలాగే ప్రతిరోజూ నువ్వు కనపడకపోతే ఈ పాండవులు, హస్తినాపుర వాసులు బతికీ ప్రయోజనము ఏముంటుంది. కేవలం పాండవులు అనే పేరుతో బతుకుతున్నాము అని అనుకోవడం తప్ప.

మా చేత పాలింపబడుతున్న ఈ కురు సామ్రాజ్యము నీ పాద స్పర్శతో పునీతమయింది. నీవు ద్వారకు వెళ్లిన తరువాత, ఈ కురు సామ్రాజ్యమును ఎవరు పునీతం చేస్తారు.

కృష్ణా! నీ చూపు పడితే చాలు పంటలు పుష్కలంగా పండుతాయి. వానలు కురుస్తాయి. ఓషధులు వృద్ధిపొందుతాయి. అటువంటి నీవు వెళ్లిపోతే ఈ కురుసామ్రాజ్యము ఎలా వృద్ధిచెందుతుంది.

కృష్ణా! చూచావు కదా! నాలోనూ, పాండవులలోనూ, ఇంకా ఈ ప్రేమబంధాలు, రాగద్వేషాలు ఎలా వృద్ధిచెందుతున్నాయో. నీ కరుణతో వాటిని ఛేదించు. నా మనస్సు నీ యందే నిరంతరము లగ్నం అయేట్టు నాకు, నా కుమారులకు మంచి బుద్ధిని ప్రసాదించు.

ఓ అర్జున సఖా! దుష్టసంహారా! గోవిందా! దుష్టులు, భూమికి భారంగా పరిణమించిన క్షత్రియ వంశములను దహించిన వాడా! గోబ్రాహ్మణుల దు:ఖమును తొలగించడానికి అవతరించిన వాడా! యోగేశ్వరా! జగద్గురూ! కృష్ణా! నీకు నమస్కారము." అని కుంతీ దేవి తన మనసు నిరంతరమూ కృష్ణుని యందు లగ్నం చేయమని ప్రార్థించింది.

(ఈ సందర్భంలో పోతన గారు రాసిన పద్యము ప్రార్థనా పద్యంగా ప్రఖ్యాతి చెందింది.

శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!

ఇలాంటిఆణిముత్యాల్లాంటి పద్యాలు వచ్చినపుడు వాటిని స్మరించుకుందాము. చదివి పులకించిపోదాము.)

ఇదంతా ఓపిగ్గా విన్నాడు కృష్ణుడు. తన మాయతో ఆమెను సమ్మోహితురాలిగా చేసాడు. తరువాత ఆమెను చూచి నవ్వుతూ ఇలా అన్నాడు. "తథాస్తు! నీవు అనుకున్నట్టే అన్నీ జరుగుతాయి." అని అన్నాడు.

తరువాత ద్వారకకు పోవడానికి రథం ఎక్కబోతుంటే ధర్మరాజు అక్కడికి వచ్చి మరి కొంత కాలము హస్తినాపురములో ఉండి పొమ్మని ప్రార్థించాడు.

అంతకు ముందు కృష్ణుడు, వ్యాసుడు, మహర్షులు ఎంతో మంది ఎన్ని విధములు ఓదార్చినా, ఎన్ని కథలు చెప్పినా, ఎన్ని ధర్మములు బోధించినా, ధర్మరాజు యుద్ధములో తన బంధుమిత్రులను అకారణంగా చంపిన పాపాన్ని మరిచిపోలేకుండా ఉన్నాడు.

ఇప్పుడు కూడా మరలా అదే మొదలెట్టాడు. శ్రీకృష్ణుడు ద్వారకకు

వెళ్లే సమయంలో అక్కడ గుమిగూడిన బ్రాహ్మణులను బంధుమిత్రులను చూచి ఇలా అన్నాడు.

"నేను అజ్ఞానాంధకారంలో మునిగి పోయి తుచ్ఛమైన రాజ్యభోగముల కొరకు తాతలను, తండ్రులను, బంధుమిత్రులను చంపుకున్న దుష్టుడను.. చచ్చిన తరువాత నక్కలకు, కుక్కలకు ఆహారం అయ్యే ఈ శరీరం కోసరం, ఈ శరీర సుఖాల కోసరం అక్షౌహిణిల సైన్యములను వధించాను. వారి చావుకు కారణం అయ్యాను. దానివలన బాలురు వృద్ధులు, స్త్రీలు అనాధలు అయ్యారు. కోట్ల సంవత్సరములు నరకంలో ఉన్నా ఈ పాపం పోదు.

యుద్ధం చేయడం శత్రువులను చంపడం క్షాత్రధర్మము అనీ సమర్థించుకోవచ్చు కానీ ఈ దారుణ మారణహోమము, తద్వారా లభించిన రాజ్యసుఖములు నాకు ఏ మాత్రం సంతోషం కలిగించడం లేదు. ఎన్ని యజ్ఞములు, యాగములు చేస్తే ఈ పాపం పోతుంది. బురదతో బురదను కడిగితే బురద పోదుకదా! మద్యంతో శుద్ధిచేస్తే మద్యం పవిత్రం కాదు కదా! అలాగే జీవహింసతో కూడిన ఎన్ని యజ్ఞములు, యాగములు చేసినా నేను చేసిన పాపము తొలగి పోదు." అని పరి పరి విధాల చింతిస్తున్నాడు ధర్మరాజు" అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు భాగవతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## ప్రథమస్కంధము

## తొమ్మిదవ అధ్యాయము

ఆ ప్రకారంగా దు:ఖిస్తున్న ధర్మరాజును చూచాడు కృష్ణుడు. తన ద్వారక ప్రయాణాన్ని కొన్ని రోజులు ఆపుజేసాడు. పాండవులను తీసు కొ ని అంపశయ్యమీద ఉన్న భీష్ముని వద్దకు వెళ్లాడు. వారి వెంట వ్యాసుడు, ధౌమ్యుడు, మొదలగు బ్రాహ్మణులు, తమ తమ వాహనముల మీద వెళ్లారు. పర్వతుడు, నారదుడు, బృహదశ్వుడు, భరద్వాజుడు, పరశురాముడు, వశిష్టుడు, ఇంద్రప్రమదుడు, త్రితుడు, గృత్సమదుడు, అసితుడు, కాక్షీవానుడు, గౌతముడు, అత్రి, కౌశికుడు, సుదర్శనుడు మొదలగు మహామునులు కూడా భీష్ముని వద్దకు చేరుకున్నారు. ఇంకా శుకుడు, కశ్యపుడు, బృహస్పతి మొదలగు మునులు కూడా అక్కడకు చేరుకున్నారు. శ్రీకృష్ణుడు కూడా ధర్మరాజు వెంట తన రథము మీద భీష్ముని వద్దకు వెళ్లాడు.

అందరూ భీష్ముని చూచి నమస్కరించారు. భీష్ముడు కూడా అందరికీ వినయంగా ప్రతి నమస్కారము చేసాడు. భీష్ముడు శ్రీకృష్ణుని చూచి భక్తితో నమస్కరించి, శారీరకంగా లేవలేడు కాబట్టి, యధాశక్తి మానసిక పూజ చేసాడు. తన సమీపములో కూర్చున్న తన మనుమలు పాండవులను చూచి ప్రేమతో ఇలా అన్నాడు.

"పాండవులారా! మీరు గోవులను, బ్రాహ్మణులను, మీదు మిక్కిలి శ్రీకృష్ణుని నిరంతరమూ పూజిస్తున్నారు. మీరు కష్టములు పడుటకు

యోగ్యులు కారు. నాయనలారా! మీరు పసివారుగా ఉండగానే మీ తండ్రి పాండురాజు కాలధర్మం చెందారు. మిమ్మల్ని పెంచి పెద్ద చేయడానికి మీ తల్లి కుంతీ ఎన్నో కష్టములు పడింది. మీరు చిన్న తనములో పడ్డ కష్టములు అన్నీ కాల వశమున,కాలానుగుణంగా సంభవించినవే కానీ ఎవరూ కావాలని చేసినవి కావు. అసలు మీరు పడ్డ కష్టములు కష్టములే కావు. ఎందుకంటే, ధర్మస్వరూపుడు ధర్మరాజు, మహాబలవంతుడు భీముడు, గాండీవధారి అర్జునుడు, మీకు అనుంగు బంధువుగా శ్రీకృష్ణుడు ఉన్న చోట కష్టములు కాపురము చేయలేవు కదా! ఇదంతా కృష్ణమాయ. ఆయన లీలా విశేషము. ఎప్పుడు ఎవరికి ఏమి జరుగుతుందో ఎవరికీ తెలియదు ఒక్క ఈశ్వరుడికి తప్ప. మనజీవితములలో జరిగే సంఘటనలు అన్నీ ఈశ్వరుని అధీనములే కదా! అనుభవించడమే మన కర్తవ్యము. ఆ సత్యమును గుర్తించి, నీవు ప్రజలను కన్నబిడ్డలవలె పాలించు. ఈ హస్తినాపుర సామ్రాజ్యమును పాలించుటకు నీవే సమర్థువు.

ఈ శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవదవతారము. ఆద్యుడు. నారాయణుడు. ఈ లోకాన్ని తన మాయాశక్తితో మోహపరవశులను చేయుచున్నాడు. అందరి హృదయములలో తానై విహరిస్తున్నాడు. ఈ మహానుభావుని మహిమలను తెలుసుకోవడం మహానుభావుడైన శివుడు, నారదుడు, కపిలుడు, మొదలగు మహాఋషులకు తప్ప వేరెవరికీ సాధ్యం కాదు. అటువంటి శ్రీకృష్ణుని నీకు బంధువుగానూ, మిత్రుడుగానూ, నీ దూతగానూ, అర్జునుడికి సారధిగానూ చేసుకున్నావు.

శ్రీకృష్ణుడు రాగద్వేషములకు అతీతుడు. మానాభిమానములు లేని వాడు. ఒకరి యందు ఇష్టము మరొకరి యందు అయిష్టము అనే బేధబుద్ధి లేని వాడు. అందరినీ సమంగా ఆదరిస్తాడు. అందరిలోనూ తానే

అయి ఆత్మస్వరూపంగా వెలుగుతున్నాడు. అటువంటి శ్రీకృష్ణుని నీవు గొప్ప పనులకు వినియోగించినా, నీచమైన సారథిలాంటి పనులకు వినియోగించినా, ఆయన ఎప్పుడూ ఎటువంటి వికారమును పొందలేదు. వీటికన్నిటికీ అతీతుడు శ్రీకృష్ణభగవానుడు. లేక పోతే అంపశయ్యమీద పరుండి, మరణము కోసరము దినములు లెక్కపెట్టుకుంటున్న ఈ అభాగ్యుడిని చూడటానికి తానే స్వయంగా నా దగ్గరకు వచ్చి నాకు తన దివ్యదర్శనభాగ్యము కలిగిస్తాడా!

ఆ మహాను భావుని నిర్మలమైన మనస్సుతో కొలిచిన వారికి, ఆయనను భక్తితో కీర్తించినవారికి, ఇహలోక కర్మ బంధనముల నుండి విముక్తి తప్పకుండా లభిస్తుంది. ఈ మహానుభావుడు, శ్రీకృష్ణుడు, ఎప్పుడూ చిరునవ్వు తన మొహము మీద చెరగని వాడు, పద్మముల వంటి కన్నులు కలవాడు, ఎల్లప్పుడూ భక్తుల హృదయ కుహరములలో నివసించేవాడు, నాలుగు భుజములతో దర్శనం ఇచ్చేవాడు, నేను ప్రాణములు విడిచేదాకా నా ఎదుట ఉండి, తన జగన్మోహనాకారంతో నాకు కనువిందు చేస్తాడని అనుకుంటున్నాను." అని భక్తితో శ్రీకృష్ణునికి నమస్కరించాడు.

తరువాత ధర్మరాజు భీష్మపితామహుని కొన్ని సందేహాలను అడిగాడు. ధర్మరాజు అడిగిన ప్రశ్నలకు సమాధానంగా భీష్ముడు, ధర్మార్థకామ మోక్షముల గురించి, సామ,దాన,భేద,దండోపాయముల గురించి, వాటిని సాధించే ఉపాయముల గురించి  కొన్ని ఉపాఖ్యానములను, ఇతిహాస ములను చెప్పాడు.

ఇంతలో ఉత్తరాయణ పుణ్యకాలము ప్రవేశించింది. భీష్ముడు మౌనవ్రతము వహించాడు. ఎదురుగా నిలబడి ఉన్న శ్రీకృష్ణుని మనసులో

నిలుపుకున్నాడు. మనస్సును నిశ్చలంగా ఉంచుకున్నాడు. తన మనస్సును శ్రీకృష్ణుని మీద లగ్నం చేసాడు.  శ్రీకృష్ణుని కృపాకటాక్షవీక్షణములు తన మీద ప్రసరించడంతో,  భీష్మునికి తన శరీరములో గుచ్చుకున్న బాణముల వల్ల కలిగే బాధ తొలగిపోయింది. శరీరం ప్రశాంతంగా ఉంది. బాహ్యేంద్రియ ములు పనులు చేయడం మానేసాయి. భీష్ముడు తాను శరీరం విడిచిపెట్టే సమయం ఆసన్నమయింది అని తెలుసుకున్నాడు. నిర్మలమైన మనస్సుతో శ్రీకృష్ణుని ఇలా ధ్యానం చేస్తున్నాడు.

"ఈ సృష్టికి కారణమైన ప్రకృతిని లీలామాత్రంగా స్వీకరించిన వాడు, ఎల్లప్పుడూ తన స్వస్వరూపంతో పరమానందాన్ని పొందేవాడూ, యాదవ కులమును ఉద్ధరించినవాడూ అయిన శ్రీకృష్ణునకు నా మనస్సును  అర్పిస్తున్నాను.

త్రిభువనమోహనాకారుడు,  నీలమేఘశ్యాముడు,  పీతాంబర ధారుడు, వికసించిన పద్మము వంటి ముఖము కలవాడూ, అర్జునుని సఖుడు అయిన శ్రీకృష్ణపరమాత్మయందు నా మనస్సు లగ్నం  అగుగాక!

యుద్ధభూమిలో ఎగిరిన దుమ్ముమొహం అంతా నిండిపోగా, ముంగురులు మోహంమీద అల్లల్లాడగా, నేను ప్రయోగించిన బాణముల దెబ్బలకు శరీరం అంతా రక్తసిక్తంకాగా, ద్విగుణీకృత సౌందర్యంతో ప్రకాశిస్తున్న శ్రీకృష్ణుని నేను  ధ్యానిస్తున్నాను.

యుద్ధం మొదలు పెట్టక ముందు, తన బావ అర్జునుని మాట ప్రకారము రథమును  ఇరుసైన్యముల మధ్య నిలిపి, శత్రుసైన్యముల వంక తేరిపారజూచి, శత్రువుల ఆయుఃప్రమాణమును హరించిన శ్రీకృష్ణుని నేను

స్తుతిస్తున్నాను. శత్రుసేనలలో ఉన్న తాతలను, తండ్రులను, సోదరులను, మామలను, బంధువులను చూచి విషాదమును పొందిన అర్జునునికి ఆత్మవిద్యను, యోగశాస్త్రమును బోధించి, యుద్ధోన్ముఖుని చేసిన ఆ పరమాత్మను స్తుతిస్తున్నాను.

ఆయుధము పట్టను, యుద్ధము చేయను అని అర్జునునికి ఇచ్చిన మాటను తప్పి, రథచక్రమును చేత ధరించి, ఏనుగు మీదికి దుమికే సింహము మాదిరి నన్ను చంపడానికి నా మీదికి వస్తుంటే, అర్జునుడు వెనక్కు లాగుతూ, తన పరువు కాపాడమని ప్రార్ధిస్తుంటే, ఆయన మాట వినిపించుకోకుండా "ఈ రోజు భీష్ముని చంపి నిన్ను రక్షిస్తాను" అని నా మీదికి వస్తున్న ఆ శ్రీకృష్ణుడేదిక్కు నాకు.

ఈ సందర్భంలో పోతన గారు రాసిన ఆణిముత్యం లాంటి లోక ప్రసిద్ధి చెందిన పద్యం ఒకటి మనం చదువుకుందాము.

సీ॥ కుప్పించి యెగసిన గుండలంబుల కాంతి గగనభాగంబెల్ల గప్పికొనగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేగున జగతి గదల
జక్రంబు జేపట్టి చనుదెంచు రయమున బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయకు మన్నింపు మనిక్రీడి మరల దిగువ

తే॥గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి
నేడు భీష్ముని జంపుదు నిన్నుగాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖ వృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

అర్జునుని రథము మీద సారథిగా కూర్చుని, రథమును తోలుతూ, యుద్ధములో చనిపోయిన సైనికులకు తన దర్శన మాత్రం చేతనే ముక్తిని ప్రసాదించిన శ్రీకృష్ణుడు నాకు కూడా ముక్తిని ప్రసాదించు గాక!

తన మందగమనంతో, దరహాసంతో, ప్రేమతో నిండిన చూపులతో, గోపికలను ప్రేమ అనే ఉన్మాదావస్థలో ముంచి, వారికి ముక్తిని, సాయుజ్యమును ప్రసాదించినట్టి దేవదేవుడు, శ్రీకృష్ణుడు, నన్ను కూడా కరుణించుగాక!

రాజసూయ యాగము అయిన తరువాత అగ్రపూజ సమయంలో సభాభవన మధ్యంలో, ఉన్నతాసనము మీద కూర్చుని పాండవులచేత అగ్రపూజలందుకున్న ఆ దేవదేవుడు నా కళ్లముందు సాక్షాత్కరించాడు.

ఈ చరాచర జగత్తులో, సకల ప్రాణులలోనూ ఆత్మస్వరూపుడై వెలుగొందుతూ, సూర్యుడు ఒక్కడే అయిననూ ఒక్కొక్కరికీ ఒక్కోసూర్యుడి లాగా ఎలాగైతే కనపడుతుంటాడో అట్టి సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణుని నేను ఎటువంటి బేధభావము లేకుండా శరణుజొచ్చాను." అని నిర్మలమైన మనస్సుతో ప్రార్థించాడు భీష్ముడు.

పైభావాన్ని పోతన గారు ఈ క్రింది పద్యంలో పొందుపరిచారు. ఈ ఆణిముత్యం కూడా అందుకోండి.

మ॥ఒక సూర్యుండు సమస్తజీవులకు దా నొక్కొక్కడై తోచు పో
లిక నే దేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోహములన్ నానావిధానూనరూ
పకుడై యొప్పుచు నుండు నట్టిహరి నే బ్రార్థింతు శుద్ధుండనై.

తరువాత భీష్ముడు తన ఇంద్రియ వృత్తులను నిరోధించాడు. మనస్సును భగవంతుని మీద లగ్నం చేసాడు. శ్వాసను నిలిపివేసాడు. తరువాత భీష్ముడు తన మనస్సును, వాక్కును, దృష్టిని, ఇంద్రియములను, ఆ పరమాత్మయందు లగ్నం చేసాడు. శ్వాసను నిరోధించాడు. తన ప్రాణములను ఊర్ధ్వముఖంగా విడిచిపెట్టాడు. భీష్ముడు ఆ పరమాత్మలో ఐక్యమయ్యాడు. భీష్ముడు పరబ్రహ్మలో కలవడం ప్రత్యక్షంగా చూచిన వారు ధన్యులయ్యారు. దేవతలు భీష్ముని మీద పుష్పవృష్టి కురిపించారు.

తరువాత ధర్మరాజు భీష్ముని పార్థివ దేహానికి అంత్యక్రియలు శాస్త్రోక్తంగా నిర్వహించాడు. అక్కడకు చేరుకున్న మునులు, ఋషులు పరమాత్ముడైన శ్రీకృష్ణుని వేనోళ్ల స్తుతించారు. తరువాత తమ తమ ఆశ్రమములకు వెళ్లిపోయారు. తరువాత ధర్మరాజు తమ్ములతో హస్తినా పురమునకు వెళ్లాడు. తన పెద తండ్రి ధృతరాష్ట్రుని, గాంధారిని ఓదార్చాడు. తరువాత ధృతరాష్ట్రుని అనుమతితో, శ్రీకృష్ణుని ఆశీస్సులతో ధర్మరాజు హస్తినాపుర రాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యాడు. ప్రజలను జనరంజకంగా పాలించాడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# ప్రథమస్కంధము
# పదవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో భాగవతపురాణమును వీనుల విందుగా ప్రవచిస్తున్న సూత పౌరాణికుని చూచి శౌనకుడు ఇలా అడిగాడు. "మహాత్మా! మహాభారత యుద్ధంలో విజయాన్ని పొంది, హస్తినకు పట్టాభిషిక్తుడైన ధర్మరాజు ఏ ప్రకారంగా రాజ్యపాలన చేసాడు వివరించండి." అని అడిగారు.

అప్పుడు సూత పౌరాణికుడు ఇలా చెప్ప సాగాడు. "ఓ బ్రాహ్మణోత్తములారా! భీష్మనిర్యాణము తరువాత ధర్మరాజు పట్టాభిషిక్తుడు అయ్యాడు. 'ఈ ప్రపంచం అంతా భగవంతుని అధీనములో ఉంది. తన చేతిలో ఏమీ లేదు. భగవంతుడు ఆడించినట్టు ఆడటమే మన కర్తవ్యము' అనే సత్యాన్ని గ్రహించిన ధర్మరాజు, ఇహలోక భ్రమలన్నీ తొలగి పోయి, స్వార్థచింతనలు వీడి, అహంకారము నశించి, సాత్వికుడై, కురు సామ్రాజ్యమును జనరంజకంగా పరిపాలిస్తున్నాడు.

శ్రీకృష్ణునికి వచ్చిన కార్యము పూర్తి అయింది. ఇంక ద్వారకకు వెళదామనుకుంటున్నాడు. కానీ హస్తినలో ఉన్న ద్రౌపది, సుభద్ర తనను పోనివ్వడం లేదు. వారి తృప్తికై మరికొన్ని రోజులు హస్తినలో ఉన్నాడు శ్రీకృష్ణుడు. ఒక సుముహూర్తమున ద్వారకకు బయలుదేరాడు. అందరి వద్దా సెలవు తీసుకున్నాడు. రథమును ఎక్కాడు. సుభద్ర, ద్రౌపది, కుంతీ,

ఉత్తర, గాంధారీ, ధృతరాష్ట్రుడు, యుయుత్సుడు, కృపాచార్యుడు, నకుల సహదేవులు, భీముడు, ధౌమ్యుడు, సత్యవతి మొదలగువారు శ్రీకృష్ణుడు వెళ్లిపోతుంటే ఆయన వియోగమును సహించలేకపోయారు. సత్పురుషుల వియోగము భరించడం కష్టం కదా!

శ్రీకృష్ణుని లీలలను, ఆయన మహిమలను ఒక్కసారి వింటే ఎలా మరిచిపోలేరో అలాగే అన్నినెలల పాటు శ్రీకృష్ణునితో పాటు ఉంటూ, తింటూ, నిద్రిస్తూ, ప్రతిరోజూ ఆయనను దర్శిస్తూ, ఆయనను తాకుతూ, ఆయనతో సరససల్లాపాలు ఆడుతూ, శ్రీకృష్ణుని దివ్యదర్శనభాగ్యమును నెలల కొద్దీ అనుభవించిన పాండవులు మున్నగు వారు, ఆయన వెళ్లిపోతున్నాడు అంటే బాధపడటం సహజమే కదా! అందుకనీ, శ్రీకృష్ణుడు ద్వారకకు ప్రయాణం అవుతుంటే ఆయనను రెప్ప వాల్చకుండా చూస్తున్నారు.

అంత:పుర స్త్రీలు ఆయనను చూస్తూ కళ్లలో నీరుకుక్కు కుంటున్నారు. పైకి ఏడిస్తే అమంగళ సూచకమని తలచి లోలోపలే బాధపడుతున్నారు. శ్రీకృష్ణునికి వీడ్కోలుసందర్భంగా మంగళవాద్యములు మోగుతున్నాయి. హస్తినా పురంలో ప్రజలు మేడల మీద ఎక్కి శ్రీకృష్ణుని మీద పూలవాన కురిపిస్తున్నారు. వారిలో వారు శ్రీకృష్ణుని మహిమల గురించి చర్చించుకుంటున్నారు.

" ప్రళయ కాలంలో త్రిగుణాత్మకమైన ఈ ప్రకృతి అంతా పరమాత్మలో లయం అయిపోగా, జీవుడు కూడా పరమాత్మలో లీనం కాగా, తన నిజరూపంతో అన్నిటికన్నా అతీతంగా వెలుగొందే ఆది పురుషుడు ఈ శ్రీకృష్ణుడేనే!

తరువాత ఆ పరమాత్మ, అనాది నుండి వస్తున్న సృష్టిచేయడం మొదలు పెట్టాడు. నామము రూపము లేని జీవాత్మకు నామ రూపములు కల్పించాడు. తన అంశతో సమస్త భూతములను సృష్టించి, వారందరి లోనూ అంతర్యామిగా నిలిచి ఉన్నాడు. ఈ జగత్తులో కర్మలను చేయుట కొరకు వేదములను సృష్టించాడు. ఇవన్నీ చేసిన వాడు ఈ శ్రీకృష్ణుడేనే!

యోగులు, భక్తులు, ప్రాణాయామంతో శ్వాసను నియమించి, ఇంద్రియములను నిగ్రహించి, భక్తిమార్గమును అనుసరించి, ఏ పరమాత్మ దర్శనం కోసరం పరితపిస్తారో ఆ పరమాత్ముడే ఈ శ్రీకృష్ణుడు. ఈ పరమాత్మను స్మరించడం వల్ల, కీర్తించడం వలననే మానవుని అంత:కరణ పరిశుద్ధము అవుతుంది గానీ, వేరే ఏయోగముల వలనా కాదు.

ఈ పరమాత్మ చరాచరజగత్తును సృష్టిస్తున్నాడు, పోషిస్తున్నాడు, లయం చేస్తున్నాడు. కానీ తాను మాత్రం ఎందులోనూ లీనం కాడు. సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడు. ఈ విషయాలన్నీ వేదాలు, ఆగమాలు, శాస్త్రములు, ఇతిహాసములు గానం చేసాయి. ఆ మహానుభావుడే ఈ శ్రీకృష్ణుడు.

రజోగుణ, తామస గుణ ప్రధానులు అయిన క్షత్రియులు అధర్మము ఆచరిస్తూ, యుద్ధములు చేస్తూ, ప్రాణులను సంహరిస్తూ, కాలం గడుపుతుంటారు. కాని ఈ శ్రీకృష్ణుడు సత్వగుణ ప్రధానుడు. సత్యము, ధర్మము, ఋతము, దయా గుణము, యశస్సు మొదలగు గుణములతో అన్ని యుగములలో అవతరిస్తూ మానవులను ఉద్ధరించే పరమాత్ముడే

ఈ శ్రీకృష్ణుడు.

ఈ శ్రీకృష్ణునికి జన్మఇచ్చిన యదువంశము ఎంత పవిత్ర మైనదో, ఈ శ్రీకృష్ణుడు తిరిగిన బృందావనము, శ్రీకృష్ణుడు సంచరించిన మధురా నగరము కూడా అంతే పవిత్రమైనవి. శ్రీకృష్ణుడు  నివసించిన ద్వారకా నగరము స్వర్గమును మరపించింది. నాలుగు సముద్రము లతో ఆవరించి ఉన్న ఈ భూమి యందు ఉత్కృ ష్ట మైన పట్టణంగా నిలిచింది ద్వారక. శ్రీకృష్ణుని ప్రతి రోజూ దర్శించుకొనే ఆ ద్వారకావాసులు  ఎంతటి అదృష్టవంతులో కదా!

శ్రీకృష్ణుని ఎనిమిది మంది భార్యలు,  పూర్వజన్మలలో ఎన్ని నోములు నోచారో ఎన్ని వ్రతాలు చేసారో ఈ జన్మలో ఆయనకు భార్యలు అయ్యారు. శ్రీకృష్ణుని బాల్య చేష్టలతో అను నిత్యము ఆనందించిన గోపకాంతల అదృష్టమే అదృష్టము కదా!

తన మీద మనసు పడ్డ రుక్మిణి మనోభీష్టము నెరవేర్చడం కోసరం శిశుపాలుడు మొదలగు రాజుల నోడించి, రుక్మిణిని చేపట్టిన కృష్ణుడు ఈయనే!  నరకాసురుని వధించి, నరకుని చెరలో ఉన్న వేల మంది స్త్రీలను బంధవిముక్తులను చేసి వారికి కొత్త జీవితమును ప్రసాదించినమహానుభావుడు ఈయనే! తన భార్య సత్యభామ కోరిక మేరకు స్వర్గము నుండి పారిజాతమును తెచ్చి ఇచ్చిన సత్యభామా విధేయుడు ఈయనే సుమా!" అంటే హస్తినాపుర వీధులలో మేడల మీద నుండి శ్రీకృష్ణుని చూస్తూ మాట్లాడుకుంటున్న హస్తినాపుర స్త్రీల మాటలను అలా అలా వింటూ, చిరునవ్వులు చిందిస్తూ తన రథము మీద వెళుతున్నాడు శ్రీకృష్ణుడు.

అందరినీ రక్షించే శ్రీకృష్ణుని వెంట, ఆయనకు రక్షణగా చతురంగ బలములు వెళుతున్నాయి. శ్రీకృష్ణుని ఎడబాటును సహించలేక ఆయనవెంట హస్తినాపుర పొలిమేరల దాకా వచ్చిన పౌరులు శ్రీకృష్ణుని రథం వెళ్లిన మేరా చూస్తూ, రథము కను మరుగు అయిన తరువాత వెనకకు తిరిగారు.

శ్రీకృష్ణుడు యమునా నదీ తీరంలో ప్రయాణిస్తూ, కురు భూములను, పాంచాలమును, శూరసేనరాజ్యమును, బ్రహ్మావర్తమును, కురుక్షేత్రమును, మత్స్యదేశమును, సారస్వత దేశమును, మరుధన్వమును, సౌవీర దేశమును, ఆభీర దేశమును ... ఈ దేశముల గుండా ప్రయాణించి ఆయాదేశాధీశులు ఇచ్చిన కానుకలు స్వీకరిస్తూ, ద్వారకా నగరమును చేరుకున్నాడు. సూర్యాస్తమయము అవడం మూలాన సంధ్యావందనాది కార్యక్రమములు నిర్వర్తించాడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము పదియవ అధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్భాగవతము

## ప్రథమ స్కంధము

## పదకొండవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూతపౌరాణికుడు శౌనకాదిమహామునులకు భాగవత పురాణమును ఇలాచెప్పసాగాడు.

"శ్రీకృష్ణుడు ద్వారకా నగర పొలిమేరల వద్దకు వచ్చాడు. తాను వచ్చినట్టు సూచనగా పాంజన్యము అనే పేరుగల తన శంఖమును పూరించాడు. తెల్లని ఆ శంఖము ఎర్రటి శ్రీకృష్ణుని పెదవులు తాకి ఎరుపెక్కిపోయింది. (సీతారామ కల్యాణ సమయంలో, సీతా రాములు ఒకరి తలమీద ఒకరు తలంబ్రాలు పోసుకొనేటప్పుడు, తెల్లనిముత్యాలు నీల మేఘశ్యాముడైన రాముని దోసిట్లో పోస్తే, అవి నీలంగా మారి పోయాయి అని రామాయణంలో వర్ణించారు.)

ద్వారకా వాసులందరూ శ్రీకృష్ణుడు వచ్చాడని తెలుసుకొని ఆతురతగా, పసిపిల్లలు తండ్రివద్దకు ప్రేమతో పరుగులు తీసినట్టు, పరుగు పరుగున ఆయన వద్దకు చేరుకున్నారు. వారందరూ తమ తమ శక్తి కొద్దీ శ్రీకృష్ణునికి కానుకలు సమర్పించుకున్నారు. తరువాత ఆయనతో ఇలా అన్నారు.

"ఓ కృష్ణా! భక్తజనులకు శరణ్యమైనవీ, సనకాదులకు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు వారిచేత నిరంతరమూ పూజింపబడేవీ అయిన నీ పాద పద్మములకు నమస్కరించుచున్నాము. ఓ కృష్ణా! నీవే మాకు తల్లి, తండ్రి,గురువు, దైవము, బంధువు, మిత్రుడు. మేమందరమూ సదా నిన్నే

స్మరిస్తుంటాము. స్వర్గవాసులకు కూడా దుర్లభమైన నీ జగన్మోహనా కారమును చూచి మేము కృతార్థులము అయినాము. నీవు ద్వారకలో లేకపోవడంతో అనాధలుగా ఉన్న మేము నీ రాకతో సనాధులము అయ్యాము.

కృష్ణా! నీవు నీ బంధువులను చూడటానికి హస్తినకు వెళ్ళావు. నీవు లేని ద్వారకలో మేము దినము ఒక యుగంగా గడిపాము. ఇన్ని రోజులు నీ సుందరమైన వదన సరోజమును చూడకుండా ఎలాగడిపామో మాకే తెలియకుండా ఉంది. ఇప్పుడు నీవువచ్చావు. మా హృదయములు ఆనందంతో నిండిపోయాయి." అని అన్నారు.

ద్వారకావాసులు తనమీద ప్రీతితో ప్రేమతో అంటున్న మాటలు ఆలకిస్తూ శ్రీకృష్ణుడు ద్వారకలో ప్రవేశించాడు. ద్వారకా నగరములో మధు, భోజ, దాశార్హ, అర్హ, కుకుర, అంధక, వృష్ణికులు అనబడే వంశముల వారు నివసిస్తున్నారు. ఆ వంశముల వారందరూ ద్వారకా నగరమును సదా రక్షిస్తూ ఉంటారు. ద్వారకా నగరము ఫలపుష్పములతో శోభిల్లుతున్న వృక్షములు, లతలు, తామర పూలతో నిండి ఉన్న సరోవరములు కల ఉద్యానవనములు, క్రీడా వనములతో శోభాయమానంగా ఉంది. శ్రీకృష్ణునికి స్వాగతం పలుకుతూ దారుల పొడుగునా పతాకములతోనూ, పూల మాలలతోనూ అలంకరించారు. రాజమార్గములు, నాలుగు వీధులు కలిసే కూడళ్లు, పణ్యవీధులను కస్తూరి మొగలగు సుగంధ ద్రవ్యములు కలిపిన నీళ్ళతో బాగుగా తడిపారు. పుష్పములు, అక్షతలు చల్లారు. నగరము అంతా దీపములతో అలంకరించారు.

శ్రీకృష్ణుడు ద్వారకకు వచ్చాడని తెలుసుకొని ఉగ్రసేనుడు, తండ్రి వసుదేవుడు, అన్నయ్య బలరాముడు, కుమారులు ప్రద్యుమ్నుడు, చారుధేష్ణుడు, జాంబవతి కుమారుడు సాంబుడు, ఇంకా అక్రూరుడు, మొదలగు వారు, ద్వారకలో ఉన్న బ్రాహ్మణులు, పురప్రముఖులు, ఆయనను కలుసుకోడానికి వచ్చారు. మంగళవాద్యాలు మోగుతున్నాయి. బ్రాహ్మణులు స్వస్తివాచకములు పలుకుతున్నారు. వారకాంతలు శ్రీకృష్ణునికి ఎదురు వెళ్లి స్వాగతం పలుకుతున్నారు. నర్తకులు నృత్యం చేస్తున్నారు. పౌరాణికులు శ్రీకృష్ణలీలలు గానం చేస్తున్నారు. వంది మాగధులుస్తోత్రపాఠాలు చదువు తున్నారు.

తనను చూడటానికి వచ్చిన బంధుమిత్రులను శ్రీకృష్ణుడు యధోచితంగా గౌరవించాడు. కొందరికి నమస్కరించాడు. కొంతమందిని ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. కొంతమందితో కరచాలనము చేసాడు. కొందరిని చిరునవ్వుతో పలకరించాడు. పెద్దల ఆశీర్వాదాలు స్వీకరిస్తూ శ్రీకృష్ణుడు ద్వారక నగర ప్రవేశము చేసాడు.

శ్రీకృష్ణుని చూడటానికి దార్వనగరంలో ఉన్న స్త్రీలు ఎత్తైన ప్రాసాదాలు ఎక్కి చూస్తున్నారు. చాలా రోజుల తరువాత చూడటం వలన శ్రీకృష్ణుని ఎంత చూసినా వారికి తనివిదీరడం లేదు. విష్ణుస్వరూపుడైన శ్రీకృష్ణుని వక్షస్థలము లక్ష్మీనివాసము. అటువంటి శ్రీకృష్ణుని వక్షస్థలమును, ముఖారవిందమును చూస్తుంటే సకల జనులకు అమృతము తాగినట్టు ఉంటుంది. శ్రీకృష్ణుని భుజములు లోకపాలకులకు నివాసములు. శ్రీకృష్ణుని పాద పద్మములు ఆయన భక్తకోటికి ఆశ్రయములు.

అటువంటి శ్రీకృష్ణుడు, ముందు తన తల్లి తండ్రులు దేవకీ వసుదేవుల వద్దకు వెళ్లి వారి ఆశీర్వాదములు తీసుకున్నాడు. తరువాత వసుదేవుని ఇతర భార్యలకు కూడా నమస్కరించి వారి ఆశీర్వాదములు పొందాడు. శ్రీకృష్ణుని తల్లులందరూ శ్రీకృష్ణుని ప్రేమతో కౌగలించుకొని, ఆనంద భాష్పాలు కళ్లనిండా నింపుకొని, మనసారా ఆశీర్వదించారు.

తరువాత తన భార్యల మందిరములకు వెళ్లాడు శ్రీకృష్ణుడు. చాలాకాలం తరువాత శ్రీకృష్ణుని చూచిన ఆ సతులు పరమానంద భరితులయ్యారు. ఆయన పాదములకు నమస్కరించారు. శ్రీకృష్ణుని చూచి వారు ఇలా అనుకున్నారు.

"వెదురు ఒకదానితో ఒకటి రాసుకొని అగ్నిని పుట్టించి ఆ అగ్నిచేతనే ఆ వెదుళ్లు దహింపబడినట్టు, ఈ లోకంలో ఉన్న క్షత్రియులు పాపాకర్ములయి భూమికి భారంగా తయారయినప్పుడు, అంతటా తానే అయిన కృష్ణుడు, వారిలో వారికి శత్రుత్వమును పెంచి, యుద్ధమును కల్పించి, వారిని నశింపచేసి, శాంతిని స్థాపించాడు.

ఈ కృష్ణుడు తాను సర్వాంతర్యామి అయి కూడా సామాన్య మానవుని వలె, కొంతమంది ఉత్తమ కాంతలకు భర్తగా వారితో రమిస్తున్నాడు. అయినా కామము నందు ఏ మాత్రమూ ఆసక్తి లేకుండా నిర్గుణుడుగా శోభిల్లుతున్నాడు. కాని లోకంలో ఉన్న పామరజనులు శ్రీకృష్ణుడు కూడా తమ వలెనే కామభోగములు అనుభవిస్తున్నాడని, కామాతురుడు అనీ అనుకుంటూ ఉంటారు. అది వారి అజ్ఞానం తప్ప వేరు కాదు. శ్రీకృష్ణుడు ఎల్లప్పుడూ ఈ బాహ్య ప్రపంచంలో సంచరిస్తున్నా, ఆ బాహ్య ప్రపంచంలోని సుఖ దు:ఖాలకు, రాగద్వేషాలకు అతీతంగా

ఉంటాడు. అదియే పరమేశ్వర తత్త్వము. శ్రీకృష్ణుని మహిమలను ఎరుగని సాధారణ స్త్రీలు శ్రీకృష్ణుని తమవాడనీ, తమకే సొంతమనీ, తమతోనే ఏకాంతంగా గడుపు తాడనీ, అనుకుంటూ ఉంటారు. అది వారి మూర్ఖత్వము." అని అనుకుంటూ ఉన్నారు.

శ్రీమద్భాగవతము
ప్రథమస్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## ప్రథమస్కంధము
## పన్నెండవ అధ్యాయము.

సూత పౌరాణికుడు శౌనకాదిమహామునులకు భాగవత పురాణమును వినిపిస్తూ ఉండగా, శౌనకాది మహామునులు సూత పౌరాణికుని ఈ విధంగా అడిగారు.

" మహాత్మా! అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రము ఉత్తర గర్భమును విచ్ఛిన్నం చేయబోగా, శ్రీకృష్ణుడు తనమాయ చేత ఉత్తర గర్భములో ఉన్న శిశువును రక్షించాడు అని చెప్పారు కదా. తరువాత ఏమిజరిగింది. పరీక్షిత్తు పుట్టుక గురించి ఆయన వృత్తాంతము గురించి వినవలెనని కోరికగా ఉంది. దయచేసి మాకు వినిపించండి." అని

అడిగారు. అప్పుడు సూతపౌరాణికుడు ఇలా చెప్ప సాగాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! ధర్మరాజు తమ్ముల సాయంతో రాజ్యపాలన చేస్తున్నాడు. ధర్మరాజుకు సకల సంపదలు సమకూరాయి. నాలుగు దిక్కులను బోలిన తమ్ములు, భార్య ద్రౌపది, విశాల కురు సామ్రాజ్యము, యజ్ఞములు, యాగములుచేసిన ఫలము, దాని వలన లభించే పుణ్యలోకాలు, అఖండమైన కీర్తి ప్రతిష్ఠలు అన్నీ చక్కగా సమకూరాయి. కాని ఆకలితో ఉన్న వాడికి పట్టెడన్నము మాదిరి, ధర్మరాజు మనస్సు మాత్రము కృష్ణుని యందే లగ్నం అయి ఉంది.

ఉత్తర గర్భంలోకి అశ్వత్థామ సంధించిన బ్రహ్మాస్త్రము ప్రవేశించినపుడు ఉత్తరగర్భంలో ఉన్న శిశువుకు ఒక మహాపురుషుడు దర్శనం ఇచ్చాడు. ఆ పురుషుడు బొటనవేలంత పొడుగు ఉన్నాడు. నిర్మలంగా ఉన్నాడు. కిరీటం ధరించి ఉన్నాడు. శ్యామల వర్ణంలో ఉన్నాడు. పసుపుపచ్చని వస్త్రములు ధరించి ఉన్నాడు. నాలుగు భుజములతో ప్రకాశిస్తున్నాడు. చెవులకు కుండలములతో చేతిలో గదతో, ఆ గదను చేతిలో పట్టుకొని తిప్పుతూ తన చుట్టు తిరుగుతూ తనను రక్షిస్తున్న ఆ దివ్యపురుషుడు ఎవరా అని ఆ శిశువు ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

ఇంతలో ఆ శిశువును నాశనం చెయ్యడానికి అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రము ఉత్తర గర్భంలోకి ప్రవేశించింది. లోపల ఉన్న విష్ణుతేజం ప్రభావానికి ఆ బ్రహ్మాస్త్రము నిర్వీర్యం అయింది. ఉత్తర గర్భంలో ఉన్న శిశువు రక్షింపబడ్డాడు. తరువాత ఆ దివ్యపురుషుడు అంతర్హితు డయ్యాడు.

తరువాత కొన్ని దినములకు గ్రహములు అన్నీ ఉచ్ఛస్థితిలో ఉండగా అభిమన్యుని భార్య ఉత్తర  ఒక మగశిశువుకు జన్మనిచ్చింది. ధర్మరాజు తన పురోహితుడైన ధౌమ్యుని పిలిపించాడు. పుణ్యాహవాచనము మొదలగు జాతక సంస్కారములు జరిపించాడు. బ్రాహ్మణులకు పేదలకు ఎన్నో దానములు ధర్మములు చేసాడు. అన్నదాన కార్యక్రమము నిర్వహించాడు.

త్రికాలవేదులైన బ్రాహ్మణులు ఇలా అన్నారు. "బ్రహ్మాస్త్రము బారి నుండి సాక్షాత్తు ఆ శ్రీమన్నారాయణుడే ఈ బాలుని బ్రతికించాడు. మీ వంశమును నిలిపాడు. కాబట్టి ఆ బాలుడు విష్ణురాతుడు అనే పేరుతో పిలువబడతాడు." అని అన్నారు. వారి ఆదేశము మేరకు ధర్మరాజు ఆ శిశు వుకు విష్ణురాతుడు అనే నామకరణం చేసాడు. దైవజ్ఞుల చేత ఆ శిశు వుకు జాతకం రాయిం చాడు.

"అభిమన్యపుత్రుడు మనువు కుమారుడు ఇక్ష్వాకువు వలె, దశరధకుమారుడు శ్రీరామచంద్రునివలె,  సత్యసంధుడు, ధర్మపరుడు, ప్రజారక్షకుడు, బ్రాహ్మణ భక్తుడు, శిబిచక్రవర్తివలె మహాదాత అవుతాడు. జనరంజకంగా ప్రజలను పాలిస్తాడు. అర్జునుని వలె శ్రేష్టుడయిన ధనుర్ధారి అవుతాడు. అగ్నిదేవుని వలె శత్రుభయంకరుడు గానూ, సముద్రునివలె గంభీరుడుగానూ ఉంటాడు. మంచి పరాక్రమంతోనూ, దయా గుణంతోనూ, సత్పురుషులకు ఆశ్రయం ఇచ్చేవాడిగానూ, క్షమాగుణంతో ప్రకాశిస్తాడు. అందరినీ సమానంగా చూడటంలో బ్రహ్మదేవునిగానూ, ఆశ్రయం ఇవ్వడంలో విష్ణువు గానూ, ప్రసన్నతలో శివుడుగానూ విరాజిల్లుతాడు. యయాతి, రంతిదేవుడివలె ధార్మికుడు అవుతాడు. ప్రహ్లాదునివలె విష్ణుభక్తుడుగానూ, బలి చక్రవర్తి వలె ధైర్యవంతుడుగానూ

కీర్తి పొందుతాడు. ఎన్నో అశ్వమేధయాగములు చేస్తాడు. సదా ఈ భూమిని రక్షిస్తూ కలి మహిమ నుంచి కాపాడతాడు. కొంత కాలానికి ఒక బ్రాహ్మణుని శాపం చేత మరణిస్తాడు. మరణించేముందు వ్యాసపుత్రుడు శుకుని ముఖతా భాగవతపురాణమును ఆస్వాదిస్తాడు. పుణ్యలోకములు చేరుకుంటాడు." అని చెప్పారు.

ధర్మరాజు ఆ బ్రాహ్మణులకు ధనమును, బంగారమును ఇచ్చి తృప్తి పరిచాడు. దేవరాతుడు పెరిగి పెద్దవాడవుతున్నాడు. కాని ఆ దేవరాతునికి తాను తల్లిగర్భంలో ఉన్నప్పుడు తనను రక్షించిన దివ్య పురుషుడు ఎవరా అన్న ఆలోచన మాత్రం పోలేదు. అందుకని కనిపించిన వారిని అందరిని పరీక్షగా చూస్తూ, ఆ దివ్యపురుషుని కోసరం వెతుకుతున్నాడు. అందరినీ పరీక్షగా చూస్తున్నాడు కాబట్టి దేవరాతుడు పరీక్షిత్తుగా ప్రసిద్ధికెక్కాడు.

పరీక్షిత్తు దినదినప్రవర్ధమానంగా పెరుగు తున్నాడు. విద్యాబుద్ధులు నేర్చుకుంటున్నాడు. జాతకంలో చెప్పిన మాదిరి పరీక్షిత్తు చిన్నప్పటినుండీ ధార్మికుడు గానూ, సత్యవాక్పరిపాలకుడుగానూ, కృష్ణభక్తుడుగానూ ప్రవర్తిస్తున్నాడు.

ధర్మరాజు అశ్వమేధ యాగము చేయసంకల్పించాడు. దానికి కావలసిన ధనమును ఎలా సంపాదించడమా అని ఆలోచిస్తున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు పూర్వము మరుత్తు ధర్మబద్ధంగా సంపాదించి దాచిపెట్టిన ధనరాసుల గురించి చెప్పాడు. ధర్మరాజు, తన తమ్ములతోనూ, శ్రీకృష్ణుని తోనూ ఉత్తరదిక్కుగా ప్రయాణం చేసి ఆ ధనరాసులను

తరలించుకొని వచ్చాడు. శ్రీకృష్ణుని ఆధ్వర్యములో అశ్వమేధయాగమును నిర్విఘ్నంగా జరిపించాడు. శ్రీకృష్ణుడు కొన్నిరోజులు హస్తినాపురములోనే ఉన్నాడు. తరువాత ద్వారకకు వెళ్లాడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

## శ్రీమద్భాగవతము

## ప్రథమ స్కంధము

## పదమూడవ అధ్యాయము.

భారత యుద్ధము జరుగుతున్న సమయంలో విదురుడు తీర్థయాత్రలు చేస్తున్నాడు. మైత్రేయ మహామునిని కలుసుకున్నాడు. శ్రీకృష్ణ తత్వమును ఆయన వలన సమగ్రంగా విన్నాడు. తరువాత హస్తినా పురమునకు తిరిగి వచ్చాడు. చాలా కాలం తరువాత వచ్చిన విదురుని చూచి పాండవులు, ద్రౌపది సుభద్ర, కుంతీ, ధృతరాష్ట్రుడు, గాంధారి ఇంకా అంత:పుర కాంతలు, ఎంతో సంతోషించారు. ఆయనకు సాదరంగా స్వాగత సత్కారాలు చేసారు. విదురుడు విశ్రాంతి తీసుకుంటున్నసమయంలో ధర్మరాజు విదురునితో ఇలా అన్నాడు.

"పిన తండ్రిగారూ! ఇన్నాళ్లు మేము మీకు జ్ఞాపకం రాలేదా! మా అందరినీ చిన్నప్పటినుండీ పక్షి తన పిల్లలను పెంచినట్టు పెంచారు. మమ్ములను లాక్షా గృహము నుండి కాపాడారు. విషప్రయోగముల నుండి

రక్షించారు. మీ నీడలో పెరిగి పెద్దవారము అయ్యాము. మమ్ములను మరిచిపోవడం ధర్మమా! మీరు ఇన్నాళ్లు తీర్థయాత్రలు చేసారు కదా! ఏమేమి తీర్థములు, పుణ్యక్షేత్రములు దర్శించారు. ఎక్కడెక్కడ తిరిగారు. మీరు కృష్ణభక్తులు కదా! ద్వారకకు వెళ్లారా!. శ్రీకృష్ణుని దర్శించారా! ఆయన క్షేమంగా ఉన్నాడా! మా అత్యంత సన్నిహితులు, బంధువులు అయిన యాదవులను చూచారా! వారందరూ క్షేమంగా ఉన్నారా!" అని అడిగాడు ధర్మరాజు.

అప్పటికే ద్వారకా నగరము నీటమునిగిపోవడమూ, శ్రీకృష్ణ నిర్యాణమూ జరిగిపోయింది. ఆ విషయం విదురునికి తెలుసు. కాని అప్రియము, అశుభము అయిన మాటలను చెప్పడం కన్నా ఊరుకోవడం ఉత్తమమని గ్రహించిన విదురుడు, ఆ విషయములను తప్ప మిగిలిన అన్ని విషయములను చెప్పాడు. తరువాత విదురుడు హస్తినలో కొన్నాళ్లు సుఖంగాఉన్నాడు.

(విదురుడు యమధర్మరాజు అంశతో శూద్రవనితకు వ్యాసునకు జన్మించాడు. క్షేత్రప్రాధాన్యంగా శూద్రుడు అయినా, వేదములను శాస్త్రములను అధ్యయనం చేసి, సాత్వికుడై, తత్వవేత్తగా విరాజిల్లాడు. విదురుని రూపంలో యముడు భూలోకంలో ఉన్న సమయంలో సూర్యుడు యముని బాధ్యతలు నిర్వర్తించేవాడు.)

యుధిష్ఠిరుడు తన మనుమడు పరీక్షిత్తు ఆటపాటలతో మురిసిపోతున్నాడు. పరీక్షిత్తు పెరిగి పెద్దవాడవుతున్నాడు. పాండవులకు, ధృతరాష్ట్రునకు అవసాన కాలము సమీపించినది అని తెలుసుకున్నాడు విదురుడు. ఒక రోజు ధృతరాష్ట్రుని ఏకాంతంలో కలుసుకొని ఇలా అన్నాడు.

"మహారాజా! పుట్టిన ప్రతివాడూ చావక తప్పదుకదా! మానవులకే మరణము తప్పించుకోడానికి సాధ్యం కానపుడు, ఇంక ఈ సంపదలు, భోగభాగ్యాలు, రాచరిక భోగాలు సంగతి చెప్పనవసరం లేదు. మీరు పెద్దవారు అయ్యారు. మీకు నా అన్న వాళ్లు లేరు. అంతా యుద్ధంలో మరణించారు. మీకు కళ్లు కనపడవు. మీ దేహము వార్ధక్యముతో శుష్కించి పోయింది. పళ్లు కూడా ఊడిపోయాయి. జీర్ణశక్తి మంద గించింది. కాని ఇంకా మీరు ఈ విషయ భోగముల యందు ఆసక్తితో ఉన్నారు.

మీ మీద భీముడు ఎంతో కసిగా ఉన్నాడు. భీముడు పడవేసే నాలుగు మెతుకుల కోసం మీరు ఆయన ఇంట్లో కాపలా కుక్కలా ఉన్నారు. పాండవులు పైకి మీమీద ప్రేమాభిమానములు చూపిస్తున్నా, లోగడ మీరూ మీ కుమారుడు వారి పట్ల చేసిన అపకారములను వారు ఎలా మరిచిపోగలరు. విషం పెట్టారు, లక్క ఇంట్లో పెట్టి కాల్చారు. జూదం ఆడించి వారి సమస్తమును దోచుకున్నారు. అవమానించారు. అడవుల పాలు చేసారు. ఎవరి అండ చూచుకొని మీరు ఇన్ని అకృత్యాలు చేసారో, వాళ్లంతా పాండవుల చేతిలో చచ్చారు. మీరుమాత్రం మిగిలారు. ఈ నాడు పాండవుల దయాదాక్షిణ్యాలమీద బతుకుతున్నారు. దీని వలన ఏమి లాభము?మీరు ఎంతటి దిక్కుమాలిన జీవితము అనుభవిస్తున్నారో మీకు తెలుసా! కాని ఇంకా హస్తినను పట్టుకొని పాకులాడుతున్నారు.

కాబట్టి, ఈ భోగాలు విడిచిపెట్టండి. వానప్రస్థమునకు వెళ్లండి. శేషజీవితమును భగవంతుని ధ్యానంలో, తపస్సులో గడపండి. విషయ భోగముల యందు ఆసక్తి లేని వాడు, దేహాభిమానమును విడిచిపెట్టిన వాడు, ఈ దేహమును తృణప్రాయంగా త్యజిస్తాడు. అటువంటి వాడే ధీరుడు. కాబట్టి ఆ భగవంతుని మనసులో నిలుపుకొని శేషజీవితమును ప్రశాంతంగా గడపండి. అశాశ్వతములైన రాజభోగములను విడిచిపెట్టండి." అని బోధించాడు విదురుడు.

ఆ మాటలు శ్రద్ధగా విన్నాడు ధృతరాష్ట్రుడు. మనస్సును స్థిరపరచుకున్నాడు. బంధువుల మీద ఉన్న ప్రేమాభిమానములను తెంచు కున్నాడు. దేహాభిమానము వదిలిపెట్టాడు. జీవితాంతము ఆయనకు తోడూ నీడగా నిలిచిన ఆయన భార్య గాంధారి కూడా భర్తను అనుసరించింది. ఇద్దరూ మోక్షమార్గము వెతుక్కుంటూ హిమాలయములకు వెళ్లిపోయారు.

మరునాడు ఉదయం ధర్మరాజు సంధ్యావందనము, హెూమము మొదలగుకార్యక్రమములు ముగించుకొని పెదతండ్రి ధృతరాష్ట్రుడు, గాంధారి ఆశీర్వాదము తీసుకొనుటకు వారి గృహమునకు వెళ్లాడు. అక్కడ ధృతరాష్ట్రుడు, గాంధారి కనిపించలేదు. అక్కడే ఉన్న సంజయుని పెదనాన్న గారి గురించి అడిగాడు.

"సంజయా! అసలే మా పెదనాన్న గారికి కళ్లు లేవు. పైగా వృద్ధుడు. నాతో చెప్పకుండా ఎక్కడికి వెళ్లారు? మా పెద తల్లి గారు కూడా కనిపించడం లేదు. మా పినతండ్రి విదురుడు కూడా కనిపించడం లేదు. వీరు ముగ్గురూ ఎక్కడికన్నా వెళ్లడం నువ్వు చూచావా! మా చిన్నతనంలోనే మా తండ్రిగారు గతిస్తే, మా పెదనాన్న గారు, మా చిన్నాన్న గారే కదా

మమ్ములను దగ్గర తీసి, పెంచి పెద్ద చేసింది. వారు కనిపించకపోతే బాధగాఉంది." అని అడిగాడు. సంజయుడు ఇలా అన్నాడు. "ధర్మజా! వారు నీకే కాదు, నాకు కూడా మాట మాత్రం అయినా చెప్పకుండా వెళ్లిపోయారు." అని సమాధానం ఇచ్చాడు.

ఇంతలో నారదుడు, తుంబురుడు అక్కడకు వచ్చారు. ధర్మరాజు నారదుని తుంబురుని సాదరంగాఆహ్వానించి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి సత్కరించాడు. ఉచితాసనము మీద కూర్చుండబెట్టి ఇలా అడిగాడు. "మహర్షీ! ఉదయం నుండి నా పెద తండ్రి ధృతరాష్ట్రుడు, పెదతల్లి గాంధారి, పినతండ్రి విదురుడు కనిపించడం లేదు. ఎక్కడకు వెళ్లారో తెలియదు." అని అన్నాడు. అప్పుడు నారదుడు ఇలా అన్నాడు.

"యుధిష్ఠిరా! నీవు వారి గురించి శోకించడం తగదు. ఎందుకంటే ఈ జగత్తు అంతా ఆ పరమాత్మ అధీనంలో ఉంది. మనమంతా ఆయన ఆజ్ఞప్రకారము నడుచుకుంటున్నాము. ఎవరిని ఎప్పుడు కలిపి ఉంచాలో ఎప్పుడు విడదీయాలో ఆ పరమాత్మకు బాగా తెలుసు. మానవులలో కలిగే సంయోగము వియోగము అన్నీ ఆ పరమాత్మ ఇష్టానుసారము జరుగుతుంటాయి. మనము నిమిత్తమాత్రులము. ఆత్మ నిత్యము. ఈ దేహములు అశాశ్వతములు. ఎప్పుడో ఒకప్పుడు రాలి పోవలసినవి. ఈ సత్యం తెలిస్తే నువ్వు వారి గురించి శోకించవు. నీ శోకానికి కారణం నీకు వారి మీద ఉన్న ప్రేమ, మోహము తప్ప వారు కాదు. ఆ ప్రేమను తుంచుకో. నీ శోకము పోతుంది.

"నేను లేకపోతే వారు ఎలా జీవిస్తారు" అనే మోహాన్ని, అజ్ఞానాన్ని విడిచిపెట్టు. ఎవరు ఉన్నా లేకపోయినా అందరూ ఆయువు ఉన్నంత కాలం బతుకుతారు. ఒకరి బతుకుకు మరొకరు కారణం అనుకోవడం అవివేకం. కాలం అనేది ధనికుడు, పేదవాడు, చదువుకున్నవాడు, చదువురానివాడు అనేతేడా లేకుండా, కాలం తీరగానే అందరినీ సమానంగా కాటేస్తుంది. కాలానికి అందరూ లోబడి ఉండాల్సిందే. తనను తానే కాలం నుండి రక్షించుకోలేనివాడు, ఇతరులను ఎలా రక్షించగలడు. కాబట్టి నువ్వు లేకపోతే నీ వాళ్లు బతకలేరు అని అనుకోవడం అజ్ఞానం.

భగవంతుడు పుట్టుకతోనే అన్ని జీవులకు ఆహారాన్ని సమకూర్చాడు. పెద్ద జీవులకు చిన్న జీవులను, వృక్షములను, ఆకులను, కాయలను, పండ్లను ఆహారంగా సృష్టించాడు. అవి ఆరగించి జీవులన్నీ బతుకుతున్నాయి. ఇంక నువ్వు ఇంకొకరికి పెట్టేదేమిటి?

ఓ ధర్మజా! ఈ జగత్తు అంతా ఆ భగవంతుని స్వరూపము. మనలో ఉన్న ఆత్మలన్నీ ఆపరమాత్మలోని భాగాలే. ప్రతిజీవిలోనూ ఆ పరమాత్మ అంతర్గతంగా ఉండి జ్ఞానేంద్రియాల ద్వారా ప్రకాశిస్తున్నాడు. అది అర్థం చేసుకోకుండా అంతా నేనే చేస్తున్నాను అనుకోవడం మాయ. నువ్వు ఈ మాయకు లోను కాకుండా లోపల ఉన్న ఆత్మను చూడు. సర్వాంతర్యామి అయిన పరమాత్మ దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కొరకు ఈ లోకంలో శ్రీకృష్ణునిగా అవతరించాడు. ఆయన వచ్చిన పని అయిపోయింది. తన స్వస్థలమునకు పోవడానికి సిద్ధంగా ఉన్నాడు. కాబట్టి నువ్వు కూడా నీ జీవితం ఉన్నంతవరకూ నీకు నిర్దేశింపబడిన కార్యములను నెరవేర్చు.

ఇంక అసలు విషయానికి వస్తే, నీ పెదతండ్రి ధృతరాష్ట్రుడు, గాంధారి, విదురుడు వానప్రస్థజీవితమును గడుపుటకు హిమాలయము లకు వెళ్లారు. గంగానదీ తీరంలో ఆశ్రమం నిర్మించుకొని, సత్త్వ, రజస్, తమోగుణములను వదిలిపెట్టి, సదా శ్రీహరిని ధ్యానిస్తూ ఉన్నారు.వాళ్లు ఇంద్రియములను నిగ్రహించి, జీవాత్మను, పరమాత్మలో ఐక్యం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు. ఇప్పుడు నువ్వు ఆయన మీద ప్రేమతో ఆయనను వెతుక్కుంటూ వెళ్లి, ఆయన ధ్యానమును భగ్నం చేయకు. ఈ రోజుకు సరిగా ఐదవ రోజున ఆయన తన దేహమును విడిచిపెట్టి పరమాత్మలో ఐక్యం అవుతాడు. ఆయన పార్థివ దేహము భస్మం అయిపోతుంది. ఆయన కుటీరము దగ్ధంఅయి పోతుంది. ఆయన భార్య గాంధారి కూడా భర్తను అనుసరిస్తుంది. భర్తతో కూడా దగ్ధం అయిపోతుంది. తన అన్న వదినలు అలా భస్మం కావడం చూచిన విదురుడు, విరక్తితో తీర్థయాత్రలకు వెళ్లిపోతాడు. కాబట్టి నీవు వారి గురించి శోకించకుండా నీ విద్యుక్త ధర్మములను నెరవేర్చు."అని అన్నాడు నారదుడు. తరువాత నారదుడు తుంబురుడు వెళ్లిపోయారు. నారదుని మాటలు శ్రద్ధగా విన్న ధర్మరాజు శోకాన్ని వదిలిపెట్టాడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# ప్రథమ స్కంధము
# పదునాలుగవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంగా సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు భాగవతపురాణమును ఇలా చెప్పసాగాడు.

"బ్రాహ్మణోత్తములారా! అర్జునుడు శ్రీకృష్ణుని, బంధువులను చూడటానికి ద్వారకకు వెళ్లాడు. కొన్ని నెలలు గడిచాయి. అర్జునుడు తిరిగి రాలేదు. అర్జునుని వద్దనుండి ఎలాంటి సమాచారము లేదు. హస్తినలో ధర్మరాజుకు మనసంతా కలవరంగా ఉంది. ప్రతిరోజూ ఎన్నో దుశ్శకునాలు కనపడుతున్నాయి.

ఋతువులు గతి తప్పాయి. వర్షాలు సకాలంలో కురవడం లేదు. హస్తినాపుర వాసులలో కోపము, లోభము ఎక్కువ అయ్యాయి. అందరూ అబద్ధాలు ఆడటం అలవాటు చేసుకున్నారు. బతకడానికి పాపాలు చెయ్యడానికైనా వెనకాడటం లేదు. ఒకరిని ఒకరు మోసం చేసుకోవడం పరిపాటి అయిపోయింది. ఆఖరుకు నమ్మిన స్నేహితులను కూడా మోసం చేస్తున్నారు. ఎంతో అన్యోన్యంగా ఉండవలసిన అమ్మ కొడుకు, తండ్రి కొడుకు, అత్త కోడలు, అమ్మ కూతురు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు వీరి మధ్య కలహాలు మొదలయ్యాయి. ఒకరిని ఒకరు నమ్మడం లేదు.

ఈ విపరీత పరిణామములను చూచిన యుధిష్ఠిరుడు భీమసేనునితో ఇలా అన్నాడు. "భీమసేనా! అర్జునుడు ద్వారకకు వెళ్లి ఏడు

మాసములు గడిచాయి. ఇంత వరకు తిరిగి రాలేదు. ద్వారక నుండి ఎటువంటి సమాచారము లేదు. నాకు చాలా ఆందోళనగా ఉంది. శ్రీకృష్ణుడు తన శరీరమును విడిచే సమయం రాబోతున్నదని నారదుడు చెప్పాడు. ఆ సమయం రాలేదు కదా! మనము ఈనాడు అనుభవిస్తున్న రాజ్య సంపదలు, భోగభాగ్యములు అన్నీ ఆ శ్రీకృష్ణుని దయ వలన లభించినవే కదా! నాకు ప్రతి దినము ఎన్నో దుశ్శకునములు కనపడుతూ ఉన్నాయి. ఎలాంటి వార్త వినవలసి వస్తుందో అని భయంగా ఉంది.

అటు చూడు నక్కలు సూర్యుని వంక చూస్తూ భయంకరంగా అరుస్తున్నాయి. పావురములు, కాకులు,గుడ్లగూబలు వికృతంగా అరుస్తున్నాయి. అప్పుడప్పుడు భూమి కంపిస్తూ ఉంది. సూర్యుని చుట్టు వలయాకారంలో నల్లని మచ్చ కనిపిస్తూ ఉంది. సూర్యకాంతికూడా తగ్గినట్టు అనిపిస్తూ ఉంది. దుమ్ముతో కూడిన గాలులు వీస్తున్నాయి. మేఘముల నుండి వర్షముతో పాటు రక్తం కూడా కురుస్తూ ఉంది. అగ్నిహెూత్రములలో అగ్ని సరిగా మండటం లేదు. పొగ వస్తూ ఉంది. దూడలకు విడవకుండా పాలన్నీ మానవులు తాగుతున్నారు. తల్లులు కూడా బిడ్డలకు పాలు ఇవ్వడం మానేసారు. ఆవుల కళ్ల వెంట నీరు కారుతూ ఉంది. ఎద్దులను మానవులు అకారణంగా హింసిస్తున్నారు. దేవతా విగ్రహముల నుండి చెమటలు కారుతున్నాయి. ఇటువంటి ఉత్పాతములు అన్నీ మనకు రాబోవు కష్టములను సూచిస్తూ ఉన్నాయి. ఏం జరుగుతుందో ఏమిటో!" అని అన్నాడు ధర్మరాజు.

ఇంతలో అర్జునుడు ద్వారక నుండి తిరిగి వచ్చాడు. అర్జునుని ముఖంఅంతా పాలిపోయి ఉంది. అర్జునుడు రాగానే శోకిస్తూ ధర్మరాజు

పాదాలపై పడ్డాడు. ధర్మరాజు అర్జునుని లేవదీసి అక్కున చేర్చుకున్నాడు. పక్కన కూర్చుండపెట్టుకొని ఇలా అడిగాడు.

"అర్జునా! ద్వారకలో మన బంధువులందరూ కుశలమే కదా! మధు, భోజ, అంధక, దశార్హ, అర్హ, సాత్వత, వృష్ణి వంశము వారందరూ క్షేమమే కదా! మన తాత గారు శూరుడు, వసుదేవుడు,దేవకీదేవి అందరూ క్షేమమే కదా! వసుదేవుని భార్యలు అందరూ క్షేమమే కదా! ఉగ్రసేనుడు ఆయన సోదరుడు దేవకుడు క్షేమమే కదా! బలదేవులు సుఖంగా ఉన్నారు కదా!శ్రీకృష్ణుని సోదరులు అయిన హృదీకుడు, అక్రూరుడు, జయంతుడు, గదుడు, సారణుడు, శత్రుజిత్తు మున్నగువారు క్షేమముగా ఉన్నారా! ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు సుఖంగా ఉన్నారా! ఇంకా శ్రీకృష్ణుని కుమారులు అయిన సుషేణుడు, చారుధేష్ణుడు, జాంబవతీ కుమారుడు సాంబుడు క్షేమంగా ఉన్నారా! శ్రీకృష్ణుని స్నేహితులు ఋషభుడు, శ్రు తదేవుడు,ఉద్ధవుడు, బలరాముని సఖులు సునందుడు, నందుడు, మొదలగు వారు కుశలమే కదా! మన బంధువులు అయిన యాదవులు మనలను జ్ఞాపకం చేసుకుంటున్నారా!

శ్రీకృష్ణుడు క్షేమంగా ఉన్నాడా! శ్రీకృష్ణుడు ఆది దేవుడు. ఈ లోకములకు మంగళము చేకూర్చడానికి యదువంశంలో అవతరించాడు. ఆ శ్రీకృష్ణుని చల్లని నీడలో ద్వారక సురక్షితంగా ఉంటుంది. రుక్మిణి, సత్యభామ మొదలగు అష్టభార్యలూ, పదహారు వేల మంది స్త్రీలు, నిరంతరమూ ఆ శ్రీకృష్ణుని సేవలలో పునీతమవుతుంటారు. వారి భాగ్యమే భాగ్యము. యాదవ వీరులందరూ శ్రీకృష్ణుని రక్షణలో, సుధర్మ అనే మహా సభలో ధర్మకార్యముల గురించి చర్చించుకుంటూ సుఖంగా ఉండి ఉంటారు. అర్జునా! నా ధోరణిలో నీ సంగతే మరిచాను. నీవు క్షేమంగా

ఉన్నావా. నీ ఆరోగ్యం సరిగా ఉందా! నీవుమునుపటి మాదిరి సంతోషంగా లేవు. ఎందుకని. ద్వారకలో నిన్ను ఎవరైనా అవమానించారా! పరుషంగా మాట్లాడారా! ఎవరికైనా ఏదన్నా ఇస్తానని ఆశపెట్టి ఇవ్వలేకపోయావా! నీ శరణు జొచ్చిన బ్రాహ్మణులను, బాలురను, గోవులను, రోగులను, స్త్రీలను, ఆశ్రయం ఇవ్వకుండా వదిలేసావా! లేక అతిథులకు భోజనం పెట్టకుండా నువ్వు ఒక్కడివే భోజనం చేసావా! లేక చేయకూడని పనులు ఏమన్నా చేసావా! అర్జునా! శ్రీకృష్ణుని వదలలేక వదలలేక వదిలి వచ్చినందుకు బాధపడుతున్నావా! లేకపోతే నీవు అలా దిగాలుగా ఉండటానికి కారణం ఏమి?" అని ఎంతో ఆతురతగా అడిగాడు ధర్మరాజు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము

పదునైదవ సర్గ.

సూతుడు శౌనకాది మహామునులకు భాగవత పురాణమును ఇలా చెప్పసాగాడు.

ఆపకుండా ధర్మరాజు ఎన్నోవిషయములను అర్జునుని అడిగాడు. కాని అర్జునుడు ఏ సమాధానమూ చెప్పలేదు. మౌనంగా ఉన్నాడు. కాని

అర్జునుని కన్నుల నుండి కన్నీళ్లు ధారాపాతంగా కారుతున్నాయి. అవి ఆపుకోలేకపోతున్నాడు అర్జునుడు. ఇంక ఉండబట్టలేక అర్జునుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

"మహారాజా! నేను శ్రీకృష్ణుని వదిలి ఒక్కక్షణం కూడా ఉండలేనని నీకు తెలుసు కదా! కానీ ఆ కృష్ణుడు నన్ను మోసం చేసి నన్ను ఒంటరిగా వదిలి వెళ్లిపోయాడు. శ్రీకృష్ణునితోనే నా ఆనందము, సంతోషము అన్నీ పోయాయి. నేను జీవచ్ఛవంలాగా తయారయ్యాను.

అన్నయ్యా! ఆ శ్రీకృష్ణుని కృపవలననే కదా నేను మత్స్య యంత్రమును కొట్టి, స్వయంవరమునకు వచ్చిన రాజులనందరినీ ఓడించి ద్రౌపదిని గెలుచుకున్నాను. ఆ శ్రీ కృష్ణుని సహాయము వలననేకదా ఇంద్రుని ఎదిరించి, ఖాండవ వనమును దహించి అగ్నిదేవుని కోరిక తీర్చినది. మయుని రక్షించి ఆయన వలన మయసభను పొందాను. ఆ శ్రీకృష్ణుని దయవలననే కదా రాజసూయ యాగమును నిర్వహింప గలిగినది. ఆ శ్రీకృష్ణుని కరుణ వలననే కదా భీమసేనుడు జరాసంధుని వధింపగలిగినది. ఆయన చెరనుండి రాజులను విడిపించగలిగినది.

అన్నయ్యా! నాడు నిండు సభలో, రాజసూయ యాగములో అవభృథస్నానముతో పవిత్రమైన ద్రౌపది కురులను, ఆ కులపాంశనుడు దుశ్శాసనుడు లాగుతుంటే, వస్త్రములను విప్పుతుంటే ఆ శ్రీకృష్ణుడే కదా అన్నయ్యా కాపాడింది. ఆ కృష్ణుడే కదా అన్నయ్యా కురుక్షేత్రయుద్ధములో దుర్మార్గులైన రాజులను మన చేత నశించచేసింది.

అన్నయ్యా! మనము అరణ్యవాసములోఉండగా దుర్వాసుడు తన శిష్య బృందముతో సహా మన ఆశ్రమమునకు, మనమంతా భోజనములు చేసిన తరువాత, అతిథిగా వచ్చినపుడు, ఆ శ్రీకృష్ణుడే కదా అన్నయ్యా ఆయన కోపాగ్ని నుండి మనలను కాపాడింది. ఆ శ్రీకృష్ణుడే కదా నన్ను పరమశివుని వద్దకు తీసుకొని వెళ్లి నాకు పాశుపతాస్త్రమును ఇప్పించింది. ఆ మహానుభావుని దయవలననే కదా నేను ఇంద్రుని అర్థసింహాసనమును అధిష్టింపగలిగినది, దిక్పాలకుల వలన దివ్యాస్త్రములను పొందగలిగినది. ఆయన అనుగ్రహము వలననే కదా నేను అజ్ఞాతవాస సమయములో విరాటుని కొలువులో ఉన్నప్పుడు, సుయోధనుడు తన సేనలతో ఉత్తర గోగ్రహణము గావించినపుడు, ఒంటరిగా ఇతరుల సాయము లేకుండా కౌరవసేన అనే సముద్రమును దాటగలిగాను.

కరుణా సముద్రుడైన ఆ శ్రీకృష్ణుడే కదా  నాకు సారథియై కురుక్షేత్ర మహా సంగ్రామమును నా చేత నిర్వర్తింపచేసాడు. ఆ మహా సంగ్రామంలో ఆ మహానుభావుడు నా వెంటనుండగా, మహావీరులైన భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, కృపాచార్యుడు, భూరిశ్రవుడు, సుశర్మ, శల్యుడు, జయద్రథుడు, బాహ్లీకుడు మొదలగు వారు నా మీద ప్రయోగించిన బాణములు నన్ను తాకకుండా నిర్వీర్యములుఅయ్యాయి. ఆ మహాయుద్ధంలో ఒక సారి నా గుర్రములు అలసి పోతే, నేను వాటికి పాతాళము నుండి జలము రప్పించి, వాటి సేద దీర్చునపుడు,శ్రీకృష్ణుడు నా పక్కనే ఉండి. శత్రువుల బాణములు నాకు తగులకుండా కాపాడాడు.

కాని నేనేం చేసాను. నా తెలివితక్కువతనంతో ఆ మహానుభావుని సారథిగా చేసుకున్నాను. కాని నన్ను ఆ మహానుభావుడు తన సఖుడిగా, బంధువుగా అభిమానించాడు, గౌరవించాడు. నేను కృష్ణుడు ఎంతో సన్నిహితంగా ఉండేవాళ్లము. మేము ఇద్దరమూ భోజనము చేసేటప్పుడు గానీ, విహరించేటప్పుడు గానీ, నిద్రించే సమయంలో గానీ, ఒకరిని ఒకరు పొగుడుకోవడం, పరిహాసంగా మాట్లాడుకోవడం చేసేవాళ్లము. నేను ఎన్ని పరిహాసములు ఆడినను ఆ మహానుభావుడు చిరునవ్వుతో సహించే వాడే కాని నన్ను పల్లెత్తు మాట కూడా అనేవాడు కాదు.

మనము ఎన్ని మాటలు అన్నా సహించి, మనకు ఇన్ని సాయములు చేసి మనలను అనుక్షణం కాపాడిన ఆ కృష్ణుడు నిర్దయుడై మనలను వదిలిపోయినాడు. నన్ను ఒంటరి వాడిని చేసాడు. నా తేజస్సు నంతా హరించాడు. నన్ను నిస్తేజుడిని చేసాడు. నాకు ఇతర రాజులలో దక్కిన గౌరవము, మర్యాద, కీర్తి, ప్రతిష్ట అన్నీ శ్రీకృష్ణుని వల్ల లభించినవే. ఇప్పుడు కూడా నా వద్ద అదే గాండీవము, అదే అక్షయతూణీరము, అదే అస్త్రకౌశల్యము, అదే రథము అవే అశ్వములు ఉన్నాయి. కానీ నా పక్కన కృష్ణుడు లేనప్పుడు, ఇవన్నీ కేవలం అలంకార ప్రాయం తప్ప దేనికీ పనికి రావు. శ్రీకృష్ణుని సాన్నిహిత్యం వలననే ఇవన్నీ శోభించాయి. అది తెలుసుకోలేక ఇన్ని రోజులూ ఇదంతా నా ప్రతిభ అనుకున్నాను. నేను ఒట్టి తెలివితక్కువ వాడిని అని ఇప్పుడే తెలుసుకున్నాను.

అన్నయ్యా! ఇంక అసలు విషయం చెబుతాను విను. నీవు ఎవరెవరి గురించి అడిగావో ఆ యాదవులు, మన బంధువులు,

మిత్రులు అంతరూ బ్రాహ్మణ శాప మోహితులై, పూర్తిగా సురాపానము చేసి, రెల్లుగడ్డితో ఒకరిని ఒకరు కొట్టుకొని మరణించారు. కేవలము నలుగురైదుగురు మాత్రం మిగిలారు. ఇదంతా ఆ శ్రీకృష్ణుని లీల. పెద్ద చేప చిన్న చేపను తిన్నట్టు, బలవంతుడు బలహీనుడిని ఓడిస్తాడు. సమాన బలము కలిగిన పెద్ద పెద్ద జీవులు ఒకరితో ఒకరు కొట్టుకుంటారు, అవమానించుకుంటారు. అందులో బలవంతుడు గెలుస్తాడు. అలాగే యాదవులు కూడా బలవంతులు బలహీనులను చంపారు. సమానమైన బలము కలవారు ఒకరితో ఒకరుకొట్టుకొని చచ్చారు. ఫలితంగా యాదవులు అంతా నశించారు. నాకు మాత్రము ఆ శ్రీకృష్ణుని నామస్మరణ మాత్రము మిగిలినది.

శ్రీకృష్ణుడు నా ఎదుట లేకపోయినా, నిరంతరము ఆయనను నా మనసులో నిలుపుకున్నాను. ఆయనను స్మరిస్తున్నాను, ధ్యానిస్తున్నాను. ఆ మహానుభావుడు నాలోనే ఉన్నప్పుడు ఇంక నేను ఎందుకు శోకించాలి. ఎవరి కోసం శోకించాలి. నాకు ప్రస్తుతము అటువంటి వైరాగ్యము కలిగింది." అని అన్నాడు అర్జునుడు.

భారత యుద్ధమునకు ముందు ఇరుసేనల మధ్యలో రథము నిలిపి, విషాదముతో కూరుకుపోయిన అర్జునునకు కృష్ణుడు చేసిన గీతా బోధ, ఇప్పటి దాకా అర్జునుని అంతరాంతరాళ్లలో నిక్షిప్తమై ఉంది. శ్రీకృష్ణ నిర్యాణంతో ఆ జ్ఞానము ఒక్కసారి పెల్లుబికింది. దాని ఫలితంగా అర్జునునిలో కామ వికారాలు తొలగిపోయాయి. వైరాగ్యం అంకురించింది. అర్జునునిలో ఉన్న అవిద్య దూరం అయింది. దానితో పాటు అర్జునునిలో ఉన్న సత్వ,రజస్,తమోగుణములు కూడా

తొలగిపోయాయి. దేహాభి మానము నశించింది. ఈ దేహమే నేను అనే భావన నశించి, అద్వైత భావము అంకురించింది.

ఇదంతా సావధానంగా విన్న ధర్మరాజు, తమకు కూడా ఈ లోకమును వదిలి వెళ్లాల్సిన సమయం ఆసన్నమయింది అని తెలుసు కున్నాడు. శ్రీకృష్ణనిర్యాణము గురించి అర్జునుని వలన తెలుసుకున్న కుంతీ దేవి, తన మనస్సును శ్రీకృష్ణుని పాద పద్మముల యందు లగ్నము చేసి, భవబంధములను తెంచుకొని ఆ పరమాత్మలో ఐక్యం అయిపోయింది.

సర్వాంతర్యామి అయిన భగవంతుడు తాను జనన మరణములకు అతీతుడయినప్పటికీ, భూభారము తగ్గించడానికి శ్రీకృష్ణుడుగా ఈ భూమి మీద మానవుడిగా అవతరించి, తన అద్భుతమైన లీలలను ప్రదర్శించి దుష్ట శిక్షణ గావించి, తన మానవ అవతారమును ఉపసంహరించుకున్నాడు. ఒక నటుడు నాటకములో ఒక పాత్రధరించి, ఆ పాత్రలో జీవించి, తరువాత ఆ వేషమును తీసివేసి తన స్వస్వరూపమును పొంది నట్టు, ఆ పరమాత్మ కూడా శ్రీకృష్ణుని గా అవతరించి, జీవించి, తన కర్తవ్యమును నిర్వర్తించి, ఆ వేషమును తీసి వేసాడు.

ఎప్పుడైతే శ్రీకృష్ణుడు తన అవతారమును చాలించాడో, అదే సమయమని కలి ప్రవేశించాడు. కలి ప్రభావము భూలోకములో విస్తరించడం ధర్మరాజుకు స్పష్టంగా కనపడుతూ ఉంది. కలి లక్షణము లైన లోభము, ఇతరులను మోసం చేయడం, కుటిలత్వము, హింస

మొదలగు అధర్మ ప్రవర్తనలు జనులలో పాకిపోతున్నాయి.

తాను కూడా ఈ లోకమును విడిచి పెట్టవలసిన సమయం వచ్చింది అని అనుకున్నాడు ధర్మరాజు. వెంటనే తన మనుమడు అయిన పరీక్షిత్తును హస్తినాపురమునకు చక్రవర్తిగా పట్టాభిషిక్తునిగావించాడు. అనిరుద్ధుని కుమారుడు అగు అజుని మధురా నగరానికి రాజుగా పట్టాభి షేకము చేసాడు.

తరువాత యుధిష్ఠిరుడు ప్రాజాపత్యము అనే యజ్ఞమును చేసాడు. అహంకారము, మమకారము, రాగద్వేషము లను విడిచి పెట్టాడు. ఇహలోకమునకు సంబంధించిన సర్వబంధనము లను తెంచుకున్నాడు. తరువాత ఆయన తన ఇంద్రియములను మనస్సులోనూ, మనస్సును ప్రాణములోనూ, ప్రాణమును అపానము లోనూ, అపానమును మృత్యువులోనూ, మృత్యువును పంచభూతాత్మక మైన దేహములోనూ లీనం చేసాడు. ఈ దేహమును సత్వ,రజస్, తమోగుణములతోనూ, ఆ గుణములను అవిద్యలోనూ, అవిద్యను జీవాత్మలోనూ, జీవాత్మను కూటస్థచైతన్యములోనూ నిలిపాడు. పిచ్చివాడిగా మారిపోయాడు. ఇల్లువదిలి ఉత్తరదిశగా వెళ్లిపోయాడు. నిరంతరము ఏకాగ్రచిత్తముతో భగవధ్యానములో మునిగిపోయాడు.

మిగిలిన నలుగురు పాండవులు తమ అన్న యుధిష్ఠిరుని మార్గమునే అనుసరించారు. వారందరూ నిరంతరమూ శ్రీకృష్ణుని పాదపద్మము లను ధ్యానించడంలోనే నిమగ్నమయ్యారు. తుదకు కైవల్యం చేరుకున్నారు.

విదురుడు కూడా కృష్ణభక్తితో పునీతుడై ఈ శరీరమును వదిలి తన పూర్వస్థితికి చేరుకున్నాడు. తన భర్తలు శ్రీకృష్ణుని సాయుజ్యము పొందారు అని తెలిసిన ద్రౌపది కూడా భర్తల మార్గమునే అనుసరించి పుణ్యలోకములను పొందింది.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## ప్రథమస్కంధము

## పదునారవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూతపౌరాణికుడు శౌనకాది మహామునులకు భాగవత పురాణమును ఈ విధంగా వినిపించాడు.

"పాండవుల మహాప్రస్థానము తరువాత పరీక్షిత్తు మహారాజు ఈ భూమిని జనరంజకంగా పరిపాలించసాగాడు. పరీక్షిత్తు తన మేనమామ ఉత్తరుడి పుత్రికయగు ఇరావతి అనే కన్యను వివాహ మాడాడు. ఆమె వలన పరీక్షిత్తుకు జనమేజయుడు మొదలగు నలుగురు కుమారులు కలిగారు. కృపాచార్యుడు ఆయనకు గురువు. కృపాచార్యుని ఆధ్వర్యంలో పరీక్షిత్తు మూడు అశ్వమేధ యాగములను

చేసాడు.

ఒక రోజు పరీక్షిత్తు దిగ్విజయ యాత్రకు బయలు దేరాడు. ఒకచోట ఒక విచిత్రము చూచాడు. కలిపురుషుడు, రాజుకు తగిన ఆభరణములను, వస్త్రములను, కిరీటమును ధరించి, శూద్రరూపంతో కనిపించాడు. ఆ కలి పురుషుడు నేలమీదపడుకొని ఉన్న ఒక ఆవును, ఎద్దును కాలితో తన్నుతున్నాడు. అది చూచిన పరీక్షిత్తు ఆ అన్యాయాన్ని ఆపాడు. కలిపురుషుడు తన రాజ్యములో ప్రవేశించాడు అని తెలుసు కున్నాడు. వెంటనే ధనుస్సును చేతిలోకి తీసుకున్నాడు. దుష్టశిక్షణ కొరకు జైత్రయాత్రకు బయలు దేరాడు.

భద్రాశ్వము, కేతుమాలము, భారతము, ఉత్తర కురు భూములు, మొదలగు దేశములను జయించాడు. ఆయాదేశములలో శ్రీకృష్ణుని లీలలను గురించి గాయకులు గానం చేయడం చూచాడు. వారికి అనేక బహుమతులను ఇచ్చాడు. తాను కూడా శ్రీకృష్ణభక్తి పారవశ్యంలో మునిగిపోయాడు.

ఇది ఇలా ఉండగా ఒక ఆశ్చర్యకరమైన సంఘటన ఒకటి జరిగింది. ధర్మదేవత ఎద్దు రూపంలో ఒంటికాలితో సంచరిస్తూ ఉన్నాడు. ఒకచోట గోరూపంలో దు:ఖితురాలై ఉన్న భూదేవతను చూచాడు. ఆమెను చూచి ధర్మదేవత ఇలా అన్నాడు.

"ఏమ్మా! నీవు సుఖంగా ఉన్నావా? నీ ముఖం చూస్తుంటే నీవు బాధపడుతున్నట్టు కనిపిస్తూ ఉంది. నీవు ఎవరి గురించి అన్నా దు:ఖిస్తున్నావా?లేక మూడు కాళ్లనుపోగొట్టుకొని ఒకే పాదంతో

తిరుగుతున్న నన్ను చూచి దు:ఖిస్తున్నావా! లేక నిన్ను దుర్మార్గులయిన క్షత్రియులు పరిపాలిస్తున్నారని బాధపడుతున్నావా! రాజులు, ప్రజలు యజ్ఞయాగములు చేయకపోవడంవల్ల దేవతలకు హవిస్సులు అందడం లేదని దు:ఖిస్తున్నావా! యజ్ఞభాగములు ఇవ్వక పోవడం వలన  ఇంద్రుడు సకాలంలో వర్షములు కురిపించడం లేదా! ఆ కారణంగా కరువు ఏర్పడి ప్రజలు బాధపడుతున్నారా!

అమ్మా! భూమాతా! భూమి మీద అశాంతి ప్రబలిపోయింది. భర్తలను భార్యలు, తల్లి తండ్రులను వారి సంతానము గౌరవించడం లేదు. భర్తలు కూడా భార్యలను రక్షించడం లేదు. పైగా రాక్షసుల వలె భార్యలను చంపుకుతింటున్నారు. విద్యాసరస్వతి కూడా సంస్కారము లేని బ్రాహ్మణుల వద్ద బందీగా ఉన్నది. క్షత్రియులచేత పూజింపతగ్గ బ్రాహ్మణులు క్షత్రియులకు సేవలు చేస్తున్నారు. ఈ దురాగతాలను చూచి  దు:ఖపడుతున్నావా.

అమ్మా!  ఇదంతా కలి ప్రభావము. రాజులు ఒకరితో ఒకరు యుద్ధములు చేసుకొని నాశనం అయిపోతున్నారు. ప్రజలు శాస్త్రములను అధ్యయనం చేయడం లేదు. చేసినా వాటిని పాటించడం లేదు. నియమాలు ఉల్లంఘించి ఇష్టం వచ్చినట్టు భోజనములు, పానీయములు సేవిస్తున్నారు. అడ్డూ ఆపూ లేకుండా రతికార్యములు చేస్తున్నారు. వీటిని చూచి బాధపడుతున్నావా! భూభారమును తొలగించడానికి అవతరించిన శ్రీకృష్ణుడు తన అవతారమును చాలించి తన స్వస్థానమునకు వెడలినాడని దు:ఖిస్తున్నావా! నీ మనస్సులో బాధ ఏమిటో నాకు చెప్పు. కాలక్రమేణా నీ శక్తి కూడా సన్నగిల్లినట్టుంది. అందుకే ఇంతగా దు:ఖిస్తున్నావు." అని

అడిగాడు ధర్మదేవత.

అప్పుడు భూదేవి ఇలా పలికింది. "ఓ ధర్మదేవతా! నీవు నన్ను ఎన్నో ప్రశ్నలు అడిగావు. వాటికి సమాధానాలు అన్నీ నీ ప్రశ్నలలోనే ఉన్నాయి. అన్నీ తెలిసీ నన్ను ఎందుకు అడుగుతావు? నీ సంగతి చెప్పు. చక్కగా నాలుగు పాదములతో సంచరించేవాడివి ఇప్పుడు ఒంటి కాలితో తిరుగుతున్నావు కదా! నా పరిస్థితి అలాగే ఉంది. ప్రజలలో అవినీతి పెరిగి పోయింది. ఎవరూ నిజం చెప్పడం లేదు. శుచిగా ఉండటం లేదు. దయా గుణము, క్షమాగుణము, త్యాగబుద్ధి, మనుషులలో మచ్చుకైనా కనిపించడం లేదు.

జనం సంతోషంగా ఉండటం మరిచిపోయారు. ఉన్నవాళ్లు లేని దాని కోసరం పాకులాడు తున్నారు. లేని వాళ్లు, ఉన్న వాళ్లకు అన్నీ ఉన్నాయనీ, తమకు ఏమీ లేవనీ బాధపడుతున్నారు. అందుకని ఎవరికీ సంతోషం లేదు. అందరికీ కోపం ఎక్కువ అయిపోయింది. ఎవరూ శాంతంగా ఉండటం లేదు. మనో నిగ్రహం ఎవరికీ లేదు. ఇంద్రియ నిగ్రహం అసలే లేదు. ఎవరూ తపస్సు చెయ్యడం లేదు. పేదవాడు, ధనికుడు మధ్య అసమానతలు పెరిగిపోయాయి. తప్పుచేసిన వాళ్లను క్షమించడం మరిచిపోయారు. దెబ్బకు దెబ్బ తీస్తున్నారు. ఏ పని చేసినా మనకేం లాభం అని లాభనష్టాలు లెక్కలు వేసుకుంటున్నారు.

శాస్త్రములను చదివి జ్ఞానం సంపాదించడం మరిచి పోయారు. అందరూ సుఖాలకోసరం పాకులాడే వాళ్లే కానీ విరక్తితో

ఉన్న వాళ్లు కనపడటం లేదు. అంతా దుర్బలులు. ఎవరికీ శౌర్యము లేదు. బలం లేదు.  ఎవరి ముఖాల్లో తేజస్సు కనిపించడం లేదు. ప్రతి ఒక్కడూ పైవాడి కింద ఊడిగం చేసేవాడే కానీ, స్వతంత్రంగా బతకడం ఎవరికీ తెలియదు. ప్రతివాడికీ తన గురించి తాను ప్రగల్భాలు చెప్పుకోవడం బాగా అలవాటయింది.

పెద్దల ఎడల ఎవరికీ వినయము, గౌరవం లేదు. ప్రజలు శీలం అనే మాట మరిచిపోయారు. అవినీతి, అశ్లీలము స్వైరవిహారం చేస్తున్నాయి. మానసికంగా అంతా దుర్బలులే. ఎవరికీ మానసిక స్థైర్యము లేదు. ఇంద్రియములను అదుపులో పెట్టుకోవడం ఎవరికీ చేతకాదు.  నిజమైన సౌభాగ్యము ఎక్కడాకనిపించడం లేదు. అంతా కృత్రిమము. దేవుడి మీద భక్తి తగ్గిపోయింది. వేదములను నమ్మడం లేదు. నాస్తికత్వము ప్రబలిపోయింది. ఏమీ లేకపోయినా అందరికీ అహంకారము మాత్రం పూర్తిగా ఉంది. నన్ను మించిన వాడు లేడనే తత్వం బాగా అబ్బింది. చేసే పని మీద శ్రద్ధ, గౌరవంగా బతకడం, మంచి పనులు చేసి కీర్తి సంపాదించడం అనే గుణములు కనుమరుగైపోయాయి.

శ్రీకృష్ణుడు ఈలోకాన్ని విడిచిపోయాడు.అప్పటి నుండి జనం కలిప్రభావం వలన  పై విధంగా తయారయ్యారు. ఆ జనం గురించి, మూడు కాళ్లుపోగొట్టుకున్న నీ గురించి, దేవతల గురించి ఋషుల గురించి పితృదేవతల గురించి, సద్బ్రాహ్మణుల గురించి  నేను నిరంతరం బాధపడుతున్నాను. ఎల్లప్పుడూ చక్కగా పుష్పించిన పద్మములలో నివసించే శ్రీమహాలక్ష్మి ఆ పద్మవనమును వదిలి భూలోకములో శ్రీకృష్ణుని పాదములను సేవిస్తూ ఉండేది. అను

నిత్యము శ్రీకృష్ణుని పాదములతో పునీతమవుతున్న నేను శ్రీకృష్ణుని నిరంతర సహచర్యముతో గర్వితురాలనయ్యాను. నా గర్వము అణచడం కోసరం అన్నట్టు శ్రీకృష్ణుడు నన్ను విడిచి వైకుంఠమునకు వెళ్లాడు. అసుర ప్రవృత్తి కలిగిన క్షత్రియులు అక్షౌహిణీల కొద్దీ పెరిగి పోవడంతో, శ్రీకృష్ణుడు అవతరించి భూభారమును తగ్గించాడు. నీవు ఒంటి కాలితో సంచరించడం చూచి, ధర్మ సంస్థాపన కొరకు ఈ భూమి మీద అవతరించాడు. కాని ఆ మహానుభావుడు నిన్ను నన్ను విడిచి వెళ్లిపోయాడు. అందుకే ఈ దు:ఖము." అని పలికింది భూమాత.

శ్రీమద్భాగవతము

పథమస్కంధము పదునారవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము

పదునేడవ అధ్యాయము.

సూతుడు శౌనకాది మహామునులకు మహాభాగవత పురాణమును ఇలా చెప్పసాగాడు.

" పరీక్షిత్ మహారాజు ఒక ఆవును, ఒక ఎద్దును కొడుతున్న, రాజలాంఛనములు ధరించి ఉన్న ఒక శూద్రుని చూచాడని

చెప్పానుకదా. ఆ ఎద్దు బక్కచిక్కిపోయి ఉంది. ఒక పాదంతో ఒణుకుతూ ఉంది. అటువంటి ఎద్దును ఆ శూద్రుడు కొడుతున్నాడు. ఆవు కూడా గడ్డికోసం పరితపిస్తూ ఉంది. కాని పచ్చగడ్డి దొరకడం లేదు. కాని బ్రాహ్మణులు, ఋషులు యజ్ఞములు చేయడం కోసరం పాలు ఇస్తూ నే ఉంది. ఆవుకంటి నుండి నీరు కారుతూ ఉంది. ఆ శూద్రుడు కొడుతుంటే దీనంగా దిక్కులు చూస్తూ ఉంది. ఆ ప్రకారం కొట్టబడుతున్న ఆవును, ఎద్దును చూచిన పరీక్షిత్తు ఆ శూద్రుని ఇలా అడిగాడు.

" నీవు ఎవరు? నా రాజ్యంలో గోవులను ఎందుకు బాధిస్తున్నావు? నీ వేషము చూడ బోతే రాజలాంఛనములతో ఉంది. కాని నీవు చేసే పనులు శూద్రుడి వలె ఉన్నాయి. లోక రక్షకుడగు శ్రీకృష్ణుడు ఈ లోకమును విడిచి వెళ్లినాడనియా నీ గర్వము. నేను ఉన్నాను. నీవు నా రాజ్యములో తప్పు చేసావు. నీకు శిక్షను విధిస్తాను. నిరపరాధి అయిన గోవును బాధించినందుకు నీకు మరణ శిక్ష సరి అయినది." అని అన్నాడు పరీక్షిత్తు.

తరువాత ఆ ఎద్దును చూచి ఇలా అన్నాడు. "నీవు తెల్లటి కాంతితో మెరిసిపోతున్నావు. కాని ఒకే పాదంతో తిరుగుతున్నావు. నీ మూడు పాదములు ఏమయ్యాయి. నీవు ఏ దేవతవు? నిన్ను చూస్తే నాకు బాధగా ఉంది. నా రాజ్యంలో ఎవరూ కంట నీరు పెట్టకూడదు. అటువంటిది నీవు కంటినీరు పెడుతున్నావు. నీవు శోకించకు . ఈశూద్రుని వలన నీకు ఎలాంటి భయం లేదు."అని అన్నాడు పరీక్షిత్తు.

తరువాత గోవును చూచి "అమ్మా గోమాతా! నేను దుష్టశిక్షణ కోసం కంకణం కట్టుకున్నాను. నీవు బాధపడవద్దు. నేను ఉన్నాను. ఓ గోమాతా! ఏ రాజు పరిపాలించే రాజ్యంలో ప్రజలు దు:ఖిస్తారో, ఆ రాజుకు ఆయువు నశిస్తుంది. నరకం ప్రాప్తిస్తుంది. ప్రజల బాధలు తీర్చడమే ప్రభువు యొక్క పరమ ధర్మము. ఈ దుర్మార్గుడు నిన్ను కొడుతున్నాడు. వీడిని ఇప్పుడే చంపుతాను. నీకు ఊరట కలిగిస్తాను." అని అన్నాడు పరీక్షిత్తు.

తరువాత ఎద్దును చూచి "ఓ వృషభమా! నీ మూడు పాదములను ఎవరు ఖండించారు. ఆ దుర్మార్గుడు ఎవరు? శ్రీకృష్ణపరమాత్మ అనుగ్రహంతో ఈ కురు సామ్రాజ్యమును పాలించు చున్న ఈ కౌరవ వంశీయుల పాలనలో ఇటువంటి దురాగతములు జరుగవు. నీ మూడు పాదములు నరికి, మా కౌరవ వంశమునకు అప్రతిష్ట తెచ్చిన వాడు ఎవడు? వాడిని కఠినంగా శిక్షిస్తాను. ఎందుకంటే నా పాలనలో నిరపరాధులకు కష్టం కలుగ చేసేవాడు నన్ను చూసి భయపడతాడు. అప్పుడు సాధుజనులు సుఖంగా జీవించగలుగుతారు. నా రాజ్యంలో నిరపరాధులను బాధపెట్టే వాళ్లు దేవతలైనా సరే కఠినంగా శిక్షిస్తాను. శాస్త్రప్రకారము ధర్మమును ఆచరించు వారిని రక్షించడం, శాస్త్రములలో చెప్పిన విధులను ఉల్లంఘించి, అధర్మము పాటించేవారిని శిక్షించడం రాజుయొక్క పరమధర్మము. కాబట్టి నా ధర్మాన్ని నేనునెరవేరుస్తాను." అని అన్నాడు పరీక్షిత్తు.

అప్పుడు ఆ ఎద్దు రూపంలో ఉన్న ధర్మదేవత ఇలా అంది. "మహారాజా! నీవు పాండవ వంశములో శ్రేష్టుడవు. నీకు తప్ప సాధువులను రక్షించడం దుర్మార్గులను శిక్షించడం అనే ఈ కార్యము ఎవరికి సాధ్యం అవుతుంది. కాని ఒక సందేహము. మానవులకు కష్టాలు ఎందుకువస్తాయో ఎవరి వలన వస్తాయో ఏ కారణం చేత వస్తాయో రక రకాలుగా చెబుతూ ఉంటారు. కాని ఏది నిజమో తెలియదు.

కొంత మంది తమకు వచ్చిన కష్టాలు తమ వల్లనే వచ్చాయని అనుకుంటూ ఉంటారు. మరి కొందరు దేవుడు మనకు కష్టాలు తెచ్చిపెట్టాడు అనుకుంటూ ఉంటారు. మరి కొందరు మనము చేసిన కర్మవలలనే కష్టాలు వచ్చాయి అనుకుంటూ ఉంటారు. మరి కొందరు ఈ ప్రకృతి వైపరీత్యము వలననే అన్ని కష్టాలు వస్తాయి అంటారు. ఇంకా కొందరు మనస్సునకు కానీ వాక్కుకు కూడా అందని వాడు, నిరాకారుడు అయిన ఆ పరమేశ్వరుడే మనకు కష్టములు కానీ సుఖములు కానీ కల్పిస్తుంటాడు అని చెబుతారు. ఇన్ని వాదములలో ఏది సముచితమో నీవే నిర్ణయించాలి." అని చెప్పింది ధర్మదేవత.

పరీక్షిత్తు ఆలోచనలో పడ్డాడు. ఆ ధర్మదేవతతో ఇలా అన్నాడు. "నీవు నిజం చెప్పడం లేదు. అధర్మం చేసిన వాడికి ఏ శిక్ష ఉంటుందో ఆ అధర్మాన్ని సూచించిన వాడికి కూడా అదే శిక్ష పడుతుంది. అందుకని నీ పాదములను ఖండించిన వాడి గురించి తెలిసినా నీవు చెప్పడం లేదు. దీనిని బట్టి చూస్తే నీవు సామాన్యురాలివి

కావు. ఈ వృషభరూపంలో ఉన్న నీవు ధర్మదేవతవు. లేకపోతే నీకు దైవ మాయ వలన ఈ గతి పట్టి ఉండవచ్చు.

కృతయుగములో తపస్సు, శుచిత్వము, దయ, సత్యము అనే నాలుగు పాదాలతో నీవు నడుస్తూ ఉండేదానివి. ఆ నాలుగు పాదములను గర్వము, స్త్రీలోలత్వము, మదిరతో కలిగిన మత్తు అనే ముగ్గురు దుర్మార్గులు ఖండించారు. ప్రస్తుతము "సత్యము" అనే పాదంతో నీవు నడుస్తున్నావు. ఆ సత్యము యొక్క బలం చేతనే నీవు జీవిస్తున్నావు. కాని కలి ప్రవేశించాడు. ఆ సత్యము అనే పాదమును కూడా ఖండించి లోకములో అసత్యమును ప్రబలింపజేయాలని చూస్తున్నాడు.

ఈమెకూడా అంతే. ఈ గోమాత భూదేవి. శ్రీకృష్ణుని కరుణ వలన భూభారము తగ్గింది. ఆమె ప్రశాంతంగా ఉంది. ఇంతలో ఈ కలి ప్రవేశించాడు. లోకంలో క్షత్రియులు అందరూ నశించారు. అధర్మపరులు, కేవలం రాజు వేషము వేసుకున్న వారు, బ్రాహ్మణులను ద్వేషించేవారు అయిన శూద్రులు ఈ భూమిని పరిపాలిస్తారు, భూమి మీద అధర్మము మితిమీరిపోతుంది అని ఈమె దు:ఖిస్తూ ఉంది. ఈ కలిని నేను నాశనం చేస్తాను." అని తన చేతిలో ఖడ్గం ధరించి బయలుదేరాడు పరీక్షిత్తు.

తనను చంపడానికి వస్తున్న పరీక్షిత్తును చూచి కలి తన రాజు వేషమును గబగబా తీసేసి, పరీక్షిత్తు కాళ్లమీద పడ్డాడు. దయాప్రపూర్ణుడు అయిన పరీక్షిత్తు కలిని చంపలేదు. నవ్వుతూ ఇలా

అన్నాడు.

“ఓ కలి పురుషా! నేను అర్జునుని మనుమడిని. శరణాగతులను చంపను. పైకి లే. నా రాజ్యములో నీకు చోటు లేదు. ఎక్కడికైనా పారిపో. ఎందుకంటే నీవు రాజు వేషంలో ఉండి అధర్మానికి సాయం చేస్తుంటావు. నీలో రకరకాలైన అధర్మములు అనగా, లోభము, మాయలు చెయ్యడం, మోసం చెయ్యడం, ఎదుటి వారి సొత్తు అపహరించడం, దౌర్జన్యంగా లాక్కోవడం, తనకు విధించిన కర్మలు కాకుండా ఎదుటి వారి కర్మలు చెయ్యడంలో ఆసక్తి చూపడం, ధనాన్ని దుర్వినియోగం చెయ్యడం, మితిమీరిన అహంకారము, ఎక్కువగా ఉన్నాయి.

నా రాజ్యంలో ధర్మపరులకే కానీ అధర్మపరులకు చోటు లేదు. నా రాజ్యంలో యజ్ఞయాగములు జరుగుతుంటాయి. విష్ణుమూర్తిని యజ్ఞములతో ఆరాధిస్తుంటారు. ఆ విష్ణుమూర్తి యజ్ఞము చేసేవారి కోరికలు తీరుస్తుంటాడు. ఆ విష్ణుమూర్తి సకల జీవులలో ఆత్మస్వరూపుడై నివసిస్తున్నాడు. వాయు రూపంలో జీవుల లోపలా బయటా సర్వాంతర్యామిగా ఉన్నాడు. నా రాజ్యంలో ధర్మము, సత్యము వెల్లివిరుస్తుంటాయి. నా రాజ్యంలో నీకు స్థానం లేదు. వెళ్లు.” అని ఆదేశించాడు పరీక్షిత్తు.

పరీక్షిత్తు పలికిన పరుషమైన మాటలు విన్న కలిపురుషుడు పరీక్షిత్తు కాళ్లమీద పడ్డాడు. పరీక్షిత్తుతో ఇలా అన్నాడు. “ఓ మహారాజా!

నేను నీ రాజ్యంలో ఉన్నా, లేక నీ రాజ్యం బయట ఉన్నా, నా కళ్లకు ఖడ్గంచేతిలో ధరించిన నీవే కనపడుతుంటావు. కాబట్టి నేను ఎక్కడున్నా ఒకటే. దయచేసి నేను ఎక్కడ ఉండాలో చెప్పు అక్కడ ఉంటాను." అని వినయంగా అడిగాడు కలిపురుషుడు.

పరీక్షిత్తు ఇలా అన్నాడు. "నీవు జూదము, మద్యపానము, వేశ్యాగృహములు, జీవహింస చేసే వారు. వీరి యందు నివసించు. ఇంకా కావాలంటే బంగారంలో కూడా ఉండు. ఎందుకంటే సువర్ణము వలన సంపద చేకూరుతుంది. ఆ సంపద కోసరం అబద్ధాలు ఆడతారు. సంపద వలన గర్వం వస్తుంది. సంపద మూలంగా కామము, కోరికలు పెరుగుతాయి. స్త్రీలోలత్వము పెరుగుతుంది. స్త్రీలకోసరం హింస ప్రజ్వరిల్లుతుంది. దాని వలన మనుషులలో శత్రుత్వము పెరిగి పోతుంది. కాబట్టి ఒక్క బంగారంలో ఉంటే నీవు అన్నిట్లో ఉన్నట్టే." అని అన్నాడు పరీక్షిత్తు.

పరీక్షిత్తు ఆజ్ఞప్రకారము కలి పురుషుడు .జూదము, మద్యపానము, పరస్త్రీసంపర్కము, జీవులను హింసిచడం, బంగారము అనే వాటిని ఆవహించాడు. కాబట్టి గొప్పవాడు కావాలి, కీర్తి ప్రతిష్టలు సంపాదించాలి, ధర్మపరుడుగా జీవించాలి అనికోరుకొనేవారు పై ఐదింటికి దూరంగా ఉండాలి. ముఖ్యంగా ధర్మంపాటించేవారు, ప్రజాపాలకులు, గురువులు, రాజులు పై ఐదింటికీ దూరంగా ఉండాలి. తరువాత పరీక్షిత్తు, తపస్సు, శుచిత్వము, దయ, అనే ధర్మదేవత యొక్క మూడు పాదములను పునరుద్ధరించాడు.

తరువాత పరీక్షిత్తు జనరంజకంగా హస్తినాపురము రాజధానిగా రాజ్యపాలన చేస్తున్నాడు.

శ్రీమద్భాగవతము
ప్రథమ స్కంధము పదునేడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ప్రథమ స్కంధము
పదునెనిమిదవ అధ్యాయము.

సూతుడు శౌనకాది మహామునులకు భాగవత కథను ఈ ప్రకారంగా వినిపించసాగాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! శ్రీహరి పాద పద్మములను ఆశ్రయించిన వారికి ఇహ, పర సుఖములు రెండూ లభిస్తాయి అన్నదానికి పరీక్షిత్తు ఉదాహరణ. శ్రీకృష్ణుని మహిమ వలన గర్భంలో ఉండగానే బ్రహ్మాస్త్రము బారి నుండి తప్పించుకున్నాడు. తరువాత బ్రాహ్మణ శాపము వలన తక్షకుని వలన మరణం సంభవిస్తుంది అని తెలిసి కూడా ఏ మాత్రమూ వ్యధ చెందలేదు. శుక మహర్షి ముఖతా భాగవత పురాణమును విన్నాడు. తుదకు గంగానదిలో మునిగి విష్ణుసాయుజ్యము పొందాడు.

శ్రీహరి నామ స్మరణ చేసేవారు, శ్రీహరి కథలను వినేవారు, శ్రీహరి పాదములను సదా సేవించేవారికి మరణ భయం కూడా ఉండదు. పరీక్షిత్తు మహారాజుకు ఇచ్చిన మాట ప్రకారము ఆయన ఈ భూమిని పరిపాలిస్తున్నంత వరకూ కలి తన ప్రభావమును చూపలేదు. శ్రీకృష్ణభగవానుడు నిర్యాణము చెందగానే కలి భూలోకంలో ప్రవేశించాడు. కాని పరీక్షిత్తుకు భయపడి ఆయన నిర్యాణము చెందు వరకు తన ప్రభావమును చూపలేకపోయాడు.

పరీక్షిత్తుకు కలి పట్ల ఏ విధమైన ద్వేషము లేదు. ఎందు కంటే పుణ్యకార్యములు చేయవలెను అని సంకల్పించినంత మాత్రముననే ఆ కార్యములకు ఫలము లభిస్తుంది. కాని పాప కార్యములను కర్మేంద్రియములతో చేస్తేనే పాప ఫలము లభిస్తుంది. మంచి పనులు చేయాలని అనుకొనే వారిని, మంచి పనులను చేసేవారిని, పరాక్రమవంతులను, సాధు పురుషులను కలి ఏమీ చేయలేడు. కేవలం మూర్ఖులను, ఎల్లప్పుడూ పాప చింతనతోనే కాలం గడిపేవారిని కలి పీడిస్తాడు. కాబట్టి పుణ్యపురుషుడు అయిన పరీక్షిత్తు ఉన్నంత కాలము కలి తన ప్రభావమును చూపలేకపోయాడు.

మహామునులారా! మీకు పరీక్షిత్తు వృత్తాంతమును వివరంగా చెప్పాను. ఇంకా ఏమి చెప్పమంటారు" అని అడిగాడు సూతపౌరాణికుడు. అప్పుడు శౌనకుడు ఇలా అన్నాడు

"ఓ పౌరాణికా! మాకు అమృతోపమానములు అయిన శ్రీకృష్ణుని కథామృతమును వినిపించావు. నీవంటి సత్పురుషుల మాటలు వినడం, మీతో కలిసి ఉండటం వలన వచ్చే సుఖానికి స్వర్గ

సుఖాలు సాటి రావు. ఇంక మానవులు అనుభవించే తుచ్ఛప్రాపంచిక భోగములు సత్సాంగత్యము ముందు దేనికీ పనికి రావు. కాబట్టి కలికాలములో సత్పురుషుల సాంగత్యము అన్నిటికన్నా మిన్న. శివుడు, బ్రహ్మ, దేవతలు, ఋషులు, మొదలగు దేవతా గణములు కూడా ఆ భగవానుని గురించి పూర్తిగా తెలుసుకోలేకపోయారు. ఇంక మేమెంత. కాబట్టి నీవు మా యందు దయయుంచి శ్రీహరి కధలను, అవతార విశేషములను సాకల్యముగా వివరించు. మాకు శ్రీహరి కధామృతము ఎంత తాగినా తనివితీరడం లేదు. పరీక్షిత్తు, వ్యాస పుత్రుడైన శుక మహర్షి వలన జ్ఞానమును పొంది విష్ణుసాయుజ్యమును పొందాడు కదా! శుక మహర్షి పరీక్షిత్తుకు చెప్పిన భాగవత పురాణమును మాకు చెప్పండి.మేము విని తరిస్తాము." అని అడిగారు.

అప్పుడు సూత పౌరాణికుడు ఇలా చెప్పసాగాడు.

"ఓ భగవద్భక్తులారా! మీరే కాదు నేనుకూడా సదా సత్పురుషుల సాంగత్యముతో పునీతుడను అయ్యాను. నేను తక్కువ కులమైన సూత కులములో పుట్టాను. కాని మా తండ్రి గారి సాహచర్యముతో, జ్ఞాన వృద్ధులను, వయోవృద్ధులను సేవించి, వారి సాంగత్యములో కృతార్థుడనయ్యాను. ఈ నాడు మీ ముందు కూర్చుని నాలుగు మంచి మాటలు చెప్పగలుగుతున్నాను.

ఆ భగవానుడు సకల సద్గుణ సంపన్నుడు. కేవలము భక్తి చేతనే ఆయనను సాక్షాత్కారం చేసుకోగలము. దానికి మార్గము శ్రీహరి కీర్తన. శ్రీహరిని కీర్తించు వారికి శ్రీహరి సాక్షాత్కారము

తప్పకుండా కలుగుతుంది. శ్రీలక్షిని బ్రహ్మాది దేవతలు సేవిస్తుంటారు. కాని లక్ష్మీదేవి విష్ణువును సేవిస్తుంటుంది. శ్రీహరి పాదముల నుండి పుట్టిన గంగా జలముతోనే శ్రీ హరికి అర్ఘ్యము ఇస్తాము.

శ్రీకృష్ణుని మీద భక్తి ఉన్న వారికి ఇహలోక సుఖముల మీద, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి పోతుంది. కోపము, మోహము, మాత్సర్యము లేని జీవితాన్ని గడుపుతారు. మీరంతా వేదములు శాస్త్రములు బాగా చదువుకొన్న వారు, సూర్యునితో సమానమైన తేజస్సు కలవారు. మీరు నన్ను శ్రీకృష్ణుని అవతార విషేషములను చెప్పమని అడిగారు. నాకు తెలిసినంతవరకూ నేను మీకు చెబుతాను. ఎందుకంటే శ్రీకృష్ణుని లీలలను పూర్తిగా వివరించడం ఎవరికీ సాధ్యం కాదు. పండితులు ఎవరికి శక్తి ఉన్నంత వరకూ వారు ఆ భగవానుని కీర్తిస్తూ ఉంటారు.

ఓ ఋషులారా! మీరంతా వేదములు శాస్త్రములు బాగా చదువుకొన్నవారు. మీరు నన్ను శ్రీకృష్ణుని అవతార విశేషములను చెప్పమని అడిగారు. నాకు తెలిసినంతవరకూ నేను మీకు వివరిస్తాను.

ఒకసారి పరీక్షిత్తు వేట నిమిత్తము అడవులలోకి వెళ్ళాడు. జంతువులను వేటాడుతున్నాడు. మధ్యాహ్నం అయింది. బాగా ఆకలిగా దప్పికగా ఉంది. ఎక్కడా నీటి చుక్క కనపడలేదు. దాహం తట్టుకోలేకపోతున్నాడు. ఆసమయంలో ఆయనకు ఒక ముని ఆశ్రమము కనపడింది. అది శమీకుడు అనే ముని ఆశ్రమము. ఆసమయంలో శమీకుడు కళ్లు మూసుకొని పరిసరాలను మరిచిపోయి ధ్యానంలో నిమగ్నమై ఉన్నాడు. ఆయనకు బాహ్య

ప్రపంచంతో సంబంధం లేదు. మనస్సును ఇంద్రియముల నుండి విడగొట్టి అంతర్ముఖం చేసుకున్నాడు. దానినే సమాధి స్థితి అంటారు. అప్పుడు జీవుడు బ్రహ్మలో లీనమై రమిస్తుంటాడు. బయట ప్రపంచంలో ఏమి జరుగుతున్నా పట్టించుకోరు.

ఆ సమయంలో పరీక్షిత్తు ఆ ముని సమాధిలో ఉన్న చోటికి వచ్చాడు. దాహంగా ఉంది కాసిన్ని నీళ్లు ఇవ్వమని అడిగాడు. ముని పలకలేదు. కళ్లు తెరవ లేదు. పరీక్షిత్తులో అహం ప్రవేశించింది. తాను కురు సామ్రాజ్యానికి మహారాజు. ఎవరైనా సరే తనను చూడగానే లేచి నిలబడి అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించవలసినది పోయి, తానుగా తాను వచ్చి నీళ్లు అడిగితే కళ్లు తెరవకుండా, మాట్లాడకుండా ఉంటాడా! అని మనసులో అనుకున్నాడు. పరీక్షిత్తులో కోపం ప్రవేశించింది. ఏమీ చేయలేక అక్కడి నుండి వెళ్లిపోబోయాడు.

పరీక్షిత్తుకు ఒక ఆలోచన వచ్చింది. ఈ ముని నిజంగా సమాధిలో ఉన్నాడా! లేక ఊరికే కళ్లు మూసుకొని ఉన్నాడా! ఈ రాజుతో నాకేం పని అని నిర్లక్ష్యంగా ఉన్నాడా! అని అనుకున్నాడు. ఇంతలో ఆ పరిసరాల్లో ఒక పాము చచ్చిపడి ఉంది. ఆ మునిని పరీక్షించాలని, ఆ మునికి తగిన శాస్తి చేయాలని అనుకున్నాడు పరీక్షిత్తు. తన బాణంతో ఆ చచ్చిన పామును తీసి ఆ ముని మెడలో వేసాడు. తరువాత అక్కడి నుండి వెళ్లిపోయాడు. రాజధాని హస్తినకు చేరుకున్నాడు.

ఇదంతా శమీకుని కుమారుడు అయిన శృంగి యొక్క స్నేహితుడు చూచాడు. వెంటనే పోయి శృంగికి ఈ విషయం చెప్పాడు. తన తండ్రికి జరిగిన అవమానానికి శృంగికి కోపం వచ్చింది. "ఈ

రాజులు, బాగా గర్వించి, మునులను, ఋషులను గౌరవించడం లేదు. పైగా అవమానిస్తున్నారు. ప్రజలను రక్షించవలసిన రాజు ఆ ప్రజలను దోచుకుంటున్నాడు, అవమానిస్తున్నాడు. ఈ దుర్మార్గులను నేను శిక్షిస్తాను."అని పలికాడు.

పక్కనే ఉన్న కౌశికీ నదిలో స్నానం చేసాడు. ఆచమనం చేసాడు. జలాన్ని చేతిలోకి తీసుకున్నాడు. "కనీస మర్యాదలను కూడా పాటించకుండా నా తండ్రి మెడలో చచ్చిన పామును వేసి అవమానించిన రాజు అయిన పరీక్షిత్తు నేటికి ఏడవ రోజున తక్షకుడు అనే పాము కాటుతో మరణించుగాక!" అని దారుణంగా శపించాడు. తరువాత పరుగు పరుగున ఆశ్రమానికి వచ్చాడు. మెడలో చచ్చిన పాముతో ఉన్న తండ్రిని చూచి దు:ఖించాడు

ఇంతలో శమీకుడు సమాధిలో నుండి బయటకు వచ్చాడు. కుమారుని చూచాడు. తన మెడలో ఉన్న చచ్చిన పామును చూచాడు. వెంటనే ఆ పామును తీసి అవతల పారేసాడు. తన కుమారుడు శృంగిని చూచి ఇలా అడిగాడు. "కుమారా! ఎందుకు ఏడుస్తున్నావు. నీకు ఎవరన్నా అపకారం చేసారా!" అని అడిగాడు. అప్పుడు శృంగి జరిగిన విషయాన్ని తాను పరీక్షిత్తుకు శాపం ఇచ్చిన విషయాన్ని తండ్రికి వివరించాడు. శమీకుడు ఆ విషయం విని చాలా బాధపడ్డాడు.

"కుమారా! ఇంత స్వల్ప విషయానికి ఇంత పెద్ద శాపం ఇచ్చావా! ప్రజారక్షకుడైన మహారాజును శపించి మహాపాపం చేసావు. కుమారా! రాజు ఉండటం వలననే కదా మనము నిర్భయంగా

బతుకుతున్నాము. రాజు సదా ప్రజలను రక్షిస్తూ ఉంటాడు. రాజు సాక్షాత్తు విష్ణు స్వరూపుడు. రాజు అనే వాడు లేకపోతే రాజ్యంలో అరాచకం ప్రబలుతుంది. దొంగలు, దుర్మార్గులు ఎక్కువ అవుతారు. పాపాలు ఎక్కువ అవుతాయి. జనులు ఒకరిని ఒకరు తిట్టుకుంటారు, కొట్టుకుంటారు, చంపుకుంటారు. రాజు లేక పోతే స్త్రీలకు రక్షణ ఉండదు. ప్రజలు వర్ణాశ్రమ ధర్మములను పాటించరు. వేదాధ్యయనము అడుగంటిపోతుంది. జనులు కేవలం కోరికలకు, కామానికి వశులై పోతారు. వర్ణసంకరం జరుగుతుంది.

ఇప్పుడు నువ్వు శపించిన పరీక్షిత్తు ధర్మాత్ముడు. అశ్వమేధ యాగము చేసిన వాడు. కేవలము దాహం తీర్చుకోడానికి మన ఆశ్రమానికి వచ్చాడు. నేను సమాధినిష్ఠలో ఉండటం వలన ఆయన దాహం తీర్చలేకపోయాను. ఆయనకు కోపం వచ్చి ఇటువంటి పని చేసాడు. అంతే కానీ, పరీక్షిత్తు కావాలని చెయ్యలేదు. కాని నీవు అతని మరణానికి దారితీసే ఘోరశాపమును ఇచ్చావు. ఆయన ఆ శాపమునకు తగడు. నిన్ను ఆ భగవంతుడే క్షమించాలి.

పరీక్షిత్తు విష్ణుభక్తుడు. విష్ణుభక్తులు ఇతరులచేత అవమానింపబడినా, వంచింపబడినా, నిందించబడినా, కొట్టబడినా, వారు తిరిగి ఏలాంటి అపకారము చెయ్యరు. అటువంటి విష్ణుభక్తునికి నీవు తీరని అపకారము చేసావు. పాపం చేసావు.” అని కుమారుని మందలించాడు శమీకుడు.

వెంటనే శమీకుడు తనశిష్యుని ఒకడిని పిలిచి, పరీక్షిత్తుకు ఈ విషయం చెప్పమని పంపాడు. ఆ శిష్యుడు వెళ్లి పరీక్షిత్తుకు శృంగి

శాపము గురించి వివరించాడు.

ఆ విషయం విన్న పరీక్షిత్తు ఎంతో చింతించాడు. కానీ శృంగికి ఎలాంటి అపకారము తలపెట్టలేదు. మార్గాంతరం కోసరం అన్వేషిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము
ప్రథమస్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ప్రథమస్కంధము
పంతొమ్మిదవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సూతుడు శౌనకాది మహామునులకు భాగవత కథను ఇలా చెప్పసాగాడు.

"మహామునులారా! నిరపరాధి అయిన ఒక ఋషికి నేను అపకారం చేసాను కదా అని చింతించాడు పరీక్షిత్తు. "దేవతలతో సమానుడగు ఋషిని అవమానించాను. నాకు త్వరలోనే తగిన దండన విధింపబడుతుంది. ఇటువంటి పనులు జీవితంలో చేయకుండా నాకు తగిన ప్రాయశ్చిత్తము తప్పక జరుగుతుంది. బ్రాహ్మణ శాపము నన్ను నా వారిని దహిస్తూ ఉంది." అని తనలో తాను

చింతిస్తున్నాడు.

ఇంతలో పరీక్షిత్తుకు శృంగి ఇచ్చిన శాపము గురించి తెలిసింది. తనకు ఏడవ దినమున మృత్యువు సంభవిస్తుంది అని తెలుసుకున్నాడు. శేషజీవితాన్ని భగవంతుని చింతనలో గడపాలని నిర్ణయించుకున్నాడు. ఇహలోకసుఖములను విడిచిపెట్టాడు. శ్రీకృష్ణుని పాదములను ఆశ్రయించాడు. గంగా తీరములో ఒక ఆశ్రమమును నిర్మించుకొని ప్రాయోపవేశము చేయాలని నిర్ణయించుకున్నాడు. నిరంతరమూ శ్రీకృష్ణ నామ స్మరణ చేస్తున్నాడు.

ఆసమయంలో అత్రి, వశిష్టుడు, చ్యవనుడు, శరద్వతుడు, అరిష్టనేమి, భృగువు, అంగిరసుడు, పరాశరుడు, విశ్వామిత్రుడు, పరశు రాముడు, ఉతథ్యుడు, ఇంద్రప్రమదుడు,సుబాహువు, మేధాతిథి, దేవలుడు, ఆర్షిషేణుడు, భరద్వాజుడు, గౌతముడు, పిప్పలాదుడు, మైత్రేయుడు, ఔర్వుడు, కవషుడు, అగస్త్యుడు, వేదవ్యాసుడు, నారదుడు మొదలగు ఋషులు తీర్థ యాత్రలు సేవిస్తూ అక్కడకు చేరుకున్నారు. పరీక్షిత్తు వారందరినీ సాదరంగా ఆహ్వానించి పూజించి ఉచితాసనములు ఇచ్చిసత్కరించాడు. పరీక్షిత్తు తనకు కలిగిన ఆపద గురించి తన ప్రాయోపవేశ నిర్ణయము గురించి వారికి తెలిపాడు.

"మహాఋషులారా! మాలాంటి క్షత్రియుడు ఆచరించు హింసాయుత, క్రూర కర్మల వలననే కదా, మీలాంటి పరమసాత్వికులైన బ్రాహ్మణులు క్షత్రియులను దూరంగా ఉంచారు. కాని నా యందు మీకు ఉన్న వాత్సల్యము చేత మీరంతా నన్ను ఆశీర్వదించడానికి ఇక్కడకు వచ్చారు. నాకు ఎంతో సంతోషంగా ఉంది. ఆ పరమేశ్వరుని

కృపాకటాక్షము వలన  శృంగి శాప కారణంగా నాకు వైరాగ్యము కలిగింది. ఈ శాపం కూడా నా మేలుకే వచ్చింది అనుకుంటున్నాను. ఈ గంగా తీరంలో నేను ప్రాయోపవేశము చేయదలచుకున్నాను. తక్షకుడు ఎప్పుడు ఏ రూపంలో వచ్చి నన్ను కాటు వేసి చంపుతాడో నాకు తెలియదు. నా చావు గురించి నాకు ఎలాంటి భయం లేదు. కాబట్టి మీరందరూ నా మీద దయయుంచి నాకు విష్ణు గాధలను వినిపించండి. నన్ను తరింపజేయండి." అని ప్రార్థించాడు.

పరీక్షిత్తు మహారాజు  తన కుమారుడైన జనమేజయునకు పట్టాభిషేకము చేసాడు. గంగా తీరంలో దర్భాసనము మీద ఉత్తర ముఖం పెట్టి కూర్చున్నాడు.

అది చూచిన మహాఋషులు పరీక్షిత్తును శ్లాఘించారు. పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీ తాతలు కూడా రాజ్యమును విడిచి వానప్రస్థమునకు వెళ్లిపోయారు. నీవు కూడా నీ తాతలు అనుసరిం చిన మార్గమునే అనుసరిస్తున్నావు. నీ అంత్యకాలము వరకు మేము నీ పక్కనే ఉంటాము." అని అన్నారు. ఆ మాటలు విన్న పరీక్షిత్తు వారితో ఇలా అన్నాడు.

"మహామునులారా! మీ స్వభావము పరోపకారము. ఇతరులకు ఉపకారము చేయకుండా మీరు ఉండలేరు. నాకు మోక్షమార్గము చూపుటకై మీరందరూ ఇక్కడకు వచ్చారు. నాకు చాలా

ఆనందంగా ఉంది." అని అన్నాడు.

ఇంతలో వ్యాస మహర్షి కుమారుడైన శుక మహర్షికూడా అక్కడకు వచ్చాడు. శుక మహర్షికి 16 ఏండ్ల వయసు. సర్వసంగ పరిత్యాగి. ఆయనది ఏ కులమో ఎవరికీ తెలియదు. ఎప్పుడూ పసిపిల్లవాడి లాగా ఉంటాడు. మంచి తేజస్వి. సాధు లక్షణములు కలిగిన వాడు. ఆయనను చూడగానే ఋషులందరూ లేచి నమస్కారము పెట్టారు. పరీక్షిత్తు ఆయనకు అర్ఘ్యము పాద్యము అర్పించి ఉచితాసనము మీద కూర్చోపెట్టాడు. పరీక్షిత్తు శుకమహర్షిని చూచి తలవంచి నమస్కరించి ఇలా అన్నాడు.

"మహాత్మా! మీరు మా అతిథులుగా రావడం మాకు ఎంతో ఆనందంగా ఉంది. మీవంటి సత్పురుషులను స్మరిస్తేనే మేము పవిత్రులము అవుతాము. అటువంటిది మీరే స్వయంగా మా ఆశ్రమమునకు వచ్చారు. మీ దర్శనం చేతనే మేము చేసిన పాపములన్నీ పటాపంచలయ్యాయి. యదువంశములో పుట్టిన శ్రీకృష్ణపరమాత్మ నాకు కూడా దూరపు బంధువు. ఇప్పుడు శాపగ్రస్తుడనైన నాకు, మరణకాలమునందు తమరి దర్శనభాగ్యం కలగటం నా పూర్వపుణ్యసుకృతము. ఈ జన్మకు ఇది చాలు. ఈ సమయంలో నాకు మానవులు వినతగినది, జపించతగినది, స్మరింపతగినది, సేవింపతగినది, చేయతగినది అగు విషయముల గురించి, వాటికి వ్యతిరేక మైన విషయముల గురించి దయతో మాకు తెలియజేయండి.

సాధారణంగా తమరు గృహస్థుల గృహములకు బిక్షకు వెళ్లినపుడు, ఆ ఇంటి ముందు ఆవుపాలు పిదికే సమయం మించి ఉండరని ప్రతీతి. కాని మా వద్ద మాత్రము ఏడు రోజుల పాటు ఉండి మమ్ములను మీ వాగామృతధారలతో కృతార్థులను చేయండి.” అని భక్తితో వేడుకున్నాడు.

శ్రీమద్భాగవతము

ప్రథమస్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

ప్రథమస్కంధము సర్వం సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత& ఓం తత్సత్.

# శ్రీమద్భాగవతము

## సంస్కృత మూలము
## భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం
2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060
సెల్:9391134792 ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము

## ద్వితీయస్కంధము

## మొదటి అధ్యాయము.

శ్రీశుకమహర్షిని పరీక్షిత్తు ఈ విధంగా అడిగాడు. "మహర్షీ! ఒక వ్యక్తి ఏ కారణం చేతనైనా మరణించబోతుంటే, అతడు ఏమి చేస్తే భగవంతునిలో ఐక్యం కాగలడు. ఆ వ్యక్తి వినవలసినది, జపించ వలసినది, స్మరించవలసినది, భజించవలసినది ఏది? అతను ఏమేమి కార్యములు చేయవలెను. వివరించండి." అని అడిగాడు.

అప్పుడు శుకమహర్షి పరీక్షిత్తు తో ఇలా అన్నాడు. "మహారాజా! మంచి ప్రశ్న వేసావు. ఇది నీకే కాదు అందరికీ ఆమోద యోగ్యమైనది. ఎల్లప్పుడూ నేను, నా ఇల్లు, ఇల్లాలు, సంసారము అనుకుంటూ అందులోనే మునిగి తేలేవాళ్లు, ఆత్మతత్వము గురించి ఆలోచించని వాళ్లు, వినతగ్గ విషయములు ఎన్నో ఉన్నాయి.

కేవలం ప్రాపంచిక విషయములలలో మాత్రమే ఆసక్తి కల వాళ్ల ఆయుర్దాయము అంతా రాత్రి పూట నిద్రపోవడంలోనే, స్త్రీసంభోగ ములతోనూ, పగటిపూట ధనము సంపాదించడంలోనూ, సుఖాలు అనుభవించడంలోనూ, కుటుంబ అవసరాలు తీర్చడంలోనూ గడిచి పోతుంది.

ఈ మనుష్యులు ప్రతిరోజూ కాలంతో పోటీపడుతుంటారు. కాలంతో యుద్ధం చేస్తుంటారు. వీరందరూ ఎప్పుడో ఒకప్పుడు

పర లోకములకు పోవలసిన వారే. ఎవ్వరూ శాశ్వతంగా ఈ లోకంలో ఉండరు. కాని ప్రతివాడూ తాను శాశ్వతంగా ఇక్కడే ఉంటాను అని అనుకొని ధనార్జన చేస్తుంటాడు. కాని వారికి ఒక విషయం తెలియదు. వారి యొక్క తండ్రులు, తాతలు, ముత్తాతలు కూడా ఇలా అనుకుంటూ నే కాలగతిని మరణించారు. కాని ఈ మనుష్యులు మాత్రం తమ తాత తండ్రుల గురించి మరిచిపోతారు. తాము, తమ భార్యా బిడ్డలు, తమ ఆస్తులు, ధనముతో ఈ లోకంలో శాశ్వతంగా ఉంటాము అని అనుకుంటూ ఉంటారు. తామందరమూ ఎప్పుడో ఒకప్పుడు కాలగతిని మరణిస్తాము అని తెలిసి కూడా తెలియనట్టే ఉంటారు. భగవంతుని గురించి ధ్యానించడం మరిచిపోతారు.

కాబట్టి మహారాజా! కైవల్యమును కోరు మనుష్యులు సర్వాంతర్యామి అగు ఈశ్వరుని గురించి వినాలి, తెలుసుకోవాలి. భగవంతుని నామస్మరణ చెయ్యాలి. భగవంతుని కీర్తించాలి. అలా అని చెప్పి మానవులు తమ దైనందిన కార్యములు మానమని కాదు. వారి స్వధర్మమును నిర్వర్తిస్తూనే భగవంతుని గూర్చి తెలుసుకోవాలి. భగవన్నామ స్మరణ చెయ్యాలి. అలా చేస్తేనే వారు మనుష్యులుగా పుట్టినందుకు ఫలితం ఉంటుంది. బతికినంత కాలము భగవన్నామ స్మరణ చేస్తుంటే, అంత్యకాలములో కూడా వారు భగవన్నామమునే ఉచ్ఛరిస్తూ మరణిస్తారు. అంత్యకాలములో భగవంతుని స్మృతి చాలా గొప్పది.

కాబట్టి అనునిత్యమూ భగవన్నామము చేయడం, భగవంతుని గురించి తెలుసుకోవడం, భగవంతుని స్మరించడం

అందరూ చేయవలసిన పని. గుణములకు అతీతులైన ముని పుంగవులు, ప్రాపంచిక విషయములమీద ఆసక్తిని క్రమక్రమంగా తగ్గించుకొని, సదా భగవంతుని గుణములను కీర్తించడంలో ఆసక్తిని చూపిస్తున్నారు.

ఓ మహారాజా! భాగవతము అనే ఈ పురాణం వేద సమ్మత మైనది. వేదముతో సమానమైనది. ఈ భాగవతము అనే పురాణాన్ని ద్వాపర యుగాంతంలో నా తండ్రి వ్యాసుడు రచించాడు. భాగవత పురాణమును నేను నా తండ్రి గారి వద్ద నేర్చుకున్నాను. ఈ భాగవత పురాణము పండితుల వలన వినిఅర్థం చేసుకోవలసినదే కానీ, స్వయంగా చదికి అర్థం చేసుకోవడం కష్టం.

ఈ భాగవతపురాణములో విష్ణువు అవతార విశేషములు, సాక్షాత్తు విష్ణువు అవతారమైన శ్రీకృష్ణుని అవతార విశేషములు విస్తృతంగా వివరింపబడ్డాయి. నాకు సత్వ, రజస్, తమోగుణముల యందు ఆసక్తిలేకపోయినా, నేను నిర్గుణత్వమును పొందినా, భగవంతుడైన శ్రీకృష్ణుని అవతార విశేషములచేత ఆకర్షింపబడిన వాడినై ఈ భాగవతపురాణమును నా తండ్రి వద్ద అధ్యయనము చేసాను.

నీవు కూడా విష్ణుభక్తుడవు. పైగా అవసానదశలో ఉన్నావు. అందు వలన ఈ భాగవతపురాణమును నేను నీకు చెబుతాను. నీవు ఈ భాగవత పురాణము మీద నమ్మకంతో శ్రద్ధగా వింటే, నీకు కైవల్యప్రాప్తి కలుగుతుంది. ఈ భాగవతపురాణమును

శ్రద్ధతో చదివినా, విన్నా, మానవులకు భగవంతుని యందు ఆసక్తి, భక్తి, శ్రద్ధ, కలుగుతాయి.

ఈ సంసారము నందు నిర్వేదము, విరక్తి కలిగి, ఏ కారణం చేత కూడా భయంలేని వారికి, మరణించిన తరువాత స్వర్గసుఖము లను, మోక్షమును కోరుతూ, జీవాత్మను పరమాత్మయందు లగ్నం చేసిన యోగులకు, హరి నామస్మరణ, శ్రీహరి కథలను వినడం, శ్రీహరిని స్మరించడం, కీర్తించడం ముఖ్యసాధనములు.

ఈ లోకంలో నిత్యము ప్రాపంచిక విషయములలో మునిగితేలు మానవులు, భగవంతునికి విముఖంగా ఉంటూ, నిర్లక్ష్యంగా, తమ జీవిత కాలములో ఎన్నో సంవత్సరములను వ్యర్థముగా గడుపు తున్నారు. తాము కాలమును వ్యర్థముగా గడుపుతున్నాము అన్న విషయం వారికి తెలియడం లేదు. జీవితం అంతా నిర్లక్ష్యంగా, వృధాగా, వ్యర్థంగా బతకడం కన్నా, దేని వల్ల అయితే మనకు శ్రేయస్సు కలుగుతుందో, దాని గురించి ఒక ముహూర్త కాలము పాటు ఆలోచిస్తే, ఆ ఆలోచన వారి జీవితమును మలుపు తిప్పుతుంది. తాము తమ జీవితంలో ఎన్నో సంవత్సరములను వ్యర్థంగా గడుపుతున్నాము అని తెలుసుకొన్న నాడు, మానవుడు తన జీవితమును మంచి మార్గములో నడుపుతాడు. శ్రేయస్సును పొందుతాడు.

మహారాజా! పూర్వము ఖట్వాంగుడు అనే రాజు ఉండే వాడు. అతడు తన జీవితమంతా ప్రాపంచిక విషయములలో

గడిపాడు. తుదకు తన జీవిత కాలము ఒక్క ముహూర్తకాలంలో ముగుస్తుంది అని తెలుసు కొని, సర్వమును విడిచిపెట్టి, ఆ ముహూర్తకాలము పాటు హరినామ స్మరణలో మునిగిపోయాడు. అభయస్వరూపుడు అయిన ఆ పరమాత్మను శరణుజొచ్చాడు. తుదకు ముక్తిని పొందాడు.

ఓ మహారాజా! నీకు ఇంకా ఏడు దినములు ఆయుర్దాయము ఉంది. ఈ ఏడుదినములు ప్రాపంచిక విషయము లలో ఆసక్తిని విడిచిపెట్టు. భార్యాపుత్రుల మీద అనురాగ మమకారము లను వదిలిపెట్టు. ముక్తి మార్గం వైపు పయనించు. ఆ పరమాత్మను సేవించు. తరించు.

అంత్యకాలము వచ్చినపుడు మానవుడు మరణ భయాన్ని విడిచి పెట్టాలి. ప్రాపంచిక విషయములలో ఆసక్తి వదిలి పెట్టాలి. దేహాభిమానమును త్యజించాలి. మనోనిగ్రహం పాటించాలి. భార్యా, బిడ్డలు, బంధువులు, మిత్రులు వీరి మీద మమకారమును కత్తితో కోసినట్టు కోసివేయాలి.

ఇంటి నుండి వెళ్లిపోవాలి. సన్యాస ఆశ్రమము స్వీకరించాలి. బ్రహ్మచర్యమును పాటించాలి. తీర్థయాత్రలు చెయ్యాలి. ఏకాంతముగా ఉన్న పవిత్రమైన స్థలమును చూచుకోవాలి. మంచి ఆసనమును ఏర్పాటుచేసుకొని దాని మీద కూర్చోవాలి. కళ్లుమూసుకొని మనసును ఏకాగ్రంగా ఉంచాలి. ప్రాణాయామంతో చంచలమైన మనస్సును అదుపులో పెట్టుకోవాలి. బుద్ధి ద్వారా మనస్సును ఇంద్రియముల నుండి మళ్లించి, అదుపులో పెట్టుకోవాలి. ఓంకారమును

ఉచ్ఛరించాలి. మనస్సును భగవంతుని యందు లగ్నం చేయాలి. భగవంతుని ఒక్కొక్క అవయవయమునందు తన మనస్సును లగ్నం చేయాలి. ఏకాగ్రమైన బుద్ధితో తానే భగవంతుడు అనుకోవాలి. భగవంతుని తప్ప వేరే విషయము గురించి ఆలోచించకూడదు. స్మరించకూడదు. ఆ పరిస్థితులలో మనస్సు భగవంతుని ఏ అవయవమునందు మనస్సు లగ్నం అవుతుందో దానినే పరమపదము అంటారు.

మానవుని మనస్సు ఎల్లప్పుడూ రజోగుణము, తమోగుణములతో లాగబడుతూ ఉంటుంది. దాని వలన మూర్ఖత్వము పెరుగుతుంది. అటువంటి వారు భగవంతుని ఏకాగ్రతతో ధ్యానించడం ద్వారా, మనస్సును అదుపులో ఉంచుకో గలరు. భగవంతుని యందు మనస్సును ఏకాగ్రతతో లగ్నంచేయడం వలన వారిలోని మలినము లు కడిగివేయబడతాయి. మనస్సు నిర్మలంగా ఉంటుంది. దీనినే ధారణ అంటారు. ధారణ అంటే మనస్సును భగవంతునియందు ఏకాగ్రతతో ఉంచడం. ఈ ధారణా యోగంతో యోగి భగవంతుని దర్శింపగలడు. ధారణతోనే పరమాత్మయందు భక్తి కలుగుతుంది." అని చెప్పాడు శుకుడు.

అప్పుడు పరీక్షిత్తు ఇలా అన్నాడు. "ఓ మహర్షి! తమరు ధారణ గురించి చెప్పారు కదా! ఆ ధారణ ఏ విధంగా చేయాలి. అందరికీ ఇష్టమైన ధారణ ఏది? దేని గురించి ధారణ చెయ్యాలి? మానవునిలో పేరుకున్న మలములు అన్నీ ఏ విధమైన ధారణ ద్వారా తొలగిపోతాయి. మాకు వివరించండి." అని అడిగాడు.

అప్పుడు శుకమహర్షి ఇలా చెప్పసాగాడు. "యోగి తనకు తగినట్టు అనుకూలమైన ఆసనమును అమర్చుకోవాలి. ఇలాంటి ఆసనమే కావాలి అనే కోరిక ఉండకూడదు. తనకు ఉన్న ఆసనమును సుఖాసనముగా భావించాలి. తరువాత శ్వాసను నియంత్రించాలి. కోరికలను వదిలిపెట్టాలి. ఇంద్రియములను కట్టడి చేయాలి. ఇంద్రియములను ప్రాపంచిక విషయములతో ఉన్న సాంగత్యము నుండి విడివడేట్టు చేయాలి. తరువాత బుద్ధితోటి మనస్సును భగవంతుని రూపము నందు అనగా ఎదురుగా ఉన్న భగవంతుని స్థూల రూపము నందు ఉంచాలి.

భగవంతుడు విరాట్ స్వరూపుడు. అంతకంటే పెద్ద స్వరూపము మరొకటి లేదు. . ఈ స్థూలప్రకృతి అంతా ఆ విరాట్ స్వరూపము నుండే పుట్టింది. ఆ విరాట్ స్వరూపము భూత,భవిష్యత్ వర్తమానములతో కూడినది.

పృథివి, ఆకాశము, అగ్ని, వాయువు, జలము, మహత్త త్త్వము, అహంకారము ఈ ఏడింటితో కూడినదే ఆ విరాట్ స్వరూపము. సమస్తజీవకోటికి ఆయనే నియంత. పాతాళ లోకము ఆ విరాట్ స్వరూపము యొక్క పాదమూలము. రసాతలము ఆయనయొక్క పాదములు. మహాతలము చీలమండ. తలాతలము ఆయన కాలిపిక్కలు. సుతలము ఆయన జానువులు. అతలము, వితలము ఆయన యొక్క తొడలు. మహీతలము ఆయన నడుము. భువర్లోకము ఆయనయొక్క నాభి. స్వర్గము ఆయన యొక్క వక్షస్థలము. మహర్లోకము ఆయన మెడ. జనోలోకము ఆయన ముఖము. తపోలోకము ఆయన లలాటము. సత్యలోకము ఆయన శిరస్సు.

ఇంద్రుడు మొదలైన దేవతలు ఆయన యొక్క చేతులు. దిక్కులు ఆయన చెవులు. శబ్దము ఆయ వినికిడి శక్తి. అశ్వినిలు ఆయన ముక్కు రంధ్రములు. ఆయన ముఖమే అగ్ని.

ఆకాశము ఆయన నేత్రగోళములు. ఆకాశంలో ప్రకాశించే సూర్యచంద్రులు ఆయన కళ్లు. రేయింపగళ్లు ఆయన కనురెప్పలు. బ్రహ్మ పదము ఆయన భ్రూమధ్యము. వరుణుడు ఆయన దవడలు. నాలుక ఆయన రసాస్వాదనము చేసే శక్తి.

వేదములు ఆయన బ్రహ్మరంధ్రము. యముడు ఆయన కోరలు. భార్యాపుత్రుల యందు మమకారము ఆయన దంతములు. ఆయన మందహాసమే జగన్మాయ. ఈ సృష్టి ఆయన కటాక్షము.

సిగ్గు ఆయన పైపెదవి. లోభము ఆయన కింది పెదవి. ధర్మము ఆయన స్తనములు. అధర్మమే ఆయన వీపు. బ్రహ్మ ఆయన జననాంగము. మిత్రావరుణులు అండకోశములు. ఆయన పొట్ట సముద్రము. ఆయన ఎముకలే పర్వతములు.

ఆయన నాడులే నదులు. ఆయన శరీరంమీద ఉన్న రోమములే వృక్షజాతులు. వాయువే ఆయన శ్వాస. కాలమే ఆయన నడక. ప్రాణుల జీవన విధానమే ఆయన ఆట. మేఘములే ఆయన కేశములు. సాయంసంధ్య ఆయన వస్త్రము. ప్రకృతి ఆయన హృదయము. ఆయన మనస్సే చంద్రుడు. విజ్ఞాన శక్తి గల ఆయన చిత్తము ఆయన మహత్తత్త్వము. రుద్రుడే అహంకారము. అశ్వములు,

ఒంటెలు, ఏనుగులు ఆయన గోళ్లు. సమస్త మృగజాతి ఆయన కటిప్రదేశము. పక్షులు పరమాత్ముడు చెక్కిన శిల్పాలు.

స్వాయంభువు ఆయన బుద్ధి. మనుష్యుడు ఆయన ఉండే నివాసస్థానము. గంధర్వులు, విద్యాధరులు, చారణులు, అప్సరసలు ఆయన స్వరములు. అసురులు ఆయన వీర్యము. బ్రాహ్మణుడు ఆయన ముఖము. క్షత్రియులు ఆయన భుజములు. వైశ్యులు ఆయన తొడలు. శూద్రులు ఆయన పాదములు. ద్రవ్యములతో కూడిన యజ్ఞములు ఆయనకు ఇష్టమైన కర్మలు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు నేను విరాట్పురుషుని అవయవముల గురించి వివరంగా చెప్పాను. మోక్షము కోరు వారు తమ తమ బుద్ధిని అనుసరించి ఈ విరాట్స్వరూపుని స్థూల శరీరము నందు తమ మనస్సును లగ్నం చేస్తారు. దీనికంటే మించిన ఉపాయము మరొకటి లేదు. నీవు కూడా సత్యస్వరూపుడు అయిన ఆ శ్రీమన్నారాయణుని ధ్యానించు, తలించు. నారాయణుని కంటే వేరు దైవము లేదు. అలా కాకుండా నీవు ఇతర దేవతల మీద కూడా ఆసక్తి చూపిస్తే, నీకు దైవము నుండు భేదభావము కలుగుతుంది. మరలా సంసారప్రవృత్తిలో పడతావు.

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము మొదటి అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# ద్వితీయ స్కంధము
# రెండవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుతో ఇలా చెప్పాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! ఇంతకు పూర్వం కూడా సృష్టి ప్రారంభంలో బ్రహ్మ ఈ ధారణనే ఉపయోగించి తాను ప్రళయ కాలమునకు ముందు ఉన్న సృష్టి గురించిన జ్ఞానమును పరమాత్ముని నుండి పొందాడు. అట్టి జ్ఞానమును పొందిన తరువాత బ్రహ్మ ప్రళయమునకు ముందు ఈ సృష్టి ఎలా ఉండేదో అటువంటి సృష్టిని, ఈ సృష్టి ఇలాగే ఉండాలి అనే నిశ్చయాత్మక బుద్ధితో చేసాడు.

తరువాత శబ్దబ్రహ్మములు అయిన వేదములు సృష్టింపబడ్డాయి. ఆ వేదములలో వివిధములైన కర్మకాండల గురించి చెప్పబడింది. ఆ కర్మకాండలతో కూడిన యజ్ఞయాగములు చేస్తే ఈ లోకంలో సకల సుఖాలు కలుగుతాయి, స్వర్గలోక సుఖాలు లభిస్తాయి అన్న ఆలోచనలు మానవుని బుద్ధిలోకి ప్రవేశించాయి. ఇదే వేదమార్గము.

ఇహలోక సుఖములను, స్వర్గసుఖములను కోరుకున్న మానవులు ఆ కర్మకాండలకు రకరకాల పేర్లుపెట్టి ఆచరిస్తున్నారు. ఆ కర్మలను రకరకాల పేర్లతో పిలుస్తున్నారు. వేరు వేరు పేర్లుకల దైవములను పూజిస్తున్నారు. క్షణికములగు ఇహలోక సుఖములను స్వర్గ సుఖములను పొందుతున్నారు. ఆ సుఖములన్నీ కూడా మానవుడు స్వప్నములో సుఖాలు అనుభవించినట్టు అనుభవిస్తూ

మాయలో పడుతున్నాడు. అంతేగానీ ఈ విశ్వమునకు మూలము విశ్వచైతన్యమని, అది ఒకటే అనీ, దానిని రకరకాల పేర్లతో పిలువరనీ మరిచిపోతున్నాడు. శాశ్వతసుఖదాయకమగు పరమ పదమును చేరుకోవడానికి ఎవరూ ప్రయత్నించడం లేదు.

కాబట్టి బాగా చదువుకున్న వాళ్లు, జ్ఞానులు ఆ వివిధ రకములైన పేర్లతో పిలువబడే తాత్కాలిక సుఖముల కోసరం వెంపర్లాడ కూడదు. రకరకాల పేర్లతో ఉన్న సుఖముల అసలు స్వరూపాన్ని తెలుసు కోవాలి. కాబట్టి మానవుడు తన దేహమునకు ఎంత కావలెనో అంత వరకే కర్మలు చేయాలి. ఆ కర్మల వలన లభించు సుఖములను అనుభవించాలి. అ కర్మలను కూడా ప్రతిఫలాపేక్ష లేకుండా చేయాలి. ప్రాపంచిక సుఖములు, సాంసారిక సుఖములు శాశ్వత సుఖములు కావు అనే నిశ్చయాత్మక బుద్ధికలిగి ఉండాలి. మానవుని శరీర పోషణమునకు కావలసిన వస్తువులు అన్నీ ఈ ప్రకృతి ఏదో ఒక విధంగా సమకూరుస్తూ ఉన్నప్పుడు వాటి కోసరం మరలా పాకులాడటం ఎందుకు?

భగవంతుడు పడుకోడానికి భూమిని సృష్టించాడు. హాయిగా నేలమీద పడుకోవచ్చు. ఈ మెత్తటి పరుపులు ఎందుకు. అలాగే తలకింద పెట్టుకోడానికి మెత్తటి చెయ్యి ఉండగా, మెత్తటి దిండ్లు ఎందుకు? దేవుడు ఇచ్చిన చేతులు, ఆ చేతులు కలిపితే ఏర్పడే దోసిలి ఉండగా, వివిధ లోహములతో చేయబడిన భోజన పాత్రలు ఎందుకు? నారచీరలు, నూలు వస్త్రములు ఉండగా పట్టుపురుగులను చంపి, వాటి దారములతో నేసిన పట్టువస్త్రములు అవసరమా!

(కొందరు బంగారు పళ్లెములలో వెండి పళ్లెములతో తింటున్నాము

అని గొప్పలు చెప్పుకుంటారు. ప్రకృతి ఇచ్చిన అరటి ఆకులు. మర్రి ఆకులు, మోదుగ అకులు, ఉండగా బంగారు వెండి పళ్లాలు అవసరమా? అని కూడా ఈ శ్లోకానికి అర్థం చెప్పుకోవచ్చు.)

తినడానికి మధురమైన ఫలములు ఇచ్చు వృక్షములు, కాయలు, ఆకులు, దుంపలు ఉన్నాయి కదా! ఆహారం కోసరం జంతువులను చంపాలా?

(ఒక జంతువును మరొక జంతువుకు ఆహారంగా సమకూర్చాడు భగవంతుడు. కాని అన్ని జంతువులను మనిషి తన ఆహారం కోసరం విలాసాల కోసం చంపుతున్నాడు.)

అలాగే దాహము తీర్చుకోడానికి స్వచ్ఛములైన జలములు ఇచ్చే నదులు ఉన్నాయి కదా? అవి ఎండి పోలేదు కదా? తల దాచుకోడానికి కొండగుహలు ఉన్నాయి కదా?

(దొరికిన దానితో తృప్తి పడాలికానీ అది కావాలి ఇది కావాలి అని కోరుకోకూడదు అని అర్థం. ఉన్నదాంట్లో చిన్న ఇల్లు కట్టుకొని దానితో తృప్తి చెందాలి కానీ, గొప్పలకు పోయి అప్పులు చేసి పెద్ద పెద్ద భవనాలు కట్టి జీవితం కష్టాలపాలు చేసుకోకూడదు.)

తనను నమ్ముకున్న వారిని ఆ విష్ణువు రక్షిస్తున్నాడు కదా! వారి యోగక్షేమములు చూస్తున్నాడు కదా! అటువంటప్పుడు ఈ పండితులు ధనముతో గర్వించిన రాజులను, ధనవంతులను, ధనం కోసరం ఆశ్రయించడం ఎందుకు? వారిని సేవించడం ఎందుకు?

(చేసిన పనికి ప్రభుత్వం జీతం ఇస్తూ ఉన్నప్పుడు, దానితో తృప్తి పడకుండా, ఇంకా డబ్బు సంపాదించాలని దురాశతో అడ్డదారులు తొక్కడం, జైలుపాలవడం ఎందుకు. ఇటీవల అక్రమార్జనకు పాల్పడి జైలు పాలయిన ఐఏయస్ ఆఫీసర్లు, జడ్జీలే దీనికి చక్కని ఉదాహరణ. మనకు ఎంత అవసరమో, ఎంతప్రాప్తం ఉందో అది మనకు భగవంతుడు ఇస్తాడు అన్న భావన ప్రతి మనిషికీ ముఖ్యం.).

అందువలన మానవులు తమ తమ చిత్తములలో స్వతసిద్ధంగా కొలువై ఉన్న ఆ పరమాత్మను సేవించాలి. ఆ పరమాత్మ ప్రేమస్వరూపుడు. మనము ఏ దృష్టితో చూస్తే అలా కనపడతాడు. ఆ పరమాత్మ సర్వవ్యాపి. ఆది అంతములేని వాడు. సకల జీవుల దేహము లలో స్థిరముగా ఉన్నవాడు. అట్టి హరిని అందరూ పూజించాలి భజించాలి. దొరికిన దానితో తృప్తి పడాలి. దొరకని దాని కోసరం వెంపర్లాడకూడదు. కర్మల ఎడల ఆసక్తి విడిచిపెట్టాలి. చేసిన కర్మలకు వచ్చే ఫలితం మీద ఆసక్తి వదిలిపెట్టాలి. దాని వలన ఈ సంసార సాగరము నుండి విముక్తి లభిస్తుంది.

కేవలం ప్రాపంచిక కర్మలలో మునిగి పోయి, ఈ దేహసుఖం కోసరం కర్మలు చేసే వాడు, ధనం కోసరం పాకులాడే వాడు తప్ప, ఆ పరమాత్మను ఎవడు సేవించకుండా, భజించకుండా, ఉంటాడు? ఎవడైతే జీవిత మంతా విషయభోగములు అనుభవిస్తూ ఉంటాడో, వాడు మరణించిన తరువాత యముని ద్వారము వద్దనున్న వైతరణీ నదిలో పడి పోయి, తాను చేసిన కర్మలకు ఫలితం అనుభవిస్తూ ఉంటాడు. ఇవన్నీ తెలిసికూడా, పశువులాంటి బుద్ధిజ్ఞానము లేని వాడు

తప్ప, వేరే ఎవరైనా ఈ ప్రాపంచిక విషయములలో మునిగిపోయి జీవితాన్ని దు:ఖమయం చేసుకుంటాడా?

అందువలననే, సర్వసంగపరిత్యాగులు అయిన యోగులు తమ మనస్సును తమలో ఉన్న పరమాత్మవైపు మళ్లించి, ధ్యానము, ధారణ ద్వారా, చతుర్భుజములతో, శంఖ, చక్ర, గద, పద్మములతో శోభిల్లుతూ, అంగుష్టపరిమాణంలో తన హృదయంలో నిలిచిన పరమాత్మను నిరంతరమూ సేవిస్తూ ఉంటారు.
మానవుడు ముందు పరమాత్మను ధ్యానించాలి. తరువాత ధారణ ద్వారా ఆ పరమాత్మ స్వరూపమును హృదయములో నిలుపు కోవాలి. ఆ పరమాత్మ స్వరూపము ఈ విధంగా ఉంటుంది.

ప్రసన్నమైన ముఖము, తామర రేకుల వంటి విశాలమయిన కళ్లు కలవాడు. పసుసు పచ్చని రంగు గల వస్త్రము ధరించిన వాడు. రత్నములు, మణులు పొదిగిన అలంకారములు కలవాడు. రత్న కిరీటమును, కుండలములను ధరించిన వాడు. ఎల్లప్పుడూ యోగులతో పూజింపబడే పాదములు కలవాడు. శ్రీవత్సము అనే మచ్చ కలిగిన వక్షస్థలము కలవాడు. కంఠమున కౌస్తుభమును ధరించిన వాడు. మెడలో ఎప్పటికీ వాడిపోని వనమాలను ధరించిన వాడు. మేఖలము, ఉంగరములు, కాళ్లకు అందియలు, ముంజేతికి కంకణములు ధరించిన వాడు. నుదుటి మీద నల్లని వెంట్రుకలు పడుతుంటే చిరునవ్వుతో కూడిన ముఖము కలవాడు, తన చూపులతో సమస్తజీవులను అనుగ్రహించేవాడు అయిన ఆ పరమాత్మను మనస్సులో స్థిరంగా ఉండేటంత వరకూ ధ్యానం చెయ్యాలి.

పై చెప్పబడిన పరమాత్మ అంగాంగములను, పరమాత్మ పాదముల నుండి మొదలుపెట్టి పైన శిరస్సు వరకూ ఒక్కొక్కదానిని ధారణ ద్వారా మనసులో నిలుపుకోవాలి. ముందు ఒక అవయవము ను ధ్యానం చేయాలి. ఆ అవయవము మనసులో స్థిరంగా నిలుపుకున్న తరువాత మరొక అవయవమును ధ్యానం చేయాలి. ఒక్కొక్క అవయవాన్ని వదిలేస్తూ పై అవయవం దగ్గరకు వెళ్లాలి. ఆ ప్రకారంగా పాదముల దగ్గర నుండి శిరస్సు దాకా ధ్యానం, ధారణ చెయ్యాలి. పరమాత్మయందు భక్తి స్థిరపడేంత వరకూ ఈ ధారణ కొనసాగించాలి.

దానికి అవసరమైన కర్మలు అంటే పూజలు, ధ్యానము చెయ్యాలి. పూజలు చెయ్యడానికీ, ధ్యానం నిలవడానికీ మనకు ఒక స్థూల రూపం, విగ్రహం కావాలి. అందుకోసరం పైన చెప్పబడిన రూపంతో కూడిన విగ్రహములను పూజించాలి. ఈ పూజలు, ధ్యానము భక్తియోగము స్థిరపడేంతవరకూ మాత్రమే చెయ్యాలి. తరువాత భగవంతుని మీద అచంచలమైన భక్తిలో మునిగిపోవాలి.

(కాని మనం విగ్రహాలను పూజిస్తూ, వాటి మధ్య తర తమ బేధాలు కల్పిస్తూ అక్కడే ఉండిపోతున్నాము. భక్తి యోగాన్ని ధారణ చెయ్యడం లేదు.)

ఒక సారి భక్తియోగమును ధారణ చేసిన యోగి, తాను ఈ దేహమును విడువ దలచి నప్పుడు ఒక పుణ్యక్షేత్రములో స్థిరమైన

ఆసనమును ఏర్పరచుకోవాలి. ప్రాణాయామం చెయ్యాలి. ఈ పని చెయ్యడానికి ప్రత్యేకమైన కాలం ఏమీ లేదు. సర్వకాల సర్వావస్థల యందు చెయ్యవచ్చు. ఇంద్రియములను నిగ్రహించుకోవాలి.

ఆ సమయంలో ప్రాపంచిక విషయముల యందు మనసును పోనీయరాదు. తన బుద్ధి చేత మనస్సును జయించాలి. మనస్సును నిర్మలంగా ఉంచుకోవాలి. తరువాత తన బుద్ధిని జీవాత్మలో లీనం చెయ్యాలి. జీవాత్మను తనలో ఉన్న పరిశుద్ధ ఆత్మయందు లయం చేయాలి. అప్పుడు పరమ శాంతిని పొందుతాడు. బాహ్య ప్రపంచంతో సంబంధం తెగిపోతుంది. అటువంటి యోగి బ్రహ్మస్వరూపమును పొందుతాడు.

అప్పుడు ఆ యోగి కాలమునకు కూడా అతీతుడు అవుతాడు. అటువంటి యోగిని ప్రకృతి శక్తులను శాసించే ఇంద్రుడు మొదలగు దేవతా గణములు కూడా ఏమీ చేయజాలవు. బ్రహ్మస్వరూపమును పొందిన యోగి మీద సత్త్వ,రజస్, తమో గుణములు, అహంకారము, మహతత్త్వము, ప్రకృతి తమ ప్రభావమును చూపలేవు.

అటువంటి యోగులు పరమాత్మ కన్నా భిన్నమైన వాటిని ఇది కాదు, ఇది వద్దు అంటూ వదిలేస్తారు. వాటి మీద ఏ మాత్రం ఆసక్తి చూపరు. ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని, దేహం మీద అభిమానమును ప్రేమను విడిచిపెడతారు. తమ హృదయంలో పరమాత్మను నిలుపుకుంటారు. సదా పరమాత్మనే ధ్యానం చేస్తుంటారు. దీనినే పరమపదము అని పిలుస్తారు.

ఈ ప్రకారంగా బ్రహ్మస్వరూపమును పొందిన యోగి, విషయ వాసనలను సమూలంగా నాశనం చేసిన యోగి, తన పాదము యొక్క మడిమతో తన మలద్వారమును మూసివేస్తాడు. ప్రాణవాయువును ఆరు చక్రముల గుండా పైకి తీసుకొని పోతాడు.

మొదట మూలాధారము నుండి  నాభి కింద ఉన్న స్వాధిష్టాన చక్రము వద్దకు తీసుకొనిపోవాలి.  తరువాత నాభి దగ్గర ఉన్న మణిపూరక చక్రము, తరువాత హృదయము దగ్గర ఉన్న అనాహత చక్రము. అక్కడి నుండి మెడకు కింది భాగములో ఉన్న విశుద్ధ చక్రము. ప్రాణ వాయువును ఈ చక్రముల గుండా తీసుకొని పోయి తుదకు దవడల వద్దకు చేర్చాలి.

తరువాత కళ్లు, చెవులు, ముక్కు, ముఖము  మూసుకొని వీటి గుండా ప్రాణములు బయటకు పోకుండా ఆపాలి. తరువాత దవడలలో ఉన్న ప్రాణ వాయువును రెండు కనుబొమల మధ్య ఉన్న ఆజ్ఞాచక్రము వద్దకు చేర్చాలి.  అక్కడి నుండి ప్రాణవాయువును ఒక క్రమపద్ధతిలో సహస్రారమునకు తీసుకొని వెళ్లాలి. అక్కడ పరమాత్మలో ఐక్యం చెయ్యాలి. ఆ తరువాత తల పైభాగములో ఉన్న బ్రహ్మరంధ్రమును ఛేధించుకొని ఈ శరీరమును విడిచిపెట్టాలి.

కొంత మంది యోగులు బ్రహ్మలోకానికి పోవాలని కోరుకుంటారు.  మరి కొందరు ఆకాశంలో విహరించే సిద్ధులు, సాధ్యులతో విహరించాలని కోరుకుంటారు. మరి కొందరు అణిమాది అష్టసిద్ధులు కావాలని కోరుకుంటారు. అటువంటి కోరికలు ఉన్న యోగులు తాము ఈ దేహమును విడిచిపెట్టే సమయంలో మనస్సులో

ఉన్న ఆ కోరికలతో, వాసనలతో పాటు ఆ యా లోకములకు వెళతారు.

ఈ ప్రకారంగా పరమాత్మను ఉపాసిస్తూ, తపస్సు చేస్తూ, జ్ఞానమును సంపాదించుకున్న యోగులకు ముల్లోకములలో, లోపలా, బయటా, స్వేచ్ఛగా సంచరించే అధికారము లభిస్తుంది. కాని ఆ యోగులు భూలోకములో ఉన్న స్థూల శరీరముతో కాకుండా, కేవలం తమ సూక్ష్మశరీరముతో, వాయు రూపంలో మాత్రమే సంచరించ గలరు. ధారణ, ధ్యానము, తపస్సు చేయకుండా కేవలము యజ్ఞయాగాదులు మొదలగు కర్మలు చేసే వారికి ముల్లోకములలో సంచరించే అధికారము లభించదు.

మన దేహంలో ఉన్న వెనుబాము మధ్యలో ఉన్న ప్రకాశవంతమైన సుషుమ్నా నాడి ద్వారా బ్రహ్మలోకమునకు వెళ్లాలి అనుకున్న యోగి ముందు ఆకాశ మార్గంలో అగ్నిలోకమునకు వెళతాడు. ఆ అగ్ని లోకంలో తన మలినములు అన్నీ పోగొట్టుకుంటాడు. పరిశుద్ధుడు అవుతాడు. అక్కడినుండి శిశుమార చక్రమునకు చేరుకుంటాడు. (దీనినే కాల చక్రము అని కూడా అంటారు. అంటే కాలానికి అతీతుడు అవుతాడు అని అర్థం.)

తరువాత ఆ యోగి తన సూక్ష్మశరీరంతో బ్రహ్మకు జన్మస్థానమైన విష్ణు నాభి దగ్గరకు వెళతాడు. ఆ విష్ణునాభిని దాటుకొని ఆ యోగి తనసూక్ష్మ శరీరంతో భృగువు మొదలగు మహాఋషులు సంచరించే మహర్లోకము చేరుకుంటాడు. అక్కడ బ్రహ్మవేత్తలు ఉంటారు. యోగి కల్పాంతము వరకూ మహర్లోకములోనే ఉంటాడు.

కల్పాంతంలో ఈ విశ్వము అంతా అంతమయి పోతుంది. అప్పుడు అక్కడ ఉన్న ఋషులు, సిద్ధులతో కలిసి ఆ యోగి బ్రహ్మలోకము చేరుకుంటాడు. బ్రహ్మలోకములో దు:ఖము కానీ, ముసలితనము కానీ, భయము కానీ, చావు గానీ ఉండవు. అంతా ఆనందమయంగా ఉంటుంది.

అక్కడకు చేరుకున్న యోగులు, భూలోకములో అను నిత్యమూ ఈ సంసార సాగరంలో పడి కొట్టుకుంటూ, ప్రాపంచిక సుఖములకోసం పాకులాడుతూ భగవంతుని మరిచిపోయి, అనంతమైన దు:ఖంలో మునిగి పోయిన మానవులను చూచి, అయ్యో పాపం, వీరు అవిద్యలో, అజ్ఞానంలో పడి కొట్టుకుంటున్నారు, వీళ్లు ఎప్పుడు బాగుపడతారో కదా, అని బాధపడటం తప్ప వేరే దు:ఖము బ్రహ్మలోకములో ఉండదు.

మృత్యుభయమును కూడా విడిచి పెట్టిన ఆ యోగి భూమి నుండి జలతత్త్వమును, జలతత్త్వము నుండి వాయు రూపమును పొందుతాడు. వాయు రూపము నుండి పరమాత్మ స్వరూపమైన ఆకాశరూపమును పొందుతాడు.

అప్పుడు ఆ యోగి ముక్కుతో పీల్చదగిన వాసనను, నాలుకతో గ్రహించదగిన రసమును, కళ్లతో చూడదగిన రూపములను, చర్మముతో అనుభవించదగ్గ స్పర్శసుఖమును, చెవులతో వినదగిన ధ్వనులను, కర్మేంద్రియములతో చేయదగిన అన్ని పనులను అతిక్రమిస్తాడు. అంటే యోగి పంచ తన్మాత్రలను పరమాత్మలో ఐక్యం చేస్తాడు. జ్ఞానేంద్రియములను,

కర్మేంద్రియములను జయిస్తాడు.

తరువాత ఆ యోగి తన స్థూలశరీరములో ఉన్న తత్త్వములను సత్త్వ, రజస్తమోగుణములతో కూడిన సాత్విక,రాజస తామస అహంకారములతో లయం చేస్తాడు. తరువాత యోగి సాత్విక,రాజస, తామస అహంకారములతో కూడిన విజ్ఞాన తత్త్వమునకు (మహత్తత్వమునకు) చేరుకుంటాడు. తరువాత ఈ సత్వ, రజస్, తమో గుణములు కలిసి పోయి సమానత్వమును పొందే ప్రధాన స్వరూపమును చేరుకుంటాడు. ఆ ప్రధానస్వరూపము నందు యోగి మహదానందాన్ని పొందుతాడు. ఆ తరువాత, ఉపాధులు అన్నీ అంతరించి పోగా, ఆనంద స్వరూపుడు, శాంతమూర్తి అయిన పరమాత్మను చేరుకుంటాడు. దీనినే భాగవతగతి అని అంటారు. ఒక సారి విష్ణుపదమైన పరమ పదమును పొందిన యోగికి జన్మలేదు. విష్ణుసాయుజ్యం పొందుతాడు.

ఓ పరీక్షిత్తు మహారాజా! నీకు వేదములలో చెప్పబడినవీ, ముక్తి పొందడానికి చెప్పబడ్డ రెండు సనాతన మార్గములను గూర్చి విపులంగా చెప్పాను. ఈ విషయాలన్నీ పూర్వము వాసుదేవుడు బ్రహ్మకు ఉపదేశించాడు. అవే నీకు చెప్పాను.

నిరంతరమూ సంసార చక్రములో, ప్రాపంచిక సుఖములలో పడి కొట్టు కుంటున్న మానవులకు ముక్తి పొందాలంటే, వాసుదేవుని యందు (పరమాత్మ యందు) అనన్యమైన, నిర్మలమైన భక్తి కలిగి ఉండటం తప్ప మరో మార్గం లేదు.

బ్రహ్మదేవుడు అన్ని వేదములను పరిశీలించి పరిశోధించి, వాసుదేవుని యందు నిర్మలమైన, ఏకాగ్రమైన భక్తి కలిగి ఉండటమే మోక్ష మార్గమనీ, పరమధర్మమనీ తన బుద్ధితో నిశ్చయించేసాడు.

మనము శ్రీహరి అన్నా, వాసుదేవుడు అన్నా, విష్ణువు అన్నా అన్నీ ఆ పరమాత్మ నామములే. ఆ పరమాత్మ అంతర్యామి రూపంలో సర్వభూతములయందు నివసించి ఉన్నాడు. ఆ పరమాత్మను మానవులు బుద్ధితోనూ, జ్ఞానముతోనూ తెలుసుకోవాలి. పరమాత్మను తెలుసుకోడానికి తగిన సాధనం అచంచలమైన భక్తి. మానవుడు సర్వకాల, సర్వావస్థల యందు, అన్ని ప్రదేశములయందు ఆ పరమాత్మను ధ్యానించాలి, కీర్తించాలి, స్మరించాలి. ఆ పరమాత్మ కథలను వీనుల విందుగా వినాలి. అర్థం చేసుకోవాలి. దానివలన మానవుల అంతఃకరణ పవిత్రము అవుతుంది. మనసు విషయవాసనల వంకకు, పాపకర్మల జోలికి పోదు. అంతకుముందు పాపపు పనులు చేయడానికి అలవాటు పడ్డ వాళ్లు కూడా వాటిని వెంటనే వెడిచిపెడతారు. మనస్సును పవిత్రంగా ఉంచుకుంటారు. బుద్ధి ద్వారా జీవాత్మను పరమాత్మవైపు మళ్లిస్తారు. అటువంటి మానవుడు తుదకు విష్ణువు యొక్క పాదపద్మముల వద్దకు చేరుకుంటాడు.

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము

# శ్రీమద్భాగవతము

# ద్వితీయ స్కంధము

# మూడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుతో ఇలా అన్నాడు.

“ఓ రాజా! బుద్ధిమంతులయిన మానవులు తమ అవసానకాలములో ఏమి చెయ్యాలి? ఎలా ప్రవర్తించాలి? ఎవరిని ధ్యానించాలి? అని నీవు అడిగావు. అటువంటి వారు పరమాత్మను గురించిన కథలను వినడం, పరమాత్మను కీర్తించడం మాత్రమే చెయ్యదగిన పని అని నీకు వివరించాను.

బ్రహ్మ వర్చస్సు కావాలనుకొనే వారు బ్రహ్మదేవుని ధ్యానించాలి. తమ తమ ఇంద్రియములు మంచి పటుత్వంతో వర్ధిల్లాలి అని కోరుకొనే వారు ఇంద్రుని ధ్యానించాలి. అలాగే సంతానము కావాలి అని కోరుకొనే వారు ప్రజాపతులను సేవించాలి.

రక రకాల కోరికలను కోరుకొనే వారు ప్రకృతి మాతను పూజించాలి. ధనం కావాలి అని కోరుకొనే వారు వసువులను పూజించాలి. వీరత్వము కావాలని కోరుకొనేవారు రుద్రులను ధ్యానించాలి.

తనకు మంచి ఆహారము లభించాలి అని కోరుకొనే వారు అదితిని ధ్యానించాలి. స్వర్గలోక సుఖాలనుకోరుకొనే వారు 12 మంది ఆదిత్యులను పూజించాలి. రాజ్యము కావాలి అని కోరుకొనే వారు విశ్వే

దేవతలను, ప్రజల అభివృద్ధి కావాలి అని కోరుకొనేవారు సాధ్యులను ధ్యానించాలి. దీర్ఘాయుష్షు కోరుకొనేవారు అశ్వినీ దేవతలను, పుష్టిగా ఉండాలని కోరుకొనేవారు భూదేవిని, పేరు ప్రతిష్ఠలు కావాలను కొనేవారు పృథివిని, స్వర్గాధినేతలను, మంచి రూపము కావాలని కోరుకొనేవారు గంధర్వులను, మంచి స్త్రీలు కావాలని కోరుకొనేవారు ఊర్వశిని, రాజ్యాధి కారము కావాలని కోరుకొనేవారు బ్రహ్మను ధ్యానించాలి.

యశస్సును కోరేవారు యజ్ఞాలు చెయ్యాలి. యజ్ఞమునకు అధిదేవత అయిన విష్ణువును పూజించాలి. ధనము పోగుచేసుకో దలచిన వారు వరుణుని ధ్యానించాలి. విద్యావంతుడు కావాలని కోరుకొనే వాడు శివుని ధ్యానించాలి. కలకాలము ఆనందకరమైన దాంపత్యజీవితము గడపాలని కోరుకొనేవారు ఉమాదేవిని పూజించాలి.

జీవితము అంతా ధర్మంగా గడపాలని కోరుకొనే వారు విష్ణువును పూజించాలి. ఎక్కువ సంతానము కావాలని కోరుకొనేవారు పితృదేవతలను ఆరాధించాలి. శారీరక, మానసిక బాధలు తీరాలని కోరుకొనేవారు యక్షులను, మంచి బలవంతులు కావాలని కోరుకొనేవారు మరుద్గణములనుపూజించాలి.

రాజ్యం కావాలని కోరుకొనే వారు మనువులను, శత్రునాశనము కోరుకొనేవారు నిర్‌ఋతులను (రాక్షస గణములను), భోగలాలసులైన వారు చంద్రుని, కోరికలు లేకుండా కేవలం దైవభక్తిని కోరుకొనేవాడు పరమాత్మను ధ్యానించాలి.

పైన చెప్పినవి అన్నీ కోరికలు. ఆ కోరికలు తీరడానికి పూజలు, క్రతువులు చేస్తారు. కానీ ఏ కోరికా లేని వాడు, తాను చేసే కర్మల ఫలితమును కోరని వాడు, తాను చేసిన కర్మల వలన కలిగిన ఫలితములను పరమాత్మకు అర్పించేవాడు, ఇతరుల ఎడల ఉదారంగా ఉండేవాడు, మరణించిన తరువాత మోక్షమును కోరుకొనే వాడు, ఎల్లప్పుడూ ఆ పరమాత్మను పూజించాలి. ధ్యానించాలి. భజించాలి, కీర్తించాలి. పౌరాణికుల ముఖతా పురాణ గాథలు, హరి కథలు, వింటే జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానం వలన రాగ ద్వేషాలు నశిస్తాయి. మనస్సు శాంతిని పొందుతుంది. ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది. సత్వ రజస్ తమోగుణముల యందు ఆసక్తి తగ్గిపోతుంది. భక్తి పెంపొందు తుంది. ఇన్ని ఫలితములను ఇచ్చే హరికథలను వినడం వలన సత్పురుషులు సుఖాన్ని పొందుతారు. అటువంటి హరికథలను వినడం యందు ఆసక్తి ఎవరికి కలుగదు?" అని చెప్పాడు శుక మహర్షి.

సూత పౌరాణికుడు చెబుతున్న భాగవత పురాణమును వింటున్న శౌనకుడు సూతుని ఇలా అడిగాడు. "ఓ సూతపౌరాణికుడా! శుక యోగీంద్రులు చెప్పిన మాటలు విన్న పరీక్షిత్తు మహారాజు ఏమన్నాడు? ఇంకా ఏమేమి చెప్పమని అడిగాడు? శుకుడు పరీక్షిత్తుకు కేవలం భగవంతుని గురించిన కథలను చెబుతాడని మాకు తెలుసు. వాటిని పరీక్షిత్తు శ్రద్ధగా వింటాడు.

ఎందుకంటే, పరీక్షిత్తు తన చిన్న తనంలో ఇతర ఆటవస్తువుల జోలికి పోకుండా కేవలం కృష్ణవిగ్రహములతోనే, కృష్ణలీలలనే ఆటలుగా ఆడుకొనేవాడని విన్నాము. పరీక్షిత్తు అంతటి

కృష్ణభక్తి కలవాడు.

ఇంక శుకమహర్షి సంగతి చెప్ప పనిలేదు. ఆయన నిరంతర వాసుదేవ స్మరణ తప్ప మరొకటి తెలియని వాడు. ఆ ఇరువురి సంభాషణలలో శ్రీకృష్ణ పరమాత్మ దివ్య కథలు తప్ప వేరే ఏ విషయము లను చర్చిస్తారు.

ప్రతీరోజూ కాలం నడుస్తూ ఉంటుంది. సూర్యుడు ఉదయించి అస్తమిస్తుంటాడు. సాధారణ మానవుని ఆయుఃప్రమాణము ప్రతిరోజూ తగ్గిపోతూ ఉంటుంది. కానీ భగవత్కథ లను వింటూ భగవంతుని గురించి కీర్తించేవారి ఆయువు ఎన్నటికీ తరగదు. ఇంకా వృద్ధిపొందుతుంది.

ఎందుకంటే, భగవంతుని కీర్తించకుండా, భగవంతుని కథలను వినకుండా, భగవంతుని స్మరించకుండా వృధాగా జీవితం గడిపే మానవులు వృక్షములతో సమానము. అటువంటి మానవులు ఊపిరిపీల్చుకుంటున్నారు వదులుతున్నారు, కొలిమి తిత్తికూడా గాలి పీల్చుకొని వదులుతూ ఉంది. రెండింటికీ తేడా ఏముంది. జంతువులు, పశువులు తిని తిరుగుతున్నాయి, శారీరక సుఖములు, మైధున సుఖములు అనుభవిస్తున్నాయి. ఈ మానవులు కూడా తిని తిరుగుతున్నారు. నిద్రా, మైధునాలతో జీవితం వృధాగా గడుపుతున్నారు. జంతువులకు మానవులకు తేడా ఏముంది.

చెవులు ఉన్నందుకు ఎల్లప్పుడూ హరికథామృతమును వినాలి. నోరుఉన్నందుకు శ్రీకృష్ణ గాధలను గానం చెయ్యాలి. లేకపోతే

చెవులు నోరు కేవలం రంధ్రాలుగానే మిగిలిపోతాయి. కుక్కలకు, గాడిదలకు కూడా చెవులు నోరు ఉన్నాయి. ఈ మానవులకూ చెవులు నోరూ ఉన్నాయి. ఏమి ప్రయోజనం?పనికిరాని మాటలు వినడానికి, మాట్లాడటానికి తప్ప ఎందుకూ పనికిరావు.

సర్వాంతర్యామి అయిన విష్ణువు కథలను వినని చెవులు కేవలం రంధ్రములు తప్ప వేరు కాదు. అలాగే విష్ణువు కథలను గానం చెయ్యని నాలుక కప్పనాలుక మాదిరి పురుగులను తినడానికే పనికివస్తుంది. చివరకు కప్ప సర్పం నోటిలో పడ్డట్టు ఈ మానవులు మృత్యుముఖంలో పడతారు.

రత్న, మణిమయ కిరీటములను ధరించే మహారాజులు గానీ, చక్రవర్తులు కానీ, అత్యంత విలువైన వస్త్రములను తలపాగా లుగా ధరించే ధనవంతులు గానీ, తమ తమ శిరస్సులతో శ్రీహరికి నమస్కరించకపోతే, ఆ తలలు కేవలం రత్న కిరీటములు, తలపాగాలు మొయ్యడానికే పనికివస్తాయి. అలాగే రత్నకంకణములు ధరించిన చేతులు, శ్రీహరికి నమస్కరించకపోతే, ఆ చేతులు కేవలం రత్న కంకణములు మొయ్యడానికే పనికొస్తాయి. చచ్చిన తరువాత తలకు ఆ కిరీటాలూ ఉండవు, చేతులకు కంకణాలూ ఉండవు.

అలాగే శ్రీహరిని చూడని కళ్లు, నెమలిపింఛములో ఉన్న కళ్లమాదిరి, నిర్జీవములైన కళ్లు మాత్రమే. విష్ణుసాన్నిధ్యమునకు వెళ్లని కాళ్లు, చెట్ల మొదళ్ల లాంటివి. ఎక్కడికీ కదలలేవు.

భగవంతునికి కానీ, భగవంతుని భక్తుల పాదములకు కానీ

నమస్కరించని వాడి బతుకు వృధా. వాడు బతికి ఉన్నా చచ్చిన శవంతో సమానమే! శ్రీవిష్ణుపాదముల చెంత పెట్టిన తులసీ దళములను స్వీకరించి కళ్లకు అద్దుకొని ఆ తులసీ దళముల సువాసనను పీల్చి ధన్యుడు కాని వాడు, బతికి ఉండీ శ్వాస పీలుస్తున్న శవంతో సమానము.

శ్రీహరి నామములను కీర్తిస్తూ ఉన్నప్పుడు కళ్ల వెంట నీళ్లు కారుతూ, ఆ నామామృతమును ఆస్వాదిస్తూ అనుభవిస్తూ తాదాత్మ్యము చెందని, హృదయము ద్రవించని, వాడి మనస్సు రాతికంటే కఠినము అయినది.

మేము అలాంటి బతుకు బతక దలచలేదు. మాకు శ్రీహరి కథామృతము కావాలి. కాబట్టి పరీక్షిత్తు మహారాజు అడిగిన ప్రశ్నలకు శుకమహర్షి ఏమని సమాధానము చెప్పాడు? శ్రీహరి కథలను శుక మహర్షి పరీక్షిత్తుకు ఎలా చెప్పాడు? అవన్నీ మాకు వివరంగా చెప్పు. మాకు చాలా కుతూహలంగా ఉంది." అని శౌనకుడు సూతపౌరాణికుని అడిగాడు.

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ద్వితీయ స్కంధము
నాలుగవ అధ్యాయము.

శౌనకుడి చేత పైవిధముగా అడగబడిన సూత పౌరాణికుడు శౌనకుడితో ఇలా అన్నాడు.

" ఓ బ్రాహ్మణోత్తములారా! ఆ ప్రకారంగా ఆత్మతత్త్వమును శుక మహర్షివలన విన్న పరీక్షిత్తు మహారాజు, పవిత్రము, శుద్ధము, నిర్మలము అయిన తన మనస్సును పరమాత్మయందు నిలిపాడు.

దేహాభి మానమును విడిచిపెట్టాడు. భార్య మీద పుత్రుల మీద ఉన్న వ్యామోహమును వదిలిపెట్టాడు. బంధు ప్రీతిని విడిచి పెట్టాడు. ధనమును, సుఖములను త్యజించాడు. రాజ్యమును తన కుమారునికి ఇచ్చాడు. నేను నాది అనే భావాన్ని విడిచిపెట్టాడు. భవబంధాలన్నీ తెంచుకున్నాడు.

ఇంక ఏడు రోజులలో తనకు మృత్యువు ఆసన్నమవుతుందని తెలిసి, ధర్మార్థకామములను విడిచిపెట్టి, కృష్ణునిమీద ఆత్మభావాన్ని నిలిపి, వానప్రస్థము స్వీకరించాడు. శుక మహర్షిని చూచి ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! పరిపూర్ణజ్ఞానముతో నిండి ఉన్న మీ బోధనల వలన నా మనస్సు పునీతమయింది. నాలో ఉన్న అజ్ఞానము అనే

అంధకారము నశించింది. జ్ఞానజ్యోతి వెలిగింది. మీరు చెప్పబోవు హరికథలను వినుట యందు ఆసక్తిని కలిగి ఉన్నాను.

గొప్ప గొప్ప మునీశ్వరులు, యోగులు కూడా ఈ అనంత విశ్వసృష్టిని చూచి ఆశ్చర్యపడు తుంటారు. ఆ పరమాత్మ తన మాయాశక్తితో ఈ విశ్వాన్ని ఎలా సృష్టించాడు. మీరు ఇదివరకే దీని గురించి చెప్పినా మరలా చెప్పండి. నాకు మరలా మరలా వినవలెనని కోరికగా ఉంది.

ఆ పరమాత్మ శక్తి అపారమైనది. అటువంటి అపారమైన శక్తిసంపన్నుడైన ఆ పరమాత్మ ఏ శక్తిని ఉపాసించి ఈ విశ్వాన్ని సృష్టించాడు? ఎలా పరిపాలిస్తున్నాడు? ఎలా తనలో లయం చేసుకుంటున్నాడు. ఆ భగవంతుడు, ఆటలాడుకుంటున్న విధంగా, తన మాయాశక్తితో ఈ జగత్తును, మహాతత్త్వము, అహంకారము మొదలగు తత్త్వములను సృష్టించాడు. తానే బ్రహ్మ, మరీచులు మొదలగు దేవతా గణములు అయి తనలో తానే క్రీడిస్తున్నాడు. అలాగే దేవతలు, మనుష్యులు, జంతువుల రూపంలో తనను తాను సృష్టించు కుంటున్నాడు.

ఇదంతా కేవలము క్రీడార్థము చేస్తున్నాడు కదా! ఇదంతా ఎలా జరుగుతూ ఉంది. ఆ పరమాత్మ ఎలా చేస్తున్నాడు. పరమాత్మచే నిర్వర్తింపబడుతున్న ఈ సృష్టి గొప్ప గొప్ప పండితులకు కూడా అర్థంకాదు. ఇంక పామరుడైన నాకు ఏమి అర్థం అవుతుంది. ఆ పరమాత్మ తన విరాట్ స్వరూపముతో బ్రహ్మ మొదలగు దేవతా

గణముల రూపములను తానే ధరించి, ఎన్నో కర్మలను చేస్తూ, ప్రకృతిలో ఉన్న సత్త్వ,రజస్తమోగుణములను ఎలా స్వీకరించాడో నాకు తెలుపండి. తమకు వేదములు, శాస్త్రములు, భగవంతుని తత్త్వము బాగా తెలుసు. అందుకని నా సందేహములను తీర్చండి." అని ప్రార్థించాడు పరీక్షిత్తు.

పరీక్షిత్తు మహారాజు అడిగిన ప్రశ్నలను శుకుడు సావధానంగా విన్నాడు. ముందుగా పరమపురుషుడైన శ్రీకృష్ణుని మనసులో స్మరించు కున్నాడు. సమస్తదేవతలకు, గురువులకు నమస్కరించాడు. తరువాత పరీక్షిత్తు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పనారంభించాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ అనంత విశ్వాన్ని సృష్టించి, పోషించి, లయం చేసేవాడు, సమస్త జీవులలో అంతర్యామిగా ఉన్నవాడు, అత్యంత మహిమాన్వితుడు, శక్తిమంతుడు, పరమ పురుషుడు అయిన ఆ పరమాత్మకు నమస్కరిస్తున్నాను. తాను ఒక్కడే అయినప్పటికీ, రజోగుణ ప్రధానంగా బ్రహ్మగానూ, సత్త్వ గుణ ప్రధానంగా విష్ణువుగానూ, తమోగుణ ప్రధానంగా శివుడు గానూ ప్రవర్తించిన ఆ పరమాత్మకు నమస్కారము.

తనను ఆరాధించి పూజించి భజించే సత్పురుషులను సదా రక్షించువాడు, వారి బాధలను తొలగించువాడు, సమస్త దేవతా రూపములను తానే ధరించి, ఆయాదేవతలను పూజించే వారికి తగిన ఫలములను ఇచ్చేవాడు (సర్వదేవనమస్కార: కేశవం ప్రతిగచ్ఛతి అని సంధ్యావందనంలో చెప్పుకుంటాము కదా!), సన్యాసాశ్రమము

స్వీకరించిన వారికి ఆత్మతత్త్వమును ప్రసాదించే ఆ పరమపురుషునికి నమస్కారము.

సత్త్వగుణ ప్రధానుడైన పరమాత్మకు నమస్కారము. తన భక్తులను ఎల్లప్పుడూ రక్షించేవాడికి, తన మీద భక్తిలేని వారికి ఏ మాత్రమూ లభ్యంకాని వాడికి నమస్కారము. తన కంటే సమానమైన వాడు కానీ, తనకంటే అధికుడైన వాడు కానీ లేని ఆ పరమాత్మకు నమస్కారము. సకల జీవులయందు ఆత్మస్వరూపము లో ఉండి కూడా, ఎల్లప్పుడూ తన స్వస్వరూపముతో విహరించేవాడికి నమస్కారము.

ఆ భగవంతుని కీర్తించినా, భజించినా, స్మరించినా, దర్శించినా, పూజించినా, వారిపాపములు పటాపంచలయి పోతాయి. అట్టి భగవానునికి నమస్కారము.

ఆ పరమాత్మయందు ఉన్న భక్తితో, జ్ఞానులు ఆయన పాదములను ఆశ్రయించి, ఈ లోకములో ఉన్న సుఖములను, పరలోకములో లభించే స్వర్గాది సుఖములను విడిచి పెట్టి, ఎల్లప్పుడూ ఆ పరబ్రహ్మలో లీనం కావడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. అటువంటి పరమాత్మకు నమస్కారము.

ఎల్లప్పుడూ తపస్సు చేసుకొనే వారు, దానధర్మములు చేసేవారు, మంచి కీర్తిని పొందిన వారు, మంచి మనసు కలవారు, వేదములు అభ్యసించిన వారు, ఎల్లప్పుడు సన్మార్గములో నడిచేవారు,

తాము చేసిన ప్రతి కర్మను ఆ పరమాత్మకు అర్పిస్తారు. ఆ కర్మఫలముల కోసరం ఆశించరు. అట్టి పరమాత్మకు నమస్కారము.

అత్యంత పాపాత్ములగు కిరాతులు మొదలగు పాపజాతులు కూడా, నిర్మలమనస్కులైన భగవద్భక్తులను ఆశ్రయిస్తే, పునీతులవుతారు. అటువంటి పరమాత్మకు నమస్కారము.

జ్ఞానుల చేత ఆత్మతత్త్వరూపంలో ఉపాసింపబడేవాడు, పరమేశ్వరుడు, వేదస్వరూపుడు, ధర్మస్వరూపుడు, తపోమయుడు, అయిన ఆ పరమాత్మ నాకు ప్రసన్నుడగును గాక!

సంపదలకు అధిపతి అయిన, యజ్ఞములకు అధిపతి అయిన, ప్రజాపతి అయిన, బుద్ధికి అధిపతి అయిన, ముల్లోకములకు అధిపతి అయిన, ఈ భూమండలమునకు అధిపతి అయిన, అంధక, వృష్ణి, సాత్వత వంశీయులలో శ్రేష్టుడు అయిన, అందరికీ రక్షకుడు అయిన, తన భక్తులను ఎల్లప్పుడూ రక్షించేవాడు అయిన ఆ పరమాత్మకు నమస్కరిస్తున్నాను.

యోగులు అయిన వాళ్లు ఆ పరమాత్మ పాద పద్మములను మనసులో నిలుపుకొని ధ్యానసమాధిలో ఉండి ఆ పరమాత్మను ధ్యానిస్తారు. దానితో వారి బుద్ధి పరిశుద్ధము అవుతుంది. అటువంటి బుద్ధితోనే యోగులు ఆత్మతత్త్వమును పొందగలుగుతారు. ఈ ఆత్మ తత్త్వమును పండితులు, కవులు, పరమాత్మ స్వరూపమును కొందరు ఆకారంతోనూ, మరి కొందరు ఆకారం లేకుండానూ (సాకార, నిరాకార ములతో) తమ ఇష్టం వచ్చినట్టు, తమకు తోచినట్టు ప్రచారం

చేస్తుంటారు. అటువంటి వారు ఆత్మ తత్త్వమును సరిగా అర్థం చేసుకోలేరు. అటువంటి భగవంతునికి నమస్కారము.

కల్పాంతంలో ఈ సృష్టివిషయములు అన్నీ సూక్ష్మరూపంలో బ్రహ్మదేవుని హృదయంలో నిక్షిప్తమై ఉన్నాయి. మరలా సృష్టి జరగాలంటే అవి బ్రహ్మ దేవుని హృదయం నుండి బయటకు రావాలి. అప్పుడు పరమాత్మ సరస్వతీ దేవిని ప్రేరేపించాడు. పరమాత్మ ప్రేరణతో సరస్వతీ దేవి వాక్కు రూపంలో బ్రహ్మ ముఖం నుంచి బయటకు వచ్చింది. అప్పుడు బ్రహ్మదేవుని హృదయంలో సూక్ష్మరూపంలో ఉన్న అంతకు ముందు ఉన్న కల్పంలో జరిగిన సృష్టికి సంబంధించిన విషయములు అన్నీ బ్రహ్మదేవుని ముఖం నుండి వాక్కురూపంలో బయటకు వచ్చాయి. వాటి ఆధారంగా బ్రహ్మదేవుడు మరలా సృష్టి కొనసాగించాడు.అటువంటి పరమాత్మకు నమస్కారము.

ఆ పరమాత్మ భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము (శూన్యము) అనే పంచభూతములతో ఈ శరీరములు అనే పురము లను సృష్టించాడు. తాను ఆ పురములలోనే నివసిస్తున్నాడు. అంటే సకల జీవుల శరీరములలో ఆత్మగా ప్రకాశిస్తున్నాడు. అందుకే ఆ పరమాత్మను పురుషుడు అని కూడా అంటారు. (పురుషుడు అంటే మనం అనుకుంటున్నట్టు మగవాడు అని అర్థం కాదు. పురుషుడు అంటే ఈ అనంత విశ్వంలో ఉన్న ప్రాణుల దేహములు అనే పురములలో ఉండే పరమాత్మ అని అర్థం.)

మానవుల దేహము అనే పురములో ఆత్మ స్వరూపుడుగా ఉన్న ఆ పరమాత్మ, ఐదు జ్ఞానేంద్రియములతోనూ, ఐదు

పంచేంద్రియములతోనూ, మనస్సు, పంచభూతములు మొత్తం పదహారు గుణములతో తన చైతన్యాన్ని బయట ప్రపంచానికి ప్రకటిస్తున్నాడు. కాని పరమాత్మ మానవుల శరీరములలో కేవలం సాక్షిగా మాత్రమే ఉంటున్నాడు. వారు చేసే పనులన్నీ చూస్తుంటాడు. కాని మానవులు చేసే ఏ పనితోనూ సంబంధం పెట్టుకోడు. కల్పించుకోడు. ఇది చెయ్యి అది వద్దు అని చెప్పడు. అటువంటి పరమాత్మకు నమస్కారము.

పూర్వము ఈ ఆత్మజ్ఞానమును వ్యాసమహర్షి ముఖం నుండి యోగులు, భక్తులు, మకరందమును తాగినట్టు, తెలుసు కున్నారు. అటువంటి వ్యాసమహర్షికి నమస్కరిస్తున్నాను.

పరమాత్మ ఈ ఆత్మజ్ఞానమును ముందు బ్రహ్మకు బోధించాడు. తరువాత బ్రహ్మ తన మానస పుత్రుడైన నారదునికి ఈ క్రింది విధంగా బోధించాడు. నారదుడు తన సందేహాలను ఒకటి వెంబడి ఒకటిగా అడుగుతుంటే బ్రహ్మదేవుడు నారదునికి ఈ విధంగా సమాధానాలు చెప్పసాగాడు. (ఇక్కడి నుండి బ్రహ్మ నారదుల సంవాదము ప్రారంభం అవుతుంది.)

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము

ఐదవ అధ్యాయము.

నారదుడు బ్రహ్మదేవుని చూచి ఇలా అడిగాడు. "ఓ దేవదేవా! నీకు నమస్కారము. నీవు ఆది దేవుడవు. అందరి కంటే ముందు పుట్టినవాడివి. నీకు తెలియని విషయములు లేవు. నాకు పరమాత్మ, జీవాత్మ వాటి తత్త్వములను గురించిన జ్ఞానమును ఉపదేశించు.

ఓ బ్రహ్మదేవా! ఈ అనంత విశ్వము యొక్క, ఈ జీవాత్మ, పరమాత్మ యొక్క స్వరూపం ఎలా ఉంటుంది. దీనిని ఎవరు సృష్టించారు? ఇది ఎవరిని ఆశ్రయించుకొని ఉంది? ఇది ఎవరిలో కలిసిపోతుంది? ఈ అనంత విశ్వమునకు అధినేత ఎవరు? ఈ అనంత విశ్వము యొక్క అసలు తత్త్వము గురించి వివరంగా చెప్పు!

ఎందుకంటే, నీకు ఈ జీవాత్మ, ఆత్మ, ప్రకృతి వీటి తత్త్వముల గురించి బాగా తెలుసు. భూత కాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము వీటి గురించి నీకు మంచి అవగాహన ఉంది. వాటికి నీవే కర్తవు. ఈ విశ్వమును గురించిన జ్ఞానము నీకు కరతలామలకము.

నీవు స్వతంత్రంగా సృష్టి చేస్తున్నావు అని నేను

అనుకుంటున్నాను. కానీ నువ్వు కూడా తపస్సు చేస్తుంటావు. నువ్వు తపస్సు చేస్తుండటం చూచి స్వతంత్రుడవైన నీకు కూడా ఒక ప్రభువు ఉన్నాడా అని నాకు ఒక సందేహం కలుగుతూ ఉంది. నీవే స్వతంత్రుడవు అయినప్పుడు నీవు ఇంకా ఎవరి గురించి తపస్సు చేస్తుంటావు. నీకు కూడా ఆరాధించ తగ్గ భగవంతుడు వేరే ఉన్నాడా? ఈ సృష్టికి సంబంధించిన జ్ఞానమును నీకు ఎవరు ప్రసాదించారు? నీవు ఎవరి ఆధారంతో ఈ అనంత విశ్వమును సృష్టి చేస్తున్నావు? నీవు ఎవరి గురించి తపస్సు చేస్తున్నావో ఆ అధినేత ఎవరు? నీ స్వరూపం ఏమిటి? ఈ సృష్టి కార్యము అంతా నీవు ఒక్కడివే చేయడం చూచి నాకు ఆశ్చర్యంగా ఉంది.

ఓ బ్రహ్మదేవా! నాకు తెలిసి నీవు, సాలెపురుగు తన నోటి నుండి కారుతున్న ద్రవం ద్వారా తన గూడును సృష్టించినట్టు, నీవు కూడా నీకుగా నీవు ఈ సృష్టిని స్వతంత్రంగా నిర్వహిస్తున్నావు. నీవు సృష్టించిన ఈ ప్రాణులన్నీ నీకు లోబడి ఉన్నాయి. వాటిని నీవు పరిపాలిస్తున్నావు. అలా అయినప్పుడు, నీవు ఎవరి గురించి తపస్సు చేస్తున్నావు?

ఓ దేవా! నీ కన్నా గొప్పవాడు కానీ, నీ కన్నా చిన్న వాడు కానీ, నీ కన్నా సమానమైన వాడు కానీ వేరే ఎవరైనా ఉన్నాడేమో నాకు తెలియదు. నీ సృష్టి కన్నా వేరుగా, ఏ పేరుతోగానీ, ఏ రూపంతో గానీ, ఏ గుణము తో గానీ ఇతరములైన స్థూల, సూక్ష్మ పదార్థములు ఏమైనా సృష్టింపబడ్డాయేమో నాకు తెలియదు. ఈ సృష్టి సమస్తము నీ వలననే జరిగిందని నేను అనుకుంటున్నాను.

అట్టి నీవు, సర్వస్వతంత్రుడవై ఉండి కూడా ఈ విధంగా ఎవరి గురించి ఘోరమైన తపస్సుచేస్తున్నావు. దీని వలన నీ కన్నా అధికుడు ఎవరైనా ఉన్నారేమో అనే మోహం కలుగుతూ ఉంది. నాకు కలిగిన ఈ అనుమానాన్ని మీరు నివృత్తి చేయాలి.

ఓ బ్రహ్మదేవా! నీవు సర్వజ్ఞుడవు. సకలేశ్వరుడవు. నీకు తెలియని విషయములు లేవు. నేను అడిగిన ప్రశ్నలు అన్నింటికీ సరిఅయిన సమాధానం ఇవ్వండి. అప్పుడే నేను నీవు చేసిన ఉపదేశములను సరిగా అర్థంచేసుకోగలను." అని నారదుడు బ్రహ్మదేవునితో అన్నాడు.

నారదుడు అడిగిన ప్రశ్నలకు బ్రహ్మ ఈ విధంగా సమాధానం ఇచ్చాడు. "నారదా! నీవు నన్ను ఈ ప్రశ్నలు అడిగి నన్ను ధన్యుడిని చేసావు. నీ సందేహము సరి అయినదే. నేను ఆ పరమాత్మ యొక్క తత్త్వమును కీర్తించడం ద్వారా, ఈ విశ్వాన్ని దర్శించాను. ఈ విశ్వసృష్టి రహస్యమును తెలుసుకున్నాను. నేను ఆ పరమాత్ముని సేవించి, కీర్తించి ఆయన దర్శనభాగ్యము పొందాను.

నారదా! నేను ఈ సృష్టికి కర్తననీ, నేను ఈ సృష్టికి ఈశ్వరుడననీ అన్నావు. ఒక విధంగా అది నిజమే. కానీ, నా కన్నా శక్తిమంతుడు, వీర్యవంతుడు అయిన పరమాత్మ వేరుగా ఉన్నాడు. ఈ విషయం నీకే కాదు. చాలా మందికి తెలియదు. నువ్వు నా మానస పుత్రుడవు. అందుకే నేనే సృష్టి కర్తను అనీ పరమాత్మ అనీ అనుకుంటు న్నావు. నా కన్నా వేరుగా నాకన్నా అధికుడు వేరే ఉన్నాడని తెలియనంత వరకూ ఈ లోకము నన్నే పరమాత్ముడిగా భావిస్తుంది.

కాని, నేను కేవలము నిమిత్త మాత్రుడిని. సూర్యుడు, చంద్రుడు, అగ్ని, గ్రహములు, నక్షత్రములు వాటి వాటి కాంతితో లోకములో ఉన్న సమస్త వస్తువులను ప్రకాశింపచేయు విధంగా, స్వయం ప్రకాశకుడైన ఆ పరమాత్మకూడా, తన కాంతితో ఈ విశ్వాన్ని ప్రకాశింపజేస్తున్నాడు. అంటే పరమాత్మ స్వయం ప్రకాశకుడు. ఆయన తన కాంతితో ఈ విశ్వంలో ఉన్న నక్షత్రములను, గ్రహములను ప్రకాశింపజేస్తున్నాడు. ఆ నక్షత్రములు గ్రహములు తమ కాంతితో ఈ లోకాలను ప్రకాశింపజేస్తున్నాయి. ఉదాహరణకు సూర్య కాంతి చంద్రుడి మీద పడి ఆ కాంతి వెన్నెల రూపంలో భూమిమీద ప్రకాశిస్తూ ఉంది. అలాగే ఆ పరమాత్మ నుండి వెలువడే కాంతితో ఈ విశ్వం అంతా కాంతి మయం అవుతున్నప్పటికీ, అందరూ, ఆ విష్ణుమాయచేత మోహితులై బ్రహ్మ ఈ విశ్వాన్ని ప్రకాశింపచేస్తున్నాడు అని అనుకుంటున్నారు. అలాగే ఆ పరమాత్మ మాయచేత మోహితులైన వారు నేను (అంటే బ్రహ్మ) జగద్గురువు అని చెప్పకుంటున్నారు. అటువంటి పరమాత్మకు నమస్కారము.

నిజానికి మాయ పరమాత్మ ముందు నిలువలేదు. కాని ఆ మాయ జీవులను మోహపరవశులను చేస్తుంది. అందుకనే జీవులు తమది కాని దానిని, అది నాది, ఇది నాది అని అనుకుంటుంటారు. నేను, నాది, అంతా నేనే, అంతా నా వల్లే జరుగుతోంది, నేను తలచుకుంటే ఏమైనా చేయగలను అని కూడా అనుకుంటుంటారు. అది కేవలం వారి అజ్ఞానము, అవిద్య.

నారదా! ఈ అనంత విశ్వంలో ఉండే ద్రవ్యరాశి కానీ, చేసే కర్మలు గానీ, నడిచే కాలము కానీ, వాటి వాటి స్వభావములు గానీ, జీవులు గానీ, ఏవి కూడా ఆ పరమాత్మ కంటే వేరు కాదు. వాటికి స్వయం ప్రతిపత్తి లేదు. అన్నీ ఆ పరమాత్మ స్వరూపాలే కానీ మనకు వేరువేరుగా కనపడుతున్నాయి.

ఆ పరమాత్మ ప్రేరణ వలననే వేదములు పుట్టాయి. దేవతలు అందరూ ఈ విరాట్ స్వరూపములోని అవయవముల నుండి జన్మించారు. ముల్లోకములు ఆ పరమాత్మ సృష్టిలో భాగాలే. మానవులు చేసే యజ్ఞయాగములు ఆ పరమాత్మను చేరుకోడానికి సాధనములు.

అవే కాదు, యోగులు చేసే ప్రాణాయామము, ఆచరించే తపస్సు, ఆర్జించే జ్ఞానము, వాటి వల్ల వచ్చే ఫలితములు అన్నీ ఆ పరమాత్మ స్వరూపాలే. అన్నీ ఆ పరమాత్మపరంగా జరిగేవే. అన్నీ ఆ పరమాత్మకు అర్పించబడేవే.

ఈ అనంత విశ్వానికి అధిపతి, అన్నిటినీ చూచే వాడు (ద్రష్ట). అన్ని చోట్లా ఉండేవాడు, సర్వభూతములలో అంతర్గతంగా ప్రకాశించేవాడు, ఆ పరమాత్మ ఒక్కడే. అనంత మైన ఈసృష్టి అంతా ముందే ఆ పరమాత్మచేత సంకల్పించబడి, సూక్ష్మరూపంలో సృష్టించబడింది. ఆ పరమాత్మచేత సృష్టించ బడిన జీవులను నేను బహిర్గతం చేస్తున్నాను. ఆ పరమాత్మ సృష్టించిన వాటిని, ఆ పరమాత్మ ప్రేరణతో, ఆ పరమాత్మ కటాక్షముతో, నేను మరలా సృష్టిస్తున్నాను. అంతే. ఇందులో నేను చేసేది ఏమీ లేదు.

## ద్వితీయస్కంధము.

ఈ సృష్టికి మూలమైన పరమాత్మ ఒక్కడే. సృష్టి, స్థితి, లయములను నిర్వహించడానికి, నిర్గుణుడు అయిన పరమాత్మచే కల్పించబడిన మాయ చేత సత్వ, రజస్, తమోగుణములు గ్రహింపబడ్డాయి.

ఈ మూడు గుణములు జీవులలో కార్య, కరణ, కర్తృత్వములను, ద్రవ్యము, జ్ఞానము, క్రియలను బంధిస్తున్నాయి. కార్యము అంటే పని. కరణము అంటే ఆ పని చేయడానికి సాధనము. కర్తృత్వము అంటే చేసే వాడు. ఒక పని చెయ్యాలంటే దానికి ద్రవ్యరాసి కావాలి. ఆ పని చెయ్యడానికి జ్ఞానం కావాలి. అప్పుడే ఆ పని పూర్తి అవుతుంది. ఇక్కడ సృష్టి అనేది చేయవలసిన కార్యము. ఆ సృష్టి చేసే వాడు బ్రహ్మ. దానికి కావలసిన జ్ఞానము పరమాత్మ బ్రహ్మకు ఇచ్చాడు. అప్పుడు సృష్టి మొదలయింది.

సృష్టిలో ఉన్న జీవులను సత్వ,రజస్తమో గుణములు తమ మాయతో బంధిస్తున్నాయి. నిజానికి పరమాత్మ నిర్గుణుడు. ఇంద్రియములకు అతీతుడు. తన స్వరూపమును ఎవరికీ వెల్లడి చేయడు. కేవలం భక్తి చేతనే ఆ పరమాత్మ తత్త్వమును యోగులు మాత్రమే తెలుసుకోగలరు. ఈ అనంత విశ్వానికీ, నాకూ ఆయనే అధినేత.

పరమాత్మ మాయను సృష్టించాడు. అదే ప్రకృతి. మొట్ట మొదట పరమాత్మ ఒకటిగా ఉన్నాడు. తాను అనేకము కావాలి అని అనుకున్నాడు. పరమాత్మకు సృష్టి చేయవలెనని కోరిక కలిగింది. అప్పుడు పరమాత్మలో నుండి కాలము, స్వభావము, కర్మ అనే శక్తులు

పుట్టాయి. ఇవన్నీ పరమాత్మ సృష్టించిన మాయ యొక్క రూపాలే.

ఆ సమయంలో ప్రకృతిలో సత్వగుణము, రజోగుణము, తమోగుణము సూక్ష్మరూపంలో ఉన్నాయి. అవి అన్నీ సమానస్థితిలో, సామ్యావస్థలో, ఏకదలికా లేకుండా ఉన్నాయి. ఆ గుణములలో కదలిక ఏర్పడింది అంటే క్షోభ పుట్టింది. మూడు గుణములలో హెచ్చుతగ్గులు ఏర్పడ్డాయి. "ముందు వెనుక", "అక్కడ ఇక్కడ", "అది ఇది" అనే భావాలు ఏర్పాడ్డాయి. దానినే "కాలము" అంటారు. ఆ కాలములో ఏర్పడిన కదలికల వలన ఎన్నో మార్పులు సంభవించాయి. కాల స్వభావములో పరిణామాలు చోటుచేసుకున్నాయి. ఆ పరిణామాలు కర్మలు (సృష్టి) చేయడానికి దారి తీసాయి. ఆ కర్మలు చేయడాన్ని మహత్తత్వము అని అంటారు.

ఈ మహత్తత్వము, కాల, కర్మ, స్వభావాల ప్రభావం వలన, ఎన్నో మార్పులు చెందింది. ఆ మార్పులు సత్వ,రజస్,తమోగుణముల వలన బాగా వృద్ధిపొందాయి. ముఖ్యంగా సత్త్వగుణము, రజోగుణము ప్రధానపాత్ర పోషించాయి. అప్పుడు తమోగుణ ప్రధానమైన అహంకారము పుట్టింది. ఆ అహంకారము ద్రవ్య,జ్ఞాన,క్రియాత్మకమైనది.

ఆ అహంకారము మరలా మూడు విధములుగా రూపాంతరం చెందింది. అవి, జ్ఞాన శక్తి ప్రధానంగా వైకారిక అహంకారము అంటే సాత్త్విక అహంకారము, క్రియాశక్తి ప్రధానంగా తైజసాహంకారము అనగా రాజసాహంకారము, ద్రవ్యశక్తి ప్రధానంగా తామసిక అహంకారము అనగా తామసాహంకారము గా పిలువబడ్డాయి.

ఈ తామసాహంకారము వికృతి చెందగా దాని నుండి ఆకాశము ఏర్పడింది. ఆ ఆకాశము యొక్క గుణము శబ్దము. అది కనపడదు. కాని శబ్దము ద్వారా మనకు ఒక వస్తువు ఉందని తెలుసుకోగలుగుతున్నాయి.

(ఏదైనా చప్పుడు అయింది. చటుక్కున అటు తిరుగుతాము. అక్కడ ఒక వస్తువు కానీ, ఒక దృశ్యము కానీ కనపడుతుంది. దానిని మనం చూస్తాము. ఆ వస్తువును కానీ, దృశ్యమును కానీ చూడడానికి మూల కారణము శబ్దము. కాని ఆ శబ్దము సూక్ష్మ రూపంలో ఉంటుంది.)

తరువాత ఆ ఆకాశము మరలా వికారము అంటే మార్పు చెందింది. అప్పుడు ఆకాశము నుండి వాయువు ఉద్భవించింది. ఆ వాయువు గుణము స్పర్శ.(గాలి మనకు కనపడదు కానీ గాలి శరీరానికి తగిలి, ఆ గాలియొక్క స్పర్శ ద్వారా మనకు ఆహ్లాదం కలుగుతుంది.)

ఆకాశం నుండి వాయువు పుట్టింది కాబట్టి, ఆకాశానికి ఉన్న శబ్ద గుణం కూడా గాలికి సంక్రమించింది. (గాలి ప్రచండంగా వీస్తుంటే హెూరు వినిపిస్తుంది.) శరీరములో ఉన్న ఇంద్రియములు ప్రాణశక్తితో కదులుతున్నా, శరీరంలో జీవశక్తి ఉన్నా, శరీరంలో బలము ఉన్నా అవి అన్నీ వాయువు యొక్క రూపాలే. (ప్రాణ వాయువు లేకపోతేమనం బతకలేము. ఊపిరి ఆడకపోతే అవయవాలు పని చెయ్యవు. బలహీనం అవుతాయి.)

మరలా కాల,కర్మ,స్వభావాల ప్రభావం చేత వాయువు కూడా మార్పు చెందింది. (అంటే కాలం గడిచేకొద్దీ చోటుచేసుకున్న పరిణామాల క్రమంలో జరిగిన కర్మల ఫలితంగా అని అర్థం. అంటే ఈ మార్పులు అన్నీ ఒకేసారి రాలేదు. కొన్ని కోట్ల కోట్ల సంవత్సరాల పాటు జరిగిన పరిణామ క్రమంలో ఏర్పడ్డాయి.) వాయువు నుండి తేజస్సు పుట్టింది.

ఆకాశానికి, వాయువుకు రూపాలు లేవు. కాని వాటి నుండి పుట్టిన తేజస్సుకు రూపం ఉంది. వెలుగు, మంట మనకు కనపడ తాయి. వెలుగులో మనం అన్నీ వస్తువులను చూడగలము. తేజస్సుకు కారణము ఆకాశము, వాయువు. వాటి గుణములు శబ్దము, స్పర్శలు. అవి కూడా తేజస్సుకు సంక్రమించాయి. అంటే తేజస్సుకు రూపంతో పాటు, శబ్దము, స్పర్శ కూడా ఉన్నాయి.

(మంట పెద్దగా అయితే ఛట ఛట శబ్దం చేయడం మనం చూస్తున్నాము. అలాగే నిప్పులో చేయి పెడితే కాలుతుంది. దాని స్పర్శ మనకు తగులుతుంది. మంటవెలుగులో మనం వస్తువులను చూడగలుగుతున్నాము.)

తరువాత జరిగిన పరిణామంలో తేజస్సుకూడా వికారం చెందింది. అందులో నుండి జలం పుట్టింది. దీని ప్రధాన గుణము రసము. అంటే రుచి. జలం పుట్టడానికి ప్రధాన కారణాలైన ఆకాశము, వాయువు, తేజస్సు గుణములు అయిన శబ్దము, స్పర్శ, రూపములు

జలానికి సంక్రమించాయి.

(నీరు గలా గలా శబ్దం చేస్తుంది, నీటిని ముట్టుకుంటే చల్లగా, వెచ్చగా ఉంటుంది. నీటికి రూపం ఉంది. నోట్లో పోసుకుంటే ఉప్పగానో తియ్యగానో ఏదో రుచితో ఉంటుంది.)

కాలం గడిచేకొద్దీ జరిగిన పరిణామాల ఫలితంగా భూమి పుట్టింది. దీని ప్రధాన గుణము వాసన. (మట్టి వాసన అందరికీ అనుభవమే. వాన చినుకులు పడ్డప్పుడు నేల నుండి ఒక విధమైన వాసన వెదజల్లబడుతుంది.) భూమికికూడా శబ్ద,స్పర్శ,రూప,రసములు అనే నాలుగు గుణములు సంక్రమించాయి. వీటినే పంచభూతములు అంటారు.

మనం మూడు అహంకారముల గురించి చెప్పుకున్నాము కదా. వాటిలో తామసాహంకారము గురించి ఇదివరకే చెప్పాను. తరువాతది సాత్త్వికాహంకారము. ఆ సాత్త్వక అహం కారము నుండి మనస్సు పుట్టింది. ఆ సాత్వికాహంకారము నుండి దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీ దేవతలు, అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, మిత్రుడు, ప్రజాపతి అనే పది మంది, ఐదు జ్ఞానేంద్రియములకూ, ఐదు కర్మేంద్రియములకు అధిష్ఠాన దేవతలుగా పుట్టారు. దిక్కులు చెవికి, వాయువు చర్మానికి, సూర్యుడు కంటికి, వరుణుడు నాలుకకు, అశ్వినులు ముక్కుపుటాలకు అధిష్ఠాన దేవతలు. అగ్ని వాక్కుకు, ఇంద్రుడు చేతులకు, విష్ణువు కాళ్లకు, మిత్రుడు విసర్జక అవయవమునకు, ప్రజాపతి జననేంద్రియమునకు అధిష్ఠాన దేవతలు.

తైజసాహంకారము నుండి జ్ఞాన శక్తి అయిన బుద్ధి, క్రియాశక్తి అయిన ప్రాణము పుట్టాయి. తైజసాహంకారము పరిణామము చెంది, అందులో నుండి చర్మము, చెవులు, కళ్లు, నాలుక, ముక్కు అనే ఐదు జ్ఞానేంద్రియములు, చేతులు,కాళ్లు, విసర్జకావయవము, జననేంద్రియము, వాక్కు అనే ఐదు కర్మేంద్రియములు పుట్టాయి.

నారదా! ఇదీ సృష్టి క్రమము. పంచభూతములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనస్సు, సత్త్వ, రజస్, తమోగుణములు అన్నీ కలిస్తేనే గానీ శరీర నిర్మాణం జరగదు. పైన చెప్పినవి అన్నీ ఆ పరమాత్మ శక్తితో ప్రేరేపించబడి, వ్యష్టి భావము, సమిష్ఠిభావములను తీసుకొని, అన్ని కలిసి, అండరూపంలో ఏర్పడ్డాయి.

అది ఒక బ్రహ్మాండము. ఆ బ్రహ్మాండము చాలా కాలం పాటు నీటిలోనే మునిగి ఉంది. కాల,కర్మ,స్వభావం చేత పరమాత్మ ఆ అండంలో ప్రవేశించి దానిని చైతన్యవంతం చేసాడు.

(ఈ పరిణామాన్ని మన మాతృగర్భంతో పోల్చుకోవచ్చు. స్త్రీ,పురుషుల కలయిక వలన అండం ఏర్పడుతుంది. ఆ అండం, నెలలు గడిచేకొద్దీ అంటే కాలం గడిచేకొద్దీ, పిండంగా మారుతుంది. ఆ పిండము మాతృగర్భంలో ఉమ్మనీటిలో ఉంటుంది. అందులోకి గతజన్మవాసనలను మోసుకొని వస్తున్న జీవాత్మ ప్రవేశించి చైతన్యం కలిగిస్తుంది. అప్పుడు పిండం క్రమక్రమంగా అవయవాలు

సంతరించుకుంటుంది.)

తరువాత ఆ బ్రహ్మాండం పగులగొట్టుకొని ఆ అండంలో నుండి విరాట్స్వరూపుడు ఆవిర్భవించాడు. ఆ విరాట్ స్వరూపునకు వేలకొలది తలలు, వేలకొలది ముఖములు, కళ్ళు,చెవులు, ముక్కులు, నోళ్ళు, తొడలు, పాదములు ఉన్నాయి. (అంటే ఈ విశ్వము పుట్టింది అని అర్థం. కోటాను కోట్ల జీవరాసులకు తలలు, కాళ్ళు, చేతులు ఉంటాయి కదా.) ఆ విరాట్పురుషుని కటి ప్రదేశము నుండి కింద ఉన్న ఏడు లోకములను, అధోలోకములనీ, కటి ప్రదేశము పైన ఉన్న ఏడు లోకములు ఊర్ధ్వలోకములనీ జ్ఞానులు అంటారు.

ఆ విరాట్పురుషుని ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు ఉద్భవించారు.

(బుద్ధి ముఖంగానూ, శక్తి చేతులు గానూ, శరీరంలోని వ్యవస్థాశక్తి తొడలుగానూ, కదలిక కాళ్ళుగానూ ఏర్పడ్డాయి అని దీనికి అర్థం. విజ్ఞానాన్నే మార్గదర్శకంగా తీసుకున్న వాళ్లని బ్రాహ్మణులనీ, దేశాన్నిగానీ, బలహీనులని గానీ రక్షించడానికి శక్తిని ఉపయోగించే వారిని క్షత్రియులు అనీ, వ్యాపార దక్షత కలవారిని వైశ్యులు అనీ, విశ్వపరమైన, సాంఘికపరమైన కార్యకలాపాలు, అంటే ఏ కదలికలు లేకపోతే అన్ని పనులు ఆగిపోతాయో ఆ గతిభావాన్ని నిర్వర్తించేవాళ్లు శూద్రులు అనీ చెప్పబడింది. కులాల పేరిట మనం చెప్పుకొనే వీళ్లు అందరూ ప్రతి మనిషిలో ఉన్న భాగాలే. వారు వారు చేసే కర్మలను బట్టి కులాలు నిర్ణయింపబడాలే కానీ, పుట్టుకతో కాదు.)

ఆ విరాట్పురుషుని నడుముభాగము నుండి భూర్లోకము, నాభి నుండి భువర్లోకము, హృదయము నుండి స్వర్లోకము, వక్షస్థలము నుండి మహర్లోకము కల్పించబడ్డాయి. . ఆపైన ఉన్న మెడ నుండి జనలోకము, స్తనభాగముల నుండి తపోలోకము, తల నుండి సత్యలోకము (బ్రహ్మలోకము) కల్పించబడ్డాయి. . వీటిలో బ్రహ్మలోకము సనాతనమైనది.

ఆ విరాట్పురుషుని కటి ప్రదేశము నుండి అతలము, ఊరువుల నుండి వితలము, జానువుల(మోకాళ్లు) నుండి సుతలము, పిక్కల నుండి తలాతలము, గుల్ఫముల(చీలమండలు) నుండి మహాతలము, పాదముల పై నుండి రసాతలము, అరి కాళ్ల నుండి పాతాళము పుట్టాయి ఈ విధంగా ఆ విరాట్పురుషుడు సర్వలోకమయుడు. కానీ, కేవలము మూడు లోకములు మాత్రమే ఉన్నాయి అనే వాళ్లు మరోవిధంగా కూడా ఈ లోక కల్పనను చెబుతూ ఉంటారు: విరాట్పురుషుని పాదముల నుండి భూలోకము, బొడ్డు నుండి భువర్లోకము, తల నుండి సువర్లోకము కల్పించబడ్డాయి అని అంటుంటారు.

( ఆ పరమాత్మ విరాట్పురుషుని రూపంలో ఈ అనంత విశ్వం అంతా నిండి ఉన్నాడు అని అర్థం. విశ్వసృష్టి ఇలా జరిగింది.)

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ద్వితీయ స్కంధము
ఆరవ అధ్యాయము.

బ్రహ్మ ఇలా చెప్పసాగాడు. "నారదా! ఆ విరాట్పురుషుని ముఖము వాక్కుకు వాటి అధిష్టాన దేవత అయిన అగ్నికి క్షేత్రము. విరాట్పురుషుని చర్మము, మాంసము, రోమములు, స్నాయువులు, ఎముకలు, మజ్జ(మూలుగు) ప్రాణము.. ఈ ఏడు ధాతువులు గాయత్రి, త్రిష్టుప్,ఉష్ణిక్, అనుష్టుప్, జగతి, పంక్తి, బృహతి ఛందస్సులకు ఉత్తత్తి స్థానాలు. ఆ విరాట్పురుషుని నాలుక, దేవతలకు ఇచ్చే హవ్యములకు, పితృదేవతలకు ఇచ్చే కవ్యములకు, అమృతతుల్యమైన అన్నమునకు, సర్వ రసములకు, ఉత్తత్తి స్థానములు. ఆ విరాట్పురుషుని ముక్కు రంధ్రములు పంచప్రాణములకు, (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన) వాయువులకు స్థానములు.

ఆయన ఘ్రాణశక్తి అశ్వినీ దేవతలకు, ఓషధులకు, సువాసనల వలన కలిగే ఆనందానికి ఉత్పత్తి స్థానము. విరాట్పురుషుని కళ్లకు ఉన్న చూచే శక్తి, రూపములకు, తేజస్సులకు ఉత్పత్తిస్థానము. ఆయన కళ్లు దేవలోకమునకు, సూర్యునకు ఉత్పత్తి స్థానము. విరాట్పురుషుని చెవులు దిక్కులకు ఉత్పత్తిస్థానము. చెవికి ఉన్న శక్తి నుండి ఆకాశము, శబ్దము పుట్టాయి. ఆ విరాట్పురుషుని శరీరము సమస్త వస్తువుల సారములకు, వాటి శక్తి, స్వరూపాలకు, వాటి సౌభాగ్యమునకు ఉత్పత్తిస్థానము.

విరాట్పురుషుని చర్మము అన్ని యజ్ఞములకు, స్పర్శ గుణానికి వాయువునకు స్థానము. విరాట్పురుషుని రోమములు సకల వృక్షజాతులకు, యజ్ఞయాగములకు ఉపయోగ పడు సమిధలకు, యజ్ఞ సంభారాలకు ఉత్పత్తిస్థానము. విరాట్పురుషుని కేశములు (వెంట్రుకలు) మేఘములకు ఉత్పత్తిస్థానము. విరాట్పురుషుని మీసములు గడ్డములకు ఉన్న కేశములు ఆయన నఖములు అనగా గోళ్లు, ఆకాశంలో పుట్టే విద్యుత్తుకు, శిలలకు, లోహధాతువులకు ఉత్పత్తిస్థానము. విరాట్పురుషుని భుజములు లోకపాలకులకు క్షేమ సంబంధమైన కర్మలకు స్థానము.

ఆయన నడక మూడులోకములకు ఆశ్రయము. ఆయన పాదములు క్షేమమునకు, శరణాన్ని ఇవ్వడానికి, అన్ని కోరికలను తీర్చడానికి స్థానములు. . విరాట్పురుషుని జననేంద్రియము జలమునకు, వీర్యమునకు, సృష్టికి, పర్జన్యుడికి, ప్రజాపతికి ఉత్పత్తి స్థానము. జననేంద్రియము యొక్క శక్తి మైధునము వలన పుట్టే ఆనందానికి ఉత్పత్తిస్థానము. విరాట్పురుషుని విసర్జకావయవము యమునకు, మిత్రునకు (సూర్యుడు) మృత్యువుకు, నరకమునకు, ఉత్పత్తిస్థానము. విసర్జకావయవ శక్తి హింసకు, నిరృతికి, మృత్యువుకు, నరకమునకు ఉత్పత్తి స్థానము.

విరాట్పురుషుని వెనుక భాగము (వీపు) పరాభవమునకు, అధర్మమునకు, అజ్ఞానమునకు ఉత్తత్తిస్థానము. విరాట్పురుషుని నాడులు నదులకు, (తూర్పువైపుగా ప్రవహించేవి) పడమటివైపుగా

ప్రవహించే నదములకు, ఉత్పత్తిస్థానములు.

విరాట్పురుషుని ఎముకలు పర్వతములకు, కొండలకు ఉత్పత్తిస్థానములు. ఆ విరాట్పురుషుని పొట్ట మూలప్రకృతికి, రసములకు, సర్వభూతములకు, వాటి మృత్యువుకు, సముద్రములకు ఉత్తత్తిస్థానము. విరాట్పురుషుని హృదయము మనస్సుకు జన్మస్థానము. ఆ విరాట్పురుషుని చిత్తము, ధర్మమునకు, నీకూ, నాకూ, మన అందరికీ, సనకసనందనాదులకు, రుద్రునకు, విజ్ఞానానికి, సత్త్వగుణమునకు ఆశ్రయము.

నారదా! ఇన్ని మాటలు ఎందుకు. నేను, నువ్వు, రుద్రుడు, నీ అన్నలయిన మునులు, సురలు, అసురులు, నాగులు, పక్షులు, మృగములు, పాకేజంతువులు, గంధర్వులు, అప్సరసలు, యక్షులు, రాక్షసులు, భూతగణములు, ఉరగములు, పశువులు, పితృదేవతలు, సిద్ధులు, విద్యాధరులు, చారణులు, చెట్లు, నేలమీద, నీటిమీదా, ఆకాశంలోనూ, జీవించే వివిధరకములైన జీవులు, గ్రహములు, నక్షత్రములు, తోకచుక్కలు, విద్యుత్తు, మేఘములు, మూడు కాలములు, వీటి అన్నిటికీ ఉత్పత్తి స్థానము ఆ విరాట్పురుషుడే. ఈ అనంత విశ్వాన్ని మొత్తము ఆయనే ఆవరించి ఉన్నాడు. ఆ విరాట్స్వరూపంలో ఈ విశ్వము అంతా పది అంగుళాల మేర ఆవరించి ఉంది.

మహాప్రాణము (సూర్యుడు, విశ్వశక్తికి ప్రతీక) ఏ విధంగా అయితే సూర్యమండలం లోపలా, బయటా తపింప చేస్తూ ఉందో, అలాగే ఆ విరాట్పురుషుడు కూడా తాను లోపలా బయటా ప్రకాశిస్తూ

ఈ అనంత విశ్వాన్ని తపింపచేస్తున్నాడు.(జీవులకు వేడిని ప్రసాదిస్తున్నాడు.).

నారదా! అతడు అమృతత్వానికీ, అభయానికీ ప్రభువు. ఆయన మరణశీలత్వమును, స్థూలద్రవ్యములను (అన్నమును) మించినవాడు. అందుకోసమనే ఎవరూ కూడా ఆయన మహిమ హద్దులను తెలుసుకోలేరు. జగత్తు యొక్క స్థితిని గురించి తెలిసిన మహాత్ములు సర్వభూతాలు ఆయన లో నాలుగవ వంతు మాత్రమే అని తెలుసుకుంటారు. (ఈనాలో శాస్త్రజ్ఞులు కూడా ఈ భూగోళం మూడు వంతులు నీరు, నాలుగవ వంతు మాత్రమే భూభూగము ఉందని చెప్పారు కదా!)

స్థితి అంటే సృష్టిలో పుట్టిన వస్తువుల ఉనికిని కాపాడుతూ ఉండటం. దీనిని ఒకటిగా తీసుకొని స్థితి పాదము అని అనవచ్చు. ఈ స్థితి పాదాన్ని నాలుగు పాదాలుగా (భాగాలుగా) విడదీస్తే ఈ నాలుగు పాదాలలోనూ సర్వభూతాలూ ఉన్నాయి. (పురుష సూక్తములో దీనినే భగవంతుడిలో ఒక పాదంగా--ఒక భాగంగా-- చెబుతారు.) సర్వభూతాలు అంటే భూలోకము అంతరిక్షము (భువర్లోకము) సువర్లోకము అని మూడులోకములలోనూ ఉండేవి. ఈ స్థితి పాదాన్ని త్రిమూర్ధంగా అంటే మూడు తలలు ఉన్నట్టుగా ఊహించవచ్చు. ఈ త్రిమూర్ధము భౌతిక సృష్టి, స్థితి పాదము. దీని మీద మహర్లోకము అనేది ఒక ద్వారము. అది ఆధ్యాత్మిక సృష్టిలోకి దారిని ఇస్తుంది. ఈ మూడు తలల మీద ఉన్నవి ఆధ్యాత్మిక సృష్టిభాగాలైన జన, తప, సత్యలోకాలు. అవి వరుసగా అమృత, క్షేమ, అభయ మయాలు.

## ద్వితీయస్కంధము.

బ్రహ్మచర్యము తరువాత గృహస్థాశ్రమములో ప్రవేశించకుండా నేరుగా సన్యాసము స్వీకరించేవారు మూడు లోకముల బయట ఉన్న పై లోకములలో అనగా జన, తపస్, సత్యలోకములలో నివసిస్తారు. కాని గృహస్థాశ్రమమును స్వీకరించిన గృహస్థులు, భూలోక, భువర్లోక, సువర్లోకములలో నివసిస్తూ ఉంటారు.

ఈ లోకంలో విద్య(ఉన్న దాన్ని ఉన్నట్టుగా చూడటం) అవిద్య(లేని దాన్ని ఉన్నట్టుగా భావించడం, మాయలోపడటం) అని రెండు ఉన్నాయి. ఆ రెండు కూడా ఆ పరమాత్మను ఆశ్రయించి ఉన్నాయి. విద్య అనేది ముక్తికోసరం పైపైకి (ఉత్తర మార్గం మీదుగా) భగవంతుని చేరుకొనే మార్గము. అవిద్య అంటే పదార్థాలను భోగిస్తూ దక్షిణ మార్గం మీదుగా కింది కిందికి దిగజారుతూ జన్మ మృత్యు వలయంలో పడి ఉండేలా చేసే మార్గము.

సూర్యుడు ఎలా అయితే తన కిరణాలతో విశ్వం అంతటినీ ప్రకాశింప చేస్తూ కూడా, తాను వేరుగా ఉంటాడో అలాగే పరమాత్మ ఈ విరాట్ అండానికి, పంచ భూతములకు, పదకొండు ఇంద్రియాలకు, మూడు గుణాలకు, కారణం అయి ఉండీ కూడా, వాటిలో ఉంటూ కూడా, వాటిని దాటి వేరుగా ఉంటాడు.

నారదా! నేను ఆ పరమాత్మ నాభి నుండి పుట్టిన కమలములో ఉద్భవించాను. (ఎలాగైతే తల్లి నాభి నుండి శిశువులు వేరుచేయబడు తున్నారో, అలాగే సృష్టి చేయడానికి గానూ పరమాత్మ నుండి, ఆయన అంశ అయిన బ్రహ్మ వేరుగా వచ్చాడు. కమలము అనగా లోకాల సంస్థానము. దానికి రేకులు చాలా ఉంటాయి కాబట్టి సృష్టి ప్రాచుర్యాన్ని

అది సూచిస్తుంది.)

ఈ సృష్టి యజ్ఞము చేయుటకు ఆ విరాట్పురుషుని అవయవములను మించిన యజ్ఞ సామగ్రి నాకు కనపడలేదు. ఆ పరమాత్మయే యజ్ఞపురుషుడు. ఆయనే యజ్ఞము. యజ్ఞము అనగా పూజాతోనూ, సమర్పణంతోనూ, భగవంతునితో సఖ్యం ఏర్పరచుకోడం. ఆ యజ్ఞమునకు యజ్ఞపశువులు, యూపస్తంభము, దర్భలు, యజ్ఞము చేయు భూమి, ఆయజ్ఞము చేయు కాలము, అన్నియజ్ఞసంభారములు, ఓషధులు, నెయ్యి, రసము, లోహములు, మట్టి, నీళ్లు, ఋక్కులు, యజుస్సులు,సామములు, నలుగురు హోతలు(బ్రహ్మ, అధ్వర్యుడు, ఉద్గాత, హోత), వేరు వేరుయజ్ఞాల పేర్లు, వాటిలో ఉపయోగించే మంత్రములు, ఈయవలసిన దక్షిణలు, చేయవలసిన వ్రతములు, దేవతల పేర్లు, యజ్ఞ చేయవలసిన పద్ధతి, సంకల్పము, తంత్రము (చేసే విధానము, పద్ధతి) గతులు, మతులు, శ్రద్ధ, ప్రాయశ్చిత్తము (తపస్సు చేయాలని నిశ్చయము) సమర్పించడం---ఈ సమస్తమైన యజ్ఞ సామగ్రి విరాట్పురుషుడి అవయవాలనుంచే నేను సేకరించాను.

ఈ ప్రకారంగా నేను యజ్ఞసంభారములను ఆ విరాట్పురుషుని శరీర అవయవములనుండి సేకరించి, యజ్ఞపురుషుని ఉద్దేశించి ఈ సృష్టి యజ్ఞమును నిర్వహిస్తున్నాను. విరాట్పురుషుడి అవయవాలనుండి మొత్తం సామగ్రిని గ్రహించి ఆ సామగ్రితోనే యజ్ఞరూపుడైన అతనిని యజ్ఞము ద్వారా పూజించాను. తరువాత మరీచి మొదలగు తొమ్మిది మంది ప్రజాపతులు అందరూ ఏకాగ్రమైన చిత్తంతో ఆ పరమాత్మను పూజించారు.

## ద్వితీయస్కంధము.

ఆ తరువాతి కాలంలో మనువులు, ఋషులు, పితృదేవతలు, దేవతలు, దైత్యులు, మానవులు, ఆ పరమాత్మను ఉద్దేశించి యజ్ఞ యాగములను చేసారు. ఆ పరమాత్మకు ఏ గుణములూ లేవు. ఆయన నిర్గుణుడు. కాని సృష్టి మొదలు పెట్టేటప్పుడు తాను బ్రహ్మ, రుద్రుడు మొదలగు రూపములగా విడిపోయాడు. మాయను సృష్టించాడు. ఆ మాయద్వారా మహత్తత్వము మొదలగు గుణములను తాను గ్రహించాడు. ఆ పరమాత్మలోనే ఈ అనంత విశ్వము నిండి ఉంది.

నారదా! నేనుకూడా ఆపరమాత్మ ఆజ్ఞతోనే ఈ సృష్టి కార్యమును నిర్వర్తిస్తున్నాను. ఆ పరమాత్మ విష్ణువు అనే రూపంలో త్రిగుణములతో కూడిన ఒక మాయాశరీరమును ధరించి, నాచే సృష్టింపబడిన ఈ లోకములను పాలిస్తున్నాడు. ఆ పరమాత్ముని ఆజ్ఞతోనే శివుడు సంహార కార్యక్రమమును నిర్వర్తిస్తున్నాడు.

నారదా! నీవు అడిగిన ప్రశ్నలకు అన్నింటికీ సమాధానం చెప్పాను. ఈ అనంత విశ్వంలో ఆ పరమాత్మ కంటే వేరు అయిన వస్తువు ఏదీ లేదు. ఈ విశ్వం అంతటా ఆ పరమాత్మ నిండి ఉన్నాడు. సత్ అసత్ రూపములు కూడా ఆ పరమాత్మే. నేను కూడా నా చిత్తములో సదా ఆ పరమాత్మను నిలుపుకున్నాను. నా వాక్కు లోనూ, నా మనస్సులోనూ, నా ఇంద్రియములలోనూ, ఆయన ప్రభావం పూర్తిగా ఉంది. అందు వలన నేను ఏ దోషమూ చేయలేను. నా చర్యలన్నీ ఏ దోషమూ లేనివి. నేను పలికిన మాట, చేసే పని, ఎన్నటికినీ అసత్యములు కావు. నా ఇంద్రియములు కూడా అనుచితమైన పనులను చేయవు.

ఆయన దయ వలన నేను వేదములను అధ్యయనము చేసాను, తపస్సు చేసాను. ఇతర ప్రజాపతులందరూ నన్ను పూజిస్తారు. గౌరవిస్తారు. నేను యోగాన్ని అవలంబించి, అచంచలమైన మనస్సుతో ఆ పరమాత్మను ధ్యానిస్తాను. ఇంత చేసినప్పటికినీ, ఈ పరమాత్మ గురించి నేను తెలుసుకోలేక పోయాను. నాకే ఆ పరమాత్మ గురించి తెలియదే, ఇంక నా చేత సృష్టింపబడిన వారు ఎలా తెలుసుకోగలరు? అట్టి ఆ పరమాత్మ పాదములకు భక్తితో నమస్కరిస్తున్నాను.

నారదా! నీకు ఇంకొక విషయం తెలుసా! మాయను ఆ పరమాత్మ కల్పించాడు అన్నాను కదా! ఆకాశమునకు తాను ఎక్కడ మొదలయిందో ఎక్కడ అంతం అవుతుందో దానికే తెలియదు అలాగే సాక్షాత్తు ఆ పరమాత్మకే తాను సృష్టించిన  మాయ గురించి, ఆ మాయ ఎంతవరకు విస్తరించిందో, దాని గురించి,  పూర్తి గా తెలియదు. ఇంక ఈ సాధారణ మానవులు, దేవతా గణములు ఆ మాయను గురించి ఎలా తెలుసుకోగలరు? అందుకే ఈ మాయలో పడి కొట్టుకుంటున్నారు.

(మాయ అంటే అవిద్య. అంటే లేనిది ఉన్నట్టు అనుకోవడం. తాడును చూచి పాము అనుకోవడం. ఉదాహరణకు ఈ భూమి అంతా మనిషి పుట్టక ముందు నుండీ ఉంది. మనిషి చచ్చిన తరువాతా ఉంటుంది. కానీ తన పరిమిత జీవిత కాలంలో “ఈ భూమి నాది..... సూది మొనమోపినంత కూడా ఎవ్వరికీ ఇవ్వను” అంటాడు మానవుడు. అదే మాయ. పుట్టిన వాడు చావక తప్పదని అందరికీ

తెలుసు. కానీ తాను చిరాయువు అనుకుంటూ ఉంటాడు. తనతో పాటు ఉన్న అందరిలో తనలో ఉన్న పరమాత్మే ఉన్నాడనీ, అందరిలో వెలుగుతున్న పరమాత్మ ఒకడే అని అందరికీ తెలుసు. కానీ సాటి వాడిని తిడతాడు, కొడతాడు, ద్వేషిస్తాడు, మోసం చేస్తాడు, ఆఖరుకు చంపుతాడు. అదే మాయ. భగవంతుడు మనకు అన్నీ ఇచ్చాడు. సస్యశ్యామలమైన భూములు, రత్నాలు, మణులు, మాణిక్యాలు, ఖనిజసంపదలు, రత్న గర్భ అయిన భూమిని ఇచ్చాడు. వర్షాలు కురిపించి స్వచ్ఛమైన నీరు, స్వచ్ఛమైనగాలి, వృక్షములు, మొక్కలు, ఆకు కూరలు, కాయకూరలు, పళ్లు, అన్నీ ఇచ్చాడు. చక్కగా అనుభవించ మన్నాడు. ఆనందించమన్నాడు. కాని మానవుడు ఏం చేస్తున్నాడు? పొద్దున్నే భిక్షాపాత్ర పట్టుకొని దేవుడిముందు బిక్షగాడి మాదిరి నిలబడి “స్వామీ! నాకు అది కావాలి, ఇది కావాలి” (ధన,కనక,వస్తు,వాహనాది అష్టైశ్వర్య సిద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం, అష్టోత్తరశతనామాని పూజాం కరిష్యే) అని దేవురిస్తున్నాడు. అడుక్కుతింటున్నాడు. ప్రతిఫలాపేక్ష లేకుండా దేవుడికి నమస్కారం కూడా చెయ్యడం లేదు. పైగా తాను సంపాదించిన పాపపు సొమ్ములో దేవుడికి బంగారు కిరీటాలు, వజ్రకవచాలు, బంగారు తొడుపుల రూపంలో, లంచం ఇస్తున్నాడు. అదే మాయ. అవిద్య. తెలియనితనం.)

నారదా! అంతెందుకు! నీవు, నేను, రుద్రుడు, ఆ పరమాత్మ గురించి పూర్తిగా తెలుసుకోలేక పోయాము. ఇంక ఇతర దేవతా గణములు ఏం తెలుసుకుంటారు? తమకు తెలిసిందే పరమాత్మ తత్త్వము అనుకుంటారు. మనమందరమూ ఆ పరమాత్మ మాయా మోహంలో పడి ఉన్నప్పటికినీ, మన బుద్ధిని ఉపయోగించి ఈ జగత్తు అంతా పరమాత్మ మాయచే నిర్మించబడింది అని మాత్రము

తెలుసుకోగలిగాము.

నేను, నీవు, దేవతాగణములు అందరూ నిరంతరము ఆ పరమాత్ముని అవతార విశేషములను స్మరిస్తున్నా, గానం చేస్తున్నా, ఆ పరమాత్మ తత్త్వమును మాత్రము తెలుసుకోలేక పోతున్నాము. ఇంక ఆ పరమాత్మ గురించి నేను ఏమి చెప్పగలను, ఆ పరమాత్మకు నమస్కరించడం తప్ప!

నారదా! ఆ పరమాత్మకు జన్మలేదు. చావు లేదు. ఆయనే ఆద్యుడు. అనంతుడు. సర్వాంతర్యామి. ప్రతి కల్పంలోనూ తనను తాను సృష్టించుకుంటాడు. ఈ అనంత విశ్వాన్ని సృష్టించి పాలించి లయం చేస్తున్నాడు.

ఆ పరమాత్మకు విషయ వాంఛలు లేవు. పరమాత్ముడు సంపూర్ణ జ్ఞానానికి ప్రతీక. అన్ని ప్రాణులలో అంతరాత్మరూపంగా వెలుగుతున్నాడు. ఆ పరమాత్మ సత్యస్వరూపుడు. నిర్గుణుడు. సందేహాలకు అతీతుడు. ఆయనకు జనన,మరణాలు లేవు. ఆయన పరిపూర్ణుడు. ఆయనకంటే వేరు ఏదీ లేదు. ఆయన లాంటి వాడు మరొకడులేడు.

ఓ నారద మహర్షీ! ఆ పరమాత్ముని తత్త్వమును కేవలము జ్ఞానులు, తపస్సంపన్నులు అయిన మహాఋషులు యోగులు మాత్రమే తెలుసుకొనగలరు. ఆ పరమాత్మ గురించి, ఆ పరమాత్మ అస్థిత్వమును గురించి తర్క వితర్కములు చేసే వాళ్లకు ఆ పరమాత్మ ఎన్నటికీ కనిపించడు.

ఆ పరమాత్మ మొదటి అవతారము విరాట్పురుషుడు. కాలము, స్వభావము, ప్రకృతి, సత్, అసత్, ద్రవ్యము (మాస్), సత్త్వ, రజస్, తమోగుణములు, అహంకారము, జ్ఞానేంద్రియములు, పంచేంద్రియ ములు, చరాచర జగత్తు, ఇవన్నీ ఆ విరాట్పురుషుని స్వరూపములే.

ఓ నారదా! నేను(బ్రహ్మ), నువ్వు (నారదుడు), శివుడు, యజ్ఞపురుషుడైన విష్ణువు, దక్షుడు మొదలగు ప్రజాపతులు, స్వర్గలోకాధి పతులు, ఖగలోకాధిపతులు, మానవలోకాధిపతులు, పాతాళ లోకాధిపతులు, గంధర్వులు, విద్యాధరులు, చారణులు, యక్షులు, రాక్షసులు, ఉరగులు, నాగులు, ఋషులు, పితృదేవతలు, దైత్యులు, సిద్ధులు, దానవ ప్రముఖులు, ఇంకా ఇతరములైన భూత, ప్రేత, పిశాచములు, కూష్మాండములు, జలచరములు, మృగములు, పక్షిజాతులు, లోకములలోని సకల ఐశ్వర్యములు కలవారు, తేజస్సులు కలవారు, ఇంద్రియ శక్తులు కలవారు, మనోశక్తులు కలవారు, శారీరక బలము కలవారు, వీర్యము, శౌర్యము, బల పరాక్రమములు కలవారు, శోభస్కరమైన వారు, లజ్జావంతులు, సకల విభూతులు కలవారు, బుద్ధిమంతులు, ఆశ్చర్యకరములైనవి, ఆకారము ధరించినవి, ఆకారములు లేనివి, అన్ని కూడా ఆ పరమాత్మ స్వరూపములే.

ఓ నారదా! ఆ పరమాత్ముని అవతార విశేషములను ప్రాధాన్య క్రమంలో నీకు నేను వివరిస్తాను. ఆ పరమాత్ముని అవతార విశేషములు అనే కథా అమృతమును నీవు తనివితీరా ఆస్వాదించు. పరమాత్మ అవతార విశేషముల కథలను విన్నవారికి, ఇతర కథలను

వినిన వాసనలు అన్నీ తొలగిపోతాయి.

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము

ఏడవ అధ్యాయము.

(ఇక్కడ ఒక విషయం పాఠకులు గమనించాలి. ఈ భాగవత పురాణాన్ని ఇప్పుడు బ్రహ్మదేవుడు నారదుడికి చెబుతున్నాడు. ఈ విషయాన్ని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెబుతున్నాడు. అది విన్న సూతుడు శౌనకాది మహామునులకు నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో చెబుతున్నాడు. ఈ వరుస గమనించండి. ఇంక చదవండి.)

బ్రహ్మదేవుడు నారదునికి పరమాత్మ అవతార లీలా విశేషములను చెబుతున్నాడు. "ఓ నారదా! పరమాత్మ ఈ భూతలమును ఉద్ధరించడానికి వరాహ అవతారమును దాల్చాడు. ఆ వరాహముతో యుద్ధం చెయ్యడానికి వచ్చిన దైత్యుని అనగా హిరణ్యాక్షుని తన వాడి అయిన గోళ్లతో కోరలతో చీల్చి చంపాడు.

తరువాత పరమాత్మ, రుచి ప్రజాపతికి, ఆయన భార్య ఆకూతికి

కుమారుడుగా జన్మించాడు. ఆయన పేరు సుయజ్ఞుడు. ఆ సుయజ్ఞుని భార్య పేరు దక్షిణ. వాళ్ల సంతానమే దేవతలు. ఆ సుయజ్ఞుడి తాత గారు స్వాయంభువ మనువు (అనగా రుచి ప్రజాపతి తండ్రి). స్వాయంభువ మనువు తన మనుమని హరి అని  పిలిచేవాడు.

నారదా! కర్దమ ప్రజాపతికి, ఆయన భార్య దేవహూతికి పరమాత్మ కపిలుడు అనే పేరుతో కుమారుడిగా జన్మించాడు. కపిలుడి తో పాటు కర్దముడికి ఇంకా తొమ్మిది మంది ఆడపిల్లలు అనగా కపిలుడికి చెల్లెళ్లు పుట్టారు. ఆ కపిలుడు తన తల్లి దేవహూతికి బ్రహ్మ విద్యను బోధించాడు. ఆమెకుమోక్షమును ప్రసాదించాడు. దేవహూతి ఇహలోక సుఖములను త్యజించి, వైకుంఠము చేరుకుంది.

అత్రిమహర్షి తనకు సంతానము కావలెననే కోరికతో ఆ పరమాత్మను ఆరాధించాడు. పరమాత్మ అత్రి మహర్షి ప్రార్థనను మన్నించాడు. “నేను నీకుకుమారుడిగా అవతరిస్తాను” అని వరం ఇచ్చాడు. అత్రికి, ఆయన భార్య అనసూయకు ఒక పుత్రుడు జన్మించాడు. ఆయనే దత్తాత్రేయుడు. యదు వంశస్థులు, హైహయులు ఆ దత్తాత్రేయుని సేవించి ఈలోకంలోనూ, పరలోకంలోనూ సకల సౌఖ్యాలు పొందారు.

నారదా! మొట్టమొదట నేను ఈ సృష్టిని చేయ సంకల్పించి తపస్సు చేసాను. నా తపస్సు ఫలితంగా సనక, సనంద, సనాతన, సనత్కుమారులు అనే ఋషులు జన్మించారు. వారు పుట్ట గానే అంతకు ముందు కల్పములో  జరిగిన ప్రళయంలో నాశన మైన ఆత్మతత్త్వమును  గురించి చక్కగా చెప్పారు.

ధర్ముడి భార్య పేరు మూర్తి. ఆమె దక్షుని కుమార్తె. పరమాత్మ ధర్మునికి, మూర్తికి, నరనారాయణుల రూపంలో ఆవిర్భవించాడు. పరమాత్మ ఒక్కడే అయినా, నరుడుగా, నారాయణుడుగా రెండు రూపములు తానే అయి జన్మించాడు. ఆ నరనారాయణులు అసమాన్య తపోశక్తి కలవారు. వారి తపస్సు భగ్నం చేయడానికి మన్మధుడు ఎంత ప్రయత్నించినా ఆయన వల్ల కాలేదు. ఆ పరమాత్మ నిర్గుణుడు, నిర్మలుడు. అందువలన మన్మధ బాణము అయిన కామము నరనారా యణులలో ప్రవేశించలేక పోయింది. అందువల్ల మన్మధ సైన్యము వారి తపస్సును భగ్నం చేయలేక పోయింది.

ఉత్తాన పాదుడి కుమారుడు ధ్రువుడు. ధ్రువుని సవతి తల్లి ధ్రువుని, అతని తండ్రి ఉత్తాన పాదుడి సమక్షంలోనే, కఠినమైన మాటలతో అవమాన పరిచింది. బాలుడైన ధ్రువుడు ఆ అవమాన మును భరించలేక తపస్సుచేయడానికి వెళ్లిపోయాడు. ఆ పరమాత్మ ధ్రువుని తపస్సుకు మెచ్చి ఆయనకు ధృవపదమును అనుగ్రహించాడు. ఆ ధృవ పదమునకు పైన ఉన్న భృగువు మొదలగు మహాఋషులు, ఆ ధృవ పదమునకు కింద ఉన్న సప్త ఋషులు ఆ ధృవుని స్తుతిస్తూ ఉంటారు.

వేనుడు అనే రాజు పరమ దుర్మార్గుడు. ఆయనను బ్రాహ్మణులు దారుణంగా శపించారు. దానితో ఆ వేనుడి రాజ్యము, పరాక్రమము, ఐశ్వర్యము సర్వనాశనం అయ్యాయి. పుత్రులు లేని కారణంగా నరకంలో పడిపోతున్నాడు వేనుడు. ఆ సమయంలో పరమాత్మ ఆ వేనుడిని రక్షించడానికి పృథువు అనే పేరుతో వేనుడికి

కుమారుడిగా జన్మించాడు. ఆ కుమారుడు తన తండ్రి వేనుడిని నరకం నుండి రక్షించాడు. ఆయనే పృథు మహారాజు. ఆయన ఈ భూమి మీద ఓషధులను విస్తరింపచేసాడు.

నాభి భార్య సుదేవి. ఆ దంపతులకు పరమాత్మ ఋషభ రూపంతో జన్మించాడు. ఆ ఋషభుడు అన్నీ సమానంగా చూచేవాడు. ఇంద్రియ నిగ్రహము కలవాడు .ఇంద్రియములను జయించిన వాడు. ఎల్లప్పుడూ సమాధిలో ఉంటూ ఉండేవాడు. ఋషులు వర్ణిస్తూ ఉండే పరమహంస పదమును గురించి ధ్యానం చేసేవాడు.

పరమాత్మ హయగ్రీవ రూపంలో యజ్ఞమునుండి పుట్టాడు. ఆయన దేహము బంగారు కాంతితో ప్రకాశిస్తూ ఉండేది. ఆయన వేదమయుడు. యజ్ఞమయుడు. ఆయన సర్వ దేవతలకు పూజనీయుడు. ఆ హయగ్రీవుడు శ్వాస విడుచునపుడు, ఆయన ముక్కు రంధ్రముల నుండి వేదలక్షణములు గల వాక్కులు పుట్టాయి.

యుగాంతంలో జలప్రళయము సంభవించింది. అప్పుడు పరమాత్మ మత్స్యరూపము ధరించాడు. వైవస్వత మనువుకు దర్శనం ఇచ్చాడు. ఈ భూమి తానే ఒక నావలాగా తయారయి సమస్త జీవులకు ఆశ్రయం కల్పించింది. ఆ మహాప్రళయంలో కలిగిన భయంతో వేదములు నా ముఖం నుండి జారిపడిపోయాయి. మత్స్యరూపంలో ఉన్న పరమాత్మ ఆ వేదములను పట్టుకున్నాడు. ఆ ప్రళయకాల జలములలో సమస్త జీవులతో నిండి ఉన్న భూమి అనే నావను పునరుద్ధరించాడు.

దేవతలు, దానవులు అమృతం కోసరం మంధర పర్వతమును కవ్వముగా చేసి, వాసుకిని తాడుగా చేసి, పాల సముద్రమును చిలుకుతూ ఉంటే, పరమాత్మ కచ్ఛప రూపంలో ఆ మంధర పర్వతముకింద నిలిచి, ఆపర్వతము  పాలసముద్రములో మునిగిపోకుండా తన వీపు మీద మోసాడు. తన వీపుమీద మంధర పర్వతము తిరుగుతూఉంటే ఆ పరమాత్మకు దురదతగ్గి సుఖంగా నిద్రించాడు.

దేవతలు అసురుల వలన కలిగిన  భయంతో తనను ప్రార్థించగా, పరమాత్మ నృసింహుడుగా అవతరించి,  గదను తీసుకొని తన మీదికి చంపడానికి వస్తున్న హిరణ్యకశిపుని, తొడలమీద వేసుకొని తన గోళ్లతో హిరణ్యకశిపుని వక్షస్థలము చీల్చి సంహరించాడు. దేవతల భయం పోగొట్టాడు.

ఒక గజరాజు తన రాణులతో ఒక కొలనులో జలక్రీడలు సలుపుతుంటే ఒక మొసలి  ఆ గజరాజు కాలు పట్టుకొంది. అప్పుడు ఆ గజరాజు ఆ కొలనులో ఉన్న ఒక తామర పూవును తొండముతో ఎత్తి పట్టుకొని ఆ పరమాత్మను మనసారా తనను రక్షింపుమని ధ్యానించాడు. ప్రార్థించాడు. ఆ గజరాజు ప్రార్థనను విన్న పరమాత్మ వెంటనే ఆలస్యం చేయకుండా తన వాహనమైన గరుత్మంతుని మీద కూర్చుని, చక్రాయుధమును ధరించి, ఆ చక్రాయుధముతో ఆ మొసలిని సంహరించాడు. తనను మనసారా శరణువేడిన గజరాజును కాపాడాడు.

పరమాత్మ, అదితి సుతులలో చిన్నవాడుగా, వామనుడుగా జన్మించాడు. బలిచక్రవర్తి యజ్ఞము చేస్తుంటే ఆయన వద్దకు వెళ్లి తనకు మూడు అడుగుల భూమిని దానంగా ఇమ్మని అడిగాడు. ఆ భగవానుడు తన పాదములను ఉంచడం ద్వారా మూడు లోకములను ఆక్రమించాడు. మూడు అడుగులు దానంగా గ్రహించు మిషతో పరమాత్మ బలి చక్రవర్తి నుండి ముల్లోకాధి పత్యము స్వీకరించాడు. విష్ణుభక్తుడు, సన్మార్గుడు అయిన బలి నుండి ఐశ్వర్యములను గ్రహించుటకు యాచనకు పాల్పడ్డాడు పరమాత్మ.

నారదా! బలి చక్రవర్తికి శాశ్వతమగు వైకుంఠపథమును అనుగ్రహించడం కోసమే, అతని వద్ద నుండి ఇహలోకములలో లభించు అశాశ్వతములైన ఐశ్వర్యములను, ముల్లోకాధి పత్యమును, హరించాడు పరమాత్మ. సాక్షాత్తు పరమాత్మస్వరూపుడగు వామన మూర్తి బ్రాహ్మణ వటువు రూపంలో తన వద్దకు రాగానే, బలి చక్రవర్తి ఆయన పాదములను కడిగి ఆ పవిత్ర జలములను తన తల మీద చల్లుకొన్నాడు. "వచ్చినది విష్ణువు, నీ ముల్లోకాధి పత్యము అపహరించడానికి వచ్చాడు" అని శుక్రాచార్యుడు వారించినా, శాపంతో నివారించినా, బలి చక్రవర్తి లక్ష్యపెట్టలేదు. మూడు అడుగుల భూమి దానంగా ఇస్తాను అన్న మాటకు కట్టుబడి ఉన్నాడు. వామన మూర్తి పాదమును ఉంచడానికి తన శిరస్సును సమర్పించాడు. ఆ పరమాత్మ పాద స్పర్శ కన్నా ఇంద్రలోకాధి పత్యము గొప్పది కాదు అని తన మనస్సులో తలంచాడు బలి చక్రవర్తి. ఆ కారణం చేతనే పరమాత్మ అతని స్వర్గలోకాధిపత్యమును అపహరించి అతనికి వైకుంఠలోకప్రాప్తిని అనుగ్రహించాడు.

నారదా! ఆ పరమాత్మ నీ హృదయాకాశంలో ప్రత్యక్షమై నీకు సంపూర్ణభక్తియోగమును, ఆత్మతత్త్వమును, భాగవత జ్ఞానమును బోధించాడు కదా! ఆ పరమాత్మను భక్తితో ధ్యానించే వారికి భాగవత జ్ఞానము కరతలామలకము కదా!

మన్వంతరంలో మనువుగా అవతరించి, దశదిశలయందు సుదర్శన చక్రస్వరూపమైప  తన ప్రభావాన్ని విస్తరింపజేసి, దుష్టులైన రాజులను శిక్షించి, ముల్లోకములలోనూ సత్య లోకములోనూ తన కీర్తిని వ్యాపింపజేసాడు.

నారదా! ఆపరమాత్మ ఈ భూమి మీద ధన్వంతరి గా అవతరించాడు. కేవలం ధన్వంతరి అనే తన పేరు పలికితేనే చాలు సర్వరోగములు నివారించాడు. భూలోకంలో ఆయుర్వేదము అనే వైద్య శాస్త్రమును  విస్తరింపచేసాడు.

భూలోకములో ఉన్న క్షత్రియులు వేదమార్గములను విడిచిపెట్టి, బ్రాహ్మణులకు ద్రోహం చేస్తూ, లోక కంటకులుగా మారి, నరక యాతనలు అనుభవించడానికి ఇష్టపడేవారిగా తయారైన సందర్భంలో, పరమాత్మ పరశురాముడిగా అవతరించి, క్షత్రియుల మీద ఇరువది ఒక్క సార్లు దండెత్తి,  తన పరశువుతో క్షత్రియకులమును సమూలంగా నిర్మూలించాడు.

నారదా! మామీద ఎంతో దయగలవాడు, మాయను తన అధీనంలో ఉంచుకున్నవాడు, పూర్ణస్వరూపుడు అయిన పరమాత్మ,

ఇక్ష్వాకు వంశంలో, దశరథమహారాజుకు పెద్ద కుమారుడిగా, రాముడు అనే పేరుతో అవతరించాడు. సీతను పెళ్లి చేసుకున్నాడు. తండ్రి ఆజ్ఞను అనుసరించి భార్య సీతతోనూ, తమ్ముడు లక్ష్మణునితోనూ పదునాలుగు సంవత్సరములు అరణ్యవాసము చేసాడు. అరణ్య వాస సమయంలో లంకకు రాజైన రావణుడు అనే రాక్షసుడు రామునితో అకారణంగా వైరముపెట్టుకొని, రామలక్ష్మణులు ఆశ్రమములో లేని సమయంలో రాముని భార్య సీతను అపహరించాడు. రాముడు లంకా నగరానికి వానర సైన్యముతో దాడి వెడలాడు. లంకను నాశనం చేయ సంకల్పించాడు. రాముని కోపమునకు భయపడి సముద్రుడు రామునికి త్రోవనిచ్చాడు.

రావణుడు మహా బలవంతుడు. రావణుడు ఇంద్రునితో యుద్ధం చేస్తున్నప్పుడు ఇంద్రుని వాహనమైన ఐరావతము అనే ఏనుగు యొక్క దంతములు రావణుని వక్షస్థలమునకు గుచ్చుకొని విరిగిపోయాయి. ముల్లోకములను జయించిన రావణుడు వర గర్వితుడై తనకు ఎదురు ఎవరూ లేరని విర్రవీగుతుండేవాడు. రాముడు, తన భార్య సీతను అపహరించిన రావణుని, తన ధనుర్బాణములతో అవలీలగా సంహరించాడు.

ద్వాపరంలో ఉన్న రాజులు బలగర్వితులై, తమ అపారమైన సేనలతో,  లెక్కలేనన్ని అకృత్యములు చేస్తూ భూమికి భారంగా తయార య్యారు. భూభారాన్ని తగ్గించడానికి ఆ పరమాత్మ యదు వంశంలో శ్రీకృష్ణుడుగా అవతరించాడు. శ్రీకృష్ణతత్త్వము తెలుసుకోవడం మా వంటి వారికి కూడా చాలా కష్టము.

బాల్యములోనే తనకు పాలు ఇవ్వడానికి వచ్చిన పూతన అనే రాక్షసిని సంహరించడం, మూడవ మాసములోనే శకటము రూపములో వచ్చిన శకటాసురుడు అనే రాక్షసుని చంపడం, దోగాడే వయసు లోనే రెండు మద్ది చెట్ల నడుమ దూరి, వాటిని పడదోయడం లాంటి లీలలు ఆ పరమాత్మకు తప్ప వేరేవాళ్లకు సాధ్యమవుతాయా నారదా!

అంతేకాదు. నందవ్రజములో ఉన్న కాళిందీ మడుగులో విషపూరితమైన నీటిని తాగిన గోప బాలురను, పశువులను ఆ శ్రీకృష్ణుడు మాత్రమే కాపాడగలిగాడు. కాళిందీ మడుగులో విషమును చిమ్ముతున్న కాళీయుడు అనే పామును అక్కడి నుండి వెళ్లగొట్ట గలగడం ఆ శ్రీకృష్ణుడికి తప్ప  పరులకు సాధ్యమా!

కాళీయుని మర్దించిన నాటి రాత్రి దావాగ్ని నందవ్రజములో ఉన్న ఎండి పోయిన చెట్లను, అడవిని కాల్చివేస్తోంది. నందవ్రజము చుట్టు మంటలు చుట్టుముట్టాయి. వ్రజములో ఉన్న ప్రజలందరూ తమకు మరణము తప్పదని భయపడ్డారు. అప్పుడు ఆ కృష్ణ పరమాత్మ వ్రజములో ఉన్న ప్రజలందరినీ కళ్లుమూసుకోమన్నాడు. ఆ మంటలను అదుపు చేసాడు. వ్రజవాసులను రక్షించాడు.  ఈ లీల చేయడం కృష్ణుడికి తప్ప మరొకరికి సాధ్యమా!

కొంటె కృష్ణుని అల్లరి మితిమీరిపోతుంటే, కృష్ణుని కట్టడానికి తల్లి యశోద తాళ్లు తీసుకొని వచ్చింది. ఎన్ని తాళ్లు తెచ్చినా అవి కృష్ణుని కట్టడానికి సరిపోలేదు. అప్పుడు కృష్ణుడు నోరు తెరిచి ఆవలించగా, కృష్ణుని నోటిలో పదునాలుగు లోకములు నిండి ఉండటం చూచి

ఆశ్చర్యపోయింది యశోద. ఇది కలా లేక వైష్ణవ మాయా అని సందేహపడింది. అటువంటి కృష్ణుని వలన జ్ఞానమునకు ప్రతిరూపమైన పుత్రప్రేమను పూర్తిగా ఆస్వాదించగలిగినది తల్లి యశోద.

ఆ కృష్ణుడు చేయలేని పనిలేదు. తన తండ్రి నందుని వరుణపాశ భయము నుండి విముక్తుడిని చేసాడు. వ్యోమాసురుడు గోవులను ఒక గుహలో బంధిస్తే వాటిని విడిపించాడు. పగలంతా శ్రమచేసి రాత్రి ఆదమరిచి నిద్రిస్తున్న గోపకులను తన మాయాశక్తి ప్రభావంతో మాయ అంటే తెలియని వైకుంఠమునకు తీసుకొని వెళ్లగలిగాడు.

నందవ్రజములో ఉన్న గోపకులు నందుని ఆధ్వర్యములో ఇంద్రునికి పూజలు చేస్తుంటే, వాటిని కృష్ణుడు ఆపించగా, కోపించిన ఇంద్రుడు వరుసగా ఏడు రోజులు ఎడతెరిపి లేకుండా వర్షము కురిపించాడు. ఆ సమయంలో ఏడు సంవత్సరముల వయసు ఉన్న బాలుడైన శ్రీకృష్ణుడు తన చేతితో గోవర్ధన పర్వతమును ఎత్తి గొడుగు మాదిరి పట్టుకొని, దాని కింద వ్రజవాసులైన గోపకులను, గోవులను, ఏడు దినములు రక్షించాడు.

చల్లని పండు వెన్నెలలో, యమునా తీరంలో, బృందావనంలో, మురళి వాయిస్తున్న శ్రీకృష్ణుని మనోహరమైన మురళీ గానామృతమును విని, కామోద్దీపితలైన గోపకాంతలు పరుగుపరుగున కృష్ణుని వద్దకు వచ్చి, రాసలీలలలో మునిగి ఉండగా, శంఖచూడుడు అనేయక్షుడు గోవులను అపహరించి నపుడు, ఆ శంఖచూడుని శిరస్సును ఖండించి గోవులను కాపాడాడు శ్రీకృష్ణుడు.

అంతే కాకుండా నారదా! ప్రలంబాసురుడు, ధేనుకాసురుడు, బకాసురుడు, కేశి, అరిష్టాసురుడు, మొదలగు అసురులు, చాణూర ముష్టికులు అనే మల్లయోధులు, కువలయా పీడము అనే పేరుగల ఏనుగు, కంసుడు, కాలయవనుడు,నరకాసురుడు, పౌండ్రక వాసుదేవుడు, శాల్వుడు, ద్వివిదుడు అనే వానరము, బల్వలుడు, దంతవక్త్రుడు, నాగ్నజిత్తు అనే రాజుకు సంబంధించిన ఏడు ఎద్దులు, శంబరాసురుడు, విదూరథుడు, రుక్మి మొదలగు వారు, కాంభోజ, మత్స్య, కురు,కేకయ, సృంజ మొదలగు దేశముల రాజులు, తనమీదికి యుద్ధానికి వచ్చినప్పుడు, కొంత మందిని తాను స్వయంగా సంహరించాడు, మరి కొంత మందిని బలరాముని చేత, అర్జునుని చేతా, భీముని చేతా సంహరింపజేసాడు. తన చేతిలో సంహరింప బడిన వారందరికీ వైకుంఠప్రాప్తిని కలుగచేసాడు పరమాత్మ. ఇటువంటి లీలలు ప్రకటించడం ఇతరులకు సాధ్యమా!

నారదా! కాల గతిని అనుసరించి మానవులు సంకుచిత స్వభావులుగా, అల్పాయుష్కులుగా, తయారవుతున్నారు. వారికి వేదాధ్యయనం కష్టంగా మారుతూ ఉంది. వేదములను అర్థం చేసుకోలేకపోతున్నారు. ఆ కారణం చేత భగవానుడు వేదవ్యాసుని రూపంలో అవతరించి, వేదములను విభజించి, పురాణములను, ఇతి హాసములను రచించి, వేదరహస్యములను వాటిలో ఇమిడ్చి అందరికీ అర్థం అయేటట్టు చేసాడు.

వేద విహిత కర్మలు ఎక్కువగా ప్రచారంలో ఉన్న రోజులలో బుద్ధుడిగా అవతరించి కొత్త ధర్మమును ప్రచారం చేసాడు.

కలియుగము అంత్య దశకు చేరుకున్నప్పుడు హరి యొక్క కధలను గానం చేసే వారు, వినే వారు అసలు ఉండరు. బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యులు అందరూ నాలుగవ జాతి అయిన శూద్రుల ధర్మమైన సేవా ధర్మమును ఆశ్రయిస్తారు. క్షత్రియులకు బదులు శూద్రులే పరిపాలనా బాధ్యతలను నిర్వర్తిస్తారు. వేద మంత్రములు మచ్చుకైనా వినిపించవు. అటువంటి సమయములో పరమాత్మ కల్కి అవతారము ధరించి కలియుగమును శాసిస్తాడు.

నారదా! సృష్టి చేసేటప్పుడు నేను, తపస్సు, ఋషులు, ప్రజాపతులు తొమ్మిది మంది, అదే విధంగా లోకపాలన చేసేటప్పుడు ధర్మము, విష్ణువు, మనువులు, దేవతలు, క్షత్రియులు, అదే విధంగా లయ కాలంలో రుద్రుడు, అధర్మము, కోపము, సర్పములు, అసురులు మొదలగు వారు, వీరందరూ ఆ పరమాత్మ యొక్క మాయావిభూతులే. ఏదీ పరమాత్మ కన్నా వేరు కాదు.

భగవానుడు తన వామనావతార సమయములో మూడు లోకములను ఆక్రమించు నపుడు, భూలోకము నుండి సత్యలోకము దాకా విశ్వమంతా కంపించింది. అప్పుడు పరమాత్మ తనయొక్క అపారమైన శక్తితోనే లోకముల నన్నిటినీ స్థిరంగా ఉంచాడు.

ఓ నారదా! నేను గానీ, నీ కన్నా ముందు పుట్టిన మునులు గానీ ఆ పరమాత్మ యొక్క మాయా విభూతులను గురించి, వాటి అంతము గురించి ఏ మాత్రమూ తెలుసుకోలేక పోయాము. మేమే కాదు వేయి పడగల ఆది శేషుడు కూడా నిరంతరమూ ఆ పరమాత్మ

గుణములు కీర్తిస్తూ ఉన్నా, ఆయన కూడా ఈ మాయ యొక్క అంతము తెలుసుకోలేకపోయాడు. ఇంక ఇతరులు ఎలా తెలుసుకోగలరు?

ఎవరైతే తనను నిష్కల్మష హృదయంతో, సంపూర్ణంగా శరణు వేడుతారో, అటువంటి మానవులమీద ఆ పరమాత్మ తన అపారమైన దయను ప్రసరిస్తాడు. అటువంటి మానవులు ఈ మాయను సులభంగా దాటగలరు. పరమాత్మ మాయ గురించి కూడా తెలుసుకోగలరు. అటువంటి భక్తులకు, తమ భార్యా బిడ్డల మీద, ఇహలోక సుఖముల మీద మమకారములు, కోరికలు ఉండవు.

నారదా!ఆ పరమాత్మ యోగమాయను గురించి నాకు తెలుసు. నేనే కాదు, నువ్వు, సనకసనందనాదులు, శివుడు, ప్రహ్లాదుడు, స్వాయంభువ మనువు, శతరూప, మనువు కుమారుడగు ప్రియవ్రతుడు, ప్రాచీన బర్హి, ఋభుడు, ధ్రువుడు కూడా ఈ యోగమాయ గురించి తెలుసుకున్నారు.

నారదా! వీరే కాదు, ఇక్ష్వాకువు, పురూరవుడు, ముచుకుందుడు, జనకుడు, గాధి, రఘువు,అంబరీషుడు, సగరుడు, గయుడు, యయాతి, మాంధాత, అలర్కుడు, శతధన్వుడు, అనుడు, రంతిదేవుడు, భీష్ముడు, బలి, అమూర్తరయుడు, దిలీపుడు, సౌభరి, ఉతంకుడు, శిబి, దేవలుడు, పిప్పలాదుడు, సారస్వతుడు అనగా దధీచి,

ఉద్ధవుడు, పరాశరుడు, భూరిషేణుడు, విభీషణుడు, హనుమంతుడు, శుకదేవుడు, అర్జునుడు, అర్ష్టిషేణుడు, విదురుడు, శ్రుతదేవుడు మొదలగు మహాత్ములు కూడా ఈ యోగ మాయ గురించి తెలుసుకొన్న వారే.

నారదా! ఈ దేవ మాయను తెలుసుకోడానికి అందరూ అర్హులే. స్త్రీలు, శూద్రులు, యవనులు, హూణులు,పాపజీవులు చివరకు పశువులు, పక్షులు  కూడా ఆ పరమాత్మయొక్క భక్తులను సేవించి వారి వల్ల ఉపదేశమును పొందితే, వారు కూడా ఈ దేవమాయను తెలుసుకోగలరు. వారి పరిస్థితే అలా ఉంటే ఇంక అనునిత్యము ఆ పరమాత్మను స్మరిస్తూ సేవిస్తూ ఉండే వారి మాట చెప్పడం ఎందుకు? అటువంటి వారు ఈ మాయలో నుండి త్వరగా బయటపడతారు.

జ్ఞానులు ఆ పరమాత్మను బ్రహ్మ అని కూడా పిలుస్తారు. బ్రహ్మ అనేది పరమాత్మ యొక్క ప్రాధమిక రూపము. బ్రహ్మము నిత్య సత్య స్వరూపము. నిరంతరసుఖదాయకము. శోకమునకు అతీతము. క్షోభ అనేది తెలియని తత్త్వము. అభయస్వరూపము. నిర్మలము. సత్ అసత్తుల కంటే భిన్నమైనది. అన్నింటినీ సమంగా చూచేది. ఆయన శబ్దమునకు వాక్కుకు అందడు.  ఆయనను మాయ ఆవరించదు. ఆ బ్రహ్మ మాయాతీతుడు.

మునులు సతతము తమ మనస్సులను ఆ పరమాత్మ యందే లగ్నము చేసి భగవంతుని యందు ఉన్న భేదభావమును వదిలిపెడతారు. సమస్తఫలములను ఇచ్చే దాత ఆ పరమాత్మ ఒక్కడే.

సత్త్వ, రజస్ తమోగుణములు, మహాతత్త్వము మొదలగు గుణములతో కూడిన కర్మలు అన్నీ ఆ పరమాత్మకే చెందుతాయి. మానవుడు తాను చేసే  కర్మలన్నీ ఆ పరమాత్మ అనుగ్రహము వలననే చేయగలుగుతాడు. పంచభూతముల కలయికతో ఏర్పడిన ఈ దేహము, ఆ పంచ భూతములు విడిపోగానే, జీర్ణమై పోతుంది. కాని ఆ దేహములో ఉన్న జీవుడు నాశనం కాడు. కేవలము ఈ  దేహమును వదిలి పెడతాడు. ఎందుకంటే మరణము దేహమునకే గానీ, జీవునకు కాదు.  జీవుడు జన్మ రహితుడు. అందువలన దేహముతో పాటు నాశనము పొందడు.

నారదా! నీకు ఆ పరమాత్మస్వరూపమును సంక్షిప్తముగా చెప్పాను. జీవశక్తి, మాయాశక్తి రెంటికీ మించినవాడు శ్రీహరి. ప్రాణుల హృదయాలలో అనాసక్తంగా, సాక్షీభూతంగా ఉంటాడు. అందువల్ల ఈ మాయతో కానీ, జీవుడు చేసే కర్మలతోగానీ పరమాత్మకు ఎలాంటి సంబంధం లేదు.

నారదా! ఆ పరమాత్మ నాకు ఉపదేశించిన  భాగవతమును నీకు సంక్షిప్తంగా చెప్పాను ఈ భాగవతములో ఆ పరమాత్మ విభూతులు సంక్షిప్తంగా వర్ణించాను. నీవు వాటిని విస్తరించు. నీవు ఆ పరమాత్మ విభూతులను బాగా విస్తరింపజేసి  ప్రజలకు వివరించు. మానవులకు ఆపరమాత్మయందు భక్తి ప్రమత్తులు పెంచు.

నారదా! ఈ సృష్టికి సంబంధించిన లీలలు అన్నీ మాయా సంబంధమైననూ, అవి అన్నీ భగవంతునికి సంబంధించినవి అగుటచేత నిర్గుణమైనవి. ఆ భగవానుని మాయలను, అవతార లీలలను నిత్యమూ

కీర్తించేవాడికి, వినేవాడికి, స్తుతించే వాడికి, అతని ఆత్మ ఎప్పుడు కూడా భగవంతుని మాయచేత మోహింపబడదు. నిర్మలంగా ఉంటుంది." అని బ్రహ్మ నారదునికి ఆ పరమాత్మ తత్త్వమును ఉపదేశించాడు.

శ్రీమద్భాగవతము
ద్వితీయ స్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ద్వితీయ స్కంధము
ఎనిమిదవ అధ్యాయము.

పరీక్షిత్తు మహారాజు శుకయోగీంద్రులను చూచి ఇలా అన్నాడు. "ఓ శుకయోగీంద్రా! బ్రహ్మ చేత ఆజ్ఞాపించబడిన నారదుడు, లోకంలో పరమాత్ముని యొక్క గుణములను కీర్తించాడని, శ్రీహరి కథలను ప్రచారం చేసాడని చెప్పారు కదా! నారదుడు ఆ పరమాత్ముని అద్భుత లీలలను కథల రూపంలో ఎవరికి ఏ విధంగా ప్రచారం చేసాడో వివరించండి.

ఇప్పుడు నా మనస్సు రాగ ద్వేషములకు అతీతంగా, ఎటువంటి ఆసక్తులు లేకుండా నిర్మలంగా ఉంది. అటువంటి మనస్సును నేను శ్రీకృష్ణుని యందు లగ్నం చేసి ఈ శరీరమును వదిలిపెట్టడానికి వీలుగా నాకు ఆ పరమాత్ముని గాధలను వివరించండి.

ఎవరైనా ఆ పరమాత్మ మంగళకరములైన కథలను ప్రతి నిత్యము శ్రద్ధగా విన్నా, కీర్తించినా, అటువంటిమానవుల హృదయాలలో ఆ పరమాత్మ ప్రవేశిస్తాడు అని విన్నాను.

వర్షఋతువులో వచ్చే వరదలతో జలాశయములలో మురికిగా తయారైన నీరు, శరదృతువులో తేరుకొని నిర్మలమైనట్టు, శ్రీకృష్ణుని కథలను, లీలలను వింటూ ఉంటే, ఆ కృష్ణుడు వారి కర్ణ రంధ్రముల ద్వారా వారి హృదయములలో ప్రవేశించి వారి పాపములను పోగొడతాడు కదా!

ఎక్కడెక్కడో తిరిగి తిరిగి అలసి పోయి ఇల్లు చేరిన పాంథుడు మరలా బయటకు వెళ్లడానికి ఇష్టపడనట్టు, ఒక సారి కృష్ణలీలలను, కృష్ణుని కథలను చెవులలో అమృతం పోసినట్టు విన్న భక్తుడు, మరలా ఇతర కథల జోలికిపోడు. కృష్ణుని పాదములను విడువడు.

ఓ శుకమహర్షీ! ఈ శరీరంలో ఉన్న జీవుడికి పంచ భూతములతో ఎలాంటి సంబంధము లేదు. కానీ ఈ శరీరము పంచభూతముల సంయోగముతో ఏర్పడింది. అంటే జీవునికి ఈ దేహము ఎటువంటి కారణము లేకుండానే ఏర్పడిందా! లేక ఈ జీవుడు పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితంగా ఈ దేహం ఏర్పడిందా! ఈ విషయం తమరికి బాగాతెలుసు. ఆ విషయ ములను నాకు వివరంగా చెప్పండి.

ఈ లోకములను సృష్టించడానికి నియమించబడిన బ్రహ్మ ఆ పరమాత్మ బొడ్డులోనుండి పుట్టిన పద్మము లోనుండి ఉద్భవించాడు కదా! తరువాత ఆ పరమాత్మ విరాట్పురుషునిగా అవతరించాడు. అంటే విరాట్పురుషుడు నిరాకారుడు,నిర్గుణుడు అయిన పరమాత్మ కంటే వేరు కదా! విరాట్పురుషుడు కూడా సాధారణ మానవుని మాదిరి తల, చేతులు, కాళ్లతోనూ, పొడుగు, పొట్టి అవయవములతోనూ, నశించి పోయే దేహముతో ఉన్న వాడు అని చెప్పారు కదా! అది ఎలా సంభవము. ఆ విరాట్పురుషునికి కూడా చేతులు కాళ్లు తల, నాశనము అయ్యే దేహము ఉంటే, విరాట్పురుషునికి, లౌకిక పురుషునికి తేడా ఏముంటుంది?

సృష్టి చేయడానికి బ్రహ్మ ఆ పరమాత్మ నాభి కమలం నుండి పుట్టాడు. ఆ పరమాత్మ దయవలననే సృష్టిని చేస్తున్నాడు. ఆ పరమాత్మ యొక్క విరాట్ రూపమును దర్శించాడు.

ఈ విశ్వంలో సృష్టి,స్థితి, లయములకు కారకుడు, అంతటా తానే అయినవాడు, సర్వాంతర్యామి, అగు పురుషుడు తాను ఈ మాయకు అధిపతి అయినప్పటికినీ, ఆ మాయకు లోబడకుండా, ఆ మాయను తాకకుండా, ప్రత్యేకంగా ఎక్కడ శయనించి ఉంటాడు?

ఆ విరాట్పురుషుని అవయవముల ద్వారానే ఇంద్రుడు, వరుణుడు మొదలగు లోకపాలకులు, దేవతా గణాలు, వారికి నివాసములైన లోకములు కల్పించబడ్డాయి అని చెప్పారు కదా! కాని, మరొక చోట ముందు లోకములు పుట్టి, వాటికి లోకపాలకులు

నియమింప బడ్డారు అనీ, వారి ద్వారా విరాట్పురుషుని అవయవములు అన్నీ కల్పించబడ్డాయి అని కూడా చెప్పారు కదా! మరి ఇలా రెండు విధములుగా చెప్పడంలో ఏమైనా విశేషం ఉందా!

ఓ శుకమహర్షీ! కల్పము, వికల్పము, వాటి పరిమాణము, కాలము, ఆకాలములలో విధములు, భూత, భవిష్యత్, వర్తమాన కాలములు, ఆ కాలముల యొక్క విధానములు, జీవుల యొక్క ఆయు:ప్రమాణములు ఎంతెంత ఉంటాయో అన్నీ నాకు వివరించండి.

కాలమును ఎలా గుణిస్తారు. అందులో అత్యల్పపరిమాణము, అత్యధిక పరిమాణము ఏమిటి? వాటిని తెలుసుకోవడం ఎలాగ? కర్మలు ఎన్ని రకాలు? శుభ కర్మలు చేస్తే వచ్చే ఫలితాలు, అశుభ కర్మలు చేస్తే వచ్చే ఫలితాలు ఎలా ఉంటాయి? కర్మలు చేసినందు వలన పొంద దగిన స్థానములు, వాటి వివరాలు అన్నీ నాకు తెలియజేయండి.

దైవత్వము పొందడానికి, ఉత్తమ లోకములు కలగడానికి, మానవులు ఏయే కర్మలు చెయ్యాలి. ఏయే కర్మలు చేస్తే మానవులకు పుణ్యలోకములు కానీ, పాప లోకములు కానీ  లభిస్తాయి. ఏయే మానవులకు ఏ యే కర్మలు చేయడానికి అధికారము కలదో తెలియజేయండి.

ఈ అనంత విశ్వంలో భూమి, పాతాళము, దిక్కులు, ఆకాశము, గ్రహములు, నక్షత్రములు, పర్వతములు, నదులు, సముద్రములు, ద్వీపములు మొదలగునవి ఉన్నాయికదా. వాటిలో రకరకాల జీవజాలము ఉంది కదా! ఆ జీవజాలము ఎలా పుట్టింది. వాటి

ఉత్పత్తి ఎలాజరిగింది?

ఈ అనంత విశ్వంలో ఎన్నో బ్రహ్మాండాలు ఉన్నాయి కదా! వాటి లోపల ఉన్న పరిమాణము ఎంత? బయట ఉన్న పరిమాణము ఎంత? ఈ విశ్వంలో ఎంతో మంది మహాత్ములు జన్మించారు కదా! వారి జీవిత చరిత్రలు నాకు తెలియజేయండి. మానవులలో వర్ణాశ్రమ ధర్మములు ఏర్పడ్డాయి కదా! ఏ యే లక్షణములు, స్వభావములను అనుసరించి ఈ వర్ణాశ్రమ ధర్మములు ఏర్పడ్డాయి.

యుగములు, వాటి పరిమాణములు, ఆయా యుగము లలో ఆచరించవలసిన ధర్మములు, ఆ పరమాత్ముని యొక్క అవతార విశేషములు వాటి చరిత్రలు నాకు తెలియజేయండి.

పుట్టినప్పటి నుండి మరణించేవరకూ మానవులు ఆచరించ వలసిన సాధారణ ధర్మములు, విశేష ధర్మములు ఏమిటి? దైనందిన కర్మలు, వ్యాపారములు, సేవలు చేసే వ్యక్తులు ఆచరించ వలసిన ధర్మములు ఏమిటి? రాజర్షులు ఆచరించవలసిన ధర్మములు ఏమిటి? మానవులకు ఆపదలు కలిగినప్పుడు వారు ఆచరించ వలసిన ధర్మములు ఏమిటి?

మనకు ఉన్న తత్త్వములు ఎన్ని? వాటి లక్షణములు ఏవి? వాటి స్వభావములు ఏవి? భగవంతుని ఎలా ఆరాధించాలి? అధ్యాత్మ శాస్త్రములో చెప్పబడిన యోగముల గురించి చెప్పండి.

మహాయోగులు యొక్క ఐశ్వర్యము ఎలా ఉంటుంది?

యోగుల యొక్క సూక్ష్మ శరీరము ఎలా లయం అవుతుంది? ఋగ్వేదము మొదలగు వేదముల గురించి, ఆయుర్వేదము మొదలగు ఉప వేదముల గురించి, ధర్మశాస్త్రముల గురించి, ఇతిహాసములు, పురాణములగురించి, వాటి లక్షణముల గురించి నాకు వివరంగా చెప్పండి.

మానవులు సంసార సాగరంలో పడి కొట్టుకుంటుంటారు కదా? వారు ఆ సంసారము అనే సముద్రమును ఎలా దాటగలరు? దానికి తగిన సాధనముఏది? విక్రమము అంటే ఏమిటి? వినాశము అంటే ఏమిటి? ఈవిశ్వంలో ప్రాణులు ఎలా పుడుతున్నారు? ఎలా లయం అవుతున్నారు? వైదిక కర్మలు అనగా నేమి? ధర్మము, కామము, అర్థము వాటి గురించి వివరించండి.

ప్రళయ కాలంలో జీవులు అన్నీ ఎలా లయం అవుతాయి? దుర్మార్గులు ఎలా పుడతారు? ఎందుకు పుడతారు? జీవుడు ఈ సంసారంలో ఎలా బంధింపబడతాడు? ఆ బంధముల నుండి ఎలా విడివడతాడు? ఆ బంధముల స్వరూపము ఏమిటి?

భగవంతుడు సర్వస్వతంత్రుడు అన్నారు కదా! మరి ఈ మాయతో ఎందుకు క్రీడిస్తున్నాడు? అవసరం ఏమిటి? ప్రళయ కాలంలో ఈ మాయ ఏమవుతుంది? భగవంతుడు ఈ మాయను విడిచిపెడతాడా! లేక సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడా?

ఓ శుకమునీంద్రా! నేను నీ శరణుజొచ్చాను. నేను అడిగిన విషయములను, నేను అడగకుండా మరిచిపోయిన విషయములను

దయతో నాకు వివరించండి. నాసందేహములను అన్నిటినీ తీర్చండి.

ఓ మునీంద్రా! నీవు బ్రహ్మదేవునితో సమానుడవు. లోకంలో మానవులు మీ వంటి పెద్దలు జ్ఞానులు ఆచరించిన విషయములనే ఆచరిస్తూ ఉంటారు. నేను కూడా మీ అడుగు జాడలలో నడవవలెనని అనుకుంటున్నాను. బ్రాహ్మణ శాపముచేత నాకు ఏడు దినములలో మరణం సంభవించబోతోంది. కాని నాకు ఆ శాపము వలన భయం ఏ మాత్రం లేదు. నీ వాక్కులు అనే అమృత పానం చేస్తున్న నాకు భయం అనేది ఏమిటో తెలియదు. కాబట్టి నా సందేహములను తీర్చండి" అని అడిగాడు పరీక్షిత్తు మహారాజు.

పరీక్షిత్తు మహారాజు అడిగిన ప్రశ్నలకు శుకుడు ఈ విధంగా సమాధానం చెప్పసాగాడు.

శ్రీమద్భాగవతము
ద్వితీయ స్కంధము
ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## ద్వితీయ స్కంధము

## తొమ్మిదవ అధ్యాయము.

పరీక్షిత్తు మహారాజు అడిగిన ప్రశ్నలకు శుక మహర్షి ఈ విధంగా సమాధానాలె చెప్పడం మొదలెట్టాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీవు అడిగిన ప్రశ్నలకు అన్నిటికీ సరి అయిన సమాధానాలు చెబుతున్నాను. శ్రద్ధగా విను.

మానవులు సహజంగా కలలు కంటూ ఉంటారు. ఆ కలలలో వివిధము లైన దృశ్యములను చూస్తూ ఉంటారు. అనుభూతులు పొందుతూ ఉంటారు. మెలుకువ రాగానే ఏమీ గుర్తు ఉండవు. మానవునికీ ఆ కలలకూ ఎలాంటి సంబంధము లేదు. అలాగే ఆత్మకూ దేహమునకు, దేహముతో చేసే పనులకూ ఎలాంటి సంబంధము లేదు. కాని ఆత్మకు, దేహాధారులకు, మధ్య మాయ అనేది ఒకటి ఉంది. ఆ మాయయే దేహధారులను ఒక విధమైన మోహంలో పడేస్తూ అన్ని కర్మలు చేయిస్తూ ఉంటుంది. ఆ మాయ లేకపోతే పరమాత్మకు దేహధారికి ఎలాంటి సంబంధము లేనే లేదు.

ఈ మాయ అనేది చాలా రూపములు కలిగి ఉంటుంది. ఆ మాయా ప్రభావం చేతనే ఆత్మ, జీవాత్మగా ఎన్నోరూపాలతో ప్రకాశి స్తున్నాడు. అంటే బాల్యము, యౌవనము వృధ్యాప్యములలో వివిధ రూపాలు ధరిస్తున్నాడు. ధనికుడు, పేదవాడు ఇలా రకరకాలుగా వ్యక్తీకరింపబడుతున్నాడు. జీవుడు ఈ మాయా ప్రభావంలో పడి నేను,

నాది. అనే మోహంలో పడుతున్నాడు.

లోపల ఉన్న జీవుడు, బయట ఉన్న ప్రకృతి చాలా బలమైనవి. ఎప్పుడైతే జీవుడు బాహ్యంలో ఉన్న ప్రకృతిని, విషయసుఖాలను విడిచి పెట్టి, నేను నాది, నువ్వు, నీది అనే భేదభావమును వదిలిపెట్టి, అంతర్ముఖుడై ఆత్మ దర్శనం చేస్తాడో, అప్పుడు అతనికి ఏ భయమూ ఉండదు. పరిపూర్ణుడవుతాడు. శుద్ధసత్త్వగుణప్రధానంగా ప్రకాశిస్తాడు.

బ్రహ్మ నిర్మలమైన హృదయంతో పరమాత్మను గురించి తపస్సు చేసాడు. ఆ తపస్సుకు సంతృప్తి చెందాడు పరమాత్మ. బ్రహ్మకు తన చిద్రూపాన్ని చూపించాడు. ఆత్మ తత్వాన్ని బోధించాడు. తరువాత బ్రహ్మదేవుడు పద్మంలో కూర్చుని ఈ సృష్టిని ఎలా చెయ్యాలా అని ఆలోచిస్తున్నాడు. కాని సృష్టి చేయడానికి తగిన విధివిధానాలను తెలుసుకోలేకపోయాడు.

ఆ సమయంలో రెండు అక్షరముల శబ్దము ఒకటి నీటి లోనుండి వినపడింది. ఆ శబ్దము రెండు సార్లు వినిపించింది. ఆ శబ్దములో మొదటి అక్షరము త రెండవ అక్షరము ప. ఈ తప తప అనే శబ్దమును విన్నాడు బ్రహ్మ. ఆ శబ్దమే విషయ వాంఛలకు దూరంగా ఉన్న మానవులకు లభించిన ధనము అని అనుకున్నాడు.

ఆ తప అనే శబ్దము ఎక్కడ నుండి వచ్చిందా, ఎలా వచ్చిందా అని పరికించాడు బ్రహ్మ. నాలుగు పక్కలా దృష్టిసారించాడు. ఎవ్వరూ కనపడలేదు. బ్రహ్మ మరలా తన ఆసనము మీద కూర్చున్నాడు. ఆ తప అనే శబ్దానికి అర్థం ఎవరో తనను తపస్సు చేయమని

ఆదేశిస్తున్నారు అని అనుకున్నాడు. ఆ తపస్సు చేయడం కూడా తన మేలు కొరకే అని అనుకున్నాడు. వెంటనే తపస్సు చేయడం మొదలు పెట్టాడు బ్రహ్మ. (జలాశయాలలో నీరు ఒడ్డును తాకుతుంటే తప తప అనే శబ్దము వినిపించడం సహజమే కదా. ఆ తప అనే శబ్దమే తనను తపస్సు చేయమని ఎవరో ఆదేశిస్తున్నారు అని బ్రహ్మ మనసులో తట్టింది.).

బ్రహ్మగారు ప్రాణవాయువును బంధించాడు. ఇంద్రియములను తన స్వాధీనంలో ఉంచుకున్నాడు. ఏకాగ్రచిత్తంలో వేయి సంవత్సరాలు తపస్సు చేసాడు.

బ్రహ్మ చేసిన తపస్సుకు సంతోషించాడు పరమాత్మ. బ్రహ్మకు తన లోకాన్ని చూపించాడు. అదే వైకుంఠము. వైకుంఠములో ఎటువంటి బాధలు లేవు. మోహము లేదు. భయం లేదు. అన్ని లోకముల కంటే గొప్పలోకం వైకుంఠము. పుణ్యం చేసుకున్న వారు, ఆత్మ జ్ఞానం పొందిన వారు మాత్రమే వైకుంఠానికి రాగలరు.

అంతే కాదు, వైకుంఠములో సత్త్వగుణము, రజో గుణము, తమోగుణము గానీ, వాటి కలయిక గానీ, మచ్చుకైనా కనిపించవు. అక్కడ ఉన్నదంతా ఏ గుణము లేని నిర్గుణ తత్త్వము. వైకుంఠములో కాలము లేదు. కాలం గడవడం గానీ, కాలానుగుణంగా వస్తువులు నాశనం అవడం గానీ లేదు. రాగద్వేషములు, ఇష్టాఇష్టాలు లేవు. లౌకికములు అయిన ప్రాపంచిక సుఖములు, దు:ఖములు, లేవు. ఆ సుఖదు:ఖములను కలిగించే మాయకూడా అక్కడ లేదు. అక్కడ ఉన్నవారంతా భగవంతుని సేవలో నిమగ్నమైన వాళ్లే.

అక్కడ ఉన్న వాళ్ల వేషధారణ కూడా వైకుంఠమునకు తగ్గట్టే ఉంది. అక్కడ ఉన్న వాళ్లు అందరూ నీలమేఘచ్ఛాయతో మెరిసిపోతున్నారు. వాళ్ల కళ్లు తామరపూల రేకుల మాదిరి ఉన్నాయి. అందరూ పసుపు పచ్చని  పీతాంబరములు కట్టుకొని ఉన్నారు. అత్యంత సుందరాకారులు. చాలా సుకుమారంగా ఉన్నారు. అందరికీ నాలుగు చేతులు ఉన్నాయి. అందరూ రత్నములు ముత్యములు తో చేయబడ్డ ఆభరణములు ధరించి ఉన్నారు. అందరూ కిరీటధారులే.

మేఘములతో దట్టంగా ఉన్న ఆకాశంలో మెరుపు మెరిస్తే ఎలా ఉంటుందో, వైకుంఠము అలా ఉంది.

వైకుంఠములో లక్ష్మీదేవి నిరంతరమూ శ్రీమన్నారాయణుని పాదసేవనం చేస్తూ, విష్ణు కీర్తిని గానం చేస్తూ ఉంటుంది.

అటువంటి వైకుంఠములో సునందుడు, నందుడు, ప్రబలుడు మొదలగు పార్షదులతో సేవింపబడుతూఉన్న శ్రీమహావిష్ణువును బ్రహ్మదేవుడు  చూచాడు.

ఆ మహావిష్ణువు చూపులలో దయ, ఆనందము ఉన్నాయి. ఆయన పెదాల మీద చిరునవ్వు ఉంది. చతుర్భుజుడు, పీతాంబరధారి, వక్షస్థలమున శ్రీలక్ష్మిని ధరించిన విష్ణువును చూచాడు బ్రహ్మ.

ఆ శ్రీమహావిష్ణువు 25 శక్తులతో విరాజిల్లుతున్నాడు.

యోగీశ్వరేశ్వరుడు, యోగుల హృదయ సింహాసనములను అధిష్టించి ఉన్న వాడు అయిన శ్రీమహా విష్ణువు ఆ వైకుంఠములో సింహాసనమును అధిష్టించి ఉన్నాడు.

(25 శక్తులు అంటే ప్రకృతి, మహతత్త్వము, బుద్ధి, అహంకారము, మనస్సు, 10 ఇంద్రియములు, 5 తన్మాత్రలు(శబ్దము, రూపము, స్పర్శ, రసము, గంధము) పంచ భూతములు (పృథివి,ఆకాశము,అగ్ని,వాయువు,నీరు) మొత్తము 25)

పరమాత్మ దర్శనం కాగానే బ్రహ్మకు ఒళ్లంతా పులకించింది. కళ్లనిండినీళ్లు నిండాయి. పరమాత్మ పాదములకు భక్తితోనమస్కారం చేసాడు (బహ్మ).

తన పాదములకు నమస్కరిస్తున్న బ్రహ్మను రెండు చేతులతో లేవదీసాడు పరమాత్మ. ఆయనతో మృదుమధురంగా ఇలా అన్నాడు.

"ఓ బ్రహ్మదేవా! నీవు సృష్టి చేయవలెను అనే కోరికతో నా గురించి తపస్సు చేసావు. నీ తపస్సుకు నేను సంతృప్తి చెందాను. నీకు ఏమి వరము కావాలో కోరుకో ప్రసాదిస్తాను. నిన్ను తపస్సు చేయమని తప తపమనే శబ్దములతో నేనే నిన్ను ప్రేరేపించాను. నా ప్రభావంతోనే నీవు ఈ వైకుంఠమును దర్శించగలిగావు.

నీవు సృష్టి చేయవలెనని సంకల్పించావు. సృష్టికి పూనుకున్నావు. కానీ నీకు ఏమి చెయ్యాలో ఎలా చెయ్యాలో

తెలియలేదు. అప్పుడు నేను నీకు తప తప శబ్దమును వినిపించి తపస్సు చేయాడానికి ప్రోత్సహించాను. అప్పుడు నువ్వు నా గురించి తపస్సు చేసావు.ఎందుకంటే నేనే తపస్సుకు ఆధారము. తపస్సే నా హృదయము. తపస్సు నా శక్తి. ఆ తపశ్శక్తి చేతనే నేను ఈ విశ్వమును సృష్టిస్తున్నాను లయం చేస్తున్నాను. తపస్సుకు అంతశక్తి ఉంది." అని అన్నాడు పరమాత్మ.

ఆ మాటలు విన్న బ్రహ్మ ఇలా అన్నాడు. "భగవాన్! ఈ అనంత విశ్వంలో ఉన్న ప్రాణులకు నీవు అధిపతివి. అందరి హృదయాంత రాళాల్లో నీవు నివసిస్తున్నావు. నీకు ఉన్న అసమాన ప్రతిభా పాటవాల చేతనే నీవు అందరి హృదయములలో ఉన్న సంకల్పములను, కోరికలను తెలుసుకోగలుగుతున్నావు. నా హృదయములో మెదులు తున్న భావములను కోరికలను కూడా నీవు తెలుసుకున్నావు. నా కోరికలను నెరవేర్చు. నాకు నీ స్థూలరూపము, సూక్ష్మరూపము దర్శించగలిగే శక్తిని ప్రసాదించు.

ఓ మాధవా! సాలెపురుగు ఎలాగయితే తన నోటి నుండి వచ్చే రసం ద్వారా దారాన్ని సృష్టించి గూడు అల్లుకొని, మరలా ఆ దారమును తన నోటిలోకి లాక్కుంటుందో, అలాగే నీవు కూడా నీ మాయాశక్తి చేత బ్రహ్మగా సృష్టించి, విష్ణువుగా పోషించి, శివుడుగా మరలా నీలోనే లయం చేసుకుంటున్నావు. ఆ పరంపరలోనే సృష్టిచేయడానికి నన్ను నియమించావు. సృష్టి ఎలా చెయ్యాలో నాకు కూడా తెలియజెయ్యి.

నీవు నాకు చెప్పిన విషయములను తు చ తప్పకుండా పాటిస్తాను. నీవు చెప్పినట్టే సృష్టి చేస్తాను. నీ వలన తత్త్వ జ్ఞానమును

ఉపదేశముగా పొందిన నేను నీ ఆజ్ఞమేరకు సృష్టి చేస్తాను. కానీ నేనే ఈ సృష్టి చేస్తున్నాను అన్న అహంకారాన్ని నా మనసులోకి రానివ్వకు.

ఓ దేవా! నీవు నాకు ఒక మిత్రుడిగా సహకరిస్తున్నావు. అది నా అదృష్టము. స్థిరమైన చిత్తముతో నేను ఈ సృష్టిని చేయడానికి నాకు సహకరించు. నేను నీ సఖుడను అయినా నీ సేవకుడను మాత్రమే. "నేనే పరమాత్మను. నేనే స్వతంత్రుడను. నేనే ఇదంతా చేస్తున్నాను" అని ఎప్పుడూ అనుకోను. అలాంటిభావాలు నాలో కలుగకుండా చూడు." అని ప్రార్థించాడు బ్రహ్మ.

బ్రహ్మదేవుని మాటలు విన్న పరమాత్మ ఇలా అన్నాడు. "నీకు పరమ గుహ్యమైనది, విజ్ఞానవంతమైనదీ, రహస్యమైనదీ, అయిన జ్ఞానమును నీకు ఉపదేశిస్తాను. స్వీకరించు.

నేను ఏమిటో, నా స్వరూపము, స్వభావము ఏమిటో, నా స్వరూపము ఏ పరిమాణంలో ఉందో, నేను ఏ ఏ విధములైన గుణములు కలిగిఉంటానో, నా వివిధ రూపములు, లీలలు, అన్నీ కూడా నీకు వివరిస్తాను. నా కృప వలన నీకు పైన చెప్పిన అన్ని విషయములు, యదార్థమైన అనుభవపూర్వకంగా సంపూర్ణంగా లభిస్తాయి." అని చెప్పాడు పరమాత్మ.

(ఇక్కడి నుండి నాలుగు శ్లోకములను చతుశ్లోకి భాగవతము అంటారు. అంటే పరమాత్మ బ్రహ్మకు ఈ నాలుగు శ్లోకములలో భాగవతము అంతటినీ ఉపదేశించాడు. ఇంతకు ముందు బ్రహ్మ

పరమాత్మను నాలుగు ప్రశ్నలు అడిగాడు.

1.నీయొక్క ప్రాకృతము, అప్రాకృతము అయిన రూపము ఎట్టిది?

2.మాయ అనగా నేమి? యోగ మాయ అనగా నేమి?

3.ఈ మాయ, యోగ మాయలతో నీవు ఈ లోకములలో సృష్టిని ఒక ఆట మాదిరి  ఎలా నిర్వహిస్తున్నావు. జీవులతో ఎలా ఆడుకుంటున్నావు?

4.నీ ఆజ్ఞమేరకు నేను ఈ సృష్టిని చెయ్యాలి అంటే, నీ ఉపదేశము మేరకునేను ఏమి చెయ్యాలి? ఈ సృష్టిని ఎలా నిర్వహించాలి?

బ్రహ్మ అడిగిన ఈ నాలుగు ప్రశ్నలకు పరమాత్మ నాలుగు శ్లోకములలో సమాధానం ఇచ్చాడు. దానినే చతుశ్లోకీ భాగవతము అంటారు. ఈ నాలుగు శ్లోకములలో భాగవత సారము అంతా ఇమిడిఉంది. ఈ నాలుగు శ్లోకములను ఆధారము చేసుకొని వ్యాసుడు 18,000 శ్లోకములతో భాగవతమును రచించాడు. మొదట ఈ నాలుగు శ్లోకములలో భాగవతమును పరమాత్మ బ్రహ్మ దేవునికి ఉపదేశిస్తే, తరువాత బ్రహ్మ ఆనాలుగు శ్లోకములను విస్తరించి నారదునికి చెప్పాడు. నారదుడు వ్యాసునికి ఇంకా విస్తరించి చెప్పాడు. నారుదుడు చెప్పిన దానిని వ్యాసుడు ఇంకా విస్తరించి, అనేక కథలు, గాథల రూపంలో భాగవతమును రచించాడు. దానిని వ్యాసుడు తనకుమారుడు శుకునికి చెబితే, శుకుడు పరీక్షిత్తుకు చెప్పాడు. ఆ భాగవత పురాణమును విన్న సూతపౌరాణికుడు శౌనకుడు మొదలగు ఋషులకు నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో చెప్పాడు. ఆ ప్రకారంగా భాగవత పురాణము ఈ లోకానికి అందించబడింది. ప్రస్తుతము ఉన్న భాగవతములో అనేక కథలు ఉన్నప్పటికినీ అవి అన్నీ పరమాత్మ బ్రహ్మకు చెప్పిన నాలుగు శ్లోకముల సారము అని గుర్తించాలి. ఇంక ఆ నాలుగు శ్లోకముల గురించి

తెలుసుకుందాము.)

1.అహమేవాసమేవాగ్రే నాన్యదత్ సదసత్పరమ్।
పశ్చాదహం యదేతచ్చ యో2వశిష్యేత సో2స్మ్యహమ్॥

ఈ సృష్టికి పూర్వము నేను ఒక్కడినే ఉన్నాను. నా కంటే వేరుగా సూక్ష్మరూపంలో గానీ, స్థూల రూపంలో గానీ, వాటికి కారణ భూతంగా వేరే ఏ వస్తువుగానీ, (ప్రకృతి లాంటి వస్తువు గానీ) వేరు ఎవరూ లేరు. ఈ సృష్టి అంత్యము అయిన తరువాత కూడా నేను ఒక్కడినే ఉంటాను. ప్రళయకాలంలో కూడా నేను ఒక్కడినే మిగిలి ఉంటాను.నా కన్నా పరమైనది వేరే ఏదీ లేదు.

(ఇది పరమాత్మ గురించి మనకు తెలుసుకోవలసినది. పరమాత్మ చెప్పిన ప్రకారము సర్వకాల సర్వావస్థలయందు ఉండేది పరమాత్మ ఒక్కడే. బ్రహ్మ, విష్ణువు,శివుడు, ఇంద్రుడు అన్నీ ఆయన స్వరూపాలే. వేరు వేరుకాదు. ఆ పరమాత్మ ఆది పురుషుడు. సనాతనుడు. పురాణ పురుషుడు. ఆ పరమాత్మసంకల్పంచేతనే బ్రహ్మ పుట్టాడు. ఇదే పరతత్త్వము. ఇదే మనకుభాగవతము, భగవద్గీత బోధించింది. ఇదేమనకు తెలుసుకోవలసిన సత్యము.

ఇక్కడ మనకు ఒక సందేహం వస్తుంది. పరమాత్మ ఒక్కడే అయినప్పుడు ప్రళయం తరువాత ఈ సృష్టి అంతా ఎలా జరిగింది అని. చిన్న ఉదాహరణ. ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా తిరుమలకు వస్తున్నారు అని ప్రకటించారు. అంటే ప్రెసిడెంటు ఒక్కడూ రైల్లో టిక్కెట్టు కొనుక్కొని

తిరుపతి వెళ్లడు కదా. ఆయన వెంట అంగ రక్షకులు, సిబ్బంది, పదుల సంఖ్యలో ఉంటారు కదా. అలాగే సృష్టికి పూర్వము, సృష్టి తరువాత, ప్రళయ కాలంలో నేనే ఉంటాను అంటే పరమాత్మ ఒక్కడే కాదు. ఈ సమస్త సృష్టి అంతా సూక్ష్మరూపంలో, అవ్యక్తంగా, ఉంటుంది అని అర్థం. మన ఇంటి ఎదురుగుండా ఖాళీస్తలం ఉంది. ఎండా కాలంలో అంతా ఎండి పోయి, రాళ్లు, దుమ్ము, ధూళి, మట్టి ఉంటుంది. వానాకాలం రాగానే వానలుకురవగానే ఆ స్థలం అంతా మొక్కలతో నిండి పోతుంది. ఏపుగా పెరిగి ఆ స్థలంమొత్తం ఆక్రమిస్తాయి. ఈ మొక్కల విత్తనాలు మీరు వెయ్యలేదు. మీరు పెంచలేదు. అసలు మీకేమీ తెలియదు. అంటే ఇవన్నీ సూక్ష్మరూపంలో ఉన్నాయి. వానాకాలంలో ప్రకటితం అయ్యాయి. మరలా ఎండాకాలంలో సూక్ష్మరూపంలోకి వెళ్లిపోతాయి. దీని వెనక ఉండి నడిపించేది పరమాత్మ. ఆయన ఒక్కడే. ఇదే ఈ శ్లోకంలో పరమాత్మ బ్రహ్మదేవునికి ఉపదేశించింది. వ్యాసుడు లాంటి మహాపురుషులు అన్ని యుగాలలో ఉంటారు. వారికి నాశనము లేదు. కాకపోతే వారికి పూర్వజన్మ జ్ఞానం ఉంటుంది. మనకు ఉండదు. కాబట్టి పరమాత్మ ఒక్కడే. ఆయన కంటే భిన్నమైనది వేరే లేదు. అదీ ఈ శ్లోకము యొక్క భావము.)

2.ఋతే2ర్థం యత్ప్రతీయేత న ప్రతీయేత చాత్మని।
తద్విద్యాదాత్మనో మాయాం యథా భాసో యథా తమః॥

పరమాత్మ, మాయ. ఈ రెండూ వేరు వేరుగా ఉన్నాయి. పరమాత్మను తెలుసుకుంటే మాయ అదృశ్యమై పోతుంది. మాయలో పడితే పరమాత్మ గోచరం కాడు. చీకట్లో ఉంటే ఏమీ కనిపించదు. వెలుగులోకి వస్తే అన్నీ కనిపిస్తాయి అంటే చీకటి అదృశ్యమైపోతుంది.

ఈ సృష్టి అంతా పరమాత్మ మాయామోహంలో పడి ఉంది. ఆ మాయలో నుండి బయట పడి పరమాత్మను తెలుసుకోవడమే మానవుని కర్తవ్యము.

ప్రతి ప్రాణిలో పరమాత్మ ఆత్మగా వెలుగుతూ ఉంటాడు. కాని ఆ వెలుగును మాయ అనే ఆవరణము కప్పివేస్తుంది. అప్పుడు ఆత్మ జీవాత్మగా మారి ప్రాపంచిక విషయములలో పడి పోతాడు. జనన మరణ చక్రంలో పడి పోతాడు. ఎప్పుడైతే జీవాత్మ ఈ ప్రాపంచిక విషయములను వదిలి పెట్టి పరమాత్మ వైపు చూస్తాడో, అప్పుడు అతనిని ఆవరించిన మాయ అనే చీకటి తొలగిపోతుంది. తన స్వస్వరూపమైన ఆత్మ స్వరూపంగా వెలుగుతాడు. మాయ అంటూ వేరే ఏమీ లేదు. పరమాత్మ గురించి తెలియక పోవడమే మాయ. దీనినే అవిద్య అంటారు. లేనిదానిని ఉందని ఊహించుకోవడం. సత్యమైన పరమాత్మ తత్త్వమును తెలుసుకోకపోవడం.

ఈ శ్లోకము గురించి శ్రీధరస్వామి ఇలా వ్యాఖ్యానించారు. దానిని సరళమైన భాషలో అందిస్తున్నాను. వివిధములైన మతములను అవలంబించేవారు భగవంతుని తత్త్వమును తెలుసుకోలేక రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. శాస్త్రములలో చెప్పబడిన పరాశక్తి యే పరమాత్మ యొక్క అచింత్యశక్తి.ఈ అచింత్య శక్తి మూడు విధములుగా ప్రకటితమయింది. అవి అంతరంగ శక్తి, బహిరంగ శక్తి, తటస్థ శక్తి. వీటినే స్వరూప శక్తి, మాయాశక్తి, జీవశక్తి అని కూడా అంటారు. స్వరూప శక్తి భగవంతునికి సంబంధించినది. బహిరంగ శక్తి ని మాయ అని అంటారు. ఇది సంసారమునకు, బంధాలకు కారణం

అవుతుంది. ఈ మాయలో భగవతత్త్వము ఏమీ లేదు. కేవలం మానవుని మోహంలో పడేస్తుంది. భగవంతునికి, మాయకు మధ్యలోనే ఈ  జీవజాలము అంతా  ఉంది. దీనినే తటస్థ శక్తి అంటారు.

ఈ విశ్వచైతన్యమే పరమాత్మ. అన్ని ప్రాణులలో ఆత్మగా వెలుగుతున్నాడు. ఆత్మ మాయకు లోబడి ప్రాపంచిక విషయాలలో పడితే జీవాత్మ అవుతుంది. పరమాత్మ వైపు పయనిస్తే పరిశుద్ధాత్మ అవుతుంది. మాయ అనేది ఒక వస్తువు కాదు. ఒక భ్రమ. చీకటి. తమస్సు. అంధకారంలోకి నెట్టే ఒక భ్రమ. ఎప్పుడైతే  మానవుడు ఇతరములైన  తత్త్వజ్ఞానముల వలన ఆత్మయొక్క స్వరూపతత్త్వమును తెలుసుకోలేడో, అతనిది పరిపూర్ణజ్ఞానము కాదు.  స్వరూప తత్త్వమును తెలుసుకోనంత వరకూ మానవుడు మాయలో పడి ఉంటాడు. దీనిని సరిగా అర్థం చేసుకోడానికి మనకు ఒక ఉదాహరణ ఇచ్చారు.

ఆత్మ స్వరూప తత్త్వము సూర్యుడు అయితే, జీవుడు ఒక ఆభాస. మాయ అనేది చీకటి. సూర్యుడు రాగానే చీకటి పటాపంచలయి పోతుంది. సూర్యోదయానికి ముందే చీకటి పారిపోతుంది. సూర్యుడు పూర్తిగా ఉదయించడానికి ముందు, చీకటి పూర్తిగా తొలగి పోవడానికి మధ్యలో ఉన్నదే ఆభాస. ఉండీ ఉండనట్టు, లేనీ లేనట్టు కనపడటమే ఆభాస. జీవుడు సూర్యుని వంకకు పోతే పరమాత్మ తత్త్వమును తెలుసుకుంటాడు.  అలా కాకుండా మాయ అనే చీకటి వైపుకు చూస్తే అజ్ఞానము అనే అంధకారంలో పడిపోతాడు. ఆత్మతత్త్వమును తెలుసుకోలేడు. కాబట్టి ఆత్మ తప్ప మిగిలింది మాయ అని గ్రహించాలి.

3.యథా మహాన్తి భూతాని భూతేషూచ్చావచేష్వను।
ప్రవిష్టాన్య ప్రవిష్టాని తథా తేషున తేష్వహమ్॥

పంచభూతములు ఐదు. భూమి, ఆకాశము, నిప్పు, నీరు, గాలి. ఈ సృష్టిలో ఉన్న దేవతలు, మనుష్యులు, జంతువులు, పక్షులు, పాకే జీవులు అన్నిటి దేహములు ఈ పంచభూతములతో తయారైనవే. పంచభూతములు అన్ని ప్రాణులలో అంతర్గతంగా ఉన్నప్పటికినీ, బయట స్వతంత్రంగా ఉంటున్నాయి. అలాగే పరమాత్మ కూడా ఈ సృష్టిలో ఉన్న జీవరాసులన్నింటిలోనూ ఆత్మగా వెలుగుతున్నా, తాను మాత్రము వాటికి భిన్నంగా జీవుల లోపలా, బయటా ఉంటున్నాడు. ఈ జగత్తులో పరమాత్మ అంతర్యామిగా వెలుగుతున్నాడు.

పంచమహాభూతములు ఈ జగత్తులోని ప్రాణులలో ఉన్నప్పటికినీ, బయటకూడా స్వతంత్రంగా ఉంటున్నాయి. ఉదాహరణకు గాలి మనం పీలుస్తున్నాము. వదులుతున్నాము. అంటే గాలి మనలో ఉంది. అలాగే నీరు తాగుతున్నాము, వదులుతున్నాము. అంటే నీరు మనలో ఉంది. కాని ప్రచండ వాయురూపంలో గాలి బయట కూడా ఉంది. అలాగే సముద్రములు, నదులు, సరస్సుల రూపంలో నీరు బయటకూడా ఉంది. అలాగే పరమాత్మ కూడా అన్ని ప్రాణులలోనూ ఆత్మ స్వరూపంగా ఉన్నా బయటకూడా ఈ విశ్వమంతా చైతన్యంగా వ్యాపించి ఉన్నాడు. పరమాత్మ లేని చోటు లేదు.

పరమాత్మ తనను నమ్ముకున్న భక్తులకు తన దివ్య మంగళ రూపంతో దర్శనం ఇస్తుంటాడు. తనను నమ్మని వారికి దూరంగా

ఉంటాడు. పరమాత్మయందు అనన్య భక్తి కలవారు పరమాత్మను దర్శించ కుండా ఒక్కక్షణం కూడా ఉండలేరు. అలాగే పరమాత్మ కూడా ఎల్లప్పుడూ తన భక్తుల హృదయాలలో కొలువై వారి  వెంటే ఉంటాడు.

4.ఏతావదేవజిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసు నాత్మనః।
అన్వయ వ్యతిరేకాభ్యాం యత్ స్యాత్ సర్వత్ర సర్వదా॥

ఆత్మను తెలుసుకోడానికి రెండు రకాలు ఉన్నాయి. ఇది కాదు ఇది కాదు అని అంటూ,  ఆత్మ కంటే భిన్నమైన దానిని తీసేస్తూ, సత్యమైన ఆత్మ స్వరూపమును తెలుసుకోవడం. ఇంక రెండవది. ఇదే బ్రహ్మము. దీని కంటే పరమైనది లేదు, పరమాత్మ సర్వత్రా వ్యాపించి ఉన్నాడు, పరమాత్మ కన్నా వేరు వస్తువు ఈ సృష్టిలో లేదు  అని ధృఢ భక్తిని విశ్వాసమును కలిగిఉండటం.

మొదటిది అనుమానం తో మొదలవుతుంది. రెండవది భక్తి విశ్వాసాలతో కూడిఉంటుంది. రెండు పద్ధతులు అనుసరింపదగ్గవే అంటారు పెద్దలు.

ఈ శ్లోకమునకు శ్రీధర స్వామి చాలా పెద్ద వ్యాఖ్య రాసారు. దీనిని మీకు అందిస్తున్నాను.

ఆత్మజిజ్ఞాస కలిగిన వ్యక్తులు భగవత్స్వరూప తత్త్వమును అనువృత్తి, వ్యావృత్తి క్రమము లేదా విధినిషేధము ద్వారా ఆ విషయమును విచారపూర్వకముగ సర్వత్ర, సర్వదా వ్యాపించిన ఏ

తత్త్వమున్నదో ఆ విషయమును గురించి పరిప్రశ్నింతురు.ఈ శ్లోకము సామవేదములోని "ఓం అగ్న ఆయాహి వీతయే" అను మంత్రసారము. ఇదిఅభిధేయమును తెలుపు శ్లోకము. తనయొక్క అశక్తతను తెలిసికొని భగవంతుని ఉపదేశమునే పాటింపవలెనను ఉద్దేశ్యమును బ్రహ్మ వ్యక్తము చేయగా, భగవంతుడు రహస్యమైన భగవత్ప్రాప్తి సాధన గురించి చెప్పుచున్నాడు. ఈ విషయము శాస్త్రములను చదివినంత మాత్రాన తెలిసేది కాదు. ఈవిషయములు తెలుసుకోవాలంటే గురువును ఆశ్రయించాలి. సాధనచెయ్యాలి. ఎందుకంటే భగవంతుని గురించిన తత్త్వము కేవలము గురువుల ద్వారానే తెలియబడుతుంది.

భగవంతుని ఎడల భక్తి కలిగి ఉండటమే పరమ పురుషార్థము అని శాస్త్రములు ఘోషిస్తున్నాయి. భగవంతుని తెలుసుకోడానికి శాస్త్రములలో కర్మ, జ్ఞానము, భక్తి అనే మూడు సాధనములను చెప్పారు. కానీ కర్మలు చేయడం, జ్ఞానము సముపార్జించడంవలన భగవతత్త్వము తెలియదు. కేవలము భక్తి ద్వారానే భగవంతుని తెలుసుకోగలము. నేను నా ధర్మమును మాత్రము ఆచరిస్తాను, భగవంతుని సేవించను అంటే ప్రయోజనము లేదు. ధాన్యము దంచితే బియ్యము వస్తాయి కానీ కేవలము ఊక దంచితే బియ్యము రావు సరికదా శ్రమ మిగులుతుంది.

భగవంతుని మీద భక్తి లేకుండా, కర్మలు చేయడం, శాస్త్రములు చదవడం, జ్ఞానమున సంపాదించడం వలన శ్రమ తప్ప వేరే ఏమీ మిగలదు. పూర్వ కాలములో యోగులు కూడా తాము చేసే ప్రతి కర్మను భగవంతునికి అర్పించి, భగవంతుని కథలను విని,

భగవంతుని మీద భక్తిని పెంపొందించుకొని, ఉత్తమగతులను పొందారు. కాబట్టి భగవంతుని మీద భక్తి లేకపోతే, ఏ పని చేసినా,ఎన్ని యజ్ఞయాగములు చేసినా ఫలితము శూన్యము. కాబట్టి భగవంతుని మీద భక్తియే సకలసాధనముల కంటే ఉత్తమమైనది అని చెప్పబడింది.

ఈ భక్తి అన్వయ, వ్యతిరేక భావములతో పొందవచ్చును. అన్వయభావము అనగా భక్తుడు ఏ కోరికలు లేకుండా గానీ, లేక మోక్షము, స్వర్గము మొదలగు కోరికలతో గానీ, తీవ్రమైన భక్తియోగముతో భగవంతుని ఉపాశించును. తీవ్ర భక్తియోగము అంటే మేఘములు ఆవరించని సూర్యుని వలె, ఏ ఆచ్ఛాదనా లేకుండా, తాను చేసే సమస్త కర్మలను పరమాత్మకు అర్పించి పరమాత్మను ఆరాధించడం.

వ్యతిరేకభావము అనగా విరాట్పురుషుని ముఖము, బాహువులు, తొడలు, పాదములనుండి ఉద్భవించిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు, వారిలో వెలిగే ఆత్మ, ఆ పరమాత్మ స్వరూపము అని తెలియకుండా అజ్ఞానంలో ఉంటారో వారు పతితులవుతారు. తపస్సు, దానము, కీర్తి, మనోనిగ్రహము కలిగిన వారు కూడా, తాము చేసిన కర్మలను పరమాత్మకు అర్పించరో వారు శ్రేయస్సును పొందలేరు.

భగవంతుని మీద భక్తి ఏ కొందరికో పరిమితము కాదు. దేశము, కాలములతో నిమిత్తము లేకుండా, కులము, వర్ణములతో నిమిత్తము లేకుండా, అందరూ ఆచరించతగ్గది. కాని, కర్మలు చేయడానికి, యజ్ఞయాగములు చేయడానికి, జ్ఞానము సముపార్జించడానికి, దేశ, కాల,పాత్రనియమములు పాటించాలి.

వాటిని అందరూ, అన్ని కాలములలో, అన్ని ప్రాంతములలో పాటించడానికి, ఆచరించడానికి వీలు లేదు.

కర్మ మార్గమును సన్యాసమును పొందువరకూ, సాంఖ్యయోగమును ఆత్మజ్ఞానము పొందువరకూ, జ్ఞానసాధనమును ముక్తి పొందునంతవరకూ పాటిస్తారు. భక్తి యోగము అలాకాదు. అన్ని కాలములయందు ఆచరించతగ్గది. భక్తి యోగమునకు అంతము అనేది లేదు. భక్తియోగములో సనాతన ధర్మము సంపూర్ణముగా కలదు.

శ్రీహరి నామమునందు రుచి మరిగిన భక్తులకు, భగవంతుని ఆరాధించడంలో దేశ, కాలములు అడ్డురావు. కాబట్టి మానవులు నిర్మలమైన అంత:కరణముతో సర్వత్ర సర్వదా హరికథాశ్రవణము, హరి కీర్తన చేయవలెను. అనేక పాపములు చేసిన పాపాత్ములు, శాప గ్రస్తులు, పతితులు, ఛండాలురు కూడా శ్రీహరిని స్మరించి, హరినామమును ఆశ్రయించి తరించారు. ఉత్తమ గతులనుపొందారు.

తల్లి గర్భంలో ఉండగానే ప్రహ్లాదుడు, బాల్యములోనే ధృవుడు, యౌవన దశలో అంబరీషుడు, వార్ధక్యములో యయాతి, అవసాన దశలో అజామీళుడు, భగవంతుని ఆరాధించి, స్మరించి, ముక్తిపొందారని పురాణములు శాస్త్రములు చెబుతున్నాయి. కాబట్టి సర్వే సర్వత్ర భక్తి మార్గమే సులభసాధ్యమని స్పష్టమయింది. భక్తిభావంతో ఎవరైనా పరమాత్మకు పత్రము, పుష్పము,ఫలము, నీరు అర్పించి భగవంతుని కటాక్షమును పొందవచ్చును.

ఈ భక్తి కేవలము దేవతలకు, మానవులకే పరిమితము కాదు. జంతువులకు, క్రిమి,కీటకములకు కూడా సాధ్యమే. పరమాత్మను భక్తితో ఆరాధించడం వలన పిపీలికాది బ్రహ్మ పర్యంతము ముక్తి పొందుతారు. ఈ శ్లోకములో పరమాత్మ తానే ఆరాధ్యుడననీ, భక్తిచేతనే తనను ఆరాధించవలెననీ రూఢిగా చెప్పాడు.

ఏతన్మతం సమాతిష్ఠ పరమేణ సమాధినా।
భవాన్ కల్పవికల్పేషు న విముహ్యతి కర్హిచిత్॥

ఓ బ్రహ్మదేవా! నీవు ఉత్తమమైన ఏకాగ్రచిత్తముతో నేను చెప్పిన సిద్ధాంతము అనుష్ఠించు. నీవు ప్రతి కల్పములో వివిధ రూపములలో సృష్టిచేసిననూ, నీకు "నేను ఈ సృష్టినంతా నిర్వర్తిస్తున్నాను" అనే అహంకారము అంటదు. నిర్మలమైన మనస్సుతో ఉంటావు. అని చతుశ్లోకీ భాగవతమును ముగించాడు పరమాత్మ.

ఈ శ్లోకము చతుశ్లోకీ భాగవతమునకు ఫలశ్రుతిగా చెప్పబడింది. మానవ జీవితంలో అహంకారము మానవుని పతనానికి నాంది. అందుకనే బ్రహ్మ మొట్ట మొదట పరమాత్మకు నమస్కరించి, నీ ఆజ్ఞప్రకారము నేనుసృష్టి చేస్తాను. కాని నేనుసృష్టి చేస్తున్నాను అనే అహంకారము నాలో కలుగనీయకు" అని ప్రార్థించాడు. దానికి సమాధానంగా పరమాత్మ ఈ శ్లోకంలో అదే ప్రకారంగా ఆశీర్వదించాడు. కాబట్టి ఈ చతుశ్లోకీ భాగవతము పరమాత్మ వలన చెప్పబడింది. ఇది సమస్తవేదముల సారము. ప్రతినిత్యము పఠించతగ్గది. ఈ నాలుగు శ్లోకములు పఠించినంత మాత్రాన భాగవతము పూర్తిగా చదివినఫలము దక్కుతుంది.

(ఈ శ్లోకమునకు శ్రీధర స్వామి వ్యాఖ్య.... సేకరణ: గౌడీయ మఠం వారి శ్రీమద్భాగవతము. తెలుగు అనువాదము శ్రీజన్నాభట్ల వాసుదేవశాస్త్రి)

శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుతో ఇలా అన్నాడు. “ఓ రాజా! బ్రహ్మదేవునికి ఉపదేశము చేసిన తరువాత పరమాత్మ అంతర్హితుడయ్యాడు. బ్రహ్మదేవుడు పరమాత్మకు నమస్కరించి సృష్టిని ప్రారంభించాడు. పూర్వ కల్పంలో సృష్టి ఎలా ఉందో అలాగే ఈ కల్పంలో కూడా సృష్టి చేయడం మొదలెట్టాడు.

ప్రజాక్షేమము కొరకు బ్రహ్మ తాను కూడా కొన్ని నియమములను ఆచరించడం మొదలు పెట్టాడు.

బ్రహ్మదేవునికి అత్యంత ప్రియమైన మానస పుత్రుడు నారదుడు. పరమ భక్తుడు. సదా పరమాత్మను స్మరిస్తూ ఉంటాడు. విష్ణు మాయను తెలుసుకోడానికి బ్రహ్మ దగ్గరకు వచ్చాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీవు ఇప్పుడు నన్ను ఏమేమి ప్రశ్నలు అడిగాడో అవే ప్రశ్నలను నారదుడు కూడా బ్రహ్మ దేవుని అడిగాడు. ఆ ప్రశ్నలకు సమాధానంగా బ్రహ్మదేవుడు నారదునికి తాను పరమాత్మ నుండి విన్న చతుశ్లోకీ భాగవతాన్ని, విస్తరించి చెప్పాడు.

## ద్వితీయస్కంధము.

ఆ తరువాత సరస్వతీ నదీ తీరంలో తపస్సు చేసుకుంటూ, మనస్సంతా వ్యాకులము చెందిన వ్యాస మహర్షికి, బ్రహ్మదేవుని వద్ద నుండి తాను విన్న భాగవతమును, నారదుడు వ్యాసునికి చెప్పాడు. నా తండ్రి అయిన వ్యాస మహర్షి ఆ భాగవతమును నాకు ఉపదేశించాడు. ఇప్పుడు అదే భాగవతాన్ని నేను నీకు చెబుతున్నాను.

ఓ రాజా! ఈ విశ్వము ఎట్లు ఆవిర్భవించింది అని నీవు నన్ను అడిగావు కదా! ఆ ప్రశ్నలకు అన్నింటికీ సమాధానాలు భాగవతము లోనే ఉన్నాయి. నేను నీకు భాగవతమును వ్యాఖ్యానిస్తూ, నీ ప్రశ్నలు అన్నింటికీ, ఇంకా ఇతర ప్రశ్నలకు సమాధానాలు చెబుతాను. సావధానంగా విను.

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## ద్వితీయ స్కంధము
## పదవ అధ్యాయము

వ్యాసుని కుమారుడైన శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు భాగవత కథను ఈ విధంగా వినిపిస్తున్నాడు. "ఓ మహారాజా! ఈ భాగవతములో పది లక్షణములు వివరించబడ్డాయి. అవి.....1. సర్గ, 2.విసర్గ, 3.స్థానము, 4.పోషణము, 5.ఊతి, 6.మన్వంతరము, 7.ఈశానుని కథ, 8.నిరోధము, 9.ముక్తి, 10. ఆశ్రయము.

ఈ లక్షణములలో కన్నిటికీ పదవ లక్షణము అత్యంత ముఖ్యమైనది. అదే ఆశ్రయము. ఈ ఆశ్రయము యొక్క తత్త్వము ను తెలుసుకోడానికి, దానిని విశుద్ధిపరచుకోడానికి, మిగిలిన తొమ్మిది లక్షణముల గురించి ముందు తెలుసుకోవాలి. మహాత్ములు అయిన వాళ్లు ఈ పది లక్షణములగురించి, వారు వారి గురువుల వద్దనుండి విన్న విషయములను మనకు చెబుతూ ఉంటారు.

మొదటి లక్షణము సర్గ. సర్గ అంటే సత్త్వరజస్ తమోగుణములలో కలిగిన మార్పుల వలన, పంచభూతములు, శబ్దము, రూపము, రసము, గంధము, స్పర్శ మొదలగు తన్మాత్రలు, పది ఇంద్రియములు, మనస్సు, మహత్తత్త్వము, అహంకారము, అనునవి పుట్టాయి. దీనినే సర్గ అంటారు. వీటిని ఆధారంగా విరాట్పురుషుడు చేసిన ఈ చరాచరసృష్టినే విసర్గ అంటారు.

చరాచరసృష్టి చేసిన తరువాత దానిని స్థిరంగా ఉంచి

పోషించాలి. అది విష్ణువు నిర్వహించాడు. దానినే స్థానము అంటారు. తాను చేసిన సృష్టి మీద పరమాత్మ తన అనుగ్రహాన్ని ప్రసరిస్తూ వారిని రక్షిస్తూ ఉంటాడు. దానినే పోషణ అంటారు.

ఈ సృష్టిలో ఉన్న మానవులను, జంతువులను పాలించడానికి మన్వంతరములు ఏర్పడ్డాయి. మనువులు ఏర్పడ్డారు. ఈ పరిపాలనా వ్యవస్థనే మన్వంతరము అంటారు.

పుట్టిన ప్రతివాడూ ఏదో ఒక కర్మ చేస్తుంటాడు. ఆ కర్మల ద్వారా బంధనాలు ఏర్పడుతుంటాయి. ఆ ఆ బంధనముల ద్వారా వాసనలు ఏర్పడుతుంటాయి. ఆ కర్మవాసనలనే ఊతులు అని అంటారు.

పరమాత్ముని యొక్క అవతారములు, వాటికథలు, పరమాత్మ భక్తుల యొక్క కథలు, ఇంకా ఇతర విషయములు అన్నీ కలిపి ఈశకథలు అని పిలువబడతాయి.

ప్రళయ కాలంలో పరమాత్మ యోగ నిద్రలో ఉంటాడు. ఆ సమయంలో ఈ విశ్వం మొత్తం ఆయనలో లీనం అయిపోతుంది. అంటే లయం అయిపోతుంది. దానినే నిరోధము అని అంటారు.

ఈ దేహములో ఉన్న జీవుడికి రెండు దేహములు ఉంటాయి. మామూలుగా కంటికి కనపడే స్థూల దేహము. కంటికి కనపడని సూక్ష్మ దేహము. ఈ రెండు దేహములు మాయ వలన ఏర్పడతాయి. జీవుడు స్థూల దేహమును సూక్ష్మదేహమును విడిచిపెట్టి, శుద్ధమైన జీవుడిగా వెలుగొందడం ముక్తి అనిపిలుస్తారు.

ఈ సృష్టి, స్థితి, లయము ఎవరి వల్ల జరుగుతున్నాయో ఎవరి వలన ఈ జగము అంతా ప్రకాశింపబడుతూ ఉందో, ఆ పరమాత్మనే ఆశ్రయుడు అని అంటారు. ఆ పరమాత్మయే ఆధ్యాత్మికము, ఆది దైవికము, ఆది భౌతికము. ఈ మూడింటిలో ఏది లేకపోయినా మిగిలిన రెండూ ఉండవు. పరమాత్మ ఈ మూడింటికి సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడు. ఆ పరమాత్మ తనకూ, తాను సృష్టించినసమస్త జీవులకు ఆశ్రయమై ఉన్నాడు.

ఆ పరమాత్మయే ప్రథమ పురుషుడు. ఆయన మొట్ట మొదట ఒక అండమును సృష్టించాడు. ఆ అండములోకి తాను ప్రవేశించాడు. ఆ అండములో ఉన్న తాను నివసించుటకు జలమును సృష్టించాడు. ఆ జలములలో వేల కొలది సంవత్సరములు అండరూపంలో ఉన్నాడు. అందుకే ఆయనను నారాయణుడు అని అన్నారు. జలమును నారములు అని అంటారు. జలములో ఉన్నాడు కాబట్టి నారాయణుడు అని పిలువబడ్డాడు.

ద్రవ్యము, కర్మ, కాలము, స్వభావము, జీవుడు ఇవన్నీ ఆ పరమాత్మ అనుగ్రహము చేతనే ప్రవర్తిస్తున్నాయి. ఆ పరమాత్మ అనుగ్రహము లేకపోతే ఇందులో ఏ ఒక్కటీ ఉండవు.

ఆ పరమాత్మ మొదట ఒకటిగాఉన్నాడు. తరువాత తాను పలువిధములుగా కావాలని అనుకున్నాడు. అంటే దేవతలు, మనుషులు, జంతువులు, పక్షులు కావాలని అనుకున్నాడు. అప్పుడు యోగ నిద్రనుండి లేచాడు. తనలో నుండి మాయను సృష్టించాడు. ఆ

మాయాశక్తితో, తనలో ఉన్న వీర్యమును మూడు విధములుగా విభజించాడు. అవే అధిదైవము, అధ్యాత్మము, అధిభూతము. ఇది ఎలా మూడు విధములుగా విభజింపబడినదో వివరిస్తాను విను.

మొదట పరమాత్మలో కదలిక కలిగింది. పనులు చేయడం మొదలయింది. అప్పుడు ఆ పురుషుని అంత: శరీరములో నుండి ఓజస్సు శక్తి, మనస్సు శక్తి, శారీరక శక్తి పుట్టాయి. ఈ మూడు శక్తుల సూక్ష్మరూపము నుండి మహాప్రాణము పుట్టింది.

దేహములో ఉన్న ఇంద్రియములు అన్నీ ఈ మహాప్రాణము యొక్క శక్తిని అనుసరించి నడుచుకుంటాయి. ఈ మహాప్రాణము పనిచెయ్యడం మానేస్తే, ఇంద్రియములు కూడా పని చెయ్యడంమానేస్తాయి.

మహాప్రాణము విరాట్పురుషుని పొట్టలో తిరగడం మొదలు పెట్టింది. అప్పుడు విరాట్పురుషుడికి ఆకలి, దాహము పుట్టాయి. ఆకలి దాహము, తీరడానికి ఆహారము, నీరు కావాలి. అవి కడుపు లోపలకు పోవడానికి ఒక మార్గము కావాలి. అప్పుడు ముఖం బహిర్గతము అయింది. ఆ ముఖము నుండి నమలడానికి దవడలు,రుచి చూడటానికి నాలుక పుట్టాయి.

తరువాత విరాట్పురుషునికి మాట్లాడాలని కోరిక పుట్టింది. అప్పుడు ముఖము నుండి వాక్కు ఇంద్రియము, వాక్కుకు అధిష్ఠాన దేవత అయినఅగ్ని, మాట్లాడటానికి మాటలు పుట్టాయి.

అప్పటి దాకా జలము లో ఉండటం వలన ఊపిరి తీసుకోడం లేదు. లోపల మహాప్రాణము చేరడంతో ప్రాణవాయువు పుట్టింది. ప్రాణ వాయువును పీల్చి వదలడానికి ముక్కు దానికి రెండు రంధ్రములు ఏర్పడ్డాయి. ఆముక్కు రంధ్రములకు వాసన చూచే శక్తి వచ్చింది. ప్రాణవాయువును పీల్చి వదలడానికీ, వాసన చూడటానికి అధిష్ఠాన దేవత వాయువు ఉద్భవించారు.

విరాట్పురుషునికి తనను తాను చూడాలని, ఈ విశ్వమంతా చూడాలనికోరిక పుట్టింది. అప్పుడు రెండు కళ్లు ఏర్పడ్డాయి. వాటికి చూచే శక్తి వచ్చింది.

విరాట్పురుషునికి వేదఘోష వినవలెనని కోరిక కలిగింది.అప్పుడు ముఖానికి అటు ఇటు రెండు చెవిరంధ్రములు పుట్టాయి. ఆ చెవులకు అధిష్ఠాన దేవత దిక్కులు. ఆ చెవులకు బయట శబ్దములను గ్రహించే శక్తి వచ్చింది.

తరువాత విరాట్పురుషునకు అన్నిటినీ స్పృశించాలని అంటే తాకాలని, ఆ వస్తువుల మృదుత్వమును, కఠినత్వమును, చిన్నదా, పెద్దదా అని తడిమి చూడాలని, వేడిగా ఉందా, చల్లగా ఉందా అని తెలుసుకోవాలనీ కోరిక పుట్టింది. దానికి అనుగుణంగా స్పర్శేంద్రియము అనగా చర్మము పుట్టింది. ఆ చర్మము మీద రోమములు పుట్టాయి. ఆ చర్మమునకు స్పర్శగుణము వచ్చింది. ఆ స్పర్శగుణమునకు అధిష్ఠాన దేవత వాయువు.

అప్పుడు విరాట్పురుషునకు నానావిధములయిన కర్మలు చేయాలని కోరిక పుట్టింది. ఆ కర్మలు చేయడానికి అవసరమయిన చేతులు పుట్టాయి. ఆ చేతులకు పనిచేసే శక్తి వచ్చింది. ఆ చేతులకు అధిష్ఠాన దేవత ఇంద్రుడు. ఆ చేతుల వలన అన్ని వస్తువులను తీసుకునే శక్తి ఏర్పడింది.

తరువాత విరాట్పురుషునకు అక్కడకు ఇక్కడకు తిరగాలని కోరిక పుట్టింది. దానికి అనుగుణంగా కాళ్లు, పాదములు ఆవిర్భవించాయి.. కాళ్లకు,పాదములకు అధిష్ఠానదేవత విష్ణువు. కాళ్లు పాదములు అన్ని చోట్లకు తిరగడానికి ఉపయోగపడ్డాయి. మానవులు ఈ చేతుల వలన కాళ్ల వలన అన్ని చోట్లకు తిరిగి యజ్ఞములకు(తాను చేయవలసిన పనులకు) కావలసిన సామగ్రిని పోగు చేయడానికి వీలుకలిగింది.

ఈ ప్రకారంగా దేహము ఏర్పడింది. ఒకే దేహము ఉంటే ఏం సరిపోతుంది. ఆ దేహము పలుదేహములుగా వృద్ధిచెందాలంటే సంతానం కలగాలి. దానికి జననేంద్రియములు కావాలి. అప్పుడు విరాట్పురుషునికి జననేంద్రియములు ఏర్పడ్డాయి. జననేంద్రియములకు అధిష్ఠాన దేవత ప్రజాపతి. సృష్టి జరగాలంటే స్త్రీ పురుషులు మధ్య కలయిక జరగాలి. అందుకే సంభోగశక్తి, సంభోగసుఖము ఏర్పడ్డాయి. తిన్న ఆహారము జీర్ణము అవుతుంది కదా. జీర్ణము కాగా మిగిలిన పదార్థమును విసర్జించాలి. అందుకని విసర్జకావయవము పుట్టింది. దానికి అధిష్ఠాన దేవతగా మిత్రుడు ఉన్నాడు. మలవిసర్జన శక్తి ఆ అవయవమునకు వచ్చింది.

ఇప్పుడు శరీరములో అన్ని అవయవములు ఏర్పాడ్డాయి. సృష్టి కార్యక్రమంలో ఒక దేహము నుండి మరొక దేహము పుట్టాలి. అప్పుడు పరమాత్మ నాభిద్వారమును పుట్టించాడు.నాభి ద్వారా మరొక దేహము వస్తుంది. పుట్టగానే మరణము కూడా దాని వెంట ఉంటుంది. జననం వెంట మృత్యువు కూడా పుట్టింది. జనన మరణములకు అధిష్ఠాన దేవత మృత్యువు.

తాను ఎవరు అనే ఆలోచన రాగానే విరాట్పురుషునకు హృదయము ఏర్పడింది. ఆ హృదయము లోనుండి మనస్సు పుట్టింది. దానికి అధిష్ఠాన దేవత చంద్రుడు. ఆ మనసులో నుండి సంకల్పములు, కోరికలు పుట్టాయి.

విరాట్పురుషుని శరీరంలో పంచభూతములు ప్రవేశించాయి. ఆ పంచభూతములలో భూమి, జలము, అగ్ని నుండి చర్మము, మాంసము, రక్తము, మెదడు, ఎముకలలో ఉండే రసము, ఎముకలు అనే ధాతువులు  ఏర్పడ్డాయి. మిగిలిన రెండు అయిన ఆకాశము, వాయువు నుండి ప్రాణవాయువు ఏర్పడింది.

అహంకారము నుండి గుణములు పుట్టాయి. గుణములనుండి ఇంద్రియములు పుట్టాయి. మనస్సు సకల వికారములకు మూలము. మనస్సునుండి అన్ని కోరికలు వికారములు కలుగుతాయి. బుద్ధి వలన విజ్ఞానము వస్తుంది. మంచి చెడు విచక్షణ కలుగుతుంది. మనస్సు సంకల్పించే పనులు మంచివా చెడ్డవా అని బుద్ధినిర్ణయిస్తుంది.

ఇప్పుడు చెప్పబడినది అంతా భగవంతుని స్థూలరూపము. ఈ స్థూల రూపం ఎనిమిది ఆవరణలతో నిండి ఉంది. అవే పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము. ఈ స్థూల రూపమును నేను నీకు వివరించాను.

ఈ స్థూలరూపమే కాకుండా పరమాత్మకు సూక్ష్మరూపం కూడా ఉఇంది. అదే అవ్యక్తము, ఆది మధ్యాంతరహితము, నిత్యము, వాక్కుకు, మనసుకు అందనిది, అత్యంత సూక్ష్మమైనది.

నేను నీకు భగవానుని స్థూలరూపము గురించి సూక్ష్మరూపము గురించి వివరించాను.కాని ఈ రెండు రూపములు మాయకు లోబడి ఉంటాయి కాబట్టి భక్తులు ఈ రెండు రూపములను గ్రహించరు.

పరామాత్మకు చేయవలసిన పనులు ఏమీ లేవు. ఆయన నిష్క్రియుడు. కాని బ్రహ్మ అనే రూపంతో, అనేకమైన పేర్లతోనూ, అనేక రూపములతోనూ, అనేక పనులతోనూ ఈ సృష్టిని చేస్తున్నాడు.

ప్రజాపతులు, మనువులు, దేవతలు, ఋషులు, పితరులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు, అసురులు, గుహ్యకులు, కిన్నరులు, అప్సరసలు, నాగులు, సర్పములు, కింపురుషులు, నరులు, మాతృకలు, రాక్షసులు, పిశాచులు, ప్రేతాత్మలు, భూతములు, కూష్మాండములు, ఉన్మాదులు, భేతాళురు,

యాతుధానులు, గ్రహములు, మృగములు, పక్షులు, పశువులు, వృక్షములు, పాకే జంతువులు, మొదలగు వాటిని బ్రహ్మసృష్టించాడు. వీరే కాకుండా, గుడ్డునుండి పుట్టే ప్రాణులను, చెమటనుండి పుట్టే ప్రాణులను, భూమినుండి పుట్టే ప్రాణులను, జలచరములను, భూచరములను, ఖేచరములను, వేరు వేరుగా సృష్టించాడు.

పరమాత్మ కర్మలను మూడు విధాలుగా విభజించాడు. ఉత్తమ కర్మలు, మధ్య రకమైన కర్మలు, అధమమైన కర్మలు. సత్త్వ, రజస్, తమోగుణములను అనుసరించి, దేవతలను, మనుషులను, రాక్షసులను సృష్టించాడు. కాని ఈ గుణములలో ఒక గుణము ఎక్కువ, మిగిలిన రెండు గుణములు తక్కువ గానూ, మూడు గుణములు హెచ్చుతగ్గులతోనూ ప్రాణులను సృష్టించాడు బ్రహ్మ.

ఆ పరమాత్మయే విష్ణు రూపంలో ఈ జగత్తును పాలిస్తున్నాడు. విష్ణురూపంలో ఉన్న పరమాత్మ, దేవతల రూపంలోనూ, మానవ రూపంలోనూ, జంతువుల రూపంలోనూ అవతరించి, ధర్మమును కాపాడుతున్నాడు. రుద్రుడుగా ఈ సృష్టిని లయం చేస్తున్నాడు.

పరమాత్మ వేదములలో ఈ విధంగా నిరూపించబడ్డాడు. కానీ, భగవంతుని తత్త్వమును తెలిసిన వారు, పరమాత్మను ఒక్కడుగానే భావిస్తారు కానీ, సృష్టి, స్థితి, లయకారులుగా వేరు వేరుగా భావించరు. ఎందుకంటే, పరమాత్మకు ఈ సృష్టి, స్థితి, లయములతో ఎలాంటి కర్తృత్వము లేదు. కాని మాయ జీవులను కప్పివేయడం వలన,

ఇవి అన్నీ పరమాత్మ చేసినట్టు మనకు అనిపిస్తూ ఉంది. ఇప్పటి దాకా చెప్పబడిన దానిని మహాకల్పము అంటారు. ఈ మహాకల్పములో ప్రాకృత సృష్టి అనగా మహత్ తత్వము, అహంకారము, మూడుగుణములు మొదలగు వాటి సృష్టి. వైకృత సృష్టి అనగా చరాచర జీవరాసుల సృష్టి, జరిగింది.

ఇప్పుడు నీకు కాలము, దాని స్థూల, సూక్ష్మ పరిమాణములు కల్పము దాని లక్షణములు, కల్ప విభాగములు, గురించి వివరిస్తాను. ప్రస్తుతము నీకు పాద్మ కల్పము గురించి వివరిస్తాను." అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకుచెప్పినట్టు, సూతుడు శౌనకాది మహామునులకు భాగవత పురాణమును చెబుతున్నాడు.

ఈ సందర్భంలో శౌనకుడు సూతపౌరాణికుని ఈ విధంగా అడిగాడు. "తమరు ఇంతకు ముందు విదురుడు, తనబంధువులను అందరినీ విడిచి పెట్టి తీర్థములను సేవించుటకు వెళ్లాడు అని చెప్పారు కదా! విదురుడు పుణ్యతీర్థములను సేవించునపుడు మైత్రేయుడు అనే మహామునిని కలుసుకున్నాడు అని చెప్పారుకదా! వారిరువురి మధ్య ఏమేమి విషయములు ప్రస్తావనకు వచ్చాయి. వారు ఏయే విషయములను మాట్లాడుకున్నారు. మైత్రేయుడు విదురునికి ఏయే విషయములను ఉపదేశించాడు. ఆ యావిషములను మాకు వినిపించండి. అసలు విదురుడు తన బంధువులను వదిలిపెట్టి ఎందుకు వెళ్లాడు. మరలా హస్తినకు ఎందుకు తిరిగి వచ్చాడు. మాకు వివరించండి." అని అడిగాడు.

అప్పుడు సూతపౌరాణికుడు, శౌనకాది మహామునులతో ఇలా అన్నాడు. "బ్రాహ్మణోత్తములారా! ఇదే విషయములను పరీక్షిత్తు శుక మహర్షిని అడిగాడు. దానికి శుక మహర్షి చెప్పినసమాధానములను నేను మీకు వివరిస్తాను." అని అన్నాడు.

శ్రీమద్భాగవతము

ద్వితీయ స్కంధము పదవ అధ్యాయము సంపూర్ణము.

ద్వితీయ స్కంధము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము
మొదటి అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తు తో ఇలా అన్నాడు. "మహారాజా! విదురుడు కురుసభలో జరుగుతున్న అధర్మమును సహించలేక హస్తినను విడిచి వెళ్లిపోయాడు. విదురుడు పుణ్యక్షేత్రములు తిరుగుతుండగా మైత్రేయుని కలుసుకున్నాడు. అప్పుడు మైత్రేయుడు ఇదే ప్రశ్న విదురుని అడిగాడు. దానికి విదురుడుచెప్పిన సమాధానము నేను నీకు చెబుతున్నాను. శ్రీకృష్ణుడు పాండవ దూతగా హస్తినా పురమునకు వెళ్లాడు. సుయోధనుడు తన ఇంటికి విందుకు ఆహ్వానించినా తిరస్కరించి, పిలువకపోయినా విదురుని ఇంటికి వెళ్లాడు శ్రీకృష్ణుడు.."అని చెప్పాడు శుకుడు.

ఇప్పుడు పరీక్షిత్తుకు ఒక సందేహము కలిగింది. "ఓ మహర్షి! విదురుడు మైత్రేయుని కలుసుకున్నాడు అని చెప్పారుకదా! విదురుడు మైత్రేయుని ఎప్పుడు, ఎక్కడ కలుసుకున్నాడు. వారు ఏమేమి మాట్లాడుకున్నారు. ఆ వివరములు మాకు చెప్పండి." అని అడిగాడు. పరీక్షిత్తు అడిగిన ప్రశ్నలకు శుకుడు ఈ విధంగా చెప్పాడు.

"మహారాజా! ధృతరాష్ట్ర మహారాజు అంధుడు. అతని కుమారుడు అహంకారంతో కళ్లు మూసుకుపోయిన మదాంధుడు. ధృతరాష్ట్రుడు కుమారుల మీద ప్రేమతో, తమ్ముని కుమారులయిన పాండవులను లక్క ఇంటిలో పెట్టి కాల్చడానికి పాల్పడ్డాడు.

## తృతీయ స్కంధము

పాండవుల భార్య, తనకు కోడలు అయిన ద్రౌపదిని నిండుసభలో వస్త్రములు లాగి పరాభవిస్తుంటే చూస్తూ ఊరుకున్నాడు కానీ పల్లెత్తు మాట అనలేదు. సుయోధనుని వారించలేదు. మాయాద్యూతంలో రాజ్యము పోగొట్టుకొన్న పాండవులు భార్య ద్రౌపదితో సహా అడవులకు వెళ్లారు. అరణ్యఅజ్ఞాతవాసములుపూర్తి అయిన తరువాత తిరిగి వచ్చి రాజ్యములో భాగం అడిగారు.కాని ధృతరాష్ట్రుడు ఏవేవో సాకులు చూపి పాండవులకు రాజ్యములో భాగము ఇవ్వలేదు.

అప్పుడు పాండవుల పక్షాన శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని వద్దకు రాయబారిగా వెళ్లాడు. కౌరవ సభలో పాండవుల పక్షాన మాట్లాడాడు. రాజ్యములో సగభాగం ఇవ్వమని అడిగాడు. లేని ఎడల, కనీసం ఐదు ఊళ్లు అయినా ఇవ్వడం ధర్మం అని పలికాడు. శ్రీకృష్ణుని పలుకులు ధృతరాష్ట్రునికి, సుయోధనునికి రుచించలేదు. వారు కృష్ణుని ఆదరించలేదు.

అప్పుడు ధృతరాష్ట్రుడు విదురుని సలహా చెప్పమని అడిగాడు. అప్పుడు విదురుడు ధృతరాష్ట్రునికి నీతి వాక్యములు చెప్పాడు. దానినే విదుర నీతి అంటారు. విదురుడు ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు.

"మహారాజా! పాండవులు మీరు పెట్టిన అన్ని బాధలు సహించారు, భరించారు. ఇప్పుడు రాజ్యంలో భాగం అడుగుతున్నారు. న్యాయంగా వారికి రావలసిన రాజ్యభాగం వారికి ఇచ్చెయ్యి. అదే ధర్మము. భీముడు అనే కాలసర్పము నిన్ను నీ కుమారులను, కురువంశమును కాటు వేయడానికి బుసలుకొడుతూ ఉందని నీవు అనునిత్యము భయపడుతున్నావు. అదీ కాకుండా శ్రీకృష్ణ పరమాత్మ

పాండవుల పక్షాననిలిచి ఉన్నాడు. నీకు అపజయం తప్పదు. ప్రస్తుతము కృష్ణుడు రాయబారిగా వచ్చి ఇక్కడే ఉన్నాడు. నీవు పుత్రవ్యామోహంతో శ్రీకృష్ణుని మాటలను కూడా లెక్కచేయడం లేదు. నీ కుమారుడు దుష్టసాంగత్యంతో చెడిపోయాడు. వాడిని వదిలెయ్యి. కృష్ణుడు చెప్పినట్టు చెయ్యి. కురువంశమును రక్షించు." అని పలికాడు విదురుడు.

విదురుని నీతులు ధృతరాష్ట్రుని కుమారుడు సుయోధనునికి  రుచించకపోగా తీవ్రమైన కోపాన్ని తెప్పించాయి. "అసలు ఈ దాసీ పుత్రుడిని ఇక్కడకు ఎవరు పిలిచారు? ఇతడు కుటిలుడు. దుర్మతి. తిన్న ఇంటినే కూల్చేవాడు. మనకు వ్యతిరేకంగా శత్రువులతో చేతులు కలుపుతున్నాడు. వీడిని వెంటనే నగరము నుండి వెడలగొట్టండి." అని ఆజ్ఞాపించాడు.

సుయోధనుడు ఈ మాదిరి విదురుని దూషిస్తున్నా ధృతరాష్ట్రుడు ఏమీ మాట్లాడలేదు. ఈమాటలను విన్న విదురుడు మౌనంగా అక్కడి నుండి వెళ్లిపోయాడు. హస్తినాపురం వదిలిపెట్టాడు. పుణ్యక్షేత్రములను దర్శించడానికి వెళ్లిపోయాడు. ఎన్నో నగరములు, నదులు, దర్శించాడు. ఎన్నో తీర్థములను సేవించాడు.

ఆ తీర్థయాత్రా పరంపరలో విదురుడు ప్రభాస క్షేత్రానికి వెళ్లాడు. ఆ సమయానికి కృష్ణరాయబారము విఫలం కావడం, భారతయుద్ధం జరగడం, కౌరవులు నాశనం కావడం, ధర్మరాజు హస్తినకు పట్టాభిషిక్తుడు కావడం జరిగిపోయాయి.

# తృతీయ స్కంధము

ప్రభాసక్షేత్రములో ఈవిషయములు అన్నీ విని కౌరవకుల నాశనమునకు ఎంతో చింతించాడు విదురుడు. తరువాత విదురుడు సరస్వతీ నదీతీరమునకు వెళ్లాడు. సరస్వతీ నదీ తీరంలో ఉండే త్రితము, ఉశవసము, మనువు, పృథువు, అగ్ని, అసితము, వాయువు, సుదాసము, గానము, గుహము, శ్రాద్ధదేవము, మొదలగు తీర్థములలో స్నానం చేసాడు. దానధర్మములను చేసాడు. ఆ ప్రకారంగా విదురుడు ఎన్నో పుణ్యక్షేత్రములను, తీర్థములను సందర్శించాడు.

తరువాత విదురుడు సౌరాష్ట్రము, సౌవీరము, మత్స్య, కురుజాంగలము మొదలగు దేశములలో పర్యటించాడు. యమునా తీరం చేరుకున్నాడు. అక్కడ కృష్ణభక్తుడయిన ఉద్ధవుని చూచాడు. కృష్ణుని అనుచరుడు, సఖుడు,భక్తుడు అయిన ఉద్ధవుని చూచి విదురుడు గట్టిగా కౌగలించుకున్నాడు. విదురుడు ఉద్ధవుని కృష్ణుని యొక్క బంధువుల క్షేమములు అడిగాడు.

"ఉద్ధవా! శ్రీకృష్ణుడు, బలరాముడు క్షేమంగా ఉన్నారా? వారి తండ్రి వసుదేవుడు క్షేమంగా ఉన్నాడా? శ్రీకృష్ణుని కుమారుడు, యాదవ సేనానాయకుడు, ప్రద్యుమ్నుడు క్షేమంగా ఉన్నాడా? సాత్వత, వృష్ణి, భోజ, దాశార్హ వంశములకు అధిపతి అయిన ఉగ్రసేనుడు క్షేమంగా ఉన్నాడా? శ్రీకృష్ణునికి జాంబవతివలన జన్మించిన కుమారుడు సాంబుడు క్షేమంగా ఉన్నాడా? అర్జునుని శిష్యుడు అయిన సాత్యకి క్షేమంగా ఉన్నాడా? శ్రీకృష్ణభక్తుడు అక్రూరుడు క్షేమంగా ఉన్నాడా? శ్రీకృష్ణుని తల్లి, దేవకుని కుమార్తె అయిన దేవకీ క్షేమంగా ఉందా?

అనిరుద్ధుడు క్షేమంగా ఉన్నాడా? సత్యభాగా కుమారులయిన చారుధేష్ణుడు, గదుడు మొదలగు వారు క్షేమంగా ఉన్నారా? యుధిష్ఠిరుడు కురు సామ్రాజ్యమును న్యాయంగా ధర్మంగా పాలిస్తున్నాడా? భీముడు కౌరవుల మీద ఉన్న పగను విడిచిపెట్టాడా లేక ఇంకా పగసాధిస్తున్నాడా? అర్జునుడు క్షేమంగా ఉన్నాడా? మాద్రి కుమారుడు, కవలలు, నకుల, సహదేవులు క్షేమంగా ఉన్నారా? పాండవుల తల్లి కుంతీదేవి క్షేమంగా ఉన్నదా?

బతికినంతకాలం పాండవులకు ఎన్నో కష్టాలు కలిగించి తనకళ్ల ఎదుటనే బంధునాశనము చూచి, ఇప్పుడు పాండవుల దయాదాక్షిణ్యముల మీద బతుకకుతున్న ధృతరాష్ట్రుని చూస్తే జాలిగా ఉంది. నేనుమాత్రము ఆ శ్రీకృష్ణుని స్మరించుకుంటూ ఎవరికీ కనపడకుండా ఈయమునాతీరంలో నివసిస్తున్నాను.

తాము విద్యాధికులమనీ, తాము ధనికులమనీ, తమకు అధికారము ఉన్నదనీ మదించిన రాజులు ఈ భూమికి భారంగామారారు. వారిని అందరినీ ఒకేసారి సంహరించ వలెననే ఉద్దేశముతో శ్రీకృష్ణుడు, సుయోధనుడు, అతని తమ్ములు, అతని స్నేహితులు చేసిన దుర్మార్గములను, పాపములను సహించాడు. అంతేకానీ, శ్రీకృష్ణుడు సుయోధనుని దుర్మార్గములను అరికట్టి తనను నమ్ముకున్న పాండవులను రక్షించడానికి  చేతకానివాడు, అసమర్థుడు కాదు అని అనుకుంటున్నాను.

ఆ పరమాత్మ తాను ఎలాంటి జన్మఎత్తనవసరం లేకపోయినా, దుష్టులనుసంహరించి, తన భక్తులను రక్షించడానికి

శ్రీకృష్ణుడుగా అవతరించాడు. తనకు ఎలాంటి కర్మలు చేయనవసరం లేకపోయినా, తన భక్తులకొరకు ఎన్నో కర్మలు ఆచరించాడు. భగవంతుని సంగతి సరేసరి. త్రిగుణములకు లోబడని మానవుడు ఎవరైనా కోరి కోరి కర్మలకు అధీనమైన ఈ దేహమును ధరించడానికి ఒప్పుకుంటాడా!

మిత్రమా! తన శరణుజొచ్చిన రాజులను, తన భక్తులను కాపాడటానికి, భగవంతుడు తనకు జన్మ అనేది లేకపోయినా, యదువంశములో జన్మించాడు. ఎన్నో లీలలను ప్రదర్శించాడు. ఉద్ధవా! నాకు ఆ పరమాత్మ లీలలను గురించి వివరించు." అని విదురుడు ఉద్ధవుని అడిగాడు.

శ్రీమద్భాగవతము
తృతీయస్కంధము మొదటి అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## రెండవ అధ్యాయము.

ఈ ప్రకారంగా విదురుడు శ్రీకృష్ణుని గురించి ఉద్ధవుని అడిగాడు. ఉద్ధవుని మనసులో ఒక్కసారిగా శ్రీకృష్ణ పరమాత్మ కనిపించాడు. ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఊహాలలో తేలిపోయాడు. అందుకని వెంటనే విదురునికి సమాధానం ఇవ్వలేదు.

ఉద్ధవుడు ఐదు సంవత్సరముల వయసులో ఉండగా శ్రీకృష్ణునితో ఆడుకొనేవాడు. శ్రీకృష్ణునితో ఆటపాటలలో మునిగి తేలేవాడు. అప్పుడు ఉద్ధవుని అమ్మ అన్నము తినడానికి పిలిచినా వెళ్లేవాడు కాదు. శ్రీకృష్ణుడు వ్రేపల్లె విడిచి వెళ్లినా కూడా ఉద్ధవుడు అక్కడే ఉన్నాడు. శ్రీకృష్ణుని తలచుకుంటూ, ఆయన లీలలను గుర్తుచేసుకుంటూ, కాలం గడిచేకొద్దీ  వృద్ధుడు అయ్యాడు.

ఇప్పుడు విదురుడు వచ్చి శ్రీకృష్ణుని గురించి అడగగానే, ఒక్కసారిగా ఉద్ధవుడికి తన బాల్యంలో శ్రీకృష్ణునితో గడిపిన రోజులు గుర్తుకు వచ్చాయి. ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఊహలలో తేలిపోయాడు.

శ్రీకృష్ణుని తలచుకోగానే ఉద్ధవుని తనువు పులకించింది. కళ్లలో నుండి ఆనందాశ్రువులు జలాజలా రాలాయి. శ్రీకృష్ణుని ప్రేమలో మునిగి పోయాడు ఉద్ధవుడు. ఉద్ధవుడు ఆ పరమాత్ముని భావనలో ఉన్నాడని అనుకున్నాడు విదురుడు.

అలా కొద్దిక్షణాలు గడిచాయి. ఉద్ధవుడు ఈ లోకంలోకి వచ్చాడు.కళ్లు తుడుచుకున్నాడు. మనసులో కృష్ణుని తలచుకుంటూ విదురునితో ఇలా అన్నాడు.

"విదురా! కృష్ణుడు సూర్యుని వంటి వాడు. సూర్యుడు అస్తమిస్తే లోకమంతా చీకటి మయం అయినట్టు శ్రీకృష్ణుడు అస్తమించగానే మా గృహము కూడా చీకటితో నిండిపోయింది. ఈ పరిస్థితులలో మిగిలిన బంధువుల విషయం ఏం చెప్పాలి?

## తృతీయ స్కంధము

విదురా! ఈ మానవ లోకము ఎంతటి దురదృష్టమైనది. పాల సముద్రములో నిత్యము ఈదులాడే చేపలకు పాలయొక్క రుచి తెలియనట్టు, ప్రతిరోజూ తమతో తిరుగుతూ తమ కళ్ల ముందు కనపడుతున్న శ్రీకృష్ణుని మహత్తును ఆ యాదవులు గుర్తించ లేకపోయారు. ఆ యాదవులు ఎంత దురదృష్టవంతులో కదా!

అందులోనూ మానసిక శాస్త్రవేత్తలు, పండితులు, ఎల్లప్పుడు శ్రీకృష్ణుని వెంట ఉండే యాదవులు కూడా శ్రీకృష్ణుని కేవలము ఒక యాదవ ప్రముఖుడుగానే చూచారు కానీ సాక్షాత్తు భగవంతుని అవతారము అని గుర్తించలేకపోయారు. వారంతా మాయకు లోబడి శ్రీకృష్ణుడు మా వాడు, మా బంధువు, మా మిత్రుడు అనుకున్నారు.

శిశుపాలుడు లాంటి వాళ్లు శ్రీకృష్ణుని ఒక శత్రువుగా తలంచి ఎన్నో దుర్భాషలాడారు. కానీ ఆ మాటలన్నీ ఆ శ్రీకృష్ణుని భక్తులమైన మాలాంటి వారి మనసును, బుద్ధిని ఏ మాత్రం ప్రభావితం చేయలేవు. మా దృష్టిలో శ్రీకృష్ణుడు పరమాత్మ అవతారము.

ద్వారకలో ఉన్న యాదవులు ఏ తపస్సు చేయలేదు.కానీ వారి ముందు శ్రీకృష్ణుడు ఎల్లప్పుడూ తిరుగాడుతూ ఉండేవాడు.కాని వారి కళ్లు ఎప్పుడూ తృప్తిచెందేవి కావు. ఎందుకంటే శ్రీకృష్ణుడు చాలా కాలం హస్తినలో, ఇతర ప్రదేశాలలో ఉండేవాడు.

ఇప్పుడు ఆ కృష్ణుడు కాలగర్భంలో కలిసిపోయాడు. ఈ లోకానికి కళ్లుపోయినట్టు అయింది. అంతే కాదు, తనయొక్క యోగమాయా బలం చేత పరమాత్మ అత్యంతసుందరమైన ఆకారంతో

శ్రీకృష్ణుడిగా అవతరించాడు. ఆ కృష్ణుని సౌందర్యానికి సకల జగత్తు సమ్మోహితమయింది.

విదురా! ఒక్కోసారి కృష్ణుడే తన సౌందర్యాన్ని చూచి ఆశ్చర్యపోయాడట. శ్రీకృష్ణుని అందము, సౌందర్యము భూషణములకే భూషణంగా శోభిల్లింది.

ధర్మరాజు రాజసూయ యాగంచేసాడు. అగ్రపూజకు కృష్ణుని సింహాసనం మీద కూర్చోపెట్టాడు. అప్పుడు కృష్ణుని జగన్మోహన రూపము చూచినవారు సృష్టిచేయడంలో బ్రహ్మదేవుని కౌశలము అంతా శ్రీకృష్ణుని సృష్టించడానికే వ్యయమైనట్టు భావించారు.

శ్రీకృష్ణుడు బాల్యంలో గిరివ్రజములో ఉండగా, వ్రజములో ఉన్న స్త్రీలు కృష్ణుని ప్రేమతోకూడినచూపులకు, ఆయన మాటలకు పొంగిపోయి, కృష్ణుడు ఎప్పటికీ తమ వాడనే గర్వించారు. కృష్ణుడు గిరివ్రజమును వదిలి మధురకు పోతుంటే వ్రజములో ఉన్న ప్రజల చూపులు, వారి మనస్సులు కృష్ణుడినే అనుసరించాయి. వారంతా కృష్ణుడు వెళ్లిన వైపే చూస్తూ శిలా విగ్రహముల మాదిరి నిలబడిపోయారు.

విదురా! ఈ జగత్తులో పుణ్యాత్ములు, పాపాత్ములు అందరూ ఆ పరమాత్మ అంశలో నుండి వచ్చినవారే. అందరిలోనూ ఆ పరమాత్మ ఉన్నాడు. కానీ, శాంతంగా ఉండే సత్పురుషులను, ఘోరమైన అసురులు బాధించడం చూచి, తట్టుకోలేక, ఆ అసురులను సంహరించడానికి

ఎన్నో అవతారాలు ఎత్తాడు పరమాత్మ.

జన్మ అంటే ఏమిటో తెలియని పరమాత్మ, వసుదేవుని ఇంటిలో జన్మించడం, కంసుడు మొదలగు దుర్మార్గుల భయంతో గిరివ్రజంలో నివసించడం, తాను మహాపరాక్రమవంతుడైనా, కాలయవనునికి భయపడి మధురా నగరాన్ని విడిచి పెట్టి వెళ్లిపోవడం, మొదలగు లీలలు చూచి మనసుకు బాధకలుగుతూ ఉంది.

శ్రీకృష్ణుడు తన తల్లితండ్రులు అయిన దేవకీవసుదేవుల పాదముల మీదపడి నమస్కరించి, “అమ్మా! నేను ఆ కంసునికి భయపడి ఇన్నాళ్లు మీ పాదసేవ చేసుకోలేకపోయాను. నా తప్పుక్షమించండి.” అని వేడుకున్నాడు. పరమాత్మ ఒక సామాన్య మానవుని వలె ప్రవర్తించడం బాధ అనిపించింది.

విదురా! శ్రీకృష్ణుడే కాలస్వరూపుడు. కేవలము తన క్రీగంటిచూపుతోనే భూభారమును రూపుమాపగలడు. కృష్ణభక్తులు ఆయన మహిమను ఎలా మరువగలరు? రాజసూయ యాగ సందర్భంలో తనను దూషించిన శిశుపాలుని తన చక్రాయుధముచేత సంహరించి, యోగులకు కూడా లభ్యము కాని పరమపదమును అనుగ్రహించాడు. ఆ సంఘటనను మీరు కూడా చూచారుకదా!

అలాగే, భారతయుద్ధంలో శత్రు సైనికులు అర్జునుని బాణములకు బలి అవుతూ, సారథిగా ఉన్న కృష్ణుని మొహం చూస్తూ ప్రాణాలు విడిచారు. ఆఖరు క్షణాల్లో తన మొహాన్ని చూస్తూ

మరణించిన వారికి, ఉత్తమ గతులు కల్పించాడు దయామయుడైన కృష్ణుడు.

విదురా! శ్రీకృష్ణుని కంటే సమానులుకానీ అధికులుకానీ ఎవరూ లేరు. ఇంద్రుడు, లోకపాలకులు కూడా అతనిని సేవిస్తుంటారు. అటువంటి కృష్ణుడు ఉగ్రసేనుని సింహాసనము మీద కూర్చోపెట్టి, ఆయనకు భృత్యుని వలె ఒంగి నిలబడడం నాకు బాధగా అనిపించింది.

విదురా! కృష్ణుని బాల్యములో బకాసురుని సోదరి అయిన పూతన అనే రాక్షసి, కృష్ణుని చంపవలెననే ఉద్దేశ్యములో, తనస్తనములకు విషము పూసుకొని వచ్చి కృష్ణునికి స్తన్యము ఇచ్చింది. తనను చంపవలెననే కోరికతో వచ్చిన పూతన స్తన్యము తాగి ఆమెను చంపి ఆమెకు సద్గతులు కల్గించాడు కృష్ణుడు. అటువంటి దయాళు వైన కృష్ణుని కాక మేము ఎవరి దగ్గర శరణు పొందుతాము.

అసురులు ఎంతోమంది కృష్ణునితో యుద్ధం చేసారు. వారంతా గరుడుని మీద ఎక్కి తమతో యుద్ధం చేస్తున్న కృష్ణుని చూస్తూ మరణించారు. అందరూ ఉత్తమ గతులుపొందారు. కృష్ణునితో యుద్ధము చేసిన అసురులు కూడా కృష్ణభక్తులే అని అనుకుంటాను.

ఆ పరమాత్మకు అసలే జన్మలేదు కదా! అటువంటిది, భూదేవి కోరిక మేరకు, కారాగారములో ఉన్న దేవకీ వసుదేవులకు పుత్రుడుగా జన్మించాడు. తరువాత కంసుడు చంపుతాడు అని భయపడి, వసుదేవుడు కృష్ణుని బుట్టలో పెట్టుకొని యమున దాటి, నందుని

ఇంటికి తీసుకొని వెళ్లాడు. నందుని గోకులంలో కృష్ణుడు పదకొండు సంవత్సరముల పాటు, అన్న బలరామునితోసహా రహస్యంగాజీవించాడు.

పరమాత్మ స్వరూపుడగు కృష్ణుడు, తాను అంతటా నిండి ఉన్నప్పటికినీ, గోప బాలురతో కూడి, గోవులను మేపుకుంటూ, యమునా నదీ తీరంలో ఉన్న ఉద్యానవనములలో తిరిగాడు.

కృష్ణుడు బాల్యములో, గోకులంలో ఉన్న వారిని ఆకర్షించుటకు ఎన్నో లీలలు చేసి చూపించాడు. ఒకప్పుడు నవ్వుతూ, మరొకప్పుడు ఏడుస్తూ, మరొకప్పుడు అమాయకంగా ఉండేవాడు. ఐదు సంవత్సరములు రాగానే కృష్ణుడు, ఆవులను, ఎద్దులను తోలుకొని అడవిలోకి పోయి, వాటిని కాస్తూ, తన వేణుగానముతో గోపాలురను సంతోషపెట్టేవాడు.

కంసుడు పంపిన రాక్షసుల నందరినీ అవలీలగా సంహరించి, గోకులములో ఉన్న వారికి ఆశ్చర్యమును కలిగించాడు. కాళింది మడుగులో కాళీయుడు అనే విషసర్పము, యమునా నదీజలములను కలుషితము, విషపూరితము చేస్తుంటే, ఆ కాళీయుని గర్వము అణగించి, యమునా నదీ జలాలను కాపాడాడు.

గోకులములో వారంతా ఇంద్రపూజ చేయాలని సంకల్పిస్తే, వారిని వారించి, తమకు ఫలములనిచ్చే గోవర్ధన పర్వతమునకు పూజలు జరిపించాడు. దానికి కోపించిన ఇంద్రుడు, గోకులము మీద కుంభవృష్టి కురిపించగా, కృష్ణుడు తన చేతితో గోవర్ధన పర్వతమును ఎత్తి దాని కింద వ్రజప్రజలకు రక్షణ ఏర్పాటు చేసాడు.

శరత్కాలములో. వెన్నెల రాత్రులలో, తన వేణుగానంతో గోప కాంతలను మైమరిపింపజేసి, వారితో రాసక్రీడలు సలిపాడు.

శ్రీమద్భాగవతము

తృతీయస్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

తృతీయస్కంధము

మూడవ అధ్యాయము.

శ్రీకృష్ణుడు తనపదకొండవ ఏట మధురకు వచ్చి, తన మేనమామ కంసుని సింహాసనము నుండి కిందకకు పడదోసి, చంపి, తన తల్లి తండ్రులైన దేవకీ వసుదేవులను చెరసాల నుండి విడిపించాడు.

తరువాత విద్యాభ్యాసమునకు సాందీపుని వద్దకు వెళ్లాడు. అక్కడ నాలుగు వేదములను అభ్యసించాడు. ఆ సాందీపుని కుమారుని పంజనుడు అనేరాక్షసుడు చంపి తింటే, వాడి పొట్టను చీల్చి ఆ కుమారుని బయటకు తీసుకొని వచ్చి పునర్జీవితుని చేసాడు.

భీష్మకుని కుమార్తె రుక్మిణి తన మీద మనసు పడినదని, ఆమెకుస్వయంవరము చాటించారని తెలుసుకొని, ఎందరో రాజులు ఆమెను వివాహమాడవలెనని కుతూహలముగా ఉన్నారని ఎరింగి,

తాను కుండిన నగరమునకు పోయి, ఆ రాజులను ఓడించి, రుక్మిణిని ద్వారకకు తీసుకొని వచ్చి వివాహం చేసుకున్నాడు.

ఏడు వృషభములను లొంగదీసుకొని, మరొక కన్య నాగ్నజితిని వివాహమాడాడు కృష్ణుడు.

శ్రీకృష్ణుడు తాను సత్యభామావిధేయుడిగా నటించి, ఆమెకు సంతోషము చేకూర్చవలెనని, ఆమెతో సహా అమరావతికి పోయి అక్కడ ఉన్న పారిజాత వృక్షమును తెచ్చి సత్యభాగ ఉద్యానవనములో నాటించాడు. ఆ విధంగా కృష్ణుడు స్త్రీలోలుడుగా పేరుపడ్డాడు.

నరకాసురుని యుద్ధములో వధించి, నరకుని తల్లి భూదేవి కోరిక మేరకు, నరకుని కుమారుడు భగదత్తునికి రాజ్యము ఇచ్చాడు. నరకుని అంత:పురములో నరకునిచేత బందీలుగా చేయబడ్డ 16,000 రాజకన్యలను చెరవిడిపించాడు. వారందరూ తమను కాపాడిన  కృష్ణుని తమ భర్తగా వరించారు. వారి కోరిక మేరకు వారందరినీవారి వారికి తగిన రూపములలో కృష్ణుడు వివాహమాడాడు. తరువాత వారికి ఒక్కొక్కరికీ తనతో సమానమైన పదిమంది పుత్రులను ప్రసాదించాడు.

తమ తమ సేనలతో మధుర మీదికి దండెత్తి వచ్చిన కాలయవనుడు, జరాసంధుడు, సాల్వుడు మొదలగు రాక్షసులను తాను స్వయంగానూ, ముచికుందుని చేతా,  భీముని చేతా చంపించాడు. అలాగే శంబుడు, ద్వివిదుడు, బాణాసురుడు, మురాసురుడు, బల్కలుడు, దంతవక్త్రుడు మొదలగు వారిని తాను

స్వయంగానూ, తనకుమారులచేతనూ చంపించాడు.

కురుక్షేత్రమహాసంగ్రామంలో భూమి నాలుగు చెరగులనుండీ 18 అక్షౌహిణీల సైన్యము వచ్చి చేరింది. కృష్ణుడు పాండవుల పక్షము అవలంబించి. తాను ఆయుధము పట్టకుండా 18 అక్షౌహిణీల సైన్యమును, భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, అర్జునుడు, భీముడు మొదలగు వారిని కారణభూతులను చేసి, వారి చేత సంహరింపజేసి భూభారమును తగ్గించాడు.

కృష్ణుడు అంతటితో ఆగలేదు. సాత్యకి, ప్రద్యుమ్నుడు, సాంబుడు మొదలగు వారి నాయకత్వంలో అపారమైన యాదవసేన ఇంకా మిగిలి ఉన్నదని గ్రహించాడు. యాదవులకు మద్యపానము అంటే ఎంతో ఇష్టం. ఆ మద్యం మత్తులో వారు ఒకరితో ఒకరు కొట్టుకోడం జరుగుతూ ఉంటుంది. అలా కొట్టుకోవడమే వారి నాశనానికి కారణం అవుతుంది. యాదవులు ఒకరితో ఒకరుకొట్టుకొని చావడంతప్ప వారిని అంతమొందించడానికి వేరే ఉపాయం కనపడలేదు కృష్ణుడికి. తాను అవతారం చాలించడానికి ప్రయత్నించగానే యాదవులు అందరూ వారిలో వారు కొట్టుకొని చావాలి అని అనుకున్నాడు పరమాత్మ. అలాగే జరిపించాడు.

భారత యుద్ధము తరువాత ధర్మరాజును రాజ్యాభిషిక్తుని చేసాడు. ఉత్తరగర్భంలో ఉన్న పాండవ వంశాంకురమును అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామాస్త్రము బారి నుండి రక్షించాడు.

## తృతీయ స్కంధము

ధర్మరాజు చేత అశ్వమేధయాగములు చేయించాడు. ధర్మరాజు సోదరులసాయంతో కురు సామ్రాజ్యమును పాలించడం చూచి ఆనందపడ్డాడు కృష్ణుడు.

తరువాత కృష్ణుడు ద్వారకకు వెళ్లాడు. తాను అన్నిభోగముల యందు విరక్తుడయ్యును, లౌకిక మైన భోగములను ధర్మమార్గంలో ద్వారకలో అనుభవించాడు కృష్ణుడు. తన అష్టభార్యలతో, పదహారువేల మంది రాచకన్యలతో ఒక్కొక్కరికి వారు తోచిన రూపాలతో అనుభవించాడు.

ఇలా కొన్ని సంవత్సరములు గడిచిపోయాయి. శ్రీకృష్ణపరమాత్మ లౌకిక భోగముల యందు విరక్తుడయ్యాడు. యోగేశ్వరుడైన ఆ పరమాత్మను సేవించే భక్తులకే ఇహలోక భోగముల యందు విరక్తి కలుగుతున్నప్పుడు, ఆ పరమాత్మకు విరక్తి కలగడంలో ఆశ్చర్యం ఏముంది.

యాదవ వీరులు బాలురుగా ఉన్నప్పుడు బాల్య చేష్టలచేత కొంతమంది మునులకు కోపం తెప్పించారు. ఆ మునులు కోపంతో ఆబాలురను శపించారు. ఆ శాపమును అనుసరించి, తరువాతి కాలంలో, యాదవులు అందరూ ప్రభాస తీర్థమునకు వెళ్లారు.

ఆ ప్రభాస తీర్థంలో యాదవ వీరులు అందరూ వారి వారి పితరులకు తర్పణాది కార్యక్రమములు ఆచరించారు. బ్రాహ్మణులకుగోదానములు భూదానములు, సువర్ణదానములు, వెండి వస్తువులు, వస్త్రములు దానం చేసారు.

తరువాత బ్రాహ్మణులకు తృప్తిగా భోజనం పెట్టారు. బ్రాహ్మణులకునమస్కరించి వారి ఆశీర్వాదములు తీసుకున్నారు.

శ్రీమద్భాగవతము
తృతీయస్కంధము మూడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
తృతీయస్కంధము
నాలుగవ అధ్యాయము.

తరువాత యాదవులు అందరూ బ్రాహ్మణుల అనుమతితో భోజనాలు చేసారు. తరువాత మద్యం సేవించారు.ఆ మద్యం మత్తులో తమను తాము మరచిపోయారు. ఒకరిని ఒకరు దూషించుకున్నారు. తరువాత కొట్టుకున్నారు. చంపుకున్నారు. సాయం సమయానికి యాదవులు అందరూ ఒకరిచేతిలో ఒకరు మరణించారు.

ఇదంతా లీలామాత్రంగా చూస్తున్నాడు కృష్ణుడు. యాదవ సంహారము పూర్తి అయిన తరువాత, కృష్ణుడు ఒంటరిగా ఒక చెట్టు మొదలు వద్ద కూర్చున్నాడు. విదురా! ఆ సమయంలో నేను కృష్ణుని పక్కనే ఉన్నాను.

## తృతీయ స్కంధము

యాదవ సంహారమునకు ముందే ఒకనాడు కృష్ణుడు నన్ను చూచి "ఉద్ధవా! ఇంక నీవు బదరికాశ్రమమునకు పో." అని ఆజ్ఞాపించాడు. కాని నేను కృష్ణుని విడిచి ఉండలేను కాబట్టి ఆయన ఆజ్ఞను పాటించలేదు. ఆయన వెంటనే ఉన్నాను.

సరస్వతీ నదీ తీరంలో చిన్న రావి చెట్టు మొదట్లో ఒంటరిగా తన ఎడమ తొడపై కుడికాలుపెట్టుకొని కూర్చుని ఉన్న శ్రీకృష్ణుని చూచాను. కృష్ణుని ముఖంలో చిరునవ్వు తొణికిసలాడుతూ ఉంది. ఇంతలో వ్యాసునికి మిత్రుడు అయిన మైత్రేయ మహర్షి అక్కడకు వచ్చాడు. మైత్రేయుని ఎదుట కృష్ణుడు నాతో ఇలా అన్నాడు.

"ఉద్ధవా! నీ మనసులో మెదులుతున్న భావాలు నాకు తెలుసు. నీవు పూర్వజన్మలో వసువు. నన్నుపొందడానికి నన్ను ఆరాధించావు. అది ఇప్పుడు ఫలించింది. నీ జన్మలలో ఇదే నీ చివరి జన్మ. అందుకే ఈ జన్మలో నా సాన్నిహిత్యము నీకు లభించింది. నీవు ఈ లోకమును వదిలి వైకుంఠమునకు పోవడానికి సిద్ధంగా ఉన్నావు. నీ చివరి దశలో నన్ను చూడటానికే నన్ను వెతుక్కుంటూ ఇక్కడకు వచ్చావు. ఈ నిర్జన ప్రదేశంలో నన్ను చూడగలిగావు. పూర్వము నేను బ్రహ్మకు పరమమైన జ్ఞానమును ఉపదేశించాను. అదే భాగవతము." అని పలుకుతున్న కృష్ణుని చూచి నేను బ్రహ్మానందభరితుడను అయ్యాను.

చేతులు జోడించి కృష్ణపరమాత్మతో ఇలా అన్నాను. "పరంధామా! నేను సదా నీపాదములను ఆశ్రయించుకొని ఉన్నాను. నీ పాదములను ఆశ్రయించినవారికి పురుషార్థములలో ఏది లభించదు.

కాని నాకు నీ పాదములయందే భక్తి, అనురక్తి. అందుకని నాకు ఏ పురుషార్థములు అక్కరలేదు. నీ పాదసేవ చాలును.

నీకు ఏ కర్మలు చేయనవసరం లేకపోయినా నిత్యము కర్మలు చేస్తున్నావు. నీవు జన్మారహితుడవు అయిన లోకకల్యాణార్థము జన్మలు ఎత్తుతున్నావు. ఏకోరికా లేకపోయినా, ఎంతో మంది భార్యలతో సంసారసుఖములు అనుభవించావు. గృహస్థాశ్రమమునుస్వీకరించావు. నీ లీలలను అర్థం చేసుకోలేక పండితులు విద్వాంసులు నిన్ను అనుమానిస్తుంటారు. సంశయంలో పడుతుంటారు.

నీకు కాలము లేదు. నీవే కాలస్వరూపుడవు. సంశయ రహితుడవు. అటువంటి నీవు నన్ను పిలిచి నీ సందేహములను తీర్చుకొనుటకు నా ఆలోచనలను అడిగేవాడివి. ఇంతకంటే నాకు భాగ్యం ఏముంటుంది. అదే నన్ను సదా సమ్మోహపరచింది.

దేవా! నీవు పరమమైన జ్ఞానమును భాగవతము అనే రూపంలో బ్రహ్మకు ఉపదేశించాను అని చెప్పావు కదా! ఆ జ్ఞానమును మాకు కూడా, మేము వినడానికి అర్హులమైతే, మాకు కూడా ఉపదేశించు. ఆ పరమ జ్ఞానమును తెలుసుకొని మేము కూడా ఈ సంసార సాగరమును దాటడానికి ప్రయత్నిస్తాము."అని నేను కృష్ణపరమాత్మను ప్రార్థించాను.

అప్పుడు కృష్ణుడు నాకు ఆ పరమమైనజ్ఞానమును ఉపదేశించాడు. శ్రీకృష్ణుని వలన పరమమైన తత్త్వజ్ఞానమును ఉపదేశించబడిన వాడనై, కృష్ణునికి ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించి,

ఆయనను విడువ లేక విడువలేక విడిచిపెట్టి  బదరికాశ్రమమునకు పోతూ, ఇక్కడకు వచ్చాను.” అని ఉద్ధవుడు విదురునితో పాండవుల వృత్తాంతమును, కృష్ణుని వృత్తాంతమును వివరంగా చెప్పాడు.

కురువంశమంతా భారతయుద్ధంలో సర్వనాశనము అయిందని తెలుసుకున్న విదురుడు దు:ఖంతో కుమిలిపోయాడు. తరువాత విదురుడు ఉద్ధవునితో ఇలా అన్నాడు.

“ఉద్ధవా! వినడానికి నేను అర్హుడిగా నీవు తలిస్తే, కృష్ణపరమాత్మ నీకు ఉపదేశించిన పరమాత్మ తత్త్వమును నాకు కూడా ఉపదేశించు. నీవు భగవద్భక్తుడవు. నేను నీకు సేవకుడను. సేవకుల కోర్కెలు తీర్చడం భక్తుల ధర్మం కదా! అందుకే కదా భగవద్భక్తులు భూలోకంలో సంచరిస్తూ భగవంతుని సేవకుల ప్రయోజనములు కాపాడుతూ ఉంటారు.”అని అన్నాడు విదురుడు.

అప్పుడు ఉద్ధవుడు విదురుని చూచి ఇలాఅన్నాడు. “నీకు చెప్పడం మరిచాను. నాకు కృష్ణుడు పరమమైన జ్ఞానమును ఉపదేశించేటప్పుడు మైత్రేయుడు నా పక్కనే ఉన్నాడు. నాకు ఉపదేశించిన తరువాత, కృష్ణుడు మైత్రేయుని చూచి “మైత్రేయా! నీ ఎదుట నేను ఉపదేశించిన పరమమైన జ్ఞానమును  నీవు నా భక్తుడు విదురునికి ఉపదేశించు.” అని అన్నాడు.

కాబట్టి నీవు మైత్రేయుని వద్దకు పోయి ఆయనను సేవించు. ఆయన నీకు పరమాత్మ జ్ఞానమును, భాగవతమును ఉపదేశిస్తాడు.” అని అన్నాడు ఉద్ధవుడు.

మరునాడు ఉద్ధవుడు యమునానదీ తీరమును వదిలిపెట్టి బదరికాశ్రమమునకు వెళ్లిపోయాడు." అని శుకుడు పరీక్షిత్తుకు భాగవత కథ వినిపిస్తున్నాడు.

అప్పుడు పరీక్షిత్తు శుకుని ఇలాఅడిగాడు. "ఓ శుకమహర్షి! బ్రాహ్మణ శాపము చేత, వృష్ణి,భోజ వంశము వారందరూ ఒకరితో ఒకరుకొట్టుకొని మరణించారుకదా! అటువంటప్పుడు ఉద్ధవుడు మాత్రము ఎలా చావకుండా మిగిలి ఉన్నాడు?"అని సందేహమును వెలిబుచ్చాడు పరీక్షిత్తు. అప్పుడు శుకుడు ఇలా చెప్పసాగాడు.

"మహారాజా! కృష్ణునికి ఈ సంగతి ముందేతెలుసు. యాదవ వంశ నాశనమునకు కేవలము బ్రాహ్మణశాపమేకాదు. భగవంతుని సంకల్పము కూడా ఒక కారణము, బ్రాహ్మణ శాపము ఒక మిష మాత్రమే  అని కృష్ణుడు తలంచాడు.

ఇంకా ఇలా అనుకున్నాడు. "నేను అవతారమును చాలించి వైకుంఠమునకు వెళ్లిన తరువాత, ఈ ఉద్ధవుడు మాత్రమే పరమజ్ఞానమును అర్థం చేసుకోడానికి తగినవాడు.  ఎందుకంటే ఉద్ధవుడు జ్ఞానసముపార్జనలో నాకు ఏ మాత్రము తీసిపోడు. ఉద్ధవుడు ఇంద్రియములను జయించిన వాడు. ఈ ప్రాపంచిక విషయముల యందు విముఖుడు. నా జ్ఞానమును లోకములో వ్యాప్తిచేయడానికి ఉద్ధవుడుఈ లోకంలో ఉండాలి." అని అనుకొన్నాడు కృష్ణుడు. అందుకే కృష్ణుడు ఉద్ధవుని బదరికాశ్రమమునకు వెళ్లమన్నాడు.

తృతీయ స్కంధము

మహారాజా! ఉద్ధవుని వలన విదురుడు శ్రీకృష్ణపరమాత్మ లీలలను విన్నాడు. పరమాత్మ అంతిమఘడియల గురించి కూడా విన్నాడు. శ్రీకృష్ణుడు తన అంతిమ సమయంలో తనను తలచుకున్నాడని, తనను గుర్తుపెట్టుకున్నాడని తెలిసి పొంగిపోయాడు.

ఉద్ధవుడు వెళ్లిపోయిన తరువాత విదురుడు కృష్ణునికి తన మీద ఉన్న ప్రేమను తలచుకొని ఆనందంతో ఏడవసాగాడు. తరువాత విదురుడు కొన్ని దినములు యమునానదీ తీరంలో గడిపి, తరువాత మైత్రేయుడు ఉన్న గంగానదీ తీరానికి వెళ్లాడు.

శ్రీమద్భాగవతము

తృతీయస్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## తృతీయస్కంధము

## ఐదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తుమహారాజుతో ఇలా అన్నాడు.

"విదురుడు గంగాతీరంలో, హరిద్వారము వద్ద ఉన్న మైత్రేయుని వద్దకు వెళ్లాడు. మైత్రేయుని చూచి విదురుడు ఇలా అన్నాడు.

"మైత్రేయా! లోకములో మానవులు తమ సుఖం కోసరంగా ఎన్నో కర్మలు చేస్తుంటారు. కాని ఆ కర్మల వలన సుఖమూ కలగడం

లేదు. వారికి ఉన్న దు:ఖములు పోవడం లేదు. పైగా ఆ కర్మల వలన కొత్త కొత్త దు:ఖములు కలుగుతున్నాయి. కాబట్టిమానవులు ఎలాంటి కర్మలు చేయాలో తమరు మాకు చెప్పాలి.

తాము అంతకు ముందు జన్మలో చేసిన కర్మల వలన శ్రీకృష్ణునిపట్ల విముఖత కలిగిన వారు, దు:ఖములో మగ్గుతున్నవారు, అయిన మానవులను అనుగ్రహించ డానికి, తమవంటి శ్రీకృష్ణభక్తులు మానవలోకంలో సంచరిస్తూ ఉంటారు. కాబట్టి ఈ లోకంలో సుఖములు పొందే మార్గము మాకు ఉపదేశించండి. మేము ఆ మార్గములో భగవానుని ఉపాశిస్తాము. అప్పుడు శ్రీకృష్ణుడు మాకు ఆత్మానుభూతిని, అసలైన, సనాతనమైన జ్ఞానమును ఇస్తాడు.

ఓ మైత్రేయా! మూడులోకములకు అధిపతి, స్వతంత్రుడు అయిన పరమాత్మ పురుష రూపంలో ఎందుకు అవతరించవలసి వచ్చింది. ఆయా అవతారములలో ఆయన చేసిన కర్మలు ఏమిటి? తనకు ఏ కోరికలు లేకపోయినప్పటికినీ, పరమాత్మ మొట్టమొదట ఈ జగత్తును ఎందుకు, ఎలా సృష్టించాడు. ఆ జగత్తులోని జీవులు జీవించడానికి ఎటువంటి విధానమును ఏర్పరిచాడు. ఈ విషయములు అన్నీ మాకు తెలియజేయవలసింది.

కల్పాంతంలో పరమాత్మ ఈ జగత్తును అంతా తనహృదయాకాశంలో నిలుపుకొని, ఎటువంటి వృత్తులు లేకుండా, యోగనిద్రలో ఉంటాడు కదా! మరలా సృష్టి ఆరంభంలో, తాను ఒకటిగా ఉన్నప్పటికానీ, బహువిధములుగా ఈ విశ్వంలో ప్రవేశించి,

బ్రహ్మ, విష్ణువు, శివుడు, దేవతలు, మరుత్తులు మొదలగువారిగా ఎలా ప్రకటితమవుతున్నాడు.

ఈ లోకములో ఉన్న గోవులు, బ్రాహ్మణులు, దేవతలయొక్క క్షేమము కోరి పరమాత్మ ఎన్నో అవతారములు ఎత్తాడు కదా! ఆ అవతారములలో ఎన్నో కర్మలు చేసాడు కదా! ఆ అవతార విశేషములను, లీలలను మాకు తెలియజెయ్యండి. భగవానుని అవతార విశేషములు ఎన్నిసార్లు విన్నా తనివితీరడం లేదు.

లోకములను, అలోకములను, లోకపాలకులతో సహా అందరినీ పరమాత్మ సృష్టించాడు. ఆ లోకములలో వివిధములైన ప్రాణులను కూడా సృష్టించాడు. ఆ ప్రాణులమధ్య జాతిభేదమును కల్పించాడు. వాటికి వేరు వేరు కర్మలను నిర్దేశించాడు. ఆ పరమాత్మ చేసిన సృష్టి గురించి మాకు సవిస్తరంగా తెలుపవలసినది.

ఓ బ్రాహ్మణోత్తమా! ఈ విశ్వమునుసృష్టించిన పరమాత్మ, తనను తానే సృష్టించుకొనే పరమాత్మ, ఈ అనంత విశ్వంలో ఉండే జీవులకు, ప్రాణులకు మధ్య ఇన్ని జాతి భేదాలు, రకాలు, రూపములు, పేర్లు, వాటికి తగ్గ కర్మలు ఎలా కల్పించాడు. ఆ విధమును మాకు తెలియజేయండి.

ఓ మైత్రేయా! నేను వేదవ్యాసుని ముఖతా వర్ణవ్యవస్థ గురించి, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రజన్మల గురించి, వారి వారి వృత్తులగురించి ఎన్నోసార్లు విన్నాను. తాత్కాలిక సుఖాలను ఇచ్చే ఆ కథలను విని తృప్తిపడ్డాను. కానీ, శ్రీకృష్ణుని గాథలను ఎన్ని సార్లు విన్నా

తృప్తి కలగడం లేదు. శ్రీకృష్ణుని కథలను, లీలలను ఎన్ని సార్లు విన్నా ఇంకా వినాలనే ఉంటుంది కానీ తృప్తి ఉండదు కదా! ఎందుకంటే, భగవంతుని కథలు, కీర్తన మన చెవుల ద్వారా లోపలకు ప్రవేశించి, ఈ సంసార బంధనములకు మూల కారణమైన ప్రాపంచికసుఖముల యందు ఆసక్తిని నాశనం చేస్తాయి కదా!

ఓ మైత్రేయమహాముని! వ్యాసుడు భగవంతుని గుణగణములను కీర్తించవలెననే కోరికతో, భారతము అనే ఇతిహాసమును రచించాడు. ఆ భారతములో ఎన్నో ప్రాపంచిక విషయములు, ప్రాపంచిక సుఖములతో కూడిన కథల ద్వారా, మానవుల బుద్ధిని భగవంతుని కథలలో కూడా లగ్నం చేయడానికి ప్రయత్నం చేసాడు. కానీ మానవులు ప్రాపంచిక సుఖములను వివరించే కథలను మాత్రమే విన్నారు. అందులో ఉన్న భగవంతుని తత్త్వమును పట్టుకోలేకపోయారు.

సాధారణ మానవులు భారత కథలలోని ప్రాపంచిక విషయములనుమాత్రమే గ్రహిస్తే, శ్రద్ధకల మానవులు, ఆ భారత కథలలో ఉన్న పరమాత్మ తత్త్వమును గ్రహించి, ప్రాపంచిక విషయముల యందు విరక్తిని పెంచుకుంటారు. అటువంటి వారు శ్రీకృష్ణుని పాదములనుసేవించడంలో ఉన్న ఆనందాన్ని పొందుతారు. అప్పుడు వారి దు:ఖములు అన్నీ తొలగిపోతాయి.

ఓ మైత్రేయా! ఈప్రపంచంలో ఉన్న మానవులు లౌకిక విషయములలో పడి, భారతములోని రక్తి కలిగించే కథలను మాత్రమే చదివి, పరమాత్ముని కథలను విస్మరిస్తున్నారు. అటువంటి వారి

గురించి నాకు చాలా బాధగా ఉంది.

అంతేకాకుండా ప్రాపంచిక విషయములలో పడి కొట్టుకుంటున్న మానవుల ఆయుర్దాయము దినదినము హరించి పోతూ ఉంది కదా! వీరెప్పుడు హరికథలయందు ఆసక్తిచూపిస్తారు, ఎప్పుడు బాగుపడతారు, ఎప్పుడు ఈ సంసార బంధనాల నుండి విముక్తి పొందుతారు అని ఆందోళనగా ఉంది.

కాబట్టి నీవుమా మీద దయయుంచి, లోకక్షేమము కోరి, మంగళప్రదుడైన పరమాత్మ యొక్కభాగవత కథలను మాకు చెప్పవలసినది. ఆ పరమాత్మ ఈ విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయముల కొరకు తన యోగమాయతో వివిధరూపములను ధరించాడు. మానవాతీతమైన ఎన్నో లీలలను ప్రదర్శించాడు. అవన్నీ మాకు వివరంగాచెప్పండి." అని అడిగాడు విదురుడు.

ఆ ప్రకారంగా విదురుడు అడుగగా, మైత్రేయుడు ఆయనను ప్రశంసించాడు. విదురునితో ఇలా అన్నాడు.

"విదురా! నీవు ఉత్తమమైన విషయములను అడిగావు. నీవు సామాన్యుడవు కావు. ఇంద్రియములను జయించినవాడవు. ఎల్లప్పుడూ శ్రీకృష్ణుని స్మరిస్తుంటావు. నీ కీర్తి లోకంలో విస్తరించి ఉంది. శ్రీకృష్ణుడు నీ ఇంటికి స్వయంగా వచ్చి విందు ఆరగించాడు.

ఈ జన్మలో నీవు వ్యాసుని పుత్రుడవే కానీ, పూర్వ జన్మలో నీవు యమధర్మరాజువు. మాండవ్యుడు అనే మహర్షి నీకు శాపం

ఇచ్చిన కారణాన నీవు వ్యాసునికి కుమారుడిగా జన్మించావు. ఈ జన్మలో నీవు శ్రీకృష్ణునికి  అత్యంత ప్రియమైన భక్తుడవు.

శ్రీకృష్ణభగవానుడు ఈ లోకమును వదిలి వెళ్లు సమయంలో నేను అక్కడే ఉన్నాను. నీకు తత్త్వజ్ఞానము ఉపదేశించమని శ్రీకృష్ణుడు నన్ను ఆదేశించాడు. శ్రీకృష్ణుని ఆదేశాను సారము నేను నీకు,  ఈ జగత్తును సృష్టించి, పోషించి, లయింప చేయుటకై యోగమాయచే కల్పించబడిన భగవంతుని అవతారములను,  చేసిన లీలలను, క్రమంగా నీకు చెబుతాను. శ్రద్ధగా విను.

మొదట్లో భగవంతుడు ఒకటిగా ఉన్నాడు. ఈ అనంత విశ్వం అంతా సూక్ష్మరూపంలో ఆయనలో లీనమై ఉంది. పరమాత్మ సృష్టి చేయవలెను అని సంకల్పించాడు.  ఒక్కడు గా ఉన్న పరమాత్మ దేనినీ చూడలేడు. ఎందుకంటే అంతా ఆయనే కాబట్టి ఆయన చూడటానికి ఏదీ లేదు. అంతకుముందు ఉన్న సృష్టి అంతా సూక్ష్మరూపంలో తనలోనే ఉంది.  తాను చూడ్డానికి ఏదో కావాలి. అందుకని మరలా సృష్టిచేయడానికి సంకల్పించాడు.

దేనినైనా చూడటానికి చూచేవాడు, చూచే వస్తువు, చూడగలిగే శక్తి ఈ మూడూ ఉండాలి. చూచేవాడు పరమాత్మ. చూడ్డానికి కానీ,  చూచే శక్తి కానీ ఏమీ లేదు. అందుకే కార్య కారణ రూపమైన, త్రిగుణాత్మకమైన,  మాయాశక్తిని సృష్టించాడు పరమాత్మ. ఈ మాయాశక్తి ద్వారా పరమాత్మ ఈ జగత్తును సృష్టించాడు.

## తృతీయ స్కంధము

ఆ మాయలో పరమాత్మ తన చైతన్య శక్తిని నిక్షిప్తం చేసాడు. కాలం గడిచేకొద్దీ, ఆ అవ్యక్తమైన మాయ నుండి, అజ్ఞానాన్ని పోగొట్టేది, విజ్ఞానమయమైనది అయిన  మహత్తత్వము ఆవిర్భవించింది. ఆ మహత్తత్వము  పరమాత్మలో సూక్ష్మరూపంలో నిక్షిప్తమై ఉన్న విశ్వాన్ని బయటకు వచ్చేట్టు చేసింది.

ఆ మహత్తత్వము మీద పరమాత్మ దృష్టి పడింది. పరమాత్మ దృష్టి పడగానే,  అహంకారమును పుట్టించే సంకల్పంతో,  ఆ మహత్తత్వము రూపాంతరం చెందింది. ఆ ప్రకారంగా మహత్తత్వము రూపాంతరం చెందగా, అంటే దాని రూపము మారి,  అందులో నుండి అహంకార తత్వము పుట్టింది. ఈ అహంకారము కర్త, కారణము కార్యము అనే మూడింటికి ఆశ్రయము అయింది. ఆ అహంకారము వలననే అందరూ అన్ని కార్యములు, ఏవేవో కారణములతో చేస్తుంటారు. ఈఅహంకారమే సమస్త భూతములు, ఇంద్రియములు, మనస్సు పుట్టడానికి కారణం అయింది.

ఈ అహంకారము మూడు విధములు.

సాత్వికాహంకారము. రాజసాహంకారము, తామసాహంకారము. సాత్వికాహంకారము మార్పు చెంది అందులో నుండి మనస్సు పుట్టింది. శబ్దము మొదలగు పనులను చేసే దేవతా శక్తులు కూడా ఆ సాత్వికాహంకారము నుండి పుట్టాయి. రాజసాహంకారము నుండి జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పుట్టాయి. తామసాహంకారము నుండి శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము,  ఉద్భవించాయి.

. ఆ శబ్దము నుండి ఆకాశము పుట్టింది. తరువాత కాలము, మాయ కలవడం చేత, పరమాత్మ సంకల్పం ప్రకారము, ఆకాశం నుండి స్పర్శ తన్మాత్ర పుట్టింది. ఆ స్పర్శ తన్మాత్ర వికారం చెంది వాయువు పుట్టింది. మహాబలము కలిగిన వాయువు ఆకాశంతో కలిసి మార్పు చెంది, రూప తన్మాత్రను సృష్టించింది. ఆ రూపతన్మాత్ర లోనుండి తేజస్సు ఆవిర్భవించింది. ఆ తేజస్సు వాయువుతో కలిసి, పరమాత్మ ఇచ్ఛ ప్రకారము, రూపాంతరం చెంది, కాలము మాయ సంయోగము చేత జలము పుట్టింది.

(ఇక్కడ నుండి ఒక విషయం గమనించండి. ఏది జరిగినా కాలము, మాయసంయోగము చేత జరుగుతూ ఉంది. అంటే ఈ పరిణామాలు ఒకరోజు జరిగినవి కావు. వందల, వేల సంవత్సరము లలో జరిగినవి. మాయ అంటే ప్రకృతి. కాలానుగతంగా ఈ ప్రకృతిలో జరిగే మార్పులను వివరిస్తున్నారు.)

తేజస్సుతో కూడిన జలము, పరమాత్మ ఇచ్ఛ వలన, వికారము చెంది, కాలము, మాయ కలవడం వలన, గంధము (వాసన) గుణముగా కల భూమి పుట్టింది. పంచభూతములు, ముందు పుట్టిన దాని గుణముతో వెనక పుట్టినదాని గుణము కలిసి మూడవ భూతమునకు ఆ గుణములు అన్నీ సంక్రమించాయి. .

ఎలాగంటే, ఆకాశ గుణము శబ్దము. ఆకాశముతో వాయువు కలియడం వలన శబ్దము, స్పర్శ అనే గుణములు పుట్టాయి. ఆకాశమునకు, వాయువు తో సంబంధం ఉండటం వలన, తరువాత పుట్టిన తేజస్సుకు శబ్దము, రూపము, స్పర్శ అనే గుణములు వచ్చాయి.

తరువాత జలము పుట్టింది. దానితో అంతకు ముందు పుట్టిన ఆకాశము, వాయువు, తేజస్సు కలిసి ఉండటం వలన, జలములో, వాటి గుణములు అయిన శబ్దము, స్పర్శ, రూపము, దానితో పాటు రసము పుట్టాయి.  తరువాత భూమి పుట్టింది. భూమిలో అంతకు ముందు పుట్టిన ఆకాశము, వాయువు, తేజస్సు, జలము కలిసి ఉన్నాయి. అందుచేత వాటి గుణములు కూడా భూమికి సంక్రమించాయి. వాటితో పాటు భూమికి సహజగుణము అయిన వాసన కూడా పుట్టింది.

కాలము, మాయ కవలడం చేత, మహత్తత్వము, అహంకారము, పంచభూతములు, పంచ తన్మాత్రలు అన్నీ పుట్టాయి. అన్ని ఆ పరమాత్మ అంశలే. పరమాత్మ నుండి ఉద్భవించిన దేవతామూర్తులే.  కాని ఇవన్నీ విడివిడిగాఉన్నాయి. అచేతనంగా ఉన్నాయి. తమ తమ పరిధిల్లో ఉన్నాయి అన్ని సంఘటితం కాలేదు. వాటికి ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా ఉన్నాయి. ఆ కారణం చేత ఈ బ్రహ్మాండ సృష్టి జరగడం లేదు.

ఆ దేవతలన్నీ  పరమాత్మను ఇలా ప్రార్థించాయి. "ఓ దేవా! నీ పాదపద్మములకు నమస్కరిస్తున్నాము. నీ పాదములను ఆశ్రయించిన నీ భక్తులు, యోగులు,  ఈసంసార దు:ఖము నుండి విముక్తి పొందుతారు. ఓ దేవా! జీవులు అందరూ ఆధ్యాత్మికము (శరీర సంబంధమైన బాధలు), ఆధిదైవికము(దైవికంగా అంటే పంచభూతముల వలన కలిగే బాధలు), ఆదిభౌతికము(ప్రకృతి లో ఉండే జీవజాతుల వలన, ప్రకృతి వైపరీత్యములవలనకలిగే బాధలు) అనే మూడు తాపములచేత (వాటినే తాపత్రయములు అంటారు) బాధపడుతూ ఉంటారు. వారికి ఏ మాత్రం శాంతి కలగటం లేదు.

అందువలన, నీపాదములను ఆశ్రయించి శాంతిని పొందుతున్నారు.

ఓ దేవా! ఋషులు, మునులు వేదాధ్యయనము చేసి, నదులలో ఉత్తమమైనది, సమస్త పాపములనుపోగొట్టేది అయిన గంగకు ఉత్పత్తిస్థానము అయిన నీపాదపద్మముల కొరకు అన్వేషిస్తున్నారు. జితేంద్రియులు అయిన నీ భక్తులు, అత్యంత శ్రద్ధతో, భక్తితో తమ పరిశుద్ధమైన మనస్సునందు నీ పాదములను నిలుపుకొని వైరాగ్యముతో కూడిన జ్ఞానమును పొందుతున్నారు. అటువంటి నీ పాదములను మేము ఆశ్రయించాము.
ఈ విశ్వమును సృష్టించి, పోషించి, లయింపజేయవలెనని సంకల్పించిన నిన్ను శరణు వేడుతున్నాము. మాకు అభయము ఇమ్ము.

ఈ లోకములో ఉన్న మానవులు తుచ్ఛములైన తమ దేహములమీద, గృహములమీద, భార్యబిడ్డలమీద మమకారము కలిగి, నేను నాది అనే దురాగ్రహముతో, తమ హృదయములలో అంతర్యామిగా నివసిస్తున్న నీ యొక్క పాదపద్మములను గుర్తించలేకున్నారు. అట్టి పాదపద్మములను మేము సేవిస్తున్నాము.

ఓ దేవా! ఎల్లప్పుడూ విషయవాంఛలతో ఇంద్రియ సుఖములతో నిండిన మనస్సు కల మానవులు, నీ పాదపద్మములను ఆశ్రయించిన భక్తులను చూడలేరు. కొంతమంది నీ భక్తులు నిర్మలమైన మనస్సుతో నిరంతరము నీ కథలను వినడం ద్వారా వైరాగ్యమునుపొంది, నిన్ను చేరుకుంటున్నారు. కొంత మంది జ్ఞానులు, మోక్షమును పొందాలనే కోరికతో, సమాధియోగముల చేత, ప్రకృతిని

జయించి, తుదకు నిన్ను చేరుకుంటున్నారు. కాని అది చాలా కష్టమైన మార్గము. కాని నీ భక్తులు మాత్రము నిన్ను నిరంతరం సేవించడం ద్వారా, నీ కథలను వినడం ద్వారా ఏ మాత్రం శ్రమ లేకుండా నిన్ను చేరుకుంటున్నారు. మోక్షమును పొందుతున్నారు.

ఓ దేవాదిదేవా! లోకములను సృష్టించవలెననే కోరికతో సత్త,రజస్,తమోగుణములలో కలిగిన మార్పు ద్వారా మా అందరినీ సృష్టించావు. మేమందరమూ నీ అధీనంలో ఉన్నాము. కాని ఎవరికి వారుగా పరస్పర విరుద్ధ భావములతో ఉన్నాము. మేమంతా కలిస్తే గానీ సృష్టిసాధ్యం కాదు. మేము ఏమేం పనులుచెయ్యాలో, కర్మ ఫలములను నీకు ఎట్లు సమర్పించాలో, ఈ సృష్టిలో ఉన్న జీవులు అన్నీ ఏ కర్మలు చెయ్యాలో, ఎలా జీవించాలో, ఏమీ తెలియకుండా ఉంది. ఊహకు అందకుండా ఉంది.

ఓ దేవా! మాకు అందరకూ నీవే అధిపతివి. మా పుట్టుకకు నీవే కారణము. నీవు జన్మరహితుడవు అయినను, లోకములో సృష్టి కొనసాగించడానికి, నీ అంశలతో మమ్ములను పుట్టించావు. మేము ఏయే కార్యములు నిర్వహించడానికి పుట్టామో, ఆ యా కార్యములు సక్రమంగా నిర్వహించడానికి మాకు ఆజ్ఞలు ఇవ్వు. నీవు సంకల్పించినకార్యములను నెరవేర్చుటకు తగిన శక్తిని, జ్ఞానమును మాకు ప్రసాదించు." అని వేడుకున్నారు.

శ్రీమద్భాగవతము

పంచమ స్కంధము, ఐదవ అధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## తృతీయస్కంధము
## ఆరవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా చెబుతున్నాడు. "తననుండి పుట్టిన మహత్తత్వము మొదలగు శక్తులు నిద్రావస్థలో ఉన్నాయనీ, అవి ఒకదానితో ఒకటి కలిసి పనిచేయలేకపోతున్నాయనీ, వాటిలో ఉన్న శక్తులు అన్నీ నిర్వీర్యంగా ఉన్నాయనీ అనుకున్నాడు పరమాత్మ. తరువాత పరమాత్మ, కాలమనే శక్తి ద్వారా, ఆ మహత్తత్వము మొదలగు ఇరువది మూడు తత్త్వములలో తన క్రియా శక్తిని ప్రవేశపెట్టాడు.

(మహత్తత్వము, అహంకారము, మనస్సు, పంచభూతములు, పది ఇంద్రియములు, పంచ తన్మాత్రలు, మొత్తము 23).

అప్పుడు 23 తత్త్వములు మేల్కొన్నాయి. వాటిలో వేరు వేరుగా ఉన్న శక్తులను సంఘటితం చేసాడు పరమాత్మ. అప్పుడు ఆ శక్తులు అన్నీ పనిచేయడం మొదలుపెట్టాయి. పరమాత్మచేత ప్రేరేపింపబడిన ఆ 23 తత్త్వములు, క్రియాశక్తితో ప్రభావితం అయ్యాయి.. అవి అన్నీ కలిసి తమ తమ అంశముల ద్వారా విరాట్ పురుషుని దేహమును సృష్టించాయి.

ఆ 23 శక్తులు కలిసి సంఘటితమై ఒక స్థూలదేహంగా రూపొందాయి. ఆయనే హిరణ్మయుడు. అంటే విశ్వశక్తిని తనలో నింపుకున్నవాడు. ఈ విశ్వమంతా ఆ విరాట్ దేహమునందే ఇమిడి

ఉంది.

అప్పుడు ఈ విశ్వం అంతా జలముతో నిండి ఉంది. ఆ జలములో విరాట్పురుషుడు వేయి సంవత్సరములు నివసించాడు. విరాట్పురుషుడు తన లోని జ్ఞాన శక్తి, క్రియాశక్తి, ఆత్మ శక్తిల ద్వారా తనను తాను ఒకటి, పది, మూడుగా విభజించుకున్నాడు.

విరాట్పురుషుడే అందరిలోనూ ఆత్మ స్వరూపుడుగా ఉన్నాడు. కాని అందరిలోనూ ఉన్న ఆత్మ ఒకటే. వేరు వేరు కాదు. ఆ ఆత్మయే పరమాత్మయొక్క అంశ. ఆ పరమాత్మనుండి అన్ని ప్రాణులు వచ్చాయి.

ఒకటి, పది, మూడుగా, విభజించుకున్నాడు అని చెప్పాను కదా. అందులో మొదటిది అంటే ఒకటి..... హృదయము. పరమాత్మ యొక్క చైతన్యము హృదయంలో ప్రవేశించింది. ఆలోచన చేయడం, సంకల్పము చేయడం మొదలయింది. తరువాత పది ప్రాణాలు పుట్టాయి అవే ప్రాణము, అపానము, ఉదానము, సమానము, వ్యానము, నాగము, కూర్మము, కృకలము, దేవదత్తము, ధనంజయము. తరువాత అవే మూడుగా ఏర్పడ్డాయి. అవే అధ్యాత్మము, అధిదైవము, అధిభూతము.

మహత్తత్వము మొదలగు దేవతా శక్తుల ప్రార్థనను మన్నించి, పరమాత్మ అండరూపమును తన తేజస్సుతో పొదిగి అందులో నుండి తన విరాట్ స్వరూపమును వెల్లడి చేసాడు. ఆ విరాట్ స్వరూపములో సర్వదేవతలకు స్థానము ఏర్పరిచాడు. ఏ దేవతకు ఏ

యే స్థానము ఏర్పరిచాడో చెబుతాను విను.

విరాట్పురుషునకు మొట్ట మొదట ముఖం ఏర్పడింది. అగ్నిదేవుడు తన వాక్ ఇంద్రియముతో ఆ ముఖంలోకి ప్రవేశించాడు. వాక్ శక్తి ద్వారా మాట్లాడ వలసిన విషయములు, మాట్లాడటం మొదలయింది.

తరువాత దవడలు ఏర్పడ్డాయి. ఆ దవడలలోనికి వరుణుడు ప్రవేశించాడు. దవడలలో నాలుక పుట్టింది. అది రసాన్ని గ్రహించడం మొదలుపెట్టింది. తరువాత రెండు నాసికా పుటములు తెరుచుకున్నాయి. అందులోకి అశ్వినులు ప్రవేశించారు. అదే ఘ్రాణేంద్రియము. వాటికి వాసనచూచే శక్తి వచ్చింది.

తరువాత విరాట్పురుషునకు రెండు నేత్రములు తెరుచుకున్నాయి. నేత్రములలోకి ఆదిత్యుడు ప్రవేశించాడు. ఆ కళ్లకు అన్ని రూపములను  చూచే శక్తి వచ్చింది. తరువాత ఆ విరాట్పురుషునికి చర్మము ఏర్పడింది. లోకపాలకుడగు వాయువు అందులోకి ప్రవేశించాడు. అప్పుడు చర్మానికి స్పర్శ శక్తి వచ్చింది.

తరువాత విరాట్పురుషునకు రెండు చెవి కన్నములు తెరుచుకున్నాయి. వాటిలో దిక్కులు ప్రవేశించాయి. నాలుగు దిక్కులనుండి వచ్చే శబ్దములను వినే శక్తి ఆ శ్రవణేంద్రియములకు వచ్చింది. అంటే శబ్దజ్ఞానము కలిగింది.

ఇందాక చర్మము వచ్చింది అని చెప్పుకు న్నాము కదా. ఆ చర్మమునకు రంధ్రములు పుట్టాయి. ఆ రంధ్రములలో నుండి రోమములు పుట్టాయి. ఓషధులు ఆ రోమముల నుండి శరీరంలోకి ప్రవేశించాయి. శరీరములో ఉన్న మలినములు చెమట రూపంలో బయటకు రాసాగాయి.

తరువాత విరాట్పురుషునకు జననేంద్రియము ఉ ద్భవించింది. దానికి అధిపతి అయిన ప్రజాపతి శుక్రము (వీర్యము) రూపంలో అందులో ప్రవేశించాడు. ఆ ఇంద్రియము సుఖానికి, పునరుత్పత్తికి స్థానము అయింది.

తరువాత విరాట్పురుషునికి మలద్వారము తెరుచుకుంది. దానికి సూర్యుడు అధిదేవతగా ప్రవేశించాడు. అప్పటి నుండి మలవిసర్జన మొదలయింది.

తరువాత విరాట్పురుషునకు రెండు చేతులు మొలుచుకొచ్చాయి. ఇంద్రుడు ఆ చేతులలో ప్రవేశించాడు. చేతులు పనులుచేయడం మొదలెట్టాయి. చేతుల సాయంతో జీవుడు అన్ని పనులను చేస్తూ జీవితం గడుపుతాడు.

తరువాత విరాట్పురుషునికి పాదములు మొలిచాయి. ఆ పాదములకు విష్ణువు అధిదేవతగా పాదములలోకి ప్రవేశించాడు. అప్పుడు పాదములకు గమన శక్తి అంటే ఎక్కడికంటే అక్కడికి వెళ్లేశక్తి వచ్చింది. పురుషుడు తానుకోరిన చోటికి పోయి తాను కోరిన వస్తువులను పొందసాగాడు.

తరువాత విరాట్పురుషునికి బుద్ధి ప్రకటితమయింది. దానికి అధిదేవతగా వాక్కుకు అధిపతి అయిన  బ్రహ్మ, ఇతరులకు మంచిని బోధించాలి అనే అంశతో,  బుద్ధిలోకి ప్రవేశించాడు.

తరువాత మనస్సు ప్రకటితమయింది. మనస్సుకు అధిదేవతగా చంద్రుడు మనసులోకి ప్రవేశించాడు. జీవుడు మనస్సు ద్వారా అన్ని కార్యములను సంకల్పించడం అనే క్రియను మొదలెట్టాడు.

తరువాత విరాట్పురుషునిలో అహంకారము పుట్టింది. అహంకారమునకు అధిదేవత అయిన రుద్రుడు అహంకారమును ఆవహించాడు. ఆ అహంకారము ద్వారా జీవుడు తాను అనుకొన్నసాధించడం మొదలెట్టాడు.

(ఇప్పటి దాకామీరు విరాట్పురుషునికి అన్ని అవయవములు ఎలా ఉద్భవించాయో తెలుసుకున్నారు. ఇవి అన్నీ మనం మానవులకు, జంతువులకు కూడా అన్వయించుకోవచ్చు. అందుకే ముందు అండము అన్నారు. మానవులకు కూడా ముందు అండము ఏర్పడి, అదిపిండము అయి, మానవ రూపము సంతరించుకొని,  తొమ్మిది నెలలు మావితో చుట్టబెట్టుకొని, జలములో ఉండి, తరువాత బయటకు వస్తున్నాడు. కాని కొన్ని జంతువులు, పక్షిజాతులలో అండము బయటకు వచ్చి వాటినిపొదిగిన తరువాత అందులో నుండి పక్షులు బయటకు వస్తున్నాయి. కాబట్టి విరాట్పురుషుని దగ్గరనుండి, సామాన్య మానవ, జంతు, పక్షి జాతులవరకూ సృష్టికార్యక్రమము ఒక్కటే అని గమనించాలి. అన్ని జీవజాలములు పంచభూతములతో నిండినవే.

చనిపోయిన తరువాత పంచభూతములలో కలిసిపోతాయి.)

అప్పటిదాకా ఏర్పడిన విరాట్‌పురుషుని శరీరంలోకి చైతన్యం ప్రవేశించింది. అన్ని అవయవములను సంఘటితపరిచి సంయుక్తంగా పనిచేయడానికి దోహదపడింది. దానివలన జీవుడు జ్ఞానమును పొందగలిగాడు.

తరువాత ఆ విరాట్పురుషుడి తల నుండి స్వర్గము, రెండు పాదముల నుండి భూమి, నాభి ప్రదేశము నుండి ఆకాశము పుట్టాయి. ఈ భూమి, ఆకాశము, స్వర్గములలో (అంటే భూలోకము, భువర్లోకము, సువర్లోకములలో) సత్వగుణము, రజోగుణము, తమోగుణముల యొక్క మార్పులు, వాటిని అనుసరించి దేవతా గణములు, మానవులు, అసురులు ప్రకటితమయ్యారు.

సత్వగుణము బాగా ఎక్కువగా ఉంటే వారిని దేవతలు అంటారు. వారు నివసించే లోకమును స్వర్గలోకము అంటారు. రజోగుణము ఎక్కుగా ఉంటే వారిని మానవులుఅంటారు. వారు యజ్ఞములు, యాగములు, వ్యవసాయము, వాణిజ్యము మొదలగు కర్మలు చేస్తుంటారు. వారికినివాస స్థానమును భూలోకము అంటారు. తామస గుణము ఎక్కువగా ఉన్న వారు అటు స్వర్గలో కంలో కాకుండా, ఇటు భూలోకంలో కాకుండా, మధ్య ఉన్న అంతరిక్షంలో (భువర్లోకంలో) ఉంటారు. వారు తామసులుగా, రౌద్రస్వభావులుగా ఉంటారు.

ఓ విదురా! విరాట్పురుషుని ముఖము నుండి బ్రాహ్మణులు పుట్టారు. వారికి వేదాధ్యయనము ముఖ్యవ్యాపకము. అందుకే వారు అందరికీ పూజ్యులు, శ్రేష్టులు, గురువులు అయ్యారు. విరాట్పురుషుని బాహువులలో నుండి క్షత్రియులు ఉద్భవించారు. వారి ప్రధాన వృత్తి క్షాత్రము, మిగిలిన మూడు వర్ణముల వారిని అన్నిరకముల ఉపద్రవముల నుండి రక్షించడం వారి బాధ్యత. విరాట్పురుషుని తొడల భాగము నుండి వైశ్యులు జన్మించారు. వారి ప్రధాన వృత్తి వ్యవసాయము, వాణిజ్యము. వీటి ద్వారా మిగిలినమూడు వర్ణముల వారు జీవించడానికి తగిన ఆహార పదార్థములను ఉత్పత్తి చేయడం, వారికి అందుబాటులో ఉంచడం వార బాధ్యత. విరాట్పురుషుని పాదములనుండి శూద్రులు జన్మించారు.వారి ప్రధాన వృత్తి మిగిలిన మూడు వర్ణముల వారికి అన్నిరకముల సేవలు అందించడం. (అంటే సర్వీసెస్. ఆల్ ఇండియా సర్వీసులు, గ్రూప్ 1, 2,3,4 సర్వీసులు అన్నీ దీని కిందికే వస్తాయి అని గ్రహించాలి.).

ఈ నాలుగు వర్ణములవారు, వారి వారికి నిర్దేశింపబడిన వృత్తులు నిర్వర్తిస్తూ, తమయొక్క ఆత్మ శుద్ధికావడానికి, తాము ఏ పరమాత్మ నుండి పుట్టారో ఆ పరమాత్మను, తమ తమ ధర్మములను చక్కగా పాలించడం, అనుష్ఠించడం ద్వారా, పూజిస్తూ ఉంటారు.

(దీనిని బట్టి చూస్తే మొదట్లో అన్ని వర్ణముల వారు భగవంతుని పూజించడానికి అర్హులు అని అర్థం అవుతూ ఉంది.తరువాతి కాలంలోనే మానవులలో స్వార్థం పెరిగి, తాము గొప్ప అనే అహంకారము ఆవరించి, కొన్ని వర్ణముల వారు దేవుడిని పూజించడానిక అర్హులు కారు, వేదములు చదవడానికి

యజ్ఞయాగములు చేయడానికి అర్హులుకారు అని ఆంక్షలు పెట్టి, కులాలమధ్య అంతరాలు లేవదీసారు. కులాల మధ్య చిచ్చురేపారు. కులం పుట్టుకతో రాదనీ, వారి గుణములను బట్టి, చేసే కర్మలను బట్టి నిర్ణయింపబడుతుందనీ తెలిస్తే ఇన్ని అపోహలు ఉండవు.)

ఓ విదురా! కాలము, కర్మ, స్వభావము యొక్క శక్తులతో నిండిన భగవానునియొక్క మాయాశక్తితో పుట్టిన విరాట్ రూపమును సంపూర్ణముగా వర్ణించడానికి ఎవరికీ శక్తి లేదు. కాని నా బుద్ధికి తోచినది, నేను విన్నది, నేను అర్థం చేసుకున్నది నీకు వివరిస్తాను.

ఓ విదురా! ఇప్పటి దాకా, భగవంతుని గురించి కాక వేరే విషయములను వినడం, చదవడం, మాట్లాడటం ద్వారా నా వాక్కులు మలినం అయ్యాయి. ఇప్పుడు నీకు భగవంతుని గురించిన విషయములను చెప్పడం ద్వారా, నా వాక్కును పవిత్రం చేసుకుంటున్నాను. ఆ పరమాత్మ ను గురించి వినడం, తెలుసుకోవడమే మానవులకు అధికమైన శ్రేయస్సును కలిగిస్తుంది.

భగవంతుని గుణములను కీర్తించడమే నోరు ఉన్నదానికి ఫలితం. అలాగే, విద్వాంసులనుండి భాగవత కథలను వినడం ద్వారా చెవులు పునీతమవుతాయి. చెవులు ఉన్నందుకు వాటికి సార్థకత కలుగుతుంది.

విదురా! బ్రహ్మ ఆ పరమాత్మ గురించి వేయి సంవత్సరములు తపస్సు చేసినను , తనకు ఉన్న బుద్ధితో ఆలోచించిననూ, ఆ పరమాత్మ గురించి పూర్తిగా తెలుసుకోలేక పోయాడు. ఇంక మానవ మాత్రులము

మనమెంత? అలాగే భగవంతునిచే కల్పితమైన యోగమాయ గురించి ఆ భగవంతునికే పూర్తిగా తెలియదు అంటే ఇంకసామాన్య మానవులమైన మనము ఆ మాయ గురించి ఎలా తెలుసుకోగలము.

అంతే కాదు ఆ పరమాత్మ గురించి బ్రహ్మ, రుద్రుడు కూడా పూర్తిగా తెలుసుకోలేకపోయారు. వారే కాదు ఇంద్రియములకు అధిష్ఠాన దేవతలు కూడా ఆ పరమాత్మగురించి తెలుసుకోవడంలో విఫలమయ్యారు. అటువంటి పరమాత్మకు నమస్కారము.

శ్రీమద్భాగవతము
తృతీయస్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
తృతీయస్కంధము
ఏడవ అధ్యాయము

ఆ విధముగా పలుకుతున్న మైత్రేయునితో విదురుడు ఇలా అన్నాడు. "మహాత్మా! పరమాత్ముడు చిన్మయస్వరూపుడు, విశ్వచైతన్యమూర్తి, ఏ వికారములు లేనివాడు, ఏ గుణములు అంటని వాడు కదా, మరి ఆ పరమాత్మ తన అవతారములలో మూడు గుణములలో ఎలా ప్రవర్తించాడు, ఇన్ని క్రియలు, ఇన్ని లీలలు ఎలా చేయగలిగాడు. సాధారణంగా బాలురు ఆడటాడుకోడానికి ఇష్టపడతారు. ఇతర బాలురతో ఆటలు ఆడుకోడానికి ఇష్టపడతారు.

బాలుడు ఇతర బాలురతో ఆటలాడుకోడానికి ఉత్సాహం చూపిస్తాడు, ప్రయత్నిస్తాడు. కాని భగవానుడు అలా కాదు కదా. ఆయన స్వతహాగా తృప్తిపొందినవాడు. ఆయన చేయవలసిన కార్యము ఏదీ లేదు. ఆయనకు ఎటువంటి సంగములు, బంధములు, కోరికలు లేవు. అటువంటప్పుడు పరమాత్మ ఈ సృష్టి ఎందుకు చేసినట్టు? ఎందుకు లయం చేస్తున్నట్టు. ఈ సకల జీవ జాలముతో ఎందుకు ఆటలాడుకుంటున్నట్టు.

భగవంతుడు తన మాయచేత ఈ జగత్తును సృష్టించాడు. పాలిస్తున్నాడు. లయం చేస్తున్నాడు. ఇదంతా ఒక క్రీడగా చేస్తున్నాడు. ఆ పరమాత్మ అక్కడ ఉన్నాడు ఇక్కడ లేడు అని లేదు. ఈ అనంత విశ్వం అంతా నిండి ఉన్నాడు. ఆయనకు కాలం అనేది లేదు. ఎందుకంటే ఆయనే కాలస్వరూపుడు. ఆయనకు బాల్యావస్థ, యౌవనము, వృద్ధాప్యము అనేవి లేవు. అసలు ఆయనకు రూపమే లేదు. ఆయనకు ఎటువంటి స్వభావములు లేవు. ఆయన జ్ఞానము అనంతము. అది ఎన్నటికీ నశించదు.

అట్టి పరమాత్మ ఈ అవిద్య, మాయలో పడి ఎలా ప్రవర్తించాడు. ఎందుకు అలా చేసాడు? ఆ పరమాత్మ సకలజీవుల దేహముల యందు ఆత్మస్వరూపుడై వెలుగుతున్నాడు అని చెప్పారుకదా. మరి సాక్షాత్తు భగవంతుడే మన దేహంలో ఉన్నప్పుడు, ఈ బాధలు, ఈ దు:ఖాలు, ఎందుకు కలుగుతున్నాయి. మానవులు అనునిత్యము ఎందుకు కష్టాలుపడుతున్నారు. దానికి కారణం ఏమిటి? మనలో ఉన్న పరమాత్మ తలచుకుంటే ఈ బాధలు అన్ని చిటికలో తొలగించగలడు కదా! మైత్రేయా! ఏదో నా అజ్ఞానముతో ఇలా అడుగుతున్నాను. ఇవన్నీ

తలచుకుంటే మనసులో బాధగా ఉంది. నా మనస్సులో కలిగిన ఈ సందేహములను తొలగించు. నన్ను కృతార్థుడిని చెయ్యి." అని అడిగాడు విదురుడు.

ఈ విధంగా విదురుడు అడుగగా, మైత్రేయుడు ఈ విధంగా విదురుడుకి సమాధానం చెప్పాడు. "విదురా! నీవు చెప్పినది సత్యమే. ఏ బంధనములు లేని పరిశుద్ధుడైన జీవునికి ఈ బంధనములు, కష్టములు, సుఖములు, దు:ఖములు అన్నీ కలగడం విరుద్ధమే. కానీ వాస్తవంగా చూస్తే ఇదంతా పరమాత్మ మాయాశక్తి వలననే కలుగుతున్నాయి కానీ వేరుకాదు. ఈ సుఖము, దు:ఖము, కష్టములు అన్నీ మాయాశక్తి నుండి పుట్టినవే.

మానవుడు సుఖం అనుకుంటే సుఖం, దు:ఖం అనుకుంటే దు:ఖం. రెండింటినీ సమంగా చూస్తే ఏ బంధము లేదు. ఒకడికి ఒక స్వప్నము వచ్చింది. అందులో వాడి తలను ఎవరో నరికేసారు. అంతలో మెలుకువ వచ్చింది. చూచుకుంటే వాడి తల బాగానే ఉంది. అంటే నిజంగా ఏమీ జరగకపోయినా, స్వప్నంలో  జరిగినట్టు ఎలా భ్రమపడుతున్నామో అలాగే ఈ సుఖదు:ఖాలు ఏమీ లేకపోయినా, అవి మనకు కలుగుతున్నాయి అని భ్రమపడుతుంటాము. నిజానికి ఏ బంధనాలు లేకపోయినా, ఉన్నట్టు అనుకుంటూ అనుభవిస్తుంటాము. అదే అవిద్య, మాయ.

ఒక జలాశయములో నీరు నిశ్చలంగా ఉంది. అందులో చంద్రుడు కనపడుతున్నాడు. ఆకాశంలో నిశ్చలంగా ఉన్నట్టే నీటిలో

కూడా నిశ్చలంగా కనపడుతున్నావు. నీవు ఒక రాయిని ఆ జలాశయంలోకి విసిరావు. నీరు కదిలింది. నీటితోపాటు చంద్రుడు కూడా అటు ఇటు కదులుతున్నాడు. నిజంగా చంద్రుడు కదలడం లేదు. మనం చేసిన పని వలన కదులుతున్నట్టు కనిపిస్తున్నాడు. అలాగే మనం చేసిన పనుల వలన సుఖము దు:ఖము, కష్టము నష్టము కలుగుతున్నాయి కానీ నిజంగా అవి లేవు.

ఆత్మకు శోకము, మోహము, కష్టము, సుఖము ఇవన్నీ లేవు. కేవలము దేహమునందు అభిమానముతోనే ఇవన్నీ జీవాత్మకు కలుగుతున్నట్టు అనిపిస్తుంది. ఇవన్నీ పోవాలంటే ఒకటే మార్గం ఉంది. అదే నిష్కామ కర్మ. ఏ పని చేసినా దాని మీద కోరిక లేకుండా చెయ్యడం. చేసిన పనికి ఫలితం ఆశించక పోవడం. అప్పుడు సుఖము దు:ఖము రెండు కలగవు. లేకపోతే మనం చేసిన కర్మల ఫలితంగా సుఖము దాని వెంట దు:ఖము, ఒకదాని వెంట ఒకటి వస్తూనే ఉంటాయి.

మరొక మార్గం ఏమిటంటే భగవంతుని మీద అపారమైన భక్తి కలిగి ఉండటం, మనం చేసే ప్రతి కర్మను, దాని ఫలితాన్ని ఆ పరమాత్మకు అర్పించడం. అప్పుడు మనం చేసే కర్మల ఫలితాలు మనలను సుఖదు:ఖాల రూపంలో అంటవు. మనలో ఉన్న మాయ, అవిద్య క్రమక్రమంగా అదృశ్యమై పోతుంది. జ్ఞానం కలుగుతుంది. దీనికంతా ఆ పరమాత్ముని దయ, కృప ఉండాలి. అప్పుడు మానవులకు ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము కలుగుతుంది. నిశ్చలమైన భావంతో ఉంటాడు. ఈ భ్రమలన్నీ పూర్తిగా నశించిపోతాయి.

దానికి తోడు అనునిత్యమూ శ్రీకృష్ణుని గుణగణములను కీర్తిస్తూ ఉంటే, ఆయన పాదములను మనసులో నిలుపుకుంటే, ఈ క్లేశములు ఏవీ దగ్గరకు చేరవు. ఎప్పుడూ బ్రహ్మానందంలో మునిగితేలుతుంటాడ మానవుడు." అని చెప్పాడు మైత్రేయుడు.

మైత్రేయుని మాటలతో బ్రహ్మానందభరితుడయ్యావు విదురుడు. మైత్రేయునితో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! నీవు చెప్పిన మాటలతో నాలో ఉన్న సందేహములు అన్నీ తొలగిపోయాయి. ఇప్పుడు నాకు భగవంతుని స్వతంత్రత, జీవుని పరతంత్రత పూర్తిగా అర్థం అయ్యాయి. ఈ జీవుని సంసార బంధనములకు కారణము అవిద్య, మాయ అని చెప్పారు. ఈ మానవుల క్లేశములకు అన్నింటికీ ఆ భగవానుని మాయ తప్ప వేరు కాదు.

ఓ మహర్షీ! నాకు తెలిసీ  ఈ లోకంలో సుఖాన్ని పొందే వాళ్లు ఇద్దరే. ఒకడు... ఏమీ తెలియని వాడు, కేవలం దేహసుఖము, ప్రపంచ సుఖము కావాలని కోరుకొనేవాడు. అలాంటి వాడు తాను కోరుకున్న సుఖాలను అనుభవిస్తాడు. మరొకడు అన్నీ తెలిసిన వాడు, జ్ఞాని, పరమాత్మ సాక్షాత్కారం పొందిన వాడు. పరమసుఖాన్ని అనుభవిస్తాడు. లోకంలో  వీరు ఇద్దరే సుఖపడు తున్నారు.

అలా కాకుండా, ప్రతి దానినీ సందేహిస్తూ, సంశయిస్తూ, దేనినీ నమ్మకుండా బతికేవాడికి, అసలు సుఖం అనేది లేదు. వాడికి అన్నీ కష్టాలే. అన్నీక్లేశాలే. అంటే తెలిసీ తెలియని వాడు. వాడికి ఏమీ తెలియదు. తనకు అంతా తెలుసు అనుకుంటూ ఉంటాడు. ప్రతిదానినీ విమర్శిస్తుంటాడు. దేనినీ నమ్మడు. ప్రతిదీ అనుమానం, సందేహం.

వాడికి ఈ జన్మలో సుఖం లభించదు.

ఓ మైత్రేయ మహర్షీ! మన కళ్లముందు ఈ ప్రకృతి కనిపిస్తున్నా, నిజానికి ఇది వేరుగా లేదు. ఇదికూడా ఆ పరమాత్మ స్వరూపమే. నీ బోధనల ద్వారానే ఈ సత్యము నేను తెలుసుకోగలిగాను. నీ వంటి భగవద్భక్తులను సేవించడం ద్వారా, భగవంతుని యందు అచంచలమైన భక్తి కలుగుతుంది. దాని ద్వారా ఈ సంసార బంధనములు తొలగిపోయి, మోక్షం సిద్ధిస్తుంది.

కానీ, నీ వంటి భగవద్భక్తులు మా కోసం ఈ లోకంలో తిరుగుతున్నా, కొంత మంది అల్పులు మిమ్ములను గుర్తించలేరు. వారికి మీ పాదసేవ చేసుకొనే భాగ్యము కలుగదు. కాని భగవంతుని ఎడల భక్తి కలిగిన వారు మాత్రం ఎల్లప్పుడూ భగవంతుని ధ్యానిస్తూ, మీలాంటి భగవద్భక్తుల సేవ చేసుకుంటూ, తరిస్తూ ఉంటారు.

ఓ మైత్రేయమహర్షీ! మొదట పరమాత్మ, మహత్తత్వము మొదలగు శక్తులను సృష్టించి వాటి ఆధారంగా విరాట్‌శరీరమును ప్రకటించి, దానిలో తాను ప్రవేశించాడు. ఆ విరాట్‌శరీరమునే పండితులు ఆది పురుషుడు అని పిలుస్తారు. ఆ విరాట్ పురుషుడే వేలకొలది తలలతో, చేతులతో, కాళ్లతో ఉన్నవాడిలా కీర్తింపబడుతుంటాడు. ఆ విరాట్ పురుషుని యందే అన్నిలోకములు ఇమిడి ఉన్నాయి. ఆ విరాట్ పురుషుని ఇంద్రియముల గురించి వాటి అధిష్టాన దేవతల గురించి, పది రకములైన ప్రాణముల గురించి, మానవులలో కల్పింపబడిన వర్ణముల గురించి,వారి వృత్తులగురించి, ఇంకా ఇతర విషయముల గురించి నాకు వివరంగా చెప్పావు. ఇప్పుడు

ఆ పరమాత్మ విభూతుల గురించి నాకు చెప్పండి. ఎందుకంటే ఆ పరమాత్మ విభూతుల నుండి ఈ సమస్త ప్రజలు ఉద్భవించారు. అలా పుట్టిన ప్రజలు, వారి పుత్రులు, పౌత్రులు, ప్రపౌత్రులు, దౌహిత్రులు, బంధువులు స్నేహితులు.వీరందరితో ఈ విశ్వం అంతా నిండిపోయింది. ఈ ప్రజలంతా ఎలా పుట్టారు? ఎవరు సృష్టించారు? మొదట బ్రహ్మ ఎవరిని సృష్టించాడు? ఏయే ప్రజాపతులను, సర్గలను, వాటిలో భేదములను, మన్వంతరములకు అధిపతులను సృష్టించాడు? కాబట్టి నాకు మనువులను, మన్వంతరములను, వారి వంశములను, వారి చరిత్రలను వివరించండి.

ఓ మైత్రేయా! ఈ లోకములు ఎన్ని? పైన ఎన్నిలోకాలు ఉన్నాయి. కింద ఎన్నిలోకాలు ఉన్నాయి.వాటి పరిమాణము ఎంత! ఇంకా భూలోకము భువర్లోకము, సువర్లోకములో పుట్టిన దేవతలు, మనుషులు, జంతువులు, పాకే జంతువులు, పక్షులు, నేరుగా పుట్టినవారు, గుడ్డునుండి పుట్టినవారు, భూమి నుండి పుట్టిన వృక్షములు మొక్కలు, ఇంకా చెమటనుండి పుట్టిన జంతువులు వాటి గురించి వివరించండి. ఇంకా, బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు వారు చేసే పనులు, వారి లీలల గురించి తెలియజేయండి.

మానవుల యొక్క రూపములు గుణములు, స్వభావములు, వారు చేసే వృత్తులను బట్టి వర్ణ వ్యవస్థ ఎలా ఏర్పడింది, నాలుగు రకములైన ఆశ్రమములు ఎలా ఏర్పడ్డాయి, మహాఋషులు ఎలా జన్మించారు, వారుచేసిన పనులు, వేదములు, వాటి విభాగములు వీటి గురించి వివరంగా చెప్పండి. యజ్ఞములు, అవి చేయు

విధానములు, యోగమార్గములు, జ్ఞానమార్గములు, వాటికి ఉపకరించే సాంఖ్యయోగము మార్గము, తంత్రశాస్త్రము, వాటి గురించి తెలియజేయండి. ఇవే కాకుండా పాషండులు, వారి ప్రవృత్తులు, నిమ్నజాతులు(తక్కువ జాతివారు), వారి స్థితి గతులు, జీవులు వారి వారి గుణములవలన, వారు చేసే కర్మల వలన కలిగిన విభజనలు, ధర్మము, అర్థము,కామము,మోక్షము అనే పురుషార్థముల గురించి, ఆ పురుషార్థములను, వాటిని పరస్పర విరోధము లేకుండా ఆచరించే ఉపాయముల గురించి, వ్యవసాయ శాస్త్రము,(అగ్రికల్చర్), వాణిజ్య శాస్త్రము, (కామర్సు), దండనీతి (పీనల్ కోడ్), అర్థశాస్త్రము (ఇకనామిక్సు, పాటిటిక్స్), వేదములు వాటిలో చెప్పబడిన విధుల గురించి నాకు వివరంగా తెలియజేయండి.

ఓ మైత్రేయ మహర్షీ! నాకు ఇంకా ఎన్నో విషయములు తెలుసుకోవాలని ఉంది. శ్రాద్ధవిధులను ఎలానిర్వహిస్తారు, పితృకర్మలను ఎలా చేస్తారు, గ్రహములు, నక్షత్రములు, వాటి చలనములు, కాల చక్రము మొదలగు విషయములను నాకు తెలియజేయండి. ఇంకా మానవులు చేయవలసిన దానములు, ధర్మములు, తపస్సు, యాగములు, యజ్ఞములు, మొదలగు కర్మ కాండల గురించి, వాటివలన కలుగుఫలముల గురించి, స్వదేశములో కాకుండా విదేశములలో ఉన్న మానవులు చేయదగినకర్మల గురించి నాకు తెలియజేయండి.

ఓ మైత్రేయ మహర్షీ! కృష్ణపరమాత్మ ఏయే పూజలతో, వ్రతములతో తృప్తిచెందుతాడో, ఎవరికి ప్రసన్నుడవుతాడో నాకు తెలియజేయండి. ఓ మైత్రేయమహర్షీ! ఇవన్నీ నేను అడగకపోయినా

మీరు మీ శిష్యులకు,మీ కుమారులకు చెబుతారు. కానీ ఉండబట్టలేక అడిగాను. కాబట్టి నాకు చెప్పండి.

మీరు మహత్తత్వము మొదలగు శక్తు గురించి చెప్పారు కదా! వాటికి ఎప్పుడు ప్రళయమువస్తుంది. ఆ ప్రళయములు ఎన్ని విధములు? ప్రళయకాలంలో, అనంతమైన సాగర జలాలలో శయనించి ఉన్న ఆ పరమాత్మను ఎవరుసేవిస్తారు? ఆయనలో ఏమేమి, ఎవరెవరు లీనమైపోతారు. ఈ విషయాలన్నీ వివరించండి. ఇంకా జీవుల తత్త్వమును, పరమాత్మ తత్త్వమును, జ్ఞానమును, గురుశిష్య బంధమును, దాని ప్రయోజనమును వివరించండి.

ఓ మహర్షీ! జ్ఞానము సంపాదించడానికి ఏయేమార్గములను మహర్షులు చెప్పారు. గురువు లేకుండా జ్ఞానము సంపాదించడం సాధ్యమా! మానవులకు గురువులు లభించడం కష్టం కదా! మరి గురువు లేకుండా జ్ఞానము, భక్తి, వైరాగ్యము స్వయంగా ఎలా కలుగుతాయి? ఓ మైత్రేయ మహర్షీ! నేను అజ్ఞానిని. నాకు ఏమీతెలియదు. నా ఆలోచనా శక్తి నశించింది. నీవు నాకు మిత్రుడవు. అందుకని నేను నిన్ను ఇలా అడుగుతున్నాను.

నేను శ్రీకృష్ణపరమాత్మ యొక్క లీలావిశేషములకు సంబంధించిన జ్ఞానమును పొంద దలచి అడిగిన ప్రశ్నలకు తగినసమాధానాలు ఇవ్వవలసినదిగా ప్రార్థిస్తున్నాను. వేదములు చదవడం వల్ల గానీ, యజ్ఞ, యాగములు చేయడం వలన గానీ, తపస్సు చేయడం వలనగానీ, దానధర్మములు చేయడం వలన గానీ

పొందే పుణ్యము, తత్వోపదేశము ద్వారా జీవునకు కలిగే పుణ్యంలో ఒక వంతు కూడాఉండదు." అని ప్రార్థించాడు విదురుడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! విదురుడు ఆ ప్రకారంగా ప్రశ్నల మీద ప్రశ్నలు వేయగా, మైత్రేయుడు ఆ ప్రశ్నలకు అన్నిటికీ తగినసమాధానాలు ఇచ్చాడు."అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు భాగవత కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము
ఎనిమిదవ అధ్యాయము.

మైత్రేయుడు విదురుని చూచి ఇలా అన్నాడు. "విదురా! నీవు పవిత్రమైన పూరు వంశములో జన్మించావు. నీవుపూర్వ జన్మలో సాక్షాత్తు యమధర్మరాజువు. నీ వు పుట్టడం వలన పూరు వంశము పవిత్రమయింది. నీవు సతతము శ్రీకృష్ణుని స్మరించుచూ ఆయననూ కీర్తిస్తూ ఉన్నావు. ఈ భాగవత పురాణమును వినడానికి నీవు తగిన వాడవు. అందుకే నీకు భాగవతమును చెప్పడానికి సంకల్పించాను. చిన్న చిన్న సుఖాలకోసరం పెద్ద పెద్ద దు:ఖాలను కొని తెచ్చుకొనే ఈ మానవుల కోసరం, వారి దు:ఖమును పోగొట్టడానికి ఈ భాగవతము చెప్పడానికి సంకల్పించాను.

ఈ భాగవతమును పూర్వము సంకర్షణుడు సనత్కుమారుడు మొదలగు ఋషులకు చెప్పాడు. అది ఎలా జరిగిందంటే, ఒక సారి సనత్కుమారుడు మొదలగు మహాఋషులు పాతాళ లోకములో ఉన్నసంకర్షణుని చూడటానికి వెళ్లారు. సంకర్షణుని నుండి వాసుదేవ తత్త్వమును తెలుసుకోడానికి వెళ్లారు. సంకర్షణునికి నమస్కరించి తమకు వాసుదేవ తత్త్వమును బోధించమని కోరారు.

అప్పడుసంకర్షణుడు (ఆదిశేషువు, అనంతుడు అని కూడా అంటారు) తనకు ఆశ్రయము అయినదీ, పండితులచే కీర్తింపబడినదీ, వాసుదేవము అనే పేరుగలదీ అయిన ఆనందమయ రూపమును ధ్యాన మార్గము ద్వారా అనుభవిస్తూ పూజిస్తున్నాడు. అంతర్ముఖుడుగా ఉన్న సంకర్షణుడు, సనత్కుమారుడు మొదలగు ఋషులు వచ్చారని గ్రహించి, తన కళ్లు కొద్దిగా తెరిచాడు. సనత్కుమారుడు మొదలగు మహామునులు వేయిపడగలతో వాటి మీద ఉన్న మణులతో ప్రకాశిస్తున్న సంకర్షణుడికి నమస్కరించి తమకు భాగవత పురాణమును బోధించమని అడిగారు. వారికోరిక మేరకు సంకర్షణుడు సనత్కుమారుడు మొదలగు ఋషులకు భాగవతమును బోధించాడు.

తానుసంకర్షణుడి నుండి విన్న భాగవతమును సనత్కుమారుడు సాంఖ్యాయన మునికి బోధంచాడు. సాంఖ్యాయనముని భాగవతమును పరాశరునికి బోధించాడు. ఆ పరాశరుడు నాకు గురువు. నాగురువుగారు అయినపరాశరుడు

భాగవతమును నాకు బోధించాడు. నీవు భాగవతమును వినడానికి అత్యంత శ్రద్ధ, భక్తి చూపిస్తున్నావు. అందువలన నా గురువుగారి వలన వినిన భాగవతమును నేను నీకు చెబుతాను. శ్రద్ధగా విను.

కల్పాంతంలో ఈ విశ్వము అంతా జలమయం అయింది. అప్పుడు పరమాత్మ తన స్వస్వరూపముతో శేషశయ్య మీద శయనించి కళ్లు మూసుకొని ఆత్మానందాన్ని అనుభవిస్తున్నాడు.  ఆ సమయంలో ఈ విశ్వం అంతా సూక్ష్మరూపంలో పరమాత్మ శరీరంలో ఇమిడిపోయి ఉంది. ఆ ప్రకారంగా పరమాత్మ అనంతమైన జలములలో వేయి మహాయుగములు శయనించి ఉన్నాడు.

మరలా సృష్టి చేయవలసినసమయం వచ్చింది అని తెలుసుకున్నాడు పరమాత్మ. అప్పుడు పరమాత్మ కాలశక్తిని ప్రేరేపించాడు. కాలం మొదలయింది. ఆ కాలశక్తి పరమాత్మను, జీవులను కర్మలు చేయడానికి  ప్రేరేపించమని ప్రార్థించింది. అప్పుడు పరమాత్మ తనలో సూక్ష్మరూపంలో ఉన్న పదునాలుగు లోకములను చూచాడు. వాటి మీద పరమాత్మ దృష్టి ప్రసరించింది. అప్పుడు కాలశక్తి రజోగుణమును ప్రేరేపించింది. పరమాత్మలో ఉన్న సూక్ష్మరూపంలో ఉన్న లోకములు రజోగుణముతో ప్రభావితమై పరమాత్మ నాభి నుండి బయటకు వచ్చాయి.

సూక్ష్మరూపములో ఉన్న 14 లోకములు అనేక రేకులతో ఉన్న  పెద్దపద్మము ఆకారములో  ఆవిర్భవించాయి. ఆ పద్మము సూర్యుని మాదిరి ప్రకాశిస్తూ ఉంది. ఆ పద్మములోకి ముందు విష్ణువు యొక్క స్థితి శక్తి  ప్రవేశించింది. తరువాత ఆ పద్మము మధ్యలో నుండి

బ్రహ్మ ఉద్భవించాడు. అందుకే ఆయనను స్వయంభువు(తనకు తానుగా పుట్టినవాడు) అన్నారు.

పుట్టగానే బ్రహ్మ ఆ మహా పద్మము మధ్యలో కూర్చున్నాడు. చుట్టు చూచాడు ఏమీ కనపడలేదు. అన్ని లోకాలు సూక్ష్మరూపంలో ఆ పద్మంలో ఉన్నాయి. అందువలన బ్రహ్మకు ఏమీ కనపడలేదు. తన ముఖమును నాలుగు వైపులా తిప్పిచూడసాగాడు. అందుకే బ్రహ్మకు నాలుగు దిక్కులా నాలుగు ముఖములు ఉన్నాయి అని అంటారు. అప్పుడు వాయువు బలంగా వీస్తూ ఉంది. ఆవాయువు వేగానికి నీటిలో అలలు లేస్తున్నాయి. ఆ పద్మం కూడా ఆ జలం మీద తేలియాడుతూ ఉంది. దానిలో బ్రహ్మ కూర్చుని ఉన్నాడు. ఆయనకు తాను ఎవరో ఆ కమలము ఏమిటో దాని రహస్యము ఏమిటో తెలుసుకోలేక పోయాడు.

"అసలు నేను ఎవరు? ఈ పద్మం మధ్యలో ఎందుకు కూర్చుని ఉన్నాను? ఈ పద్మముఈ జలములో నుండి ఎలా పుట్టింది. ఏ ఆధారమూ లేకుండా ఈ జలములో ఎలా నిలబడి ఉంది? దీనికి ఆధారంగా ఏదో వస్తువు కింద ఉండి ఉండాలి." అని అనుకున్నాడు బ్రహ్మ. ఇలా ఆలోచించిన బ్రహ్మ ఆ పద్మము మధ్యలో నుండి, ఆ పద్మము యొక్క కాడలోకి ప్రవేశించాడు. అక్కడ అంతా చీకటి ఏమీ కనపడటం లేదు. అలా పోగా పోగా పరమాత్మ నాభి వద్దకు చేరుకున్నాడు. అక్కడ కూడా జలం తప్ప ఏమీ కనపడలేదు. ఆ కాడకు ఆధారం కూడా ఏమీ కనపడలేదు. అందుకని మరలా వెనక్కు తిరిగిపద్మం మధ్యలోకి వచ్చాడు.

# తృతీయ స్కంధము

బ్రహ్మదేవుడు ఇలా వెతకడంలో చాలా కాలం గడిచి పోయింది. బ్రహ్మ ఆ కమలం మధ్యలో సమాధిలో కూర్చున్నాడు. అంతర్ముఖుడు అయ్యాడు. పరమాత్మను ప్రార్థించడం మొదలు పెట్టాడు. ఆ ప్రకారంగా బ్రహ్మ పరమాత్మను ఒక పూర్ణాయువులో సమానమైన కాలము పాటు ప్రార్థించాడు. అప్పుడు బ్రహ్మకు పరమాత్మ గురించిన జ్ఞానం కలిగింది. బ్రహ్మ హృదయంలో పరమాత్మ సాక్షాత్కరించాడు.

బ్రహ్మ హృదయంలో పరమాత్మ ఈ రూపంతో సాక్షాత్కరించాడు. అనంత జలములలో, ఆదిశేషువు శరీరము మీదపడుకొని ఉన్నాడు. ఆదిశేషువు వేయి పడగలు గొడుగు మాదిరి ఉన్నాయి. ఆ వేయిపడగల మీద ఉన్న రత్నములు మణుల కాంతితో ఆ ప్రదేశములో చీకట్లు తొలగి పోయాయి. ఆ ప్రాంతం అంతా దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంది. పరమాత్మ నీలమేఘ వర్ణంతో ఉన్నాడు. పచ్చటి వస్త్రములను ధరించి ఉన్నాడు.

పరమాత్మ తలమీద మణిమయమైన స్వర్ణ కిరీటము ఉంది. మెడలో వనమాల ఉంది. చేతులు కాళ్లు బలిష్టంగా ఉన్నాయి. ఆ పరమాత్మ దేహమునకు ఆది అంతము కనపడటం లేదు. మూడులోకములలో వ్యాపించి ఉంది. పరమాత్మ కాళ్ల వేళ్లకు ఉన్న గోళ్ల కాంతి పది చంద్రులవలె ప్రకాశాలు వెదజల్లుతూ ఉంది. పరమాత్మ ముఖంలో చిరునవ్వు తాండవిస్తూ ఉంది. ఆయన పెదాలు దొండపండు మాదిరి, ఆయన ముక్కు అతి సుందరంగానూ, శోభిల్లుతున్నాయి. ఆయన వక్షము మీద శ్రీవత్సము అనే మచ్చ ఉంది. ఈ ఆకారంతో ఉన్న విరాట్పురుషుడు మంచి గంధపు చెట్టు మాదిరి బ్రహ్మ హృదయంలో దర్శనం ఇచ్చాడు.

ఆ విరాట్పురుషుని రూపము పెద్ద పర్వతము మాదిరి ఉంది. పర్వతము అనేక జీవులకు ఆశ్రయం అయినట్టు ఆ విరాట్పురుషుడు ఈ అనంత విశ్వంలో ఉన్నసకల ప్రాణులకు ఆశ్రయముఅయి ఉన్నాడు. ఆయన గుండెల మీద కౌస్తుభము అనే మణి మెరుస్తూ ఉంది. ఆయన కంఠసీమను వనమాల చుట్టుకొని ఉంది. ఆ విరాట్ స్వరూపాన్ని సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని మొదలగు వారు కూడా తెలుసుకోలేకపోయారు. ఆయన చేతులలో శంఖ,చక్ర,గదలు మెరుస్తున్నాయి.

బ్రహ్మకు ఏమీ అర్థం కాలేదు. కళ్లు తెరిచి చూచాడు. బయట పరమాత్మ నాభిలో నుండి పుట్టిన పద్మము, తాను, చుట్టు జలము, వాయువు, ఆకాశము తప్ప వేరే ఏమీ కనపడలేదు. రజోగుణముతో కూడిన బ్రహ్మ సృష్టిచేయడానికిసంకల్పించాడు కానీ పైన చెప్పిన ఐదు తత్వాలు తప్ప వేరే ఏమీ కనపడలేదు. బ్రహ్మకు ఏమి చేయాలో తోచలేదు. ఎలాగైనా సృష్టి ప్రారంభించాలనే ఉత్సాహంతో బ్రహ్మపరమాత్మయందు మనస్సు నిలిపాడు. ఆ పరమాత్మను గురించి కీర్తించడం మొదలుపెట్టాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## తృతీయ స్కంధము

## తొమ్మిదవ అధ్యాయము.

పరమేశ్వరుని గురించి బ్రహ్మ ఈ విధంగా ప్రార్థిస్తున్నాడు. "ఓ దేవా! ఎంతో కాలము తపస్సు చేసి నేను నిన్ను తెలుసుకోగలిగాను. కాని సామాన్య మానవులు నిన్నుఎలా తెలుసుకోగలరు? వారు ఎంతో దురదృష్టవంతులు కాబట్టి నీ గురించి తెలుసుకోలేకపోయారు. నీవు ఒక్కడివే ఉన్నావు. నీవు తప్ప మరొకటి ఈ విశ్వంలో లేదు. అంతటా నీవేనిండి ఉన్నావు. ఒకవేళ నీమాదిరి మరొక వస్తువు ఉన్నది అని అనుకున్నాకూడా, అది నీ వలె సత్యమైనది, నిత్యమైనది కాదు. నీవు ఒకటిగా ఉన్నను ఈ జగత్తు అంతా ఎన్నోరూపములతోనూ, పేర్లతోనూ వెల్లడి అయ్యావు. ఈ విశ్వం అంతా నీవు వెల్లడి కావడం కూడా నీ మాయాశక్తి వలననే జరిగింది.

ఓ దేవా! నీ వలన పొందిన జ్ఞానముతో నాలో ఉన్న సందేహములు అన్నీ తొలగి పోయాయి. నీవు నీ భక్తుల పట్ల ఉన్న దయతో ఎన్నో అవతారములు ఎత్తావు. కానీ ఆ అవతారములు ఎత్తక మునుపే నీవు ఇప్పుడు నాకు కనపడుతున్న రూపంలో వెల్లడి అయ్యావు. ఆ స్వరూపము యొక్క నాభి కమలము నుండియే నేను ఉద్భవించాను. నీవు ఈ విశ్వమును సృష్టించడానికి కారణభూతుడవు కానీ ఈ విశ్వానికి అతీతంగా ఉన్నావు. నీ నుండే ఈ సమస్తభూతములు ఆవిర్భవించాయి. అటువంటి నిన్ను నేను శరణు వేడుతున్నాను.

మేము నిన్ను ఉపాసిస్తున్నాము. సేవిస్తున్నాము. నా మేలు గోరి నేను ధ్యానములో ఉండగా నా హృదయములో ఈ రూపంతో నాకు దర్శనం ఇచ్చావు. నీవు సచ్చిదానంద స్వరూపుడవు. అన్ని ఐశ్వర్యములు నీలోనే ఉన్నాయి. అట్టి నీకు నమస్కారము. నీ భక్తులు నీ కథలను వీనుల విందుగా వినుచున్నారు. నీ మీద ఉన్న ప్రేమతో కూడిన భక్తితో నీ పాదములను ఆశ్రయించుకొని ఉన్నారు. నీ భక్తుల హృదయములను నీవు ఎన్నటికీ విడిచిపెట్టవు.

ఓ దేవా! మానవులు నీ పాదములను ఆశ్రయించనంత వరకు, వారిని ధనము, దేహాభిమానము, బంధువులు, వారిమూలంగా కలిగే భయము, దు:ఖము, ప్రేమ, దీనత్వము, లోభము మొదలగునవి బాధిస్తూ ఉంటాయి. వారి దు:ఖమునకు ఒకటే కారణము. అదే నేను, నాది అనే స్వార్థ చింతన. మానవులకు కలిగే సకల దు:ఖములు నీ లీలలు కీర్తించడం ద్వారా, వినడం ద్వారా, తొలగిపోతాయి. కానీ ఈ తుచ్ఛమానవులు నీ లీలలను వినడానికి కానీ, గానం చేయడానికి కానీ విముఖంగా ఉంటారు. ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయముల యందు ఆసక్తితో, మలినమైన మనస్సుతో తమకు దు:ఖము కలిగించే పనులు ఎన్నోచేస్తుంటారు. వారి బుద్ధి అంతా నాశనమైపోతుంది.

ఓ దేవా! ఈ జీవులు నిరంతరము ఆకలి దప్పులతో, పలురకములైన రోగములతో, వేడి, చలి, వర్షము మొదలగు వాతావరణ మార్పులతో, ఒకరితో ఒకరు అకారణంగా తగవులాడుకోడంతో, పరస్త్రీలయందు వ్యామోహంతో, వల్లమాలినకోపంతో, అను నిత్యమూ బాధపడుతుంటారు. ఈ

మానవుల అవస్థను చూచి నాకు చాలా జాలిగా ఉంది. నీవు కల్పించిన మాయ ద్వారా మానవులకు దేహాభిమానము ఎక్కువవుతుంది. ఆ దేహాభి మానము ఎంతవరకు ఉంటుందో, అప్పటి దాకా మానవుడు నీ గురించి తలుచుకోడు, ఆలోచించడు. (నాకంటే గొప్పవాడు లేడు అని అహంకారంతో విర్రవీగుతుంటాడు).

మానవునికి దేహాభిమానము, అహంకారము, స్వార్థము ఎంతవరకు ఉంటుందో అప్పటి దాకా వాడు దు:ఖభూయిష్టము అయిన సంసారంలో పడి కొట్టుకుంటుంటాడు. ఆ సంసారము వలన దు:ఖములు తప్ప సుఖములు కలుగవు, వ్యర్థము  అని తెలిసికూడా దానిని వదిలిపెట్టడానికి ఇష్టపడడు. ఈ మానవులు పగలంతా అనేక విధములయిన పనులతో తీరిక లేకుండా ఉంటారు. రాత్రి కాగానే అలసిపోయి నిద్రపోతారు. రాత్రి అన్నా ప్రశాంతంగా నిద్రపోతారా అంటే అదీలేదు. రకరకాలైన కోరికలను తీర్చుకోడంలో నిద్రకూడా సరిగా పోరు. (అర్థరాత్రి దాకా క్లబ్బులలో, పబ్బులలో గడిపే వారి గురించి బ్రహ్మ ఆనాడే ఊహించాడేమో!) వారు అనుకున్న పనులు కాకపోతే, కోరికలు తీరకపోతే మరలా దు:ఖములో మునిగిపోతారు.

సామాన్యమానవుల సంగతి అటుంచితే, జితేంద్రియులు అయిన మునులుకూడా నీ మీద భక్తి లేకపోతే,  నీ లీలలు వినడానికి, కీర్తించడానికి,  విముఖంగా ఉంటే, వారుకూడా ఈ సంసార కూపంలో పడక తప్పదు. ఓ దేవా! నీ మీద ఎవరుభక్తి కలిగి ఉంటారో, నీపుణ్యకథలను ఎవరు వింటూ ఉంటారో, వారి హృదయములలో నీవు ఎల్లప్పుడూ నివసిస్తూ ఉంటావు. నీ భక్తులు నిన్ను ఏయేరూపములలో ఆరాధిస్తూ ఉంటారో, నీవుకూడా వారికి ఆయారూపములలో

సాక్షాత్కరించి, వారి మీద నీ అనుగ్రహము చూపిస్తూ ఉంటావు.

ఓ దేవా! నీవు అన్ని ప్రాణుల అంతరాత్మలలో ఆత్మస్వరూపంగా నివసిస్తున్నావు. నీవు అందరికీ ప్రీతిపాత్రుడివి. నీకు అయిష్టులు ఎవరూ లేరు. కానీ నీ మీద భక్తి లేని వారికి నీవు లభ్యం కావు. తన సాటి వారి మీద దయ చూపించే వారికి, సకల భూతములయందు దయకలవారికి, నీవు సులభంగా ప్రసన్నం అవుతావు.కాని ఏవేవో కోరికలతో నిన్ను పూజించేవారికి, వారు ఎన్ని ఉపచారములు చేసినా, వారికి ప్రసన్నుడవు కావు. (ప్రజాధనాన్ని కొల్లగొట్టిన గాలి జనార్ధన రెడ్డి వేంకటేశ్వరస్వామివారికి కోట్లుఖర్చుపెట్టి వజ్రాల కిరీటంచేయించినా ఆయనకు జైలు తప్పలేదు.)

అందు వలన మానవులు వివిధము లైన శ్రౌత, స్మార్త, యజ్ఞ మొదలగుకర్మల ద్వారానూ, కఠోరమైన తపస్సు చేయడం ద్వారానూ, నీకుపరిచర్యలు చేయడం ద్వారానూ నిన్నుపూజిస్తున్నారు. ఆరాధిస్తున్నారు. కాని ఆ కర్మలన్నీ నీకు అర్పించినపుడే, ఆ కర్మఫలములను ఆశించకుండా ఉన్నప్పుడే, వారు కృతార్ధులవుతారు. నీ స్వరూప దర్శనము చేతనే మానవులకు భేదభావము తొలగి పోతుంది.నీ దర్శన మాత్రం చేతనే అవిద్య తొలగిపోయి, జ్ఞానము కలుగుతుంది. అట్టి నీకు నమస్కారము.

ఈ అనంత విశ్వంలో సృష్టి, స్థితి, లయములను నీ మాయచేత  నీవు ఒక క్రీడగా నిర్వర్తిస్తున్నావు. కాని ఆ మాయకు నీవు లోబడవు. అట్టి నీకు నమస్కారము. మానవులు తమ అవసాన కాలము

నందు నీ అవతార విశేషములను వినడం కానీ, నిన్ను కీర్తించడం కానీ, నిన్ను స్మరించడం కానీ, నీ గుణగణములను గురించి స్తుతించడం కానీ చేస్తే, వారికి అంతకు ముందు జన్మలలో చేసినపాపములు అన్నీ నశించి, ముక్తులవుతారు. వారు భగవంతుని చేరుకుంటారు. అటువంటి భగవంతుని నేను శరణువేడుతున్నాను.

ఓ దేవా! నీవు భువనము అనే వృక్ష రూపం ధరిస్తే, సృష్టికి అధిపతి అయిననేను, స్థితికి అధిపతి అయిన విష్ణువు, లయమునకు అధిపతి అయిన శివుడు, ఆ వృక్షమునకు మూడుపాదములుగా ఉన్నాము. అందుచేతనే నీవు త్రిపాదుడవు అనిపిలువబడుతున్నావు. ఈ వృక్షమునకు మరీచి మున్నగు మునులు, మనువులు శాఖోప శాఖలుగా విస్తరించారు. ఈ భువనము అనే వృక్షరూపము ధరించిన నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు, నిన్ను ఆరాధించడమే మానవులకు మేలు కలిగించే ధర్మము అని చెప్పావు. కాని ఈ మానవులు నిన్ను ఆరాధించకుండా, ఎల్లప్పుడూ చేయకూడనిపనులు చేస్తూ, వారి జీవిత కాలమును వృథా చేసుకుంటున్నారు. కాలం తీరగానే వెళ్లిపోతున్నారు. అటువంటి కాలస్వరూపుడవు అయిన నీకు నమస్కారము.

ఓ దేవా! నేను రెండు పరార్థముల కాలము బ్రహ్మ పదవిలో ఉంటాను కాబట్టి అన్ని లోకములలో వారు నన్ను పూజిస్తారు. . అటువంటి వాడిని అయిన నేను కాలస్వరూపుడవు అయిన నీకు భయపడుతుంటాను. ఓ దేవా! నిన్ను ప్రసన్నుడిని చేసుకోడానికి నేను ఎన్నో యజ్ఞాలు చేసాను. తపస్సు చేసాను. అటువంటి

యజ్ఞస్వరూపుడవు అయిన నీకు నమస్కారము.

ఓ దేవా! నీకు ఎటువంటి కోరికలు లేవు. విషయ వాంఛలు లేవు. కాని నీవు ఏర్పరచిన ధర్మములను రక్షించడానికి నీవు దేవతలలోనూ, మనుష్యులలోనూ, జంతువులలోనూ జన్మించావు.ఎన్నో అవతారములను ఎత్తావు. ఎన్నో లీలలను చేసావు. కాని నీవు ఏ కర్మలోనూ ఆసక్తి చూపలేదు. అంతా నిమిత్తమాత్రంగా చేసావు. అటువంటి నీకు నమస్కారము.

ఓ దేవా! ఈ సమయంలో నీవు సమస్తజగత్తును నీ ఉదరంలో లీనం చేసుకున్నావు. ఉధృతమైన కెరటాలతో నిండిఉన్న సముద్రము మధ్యలో, భయంకరమైన తలలుగల పాము మీద హాయిగా పడుకొని సుఖంగా నిద్రపోతున్నావు. సామాన్య మానవులుకూడా ఇలాగే నిద్రపోవాలని సూచిస్తున్నావు.

(దీని అర్థం వేరుగా ఉంది. సాధారణంగా మానవులు భయంకరమైన అలలతో కూడిన సముద్రాన్ని చూచి భయపడతారు. పామును చూచి ఆమడ దూరంపారిపోతారు. ఇంట్లో పాము ఉంటే దానిని చంపిన దాకానిద్రపోరు. అటువంటిది, భయంకరమైన అలలతో కూడిన సముద్రము మధ్యలో, ఐదు తలల పాము మీద సుఖంగా, హాయిగా, నిశ్చింతగా నిద్రపోతున్న పరమాత్మ, మానవులుకూడా అలాగే ఉండాలని సందేశము ఇస్తున్నాడు. సంసారమే సముద్రము. అందులో అలలే అనేరకములైనకష్టాలు. పెద్ద ఐదు తలలపాము మనలో ఉన్న ఐదు భయాలు. (అస్మిత, అవిద్య, రాగము, ద్వేషము, అభినివేశము).

వీటి బారిన పడి గిలా గిలాకొట్టుకుంటుంటాము. మానవుడు ఈ భయాలను, కష్టాలను లొంగదీసుకోవాలి. వాటికి భయపడకూడదు. ఆ భయాలు, కష్టాల పడగనీడలలోనే, నిశ్చింతగా,సుఖంగా, నిద్రించాలి. అప్పుడు మానవుడికి అనంతమైన సుఖం లభిస్తుంది. అని పరమాత్మ సందేశము. ఆ సందేశాన్ని అర్థం చేసుకోకుండా మనము కేవలం ఆ మూర్తిని, ఆ విగ్రహాన్ని మాత్రం పూజచేస్తుంటాము. అదే అవిద్య.)

ఓ దేవా! నీవు యోగనిద్రలో ఉన్నావు. ఈ సమస్తవిశ్వం నీలో లీనమై ఉంది. నీ ఆజ్ఞమేరకు నేను సృష్టిచేయడానికి సిద్ధంగా ఉన్నాను. నీ యోగనిద్ర పూర్తి అయింది. నీ కళ్లు తెరుచుకుంటున్నాయి. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు ఈ విశ్వానికే మిత్రుడవు. ఆత్మస్వరూపుడవు. జ్ఞానవంతుడవు. లోకములలో ఉన్న ఐశ్వైర్యములన్నీ నీవే కల్పిస్తున్నావు. నీ భక్తులనుసదా కాపాడుతూ ఉంటావు. నాకు కూడా జ్ఞానాన్ని ప్రసాదించు. ఇదివరకు కల్పంలో సృష్టి ఎలా ఉందో అలాగే మరలా సృష్టిచేయడానికి తగిన శక్తిని నాకు ఇవ్వు.

ఓ దేవా! నీవు నీభక్తులకు వరాలు ఇస్తుంటావు. నీవే విష్ణువుగా, లక్ష్మిగా రూపాలు ధరించావు. లక్ష్మీదేవితో కూడి నీ అవతారములలో ఎన్నో లీలలను ప్రదర్శించావు. నీ ఆజ్ఞమేరకు నేను ఈ సృష్టిచేస్తున్నాను. “నేనే ఈ సృష్టినంతా చేస్తున్నాను” అనే అహంకారాన్ని నాచిత్తములో కలిగించకు. ఎందుకంటే నేను నీ నాభికమలములో నుండి పుట్టాను. చిత్రాతిచిత్రమయిన ఈ సృష్టిని చేసేటప్పుడు, నీ దయవలన, నా వాక్కు, నా ప్రజ్ఞ నష్టం కాకుండా చూడు.

ఓ పరమాత్మా! నీవు యోగనిద్రనుండి లేచి, కళ్లు తెరిచి, ఈ విశ్వాన్ని సృష్టించడానికి, నీ వాక్కులతో నన్ను అనుగ్రహించు!" అని బ్రహ్మ పరమాత్మను ప్రార్థించాడు." అని మైత్రేయుడు విదురునితో చెప్పాడు.

"ఓ విదురా! ఆ ప్రకారంగా బ్రహ్మ చాలాకాలము తపస్సు చేసిన తరువాత, తన హృదయంలో గోచరించిన పరమాత్మను ప్రార్థించాడు. తరువాత మౌనంగా ఉన్నాడు. అప్పుడు పరమాత్మ బ్రహ్మతో ఇలా అన్నాడు.

"బ్రహ్మదేవా! నీవు ఎందుకు కలత చెందుతున్నావు. ఇంకా ఆలస్యం చేయకుండా, వెంటనే సృష్టి చేయడం మొదలుపెట్టు. ఇప్పుడు నీవు అడిగిన విషయాలన్నీ నీకు ఇంతకు ముందే చెప్పాను. తపస్సుతోనే ఏ కార్యము అయిననెరవేరుతుంది. అందుకని మరలా తపస్సు చెయ్యి. నీకు తరుణోపాయం లభిస్తుంది. తపస్సు ద్వారా నీవు నీ హృదయంలో భూలోకము మొదలగు లోకములను సూక్ష్మరూపంతో చూడగలవు. నీవునా మీద భక్తితో, ఏకాగ్రచిత్తంతో, నీ ఆత్మలో ఈ విశ్వమంతా నిండి ఉన్న నన్ను చూడగలవు. అలాగే నాలో ఉన్న ఈ అనంత విశ్వమును కూడా చూడగలవు.

అన్నిప్రాణులలోనూ నేను ఆత్మస్వరూపుడుగా ఉన్నాను అన్న నిజం తెలుసుకున్న నాడు, మానవులు, నాది, నీది, నేను నువ్వు, అనే ఈ మోహాన్ని విడిచి పెడతారు. మానవులు నిరంతరము ఇంద్రియములు, సత్వ,రజస్తమోగుణములు, ప్రాపంచిక

విషయములు గురించి ఆలోచిస్తుంటాడు. వాటినిపొందడానికి తాపత్రయపడుతుంటాడు. వాటిని వదిలిపెడితే నన్ను దర్శించగలుగుతాడు.తద్వారా మోక్షమును పొందగలడు. కాబట్టి ముందు మానవుడు మూడు గుణములను పోగొట్టుకోవాలి. ఇంద్రియ నిగ్రహము,మనోనిగ్రహము అలవరచుకోవాలి. నా మీద భక్తి కలిగి ఉండాలి. నీకు నేను శక్తిని, ప్రజ్ఞను ఇస్తున్నాను. నీవు నానారకములైన జీవులను, ప్రాణులను సృష్టిస్తున్నా, నీ చిత్తము ఎటువంటి వికారము, మోహమునకు లోనుకాదు. ఈ సృష్టి అంతా రజోగుణ ప్రధానంగా చేయాల్సి ఉంటుంది. కాని, నీవు సృష్టి చేస్తున్నప్పుడు నీ మనస్సు ఎల్లప్పుడూ నా మీద లగ్నం అయి ఉంటుంది కాబట్టి పాపభూయిష్టమైన రజోగుణము నిన్ను బంధించలేదు.

ఈ దేహధారులైన మానవులకు నేను కనపడను. వారు నన్ను తెలుసుకోలేరు. కాని వారిని సృష్టించబోయే నీకు కనపడుతున్నాను. ఎందుకంటే నా స్వరూపము సత్వాదిగుణములచేత, పంచభూతములచేతా, అహంకారము చేతా కూడినది కాదు. నీవు పుట్టగానే నన్ను వెతుక్కుంటూ తామర కాడ ద్వారా నాలోకి ప్రవేశించడానికి ప్రయత్నించావు. నా కోసం వెదికావు. నేను ఉన్నానా లేనా అనేసందేహము నీకు కలిగింది. అందుకే నీ హృదయంలో నా స్వరూపాన్ని నీకు చూపించాను. నువ్వు నన్ను ఏకాగ్రచిత్తంతో కీర్తించావు. ప్రార్థించావు. అది కూడా నా అనుగ్రహం వలననే చేయగలిగావు. నీ ప్రార్థనకు నేనుసంతోషించాను. ఈ సృష్టి చేసే పనిలో నీకు జయం కలుగుతుంది. నీవు నన్ను ఇప్పుడు ఎలా స్తోత్రం చేసావో అలాగే మానవులుకూడా నన్ను కీర్తిస్తే నేను వారికి ప్రసన్నుడను అవుతాను.(ఈ శ్లోకము ఫలశ్రుతి గా చెప్పబడింది.) మానవులు చేసే

యజ్ఞములు, యాగములు, వ్రతములు, దానములు, యోగములు, సమాధి మొదలగు వాటి వల్ల వారికి కలిగే ఫలము లన్నీ నా అనుగ్రహము వలననే కలుగుతాయి. అహంకార పూరితులైన మానవులలో కూడా నేను ఆత్మస్వరూపంతో వెలుగుతుంటాను. అలాగే సాధుజనులలోకూడా నేను అదే ఆత్మస్వరూపంతో వెలుగుతుంటాను. నేను ఆత్మస్వరూపంతో లోపల వెలుగుతూ ఉండటం వలననే మానవులు ఈదేహాన్ని ప్రేమిస్తున్నారు. నేను ఈ దేహాన్ని విడిచిపెట్టి వెళ్లిపోతే వెంటనే ఈ దేహాన్ని దహనం కానీ, ఖననం కానీ చేస్తారు. కాబట్టి మానవులు ప్రేమించేది లోపల ఉన్న ఆత్మను కానీ, దేహాన్ని కాదు అని తెలుసుకో.

కాబట్టి ఓ బ్రహ్మదేవా! నీవు వేదమయుడవు. అన్నీ తెలిసినవాడవు. ఎవరిమీదా నీకు ప్రత్యేకమైన ప్రేమ అంటే ఏమీ లేదు. కాబట్టి ఇంతకు ముందు కల్పంలో సృష్టి ఎలా ఉందో అలాగే ఈ కల్పంలో కూడా సృష్టిని కొనసాగించు. నాలో ఉన్న మూడు లోకములను, అందులో ఉన్న చరా చర జగత్తును మరలా సృజించు. మూడులోకములలో ఉన్న మానవులను, జంతువులను, పక్షులను, పాకే జంతువులను, నీటిలో ఉండే జంతువులను సృష్టించు." అని పరమాత్మ బ్రహ్మను ఆదేశించాడు. ఓ విదురా! ఆ ప్రకారంగా బ్రహ్మను ఆదేశించిన పరమాత్మ, బ్రహ్మ హృదయంలో నుండి అదృశ్యం అయ్యాడు.

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## తృతీయ స్కంధము

### పదవ అధ్యాయము.

విదురుడు మైత్రేయుడిని ఇలా అడిగాడు."ఓ మహర్షీ! ఆ ప్రకారంగా బ్రహ్మ హృదయంలో కనిపించి బ్రహ్మకు జ్ఞానబోధచేసిన పరమాత్మ అదృశ్యమైన తరువాత, లోకపితామహుడు అనగా బ్రహ్మ సృష్టి ఏ విధంగా చేసాడో తెలుపండి. నాసందేహములు అన్నీ తీరేటట్టు బ్రహ్మసృష్టి గురించి వివరంగా చెప్పండి." అని అడిగాడు. అప్పుడు మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పసాగాడు.

"విదురా! పరమాత్మ ఆదేశానుసారము బ్రహ్మ తన మనస్సును పరమాత్మ యందు లగ్నం చేసి, మరలా నూరుసంవత్సరములు తపస్సుచేసాడు. ఆ సమయంలో బ్రహ్మ తాను కూర్చున్న పద్మము, దానికి ఆధారమగు జలము, ప్రళయ కాలమునందు వీచే ప్రభంజనంలాంటి గాలికి అల్లల్లాడటం చూచాడు. ఉధృతమైన గాలిలో, అల్లకల్లోలంగా ఉన్న జలంలో ఉన్న పద్మంలో కూర్చుని సృష్టి చేయడం తనకు సాధ్యం కాదు అని అనుకున్నాడు బ్రహ్మ. వెంటనే తన తపో బలం చేత, తాను ఆర్జించిన జ్ఞానం చేతా, ఆ ప్రళయకాల జలాలను, ఉధృతంగా వీస్తున్న గాలిని శాంతింప చేసాడు. ప్రకృతి అంతా ప్రశాంతంగా ఉంది. అప్పుడు తాను కూర్చున్న పద్మం వైపు చూచాడు. ఆ పద్మము ఆకాశం వరకు వ్యాపించి ఉండటం గమనించాడు బ్రహ్మ. ఆ పద్మములోనే అన్ని లోకాలు వ్యాపించి ఉన్నాయి అని గ్రహించాడు. "ఈ పద్మము ద్వారా నేను లోకములను సృష్టిస్తాను" అని సంకల్పించాడు.

బ్రహ్మ ఆ కమలము రేకుల మధ్య ఉన్న కర్ణిక మీద కూర్చున్నాడు. తానుకూర్చున్న పద్మము 14 లోకములను సృష్టించడానికి సరిపడా ఉంది. కాని బ్రహ్మ ఆ పద్మమును ముందు మూడులోకములుగా విభజించాడు. అవే భూలోకము, భువర్లోకము సువర్లోకము. ఆ మూడులోకములను జీవులకు కర్మలు చేయుటకు, సుఖములు, దు:ఖములు అనుభవించుటకు స్థావరములుగా చేసాడు. ఆ మూడు లోకములలో ఏ కోరికలు లేకుండా కర్మలు చేసేవారు బ్రహ్మ లోకమును పొందుతారు. కాబట్టి వారి కొరకు వేరే లోకము అవసరములేకుండా పోయింది. ఎందుకంటే మూడులోకాలు తప్ప మిగిలింది అంతా బ్రహ్మమయం కాబట్టి." అని పలికాడు మైత్రేయుడు.

ఇంతలో విదురునికి ఒక సందేహము కలిగింది. "ఓ మహర్షీ! తమరు ఇంతకు ముందు కాల స్వరూపమును గూర్చి చెప్పారు. కాని నాకు సరిగా అర్థం కాలేదు. కొంచెం వివరంగా చెప్పండి." అని అడిగాడు. అప్పుడు మైత్రేయుడు ఈ విధంగా చెప్పడం మొదలుపెట్టాడు.

"విదురా! ఇంతకు ముందు నేను చెప్పిన సత్వ,రజస్, తమోగుణములు, మహత్తత్వము, అహంకారము మొదలగు తత్త్వములలో కలిగే పరిణామము (మార్పును) ద్వారా కనిపించే దానిని కాలము అని పిలుస్తారు. కాలమునకు మొదలు కొస లేదు. కాలము అవిఛ్ఛిన్నమయింది. ఎందుకంటే ఈ రోజు సూర్యోదయము మొదలు రేపుసూర్యోదయము వరకు ఉన్న కాలమును మనము 24 గంటలుగా విభజించుకున్నాము. అలాగే వారములు, మాసములు,

సంవత్సరములుగా ఏర్పరచుకున్నాము. నిజానికి సూర్యుడు ఉదయించడం లేదు అస్తమించడం లేదు. తిరిగేది భూమి మాత్రమే. భూమి తిరగడాన్ని బట్టి మనకు గంటలు, రోజులు, నెలలు, సంవత్సరాలు లెక్క పెట్టుకుంటున్నాము. సంతోషంగా ఉంటే కాలం తొందరగా గడిచిపోతుంది. కష్టాలలో ఉంటే రోజులు భారంగా గడుస్తాయి. నిజానికి కాలం కదలడం లేదు. కదిలేది ఈ ప్రకృతిలోని పదార్థాలే. వీటి చలనాన్ని బట్టి కాలాన్ని లెక్కకడుతున్నాము.

ఈ కాలాన్ని నిమిత్తంగా చేసుకొని పరమాత్మ ఈ విశ్వాన్ని సృష్టించాడు. కల్పాంతంలో ఈ విశ్వం అంతా పరమాత్మలో సూక్ష్మరూపంలో ఇమిడి ఉంది. తరువాతి కల్పం ప్రారంభంలో మరలా ఈ విశ్వం మరొక రూపంలో సృష్టించబడుతూ ఉంది. కాబట్టి విశ్వంలో మార్పులేదు. అప్పుడు ఎలా ఉందో ఇప్పుడూ అలాగే ఉంది. కాకపోతే రూపంలో మార్పు అంతే.

బ్రహ్మగారిచేత ఈ విశ్వము తొమ్మిది విధములుగా సృష్టింపబడింది. కాలముచేత, ద్రవ్యము చేత, గుణముల చేతా పదవ సృష్టి కూడా సంభవము అయింది. మొదటిది మహత్తత్వము. ఈ మహత్తత్వము పరమాత్మ గుణములలో హెచ్చుతగ్గులు కారణంగా ఏర్పడింది. రెండవ సృష్టి అహంకారము. ఈ అహంకారము నుండి పంచభూతములు, పది ఇంద్రియములు, దేవతలు, మనస్సు ఏర్పడ్డాయి. మూడవది భూతసృష్టి. దీని వలన పంచ తన్మాత్రలు అనగా శబ్ద,స్పర్శ,రస,రూప,గంధములు ఏర్పడ్డాయి. నాలుగవది ఇంద్రియసృష్టి. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ఏర్పడ్డాయి.

అహంకారము మూడు విధములు అని చెప్పాను కదా! అందులో సాత్వికాహంకారము నుండి ఐదవ సృష్టి ఏర్పడింది. ఈ సృష్టిలో ఇంద్రియములకు అధిష్టాన దేవతలు సృష్టింపబడ్డారు. ఆరవ సృష్టి అవిద్య. తెలియని తనము. ఈ సృష్టి మానవుల బుద్ధిని ఆవరించి దానిని పనిచేయకుండా చేస్తుంది. ఇదికూడా భగవంతుని వలన సృష్టింపబడినదే. ఈ ఆరు విధములైన సృష్టులు ప్రాకృత సృష్టి అంటారు. ఈ సృష్టి అంతా పరమాత్మ మాయాశక్తి వలన ఏర్పడింది.

ఏడవది స్థావర సృష్టి. అంటే కదలనివి. వనస్పతులు, ఓషధులు, లతలు, గట్టి అయిన బెరడు కలిగిన చెట్లు, భూమి మీదనే పాకే తీగల చెట్లు, పూలు, కాయలు, పండ్లు ఇచ్చే చెట్లు, ఈఆరువిధములైన చెట్ల జాతులు ఏడవ సృష్టి. ఈ చెట్లు అన్నీ నేలలోపుట్టి పైకి ఎదుగుతాయి.పాకుతాయి. వీటికి స్పర్శజ్ఞానము ఉంటుంది. కానీ కదలలేవు. తిరిగి బదులు చెప్పలేవు.

ఎనిమిదవ సృష్టి పశువులు, పక్షులు సృష్టి. అవి 18 రకాలు. వీటికి వర్తమానము తప్ప భవిష్యత్తు గురించి ఆలోచించవు. (మానవుల మాదిరి, తాను నానారకాల గడ్డి తింటూ,  కొడుకులకు, మనుమళ్లకు, ముని మనుమళ్లకు కోట్లు  కూడబెట్టవు.) ఏ పూట తిండి ఆ పూట తింటూ తృప్తిగా బతుకుతాయి. వీటికి వాసన చూచే శక్తి ఎక్కువ. (కుక్క మొదలగునవి). వీటికి ఆలోచనా శక్తి లేదు. (సంతోషం వస్తే గెంతుతాయి. అంతలోనే  ఆపద వస్తే అనుభవిస్తాయి). ఈ జంతువులలో ఆవు, గేదె,మేక,లేడి,పంది, గవయ మృగము, రురు అనే మృగము.  ఈ తొమ్మిది రకముల జంతువులు  రెండు గిట్టలు కల జంతువులు. (గిట్టలు చీలి ఉంటాయి.).

ఇంక గాడిద, కంచరగాడిద, గుర్రము, గౌరమృగము, శరభ మృగము, చామరీ మృగము, ఈ ఆరు మృగములు ఒకే గిట్ట కలవి. ఇంక ఐదు గోళ్లు కల మృగములు. కుక్క,నక్క, తోడేలు, పులి, పిల్లి, కుందేలు, ముళ్లపంది, సింహము, కోతి, ఏనుగు, తాబేలు, ఉడుము, ఎలుగుబంటి, మొసలి. ఇవన్నీ ఐదుగోళ్లుకల జంతువులు. ఇంక ఐదుగోళ్లు కల పక్షుల జాతులు... కంకపక్షి, గ్రద్ద, కొంగ, డేగ, భాస పక్షి, నెమలి, హంస, బెగ్గురుపక్షి, చక్రవాకము, కాకి, గుడ్లగూబ మొదలగుపక్షులు.

తొమ్మిదవ సృష్టి మానవుడు. అందులో ఆడ, మగ జాతులు. ఈ మానవులు అంతా ఒకే విధంగా ఉంటారు. వీరికి ఆహారము పైనుండి కిందికి పోతుంది. మానవులు సాధారణంగా రజోగుణము ప్రధానంగా ఉంటారు. (పౌరుషము, పరాక్రమము, కోపము, రోషము, బలము ఇవన్నీ రజోగుణ లక్షణములు). మనుషులు ఎక్కువగా కర్మలు చేయడంలో నిమగ్నమై ఉంటారు. సుఖము దు:ఖము ఒకదాని వెంట ఒకటి అనుభవించుటకు అలవాటు పడతారు. పై చెప్పబడిన 7,8,9 సృష్టులు వైకృత సృష్టి అంటారు. ఇప్పటికి తొమ్మిది విధములైన సృష్టుల గురించి చెప్పాను.

ఈ తొమ్మిది సృష్టులు కాకుండా పదవ సృష్టి ఒకటి ఉంది. సనత్కుమారులు మొదలగు మహామునులు సృష్టించబడ్డారు. వారిలో మానవత్వమూ, దేవత్వమూ రెండూ ఉన్నాయి. వైకారిక సృష్టిలో ఎనిమిది మంది దేవతాగణములు, రాక్షస గణములు ఉన్నారు. వారు దేవతలు,పితరులు, అసురులు, గంధర్వులు, అప్సరసలు, సిద్ధులు, చారణులు, విద్యాధరులు, యక్షులు, రాక్షసులు, భూతములు,

ప్రేతములు, పిశాచములు, కిన్నరులు, కింపురుషులు, మొదలగు వారు.

విదురా! దీనితో బ్రహ్మగారు చేసిన పది రకములైన సృష్టుల గురించి వివరించాను. తరువాత మనువుల గురించి వారి వంశముల గురించి, వివరిస్తాను. ఈ సృష్టి అంతా ఆ పరమాత్మ తనను తాను బ్రహ్మగా సృష్టించుకొని, రజోగుణ ప్రధానుడై, చేసిన సృష్టి.

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము పదియవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము
పదకొండవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా అంటున్నాడు. "విదురా! పరమాణువు గురించి చెబుతాను విను. ఈ భూమి మొదలగు పంచభూతములలో అత్యల్పమైనది అనగా ఇంక అంశలు లేనిది అనగా ఇంక విభాజించలేనిది (ఇన్‌డివిజబుల్), ఇతరములతో కలియనిది, ప్రత్యేకమైనది, అది ఏ వస్తువూ కాదు. దానినే పరమాణువు అని అంటారు. ఈ పరమాణువులు అన్నీ కలిసి మన దేహంగా, బయట కనిపించేపదార్థాలుగా రూపొందుతాయి.

అన్నిటికన్నా సూక్ష్మతమమైన పరమాణువు ఉన్నట్టే అన్నిటికన్నా పెద్దది విశ్వచైతన్యము. అదే పరమాత్మ. ఈ పరమాణువు పరమాత్మే.

అనంత విశ్వమూ పరమాత్మ. అందుకే పరమాత్మ అంతటా నిండి ఉన్నాడు. ఆయన లేని చోటు లేదు అని పెద్దలు చెబుతారు. ఒక వస్తువు యొక్క సూక్ష్మరూపము పరమాణువు, అలాగే స్థూల రూపము విశ్వచైతన్యము,

పరమాత్మ అని ఎలా అన్నామో, అలాగే కాలము కూడా అతి సూక్ష్మమైనది అతి స్థూలమైనది. విడగొట్టుకుంటూ పోతే ఆఖరుకు ఏది మిగులుతుందో దానినే కాలము యొక్క సూక్ష్మరూపము. అలాగే యుగములు, మహాయుగములుగా చెప్పుకుంటూ పోతే అన్నిటి కన్నాపెద్దది కాలము యొక్క స్థూల రూపము. కొంచెం వివరంగా చెబుతాను.

ఒక పరామాణువు ఒక చోట స్థిరంగా ఉండే కాలమును పరమాణు కాలము అంటారు. ఎందుకంటే పరమాణువులు స్థిరంగా ఉండవు. నిరంతరం చలిస్తూ ఉంటాయి. అలాగే సృష్టి జరిగినప్పటి నుండి కల్పాంత ప్రళయము వరకూ ఉన్న కాలమును స్థూల కాలము అని అంటారు. ఎందుకంటే, నిమిషంతో పోలిస్తే గంట స్థూలము. గంటతో పోలిస్తే రోజుస్థూలము. అలాగే నెలలు, సంవత్సరములు దేనికదే స్థూలము. అపరిమితమైన స్థూలము ప్రళయకాలము వరకు ఉంటుంది.

ఇంక ఈ పరమాణువులను ఎలా లెక్కిస్తారో చెబుతాను. రెండు పరమాణువులు ఒక అణువు. మూడు అణువులు కలిసి ఒక త్రసరేణువు. పొద్దునే సూర్యుడు వస్తాడు. ఎనిమిది గంటలకు ఎండవస్తుంది. కిటికీకి ఒక చిన్న రంధ్రము ఉంటుంది. ఆ రంధ్రంలో

నుండిసూర్య కిరణాలు గోడమీద పడుతుంటాయి. కిటికీ దగ్గర నుండి గోడ దాకా ఒక ఫోకస్ మాదిరి కనపడుతుంది. ఆ ఫోకస్ లో సన్న ధూళి రేణువులు చలిస్తుంటాయి. వాటినే త్రసరేణువులు అంటారు. ఈ త్రసరేణువులు అతిసూక్ష్మంగా అతి తేలికగా గాలిలో ఎగురుతుంటాయి.

ఇటువంటి మూడు త్రసరేణువులు ఒక చోట స్థిరంగా ఉన్న కాలమును త్రుటి అంటారు. ఇందాకటిమాదిరే ఇవి కూడా ఒకచోట ఉండవు. నిరంతరం చలిస్తుంటాయి. అటువంటి త్రసరేణువులు ఒక చోట ఉంటే ఆ కాలమును తృటి అంటారు. అటువంటి తృటులు నూరు అయితే ఒక వేధ అంటారు. మూడు వేధలు ఒక లవము. అటువంటి లవములు  మూడు కలిస్తే ఒక నిమేషము అవుతుంది. (మన వాడుకలో ఉన్న నిమిషము కాదు).

మూడు నిమేషములు ఒక క్షణము. ఐదు క్షణములు ఒక కాష్ట. 15 కాష్టములు ఒక లఘువు. 15 లఘువులు ఒక నాడి లేక దండము. రెండు దండములు ఒక ముహూర్తము (అనగా దాదాపు మనకు వాడుకలో ఉండే  45 నిమిషములతో సమానము).  మూడు ముహూర్తములు లేక ఆరు లేక ఏడు నాడులు ఒక జాము. లేక ప్రహరము. అటువంటిజాములు నాలుగు అయితే ఒక పగలు కానీ రాత్రి కానీ అవుతుంది.

ఇంక ఈ నాడిని కానీ దండమును కానీ కొలవడం ఎలాగ అంటే నాలుగు మినపగింజల ఎత్తు బంగారముతో  నాలుగు అంగుళముల పొడుగు ఒక సన్నని కడ్డీ తయారు చేసి, దానితో  ఆరు పలముల పరిమాణము కల   ఒక రాగి పాత్రకు రంధ్రం చేయాలి.

(పలము అంటే మూడు తులముల పరిమాణములేక 64 మినపగింజల ఎత్తుగల బంగారము తూగే పరిమాణము.).

ఆ రాగి పాత్ర నిండా ఒక ప్రస్థము అంటే 32 పలముల నీరు పోసి ఆ నీరంతా ఆ రంధ్రములోనుండి బయటకు వచ్చే సమయాన్ని నాడి లేక దండము అని కొలుస్తారు. నాలుగు ప్రహరములు అనగా జాములు ఒక పగలు అన్నాము కదా. అటువంటి ఒక పగలు, రాత్రి అంటే ఎనిమిది జాములు కలిసి ఒక రోజు. అటువంటి 15 రోజులు ఒక పక్షము. అవే శుక్లపక్షము, కృష్ణపక్షము. ఈ రెండు పక్షములు కలిసి ఒక మాసము. ఈ మాసము పితృదేవులకు ఒక రోజు అవుతుంది. (అందుకే చనిపోయిన సంవత్సరము పాటు మాసికములు అనగా నెలకొక సారి పిండాలు,బాహ్మణులకు భోజనము పెడతారు. అంటే చనిపోయిన వాళ్లకు రోజూ భోజనము పెడుతున్నాము అన్నమాట.) అటువంటి రెండు మాసములు ఒక ఋతువు అంటారు. ఆరు ఋతువులు కలిపి రెండు అయనములు. ఆ అయనములు రెండు రకాలు. ఉత్తర అయనము దక్షిన అయనము. ఈ రెండు అయనములు (అనగా ఒక సంవత్సరము) కలిపి దేవతలకు ఒక రోజు అవుతుంది. అటువంటి నూరుసంవత్సరములు కలిస్తే మానవునికి పూర్ణ ఆయుర్దాయము.

చంద్రుడు మొదలగు గ్రహములకు, అశ్విని మొదలగు నక్షత్రములకు, తారా మండలములకు (గెలాక్సీ) అధిపతి సూర్యుడు. ఈ కాల స్వరూపుడు అయిన సూర్యుడు ఈ అనంత విశ్వం చుట్టు ప్రదక్షిణం చేస్తున్నాడు. ఈ కాలమును వర్షము అంటారు. ఈవర్షము ఐదు విధములు. అవే సంవత్సరము, పరివత్సరము, ఇదావత్సరము,

అనువత్సరము, వత్సరము. ఈ ఐదువిధములైన వర్షములను కలుగచేసే సూర్యభగవానునికి నమస్కరించు.

సూర్యుడు తేజస్వరూపుడు. పంచభూతములలో ఒకడు. ఈ సూర్యుడు తన కిరణ శక్తితో గింజలలో నుండి మొలకలను పుట్టిస్తాడు.

(మొక్క సూర్యరశ్మి ఎటు ఉంటే అటు వంగుతుంది అని చిన్నప్పుడు మనం చదువుకున్నాము కదా! కాబట్టి మొక్కలు పెరగడానికి సూర్యరశ్మి ముఖ్యము. సూర్యరశ్మిలో నుండి మనకు డి విటమిన్ వస్తుంది అని వైద్యులు చెబుతుంటారు. కానీ మనం మాత్రం మెడదాకా టై బిగించి కాళ్ల దాకా సూట్ వేసి, సాక్సులు, బూట్లు వేసి, శరీరానికి ఎండ తగుల కుండా జాగ్రత్త పడుతున్నాము. ఎసి ఉన్న బెడ్ రూమునుండి ఎసి కారులోకి, ఎసి కారులోనుండి ఆఫీసులో ఎసి రూములోకి, మరలా అక్కడి నుండి క్లబ్బులో ఎసీ లోకి అక్కడి నుండి ఇంట్లో ఎసి బెడ్ రూములోకి మారుతున్నాము. రాత్రి పొద్దుపోయిందాకా క్లబ్బులో పబ్బులలో గడిపి ఉదయంపూట సూర్యోదయం ఎలా ఉంటుందో మరిచిపోయాము. కాస్త ఎండను కూడా తట్టుకొనే శక్తి కోల్పోయాము. 20 ఏళ్లకే బిపి, షుగర్ తదితర జబ్బులతో డాక్టర్లను పోషిస్తున్నాము. ఇదీ మన జీవన విధానము.)

విదురా! సూర్యుడు కాల స్వరూపుడు అని చెప్పాను కదా! కాలం గడిచేకొద్దీ మానవుల ఆయువు తరిగిపోతూ ఉంటుంది. సూర్యుడు మనలను పోషిస్తూ, లయం చేస్తూ ఉంటాడు. అటువంటి కాలస్వరూపుడు సూర్యభగవానునికి నమస్కరించు." అని మైత్రేయుడు

విదురుడికి కాలస్వరూపము గురించి వివరించాడు.

అది అంతా విన్న విదురుడు మైత్రేయునితో ఇలా అన్నాడు. "మైత్రేయా! నీవు పితృదేవతలయొక్క, మానవుల యొక్క ఆయు:ప్రమాణం గురించి చెప్పావు. కానీ ఈ ముల్లోకముల బయట సంచరించే మహామునుల ఆయు:ప్రమాణము గురించి చెప్పు. నీవు కాలస్వరూపుడు అయిన పరమాత్మను గురించి బాగా తెలిసినవాడవు. నీ వంటి జ్ఞానులు యోగ దృష్టి ద్వారా ఈ ప్రపంచమును దర్శించగలరు." అని అడిగాడు. మైత్రేయుడు ఇలా చెప్పసాగాడు.

"విదురా! ఈ అవిచ్ఛిన్న మైన కాల గతిలో యుగములు నాలుగు. అవి కృతయుగము. త్రేతాయుగము.ద్వాపర యుగము. కలియుగము.  ఒక్కొక్క యుగము 12,000 సంవత్సరముల కాల పరిమితితో కూడి ఉంది. ఈ నాలుగు యుగములు వరుసగా నాలుగు వేలు, మూడు వేలు, రెండు వేలు, వెయ్యి సంవత్సరముల కాల పరిమితి కలిగి ఉన్నాయి. ఈ యుగముల మధ్య కాలమును, ఒక యుగమునకు ముందు వచ్చేది  సంధ్య, తరువాత వచ్చేది సంధ్యఅంశ అని అంటారు. ఈ సంధ్యలు, సంధ్యాంశలు క్రమంగా ఎనిమిది వందలు, ఆరు వందలు, నాలుగు వందలు, రెండు వందలు సంవత్సరములు. యుగమునకు ముందు సంధ్య, చివర సంధ్యాంశము ఉంటాయి. ఇవి వందల సంవత్సరములలో ఉంటాయి. ఈ సంధ్య, సంధ్యాంశ మధ్య ఉన్న కాలమును యుగము అని అంటారు.

(కృతయుగమునకు ముందు 400, వెనుక 400,మధ్య 4000. ఇలా వేసుకుపోవాలి.

కృతయుగము 400+4000+400+

త్రేతాయుగము 300+3000+300+

ద్వాపరయుగము 200+2000+200+

కలియుగము 100+1000+100+

మరలా కృతయుగము

ఇలాగా లెక్కవేసుకొని కూడితే 12,000 సంవత్సరములు వస్తాయి.)

ఒక్కొక్క యుగమునకు ఒక్కొక్క విశేషమైనధర్మము ఉ ంటుంది. కృతయుగములో ధర్మము నాలుగుపాదములతో నడుస్తుంది. ఆనాలుగు పాదములు ఏవంటే...తపస్సు, శౌచము, దయ, క్షమ). ఒక్కొక్క యుగము గడిచేకొద్దీ ఒక్కొక్కపాదము క్షీణించి, కలి యుగములో కేవలము క్షమ మాత్రము మిగులుతుంది.

బ్రహ్మ మొదట మూడు లోకములను సృష్టించాడు అని చెప్పాను కదా. అవి భూలోకము, భువర్లోకము, సువర్లోకము. వీటికి ఆవల మహర్లోకము, జనలోకము తపోలోకము, సత్య లోకము ఉన్నాయి. జనలోకము, తపోలోకము, సత్యలోకములకు పోవడానికి మహర్లోకము ద్వారము వంటిది. ఈ ఏడులోకములలో, వేయి యుగములు గడిస్తే ఒక పగలు, వేయి యుగములు గడిస్తే ఒక రాత్రి అవుతాయి. ఆ రాత్రి సమయములో బ్రహ్మ నిద్రపోతాడు. మరునాడు నిద్రలేవగానే మరలా సృష్టి మొదలుపెడతాడు. అంటే బ్రహ్మ పగలంతా సృష్టించి, రాత్రి నిద్రపోయి, మరలా పొద్దునేసృష్టికార్యము మొదలు పెడతాడు.

## తృతీయ స్కంధము

(దీనిని మనకు అన్వయించుకుంటూ సరిగాసరిపోతుంది. పగలంతా మనము చేతులు, కాళ్ళు, కళ్లు, ముక్కు, చెవులు, మనసు వీటితో ఎన్నెన్నో పనులుచేస్తాము, రాత్రి కాగానే అన్ని అవయవములు విశ్రాంతి తీసుకుంటాయి. కళ్లు మూసుకుంటాము. హాయిగా నిద్రపోతాము. అప్పుడు బయట ప్రపంచంతో మనకు సంబంధం ఉండదు. అంటే ఈ ప్రపంచాన్ని మన మనసులో దాచుకుంటాము. మరునాడు నిద్రలేచినప్పుడు, కళ్లు తెరిచినప్పుడు, మరలా ఈ ప్రపంచం మనకళ్ల ముందు నిలుస్తుంది. అందుకే అన్నారు కళ్లు తెరిస్తే జననం, కళ్ళు మూస్తే మరణం ఈ మధ్య నడిచేదే జగన్నాటకం అని).

బ్రహ్మ యొక్క పగటి కాలంలో 14 మంది మనువులు పరిపాలిస్తారు. ఒక్కొక్క మనువు 71 మహాయుగములు పాలిస్తాడు. (నాలుగు యుగములు కలిస్తే ఒక మహాయుగము అవుతుంది.) ఒకొక్క మన్వంతరంలో మనువంశము వారు ఈ భూమిని పరిపాలిస్తారు. మనువులతో పాటు, సప్తఋషులు, దేవతలు, ఇంద్రులు (ఇంద్రుడు అనేది ఒక పదవి), గంధర్వులు మొదలగు దేవతాగణములు ఉద్భవిస్తారు. ఇదీ పగటి పూట బ్రహ్మ చేసే పని.

వీరితోపాటు తమ తమ పూర్వజన్మల కర్మల ఫలితంగా దేవతలు,మానవులు, జంతువులు, పక్షులు పుడుతుంటాయి. ఈ మన్వంతరములలో పరమాత్మ సత్వగుణమును అవలంబించి, అవతారములను ఎత్తుతూ ధర్మమును కాపాడుతూ ఉంటాడు. సాయంత్రం కాగానే పరమాత్మ తమోగుణమును స్వీకరించి రుద్రుని రూపంలో ఈ అనంత విశ్వాన్ని తనలో లయం చేసుకుంటాడు. అంటే ఈ సృష్టిమొత్తాన్ని సూక్ష్మరూపంలో తనలోకి లాగేసుకుంటాడు. అప్పుడు

పరమాత్మ ఒక్కడే ఉంటాడు. మాయ కూడా తొలగి పోతుంది. అప్పుడు బ్రహ్మకు రాత్రి సమయము. బ్రహ్మచే సృష్టించబడిన మూడులోకములు అదృశ్యమైపోతాయి.

ఆ సమయంలో భృగువు మొదలగు మహాఋషులు మహర్లోకము నుండి ఆ తరువాత ఉన్న జనలోకానికి వెళ్లిపోతారు. ఆసమయంలో సప్తసముద్రములు, ప్రచండ వాయువులతో భయంకరమైన తరంగములు పైకి లేచి మూడులోకములను జలమయం చేస్తాయి. ప్రచండ వాయువు, అల్లకల్లోలంగా ఉన్న అనంత జలరాసి తప్ప వేరే ఏమీ ఉండదు. ఆ సమయంలో పరమాత్మ శేషశయ్య మీద పడుకొంటాడు. యోగనిద్రలో కళ్లుమూసుకొని పడుకొని ఉంటాడు. జనలోకములో ఉన్న భృగువు మొదలగు మహాఋషులు పరమాత్మను స్తుతిస్తుంటారు.

ఈ విధంగా కాలంగడుస్తుంటే, వేయియుగముల రాత్రి గడిచిపోతుంది. మరలా సృష్టి ప్రారంభం అవుతుంది. ఈ ప్రకారంగా బ్రహ్మకు నూరు సంవత్సరములు పూర్తి అవుతాయి. బ్రహ్మయొక్క మొదటి 50 సంవత్సరములను పూర్వ పరార్థము అంటారు. (ఇప్పుడు ద్వితీయ పరార్థము నడుస్తూ ఉంది. మనం సంకల్పం చెప్పుకొనేటప్పుడు, అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరాహ కల్పే అని చెప్పుకుంటాము కదా. అదే ఇది.)

మొదటి పరార్థము అంటే బ్రహ్మ యొక్క మొదటి 50 సంవత్సరములు. దానినే పూర్వ పరార్థము అంటాము. దానికిముందు బ్రాహ్మ కల్పము నడిచింది. ఆకల్పములోనే బ్రహ్మ ఆవిర్భవించాడు. ఆయనే శబ్ద బ్రహ్మ

అంటారు. బ్రాహ్మ కల్పము తరువాత పాద్మకల్పము వచ్చింది. అప్పుడే పరమాత్మ బొడ్డులోనుండి పుట్టిన కమలము నుండి బ్రహ్మ ఉ ద్భవించాడు.

ఇంక రెండవ పరార్థముయొక్క మొదటి కల్పమును వారాహ కల్పము అంటారు. (దానినే శ్వేతవరాహ కల్పే అని మనం సంకల్పంలో చెప్పుకుంటాము.) ఈ రెండు పరార్థముల కాలము పరమాత్మకు ఒక రెప్పపాటు కాలము తో సమానము. మొట్టమొదట పరమాణు కాలము నుండి ద్వితీయ పరార్థము వరకు, గడిచిన కాలం అంతా పరమాత్మ అధీనంలోనే ఉంటుంది. కానీ దేహధారులైన మనుషులు, జంతువులు, పక్షుల మీద తన ప్రభావము చూపుతుంది. (అంటే కాలం తీరగానే ఈ ప్రాణులన్నీ నశిస్తాయి. కాని పరమాత్మ కాలమునకు లోను కాడు. కాలాతీతుడు.)

విదురా! మహత్తత్త్వము, అహంకారము, పంచ తన్మాత్రలు, ప్రకృతి అనే ఎనిమిది ప్రకృతులలోనూ, పది ఇంద్రియములు, మనస్సు, పంచభూతములు అని పదహారు వికారములతోనూ మొదలైన ఈ బ్రహ్మాండము లోపల యాభైకోట్ల యోజనముల విస్తీర్ణము ఉంది. ఈ బ్రహ్మాండము కంటే పదిరెట్లు అధికముగా ఉంటే బ్రహ్మాండాలు ఈ అనంత విశ్వంలో కోటాను కోట్లు ఉన్నాయి. ఈ అనంత విశ్వము పరమాత్మయొక్క పరిపూర్ణమైన భగవత్తత్వము.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# తృతీయ స్కంధము
# పన్నెండవ అధ్యాయము.

విదురా! ఇప్పటి దాకా నీకు కాలము, దాని స్వభావము, కాల పరిమాణము అన్నిటి గురించి చెప్పాను. ఇప్పుడు బ్రహ్మ సృష్టిని గురించి చెబుతాను. విను.

మొట్ట మొదట బ్రహ్మ అజ్ఞానము అనే తమస్సును (అజ్ఞానాంధకారము) సృష్టించాడు. అంటే "అంతా నాకు తెలుసు. నాకు తెలియంది ఏమీ లేదు. ఈ శరీరమే నిత్యము. శాశ్వతము" అనే భావన. తరువాత మోహాన్ని సృష్టించాడు. దీని వలన మానవులకు మనుషుల మీద ముఖ్యంగా స్త్రీలమీద, బంధువుల మీద, వస్తువుల మీద కోరిక, నాకు కావాలనే కాంక్ష ఏర్పడుతుంది. అదే అన్ని అనర్థాలకు దారి తీస్తుంది.

తరువాత మహా మోహము అంటే స్త్రీవాంఛ, కోరుకున్న స్త్రీని అనుభవించాలనే కోరికను, వాంఛను, సృష్టించాడు. తరువాత కోపాన్ని సృష్టించాడు. తాను కోరుకున్న వస్తువు కానీ, స్త్రీకానీ లభించకపోతే వచ్చేది కోపము. అందుకే అమితమైన కోపాన్ని సృష్టించాడు. తరువాత నిరాశ, నిస్పృహ చేతగాని తనాన్ని సృష్టించాడు. కోరుకున్న ది దొర్కపోతే, ఇంక తాను జీవించి ఉండటం వృధా, మరణమే శరణ్యము, నేను బతికీ ఒకటే చచ్చి ఒకటే అనే భావననుసృష్టించాడు.

ఇవన్నీ సృష్టించిన తరువాత ఇదేంటీ, లోకం ఇంత పాపమయం అయింది అని బాధపడ్డాడు. ఆయనకు తాను చేసిన సృష్టితో తృప్తి కలుగలేదు. మరలా పరమాత్మను మనసులో స్మరించుకున్నాడు. బ్రహ్మ గారి బుద్ధి నిర్మలమయింది. మరలా సృష్టి చేయడం మొదలెట్టాడు.

ముందు ఏమీ పని చేయని వారు, చెయ్యడానికి పని అంటూ లేని వారు, ఇంద్రియములను మనసులను జయించిన వారు అయిన సనకుడు,సనందుడు, సనాతనుడు, సనత్కుమారుడు అనే నలుగురు మునులనుసృష్టించాడు. ఆ నలుగురూవచ్చి ఎదురుగా నిలబడ్డారు.

"కుమారులారా! మీరు సృష్టిని కొనసాగించండి.మంచి వారిని, మీ లాంటి వారిని సృష్టించండి" అని ఆదేశించాడు.

"మేము భగవంతుని భక్తులము. మాకు కోరికలు లేవు.మేము ఈ సృష్టి చేయలేము." అని అన్నారు. దానితో బ్రహ్మదేవునికి కోపం వచ్చింది.

(కొడుకులు చెప్పిన పని చేయకపోతే తండ్రికి కోపం రావడం సహజమే కదా!)

బ్రహ్మకు పట్టరాని కోపం వచ్చింది. కనుబొమలు ముడిచాడు. తన కోపాన్ని అణచుకోడానికి ప్రయత్నించాడు. కాని ఆ కోపము ఆగలేదు. ఆయన నుదుటి నుండి నీలం రంగులో ఉన్న ఒక

కుమారుడు పుట్టాడు. పుట్టగానే వాడు పెద్దగా ఏడవడం మొదలు పెట్టాడు.

"నేను ఎవరు? నా పేరు ఏమిటి? నేను ఎక్కడ ఉండాలి? చెప్పండి" అని పెద్దగా ఏడవసాగాడు.

అప్పుడు బ్రహ్మ అతనితో ఇలా అన్నాడు. "నువ్వు పుట్టగానే చిన్న పిల్లవాడు ఏడిచినట్టు పెద్దగా ఏడిచావు కాబట్టి నీ పేరు రుద్రుడు. నిన్ను అందరూ రుద్రుడు అని పిలుస్తారు. నీవు మానవుల హృదయాలలోనూ, ఇంద్రియములలోనూ, ప్రాణములలోనూ, ఆకాశములోనూ, వాయువులోనూ, అగ్నిలోనూ, జలములోనూ, భూమిలోనూ, సూర్యుడిలోనూ, చంద్రునిలోనూ, తపస్సులోనూ నివసించు. (అంటే రుద్రునికి సర్వవ్యాపకత్వమును ప్రసాదించాడు బ్రహ్మ).

నీకు రుద్రుడు అనే పేరు కాకుండా ఇంకా పదకొండు పేర్లు ఉన్నాయి. అవేమిటంటే.......మన్యువు, మనువు, మహివసుడు, మహాత్ముడు, శివుడు, ఋతధ్వజుడు, ఉగ్రరేతస్కుడు, భవుడు, కాలుడు, వామదేవుడు, ధృతవ్రతుడు అనే పేర్లు ఉన్నాయి. ఈ పదకొండు పేర్లకు నీకు పదకొండు మంది భార్యలను ఏర్పరిచాను. వారే ధీ,ధృతి,రసల, ఉమ, నియుత్తు, సర్పి, ఇల, అంబిక, ఇరావతి, స్వధ, దీక్ష, నిన్ను, నీ భార్యలను, ఈ సృష్టి కొనసాగించడానికి నియమిస్తున్నాను. ఈ భార్యలతో కూడి నీవు సృష్టి చెయ్యి." అని ఆదేశించాడు బ్రహ్మ.

ఇంక రెచ్చిపోయాడు రుద్రుడు, తన బలానికి తగ్గట్టు, తన ఆకారానికి తగ్గట్టు, తన స్వభావానికి తగ్గట్టు సృష్టి చేయడం మొదలు పెట్టాడు. ఆయనకుపుట్టిన వారంతా ఆయనలాగానే రౌద్రస్వభావులు, రౌద్రాకారులు. వాళ్లంతా గుంపులు గుంపులుగా ఏర్పడి అప్పటి దాకా సృష్టించబడిన దేవతా గణాలను తినడం మొదలుపెట్టారు.

ఇది చూచిన బ్రహ్మ చింతాక్రాంతుడయ్యాడు. వెంటనే రుద్రుని పిలిచి "నువ్వు  సృష్టి చేసిన రుద్రులవలన ఏమీ ప్రయోజనము లేదు. కాబట్టి ఇంక చాలు. నీ సృష్టి ఆపు." అని అన్నాడు.

రుద్రుడు వెంటనే తన సృష్టిని ఆపేసాడు. రుద్రుడు బ్రహ్మను చూచి "ఇప్పుడు నేనేం చేయాలి" అని అన్నాడు.

"కాస్త శాంతంగా ఉండు. తపస్సు చెయ్యి. అందరికీ ఆనందం చేకూర్చు. నువ్వు తపస్సు చేసిన తరువాత నీకు సృష్టి ఇంతకు ముందు ఎలా ఉందో అలాగే చెయ్యాలని తెలుస్తుంది. అప్పుడు సృష్టి చెయ్యి." అని అన్నాడు బ్రహ్మ. అలాగే అని రుద్రుడు తపస్సుచేయడానికి వెళ్లి పోయాడు.

తాను చేసిన రెండు ప్రయత్నాలు విఫలం అయ్యేటప్పటికి బ్రహ్మమరలా ఆలోచించాడు. బ్రహ్మ గారి ఆలోచన నుండి పది మంది ప్రజాపతులు పుట్టారు. వారే......మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వశిష్టుడు, దక్షుడు, నారదుడు.  వీరంతా బ్రహ్మ అవయవముల నుండి ఉద్భవించారు.

బ్రహ్మ ఒడిలోనుండి నారదుడు, బొటనవేలినుండి దక్షుడు, ప్రాణముల నుండి వశిష్ఠుడు, బ్రహ్మదేవుని చర్మము నుండి భృగువు, చెవులలో నుండి పులస్త్యుడు, ముఖము నుండిఅంగిరసుడు, కళ్లనుండి అత్రి, మనసులో నుండి మరీచి ఉద్భవించారు. బ్రహ్మగారి దక్షిణవైపు వక్షము నుండి ధర్మము పుట్టింది. ఆయన వెనుక భాగము నుండి అధర్మము పుట్టింది. అధర్మము నుండి మృత్యువు పుట్టింది. బ్రహ్మగారి హృదయము నుండి కోరికలు, కనుబొమలనుండి కోపము, పెదవుల నుండి లోభము, ముఖము నుండి వాక్కు, జననాంగము నుండి సాగరములు, మలద్వారము నుండి రాక్షసత్వము పుట్టాయి. బ్రహ్మగారి దేహకాంతి నుండి కర్దముడు అనే ప్రజాపతి ఉద్భవించాడు.

ఈ ప్రకారంగా ఈ కనపడే ప్రపంచం అంతా బ్రహ్మ దేహము నుండి పుట్టింది. తాను పుట్టించిన వాటిలో నుండి బ్రహ్మ దేవుడు వాక్కును గ్రహించాడు. (వాక్కు అంటే వాగ్దేవి. సరస్వతి. సమస్త విద్యలు. అంటే తన కూతురిని కామించాడు అన్న భ్రమ అందరికీ కలిగింది.)

వాక్కుతో పుట్టిన మరీచి మొదలగు వారు బ్రహ్మతో ఇలా అన్నారు. “ఇంతకు ముందు బ్రహ్మలు ఎవరూ ఇలాంటి పని చేయలేదు. ఇంక ముందు బ్రహ్మలు కూడా ఇలాంటి పని చేయరు. నీకు అన్నీ తెలిసి కూడా నీవు సృష్టించిన వాక్కును స్వీకరించావు. నీ వంటి వారికి ఇది మంచి పద్ధతి కాదు. ఎందుకంటే లోకాలు అన్నీ నీవు చేసిన పనులను అనుసరిస్తాయి కదా! నీవే నీ పుత్రికను కామిస్తే ఇంక ఇతరుల గురించి చెప్పేదేముంది.”అని పలికారు.

మరీచి మొదలగు వారు పలికిన పలుకులకు బ్రహ్మ సిగ్గు పడ్డాడు. వెంటనే ఏ వాక్కునైతే తానుస్వీకరించాడో, ఆ దేహాన్ని విడిచిపెట్టాడు. బ్రహ్మ విడిచిపెట్టిన దేహాన్ని దిక్కులు స్వీకరించాయి. అదే తమస్సు. తెల్లని మంచుతో కూడిన తమస్సు.

తరువాత బ్రహ్మ తనకు ఇంతకు ముందు ఉన్న  దేహము దాల్చి,  ఈ సృష్టిని ఎలా చేయాలా అని ఆలోచించాడు. ఆయన నాలుగు ముఖముల నుండి నాలుగు వేదములు ఆవిర్భవించాయి. తరువాత వేదములలో చెప్పబడిన యజ్ఞములు, క్రతువులు, అందులో చెప్పబడిన కర్మలు, వాటికి అవసరమైన హెూత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అను నలుగురు ఋత్విక్కులు, వేదములకు అనుగుణంగా ఉపవేదములు, నీతి శాస్త్రము మొదలగు శాస్త్రములు, నాలుగు పాదములతో కూడిన ధర్మము, నాలుగు ఆశ్రమములు బయటకు వచ్చాయి." అని చెప్పాడు మైత్రేయుడు.

అప్పుడు విదురునికి ఒక సందేహం వచ్చింది. "ఓ మహర్షీ! మీరు బ్రహ్మ నాలుగు ముఖముల నుండి నాలుగు వేదములు వచ్చాయి అన్నారు కదా! ఏయే ముఖముల నుండి ఏయేవేదములు వచ్చాయి. నాకు తెలియజేయండి" అని అడిగాడు. ఆ ప్రశ్నకు ఈ విధంగా బదులు చెప్పాడు మైత్రేయుడు.

"విదురా! బ్రహ్మకు నాలుగు దిక్కులా నాలుగు ముఖాలు ఉంటాయి అని చెప్పాను కదా! తూర్పు వైపు ఉన్న ముఖంనుండి ఋగ్వేదము, దక్షిణము వైపు ముఖం నుండి యజుర్వేదము,

పడమరవైపు ముఖం నుండి సామవేదము, ఉత్తర దిక్కు ముఖం నుండి అధర్వణవేదము ఉద్భవించాయి. వాటి వెంట శస్త్రము, ఇజ్య, స్తుతిస్తోమము, ప్రాయశ్చిత్తము అనే యజ్ఞకర్మలను కూడా వెలువరించాడు బ్రహ్మ.

అలాగే తూర్పు వైపున ఉన్న ముఖం నుండి ఆయుర్వేదము, దక్షిణముఖం నుండి ధనుర్వేదము, పడమటి ముఖం నుండి గాంధర్వవేదము, ఉత్తర ముఖం నుండి స్థాపత్యవేదము (శిల్పకళ) బయటకు వచ్చాయి. తరువాత బ్రహ్మతన నాలుగు ముఖముల నుండి ఇతిహాసములు, పురాణములు, పంచమవేదము సృష్టించాడు.

అలాగే షోడశి ఉక్థములు తూర్పు ముఖము నుండి, చయనము అగ్నిష్టోమము దక్షిణ ముఖం నుండి, ఆప్తోర్యామము అతిరాత్రము పడమర ఉన్న ముఖం నుండి, గోసవము, వాజపేయము ఉత్తర దిక్కున ఉన్న ముఖం నుండి పుట్టాయి.

తరువాత బ్రహ్మ, అన్ని రకాల శౌచము, దానము, తపస్సు, సత్యము అను ధర్మము యొక్క నాలుగు పాదములను, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వారి వారి గుణములను బట్టి, వారు చేయు కర్మలను బట్టి సృష్టించాడు.

తరువాత బ్రహ్మచర్యమునకు సంబంధించిన సావిత్రము, ప్రాజాపత్యము, బ్రాహ్మము, బృహద్వ్రతము అనే నాలుగు వృత్తులు, అలాగే గృహస్థాశ్రమమునకుసంబంధించిన వార్త, సంచయము, శాలీనము, శిలోంఛమము అనునాలుగు వృత్తులనుసృష్టించాడు. తరువాత

వానప్రస్థమునకుసంబంధించిన వైఖానసులు, వాలఖిల్యులు, ఔదుంబరులు, ఫేనపులు అనే వారిని సృష్టించాడు. ఆఖరుది అయినసన్యాసాశ్రమమునకు సంబంధించి కుటీచకుడు, బహూదకుడు, హంస, నిష్క్రియుడు అనే నాలుగు బేధములతో సృష్టించాడు.

తరువాత బ్రహ్మ నాలుగు ముఖముల నుండి తర్కశాస్త్రము, వేదవిద్య, వృత్తికి సంబంధించిన విద్యలు, దండనీతి, అను నాలుగు శాస్త్రములు వెలుపలికి వచ్చాయి. బ్రహ్మ హృదయము నుండి ఓంకారము అనే ప్రణవ నాదము ఉత్పన్నమయింది.

బ్రహ్మదేవుని రోమకూపముల నుండి  ఉష్ణిక్కు అనే ఛందస్సు, చర్మము నుండి గాయత్రి మంత్రము, మాంసము నుండి త్రిష్టుప్పు ఛందస్సు, అస్థికల నుండి జగతి ఛందస్సు, ఎముకల లోపల ఉండే గుజ్జు నుండి బృహతీ ఛందస్సు పుట్టాయి.

బ్రహ్మగారి ప్రాణముల నుండి “క” నుండి “మ” వరకు ఉన్న 25 అక్షరములు, దేహము నుండి “అ” నుండి “ఔ” వరము ఉన్న స్వరవర్ణములు, “శ,ష,స,హ” అనే ఊష్మవర్ణములు బ్రహ్మ దేవుని ఇంద్రియముల నుండి పుట్టాయి. “య,ర,ల,వ” అను అంతస్థ వర్ణములు బ్రహ్మదేవుని బలము నుండి ఆవిర్భవించాయి.

బ్రహ్మ దేవుడు విలాసంగా ఉన్నప్పుడు ఆయన విలాసము లోనుండి సంగీతము, దానికి ఉపయోగించే సప్త స్వరములు పుట్టాయి.న (నిషాదము, ఋషభము, గాంధారము, షడ్జము,

మధ్యమము, ధైవతము, పంచమము).

ఈ ప్రకారంగా బ్రహ్మ శబ్దస్వరూపుడుగా వ్యక్తం అయ్యాడు. ఆయనలో నుండి కనపడకుండా వచ్చేదే ప్రణవనాదము. ఇది వరకు బ్రహ్మ తన శరీరమును విడిచి పెట్టాడు అని చెప్పుకున్నాము కదా ఇప్పుడు బ్రహ్మ ఈ శబ్దములనే తన శరీరంగా గ్రహించాడు. మరలా ఈ సృష్టి ఎలా చెయ్యాలా అని ఆలోచించసాగాడు. మరీచి మొదలగు ప్రజాపతులను సృష్టించాడు కానీ వారి వలస సృష్టి వేగంగా వృద్ధి చెందడం లేదని గ్రహించాడు. తాను పుట్టినది మొదలు సృష్టి ఎలా చెయ్యాలా అని ఎన్నో ప్రయత్నాలు చేసినా అవి ఫలించడం లేదు. సృష్టి సాగడం లేదు.

మరలా పరమాత్మను మనసులో తలచుకున్నాడు. తీవ్రంగా ఆలోచించాడు. ఆ ఆలోచనా ఫలితంగానే ఆయన తనను తాను రెండుగా విభజించుకున్నాడు. అంటే సృష్టిలో రెండు జాతులు ఉండాలి అని నిర్ధారించుకున్నాడు. అవే ఆడ, మగ. అన్ని ప్రాణులలోనూ ఈ రెండు జాతులే ఉండాలి అని అనుకొని తనను తాను రెండుగా విభజించుకున్నాడు. దానినే కాయము అంటే దేహము అని అన్నాడు. ఆ దేహమును ధరించిన వాడు దేహధారి అని అన్నారు. కాబట్టి రెండు విధములైన దేహములను ఏర్పరిచాడు. అవే ఆడ మగ. ఆడ మగ మధ్య ఆకర్షణ పెట్టాడు. అవి కలుసుకుని మైధునక్రియ సలిపితేనే గాని సృష్టిజరగదు. ఆ మగ శరీరము పేరు స్వాయంభువ మనువు. ఆ ఆడ శరీరం పేరు శతరూప.

(వీరి పేర్లు గమనించండి. స్వాయంభువుడు అంటే తనకు తానుగా పుట్టిన వాడు. శతరూప అంటే నూరురూపములు. నూరు అంటే వంద అని కాదు. లెక్కలేనన్ని. స్త్రీ తన నుండి జీవజాతులను సృష్టించగలదు. ఒక్కొక్క దేహానికి ఒక్కొక్క రూపము. ఒకరికి పోలిన వాళ్లు ఒకరు ఉండరు. అందుకే ఆమెను శతరూప అని పేరుపెట్టారు.  బహుశా ఇక్కడినుండి తీసుకున్నదే ఆదాము, ఈవ్. వారుకూడా మొదటి దేహములు అని బైబిల్ లో చెప్పబడింది కదా!)

తదా మిథున ధర్మేణ ప్రజాహ్యేధాంబభూవిరే.

అప్పటి నుండి స్త్రీపురుషుల కలయిక వలన అనగా మిథున ధర్మము వలన ప్రజలు వృద్ధిపొందారు. ఇక్కడ మరొక మాట కూడా చెప్పకోవాలి.ఈ ప్రజలందరూ మనువుకుజన్మించారుకాబట్టి మానవులు అని పిలువబడ్డారు. మనువు కుమారులు మానవులు. స్వాయంభువ మనువుకు శతరూపకు ఐదురు సంతానం కలిగారు. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే కుమారులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే కుమార్తెలు కలిగారు.

మనువు ఆకూతి అనే కుమార్తెను ఋచి అనే ఋషికి, మధ్య పుత్రిక దేవహూతిని కర్దముడు అనే ఋషికి, ప్రసూతి అనే ఆఖరుకుమార్తెను దక్షునికి ఇచ్చి వివాహం జరిపించాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## పదమూడవ అధ్యాయము.

"ఓ మైత్రేయ మహర్షీ! స్వాయంభువ మనువు, శతరూప తరువాత ఏమేమి చేసారు. వివరించండి" అని విదురుడు మైత్రేయ మహర్షిని అడిగాడు. అప్పుడు మైత్రేయుడు ఈ ప్రకారం చెప్పాడు.

"విదురా! మనువు ఆ పరమాత్మను అనుదినము సేవించేవాడు. స్వాయంభువ మనువుకు శతరూపము వివాహం జరిగింది.
(ఇదే మొదటి వివాహము. అంటే వివాహము లేనిదే స్త్రీపురుషులు కలవ కూడదు. సంతానం కనకూడదు అనే నిబంధన సృష్టి పుట్టినప్పటి నుండి ఉంది. ఈ రోజుల్లో "పెళ్లికాకుండానే కలిసి జీవించడం, పెళ్లి వృథా" అని ఒక విపరీత ధోరణి ప్రబలుతూ ఉంది. అది ఎంత విరుద్ధభావమో గమనించండి.)

అప్పుడు స్వాయంభువ మనువు చేతులుజోడించి బ్రహ్మదేవుని ఇలా ప్రార్థించాడు.

"ఓ దేవదేవా! నీవు సకల ప్రాణులను సృష్టిస్తున్నావు. నీకు నీవు సృష్టించిన వారి మీద నీకు ప్రేమ కానీ ద్వేషం కానీ లేవు. నేను నీ సంతానమును. నేను నీకు ఎటువంటి సేవచేయాలో ఆజ్ఞాపించు. మా శక్తికి తగ్గట్టు నీకు మేము ఎటువంటి సేవచేయగలమో

ఆజ్ఞాపించు. మాకు ఈ లోకంలో నూ పర లోకం లోనూ కీర్తి కలిగించే మార్గము చెప్పండి." అని ప్రార్థించాడు.

అప్పుడు బ్రహ్మ స్వాయంభువ మనువుతో ఇలా అన్నాడు. "నీవు నన్ను ఏమి చెయ్యాలి అని అడిగావు. నాకు చాలా సంతోషంగా ఉంది. నీవు నా మానస పుత్రుడవు. తండ్రి ఆజ్ఞను పాలించే పుత్రులు ఉండటం కన్నా ఆ తండ్రికి ఆనందం ఏముంటుంది. నీవు నీ భార్య శతరూప కలిసి గుణవంతులు, వీర్య వంతులు అయిన సంతానమును పొందండి. దాని వలన సృష్టి కొనసాగుతుంది. యజ్ఞములు చేసి యజ్ఞపురుషుని ఆరాధించు. ప్రజలను జనరంజకంగా పరిపాలించు. పరమాత్మ నీకు అండగా ఉంటాడు. యజ్ఞముల చేత యజ్ఞపురుషుడైన విష్ణువు తృప్తిపరచు." అని ఆదేశించాడు బ్రహ్మ.

అప్పుడు మనువు బ్రహ్మను ఇలా అడిగాడు. "ఓ బ్రహ్మదేవా! నేను నీ ఆజ్ఞను పాలించడానికి సిద్ధంగా ఉన్నాను. కానీ నేను నివసించడానికి, సంతానమును పొందడానికి తగిన ప్రదేశము ఎక్కడ ఉంది. నేను ఎక్కడ ఉండాలి. ఎందుకంటూ ఇప్పటి వరకూ సకల జీవులకు నివాసము అయిన భూమి ప్రళయకాలసమయమున జలములో మునిగి పోయింది.  ఆ భూమిని మరలా పైకి తీసుకు రావడానికి ప్రయత్నం చేయండి." అని ప్రార్థించాడు మనువు.

బ్రహ్మ ఆలోచనలో పడ్డాడు. ప్రళయకాలంలో భూమి అంతా జలమయం అయింది. భూమి జలంలో మునిగిపోయింది.

(అంటే సముద్రములు అన్నీ పొంగి భూమి అంతా జలమయం అని అర్థం చేసుకోవాలి). ఈ భూమిని మరలా జలం నుండి ఎలా విముక్తి చేయాలి. అని దీర్ఘంగా ఆలోచిస్తూ నిట్టూర్పులు విడుస్తున్నాడు.

ఆ సమయంలో ఆయన నిశ్వాస గుండా ఒక చిన్న వరాహము పిల్ల బయటకు వచ్చింది. అది బొటనవేలి ప్రమాణంలో ఉంది. ఈ వరాహము పిల్ల ఎవరా అని చూస్తూ ఉండగానే అది పెరిగి పెద్దది అయింది. క్షణంలో ఏనుగు అంత అయింది.

బ్రహ్మ ఆశ్చర్యపోయాడు. మరీచి మొదలగు ప్రజాపతులను పిలిపించాడు. వారితో సమాలోచనలు జరిపాడు. ఈ వరాహము ఎవరు? ఇది ఏదైనా దేవతా రూపమా? కేవలం నా ముక్కులో నుండి ఇంత పెద్ద వరాహము రావడం ఆశ్చర్యంగా ఉంది.సందేహము లేదు. ఇది యజ్ఞపురుషుడు అయిన ఆ పరమాత్మయే." అని అనుకున్నాడు.

ఇంతలో యజ్ఞపురుషుడు అయిన భగవానుడు కొండమాదిరి పెరిగిపోయి  పెద్దగా గర్జించసాగాడు. అది చూచి బ్రహ్మ, మరీచి మొదలగు వారు ఎంతో సంతోషించారు. భగవానుని గర్జన విని జనలోకము తపోలోకము, సత్యలోకములో ఉన్న వారు కూడా ఎంతో సంతోషించారు. భగవానుని వేద మంత్రములతో కీర్తించసాగారు. యజ్ఞవరాహమూర్తి అయిన భగవానుడు భూమిని ఉద్ధరించడానికి  జలములోకి ప్రవేశించాడు.

అంత పెద్ద శరీరము ఒక్కసారిగా నీటిలో పడేసరికి  ఆ

వేగానికి ఆ జలము పెద్దగా ధ్వని చేస్తూ రెండుగా చీలినట్టు అయింది. ఆ ప్రకారంగా యజ్ఞవరాహ మూర్తి రసాతలము చేరుకున్నాడు. జలములో మునిగి ఉన్న భూమిని చూచాడు. భూమిని చూడగానే ఆ యజ్ఞవరాహ మూర్తి భూమిని తన కోరలతో లేవనెత్తి రసాతలము నుండి పైకి తీసుకువస్తున్నాడు.

ఆ సమయంలో హిరణ్యాక్షుడు అనే దైత్యుడు ఆయనను అడ్డగించాడు. కోపించిన యజ్ఞవరాహ మూర్తి ఆ హిరణ్యాక్షుడు అనే దైత్యుని సునాయాసంగా చంపాడు. భూమిని జలము నుండి పైకి తీసుకొని వచ్చాడు. అది చూచి ఋషులు అందరూ భగవానుని ఈ ప్రకారంగా స్తుతించారు.

"ఓ యజ్ఞపురుషా! వేదమయా! నీకు నమస్కారము. ఈ భూమిని జలము నుండి ఉద్ధరించడానికి అవతరించిన నీకు నమస్కారము. నీ యజ్ఞమే నీ అవతారము. అటువంటి యజ్ఞావతారము చెడ్డవారికి కనిపించదు. నీవు సాక్షాత్తు యజ్ఞస్వరూపుడవు. నీ చర్మము నందు యజ్ఞమంత్రములు, రోమములలో పవిత్రములన దర్భలు, కళ్లలో నెయ్యిమొదలగు యజ్ఞకుండములో వేయు హెూమద్రవ్యములు, పాదములలో ఋత్విక్కుల కర్మలు కలిగి ఉన్నావు. నీ పొడుగాటి ముఖము కొస యజ్ఞములో నెయ్యి వేయుటకు ఉపయోగించే గరిటె మాదిరి ఉంది. నీముక్కు ఒక యజ్ఞపాత్ర. నీ పొట్ట యజ్ఞములో ఉపయోగించే ఇడ అనే పాత్ర. నీ చెవులు చమస అనే యజ్ఞ పాత్ర. నీ ముఖము ప్రాశితము అనే పాత్ర. నీవు నమలడమే అగ్నిహెూత్రము మండుతున్నట్టు ఉంది. నీవు అవతరించడమే ఒక దీక్ష. నీ మెడ మూడు ఉపసత్తులు.

నీ దంతములు ప్రాయణీయము (దీక్ష మొదలు, ఆఖరు). నీ నాలుక ప్రవర్గ్యము. (మహావీరము అనే కర్మ. ఒకపాత్రలో నెయ్యి పోసి, ఆ పాత్రను బాగా వేడి చేసి అందులో పాలు పోస్తే భగ్గున మండుతుంది. అదే మహావీరము). శిరస్సు సభ్యాగ్ని. (అందులో హోమం చెయ్యరు). ఆవసథ్యఅగ్ని (అంటే ఇంట్లో ఉండే అగ్ని. ప్రతిగృహస్తు నిత్యము చేయవలసిన ఔపోసనా కార్యక్రమములో ఉంచే అగ్ని.). నీ ప్రాణములు చితి అనే అగ్ని కుండములు. సోమరసము నీ వీర్యము. యజ్ఞము చేసేటప్పుడు ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము చేసే అగ్నికార్యములు, నీ యొక్క ఆసనములు. యేడు రకములైన యజ్ఞములు అనగా అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థము, షోడశి, వాజపేయము, అతిరాత్రము, ఆప్తోర్యామము అవి నీలో ఉన్న ఏడు ధాతువులు.  నీ శరీరంలో ఉన్న సంధులు సకల యజ్ఞ స్వరూపాలు. నీ శరీరమే యజ్ఞమయము.

ఓ దేవా! యజ్ఞములో పఠించే సర్వ మంత్రములు, ఆహ్వానింపబడే సర్వదేవతలు, యజ్ఞములో ఉపయోగించే సకల ద్రవ్యములు, అన్ని రకములైన యజ్ఞములు, యజ్ఞములో చేసేసకల కర్మలు అన్నీ నీ రూపాలే. అట్టి నీకు నమస్కారము. కేవలము వైరాగ్యం చేత, భక్తి చేత, ఏకాగ్రచిత్తం చేత అనుభవంలోకి వచ్చే జ్ఞానమే నీ స్వరూపము. అటువంటి జ్ఞానమును ఇచ్చే నీకు నమస్కారము. నీ కోరల మీద నిలిచి ఉన్న ఈ భూమి ఎంతో శోభాయమానంగా ఉంది. సకల ప్రాణులు జీవించడానికి ఆధారమైన ఈ భూమిని నీటి మీద నిలుపు. నీ శక్తి ఆ భూమిలో నిక్షిప్తమై ఉంది. అటువంటి నీకు. భూదేవికి నమస్కరిస్తున్నాము. రసాతలంలో జలమధ్యంలో ఉన్న

భూమిని పైకి తీసుకు రావడం నీ ఒక్కడికే సాధ్యం అవుతుంది. అంత సాహసం నీకు తప్పఎవరికీ లేదు. ఈ విశ్వమే నీ మాయ వలన సృష్టించ బడింది. నీవు ఈ ప్రళయకాల జలముల నుండి బయటకు వచ్చిన తరువాత నీ శరీరాన్ని విదిలించినప్పుడు పడ్డ తుంపరలలో జలకమాడిన మేము పవిత్రులము అయ్యాము. నీ లీలలు వర్ణింపలేము. నీ లీలలయొక్క అంతము తెలుసు అన్న వాడి కన్నా మూఢుడు మరొకడు ఉండడు. నీ మాయాగుణము చేత ఈ జగత్తు అంతా మాయామోహితమై ఉంది. అట్టి నీకు నమస్కారము." అని జనలోక, తపోలోక వాసులు ఆ యజ్ఞవరాహ మూర్తిని స్తుతించారు. (అందరూ అసహ్యించుకొనే వరాహమును ఒక యజ్ఞస్వరూపునిగా భావించడం మనమహాఋషులకే చెల్లింది. అంతగొప్పది మనసంస్కృ తి).

అప్పుడు యజ్ఞవరాహ మూర్తి అయిన భగవానుడు తన గిట్టలతో నీటిని అటు ఇటు నెట్టి భూమిని నీటిపై నిలిపాడు. తరువాత యజ్ఞవరాహ మూర్తి అయిన భగవానుడు అంతర్హితుడు అయ్యాడు.

ఈ కథను విన్న వారికి వినిపించిన వారికి పరమాత్మ ప్రసన్నుడు అవుతాడు. ఆ భగవానుడే ప్రసన్నుడయితే ఇంక కావాల్సింది ఏముంటుంది? దాని ముందు ఇహ లోక సుఖములు, ధన ధాన్యములు, భోగభాగ్యములు తుచ్ఛమైనవి.

నిశ్చలమైన భక్తితో భగవంతుని ధ్యానిస్తే ఆయనే స్వయంగా పరమపదమును ఇస్తాడు. ఈ భగవంతుని కథలు అనే అమృతమును చెవులారా వినిన వాడు వాటిని ఎలా విడువగలడు. విడిస్తే వాడు పశు

వుతో సమానము." అని మైత్రేయుడు విదురునికి చెప్పాడు.

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము పన్నెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## పదమూడవ అధ్యాయము.

మైత్రేయుడు గబా గబా చెప్పుకు పోతుంటే విదురుడు అడ్డుతగిలాడు. "ఓ మైత్రేయ మహర్షీ! హిరణ్యాక్షుడు అడ్డు తగిలితే యజ్ఞవరాహమూర్తి అయిన పరమాత్మ ఆయనను సంహరించాడు అని చెప్పారు. అసలు ఈ హిరణ్యాక్షుడు ఎవరు? వరాహమూర్తిని ఎందుకు అడ్డగించాడు. నాకు ఏమీ అర్థం కాలేదు. వివరంగా చెప్పండి" అని అడిగాడు. అప్పుడు మైత్రేయుడు ఈ ప్రకారంగా చెప్పసాగాడు.

"విదురా! ఈ వృత్తాంతమును పూర్వము బ్రహ్మదేవుడు దేవతలకు చెబుతుంటే నేను విన్నాను. దానినే నీకు చెబుతాను. శ్రద్ధగా విను. దక్షుడు తనకుమార్తె దితిని కశ్యప ప్రజాపతికి ఇచ్చి వివాహం చేసాడు. కాని ఆమెకు ఎంత కాలానికి సంతానం కలగలేదు. ఒక రోజు సాయంత్రం ఆమె చక్కగా అలంకరించుకొని భర్త అయిన కశ్యపుని వద్దకు వచ్చింది. ఆ సమయంలో కశ్యపుడు సాయంత్రం చేయవలసిన అగ్నిహోత్రమును చేసి, ధ్యానంలో కూర్చుని ఉన్నాడు.

ఆ సమయంలో దితి తన భర్త కశ్యపునితో ఇలా అంది. "నాథా! మీకు తెలుసు కదా. నాకు సంతానము లేదు. నా సవతుల ముందు నేను సిగ్గుతో తల ఎత్తుకోలేకపోతున్నాను. నా మీద అనుగ్రహం చూపి నాకు సంతాన ప్రాప్తి కలిగించండి. మీరు తపస్సంపన్నులు. గుణవంతులు. అటువంటి మీకు పుట్టబోయే కుమారుడు ముల్లోకములచేత కీర్తింపబడతాడు. అటువంటి పుత్రుని కన్న నేను కీర్తిమంతురాలనవుతాను. మా తండ్రి గారైన దక్షుడు తన పదముగ్గురు కుమార్తెలను తమరికి ఇచ్చి వివాహం చేసాడు. మేమంతా మిమ్మల్ని కోరి కోరి వివాహం చేసుకున్నాము. నేను మీ మాట జవదాటకుండా నడుచుకుంటున్నాను. అటువంటి నాకు పుత్రసౌభాగ్యం కలిగించకపోవడం భావ్యమా! కాబట్టి నాయందు దయయుంచి నాకు పుత్రబిక్ష పెట్టండి. నా కోరిక తీర్చండి. మీకు నేను చేస్తున్న ప్రార్థన వృధా కానివ్వకండి." అని ప్రాధేయపడింది దితి.

ఆమెను చూచి కశ్యపుడు కళ్లు తెరిచి ఆమెతో ఇలా అన్నాడు. "సౌభాగ్యవతీ! నీ కోరిక తప్పకుండా తీరుతుంది. గృహస్తుకు తన భార్యను సంతోషపెట్టడమే ముఖ్యకర్తవ్యము. అప్పుడు నేను గృహస్థాశ్రమము స్వీకరించినందుకు ఫలం దక్కుతుంది. గృహస్తు తన భార్య సహాయ సహకారములతోనే కదా యజ్ఞయాగములు, దాన ధర్మములు చేసి తరిస్తాడు. అందుకే భార్యను అర్థాంగి అని అంటారు. భార్య ఇంటి బాధ్యతలను సమర్థవంతంగా నెరవేరుస్తుంటే భర్త, నిశ్చింతగా తిరుగుతుంటాడు. అందుకే అన్ని ఆశ్రమములలోని గృహస్థాశ్రమము ఉత్తమమైనది అని అంటారు. అందులోనూ నీ వంటి భార్యను పొందిన నేను ధన్యుడను. నీవు నాకు చేసిన సేవలకు ఈ జన్మలో గానీ వచ్చే జన్మలో గానీ నీఋణము తీర్చుకోలేను. నీకు పుత్ర

సంతానమును కలుగచేయడానికి నేను సమర్ధుడను.

కాని ఈ సమయంలో మనం మైధున క్రియ చేస్తే లోకం మనలను క్షమించదు. ఎందుకంటే, ఇది సంధ్యాసమయము. ఘోరమైన కాలము. ఇప్పుడు రుద్రుని అనుచరులు సంచరిస్తూ ఉంటారు. రుద్రుడు కూడా తన వృషభమును ఎక్కి లోక సంచారం చేస్తుంటాడు. ఇది నిషిద్ధసమయము. ఈ సమయములో రుద్రుడు తన మూడు నేత్రములతో లోకములను తీక్షణంగా చూస్తుంటాడు. (మూడు నేత్రములు అంటే సూర్యుడు చంద్రుడు. సంధ్యాసమయంలో సూర్యుడు అస్తమిస్తుంటాడు. అలాగే చంద్రుడు ఉదయిస్తుంటాడు. ఇద్దరూ ఆకాశంలో కనపడతారు. మూడో నేత్రము అగ్ని. సంధ్యా సమయంలో అగ్ని సాయంత్రపు అగ్నిహెూత్రరూపంలో ప్రజ్వరల్లుతూ ఉంటుంది.) రుద్రునికి తన వారు పెరవారు అనే బేధము ఏదు. తప్పుచేస్తే ఎవరినైనా శిక్షిస్తాడు.
(వరుసకు రుద్రుడు దితి బావగారు అవుతాడు. ఎలా అంటే దితి సోదరి సతిని రుద్రుడు పెళ్లి చేసుకున్నాడు.) నీ బంధువు అని రుద్రుడు క్షమిస్తాడేమో ఆయనకు అటువంటి భేదం లేదు అని నర్మగర్భంగా అన్నాడు కశ్యపుడు.

కశ్యపుడు ఇంకా ఇలా అన్నాడు. "రుద్రునికి సమానమైన వాడు గానీ అధికమైన వాడు కానీ లేడు. ఆయన శాసనము అనుల్లంఘనీయము. కేవలము ఈ శరీరమే తాము అని, ఈ శరీరమునకు అనేకము లైన అలంకరణములు చేసుకొని తృప్తి చెందే వారు, శ్మశానవాసి, భస్మముపూసుకొని చర్మము కట్టుకొని తిరిగే

రుద్రుని భయంకరస్వరూపుడు అని పరిహసిస్తుంటారు. కాని బ్రహ్మ మొదలగు వారు కూడా రుద్రుని ఆజ్ఞకు లోబడే తమ తమ విధులను నిర్వర్తిస్తుంటారు. యోగమాయ ఆయన అధీనము. అందుకని పరమాత్మస్వరూపుడు అయిన రుద్రుని తత్త్వము తెలుసుకోవడం చాలా కష్టం. కాబట్టి ఆ రుద్రుడు సంచరించే సమయంలో మనం సంగమిచండం క్షేమం కాదు." అని సున్నితంగా చెప్పాడు కశ్యపుడు.

కానీ కామంతో కళ్లు మూసుకుపోయిన దితికి కశ్యపుని బోధ చెవికి ఎక్కలేదు. ఇప్పుడే నాకు సంతాన ప్రాప్తి కలిగించమని బలవంతం చేసింది. దితిని ఒప్పించడం తన వల్ల కాదనుకున్నాడు కశ్యపుడు. ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది అని అనుకున్నాడు. మనసులో ఈశ్వరునికి నమస్కరించాడు. ఒక ఏకాంతప్రదేశంలో తన భార్య దితితో మైధున కార్యంలో పాల్గొన్నాడు. ఆమెలో తన వీర్యాన్ని నిక్షిప్తం చేసాడు. తరువాత స్నానం చేసి ఆచమించి ధ్యానంలో కూర్చున్నాడు.

ఆవేశం చల్లారిన తరువాత భర్తమాటలలోని యదార్థం గ్రహించింది దితి. తన కామ ప్రవర్తనకు సిగ్గు పడింది. మెల్ల మెల్లగా భర్త వద్దకు వచ్చింది దూరంగా నిలబడి తలవంచుకొని ఇలాఅంది. "నాధా! నేను భూతపతి అయిన రుద్రుని ఎడల అపరాధం చేసాను. ఆయన నా గర్భం నాశనం చేస్తాడేమో అని భయంగా ఉంది. ఆ మహాదేవునకు మనస్ఫూర్తిగా నమస్కరిస్తున్నాను. రుద్రుడు నా చెల్లికి భర్త. ఆ మాత్రం నా వంటి స్త్రీలమీద దయచూపకుండా ఉంటాడా! అందుచేత ఆయన నా మీద తన ప్రసన్నమైన చూపులను ప్రసరిస్తాడు. నాకు ఏమీ అపకారము చేయడు." అని అంది.

ఆ మాటలు విన్న కశ్యపుడు దితితో ఇలా అన్నాడు. "నీవు నీ మనోనిగ్రహాన్ని కోల్పోయావు. నీ మనస్సు అపవిత్రం అయింది. నేను ఎంత చెప్పినా నీవు వినలేదు. రుద్రునికి అపచారం చేసావు. సంధ్యాకాలంలో మైధునక్రియకు పాల్పడ్డ దోషం నిన్ను చుట్టుకుంటుంది. ఆకారణంగా నీకు దుర్మార్గులు, కులనాశకులు అయిన ఇద్దరుకుమారులు జన్మిస్తారు. వారు ముల్లోకములను క్షోభపెడతారు. అందరినీ పీడించుకుతింటారు. లోకకంటకులవుతారు. నిరపరాధులను చంపుతారు. స్త్రీలను చెరపడతారు. ఋషులను వేధిస్తారు. వారిఆగడములను భరించలేక పరమాత్మ తానే వరాహావతారము, నరసింహావతారం దాల్చి వారిని సంహరిస్తాడు." అని చెప్పాడు కశ్యపుడు.

ఆ మాటలకు దితి ఇలా అంది. "నా కుమారులు ఆ పరమాత్మచేతిలో చావాలని, బ్రాహ్మణుల కోపాగ్ని వల్ల చావకూడదనీ ప్రార్ధిస్తున్నాను. ఎందుకంటే బ్రాహ్మణుల కోపానికి గురి అయిన వాళ్లను, నరకంలో ఉన్న వారు కూడా క్షమించరు." అని పలికింది.

దానికి కశ్యపుడు ఇలా అన్నాడు. "ఇదంతా నీవే చేజేతులా చేసుకున్నావు. నేను వద్దని వారించినా వినలేదు. కాని తరువాత పశ్చాత్తాప పడుతున్నావు. దాని వలన నీలో జ్ఞానం పుట్టింది. చేసిన తప్పు తెలుసుకున్నావు. కాబట్టి నీకుపుట్టబోయే కుమారులలో ఒకడికి పుట్టబోయే కొడుకు పరమభాగవతోత్తముడు అవుతాడు. లోకోత్తర కీర్తి గడిస్తాడు. అతడి కీర్తిని ముల్లోకములు గానం చేస్తాయి. మానవులు నీ మనుమని ఆదర్శంగా తీసుకొని తమ ఆత్మలను శుద్ధిచేసుకుంటారు.

శ్రీహరి నీ మనుమని భక్తికి ఎంతోసంతోషిస్తాడు. అతడు ప్రహ్లాదుడు అనే పేరుతో కీర్తింపబడతాడు. శ్రీహరి ఎడల అత్యంత భక్తిభావంతో ఉంటాడు.

ప్రహ్లాదు జితేంద్రియుడు. దేహాభి మానము లేని వాడు. మంచి వాడు. ధైర్యవంతుడు. ఇతరులు బాగుపడితే సంతోషిస్తాడు. అతడికి శత్రువులు అంటూ ఉండరు. ప్రహ్లాదుని చూచినంతనే ప్రజలు పూర్ణచంద్రుని చూచి నంత ఆనందం పొందుతారు. అటువంటి వాడు నీకుమనుమడుగా, పరమదుర్మార్గుడైన నీ కుమారునికి కుమారునిగా జన్మిస్తాడు."అని అన్నాడు కశ్యపుడు.

ఆ మాటలు విన్న దితి ఎంతో సంతోషించింది. కొడుకులు దుర్మార్గులు అయినా మనుమడు పరమభాగవతోత్తముడు అయినందుకు సంతోషించింది. పైగా తన కుమారులకు శ్రీహరి చేతిలో మరణం సంభవించబోతున్నందుకు కూడా దితి హర్షం వెలిబుచ్చింది.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## పదునైదవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పసాగాడు. "ఎంత మనసు సరిపెట్టుకున్నా తన కడుపులో రాక్షసులు పెరుగుతున్నారు అన్న బాధ దితి మనసులో కలచివేస్తూ ఉంది. ఆ ప్రకారంగా దితి నూరు సంవత్సరముల పాటు గర్భం ధరించింది.

దితి గర్భములో ఉన్న దైత్యుల ప్రభావానికి సూర్యుని కాంతి తగ్గిపోయింది. దిక్కులలో చీకట్లు అలముకుంటున్నాయి. ఇంద్రుడు మొదలగు లోక పాలకులు ఈ విషయాన్ని బ్రహ్మ దృష్టికి తీసుకొని వెళ్లారు.

"దేవా!నీకు అన్నీ తెలుసు. ఈ ఉత్పాతాలు ఎందుకు జరుగుతున్నాయో మేము చెప్పపనిలేదు. మా భయం గురించి కూడా నీకు తెలుసు. నీ జ్ఞానము అపూర్వము. పరమాత్ముని మాయ చేత నీకు ఈ దేహము వచ్చిందని మాకు తెలుసు నీవే మాయాస్వరూపుడవు. రజోగుణము ధరించి ఈ సృష్టిని చేస్తున్నావు. జగత్తుకు కారకుడవైన నీకు నమస్కరిస్తున్నాము. మూడు లోకములు నీలోనే ఉన్నాయి. నిన్ను భక్తితో పూజించే వారికి ఎప్పుడుకూడా ఆపదలు కలుగవు. నీ చేత సృష్టించబడిన ప్రజలందరూ సదా నిన్నే స్మరిస్తుంటారు. అటువంటి నీకు నమస్కారము. మాకు వచ్చిన ఆపదలను కూడా నీవు దయయుంచి చూడు.

నిషిద్ధసమయములో దితి యందు నిక్షిప్తమైన కశ్యపుని వీర్యము దిన దిన ప్రవర్థమానంగా పెరుగుతూ ఉంది. అది ముల్లోకములకు ప్రమాదం తెచ్చిపెడుతుందని భయంగా ఉంది." అని అన్నారు.

బ్రహ్మదేవుడు తన యోగదృష్టితో అంతా తెలుసుకున్నాడు. ఇంద్రుడు మొదలగు దిక్పాలకులను చూచి ఇలా అన్నాడు. "నేను మొదట సనకాదులను పుట్టించాను. వారు విరక్తితో ఊర్ధ్వలోకములలో తిరుగుతున్నారు. ఒకసారి వారు శ్రీమన్నారాయణుని దర్శించుకోడానికి వైకుంఠమునకు వెళ్లారు.

వైకుంఠములో నివసించే వారంతా శ్రీమన్నారాయణుని మాదిరే ఉంటారు. ఆయనను సేవిస్తుంటారు. వైకుంఠవాసుడైన విష్ణువు శుద్ధసత్త్వమయ రూపంతో ప్రకాశిస్తూ ఉంటాడు. ఆ వైకుంఠములో నిశ్శ్రేయసము అనే వనము ఒకటి ఉంది. ఆ వనములో ఉన్న వృక్షములు అన్ని కాలములలోనూ ఋతువులలోనే ఫలములతో పుష్పములతో శోభిల్లుతూ ఉంటుంది. వైకుంఠ వాసులందరూ శ్రీహరి లీలలను  నిరంతరము గానం చేస్తుంటారు. వారికి శ్రీహరి మీద భక్తి తప్ప వైకుంఠములో ఉన్న భోగముల మీద ఆసక్తి లేదు.

తులసి మొక్క శ్రీహరికి అత్యతంత ప్రీతి పాత్రము. ఆ తులసి మొక్కను మిగిలిన అన్ని పుష్పజాతులు గౌరవిస్తుంటాయి. వైకుంఠములో ఉన్న లక్ష్మీదేవి యొక్క కరుణాకటాక్ష వీక్షణము కొరకు అందరూ ప్రయత్నిస్తుంటారు. కాని ఆ లక్ష్మీదేవి శ్రీహరి పాదసేవనము చేస్తూ తరిస్తూ ఉంటుంది.

వైకుంఠధామములో శ్రీహరి కథలను తప్ప వేరు కథల గురించి ఎవరూ ఆలోచించరు.

అన్ని జన్మలలో కెల్లా మానవ జన్మ శ్రేష్ఠమైనది. కానీ మానవులు శ్రీహరి సేవ చేయకుండా ప్రాపంచిక సుఖములలో మునిగి తేలుతుంటారు. వారు పరమాత్మ మాయలో పడి కొట్టుకుంటూ ఉంటారు. వారు వైకుంఠమును గురించి ఆలోచించరు. అలా కాకకుండా ఎల్లప్పుడూ శ్రీహరి సేవ చేసేవారు, మృత్యువు అంటే భయం లేని వారు, దయ, కరుణ,దానము మొదలగు గుణములు కలిగినవారు, శ్రీహరి నామస్మరణ చేతనే పులకించేవారు, అట్టివారు వైకుంఠ ధామమును చేరుకుంటారు.

అటువంటి వైకుంఠమునకు సనకాదులు చేరుకున్నారు. వారు ఆరు ద్వారములను నిరాటంకంగా దాటి వెళ్లారు. ఎవరూ వారిని అడ్డుపెట్టలేదు. ఏడవ ద్వారము వద్దకు వచ్చారు. అక్కడ గదలను ఆయుధములుగా ధరించిన వారు, కిరీటములు ధరించిన వారు అయిన ఇద్దరు ద్వారపాలకులు ఉన్నారు.

ఈ వచ్చిన వాళ్లు ఎవరు ఇంత దూరం ఎలా రాగలిగారు అని సనకాదులను కోపంతో చూచారు ఆ ద్వారపాలకులు. పైగా ఆ సనకాదులు వృద్ధులు. కానీ ఐదు సంవత్సరముల వయసు కల బాలుర మాదిరి ఉన్నారు. వారి ప్రభావమును తెలియక ఆ ద్వారపాలకులు సనకాదులను అడ్డగించారు. లోపలకు వెళ్లడానికి వీలులేదు అన్ని గట్టిగా చెప్పారు.

ఆ ద్వారపాలకుల పేర్లు జయుడు విజయుడు.

సనకాదులు ఎప్పుడెప్పుడు శ్రీహరిని చూద్దామా అని తహతహలాడుతున్నారు. ఇంతలో జయవిజయులు తమను అడ్డుపెట్టేటప్పటికి సహించలేకపోయారు.వారి ముఖములు కోపంతో ఎర్రగా అయ్యాయి. ఆ ద్వారపాలకులను చూచి ఇలా అన్నారు. " పూర్వజన్మలో ఎంతో పుణ్యం చేసుకుంటేనే గానీ, మానవులు వైకుంఠమునకు రారు. వైకుంఠమునకు వచ్చిన వారందరూ భగవంతుని మీద భక్తి, అందరినీ సమంగా ఆదరించే గుణము కలిగి ఉంటారు. మీరు కూడా ఆ ప్రకారంగా పూర్వపుణ్యవిశేషము చేతనే ఇక్కడకు వచ్చి ఉంటారు. కానీ మీ ఇద్దరికీ మునులను గౌరవించలేని దుర్బుద్ధి ఎలా కలిగింది.

శ్రీహరి అమిత శాంతస్వభావుడు. ఆయనకు విరోధులు అంటూ ఎవరూ లేరు. కానీ, మీరుమాత్రము శాంతమును కోల్పోయారు. మేము కూడా నీవలెనే ఉంటామని అనుకుంటున్నారు. ఈ వైకుంఠమునకు భగవద్భక్తులు తప్ప వేరే ఎవరూరారు కదా! మీరు ఎందుకు మమ్ములను శంకించారు, అడ్డగించారు.

శ్రీహరి ఎవరో తెలుసా మీకు? ఆయన ఈ సమస్త విశ్వములో తనలోనే ధరించి ఉన్నాడు. ఆయనకు ఎవరి పట్లా భేదభావము లేదు. అందరినీ సమానంగా చూస్తాడు. మీరు ఆ శ్రీహరి ఎలా ఉంటాడో అటువంటి వేషమును ధరించి ఉన్నారు. కానీ మీలో సామాన్య మానవులకు ఉండే ఈ భేదబుద్ధి కలగడానికి కారణం ఏమి?

మీరు ఈ వైకుంఠము ద్వారము వద్ద ఉన్నారు. కానీ పరమ మూర్ఖులు. మీలో ఈ మూర్ఖత్వాన్ని పోగొట్టడానికి మీకు శిక్ష వేయాలి.మీకు తగిన శిక్ష గురించి ఆలోచిస్తున్నాము. మీలో ఉన్న ఈ భేదబుద్ధి దోషం వలన, మీరు ఇద్దరూ తక్షణమే ఈ వైకుంఠమును విడిచిపెట్టాలి. కామ,క్రోధములకు నిలయమైన పాపజన్మలు పొందండి. పాపాత్ములుగా పుట్టండి." అని శపించారు.

జయవిజయులకు తమ తప్పు తెలిసి వచ్చింది. వెంటనే వారు ఇద్దరూ సనకాదుల కాళ్ల మీద పడ్డారు. తప్పు కాయమని వేడుకున్నారు. "మహాత్ములారా! మేమే పాపం చేసాము. మీరు మాకు శాపం ఇవ్వడం సరి అయినదే. ఈ శాపం ద్వారా మేము చేసిన పాపములు తొలగిపోయి పునీతులము అవుతాము. మా మీద మీరు కనికరం చూచి,మేము ఎటువంటిపాప జన్మలు ఎత్తినను, భగవంతుని మీద స్మృతిని మాత్రము మరిచిపోకుండా ఉండేటట్టు అనుగ్రహించండి." అని వేడుకున్నారు.

ఈ విషయం అంతా శ్రీహరికి తెలిసింది. ఆయన లక్ష్మీసమేతంగా పాదచారియై అక్కడకు వచ్చాడు. తమ వద్దకు నడిచి వస్తున్న శ్రీమహావిష్ణువును సనకాదులు చూచారు. వెంటనే వారు శ్రీహరికి నమస్కరించారు. శ్రీహరిని చూచి వారి శరీరములు పులకించాయి. ఆయనను మనసులోనే ధ్యానిస్తున్నారు. సనకాదులు శ్రీహరిని ఈ విధంగా కీర్తించారు.

"ఓ దేవా! నీవు అందరి జీవులహృదయములలో ఉన్నప్పటికినీ, పాపాత్ములకు నీవు కనిపించవు. కానీ మాకు మాత్రము నీ దివ్యమంగళ విగ్రహమును దర్శింపజేసావు. మా తండ్రియగు బ్రహ్మ గారు నీ రహస్యమును మాకు బోధించారు. ఆ బోధనలతో నీవు మాలో ప్రవేశించావు. ఆహంకారము లేని వారికీ, రాగద్వేషములు లేని వారికీ, నీ దయ వలన నీ స్వరూపము కనిపిస్తుంది. వారు తమ తమ మనసులలో నిన్ను నిలుపుకొని నీ తత్త్వాన్ని పొందగలుగుతారు.

నీవే పరతత్త్వము అని మాకు తెలుసు. నీవు విశుద్ధమైన సత్త్వగుణ స్వరూపుడవు. నీవు నిరంతరము నీ భక్తులకు ఆనందాన్ని కలుగజేస్తుంటావు. నీ పాదములను ఆశ్రయించిన నీ భక్తులకు నీవు మోక్షము ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నా, వారు దానిని తీసుకోరు. ఇంక స్వర్గసుఖములను ఎలా కోరుకుంటారు. నీభక్తులుఎల్లప్పుడూ నీ పాదకమలముల సేవను కోరుకుంటారు. వారికి ఈ మోక్ష పదము, స్వర్గపదము కానీ వారికి అక్కరలేదు. ఓ దేవా! ఎల్లప్పుడూ మా చిత్తములు నీ యందే నిలిచేటట్టు అనుగ్రహించు. ఎల్లప్పుడూ మా వాక్కు నిన్ను కీర్తించేట్టు అనుగ్రహించు. మేము ఏమైనా పాపము చేసి ఉంటే మమ్ములను మన్నించు. నీ మనోహరమైన రూపము చూచి మా జన్మధన్యమైంది. ప్రాపంచిక విషయములయందు ఆసక్తి కలవారికీ, ఇంద్రియలోలురకు నీ రూపము గోచరించదు. మా యందు దయ ఉంచి నువ్వు మాకు కనపడ్డావు. మేము నీకు భక్తితో నమస్కరిస్తున్నాము." అని సనకాదులు ప్రార్థించారు.

శ్రీమద్భాగవతము

తృతీయస్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## తృతీయస్కంధము
## పదహారవ అధ్యాయము.

బ్రహ్మ దేవతలతో ఇలా అన్నాడు. "ఆ ప్రకారంగా తనను కీర్తించిన సనకాదులతో శ్రీహరి ఇలా అన్నాడు. "మహామునులారా! వీరి పేరు జయుడు, విజయుడు. వీరిద్దరూ నా పార్షదులు. మీరెవరో, నాకు మీరు ఎంత దగ్గర వారో, తెలియక వీరు మిమ్మల్ని లోపలకు రాకుండా నిరోధించారు. తప్పు చేసారు. మీరు నాకు అత్యంతభక్తులు. ఆ తప్పుకు మీరు వీరికి విధించిన శిక్ష సమంజసమే. ఇటువంటి పార్షదులను కలిగిన నేను కూడా వారు చేసిన తప్పుకు బాధ్యుడనే. వారి బదులుగా నేను మిమ్మల్ని నాపట్ల ప్రసన్నులు కావలసినది గా కోరుతున్నాను. సేవకుడు ఏదైనా అపరాధము చేస్తే దాని ఫలితము యజమాని కూడా అనుభవించాలి కదా!

మీరు సామాన్యులు కారు. నా కీర్తిని యశస్సును ముల్లోకములలో వ్యాపింపజేసారు. అటువంటి మీ పట్ల అపరాధము చేసిన వారు ఎటువంటి వారైనా వారిని సంహరించవలసినదే. వాస్తవానికి నా పాదములకు విలువ లేదు. కానీ నా పాదములను మీరు సేవించడం ద్వారా వాటికి మానవుల పాపములను నాశనము చేసే ప్రభావము కలిగినది. బ్రహ్మ మొదలగు దేవతలు తమ కోర్కెలు తీరడానికి లక్ష్మీదేవిని సేవిస్తూ ఉంటారు. కాని ఆ లక్ష్మీదేవి నా అనుగ్రహం కొరకు నన్ను సేవిస్తూ ఉంటుంది. నన్ను క్షణకాలము విడిచిఉండదు.

ఓ బ్రాహ్మణ శ్రేష్టులారా! నేను యజ్ఞ పురుషుడను. అగ్నిద్వారా నేను హవిస్సులను స్వీకరిస్తూ ఉంటాను. జ్ఞానులు వారు చేయు కర్మల యొక్క ఫలములను, వారు తినే ప్రతి వస్తువును నాకు సమర్పిస్తున్నారు. నాకు సమర్పించిన తరువాతనే వారు భుజిస్తున్నారు. నాకు నివేదించి వారు భుజించిన ఆహారమును నేను తిన్నట్టుగానే భావిస్తాను. యజ్ఞయాగములలో నాకు అర్పించే హవిర్భాగముల కన్నా నా భక్తులు నాకు నివేదించి, వారు భుజించే ఆహారమే నాకు ఎక్కువ ప్రీతి.

మీరు సేవించిన నా పాదములను కడిగిన జలమును లోకపాలకులు అందరూ భక్తితో స్వీకరిస్తారు. కానీ మీ వంటి బ్రాహ్మణుల యొక్క పాదములు కడిగిన జలమును పరమపవిత్రంగా నేను స్వీకరిస్తాను. నా శిరస్సున ధరిస్తాను. అటువంటి బ్రాహ్మణులకు అపకారం జరిగితే నేను సహించగలనా!

ఉత్తములైన బ్రాహ్మణులు, గోవులు, ఎటువంటి రక్షణ లేని ప్రాణికోటి, ఈ మూడింటిలో నేను నివసిస్తుంటాను. వారు నా శరీరముతో సమానము. అటువంటి బ్రాహ్మణులకు, గోవులకు, దీనులకు ఎవరైనా అపకారం చేస్తే వారు పాపలోకములకు పోతారు. వారిని యమదూతలు గ్రద్దలవలె పొడుచుకొని తింటారు.

ఉత్తములైన బ్రాహ్మణుల వాక్కు కఠినముగా ఉన్నను వారి మనసు వెన్న. అటువంటి బ్రాహ్మణులను ఎవరు సేవిస్తారో, ఆ బ్రాహ్మణభక్తులకు నేను సదా వశుడనై ఉంటాను. అటువంటి బ్రాహ్మణ

భక్తుడనైన నా యొక్క  సేవకులు మీపట్ల అపరాధము చేసారు. వారు చేసిన అపరాధములో నాకు కూడా భాగము ఉంది కాబట్టి మీరు వారికి ఇచ్చిన శాపము తొందరగా పూర్తి అయేటట్టు వారిని అనుగ్రహించండి.  మీరు వారికి ఇచ్చిన  శాపము అనుభవించిన తరువాత వారు మరలా నా దగ్గరకు వచ్చేటట్టు అనుగ్రహించండి." అని శ్రీహరి సనకాదులతో అన్నాడు.

ఇదంతా విన్న తరువాత సనకాదులకు శ్రీహరి తమను పొగుడుతున్నాడా లేక నిందిస్తున్నాడా అని అర్థం చేసుకోలేకపోయారు. అంతటి గూడార్థములతో కూడిన శ్రీహరి మాటలను వారు సరిగా అర్థం చేసుకోలేదు. కాని శ్రీహరి తమను అభినందించాడు అని అర్థం చేసుకున్నారు. అందుకని సనకాదులు శ్రీహరితో ఇలా అన్నారు.

"ఓ దేవా! నీవు సర్వాంతర్యామివి అయి ఉండి కూడా, నీకు అన్నీ తెలిసి ఉండి కూడా,  మా మీద  ఇంతగా నీ అనుగ్రహం చూపిస్తున్నావు అంటే నీ లీలలను మేము అర్థం చేసుకోలేక పోతున్నాము. ఓ దేవా! నీవు సదా బ్రాహ్మణుల మేలు కోరుతావనీ, నీవు బ్రాహ్మణులను పరదైవములుగా భావిస్తావనీ పలికావు. కానీ ఆ బ్రాహ్మణులకు మూలము నీవే కదా! నీ ముఖము నుండే కదా బ్రాహ్మణులు ఉద్భవించింది. నీ వలననే  కదా మూడులోకములలో సనాతన ధర్మము పుట్టింది. దానిని నీవు ఎప్పటికప్పుడు అవతరించి, నీ లీలలతో ఆ సనాతన ధర్మము నాశనం కాకుండా రక్షిస్తున్నావు. (ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే)

నీ అనుగ్రహము చేతనే కదా విరాగులు, విరక్తులు అయిన యోగులు ఈ పాపలోకములో ఎక్కువ కాలము ఉండకుండా సత్వరమే నిన్ను చేరుకుంటున్నారు. అటువంటి నీవు మా అనుగ్రహం కోరండంలో అర్థం మాకు బోధపడటం లేదు.

ముల్లోకములలో ఐశ్వర్యంకోరుకునే వారు లక్ష్మీదేవి పాదములను తమ శిరస్సున ధరిస్తారు. పూజిస్తారు. ఉపాసిస్తారు. ఆ లక్ష్మీదేవి నీ పాదములను ఆశ్రయించి నిన్ను సేవిస్తూ ఉంటుంది. నిన్ను సేవించే లక్ష్మీదేవి కంటే నీవు నీ భక్తులను ఎక్కువగా ప్రేమిస్తావు.

ఓ దేవా! సకల సౌభాగ్యములు నీ యందే ఉన్నాయి. అన్ని ఐశ్వర్యైములను ప్రసాదించేది నువ్వే. నీవు పరిశుద్ధుడవు. అటువంటి నీవు బ్రాహ్మణుల ధూళిని నీ శిరస్సున ధరిస్తాను అంటున్నావు. అది మమ్ములను శిక్షించడానికేనా దేవా!

మూడు యుగములలో నీవు అవతరిస్తున్నావు. ఈ మూడు యుగముల ధర్మములైన తపస్సు, శౌచము, దయ నీ యందే ఉన్నాయి. వాటి చేతనే నువ్వు ఈ లోకములను రక్షిస్తున్నావు. నీవు శుద్ధ సత్త్వగుణ సంపన్నుడవు. మాలో ఉన్న రజోగుణమును, తమోగుణమును పోగొట్టి మమ్ములను రక్షించు.

నీవు సదా బ్రాహ్మణులను రక్షిస్తూ ఉంటావు. లేకపోతే ఈ లోకములో వేదవిద్య నశించి పోతుంది. బ్రాహ్మణుల వలననే కదా సదాచారములు లోకములో తరతరాలుగా నిలిచి ఉండేది. ఎందుకంటే ఈ లోకంలో ప్రజలు పెద్దవాళ్లను అనుసరిస్తూ, వారి ఆచరించిన

ధర్మములను ప్రమాణంగా తీసుకుంటారు.

ఓ దేవా! నీవు సత్త్వగుణ సంపన్నుడవు. నీవు లోకసంరక్షణార్థము, అనేక అవతారములు ఎత్తి దుష్టులను సంహరిస్తున్నావు. వేదమార్గమును కాపాడుతున్నావు. ఓ దేవా! నీవు ముల్లోకములకు అధిపతివైనను, బ్రాహ్మణుల వద్ద వినయంగా ఉంటావు. అందువలన నీ ప్రభావమునకు, నీ కీర్తికి, యశస్సుకు భంగం వాటిల్లదు. నీవు బ్రాహ్మణుల ఎడల భక్తికలిగి ఉండటం కూడా నీ లీలగా భావిస్తుంటాము.

ఓ జగన్నాధా! మేము నీ ద్వారపాలకులు అయిన వీరికి శిక్ష విధించాము. ఆ శిక్షను మీరు మార్చవచ్చును లేక వేరే శిక్ష విధించవచ్చును. లేదా ఆ శాపమును తీసి వేసి, నిరపరాధులైన నీ పార్షదులను శపించినందుకు మమ్ములను శిక్షింపవచ్చును. నీవు ఏది చేసినా అది మాకు అంగీకారమే!" అని పలికారు సనకాదులు.

సనకాదుల మాటలు విన్న శ్రీహరి, తన నిర్ణయాన్ని ఇలా ప్రకటించావు. "ఓ బ్రాహ్మణోత్తములారా! మీ శాపము వలన వీరు ఇద్దరూ అసురులుగా జన్మిస్తారు. వీరు ఇద్దరూ నా మీద అధిక మైన కోపము కలిగి ఉండి. ఆ కారణంచేతనే త్వరలో నా దగ్గరకు వస్తారు. మీరు ఆ శాపం ఇవ్వడం కూడా నా కారణంగానే జరగింది. మీరు ఏమీ చింతించకండి." అని పలికాడు శ్రీహరి.

తృతీయ స్కంధము

సనకాదులకు వచ్చిన పని అయింది. శ్రీహరిని ద్వారము దగ్గరే దర్శించుకున్నారు. వారు శ్రీహరికి ప్రదక్షిణ పూర్వకముగా నమస్కరించి, శ్రీహరి అనుమతితో అక్కడి నుండి తమ స్థానములకు వెళ్ళిపోయారు. వారు వెళ్లిన తరువాత శ్రీహరి జయ విజయులతో ఇలా అన్నాడు.

"మీరు ఏమీ భయపడకండి. మీరు ఇక్కడి నుండి వెళ్లి పొండి. త్వరలోనే మీమీస్థానములకు తిరిగి వస్తారు. నేను బ్రాహ్మణులు మీకు ఇచ్చిన శాపమును వెనకకు త్రిప్పుటకు సమర్ధడైనాగానీ, ఆ విధంగా చేయడం నాకు ఇష్టం లేదు. అందువలన, వారి శాపము నా అనుమతి పొందినది అని గ్రహించండి. మీకు మరొక విషయం గుర్తుచేస్తున్నాను. పూర్వము నేను యోగ నిద్రలో ఉన్నప్పుడు లక్ష్మీదేవి నా వద్దకు రావడానికి ప్రయత్నించగా, మీరు అడ్డగించారు. అప్పుడే లక్ష్మీదేవి ఈ శాపమునకు బీజము వేసినది. ఇప్పుడు బ్రాహ్మణ శాపముతో అది ఫలించినది. మీరు అసురులుగా జన్మించి, నా యందు అమిత మైన క్రోధముతో నన్ను ధిక్కరించి త్వరలోనే వైకుంఠమునకు రాగలరు."అని చెప్పి శ్రీహరి తిరిగి వైకుంఠమునకు వెళ్లాడు.

బ్రాహ్మణ శాపముతో గర్వము నశించిన ఆ జయ విజయులు అనే శ్రీహరి పార్షదులు, వైకుంఠము నుండి భూలోకమునకు పడిపోయారు. అప్పటి దాకా తమ  మధ్య ఉన్న జయ విజయులు హఠాత్తుగా పతనం కావడం చూచి వైకుంఠ వాసులు హాహాకారాలు చేసారు. వారు భూమి మీదకు పతనం అయ్యే సమయంలోనే కశ్యపుని భార్య దితి తన భర్తతో అసురసంధ్య వేళ మైధునం చేయడం జరిగింది. అప్పుడే భూమికి దిగిన జయవిజయులు

కశ్యపుని వీర్యము ద్వారా దితి గర్భంలోకి ప్రవేశించారు. ఆ జయవిజయులే దితి గర్భంలో దైత్యులుగా పెరుగుతున్నారు. దీనికి నేను ఏమీ ప్రతి క్రియ చేయలేను. సృష్టి, స్థితి, లయకారకుడైన ఆ పరమాత్మ యే మీ సమస్యకు పరిష్కారం చూపగలడు. ఈ విషయంలో మీరు ఏమీ చింతించకండి." అని బ్రహ్మదేవుడు దేవతలను అనునయించి పంపాడు."అని మైత్రేయుడు విదురునికి వివరించాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము పదునారవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము

పదిహేడవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు. "బ్రహ్మ వద్దకు తమ గోడు చెప్పకోడానికి వెళ్లిన దేవతాగణములు, లోకంలో అన్ని ఉపద్రవములు పుట్టడానికి కారణం తెలుసుకొని తమ తమ స్థానములకు తిరిగి వెళ్లిపోయారు. దితి నూరు సంవత్సరములు గర్భం ధరించి కవలలను ప్రసవించింది.

ఆ కవలలు పుట్టిన సమయంలో ముల్లోకములలో అనేక ఉత్పాతాలు సంభవించాయి. భూమి కంపించింది. ఆకాశంలో తోకచుక్కలు కనిపించాయి. సుడి గాలులు వీచాయి. ఆకాశం అంతా

అంధకార మయం అయింది. సముద్రంలో అలలు ఉవ్వెత్తున ఎగిసిపడుతున్నాయి. ఆకాశంలో మేఘములు ఏర్పడకుండానే ఉరుములు మెరుపులు వస్తున్నాయి. కుక్కలు అరుస్తున్నాయి. నక్కలు అమంగళకరంగా కూస్తున్నాయి. దేవతా విగ్రహముల నుండి కన్నీళ్లు స్రవిస్తున్నాయి. ఇది చూచిన దేవతాగణములు, ఋషి గణములు, సనకాదులు కూడా లోకాలకు ఏదో ప్రళయం సంభవించబోతోందని భయపడ్డారు.

క్రమక్రమంగా దితి కుమారులైన దైత్యులు పెరుగుతున్నారు. వారి శరీరములు రాళ్ల  మాదిరి కఠినంగా ఉన్నాయి. వారి శరీరములు అనూహ్యంగా పెరిగిపోతున్నాయి. కశ్యప ప్రజాపతి కుమారులు ఇరువురికీ నామకరణం చేసాడు. మొదట పుట్టిన వాడికి హిరణ్య కశిపుడనీ, తరువాత పుట్టిన వాడికి హిరణ్యాక్షుడు అనీ పేర్లు పెట్టాడు. హిరణ్య కశిపుడు, హిరణ్యాక్షుడు పెరిగి పెద్దవారయ్యారు.

హిరణ్య కశిపుడు తపస్సు చేసి బ్రహ్మ వలన వరాలు పొందాడు. ఆ వరాల గర్వంతో మూడు లోకాలను, నాలుగు దిక్కులను జయించి స్వాధీనం చేసుకున్నాడు. దిక్పాలకులు అతనికి దాసులయ్యారు. హిరణ్యాక్షుడు గద బుజాన వేసుకొని ఎవరు యుద్ధానికి వస్తారా అని వెదుకుతున్నాడు. ఆ విధంగా వెదుకుతూ ఒక రోజు స్వర్గానికి వెళ్లాడు. హిరణ్యాక్షుని చూచి దేవతలు అందరూ భయంతో దాక్కున్నారు. దేవతలు లేని స్వర్గాన్ని చూచి హిరణ్యాక్షుడు పెద్దగా అరిచాడు. ఆ కోపాన్ని పోగొట్టు కోడానికి సముద్రంలో ప్రవేశించి జలక్రీడలు ఆడుతున్నాడు.

భూమి మీద ఉన్న వాడు నీళ్లలో ప్రవేశించగానే జలచరములు అన్నీ భయపడి పారిపోయాయి. హిరణ్యాక్షుడు సముద్రములో చాలా సంవత్సరములు జలక్రీడలు ఆడుకున్నాడు. అక్కడి నుండి జలమునకు అధిపతి అయిన వరుణుని నగరమునకు చేరుకున్నాడు. వరుణుని చూచి "వరుణదేవా! నమస్కారం. అబ్బో నీవు సామాన్యుడవు కావు. లోకపాలకులకు అధినేతవు. నీకు గొప్ప పేరు కీర్తి ఉంది కదా! ఇదివరకు నీవు దైత్యులను దానవులను ఓడించి రాజసూయ యాగం చేసావట. అటువంటి వాడివి, నాతో కూడా కాస్త యుద్ధం చేసి పెట్టు." అని వ్యంగ్యంగా అన్నాడు.

ఆ మాటలు విన్న వరుణుడికి కోపం వచ్చింది. కాని వీడితో ఎందుకని ఆ కోపాన్ని అణచుకున్నాడు. "ఓ దైత్యా! ప్రస్తుతము నేను యుద్ధములు చేయడం విరమించుకున్నాను. నీతో యుద్ధం చేయగలిగిన వాడు ఒక్క విష్ణువు ఒక్కడే. ఆయనతో యుద్ధం చెయ్యి. నీ దురద తీర్చుకో. తొందరగా విష్ణువు వద్దకు వెళ్లు. నీవు విష్ణువుతో యుద్ధం చేసావనుకో నీవు నిటారుగా నిలబడవు. భూతల శయనమే నీకు శరణ్యము. అసలు నీ వంటి దుర్మార్గులను దుష్టులను చంపడానికే విష్ణువు అవతారాలు ఎత్తుతున్నాడు. నీ కోసం వరాహావతారంలో ఉన్నాడు. తొందరగా వెళ్లు." అని వరుణుడు హిరణ్యాక్షుని విష్ణువు మీదికి యుద్ధానికి పురికొల్పాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము పదిహేడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము

పదిహేడవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు. “జలమునకు అధిపతి అయిన వరుణుడు చెప్పిన మాటలు విన్న హిరణ్యాక్షుడికి కోపం వచ్చింది. కాని వీడితో ఎందుకులే అని శ్రీహరిని వెదుక్కుంటూ వెళ్లాడు. దారిలో నారదుడు కనిపించాడు. శ్రీహరి రసాతలంలో ఉంటాడు అని చెప్పాడు. నారదుని మాట ప్రకారము హిరణ్యాక్షుడు రసాతలమునకు వెళ్లాడు.
(రసాతలము అంటే భూమి పైపొరకు కింద ఉండే ఆరవ లోకము. ప్రస్తుతము మన పరిభాషలో చెప్పుకోవాలంటే ఖనిజములు, ఖనిజవాయువులు, చమురు పదార్థములు లభించే భూమి పొర.)

అప్పటికే శ్రీహరి యజ్ఞవరాహ రూపము ధరించి రసాతలములో ఉన్న భూమిని తన కోరల మీద పెట్టుకొని పైకి తీసుకొని వస్తున్నాడు. అటువంటి వరాహమును చూచాడు హిరణ్యాక్షుడు. “ఇదేమిటి! ఈ అడవి జంతువు ఇక్కడ ఉందేమిటి!” అని ఆశ్చర్యంగా చూచాడు. ఆ దైత్యుడు ఆ యజ్ఞవరాహరూపుడగు శ్రీహరితో ఇలా అన్నాడు.

“ ఒరేయ్! ఇలారా! ఇదేమిటి భూమిని తీసుకొని వెళు తున్నావు. ఇక్కడ దించు. ఈ భూమిని బ్రహ్మ మాకు ఇచ్చాడు. నీవు ఎవరు తీసుకొని వెళ్లడానికి. అయినా ఈ వరాహ రూపం ఏమిటి? నీవు వరాహ రూపంలో వచ్చిన దేవతవా! నా కళ్ల ఎదురుగా నీవు

భూమిని తీసుకెళ్లడం సాధ్యం కాదు. అక్కడ పెట్టు." అని గర్జించాడు హిరణ్యాక్షుడు.

శ్రీహరి మాట్లాడలేదు. హిరణ్యాక్షుడు మరలా ఇలా అన్నాడు. "ఓహెూ! తమరు విష్ణుదేవులా! మా శత్రువులైన దేవతలు నిన్ను ఈ పనికి పంపారా! అందుకేనా దొంగతనంగా భూమిని తీసుకెళుతున్నావు. పైగా మా అసురులను దొంగదెబ్బ తీస్తున్నావు. నీ మాయలు నా దగ్గర సాగవు. ఈరోజు నిన్ను చంపి మా దైత్యులకు సంతోషం కలిగిస్తాను. ఇదిగో ఈ గదతో నీ నెత్తిమీద ఒక దెబ్బ వేస్తే తలపగిలిచస్తావు. నిన్ను నమ్ముకున్న దేవతలను, ఋషులను, అనాధలను చేస్తాను." గర్వంగా పలికాడు హిరణ్యకశిపుడు.

వరాహ మూర్తి అయిన శ్రీహరికి మహా కోపం వచ్చింది. ఇప్పుడు కోపిస్తే తన కోరల మీద ఉన్న భూదేవి కంపించి పోతుందని, తన కోపాన్ని అణచుకున్నాడు. తన దారిన తాను భూమిని తీసుకొని జలముల నుండి బయటకు వస్తున్నాడు. మూడు లోకములను గడగడలాడించిన తనను ఒక వరాహము లెక్కచేయకపోవడంతో హిరణ్యాక్షునికికోపం మిన్ను ముట్టింది. "ఓ పిరికి వాడా! సిగ్గు లేదా నీకు. మా భూమిని తీసుకొని పరుగెత్తిపోతున్నావు." అని అరుస్తూ వరాహ మూర్తి వెంటబడ్డాడు హిరణ్యాక్షుడు.

ఈ రాక్షసుడు ఓ పట్టాన వదిలేటట్టు లేడు అని అనుకున్నాడు వరాహ మూర్తి. తన కోరల మీద ఉన్న భూమిని జలము మీదనే ఒక ఆధారమును ఏర్పరచి దాని మీద నిలిపాడు. ఆ భూమిలో

తన ఆకర్షణ శక్తిని ప్రవేశ పెట్టాడు. అప్పుడు ఆ భూమి ఏ ఆధారము లేకనే నిలిచి ఉంది. (ప్రస్తుతము మనం ఉండేభూమి ఏ ఆధారమూ లేకుండా అదే పరిస్థితిలో ఉంది కదా!దీనినే కథారూపంలో చెప్పారు. అంతే!)

అప్పుడు తన వెంట తన తిడుతూ వస్తున్న హిరణ్యాక్షుని చూచి శ్రీహరి నవ్వుతూ ఇలా అన్నాడు. "ఓ దైత్యుడా! నీవు అన్నట్టు నేను అడవులలో తిరిగే మృగమును. అందులో సందేహము లేదు. కానీ నీవు ఎందుకు నా వెంట బడి కుక్క మాదిరి అరుస్తున్నావు. నేను కూడా నీ వంటి కుక్కల కోసరం తిరుగుతూ ఉంటాను. నీకు చావు మూడింది. అందుకే అలా అరుస్తున్నావు. పైగా నీ గురించి నువ్వే పొగుడుకుంటున్నావు. నీ వంటి ఆత్మస్తుతి చేసే వాళ్లను లోకులు గౌరవించరు.

ఇప్పుడు చెబుతున్నాను విను. ఇది మా భూమి. ప్రళయకాలంలో రసాతలంలో మేమే ఉంచాము. ఇప్పుడు నేను ఆ భూమిని బయటకు తీసుకొని వస్తున్నాను. నువ్వు నీ గదతో నన్ను కొడుతున్నావు. మాకు యుద్ధము కొత్త కాదు. నీ వంటి బలవంతులతో విరోధము పెట్టుకొని నేను ఎక్కడకు వెళ్లాను. అందుకే ఇక్కడే ఉన్నాను. నాతో యుద్ధం చెయ్యి. నన్ను చంపుతానని నీ వాళ్ల ముందర ప్రతిజ్ఞచేసావుకదా! నన్ను చంపి ఆ ప్రతిజ్ఞ నెరవేర్చుకో. నీ వాళ్ల కోరిక నెరవేర్చు. వాళ్ల దు:ఖమును పోగొట్టు." అని వ్యంగ్యంగా అన్నాడు శ్రీహరి.

ఆ మాటలకు హిరణ్యాక్షుడు కోపం పట్టలేకపోయాడు. వాడికి ఒళ్లంతా మండిపోతూ ఉంది. పెద్దగా బుసలు కొడుతున్నాడు. తన

చేతిలో ఉన్న గదతో శ్రీహరిని గట్టిగా మోదాడు. తన వక్షస్థలము మీదపడబోయిన ఆ గదాఘాతమును శ్రీహరి పక్కకు తిరిగి తప్పించుకున్నాడు. హిరణ్యాక్షుడు తన గదను గిరా గిరా తిప్పుతూ పళ్లు పటా పటా కొరుకుతున్నాడు. ఇది చూచిన వరాహ రూపంలో ఉన్న శ్రీహరికి కూడా కోపం వచ్చింది. ఆ దైత్యుడి వంకకు పరుగెత్తాడు.

శ్రీహరి తను కూడా ఒక గదను తీసుకొని హిరణ్యాక్షుడి కంటి మీద గట్టిగా మోదాడు. కాని హిరణ్యాక్షుడు ఆ గదాఘాతాన్ని నేర్పుగా తప్పించుకున్నాడు. ఇరువురికి భయంకరమైన గదాయుద్ధము జరిగింది. గదల దెబ్బలకు వారి ఇరువురి దేహములు రక్తసిక్తములు అయ్యాయి. రెండు పెద్ద ఆబోతులు కుమ్ముకుంటున్నట్టు వరాహము హిరణ్యాక్షుడు యుద్ధం చేస్తున్నారు. వీరి యుద్ధం చూడటానికి బ్రహ్మదేవుడు తన పరివారంతో ఆకాశంలో నిలబడి చూస్తున్నాడు.

ఇద్దరి మధ్య యుద్ధము ఎంతకూ తెగడం లేదు. అది చూచి బ్రహ్మ దేవుడు శ్రీహరితో ఇలా అన్నాడు. "దేవా! ఈ దైత్యుడు నా వలన వరాలు పొందాడు. ఆ వరగర్వంతో దేవతలను, బ్రాహ్మణులను, గోవులను బాధపెడుతున్నాడు. వీడు మూడులోకములను భయోత్పాతానికి గురిచేస్తున్నాడు. వీడిని యుద్ధంలో ఓడించే వీరుడు ముల్లోకములలో లేడు. అందుకని వీడు మూడులోకములలో ఉన్న వారిని యుద్ధానికి ఆహ్వానిస్తూ తిరుగుతుంటే నీ కంట బడ్డాడు. ఈ దుర్మార్గుడితో నీవెందుకు ఇంతసేపు యుద్ధం చేస్తావు. పైగా సాయంత్రం కాబోతోంది. రాత్రి వేళలో అసురులు రెట్టింపు శక్తితో విజృంభిస్తారు. కాబట్టి వెంటనే ఈ దైత్యుని నీ మాయాశక్తితో

సంహరించు. వీడి మరణంతో మూడులోకములు శాంతి పొందుతాయి. ఈ సాయంకాలము వీడి మరణానికి అద్భుతమైన అభిజిత్‌యోగము. కాబట్టి ఈ ముహూర్తంలోనే వీడిని సంహరించు. అంతే కాకుండా, వీడికి శాపం ఇచ్చేసమయంలో వీడు నీ చేతిలో సంహరింపబడతాడు అని నిర్ణయింపబడింది. వాడి అదృష్టం కొద్దీ వాడు నీతో యుద్ధానికి తలపడ్డాడు. అందువలన వీడిని వెంటనే సంహరించి, వీడికి ఈ రాక్షస దేహము నుండి విముక్తిని ప్రసాదించు. ముల్లోకములకు శాంతిని చేకూర్చు." అని అన్నాడు బ్రహ్మ.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము

పంతొమ్మిదవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పసాగాడు. 'విదురా! బ్రహ్మ చెప్పిన మాటలను చిరునవ్వునవ్వుతూ శ్రద్ధగా విన్నాడు వరాహమూర్తి. ఆయన మాటలను అంగీకరించినట్టు కనుసైగచేసాడు. ఎదురుగా ఉన్న హిరణ్యాక్షుని వంక చూచాడు. ఆ దైత్యుడు అటు ఇటు తిరుగుతున్నాడు.. వరాహమూర్తి తన గదతో వాడి మెడమీద కొట్టాడు. ఆ దెబ్బను హిరణ్యాక్షుడు తన గదతో కాచుకున్నాడు.

వరాహ మూర్తి గద కిందపడిపోయింది. అప్పుడు వరాహమూర్తి చేతిలో ఆయుధము లేదు. వరాహమూర్తి మీద దాడి చేయడానికి ఇదే సమయము అనుకున్నాడు హిరణ్యాక్షుడు. కాని హిరణ్యాక్షుడు యుద్ధ ధర్మమును పాటించాడు. నిరాయుధునితో యుద్ధం చేయడం ధర్మం కాదని వరాహ మూర్తి మీద ఆయుధమును ప్రయోగించలేదు. ఎలాగైనా వరాహ మూర్తిని రెచ్చగొట్టడమే ఆ దైత్యుని ఉద్దేశ్యము.

అది చూచినవరాహ మూర్తి దైత్యుని యుద్ధనీతికి ప్రశంసించాడు. ఈ సారి తన సుదర్శన చక్రమును చేత ధరించాడు. తలచి నంత మాత్రముననే సుదర్శన చక్రము భగవానుని చేతిని అలంకరించింది. గిరా గిరా తిరుగుతూ ఉంది. హిరణ్యాక్షునిలో భగవానుడికి తన పార్షదుడు, శాపోపహతుడు అయిన జయుడు కనిపిస్తున్నాడు. అందుకే వాడితో ఆటలాడి నట్టు యుద్ధం చేస్తున్నాడు. ఇదితెలియని దేవతలు “ఓ దేవా! వాడిని వెంటనే చంపండి. లేకపోతే వాడు ఇంకా విజృంభిస్తాడు. ముల్లోకాలకు చేటుతెస్తాడు” అని తొందరపెట్టసాగారు.

వరాహ మూర్తి చేతిలో చక్రాన్ని చూచాడు హిరణ్యాక్షుడు. కోపంతో అతని పెదాలు వణుకుతున్నాయి. పళ్లు కొరుకుతూ వెంటనే తన గదను వరాహ మూర్తి మీద ప్రయోగించాడు. “ఒరేయ్ ఈ దెబ్బతో నువ్వు చచ్చావురా!” అని గట్టిగా అరిచాడు. అది చూచిన వరాహ మూర్తి పైకి లేచి తనకాలితో ఆ గదను ఒక తాపు తన్నాడు. అది కిందపడిపోయింది.

ఇప్పుడు దైత్యుడు నిరాయుధుడు అయ్యాడు. "ఓ దైత్యా! నీ గదను తీసుకో. అప్పటి దాకా నిన్ను కొట్టను" అన్నాడు. వెంటనే హిరణ్యాక్షుడు తన గదను తన చేతిలోక తీసుకున్నాడు. భయంకరంగా గర్జించాడు. గిరా గిరా తిప్పి ఆ గదను వరాహమూర్తి మీదికి విసిరాడు. తన మీదికి వస్తున్న గదను వరాహ మూర్తి అవలీలగా ఒడిసి పట్టుకున్నాడు. తాను విసిరిన గద నిష్ఫలము అవడం చూచి దైత్యుడు మండిపోయాడు.

వరాహ మూర్తి తన చేతిలో ఉన్న గదను "ఇదిగో తీసుకో" అంటూ వాడి మీదికి విసరాడు. కాని హిరణ్యాక్షుడు పౌరుషంతో ఆ గదను తీసుకోలేదు. ఒక త్రిశూలాన్ని తీసుకొని దానిని వరాహ మూర్తి మీదికి విసిరాడు. భగవానుడు తన చక్రమును ప్రయోగించి ఆ శూలమును తునాతునకలు చేసాడు.

ఇంక ఇలా కాదని హిరణ్యాక్షుడు మాయాయుద్ధం చేయసాగాడు. హటాత్తుగా వరాహ మూర్తి మీదికి లంఘించి ఆయన గుండెలమీద గట్టిగా గుద్ది మాయం అయ్యాడు. కాని భగవానుడు ఆ దెబ్బకు ఏ మాత్రం చలించలేదు. హిరణ్యాక్షుడు నానావిధములయిన మాయలను పరమాత్మ మీద ప్రయోగించాడు. ఆ మాయల ప్రభావం చేత మూడులోకములు ప్రళయం సంభవించినట్టు తల్లడిల్లిపోయాయి. వాడి మాయలకు ప్రచండ వేగంతో గాలులు వీచడం, రాళ్లవర్షం కురవడం, ఉరుములు, మెరుపులు దట్టంగా మేఘాలు ఆవరించడం, చీకట్లు కమ్ముకోవడం జరుగుతున్నాయ.

ఇదంతా ఏమీ జరగడం లేదు రాక్షస మాయ వల్ల కలిగిన భ్రమ అని పరమాత్మకు తెలుసు. ఆ రాక్షస మాయను నిర్మూలించడానికి భగవానుడు తనసుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. సుదర్శన చక్రము ఆ దైత్యుని మాయలను ఛేధించింది. తన మాయలు అన్నీ నిరర్థకములు కావడం చూచి హిరణ్యాక్షుడు వరాహ మూర్తి మీదికి ఉరికాడు. వరాహ మూర్తిని తన బలమైన బాహువుల మధ్య బంధించి నలిపేయసాగాడు.

కాని ఆశ్చర్యంగా వరాహ మూర్తి బయట నిలబడి ఆ దైత్యుని చూస్తున్నాడు. తన బాహుబంధంలో వరాహమూర్తి లేకపోవడం చూచి విస్తుపోయాడు ఆ దైత్యుడు. తన పిడికిళ్లు బిగించి వరాహమూర్తిని కొట్టసాగాడు. వరాహ మూర్తి కూడా తనపిడికిలి బిగించి హిరణ్యాక్షుని కణత మీద కొట్టాడు. ఆ దెబ్బకు హిరణ్యాక్షుని తల తిరిగింది. కళ్లు బయటకు వచ్చాయి. చేతులుకాళ్లు ఆడటం లేదు. హిరణ్యాక్షుడు గిరా గిరా తిరిగి కిందపడ్డాడు. గిలా గిలా కొట్టుకొని మరణించాడు. కణత ఆయువు పట్టు. దైత్యుని కణత మీద పిడికిలితో బలంగా కొట్టడం వలన హిరణ్యాక్షుడు మరణించాడు.

ఆ దైత్యుడి మరణం చూచిన బ్రహ్మ దేవతలు "ఆహా! భగవంతుని చేతిలో మరణం ఎంత పుణ్యం చేసుకుంటే లభిస్తుంది. ఎంతో మంది యోగులు ఈ శరీరము నుండి విముక్తి పొందుటకు తపస్సు చేస్తారు. వారికి లభించని భాగ్యము, ఈ దైత్యునికి, అదీ భగవానుని ముఖం వంక చూస్తూ మరణించే భాగ్యం ఈ హిరణ్యాక్షునికి లభించింది." అని ఆశ్చర్యపోయారు.

## తృతీయ స్కంధము

బ్రాహ్మణ శాపముతో దైత్యుడుగా జన్మించిన భగవానుని పార్షదులలో ఒకడు తిరిగి తన స్వస్థానమును చేరుకున్నాడు. అప్పుడు దేవతలు, బ్రహ్మ పరమాత్మను ఈ విధంగా స్తుతించారు.

"ఓ దేవదేవా! నీకు నమస్కారము. నీవు యజ్ఞపురుషుడవు. యజ్ఞవరాహ అవతారమును ధరించి భూమిని రక్షించావు. దైత్యుని శిక్షించావు. మూడులోకములకు శాంతని చేకూర్చావు. నీకు మరలా మరలా నమస్కరించుచున్నాము." అని పరమాత్మకు నమస్కరించి వారి వారి స్థానములకు వెళ్లిపోయారు.

విదురా! ఆ ప్రకారంగా బ్రహ్మ మొదలగు దేవతాగణములతో స్తుతించబడిన ఆదివరాహ రూపంలో ఉన్న హరి వైకుంఠమునకు తిరిగి వెళ్లిపోయాడు. విదురా! భగవానుని అవతార విశేషములను నేను నా గురువుల వలన విన్న ప్రకారము నీకు వివరించాను." అని చెప్పాడు మైత్రేయుడు. మైత్రేయుని వలన శ్రీహరి అవతార విశేష ములను విన్న విదురుడు పరమానందభరితుడు అయ్యాడు." అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెప్పిన భాగవతమును సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు చెప్పాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! పరమాత్ముని అవతార లీలా విశేషములను వినిన ఎవరికి ఆనందం కలుగదు. ఈ భూమిని ఉద్ధరించడానికి యజ్ఞవరాహ రూపంతో అవతరించిన పరమాత్మ చేసిన హిరణ్యాక్ష వధ అనే ఈ కథను ఎవరు చదివినా, విన్నా, భగవానుని కీర్తించినా, వారికి అన్ని పాపముల నుండి విముక్తి లభిస్తుంది.

పుణ్యమును కలిగించేది, పవిత్రమైనది, మానవుల మనసులను ధన్యం చేసేది, కీర్తి ప్రతిష్ఠలు కలిగించేది, ఆయుష్షును పెంచేది, అయిన ఈ భగవంతుని చరిత్ర వినిన వారికి మరణానంతరము పరమాత్మలో ఐక్యము అవుతారు అనడంలో ఎటువంటి సందేహము లేదు." అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో భాగవత కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము
ఇరవయ్యవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సూతపౌరాణికుని వలన భాగవతమును వింటున్న శౌనకుడు మొదలగు మహామునులు సూతుని ఇలా అడిగారు.

"మహాత్మా! స్వాయంభువ మనువు తాను ఉండేదానికి ఒక స్థావరము కావాలని బ్రహ్మను అడిగాడు. ఆ భూమి ప్రళయకాలంలో జలమయం అయింది. భూమి మీద ఉన్న ప్రాణులన్నీ సూక్ష్మరూపంలో పరమాత్మయందు లీనమై ఉన్నాయి అని చెప్పారు. మరి ఆ ప్రాణులను

మరలా సృష్టించడానికి బ్రహ్మ ఏ విధానమును అవలంబించాడు? విదురుడు మైత్రేయుని ఏ యే విషయములు అడిగాడు. మేము అడిగిన విషయములు కూడా అడిగాడా? ఈ విదుర మైత్రేయుల సంభాషణమును, ఇంకా ఇతరము లైన పరమాత్ముని కథలు విన్నంతనే జీవున పాపములు నశిస్తాయి. మాకు ఆ విషయము లన్నీ వివరించండి. మేము కూడా శ్రీహరిలీలలను విని పావనులము అవుతాము." అని అన్నారు.

అప్పుడు సూతపౌరాణికుడు శౌనకాది మహామునులకు ఈ విధంగా చెప్పసాగాడు. "వరాహరూపము ధరించిన పరమాత్మ భూమిని ఉద్ధరించడం, హిరణ్యాక్షుని సంహరించడం, గురించి విన్న విదురుడు పరమానంద భరితుడు అయ్యాడు. విదురుడు మైత్రేయుని ఇలా అడిగాడు.

"ఓ మైత్రేయ మహర్షీ! బ్రహ్మగారు మరీచి మొదలగు ప్రజాపతులను సృష్టించిన తరువాత ఏమి చేసాడు? మరీచి మొదలగు ప్రజాపతులు స్వాయంభువ మనువు బ్రహ్మయొక్క ఆజ్ఞలను అనుసరించి ఏ విధంగా విశ్వ సృష్టి చేసారు? వారు తమ తమ భార్యలతో కూడి ఈ సృష్టి చేసారా? లేక స్వతంత్రంగా సృష్టి చేసారా? లేక అందరూ కలిసి ఈ విశ్వాన్ని సృష్టించారా? తెలియజేయండి." అని అడిగాడు. దానికి సమాధానంగా మైత్రేయుడు ఇలా చెప్పాడు.

"విదురా! మొట్టమొదట సత్త్వ,రజస్,తమోగుణ ప్రధానమైన ఈ ప్రకృతి ఏ విధమైన వికారము, కదలిక లేకుండా స్తబ్ధుగాఉండింది.

కాల శక్తి ప్రభావము చేత ఆ మూడుగుణములలో హెచ్చుతగ్గులు సంభవించాయి. ఆ హెచ్చుతగ్గుల వలన మహత్తత్వము ఆవిర్భవించింది. రజోగుణ ప్రధానమైన ఆ మహత్తత్వము నుండి మూడురకములైన అహంకారము పుట్టింది. ఆ అహంకారము నుండి శబ్దము మొదలగు ఐదు తన్మాత్రలు, పంచభూతములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, వాటికి అధిదేవతలు సృష్టింపబడ్డారు. ఇవన్నీ వేటికి అవి విడి విడిగా ఉండటం వలన, వాటిని సంఘటితం చేసే శక్తిలేకపోవడం వలన అవి సృష్టిచేయలేకపోయాయి.

అప్పుడు పరమాత్మ తన యోగమాయశక్తిని వాటిలో ప్రవేశపెట్టాడు. అప్పుడు అవి చైతన్యవంతం అయ్యాయి. అవన్నీ కలిసి ఒక శక్తవంతమైన అండమును సృష్టించాయి. ఆ అండము వేయి సంవత్సరముల పాటు జలంలో ఉండింది. అప్పుడు పరమాత్మ ఆ అండకోశములో ప్రవేశించాడు. అప్పుడు ఆ అండము చైతన్యవంతం అయింది. ఆ అండకోశములో ఉన్న పరమాత్మ నాభి ప్రదేశము నుండి ఒక కాంతివంతమైన పద్మము ఆవిర్భవించింది. ఆ పద్మములో సర్వజీవరాసులు సూక్ష్మరూపంలో ఉన్నారు.

ఆ పద్మము మధ్య నుండి బ్రహ్మదేవుడు పుట్టాడు. ఆ అండము లోపల ఉన్న జలములో శయనించి ఉన్న పరమాత్మ ఆదేశాను సారము బ్రహ్మ అంతకు ముందు ఉన్న కల్పములలో ఉన్న మాదిరి, రూపములతో, నామములతో ఈ సృష్టిని చేయడం మొదలు పెట్టాడు.

## తృతీయ స్కంధము

మొట్ట మొదట బ్రహ్మ ఐదురకములైన అవిద్యలను సృష్టించాడు. వాటి పేర్లు తామిస్రము అంధతామిస్రము, తమస్సు, మోహము, మహాతపస్సు. వీటిని క్లేశములు అని కూడా అంటారు.

అవిద్యలను సృష్టించిన ఆ దేహమును బ్రహ్మవదిలేసాడు. బ్రహ్మచేత వదిలిపెట్టబడిన ఆ శరీరము రాత్రిగా(చీకటిగా) మారిపోయింది. రాత్రిగా మారిన ఆ శరీరము నుండి యక్షులు, రాక్షసులు పుట్టారు. పుట్టిన వెంటనే వారికి ఆకలి, దాహము అధికం అయ్యాయి. ఎదురుగా బ్రహ్మ కనిపించాడు. తమ ఆకలి దాహము తీర్చమని వారు బ్రహ్మమీదికి వెళ్లారు. కొంత మంది "వీడుమనలను పుట్టించాడు అని రక్షించకండి." అని కొందరూ, "వీడిని భక్షించండి" అని కొందరూ అరవసాగారు. "రక్షించకండి" అని అరిచినవారు రాక్షసులుగానూ, "భక్షించండి" అన్నావారు భక్షకులు అనగా యక్షులు గానూ పిలువబడ్డారు.

బ్రహ్మ దేవతలను సృష్టించి నపుడు దివ్యము ప్రకాశవంతమైన రూపము ధరించాడు. ఆ దేహమును కూడా బ్రహ్మ విడిచిపెట్టాడు. ఆ ప్రకాశవంతమైన దేహమే పగలుగా మారింది. ఆ పగలును దేవతలు గ్రహించారు.

తరువాత బ్రహ్మ వేరే దేహమును ధరించాడు. ఆ దేహము యొక్క జఘనభాగము నుండి దైత్యులనుపుట్టించాడు. ఆ దైత్యులు ఎక్కువగా స్త్రీలోలురు. ఎల్లప్పుడూ స్త్రీసాంగత్యమును కోరుకుంటూఉంటారు. స్త్రీలు కనపడితే వదిలిపెట్టరు. (ఉదాహరణకు రావణుడు). ఆ దైత్యులు పుట్టగానే బ్రహ్మ మీదికి దుమికారు. వారిని

ప్రవర్తన చూచి బ్రహ్మకు భయం పట్టుకుంది. ఆయన కూడా పరుగెత్తాడు. అలా పరుగెత్తి శ్రీహరి వద్దకు వెళ్లాడు. తాను దైత్యులను పుట్టించడం వారు కామాతురులై తన వెంటబడటం అంతా వివరించాడు.

“ఓ పరమాత్మా! నేను వీరిని యాదాలాపంగా సృష్టించాను. వీరు ఇంతటి కామాతురులు అని నాకు తెలియదు. మైధునం కోసరం నా వెంటబడుతున్నారు. నన్ను రక్షించండి.” అని వేడుకున్నాడు.

దానికి పరమాత్మ ఇలా అన్నాడు. “నీవు దుష్టులగు దైత్యులను సృష్టించావు. వారు కామాతురులుఅయ్యారు. నీ వెంట బడుతున్నారు. కాబట్టి ఈ పాపపు శరీరాన్ని వాళ్లకే విడిచిపెట్టు.” అని అన్నాడు. పరమాత్మ మాట ప్రకారము బ్రహ్మ ఆ దేహమును కూడా విడిచిపెట్టి వేరొక దేహమును ధరించాడు. బ్రహ్మ విడిచిపెట్టిన ఆ దేహము ఒక అందమైన స్త్రీరూపము ధరించింది. అదే అసురసంధ్య కాలము. కామోద్రేకము కలిగే కాలము. ఆమెను చూచి అసురులు, దైత్యులు మోహితులయ్యారు.

“ఆహా! ఈమెరూపము ఎంత మనోహరముగాఉంది. ఈమె యవ్వనవతి. ధైర్యవంతురాలు. లేకపోతే మనమధ్యకు ఎందుకు వస్తుంది. చూడ చూడ ఈమె మీద కామకోరికలు కలుగుతున్నాయి. కానీ ఈమె మాత్రము ఎటువంటి కోరికలు లేనిదానివలె తిరుగుతూ ఉంది.”అని ఆ రాక్షసులు, దైత్యులు ఆమెను గురించి రకరకాలుగా అనుకుంటున్నారు. కొంతమంది ఆమెకు తగు మర్యాదలను చేసి

ఆమెను పక్కనకూర్చోపెట్టుకొని "సుందరీ! నీవు ఎవరు? నీ తల్లితండ్రులు ఎవరు? ఇక్కడ ఏంచేస్తున్నావు? నీ అందంతో సోయగంతో మా అందరినీ పిచ్చివాళ్లను చేస్తున్నావు. నీవు ఎవరైనా కానీ, నీ దర్శనభాగ్యం మాకు కలిగించావు. అదే మాకు గొప్ప అదృష్టము. "అని ఆమెచుట్టు తిరుగుతున్నారు.

ఆమె మాత్రము ఇదేమీ పట్టనట్టు ఒక పూలబంతితో ఆడుకుంటూఉంది. "ఓ సుందరీ! మేము నీ కోసరం పరితపిస్తుంటే నీవు ఆ బంతితో ఆడుకుంటున్నావు. నీ కాళ్లు చేతులు ఒక చోట కుదురుగా ఉండటం లేదు. అబ్బా! అలా ఆడకు. నీ సన్నని నడుము నీసుకుమారమైన శరీరభారంతో అలిసిపోతుంది. నీ నల్లని కురులు అబ్బా ఎంత అందంగా ఉన్నాయో! " అని ఆ అసురులు దైత్యులు ఆ సుకుమారి వెంట తిరుగుతున్నారు. వారందరూ ఆ కామదేవతను తమలో తాముపంచేసుకున్నారు. వారి పీడ వదిలిందని సంతోషించాడు బ్రహ్మ.

తరువాత తన శరీరంలో ఉన్న కాంతితో గంధర్వులను, అప్సరసలను సృష్టించాడు. తరువాత ఆ కాంతి మంతమైన శరీరాన్ని కూడా వదిలిపెట్టాడు. గంధర్వులు బ్రహ్మ వదిలిపెట్టిన ఆ శరీరాన్ని స్వీకరించి గంధర్వలోకాన్ని ఏర్పాటుచేసుకున్నారు.

తరువాత బ్రహ్మ మరొకక దేహాన్ని ధరించాడు. వీళ్లందరినీ సృష్టించి అలసిపోయాడు. బ్రహ్మ అలసట లో నుండి భూతములు, పిశాచములు పుట్టాయి. వాళ్లకు ఒంటి మీద బట్టలు లేవు జుట్టువిరబోసుకొని వికృతంగా ఉన్నారు. వారిని చూచి బ్రహ్మ

కళ్లుమూసుకున్నాడు. వెంటనే ఆ శరీరాన్ని కూడా విడిచిపెట్టాడు. ఆ శరీరమే "ఆలస్యం"గా మారింది. అందులో నుండి నిద్ర, భ్రాంతి, ఉన్మాదము పుట్టాయి. బ్రహ్మ విడిచిపెట్టిన ఆ శరీరాన్ని (ఆలస్యము, నిద్ర, భ్రాంతి, ఉన్మాదము మొదలగు అవలక్షణములు కలది) భూతాలు, పిశాచాలు స్వీకరించాయి.

తరువాత బ్రహ్మ ఏ శరీరమూ ధరించలేదు. అదృశ్యరూపంలో (సూక్ష్మరూపంలో) ఉండి దేవతలను, సిద్ధులను, సాధ్యులను, పితృదేవతలను సృష్టించాడు. వారు తీసుకోడానికి బ్రహ్మకు దేహము లేదు. అదృశ్యరూపంలో ఉన్నాడు. పితృదేవతలు, దేవతాగణములు ఆ అదృశ్యరూపమునే స్వీకరించారు. (అందుకే వాళ్లు మనకు కనపడరు. కాని అదృశ్యరూపంలో ఉంటారు). ప్రజలు తమ పితృదేవతలకు శ్రాద్ధములుపెట్టి సమర్పించే పిండములను వారు అదృశ్యరూపంలో స్వీకరిస్తారు. అలాగే యజ్ఞయాగములు చేసినపుడు అగ్నిలో హెూమము చేయు హవిస్సులను దేవతలు అదృశ్యరూపంలో స్వీకరిస్తారు.

వీరిని సృష్టించిన తరువాత బ్రహ్మ అదే మాదిరిగా సిద్ధులను, సాధ్యులను సృష్టించాడు. వారికి కూడా  అదృశ్యరూపాలు ప్రసాదించాడు. తరువాత బ్రహ్మ అచ్చం తన మాదిరిగానే ఉన్న కిన్నరులు, కింపురుషులను సృష్టించాడు.

తరువాత బ్రహ్మ మరొక స్థూల శరీరము ధరించాడు. తాను చేసిన సృష్టి వంక చూచాడు. ఎంత సేపూ తాను సృష్టి చేయడమే

గానీ, తాను సృష్టి చేసిన వాళ్లు మరలా సృష్టి చేయడం లేదని గ్రహించాడు. అందువల్ల సృష్టి కొనసాగడం లేదని చింతించాడు. ఈ శరీరం కూడా బాగాలేదని ఆ స్థూల శరీరాన్ని కూడా వదిలిపెట్టాడు. ఆ శరీరం వదిలేటప్పుడు బ్రహ్మ చాలా కోపంగా ఉన్నాడు. అందుకని బ్రహ్మ వదిలిన శరీరము నుండి అమితమైన కోపస్వభావము కల సర్పములు పుట్టాయి.

బ్రహ్మ మరలా ఆలోచించడం మొదలె పెట్టాడు. ఎలాగైనా ప్రజలను సృష్టించాలి. వారి వల్ల సృష్టి కొనసాగాలి అని అనుకున్నాడు. అందుకని తనమనసులో నుండి మనువులను సృష్టించాడు. ఆ మనువులకు తగిన పురుష దేహాలను ఇచ్చాడు. వారే మొట్ట మొదట పుట్టినవారు. మనువుల వల్ల పుట్టిన వారు మానవులుగా పిలువబడ్డారు.

తరువాత బ్రహ్మ తాను చేసిన తపస్సును, ఉపాసనను, అష్టాంగయోగములను, వైరాగ్యమును, సమాధిని ఉపయోగించి ఆ లక్షణములు కలిగిన ఋషులను సృష్టించాడు. ఆ ఋషులు ఒక్కొక్కరికీ తనలో ఉన్న సమాధి, యోగము, తపస్సు, విద్య, వైరాగ్యము, ఐశ్వర్యము అనే అంశలను ఇచ్చాడు. ఈ ప్రకారంగా బ్రహ్మ సృష్టిని కొనసాగించాడు.

శ్రీమద్భాగవతము

తృతీయస్కంధము ఇరవయ్యవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

తృతీయస్కంధము

ఇరవైఒకటవ అధ్యాయము

విదురుడు మైత్రేయుని ఈ విధంగా అడిగాడు.

"మైత్రేయా! స్వాయంభువ మనువు, శతరూప ఇరువురు మిధున ధర్మంతో సృష్టిని ఎలా కొనసాగించారు. ఏ ప్రకారం ప్రజలను వృద్ధిచేసారు. స్వాయంభువ మనువుకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇరువురు కుమారులు కలిగారు కదా! వారు ఈ భూమిని ఎలా పరిపాలించారు. అలాగే స్వాయంభువ మనువుకు దేవహూతి అనే కుమార్తె కలిగిందని, ఆమెను కర్దమప్రజాపతికి ఇచ్చి వివాహం చేసారని నీవలన విన్నాను. కర్దముడు జితేంద్రియుడు. యోగి. విరాగి కదా. మరి వారికి సంతానము ఎలా కలిగింది. అలాగే స్వాయంభువ మనువు కుమార్తె ఆకూతిని, ఋచి అనే మహర్షి, మరొక కుమార్తె ప్రసూతిని దక్షప్రజాపతి పెళ్లిచేసుకున్నారు కదా! వారికి సంతానం కలిగిందా! కలిగితే వారి గురించి కూడా చెప్పండి." అని అడిగాడు విదురుడు.

విదురుడు అడిగిన ప్రశ్నలకు మైత్రేయుడు ఈ విధంగా బదులుచెప్పాడు. "విదురా! బ్రహ్మ కర్దమ ప్రజాపతిని పిలిచి నీవు వెంటనే సృష్టి చెయ్యి అని ఆదేశించాడు. అలాగే అని కర్దముడు తపస్సు చేయడానికి వెళ్లాడు. సరస్వతీ నదీ తీరంలో పదివేల సంవత్సరములు తపస్సు చేసాడు.

కర్దముడు క్రియాయోగం ద్వారా శ్రీహరిని ధ్యానం చేయడం మొదలెట్టాడు. కర్దముని తపస్సుకు మెచ్చి శ్రీహరి కర్దమునికిశబ్ద బ్రహ్మగా ప్రసన్నుడుఅయ్యాడు. ఆ సమయంలో శ్రీహరి రూపం ఇలా ఉంది.

నిర్మలంగా, ప్రకాశవంతంగా, తెల్ల కలువ పూల మాల ధరించి, ముఖాన ముంగురులు పడుతుంటే, పసుపు పచ్చని వస్త్రమును ధరించి, కిరీటమును, కుండలములను ధరించి, శంఖము, చక్రము, గదలను ధరించి, మరొక చేత్తో తెల్ల కలువపూవును విలాసంగా పట్టుకొని, మెడలో కౌస్తుభము వేలాడుతుండగా, చిరునవ్వునవ్వుతూ, కర్దమునికి దర్శనం ఇచ్చాడు.

ఆ మూర్తిని చూచి కర్దముడు చేతులు జోడించి ఇలా ప్రార్థించాడు. "ఓ దేవదేవా! నీ దర్శనము వలన నా నేత్రములు ధన్యములు అయ్యాయి. ఎన్నో జన్మలు తపస్సుచేసిన యోగ సిద్ధులకు లభ్యం కాని నీ దర్శనము నాకు ప్రసాదించావు. నీ పాదాలు పట్టుకుంటే ఈ సంసార సముద్రాన్ని దాటవచ్చును. కానీ ఈ తుచ్ఛమానవులు నిన్ను ఏవేవో చిన్నచిన్న కోరికలు కోరుతుంటారు. నీవు కూడా వారి కోరికలను తీరుస్తుంటావు. వాళ్లు కోరేకోరికలు నరకానికి దారి తీస్తాయి అని వారికి తెలియదు.
(ఎవడైనా పతనం కావాలంటే వాడికి ఒక కోటిరూపాయలు ఇస్తాడు భగవంతుడు. ఆ క్షణం నుంచి వాడి జీవితం నరకప్రాయం అవుతుంది. దానిని దాచలేక, ఖర్చుపెట్టడానికి బుద్ధిపుట్టక, మరొకరికి దానం చెయ్యడానికి మనసురాక, దొంగలు ఎత్తుకుపోతారని అనుక్షణం భయపడుతూ, నరకం అనుభవిస్తాడు. కాని అదే సుఖం

అనుకుంటాడు. అదే మాయ).

ఓ దేవా! నేను మాత్రము తక్కువవాడనేమీ కాదు. మానవులు కోరికలుకోరుతున్నారు అని ఒక పక్క నిందిస్తూ నేను కూడా నాకు ఒక మంచి భార్యను ప్రసాదించమని నిన్ను కోరుతున్నాను. ఓ దేవా! కోరికల మయమైన ఈ లోకము నీ యొక్క వాక్కు అనే తాటితో బంధింపబడి ఉంది. నేను కూడా ఈ లోకాన్నే అనుసరించి నాకు మంచి భార్యను ప్రసాదించమని కోరుతున్నాను. దాని కోసరమే నీకు ఇన్నాళ్లు పూజలు చేసాను. నివేదనలు సమర్పించాను. కాని నేను నా కామ కోరికలను తీర్చుకోడానికి భార్యను కోరుకోడం లేదు. బ్రహ్మగారి ఆజ్ఞనుసారము సృష్టిని కొనసాగించడానికి. దేవ ఋణము, పితృఋణము ఋషిఋణము తీర్చుకోడానికీ ఒక కుమారుని పుట్టించడం కోసరం భార్యను ఇమ్మని అర్థిస్తున్నాను.

ఓ దేవా! నీ భక్తులు ఎల్లప్పుడూ నీ గుణములను కథారూపంలో చదువుతూ వింటూ, ఆకలి దప్పులను మరిచిపోయి, నీ పాదపద్మములను ఆశ్రయించుకొని భయం అనేది తెలియకుండా బతుకుతున్నారు. వారికి ఈ కోరికలతో సతమతమయ్యే అల్పులు ఐన మానవుల గురించి పట్టదు.

భూత,భవిష్యత్,వర్తమానములతో కూడిన ఈ కాలచక్రము బ్రహ్మ అనే అక్షము మీద తిరుగుతూ ఉంటుంది. ఈ కాలచక్రములో పదమూడు ఆకులు ఉన్నాయి. అవే అధికమాసములతోకూడిన పదమూడు నెలలు. ఇందులో 360 పర్వములు ఉన్నాయి. అవే 360

రోజులు. ఈ కాలచక్రమునకు ఆరు ఇరుసులు ఉన్నాయి. అవే ఆరు ఋతువులు. దీని వేగము చాలా తీవ్రంగా ఉంటుంది. ఈకాల చక్రము ఈ జగత్తును ఆవరించి ఉంటుంది. కానీ నీ భక్తులు ఈ కాలచక్రము వలన తమ ఆయువు హరించుకుపోతున్నదనీ, తాము మృత్యువుకు చేరువ అవుతున్నామనీ ఏమాత్రమూ భయపడరు.

ఓ దేవా! నీవు మొదట ఒక్కడివే అయి ఉన్నావు. అటువంటి నీవు అనేకము అవుదాము అని సంకల్పించావు. ఆ సంకల్పంతోనే నీవు యోగమాయను సృష్టించావు. ఆ యోగమాయలో నుండి సత్వ,రజస్,తమోగుణములు ఆవిర్భవించాయి. ఆ గుణములు యోగమాయకు లోబడిఉన్నాయి. సాలెపురుగు తననోటి నుండి స్రవించే ద్రవము నుండి దారమును తయారు చేసి, గూడుకట్టుకొని, అందులో ఉండి, మరలా ఆ గూడును తనలోనే ఇముడ్చుకున్నట్టు, నీవు కూడా ఈ విశ్వమును సృష్టించి, పోషించి. నీలోనే లయం చేసుకుంటున్నావు.

ఓ దేవా! ఈ జగత్తులో ఉన్న మాబోటి కామాసక్తులైన మానవుల కోసరంగా నీవు విషయ సుఖములను సృష్టించావు. నిజానికి మమ్ములను ఈ కామోపభోగములలో పడవేయడం నీకు ఇష్టం లేదు. కానీ, మేము దేవ ఋణము, పితృఋణము,ఋషి ఋణము తీర్చుకోవాలంటే మాకు సంతానం కావాలి. సంతానం కావాలంటే మేము కామానికి లోను కావాలి. కాబట్టి ఆ కామసుఖాలు మాకు ప్రసాదించు. వాటిద్వారా మేము ముక్తి మార్గం చేరుకునేటట్టు మమ్ములను దీవించు.

నీ దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించడం మాకు  ఇహలోక సుఖములను, పరలోక సుఖములను కలుగచేస్తుంది కదా!

ఓ దేవా! నిజానికి నీకు ఏకర్మాచేయనవసరం లేదు. కాని నీ మాయద్వారా నీవు అవతారాలు ఎత్తుతున్నట్టు, కర్మలు చేస్తున్నట్టు, భోగాలు అనుభవిస్తున్నట్టు  కనిపిస్తున్నావు. నిన్ను చూచి మేమూ అటువంటి కర్మలను ఆచరిస్తున్నాము. అటువంటి నీకు నమస్కారము." అని కర్దమప్రజాపతి శ్రీహరిని ప్రార్థించాడు.

కర్దముని ప్రార్థనలు విన్న శ్రీహరి ఇలా అన్నాడు.

"ఓ మునిపుంగవా! నీవు ఏ ఉద్దేశ్యముతో నన్ను ధ్యానించావో, నీ మనసులోని భావమును, కోరికను నేను తెలుసుకున్నాను. దానికి తగిన ఏర్పాటు చేసి ఉంచాను. తమ శరీరమును, వాక్కును, మనసును నా యందు లగ్నము చేసి నన్ను సేవించే భక్తుల కోరికలు తీర్చడానికి నేను ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటాను. నీవంటి వారు నా అనుగ్రహానికి పాత్రులు అయి ఉన్నారు.

బ్రహ్మచేత సృష్టించ బడిన స్వాయంభువ మనువు ఈ భూమిని పరిపాలిస్తున్నాడు. ఆయన ధర్మపరుడు. రాజర్షి. ఆయన తన భార్య శతరూపతో కలిసి నిన్ను దర్శించడానికి నీ వద్దకు వస్తున్నాడు. ఆ స్వాయంభువ మనువుకు గుణవతి శీలవతి అయిన కుమార్తె ఉంది. తన కుమార్తెకు తగిన భర్తను వెతుకుతూ స్వాయంభువ మనువు నీ వద్దకు వస్తున్నాడు. ఆయన తన కుమార్తెను నీకు ఇచ్చి వివాహం

చేస్తాడు. నీవు కూడా ఒక మంచి భార్య కొరకు వెతుకుతున్నావు కదా! ఆ రాజకన్య నిన్ను తన భర్తగా స్వీకరిస్తుంది. నీ వలన ఆమెకు తొమ్మిది మంది పుత్రికలు కలుగుతారు. వారు మరీచి మొదలగు ఋషులను భర్తలుగా స్వీకరిస్తారు. వారి వలన ఈ సృష్టి కొనసాగుతుంది. నీవు నా అదేశము ప్రకారము ఆచరించి, నీవే చేయు సమస్త కర్మలను నాకు అర్పించి, తుదకు శుద్ధసత్త్వరూపంతో నన్ను చేరుకుంటావు.

ఓ కర్దమ మహర్షీ! నీవు గృహస్థాశ్రమముస్వీకరించిననూ జితేంద్రియుడవు. సకల జీవరాసుల యందు దయగలిగి ఉంటావు. సమస్త జీవరాసులలో నన్ను చూస్తావు. నాలో నిన్ను, సకల జీవరాసులను చూస్తావు. అటువంటి నీకు, నీ భార్య దేవహూతికి నేను కుమారుడుగా జన్మించి, ఈ లోకములో తత్త్వ సంహితను (సాంఖ్యశాస్త్రమును) ప్రబోధిస్తాను." అని చెప్పాడు.

ఈ విధంగా కర్దమునికి కోరిన వరాలు ఇచ్చిన శ్రీహరి అంతర్హితుడయ్యాడు. తరువాత కర్దముడు రాజర్షిఅయిన స్వాయంభువ మనువు, ఆయనభార్య శతరూప రాకకోసరం నిరీక్షిస్తున్నాడు.

ఓ విదురా! భగవానుడు చెప్పిన ప్రకారము స్వాయంభువ మనువు, ఆయన భార్య శతరూప,ఆయనకుమార్తె దేవహూతితో సహా ఒక రథము మీద కూర్చుని, తన కుమార్తెకు తగిన వరుడిని వెదుకుతూ తిరుగుతున్నాడు. అలా తిరుగుతూ సరస్వతీ నదీ తీరమున ఉన్న కర్దముని ఆశ్రమానికి చేరుకున్నాడు. కర్దముని ఆశ్రమము ఫల,పుష్పములతో నిండిన చెట్లతోనూ, లతలతోనూ, పెంపుడు

జంతువులతోనూ, కిలకిలారావాలు చేయు పక్షులతోనూ, మృదుమధురంగా కూసే కోయిలలతోనూ, కన్నులవిందుగా నృత్యం చేసే నెమళ్లతోనూ,  హంసలు, బాతులు, బెగ్గురుపక్షులతో నిండిన సరోవరములతోనూ, నిండి ఉంది.

అటువంటి ఆశ్రమానికి స్వాయంభువ మనువు వచ్చాడు. ఆ సమయంలో కర్దముడు సాయంత్రం చేయవలసిన సంధ్యావందనము, అగ్నిహోత్రము మొదలగు కార్యములు ముగించుకొని కూర్చుని ఉన్నాడు. కర్దముని శరీరంనుండి ఒక విధమైన దివ్య కాంతి ప్రసరిస్తూ ఉంది. మనువు వచ్చి కర్దముని పాదములకు నమస్కరించాడు. కర్దముడుకూడా మనువును సాదరంగా ఆహ్వానించి, అర్ఘ్యపాద్యములు, ఉచితాసనము ఇచ్చి సత్కరించాడు. మనువుకూడా కర్దముడు చేసిన సపర్యలను ఆనందంగా స్వీకరించాడు. కర్దముని పక్కనే కూర్చున్నాడు.

కర్దమునికి శ్రీహరి చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. మనువును చూచి కర్దముడు ఇలా అన్నాడు. “ఓ రాజర్షీ! నీవు భగవంతుని నుండి సంక్రమించిన  పాలనాశక్తి స్వరూపుడవు. నీవు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణచేస్తూ ఈ భూమి అంతా తిరుగుతున్నావు. నీవు సాక్షాత్తు శ్రీహరి స్వరూపుడవు. అట్టి నీకు నమస్కరిస్తున్నాను. కేవలం నీ రథధ్వనిని వినినంతనే పాపకర్ములకు భయం పుడుతుంది. నీవు నీ సేనలతో భూమి అంతా సూర్యుని మాదిరి తిరుగుతూ ధర్మరక్షణ చేస్తున్నావు. నీవే కనుక ఈ మాదిరి భూప్రదక్షిణము చేయకపోతే, దుర్మార్గులు,దస్యులు  విజృంభించి వర్ణాశ్రమ ధర్మములను రూపుమాపి ఉండేవాళ్లు.

ఈ మానవులు అందరూ ప్రాపంచిక విషయములలో పడి, కామాతురులై విషయలోలురై, నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారు. వారి వలన అధర్మము లోకంలో విజృంభిస్తుంది. ఇవేమీ పట్టకుండా నీవు ఊరకుంటే, ఈ దుర్మార్గుల పాలబడి ఈ లోకము ఎన్నడో నశించిపోయేది.

ఇంతకూ మీరు నా ఆశ్రమమునకు ఏ పనిమీద వచ్చారో తెలుసుకోదలచాను. మీకు నేను ఏమి సహాయము చేయగలనో తెలుపండి. దానిని నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తాను." అని అన్నాడు కర్దముడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ఇరువది ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## ఇరువది రెండవ అధ్యాయము

. మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పసాగాడు. "ఆ విధంగా కర్దముడు తనను పొగుడుతుంటే, స్వాయంభువ మనువు సిగ్గుతో కుచించుకుపోయాడు. వినయంగా కర్దమునితో ఇలా అన్నాడు.

"మహాత్మా! వేదస్వరూపుడు అయిన బ్రహ్మ తన ముఖము నుండి, ఎల్లప్పుడూ తపస్సు నందు ఆసక్తి కలవారు, విషయ వాంఛల

యందు ఆసక్తి లేని వారు అయిన  బ్రాహ్మణులను సృష్టించాడు. ఆ బ్రాహ్మణులను సంరక్షించడానికి తన బాహువుల నుండి క్షత్రియులను సృష్టించాడు.  బ్రాహ్మణులు, క్షత్రియులకు హృదయము వంటి వారైతే, క్షత్రియులు బ్రాహ్మణులకు భుజములవంటి వారు. అందువలన బ్రాహ్మణులు తమ తపోబలముతో క్షత్రియులను,  క్షత్రియులు తమ భుజబలంతో బ్రాహ్మణులను,  ఒకరిని ఒకరు రక్షించుకుంటున్నారు. కాని మనలనందరరూ ఆ పరమాత్మ రక్షిస్తున్నాడు.

ఓ దేవా! మీ దర్శనభాగ్యముచేతనే నా లో ఉన్న సకల సందేహములు తొలగిపోయాయి. మీరు నాకు రాజధర్మములను ఉపదేశించారు. ఆ ధర్మములను నేను తప్పకుండా ఆచరిస్తాను. నేను పూర్వజన్మలో చేసుకున్న అదృష్టము వలన నాకు మీ దర్శనభాగ్యము, మీ పాద ధూళిని నా శిరస్సున ధరించే పుణ్యము లభించింది. దుర్మార్గులకు మీ దర్శనభాగ్యము కలుగదు కదా! తమకు నా మీద ఉన్న దయ వలన నాకు రాజధర్మములను ఉపదేశించారు. వాటిని నేను శ్రద్ధతో విన్నాను.      ఇదంతా నేను చేసుకున్న సుకృతము.

ఓ మహర్షీ! నేను నా పుత్రిక గురించి కలత చెందుతున్నాను. ఈ విషయంలో నా మనవిని వినగోరుతున్నాను. ఈమె నా కుమార్తె. నాకూ, నా భార్య శతరూపకుజన్మించిన కుమార్తె. పేరు దేవహూతి. నాకుమారులు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనువారలకు సోదరి. ఈమె గుణవతి. శీలవతి. యౌవనవతి. ఆమె తనకు తగిన భర్త కోసరం వెదుకుతూ ఉంది. నారద మహర్షివలన తమరి గురించి తమరి రూపము, గుణము, పాండిత్యము గురించి

విని తమరినే భర్తగా వరించింది.

ఓ బ్రాహ్మణోత్తమా! నేను, నా భార్య, కలిసి మా కుమార్తెను మీకు భక్తితో సమర్పించుకుంటున్నాము. మీరు ఈమెను భార్యగా స్వీకరించండి. గృహస్థాశ్రమములో మీకు ఈమె అన్నివిధాలా సహకరిస్తుంది. మీరు కూడా మీకు తగిన వధువు కొరకు వెదుకుతున్నారు అని తెలుసుకొన్నాను. ఎటువంటి విరాగి అయినా కోరి వచ్చిన కాంతను కాదనడు కదా! అటువంటిది మీరు కూడా మీకు తగిన భార్య కొరకు చూస్తున్నారు కాబట్టి, ఇంక చెప్పేది ఏముంది! కోరి వచ్చిన కన్యను తిరస్కరించి తరువాత బాధపడటం మీ వంటి వారికి తగదు. మీ వద్దకు వచ్చిన వారిని కాదంటే మీ గౌరవంకూడా తగ్గిపోతుంది.

ఓ మహర్షీ! మీరుకూడా వివాహము చేసుకొనవలెనని తలంపుతో ఉన్నారు కాబట్టి, నా కుమార్తెను పాణిగ్రహణము చేయవలసినదిగా కోరుతున్నాను. మీరు ఇప్పటి వరకు బ్రహ్మ చర్యమునుపాటించారు. ఇప్పటినుండి గృహస్థాశ్రమమును స్వీకరించండి."అని ప్రాధేయ పడ్డాడు స్వాయంభువ మనువు.

మనువు మాటలను అంగీకరించాడు కర్దముడు. "మీరుకోరినట్లు నేను ఈ వివాహమునకు అంగీకరిస్తున్నాను. మీరు ఈమెను వేరే ఎవరికీ ఇస్తానని వాగ్దానము చేసి  ఉండలేదని అనుకుంటున్నాను. ఈమెకు, నాకు ఇదే ప్రథమ వివాహము. ఈ వివాహము మా ఇద్దరి ఇష్టం మీద జరుగుతుంది.

మహారాజా! మా వివాహమును శాస్త్రోక్తంగా నిర్వహించండి. నీ కుమార్తె సౌందర్యమును చూచి ఎవరు ఈమెను వరించకుండా ఉంటారు? ఎందుకంటే, ఇదివరకు, ఒక సారి ఈమె ఎత్తైన మేడమీద ఒక బంతితో ఆడుకుంటూ ఉంటే, పైనుండి విమానము మీద వెళుతున్న విశ్వావసుడు అనే గంధర్వుడు చూచాడు. ఈమె అందానికి వివశుడై కళ్లుతిరిగి,  విమానము మీది నుండి కిందపడ్డాడు. అటువంటి అందము ఈమెది. స్వాయంభువ మనుకు కుమార్తె, ఉత్తానపాదుని సోదరి స్వయంగా వచ్చి వరిస్తే, ఎవరు తిరస్కరించగలరు?

మహారాజా! మరొక విషయం. నా వలన ఈమెకు సంతానము కలుగువరకూ నేను ఈమెతో గృహస్థాశ్రమ జీవితం గడుపుతాను. తరువాత పరమాత్మ ఆజ్ఞమేరకు నేను సన్యాసాశ్రమము స్వీకరిస్తాను. ఇది నా నియమము."అని పలికాడు కర్దముడు.

దానికి మనువు సమ్మతించాడు. తరువాత తన భార్య శతరూపతోనూ, కుమార్తె దేవహూతి తోనూ చర్చించాడు. వారి అంగీకారము కూడా తీసుకున్నాడు. తరువాత కర్దమునికి తన కుమార్తె దేవహూతిని ఇచ్చి వైభవంగా వివాహము జరిపించాడు. శతరూప తన కుమార్తె దేవహూతికి అనేకములైన విలువైన ఆభరణములు, వస్త్రములు, గృహోపకరణములు ఇచ్చింది. మనువు, శతరూప తమ కుమార్తెను ప్రేమతో ఆలింగనము చేసుకొని, ఆమెను  విడువలేక, విడువలేక విడిచి పెట్టి బ్రహ్మావర్తదేశంలో ఉన్న తమ రాజధాని అయిన బర్హిష్మతి అనే పట్టణమునకు వెళ్లిపోయారు.

## తృతీయ స్కంధము

కుమార్తె వివాహముజరిపించి వచ్చిన మనువుకు బర్హిష్మతి పట్టణములో ఘనస్వాగతం లభించింది.

ఓ విదురా! ఆ పట్టణమునకు బర్హిష్మతి అనే పేరు ఎలా వచ్చిందో తెలుసా! పూర్వము యజ్ఞవరాహ అవతారమును ధరించిన శ్రీహరి తన శరీరమును విదిల్చాడు.అప్పుడు ఆ వరాహ రోమములు కిందపడ్డాయి. ఆ రోమములు దర్భలుగానూ, రెల్లుగడ్డిగానూ మారిపోయాయి. ఆ దర్భలనే ఋషులు, బ్రాహ్మణులు యజ్ఞములలో పవిత్రములుగా వాడసాగారు. ఆ దర్భలతోనే యజ్ఞపురుషుని ఆరాధించి, రాక్షసులను పారదోలగలిగారు. స్వాయంభువ మనువు కూడా ఆదర్భలతోనే ఒక ఆసనమును ఏర్పరచుకొని శ్రీహరిని ఆరాధించాడు. అందుకే ఆ ప్రదేశమునకు బర్హిష్మతి అనే పేరు వచ్చింది.

ఆ బర్హిష్మతి నగరంలోకి ప్రవేశించాడు స్వాయంభువ మనువు. ప్రతిరోజూ శ్రీహరి అవతార విశేషములను కథలు కథలు గా వింటూ శ్రీహరి సేవలో కాలం గడుపుతూ ప్రజలను పాలిస్తున్నాడు స్వాయంభువమనువు. ఆ మనువు ఐహిక భోగములు అనుభవిస్తున్నా, వాటికి ఏనాడూ లోబడలేదు. ఆయన మనస్సు నిరంతరమూ శ్రీహరియందు లగ్నమై ఉండటం వలన, ఆయన తన కాలమును నిరర్థకముగా గడపడం లేదు. స్వాయంభువ మనువు సత్త్వ,రజస్,తమోగుణములకు లోబడకుండా, శ్రీహరిని అనునిత్యమూ స్మరిస్తూ, డెబ్బై ఒక్క యుగముల పాటు ఈ భూమినిపరిపాలించాడు. దానినే స్వాయంభువ మన్వంతరము అని పిలుస్తారు.

తన జీవిత కాలంలో స్వాయంభువ మనువు, సకల ప్రాణులకు మేలు చేయడంలోనే ఆసక్తి కనబరిచాడు. ఎందరో మహామునులు ఆయన వద్దకు వచ్చి ధర్మ సూక్ష్మముల గురించి తెలుసుకొనేవారు. ఆయన కూడా వారికి వర్ణాశ్రమ ధర్మములను, ఆశ్రమ ధర్మములను, మానవులు ఆచరించ వలసిన ధర్మములను, ఇంకా నానావిధములైన ధర్మములను మునులకు, ప్రజలకు వివరించాడు.

ఓ విదురా! ఇప్పటి వరకూ నీకు స్వాయంభువ మనువు గురించి వివరించాను. తరువాత, స్వాయంభువ మనువు కుమార్తె దేవహూతి, కర్దముల వైవాహిక జీవితము గురించి వివరిస్తాను." అని అన్నాడు మైత్రేయుడు.

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము ఇరువది రెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## ఇరువది మూడవ అధ్యాయము

మైత్రేయుడు విదురునికి ఈ విధంగా చెప్పసాగాడు.

కర్దమునికి దేవహూతికి వివాహం జరిగింది.. దేవహూతి

తల్లితండ్రులు అమ్మాయిని అత్తవారి ఇంట వదిలి పెట్టి వెళ్లిపోయారు. అప్పటి నుండి దేవహూతి భర్తను దైవంగా భావించి ఆయనకు సేవలు చేస్తూ ఉంది. దేవహూతి  కామసంబంధమైన  కోరికలను, కపటమును, ద్వేషమును, లోభమును, అహంకారమును వదిలిపెట్టింది. భర్త పట్ల అచంచలమైన విశ్వాసము, గౌరవము పెంపొందించుకుంది. ఇంద్రియ నిగ్రహమును అలవరచుకుంది. భర్త మనసు కనిపెట్టి ఆయనకు సేవలు చేయసాగింది.

భర్త సేవలలో తన దేహము సంగతి మరిచి పోయింది దేవహూతి.  భర్త సేవలతోనూ, నియమ నిష్ఠలతోనూ,  ఆమె దేహము కృశించి పోయింది. అది గమనించాడు కర్దముడు. ఒక రోజు దేవహూతిని చూచి ఇలా అన్నాడు.

"భార్యామణీ! మన వివాహము అయినది మొదలు నువ్వు నన్ను శ్రద్ధతో సేవిస్తున్నావు. నీ దేహం గురించి కూడా పట్టించుకోవడం లేదు.  దేహధారులందరికీ, తమ దేహము అనిన ఎంతో ఇష్టము కదా! కానీ, నీవు నీ దేహము దినదినము క్షీణించిపోతున్నా లెక్కచేయడం లేదు.  నీ సేవలతో నేను తృప్తిపడ్డాను. నేను చేసిన తపస్సు, సమాధి, ఉపాసన మొదలగు యోగముల వలన, నాకు ఎన్నో విభూతులు, శక్తులు లభించాయి. అవి అన్నీ నీ వలననే నాకు కలిగాయి. నీవు నాకు సేవలు చేస్తూ ఉండకపోతే నేను ఇన్ని శక్తులు సాధించి ఉండేవాడిని కాదు. కాబట్టి నేను సంపాదించిన శక్తులలో విభూతులలో నీకూ భాగం ఉంది. కానీ నీవు క్షత్రియ కాంతవు అనీ, నీకు అన్ని భోగములు అనుభవించే హక్కు ఉన్నదనీ నీవు ఏనాడూ గర్వించలేదు.  కాబట్టి నీవు ఏయేభోగములు అనుభవించదలచుకున్నావో చెప్పు." అని

అడిగాడు కర్దముడు.

అప్పుడు దేవహూతికి తన భర్త తనను నిర్లక్ష్యం చేస్తున్నాడు అనే భావన తొలగిపోయింది. స్త్రీసహజమైన సిగ్గు ముంచుకొచ్చింది. పెదవుల మీద మందహాసం చిగురించింది. తలవంచుకొని భర్తతో ఇలా అంది.

"నాథా! మీరు అమోఘమైన యోగమాయలకు అధిపతులు. మీరు చెప్పినదానిలో అసత్యము లేదు. ఒక్కసారి మీరు మన వివాహసమయములో నాతో అన్నమాట గుర్తు తెచ్చుకోండి. "మనకు సంతానము కలుగువరకు, గృహస్థాశ్రమంలో ఉంటాను, తరువాత సన్యాసాశ్రమము స్వీకరిస్తాను" అని అన్నారు. కానీ మీరు ఆ దిశగా ఇప్పటి వరకూ ఏ ప్రయత్నమూ చేయలేదు. మనకు సంతానము కలుగలేదు. నాకు సంతానమును పొందవలెనని కోరికగా ఉంది. ఆ కోర్కె తీర్చండి. ఉత్తముడైన భర్త ద్వారా సంతానము పొందడం కన్నా పొందదగిన సుఖం పతివ్రత అయిన భార్యకు వేరే ఏముంటుంది.

ఈ విషయంలో నాకూ ఏమీ తెలియదు. కామశాస్త్రములో సంతానమును పొందడానికి ఏమేమి చెయ్యాలో నాకు తెలియ జేయండి. ప్రస్తుతము నా శరీరము క్షీణించి, దుర్బలమై ఉంది. ఈ శరీరము భర్తతో సంభోగమునకు, గర్భధారణకు అనువైనదిగా చేసుకోడానికి, అభ్యంగనము, మంచి ఆహారము తీసుకోవడం మొదలగు కార్యములు చేయడానికి అనుమతి ఇవ్వండి. మనము ఆనందంగా విహరించడానికి, మనకు ఏకాంతము సమకూర్చడానికి,

ఏకాంత సమయంలో ఆనందంగా గడపడానికి  అనువైన అందమైన భవనమును నిర్మించండి." అని చెప్పీ చెప్పకుండానే అసలు విషయాన్ని చెప్పింది దేవహూతి.

భార్య మనసులో ఉన్న కోరికలను అర్థం చేసుకున్నాడు కర్దముడు. తన యోగమాయా ప్రభావంతో ఒక అందమైన విమానమును నిర్మించాడు. అది ఒక చోట ఉండగలదు. అన్ని చోట్లా తిరగ గలదు. కోరిన వస్తువులను, అవసరాలను సమకూర్చగలదు. అందమైన ఆ విమానములో మణిమయమైన భవనము అందంగా రత్నములతోనూ, మణిమాణిక్యములతో నూ అలంకరింపబడి ఉంది. పడక గదులు, అన్ని రకములైన సౌకర్యములు ఉన్నాయి. ఆహార పానీయాలు సమృద్ధిగా ఉన్నాయి. రకరకాలైన పూలమాలలు, వస్త్రములు, ఆభరణములు, పట్టువస్త్రములు, సమృద్ధిగా ఉన్నాయి.

ఆ విమానములో వేరు వేరు అంతస్థులలో, పడకగదులు, శయ్యలు, మెత్తని పరుపులతో అంకరింపబడి ఉన్నాయి. ఆ భవనం అంతా మణులతోనూ, మరకతములతోనూ అలంకరింపబడి ఉంది. ద్వారములు, తలుపులు పగడములు, ముత్యములతో అలంకరింపబడి ఉన్నాయి. ఆ భవనములో అలంకారము కోసరము ఉంచిన హంసలు, పావురములు మొదలగు పక్షుల బొమ్మలను చూచి, వాటిని తమ సహచరులని నమ్మి,  నిజమైన పక్షులు  వాటి చుట్టు వాలుతున్నాయి.

తాను సృష్టించిన మాయావిమానమును చూచి కర్దముడే ఆశ్చర్యపోయాడు. కాని దేవహూతికి తృప్తి కలుగలేదు. ఎక్కడచూచినా ప్రాణము లేని వస్తువులు కనపడుతున్నాయికానీ, పరిచారికలు,

చెలికత్తెలు కనిపించడం లేదు. తనకు స్నానం చేయించే వారెవరు, అలంకరించేవారెవరు అని బాధపడుతూ ఉంది.

దేవహూతి మనసులో ఉన్న భావాలన గ్రహించాడు కర్దముడు. ఆమెతో ఇలా అన్నాడు. “ అది బిందు సరోవరము. పరమాత్మ ఆనందభాష్పములతో నిండి ఉంది. ఆ సరోవరము అందరి కోరికలను తీరుస్తుంది. నీవు వెళ్లి ఆ బిందు సరోవరములో ఒక్కసారి మునుగు. తరువాత వచ్చి ఈ విమానము ఎక్కు. ” అని అన్నాడు కర్దముడు.

అప్పుడు ఆమె ధరించిన వస్త్రములు అన్నీ మలినంగా ఉన్నాయి. తల వెంట్రుకలు అన్నీ తైల సంస్కారము లేక జడలుకట్టి ఉన్నాయి. అటువంటి దేవహూతి భర్త ఆజ్ఞమేరము బిందుసరోవరములో ప్రవేశించింది. ఈ బిందు సరొవరము లోపల ఆమెకు వేయి మంది అందమైన అమ్మాయిలు కనిపించారు. వారు ఆమెకు నమస్కరించి “అమ్మా! మేము నీ పరిచారికలము. నీవు ఏమి చెబితే అది చేస్తాము. ఆజ్ఞాపించండి” అని అడిగారు. ఆమె ఆశ్చర్యపోయింది.

వెంటనే ఆ పరిచారికలు దేవహూతికి అభ్యంగన స్నానం చేయించారు. మంచి వస్త్రములు, ఆభరణములు ధరింపచేసారు. రుచికరమైన భోజనము ఏర్పాటు చేసారు. అప్పుడు దేవహూతి అమితమైన సౌందర్యముతో మెరిసిపోతూ ఉంది. తనను తాను అద్దంలో చూచుకొని మురిసిపోయింది. తనను వేల కొలది చెలులుసేవిస్తూ ఉండగా భర్త దగ్గరకు వెళ్లింది. తన భర్తయొక్క మహిమలకు ఆశ్చర్యపోయింది. అత్యంత సౌందర్యంతో శోభిల్లుతున్న తన

భార్య దేవహూతిని చూచిన కర్దమునికి కామ వికారం కలిగింది. భార్యతో కలిసి ఆ విమానమును ఎక్కాడు. దేవహూతి కే కాదు కర్దమునికి కూడా గంధర్వ కాంతలు సేవలు చేస్తూ ఉన్నారు. ఆ విమానములో ఉన్న కర్దముడు దేవహూతి తార, చంద్రుల మాదిరి ప్రకాశిస్తున్నారు.

తరువాత వారు ఆ విమానంలో బయలు దేరారు. వివిధ ప్రదేశములలో క్రీడించారు. సురలోక భోగములు అనుభవించారు. వైశ్రంభకము, సురసనము, నందనము, పుష్పభద్రకము, చైత్రరథము మొదలగు దేవతా ఉద్యానవనములలో విహరించారు. ఆ ప్రకారంగా దేవహూతి కర్దములు ఆ విమానములో లోకాలన్నీ తిరిగారు. అలా కొంతకాలము విమానంలో ఆనందంగా విహరంచి, తమ ఆశ్రమమునకు తిరిగి వచ్చారు. ఈ కాలంలో కర్దముడు తనను తాను తొమ్మిది రూపములుగా వ్యక్తపరచుకొని,  తన భార్య దేవహూతితో రమించాడు.

వారికి సంవత్సరము ఒక క్షణంగా గడిచిపోయింది. దేవహూతికి కాలం ఎలా గడుస్తూ ఉందో కూడా తెలియలేదు. భర్తతో కూడా రతిసుఖములో తేలియాడుతూ ఉంది. కర్దముని రేతస్సు తొమ్మిది భాగములుగా దేవహూతి గర్భంలో నిక్షిప్తం అయింది. దాని ఫలితంగా దేవహూతికి తొమ్మిది మంది కుమార్తెలు కలిగారు. వారంతా సర్వాంగ సుందరులు.

సంతానం కలగడం తోటే కర్దమునికి తాను శ్రీహరిమాట గుర్తుకు వచ్చింది. వెంటనే సన్యాసాశ్రమము స్వీకరించడానికి సిద్ధం

అయ్యాడు. ఆ విషయం దేవహూతికి చెప్పాడు. భర్తను చూచి దేవహూతి, భర్తవియోగబాధను మనసులో అణచుకొని, ఒక్క చిరునవ్వు నవ్వింది.

"నాథా! మన వివాహ సమయంలో మీరు అన్న మాటను పాటిస్తున్నారు. కాని మీ కుమార్తెల సంగతి ఏమిటి? ఆడుదాన్ని నేను వారికి భర్తలను వెదకలేను. మీ కుమార్తెలు తమ తమ భర్తలను వెదుక్కోవాలి. పైగా నేను ఇంతకాలము మీతో సుఖాలలో తేలియాడాను. ఈ సంసార జీవితం మీద నాకు విరక్తి కలిగింది. నాకు తత్త్వజ్ఞానమును ఉపదేశించడానికి నాకు ఒక కుమారుని ప్రసాదించరా! ఎందుకంటే ఇన్నాళ్లు నేను ఆ భగవంతుని తలచుకోలేదు. ధ్యానించలేదు. విషయసుఖములు అనుభవించడంతోనే కాలం గడిచిపోయింది. ఇన్నాళ్లు మీతో కాపురం చేసి కూడా, కనీసం మీ వలన కూడా నేను ఆత్మజ్ఞానమును, బ్రహ్మజ్ఞానమును తెలుసుకోలేదు. దుర్మార్గులతో చేసిన సాంగత్యము సాంసారికసుఖములకు కారణం అయినట్టే, మీవంటి సత్పురుషులతో చేసిన సాంగత్యము ఆ సంసార బంధముల నుండి విముక్తికి కారణం అవుతుంది.

నాథా! ఈ ప్రపంచంలో ఎవరు చేసే కర్మలు కేవలం కామవాంఛలు తీర్చుకోడానికి పనికివస్తాయో, ఏయే కర్మలు నిష్కామంతో చేయబడకుండా, వైరాగ్యమును కలుగచేయవో, ఎవరు చేసే కర్మలు శ్రీహరికి అర్పితము కావో, అటువంటి వారు బతికి ఉన్నా చచ్చినవాడి కిందనే లెక్క. నేను కూడా ఆ భగవంతుని మాయలో పడి ఇంతకాలము మీతో విషయభోగములు అనుభవించాను. పరమాత్మను

విస్మరించాను. మీవంటి జితేంద్రియులను భర్తగా పొంది కూడా, నేను మోక్ష సాధనకు ఎటువంటి ప్రయత్నము చేయలేదు. అది నా దురదృష్టము. కాబట్టి నాకు వైరాగ్యము గురించి బోధించే ఒక కుమారుని ప్రసాదించండి." అని పలికింది దేవహూతి.

శ్రీమద్భాగవతము

తృతీయస్కంధము ఇరువదిమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

తృతీయస్కంధము

ఇరువదినాలుగవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పసాగాడు.

"దేవహూతి మాటలు విన్న కర్దముడు చిరునవ్వు నవ్వాడు. ఆయన మనస్సంతా కరుణతో, దయతో నిండి పోయింది. భార్య వంక ప్రేమతో చూస్తూ ఇలా అన్నాడు.

"ఓ సాధ్వీ! నీవు ఎన్నటికీ దు:ఖితురాలవు కావు. నీకు పుత్రులు లేరు అన్న బాధ అవసరం లేదు. నీ గర్భవాసాన సాక్షాత్తు పరమాత్మ పుత్రుడుగా జన్మించబోతున్నాడు. పరమాత్మ నాకు ఆ వరం ప్రసాదించాడు. ఇప్పటి నుండి నీవు ఆ పరమాత్మను భక్తితో పూజించు. నీ పూజలు ఫలిస్తాయి. నీకుశుభం కలుగుతుంది. నీ పూజలు ఫలించి,

ఆ పరమాత్మ నీ యొక్క నా యొక్క కీర్తిని ఇనుమడింపచేస్తూ, మనకు పుత్రుడుగా జన్మిస్తాడు. మనజన్మలను సార్ధకం చేస్తాడు. నీ కుమారుడు నీకు తత్త్వజ్ఞానమును బోధిస్తాడు. నీలోని అజ్ఞానమును, అవిద్యను పోగొడతాడు. నీకు ముక్తిని ప్రసాదిస్తాడు." అని అన్నాడు కర్దముడు.

భర్త మాటలు విన్న దేవహూతి పరమానంద భరితురాలయింది. అటు భర్తను ఇటు పరమాత్మను భక్తి శ్రద్ధలతో పూజింపసాగింది. కొన్నాళ్లు ఆమె పూజలు ఫలించింది. దేవహూతి గర్భం ధరించింది. ఆమె కు పరమాత్మ పుత్రుడుగా జన్మించాడు. ఆ సమయంలో ఎన్నో శుభశకునములు పొడసూపాయి. ఆకాశం లయబద్ధంగా ఉరిమింది. గంధర్వులు ఆడారు, పాడారు. దేవతలు పుష్పవర్షము కురిపించారు.

ఈవిషయం తెలుసుకొన్న బ్రహ్మ, సనకాదులను, మరీచి మొదలగుమహాఋషులను వెంట తీసుకొని పసిబిడ్డగా అవతరించిన పరమాత్మను చూడడానికి కర్దముని ఆశ్రమమునకు వచ్చాడు. కర్దముని దేవహూతిని చూచి ఇలా అన్నాడు. '

'కర్దమా! నీవు నా ఆదేశములను చక్కగాపాటించావు. ఆ పరమాత్మనే పుత్రుడుగా పొందగలిగావు. నీ కుమార్తెలకు వివాహము చేయు సమయము ఆసన్నమయింది. నీ కుమార్తెలను ఈ ఋషులకు ఇమ్ము. నీ పుత్రికలు వీరిని భర్తలుగా పొంది ఈ సృష్టిని కొనసాగిస్తారు. వారి వారి వంశములను వృద్ధిచేస్తారు. ఈ మరీచి మొదలగు మహామునులకు వారి వారి గుణగణములను బట్టి నీ కుమార్తెలను

వారికి ఇచ్చి వివాహం జరిపించు. కీర్తిమంతుడవుగా!

ఓ కర్దమా! నీకు జన్మించిన పుత్రుడు సాక్షాత్తు ఆ పరమాత్మ అవతారము. ఆ పరమాత్మ తన యోగ మాయ ద్వారా నీ కు కుమారుడుగా జన్మించాడు. ఓ దేవహూతీ! నీలోని అవిద్యను, మోహమును నశింపచేయడానికి, నీకు తత్త్వజ్ఞానమును బోధించడానికి ఆ శ్రీహరి నీకు కుమారుడుగా ఉద్భవించాడు. ఆయన కపిలుడుగా ప్రసిద్ధిచెందిి. సాంఖ్యయోగమును లోకములో ప్రచారం చేస్తాడు. సాంఖ్యుల చేత పూజింపబడతాడు." అని అన్నాడు.

తరువాత మరీచి మొదలగు ఋషులను అక్కడే ఉంచి, బ్రహ్మ సనకాదులతో, నారదునితో కలిసి సత్యలోకమునకు వెళ్లిపోయాడు.

ఆ ప్రకారంగా బ్రహ్మదేవుడు వెళ్లిపోయిన తరువాత కర్దముడు బ్రహ్మదేవుని ఆదేశానుసారము తన కుమార్తెలను మరీచి మొదలగు మహామునులకు ఇచ్చి వివాహం జరిపించాడు. మరీచికి కళ అను కన్యను, అత్రికి అనసూయ అను కన్యను, అంగిరసునకు శ్రద్ధఅను కన్యను, పులస్త్యునకు హవిర్భువు అను కన్యను, పులహునకు గతి అను కన్యను,  అథర్వునకు శాంతి అను కన్యను,  క్రతువునకు క్రియ అనే పేరు గల కన్యను, భృగువునకు ఖ్యాతి అను కన్యను, వశిష్టునకు అరుంధతి అను కన్యను ఇచ్చి వివాహం జరిపించాడు. వివాహము తరువాత ఆ మహామునులందరూ భార్యాసమేతంగా, కర్దముని వద్ద అనుజ్ఞతీసుకొని తమ తమ స్థానములకు వెళ్లిపోయారు.

ఆ శ్రీహరి తనకు కుమారుడుగా జన్మించాడు అని పొంగిపోయాడు కర్దముడు. ఏకాంతంగా ఆ శిశువు దగ్గరకు పోయి, నమస్కరించి, ఇలా అన్నాడు.

"ఓ దేవా! మా బోటి మానవులు అనునిత్యం ఏదో ఒక రూపంలో పాపాలు చేస్తున్నాము, అటువంటి మాకు ఎన్నో పూజలు చేస్తేకానీ దేవతలు ప్రసన్నులు కారు. మహా మహా యోగులు ఎవని స్వరూపమును కనులారా చూడటానికి తపస్సు, సమాధి ద్వారా ప్రయత్నిస్తుంటారో అటువంటి నీవు, విషయలోలురమైన మా ఇంట్లో శిశువుగాజన్మించావు. మేము నీపట్ల చూపిన భక్తికి సార్ధకత లభించింది. భక్తపరాధీనుడవు అని మరొకమారు ఋజువు అయింది.

నీ వాక్కులతో నీ బోధనలతో ఈ లోకాన్ని ఉద్ధరించడానికి, నీకు నాకు ఇచ్చి మాట ప్రకారము మా ఇంట్లో అవతరించావా పరమాత్మా! నీకు రూపం అంటూ లేదు. నిరాకారుడవు. కాని నీ భక్తులు నిన్ను ఏ రూపంతో ఆరాధిస్తారో ఆయారూపములతో వారిని కరుణిస్తావు. వారి కోరికలు తీరుస్తావు. అన్నిరూపములు నీవే కదా పరమాత్మా! ఆత్మతత్త్వమును గురించి తెలుసుకోడానికి బాగా తెలిసిన వారు నీ పాదములను ఆశ్రయిస్తూ ఉంటారు. నీవు ఐశ్వర్యము, వైరాగ్యము, యశస్సు, జ్ఞానము, వీర్యము, ధనము అనే ఆరు ఐశ్వర్యములకు నిలయము. అటువంటి నిన్ను నేను శరణుకోరుతున్నాను.

ఓ దేవా! నీవు ఈ ప్రకృతి స్వరూపుడవు. పరమేశ్వరుడవు. పురుషుడవు. మహతత్త్వరూపుడవు. కాలపురుషుడవు. సర్వము తెలిసినవాడవు. సత్త్వ,రజస్తమోగుణములను అధీనంలో ఉంచుకున్నవాడవు. లోకపాలకుడవు. ఈ ప్రపంచంలో ఉన్న సమస్తజీవరాసులలో నివశించేవాడివి. ఇప్పుడు ఈ కపిలరూపంలో నా గృహంలో ఉద్భవించావా మహానుభావా!

నీవు నాకు పుత్రుడుగా జన్మించడం వలన నేను పితృఋణము, ఋషిఋణము,దేవఋణముల నుండి విముక్తుడను అయ్యాను. నా ప్రార్థన మన్నించి నాకు ఈ సంసార బంధముల నుండి విముక్తిని ప్రసాదించు. నేను సన్యసించి నీ నామస్మరణతో పునీతుడను అవుతాను. నన్ను అనుగ్రహించు." అని వేడుకున్నాడు కర్దముడు.

కర్దముని ప్రార్థనలను విన్న శ్రీహరి కర్దమునితో ఇలా అన్నాడు. "వైదిక కర్మలలోగానీ, లౌకిక కర్మలలోగానీ, నా మాటయే ప్రమాణంగా ఆచరిస్తారు. నేను నీకు పుత్రుడుగా జన్మిస్తాను అని మాట ఇచ్చాను. నా మాటను నిలబెట్టుకోడానికి నీకు కుమారుడిగా జన్మించాను. ఈ లోకంలో ఉన్న మునులు తాము ముందు జన్మలలో చేసిన కర్మల వాసనల నుండి వారి వారి సూక్ష్మదేహములు విముక్తికాక బాధపడుతున్నారు. అటువంటి వారికి ఆత్మ దర్శనము చేయడానికి అనువైన తత్త్వమును ఉపదేశించడానికే ఈ అవతారము దాల్చాను. ఈ ఆత్మజ్ఞానము పూర్వము ఉండింది. కానీ ప్రస్తుతము నశించి పోయింది. దానిని తిరిగి ఉద్ధరించడానికే నేను కపిలుడుగా జన్మించాను. నీవు కోరినట్టు నీకు సన్యసించుటకు అనుమతి ఇచ్చాను. ఇంక నీవు నీ కోరినచోటికి వెళ్లవచ్చును. నీవు చేసే కర్మలు అన్నీ నాకు అర్పించి,

నిష్కామ కర్మలు ఆచరిస్తూ, నన్ను సేవిస్తూ తుదకు నన్ను చేరుకో. నన్ను నీ ఆత్మయందు చూచుకో. అన్ని సంతాపములను విడిచిపెట్టు. మోక్షపదమును పొందు. నేను కూడా నా తల్లి దేవహూతికి ఆత్మతత్త్వమును బోధించి ఆమెను ఈ సంసార బంధనముల నుండి విముక్తి చేస్తాను."అని పలికాడు పరమాత్మ.

అప్పుడు కర్దముడు శ్రీహరికి ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించి, అడవులకు వెళ్లిపోయాడు. సన్యాసాశ్రమమును స్వీకరించాడు. అహింసావ్రతమును అవలంబించాడు. కోరికలను విడిచిపెట్టాడు. ఉండిన చోట ఉండకుండా భూమి అంతా తిరుగుతున్నాడు. పరమాత్మయందు అచంచలమైన భక్తి భావంతో ఆ పరబ్రహ్మమును సాక్షాత్కరింపజేసుకున్నాడు. అహంకారము మమకారములు వదిలిపెట్టాడు. అందరినీ సమంగా చూడసాగాడు. మనస్సును అంతర్ముఖం చేసుకున్నాడు. తన మనస్సును పరమాత్మయందు స్థిరంగా నిలిపాడు. ఈ భవబంధములనుండి విముక్తుడు అయ్యాడు కర్దముడు. ఈ అనంత విశ్వంలో ఉన్న సకల జీవరాసులలో ఆ పరమాత్మ ఉన్నట్టు, తనలో ఉన్న పరమాత్మలోనే సకల జీవరాసులు ఉన్నట్టు తెలుసుకున్నాడు. ఆప్రకారంగా కర్దముడు పరమాత్మలో ఐక్యం అయ్యాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ఇరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము

ఇరువది ఐదవ అధ్యాయము.

సూత పౌరాణికుడు చెబుతున్న భాగవతమును వింటున్న శౌనకుడు ఇలా అడిగాడు.

"ఓ సూతపౌరాణికుడా! తనకు జన్మ అంటూ లేక పోయిననూ. తాను జన్మ ఎత్తవలసిన అవసరం లేకపోయిననూ, ఈ లోకంలో తత్త్వజ్ఞానమును బోధించడానికి, పరమాత్మ తన మాయాశక్తితో కపిలుడిగా దేవహూతి గర్భంలో జన్మించాడు. ఆ పరమాత్మ కథలు మేము ఎన్నో వినిఉన్నాము. కాని ఆ పరమాత్మ అవతార లీలలు ఎన్ని సార్లు విన్ననూ మాకు తృప్తి కలగటం లేదు. కాబట్టి మాకు పరమాత్మ అవతార లీలలు మాకు సవిస్తరంగా చెప్పండి." అని అడిగాడు.

అప్పుడు సూత పౌరాణికుడు శౌనకాదిమహామునులకు ఇలా చెప్పాడు. "ఓ బ్రాహ్మణోత్తములారా! ఇప్పుడు మీరు నన్ను అడిగినట్టే విదురుడుకూడా మైత్రేయుని అడిగాడు. దానికి మైత్రేయుడు ఏమి చెప్పాడో మీకు వివరిస్తాను. మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు.

"విదురా! తన తండ్రి అయిన కర్దముడు సన్యసించి వెళ్లిపోగా, కపిలుడు తన తల్లి దేవహూతితో బిందుసరోవరము వద్ద ఉ న్న ఆశ్రమములో ఉంటున్నాడు. దేవహూతికి బ్రహ్మగారుచెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. వెంటనే తన కుమారుడు కపిలుని చూచి

దేవహూతి ఇలా అడిగింది.

"కుమారా! నేను ఇప్పటికి వరకూ ఈ ప్రాపంచిక విషయములలో పాకులాడుతూ, ఇంద్రియ లోలత్వముతో అజ్ఞానము అనే అంధకారములో మునిగిపోయి ఉన్నాను. ఇన్ని జన్మల తరువాత నా అజ్ఞానము అనే అంధకారమును తొలగించే పుత్రుడు నాకు కలిగాడు. నువ్వు నాకు కుమారుడిగా పుట్టడం నా అదృష్టం. నీవు సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడవు అని నాకు తెలుసు. అజ్ఞానము అనే చీకటిలో కొట్టు మిట్టాడుతున్న ప్రజలకు సూర్యుని వలె ఈ లోకంలో ఉదయించావు.

ఓ దేవా! మానవుల దేహముల యందు అహంకారము, మమకారము, అభిమానము, అసూయ అన్నీ నీ మాయవలననే కల్పింపబడ్డాయి. వాటిని పోగొట్టడానికి నీవే తగిన వాడివి. అందుకని నేను నిన్ను శరణు వేడుతున్నాను. ఈ సంసారము అనే మహావృక్షమును మొదలంటా నరకడానికి గొడ్డలి వంటి వాడివి. నాకు ఈ ప్రకృతి గురించి, పురుషుని గురించి వివరంగా చెప్పు. నీ వలన ఈ తత్త్వజ్ఞానమునుతెలుసుకోదలచి నీకు నమస్కరించి అడుగుతున్నాను." అని పలికింది దేవహూతి.

సామాన్య జనులకు ముక్తి మార్గాన్ని బోధించే భక్తి యోగము గురించి తన తల్లి తనను అడగటం చూచి ఎంతో సంతోషించాడు. కపిలుడు తన తల్లి దేవహూతితో చిరునవ్వుతో ఇలా అన్నాడు.

"తల్లీ! నీకు నమస్కారము. ఈ లోకంలో మానవులకు మోక్షమును ప్రసాదించేదీ, పరమాత్మకు కూడా ఇష్టము అయినదీ ఒక్క భక్తియోగము ఒక్కటే అని నా అభిప్రాయము. మానవుల సుఖములను, దు:ఖములను ఈ భక్తి మాత్రమే నివారింపగలదు.

ఓ తల్లీ! నేను నా పూర్వ జన్మలో, ఋషులు, శమము, దమము మొదలగు అంగములతో కూడిన పరమాత్మ యోగమును గురించి అడిగారు. అప్పుడు నేను వారికి చెప్పిన విషయములే ఇప్పుడు నీకు నేను చెబుతాను.

జీవులకు బంధనములు కలిగించాలన్నా, మోక్షమును పొందాలన్నా దానికి వారి మనసే కారణము. ఎందుకంటే, ఈ మనస్సు ప్రాపంచిక విషయములలో, కామములలో ఆసక్తి చూపిన అది జీవులకు బంధనములను కలుగజేస్తుంది. అదే మనస్సు పరమాత్మయందు లగ్నం అయితే మోక్షానికి దారితీస్తుంది.

ఈ మనస్సుకుఉన్న ప్రధానలక్షణము నేను, నాది అనే వాటి వలన కలిగే కోరికలు, లోభత్వము, కోపములకు లోబడి ప్రవర్తిస్తూ ఉంటుంది. ఎప్పుడైతే ఈ మనస్సు ఆ కోరికలు, లోభత్వమును విడిచిపెట్టి నేను నాది అనే భ్రాంతిని తొలగించుకొన్న నాడు, ఆ మనసు పరిశుద్ధము అవుతుంది. అప్పుడు ఆ మనసు సుఖములను, దు:ఖములను సమానంగా చూస్తుంది.

అప్పుడు జీవుడు తాను ఎవరో తెలుసుకోగలుగుతాడు. తాను ఈ దేహము కాదు. ఈ దేహము కన్నా వేరైనది మరొకటి ఉంది. అదే

సూక్ష్మరూపంలో ఉన్న ఆత్మస్వరూపము. తన అసలు స్వరూపము అది. ఈ విషయ వాసనలు ఈ దేహమునకే గానీ ఆత్మకు కావు. ఆ ఆత్మను జ్ఞానము, వైరాగ్యముతో కూడిన మనసుతోనే తెలుసుకోగలము. అని తెలుసుకుంటాడు.

అప్పుడు జీవుడు ఈ ప్రకృతిని అందులో ఉన్న విషయములను, తృణప్రాయంగా చూస్తాడు. తనముందు ఈ ప్రకృతి బలహీనమైనదిగా పరిగణిస్తాడు. యోగులు పరబ్రహ్మమును పొందాలంటే, ఆ భగవంతుని యందు అచంచలమైనభక్తి కలిగి ఉండటం తప్పమరోమార్గము లేదు.

మానవుడు పుట్టినప్పటి నుండి తల్లి, తండ్రి, భార్య, పుత్రులు, బంధువులు వీళ్లమీద ఆసక్తితో బతుకుతున్నాడు. జీవుని బంధనములకు ఇవే కారణము. భార్యబిడ్డలమీద చూపుతున్న ఆసక్తి భగవద్భక్తుల మీద, సాధువుల మీద చూపిస్తే, అదే మోక్షమునకు ద్వారము వంటిది అని పెద్దలు చెబుతారు.

అలాంటిసాధువులు ఎలాంటి వారై ఉండాలంటే, వారు ఎల్లప్పుడూ హరినామ సంకీర్తనము చేస్తూ ఉండాలి. సాటి వారి మీద దయగలిగి ఉండాలి. సర్వజీవులకు ఎలాంటి అపకారము చేయకుండా, వారి క్షేమాన్ని, సుఖాన్ని కోరుకొనే వారై ఉండాలి. ఆ సాధువులకు శత్రువులు అనే వారు ఉండకూడదు. శాంతి కాముకులై ఉండాలి. వారి సౌశీల్యమే వారికి ఆభరణంగా ప్రకాశించాలి. వారు ఎల్లప్పుడూ శాస్త్రప్రమాణాలనే పాటించాలి. శాస్త్రవిరుద్ధంగా

నడవకూడదు. అటువంటి సాధువులను, భగవద్భక్తులను సేవిస్తే అదే మోక్షానికి హేతువు అవుతుంది.

తల్లీ! ఇంకా ఆ సాధువులను గుర్తించడం ఎలాగో చెబుతాను విను. వారు నన్నే ఎల్లప్పుడూ కీర్తిస్తూ ఉంటారు. వారికి వేరే ఆలోచన, ధ్యాస ఉండదు. నా కోసరం వారు అన్న కర్మలను విడిచిపెడతారు. భార్య,పుత్రులయందు మోహమును పెంచుకొనరు.అవసరమైతే వారిని విడిచిపెడతారు. వారు ఎల్లప్పుడూ నాకు సంబంధించిన కథలనే వింటూ, చదువుతూ, గానం చేస్తూ ఉంటారు. వారికి మరొక ఆలోచన ఉండదు. ఎల్లప్పుడూ నా యందే తమ మనస్సును లగ్నంచేస్తారు. ఇటువంటి సాధువులకు ఏ తాపత్రయమూ ఉండదు. వారికి దేని మీదా ఆసక్తి ఉండదు. ఏ కోరికలూఉండవు. ఇటువంటిసాధువుల సాంగత్యమునే నీవు కోరుకోవాలి. వారు నీలోని దోషములను అన్నీ పోగొట్టగల సమర్థులు.

అంతేకాకుండా. ఎల్లప్పుడూ సత్సంగములో ఉండాలి. సత్సంగములో ఉంటే చెవులకు, మనసుకు ఆహ్లాదాన్ని కలిగించే విషయములను మాట్లాడుకుంటారు. చర్చించుకుంటారు. ఆ సాధువుల సాంగత్యములో అవిద్య పూర్తిగా తొలగిపోతుంది. జ్ఞానము పెంపొందుతుంది. అప్పుడు నా యందు శ్రద్ధ, భక్తి పుడుతుంది. ఎల్లప్పుడూ నేను చేసిన సృష్టి గురించి నేను చేసిన లీలల గురించి వినడం ద్వారా, తెలుసుకోవడం ద్వారా లభించిన భక్తితో ఈ ప్రాపంచిక విషయముల మీద వైరాగ్యము కలుగుతుంది. అప్పుడు మానవులు తమ మనస్సును విషయ వాంఛలమీదికి పోకుండా నిగ్రహించుకోగలుగుతారు.

ఈ విధంగా చేస్తే, మానవుడు ప్రాపంచిక విషయముల జోలికి పోకుండా, వైరాగ్యముతో కూడిన జ్ఞానముతోనూ, యోగముతోనూ, నాయందు కలిగిన భక్తితోనూ, తన దేహము నందుఉన్న నన్ను దర్శింపగలడు." అని భక్తి గురించి వివరంగా చెప్పాడు కపిలుడు.

అంతావిన్న దేవహూతి కపిలుని ఇలా అడిగింది.

"నీ పట్ల భక్తి కలిగి ఉండమన్నావు కదా! మరి ఆ భక్తిని నీ పట్ల ఎలా ప్రకటించాలి? నేను ఆడుదానిని. నేను మోక్షమును పొందాలంటే దానికి మార్గము ఏమిటి? నేను ఏ రకమైన భక్తియోగమును అనుష్ఠించాలి? నీ మీద భక్తి కలగడానికి. తత్త్వజ్ఞానమును తెలుసుకోడానికి మూలమైన ఆ యోగము ఏది? అది ఎన్ని విధములుగా ఉంటుంది. నీవు అంటున్న సాంఖ్యయోగము ఓ పట్టాన అర్థం కాదు. అందునా నేను స్త్రీని. నాబోటి వాళ్ల కు  అసలు అర్థం కాదు. అందుకని నా లాంటి అర్థంకాని వారికి కూడా అర్థం అయేటట్టు,  సులభశైలిలో నాకు  చెప్పవలసినది." అని అడిగింది. తల్లి అడిగిన ప్రశ్నలకు కపిలుడు ఈ విధంగా చెప్పాడు.

"అమ్మా!  మానవుని మనస్సు శుద్ధసత్త్వగుణంతో నిండి ఉంటుంది. అటువంటి సత్త్వగుణ ప్రధానమైన మనస్సును, ఇంద్రియములను, పరమాత్మయందు లగ్నం చేస్తే, అప్పుడు నిర్మలమైన భగవద్భక్తి కలుగుతుంది. కాని ఆ భక్తి ఎటువంటికోరికలతో కూడినది అయి ఉండకూడదు. అటువంటి  నిష్కామ భక్తి  మోక్షము కంటే

గొప్పది. ఎలాగైతే మనము తిన్న అన్నమును కడుపులో ఉన్న జఠరాగ్ని జీర్ణం చేస్తుందో అలాగే ఈ భగద్భక్తి వాసనలతో కూడిన సూక్ష్మశరీరాన్ని నాశనం చేస్తుంది. భగవంతుని మీద నిర్మలమైన భక్తి ఉంటే, ముక్తి దానంతట అదే లభిస్తుంది. ముక్తి పొందడానికి వేరే శ్రమ చెయ్యనక్కరలేదు.

తల్లీ! ఎవరైతే తమ అన్ని ఇంద్రియముల ద్వారా పరమాత్ముని యొక్క పాదములను ఆశ్రయించి పూజిస్తారో, తాము చేసే అన్ని కర్మలను పరమాత్మకు అర్పిస్తారో, అందరూ కలిసి పరమాత్మ యొక్క మహత్తును శ్లాఘిస్తూ ఉంటారో, అటువంటి వారు మోక్షమును ఇస్తామన్నా తీసుకోరు. వారికి మోక్షము అక్కరలేదు. పరమాత్మ సేవయే వారి పరమార్ధము. అటువంటి వారు ప్రసన్నమైన పరమాత్మ ముఖమును దర్శించడానికి ఎల్లప్పుడూ ఇష్టపడుతూ ఉంటారు. వారు పరమాత్మతో మాట్లాడుతూ ఉంటారు.

కాబట్టి ముక్తి కన్నా భక్తిగొప్పది. ఎందుకంటే భక్తియందు ప్రతి నిత్యము పరమాత్మను దర్శింపవచ్చును. నిరంతరమూ పరమాత్మయందు భక్తి కలిగి ఉండి, పరమాత్మనే సేవిస్తూ, తమ హృదయములలో దర్శిస్తూ, పరమానందాన్ని అనుభవించే వారికి, వారు కోరకపోయిననూ పరమాత్మ వారికి ముక్తిని, మోక్షమును అనుగ్రహిస్తాడు.

భగవంతుని ఎడలభక్తి కలిగి ఉంటే వారిలో ఉన్న అవిద్య నశిస్తుంది. అప్పుడు పరమాత్మ మాయచే సృష్టించబడిన స్వర్గలోక సుఖములు, భోగములు, వైకుంఠము లో లభించు ఐశ్వర్యములు

వేనినీ కోరరు. వారు కోరక పోయినా పరమాత్మ వారిని వైకుంఠమునకు తీసుకొని పోయి వారిచే వైకుంఠములో లభించు సమస్తభోగములను వారి చేత అనుభవింపజేస్తాడు.

అమ్మా! ఈ లోకములో పుణ్యము చేసుకుంటే స్వర్గలోకమునకు వెళ్లి అక్కడసుఖములు అనుభవిస్తాడు. ఆ పుణ్యము అయి పోగానే మరలా ఏదో ఒక జన్మఎత్తుతాడు. అందుచేత స్వర్గలోక ఫలములు, వాటిని అనుభవించేవాడు రెండూ శాశ్వతములు కావు. కాని పరమాత్మయందు భక్తి కల భక్తులకు వైకుంఠప్రాప్తి, అందులో సుఖములు లభిస్తాయి. ఆ సుఖములు శాశ్వతములు. స్వర్గసుఖముల మాదిరి తాత్కాలికములు కావు.

తల్లీ! ఎవరైతే భార్యాబిడ్డల మీదా, ఈ లోకములో లభించే ఐశ్వర్యముల మీదా, గృహముల మీదా, భూమి మీదా, పశుసంపద మీదా వ్యామోహమును వదిలిపెట్టి, నిశ్చలమైన భక్తితో పరమాత్మను సేవిస్తారో, వారిని ఆ పరమాత్మ సంసారసాగరమునుండి రక్షిస్తాడు.

అమ్మా! పరమాత్మ సకల ప్రాణులయందు ఉన్నాడు. ప్రకృతిని అందులోని జీవులను శాసిస్తున్నాడు. ఆ పరమాత్మను సేవించనిదే వారికి ఈ సంసార బంధముల నుండి ముక్తి లభించదు. అమ్మా! పంచభూతములు ఆయన అధీనములో ఉన్నాయి. ఆయన ఆజ్ఞను పాటిస్తుంటాయి. అందుకని ఆ పరమాత్మ యందు భక్తి కలిగి ఉండటమే పరమార్థము. భక్తి లేనిదే ముక్తి లేదు. ఎంతో జ్ఞానమును సముపార్జించి, వైరాగ్యమును పొందిన యోగులు కూడా, ఆ

పరమాత్మయందు భక్తితో ఆయన పాదములను ఆశ్రయిస్తారు. ఈ సంసార సాగరంలో కొట్టుమిట్టాడే మానవులకు, పరమాత్మయందు భక్తి కలిగి ఉండటమే అమితమైన శ్రేయస్సును కలుగజేస్తుంది." అని కపిలుడు తన తల్లికి భక్తియోగమును ఉపదేశించాడు.

(ఈ అధ్యాయములో కపిలుడు పరమాత్మ అవతారము కాబట్టి 'నేను' అని ఉపయోగించాడు. నేను అంటే పాఠకులకు సందేహము వస్తుంది కాబట్టి నేను బదులు పరమాత్మ అని వాడాను. కపిలుడే పరమాత్మ అవతారము అని అర్థం చేసుకుంటే సరిపోతుంది.)

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ఇరువది ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## తృతీయ స్కంధము

## ఇరువది ఆరవ అధ్యాయము

కపిలుడు తన తల్లి దేవహూతితో పరమాత్మ తత్త్వమును గురించి ఇలా చెప్పాడు.

"అమ్మా! ఇప్పుడు నీకు నేను తత్త్వ లక్షణముల గురించి చెబుతాను. వీటిని తెలుసుకుంటే జీవుడు ప్రాపంచిక బంధముల నుండి విముక్తుడు అవుతాడు. ఈ తత్త్వ జ్ఞానమును తెలుసుకుంటే సకల దు:ఖములు తొలగి పోతాయి.

అనాదిగా పురుషుడు (పరమాత్మ) నిర్గుణుడు. ఈ ప్రకృతి కంటే భిన్నమైన వాడు. సత్త్వ,రజస్తమోగుణములకు అతీతుడు. మానవుల ఇంద్రియములతో ఆ పురుషుని తెలుసుకోలేము. ఆ పురుషుడు తనకు తానుగా ప్రకాశిస్తుంటాడు. ఈ అనంత విశ్వం అంతా ఆయన వలననే ప్రకాశిస్తూ ఉంది. ఈ ప్రకృతిమాత కూడా ఆ అనంత విశ్వంలో నుండి ఆవిర్భవించింది.

ఈ ప్రకృతి లోనే మానవులు, జంతువులు, పక్షులు, జలచరములు అన్నీ సృష్టింప బడ్డాయి. వాటితో పాటు పరమాత్మ అవిద్యను కూడా సృష్టించాడు. ఈ జీవుడు ఆ అవిద్యకు లోబడి ఈ ప్రకృతి అంతా నిజమని భ్రాంతిలో పడుతున్నాడు. ఇంకా తాను చేసే అన్ని పనులకు తానే కర్త అని అనుకుంటున్నాడు. అంటే అన్ని తన వలననే జరుగుతున్నాయి, అన్నీ తానే చేస్తున్నాను, ఇదంతా నాది, అన్నీ నాకే కావాలి  అని అనుకుంటున్నాడు. దానినే అహంకారము అంటారు.

నిజానికి జీవాత్మకు ఎలాంటి కర్తృత్వము లేదు. ఏమీ చేయడు కేవలం సాక్షీభూతంగా చూస్తుంటాడు. కానీ అవిద్యతో కూడిన  ఈ అహంకారము వలననే జీవాత్మ  అన్నీ తానే చేసాను అనుకుంటూ, తనకు తానుగా ఈ సంసార బంధనములలో చిక్కుపడి పోతున్నాడు. భోగములు, విషయవాంఛలు అనుభవించడానికి ఉత్సాహపడుతున్నాడు.  జనన మరణ చక్రములో గిరా గిరా తిరుగుతున్నాడు.  స్వతంత్రుడైన జీవాత్మ అస్వతంత్రుడుగా మారిపోతున్నాడు.

ఏ పని జరిగినా, దానికి ఏది కారణమైనా, దానికి ఎవడు కర్త అయినా, దీనికి అంతా ప్రకృతే కారణము.అన్ని పనులు ఈ ప్రకృతిలోనే జరుగుతున్నాయి. కానీ అవిద్యకు లోబడ్డ జీవుడు అన్నీ తానే చేస్తున్నాను, ఈ పనుల వలన కలిగేసుఖదు:ఖములకు నేనేకారణము అని అనుకుంటున్నాడు." అని చెప్పాడు కపిలుడు.

ఇప్పుడు దేవహూతి తనకుమారుని ఈ విధంగా అడిగింది. "కుమారా! ప్రకృతి, పురుషుడు అని అంటున్నావు కదా! వాటి లక్షణముల గురించి చెప్పు. ఈ విశ్వము యొక్క సూక్ష్మరూపము ఎలా ఉంటుంది. స్థూలరూపము ఎలా ఉంటుంది. వాటి గురించి వివరంగా చెప్పు." అని అడిగింది. తల్లి అడిగిన ప్రశ్నలకు కపిలుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"అమ్మా! సత్త్వ, రజస్తమోగుణములతో నిండినది, ప్రళయకాలములో కూడా నాశనము కానిదీ అంటే సూక్ష్మరూపంలో ఉండేది అయిన ఈ ప్రకృతిని అవ్యక్తము అని అంటారు. ప్రకృతి లోనుండి మహత్తత్వము మొదలగునవి ఉద్భవించాయి కాబట్టి దీనిని ప్రధానము అని కూడా అంటారు. ప్రకృతి అనగా ప్రకృష్టంగా అంటే బాగుగా చేయబడినది అని అర్థము.

విత్తనములో ఉన్న చెట్టు అవ్యక్తము. ఆ విత్తనమును భూమిలో నాటితే కాలవశమున అది మొక్కయి, చెట్టయి, మాను అవుతుంది. అప్పుడు చెట్టు వ్యక్తమవుతుంది. కొంతకాలానికి ఆ చెట్టు పడిపోయి భూమిలో కలిసిపోతుంది. ఇందువలననే ప్రకృతి అవ్యక్తము అంటారు.

తల్లీ! పంచభూతములు, పంచతన్మాత్రలు, పది ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారములు, ఇవి 24 తత్త్వములు. వీటినే బ్రహ్మము అని అంటారు. వీటిని వివరిస్తాను.

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము ఇవి పంచభూతములు. వాసన, రుచి, స్పర్శ, శబ్దము, రూపము, ఇవి పంచ తన్మాత్రలు. కళ్లు, చెవులు, ముక్కు, నోరు,నాలుక (వాక్కు) చర్మము, చేతులు, కాళ్లు, జననేంద్రియములు, విసర్జకావయవము ఇది పది ఇంద్రియములు. ఇవే కాకుండా మనస్సు బుద్ధి, చిత్తము, అహంకారము ఇవి నాలుగు అంత:కరణములు. మొత్తము 24 తత్త్వములు.

ఇంక 25వ తత్త్వము కాలము. ఈ ప్రకృతిని నడిపించేది కాలము. ఈ కాలము వలననే ప్రకృతిలో ఉన్న జీవునకు నేను నాది అనే అహంకారము, అవిద్య వలన కలుగుతూ ఉంది. ఈ కాలము వలన కలిగిన ప్రేరణతోనే  సత్త్వ, రజస్తమోగుణములలో హెచ్చుతగ్గులు కలిగి మహత్తత్వము ఆవిర్భవించింది. పరమాత్మ తన యోగమాయాశక్తి తో అన్ని ప్రాణులలో అంతర్లీనంగా స్థిరంగా ఆత్మగా  ఉన్నాడు. బయట కాలస్వరూపుడుగా, చలనశీలుడుగా ఉన్నాడు.

ఈ ఇరువది ఐదు తత్త్వములకు అధిపతి ఆ పరమాత్మయే. సామ్యావస్థలో ఉన్న మూడుగుణములలో క్షోభకలిగించినది ఆ పరమాత్ముని శక్తియే. ఆక్షోభలో నుండి మహత్తత్వము  ఆవిర్భవించింది. ఆ మహత్తత్వము అత్యంత ప్రకాశవంతమయినది. ఆ మహత్తత్వమే ఈ జగత్తు ఆవిర్భవించడానికి మూలకారణము. ఈ మహత్తత్వములోనే

అహంకారము అనేది సూక్ష్మరూపంలో ఉంది. సూక్ష్మరూపంలో తనలో ఉన్న అహంకారాన్ని ఈ మహత్తత్వము బయట ప్రపంచానికి వెల్లడి చేసింది. ఆ మహత్తత్వము వలననే బయట ప్రపంచములో ఉన్న అజ్ఞానము అనే అంధకారము నశించిపోయింది.

ఈ మహత్తత్వము సత్వగుణ ప్రధానమైనది. స్వచ్ఛమైనది. ఈ మహత్తత్వములో రాగము ద్వేషము మొదలగు ద్వంద్వములు లేవు. ఈ మహత్తత్వమునే చిత్తము అనీ, వాసుదేవుడు అనీ పిలుస్తారు. స్వచ్ఛత, ఏ విధమైన వికారములు లేకపోవడం, శాంతంగాఉండటం అనే మూడుగుణములు జలమునకుకూడా ఉన్నాయి. జలమును నారములు అంటారు. అందుకే ఆ మూడుగుణములు కలిగిన వానిని నారాయణుడు అనికూడా అంటారు.

ఈ మహత్తత్వము వికారము అంటే రూపాంతరం చెంది క్రియాశక్తిగా మారింది అందులో నుండి అహంకారము పుట్టింది. ఆ అహంకారము మూడు విధములు.. అవి సాత్త్వికాహంకారము అనగా వైకారిక అహంకారము. తైజసాహంకారము అనగా రాజసాహంకారము, తామసాహంకారము. ఈ అహంకారముల నుండి మనస్సు, ఇంద్రియములు, పంచభూతములు పుట్టాయి.

దీని కంతకు కారణభూతుడైన మూల పురుషుడు వేలకొలదీ శిరస్సులతో, అనంతుడు, సంకర్షణుడు అనే పేర్లతో పంచభూతములకు, ఇంద్రియములకు, మనస్సుకు కారణమయ్యాడు. ఈ అహంకార లక్షణములు కూడా మూడు.

మనస్సు పనులను చేయడానికి సంకల్పిస్తుంది. ఈ పనులు చేయడానికి ఇంద్రియాలు కారణమవుతాయి. ఈ పనులన్నీ జరిగేది ఈ ప్రకృతి లోనే.

సాత్త్వికాహంకారమునకు శాంతము, రాజసాహంకారము నకు ఘోరత్వము, తామసాహంకారమునకు మూఢత్వము లక్షణములు. ఒక్కొక్కదాన్నీ వివరిస్తాను.

సాత్వికాహంకారము నుండి మనస్సు దాని తత్త్వము పుట్టాయి. ఆ మనస్సులో కోరికలు పుట్టాయి. అంటే ఇది కావాలి, అది వద్దు, అనే సంకల్పము వికల్పము. వీటి వలన వల్లమాలిన కోరికలు మనసునుండి పుట్టుకొచ్చాయి. ఈ మనస్సు ఇంద్రియములకు అధిపతి. ఈ మనస్సుకు అధిపతి అనిరుద్ధుడు. (అనిరుద్ధుడు అంటే అడ్డు ఆపు లేని వాడు అని అర్థము. అంటే మన మనసుకూడా మనమాట వినదు. అడ్డు ఆపు లేకుండా తన ఇష్టం వచ్చినట్టు పోతుంటుంది.) యోగులు, తాపసులు అందరూ ముందు ఈ అనిరుద్ధుని వశపరచుకోడానికి ప్రయత్నిస్తారు. అంటే మనస్సును వశపరచు కోడానికి ప్రయత్నిస్తారు.

అమ్మా! తరువాతది రాజసాహంకారము. అది కూడా మార్పు చెందగా అందు లో నుండి బుద్ధి ఆవిర్భవించింది. ఈ బుద్ధి చేసే పని ఏమిటంటే....ఈ ప్రకృతిలో ఎన్నో పదార్థాలు ఉన్నాయి. వాటిని మన ఇంద్రియాలు గ్రహించడానికి అంటే తీసుకోడానికి,పొందడానికి, అనుభవించడానికి ప్రయత్నం చేస్తాయి. అప్పుడు ఈ బుద్ధి ఆ పదార్థాల గురించిన విజ్ఞానాన్ని వాటి స్వరూప స్వభావాల్ని మనస్సుకు వివరిస్తుంది. ఇదిమంచి చెడుఅని చెబుతుంది. వినడం వినకపోవడం

మనసు ఇష్టం. ఆ ప్రకారంగా ఈ ప్రపంచంలో ఉండే మంచి చెడును వివరించే జ్ఞానమే బుద్ధి. ఈ బుద్ధిని ప్రద్యుమ్నుడు అని పిలుస్తారు. (వాసుదేవుడు అంతటా ఉండేవాడు, సంకర్షణుడు అహంకార స్వరూపుడు, అనిరుద్ధుడు మనస్సు, ప్రద్యుమ్నుడు బుద్ధి.)

ఈ బుద్ధికి ఉన్న లక్షణాలు వివరిస్తాను.

మొదటిది సంశయము. అదా ఇదా, ఏది మంచిది, ఏది చేస్తే బాగుంటుంది అనే అనుమానాలను రేకెత్తిస్తుంది. సరి అయిన వస్తువును ఎంచుకోడానికి, సరి అయిన పని చేయడానికి తోడ్పడుతుంది.

రెండవది ఒకదానిని మరొక దానిగా అర్థం చేసుకోవడం. పొరపాటు పడటం. తాడును చూచి పాము అనుకొని హడలిపోవడం. చెడ్డపనులను కూడా మంచివి అనుకొని చేసెయ్యడం.

ఇంక మూడవ లక్షణము నిశ్చయము. ఊరికే అనుమానిస్తూ అదా ఇదాఅని చూస్తూ కూర్చోకుండా ఏదో ఒకటి నిశ్చయం చేయడం. త్వరగా నిర్ణయాలు తీసుకోవడం. తొందరపాటు నిర్ణయాలు తీసుకోవడం.

నాలుగవది స్మృతి. అంటే తాను ఇదివరకు చేసిన పనులను గుర్తుకు తెచ్చుకొని ఆ ప్రకారం చెయ్యడం. దానినే అనుభవ జ్ఞానము అంటారు.

ఆఖరుది స్వాపము. ఒక మంచి నిర్ణయాన్ని తీసుకున్న తరువాత పొందే అనుభూతి. ఇవీ బుద్ధియొక్క లక్షణములు.

జ్ఞానముకలవి గానూ, క్రియలు చేసేవి గానూ ఇంద్రియములను రెండు విధములుగా విభజించారు. అవే జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు. ఈ ఇంద్రియములు తైజసాహంకారము నుండి పుట్టాయి. వీటిలో క్రియలు చేసేవి ప్రాణశక్తిని కలిగి ఉంటాయి. జ్ఞానముతో పనిచేసేవి బుద్ధిశక్తిని కలిగి ఉంటాయి.

భగవంతుని శక్తి కాలానుగుణంగా రూపాంతరం చెంది తామసాహంకారముగా పరిణమించింది. అందులో నుండి మొట్ట మొదట శబ్దం అనే తన్మాత్ర పుట్టింది. ఆ శబ్దానికి ఆశ్రయంగా ఆకాశం పుట్టింది. శబ్దము వినడానికి చెవులు పుట్టాయి.

ఈ శబ్దానికి మూడు లక్షణాలు ఉన్నాయి. మొదటిది ఈ శబ్దం ఒక అర్థానికి ఆశ్రయం ఇస్తుంది. అంటే ప్రతి శబ్దానికి (పదం, కావచ్చు వాక్యం కావచ్చు అరుపు కావచ్చు,) ఒక అర్థం ఉంటుంది. రెండవది ఈ శబ్దం ఏదో ఒక ప్రాణి నుండి కానీ, వస్తువు నుంచి కానీ వస్తుంది. కాబట్టి శబ్దం చెయ్యడానికి ఏదో ఒక ప్రాణి కానీ, వస్తువు కానీ ఉండాలి. మూడవది ఈ శబ్దం  ఆకాశానికి తన్మాత్రగా పని చేస్తుంది.   ఇవీ శబ్దలక్షణాలు.

ఇంక ఆకాశము యొక్క లక్షణాలు చెబుతాను. ఆకాశము అంటే ఏ ప్రాణికి కానీ, వస్తువుకు కానీ ఉండటానికి అవకాశం ఇచ్చేది.

తృతీయ స్కంధము

ఈ లోకంలో ఉన్న సమస్త జీవులు, వస్తువులు ఉండే ప్రదేశమే ఆకాశము. ఇది లోపలా బయటా కూడా ఉంటుంది. అంటే మన శరీరం లోపల కూడా ఆకాశం ఉంది. శరీరంలో ఊపిరితిత్తులు, ఎముకలు, జీర్ణాశయము ఉన్నాయి. వాటిలో కొంత మేర ఖాళీ ఉంది. అదే ఆకాశము. అవి మనశరీరంలో ఉండటానికి అవకాశం కల్పించింది ఆకాశం. కాబట్టి ఈ ఆకాశము, సకల ప్రాణులకు, మానవుల ఇంద్రియాలకు, మనస్సుకు స్థానం కల్పించేది ఆకాశము.

తరువాత, శబ్ద తన్మాత్రకు ఆశ్రయమైన ఆకాశము కాలానుగుణంగా రూపాంతరం చెంది, అందులో నుండి స్పర్శ తన్మాత్ర పుట్టింది. ఆ స్పర్శ తన్మాత్రకు ఆశ్రయంగా పంచభూతములలో రెండవది అయిన వాయువు పుట్టింది. అదే దేహములో చర్మంగా పరిణామం చెందింది. ఈ చర్మం ద్వారా ప్రాణులు తాము తాకిన, తమను తాకిన ప్రాణుల, వస్తువుల గట్టిదనము, మృదుత్వము, వేడి, చల్లదనము, తెలుస్తాయి. ఈ స్పర్శ తత్త్వాన్ని వాయు తన్మాత్ర అని అంటారు. (చల్లగాలి, వేడిగాలి మన చర్మానికి తగిలితే ఆ స్పర్శద్వారా తెలుసుకుంటాము.).

ఇంక వాయువు యొక్క లక్షణాలు ఏవంటే.....వస్తువులను కదిలించడం, ఒకదానితో ఒకటి కలపడం, వాసనలను ముక్కులదాకా మోసుకుపోవడం, చల్లదనాన్ని, వేడి దనాన్ని చర్మందాకా మోసుకుపోవడం (చల్లగాలి, వేడి గాలి, చలి గాలి, వగైరా), వీటి ద్వారా ఇంద్రియములకు సుఖమును, దు:ఖమును కలిగించడం, ఇంద్రియములను ప్రేరేపించడం మొదలగు పనులు చేస్తుంది.

స్పర్శతన్మాత్ర రూపమైన వాయువు, కాలానుగుణంగా మార్పు చెంది, అందులో నుండి రూప తన్మాత్ర పుట్టింది. ఆ రూప తన్మాత్ర నుండి తేజోరూపము అయిన అగ్ని పుట్టింది. అదే పంచభూతములలో మూడవది. ఈ రూపములను చూడటానికి కళ్లు ఆవిర్భవించాయి. ఈ రూపతన్మాత్ర లక్షణములు ఏవంటే.....ప్రాణులను, వస్తువులను రకరకాలైనా ఆకారాలలో చూపిస్తుంది. ఆ ఆకారం ఎంత పొడుగు, లావు, పరిమాణంలో ఉందో తెలియజేస్తుంది. వెలుగులో అన్ని వస్తువులను ప్రకటితం చేస్తుంది.

ఇంక ఈ రూపతన్మాత్ర నుండి పుట్టిన తేజస్సు (అగ్ని) యొక్క లక్షణములు.....తన వెలుగుతో వస్తువులను ప్రకాశించజేయడం, పదార్థాలను ఉడికించి తినడానికి వీలుగా చేయడం, చల్లదనాన్ని తొలగించడం, తిన్న అన్నాన్ని, తాగిన నీటిని జీర్ణం చేసి, మరలా ఆకలి, దాహం కలిగించడం, ఆ ఆకలి, దాహం తీరడానికి ఆహార పదార్థాలను తయారు చేయడం. (జఠరాగ్ని అంటారు కదా!), వస్తువులను మండించడం, మొదలగునవి.

రూపతన్మాత్ర అయిన తేజస్సు  కాలానుగుణంగా రూపాంతరం చెంది దాని నుండి రస తన్మాత్ర పుట్టింది. ఆ రసతన్మాత్రకు  ఆశ్రయంగా జలము ఆవిర్భవించింది. అదే పంచభూతములలో నాలుగవది. ఈ రసాన్ని గ్రహించడానికీ, ఆస్వాదించడానికి, నాలుక పుట్టింది.  ఆ రసతన్మాత్ర లక్షణములు ఏవంటే.....రకరకాలైన రుచులను, మనం తినే ఆహార పదార్థముల నుండి గ్రహించి,  దేనికది విభజించి, అనుభవింపజేయడం.

ఇంక నీరు యొక్కలక్షణములు....పదార్థములను తడపడం, ముద్దగా చేయడం, ప్రాణశక్తిని కలిగించడం, దాహం తీర్చడం, వస్తువులను నానబెట్టి మెత్తగా చేయడం, ఉష్ణము వలన కలిగే తాపమును పోగొట్టడం, ఆవిరి కావడం, మరలా నీరుగా మారడం.

ఈ రసతన్మాత్రకు ఆశ్రయమగు జలము కాల వశమున రూపాంతరం చెంది, అందులో నుండి  గంధ తన్మాత్ర(వాసన) పుట్టింది. ఆ గంధం  భూమినుండి ఉద్భవించింది. ఈ వాసనను గ్రహించడానికి ఘ్రాణేంద్రియము (ముక్కు) ఉత్పన్నమయింది. నిజానికి వాసన ఒకటే అయినప్పటికినీ, అందులో రకరకాల వాసనలు మంచి వాసనలు, చెడ్డ వాసనలు, దుర్వాసనలు, ఘాటైన వాసనలు, సువాసనలు, ఉన్నాయి. ఆ వాసనలు ఒకదానితో ఒకటికలిసి కొత్త కొత్త వాసనలు కూడా పుడుతుంటాయి.(వాన కురిసినపుడు, మట్టిని నీటితో తడిపినపుడు భూమిలో నుండి కమ్మటి వాసన వస్తుంది. పల్లెలలో ఉన్న వాళ్లకు ఈ అనుభవం ఉంటుంది.  అదే భూమియొక్క తన్మాత్ర).

ఈ వాసనలను తన్మాత్రగా కల భూమి యొక్క లక్షణములు....సకల జీవులకు, మానవులకు నివాసం కల్పిస్తుంది. ఒక రూపంతో కనపడుతుంది. జలాశయాలకు, సముద్రాలకు నిలయంగా ఉంటుంది. ఇంకా వాయువు, అగ్ని, జలము వీటికి ఆశ్రయం కలిగిస్తుంది.  ఆకాశం నుండి వేరుగా ఉంటుంది.

తల్లీ! ఆకాశము యొక్క గుణము శబ్దము. ఆ శబ్దము వినడానికి మనకు చెవులు ఇంద్రియములు. వాయువు యొక్క గుణము స్పర్శ. ఆ స్పర్శను తెలుసుకోడానికి మనకు చర్మము

ఇంద్రియము. తేజస్సుయొక్క గుణము రూపము ఆ రూపములు తెలుసుకోడానికి మనకు కళ్లు ఇంద్రియము. జలము యొక్క గుణము రుచి. దానిని తెలుసుకోడానికి మనకు నాలుక ఇంద్రియము. భూమియొక్క గుణము వాసన. దానిని తెలుసుకోడానికి మనకు ముక్కు ఘ్రాణేంద్రియము. ఈ ఐదు గుణములు ఒకదానితో ఒకటి సంబంధమునుకలిగి ఉంటాయి. ఆకాశము, అగ్ని, వాయువు, జలముల యొక్క గుణములు కూడా మనకు భూమి నుంచి కూడా లభిస్తాయి.

అమ్మా! ఈ ఏడు తత్త్వములు అనగా మహత్తత్వము, అహంకారము, పంచ తన్మాత్రలు అన్నీ ఒకదానితో ఒకటి కలవ కుండా దేనికది విడి విడిగాఉన్నప్పుడు పరమాత్మ, కాలము, కర్మ, గుణము అనేవాటితో కలిసి ఆ ఏడు తత్తత్వములలో ప్రవేశించాడు. అంటే కాలము గడిచేకొద్దీ జరిగే పరిణామాల ననుసరించి వాటిలో చైతన్యం వచ్చింది.

పరమాత్మ వాటిలో ప్రవేశించడం వలన పుట్టిన చైతన్యంతో వాటిలో కదలిక ఏర్పడింది. ఆ కదలికతో అవి అన్నీ ఒకదానితో ఒకటి కలిసిపోయాయి. వాటి కలయికతో ఒక అండము పుట్టింది. ఆ అండము నుండి విరాట్పురుషుడు పుట్టాడు. ఆ అండము పేరు విశేషము. దానినే పరమాత్ముని మాయా స్వరూపము అంటారు. (ఇక్కడి నుండి గమనించండి. తల్లి గర్భంలో శిశువు ఎలా రూపు దిద్దుకుంటాడో అదే మాదిరి ఈ అండములో కూడా విరాట్పురుషునికి రూపం ఏర్పడుతుంది.)

ఈ అండము జలములో ఉంది. (తల్లిగర్భంలో కూడా పిండము ఉమ్మ నీటిలో తేలియాడుతూ ఉంటుంది.) అప్పుడు ఆ అండమునకు కదలిక వచ్చింది. ఆ కదలిక ప్రభావం చేత మొదట ఆ అండమునకు ముఖము ఆవిర్భవించింది. తరువాత నోరు, అందులో నాలుక పుట్టింది. ఆ నోటిలోకి అగ్ని దేవుడు ప్రవేశించాడు. తరువాత రెండు ముక్కు రంధ్రములు పుట్టాయి. అవి ప్రాణవాయువును, వాసనలను పీల్చడం వదలడం మొదలు పెట్టాయి. వాటిలో వాయుదేవుడు ప్రవేశించాడు. ఆ తరువాత రెండు కళ్లు పుట్టాయి. దానికి అధిష్ఠాన దేవతయగు సూర్యుడు వాటిలో ప్రవేశించాడు. అప్పుడు వాటిలోకి చూచేశక్తి వచ్చింది. (కొంత మందికి కళ్లు ఉ ంటాయి కాని వాటికి చూచే శక్తి ఉండదు. కళ్లు వేరు, వాటికి చూచే శక్తి వేరు.) తరువాత రెండు చెవులు మొలిచాయి. వాటికి అధిష్ఠాన దేవతలయిన దిక్కులు అందులోకి దేవతా రూపములలో ప్రవేశించాయి. అప్పుడువాటికి వినికిడి శక్తి కలిగింది. తరువాత విరాట్పురుషునకు చర్మము, వాటి మీద రోమములు ఉత్పన్నమయ్యాయి. తరువాత జననేంద్రియము ఆవిర్భవించింది. ఆ జననేంద్రియము నుండి వీర్యము, నీరు రావడం మొదలు పెట్టింది. దాని తరువాత విసర్జకావయవము పుట్టింది. దానిలో నుండి మృత్యువు పుట్టింది. తరువాత రెండు చేతులు పుట్టాయి. వాటిలో బలము, దానికి అధిపతి అయిన ఇంద్రుడు ప్రవేశించాడు. తరువాత రెండు పాదములు పుట్టాయి. వాటికి ఒక చోటి నుండి మరొక చోటికి పోయే గమన శక్తి వచ్చింది. ఆ గమన శక్తికి అధిష్ఠానదేవత విష్ణువు ప్రవేశించాడు.

తరువాత విరాట్పురుషుని శరీరంలో నాడులు ఏర్పడ్డాయి. ఆ నాడులలో రక్తం ప్రసరించే శక్తి పుట్టింది. ఆ నాడులే నదులుగా

ఏర్పడ్డాయి. తరువాత విరాట్పురుషునకు పొట్ట ఏర్పడింది. పొట్ట ఏర్పడగానే ఆకలి, దాహము ఏర్పడ్డాయి. వీటి నుండి సముద్రములు ఏర్పడ్డాయి. తరువాత విరాట్పురుషునకు హృదయము ఏర్పడింది. అందులో నుండి మనస్సు పుట్టింది. ఆ మనస్సు నుండి చంద్రుడు, హృదయము నుండి బుద్ధి, అహంకారము, చిత్తము పుట్టాయి. బుద్ధి నుండి వాక్కుకు అధిపతి అయిన బ్రహ్మ ఆవిర్భవించాడు. అహంకారము నుండి రుద్రుడు, చిత్తము ఉండి వాసుదేవుడు పుట్టారు. ఈ ప్రకారంగా అన్ని అవయవములు ఆవిర్భవించాయి. వాటికి అధిష్ఠాన దేవతలు ఏర్పడ్డారు. కాని ఆ అండములో కదలిక లేదు.

(తొమ్మిదోనెలవచ్చినా, పిండములో కదలిక లేదు అని డాక్టర్లు చెప్పడం మనం వింటుంటాము.)

పైన చెప్పబడిన అధిష్ఠాన దేవతలు అందరూ తమ తమ అవయవములలో ప్రవేశించారు. ఎలాగంటే, అగ్ని నాలుకలోనూ, వాయువు ముక్కులోనూ, సూర్యుడు కళ్లలోనూ, దిక్కులు చెవులలోకీ ప్రవేశించారు. కానీ విరాట్పురుషునిలో కదలిక లేదు.

ఓషధులు చర్మంలోకి ప్రవేశించాయి. జలము శుక్రరూపంలో జననేంద్రియములోకి ప్రవేశించింది. అయినా విరాట్పురుషుడు లేవలేదు.

మృత్యుదేవత అపానద్వారములో ప్రవేశించింది. ఇంద్రుడు తన బలముతో బాహువులలోకి ప్రవేశించాడు. విష్ణువు తన గమన

శక్తితో కాళ్లలో ప్రవేశించాడు. రక్తము నాడులలో, నదుల మాదిరి ప్రవహించసాగింది. సముద్రుడు ఆకలి దప్పిక రూపములతో ఉదరములోకి,చంద్రుడు మనస్సులోకి ప్రవేశించారు. అయినా విరాట్పురుషునిలో కదలిక లేదు.

బ్రహ్మదేవుడు బుద్ధిరూపంతో హృదయంలో ప్రవేశించాడు. రుద్రుడు అభిమానము అనే లక్షణంతో ప్రవేశించాడు. అయినా విరాట్పురుషునిలో కదలిక లేదు.

ఆఖరున, అంతర్యామిగా ఉన్న పురుషుడు (పరమాత్మ) ఆత్మరూపంలో హృదయంలో ప్రవేశించాడు. అప్పుడు నీటిలో ఉన్న ఆ అండమునకు కదలిక వచ్చింది.

అమ్మా! లోపల ఉన్న జీవాత్మ లేవకుండా, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, తమ తమ శక్తితో నిద్రించు మానవుని లేపలేనట్టు, అగ్ని మొదలగు దేవతలు కూడా పరమాత్ముని ప్రవేశం లేకుండా విరాట్పురుషుని లేపలేకపోయారు.

కాబట్టి అమ్మా! ఎల్లప్పుడూ నిర్మల మైన భక్తితో, శ్రద్ధతో, ప్రాపంచిక విషయములమీద విరక్తితో, ఆ భగవంతుని ప్రసన్నం చేసుకోవాలి. పరిశుద్ధమైన అంత:కరణంలో ఆ పరమాత్మను దర్శించాలి."అని కపిలుడు తన తల్లి దేవహూతికి తత్త్వజ్ఞానమును ఉపదేశించాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ఇరువది ఆరవ అధ్యాయము సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## ఇరువది ఏడవ అధ్యాయము.

కపిలుడు తన తల్లి దేవహూతితో ఇలా చెబుతున్నాడు.

"తల్లీ! ఆకాశంలో సూర్యుడు వెలుగుతుంటాడు. ఆయన ప్రతి బింబము భూమి మీద ఉన్న నీటిలో ప్రతిబింబిస్తూ ఉంటుంది. కాని సూర్యుని ప్రతి బింబము ఆ నీటితో తడిసిపోదు. అదే విధంగా, పరిశుద్ధుడు అయినజీవుడు దేహములో ఉన్నప్పటికినీ, ఆ జీవుడికి రాగ ద్వేషములు మొదలగునవి అంటకపోతే, సత్త్వ, రజస్, తమోగుణములకు దూరంగా ఉంటే, ఏ పనీ తాను చేయడం లేదు అన్నీ పరమాత్మకు అర్పణ అనే భావన ఉంటే, ఈ ప్రపంచములో అను నిత్యము సంభవించే సుఖములలోనూ దు:ఖములలోనూ మునిగి పోడు. కేవలం చూస్తూ ఉంటాడు.

అలా కాకుండా, జీవుడు రాగ ద్వేషములకు లోబడి, సుఖము వస్తే పొంగి పోతూ, దు:ఖము వస్తే కుంగి పోతూ, అన్నీ నేనే చేస్తున్నాను, నేను చేసే పనులకు ఫలితం నాకే లభిస్తుంది అనే భావనలో ఉంటాడు.  అటువంటి భావనలు ఉన్న జీవుడు తాను చేసే కర్మల ఫలితములను ఈ జన్మలోనూ, తదుపరి జన్మలలోనూ అనుభవిస్తూ ఉంటాడు. ఆ కర్మఫలములను అనుభవించడానికి ఎన్నో జన్మలు ఎత్తుతూ ఉంటాడు. జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉంటాడు. అను నిత్యము సంభవించే సుఖాలను, దు:ఖాలను విడువ

లేక ఈ సంసారంలో పడి కొట్టుకుంటూ ఉంటాడు. ఎల్లప్పుడూ ఈ ప్రాపంచిక సుఖములను గురించి ఆలోచిస్తూ ఉంటాడు.

కలలో మనకు ఎన్నో వస్తువులు ఉన్నట్టు కనిపిస్తూ ఉంటాయి. ఎన్నో సంఘటనలు జరిగినట్టు అనిపిస్తూ ఉంటాయి. కాని అవేవీ నిజంకావు. మెలుకువ రాగానే మాయమై పోతాయి. అలాగే నిజ జీవితంలోకూడా జరిగే సంఘటనలు, కలిగే సుఖదు:ఖాలు అన్నీ కూడా మాయ. ఏవీ నిజం కావు. మనం సుఖం అనుకుంటే సుఖం. దు:ఖం అనుకుంటే దు:ఖం.

సుఖదు:ఖాలు మనసునుండి పుడతాయి. ఒకరికి సుఖం మరొకరికి దు:ఖం గా మారుతుంది. ఇదే మాయ. ఇది తెలుసుకుంటే గానీ ఈ సంసారమునుండి బయటపడలేరు. అందు చేత చిత్తమును ప్రాపంచిక విషయముల నుండి భగవంతుని వైపుకు మళ్లించాలి. దానికి భక్తి ఒకటే మార్గము. భగంతుని మీద భక్తితోనే చిత్తము ఈ సంసారము నుండి భగవంతుని వంకకు మళ్లుతుంది. భగవంతుని మీద భక్తి, సంసార సుఖముల మీద వైరాగ్యము ఈ రెండే ముక్తికి మార్గాలు.

దానికి ఏమేయి చెయ్యాలంటే......యోగమును అవలంబించాలి.చిత్తమును ఏకాగ్రం చెయ్యాలి. అంటే చిత్తమును భగవంతుని మీద లగ్నం చెయ్యాలి. భగవంతుని మీద ఎటువంటి కపటం లేని ప్రేమను కలిగి ఉండాలి. (కేవలం కోరికలు కోరడానికి భక్తి పెంచుకోకూడదు.) భగవంతుని కథలను నిత్యం వినాలి. చదవాలి. అధ్యయనం చెయ్యాలి. ప్రపంచములో ఉన్న అన్ని జీవజాతుల యందు,

మానవుల యందు సమమైన దృష్టి కలిగి ఉండాలి. (కులం పేరుతో, మతం పేరుతో, జాతి పేరుతో, ప్రాంతం పేరుతో మనుషులను విభజించి చూడకూడదు. నేడు మనుషులను పట్టుకున్న పెద్ద జాడ్యం ఇదే!) ఎవరి తోనూ విరోధము పెట్టుకోకూడదు. చెడ్డ వాళ్లతో స్నేహం చెయ్యకూడదు.

బ్రహ్మచర్యము పాటించాలి. (బ్రహ్మ చర్యము అంటే పెళ్లి చేసుకోకూడదు అని కాదు అర్థం. కేవలం సంతానం కోసరం మాత్రమే భార్యతో సంగమించేవాడు నిత్య బ్రహ్మచారి.) అనవసర సంభాషణలతో పొద్దు పుచ్చకూడదు. మనస్సును అన్ని విషయముల మీదకు పోకుండా కట్టడి చెయ్యాలి. తనకు లభించిన దానితో తృప్తిపడాలి. తనకు లేని దాని కోసరం ఆరాటపడకూడదు.

మితంగా తినాలి. (దొరికింది కదా అని ఇష్టం వచ్చినట్టు తినకూడదు.)సాధ్యమైనంత వరకూ ఏకాంతంగా ఉంటూ భగవధ్యానంలో గడపాలి. మంచి వారితో స్నేహం చెయ్యాలి. వారి మీద ప్రేమను చూపించాలి. ఎవరినీ ద్వేషించకూడదు. భార్య మీద, సంతానము మీద తగినంత వరకే ప్రేమ అభిమానము చూపించాలి. అతి పనికిరాదు.

(కొడుకులకోసరం అల్లుళ్ల కోసరం ఎన్నో అక్రమాలు చేసి ప్రజల ధనాన్ని దోచి పెట్టే వాళ్లను మనం చూస్తున్నాము.)

అన్నిటి కన్నా ముందు నేను, నాది అనే భావన వదలాలి.

తాను చేసే అన్ని పనులను, వాటి ఫలితాలను పరమాత్మకు అర్పించాలి. అప్పుడే మానవునికి తత్త్వజ్ఞానము కలుగుతుంది. దానికి తోడు భక్తి యోగం అవలంబిస్తే, సులభంగా పరమాత్మను చేరుకుంటాడు.

ఇవన్నీ బయటకు కనపడేవి. మనసులో జరిగేవి బయటకు కనపడవు. కాబట్టి మనసులో  కూడా భగవంతుని ఎడల భక్తి, అనురక్తి కలిగి ఉండాలి. (అంతేకానీ రోజూ దేవుడికి పూజలు చేస్తూ మనసులో సాటివాళ్ల చెడును కోరడం దైవద్రోహం అవుతుంది.) మనసా, వాచా, కర్మణా భగవంతుని మీద మనసు నిలిపి, భక్తి కలిగి ఉంటే, అతనిలో ఉన్న  అహంకారం నశిస్తుంది.  జీవుడు పరమాత్మ వైపుకు పయనిస్తాడు. అన్నిజీవులలో పూలలో దారం మాదిరి, అంతర్లీనంగా, ఆత్మగా వెలుగుతున్న పరమాత్మ దర్శనం కలుగుతుంది.

అమ్మా! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తూ ఉంటాడు. ఆ సూర్యుని ప్రతిబింబము నేల మీద ఉన్నపాత్రలో ఉన్న నీటిలో పడుతుంది. ఆ నీటిలో ప్రతిఫలించే సూర్యుని కాంతి ఎదురుగా ఉన్న గోడ మీద పడుతుంది. మానవుడు ముందు ఆ గోడ మీద ఉన్న కాంతిని చూడాలి. అది ఎక్కడి నుండి వచ్చిందో తెలుసుకొని అప్పుడు నీటిలో ఉన్న సూర్యుడి ప్రతి బింబాన్ని చూడాలి. తరువాత ఆ ప్రతి బింబం ఎక్కడి నుంచి వచ్చిందో తెలుసుకొని ఆకాశంలో వెలుగుతున్న సూర్యుడిని  చూడాలి.

అలాగే, గోడ మీద ఉన్న వెలుగు కోరికలు, అహంకారంతో కూడిన జీవాత్మ. ముందు ఆ అహంకారాన్నీ, కోరికలను విడిచిపెట్టాలి.

అప్పుడు నీటిలో ఉన్న సూర్యుని ప్రతిబింబం కనపడినట్టు మానవునికి ఆత్మగురించి తెలుస్తుంది. అప్పుడు భగవంతుని మీద నిశ్చలము, నిర్మలము అయిన భక్తిని అలవరచుకుంటే. ఆకాశంలో ఉన్న సూర్యుని దర్శించినట్టు, దేహంలో ఉన్న ఆత్మ దర్శనం కలుగుతుంది.

మానవుడు నిద్రించునపుడు, అతని ఇంద్రియములు, అహంకారము, మనస్సు, బుద్ధి, తన్మాత్రలు అన్నీకూడా నిద్రావస్థలో ఉంటాయి. జీవుడు మాత్రము చైతన్యావస్థలో ఉంటాడు. దూరంగా ఉండి ఈ శరీరాన్ని చూస్తూ ఉంటాడు. తనలో ఉన్న అహంకారము లేకపోగా, జీవుడు ఏదో పోగొట్టుకున్నట్టు చింతిస్తాడు. శరీరం చైతన్యావస్థకు రాగానే అహంకారము మరలా జీవునిలో చేరుతుంది. ఇంద్రియములు పనిచేయడం మొదలు పెడతాయి. అలా కాకుండా జాగ్రదావస్తలో  ఉన్నప్పుడు కూడా మానవుడు అహంకారాన్ని కోరికలను విడిచిపెడితే, పరమాత్మను పొందడానికి అర్హుడు అవుతాడు." అని కపిలుడు తన తల్లి దేవహూతికి ఆత్మతత్వాన్ని ఉపదేశించాడు.

తన కుమారుడు చెప్పినది అంతా విన్న తరువాత దేవహూతికి కొన్ని సందేహాలు కలిగాయి. "కుమారా! ప్రకృతి పురుషుడు ఇరువురు ఎప్పటికీ ఉండే తత్వాలు. అవి ఒకదానిని ఒకటి విడిచి ఉండవు. ఒకదానిని మరొకటి ఆశ్రయించుకొని ఉంటాయి. ఎలాగంటే భూమిని వాసన వీడనట్టు, జలమును రుచి వదలనట్టు, ప్రకృతి పురుషుని విడిచిపెట్టి ఉండదు. నిజానికి మానవులలో అంతర్లీనంగా ఉన్న పురుషుడు ఏమీ చెయ్యడు. సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడు.

కానీ ఆ పురుషుడు ప్రకృతిగుణముల యందు ఆసక్తితో జీవాత్మగా కర్మలు చేస్తుంటాడు. తానే అన్ని కర్మలు చేస్తున్నాను అని కర్తృత్వము తనమీద ఆపాదించుకుంటూ ఉంటాడు. అలాంటప్పుడు ప్రకృతి గుణములమీదా ఆసక్తి ఉన్న పురుషునికి ముక్తి ఎలా లభిస్తుంది.

పోనీ నువ్వు చెప్పినట్టు సత్సాంగత్యము చేత తత్త్వవిచారము చేయడం చేత, జీవునికి సంసారము అంటే విరక్తి కలుగవచ్చు కానీ ఆ సంసారమునకు మూల కారణమైన కోరికలు, రాగద్వేషములు జీవునిలోనే ఉంటాయి కదా. అవి నశించనంతవరకూ ఈ సంసార భయము తొలగి పోదు కదా!" అని అడిగింది దేవహూతి. దానికి కపిలుడు ఈ విధంగా చెప్పాడు.

"అమ్మా! అందుకే భక్తియోగము అవలంబించాలి అని చెప్పాను. నిర్మలమైన మనస్సుతో, ఏ విధమైన ఫలాపేక్ష లేకుండా కర్మలు చేస్తూ, తాను చేసిన కర్మలు అన్నీ పరమేశ్వరునకు అర్పిస్తూ, స్వధర్మాన్ని ఆచరిస్తూ, పరమాత్మయందు అచంచలమైన భక్తి కలిగి ఉంటూ, పరమాత్మ యొక్క అవతారవిశేషముల కథలు వింటూ, పరమాత్మను కీర్తిస్తూ, తాత్వికజ్ఞానము చేత, వైరాగ్యము చేత, తపస్సు చేతా, ఏకాగ్రమైన మనస్సుచేతా పరమాత్మను ధ్యానిస్తే, కట్టెలో పుట్టిన అగ్ని ఆ కట్టెనే నెమ్మదిగా నెమ్మదిగా కాల్చినట్టు, పురుషుడి లోని అహంకారము, కోరికలు, రాగద్వేషాలు అన్నీ వాటంతట అవే మెల్లమెల్లగా నశించిపోతాయి.

అప్పుడు పురుషునికి ప్రకృతి మీద ఆసక్తి నశిస్తుంది. ప్రకృతియందు ఉండే దోషములను కనిపెడతాడు. ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని పూర్తిగా నశింపజేస్తాడు. ఆత్మానందాన్ని పొందుతాడు. అటువంటి పురుషునికి ప్రకృతితో కలిసి ఉండటం వలన ఎలాంటి ఆపదా కలుగదు. నిర్లిప్తంగా ఉంటాడు.

ఎలాగంటే, నిద్రపోయేటప్పుడు వచ్చే కలలలో ఎన్నో విషయాలు కనిపించి భయపెడుతుంటాయి. మెలుకువ రాగానే అవన్నీ మాయమైపోతాయి. ఒకవేళ గుర్తుకు వచ్చినా అది కలే కదా అని నవ్వుకుంటాడు కానీ వాటికి ఎలాంటి ప్రాధాన్యతా ఇవ్వడు. అలాగే పురుషుడు ప్రకృతిలో ఉన్న విషయములకు ఎలాంటి ప్రాధాన్యతా ఇవ్వడు. వాటి మీద ఆసక్తి చూపడు. ఇదంతా మాయగా తెలుసుకుంటాడు.   అంతర్లీనంగా ఉన్న ఆత్మమీద మనసు లగ్నం చేస్తాడు. ఆత్మదర్శనం చేస్తాడు.

అటువంటి పురుషుని మీద ప్రకృతి తన ప్రభావాన్ని చూపలేదు. అటువంటిపురుషుడు ఎన్నో మంచి జన్మలు ఎత్తుతాడు. అన్ని జన్మలలోనూ  భగవంతుడిని ఆశ్రయించి, వైరాగ్యంతోనూ, భగవంతుని మీద భక్తితోనూ,  తనలోని వాసనలను క్రమక్రమంగా పోగొట్టుకొని పరిశుద్ధుడవుతాడు.  ఆత్మతత్వాన్ని తెలుసుకుంటాడు. నిత్యానందము కలిగించే బ్రహ్మస్వరూపమును పొందుతాడు. అతనిలో ఉన్న అన్ని సందేహములు తొలగిపోతాయి. అతని సూక్ష్మశరీరం కూడా నాశనం అయి పోతుంది. ఆ పురుషుడు మరలా జన్మలేని స్థితిని పొందుతాడు.

ఇట్టి స్థితిని పొందిన పురుషుడు, తనకు అయాచితంగా లభించిన అణిమాది అష్టసిద్ధులయందుకూడా ఆసక్తి చూపడు. ఎల్లప్పుడూ తన మనస్సును పరమాత్మయందే లగ్నం చేస్తాడు. అప్పుడు మృత్యుదేవత కూడా అతని దగ్గరకు రావడానికి భయపడుతుంది." అని కపిలుడు తన తల్లి దేవహూతికి ఆత్మతత్త్వమును ఉపదేశించాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ఇరువది ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## తృతీయ స్కంధము

## ఇరువది ఎనిమిదవ అధ్యాయము.

కపిలుడు తన తల్లి దేవహూతికి తత్త్వజ్ఞాన బోధ చేస్తున్నాడు.

"అమ్మా! ఇప్పుడు నీకు నేను యోగ లక్షణాలను వివరిస్తాను. ఈ యోగాన్ని ఆచరిస్తే మనస్సు ప్రశాంతమవుతుంది. పరమాత్మ యందు లగ్నం అవుతుంది. యోగమును ఆచరించడానికి ప్రతిమనిషీ యథాశక్తి స్వధర్మమునే ఆచరించాలి. పరధర్మమును ఆచరించడం మానుకోవాలి. పరమాత్మ తనకు ప్రసాదించిన సంపదతోనే తృప్తి పడాలి. ఇతరుల సంపద కోసం పాకులాడకూడదు. భగవంతుని తత్త్వము తెలిసిన వారి వద్దకు పోయి వారికి సేవ చేసి వారి బోధనలు వింటూ ఉండాలి.

అర్థము, కామము ల యందు ఆసక్తి  తగ్గించుకోవాలి. ధర్మంగానే అర్థము,కామము పొందాలి. ఎప్పుడూ మోక్ష ధర్మము నుందు ఆసక్తి కలిగి ఉండాలి. పరిమితంగానే భోజనం చెయ్యాలి. ప్రశాంత ప్రదేశములలో నివసించాలి. ఎల్లప్పుడూ పరమాత్మనే స్మరిస్తూ ఉండాలి. అహింసా వ్రతమును పాటించాలి. ఏ ప్రాణినీ ఏ విధంగా కూడా హింసించకూడదు. ఎల్లప్పుడూ సత్యమునే పలకాలి. అబద్ధం ఆడకూడదు.

ఇతరుల వస్తువులను అపహరించడం మహా పాపం అని భావించాలి. ఇతరులు తనకు ఏదైనా దాన రూపంలో ఇచ్చినా, తన జీవితమునకు ఎంత అవసరమో అంతే తీసుకోవాలి. అంతే గానీ ఇస్తున్నారు కదా అని కూడబెట్టకూడదు. బ్రహ్మచర్యమును పాటించాలి. (దీని గురించి ఇదివరకే చెప్పుకున్నాము. కేవలం సంతాన ప్రాప్తి కొరకే భార్యతో కలిసేవాడు, నిత్య బ్రహ్మచారి.)

ఏ పని చేసినా ఒక తపస్సులాగా ఆచరించాలి. దేహమును, అంత:కరణమును శుభ్రంగా పవిత్రంగా ఉంచుకోవాలి. వేదములను అధ్యయనం చేయాలి. ప్రతిరోజూ పరమాత్మను పూజించాలి. ఇతరులతో అనవసరమైన మాటలను మాట్లాడకూడదు. ఎంతవరకు అవసరమో అంతవరకే మాట్లాడాలి. ధ్యానమునకు, పూజకు కూర్చునేటప్పుడు చక్కటి సుఖమైన ఆసనము మీద కూర్చోవాలి. ఇంద్రియములను కట్టడి చేయాలి. మనసుతో కూడా ప్రాణములను మూర్ధము నందు నిలపాలి.

## తృతీయ స్కంధము

పరమాత్ముని యొక్క లీలలను, కథలను చదవాలి లేకపోతే వినాలి. పరమాత్మను ఎల్లప్పుడూ స్మరించాలి.కీర్తించాలి. మనస్సును ఆ పని చేయాలి ఈ పని చేయకూడదు అని ఎల్లప్పుడూ అల్లకల్లోలంగా ఉంచకూడదు. మనసును ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉంచుకోవాలి. ఇవే కాకుండా శాస్త్రసమ్మతమైన ఇతర ఉపాయముల ద్వారా కూడా ప్రాపంచిక విషయములలో చిక్కుకుపోయే మనస్సును వెనక్కులాగి బుద్ధితో కలపాలి.

ఇదంతా సక్రమంగా జరగాలంటే మొదట స్థిరంగా ఒక చోట కూర్చోవాలి. ఆ స్థలము పవిత్రమైన స్థలము అయి ఉండాలి. అటువంటి ప్రదేశములో దర్భలతోనూ, గడ్డితోనూ మెత్తటి ఆసనము ఏర్పరచుకోవాలి. దాని మీద శరీరమును నిటారుగా పెట్టి కూర్చోవాలి. అప్పుడు అభ్యాసము మొదలెట్టాలి.

మొదట ప్రాణాయామం చెయ్యాలి. పూరకము, కుంభకము, రేచకముల ద్వారా కానీ, లేక రేచకము, కుంభకము, పూరకముల ద్వారాగానీ ప్రాణాయామమును అభ్యసించాలి. ఆ ప్రాణాయామము చేస్తున్నపుడు శరీరనాడులలో గాలి ఎలా ప్రసరిస్తూ ఉందో గమనించాలి. ఇలా చేస్తే మనస్సు స్థిరంగా ఉంటుంది. మకిల పట్టిన బంగారాన్ని నిప్పులో వేసి కాలిస్తే ఎలా మకిల అంత పోయి ధగా ధగా మెరుస్తుందో అలాగే శ్వాసను జయించినయోగి యొక్క మనస్సు కూడా నిర్మలము అవుతుంది. అంతే కాకుండా ప్రాణాయామము అచరించడం వలన వాతము, పిత్తము, శ్లేష్మము వలన వచ్చే వ్యాధులు కూడా నిర్మూలింపబడతాయి. అలాగే రాగద్వేషములు కూడా అదుపులో

ఉంటాయి.

ఈ ప్రకారంగా ప్రాణాయామము ద్వారా మనస్సును నిర్మలంగా చేసుకున్న తరువాత, చూపును నొసటిమధ్యలో నిలిపి ఏకాగ్రతతో పరమాత్మను ధ్యానించాలి. ఆ పరమాత్మ స్వరూపమును మనసులో నిలుపుకోవాలి. ప్రసన్నమైన ముఖము కలవాడు, ఎర్రని నేత్రములు కలవాడు, నీలమేఘశ్యాముడు, శంఖము, చక్రము, గద ఆయుధములుగా ధరించిన వాడు, పచ్చని పట్టు వస్త్రమును ధరించిన వాడు, వక్షస్థలములో శ్రీవత్సము అనే గుర్తు కలవాడు, కౌస్తుభమణిని కంఠసీమలో అలంకరించుకున్నవాడు, పొగుగాటి వనమాలను ధరించిన వాడు, రత్న కంకణములు, కిరీటము, ధరించిన వాడు, భక్తుల హృదయములే ఆసనముగా చేసుకున్న వాడు, అత్యంత సుందరాకారుడు, శాంతమూర్తి, చూచువారి మనస్సులు రంజిల్ల చేయువాడు, ముల్లోకములచేత నమస్కరింపబడేవాడు, తన భక్తులయందు దయచూపేవాడు,మంచి యశస్సు కలవాడు, బలిచక్రవర్తి మొదలగు వారికి ఉన్నతలోకములు ప్రసాదించినవాడు, అట్టి పరమాత్మ స్వరూపాన్ని మనసులో దర్శించాలి.

ఎవరెవరి మనసుకు తోచినట్టు వారు ఆ పరమాత్మ స్వరూపాన్ని నిల్చున్నట్టు గానీ, కూర్చున్నట్టు గానీ పరుండినట్టు గానీ ధ్యానించవచ్చును. యోగి మొట్ట మొదట ఆ పరమాత్మ స్వరూపము పూర్తి గా ధ్యానించాలి. తరువాత ఒక్కొక్క అవయవము మీద మనసును లగ్నం చేసి ధ్యానించాలి. పాదముల వద్ద నుండి మొదలు పెట్టాలి. వజ్రము, అంకుశము, ధ్వజము, పద్మము చిహ్నములు కల

పరమాత్మ పాదములను ధ్యానించాలి. పరమాత్మ పాదపద్మములు ధ్యానిస్తే, యోగి హృదయములో ఉన్న అజ్ఞానము అనే అంధకారము తొలగిపోతుంది. ఆ పరమాత్మ పాదములను కడిగిన నీటి నుండి పుట్టిన గంగా నదీజలములు శివుని శిరస్సును అలంకరించాయి. కాబట్టి పరమాత్మ పాదములను ఎల్లప్పుడూ భక్తితో ధ్యానించాలి.

తరువాత యోగి తన దృష్టిని పైకి లేపాలి. అప్పుడు పరమాత్మ మోకాళ్లు కనపడతాయి. ఆ మోకాళ్లనే లక్ష్మీదేవి తన తొడల మీద పెట్టుకొని తన చేతులతో సేవిస్తూ ఉంటుంది. అటువంటి మోకాళ్లకు నమస్కరించాలి. తరువాత పరమాత్మ తొడలు కనపడతాయి. ఈ లోకముల భారమును భరిస్తున్న ఆ తొడలకు భక్తితో నమస్కరించాలి. తరువాత యోగి తన దృష్టిని పరమాత్మ నడుము మీదికి ప్రసరింపచేయాలి. మొలనూలుతోనూ, పీతాంబరముతోనూ అలంకరింపబడిన పరమాత్మ నడుము ప్రదేశమును భక్తితో ధ్యానించాలి.

తరువాత యోగి తన దృష్టిని పరమాత్మ నాభి ప్రదేశంలో నిలపాలి. ఆ నాభి సరోవరము నుండే బ్రహ్మ ఉద్భవించాడు. అదే బ్రహ్మయొక్క స్థానము. అట్టి నాభిని ధ్యానించాలి. తరువాత యోగి తన దృష్టిని పరమాత్మ వక్షస్థము మీద నిలపాలి. లక్ష్మీదేవికి నివాసమయిన వక్షస్థలమును భక్తితో ధ్యానించాలి. తరువాత కౌస్తుభమణిని అలంకారముగా ధరించిన పరమాత్మకంఠసీమను ధ్యానించాలి. తరువాత పరమాత్మ యొక్క భుజములను, బాహువులను ధ్యానించాలి. తరువాత పరమాత్మ చేతులనలంకరించిన చక్రాయుధమును, తెల్లని

శంఖమును, కౌమోదకి అనే గదను ధ్యానంచేయాలి.

తరువాత శ్రీహరి యొక్క ముఖమును మనసులో నిలుపుకోవాలి. ప్రకాశవంతమైన ముఖకమలము, మకర కుండలములు, కోమలములైన చెక్కిళ్లు, ఎత్తైన ముక్కు, ముఖము మీద పడు ముంగురులు, తామరరేకుల వంటి కళ్లు, వీటిని ఏకాగ్రతతో ధ్యానించాలి. తరువాత శ్రీహరి ముఖము మీద వెలిగే చిరునవ్వు మీద దృష్టి పెట్టాలి. శ్రీహరి యొక్క నగుమోము చూస్తే చాలు సకల దు:ఖములు తొలగిపోతాయి. మన్మధుని విల్లు వంటి శ్రీహరి కనుబొమలు మన్మధునే జయించేటట్టు ఉంటాయి. యోగి వాటిని ధ్యానించాలి.

ఇటువంటి జగన్మోహనాకారమును దర్శించిన యోగి మనస్సు ఆనందంతో ద్రవించి పోతుంది. శరీరం అంతా గగుర్పాటు చెందుతుంది. కళ్లనుండి ఆనందభాష్పాలు రాలుతాయి. యోగి ఆనంద సాగరంలో మునిగితేలుతుంటాడు. ఆ స్థితిలో ఉన్న సాధకుడికి యోగముతో కూడా భక్తి కలిసిపోతే, చిత్తము ఆ శుద్ధభక్తిప్రభావముతో కూడిన  యోగసాధన, ధ్యానము, తపస్సు మొదలగునవి విడిచిపెట్టి కైవల్యమును కూడా కోరుకోదు. కేవలము పరమాత్మ యందు భక్తిలో నిమగ్నమవుతుంది.

ఆ ప్రకారంగా చిత్తము ప్రాపంచిక విషయములలో ఆసక్తిని విడిచిపెట్టి, భగవంతునికి సంబంధించిన విషయములలో నిమగ్నమయినపుడు, సాంసారిక విషయములలో విరక్తి చెందినపుడు,

ప్రమిదలో నూనె లేకపోతే దీపము ఆరిపోయినట్టు, చిత్తము కూడా ఇంద్రియములను గ్రహించడం మానివేసి, చిన్మయమైన ఆనందమును పొందుటకు, ఈ స్థూలశరీరము. సూక్ష్మ శరీరముల మీద అభిమానమును విడిచిపెడుతుంది. అప్పుడు సాధకుడు పరమాత్మను ప్రత్యక్షం చేసుకోగలుగుతాడు.

అప్పుడు ఆ యోగి చిత్తములో అవిద్య అజ్ఞానము అనేవి పూర్తిగా నశించిపోతాయి. సుఖము దు:ఖము అనేవి మచ్చుకైనా కనపడవు. కేవలం బ్రహ్మ స్వరూపాన్ని దర్శిస్తాడు. ఆ యోగి ఆత్మతత్త్వమును తెలుసుకున్నవాడు అవుతాడు. అంతకుముందు అతని ఆత్మ ప్రాపంచిక విషయములలో లీనమై అనుభవించిన సుఖదు:ఖములు, అనుభవములు అన్నీ అవిద్యతో కూడిన అహంకారము చేత ఏర్పడినవి అని తెలుసుకుంటాడు.

అప్పుడు ఆ యోగికి దేహాభి మానము పూర్తిగా నశిస్తుంది. మద్యముసేవించిన మత్తులో ఉన్న మానవునికి తన ఒంటి మీద బట్టలు ఉన్నాయో తొలగిపోయాయో తెలియనట్టు, ఈ స్థితిలో ఉన్న యోగికి కూడా తన దేహముతో ఏమి చేస్తున్నాడో తెలియదు. ఎక్కడకు పోతాడో, ఏమి తింటాడో, ఎక్కడ ఉంటాడో తెలియదు. దేహము గురించి పట్టించుకోడు. ఆ యోగి యొక్క పూర్వ సంస్కారముల వలన ఈ దేహం లభించింది. దేహం ఉన్నంతవరకూ కర్మలు చేస్తుంటాడు. కాని వాటిలో లీనం కాడు. కేవలం సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడు.

(ఆహారం తినాలి కాబట్టి తింటాడు. దాహానికి నీరు తాగాలి కాబట్టి తాగుతాడు.కాలకృత్యములు తీర్చుకుంటాడు. అంతేకానీ తనకు కావాలి అని ఏపనీ చెయ్యడు.)

మనకు స్వప్నములో కనపడ్డ మనుషులను, వస్తువులను, జరిగిన సంఘటనలను ఎలా దూరంగా ఉండి చూస్తూ ఉంటామో అలాగే యోగి కూడా తాను ఆచరించే దైనందిన కర్మలను కూడా సాక్షీభూతంగా చూస్తుంటాడు. ఏదీ పట్టించుకోడు. ఈ దేహమునకు సంబంధించిన  భార్యను, బిడ్డలను పట్టించుకోడు.  నిర్లిప్తంగా ఉంటాడు. తననిజస్వరూపాన్ని అంటే ఆత్మస్వరూపాన్ని దర్శిస్తూ ఉంటాడు.

సాధారణంగా మానవులు తమ భార్యా బిడ్డలమీద, వస్తువుల మీద, డబ్బుమీద, ఆస్తుల మీద ఉన్న అధిక ప్రేమ వలన, అవన్నీ తానే అనుకుంటాడు. అవి లేకపోతే బతకలేను, బతికీ వృధా అనుకుంటాడు. నిజానికి అవి వేరు, ఇతను వేరు. భార్య, కుమారులు ఇతను కాదు. ధనము, ఆస్తి, ఇళ్లు ఇతను కాదు. అవన్నీ వేరే. కానీ అవన్నీ తనే అనే అజ్ఞానంలో ఉంటాడు.

అలాగే, ఈ దేహము వేరు, దేహములో ఉన్న జీవాత్మ వేరు. కానీ ఈ దేహమే నేను అనుకుంటాడు. ఈ దేహము కోసరం ఎన్నో అకృత్యాలు చేస్తాడు. కాబట్టి మానవులు ఈ దేహము వేరు తాను వేరు అని తెలుసుకోవాలి. ఎలాగంటే, ఒక కట్టెకు నిప్పు అంటిస్తే అది కాలుతూ ఉంటుంది. అలా కట్టెకాలుతున్నప్పుడు మంట, పొగ, నిప్పు రవ్వలు

బయటకు వస్తాయి. అవన్నీ ఒకటిగానే ఉన్నట్టు కనపడతాయి కానీ రవ్వలు, పొగ వేరు నిప్పు వేరు. అలాగే బయట కనపడుతున్న పంచభూతములు, ఇంద్రియములు, దేహము, మనస్సు, బుద్ధి, అహంకారములు, వీటినన్నిటినీ భరించే జీవాత్మ, ఇవన్నీ దేహంలో వెలుగుతున్న ఆత్మ కన్నా వేరు.

దేహంలో ఉన్న ఆత్మ పరమాత్మ స్వరూపము. ఆయనే భగవానుడు. ఆయనకు దేహముతో చేసే పనులు, అనుభవించే సుఖదు:ఖములు ఏవీ అంటవు. అన్నీ సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడు.కాలం తీరగానే ఈ దేహాన్ని వదిలి వెళ్లిపోతాడు.ఈ నిజాన్ని తెలుసుకొన్న యోగి, సర్వభూతములలో పరమాత్మను, పరమాత్మలో సర్వభూతములను దర్శిస్తాడు.

(అందరిలో ఉండే పరమాత్మ స్వరూపము ఒకటే కాబట్టి, మానవుల మధ్య కోపాలు, ద్వేషాలు, అభిమానాలు, కుల,మత,ప్రాంతీయ తత్వాలు అన్నీ అర్థం లేనివి. సర్వమానవ సౌభ్రాతృత్వమే శ్రేయోదాయకము అని కపిలుడు నేటి తరానికి సందేశము అందిస్తున్నాడు.)

మనకు కనిపించే అగ్ని ఒకటే. కానీ ఆ అగ్ని వివిధ ప్రదేశాలలో, వివిధ రూపాలలో కనిపిస్తూ ఉంటుంది.

(పెద్ద పెద్ద భవనాలు అంటుకున్నప్పుడు అగ్ని జ్వాలలు ఆకాశాన్నంటుతాయి. అగ్గిపుల్ల వెలిగించినపుడు మంటచిన్నదిగా ఉ ంటుంది. వంట వండేటప్పుడు తగుమాత్రంగా అగ్ని జ్వాలలు ఉంటాయి.)

అలాగే, ఆత్మ కూడా దేహములో ఉన్నప్పుడు ఆ దేహము యొక్క గుణములను బట్టి, రాగద్వేషములను బట్టి జీవాత్మరూపంలో నానారకాలుగా ప్రవర్తిస్తుంది. కాబట్టి మానవులు భక్తి యోగము ద్వారానే, అన్ని సంసార బంధనాలకు కారణభూతమైనదీ, కార్య, కారణములతో కూడినదీ అయిన ఈ ప్రకృతిని పరమాత్మ అనుగ్రమంతో జయించాలి. ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవాలి.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ఇరువదిఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము

ఇరువదితొమ్మిదవ అధ్యాయము.

తన కుమారుడైన కపిలుడు బోధించిన తత్త్వజ్ఞానమును విన్న తరువాత తల్లి దేవహూతికి కొన్ని సందేహాలు కలిగాయి. వాటిని నివృత్తి చేసుకోవాలని దేవహూతి తనకుమారుడు కపిలుడిని ఇలా అడిగింది.

“కుమారా! నీవు ఇప్పటి దాకా నాకు మహత్తత్వము మొదలగు తత్త్వలక్షణములను, ప్రకృతి,పురుషుడు వీరి లక్షణములను, సాంఖ్యశాస్త్రములో ఉన్నట్టు నాకుచెప్పావు. నేను మహత్తత్వము మొదలగు లక్షణముల గురించి బాగా తెలుసుకున్నాను.

కాని నీవు వీటి అన్నిటికీ మూలము భక్తియోగము అని చెప్పావు. ఆ భక్తియోగము గురించి నాకు వివరంగా చెప్పు. అసలుసంసారము అంటే ఏమిటి? దాని నుండి ఎలా విముక్తి పొందుతారు? నాకు వివరంగా చెప్పు. అదీ కాకుండా కాలస్వరూపుడు, ఈ విశ్వమునకు అంతటికీ మూలకారణము అయిన పరమాత్మ గురించి వివరంగా చెప్పు.

ఆ పరమాత్మ మీద భక్తితో కాదు, భయంతోనే మానవులందరూ ఆయన మీద భక్తి చూపిస్తున్నారు. కేవలం పుణ్యం సంపాదించుకోడం కోసరమే మానవులు పరమాత్మ మీద భక్తి కలిగి ఉంటున్నారు. ఇది ఎలా జరుగుతూ ఉంది. అంతే కాకుండా, మానవులందరూ నిరంతరమూ ఈ సంసార బంధనములలో చిక్కుకొని, ఈ దేహములే నిజములని నమ్మి, అహంకారముతో విర్రవీగుతున్నారు. ఎల్లప్పుడూ నేను నాది నేనే చేస్తున్నాను అనే భావనతో ఎన్నో అకృత్యములు చేస్తున్నారు. అజ్ఞానము అనే అంధకారంలో కొట్టుమిట్టాడుతున్నారు. వారిని ఆ అంధకారము నుండి మేలుకొలుపడానికి, వారికి వెలుగుచూపడానికి పరమాత్ముడవైన నీవు, లోకములో అలముకున్న చీకట్లను పారదోలి వెలుగును ప్రసరింపజేసే సూర్యభగవానుడి వలె, నాకు కుమారుడిగా అవతరించావు. కాబట్టి నీవే నా సందేహములను తీర్చడానికి సమర్థుడివి." అని దేవహూతి తన కుమారుడు కపిలుడిని అడిగింది. తన తల్లి ప్రేమతో అడిగిన ప్రశ్నలకు కపిలుడు ఈవిధంగా సమాధానం చెప్పాడు.

"తల్లీ! మానవులందరూ ఒకటిగా లేరు కదా. వివిధములైన గుణములతో, లక్షణములతో, మనస్తత్వములతో ఉన్నారు. వారి వారి గుణములకు తగ్గట్టు వారు పరమాత్ముని మీద భక్తిభావమును చూపుతుంటారు. మానవులలో సాధారణంగా సత్త్వ, రజస్, తమోగుణములు ప్రధానంగా ఉన్నాయి. వారి వారి గుణముల ప్రభావం చేతా, వారు చేయు పనుల చేతా, వారి భక్తిలో కూడా భేదము కనపడుతుంది. ఎక్కువగా కోపంకల భక్తుడు కూడా పరమాత్మ యందు  భక్తి కలిగి ఉంటాడు. కానీ ప్రేమతో కాదు. ద్వేషంతో, గర్వంతో, మాత్సర్యంతో పరమాత్మను తలచుకుంటూ ఉంటాడు. దానిని తామస భక్తి అంటారు.

(ఉదాహరణకు రావణాసురుడు, హిరణ్యకశిపుడు).

తనకుపేరు రావడానికి, తనకోరికలు తీర్చుకోడానికి, ధనము, ఐశ్వర్యము పొందడానికి, పరమాత్మను పూజించే వ్యక్తి భక్తి రాజస భక్తి. (ప్రస్తుతము అందరూ అవలంబించే భక్తి రాజస భక్తి). ఇంక మూడవ రకమైన భక్తి సాత్విక భక్తి. తాను అంతకు ముందు జన్మలలో చేసినపాపములను పోగొట్టుకోడానికి, ఈ జన్మలో మంచి పనులు చెయ్యడానికి, ఏ విధమైన కోరికలు కోరకుండా, తాను  చేసిన కర్మలను అన్నీ పరమాత్మకు అర్పిస్తూ, పరమాత్మను పూజించే భక్తి సాత్త్విక భక్తి.

అమ్మా! ఈ భక్తిరూపములు అన్నీ సగుణాకారంతో పరమాత్మను ధ్యానించేవాళ్లకు అనుకూలమైనవి. దీనికి భిన్నంగా ఉండేది నిర్గుణ భక్తి.ఆ భక్తి శుద్ధమైనది. ఈ భక్తుడు పరమాత్మను ఏ

ఆకారంతో కాకుండా కేవలం హృదయంలో నిలుపుకుంటాడు. మానసిక పూజ చేస్తాడు. గంగా ప్రవాహము సముద్రము వైపుకు ఉరకలువేస్తూ ప్రవహించినట్టు, ఆ భక్తుడు పరమాత్మ గుణములను కీర్తించినంత మాత్రముననే, పరవశించిపోతాడు. తన ఆత్మనునాకు అర్పిస్తాడు. ఇదే నిర్గుణభక్తి లక్షణము. ఈ భక్తిలో ఎటువంటి ఫలములను ఆశించడు. ఏ కోరికా కోరడు. కేవలం నిర్గుణుడైన పరమాత్మను మనసులో నిలుపుకుంటాడు. అటువంటి భక్తులు, వైకుంఠపదమునుకానీ, దానికి సమానమైన పదమును కానీ, ఎల్లప్పుడూ పరమాత్మ సన్నిధానంలో ఉండటం కానీ,  పరమాత్మలో ఐక్యం కావడం కానీ, కోరుకోరు. ఎల్లప్పుడూ పరమాత్మ మీద భక్తి, పరమాత్మను సేవించడం మాత్రమే కోరుకుంటారు. ఈ భక్తినే ఆత్యంతిక భక్తియోగము అని అంటారు. ఈ భక్తి ద్వారా సాధకుడు సత్వ, రజస్,తమోగుణములను వదిలిపెట్టి, నిర్మలమైన నా ప్రేమను మాత్రమే కోరుకుంటాడు.

ఓ తల్లీ! పైన చెప్పిన భక్తియోగములకు తగిన సాధనముల గురించి చెబుతాను విను. ఎటువంటి ఫలితములను కోరని ధర్మము, భక్తికి అనుకూలమైన ధర్మము, ప్రతి దినము ఆచరించగలిగే ధర్మము ఆచరించాలి. నిత్యము శ్రద్ధతో పరమాత్మను పూజించాలి. స్తుతించాలి. సకల భూతములలోనూ పరమాత్మను దర్శించాలి. ప్రతి దానికీ కుంగిపోకుండా ధైర్యంగా ఉండాలి. ప్రాపంచిక విషయముల మీద వైరాగ్యముతో ఉండాలి. తన కన్నా పెద్దవారిని గౌరవించాలి. దీనుల పట్ల దయకలిగి ఉండాలి. తన మాదిరి భావజాలము కలిగిన వారితోనే, తన మాదిరి ఆలోచించగలిగే వారితోనే స్నేహం చెయ్యాలి.

ఇంద్రియములను, మనస్సును వశంలో ఉంచుకోవాలి. గురువుల వద్ద, సత్పురుషుల వద్దకుపోయి, తెలియని విషయాలు తెలుసుకోవాలి. సత్సంగములలో పాల్గొనాలి.

అన్నిటి కన్నా ముఖ్యమైనది అహంకారమును విడిచిపెట్టాలి. నేను, నాది అనే భావనకు దూరంగా ఉండాలి. ఈ నియమములు పాటించిన మానవుడు నిర్మలమైన మనస్సుతో పరమాత్మను పొందగలడు. వాయువు పూలనుండివెలువడుసువాసనను మన ముక్కుదాకా ఎలా మోసుకొని వస్తుందో, అలాగే నిర్మలమైన భక్తియోగముతో కూడిన చిత్తము, రాగద్వేషములను, అహంకారమును విడిచిపెట్టిన మనస్సు, సులభంగా పరమాత్మను చేరుకుంటుంది.

అమ్మా! పరమాత్మ అన్ని ప్రాణులలోనూ ఆత్మస్వరూపంగా వెలుగుతున్నాడు. కాని ఈ మానవులు సాటి మానవులలో కూడా పరమాత్మ ఆత్మస్వరూపంగాఉన్నాడని తెలియక పరస్పరము ద్వేషించుకుంటున్నారు. సాటి మనిషిని ద్వేషిస్తే, ఆ మనిషిలో ఉన్న పరమాత్మనుకూడా ద్వేషించినట్టే కదా! ఆ విధంగా మానవులు పరమాత్మను అవమానిస్తున్నారు. కాని, తమ కోరికలు తీరడానికి పరమాత్మ రూపమును వివిధ విగ్రహములుగా ప్రతిష్ఠించి పూజిస్తున్నారు. సాటి మనిషిలో ఉన్న పరమాత్మను గౌరవించలేనివారు, పరమాత్మ విగ్రహములను పూజిస్తున్నారు. అది కూడా పరమాత్మను అవమానపరచినట్టే కదా! సర్వభూతములలో ఉన్న పరమాత్మను నిర్లక్ష్యం చేసి, పరమాత్మ విగ్రహములను ప్రతిష్ఠించి పూజించడం,

బూడిదలో పోసిన పన్నీరే కదా!

అంతే కాదు తల్లీ! సాటి ప్రాణులలో అంతర్యామిగా ఉన్న పరమాత్మను గుర్తించని వాడు, ఈ దేహమే శాశ్వతము అని తలచే వాడు, ఒక దేవుడికీ మరొక దేవుడికీ భేదమును కల్పించేవాడు, సాటి ప్రాణులమీద ద్వేషము, శత్రుత్వము చూపేవాడు, అటువంటి మానవుని చిత్తము ఎప్పుడుకూడా ప్రశాంతంగా ఉండదు. ఎప్పుడూ ఏదో ఒక సమస్యతో బాధపడుతుంటాడు. సాటి మానవులను దూషించేవాడు, సాటి ప్రాణులను హింసించేవాడు, పరమాత్మ విగ్రహములకు ఎన్ని పూజలు చేసినా, ఎన్ని నివేదనలు సమర్పించినా, ఎన్ని వ్రతములు చేసినా, ఆ పరమాత్మ వాడికి ప్రసన్నుడు కాడు.

అమ్మా! ఇంక విగ్రహములను ఎంతవరకూ పూజించాలి అంటే పరమాత్మ మీద భక్తి కుదిరే వరకూ, తన హృదయంలో ఉన్న ఆత్మ సాక్షాత్కారము కలిగే వరకూ, సర్వప్రాణులలోనూ ఆ పరమాత్మను దర్శించేవరకూ, విగ్రహారాధన చెయ్యాలి. ఒక సారి ఆత్మ సాక్షాత్కారము పొందిన తరువాత విగ్రహములను పూజించనవసరం లేదు. విగ్రహములతో పని ఉండదు.

ఇంతెందుకు తల్లీ! ఏ మానవుడైనా తనకూ, తన తోటి వాడికీ, (కులాల రీత్యా, మతాల రీత్యా, ప్రాంతాలరీత్యా)స్వల్పమైనభేదం పాటించినా, అట్టి వాడిమీద నేను ప్రేమ చూపించను సరికదా, వారి పాలిట మృత్యుదేవతనవుతాను. వారికి భయం కలిగిస్తాను. కాబట్టి ఓ తల్లీ! మానవులందరూ పరమాత్మ సర్వభూతములలో ఉన్నాడు అని

తెలుసుకోవాలి. పరమాత్మను సర్వాంతర్యామిగా భావించాలి. పరమాత్మ స్వరూపమునే పూజించాలి. సకల ప్రాణుల యందు సమాన మైన ప్రేమ అనురాగము దయ కలిగి ఉండాలి. సాటి వారితో స్నేహంగా ఉండాలి. శత్రుత్వము పనికిరాదు. పేదలకు, లేని వారికి శక్తి కొద్దీ దానధర్మాలు చెయ్యాలి.

తల్లీ! పరమాత్మ సృష్టిలో అనేకజీవజాతులు ఉన్నాయి. వాటిలో ప్రాణము ఉన్నవి కొన్ని. ప్రాణము లేనివి కొన్ని. ప్రాణము లేని వాటి కంటే ప్రాణము ఉన్నవి శ్రేష్టమైనవి. ప్రాణములు ఉన్న వాటిలో ఇంద్రియములతో పనులు చేసేవి శ్రేష్టమైనవి. ఆ ఇంద్రియములతో పనులు చేసే ప్రాణులలో స్పర్శను అనుభవించే ప్రాణులు, రసమును గ్రహించే ప్రాణులు ఉన్నాయి. స్పర్శను అనుభవించే ప్రాణుల కంటే రసమును గ్రహించే ప్రాణులు శ్రేష్టమైనవి. రసమును గ్రహించే ప్రాణుల కంటే వాసనను గ్రహించగలిగే ప్రాణులు శ్రేష్టమైనవి. వాసనను గ్రహించే ప్రాణులకంటే శబ్దమును గ్రహించే ప్రాణులు శ్రేష్టమైనవి. శబ్దమును గ్రహించే ప్రాణుల కంటే రూపమును చూచి గుర్తుపట్టగల ప్రాణులు శ్రేష్టమైనవి. రూపమును చూచి గుర్తుపట్టగల ప్రాణులలో, దంతములు కల ప్రాణులు శ్రేష్టమైనవి. వాటిలో కూడా అనేక పాదములు కల జీవులు శ్రేష్టమైనవి. వాటిలో కూడా నాలుగు పాదములతో సంచరించే జీవులు శ్రేష్టమైనవి. వాటి కంటే రెండు పాదములతో నడిచే మానవులు శ్రేష్టులు.

రెండు పాదములతో నడిచే మానవులలో బ్రాహ్మణ,క్షత్రియ, వైశ్య,శూద్ర వర్ణములు శ్రేష్టమైనవి. ఆ నాలుగు వర్ణములలో బ్రాహ్మణులు

ప్రధానమైన వారు. ఆ బ్రాహ్మణులలో వేదములు చదువుకున్న వారు, వేదములను అర్థం చేసుకున్న వారు శ్రేష్టులు. వేదములు చదువుకొని, వాటి అర్థము తెలుసుకున్న వారి కంటే వేదములు చదివిన తరువాత వచ్చే సందేహములను తీర్చే పండితుడు శ్రేష్టుడు. వారిలో కూడా స్వధర్మము మీద ఆసక్తి కలిగి స్వధర్మమును ఆచరించే వాడు శ్రేష్టుడు. వారిలో కల్లా స్వధర్మమునుకూడా విడిచిపెట్టి అన్ని కర్మములను ఏ విధమైన కోరికలు లేకుండా నిష్కామంగా ఆచరించేవాడు శ్రేష్టుడు.

వారిలో కల్లా, తానే చేసే ప్రతి పనిని, దాని వలన వచ్చే ఫలితములను భగవంతునికి అర్పించేవాడు, వాటినే కాదు తన సర్వస్తమును భగవంతునికి అర్పించే వాడు, భగవంతుని త్రికరణ శుద్ధిగా నమ్మేవాడు, భగవంతుని శరణు పొందేవాడు, అన్ని కర్మలను భగవంతునికి అర్పించే వాడు, ఎటువంటి కర్తృత్వఅభిమానము లేని వాడు, అందరినీ సమంగా చూచేవాడు, పురుషులలో కల్లా పరమ శ్రేష్టుడు. వీడి కన్నా శ్రేష్టుడు మరొకడు లేడు.

అమ్మా! పరమాత్మసర్వాంతర్యామి. అంతటా నిండి ఉన్నాడు. ఆయన లేని చోటు లేదు. సకల జీవులలో ఉన్నాడు. ఈ సత్యమును తెలుసుకొని సర్వప్రాణులను సమంగా ఆదరించి నమస్కరించాలి. అదే మానవధర్మము.

అమ్మా! నేనునీకు భక్తి గురించి, యోగము గురించి చెప్పాను. ఈ రెండింటిలో దేనిని అనుసరించి అయిన మానవుడు పరమాత్మను చేరుకోగలడు.

అమ్మా! ఈ అనంత విశ్వం అంతా భగవంతుని స్వరూపమే. ప్రకృతి,పురుషుడు అనే రూపాలతో మనకు కనపడుతూ ఉంది. మానవులు తాము చేసిన కర్మల ఫలమును అనుభవిస్తూ ఉంటారు. దానికి దైవము అనే పేరు పెట్టుకుంటారు. కాల ప్రభావము వలన అన్ని వస్తువులు పరిణామము చెందుతున్నాయి. ఈ కాలమే మానవులకు మృత్యుభయాన్ని కలుగచేస్తూ ఉంది.
(కాలం తీరగానే మృత్యువు కబళించడం సాధారణం. కాబట్టి మృత్యువు ఎప్పుడు వస్తుందో అని మానవుడు భయపడుతూ ఉంటాడు. ).

పరమాత్మ అన్ని ప్రాణులలో ఉన్నాడు. కాని ఒక ప్రాణి మరొక ప్రాణికి ఆహారంగా నిర్ణయింపబడింది. ఒక ప్రాణికి కాలంతీరగానే మరొక ప్రాణికి ఆహారం అవుతూ ఉంది. ఆ ప్రకారంగా కాలము సకల ప్రాణులను శాసిస్తూ ఉంది. ఈకాలమునకు ఒకటి ఇష్టము మరొకటి అయిష్టము అని లేదు. కాలమునకు బంధువులు మిత్రులు లేరు. వాడూ వీడూ అనే భేదము లేకుండా, తన మన అనకుండా, కాలము తీరగానే అందరినీ సంహరిస్తుంది. ఈ కాల మహిమ చేతనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. గాలి వీస్తూ ఉంది. వర్షాలు కురుస్తున్నాయి. నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి.
(అంటే దీని అర్థం.... భూమి తిరగడానికి కొంత కాలం పడుతుంది. ఉదయం కాలం రాగానే సూర్యుడు ప్రకాశిస్తాడు. వానాకాలం రాగానే వర్షాలు కురుస్తాయి. చలికాలం రాగానే ఈదురుగాలులు,చలిగాలులు వీస్తాయి. అంతా కాలానుగుణంగా ప్రకృతి స్పందిస్తూ ఉంటుంది.) కాలానుగుణంగానే పుష్పములు పుష్పిస్తాయి. కాయలు కాస్తాయి. పండ్లు పండుతాయి. (ఎండాకాలంలో మామిడి పళ్లు, మల్లెపూలు వస్తాయి.

వానాకాలంలో సీతాఫలాలు వస్తాయి. అంతా కాలానుగుణంగా జరుగుతాయి.)

అమ్మా! ఈ కాలము వలననే జీవులకు శ్వాసక్రియ క్రమబద్ధంగా జరుగుతూ ఉంది.

(ఒక్కోజీవికీ ఒక్కొక్కక విధంగా శ్వాసక్రియజరుగుతూ ఉంటుంది. శ్వాసతీసే కాలము శ్వాస విడిచే కాలము నిర్ణయింపబడి ఉంటుంది. ఉ ఛ్వాసనిశ్వాసల పరిమాణాన్ని బట్టి వాటి ఆయుర్దాయము ఉంటుంది.)

అమ్మా!ఈ చరాచర జగత్తు దేవతా గణముల అధీనంలో ఉంది. ఆదేవతలు కూడా కాలమునకు లోబడి ప్రవర్తిస్తూ ఉంటారు. వారిని కూడా కాలము శాసిస్తుంది. కాలమే పరమాత్మ స్వరూపము. కాలపరిణామము వలననే మానవులలో సృష్టి జరుగుతూ ఉంది.

( మానవులలో, తల్లి గర్భంలో శిశువు తొమ్మిది నెలలు ఉ ంటాడు. ఇతర ప్రాణులలో వివిధ కాలపరిమాణములలో సంతానము పుడుతూ ఉంటారు. కొన్ని ప్రాణులు గుడ్డుపెట్టి నిర్ణీత కాలము పొదిగిన తరువాతనే పిల్లలు బయటకు వస్తాయి. కాబట్టి ఈ సృష్టి అంతా కాలానుగుణంగానే సాగుతూ ఉంది.)

అందు వలననే కాలము సృష్టికి, స్థితికి, లయమునకు కారణము అవుతూఉంది. ఈ కాలమునకు ఆది అంతమూ లేదు. కాలమునకు రూపము, గుణము లేదు. కాలము అవ్యయము. అందుకే

పరమాత్మను కాలస్వరూపుడు అని అంటారు."అని కపిలుడు తన తల్లి దేవహూతికి కాల స్వభావమును గురించి తెలియజేసాడు.

శ్రీమద్భాగవతము
తృతీయ స్కంధము ఇరువది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

## శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## ముప్పదవ అధ్యాయము.

కపిలుడు తన తల్లి దేవహూతికి తత్త్వజ్ఞానమును ఉపదేశిస్తున్నాడు.

"అమ్మా! నీకు ఇప్పటి దాకా కాలమహిమను గురించి చెప్పాను. అమ్మా! ఈ కాల ప్రభావము చేతనే మానవులు వివిధమైన కర్మలు చేయడానికి ప్రేరేపింపబడుతున్నారు. కాని కాలము యొక్క బలమును తెలుసుకోలేక దు:ఖముల పాలవుతున్నారు. తాత్కాలికమైన సుఖములను ఆశించి మానవులు ఎన్నోపనులు చేస్తుంటారు. కాని వాటి వలన ఆఖరుకు దు:ఖమునే పొందుతున్నాడు. తాము ఎన్నో కర్మలు చేసి సంపాదించిన వస్తువులు, సంపదలు, కాలగమనంలో కొట్టుకుపోతాయని తెలుసుకోలేక పోతున్నారు. వాటి కోసరం వెంపర్లాడుతున్నారు. తుదకు అవి తననుండి వెళ్లిపోతే దు:ఖాలపాలవుతున్నారు.

అమ్మా! ఈ మానవులు తన భార్య, పుత్రులు, సంపదలు (ఆస్తులు, భవనములు, ధనము, పదవులు) ఇవన్నీ శాశ్వతము అనే మాయలో పడి కొట్టుకుంటున్నారు. వాటి కోసరం చేయకూడని పనులు చేస్తున్నారు.  నానా గడ్డీ కరుస్తున్నారు. కాలక్రమేణా అవి నష్టం కావడంతో అమితమైన దు:ఖములో పడిపోతున్నారు.

తన కళ్లముందు ఇంత జరుగుతున్నా మానవునికి తెలివి రాదు. ఈ సంసారంలో పడి కొట్టుమిట్టాడుతుంటాడు. ఈ జన్మలో చేసిన కర్మలఫలితములను అనుభవించడానికి మరోజన్మ, ఆ జన్మలో చేసిన కర్మఫలితములను అనుభవించడానికి మరోజన్మ ఇలా జనన మరణ చక్రంలో తిరుగుతుంటాడు. అలా తిరుగుతూ ఉంటాడే కానీ ఈ సంసారము మాయ, అశాశ్వతము అని దాని మీద విరక్తి పెంచుకోడు.

దీని కంతటికినీ పరమాత్మ మాయ మూలము. ఆ మాయలో పడ్డ మానవుడు ఇలా జన్మలు ఎత్తుతూనే ఉంటాడు. తుదకు తాను చేసిన పాప కర్మల మూలంగా పశువులు, పక్షులు, క్రిమి కీటకాది జన్మలు ఎత్తినా ఆ పశు,పక్షి,క్రిముల దేహములమీద మమకారము పెంచుకొని, వాటికి తగ్గ ఆహారమునే ఇష్టంగా తింటూ, కనీసం ఆ దేహములు కూడా విడువడానికి ఇష్టపడడు. జీవుడికి ఈ దేహాభి మానము ఎన్ని జన్మలు ఎత్తినా పోదు.

ఈ జీవుడు ఏ దేహములో ఉన్నా, ఆ దేహమునకు సంబంధించిన భార్య, సంతానము, సంపదలు, ఇళ్లు, ఆస్తులు, పశు వులు, ధనము, బంధువులు వీళ్లే తన సర్వస్వము అని భావిస్తూ వారి

కోసరం ఏపాడు పని చెయ్యడానికైనా సిద్ధపడతాడు. ఆ పని చేయడం వల్ల తనను తాను ఎంతో గొప్పగా ఊహించుకుంటాడు. ఆ భ్రమలో పడి పోతాడు. (కొడుకుల కోసరం కోట్లకొలది ప్రజాధనాన్ని దోచిపెట్టి, తుదకు అకాల మరణం చెందిన వారిని మనం కళ్లారా చూస్తున్నాము కదా!)

అమ్మా! సూర్యోదయం నుంచి రాత్రి పడుకోబోయే దాకా, భార్య బిడ్డల గురించి ఆలోచిస్తూ, వారికోసం సంపాదిస్తూ, వారిపోషణ కోసరం నానా అవస్థలు పడుతూ, ఈ మానవుడు రెక్కలు ముక్కలు చేసుకుంటూ ఉంటాడు. తుదకు చేయరాని పనులు, అక్రమాలు చేయడానికైనా వెనుకాడడు.

అమ్మా! భార్యా బిడ్డల మీద ఇంత ప్రేమ చూపించి, వారి కోసరం నానా పాట్లు పడ్డ మానవులను, వారి వృద్ధాప్యంలో ఆ సంతానము ఏ మాత్రం పట్టించుకోరు. నిర్లక్ష్యం చేస్తారు.

(చిన్నప్పుడు అల్లారుముద్దుగా పెంచి పెద్ద పెద్ద చదువులు చదివించిన పిల్లలు, హాయిగా విదేశాలకు ఎగిరిపోతే, ఇక్కడ పలకరించే దిక్కులేక ఒంటరి బతుకులు ఈడుస్తున్న వృద్ధ తల్లి తండ్రులను మనం అనునిత్యం చూస్తూనే ఉన్నాము.)

అమ్మా! నీకు చెప్పకూడదుకానీ, ఈ మానవులు, కట్టుకున్న భార్యనునిర్లక్ష్యం చేసి వేశ్యాలోలురై, వారి కపటమాటలు నమ్మి సంసారాలు నాశనం చేసుకుంటారు. తుదకు అడుక్కుతింటారు.

అమ్మా! ఇవన్నీ నిజాలు కాదని తెలిసికూడా మానవులు ఈ సంసారంలో పడుతుంటారు. అంతటితో ఆగరు, పగలు, ప్రతీకారాలతో రగిలిపోతుంటారు. సాటి మానవులను బాధిస్తుంటారు, హింసిస్తుంటారు. దానికి ఫలితంగా తాము కూడా కష్టాలపాలవు తుంటారు.

అమ్మా ఇంకోవిషయం చెప్పనా! ఈ భార్యా బిడ్డల మీద బంధువుల మీద ఆసక్తి కలిగి ఉన్న వాడు తాను కూడా కడుపునిండా తినడు. ముందు తాను ఎవరిని అధికంగా ప్రేమిస్తున్నాడో వారికి పెట్టి, తరువాత మిగిలింది తింటాడు. ఎవరైతే వీడి సంపదను తిన్నారో వారే ఇతనిని బయటకు గెంటేస్తారు. అయినా మానవునికి బుద్ధిరాదు. పదేపదే తన భార్యబిడ్డలకోసరం బంధువుల కోసరం అక్రమ పద్ధతులలో ధనాన్ని సంపాదిస్తుంటాడు.

అమ్మా! వీరే కాదు. ఇంకా అదృష్టహీనులు చాలామంది ఉన్నారు. తనను తాను పోషించే శక్తిలేకపోయినా పెళ్లి చేసుకుంటాడు. సంతానాన్ని కంటాడు. వారిని పోషించడానికి చేతిలో ధనం ఉండదు. అదృష్టదేవత ముఖం చాటేస్తుంది. ఏమిచెయ్యాలో తోచక నిరంతరమూ దు:ఖిస్తుంటాడు. పోషించలేని వాడివి పెళ్లి ఎందుకుచేసుకున్నావని భార్య, తిండి పెట్టలేనివాడివి పిల్లల్ని ఎందుకు కన్నావని సంతానము అతనిని సూటిపోటీ మాటలతో హింసిస్తారు. హీనంగా చూస్తారు.

అయినా ఆ మానవుడికి బుద్ధిరాదు. సంసారము మీద మమత చావదు. వైరాగ్యము కలుగదు. ఎవరికోసరమైతే తాను తన సర్వస్వము ధారపోసాడో, రేయింబవళ్లు కష్టించి పనిచేసాడో, వారి వలననే పోషింపబడతాడు. ఇంతలో ముసలి తనం వస్తుంది. శరీరం స్వాధీనం తప్పుతుంది. రూపం చెడిపోతుంది. ఆకలి మందగిస్తుంది. తినాలని ఆశ.  తింటే అరగదు. చావు కోసరం ఎదురు చూస్తూ ఒక మూల పడిఉంటాడు. భార్యాబిడ్డలు దయతలచి పెట్టే పిడికెడు మెతుకులకోసరం, వారుఅనే మాటలను, చేసే అవమానాలను భరిస్తూ జీవితం గడుపుతుంటాడు.

ఇంతలో మరణం ముంచుకొస్తుంది. కనుగుడ్లు తేలిపోతాయి. శ్వాస ఆడదు. కఫం గొంతుకు అడ్డంపడుతుంది. శ్వాసతీసుకోవడమే కష్టం అవుతుంది. గొంతులో గుర గుర శబ్దం మొదలవుతుంది. ఆ సమయంలో భార్యాబిడ్డలు, బంధువులు చుట్టు చేరి చూస్తూ ఉంటారు. చచ్చేవాడివి ఎటూ చస్తున్నావు ఏది ఎక్కడ పెట్టావో ఏ ధనం ఎక్కడ దాచావో చెప్పి చావు, ఏవేవి ఎక్కడ ఉ న్నాయో గుర్తు తెచ్చుకో  అని నలుపక్కల నుండి అడుగుతుంటారు. సమాధానం చెప్పాలని ఉన్నా నోట్లోనుండి మాట పెగలదు. సైగలు చేస్తుంటాడు.

ఇంతకాలము ఏ భార్యాబిడ్డల గురించి తాపత్రయపడ్డాడో, ఏ ఆస్తులు సంపాదించడానికి ఇళ్లు కట్టడానికి నిరంతరం శ్రమించాడో, ఏ బంధువుల కోసరం పాటు పడ్డాడో వారి నందరినీ విడిచి పెట్టి, చివరకు అత్యంత హేయమైన, దుర్భరమైన జీవితం గడిపి తుదకు

ప్రాణాలు విడిచే సమయం ఆసన్నమవుతుంది. . అప్పుడు తనను తీసుకొనిపోవడానికి వచ్చి భయంకారాకారులైన యమదూతలు కనపడతారు. వారిని చూచి అమితమైన భయంతో ఈ జీవుడికి మలమూత్రాలు ఒకేసారి వస్తాయి. ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోతాయి.

అప్పుడు యమదూతలు ఆ జీవుని ప్రాణములను స్థూలశరీరం నుండి యాతనాశరీరంలోకి ప్రవేశపెడతారు. ఆ యాతనాశరీరంలో ఉన్న జీవుని మెడకు ఒక తాడు బిగిస్తారు. ఆ జీవుడిని బలాత్కారంగా యమలోకానికి ఈడ్చుకొని పోతారు. ఊరికే తీసుకొని పోరు. యమలోకం చేరేదాకా, దారి పొడుగునా తిట్టుకుంటూ తీసుకొనిపోతారు. ఆ తిట్లను భరించలేక ఆ జీవుడు పరితాపం చెందుతాడు. యాతనా శరీరం వణుకుతూఉంటుంది. ఇంతలో దారిలో ఉన్న కుక్కలు అతని యాతనా శరీరాన్ని కొరుక్కుతింటాయి. అతడు చేసిన పాపాలు వరసగా అప్పుడు గుర్తుకు వస్తాయి.

యమదూతలు అతనిని మండుతున్న ఇసుక మీదుగా లాక్కుని పోతారు. కనీసం ఆపను కూడా ఆపరు. దాహం అయితే నీళ్లు ఇవ్వరు. ఆకలి వేస్తే ఆహారం కూడా ఇవ్వరు. పైన మండుతున్న సూర్యుడు, కింద మండుతున్న ఇసుక, అతని యాతనా శరీరం నరకం అనుభవిస్తుంది. పైగా యమదూతలు అతని వీపు మీద కొరడాలతో కొడుతూ తీసుకొని పోతారు. పైగా అంతా చీకటి. ఆ చీకటి దారిలో యమదూతలు కొడుతుంటే, కిందపడుతూ లేస్తూ వెళుతుంటాడు ఆ

జీవుడు. యమలోకము దాదాపు తొంభైవేల యోజనముల దూరం ఉ ంటుంది.  ఇంత దూరాన్ని రెండు క్షణాలలోనే వెళ్లిపోతారు.

అక్కడ యాతనా శరీరంలో ఉన్న జీవుడిని నానా రకాల నరకబాధలకు గురి చేస్తారు. యమలోకంలో జరుగుతున్న దృశ్యాలు చూచి ఆ జీవుడు ఇవన్నీ తనకు కూడా జరుగుతాయా అని వణికిపోతాడు. ఒక చోట పాపుల యాతనా శరీరములను మండుచున్న కట్టెలలో పడేస్తారు. మరొక చోట ఒకడి శరీరమును కోసి, ఆ మాంసమును వాడిచేతనే తినిపిస్తున్నారు. మరొక చోట కుక్కలు, నక్కలు పాపుల మాంసమును పీక్కుతింటున్నాయి. మరొక చోట పాపులను, పాములు తేళ్ల మధ్య వేసి వాటి చేత కరిపిస్తున్నారు. మరొకచోట యాతనా శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరుకుతున్నారు. మరొక చోట పాపుల యాతనా శరీరాలను ఏనుగులతో తొక్కిస్తున్నారు. ఎత్తైన పర్వతముల మీది నుండి కింది దొర్లిస్తున్నారు. గోతులు తవ్వి వాటిలో కప్పెడుతున్నారు.

అమ్మా! ఈ నరకయాతనలు కాక, ఇంకా తామిస్రము, అంధతామిస్రము, రౌరవము మొదలగు నరకములలో కూడా పాపులను యాతలను పెడతారు. వారు వారు చేసిన పాపములను అనుసరించి స్త్రీలు గానీ పురుషులు గానీ ఈ నరకయాతలను అనుభవింపక తప్పదు.

కానీ అమ్మా! నేను చెప్పిన యమలోకము, నరకయాతనలు ఎక్కడో లేవు. ఈ భూలోకములోనే ఉన్నాయి మానవుడు తాను చేసిన

పాపములకు ఫలితం అంటే స్వర్గ నరకాలు ఇక్కడే అనుభవిస్తాడు అని పండితులు చెబుతుంటారు. అమ్మా ఈ ప్రకారంగా మానవుడు తాను భార్యా బిడ్డలను పోషించడానికి తన పొట్ట నింపుకోడానికి చేసిన కర్మలకు ఫలము యమలోకంలో అనుభవిస్తాడు.

మానవుడు ఎన్ని పాపాలు చేసినా, ఎంత పాపపు సొమ్ము సంపాదించినా, అవన్నీ ఇక్కడే వదిలి ఆపాపాలకు సంబంధించిన వాసనలను తనతో పాటు తీసుకొని వెళతాడు. యమలోకంలో వాటికి తగిన శిక్షలు అనుభవిస్తాడు. కేవలము అధర్మము ద్వారా, అక్రమంగా, ఇతరులను బాధపెట్టి, హింసించి, ధనం, ఆస్తులు సంపాదించేవాడు, యమలోకంలో అంధతామిస్రము అనే నరకంలో పడిపోతాడు. అదే నరకంలో ఆఖరు నరకము.

ఈ ప్రకారంగా నరకయాతలను అనుభవించిన తరువాత, ఆ జీవుడు మరలా భూలోకమునకు వచ్చి తన పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితంగా పశు,పక్షి,కీటకములలో తనకు అనువైన శరీరంలో ప్రవేశిస్తాడు. ఆ శరీరములలో జీవించి తనపాపములను కడిగేసు కుంటాడు. ఆ ప్రకారంగా తనపాపములను ప్రక్షాళన చేసుకొన్న తరువాత తిరిగి మానవ జన్మ పొందుతాడు." అని కపిలుడు తన తల్లి దేవహూతికి ప్రాపంచిక విషయములలో అనురక్తుడైన మానవుల అధోగతిని వివరించాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ అధ్యాయము ముప్పదియవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓంతత్సత్

# శ్రీమద్భాగవతము

## తృతీయ అధ్యాయము

## ముప్పదిఒకటవ అధ్యాయము.

కపిలుడు తన తల్లి దేవహూతికి మానవుల జన్మ రహస్యములను బోధిస్తున్నాడు.

"తల్లీ! ఈ దేహమును వదిలిన జీవుడు సూక్ష్మదేహంతో తిరుగుతుంటాడు. తన పూర్వజన్మలో చేసిన కర్మల వాసనలను, ఫలములను తనతో మోసుకొని పోతుంటాడు. వాటిని అనుసరించి తనకు అనువైన దేహమును వెతుక్కుంటుంటాడు.

ముందు పురుషులను ఆశ్రయిస్తాడు. వారి రేతస్సులో ప్రవేశిస్తాడు. వారి జననేంద్రియము ద్వారా రేతస్సు రూపంలో స్త్రీ గర్భంలోకి ప్రవేశిస్తాడు. ఆ రేతస్సు స్త్రీ గర్భములో ఉన్న శోణితముతో కలుస్తుంది. ఐదురోజులు గడిచిన తరువాత ఆ శోణితముతో కూడిన ఆ రేతస్సు చిన్న బుడగ మాదిరి తయారవుతుంది. పది దినముల తరువాత చిన్న రేగుపండు మాదిరి పెరుగుతుంది. తరువాత చిన్న మాంసపు ముద్ద రూపంలో అండంగా తయారవుతుంది. ఆ ప్రకారంగా ఒక నెలరోజులు ఉంటాడు.

నెల దాటగానే ఆ అండానికి తల ఏర్పడుతుంది. రెండవ నెలలో చేతులు, కాళ్లు మొదలగు అవయవములు ఏర్పడతాయి. మూడవ నెలలో గోళ్లు, వెంట్రుకలు, ఎముకలు, వాటిని కప్పుతూ

చర్మము, జననేంద్రియము, వేరు వేరుగా ఏర్పడతాయి.

నాలుగవ నెలలో ఏడు ధాతువులు ఏర్పడతాయి. అవి చర్మము,మాంసము, రక్తము, మెదడు, ఎముకలలో ఉండే మజ్జ, ఎముకలు ఏర్పడతాయి.

ఐదవ నెలలో ఆకలి, దాహము తెలుస్తాయి.

ఆరవ నెలలో జీవుడు తల్లి మావిలో కుడి పక్కన ఉంటాడు. కొంచెం కదులుతుంటాడు. ఆ జీవునికి తన తల్లి తిన్న ఆహారము నుండి ఆహారము లభిస్తుంది. తల్లి అశ్రద్ధగా ఉంటే, ఆమె పొట్టలో ఉన్న సూక్ష్మజీవులు ఆ జీవుని కుట్టి బాధపెడుతుంటాయి. ఆ బాధలు తట్టుకోలేక మూర్ఛపోతాడు. (బిడ్డ తిరగడం లేదు అని మన వాళ్లు అంటుంటారు కదా). తల్లి తిన్నటు వంటి అధిక కారము, పులుపు, అధికమైన వేడి పదార్థములు, అధిక మైన చల్లటి పదార్థములు ఆ జీవుని బాధపెడుతుంటాయి. అవి అన్నీ ఓర్చుకుంటూ ఉంటాడు.

తల్లి గర్భంలో ఈ జీవుడు మావిలో పడి ఉంటాడు. ఒక్కోసారి తల్లి పొట్టలోని పేగులు అతనిని చుట్టుకొని ఉంటాయి. ముడుచుకొని తలక్రిందులుగా పడుకొని ఉంటాడు. పంజరంలో పక్షి మాదిరి తల్లి గర్భంలో పడి ఉంటాడు. ఆసమయంలో ఆ జీవునికి తాను పూర్వజన్మలో చేసిన పాప పుణ్యములు గుర్తుకు వస్తాయి. ఆ జన్మలలో చేసిన కర్మలవలననే కదా ఈ గర్భవాసము కలిగింది అని చింతిస్తాడు.

అప్పటికి జీవునికి ఏడునెలలు పూర్తి అవుతాయి. అప్పుడు ఆ జీవునికి జ్ఞానము కలుగుతుంది. అప్పుడు ఆ జీవుడు తల్లి గర్భంలో అటు ఇటు తిరుగుతాడు. కాళ్లు చేతులు ఆడిస్తాడు. ఆ స్పర్శ తల్లికి తెలుస్తూ ఉంటుంది. ఆ సమయంలో తనకు కలిగిన జ్ఞానముతో ఆ జీవుడు భగవంతుని ఇలా స్తుతిస్తాడు.

"ఓ దేవా! సర్వాంతర్యామి అగు నిన్ను శరణు వేడుతున్నాను. నేను పూర్వజన్మలలో చేసిన పాపకర్మలు, పుణ్య కర్మల ఫలితంగా ఈ మానవ జన్మ ఎత్తుతున్నాను. మాతృగర్భంలో ఉన్నాను. ఓ దేవా! ఈ శరీరము పంచభూతములతో ఏర్పడింది. మాయలో పడి ఉన్నాను. మాయాతీతుడవైన నీకు నమస్కారము. కేవలము పరమేశ్వరుని పట్ల భక్తి చేతనే జీవుడు ఈ జనన మరణ చక్రమును తప్పించుకోగలడు. ఆ పరమేశ్వరుడు తప్ప నాకు జ్ఞానమును ప్రసాదించే వాడు ఇంకెవడున్నాడు? అతడే ఈ చరాచర జగత్తులో అన్ని ప్రాణులలో ఆత్మస్వరూపంగా ఉన్నాడు." అని ప్రార్థిస్తాడు.

తరువాత జీవుడు మాతృగర్భము నుండి బయట ప్రపంచము లోకి రావడానికి ముందు ఏ విధమైన శారీరక బాధలు,మానసిక బాధలు, దైవికమైన కష్టములు లేకుండా రక్షించమని పరమాత్మనుఈ ప్రకారంగా ప్రార్థిస్తున్నాడు.

" ఓ దేవా! నేను రక్తము, ఎముకలతో నిండిన మాతృగర్భంలో పడి ఆమె తిన్న ఆహారమును తింటూ బతుకుతున్నాను. బయట ప్రపంచములోకి రావడానికి కాలమును

లెక్కబెట్టుకుంటున్నాను. తొందరగా నాకు ఈ గర్భవాసము నుండి విముక్తి కలిగించు.

ఓ దేవా! నీవు దయాసముద్రుడవు. మాతృగర్భంలో ఉండగానే నిన్ను ప్రార్థించే జ్ఞానమును నాకు కలుగచేసావు. నీకు నమస్కరించడం తప్ప నేను ఏమీ చేయలేను. ఓ దేవా! నాకు మానవ జన్మ ఇచ్చినందుకు నీకు కృతజ్ఞుడను. పశుపక్ష్యాదులు, ఇతర పాకే జంతువులు ఈ జ్ఞానము లేకుండా కేవలము తమ శరీరముల వలనపుట్టిన సుఖదు:ఖములను అనుభవిస్తుంటాయి. కాని నీ దయవలన మానవ జన్మ ఎత్తుతున్నాను. నాకు మనసు, బుద్ధి, ఆలోచనా శక్తి ఇచ్చావు. నిన్ను స్మరించుకొనే అవకాశము ఇచ్చావు. నిన్ను శరీరంలోపల, శరీరం బయట దర్శించే అవకాశము కల్పించావు. నీకు ఎంతో కృతజ్ఞుడను.

ఓ దేవా! నాకు అప్పుడప్పుడు అనిపిస్తుంది. ఈ తల్లి గర్భవాసంలోనే శాశ్వతంగా ఉండిపోతే బాగుంటుంది అని. ఎందుకంటే మాతృగర్భంలో ఉండే బాధలకన్నా బయట ప్రపంచంలో ఉండే బాధలు ఎక్కువకదా! పైగా తల్లి గర్భవాసంలో నీ మాయ నా మీద పనిచెయ్యదు. బయట ప్రపంచంలోకి వెళితే నీ మాయకు లోబడి నేను సంసార కూపంలో పడిపోతాను. నేను నాది అనే అహంకారంతో సంసార చక్రంలో పడి తిరుగుతుంటాను. ఇక్కడ ఉంటే నిరంతరము నీ పాదపద్మములను తలచుకుంటూ, అమ్మతినే ఆహారమే తింటూ ఉంటాను. నాకు ఇదే ఆఖరి జన్మఅయేటట్టు కరుణించు." అని తల్లి గర్భంలో ఉన్న శిశువు భగవంతుని వేడుకుంటాడు.

అమ్మా! ఈ ప్రకారంగా జీవుడు మాతృగర్భంలో పదినెలలు గడుపుతాడు. పదినెలలు నిండగానే మాతృగర్భంలో ఉన్న వాయువు శిశువును బలవంతంగా బయటకు నెడుతుంది. ఆ శిశువు తలకిందులుగా బయటకు వస్తాడు. ఆ శిశువు బయట ప్రపంచంలోకిరాగానే అతనికి పూర్వజన్మ స్మృతి పోతుంది.

ఒళ్లంతా రక్తంతో, మావిని చుట్టుకొని మాతృగర్భంనుండి బయట పడతాడు. చేతులు కాళ్లు కదిలిస్తూ ఏడుస్తాడు. ఆ స్థితిలో తనకు ఏమి కావాలో చెప్పలేడు. ఇది కావాలని అడగలేదు. అన్నిటికీ ఏడుస్తాడు. ఏడుపు ద్వారానే తనకు ఏం కావాలో తెలియజేస్తాడు. ఎక్కడ పడుకోబెడితే అక్కడే ఉంటాడు. చీమలు, దోమలు కుడుతున్నా ఏడుస్తాడు కానీ చెప్పలేడు. దురద పుడితే గోక్కోలేడు.పైకి లేవలేడు. ఏడవడంఒక్కటే తెలిసిన స్థితి అది.

తరువాత క్రమ క్రమంగా పెరిగి పెద్దవాడు అవుతాడు. శైశవములో ఉన్న కష్టములు అన్నీ అనుభవిస్తాడు. చదువునేర్చుకోడంలో ఉండే బాధలు అన్నీ పడతాడు. యవ్వనంలో తాను కోరిన సుఖములు లభ్యం కాకపోవడంతో నిత్యము బాధపడుతుంటాడు. అందులో నుండి కోపం పుడుతుంది. కోపంలో ఏమి చేస్తాడో అతనికే తెలియదు. దానితో పాటు ఆత్మాభిమానము దేహాభిమానము వృద్ధిపొందుతుంది. కోరికలు కూడా పెరుగుతాయి. చెడు స్నేహాలు అలవడతాయి. అన్నీ నాకే కావాలి. అంతా నేనే చేస్తున్నాను. నాకంటే మించిన వాడు లేడు అనే దేహాభిమానము వృద్ధిపొందుతుంది.

అవిద్య అజ్ఞానము ఆ జీవుని ఆవహిస్తాయి. అన్ని బంధనాలు చుట్టుకుంటాయి. వాటి వలన కించిత్ సుఖము దీర్ఘకాలము దు:ఖము అనుభవిస్తుంటాడు. తన కడుపు నింపుకోడానికి, స్త్రీసంబంధమైన కోరికలు తీర్చుకోడానికి అడ్డదారులు తొక్కుతాడు. దుష్టులతో స్నేహం చేస్తాడు. వారి మార్గంలో నడుస్తూ నరకంలో పడిపోతాడు.

మంచి వాడు కూడా దుర్మార్గుల సహవాసములో నశించిపోతాడు. సత్యము, పవిత్రంగా ఉండటం, దయ, మౌనంగా ఉండటం, మంచి బుద్ధికలిగి ఉండటం, సంపదలుకలిగిఉండటం, కీర్తి, ఓర్పు, ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము, మనసును ప్రశాంతంగా ఉంచుకోవడం, ఉన్నతంగా ఆలోచించడం మొదలగు మంచి గుణములు అన్నీదుర్మార్గులతో సహవాసం చేయడం వలన నశించిపోతాయి. స్త్రీలోలురు అయి పోతారు. మూఢత్వము ఆవరిస్తుంది. కాబట్టి దుర్మార్గులతో స్నేహం మంచిది కాదు.

ముఖ్యంగా పురుషులకు స్త్రీసాంగత్యము వలన, కామకోరికలయందు ఆసక్తి ఉండటం వలన కలిగే బంధనములు ఇంక దేని వలనా కలుగవు. ఈ కామ సంబంధమైన కోరికలు దేవతలను, మహా ఋషులను కూడా వదిలిపెట్టవు. ఇంక మానవుల సంగతి చెప్పేదేముంది. ఒక్క నరనారాయణులు తప్ప మిగిలిన వారందరూ స్త్రీ ఆకర్షణకు లొంగినవారే! స్త్రీయొక్క కనుసైగచేతనే, కనుబొమల విన్యాసము చేతనే మగాళ్లు వాళ్లకు వశులవుతారు. పాదముల దగ్గర పడి ఉంటారు.

కాబట్టి భక్తియోగమును అవలంబించి పరమ పదమును పొందదలచిన వ్యక్తి స్త్రీలకు దూరంగా ఉండాలి. వారితో సంపర్కము పెట్టుకోకూడదు. స్త్రీసాంగత్యము పురుషునికి నరకద్వారము వంటిది అని వేరుచెప్పనక్కరలేదు. ఎందుకంటే, స్త్రీ అనేది ఒక మాయ. పురుషులకు సేవ చేసే నెపంతో నెమ్మదిగా స్త్రీలు పురుషుల వద్దకు చేరుతారు. కాని ఆ స్త్రీ సాంగత్యము గడ్డితో కప్పబడిన బావి అని తెలుసుకోలేని వాడు ఆ బావిలో పడిపోతాడు.

ఇందులో మరొక విశేషము కూడా ఉంది. జీవితమంతా స్త్రీ సాంగత్యములో గడిపినవాడు అంత్య కాలములో కూడా స్త్రీని స్మరిస్తూ మరణిస్తాడు. మరుజన్మలో స్త్రీగానే పుడతాడు. మరొక పురుషుడికి భార్యగా అతని సంతానానికి తల్లిగా మరలా సంసార కూపంలో పడిపోతాడు. మొగుడు, పిల్లలు, గృహము, సంపదలు అన్నీ తాత్కాలికంగా అనుకూలంగా కనపడినప్పటికినీ, ఆ జీవుడు బుద్ధిమంతుడైతే ఆ సంసార బంధనములను నరకప్రాయంగా భావిస్తాడు.

ఈ ప్రపంచమును వదిలిపెట్టిన తరువాత కూడా జీవుడు సూక్ష్మదేహంతో ఒక లోకము నుండి మరొక లోకమునకు తిరుగుతూ తాను చేసిన కర్మఫలములను అనుభవిస్తూ ఉంటాడు. మానవుడిగా పుట్టిన తరువాత కూడా మరలా అవే కర్మలు చేస్తూ ఉంటాడు.

ఓ తల్లీ! సూక్ష్మదేహము ఆత్మను అనుసరిస్తూ ఉంటుంది. పంచభూతములతో నిర్మితమైన స్థూల దేహము భోగములకు,

ఇంద్రియ సుఖములకు  నిలయము. ఆత్మ దేహంలో ప్రవేశిస్తే అది జన్మ, ఆత్మ దేహమును విడిచిపోతే అది మృత్యువు. వివరంగా చెప్పాలంటే, ఆ దేహానికి కళ్లు, ముక్కు, చెవులు చేతులు కాళ్లు ఉంటాయి. కాని వాటికి చూచే శక్తి, వాసనచూచేశక్తి, చేతులుకాళ్లు కదిల్చే శక్తి లేకపోతే అది మరణమే. ఆ శక్తిని ఇచ్చేది జీవాత్మ. ఆ జీవాత్మ బయటకు పోతే శరీరానికి మరణం సంప్రాప్తిస్తుంది.

కాబట్టి మానవుడు మరణానికి భయపడకూడదు. మరణం అనేది ఎప్పుడో ఒకప్పుడురాక తప్పదు. దాని కోసరం భయపడటం, బాధపడటం అవివేకము. బతికి ఉన్నంత కాలము నిష్కామంగా కర్మలు చేస్తూ చేసిన కర్మలను భగవంతునికి అర్పిస్తూ నిస్సంగుడుగా బతకాలి. అప్పుడు మానవునికి ఈ సంసారము నుండు దేహము నందు మోహము నశిస్తుంది. యోగము, వైరాగ్యము అలవడుతుంది. ఈ సంసారము ఐహికభోగములు అన్నీ అశాశ్వతములు, మాయ అని తెలుసుకుంటాడు. అదే నిజమైన జీవితము." అని కపిలుడు తన తల్లి దేవహూతికి మానవ జన్మ గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ముప్పది ఒకటవ అధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ తత్సత్ తత్సత్

# శ్రీమద్భాగవతము
## తృతీయ స్కంధము
## ముప్పది రెండవ అధ్యాయము.

కపిలుడు తన తల్లి దేవహూతికి సాత్వికధర్మమునుఎలా అనుష్ఠించాలి, జీవుడు పైలోకములను ఎలా పొందుతాడు, భగవంతుని తత్త్వమును తెలుసుకోలేని వాళ్లు తిరిగి తిరిగి జన్మలు ఎలా పొందుతారు వివరించాడు.

“తల్లీ! మానవులు పెళ్లి చేసుకొని, సంతానాన్ని పొంది, ధర్మము, అర్థము, కామములను అనుభవిస్తూ ఉంటారు. తమ తమ ధర్మములను సక్రమంగా నెరవేరుస్తూ ఉంటారు. అటువంటి వారు కూడా భగవంతుని గురించి అసలు స్వరూపం తెలుసుకోలేరు. తెలుసుకోడానికి ఆసక్తి చూపరు. ప్రాపంచిక సుఖాలకోసరం, కోరికలు తీర్చుకోడం కోసరం పాకులాడుతుంటారు. రకరకాల దేవుళ్లను, దేవతలను పూజిస్తూ ఉంటారు. తమ తమ పితృదేవతలకు శ్రాద్ధకర్మలను ఆచరిస్తూ ఉంటారు. వారి బుద్ధి ఎప్పటికీ అక్కడే నిలిచి పోతుంది.

దేవుళ్లను, దేవతలను పూజించడం, వారికి వ్రతాలు చెయ్యడం, వారికి నైవేద్యాలు అర్పించడం, పితృదేవతలకు శ్రాద్ధాలు పెట్టడం చేస్తూ ఉంటారు. ఇవి చేసినందువలన పుణ్యం వస్తుంది. పుణ్యలోకాలకు వెళతారు. అక్కడ సుఖాలు అనుభవిస్తారు. వారు చేసిన పుణ్యం అయిపోగానే మరలా ఈ లోకంలో పుడతారు. (క్షీణేపుణ్యే

మర్త్యలోకంవిశంతి (భ.గీ.) ఈ ప్రకారంగా రకరకాల దేవుళ్లకు పూజలు వ్రతాలు చెయ్యడం, పుణ్యలోకాలు పొందడం, ఆ పుణ్యం క్షీణించిపోగానే మరలా మానవులుగా పుట్టడం తోనే వారి జీవితం తిరుగుతూ ఉంటుంది. శాశ్వతమైన బ్రహ్మపదమునుఎప్పటికీ పొందలేరు. ఎందుకంటే ఆ పుణ్యలోకాలే శాశ్వతాలుకావు.

కల్పాంతంలో ఆ పుణ్యలోకాలు అన్నీ కూడా పరమాత్మలో లయం అయిపోతాయి. ఆ లోకాలలో సుఖాలు అనుభవిస్తున్నవారు కూడా ఆ లోకాలనుండి పతనమైపోతారు. అలాకాకుండా, తమ తమ ధర్మములను ఆచరిస్తూ, సత్త్వగుణమును అలవరచుకొని, చిత్తమును పరిశుద్ధం చేసుకొని, తాముచేసే కర్మఫలములను పరమాత్మకు అర్పిస్తూ, ప్రాపంచిక విషయముల మీద వైరాగ్యమును కలిగి ఉండి, బాహ్య విషయములలో మమకారమును విడిచిపెట్టి, అహంకారమును వదిలిపెట్టి, నిరంతరము పరమాత్మను స్మరించే భక్తులు, శాశ్వత బ్రహ్మ పదమును పొందుతారు. పరమాత్మలో ఐక్యం అయిపోతారు. అటువంటి వారు. రెండు పరార్థముల వరకు (అంటే బ్రహ్మలోకము అనగా సత్యలోకము లయమగునంతవరకూ) సత్యలోకములోనే ఉంటారు.

(ఒక వివరణ: మనం కలియుగంలో ఉన్నాము. యుగాలు నాలుగు. అటువంటి యుగాలు 1000 అయితే బ్రహ్మకు ఒక పగలు. మరలా1000 యుగాలు గడిస్తే బ్రహ్మకు ఒక రాత్రి. అంటే 2000 యుగాలు ఒక రోజు. అటువంటివి 50 సంవత్సరాలు గడిస్తే బ్రహ్మకు పూర్వార్థము. తరువాత 50 ఏళ్లు ద్వితీయ పరార్థము. ఆ

ప్రకారంగా100 ఏళ్లు కాగానే బ్రహ్మ పరమాత్మలో ఐక్యమైపోతాడు.)

ఆ తరువాత బ్రహ్మ పరమాత్మలో ఐక్యమై పోతాడు. అప్పటి దాకా బ్రహ్మలోకములో ఉన్న జీవులు కూడా బ్రహ్మతో కూడా పరమాత్మలో ఐక్యం అయి పోతారు. ఇంక వారికి జన్మ అంటూ లేదు. పరబ్రహ్మస్వరూపాన్ని పొందుతారు.

కాబట్టి తల్లీ! నీవు కూడా ఆ పరమాత్మను సేవించు. పరమాత్మ ఎక్కడో లేడు. అన్ని ప్రాణుల హృదయాలలో నివాసము ఏర్పరచుకొని ఉన్నాడు. సర్వ వ్యాపి అయిన ఆ పరమాత్మను శరణుపొందు. తల్లీ ఇక్కడ ఒక విశేషము ఉంది. అది ఏమిటంటే, బ్రహ్మ ఆది పురుషుడు. ఆయన మరీచి మొదలగు మహా ఋషులను, యోగులను, యోగసిద్ధులను,సనత్కుమారుడు మొదలగు ఋషులను, పుట్టించాడు. వారందరూ కారణ జన్ములు. వారు పరమాత్మను సగుణోపాసన చేస్తుంటారు. పరమాత్మ నిరాకారుడు అని తెలిసి కూడా ప్రాకృత కర్మల ననుసరించి ఒక ఆకారంతో పూజిస్తుంటారు. అదీ కూడా లోకకల్యాణార్థమే.

వారందరూ సత్త్వరజస్తమోగుణములకు లోబడి ఉంటారు. వారు కాల ప్రభావం చేత, ప్రతికల్పంలో పుడుతూ, కల్పాంతంలో లయం అయిపోతే, మరలా కల్పం ప్రారంభం కాగానే పుడుతుంటారు. వారు బ్రహ్మలోకము మొదలు కొని అన్నిలోకములలో తిరుగుతూ ఉంటారు. వారికి ఉన్న అధికారములు అన్ని కల్పములలోనూ వారివెంటనే ఉంటాయి. కాని ఈ లోకంలో ఉన్న మానవులు ఒకసారి మరణిస్తే

వారికి ఈ జన్మ స్మృతి కానీ, ఈ జన్మలో ఉన్న అధికారములు, శక్తులు కానీ ఉండవు. ఎందుకంటే వారు ప్రాపంచిక విషయములలో నిమగ్నమై కర్మలు చేయడంలోనూ, కోరికలు తీర్చుకోడంలోనూ ఆసక్తి చూపిస్తూ ఉంటారు.

మానవులు సహజంగా రజోగుణ ప్రధానంగా కలవారు. వాళ్ల మనసులు ఎప్పుడూ ఏదో ఒక కోరిక కోరుకుంటూ అది తీరకపోతే బాధలను అనుభవిస్తూ ఉంటారు. వారు ఎల్లప్పుడూ కామాసక్తులై ఉంటారు. ఇంద్రియలోలురై ఉంటారు. అంటే రుచికరమైన పదార్థములు తినడం, తాగడం, అనుభవించడం, కోరుకొన్న స్త్రీలతో సుఖాలు అనుభవించడం, చేస్తూ ఉంటారు. తమ తమ కోరికలు తీరడం కోసరం దేవతలకు పూజలు చేస్తుంటారు. పితృదేవతలను అర్చిస్తూ ఉంటారు.

ఈ ప్రాపంచిక విషయములలో ఆసక్తిని పెంపొందించుకొని, పరమాత్మ యందు భక్తిని కలిగి ఉండరు. పరమాత్మను కీర్తించడం కన్నా, పరమాత్మ యొక్క కథలను వినడం కన్నా, లౌకికమైన కథలను వినడం, రాజుల కథలను ఇతర కామప్రకోపిత విషయములను చదవడం, వినడంలో ఆసక్తి చూపిస్తుంటారు.

అటువంటి మానవులు సాధారణంగా దక్షిణాయనంలో చనిపోతారు. చనిపోగానే పితృలోకాలకు పోతారు. తాము చేసిన పుణ్యకార్యములకు స్వర్గ సుఖములను, పాప కార్యములకు నరకబాధలను అనుభవించి, అక్కడి నుండి తమ సంతానమునకు

పుత్రులుగానూ, పౌత్రులుగానూ జన్మిస్తూ ఉంటారు. మరలా మాతృగర్భం నుండి భూగర్భం చేరేవరకూ సంసారసుఖములలో మునిగి తేలుతుంటారు.

కాబట్టి తల్లీ! నీవు ఆ పరమాత్మను ఆశ్రయించు. ఆయనను ఆరాధించు. ఆయనపాదపద్మములను పూజించు. ఇదంతా భక్తియోగము చేతనే సాధ్యం అవుతుంది. నీవు ఆ పరమాత్మయందు నిరంతరమూ భక్తి కలిగి ఉంటే, నీలో ఉన్న ప్రాపంచిక విషయముల మీద ఉన్న ఆసక్తి క్రమక్రమంగా నాశనం అవుతుంది. దాని స్థానంలో వైరాగ్యము, నిర్మలమైన జ్ఞానము పుడుతుంది. ఆ నిర్మల జ్ఞానము వలననే బ్రహ్మ సాక్షాత్కారము కలుగుతుంది.

పరమాత్ముని యందు అచంచల భక్తి కలిగిన భక్తునికి ఇది ఇష్టము, అది అయిష్టము, ఇది కావాలి, అది వద్దు అనే భేదభావము నశిస్తుంది. అటువంటి భక్తుడు ప్రాపంచిక విషయముల మీద సంగమును వదిలిపెట్టి, ప్రపంచములో ఉన్న అన్ని ప్రాణులను, వస్తువులను సమదృష్టితో చూడగలడు. అప్పుడు అతనికి ఈ ప్రపంచమంతా ఆనంద మయంగా కనపడుతుంది. దు:ఖము అనేది మచ్చునకైనా కనపడదు.

ఆ పరమానంద తత్త్వము పరమాత్మ స్వరూపము. ఆ పరమాత్మను అనేక పేర్లతో పిలుస్తూ ఉంటారు. జ్ఞానస్వరూపుడుఅనీ, పరబ్రహ్మ అనీ, పరమాత్ముడు అనీ పరమేశ్వరుడు అనీ, పురుషుడు అనీ, మొదలగు పేర్లతో పిలువబడుతుంటాడు. ఏ పేరుతో పిలిచినా ఆ

విశ్వచైతన్యం ఒక్కటే. అదే పరమాత్మ.

ఆ పరమాత్మను చేరుకోడానికి భక్తి ఒకటే మార్గము. జీవుని యొక్క అంతిమ ప్రయోజనమునకు భక్తియే మూలము. ప్రాపంచిక విషయముల మీద సంగము వదిలి పెట్టి, ఇంద్రియములను మనసును నిగ్రహించి, ఉదాసీనంగా ఉండటమే భక్తియోగమునకు ఫలము. ఆ పరమాత్మ ఒక్కడే. ఆయనే చిన్మయస్వరూపుడు. నిర్గుణబ్రహ్మము. కాని మానవుని ఇంద్రియములకు ఉన్న భ్రాంతితో, ఆ పరమాత్మ రకరకాల రూపములతో వైవిధ్యంగా కనపడుతుంటాడు.

అమ్మా! మహత్తత్వము ఒక్కటే. అందులో నుండి సత్త్వ,రజస్, తమోరూపమైన అహంకారము, పంచభూతములు, పది ఇంద్రియములు, మనస్సు, విరాట్ రూపము, జీవుని యొక్క స్థూల, సూక్ష్మ శరీరములు, బ్రహ్మాండరూపము, మాయతో కూడిన ఈ ప్రకృతి, వెలువడ్డాయి. ఇవన్నీ ఆ పరమాత్మ స్వరూపాలే. అంతా ఆ బ్రహ్మ పదార్థమే.

తల్లీ! ఏ వ్యక్తి అయితే శ్రద్ధతో, భక్తితో, యోగమును అనుష్టించడంతో, స్థిరమైన చిత్తము, సంగము లేకుండా ఉండటం, సంసారము మీద ఆసక్తి నశించడం, మొదలగు లక్షణములు కలిగి ఉంటాడో, అతడే ఈ లోకమంతా పరబ్రహ్మస్వరూపము అని భావిస్తాడు.

అమ్మా! ఇప్పటి దాకా నీకు, పరమాత్మను దర్శించడానికి ద్వారము అయిన తత్త్వజ్ఞానమును ఉపదేశించాను. నేను

ఉపదేశించిన ఈ జ్ఞానముతో ప్రకృతి, పురుషుల యొక్క యదార్థమైన జ్ఞానము నీకు గోచరమవుతుంది.

అమ్మా! నేను నీకు రెండు విధములైన తత్త్వములను ఉపదేశించాను. ఒకటి జ్ఞాన యోగము (దానినే సాంఖ్యయోగము అంటారు) రెండవది నిర్గుణమైన భక్తి యోగము. నిజానికి ఈ రెండూ ఒకటే. వేరు కాదు. రెండింటికి లభించే ఫలము ఒకటే. ఈ రెండును భగంతుని చేరుకోడానికి మార్గాలే.

పాలు మన కళ్లకు తెల్లగా కనిపిస్తాయి. నాలుక మీద వేసుకుంటే రుచిగా ఉంటాయి. చేతితో తాకితో చల్లగా ఉంటాయి. అలాగే మైనం చూడటానికి తెల్లగా ఉంటుంది. ఏ రంగు వేస్తే ఆ రంగులోకి మారుతుంది. ఏ రూపం ఇస్తే ఆ రూపంలో కనపడుతుంది. అలాగే భగవంతుడు ఒక్కడే.మనం ఏ భావంతో చూస్తే ఆ రూపంలో కనపడతాడు. శాస్త్రములలో ఆ పరమాత్మను ఏ యే రూపములతో వర్ణించారో ఆ రూప విశేషములతో మనకు దర్శనం ఇస్తాడు.

ఈ ప్రకారంగా పరమాత్మ నానావిధములైన రూపములతో కనపడినా, నిజానికి నిరాకారుడు,నిర్గుణుడు అయిన పరమాత్మ ఒక్కడే. పరమాత్మ నిర్గుణుడు అయినప్పటికినీ, సగుణుడుగానూ, నిర్గుణుడు గానూ రెండు విధములుగా మనకు గోచరిస్తుంటాడు. ఎలాగంటే, యజ్ఞములు, యాగములు చేయడం, తీర్థయాత్రలు సేవించడం, దానములు, ధర్మములు ఆచరించడం, మొదలగు గృహస్థధర్మములను పాటించడం ద్వారానూ; తపస్సు, సమాధి మొదలగు

వానప్రస్థధర్మములను ఆచరించడం ద్వారానూ; వేదములను, శాస్త్రములను చదవడం, అర్థం చేసుకొనడం, వాటిగురించి చర్చించడం, విమర్శించడం, మొదలగు బ్రహ్మచర్య ధర్మములను పాటించడం ద్వారానూ; మనస్సును నిగ్రహించడం, ఇంద్రియములను స్వాధీనంలో ఉంచుకోవడం మొదలగు సన్యాసధర్మములను ఆచరించడం ద్వారానూ, వివిధ అంగములతో కూడిన రాజయోగమును అవలంబించడం ద్వారానూ; భగవంతుని మీద ప్రేమ, భయము, భక్తి కలిగి ఉండటం ద్వారానూ, భగవంతునికి సంబంధించని విషయములలో వైరాగ్యము కలిగి ఉండటం ద్వారానూ, భగవానుని సగుణ, నిర్గుణ స్వరూపములను సాధకుడు దర్శించగలడు.

అమ్మా! నేను నీకు సాత్విక,రాజసిక,తామసిక,నిర్గుణ, భక్తి యోగముల గురించి వివరంగాచెప్పాను. సకల ప్రాణుల యొక్క సృష్టి,స్థితి,లయములకు కారకుడు, సకల ప్రాణులలో ఆత్మస్వరూపంగా ఉండేవాడు, బయట కాలస్వరూపుడుగా ప్రకాశించేవాడు అయిన పరమాత్మ గురించి చెప్పాను. అమ్మా! అవిద్యకు లోనై, ఏ సంసార సుఖములకు లోబడి మానవుడు ముక్తి పొందజాలడో ఆ సంసార బంధనములగురించి నీకు విపులంగా చెప్పాను.

అమ్మా! ఈ తత్త్వజ్ఞానమును దుష్టులు, అవినీతిపరులు, గర్వాంధులు, దుర్మార్గులు, విషయవాంఛలలో మునిగితేలేవారు, ఎల్లప్పుడూ భార్య,సంతానము వీరి యొక్క యోగక్షేమముల మీదనే ఆసక్తిని చూపిస్తూ భగవంతుని మరిచిపోయేవారు, ఎల్లప్పుడూ

ధనార్జనయందు ఆసక్తి కలవారు, భగవంతుని మీద  ఏ మాత్రమూభక్తి శ్రద్ధ లేని వారు, భక్తి లేకపోగా, భగవంతుని మీద భక్తి కలవారిని ద్వేషించేవారు, ఇటువంటి వారికి ఈ తత్త్వజ్ఞానమును ఉపదేశించ కూడదు.

అలా కాకుండా భగవంతుని మీద శ్రద్ధ, భక్తి కలవారు, భగవద్భక్తులు, నీతి మంతులు, ఆచార, వ్యవహారములలో ఆసక్తి కలవారు, సకలభూతములయందు జాలి, దయ చూపేవారు, తోటి వారికి సాయం చేయడంలోనూ, సేవ చేయడంలోనూ ఆసక్తి కలవారు, ప్రాపంచిక విషయములలో అంతగా ఆసక్తి చూపని వారు, వేదములను, శాస్త్రములను చదివినవారు, పరుల ఎడల మాత్సర్యములేనివారు, శారీరకంగానూ, మానసికంగానూ నిర్మలంగా, శుచిగా, శుభ్రంగా ఉండేవారు, ఎల్లప్పుడూ పరమాత్మనే పూజించేవారు, ధ్యానించేవారు, అటువంటి వారికి ఈ తత్త్వశాస్త్రమును ఉపదేశింప వచ్చును.

అమ్మా! ఈ తత్త్వశాస్త్రమును చదివిననూ, విన్ననూ, పరమాత్మయందు మనసు పెట్టి ఈ తత్త్వశాస్త్రమును అధ్యయనం చేసిననూ, అట్టివారు పరమపదమును పొందుతారు.

శ్రీమద్భాగవతము

తృతీయ అధ్యాయము ముప్పదిరెండవ అధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

## శ్రీమద్భాగవతము
## తృతీయ అధ్యాయము
## ముప్పది మూడవ అధ్యాయము.

ఈ విధంగా మైత్రేయుడు విదురునకు కపిలుడు తన తల్లి దేవహూతికి చెప్పిన ఆత్మతత్త్వమును వివరించాడు.

"విదురా! ఆ ప్రకారంగా కపిలుడు చెప్పిన విషయములను అన్నీ సావధానంగా విన్న అతని తల్లి దేవహూతి పరమానందం చెందింది. ఆమెను ఆవహించిన మోహము,మాయ తొలగిపోయింది. ఆమె తన ఎదురుగా ఉన్న తన కుమారుడు కపిలుని సాక్షాత్తు పరమాత్మ అవతారంగా భావించింది. కపిలునికి రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేసింది. కపిలుని ఈ విధంగా కీర్తించింది.

"ఓ పరమాత్మా! నీవు నా ముందు పంచభూతాత్మకము అయిన స్థూల శరీరముతో కనపడుతున్నావు. కాని ఈ చరాచరసృష్టికి నీవే కారణభూతుడవు. నీ నాభి కమలము నుండి బ్రహ్మ ఉద్భవించాడు. నిన్ను స్తుతించాడు. నీవు నిష్క్రియుడవు. నీవు నీ శక్తిని విభజించి త్రిగుణములతో కూడిన ఈ విశ్వాన్ని సృష్టించావు. సృష్టి, స్థితి, లయములను అవలీలగా నిర్వర్తిస్తున్నావు. నీ శక్తి ఊహకు అందనిది.

ఓ దేవా! ప్రళయ కాలములో ఈ సృష్టి అంతా సూక్ష్మరూపంలో నీ పొట్టలో ఇమిడిఉంది. అటువంటి నిన్ను నేను నా గర్భంలో ధరించాను. నేను ఎంత అదృష్టవంతురాలను.

ఈ విశ్వము అంతా జలమయం అయినప్పుడు నీవు చిన్ని బాలుడుగా వటపత్ర శాయిగా నీ కాలి బొటనవేలిని నోటిలో పెట్టుకొని చీకావు కదూ! అటువంటి నీవు లోకంలో పెచ్చరిల్లిన పాపమును నాశనం చేయడానికి పాపాత్ములను సంహరించడానికి నీ భక్తులను రక్షించడానికి వరాహము మొదలగు అవతారములను ధరించావు. అంతే కాదు, నాకు, నాతో పాటు మానవులకు తత్త్వజ్ఞానమును, సాంఖ్యయోగమును బోధించడానికి నా కుమారుడిగా అవతరించావు.

ఓ దేవా! ఎంతటి నీచుడైనా, పాపాత్ముడైనా, నీ నామమును శ్రవణానందముగా విన్నా, నీకు భక్తితో నమస్కరించినా, నిన్ను మనసారా స్మరించినా, వాడి సకల పాపములు తొలగిపోతాయి. ఇంక నీ మీద అచంచలమైన భక్తితో నిన్ను దర్శించిన వారి సంగతి చెప్పనవసరం లేదు కదా! ఎవరి నాలుక మీద నీ పవిత్రమైన నామము ఉచ్ఛరింపబడుతుందో వాడు ఎంతటి నీచ కులములో జన్మించినా వాడు అందరిలోకల్లా శ్రేష్టుడు అవుతాడు. సదా నీ నామమును కీర్తించువాడు యజ్ఞములు, యాగములు, తపస్సు, హెూమములు చేసిన వాడు, వేదాధ్యయనము చేసినవాడితో సమానము అవుతాడు.

ఓ దేవా! నీవే పరబ్రహ్మావు. పరమ పురుషుడవు. విషయ వాంఛలకు లోనైన వారికి నిన్ను ధ్యానించడం సాధ్యం కాదు. కేవలము, విషయ వాంఛల నుండి విడివడిన చిత్తము కలవారికే నిన్ను ధ్యానించడానికి సాధ్యము అవుతుంది.

ఓ దేవా! కపిల రూపంలో నా కుమారుడిగా జన్మించిన, ఆ పరమత్మ అవతారమైన నీకు మనసారా నమస్కరిస్తున్నాను." అని మైత్రేయి తన కుమారుడు అయిన కపిలుడికి నమస్కరించింది.

తన తల్లి తను ఆ ప్రకారంగా కీర్తించగా, కపిలుడు తన తల్లి దేవహూతితో ఇలా అన్నాడు.

"అమ్మా! నేను నీకు చేసిన ఉపదేశములను నీవు చక్కగా ఆచరించవచ్చును. వాటిని ఆచరించి నీవు అచిర కాలంలోనే ముక్తిని పొందుతావు. ఇదే విషయాన్ని బ్రహ్మవాదులు అందరూ ముక్తకంఠంతో చెప్పారు. అందు వలన నీవు జ్ఞానమార్గమును కానీ, భక్తి మార్గమును కానీ అవలంబించి ముక్తిపొందు. అన్నిటి కన్నా సులభమైన భక్తి యోగమును ఆచరింపని వాడు ఈ సంసార కూపంలో పడిపోతాడు." అని అన్నాడు. తరువాత కపిలుడు అక్కడి నుండి వెళ్లిపోయాడు.

కుమారుడు తనను వదిలిపెట్టి వెళ్లిపోయిన తరువాత దేవహూతి అన్ని భోగములను వదిలిపెట్టింది. మూడు పూట్లా స్నానం, ధ్యానము లో మునిగిపోయింది. నారచీరలు కట్టుకొని కఠోర మైన తపస్సు చేయసాగింది. ఆమెశరీరం క్రమక్రమంగా శిథిలముకాసాగింది.

కర్దముడు ఉన్నప్పుడు ఆయనతో అనుభవించిన గృహస్థాశ్రమ సుఖములు అన్నీ మనసులో నుండి బయటకు నెట్టివేసింది. పూర్తిగ వైరాగ్యమును అలవరచుకొంది. తన కుమారుడు తనకు ఉపదేశించిన ధ్యానయోగమును, భక్తియోగమును

నిర్మలమైన మనస్సుతో అనుష్ఠించసాగింది. పరిమితంగా ఆహారం తీసుకుంటూ మనస్సును స్థిరపరచుకొంది. నిరంతరము పరమాత్మయందే తన చిత్తమును నిలిపి, ధ్యానం చేయసాగింది. అలా ధ్యానం చేస్తూ దేవహూతి బ్రహ్మనిర్వాణం పొందింది.

విదురా! దేవహూతి బ్రహ్మ పదమును పొందిన ప్రదేశమును సిద్ధిపదము అనే పేరుతో ప్రసిద్ధిచెందింది. ఆమె దేహము ఒక నదిగా మారి పోయింది. దానిని సిద్ధులు సేవిస్తూ ఉంటారు. ఆ ప్రకారంగా దేవహూతి పరమపదమును పొందింది. తల్లిని వదిలిపెట్టి వెళ్లిన కపిలుడు, ఈశాన్యదిక్కుగా వెళ్లిపోయాడు. సిద్ధులు, సాధ్యులు, చారణులు, గంధర్వులు, మునులు, ఆయనను స్తుతించసాగారు. సముద్రుడు ఆయనకు అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించాడు. కపిలుడు యోగ సమాధిలో కూర్చున్నాడు. ఈ నాటికి కూడా కపిలుడు యోగసమాధిలో ఉన్నాడని సాంఖ్యులు ఆయనను కీర్తిస్తూ ఉంటారు. విదురా! నీవు అడిగిన విషయములను అన్నిటినీ నీకు వివరించాను. పరమ పవిత్రమగు కపిలుడు దేవహూతి సంవాదమును కూడా చెప్పాను. ఈ కపిలముని చేసిన బోధనలను, ఆత్మయోగ తత్త్వమును, చదివినా, వినినా, అతని చిత్తము పరమాత్మ యందు లగ్నం అవుతుంది. అంత్యకాలములోఅతని చిత్తము పరమాత్మపాదముల యొక్కసేవను పొందుతుంది.

శ్రీమద్భాగవతము

తృతీయ స్కంధము ముప్పది మూడవ అధ్యాయము సంపూర్ణము.

తృతీయ స్కంధము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

## సంస్కృత మూలము

## భగవాన్ వ్యాసమహర్షి

## తేటతెలుగులో

## యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్:9866140619 ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము

## చతుర్థ స్కంధము

## ప్రథమ అధ్యాయము.

పరీక్షిత్తు మహారాజుకు శుకమహర్షి చెప్పిన భాగవతమును, నైమిశారణ్యంలో, సత్రయాగ సందర్భంలో, సూతపౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు ఈ విధంగా చెప్పాడు.

మైత్రేయుడు విదురునితో ఇలా అంటున్నాడు.

"విదురా! ఇప్పటిదాకా నీకు, కపిలుడు తన తల్లి దేవహూతికి చేసిన తత్త్వబోధను గురించి చెప్పాను. తరువాత కథ చెబుతాను విను.

స్వాయంభువ మనువు ఆయన భార్య శతరూప సృష్టి చేయడానికి పూనుకున్నారు అని చెప్పానుకదా. వారి సంతతి ఈ ప్రకారంగా అభివృద్ధి చెందింది.

స్వాయంభువ మనువు, శతరూపలకు ముగ్గురు కుమార్తెలు కలిగారు. వారి పేర్లు ఆకూతి, దేవహూతి, ప్రసూతి. పుత్రికలే కాకుండా వారికి ఇద్దరుకుమారులు కూడా కలిగారు. వారి పేర్లు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు.

పెద్ద కుమార్తె ఆకూతిని రుచి ప్రజాపతికి ఇచ్చి శాస్త్రోక్తంగా వివాహము జరిపించారు. రుచి ప్రజాపతికి, ఆకూతికి ఒక

కుమారుడు,కుమార్తె జన్మించారు. వారు సాక్షాత్తు నారాయణుడు, లక్ష్మీదేవి స్వరూపులు. కుమారుడి పేరు యజ్ఞుడు. కుమార్తె పేరు దక్షిణ.

స్వాయంభువ మనువు తన మనుమడైన యజ్ఞుని పెంచుకోడానికి తన ఇంటి తీసుకొచ్చాడు. రుచి తన కుమార్తె దక్షిణను తన కుమారుని వలె పెంచుకుంటున్నాడు. వారికి యుక్త వయసు రాగానే వివాహము జరిపించారు. స్వాయంభువ మనువు తన పెంపుడు మనుమడు యజ్ఞుని, రుచి కుమార్తె దక్షిణకు ఇచ్చి వివాహం చేసాడు. వారిద్దరూ విష్ణుమూర్తి, లక్ష్మీదేవి స్వరూపులు కాబట్టి, ఈ వివాహము పెద్దల సమ్మతిన శాస్త్రోక్తంగా జరిగింది.

యజ్ఞుడు, దక్షిణ వీరిద్దరికీ , పన్నెండుమంది పుత్రులు కలిగారు. వారిపేర్లు, తోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతి, ఇదస్పతి, ఇధ్మడు, కవి, విభుడు, స్వాహ్నుడు, సుదేవుడు, రోచనుడు. ఈ పన్నెండుమంది తుషితులు అనే పేరుతో దేవతలు అయ్యారు. మరీచి మొదలగు వారు సప్తఋషులు అయ్యారు. యజ్ఞుడు శ్రీహరి అవతారంగా కీర్తింపబడ్డాడు. తరువాత యజ్ఞుడు దేవేంద్రపదవిని అలంకరించాడు.

మహాతేజోవంతులైన స్వాయంభువ మనువు కుమారులు....ప్రియవ్రతుడు,ఉత్తానపాదుడు వారి కుమారులు, మనుమలు, మునిమనుమల వలన మనువంశము వృద్ధిపొందింది.

ఓ విదురా! స్వాయంభువ మనువు రెండవ కుమార్తెను కర్దమమహామునికి ఇచ్చి వివాహం చేయడం, వారికి కపిలుడు

పుట్టడం చెప్పాను కదా! తరువాత స్వాయంభువ మనువు మూడవ కుమార్తె అయిన ప్రసూతిని బ్రహ్మ కుమారుడైన దక్షునికి ఇచ్చి వివాహం చేసారు. వారు కూడా మనువంశమును వృద్ధిచేసారు.

తరువాత కర్దమునికి, దేవహూతికి తొమ్మిది మంది పుత్రికలు కలిగారనీ వారిని మరీచి మొదలగు మహామునులకు ఇచ్చి వివాహం చేసారని చెప్పాను కదా! ఇప్పుడు నేను వారి వంశములు ఎలా అభివృద్ధి చెందాయి అనే విషయాన్ని వివరిస్తాను.

బ్రహ్మ మానస పుత్రులలో మొదటి వాడు మరీచి. మరీచికి కర్దముని కుమార్తె కళను ఇచ్చి వివాహం చేసారు. మరీచికి, కళకు ఇద్దరుకుమారులు కలిగారు. వారే కశ్యపుడు, పూర్ణిమానుడు. వీరిద్దరి వంశములతో ప్రపంచం అంతా నిండి పోయింది. పూర్ణిమానుడికి విరజుడు, విశ్వగుడు అనే ఇద్దరు కుమారులు, దేవకూల్య అనే కుమార్తె కలిగారు. ఆ దేవకూల్య అన కన్య తన తదుపరి జన్మలో గంగానదిగా ఆవిర్భవించింది.

బ్రహ్మ మానస పుత్రులలో రెండవ వాడు అత్రి. అత్రి మహర్షికి, అనసూయకు దత్తాత్రేయుడు, దుర్వాసుడు, సోముడు, అనే పుత్రులు జన్మించారు. ఆ ముగ్గురు కుమారులు సాక్షాత్తు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల అంశలతో జన్మించారు. (దత్తాత్రేయుడు విష్ణు అంశ, దుర్వాసుడు రుద్రుని అంశ, సోముడు బ్రహ్మ అంశ).

అప్పుడు విదురునికి ఒక సందేహం కలిగింది. " గురువుగారూ! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి, స్థితి, లయకారులు

కదా. మరి వారే స్వయంగా అత్రి మహర్షికి, అనసూయకు ఎలా కుమారులుగా జన్మించారు. దీనికి ఏమైనా ప్రత్యేకమైనకారణం ఏమైనా ఉందా?”అని అడిగాడు.

అప్పుడు మైత్రేయుడు ఇలా చెప్పసాగాడు.

“విదురా! అత్రి మహర్షి, అనసూయలు బ్రహ్మ ఆదేశాను సారము సృష్టి చేయడానికి ఆయత్తమయ్యారు. అందుకోసమై తపస్సు చేయడానికి కుల పర్వతము వద్దకు తపస్సు చేయడానికి వెళ్లారు. ఆ కుల పర్వతము అనేకములైన పూలు, ఫల వృక్షములతోనూ, సరోవరములతోనూ సర్వాంగ సుందరంగా  శోభిల్లుతూ ఉంది. ఆ కుల పర్వతము వద్ద అత్రి మహాముని ప్రాణాయామము ద్వారా మనస్సును, ఇంద్రియములను అదుపులో ఉంచుకొని, కేవలం గాలిని మాత్రం పీలుస్తూ, ఒంటికాలిమీద నిలబడి నూరుసంవత్సరములు తపస్సుచేసాడు.

ఆయన మనస్సులో ఒకే భావన. “నేను ఆపరమాత్మను మనసులో నిలుపుకున్నాను. ఆయన నాకు తన వంటి సంతానమును ప్రసాదించాలి” అనే ఏకాగ్రమైన మనస్సుతో తపస్సు చేసాడు. ఆ సమయంలో అత్రి మహాముని తలమీది నుండి అగ్ని జ్వాలలు పుట్టాయి. ఆ యోగాగ్ని ద్వారా ముల్లోకములు దహించుకుపోసాగాయి. ఆ పరమాత్మ స్వరూపాలైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు దేవతలను, గంధర్వులను ఋషులను వెంటబెట్టుకొని అత్రి మహాముని ఆశ్రమము వద్దకు వెళ్లారు.

త్రిమూర్తులను చూడగానే అత్రి మహాముని మనస్సు ఆనందంతో నిండిపోయింది. ఒంటికాలి మీద నిలబడి త్రిమూర్తులను కనులారా చూస్తున్నాడు. అత్రి మహాముని వారిని సాదరంగా ఆహ్వానించి, అతిథి మర్యాదలు చేసాడు. వారిని యథావిధిగా పూజించాడు. అత్రి మహాముని ఆనంద పారవశ్యంతో, అర్ధనిమీలిత నేత్రములతో త్రిమూర్తులను ఈ విధంగా స్తుతించాడు.

"ఓ త్రిమూర్తులారా! ప్రతి కల్పప్రారంభంలో మూడుగుణములలో కలిగిన క్షోభచేత, ఈ విశ్వములో సృష్టి,స్థితి, లయములు కలుగుతున్నాయి. సృష్టి,స్థితి,లయకారులైన మీరు బ్రహ్మ,విష్ణు,రుద్రరూపములతో అవతరించారు. అటువంటి మీ పాదపద్మములకునమస్కరిస్తున్నాను. కాని నేను మంచి సంతానము కొరకు ఆ పరమాత్మను మాత్రమే ఆహ్వానించాను. కాని మీరు ముగ్గురు వచ్చారు. వీరిలో నేను ఆహ్వానించిన పరమాత్మ ఎవరు? నేను నిరాకారుడు, నిర్గుణుడు అయిన పరమాత్మను నా మనస్సులో నిలుపుకొని తపస్సు చేసాను. కానీ మామూలు మానవులకు గోచరం కాని  మీరు మూడు ఆకారాలతో నా ముందు ప్రత్యక్షం అయ్యారు.  ఇది ఎలాజరిగింది? నాకు తెలియజేయండి." అని అడిగాడు.

దానికి త్రిమూర్తులు చిరునవ్వునవ్వుతూ అత్రి మహామునికి ఇలా చెప్పారు. "ఓ అత్రి మహర్షీ! నీ సంకల్పము గొప్పది. నీ కోరిక తప్పక నెరవేరుతుంది. నీవు ఆరాధించిన ఆ పరమాత్మ ఒక్కడే. ఆ పరమాత్మ తత్త్వమే మూడు వేరు వేరు పనులు చేయుటకు, మూడు అంశలతో ముగ్గురుగా విభజింపబడ్డాము. ఇప్పుడు మా ముగ్గురి అంశలతో నీకు

ముగ్గురు కుమారులు కలుగుతారు. వారు నీ కీర్తిని నేల నలుచెరగులా విస్తరింపజేస్తారు." అని అత్రి మహామునికి వరం ప్రసాదించారు.

తరువాత అత్రి తన భార్య అనసూయతో కలిసి త్రిమూర్తులను అర్చించారు. ఆ దంపతుల పూజలందుకొనిన తరువాత త్రిమూర్తులు వెళ్లిపోయారు. తరువాత అనసూయాదేవి గర్భం ధరించి, బ్రహ్మ అంశతో సోముడు (చంద్రుడు), విష్ణు అంశతో మహాయోగి దత్తాత్రేయుడిని, రుద్రఅంశతో మహాకోపిష్టి దుర్వాసుని పుత్రులుగా పొందింది.

(మనకు వాడుకలో ఉన్న అనసూయ కథ అంటే త్రిమూర్తులు ఆమె ఇంటికి రావడం, ఆమెను వివస్త్రగా భోజనం వడ్డించమనడం, ఆమె వారిని శిశువులుగా మార్చడం ఇదంతా కల్పన  కావచ్చు. లేదా ఏదైనా పురాణంలో ఉండి ఉండవచ్చు.)

ఓ విదురా! బ్రహ్మ మానస పుత్రులలో తరువాతి వాడైన అంగిరసుడు అనే మహాఋషి కథ చెబుతాను విను. అంగిరసుని భార్య పేరు శ్రద్ధ. అంగిరసునికి, శ్రద్ధకు నలుగురు కుమార్తెలు కలిగారు. వారి పేర్లు సినీవాలి, కుహు, రాక, అనుమతి. ఇద్దరు కుమారులుకూడా కలిగారు. వారు  ఉతథ్యుడు, బృహస్పతి.  వీరి వలన సృష్టి కొనసాగింది.

బ్రహ్మ మానస పుత్రులలో తరువాతి వాడు పులస్త్యుడు. ఆయన భార్య పేరు హవిర్భు. వారికి అగస్త్యుడు అనే కుమారుడు కలిగాడు. ఆ అగస్త్యుడే తరువాతి జన్మలో జఠరాగ్ని రూపంలో ప్రతిదేహంలో ఉన్నాడు.

పులస్త్యునికి మరొక కుమారుడు కూడా కలిగాడు. అతని పేరు విశ్రవసుడు. విశ్రవసుడు గొప్ప తపస్వి. విశ్రవసునకు ఇద్దరు భార్యలు. మొదటి భార్య ఇలకు కుబేరుడు, రెండవ భార్య కేశినికి రావణుడు, కుంభకర్ణుడు అనే కుమారులు కలిగారు.

బ్రహ్మమానసపుత్రులో తరువాతి వాడైన  పులహుని భార్య గతి. వారిరువురికీ కర్మశ్రేష్టుడు, వరీయాంసుడు, సహిష్ణువు అను ముగ్గురు కుమారులు కలిగారు.

బ్రహ్మమానస పుత్రులలో తరువాతి వాడైన క్రతువుకు క్రియ అను ఆమెతో వివాహం అయింది. వారిద్దరికీ 60,000 మంది వాలఖిల్యులు జన్మించారు.

బ్రహ్మమానస పుత్రులలో తరువాతి వాడైన వశిష్ఠునికి ఊర్జ అనే ఆమెతో వివాహం అయింది. వారిరువురకు చిత్రకేతువు మొదలగు ఏడుగురు కుమారులు కలిగారు. వారి పేర్లు చిత్రకేతువు,సురోచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసుభృద్యానుడు, ద్యుమాంసుడు. వశిష్ఠునికి మరొక భార్య ద్వారా శక్తి మొదలగు పుత్రులు కలిగారు. (ఈ శక్తి కుమారుడే పరాశరుడు. పరాశరుని కుమారుడు వ్యాసుడు. వ్యాసుని కుమారుడు శుకుడు).

బ్రహ్మ మానస పుత్రులలో తరువాతి వాడు అధర్వుడు. అధర్వఋషి భార్యపేరు చిత్తి. వారికి దధీచి అనే కుమారుడు కలిగాడు.

విదురా! ఇప్పుడు నీకు బ్రహ్మమానస పుత్రులలో తరువాతి వాడైన భృగు మహర్షి వృత్తాంతమును చెబుతాను విను. భృగువు భార్య పేరు ఖ్యాతి. వారికి ధాత, విధాత, అనే కుమారులు కలిగారు. శ్రీ అనే కుమార్తె కూడాకలిగింది. ధాత, విధాతలకు మేరు, ఋషి కుమార్తెలు అయిన ఆయతి, నియతి అనే కన్యలను ఇచ్చి వివాహం జరిపించారు. వారికి మృకండుడు, ప్రాణుడు అనే కుమారులు కలిగారు.

మృకండ మహర్షికి మార్కండేయుడు, ప్రాణుడికి వేదశిరుడు అనే కుమారులు జన్మించారు. భృగువుకు కవి అనే కుమారుడు కూడా ఉన్నాడు. ఆ కవి యొక్కకుమారుడే రాక్షస గురువు శుక్రాచార్యుడు. భృగు మహర్షి యొక్క సంతతి లోకంలో బాగా వ్యాప్తిచెందింది.

విదురా! నీకు బ్రహ్మ మానస పుత్రులలో తరువాతి వాడైన దక్షుని గురించి చెబుతాను విను. దక్షుడు మనువు యొక్క కుమార్తె అయిన ప్రసూతిని వివాహం చేసుకున్నాడు. వారికి 16 మంది కుమార్తెలు కలిగారు. అందులో పదముగ్గురు కన్యలను, దక్షుడు ధర్ముడు అనే వానికి ఇచ్చి వివాహం చేసాడు. ఒక కన్యఅయిన స్వాహాదేవిని అగ్ని దేవునికి, మరొక కన్యను పితృగణములకు, ఆఖరి కన్యఅయిన సతీదేవిని శివునికి ఇచ్చి వివాహం చేసాడు.

ధర్మునికి ఇచ్చి వివాహం చేసిన కన్యల పేర్లు..... శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, పుష్టి, క్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, హ్రీ, మూర్తి. ఈ పదముగ్గురు ధర్ముని భార్యలు. శ్రద్ధ అనే ఆమెకు సత్యము, మైత్రికి ప్రసాదము, దయ అనే ఆమెకు అభయము, శాంతి అనే ఆమెకు

సుఖము, తుష్టి అనే ఆమెకు హర్షము, పుష్టి అనే ఆమెకు గర్వము అనే సంతానము పుట్టారు. క్రియ అనే ఆమెకు  యోగమును, ఉన్నతికి దర్పమును, బుద్ధికి అర్థమును, మేధకు స్మృతి, తితిక్ష కు మంగళము, హ్రీ కి వినయము అనేవారు పుట్టారు.

(పైన చెప్పిన పేర్లు గమనించండి. అవి అన్నీ మానవులకు ఉన్న లక్షణముల పేర్లు, అంటే అటువంటి లక్షణములు, గుణములు, వృత్తులు కల వారు పుట్టారు అని చెప్పుకోవచ్చు.)

ధర్మునికి మూర్తి అనే భార్య వలన నరుడు, నారాయణుడు అనే ఋషులు జన్మించారు. నరనారాయణులు జన్మించినపుడు ఈ విశ్వం అంతా ప్రసన్నంగా తయారయింది. ఆకాశము నుండి పూలవర్షము కురిసింది. మునులు, గంధర్వులు, కిన్నరులు, భగవంతుని స్తుతించారు. దేవతలందరూ నరుడు,నారాయణుని ఈ విధంగా  స్తుతించారు.

"పరమాత్మ తన మాయ ద్వారా ఈ విరాట్ రూపమును సృష్టించాడు. ఆ విరాట్ రూపమే ధర్ముని ఇంట నర నారాయణ రూపంలో ఉద్భవించింది. అట్టిపరమాత్మకు నమస్కరిస్తున్నాము. శాస్త్రములను అధ్యయనం చేయడం ద్వారా భగవంతుడు ఇలా ఉంటాడు అని తెలుసుకోగలుగుతాము కాని భగవంతుని ప్రత్యక్షము చేసుకోలేము. అట్టి భగవంతుడు ఈ దేవతలను సృష్టించాడు. ఆ పరమాత్మ యొక్క కరుణాపూరితమైన దృష్టి మామీద ప్రసరించుగాక!" అని ప్రార్థించారు.

వారి పూజలను స్వీకరించిన నరుడు నారాయణుడు ధర్ముని ఇల్లు వదిలి గంధమాధన పర్వతము మీదికి తపస్సు చేసుకోడానికి వెళ్లిపోయారు.

ఆ నరుడు నారాయణుడే ద్వాపర యుగములో అర్జునుడు గానూ, శ్రీకృష్ణుడు గానూ జన్మించారు.

దక్షుని కుమార్తె ను అగ్నిగి ఇచ్చి వివాహం చేసారని చెప్పాను కదా! ఆమె పేరు స్వాహా దేవి. అగ్నిదేవునికి స్వాహాదేవికి ముగ్గురు కుమారులు కలిగారు. వారి పేర్లు పావకుడు, పవమానుడు, శుచి. ఈ ముగ్గురి వలన 45 రకాలైన అగ్నులు పుట్టారు. అగ్ని మొత్తం 49 రకాలు అని చెబుతారు. (అగ్ని, ఆయన కుమారులు ముగ్గురు, ఆయన మనుమలు 45 మంది. మొత్తం 49 మంది).
యజ్ఞములు,యాగములలో అగ్నిని మండించి, అందులో స్వాహా మంత్రములు జపిస్తూ, వేసే హవిస్సులను, ఈ 49 అగ్నులు స్వీకరించి, ఆయాదేవతలకు చేరుస్తాయి.

దక్షుడు తన మరొక కుమార్తెను పితృదేవతలకు ఇచ్చాడు అని చెప్పాను కదా. ఆమె పేరు స్వధ. (పితృకార్యములలో స్వధానస్ తర్పయామి అని తర్పణాలు పితృదేవతలకు విడుస్తాము కదా!) ఆ పితృదేవతలు అగ్నిష్వాత్త, బర్హిషదుడు, సోమపుడు, ఆజ్యపుడు.

ఈ పితృగణములు రెండు రకాలు. సాగ్నికులు అంటే అగ్ని కార్యములో అర్చింపబడేవారు. నిరగ్నికులు అంటే అగ్ని కార్యముతో

నిమిత్తము లేకుండా అర్చింపబడేవారు. ఈ రెండు విధములైన పితృగణములకు స్వధ అనే దక్షుని కుమార్తె భార్య అయింది.

ఈ స్వధ పితృగణముల వలన ఇద్దరు కుమార్తెలకు జన్మనిచ్చింది. వారి పేర్లు వయున, ధారిణి. ఈ పుత్రికలు అపారజ్ఞానసంపన్నులు.

దక్షుని ఆఖరుకుమార్తె పేరు సతీదేవి. ఆమె శివునికి భార్య అయింది. ఆమెకు సంతానము కలుగలేదు. ఆమె ఎల్లప్పుడూ పతిసేవలో నిమగ్నం అయి ఉండేది. సతీదేవి తండ్రి దక్షుడు అకారణంగా శివుని మీద వైరం పెంచుకున్నాడు. దక్షుని వైరం కారణంగా సతీదేవి యోగాగ్నిలో దగ్ధం అయిపోయింది.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము మొదటి అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము

రెండవ అధ్యాయము.

అప్పుడు విదురుడికి ఒక సందేహం వచ్చింది.

"మైత్రేయా! సతీదేవి దక్షుని కుమార్తె కదా! మరి ఆమె మీద ప్రేమ ఉండాలికదా! అలా అయితే సతీదేవి ఎందుకు యోగాగ్నిలో కాలిపోయింది. శివుడు అంటే ఈ చరాచర జగత్తుకు గురువు వంటి వాడు. ఆయనకు శత్రువులు అంటూ ఎవరూ లేరు కదా! పైగా శివుడు ఎప్పుడూ ప్రశాంతంగాఉంటాడు. అందరి ఆత్మలలో తానై ఉంటాడు. ఆయనను మూడులోకాలు పూజిస్తాయి. అటువంటి శివుడి మీద దక్షుడికి  విరోధం ఎందుకు కలిగింది. మామా అల్లుళ్ల మధ్య కలిగిన కలహానికి కారణం ఏమిటి? మామాఅల్లుళ్లు తగవులాడుకుంటే, మధ్యలో సతీదేవి ఎందుకు ఆత్మాహుతి చేసుకుంది? అంతా అయోమయంగా ఉంది. దీని గురించి వివరంగా చెప్పండి." అని అడిగాడు విదురుడు. అప్పుడు మైత్రేయుడు ఇలా చెప్ప సాగాడు.

"విదురా! పూర్వము ప్రజాపతులు అందరూ కలిసి ఒక మహా యజ్ఞము చేసారు. దానికి దక్షుడు యజయాని. ఆ యజ్ఞమునకు మహా ఋషులు, దేవతలు, మునులు, అగ్నులు అందరూ వచ్చారు. అందరూ కూర్చుని ఉండగా దక్షుడు ఠీవిగా సభామండపంలోకి ప్రవేశించాడు. దక్షుని చూచి అందరూ గౌరవ సూచకంగా లేచి నిలబడ్డారు. కాని బ్రహ్మ, శివుడు మాత్రం లేచి నిలబడలేదు. కూర్చునే ఉన్నారు.

దక్షుడు అందరినీ పలకరిస్తూ నమస్కారం చేసిన వారికి తిరిగి నమస్కారం చేస్తూ బ్రహ్మ దగ్గరకు వచ్చాడు. తండ్రి గారైన బ్రహ్మకు దక్షుడు భక్తిపూర్వకంగా నమస్కరించాడు. బ్రహ్మగారు దక్షుని తనపక్కన ఉన్న ఆసనము మీద కూర్చోపెట్టుకున్నాడు. దక్షుడు నిలబడి ఉండి బ్రహ్మకు నమస్కారము చేస్తున్నప్పుడు శివుడు లేచి నిలబడలేదు. దక్షుని పలకరించలేదు. తనకేమీ పట్టనట్టు తన ఆసనంలో తాను కూర్చుని ఉన్నాడు.

ఇది గమనించాడు దక్షుడు. శివుడు తనను అవమానించినట్టు భావించాడు. దక్షునికి ఎక్కడలేని కోపం వచ్చింది. కోపంతో కళ్లు ఎరుపెక్కాయి. లేచి నిలబడి సభలో ఉన్న వారిని చూచి ఇలా అన్నాడు.

"ఓ బ్రహ్మర్షులారా! దేవతలారా! అగ్నులారా! నేను అజ్ఞానంతో గానీ, మాత్సర్యంతో గానీ ఈ మాటలు అనడం లేదు. సభలో పాటించ వలసిన ఆచారముల గురించి వ్యవహారముల గురించి చెబుతున్నాను. దయయుంచి సావధానంగా వినండి. ఇదిగో ఇక్కడ కూర్చున్నాడే శివుడు. అతడు సిగ్గు లేకుండా సభామర్యాదలను అతిక్రమించాడు. లోక పాలకుడుగా ఇతని కీర్తి అంతా నాశనం అయింది.

నా కుమార్తె సతీదేవి అత్యంత సాధుశీల. ఆమె ఈ శివుని వివాహం చేసుకుంది. ఇతడు నాకుఅల్లుడు. అల్లుడుగా మామకు గౌరవం ఇవ్వాలి కదా! నేను ప్రజాపతిని. అందరూ నన్ను గౌరవిస్తారు.

కాని ఈ శివుడు నన్ను ఒక మామగారుగా గానీ, ప్రజాపతిగా గాని గౌరవించలేదు. నా పట్ల మర్యాద చూపలేదు. కనీసం లేచి నిలబడలేదు. మర్యాదపూర్వకంగా ఒక్క మాటకూడా మాట్లాడలేదు. అటువంటి ఆచార హీనుడికి, గర్విష్టికి, మర్యాద తెలియని వాడికి, ఏమాత్రం శుచి, శుభ్రత లేని వాడికి సాధుశీల అయిన నా కుమార్తెను ఇచ్చి వివాహం చేసాను.

ఈ శివుడు ఎలాంటి వాడో మీకు తెలుసు! ఎప్పుడూ తలవిరబోసుకొని, ఒంటి మీద బట్టలు లేకుండా, పిచ్చి వాడి వలె కాసేపు నవ్వుతూ కాసేపు ఏడుస్తూ శ్మశానాల వెంట తిరుగుతుంటాడు. ఇతడు ఏ ఆభరణములు ధరించడు. ఒళ్లంతా శవాలను కాల్చిన బూడిద పూసుకుంటాడు. మెడలో పుర్రెలతో కట్టిన మాల వేసుకుంటాడు. శరీరం అంతా ఎముకలతో చేసిన ఆభరణములను ధరిస్తాడు. ఇతడు పేరుకు మాత్రమే శివుడు (ఆనందకరుడు) కాని వాస్తవంలో ఇతడు అశివుడు (ఏమాత్రం ఆనందం లేని వాడు).

ఇతడిని పిచ్చివాళ్లు మాత్రమే అభిమానిస్తారు. ఇతడు భూతములను, ప్రేతములను వెంటబెట్టుకొని వారికి నాయకుడిగా ఉంటున్నాడు. నా ఖర్మకాలి, బ్రహ్మగారి మాటలు నమ్మి, నా కూతురు సతిని ఈ భూతనాధుడికి, ఆచారహీనుడికి ఇచ్చి పెళ్లిచేసాను." ఆ ప్రకారంగా దక్షుడుశివుని అనరాని మాటలు అన్నాడు.

అన్నీ విన్న శివుడు ఏ మాత్రం చలించలేదు. నిర్వికారంగా మౌనంగా కూర్చుని ఉన్నాడు. ఎన్ని తిట్టినా దక్షునికి తృప్తి కలగలేదు.

దక్షుడు శాంతించలేదు. ఇలా కాదని శివుని శపించడానికి జలము చేతిలోకి తీసుకున్నాడు.

"ఓ దేవతలారా! అగ్నులారా! ఈ అధముడు మీతో సమానంగా యజ్ఞములో హవిర్భాగమునకు అర్హుడు కాదు. ఇతనికి హవిర్భాగము ఇవ్వను." అని శపించాడు దక్షుడు.

అక్కడ ఉన్న దేవతలు అందరూ వద్దన్నా వినకుండా యజ్ఞములలో హవిర్భాగములు ఇవ్వకూడదని  శివుని దారుణంగా శపించాడు.  శివుని శపించిన తరువాత దక్షుడు అక్కడ ఉండలేకపోయాడు. కోపంతో యజ్ఞవాటికను విడిచి పెట్టి తన ఇంటికి వెళ్లిపోయాడు.

ఇదంతా చూస్తూ శివుని పక్కనే నిలబడి ఉన్న నందీశ్వరుని కళ్లు ఎరుపెక్కాయి. కోపంతో ఊగి పోయాడు. శివుని శపించిన దక్షుని, దక్షుడు శివుని దారుణంగా తిడుతూ ఉండగా వింటూ ఏమీ మాట్లాడకుండా ఉన్న సభలో ఉన్న వారిని నందీశ్వరుడు శపించాడు.

"దేవతలారా! ఈ దక్షుడు మూఢుడు. వీడు మౌనంగాఉన్న శివుని శపించాడు. ఇటువంటి వాడు తాను సంపాదించుకున్న తత్త్వజ్ఞానము అంతా నశించిపోవుగాక! వీడి బుద్ధి నశించి పోతుంది. ఇతడు స్త్రీసుఖములలో మునిగి తేలుతూ, కపటములైన ధర్మములను ఆచరిస్తూ, భ్రష్టుడైపోవుగాక! ఇప్పటి నుండి ఈ దక్షుని బుద్ధి, దేహమే

ఆత్మ అని భావిస్తుంది. శరీరసుఖాలకే ప్రాధాన్యం ఇస్తుంది. ఆత్మతత్త్వమును పూర్తిగా మరచిపోతాడు. పశువు మాదిరి ప్రవర్తిస్తాడు. ఎల్లప్పుడూ స్త్రీలమధ్య తిరుగుతూ స్త్రీలోలుడై ఉంటాడు. అటువంటి లక్షణములు కల మేక ముఖాన్ని ధరిస్తాడు.

ఈ దక్షుడు శివద్వేషి. ఇతనితో పాటు ఇతని చర్యలను ఆమోదించిన బ్రాహ్మణులు కూడా ఇతని మాదిరే సంసార సుఖములే ముఖ్యమని భావించి, జనన మరణ చక్రములో పడి పతనమవుతారు. వీరి మనసంతా శివద్వేషంతో నిండిపోయింది. వీరు వేదాధ్యయనము మరిచిపోయి ప్రాపంచిక కర్మలు చేయడంలోనే మునిగితేలుతుంటారు. అంతే కాకుండా ఈ బ్రాహ్మణులు అందరూ విచక్షణ లేకుండా సర్వభక్షకులు అవుతారు. తినకూడనివి కూడా ఇష్టంగా తింటారు. తన దేహమును, తమ భార్యను, సంతానమును పోషించుకోడానికే పూజలు వ్రతాలు చేస్తారు. ధనము సంపాదించడానికి, ఇంద్రియ సుఖములు పొందడానికి, వీరు అడుక్కుతినడానికైనా వెనకాడరు." అని నందీశ్వరుడు బ్రాహ్మణులను దారుణంగా శపించాడు.

ఆ శాప వాక్కులను విన్న భృగువు కోపంతో రగిలిపోయాడు. తిరుగు శాపం ఇచ్చాడు. "ఈ శివుడిని పూజించేవాళ్లు, శివుడిని గురించి వ్రతాలు చేసేవాళ్లు, ఆ వ్యక్తులను అనుసరించే వాళ్లు, శాస్త్రవిజ్ఞానమునకు దూరమై పాషండులైపోతారు. వీరికి శుచి శుభ్రత ఉండదు. మూర్ఖంగా ప్రవర్తిస్తారు. ఎప్పుడూ జడలు కట్టుకొని ఒళ్లంతా భస్మంపూసుకొని తిరుగుతుంటారు. వీరు సురను, మద్యమును సేవిస్తూ భ్రష్టులవుతారు.

ఈ శివుడిని పూజించే వాళ్లందరూ ధర్మమును, వేదములను, బ్రాహ్మణులను నిందించారు. అందువలన వీరంతా పాషండ ధర్మాన్ని ఆశ్రయిస్తారు. ఎందుకంటే, వేదమార్గమే ఉత్తమమైనది. సనాతనమైనది. మానవులందరూ అవలంబించ వలసినది. మహాఋషులు అందరూ అనాదిగా వేదధర్మమునే ఆచరిస్తున్నారు. జనార్దనుడే వేదములకు ప్రమాణము. అటువంటి వేదమును ఈ శివారాధకులు నిందించారు. కాబట్టి మీరందరూ తామసులు. భూతగణములు, వీటికి అధినాధుడైన మీ శివుడు, నివసించే ప్రదేశములోనే నివసించండి. ఆ పాషండుడైన శివునే ఆరాధించండి." అని శివుని అనుసరించేవారిని, శివారాధకులను శపించాడు భృగువు.

భృగువు పెట్టిన శాపమునకు చాలా బాధపడ్డాడు శివుడు. అక్కడి నుండి తన అనుచర గణముతో వెళ్లిపోయాడు. శివుడు వెళ్లి పోయిన తరువాత ఆ యజ్ఞమును ప్రజాపతులు అందరూ కలిసి యధావిధిగా కొనసాగించారు. తరువాత గంగా యమునలు కలిసే చోట అవభృధ స్నానాలు చేసారు. తరువాత తమ తమ స్థానములకు వెళ్లిపోయారు.

శ్రీమద్భాగవతము
చతుర్థస్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం త్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# చతుర్థ స్కంధము

## మూడవ అధ్యాయము.

"విదురా! ఆ ప్రకారంగా మామా అల్లుళ్లు అయిన దక్షుడు శివుడు పరస్పర విరోధంతో ద్వేషంతో చాలా కాలం గడిపారు. బ్రహ్మ దేవుడు దక్షుని ప్రజాపతులందరికీ అధిపతిని చేసాడు. ప్రజాపతులకు అధిపతిగా అభిషేకము కాగానే దక్షునిలో ఉన్న గర్వము రెట్టింపు అయింది. త్రిమూర్తులను కూడా లెక్కచేయడం మానేసాడు. వాజపేయము అనే యజ్ఞమును చేసాడు.

తరువాత బ్రహస్పతిసవము అనే యజ్ఞమును చయడానికి సంకల్పించాడు. దేవతలను, గంధర్వులను, ఋషులను అందరినీ ఆహ్వానించాడు. ఒక్క శివుని తప్ప అందరినీ ఆహ్వానించాడు. దక్షుని యజ్ఞము చూడటానికి ఆయన ఇచ్చే కానుకలు అందుకోడానికి దేవతలు, దేవఋషులు, గంధర్వులు, మహాఋషులు అందరూ కోలాహలంగా వెళుతున్నారు.

విమానముల మీద చక్కగా అలంకరించుకొని వెళుతున్న దేవకాంతలను చూచింది సతీదేవి. వారిని అడిగి తన తండ్రి అయిన దక్షప్రజాపతి యజ్ఞము చేస్తున్నాడని తెలుసుకొంది. వెంటనే భర్త అయిన పరమశివుని వద్దకుపోయి ఇలా అడిగింది.

"మీ మామగారైన దక్షప్రజాపతి యజ్ఞము చేయుచున్నాడని తెలిసింది. ఆ యజ్ఞమునకు దేవతలందరూ గుంపులు గుంపులుగా

వెళుతున్నారు. మీకు ఇష్టం అయితే మనం ఇద్దరం కూడా ఆ యజ్ఞమునకు వెళ్దాము. నాకు కూడా మా పుట్టింటి వారిని చూడవలెనని కోరికగా ఉంది. ఈ యజ్ఞమునకు మా సోదరీమణులు అందరూ వస్తారు. నా తల్లి తండ్రులు ఇచ్చిన బహుమానములను తీసుకోడానికి ఎంతో ఉత్సాహంగా వస్తారు. మీతో పాటు నాకు కూడా మా పుట్టింటి వారు చేయు మర్యాదలను స్వీకరించవలెనని కోరికగా ఉంది.

అదీకాకుండా నేను నాపుట్టింటికి పోయి చాలా కాలం అయింది. మా బంధువులను అందరినీ చూడటానికి నాకు చాలా ఉత్సాహంగా ఉంది. ఈ సాకుతో అయినా నేను మా వాళ్లందరినీ చూడటానికి వీలుపడుతుంది. అందుచేత నేను కూడా ఆ యజ్ఞమునకు పోయి, నా అక్కలను వారి పిల్లలను, నా తల్లిని, బంధువులను, యజ్ఞమును చూచి వస్తాను.

ఇటువంటి యజ్ఞములు త్రిగుణాతీతులయిన మీకు ఏమంత అద్భుతములుగా కనిపించవు. ఈ విశ్వమంతా మీ మాయతో కప్పబడి ఉంది. కాని నేను స్త్రీని. మీమాయలను ఎరిగిన దానను కాను. నాకన్నీ అద్భుతములుగానే ఉంటాయి. కాబట్టి మీరు అనుమతిస్తే నేను మా పుట్టింటి వెళ్లి వస్తాను. నేను చెప్పడం కాదు. ఒకసారి అటు చూడండి. దేవతలు, గంధర్వులు తమ తమ భర్తలతో బాగా అలంకరించుకొని యజ్ఞమునకు ఎంతో ఉత్సాహంగా వెళుతున్నారు.

అయినా తమరికి తెలియనిదేముంది. పుట్టింట్లో జరిగే శుభకార్యములకు వెళ్లడానికి ఏ ఆడపిల్ల ఉత్సాహం చూపించదు. అయినా పుట్టింటికి వెళ్లడానికి ఒకరు పిలవాలా ఏంటి? భర్త ఇంటికి, తల్లి తండ్రుల ఇంటికి పిలువకపోయినా వెళ్లవచ్చును. అందువలన నా మీద దయయుంచి మీరు నాకు అనుమతి ఇస్తే నేను మా పుట్టింటి వెళ్లివస్తాను." అని పలికింది సతీదేవి.

భార్య అంత దీనంగా అడుగుతుంటే ఒక్క చిరునవ్వు నవ్వాడు శివుడు.

"దేవీ! పిలువకపోయినా పుట్టింటి వెళ్లవచ్చును అన్న మాట వినడానికి బాగానే ఉంటుంది. నీవు చెప్పిన మాట మామూలు స్త్రీలకు వర్తిస్తుంది. కానీ నీ పుట్టింటి వారు నేనంటే ద్వేషభావంతో ఉన్నారు. నా మీద ఉన్న ద్వేషాన్ని నీ మీద కూడా చూపించే అవకాశం ఉంది. నీ తండ్రి గర్విష్టి. కోపిష్టి. నిన్ను అవమానించగలడు దూషించగలడు. అందువలన నీవు వెళ్లడం మంచిది కాదు.

దేవీ! ఈ సందర్భములో నీకు కొన్ని మాటలు చెబుతాను సావధానంగా విను. విద్య, తపస్సు, ధనము, మంచి అందమైన రూపము, యౌవనము, గొప్ప వంశము ఇవన్నీ మంచి వారికి శోభను ఇస్తాయి. కానీ ఈ గుణములు మూర్ఖులయందు ఉంటే అవి వారికి చెడు చేస్తాయి. పైగా మూర్ఖులకు పైగుణాలు ఉంటే వారిలో గర్వం పెరుగుతుంది. వారిలో ఉన్న వివేకము నశించిపోతుంది. అందువలన వారికి మంచి చెడు విచక్షణ తెలియదు.

ప్రస్తుతము నీ తండ్రి అదే పరిస్థితిలో ఉన్నాడు. తాను ప్రజాపతులకు అధిపతి అనే గర్వంతో విర్రవీగుతున్నాడు. ఎవరినీ లెక్కచేయడం లేదు. అటువంటి వారి ఇళ్లకు నీ వంటి సాధ్వీమణులు వెళ్లడం మంచిది కాదు. ఇటువంటి వారు ఇంటికి వచ్చిన వారిని చులకనగా చూస్తారు. వ్యంగ్యమైన మాటలతో ఎత్తిపొడుపు మాటలతో బాధపెడతారు. అటువంటి వారు మాట్లాడే మాటలు శత్రువుల బాణముల కంటే పదునుగా ఉంటాయి. యుద్ధములో ఒంటినిండా బాణములు గుచ్చుకున్నా సుఖంగా నిద్రపోవచ్చుకానీ, ఇంటికి వచ్చిన వారిని  గర్వాంధులు చులకనగా మాట్లాడే మాటలను సహించడం దుర్భరం. అటువంటి మాటలు వినిన తరువాత నిద్రకూడా పట్టదు.

దేవీ!  దక్షునికి తన కుమార్తెలలో కల్లా నీవు అత్యంత ప్రియమైన పుత్రికవు అని నాకు తెలుసు. కాని నన్ను పెళ్లి చేసుకున్నందు వలన, నా దగ్గర ఉన్నందు వలన, నాతో పాటునీ మీద కూడా దక్షునికి ద్వేషం పుట్టింది. కాబట్టి ఇప్పుడు నీవు పుట్టింటికి వెళ్లినా దక్షుడు నిన్ను గౌరవించడు.  నా మీద కోపం నీ మీద చూపిస్తాడు. అనకూడదు కానీ నీ తండ్రి దుష్టుడు. నా వంటి నిరహంకారుడు, నిర్గుణుని చూచి, దురంహంకారి యగు నీ తండ్రి నా మీద ఈర్ష్య, ద్వేషముతో రగిలిపోతున్నాడు.

దేవీ! సాధారణంగా అజ్ఞానులు అయిన వాళ్లు ఒకరికి చూచి ఒకరునమస్కరించుకోవడం, అభివాదం చేసుకోవడం, చేస్తారు. వారుకేవలము దేహాభిమానులు. కాని జ్ఞానులకు ఈ నమస్కారములు ప్రతినమస్కారములు అవసరం లేదు. జ్ఞానులు దేహములోని అంతరాత్మను దర్శిస్తారు. వానికి నమస్కరిస్తారు.

అలాగేనేను దక్షునికి నమస్కరించలేదు. అతనిలో అంతర్లీనంగా ఉన్న వాసుదేవునికి నమస్కరించాను. అది తెలుసుకోలేక ఆ మూర్ఖుడు నేను తనను గౌరవించలేదని నామీద ద్వేషము పెంచుకున్నాడు.

దేవీ! వాసుదేవుడు అంటే ఎవరనుకున్నావు? పరిశుద్ధమైన అంత:కరణమే వాసుదేవుడు. వాసుదేవుడు అంటే అంతటాఉన్న వాడు. ఆ పరమాత్మ నాలో ఉన్నాడు, నీలో ఉన్నాడు, నీ తండ్రి దక్షునిలో ఉన్నాడు. దక్షునిలో ఉన్న ఆ వాసుదేవునికి నేను మనస్సులోనే నమస్కరించాను. నీ తండ్రి ఆ విషయం తెలుసుకోలేక నేను లేచి నిలబడి చేతులతో నమస్కరించలేదని అనుకొన్నాడు. అందుకని నా మీద కోపము, ద్వేషముతో రగిలిపోతున్నాడు.

దక్షుడు నీకు జన్మనిచ్చిన తండ్రి అయినప్పటికినీ నీవు ప్రస్తుతము ఆ ఇంటివి వెళ్లకూడదు. నీ తల్లి, అక్కలు కూడా దక్షుని మాట జవదాటరు. వారు కూడా నిన్ను అవమానం చేసే అవకాశం ఉంది. ఎందుకంటే, ప్రజాపతుల యజ్ఞములో నేను ఏమీ చేయక పోయినా, మాట్లాడకపోయినా, నీ తండ్రి నన్ను అకారణంగా దూషించాడు. నా కారణంగా నిన్ను దూషించే అవకాశం లేకపోలేదు. అందుకని నీవు దక్షుని యజ్ఞమునకు పోవడం మంచిది కాదు.

ఇంత చెప్పినా, నా మాట వినకుండా, నీవు నీ తండ్రి చేయు యజ్ఞమునకువెళితే నీకు పరాభవము తప్పదు. గౌరవము ,మర్యాద కలిగిన నీ వంటి సాధ్వికి తన బంధువుల వలన అవమానము జరిగితే అది మరణానికి కూడా దారి తీయవచ్చు. కాబట్టి నీవు వెళ్లకపోవడమే మంచిది." అని అన్నాడు శివుడు.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము

నాలుగవ అధ్యాయము.

ఈ విధంగా చెప్పిన శివుడు, నిర్ణయాన్ని సతీదేవికి వదిలి మౌనంగా ఉండిపోయాడు. కాని శివుని మనసులో కీడు శంకించాడు. "నేను వెళ్లమన్నా, వద్దన్నా ఈమె మాత్రం తన పుట్టింటికి పోవడం తథ్యం. వెళ్లిన ఈమె తిరిగి రావడం అనుమానమే. స్వాభిమానం కల సతీదేవి ప్రాణత్యాగం చేసుకోవచ్చు." అని అనుకున్నాడు శివుడు.

శివుడిమనసులో ఇలా ఆలోచిస్తుంటే, సతీదేవి మాత్రం లోపలకు బయటకు అసహనంగా తిరుగుతూ ఉంది. ఆమె కూడా ఎటూ తేల్చుకోలేకపోతోంది. వెళితే భర్తకు కోపం వస్తుందేమో, వెళ్లకపోతే తన వారిని చూచే అవకాశం ఇప్పట్లో రాదేమో అని మథనపడుతూ అటు ఇటు తిరుగుతూ ఉంది.

పెళ్లి అయిన తరువాత పుట్టింటి పోలేదు సతీదేవి. అందుకని తన తల్లిని, అక్కలను, బంధువులను చూడవలెనని కోరిక బలంగా ఉంది. అది తీరకపోవడంతో కళ్లలో నీళ్లు తరుగుతున్నాయ సతీదేవికి. ఏడుపు వస్తూ ఉంది. శరీరం అంతా వణుకుతూ ఉంది. భర్త వద్దన్నందుకు ఆమెకు భర్త మీద పట్టరాని కోపంగా ఉంది. భర్తను తన చూపులతో కాల్చివేస్తుందా అన్నట్టుకొర కొరా చూస్తూ ఉంది.

ఏమయితే అది అయిందని పుట్టింటికి పోవడానికే నిర్ణయించుకుంది సతీదేవి. శివుని భార్య అయినప్పటికీ, స్త్రీ సహజమైన మూర్ఖత్వముతో, పరమ శివుని మాటలను లక్ష్యపెట్టకుండా పుట్టింటికి బయలుదేరింది.

ఒంటరిగా వెళుతున్న సతీదేవిని చూచి మణిమంతుడు, మదుడు మొదలగు శివుని అనుచరులు ఆమె వెంట వెళ్లారు. అందరి కన్నా ముందు నందీశ్వరుడు బయలుదేరాడు. వాళ్ల వెంట అనేక మంది శివుని అనుచరులు, యక్షులు బయలు దేరారు.  వారందరూ సతీదేవి వద్దకు వెళ్లారు. ఆమెనునందీశ్వరుని మీద ఎక్కించారు. కొంత మంది ఆమెకు గొడుగుపట్టారు. మంగళ తూర్యనాదములతో ఆమెను అనుసరించారు.  ఆ ప్రకారంగా శివుని భార్య సతీదేవి, భర్త

ఆదేశమునకు విరుద్ధంగా, దక్షుని యజ్ఞము చేయు ప్రదేశమునకు చేరుకుంది.

యజ్ఞవాటికలో వేదఘోషలు వినబడుతున్నాయి. ఆ సమయంలో యజ్ఞమునకు సంబంధించిన పశువిశసనము జరుగుతూ ఉంది. నాలుగు పక్కలా దేవతలు, బ్రాహ్మణులు కూర్చుని ఉన్నారు. మట్టి పాత్రలు, కొయ్యతో చేసిన గరిటలు, బంగారుపాత్రలు, దర్భలు అన్నీ యాగశాల చుట్టు పరచబడి ఉన్నాయి.

సతీదేవి రావడం దక్షుడు చూచాడు. కానీ ఆమెను కనీసం పలకరించలేదు. ఆమెను పలకరించాలని మర్యాద చేయాలని అక్కడ ఉన్న వారికి మనసులో ఉన్నా, దక్షుడికి భయపడి ఎవరూ ఆమెను పలకరించలేదు. మర్యాదచేయలేదు.

ఇంతలో సతీదేవి తల్లి, దక్షుని భార్య, తన కుమార్తెలతో సహా అక్కడికి వచ్చింది. కూతురిని గాఢంగా కౌగలించుకుంది. సతీదేవి అక్కలు కూడా ఆమెను కుశల ప్రశ్నలు వేసారు. కానీ సతీదేవికి తన తల్లి, పినతల్లులు, అక్కల పలకరింపులు, ఆదరణ, ఆప్యాయతము ఆమె చాలాసంతోషించింది ఆమె కళ్లవెంట ఆనంద భాష్పాలు కారుతున్నాయి. . తన తండ్రి తనను కనీసం పలకరించకుండా అవమానం చేసాడు అనే బాధ మనసులో ముల్లులా గుచ్చుకుంటూ ఉంది.

ఆమెకు తన తల్లి అక్కలమాటలు వినపడటం లేదు. వారు ఇచ్చిన అలంకారములను, ఆసనములను ఆమె స్వీకరించలేదు. తన తండ్రి దక్షుడు తన భర్తను పిలవకుండా ఆయనను అవమానించాడు.

పిలవకపోయినా వచ్చిన తనను కూడా కనీసం పలకరించకుండా అవమానించాడు.

ఆమె ఇంకొక విషయంగమనించింది. అక్కడ దేవతలందరికీ పేరుపేరునా హవిర్భాగములను ఇస్తున్నారు. కానీ తన భర్త శివుని పేరు వినిపించడం లేదు. అంటే తన తండ్రి తన భర్తకు చెందవలసిన హవిస్సునుకూడా ఇవ్వడం లేదన్నమాట!

సతీదేవి కోపం మిన్ను ముట్టింది. ఆమె తన కళ్లతో లోకాలన్నీ దగ్ధం చేస్తుందా అన్నట్టు కోపంగా చూస్తూ ఉంది. సతీ దేవికి జరిగిన అవమానము ఆమెకు వచ్చినకోపం చూచి ఆమె వెంటవచ్చిన రుద్రగణములు ముందుకు ఉరకడానికి సిద్ధంగా ఉన్నాయి. వారిని సతీదేవి చేతితో వారించింది. గర్విష్టి, శివద్వేషి అయిన తన తండ్రి దక్షుని చూచి ఇలా అంది.

"తండ్రీ! నీ అల్లుడు గారు పరమ శివుని గూర్చి నీకు బాగా తెలుసు. ఆయన మానవుల కందరికీ ప్రియమైన వాడు. ఆయనకు విరోధులు అంటూ ఎవరూ లేరు నీవు తప్ప. ఆయన అందరికన్నా గొప్పవాడు. అటువంటి శివుని నీవు ద్వేషిస్తున్నావు. సత్పురుషులు అయిన వారు ఇతరుల లో ఉన్న దోషములను కూడా మంచి గుణములుగానే గ్రహిస్తారు. కానీ నీవంటి అసూయా పరుడు ఇతరులలో ఉన్న మంచి గుణములను కూడా చెడ్డ గుణములు గానే భావిస్తాడు. అందుకనే నీవు సకల జనులచేత కీర్తింపబడుతున్న శివుని మీద ద్వేషము పూనావు.

నీకు దేహాభిమానము ఎక్కువ. ఈ దేహమునే సర్వస్వముగా భావిస్తున్నావు. నీ వంటివారు పరమశివుని వంటి మహాత్ములను నిందించడంలో ఆశ్చర్యం లేదు. కాని ఒక మాట గుర్తు పెట్టుకో. పరమశివుని వంటి మహాత్ములు తమను ఎంత దూషించిన సహిస్తారు. కానీ వారి పాదరేణువుల వంటి వారు మాత్రం ఏ మాత్రం సహించలేరు. శివ అనే నామము మంగళకరమైనది. ఒక్కసారి నాలుకతో పలికినా సర్వపాపములు తొలగిపోతాయి. కానీ నీవు అమంగళకరుడవు.అందుకే మంగళకరుడైన శివుని ద్వేషిస్తున్నావు. ఎవని పాదపద్మములను దేవతలందరూ సేవిస్తుంటారో, ఎవని పాదపద్మములను ఆశ్రయిస్తే సకల కోరికలు నెరవేరుతాయో, అట్టి శివుని నువ్వు అకారణంగా దూషించావు.

నిజమే. నా భర్త శివుడు శ్మశానాలలో తిరుగుతుంటాడు. కపాలములను మాలగా ధరిస్తాడు. భూత ప్రేతపిశాచములతో కూడి శ్మశానములలో ఉంటాడు. కాని అటువంటి శివుని పాద రేణువులను బ్రహ్మాది దేవతలు శిరస్సున ధరిస్తారు. కాని నువ్వు మాత్రం నా భర్త పేరుకే శివుడనీ, ఆయన వేషము, చేసే చేష్టలు అమంగళకరములనీ భావిస్తుంటావు. ఆయన పట్ల ద్వేషము పూనిన నీవు అలా భావించక ఇంకోలా ఎలా భావిస్తావు?

ఓ తండ్రీ! దాసులైన వారు తమ ప్రభువును ఎవరైనా దూషిస్తే వారిని సంహరిస్తారు. లేదా ఆ అవమానము భరించలేక ఆత్మాహుతి చేసుకుంటారు. దానికీ సమర్థత లేకపోతే చెవులు

మూసుకొని అక్కడి నుండి వెళ్లిపోవాలి. సమర్థత ఉంటే తమ ప్రభువును గురించి అమంగళకరమైన పలుకులు పలికిన వారి నాలుక కోసేస్తారు. తరువాత తనకు తాను ఆత్మాహుతి చేసుకుంటారు. ప్రభువులభక్తులకు, దాసులకు ఇదే కర్తవ్యము.

నేను నా ప్రభువు శివునికి దాసురాలిని భక్తురాలిని. నీవు నా తండ్రివి. నిన్ను నేను ఏమీ చేయలేను. అందుకని ఆత్మాహుతి చేసుకుంటున్నాను. నీవు శివుని ద్వేషిస్తున్నావు. నీ వలన లభించిన ఈ దేహము నాకు అక్కర లేదు. దీనిని వెంటనే విడిచిపెడుతున్నాను. ఎల్లప్పుడూ తనలో తాను ఆత్మానందాన్ని అనుభవించేవాడు, ఆత్మలో రమించే వాడు వేదాలలో ఏమి చెప్పారో, ఎన్ని కర్మకాండలు ఉన్నాయో అవన్నీ పట్టించుకోడు. అలాగే దేవతలకు ఉన్న ధర్మము,మానవులకు ఉన్న ధర్మము వేరు.

అలాగే జ్ఞాన కాండ వేరు, కర్మ కాండవేరు. ఎవరి ధర్మము వారిది. ఒకరిని ఒకరునిందించ కూడదు. మనస్సును, ఇంద్రియములను నిగ్రహించి, తపస్సు చేయడం వేరు. యజ్ఞయాగాది కర్మలు చేయడం వేరు. రెండూ అవసరమే. వేదములలో ఈ రెండు మార్గముల గురించి చెప్పారు. ఈ రెండు కర్మలను ఒకే వ్యక్తి ఆచరించడం కూడా సంభవమే. యజ్ఞయాగాలు చేస్తూ, మనస్సును, ఇంద్రియములను అదుపులో ఉంచుకొని తపస్సు చేసే వాళ్లు కూడా ఉన్నారు. భోగములు అనుభవించడం, వైరాగ్యాన్ని ఆచరించడం రెండూ ప్రాపంచిక విషయములే.

నా భర్త అయినపరమేశ్వరునికి ఈ ప్రాకృతిక కర్మలతో పనిలేదు. వేదవిధానాలతో పనిలేదు. యజ్ఞయాగాదులతో పని లేదు.

ఆయనకు తెలిసింది పరమాత్మ సేవ ఒక్కటే. నీవు యజ్ఞయాగాదులతో మునికి తేలుతుంటావు. నా భర్త వద్ద అణిమాది అష్టసిద్ధులు ఉన్నాయి. నీ వద్ద అవి లేవు. నీకు ఉన్న ఐశ్వర్యములు, ధనధాన్యములు, భోగభాగ్యములు యజ్ఞయాగములు చేయడానికే పరిమితములు. నీ లాంటివారు నా భర్తలాంటి వారిని అర్థం చేసుకోలేరు. నారదుడు మొదలగు మహర్షులు నా భర్తలాంటి వారిని అర్థంచేసుకోగల సమర్థులు.

ఓ తండ్రీ! నీవు శివద్వేషివి. నీ శరీరంలో అణువణువు శివుని మీద ద్వేషంతో రగిలిపోతూ ఉంది. నీ దేహమునుండి పుట్టిన ఈ దేహముతో నాకు పని లేదు. నిన్ను తండ్రి అని చెప్పుకోడానికి నేను సిగ్గుపడుతున్నాను. నా భర్త వంటి మహాత్ములను ద్వేషించే నీవంటి వారి జన్మ హీనమైనది. ఒక వేళ నేను బతికి ఉన్నా, నా భర్త నన్ను దాక్షాయణీ అని పిలిస్తే, ఈ దక్షుడా నా తండ్రి అని నేను బాధపడాల్సివస్తుంది. నీ వలన కలిగిన ఈ దేహము నాకు శవముతో సమానము. ఈ దేహమును నేను భరించలేను. వెంటనే విడిచిపెడతాను." అని పలికింది సతీదేవి.

వెంటనే ఆ యజ్ఞశాలలో ఉత్తరదిక్కుగా మొహం పెట్టి కూర్చుంది. తన చీరతో ఒళ్లంతా కప్పుకుంది. చేతిలోకి నీటిని తీసుకొని ఆచమనం చేసింది. రెండు కళ్లను మూసుకొని యోగమార్గములోకి ప్రవేశించింది. ప్రాణాపానములను బంధించింది. తన ప్రాణములను నాభి చక్రం దగ్గరనిలిపింది. ఉదాన వాయువును మెల్లి మెల్లి గా బుద్ధితో కలిపి హృదయంలో నిలిపింది. తరువాత తన ప్రాణములను

నొసటి దగ్గరకు చేర్చింది. రుద్రుని చేత స్పృశించబడిన తన శరీరము అంతటా అగ్నిని వాయువును ప్రసరింప చేసింది. తన మనస్సును శివుని యందు లగ్నం చేసింది. సతీదేవి లో నుండి పుట్టిన అగ్ని ఆమెను దగ్ధంచేసింది.

సతీదేవి మంటలలో కాలి పోవడం చూచి అక్కడ ఉన్న వారందరూ హాహాకారాలు చేసారు. “ఈ దక్షుని దూషణల వల్ల కదా శివుని భార్య సతీదేవి దుర్మరణం పాలయింది” అని అందరూ మనసులో దక్షుని నిందించారు. ఇంకా మరి కొంత మంది “తన కుమార్తె అనే భావన కూడా లేకుండా, ఆమెను గౌరవించకుండా, ఆమె మరణానికి కారకుడయ్యాడు ఈ దక్షుడు” అని నిందించసాగారు.

“ఈ దక్షుడికి ఈ లోకంలో అపకీర్తి, పరలోకములో నరకము తథ్యము. కన్నకూతురు ఇంటికొస్తే కనీస మర్యాద చేయలేదు. మంటలలో కాలి పోతున్నా కనీసం ఆపను కూడా ఆపలేదు. వీడికినరకమే తగినది” అని కొంతమంది అనుకొన్నారు.

ఈ ప్రకారంగా అక్కడ చేరిన వారు పరి పరి విధములుగా అనుకొన్నారు. తమ ప్రభువు అయిన పరమశివుని భార్య సతీదేవి తమ కళ్ల ముందు ప్రాణత్యాగము చేసుకొని మంటలలో కాలిపోతుంటే శివుని అనుచరులు సహించలేకపోయారు. వెంటనే తమ చేతులలో అస్త్రములు, శస్త్రములు ధరించి దక్షుని చంపడానికి అతని మీదికి వెళ్లారు.

యజ్ఞమునకు ఆధ్వర్యము వహిస్తున్న భృగువు ఇదంతా చూచాడు. శివుని అనుచరులను పారదోలడానికి యజుర్వేదములో చెప్పబడిన మంత్రములను ఉచ్ఛరిస్తూ దక్షిణాగ్నిలో హెూమం చేసాడు. అప్పుడు దక్షిణాగ్నినుండి ఋషభులు అనే దేవతలు పుట్టుకొచ్చారు. ఋషభులందరూ హెూమగుండములో ఉన్న కొరివి కట్టెలను తీసుకొని శివుని అనుచరుల మీద తిరగబడ్డారు. ఋషభుల ధాటికి తట్టుకోలేక శివుని అనుచరులు నలుదిక్కులకు పారిపోయారు.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## చతుర్థస్కంధము

## ఐదవ అధ్యాయము

దక్షుని యజ్ఞానికి సతీదేవి రావడం, ఆమెను దక్షుడు పలకరించకుండా, మర్యాద చేయకుండా అవమానించడం, ఆమె యోగాగ్నిలో పడి దగ్ధంఅయి పోవడం అంతా కళ్లారా చూచిన నారదుడు వెంటనే కైలాసానికి పోయి ఈశ్వరుడికి ఈ విషయాలన్నీ వివరంగా తెలియజేసాడు.

తన భార్య మరణ వార్త విన్న మహేశ్వరుడు కోపంతో మండి పడ్డాడు. వెంటనే తన జటాజూటము నుండి ఒక జడను లాగి నేలకేసి బలంగా కొట్టాడు. ఆ జడనుండి పెద్ద శరీరముతో, మూడు నేత్రములతో, సహస్రబాహువులతో, కపాల మాలను ధరించిన ఒక భయంకరాకారుడు పుట్టాడు. అతడే వీరభద్రుడు.

వీరభద్రుడు తల వంచి శివునికి నమస్కరించి "నా వల్ల కావలసిన పనిఏమిటో చెప్పండి" అని అడిగాడు.

"వీరభద్రా! నీవు నా అంశతో జన్మించావు. నా పరివారము నకు నాయకుడవై దక్షుని చేయు యజ్ఞమును ధ్వంసము చెయ్యి."అని ఆదేశించాడు శివుడు.

శివుని ఆదేశమును పొందిన వీరభద్రుడు రుద్ర పరివారమును వెంటతీసుకొని దక్షుడు యజ్ఞము చేయు ప్రదేశమునకు వెళ్లాడు. భయంకరాకారుడైన వీరభద్రుడు అతని అనుచరులు చాలా దూరంలో ఉండగానే ఆకాశమంతా ఎర్రని ధూళి ఆవరించింది. అది చూచి యజ్ఞవాటికలో ఉన్న బ్రాహ్మణులు, ఋత్విక్కులు అందరూ కలవరపడ్డారు. కొంత మంది "సతీదేవిని అవమానించినపాపం ఊరికే పోతుందా" అని అనుకోసాగారు.

ఇది చూచి దక్షునికి కూడా భయం వేసింది. పైకి మాత్రం ధైర్యంగా ఉన్నాడు. అంతలోనే శివుని అనుచరులు ఆ యజ్ఞశాలను చుట్టుముట్టారు. యజ్ఞశాలను ధ్వంసం చేయసాగారు. పందిళ్లను

కూలదోసారు. సభామండపమును కూలగొట్టారు. యజ్ఞపాత్రలను పగలగొట్టారు. నెయ్యిపాలు అన్నీపారపోసారు. తాళ్లు అన్నీ తెంపేసారు.

మణిమంతుడు అనే శివుని అనుచరుడు భృగువును, వీరభద్రుడు దక్షుని, చండేశుడు సూర్యుని, నందీశ్వరుడు భగుని బంధించారు. మిగిలిన రుద్ర అనుచరులు రాళ్లతోనూ కర్రలతోనూ అక్కడ ఉన్న బ్రాహ్మణులను, ఋత్విక్కులను కొట్టసాగారు. వీరభద్రుడు భృగువు మీసాలుపీకాడు. భగదేవుని రెండు కళ్లుపీకాడు. పూషుని పళ్లు రాలగొట్టాడు. ఆఖరున దక్షుని కింద పడవేసి అతని గుండెల మీద కూర్చుని, యజ్ఞములో పశువులను నరికే కత్తి తీసుకొని, దక్షుని మెడను నరికాడు. దక్షుని తల శరీరము నుండి వేరయింది.

దక్షుని చావు చూచిన భూత,ప్రేత,పిశాచములు ఆనందముతో నృత్యం చేసాయి. దక్షుని భార్యలు, కుమార్తెలు హాహాకారాలు చేసారు. అప్పటికీ కోపం తీరని వీరభద్రుడు దక్షుని తలను దక్షిణాగ్నిలో పడవేసి ఆహుతి చేసాడు.

తరువాత శివుని అనుచరులు యజ్ఞమునకు వచ్చిన దేవతలను, గంధర్వులను, ఋత్విక్కులను నానా రకములయిన ఆయుధములతో చావగొట్టారు. వారందరూ పారిపోయారు. తరువాత వీరభద్రుని అనుచరులు యజ్ఞవాటికను దగ్ధం చేసారు. వీరభద్రుడు, అతని అనుచరులు వచ్చిన పని పూర్తిచేసుకొనికైలాసం వెళ్లిపోయారు.

శ్రీమద్భాగవతము చతుర్థస్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము

ఆరవ అధ్యాయము.

వీరభద్రుడు వెళ్లి పోయిన తరువాత దేవతలందరూ, ఋత్విక్కులను వెంటబెట్టుకొని బ్రహ్మదేవుని వద్దకు వెళ్లారు. వీరభద్రుడు అతని అనుచరులు దక్షయజ్ఞమును ఎలా ధ్వంసం చేసారో వివరంగా చెప్పారు. దక్షుడు పరమశివుని అవమానపరిచాడు కాబట్టి ఇలాంటిది ఏదో జరుగుతుందని, బ్రహ్మ, విష్ణువు దక్షుని యజ్ఞమునకు వెళ్లలేదు.

దేవతలు చెప్పింది అంతా విన్న బ్రహ్మ వారితో ఇలా అన్నాడు. "ఓ దేవతలారా! పరమశివుని దూషించిన వాడికి ఇంతకన్నా ఘనమైన సత్కారము ఏం జరుగుతుంది. దక్షుడు అలా చేసాడు.మీరు కూడా ఆ యజ్ఞమునకుపోయి శివునికి దూరం అయ్యారు. కాబట్టి ఇప్పుడు మీరు వెళ్లి పరమశివునిపాదములను ఆశ్రయించడమే శ్రేయోదాయకము.

శివునికి కోపం వస్తే మూడులోకాలను భస్మం చేస్తాడు. దక్షుడు పలికిన పలుకుల వలన శివుని మనస్సు బాగా గాయపడింది. దానికి తోడు ఆయన భార్య మరణించింది. దాంతో ఆయన కోపం ఇంకా ఎక్కువఅయింది. ఇప్పుడు మీరందరూ ఆయన వద్దకుపోయి మీరు చేసిన తప్పులకు పరమశివుని క్షమించమని కోరండి. మరలా యజ్ఞమును యధావిధిగా కొనసాగించమని అర్థించండి. ఇంతకన్నా వేరు ఉపాయము మరొకటి నాకు తోచడం లేదు." అని అన్నాడు

బ్రహ్మదేవుడు.

ఆ మాటలు విన్న దేవతలు బ్రహ్మదేవుని కూడా తమ వెంట రమ్మని అర్థించారు. వారి కోరిక మన్నించి బ్రహ్మ దేవుడు కూడా వారి వెంట బయలు దేరాడు. బ్రహ్మగారి నాయకత్వంలో దేవతలు, ప్రజాపతులు, ఋత్విక్కులు అందరూ కైలాసానికి బయలు దేరారు.

కైలాసంలో సిద్ధులు, దేవతలు, ఆ పరమశివుని నిత్యము సేవిస్తూ ఉంటారు. కిన్నరులు, గంధర్వులు, అప్సరసలతో కైలాసం నిండి ఉంటుంది. కైలాసములో ఉన్న పర్వత శిఖరములు పళ్లు, పూలు సమృద్ధిగా ఉన్న వృక్షములతోనూ, ధాతువులతోనూ నిండి ఉన్నాయి. నిర్మలమైన నీటితో నిండిన సెలయేళ్లు గలా గలా పారుతున్నాయి. నెమళ్లు, కోయిలలు మొదలగు పక్షుల కిలా కిలా రావాలతో కైలాసము మార్మోగిపోతోంది. కొండ చరియలలో ఏనుగులు సంచరిస్తూ కొండలు కదులుతున్నాయా అన్నట్టు ఉన్నాయి.

ఆ కైలాస పర్వతము మీద మందారములు, పారిజాతములు, సరలములు, తమాలములు, మద్ది, తాడి, ఎర్రచందనము, వేగిస, అర్జున, మామిడి, కడిమి, వేప, నాగ,పున్నాగ, చంపక, పాటల, అశోక, పొగడ, మొల్ల, గోరంటి, తామల, ఉసిరిక, ఉత్తరేణి, మల్లె, మాధవి, పనస, అత్తి, అశ్వత్థ, జువ్వి, జమ్మి, నేరేడు, ఖర్జూర, మామిడి, విప్ప, గార, వెదురు మొదలగు వృక్షములు, పొదలు, లతలతో శోభాయమానంగా ఉంది.

కైలాస పర్వతము మీద ఉన్న సరోవరములు, సెలయేళ్లు నిర్మలమైన జలముతో అలరారుతున్నాయి. అంతే కాకుండా కైలాస పర్వతము మీద రకరకాలైన జంతువులు తిరుగుతున్నాయి. అటువంటి కైలాస పర్వతమును చూచి దేవతలు ఎంతో ఆశ్చర్యపోయారు. కైలాస పర్వతమునకుపోవు దారిలో వారికి అలకా పురి కనపడింది. అక్కడ ఉన్న సౌగంధికము అనే వనమును చూచారు.

ఆ అలకాపురి పక్కనే నంద, అలక నంద అనేనదులు ప్రవహిస్తున్నాయి. దేవతా స్త్రీలు, అప్సరసలు దేవలోకము నుండి దిగివచ్చి ఆ నదులలో స్నానం చేస్తున్నారు. ఆ రెండు నదులలోకి దిగి ఏనుగులు తనివిదీరా జలకాలాడి నిర్మలమైన ఆ నదీజలములను తాగుతున్నాయి. అలకాపురిలో ఉన్న ఎత్తైన సౌధములు అన్నీ బంగారుతో కప్పబడి ఉన్నాయి. ఆ అలకాపురిని యక్షులకు రాజైన కుబేరుడు పరిపాలిస్తున్నాడు. దేవతలు సౌగంధిక వనమును చేరుకున్నారు. ఆ వనములో కోకిలలు మొదలగు పక్షుల కిలకిలారావములు, తుమ్మెదల ఝుంకారములు మారుమోగుతున్నాయి.

పరమశివుని వద్దకుపోతున్న దేవతలు అక్కడ ఒక వటవృక్షమును చూచారు. ఆ వృక్షము నూరు యోజనముల ఎత్తు, డెబ్బైఆరు యోజనముల వెడల్పుకలిగి ఉంది. ఆ వటవృక్షము కింద శివుడు కూర్చుని ఉన్నాడు. ఆయన చుట్టు కుబేరుడు, సిద్ధులు, సనకసనందనాదులు, యక్షులు, రాక్షసులు కూర్చుని ఉన్నారు. ఆ సమయంలో శివుడు ఒంటి నిండా భస్మము పూసుకొని, చేతిలో దండకమండలములు ధరించి, మృగచర్మముకట్టుకొని, తలమీద చంద్రవంకను ధరించి, ఆ చెట్టు కింద ప్రశాంతమైన చిరునవ్వుతో

దర్భలతో చేసిన ఆసనము మీద కూర్చుని ఉన్నాడు.

ఆ సమయంలో శివుడు నారదుడు అడిగిన ప్రశ్నలకు బదులు చెబుతూ, తత్త్వజ్ఞానమును ఉపదేశిస్తున్నాడు. శివుడు తన ఎడమ పాదమును కుడి తొడపైన, ఎడమ చేతిని ఎడమ తొడమీద పెట్టుకొని కూర్చుని ఉన్నాడు. కుడిచేతిలో జపమాల ఉంది. అటువంటి శివుని చూచి దేవతలు అందరూ ఆయనకు భక్తితో నమస్కరించారు. బ్రహ్మ తన వద్దకు రావడం చూచిన శివుడు లేచి నిలబడ్డాడు. ఆయనకునమస్కరించాడు. ఆయనతో పాటుసిద్ధులు, నారదుడు, దేవతలు కూడా బ్రహ్మకు నమస్కరించారు.

శివుడు బ్రహ్మ ఉచితాసనమును చూపించాడు. తనకు నమస్కరిస్తున్న శివుని చూచి బ్రహ్మ చిరునవ్వుతో ఇలాఅన్నాడు.

"ఓ పరమశివా! నీవు ఈ చరాచర జగత్తుకు ఈశ్వరుడవుకదా! నీవేప్రకృతివి. నీవే పురుషుడవు. నీవు నిర్గుణుడవు. నిరాకారుడవు. నీవునాకు నమస్కరిస్తున్నా, నేను నిన్ను ఈశ్వరునిగానే భావిస్తున్నాను.

ఓ పరమశివా! నీవే సృష్టి, స్థితి, లయకారకుడవు. దక్షుడు చేసినయజ్ఞము కూడా నీ అనుగ్రహము వలన జరిగినదే కదా! లోకములో వర్ణాశ్రమ ధర్మములను నీవే కదా నిర్ణయించినది. మంచి పనులు చేసిన వారికి స్వర్గమును, మోక్షమును నీవే కదా

ప్రసాదిస్తున్నావు. దుర్మార్గులకు నీవే కదా నరకలోకమును విధిస్తున్నావు. కాని కొందరి విషయంలో ఇది అటు ఇటు జరుగుతూ ఉంది.

ఓ పరమశివా! ఎల్లప్పుడూ నీపాదములనే సేవించు వారు, అన్ని ప్రాణులలో నిన్నే దర్శించువారు, ఈ సృష్టిలో ఉన్న అన్ని ప్రాణులను సమదృష్టితో భేదభావం లేకుండా చూచేవారు నీ కోపానికి పాత్రులు కారు. ఈ లక్షణములు లేకపోవడం చేత దక్షుడు నీ ఆగ్రహానికి గురి అయ్యాడు. సాటి మానవులలో భేదదృష్టి కలవారు, (వాడు ఎక్కువ, వీడు తక్కువ అనీ, కుల, మత, ప్రాంతములను బట్టి, ధనిక పేద తారతమ్యమును బట్టి, భేదభావమును కలిగి ఉండటం), లౌకికమైన కర్మల యందు ఆసక్తి కలిగి ఉండటం, ఇతరుల ఐశ్వర్యమును ఉన్నతిని చూచి ఓర్వలేకపోవడం, ఇతరులను దూషించడం, ఇతరులను శారీరకంగా మానసికంగా హింసించడం, అటువంటి వారిని భగవంతుడే తగిన విధంగా శిక్షిస్తాడు. దక్షుడికి పైచెప్పిన అవలక్షణాలు ఉన్నాయి. వాడిని భగవంతుడే శిక్షిస్తాడు కదా! నీవు ఎందుకు వాడి యజ్ఞాన్నిపాడుచేసి వాడిని చంపించావు.

ఓ పరమశివా! ఎప్పుడైనా,ఎక్కడైనా మానవులు విష్ణుమాయచేత మోహితులై ఏమైనా తప్పులు చేస్తే, నీ వంటి సాధువులు వారి మీద దయచూపాలి, వారు చేసిన పనులు అన్నీ ప్రారబ్ధములు అని సరిపెట్టుకోవాలి కానీ, వారి మీద నీ పరాక్రమము చూపడం ధర్మమా! దక్షుడు ఆ పరమాత్మ సృష్టించిన మోహంలో ఉన్నాడు. నీవు ఆ మోహానికి అతీతుడవు. మోహాతీతుడవైన నీవు, మోహములో పడి తప్పులు చేసేవారి పట్ల, లౌకిక కర్మలయందు ఆసక్తి కలిగి, అహంకారంతో ఇతరులను దూషించే వారిపట్ల, దయచూపాలి

కానీ, శిక్షించరాదు.

ఓ పరమశివా! నీవు యజ్ఞఫలములను ఇచ్చేవాడివి. యజ్ఞఫలములను స్వీకరించేవాడివి. దక్షుని ఆజ్ఞమేరకు నీకు యజ్ఞభాగమును ఇవ్వనందువలన, ఆ యజ్ఞమును ధ్వంసం చేసావు. ఆ యజ్ఞము అసంపూర్తిగా మిగిలిపోయింది. యజ్ఞము ఈ ప్రకారంగా అర్థాంతరంగా ఆగిపోకూడదు. కాబట్టి దక్షుని యజ్ఞమును మరలా కొనసాగేట్టు చెయ్యి. దక్షుని మరలా పునర్జీవితుడిని చెయ్యి. భగుడికి కళ్లను, భృగువుకు మీసములను, పూషునకు దంతములను మరలా వచ్చేట్టు చెయ్యి. ఈ ధ్వంసకార్యక్రమములో రాళ్ల దెబ్బలు, కర్రలతో దెబ్బలు తిని గాయముల పాలైన ఋత్విక్కులను, బ్రాహ్మణులను మరలా ఆరోగ్యవంతులను చెయ్యి.

ఓ రుద్రభాగా! ఈ యజ్ఞములో నీ హవిర్భాగమును నీవు తీసుకో. ఏ యజ్ఞములోనైనా అందరికీ భాగములు ఇవ్వగా మిగిలినదంతయూ నీకే చెందుతుంది. కాబట్టి దయయుంది ఈ యజ్ఞమును పూర్తిచేయి."అని బ్రహ్మదేవుడు శివునికి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము

ఏడవ అధ్యాయము.

బ్రహ్మ చెప్పిన మాటలనుసావధానంగా విన్న మహాశివుడు చిరునవ్వు నవ్వాడు. "బ్రహ్మదేవా! నాకు ఎవరి మీద కోపము ద్వేషము లేవు. దక్షుడు మాయామోహితుడు. అజ్ఞాని. ఆయన చేసిన అపరాధములగురించి నేను చర్చించదలచుకోలేదు. కేవలము లోక మర్యాద కాపాడటం కోసం కోసరం దక్షునికి శిక్ష విధించాను.

దక్షుని శిరస్సు హెూమగుండములో పడి కాలిపోయినది. కాబట్టి అతనికి ఒక మేక తల తెచ్చి అతికించండి. అతను పునర్జీవితుడు అవుతాడు. భగదేవత మిత్రుని కళ్లను తన కళ్లుగా చేసుకుంటాడు. పూషునకు పళ్లు లేవు కాబట్టి ఆయనకు ఇకనుండి నమల నవసరం లేని పిండి ఆహారం అవుతుంది. మీరు నాకు యజ్ఞములో మిగిలిన భాగమును నాకు అర్పించారు కాబట్టి మీరు దక్షయజ్ఞధ్వంసములో కోల్పోయిన మీమీ అవయవములు మీకు మరలా లభిస్తాయి. మీ గాయములు మానిపోతాయి. మీరు మరలా ఆరోగ్యవంతులవుతారు." అని అన్నాడు.

మహాశివుడు పలికిన పలుకులకు అందరూ సంతుష్టిచెందారు. వారందరూ శివుని యజ్ఞమునకు ఆహ్వానించారు. శివుడు, బ్రహ్మ వెంట రాగా దేవతలు, ఋత్విక్కులు, ఋషులు అందరూ యాగశాలకు వెళ్లారు. యాగ శాలలో దక్షుని మొండెము పడి ఉంది. ఋత్విక్కులు అంతకు ముందు బలి ఇచ్చిన మేకపోతు తల

తెచ్చి దక్షుని మొండెమునకు అంటించారు. శివుడు దక్షుని ప్రేమతో చూచాడు.

దక్షుడు నిద్ర నుండి మేల్కొన్నవాడి మాదిరి మేల్కొన్నాడు. ఎదురుగా శివుడు కనిపించాడు. అప్పటి దాకా శివుని మీద ద్వేషంతో రగిలిపోయిన దక్షుని మనసు నిర్మలమైపోయింది. దక్షునికి తన కుమార్తె సతీదేవి గుర్తుకు వచ్చింది. తన వలన ఆత్మత్యాగము చేసుకున్న కుమార్తెను తలచుకొని దక్షుడు దు:ఖించాడు. అతని గొంతు పెగల లేదు. ఎదురుగా ఉన్న శివుని స్తుతించాలని మనసులో ఉన్నా కూతురు మరణాన్ని తలచుకొన్న దక్షుని గొంతు మూగవోయింది. అతికష్టంతో మనసును దిటవుపరచుకొని ఏ మాత్రం కపటం లేకుండా తన అల్లుడైన మహాశివుని ఇలా స్తుతించాడు.

"ఓభవా! నేను నిన్ను అకారణంగా అవమానించాను. దూషించాను. నాకు తగు దండన విధించి నన్ను కరుణించావు. నీవుకానీ, శ్రీహరి కానీ పేరుకు మాత్రమే బ్రాహ్మణులుగా ఉన్న వారినీ నా మాదిరి కేవలం యజ్ఞయాగాదులు చేస్తూ అహంకరించిన వారినీ ఏ మాత్రం ఉపేక్షచేయరు.

ఓ దేవా! నీవు నీ ముఖమునుండి వేదవిదులయిన బ్రాహ్మణులను నీ ముఖం నుండి సృష్టించావు. అటువంటి బ్రాహ్మణులను నీవు ఎల్లప్పుడూరక్షిస్తూ ఉంటావు. నీ యొక్క తత్త్వమును తెలుసుకొన లేక నిన్ను నిండు సభలో అందరి ఎదుటా దూషించాను

అవమానించాను. నేను నిన్ను దూషించి పతితుడనయ్యాను కానీ నీ మహత్తు ఏ మాత్రం తగ్గలేదు. నేను ఎంత దూషించినా నీవు నన్ను ఏమీ అనకుండా దయతో చూచావు. నా మీద ప్రసన్నుడవై నాకు మరలా పునర్జన్మను ప్రసాదించావు." అని మహాశివుని స్తుతించాడు దక్షుడు.

ఈ ప్రకారంగా దక్షుడు మహాశివుని తన తప్పులు క్షమించమని వేడుకున్న తరువాత బ్రహ్మదేవుని ఆదేశము ప్రకారము మరలా యజ్ఞమును కొనసాగించడానికి ఉపక్రమించాడు. ఋత్విక్కులు బ్రాహ్మణులు యజ్ఞశాలకు చేరుకున్నారు.మరలా యజ్ఞము మొదలయింది. అప్పటి దాకా అక్కడ జరిగిన మారణ కాండతో సంక్రమించిన దోష పరిహారార్ధము విష్ణుసంబంధమైన హోమములను చేసారు. పురోడాశము అనే హవిస్సును హోమంలో వేసారు.

దక్షుడు శ్రీహరికి చెందవలసిన హవిస్సును చేతిలోకి తీసుకొని విష్ణువును ఆహ్వానించాడు. విష్ణువు ప్రత్యక్షం అయి ఆ హవిస్సును స్వీకరించాడు.

గరుత్మంతుని మీద వచ్చిన విష్ణువు శ్యామల వర్ణంతో, మణి కిరీటంతో, కుండలములతో, నల్లని ముంగురులతో, శంఖు చక్రములతో, గద పద్మములతో, విరాజిల్లుతున్నాడు. విష్ణువు వక్షస్థలమున లక్ష్మీదేవి, వనమాల విరాజిల్లుతున్నాయి.విష్ణుపార్షదులు ఇరువైపులా వింజామరలు వీస్తున్నారు. విష్ణువు శిరస్సు మీద పాలనురుగు వంటి శ్వేతచ్ఛత్రము మెరిసిపోతూ ఉంది.

విష్ణువు రాగానే బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు, దేవతలు లేచి నమస్కరించారు. దేవతలందరూ విష్ణువును ఈ ప్రకారంగా స్తుతించారు. ముందు దక్షుడు, శ్రీహరి పూజకు కావలసిన వస్తువులను చేతిలోకి తీసుకొని విష్ణువును ఇలా స్తుతించాడు.

"ఓ దేవా! నీవు వైకుంఠములో ఉన్ననూ, ప్రకృతిలో నివసించు మానవుల హృదయాలలో నివసిస్తూ ఉంటావు. కాని వారిని ఆవరించిన మాయ నిన్ను అంటదు.నీవు పరిశుద్ధుడవు. నీవు సతతము మానవుల హృదయాలలో ఆత్మస్వరూపముగా ఉన్ననూ, ఈ ప్రాపంచిక విషయముల సంపర్కము నీకు ఉండదు. నిమిత్తమాత్రంగా, సాక్షీభూతంగా ఉంటావు. నీవు మాయను జయించిన వాడవు. మా అందరికీ అభయమును ప్రసాదించేవాడివి.

కానీ, నీవు మానవుల హృదయాలలో ఉన్నావు కాబట్టి, నీకు కూడా ఈ ప్రాపంచిక విషయములు, విషయవాంఛలతో సంబంధం కల్పించి నిన్నుకూడా మాయామోహితుని వలె ప్రజలు అనుకుంటూ ఉంటారు. నీకు ఏ వాసనా అంటదని వారికి తెలియదు." అని ప్రార్థించాడు దక్షుడు.

తరువాత ఋత్విక్కులు విష్ణువును ఇలా ప్రార్థించారు. "దేవా! మా అందరినీ నందీశ్వరుడు దారుణంగా శపించాడు. అందువలన మా బుద్ధి అంతా కర్మకాండల మీదనే లగ్నం అయి ఉంది. దానితో మాకు మూఢత్వము ఆవరించింది. మూర్ఖత్వములో పడిపోయాము.

అందు చేత మేము నీ తత్త్వమును తెలుసుకోలేకపోతున్నాము. కాని, మేము చేయు యజ్ఞముల ద్వారా, యజ్ఞస్వరూపుడవైన నిన్ను తెలుసుకోగలిగాము. నీ కొరకు, వివిధ దేవతలకొరకు, వివిధములైన యజ్ఞభాగములను, హవిస్సులను ఏర్పాటు చేసాము."అని అన్నారు.

తరువాత యజ్ఞమునకు వచ్చిన సదస్యులు ఇలా అన్నారు. "ఓ దేవా! ఈ సంసారము అనే అడవి మార్గము ఎన్నో కష్ట, నష్టములతో నిండి ఉంది. మానవుల మీద కాలము అనే భయంకర సర్పము, మృత్యురూపంలో ఎప్పుడు కాటు వేద్దామా అని పొంచి ఉంది. ఈ సంసారంలో సుఖము, దు:ఖము అనే గోతులు ఎన్నో ఉన్నాయి. దుర్మార్గులు అనే క్రూరజంతువులు మా చుట్టుపక్కల తిరుగుతూ ఉంటారు. శోకము అనే అగ్ని మా చుట్టునిరంతరము ప్రజ్వరిల్లుతూ ఉంది. విషయ వాంఛలు, కోరికలు అనేవి ఎండమావుల మాదిరి మా అందరినీ ప్రలోభపెడుతున్నాయి. ఆశచూపిస్తున్నాయి.

అటువంటి మార్గములో మేము ప్రయాణం చేస్తున్నాము. మాకు విశ్రాంతి అంటూ లేదు. ఈ సంసారము అనే దారిలో జననము, రోగములు,మరణము, ఈ దేహము మీద అభిమానము, ఇంటిమీద, భూముల మీద అభిమానము, స్త్రీవ్యామోహము మమ్ములను నిరంతరమూ కోరికల వైపుకు లాగుతున్నాయి. ఇటువంటి మార్గంలో ప్రయాణించేవారు నిన్ను ఎప్పటికి చేరుకుంటారో కదా!" అని ప్రార్థించారు.

తరువాత రుద్రుడు ఇలా కీర్తించాడు. "ఓ దేవా! కోరికలతో సతమతమయ్యే వాళ్లకు నీ పాదములు వాళ్ల కోరికలు తీర్చే కల్పవృక్షాలు. ఏ కోరికలు లేని మునులు కూడా నీ పాదములను సేవిస్తూ ఉంటారు.

మాలాంటి వారి మనస్సులు కూడా నీ పాదముల యందు లగ్నం అయి ఉన్నాయి. ఈ సత్యము తెలుసుకోలేని మూర్ఖులు, పరమేశ్వరుడు విష్ణువు పాదములను పూజించడం ఏమిటని విమర్శలు చేస్తుంటారు. నేను ఆ విమర్శలను ఏ మాత్రం లక్ష్యపెట్టను." అని అన్నాడు శివుడు.

తరువాత భృగు మహర్షి ఇలా ప్రార్థించాడు. ఓ దేవా! నీ మాయ తెలుసుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. బ్రహ్మ మొదలగు దేవతలు కూడా అజ్ఞానంలోపడి కొట్టుకుంటున్నారు. ఓ దేవా! నీ పరమాత్మ తత్త్వము వారి హృదయములలో సూక్ష్మరూపంలో నిక్షిప్తం అయి ఉన్నప్పటికీనీ, వారు నీ తత్త్వమును గురించి ఏ మాత్రం తెలుసుకోలేకపోతున్నారు. అటువంటి వారిని కూడా రక్షించే నీవు నా పట్ల ప్రసన్నుడవు కా దేవా!" అని ప్రార్థించాడు.

తరువాత బ్రహ్మ ఇలా అన్నాడు. "ఓ దేవా! ఈ జీవులు తమ కళ్లతో చూచే నీవు, చెవులతో విసే నీ తత్త్వము నిజం కాదు. అదంతా మాయ. నీవు వారు చూచే రూపము కంటే భిన్నంగా ఉన్నావు. ఎందు కంటే నీవు జ్ఞానస్వరూపుడవు. ఈ ప్రకృతికి, ఈ దేహమునకు ఆధారము నీవే. నీవు అంతటా నిండి ఉన్నావు. నీవు ఈ మాదిరి, ఈ ప్రదశములో ఉన్నావు అని చెప్పడం అజ్ఞానము కాక మరేమిటి?" అని స్తుతించాడు బ్రహ్మ.

తరువాత ఇంద్రుడు ఈ ప్రకారంగా ప్రార్థించాడు. "ఓ దేవా! నీవు ధర్మమును రక్షిస్తావు. అధర్మ ప్రవర్తకులను శిక్షిస్తావు. దేవతలకు

హాని కలిగించే రాక్షసులను నాశనం చేస్తావు. నీవు ఆ ప్రపంచమునకు అభయప్రదాతవు. నీ రూపు కళ్లకు, మనసుకు ఆనందాన్ని కలుగజేస్తుంది." అనిస్తుతించాడు ఇంద్రుడు.

తరువాత అక్కడ ఉన్న ఋషుల పత్నులు, ఋత్విక్కుల భార్యలు ఇలా ప్రార్థించారు. "ఓ యజ్ఞస్వరూపా! కేవలం నిన్ను పూజించడానికే బ్రహ్మ యజ్ఞములను సృష్టించాడు. కాని మామా అల్లుళ్ల కలహము వలన ఈ యజ్ఞము ఆగి పోయింది. శ్మశానమును తలపించే ఈ యజ్ఞభూమిని నీ పవిత్రము మంగళకరమైన చూపులతో శుద్ధిచేయి. ఈ యజ్ఞమును మరలా కొనసాగించు." అని ప్రార్థించారు.

తరువాత ఋషులందరూ ఇలా స్తుతించారు. "ఓ దేవా! నీవు ఎన్ని అవతారములు ఎత్తిననూ, ఎన్ని కార్యములు చేసిననూ, వాటిలో లీనం కావు. ఈ మానవులు సకల సంపదలు కావాలనీ, నానారకములైన కోరికలు తీర్చమని, లక్ష్మీదేవిని కోరుతుంటారు. కాని ఆ లక్ష్మీదేవి నీ చరణారవిందములను కోరుతూ ఉంటుంది. నిన్ను పూజిస్తే సకల సంపదలు, సకల కోరికలుసిద్ధిస్తాయని వారికి తెలియదు." అని ప్రార్థించారు.

తరువాత సిద్ధులు ఇలా అన్నారు. "ఓ దేవా! మా మనస్సు ఎల్లప్పుడూ నానా విధములైన క్లేశములతో మండి పోతూ ఉంటుంది. ఆ సమయంలో నీ కథామృతము అనే నదిలోకి దూకి మేము సేదతీరుతుంటాము. కోరికలు, కష్టములు అనే అగ్నిలో మండి పోతున్న మా మనస్సులకు ఊరట లభిస్తుంది. ఒక సారి నీ సేవలో, నీ భక్తిలో మునిగిన వాడికి, ఇంక ఇతర విషయములతో పనేముంటుంది." అని

ప్రార్థించారు.

తరువాత దక్షుని భార్య ఇలా ప్రార్థించింది. "ఓ పరమేశ్వరా! నిన్ను మా గృహమునకు స్వాగతిస్తున్నాము. నీకు నమస్కారములు చేస్తున్నాము. మా మీద ప్రసన్నుడవు కా! నీవు భార్యసమేతంగా మా ఇంటికి వచ్చి మా అందరినీ రక్షించు. ఈ యజ్ఞమును నిర్విఘ్నంగా జరిగేట్టు చూడు." అని ప్రార్థించింది.

తరువాత లోకపాలకులు విష్ణువును ఇలా ప్రార్థించారు. "ఓ దేవా! నీవు అంతటా ఉంటావు. నీకు తెలియని విషయం లేదు. అన్నీ సాక్షీభూతంగా చూస్తుంటావు. అటువంటి నిన్ను మా పరిమిత దృష్టితో ఎలా చూడగలము. నీవు ఈ పంచభూతములలో ఒకడవు కావు. పంచభూతముల కన్నా వేరుగా ఆరవ భూతము వలె కనపడుతున్నావు. ఇది కూడా నీ మాయాప్రభావమే కదా!" అని స్తుతించారు. (ఇక్కడా ఆరవ భూతము అంటే యోగదృష్టి అని అనుకోవచ్చు మనము సిక్స్‌త్ సెన్స్ అని అంటుంటాము కదా. అటువంటిది కావచ్చు.)

తరువాత యోగులు ఇలా ప్రార్థించారు. "ఓ దేవా! ఈ సకల చరాచర జగత్తులో నీవు ఉన్నావు. అందరిలో నీవు ఉన్నావు. నీలో అందరూ ఉన్నారు. ఈ సత్యం తెలుసుకున్న వారు నీకు ప్రియమైనవారు. నిన్ను భక్తితో సేవించే భాగ్యం మాకు ప్రసాదించు. ఓ దేవా!నీవు ఈ సృష్టి, స్థితి, లయములను ఎటువంటి భేదబుద్ధి లేకుండా నిర్వర్తిస్తున్నావు. కానీ నీ మాయ చేత జీవులలో భేదబుద్ధిని కలిగిస్తున్నావు. (బ్రహ్మ సృష్టిస్తాడనీ, విష్ణువు పోషిస్తాడనీ, శివుడు లయం

చేస్తాడనీ అనుకుంటుంటారు') ఇదంతా నీ మాయాప్రభావం వలననే కలుగుతూ ఉంది. జీవులు ఈ మాయలో పడి నిన్ను వివిధ రూపములతో పూజిస్తుంటారు. అందుకని మేము నిన్ను శరణు జొచ్చాము. ఈ జీవులలో ఈ మాయామోహములను తొలగించి వారికి మోక్షమును ప్రసాదించు. అట్టి మహిమ కల నీకు మేము నమస్కరిస్తున్నాము." అని అన్నారు.

తరువాత బ్రహ్మ ఇలా అన్నాడు. "ఓ దేవా! నీవు సత్త్వగుణ సంపన్నుడవు. ఆ లోకంలో ధర్మమును నీవే స్థాపించావు. నిర్గుణ స్వరూపుడవు అయిన నీకు నమస్కారము. ఇప్పటికీ నేను కానీ రుద్రుడు కానీ దేవతలు కానీ నీ తత్త్వమును తెలుసుకోలేకపోతున్నారు." అని అన్నాడు.

తరువాత అగ్ని ఇలా అన్నాడు. "ఓ దేవా! నేను నీ తేజస్సు వలననే అగ్ని కుండములో మండుతున్నాను. నాలో వేసిన హవిస్సులను దేవతలకు అందజేస్తున్నాను. నీవు యజ్ఞపురుషుడవు. ఈ యజ్ఞములను రక్షించే వాడివి నువ్వే! ఐదు రకములైన యజ్ఞ స్వరూపములు నీవే!(అగ్నిహోత్రము, దర్శము, పౌర్ణమాసము, చాతుర్మాస్యము, పశుసోమము) అట్టి నీకు నమస్కరిస్తున్నాను." అని అన్నాడు.

తరువాత దేవతలు ఇలా ప్రార్థించారు. "ఓ దేవా! కల్పాంతంలో ఈ సమస్త జగత్తును నీలో లీనం చేసుకొని ఆ జలరాసిలో విలాసంగా పడుకొని ఉంటావు. సనకాది మహామునులు తమ తమ

మనస్సులలో నిన్ను నిరంతరం ధ్యానిస్తుంటారు. అట్టి నీకు నమస్కారము." అని అన్నారు.

తరువాత గంధర్వులు ఇలా ప్రార్థించారు. "ఓ దేవా! మరీచి మొదలగు ప్రజాపతులు, రుద్రులు, బ్రహ్మ, ఇంద్రుడు, దేవతలు అందరూ నీ అంశలో నుండి పుట్టినవారే. అట్టి నీకు నమస్కారము." అని అన్నారు.

తరువాత విద్యాధరులు ఇలా స్తుతించారు. "ఓ దేవా! అనేక జన్మల తరువాత జీవుడు మానవ జన్మ పొందుతాడు. కానీ అజ్ఞానంతో విషయవాంఛలకు లోనవుతాడు.  దేహాభిమానమునతో ఇది నాది అది నీది అనే మాయలో పడిపోతాడు. తాత్కాలిక సుఖముల కోసరం అర్రులు చాస్తుంటాడు. అట్టి మానవులకు నీ కథలు వినడం అనే అమృతము వారిమోహమును పూర్తిగా నాశనం చేస్తుంది అనడంలో సందేహము లేదు.అట్టి నీకు నమస్కారము." అని అన్నారు.

తరువాత ఆ యజ్ఞమునకు వచ్చిన బ్రాహ్మణులు ఇలా అన్నారు. "ఓ దేవా! నీవు యజ్ఞస్వరూపుడవు. నీవే హవిస్సువు. నీవే అగ్నివి. నీవే యజ్ఞమంత్రము. నీవే యజ్ఞములో ఉపయోగించే సమిధవు. యజ్ఞములో ఉపయోగించే సమస్త పదార్థములు, పాత్రలు నీవే. ఈ యజ్ఞము సంకల్పించింది నీవే. చేయించింది నీవే. పాడు చేసినదీ నీవే. ఓ దేవా! ఇప్పుడు ఈ యజ్ఞము అపవిత్రము అయింది. నాశనము అయింది. ఈ యజ్ఞమును నీవే పునరుద్ధరించు. దానికి నీవే తగిన వాడవు. అట్టి నీకు నమస్కరిస్తున్నాము." అని ప్రార్థించారు.

తరువాత విష్ణువు అనుమతితో దక్షుడు తిరిగి యజ్ఞమును ఎక్కడ ఆగిందో అక్కడి నుండి ప్రారంభించాడు. ముందు యజ్ఞభాగమును విష్ణువుకు అర్పించారు. దానిని స్వీకరించిన విష్ణువు దక్షునితో ఇలా అన్నాడు.

“దక్షా! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులము అయిన మాలో ఏభేదమూ లేదు. మేము ముగ్గురమూ ఒకటే. మేము ముగ్గురుగా కనపడటం కేవలం మాయ. ఆ మాయతోనే మేము ఈ జగత్తును పరిపాలిస్తున్నాము. సృష్టిస్తున్నాము, పాలిస్తున్నాము, లయం చేస్తున్నాము. నేను బ్రహ్మగానూ, విష్ణువుగానూ, శివుడుగానూ ఆయా రూపములను ధరించి ఆయాకార్యములు నిర్వర్తిస్తున్నాను. నేను జ్ఞాన స్వరూపుడను. స్వతంత్రుడను. కేవలం అజ్ఞానులే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వేరు వేరు అనుకుంటూ, ఎవరికి వారే స్వతంత్రులు అనుకుంటూ, వారిని విడి విడిగా పూజిస్తుంటారు. వారిలో వారు ద్వేషించుకుంటూ ఉంటారు.

ఏ మానవుడైనా తన తల, చేతులు, కాళ్లు తనకంటే వేరు అని తలంచడు కదా. అన్నీ కలిస్తేనే దేహము. అలాగే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ ఒకే పరమాత్మ స్వరూపాలు. తల, చేతులు, కాళ్లు ఏ ప్రకారంగా వాటి వాటి పనులను చేస్తుంటాయో అలాగే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కూడా వారి వారిపనులను చేస్తుంటారు. కాని వారంతా పరమాత్మ స్వరూపాలే.వారిలో వారికి ఏ విధమైన భేదము లేదు. నాయందు భక్తి కలవారే ఈ విషయములను తెలుసుకోగలరు. మా ముగ్గురిలో ఒకే పరమాత్మను చూచేవాడు, మా యందు భేదబుద్ధిలేని వాడు శాంతిని పొందుతాడు.” అని దక్షునికి తత్త్వబోధ చేసాడు విష్ణువు.

దక్షుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. తరువాత దక్షుడు శ్రీహరిని అర్చించాడు. తరువాత దేవతలందరినీ పూజించాడు. తరువాత యజ్ఞములో మిగిలిన హవిర్భాగమును శివునికి అర్పించాడు. ఆ విధంగా యజ్ఞము పూర్తి అయింది. తరువాత దక్షుడు, ఋత్విక్కులు కలిసి అవబృధ స్నానం చేసారు. త్రిమూర్తులు, దేవతలు అందరూ దక్షుని దీవించారు. తమ తమ స్థానములకు వెళ్లిపోయారు.

విదురా! ఇదీ సతీదేవి వృత్తాంతము. తరువాత సతీదేవి, హిమవంతునికి ఆయన భార్య మేనకకు పుత్రికగా జన్మించింది అని విన్నాను. తరువాత ఆమె పార్వతీ అనే పేరుతో శివుని తిరిగి తన భర్తగా పొందగలిగింది. విదురా! ఈ దక్షుని చరిత్ర నేను ఉద్ధవుని వలన విన్నాను. నీకు విన్నది విన్నట్టు చెప్పాను.

విదురా!ఈ దక్షుని వృత్తాంతము పరమ పవిత్రము, కీర్తిదాయకము, పాపనాశకరము. ఈ శివుని చరిత్రను వింటే సకల పాపములు నశించిపోతాయి." అని మైత్రేయుడు విదురునికి దక్షయజ్ఞవృత్తాంతమును చెప్పాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము

ఎనిమిదవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పసాగాడు.

"విదురా! సృష్టి క్రమంలో బ్రహ్మదేవుడు సనకాదులను, నారదుని,ఋభువుని, హంసుని, అరుణి, యతి వీరందరినీ సృష్టించారు. కాని వీరి వలన సృష్టి జరగలేదు. ఎందుకంటే వీరందరూ గృహస్థాశ్రమమును స్వీకరించలేదు. అందువలన వీరికి సంతానము కలగలేదు.

విదురా! ఈ లోకంలో ధర్మంతో పాటు అధర్మం కూడా వృద్ధిపొందింది. అది ఎలాగంటే......అధర్మానికి మిధ్య (ఏమీ లేకపోవడం) అనే భార్య ఉంది. వాళ్లకు ఇద్దరు సంతానము... దంభుడు (డంబాలు పలికేవాడు), మాయ అనే కుమార్తె. నిర్రృతి (ఏ పనికీ కొరగాని వాడు) అనేవాడు వీళ్లిద్దరినీ తన సంతానంగా స్వీకరించాడు. అధర్మానికి పుట్టిన వాళ్లు కాబట్టి అధర్మంగానే ప్రవర్తించి దంభుడు, మాయ అనే వాళ్లిద్దరూ భార్యాభర్తల మాదిరి ప్రవర్తించారు. వారికి లోభుడు అనే కుమారుడు, నికృతి (అంటే మూర్ఖత్వము, మొండితనము,) అనే కుమార్తెజన్మించారు.

అధర్మపరులు కాబట్టి ఆ తోబుట్టువులు కలిసి పిల్లలను పుట్టించారు. వారే క్రోధుడు (కోపము) అనే కుమారుడు, హింస అనే

కుమార్తె కలిగారు. కోపానికి, హింసకు ఇద్దరు సంతానము కలిగారు. వారే కలి అనే కుమారుడు, దురుక్తి (చెడ్డ మాటలు, చెడ్డ పనులు) అనే కుమార్తె పుట్టారు. మరలా వీరి ద్దరికీ సంతానము కలిగారు. వారే భీతి(భయము, ఆందోళన) అనే కుమార్తె, మృత్యువు అనే కుమారుడు కలిగారు. మరలా ఆ ఇద్దరికీ నరకము అనే కుమారుడు, యాతన అనే కుమార్తె కలిగారు. తరువాత ఏం జరుగుతుందో తెలుసు కదా! నరక ప్రాప్తి.

విదురా! ఇదీ అధర్మము యొక్క వంశ చరిత్ర. అధర్మాన్ని ఆచరిస్తే తుదకునరకప్రాప్తి కలుగుతుంది. విదురా! ఇప్పుడు నీకు శ్రీహరి అంశలో జన్మించిన స్వాయంభువ మనువు వంశ చరిత్ర వివరిస్తాను. సావధానంగా విను.

స్వాయంభువ మనువు, శతరూప భార్యా భర్తలు వారికి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే కుమారులు జన్మించారు. వారిద్దరూ ఈ భూమిని పాలించడానికి నియమింపబడ్డారు.

ఉత్తాన పాదునకు ఇద్దరు భార్యలు. సురుచి, సునీతి. సునీతికి ఒక కుమారుడు. అతని పేరు ధ్రువుడు. ఉత్తానపాదుడు సురుచిని ఎక్కువగా ప్రేమించేవాడు. సునీతిని నిరాదరించేవాడు.

ఒకరోజు ఉత్తాన పాదుడు కూర్చుని ఉన్నాడు. సురుచి కుమారుడు అయిన ఉత్తముడు తండ్రి ఒడిలో కూర్చుని ఉన్నాడు. ఆ సమయంలో సునీతి కుమారుడు ధృవుడు అక్కడకు వచ్చాడు. తాను

కూడా తండ్రి తొడమీద కూర్చోబోయాడు. కాని ఉత్తముడు ధృవుని ఆవలకునెట్టాడు. ఉత్తాన పాదుడు ఉత్తముని మందలించలేదు.

పక్కనే ఉన్న సురుచి ధృవునితో ఇలా అంది. "కుమారా! నీవు రాజ కుమారుడివే. కాని నా గర్భంలో జన్మించలేదు. అందుకే నీకు నీ తండ్రి తొడమీద కూర్చునే అదృష్టం పట్టలేదు.  నీవు ఇంకా బాలుడివి. నీవు వేరే స్త్రీకి జన్మించావు. అందుకనే నీవు పొందరాని విషయముల కోసరం ఆశించకూడదు. నీకు నీ తండ్రి తొడమీద కూర్చునే అర్హత లేదు. నీకూ నీ తండ్రి తొడమీద కూర్చోవాలనీ, నీ తండ్రి సింహాసనము ఎక్కాలనీ కోరికగా ఉంటే తపస్సు చెయ్యి. నా కడుపున పుట్టించమని ఆ దేవుని ప్రార్థించు. ఆ భగవంతుని అనుగ్రహంతో మళ్లీ జన్మలో నా గర్భవాసాన జన్మించి రాజ్యాధికారాన్ని పొందు." అని సవతి మత్సరాన్ని వెళ్లగక్కింది.

ఓ విదురా! ఈ మాటలు విన్న ధృవుని మనస్సు ఎంతో గాయపడింది. తండ్రి మొహంలోకి చూచాడు. తండ్రి సురుచి మాటలకు ఎదురు చెప్పలేక తలదించుకున్నాడు. ధృవుని కోపం మిన్ను ముట్టింది. కళ్లనిండా నీళ్లు నిండాయి. విసా విసా నడుచుకుంటూ తన తల్లి సురుచి వద్దకు వెళ్లాడు. కుమారుడి కోపము, దు:ఖము చూచి సునీతి తల్లడిల్లి పోయింది. కుమారుని దగ్గరకు తీసుకొని ఒడిలో పడుకో బెట్టుకుంది.

ఇంతలో అంత:పురస్త్రీలు వచ్చి ఉత్తానపాదుని వద్ద జరిగిన విషయాలు సురుచి అన్న మాటలు వివరంగా చెప్పారు. సునీతి ఎంతో బాధ పడింది. కళ్ల నుండి నీళ్లు కారుతున్నాయి. కుమారుని తల

నిమురుతూ ఇలా పలికింది.

"కుమారా! ఇది నీయొక్క నా యొక్కపూర్వ జన్మ కర్మఫలము కానీ వేరు కాదు. నీ కర్మఫలము చేత నీవు నా వంటి దురదృష్టవంతురాలి గర్భవాసాన జన్మించావు. సురుచి చెప్పిన మాటలు నిజాలు. మీ తండ్రిగారు నన్ను భార్యగా చూడటం లేదు. కనీసం దాసిగా కూడా చూడటం లేదు. నేను అంతటి అధమ స్థితిలో ఉన్నాను. నా వంటి దాని కుమారుడికి తండ్రి వద్ద గౌరవము ఎలా లభిస్తుంది.

కుమారా! నీకు నిజంగా రాజసింహాసనము పొందాలని ఉంటే, మీ తల్లి సురుచి అన్న మాటప్రకారం చెయ్యి. ఆమె నీకు మంచి మార్గమును సూచించింది. నీవు ఆ మార్గంలోనే నడువు. పరమాత్మ అయిన శ్రీహరి సత్త్వగుణ సంపన్నుడు. ఆయన పాద పద్మములు సేవించి బ్రహ్మ తన అత్యున్నత పదవిని పొందాడు. మీ తాతగారు అయినస్వాయంభువ మనువు పరమాత్మను ఆరాధించి మోక్షపదవిని పొందాడు. మహా మహా యోగులు కూడా ఆ పరమాత్మ పాదపద్మములను ఆశ్రయిస్తారు. నీవు కూడా అన్ని దు:ఖములను వదిలిపెట్టి ఆ శ్రీహరి పాదములను మనస్సులో నిలుపుకొని ధ్యానించు. నీ కోరిక నెరవేరుతుంది. కుమారా! ఆ శ్రీహరి తప్ప నీ దు:ఖమును పోగొట్టి నీ కోరికలను తీర్చు వారు ఎవరూ లేరు. ఈ లోకంలో ఉన్న వారందరూ లక్ష్మీదేవిని ధ్యానిస్తుంటే ఆ లక్ష్మీదేవి శ్రీహరిని పూజిస్తూ ఉంటుంది. కాబట్టి నీవు కూడా ఆ శ్రీహరిని పూజించు." అని చెప్పింది సునీతి.

తల్లి మాటలను విన్న ధృవుడు ధైర్యము తెచ్చుకున్నాడు. వెంటనే నగరం విడిచి వెళ్లిపోయాడు.  ఈ విషయం తెలుసుకున్న నారదుడు వెంటనే ధృవుని వద్దకు వెళ్లాడు. ధృవుడు నారదునికి నమస్కరించాడు. నారదుడు తన అమృత హస్తంతో ధృవుని దీవించాడు. ధృవునితో ఇలా అన్నాడు.

"పుత్రకా! ధృవా! నీవు బాలుడవు. నీది ఆడుకొనే వయసు. ఈ వయసులో నీకు అవమానములు, దూషణలు అంటవు. వాటికి నీవు స్పందించకూడదు.ఎవరన్నా మనలను అవమానించారు అన్నప్పుడు మనకు కలిగే దు:ఖము కేవలము మోహము తప్ప వేరు కాదు. ఈ ప్రపంచంలో మానవులకు తాము చేసే పనుల ఫలితం గానే సుఖము, దు:ఖము కలుగుతుంటాయి. దైవము అనుకూలించనిదే మానవులు ఎన్ని కర్మలు చేసినా అవి ఫలితమును ఇవ్వవు. కాబట్టి మానవులు తమకు లభించిన వాటితోనే తృప్తిపడటం మంచిది.

నీవు నీ తల్లి మాట ప్రకారము ఆ పరమాత్మను మెప్పించి వరాలు పొందాలని వచ్చావు. ఆ పరమాత్మను మెప్పించడం చాలా కష్టము. అది మానవులకు సాధ్యం కాదు. సర్వ సంగ పరిత్యాగులైన మునులు అన్ని వదిలిపెట్టి తీవ్రమైన సమాధిలో ఉండి తపస్సు చేస్తేనే ఆ పరమాత్మ దర్శనం లభించడంలేదు. కాబట్టి నీ ప్రయత్నము ఫలితాన్ని ఇవ్వదు. నీకు బాగా వయసు వచ్చి వానప్రస్థ ఆశ్రమమును స్వీకరించినపుడు ప్రయత్నం చెయ్యి. నీకు ఫలితం లభిస్తుంది. మనకు లభించిన దానితోనే తృప్తి పొందడం మానవ ధర్మము. అంతకన్నా ఎక్కువ ఆశించడం అత్యాశ అవుతుంది.

ధృవా! మనకంటే ఎక్కువ జ్ఞానము, సంపద ఉన్న వారిని ప్రేమించడం, మనకన్నా తక్కువ జ్ఞానము ధనము ఉన్న వారిని చూచి వారి మీద దయ, కృప చూపించడం, తనతో సమానంగా జ్ఞానము, ధనము ఉన్న వారితో స్నేహం చేయడం ఉత్తముని లక్షణము. కాబట్టి నీ సోదరుడు, నీ తండ్రి నిన్ను అవమానించారని దు:ఖించకు." అని హితబోధ చేసాడు నారదుడు.

నారదుని చూచి ధృవుడు ఇలా అన్నాడు. "నారదమహర్షీ! మీరు చూపిన శాంతి మార్గము సుఖములను, దు:ఖములను బాగా అనుభవించి, వివేకము నశించిన వారికి ఉపయోగిస్తుందేమో కానీ నాకు కాదు. నేను క్షత్రియుడను. నాది రాజస లక్షణము. నా సవతి తల్లి మాట్లాడిన మాటల వలన నా మనసు తీవ్రంగా గాయపడింది. ఇటువంటి పరిస్థితులలో నేను తమరి మాటలను వినడానికి సిద్ధంగా లేను. నాకు ప్రస్తుతము కావలసినది నా తాతలు తండ్రులు పొందలేనిది, మూడులో లోకములలో గొప్పది అయిన స్థానమును పొందదలచుకున్నాను. ఆ స్థానమును పొందడానికి సులభమైన మార్గము ఏదైనా ఉంటే నాకు ఉపదేశించండి. అంతేకానీ నన్ను నిరుత్సాహపరచకండి. తమరు సామాన్యులు కారు. బ్రహ్మ మానస పుత్రులు. హరి నామ సంకీర్తనము చేస్తూ మూడు లోకములు తిరుగుతూ ఉంటారు. మీకు తెలియని విషయములు ఉండవు. అందుకని నాకు కర్తవ్యము ఉపదేశించండి." అని ప్రార్థించాడు ధృవుడు.

ధృవుని మాటలకు నారదుడు చాలా సంతోషించాడు. అతని కర్తవ్య నిష్టకు అభినందించాడు. ధృవునితో ఇలా అన్నాడు. "కుమారా! నీ తల్లి నీకు చూపిన మార్గమే శ్రేష్టమైనది. నీవు ఆ వాసుదేవుని మీద అచంచలమైన భక్తితో ధ్యానించు. మనస్సును ఆ వాసుదేవుని మీద లగ్నం చెయ్యి. ఈ లోకంలో ధర్మము, అర్థము, కామము కావలసిన వారు ఆ వాసుదేవుని పాదములను పూజించడం తప్ప మరోమార్గము లేదు.

కుమారా! యమునా నదీ తీరంలో మధువనము అని ఉంది (ఇప్పటి మధుర). అక్కడ వాసుదేవుడు నివసిస్తుంటాడు అని అంటారు. అక్కడే కాళింది అనే సరస్సు ఉంది. నీవు ఆ సరస్సులో స్నానము చేసి, ప్రాణాయామము ద్వారా మనస్సును నిగ్రహించి, చిత్తమును స్థిరంగా ఉంచి,  ఆ వాసుదేవుని ధ్యానించు. ఆ వాసుదేవుని రూపమును మనసులో నిలుపుకో. అది ఎలా ఉంటుందంటే.....ప్రసన్నమైన ముఖము, కరుణతో నిండిన చూపులు,, మంచి కనుబొమలు, సుందరాకారుడు, రమణీయములైన అవయవములు కలవాడు, భక్తులకు ఆశ్రయము ఇచ్చేవాడు, తనను శరణుజొచ్చిన వారిని కాపాడేవాడు, దయాసముద్రుడు, శ్రీవత్సము అనే పుట్టుమచ్చను వక్షస్థలము మీదకలిగిన వాడు, నీలమేఘశ్యాముడు, వనమాలను ధరించిన వాడు, శంఖ, చక్ర, గదా, పద్మములను చేతులలో కలిగిన వాడు, కిరీటము తల మీద కలిగినవాడు, కౌస్తుభమణిని కంఠములో ధరించిన వాడు, పచ్చని పట్టు వస్త్రము కట్టుకున్న వాడు, శాంతస్వరూపుడు, చూచేవారి మనస్సుకు ఆనందము కలిగించేవాడు, భక్తుల మనసులలో నివసించేవాడు, ఎప్పుడూ చిరునవ్వునవ్వుతూ అందరినీ ప్రేమతో చూచేవాడు, కోరిన

వరములను ఇచ్చేవాడు, ఇటువంటి రూపముతో ఉన్న శ్రీహరిని మనసులో నిలుపుకొని ధ్యానించు.
(అప్పటి దాకా శ్రీహరి ఎలాఉంటాడో ధృవునికి తెలియదు. అందుకని అంగాంగ వర్ణన చేసి ఆయన రూపాన్ని పరిచయం చేసాడు నారదుడు.)

ఆ పరమాత్మ నీకు కనిపించి నీ కోరికలు తీరుస్తాడు. కుమారా! అంతేకాదు. నీకు ఒక రహస్యమైన మంత్రమును ఉపదేశిస్తాను. దానిని జపించు. ఈ మంత్రమును మానవులు ఏడు రోజులు భక్తిలో ఏకాగ్రతతో జపం చేస్తే, దేవతలు కూడా కనిపిస్తారు." అని ధృవుని చెవిలో "ఓంనమోభగవతేవాసుదేవాయ" అనే మంత్రమును ఉపదేశించాడు.

"ధృవా! నీవు ఈ మంత్రమును జపిస్తూ ఆ వాసుదేవుని పూజించు. యమునానదీతీరంలో ఉన్న వనముల నుండి నీవు పుష్పములను, ఫలములను, తులసీ దళములను తెచ్చి, ఆ శ్రీహరిని పూజించు.

నీకు ఏకాగ్రత నిలవాలంటే నీవు రాతితో తయారు చేయబడిన ఆ శ్రీహరి ప్రతిమను తెచ్చి దాని మీద మనస్సును లగ్నం చేసి పూజించు. నీకు రాతితో చేసిన శ్రీహరి ప్రతిమ దొరకకపోతే నీవే స్వయంగా మట్టితో శ్రీహరి ప్రతిమను చేసి దానిని పూజించు. నీవు ఆ శ్రీహరి అవతార లీలలను,ఆయన మహిమలను భక్తితో ధ్యానించు. నేను నీకు ఉపదేశించిన ద్వాదశ అక్షర మంత్రము ద్వారా ఆ శ్రీహరిని

యధావిధిగా, మన పూర్వీకులు ఏ ఏవిధములైన పూజావిధానములను ఏర్పరచారో ఆయా విధానముల ప్రకారము పూజించు.

నేను చెప్పిన ప్రకారము నీవు ఆ శ్రీహరిని పూజిస్తే, నీకోరికలు ఆయన తీరుస్తాడు. నీ మనసులో ఉన్న కోరికలను అన్నిటినీ ఆయన తెలుసుకొని అవి తీరుస్తాడు. ఇదే విధంగా, ప్రాపంచిక విషయములను విడిచి పెట్టి, విరక్తితో, ఆ శ్రీహరిని ధ్యానించే మానవులకు మోక్షాన్ని ప్రసాదిస్తాడు ఆ శ్రీహరి. దీని కంతటికీ మూలము భక్తి, అచంచలమైన భక్తి. ఏకాగ్రమైన చిత్తముతో, భక్తితో ఆ శ్రీహరిని సేవిస్తే, ఆయన తప్పకుండా కరుణిస్తాడు." అని నారదుడు ధృవునికి భక్తియోగమును ఉపదేశించాడు.

అప్పుడు ధృవుడు నారదునికి భక్తితో ప్రదక్షిణము చేసి నమస్కరించాడు. వెంటనే యమునా నదీ తీరంలో ఉండే మధువనమునకు బయలుదేరాడు.  ధృవునికి భక్తియోగము ఉపదేశించిన నారదుడు వెంటనే ధృవుని తండ్రి ఉత్తానపాదుని వద్దకు వెళ్లాడు. ఆయనతో ఇలా చెప్పాడు.

"రాజా! నీవు ఎందుకో చింతిస్తున్నట్టు కనపడుతున్నావు. కారణము ఏమి?" అని ఏమీ తెలియనట్టు అడిగాడు.

అప్పుడు ఉత్తానపాదుడు నారదునితో ఇలా అన్నాడు. "నారదా! నేను నా రెండవ భార్య సురుచి వ్యామోహంలో పడి నా కుమారుడు ధృవుని ఇంటి నుండి వెళ్లగొట్టాను. నా కుమారుడు ఎక్కడ ఉన్నాడో ఏమో! అడవులలో ఏ క్రూరమృగమైనా  చంపి తినేసిందేమో

ఆందోళనగా ఉంది. నా భార్యావిధేయతతో ఎంతటి దుర్మార్గానికి పాల్పడ్డానో చూడండి. ప్రేమగా నా తొడమీద కూర్చోడానికి వచ్చిన ధృవుని ఆదరించలేదు. సరికదా నా భార్య సురుచి శూలాల్లాంటి మాటలు అంటున్నా మౌనంగా ఉన్నాను. అందుకే బాధపడుతున్నాను." అని అన్నాడు.

ఆ మాటలు విన్న నారదుడు ఉత్తానపాదునితో ఇలా అన్నాడు. "రాజా! నీ కుమారుని నీవు వదిలిపెట్టినా దైవము రక్షిస్తున్నాడు. నీ కుమారుడు ధృవుని గురించి నీకు తెలియదు. అతని కీర్తి ముల్లోకములలో వ్యాపిస్తుంది. అటువంటి కుమారుని గురించి నీవు దు:ఖించడం సరికాదు. నీ కుమారుడు ధృవుడు ఆ శ్రీహరిని ప్రసన్నుని చేసుకొని త్వరలోనే తిరిగిరాగలడు. నీవు నిశ్చింతగా ఉండు." అని అన్నాడు నారదుడు.

నారదుని మాటలకు ఎంతో సంతోషించిన ఉత్తానపాదుడు కుమారుని రాకకోసరం ఎదురుచూస్తున్నాడు. యమునానదీ తీరానికి వెళ్లిన ధృవుడు స్నానం చేసాడు. ఆ రాత్రి ఉపవాసం ఉన్నాడు. నారదుడు ఉపదేశించిన మంత్రమును పఠిస్తూ శ్రీహరిని అర్చించాడు.

తరువాత మూడు రోజులకు ఒకసారి ఫలములను ఆహారంగా తీసుకుంటూ ఒక నెల పాటు శ్రీహరిని పూజిస్తూ గడిపాడు. తరువాత ఆరురోజుల కొక సారి ఆకులను, దుంపలను, గింజలను తింటూ రెండవనెల గడిపాడు. తరువాత తొమ్మిదిరోజులకు ఒక సారి కేవలం నీరు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ మూడవ నెల

గడిపాడు. తరువాత పన్నెండు రోజులకు ఒక సారి గాలి పీల్చుకుంటూ నాల్గవ నెల గడిపాడు. ఐదవ నెలలో ఒంటికాలి మీద నిలబడి ఏమీ ఆహారం తీసుకోకుండా శ్రీహరిని ధ్యానించాడు. ధృవుని తపస్సుకు మూడు లోకములు తల్లడిల్లిపోయాయి. ధృవుడు ఒంటి కాలి మీద నిలబడి తపస్సు చేయడం చూచి దేవతలు ఆశ్చర్యపోతున్నారు. గాలి కూడా స్తంభించి పోయింది.

దేవతలందరూ శ్రీహరి దగ్గరకు పోయి ఆయన శరణు వేడారు.  దేవతలందరూ శ్రీహరితో ఇలా అన్నారు. "ఓ దేవా!ధృవుని కఠోర తపస్సుకు మూడులోకములలో గాలి స్తంభించింది. ఊపిరి ఆడటం లేదు. ఇంతకు ముందు ఇటువంటి ఉత్పాతమును ఎన్నడూ మేము చూడలేదు. ఈ కష్టము నుండి మమ్ములను కాపాడండి." అని ప్రార్థించారు.

శ్రీహరి దేవతలతో ఇలా అన్నాడు. "మీరు నిశ్చింతగా ఉండండి. నేను ఇప్పుడే పోయి ఆ బాలుని తపస్సు విరమింపజేస్తాను.  ఆ బాలుడు సామాన్యుడు కాదు. ఉత్తానపాదుని కుమారుడు ధృవుడు. నా గురించి ఏకాగ్రతతో తపస్సు చేస్తున్నాడు. ఆ బాలుని తపస్సుకు మీరు ఏ మాత్రమూ భయపడవలసిన అవసరం లేదు. మీరు మీ మీ స్థానములకు వెళ్లండి." అని అన్నాడు శ్రీహరి.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత& ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము

తొమ్మిదవ అధ్యాయము.

"విదురా! ఆ ప్రకారంగా దేవతలకు అభయం ఇచ్చిన శ్రీహరి గరుడుని మీద ఎక్కి మధువనమునకు వెళ్లాడు. ధ్రువుడు తీవ్రంగా తపస్సు చేస్తున్నాడు. తన మనస్సులో నారదుల వారు చెప్పిన శ్రీహరి అవతారమూర్తిని దర్శిస్తున్నాడు. శ్రీహరి అక్కడకు రాగానే కళ్లు తెరిచాడు. ఇప్పటి వరకు తాను మనసులో ధ్యానం చేస్తున్న శ్రీహరి అవతారం తన ఎదురుగా కనిపించగానే పులకించిపోయాడు ధ్రువుడు. శ్రీహరికి సాష్టాంగ ప్రణామం చేసాడు. శ్రీహరి దివ్యమంగళ విగ్రహం వంక ప్రేమగా భక్తితో చూడసాగాడు.

శ్రీహరి ప్రేమతో ఆ చిన్నవాడి బుగ్గలు తన శంఖంతో తడిమాడు. ఆ శంఖ స్పర్శకు ధ్రువునికి అమోఘమైన వాక్షక్తి లభించింది. పరమాత్మకు సంబందించిన తత్త్వజ్ఞానము అంతా ఆ బాలునకు మనసులో  స్ఫురించింది. వెంటనే ధ్రువుడు శ్రీహరిని ఈ విధంగా స్తుతించసాగాడు.

"ఓ దేవా! నీవు జ్ఞాన శక్తిని, క్రియా శక్తిని ధరించిన వాడవు. నీ శక్తి ద్వారా నాలో ప్రవేశించి. నాకు ఆత్మజ్ఞానమును, వాక్షక్తిని ప్రసాదించావు. అట్టి నీకు భక్తితో నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! నీవు నీ మాయ చేత సత్త్వ,రజస్,తమోగుణములతో కూడిన ఈ విశ్వమును సృష్టించావు. ఈ విశ్వం అంతటా నీవు వ్యాపించి ఉన్నావు. ఒకే అగ్ని అనేక వస్తువులలో అనేక రూపములతో వెలుగునట్టు, నీవు ఒక్కడివే అయి ఉండి కూడా, అనేక రూపములతో అందరి ప్రాణులలో కనపడుతున్నావు. ఈ సృష్టి ప్రారంభంలో బ్రహ్మ నీవు ప్రసాదించిన జ్ఞానముతోనే కదా ఈ సృష్టిని దర్శించాడు.

ఓ దేవా! ముక్తి కోరే వారికి నీ పాదములే కదా ఆశ్రయములు. నిన్ను ఆశ్రయించిన భక్తులను ఈ జనన మరణ చక్రము నుండి విముక్తులను చేస్తావు. కోరినకోరికలు నెరవేర్చడంలో నీవు కల్పతరువుతో సమానం. కేవలం మాయతో కప్పబడిన వారు మాత్రమే నిన్ను లౌకికమైన, ప్రాపంచికమైన కోరికలు కోరుతుంటారు. అటువంటి కోరికలు కోరిన వారు, ఆ కోరికలు తీరగానే తీరని దు:ఖంలో పడిపోయి, నరకానికి పోతారు.

ఓ దేవా! నిరంతరము నీ పాదములను ధ్యానించడం వలన, నీ కథలను వినడం వలన కలిగే ఆనందము ఇంకెక్కడా లభించదు.

ఓ దేవా! నాకు ఎల్లప్పుడూ నీ భక్తులయొక్క సాంగత్యము కలుగచెయ్యి. వారి సాంగత్యములో నేను నీ యొక్క కథలు విని, నీ యందు భక్తిని పెంపొందించుకొని, సంసారసాగరమును అవలీలగా దాటుతాను.

ఓ దేవా! నీ పాదపద్మములను సేవించడంలో ఆసక్తి ఉన్న మహాత్ముల యొక్క సాంగత్యమును కలిగినవారు, ఈ దేహమును గురించి గానీ, భార్య బిడ్డల గురించి గానీ, ప్రాపంచిక విషయ

వాంఛల గురించి గానీ ఆలోచించరు.

ఓ దేవా! నీవు ఈ చరాచర జగత్తులో మానవులు, పశు వులు, పక్షులు, పర్వతముల రూపములో వ్యాపించి ఉన్నావు. ఇవి అన్నీ నీ స్వరూపము అయినప్పటికీ, రకరకాల రూపములతో కనిపిస్తున్నాయి. దీనికంతటికీ కారణము నీ లోనుండి పుట్టి మహత్తత్వము, అహంకారము, పంచభూతములు మొదలగునవి కారణములు.

ఓ దేవా! దీని కంటే భిన్నమైన నీ శుద్ధసత్త్వస్వరూపము నాకు తెలియదు. ఏ విధమైన వికారములు లేని నీ పరబ్రహ్మ స్వరూపము నాకు తెలియదు.

ఓ దేవా! ప్రళయకాలంలో, ఈ బ్రహ్మాండములనన్నిటినీ తనలో ఇముడ్చుకొని, యోగనిద్రలోఉన్న నీ యొక్క నాభి నుండి పుట్టిన పద్మములో నుండి బ్రహ్మ ఉద్భవించాడు. అట్టి  నీకు నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! నీవు శుద్ధసత్త్వస్వరూపుడవు. సర్వజ్ఞుడవు. అందరిలో ఆత్మస్వరూపుడవుగా ఉన్నావు.  నీకు ఏ వికారములు లేవు. నీకు ఆది అంతము లేదు. మూడుగుణములకు అతీతుడవు. యజ్ఞస్వరూపుడవు. అట్టి నీకు నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! నీ నుండి విద్య, అవిద్యలాంటి విరుద్ధభావములు కల అనేకములైన శక్తులు పుట్టాయి. ఈ విశ్వమునకు అంతటికీ నీవే

కారణభూతుడవు. అనంతుడవు. ఆనంద స్వరూపుడవు. అట్టి నిన్ను శరణు వేడుతున్నాను.

ఓ దేవా! నిష్కామభక్తితో నిన్ను సేవించే వారికి రాజ్యభోగములు ఇచ్చినా తీసుకోరు. నీ పాదపద్మముల సేవయే పరమావధిగా కోరుకుంటారు. అంతేకాదు. నీవు మా లాంటి వారి కోరికలను కూడా తీరుస్తుంటావు. ఓ దేవా! నీకు నమస్కారము." అని ధ్రువుడు శ్రీహరిని స్తుతించాడు.

భక్త వత్సలుడగు శ్రీహరి ధ్రువుని భక్తికి ఎంతో సంతోషించాడు. భగవానుడు ధ్రువునితో ఇలా అన్నాడు.

"బాలకా! నాకు నీ మనసులో ఉన్న కోరిక తెలుసు. నేను నీకు ఒక ఉత్తమమైన పదమును ఇవ్వదలిచాను. నీకు శుభం కలుగుతుంది. తేజస్సుతో కూడినది, నాశనము లేనిదీ అయిన నక్షత్రలోకము ఉంది. ఆ  లోకమును ఇప్పటికి ఎవ్వరూ పొందలేదు. ఆ నక్షత్రలోకములో నక్షత్రములు, గ్రహములు తిరుగుతుంటాయి. దానినే జ్యోతిశ్చక్రము అనిఅంటారు. ఆ జ్యోతిశ్చక్రములో నీకు స్థిరమైన నివాసము ఏర్పరిచాను. ఈసృష్టి ఉన్నంతవరకూ నీవు ఆ లోకములో ఉంటావు.

నీ లోకమును ధ్రువలోకము అని పిలుస్తారు. నీ చుట్టు సప్తఋషులు, నక్షత్రములు తిరుగుతూ ఉంటాయి. ఇతరులకు లభ్యంకాని అట్టి లోకమును నీకు ప్రసాదిస్తున్నాను. కాని అది ఇప్పుడు కాదు. ఇప్పుడు నీవు నీ తండ్రి వద్దకు వెళ్లు. ఆయన అనంతరము నీవు

రాజువు కాగలవు. నీవు ధర్మమును అనుసరించి రాజ్యపాలన చెయ్యి. 36,000 సంవత్సరములు రాజ్య పాలన చేస్తావు. నీ సోదరుడు ఉత్తముడు వేటకు పోయిచనిపోతాడు. అతని తల్లి సురుచి పుత్రశోకముతో మరణిస్తుంది. నీ ఆయుర్దాయము తీరిన తరువాత నన్ను చేరుకుంటావు. ఒక్క మారు అక్కడకు వస్తే మరలా జన్మ ఉండదు. అదే శాశ్వతమైన పరమపదము." అని పలికాడు. తరువాత శ్రీహరి అంతర్ధానం అయ్యాడు.

ధ్రువుడు శ్రీహరి దర్శనభాగ్యమును పొందాడు. శ్రీహరి పాదములను అర్చించాడు. కావలసిన వరములను పొందాడు. కాని అతని మనస్సు ఎందుకో ప్రసన్నతను పొందలేదు. అటువంటి అప్రసన్న హృదయంతోనే ధ్రువుడు తన తండ్రి వద్దకు వెళ్లాడు."అని మైత్రేయుడు విదురునితో ధ్రువుని వృత్తాంతము వివరించాడు.

అప్పుడు విదురుడు మైత్రేయుని ఇలా అడిగాడు. "మైత్రేయా! శ్రీహరిపదము కోరికలు ఉన్న వారు పొందనలవి కాదు. కాని ధ్రువుడు పరమాత్మ దయవలన ఆ పరమ పదమును పొందగలిగాడు. కానీ ధ్రువుడు మనసు ప్రసన్నతను పొందలేదు అని అన్నారు. దానికి కారణమేమి?" అని అడిగాడు.

మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పసాగాడు. "విదురా! ధ్రువుడు తన సవతి తల్లి చేతిలో అవమానమును పొంది, తపస్సుకు వెళ్లాడు. శ్రీహరి కనపడినప్పుడు కూడా ధ్రువుని మనస్సులో తన సవతి తల్లి చేసిన అవమానమే మెదులుతూ ఉంది. అందు వలన సాక్షాత్తు

పరమాత్మ తన ఎదుట సాక్షాత్కరించిననూ ముక్తిని ప్రసాదించమని అడగలేకపోయాడు. అలాకోరనందుకు తరువాత చాలా చింతించాడు.

తన నగరానికి వస్తూ ధ్రువుడు తనలో తాను ఇలా అనుకోసాగాడు. "మహామునులు సైతము ఎన్నోజన్మలలో చేసిన తపోఫలంతో కానీ అందుకోలేని శ్రీహరి పాదపద్మములను నేను కేవలము ఆరునెలల కాలములో అందుకోగలిగాను. కాని ఏమి లాభము. మరలా ఈ సంసార కూపంలో పడిపోయాను. నా వంటి దురదృష్టవంతుడు మరొకడు ఉండడు. నేను ఒట్టి మూర్ఖుడను. సాక్షాత్తు శ్రీహరి పాదముల చెంత చేరినను, అశాశ్వతములైన రాజ్యసుఖములను కోరుకున్నాను. ఇదంతా దేవతలు పన్నిన పన్నాగము. లేకపోతే నాకు అటువంటి బుద్ధి ఎందుకు పుడుతుంది. నారదుడు నాకు అప్పుడే చెప్పాడు. నేను ఆయన మాటలు వినలేదు. నాకు దైవ మాయ ఆవహించినట్టుంది. అందుకే నాకు రాజ్యము కోరుకొనే దుర్బుద్ధి పుట్టింది. లేకపోతే శాశ్వత ముక్తి పదమును కోరుకొనే వాడిని. ఇప్పుడు ఎంత చింతించి ఏమి ప్రయోజనము.

ఆత్మస్వరూపుడై ఈ జగత్తు అంతా నిండి ఉన్న ఆ పరమాత్మను ప్రసన్నుడిగా చేసుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. అటువంటి పరమాత్మను నేను ప్రసన్నునిగా చేసుకున్నాను. కానీ ఏమి లాభం. తుచ్ఛమైన రాజ్యసుఖాలు కోరుకున్నాను. ఇదిఎలా ఉందంటే చక్రవర్తిగారు దయతలచి నీకుఏం కావాలి కోరుకో అని ఒకదరిద్రుడిని కోరితో, ధనము,ధాన్యము,భోగభాగ్యములు కోరుకోవడానికి బదులు, వాడు నాకు పొట్టుతో ఉన్న బియ్యం కావాలి అని అడిగాడట. అలా ఉంది నేనుకోరుకోవడం. శ్రీహరి నాకు మోక్షం ఇవ్వడానికి వస్తే నేను

నా మూర్ఖత్వంతో రాజ్యసుఖములు కోరుకున్నాను. అంతా అయిపోయిన తరువాత చింతించి ఏమి లాభం." అని పరిపరి విధముల వాపోయాడు ధ్రువుడు.

ఇంతలో తన కుమారుడు ధ్రువుడు తిరిగి నగరానికి వస్తున్నాడు అన్న వార్త ఉత్తానపాదునికి తెలిసింది. అదినిజమో కాదో అన్న అయోమయస్థితిలో ఉన్నాడు ఉత్తానపాదుడు. నా లాంటి దురదృష్టవంతునికి అంతటి అదృష్టమా అని అనుకున్నాడు. ఇంతలో నీ కుమారుడు త్వరలో నీ దగ్గరకు వస్తాడు అని నారదుడు చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి. తన కుమారుడు ధ్రువుడు తిరిగి నగరానికి రావడం నిజమేనని నమ్మాడు. వెంటనే ఆ వార్త తెచ్చిన వాడికి అనేక బహుమానాలు ఇచ్చాడు.

తన వెంట పురోహితులను తీసుకొని, మంగళ వాద్యములు మోగుతుండగా,  రథం ఎక్కి ధ్రువునికి ఎదురు వెళ్లాడు. ధ్రువుని అన్న ఉత్తముడు, ధ్రువుని తల్లి సునీతి, సవతి తల్లి సురుచి కూడా ధ్రువునికి ఎదురు వెళ్లారు. అల్లంత దూరంలో ధ్రువుని చూచాడు ఉత్తానపాదుడు. రథం దిగి కుమారునికి ఎదురు వెళ్లాడు. రెండు చేతులతో కుమారుని కౌగలించుకున్నాడు. కుమారుని చూచిన ఉత్తానపాదుని కళ్లనుండి ఆనందభాష్పాలు జలా జలా రాలుతున్నాయి.

కాని ధ్రువుని మనస్సులో ఎటువంటిరాగద్వేషములు లేవు. పరమాత్ముని దర్శనంతో ధ్రువునిలోని రాగద్వేషములు సమసిపోయాయి. ధ్రువుడు నిర్వికారంగా ఉన్నాడు. ధ్రువుడు తండ్రి

కాళ్లకునమస్కరించాడు. ఉత్తానపాదుడు కుమారుని మనసారా దీవించాడు. తరువాత ధ్రువుడు తన తల్లులు ఇద్దరికీ నమస్కరించాడు. వారి ఆశీర్వాదం తీసుకున్నాడు. తరువాత ఉత్తముడు తన సోదరుని గాఢంగా కౌగలించుకున్నాడు. ధ్రువుని తల్లి సునీతి తన కుమారుని గాఢంగా కౌగలించుకొని అతని శిరస్సును ముద్దాడింది.

తరువాత ధ్రువుడు భద్రగజము మీద ఊరేగుతూ రాచనగరులోకి ప్రవేశించాడు. వంది మాగధులు ధ్రువుని గుణగణములను కీర్తిస్తూ వెంట నడిచారు. అందరూ నగరంలోకి వెళ్లారు. ధ్రువుని రాకను పురస్కరించుకొని నగరము అంతా శోభాయమానంగా అలంకరించారు. అరటి స్తంభాలు కట్టారు. మామిడి తోరణాలతో అలంకరించారు. వీధులన్నీ కస్తూరి మంచి గంధము నీటితో తడిపారు. ముగ్గులు పెట్టారు. రాజవీధిలో ధ్రువుడు నడుస్తుంటే పుణ్యస్త్రీలు ధ్రువుని మీద అక్షింతలు జల్లి ఆశీర్వదించారు. ధ్రువుడు తన తండ్రి భవనములోనికి ప్రవేశించాడు. ఉత్తానపాదుడు తన కుమారుని దగ్గర కూర్చుండబెట్టుకొని జరిగిన విషయములు తెలుసుకొని ఆశ్చర్యపోయాడు.

కాలచక్రం తిరుగుతూ ఉంది. ధ్రువుడు యౌవన వంతుడయ్యాడు. ఉత్తానపాదుడు ధ్రువునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేసాడు. ఉత్తానపాదుడు తనకు ముసలితనమువచ్చినది అని తెలుసుకొని ధ్రువుని రాజుగా అభిషేకించి, తాను వనములకు వెళ్లిపోయాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీమద్భాగవతము
చతుర్థ స్కంధము
పదవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునికి ధ్రువుని వృత్తాంతము చెప్పసాగాడు.

"విదురా! తరువాత ధ్రువునికి వివాహం అయింది. శిశు కుమార ప్రజాపతి కుమార్తె భ్రమి అనే కన్యను వివాహం చేసుకున్నాడు. వారికి కల్పము, వత్సరము అనే కుమారులు కలిగారు. ధ్రువుడు ఇల అనే మరొక భార్య యందు ఉత్కలుడు అనే కుమారుని, స్త్రీరత్నము అనే కుమార్తెను కన్నాడు.

ధ్రువుడి అన్న గారైన ఉత్తముడికి ఇంకా వివాహము కాలేదు. ఒక రోజు అతడు వేట నిమిత్తము హిమాలయ పర్వత ప్రాంతమునకు వెళ్లాడు. అక్కడ ఉత్తముడికి ఒక యక్షునితో వైరం కలిగింది. ఇరువురికి జరిగిన యుద్ధములో ఉత్తముడు మరణించాడు. పుత్రశోకము తట్టుకోలేక అతని తల్లి సురుచి కూడా మరణించింది.

తన సోదరుడు యక్షుల చేతిలో మరణించాడు అన్న వార్త ధ్రువునికి తెలిసింది. కోపంతో రగిలిపోయాడు ధ్రువుడు. వెంటనే సైన్యసమేతంగా యక్షదేశము అయిన అలకాపురి మీదికి యుద్ధానికి బయలుదేరాడు. అలకాపురి వద్దకుపోయి తాను యుద్ధానికి వచ్చినట్టు

తెలుపడానికి తన శంఖం పూరించాడు. అలకాపురిలో ఉన్న యక్షసైనికులు ధ్రువునిమీదికి యుద్ధానికి వచ్చారు.

ధ్రువుడు ఆ యక్షసైనికులను వాడిఅయిన తన బాణములతో చంపాడు. మిగిలిన యక్షులు ఒకే మారు ధ్రువుని మీద బాణములను ప్రయోగించారు. యక్షసైనికులు అందరూ తమ చేతిలో ఉన్న బాణములు, బల్లెములు, పరిఘలు, శూలములు ఒకే సారి ధ్రువుని మీద, అతని సారధి మీద, హయముల మీద ప్రయోగించారు. ధ్రువుడు తన రథము సహా ఆ బాణములతో కప్పబడిపోయాడు. క్షణకాలం తరువాత ధ్రువుడు తన శక్తితో ఆ బాణములను ఛేధించుకొని బయటకు వచ్చాడు. ధ్రువుడు తన శస్త్రములు అస్త్రములతో యక్షులను చించి చెండాడాడు. యుద్ధభూమి అంతా యక్షుల మృతకళేబరము లతో నిండిపోయింది. చావగా మిగిలిన యక్షులు యుద్ధభూమి నుండి పారిపోయారు.

తనను ఎదిరించే వారు లేకపోవడంతో ధ్రువుడు కాసేపు సేదతీరాడు. అలకాపురిలోనికి ప్రవేశించి ఆ నగర శోభను చూద్దామని అనుకున్నాడు కానీ యక్షులు మాయావులు వారిని నమ్మకూడదు అని అనుకున్నాడు. ఏపక్కనుండి యక్షులు దాడి చేస్తారో అని జాగ్రత్తగా ఉ న్నాడు.

ధ్రువుడు అనుకున్నట్టే యక్షులు మాయాయుద్ధం మొదలెట్టారు. భయంకరమైన మేఘ గర్జనలు, ప్రచండ వాయువు మొదలయింది. ఆకాశము మేఘములతో నిండిపోయింది.

దుమ్మురేగుతోంది. ఉరుములు ఉరుముతున్నాయి. ఆకాశము నుండి నీటికి బదులురక్తము కురవ సాగింది. ఆకాశము నుండి మానవ శరీరములు తల, చేతులు, కాళ్లు లేకుండా కింద పడుతున్నాయి. ఇంతలో ఆకాశంలో ఒక పెద్ద పర్వతము కనపడింది. ఆ పర్వతము మీద నానారకములైన ఆయుధములు ధరించిన యక్షులు కనపడుతున్నారు. ఆ పర్వతము మీది నుండి సింహములు, పులులు, ఏనుగులు తన మీదికి వస్తున్నట్టు భ్రమకలిగింది ధ్రువునికి. మాయా విద్యలో ఆరితేరిన యక్షులు ధ్రువుని భయపెట్టడం కోసరం ఇటువంటి మాయలు ఎన్నో పన్నారు. కాని ఈ మాయలకు ధ్రువుడు చలించలేదు. ఆకాశము నుండి దేవతలు, మునులు ధ్రువునికి ఏ ఆపదా కలగకుండా కాపాడమని ఆ శ్రీహరిని ప్రార్థించారు.

శ్రీమద్భాగవతము
చతుర్థస్కంధము పదియవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
చతుర్థస్కంధము
పదకొండవ అధ్యాయము.

విదురా! యక్షులు చేసే మాయా యుద్ధమును ఎదుర్కోడానికి ధ్రువుడు నారాయణాస్త్రమునుసంధించాడు. నారాయణాస్త్రము మహిమకు యక్షుల మాయ నాశనం అయిపోయింది. నారాయణాస్త్రములో నుండి వేలకొలది బాణములు

యక్షులను చించి చెండాడుతున్నాయి. యక్షుల కోపము మిన్ను ముట్టింది. యక్షులు అందరూ తమ తమ ఆయుధములను చేతబూని ధ్రువుని మీదికి పరుగెత్తారు. ధ్రువుడు తన వాడి అయిన బాణములతో తన మీదికి వస్తున్న యక్షులను పరలోకమునకు పంపాడు.

ఈ మారణహోమం గురించి తెలుసుకున్న ధ్రువుని తాతగారైన స్వాయంభువమనువు మహర్షులను వెంట బెట్టుకొని ధ్రువుని వద్దకు వెళ్లాడు. తన మనుమనితో ఇలా అన్నాడు.

"కుమారా! ఈ ప్రకారంగా యక్షులను ఎందుకు చంపుతున్నావు. వారు నీకు ఏం అపకారం చేసారు. ఇంతకూ యక్షులు చేసిన నేరం ఏమిటి? వారు నీ సోదరుడిని ఒక్కడిని మాత్రమే చంపారు. కాని నువ్వు వేలకొద్ది యక్షులను చంపావు? ఇది నీకు ధర్మమా! ఇతరులను చంపడం పశువుల స్వభావము. పరమాత్మను ప్రసన్నం చేసుకున్న వాడివి నీకు ఇది తగునా? భగవంతుని భక్తులకు ఇది భావ్యము కాదు.

నీకు పరమాత్మయొక్క తత్త్వజ్ఞానము తెలుసు. అన్ని ప్రాణులలోనూ పరమాత్మ ఆత్మస్వరూపంతో ఉన్నాడు. ఈ సత్యం తెలుసుకొన్న నీవు ఆ పరమాత్మను ఆరాధించి ఉత్తమ మైన పదవిని పొందావు. నీవు నిరంతరము శ్రీహరి ధ్యానములో నిమగ్నమై ఉన్నావు. శ్రీహరిని సేవించు భక్తులు అందరూ నిన్ను కీర్తిస్తుంటారు. నీవు మాత్రము కోపంతో ఇటువంటి పాపపు పనులు చేస్తున్నావు. నీకు ఇది ధర్మమా!

మనకన్నా గొప్ప వారి యందు గౌరవము, మనకన్నా తక్కువ వారి యందు దయ, మనతో సమానమైన వారి యందు మైత్రి, అన్ని ప్రాణులను సమంగా భావించేవాడికి భగవంతుడు ప్రసన్నమవుతాడు అని నీకు తెలుసు. ఒక సారి పరమత్మ ప్రసన్నుడయితే అతడిని ఇహలోక బంధముల నుండి విముక్తి కలుగుఉంది. అతడికి అత్యున్నతమైన బ్రహ్మపదము లభిస్తుంది.

కుమారా! నీకు తెలుసు కదా! ఈ లోకంలో స్త్రీ పురుషుడు శారీరకంగాకలిస్తే సృష్టి జరుగుతుంది. ఆడవారు, మగవారు, పుడతారు. ఆ పుట్టిన వారు సత్త్వ,రజస్తమోగుణములతో పెరుగుతారు. మరలా ఆ స్త్రీపురుషులు కలిస్తే, వారికి సంతానం కలుగుతుంది. ఈ ప్రకారంగా సృష్టి అనంతంగా కొనసాగుతుంది.  ఇదంతా మాయ. పుట్టడం, పెరగడం చావడం మాయకాక మరేముంది. దీనికంతా కర్త ఆ పరమాత్మ. ఆయన నిమిత్త మాత్రుడు. ఎందులోనూ లీనం కాడు. సాక్షీభూతంగా ఉంటాడు. మనం మాత్రం అయస్కాంత శక్తికి ఇనుము ఆకర్షింపబడి చైతన్యం పొందినట్టు, ఆ పరమాత్మ శక్తివలన మనం అందరం చైతన్యం పొందుతున్నాము.

కాలశక్తి ప్రభావంచేత మూడు గుణములలో చలనం రాగా, భగవంతుడు తన శక్తిని ఈ ప్రాణుల యందు ఉంచాడు. తాను ఏ కర్మా చేయనవసరం లేకపోయినా, ఆయా ప్రాణుల దేహములో ఉండి అన్ని కర్మలు చేస్తుంటాడు. తనకు ఎవరినీ చంపనవసరం లేకపోయినా, దేహములో ఉన్నాడు కాబట్టి చంపుతుంటాడు. ఆ భగవానుని లీలలు విచిత్రములు.

కుమారా! కాలస్వరూపుడు అగు భగవంతుడు అనాది. అనంతుడు. నిర్వికారుడు. ఆయనకు నాశనము లేదు. ఇందాక చెప్పినట్టు ప్రాణుల ద్వారా ప్రాణులను సృష్టిస్తుంటాడు. ఆ ప్రాణుల చేతనే ప్రాణులను చంపిస్తుంటాడు. ఒక ప్రాణికి మరొక ప్రాణిని ఆహారంగా కల్పించాడు. మరణాలకు మృత్యువును అధిదేవతగా చేసాడు. ఆ మృత్యువుకు తన మన అనే భేదం లేదు. అన్ని ప్రాణులను సమంగా చూస్తుంది. సమంగా చంపుతుంది. ఆ మృత్యువు సర్వవ్యాపి. అంతటా వ్యాపించి ఉంటుంది. పుట్టిన ప్రతిప్రాణి వెనకా పొంచి ఉంటుంది. సమయం చూచి కబళిస్తుంది.

ఈ ప్రాణులంతా కాలం వెంట పరుగెడుతూ, కర్మలు చేస్తుంటారు. కాలం తీరగానే మృత్యుముఖంలో పడిపోతారు. కాని పరమాత్మ ఈ కాలమునకు అతీతుడు. ఆయనకు కాలము అనేది లేదు. ఈ కాలమును కొంత మంది కర్మ అంటారు. మరి కొంత మంది దైవము అంటారు. గ్రహచారము, గ్రహబలము అని జ్యోతిష్కులు అంటారు. ఇవన్నీ ఒప్పుకోని నిరీశ్వరవాదులు ఇదంతా స్వభావము అంటారు. కామకోరికలతో సతమతమయ్యేవాళ్లు ఇదంతా కామము అంటారు.

కాని కాలస్వరూపుడు ఆ పరమాత్మ ఒక్కడే. ఆ పరమాత్మ ఎవరికీ కనిపించడు. మహత్తత్వము మొదలగు శక్తులు ఆయన నుండి పుట్టాయి. ఆ ఈశ్వరుడు ఎప్పుడు ఎవరిని ఏమి చేస్తాడో ఎవరికీ తెలియదు. ఆ పరమాత్మ గురించి పూర్తిగా తెలుసుకున్నవాడు ఎవరూ లేరు.

కాబట్టి కుమారా! నీ సోదరుని మరణానికి ఈ యక్షులు కారణం అని నీవు అనుకుంటున్నావు, అది పొరపాటు. నిజానికి ఈ యక్షులు నీ సోదరుని చంపలేదు. అందరి చావు పుట్టుకలకు ఆ భగవంతుడే కారణము. ఈ పరమాత్మ ఈ అనంత విశ్వమును సృష్టిస్తున్నాడు, పోషిస్తున్నాడు, లయం చేస్తున్నాడు. కాని ఆయన దేనిలోనూ లీనంకాడు. ఎందు కంటే ఆ పరమాత్మ సకల ప్రాణులను కాపాడుతుంటాడు. అసలు ఈ ప్రాణులందరూ పుట్టడానికి ఆయనే కారణం కదా! సృష్టి స్థితి లయములకు ఆయనే కారణం కదా!

కుమారా! ఇంకొక విషయం చెప్పనా! పరమాత్మ తన భక్తులకు అమృత స్వరూపుడు, తన విరోధులకు మృత్యుస్వరూపుడు. ఈ సకలజగత్తును పాలించే వాడు ఆ పరమాత్మయే! మానవులు దేవతలు ఆయనను ఆశ్రయించి మనుగడ సాగిస్తున్నారు. మనమందరమూ ఆయన ఆజ్ఞకు లోబడి ఆయన చెప్పినట్టు నడుచుకుంటున్నాము.

కుమారా! నీ గతం గుర్తుకు తెచ్చుకో. నీవు నీ సవతి తల్లి అన్న మాటలకు బాధపడి, ఇల్లువిడిచి పెట్టి వెళ్లి పోయావు. పరమాత్మను నిర్మలమైన మనస్సుతో ధ్యానించి ఎవరికీ దక్కని ఉన్నత పదమును పొందావు. ఇప్పుడు కూడా అదే దృష్టితో ఉండు. నిర్గుణుడు,నాశము లేని వాడు, సర్వవ్యాపి అయిన  పరమాత్మను గురించి ధ్యానించు. అప్పుడు నీకు శత్రువులే ఉండరు. ఈ భేదభావము ఉండదు. అందరూ పరమాత్మస్వరూపులుగానే గోచరిస్తారు. నీకు

ఎవరిమీద కోపం ద్వేషం ఉండదు.ఎవరినీ చంపవు. అందరినీ ప్రేమతో ఆదరిస్తావు. నేను నాది అనే అహంకారము, అవిద్య నీ నుండి దూరం అవుతుంది.

కుమారా! నీవు రాజువు. నీకు కోపం తగదు. నీకు కోపం వస్తే నీ ప్రజలు నీకు దూరం అవుతారు. జనానికి నువ్వు అంటే ప్రేమ ఉండదు. అందరూ నిన్ను చూచి భయపడతారు. కాబట్టి నీవు నీ క్షేమము, నీ ప్రజల క్షేమము కోరినవాడివి అయితే కోపాన్ని వదిలిపెట్టు. కేవలం నీ సోదరుని చంపాడు అన్న కోపంతో నీవు సాక్షాత్తు పరమశివుని సోదరుడైన కుబేరుని అనుచరులను చంపావు. కుబేరుని అవమానించావు. కుబేరుడు లోకపాలకుడు. ఆయనకుకోపం వచ్చి మన వంశమును నాశనం చేయకముందే నీవు వెళ్లి ఆ కుబేరుని క్షమించమని అడుగు. ఆయనను ప్రసన్నుడిగా చేసుకో! " అని ధృవునకు  కర్తవ్యమును ఉపదేశించాడు స్వాయంభువ మనువు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము

పన్నెండవ అధ్యాయము.

తన తాత గారైన స్వాయంభువమనువుచెప్పిన మాటలను సావధానంగా విన్నాడు ధ్రువుడు. తన కోపాన్ని వదిలిపెట్టాడు. తను చేస్తున్నది అకారణ హింస అని తెలుసుకున్నాడు. పశ్చాత్తాప పడ్డాడు.

ఈ విషయం తెలుసుకున్న కుబేరుడు ధ్రువుని వద్దకు వచ్చాడు. కుబేరుని చూచి ధ్రువుడు రెండు చేతులు జోడించి నమస్కరించాడు. కుబేరుడు ధ్రువునితో ఇలా అన్నాడు.

"ఓ క్షత్రియ కుమారా! నీకు పెద్దల ఎడల ఉన్న గౌరవమునకు ఎంతో సంతోషించాను. నీవు నీ తాత గారి మాట ప్రకారం యుద్ధము విరమించావు. హింసా మార్గమును వదిలిపెట్టావు. మీ తాతగారు చెప్పినట్టు నీవు యక్షులను చంప లేదు. యక్షులు నీ సోదరుని చంపలేదు. అంతా విధివిలాసము. ఆ పరమాత్ముని లీల. ఈ విశ్వంలో జనన మరణములకు కాలమే మూలము. మానవులలో ఉన్న అజ్ఞానము కారణంగా నేను, నీవు, వీడు నా వాడు, వాడు నీ వాడు, వీడిని వాడు చంపాడు, వాడిని వీడు చంపాడు అనే భావన కలుగుతూ ఉంటుంది. ఇదంతా మాయ అని వాళ్లకు తెలియదు. ఈ మాయ వలననే ఈ దేహాభిమానములు, సుఖదు:ఖాలు, బంధనాలు కలుగుతూ ఉంటాయి.

ధ్రువ కుమారా! ఇంక నీవు ఇక్కడి నుండి వెళ్లిపో. నిరంతరము ఆ పరమాత్మను సేవించు. ఈ సంసార సాగరమును దాటాలంటే ఆ పరమాత్మ పాద పద్మములు తప్ప మరొకటి లేదు. ఎందుకంటే ఆ పరమాత్మలో సత్త్వ,రజస్తమోగుణములతో కూడిన ఈ మాయకు చోటు లేదు. ఆ పరమాత్మ మాయను జయించాడు. అందుకని ఆ పరమాత్మనుసేవించి నీ జన్మను సార్థకం చేసుకో.

కుమారా! నేనే నీ వద్దకు వచ్చాను. ఊరికే వెళ్లను. ఏదైనా వరం కోరుకో! ఇస్తాను. నీవు సామాన్యుడవు కావు. సాక్షాత్తు ఆ శ్రీహరి పాదములను స్వయంగా దర్శించినవాడవు. నీకు వరం ఇవ్వడం నా అదృష్టంగా భావిస్తున్నాను. కోరుకో!' అని అన్నాడు కుబేరుడు.

కుబేరుడు తన పట్ల చూపిన ఆదరమునకు, అభిమానమునకు పులకించి పోయాడు ధ్రువుడు. కుబేరునితో ఇలా అన్నాడు. "కుబేరా! నాకు ఏ వరమూ అక్కరలేదు. నా మనసు నిరంతరము శ్రీహరియందు లగ్నం అయి ఉండేటట్టు, ఇటువంటి ఆవేశకావేషములతో మలినం కాకుండునట్టు, వరం ప్రసాదించు." అని కోరుకున్నాడు. కుబేరుడు ధ్రువుడు కోరిన వరమును ప్రసాదించి వెళ్లిపోయాడు.

తరువాత ధ్రువుడు తన నగరమునకు తిరిగి వచ్చాడు. యజ్ఞయాగములు చేసి ఆ యజ్ఞపురుషుని ఆరాధించాడు. ఎల్లప్పుడూ ఆ పరమాత్మయందు మనసు లగ్నం చేసి, సకలభూతములలో ఆ పరమాత్మను దర్శించాడు. తన ప్రజలను కన్న బిడ్డలవలె పరిపాలించాడు. ధ్రువుని పాలనలో ప్రజలు కూడా ఆయనను తమ తండ్రి లాగా తలపోసారు. ఆ ప్రకారంగా ధ్రువుడు 36,000 సంవత్సరములు రాజ్యపాలన సాగించాడు. ఎన్నోయజ్ఞములు యాగములు చేసాడు. రాజ్యభోగములు అనుభవించాడు. తుదకు ఈ దేహము, భార్యాపుత్రులు, బంధువులు, మిత్రులు, ధనము, భోగములు అశాశ్వతములు అని భావించి తన కుమారునికి రాజ్యాధికారము అప్పగించాడు. బదరికాశ్రమమునకు వెళ్లిపోయాడు.

అక్కడ ఒక ఆశ్రమమును నిర్మించుకున్నాడు. మనసును ఇంద్రియములను జయించాడు. ప్రాణాయామంతో శ్వాసను జయించాడు. మనసులో పరమాత్మను నిలుపుకున్నాడు. ఈ స్థూలదేహమును మరిచిపోయాడు. తదేక ధ్యానంలో నిమగ్నం అయ్యాడు. పరమాత్మ ధ్యానంలో లీనమైన ధ్రువునకు బాహ్య ప్రపంచముతో సంబంధం పూర్తిగా తెగిపోయింది. మనసంతా పరమాత్మతో నిండి పోయింది. కళ్లనిండా నీళ్లుకారుతున్నాయి. తాదాత్మ్య స్థితిలో ఉన్నాడు.

అప్పుడు ఆకాశం నుండి ఒక దివ్యమైన విమానము ధ్రువుడు ఉన్న చోట దిగసాగింది. ఆ విమానములో నాలుగు భుజములు కలవారు, శ్యామల వర్ణము వారు, అయిన ఇద్దరు దేవతా మూర్తులు ఉన్నారు. వారు ఆ విమానము దిగారు. ధ్రువుడు వారి వంక చూచాడు. వారు సాక్షాత్తు విష్ణువు అనుచరులని భావించాడు. లేచి నిలబడ్డాడు. శ్రీహరినామమును కీర్తిస్తూ వారికి నమస్కరించాడు. విష్ణువు అనుచరులు ధ్రువుని చూచి ఇలా అన్నారు.

“ఓ రాజా! నీకు శుభం కలుగుతుంది. నీవు ఐదు సంవత్సరముల వయసు ఉన్నప్పుడు శ్రీహరిని గురించి తపస్సు చేసావు. నీ తపస్సుకు ఆ విష్ణువు తృప్తి చెందాడు. నీవు ఈ దేహము విడువ వలసిన సమయం వచ్చింది. నిన్ను విష్ణువు వద్దకు తీసుకొని పోవుటకు వచ్చాము. ఎవరికీ సాధ్యం కానివిష్ణుపదమును నీవు పొందగలిగావు. సప్తఋషులు, సూర్య చంద్రులు నక్షత్రములు నీ చుట్టు

తిరుగుతుంటాయి. అటువంటి పదవి నీకు లభించింది. ఇది వరకు మీ వంశములో ఎవరు గానీ ఇటువంటి అత్యున్నత పదవిని అధిష్టింపలేదు. నీ కొరకు విష్ణువు ఈ విమానమును పంపాడు. దీనిని ఎక్కు." అని పలికారు.

విష్ణువు యొక్క అనుచరులు చెప్పిన మాటలను విన్నాడు ధ్రువుడు. స్నానాదులు ఆచరించి, అనుష్టానమును పూర్తి చేసుకొని, తన తోటి మునులందరికీ నమస్కరించాడు.వారి ఆశీర్వాదము తీసుకున్నాడు. తరువాత ఆ విమానమునకు ప్రదక్షిణము చేసి నమస్కారము చేసాడు. అందులో వచ్చిన విష్ణువు అనుచరులకు నమస్కరించాడు. తరువాత ఆ విమానమును ఎక్కబోయాడు.

అప్పుడు మృత్యుదేవత అక్కడకు వచ్చాడు. "ఓ మహానుభావా! నీవు మృత్యువును జయించావు. నా తలమీద పాదము పెట్టి ఎక్కు" అని ధ్రువుని ముందు ఒంగి నిలబడ్డాడు. ధ్రువుడు మృత్యువు తలమీద పాదము పెట్టి ఆ విమానము ఎక్కాడు. అప్పుడు దేవదుందుభులు మోగాయి. దేవతలు పూలవాన కురిపించారు.

ఇంతలో ధ్రువునికి ఒక ఆలోచన వచ్చింది. "ఇన్నాళ్లు తనను అనుసరించి ఉన్న తన తల్లి సునీతిని వదిలి తాను విష్ణులోకమునకు ఎలా వెళ్లగలను" అని అనుకున్నాడు. ధ్రువుని మనసులో ఉన్న ఆలోచనను విష్ణువు అనుచరులు కనిపెట్టారు. "మహారాజా! అటు చూడండి.మీ తల్లి సునీతి మీ కన్నా ముందే విమానములో వెళు తున్నారు." అని చెప్పారు. అప్పుడు ధ్రువుడు సంతోషంతో విమానం ఎక్కాడు. నక్షత్రం మండలం మీదుగా వెళుతున్నాడు. గ్రహములు తన

చుట్టు తిరగడం గమనించాడు.

ఆ ప్రకారంగా ధ్రువుడు మూడు లోకములను, నక్షత్రమండలములను దాటి ఎల్లప్పుడూ ప్రకాశంతో నిండి ఉండే విష్ణుపదమును చేరుకున్నాడు. ఎల్లప్పుడూ ఇతరులకు మేలు చేయువారు, శాంతమూర్తులు, అందరినీ సమంగా చూచేవారు, పరిశుద్ధమైన మనసు కలవారు, తామే కాకుండా తమ తోటి వారిని కూడా శ్రీహరి సేవలో లీనమయ్యేట్టు చేసేవారు, ఎల్లప్పుడూ శ్రీహరి నామమును స్మరించేవారు మాత్రమే ఆ విష్ణుపదమునకు అర్హులు.

ధ్రువుడు ఉన్న నక్షత్రలోకము జ్యోతిశ్చక్రము మధ్యలో ఉంది. ధ్రువుని చుట్టు నక్షత్రములు ప్రదక్షిణం చేస్తుంటాయి. ఆ ప్రకారంగా ధ్రువుడు మూడులోకముల చేతా పూజింపబడే స్థానమును పొందాడు. ధ్రువుడు పొందిన మహిమను చూచిన నారదుడు ప్రచేతసుడు చేయుచున్న యజ్ఞము సందర్భంగా జరిగిన సభలో, ప్రచేతసుల ముందు ధ్రువుని మహిమను ఈ విధంగా కీర్తించాడు.

"ఈ ధ్రువుడు మహా పతివ్రత అయిన సునీతి కుమారుడు. చిన్న వయసులోనే తన సవతి తల్లి పలికిన పలుకులకు మనస్సు కష్టపెట్టుకొని, తపస్సు చేసి మహా ఋషులు కూడా పొందలేని బ్రహ్మ పదమును పొందగలిగాడు. ఇప్పటి వరకూ అంత చిన్న వయసులో అంత కొద్ది కాలములో ఇంతటి పదవిని పొందినవారు లేరు."అని నారదుడు ప్రశంసించాడు.

విదురా! నీవు కోరినట్టు నీకు ధ్రువుని చరిత్రను వివరంగా చెప్పాను. ఈ ధ్రువుని చరిత్ర చదివినా, వినినా వారు ధన్యులు అవుతారు. వారి కీర్తి పెరుగుతుంది. ఈ చరిత్ర పరమ పవిత్రము, మంగళకరము, స్వర్గమునకు సోపానము వంటిది. పాపములను నాశనము చేస్తుంది. ఈ చరిత్ర చదివితే భగవంతుని ఎడల భక్తి కలుగుతుంది. అవిద్య, అజ్ఞానము నశిస్తుంది. మంచి శీలము అబ్బుతుంది. మనస్సు నిర్మలమవుతుంది.

ఈ ధ్రువ చరిత్రము బ్రాహ్మణుల సభలలో ఉదయము, సాయంత్రము పఠించవలెను. ఇంకా పౌర్ణమినాడు, అమావాస్యనాడు, ద్వాదశినాడు, శ్రవణానక్షత్రము ఉండు రోజు, మూడు తిథులు కలిసేరోజు (అవి అరుదుగా వస్తాయి) సంక్రాంతి రోజు, ఆదివారము రోజు ఈ ధ్రువచరిత్రను పారాయణము చేయవలెను.

కేవలము చదవడమే కాదు, శ్రీహరి భక్తులకు, శ్రీహరి మీద శ్రద్ధ ఉన్న వారికి  వినిపించాలి. ముఖ్యంగా భగవంతుని మీద భక్తి లేని వారికి చదివి వినిపించాలి. అటువంటి వారు కూడా భగవంతుని మీద భక్తిని పెంపొందించుకుంటారు. భగవంతుని భక్తులుగా మారి పోతారు." అని మైత్రేయుడు విదురునికి ధ్రువచరిత్ర వినిపించాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము పన్నెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## చతుర్థ స్కంధము
## పదమూడవ అధ్యాయము.

(ఈ భాగవతమును శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెబితే, దానిని నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూతపౌరాణికుడు శౌనకుడు మొదలగు మహర్షులకు వినిపించాడు. అందులో అంతర్భాగంగా మైత్రేయుడు విదురునికి చెబుతున్న విషయములను మనము చదువుకుంటున్నాము. పాఠకులు ఈ విషయం గుర్తుపెట్టుకోవాలని మనవి.)

ధ్రువ చరిత్రను విన్న విదురుడు మైత్రేయుని ఇలా అడిగాడు. "మైత్రేయా! నీవు ప్రచేతసుల సభలో నారదుడు ధ్రువుని చరిత్రను గానం చేసాడు అని చెప్పావు కదా! ఆ ప్రచేతసులెవరు? వారు ఏ వంశములో జన్మించారు? వారి తల్లితండ్రులు ఎవరు? వారు ఎక్కడ యజ్ఞము చేసారు? ఈ విషయములన్నీ నాకు వివరంగా చెప్పండి." అని అడిగాడు.

అప్పుడు మైత్రేయుడు విదురునితో ఇలా చెప్పసాగాడు. "విదురా! ధ్రువుడు వానప్రస్థమునకు పోవడానికి నిశ్చయించుకున్నాడు. ధ్రువుని కుమారుడు అయిన ఉత్కలుడు తండ్రి వద్దనుండి రాజ్యాధికారమును తీసుకోడానికి ఇష్టపడలేదు. ఎందుకంటే ఉత్కలుడు పుట్టినప్పటి నుండి ఈ ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి చూపలేదు. జ్ఞాన యోగము అవలంబించాడు. రాగ ద్వేషములను

విడిచిపెట్టాడు. అందరినీ సమంగా చూచేవాడు. అందరిలో పరమాత్మను, పరమాత్మలో అందరినీ దర్శించేవాడు. దేహము మీద అభిమానము వదిలిపెట్టాడు. శాంతమూర్తిగా, అలౌకికమైన ఆనందం అనుభవిస్తూ ఉండేవాడు.

ఉత్కలుడు బయటవారు చూడడానికి పిచ్చివాడి మాదిరి ఉండేవాడు. అతడు దారిలో పోతుంటే అందరూ అతనిని ఒక పిచ్చివాడిగా, జడుడిగా, గుడ్డివానిగా, చెవిటివానిగా, ఉన్మత్తునిగా చూచేవారు. ఇతని ప్రవర్తన చూచిన మంత్రులు, కులవృద్ధులు ఇతనిని పిచ్చివానిగా భావించి, అతనికి రాజ్యము ఇవ్వలేదు. అతని తమ్ముడు అయిన భ్రమి కుమారుడు అయిన వత్సరుని రాజ్యాభిషిక్తుని చేసారు.

ఆ వత్సరుని భార్య పేరు సునీథి. వారికి ఆరుగురు కుమారులు కలిగారు. వారు పుష్పార్ణుడు, తిగ్మకేతువు, ఇషుడు, ఊరుడు, వసువు, జయుడు. పుష్పార్ణునికి ప్రభ, దోష అనే ఇద్దరు భార్యలు ఉన్నారు. వారిలో ప్రభకు ప్రాత:కాలము, మధ్యాహ్నము, సాయంకాలము అనే ముగ్గురు కుమారులు కలిగారు. దోష అనే ఆమెకు ప్రదోషుడు, నిశీథి, వ్యుష్టుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. వ్యుష్టుడి భార్యపేరు పుష్కరిణి. వారికి సర్వతేజుడు అనే కుమారుడు కలిగాడు. ఆ సర్వతేజునకు చక్షువు అనే పేరు కూడా ఉంది. అతని భార్య ఆకూతి. వారిరువురికి చాక్షుషమనువు అనే కుమారుడు కలిగాడు.

చాక్షుష మనువు భార్య నడ్వల. వారికి పన్నెండు మంది కుమారులు పుట్టారు. వారు పురువు, కుత్సుడు, ఋతుడు, ద్యుమనుడు, సత్యవంతుడు, ధ్రుతుడు, వ్రతుడు, అగ్నిష్టోముడు, అతిరాత్రుడు, ప్రద్యుమ్నుడు, శిబి, ఉల్మూకుడు అనే పన్నెండు మంది కుమారులు.
ఉల్మూకుని భార్య పేరు పుష్కరిణి. వారికిఅంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, గయుడు, అనే ఆరుగురు కుమారులుకలిగారు.

వారిలో అంగుని భార్యపేరు సునీథ. వారిద్దరికీ వేనుడు అనే కుమారుడు కలిగాడు. చిన్నప్పటి నుండి ఈ వేనుడు దుర్మార్గుడు గా పెరిగాడు. వీడి దుర్మార్గమును సహించలేక అతని తండ్రి విరక్తితో నగరము విడిచిపెట్టి వెళ్లిపోయాడు. వేనుని దుర్మార్గమును తట్టుకోలేక ఋషులు అతనిని శపించారు. ఆ శాపకారణంగా అతడు చనిపోయాడు. వేనుడు చనిపోయిన తరువాత ఆ ఋషులు అతని కుడిచేతిని మర్దించారు. ఆ మర్దన ఫలితం చేత పృథువు అనే కుమారుడు జన్మించాడు. పృథుడు సాక్షాత్తు శ్రీహరి అవతారము."అని చెప్పాడు మైత్రేయుడు.

ఇప్పుడు విదురునికి ఒక సందేహము వచ్చింది. "మహాత్మా! అంగరాజు పుణ్యాత్ముడు, సాధుస్వభావుడు కదా. మరి అతనికి వేనుడు అనే దుర్మార్గుడు ఎందుకు కుమారుడుగా జన్మించాడు. వేనుడిని రాజ్యము నుండి  వెళ్లగొట్టకుండా అంగరాజు ఎందుకు రాజ్యము విడిచి వెళ్లిపోయాడు. అంగరాజు తరువాత రాజైన వేనుని మునులు ఎందుకు

శపించారు. రాజును ఆ ప్రకారము శపించవచ్చునా? ఈ వివరాలన్నీ నాకు తెలియజేయండి." అని అడిగాడు విదురుడు. మైత్రేయుడు ఇలా చెప్ప సాగాడు.

"విదురా! అంగుడు రాజర్షి. ఒక సారి ఆయన యజ్ఞము చేస్తున్నాడు. హవిస్సులు తీసుకోడానికి దేవతలను మంత్రపూర్వకంగా ఆహ్వానించారు ఋత్విక్కులు. కాని దేవతలు రాలేదు. అంగరాజు ఋత్విక్కుల వంక చూచాడు. "రాజా! మేము యజ్ఞమునకు కావలసిన సంభారములు ధర్మ మార్గముననే సేకరించాము. ఈ సంభారములలో ఏ దోషమూ లేదు. మేము వేదం చదువుకున్నాము. మేము ఉచ్ఛరించిన మంత్రములలో కూడా ఎటువంటి దోషము లేదు. ఆ మంత్రములు శక్తికలవి. మేము దేవతల పట్ల ఎటువంటి తిరస్కార భావము చూపలేదు. దేవతలు వచ్చి వారి హవిర్భాగములను ఎందుకు స్వీకరించడం లేదో తెలియడం లేదు." అని అన్నారు.

అంగరాజు చాలా బాధ పడ్డాడు. వెంటనే అక్కడ ఉన్న సదస్యులను పిలిచి దేవతలు ఎందుకు రాలేదు? కారణం ఏమిటి? అని అడిగాడు. దానికి సదస్యులు ఈ విధంగా బదులు చెప్పారు. "రాజా! నీవు ఈ జన్మలో గానీ గత జన్మలో గానీ ఏ పాపమూ చేయలేదు. కాని నీకు ఈ జన్మలో పుత్ర సంతానము లేదు. పుత్రులు లేని వారి నుండి దేవతలు హవిస్సులు స్వీకరించరు. ఆ కారణం చేత దేవతలు రాలేదు. నీవు పుత్రులు కావాలనే కోరికతో యజ్ఞము చేస్తే నీకు ఆ యజ్ఞపురుషుడు తప్పకు సంతానమును ప్రసాదిస్తాడు." అని అన్నారు.

ఆ మాటలు విన్న అంగరాజు వెంటనే పుత్రుల కోసరం ఒక యజ్ఞము చేసాడు. ఆ యజ్ఞ కుండము లో నుండి యజ్ఞ పురుషుడు బయటకు వచ్చాడు. అతని చేతిలో ఒక బంగారు పాత్ర అందులో పాయసము ఉన్నాయి. అంగరాజు ఆ పాయస పాత్రను తీసుకొని తన భార్యకు ఇచ్చాడు. ఆమె ఆ పాయసమును స్వీకరించింది. కాలగతిన ఆమె గర్భము ధరించి ఒక కుమారుని ప్రసవించింది. ఆ కుమారుని పేరు వేనుడు.

వేనుడు పుట్టినప్పటి నుండి అధర్మకార్యములు అంటే ఎంతో ఇష్టము. దుష్టుడుగా తయారయ్యాడు. అడవిలోకిపోయి చిన్న చిన్న మృగములను చంపేవాడు. తనతో ఆడుకొనే బాలురను అతి క్రూరంగా చంపేవాడు. వేనుడు రావడం చూచిన ప్రజలు దూరంగా పారిపోయేవారు. ఇది చూచి అంగరాజు కుమారుని కఠినంగా దండించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. దుర్మార్గులయిన కుమారులను కన్న వారు పడే కష్టాలు అన్నీ అంగరాజు అనుభవించాడు. ఆ కుమారుని వలన అతనికి అపఖ్యాతి వచ్చింది. మానసికంగా కుంగిపోయాడు.

విదురా! సంతానము లేని వారు సంతానము కొరకు యజ్ఞములు, యాగములు, వ్రతములు చేస్తారు. అన్ని దేవుళ్లకు మొక్కుతారు. ఆ పుట్టే కుమారుడు దుర్మార్గుడు అయితే వచ్చే కష్టాలను వారు ఊహించలేరు. చెడ్డ సంతానమువలన మానవులకు చెడ్డ పేరు, అందరితో విరోధము, మానసిక బాధ కలుగుతాయి. ప్రతిరోజూ ఇంటి మీదికి తగాదాలు వస్తుంటాయి. ఇటువంటి కుమారులు ఎందుకు పుట్టారా అని ఏడుస్తారు. జ్ఞాని అయిన వాడు అటువంటి కుమారులను

ఆదరించడు.

అందుకని అంగరాజుకు నిర్వేదము కలిగింది. రాత్రిళ్లు నిద్రపట్టడం లేదు. ఒకరోజు రాత్రి ఎవ్వరికీ చెప్పకుండా రాజ్యము విడిచి వెళ్లిపోయాడు అంగరాజు. మరునాడు అంగుడు కనిపించలేదు. మంత్రులు, పురోహితులు అందరూ రాజు విరక్తితో వెళ్లిపోయాడు అని అనుకున్నారు. అంగరాజు కోసరం వెతికించారు కానీ ప్రయోజనం లేకపోయింది. రాజు లేని రాజ్యము అరాచకం అవుతుంది. అందుకని ఏం చెయ్యాలా అని ఆలోచించసాగారు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము

పదునాలుగవ అధ్యాయము.

రాజు లేని రాజ్యము అరాచకము అవుతుంది అని తలంచిన మంత్రులు, పురోహితులు అంగరాజు భార్య అనుమతితో వేనుని రాజుగా అభిషేకించారు. క్రూరస్వభావము కల వేనుడు రాజు కాగానే, వేనుడు తమను కఠినంగా శిక్షిస్తాడేమో అని భయపడి, దుర్మార్గులు అంతా రాజ్యము విడిచి పారిపోయారు. వేనుడు తనకు తానే భగవంతుడిగా ప్రకటించుకున్నాడు. తనను కాకుండా వేరు దేవుళ్లను పూజించే వారిని అవమానించసాగాడు.

వేనుడు వేదములను నమ్మడు. ఎవరినీ వేదములలో చెప్పబడిన యజ్ఞములు, యాగములు చేయవద్దని ఆదేశించాడు. ధర్మము అనేది లేకుండా చేసాడు. రాజు యొక్క అధర్మ ప్రవర్తన చూచి అధి కారులుకూడా అధర్మవర్తనులుగా మారి పోయారు.  ఇది చూచినమునులు అందరూ ఒకచోట చేరి ఆలోచించసాగారు.

"వేనుడి రాజ్యములో ప్రజలు చాలా బాధలు పడుతున్నారు. రాజ్యము అరాచకము అవుతుందని వేనుని రాజును చేస్తే, వీడు ఇలా తయారయ్యాడు. ధర్మాత్ముడైన అంగరాజుకు ఇలాంటి అధర్మవర్తనుడు పుట్టాడు. వీడు మంచి మాటలు వినే పరిస్థితిలో లేడు.  ఇప్పుడు ప్రజలను రక్షించే ఉపాయము ఆలోచించాలి. వీడి అధర్మ ప్రవర్తన వలన వీడు ఇప్పటికే చచ్చాడు. ముందు మంచి మాటలతో చెప్పి చూస్తాము. వినకపోతే ప్రజా క్షేమం దృష్ట్యా వీడిని మన శాపంతో నాశనం చేద్దాము. " అని అనుకున్నారు.

అందరూ వేనుని వద్దకు వెళ్లారు. వేనునితో ఇలా అన్నారు. "మహారాజా! మేము చెప్పబోవు మాటలను శ్రద్ధగా వినండి. దీని వలన తమరికి ఆయుష్షు, కీర్తి వృద్ధిపొందుతాయి. మనస్సు, వాక్కు, దేహము వీటి ద్వారా ధర్మమును పాటించాలి. అటువంటి వారికి స్వర్గలోక సౌఖ్యములు, తుదకు మోక్షము లభిస్తుంది. కాని నీవు ధర్మహాని కలిగించే పనులు చేస్తున్నావు. రాజ్యంలో ధర్మం నశిస్తే ఆ రాజుకు ఐశ్వర్యము నిలువదు.

నీ అధర్మ ప్రవర్తన బట్టి అమాత్యులు రాజు ఉద్యోగులు లంచగొండులు అయ్యారు. దేశంలో దొంగతనాలు నేరాలు పెరిగిపోతున్నాయి. నీవు ప్రజల నుండి పన్ను తీసుకుంటున్నావు. దానికి ప్రతిగా ప్రజాక్షేమం కొరకు ఏమీ చెయ్యడం లేదు. ప్రజల వద్దనుండి పన్ను తీసుకుంటూ ప్రజలకు సేవచెయ్యని రాజుకు ఈ లోకంలో కానీ పరలోకంలోకానీ సుఖం ఉండదు. ఏ రాజు రాజ్యములో వర్ణాశ్రమ ధర్మములు చక్కగా అనుష్టింపబడతాయో ఆ రాజుమీద పరమాత్మ తన కరుణను ప్రసరిస్తాడు. ఆ పరమాత్మ కరుణా కటాక్ష వీక్షణములు ప్రసరించే ఆ రాజు పొందదగనది ఈ లోకంలో కానీ పరలోకంలో కానీ ఏమి ఉంటుంది.

ఓ రాజా! స్వర్గము మొదలగు మూడు లోకములకు, లోక పాలకులకు, దేవతలకు, యజ్ఞములకు అధిపతి అయిన ఆ పరమాత్మ, యజ్ఞస్వరూపుడు,వేదస్వరూపుడు, తపోరూపుడు అయిన ఆ పరమాత్మను నీ దేశములో ప్రజలు యజ్ఞములు, యాగములు చేయడం ద్వారా పూజిస్తున్నారు. నీవు కూడా వారి మాదిరి యజ్ఞయాగములు చేసి ఆ పరమాత్మను సేవించు. ఏ రాజ్యంలో బ్రాహ్మణులు యజ్ఞ యాగములు చేస్తుంటారో, ఆ రాజ్యంలో పంచభూతములు చక్కగా కోరిన వరములు ప్రసాదిస్తాయి. " అని వేనుడికి నచ్చచెప్పబోయారు ఋషులు.

(అంటే సకాలంలో వర్షాలు కురుస్తాయి, వరదలు రావు, గాలి వానలువచ్చి కొట్టుకుపోవు, అగ్ని ప్రమాదాలు రావు. పిడుగులు పడవు. ఇదీ పంచభూతములు మన మీద కరుణిస్తే కలిగే లాభాలు.)

కాని వేనుడు వారి మాటలు పెడచెవిని పెట్టాడు. "నేను ఈ దేశపు రాజును. నన్ను వదిలిపెట్టి ఎవరికో యజ్ఞములు యాగములు చేయడం ఏమిటి? మీరు అందరూ మూర్ఖులు. ఎదురుగా ఉన్న నన్ను వదిలిపెట్టి ఎవరినో సేవిస్తున్నారు. నేను మీకు ప్రభువును. నేను ఈశ్వరుడను. ఆ యజ్ఞములు అన్నీ నా పరంగానే చెయ్యాలి. నన్ను అవమానిస్తే మీకు ఈ లోకంలో కానీ పరలోకంలో కానీ సుఖాలు కలుగవు. మీరు యజ్ఞపురుషుడు అంటున్నారు. ఆ యజ్ఞపురుషుడు ఎవరు? ఎక్కడ ఉంటాడు? మీకు తెలుసో లేదో! బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, ఇంద్రుడు, చంద్రుడు, పంచభూతములు, కుబేరుడు, యముడు, సూర్యుడు, దేవతలు అన్నీ నాయందే ఉన్నారు. రాజును అయిన నేను సర్వదేవమయుడను. ఆ విషయం గుర్తుపెట్టుకోండి.

కాబట్టి ఓ మునులారా! నా మీద ఉన్న ద్వేషమును వదిలిపెట్టండి. నన్నే పరమాత్మగా కొలవండి. అన్ని యజ్ఞములు నా పరంగా చేయండి. హవిస్సులు నాకు అర్పించండి. నా కంటే వేరే దేవుడు ఎవరూ లేరు. అన్నీ నేనే." అని గర్వంగా చెప్పాడు వేనుడు.

వేనుడి మాటలు విన్న ఋషులు,మునులు, ఖిన్నులయ్యారు. బుద్ధిలేని వాడు, దుర్మార్గుడు, అయిన వేనుని మాటలను మునులు అంగీకరించలేదు. అప్పుడు వారు ఇలా అన్నారు.

" ఈ అధర్మపరుడు అయిన వేనుడు ఇంక జీవించ ఉండకూడదు. వీడిని వెంటనే సంహరించండి. వీడు బతికి ఉంటే ఈ లోకాన్నే నాశనం చేస్తాడు. వీడికి రాజుగా ఉండే యోగ్యతలేదు. వీడు దైవదూషణ చేస్తున్నాడు. తానే పరమాత్మఅని ప్రకటించుకుంటున్నాడు.

ఎవరి కరుణతో, దయతో వీడు రాజు అయ్యాడో ఆ పరమాత్మనే దూషిస్తున్నాడు. కాబట్టి వీడిని చంపక తప్పదు.” అని తీర్మానించారు.

ఆ మునులందరూ తమ కోపాన్ని ఒక్కసారిగా ప్రదర్శించారు. ఆ కోపాగ్నిలో వేనుడు దగ్ధం అయిపోయాడు. వేనుడు మరణించిన తరువాత మునులు తమ తమ ఆశ్రమములకు వెళ్లిపోయారు. తన కుమారుడు మరణించాడని తెలిసి అతని తల్లి సునీథి పరుగు పరుగున వచ్చి తన కుమారుడు వేనుని శరీరాన్ని ఒక చోట పెట్టి రక్షిస్తూ ఉంది. వేనుని సంహరించిన తరువాత ఆ మునులందరూ సరస్వతీ నదిలో స్నానం చేసి హెూమములు చేస్తున్నారు. తరువాత పరమాత్మ కథలను చెప్పుకుంటున్నారు.

ఇంతలో వారికి ఒక అనుమానం వచ్చింది. మనము వేనుడిని చంపేసాము. మరి ఆ రాజ్యం ఎలా ఉందో. అరాచకం పెరగలేదుకదా! అని అనుకున్నారు.

వారు అలా అనుకుంటూ ఉంటే కొంత మంది దొంగలు దొంగసొత్తును చేతబట్టుకొని అటుగా పరుగెడుతున్నారు. అప్పుడు వారికి అర్థం అయింది. రాజు అయిన వేనుడు చనిపోగానే రాజ్యంలో అరాచకం ప్రబలిపోయింది. దొంగతనాలు దోపిడీలు హింస పెరిగిపోయింది. ప్రజలు నానాబాధలు పడుతున్నారు.

ఈ దుర్మార్గులను అందరినీ చంపగల శక్తి  ఆ మునులకు ఉంది. కానీ వారి కోసరం తమ తపశ్శక్తి వృధాచేసుకోదలచలేదు. వారు ఇలా ఆలోచించసాగారు. “వేనుని వంశము అంతము

అయిపోకూడదు. వీడి వంశంలో వీడు ఒక్కడే దుర్మార్గుడు కానీ మిగిలిన అందరూ ధర్మాత్ములే. కాబట్టి ఈ వేనుని వంశమును రక్షించాలి. ఈ రాజ్యానికి ఒక రాజును పుట్టించాలి." అని అనుకున్నారు.

వెంటనే ఆ మునులందరూ వేనుని తల్లి సునీథ వేనుని శరీరాన్ని సంరక్షిస్తున్న ప్రదేశానికి చేరుకున్నారు. వేనుని మృతకళేబరము చుట్టుకూర్చున్నారు. వేనుని మృతదేహము యొక్క తొడల భాగాన్ని మర్దించారు. అప్పుడు ఆ తొడ ప్రదేశం నుండి ఒక పొట్టి మనిషి పుట్టాడు. వాడు నల్లగా ఉన్నాడు. దవడలు పెద్దవిగా ఉన్నాయి. చట్టి ముక్కు. ఎర్రని కళ్లు. రాగి రంగు జుట్టు. వికృతంగాఉన్నాడు. ఆ పొట్టివాడు మునుల ముందు నిలబడి "నేను ఏమి చెయ్యాలి" అని అడిగాడు.

ఇలాంటి వాడిని రాజును చేయడం ఏమిటని ఆ మునులు "నిషీద" (అక్కడ కూర్చో) అన్నారు. అందువలన వాడిని నిషాదుడు అని అన్నారు. వాడి వంశంవాళ్లు నిషాదులు అయ్యారు. ఆనిషాదుడు పుట్టగానే మునులు వేనుడి పాపాలన్నీ ఆ నిషాదుడిని స్వీకరించ మన్నారు. మునుల ఆజ్ఞ ప్రకారము ఆ పొట్టి వాడైననిషాదుడు వేనుడి పాపాలన్నీ స్వీకరించాడు. అప్పటినుండి నిషాదులు పాపాత్ములు అయ్యారు. వారు గ్రామాలలో పట్టణాలలో ఉండకుండా అరణ్యాలలో ఉంటున్నారు.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము

పదునైదవ అధ్యాయము

వేనుని తొడల నుండి పొట్టివాడు వికృతాకారుడు పుట్టాడని మునులు తమ పట్టు విడువ లేదు. మరలా వేనుని శరీరమును మథించారు. ఈ సారి వారు వేనుని బాహువులను మథించారు. వేనుని బాహువుల లోనుండి ఒక పురుషుడు ఒక స్త్రీ పుట్టారు. ఆ స్త్రీపురుషులు సాక్షాత్తు భగవంతుని అవతారములు అని అనుకొన్నారు ఆ ఋషులు.

(ఇదేమిటి. తొడల నుండి చేతుల నుండి బిడ్డలు పుట్టడం ఏమిటి అని అనుకుంటున్నారా! మరి ఈ నాటి పరిశోధనలలో క్లోనింగ్ అనీ, జీన్సు అనీ, పిండం దశలోనే జీన్సును మార్చవచ్చనీ, స్త్రీపురుష సంయోగం అవసరం లేకుండానే బిడ్డలను పుట్టించవచ్చనీ, నేటి శాస్త్రపరిజ్ఞానము చెబుతూ ఉంది కదా!(ఈనాడు నవంబరు 6,2012 దిన పత్రిక సుఖీభవలో చూడండి.) ఆ పరిజ్ఞానమే 5,000 సంవత్సరాల కిందట ఋషులు చూచాయగా చెబితే మనం నమ్మడం లేదు!)

ఆ కుమారుడు సాక్షాత్తు విష్ణువు అంశ అనీ, కుమార్తె లక్ష్మీదేవి అంశ అనీ భావించారు. ఆ కుమారుడికి పృథు అనే పేరు పెట్టారు. అతడే భూమిని పరిపాలించగలడు. ఆ కుమార్తె లక్ష్మీదేవిగా పృథు మహారాజును భర్తగా సేవించగలదు. దానికి కారణం కూడా వారుచెప్పారు. లోకములను ఉద్ధరించడానికి శ్రీహరి పృథు

మహారాజుగా జన్మించాడు. ఆయనతో పాటు ఆయనభార్య లక్ష్మీదేవి కూడా జన్మించింది.
(వీరిది అన్న చెల్లి అనుబంధంకాదు అని చెప్పినట్టుంది. పైగా వీరు ఒకతల్లి కడుపున పుట్టలేదు. కేవలం చనిపోయిన వేనుడి అవయవాలను మర్దించడం ద్వారా పుట్టారు. వీరికి ఈ లౌకిక మైన బంధుత్వం అంటకట్టకూడదు అని ఋషుల భావన అయి ఉండవచ్చు.)

ఈ మునులు వీరి యొక్క గుణగణములను కీర్తించారు. దేవతలు పుష్పముల వాన కురిపించారు. దేవ దుందుభులు మోగాయి. దేవర్షులు, పితృదేవతలు అందరూ అక్కడకు చేరుకున్నారు. బ్రహ్మదేవుడు కూడా దేవతలతో సహా అక్కడకు వచ్చాడు.

వేనుడి కుమారుడి కుడి చేతిలో విష్ణు చక్రము, పాదములలో పద్మము గుర్తులు ఉండటం చూచారు. ఆ కుమారుని శ్రీహరి అంశగా భావించారు. వెనువెంటనే ఋషులు మునులు బ్రాహ్మణులు ఆ బాలునిని రాజుగా అభిషేకించారు.

ఆ ప్రకారంగా రాజ్యాభిషిక్తుడు అయిన పృథు మహారాజు అర్చిదేవిని వివాహం చేసుకున్నాడు. ఆ పృథుమహారాజుకు కుబేరుడు ఒక బంగారుతో చేయబడిన సింహాసనమును ఇచ్చాడు. వరుణుడు తెల్లని గొడుగును ఇచ్చాడు. వాయు దేవుడు రెండు చామరములను (గాలి రావడానికి విసిరేవి) ఇచ్చాడు. ధర్మదేవత ఒక మాలను ఇచ్చింది. ఇంద్రుడు కిరీటమును ఇచ్చాడు. యముడు దండమును ఇచ్చాడు. బ్రహ్మ వేదములను ఇచ్చాడు. సరస్వతీ దేవి ఒక హారమును ఇచ్చింది.

విష్ణువు సుదర్శనము అనే చక్రమును ఇచ్చాడు. లక్ష్మీదేవి అపారమయిన సంపదలను ఇచ్చింది. రుద్రుడు ఒక కత్తిని, పార్వతి ఒక డాలును ఇచ్చారు. చంద్రుడు మరణములేని అశ్వములను ఇచ్చాడు. విశ్వ కర్మ ఒక రథమును ఇచ్చాడు. అగ్ని దేవుడు ఒక దివ్యమైన ధనుస్సును ఇచ్చాడు. సూర్యుడు సూర్యకిరణముల వంటి వాడి అయిన బాణములను ఇచ్చాడు. భూదేవి పాదుకలను ఇచ్చింది. ఆకాశము పుష్పములను ఇచ్చింది. గంధర్వులు తన నాట్య, సంగీత కౌశలమును ప్రదర్శించారు. ఋషులు ఆశీర్వదించారు. సముద్రుడు శంఖమును ఇచ్చాడు. ప్రకృతి మంచి మార్గమును ఏర్పాటు చేసింది. సూతులు వంది మాగధులు ఆయనను స్తుతించడానికి వచ్చారు. తనను స్తోత్రము చేయడానికి వచ్చిన వారితో పృథు మహారాజు ఇలా అన్నాడు.

"ఓ వంది మాగధులారా! నేను ఇప్పుడే పుట్టాను. ఇంకా నేను ఏమీ చేయలేదు. నా పరాక్రమము ఏమిటో లోకానికి తెలియదు. అటువంటప్పుడు నన్ను ఏమని స్తుతిస్తారు. కాబట్టి నన్ను స్తుతించడం మాని ఎవరైనా యోగ్యులను స్తుతించండి. ఇప్పుడు మీరు నేను ఏమేమో చేస్తానని స్తుతించి అవి నేనునెరవేర్చలేకపోతే మీ స్తోత్రములు అన్నీ అబద్ధములు అవుతాయి. అది నాకు ఇష్టం లేదు.

ప్రస్తుతము  నా గుణములు అన్నీ నాలో నిగూఢంగా అవ్యక్తంగా ఉన్నాయి. కాలక్రమేణా అవి బయటకు వస్తాయి. అప్పుడు మీరునన్ను పొగడండి. బాగుంటుంది. ప్రస్తుతము శ్రీహరినికీర్తించండి. ప్రజలు ఇప్పటి దాకా ఏమీ చేయని  నా వంటి వాడిని కీర్తించడానికి ఇష్టపడరు. ఎన్నో మంచి పనులు చేయడానికి, మా పెద్దల గుణగణములను నాలో పెంపొందించుకోడానికి నాకు శక్తి

ఉన్నప్పటికినీ, నేను ఏమీ చేయకుండానే నన్నునేను మనుషులను పెట్టి పొగిడించుకోవడం మంచి పద్ధతి కాదు.

ఇది ఎలా ఉందంటే, ఎవరైనా ఏవో కొన్ని శాస్త్రములు చదివి, అంత మ ఆత్రం చేతనే, "నాకు అన్నీ శక్తులు వచ్చేసాయి, నాకు అంతా వచ్చు" అని తనను తాను పొగుడుకుంటే, లోకం అతనిని చూచి హేళనగా నవ్వుతుంది. కాని తనను చూచి అందరూ నవ్వుతున్నారని వాడికి తెలియదు.(ప్రస్తుతం మన రాజకీయ నాయకులనుపట్టి పీడిస్తున్న జాడ్యము ఇదే!)

కపటం లేని వారు, ఉన్నతమైన హృదయం కలవారు, తనను ఎవరైనా పొడుగుతుంటే సిగ్గు పడేవారు, అటువంటి వారు ఎంతో జ్ఞానమును, శక్తులను ఆర్జించినా, ఎవరైనా తమను పొగుడుతుంటే ఒప్పుకోరు. నేను చేసే మంచి పనులను చూచి ప్రజలు ఆనందపడాలి కానీ నన్ను నేను పొగిడించుకోవడం వలన ఏమి ప్రయోజనము.

"నీవు గొప్ప వాడివి, నీవు ఏం చేసినా చెల్లుతుంది" అని పొగుడుతుంటే, బుద్ధిలేని వాళ్లు పొంగిపోతారు కానీ, బుద్ధిమంతులు అటువంటి పొగడ్తలను సహించరు. మొగ్గలోనే తుంచేస్తారు.

కాబట్టి ఓ వందిమాగధులారా! నేను ఇప్పటి దాకా ఎటువంటి మంచి పనులు చేయలేదు. నాకు కీర్తి రాలేదు. ఇప్పుడు మీరు స్తుతిస్తున్న స్తోత్రములకునేను పొంగిపోతే, నా వంటి అజ్ఞాని

మరొకడు ఉండడు. దయచేసి నన్ను స్తుతించకండి." అని వినయంగా అన్నాడు పృథు మహారాజు.

(మేము అధికారంలోకి వస్తే అన్నీ ఉచితంగా ఇస్తాము. అందరికీ ఇళ్లుకట్టించి ఇస్తాము, ఉద్యోగాలు ఇస్తాము, ఉచితంగా కరెంటు ఇస్తాము, ఉచితంగా బియ్యం ఇస్తాము, ఉచితంగా పెళ్ళిల్లు చేయిస్తాము అంటూ వాగ్దానాలు చేసే రాజకీయనాయకులు పృథు మహారాజును చూచి నేర్చుకోవాలి.

అలాగే "నీకేం తక్కువ. నీకు సియం, పియమ్ కావాల్సిన అర్హతలు అన్నీ ఉన్నాయి. నీ తండ్రి తరువాత, నువ్వే మా సియం అని పొగిడించుకునే వాళ్లు, వారి భక్తజనులు కూడా ఈ అధ్యాయం చదివి, పృథుమహారాజును చూచి, తాము ఏమిటో తమ అర్హత ఏమిటో తాము తెలుసుకోవాలి.)

శ్రీమద్భాగవతము
చతుర్థస్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## చతుర్థస్కంధము

## పదునారవ అధ్యాయము.

పృథు మహారాజు ఈ ప్రకారం చెప్పగా ఆయన మాటలు విన్న వంది మాగధులు అనే స్తోత్రములు చేసేవారు, మునుల వంక చూచారు. అప్పుడు మునులు వారితో ఇలా అన్నారు.

"మహారాజులు అలాగే అంటారు. వారు ఏమేమి చెయ్యాలో మీరు చెబితేనే కదా తెలిసేది. కాబట్టి భవిష్యత్తులో పృథు మహారాజు ఏమేమి చెయ్యాలో మీ స్తోత్రాల ద్వారా వివరించండి." అని అన్నారు. అప్పుడు ఆ వందిమాగధులు పృథు మహారాజును పొగడకుండా ఆయన కర్తవ్యములు, బాధ్యతలు స్తోత్రముల ద్వారా తెలియజేసారు.

"ఓ మహారాజా! నీ గురించి నీవు తెలుసుకో. నీవు విష్ణువు అంశలో పుట్టిన వాడివి. నీ మహిమను వర్ణించే శక్తి మాకు లేదు. నీవు దుర్మార్గుడు అయిన వేనరాజు శరీరం నుండి పుట్టినా, విష్ణువు పౌరుషము,  పరాక్రమము అంతా నీలో ఉంది. నీవు శ్రీహరి అంశలో పుట్టావు కాబట్టి నిన్ను కీర్తిస్తే ఆ శ్రీహరిని కీర్తించినట్టే. పైగా మునులు అందరూ నిన్ను కీర్తించమన్నారు. వారి యోగబలమును మాలో ప్రవేశపెట్టారు.  కాబట్టి, మాకు నిన్ను కీర్తించే శక్తి, అర్హత కలిగింది.

ఈ పృథు చక్రవర్తి స్వధర్మమును పాలిస్తాడు. జనుల చేత వారి వారి వర్ణాశ్రమ ధర్మములను పాటింపజేస్తాడు. పృథు చక్రవర్తి వర్ణాశ్రమ ధర్మములను కాపాడుతాడు. వర్ణాశ్రమ ధర్మములను

అతిక్రమించిన వారిని కఠినంగా శిక్షిస్తాడు. ఈ పృథు చక్రవర్తి మానవ రూపముతో ఉన్నను, అప్పుడప్పుడు మూడులోకములకు మేలు చేయడానికి ఇంద్రుడు మొదలగు లోకపాలకుల రూపములను ధరిస్తాడు.

ఈ పృథు చక్రవర్తి అందరినీ సమనంగా చూస్తాడు. భూతదయ కలవాడు. ప్రజల వద్ద నుండి పన్నుల రూపంలో ధనం రాబట్టి ఆ ధనాన్ని ప్రజా ప్రయోజనాలకు. దాన ధర్మాలకు వినియోగిస్తాడు. ఈ పృథు చక్రవర్తికి సహనము ఎక్కువ. అందరినీ క్షమిస్తాడు. బాధ పడే వారి మీద కరుణ చూపిస్తాడు. ఎవరైనా ఇతనిని ద్వేషించినా అవమానించినా సహించి ఊరుకుంటాడు.

సకాలములో వర్షముకు కురిపించడం ఇంద్రుని బాధ్యత. ఒక వేళ ఇంద్రుడు సకాలంలో వర్షాలు కురిపించకపోతే, తానే ఇంద్రుడుగా మారి, మేఘములను శాసించి, వర్షాలు కురిపిస్తాడు. ప్రజలను రక్షిస్తాడు. ఈ పృథు చక్రవర్తి తన మృదుమధుర సంభాషణలతో, లలితమైన హావభావములతోనూ అందరినీ ఆనందింపజేస్తాడు.

ఈ పృథు చక్రవర్తి ఎప్పుడు ఎక్కడకు ఎందుకు పోతాడో, ఏ పని ఎందుకు చేస్తాడో ఎవరికీ తెలియదు. అంత గంభీరంగా రహస్యంగా రాచకార్యములు నెరవేరుస్తాడు. ఆయన చేసిన పనులకు మంచిఫలితములు కలిగినపుడే ఆ పనుల గురించి ప్రజలు తెలుసుకుంటారు.

ఈ పృథు చక్రవర్తి న్యాయము, ధర్మము అయిన మార్గములలోనే ధనమును కూడబెడతాడు. ఎవరినీ హింసించడు. బాధపెట్టడు. ఈతడు మహా గుణవంతుడు. వరుణుడు వానలుకురిపించినట్లు ఈతడు ప్రజలమీద తన కరుణను ప్రేమను వర్షింపజేస్తాడు.

ఈ పృథు చక్రవర్తి శత్రు భయంకరుడు. ఈతనిని తాకడానికికూడా శత్రువులకు ధైర్యం చాలదు. ఈతనిని ఓడించడానికి ఎవరికీ చేతకాదు. ఈ పృథు చక్రవర్తి చార చక్షువు. చారుల ద్వారా రాజ్యంలో జరిగే అన్ని విషయములను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉంటాడు. ఏదైనాపొరపాటు జరిగితే వెంటనే సరిదిద్దుతాడు.

ఈ పృథు చక్రవర్తి నేరము చేసిన వారిని, తప్పుచేసిన వారిని వారు చేసిన తప్పుకు, నేరములకు తగిన శిక్షలు విధిస్తాడు. నిరపరాధులను సగౌరవంగా విడుదల చేస్తాడు. ఈ పృథు చక్రవర్తి తన ఆజ్ఞలను ఈ భూమి అంతా వర్తింపజేస్తాడు. ప్రజలందరూ ఆయనను "రాజా" అని సంబోధిస్తారు. ఈ పృథు చక్రవర్తి ధృడమైన వ్రతము కలవాడు. బ్రాహ్మణులకు మేలు చేస్తాడు. వృద్ధులకుసేవజేస్తాడు. వారిని గౌరవిస్తాడు. అన్ని ప్రాణులకు ఆశ్రయం కల్పిస్తాడు. దీనులను కరుణిస్తాడు.

ఈ పృథు చక్రవర్తి పరస్త్రీలను తన తల్లి వలె గౌరవిస్తాడు. తన భార్యను ఎంతో ఆదరంగా చూస్తాడు. ప్రజలను తన కన్న బిడ్డలవలె పరిపాలిస్తాడు. వేదవేదాంగపండితులైన బ్రాహ్మణులకు సేవకుని వలె

వ్యవహరిస్తాడు. ప్రజలందరూ ఇతనిని తమను తాము ఎలా ప్రేమిస్తారో అలా ప్రేమిస్తారు. సన్యాసులను ఈయన గౌరవిస్తాడు. మంచివారికి కీడు చేసేవారిని కఠినంగా శిక్షిస్తాడు.

ఈ పృథు చక్రవర్తి సాక్షాత్తు భగవంతుని అంశలో పుట్టినవాడు. భగవంతుని మాదిరి ఈయన ఎవరి యందు భేదబుద్ధి కలిగి ఉండడు. ఈయన పరాక్రమము అద్వితీయము. ఈయన రాజులకు రాజు. ఈ పృథు చక్రవర్తి భూమండలమునంతా శాసిస్తాడు. తన రథం మీద భూమి అంతా తిరుగుతూ తన శాసనాన్ని భూమండలము అంతా అమలు చేస్తాడు.

ఈ పృథు చక్రవర్తి ఇంద్రుడు మొదలగు లోకపాలకుల వద్ద నుండి కూడా శుల్కములను తీసుకుంటాడు. ఈ పృథు చక్రవర్తి భూమండలమునకు మొట్టమొదటి రాజు. పృథు చక్రవర్తి ఈ భూమి నంతా చదును చేసి పంటలు పండిస్తాడు. ఓషధులను భూమి నుండి వెలికితీస్తాడు. శత్రురాజులు తన మీదికి యుద్ధమునకు వచ్చినపుడు సింహము వలె వారిలో జొరబడి వారిని చిందర వందర చేస్తాడు. ఈయన పరాక్రమానికి శత్రురాజులు నిలువలేక పారిపోతారు.

ఈ పృథు చక్రవర్తి సరస్వతీ నదిపుట్టిన ప్రదేశంలో అశ్వమేధయాగము చేస్తాడు. ఈయన మీదకోపంతో ఇంద్రుడు ఈ పృథు చక్రవర్తి యజ్ఞఅశ్వమును దొంగిలిస్తాడు. ఈ పృథు చక్రవర్తి తన గృహమునకు వచ్చి సనత్కుమారుని వద్దకుపోయి ఆయన వద్ద నుండి పరబ్రహ్మమును తెలుసుకోదగిన జ్ఞానమును పొందుతాడు.

ఈ పృథు చక్రవర్తి పైన చెప్పిన విధంగా రాజ్యపాలన చేస్తూ అఖండమైన కీర్తి ప్రతిష్టలు గడిస్తాడు. ఈ పృథు చక్రవర్తి కి ఈ భూమండలములో ఎదురు లేదు. ఈయన కీర్తి భూమండలము అంతా విస్తరిస్తుంది. ఈయన తన పాలనలో ఉన్న ప్రజల కష్టాలు అన్నీ పోగొడతాడు. ఈ పృథు చక్రవర్తిని దేవతలు అందరూ కీర్తిస్తారు." అని వంది మాగధులు పృథు మహారాజును కీర్తించారు.

శ్రీమద్భాగవతము
చతుర్థస్కంధము పదహారవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
చతుర్థస్కంధము
పదిహేడవ అధ్యాయము.

పృథు మహారాజు తన కర్తవ్యములను, తాను చేయవలసిన పనులను, నిర్వహించవలసిన బాధ్యతలను నేర్పుగా చెప్పిన వంది మాగధులకు తగిన బహుమానములను ఇచ్చి పంపించాడు. తరువాత నాలుగు వర్ణముల వారిని అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను, తన కిందపనిచేసే పనివారినీ, పురోహితులను అందరినీ పిలిపించి వారి వారి అర్హతలను బట్టి సత్కరించాడు." అని మైత్రేయుడు విదురునికి చెప్పాడు.

ఇప్పుడు విదురునికి ఒక సందేహము వచ్చింది. "మైత్రేయా! తమరుచెప్పడంలో పృథుమహారాజు భూదేవిని పితికి ఓషధులను వెలికి తీసాడు అన్నారు కదా. అది ఎలా సంభవమయింది తెలియజేయండి. ఎందుకంటే సాధారణంగా భూమి చదునుగా ఉండదు. ఎగుడు దిగుడుగా ఉంటుంది కదా! పృథు మహారాజు ఆ భూమిని ఎలా సమతలంగా చేసాడు. అదీ కాకుండా ఇంద్రుడు పృథు మహారాజు యజ్ఞాశ్వమును దొంగిలించాడు అన్నారుకదా. అది ఎలా జరిగింది. తరువాత పృథు మహారాజు సనత్కుమారుని వలన భగవంతుని తత్త్వమును తెలుసుకున్నాడు అని చెప్పారు కదా! ఆయన తెలుసుకున్న తత్త్వమును నాకు కూడా వివరించండి. అదీకాకుండా, పృథు మహారాజు సాక్షాత్తు విష్ణువు అంశ అని అన్నారు కదా! అందుకని ఆ పృథు మహారాజు చరిత్ర నాకు వివరంగా చెప్పండి. " అని అడిగాడు. అప్పుడు మైత్రేయుడు ఈ విధంగా చెప్పసాగాడు.

"విదురా! పృథు మహారాజు ఈ భూమండలమునకు పట్టాభిషిక్తుడు అయిన తరువాత రాజ్యములో పరిస్థితులను గమనించాడు.భూమండలంలో ప్రజలు ఆహారం దొరక్క బాధలు పడుతున్నారు అని గ్రహించాడు. దానికి తోడు ప్రజలందరూ వచ్చి పృథు మహారాజుతో ఇలా మొరపెట్టుకున్నారు.

"ఓ మహారాజా! మేము ఆకలి బాధతో చచ్చిపోతున్నాము. మా ఆకలి తీరే మార్గం కనిపించడం లేదు. నిన్ను మా పాలకుడిగా మునులు అందరూ నియమించారు. నీవే మా ఆకలి తీరే మార్గం చూపాలి. ఈ ఆకలితో మేము అందరమూ నశించి పోకముందే మా ఆకలి తీరే ఉపాయము ఆలోచించు. నీవు అన్ని లోకములను

రక్షిస్తావనీ, అన్ని లోకములకు జీవన ప్రదాతవు అనీ అంటారు. కాబట్టి నిన్ను మేము శరణు వేడుతున్నాము." అని ప్రార్థించారు.

వారి ప్రార్థనలను విన్న పృథు మహారాజు వారికి అభయం ఇచ్చాడు. ఈ ప్రాణులకు ఆకలి బాధ ఎందుకు తీరడం లేదా అని ఆలోచించాడు. దానికి కారణం తెలుసుకున్నాడు. ఈ భూమిలో అన్ని రకాల ధాన్యాలు, ఓషధులు ఉన్నాయి. అవన్ని భూదేవి తనలో దాచుకొంది. బయట పెట్టడం లేదు. కాబట్టి ఈ భూదేవి నుంచి ఆహారమును బయటకు తీయాలి అని అనుకున్నాడు.

వెంటనే తన బాణమును భూదేవి మీదసంధించాడు. ఇది చూచి భూదేవి పారిపోయింది. పృథు మహారాజు భూదేవిని ఆమె ఎక్కడకు పోతే అక్కడకు వెంబడించాడు. ఇంక పరుగెత్త లేక భూదేవి ఆగి పోయింది. పృథు మహారాజును చూచి ఇలా పలికింది.

"ఓ మహారాజా! నిన్ను అందరూ ధర్మాత్ముడు అంటారే. నేను ఏమి అపరాధము చేసానని నన్ను కొట్టడానికి బాణం ఎక్కుపెట్టావు. అందులోనూ నేను స్త్రీని. స్త్రీ వధ మహాపాపం కదా! ఒక వేళ స్త్రీ తప్పు చేసినా మామూలు మానవులే వారిని కొట్టరు. నీవు మహారాజువు నన్ను ఏల దండించడానికిపూనుకున్నావు. నేను ఈ భూమి మీద జీవించే ప్రాణులకు ఆధారము. నన్ను ముక్కలు చేస్తే వారు ఎక్కడ ఉంటారు. ఆలోచించు." అని పలికింది భూదేవి.

దానికి పృథు మహారాజు ఈ విధంగా బదులు చెప్పాడు. "నేను ఈ భూమండలమునకు మహారాజును. నీవు నా శాసనమును వ్యతిరేకించావు. మానవులు చేసే యజ్ఞయాగములలో నీవు హవిర్భాగమును తీసుకుంటావు. కానీ వారికి ఆహారమును ఇవ్వవు. ఎందుకని. గోవు గడ్డితిని పాలు ఇవ్వకపోతే దానిని దండిస్తారా లేదా. నిన్ను కూడా అలాగే దండిస్తాను. బ్రహ్మదేవుడు సృష్టిక్రమంలో అనేకములైన గింజలను, ఓషధులను సృష్టించాడు. వాటిని మానవులకు ఆహారంగా ఏర్పరిచాడు. నీవు ఆ గింజలను (ధాన్యమును)నీలో దాచుకున్నావు. పంటల రూపంలో ప్రజలకు ఇవ్వడం లేదు. కాబట్టి నిన్ను దండించి (భూమిని దున్ని) ప్రజలకు ఆహారముసమకూరుస్తాను. తన్ను తాను పోషించుకుంటూ, ఇతర ప్రాణుల ఆకలి తీర్చని వాడిని స్త్రీఅయినా పురుషుడు అయినా దండింప తగినవాడు. కాబట్టి నిన్ను దండించక తప్పదు." అని పలికాడు పృథు మహారాజు.

ఆ మాటలు విన్న భూదేవి ఇలా అంది. "ఓ మహారాజా! నీకు నమస్కారము. నీకు అహంకారము లేదు. నీకు రాగద్వేషములు లేవు. నీవు పరమపురుషుడవు. ఈ ప్రాణులందరూ నివసించడానికి నన్ను సృష్టించారు. నాలో  మనుష్యులు, జంతువులు, పశువులు, పక్షులు, పాములు, పాకే జంతువులు, చెమట నుండి పుట్టే జంతువులు, వృక్షములు, నా మీద నివసించమని ఆ బ్రహ్మ ఆదేశించాడు. నీవు సాక్షాత్తు బ్రహ్మ స్వరూపుడవు. నీవే నన్ను చంపుతాను అంటే నేను ఎవరితో చెప్పుకోవాలి. బ్రహ్మ నన్ను సృష్టించాడు. నువ్వు నన్ను చంపుతాను అంటున్నావు.

ఆ పరమాత్మ తాను స్వతంత్రుడు సమర్ధుడు అయి ఉండి కూడా సృష్టిచేయడానికి బ్రహ్మను నియమించాడు. ఆ బ్రహ్మ నన్ను సృష్టించాడు. ఆ పరమాత్మకు నమస్కరించి నన్ను కాపాడమని వేడుకుంటున్నాను. ఓ పరమాత్మా! నీ మాయాశక్తితో ఈ విశ్వమునుసృష్టించావు. నేను రసాతలంలో పడి ఉంటే నీవు ఆది వరాహ రూపంతో నన్ను జలాల పైకి తీసుకొని వచ్చావు. నీ ఆజ్ఞమేరకు నేను సమస్త ప్రాణులను నా మీద ధరిస్తున్నాను.

ఓ పృథు మహారాజా! నీవుసాక్షాత్తు ఆ పరమాత్మ స్వరూపుడవు కదా! నీవే నన్ను బాణములతో చంపడానికి చూస్తున్నావు. ఇది ఆశ్చర్యము కదా! నీ మాయతో ఈ విశ్వంలో ఉండే ప్రాణులను మోహంలో పడవేస్తున్నావు. నేను కూడా ఆమోహంలో పడి నువ్వు నన్ను ఎందుకు తరుముతున్నావో,ఎందుకు దండిస్తున్నావో తెలుసుకోలేక పోతున్నాను. నీకు నమస్కరించడం తప్ప ఏమీ చేయలేను. అందుకని ఓ పృథు మహారాజా! నీకు నమస్కారము. నన్ను రక్షించు." అని భూదేవి పృథు మహారాజును ప్రార్థించింది.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము పదిహేడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము

పదునెనిమిదవ అధ్యాయము.

"విదురా! ఆ ప్రకారంగా పృథు మహారాజును ప్రార్థించిన భూదేవి అసలు విషయాన్ని ఈ విధంగా వివరించింది.

"ఓ మహారాజా! నీవు కాస్త కోపం తగ్గించుకొని నా మాటలు ఆలకించు. నీ వంటి వారికి కోపము తగదు. శాంతంగా నేను చెప్పేది విను. ఈ లోకము లోనూ పర లోకము లోనూ మానవులకు పురుషార్ధములు, అంటే ధర్మము, అర్థము,కామము, మోక్షము సిద్ధించడానికి మునులు, ఋషులు ఎన్నో ఉపాయములను నిర్ణయించారు. మానవులందరూ ఆ మునులు ఋషులు చెప్పిన ఉపాయములను నేర్పుతో పాటిస్తే వారికి ఏ మాత్రం కష్టం లేకుండా ఫలితం దక్కుతుంది. కాని కొంతమంది తమ సొంత తెలితేటలు ఉ పయోగించి పనులు చేస్తుంటారు. వారికి ఏ ఫలితమూ దక్కదు. వాళ్లు ఎన్ని సార్లు ఏం చేసినా ఫలితం శూన్యం. కాబట్టి తొందర పడి ఏదో చెయ్యకుండా నేను చెప్పేది సావధానంగా విను.

ఓ మహారాజా! పూర్వము బ్రహ్మ ఈ లోకములో ఉన్న ప్రాణులకు ఆహారము సమకూర్చడానికి ఎన్నో ఓషధులను, ధాన్యములను, తిండి గింజలను సృష్టించాడు. అవి అన్నీనాలో భద్రపరిచాడు. కాని ఈ ఓషధులను ధాన్యమును కొందరు స్వార్థపరులు ప్రజలకు దక్కకుండా దాచి పెట్టారు. నీ తండ్రి వేనుడి కాలంలో అధర్మం ప్రజ్వరిల్లి, యజ్ఞములు చేయడం మాని వేసారు.

దాంతో వర్షాలు కురవలేదు. పంటలు పండలేదు. ఓషధులు, ధాన్యము, తిండి గింజలు అన్నీ నాలోనే దాచుకున్నాను. వాటిని బయటకు తీయాల్సిన బాధ్యత నీది. యజ్ఞములు చేసి వర్షాలు కురిపించు. వ్యవసాయము చేసి పంటలు పండించు. నీ ప్రజలకు ఆహారము సమకూర్చు. అవేమీ చేయకుండా నన్నుచంపుతాను అని నా వెంటబడితే ప్రయోజనం ఏముంటుంది.

నేను గోవులాంటి దానిని. నానుండి పాలు పితుక్కోవాలి కానీ నన్ను చంపితే ప్రయోజనం ఏముంటుంది. కాబట్టి ఒక పాత్రను తెచ్చి నా నుండి ఓషధులను, ధాన్యములను పితుక్కో. నీవు కోరినవన్నీ నేను ఇస్తాను. ఓ రాజా! ముందు నీవు భూమిని సమతలంగా చెయ్యి. అక్కడక్కడ లోతుగా చెయ్యి. అందులో వర్షాకాలము తరువాత కూడా నీరు నిలుస్తుంది. భూమి తడి ఆరకుండా ఉంటుంది." అని పలికింది భూదేవి.

(ఇది ఏనాడో చెప్పిన మాట. కానీ ఈ నాడు జరుగుతున్నదేమిటి. పచ్చని పంట పొలాలను సెజ్‌ల పేరు మీద పంటలు పండించకుండా బీడు పెడుతున్నారు. నగరాల చుట్టు జనావాసాలు పెరిగాయని కూరగాయలు పండించే భూములను ఇళ్ల స్తలాలుగా మార్చేస్తున్నారు. చెరువులను, కుంటలను పూడ్చి ఇళ్లు కడుతున్నారు. ఫలితంగా భూగర్భజలాలు అడుగంటి పోతున్నాయి. దాని వలన పంటలు పండటం లేదు.  బియ్యంధరలు, కూరకాయల ధరలు పెరిగిపోతున్నాయి. భూదేవిమొర ఆనాడు పృథు మహారాజు ఆలకించాడు. ఈ నాడు ఎవరు ఆలకిస్తారు!)

భూదేవి పలికిన పలుకులను సావధానంగా విన్న పృథు మహారాజు ఎంతో సంతోషించాడు. భూమినుండి సకల ఔషధములను పిండాడు. (అంటే భూమిని చదును చేసి దుక్కి దున్ని నీరు పెట్టి పంటలు పండించాడు). ఇది చూచిన మునులు, ఋషులు కూడా అదే మార్గము అవలంబించారు. తమ తమ కోరికలను అనుసరించి భూమి నుండి తమకు కావలసిన పదార్థములను పిండుకోసాగారు.

(ఇక్కడా పాఠకులు ఒక విషయం గమనించాలి. భాగవతంలో అన్ని విషయాలు సూచనామాత్రంగా ప్రతీకాత్మకంగా చెప్పబడ్డాయి. వాటిని మనము సరిఅయినపద్ధతిలో అర్థం చేసుకోవాలి. ఈ భూమి మీద మనం పుట్టాము. అన్ని ప్రాణులు పుట్టాయి. మనకూ తక్కిన ప్రాణులకు కావలసిన పదార్థములు అన్నీ ఈ భూమి నుండి వస్తున్నాయి. అంటే మనకు కావలసిన పదార్థములను మనం భూమి నుండి పిదుకుకుంటున్నాము. తుదకు వెండి బంగారము ఖనిజములు, రత్నములు, మణులు అన్నీ ఈ భూమి నుండే వస్తున్నాయి. ఆకాశం నుండి ఒక్క జలము, వెలుగు తప్ప మిగిలినవి అన్నీ భూమి నుండే వస్తున్నాయి. వీటిని ఉపయోగించుకొని మనం బతుకుతున్నాము. కళలు, వృత్తులు, వృద్ధిచెందుతున్నాయి. ఇలా అర్థం చేసుకుంటూ చదవండి.)

ఋషులు, మునులు బృహస్పతిని ఆవుదూడగా చేసుకొని భూమి నుండి ఇంద్రియములు అనే పాత్ర ద్వారా వేదములు అనే పాలను పిండుకున్నారు. (అంటే వేదములను బృహస్పతి ద్వారా చెవులతో విని, నోటితో పలికి నేర్చుకున్నారు.)

దేవతలు అందరూ ఇంద్రుని దూడగా చేసుకొని బంగారు పాత్రలో అమృతమును, వీర్యమును, ఓజస్సును, బలమును పిండుకున్నారు. దైత్యులు, దానవులు ప్రహ్లాదుని దూడగా చేసుకొని లోహముతో చేసిన పాత్రలో సుర, ఆసవము రూపంలో ఉన్న పాలను పిండుకున్నారు. (మద్యమును, ఆసవములను, పానీయములను తయారు చేసుకున్నారు.)

గంధర్వులు, అప్సరసలు విశ్వావసువును దూడగా చేసుకొని పద్మముల వంటి పాత్రలలో గానము, వాక్చాతుర్యము, సౌందర్యము అనే పాలను పిండుకున్నారు. పితృదేవతలు అర్యముని దూడగా చేసుకొని మట్టి పాత్రలలో శ్రద్ధతోకవ్యమును అనగా పితృకార్యములలో ఇచ్చే పిండములు అనే పాలను పిండుకున్నారు. (ఇక్కడ శ్రద్ధ అనే మాట వాడారు. శ్రద్ధతో పెట్టేది శ్రాద్ధము అని పెద్దలు అంటారు. దేవతలకు హెూమాగ్ని ద్వారా ఇచ్చేది హవ్యము. అందుకే అగ్నిని హవ్యవాహనుడు అంటే దేవతలకు చెందిన హవ్యమును మోసుకెళ్లేవాడు అంటారు. పితృదేవతలకు శ్రద్ధతో ఇచ్చేది కవ్యము. ఈ నాడు పితృకర్మలు, శ్రాద్ధములు భయంతో, ఏదో చెయ్యాలి కాబట్టి చేస్తున్నారు కానీ అందులో శ్రద్ధ ఏమాత్రం కనపడటం లేదు. “ఆమ పాత్రే మహాభాగ శ్రద్ధయా శ్రాద్ధదేవతా:” )

సిద్ధులు కపిలుని దూడగా చేసుకొని అణిమాది అష్టసిద్ధులను పిండుకున్నారు. విద్యాధరులు ఆకాశము అనే పాత్రలో ఖేచర విద్యలను పిండుకున్నారు. కింపురుషులు మయుడు అనే దానవుని దూడగా చేసుకొని అంతర్ధానం కావడం, చిత్రవిచిత్రరూపములను ధరించడం మొదలగు మాయలను

పిండుకున్నారు. యక్షులు, రాక్షసులు, పిశాచజాతులు, మొదలగు మాంసాహారులు రుద్రుని దూడగా చేసుకొని మానవుల పుర్రెలు అనే పాత్రలలో రక్తం మాదిరి ఉన్న మద్యమును పిండుకున్నారు.

సర్పములు, తేళ్లు, మొదలగు విషజంతువులు తక్షకుని దూడగా చేసుకొని విషాన్నిపిండుకున్నాయి. ఆవులు, గుర్రములు, పశు వులు, నందీశ్వరుని దూడగా చేసుకొని అరణ్యము అను పాత్రలో గడ్డి అనే పాలను పిండుకున్నాయి. సింహములు, పులులు మొదలగుకోరలు కలిగిన క్రూరజంతువులు సింహమును దూడగా చేసుకొని చచ్చిన కళేబరములు అనే పాత్రలో మాంసము అనే పాలను పిండుకున్నాయి.

పక్షి జాతులు అన్నీ గరుడుని దూడగా చేసుకొని దేహము అనే పాత్రలో కీటకములను, ఫలములను, గింజలను పాలుగా పిండుకున్నాయి. పెద్ద పెద్ద వృక్షములు అన్నీ మర్రిచెట్టును దూడగా చేసుకొని రక రకాల రసములతో కూడిన పండ్లను పాలుగా పిండుకున్నాయి. పర్వతములు హిమాలయ పర్వతమును దూడగా చేసుకొని నానారకములైన లోహములను, ధాతువులను పిండుకున్నాయి.

ఈ ప్రకారంగా భూమి మీద ఉన్న అందరూ తమ తమ జాతులలోని ప్రధానముగా ఉన్న వాటిని దూడలుగా చేసుకొని తమకు కావలసిన వాటిని, రకరకాల వస్తువుల రూపంలో  భూమి నుండి పిండుకున్నాయి. అన్నమును తినే మానవులు భూమిని దున్ని చదును చేసి పంటలు పండించి ఆహార ధాన్యములను సమకూర్చుకున్నారు.

విదురా! ఈ ప్రకారంగా భూమి సస్యశ్యామలము అయింది. పంటపొలాలతో అరణ్యములతో చెట్లతో కళకళలాడింది. ప్రజల కోరికలను అన్నిటినీ తీర్చిన భూదేవిని పృథు మహారాజు తన కుమార్తెగా స్వీకరించాడు. పృథు మహారాజు తన బాణములతో భూమిని సమతలంగా చేసాడు.
(అంటే అప్పటినుండి భూమండలములోని ప్రజలు వ్యవసాయము చేసి పంటలు పండించడానికి అలవాటు పడ్డారు.)

తరువాత పృథు మహారాజు ప్రజలు ఉండటానికి వారి వారికి తగ్గట్టుగా నివాసములను ఏర్పాటు చేసాడు. ఆ ప్రకారంగా గ్రామములు, పురములు, పట్టణములు, దుర్గములు, పల్లెలు, సేనల శిబిరములు, వ్యవసాయ కుటుంబములు, పారిశ్రామిక కుటుంబములు, పర్వత ప్రాంతములలో నివాస స్థానములు ఏర్పడ్డాయి. పృథు మహారాజుకు ముందు ఈ భూమండలములో గ్రామములు, పురములు, పట్టణములు మొదలగునవి లేవు.

పృథు మహారాజు పాలనలో ప్రజలు వ్యవసాయము చేసుకుంటూ పంటలు పండించుకుంటూ, ఒక చోట స్థిరంగా ఉండసాగారు. (ప్రజలు తమ సంచార జీవనము మాని స్థిర నివాసము ఏర్పరచుకోసాగారు అని కూడా అర్థం చెప్పుకోవచ్చు. మన చరిత్ర కూడా ఇదే చెబుతుంది కదా!)

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము

పంతొమ్మిదవ అధ్యాయము.

"విదురా! ఈ ప్రకారంగా పృథు మహారాజు ప్రజల కష్టములను, ఆహార సమస్యలను, నివాస సమస్యలను తీర్చిన తరువాత, యజ్ఞయాగములను చేయ సంకల్పించాడు. సరస్వతీ నదీ తీరంలో బ్రహ్మావర్తము అనే ప్రదేశంలో నూరు అశ్వమేధయాగములనుచేయ సంకల్పించాడు.(నూరు అశ్వమేధ యాగములను పూర్తి చేసిన వాడు ఇంద్రపదవికి అర్హుడు.)

పృథు మహారాజు నూరు అశ్వమేధ యాగములను చేసి ఎక్కడ తన పదవికి ముప్పుతెస్తాడో అని భయపడ్డాడు ఇంద్రుడు. పృథు మహారాజు అంటే మాత్సర్యము పెంచుకున్నాడు. పృథు మహారాజు చేస్తున్న యాగములకు స్వయంగా విష్ణువు కూడా వచ్చాడు. విష్ణువుతో పాటు బ్రహ్మ, రుద్రుడు, లోకపాలకులు, గంధర్వులు, ఋషులు, మునులు అందరూ వచ్చారు. ఇంకా సిద్ధులు, విద్యాధరులు, దైత్యులు, దానవులు, యక్షులు, సునందుడు, నందుడు మొదలగు ప్రముఖులు, కపిలుడు, నారదుడు, దత్తాత్రేయుడు, సనకసనందనాదులు, కూడా ఆ యాగములకు వచ్చారు.

పృథు మహారాజుకు భూదేవి సమస్తయాగ సామగ్రిని సమకూర్చింది. వచ్చిన వారందరూ తమ తమ శక్తి కొద్దీ యాగములకు

కావలసని భోజన సామగ్రిని, పానీయములను, ఆహార పదార్థములను, సమర్పించుకున్నారు.

ఇంత వైభవంగా జరుగుతున్న యజ్ఞములను చూచి ఇంద్రుడికి ఒళ్లంతా కంపరంగా ఉంది. తట్టుకోలేకపోతున్నాడు. ఎలాగైనా ఆ యజ్ఞములను భగ్నం చేయాలని సంకల్పించుకున్నాడు. ఇంద్రుడు యథాశక్తి ఆటంకములను, విఘ్నములను కలుగజేస్తున్నాడు. అయినప్పటికినీ, పృథు మహారాజు చలించలేదు. అన్ని అవరోధములను దాటుకుంటూ తొంభైతొమ్మిది అశ్వమేధయాగములనుపూర్తి చేసాడు.

నూరవ అశ్వమేధ యాగము జరుగుతూ ఉంది. నూరవ అశ్వమేధయాగంలో భాగంగా పృథు మహారాజు విష్ణువును పూజిస్తున్నాడు. దానితో యాగం పూర్తి అవుతుంది. దానితో పృథు మహారాజు రెండవ ఇంద్రుడు అవుతాడు. అది సహించలేకపోయాడు ఇంద్రుడు. ఎవరికీ కనపడకుండా, ఒక పాషండుని వేషంలో వచ్చి యజ్ఞపశువును దొంగిలించుకొని వెళ్లిపోయాడు.

ఇంద్రుడు యజ్ఞపశువుతో సహా ఆకాశమార్గంలో వెళ్లడం చూచాడు అత్రి మహర్షి. వెంటనే పృథువు కుమారుడినిపిలిచి ఇంద్రుడిని సంహరించి యజ్ఞపశువును తీసుకొని రమ్మని పంపాడు. వెంటనే పృథు మహారాజు కుమారుడు కోపంతో ఇంద్రుని వెంట పడ్డాడు. “నిలు నిలు ఎక్కడికి పోతావు” అంటూ ఇంద్రుని వెంట పరుగెడుతున్నాడు. జడలను ధరించి, శరీరం అంతా బూడిద పూసుకొని, పాషండుని వేషంలో ఉన్న ఇంద్రుని చూచిన పృథు మహారాజుకుమారుడు అతని మీద బాణం సంధించలేదు. అది

ధర్మంకాదనుకున్నాడు. పృథు కుమారుడు ఇంద్రుని మీద బాణం వెయ్యక పోవడం చూచాడు అత్రి.

"కుమారా! వాడు పాషండుడు కాడు. ఇంద్రుడు. నీ తండ్రి నూరవ అశ్వమేథయాగముపూర్తి చేయకుండా ఆపడానికి యజ్ఞపశు వును దొంగిలించి తీసుకుపోతున్నాడు. ఇంద్రుని వెంటనే చంపు." అని అరిచాడు అత్రి మహాముని.

ఆ మాటలను విన్న పృథు మహారాజుకుమారుడు ఇంద్రుని చంపడానికి ఆయన వెంటబడ్డాడు. వెంటనే ఇంద్రుడు ఆ పాషండ వేషమును తీసేసి, ఇంద్రుడిగా మారి పోయాడు. యజ్ఞపశువును అక్కడే వదిలిపెట్టి మాయం అయ్యాడు. పృథు మహారాజు కుమారుడు ఆ యజ్ఞపశువును తీసుకొని యాగశాలకు వచ్చాడు. పృథు మహారాజు కుమారుడు చేసిన సాహసకృత్యమునకు అందరూ సంతోషించారు. అతనిని అప్పటి నుండి విజితాశ్వుడు అని పిలువసాగారు. ఋత్విక్కులు ఆ యాగాశ్వమును బంగారు గొలుసులతో యూపస్తంభమునకు కట్టారు.

ఏదో తాత్కాలికంగా తప్పించుకోడానికి మాయం అయ్యాడు కానీ, ఇంద్రుడికి ఆ యజ్ఞం భగ్నం చెయ్యాలనే కోరిక మాత్రం చావలేదు. మరొక ప్రయత్నం చేసాడు. ఈ సారి ఇంద్రుడు శివుడి మాదిరి వేషం వేసుకున్నాడు. చేతిలో కపాలము, ఖట్వాంగము ధరించాడు. ఆ యాగశాలలో కటిక చీకటి కల్పించాడు. ఆ చీకట్లో శివుడి వేషంలో వచ్చి మరలా యాగాశ్వమును దొంగిలించాడు. యాగాశ్వంతో సహా ఆకాశంలో పరుగెడుతున్నాడు. అత్రి మహర్షి ఇది గమనించాడు.

మరలా పృథు మహారాజుకుమారుడికి చెప్పాడు.

ఈ సారి విజితాశ్వుడు ఇంద్రుని వెంట పరుగెత్తలేదు. యాగశాల నుండి బాణములను ప్రయోగించాడు. ఇంక లాభంలేదనుకొని ఇంద్రుడు తను వేసుకున్న శివుడి వేషం తీసేసి, యాగాశ్వమును అక్కడే వదిలిపెట్టి మాయం అయ్యాడు. వెంటనే విజితాశ్వుడు పోయి యాగాశ్వమును యాగశాలకు తీసుకొని వచ్చాడు.

ఇంద్రుడు రెండు సార్లు వేసుకున్న దొంగ వేషములను కలియుగంలో దొంగసాధువులు, కపట సాధువులు స్వీకరించారు. ఆ కపట వేషములను పాషండ వేషములు అంటే కపట వేషములు అనీ,పాపుల వేషములు అనీ పేరు. పాపాలు చేయడానికి ఆ వేషాలు అనువుగా ఉండటంతో మానవులు ఆమాదిరి కపటవేషముల పట్ల ఆకర్షింపబడ్డారు. ప్రజలను మోసం చేయాలనుకున్న వారి బుద్ధి ఈ కపటవేషాలలో లగ్నం అయింది. (ఈ రోజుల్లో అక్కడక్కడా రక రకాల కపట వేషాలలో కనపడుతున్న దొంగ స్వామీజీలు, దొంగ సాధువులు ఆ నాడు ఇంద్రుడు వేసుకున్న కపటవేషములకు ప్రతీకలు అయి ఉంటారు.)

ఇప్పటి దాకా జరిగింది పృథు మహారాజుకు తెలియదు. ఈ విషయాలన్నీ తెలుసుకున్న పృథు మహారాజు ఇంద్రుడికి చంపడానికి ధనుర్బాణాలు తీసుకొని బయలుదేరాడు. వెంటనే ఋత్విక్కులు అతనిని వారించారు.

"పృథు మహారాజా! నువ్వు యాగ దీక్షలో ఉన్నావు. హింస పనికిరాదు. ఇంద్రుని వదిలిపెట్టు. మేము మా మంత్రములతో ఇంద్రుని ఆహ్వానిస్తాము. ఈ హోమకుండములో వచ్చి పడేట్టు చేస్తాము." అని అన్నారు. ఋత్విక్కుల మాటలు విన్న పృథు మహారాజు అప్పటికి శాంతించాడు.

వెంటనే ఋత్విక్కులు ఇంద్రుని ఆవాహన చేస్తూ మంత్రములు చదువుతున్నారు. ఇంద్రుని అగ్నిలో ఆహుతి చేయడానికి నెయ్యి తీసుకున్నారు. వెంటనే బ్రహ్మదేవుడు వారిని వారించాడు. "ఋత్విక్కులారా! ఇంద్రుడు లోకపాలకుడు. తెలిసో తెలియకో తప్పు చేసాడు. మీరు ఇంద్రుని ఆవాహన చేసి అగ్నిలో ఆహుతి చేయడం తగదు. ఇంద్రుడు కేవలము ఈ యజ్ఞమునకు ఆటంకము కలుగజేయవలెననే దుర్బుద్ధితో ఈ పని చేసాడు. దాని వలన యాగము ఆగిపోలేదు కదా. ఇప్పటికి తొంబైతొమ్మిది యాగములు పూర్తి అయ్యాయి కదా. నూరవది కూడా పూర్తి అవుతుంది. కాబట్టి ఇంద్రుని వదిలిపెట్టండి." అని అన్నాడు.

తరువాత బ్రహ్మ పృథు మహారాజుతో ఇలా అన్నాడు. "ఓ పృథు మహారాజా! ఈ యజ్ఞములు, యాగములు అన్నీ ఏవేవో కోరికలు తీరడానికి చేసే కర్మకాండలు. నీకు మోక్షధర్మము ఏమిటో తెలుసు. నీకు ఈ యజ్ఞయాగములతో ఏమి ప్రయోజనము కలుగుతుంది. కాబట్టి మోక్షమార్గము కోసరం ప్రయత్నించు. మహారాజా! నీకో విషయం తెలుసా! నీవు, ఇంద్రుడు ఇద్దరూ ఆ విష్ణువుయొక్క అంశలతో ఉద్భవించిన వారే! నీవు ఇంద్రుడు ఒకటే. వేరు కాదు. నీవు ఇంద్రుడి

మీద కోపం తెచ్చుకున్నావంటే, నీ మీద నువ్వు కోపం తెచ్చుకున్నట్టే కదా! కాబట్టి ఇంద్రుడి మీద కోపం మాను. అయినా మహారాజా! నీ యాగమునకు విఘ్నము ఏమీ కలుగలేదు కదా!

కాని, ఇంద్రుడి వలన మరొక సమస్య వచ్చి పడింది. యజ్ఞాశ్వమును హరించుటకు ఇంద్రుడు పాషండ వేషములు, జడలు ధరించాడు. తరువాత పారిపోతూ వాటిని విడిచిపెట్టాడు. వాటిని దుష్టమానవులు స్వీకరించారు. ఆ వేషములు ధర్మాన్ని నాశనం చేసేవి. ఆ వేషములు కపట మానవులను ఆకర్షిస్తున్నాయి.

ఓ పృథు మహారాజా! నీ తండ్రి వేనుని దురాచారముల వలన ధర్మం నశించిపోయింది. ఆయన వలన నాశనము అయిన ధర్మమును పునరుద్ధరించడానికి నీవు విష్ణువు అంశతో అవతరించావు. ఈ లోకంలో ధర్మమును ప్రతిష్ఠించడానికి మహామునులు నిన్ను పుట్టించారు. వారు నిన్ను ఎందుకు పుట్టించారో ఆ కర్తవ్యములను నువ్వు నెరవేర్చు.

ఇంద్రుడు వదిలిపెట్టిన పాషండ వేషములను ధరించిన వారి వలన పాషండ ధర్మము ఒకటి లోకంలో ప్రబలిపోతుంది. ఈ పాషండ ధర్మమును నువ్వు నాశనం చేసి ధర్మమును ప్రతిష్ఠించాలి. అందుకని నువ్వు ఇంద్రుని మీద ఉన్న కోపమును వదిలిపెట్టి, లోకమును రక్షించు.అదే నీ కర్తవ్యము." అని బోధించాడు బ్రహ్మ.

బ్రహ్మగారు చెప్పినమాటలను సావధానంగా విన్న పృథు మహారాజు ఇంద్రుని మీద కోపాన్ని విడిచి పెట్టి ఇంద్రునితో స్నేహం చేసాడు. తరువాత పృథు మహారాజు యజ్ఞము అయినతరువాత చేయవలసినపుణ్య స్నానములను చేసాడు. ఋత్విక్కులకు, బ్రాహ్మణులకు, ఆహూతులకు అనేకములైన దక్షిణలు, బహుమానాలు ఇచ్చి సత్కరించాడు. యాగమునకు వచ్చి వారందరూ పృథు మహారాజును మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు.

"ఓ పృథు మహారాజా! ఈ యజ్ఞమునకు ఆహ్వానించిన దేవతలు, పితృదేవతలు, ఋషులు, ఆహూతులు అందరూ నీవు చేసిన పూజలకు, దానములకు సంతుష్టులయ్యారు." అని ఆశీర్వదించారు.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## చతుర్థస్కంధము

## ఇరువదవ అధ్యాయము.

విదురా! యజ్ఞేశ్వరుడు అయిన విష్ణువు, ఇంద్రునితో కలిసి పృథువు చేయు యజ్ఞమునకు వచ్చాడు. పృథు మహారాజు విష్ణువును, ఇంద్రుని పూజించాడు. అప్పుడు విష్ణువు పృథు మహారాజుతో ఇలా అన్నాడు.

"ఓ పృథు మహారాజా! ఈ ఇంద్రుడు నువ్వు చేస్తున్న నూరవ అశ్వమేధ యాగమునకు అవరోధములు కల్పించాడు. తాను చేసిన పనులకు ఇంద్రుడు నిన్ను క్షమించమని కోరుతున్నాడు. కాబట్టి ఇంద్రుడు నీచేత క్షమించబడటానికి అర్హుడు.

మహారాజా! దేహము వేరు, ఆత్మ వేరు. రెండూ ఒకటి కాదు. కాబట్టి ఇతర ప్రాణుల దేహములను హింసించడం ధర్మం కాదు. కానీ నీవంటి వివేకవంతులు కూడా మాయలో పడి జీవహింసతో కూడిన ఈ యజ్ఞములను చేస్తున్నారు. నీవు ఇంతకాలము ఆర్జించిన జ్ఞానము అంతా వృధా చేసుకుంటున్నావు. ఈ దేహము, అవిద్యతోనూ, కోరికలకు సంబంధించిన కర్మలతోనూ నిండి ఉంది. ఈ విషయం తెలుసుకున్న ఆత్మజ్ఞాని ఈ దేహము యందు, ఈ దేహము కొరకు చేసే కర్మల పట్ల ఆసక్తుడు కాడు. ఈ దేహము మీద ఆసక్తి లేని వాడికి, ఈ దేహము వలన కలిగిన భార్య, పిల్లలు, గృహము, ధనము వీటియందు ఆసక్తి ఎందుకు? వాటి మీద మమకారము చూపడంఎందుకు?

ఓ పృథూ! పరమాత్మ ఒక్కడే. ఆయన పరిశుద్ధుడు. స్వయంగా ప్రకాశిస్తుంటాడు. ఆయనలో ఈ సత్వ,రజస్, తమోగుణములు లేవు. కాని ఈ మూడు గుణములు ఆయనలో నుండి పుట్టాయి. పరమాత్మ సర్వవ్యాపకుడు. ఆయనకు ఇక్కడ ఉన్నాడు అక్కడ లేడు అని చెప్పకూడదు. అంతటా నిండి ఉన్నాడు. జీవులు చేసే కర్మలను సాక్షిగా చూస్తుంటాడు. దేహము వేరు అందులో ఉన్న ఆత్మ వేరు. ఈ విషయం తెలుసుకున్న వాడు దేహము మీద అభిమానము

పెంచుకోడు. దేహములో ఉన్న గుణముల యందు ఆసక్తి చూపించడు. నిర్లిప్తంగా ఉంటాడు. అటువంటి వాడు పరమాత్మ యందు సంచరిస్తుంటాడు. ఎటువంటి కోరికలు లేని వాడు, పరమాత్మ యందు శ్రద్ధ భక్తి కలవాడు, తాను చేసే కర్మల ద్వారా నన్నే పూజిస్తుంటాడు. దానివలన అతని మనసు ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉంటుంది. ప్రసన్నత్వమును పొందుతుంది.

మానవుని మనస్సు ప్రసన్నత్వమును పొందగానే సత్వ,రజస్,తమోగుణముల నుండి విముక్తి పొందుతాడు. అతనిలో రాగద్వేషములు నశిస్తాయి. జీవుల నందరినీ సమంగా ఆదరిస్తాడు. ఎటువంటి భేదభావము అతనిలో ఉండదు. అతడు ప్రాపంచిక విషయములలో ఉదాసీనంగా ఉంటూ, మనసు ఎల్లప్పుడూ నాయందే లగ్నం చేస్తాడు. అదే బ్రహ్మ కైవల్యము.

ఓ పృథు మహారాజా! ప్రాపంచిక విషయములలో ఉదాసీనంగా ఉన్నవాడు, తన కళ్ల ఎదురుగా ఏమి జరిగినా కేవలం సాక్షీగా చూచేవాడు, ఎటువంటి మానసిక వికారములు లేనివాడు, ఆత్మను కేవలము ఈ దేహముతో చేసే పనులకు మనస్సు చేసే ఆలోచనలకు ఒక ద్రష్టగా (కేవలం చూచేవాడుగా) తెలుసుకున్న వాడు, మోక్షము పొందుతాడు.

దేహము, ఆ దేహముతో చేసే కర్మలు, ఇంద్రియ వాంఛలు, ఆ ఇంద్రియములకు ఉన్న అధిష్టానదేవతలు, వీటి యొక్క కలయిక తోనే ఈ సంసారము, భోగములను, సుఖములను అనుభవించడం

జరుగుతుంది. ఈ విషయమును తెలుసుకున్న వివేకవంతులు, తమ మనస్సును విషయ వాంఛల నుండి మళ్లించి నాయందు లగ్నం చేస్తారు. అప్పుడు వారి మనసు నిశ్చలంగా ఉంటుంది. మనస్సు నిశ్చలంగా ఉన్నప్పుడు, సంపదలు వచ్చినా, పోయినా, బంధు మిత్రులు కలిసినా విడిపోయినా, సుఖాలు వచ్చినా, దు:ఖాలు కలిగినా, వారి చిత్తము వికారము పొందదు. నిశ్చలంగా ఉంటుంది.

ఓ పృథు మహారాజా! నీకు అన్నీ తెలుసు. సుఖములను దు:ఖములను సమంగా భావించు. గొప్ప విషయములను, తక్కువ విషయములను సమంగా చూడు. వాటి యందు సమమైన బుద్ధిని కలిగి ఉండు. నీ మనస్సును, నీ ఇంద్రియములను నీ అధీనంలో ఉంచుకో. నీవు సరి అయిన మంత్రులను నియమించుకో. ఈ భూమిని పాలించు. ప్రజలను రక్షించు. రాజులకు ప్రజాపాలనే శ్రేయోదాయకము. ప్రజలు చేసిన పుణ్యంలో రాజుకు ఆరవ వంతు లభిస్తుంది. అలా కాకుండా ప్రజల నుండి పన్నులు వసూలు చేస్తూ, వారికి ఏ మాత్రము సౌకర్యాలు కల్పించకుండా, వారిరక్షణ పట్టించుకోకుండా ఉండే రాజుకు, ఆ రాజు చేసిన పుణ్యంలో ఆరవ వంతు ప్రజలకు చెందుతుంది. అంతే కాకుండా అటువంటి రాజు ప్రజలు చేసే పాపములఫలాన్ని కూడా అనుభవిస్తాడు.

కాబట్టి ఓ పృథు మహారాజా! ఋషులు, మునులు, పెద్దలు ప్రతిపాదించిన ధర్మములను, వంశపరంపరగా వచ్చిన ధర్మములను నీవు ఆచరించు. రాగద్వేషములు లేకుండా ఈ భూమిని పరిపాలించు. దాని వలన ప్రజలకు నీ మీద ప్రేమ కలుగుతుంది. తొందరలో నీ వద్దకు సనకాది మహా పురుషులు వస్తారు.

ఓ పృథు మహారాజా! ఎవరిలో అయితే ఇతరుల మీద వైషమ్యము, ద్వేషము, కోపము ఉండదో వారికి నేను వశుడనై ఉంటాను. ఎన్ని యజ్ఞములు, యాగములు చేసినా,తపస్సు చేసినా, చిత్తశుద్ధిలేని వారికి నేను వశుడను కాను నీ మంచి గుణములకు, ఇతరుల మీద మత్సరము లేని నీ  స్వభావమునకు నేను పరవశు డనయ్యాను. ఏమైనా వరం కోరుకో ఇస్తాను." అని అన్నాడు విష్ణువు.

విష్ణువు ఆ ప్రకారంగా జ్ఞాన బోధ చేస్తుంటే పృథు మహారాజు చేతులు జోడించి, తలవంచుకొని నిలబడ్డాడు. ఇంద్రుడు తాను చేసినపనికి సిగ్గుతో కుంగిపోయాడు. పృథు మహారాజు పాదముల మీద పడి క్షమించమని ప్రార్థించాడు. పృథువు ఇంద్రుని లేవదీసి కౌగలించుకున్నాడు. ఇంద్రుని మీద ఉన్న కోపమును విడిచిపెట్టాడు. పృథు మహారాజు పూజాసామగ్రిని తెప్పించి విష్ణువు పాదపద్మములను పూజించాడు. తరువాత విష్ణువు అక్కడి నుండి వెళ్లిపోవడానికి సిద్ధం అయ్యాడు. కానీ తన అంశతో పుట్టిన పృథువును చూస్తూ అలాగే ఉండిపోయాడు.

పృథు మహారాజుకు విష్ణువునునోరారా కీర్తించాలని కోరిక ఉన్నా ఆనందంతో కళ్లనీళ్లునిండాయి. గొంతూ మూగబోయింది. మాట బయటకు రాలేదు. కేవలము పృథువు విష్ణువును తన మనసులోనే గట్టిగా కౌగలించుకున్నాడు. ఆనంద భాష్పములను కారుస్తున్నాడు. తుదకు ఎలాగో ఒక లాగ నోరు పెగుల్చుకొని పృథువు శ్రీహరితో ఇలా అన్నాడు.

"దేవా! నీవు నన్ను వరము కోరుకోమన్నావు. కానీ ఈ దేహముతో అనుభవించదగిన వరములను కోరుకోవడం నాకు భావ్యం కాదు. ఈ ప్రాపంచిక సుఖాలు, దేహవాంఛలు, నరకానికి దారితీస్తాయి. కాబట్టి ఆ తుచ్ఛకోరికలను నేను కోరను. ఓ దేవా! ఎక్కడైతే పరమభాగవతులు నీ గురించి కీర్తించడం, నీ కథలను వినడం, జరగదో అటువంటి మోక్షపదవి నాకు అక్కరలేదు. ఎల్లప్పుడూ నీ గుణకీర్తనములను, నీ పుణ్యకథలను వినడానికి నాకు వేయి చెవులను ప్రసాదించు. అదే నాకోరిక. నాకు ఏ ఇతర వరములతో పనిలేదు.

ఓ దేవా! పెద్దల వలన నీ గురించి నీ లీలల గురించి, నీ కీర్తి గురించి ఒక్కసారి విన్న తరువాత, దాని నుండి మనసును ఇతర విషయముల మీదికి మరల్చడం కష్టం కదా! అందుకే కదా ముల్లోకములచేత పూజింపబడుతున్న లక్ష్మీదేవి నిరంతరమూ నిన్ను పూజిస్తూ ఉంటుంది. ఓ దేవా! లక్ష్మీదేవికి నీవు భర్తవు. మాకు కూడానీవే భర్తవు. అందుకే లక్ష్మీదేవితో కలిసినిరంతరము నీ పాదపద్మములనే సేవిస్తున్నాము. కాని మా మధ్య సవతి మాత్సర్యము లేదు (అని వ్యాసుడు ఛలోక్తిగా అన్నాడు.)

ఓ దేవా! లక్ష్మీదేవితో కలిసి నేను కూడా నిరంతరము నీ పాదసేవలో నిమగ్నం కావాలని ఉంది. నీవు దీనులను కాపాడేవాడివి. నీ భక్తులు నిన్ను అనేకమైన కోరరాని కోరికలు కోరుతుంటారు.

వాటినికూడా నీవు తీరుస్తుంటావు. నీ మాయాగుణంతో నీవు చేయలేని పని తీర్చలేని కోరికలు ఏముంటాయి. కాని సత్పురుషులకు నీ పాదసేవ తప్ప మరేకోరికా ఉండదు.

ఓ దేవా! నన్ను వరము కోరుకోమన్నావు. అంటే నేను నీ మాయలో పడి ఈ ప్రాపంచిక విషయములకు సంబంధించిన వరములు కోరతానని అనుకున్నావా! నీ మాయలో పడ్డ మానవులు వారి వారి కోరికలు నెరవేరడానికి కోరికలతో కూడిన కర్మలు చేస్తుంటారు. నీ మాయ అనే అజ్ఞానంలో పడ్డ మానవులు ప్రాపంచిక సుఖములను, ధనమును, మంచి భార్యను సంతానమును కోరుకుంటారు. నీవు ఒక్కడివి అని తెలియక నిన్ను వివిధ రూపములతో భేదభావంతో పూజిస్తుంటారు. ఒక తండ్రి తన కుమారులను మంచి మార్గంలో పెట్టడానికి ప్రయత్నించినట్టు, నీవు కూడా ఈ మానవులను మంచి మార్గంలో పెట్టడానికి నిరంతరము ప్రయత్నిస్తుంటావు. అట్టి నీకు నమస్కారము." అని పృథు మహారాజు విష్ణువునుస్తుతించాడు.

పృథు మహారాజు పలికిన పలుకులను చిరునవ్వుతో విన్న విష్ణువు ఇలా అన్నాడు. "పృథు మహారాజా! నీవు కోరినట్టు నాయందు నీకు అవిచ్ఛిన్నమైన భక్తి కలుగుతుంది. నీవు చేసుకున్న పూర్వజన్మపుణ్యము వలననే ఇది సాధ్యముఅయింది. నీ వంటి ఉత్తములు తమ బుద్ధిబలముతో నా మాయను కూడా జయించగలుగుతారు. ఓ పృథు మహారాజా! నీవు నా ఆదేశమును పాటిస్తూ ప్రజలను పాలించు. నీకు శుభం కలుగుతుంది."అని పృథు

మహారాజును ఆశీర్వదించి, విష్ణువు వైకుంఠమునకు వెళ్లిపోయాడు.

తరువాత పృథు మహారాజు దేవ ఋషులను, పితృదేవతలను, గంధర్వులను, సిద్ధును, చారణులను, నాగులనుకిన్నరులను, అప్సరసలను, పక్షిజాతులను, మానవులను, ఇంకా ఇతరములైన ప్రాణులను అన్నీ పరమాత్మ స్వరూపాలుగా భావించి పూజించాడు. పృథు మహారాజుచేత పూజలందుకున్న వారంతా తమ తమ నివాసములకు వెళ్లిపోయారు. సాధారణమానవుల చర్మచక్షువులకు కనపించని విష్ణువు తన భక్తుడైన పృథువు నేత్రములకు మాత్రము దర్శనం ఇచ్చాడు. ఆయన రూపమును మనసులోనే నిలుపుకున్న పృథువు తన నివాసమునకు వెళ్లిపోయాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము ఇరువదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

## శ్రీమద్భాగవతము

## చతుర్థ స్కంధము

## ఇరువది ఒకటవ అధ్యాయము.

యాగ శాల నుండి నగరంలోకి ప్రవేశించిన పృథు మహారాజుకు ప్రజలు ఘనంగా స్వాగత సత్కారాలు చేసారు. రాజవీధులను చందనము అగరు కలిపిన నీటితో తడిపారు. మామిడి తోరణాలు కట్టారు. అరటి చెట్లు స్తంభములకు కట్టారు. ముత్తయిదువలు, కన్యలు మంగళద్రవ్యములతో హారతులతో పృథు

మహారాజుకుస్వాగతం పలికారు.

పృథు మహారాజు వారికి తగిన కానుకలు ఇచ్చి తృప్తిపరిచాడు. తరువాత పృథు మహారాజు విష్ణువు చెప్పిన ప్రకారము తనకు అవసరము ఉన్నంత వరకే భోగములను అనుభవిస్తూ ప్రజలను కన్న బిడ్డలవలె ఆదరిస్తూ రాజ్యపాలన సాగించాడు. భూమండలంలో ఆయన ఆజ్ఞకు తిరుగు లేదు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ సమర్థవంతంగా నెరవేర్చాడు. బ్రాహ్మణులను, ఋషులను, సత్పురుషులను ఆదరించాడు.

ఒక సారి పృథు మహారాజు ఒక యజ్ఞమును తలపెట్టి యజ్ఞ దీక్ష వహించాడు. ఆభరణములు ఏమీ ధరించకుండా నిరాడంబరంగా ఉన్నాడు. పగలంతా యజ్ఞము అయిన తరువాత సాయంత్రం ఒక సభ నిర్వహించాడు. ఆ సభలో తన ప్రజలను ఉద్దేశించి ఇలా అన్నాడు.

"ప్రజలారా! సాధువులారా!ఋషులారా! ఋత్విక్కులారా! మీకు అందరికీ శుభం కలుగుగాక! ఈ నాడు నేను మీతో నా ఆలోచనలను పంచుకోవాలని అనుకుంటున్నాను. ఆ పరమాత్మ నన్ను ఈ భూమండలంలో ఉన్న ప్రజలకు రక్షకుడిగా, ధర్మమును రక్షించడానికి, మీ అందరికీ ఆహారమును సమకూర్చడానికి, మీ చేత వర్ణాశ్రమ ధర్మములను చక్కగా పాటింపచేయడానికి, నియమించాడు. నా ఆజ్ఞమేరకు మీరు అందరూ ధర్మం ప్రకారం నడుచుకుంటున్నారు. మీకు కరువు కాటకాలు లేకుండా అందరికీ ఆహారము నేను సమకూరుస్తున్నాను. మీకు సేవ చేసినందువలన నాకు పుణ్యలోకములు లభిస్తాయని నమ్ముతున్నాను.

ఓ ప్రజలారా! తన పాలనలో ఉండే ప్రజలకు ఎప్పటికప్పుడు ధర్మబోధ చెయ్యడం, వారితో ఆచరింపజెయ్యడం, రాజు యొక్క కర్తవ్యం. మీ వద్దనుండి పన్నులు మాత్రం వసూలు చేస్తూ, మీ అందరినీ ధర్మామార్గాన నడిపించని రాజు నరకానికి పోతాడు. ప్రజలు చేసే పాపాలలో భాగం పంచుకుంటాడు. అందుకే మీకు ఎప్పటికప్పుడు ధర్మములను గురించి వివరిస్తున్నాను.

ఓ ప్రజలారా! మీరు మీ మనస్సును నిరంతరము ఆ పరమాత్మయందు లగ్నం చేసి మీ దైనందిన కృత్యములు చేసుకోవాలి. మీరు అందరూ మీ మీ స్వధర్మములను చక్కగా పాటించండి. పరధర్మాన్ని పాటించకండి. మీరు స్వధర్మమును పాటించడం వలన నాకు మేలు చేసిన వారు అవుతారు. అప్పుడు నా ధర్మపాలన సక్రమంగాసాగుతుంది. మీరు స్వధర్మాని పాటిస్తే,పాటించి నందుకు మీకు, పాలకుడ నైన నాకూ స్వర్గంలో సమాన మైన ఫలము లభిస్తుంది.

మీకు మీరు ఆచరించవలసిన ధర్మముల గురించి చెప్పకుండా, వివరించకుండా, మిమ్ములను స్వధర్మాచరణము చేయడానికి ప్రోత్సహించకుండా, కేవలము మీ వద్దనుండి పన్నులు తీసుకుంటూ రాజ్యాధి కారము అనుభవించే రాజు,నరకానికి పోతాడు. అంతే కాదు, ప్రజలు చేసినపాపములో ఆ రాజుకు ఆరవ వంతు పాపం చుట్టుకుంటుంది. కాబట్టి మీరు మీ స్వధర్మాన్ని ఆచరిస్తే నాకు మేలు చేసిన వారు అవుతారు. నా మీద అనుగ్రహం చూపించినవారు

అవుతారు.

ఓ ప్రజలారా! మీరు వివేకము కలవారు. కాబట్టి నా మాటలు ఆలకించండి. ఆమోదించండి.ఆచరించండి. మంచి మాటలు చెప్పేవాడు, ఆ చెప్పిన మాటలను ఆమోదించేవాడు, వాటిని ఆచరించేవాడు సమానమైన ఫలమును పొందుతారు.

ఓ ప్రజలారా! పరమాత్మ ఒక్కడే. అతడే యజ్ఞపురుషుడు. మనమంతా ఆ పరమాత్మను పూజించాలి. ధ్యానించాలి. ఆపరమాత్మ లేకపోతే ఈ లోకములో కానీ పరలోకములో కానీ మనము చేసిన మంచి పనులకు మంచి ఫలితములను ఎవరు ఇస్తారు. ఈ భూమిమీద నా తండ్రి వేనుడు లాంటి దుర్మార్గులైన రాజులు పరమాత్మను నమ్మకుండా, యజ్ఞయాగములు చేయకుండా, దుర్మార్గంగా ప్రవర్తించారు.

ఈ లోకంలో నా తండ్రి వేనుడి వంటి దుర్మార్గులే కాదు, , మను చక్రవర్తి, ఉత్తానపాదుడు, ధ్రువుడు, ప్రియవ్రతుడు, అంగరాజు, బ్రహ్మ, శివుడు, ప్రహ్లాదుడు, బలి ఇంకా చాలా మంది మహాత్ములు ఉన్నారు. వారంతా పరమాత్మను నమ్మారు. . వాళ్ల దృష్టిలో పరమాత్మ అనేవాడు ఒకడు ఉన్నాడు. ఈ లోకంలో ధర్మము, అర్థము, కామము అనే పురుషార్థములు, స్వర్గ మోక్షములు అన్నీ ఆ పరమాత్మ అధీనంలో ఉంటాయని పెద్దలు చెబుతారు. ఆ పరమాత్మను ఆశ్రయించిన వారు ఈ సంసార కూపము నుండి బయటపడతారు.

ఓ ప్రజలారా! ఆ పరమాత్మ పాదములను సేవిస్తే, ఎవరికైతే గతజన్మలలో చేసిన పాపములు తొలగిపోయి, ఈ సంసారమనే తాపము నుండి విముక్తి కలుగుతుందో, ఎవరు ఆ పరమాత్మ పాదపద్మములను ఆశ్రయిస్తారో, ఎవరి పాపములు సమూలంగా ప్రక్షాళన కాబడతాయో, అటువంటి వారు వైరాగ్యముతో కూడిన భక్తియోగమును ఆచరించి దాని ద్వారా విజ్ఞానమును పొంది, తిరిగి ఈ సంసారకూపంలో పడరు. కాబట్టి మీరు కూడా ధృడమైన నిశ్చయంతో, కపటం లేకుండా, మీ మీ స్వధర్మములను పాటిస్తూ, త్రికరణ శుద్ధిగా మీ మీ కర్మలను చేస్తూ, ఆ భగవంతుని పాదములను సేవించండి.

ఆ పరమాత్మ శుద్ధసత్త్వగుణమునే ప్రధానముగా కలవాడు. సచ్చిదానంద స్వరూపుడు. ఆయనకు ఈ ప్రాపంచిక విషయములు అంటవు. ఆయన యజ్ఞపురుషుడు. ఘనీభూతమైన జ్ఞానము కలవాడు. యజ్ఞము అంటే మనం చేసే ప్రతి కర్మ యజ్ఞమే. మనం చేసే ప్రతి కర్మలో పరమాత్మ ఉన్నాడు. మనము ఒక యజ్ఞము సంకల్పిస్తే, ఆ సంకల్పంలోనూ, యజ్ఞముచేయడానికి సేకరించిన పదార్థములలోనూ, అందుకు వినియోగించే ద్రవ్యములోనూ, యజ్ఞములో చేసే అన్ని కర్మలలోనూ, యజ్ఞములో ఆవాహనచేసే వివిధ పేర్లుకల దేవతలలోనూ, ఆ పరమాత్మ ఉన్నాడు. అందువల్ల యజ్ఞమే పరమాత్మ.

(దీనిని బట్టే వర్క్ ఈజ్ వర్‌షిప్ అనే సామెత వచ్చింది. మనం చేసే ప్రతి పనిని, అది ఆఫీసు పని కానీ, వ్యాపారము కానీ, వృత్తి విద్యకానీ, విద్యార్థులు అయితే చదువుకోడం కానీ, ఏదో చెయ్యాలని చేయకుండా, శ్రద్ధా భక్తులతో దైవపరంగా చేస్తే చక్కని ఫలితాలు లభిస్తాయి అనడంలో సందేహము లేదు. నాడు పృథు మహారాజు ఇదే

చెప్పాడు.)

పరమాత్మను మించి మరొక వస్తువు లేదు. ప్రతి కట్టెలోనూ అగ్ని అంతర్లీనంగా ఉంటుంది. ఆకట్టె అంటుకోగానే ప్రజ్వరిల్లుతుంది. అలాగే పరమాత్మ కూడా ఈ ప్రకృతిలోనూ, కాలములోనూ, జీవులయొక్క వాసనలలోనూ, వారియొక్క సుఖదు:ఖములలోనూ కలిసి పోయి ఉన్నాడు. పుట్టిన ప్రతి ప్రాణిలోనూ పరమాత్మ అంతర్లీనంగా ఉండి, వారి వారి కర్మఫలములను బట్టి, వారి యొక్క బుద్ధి, మనసు ప్రేరణ వలన చేయబడే కర్మల ద్వారా బయటకు ప్రకటితమవు తున్నాడు. ఈ భూమి మీద నివసించే ప్రజలు, యజ్ఞపురుషుడు, దేవతలకు అధిపతి, జగత్తునకే గురువు అయిన ఆ పరమాత్మను ఆరాధిస్తే, వారు నా మీద అనుగ్రహము చూపించినవారు అవుతారు.

ఓ ప్రజలారా! మరొక మాట. బ్రాహ్మణులకు సహనము, తపస్సు, జ్ఞానము, వేదాధ్యయనము ఎక్కువ. ఈ విశిష్టమైన లక్షణములు కలవారినే బ్రాహ్మణులు అంటారు. (పుట్టుకచేత బ్రాహ్మణులు కారు అని భావన). అటువంటి బ్రాహ్మణ వంశముల వారి మీద రాజులు తమ అధికారదర్పమును ప్రదర్శింపకూడదు. బ్రాహ్మణులు పూజించతగినవారుకానీ, దండించదగినవారుకాదు. ఆ శ్రీహరి కూడా బ్రాహ్మణులను పూజించి అనంతమైన ఐశ్వర్యమును పొందాడు. మీరుకూడా వేదవిదులైన బ్రాహ్మణులను సేవిస్తే, ఆ శ్రీహరి కూడా సంతోషిస్తాడు.

ఆత్మజ్ఞానము కలిగిన బ్రాహ్మణులను సేవిస్తే, మీ హృదయములు పరిశుద్ధము అవుతాయి. ఏ విధమైన జ్ఞానము

సంపాదించకుండానే మీకు ముక్తిలభిస్తుంది. ఎందుకంటే బ్రాహ్మణులముఖములలో దేవతలునివసిస్తుంటారు. పరమాత్మ అంతటా ఉన్నాడు. యజ్ఞము చేసే వారు ఇంద్రుడు మొదలగు దేవతల నామములను బ్రాహ్మణుల ముఖము ద్వారా ఉచ్ఛరిస్తూ హెూమం చేస్తే, దానిని పరమాత్మ తృప్తిగా స్వీకరిస్తాడు. అంతేగానీ, బ్రాహ్మణుల ప్రమేయం లేకుండా హెూమం చేస్తే అది ఎందుకూ పనికిరాదు. వేదముల యొక్క అర్థము భావము తెలుసుకోడానికి బ్రాహ్మణులు నిత్యమూ శ్రద్ధతోనూ, తపస్సుతోనూ, ఆచరణతోనూ, మౌనంగానూ, ఇద్రియ నిగ్రహంతోనూ, ప్రయత్నిస్తూ ఉంటారు.

నేను ఈ భూమండలమునకు మహారాజును అయి ఉండి కూడా ఎల్లప్పుడూ బ్రాహ్మణుల పాద ధూళిని నా శిరస్సున ధరిస్తూ ఉంటాను. ఎవరైతే వేదమూర్తులైన బ్రాహ్మణుల పాదధూళిని తన శిరస్సున ధరిస్తారో వారి పాపములన్నీ పటాపంచలయిపోతాయి. వారు గుణవంతులు అవుతారు. మానవులు మంచి గుణములు కలవాడు, మంచి చరిత్రకలవాడు, కృతజ్ఞతా భావము కలవాడు, జ్ఞానవృద్ధుడు అయిన గురువును సేవించాలి. అట్టి గురువునుసేవించే మానవులకు నాలుగు పురుషార్థములు లభిస్తాయి.

ఓ ప్రజలారా! ఈ కారణంగా నేను బ్రాహ్మణులను, గోవులను, గురువులను పూజిస్తాను.” అని పలికాడు పృథు మహారాజు.

మహారాజు మాటలు విన్న ప్రజలు, దేవతలు, బ్రాహ్మణులు ఎంతో సంతోషించారు. వారంతా పృథు మహారాజుతో ఇలా అన్నారు.

"ఓ మహారాజా! పుత్రుని ద్వారా మానవులకు ఉత్తమ లోకములు సిద్ధిస్తాయి అని లోకోక్తి. నీ వంటి కుమారుని పొందిన వేనుడు, తాను దుర్మార్గుడయ్యు, నీ వలన ఉత్తమ గతులు పొందుతాడు. ఇదే ప్రకారము తాను చేసిన దైవదూషణ వలన హిరణ్య కశిపుడు నరకమును వెళ్లినను, తన కుమారుడు ప్రహ్లాదుని భగవద్భక్తి వలన, నరకమును దాటి స్వర్గమునకు వెళ్లాడు. మీకు పరమాత్మయందు, బ్రాహ్మణుల యందు ఉన్న భక్తిని చూచి మేము చాలా సంతోషించాము. నీవు చిరకాలము కీర్తితో వర్ధిల్లాలి.

ఓ మహారాజా! నీవు మాకు రాజువు. నీ వలన మేము పరమాత్మను గురించి తెలుసుకోగలిగాము. నీవు మాకు విష్ణువు యొక్క కీర్తిని తెలియచెప్పావు. నీ ప్రజలకు రాజుగా నీవు ఉపదేశించడం నీ కర్తవ్యము. వాటిని ఆచరించడం  ప్రజలుగా మా కర్తవ్యము. ఇప్పటి దాకా, మేము పరమాత్మజ్ఞానము లేక, అజ్ఞానంలో కొట్టుకుంటున్నాము. జనన మరణ చక్రంలో గిరా గిరా తిరుగుతున్నాము. ఈ నాడు నీవు నీ బోధనల వలన, మేము అజ్ఞానము అనే చీకటి లోనుండి వెలుగులోకి వచ్చాము. ఆ శ్రీహరి బ్రాహ్మణుల హృదయములలో ఉండి క్షత్రియులను, క్షత్రియుల హృదయములలో ఉండి బ్రాహ్మణులను, బ్రాహ్మణ, క్షత్రియుల హృదయములలో ఉండి ఈ సమస్త విశ్వమును పాలించు చున్నాడు. అట్టి శ్రీహరికి భక్తితో నమస్కరిస్తున్నాము." అని ప్రజలు పృథు మహారాజుకు తమ కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కందము ఇరవై ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## చతుర్థ స్కందము

## ఇరవై రెండవ అధ్యాయము.

పృథు మహారాజు ఈ ప్రకారంగా తనప్రజలతో సభ నిర్వహించు సమయములో సూర్యుని తేజముతో సమానమైనతేజస్సు కలిగిన సనకసనందనాదులు అక్కడకి వచ్చారు. పృథు మహారాజు వారిని చూచి మంత్రులతో సహా లేచినిలబడ్డాడు. వారికి సాష్టాంగ నమస్కారము చేసాడు. ఆ మునులను సాదరంగాఆహ్వానించి, అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి సత్కరించాడు. వారి పాదములుకడిగిన జలమును తన తలమీద చల్లుకున్నాడు. పృథు మహారాజు వారిని చూచి భక్తితో నమస్కరిస్తూ ఇలా అన్నాడు.

"ఓ మహాఋషులారా! నేను ఎంతో పుణ్యం చేసుకుంటేకానీ మీ వంటి మహాత్ముల దర్శనభాగ్యము లభించదు. నేను కృతార్థుడను అయ్యాను. మీ వంటి బ్రాహ్మణుల దర్శనంతో నాకు శివుడు, విష్ణువుయొక్క దర్శనం కూడా అయిన పుణ్యం లభించింది. మీ దర్శనము అయిన తరువాత నాకు ఈ లోకములో కానీ పర లోకములో కానీ పొంద దగినది ఏదీ లేదు. ఎంతో గొప్పవారైన మునులు కూడా పరమాత్మను గురించి తెలుసుకోలేనట్టు మీ వంటి మహాత్ములు జనం మధ్యలో తిరుగుతున్నా, మీ మహిమలను సామాన్య జనులు తెలుసుకోలేరు. మీ వంటి మహాత్ములను పూజించడానికి ఎవరి గృహంలో నీరు, ధాన్యము, దర్భలు ఉంటాయో వారే నిజమైన గృహస్థులు. వారిజీవితము ధన్యము.

ఓ బ్రాహ్మణోత్తములారా! మీకు స్వాగతము. మీరు బాల్యము నుండి ఎన్నో వ్రతములు చేసారు. మీరు ఇంద్రియములను జయించారు. కాని మేము ఇంద్రియములతో కూడి సుఖములనే పురుషార్థములుగా భావించాము. అన్ని రకములైన బాధలకు నిలయమైన ఈ సంసారములో పడి కొట్టుకుంటున్నాము. మాకు ఎప్పుడైనా, ఎప్పటికైనా ఈ సంసారము నుండి విముక్తి లభిస్తుందంటారా!

ఓ మహాఋషులారా! మిమ్ములను బాగున్నారా అని అడగడం ధర్మంకాదు. ఎందుకంటే మీరు ఎల్లప్పుడూ బాగానే ఉంటారు. మీకు శుభము, అశుభము అనే తేడా లేదు కదా! ఈ సంసార సాగరంలో పడి కొట్టుకొనేవారికి మీరు ఆప్తులు, బంధువుల వంటి వారు. ఈ సంసారము నుండి ఏ మాత్రము శ్రమలేకుండా బయట పడటం ఎలాగా అని అడుగుతున్నాను. ఆ పరమాత్మయే మీ రూపంలో మా వద్దకు వచ్చాడు అని నమ్ముతున్నాను. దయచేసి నా సందేహమును నివృత్తి చేయండి." అని అడిగాడు పృథు మహారాజు.

పృథు మహారాజు అడిగిన ప్రశ్నలు విని సనత్కుమారుడు చిరునవ్వు నవ్వాడు. పృథు మహారాజుతో ఇలా అన్నాడు.

"మహారాజా! నీవు అందరి మంచి కోరేవాడివి. బాగా చదువుకున్న వాడివి. నీకు అన్నీ తెలుసు. నీవు తెలుసుకోతగ్గది ఏమీ లేదు. కానీ నీ ప్రజలుకూడా తెలుసుకోవాలనే కోరికతో అడిగావు. నీవు

అడిగిన ప్రశ్న ఎంతో ఉత్తమమైనది. నీ వంటి మంచి వారు అడగదగ్గ ప్రశ్ననే అడిగావు. నేను సాధువును.నువ్వు సత్పురుషుడవు. మన సంగమము, సంభాషణ అందరికీ శుభాలు కలుగచేస్తుంది.

ఓ రాజా!నీకు శ్రీహరి మీద అచంచలమైన భక్తి విశ్వాసాలు ఉన్నాయి. శ్రీహరి మీద ఉన్న భక్తి కారణంగా నీలో ఉన్న విషయవాసనల రూపంతో ఉన్న మలినం అంతా తొలగిపోయింది.

ఓరాజా! ఈ దేహము, ఇంద్రియములు, లోపల ఉన్న ఆత్మకన్నా భిన్నమైనవి. వాటి యందు ఆసక్తి ఉండకూడదు. కేవలం నిర్గుణ బ్రహ్మస్వరూపమైన ఆత్మయందే ధృడమైన ఆసక్తి ఉండాలి. ఇదే జీవుడు మోక్షముపొందుటకు చక్కని మార్గము అని పెద్దలు చెబుతారు. శ్రద్ధచేత, భగవంతుని గురించి తెలుసుకోవడం చేత, తత్త్వజ్ఞానము తెలుసుకోవాలనే కోరికచేతా, భగవంతుని సేవించాలనే నిష్టచేతా, భగవంతుని భక్తులను పూజించడం చేతా, భగవంతుని యొక్క కథలను వినడం చేతా, భగవంతుని మీద ఆసక్తి కలుగుతుంది.

అంతే కాకుండా, ధనము, ఆభరణములు, బంగారము మొదలగు ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి లేకపోవడం చేతా, అటువంటి ఆసక్తి ఉన్న వారి సాంగత్యము లేకపోవడంచేతా, ధనమును, దానికి సంబంధించినకోరికలను విడిచిపెట్టడం చేతా, వీటి వల్ల కూడా ఆత్మవిచారము చేసుకోడం యందు  ఆసక్తి కలుగుతుంది.

ఎక్కడైతే శ్రీహరి కీర్తనమునకు, శ్రీహరి కథలను వినడానికి అవకాశం ఉండదో అట్టి ప్రదేశమును వెంటనే విడిచిపెట్టాలి. అటువంటి ప్రదేశమునకు వెళ్లాలని ఎప్పుడూ అనుకోకూడదు. అటువంటి ప్రదేశములకు వెళ్లడం వలన దేహమునకు ఇంద్రియములకు సంతోషము, తృప్తి కలుగుతుందేమో కాని ఆత్మకు తృప్తికలుగదు.

ఈ కింది వాటి వలన పరమాత్మయందు భక్తి వృద్ధిచెందుతుంది. అహింసను ఒక వ్రతంలా పాటించడం వలనా, సన్యాసాశ్రమము స్వీకరించిన వారి వలన ఉపదేశములు పొందడంవలనా, శ్రీహరి లీలలను వినడం వలనా, ఇంద్రియములను నిగ్రహించడం వలనా, భోగములను వృద్ధి చేసే వాసనలను వదిలిపెట్టడం వలనా, పరులను నిందించకుండా ఉండటం వలనా, సుఖదు:ఖములను సమంగా చూడటం వలనా, హరికథలను నిరంతరం వినడం వలనా, మానవులలో భక్తి వృద్ధిచెందుతుంది.

భక్తి వృద్ధి చెందడం వలన ప్రాపంచిక విషయములలో వైరాగ్యము, నిర్గుణుడు అయిన పరబ్రహ్మ యందు ఆసక్తి కలుగుతుంది. పరబ్రహ్మయందు ఆసక్తి కలిగిననాడు, జ్ఞానం, వైరాగ్యం పెరుగుతుంది. అప్పుడు జీవుని ఆవరించి ఉన్న అవిద్య, అజ్ఞానము, రాగము, ద్వేషము మొదలగునవి అంతరించిపోతాయి. జీవుని ఆవరించి ఉన్న అవిద్య అంతరించిపోగా, జీవునికి ఆత్మకు ఉన్న భేదము తొలగి పోతుంది. జీవాత్మ దేహంలో అంతర్లీనంగా ఉన్న ఆత్మవైపుకు చూస్తాడు. అప్పుడు జీవునికి ప్రాపంచిక విషయముల అనుభవం ఉండదు.

ఓ పృథు మహారాజా! జీవుడు ఈ దేహములో ఉన్నంత వరకూ ప్రాపంచిక విషయములను, భోగములను, సుఖదు:ఖములను అనుభవిస్తుంటాడు. ఈ దేహమును విడిచి పెడితే ఆ అనుభవాలు ఉండవు. కాని పైన చెప్పిన విధంగా జీవుడు అంతర్లీనంగా ఉన్న ఆత్మవైపుకు చూచినపుడు, జీవుడు ఈ దేహంలో ఉన్నా ప్రాపంచిక విషయములకు, ప్రపంచంలో ఉండే భోగములకు, సుఖదు:ఖములకు ప్రభావితుడు కాదు. నేను వేరు దేహము వేరు అనే భావనతో ఉంటాడు. అంటే ఈ శరీరం ఉన్నా లేనట్టుగానే భావిస్తాడు.

ఓ పృథు మహారాజా! ఈ లోకంలో వస్తువులు దర్పణములో (అద్దములో) జలములో ప్రతిబింబిస్తాయి. బయట వస్తువు నిశ్చలంగా ఉన్నా నీటిలో దాని ప్రతి బింబము కదులుతున్నట్టు భ్రమకలిగిస్తుంది అలాగే జీవుడు ప్రాపంచిక విషయములలో లీనమైనపుడు అవి కదులుతున్నట్టు తనకు సుఖాలను ఇస్తున్నట్టు భ్రాంతి చెందుతాడు. కాని ఆ జీవుడు ప్రాపంచికవిషయముల యందు విరక్తి చెంది పరమాత్మవైపు మళ్లినపుడు, ప్రాపంచిక విషయముల వలన సుఖాలు కలుగుతాయి అనే భ్రాంతి తొలగి పోతుంది. ప్రతిబింబమే లేనపుడు భ్రాంతికి అవకాశము లేదు.

కాని ఎల్లప్పుడు విషయ వాంఛలలో మునిగి తేలేవాడికి నిరంతరము వాటియందే ఆసక్తి కలిగిఉంటాడు. అతని మనస్సు కూడా విషయ వాంఛలయందే లగ్నం అయి ఉంటుంది. అప్పుడు బుద్ధి తన విచక్షణా జ్ఞానాన్ని కోల్పోతుంది. బుద్ధి విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయినపుడు ఆ మానవునికి తాను ఏం చేస్తున్నాడో అన్న స్మృతి కూడా ఉండదు.

ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తుంటాడు. మానవుని స్మృతి నాశనం అయినపుడు అతడు అప్పటిదాకా సంపాదించుకున్న జ్ఞానం కూడా నాశనంఅవుతుంది. జీవుడి జ్ఞానం ఎప్పుడు నశించిందో, అదే ఆత్మనాశనము అని పెద్దలు అంటారు. ఆ జీవునికి ఆత్మజ్ఞానము ఎన్నటికీ కలుగదు. మహారాజా! ఈ దేహములో ఆత్మ ఉండబట్టే కదా, ఇన్ని ప్రాపంచిక సుఖములు అనుభవిస్తున్నాడు. అటువంటి ఆత్మ నష్టం అయిపోతే, ఇంక వాడికి దు:ఖము కాక మరేమి మిగులుతుంది.

పృథుమహారాజా! మానవులకు ధనము, భోగములు, వీటి మీద ఆసక్తి, వాటి గురించి ఆలోచించడం, ఇవే వారి నాశనానికి కారణాలు. ధనము, వాటి వల్ల వచ్చే సుఖాలను గురించి ఆలోచిస్తూ జీవుడు జ్ఞానమును కోల్పోతాడు. భ్రష్టుడవుతాడు. కాబట్టి ఓ పృథు మహారాజా! ఈ సంసారము నుండి విముక్తి పొందదలచిన వాడు ఎప్పుడు కూడా ప్రాపంచిక విషయములయందు ఆసక్తి చూపకూడదు.

ధర్మము, అర్థము, కామము, మోక్షము అనేవి పురుషార్థములు అని చెప్పినప్పటికినీ, భగవంతుని మీద భక్తితో, భగవంతుని సేవించడం వలన కలిగే మోక్షమే అసలైన పురుషార్థము అని చెప్పబడింది. అందరూ ఆచరించ దగ్గది ఆ పురుషార్థమే. ధర్మంగా పొందే అర్థము, కామము కేవలం ఇహలోక సుఖములను ఇస్తాయి. ఆ సుఖాలు కాలానుగుణంగా వస్తూ పోతూ ఉంటాయి. ముందు సుఖాన్ని, ఆ వెను వెంటనే దు:ఖాన్ని కలుగజేస్తాయి. ఈ సృష్టిలో ఉన్న అన్ని ఉత్తమ, మధ్యమ, అధమ వస్తువులు, సత్వ,రజస్,తమోగుణముల హెచ్చుతగ్గుల మూలంగా పుట్టినవే. కాలానుగుణంగా ఆ వస్తువులు అన్నీ

నశించిపోయేవే. వాటికి శాశ్వతత్వము లేదు. అందువలన ఆ వస్తువుల వలన మానవులకు ఎటువంటి శుభములు కలుగవు. తాత్కాలిక సుఖదు:ఖాలు కలుగుతాయి.

ఓ పృథు మహారాజా! ఈ శరీరంలో ఉన్న ఇంద్రియములు, వీటిలో ఉండే ప్రాణము, బుద్ధి, అహంకారము ఇవి అన్నీ కలిపి దేహము అంటారు. కానీ ఆ దేహములో అంతర్యామిగా వెలుగుతున్న ఆ పరమాత్మను మనం తెలుసుకోడానికి ప్రయత్నించాలి. అంతే గానీ ఈ దేహమే నేను, నేనే ఈ దేహము అని అనుకోవడం అవివేకము. కాని జీవునికి ఈ భ్రమ సహజంగా వస్తుంది. పూల మాలను చూచి పాము అని భ్రమించినట్టుగా, ఈ దేహమునే సర్వస్వము అనుకుంటూ ఉంటాడు జీవుడు. జీవునిలో ఉన్న అవివేకము నశించి, వివేకము, జ్ఞానము వృద్ధి పొందినపుడు ఈభ్రమ తొలగి పోతుంది. ఆత్మసాక్షాత్కారం అవుతుంది.

ఓ మహారాజా! నేను కూడా అట్టి ఆత్మజ్ఞానమును పొంది, నిత్యముక్తుడు, శుద్ధసత్వస్వరూపుడు, ఈ ప్రాపంచిక కర్మలయొక్క మలినము అంటని వాడు అయిన ఆ పరమాత్మను శరణుజొచ్చాను.

ఓ మహారాజా! కేవలము ఇంద్రియములను నిగ్రహించి ఒక చోట కూర్చుని తపస్సు చేయడం వలన ఏమీ లాభం లేదు. విషయవాంఛల యందు ఆసక్తి నశించాలి. పరమాత్మయందు భక్తి కలిగి ఉండాలి. ఆ భక్తితోనే పూర్వజన్మకర్మల యొక్క వాసనలతో కూడిన హృదయ గ్రంథిని సులభంగా ఛేదించవచ్చును. కాని యోగులు పరమాత్మయందు భక్తి లేకుండా, విషయ వాంఛల మీద

ఆసక్తి నశించకుండా, కేవలం ఇంద్రియములను నిగ్రహించి నందువలన ప్రయోజనము లేదు. కాబట్టి నీవు కూడా ఇంద్రియ నిగ్రహము అనే మాట వదిలిపెట్టి ఆ పరమాత్మయందుభక్తి కలిగి ఉండు.

ఓ మహారాజా! ఈ సంసారము అనేది ఒక మహాసముద్రము. అందులో భయంకరమైన మొసళ్లు ఉన్నాయి. ఆ సంసారసాగరాన్ని దాటడానికి భగవంతుని భక్తి అనే నావను ఆశ్రయించడమే ఉత్తమమైన మార్గము. భగవంతుని ఆశ్రయించడం వదిలిపెట్టి ఎన్ని ప్రయత్నాలు చేసినా, వారు కష్టాలపాలవుతారు.

ఓ మహారాజా! నీవు కూడా భగవంతుని పాదపద్మములు అనే నావను ఆధారంగా చేసుకొని ఈ సంసార సముద్రాన్ని దాటడానికి ప్రయత్నించు." అని సనత్కుమారుడు పృథుమహారాజుకు జ్ఞానబోధ చేసాడు.

ఓ విదురా! ఈ ప్రకారంగా సనత్కుమారుడు చేసిన ఆత్మ తత్త్వమును గురించి విన్న పృథు మహారాజుకు ఆ మహాఋషితో ఇలా అన్నాడు.

"ఓ దేవా! దయాళువైన శ్రీహరి ఇంతకు పూర్వమే నా మీద దయచూపించాడు. ఆ భగవంతుని మీద భక్తి మార్గమును బోధించుటకు ఇప్పుడు మీరు వచ్చారు. ఆ భగవంతుని మీద భక్తి ద్వారా మీరు భగవంతుని అనుగ్రహమును పూర్తిగా సంపాదించుకున్నారు.

మీకు నేను ఏమి గురుదక్షిణ ఈయగలను. నారాజ్యము, నా ప్రజలు, నా దేహము అన్నీ మీ అధీనములు. నాకు ఉన్న సకల భోగములు, రాజ్యమును, ఈ దేహమును మీకు అర్పిస్తున్నాను. స్వీకరించండి. ఈ రాజ్యాధికారము బ్రాహ్మణులు క్షత్రియులకు పెట్టిన బిక్ష. మీ దయ వలననే క్షత్రియులు రాజ్యాధికారమును, రాజభోగములను అనుభవించుచున్నారు. మీకు ఇవ్వడము అంటే మీరు మాకు ఇచ్చినది మరలా మీకు ఇవ్వడమే. మీరు వేదము చదువుకున్నారు. పరమాత్మ తత్త్వమును బాగా తెలిసిన వారు. మీరు నాకు ఆ పరమాత్మ తత్త్వమును సాకల్యముగా వివరించారు. మీకు భక్తితో నమస్కరించడం తప్ప నేను ఏమి ఇచ్చుకోగలను." అని పృథు మహారాజు భక్తితో సనకసనందాదులకు నమస్కరించాడు.

పృథు మహారాజు చేసినపూజలు అందుకున్న ఆ మహాఋషులు ఆనందంతో ఆకాశమార్గాన వెళ్లిపోయారు. వారి దర్శన భాగ్యం చేత, వారి బోధనలు వినడం వలన తాను కృతార్థుడనయ్యాను అని పొంగిపోయాడు పృథు మహారాజు. తరువాత పృథువు జనరంజకంగా రాజ్యపాలన చేయసాగాడు. దేశ, కాలములను అనుసరించి కర్మలను చేయసాగాడు. చేసిన కర్మలు అన్నిటినీ భగవంతునికే అర్పించేవాడు. అన్ని కర్మలను శ్రద్ధతో చేస్తూనే, ఆ కర్మలమీదా, వాటి ఫలముల మీదా ఎటువంటి ఆసక్తిలేకుండా కర్మలను చేసేవాడు. అన్ని కర్మలు ఆ భగవంతుడే చేస్తున్నాడు, తాను కేవలం నిమిత్తమాత్రుడు అనే భావనతోనే కర్మలు చేసేవాడు. రాజభవనంలో భార్యతో కాపురం చేస్తూ కూడా, ఏ విషయముల యందు ఆసక్తి లేకుండా ఉండేవాడు.

ఆకారణంగా పృథు మహారాజు ఎల్లప్పుడూ మంచి పనులనే చేసేవాడు. ప్రజలకు కష్టంకలిగించే పనులను చేసేవాడు కాదు. ఆ ప్రకారంగా జీవితం గడుపుతున్న పృథుమహారాజుకు అతని భార్య అర్చి వలన విజితాశ్వుడు, హర్యక్షుడు, ద్రవిణుడు, ధూమకేశుడు, వృకుడు అనే ఐదుగురు కుమారులుకలిగారు. ఆ కుమారులసాయంతో పృథువు రాజ్యపాలన సక్రమంగా సాగించాడు.

పృథువు ఎప్పుడూ మృదువుగా నెమ్మదిగా ఎదుటి వారికి ప్రీతికలిగించేటట్టు మాట్లాడేవాడు. పృథు మహారాజు ప్రజల వద్ద నుండి తగుమాత్రంగా పన్నులు తీసుకుంటూ ఆ ధనమును మరలా వారి క్షేమమునకే వినియోగించేవాడు. దానధర్మములు చేసేవాడు. అవసరం వచ్చినపుడు అగ్నివలె తీక్షణంగా ఉండేవాడు. ఇంద్రుని వలె బలపరాక్రమములు ప్రదర్శించేవాడు. దీనులయందు క్షమాగుణము కలిగి ఉండేవాడు. ఎప్పటి కప్పుడు ప్రజల అవసరములు తెలుసుకుంటూ వాటిని తీర్చేవాడు. పృథు మహారాజు దయాసముద్రుడైనా ఎప్పుడూ గంభీరంగా ఉండేవాడు. ఆయన మనసులో ఉన్న విషయాలను ఎవరూ ఊహించలేకపోయేవారు. దుష్టులను దండించడంలో యమధర్మరాజును తలపించేవాడు. ఆయన పాలనలో జనం సుఖంగా ఉన్నారు.

పృథు మహారాజు అపారమైన ధనరాసులను సేకరించి వాటిని ప్రజలక్షేమం కోసం వినియోగించేవాడు. భూమండలం అంతా తిరుగుతూ ఎక్కడ ఏమి జరుగుతూ ఉందో తెలుసుకొనేవాడు. పృథు మహారాజు పరాక్రమంలో రుద్రుని మాదిరి, సౌందర్యంలో మన్మథుని

మాదిరి నిర్భయత్వంలో సింహము మాదిరి ప్రకాశించేవాడు. ప్రజలమీద వాత్సల్యము చూపడంలో మనువును మించిపోయాడు. ఆత్మతత్త్వ విచారంలో బృహస్పతినిమరపించాడు. ఇంద్రియములను జయించి జితేంద్రియుడు అయ్యాడు. గోవులను, బ్రాహ్మణులను పూజించేవాడు. ఇతరులకు ఉపకారం చేయడంలో అందరి కన్నా ముందు ఉండేవాడు. ఈ ప్రకారంగా పృథు మహారాజు జనరంజకంగా రాజ్యపాలన చేస్తూ తన జీవితమును ఆనందంగా గడిపాడు. ఆయనకీర్తి భూమి నలుపక్కలా వ్యాపించింది. అందరూ పృథు మహారాజు పాలనను కీర్తించసాగారు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము ఇరవైరెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము

ఇరవైమూడవ అధ్యాయము.

విదురా! పృథుమహారాజుకు కాలం గడిచేకొద్దీ వృద్ధాప్యము ఆవరించింది. తాను వానప్రస్థమునకు వెళ్లవలసిన సమయము ఆసన్నమయిందని తెలుసుకున్నాడు. తనలో తాను ఈ ప్రకారంగా అనుకున్నాడు.

"చిర కాలంగా నేను ఈ భూమండలాన్ని పాలించాను. గోవు నుండి పాలు పితికినట్టు నేను భూమి నుండి ఆహారధాన్యములను,

ఓషధులను పితికి ప్రజలకు ఆహారమును అందించాను. ధర్మాన్ని రక్షించాను. మంచి వారికిరక్షణ కల్పించాను. దుష్టులను శిక్షించాను. నేను అనుకున్న పనులన్నీ పూర్తి చేసాను.” అని అనుకున్నాడు.

తరువాత తన కుమారులను రాజ్యాభిషిక్తులను చేసాడు. భార్యతో సహా తపస్సుచేసుకోడానికి అడవులకు వెళ్లిపోయాడు. ఒక ప్రశాంత మైన ప్రదేశములో ఆశ్రమమును నిర్మించుకొని తపస్సు చేయడం మొదలెట్టాడు. కొన్ని రోజులు కందమూలములు తింటూ, మరి కొన్నిరోజులు ఆకులను తింటూ, మరి కొన్ని రోజులు కేవలం నీరు తాగుతూ, తరువాత గాలిని మాత్రం పీలుస్తూ తపస్సు చేసాడు. ఎండాకాలంలో పంచాగ్నుల మధ్య నిలబడి తపస్సు చేసాడు. వర్షాకాలంలో వర్షంలో కూర్చుని తపస్సు చేసాడు. చలికాలంలో గొంతు దాకా నీటిలో కూర్చుని తపస్సు చేసాడు. కటికనేలమీద పడుకొనే వాడు.

ఇలా తపస్సు చేయడం వలన అతని లోని కామ వాసనలు అన్నీ నశించిపోయాయి. హృదయం పరిశుద్ధమయింది. ప్రాణాయామంతో ఇంద్రియములను, మనస్సును నిగ్రహించాడు. కామమును, క్రోధమును అదుపులో ఉంచాడు. సంసారమునకు సంబంధించిన అన్ని బంధములను తెంచుకున్నాడు. కేవలం శ్రీహరి నామ స్మరణ తప్పమరొకటి మనసులోకి రానిచ్చేవాడు కాదు. భగవంతుని యందు అచంచలమైన భక్తి, శ్రద్ధతో తపస్సు చేసాడు.

పృథు మహారాజు అనుసరించిన వైరాగ్యము వలన ఆయనకు ఆత్మజ్ఞానం కలిగింది. ఆత్మతత్త్వమును తెలుసుకున్నాడు. ఈ

క్రమంలో ఆయనకు అణిమ, గరిమ మొదలగు ఎనిమిదిసిద్ధులు లభించాయి. కాని ఆయన వాటి గురించి పట్టించుకోలేదు. ఒక సారి శ్రీహరి కథామృతసేవనంలో మునిగి పోయిన తరువాత, ఆ యోగములు, సిద్దులు యొక్క అవసరమేలేదు.

పృథు మహారాజుకు ఈ దేహమును వదల వలసిన సమయం వచ్చింది అని తెలుసుకున్నాడు. మొదట తన కాలి మడమను విసర్జకావయవమునకు అదిమిపెట్టాడు. (కింది నుండి ప్రాణం పోకుండా యోగులు ఆ పని చేస్తారు.) తరువాత ప్రాణవాయువును హృదయంలోకి తీసుకెళ్లాడు. అక్కడి నుండి కంఠమునకు, అక్కడి నుండి నొసటి వద్దకు తీసుకుని వెళ్లాడు. అక్కడి నుండి ప్రాణవాయువును బ్రహ్మరంధ్రము వద్దకు తీసుకొని పోయి, వాటిని పంచభూతములలో లీనం చేసాడు. ప్రాణ వాయువును వాయువు తోనూ, దేహమును భూమిలోనూ, తనలో ఉన్న ఉష్ణమును అగ్నిలోనూ, ఇంద్రియశక్తిని ఆకాశములోనూ, దేహములో ఉన్న నీటి అంశను జలము నందు, కలిపేసాడు.

ఈ పంచభూతములు ఎలా ఆవిర్భవించాయో అదే క్రమంలో అనగా పృథివిని జలములోనూ, జలమును తేజస్సులోనూ, తేజస్సును వాయువునందు, వాయువు ఆకాశంలోనూ, మనస్సును ఇంద్రియములలోనూ, ఇంద్రియములను తన్మాత్రలలోనూ కలిపేసాడు. అహంకారమును మహత్తత్వములో కలిపాడు. మహత్తత్వమును ప్రకృతిలోనూ, ప్రకృతిని సూక్ష్మశరీరంలోనూ నిలిపాడు. తాను అనుసరించిన జ్ఞాన వైరాగ్యముల ప్రభావం చేత ఆ సూక్ష్మదేహాన్ని కూడా వదిలిపెట్టి పరమాత్మలో ఐక్యం అయ్యాడు.

ఆయన భార్య, తన భర్త  మరణించడం చూచింది. మానవ సహజమైన దు:ఖము ఆమెను ఆవరించింది. అంతలోనే తేరుకుంది. తన భర్త అంతిమ సంస్కారానికి ఒక చితి పేర్చింది. భర్త శరీరమును ఆ చితిమీద పడుకోబెట్టింది. చితికి నిప్పంటించింది. ఆ చితికి మూడు సార్లు ప్రదక్షిణం చేసి తాను కూడా ఆ చితిలో ప్రవేశించింది. భర్త శరీరంతో పాటు తాను కూడా ఆచితిమంటల్లో కాలి పోయింది.

ఈ దృశ్యమును చూచిన దేవతలు పూల వాన కురిపించారు. దేవతలు ఇలా అనుకున్నారు. “ఈ సాధ్వి జీవితాంతము తన భర్తను భక్తితో సేవించి తుదకు మరణంలోకూడా ఆయనను అనుసరించింది. మానవులు చంచలమైన మనస్సు కలవారైనా, ఆత్మజ్ఞానము పొందిన తరువాత, ఉత్తమ లోకములను పొందుతారు అనడంలో సందేహము లేదు. మానవదేహము మోక్షమునకు ద్వారము వంటిది. కాని మానవులు అది తెలుసుకోలేక, విషయ వాంఛల యందు, ప్రాపంచిక విషయములయందు లీనమై భగవంతుని కీర్తించడం మరిచిపోతున్నారు. అటువంటి వారికి భక్తి మార్గము తప్ప మరొకమార్గము లేదు.” అని తమలో తాము అనుకున్నారు.

ఓ విదురా! దేవతలు ఇలా అనుకుంటూఉండగా, పృథు మహారాజు భార్య అర్చి కూడా భర్తను అనుసరించి ఉత్తమలోకములకు వెళ్లిపోయింది. విదురా! పుణ్య పురుషుడు అయిన పృథు మహారాజు చరిత్రను నీకు విపులంగా చెప్పాను. ఈ చరిత్రను చదివినా, విన్నా, లేక ఇతరులకు వినిపించినా, వారికి పృథు మహారాజు మాదిరి ఉత్తమలోకములు ప్రాప్తిస్తాయి. ఈ పృథు మహారాజు చరిత్రను చదివిన

బ్రాహ్మణులు బ్రహ్మవర్చస్సునుపొందుతారు. క్షత్రియులు రాజ్యాధికారమును పొందుతారు. వైశ్యులు వ్యాపారంలో రాణిస్తారు. శూద్రులు తమ వారిలో ఉత్తములుగా గుర్తింపబడతారు. ఈ పృథు మహారాజు చరిత్రను మూడుసార్లు వింటే ఉత్తమ సంతానము కలుగుతుంది. ధనవంతుడవుతాడు. కీర్తిమంతుడవుతాడు. చక్కని విద్య అబ్బుతుంది. ఈ పృథు మహారాజు చరిత్ర మంగళకరము, ధనాన్ని ఇస్తుంది. కీర్తిని పెంపొందిస్తుంది. ఆయుష్షను వృద్ధిచేస్తుంది. కలి వలన కలిగే దోషములనుపోగొడుతుంది.

ఈపృథు మహారాజు చరిత్ర ధర్మ, అర్థ, కామ, మోక్షములకు మూలము.కాబట్టి ఈ చరిత్రను ఎన్ని సార్లు విన్నా తనివితీరదు. కాని ఈ చరిత్రను చదివే ముందు, వినేముందు దుష్టుల సహవాసమును మానుకోవాలి. ఏదో ఫలితం వస్తుందని చదవకూడదు. భగవంతుని యందునిర్మలమైన భక్తి కలిగి ఉండాలి. అప్పుడే ఈ చరిత్ర చదివినందుకు ఫలితం చేకూరుతుంది.

ఓ విదురా! నీవుకోరినట్టు నీకుపృథు మహారాజు చరిత్ర వినిపించాను. ఈ చరిత్రవింటే జనులు శ్రీహరి పాదపద్మములయందు తమ మనస్సులను లగ్నం చేసి అఖండ మైన భక్తి శ్రద్ధలతో ఆ పరమాత్మను కీర్తిస్తారు.” అని మైత్రేయుడు విదురునికి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము  ఇరువదిమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## చతుర్థ స్కంధము

### ఇరువదినాలుగవ అధ్యాయము.

"విదురా! పృథుమహారాజు మరణించిన తరువాత ఆయన కుమారుడు విజితాశ్వుడు రాజు అయ్యాడని చెప్పానుకదా. విజితాశ్వుడు అంటే ఇంద్రుని జయించి యజ్ఞాశ్వమును తీసుకొని వచ్చిన వాడు. అతనికి తన సోదరులు అంటే ఎంతో మమకారము. పెద్దవాడుగా తాను రాజ్యమునకు అర్హుడు అయినప్పటికినీ, విజితాశ్వుడు రాజ్యమును తన తమ్ములకుకూడా పంచి ఇచ్చాడు.

హర్యక్షునకుతూర్పు దిక్కుగా ఉన్న రాజ్యము, ధూమ్రకేశునకు దక్షిణ దిక్కుగా ఉన్న రాజ్యము, వృకునకు పడమట దిక్కుగా ఉన్న రాజ్యము, ద్రవిణునకు ఉత్తర దిక్కుగా ఉన్న రాజ్యము ఇచ్చాడు. విజితాశ్వుడు ఇంద్రుని జయించి నపుడు, ఇంద్రుని వలన అంతర్ధానము అనే విద్యను పొందాడు.

విజితాశ్వుని భార్య పేరుశిఖండిని. ఆమె వలన విజితాశ్వునకు ముగ్గురు కుమారులు కలిగారు. వారి పేర్లు పావకుడు, పవమానుడు, శుచి. వీరు అంతకు ముందు జన్మలో మూడు అగ్నులు. వశిష్ఠమహాముని శాపము వలన విజితాశ్వునికి కుమారులుగా జన్మించారు. విజితాశ్వునకు మరొక భార్య అయిన నభస్వతి అనే భార్య వలన హవిర్ధానుడు అనే కుమారుడు కలిగాడు.

విజితాశ్వునికి రాజ్యం చేయడం ఇష్టం లేదు. అందుకని పైన చెప్పినట్టు తన రాజ్యమును తన నలుగురు తమ్ముళ్లకు పంచి ఇచ్చాడు. తాను ఒక మహాయజ్ఞమును చేయ తలపెట్టాడు. ఆయజ్ఞము పూర్తి చేసి సమాధి యోగమును అభ్యసించి, పరమాత్మను చేరుకున్నాడు.

విజితాశ్వునికి నభస్వతి వలన కలిగిన పుత్రుడు హవిర్ధానుడు అని చెప్పాను కదా. హవిర్ధానునికి తన భార్య హవిర్ధాని వలన ఆరుగురుకుమారులు కలిగారు. వారిపేర్లు బర్హిషదుడు, గయుడు, శుక్లుడు, కృష్ణుడు, సత్యుడు, జితవ్రతుడు. వీరిలో బర్హిషదుడు ఎన్నో యజ్ఞములు యాగములు చేసి  కీర్తి పొందాడు. అతడు ప్రజాపతిగా నియమింపబడ్డాడు. అతడు చేసిన యజ్ఞములలో తూర్పుదిక్కుగా కొసలనుపెట్టినపరిచిన దర్భలతో భూమి అంతా నిండి పోయింది. అందు వలన అతనికి ప్రాచీన బర్హి అని పేరు వచ్చింది.

ఆయన ప్రజాపతి కాబట్టి, బ్రహ్మయొక్క ఆదేశము ప్రకారము శతద్రుతి అనే కన్యను వివాహం చేసుకున్నాడు. సృష్టి చేయడానికి ఉపక్రమించాడు. శతద్రుతి అతిలోకసుందరి. ప్రాచీన బర్హికి శతద్రుతి వలన పదహారుమంది కుమారులుకలిగారు. వారు ప్రచేతసులు అని పిలువబడ్డారు. ప్రాచీనబర్హి తన కుమారులను సృష్టిని కొనసాగించమని కోరాడు.

సృష్టి చేయడానికి ముందు తపస్సు చేయాలని నిశ్చయించుకొని  ఆ పదహారుమంది ప్రచేతసులు తపస్సు చేయడానికి బయలు దేరారు. దారిలో వారికి శివుడు కనిపించాడు. ప్రచేతసులకు

శివుడు శ్రీహరి మహత్తును ఉపదేశించాడు. పరమశివుని ఉపదేశములు విన్న ప్రజేతసులు ఇంద్రియములను జయించి శ్రీహరి ధ్యానము, జపము, తపస్సులో మునిగిపోయారు." అని మైత్రేయుడు విదురునికి చెబుతుంటే విదురునికి ఒకసందేహము వచ్చింది.

"ఓ మైత్రేయా! ప్రచేతసులు తపస్సుకు పోతుంటే పరమశివుడు ప్రత్యక్షం అయి వారికి శ్రీహరి తత్త్వమును ఉపదేశించాడు అని చెప్పారుకదా! పరమశివుడు లోకపాలకుడు. ప్రచేతసులు దేహధారులు. మరి పరమశివుడు వారికి ఎలా ఉపదేశించగలిగాడు. ఎందుకంటే శివుని చూడటం, మాట్లాడటం దేహమును ధరించిన మానవులకు సామాన్యము కాదు. మునులు కూడా ప్రాపంచిక విషయముల యందు ఆసక్తిని వదిలిపెట్టి ఆపరమేశ్వరుని చూడటానికి తాపత్రయపడుతుంటారు. కాని వారికి ఆ పరమేశ్వరుడు కనిపించడు. మరి ఈ ప్రచేతసులకు ఎందుకు కనిపించాడు ఎలాకనిపించాడు. వివరంగా తెలియజేయండి." అని అడిగాడు. దానికి మైత్రేయుడు ఈవిధంగా సమాధానం చెప్పాడు.

"ఓ విదురా! తండ్రి ఆజ్ఞ మేరకు ప్రచేతసులు తపస్సు చేయడానికి పడమటి దిక్కుగా బయలుదేరారు. కొంత దూరము పోగానే వారు ఒక పెద్ద సరస్సును(చెరువు) చూచారు. ఆ సరస్సులో నీళ్లు చాలా నిర్మలంగా ఉన్నాయి. ఆ చెరువులో తామర పూలు,కలువ పూలు ఇంకా అనేకములైననీటి పూలు వికసించి ఉన్నాయి. ఆ నిర్మలమైన జలములో చేపలు యథేచ్ఛగా తిరుగుతున్నాయి.

ప్రచేతసులు ఆ సరస్సు అందాలను చూస్తూ వెళుతున్నారు. ఇంతలో వారికి ఒక మధురమైన సంగీతధ్వని వినిపించింది. ఆ ధ్వని ఎక్కడినుండి వచ్చినదా అని ప్రచేతసులు సరస్సు వంక చూచారు.

తన అనుచరులతో పరమశివుడు ఆ సరస్సులోనుండి బయటకువచ్చాడు. పరమశివుని చూచిన ప్రచేతసులు ఆయనకు భక్తితో నమస్కరించారు. ప్రచేతసులను చూచి శివుడు వారితో ఇలా అన్నాడు.

"మీరు ప్రాచీన బర్హి కుమారులు అనీ, మీ తండ్రి ఆదేశమును అనుసరించి తపస్సు చేయడానికి వెళుతున్నారనీ నాకు తెలుసు. మీమీద దయ చూపడానికే నేను మీకు దర్శనం ఇచ్చాను. మీరు ఆ వాసుదేవుని శరణు వేడండి.మీకు అన్నీ శుభాలు కలుగుతాయి. నాకు కూడా ఆ వాసుదేవుడే శరణ్యము. స్వధర్మాన్ని నిష్ఠతో ఆచరించే మానవులు ఎన్నోజన్మలు ఎత్తితే గానీ పరమపదమును పొందలేరు. కానీ విష్ణువు మీద అచంచలమైన భక్తి ఉన్న వాడు అచిరకాలములోనే విష్ణుపదమును పొందగలడు. మీరు విష్ణువుకు ప్రియమైనవారు. అందుచేత ఆ విష్ణువు మాదిరి మీరూ నాకూ ప్రియమైనవారు. ఇప్పుడు మీకు మంగళకరము, పవిత్రము అయిన పరమాత్మయొక్క కీర్తిని గానం చేస్తాను. శ్రద్ధగా వినండి. తరువాత దానినే జపించండి.మీకు శుభం కలుగుతుంది." అని ఈశ్వరుడు ప్రచేతసులతో అన్నాడు.

ఓ విదురా! తరువాత పరమశివుడు ప్రచేతసులకు నారాయణుని గురించిన విషయములనుచెప్పసాగాడు. ప్రచేతసులు కూడా పరమశివుని మాటలను శ్రద్ధగా విన్నారు. పరమశివుడు వాసుదేవుని ఈ విధంగా కీర్తించాడు.

“ఓ వాసుదేవా!నీవు ఆత్మతత్త్వమును తెలుసుకున్న మానవులకు ఆత్మానందాన్ని కలుగచేస్తున్నావు. నీవు ఎల్లప్పుడూ ఆత్మానందంలో ఉంటూ నీతో పాటు నాకు కూడా ఆత్మానందాన్ని కలుగజేస్తున్నావు.నీవు అందరికీ ఆత్మస్వరూపుడవు. సర్వవ్యాపివి. అట్టినీకు నమస్కారము.

ఓ పంకజనాభా! నీవు పంచభూతములకు, పంచ తన్మాత్రలకు, ఇంద్రియములకు నియామకుడవు. ఓ వాసుదేవా! నీవు శాంతుడవు. స్థిరంగా ఉండేవాడివి. స్వయంగా ప్రకాశించే వాడివి. అట్టి నీకు నమస్కారము.

అహంకారమునకుప్రతీక అయినసంకర్షుణడవు నీవే! బుద్ధికి అధిష్ఠాన దేవత అయినప్రద్యుమ్నుడవు నీవే. ఈ లోకములను అంతం చేసే వాడివి నీవే. అట్టి నీకు నమస్కారము. మనస్సుకు అధినాధుడవైన ఓ అనిరుద్ధుడా! ఇంద్రియములకు అధిపతివైన ఓ హృషీకేశుడా! నీవు సూర్యుని రూపంతో నీ తేజస్సుతో అన్ని లోకములను నీ వెలుగులతో నింపుతున్నావు. నీకు పెరగడం తరగడం లేదు. అట్టి నీకునమస్కారము.

ఓ వాసుదేవా! నీవు అటు స్వర్గమునకు, ఇటు మోక్షమునకు ద్వారము వంటి వాడివి. నీవు ఆకాశము వలె పవిత్రమైనవాడివి. నీవు యజ్ఞస్వరూపుడవు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు ఇచ్ఛాశక్తి స్వరూపుడవు. బలస్వరూపుడవు. నీవు వేదస్వరూపుడవు. సమస్తప్రాణులకు ఆహారమును సమకూర్చేవాడివి నీవే! జలస్వరూపుడవు నీవే! అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా నీవే విరాట్ స్వరూపుడవు. నీవు సమస్తప్రాణుల దేహములలో ఆత్మస్వరూపుడవై ఉన్నావు. వారి దేహములలో ఉన్న శారీరక బలము,మానసిక బలము,నీవే. వారిలో సంచరించే ప్రాణవాయువు నీవే. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీవే ఈ అనంతమైన ఆకాశము. నీవు ఆకాశం మాదిరి బయటా ఉన్నావు. అన్ని ప్రాణుల అంతరాంతరాళములలో ఆత్మస్వరూపుడుగా కూడా వెలుగుతున్నావు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు శుభమైన కర్మలలోనూ, అశుభమైన కర్మలలోనూ ఉన్నావు. శుభ కర్మలకు మంచి ఫలములు అశుభ కర్మలకు దు:ఖపూరితమైన ఫలములు ఇస్తావు. ఆఖరుకు మృత్యువును కూడా ఇచ్చేది నీవే. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! జీవులకు వారు వారు చేసే కర్మలను బట్టి ఫలములు ఇచ్చేవాడివి నీవే. నీవు అన్నీ తెలిసిన వాడవు.

పురాణపురుషుడవు. ధర్మస్వరూపుడవు. మొక్కవోని మేధస్సు కలవాడివి. సాంఖ్యయోగమును లోకములో ప్రవర్తింప చేసినవాడివి. అట్టి నీకు నమస్కారము.

ఇచ్ఛాశక్తి(ఒక పని చేయాలని సంకల్పించడం),
జ్ఞానశక్తి (ఆ పని చేయదగినదా కాదా అని తాను ఆర్జించిన విచక్షణా జ్ఞానము చేత నిర్ణయించడం),
క్రియాశక్తి (ఆ నిర్ణయాలను కార్యరూపంలో పెట్టడం)
అనే మూడు శక్తులకు నీవు అధిపతివి. మనిషిలో ఉండే అహంకారము నీవే. మాట్లాడే మాటా నువ్వే. అట్టి నీకు నమస్కారము.

(అంటే మనచేత ఒక పని చెయ్యాలనికానీ, ఒక మాట మాట్లాడాలని అనుకొనేలా చేసేది, ఆ పని, ఆ మాట మంచిదా కాదా అని నిర్ణయించేది. ఆ పనిని మన చేత చేయించేది, ఆ మాటలను మనచేత మాట్లాడించేదీ అన్నీ ఆ పరమాత్మ. మనం ఏదో చేస్తున్నాము అంతా మన చేతిలోనే ఉంది. నేను లేనిదే ఏమీ జరగదు అని అనుకోవడంమన మూర్ఖత్వం.)

ఓ దేవా! మంగళకరమైన నీ రూపము నీ మీద భక్తి ఉన్న వాళ్లందరి చేతా పూజింపబడుతుంది. అట్టి నీ రూపమును మేము దర్శించాలని ఆతురతగా ఉన్నాము. మా కళ్లకు విందు చేసేటట్టు, మాకు నీ దర్శనభాగ్యం ప్రసాదించు.
(కలియుగ ప్రత్యక్ష దైవం ఆ శ్రీవేంకటేశ్వరుని క్షణకాలం చూడాలని, తరించాలనీ మనం తహతహలాడటం ఇటువంటిదే.)

ఓ దేవా! నీరూపము శ్యామల వర్ణంలో ఉంటుంది. అత్యంత సుందరంగా ఉంటుంది. నీ అందమైన ముఖము, నీ విశాలమైన చతుర్భుజములు, తామర రేకుల వంటి నీ కళ్లు, విల్లులాంటి నీ కనుబొమలు, పొడుగాటి ముక్కు, నిండైన నీ చెక్కిళ్లు, మా వంక ప్రేమగా చూసే నీ క్రీగంటి చూపులు, పచ్చని పట్టువస్త్రము, తళతళమెరిసే నీ చెవి కుండలములు, ఎత్తుగా ఉండి ప్రకాశించే నీకిరీటము, నీ మెడనిండా ఆభరణములు, శంఖము, చక్రము, గద, పద్మము, పొడుగాటి వనమాల, నీ కంఠసీమలో కాంతులు వెదజల్లుతున్న కౌస్తుభము, నడుముకు కట్టిన నీలం రంగు పట్టు వస్త్రము, దానిమీద కట్టిన బంగారు మొలత్రాడు, సమానంగా, పొడవుగా అమరినట్టున్న తొడలు, మోకాళ్లు, పద్మముల వంటి నీ పాదములు, ఓ దేవా! ఇటువంటి నీ స్వరూపముతో మాకు దర్శనం ఇవ్వు.

(పరమాత్మను ఈ స్వరూపంతో ఎవరైనా తమ మనస్సులో దర్శించుకోవచ్చు. మానసిక పూజ చేసుకోవచ్చు. దీని కోసరం అధిక ప్రయాసలకు ఓర్చి ఎక్కడికో పోవాల్సిన అవసరం లేదు. అందుకే వ్యాసుడు మనకు పరమాత్మస్వరూపాన్ని వివరంగా విశధంగా వర్ణించాడు. అంతే కాదు, నాటకాలలో కానీ, సీరియల్సులో కానీ,సినిమాలలో కానీ శ్రీమహావిష్ణువును వాళ్ల ఇష్టం వచ్చిన అలంకారాలతో రూపంతో చూపిస్తుంటారు. వారు భాగవతంలోని ఈ అధ్యాయం చదివితే శ్రీహరి రూపం గురించి అవగాహన పెరుగుతుంది.)

ఓ దేవా! తమ ఆత్మలను శుద్ధిపరచుకోవాలని కోరుకొనే భక్తులు పైన చెప్పిన నీ రూపమును మనసులో ధ్యానించాలి. ఈ స్వరూపము ప్రత్యక్షముగా కనపడదు. కేవలము భక్తియోగ ప్రభావం చేతనే ఈ స్వరూపము మానసికంగా చూడడానికి సాధ్యం అవుతుంది.

ఓ దేవా! స్వర్గలోకములో ఉండే దేవతలకు, ఇంద్రునికి నీవు దర్శనం ఇస్తుంటావు. కానీ స్వర్గసుఖములను కూడా తృణప్రాయంగా చూసే నీ భక్తులకు, ఆత్మతత్త్వవేత్తలకు, నిన్ను ఆరాధించడం తప్పమరో పని లేదు. అటువంటి వారు నీ పాదపద్మములు తప్ప స్వర్గసుఖములు కోరుకోరు. కాని నీవు అందరి మానవులకు అంత సులభంగా లభ్యం కావు. కానీ నీ భక్తులకు మాత్రము సులభంగా వశమౌతావు. తన అచంచలమైన, నిర్మలమైన భక్తితో ఒక్కసారి నిన్ను ప్రసన్నునిగా చేసుకున్న తరువాత ఏ మానవుడు కూడా ఐహికసుఖముల వైపు, ప్రాపంచిక విషయముల వంక కన్నెత్తి చూడడు.

ఓ దేవా! కాలము అందరినీ తన కనుసన్నలలో ఆడిస్తుంది. కానీ నీ పాదములను ఆశ్రయించిన నీ భక్తులను మాత్రం కన్నెత్తి కూడా చూడడానికి సాహసించదు.

ఓ దేవా! నిన్ను భక్తితో కొలిచే నీ భక్తుల యొక్క సాహచర్యములో కలిగే ఆనందముతో పోలిస్తే, ఈ ప్రాపంచిక సుఖములు కానీ, స్వర్గలోక సుఖములు కానీ ఎందుకూ పనికిరావు.

ఓ దేవా! నీ పాదములను ఆశ్రయించిన నీ భక్తులకు సమస్త పాపములు తొలగి పోతాయి. అటువంటి నీ భక్తులు సాటి ప్రాణుల యందు దయ చూపిస్తుంటారు. వారికి రాగద్వేషములు అంటవు. సాత్విక గుణ సంపన్నులుగా ఉంటారు. అటువంటి నీ భక్తుల సాంగత్యమును మాకు ప్రసాదించు. ఈ విధంగా మమ్ములను అనుగ్రహించు.

ఓ దేవా! ఎవని చిత్తము నీ భక్తి చేత  పరిశుద్ధము అవుతుందో, ఎవని చిత్తము ప్రాపంచిక విషయములయందు లగ్నము కాదో, ఎవని చిత్తము అజ్ఞానము అనే గుహలో ప్రవేశించదో, అటువంటి మానవుడు నీ యొక్క తత్త్వమును తెలుసుకోగలడు.

ఓ దేవా! ఈ సమస్త విశ్వమునకు నీవే ఆధారము. నీ యందే ఈ విశ్వము నిలిచిఉంది. ఈ విశ్వమంతా నీవే వ్యాపించి ఉన్నావు. నీకు ఎలాంటి వికారములు లేవు. నీ మాయచేత సృష్టి స్థితి లయములు జరుగుతున్నాయి. నీ మాయ చేతనే మానవులలో నువ్వు నేను, వాడు వీడు, అనే భేద బుద్ధి కలుగుతూ ఉంది. కాని ఆ మాయ నీ మీదకానీ నీ భక్తుల మీద కానీ తన ప్రభావమును చూపలేదు. నీ దయ వలననే నీ గురించి నీ మాయ గురించి తెలుసుకోగలము.

నీ మీద భక్తి ఉన్న వాళ్లు, వేదములను శాస్త్రములను అధ్యయనం చేసిన వాళ్లు,  అత్యంత శ్రద్ధతో నిన్ను సేవించి నీ తత్త్వమును తెలుసుకోగలుగుతారు. ఇతరులకు అది సాధ్యము కాదు.

ఓ దేవా! ఆది, అనాది నువ్వే. ఈ సృష్టికి ముందు మాయాశక్తి  నీలో నిద్రాణంగా ఉంది. కాలాను గుణంగా ఆ మాయాశక్తి నీ నుండి బయటకు వచ్చి సత్త్వ,రజస్,తమోగుణములలో కదలిక పుట్టించింది. అప్పుడు మహత్తత్వము ఆవిర్భవించింది. ఆ మహత్తత్వములో నుండి అహంకారము, పంచభూతములు, పంచతన్మాత్రలు, దేవతలు, ఋషులు,మరుత్తులు, ప్రాణులు, దేహధారులు పుట్టారు. క్రమక్రమంగా ఈ సృష్టి జరగడం మొదలయింది.

అదే ప్రకారంగా నీవు నీ మాయాశక్తితో మనుషులను, జంతువులను, పక్షులను, పాకే జంతువులను, వృక్షములను, మొక్కలను,  సృష్టించి అంతర్యామి రూపంగా వాటిలో ప్రవేశించావు.

ఓ దేవా! మానవ శరీరమే తొమ్మిది ద్వారములు కల పురము అయితే ఆ పురములో అంతర్లీనంగా ఉండే వాడు పురుషుడు అని చెప్పబడుతున్నాడు. కానీ మానవుడు ప్రాపంచిక విషయముల యందు ఆసక్తుడై జీవాత్మగా రూపాంతరం చెంది. జనన మరణ చక్రంలో తిరుగుతున్నాడు.

ఓ దేవా! నీవు ఈ సమస్త విశ్వమును సృష్టించి అందులోకి అంతర్లీనంగా ప్రవేశించావు. అన్నిటిలో ఉంటూనే కాలగతిన ప్రాణులను ఆ ప్రాణుల చేతనే చంపిస్తున్నావు. ఇదంతా ఒక లీలగా చేస్తున్నావు.

ఓ దేవా! నీ చేత సృష్టింపబడిన మానవులు విషయలోలురై, ప్రాపంచిక విషయముల యందు ఆసక్తితో అంతా నాకే కావాలనే

లోభబుద్ధిని పెంచుకుంటున్నారు. ఏ పని ఎప్పుడు ఎందుకు చేస్తున్నాడో తెలియకుండా చేసేస్తున్నాడు. నీవు మాత్రము అప్రమత్తుడవై మానవుల కాలము తీరగానే, వారి ప్రాణములను హరిస్తున్నావు.

ఓ దేవా! ఈ విశ్వము అంతా నీ చేత అంతం కాబడుతూ ఉంది. ఈ సమయంలో నీవే మానవులకు దిక్కు. అప్పుడే మానవులు మరణానికి భయపడరు. నీ పాదపద్మములను ఆశ్రయించిన వాడికి మరణభయం ఉండదు కదా!

ఓ దేవా! నీవుఅందరి చేతాపూజింపబడుతున్నావు. బ్రహ్మ, దేవతలు, మనువులు నిన్ను సదా పూజిస్తూ ఉంటారు. ఇంక సాధారణ మానవుల సంగతి చెప్పేదేముంది.

కాబట్టి ఓ ప్రచేతసులారా! మీరు కూడా అత్యంత భక్తి శ్రద్ధలతో, పరిశుద్ధమైన చిత్తముతో ఆ పరమాత్మను స్తుతించండి. నేనుచెప్పిన స్తోత్రమును ప్రతిదినము జపించండి. మీకు శుభం కలుగుతుంది. శ్రీహరి అక్కడ ఉన్నాడు ఇక్కడ లేడు అనే సందేహము వద్దు. ఆ శ్రీహరి అన్ని జీవులలో సర్వాంతర్యామిగా వెలుగుతున్నాడు. మీరు నిరంతరము ఆయన గుణములను కీర్తిస్తూ ఆయనను స్తోత్రము చేయండి. ఆయననే స్మరించండి. ఆ పరమాత్మనే మీ మనసులో నిలుపుకోండి. మునివృత్తి అవలంబించి, ఆయన గురించి తపస్సు చేయండి.

ఇప్పుడు నేను మీకు బోధించిన ఈ స్తోత్రమును పూర్వము బ్రహ్మ, సృష్టి చేయడానికి ప్రేరేపించబడిన భృగువు మొదలగు తన

మానస పుత్రులకు, నాకూ బోధించాడు. బ్రహ్మ బోధించిన ఈ స్తోత్రముతో మేము మాలో ఉన్న అజ్ఞానమును నాశనం చేసి, వివిధ రకములైన ప్రజాసృష్టి చేసాము. కాబట్టి ఏ మానవుడైతే ప్రాపంచిక విషయముల యందు ఆసక్తి చూపకుండా, ఆ పరమాత్మను ఆశ్రయించి, ఈ స్తోత్రమును జపిస్తాడో, అతనికి సకల శుభములు కలుగుతాయి.

ప్రచేతసులారా! ఈ లోకంలో ఉన్న అన్ని శ్రేయస్సులలో కల్లా ఆ పరమాత్మను గురించిన జ్ఞానము అధికమైన శ్రేయస్సును కలుగజేస్తుంది. ఈ సంసారము అనే సాగరమును దాటడానికి పరమాత్మను గురించిన జ్ఞానము అనే నావ ద్వారానే సాధ్యమవుతుంది. నేను చెప్పిన ఈస్తోత్రమును శ్రద్ధతో చదివితే ఆ పరమాత్మను సునాయాసంగా ప్రసన్నంచేసుకోగలరు. ఈ స్తోత్రంతో మానవుడు ఆ పరమాత్మను తృప్తిపరిచి తాను కోరుకున్న ఫలములను పొందగలడు. ఈ స్తోత్రమును ఉదయముననే లేచి చదివినా, వినినా, వారికి ఆ సంసారబంధనములు తొలగిపోతాయి. ప్రచేతసులారా! అందుకే మీకు ఈ స్తోత్రమును చెప్పాను. మీరు కూడా ఏకాగ్రచిత్తంతో ఈ స్తోత్రమును జపించండి. మీ అభీష్టములు అన్నీ సిద్ధిస్తాయి." అని పరమ శివుడు ప్రచేతసులకు వివరించాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము ఇరవైనాల్గవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము

ఇరవై ఐదవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా అంటున్నాడు.

"ఓ విదురా!భగవానుడగు రుద్రుడు ప్రచేతసులకు పరమాత్మను గురించి ఉపదేశించిన తరువాత, అక్కడి నుండి వెళ్లిపోయాడు. తరువాత ప్రచేతసులు రుద్రుడు ఉపదేశించిన పరమాత్మ తత్త్వమును జపిస్తూ నీళ్లలో మునిగి పదివేల సంవత్సరములు తపస్సుచేయనారంభించారు.

విదురా! అక్కడ ప్రచేతసులు తపస్సు చేస్తుంటే, వారి తండ్రి అయిన ప్రాచీన బర్హి మనశ్శాంతి లేకుండా బాధపడుతున్నాడు. ఆసమయంలో నారద మహర్షి ఆయన వద్దకు వచ్చాడు. నారద మహర్షిని ప్రాచీన బర్హి సాదరంగా ఆహ్వానించి, అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి సత్కరించాడు. అప్పుడు నారదుడు ప్రాచీన బర్హితో ఇలా అన్నాడు.

"ఓ మహారాజా! నువ్వు ఇన్ని యజ్ఞములు యాగములు చేసావు కదా! ఏమిసాధించావు? అసలు ఏమి సాధించాలనే కోరికతో ఇన్ని కర్మలను చేసావు. ఉన్న దు:ఖము పోవడం, లేని సుఖం రావడం. ఇంతేగా నువ్వు కోరుకున్నది.  కాని నీ దు:ఖము పోలేదు. నువ్వు కోరుకున్న సుఖము లభించలేదు. అంతేనా!"అని అడిగాడు నారదుడు.

దానికి ప్రాచీన బర్హి ఇలా సమాధానంఇచ్చాడు.

"నారదమునీంద్రా! నా బుద్ధి కర్మలు చేయడం అందే లగ్నం అయి ఉంది. అందుకే యజ్ఞములు యాగములు చేసాను. కానీ నాకు దేని వలన శ్రేయస్సు కలుగుతుందో తెలుసుకోలేకపోతున్నాను. ఒక కర్మ చేస్తే మరో కర్మ. అది అయిన తరువాత మరొకటి ఇలా కర్మలు చేయడం తోనే నా జీవితం సరిపోయింది. నాకు ఈ కర్మ బంధనముల నుండి విముక్తి కలిగే మార్గము ఉపదేశించండి.

ఈ సంసారంలో పడిన మానవుడు, తన భార్య, సంతానము, ధనము, ఇళ్లు, భూమి, రాజ్యములు, వీటినే పరమార్థాలుగా భావించి, వాటిని కపటోపాయము ద్వారా పొందడానికి ఎన్నో విధములైన కర్మలను చేస్తున్నాడు. ఎన్ని కర్మలు చేసినా ఆ మానవునికి తృప్తి కలగడం లేదు. ఈ లోకంలోనే కాదు పరలోకం లో కూడా సుఖంగా ఉండలేక పోతున్నాడు. కాబట్టి ఈ సంసారసాగరం నుండి బయటపడే జ్ఞానమును నాకు ప్రసాదించండి " అని అడిగాడు. దానికి నారదుడు ఇలా చెప్పసాగాడు.

"ఓ రాజా! అటు చూడు. నీవు చేసిన యజ్ఞములలో, యాగములలో, దయా దాక్షిణ్యం లేకుండా ఎన్నో వేల పశువులను చంపావు. ఆ జీవులన్నీ పైలోకంలో నీకోసం ఎలా ఎదురు చూస్తున్నాయో చూడు! నీ చేత చంపబడిన పశువులు నువ్వు వాటిని పెట్టిన బాధలను, చిత్రహింసలను గుర్తుకు తెచ్చుకుంటూ, నువ్వు ఎప్పుడు వస్తావా, నిన్ను ఎప్పుడు తమ వాడి అయిన కొమ్ములతో పొడిచి

పొడిచి చంపుదామా అని మహా కోపంతో ఎదురుచూస్తున్నాయి. ఆ పశువులు అన్నీ నీ చావు కోరుకుంటున్నాయి. ఇంక నీకు సుఖము శాంతి ఎలా లభిస్తుంది. ఈ సందర్భంలో నీకు ఒక కథ చెబుతాను సావధానంగా విను. వింటూ అర్థంచేసుకోడానికి ప్రయత్నించు.

పూర్వము ఒక రాజు ఉండేవాడు అతని పేరు పురంజనుడు. అతనికి ఒక మిత్రుడు ఉండేవాడు. అతనికి పేరు లేదు. ఉన్నా ఎవరికీ తెలియదు. ఆ పురంజనుడు ఉండటానికి ఒక పురము కావాల్సివచ్చింది. తనకు అనువైన పురాన్ని వెదుక్కుంటూ బయలుదేరాడు పురంజనుడు. ఎంత వెదికినా తనకు కావాల్సిన, తన కోరికలకు అనుగుణంగాఉన్న, తనకు అనుకూలమైనపురము దొరకలేదు. ఆ పురంజనుడు హిమాలయ ప్రాంతము దిగువన వెదుకుతున్నాడు.

అప్పుడు అతనికి ఒకపురము కనిపించింది.ఆ పురమునకు తొమ్మిది ద్వారములు ఉన్నాయి. ఆ పురము తనకు కావలసిన తాను కోరుకున్న అన్ని లక్షణములతో శోభిల్లుతూ ఉంది. ఇదే తనకు తగిన పురము అని అనుకున్నాడు పురంజనుడు. ఆ పురము చుట్టు ప్రాకారములు ఉన్నాయి.  చుట్టు లోతైన అగడ్త ఉంది. ఆ ప్రాకారానికి ద్వారాలు ఉన్నాయి. పురము బయట విహరించడానికి ఉద్యానవనములు ఉన్నాయి. బయటకు రావడానికి ద్వారాలు ఉన్నాయి. ఆ పురములో ఉన్న భవన శిఖరములు బంగారు, వెండి, లోహములతో నిర్మింపబడి ఉన్నాయి. ఆ పురము లోపలి భాగములో నీలములు, స్ఫటికములు, వజ్రములు, వైడూర్యములు, ముత్యములు, మరకతములు మొదలగు విలువైనవాటితో అలంకరింపబడి ఉంది. ఆ నగరము

నాగులకు రాజధాని అయినభోగవతీ నగరమును తలపిస్తూ ఉంది.

ఇంకా ఆ పురములో సభాభవనము, నాలుగు వీధుల కూడలులు, రాజవీధులు, ఆటలాడుకొనే స్థలములు, అంగడి వీధులు, విశ్రాంతి గృహములు, ఎగిరే పతాకములు, అక్కడక్కడా అరుగులు, ఆ పురంలో శోభాయమానంగా ఉన్నాయి. ఆ పురము బయట ఉద్యానవనాలు ఉన్నాయి. ఆ ఉద్యానవనములలో వృక్షములు, మొక్కలు, తీగలు ఉన్నాయి. వాటి మధ్యలో ఒక జలాశయము ఉంది. ఆందులో నీరు నిర్మలంగా ఉన్నాయి. ఆ వనములో పక్షులు కిలా కిలా రావాలు చేస్తున్నాయి. తుమ్మెదలు ఝుంకారాలు చేస్తున్నాయి. ఆవనములో పూచినపుష్పముల నుండి సుగంధములు వెదజల్లుతున్నాయి. ఆ వనంలో చెట్ల మీద ఉన్న కోయిలలు మనోహరంగా కూస్తూ దారినపోయే బాటసారులను ఆ వనంలోకివచ్చి సేదదీరమని ఆహ్వానిస్తున్నాయా అన్నట్టుఉంది.

ఆ వనంలో ఇంకో విషయం కూడా ఉంది. ఆ వనంలో అనేకములైన క్రూరజంతువులుకూడా ఉన్నాయి కానీ అవి వాటి క్రూరత్వమును మరిచి పోయి ఇతర సాధుజంతువులతో కలిసిమెలిసి జీవిస్తున్నాయి. అందుకని ఆ వనములోకిపోవడానికి ఎవరికీ భయం కానీ, ఆటంకము కానీ ఎదురు కావడం లేదే. అందరూ స్వేచ్ఛగా ఆ వనములో తిరిగే వాతావరణము కనిపిస్తూ ఉంది.

ఇంతలో ఆ ఉద్యానవనములోకి ఒక సుందరి ప్రవేశించింది. ఆమె చాలా అందంగా ఉంది. లేత ప్రాయంలో ఉంది. చక్కగా అలంకరించుకొని ఉంది. ఆమె తనకు అనువైన భర్త గురించి

వెతుకుతూ ఉందా అన్నట్టు ఆ వనంలో సంచరిస్తూ ఉంది. ఆమెను ఒక ఐదు తలలపాము రక్షిస్తూ ఉంది. ఆమె చుట్టు పదకొండు మంది సేవకులు ఉన్నారు. అందులో పదిమందికి ఒక్కొక్కరికీ నూరు మంది స్త్రీలు సేవకులుగా ఉన్నారు.

ఆమె చాలా అందంగాఉంది. ఆమె ముక్కు కొనదదేలి ఉంది. ఆమె చెక్కిళ్లు, ముఖము, ఇంకా అందంగాఉన్నాయి. ముఖానికి తగ్గచెవులు, ఆ చెవులకు కుండలములో ఆమెకు మరింత శోభను కూరుస్తున్నాయి. ఆమె ఎరుపు, తెలుపు,నీలము కలిసిన ఛాయలో మెరిసిపోతూ ఉంది. ఆమె పసుపు, ఎరుపు కలిసిన రంగులో ఉన్న వస్త్రములు ధరించింది. ఆమె నడుము చుట్టు మేఖలములు మెరిసిపోతున్నాయి. ఆమె అటు ఇటు తిరుగుతుంటే ఆమె కాలి అందియలు ఘల్లు ఘల్లు మంటూ మోగుతున్నాయి. ఆమె తన క్రీగంటి చూపుతో పరిసరములను వీక్షిస్తూ ఉంది. అప్పుడప్పుడు సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ ఉంది.

అటువంటి అందమైన స్త్రీని చూచాడు పురంజనుడు. ఆమె దగ్గరకుపోయి ఆమెను ఇలా అడిగాడు. "ఓ లలనామణీ! నీవు ఎవరు? నీ తల్లి తండ్రులు ఎవరు? నువ్వు ఎక్కడి నుండి వచ్చావు. ఈ ఉద్యానవనములో ఏంచేస్తున్నావు? నీ వెంట వచ్చే పదకొండు మందిలో ఆ పదకొండవ వ్యక్తి చాలా బలిష్టంగా ఉన్నాడు. అతనుఎవరు? మిగిలిన పదిమంది వెంట ఉన్న స్త్రీలు ఎవరు? నిన్నుకాపలా కాస్తున్న ఆ ఐదుతలల సర్పము ఎవరు? ఇంతకూ నీవు మానవ కాంతవా లేక దేవకాంతవా? నీవు లజ్జాదేవివా? లేక పార్వతీ దేవివా? లేక లక్ష్మీదేవివా? లేక సరస్వతివా? లేక నిన్ను వదిలిపోయిన భర్తను

వెదుక్కుంటూ వెళుతున్న దేవకాంతవా? నీ భర్త ఎంతో అదృష్టవంతుడు. నీ పాద సేవ చేసుకుంటేనే నీ భర్తకు సకలకోరికలు నెరవేరుతాయి కదా!

నీవు దేవకాంతవు అయితే నీ చేతిలో విలాసంగా ఒక పద్మము ఉండాలి కదా! అది ఎక్కడపడిపోయింది. పైగా నీ పాదములు భూమిమీద ఆనుతున్నాయి. అంటే నీవు దేవకాంతవు కావు. మానవ కాంతవు. ఓ సుందరీ! నేనూ మానవుడినే. నేను ఎన్నో పుణ్యకార్యములు చేసాను. అందుకని నీవునన్ను వరించు. నేను నీకు సకల సౌఖ్యములు కలుగజేస్తాను. మనం ఇద్దరం ఈ పురములో ఆనందంగా సుఖజీవనం గడుపుదాము. నీ వాలు చూపులు నా హృదయాన్ని ఛిన్నాభిన్నం చేసాయి. సిగ్గుతో కూడిన నీ క్రీగంటి చూపుల తూపులతో మన్మథుడు నన్ను బాధిస్తున్నాడు. ఓసుందరీ! నన్ను అనుగ్రహించు. నా మీద దయచూపించు. అలా సిగ్గుతో తల వంచుకుంటావెందుకు. తల ఎత్తి ఒక్కసారి నా వంక చూడు. నాకు నీ సుందరవదనారవిందమును చూచే భాగ్యము కలుగజెయ్యి." అని ప్రాధేయపడ్డాడు పురంజనుడు.

ఇప్పటిదాకా కథ చెప్పిన నారదుడు ప్రాచీన బర్హితో ఇంకా ఇలా అన్నాడు.

"ఓ మహారాజా! వీరుడైన ఆ పురంజనుడు ఆ అందాలరాశిని చూడగానే బేలగా మారి పోయాడు. ఆమె అందానికి దాసుడయ్యాడు. పురంజనుని ప్రేమను చూచిన ఆ యవ్వనవతి కూడా పురంజనుని మీద మోహము పెంచుకుంది. ఆమె నవ్వుతూ

పురంజనునితో ఇలా అంది.

"ఓ పురుషపుంగవా! నా తల్లితండ్రులు ఎవరో నాకు తెలియదు. నాగురించి కానీ, నా గోత్రము కానీ, నా పేరు కానీ నాకు ఏమీ తెలియదు. ఈ పురము నాకు నివాసము. ఇందులో నేను నివాసముఉంటున్నాను. ఈ పురము ఎవరిచేత నిర్మించబడిందో కూడా నాకు తెలియదు. ఇక్కడ ఉన్న స్త్రీలు పురుషులు నా అనుచరులు. ఈ సర్పము ఈ పురమును రక్షిస్తూ ఉంటుంది. నేనునిద్రపోతున్నప్పుడు ఈ సర్పము మేలుకొని ఉండి మా అందరినీ రక్షిస్తూ ఉంటుంది. నా అదృష్టవశాత్తు నీవు ఇక్కడకు వచ్చావు. నీవు కూడా ఇంద్రియ సుఖములనుకోరి ఇక్కడకు వచ్చావని తెలుస్తూ ఉంది. నేను, నా సఖులు, నీకు కావలసిన సుఖములను ఇస్తాము. నేను నీకు అందిచే భోగములను, సుఖములను చక్కగా అనుభవించు.

నీవు తొమ్మిది ద్వారములు కల ఈ పురములో నూరు సంవత్సరములు హాయిగా నివసించు. ఈ లోకములో కొందరికి రేపు ఏం జరుగుతుందో, చనిపోయిన తరువాత ఎలాంటి లోకాలు వస్తాయో ఏమీ అక్కరలేదు. కేవలము ఈ రోజు దొరికే సుఖములతో తృప్తిపడతారు. అటువంటి వారితో నేను ఏం సుఖపడగలను. అందుకని నిన్ను కోరుకున్నాను. నిన్నేవరించాను. నీతో తప్ప వేరే ఎవరితోనూ నేను సుఖపడలేను.

అన్నిటికన్నా గృహస్థాశ్రమము గొప్పది. ఈ ఆశ్రమములోనే అర్థము, కామము, భార్య, సంతానము, సుఖములు, కీర్తి అన్నీ దొరుకుతాయి. గృహస్థాశ్రమములో అన్నీ అనుభవించవచ్చును. అలా

కాకుండా సన్యాసాశ్రమములో ఏముంటుంది? సన్యాసులకు ఈ సంసార సుఖముల గురించి ఏమీ తెలియదు కదా! ఈ లోకంలో సర్వప్రాణులకు, మానవులకు, ఋషులకు, మునులకు అనుభవించతగ్గది గృహస్థాశ్రమము ఒక్కటే! అనిపెద్దలు చెబుతారు. అందుకని మన ఇద్దరమూ గృహస్థాశ్రమము స్వీకరించి సంసార సుఖములు అనుభవిద్దాము.

నీవు చూడబోతే రాకుమారుడిలాగున్నావు. నీ హృదయము విశాలమైనది. నువ్వు ప్రియంగామాట్లాడుతున్నావు. నీ వంటి వాడు భర్తగా లభించి నప్పుడు వద్దు అనే యువతి కూడా ఉంటుందా చెప్పు. నీ విశాలమైన బాహువులలో బందీ కావడం కన్నా అదృష్టం ఏముంటుంది నాకు. నీవు సామాన్యుడివి కావు. కరుణాసముద్రుడివి. నీ చిరునవ్వుతో నా లాంటి వారి మన్మధబాధలను తీర్చగల శక్తి నీకు ఉంది." అని మృదుమధురంగా పలికింది ఆ యువతి.

ఓ ప్రాచీన బర్హి మహారాజా! ఆ మాటలు విన్న పురంజనుడు ఉబ్బితబ్బిబ్బయ్యాడు. తనను తాను మరిచిపోయాడు. ఆ యువతికి దాసోహం అయ్యాడు. ఆ యువతి వెంట ఆ పురములోనికి ప్రవేశించాడు. ఆమెను భార్యగా చేసుకున్నాడు. ఆమెతో నూరుసంవత్సరముల కాలము ఆనందంగా గడిపాడు. ఆ పురములోని గాయకులు పురంజనుని కీర్తిని గానం చేయసాగారు. పురంజనుడు, ఆ యువతితోనూ ఆమె సఖులతోనూ ఆ పురములో ఉన్న సరోవరములో దిగి జలకాలాడసాగాడు.

ఆ పురము లోపల ఉన్నవారు  బయటకు రావడానికి పైన ఏడు కింద రెండు  మొత్తము తొమ్మిది ద్వారములు ఉన్నాయి. పైభాగమున ఉన్న ఏడు ద్వారములలో, ముందు వైపు ఐదు ద్వారములు ఉన్నాయి. రెండు పక్కలకు ఉన్నాయి. కింది భాగంలో రెండు ద్వారములు ఉన్నాయి.  వాటి పేర్లు చెబుతాను విను.

ముందు భాగంలో ఖద్యోతము, ఆవిర్ముఖి అనే రెండు మిలా మిలా మెరిసే ద్వారాలు పక్కపక్కనే ఉన్నాయి. పురంజనుడు తన మిత్రుడైన ద్యుమనుడిని వెంట తీసుకొని ఈ రెండు ద్వారముల గుండా విభ్రాజితము అనే జనపదానికి వెళుతుంటాడు.

పైన చెప్పబడినరెండు ద్వారముల కింద మరొక రెండు ద్వారములు ఒకేచోట ఉన్నాయి. వాటి పేర్లు నలిని, నాలిని. పురంజనుడు తన మిత్రుడైన అవధూత తో కలిసి ఈ రెండు ద్వారముల ద్వారా సౌరభము అనే ప్రాంతానికివెళుతుంటాడు.

పైన చెప్పినరెండు ద్వారముల కింద ఒకపెద్ద ద్వారము ఉంది. దాని పేరు ముఖ్య. పురంజనుడు తన మిత్రులైన రసజ్ఞ, విపణ అనే వారిని వెంటబెట్టుకొని బహూదనము, ఆపణము అనే ప్రదేశములకు వెళుతుంటాడు.

ఈ ఐదు ద్వారములు ముందు భాగంలో ఉన్నాయి. తరువాత కుడి పక్క ఒకటి, ఎడమ పక్క ఒకటి ద్వారాలు ఉన్నాయి. పురంజనుడు కుడి వైపున ఉన్న పితృహు అనే ద్వారము గుండా

శ్రుతిధరుడు అనే మిత్రుని వెంటబెట్టుకొని దక్షిన పంచాల రాజ్యమునకు పోతుంటాడు. అలాగే ఎడమ వైపున ఉన్న దేవహు అనే ద్వారము గుండా అదే శ్రుతిధరునితో కలిసి ఉత్తర పంచాల రాజ్యమునకు వెళుతుంటాడు.

తరువాత ఆ పురమునకు కింది భాగంలో ముందు ఒకటి వెనుక ఒకటి ద్వారములు ఉన్నాయి. పురంజనుడు ముందు వైపున ఉన్న ఆసురి అనే ద్వారము గుండా దుర్మదుడు అనే స్నేహితుని సాయంతో  గ్రామకము అనే ప్రదేశానికి పోతుంటాడు. అలాగే వెనుక వైపునున్న నిరృతి అనే ద్వారం గుండా లుబ్ధకుడు అనే మిత్రుని తో సహా వైశసము అనే ప్రదేశమునకు వెళుతుంటాడు పురంజనుడు.

ఆ పురములో ఈ తొమ్మిది ద్వారాలే కాకుండా  నలుగురు గుడ్డివాళ్లు కూడా ఉన్నారు. పురంజనుడు ఆ నలుగురిలో,  ఇద్దరి సాయంతో ఎక్కడికంటే అక్కడికి వెళతాడు. మరో ఇద్దరి సాయంతో ఏపని అంటే ఆ పని చేస్తాడు.

ఆ పురములో ఒక అంత: పురము  ఉంది. అందులో పురంజనుడి భార్య, ఆమెకు కలిగిన సంతానము, విషూచిని అనే వ్యక్తి ఉన్నారు. వారితో కలిసి పురంజనుడు సుఖాలను అనుభవిస్తున్నాడు. మోహంతోనూ, ప్రసన్నత్వంతోనూ, సంతోషంతోనూ అన్ని భోగాలను అనుభవిస్తున్నాడు.

ఆ పురంజనుడు తన భార్య మోహంలో పూర్తిగా మునిగిపోయాడు. ఆమె మాట జవదాటడం లేదు. ఆమె ఏమి చేస్తే ఆ పనులను తానూ చేస్తున్నాడు. అన్ని విధాలా ఆమెను అనుకరిస్తున్నాడు.

ఆ యువతి మద్యపానం చేస్తే తానూ మద్యం సేవిస్తున్నాడు. ఆమె మోహంలో పడి చేయరాని పనులు కూడా సంతోషంగా చేసేస్తున్నాడు. ఆమె ఆహారం తీసుకుంటుంటే ఆమె పక్కను కూర్చుని తానూ అదే ఆహారం తీసుకుంటాడు. ఆ యువతి పాటలు పాడితే తానూ పాడతాడు. ఆమె మాట్లాడితే తానూ మాట్లాడతాడు. ఆమె నవ్వితే తానూ నవ్వుతాడు. ఆమె ఏడిస్తే తానూ ఏడుస్తాడు. ఆ యువతి కారణం లేకుండా పరుగెత్తితే తానూ ఆమె వెంట పరుగెడతాడు. ఆమె చటుక్కున నిలబడితే తానూ నిలబడతాడు. ఆమె కూర్చుంటే తానూ కూర్చుంటాడు. ఆమె పడుకుంటే తానూ పడుకుంటాడు. ఎప్పుడైనా ఆ యువతి ఏదైనా శ్రద్ధగా వింటుంటే తానూ అంతే శ్రద్ధతో వింటాడు. ఆమె ఏవైపు చూస్తూ తానూ ఆ వైపు చూస్తాడు. ఆమె ఏ వస్తువునైనా వాసన చూస్తే తానూ అదే వస్తువును వాసన చూస్తాడు. ఆమె ఏ వస్తువును తాకితే ఆ పురంజనుడు కూడా అదే వస్తువును తాకుతాడు. ఆ యువతి ఏడిస్తే పురంజనుడు కూడా కుయ్యో మొర్రోఅంటూ ఏడుస్తాడు. ఇంతలోనే ఆమె నవ్వితే తాను కూడా హిహిహి అంటూ నవ్వుతాడు. ఆమె తృప్తిగా ఉంటే తానూ తృప్తిగాఉంటాడు.

ఈ ప్రకారంగా ఆ యువతి ఏమి చేస్తే అదే చేస్తూ ఆ యువతికి పూర్తిగా దాసుడు అయ్యాడు. పూర్తిగా మూర్ఖత్వంలో మునిగిపోయాడు. ఆప్రకారంగా పురంజనుడు తన భార్య దగ్గర ఒకపెంపుడు జంతువు మాదిరి వ్యవహరిస్తున్నాడు. ఆమె ఎలా ఆడిస్తే

అలా ఆడుతున్నాడు. తనకు ఏ కోరికా లేకపోయినా, ఏ పనీ చెయ్యాలని అనిపించకపోయినా, ఆమె కోరుకున్నది కాబట్టి, ఆమె చేస్తున్నది కాబట్టి ఆయా పనులను చేస్తున్నాడు. పూర్తిగా ఆ యువతికి వశవర్తనుడు అయ్యాడు పురంజనుడు.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము ఇరువది ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము

ఇరువది ఆరవ అధ్యాయము.

(పాఠకులకు ఒక సారి గుర్తుచేస్తున్నాను. ఈ పురంజనుడి కథను నారదుడు ప్రాచీన బర్హి అనే మహారాజుకు చెబుతున్నాడని, మైత్రేయుడు విదురునికి చెప్పినట్టు, శుకుడు పరీక్షిత్తు మహారాజుకు చెబుతుంటే విన్న సూతపౌరాణికుడు శౌనకాది మహామునులకు, సత్రయాగ సందర్భంలో చెబుతున్నాడు. ఇంక చదవండి.)

నారదుడు ప్రాచీన బర్హికి పురంజనోపాఖ్యానమును ఈ ప్రకారంగా చెప్పసాగాడు.

"ఓ మహారాజా! ఒకరోజు ఆ పురంజనుడు వేటకు వెళ్లాడు. ఒక రథాన్ని సిద్ధం చేసుకున్నాడు. ఆ రథానికి ఐదు గుర్రాలను కట్టాడు.

అందువల్ల ఆ రథము చాలా వేగంగాపరుగెట్ట గలదు. ఆ రథానికి ఆధారంగా కింద రెండు పెద్ద పెద్ద పొడుగాటి కొయ్యలు ఉన్నాయి. ఆ రథానికి రెండు చక్రములు, ఒక ఇరుసు ఉన్నాయి. రథం నడిపేవాడు కూర్చోడానికి మూడు వెదురు బొంగులతో నొగలు ఏర్పరుపబడింది. ఆ రథమునకు కట్టిన గుర్రములకు ఐదు పగ్గములు, ఒక కళ్లెపు తాడు కట్టబడి ఉన్నాయి. ఆ రథములో ఒకడు మాత్రమే కూర్చోడానికి ఆసనం ఉంది. ఆ రథమునకు రెండు కాడిబంధములు ఉన్నాయి. ఆ కాడి బంధములకు అశ్వములు కట్టబడి ఉన్నాయి. ఆ రథములో ఏడు అంతస్థులు ఉన్నాయి. ఆ రథము ఐదు విధములుగా అటు ఇటు పరుగెడుతూ ఉంది. అటువంటి రథంలో పురంజనుడు కూర్చున్నాడు.

పురంజనుడి వెంట ఒక సేనాధి పతి కూడా ఉన్నాడు. ఆ పురంజనుడు ఒక ధనుస్సును చేత పట్టుకున్నాడు. నిండుగా బాణములు ఉన్న తూణీరమును వీపుకు కట్టుకున్నాడు. బంగారు కవచమును ధరించాడు. తన సేనాధి పతి వెంటరాగా, పంచప్రస్థము అనే అడవికి వేటకు వెళ్లాడు. ఎప్పుడూ క్షణకాలం కూడా విడిచి ఉండని తన భార్యను పురంజనుడు తనతో పాటే వేటకు తీసుకొని పోలేదు. ఒంటరిగానే వెళ్లాడు. వేటకోసరం అడవిలోకి ప్రవేశించగానే పురంజనుడు అతి క్రూరుడుగా మారి పోయాడు. తన పదునైన బాణములతో నిర్దాక్షిణ్యంగా మృగములను వధించసాగాడు.

ఓ ప్రాచీన బర్హి మహారాజా! రాజులు వేటకు వెళ్లినపుడు కొన్నినియమాలు పాటిస్తారు కదా! వేటాడటానికి అనువైన మృగములనే సంహరించాలి కదా! ఇష్టం వచ్చినట్టు మృగములను వేటాడకూడదు

కదా! అవసరమున్నంత వరకే మృగములను వేటాడాలి కదా! ఓ రాజా! ఈ ప్రకారంగా నియమం ప్రకారము, శాస్త్రములలో చెప్పిన ప్రకారము వేటాడితే, ఆ వేటలో మృగములను చంపిన పాపము అతనికి అంటదు. కాని ఏ రాజైతే వేటకు అనుసరించవలసిన నియమములను మరిచిపోయి, ఇష్టం వచ్చినట్టు మృగములను చంపితే, అతడు సర్వనాశనం అవుతాడు. అప్పటి దాకా అతడు ఆర్జించిన జ్ఞానము నశించి, నరకకూపంలో పడిపోతాడు.

ఈ విధమైన వేటధర్మములను అన్నీ పురంజనుడు పాటించలేదు. తన ఇష్టం వచ్చినట్టు వాడిఅయిన బాణములతో వేలకొలది మృగములను, ఈమృగము వేటాడ తగినది, ఈమృగమును వేటాడకూడదు అనే విచక్షణా జ్ఞానము లేకుండా చంపాడు. ఆ పురంజనుడి మారణకాండకు భయపడి మృగములు పారిపోయాయి. ఆ అరణ్యములో ఉన్న మునులు కూడా పురంజనుడి విచక్షణారహితమైన వేటను చూచి ఎంతో దు:ఖించారు. ఆ ప్రకారంగా పురంజనుడు ఆ అరణ్యములో ఉన్న కుందేళ్లను, వరాహములను, అడవి దున్నలను, లేళ్లను, ఇంకా అనేక సాధుమృగములను కూడా వేలకొలదిగా సంహరించాడు.

ఇంతలో పురంజనుడికి ఆకలి దాహం వేసాయి. పురంజనుడు వేట చాలించి తన పురమునకు వచ్చాడు. రాగానే స్నానము చేసి ఆహారము తీసుకున్నాడు. హాయిగా హంసతూలికా తల్పము మీద పడుకొని వేటవలన కలిగిన అలసట తీర్చుకున్నాడు. తరువాత అగరు ధూపం వేసుకున్నాడు. మైపూతలు పూసుకున్నాడు.

సువాసన కలిగిన పూలతో అలంకరించుకున్నాడు.

కడుపు నిండా తిని, చక్కగా అలంకరించుకున్న తరువాత పురంజనుడికి మదనవికారము పుట్టింది. మన్మధుడి బాధ ఎక్కువ అయింది. అప్పుడు  భార్య గుర్తుకు వచ్చింది. భార్య కోసరం పురములో వెదికాడు. ఆమె ఎక్కడా కనపడలేదు. ఆవేశం ముంచుకొచ్చింది. అంత:పుర కాంతలను పిలిచి...

"ఓ సుందరీమణులారా! మీకు, మీ రాణి గారికి సౌఖ్యమే కదా! ఇంటికి రాగానే నా భార్య నాకు ఎదురువచ్చి నాకు స్వాగతం పలికేది. ఇప్పుడు ఎందుకు రాలేదు. ఆమెకు ఏమయింది. ఇంటికి రాగానే తల్లి, భార్య కనపడకపోతే ఆపురుషుడు ఎంతటి ఆవేదన చెందుతాడో మీకు తెలియదా! తల్లి భార్య లేని ఇల్లు చక్రములు లేని రథము వంటిది కదా! నాకు సర్వస్వము నా భార్య. నాకు ఏదైనా కష్టం కలిగితే నాకు ధైర్యం చెప్పేది, నాకు జ్ఞానబోధ చేసే నా భార్య ఎందుకు కనిపించడం లేదు." అని ఆతురతగా అడిగాడు పురంజనుడు.

అప్పుడు ఆస్త్రీలు పురంజనుడితో ఇలా అన్నారు. " ఓ మహారాజా! నీ భార్య మనసులో ఏముందో మాకు తెలియదు. అటు చూడు! నీ భార్య  కటిక నేలమీద పడుకొని ఉంది." అని అన్నారు. నేలమీద పడుకొని ఉన్న తన భార్యను చూచాడు పురంజనుడు.

పురంజనుడి మనసు తల్లడిల్లిపోయింది. కలత చెందింది. ఆమె కోపమునకు కారణం తెలుసుకోలేకపోయాడు. వెంటనే  వెళ్లి ఆమె పక్కనకూర్చుని ఆమెను తన ప్రియమైన మాటలతో

ఓదార్చసాగాడు. ఎన్నోవిధములుగా ఆమెను అనునయిస్తున్నాడు. ఆమె పాదములు పట్టుకొని బతిమాలుతున్నాడు. ఆమెను తన ఒడిలో కూర్చోబెట్టుకొని అనునయిస్తున్నాడు.

"ఓ సుందరీ! నీకోమాట చెప్పనా! సేవకులు తప్పు చేస్తే యజమానులు శిక్షించాలి. యజమానులు వేసే శిక్ష సేవకులమీద అనుగ్రహం చూపించినట్టే అవుతుంది. నేను నీ సేవకుడను. నేను చేసిన తప్పుకు నాకు తగిన శిక్ష విధించు. ఆనందంతో స్వీకరిస్తాను. అంతే కానీ ఈ ప్రకారం అలిగితే ఎలాగ! నీవు నాకు యజమానురాలివి. నా హృదయేశ్వరివి. నన్ను నీ వాడిగా భావించు. నీ అందమైన ముఖము ఎత్తి నా వంక చూడు. నన్ను కరుణించు.

పోనీ నీకు ఎవరైనా అపకారం చేసారా! నిన్ను ఎవరైనా అవమానించారా చెప్పు. వెంటనే వాడిని కఠినంగా శిక్షిస్తాను. వాడు బ్రాహ్మణుడు, విష్ణుభక్తుడు అయితే తప్ప వాడికి నా చేతిలో చావు తప్పదు. ఓ సుందరీ! నీకు అపకారం చేసి బతికిన వాడు ముల్లోకములలో లేడు.

చూడు. నీ ముఖం తిలకం లేకుండా ఎంత కళావిహీనంగా ఉందో. తిలకం లేకుండా నీ ముఖం చూడలేకుండా ఉన్నాను. ప్రేమికులు తమ ప్రియురాండ్ర ముఖములను, తిలకం లేకుండా, ఆనందం లేకుండా, ప్రేమ లేకుండా,  కోపంతో భయంకరంగా ఉండటం చూడలేరు. నీకన్నీటితో నీ పమిట ఎలా తడిసిపోయిందో చూడు.

ఏదో వేటాడవలెనని కోరికతో, నీ అనుమతి లేకుండా,నిన్ను తీసుకొని వెళ్లకుండా ఘోరమైన తప్పు చేసాను. నన్ను నీ ప్రియునిగా భావించి ప్రేమతో క్షమించు. ” అని నానావిధాలుగా ప్రాధేయపడ్డాడు పురంజనుడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము ఇరవై ఆరవఅధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము

ఇరవైఏడవ అధ్యాయము

నారదుడు ప్రాచీన బర్హి మహారాజుకు పురంజనో పాఖ్యానమును ఈవిధంగా చెబుతున్నాడు.

“ఓ మహారాజా! ఆ ప్రకారంగా పురంజనుడు తన భార్యతో తాను పొరపాటున ఆమెకు చెప్పకుండా, ఆమెఅనుమతి తీసుకోకుండా వేటకు వెళ్లాననీ, ఆ తప్పును క్షమించమనీ వేడుకున్నాడు. భర్త ప్రార్థనను మన్నించింది పురంజనుని భార్య పురంజని. అతనిని క్షమించింది. పురంజనుని మీద ప్రేమ కురిపించింది.

ఆమె లేచి చక్కగా స్నానం చేసింది. చక్కటి వస్త్రములు ధరించింది. అన్ని ఆభరణములు పెట్టుకుంది. సువాసనలు వెదజల్లే మైపూతలు పూసుకుంది. భార్యాభర్తలు ఇద్దరూ తృప్తిగా భోజనం చేసారు. ఇద్దరూ ఏకాంత స్థలములో కామకేళిలో తేలియాడారు. పురంజనుడు మరలా మామూలు అయ్యాడు. ఆమెకు దాసుడు అయ్యాడు. తన బుద్ధి వివేకము కోల్పోయాడు.

ఆ ప్రకారం విషయవాంఛలలో తేలియాడుతున్న పురంజనుని ఆయువు క్షణం క్షనం తరిగిపోసాగింది. కాని పురంజనుడికి ఆ విషయం తెలియడం లేదు. భార్య మోహంలో తేలియాడుతున్నాడు. ప్రతిరోజూ ఏయేభోగములు అనుభవించాలా అని ఆలోచనలలో మునిగిపోయాడు. రోజుకోవిధంగా కోరికలు తీర్చుకుంటున్నాడు. భార్యమోహంలో పడిన అతని యౌవనం క్షణాల్లా గడిచిపోయింది. పురంజనునికి తన భార్య పురంజని వలన 1100 మంది కుమారులు, 110 మంది కుమార్తెలు కలిగారు.

అప్పటికి పురంజనుని ఆయుర్దాయములో సగం అయిపోయింది. పురంజనుడు తన కుమారులకు, కుమార్తెలకు తగిన సంబంధములు తీసుకొని వచ్చి అందరికీ వివాహములు జరిపించాడు. పురంజనుని కుమారులు ఒక్కొక్కరికీ 100 మంది కుమారులు జన్మించారు. ఈ విధంగా పురంజనుని వంశము పుత్రులు, పుత్రికలు, పౌత్రులతో తాపర తంపరగా పెరిగిపోయింది. పురంజనుడు తన కుమారులు, కుమార్తెలు, మనుమల యందు, బంధువులయందు, ధనమునందు, ఆ పురమునందు మమకారమును ఓ పట్టాన

వదులుకోలేకపోయాడు. వారి కోసరము ఎన్నో యజ్ఞములు యాగములు చేసాడు. ఆ యజ్ఞములలో ఎన్నో పశువులను చంపాడు. ఆ యజ్ఞములు చేసి దేవతలను,పితృదేవతలనుతృప్తిపరచాడు. ఇంతలో పురంజనుని ముసలితనము ఆవరించింది.

ఇది ఇలా ఉండగా ఓ ప్రాచీన బర్హిమహారాజా! చండవేగుడు అనే గంధర్వరాజు ఉండేవాడు. అతనికి 360 మంది గంధర్వులు అనుచరులుగా ఉన్నారు. అందులో సగం మంది చీకటి మాదిరి నల్లగానూ, సగం మంది వెలుతురు మాదిరి తెల్లగానూ ఉన్నారు. వారందరూ దంపతులు. ఆ చండవేగునితో సహా ఆ గంధర్వులు పురంజనుని ఇంట్లో పడి తింటున్నారు. ఆ పురమును గుల్లచేస్తున్నారు. ఇదంతా గమనిస్తున్న ఐదుతలల పాము ఆ గంధర్వులను కట్టడి చేయడానికి ప్రయత్నం చేసింది. ఆ ఐదుతలల పాము ప్రతిరోజూ రాత్రింబగళ్లు ఆ గంధర్వులతో యుద్ధం చేయసాగింది. ఐదుతలల పాము బలం క్షీణించింది కానీ ఆ గంధర్వుల బలము ఏమాత్రము తగ్గలేదు.

ఈ గంధర్వుల ధాటికి తట్టుకోలేక పురంజనుడు, అతనిసంతానము, బంధువులు అంతా చింతాక్రాంతులయ్యారు. క్రమేణా పురంజనుడికి అతని సంతానమునకు బంధువులకు ఆ చింత తొలగి పోయింది. ఇంతకు ముందు మాదిరి భోగములను అనుభవించసాగారు.

ఇది ఇలా ఉండగా, ఓ ప్రాచీన బర్హి మహారాజా! జర (ముసలి తనము) అనే కాలకన్య తనకు తగిన వరుని గురించి వెదక సాగింది. కాని ఆమెను భార్యగా స్వీకరించడానికి ఎవరూ ఇష్టపడలేదు. ఆమెను ఎవరూ ఇష్టపడక పోవడంతో ఆమె తన దౌర్భాగ్యానికి చింతించసాగింది. దానితో ఆమెకు దుర్భగ అనే పేరు సార్థకం అయింది.

ఓ ప్రాచీన బర్హి మహారాజా! ఈ కాలకన్య ఒక సారి తనకు తగిన భర్తను వెదుక్కుంటూ మూడులోకములు తిరుగుతూ నాకు తారసపడింది. నన్ను చూడగానే ఆ కాలకన్య తనను వివాహం చేసుకోమని నన్ను అడిగింది. నేను సున్నితంగా తిరస్కరించాను. అందుకని నన్ను మూడులోకములు ఉన్నచోట ఉండకుండా తిరుగుతూ ఉండమని నన్ను శపించింది. అందువలననే నేనునిరంతరము హరినామ సంకీర్తన చేస్తూ లోకసంచారము చేస్తున్నాను.

తరువాత నేను ఆ కాలకన్యను భయము అనే పేరుకల యవనుడి వద్దకు పంపించాను. ఆ కాలకన్య నేను చేసిన ఉపదేశము మేరకు భయము అనే యవనుని వద్దకు పోయి అతనిని తనను వివాహము చేసుకోమని అడిగింది. “ఓ యవనరాజా! నీవు యవనుల కందరికీ అధిపతివి. నేను నిన్ను నా భర్తగా వరించాను. నాసంకల్పము వృథా కారాదు. ఎవరైనా కన్యాదానము చేస్తాను అంటే వద్దు అనకూడదు. నాకుగా నేను, నన్ను నీకు అర్పించుకుంటున్నాను. నామీద దయయుంచి నన్ను స్వీకరించు.”అని అడిగింది.

కాలకన్య మాటలను విన్న భయము అనే ఆ యవనుడు చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు. "ఓ కాలకన్యా! నీవంటే ఎవరికీ ఇష్టం ఉండదు (కోరి కోరి ఎవరు వృద్ధాప్యమును తమ జీవితంలోకి ఆహ్వానిస్తారు) కాబట్టి, నీకు కాబోయే భర్తను నీకు నేను ఇదివరకే నిర్ణయించి ఉంచాను. ఒకరు కాదు. కోట్లాది మంది. నీవు ఎవరికీ కనపడకుండా అదృశ్యరూపంలో ఈ లోకంలో ఉన్న ప్రాణుల శరీరాల్లో ప్రవేశించి వారిని వివాహమాడు. (వారికి ముసలితనం ఆవహిస్తుంది). నీ ప్రభావంతో వారిని నాశనం చెయ్యి.

నాకు ఒక సోదరుడు ఉన్నాడు. వాడి పేరు జ్వరము. ఇప్పటినుండి నీవు కూడా నా సోదరివి. ఇంక నేను ఎవరోతెలుసు కదా! భయాన్ని. నీ వలన కలిగే వృద్ధాప్యమునకు నేను (భయము), నా సోదరుడు (జ్వరము), నా సైనికులు (వివిధములైన వ్యాధులు) తోడైతే, ప్రాణులను అవలీలగా మృత్యుముఖంలోకి నెట్టవచ్చు." అని అన్నాడు భయము అనే ఆ గంధర్వుడు.

శ్రీమద్భాగవతము

చతుర్ధ స్కంధము ఇరువది ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము

ఇరువది ఎనిమిదవ అధ్యాయము.

నారదుడు ప్రాచీన బర్హి మహారాజుకు పురంజనో పాఖ్యానమును ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ ప్రాచీన బర్హి మహారాజా! ఆ విధంగా భయము అనే గంధర్వుడు, కాలకన్యతోనూ తన సోదరుడు జ్వరముతోనూ, వ్యాధులు అనే తన సైన్యముతోనూ పురంజనుని పురము మీద పడ్డాడు. అప్పటికే తొమ్మిది ద్వారములు గల ఆ పురమును రక్షిస్తున్న ఆ ఐదుతలల పాము యొక్క బలము క్షీణించింది. అయినా శక్తి కొద్దీ ఆ పురమును రక్షిస్తూ ఉంది. అటువంటి పురమును భయము, కాలము అనే ఇద్దరూ బలవంతంగా ఆక్రమించారు. కాలకన్యక ఆక్రమించగానే ఆ పురములో ఉన్న పురంజనునికి శక్తి తగ్గిపోయింది. పురంజనుడు కాలకన్య అధీనంలోకి వెళ్లిపోయాడు.

ఇంతలో పురంజనుని పురమునకు ఉన్న తొమ్మిది ద్వారముల గుండా భయము అనే గంధర్వుని సైనికులు అనే వ్యాధులు ఆ పురములోనికి ప్రవేశించాయి. ఆ పురమును పూర్తిగా నాశనం చేయసాగాయి.  ఇంత జరిగినా ఆ పురంజనుడికి ఆ పురము మీదా, తన భార్య పురంజని మీదా మమకారము పోలేదు. గంధర్వుని సైనికులు పెట్టే బాధలను భరిస్తున్నాడు.

కాలకన్య పురంజనుని గట్టిగా కౌగలించుకోగానే పురంజనుని శక్తి పూర్తిగా క్షీణించిపోయింది. కదలలేక పోతున్నాడు. అప్పటిదాకా కామభోగములు అనుభవించిన ఆపురంజనుడు ఇంకా ఆ సుఖములు కావాలని ఆరాటపడుతున్నాడు కానీ అనుభవించడానికి శక్తి లేదని దు:ఖిస్తున్నాడు. రోజు రోజుకూ కాలకన్య ప్రభావం వలన తన పురము క్షీణించిపోతూ ఉందని తెలుసుకున్నాడు పురంజనుడు.

ఎప్పుడయితే పురంజనుడు క్షీణించి పోసాగాడో, అతని భార్య, పుత్రులు, మనుమలు, మనుమరాండ్రు, అతని సేవకులు అందరూ అతనికి సేవచేయడం మానేసారు. అతని ముఖం కూడా చూడటం లేదు. పురంజని కూడా భర్త మీద ఇది వరకు చూపిన ప్రేమ మమకారము చూపడం లేదు. ఒక పక్క కాలకన్య, మరొక పక్క గంధర్వుని సైనికులు తన పురమును నాశనం చేస్తుంటే ఏమీ చెయ్యలేక చూస్తూ ఊరుకున్నాడు పురంజనుడు. ఇలా జరిగిందేమిటా అని చింతిస్తున్నాడు. కాలకన్యను గంధర్వ సైనికులను ఎలా ఎదుర్కోవాలా అని ఆలోచిస్తున్నాడు.

కాలకన్య తన మీద తన ప్రభావాన్ని చూపుతుంటే, తాను అంతకు ముందు అనుభవించిన కామ భోగములను తలచుకుంటూ కుంగిపోతున్నాడు పురంజనుడు. తన భార్య, పుత్రులు, పౌత్రులు తనను చీదరించుకుంటున్నా, ఇంకా వారి మీద ప్రేమ చూపిస్తూ వారిని లాలిస్తున్నాడు.

ఇది ఇలా ఉండగా ఆ గంధర్వుని సోదరుడు జ్వరము అనే వాడు కూడా పురంజనుని పురంలో ప్రవేశించాడు. ఆ పురము అంతా వేడి పుట్టించాడు. ఆ వేడికి పురము సలా సలా కాగిపోతూ ఉంది. పురంజనుని పురము ఇలా వేడికి కాలిపోతుంటే అతని అనుచరులు, భార్యా,పిల్లలు ఆ వేడి తట్టుకోలేక అల్లల్లాడిపోతున్నారు.

అప్పటి దాకా ఆ పురమును కాపాడుతున్న ఐదుతలల పాము, కాలకన్య, భయము అనే గంధర్వుడు, అతని అనుచరులు పురమును ఆక్రమించి ధ్వంసం చేయడం, జ్వరముతో వేడిపుట్టడం చూచి, తనలో తాను శోకించింది. ఆ పాము కంపించసాగింది. ఇంక తాను ఆ పురమును రక్షింపలేను అని అనుకొన్నది. ఇంక ఆ పురమును వదిలిపెట్టి వెళ్లిపోవాలి అని నిశ్చయించుకుంది.

పురంజనుడి శక్తి అంతా హరించి పోయింది. అతని పురము అంతా శిథిలము అయిపోయింది. యవనులు అతని గొంతును ఆక్రమించారు. గొంతులో నుండి గుర గుర శబ్దం రావడం మొదలయింది. ఆ సమయంలో ఒక్కసారిగాపురంజనుడికి తన వాళ్లంతా గుర్తుకు రాసాగారు.

“నేను ఈ పురము వదిలి పెట్టి పోతే వీళ్లంతా ఏమవుతారు? ఎలా బతుకుతారు. నా భార్య ఒట్టి అమాయకురాలు. వీళ్లందరినీ ఎలా పోషిస్తుందో ఏమో! ఎన్ని కష్టాలు పడుతుందో! నేను భోజనం చేయనిదే తానుకూడా భోజనం చేసేది కాదు. నేను స్నానం చేస్తే కానీ తను కూడా స్నానం చేసేది కాదు. నేను కోప్పడితే గడా గడా

వణికిపోయేది. ఒక్కోసారి నాకే ఏ ఆలోచనా తట్టకపోతే తనే నాకు ఆలోచనలుచెప్పేది. నేను శిథిలము అయిన ఈ పురమును వదిలి వెళ్లిపోతే ఆమె ఏమవుతుందో కదా! నా కుమారులు, కుమార్తెలు, కోడళ్లు, అల్లుళ్లు, మనుమలు, మనుమరాళ్లు ఏమవుతారో కదా!" అని ఏడుస్తున్నాడు.

ఇంక వీడు ఇక్కడ ఉండటానికి వీలు లేదు అని భయము అనే యవన రాజు మృత్యువు అనేరూపంలో పురంజనుడి వద్దకు వచ్చాడు. ఆ యవనుడి భటులు ఆ పురంజనుడిని తాళ్లతో కట్టారు. ఈడ్చుకొని పోతున్నారు. ఆ పురంజనుని అనుచరులు ఆ పురంజనుని వెంట కొంతదూరము పరుగెత్తారు. ఎప్పుడైతే పురంజనుని యవన భటులు లాక్కెళ్లిపోయారో అప్పటిదాకా ఆ పురమును రక్షిస్తున్న ఐదు తలల పాము (ఐదు ప్రాణములు) ఆ పురమును వదిలిపెట్టి వెళ్లిపోయాయి. వెంటనే ఆ పురము కుప్పకూలి పోయింది. భూమిలో కలిసిపోయింది.

ఆ యవన దూతలు పురంజనుని లాక్కెళుతున్నారు. అంతా చీకటిగా ఉంది. అప్పటిదాకా పురంజనుడికి తన (పేరులేని) స్నేహితుడు గుర్తుకు రాలేదు. ఆ పురంజనుడిని ఆ ప్రకారంగా లాక్కెళు తుంటే, దారిలో అంతకు ముందు ఆ పురంజనుడు యజ్ఞములు, యాగములు చేస్తూ, ఆ యజ్ఞయాగములలో నిర్దాక్షిణ్యంగా చంపిన పశువులు అన్నీ ఒక్కటిగా వచ్చి ఆ పురంజనుడిని తమ కొమ్ములతో పొడిచి పొడిచి చంపుతున్నాయి. ఆ బాధ భరించలేక ఆ పురంజనుడు హృదయ విదారకంగా అరుస్తున్నాడు.

యవన భటులు ఇదేమీ లక్ష్య పెట్ట కుండా పురంజనుని నేల మీద ఈడ్చుకుంటూ వెళుతున్నారు. తరువాత పురంజనుడికి పూర్వ స్మృ తి పోయింది. ఆ నరకంలో చాలాకాలం ఉన్నాడు.

ఆపురంజనుడు, చనిపోయేసమయంలో కూడా తన భార్య గురించి తలచుకుంటూ ఉండటం చేత, మరుజన్మలో ఆ పురంజనుడు ఒక స్త్రీగా జన్మించాడు. విదర్భరాజు కుమార్తెగా జన్మించాడు. విదర్భరాజు ఆ కన్యను వీరుడు, పరాక్రమవంతుడు అయిన మలయధ్వజుడు అనే రాజుకు ఇచ్చి వివాహం చేసాడు. వారికి ఒక కుమార్తె, ఏడుగురు కుమారులు జన్మించారు. ఆ ఏడుగురికి కోటాను కోట్లమంది సంతానము కలిగారు. మలయ ధ్వజుడు తన కుమార్తెను అగస్త్యునికి ఇచ్చి వివాహము చేసాడు. వారికి ధృఢచ్యుతుడు అనే కుమారుడు కలిగాడు. వార్ధక్యము రాగానే మలయధ్వజుడు వానప్రస్థమునకు వెళ్లాడు. ఆయన భార్య (విదర్భరాజకుమార్తె) కూడా ఆయన వెంట వెళ్లింది.

మలయధ్వజుడు కులాచలము అనే ప్రదేశములో ఆశ్రమం ఏర్పరచుకున్నాడు. ఆ ప్రదేశంలో చంద్రరస, తామ్రపర్ణి, వటోదకము అనే నదులు ప్రవహిస్తున్నాయి. ఆ నదులలో స్నానం చేసి తన మలినములను పోగొట్టకొని మలయధ్వజుడు తపస్సు చేయసాగాడు. కందమూలములు, జలము ఆహారంగా తీసుకుంటూ తపస్సు చేయసాగాడు. ఆ మలయధ్వజుడు శీతోష్ణములు, ఎండలు వానలు, ఆకలి దప్పులు, సుఖదు:ఖములు అన్నిటికీ ఓర్చుకొని తపస్సు చేస్తున్నాడు. ఇంద్రియములను, మనస్సును, ప్రాణములను జయించి మనస్సును

పరమాత్మయందే లగ్నం చేసాడు. దేహము మీద అభిమానమును విడిచిపెట్టాడు. తాను వేరు దేహము వేరు అనే భావనను పెంపొందించుకున్నాడు. ఆ ప్రకారంగా నూరు సంవత్సరములు ఘోరతపస్సు చేసాడు. భగవంతుడు అతనికి శుద్ధమైన పరమాత్మ జ్ఞానమును ప్రసాదించాడు. ఎప్పుడైతే మలయధ్వజుడికి పరమాత్మజ్ఞానం కలిగిందో వెంటనే దేహాన్ని విడిచిపెట్టి పరమాత్మలో ఐక్యం అయ్యాడు.

ఈ విషయం తెలియని ఆయన భార్య అయిన విదర్భరాజ పుత్రిక ఆయనకు యధావిధిగా సేవలు చేస్తూ ఉంది. ఆయన పాదములు ఆమెకు చల్లగా తగిలాయి. మలయధ్వజుడు చనిపోయాడని గ్రహించింది. పెద్దపెట్టున ఏడవసాగింది. ఆమె కళ్లనుండి నీళ్లు ధారాపాతంగా కారుతున్నాయి. “ఓ రాజా! ఎందుకుపడుకున్నావు. లే లే. నీ ప్రజలునీ కోసరం ఎదురు చూస్తున్నారు. వారి మొర ఆలకించు. వారికి దర్శనం ఇవ్వు.” అని ఏడుస్తూ ఉంది.

ఎంత ఏడ్చినా పోయిన వాడు రాడని తెలిసి వెంటనే ఎండు కట్టెలతో చితి పేర్చింది. తన భర్త శరీరాన్ని ఆ చితి మీద పెట్టింది. చితికి నిప్పుపెట్టింది. తాను కూడా ఆ చితిలో దూకి భర్తను అనుసరించ వలెనని అనుకొంది. ఆ సమయంలో ఆక్కడికి ఒక వ్యక్తి బ్రాహ్మణ రూపంలో వచ్చాడు. ఆమెను చితిలో దూకకుండా ఆపాడు. “అమ్మా! నీవు ఎవరు? ఎవరి భార్యవు? ఈ చితిమీద ఉన్న పురుషుడు ఎవరు? నువ్వు ఎందుకు ఏడుస్తున్నావు? ఈ చితిలో ఎందుకు దూకబోతున్నావు?” అని అడిగాడు.

ఆ విదర్భరాజ పుత్రి ఆ బ్రాహ్మణుని వంక అదేపనిగా చూస్తూ ఉంది. ఆ బ్రాహ్మణుడు చిరునవ్వు నవ్వి "మిత్రమా! నన్ను గుర్తు పట్టలేదా! నేను నీ స్నేహితుడను. ఇదివరకు మనం ఇద్దరం మంచి స్నేహితులము. గుర్తులేదా!
(మీరు కూడా గుర్తుకు తెచ్చుకోండి. మొట్టమొదట ఈ పురంజనుడికి ఒక పేరులేని స్నేహితుడు ఉన్నాడు అని చదువుకున్నాము కదా! ఆ పేరులేని స్నేహితుడే ఈ బ్రాహ్మణ రూపంలో వచ్చాడు).

మిత్రమా! నేను నీకు గుర్తు ఉండనులే. నన్ను ఎప్పుడో మర్చిపోయి ఉంటావు. పోనీ నీవు నన్ను మర్చిపోయినా, కనీసం ఒకప్పుడు నా లాంటి స్నేహితుడు ఒకడు ఉన్నాడని జ్ఞాపకం తెచ్చుకో! ఒకప్పుడు నువ్వు నన్ను వదిలి పెట్టి నీవు, తగిన భోగములు, కామసుఖములు  లభించే పురమును వెతుక్కుంటూ వెళ్లావు. అదైనా గుర్తుందా! నీవు ఈ ప్రాపంచిక సుఖముల మీద ఆసక్తితో ఒక పురములోకి ప్రవేశించావు.

ఏమిటి! ఇంకా గుర్తు రాలేదా!  నువ్వు నేను హంసలము. మనం ఇద్దరం జంటగా "మానస" సరోవరంలో విహరించేవాళ్లము. అప్పుడు మనకు ఏ పురము, గృహము లేదు. హాయిగా విహరించేవాళ్లము. మిత్రమా! హంసగా ఉన్న  నీకు ప్రాపంచిక సుఖములు, కామభోగములు అనుభవించవలెనని ఆసక్తి కలిగింది. దాంతో నా నుంచి విడిపోయావు. ఈ సంసారంలో పడ్డావు. నీ కోరికలు తీర్చుకోడానికి తగిన పురము కొరకు వెదకడం మొదలెట్టావు. అప్పుడు నీకు ఒక స్త్రీ (ప్రకృతి) కనపడింది. ఆమె నిర్మించిన

పురములో (దేహములో) ప్రవేశించావు.

మిత్రమా! ఆ పురమునకు తొమ్మిది ద్వారములు, రక్షణగా ఐదు తలల పాము (ఐదు ప్రాణములు), చుట్టు ఐదు ఉద్యాన వనములు ( ఐదు కర్మేంద్రియములు), ఆ పురములో ఆరుకులముల వారు ( ఐదు జ్ఞానేంద్రియములు, మనస్సు), ఆ పురమునకు మూడు ప్రహరీ గోడలు ( నీరు, అగ్ని, పదార్ధము), ఉన్నాయి కదా!

ఆ పురంలో నువ్వు ప్రవేశించావు. విషయ వాంఛలకు లోబడి అన్ని కోర్కెలను తీర్చుకున్నావు, ఆ స్త్రీ కొరకు ఆరాటపడ్డావు. ఇన్ని కష్టాలు అనుభవించావు. ఓమిత్రమా! ఇదంతా నీ భ్రమ. నీవు విదర్భరాజుకు పుట్టలేదు. ఈ మలయధ్వజుడు నీ భర్త కాడు. పోయిన జన్మలో నువ్వు ఆ పురంజనికి భర్తవు కావు. నీకు సంతానము, వారికి సంతానము కలగలేదు. నీకు ఎటువంటి బంధుమిత్రులు లేరు. నీవు తొమ్మిది ద్వారములు కల ఏ పురములో ఇంతకాలము బందీగాఉన్నావో అదీ నీ భ్రమ. నీవు పోయిన జన్మలో పురుషుడు అనుకున్నావు. ఈ జన్మలో స్త్రీ అనుకున్నావు. నిజానికి నీవు ఏమీ కావు. ఇదంతా మాయ. అది కూడా నా శక్తి వలన కలిగిన మాయ.

మిత్రమా! నిజానికి నువ్వు నేను ఒకటే. ఇద్దరికీ భేదం లేదు. ఇద్దరమూ పరిశుద్ధులమే. నేనుపరమాత్మను. నీవు జీవుడవు. కేవలము నీవు ప్రాపంచికసుఖములవైపు తిరిగావు కాబట్టి జీవుడవు అయ్యావు. లేకపోతే నువ్వు నేను ఒకటే. వేరు కాదు. ఎవరైనా దర్పణంలో (అద్దంలో) చూచుకుంటే వారి ప్రతిబింబం ఆ దర్పణంలో

కనపడుతుంది కదా. కాని రెండూ ఒకటే. అలాగే, పరమాత్మ అయిన నేను జీవుడవు అయిననీవు ఇద్దరం ఒకటే." అనిపలికాడు ఆ బ్రాహ్మణుడు.

బ్రాహ్మణ వేషములో ఉన్న పరమాత్మ పలికిన పలుకులు విని విదర్భరాజకుమారి దేహంలో ఉన్న జీవుడు తన స్వస్వరూపమును తెలుసుకున్నాడు. ఇద్దరూ ఒకే హంసరూపము అన్న జ్ఞానం కలిగింది. అంతకు పూర్వము కేవలము ప్రాపంచిక సుఖముల మీద అనురక్తితో జీవుడిగా మారినప్పుడు పోగొట్టుకున్న జ్ఞానము ఇప్పుడు కలిగింది.

ఓ ప్రాచీన బర్హి మహారాజా! ఈ పురంజనోపాఖ్యానమును చెప్పడంద్వారా, నీకు ఆత్మతత్త్వజ్ఞానమును బోధించాను. అర్థం చేసుకొని ఆచరించు." అని నారదుడు ప్రాచీన బర్హి మహారాజుకు పురంజనోపాఖ్యానము అనే ఆత్మతత్త్వజ్ఞానమును బోధించాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము  ఇరువది ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## చతుర్థ స్కంధము

## ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

నారద మునీంద్రుడు ప్రాచీన బర్హి మహారాజుకు పురంజనోపాఖ్యానమును వినిపించాడు. కానీ ఆ రాజుకు ఏమీ అర్థం కాలేదు. ప్రాచీన బర్హి నారదునితో ఇలా అన్నాడు.

"ఓ నారదమునీంద్రా! మీరుచెప్పిన ఉపాఖ్యానములోని అంతరార్థము నాకు ఏమీ అవగతము కాలేదు. ఎందుకంటే మేము ఈ బాహ్యప్రపంచములో ఉన్న కర్మలలో పడి కొట్టుకుంటున్నాము. ఇటువంటి విషయములను అర్థం చేసుకొనే శక్తి మాకు లేదు. కాబట్టి దయచేసి నాకు ఈ కథలోని ఆంతర్యము, అంతరార్థము చక్కగా వివరించండి." అని అడిగాడు. అప్పుడు నారదుడు ప్రాచీన బర్హి మహారాజుతో ఇలా చెప్పసాగాడు.

"ఓ మహారాజా! నేను పురంజనుడు అని చెప్పానే అతడే పురుషుడు అనగా జీవుడు. ఈ పురుషుడు తాను చేసిన కర్మల ఫలితంగా దేహములను పొందుతాడు. అవి రెండు పాదములు, నాలుగు పాదములు, అనేక పాదములు, అసలు పాదములు లేని దేహములు (అంటే పాకే జంతువులు). ఈ దేహములు అనే పురములలో జీవుడు ఉంటాడు. జీవుడు తాను ధరించిన దేహము ద్వారా తెలియబడుతున్నాడు కాబట్టి పురంజనుడు అని అన్నారు.

పురుషునకు ఒక స్నేహితుడు ఉన్నాడు, అతనికి పేరు లేదు అని చెప్పానే ఆ స్నేహితుడే పరమాత్మ. దేహధారులైన పురుషులు ఆ పరమాత్మను ఎటువంటి పేరుతో గానీ, రూపముతో గానీ, గుణముతోగానీ  తెలుసుకోలేరు. అందుకని పరమాత్మకు పేరు, రూపము, గుణములేదు.

ప్రతి దేహమునకు తొమ్మిది ద్వారములు ఉంటాయి. అందుకే తొమ్మిది ద్వారముల పురము అని చెప్పాను. ఈ తొమ్మిది ద్వారములతోనూ, నాలుగు గుడ్డివైన చేతులు, కాళ్లతోనూ, జీవుడు ప్రాపంచిక సుఖములను అనుభవిస్తుంటాడు.

ఆ పురము దగ్గర ఒక స్త్రీ ఉంది అని చెప్పాను. ఆమెయే బుద్ధి. ఆమెను పురంజని అని కూడా పిలుస్తారు. ఈ బుద్ధిని ఆధారం చేసుకొని జీవుడు బయట ప్రపంచంలో ఉన్న వస్తువులను ఇది నాది, అది నీది అనే భ్రాంతిలో పడుతుంటాడు. జీవుడు తన ఇంద్రియములతో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను అనుభవిస్తుంటాడు.

జ్ఞానేంద్రియములే పురంజనుని స్నేహితులు.  జీవుడు జ్ఞానేంద్రియములతో జ్ఞానముతో కూడినకర్మలు చేస్తుంటాడు. నీకు ఐదుతలల పాము అని చెప్పానే అదే ఐదువిధములుగా దేహములో సంచరిస్తున్న ప్రాణము. (పంచ ప్రాణములు). ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు అని చెప్పాను కదా వీటికి అధినేత మనస్సు. వాడినే భటులకు నాయకుడు అని చెప్పాను. ఆ నాయకుడు బలవంతుడు. అలాగే మనస్సు కూడా చాలా బలమైనది.

నీకు పంచాల రాజ్యము మధ్య ఉన్నతొమ్మిదిద్వారముల పురము అని చెప్పాను కదా. పంచాల దేశము అంటే శబ్ద, స్పర్శ,రస,రూప,గంధములు, వీటిని అనుభవిస్తూ ఉన్నదే ఈ దేహము. ఇంక తొమ్మిది ద్వారములు అనగా రెండు కళ్లు, రెండు చెవులు, రెండు ముక్కు రంధ్రములు,  ఈ జంట ద్వారములు పక్క పక్కనే ఉంటాయి. నోరు మాత్రము ఒకటిగా ఉంటుంది. కింది వైపున ఉన్న రెండు ద్వారములు అనగా జననాంగము, విసర్జకావయవము పక్క పక్కనే ఉంటాయి. ఇవి నవద్వారములు. దేహములో ఉన్న జీవుడు ఈ తొమ్మిది ద్వారముల గుండా బయటకు వెళుతుంటాడు. బయట ఉన్న శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములను గ్రహిస్తుంటాడు.

ఈ ద్వారములకు పేర్లుకూడా చెప్పానుకదా. అవేమిటంటే..... ఖద్యోతము, ఆవిర్ముఖి అనేవి రెండు కళ్లకు పేర్లు. అవి బయట ఉన్న దృశ్యములను, రూపములను చూస్తుంటాయి. వాటినే విభ్రాజితములు అంటారు. ఇలాచూడడానికి ద్యుమనుడు అనగా వెలుగు అనే మిత్రుడి సహాయం తీసుకుంటాడు. (ఏ దృశ్యము మీద నైనా వెలుగు పడితేనే కానీ మనకు కనిపించదు కదా).

ఇంక రెండు ముక్కు రంధ్రములకు నలిని నాలిని అని పేర్లు. వాటి గుండా సౌరభ దేశమునకు వెళతాడు అని చెప్పాను. అంటే ముక్కు తోటి బయట ఉన్న వస్తువుల వాసనలను చూస్తుంటాడు. దీనికి మిత్రుడు అవధూత అంటే వాసన చూచే శక్తి.

ముఖ్యము అనే ద్వారము గురించి చెప్పాను. అదే నోరు. అదే వాక్ ఇంద్రియము. దీని ద్వారా రసమును (ఆహారములో రుచులను) గ్రహిస్తాము. అంతే కాకుండా వాక్శక్తితో మాట్లాడగలుగుతాము. అంటే నోటితో ఆహారము తీసుకుంటాము, మాట్లాడగలుగుతాము.

తరువాత తలకు అటు ఇటు రెండు చెవి రంధ్రములు ఉన్నాయి. కుడి పక్క చెవి పేరు పితృహు, ఎడమపక్క చెవి పేరు దేవహూ. కుడి చెవితో కర్మకాండల గురించిన శాస్త్రములు అన్నీ వింటాడు. ఎడమ చెవితో జ్ఞానకాండల గురించిన శాస్త్రములు అన్నీ వింటాడు.

ఇంక కింది భాగములో రెండు ద్వారములు ఉన్నాయి అవి జననాంగము. విసర్జకావయవము. జననాంగము అంటే స్త్రీ, పురుష జననాంగములు. వీటి సంయోగము చేత ఆనందము కలుగుతుంది. సంతానోత్పత్తి కలుగుతుంది. విసర్జకావయవము అనగా మలద్వారమును నిర్‌ృతి అంటారు. అది నరక ద్వారముతో సమానము. ఇవి తొమ్మిది ద్వారములు.

ఇవి కాకుండా ఇద్దరు అంధులు అనగా గుడ్డివాళ్లు ఉంటారుఅని చెప్పాను. అవే చేతులు కాళ్లు. చేతులు పనులు చేస్తాయి. కాళ్లు ఎక్కడి కంటే అక్కడకు తీసుకెళతాయి. ఆ పురములో అంత:పురము ఉందని చెప్పాను కదా. అదే హృదయము. దానినే మనస్సు, విషూచి (అంతటా తిరిగేది) అని కూడా అంటారు.

పురుషుడు ఈ అంత:పురము అనే మనస్సుతో సుఖము, హర్షము, సంతోషము మొదలగు ఆహ్లాదకరమైన విషయములను అనుభవిస్తుంటాడు.

ఆ పురంజనుడు ఒక స్త్రీని వివాహమాడాడు ఆమెతో సుఖాలు అనుభవించాడు అని చెప్పాను కదా ఆమెయే బుద్ధి. పురంజనుడు కూడా ఆమె ఏం చేస్తే అదే చేసేవాడనిచెప్పాను. జీవుడు కూడా బుద్ధి ఎలా ఆడిస్తే అలా ఆడుతుంటాడు. బుద్ధికి ఏం తోస్తే అది చేస్తుంటాడు.

ఓ ప్రాచీన బర్హి మహారాజా! ఈ పురంజనుడు రథం మీద కూర్చుని వేటకు వెళ్లాడు అని చెప్పాను కదా. ఆ రథమే ఈ దేహము. ఇంద్రియములద్వారా కలిగే కోరికలు దానికి కట్టిన గుర్రములు. పాపము, పుణ్యము దానికి చక్రములు. సత్వ,రజస్,తమోగుణములు దానికి కట్టిన పతాకములు. గుర్రములకు కట్టిన తాళ్లు పంచప్రాణములు. మనస్సే ఆ గుర్రములకు కట్టిన పగ్గము. ఆ రథాన్ని బుద్ధి అనే వాడు తోలుతాడు. ఆ దేహము అనే రథములో జీవుడు హృదయము అనే స్థానములో కూర్చుంటాడు. సుఖ,దు:ఖములు, శోకము మోహములు దాని నొగలు. సప్తధాతువులు ఆ రథమునకు ఉన్న ఏడు ఆవరణములు. పది ఇంద్రియములు ఆ పురంజనుని సేన. అటువంటి రథము ఎక్కి జీవుడు ఎండమావులు అనే మృగములను వేటాడటానికి బయలుదేరాడు. అంటేకోరికలు తీర్చుకోడానికి ప్రపంచంమీద పడ్డాడు.

ఆ కోరికలు ఎండమావుల వంటివి. రూపం లేనటువంటివి. వాటి వెంట పరుగెడితే ఆ కోరికలు దు:ఖాన్ని కలుగజేస్తాయి. పురంజనుడు కూడా విచక్షణ లేకుండా వేటాడి దు:ఖాన్ని పొందాడు.

చండ వేగుడు అనే గంధర్వుడు ఆ పురములోకి జొరబడి నాశనం చేసాడు అన్నాను కదా. ఆ చండవేగుడే సంవత్సరము. ఆ చండవేగుడికి 360 మంది నల్లటి తెల్లటి పరిచారికలు ఉన్నారన్నాను కదా. వారే రాత్రి పగలు. రోజులు గడిచే కొద్దీ పురము అంటే దేహము ఆయువు క్షీణిస్తుంది కదా!

తరువాత నీకు కాలకన్యను గూర్చి చెప్పాను. ఆ కాలకన్య ఎవరో కాదు. వృద్ధాప్యము అంటే ముసలితనము. క్రమక్రమంగా దేహాన్ని ఆక్రమిస్తుంది. దేహమును, అవయవములను బలహీన పరుస్తుంది. అందుకే మానవులు ముసలితనం అంటే భయపడతారు. ఎవరూ ముసలితనమును ఆహ్వానించరు. నిత్యయౌవనులుగా ఉండాలనిఅనుకుంటారు.

ఆ కాలకన్యను సోదరిగా స్వీకరించాడు భయము అనగా మృత్యుభయము అనే యవనుడు. (మనిషి దేనికీ భయపడడు. చావుకు భయపడతాడు. ఎదురుగా ఎంతమంది చస్తున్నా తాను మాత్రం చిరంజీవి అనుకుంటాడు.) వృద్ధాప్యము మరణానికి ద్వారం వంటిది. అందుకే మృత్యువు వృద్ధాప్యాన్ని సోదరిగా స్వీకరించాడు.

ఆ యవనుడి సేనలే మానసికంగా, శారీరకంగా వచ్చే వ్యాధులు. ఈ యవనుడి సోదరుడి పేరు జ్వరము. అది రెండు రకాలు. వేడి ఎక్కువఅయితే వచ్చే జ్వరం. ఉష్ణజ్వరం. చల్లదనం ఎక్కువఅయితే వచ్చే జ్వరం. (చలిజ్వరం). ఈ జ్వరాలు తీవ్రం అయితే మరణానికి దారి తీస్తాయి. అందుకే మృత్యువుకు సోదరుడు జ్వరం.

మహారాజా! ఈ ప్రకారంగా జీవుడు ఈ దేహములో ఉండి, తనకుతానుగా కొని తెచ్చుకొనే దు:ఖాలు, ఇతరు వలన తనకు కలిగే దు:ఖాలు, దైవికంగా కలిగే దు:ఖాలు, ఈ మూడు రకములైన దు:ఖములను అనుభవిస్తున్నాడు. అంతే కాకుండా ఆకలి బాధ, దాహము బాధ, అవయవములు పనిచేయకపోవడం వలన వచ్చే గుడ్డితనము, కుంటి తనము, చెవుడు, మూగ,  మొదలగు బాధలు అనుభవిస్తుంటాడు. అంతే కాకుండా వల్లమాలినకోరికలతో సతమతమవుతూ, అవి తీరకపోతే దు:ఖిస్తూ, జీవుడు నూరేండ్లు ఈ తొమ్మిది ద్వారముల పురము అనే దేహములో బందీగా ఉంటున్నాడు.

ఓ మహారాజా! ఈ జీవుడు స్వతాహాగా స్వయంగా ప్రకాశించే గుణము కలవాడు. కానీ ఈ ప్రకృతి గుణములకు లోబడి తన స్వయం ప్రకాశ గుణమును కోల్పోయాడు. ఎప్పుడూ ఈ ప్రకృతిలో సంచరించడం వలన, ఈ దేహమే నాది. నేను ఈ దేహము అనే అజ్ఞానంలో పడి పోతున్నాడు. దేహాభి మానమును పెంచుకుంటున్నాడు. ఆ దేహముతో, పుణ్య కర్మలు, పాప కర్మలు, పుణ్యము పాపము కలిసిన కర్మలు చేస్తుంటాడు. తాను చేసే కర్మలను బట్టి మరుసటి జన్మలో వివిధ రకములైన దేహములను పొందుతుంటాడు. ఎక్కువగా పుణ్య

కర్మలు చేస్తే స్వర్గలోకము మొదలగు పుణ్యలోకములు పొందుతాడు. పాప కర్మలు చేస్తే వివిధరకములైన జంతువులుగానూ, పశు వులాగానూ, పక్షులుగానూ జన్మిస్తాడు. పుణ్యము, పాపము కలిపి చేసిన వాడు మనిషి జన్మ ఎత్తి ఆ పుణ్య పాపముల ఫలమును అనుభవిస్తాడు. ఈ మానవ జన్మలో కూడా ఒక్కోసారి పురుషుడు గానూ, ఒక్కొక్కప్పుడు స్త్రీగానూ, ఇంకా నపుంసకుడా గానూ తాను చేసిన కర్మఫలములను బట్టి దేహములు పొందుతూ ఉంటాడు. ఎవరి కర్మఫలము వారు అనుభవించాలి కదా!

ఓ మహారాజా! ఒక కుక్క ఉంది. దానికి ఆకలి వేసింది. ఎవరైనా ఇంత ముద్ద పెట్టకపోతారా అని ఇంటింటి వెళుతుంది. కొంత మంది జాలి తలచి అన్నం పెడతారు. కొంతమంది కర్రతీసుకొని కొడతారు. అంతా అది చేసుకున్న ప్రారబ్ధము వలన జరుగుతుంది. అలాగే ఈ దేహములో ఉన్న జీవుడు కూడా తన కోరికలు తీర్చుకోడానికి మంచి మార్గములు, చెడు మార్గములు తొక్కుతుంటాడు. వాటి ఫలితంగా స్వర్గలోకములు, నరక లోకములు, మనిషి జన్మ, పశుజన్మ, ఎత్తుతూ ఉంటాడు. సుఖములను, దు:ఖములను అనుభవిస్తూ ఉంటాడు.

ఓ మహారాజా! దేహధారులందరికీ దు:ఖములు సహజంగా కలుగుతుంటాయి. వాటికి శాస్త్రములలో మార్గములు చూపబడ్డాయి. కానీ జీవుడు వాటిని పాటించడు.  తనకు తానుగా దు:ఖములలో చిక్కుకుంటూ ఉంటాడు. లేక ఇతరుల వలన దు:ఖములు పొందుతూ ఉంటాడు. అదీ ఇదీ కాకపోతే దైవికముగా కలిగే అంటే తుఫానులు,

భూకంపాల వలన కలిగే దు:ఖమును అనుభవిస్తూ ఉంటాడు. కానీ శాస్త్రములలో చెప్పిన మార్గములను పాటించడు.

ఎలాగంటే, ఒకడి నెత్తి మీద బరువు మోస్తున్నాడు. కాసేపు బుజం మీద పెట్టుకుంటాడు. అంటేకొంత సుఖం పొందుతాడు. కాసేపుచేత్తోపట్టుకుంటాడు. ఇంకొంత సుఖంపొందుతాడు. అంతేకానీ పూర్తిగా దు:ఖాన్నిపోగొట్టుకోడానికి ప్రయత్నించడు. దు:ఖానికి దు:ఖానికి మధ్య కలిగే విరామమే సుఖము. దానికోసమే జీవుడు వెంపర్లాడుతుంటాడు.

ఓ మహారాజా! ఇంకొక విషయం చెబుతాను విను. ఒక దు:ఖాన్ని పోగొట్టు కోడానికి మరొక కర్మ చేస్తాడు జీవుడు. ఆ కర్మవలన దు:ఖం పోదు. మరొక దు:ఖం వచ్చి చేరుతుంది. ఎందుకంటే కర్మ, దాని వలన కలిగే దు:ఖము, ఆ దు:ఖము పోవడానికి చేసే మరొక కర్మ, ఇవన్నీ  అజ్ఞానము అవిద్య వలన కలిగేవే. ఒకడికి ఒక కల వచ్చింది. ఆ కలలో ఏదో భయానక దృశ్యం చూచి భయపడ్డాడు. ఆ భయం పోవడానికి మరొక కల కన్నాడు. అందులోమరొక భయానక దృశ్యం చూచాడు. వాడి భయం మరింత ఎక్కు అయింది. ఒక స్వప్నం వలన కలిగిన భయం పోవడానికి, నిద్రలేచి, మొహం కడుక్కుని కాసేపుమేలుకొని ఉంటే ఆ భయం పోతుంది కానీ, మరలా అదేరకమైన మరొక కల కంటే ముందు ఉన్న భయం పోదు కదా! అలాగే, ఒక కర్మ చేసినందువలన కలిగిన దు:ఖము పోవడానికి మరొక కర్మ చేసి ఇంకొక దు:ఖము కొనితెచ్చుకోవడం అవివేకము, అజ్ఞానము.

(ఈ విషయాన్ని సరదాగా నేటికి అన్వయించుకుంటే ఎలా ఉంటుందో చూద్దాం. ఒకడు ఒక్కొక్క షేరు ధర 200 రూపాయల చొప్పున 100 షేర్లు కొన్నాడు అనుకుందాము. మర్నాడు ఆ షేరు 180 అయింది. దానిని యావరేజీ చేద్దామని 180 రూపాయల చొప్పున మరొక 100 షేర్లుకొన్నాడు. మర్నాడు అది 160 అయింది. ఆ రేటుకుమరొక 100 కొన్నాడు. ఈ విధంగా ఒక నష్టం తగ్గించు కోడానికి మరొక నష్టాన్ని కొనుక్కుంటున్నాడు అన్న మాట. అలా కాకుండా 200 కు కొన్నప్పుడు 195 కు స్టాప్ లాస్ పెట్టుకుంటే 500 ల నష్టంతో బయటపడేవాడు. కావాలంటే ఏ 150 లో మరలా కొనుక్కొని, వాటిని 155 కు అమ్మి తన నష్టాన్ని భర్తీచేసుకొనే వాడు. అలా చెయ్యకుండా, ఒక కష్టాన్ని పోగొట్టుకోడానికి మరొక పనిచేసి మరొక కష్టం కొనుక్కోవడం అంటే ఇదే.)

మహారాజా! ఈ జీవునికి మరొక దౌర్బల్యం ఉంది. అదే లేని పోనివి ఊహించుకోవడం. గాలిలో మేడలు కట్టడం. స్వప్నలోకాలలో విహరించడం. వాస్తవాలను మరిచిపోవడం. ఇంకొంతమంది ఏవేవో ఊహించుకొని భయపడుతుంటారు. దు:ఖపడుతుంటారు. తాడును చూచి పాము అనుకొని వణికిపోతుంటారు. దొంగలు పడ్డారనీ, పులీ మీద పడిందనీ వణికిపోతుంటారు. ఇదంతా వాస్తవానికి భిన్నంగా ఊహాలోకాలలో విహరించడం వలనకలిగే బాధలు. దీని కంతటికీ అజ్ఞానము, అవిద్య కారణము. తన మరణం అనివార్యము అని తెలిసినా, ఈ అజ్ఞానము వలన, మరణిస్తాము అన్న భయం కూడా వెంటాడుతూ ఉంటుంది.

ఈ అజ్ఞానము పూర్తి గా పోవాలంటే ఆ పరమాత్మ యందు అచంచలమైన నిర్మలమైన భక్తి కలిగి ఉండటమే  ఉత్తమమైన మార్గము. దానికి మించిన ఉపాయము మరొకటి లేదు. పరమాత్మయందు భక్తి కలిగి ఉంటే అజ్ఞానము పూర్తిగా నశిస్తుంది. జీవుడు దేనికీ భయపడడు. నిశ్చింతగా ఉంటాడు. పరమాత్మ యందుభక్తి కలిగి ఉంటే జ్ఞానం దానంతట అదే కలుగుతుంది. జ్ఞానము కలిగినప్పుడు అజ్ఞానము నశించిపోతుంది. ప్రాపంచిక విషయముల మీద విరక్తి కలుగుతుంది. భగవంతుని మీద ప్రేమ కలుగుతుంది.

ఓ మహారాజా! దానికి కావలసింది నిరంతరము పరమాత్మ యొక్క కథలు వినడం. పరమాత్మను కీర్తించడం. ఎల్లప్పుడూ పరమాత్మను స్మరించడం. వీటి వలన పరమాత్మ యందు భక్తి సులభంగా కొద్ది కాలములోనే  పెంపొందుతుంది. కాబట్టి జీవుడు ఎల్లప్పుడూ సత్పురుషులు ఉన్న చోటనే ఉండాలి. సత్సాంగత్యం కోరుకోవాలి. వారి నోటి వెంట వాసుదేవుని కథలు వినాలి. వాసుదేవుని కీర్తిని గానం చేయాలి. వాసుదేవుని మనసారా స్మరించాలి. అప్పుడు ఆకలి, దాహము, భయము, దు:ఖము ఏవీ ఉండవు. ప్రాపంచిక విషయముల మీద మోహము నశిస్తుంది. ఎల్లప్పుడూ దు:ఖము అనేది తెలియకుండా ఆనంద సాగరంలో ఓలలాడుతుంటాడు.

కాని, ఓ ప్రాచీన బర్హి మహారాజా! మానవునికి సహజంగా ఆకలి దాహము కలుగుతుంటాయి. మానవుడు తనలో పుట్టిన అన్ని రకములైన "ఆకలి", అన్ని రకములైన "దాహము" లను(ధన దాహము,

అధికార దాహము, కామదాహము, మొదలైనవి) తీర్చుకోడానికి నిరంతరము శ్రమపడుతుంటాడు. పరమాత్మను గురించి తలుచుకోడానికి అతనికి తీరిక ఉండదు. హరి కథలను వినడానికి ఎటువంటి ఆసక్తి చూపించడు.

ఇంతెందుకు, ప్రజాపతులకు అధిపతి అయిన బ్రహ్మ, మనువులు, దక్షుడు, మున్నగు ప్రజాపతులు, సనకాదులు, మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, క్రతువు, భృగువు, వశిష్ఠుడు, నా వంటి వారు కూడా ఈ కోరికలకు అవి తీరకపోతే కోపమునకు అసూయకు వశులై ఆ పరమాత్మను గురించి పూర్తిగా తెలుసుకోలేకపోయారు కానీ తాము తెలుసుకున్నాము అనే భ్రమలో ఉన్నారు.

వేదములు అనంతములు. వాటికి శబ్దబ్రహ్మములు అని పేరు. ఆ వేదములలో ఉన్న మంత్రములను వేరు విధంగా అర్థం చేసుకొని ఇంద్రుడు మొదలగు వివిధ దేవతలను పూజిస్తూ, ఆ పరమాత్మయొక్క అసలు తత్త్వమును తెలుసుకోలేక పోతున్నారు. అలా కాకుండా పరమాత్మ మీద భక్తినిపెంపొందించుకొని జీవాత్మను పరమాత్మలో ఐక్యం చేయడానికి ప్రయత్నం చేసేవాడిమీద ఆ పరమాత్మ తన కరుణను ప్రసరింప చేస్తాడు. వాడిని ఈసంసార బంధముల నుండి ఉద్ధరించి, తనలో చేర్చుకుంటాడు. అటువంటి భక్తుడు లౌకికమైన వ్యవహారములలో ఆసక్తి చూపడు. వేదములలో చెప్పబడిన కర్మకాండలను చేయడానికి ఇష్టపడడు. భగవంతుని మీద అచంచలమైన భక్తిని కలిగి ఉంటాడు.

కేవలము అజ్ఞానులే వేదములు కేవలము కర్మకాండలు బోధిస్తాయి అని చెబుతారు. అది నిజంకాదు. వారు వేదములను సరిగా చదివి వాటి భావమును అవగాహన చేసుకోకపోవడం వలన అలా అంటుంటారు.

ఓ ప్రాచీన బర్హి మహారాజా! నీవు ఏం చేసావో చెప్పు. నేను అన్ని యజ్ఞములు చేసానని గర్వంగా చెప్పుకున్నావు. యజ్ఞకాలంలో నీవు పరిచిన దర్భలతో ఈ భూమి నిండి పోయిందని గొప్పలు చెప్పుకున్నావు. నీవు కేవలము నీ గొప్పదనాన్ని చాటుకోడానికే ఇన్ని యజ్ఞములు యాగములు చేసావు కానీ భగవంతునిమీద భక్తితో కాదు. కాబట్టి అవన్నీ నిష్ప్రయోజనములు అయ్యాయి.
(ఈ రోజుల్లో కూడా చాలా మంది తాము దేవుడికి స్వర్ణ కిరీటం చేయంచాము, రత్నాల హారములు చేయించాము, బంగారు తొడుగు వేయించాము అని గొప్పలు చెప్పుకుంటూ ప్రచారం చేసుకుంటారు, ఫోటోలు వేయించుకుంటారు. అవి అన్నీ ఎందుకూ పనికిరావు అని స్పష్టం చేసాడు నారదుడు.)

ఓ రాజా! హరి సేవయే నీ కర్తవ్యము అని తెలుసుకోలేక పోయావు. శ్రీహరికి ఏద్వైతే సంతుష్టిని కలుగజేస్తుందో అదే జీవుని కర్తవ్యము అని నీకు తెలియదు. ఏది అభ్యసిస్తే శ్రీహరి యందు భక్తి కలుగుతుందో, బుద్ధి స్థిరంగా ఉంటుందో అదే సరైన విద్య.

ఓ మహారాజా! ఆ శ్రీహరి అన్ని జీవులలో అంతర్లీనంగా ఉన్నాడు. ఈ విశ్వమును శాసించేది ఆయనే. ఈ ప్రాపంచిక

విషయముల నుండి బయట పడాలంటే ఆయన పాదములను ఆశ్రయించడమే ఏకైక మార్గము. శ్రీహరిని నమ్ముకుంటే ఆ మానవునికి సకల శ్రేయస్సులు కలుగుతాయి. పరమాత్మను నమ్ముకున్నవాడికి ఎలాంటి భయమూ ఉండదు. ఎందుకంటే సాక్షాత్తు పరమాత్మ తనలోనే ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు అని తెలుసుకున్న జీవుడికి ఇంక భయం ఎందుకు ఉంటుంది. ఆ విషయం తెలుసుకున్న వాడే అన్ని విద్యలను తెలిసిన వాడు. ఆయనే అజ్ఞానులందరికీ గురువు. ఆయనే సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడు.

ఓ ప్రాచీన బర్హి మహారాజా! ఈ సందర్భంగా నీకు ఒక వృత్తాంతము చెబుతాను. సావధానంగా విను. ఒక అడవిలో ఒక జింక ఉంది. దానికి ఒక ఆడజింక భార్య. ఆ మగ జింక తన భార్యతో సహా అడవిలో విహరిస్తూ ఉంది. లేత పచ్చిక చిగుళ్లను ఆప్యాయంగా తింటూ ఉంది. ఆ వనంలో తేనెకోసరం తిరిగే తుమ్మెదల ఝుంకారాల్ని వీనుల విందుగా వింటూ ఉంది. కానీ పక్క పొదలోనే తాను ఏమరి పాటుగా ఉన్నప్పుడు తనను చంపి తినడానికి ఒక తోడేలు పొంచి ఉన్నదని దానికి తెలియదు. దూరంగా చెట్టు మీద కూర్చున్న వేటకాడు తన వంక ఒక వాడి అయిన బాణమును ఎక్కుపెట్టి ఉన్నాడనీ ఏ క్షణంలో నైనా ఆ బాణము తన గుండెల్లో గుచ్చుకుంటుందనీ ఆ జింకకు తెలియదు.

జీవుడు ఆ జింకతో సమానమే. అదే పరిస్థితిలో ఉన్నాడు. జీవుడు కూడా సంసారంలో పడి భార్యతో సుఖజీవనం చేస్తుంటాడు. అన్ని రకాల భోగాలను, సుఖాలను అనుభవిస్తుంటాడు. రుచి రుచిగా

తింటుంటాడు. అనేకములైన పానీయములను తాగుతుంటాడు. స్త్రీలతో కామసంబంధమైన సుఖములను అనుభవిస్తుంటాడు. ఇంకా కొత్త కొత్త రుచుల కోసరం వెదుకుతుంటాడు. భార్యా బిడ్డల మీద, బంధువుల మీద వ్యామోహముతో వారి కోసరమే బతుకుతుంటాడు. కానీ తన పక్కనే పొంచి ఉన్న కాలము అనే తోడేలు తన ఆయుష్షును క్షణక్షణం హరిస్తూ ఉందని తెలుసుకోలేకపోతున్నాడు. మృత్యువు అనే వేటకాడు తన మీద పడి తనను ఎప్పుడు కబళిస్తాడో, తన ప్రాణాలు ఎప్పుడు ఏ క్షణంలో హరిస్తాడో అని తెలుసుకోలేకపోతున్నాడు. ఎప్పుడో ఒకప్పుడు మృత్యువాత పడటం తప్పదు అని తెలిసికూడా తనను తాను చిరకాలం బతుకుతాడు అని అనుకుంటూ ఉంటాడు.

ఓ రాజా! నీవుకూడా ప్రస్తుతము ఆ జింక ఉన్న పరిస్థితిలో ఉన్నావు. కాబట్టి జాగ్రత్తగా ఉండు. పరమాత్మ యందునీ చిత్తము లగ్నం చెయ్యి. ఈ కర్మ కాండల మీద, యజ్ఞయాగముల మీద, వ్రతముల మీద ఆసక్తి వదిలిపెట్టు. కామకోరికలతో నిండి ఉన్న గృహస్థాశ్రమమును వదిలిపెట్టు. ఆ పరమాత్మ మీదమనసు నిలుపు. క్రమక్రమంగా ఈ సంసారము నుండి విముక్తి పొందుతావు." అని నారదుడు ప్రాచీన బర్హికి జ్ఞానోపదేశం చేసాడు.

నారదుడు చెప్పిన మాటలను సావధానంగా విన్న ప్రాచీన బర్హి మహారాజు నారదునితో ఇలా అన్నాడు. "ఓ నారదమహర్షీ! నీవు చెప్పిన విషయములను విని బాగా ఆలోచించాను. కానీ నా దగ్గర ఉన్న గురువులకు ఈ విషయాలు ఎందుకు తెలియదు? తెలిసినా నాకు చెప్పలేదా! లేక నన్ను తప్పు మార్గంలో నడిపించారా! నీవు చెప్పిన

విషయములు అన్నీ వాళ్లకు కూడా తెలిస్తే వాళ్లు నాకు ఎందుకు చెప్పరు! ఎందుకంటే ఇప్పటి దాకా నాకు నా గురువులు ఉపదేశించిన వాటికీ, నీవు చెప్పిన వాటికీ చాలా తేడా ఉంది. నీవు నాకు భక్తి గురించి, జ్ఞానము గురించి, వైరాగ్యము గురించి వివరంగా చెప్పావు. అన్నీ జయించాము అని చెప్పుకుంటున్న మహాఋషులు కూడా అప్పుడప్పుడు ఈ మోహంలో పడుతుంటారు.

అది అలా ఉంచండి. నాకు మరొక సందేహము కలిగింది. జీవుడు ఈ దేహముతో ఎన్నో కర్మలు చేస్తుంటాడు. ఆయువు తీరగానే ఈ దేహమును విడిచిపెడతాడు. సూక్ష్మదేహంతో పరలోకానికి పోయి వాడు చేసిన కర్మలకు ఫలితంగా స్వర్గ,నరకాలను అనుభవిస్తాడు అని పెద్దలు చెబుతారు. కానీ,  జీవుడు వదిలిపెట్టిన దేహముతోనే వాడు చేసిన కర్మలు కూడా నాశనము అవుతాయి కదా! జీవుడు చేసిన కర్మలు దేహంతో కూడా ఇక్కడే అంతం అయినప్పుడు, ఇంక ఆ కర్మల ఫలాన్ని పరలోకంలో  వేరే దేహంతో అనుభవించే అవకాశం ఎక్కడుంది. కర్మలే లేనపుడు కర్మఫలం మాత్రం ఎక్కడుంటుంది. ఈ విషయం నాకు తెలియజేయండి." అని అడిగాడు.

ప్రాచీన బర్హి అడిగిన ప్రశ్నకు నారదుడు ఈవిధంగా సమాధానం చెప్పాడు. "మహారాజా! జీవుడు స్థూల దేహంలో ఉంటాడు అనీ నీకు తెలుసు కదా. స్థూల దేహం అంటే పది ఇంద్రియములు. మనకు కనపడేవి. కానీ ఈ స్థూల దేహముతో చేసే అన్నిపనులకు మూల కారణము లోపల ఉన్న సూక్ష్మదేహము. మనము చేసే పనులకు సంబంధించిన వాసనలను అన్నిటినీ ఆ సూక్ష్మదేహము సేకరించి

తనతో ఉంచుకుంటుంది. ఈ స్థూల దేహము కాలానుగుణంగా మరణించినా, సూక్ష్మ దేహము మరణించదు. ఆ సూక్ష్మదేహము, ఆ వాసనలతో సహా మరొక దేహమును ఆశ్రయిస్తుంది. మరొక దేహాన్ని ఆశ్రయించే ముందు, గతజన్మలో తాను చేసిన పాపములు, పుణ్యములు వాటికి సంక్రమించిన ఫలములను, స్వర్గ,నరకములలో అనుభవిస్తుంది.

ఇదిఎలాగంటే, మానవుడు నిద్రపోయినపుడు దేహము, అవయవములు పనిచేయవు. అంటే స్థూల దేహము మరణించినట్టు పడిఉంటుంది. అప్పుడు లోపల ఉన్న సూక్ష్మదేహము పనిచేస్తుంది. అదే మనస్సు ఆ మనస్సుతో రకరకాల దేహములను కల్పించుకుంటుంది. అదే నిజమని నమ్ముతుంది. రకరకాల పనులుచేస్తుంది. సుఖాలను అనుభవిస్తుంది. దు:ఖమును పొందుతుంది. భయపడుతుంది. (కలలు కనడం అంటే ఇదే!) మెలుకువ రాగానే అవిఅన్నీ మాయం అయిపోతాయి. అలాగే ఈ స్థూల దేహము మరణించిన తరువాత సూక్ష్మదేహము స్వర్గములో సుఖములను, నరకములో దు:ఖములను, తాను స్వప్నములో రకకరాల దేహములతో అనుభవించినట్టు, అనుభవిస్తుంది. అంటే స్వర్గ నరకములలో కూడా తాను చేసిన కర్మలఫలములకు అనుగుణంగా దేహములను కల్పించుకొని, వాటిని ధరించి అనుభవిస్తుంది. స్వర్గములో, నరకములో కర్మఫలములను అనుభవించడం పూర్తి కాగానే ( స్వప్నములో నుండి మేలుకొని తన దేహములో ప్రవేశించినట్టు) మరొక దేహంలో ప్రవేశిస్తుంది.

మహారాజా! జీవుడు స్థూలదేహములో ఉన్నంత కాలము, దేహాభిమానంతో నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, నేను మహారాజును, నేను విద్వాంసుడను అనే భావనలతో రకరకాలైన కర్మలను చేస్తుంటాడు. ఆయా కర్మల ఫలితములను అనుసరించి, మరు జన్మలో దేహములు పొందుతాడు.

ఒక మానవుని యొక్క మానసిక ప్రవృత్తిని, ఆ మానవుడు చేసే పనులను బట్టి నిర్ణయిస్తాము. అలాగే, ఆ మానవునియొక్క చిత్రవృత్తిని బట్టి అతనిపూర్వజన్మలో ఏమేం పనులు చేసాడో ఊహించవచ్చును.
( ఎవడికైనా భరించరాని కష్టం దు:ఖం వచ్చినప్పుడు, “పోయినజన్మలో ఏం పాపాచేసాడో ఏమో! ఈ జన్మలో ఈవిధంగా అనుభవిస్తున్నాడు” అని మనం సాధారణంగా అంటుంటాము కదా!)

స్వప్నములు వచ్చినపుడు, ఆ స్వప్నములలో ఈ జన్మలో ఎన్నడూ కూడా చూడని మనుషులను, ప్రదేశములను చూస్తుంటాము. ఆ ప్రదేశములను, మనుషులను అతడు తనపూర్వజన్మలో చూచి ఉంటాడు. అవే ఈజన్మలో స్ఫురణకు వస్తున్నాయి అని గ్రహించాలి. ఎందుకంటే ఎప్పుడూ చూడని మనుషులు, ప్రదేశములు గుర్తుకు వచ్చే అవకాశం లేదు. ఎప్పుడో ఒకప్పుడు చూచి ఉండాలి. ఈ జన్మలో చూడనప్పుడు, గతజన్మలో చూచిఉండాలి అని భావించాలి.

ఓ మహారాజా! ఒకడు పరమ శాంతంగా ఉంటాడు. అతడు జీవితాంతం అలాగే శాంత స్వభావుడుగా ఉంటాడు అని మనస్సు

నిర్ణయిస్తుంది. అలాగే మరొకడు ఉగ్రస్వభావుడుగా ఉంటాడు. వాడిని జీవితాంతం అదే స్వభావంతో కొనసాగుతాడని మనస్సునిర్ణయిస్తుంది. ఈ స్వభావాలు అతనికి గత జన్మనుండి సంక్రమిస్తాయి.

మహారాజా! ఒక్కోసారి మనకు కలత నిద్రలో వచ్చే కలలో చిత్ర విచిత్ర మైన విషయములు కనిపిస్తూ ఉంటాయి. అవి ఇంతకుముందు మనము చూడనివి, విననివి. (కనీ, వినీ ఎరుగని అని వాడుతూ ఉంటారు). ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా ఉంటాయి. ఎప్పుడో చచ్చి పోయిన వాళ్లు ఇప్పుడు మనతో మాట్లాడుతున్నట్టు అనుభూతి కలుగుతుంది. మైళ్ల దూరంలో నివసించే వాళ్లు, ఒక ఇంట్లో కూర్చుని మాట్లాడుకుంటున్నట్టు అనిపిస్తుంది. అవన్నీ కూడా మనసులో నిక్షిప్తమైన భావాలే. అవి ఒక ప్రదేశము, ఒక కాలము, ఒక పనికి సంబంధించి ఉండవు. కలగా పులగంగా ఉంటాయి.

ప్రతి ప్రాణికి మనస్సు అనేది ఒకటి ఉందని చెప్పాను కదా! ఆ మనస్సు ఈ జన్మకు మాత్రము పరిమితం కాదు. ఇదివరకు ఆ ప్రాణి ఎత్తిన జన్మల వాసనలు అన్నీ తనలో నిక్షిప్తంచేసుకొని ఉంటుంది. ప్రతి జన్మలోనూ ఎన్నో విషయాలను వింటూ ఉంటాము. ఎన్నో విషయాలను చూస్తూ ఉంటాము. ఎన్నో పనులు (మంచి పనులు చెడ్డ పనులు) చేస్తూ ఉంటాము. అవి అన్నీ మనసులో సూక్ష్మరూపంలో దాగి ఉంటాయి. నిద్రావస్థలో ఉన్నపుడు ఆ వాసనలు కలల రూపంలో కనపడుతుంటాయి. ఇంతకుముందుజన్మలలో చూచిన వాళ్లు,చేసిన పనులు, ఈ జన్మలో స్వప్నములో కనపడుతుంటారు. ఈ కలలు కొన్ని

సార్లు సంక్షిప్తంగా ఉంటాయి. కొన్ని సార్లు దీర్ఘంగా, విస్తృతంగా ఉంటాయి. ఇదంతా మనసులో గత జన్మల వాసనలు అన్నీ నిక్షిప్తం అయి ఉండటమే కారణము.

ఓ మహారాజా! ఎల్లప్పుడూ సాత్వికంగా ఉంటూ, చిత్తంలో ఎల్లప్పుడూ భగవంతుని ధ్యానం చేస్తూ, ఉండే వాడికి ఈ అనంత విశ్వం అంతా ప్రకాశవంతంగా కనిపిస్తుంది. ప్రతి ప్రాణిలోనూ భగవంతుని చూడగలడు. ప్రస్తుతము మానవులకు భగవంతుని ప్రార్థించే సమయం లేదు. ఎప్పుడూ నేను నాది అనుకుంటూ ప్రాపంచిక విషయముల గురించి పాకులాడుతుంటాడు.

ఓ మహారాజా! ప్రతి ప్రాణికి స్థూల దేహము, సూక్ష్మదేహము అని రెండు దేహములు ఉంటాయి. స్థూల దేహము అంటే మనకు కనిపించే దేహము. ఈ దేహము లోపల బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు అనే పంచ తన్మాత్రలు, సత్త్వ,రజస్తమోగుణములు ఇవన్నీ కలిస్తే సూక్ష్మదేహము అవుతుంది. ప్రాణి మరణించినపుడు స్థూల దేహము మాత్రము ఇక్కడే ఉంటుంది. సూక్ష్మదేహము బయటకు వెళ్లిపోతుంది. ఈ సూక్ష్మదేహము స్థూల దేహములో ఉన్నంత వరకూ, దేహాభి మానము, నేను నాది అనే భావన ప్రతి ప్రాణిలోనూ ఉంటుంది.

కాని కొన్ని సమయాలలో ఈ స్థూలదేహము పని చేయదు. నిద్ర, మూర్ఛ, ఉపతాపము (మనం కోమా అంటామే అది) మృత్యుకాలము (చనిపోయేముందు వచ్చే మగత, స్పృహలేకపోవడం),

విపరీతంగా జ్వరం వచ్చినప్పుడు కలిగే మగత, ఈ పరిస్థితులలో జీవునికి దేహము స్వాధీనములో ఉండదు. అప్పుడు దేహాభిమానము ఉండదు.

(వీటికి తోడు మనం మరొకటి కూడా చేర్చుకోవచ్చు. కల్లు కాంపౌండుల దగ్గరా, వైన్ షాపుల దగ్గరా, చిత్తుగా తాగి ఒంటిమీద స్పృహలేకుండా, రోడ్ల పక్కన, దుమ్ములో, మట్టిలో పొర్లాడుతుంటారు. వారికి ఒంటిమీద బట్ట ఉందో లేదో కూడా తెలియదు).

సాధారణంగా మానవులకు వయసు వచ్చిన తరువాత పది ఇంద్రియములు, మనస్సు ద్వారా లోపల ఉన్న సూక్ష్మదేహము పనిచేస్తూ ఉంటుంది. కాని జీవుడు తల్లి గర్భంలో ఉన్నప్పుడు, శిశువుగా ఉన్నప్పుడు ఈ సూక్ష్మదేహము పూర్తిగా పనిచేయదు. జీవుడు ఎల్లప్పుడు ఈ సూక్ష్మదేహముతో ఆలోచిస్తుంటాడు.ఈ ప్రాపంచిక విషయములలో గాఢంగా లీనమైనప్పుడు, మేల్కొని ఉన్నా, నిద్రపోయినా, తన ఎదురుగుండా ఆ విషయములు లేకపోయినా, వాటి గురించే ఆలోచిస్తూ ఉంటాడు.

(ఎవడి మీదన్నా తీవ్రమైన కోపం ఉన్నపుడు, వాడి మీద ప్రతీకారం తీర్చుకోవాలి అనుకున్నప్పుడు, వాడు ఎదురుగా లేకపోయినా వాడి గురించే ఆలోచించడం, వాడి మీది కోపాన్ని ఇంట్లో ఉన్న వస్తువుల మీద చూపించి వాటిని బద్దలు కొట్టడం, ఆఖరుకు నిద్రపోతూ, కలలో కూడా వాడి గురించి కలవరించడం ఈ కోవకు చెందుతాయి.)

ఓ రాజా! ఇప్పుడు నీకురెండు విషయాలు చెప్పాను. ఒకటి సూక్ష్మదేహము. రెండవది జీవుడు. సూక్ష్మదేహము అంటే శబ్దము, స్పర్శ,

రూపము, రసము గంధము, పది ఇంద్రియములు, మనస్సు (దీనినే బుద్ధి, చిత్తము, అంత:కరణము అని కూడా సమయానుకూలంగా పిలుస్తారు), సత్త్వ,రజస్తమోగుణములు, ఇవి అన్నీ కలిపి సూక్ష్మదేహంగా రూపొందుతుంది. ఇవన్నీ చైతన్యవంతం అయితే దానిని జీవుడు అంటారు.

(ఎదురుగా మామిడిపండు ఉంటుంది. తినడానికి నోరు, నాలుక ఉంటాయి. కాని లోపల చైతన్యం లేకపోతే మామిడి పండు తినాలనే కోరిక, అది తియ్యగా ఉంది అనే భావన రాదు. ఆ చైతన్యమే జీవుడు).

లోపల ఉన్న ఈ సూక్ష్మదేహము చేతనే జీవుడు బయట ప్రపంచములో జరిగే విషయములను అనుభవించగలుగుతున్నాడు. కావలసినవి తీసుకుంటున్నాడు. వద్దు అనుకున్నవి వదిలిపెడుతున్నాడు. ప్రాపంచిక విషయములను అనుభవించడం ద్వారా సంతోషము, దు:ఖము, శోకము, ఆనందము మొదలగు భావాలను పొందుతున్నాడు. మనస్సు ఈ వాసనలను తనలో నిక్షిప్తం చేసుకుంటూ ఉంటుంది. జీవుడు ఈ దేహాన్ని వదిలిపెట్టినా, సూక్ష్మదేహము మాత్రము తిరిగి మరొక దేహములో ప్రవేశించేంత వరకు, గతజన్మ వాసనల ప్రభావంలో ఉంటుంది.

కాబట్టి మహారాజా! జీవుడు మరలా మరొక దేహంలో ప్రవేశించడానికి ఈ మనస్సే కారణము. గతజన్మ వాసనలకు అనుగుణమైన దేహంలో ప్రవేశించి, ఆ దేహంలో మరలా కర్మలు చేయడం మొదలుపెడుతుంది. ఇలాగా, మనసులో ఉన్న వాసనలు అన్నీ నాశనం అయ్యేంతవరకూ జీవునికి జననమరణ చక్రంలో

తిరగడం తప్పదు.  ఎందుకంటే, గతజన్మలో చేసిన కర్మల వాసనలు మనసులో నిక్షిప్తం అయి ఉంటాయి. ఆ విషయ వాసనల ప్రకారమే ఈ జన్మలో కూడాకర్మలు చేస్తుంటాడు. ఆ కర్మల ఫలితములను అనుభవిస్తూ ఉంటాడు. ఆ ఫలితములు మరలా మరలా అనుభవించడానికి మరలా మరలా కర్మలు చేస్తుంటాడు. ఈ కర్మల వలననే జీవునికి బంధనములు ఏర్పడతాయి.

ఈ వాసనలు నిర్మూలం కావాలంటే, ఈ బంధనములు తొలగిపోవాలంటే, సృష్టి, స్థితి, లయకారుడైన ఆ పరమాత్మను సేవించడం, కీర్తించడం, ఆయన కథలను వినడం, ఆయన మీద నిర్మలమైన భక్తి కలిగిఉండటం కన్నా మరొక మార్గం లేదు. ఆయన పాదములు పట్టుకుంటేనే కానీ ఈ అవిద్య తొలగిపోదు. కాబట్టి ఈ కర్మలు, యజ్ఞయాగములు చేయడం మాని, పరమేశ్వరుని ధ్యానించు. నీకు ఈ కర్మబంధనముల నుండి విముక్తి కలుగుతుంది." అని నారదుడు ప్రాచీన బర్హికి జ్ఞానోపదేశం చేసాడు. తరువాత నారదుడు ప్రాచీన బర్హిదగ్గర సెలవు తీసుకొని వెళ్లిపోయాడు.

ప్రాచీన బర్హి మహారాజు ఇంక క్షణకాలం కూడా ఆలస్యం చేయలేదు. తన కుమారుల రాక కోసరం ఎదురు చూడలేదు. మంత్రులను పిలిచి "నా కుమారులు రాగానే ప్రజాసృష్టిని కాపాడమని నా మాటగా చెప్పండి" అని వారికి చెప్పాడు. రాజ్య పాలన వారికి అప్పగించాడు. తపస్సు చేసుకోడానికి కపిలాశ్రమమునకు వెళ్లిపోయాడు. అక్కడ అన్ని సంగములను వదిలిపెట్టాడు. మనస్సును అదుపులో పెట్టుకున్నాడు. పరమాత్మ పాదములమీద మనసు నిలిపాడు.

పరమాత్మలో లీనమైపోయాడు.

ఓ విదురా! నారదుడు చెప్పిన ఉపాఖ్యానములను, జ్ఞాన బోధను విన్నావు కదా! నారదుడు కథల రూపంలో అధ్యాత్మ తత్త్వమును ఉపదేశించాడు. ఈ ఆత్మ తత్త్వమును ఎవరు చదువుతారో, ఎవరు వింటారో, మరొకరికి వినిపిస్తారో, వారికి దేహాభిమానము, అహంకారము నశిస్తుంది. ఈ వాసనామయమైన సూక్ష్మదేహము నుండి విముక్తి కలుగుతుంది. పరమాత్మలో ఐక్యం అవుతాడు." అని మైత్రేయుడు విదురునికి నారద ప్రాచీన బర్హి సంవాదమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము ఇరువదితొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## చతుర్థ స్కంధము

## ముప్పదవ అధ్యాయము.

విదురుడు మైత్రేయునితో ఇలా అంటున్నాడు. "ఓ మైత్రేయ మహర్షీ! ప్రాచీన బర్హికుమారులు అయిన ప్రచేతసులు తండ్రి ఆదేశంతో తపస్సుకు బయలు దేరారనీ, వారికి దారిలో పరమేశ్వరుడు ప్రత్యక్షం అయ్యాడనీ, వారికి రుద్రగీత వినిపించాడనీ తరువాత వారు తపస్సుకు వెళ్లారనీ చెప్పావు. ఆ తరువాత ఏం జరిగింది. వారికి ఆ

రుద్రగీత వలన ఏం ప్రయోజనం కలిగింది. నాకు వివరించండి. అయినా కూడా, ఒక సారి పరమేశ్వరుడు ప్రత్యక్షం అయి, ఆ పరమాత్మయొక్క మహాత్మ్యమును వినిపించిన తరువాత, ప్రచేతసులకు పరమ పదము లభించినట్టే కదా! మరి ఆ తరువాత కూడా ప్రచేతసులు తపస్సు ఎందుకు చేసారు? ఆ తపస్సు చేసినందు వలన వారికి ఏమి ఫలితం కలిగింది. " అని అడిగాడు.

మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు. "విదురా! ప్రచేతసులు రుద్రుని వలన రుద్రగీతను విన్న తరువాత కూడా తండ్రి ఆదేశము మేరకు తపస్సు చేసారు. సముద్రము లోపల నీటిలో మునిగి పదివేల సంవత్సరములు రుద్ర గీతను జపిస్తూ తపస్సు చేసారు. వారి తపస్సుకు మెచ్చిన శ్రీహరి వారికి ప్రత్యక్షం అయ్యాడు.

శ్రీహరి గరుత్మంతుని మీద ఎక్కి అక్కడకు వచ్చాడు. పసుపు పచ్చని పట్టు బట్టను కట్టుకొని ఉన్నాడు. మెడలో కౌస్తుభమణి మెరుస్తూ ఉంది. శ్రీహరి మేని నుండి వెలువడే కాంతితో ఆ ప్రదేశం అంతా ప్రకాశ వంతం అయింది. శ్రీహరి చెవులకు ఉన్న కుండలములు ఆ కాంతిలో మెరుస్తున్నాయి. శ్రీహరిని మునులు, గంధర్వులు సేవిస్తున్నారు. ఆయన మెడలో పొడుగాటి వనమాల వేలాడుతూ ఉంది. ఆ ప్రకారంగా స్వప్రకాశంతో వెలిగిపోతున్న శ్రీహరి ప్రచేతసులను చూచి మేఘ గంభీర స్వరంతో ఇలా అన్నాడు.

"ఓ కుమారులారా! మీ తపస్సుకు మెచ్చాను. మీరు పది మంది సోదరులు అయినప్పటికీ ఒకటిగా నిలిచి నా గురించి తపస్సు చేసారు. నాకు చాలా సంతోషము అయింది. మీకు ఏం వరం

కావాలో కోరుకోండి. మీ వంటి సోదరులనుచూచి మానవులు సోదర ప్రేమ ఎలా ఉంటుందో తెలుసుకుంటారు. మానవులందరూ సాయంసమయంలో మీ సోదరులను తలచుకొని వారు కూడా తమ తమ సోదరులను, సాటి మానవులను తమతో సమానంగా ప్రేమిస్తారు. మీ మాదిరి రుద్రగీతతో ప్రతిరోజూ ఉదయం సాయంకాలం నన్ను స్తుతించే వారికి నేను ప్రసన్నుడనవుతాను. వారు కోరిన కోరికలు తీరుస్తాను. అదీ కాకుండా, మీరు పరమశివుని దర్శనంతో తృప్తి చెందకుండా మీ తండ్రి గారు చెప్పిన మాటను పాటించారు. పితృవాక్యపరిపాలన చేసారు. మీ కీర్తి ముల్లోకములలో వ్యాప్తి చెందుతుంది. మీకు ఒక పుత్రుడు కలుగుతాడు. అతడు బ్రహ్మదేవునితో సమానమవుతాడు. అతని సంతానముచేత మూడులోకములు నిండి పోతాయి.

కుమారులారా! పూర్వము కండు మహర్షి అనే ముని ఉండేవాడు. ఆయనకు ప్రమ్లోచ అనే అప్సరస వలన ఒక పుత్రిక కలిగింది. ఆ పుత్రికను వనదేవతలు పెంచి పెద్ద చేసారు. ఆ శిశువు ఆకలి వేసి ఏడుస్తుంటే చంద్రుడు తనచూపుడు వేలు ఆ శిశువు నోట్లోపెట్టి, అమృతమును స్రవించి, ఆ శిశువు ఆకలి తీర్చాడు. మీ తండ్రి మీకు ఈ లోకంలో సృష్టి చేయమని ఆదేశించాడు. మీరు వనదేవతల వద్ద పెరుగుతున్న ఆ కన్యను వివాహమాడి మీతండ్రి గారి కోరిక తీర్చండి. మీ సోదరులు పది మందీ ఒకే మాట మీద ఉంటారు. ఒకే ధర్మము, ఒకే శీలము కలవారు. కాబట్టి మీరు అందరూ ఆమెను వివాహం చేసుకోండి. ఆ కన్యకూడా మీకు తగినట్టు నడుచుకుంటుంది.(మహాభారత కథలో ద్రౌపది మాదిరి ఉదంతము

అంతకు పూర్వమే జరిగిందని మనకు ఈ కథ ద్వారాతెలుస్తూ ఉంది.) మీరు వేయి సంవత్సరములు ఈ లోకంలో సకలభోగాలు అనుభవిస్తారు. తరువాత నన్ను చేరుకుంటారు.

మీరే కాదు. నేను సకల కర్మలకు కారణం అనీ, అన్నికర్మలను, వాటి ఫలములను నాకు అర్పించువారు, నా గురించిన కథలను వింటూ సత్సాంగత్యములో ఉండేవారు, వారు గృహస్థాశ్రమములో ఉన్నప్పటికినీ, వారికి ఏ మలినమూఅంటదు. సంసారముల వలన కలిగే క్లేశములు వారిని బంధించవు. నిత్యమూ నా కథలను వింటూ, నా గుణగణములను కీర్తిస్తూ, ఉండే వారి హృదయములలో నేను పరబ్రహ్మ స్వరూపములో తిష్టవేసుకొని కూర్చుని ఉంటాను. నేను వారి యందు ఉన్నప్పుడు, వారిని ఎటువంటి మోహములు కానీ, శోకములు కానీ అంటవు. కాబట్టి మీరు కూడా గృహస్థాశ్రమములో ఉన్నప్పటికినీ, నిరంతరమూ నన్నే స్మరిస్తూ ఉండటంవలన, మీకు ఈ సంసారములో కలిగే రాగద్వేషములు,సుఖదు:ఖములు అంటవు."అని పలికాడు శ్రీహరి.

శ్రీహరి అమృతోపమానమయిన మాటలు విన్న ఆ ప్రచేతసులు చేతులు జోడించి ఇలా అన్నారు. "ఓ దేవా! సర్వ క్లేశములను తొలగించే వాడివి నువ్వే మా ఎదుట ప్రత్యక్షం అయితే, ఇంకా మాకు క్లేశములు ఎందుకుంటాయి. నిన్ను ఈ స్థూల దేహములో ఉన్న ఇంద్రియములతో తెలుసుకోలేము .అటువంటి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు శుద్ధుడవు. శాంతస్వరూపుడవు. ఆనంద స్వరూపుడవు. నీవు ఒక్కడి వైనప్పటికినీ, నీ మాయ వలన సృష్టి చేసే టప్పుడు బ్రహ్మగానూ, పోషించేటప్పుడు విష్ణువు గానూ, లయం చేసేటప్పుడు రుద్రుడు గానూ గోచరిస్తున్నావు. అట్టి నీకు నమస్కారము. ఓ దేవా! నీ అసలు తత్త్వము తెలుసుకున్న జీవులకు ఈ సంసారము నుండి విముక్తి లభిస్తుంది కదా! అట్టి నీకు నమస్కారము. నాభిలో కమలము కలవాడా! కమలములను మాలగా కలవాడా! కమలములవలె ఉన్న పాదములు కలవాడా! తామర రేకుల వంటి కన్నులు కలవాడా! అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు మూడులోకములలో ఉన్న జీవులకు ఆధారము. నీవే సర్వసాక్షివి. అట్టి నీకు నమస్కారము. ఓ దేవా! నీ దర్శన భాగ్యంచేతనే, మాలోని క్లేశములు అన్నీ తొలగి పోయాయి. ఇంతకంటే మాకు ఏం కావాలి? నీవు దీనజనోద్ధారకుడవు. ఈ లోకంలో ఉన్న దీనులను "వీళ్లు అందరూ నా వాళ్లు" అని నీవు అనుకుంటూ ఉండటం నీకే తగినది. ఎలా అంటే, దయామయుడైన యజమాని ఎల్లప్పుడూ తన వద్ద పని చేసే వారి యోగక్షేమములు విచారిస్తూ ఉంటాడు. అటువంటప్పుడు ఆ భృత్యుల కష్టములు అన్నీ తీరినట్టే కదా! అలాగే నీవు కూడా మంచి వారినే కాదు, దుష్టులను, నీచులను, తుచ్ఛులనుకూడా వారి హృదయ కుహరములలో ఉండి వారికోరికలు తీరుస్తూ ఉంటావు. అటువంటి వారి కోరికలే నీవు తీరుస్తూ ఉన్నప్పుడు, ఇంక మా కోరికల విషయం నీకు తెలియకుండా ఉంటుందా!

పరమాత్మ స్వరూపుడవు అయిన నీవు మాకు ప్రసన్నుడవు అయ్యావు. మా కోరికలు లన్నీ నీ వలన కాక మరెవరి వలన తీరుతాయి. కాబట్టి మేము ఒక్క వరమును కోరుతున్నాము. నీవు అనంతుడవు. సర్వవ్యాపివి. పారిజాతపుష్పములోని మకరందమును సేవించడానికి అలవాటు పడ్డ తుమ్మెద, ఇతర పుష్పముల మీద వాలడానికి ఇష్టపడుతుందా! అలాగే నీ పాదకమలములను సేవించడానికి ఉత్సాహం చూపించే మేము, మా కోరికలు తీరడానికి ఇతర దేవతలను ఎందుకు ప్రార్థిస్తాము.

ఓ దేవా! నీ మాయకు లోబడి మేము ఈ సంసారములో ఎంతవరకూ సంచరిస్తూ ఉంటాయో అంతకాలమూ, కాదు కాదు, అన్ని జన్మలకూ నీ పాద సేవను మరిచి పోకుండా, సదా నిన్ను కొలిచే నీ  భక్తుల పాదసేవలు మరిచిపోకుండా ఉండే మాకు వరం ప్రసాదించండి. ఎందుకంటే. నిరంతరమూ నిన్నుకొలిచే నీ భక్తుల పాద సేవ కొద్దికాలము చేసినను, అది అనంతమైన ఫలితములను ఇస్తుంది. నీ భక్తుల పాద సేవతో, స్వర్గ సుఖములు కూడా సాటి రావు. ఇంక ఈ ప్రపంచంలో లభించే రాజభోగములు, విషయ సుఖముల సంగతి చెప్పేదేముంది.

నీ భక్తులు అంతా ఒకచోట చేరితే నీ కథలను చెప్పుకుంటూ ఉంటారు. నీకథలను వినడం అలవాటు చేసుకుంటే, ఇతర భోగములు అనుభవించాలి అన్న కోరిక నశిస్తుంది. అప్పుడు సాటి ప్రాణుల మీద వైర భావము, విరోధము, ద్వేషము ఉండవు. వాటి స్థానంలో తనతోటి వారి మీద ప్రేమ, వారికి సాయం చెయ్యాలనే

కోరికా పుడతాయి. తాము చేసే పనులను, వాటి ఫలములను నీకే అర్పింస్తుంటారు. నీ గుణగణములను ఎల్లప్పుడూ కీర్తించే సాధువుల సాంగత్యంలో జీవితం గడుపుతారు. తీర్థయాత్రలుచేస్తూ ఉంటారు. ఈ ప్రపంచంలో ఉన్న అందరికీ జ్ఞానబోధ చేస్తుంటారు. అటువంటి సాధువుల సాంగత్యము ఎవరుకోరుకోరు?

ఓ దేవా! మేము నీ గురించి తపస్సుచేయడానికి వస్తున్నప్పుడు ఆ పరమేశ్వరుడు ప్రత్యక్షం అయి మాకు రుద్రగీత ఉపదేశించాడు. ఆ రుద్రగీతను నిరంతరం స్తుతించడం వలననే నీ దర్శనా భాగ్యం కలిగింది.

ఓ దేవా! మేము అందరమూ వేదములను చదువుకున్నాము. మా గురువులను, బ్రాహ్మణులను, వృద్ధులను పూజించాము. మంచి వారినీ, మా సోదరులను, ఇతర ప్రాణులను ఎన్నడూ హింసించలేదు. నీ గురించి పదివేల సంవత్సరములు జలంలో ఉండి తపస్సు చేసాము. మేము చేసిన పనుల వలన నీకు సంతోషము కలిగితే చాలు. అదే మాకు నీవు ప్రసాదించే వరము.

ఓ దేవా! యోగులు, మనువులు, పరమశివుడు, దేవతలు వీరందరూ నీ మహిమ గురించి పూర్తిగా తెలుసుకోలేక పోయారు. వారికి తెలిసినంతవరకూ నిన్ను కీర్తిస్తున్నారు. ఇంక మానవమాత్రులము మేమెంత. అందుచేత మేము కూడా మా శక్తి కొలదీ నిన్ను స్తుతించాము. ఓ దేవా! పరిశుద్ధస్వరూపుడవు, పరమ పురుషుడవు, సత్త్వగుణ సంపన్నుడవు, వాసుదేవుడవు అయిన నీకు నమస్కారము."

అని ప్రచేతసులు తమ శక్తికొలదీ శ్రీహరిని స్తుతించారు.

అప్పుడు శ్రీహరి వారిని చూచి చిరునవ్వు నవ్వి "మీరుకోరినట్టే జరుగుతుంది." అని వారికి వరం ప్రసాదించి అంతర్హితుడయ్యాడు.

తరువాత ప్రచేతసులు జలము నుండి బయటకు వచ్చారు. తమచుట్టు చూచారు. పదివేలసంవత్సరముల తరువాత బయట ప్రపంచాన్ని చూస్తున్నారు. తమ చుట్టు వృక్షములు పెరిగిపోయి తమకు దారి కనిపించడం లేదు అందుకని అడ్డం వచ్చిన చెట్లను కాల్చడం మొదలు పెట్టారు. భూమి మీద ఉన్న వృక్షములు అన్నీ మాడి మసి అయిపోతున్నాయి.  అప్పుడు బ్రహ్మదేవుడు పంపగా చంద్రుడు, వన దేవతలు అక్కడకు వచ్చారు. చెట్లను కాల్చడం పాపం అని చెప్పారు. అప్పటి దాకా తమ వద్ద పెరిగిన కన్యను వారికి ఇచ్చి వివాహం చేసారు.

ప్రచేతసులు పదిమందీ శ్రీహరి ఆదేశము మేరకు మారిష అను ఆ కన్యను వివామం చేసుకున్నారు. ప్రచేతసులకు ఆ కన్యయందు ఒకకుమారుడు జన్మించాడు. అతనే దక్షుడు. పూర్వజన్మలో ఈశ్వరునితో విరోధము పెట్టుకున్న దక్షుడు వీరభద్రుని చేతిలో మరణించాడు. తరువాత యాగము కొనసాగించడానికి దక్షుని శరీరమునకు మేక తల తెచ్చి అతికించారు. యజ్ఞము పూర్తి చేసారు. తరువాత మేకతలతో ఉన్న దక్షుడు కాలానుగుణంగా మృతి చెందాడు.

తరువాత ఆరవ మన్వంతరము అయిన చాక్షుస మన్వంతరంలో ప్రచేతసులకు కుమారుడిగా జన్మించాడు. దక్షుని ప్రభావానికి దేవతల తేజస్సులన్నీ మసకబారి పోయాయి. ఆ దక్షుడు అన్ని కర్మలలో నిపుణత్వమును సాధించాడు. దక్షత కలవాడు కనుక దక్షుడు అనే పేరు సార్థకం చేసుకున్నాడు. దక్షుని సామర్థ్యము చూచి బ్రహ్మ దక్షుని ప్రజాపతిగా నియమించాడు. సృష్టి కొనసాగించే కార్యాన్ని దక్షునికి అప్పగించాడు. తరువాత దక్షుడు మరీచి మొదలగు ప్రజాపతులను వారి వారి స్థానాలలో నియమించి ప్రజాసృష్టి, ప్రజాపాలన, ప్రజారక్షణ కార్యములను వారికి అప్పగించాడు." అని విదురునికి మైత్రేయుడు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థస్కంధము ముప్పదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## చతుర్థస్కంధము

## ముప్పది ఒకటవ అధ్యాయము.

మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు. "విదురా! ఆ ప్రకారంగా వెయ్యి సంవత్సములు గడిచాయి. శ్రీహరి వాక్కులను అనుసరించి ప్రచేతసులు రాజ్యమును కుమారునికి అప్పగించి, ఇల్లు విడిచిపెట్టి వెళ్లిపోయారు. పరబ్రహ్మను గురించి ఆలోచించిన వారికి అన్ని ప్రాణులలోన భగవంతుని దర్శనం అవుతుంది. పూర్వము జాజలి

అనే మహర్షి తూర్పు సముద్రతీరంలో అటువంటి జ్ఞానమును సంపాదించి సిద్ధిపొందాడు. ఇప్పుడు ప్రచేతసులు కూడా ఆ ప్రదేశానికి వెళ్లారు. ఆ ప్రదేశంలో ఆశ్రమం నిర్మించుకున్నారు. ఇంద్రియములను, మనస్సును నిగ్రహించారు. ప్రాపంచిక విషయముల వంక చూడటం మానేసారు. నిర్మలమైన మనస్సుతో పరబ్రహ్మను గురించి ధ్యానం చేయడం మొదలు పెట్టారు.

ఆ సమయంలో నారదుడు అక్కడి వచ్చాడు. నారదుని చూచి ప్రచేతసులు లేచి నిలబడి నమస్కరించి, అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించారు. ఉచితాసనము మీద కూర్చుండబెట్టారు. అప్పుడు ప్రచేతసులు నారదునితో ఇలా అన్నాడు.

"ఓ నారద మహర్షీ! మీకు స్వాగతము. మా అదృష్టము పండి మీరు మా ఆశ్రమమునకు వచ్చారు. మేము ధన్యులము అయ్యాము. మేము పరమశివుడు ఉపదేశించిన రుద్రగీతను, శ్రీహరి పలికిన అమృతముతో సమానమైన వాక్కులు విన్నాము. కానీ, వేయి సంవత్సరముల పాటు రాజ్యాధికారము, సంసార సాగరంలో పడి, అవి అన్నీ మరిచిపోయాము. మా అదృష్టం కొద్దీ మీరు మా వద్దకు వచ్చారు. ఈ సమయంలో మీరు మాకు అధ్యాత్మజ్ఞానమును బోధించి మమ్ములను కృతార్థులను చేయండి."అని అడిగారు. అప్పుడు నారదుడు ప్రచేతసులతో ఇలా అన్నాడు.

"ఎవరైతే ఆ పరమాత్మను భక్తితో సేవిస్తారో వారి జన్మములే నిజమైన జన్మలు. ఎవరైతే తాము చేసిన కర్మలను పరమాత్మకు అర్పిస్తారో ఆ కర్మలే నిజమైన కర్మలు. ఎవరి మనస్సులో నిరంతరము శ్రీహరి స్మరింపబడతాడో, ఆ మనసులే నిజమైన మనసులు. ఏ వాక్కులతో అయితే శ్రీహరి స్తుతింపబడతాడో, ఆ వాక్కులే నిజమైన వాక్కులు.

మానవునికి మూడు జన్మలు ఉన్నాయి. మొదటిది తల్లి గర్భంనుండి బయటకు రావడం.దానిని శౌక్రజన్మ అంటారు. రెండవది ఉపనయనం చేసుకున్న తరువాత ద్విజుడు అవుతాడు. దానిని సావిత్రజన్మ అంటారు. మూడవది ఆ పరమాత్మను భక్తితో సేవించడం ఒకయజ్ఞంలాగా చేయడానికి దీక్ష పూనడం. దానిని దైక్షజన్మ అంటారు. మొదటి జన్మ రెండవ జన్మ సాధారణంగా జరుగుతాయి. కాని మూడవ జన్మ ఎత్తనిదే ఆ జన్మకు సార్థకతలేదు. శ్రీహరిని సేవించడం వలన కాకుండా వేదములలో చెప్పబడిన యజ్ఞములు యాగములు చేయడం వలన, చాలా కాలం బతకడం వలన ఏమి ఫలితం ఉంటుంది!

శ్రీహరిని సేవించకుండా, శ్రీహరిమీద అచంచల మైన భక్తి వి శ్వాసాలు లేకుండా, కేవలం వేదములలో చెప్పబడిన కర్మలు చేయడం వలనా, వేదాంతములనువినడం వలనా, తపస్సు చేయడం వలనా, శాస్త్రములను వ్యాఖ్యానించడం వలనా, వాద ప్రతివాదములు చేయడం వలనా, నానావిధము లైన శాస్త్రములను చదివి జ్ఞాపకం ఉంచుకొనడం వలనా, అపారమైన బుద్ధి కుశలత వలనా, శారీరక

బలంకలిగి ఉండటం వలనా, ఇంద్రియపటుత్వము కలిగి ఉండటం వలనా ఏమి ప్రయోజనము.

ఇవన్నీ ఉండవలసినదే కానీ వీటితోడు శ్రీహరి మీద భక్తి కూడా తోడయితే అతని జన్మ సార్థకమౌతుంది. ఇవే కాకుండా కొంతమంది ప్రాణాయామములు, అష్టాంగయోగములు, ఆత్మజ్ఞానము పెంపొందించుకోవడం, సన్యాసం తీసుకోవడం, వేదములను అధ్యయనం చేయడం, వ్రతములు ఆచరించడం, వైరాగ్యము కలిగి ఉండటం... ఇవన్నీ కూడా మానవునికి శ్రేయస్సును కలిగించేవే కానీ శ్రీహరి మీద భక్తి లేకపోతే, శ్రీహరిని మనం చేసే కర్మలతో తృప్తిపరచలేకపోతే, చేసిన కర్మలన్నిటినీ పరమాత్మ కు అర్పించక పోతే, ఎన్ని కర్మలు చేసినా  ఏమీ ప్రయోజనము లేదు.

మానవులకు ఎన్ని శ్రేయస్సులు ఉన్నా పరమాత్మ మీద భక్తి శ్రద్ధ పరమశ్రేయస్సును ఇస్తుంది. ఇందులో సందేహము ఏ మాత్రము లేదు. సకల ప్రాణులలో ఆ శ్రీహరి ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. జీవులకు ఆత్మజ్ఞానమును ప్రసాదించేది ఆపరమాత్మ ఒక్కడే.

ప్రచేతసులారా! ఒక వృక్షము ఉందనుకోండి. దాని మొదట్లో నీరు పోస్తే, ఆ నీరు ఆ వృక్షము యొక్క కొమ్మలకు,  ఆకులకు, పుష్పములకు, కాయలకు, ఆఖరుకు చిట్టచివరి చిగురుటాకు వరకూ చేరుతుంది. మనం విడివిడిగా కొమ్మలను, ఆకులను తడపనవసరం లేదు. అలాగే, కడుపుకు ఆహారం తీసుకుంటే, అన్ని ఇంద్రియములకు బలం వస్తుంది. అలాగే ఆ పరమాత్మను, శ్రీహరిని పూజిస్తే

సర్వదేవతలను, పితృదేవతలను, పూజించినట్టే. వేరు వేరుగా వారిని పూజించనవసరంలేదు. (ఈ భావాన్ని పోతన గారు హృద్యంగా వర్ణించారు. అవధరించండి.)

మ: కమలాధీశ్వరు బూజసేయుట సమగ్రప్రీతి బ్రాణోపహా
రము సర్వేంద్రియతృప్తి హేతువును సర్వక్ష్మాజమూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబు నగు రేఖన్ సర్వదేవార్చన
క్రమమై యొప్పు ధరావరేణ్యసుతులారా బుద్ధినూహించినన్.

ఓ ప్రచేతసులారా! వేసవికాలంలో సూర్యుడు భూమిమీది నీటిని తన వేడిమితో ఆవిరిచేసి తనలోకి లాక్కుంటాడు. వానాకాలంలో ఆ నీటిని మేఘముల ద్వారా వర్షంగా మనకు ఇస్తాడు. అలాగే ఈ విశ్వంలో సమస్త ప్రాణి కోటి ఆ భూమి నుండి పుడుతుంది. కొంత కాలం జీవిస్తుంది. ఆ భూమిలోనే కలిసిపోతుంది. (మాతృగర్భంనుండి భూగర్భం దాకా సాగే ప్రయాణమే జీవితం.) అలాగే పరమాత్మ ఈ విశ్వాన్ని సృష్టించి, పోషించి, మరలా తనలో లయం చేసుకుంటూ ఉంటాడు. ఇది ఆయనకు ఒక క్రీడ.

సూర్యుడు, సూర్యుని వెలుతురు రెండూ ఒకటే. వేరుకాదు. ఎందుకంటే సూర్యుని నుండి సూర్యరశ్మి పుట్టింది. అలాగే పరమాత్మ, ఆ పరమాత్మ లో నుండి పుట్టిన ఈ విశ్వం వేరు కాదు. రెండూ ఒకటే. కాని ఆయన మాయాశక్తివలన వేరుగా ఉన్నట్టు కనపడుతూ ఉంటుంది. పగలంతా ఈ దేహము, ఇంద్రియములు పనిచేస్తూ ఉంటాయి. నా కంటే వీరుడు లేడు అని విర్రవీగుతుంటాయి. రాత్రి నిద్రలో అదే దేహము, ఇంద్రియములు ఏ మాత్రం చలనం లేకుండా

శవంలా పడి ఉంటాయి. అలాగే సృష్టి జరిగేటప్పుడు ఈ విశ్వము అంతా పరమాత్మ కన్నా వేరుగా కనపడుతుంటుంది. అంటే నేనే ఈ దేహము, వేరే ఎవరూ లేరు, అంతా నేనే, నన్ను మించిన వాడు లేడు అనే భావన కలుగుతుంది. కాని ఎవరికైతే దేహాభిమానమునశించి, పరమాత్మ వంక చూస్తాడో, అప్పుడే తనలో ఉన్న పరమాత్మను దర్శించగలుగుతాడు. సాటి ప్రాణులలో కూడా పరమాత్మను దర్శించగలుగుతాడు.

ఓ ప్రచేతసులారా! ఈ విశ్వంలో సూర్యుడు ఎప్పుడూ వెలుగుతూ ఉంటాడు. కానీ మేఘములు అడ్డు వచ్చినపుడు, రాహు కేతువులు అడ్డువచ్చినపుడు చీకట్లు కమ్ముతాయి. అవి తొలగి పోగానే, మరలా ప్రకాశం వస్తుంది. అలాగే, ఆ పరమాత్మ యొక్క ప్రకాశము సత్త్వ,రజస్తమోగుణముల శక్తి ప్రవాహముల వలన ఒకప్పుడు తన ప్రకాశాన్ని కోల్పోతుంటుంది. ఆ గుణముల శక్తి తగ్గినపుడు మరలా పూర్వ ప్రకాశాన్ని పొందుతుంది.

సకల ప్రాణుల దేహములలో ఉండే ఆత్మ ఒక్కటే. ఆ పరమాత్మయే అన్ని ప్రాణులలో ఆత్మస్వరూపంగా ప్రకాశిస్తూ ఉంటాడు.ఆ పరమాత్మ కారణం గానే త్రిగుణాత్మకమైన ఈ ప్రకృతి ఉద్భవించింది. కాని పరమాత్మ ఆ గుణములకు, మాయకు అతీతుడు. ఆత్మ, పరమాత్మ ఒక్కటే అనే భావనతో అన్ని ప్రాణులలో ఉన్న పరమాత్మను సేవించాలి. .

ఓ ప్రచేతసులారా! సకల ప్రాణులయందు దయగలిగి ఉండటం, ఉన్న దానితో తృప్తిపడటం, ప్రాపంచిక విషయముల నుండి,

విషయ సుఖముల నుండి మనస్సును, ఇంద్రియములను నిగ్రహించడం, చేయగలిగితే ఆ పరమాత్మ తొందరగా ప్రసన్నుడవుతాడు. ఈ సకలమైన వాసనల నుండి విముక్తి పొందిన భక్తజనుల హృదయములయందు ఆ శ్రీహరి ఎల్లప్పుడూ నివసిస్తుంటాడు. శ్రీహరి తన భక్తుల హృదయములను విడిచిపెట్టి ఎక్కడకూ పోడు. ధనము లేని వారికి శ్రీహరి మీద భక్తి అపరిమితమైన ధనముతో సమానము. శ్రీహరి వారినే ప్రేమిస్తాడు. వారు కూడా నిరంతరము శ్రీహరి మీద భక్తిప్రమత్తులు కలిగి ఉంటారు. కాని తాము పండితులమనీ, ధనవంతులమనీ, తాము యజ్ఞయాగములు మొదలగు వేదములో చెప్పబడిన కర్మలు చేసామనీ విర్రవీగే వారు భగవద్భక్తులను చులకనగా చూస్తారు. అటువంటి గర్వాంధుల పూజలను శ్రీహరి ఎప్పుడూ స్వీకరించడు.

ఓ ప్రచేతసులారా! పరమాత్మ స్వయంగా పరిపూర్ణుడు అయినప్పటికినీ ఎల్లప్పుడూ భక్తుల వశంలో ఉన్నవాడు, లక్ష్మీదేవిని, చక్రవర్తులను, దేవతలను కూడా లక్ష్యపెట్టని వాడు అయిన శ్రీహరిని ఏ భక్తుడు మాత్రము ఎలా స్మరించకుండా, ఆయనను వదిలిపెట్టి ఎలా ఉండగలడు? కాబట్టి మీరు కూడా ఆ పరమాత్మను నిర్మలమైన మనస్సుతో సేవించండి." అని చెప్పి నారదుడు వెళ్లిపోయాడు.

తరువాత ప్రచేతసులు నారదుని మాటలను మననం చేసుకుంటూ, శ్రీహరి భక్తిలో మునిగిపోయి,ఈ దేహములను వదిలిపెట్టి, వైకుంఠము చేరుకున్నారు. విదురా! నీవు అడిగిన ప్రచేతసుల చరిత్ర, నారద ప్రచేతసుల సంవాదము నీకు

వివరించాను." అని మైత్రేయుడు విదురునికి చెప్పాడు.

మైత్రేయుడు చెప్పిన భగవంతుని మహాత్మ్యమును విని విదురుడు పులకించి పోయాడు. ఆయన కళ్ల వెంట ఆనందాశ్రువులు ధారాపాతంగా కారుతున్నాయి. గద్గద స్వరంతో విదురుడు మైత్రేయునితో ఇలా అన్నాడు.

"మహాత్మా! నీవు నీ బోధనలతో నాకు ఈ సంసారమును తరించే మార్గమును చూపించావు. భక్తుల హృదయములలో ఆ పరమాత్మ ఎల్లప్పుడూ ప్రకాశిస్తూ ఉంటాడు. ఈ సత్యమును తెలుసుకొని నేను పరమానందభరితుడను అయ్యాను. ఇంక నాకు సెలవుఇప్పించండి." అని విదురుడు మైత్రేయుని వద్ద సెలవు తీసుకొని హస్తినాపురమునకు వెళ్లాడు." అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు మైత్రేయ విదుర సంవాదమును వినిపించాడు.

తరువాత శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుతో ఇలా అన్నాడు. "మహారాజా! శ్రీహరి మీద మనసు ఉంచిన ఈ ప్రచేతసుల చరిత్రమును ఎవరూ చదివినా, వినినా, వారికి దీర్ఘాయువు, కీర్తి, ఐశ్వర్యములు కలుగుతాయి.

నీకు ఇంతకు ముందు స్వాయంభువ మనువు కుమారుడైన ఉత్తానపాదుడు అతని కుమారుడు ధృవుడు వారి వంశము గురించి వివరంగా చెప్పాను. ఇప్పుడు స్వాయంభువ మనువు

రెండవ కుమారుడు అయిన ప్రియవ్రతుని వంశమును గురించి వివరిస్తాను. శ్రద్ధగా విను. ఈ ప్రియవ్రతుడు నారదుని వలన ఆత్మ విద్యను పొంది, రాజ్యపాలన చేయడానికి విముఖత్వము చూపించాడు. కాని తరువాత రాజ్యమును పాలించాడు. తుదకు తన కుమారులకు రాజ్యాభిషేకము చేసి వానప్రస్థమునకు వెళ్లిపోయాడు. ఆ పరమాత్మలో ఐక్యం అయ్యాడు" అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెప్పినట్టు సూతుడు శౌనకాది మహామునులకు నైమిశారణ్యంలో, సత్రయాగ సందర్భంలో భాగవత కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

చతుర్థ స్కంధము ముప్పది ఒకటవ అధ్యాయముసంపూర్ణము

చతుర్థస్కంధము సర్వం సంపూర్ణం.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్:9866140619 ఫోన్:040-24048104

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము

మొదటి అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత పురాణమును చెబుతున్న సందర్భంలో, పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని ఈ విధంగా అడిగాడు.

"ఓ మునీంద్రా! ఇదివరకు తమరు స్వాయంభువ మనువు కుమారుడైన ప్రియవ్రతుడు మహా భక్తుడు. ఈ ప్రాపంచిక సుఖముల మీద, విషయ వాంఛల మీద ఆసక్తి లేని వాడు అని చెప్పారు కదా! మరి ఆ ప్రియవ్రతుడు గృహస్థాశ్రమము ఎందుకు స్వీకరించాడు? ఎందుకంటే గృహస్థాశ్రమము లో ఉన్న వారు ఆత్మజ్ఞానము నశించి, కర్మబంధనములలో చిక్కుకుంటారు కదా! పైగా ప్రియవ్రతుడి లాంటి ఆత్మజ్ఞానము కల వారికి, తాము చేసే కర్మల మీద ఆసక్తి లేని వారికి, గృహస్థాశ్రమము మీద కోరిక ఎందుకు కలిగింది. అలా కోరిక కలగటం మంచిది కాదు కదా!

బ్రహ్మర్షీ! ఎవని చిత్తము ఆ పరమాత్మ పాదపద్మముల యందు లగ్నం అవుతుందో, ఎవడు ప్రశాంత మైన చిత్తంతో ఉంటాడో, అటువంటి వారి హృదయము భార్య, పుత్రుల యందు, రాజ్యపాలన యందు  ఆసక్తి చూపదు కదా! పోనీ! ప్రియ వ్రతుడికి రాజ్యసుఖముల యందు, భార్యా కుమారుల యందు ఇదివరకే ఆసక్తి ఉందా అని అనుకుంటే, మరి ఆయనకు పరమాత్మయందు అచంచలమైన భక్తి, ఎల్లప్పుడు భగవంతుని ధ్యానించాలి, స్మరించాలి అనే ఆత్మజ్ఞానము ఎలా

కలిగింది. ఇదంతా నాకు అనేక సందేహములను కలిగిస్తూ ఉంది. దయచేసి నా సందేహములను నివృత్తి చేయండి." అని పరీక్షిత్తు మహారాజు శుకమహర్షిని ప్రశ్నించాడు.

పరీక్షిత్తు మహారాజు అడిగిన ప్రశ్నలకు శుక మహర్షి ఈ విధంగా సమాధానాలు చెప్పాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీ మాటలలో ఏ మాత్రమూ అసత్యము లేదు. కొంత మంది ప్రియవ్రతుడి లాంటి వాళ్లకు, ఆ పరమాత్మ యందు ఎనలేని భక్తి ఉంటుంది. వారికి ఈ ప్రాపంచిక విషయముల మీద, విషయ వాంఛలమీద ఆసక్తి ఉండదు. వారు ఎల్లప్పుడూ ఆ వాసుదేవుని కథలను వినడం యందు ఆసక్తి కలిగి ఉంటారు. కానీ, అటువంటి భాగతోత్తములకు కూడా అప్పుడప్పుడూ ఈ సంసార సుఖములు, రాజ్య సుఖముల రూపంలో కొన్ని విఘ్నాలు కలుగుతుంటాయి. కాని వారు ఆ విఘ్నాలను లక్ష్యపెట్టరు. వాటిని అవలీలగా దాటి మరలా తమ చిత్తమును ఆ పరమాత్మయందు లగ్నం చేస్తుంటారు. ప్రియవ్రతుడి లాంటి వారు ఎన్ని విఘ్నములు వచ్చిననూ ఆ వాసుదేవుని పాదపద్మములను ఎన్నటికీ విడిచిపెట్టరు.

ఓ మహారాజా! ఈ ప్రియవ్రతుడు నారదుని, భక్తితో సేవించాడు. నారదుడు ప్రియవ్రతునికి ఆత్మజ్ఞానమును బోధించాడు. దానివలన ప్రియవ్రతుడు పురుషార్థములలో గొప్పదైన మోక్ష మార్గములో లీనమయ్యాడు. ఆత్మతత్వాన్ని గురించి బాగా తెలుసుకున్నాడు. నారదుని వలన జ్ఞానదీక్షనుకూడా స్వీకరించాడు.

ఈ సమయంలో ప్రియవ్రతుని తండ్రి అయిన స్వాయంభువ మనువు ప్రియవ్రతుని రాజ్యపాలన స్వీకరించమని కోరాడు. కాని ప్రియవ్రతుడు ఒప్పుకోలేదు. అప్పటికే ప్రియవ్రతుడు ఏకాగ్రమైన చిత్తముతో వాసుదేవుని ధ్యానిస్తున్నాడు. ఇంద్రియ నిగ్రహం పాటిస్తున్నాడు. తండ్రి ఆజ్ఞను పాటించకపోవడం అధర్మము అయినప్పటికినీ, రాజ్యాధికారము స్వీకరిస్తే, ప్రాపంచిక సుఖములయందు మనసును లగ్నం చేయాల్సివస్తుందనీ, కామము, క్రోధము మొదలగు అరిషడ్వర్గములు తనను ఆవహిస్తాయనీ ఆలోచించి, ప్రియవ్రతుడు తండ్రి ఆజ్ఞను తిరస్కరించాడు. రాజ్యపాలనను స్వీకరించడానికి ఒప్పుకోలేదు.

ఈ విషయం బ్రహ్మదేవునికి తెలిసింది. అప్పటికే బ్రహ్మ గారు సత్వరజస్తమోగుణములతో కూడిన సృష్టి చేయడం మొదలు పెట్టాడు. మనువులకు ఆ బాధ్యత అప్పగించాడు. స్వాయంభువ మనువు, అతని కుమారుడు ఉత్తాన పాదుడు, గృహస్థాశ్రమము స్వీకరించి సృష్టిని కొనసాగించారు. కాని స్వాయంభువ మనువు రెండవ కుమారుడు ప్రియవ్రతుడు గృహస్థాశ్రమం స్వీకరించడానికి ఒప్పుకోవడం లేదని తెలిసింది. ప్రియవ్రతుడు గృహస్థాశ్రమమును స్వీకరించకపోతే సృష్టి నిలిచిపోతుంది. కాబట్టి ప్రియవ్రతుని మనసు మార్చడానికి, వెంటనే మరీచిమొదలగు మహామునులను వెంటబెట్టుకొని బ్రహ్మగారు సత్యలోకము నుండి భూలోకమునకు దిగివచ్చాడు.

హంస వాహనం మీద వస్తున్న తన తండ్రి గారైన బ్రహ్మ గారిని చూచాడు నారదుడు. ఆ సమయంలో నారదుడు ప్రియవ్రతునికి బ్రహ్మజ్ఞాన దీక్షను ఇస్తున్నాడు. వారిపక్కనే తన కుమారుడి మనసు మార్చడానికి వచ్చిన స్వాయంభువ మనువు కూడా ఉన్నాడు.

బ్రహ్మదేవుని రాకను చూచిన ఈ ముగ్గురూ లేచి బ్రహ్మ దేవునికి నమస్కరించారు. ఆయనకు అర్ఘ్య పాద్యాదులను సమర్పించి ఉచితాసనము మీద కూర్చుండబెట్టారు. బ్రహ్మగారు ప్రియవ్రతుని చూచి ప్రసన్నమైన ముఖంతో, చిరునవ్వుతో ఇలా చెప్పసాగాడు.

"ప్రియవ్రతా! నా మాట విను. నీవు చేస్తున్నది ధర్మం కాదు. నేను, నీ తండ్రి, నీకు బోధిస్తున్న ఈ నారదుడు మేము ఎవరమూ స్వతంత్రులము కాము. అందరమూ ఆ పరమేశ్వరుని ఆజ్ఞకు లోబడి ఉన్నాము. బ్రహ్మచర్యము, గృహస్థ ఆశ్రమము, వానప్రస్థము, సన్యాసము అన్నీ ఆ పరమేశ్వరుడు కల్పించాడు. నీవు గృహస్థ ఆశ్రమమును కాదని సన్యాసం స్వీకరించడం తగదు.

ఈ విశ్వసృష్టిలో ఎవరైనా సరే. ఎంతటి తపోధనుడైనా, యోగీశ్వరుడైనా, బుద్ధిమంతుడైనా, ధనవంతుడైనా, విద్యావంతుడైనా, రాజు అయినా, చక్రవర్తి అయినా, అందరూ ఆ పరమేశ్వరుని ఆజ్ఞకు లోబడి ప్రవర్తించవలసినదే.ఎవరూ ఆయన చేసిన ఆజ్ఞలను ధిక్కరించడానికి వీలులేదు. అంత సమర్థత ఎవరికీ లేదు.

కుమారా! ఈ జీవులు అన్నీ ఆ పరమాత్మ ఆజ్ఞను అనుసరించి, పుట్టడం, పెరగడం, శోకించడం, మోహించడం, భయపడటం,సుఖపడటం, దు:ఖపడటం, ఆఖరున చావడం ఇంకా ఇతరములైన పనులు చేస్తున్నారు. అంతేకానీ, ఆ పరమేశ్వరుని ఆజ్ఞను ధిక్కరించి ఏమీ చేయడం లేదు. మనుష్యులు తన దగ్గర ఉన్న జంతువుల ముక్కులకు తాళ్లు కట్టి వాటి చేత పని చేయిస్తుంటారు. అలాగే పరమాత్మ కూడా మానవులను, తన వాక్కులు అయిన వేదవాక్కులు అనే తాళ్లతో మనలను బంధించి మనచేత పనులు చేయిస్తున్నాడు. మానవులు కూడా సత్త్వరజస్తమోగుణములకు లోబడి, వర్ణాశ్రమ ధర్మములను అనుసరిస్తూ, వేదములలో చెప్పబడిన కర్మలను ఆచరిస్తున్నారు.

కుమారా ప్రియవ్రతా! ఆ పరమాత్మ మనము చేసిన కర్మలకు తగిన ఫలములను ఇస్తుంటాడు. వాటి ప్రకారము మనకు దేహములు వస్తుంటాయి. ఆ పరమాత్మ ఆజ్ఞ ప్రకారము మనకు లభించిన దేహములను ధరించి, భగవంతుడు మనకు నిర్దేశించిన పనులను చేస్తున్నాము. ఆ దేహములలో సుఖములను, దు:ఖములను అనుభవిస్తున్నాము. అదే మన కర్తవ్యము.

కుమారా! మరొక మాట. మానవులకు వారు చేసిన ప్రారబ్ధ కర్మల ఫలితంగా దేహం లభిస్తూ ఉంటుంది. ఆ ప్రారబ్ధ కర్మలు తీరేవరకూ ఆ దేహంలో ఉండి కర్మఫలములను అనుభవించక తప్పదు. కాని ఏ కర్మలు చేయడం వలన ఈ దేహం లభించిందో, మరలా అవే కర్మలను చేసి మరలా మరొక దేహాన్ని తెచ్చుకోడానికి

బుద్ధిమంతులు ఇష్టపడరు. ఇంద్రియములను జయించకుండా, కోరికలను వదిలిపెట్టకుండా, వానప్రస్థమునకు పోయి, అక్కడ ఆశ్రమము నిర్మించుకొని ఉన్నప్పటికినీ, మనసు మాత్రం ప్రాపంచిక విషయముల మీదనే నిలిచి ఉంటుంది. కామ, లోభ,క్రోధ, మోహ, మద,మాత్సర్యములు అతనిని నిత్యము వెన్నాడుతూనే ఉంటాయి. కాబట్టి ఇంద్రియములను, మనస్సును నిగ్రహించ కుండా అడవులకు పోయినా ప్రయోజనము లేదు. ఇంద్రియములను, మనస్సును జయించిన వాడికి గృహస్థాశ్రమములో ఉన్నా అతనికి ఎటువంటి అపకారము జరగదు.

కుమారా! మనస్సును, ఇంద్రియములను జయించవలెననే కోరిక కలవాడు ముందు గృహస్థాశ్రమములో ఉండి ఆ పని చేయాలి. గృ హస్థాశ్రమములో ఉండి మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము సంపాదించిన వాడు, ఆ తరువాత ఎక్కడైనా స్వేచ్ఛగా తిరుగ వచ్చును. అప్పుడు అతడు అడవులలో ఉన్నా జనపదాలలో ఉన్నా ఒక్కటే.

ప్రియవ్రతా! నీవు సామాన్యుడవు కావు. నీవు ఆ వాసుదేవుని పాదపద్మములను ఆశ్రయించి నీ లోని ఆరుగురు శత్రువులను అనగా కామ,క్రోధ,లోభ,మోహ,మద,మాత్సర్యములనుజయించావు. ఇంక నీకు గృహస్థాశ్రమము, రాజ్యపాలన అంటే భయం ఎందుకు. నీవు ఎక్కడున్నా ఎటువంటి ఆసక్తి లేకుండా కర్మలు చేయగలవు. కాబట్టి నీ తండ్రి గారు చెప్పినట్టు గృహస్థాశ్రమము స్వీకరించి, రాజ్యపాలన సాగించు. తరువాత వానప్రస్థమునకు వెళ్లవచ్చును." అని బోధించాడు బ్రహ్మ.

తన తండ్రి బ్రహ్మగారి మాటలకు ఎదురు చెప్పలేకపోయాడు నారదుడు. బ్రహ్మగారి వాక్కులను శిరసావహించాడు ప్రియవ్రతుడు.

తరువాత బ్రహ్మగారు సత్యలోకమునకు వెళ్లిపోయాడు. తాను తలచిన విధంగా మాట్లాడినందుకు స్వాయంభువ మనువు కూడా ఎంతో సంతోషించాడు. వెంటనే స్వాయంభువ మనువు తన కుమారుడు ప్రియవ్రతుని సకల భూమండలానికి  పట్టాభిషిక్తుని చేసాడు. తరువాత స్వాయంభువ మనువు వానప్రస్థమునకు వెళ్లిపోయాడు.

తండ్రి ఆజ్ఞను అనుసరించి ప్రియవ్రతుడు రాజ్యాధికారమును స్వీకరించాడు. ప్రాపంచిక విషయములలో, రాజభోగములలో అనునిత్యము సంచరిస్తూ ఉన్నా, ప్రియవ్రతుని చిత్తము మాత్రము నిరంతరమూ వాసుదేవుని యందు లగ్నం అయి ఉంది. అతని మనస్సు ఎల్లప్పుడూ పరిశుద్ధంగా ఉంది. కేవలం నిమిత్తమాత్రుడుగా ప్రియవ్రతుడు ఈ భూమండలమును పరిపాలించాడు.

ప్రియవ్రతుడు విశ్వకర్మ కుమార్తె అయిన బర్హిష్మతి అనే కన్యను వివాహం చేసుకున్నాడు. వారికి పదిమంది కుమారులు ఒక కుమార్తె కలిగారు. ఆ కుమార్తె పేరు ఊర్జస్వతి. ఆ పదిమంది కుమారుల పేర్లు వరుసగా...అగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహువు, మహావీరుడు, హిరణ్యరేతసుడు, ఘృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిథి, వీతిహోత్రుడు, కవి. వీరందరికీ అగ్నికి సంబంధించిన పేర్లుపెట్టాడు ప్రియవ్రతుడు.

ఈ పది మందిలో కవి, మహావీరుడు, సవనుడు చిన్నప్పుడే సన్యాసాశ్రమము స్వీకరించారు. అనునిత్యమూ వాసుదేవుని స్మరిస్తూ

అడవులకు వెళ్లిపోయారు. ప్రియవ్రతునికి మరొక భార్య కూడా ఉంది. ఆమెవలన ప్రియవ్రతునికి ముగ్గురు కుమారులు కలిగారు. వారి పేర్లు ఉత్తముడు, తామసుడు, రైవతుడు. ఈ ముగ్గురు కుమారులు మూడు మన్వంతరములకు అధిపతులు అయ్యారు.

(మొదటి మన్వంతరము స్వాయంభువ మన్వంతరము. రెండవ మన్వంతరము స్వారోచిష మన్వంతరము. మూడవది ఉత్తమ మన్వంతరము. నాలుగవది తామస మన్వంతరము. ఐదవది రైవత మన్వంతరము. తరువాత చాక్షుస మన్వంతరము వచ్చింది. ఆ తరువాత వైవస్వత మన్వంతరము వచ్చింది. ప్రస్తుతం మనము వైవస్వత మన్వంతరములో ఉన్నాము. అందుకే సంకల్పంలో ద్వితీయ పరార్థే, శ్వేతవరాహ కల్పే, వైవస్వత మన్వంతరే. కలియుగే, ప్రథమపాదే..... అని చెప్పుకుంటాము.)

ప్రియవ్రతుడు పదకొండు అర్బుద సంవత్సరములు ఈ భూమండలమును పాలించాడు. (అర్బుదము అంటే 100 కోట్లు అంటే ఒక బిలియన్). ప్రియవ్రతుడు తన పాలనలో భూమండలంలో ధర్మాన్ని ప్రతిష్టించాడు. అధర్మాన్ని నిర్మూలించాడు. అధర్మ ప్రవర్తన అనేది మచ్చుకైనా లేకుండా పోయింది. అలా అని సంసారమును నిర్లక్ష్యం చేయలేదు. తన భార్యలను ఎంతో ఆదరంగా ప్రేమతో చూచాడు. బయట వాళ్లకు ప్రియవ్రతుడు ప్రాపంచిక విషయములలో లీనమైనట్టు కనపడినప్పటికినీ, లోపల మాత్రం నిరంతరం హరినామ సంకీర్తనలో మునిగితేలేవాడు. తాను చేసిన అన్ని పనులను పరమాత్మకు అర్పించేవాడు.

సూర్యుడు తన కిరణాలను భూమి మీద సగం భాగంమాత్రమే ప్రసరిస్తున్నాడు, మిగిలిన సగభాగం చీకట్లో ఉందని గ్రహించాడు. తన రాజ్యంలో ఎల్లప్పుడూ సూర్యునికిరణములు ప్రసరించాలని కోరుకున్నాడు. భూమండలమును అంతా ఒకే గొడుగు కిందికి తెచ్చాడు.

(అంటే భూమి తిరగడం మానింది అని కాదు. తన రాజ్యంలో ఎల్లప్పుడూ ఎక్కడో ఒక చోట సూర్యకిరణములు ప్రసరించాలి. అంటే భూమండలము అంతా తన అధీనంలోకి రావాలి అని అనుకున్నాడు. బ్రిటిషువాళ్లు మన దేశాన్ని పరిపాలించే రోజుల్లో కూడా 'రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యము' అనేవారు. అంటే ఈ ప్రపంచంలో అంతటా బ్రిటిషువాళ్లు తమ సామ్రాజ్యాలను స్థాపించారు అని అర్థం. ప్రతినిమిషం ప్రపంచంలో ఎక్కడో ఒక చోట ఏదో ఒక బ్రిటిషు సామ్రాజ్యంలో సూర్యుడు తన కిరణాలను వెదజల్లుతుంటాడు అని అర్థం.)

ప్రియవ్రతుడు తన రథము మీద భూమండలము అంతా ప్రదక్షిణము చేసాడు. ఆయన రథము తిరగడం వలన ఏడు గాడులు ఏర్పడ్డాయి. అవే సప్తసముద్రాలుగా ప్రశిద్ధిచెందాయి. ఆ సప్త సముద్రముల మధ్య ఏడు ద్వీపములు ఏర్పడ్డాయి. (అంటే ఈ భూమండలాన్ని ఏడు భాగములుగా లేక ద్వీపములుగా విభజించాడు అని అర్థం చేసుకోవచ్చు.) ఆ ఏడు ద్వీపముల పేర్లు వరుసగా.....జంబూద్వీపము, ప్లక్ష ద్వీపము, శాల్మలి ద్వీపము, కుశ ద్వీపము, క్రౌంచ ద్వీపము, శాక ద్వీపము, పుష్కర ద్వీపము. తన

ఏడుగురు కుమారులను ఈ ఏడు ద్వీపములకు చక్రవర్తులను చేసాడు ప్రియవ్రతుడు.

తరువాత తన కుమార్తె ఊర్జస్వతిని రాక్షస గురువు శుక్రాచార్యులవారికి ఇచ్చి వివాహం చేసాడు. వారికి దేవయాని అనే కుమార్తె కలిగింది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ పరమాత్మను నమ్మిన వారికి ఈ లోకంలో అసాధ్యం అనేది లేదు కదా! ప్రియవ్రతుడు ఒక రోజు ఒంటరిగా కూర్చుని తనలో తాను ఇలా ఆలోచించ సాగాడు. "బ్రహ్మదేవుని ఆదేశము ప్రకారము, నాతండ్రి గారి ఆజ్ఞ ప్రకారము రాజ్యాధికారాన్ని, గృహస్థాశ్రమాన్నిస్వీకరించాను. ఇన్నాళ్లు ప్రాపంచిక విషయములలో, రాజ్య భోగములలో మునిగి తేలాను. దీని వలన ఏమి ప్రయోజనం కలిగింది. ఈ మాయలో పడి అన్నీ మరిచిపోయాను. కానీ నారదుల వారి ఉపదేశము వలన నాలోని శ్రీహరి నామ స్మరణ నన్ను వదిలిపోలేదు. దానికి తోడు ఆ పరమాత్మ కృప నాయందు ఉంది కాబట్టి నాకు ఇప్పటి కన్నా ఆత్మజ్ఞానం కలిగింది." అని అనుకున్నాడు.

తన కుమారులను సప్తద్వీపములకు చక్రవర్తులుగా అభిషేకించాడు. రాజ్యభోగములను తృణప్రాయంగా వదిలిపెట్టాడు. వానప్రస్థమునకు వెళ్లిపోయాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ప్రియవ్రతుని మహిమను వర్ణించడం ఎవరి వల్లా కాదు. అంతటి మహానుభావుడు. ఆయన చేసిన పనులను ఆ ఈశ్వరుడు కూడా చేయలేడు. తన రథచక్రముల

చేత పడిన గాడుల మూలంగా ఏడు సముద్రములను ఏర్పరచడం ఎవరి తరం అవుతుంది. మానవులు సుఖంగా నివసించడానికి ప్రియవ్రతుడు ఈ భూమండలమును ఏడు ద్వీపములుగా విభజించాడు. వాటికి హద్దులు ఏర్పరిచాడు. ఆ హద్దులను పర్వతములు, అరణ్యములు, నదుల ద్వారా గుర్తించాడు. ఇంత చేస్తూ కూడా అన్ని కర్మలను నిష్కామంగా నే చేసాడు. అన్నీ పరమాత్మకు అర్పించాడు. సమస్త వైభవములను నరకప్రాయంగా భావించాడు. అటువంటి ప్రియవ్రతుని విజయ చరిత్ర నీకు చెప్పాను." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము
పంచమ స్కంధము మొదటి అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
పంచమ స్కంధము
రెండవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు భాగవతకథను ఈ ప్రకారంగా చెబుతున్నాడు.

"ఓ మహారాజా! ప్రియవ్రతుడు వానప్రస్థమునకు వెళ్లిన తరువాత, ఆయన కుమారుడు అగ్నీధ్రుడు జంబూద్వీపమును పరిపాలిస్తున్నాడు. కొంతకాలము తరువాత అగ్నీధ్రునికి సంతానము

కావాలని కోరిక కలిగింది. అందుకని అప్సరసలు సంచరించే మందర పర్వత ప్రాంతమునకు వెళ్లాడు. అక్కడ అప్సరసల కొరకు తపస్సు చేస్తున్నాడు.

ఆ సమయంలో పూర్వచిత్తి అనే అప్సరస ఆ ప్రాంతానికి విహారానికి వచ్చింది. అగ్నీధ్రుడు పూర్వచిత్తిని చూచాడు. ఆమె తనకు తగిన అప్సరస అని అనుకున్నాడు. ఆమెను మోహించాడు. మన్మథ బాధను ఓర్వలేక, ఆమెతో ఇలా అన్నాడు.

“నీవు ఎవరవు? ఇక్కడ ఏం చేస్తున్నావు. నీవు మాయాదేవతవా! నీ కనుబొమలు ఇంద్రధనుస్సుల మాదిరి నా హృదయములోనికి బాణములు వదులుతున్నాయి. నిన్ను చూచి ఇంద్రియములను జయించిన నాకే మోహము కలుగుతూ ఉంది. నీ వాలు చూపులతో నన్ను కట్టిపడేసావు. నీవు నడుస్తుంటే నీ కాలి అందియలు ఘల్లు ఘల్లు మంటూ నా గుండెల్లో నాట్యం చేస్తున్నాయి. నీ కులుకు నీ హొయలు నాకు ఊపిరి ఆడనీయడం లేదు. నీ రాకతో నా ఆశ్రమము అంతా సువాసనలతో నిండి పోయింది. నీవు ఎక్కడ ఉంటావు. నీ నివాసము నాకు చూపించవా! నీవు ఏమేమి ఆహారంగా తీసుకుంటావు. నీ పెదాలు నీవు వేసుకున్న తాంబూలముతో ఎర్రగా మెరుస్తున్నాయి. నీవు నీ కళ్లను అల్లల్లాడిస్తుంటే నా గుండెలు గుభిల్లుమంటున్నాయి. నిన్ను చూస్తే ఎటువంటి తాపసి అయిన తన తపస్సును వదిలిపెట్టి నీ వెంట పడక మానడు. నా అదృష్టం కొద్దీ నీవు నా కంట పడ్డావు. నేను నీకు వశుడను అయ్యాను. ఆ బ్రహ్మదేవుడు నిన్ను నాకు భార్యగా పంపినట్టుంది. నేను నిన్ను వదలను. నీ యందు నా హృదయము, మనస్సు లగ్నమయ్యాయి. నేను నీ దాసుడను. నన్ను

నీ ఇష్టం వచ్చిన చోటికి తీసుకొని వెళ్లు. మనం హాయిగా విహరిద్దాము."అని అగ్నీధ్రుడు తన ప్రేమను రకరకాలుగా ఆమెకు వివరించాడు.

పూర్వచిత్తి అనే ఆ అప్సరస కూడా అగ్నీధ్రుని అందచందాలు వయసు చూచి అతని వైపు ఆకర్షితురాలయింది. ఇద్దరూ కలిసి ఆ పర్వత సానువులలో విహరించసాగారు. వారిరువురికీ తొమ్మిది మంది పుత్రులు కలిగారు. వారి పేర్లు నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు.

అగ్నీధ్రుడు తాను పరిపాలించే జంబూద్వీపమును తొమ్మిది వర్షములు (ప్రాంతములు) గా విభజించాడు. ఆ తొమ్మిది మందిని తొమ్మిది ప్రాంతములకు రాజులుగా చేసాడు. ఆ తొమ్మిది మంది తమకు తండ్రి పంచి ఇచ్చిన భూభాగములను జనరంజకంగా పాలించసాగారు. కాలానుగుణంగా అగ్నీధ్రుడు అప్సరలోకమునకు వెళ్లిపోయాడు.

తండ్రి మరణించిన తరువాత ఆయన తొమ్మిది మంది కుమారులు మేరువు యొక్క తొమ్మిది మంది కుమార్తెలను వివాహం చేసుకున్నారు. వారి పేర్లు మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్ర, లత, రమ్య, శ్యామ, నారి, దేవవీతి.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము
మూడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తుకు భాగవత కథను ఈ విధంగా చెబుతున్నాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! అగ్నీధ్రుని కుమారుడు నాభి అని చెప్పాను కదా. ఆయన భార్య పేరు మేరు దేవి. ఆయనకు చాలా కాలం వరకు సంతానం లేదు. అందుకని ఆయన తన భార్య మేరుదేవిని పక్కన ఉంచుకొని శ్రీమహావిష్ణువును గురించి ఒక యజ్ఞం చేయసాగాడు. యజ్ఞం చేయడానికి ధనము, చక్కని ప్రదేశము, మంచి ముహూర్తము, వేద మంత్రములు, ఋత్విక్కులు, వారికి దక్షిణలు, ఆ యజ్ఞము చేయు విధివిధానములు, ఈ ఏడూ కావాలి.కాని వీటి వలన ఆ పరమాత్మ తనకు లభ్యం కాడు అని నాభికి తెలుసు. అయినా, పరమాత్మ తన భక్తులమీద వాత్సల్యం చూపిస్తాడు. అందుకని నాభి నిర్మల మైన మనస్సుతో యజ్ఞ చేయసాగాడు.

ఆ యజ్ఞంలో పరమాత్మకు సంబంధించిన ప్రవర్గ్య అనే కర్మద్వారా శ్రీహరిని ఆహ్వానించాడు. నాభి ఆహ్వానమును మన్నించి, పీతాంబరము, మెడలో కౌస్తుభము, వక్షస్థలంలో శ్రీవత్సమనే గుర్తు, శంఖ,చక్ర,గద,పద్మములు, మెడలో వనమాలను ధరించిన శ్రీహరి ఆ యజ్ఞమునకు వచ్చాడు. శ్రీహరి రాకనుచూచి ఋత్తిక్కులు, నాభి లేచి ఆయనకునమస్కరించి అర్ఘ్యపాద్యాదులు ఉచితాసనము ఇచ్చి

సత్కరించారు. అప్పుడు ఆయజ్ఞమునకు ఆధ్వర్యము వహించిన మహాఋషులు అయిన ఋత్విక్కులు శ్రీహరిని ఇలా ప్రార్థించారు.

"ఓ దేవా! మేము నీ భక్తులము. నీకు సేవకులము. నీవు మా పూజలు స్వీకరించాలి. మా ప్రార్థనలను వినాలి. మేము మా పెద్దల నుండి పరమాత్మవైన నీకు మాటి మాటికీ ఎలా నమస్కారం చేయడం బాగా నేర్చుకున్నాము. నీవు ప్రకృతి గుణములకు అతీతుడవు.మేము ప్రకృతి గుణములకు లోబడి ఉన్నాము. నీకు ఏ పేరు లేదు. ఏ రూపము లేదు. ఏ గుణము లేదు. కాని మా సౌకర్యం కొరకు నీకు ఒక పేరు పెట్టాము. ఒక రూపం కల్పించాము. ఎందుకంటే మేము నిన్ను పూజించాలి. ధ్యానించాలి. కాబట్టి మాకు ఒక రూపం, పేరు కావాలి. అందుకని నీకు ఒక రూపం కల్పించి దానికి ఒక పేరు పెట్టాము. అయినా మేము నీకు ఒక రూపం కల్పించడానికి ఒకపేరు పెట్టడానికి అర్హులము కాము.

ఓ దేవా! నీకు ఈ జీవుల మనసులలో ఉన్న కల్మషములను అన్నింటినీ నాశనం చేసే శక్తి నీకే ఉంది. అటువంటి నిన్ను కీర్తించడం తప్ప మాకు మరొకటి చేతకాదు. నీకు మేము ఏమి ఇవ్వగలము. మేము నీకు మా వాక్కులతో పూజచేస్తాము. నీకు నీటిని అర్పిస్తాము. నీకు పుష్పములను, ఆకులను, లేతచిగుళ్లనుపూజకోసరం అర్పిస్తాము. తులసిదళములతో పూజ చేస్తాము. మేము ఏరకంగా పూజచేసినా నీవు తృప్తిపొందుతావు. (పత్రం,పుష్పం,ఫలం,తోయం..భక్తితో ఏమి ఇచ్చినా స్వీకరిస్తాను అని గీతలో చెప్పాడు కదా!)

అలా కాకుండా నీకు ఎంతో ధనమును వ్యయం చేసి, యజ్ఞయాగములు చేసినా వాటి వలన నీకు ఎలాటి తృప్తి కలుగదు. ఏదో మా తృప్తి కొరకు చేయడం తప్ప, ఈ యజ్ఞయాగముల వలన నీకు ఎలాంటి ప్రయోజనము లేదు కదా!

ఓ దేవా! నీవు ఆనంద స్వరూపుడవు. సచ్చిదానంద మూర్తివి. అటువంటి నీవు కనిపించగానే మేము తుచ్ఛమైన కామ భోగములకు సంబంధించిన కోరికలు  కోరుకుంటాము. మా కన్నా తెలివితక్కువ వాళ్లు ఎవరైనా ఉంటారా! ఎందుకంటే మేము మా కోరికలు తీరడానికే నీకు రకరకాల పూజలు, వ్రతాలు, యజ్ఞములు చేస్తున్నాము. కాని అవన్నీ నీ అనుగ్రహాన్ని పొందడానికి ఏ మాత్రమూ పనికిరావు. మేము పరమ మూర్ఖులము. మాకు ఏం కావాలో మాకు తెలియదు.

నీవు మాకు పరమ పదాన్ని, మోక్షాన్ని ప్రసాదించాలనే కోరికతో  నీ దగ్గరకు వస్తాము. కాని, నీవు ప్రత్యక్షం కాగానే  మేము తుచ్ఛమైన కామసంబంధమైన కోరికలు కోరుతుంటాము. అది మా అజ్ఞానమే కదా!

ఓ దేవా! ఈ రాజర్షిఅయిన నాభి చేస్తున్న యజ్ఞమునకు సంతుష్టి చెంది నీవుమా వద్దకు వచ్చావు. అదే మాకు పెద్ద వరము. ఓ దేవా! సర్వసంగపరిత్యాగులైన మహాఋషులు కూడా నీ గుణములను ఎల్లప్పుడూ కీర్తిస్తూ ఉంటారు. కాని  చెడ్డ పనులు చేసేటప్పుడూ, ఆకలితో బాధించబడుతున్నప్పుడూ,  పతితులమైనప్పుడూ,  కాలంతీరి మృత్యువాతపడుతున్నప్పుడూ అంటే అవసాన దశలో ఉన్నప్పుడూ నీ దివ్య నామమును కీర్తించలేము. నిన్ను స్మరించలేము.  అటువంటి

దుష్కరమైన పరిస్థితులలో కూడా నిన్ను మరిచిపోకుండా, నీ నామస్మరణ చేస్తూ నీ గుణగణములను కీర్తించే శక్తిని మాకు ప్రసాదించు.

కాని ఈ నాభి రాజు పుత్రసంతానం కోసరం ఈ యజ్ఞం చేస్తున్నాడు. ఈయనకు  మాత్రము నీ లాంటి పుత్రులను ప్రసాదించు. ఇది ఎలా ఉందంటే కుబేరుని వద్దకు పోయి ధాన్యము మీదపొట్టును ఇవ్వమని అడిగినట్టు ఉంది. ఇదంతా నీ మాయ కాక మరేమిటి! నీ మాయ గురించి తెలుసుకోవడం, నీ మాయను జయించడం  ఎవరి తరమూ కాదు.

ఈ సంసారంలో ఉంటూ నీ మాయాశక్తితో ఆవరింపబడని వాడూ, నీ మాయకు వశుడు కానీ వాడూ, నీ మాయలో బడి విషయవాంఛలకు లోనుకాని వాడూ, ఈ లోకంలో ఎవడైనా ఉన్నాడా! నీ మాయను దాటాలంటే నీ భక్తులైన మహాపురుషుల యొక్క చరణములను ఆశ్రయించడం ఒకటే మార్గము.

ఓ దేవదేవా! మా రాజుకు సంతానం కావాలని కోరిక మెండుగా ఉంది. అందుకని ఈ యజ్ఞం చేసి నిన్ను ఆహ్వానించాము. బుద్ధిలేకుండా నిన్ను ఈ చిన్న కోరిక కోరుతున్నాము. పరమాత్మ ప్రత్యక్షం అయినప్పుడు ఇటువంటి చిన్న కోరిక కోరడం మా మూర్ఖత్వమే. కానీ ఈ చిన్నికోరిక తీర్చి మమ్ములను కృతార్థులనుచెయ్యి." అని ఋత్విక్కులు శ్రీహరిని ప్రార్థించారు.

వారి ప్రార్థనను విన్న శ్రీహరి చిరునవ్వు నవ్వాడు.

"ఓ ఋషులారా! మీ ప్రార్థనలకు సంతుష్టుడను అయ్యాను. కాని ఏమీ కోరలేదంటూనే పెద్దకోరిక కోరారు. నాలాంటి కుమారుడుఈ నాభి రాజుకు పుత్రుడుగా పుట్టాలని కోరారు. అది సాధ్యం కాదు. ఎందుకంటే నేను ఒక్కడినే. నాలాంటి వాడు కానీ, నాతో సమానమైన వాడుకానీ మరొకడు లేడు. కానీ మీరుకోరారు కాబట్టి , మీ కోరిక వృధా కారాదు కాబట్టి, మీకు ఒక వరం ఇస్తున్నాను. నేను నా అంశతో ఈ నాభి రాజుకు, మేరు దేవికి పుత్రుడుగా జన్మిస్తాను." అని పలికి శ్రీహరి అదృశ్యమయ్యాడు.

తరువాత శ్రీహరి తాను ఋషులకు ఇచ్చిన వరము ప్రకారము నాభి మహారాజుకు, మేరు దేవికి శుద్ధసత్త్వరూపంతో ఋషభుడు అన పేరుతో పుత్రుడుగా జన్మించాడు.

శ్రీమద్భాగవతము

పంచమ స్కంధము మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## పంచమ స్కంధము
## నాలుగవ అధ్యాయము.

శుకమహర్షి పరీక్షిత్ మహారాజుతో భాగవత పురాణాన్ని ఇలా చెప్పాడు.

“మహారాజా! శ్రీహరి, నాభికి, ఋషభుడు అనే పేరుతో కుమారుడుగా జన్మించాడు అని చెప్పాను కదా. ఆ కుమారుడు పుట్టినపుడు అతని పాదముల లో భగవంతుని లక్షణములు కనిపించాయి. ఆ కుమారుని చూచిన బ్రాహ్మణులు ఇతడు భూమండలమును పరిపాలిస్తాడు అని పలికారు. నాభి ఆ కుమారునికి ఋషభుడు అని పేరు పెట్టాడు.

ఈ ఋషభుడు దిన దిన ప్రవర్ధమానంగా పెరుగుతున్నాడు. ఆ ఋషభుడు సత్త్వగుణము కలిగిన వాడు. మంచి తేజస్సు కలవాడు. వీర్యవంతుడు. కొద్దికాలంలోనే మంచి కీర్తి గడించాడు. ఎల్లప్పుడు ఉత్సాహంగా ఉండేవాడు. ఋషభుని ఐశ్వర్యమును వైభవమును చూచి ఇంద్రుడు ఈర్ష్య పడ్డాడు. అతని రాజ్యములో వర్షములు కురిపించలేదు. అప్పుడు ఋషభుడు తన శక్తితో వర్షములు కురిపించాడు. కుమారుని శక్తిని, కీర్తిని, గుణగణములనుచూచి నాభి పరవశుడయ్యాడు. నాభి రాజ్యములోని ప్రజలు, మంత్రులు, సామంతులు ఋషభుడు రాజు కావాలని కోరుకుంటున్నారని తెలుసుకున్నాడు నాభి. వారి కోరిక ప్రకారము నాభి తన కుమారుడు

ఋషభుని రాజ్యాభిషిక్తుని చేసాడు. తరువాత నాభి తన భార్య మేరుదేవితో సహా బదరికాశ్రమమునకు వెళ్లిపోయాడు. అక్కడ నరనారాయణుల గురించి తపస్సు చేసి వైకుంఠము చేరుకున్నాడు.

పరీక్షిత్ మహారాజా! ఆ నాభి గురించి మునులు ఇలా కీర్తిస్తారు.

నాభి మాదిరి బ్రాహ్మణులను పూజించేవాడు ఈ లోకంలో మరొకడు లేడు. ఆ కారణం చేతనే ఋత్విక్కులు యజ్ఞము చేసి శ్రీహరిని ప్రత్యక్షం చేసుకున్నారు. నాభికి పుత్రసంతానం కలిగేట్టు చేసారు. సాక్షాత్తు శ్రీహరి అంశతో ఋషభుడు జన్మించాడు.

తన తండ్రి అయిన నాభి బదరికాశ్రమమునకు వెళ్లి పరమపదించిన తరువాత, ఋషభుడు అజనాభండము అనే తన రాజ్యమును జనరంజకంగా పాలించసాగాడు. గృహస్థాశ్రమము స్వీకరించి జయంతి అనే కన్యను వివాహం చేసుకున్నాడు. ఆమెవలన నూరుమంది కుమారులను కన్నాడు. ఆ కుమారులలో పెద్దవాడు భరతుడు. ఆయన పేరు మీదనే భారతవర్షము అనే పేరు వచ్చింది. (అదే నేడు భారత దేశంగా పిలువబడుతూ ఉంది. ఆ రోజుల్లో మన దేశం పేరు అజనాభండము).

భరతుని తరువాత తొమ్మిది మంది కుమారుల పేర్లు...కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, మలయుడు, కేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృక్కు, విదర్భుడు, కీకటుడు. వీరి తరువాత ఉన్న వారు కవి, హవి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు,

ఆవిర్హోత్రుడు, ద్రుమిళుడు, చమసుడు, కరభాజనుడు.

ఈ తొమ్మిదిమంది పరమభాగవతోత్తములు. ఈ తొమ్మిదిమంది నిరంతరము వాసుదేవుని పూజించడం, కీర్తించడం తప్పమరొక పని చేయరు. ఇప్పటికి 19 మంది గురించి చెప్పాను. మిగిలిన 81 మంది కుమారులు కూడా తండ్రి మాటను జవదాటరు. వేదము చదువుకున్నారు. నీతి మంతులు. యజ్ఞయాగములు చేసారు. సదాచారులు. వారు క్షత్రియులుగా పుట్టినప్పటికినీ బ్రాహ్మణత్వమును స్వీకరించి బ్రాహ్మణులయ్యారు.
(పుట్టుకతో ఎవరికీ కులం రాదు. గుణముల వలనా, చేసే కర్మల వలనా కులం నిర్ధారింపబడుతుంది అని భాగవతంలో, గీతలో స్పష్టంగా చెప్పబడింది. కానీ ఈ నాడు మనం కేవలం పుట్టుకతో కులాన్ని నిర్ధారించి ఆ కులాల కోసరం కొట్టుకుచస్తున్నాము.).

ఓ మహారాజా! ఋషభుడు సాక్షాత్తు శ్రీహరి అంశతో జన్మించాడు అని నీకు ఇదివరకే చెప్పానుకదా! అందుకే ఋషభుడు ఎల్లప్పుడూ స్వతంత్రంగా, చిదానంద స్వరూపుడుగా, ఏ కర్మలూ అంటకుండా, ఉండే వాడు. ఆయనకు రాగ ద్వేషములు లేవు. మరణం అంటే భయం లేదు. సృష్టిలోని అన్ని ప్రాణులను సమంగా చూచేవాడు. ఇతరుల కష్టములను తన కష్టములుగా భావించి, వాటిని తీర్చేవాడు. అందరి మంచినీ కోరుకునేవాడు.

ఆయన సాక్షాత్తు భగవంతుని అంశ అయినప్పటికినీ, సాధారణ మానవుల వలె వర్ణాశ్రమ ధర్మములను పాటించేవాడు. అన్ని ధర్మములను ఆచరించేవాడు. తాను ధర్మం తప్పకుండా, నీతిగా ప్రవర్తిస్తూ, తన ప్రజలను కూడా అదే మాదిరి ధర్మంగా, నీతిగా జీవించమని చెప్పేవాడు. రాజులు ఆచరిస్తేనే కదా ప్రజలు కూడా రాజు మార్గముననే నడిచేది. రాజులు తాము ఆచరించకుండా ప్రజలను ధర్మం తప్పకుండా జీవించమనడం భావ్యంకాదు అని నమ్మేవాడు ఋషభుడు. అందుకని ముందు తాను ఆచరించి చూపేవాడు. ఋషభదేవుడు వేదములను, శాస్త్రములను చదువుకున్నాడు. విజ్ఞానమును సంపాదించాడు.కానీ అన్నీ తనకు తెలుసు అనే అహంకారముతో ఉండే వాడు కాదు. తన రాజ్యములో వేదవిదులు అయిన, ధర్మశాస్త్రములను అధ్యయనం చేసిన బ్రాహ్మణులు చూపిన మార్గములో నడిచేవాడు. అంతేకానీ తనకు అన్నీ తెలుసు అని గర్వంతో విర్రవీగేవాడు కాదు.

ఆ ఋషభుడు నూరు యజ్ఞములు చేసి యజ్ఞపురుషుడు అయిన శ్రీమహావిష్ణువును ఆరాధించాడు. దేవతలందరికీ హవిస్సులు అర్పించాడు. ఋషభుని రాజ్యములో ఉన్న ప్రజలుకూడా ఆయనమాదిరే శ్రీహరి భక్తులుగా ఉండేవారు. వారు భగవంతుని తుచ్ఛమైన ప్రాపంచికమైన, విషయ వాంఛలతో కూడిన, కోరికలు కోరేవారు కాదు. వారికి తమ ప్రభువు ఋషభుడే దైవము. ఆయనే అన్ని కోరికలు తీరుస్తాడు అనే నమ్మకంతో ఉండేవారు.

ఒక సారి బ్రహ్మావర్తములో బ్రహ్మర్షుల సభ జరుగుతూ ఉంది. ఆ సభలో తన కుమారులు కూడా ఉన్నారు. వారు మహర్షులు చేసే ఉపదేశాలను శ్రద్ధగా వింటున్నారు. ఆ సమయంలో ఋషభుడు తన కుమారులకు ఈ విధంగా తత్త్వబోధ చేసాడు.

శ్రీమద్భాగవతము
పంచమ స్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## పంచమ స్కంధము
## ఐదవ అధ్యాయము.

ఋషభుడు తన కుమారులకు, అక్కడ చేరిన మునులకు, ఋషులకు, ప్రజలకు ఈ విధంగా బోధించాడు.

"కుమారులారా! ఈ ప్రపంచంలో మనము ఈ దేహములతో పుట్టాము. ఈ దేహములతో మనము కేవలం ప్రాపంచిక సుఖములు అనుభవిస్తూ సుఖదు:ఖములను అనుభవిస్తున్నాము. ఈ కామ భోగములు మనమే కాదు పశువులు కూడా అనుభవిస్తున్నాయి. కాబట్టి ఈ దేహము కేవలము కామవాంఛలు తీర్చుకోవడానికి మాత్రమే కాదు అని అందరూ గ్రహించాలి.

## పంచమ స్కంధము

ఈ దేహము ఉన్నందుకు మనము భగవంతుని సేవచేయాలి. భగవంతుని సేవచేయడం అంటే భగవంతుని గురించి తపస్సు చేయడమే. భగవంతుని గురించి తపస్సు చేస్తే మన మనసు నిర్మలము అవుతుంది. మనసు నిర్మలంగా ఉంటే, మనకు అంతులేని ఆనందము కలుగుతుంది. ఆ ఆనందము ప్రపంచంలో దొరికే కామభోగములు అనుభవించినా కలిగే పరిమితమైన ఆనందము వంటిది కాదు.

భగవంతుని గురించి తపస్సు చేయాలంటే ముందు మహాత్ముల సేవ చేయాలి. మహాత్ముల సేవయే ఈ దేహము నుండి విముక్తికి ద్వారము వంటిది. ఎల్లప్పుడూ కామవాంఛలతో, విషయభోగముల కొరకు వెంపర్లాడటం, వాటి కోసరం ప్రయత్నాలే చేయడం నరకద్వారంలో ప్రవేశించడం లాంటిది. దానివలన దు:ఖమే కాని సుఖము లభించదు.

మహాత్ముల సేవ చేయమని చెప్పాను కదా! ఆ మహాత్ములు అంటే సృష్టిలో ఉన్న అన్ని ప్రాణులను సమంగా చూచేవారు, ఎల్లప్పుడూ పరమాత్మయందు మనస్సు లగ్నం చేసేవారు, కోపము అంటే ఎరుగని వారు, అన్ని ప్రాణుల క్షేమమును కోరేవారు, చెడ్డపని చేయడం అంటే ఏమిటో తెలియనివారు. వారే మహాత్ములు అని తెలుసుకోవాలి.

పరమాత్మయందు ప్రేమ, భక్తి కలవారు,   భగవంతుని మీద భక్తి తప్ప మరొకటి తెలియని వారు, కేవలము తినడానికి తిండి, కట్టుకోడానికి వస్త్రములు, వీటి గురించి మాత్రమే ఆలోచించే వారు, అనవసరంగా మాట్లాడని వారు, ఎల్లప్పుడూ ధనము, భార్య, పిల్లలు,

ఇల్లు, సంపదలు వీటి యందు వల్లమాలిన మోహము లేని వారు, తాను, తన భార్య పిల్లలు పోషణకు మాత్రమే ధనమును సంపాదించడం తప్ప, అధికంగా ధనం సంపాదించడంమీద ఆసక్తి లేని వారు, వీరిని మహాత్ములు అంటారు.

కాని, ఈ లోకంలో ఉన్న మానవులు ఎల్లప్పుడూ తన ఇంద్రియముల ప్రీతి కోసమే పనులను చేస్తుంటాడు. ఇంద్రియ భోగములను తీర్చుకోడానికి పాపపు పనులు కూడా చేస్తుంటారు. అటువంటిపాపపు పనులు చేయడం వల్లనే ఈ దేహం వచ్చింది. ఈ దేహంతో పాపపు పనులు చేయడం ద్వారా కష్టాలను అనుభవిస్తున్నాడు. కాబట్టి ఈ దేహంతో పాపపుపనులు చేయడం మంచిదని నేను అంగీకరించను. ఈ దేహంతో కేవలము భగవంతుని స్మరించాలి, ధ్యానం చేయాలి, తపస్సు చేయాలి. ఈ విషయాలు తెలియాలంటే మానవునికి ఆత్మతత్త్వము తెలియాలి. జీవునికి ఆత్మ తత్త్వము తెలియనంతవరకూ ఈ దేహమే సర్వస్వము అనుకుంటూ ఉ ంటాడు. అదే అజ్ఞానము, అవిద్య. ఈ అజ్ఞానము, అవిద్యచేత ఆవరించబడ్డ మానవుడు, వాటి వలన కలిగే బాధలను, పరాభవాలను కష్టనష్టములను  అనుభవించక తప్పదు.

పుణ్యకర్మలు, పాప కర్మలు చేయడం వలన సుఖము, దు:ఖము కలుగుతుంటాయి. మనసుకూడా ఆయా కర్మలు చేయడానికి ఆసక్తి చూపుతుంటుంది. ఆ కర్మలు చేయడం వలన దేహానికి బంధనములు పెరుగుతాయి.  ఎంతవరకైతే ఆత్మను అవిద్య అజ్ఞానము ఆవరించి ఉంటాయో, అప్పటి వరకు జీవుడు కర్మలను

చేస్తూనే ఉంటాడు. కర్మలు చేస్తూ ఉన్నంతవరకూ దేహబంధనములు పెరుగుతాయే గాని, వాటి నుండి విముక్తికలగదు. ఈ కర్మబంధనములనుండి విముక్తి కలగాలంటే భగవంతుని మీద భక్తి,ప్రేమ పెంచుకోవాలి. దాని కోసరం తపస్సు చేయాలి.

పండితులు, జ్ఞానులు కూడా ఆత్మతత్త్వమును తెలుసుకోలేక, విషయ వాంఛలకు లోబడి, గృహస్థాశ్రమును స్వీకరించి, స్త్రీసుఖానికి ప్రాధాన్యత ఇస్తుంటారు. దాని వలన అనేకములైన దు:ఖములను, కష్టములను అనుభవిస్తుంటారు. ఎప్పుడైతే హృదయం స్త్రీవ్యామోహము తో నిండిపోయిందో, అప్పుడే సంసారము, భార్య, పిల్లలు, ఇల్లు, ఆస్తి, ధనము, నేను, నాది అనే అహంకారము, నువ్వు, నేను అనే భేదబుద్ధి ఏర్పడతాయి. జీవితాంతము ఈ మోహంలో పడి కొట్టుకుంటూ ఉంటాడు.

మానవుల హృదయాలలో ఎప్పుడైతే స్త్రీవ్యామోహము, కర్మల యందు ఆసక్తి, ఆ కర్మఫలములు అనుభవించాలనే అనురక్తి నశిస్తుందో, అప్పుడు నేను నాది అనే అహంకారము నశిస్తుంది. కర్మల పట్ల ఆసక్తి తగ్గుతుంది. మనస్సు భగవంతుని యందు లగ్నం అవుతుంది. భగవంతుని యందు ప్రేమ భక్తి కలుగుతుంది. భగవంతుని గురించి తపస్సు చేస్తాడు. అప్పుడు మానవునికి ఈ కర్మబంధనముల నుండి విముక్తి కలుగుతుంది.

పరమ హంస పదమునుపొందిన(అంటే సన్యాస ఆశ్రమమును స్వీకరించిన) గురువుల యందు భక్తి శ్రద్ధలు కలిగి ఉంటూ, విషయవాంఛల యందు, ప్రాపంచిక విషయముల యందు

కోరిక లేకుండా ఉంటూ, సుఖ దు:ఖములు, రాగ ద్వేషములు మొదలగు వాటిని సమంగా చూస్తూ, తన గురించే కాకుండా లోకంలో ఉన్న జీవుల అన్నిటి గురించి ఆలోచిస్తూ, ఆత్మతత్త్వమును గురించి ఎల్లప్పుడూ చర్చిస్తూ, పరమాత్మను గురించి పూజలు, వ్రతములు చేస్తూ, కోరికలతోనిండిన పనులను వదిలిపెడుతూ, ఎల్లప్పుడూ భగవంతుని ఆరాధించుటయందే నిమగ్నమౌతూ, భగవంతుని కీర్తిని, కథలను చెప్పుకుంటూ, నా భక్తులతో అనునిత్యమూ సాంగత్యము కలిగి ఉంటూ,  సకల భూతముల యందు సమమైన దృష్టి కలిగిఉంటూ, ఇతరుల మీద వైరభావము లేకుండా, కోపమునకు, శోకమునకు లోనుకాకుండా నిర్మలంగా ప్రశాంతంగా ఉంటూ, ఈ దేహము నాది, ఈ ఇల్లు నాది, వీళ్ల నా వాళ్లు, ఎదుటి వాళ్లు పరాయి వాళ్లు అనే భేదభావమును విడిచిపెట్టి, ఆత్మతత్త్వమును తెలుసుకుంటూ, ఎక్కువమంది ఉంటే చోట కాకుండా, ఒంటరిగా నివసిస్తూ, మనస్సును, ఇంద్రియములను నిగ్రహించుకుంటూ, వేదములను, శాస్త్రములను చదువుకుంటూ, బ్రహ్మచర్యమును పాటిస్తూ, తనకు వేదములు శాస్త్రములు విధించిన కర్మలను మాత్రమే నిర్వర్తిస్తూ, అనవసరమైన చర్చలు చేయకుండా, అనవసరంగా మాట్లాడకుండా, ఎల్లప్పుడూ భగవంతుని గురించి ఆలోచిస్తూ, జ్ఞానమును సంపాదించుకుంటూ, ఎల్లప్పుడూ ఎలాంటి భయానికి లోను కాకుండా ధైర్యంగా ఉంటూ, జీవితం గడిపే మానవుడు ఈ సంసారము అనే సాగరమును సులభంగా దాటగలడు. తనలో ఉన్న అహంకారమును సమూలంగా నాశనం చేయగలడు.

ఓ కుమారులారా! మీ అందరికీ అవిద్య వలన, మీ పూర్వజన్మవాసనల ఫలితంగానూ మీరు ఈ జన్మలో కర్మలు చేస్తున్నారు. ఆ కర్మల ఫలాలతో మీ హృదయం నిండి పోయింది. నేను పైన చెప్పిన ఉపాయాలతో మీరు మీ హృదయములలో నిండి ఉన్న కర్మఫలముల నుండి విముక్తి పొందండి. అందుకే మీకు ఈ ఉపదేశమును చేసాను. నేను కాదు, ఈ ప్రపంచంలో తన ప్రజల క్షేమం కోరే రాజు, తన శిష్యుల క్షేమం కోరే గురువు, తన పుత్రుల క్షేమం కోరే తండ్రి ఈ మాదిరి ఉపదేశములను చేయాలి. వారికి తెలిసేటట్టు బోధించాలి.

రాజు గానీ, గురువుగానీ, తండ్రి గానీ, తాము చెప్పింది ఎదుటి వారికి అర్థం కాకపోతే కోపం తెచ్చుకోకూడదు. బాగా అర్థం అయ్యేంత వరకూ మరలా మరలా బోధించాలి. వారిని సన్మార్గంలో నడిచేటట్టు చెయ్యాలి. అది రాజులు, గురువులు, తండ్రుల కర్తవ్యము.

ఎల్లప్పుడూ కర్మలయందే ఆసక్తి కలవారిని, తత్త్వజ్ఞానము తెలియని వారినీ, ఇంకా కర్మలు చేయమని ప్రోత్సహించకూడదు. మానవులలో మోహాన్ని పెంచి, వారిలో కామప్రవృత్తిని పెంచి, వారిని ఈ సంసారము అనే కూపంలో పడేస్తే ఏం లాభం? ఒక గుడ్డివాడు ఎదురుగా గొయ్యి ఉందని తెలియక అటే వెళుతుంటాడు. వాడిని ఇంకా గోతి వైపుకు నెట్టకుండా, వాడిని కాపాడాలి. ఆ అంధుడిని సన్మార్గంలో నడిపించాలి. అది ప్రతి మానవుడి కర్తవ్యము. ఎల్లప్పుడూ కర్మలలో పడి కొట్టు కుంటూఉండే వాడిని ఇంకా కర్మలు చేయమని ప్రోత్సహించడం ఆ పరమాత్మకు అపరాధము చేసినట్టే అవుతుంది కానీ వేరు కాదు. ఎందుకంటే, తను ఎలా బాగుపడాలో ఏ మానవుడికీ

తెలియదు. అందుకని ఎల్లప్పుడూ కామవాంఛలతోనూ, విషయ వాంఛలతోనూ మునిగి తేలుతుంటాడు. అటువంటి మూర్ఖుడు కష్టాలు అనుభవిస్తుంటాడు. ఇతరులతో వైరం పెట్టుకుంటూ ఉంటాడు. కాని దానివలన వచ్చే బాధల గురించి ఆలోచించడు.

జ్ఞానవంతులు, దయాగుణం కలవారు, ఆత్మతత్త్వమును తెలిసిన వారు, అటువంటి అజ్ఞానులను,మూఢులను రక్షించాలి. వారికి జ్ఞానోదయం కలిగించాలి. వారిని ఈ కామ్యకర్మల జోలికి పోకుండా ఆపాలి. వారిని సన్మార్గంలో నడిపించాలి. ఈ బాధ్యత ప్రతి తల్లి, తండ్రి, గురువు, రాజు, మిత్రుడు, భర్త నిర్వర్తించాలి. ఆ ప్రకారంగా తమ తమ బాధ్యతలను నిర్వర్తించని గురువు గురువు కాదు. తల్లి తల్లి కాదు. తండ్రి తండ్రి కాడు. మిత్రుడు మిత్రుడు కాడు. భర్త భర్త కాడు. రాజు రాజు కాడు. అలాగే మానవుల నుండి పూజలు, నైవేద్యాలు అందుకుంటూ, మానవులను సన్మార్గంలో నడిపించలేని, వారిలో ఉన్న అజ్ఞానమును అవిద్యను పోగొట్టలేని దేవుళ్లు, దేవతలు అసలు దేవుళ్లే కారు. దేవతలు అసలే కారు.

నేను కూడా మీ వలెనే శరీరధారినే. కాని నేను ఈ శరీరంతో కామ్యకర్మలు చేయడం లేదు. అవసరం ఉన్నంతవరకే కర్మలు చేస్తున్నాను. నా హృదయము సత్త్వగుణముతో నిండి ఉంది. నా హృదయం అంతా పరమాత్మ యందు భక్తితో నిండి ఉంది. నేను ఎల్లప్పుడూ ధర్మమునే పాటిస్తాను. అధర్మమును నా దరిదాపులకు కూడా రానివ్వను. అందుచేత నన్ను అందరూ ఋషభుడు (శ్రేష్టమైనవాడు) అని అంటారు.

కుమారులారా! మీరందరూ నాకు పుత్రులు.మీ అందరికీ పెద్దవాడు భరతుడు. మీలో మీరు ఎటువంటి మాత్సర్యము లేకుండా అందరూ భరతుని సేవించండి. మీరు భరతుని సేవిస్తే మీ తండ్రి అయిన నన్ను సేవించినట్టే అవుతుంది. భరతునికి రాజ్యపాలనలో తోడుగా నిలవండి.

ఓ కుమారులారా! ఈ అనంత విశ్వంలో కదిలేవి, కదలనివి(చరారచములు) అనే రెండు జాతులు ఉన్నాయి. కదలని వాటిలో వృక్షములు గొప్పవి. కదిలే వాటిలో పాకే జంతువులు గొప్పవి. వాటి కంటే పశువులు, పక్షులు గొప్పవి. వాటి కంటే మానవులు గొప్పవారు. మానవులకంటే గంధర్వులు గొప్పవారు. గంధర్వులకంటే సిద్ధులు గొప్పవారు. వారి కంటే అసురులు వారి కంటే దేవతలు గొప్పవారు. దేవతలలో ఇంద్రుడు గొప్పవాడు. ఇంద్రుని కంటే ప్రజాపతులైన దక్షుడు మొదలగు వారు గొప్పవారు. ఆ ప్రజాపతులలో శివుడు గొప్పవాడు. శివుని కంటే బ్రహ్మ శ్రేష్టుడు. ఆ బ్రహ్మకూడా వాసుదేవుని అదీనంలో ఉన్నాడు. ఆ వాసుదేవుడు ఎల్లప్పుడూ బ్రాహ్మణులను పూజిస్తూ ఉంటాడు. నేను కూడా బ్రాహ్మణులను దైవసమానంగా పూజిస్తూ ఉంటాను.

ఓ కుమారులారా! ఈ ప్రపంచంలో నేను బ్రాహ్మణులతో సమానంగా ఎవరినీ పరిగణించను. అందుకని నాకు బ్రాహ్మణుల కంటే గొప్పవాడు కనిపించలేదు. అందుకే బ్రాహ్మణులకు భక్తితో పెట్టిన భోజనము పరమాత్మకు చెందుతుంది. బ్రాహ్మణుడు తింటే పరమాత్మ తిన్నట్టే. యజ్ఞములు యాగములు చేసి అగ్నిహోత్రములో హవిస్సులు

వేసేకంటే. బ్రాహ్మణులకుభోజనం పెట్టడం ఉత్తమమైనది. వేదములు అన్నీ పరమాత్మ స్వరూపములు. బ్రాహ్మణులు  వేదములను అధ్యయనం చేస్తారు. అందుకని బ్రాహ్మణులు పరమాత్మస్వరూపులు.

పుట్టుకతో ఎవరూ బ్రాహ్మణులు కారు.  బ్రాహ్మణులు అయిన వాళ్లు ఎలా ఉండాలంటే... సత్త్వగుణము కలిగి ఉండాలి. మనస్సును, ఇంద్రియములను నిగ్రహించగలిగి ఉండాలి. ఎల్లప్పుడూ సత్యము పలకాలి. తపస్సు చెయ్యాలి. అందరి మీద దయకలిగి ఉండాలి. సహనము, ఓర్పు కలిగి ఉండాలి. వేదములను చదివి అర్థం చేసుకొని ఆచరించేవాళ్లు అయి ఉండాలి. వీరినే బ్రాహ్మణులు అని అంటారు. ఇటువంటిగుణములు కలిగిన బ్రాహ్మణుల కన్నా అధికులు ఎవరుంటారు చెప్పండి.

ఆ పరమాత్మ సర్వశక్తిమంతుడు. బ్రహ్మ,శివుడి కంటే గొప్పవాడు. స్వర్గమునకు, మోక్షమునకు అధిపతి. అటువంటి పరమాత్మను కూడా బ్రాహ్మణులు అయిన వాళ్లు ఏమీ కోరుకోరు. ఎందుకంటే వారికి ఎటువంటి కోరికలు లేవు. వారికి ఉండేది పరమాత్మయందు అచంచలమైన నిర్మలమైన భక్తి, శ్రద్ధ. అటువంటి బ్రాహ్మణులకు రాజభోగములు ఎందుకు?

కుమారులారా! కాబట్టి ఈ గుణములు కలిగిన బ్రాహ్మణులను సేవించడం, ఈ చరాచర జగత్తుకు అధిపతి అయిన పరమాత్మను సేవించడంలాంటిదే! కాబట్టి మీరు కూడా, మాత్సర్యములను మొదలగు దుర్గుణములు వదిలిపెట్టి బ్రాహ్మణులను

సేవించండి. మీకు ఆపరమాత్మను సేవించిన ఫలితం దక్కుతుంది. పరమాత్మను సేవించడం వలన మానవుల మనసుకు, కళ్లకు, వాక్కుకు, ఇతర ఇంద్రియములకు సార్ధకత చేకూరుతుంది. ఆ పరమాత్మను సేవించనిదే మానవుడు ఈ సంసారము నుండి విముక్తి పొందలేడు." అని ఋషభుడు తన కుమారులకు, అక్కడ ఉన్న ఋత్విక్కులకు, ప్రజలకు జ్ఞానబోధ చేసాడు.

ఋషభుని బోధనలు విన్న ఆయన కుమారులు జ్ఞానవంతులు అయ్యారు. అప్పుడు ఋషభుడు తన పెద్ద కుమారుడు, పరమభాగవతులలో ఉత్తముడు, ఎల్లప్పుడూ భగవంతుని భక్తులనుసేవించేవాడు అయిన భరతుని ఈ భూమండలాన్ని పాలించడానికి రాజ్యాభిషిక్తుని చేసాడు. అప్పటి దాకా తన రాజ్యములో ఉన్న ప్రజలకు, ఋత్విక్కులకు, తనకుమారులకు జ్ఞానబోధ చేసాడు. ఇంక లోకములో ఉన్న ప్రజలను కూడా చైతన్య వంతులనుచేయాలని అనుకున్నాడు.  అందరికన్నా ముందు తాను ఆచరించి చూపించాలని నిశ్చయించాడు.

రాజభోగములను, రాజ లాంఛనములను వదిలిపెట్టాడు. కేవలం ఒంటి మీద సాధారణ వస్త్రములు ధరించాడు. వెంట్రుకలు విరబోసుకున్నాడు. తన హృదయంలో ఆహవనీయాగ్నిని నిలుపు కున్నాడు. అవధూత వేషంలో తన దేశమైన బ్రహ్మావర్తమును విడిచిపెట్టి వెళ్లిపోయాడు. జనంమధ్య ఒక పిచ్చివాని వలె, గుడ్డివానివలె, చెవిటి వాని వలె తిరుగుతున్నాడు. ఎవరైనా తనను పలకరిస్తే వారికి సమాధానం కూడా చెప్పడం లేదు. ఎవరితోనూ మాట్లాడటం లేదు. మౌనవ్రతము పట్టినట్లు తిరగసాగాడు.

ఆ ప్రకారంగా ఋషభుడు గ్రామములు, పట్టణములు, చిన్న చిన్న పల్లెలు, అక్కడక్కడ యాత్రికులు బసచేసే సత్రములు, పర్వతములు, అడవులు, అందులో ఉన్న ఋషి ఆశ్రమములు, గుండా ప్రయాణం చేస్తున్నాడు. అతనిని చూచిన  ప్రజలు అతనిని ఒక పిచ్చివానిగా తలచి అతనిని తిట్టడం కొట్టడం బాధించడం చేసి వినోదిస్తున్నారు. ఋషభుడు అవేమీ పట్టించుకోకుండా తన దారిన తానుపోతున్నాడు. ఎందుకంటే ఋషభుడు ఈ దేహము నాది అనే అభిమానమును ఎప్పుడో విడిచిపె పెట్టాడు కాబట్టి ఎవరు ఏమన్నా పట్టించుకొనే వాడు కాదు.

ఆ ప్రకారంగా ఋషభుడు ఈ భూమండలం అంతా తిరుగుతున్నాడు. ఋషభుడు స్వతాహాగా క్షత్రియుడు. మంచి అందగాడు. స్ఫురద్రూపి, ఆజానుబాహుడు. సుకుమారమైన శరీరం కలవాడు. ఎప్పుడూ చిరునవ్వునవ్వుతూ ఉండేవాడు. అటువంటి వాడు అన్నిటినీ వదిలిపెట్టి పిచ్చివాడి వలె తిరుగుతున్నాడు.

ఆప్రకారంగా ఋషభుడు జనంలో తిరుగుతూ, ప్రజలందరూ ప్రాపంచిక విషయములలో, విషయవాంఛలతో మునిగి తేలుతున్నారనీ, వారికి భగవంతుని మీద ఏమాత్రం భక్తిభావం లేదనీ గ్రహించాడు. తన ప్రవర్తన వలన ప్రజలలో వైరాగ్యము తేవాలని అనుకున్నాడు. సన్యాసాశ్రమములో ఎలా ఉండాలో ప్రజలకు తెలియజెప్పాలని, తాను సన్యాసిగా మారాడు.

ఋషభుడు సాక్షాత్తు వాసుదేవుని అంశతో జన్మించాడు. ఆయనకు ఎప్పుడుకావాలంటే అప్పుడు ముక్తి లభిస్తుంది. ఇంత శ్రమపడనవసరం లేదు. కానీ లోకంలో ఉన్న ప్రజలను ఉద్ధరించాలని తాను సన్యాసిగా, పిచ్చివాడుగా, ఉన్మత్తుడుగా మారాడు. కాని మనసులో మాత్రము నిరంతరము ఆనందానుభూతులలో తేలియాడుతున్నాడు.

ఈ ప్రకారంగా సర్వసంగపరిత్యాగుడై, సన్యాసిగా మారిన ఋషభునకు అయాచితంగా అష్టసిద్ధులు లభించాయి. అంటే ఆకాశగమనము, అంతర్ధానవిద్య, మనోవేగంతో ఒకచోటి నుండి మరొక చోటికి వెళ్లడం, పరకాయప్రవేశము, దూరంనుండి శబ్దములను వినడం లాంటి విద్యలు అన్నీ అతనికి అబ్బాయి. కాని ఋషభుడు ఆ విద్యలను ఎన్నడూ వినియోగించలేదు. అసలు ఆ శక్తులు తనకు ఉన్నట్టు కూడా ప్రవర్తించలేదు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము

ఆరవ అధ్యాయము.

శుక మహర్షి చెబుతున్న భాగవత కథను వింటున్న పరీక్షిత్ మహారాజు ఇలా అన్నాడు.

"ఓ మహర్షీ! యోగము అవలంబించడం వలన రాగ ద్వేషములు నశించి, జ్ఞానము వృద్ధి చెందుతుంది. ఆ సమయంలో అయాచితంగా కొన్నిసిద్ధులు సంక్రమిస్తాయి. కాని ఋషభుడు లాంటి యోగులు వాటిని ఎందుకు స్వీకరించలేదు. అవేమీ ఆయనకు దు:ఖమును కలిగించవు కదా!" అని అడిగాడు. దానికి శుకుడు ఈ విధంగా సమాధానం చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీవు పలికినది నిజమే. కానీ మనస్సు చంచలమైనది. యోగులు తమ మనస్సును నమ్మరు. అటువంటి శక్తులు లభించినపుడు యోగుల మనస్సు ఏ క్షణంలో నైనా మారవచ్చు. అందుకని ఋషభులు లాంటి యోగులు అటువంటి శక్తులను స్వీకరించరు. చంచల మైన మనస్సు కలవాళ్లు ఎవరితోనూ స్నేహం చేయకూడదు. అలా చేస్తే, ఆ స్నేహితులకు లొంగిపోయే ప్రమాదం ఉంది. చంచలమైన మనస్సును నమ్మిన యోగులు కూడా కామమునకు క్రోధమునకు వశులై, భ్రష్టులయ్యారు. కాబట్టి, చంచలమైన మనస్సు వలన కామము, క్రోధము, మోహము, మదము, మాత్సర్యము, లోభము, భయము కలుగుతాయి అని తెలిసిన

బుద్ధిమంతుడు, ఈ మనస్సును ఎందుకు నమ్ముతాడు. అందుకనే ఋషభుడు తనకు అయాచితంగా లభించిన శక్తులను నమ్మలేదు.

తుదకు ఋషభుడు తన ప్రాణములను విడిచిపెట్టవలెనని నిశ్చయించుకున్నాడు. వాసుదేవుని యందు మనస్సు లగ్నం చేసాడు. దేహాభిమానమును పూర్తిగా విడిచిపెట్టాడు. ఒక జడుని మాదిరి జీవించాడు. అలా తిరుగుతూ దక్షిణదేశంలో ప్రవేశించాడు. కుటకాచలము సమీపమునకు చేరుకున్నాడు. కుటకాచలము దగ్గర ఒక అడవిలో తిరుగుతుంటే వెదురు బొంగులు ఒకదానితో ఒకటి రాచుకొని హటాత్తుగా అగ్ని ప్రజ్వరిల్లింది. ఆ అగ్ని అడవిలో తిరుగుతున్న ఋషభుని చుట్టుముట్టింది. ఋషభుడు ఆ అగ్నికీలలకు ఆహుతి అయ్యాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ఋషభదేవుని గురించి పండితులు ఈ విధంగా చెబుతారు. ఏడు సముద్రములతో ఆవరించబడిన ఈ భూమిలోనూ, ఆ భూమిలో ఉన్న ద్వీపములలోనూ, వర్షములలోనూ, ఈ భారత వర్షము మిక్కిలి పుణ్యవంతమైనది. ఆ భారతవర్షము మాదిరి దానిని పాలించిన ఋషభుని కీర్తి కూడా అంతటి పుణ్యవంతమైనది. ఆ ఋషభుడు సాక్షాత్తు శ్రీహరి అంశతో జన్మించాడు. లోకానికి ధర్మాన్ని బోధించాడు. సన్యాసధర్మమును తాను ఆచరించి అందరికీ మార్గదర్శకుడయ్యాడు. ఈ లోకంలో ఏ యోగి అయినా ఋషభుని మాదిరి సన్యాస ధర్మమును స్వీకరించగలడా! ఎంతో మంది యోగులు అణిమాది సిద్ధులకొరకు పరితపిస్తుంటారు. అటువంటి సిద్ధులు అయాచితంగా లభించినా, ఋషభుడు వాటిని స్వీకరించలేదు.

ఓ మహారాజా! మూడులోకములకు గురువైన ఋషభ చరిత్ర నీకు వివరించి చెప్పాను. దీనిని చదివినా, విన్నా, వారి పాపములు నశించి, సకల శుభములు కలుగుతాయి. అటువంటి వారికి భగవంతుని మీద భక్తి కలుగుతుంది. తుదకు ఆ పరమాత్మలో లీనం అవుతారు.

ఓ మహారాజా! వివిధములైన పాపములుచేసి ఈ సంసార కూపంలో పడి కొట్టుకుంటున్న వాళ్లు, భగవంతుని మీద భక్తి అనే సరస్సులో స్నానం చేస్తే, వారికి ఆ సంసారము వలన కలిగిన కష్టములు తొలగిపోయి. అనునిత్యము సుఖసంతోషాలలో మునిగితేలుతుంటారు. భగవంతుని మీద అపారమైన భక్తి కలవారు తుదకు ముక్తిని పొందుతారు. అటువంటి భగవద్భక్తులకు పరమాత్మ ముక్తిని ప్రసాదించినా, వారు దానిని కాదని, తాము కేవలము భగవంతుని భక్తిలో లీనమైపోతారు.

ఓ పరీక్షిత్ మహారాజా! సాక్షాత్తు ఆ శ్రీహరి శ్రీకృష్ణుడుగా అవతరించి, మీకు, యాదవులకు, గురువుగానూ, బంధువుగానూ, అప్పుడప్పుడు మీకు సేవకుడు గానూ అంటే నీ తాతగారు అర్జునునికి సారథిగానూ సేవచేసాడు. ఆ కృష్ణపరమాత్మ తనను సేవించిన వారికి ముక్తిని ప్రసాదిస్తాడోలేదో తెలియదుగానీ, భక్తి మార్గమును మాత్రము ప్రసాదిస్తాడు.

ఓ మహారాజా! ఋషభదేవుడు తనకు ఉన్న దానితోనే తృప్తి పడ్డాడు. ఇతరము లైన పురుషార్థములను కోరుకొనలేదు. ఈ లోకంలో కేవలం దేహాభిమానముతో ఈ దేహముతో చేసే పనులతో చేసే ప్రతి పనికీ లాభనష్టములను కోరుకొనే ఈ ప్రజలకు, ఆత్మతత్త్వమును బోధించి వారిని చైతన్యవంతులను చేసాడు. వారిలో శ్రీహరి యందు భక్తి భావమును పెంపొందించాడు. అట్టి ఋషభదేవునికి నమస్కారము." అని శుకుడు పరీక్షిత్తుకు భాగవత కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము

ఏడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత కథను ఈ ప్రకారంగా వినిపించసాగాడు.

. "ఓ పరీక్షిత్ మహారాజా! తన తండ్రి ఋషభదేవుని ఆదేశానుసారము ఆయన పెద్ద కుమారుడు అయిన భరతుడు రాజ్యపాలన సాగించాడు. భరతుడు విశ్వరూపుని కుమార్తె అయిన పంచజని అనే కన్యను వివాహం చేసుకున్నాడు. వారిరువురికీ ఐదుగురు కుమారులు కలిగారు. వారి పేర్లు సుమతి, రాష్ట్రభృత్తు,

సుదర్శనుడు, ఆవరణుడు, ధూమ్రకేతువు.

భరతుడు రాజ్యాభిషిక్తుడు కాక పూర్వము ఆ వర్షమును ( ఆ దేశమును) అజనాభము అని పిలిచేవారు. భరతుడు రాజు అయిన తరువాత ఆ దేశమును భారతవర్షము అని పిలువసాగారు. (ఇప్పటికీ మనం సంకల్పంలో భారతవర్షే, భరతఖండే అని చెప్పుకుంటాము కదా!)

భరతుడు తన తండ్రి,తాత వలె ప్రజలను కన్న బిడ్డలవలెపరిపాలించాడు. భరతుడు చిన్నవి,పెద్దవి అయిన యజ్ఞములు ఎన్నో చేసాడు. అగ్నిహోత్రములు, దర్శపౌర్ణమాసములు, చాతుర్మాస్యములు మొదలగు యజ్ఞములు చేసాడు. అశ్వమేధ యజ్ఞములను నిర్విఘ్నంగా పరిసమాప్తి చేసాడు. కాని ఈ యజ్ఞములు అన్నింటిలోనూ భరతుడు ఒక విలక్షణ మైన పద్ధతి అవలంబించాడు. సాధారణంగా యజ్ఞములలో ఆయాదేవతలను ఆహ్వానించి వారికి హవిస్సులు ఇస్తారు. కానీ భరతుడు మాత్రము తాను చేసే యజ్ఞములు, హవిస్సులు, యజ్ఞఫలములు  అన్నీ యజ్ఞపురుషుడుఅయిన ఆ వాసుదేవునికి అర్పించేవాడు. ఎందుకంటే సమస్త దేవతలను, ఇంద్రుడిని అందరినీ ఆ వాసుదేవుడు నియమించాడు కదా. అందుకని వాసుదేవునికి సమర్పిస్తే అందరికీ సమర్పించినట్టే అనిభావించేవాడు. ఇంద్రుడు మొదలగు దేవతలను ఆ విరాట్పురుషుని శరీరభాగములుగా భావించి హవిస్సులను అర్పించేవాడు.

(ఇంద్రుడు విరాట్పురుషుని బాహువుల నుండి పుట్టాడు కాబట్టి ఇంద్రాయస్వాహా అంటూ విరాట్పురుషుని బాహువులను ధ్యానించేవాడు. అలాగే సూర్యుడు విరాట్పురుషుని నేత్రముల నుండి

పుట్టాడు కాబట్టి సూర్యాయస్వాహా అంటూ వాసుదేవుని నేత్రములను ధ్యానించేవాడు.)

ఈ పద్ధతి వలన భరతునిలో రాగద్వేషములు, ఫలాపేక్ష నశించాయి. అతని హృదయము పరిశుద్ధమయింది. వాసుదేవుని యందు భరతునికి భక్తి దినదినప్రవర్ధమానమయింది. పరమాత్మ, బ్రహ్మ, భగవంతుడు అన్నీ ఆ వాసుదేవుడే అని నమ్మాడు.

యోగులు తమ హృదయములలో నిరంతరమూ ఎవనిని ధ్యానం చేస్తారో ఆయనే పరమాత్మ. జ్ఞానులు అయిన వాళ్లు ఎవరిని నిత్యమూ పూజిస్తారో ఆయనే పరబ్రహ్మ. భక్తులు ఎవరిని నిత్యమూ స్మరిస్తారో ఆయనే వాసుదేవుడు. ఆ పరమాత్మ రూపము శాస్త్రములలో ప్రస్ఫుటంగా వర్ణించబడింది. శ్రీవత్సము, కౌస్తుభము, వనమాల, శంఖము, చక్రము, గద, తామర పుష్పము, పీతాంబరము, దయగల చూపులు ఇవే పరమాత్మ లక్షణములు. నిశ్చలమైన ఈ పరమాత్మ స్వరూపము భక్తులైన నారదుడు మొదలగు వారి హృదయములలో ప్రకాశిస్తూ ఉంటుంది.

ఆ ప్రకారంగా భరతుడు వాసుదేవుని తన హృదయంలో నిలుపుకొని భక్తితో సేవించాడు. ఆయన ఆయుఃప్రమాణము కోటి సంవత్సరములు పూర్తి అయ్యాయి. తరువాత తన రాజ్యమును, సంపదను తన కుమారులకు ఇచ్చాడు. రాజభవనమును వదిలి పెట్టి చక్రానది ఒడ్డున ఉన్న పులహాశ్రమమునకు తపస్సు చేసుకోడానికి వెళ్లిపోయాడు. ఆ ప్రదేశంలో వాసుదేవుడు తన భక్తులకు దర్శనం ఇస్తూ ఉంటాడు. ఆ చక్రనదిలో ఉన్న రాళ్లకు మధ్యలో ఒక రంధ్రము

అచ్చు నాభివలె ఉండటం ప్రత్యేకత.

ఆ పులహాశ్రమములో భరతుడు నిత్యము వాసుదేవుని పూలతోనూ, ఆకులతోనూ, జలముతోనూ అర్చిస్తున్నాడు. అతనిలో విషయ వాంఛలు నశించాయి. మనో నిగ్రహం అలవడింది. ప్రతి రోజూ భగవంతుని సేవించడం వలన భరతునికి వాసుదేవుని యందు ప్రేమ దినదినప్రవర్థమానంగా వృద్ధిచెందింది. భరతుడు నిరంతరమూ భగవంతుని ధ్యానములో మునిగిపోయాడు. వేరే ఆలోచనలు ఏవీ అతని మనసులోకి రావడంలేదు. అతనిలో భక్తియోగము గాఢంగా వృద్ధిపొందింది. అతని మనస్సు ఎల్లప్పుడూ బ్రహ్మానందంలో మునిగి తేలుతూ ఉండేది. భరతుడు సూర్యోదయము, సూర్యాస్తమయ వేళలలో భగవంతుని ఈ విధంగా ధ్యానించేవాడు.

పరోరజః సవితుర్జాతవేదో దేవస్య భర్గో మనసేదం జజాన।
స్వ రేతసాఽదః పునరావిశ్య చష్టే హంసం గృధ్రాణం నృషద్రిఙ్గిరామిమః॥

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## పంచమస్కంధము

## ఎనిమిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా భరతుడు చక్ర నదీ తీరంలో పులహాశ్రమంలో పరమాత్ముని సేవలో నిమగ్నం అయి ఉన్నప్పుడు ఒక విచిత్రం జరిగింది.

ఒక రోజు భరతుడు చక్రనదీ తీరంలో స్నానం చేసి సంధ్యావందనం చేసుకుంటున్నాడు. ఒక నిండు గర్భిణి అయిన లేడి ఆ నదిలో నీరు తాగడానికి వచ్చింది. ఆ లేడి నీరు తాగుతూ ఉండగా సమీప పొదలలో నుండి సింహం పెద్దగా గర్జించింది. ఆ సింహ గర్జన నలుదిక్కులా ప్రతధ్వనించింది. ఆ శబ్దానికి ఆ లేడి బెదిరిపోయింది. లేడి అసలే పిరికి జంతువు. పైగా సింహ గర్జన. ఆ లేడి భయంతో గజగజా వణికిపోయింది. చెంగున ఆ నదిలోకి దూకింది. ఆ దూకడంలో నిండు గర్భిణిగా ఉన్న ఆ లేడి గర్భంలో ఉన్న లేడి పిల్ల జారి నదిలో పడింది. ఆకస్మిక ప్రసవానికి, భయానికి, తట్టుకోలేక ఆ లేడి ఆ నదిలో పడగానే మరణించింది. ఇదంతా కొన్ని క్షణాలలో జరిగిపోయింది.

ఇదంతా ఒడ్డున కూర్చుని సంధ్యావందనం చేసుకుంటున్న భరతుడు గమనించాడు. నదిలో తేలుతున్న ఆ లేడి కూనను చూచి జాలిపడ్డాడు భరతుడు. అతని హృదయం ద్రవించింది. వెంటనే లేచి నీళ్లలో దిగి ఆ లేడి కూనను తన చేతుల్లోకి తీసుకున్నాడు. తల్లిలేని ఆ లేడి కూనను తనతో పాటు ఆశ్రమానికి తీసుకొని వచ్చాడు.

ముద్దుగా అటు ఇటు తిరుగుతున్న ఆ లేడి కూనను చూసి భరతుడు ముచ్చట పడ్డాడు. లేత చిగుళ్లను, లేత పచ్చికను తెచ్చి దానికి ఆహారంగా ఇచ్చాడు. తోడేళ్లు మొదలగు క్రూర జంతువులు తినేస్తాయేమో అని ఆ లేడి కూనను కంటి రెప్పలా కాపాడేవాడు. దానిని ప్రేమగా లాలించేవాడు. ముద్దులాడేవాడు. అది చెంగు చెంగున గెంతుతుంటే ఎంతో సంతోషపడిపోయేవాడు.

ఆ లేడి కూన వ్యామోహంలో పడి భరతుని నిత్యాగ్నిహోత్రము, తపస్సు, భగవంతుని పూజలు, అన్నీ ఆగిపోయాయి. భరతుడు ఎల్లప్పుడూ దాని సేవలోనే నిమగ్నం అయ్యాడు. తాను చేస్తున్న పనులను తనలో తాను సమర్థించుకొనే వాడు.

"నేనేం తప్పు చేస్తున్నాను. పాపం తల్లిలేని పిల్ల. దాని ఆలనాపాలనా చూడ్డం తప్పుకాదు కదా! దానికి మాత్రం ఎవరున్నారు. తల్లి, తండ్రి, అన్నీ నేనే కదా! నేను దానిని తల్లిగా కాపాడతానని ధృడమైన విశ్వాసంతో ఉంది పాపం. కేవలం నా దైనందిన చర్యలు ఆగిపోతాయి అని దీనిని నిర్లక్ష్యం చేయలేను కదా! దీనులైన ప్రాణులను రక్షించడం ప్రతిమానవుడి కర్తవ్యం కదా! నా కర్తవ్యం నేను నెరవేరుస్తున్నాను. ఇందులో తప్పేముంది. ఈ లేడి కూన నన్ను శరణుజొచ్చింది. శరణుజొచ్చిన వారిని రక్షించడం ధర్మం కదా! ఆ ధర్మాన్ని నేను పాటిస్తున్నాను. కాబట్టి నా తపస్సు, పూజలు, సంధ్యావందనము ఆగిపోయినప్పటికినీ, ఈ లేడి కూన ఆలనా పాలనా చూడ్డం నా కర్తవ్యం. దీనిని నేను విడువలేను." అని తనలో తాను

సర్దిచెప్పుకున్నాడు భరతుడు.

మహారాజా! ప్రాపంచిక విషయములను విడిచిపెట్టినవారు, సహజంగా దయకలవారు అయిన సత్పురుషులు కూడా ఇతరుల మీద జాలి, దయతో తమ స్వకర్మలను కూడా చేయడం మానుకుంటారు. దానికి ఏవేవో సాకులు చెప్పుకుంటారు. భరతుడు అదే చేసాడు

ఓ మహారాజా! ఆ ప్రకారంగా భరతునికి ఆ లేడిపిల్ల మీద మమకారము ఎక్కువయింది. దానితో పాటు ఆడుకోవడం, పరుగెత్తడం, స్నానం చేయడం వంటివి చేస్తున్నాడు. తాను దర్భలు, పూలు, తేవడానికి అడవిలోకి వెళ్లినప్పుడు ఈ లేడి పిల్లను ఏ తోడేలైనా ఎత్తుకుపోతుందని, తనతో పాటు అడవికి తీసుకెళ్లే వాడు. ఆ లేడి పిల్ల మధ్యదారిలో మారాం చేస్తూ అటు ఇటు పరుగెడుతుంటే దానితో పాటు పరుగెత్తేవాడు. అది నడవలేకపోతే బుజాల మీద ఎక్కించుకొని మోసుకుంటూ పోయేవాడు. తాను కూర్చుని ఉన్నప్పుడు దానిని ఒడిలో కూర్చోపెట్టుకొని లాలించేవాడు. వెల్లకిలా పడుకొని ఉన్నప్పుడు గుండెల మీద ఎక్కించుకొని ఆడించేవాడు.
అప్పుడప్పుడు సంధ్యావందనము, పూజలు చేస్తున్నా మధ్య మధ్యలో ఈ లేడికూన ఎక్కిడికి పోయిందో అని అటు ఇటు చూచేవాడు. దానితో అతనిలో ఏకాగ్రత నశించింది.

అది లేడి కూన. చెంగు చెంగున గెంతుతూ ఉంటుంది. ఎప్పుడైనా భరతుని కన్నుగప్పి అది అడవిలోకి పారిపోతే, దాని గురించి బెంగ పెట్టుకొనే వాడు. పరి పరి విధాల ఆలోచించేవాడు.

"పాపం ఆ లేడి దీనిని నా చేతిలో పెట్టి కన్ను మూసింది. నేను పాపాత్ముడను. దీని ఆలనాపాలనా సరిగా చూడటం లేదు. అందుకే పారి పోయింది. ఎక్కడని వెదకను. అది మరలా నా కళ్లబడే దాకానాకు మనశ్శాంతి లేదు కదా! ఏమో! మరలా నా లేడి పిల్లను నా కళ్లముందు పచ్చిక కొరుకుతూ అటు ఇటు తిరగడం చూడగలనా! కొంపదీసి ఏ తోడేలు కానీ, పులి గానీ దీనిని నమిలి మింగలేదు కదా! అయ్యో! సూర్యాస్తమయం అవుతూ ఉంది. ఎక్కడకుపోయిందో ఏమిటో! ఇంకా తిరిగి రాలేదు. ఏం చెయ్యాలో తోచడం లేదు. ఆ తల్లిలేని కూనను ఎక్కడని వెదకను. నా లేడి పిల్ల మరలా నా వద్దకు వచ్చి నా కళ్లకు కనిపిస్తేనే కానీ నా హృదయం కుదుటపడదు. నాకు సంతోషం కలగదు. ఈ పాపాత్ముడికి అంత అదృష్టమా!

ఆలోచించిన కొద్దీ దాని చిలిపి చేష్టలే గుర్తుకొస్తున్నాయి. నేను కళ్లు మూసుకున్నట్టు మూసుకొని దానిని ఓరకంటి తో చూస్తుంటే, అది తన మృదువైన కొమ్ములతో నా వీపు గోకుతుంటే, ఆ ఆనందం ఏమని చెప్పాలి. నేను పూజచేసుకుంటూ దర్భలు పక్కన పెట్టుకుంటే ఆ దర్భలను గడ్డిపరకలు అని ఆ లేడిపిల్ల తింటే, నేను దానిని కోప్పడితే, అది నామీద అలిగి నా దగ్గరకు రాకుండా మారాం చేస్తుంటే, ఎంత ముద్దుగాఉంటుందో!" అని పరిపరి విధములుగా ఆ లేడి పిల్లను తలచుకుంటూ పరితపిస్తున్నాడు భరతుడు.

ఇంతలో పున్నమి నాటి చంద్రుడు ఆకాశంలో కనిపించాడు. ఆ చంద్రుడిలో చిన్న జింకపిల్ల కనిపించింది. ఆ జింక పిల్లను చూచి మరలా భరతుడికి తన లేడిపిల్ల గుర్తుకు వచ్చింది. "అయ్యో! నా జింక

పిల్లను ఎవరైనా ఎత్తుకుపోతారేమో అని భయపడి చంద్రుడు నా మీద జాలితో నాజింకపిల్లను తీసుకెళ్లి తనలో దాచుకున్నట్టున్నాడు. ఈ జింక పిల్ల నాకు అత్యంత ప్రియమైనది. నేను దానిని నా కన్నబిడ్డలా చూచుకుంటున్నాను. అది కనపడకపోతే నా మనసు విలవిలలాడి పోతోంది. నా బాధ చూడలేక చంద్రుడు నా మీద ఈ చల్లని వెన్నెల కురిపిస్తున్నాడు."అని రకరకాలుగా శోకిస్తున్నాడు భరతుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! చూచావా వ్యామోహం ఎంతటి పని చేస్తుందో. ఇది భరతుని పూర్వజన్మకర్మల ఫలము. ఈ జింక పిల్ల రూపంలో వచ్చి భరతుని నియమ నిష్టలను, తపస్సును, పూజలను నాశనంచేసింది. లేకపోతే రాజ్యమును, భార్యను, పుత్రులను గడ్డిపోచ ప్రాయంగా విడిచిపెట్టిన వాడికి ఈ జింకపిల్ల మీద ఇంతటి వ్యామోహం ఏమిటి? పుట్టగానే తల్లిని పోగొట్టు కుంది కాబట్టి జాలితో ఆశ్రమానికి తీసుకొని వచ్చాడు. నాలుగు రోజులు ఉంచుకొని అది స్వేచ్ఛగా తిరగడం, తనంతట ఆహారం సంపాదించుకోడం, నేర్చుకున్న తరువాత దానిని స్వేచ్ఛగా అడవిలో వదిలి పెట్టి ఉంటే బాగుండేది

"అడవిలో ఎన్ని జింకలు లేవు. అన్నిటినీ నేనే పెంచుతున్నానా! అవి బతకడం లేదా! అలాగే ఈ జింకపిల్ల కూడా!" అని భరతుడు అనుకొని ఉంటే బాగుండేది. అలా కాకుండా దాని మీద వల్లమాలిన వ్యామోహం పెంచుకోవడం వల్ల ఇదంతా వచ్చింది. ఇంద్రియములను, మనస్సును నిగ్రహించిన భరతుడు ఒక లేడి పిల్ల పోషణ, లాలన, పాలనయందు ఇంతటి వ్యామోహం చూపడం ఏమిటి! దానివలన అతడు భ్రష్టుడు కావడం ఏమిటి! అంతా విచిత్రం కాకపోతే!

సాయంత్రానికి ఆ ఆ జింకపిల్ల మరలా భరతుని వద్దకు చేరింది. కాలం గడుస్తూ ఉంది. భరతునికి అవసాన దశ వచ్చింది. భరతుని మనసంతా జింకపిల్లమీదనే ఉంది. దానిని చూస్తూ దాని మీద వ్యామోహంతో మరణించాడు. మరుజన్మలో ఒక జింకపిల్లగా పుట్టాడు. కాని భరతునికి పూర్వజన్మస్మృతి అలాగే ఉంది. తానేమిటి జింకపిల్లగా పుట్టడమేమిటి అని తనలో తాను తర్కించుకుంటున్నాడు. ఇలా అనుకున్నాడు. "నిష్ఠాగరిష్టుడనైన నాకు ఎంతటి కష్టం వచ్చింది. వాసుదేవుని చరణములను భక్తితో పూజించి, కైవల్యము పొందవలసిననేను ఈ క్షుద్రమైన జింక జన్మఎత్తడం ఏమిటి! నేను రాజ్యం చేసాను. విరక్తితో భార్య పుత్రులను,రాజ్యమును వదిలి పెట్టాను. పులహాశ్రమము చేరుకొని, ఇంద్రియములను, మనస్సును జయించి తపస్సు చేసుకుంటున్నాను. సకలజీవులలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్న ఆ వాసుదేవుని స్మరిస్తూ, స్తుతిస్తూ, కీర్తిస్తూ చాలాకాలం గడిపాను. కాని ఈ చంచలమైన మనస్సు ఆ తల్లిలేని జింకపిల్ల మీద లగ్నం అయి నన్ను భ్రష్టుడిని చేసింది. ఇప్పుడు ఏం అనుకున్నా ఏం లాభం లేదు." అని అనుకుంటూ మరలా తానుపూర్వము నివసించిన పులహాశ్రమమునుచేరుకున్నాడు. అక్కడ దొరికిన పచ్చి గడ్డి ఎండు గడ్డి తింటూ, ఎవరి జోలికీ పోకుండా ఎంటువంటి సంగము లేకుండా బతికి కొంత కాలము తరువాత ఆ నదిలో పడి ఆ జింకశరీరమును వదిలిపెట్టాడు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# పంచమస్కంధము
# తొమ్మిదవ అధ్యాయము.

శుకుడు పరీక్షిత్ మహారాజుకు భాగవతపురాణమును ఇలా చెప్పసాగాడు.

. "మహారాజా! ఆ విధంగా లేడి శరీరమును విడిచిపెట్టిన భరతుడు తరువాతి జన్మలో ఒక బ్రాహ్మణుని ఇంటిలో జన్మించాడు. ఆ బ్రాహ్మణుడు ఆంగీరస గోత్రీకుడు. మనో నిగ్రహము ఇంద్రియ నిగ్రహము కలవాడు. వేదములను అధ్యయనం చేసిన వాడు. దాన ధర్మములు చేస్తూ ఉండేవాడు. ఉన్నదానితో తృప్తిపడేవాడు. ఎంతో ఓర్పు కలవాడు. వినయము, విద్య కలవాడు. ఇతరుల పట్ల అసూయలేని వాడు. ఆత్మజ్ఞానమును సాధించిన వాడు.

అటువంటి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు భరతుడు. ఆ బ్రాహ్మణునకు ఇద్దరు భార్యలు.మొదటి భార్యకు తొమ్మిది మంది కుమారులు. రెండవ భార్యకు ఒక పుత్రుడు ఒక పుత్రిక కవలలుగా పుట్టారు. అందులో ఒకడు లేడి శరీరమును వదిలి పెట్టి బ్రాహ్మణ శరీరంలో పుట్టిన భరతుడు.

భరతునికి పూర్వజన్మ స్మృ తి ఎక్కడికీ పోలేదు. తాను భరతుడుగా పుట్టడం, రాజ్యం ఏలడం, తరువాత వానప్రస్థమునకు వెళ్లడం, ఒక లేడినిపెంచడం, ఆ లేడితో మమేకం కావడం, దాని

ఫలితంగా లేడిగా పుట్టడం, తరువాత ఆ లేడి శరీరమును వదిలిపెట్టి బ్రాహ్మణుని ఇంట్లో పుట్టడం అన్నీ గుర్తు ఉన్నాయి. భరతుడు మరలా అటువంటి పొరపాటు చేయదలచుకోలేదు. తన మనస్సులోనే పరమాత్మను కీర్తించేవాడు, పూజించేవాడు. అంతే గానీ బయటకు కనపడేవాడు కాదు. ఎవరితోనూ సంబంధం పెట్టుకొనే వాడు కాదు. ఒక జడుడి మాదిరి, పిచ్చివాడి మాదిరి ఏమీ తెలియని వాడి మాదిరి ప్రవర్తించేవాడు.

ఇవేమీ ఆ బ్రాహ్మణునికి తెలియవు. ఆ బ్రాహ్మణునికి భరతుడు అంటే ఎంతో ప్రేమ. అందు వలన భరతునికి అక్షరాభ్యాసము, ఉపనయనము, వేదాధ్యాయనము అన్నీ జరిపించాడు. ఇవన్నీ భరతునికి ఇష్టం లేదు. కానీ తండ్రి మాత్రము కుమారుని విద్యావంతుని చేయడం తన విధి అని భరతుడికి అన్నీ యధావిధిగా జరిపించాడు. కాని భరతుడు తండ్రి చెప్పినది ఒకటీ సక్రమంగా చేసేవాడు కాదు. పైగా అన్నీ విరుద్ధంగా చేసేవాడు. ఒకటిచెయ్యమంటే మరొకటి చేసేవాడు. కాని ఆ బ్రాహ్మణుని మనసు మాత్రము తన కుమారుని గొప్పవాడిగా  చేయవలెనని ఎంతో పరితపించేది. అందుకని భరతునికి ఇష్టం లేకపోయినా అతనికి బ్రహ్మచర్యము, శౌచము, వేదాధ్యయనము, వ్రతములు, నియమములు, గురు సేవ, అగ్నికార్యములు అన్నీ భరతుడి చేత చేయించాడు. కాని భరతుడు ఏమీ చేసేవాడు కాదు.

ఆ బ్రాహ్మణుడు చేసిన ప్రయత్నములు అన్నీ నిష్ఫలములు అయ్యాయి. తన కుమారుని గొప్ప పండితుని చేయవలెనని ఆశ తీరకుండానే ఆ బ్రాహ్మణుడు మరణించాడు. ఆ బ్రాహ్మణుని రెండవ

భార్య తన కుమారుడు భరతుని, తన కుమార్తెను తన సవతి (పెద్దభార్య) కు అప్పగించి, భర్తతో సహగమనం చేసింది.

ఇప్పుడు ఆ బ్రాహ్మణుని పెద్ద భార్య కుమారులు ఇంటికి అధిపతులు అయ్యారు. వారు భరతుని ఒక పిచ్చివాడిగానూ, మందమతి గానూ చూడసాగారు. వాడికి చదువు చెప్పించడం మానుకున్నారు. వారు మాత్రము, వేదములు, శాస్త్రములు చక్కగా చదువుకున్నారు. కాని వారికి భరతునికి అబ్బిన పరమాత్మ ఎడల భక్తి మాత్రము లేశ మాత్రము కూడా అబ్బలేదు.

భరతుడు వీధిలోకిపోతే, ఆ ఊరి ప్రజలు భరతుని ఒక పిచ్చివాడిగానూ, జడుడి గానూ, మూగవాడిగానూ, చూడసాగారు.. భరతుడు కూడా వారిని ఒక్క మాట కూడా అనే వాడు. వాళ్లు ఎలా పిలిస్తే అలా పలికేవాడు. వాళ్లు ఏమి చెబితే అది చేసేవాడు. ఎవరు ఏమి ఇచ్చినా తీసుకొనేవాడు. ఆ ఊరి వారందరికీ జీతం భత్యం లేని పనివాడుగా తయారయ్యాడు. ఆకలి వేస్తే ఏది దొరికితే అది తినేవాడు. నాలుకకు రుచిగా ఉందా లేదా అని అస్సలు పట్టించుకొనేవాడు కాదు. ఎందుకంటే భరతుడు పూర్వజన్మలలోనే సుఖదు:ఖములకు, రాగద్వేషములకు అతీతుడు అయ్యాడు. దేహాభిమానమును పూర్తిగా వదిలేసాడు. బయట ఎలా ప్రవర్తించినా, మనసులో మాత్రము నిరంతరము హరినామస్మరణలో నిమగ్నం అయ్యేవాడు.

ఈ మాదిరి ఉన్నప్పటికినీ, భరతుని శరీరము పొడుగ్గా, పొడుగ్గు తగ్గ లావుతో ధృఢంగా ఉండేది. అతని శరీర అవయవములు

పుష్టిగా ఉండేవి. కాని భరతుడు ఎండాకాలంలో, వానాకాలంలో చలి కాలంలో తన శరీరమును పూర్తిగా కప్పుకొనేవాడు కాదు. నడుముకు ఒక వస్త్రము, పైన ఒక వస్త్రము కప్పుకొనే వాడు. యజ్ఞోపవీతం బుజానికి వేలాడుతూ ఉండేది. రోజూ స్నానం చేసేవాడు కాదు. అందుకని అతని శరీరం మలినంగా ఉండేది. ఆ ఊరి వాళ్లందరూ భరతుని బ్రాహ్మణ వంశంలో చెడబుట్టాడు అనే వారు. కానీ భరతుడు ఏమీ పట్టించుకొనే వాడు కాదు.

భరతునిచేత అతని అన్నయ్యలు ఇంటి పని, పొలం పని అంతా చేయించుకొనేవారు. రాత్రిళ్లు పంటపొలాలకు కాపలాగా పడుకోమనేవాళ్లు. వాళ్లందరూ తినగా మిగిలిన అడుగు అన్నము, మాడిపోయిన అన్నము, అదీ లేకపోతే పురుగుపట్టిన పిండి పెట్టేవాళ్లు. అదే అమృతప్రాయంగా తినేవాడు భరతుడు.

ఇది ఇలా ఉండగా, ఆ ప్రాంతంలో ఒక దొంగల గుంపు ఉండేది. ఆ దొంగల నాయకుడికి పిల్లలు లేరు. అమ్మవారికి నరబలి ఇస్తే పిల్ల పుడతారని ఆ దొంగల పురోహితుడు చెప్పాడు. నరబలి కోసరం ఆ దొంగలు ఒకడిని పట్టుకొని వచ్చారు. సరిగాబలి ఇచ్చే ముందు రోజు ఆ బలిపశువు పారిపోయాడు. మర్నాడే బలి ఇవ్వాలి. అందుకని ఆ దొంగలు మరొక బలిపశువుకొరకు వెదక సాగారు.

ఆ రాత్రి వారికి పొలంలో కాపలా కాస్తున్న భరతుడు కనిపించాడు. పొడుగ్గా, లావుగా, బలిసిన అవయవాలతో ఎద్దులాగా ధృఢంగా ఉన్న భరతుని చూచి పరమానందభరితులయ్యారు. భరతుని

తాళ్లతో కట్టారు. కాళికాలయానికి లాక్కుని పోయారు. అప్పటికే దొంగల నాయకుడు అమ్మవారి పూజముగించి బలిపశువు కొరకు ఎదురు చూస్తున్నాడు. దొంగలు భరతుని తమ నాయకుని ముందు నిలబెట్టారు. బలికి తగిన మనిషి దొరికాడు అనుకున్నాడు ఆదొంగల నాయకుడు. భరతుని బలికి తయారు చేయమన్నాడు.

దొంగలు భరతునికి స్నానం చేయించారు. ఎర్రబట్టలు కట్టారు. మెడలో ఎర్రటి పూల మాలలు వేసారు. గంధం పూసారు. బొట్టు పెట్టారు.  బలి పశువును అలంకరించినట్టు అలంకరించారు. దొంగల పూజారి అమ్మవారికి పూజ చేసాడు. భరతుని బలి ఇవ్వడానికి పెద్ద కత్తిపట్టుకొని నిలబడ్డాడు. భరతుని తల నరికి అతని మెడనుండి కారే రక్తంతో కాళికి అభిషేయం చేయడానికి సిద్ధంగా ఉన్నాడు.

దొంగలంతా పూర్తిగా మద్యంసేవించి ఊగి పోతున్నారు. ఒక బ్రాహ్మణుడిని చంపుతున్నామే అనే బాధ, ఆ అమాయకుడి మీద దయ వారికి ఏకోశానా లేదు. వారికి అదొక ఆనందంగా ఉంది. అందుకే ఆడుతున్నారు, పాడుతున్నారు. బలిని చూద్దామని ఉత్సాహంతో గంతులు వేస్తున్నారు.

ఇదంతా ఓ కంట కనిపెడుతూ ఉంది కాళీ మాత. సర్వభూతములను తనతో సమానంగా భావించేవాడు, ఎవరిమీదా శత్రుత్వము లేని వాడు, ఎల్లప్పుడూ భగవంతుని మనసులో స్మరించేవాడు అయిన ఆ బ్రాహ్మణుని చంపడం ఆ తల్లికి రుచించలేదు. ఆమె ఒక్కసారిగా హుంకరించింది. తన కరాళ రూపంతో ఆ విగ్రహాన్ని

చీల్చుకొని బయటకు వచ్చింది. ఆమెతోపాటు ఆమె అనుచరులుకూడా వికటాట్టహాసాలు చేస్తూ బయటకు వచ్చారు.

అమ్మవారిని చూచిన దొంగలు భయంతో వణికిపోయారు. భరతుని వదిలేసారు. భరతుడు అమ్మవారికి నమస్కరించి అక్కడి నుండి వెళ్లిపోయాడు. ఇంక కాళీమాత ఆమె అనుచరులు విజృంభించారు. ఆ దొంగల చేతులలో ఉన్న కత్తులను తీసుకొని ఆ దొంగల తలలను నరికారు. వారి రక్తాన్ని పట్టి తాగారు. వారి రక్తాన్ని ఒళ్లంతా పూసుకున్నారు. ఆ దొంగల తలకాయలతో బంతులాట ఆడుకున్నారు. ఆ దొంగల కళేబరాల మధ్య కరాళ నృత్యం చేసారు. తరువాత ఆ తల్లి తన అనుచరులతో సహా అంతర్ధానం అయింది.

ఓ పరీక్షిత్ మహారాజా! భరతుడి లాంటి మహానుభావులకు అపకారం తలపెట్టిన వారికి ఇదే గతి పట్టడంలో ఆశ్చర్యం ఏముంది. ఎందుకంటే భరతుడు సామాన్యుడు కాదు. దేహాభి మానమును, అహంకారమును వదిలిపెట్టినవాడు. అన్ని ప్రాణుల యందు పరమాత్మను చూచేవాడు. ఎవరికీ అపకారము చేయని వాడు. ఎల్లప్పుడూ మనసులో శ్రీహరిని ధ్యానించేవాడు. తనను బలి ఇవ్వబోతున్నారని తెలిసినా చలించని వాడు. అటువంటి భరతుని భగవంతుడు రక్షించకుండా ఎలా ఉండగలడు. అందుకే కాళికా మాత రూపంలో వచ్చి రక్షించాడు. భగవద్భక్తుల విషయంలో ఇదేమీ ఆశ్చర్యకరమైన విషయం కాదు కదా!

(ఈ సందర్భంలో మనము గీతా శ్లోకాన్ని స్మరించుకుందాము.
అనన్యాశ్చింతయంతోమా ఏజనాపర్యుపాసతే
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమం మహావ్యహమ్॥)

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము
పదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత పురాణమును ఇలా చెప్పసాగాడు.

. " ఓ మహారాజా! కాళికాలయము నుండి బయటకు వచ్చిన భరతుడు తన దారిన తాను వెళుతున్నాడు. అలా వెళుతూ వెళుతూ భరతుడు సౌవీర దేశమునకు చేరుకున్నాడు.

సౌవీర దేశమును రహూగణుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆయన కపిలాశ్రమమునకు వెళ్లడానికి పల్లకీ సిద్ధం చేయమన్నాడు. పల్లకీ బోయీలకు అధిపతి అయిన వాడు బోయీలను రమ్మన్నాడు. నలుగు బోయీలకు గాను ముగ్గురే ఉన్నారు. ఒకడు

రాలేదు. ఒక పక్క రాజుగారు వస్తున్నారు. ఎవడో ఒకడిని తీసుకురమ్మని బోయీలకు చెప్పాడు.

అదే సమయంలో భరతుడు ఆ ప్రాంతానికి వచ్చాడు. ఎత్తుగా పొడుగ్గా ధృఢంగా, ఎద్దులాగా ఉన్న భరతుని చూచి ఇతడు పల్లకీ మోయడానికి తగిన వాడనుకొని భరతుని బోయీల అధిపతి వద్దకు తీసుకొని వచ్చారు. "నువ్వు పల్లకీ మోస్తావా" అని అడిగాడు ఆ అధిపతి. సరే అని తల ఊపాడు భరతుడు. ఇంతలో రహూగణుడు వచ్చి పల్లకీలో కూర్చున్నాడు. ముందు ఇద్దరు బోయీలు వెనక ఇద్దరు బోయీలు పల్లకీ మోస్తున్నారు. వెనకబోయీలలో ఒకడు భరతుడు.

భరతుడు తాను పల్లకీ మోస్తున్నప్పుడు నేల వంక చూస్తున్నాడు. తన కాలి కింద ఏదన్నా ప్రాణి పడి చచ్చిపోతుందేమో అనే భయంతో అడుగులు అడ్డదిడ్డంగా వేస్తున్నాడు. పైగా భరతునికి పల్లకీ మోసే అనుభవం లేదు. అందువలన మిగిలిన బోయీల వలె సక్రమంగా మోయలేకపోతున్నాడు. దీనితో పల్లకీ అటు ఇటు ఊగసాగింది. లోపల ఉన్న రాజుగారికి కోపం వచ్చింది. "ఎవర్రా అది! పల్లకీని అలా మోస్తున్నారు. సరిగా మోయండి" అని బోయీలను మందలించాడు.

రాజు గారికి కోపం వచ్చిందని తెలిసి బోయీలు గడగడ వణికిపోయారు. రాజుగారి ముందు చేతులో జోడించి "మహారాజా! ఇందులో మా తప్పు ఏమీ లేదు. ఈ రోజు ఒక కొత్త బోయీ ఒకడు వచ్చాడు. అతనికి సరిగా మోయడం చేతకాదు. అందుకనీ పల్లకీ ఊగుతూ ఉంది. క్షమించండి." అని రాజుగారిని విన్నవించుకున్నారు.

ఒక్కడు సరిగా మోయకపోయినా పల్లకీ ఊగుతుందని గ్రహించాడు మహారాజు.

లావుగా పొడుగ్గా, ధృడంగా ఉన్న భరతుని చూచి హేళనగా రాజు ఇలా అన్నాడు. "ఏంటి సోదరా! అంత కష్టపడుతున్నావా! అయ్యో పల్లకీ ఎంత దూరం మోసావు. చాలా కష్ట పడ్డావు. పైగా ముసలి వాడివి. సన్నగా పుల్ల లాగా ఉన్నావు. పల్లకీ ఏంమోస్తావులే! నీ తప్పు ఏం లేదు. ఈ బోయీలకే పల్లకీ మోయడం రాదు కదా! ఏమంటావు?" అని ఎకసక్కెంగామాట్లాడాడు.

ఆ మాటలను విన్న భరతుడు మౌనంగా ఉన్నాడు. మరలా పల్లకీ ఎత్తుకున్నాడు. దేహము మీద ఏమీ అభిమానము లేని భరతునికి రాజు గారి మాటలు బాధ కలిగించలేదు. మౌనంగామోస్తున్నాడు. కాని తన పూర్వ పద్ధతిని వదిలిపెట్టలేదు. కింద చూస్తూ కాలి కింది ఏ కీటకమూ పడకుండా జాగ్రత్తగా అస్తవ్యస్తంగా అడుగులేస్తూ పల్లకీ మోస్తున్నాడు. ఈ సారి పల్లకీ ఎక్కువగా ఊగసాగింది. పల్లకీలో ఉన్న రహూగణ మహారాజుకు కోపం ఎక్కువయింది.

"ఓరి దుష్టుడా! నీకు ఇంకా బుద్ధిరాలేదా! నీవు ఏం చేస్తున్నావో నీకు తెలుస్తూ ఉందా! నీవు అసలు బతికే ఉన్నావా లేక బతికి ఉండీ శవంలాగా నడుస్తున్నావా! నేను ఎవరో తెలుసా! ఈ రాజ్యమునకు మహారాజును! నీకు ప్రభువును. నా ఆజ్ఞను ధిక్కరించిన వాడిని నేను యమధర్మరాజు మాదిరి కఠినంగా శిక్షిస్తాను. నిన్ను కూడా కఠినంగా శిక్షిస్తేనే గానీ నీవు దారిలోకి వచ్చేట్టు లేవు." అని రజో

గుణము, తమోగుణములతో కూడిన రాజు అనే అహంకారంతో పరమభాగవతోత్తముడు నివురుగప్పిన నిప్పుమాదిరి ఉన్న భరతుని నానారకాలుగా దూషించాడు.

రహూగణుడు సామాన్యుడు కాడు. గొప్ప పండితుడు. శాస్త్రములను చదువుకున్నాడు. కానీ రాజు అనే అహంకారము, మదము అతని కళ్లు కప్పింది. ఎదుటి వాడు ఎవరా అనే ఆలోచన అతని మనసులోకి రాలేదు. కోపంతో రగిలిపోతున్న రహూగణ మహారాజును చూచి అప్పటి దాకా మౌనంగా ఉన్న భరతుడు ఒక్కసారిగా నోరు తెరిచి ఆ రాజుతో ఇలా అన్నాడు.

"ఓ మహారాజా! నీవు పలికినది నిజం. ఏ మాత్రం అసత్యము లేదు. నేనే ఈ దేహము అని నేను అనుకుంటే, నాశరీరానికి పల్లకీ మోసే భారము, ఎంత దూరం మొయ్యాలి అనే భావన ఉంటుంది. కానీ నాకు ఈ దేహము మీద అభిమానము, మమకారము లేదు. ఎల్లప్పుడూ నేను వేరు ఈ దేహము వేరు అని అనుకుంటూ ఉంటాను.

నేను లావుగా, ఎత్తుగా, ధృడంగా ఉన్నాను అని అన్నావు. లావు, పొట్టి, పొడుగు, కృశించడం, ఆరోగ్యంగా ఉండటం, వ్యాధులు, కోరికలు, ఆశలు, తగవులు, విషయవాంఛలు, ముసలితనము, నిద్ర, కోపము, ఈదేహమే నేను అనే అహంకారము, శోకము,మోహము ఇవన్నీ దేహము మీద అభిమానము కలవారికి పుడతాయి కానీ నాకు కాదు. నాకు ఈ దేహము మీద ఎలాంటి అభిమానము, అహంకారము లేవు. కాబట్టి నా దేహము ఎలా ఉన్నా నేను పట్టించుకోను.

రాజా! నేను బతికి ఉన్న శవంలాగా మోస్తున్నాను అని అన్నావు. నేనే కాదు అందరూ బతికి ఉన్న శవాలే. ప్రతివాడూ ప్రతిక్షణము చావుకు దగ్గరవుతున్నాడు. ప్రతివాడికీ పుట్టుక చావు ఉంటాయి.

ఓ రాజా! నీవు నన్ను "రాజాజ్ఞను ధిక్కరిస్తున్నావు" అని అన్నావు. ఇక్కడ రాజు ఎవరు, సేవకుడు ఎవరు. నీవు నీ దేహము మీద ఉన్న అభిమానంతో రాజు అని అనుకుంటున్నావు. నన్ను పల్లకీ మోయమన్నావు. కాని నేను నీ సేవకుడను కాను. ఎందుకంటే నాకు దేహాభిమానము లేదు. "నేను రాజు, వీడు సేవకుడు, వీడు నా పల్లకీ మోయాలి" అనేది లౌకికభావన. ఈ లౌకిక భావనను ప్రాపంచిక వ్యవహారములలో ఉపయోగిస్తారు. నిజానికి అందరూ సమనమే. అందరి దేహములలో ఉన్న ఆత్మ ఒకటే. ఆత్మకు భేదబుద్ధి లేదుకదా! పోనీలే! నీవు "నేను రాజును" అని అనుకుంటున్నావు కాబట్టి నీకు ఏమి సేవ చెయ్యాలో చెప్పు చేస్తాను.

ఓ రాజా! నీవు ఇంకొక మాట కూడా అన్నావు. "ఓరీ నీవు పొగరుగా ఉన్నావు. నిన్ను నేను శిక్షిస్తాను. సక్రమమైన దారిలో పెడతాను" అని కూడా అన్నావు కదా! నేను పిచ్చివాడిలాగా, జడుడి లాగా, అమాయకుడిలాగా కనిపిస్తున్నా, నాకు బ్రహ్మజ్ఞానము, ఆత్మసాక్షాత్కారము కలిగాయి. నాకు దేహాభిమానము ఏ మాత్రము లేదు. ఇంక నువ్వు నన్ను ఏం శిక్షిస్తావు. ఏ దారిలో పెడతావు. నీ

దృష్టిలో నేను ఒక పొగరుబోతును. దుష్టుడను. అందుకని నన్ను శిక్షిస్తాను అంటున్నావు. కానీ నన్ను శిక్షించడం అంటే బాగా పిసికిన పిండిని ఇంకా ఇంకా పిసకడం లాంటిది. నీ శిక్షలు ఈ దేహానికే కానీ నాకు కాదు. నన్ను దండిస్తే నీకు ఏం లాభం లేదు శ్రమ తప్ప." అని అన్నాడు భరతుడు.

మరలా భరతుడు పల్లకీ ఎత్తుకున్నాడు. భరతుని మాటలకు రహూగణ మహారాజు నిర్ఘాంతపోయాడు. నోట మాట రాలేదు. ఒక్కసారి దిగ్భ్రాంతి చెందాడు. ఆ రాజుకు తానేమిటో తెలిసి వచ్చింది. పల్లకీ ఆపండి అని అరిచాడు. పల్లకీ ఆగింది. పల్లకీ లోనుండి కిందికి దిగాడు. భరతుని కాళ్లమీద పడ్డాడు. సాష్టాంగప్రణామంచేసాడు. "నన్ను క్షమించండి నన్ను క్షమించండి. నేను తప్పు చేసాను." అని ప్రాధేయపడ్డాడు.

భరతుడు రహూగణ మహారాజును పైకి లేవదీసాడు. ప్రసన్నంగా ఆయనమొహంలోకి చూచాడు. రహూగణమహారాజు చేతులు జోడించి భరతునితో ఇలా అన్నాడు.

"ఓ మహాత్మా! మారు వేషంలో తిరుగుతున్న తమరు ఎవరు? మీ మెడలో యజ్ఞోపవీతము ఉంది. మీరు బ్రాహ్మణుడివా! లేక అన్నీ వదిలిపెట్టిన అవధూతవా! తమరి గురువు ఎవరు? తమరి నివాసము ఏది? ఇక్కడకు ఏమి పనిమీద వచ్చారు? మీరు నా క్షేమం గోరి నన్ను సరి అయిన మార్గంలో పెట్టడానికి వచ్చినట్టున్నారు. నేను కపిలమహర్షిని దర్శించడానికి కపిలాశ్రమమునకు వెళుతున్నాను.

తమరు సాక్షాత్తు ఆ కపిల మహర్షి మాదిరి నాకు దర్శనం ఇచ్చారు.

ఓ మహాత్మా! నేను దేవేంద్రుని వజ్రాయుధమునకు గానీ, ఈశ్వరుని త్రిశూలమునకు కానీ, యముడి దండమునకు కానీ భయపడను, కానీ బ్రాహ్మణ దూషణకు భయపడతాను. బ్రాహ్మణుల పట్ల చేసిన అపరాధమునకు భయపడతాను. తమరు సామాన్యులు కారు. తమరి విజ్ఞానము నివురుగప్పిన నిప్పు మాదిరి తమరిలో దాగి ఉంది. తమరు సర్వసంగ పరిత్యాగులు. దేహాభిమానమును విడిచిపెట్టినవారు. ఇంతటి విజ్ఞానవంతులు, మహిమ కలవారు అయి ఉండి కూడా తమరు ఈ మాదిరి పిచ్చివాడి మాదిరి, జడుడి మాదిరి ఎందుకు తిరుగుతున్నారు. తమరు ఇప్పుడు నాతో పలికిన పలుకుల అర్థము నాకు సరిగా బోధ పడలేదు. దయయుంచి తమరి పలుకులలోని అంతరార్థమును వివరించి నన్ను కృతార్థుని చెయ్యండి.

ఓ మహాత్మా! తమరు యోగీశ్వరులు. ఆత్మ తత్త్వమును బాగా తెలిసినవారు. మహాఋషులకే గురువు కాదగిన వారు ఈ లోకంలో ఉన్న అజ్ఞానులకు జ్ఞానబిక్షపెట్టడానికి అవతరించిన పరమాత్మవు. సందేహము లేదు. నేను కపిల మహర్షి దర్శనం చేసుకోడానికి వెళుతుండగా తమరు సాక్షాత్తు ఆ కపిల మహర్షి వలె సాక్షాత్కరించారు.

మహానుభావా! తమరు సాక్షాత్తు కపిలమహర్షి వంటి మహానుబావులు అయి ఉండి కూడా, ఈ లోకంలో ఉన్న సాధువులను పరీక్షించడానికి ఈ మాదిరి ఉన్నాది మాదిరి. జడుని మాదిరి,

పిచ్చివాని మాదిరి తిరుగుతున్నారా! తమరి గురించి మహాత్ములైన సాధువులకే తెలియనప్పుడు, మా వంటి వివేకము లేని వారు, బుద్ధిహీనులు,ఎల్లప్పుడూ నా ఇల్లు, నా భార్యాపిల్లలు అని పరితపించే వారికి తమరి గురించి తమరి ప్రవర్తన గురించి ఏమి తెలుస్తుంది.

ఓ మహాత్మా! నా పల్లకీ మోయడం వలన తమరికి ఎలాంటి శ్రమ లేదు అని చెప్పారు. పల్లకీ బరువు కదా. అందులో నేను కూర్చుని ఉన్నాను. మరి పల్లకీ మోసేటప్పుడు తమరి శరీరానికి శ్రమ కలుగుతుంది కదా! మరి తమరికి శ్రమ కలగ లేదు అని ఎలా అనగలరు.

తమరుమరొక మాట చెప్పారు. యజమాని, సేవకుడు అనే భేదబుద్ధి కేవలము వ్యవహారమునకే గానీ, నిజంగా లేదు అని అన్నారు. మరి కుండతో నీళ్లు తీసుకొని వస్తాము కదా. కుండ నిజము కానప్పుడు, కేవలము వ్యావహారికము అయినప్పుడు, దానిలో నీళ్ల ఎలా తీసుకొని రాగలము. కుండే లేనపుడు నీళ్లు ఎలా వస్తాయి. కాబట్టి కళ్లకు కనబడేవి, మన కళ్ల ఎదురుగా జరిగే ఈ ప్రపంచ వ్యవహారములు అన్నీ నిజమే అని అంటాను.

అలాగే మనం పొయ్యి మీద గిన్నె పెట్టాము. ఆ గిన్నెలో నీరు పోసాము. ఆనీటిలో బియ్యము వేసాము. గిన్నె కింద మంట పెట్టాము. ఆ మంటకు గిన్నె వేడెక్కుతుంది. గిన్నె వేడెక్కితే అందులో ఉన్న నీరు సలసలా కాగుతాయి. ఆ నీటిలో ఉన్న బియ్యము ఉడుకుతాయి. అలాగే ఈ దేహము, ఇంద్రియములు, మనస్సు వీటితో చేసే కర్మలు అన్నీ అదే దేహములో ఉన్న ఆత్మకు కూడా అంటుకోవాలి కదా. మరి తమరు దేహము, వేరు ఆత్మ వేరు అన్నారు కదా! అది ఎంతవరకు సత్యము!

ఓ మహాత్మా! తమరు రాజు, సేవకుడు ఈ సంబంధము నిజం కాదు అని చెప్పారు. సేవకులను దండించడం పిసికిన పిండిని మరలా పిసకడం లాంటిది అని అన్నారు. కాని, నేను రాజును అన్నమాట సత్యం కదా. నేను ప్రజలను పాలించడం, సన్మార్గులనుకాపాడటం, దుర్మార్గులను శిక్షించడం కూడా నిజమే కదా! తప్పు చేసిన వారిని శిక్షించడం రాజధర్మం కదా! రాజు తన కర్తవ్యమును నిర్వర్తించాలి కదా! రాజుకు సేవకులు సేవ చేయడం ధర్మం కదా. సేవకులు వారి పని వారుచెయ్యాలి కదా! ఇదంతా నిజం కాదు అని ఎలా అనగలరు? రాజుగా నా ధర్మం నేను చేస్తున్నాను. అంతే కాదు. నేను నిత్యము భగవంతుని ఆరాధిస్తున్నాను. భగవంతుని ఆరాధించడం ప్రతి వ్యక్తి స్వధర్మము. ఆ ధర్మమును పాటిస్తే, సమస్త పాపములు నివృత్తి అవుతాయి.

ఓ మహానుభావా! తమరు చెప్పిన విషయములు నాకుసరిగా అర్థం కాకపోవడం చేత ఇలా నా సందేహాలను తమ ముందు ఉంచాను. అదీ కాకుండా, తమరు ఎవరో తెలియకుండా, నేను రాజును అనే గర్వంతో, మదంతో, తమరిని ఒక సాధారణ సేవకుని గా భావించి తమరిని తూలనాడాను. అవమానించాను. తమరు నన్ను క్షమించాలి. తమరి కృపాదృష్టి నా మీద ప్రసరింపచేస్తేనే కానీ నేను తమరిని దూషించిన పాపము తొలగిపోదు.

ఓ మహాత్మా! తమరు ఈ ప్రపంచంలోని సమస్త ప్రజల హితం కోరేవారు. తమరికి దేహాభి మానము లేదు. అందుకనే నేను ఎన్ని మాటలన్నా తమరు నా మీద కోపగించుకోలేదు. కాని తమలాంటి వారిని అవమానించినందుకు, సాక్షాత్తు పరమశివుడులాంటి శక్తి మంతుడైనా, పాపము మూటకట్టుకొనక తప్పదు. ఇంక నేనెంత!" అని రహూగణ మహారాజు భరతునితో వినయంగా అన్నాడు.

శ్రీమద్భాగవతము

పంచమోధ్యాయము పదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## పంచమోధ్యాయము

## పదకొండవ అధ్యాయము

రహూగణ మహారాజు పలికిన మాటలన్నీ సావధానంగా విన్న భరతుడు ఆ మహారాజుతో ఇలా అన్నాడు. "ఓ మహారాజా! నీకు అన్నీ తెలిసినట్టు మాట్లాడుతున్నావు. నిజానికి నీకు తత్త్వజ్ఞానము గురించి ఏమీ తెలియదు. ఎందుకంటే తత్త్వజ్ఞానము తెలిసిన వారు. తత్త్వమును లౌకిక వ్యవహారములను కలిపి చెప్పరు. తత్త్వము వేరు. లౌకిక వ్యవహారములు వేరు. అలాగే నేను చెప్పిన ఆత్మతత్త్వము వేరు. నీవు చెప్పిన యజమాని, సేవకుడు పోలిక వేరు. బాగా తెలిసిన వారు, తత్త్వవిచారము చేసేటప్పుడు ఇటువంటి లౌకిక విషయములను ఒప్పుకోరు.

ఓ రాజా! ఈ లోకంలో గృహము, భార్య, పుత్రులు, సంపదలు, రాజు, సేవకులు అన్ని సంబంధాలు ఉంటాయి. ఈ గృహస్థాశ్రమములో ఉన్న వారు వేదములలో చెప్పబడిన యజ్ఞములు యాగములు చేస్తూ ఉంటారు. వేదములను వల్లె వేస్తూ ఉంటారు. కానీ ఈ వేదములలో కూడా రాగద్వేషములు లేని ఆత్మతత్త్వము పూర్తిగా నిశ్చయంగా వెల్లడి కాదు.

ఓ రాజా! మీరు, సాధారణ మానవులు ఈ యజ్ఞములు, యాగములు, పూజలు, వ్రతాలు ఎందుకు చేస్తున్నారు. కొందరు సంతానము కొరకు పుత్రకామేష్టి యాగం చేస్తారు. మరి కొందరు స్వర్గసుఖాల కొరకు యజ్ఞాలు చేస్తారు. మరి కొందరు సంపదలు కలగాలని చేస్తారు. మరి కొందరు రాజ్య విస్తరణ కోసరం, అశ్వమేధయాగములు, రాజసూయయాగము చేస్తారు. ఇవి అన్నీ వేదోక్తంగానే చేస్తారు. వీటి వలన ఫలితాలనుపొందుతారు. కాని ఈ ఫలితములన్నీ స్వప్నములో కలిగే సుఖముల మాదిరి నిజములు కావు అని గ్రహించలేరు. ఇటువంటి వారికి ఎన్ని ఉపనిషద్వాక్యములు చెబితే ఆత్తతత్త్వము బోధపడుతుంది.

ఓ రాజా! పురుషుని మనస్సు సత్త్వ,రజస్తమోగుణములకు లోబడి ఉంటుంది. ఆ మనస్సు ఎవరి మాటా వినదు. స్వతంత్రంగా తనకు తోచినట్టు పనులు చేస్తుంటుంది. ఆ పనుల వలన పుణ్యము గానీ, పాపము గానీ, కాస్త పుణ్యము కాస్త పాపము గానీ అంటే మిశ్రమఫలితం గానీ లభిస్తూ ఉంటుంది. ఆ ఫలితములను

అనుభవించి తీరవలసిందే. దానిని ఎవరూ ఆపలేరు.

ఓ రాజా! ఈ దేహంతో చేసే పుణ్యకార్యములు, పాపకార్యముల వలన పుట్టే వాసనలతో ఈ మనస్సు నిండి పోతుంది. పైగా ఈ మనస్సు కామము, క్రోధము మొదలగు వికారములచేత, సత్వ,రజస్తమోగుణముల చేతా, నిరంతరమూ చలిస్తూ ఉంటుంది. స్థిరంగా ఉండదు. వీటి ఫలితంగా ఆ మనస్సు వాసనలను మోసుకుంటూ జీవుడితో కూడా వివిధ దేహములలో ప్రవేశించి, వివిధ రూపములతో, పేర్లతో ప్రకటింపబడుతూ ఉంటుంది. ఈ దేహధారణ వలననే జీవుడు ఉన్నత స్థితికి చేరుకోడానికి కానీ, అధోగతిపాలవడం గానీ జరుగుతూ ఉంటుంది.

ఈ మనస్సు దేహములో ఉన్న జీవుని గట్టిగా ఆవరించి ఉంటుంది. ఆ జీవుడిని మనస్సు  సంసారంలో పడవేస్తుంది. దాని వలన జీవుడు సుఖదు:ఖములు, లోభము, మోహము, పాపము, పుణ్యములు, మొదలగు ఫలములను అనుభవిస్తూ ఉంటాడు. మనస్సు జీవుని ఆవరించి ఉన్నంత వరకూ ఈ లోకవ్యవహారములు, సంసార బంధములు తప్పవు. కాబట్టి ఈ జీవుడు గొప్పజన్మలు ఎత్తడానికి కానీ, నీచ జన్మలు ఎత్తడానికి కానీ ఈ మనస్సే కారణము అనిపండితులు చెబుతూ ఉంటారు.

ఓ రాజా! మనస్సు విషయవాంఛల యందు ఆసక్తి చూపిస్తే, అది ఎన్నో కష్టాలకు కారణమవుతుంది. కాబట్టి విషయ వాంఛల యందు ఆసక్తి లేకపోవడమే మోక్షమునకు ద్వారము. మనస్సు

సత్వ,రజస్తమోగుణములతో చేరి రక రకాల పనులను చేస్తుంటుంది. అలా చేరకుండా ఉంటే మనస్సు నిర్మలంగా, ఎటువంటి వికారములు లేకుండా ఉండాలి.

ఓ రాజా! మానవునికి 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, అహంకారము మొత్తము పదకొండు. వీటితో మనసు పనులుచేస్తుంటుంది. శబ్దము,రూపము,గంధము,రసము,స్పర్శ ఇవి 5 జ్ఞానేంద్రియములు చేసే పనులు, అలాగే కర్మేంద్రియములు నడవడం, పనులుచేయడం లాంటి బయట పనులుచేస్తుంటాయి.ఈ దేహము నాది, ఈ ఇల్లు నాది, వీళ్లు నా వాళ్లు అనేది అహంకారము చేసే పని. మనసు ఈ పదకొండు వృత్తులతో సంబంధం పెట్టుకొని ప్రవర్తిస్తూ ఉంటుంది.

ఓ రాజా! ఇంకా వివరంగా చెబుతాను విను. శబ్ద,రస,రూప,గంధాదులు జ్ఞానేద్రియములకు విషయములు. అలాగే నడవడం, పనులుచేయడం, సంభోగించడం, విసర్జించడం మొదలగునవి కర్మేంద్రియములకు విషయములు. నేను నాది అనేది అహంకారము.

ఓ రాజా! ఇప్పుడు చెప్పానే ఈ పదకొండు వృత్తులకు ఆశ్రయం ఇచ్చేది ఈ దేహము. ఈదేహమును పన్నెండవ వృత్తి అని పండితులు అంటారు. ఎందుకంటే పదకొండవ వృత్తి అయిన అహంకారముతోనే నేను నాది, ఈ దేహము నాది, నేనే ఈ దేహము అనే భావన కలుగుతుంది. అందువలన దేహమును 12వ వృత్తి అంటారు.

ఓ రాజా! మానవుడు బాహ్య ప్రపంచములో తిరుగుతున్నప్పుడు, ద్రవ్యము, స్వభావము, ఆశయము, కర్మ, కాలము వీటికి లోబడి పైన చెప్పిన పదకొండు వృత్తులతో ప్రవర్తిస్తూ ఉంటాడు. ఈ ద్రవ్యము,స్వభావము మొదలగునవి ఈ పదకొండు వృత్తులతో కలిసి వికారము చెందుతాయి. ఆ వికారములు మొదట ఒకటి, తరువాత పది, తరువాత నూరు, వేయి, లక్ష ఇలా పెరుగుతూ పోతాయి. ఇదంతాకూడా దేహము లోపల ఆత్మ ఉండబట్టే జరుగుతున్నాయి. ఆత్మ లేకపోతే ఇవన్నీ జరిగే అవకాశమే లేదు.

ఓ రాజా! పైన చెప్పిన విధంగా మనస్సుకు అనేక వికారములు ఉన్నాయి. ఇవి ఈ నాటివి, ఈ జన్మలోవి మాత్రమే కావు. జన్మజన్మల నుండి ఉన్న వికారములు. మనసు వెంట వస్తూ ఉంటాయి. ఈ వికారములు మానవునకు మెలుకువగా ఉన్నప్పుడు, కలలు కంటున్నప్పుడు అనుభవంలోకి వస్తాయి. గాఢ నిద్రలో ఉన్నప్పుడు కనపడవు. సాధారణ మానవుడు ఇవన్నీ నిజము అనుకొని అనుభవిస్తూ దు:ఖములను, సుఖములను అనుభవిస్తూ ఉంటాడు. ఆత్మతత్త్వమును తెలుసుకున్న జీవుడు కేవలం దూరంగా ఉండి చూస్తూ ఉన్నట్టు ఉంటాడు.

ఓ రాజా! పరమాత్మ ఆత్మస్వరూపుడై అన్ని ప్రాణులలో వెలుగుతున్నాడు. ఆ పరమాత్మ అంతటా నిండి ఉన్నాడు. ఈ జగత్తుకు కారణం అతడే. అతడు పరిపూర్ణుడు. స్వయం ప్రకాశము కలవాడు. పరమాత్మకు జనన మరణములు లేవు. బ్రహ్మ మొదలగు వారికి కూడా ఆయన అధిపతి. విశ్వములోని సకల భూతములకు ఆయనే

నివాసము. అందుకే ఆయనను వాసుదేవుడు అని అన్నారు.
( వాసనాత్ వాసుదేవస్య వాసితంతే జగత్రయం। సర్వభూతనివాసోసి శ్రీ వాసుదేవ నమోస్తుతే అని సంధ్యావందనంలో చెప్పుకుంటాము కదా!)

ఈ వాసుదేవుడే తన మాయద్వారా జీవులను నియంత్రిస్తున్నాడు. ఈ వాసుదేవుడే వాయువురూపంలో ప్రతి ప్రాణిలో ప్రవేశించి చైతన్యం కలుగచేస్తున్నాడు. ఆ పరమపురుషుడు అయిన వాసుదేవుడే ఈ అనంత విశ్వం అంతా నిండి ఉండి ఆధిపత్యం వహిస్తున్నాడు. ఇంక ఈ దేహములో ఉన్న జీవుడు ప్రాపంచిక విషయములలో సంగము వదిలిపెట్టి, కామ,క్రోధాదులను దూరంగా ఉంచి, ఇంద్రియములను, మనస్సును జయించి, తనను ఆవరించి ఉన్న మాయకు లోబడకుండా, ఆత్మతత్త్వమును తెలుసుకుంటేనే, ఈ సంసారమునుండి బయటపడగలడు. లేకపోతే ఈ జనన మరణ చక్రంలో నిరంతరమూ తిరుగుతూ ఉంటాడు.

ఓ రాజా! మరలా చెబుతున్నాను విను. ఈ మనస్సే సకల క్లేశములకు మూలము. ఈ మనస్సు గురించి తెలుసుకోనంతవరకూ జీవుడు దానికి లోబడి సంసారంలో కొట్టుకుంటూ ఉంటాడు. రోగములు, దు:ఖములు, మోహము, రాగద్వేషములు, విరోధములు. స్నేహములు  ఈ మనస్సుకు తోడుగా నిలిచి సంసార బంధనములకు కారణమవుతాయి. కాబట్టి మనసునునిగ్రహించడం ముఖ్యము.

ఓ రాజా! ఆఖరి మాటగా చెబుతున్నాను. ఈ మనస్సు జీవునికి ప్రబలమైన శత్రువు. అత్యంత బలమైనది. ఆ దీనిదేముందిలే

అని నిర్లక్ష్యం చేస్తే అది జీవుని అధ:పాతాళానికి తొక్కుతుంది. జీవుని అసలుస్వరూపాన్ని కప్పివేసి, వికృతంగా చేస్తుంది. ఈ మనస్సును జయించే మార్గము ఒకటే ఒకటి ఉంది. అదే గురువు పాదములను ఆశ్రయించడం. ఆత్మతత్త్వమును తెలుసుకోవడం. నీవు కూడా గురువు పాదములను ఆశ్రయించి ఈ సంసార బంధనములనుండి విముక్తుడవు కమ్ము."అని భరతుడు రహూగణునికి ఆత్మతత్త్వమును బోధించాడు.

శ్రీమద్భాగవతము

పంచమ స్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## పంచమ స్కంధము

## పన్నెండవ అధ్యాయము

. ఓ అవధూత మహాశయా! మావంటి అజ్ఞానులను, అవివేకులను, ఉద్ధరించడానికే నీవు అవతరించావు. నీవు ఆనంద స్వరూపుడవు. నీవు కేవలం యజ్ఞోపవీతము ధరించిన బ్రాహ్మణుని మాదిరి కనపడుతూ, నీ అపరిమితమైన జ్ఞానమును నిగూఢంగా ఉంచావు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నాకు ఈ దేహము మీద ఉన్న అభిమానము, అహంకారము అనే పాము నా వివేకమును కాటు వేసింది. ఇట్టి సమయములో అమృతముతో సమానమైన నీ వాక్కులు నాకు ఒక ఔషధము లాగా పనిచేసాయి.

ఓ మహాత్మా! నాకు అన్నీ సందేహములే. నీవు ఆత్మతత్త్వమును గురించి చెప్పిన మాటలు ఒకటీ సరిగా అర్థం కాలేదు. నా మీద దయయుంచి నాకు అర్థమయ్యేటట్టు నీ బోధనలను వివరించి చెప్పు. నీ నోటి వెంట వచ్చు  అమృతమయములైన వాక్కులను వినవలెనని నాకు కుతూహలముగా ఉంది.

ఓ యోగేశ్వరా! నేను పల్లకీలో కూర్చున్నాను. వీరుపల్లకీ మోస్తున్నారు. ఎంతో దూరం వచ్చాము. వారికి శ్రమ కలిగింది. ఇదంతా కళ్లకు కట్టినట్టు కనపడుతూ ఉన్నప్పుడు ఇదంతా వ్యవహారమూలము కానీ, ఆత్మతత్త్వరీత్యా  నిజం కాదు అని అన్నారు. అది ఎలా సాధ్యం. ఎదురుగుండా కనపడుతున్న విషయములు నిజాలుకావు అని ఎలా అనగలము. నాకు వివరంగా చెప్పండి." అని అడిగాడు రహూగణ మహారాజు.

రహూగణుడు అడిగిన ప్రశ్నకు భరతుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. "ఓ రాజా! ఈ లోకంలో ఉన్న అన్ని వస్తువులు ఈ భూమి నుండి పుట్టినవే. కాని రకరకాల పేర్లతో వ్యవహరింపబడు తున్నాయి. వాటిలో కొన్ని కదిలేవి కొన్ని కదలనివి.

కింద పాదములు, వాటిపైన చీల మండలు, వాటి పైన పిక్కలు, వాటి పైన నడుము, దానిపైన దేహము, దాని పైన ఒక తల.  ఇదంతా కలిపి మనిషి అన్నాము. అలాగే ఈ భూమి నుండి పుట్టిన చెట్టునుండి సేకరించిన కలప నుండి  ఈ కదలని పల్లకీ తయారయింది. ఆ పల్లకీలో సౌవీరమహారాజు అనే ఒక మనిషి కూర్చున్నాడు. ఆ మనిషిలో నేను ఈ దేశము రాజును అనే దేహాభి మానము ఆవరించి ఉంది. నిజానికి ఆ పల్లకీలో కూర్చున్న రాజు, పల్లకీ మోసే బోయీలు, కదలని ఆ పల్లకీ, అన్నీ ఈ భూమి నుండి పుట్టినవే.

అందరూ ఒకే చోటనుండి పుట్టినప్పుడు, నీవు పల్లకీలో కూర్చుని వీరి చేత మోయించుకుంటున్నావు. వీరు ఎంత శ్రమ పడుతున్నారో చూడు. అదిమోసేవాడికే తెలుస్తుంది. వీరి అవస్థ వర్ణనాతీతము. ఏదో కొంచెం ధనం ఇస్తున్నావనీ నీవు హాయిగా పల్లకీలోకూర్చుని వీరి చేత మోయించుకోవడం, వీరిని బాధపెట్టడం ధర్మమా! నీకు అసలు జాలి, దయ అనేవి ఉన్నాయా! పైగా నేను ఈ దేశపు రాజును, ఈ దేశపు ప్రజలను రక్షిస్తున్నాను అని గొప్పలు చెప్పుకుంటున్నావు. నిన్ను నువ్వే పొగుడుకుంటున్నావు. పొగిడించుకుంటున్నావు. ఇది అంతా మిథ్య అని తెలుసుకోలేక పోతున్నావు. నీవు అవివేకివి, అజ్ఞానివి. ఆత్మ, అనాత్మ వివేచనము లేని వాడివి. నీవు రాజుగా ఉండ తగవు.

ఓ రాజా! ఈ భూమి నుండి అనేక పదార్థములు పుడుతున్నాయి. పెరుగుతున్నాయి. చస్తున్నాయి. ఆ పదార్థములన్నీ పృథివీ తత్త్వము కలవే కానీ ఈ లోకంలో రకరకాల పేర్లతో

పిలువబడుతున్నాయి. అలాగే మనం చేసే పనులు కూడా వ్యవహారములే కానీ నిజాలు కావు. మట్టి కుండతో నీరు తీసుకొని వస్తున్నాడు. అంటే ఆ కుండ, అందులో నీరు అన్నీ భూమి నుండి వచ్చినవే. కుండ పగిలిపోతే భూమిలోకలిసిపోతుంది. నీరుకూడా భూమిలోకి ఇంకిపోతుంది. ఇందులో ఏది సత్యము; కుండ సత్యమా లేక నీరు సత్యమా లేక కుండలో నీరు తీసుకురావడం సత్యమా. అన్నీ భూమినుండి వచ్చినవేకదా! అన్నీ వ్యవహారమూలములే కదా!

పోనీ ఈ భూమి సత్యము అని అంటావా! ఈ భూమి అంటే ఏమిటి. మట్టి, రాళ్లు, జలంతో కూడినదే ఈ భూమి. ఇవేమీ సత్యము కానపుడు భూమి మాత్రము సత్యం ఎలా అవుతుంది. ఎందుకంటే ఈ భూమిలో నుండి పుట్టిన ప్రతి వస్తువూ నాశనం అవుతూ ఉంది. అంటే మార్పు చెంది మరలా భూమిలో కలిసిపోతూ ఉంది. ఎలాగంటే, ఈ భూమి, అందులో నుండి పుట్టిన ప్రతి వస్తువు పరమాణువుల మయము. ఆ పరమాణువులే నిరంతరము మారిపోతుంటాయి. అంటే ఈ భూమి నుండి పుట్టే ప్రతి వస్తువు పరమాణువుల సముదాయము. అవిచెందే మార్పు. నిరంతరము మార్పుచెందే పరమాణువులు నిత్యములు అని ఎలా అనగలవు? పరమాణువులే నిత్యములు కానపుడు. ఆ పరమాణువుల కలయికతో ఏర్పడిన కుండ, బట్ట, భూమి నుండి పుట్టిన వస్తువులు అన్నీ సత్యములు అని ఎలా అనగలవు? (ఇక్కడ నాశనం కావడం అంటే మార్పు చెందడంఅని అర్థం. ఏదీ లేకుండా పోదు. కాని మార్పుచెందుతుంది. మార్పుచెందేది నిత్యము కాదు అని భావన.)

ఓ రాజా! ఈ ప్రకారంగా ఈ భూమినుండి పుట్టిన ప్రతి వస్తువు పెద్దదిగానూ, చిన్నది గానూ, లావుగానూ, సన్నంగానూ, కంటికి కనపడుతూనూ, కంటికి కనపడకుండాను, నీచంగానూ, గొప్పదిగానూ, పనులు గానూ, కదిలేవిగానూ, కదలనివిగానూ మనం కల్పించుకుంటున్నాము. కానీ అన్నీ భూమి నుండి వచ్చినవే. ఇవి ఏవీ శాశ్వతములు కావు. ఈ నాడు ఉంటాయి. కొంత కాలానికి మరొక విధంగామార్పు చెందుతాయి. కనపడకుండా పోతాయి. మరొక రూపంలో కనపడతాయి. కాబట్టి ఈ చరాచర జగత్తులో అన్నీ మాయవల్ల పుట్టినవి అని తెలుసుకో!

ఇప్పుడు నువ్వు నన్ను ఒక ప్రశ్న అడగవచ్చు. అన్నీ అసత్యములు అయినప్పుడుమరి సత్యము ఏది అని. ఏదయితే మార్పుచెందదో అదే సత్యము. ఏదయితే రెండు కాదో అదే సత్యము. ఏదయితే గుణములకు అతీతమయినదో ఏదయితే సర్వము వ్యాపించి ఉన్నదో, ఏదయితే సకలజీవులలో ప్రకాశిస్తూ ఉందో అదే సత్యము. .అదే పరమాత్మ. ఆయననే వాసుదేవుడు అని చెబుతారు.

ఓ మహారాజా! ఈ తత్త్వజ్ఞానము తెలియాలంటే గురువు అనుగ్రహం కావాలి. మహాభాగవతుల పాదములను ఆశ్రయించాలి. అంతే కానీ తపస్సు చేసినందువలన, యజ్ఞములు చేసినందు వలన, సన్యాసము స్వీకరించినందువలన, నదీస్నానములు చేసినందు వలనా, సూర్యోపాసన చేసినందువలనా, వేదములు అధ్యయనం చేసినందువలన తత్త్వజ్ఞానము బోధపడదు.

ఓ రాజా! ఉత్తములు ఉన్న సభలో, సత్పురుషుల సాంగత్యంలో, వ్యర్థమైన మాటలకు తావుఉండదు. అక్కడ భగవంతుని కీర్తిస్తూ ఉంటారు. భగవంతుని కథలను వినిపిస్తూ ఉంటారు. అప్పుడు ఈ లౌకికమైన వాసనలు నశించి వాసుదేవుని యందు భక్తి పుడుతుంది.

ఓ మహారాజా! ఇంక నా గురించి చెబుతాను విను. నేను పూర్వ జన్మలో భరతుడు అనే మహారాజును. నేను రాజుగా ప్రజలను పరిపాలిస్తున్నా, లౌకిక విషయమ్ములలో సంగముపెట్టుకోలేదు. ఎల్లప్పుడు భగవంతుని ఆరాధించాను. వయస్సు మీదపడటంతో వానప్రస్థమునకు వెళ్లాను. అక్కడ విధివశాత్తు ఒక లేడిపిల్లమీద ఆసక్తితో, దానితో సాంగత్యము ఏర్పడింది. నా తపస్సు చెడిపోయింది. ఆ లేడి పిల్ల ధ్యాసలో పడిపోయాను.

ఆ కారణంగా మరుజన్మలో నేను లేడిగా జన్మించాను. కానీ నా పూర్వజన్మ సుకృతం వలన నాకు పూర్వజన్మ స్మృతి పోలేదు. ఆ మృగజన్మ తరువాత ఒక బ్రాహ్మణుని ఇంటిలో జన్మించాను. జనములో తిరిగితే ఎక్కడ నాకు ప్రాపంచిక విషయములలో సంగము కలుగుతుందో అని పిచ్చివాడి రూపంలో ఏమీ పట్టనట్టు తిరుగుతున్నాను.

ఓ రాజా! మానవుడు సత్పురుషుల సాంగత్యములో జ్ఞానము అనే ఖడ్గమును సంపాదించి, ఆ జ్ఞానఖడ్గముతో తనలో ఉన్న అవిద్యను, అజ్ఞానమును నరికిపారేయ్యాలి. ఎల్లప్పుడూ పరమాత్మను

స్మరించాలి. ధ్యానించాలి. దాని వలన ఈ సంసారము నుండి బయటపడగలడు." అని భరతుడు రహూగణ మహారాజుకు తత్త్వబోధ చేసాడు.

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము పన్నెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము
పదమూడవ అధ్యాయము.

శుకుడు పరీక్షిత్తు మహారాజుకు భాగవత పురాణమును ఇలా చెప్పసాగాడు.

"మహారాజా! భరతుడు అంతటితో ఆగకుండా ఈ సంసారము అనే అడవి ఎలాఉంటుందో వివరించాడు. భరతుడు రహూగణ మహారాజుతో ఇలా అంటున్నాడు.

"ఓ మహారాజా! ఈ సంసారము అనే అడవి చాలా భయంకరమైనది. ఈ సంసారము అనే అడవి పరమాత్మ మాయచే కప్పబడి ఉంటుంది. ఈ అడవిలో సత్వ,రజస్తమోగుణములు వలన లభించే సుఖదు:ఖములు, లేక సుఖదు:ఖముల కలయికలు

అనుభవంలోకి వస్తాయి. మానవుడు ధర్మము, అర్థము, కామములు అనే పురుషార్థముల వెంట పరుగెడుతూ ఈ అడవిలో దారీ తెన్నూ కనపడకుండా తిరుగుతూ ఉంటారు. ఈ అడవిలో దు:ఖములే కానీ సుఖములు కనపడవు.

ఓ రాజా! ఈ అడవిలో మానవులు, వ్యాపారము చేసుకొనే వారు తమ తమ ధనముతో, వస్తువులతో ప్రయాణం చేస్తున్నట్టు, తిరుగుతుంటారు. ఆ అడవిలో ఆరుగురు దొంగలు ఉన్నారు. ఆ దొంగలు ఆ వ్యాపారస్థుల వద్ద ఉన్న ధనమును దొంగిలిస్తారు. ఆ అడవిలో భయంకరమైన తోడేళ్లు తిరుగుతుంటాయి. ఆ తోడేళ్లు ఆ వ్యాపారస్థులను చంపుకుతింటూఉంటాయి. ఏడిపిస్తుంటాయి. ఓ పట్టాన వదలవు.

ఆ అడవిలో వృక్షములు, తీగలు, పొగలు అల్లిబిల్లిగా అల్లుకొని ఉంటాయి. ఆ పొదలలో ఉన్న భయంకరమైన దోమలు పీకి పెడుతుంటాయి.  ఆఅడవిలో సుందరమైన భవనములు ఉన్నట్టు కనిపిస్తాయి. దగ్గరకు పోతే కనిపించవు. దూరంగా ఏదో మెరుస్తూ ఉంటుంది. అది బంగారము అని దగ్గరకు పోతే అది మిణుగురు పురుగుగా కనిపిస్తుంది. దూరంగా వెలుగు కనిపిస్తుంది. దగ్గరకు పోతేఅది కొరివి దయ్యంగా భయపెడుతుంది.

కాని మానవుడు వాటి వెంటనే పరుగెడుతుంటాడు. ఒక్కోసారి ఆ అడవిలో సుడి గాలి వీచి, దుమ్మురేగి కళ్లలో పడి, కళ్లు కనపడవు. ఎటు పోతున్నామో కూడా తెలియకుండా దిక్కుతోచకుండా తిరుగుతుంటాడు. ఆ అడవిలో కీచురాళ్లు అరుస్తుంటాయి

కర్ణకఠోరంగా అరుస్తుంటాయి. మరొక పక్కనుండీ గుడ్లగూబలు చెవులు పగిలేటట్టు అరుస్తుంటాయి.

ఈ కష్టములు అన్నీ భరిస్తూ ప్రయాణం చేస్తుంటే, ఇంతలో మానవుడు ఆ వ్యాపారికి ఆకలి, దాహము అవుతుంది. ఒక చెట్టు కిందకూర్చుంటాడు. దూరంగా నీరు ఉన్నట్టు అనిపిస్తుంది. ఆ నీటి కొరకు పరుగెడతాడు. కానీ నీరు కనిపించదు. అవి ఎండమావులు అని తెలుసుకొని ఉసూరుమంటాడు. దూరంగా ఒక నది ఉన్నట్టు తోస్తుంది. ఆ నదిలో నీరు ఉంటుందేమో అని అటు పరుగెడతాడు.కాని ఈ నదిలో చుక్కనీరు ఉండదు. నీరసంగా కూలబడతాడు. కడుపులో ఆకలి. దాహము. పక్కనున్న వారిని కాస్త అన్నం పెట్టమని నీరు ఇవ్వమనీ అడుక్కుంటాడు. ఇంతటి దుస్థితి పట్టిందేమిటా అని శోకిస్తాడు. వారు పెడితే సంతోషిస్తాడు. లేకపోతే దు:ఖిస్తాడు. ఏడుస్తాడు.

ఇది ఇలా ఉండగా, వ్యాపారం చేసిన దానికి పన్ను కట్టమని రాజులు ఉన్న సొమ్ములాక్కుంటారు. సంసారంలో కష్టాలు, వ్యాపారంలో వచ్చిన లాభం రాజుకు పన్నులు కట్టగా, ఒట్టిచేతులతో చచ్చినట్టు పడి ఉంటాడు. రాజుకు పన్ను ఎగ్గొట్టి దాచుకున్న ధనమును తనకన్నా బలవంతుడు వచ్చి దోచుకుంటాడు. లెక్కకు రాని ధనం (బ్లాక్‌మనీ) కూడా పోయినప్పుడు వాడి దు:ఖానికి అంతు ఉండదు. పైకి చెప్పుకోలేక లోలోపల కుమిలిపోతుంటాడు. ఈ సమయంలో తాను ఎంతో సుఖపడుతున్నట్టు కలలు కంటూ ఉంటాడు. అవినిజం కావని తెలుసు. అయినా అదొక తృప్తి. ఆ సుఖం కూడా క్షణకాలమే ఉంటుంది.

ఎదురుగా ఒక పర్వతము కనపడుతుంది. ఆ పర్వతము ఆవల నిధులు ఉన్నాయని ఆబగా ఆ పర్వతము ఎక్కబోతాడు. కాలికి ఉన్న పాదరక్షలు కూడా జారిపోతాయి. ఒట్టి కాళ్లతో ఎక్కుతుంటే కాలికి ముళ్లు గుచ్చుకుంటాయి.సూదుల వంటి రాళ్లు అరికాళ్లలో దిగబడతాయి. అయినా లెక్కచెయ్యడు. ఎక్కుతూనే ఉంటాడు. ఇంతా చేసినా అక్కడ ఏమీ దొరకదు. చిర్రెత్తుకొస్తుంది. అందరి మీద విరుచుకుపడతాడు. అందరినీ తిడతాడు. అరుస్తాడు. కోపగిస్తాడు.

ఇంతలో ఒక పాము కరుస్తుంది. కుయ్యోమని అరుస్తాడు. అటు ఇటు పరుగెడతాడు. కిందపడి గిలా గిలా కొట్టుకుంటాడు. స్పృహతప్పిపోతాడు. శవంమాదిరి పడి ఉంటాడు. అలా స్పృహ కోల్పోయిన వాడు పక్కనే ఉన్న గోతిలో పడతాడు. ఆ గోతిలో ఉన్న తేనెపట్టులో ఉన్న తేనెను తాగాలి అని అనుకుంటాడు. ఇంతలో ఆ తేనెటీగలు కుట్టి కుట్టి పెడతాయి. ఒళ్లంతా వాచి పోతుంది. బాధతో విలవిలలాడి పోతాడు. అతి కష్టం మీద కొద్ది కొద్ది తేనె చుక్కలను నాలిక మీద వేసుకుంటాడు. దానితోనే తృప్తి పొందుతాడు. ఇంతలో పక్కనున్న వాడు ఆ తేనెను కూడా వాడి దగ్గరనుండి లాక్కుంటాడు. కనీసం ఆ సుఖం కూడా దక్కకపోయేసరికి నిరాశ పడతాడు.

అసలే అడవి. పైగా వేసవికాలము, వర్షాకాలము, చలి కాలము. ఎండకు, వానకు, చలికి నానాబాధలు పడుతూ ఉంటాడు. కాని ఆ అడవిలోనే పడి ఉంటాడు. బయటకు రాడు. ఇలా కాదని చిన్నచిన్న వ్యాపారాలు చేసి ప్రజలను మోసం చేసి ధనం

సంపాదించాలని అనుకుంటాడు. అది బయటపడి ప్రజలు చావచితక తంతారు. అందరితో విరోధము పెంచుకుంటాడు. ఉన్నదంతా పోతుంది.

ఆ సంసారము అనే అడవిలో ఉండటానికి ఇల్లు, తినడానికి తిండి, కట్టుకోడానికి బట్ట కూడా ఉండవు. వాటి కోసరం ఇతరులను యాచిస్తాడు. కాని ఎవ్వరూ ఇవ్వరు. తన కోరికలను తీర్చుకోడానికి దొంగతనాలకుపాల్పడతాడు. దొంగతనం చేస్తూ దొరికిపోయి అవమానాల పాలవుతాడు. ఇలా కాదని. నలుగురిని కూడగట్టుకొని ఒక వ్యాపారం మొదలుపెడతాడు. లాభాలు నష్టాలు పంచుకోడంలో తేడాలు వస్తాయి. ఒకరిని ఒకరు నమ్మరు. ఒకరితో ఒకరు లోలోపల శత్రుత్వము పెంచుకుంటారు. ఉన్న కష్టాలు చాలక పెళ్లి కూడా చేసుకుంటాడు. కొత్త కొత్త బంధుత్వాలు కలుపుకుంటాడు. ఆ సంసారము అనే అడవిలో గిరా గిరా తిరిగేస్తుంటాడు.

సంసారం పెరిగే కొద్దీ ఖర్చులు పెరుగుతాయి. ఎక్కువ ధనం సంపాదించాలి. అందుకని ఎక్కువ శ్రమ పడతాడు. వచ్చిన ధనం వచ్చినట్టు ఖర్చుఅయిపోతుంది. విలాసాలకు ధనంలేక బాధలు పడుతుంటాడు. క్రమక్రమంగా కాలం గడిచేకొద్దీ తాతలు, తండ్రులు మరణించి, కొడుకులు, కూతుళ్లు, మనుమలు మనుమరాళ్లు పుట్టుకొస్తారు. వీరందరినీ చూసుకుంటూ ఈ సంసారము అనే అడవిలో తిరుగుతూ ఉంటాడు.

ఓ రాజా! ఇటువంటి మానవునికి, ఎంత సమర్థత, నేర్పు ఉన్నా, భగవంతుని మీద భక్తి ఎలా పెరుగుతుంది. అందుకే సంసారములో పడ్డవాడు, దానినుండి బయటపడిముక్తిని పొందలేకపోతున్నాడు. సామాన్య మానవుల సంగతి ఇలా ఉంటే, ఇంక క్షత్రియులు తమ కంటే గొప్పవారు, పరాక్రమవంతులు, వీరులు, లేరని ఈ భూమి అంతా నాది అనే అహంకారంతో సాటి రాజుల మీద యుద్ధాలు ప్రకటిస్తుంటారు. అందరితో విరోధముపెంచుకుంటారు. ఆ యుద్ధములలో మరణిస్తుంటారు.

ఓ రాజా! కాబట్టి నీ వంటి రాజులు కూడా ఆ పరమాత్మనుసేవించి, ముక్తిని పొందలేరు. ఈ మానవులందరూ సంసారము అనే అడవిలో పడి తిరుగుతూ, ఆ అడవిలో ఉన్న చెట్ల మీద చేరిన పక్షుల కిలకిలారావములు, కోయిలల కుహూ కుహూ రవములు వింటూ ఆనందిస్తుంటారు. ఇంతలో సింహగర్జనలు,పులుల గాండ్రింపులు, ఏనుగుల ఘీంకారములు విని భయంతో వణికిపోతుంటారు. వాటిని తట్టుకోలేక గ్రద్దలు, రాబందులు వంటి దుష్టులతో స్నేహం చేస్తారు. ఆఖరుకు వాళ్లచేతిలో మోసగింపబడి శోకిస్తారు.

ఇదంతా జరిగి తల బొప్పికట్టిన తరువాత హంసలు ఉన్న సరోవరము వద్దకు పోయి వాటితో స్నేహం చేయడానికి ప్రయత్నిస్తాడు. కాని ఆ హంసలు వీడి బుద్ధి తెలిసి దగ్గరకు రానివ్వవు. చేసేది లేక చెట్లమీద ఉన్న కోతులతో జతకడతాడు. ఆ కోతులతో ఆడుకుంటూ ఉంటాడు. ఆ కోతిచేష్టలలో మునిగి పోయి, తనకు మరణం ఆసన్నమవుతూ ఉందని మరిచిపోతాడు.

రోగాలు అనే గోతిలో పడతాడు. ఆ గోతి లోపల మృత్యుదేవత ఏనుగు వలె భయంకరంగా కనిపిస్తుంది. అప్పుడు భయంతో వణికిపోతూ పక్కనే ఉన్న ఒక తీగనుపట్టుకొంటాడు. ఆ తీగ సాయంతో మెల్ల మెల్లగా గోతి లోపల నుండి బయటపడతాడు. అయినా వాడికి సిగ్గు రాదు. మరలా తన పూర్వమార్గమునే అవలంబిస్తాడు.

ఓరాజా! ఈ ప్రకారంగా భగవంతుని మాయ కమ్మిన మానవులు సంసారము అనే అడవిలో దిక్కుతోచకుండా తిరుగుతుంటారు. వారికి ఏ నాటికి కూడా పరమాత్మ గురించిన జ్ఞానము కలుగదు.

ఓ రహూగణ మహారాజా! నీవుకూడా నేను చెప్పిన మానవులవలె ఈ సంసారము అనే భయంకరమైన అడవిలో తిరుగుతున్నావు. ప్రాపంచిక విషయములలోనూ, విషయవాంఛల లోనూ మునిగితేలుతున్నావు. కాబట్టి ఇంకమీదటైనా ఈ ప్రాపంచిక విషయములను, రాజ్యపాలనా వ్యవహారములను విడిచిపెట్టు. ఈజగత్తులో ఉన్న అన్ని ప్రాణుల యందు దయతో ఉండు. నువ్వు పల్లకీలోకూర్చుని బోయీలతో మోయించుకుంటూ వారినికష్టపెట్టకు. ప్రాపంచిక విషయములలో ఆసక్తిని, విషయవాంఛలను పూర్తిగా వదిలి పెట్టు. జ్ఞానమును అనే కత్తితో ఈ మాయ ను నరికివెయ్యి. సంసారము అనే అడవిలో నుండి బయటకు రా! పరమాత్మ వైపుకు పయనించు. ”
అని భరతుడు రహూగణ మహారాజుకు జ్ఞానబోధ చేసాడు.

భరతుని బోధనలు విన్న తరువాత రహూగణ మహారాజుకు జ్ఞానోదయం కలిగింది. మానవ జన్మ ఎంతటి గొప్పదో, దానిని మానవులు ఎలా వ్యర్థం చేసుకుంటున్నారో తెలుసుకున్నాడు.

"ఆహా! ఈ మానవ జన్మ ఎంత గొప్పది. స్వర్గంలో ఉన్న దేవతలకు కూడా ఈ మానవ జన్మలో ఉండే మాధుర్యము తెలియదు. దేవతల పుట్టుకకూడా మానవ పుట్టుక కంటే శ్రేష్టమైనది కాదు. భూమి మీద మానవుడుగా పుట్టి పరమాత్మను సేవించాలి కానీ, స్వర్గంలో దేవతగా పుట్టి సుఖాలు అనుభవించడం వలన ఏం లాభం కలుగుతుంది. ఎందుకంటే స్వర్గములో ఉన్న దేవతలకు వాసుదేవుని స్మరించడం, కీర్తించడం, వాసుదేవుని కథలను వినడం వంటి కర్మలు చేయడానికి కానీ, పరమాత్మ భక్తులను సేవించడం గానీ కుదరదు కదా!

ఓ మహానుభావా! నీవుసామాన్యుడవుకావు. సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడవు. క్షణకాలము నీ పాదధూళిని సేవించి నంత మాత్రాన నాకు జ్ఞానోదయం కలిగింది. నా అవివేకము, అజ్ఞానము నశించాయి. సంసారముమీద నాకు విరక్తి కలిగింది. ఈ భూమి మీద నడయాడే మహాత్ములకు, శిశువులకు, యువకులకు, వటువులకు, బ్రాహ్మణులకు, నీ మాదిరి అవధూతలు గానూ, పైకి పిచ్చివాళ్లుగా కనిపించే బ్రహ్మజ్ఞానులకు నా మనఃపూర్వక నమస్కారములు. అందరిలో నేను సర్వాంతర్యామి అయిన పరమాత్మను దర్శించగలుగుతున్నాను. వీరందరి కరుణాకటాక్షవీక్షణములు మా వంటి క్షత్రియుల మీద ప్రసరించుగాక!" అని భరతునికి సాష్టాంగ

నమస్కారము చేసాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆసమయంలో భరతుని ముఖం ప్రశాంతంగా ఉంది. రహూగణుని మీద ఎటువంటి కోపము లేదు. తరువాత భరతుడు ఎటువంటి వికారము లేకుండా అక్కడి నుండి వెళ్లిపోయాడు. భరతుని వలన ఆత్మతత్త్వమును తెలుసుకున్న రహూగణుడు దేహాభిమానమును వదిలిపెట్టాడు. ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము పాటించాడు. సర్వభూతముల యందు పరమాత్మను చూడగలిగాడు. పరమాత్మ పాదపద్మముల యందు తన మనసును నిలిపాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకుచెప్పాడు.

అంతావిన్న పరీక్షిత్‌మహారాజు శుక మహర్షితో ఇలా అన్నాడు.

"మహానుభావా! తమరికి తెలియని విషయములు లేవు. ఒక వ్యాపారిని ఉదాహరణగాతీసుకొని, సంసారమును ఒక అడవిగా చూపి, జీవుడు సంసారములో పడే బాధలు అన్నీ వివరించారు. ఇదంతా విన్న తరువాత జ్ఞానులు, రహూగణుని వంటి వివేకులు తమ బుద్ధిబలమును ఉపయోగించి తమరు చెప్పినది అర్థం చేసుకోగలిగారు. కాని నాకు మాత్రము ఏమీ అర్థం కాలేదు. నాకే కాదు సామాన్య మానవులకు ఏమీ అర్థంకాదు. ఎందుకంటే తమరు చెప్పిన వృత్తాంతములోని భావము చాలా నిగూఢమైనది.

కాబట్టి తమరు నా మీద దయయుంచి, తమరుచెప్పిన

వ్యాపారి వృత్తాంతములో ఉన్న అంతరార్థమును వివరించ వలసినది.”
అని ప్రార్థించాడు.

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## పంచమస్కంధము
## పదునాలుగవ అధ్యాయము.

శుకుడు పరీక్షిత్ మహారాజుకు, భరతుడు రహూగణ మహారాజుకు చెప్పిన వృత్తాంతమునకు వివరణ ఇస్తున్నాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! సాధారణంగా వ్యాపారులు ధనము సంపాదించడానికి వ్యాపారాలు చేస్తారు. ఆ వ్యాపారాల కోసరం దుర్గమమైన అరణ్యములలో గుంపులు గుంపులుగా ప్రయాణం చేస్తుంటారు. అలాగే, సుఖాల కోసరం పాకులాడే జీవుడు కూడా పరమాత్మ యొక్క మాయకు లోబడి, ప్రాపంచిక విషయములు, విషయవాంఛలు కల సంసారము అనే అడవిలోకి ప్రవేశిస్తాడు

సంసారము అనే అడవిలో తిరుగుతున్నంత కాలము జీవునికి పరమాత్మ తత్త్వము అర్థం కాదు. భక్తిమార్గమును పొందలేడు.

ఎందుకంటే, వారిని దేహాభి మానము, విషయ వాంఛలు ప్రలోభపెడుతుంటాయి. వాటిలో మునిగి పోయి, పరమాత్మను స్మరించడం మరిచిపోతాడు. సత్వ,రజస్తమోగుణములతోకూడిన కర్మలు చేస్తూ వాటి వలన వచ్చే సుఖములు, దు:ఖములు, సుఖము దు:ఖము కలిసిన ఫలితములను అనుభవిస్తూ ఉంటాడు.
వాటి ఫలితంగా మానవ దేహము, పశువుల దేహము, పక్షుల దేహము, మొదలగు దేహములనుపొందుతూ ఉంటాడు. ఇది అనాదిగా వస్తూ ఉంది.

పంచేంద్రియములు, మనస్సు ఈ ఆరూ సంసారము అనే అడవిలోకి ప్రవేశించడానికి ద్వారములు. ఆ ద్వారముల ద్వారా సంసారము అనే అడవిలోకి ప్రవేశించిన జీవుడు సుఖదుఖములను అనుభవిస్తూ ఉంటాడు. పోనీ ఆ జీవుడు చేసే కర్మలు ఫలిస్తాయా అంటే అదీ లేదు. ఎల్లప్పుడూ వ్యతిరేక ఫలితములు వస్తుంటాయి. జీవుడు చేసే ప్రతి పనికీ ఏదో ఒక విఘ్నము కలుగుతూనే ఉంటుంది.

ఈ సంసారము అనే అడవిలో నుండి బయట పడటానికి పరమాత్మతో సమానమైన గురువు యొక్క పాదారవిందములను సేవించడమే తరుణోపాయము. పరమాత్మయందు భక్తితోనే ఈ సంసారము అనే అడవిలోనుండి బయటకు రాగలరు. కానీ ఎవరూ బయటకు రావడానిక ఇష్టపడరు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ అడవిలో పోతున్న వ్యాపారులు తమతో కూడా తాము ధర్మంగా, న్యాయంగా వ్యాపారం చేసి సంపాదించిన డబ్బును తీసుకుపోతూ ఉంటే, దొంగలు అడ్డగించి ఆ ధనమును దోచుకొనిపోతారు. అలాగే ఈ సంసారం అనే అడవిలో చిక్కుకున్న జీవుడు అంతకు ముందు పరమాత్మను సేవించి ఆర్జించినపుణ్యము అనే ధనమును, పంచేంద్రియములు, మనస్సు అనే ఆరుగురు దొంగలు తాము చేసే కర్మలు అంటే చూడటం (కళ్లు,) స్పర్శ (చర్మము) శ్రవణము (చెవులు) ఆస్వాదనం (నాలుక), ఆఘ్రాణము(ముక్కు) ద్వారా, దోచుకొని పోతారు.

(పెద్దలు సంపాదించిన ఆస్తిని, ధనమును, వారి వారసులు వ్యసనములకు బానిస అయి నాశనం చేస్తారు కదా! ఎలాగంటే, కళ్లతో లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అని భ్రమపడటం, చూచిన ప్రతి వస్తువు నాకు కావాలి అనుకోవడం, దాని కోసరం అడ్డమైన దారులు తొక్కడం, ఇంటర్‌నెట్‌లో అసభ్యకరమైన దృశ్యములు చూడ్డం, అసభ్యకరమైన సాహిత్యం చదవడం, వాటిని ఆచరించి పతనం కావడం,
ఇంక చర్మంతో స్పర్శసుఖం అంటే కౌగలింతలు, ముద్దులు, స్త్రీసుఖం పొందడం, వాటి కోసరం ఆస్తులు తగలేయడం,
చెవులు...పబ్బులకు, క్లబ్బులకు వెళ్లడం, అక్కడ తెల్లవారేదాకా హెూరెత్తే సంగీతంవినడం, ఆరోగ్యం నాశనం చేసుకోవడం,
నాలుక...మద్యం తాగడం,
ముక్కు..పొగతాగడం.
ఇవన్నీ తనకే కావాలని, తనే చెయ్యాలనీ, తానే అనుభవించాలనీ కోరుకోవడం మనసుచేసే పని. ఇవే ఈ నాటి నరకానికి మార్గాలు.)

ఓ రాజా! అడవిలో తిరుగుతున్న వ్యాపారిని తోడేళ్లు భయపెడతాయని చెప్పానుకదా! సంసారము అనే అడవిలో భార్య, పుత్రులు, కూతుళ్లు, అల్లుళ్లు, బంధువులు మొదలగు వారు తోడేళ్ల వంటి వారు. జీవుడు కష్టపడి ఆర్జించిన ధనమును అపహరించడానికి తోడేళ్ల మాదిరి కాచుకొని ఉంటారు. ఒక్కొక్కసారి, ఆ జీవుని కళ్లముందే ఆ ధనమును బలవంతంగా లాక్కుని పోతారు.

మహారాజా! ఈ కోరికలు ఎలాంటివి అంటే కలుపు మొక్కల లాంటివి. కర్షకుడు ప్రతి సారీ భూమిని దున్ని చదును చేసి విత్తనములు నాటుతాడు. కాని ఆ విత్తనాలు మొలకెత్తకముందే పిచ్చిమొక్కలు, కలుపు మొక్కలు ఏపుగా పెరుగుతాయి. వాటిని పీకే కొద్దీ అంతే వేగంతో పెరుగుతాయి. కోరికలు కూడా అంతే. ఒక కోరిక తీరితే మరొక కోరిక పుడుతుంది. దానికి అంతం లేదు. పెట్టెలోనుండి తీసినట్టు ఒకదాని వెంబడి ఒకటి బయటకు వస్తూనే ఉంటాయి. జీవుడు పూర్వజన్మలలో చేసినకర్మల వాసనలను బట్టిఈ కోరికలు పుడుతుంటాయి. ఆవాసనలు అంతరిస్తే కానీ, ఈకోరికలు అంతరించవు. (మాన్ ఈజ్ ఎ బండిల్ ఆఫ్ వాంట్స్ అని మన ఆర్థిక శాస్త్రవేత్తలు అంటారు కదా!)

మహారాజా! అడవిలో తిరుగుతున్న వ్యాపారిని అడవిలో ఉన్న ఈగలు, దోమలు, మిడతలు, పక్షులు, ఎలుకలు ఎలాగైతే కొర్కుక్కుతింటాయో, అలాగే ఈ సంసారము అనే అడవిలో తిరుగుతున్న జీవుని బంధువులు అనే ఎలుకలు, రాబందులు పీక్కుతింటూ ఉంటారు. అయినప్పటికినీ జీవుడు ఈ సంసారంలోనే

తిరుగుతూ ఉంటాడు కానీ బయటకు రావడానికి ప్రయత్నించడు. ఒక వేళ ప్రయత్నించినా, మరొకసంసార బంధం వైపుకు వెళతాడు.

మానవుడు ఈ సంసారాన్ని, అదేదో గంధర్వనగరంలా ఉంది అని అనుకుంటాడు. ఆ గంధర్వనగరంలో మంచి పానీయాలు దొరుకుతాయనీ, మంచి భోజనం దొరుకుతుందనీ, అందమైన స్త్రీల సుఖం దొరుకుతుందనీ ఆశపడతాడు. కానీ అది కూడా తన భ్రమ అనీ, అవన్నీ ఎండమావుల వంటివనీ, అక్కడ ఏమీ లేదనీ తెలుసుకోలేడు. ఆ సుఖాల కోసరం వాటి వెంట పరుగెడుతూనే ఉంటాడు. తాను ఉన్న సంసారమునే సత్యము, నిత్యము, శాశ్వతము అనుకుంటూ ఉంటాడు.

మానవులలో హింసకు, ఇతర స్త్రీలతో అక్రమ సంబంధాలకు, జూదమునకు, మద్యపానమునకు, మొదలగు వ్యసనములకు మూలము ధనము, బంగారము. ఎక్కువగా ధనము, బంగారము సంపాదించాలనుకునే వారు రజోగుణ ప్రధానులు. అందుకని వారు ఎప్పుడూ అక్రమ మార్గాలలో ధనము, బంగారము సంపాదించడానికి, సంపాదించిన ధనము ద్వారా పైనచెప్పబడిన వ్యసనములను తీర్చుకోడానికీ ఇష్టపడుతుంటారు. చలితో బాధ పడే వ్యక్తి అగ్ని ఎక్కడ ఉంటే అక్కడకు పరుగెడతాడు. దూరంగా కొరివి దయ్యం మండుతున్నా సరే ఆ అగ్నిలో చలి కాచుకోవచ్చు అని అక్కడికిపరుగెడతాడు. అలాగే ధనము, బంగారము కొరివి దయ్యాల్లాంటివి. కాని మానవుడు వాటి వెంట పరుగెడు తుంటాడు.

ఇంకా ఈ సంసారములో ఉన్న జీవుడికి ఉండటానికి ఇల్లు, తాగడానికి పానీయములు, ధనము, విషయ సుఖములు మొదలగునవి అత్యవసరములు. వాటిని సక్రమంగానో, అక్రమంగానో పొందడానికి జీవుడు శతవిధాలా ప్రయత్నాలు చేస్తూ ఈ సంసారము అనే అడవిలో అటు ఇటూ పరుగెడుతుంటాడు. కామముతో కూడిన స్త్రీసాంగత్యము సుడి గాలి వంటిది. కామం తలకెక్కిన జీవునికి స్త్రీతో సాంగత్యం ఏర్పడినప్పుడు, అతనికి కన్ను మిన్ను కనపడదు. పైన సూర్యుడు, చంద్రుడు చూస్తున్నారని ధ్యాస కూడా ఉండదు. (అంటే రాత్రి పగలు అనే భేదం లేకుండా కామ సుఖాలు అనుభవిస్తూనే ఉంటాడు. ఇల్లు ఒళ్లు గుల్ల చేసుకుంటాడు.)

మహారాజా! ఈ జీవునికి అప్పుడప్పుడు సత్పురుషుల సాంగత్యము వలన కొంత జ్ఞానోదయంఅవుతుంది. ఈ ప్రాపంచిక విషయములు అన్నీ ఎందుకూపనికిరావు, కేవలం దు:ఖమును కలుగచేస్తాయి అని అనుకుంటాడు. ఇంతలోనే అతనిలో నేను, నాది అనే అహంకారము, దేహాభిమానము ప్రవేశిస్తుంది. అంతే ఆ కాస్త జ్ఞానం కూడా ఆవిరి అయిపోతుంది. మరలా యధావిధిగా సంసారంలో పడతాడు. విషయవాంఛల వెంట పరుగెడుతుంటాడు.

ఓ రాజా! అడవిలో కీచురాళ్ల రొదలు, గుడ్లగూబలు కర్ణకఠోరమైన అరుపులు వినబడుతుంటాయి అని అన్నారు కదా. అవే బయట ప్రపంచంలో ఉన్న వాళ్లు మాట్లాడే పరుషమైన మాటలు. వాటికి ప్రతిగా జీవుడు కూడా అలాగే పరుషంగా మాట్లాడుతుంటాడు. ఇతరులతో తగాదాలు, విరోధము పెట్టుకుంటాడు. అరుస్తాడు.

కొడతాడు. ఎదుటి వారి మనసులకు బాధ కలిగిస్తాడు.

అడవిలో తిరుగుతున్న వ్యాపారి ఆహారం కొరకు విషముతో నిండిన వృక్షములు, తీగలు, మొక్కలు వాటికి కాచిన కాయలు, ఫలముల కొరకు ఆశ్రయిస్తాడు అని చెప్పారుకదా! అదేమంటే, ఈ జీవుడు కూడా లౌకికసుఖాలు, ధనము, నివాసములు, భోగ వస్తువులు అన్నీ విషతుల్యములైనప్పటకినీ, వాటిని సంపాదించడానికి ఆరాటపడు తుంటాడు. వాటి వెంట పరుగెడుతుంటాడు. అవి దొరక్క పోతే నిరాశపడి పోతాడు. వెంటనే ఒక ధనికుని వద్దకు పరుగెడతాడు. అభిమానము చంపుకొనియాచిస్తాడు. ప్రాధేయపడతాడు. లేదు పొమ్మన్నా వదలడు. ( నేడు కూడా, గొప్పలకు పోయి, తాహతుకు మించిన కోరికలు తీర్చుకోడానికి, అధిక వడ్డీలకు అప్పులు చేయడం, సర్వం పోగొట్టుకోవడం, కష్టాలపాలవడం చూస్తున్నాము కదా!.)

మహారాజా! ఈ సంసారము అనే అడవిలో చిక్కుపడి ఉన్న జీవునికి ఎక్కువగా దుష్టులతోనే సాంగత్యము లభిస్తుంది. వాడికి ఉన్న బుద్ధి జ్ఞానము నశించి పోతుంది. కష్టాలు చుట్టుముడతాయి. పరమాత్మను మరిచిపోతాడు. దేవుడు లేడనే వాదనకు దిగుతాడు. ఉంటే నాకు ఇన్ని కష్టాలు వస్తాయా అని ఎదురు ప్రశ్నవేస్తాడు. వేదములను, శాస్త్రములను నమ్మడు. నాస్తికుడుగా మారి పోతాడు. మనశ్శాంతి కరువై నిరంతరమూ దు:ఖసాగరంలో మునిగిపోతాడు.

మహారాజా! ఈ సంసారంలో ఉన్న జీవుడు తన దగ్గర లేని ధనం కోసరం, వస్తువుల కోసరం ఇతరులను బాధపెట్టడానికి గానీ, వారి వద్ద ఉన్న ధనాన్ని వస్తువులను లాక్కోవడానికి గానీ వెనుకాడడు. కాని అవి దక్కవు. ఇంట్లో ఉన్న తండ్రి వద్ద గానీ, కుమారుని వద్ద కానీ

ఏ వస్తువు ఉన్నా  వారిని బాధపెట్టి అయినా సరే దానిని లాక్కుంటాడు.

(నేను కడపజిల్లాలో మేజిస్ట్రేటుగా పనిచేస్తున్నప్పుడు ఒక కొడుకు తండ్రిని బీడీ ఇవ్వమని అడిగాడు. నా దగ్గర లేదురా అన్నాడు తండ్రి. అంతే. కొడుక్కు కోపం వచ్చింది. పక్కనే ఉన్నరోకలి తీసుకొని తన తండ్రి తల మీద బలంగా మోదాడు. తండ్రి చచ్చాడు. కొడుకు జైలుపాలయ్యాడు.)

మహారాజా! అడవిలో దావానలము ఎలా ప్రజ్వరిల్లుతుందో, గృహము కూడా ఒక దావానలము వంటిది. గృహంలో అగ్ని వంటి దు:ఖమే తప్ప సుఖం ఉండదు. అప్పుడప్పుడు కాస్తంత సుఖం లభించినా ఆఖరుకు దు:ఖమే మిగులుతుంది. జీవునికి అనుకూలమైన వస్తువులు సంసారంలో దొరకవు. ఉన్నవాటితో తృప్తి కలగదు. కాబట్టి ఎప్పుడూ ఏడుస్తూ ఆ మంటల్లో పడి మాడిపోతుంటాడు. పైగా, "నేను ఒట్టి దరిద్రుడను, దేవుడు నాకు అన్యాయం చేసాడు. జీవితంలో నాకు సుఖం లేదు" అంటూ ఏడుస్తుంటాడు.

మహారాజా! జీవుడు తిరిగే సంసారము అనే అడవిలో రాక్షసులుకూడా ఉంటారు, ఆ రాక్షసులు జీవుడిని పీక్కుతింటారు అని చెప్పారు కదా! ఆ రాక్షసులు ఎవరో కాదు. నీ లాంటి ప్రభువులు. జీవుడు కష్టపడి సంపాదించిన ధనమును అంతా పన్నుల రూపంలో అపహరిస్తారు.  చేతిలో ధనం లేక, తినడానికి తిండిలేక, తన వారిని పోషించలేక ఆ జీవుడు నానాయాతనా పడతాడు. అప్పుడు ఆ జీవుడు బతికి ఉన్నా ఏ సుఖమూ లేకుండా చచ్చిన వాడి మాదిరి బతుకు

ఈడుస్తాడు.
(ప్రస్తుతం మన పరిస్థితీ అంతే! ఆదాయపు పన్ను, వాట్, సెస్సులు, ఛార్జీలు, ఇవి కట్టలేక నానాపాట్లుపడుతున్నాము కదా!)

ఇటువంటి దు:ఖములలో కూడా అప్పుడప్పుడు కల వచ్చినట్టు సుఖాలు వచ్చి పలకరించి పోతుంటాయి. కాని మరలా కష్టాలు చుట్టుముడతాయి. (పేకాటలో, గుర్రప్పందాలలో, స్టాక్ మార్కెట్ లో లక్షలు పోగొట్టుకున్నా, ఒకసారి పదివేలు వస్తే చాలు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయిపోతాడు. ఊరంతా చెప్పుకుంటాడు. అదీ మానవ నైజం)

మహారాజా! జీవుడికి చేతిలో ధనం లేకపోయినా ఆడంబరాలకు ఆర్భాటాలకు తక్కువలేదు. గొప్ప కోసరం యజ్ఞములు యాగములు చేస్తాడు. ఎంతో వ్యయం చేసి పెళ్లిళ్లు, ఉపనయనాలు చేస్తాడు. వాటికి ఎంతో ధనం వ్యయం అవుతుంది. అప్పులు కొండలాగా పెరిగిపోతాయి. ఆ ధనం సంపాదించడానికి మరలా లౌకికమైన కర్మలలో లీనం అవుతాడు. పతితుడు అవుతాడు. కొండ ఎక్కేవాడు దారిలో రాళ్లు ముళ్లు గుచ్చుకుంటే ఎంత బాధ పడతాడో అలాంటి బాధలే పడతాడు. (పేరుకోసరం, గొప్పకోసరం అప్పులు చేసి ఆర్భాటంగా శుభకార్యాలు చేసి, వ్యాపారాలు చేసి, ఆ అప్పులు తీర్చలేక ప్రాణాలు తీసుకున్న వాళ్లు ఎంతో మంది.)

ఒక్కోసారి తినడానికి తిండి కూడా కరువవుతుంది. ఏమీ చెయ్యలేని స్థితి. కోపం వస్తుంది. ఆ కోపం భార్యాపిల్లల మీద చూపిస్తాడు. అంతకన్నా ఏమీ చెయ్యలేడు కాబట్టి. అటు వంటి పరిస్తితుల్లో ఏమీ చెయ్యలేక, కాళ్లు ముడుచుకొని నిద్రపోతాడు.

చచ్చినశవం లాగా పడి ఉంటాడు.

వీడి పరిస్తితి ఇలా ఉంటే, మరి కొందరికి ఆ నిద్రకూడా పట్టదు. అప్పులవాళ్లు పీక్కుతింటూ ఉంటారు. దుర్మార్గులతో స్నేహం చేయడం కారణంగా కంటి నిండా నిద్రకూడా కరువవుతుంది. ఒక్కోసారి నిద్రపోవడానికి కూడా సమయం చిక్కదు. వారికి ఇంక చాలు అనే తృప్తి ఉండదు. ఇంకాసంపాదించాలి, ఇంకా లాభాలు రావాలి అంటూ మోహంలో కూరుకుపోతారు.
(పేకాట, తాగుడు, వ్యభిచారము అలవాటైన వ్యసనపరులకు, వ్యాపారాలు, లాభనష్టాల లెక్కలలో మునిగి తేలేవారికీ, డబ్బు సంపాదన కోసరం రాత్రింబగళ్లు షూటింగులు చేసే నటీనటులకు, కడుపునిండా తిండి తినడానికి, కంటి నిండా నిద్రపోవడానికి కూడా తీరిక ఉండదు, అన్న విషయం మనకు తెలిసిందే కదా!)

మహారాజా! ఇంకా, ఎదుటి వాళ్ల ధనమును అపహరించడానికి ఎదుటి వాళ్ల భార్యలను లొంగదీసుకోడానికి నిరంతరం ప్రయత్నించేవారు కూడా లేకపోలేదు. చుట్టు పక్కల వాళ్లు పట్టుకొని కొట్టినా, రాజభటులు పట్టుకొని కొట్టినా, కారాగారంలో బంధించినా వీరు తమ బుద్ధిమానుకోరు. ఎదుటి వాడి ధనంమీద, ఎదుటి వాడి భార్య మీదా ఎప్పుడూ ఆశపడుతూ ఉంటాడు.

(నేటి కబ్జాదార్లు, చిట్‌ఫండ్ కంపెనీ పెట్టి, ప్రజల డబ్బును వసూలు చేసి బోర్డు తిప్పేసేవాళ్లు, ఉద్యోగాలు ఇప్పిస్తామని డబ్బు వసూలుచేసి పరారయ్యేవాళ్లు, కిడ్నాపర్లు, డబ్బున్న వారి భార్యలను లోబరచుకొని

బ్లాక్ మైల్ చేసి డబ్బు సంపాదించే వాళ్లు ఈ కోవలోకి వస్తారు.)

జీవుడు ఈ విధంగా ఎదుటి వారిని మోసం చేసి, వారి ధనాన్ని అపహరించినా, అది వాడి దగ్గర నిలవదు. వీడి కంటే ఘనుడు మరొకడు ఉంటాడు. వాడు వీడిని మోసంచేసి వీడు సంపాదించిన ధనాన్ని దోచుకుపోతాడు. వీడికన్నా పైవాడు, వీడిని పట్టుకొని ఆ ధనాన్ని లాక్కుంటాడు. ఈ ప్రకారము అక్రమంగా ఆర్జించిన ధనము చేతులు మారుతూ ఉంటుంది.

(ఒకడు దొంగతనం చేసి 10 తులాల బంగారం ఎత్తుకుపోయాడు అనుకుందాము. వాడిని పోలీసులు పట్టుకొని వాడి దగ్గర నుండి 9 తులాల బంగారం రికవర్ చేస్తారు. పై అధికారులకు 6 తులాలు మాత్రమే రికవర్ అయిందని చెబుతారు. ఆఖరుకు 3 తులాలు మాత్రం దొరికిందని కోర్టులో చెబుతారు. సొమ్ముపోయిన వాడికి ఖర్చులు పోను 2 తులాలు మాత్రమే దక్కుతుంది. కొన్ని సార్లు అదీ దక్కదు.).

ఇది ఇలా ఉంటే, ఓ రాజా! అక్రమంగా సంపాదించిన ధనమును పంచుకోడంలో తేడాలు వచ్చి, ఒకరిని ఒకరు మోసం చెయ్యడానికి ప్రయత్నించడం, ఒకరి మీద ఒకరికి అనుమానం రావడం, విరోధము, ద్వేషం ప్రబలడం జరుగుతుంది. ఒకరిని ఒకరు కొట్టుకోవడం, చంపుకోవడం జరుగుతుంది.

కాబట్టి మహారాజా! జీవుడు దేహములో ఉండి ఈ మాదిరి ప్రవర్తించడానికి, సంసారకూపంలో పడడానికీ, ఆ జీవుడు పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితమే కాని వేరుకాదు. మహారాజా! ఇవన్నీ ఒక దారి అయితే, జీవుడి దురలవాట్ల వలన వచ్చే రోగాలు, బయట వాతావరణం వలన వచ్చే రోగాలు, ప్రమాద వశాత్తు కలిగేవి,

(అంటే కాళ్లు విరగడం, చేతులు విరగడం, గాయాలు కావడం, భూకంపాలు, తుఫానులు, అగ్ని ప్రమాదాలు వరదలు వలన వచ్చే నష్టాలు కూడా జీవుని బాధిస్తూ ఉంటాయి. వీటి వలన కూడా జీవుడు బాధలు, కష్టాలు అనుభవిస్తూ ఉంటాడు.ఇటీవల రష్యాలో ఉల్క శకలం పడి వందలకొద్దీ మరణించారు. ఇది ఆది దైవికం.)

మహారాజా! సంసారంలో వచ్చే ఈ కష్టాలు చాలా సహజం. ఇవన్నీ బయటనుండి వచ్చే కష్టాలు. ఇంక జీవునిలోపల నుండి పుట్టే కష్టాలు కూడా ఉన్నాయి అవి....సుఖము, దుఃఖము, ఒకరిని అమితంగా ప్రేమించడం, మరొకరిని విపరీతంగా ద్వేషించడం, ప్రతిదానికీ భయపడటం, దేహం మీద అభిమానం పెంచుకోవడం, ప్రతిదానికీ  ఆవేశపడి, పిచ్చిపట్టినట్టు ప్రవర్తించడం, (చిన్నిచిన్ని కారణాలకు ఆత్మహత్యలు చేసుకోవడం, తనను ప్రేమించలేదని ఆ అమ్మాయి మీద ఆసిడ్ పొయ్యడం, మేడమీదినుండి తోసి చంపడం), ప్రతిదానికీ ఏడవడం, తనకు నచ్చిన దానిమీద విపరీతమైన వ్యామోహం పెంచుకోవడం అది లేకపోతే బతకలేను అనే వ్యామోహానికి లోనుకావడం, అంతా నాకే కావాలి అనే లోభము, నాకు లేనిది  ఎదుటి వారికి ఉందనే మాత్సర్యము, ఎదుటి వారి సంతోషాన్ని చూచి ఈర్ష్య పడటం,  చెడ్డ పనులు చేసి ఎదుటి వారి చేతిలో అవమానాల పాలు కావడం,  ఆకలికి తట్టుకోలేక పోవడం,  ముసలి తనంలో వచ్చే వ్యాధులతో బాధలు పడటం, తుదకు మృత్యువాత పడటం. ఇవన్నీ సంసారంలో వచ్చే కష్టాలు. వీటిని ఎవరూ తప్పించుకోలేరు.

మహారాజా! జీవుడు సంసారంలో పడటానికి మూలం వివాహం. ఒక అమ్మాయిని చూస్తాడు. ఈ అమ్మాయి కౌగిట్లో

స్వర్గసుఖాలు అనుభవిస్తాను అనే మాయలో పడతాడు. పెళ్లి చేసుకుంటాడు. ఒకరికి ద్దరు అయ్యారు కదా. వాళ్లు ఉండటానికి ఒక ఇల్లు కావాలి. దాని కోసరం నానా పాట్లు పడతాడు. ఇంతలో పిల్లలు పుడతారు. వారి ఆటపాటలతో ముద్దు ముచ్చట్లతో ఆనందం కలిగినా వారిని పోషించడానికి నానా పాట్లు పడతాడు. ఆ ప్రకారంగా జీవుడు సంసారము అనే అంధకారంలో పడి కొట్టుకుంటున్నాడు.

మహారాజా! ఇప్పుడు నీకు కాల చక్రము గురించి చెబుతాను. దీనినే విష్ణు చక్రము అని కూడా అంటారు. ఆ కాలచక్రము యొక్క స్వరూపము అతి స్వల్పమైన కాల పరిమాణము నుంచి బ్రహ్మయొక్క ఆయుర్దాయము వరకూ వ్యాపించి ఉంది. ఈ కాల చక్రము నిరంతరమూ తిరుగుతూనే ఉంటుంది. ఈ కాలచక్ర ప్రభావము చేత అతి స్వల్పమైన గడ్డి పరక దగ్గర నుండి భారీశరీరంతో ఉన్న గజము వరకు ఉన్న సకల ప్రాణుల యొక్క ఆయుష్షును బాల్య యౌవన, వార్ధక్యముల రూపంలో నిత్యమూ హరిస్తూ ఉంటుంది. ఈ కాలచక్రము ఆపడం ఎవరి తరమూ కాదు.

ఈ కాలము పరమాత్మ అధీనంలో ఉంటుంది. ఈ కాల చక్రానికి భయపడిన జీవుడు పరమాత్మను విడిచిపెట్టి అజ్ఞానంతో వివిధరకాల దేవతలను ఆశ్రయిస్తూ ఉంటాడు. తాను ఆశ్రయించిన దేవతలకు అనుగుణంగా శాస్త్రప్రమాణములను చెబుతూ ఉంటాడు. ఈ దేవతలు ఎవ్వరూ జీవుని కాల చక్ర ప్రభావము నుండి రక్షించలేరు.

ఇటువంటి పాషండ దేవతలను పూజించే వారు ఎక్కువగా ఇతరులను మోసగిస్తూ ఉంటారు. వారి మోసానికి బలి అయిన

జీవుడు, తుదకు బ్రాహ్మణులను ఆశ్రయిస్తాడు. కాని బ్రాహ్మణులు పరమేశ్వరునికి చేసే ఆరాధనలు వారికి నచ్చవు. అప్పుడు అతడు మరలా శూద్రుల ఆచారాలను ఆశ్రయిస్తాడు. అక్కడ పరమాత్మ ప్రసక్తి ఉండదు. తినడం, స్త్రీలతో సంభోగించడం, నిద్రించడం, సుఖించడం. ఇదే జీవనంగా గడుపుతాడు. దాదాపు వానరుల మాదిరి స్వేచ్ఛగా జీవించడానికి అలవాటు పడతాడు. ఇటువంటి స్వేచ్ఛాజీవనానికి అలవాటు పడ్డ జీవుడు తనకు మరణం ఆసన్నమవుతోందని గ్రహించలేడు.

అడవిలో ఉన్న వానరములు బోయవాడు పన్నిన వల ఉందని తెలుసుకోలేక, ఆ వలలో చిక్కుకొని గిలగిలా కొట్టుకుంటాయి. అదేమాదిరి జీవుడు ప్రాపంచిక సుఖములలోనూ, విషయ సుఖములలోనూ మునిగిపోయి, భార్య, సంతానము, బంధువుల మీద ప్రేమతో, తాను సంపాదించిన ధనమును దాచుకొనవలెననే కోరికలతో, వయసు అయిపోయినను స్త్రీసంభోగ వాంఛ చావకుండా అనుభవిస్తూ,  సంసార బంధనముల నుండి బయటపడలేడు.

ఈ ప్రకారంగా సంసారంలో, విషయవాంఛాలోలుడైన జీవుడు, పరమాత్మను ఆరాధించడం మరిచిపోతాడు. వృద్ధాప్యంతో, రోగాలతో సతమతమవుతూ ఉంటాడు. ఆ సమయంలో మృత్యువు ఏనుగులాగా మీద పడటానికి సిద్ధంగా ఉంటుంది. మృత్యువు నుండి తప్పించుకోడానికి కొండ గుహల వెంట పరుగెడతాడు. (కార్పొరేట్ హాస్పిటల్సు వెంట తిరగడం, ఆక్సిజన్ పెట్టడం, తాత్కాలికంగా హార్ట్‌బీట్ ఇవ్వడం ఇలాంటివి. చుట్టు పది మంది డాక్టర్లు చేరి ఎవరు

ఏంచేస్తున్నారో తెలియకుండా వారికి తోచిన వైద్యం చెయడం. చివరకు ప్రశాంతంగా కూడా చావనివ్వరు. ఇవన్నీ తుదకు చస్తాడని తెలిసీ చేసే ప్రక్రియలు.)

జీవునకు దైవికముగా ఋతుక్రమంలో వచ్చే చలి, వేడి, వాన వీటివలన కలిగే కష్టనష్టములు, ప్రమాదవశాత్తు వచ్చే ఆపదలు, శారీరక మానసిక బాధలు, తుఫానులు, భూకంపములు అగ్ని ప్రమాదముల వలన కలిగే బాధలు వీటిని తట్టుకోడానికి శక్తి లేక నానా యాతనా పడుతుంటాడు.

ఒక్కోసారి కొంతమంది కలిసి వ్యాపారాలు చేస్తుంటారు. లాభాలు వస్తాయి. లాభాలు పంచుకోడంలో తగాదాలు వస్తాయి. విభేధాలు వస్తాయి. ఒకరిని ఒకరు మోసం చేసుకుంటూ ఉంటారు. దానివలన శత్రుత్వము పెరుగుతుంది. ఒక్కొక్కప్పుడు ఉన్నధనం అంతా పోతుంది. చేతిలో చిల్లి గవ్వ ఉండదు. ఇల్లు వాకిలి అంతా పోతాయి. తినడానికి తిండి తలదాచుకోడానికి నీడ కరువవుతాయి. తనకు ఇష్టమైన వస్తువులను పొందలేడు. బాగా బతికిన వాడు బికారి అవుతాడు. అప్పుడు ఎలాగైనా ధనం సంపాదించాలని అడ్డదార్లు తొక్కుతాడు. ఇతరులను మోసం చేసి ధనంసంపాదించాలి అని అనుకుంటాడు. ఆ మోసం బయటపడి అవమానాల పాలవుతాడు.

ఇంకా కొంతమంది సంబంధములు కలుపుకోవడం ద్వారా ఆస్తులు ధనము సంపాదించాలని అనుకుంటారు. కుమారుడికి కుమార్తెకు ఇష్టం లేకపోయినా వాళ్లకు వివాహాలు చేస్తారు. తరువాత వాళ్లు ఎదురు తిరిగితే వాళ్లతో శత్రుత్వము పెంచుకుంటారు.

మహారాజా! ఈ సంసారంలో ఎన్నోరకాల బాధలు,అడ్డంకులు ఉన్నాయి. వీటిని దాటలేక మానవుడు దు:ఖాల పాలవుతున్నాడు. ఇవే కాకుండా మానవుడికి మరొక విధంగా కూడా సుఖాలు దు:ఖాలు కలుగుతుంటాయి. ఇంట్లో ఉన్న తల్లి తండ్రులు, తాతలు పోయినప్పుడు దు:ఖము, కొడుకులకు కూతుళ్లకు  మనుమళ్లు మనుమరాళ్లు పుట్టినప్పుడు సంతోషము కలుగుతుంటాయి. వీళ్లకు ఏమన్నా వ్యాధులు వస్తే భయపడి పోతాడు. అందరి మీదా చిరాకు పడతాడు. వాళ్ల పక్కన కూర్చుని వాళ్ల ఆలనా పాలనా చూస్తుంటాడు.

ఈ సంసారంలో జీవునికి సంతోషం ఎక్కువయితే పాటలు పాడతాడు. నాట్యం చేస్తాడు. దు:ఖం ఎక్కువయితే కుంగిపోతాడు. నిర్జీవంగా తయారవుతాడు.  ఈ ప్రకారంగా జీవుడు సంసారంలో బంధింపబడతాడు. సంసారంలో బంధింపబడ్డ జీవుడు పరమాత్మ గురించి ఆలోచించడు. ఆలోచించే సమయం కూడా ఉండదు. తను, భార్య, పిల్లలు, సంపాదన, సుఖాలు అనుభవించడం వీటికే సమయం చాలదు.

కాని ఈ సంసారసాగరాన్ని దాటడానికి ఆ పరమాత్మను స్మరించడం, ధ్యానించడమే ఉత్తమమైన మార్గము. కానీ, ఎవరికీ ఈ మార్గంలో ప్రయాణం చేయడానికి ఇష్టం ఉండదు. అటువంటి వారికి ఎన్నటికీ ముక్తి లభించదు. భగవంతుని అనుగ్రహం పొందాలంటే, సర్వభూతములయందు సమత్వము అలవరచుకోవాలి. ఇంద్రియములను జయించాలి. మనసును అదుపులో పెట్టుకోవాలి.

అప్పుడు భగవంతుని మీద అచంచలమైన భక్తి పుడుతుంది. కాని నిరంతరము సంసారంలో పడి ఉన్న వారికి ఈ భక్తిని పొందలేరు.

మహారాజా! కొంత మంది ఋషులు ఉంటారు. వారు జితేంద్రియులు. యజ్ఞములు యాగములు చేస్తారు చేయిస్తారు. కర్మలు చేయడంలోనే ఆసక్తి చూపిస్తారు. వారుకూడా సంసారములో పడిపోతారు. అటువంటి వారు కూడా భగవంతుని చేరుకోలేరు. ఇంక మీ వంటి రాజులు కూడా ముక్తి పొందలేరు. ఎందుకంటే, క్షత్రియులకు దేహాభి మానము, వారి రాజ్యము మీద మక్కువ ఎక్కువ. ఈ రాజ్యం నాది, ఈ భూమి నాది అనే అహంకారంతో గర్విస్తుంటారు. తోటి రాజులతో శత్రుత్వము పెంచుకుంటారు. వారితో యుద్ధాలు చేస్తారు. తుదకు ఇద్దరూ యుద్ధరంగంలో మరణిస్తారు. ఆ రాజ్యము పరులపాలవుతుంది.

ఈ ప్రకారం వీరుడిగా యుద్ధ రంగంలో మరణించిన వారు, యజ్ఞయాగములు చేసిన ఋషులు, మునులు, మరణించిన తరువాత స్వర్గలోకమునకు పోతారు. అక్కడ స్వర్గసుఖములు అనుభవిస్తారు. వారు చేసిన పుణ్యం కాస్తా అయిపోగానే మరలా మానవ లోకంలో పుడతారు. (క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి...గీతావాక్యము).

మహారాజా! కేవలము పరమాత్మయందు అచంచలమైన భక్తితోనే ముక్తి సాధింపబడుతుంది కానీ కర్మలవలనకాదు." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు సంసారము, దానిలోని కష్టనష్టములు, భరతుడు చెప్పిన కథకు వివరణ చెప్పాడు. ఇంకా ఇలా అంటున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! చిన్న ఈగ గరుత్మంతునితో పోటీ పడటానికి ఏ విధంగానూ సరిపోదు. అలాగే ఈ భూమి మీద ఉన్న ఏ రాజుకూడా రాజర్షులు అయిన  భరతుడు, ఋషభుడు వీరితో ఏ విషయంలోనూ పోటీ పడలేరు. భరతుడు తాను యౌవనంలో ఉండగానే పరమాత్మ యందు తనమనసును లగ్నం చేసాడు. ప్రాపంచిక విషయములలో ఆసక్తిని పూర్తిగా విడిచి పెట్టాడు. భార్యను, పుత్రులను, రాజ్యమును గడ్డిపోచతో సమానంగా విడిచిపెట్టాడు. రాజభోగములను, అనంత మైన సంపదలను, విషయవాంఛలను పూర్తిగా త్యజించాడు.  భరతుడి దృష్టిలో  భగవంతుని మీద ఉన్న అచంచలమైన భక్తి ముందు మోక్షం కూడా ఎందుకూ పనికిరాదు. కర్మవశాత్తు లేడిగా పుట్టినా, ఆ లేడి శరీరమును విడిచిపెట్టునపుడు భరతుడు తన మనస్సును పరమాత్మయందు లగ్నం చేసాడు. పరమాత్మను స్తుతించాడు. తనను తాను పరమాత్మకు అర్పించు కున్నాడు. ఇటువంటి రాజర్షి అయిన భరతుని పరిశుద్ధమైన గుణములను, ఆయన చేసిన కర్మలను లోకం అంతా గౌరవిస్తుంది. మంగళకరము, ఆయుష్షను వృద్ధిచెందించేది, ధన్యమైనది, యశస్సును కలిగించేది, స్వర్గమును, మోక్షమును ఇచ్చేది అయిన ఈ భరతుని చరిత్రను విన్నా, గానం చేసినా, వారికి అన్ని కోరికలు నెరవేరుతాయి." అని శుకుడు పరీక్షిత్తు మహారాజుకు భరతుని గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

పంచమ స్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణం.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# పంచమ స్కంధము
# పదునైదవ  అధ్యాయము.

శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు భరతుని వంశము గురించి ఈ విధంగా వివరించాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! భరతునికి ఒకకుమారుడు ఉన్నాడు. అతనిపేరు సుమతి. సుమతికి తన భార్య వృద్ధసేనయందు దేవతాజిత్తు అనేకుమారుడు కలిగాడు.  దేవతాజిత్తుకు అతని భార్య అసురి యందు దేవద్యుమ్నుడు అనే కుమారుడు జన్మించాడు. దేవద్యుమ్నునికి అతని భార్య ధేనుమతికి పరమేష్టి అనే కుమారుడు జన్మించాడు. పరమేష్టికి, అతని భార్య సువర్చలకు ప్రతీహుడు అనే కుమారుడు జన్మించాడు. ప్రతీహుని భార్య సువర్చల. వారిద్దరికీ ప్రతిహర్త, ప్రస్తోత, ఉద్గాత అనే కుమారులు జన్మించారు. ప్రతిహర్తకు స్తుతి అనే భార్య వలన  అజుడు, భూముడు అనే కుమారులు జన్మించారు.  భూముడికి అతని భార్య ఋషికుల్య వలన ఉద్గీథుడు అనే కుమారుడు జన్మించాడు. ఉద్గీథునికి అతని భార్య దేవకుల్యకు ప్రస్తావుడు అనే కుమారుడు జన్మించాడు. ప్రస్తావునకు అతని భార్య విరుత్స వలన విభుడు అనే కుమారుడు కలిగాడు. విభుడు అతని భార్య రతికి పృథుసేనుడు అనే కుమారుడు జన్మించాడు. ప్రథుసేనుడికి అతని భార్య  ఆకూతి వలన నక్తుడు, నక్తుడికి అతని భార్య ద్రుతి వలన గయుడు అనే కుమారుడుజన్మించాడు.

గయుడు గొప్ప రాజర్షి. సత్త్వగుణ సంపన్నుడు. విష్ణు భక్తుడు. ఆత్మజ్ఞానమును పొందిన వాడు. ఆ గయుడు ప్రజాపాలన లోనూ, దుష్టులను శిక్షించడంలోనూ, ప్రజలకు తగిన సౌకర్యాలు కల్పించడంలోనూ,. ప్రజలలో ఉన్న సామర్ధ్యమును గుర్తించి వారిని తగురీతిగా గౌరవించి సత్కరించడంలోనూ, ప్రజలకు ధర్మబోధ చేసి వారిని సన్మార్గులుగాతీర్చిదిద్దడంలోనూ, యజ్ఞములు, యాగములు చేసి ప్రజలకు తగిన జీవనోపాధి కల్పించడంలోనూ, మొదలైన రాజధర్మములను ఆచరించడంలోనూ, తాను గృహస్థాశ్రమములో ఉండి భార్యా బిడ్డలను సంతోషపెట్టడంలోనూ,  గయుడు సమర్ధుడు అనిపించుకున్నాడు.

అంతేకాదు, సర్వవ్యాపి అయిన పరమాత్మకు తాను చేసిన అన్ని పనులను, వాటి ఫలములను సమర్పించి, తాను వాటితో ఏ సంగమూ లేకుండా ఉండేవాడు. త్రికరణ శుద్ధిగా పరమాత్మను సేవించేవాడు. భగవంతుని ఎడల అపారమైన భక్తి కలవారి పాదములను ఆశ్రయించి వారి సాంగత్యములో తానుకూడా భగవద్భక్తిని అలవరచుకొనేవాడు. పైధర్మములను ఆచరించడం వలన గయుని యొక్క బుద్ధి పరిశుద్ధము అయింది.

గయునికి దేహాభిమానము(నేను, నాది అనే భావన) నశించింది.  గయుడు ఎల్లప్పుడు తనలో ఆత్మస్వరూపంగా వెలుగుతున్న పరమాత్మలో లీనమయి బ్రహ్మానందము అనుభవిస్తూ ఉండేవాడు. ఈ ప్రకారంగా దేనితోకూడా సంగము పెట్టుకోకుండా ధర్మము ప్రకారము రాజ్యపాలన చేస్తూ ఉండేవాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! పండితులు గయుని ఇలా కీర్తించేవారు. గయుడు వేదములో చెప్పబడిన మాదిరి యజ్ఞములు చేసేవాడు. మంచిమనసు కలవాడు. సకల శాస్త్రములు చదివిన వాడు. ధర్మమును రక్షించేవాడు. శ్రీమంతుడు. సాధుజనులను రక్షించేవాడు. భగవద్భక్తులను సేవించేవాడు. గుణవంతుడు అయిన గయునితో సమానమైన రాజు ఎవరున్నారు అని అనుకొనేవారు. గయుని పాలనలో నదులు జలములతో సమృద్ధిగా ఉండేవి. పంటలు బాగా పండేవి. గోమాత పాలు ఇచ్చినట్టు భూమాత ధాన్యమును, ఖనిజములను పుష్కలంగా ఇచ్చేది. దానితో గయుని రాజ్యము సుభిక్షంగా ఉండేది.

గయుడికి ఏకోరికాలేదు. అన్ని కోరికలు వాటంతట అవే తీరుతున్నాయి. అతడు చేసే వేదసమ్మతమైన యజ్ఞయాగములు, ధర్మకార్యములు అతనికి సకల భోగములను సమకూర్చేవి. సామంత రాజులు ధర్మబద్ధంగా గయునికి కానుకలు సమర్పించేవారు. బ్రాహ్మణులు కూడా తాము ఆర్జించిన పుణ్యములో ఆరవ వంతు గయునికి ఇచ్చేవారు. గయుడు చేసే యజ్ఞములకు సాక్షాత్తు ఇంద్రుడు, విష్ణువు వచ్చి వారి హవిర్భాగములను స్వీకరించేవారని చెప్పుకుంటారు. ఇంద్రుడు, విష్ణువు, “నీవుచేసినయాగముచేత మేము సంతుష్టులమైనాము” అని గయునితో చెప్పి, ఆయనను ఆశీర్వదించి వెళ్లేవారు.

అటువంటి మహానుభావుడు అయిన గయునికి తన భార్య గాయంతి ద్వారా చిత్రరథుడు, సుగతి, అవిరోధనుడు, అనే ముగ్గురు

కుమారులు జన్మించారు. వారిలో చిత్రరథుడికి అతని భార్య ఊర్ణకు సమ్రాట్టు అనే కుమారుడు జన్మించాడు. సమ్రాట్టు భార్యఉత్కలకు మరీచి జన్మించాడు. మరీచికి అతని భార్య ఇందుమతికి బిందుమానుడు అనే కుమారుడు జన్మించాడు. బిందుమానుడికి అతని భార్య సరఘకు మధునుడు జన్మించాడు. మధునకు అతని భార్య సుమనకు వీరవ్రతుడు జన్మించాడు. వీరవ్రతునకు అతని భార్య భోజ వలన మంథుడు, ప్రమంథుడు అనే కుమారులు జన్మించారు. మంథునకు అతని భార్య సత్యకు భౌవనుడు అనేకుమారుడు జన్మించాడు. భౌవనుడికి అతని భార్య దూషణ వలన త్వష్టఅనే కుమారుడు జన్మించాడు. త్వష్టకు, అతని భార్య విరోచనకు విరజుడు అనే కుమారుడు పుట్టాడు. విరజుని భార్య విషూచి. వారిద్దరికీ నూరుగురుకుమారులు, ఒక కుమార్తె జన్మించారు. ఆ నూరుగురు కుమారులలో శతజిత్తు అనే వాడు చాలా గొప్పవాడు. ఈ శతజిత్తు ప్రియవ్రతుని వంశములో వాడు. ఆ వంశమునకే కీర్తిప్రతిష్టలు సంపాదించి పెట్టాడు అని పెద్దలు అంటారు.

శ్రీమద్భాగవతము

పంచమ స్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సతsు ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

పంచమ స్కంధము

పదునారవ అధ్యాయము.

పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని ఇలా అడిగాడు.

"ఎంత వరకు సూర్యునికాంతి పడుతుందో అంత మేరా భూగోళము విస్తరించి ఉంది అని తమరు నాకుచెప్పారు. అదీ కాకుండా ఈ భూమి మీద ప్రియవ్రత మహారాజు తన రథమును తిప్పి, భూగోళమును ఏడు భాగములుగా చేసాడనీ, వాటి మధ్య ఏడుసముద్రములు ఏర్పడ్డాయనీ తమరు చెప్పారు. ఈ సప్తసముద్రముల పేర్లు, వాటిమధ్య ఉన్న ద్వీపముల పేర్లు, నాకు చెప్పారు. కానీ ఆ ద్వీపముల విస్తీర్ణము, వాటి స్వభావము, వాటి హద్దులు నాకు చెప్పలేదు. ఆ విశేషములుకూడా నాకు తెలియజేయండి.

పరమాత్మ సత్వ,రజస్తమోగుణముల కలయికతో ఒక విరాట్ స్వరూపమును ధరించాడు. ఆ విరాట్ స్వరూపము యందుమనస్సు లగ్నం చేస్తే, వాసుదేవుని తెలుసుకోగలము. కాని పరమాత్మ యొక్క స్థూల రూపము ఎలా ఉంటుంది వివరంగా తెలియజేయండి." అని అడిగాడు పరీక్షిత్తు. దానికి శుక మహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఓ రాజా! ఆ పరమాత్మయొక్క విరాట్ రూపమునకు ఆది, అంతము లేదు. అది ఈ విశ్వము అంతా నిండి ఉంది. అది ఒక మాయాస్వరూపము. ఆ విరాట్ స్వరూపమును గురించి మానవుడు తన జీవిత కాలము శ్రమించిననూ, ఎన్నటికీ తెలుసుకోలేడు. అంతే కాదు, వాక్కు ద్వారా, మనస్సు ద్వారా ఆ విరాట్ స్వరూపమును వర్ణింపలేము. కాబట్టి నేను నా శక్తి మేరకు ఈ భూగోళము గురించి, దాని విస్తీర్ణము గురించి, అందులో ఉన్న ముఖ్యమైన ద్వీపముల గురించి నీకు వివరిస్తాను.

ఈ భూమండలమును ఒక పద్మముతో పోల్చవచ్చును. అందులో విస్తరించి ఉన్న రేకులే సప్తద్వీపములు. ఆ సప్తద్వీపముల మధ్య ఉన్నది జంబూద్వీపము. ఈ జంబూద్వీపము లక్షయోజనముల విస్తీర్ణము కలిగి ఉంది. ఈ జంబూద్వీపము తామరాకు వలె గుండ్రంగా ఉంటుంది. ఈ జంబూద్వీపంతో తొమ్మిది వర్షములు (అనగా దేశములు, ప్రాంతములు. మన దేశాన్ని భారతవర్షముఅని అంటారు.) ప్రతి వర్షము తొమ్మిది వేల యోజనముల విస్తీర్ణము కలిగి ఉంది. ఈ తొమ్మిది వర్షముల మధ్య ఎనిమిది పర్వతములు ఆ తొమ్మిది వర్షములకు హద్దులుగా ఉన్నాయి.

ఈ తొమ్మిది వర్షములలో ఇలావృత వర్షము అనే దేశము మధ్యగా ఉంది. ఈ ఇలావృత వర్షములోనే మేరు పర్వతము ఉంది. ఆ మేరు పర్వతము సువర్ణమయము. ఈ మేరు పర్వతము లక్షయోజనముల విస్తీర్ణము కలిగి ఉంది. ఈ మేరు పర్వతము

భూమండలము మధ్యలో ఉంది.ఈ మేరు పర్వతము ఎత్తు 84వేల యోజనములు.

ఇలావృత వర్షమునకు ఉత్తర దిక్కుగా రమ్యకము, హిరణ్మయము, కురు అనే వర్షములు ఉన్నాయి. ఆ మూడు వర్షములకు నీలము, శ్వేతము, శృంగవంతము అనే పర్వతములు హద్దులుగా ఉన్నాయి.

ఇలావృత వర్షమునకు దక్షిణముగా హరివర్షము, కింపురుషము, భారత వర్షము ఉన్నాయి. ఈ మూడు వర్షములను నిషధము, హేమకూటము, హిమాలయము అనే మూడు పర్వతములు విడదీసి, వాటికి సరిహద్దులుగా ఉన్నాయి.

ఇలావృత వర్షమునకు పడమర దిక్కుగా కేతుమాల వర్షము దాని హద్దుగా మాల్యవంతము అనే పర్వతము, తూర్పుదిక్కున భద్రాశ్వము అనే వర్షము దానికి హద్దుగా గంధమాధనము అనే పర్వతము ఉన్నాయి.

మేరు పర్వతమునకు చుట్టు మందరము, మేరు మందరము, సుపార్శ్వము, కుముదము అనే పర్వతములు ఉన్నాయి. ఇవి ఒక్కొక్కటీ పదివేల యోజనముల విస్తీర్ణములో ఉన్నాయి. ఈ నాలుగు పర్వతముల మీద నాలుగు పెద్ద వృక్షములు ఉన్నాయి. ఈ నాలుగు పర్వతముల మీద నాలుగు మడుగులు ఉన్నాయి. మొదటిదానిలో పాలు ఉంటాయి, రెండవ దానిలో తేనె ఉంటుంది. మూడవ దానిలో చెరకు రసం ఉంటుంది. నాలుగవ దానిలో

పరిశుద్ధమైన నీరు ఉంటుంది. సిద్ధులు, చారణులు వచ్చి ఈ హ్రదములలో  ఉన్న నీటిని తాగి సిద్ధులు పొందుతారు.

ఆ పర్వతముల మీద నాలుగు ఉద్యానవనములు కూడా ఉన్నాయి. అవి....నందనము, చిత్రరథము, వైభ్రాజకము, సర్వతోభద్రము. ఈ ఉద్యాన వనములలో దేవతలు అప్సరసలు విహరిస్తుంటారు. గంధర్వులు గానం చేస్తుంటారు.

మందర పర్వతమునకు కింద భాగమున దేవచూతము అనే మామిడి చెట్టు ఉంది. దానికి పెద్ద పెద్ద మామిడి పండ్లు కాస్తాయి. అవి ఆ చెట్టు నుండి కిందపడి నలిగిపోయి వాటి నుండి  ఎర్రగా ఉన్న రుచికరమైన రసం పారుతూ ఉంటుంది. ఆ రసం ఒక నది మాదిరి అయింది. దాని పేరు అరుణోదము. ఆ నది మందరపర్వతము నుండి ఇలావృత వర్షము వరకు ప్రవహిస్తూ ఉంటుంది. ఈ నదిలో ఉన్న మామిడి రసమునుతాగడం చేత యక్షకాంతల శరీరములు ఎప్పుడూ మంచి వాసలను వెదజల్లుతుంటాయి.

రెండవది జంబూ వృక్షము. అనగా నేరేడు చెట్టు. ఈ నేరేడు చెట్టు పళ్లు కూడా చాలా పెద్దవిగా ఉంటాయి. అవి నేల మీద పడిపగిలి పోయి, వాటి రసం నది మాదిరి పారుతూ ఉంటుంది. దానినే జంబూనది అంటారు. (ప్రస్తుతం ఉన్న జమ్ము ప్రాంతం అదే కావచ్చు). ఈ జంబూనది ఇలావృత వర్షము వరకూ ప్రవహిస్తూ ఉంటుంది. ఈ జంబూ నదిలోని మట్టి  గాలితోనూ, సూర్యరశ్మితోనూ కలిసి అనేక రసాయనక మార్పులుచెంది బంగారముగా మారుతుంది. అందుకే బంగారమును జాంబూనదము అంటారు.

మూడవది సుపార్శ్వపర్వతము పక్కనే ఉన్న మహాకదంబ వృక్షము. ఆ వృక్షము తొర్రలలోనుండి ఐదు రసాలు కారుతుంటాయి. అవి అన్నీ కలిసి ఒక నదిగా పారుతుంటుంది. ఆ నది ఇలావృత వర్షము వరకూ వ్యాపించి ఉంటుంది.

నాలుగవది అయిన కుముద పర్వతము పక్కన ఉన్న శతవల్శ అనే మర్రి చెట్టు ఉంది. దాని మొదలునుండి కూడా ఒక నది ప్రవహిస్తూ ఉంటుంది. ఆ నది ఉత్తర దిక్కుగా ప్రవహిస్తుంది. అది తీర ప్రాంతములను సస్యస్యామలం చేస్తుంది. ఈ నదులలో ప్రవహించు రసములను, జలమును సేవించిన వారికి ముసలితనము, దాని వలనవచ్చే అనర్థములు రావు. ఎటువంటి రోగములు రావు. జీవితాంతము సుఖంగా కాలం గడుపుతారు.

ఇవి కాకుండా మేరు పర్వతమునకునాలుగు దిక్కులా కురంగము, కురరము, కుసుంభము, వైకంకము, త్రికూటము, శిశిరము, పతంగము, రుచకము, నిషధము, శితివాసము, కపిలము, శంఖము, వైడూర్యము, జారుధి, హంసము, ఋషభము, నాగము, కాలంజరము, నీరదము అనే పర్వతములు ఉన్నాయి. ఈ పర్వతముల మధ్య మేరుపర్వతము ఉంది. ఈ మేరు పర్వతమునకు తూర్పు దిక్కున జఠరము, దేవకూటము అనే పర్వతములు ఉన్నాయి. అవి ఉత్తర దక్షిణ దిక్కులుగా వ్యాపించి ఉన్నాయి. అవి 18 వేలయోజనముల పొడుగున విస్తరించి ఉన్నాయి. అలాగే మేరు పర్వతమునకు పడమటి దిక్కున పారి యాత్రము, పవనము అనే రెండు పర్వతములు ఉత్తర దక్షిణ దిక్కులుగా వ్యాపించి ఉన్నాయి. వాటి పొడుగు 18వేల యోజనములు. మేరు పర్వతమునకు దక్షిణ దిక్కుగా కైలాసపర్వతము, కరవీర

పర్వతము ఉన్నాయి. ఇవి తూర్పు పడమరలుగా వ్యాపించి ఉన్నాయి. ఇవికూడా 18 వేలయోజనముల పొడుగు ఉన్నాయి. రెండు వేల యోజనముల ఎత్తు కలిగి ఉన్నాయి. మేరు పర్వతము ఉత్తర దిక్కున త్రిశృంగము, మకరము అనే పర్వతములు ఉన్నాయి. ఇవి తూర్పు పడమరలుగా 18వేల యోజనములు వ్యాపించి ఉన్నాయి. రెండు వేల యోజనముల ఎత్తుతో ఉన్నాయి. (ఈ ఎనిమిది పర్వతములు సమానమైన పొడుగు ఎత్తుతో ఉన్నాయి. అంటే నలుపక్కలా చదరంగా ఉన్నాయి.) వీటి మధ్య మేరు పర్వతము ఉంది.

ఈ మేరు పర్వతము మీద మధ్య భాగమున బ్రహ్మదేవుని సత్యలోకము ఉంది. దీని పేరు శాతకౌంభీపురము అని అంటారు. ఈ బ్రహ్మలోకమునకు నాలుగు పక్కలా ఇంద్రుడు మొదలగు లోకపాలకులయొక్క పురములు ఉన్నాయి. ఈ పురముల యొక్క విస్తీర్ణము బ్రహ్మ యొక్క పురము విస్తీర్ణములో నాలుగవ భాగము.

శ్రీమద్భాగవతము

పంచమ స్కంధము పదునారవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
పంచమ స్కంధము
పదునేడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఇలా చెబుతున్నాడు.

“మహారాజా! యజ్ఞ మూర్తి అయినపరమాత్మ పాదముల నుండి ఒకజలధార పుట్టింది. ఆజలము తాకిన మాత్రముననే అన్ని పాపములు పోతాయి. ఆ జలము చాలా నిర్మలంగా ఉంటుంది. ఆ జలధారకు విష్ణుపదము అని పేరు వచ్చింది. ఆ గంగా జలధార క్రమ క్రమంగా పెద్దది అయి కొన్ని వేలసంవత్సరముల తరువాత ఆ గంగా జలధార సప్తర్షి మండలములోనికి ప్రవేశించింది. సప్తఋషులు ఆ జలధారను గంగాదేవిగా గుర్తించి పూజించారు. ఆ గంగాజలమును తమ శిరస్సుల మీద చల్లుకున్నారు. విష్ణువు పాదముల నుండి ఉద్భవించిన ఆ గంగ ముక్తిని ప్రసాదించగలదని అంగీకరించారు.

సప్తఋషి మండలమును దాటిన ఆ గంగా ప్రవాహము క్రమక్రమంగా చంద్రలోకమును చేరింది. చంద్రలోకము గుండా ప్రవహిస్తూ ఆ గంగా ప్రవాహము మేర పర్వత శిఖరము మీద ఉన్న బ్రహ్మలోకము చేరింది. అక్కడ ఆగంగా ప్రవాహము నాలుగు ధారలుగా చీలిపోయింది. అవి సీత, అలకనంద, చక్షు, భద్ర. అందులో సీత అనే గంగా ప్రవాహము పర్వతముల గుండా ప్రవహిస్తూ కిందికి జారి గంధమాధన పర్వతము మీదకు చేరింది. అక్కడ నుండి సీత అనే గంగా ప్రవాహము భద్రాశ్వ వర్షము గుండా ప్రవహించి

తూర్పుసముద్రములో కలిసిపోయింది.

రెండవది అయిన చక్షు అనే గంగా ప్రవాహముమాల్యవంత పర్వత శిఖరము మీదుగా ప్రవహించి, భూమి మీదికి చేరి, వేగంగా ప్రవహిస్తూ, కేతుమాల వర్షము గుండా ప్రవహిస్తూ, పడమటి సముద్రములో కలిసిపోయింది.

మూడవదిఅయిన భద్ర అనే జలధార మేరు శిఖరము నుండి పర్వతముల మీదుగా ప్రవహిస్తూ, శృంగవంత పర్వతము మీది నుండిప్రవహిస్తూ భూమి మీదికి వచ్చి, ఉత్తర కురు దేశము గుండా ప్రవహిస్తూ, ఉత్తర సముద్రములో కలిసిపోయింది.

ఆఖరుది అయిన అలక నంద మేరు పర్వతము నుండి దక్షిణ దిక్కుగా ప్రవహించి, అనేక పర్వతముల గుండా ప్రవహించి, తీవ్రవేగముతో, హేమకూట పర్వతము, హిమాలయ పర్వతములగుండా ప్రవహించి, భారత వర్షములోకి ప్రవేశించి, దక్షిణముగా ఉన్న సముద్రములో కలుస్తూ ఉంది. ఈ అలక నందలో స్నానం చేస్తే అన్నిపాపములు పోతాయని నమ్మకము. ఈ అలక నందలో స్నానం చేసిన వారికి రాజసూయ, అశ్వమేధ యాగములు చేసిన పుణ్యం దక్కుతుంది.

ఇవే కాకుండా ఇంకా ఎన్నో నదులు చిన్న చిన్న ధారలుగా మేరు పర్వతము నుండి పుట్టి అనేక పర్వతముల గుండా ప్రవహించి, అన్ని వర్షములను సస్యశ్యామలము చేసి, తుదకు సముద్రములలో

కలుస్తూ ఉన్నాయి.

తొమ్మిది వర్షములలోనూ భారత వర్షము కర్మభూమి. ఎందుకంటే, చేసిన పుణ్యములకు తగిన ఫలములను స్వర్గలోకములో అనుభవించి, ఇంకా మిగిలినపుణ్యమును ఈ ఎనిమిది వర్షములలో అనుభవిస్తారు. తొమ్మిదవ వర్షము అయిన భరత వర్షములో అనుభవానికి అవకాశం లేదు. ఎందుకంటే భారత వర్షము కేవలం కర్మభూమి. భారత వర్షము కాకుండా మిగిలిన ఎనిమిది వర్షములలో నివసించే వారు దేవతలతో సమానంగా ఉంటారు. వారికి బలం ఎక్కువ. వారి శరీరములు ధృఢంగా ఉంటాయి. వారు ఎప్పుడూ యవ్వనవంతులుగా ఉంటారు. స్త్రీలు కూడా ఎంతో అందంగా ఉంటారు. ఆ ఎనిమిది వర్షములలో ఉన్న ప్రజలు స్వర్గలోక సుఖములతో సమానమైన సుఖములను అనుభవిస్తారు.

ఈ వర్షములు ఉన్న ప్రాంతములలో పూలు, పండ్లు ఉన్న చెట్లు విస్తారంగా ఉన్నాయి. ఆ ఎనిమిది వర్షములకు హద్దుగా ఉన్న పర్వతములమీద ఎన్నో జలాశయాలు, ఉద్యానవనములు ఉన్నాయి. ఆ వర్షములలో నివసించేవారు ఆ ఉద్యానవనములలో తిరుగుతూ, ఆ జలాశయాలలో జలకాలాటలు ఆడుతూ ఎంతో ఆనందంగా ఉంటారు. ఆవర్షములలో ఉన్న స్త్రీలకు కామవాంఛలు ఎక్కువ.

(తమాషాగా చెప్పుకోవాలంటే తొమ్మిది వర్షములలో భారత వర్షము తక్క మిగిలిన వర్షములు అంటే ఇతర దేశాలు కదా! అందుకేనేమో మన వాళ్లంతా ఇతరదేశాల మీద మోజుతో ఆ దేశాలలో

ఇక్కడ లేనిసుఖాలు అనుభవించాలనే కోరికతో, ఇతర దేశాలకు ఎగిరిపోతుంటారు.)

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ తొమ్మిది వర్షములలో ఉన్న ప్రజలను అనుగ్రహించ డానికి పరమాత్మ వివిధ దేవతామూర్తుల పేర్లతో దర్శనం ఇస్తుంటాడు. (వెలుస్తుంటాడు అని చెప్పుకోవచ్చు. ప్రపంచంలో ఎన్ని మతాలు ఉన్నా ఆయామతాలలో ఎంతో మంది దేవుళ్లు ఉన్నా, అన్నీ ఆ పరమాత్మ స్వరూపాలే.)

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ భూమండలము మీద తొమ్మిది వర్షములు ఉన్నాయని చెప్పాను కదా! అందులో మొదటిది ఇలావృత వర్షము. ఈ వర్షము గురించి చెబుతాను విను.

ఇలావృత వర్షంలో ఈశ్వరుడు తన భార్య భవానితో సహా సేవింపబడుతుంటాడు. ఇలావృత వర్షంలో పరమశివుడు పరమాత్మను ఈ క్రింది మంత్రంతో జపిస్తూ ఉంటాడు.

"ఓం నమో భగవతే మహాపురుషాయ సర్వగుణ సంఖ్యానాయానన్తయావ్యక్తాయ నమః" ఇతి.

మహారాజా! శివుడు ఈ మంత్రములో సంకర్షణుని కీర్తిస్తున్నాడు. "మహా పురుషుడు, సర్వగుణ సంపన్నుడు, అనంతుడు, అవ్యక్తుడు అయిన పరమాత్మకు నమస్కారము."

పరమాత్మ వాసుదేవుడు, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణ అనే నాలుగు రూపములతో ప్రకటితమవుతుంటాడు. అందులో ఒకటి సంకర్షణుడు. సంకర్షణుడు తామసానికి, అహంకారానికి ప్రతీక. పరమశివుడు ఆ సంకర్షణుని అంశ. పరమాత్మ శుద్ధసత్వగుణ సంపన్నుడు,

అయినప్పటికినీ, సంకర్షణుడిగా ఆయన చేసే పని సంహారము కాబట్టి తామసత్వము, అహంకారము అవసరము.

పరమశివుడు తనకు మూలము అయిన సంకర్షణుని ఈ ప్రకారంగా ధ్యానిస్తాడు. "ఓ దేవా! సకల గుణములతో ప్రకాశించే ఆ పరమాత్మునకు నమస్కారము చేస్తున్నాను.

" ఓ దేవా! నీ పాదపద్మములను సేవించిన వారికి జరామరణభయము ఉండదు కదా! ఈ లోకములో ఉన్న ఐశ్వర్యములు అన్నీ నీయందే నిక్షిప్తము అయి ఉన్నాయి. ఆఐశ్వర్యములను అందరికీ ప్రసాదిస్తూ నీవు అన్నిలోకములను పాలిస్తున్నావు. నిన్ను నమ్మిన నీ భక్తులకు సంసార సాగరము నుండి విముక్తిని ప్రసాదిస్తున్నావు. అట్టినిన్ను నేను సేవిస్తున్నాను.

ఓ దేవా! నేను ఈ సంహార కార్యక్రమమును చేస్తూ ఉండటం వలన నా కోపమును ఆపుకోలేకపోతున్నాను. మానవులను అందరినీ క్రోధముద్వారా, రాగద్వేషములద్వారా,ఈ మాయలో పడవేసి, నీవు మాత్రము ఈ మాయకు అతీతంగా వ్యవహరిస్తున్నావు. ఇంద్రియములనుజయించవలెను అని అనుకొనే నీభక్తులు నిన్ను సేవించకుండా ఎలా ఉంటారు? నిన్ను సృష్టి స్తితి లయకారుడిగా, అనంతుడిగా ఋషులు పిలుస్తూ ఉంటారు. అనంతుడిగా నీవు ఈ భూమిని నీ శిరస్సు మీద మోస్తున్నావు. నీకు ఉన్న వేయిపడగల మీద ఈ భూమండలము ఒక చిన్న గింజ మాదిరి ఉంటుంది కదా! అంతటి మహాత్ముడవైన నిన్ను ఎవరు ఆరాధించరు!

ఓ సంకర్షణా! నీనుండి బ్రహ్మదేవుడు ఉద్భవించాడు. ఆ బ్రహ్మ నుండి అహంకార తత్త్వముతో నేను పుట్టాను. నా తేజో బలంతో త్రిగుణములతో కూడిన ఈ సృష్టిని నిర్వహించాను. మేమందరమూ ఈ పరమాత్మ ఆదేశాలకు లోబడి ఆయన అనుగ్రహము చేత దేవతలను, సకల భూతములను సృష్టించాము. అటువంటి పరమాత్మ స్వరూపుడు అయిన అనంతునికి నమస్కారము.

సకల ప్రాణులను పరమాత్మునిచే సృష్టించబడిన మాయ కప్పివేయుచున్నది. సృష్టి స్థితి లయకారుడైన ఆ పరమాత్మ దయ లేనిదే ఈమాయను దాటలేము. అటువంటి పరమాత్మకు నమస్కారము" అని శివుడు పరమాత్మను ప్రార్థించాడు.

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము పదునేడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## పంచమస్కంధము

## పదునెనిమిదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు నవ వర్షములను వర్ణిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఇలావృత వర్షము తరువాతది భద్రాశ్వ వర్షము. ఈ భద్రాశ్వవర్షములో భద్రశ్రవుడు అతని అనుచరులు నివసిస్తూ ఉంటారు. వారికి ఆరాధ్య దైవము హయగ్రీవరూపములో ఉన్న పరమాత్మ. ఆ హయగ్రీవుని భద్రశ్రవుడు ఈ విధంగా ధ్యానిస్తాడు.

"ఓం నమో భగవతే ధర్మాయాత్మ విశోధనాయ నమ ఇతి.॥"

మేము ధర్మస్వరూపుడు, మానవులలో ఉన్న అజ్ఞానమును అవిద్యను పోగొట్టి ఆత్మజ్ఞానమును ప్రసాదించే హయగ్రీవ స్వరూపమును స్మరిస్తున్నాము. ఈ మానవులందరూ అజ్ఞానములో అవిద్యలో కొట్టుమిట్టాడుతున్నారు. పుట్టినవాడు చావక తప్పదని అందరికీ తెలుసు. తనకళ్ల ముందే తన తండ్రి, తాతలు, ఒక్కోసారి తనకన్నా చిన్నవారు అయిన కుమారులు, మనుమలు కూడా మరణిస్తుంటారు. ఇవన్నీ చూస్తూ కూడా మానవుడు తాను మాత్రము చిరకాలము బతుకుతాను అని అనుకుంటూ ఉంటాడు. ఇంకా ఇంకా ధనము సంపాదించి ఆ ధనముతో సుఖములను అనుభవించాలని ఆశతో జీవిస్తుంటాడు.

ఓ దేవా! వీరే కాదు. వేదములను శాస్త్రములను చదివిన వాళ్లు, వివేకము కల వారు, ఈ ప్రపంచము అశాశ్వతము అని అందరికీ చెప్పే వాళ్లకూడా, నీ మాయకు లోబడి, తాము మాత్రము శాశ్వతముగా జీవిస్తాము అనే మోహంలో పడిపోతున్నారు. ఇదంతా నీ లీల కాక మరేమిటి. అటువంటి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు సర్వాంతర్యామివి. నీకు చేయవలసిన కర్మ అంటూ ఏమీ లేదు. కాని నీవు సృష్టి స్థితి, లయములను చేస్తున్నావు అని వేదములలో చెప్పబడింది. ఇది సంభవమే. నీకు అసాధ్యము అంటూ ఏమీ లేదు. ప్రతి కార్యమునకు నీవే కారణము. అందరి ఆత్మలలో ఉండి అందరి చేతా అన్ని కార్యములను చేయిస్తున్నావు. కాని ఆ కార్యముల కంటే వేరుగా ఉంటున్నావు. నీ లీలలు మా ఆలోచనాశక్తికి అందవు.

ఓ దేవా! కల్పము అంతము అయినప్పుడు వేదములు, శాస్త్రములు అన్నీ మరుగున పడిపోయాయి. నీవు హయగ్రీవ రూపంలో వేదములను పునరుద్ధరించావు. వాటిని బ్రహ్మ ముఖము నుండి వెలువరించావు.అట్టినీకు నమస్కారము." అని భద్రశ్రవుడు హయగ్రీవరూపంలో ఉన్న పరమాత్మను ప్రార్థించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! తరువాతి వర్షము హరి వర్షము. ఈ హరి వర్షములో పరమాత్మ నృసింహావతారములో ఉపాసింప బడతాడు. నృసింహావతారము గురించి తరువాత వివరిస్తాను. హరివర్షములో ప్రహ్లాదుడు తన అనుచరులతో నివసిస్తుంటాడు.

మహాభాగవత శ్రేష్టుడు, దైత్య,దానవ కులములకు వన్నెతెచ్చినవాడు, భగవద్భక్తుడు అయిన ప్రహ్లాదుడు పరమాత్మను నృసింహావతారములో ఇలా స్తుతిస్తున్నాడు.

"ఓం నమో భగవతే శ్రీనరసింహాయ నమస్తేజస్తేజసే ఆవిరావిర్భవ వజ్రనఖ వజ్రదంష్ట్ర కర్మాశయాన్ రన్ధయ రన్ధయ తమో గ్రస గ్రస ఓం స్వాహా అభయమభయమాత్మని భూయిష్ఠా: ఓం క్ష్రౌమ్ ఇతి॥

"శ్రీనారసింహునికి నమస్కారము. నారసింహుడు తేజస్సుకే తేజస్సు. ఆయన నఖములు, కోరలు వజ్రసమానములు. ఆయన మానవుల కర్మవాసనలు అన్నీ భస్మంచేయగలశక్తి కలవాడు. మానవులలో ఉండే అజ్ఞానమును అవిద్యను నాశనం చేయగలవాడు.

ఓ దేవా! మా అందరికీ అభయం ప్రసాదించు.".

ఇంకా ఇలా ప్రార్థిస్తున్నారు. "ఓ దేవా! నీ వలన సకల జగత్తుకు శుభం కలుగుగాక!దుష్టులు తమ దుష్టబుద్ధి వదిలి సన్మార్గులు అగుదురు గాక! మానవులు తమ బుద్ధిబలమును ఉపయోగించి అందరికీ శుభం చేయడానికి ప్రయత్నిస్తారు. వారి మనస్సు ఎల్లప్పుడూ శుభములనే కోరుకొను గాక! మా అందరి బుద్ధి ఏకోరికలు లేకుండా ఎల్లప్పుడూ పరమాత్మయందే లగ్నం అవును గాక!

ఓ దేవా! మేము చేసే కార్యముల యందు, ఆ కార్యములు చేయడం వలన కలిగే ఫలితముల యందు మాకు ఆసక్తి లేకుండు గాక! ఎందుకంటే మేము చేసే పనులయందు, ఆ పనుల వలన వచ్చే ఫలితములయందు ఆసక్తి ఉంటే, మేము సంసారములో పడిపోతాము.

ఇల్లు, భార్య, పిల్లలు, బంధువులు, కోరికలు, సుఖములు వీటి మీద మమకారము పెరుగుతుంది. అలాకాకుండా మా బుద్ధి ఎల్లప్పుడూ భగవంతుని యందే లగ్నము అగును గాక!

ఓ దేవా! ఆత్మతత్త్వమును తెలిసిన వారు కేవలము శరీరమును పోషించుకోడానికి కావలసిన ధనమును మాత్రమే సంపాదిస్తారు. ప్రాణములను నిలుపుకోడానికి కావలసిన ఆహారమును మాత్రమే తీసుకుంటారు. తనకు లభించిన దానితోనే తృప్తి చెందుతారు. అటువంటి వారు ఇంకా ఇంకా సంపాదించాలని ఆశించరు. వారికి గృహము, సంసారము నందు ఆసక్తి ఉండదు. కేవలము భగవంతుని మీదనే మనస్సు లగ్నం చేస్తారు.

ఓ దేవా! భగవంతుని గురించి తెలుసుకోవాలంటే భగవద్భక్తుల వలననే తెలుసుకోగలము. భగవద్భక్తులు భగవంతుని గురించి పలికే పలుకులు, చేసే కీర్తనలు మా చెవుల ద్వారా మా మనసులోకి ప్రవేశించి మా మనసులలో ఉన్న మలినములను పోగొడతాయి. కాబట్టి వివేకము కల ప్రతివాడూ భగవద్భక్తులను ఆశ్రయించి, వారి వలన ఉపదేశములను పొందుతాడు.

భగవంతుని ఏ కోరికలూ కోరకుండా సేవించే వారిలో ధర్మము, జ్ఞానము, వైరాగ్యము మొదలగు గుణములు పుష్కలంగా ఉంటాయి. అలా కాకుండా కేవలం కోరికలు తీర్చుకోడానికే భగవంతునికి పూజలు చేస్తూ, ఇల్లు, భార్య, పిల్లలు, ధనము వీటి యందే ఆసక్తి కలవారికి భగవంతునియందు భక్తి ఉండదు. అటువంటి

వారి  మనస్సు ఎప్పుడూ ప్రాపంచిక విషయముల వంక విషయ వాంఛల వంక పరుగెడుతూ ఉంటుంది. అటువంటి వారిమనసులలో భక్తికి స్థానము లేదు. వారు గుణవంతులు అనిపించుకోలేరు.

నీళ్లలో  ఉన్న చేపకు నీరు ఆధారము. అలాగే ఈ విశ్వంలో ఉన్న ప్రాణులకు పరమాత్మ ఆధారము. ఆ పరమాత్మ అన్ని ప్రాణులలోనూ ఆత్మస్వరూపంగా వెలుగుతున్నాడు. పుట్టిన ప్రతి ప్రాణికీ కాలం గడిచేకొద్దీ వయసు పెరుగుతుంటుంది. వారు వయోవృద్ధులు అవుతారేమో కానీ జ్ఞానవృద్ధులు కాలేరు. జ్ఞానము వృద్ధిచెందితేనే గానీ పరమాత్మ తత్త్వము అర్థం కాదు. కేవలం వయసు వచ్చిన వారిలో జ్ఞానం వలన కలిగే మహత్త్యము కొద్దిగా కూడా ఉండదు. అందువలన అందరూ ఆ నృసింహదేవుని పాదములు ఆశ్రయించండి. సేవించండి. తరించండి.

సంసారములో ఉంటే రాగద్వేషములు, కోరికలు, అవి తీరకపోతే నిరాశ, కోపము, అవమానము, భయము, దీనత్వము అన్నీ కలుగుతాయి. అందువలన జననమరణములు తప్పవు. ఈ జననమరణచక్రము నుండి తప్పించుకోవాలంటే సంసారము నుండి విముక్తి పొందాలి."అని ప్రహ్లాదుడు తన తోటి అసురులకు, ప్రజలకు బోధించాడు.

పరీక్షిత్ మహారాజా! తరువాతది కేతుమాల వర్షము. ఈ వర్షములో విష్ణువు కామదేవుని స్వరూపంలో ఉంటాడు. కామదేవుడు అంటే మన్మథుడు. లక్ష్మీదేవి ఈ వర్షములో పరమాత్మను ఈ క్రింది మంత్రములో ఉపాసిస్తుంది.

"ఓం హ్రాం హ్రీం హ్రూం ఓం నమో భగవతేహృషీకేశాయ సర్వగుణ విశేషైర్విలక్షితాత్మనే ఆకూతీనాం చిత్తీనాం చేతసాం విశేషణాం చాధిపతయే షోడశకలాయ ఛన్దోమయా యాన్నమయా యామృతమయాాయ సర్వమయాాయ సహసే ఓజసే బలాయ కాన్తాయ కామాయ నమస్తే ఉభయత్ర భూయాత్ ఇతి."

హృషీకేశుని రూపంతో ఉన్న పరమాత్మకు నమస్కరిస్తున్నాను. ఆయన వేద స్వరూపుడు. అన్నస్వరూపుడు. అమృత మయుడు.సర్వము వ్యాపించి ఉన్నవాడు. ఈ విశ్వమంతా ఆయన స్వరూపమే. బలమునకు, కామమునకు, కాంతికి ఆయన ప్రతీక. అటువంటి పరమాత్మకు నమస్కారము.

నీవు అందరికీ అభయము ఇచ్చువాడవు. అందరినీ రక్షిస్తూ ఉంటావు. ఈ లోకములకు నీవే ప్రభువు. నీవు తప్ప వేరే ఎవరూ లేరు. అందరికీ నిన్ను సేవించడమే పరమావధి.

ఓ దేవా! స్త్రీలు నిన్ను నిర్మలమైన మనస్సుతో పూజించి వారు కోరుకున్న కోరికలను సఫలం చేసుకుంటారు. నీవు కూడా ఆ స్త్రీలు కోరుకున్న కోరికలను తీరుస్తూ ఉంటావు. కాని ఆ కోరికల వలన కలిగే ఫలితములు, సుఖములు క్షణికములు అని వారికి తెలియదు. ఆ ఫలములు, సుఖములు తీరి పోగానే మరలా నిన్ను కోరికలు కోరుతుంటారు. ఇటువంటి క్షణికమైన కోరికలు కోరడం వలన ఏమి ప్రయోజనము.

ఓ దేవా! నేను (లక్ష్మీదేవి) సకల సంపదలకు అధిపతిని. అందుకే అందరూ నన్ను సేవిస్తుంటారు. నా కరుణాకటాక్ష వీక్షణముల కొరకు ఎదురు చూస్తుంటారు. కానీ నేను మాత్రము నిన్ను సేవిస్తూ, నీ కరుణ కోసరం ఎదురు చూస్తుంటాను. ఎంతమంది నన్ను పూజించి నప్పటికినీ, నేను మాత్రము నిన్ను పూజించేవారిని, నీ భక్తులను మాత్రమే కరుణిస్తుంటాను. ఎన్ని పూజలు చేసినా ఇతరులు నా అనుగ్రహానికి పాత్రులు కాలేరు.

ఓ దేవా! నీ అభయహస్తము నుండి అన్ని వరములు కురుస్తుంటాయి. అందుకే నీ భక్తులు నీ అభయ హస్తమునకు నమస్కరిస్తుంటారు. నీవు కూడా నీ భక్తుల తలల మీద నీ అభయ హస్తమును ఉంచి ఆశీర్వదిస్తుంటావు. నన్ను నీ హృదయ సీమలో ఉంచుకొన్నప్పటికినీ, నీవు మాత్రము ఎల్లప్పుడూ నీ భక్తులయందే ప్రేమ, ఆదరము చూపుతుంటావు. నీ మాయను తెలుసుకోవడం ఎవరి తరమూ కాదు. అటువంటి నీకు నమస్కారము. " అని లక్ష్మీదేవి ఆ పరమాత్మను ప్రార్థిస్తుంది.

ఓ పరీక్షిత్ మహారాజా! తరువాతది రమ్యక వర్షము. ఈ వర్షమునకు అధిపతి మనువు. ఈ వర్షములో ఉన్న ప్రజలు మత్స్యావతారములో ఉన్న పరమాత్మను పూజిస్తారు. ఈ క్రింది మంత్రమును జపిస్తూ ఉంటారు.

"ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమః సత్త్వాయ ప్రాణాయౌజసే సహసే బలాయ మహామత్స్యాయ నమ ఇతి.॥"

సత్త్వగుణ స్వరూపుడైన ఆ పరమాత్మకు నమస్కారము. విశ్వములో ఉన్న ప్రాణులకు అందరికీ ఆయన ప్రభువు. అటువంటి మత్స్యావతారుడికి నమస్కారము.

ఓ దేవా! నీవు ఈ విశ్వమునకు ఈశ్వరుడవు. అన్ని జీవులలో లోపలా, బయటా ఉన్నావు. లోక పాలకులు కూడా నీ గురించి పూర్తిగా తెలుసుకోలేరు. ఇంద్రుడు మొదలగు లోక పాలకులుకూడా మాత్సర్యముతో ఒకరిని ఒకరు ద్వేషించుకుంటూ ఉంటారు. నీ కృప, కరుణ లేనిచో వారు ఈ విశ్వమును పాలించలేరు. నిజానికి నీవే ఈ సమస్త విశ్వమును పాలిస్తున్నావు. సకల ఓషధులకు, ఆహారపదార్థములకు ఈ భూమి మూలము. ప్రళయ కాలములో ఈ భూమి అంతా జలమయం అయినప్పుడు నీవు మత్స్యరూపములో నన్ను (మనువును) ఓషధులను రక్షించావు. అట్టి నీకు నమస్కారము. " అని మనువు ప్రార్థించాడు.

పరీక్షిత్ మహారాజా! తరువాతది హిరణ్మయ వర్షము. ఈ వర్షములో పరమాత్మ కూర్మావతారములో పూజింపబడుతుంటాడు. ఈ వర్షమును పితృగణములకు అధిపతి అయిన అర్యముడు పరిపాలిస్తున్నాడు. అర్యముడు ఈ క్రింది మంత్రముతో కూర్మావతారములో ఉన్న పరమాత్మను కీర్తిస్తుంటాడు.

"ఓం నమో భగవతే అకూపారాయ సర్వసత్త్వగుణ విశేషణాయ నమోఅనుప లక్షితస్థానాయ నమో వర్ష్మణే నమో భూమ్నే నమోఅవస్థానాయ నమస్తే ఇతి."

భగవానుడు అనగా కూర్మదేవునకు నమస్కారము.

ఓ దేవా! నీవు ఎల్లప్పుడూ జలములో ఉండటం వలన నిన్ను చూడటం సాధ్యంకాదు. నీవు సర్వసత్త్వగుణ విశేషణుడవు. నీవు కాలాతీతుడవు. ఈ విశ్వమునకు ఆధారము నీవే. నీవు ఎక్కడికైనా వెళ్లగలవు. సర్వవ్యాపివి. అట్టి నీకు నమస్కారము. నీవు నీ మాయా శక్తితో ఈ ప్రపంచమును ప్రకటితం చేస్తున్నావు. కాని ఇదంతా నిజం కాదు. నీ విరాట్ రూపము కూడా మేము కల్పించుకున్నదే. నీకు రూపము, పేరు లేదు. కానీ నీవు అనేక రూపములతో దర్శనం ఇస్తుంటావు. నీ రూపములను లెక్కపెట్టడానికి అలవికాదు. నీవు ఇలా ఉంటావు అని ఎవ్వరూ చెప్పలేరు. అట్టి నీకు నమస్కారము.

నీ మాయ వలననే ఈ ప్రకృతి, దేవతలు, మానవులు, సమస్త ప్రాణులు, లోకములు, ఉద్భవించాయి. రక రకాల పేర్లతో పిలువబడుతున్నాయి. ఇదంతా నీ మాయావిలాసము. నీవు ఒక్కడివే సత్యము. ఇదంతా నీ మాయ, భ్రమ. నీవు ధరించిన రూపములకు, పేర్లకు మధ్య తేడాను గుర్తించడం ఎవరి తరమూ కాదు. అట్టి నీకు నమస్కారము."అని అర్యముడు ప్రార్థించాడు.

పరీక్షిత్ మహారాజా! తరువాతి వర్షమును ఉత్తర కురువర్షము అని పిలుస్తారు. ఈ వర్షములో పరమాత్మను వరాహ రూపములో ఆరాధిస్తారు. ఈ వర్షమునకు అధిపతి పృథివి. ఆమె ఉత్తరాఖండ వాసులతో కలిసి ఆ  వరాహరూపంలో ఉన్న పరమాత్మను ఇలా ప్రార్థించింది.

"ఓం నమో భగవతే మన్త్ర తత్త్వ లింగాయ యజ్ఞక్రతవే మహాధ్వరావయవాయ మహాపురుషాయ నమ: కర్మశుక్లాయ త్రియుగాయ నమస్తే ఇతి."

ఓ దేవా! నిన్ను యజ్ఞములలో ఉపయోగించే మంత్ర తత్త్వము చేతనే తెలుసుకొనగలము. నీవు యజ్ఞవరాహమూర్తివి. యజ్ఞస్వరూపుడవు. అన్ని యజ్ఞములకు అధిష్టాన దేవతవు నీవు. నీ అవయవములే యజ్ఞములు. నీవు మహాపురుషుడవు. అట్టినీకు నమస్కారము.

గొప్ప తత్త్వము తెలిసిన వారు, నీ దర్శనము కోరి వెదుకుతూ ఉంటారు. కేవలము వారు చేసే యోగముల ద్వారా, వారి మనసుతో చేసే సంకల్పముల ద్వారా, నీ స్వరూపము తెలియదు. నీ దర్శనము కావాలంటే సాధన చెయ్యాలి. ఆ సాధనకు ఫలితంగానే నీవు వారికి దర్శనము ఇస్తావు. అంతేకానీ కేవలం కర్మలు చేసినంత మాత్రాన నీ దర్శనం లభ్యంకాదు. అట్టి నీకు నమస్కారము.

మంచి మంచి శబ్దములు వినడం, ఇంద్రియములతో పనులు చేయడం, సుఖాలు అనుభవించడం, అహంకారంతో ప్రవర్తించడం ఇవి అన్నీ నీ మాయా స్వరూపాలే. నీ మాయా స్వరూపమే మానవుల చేత ఈ పనులు అన్నీ చేయిస్తూ వారికి ఆనందం కలిగిస్తూ ఉంది. అన్ని పనులకు కారణము, కార్యము రెండూనువ్వే. కాని నీకు ఈ మాయ ఏమీ అంటుకోదు. నీవు

మాయకు అతీతంగాఉంటావు. కేవలము ఆత్మతత్త్వము తెలుసుకున్న వారే నిన్ను దర్శించగలరు. అటువంటి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు పుట్టిస్తున్నావు, పోషిస్తున్నావు, లయం చేస్తున్నావు. ఇవన్నీ నీకు ఇష్టం అయి నీ కోసరం చేస్తున్నావా అంటే అదీ కాదు. కేవలం జీవులచేత తమ తమ పురాకృత కర్మలు అనుభవింప చేయడానికి నీవు ఈ సృష్టిని చేస్తున్నావు. నిజానికి ఈ ప్రకృతిలో చైతన్యం లేదు. కానీ సత్వ,రజస్తమోగుణముల ప్రభావంతో ఈ ప్రకృతిలో సృష్టి, స్థితి, లయ కార్యములు జరుగుతున్నాయి. అది కూడా నీ మాయకు లోబడి జరుగుతూ ఉంది. నీవు మాత్రము ఈ త్రిగుణాత్మకమైన ప్రకృతిని, అందులో జరిగే సృష్టి,స్థితి,లయములను సాక్షీభూతంగా చూస్తున్నావు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు రసాతలంలో ఉన్న నన్ను భూతలం మీదికి తీసుకు వచ్చావు. ఆ కార్యములో లోక భయంకరుడైన హిరణ్యాక్షుని వధించావు. అట్టినీకు నమస్కారము." అని పృథివి ఆది వరాహ మూర్తికి, యజ్ఞవరాహమూర్తిని కీర్తించింది." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు మహాభాగవత పురాణమును వినిపిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము

పంతొమ్మిదవ అధ్యాయము.

శుకమహర్షి పరీక్షిత్ మహారాజుతో ఇలా అన్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! తరువాత వర్షము కింపురుష వర్షము. ఈ కింపురుష వర్షములో హనుమంతుడు శ్రీరామచంద్రుని ఉపాసిస్తుంటాడు. కింపురుషులకు అధిపతి అర్ష్టిషేణుడు. హనుమంతుడు అర్ష్టిషేణుడు కలిసి శ్రీరామచంద్రుని ఈ విధంగా కీర్తిస్తుంటారు.

"ఓం నమోభగవతే ఉత్తమశ్లోకాయ నమ ఆర్యలక్షణ శీలవ్రతాయ నమ ఉప శిక్షితాత్మన ఉపాసితలోకాయ నమ: సాధువాదనికషణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహాపురుషాయ మహారాజాయ నమ ఇతి.॥"

ఉత్తమశ్లోకుడగు శ్రీరామచంద్రునికి నమస్కారము. శ్రీరామునియందు ఉత్తమపురుషులయందు గల అన్ని మంచి గుణములు ఉన్నాయి. ఆయన తనకు ఉన్న మంచి గుణములను తాను ఆచరించి లోకానికి చూపించాడు. శ్రీరాముడు ఆత్మజ్ఞానమును తెలిసినవాడు. లోకములో ఉన్న ప్రజలకు తెలియజెప్పడానికి తాను ఆచరించి చూపించాడు. శ్రీరాముడు దయాసముద్రుడు. సాధువుల చేత పూజింపబడేవాడు.

మహాపురుషుడు. రాజులలో అగ్రగణ్యుడు. అట్టి శ్రీరామచంద్రునికి నమస్కారము.

శ్రీరాముడు విశుద్ధమైన మనసు కలవాడు. ఆయనకు ఈ లౌకిక బంధములు ఏవీ లేవు. వేదములను, శాస్త్రములను బాగా అధ్యయనము చేసిన వాడు. అహంకారము లేని వాడు. సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపము అయిన ఆ శ్రీరామచంద్రునికి నమస్కారము. రావణుడు మానవుల వల్ల తప్ప మరెవరి వల్లా చావు లేకుండా వరం పొందాడు. ఆ కారణం చేత శ్రీరామచంద్రుడు మానవుడిగా ఆ లోకంలో పుట్టి, రాక్షససంహారం చేసాడు.

అయినా, కేవలం రావణుని చంపడానికే శ్రీరాముడు అవతరించలేదు. మానవులకు ఎన్ని కష్టాలు వస్తాయో, భార్యావియోగము ఎంత దుర్భరమైనదో, ఆ సమయంలో ఎంత ధైర్యంగా ఉండాలో తాను ఆచరించి, అనుభవించి లోకానికి తెలియబరిచాడు. లేకపోతే పరమాత్మ స్వరూపుడు, నిరంతరము ఆనందం అనుభవించేవాడు అయిన శ్రీరామునికి భార్యావియోగము, దాని వలన దు:ఖము కలగడంఏమిటి!

శ్రీరాముడు బయట ప్రపంచంలో ఉన్న ఏ వస్తువు మీద గానీ, మనుషుల మీద గానీ ఎటువంటి ఆసక్తి చూపలేదు. కాని ఆసక్తి ఉన్నట్టు లోకానికి కనిపించాడు. ఆ కారణం చేతనే, సీతా వియోగం వలన కలిగిన బాధను అనుభవించాడు. అనుభవించినట్టు లోకానికి తెలియపరిచాడు. లేకపోతే సాక్షాత్తు లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవి ఆయనను విడిచి వెళ్లడం ఎన్నటికీ జరగదు కదా!

ఇక్ష్వాకు వంశంలో జన్మించడం, సుందరమైన రూపం కలిగి ఉండటం, మంచి భాషాజ్ఞానము కలిగి ఉండటం, ఇవి అన్నీ శ్రీరామునికి ప్రీతి కలిగించలేదు. ఎందుకంటే మేము వానరులము, మేము ఉన్నత వంశములో పుట్టలేదు. మాకు సుందరమైన రూపము లేదు. మాకు భాషా పరిజ్ఞానము లేదు. కానీ శ్రీరామచంద్రుడు మమ్ములను అక్కున చేర్చుకున్నాడు. ఆదరించాడు. మాతో స్నేహం చేసాడు. కాబట్టి, శ్రీరామ చంద్రుని భజించడానికి, కీర్తించడానికి, భక్తితో సేవించడానికి ఉన్నత కులం, భాషా పరిజ్ఞానము, అందమైన రూపం అవసరం లేదు. దేవతలు, రాక్షసులు, మృగములు, పక్షులు ఏవైనా శ్రీరామచంద్రుని పూజించవచ్చును. ఆయనను సేవించడానికి ఏ కష్టమూ పడవలసిన అవసరము లేదు. రామనామమును జపిస్తే చాలు. ఆ మాత్రానికే శ్రీరాముడు సంతోషిస్తాడు. కోరిన వరాలు ఇస్తాడు. కేవలం తాను అయోధ్యలో పుట్టిన కారణంగా శ్రీరాముడు అయోధ్యలో నివసించే వారందరినీ తనతో పాటు వైకుంఠమునకు తీసుకొని వెళ్లాడు కదా!" అంటూ హనుమంతుడు నిరంతరము శ్రీరాముని కీర్తిస్తూ ఉంటాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! తరువాత వర్షము భారత వర్షము. ఈ భారత వర్షములో పరమాత్మ నరనారాయణ రూపంలో బదరికావనములో అవతరించాడు. తన భక్తులకు ఆత్మవిద్యను బోధించాడు. ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, ఇంద్రియ నిగ్రహము, వీటిని అలవరచుకొని, అహంకారమును వదిలి పెట్టి, నరనారాయణులు బదరికావనములో కల్పాంతము వరకు తపస్సుచేసారు. ఆత్మసాక్షాత్కారమును పొందారు. ఈ వర్షములో

నారదుడు, భారతవర్షములో ఉన్న ప్రజలతో కలిసి నరనారాయణ స్వరూపములో ఉన్నపరమాత్మను ఈ విధంగా ప్రార్థించాడు.

"ఓం నమో భగవతే ఉపశమశీలయోపరతానాత్మ్యాయ
నమో అకించనవిత్తాయ ఋషిఋషభాయ, నరనారాయణాయ,
పరమహంస పరమగురవే ఆత్మారామాధిపతయే నమో నమ ఇతి."

ఓ ఋషిశ్రేష్టులారా! మీకు నమస్కారము. మీరు ఇంద్రియములను జయించిన వారు. అహంకారము లేని వారు. ధనములేని వారికి ధనము వంటి వారు. మీరు సన్యాసాశ్రమము స్వీకరించిన వారికి గురువులు. ఆత్మసాక్షాత్కారము పొందినవారు. అట్టి మీకు నమస్కారము.

నారదుడు ఇంకా నరనారాయణులను ఈ విధంగా కీర్తిస్తున్నాడు. "ఆ పరమాత్మ ఈ విశ్వంలో సృష్టిస్థితిలయములను నిర్వహిస్తున్నప్పటికినీ, తాను మాత్రము ఏమీ చేయనట్టు, తనకు ఏమీ సంబంధం లేనట్టు ఉంటాడు. ఆ పరమాత్మ తన అవతారములలో దేహమును ధరించినప్పటికినీ దేహములకు సహజమైన ఆకలి దప్పికలకు ఆయన లోబడలేదు. ఆ దేహములలో ఉండి అన్నీ చూస్తూ ఉన్నప్పటికినీ, తాను ఏమీ చూడనట్టే ఎటువంటి వికారములు లేకుండా ఉన్నాడు. ఏమాత్రం ఆసక్తిలేని వాడు, ఎల్లప్పుడూ ఏకాంతంగా ఉండేవాడు, అన్నిటినీ సాక్షీభూతంగా చూచేవాడు అయిన ఆ పరమాత్మకునమస్కారము.

ఓ నరనారాయణ స్వరూపులారా! యోగులు అయిన వారు సంసారబంధములకు మూలకారణమైన దేహము మీద అభిమానమును వదిలిపెట్టి, భక్తియోగమును అవలంబించి, నీ యందు మనస్సు నిలిపి నిరంతరము నిన్నే ధ్యానిస్తుంటారు.

ఓ మహాత్ములారా! మానవులు ఈ లోకంలో ఉన్న అన్ని సుఖములను అనుభవించి, ఇంకా తనివి తీరక, అంత్యకాలములో కూడా ఈ దేహాన్ని విడిచిపెట్టడానికి ఇష్టపడరు. సామాన్య మానవులే కాదు, శాస్త్రములను బాగా చదువుకున్న వారు కూడా, ఇదే మాదిరి చావుకు భయపడుతుంటారు. అటువంటి వారు కూడా మృత్యువుకు భయపడితే, వారు చదివిన చదువు, సంపాదించిన శాస్త్ర పరిజ్ఞానము వృథా శ్రమ కదా! అందువలన, ఓ ప్రభో! మనసును స్థిరంగా ఉంచుకొనే లక్షణమైన జ్ఞానయోగమును మాకు ప్రసాదించు. ఆ జ్ఞానయోగం ద్వారానే 'నేను, నాది, నాకన్నా మించిన వాడు లేడు' అనే దేహాభిమానము, అహంకారము నశిస్తుంది. వేరే దేని వలనా ఈ దేహాభిమానము, అహంకారము నశించదు." అని నారదుడు పరమాత్మస్వరూపులైన నరనారాయణులను కీర్తించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇలావృత వర్షములో వలెనే భారత వర్షములో కూడా అనేకములైన పర్వతములు, నదులు ఉన్నాయి. ఈ క్రింది పర్వతములు ముఖ్యమైనవి. అవి.....మలయము, మంగళప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కూటకము, కోణ్వము, సహ్యము, దేవగిరి, ఋష్యమూకము, శ్రీశైలము, వేంకటము, మహేంద్రము, వారిధారము, వింధ్యము, శుక్తిమంతము, ఋక్షగిరి, పారిపాత్రము,

ద్రోణము, చిత్రకూటము, గోవర్ధనము, రైవతకము, కకుభము, నీలము, గోకాముఖము, ఇంద్రకీలము, కామగిరి మొదలైనవి. ఇవే కాకుండా ఇంకా వేలకొద్దీ పేరు ఉన్నవి, పేరు లేనివి పర్వతములు ఉన్నాయి.

ఆ పర్వతముల మీద పుట్టి కిందికి ప్రవహించిన నదీనదములు ఎన్నో ఉన్నాయి. వాటిని వివరిస్తాను. బ్రహ్మపుత్ర, శోణ అనేవి నదములు. ఇంక నదులు..... చంద్రవంశ, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవ, సురస, నర్మద, చర్మణ్వతి, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసామ, కౌశికీ, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయు, ఓఘవతి, షష్ఠవతి,సుషోమ, శతద్రు, చంద్రభాగ, మరుద్వృధ, వితస్త, అసిక్ని, విశ్వ మొదలైన నదులు ప్రధానమైనవి.

భారత వర్షములో నివసించే ప్రజలు ఈ నదులలో స్నానం చేసినా కానీ, లేక స్నానం చేసినట్టు మనసులో సంకల్పించిన గానీ, పుణ్యము పొందుతారు. ఈ భారత వర్షములో జన్మించిన మానవులు సత్వ, రజస్, తమోగుణములో కూడిన తాము చేసిన కర్మలకు అనుగుణంగా, దేవ, మనుష్య, జంతువులు, పక్షుల జన్మలను పొందుతుంటారు. ఈ భారత వర్షములో మానవులకు తాము చేసిన కర్మలకు తగిన ఫలితములు వెంట వెంటనే లభిస్తుంటాయి. ఈ వర్షములో జీవించే మానవులు తాము చేసిన కర్మలను, కర్మఫలములను పరమాత్మకు అర్పించి ముక్తిని పొందుతుంటారు.

ఈ లోకంలో మానవులు తమ తమ కోరికలను తీర్చుకోడానికి పనులుచేస్తుంటారు. ఆ పనులకు మంచి ఫలితములు,చెడ్డ ఫలితములు అనుభవిస్తుంటారు. ఆ కర్మల ఫలితంగా దేవ,మానుష,పశు వులుగా పుడుతుంటారు. తమ తమ కోరికలను తీర్చుకోడానికి కర్మలు చేయడానికి మూలం అవిద్య, అజ్ఞానము. ఈ అవిద్య అజ్ఞానము నశించాలంటే సత్పురుషులు, భగవద్భక్తుల సాంగత్యము కావాలి. అప్పడు పరమాత్మయందు ఏ కోరికా లేని భక్తి కలుగుతుంది. పరమాత్మయందు అచంచలమైన, ఏ కోరికలు లేని భక్తి కలిగిననాడు, కోరికలు తీర్చుకోడానికి కర్మలు చేయడం, వాటి ఫలితములను అనుభవించడం జరగదు. దానివలన ముక్తి లభిస్తుంది. ఈకారణం చేతనే దేవతలు కూడా ఈ భరతవర్షములో పుట్టాలని కోరుకుంటారు.

ఈ భరత వర్షములో ఉన్న మానవులను, స్వర్గలోకములో నివస్తూ, స్వర్గ సుఖములను అనుభవిస్తున్నవారు, ఈ విధంగా కీర్తిస్తూ ఉంటారు.

"ఈ భారత వర్షములో పుట్టిన మానవులు ఎంతటి అదృష్టవంతులు. ఎంతో పుణ్యం చేసుకుంటేనే గానీ ఈభారత వర్షంలో పుట్టరు. ఈ భారత వర్షంలో పుట్టిన వారు ఏ తపస్సు, యజ్ఞయాగములు చేయ నవసరం లేదు. కేవలం భక్తి ఉంటే చాలు, ఆ పరమాత్మ ప్రసన్నుడవుతాడు. అంతటి అదృష్టం మనకు లేదు కదా!

మనకు మానవులుగా పుట్టాలని కోరిక ఉన్నా పుట్టలేము. ఆ పరమాత్మను భక్తితో సేవించడానికి భారత వర్షములో మానవునిగా జన్మించడమే ఉత్తమమైన మార్గము. ఎంతో కష్టపడి, యజ్ఞములు, యాగములు, తపస్సులు, వ్రతములు, దానములు చేసి స్వర్గానికి వస్తారు. కానీ స్వర్గంలో కేవలము స్వర్గ సుఖాలు దొరుకుతాయి కానీ, పరమాత్మ అయిన నారాయణుని పాదపద్మముల సేవ దొరకదు కదా! రెండు పరార్థముల పాటు అంటే బ్రహ్మదేవుని జీవిత కాలము పాటు బ్రహ్మలోకములో ఉండేకంటే, కొద్దికాలమైనా మానవునిగా భారత వర్షములో జీవించడం శ్రేష్ఠము. ఎందుకంటే మానవుల జీవితములు నీటిబుడగలలాంటివి. మానవులు జీవించేది కొద్దికాలమైనా వారు తాము చేసిన కర్మలను, వాటి ఫలములను పరమాత్మకు అర్పించి,భక్తిమార్గము అవలంబించి ముక్తిని పొందుతారు. స్వర్గలోకములో ఉన్న దేవతలకు ఆ అవకాశము లేదు కదా!

ఎక్కడైతే భగవంతుని కథలు వినిపించవో, ఎక్కడైతే భగవద్భక్తులకు స్థానం లేదో, ఎక్కడైతే శ్రీహరియొక్క సంకీర్తనము జరగదో, ఆ ప్రదేశము స్వర్గమైనా, బ్రహ్మలోకమైనా బుద్ధిమంతులు అక్కడికి వెళ్లడానికి ఇష్టపడరు. ఎవరైతే ఈ భారత వర్షములో పుట్టి కూడా, ఇంద్రియములకు బానిసలై, విషయవాంఛలకు లోబడి, ధనము సంపాదించడం, కోరికలు తీర్చుకోవడం, సుఖాలు అనుభవించడం ధ్యేయంగా పెట్టుకుంటారో, ఎవరైతే ఈ సంసార బంధనముల నుండి బయటపడరో, ఎవరైతే పరమాత్మయందు భక్తి కలిగి ఉండరో, అటువంటి వారు, చెట్టు మీది పక్షులవలె, పొద్దుటే లేచి ఎక్కడెక్కడతిరిగినా, ఎంతదూరం ప్రయాణించినా, సాయంత్రానికి మరలా ఆ చెట్టుమీదనే వాలుతుంటారు. అలాగే మానవులు కూడా ఈ కర్మబంధములలో చిక్కుకొని జనన మరణ చక్రములో తిరుగుతూ

ఉంటారు. మరలా మరలా సంసారము అనే వృక్షము మీద వాలుతూ ఉంటారు.

ఈ భారత వర్షములో పుట్టిన మానవులు తాము చేసే మంచి పనుల వలన, అనుసరించే భక్తి యోగము వలనా, మోక్షము పొందడానికి అవకాశము ఉన్నప్పటికినీ, తాము చేసే కర్మల ఫలితంగా, మరలా మరలా సంసార బంధనములలో చిక్కుకుంటూ ఉంటారు. మానవులు యజ్ఞములు, యాగములు చేస్తూ, హవిస్సులను దేవతలకు అర్పిస్తూ ఉంటారు. ఆ హవిస్సులన్నీ వేరు వేరు దేవతల పేర్లతో అర్పించి నప్పటికినీ, ఆహవిస్సులన్నీ ఆ పరమాత్మకే చెందుతాయి. మానవులు కోరే కోరికలు అన్నీ తీర్చడానికి సమర్థుడైన పరమాత్మ, ఆ మానవుడు అర్పించే హవిస్సులను సంతోషంగా స్వీకరిస్తాడు.
సామాన్య మానవుడు కదా, వీడు ఇచ్చే హవిస్సులను, పరిపూర్ణస్వరూపుడను అయిన నేను తీసుకోవడం ఏమిటి అని తిరస్కరించడు.

భక్తులలో రకరకాలైన కోరికలు కోరేవారు, అసలు కోరికలే కోరకుండా భగవంతుని మీద భక్తి కలిగిన వారు అని రెండు రకాలుగా ఉంటారు. పరమాత్మ తన భక్తులు ఏమి కోరికలుకోరినా వాటిని పరిపూర్ణంగా అంటే ఇంక వాడికి కోరడానికి ఏ కోరికా లేకుండా, తీరుస్తూ ఉంటాడు. ఆ పరమాత్మ యొక్క పాదములను సేవిస్తే ఇతరములైన కోరికలు నశిస్తాయి. ఆ కారణం చేత భగవంతుడు తన భక్తులకు తన పాదసేవనే అనుగ్రహిస్తూ ఉంటాడు.

ఈ స్వర్గములో ఉన్న మేమంతా యజ్ఞములు చేసీ, యాగములు చేసీ, వేదములను అధ్యయనము చేసీ, పుణ్యములను సంపాదించి, ఈ స్వర్గలోక సుఖములను అనుభవిస్తున్నాము. మేము సంపాదించిన పుణ్యములో ఏ కొంచెమైనా మిగిలి ఉంటే, ఆ పుణ్యఫలంగా మాకు భారతవర్షములో మానవులుగా పుట్టి నీ భక్తులుగా నిరంతరము హరినామస్మరణ చేసే భాగ్యాన్ని ప్రసాదించు. ఇదే మా ప్రార్థన. ఆ పరమాత్మ భారత వర్షములో ఉండే ప్రజలకు అన్ని శుభములు చేకూర్చుగాక." అని స్వర్గలోక వాసులు ప్రార్థించారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటి దాకా నీకు జంబూద్వీపం గురించి, భారత వర్షము గురించి చెప్పాను. కొంత మంది పండితులు జంబూద్వీపంలో ఎనిమిది ఉపద్వీపములు ఉన్నాయని చెబుతారు. ఈ ద్వీపములు ఎలా ఏర్పడ్డాయి అంటే, పూర్వము సగరుని కుమారులు యాగాశ్వమును వెదుకుతూ భూమిని తవ్వుకుంటూ వెళుతున్నారు. అలా వారు భూమిని తవ్వడం వలన అఖాతాలు ఏర్పడి ఆ అఖాతాల మధ్య ఉన్న భూభాగము ద్వీపములుగా ఏర్పాడ్డాయి. ఈ ద్వీపముల పేర్లు..... స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందహరిణము, పాంచజన్యము, సింహళము, లంక. ఓ పరీక్షిత్ మహారాజా! దీనితో జంబూద్వీప వర్ణన పూర్తి అయింది." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# పంచమస్కంధము
# ఇరవయ్యవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు భాగవత పురాణమును ఈ విధంగా చెబుతున్నాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! తరువాత నీకు ప్లక్షద్వీపము మొదలగు ఆరు ద్వీపముల గురించి వివరిస్తాను. జంబూద్వీపము చుట్టు సముద్రము ఉంది. అలాగే ప్లక్ష ద్వీపము చుట్టు సముద్రము ఉంది. ఈ ప్లక్ష ద్వీపము, తన చుట్టు ఉన్న సముద్రమునకు రెండు రెట్లు ఉంది. ఈ ద్వీపములో ప్లక్షము అనే మహావృక్షము ఉంది. (ప్లక్షము అనగా జువ్విచెట్టు.) ఈ ప్లక్ష వృక్షము కూడా జంబూ వృక్షముతో సమానము. ఈ వృక్షము మొక్క మొదలులో ఏడు శిఖలతో మండే అగ్ని మండుతూ ఉంటుంది. ప్లక్షవృక్షము వలననే ఆ ద్వీపమునకు ప్లక్షద్వీపము అనే పేరు వచ్చింది. ఈ ద్వీపమునకు అధిపతి ప్రియవ్రతుని కుమారుడు అయిన నిధ్మజిహ్వుడు. అతనికి ఏడుగురు కుమారులు. ఆ నిధ్మజిహ్వుడు ప్లక్ష ద్వీపమును ఏడు వర్షములుగా అనగా ఏడు భాగములుగా విభజించి తన ఏడుగురుకుమారులకు పంచి ఇచ్చాడు. తరువాత అరణ్యములకు తపస్సు చేసుకోడానికి వెళ్లిపోయాడు.

ఆ ఏడుగురు కుమారుల పేర్లను అనుసరించి ఆ ఏడు వర్షముల పేర్లు ఈ విధంగా ఉన్నాయి. శివము, వయసము,

సుభద్రము, శాన్తము, క్షేమము, అమృతము, అభయము,. ఈ ఏడు వర్షములను ఏడు సరిహద్దు పర్వతములు విభజిస్తున్నాయి. వాటి పేర్లు మణికూటము, వజ్రకూటము, ఇంద్రసేనము, జ్యోతిష్మంతము, సువర్ణము, హిరణ్యష్టీవము, మేఘమాల,. ఈ ఏడు వర్షములలో ఏడు నదులు ప్రవహిస్తున్నాయి. వాటి పేర్లు అరుణ, నృమ్ణ, అంగిరసి, సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర. ఆ ఏడు వర్షములలో ఉన్న ప్రజలు ఈ ఏడునదులలో స్నానము చేసి ఆ జలములను తాగి పునీతులు అవుతున్నారు.

ఆ వర్షములలో నాలుగు వర్ణములవారు నివసిస్తున్నారు. ఆ వర్ణముల పేర్లు హంస, పతంగ, ఊర్ధ్వయన, సత్యాంగ. ఆ వర్షములలో ఉన్న వారు వేయి సంవత్సరముల ఆయుర్దాయము కలవారు. వారు వేదములను అధ్యయనం చేసారు. వారు సూర్యుని ఈ విధంగా ఆరాధిస్తారు.

"మేము సనాతనుడు, సర్వవ్యాపి అయిన సూర్యభగవానుని శరణుకోరుతున్నాము. ఆయన వేదములకు, శుభము, అశుభము అయిన ఫలములకు అధిపతి. ఆయనకు నమస్కారము." అని ప్రార్థిస్తారు.

ఆ ప్లక్షద్వీపములో ఉన్న ప్రజలు ఎక్కువ ఆయుర్దాయము తోనూ, బల పరాక్రమములతోనూ, పుట్టుకతోనే వచ్చిన తెలివితేటల తోనూ, అమితమైన సాహసముతోనూ, ప్రకాశిస్తుంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ప్లక్ష ద్వీపము పక్కనే శాల్మలీద్వీపము అనే ద్వీపము ఉంది. ఆ శాల్మలీ ద్వీపము ప్లక్ష ద్వీపము కన్నా రెట్టింపు ఉ ంటుంది. ఈ శాల్మలీ ద్వీపము కూడా సముద్రముతో చుట్టబడి ఉంది. ఈ శాల్మలీ ద్వీపములో ఒక శాల్మలీ వృక్షము(బూరుగుచెట్టు) ఉంది. ఆ చెట్టు వలననే ఆ ద్వీపమునకు శాల్మలీ ద్వీపము అనే పేరు వచ్చింది. ఆ శాల్మలీ వృక్షము మీద గరుత్మంతుడు నివసిస్తుంటాడు. ఆ ద్వీపమునకు ప్రియవ్రతుని కుమారుడైన యజ్ఞబాహువు అధిపతి. ఆయనకుకూడా ఏడుగురు కుమారులు. ఆ యజ్ఞబాహువు శాల్మలీ ద్వీపమును ఏడు వర్షములుగా విభజించి, తన ఏడుగురు కుమారులకు పంచి ఇచ్చాడు. ఆ ఏడు వర్షముల పేర్లు.....సురోచనము, సౌమనస్యము, రమణకము, దేవబర్హము, పారిభద్రము, ఆప్యాయనము, అభిజ్ఞాతము. ఆ ఏడు వర్షములకు ఏడుపర్వతములు సరిహద్దులుగా ఉన్నాయి. ఆ పర్వతముల పేర్లు.....సురసము, శతశృంగము, వామదేవము, కుందము, కుముదము, పుష్పవర్షము, సహస్రశ్రుతి. ఈ పర్వతములు ఆ ఏడు వర్షములకు హద్దులుగా ఉన్నాయి. ఆ ఏడు వర్షములలో ఏడు నదులు ప్రవహిస్తున్నాయి. వాటి పేర్లు.... అనుమతి, సినీవాలి, సరస్వతి, కుహూ, రజని, నంద, రాక.

ఆ ద్వీపములో నాలుగు వర్ణముల వారు ఉన్నారు. ఆ వర్ణముల పేర్లు...శ్రుతిధరులు, వీర్యధరులు, వసుంధరులు, ఇషుంధరులు. వీరందరూ చంద్రుని పూజిస్తారు.

"ఓ దేవా! నీవు కాలమును శుక్లపక్షము, కృష్ణపక్షము అని విభజించి, దేవతలకు, పితృదేవతలకు హవ్యములు, కవ్యములు ఏర్పాటు

చేసావు. ఈ ప్రజలందరినీ నీవు పోషిస్తున్నావు. అట్టి నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!" అని ప్రార్థిస్తుంటారు.

ఈ శాల్మలీ ద్వీపమునకు పక్కనే కుశ ద్వీపము ఉంది. ఆ ద్వీపము శాల్మలీ ద్వీపమునకు రెట్టింపు వైశాల్యముతో ఉంది. ఈ కుశ ద్వీపము చుట్టు సముద్రము ఉంది. ఈ కుశ ద్వీపములో దర్భలు ఎక్కువగా మొలుస్తాయి అందుకని దీనిని కుశద్వీపము అని పిలుస్తారు. ప్రియవ్రతుని మరొక కుమారుడు అయిన హిరణ్యరేతసుడు ఆ ద్వీపమునకు అధిపతి. ఆయనకు ఏడుగురుకుమారులు. వారి పేర్లు వసువు, వసుదానుడు, ధృఢరుచి, నాభిగుప్తుడు, స్తుత్యవ్రతుడు, వివిక్తుడు, వామదేవుడు. హిరణ్యరేతసుడు కుశద్వీపమును ఏడు వర్షములుగా విభజించి తన ఏడుగురు కుమారులకు ఇచ్చాడు. ఈ ఏడు వర్షములకు ఏడు పర్వతములు సరిహద్దులుగా నిలిచి ఉన్నాయి. ఆ పర్వతముల పేర్లు వరుసగా....చక్ర, చతుఃశృంగ, కపిలము, చిత్రకూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము. ఈ శుక ద్వీపములో ఏడు నదులు ప్రవహిస్తున్నాయి. వాటి పేర్లు... రసకుల్య, మధుకుల్య, మిత్రవింద, శ్రుతవింద, దేవగర్భ, ఘృతచ్యుత, మంత్రమాల.

ఈ కుశద్వీపములో నాలుగు వర్ణముల వారు నివసిస్తున్నారు. ఆ వర్ణముల పేర్లు కుశలము, కోవిదము, అభియుక్తము, కులకము. వీరందరూ ఆ నదులలో స్నానం చేసి తాము చేసిన పాపముల నుండి విముక్తులవుతుంటారు. ఆ ద్వీప వాసులు అగ్నిదేవుని ఉపసిస్తారు.

"ఓ అగ్నిదేవా! నీవు సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడవు. మేము నీలో వేసే హవిస్సులను, నీవు దేవతలకు అందజేస్తుంటావు. ఆ పరమాత్మయొక్క అంశలయిన దేవతలకు మేము నీకు అర్పించే హవిస్సులను అందచేయమని నిన్ను ప్రార్థిస్తున్నాము." అని అగ్నిదేవుని ప్రార్థిస్తారు.

కుశ ద్వీపము పక్కనే క్రౌంచద్వీపము ఉంది. ఆ ద్వీపము కూడా కుశద్వీపమునకు రెట్టింపు ఉంటుంది. ఈ క్రౌంచద్వీపము చుట్టు సముద్రము ఆవరించి ఉంటుంది. ఈ ద్వీపములో క్రౌంచము అనే పర్వతము ఉంది. అందుకే ఈ ద్వీపమునకు క్రౌంచ ద్వీపము అనే పేరు వచ్చింది. ఈ ద్వీపమునకు అధిపతి ప్రియవ్రతుని కుమారుడు ఘృతప్రస్థుడు. ఈయన కూడా తన రాజ్యమును ఏడు భాగములు చేసి తన ఏడుగురు కుమారులకు సమానంగా పంచి ఇచ్చాడు. ఆయన ఏడుగురు కుమారుల పేర్లు వరుసగా..... ఆత్ముడు, మధురుహుడు, మేఘవృష్ఠుడు, సుధాముడు, లోహితార్ణుడు, వనస్పతి. ఈ ఏడు వర్షములను విభజిస్తూ ఏడు సరిహద్దుపర్వతములు ఉన్నాయి. వాటి పేర్లు.... శుక్లము, వర్థమానము, భోజనము, ఉపబర్హణము, నందము, నందనము, సర్వతోభద్రము. ఈ పర్వతసానువులలో పుట్టి ఏడు నదులు ప్రవహిస్తున్నాయి. వాటి పేర్లు అభయము, అమృతౌఘము, ఆర్యకము, తీర్థవతి, రూపవృత్తి, పవిత్రవతి, శుక్ల.

ఈ ద్వీపములో నాలుగు వర్ణముల వారు నివసిస్తున్నారు. పురుష, ఋషభ, ద్రవిణ, దేవక అనే వర్ణములు. ఆ నాలుగు వర్ణముల వారు ఆ నదులలోని నీటిలో స్నానం చేసి పవిత్రులవుతారు. ఆ

ద్వీపములో ఉన్న ప్రజలకు నదులు, జలము దేవతలు. ఆ జలదేవతలను ఈ ప్రకారంగా కీర్తిస్తూ ఉంటారు.

"ఓ జలదేవతలారా! మీరు పరమాత్మ స్వరూపులు. మీరు భూలోకములోనూ, స్వర్గలోకములోనూ, భువర్లోకములోనూ ప్రవహిస్తూ, అక్కడ నివసించేవారిని పవిత్రము చేయుచున్నారు. మీలో స్నానం చేసే వారి పాపములను పోగొడుతున్నారు. అందువలన మేమందరమూ మిమ్ములను పూజిస్తున్నాము." అని కీర్తిస్తుంటారు.

ఈ ద్వీపము తరువాత శాకద్వీపము అనే ద్వీపము ఒకటి ఉంది. ఈ శాక ద్వీపము చుట్టు సముద్రము ఉంది. మధ్యలో ఈ ద్వీపము ఉంది. ఈ ద్వీపములో శాకము అనే ఒక మహావృక్షము ఉంది. అందువలన ఈ ద్వీపమునకు శాక ద్వీపము అనే పేరు వచ్చింది. ప్రియవ్రతుని కుమారుడు అయిన మేధాతిథి ఈ ద్వీపమునకు అధిపతి. ఈయన కూడా ఈ ద్వీపమును ఏడు భాగములుగా సమానంగా విభజించి తన ఏడుగురు కుమారులకు పంచి ఇచ్చాడు. ఆ కుమారుల పేర్లు..... పురోజవుడు, మనోజవుడు, వేపమానుడు, ధూమ్రానీకుడు, చిత్రరేఫుడు, బహురూపుడు, విశ్వధరుడు. ఈ ద్వీపములో కూడా ఏడు పర్వతములు ఉన్నాయి. అవి ఆయా ప్రాంతములకు సరిహద్దులుగా ఉన్నాయి. వాటి పేర్లు ఈశానము, ఉరుశృంగము, బలభద్రము, శతకేసరము, సహస్రసోతము, దేవపాలము, మహానసము. ఈ ఏడు పర్వతములనుండి ఏడు నదులుపుట్టి ఆ ద్వీపములో ప్రవహిస్తున్నాయి. ఆ నదుల పేర్లు....అనఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచపది, సహస్రస్తుతి, నిజధృతి.

ఈ ద్వీపములో ఋతవ్రత, సత్యవ్రత, దానవ్రత, అనువ్రత అనే నాలుగు వర్ణముల వారు నివసిస్తుంటారు. ఆ ద్వీపములో నివసించేవారు. వాయుదేవుని పూజిస్తూ ఉంటారు. వారు ప్రాణాయామం చేస్తూ తమలో ఉన్న కల్మషములను పోగొట్టు కుంటూ ఉంటారు. వారు వాయుదేవుని ఈ విధంగా కీర్తిస్తుంటారు.

"ఓ ప్రాణదాతా! నీవు ప్రాణము, అపానము రూపములో ప్రాణుల దేహములో చలిస్తూ, ప్రాణుల బయట కూడా సర్వాంతర్యామి గా ఉంటూ, ఈ సమస్త జగత్తుకు ప్రాణాధారమై ఉన్నావు. అట్టినీవు మమ్ములనుసదా కాపాడాలి." అని వాయుదేవుని ప్రార్థించారు.

శాక ద్వీపము తరువాత పుష్కర ద్వీపము ఉంది. ఈ ద్వీపము వైశాల్యము శాకద్వీపము కన్నా రెట్టింపు ఉంటుంది. ఈ ద్వీపము చుట్టు మంచి నీటి సముద్రము ఉంది. ఈ ద్వీపములో ఒక పెద్ద తామర పుష్పము ఉంది. దాని రేకులు బంగారురంగులో ప్రకాశిస్తుంటాయి. ఆ పద్మము మధ్యలో బ్రహ్మ ఉంటాడని ప్రతీతి. ఈ ద్వీపము తూర్పు పడమరలుగా విస్తరించి ఉంది. వీటి మధ్యలో మానసోత్తరముఅనే పర్వతము తూర్పు భాగమును పడమర భాగమును విభజిస్తూ ఉంది. ఆ పర్వతము పదివేల యోజనముల ఎత్తు ఉంది. ఆ పర్వతమునకు నాలుగు పక్కలా లోకపాలకుల నివాసములు ఉన్నాయి. ఈ ద్వీపమునకు అధిపతి ప్రియవ్రతుని కుమారుడు వీతిహోత్రుడు. అతనికి ఇద్దరు కుమారులు. వారు రమణకుడు, ధాతకుడు. వీతి హోత్రుడు ఆ ద్వీపమును తూర్పు పడమర భాగములుగా విభజించి ఇద్దరికి పంచి ఇచ్చాడు.

ఆ ద్వీపములో నివసించే ప్రజలు బ్రహ్మదేవుని ఆరాధిస్తారు. "ఓ దేవా! నీవు కర్మలకు, కర్మ ఫలములకు కర్తవు. నీ ముఖము నుండి వేదములు వెలువడ్డాయి. నీకు పరమేశ్వరునికి భేదములేదు. మీరిద్దరూ ఒకరిని ఒకరు సేవించుకుంటూ ఉంటారు. అట్టి నీకు నమస్కారము." అని బ్రహ్మదేవుని కీర్తిస్తుంటారు.

ఈ పుష్కర ద్వీపము ఆవల ఒక పర్వతము ఉంది. దానిని లోకాలోక పర్వతము అంటారు. ఆ పర్వతము అవతల సూర్యుని కాంతి ప్రసరించదు. అంతా చీకటి. అక్కడ ఏముందో తెలియదు. సూర్యుని కిరణములను ఈ పర్వతము అడ్డుతున్న కారణంగా ఆ పర్వతము ఆవల చీకటి ఏర్పడింది అని అంటారు. ఆ పర్వతమును ఇవతల లోకము అంటే అందరికీ కనపడేది, అవతల అలోకము అంటే ఏమీ కనపడనిది ఉంది. అందుకే ఆ పర్వతమునకు లోకాలోకపర్వతము అనే పేరు వచ్చింది. (లోకము అంటే కనపడేది. అలోకము అంటే కనపడనిది).

ఈ లోకాలోక పర్వతమునకు పుష్కర ద్వీపమునకు మధ్య బంగారం లాగా మెరిసిపోయే ఒక ద్వీపము ఉంది. ఈ ప్రాంతము అద్దము మాదిరి స్వచ్ఛంగా మెరుస్తూ ఉంటుంది. మరొక విశేషము ఏమిటంటే, ఆ ద్వీపము మీదికి ఏ ప్రాణి వెళ్లినా, ఏ వస్తువును విసిరి వేసినా, ఆ ప్రాణి, ఆ వస్తువు మాయం అయిపోతుంది. తిరిగి రాదు. ఈ లోకాలోక పర్వతము ఇవతల భూలోకము, భువర్లోకము, సువర్లోకము ఉన్నాయి. ఆ పర్వతము ఆవల మిగిలిన లోకములు ఉన్నాయి. అడ్డుగా లోకాలోకపర్వతము ఉంది.

(దీనికి పెద్దవాళ్లు చెప్పే అర్థం ఏమిటంటే.... మనకు పైన ఏడులోకములు ఉన్నాయి అవి భూలోకము, భువర్లోకము, సువర్లోకము. ఆ తరువాత మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. ఈ మహర్లోకము పై మూడు లోకములకు ద్వారము వంటిది. ఆ మహర్లోకమే ఈ లోకాలోక పర్వతము. ఆ లోకాలోక పర్వతము ఆవల జనలోకము, తపోలోకము, సత్యలోకము ఉన్నాయి అంటారు. అవి స్వయం ప్రకాశ లోకములు. అక్కడ సూర్యకిరణములు అవసరం లేదు. సూర్యకిరణముల కాంతిలో కానీ మనము చూడలేము. కాబట్టి ఆ లోకములు మన కళ్లకు కనపడవు. ఈ విధంగా అర్థం చేసుకోవచ్చు.)

పరమాత్మ ఈ లోకాలోక పర్వతమును భూలోకము, భువర్లోకము,సువర్లోకములకు సరిహద్దుగా ఉంచాడు. సూర్యకిరణములు ఈ మూడులోకములను ప్రకాశింపజేస్తాయి. ఈ లోకాలోక పర్వతము ఎత్తుగా ఉండటం వలన సూర్యకిరణములు ఈ పర్వతము ఆవలకు ప్రసరించవు. పండితులు ఈ లోకాలోకపర్వతము యాభైకోట్ల యోజనముల విస్తీర్ణములో ఉందని అంటారు. ఈ విస్తీర్ణము భూలోకములో నాలుగవ వంతు అని పండితుల అభిప్రాయము.

ఈ లోకాలోక పర్వతము పైన నాలుగు దిక్కులా నాలుగు ఏనుగులు ఉన్నాయి వాటినే దిగ్గజములు అంటారు. వాటి పేర్లు ఋషభము, పుష్కరచూడము, వామనము, అపరాజితము. ఆ దిగ్గజముల మధ్య అంతర్యామి, విశుద్ధసత్త్వగుణసంపన్నుడు అయిన

పరమాత్మ, సమస్త అలంకరణములతో, అస్త్ర శస్త్రములతో, నాలుగు భుజములతో, విష్వక్సేనుడు మొదలగు పార్షదులు, ఇంద్రుడు మొదలగు లోకపాలకులు, తనను సేవిస్తూ ఉండగా ఆ లోకాలోక పర్వతము మీద దివ్యమైన రూపంతో విరాజిల్లుతుంటాడు. ఈ మూడు లోకములతో జరిగే పనులన్నీ ఆ పరామాత్మ మాయాజనితములే. ఆ పరమాత్మ వివిధ రూపములతో తనను తాను ప్రకటించుకుంటూ, ఈ మూడులోకములను పరిపాలిస్తున్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ లోకాలోక పర్వతమునకు ఈవల లోకములు ఉన్నాయి అని చెప్పాను కదా. ఆవల అలోకములు ఉన్నాయి. అంటే చీకటి లోకములు. ఆ అలోకము యొక్క విస్తీర్ణము పన్నెండున్నర కోట్ల యోజనములు. ఈ అలోకమునకు ఆవల మోక్షము ఉంది అని చెబుతారు. అక్కడకు కేవలము యోగులు, యోగేశ్వరులు మాత్రమే వెళ్లగలరు అని పండితులు చెబుతారు.

ఇది ఇలా ఉంటే, ఓ పరీక్షిత్ మహారాజా! ఈ బ్రహ్మాండము మధ్యలో సూర్యుడు ఉన్నాడు. భూలోకము, భువర్లోకము (అంటే భూమి ఆకాశము అని చెప్పుకోవచ్చు) మధ్యలో ఉన్న భాగమే బ్రహ్మాండము. ఈ భూమ్యాకాశాలము మధ్య దూరము 25కోట్లయోజనములు. మొట్ట మొదట ఈ బ్రహ్మాండము చేతనత్వము లేకుండా ఉంది. సూర్యుడు ఈ బ్రహ్మాండములో ప్రవేశించి చేతనత్వమును కల్పించాడు. మృతంగా ఉన్న బ్రహ్మాండమునకు చేతనత్వము కల్పించాడు కాబట్టి ఆయనను మార్తాండుడు అని అంటారు. ఆయనను హిరణ్యగర్భుడు అని కూడా అంటారు. ఆ అండము లో నుండి విరాట్ స్వరూపము ప్రకటితము

అయింది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ సూర్యుని వలననే మనకు దిక్కులు, ఆకాశము, భూమి కనపడుతున్నాయి. ఇంక స్వర్గము, నరకము, అతలము మొదలగు అధోలోకములు కూడా సూర్యుని వలన ప్రకటితము అవుతున్నాయి. ఈ భూమి మీద నివసించే సకల ప్రాణులకు అంటే మనుషులు, వృక్షములు, జంతువులు మొదలగు వాటికి సూర్యుడు,సూర్యరశ్మి ప్రాణాధారము." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకుచెప్పాడు.

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము ఇరవయ్యవ అధ్యాయముసంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
పంచమస్కంధము
ఇరవై ఒకటవ  అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుతో ఇలా అన్నాడు. "మహారాజా! నీకు ఇప్పటిదాకా భూమండలము యొక్క పరిమాణము, లక్షణములను వివరంగా చెప్పాను. ఈ భూమి మనకు గోళాకారములో కనిపిస్తూ ఉంది. భూమి మీద ఉన్న ఆకాశము బోర్లించిన పాత్రమాదిరి ఉంది. ఈ ఆకాశము మధ్యలో ఉన్న సూర్యుడు భూమి మీద ఉన్న

ప్రాణులకు వేడి, వెలుగు, ప్రాణశక్తి ఇస్తున్నాడు. ఈ సూర్యుడు తన తేజస్సుతో మూడు లోకములకు వేడి వెలుగు ఇస్తున్నాడు.

సూర్యుని గమనము రెండుగా విభజింప బడినది. ఉత్తరంగా పయనించడం అంటే ఉత్తరాయనము. దక్షిణంగా పయనించడం అంటే దక్షిణాయనము. ఈ సూర్యుని వేగము ఒక్కొక్కప్పుడు ఎక్కువగానూ, తక్కువగానూ, సమానంగానూ ఉంటూఉంటుంది. సూర్యుడు మకర రాశిలో ప్రవేశించినప్పటినుండి ఉత్తరాయనము అంటే పగలు ఎక్కువగా ఉంటుంది. అలాగే సూర్యుడు తులా రాశిలోకి ప్రవేశించినప్పటినుండి దక్షిణాయనము అంటే రాత్రి ఎక్కువగా ఉంటుంది. సూర్యుడు మేష రాశి, తులా రాశిలో ఉన్నప్పుడు రాత్రి పగలుసమానంగా ఉంటాయి. మేషరాశి తరువాత వచ్చే వృషభరాశి నుండి తరువాత ఐదురాసుల కాలము, పగలు నెలనెలకూ ఒక ఘటిక వంతున పెరుగుతూ ఉంటుంది. తరువాత తులారాశి తరువాత వచ్చే వృశ్చికరాశి నుండి ఐదురాసుల కాలము నెలకు ఒక ఘటిక వంతున పగలు తగ్గి, రాత్రికాలముపెరుగుతూ ఉంటుంది. అంటే ఉత్తరాయన కాలము ఆరు నెలలు పగలు, దక్షిణాయన కాలము ఆరు నెలలు రాత్రి వృద్ధిపొందుతుంటాయి. ఈ విధంగా సూర్యుడు భూమిచుట్టు 9,51,00,000 యోజనముల దూరం మేరు పర్వతము చుట్టు గుండ్రంగా తిరుగుతూ ఉంటాడు.

ఈ మేరు పర్వతమునకు తూర్పున దేవధాని అనే ఇంద్రుని పట్టణము, దక్షిణమున సంయమని అనే యముని పట్టణము, పడమటి దిక్కున నిమ్లోచని అనే వరుణుని పట్టణము, ఉత్తర దిక్కున విభావరి అనే చంద్రుని పట్టణము ఉన్నాయి. ఇవి అన్నీసమాన

దూరంలో ఉన్నాయి. సూర్యుని భ్రమణమును అనుసరించి మనకు ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, అర్ధరాత్రి కలుగుతుంటాయి. ఈ సూర్యగమనమునననుసరించి జీవులు పగలంతా పనులు చేసుకుంటారు, రాత్రిపూట నిద్రపోతారు.

సూర్యుడు ఈ ప్రకారంగా తిరుగుతున్నప్పటికినీ, సూర్యుడు తన కిరణములను మధ్యాహ్న సమయములో మేరు పర్వతము మీద ఎప్పుడూ నిట్టనిలువుగా కిరణములను ప్రసరిస్తూ అధికమైన వేడిమిని కలుగచేస్తుంటాడు.
(భూమధ్యరేఖ మీద అన్నిరోజులలోనూ సూర్యుని కిరణములు నిలువుగా పడుతుంటాయి అని చెబుతారు కదా. మేరు పర్వతము భూమధ్యరేఖమీద ఉందని కొందరి భావన. మేరుపర్వతము అనే పేరు గల అగ్ని పర్వతము ఆఫ్రికా ఖండములోని టాంజేనియా దేశంలో ఉంది. ఆఫ్రికా ఖండము మీదుగా టాంజేనియాకు దగ్గరగా భూమధ్యరేఖపోతుంది. ఆ మేరు పర్వతము కిళిమాంజారో పర్వతము నుండి కనిపిస్తుందంటారు. కాని మేరు పర్వతము కాశ్మీరుకు ఈశాన్యదిక్కున ఉందని కొంతమంది పాశ్చాత్యుల వాదన. సూర్య సిద్ధాంతంలో మేరు పర్వతము భూమికి మధ్యలో ఉందని ఉదహరింపబడింది. వరాహ మిహిరుడు మేరు పర్వతము ఉత్తరధృవ ప్రాంతంలో ఉందని రాసారు. కాని అక్కడ పర్వతములు లేవు అని తెలిసింది. కాబట్టి మేరు పర్వతము ఫలానా చోట ఉందని ఎవరూచెప్పలేకపోతున్నారు. )

సూర్యుడు భూమి మీద ఏ సమయములో ఉదయిస్తాడో, అక్కడినుండి సమంగా భూమి ఆవల వైపుకు ఒక తాడు పడితే, సరిగా భూమి అవతల ఆసమయంలో సాయంత్రం అవుతుంది. భూమి మీద ఏసమయంలో సూర్యుడు ఆకాశంలో నిట్టనిలువుగా కిరణములను ప్రసరిస్తుంటాడో అంటే మధ్యాహ్నకాలం అవుతుందో, అక్కడి నుండి తాడుపట్టుకుంటే భూమికి ఆవల వైపున అర్ధరాత్రి అవుతుంది. (హైదరాబాదులో సూర్యోదయం అయినప్పుడు, సరిగా భూమికి ఆవల ఉన్న అమెరికాలో సూర్యాస్తమయం అవుతుంది కదా!)

ఇప్పుడు సూర్యగమనమును గురించి చెబుతాను విను. మేరుపర్వతమునకు నాలుగు దిక్కులా లోకపాలకుల నగరములు ఉన్నాయని చెప్పానుకదా! తూర్పువైపున ఉన్న ఇంద్రుని నగరము నుండి దక్షిణమున ఉన్న యమపురమునకు 2,37,75,000 యోజనముల దూరం 15 ఘడియలలో అనగా 12గంటలపాటు ప్రయాణిస్తాడు. అక్కడి నుండి వరుణ పురమునకు, అక్కడి నుండి చంద్రుని పురమునకు, మరలా అక్కడి నుండి ఇంద్రుని పురమునకు ప్రయాణిస్తాడు. దీనినే జ్యోతిశ్చక్రము అని అంటారు. సూర్యుడు ఒక సారి భూమిని చుట్టిరావడానికి 34,08,000 యోజనముల దూరం ప్రయాణిస్తాడు. (యోజనము అంటే 9 కిలోమీటర్ల దూరము).

సూర్యుని రథచక్రము పేరుసంవత్సరము. ఆచక్రమునకు 12నెలలు పన్నెండు ఆకులు. ఆ పన్నెండు ఆకులు రెండు రెండుగా అంటే ఆరు ఋతువులుగా విభజింపబడి ఉంటాయి. దాని మధ్యగా ఒక ఇరుసు. ఆ ఇరుసుకు ఒక పక్క మేరు పర్వతము, మరొక పక్క

మానసోత్తర పర్వతము ఉన్నాయి.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ సూర్య రథమును అరుణుడు (అనూరుడు అని కూడా అంటారు) నడుపుతుంటాడు. ఆయన సూర్యునికి ఎదురుగా కూర్చుంటాడు. సూర్య రథముయొక్క పొడవు 36,00,000 యోజనములు. వెడల్పు 9,00,000యోజనములు. సూర్యుని రథమునకు ఛందస్సులు అనే ఏడు గుర్రములు కట్టబడి ఉంటాయి. గాయత్రి, బృహతి, ఉష్ణిక్,జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి అనే ఏడు ఛందస్సులుసూర్యుని రథమునకు హయముల వంటివి.

ఆ మాదిరిగా మేరుపర్వతము చుట్టు తిరుగుతున్న సూర్యుని వాలఖిల్యులు అనే ఋషులు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు మొత్తం పదునాలుగు మంది, వారు ఏడు గణములుగా ఏర్పడి, ప్రతి నెలలోనూ వేరు వేరు పేర్లతో సూర్యుని స్తుతిస్తుంటారు.

సూర్యుడు భూమిచుట్టు తిరగడానికి క్షణానికి 2,002 యోజనముల వేగంతో తిరుగుతుంటాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు సూర్యుని గమనాన్ని గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము ఇరవైఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓంతత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## పంచమ స్కంధము

## శ్రీమద్భాగవతము

## పంచమస్కంధము

## ఇరవైరెండవ అధ్యాయము.

శుక మహర్షి ఇంకా ఇలా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! కుమ్మరి సారె అనగా కుమ్మరి వాడు కుండలు చేయు చక్రము. ఆ చక్రము కుమ్మరి వాడు తిప్పుతాడు. అది ఒక అక్షము మీద గిర్రున వేగంగా తిరుగుతూ ఉంటుంది. ఆ చక్రము మీద ఒక చీమ కానీ కీటకము కానీ ఉంటుంది. దానికి ఈ చక్రము తిరిగే వేగము తెలియదు. ఆ చీమ గానీ, కీటకము గానీ ఆ చక్రము మీద ముందుకు వెనక్కు పక్కలకు తన ఇష్టం వచ్చినట్టు తిరుగుతూ ఉంటుంది.

అలాగే ఈ అనంత విశ్వంలో ఎన్నో నక్షత్రాలు ఉన్నాయి. వాటికి గ్రహాలు ఉన్నాయి. ఆ గ్రహాలు ఆ నక్షత్రాల చుట్టు తిరుగుతూ తమ తమ గతులను బట్టి తిరుగుతూ ఉంటాయి. ఆ నక్షత్రాలన్నీ ఈ జ్యోతిశ్చక్రము యొక్క అక్షముచుట్టు తిరుగుతూ ఉంటాయి. ఈ ప్రకారంగా నక్షత్రాల గమనము, నక్షత్రముల చుట్టు తిరిగే గ్రహముల గమనము వేరువేరుగా ఉంటాయి.

ఇంక మన సూర్యుని విషయానికి వస్తే, ఆ పరమాత్మ సూర్యుని రూపంలో ప్రకాశిస్తుంటాడు. ఆ పరమాత్మ తనకు నిర్దేశించిన మార్గములో తిరుగుతూఉంటాడు. తాను తిరిగే కాలమును పన్నెండు భాగములుగా విభజించుకుంటాడు. వాటిని మరలా రెండు రెండుగా

విభజించి ఆరు ఋతువులుగా చేస్తాడు. ఆ ఆరు ఋతువులు కొన్నింటిలో ఎక్కువ వేడిని, కొన్నిఋతువులలో ఎక్కువ చలిని అందిస్తుంటాడు. ఆ సూర్యుడే అగ్ని రూపంలో ప్రతి ఇంటిలోనూ, యజ్ఞయాగములలోనూ వెలుగుతుంటాడు.

సూర్యుడు ఆ పరమాత్మ యొక్క ఆజ్ఞానుసారము ఆకాశము భూమి మధ్యలో ఉండే ఈ కాలచక్రములో మేషము మొదలగు రాసుల మధ్య సంచరిస్తుంటాడు. సూర్య గమనము ప్రకారము మనకు పన్నెండు నెలలు ఏర్పడ్డాయి. ఆ పన్నెండు నెలలను ఒక సంవత్సరము అంటారు. ఈ సంవత్సరమును, నెలలను, రాసులను కొందరు సూర్యుని గమనాన్ని, కొందరు చంద్రుని గమనాన్ని అనుసరించి గుణిస్తారు. వాటినే సూర్యమానము, చంద్రమానము అని పిలుస్తారు. (ఆంధ్ర దేశములో చాంద్రమానము, తమిళ దేశంలో సూర్యమానము ఆచరించడం మనకు తెలుసు.)

చాంద్రమానము ప్రకారము, పదిహేను రోజులను ఒక పక్షము అంటారు. అటువంటి రెండు పక్షములు కలిస్తే అనగా ఒక మాసము పితృదేవతలకు ఒక రోజుతో సమానము. సూర్య మానము ప్రకారము 27 నక్షత్రములు, 12 రాసులు ఉన్నాయి. ఒక నక్షత్రానికి నాలుగు పాదాలు ఉంటాయి. అందులో 2.25 వంతు ఒక మాసముతో సమానము. (అంటే ఒక మాసములో రెండు నక్షత్రములు, ఒక పాదము నడుస్తాయి.)

సూర్యుడు రెండు రాసులలో తిరగడాన్ని ఒక ఋతువు అంటారు. ఇటువంటి ఆరు ఋతువులు ఒక సంవత్సరము అవుతుంది. సూర్యుడు ఆకాశ మార్గంలో ఆరు మాసములు సంచరిస్తే దానిని అయనము అంటారు. అదే ప్రకారంగా సూర్యుడు ఈ మూడు లోకములను ఒకసారి చుట్టి వస్తాడో ఆ కాలమును సంవత్సరము అంటారు. ఆ సంవత్సరమునే పరివత్సరము, ఇదావత్సరము, అనువత్సరము, వత్సరము అనే పేర్లతో కూడాపిలుస్తారు.

ఓ పరీక్షిత్ మహారాజా! సూర్యునికి లక్షయోజనముల దూరములో చంద్రుడు ఉన్నాడు. చంద్రుడు కూడా నిరంతరము తిరుగుతూ ఉంటాడు. చంద్రుడికి ఒక నెల  సూర్యునికి ఒక సంవత్సరముతో సమానము. అలాగే చంద్రునికి 2.25 దినములు గడిస్తే అది సూర్యునికి ఒక నెలతో సమానము. అలాగే చంద్రునికి ఒక రోజు సూర్యునికి ఒక పక్షముతో సమానము.

(సూర్య గమనానికి చంద్ర గమనానికి రిలెటివిటీని చూపించడానికి ప్రయత్నించాడు వ్యాసుడు. మన నమ్మకం ప్రకారం కూడా మనిషి చనిపోయిన తరువాత పది రోజులు రుద్ర రూపంలో భూమి మీదనే ఉంటాడు. అందుకే మనము నిత్య కర్మచేసి రోజూ అన్నం వండి నివేదన చేస్తాము. తరువాత వసురూపము అంటే చంద్రలోకము లో ఉంటాడు. అంటే మనకు ఒక నెల, చంద్రునికి ఒక రోజు. అందుకే ప్రతి నెలా మాసికములు పెట్టి బ్రాహ్మణులకు భోజనముపెట్టి తర్పణములు విడిచి పిండప్రదానం చేస్తాము. తరువాత సూర్యలోకానికి వెడతాడు. అక్కడ మనకు ఒక సంత్సరము గడిస్తే అక్కడ ఒక రోజు

అవుతుంది. అందుకే ప్రతి సంవత్సరము శ్రద్ధతో శ్రాద్ధము పెడతాము. ఈ ప్రక్రియ వలననే మనకు భూమికి, చంద్రునికి, సూర్యునికి గమనంలో తేడా తెలుస్తూ ఉంది. దానిని చెప్పడానికి ప్రయత్నంచేసాడు వ్యాసుడు.)

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ చంద్రునికి వృద్ధి క్షీణతలు ఉన్నాయి. చంద్రుడు పదిహేను రోజులపాటు వృద్ధిచెందుతూ దేవలోకము వైపు ప్రయాణము చేస్తాడు. దానినే శుక్లపక్షము అంటారు. (దేవలోకము వెలుగుకు ప్రకాశమునకు ప్రతీక) తరువాత చంద్రుడు క్షీణిస్తూ పితృలోకము వైపుకు ప్రయాణిస్తాడు. దానిని కృష్ణ పక్షముఅంటారు. ఈ ప్రకారంగా చంద్రుడు దేవలోకమునకు, పితృలోకమునకు పగలు రాత్రి కలుగచేస్తాడు.

చంద్రుడు ముప్పది ముహూర్తముల కాలము ఒక్కొక్క నక్షత్రములో ఉంటాడు. (ముహూర్తము అనగా మన కాలమానము ప్రకారము 48నిమిషములు. 30 ని 48 తో గుణిస్తే 1440 నిమిషాలు వస్తాయి. వాటిని 60 తో భాగిస్తే 24 గంటలు అంటే ఒక రోజు. అంటే చంద్రుడు ఒక్కో నక్షత్రములో ఒక రోజు ఉంటాడు. చాంద్రమానము ప్రకరాము అంతే కదా!)

ఈ చంద్రుడు అమృతమును కురిపిస్తాడు. ఓషధులను, పంటలను ఏపుగా పండిస్తాడు. సకల ప్రాణులకుజీవనాధారము ఈ చంద్రుడు. అందుకే చంద్రుని జీవుడు అని కూడా అంటారు. ఈ చంద్రుడు మనస్సుకు అధిపతి అని అంటారు. ఓషధులను, అన్నమును ఇస్తాడు. సర్వప్రాణులకు జీవన స్వరూపుడు. చంద్రుడు దేవతలకు, పితరులకు, మానవులకు, సకల జీవరాసులకుప్రీతిపాత్రుడు అయ్యాడు.

ఈ చంద్ర మండలమునకు రెండు లక్షల యోజనముల దూరములో కొన్ని నక్షత్రముల సముదాయము ఉంది. అవి మేరు పర్వతమునకు దక్షిణ దిశగా ఉన్నాయి. వాటి సంఖ్య 27. అభిజిత్ నక్షత్రముతో సహా 28.

(మనకు అశ్విని,భరణి మొదలగు 27నక్షత్రములు తెలుసు. మిట్ట మధ్యాహ్నము ఉండే నక్షత్రము అభిజిత్ నక్షత్రము. దానినే అభిజిత్ లగ్నము అని కూడా అంటారు.)

ఈ నక్షత్ర మండలమునకు రెండు లక్షల యోజనముల దూరములో శుక్ర గ్రహము ఉంది. ఈ గ్రహము ఒక్కొక్కప్పుడు అతి వేగంగా అంటే సూర్యుని వేగంతో సమానంగా, ఒక్కొక్కప్పుడు నెమ్మదిగా తిరుగుతూ ఉంటుంది.ఈ గ్రహము వర్షములు కురిపించి భూమిని సస్యశ్యామలము చేస్తుంది అన్ని ప్రాణులకు హితమును చేకూరుస్తుంది. చెడు పరిణామాలను అడ్డుకుంటుంది. (అందుకేనేమో శుక్రమహర్దశ అనే పేరు వచ్చింది.)

ఈ శుక్రగ్రహమునకు రెండు లక్షల యోజనముల దూరంలో బుధ గ్రహము ఉంది. ఈ బుధ గ్రహము కూడా లోకాలకు మంచి చేస్తుంది. కాని ఈ బుధ గ్రహము సూర్యునికి దూరంగా వెళ్లినపుడు గాలి బలంగా వీస్తుంది. మేఘాలు ఏర్పడతాయి కాని వర్షం కురవదు. ఈ బుధ గ్రహము వలన అతి వృష్టి, అనావృష్టి సంభవిస్తాయి.

ఈ బుధ గ్రహమునకు రెండు లక్షల యోజనముల దూరంలో కుజ గ్రహము (అంగారక గ్రహము) ఉంది. ఈ కుజ గ్రహము ఒక్కొక్క రాశిలో 45 రోజులు ఉంటుంది. (అంటే మనకు 30 రోజులు అయితే ఆ గ్రహం మీద 45రోజులు అవుతాయి.) ఇది లోకాలకు, మానవులకు కీడు చేస్తుంది. దు:ఖములను కలుగజేస్తుంది. ఇది అశుభ గ్రహము. ఈకుజగ్రహమునకు రెండు లక్షల యోజనముల దూరంలో బృహస్పతి గ్రహము ఉంది. ఈ గ్రహము యొక్క గమనమును బట్టి ఈ గ్రహము ఒక్కొక్క రాశిలో ఒక సంవత్సరము ఉంటుంది. (అంటే మనకు ఒక నెల అక్కడ ఒక సంవత్సరముతో సమానము.)

ఈ బృహస్పతి గ్రహమునకు రెండు లక్షల యోజనముల దూరంలో శనిగ్రహము ఉంది. ఈ గ్రహ చలనము ప్రకారము ఒకొక్క రాశిలో ముప్పది నెలలు ఉంటుంది. (అంటే మనకు ఒక నెల, ఆ గ్రహం మీద ముప్పది నెలలకు సమానము.) ఆ గ్రహము సూర్యుని చుట్టి రావడానికి ముప్పది సంవత్సరములు పడుతుంది. ఈ శనిగ్రహము మానవులను అశాంతి పాలు చేస్తుంది. ఈ శనిగ్రహము నుండి 11లక్షల యోజనముల దూరములో ధ్రువ నక్షత్రము ఉంది. దానినే విష్ణుపదము అంటారు. (దీనినే ఈ విశ్వమునకు కేంద్రము అంటారు. అందుకే ధృవనక్షత్రము కదలదు. స్థిరంగా ఉంటుంది.).

శ్రీమద్భాగవతము

పంచమ స్కంధము ఇరువది రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓంతత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
పంచమ స్కంధము
ఇరువది మూడవ అధ్యాయము.

శుకమహర్షి పరీక్షిత్ మహారాజుతో గ్రహములు, నక్షత్రములు వాటి గమనముల గురించి ఇలా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ నక్షత్రమండలముల మధ్య ధృవ నక్షత్రము  స్థిరంగా కేంద్రంగా వెలుగుతున్నాడు. అన్ని నక్షత్ర మండలములకు ధృవ నక్షత్రము కేంద్ర బిందువు. (మనకు అర్థం కావడానికి వ్యాసుడు ఒక మంచి ఉదాహరణ ఇచ్చాడు.) మనం ఒక కర్రను భూమిలో పాతాము. దానికి కొన్ని పశువులను కట్టాము. ఆ పశు వులు తమకు కట్టిన తాళ్ల పొడుగును బట్టి వాటి వాటిపరిధులలో తిరుగుతూ ఉంటాయి. అలాగే ఈ నక్షత్రమండలములు అన్నీ ధృవ నక్షత్రము చుట్టు వాటి వాటి పరిధులలో తిరుగుతూ ఉంటాయి.

(మనకు తెలిసినంతవరకుసూర్యుని చుట్టుభూమి తిరుగుతూ ఉంది. కాని సూర్యుడు కూడా తిరుగు తున్నాడు అని పైన చెప్పారు కదా. దానికి ఇదీ మూలము. ఒక్క సూర్యుడే కాదు అన్ని నక్షత్ర సముదాయాలు అన్నీ ఈ అనంత విశ్వంలో తిరుగుతూనే ఉన్నాయి. ఒక్క ధృవ నక్షత్రము తప్ప ఏదీ నిలకడగా లేదు అని భావన.)

అదే ప్రకారము ఈ కాలచక్రంలో సూర్యుడు మొదలగు నక్షత్రములు, వాటి చుట్టు తిరిగే గ్రహములు, ధృవ నక్షత్రమును కేంద్రంగా చేసుకొని ఒక నిర్దిష్టమైన పరిథిలో తిరుగుతూ ఉంటాయి. ఆకాశంలో పక్షులు ఎలాగా అయితే పడిపోకుండా తిరుగుతూ ఉంటాయో అలాగే ఈ నక్షత్రములు, గ్రహములుకూడా ఒకదానిని ఒకటి ఆకర్షించుకుంటూ, జారిపోకుండా, పడిపోకుండా, నిర్దిష్టమైన పరిథిలో పరిభ్రమిస్తూ ఉంటాయి. ఏవి కూడా ఒకదానితో ఒకటి ఢీకొనవు. భూమి మీదపడవు. ఇది అంతా పరమాత్మ యొక్క మాయ వలన జరుగుతూ ఉంటుంది.

ఈ నక్షత్రములు, గ్రహములు అన్నీ కలిపి జ్యోతిశ్చక్రము అని అంటారు. కొంత మంది ఈ జ్యోతిశ్చక్రము అనేది ఒక కల్పితము అని అంటారు. శిశుమారము అంటే మొసలి. ఈ జ్యోతిశ్చక్రము మొసలి ముడుచుకొని పడుకొని ఉంటే ఎలా ఉంటుందో అలా ఉంటుంది.

( The visible stars appear, spread all over the night sky, but are particularly concentrated in one band, which we call the Milky Way. As long ago as 1750, some astronomers were suggesting that the appearance of the Milky Way could be explained if most of the visible stars lie in a single disclike configuration, one example of what we now call a spiral galaxy....Stephen Hawking)

(కాబట్టి నేటి శాస్త్రజ్ఞులు కూడా మన గెలాక్సీ చుట్ట చుట్టుకొని ఉందని ధృవీకరించారు. ఇంక భాగవతంలోకి వద్దాము.).

ఆ ప్రకారంగా చుట్టు చుట్టుకొని పడుకొని ఉన్న మొసలి లేక మకరము తల కిందికి ఒంగి ఉంటుంది. దేహము చుట్టచుట్టుకొని ఉంటుంది. దాని తోక కొసన ధృవ నక్షత్రము ప్రకాశిస్తూ ఉంటుంది. తోక పొడుగునా బ్రహ్మ, అగ్ని, ఇంద్రుడు, ధర్మదేవత నక్షత్రరూపంలో ఉంటారు. దానినడుము భాగమున సప్తర్షి మండలము ఉంటుంది. దాని శరీరము దక్షిణదిక్కుగా అంటే కుడిపక్కకు ఒంగి ఉంటుంది. దాని శరీరము దక్షిణ దిశ యందు అంటే కుడి వైపున అభిజిత్తు నుండి పునర్వసు వరకు 14 నక్షత్రములు, ఎడమ వైపున పుష్యమి నుండి ఉత్తారాషాఢ వరకు ఉన్న 14 నక్షత్రములు ఉన్నాయి. కాబట్టి ఆ మొసలి ఆకారంలో ఉండే శింశుమార చక్రమునకు నక్షత్రములు అటు ఇటు సమానంగా ఉంటాయి. ఆ శింశుమార చక్రము కింది భాగమున అనగా పూర్వాషాఢ, ఉత్తరాషాఢ అనునక్షత్రములు, పొట్ట భాగమున ఆకాశ గంగ ఉన్నాయి. ఈ శిశుమార చక్రమునకు పునర్వసు పుష్యమీ నక్షత్రములు కుడి ఎడమల ఉన్న ముందు పాదముల యందు పక్కల ఉన్నాయి. ఆరుద్ర, ఆశ్లేష నక్షత్రములు కుడి ఎడమల ఉన్న కింది పాదముల వద్ద ఉన్నాయి. అభిజిత్ ఉత్తరాషాఢ నక్షత్రములు కుడి ఎడమల ముక్కు రంధ్రముల దగ్గర ఉన్నాయి. శ్రవణం, పూర్వాషాఢ నక్షత్రములు కుడి ఎడమ కళ్ల దగ్గర ఉన్నాయి. ధనిష్ట, మూల నక్షత్రములు ఆ శింశుమారమునకు కుడి ఎడమ చెవుల వద్ద ఉన్నాయి. మఘ నుండి అనూరాధ వరకు ఉన్న ఎనిమిది నక్షత్రములు ఎడమ పక్కన ఉన్న పక్కటెముకల దగ్గర, మృగశిర నుండి కిందికి ఉన్న

పూర్వాభాద్ర నక్షత్రము వరకు కుడి పక్కన ఉన్నపక్కటెముకల దగ్గర ఉన్నాయి. శతభిష, జ్యేష్ట నక్షత్రములు ఆ మొసలి భుజముల దగ్గర ఉన్నాయి. మొత్తము 28నక్షత్రముల సమూహమే ఈ శింశుమార చక్రము. ఈ శింశుమారమునకు పైదవడ భాగంలో అగస్త్యుడు, కింది దవడ భాగంలో యముడు, ముఖ భాగంలో కుజుడు, వెనుక భాగంలో శని, కంఠభాగంలో బృహస్పతి, వక్షస్థలము దగ్గర ఆదిత్యుడు, హృదయ భాగంలో నారాయణుడు, మనస్సులో చంద్రుడు, నాభి భాగంలో శు క్రుడు, స్తనముల భాగంలో అశ్వినీ కుమారులు, ప్రాణము అపానములలో బుధుడు, కంఠప్రదేశములో రాహువు, అన్ని అంగముల యందు కేతువు, రోమముల యందు తారలు నిలిచి ఉన్నారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ ప్రకారంగా చెప్పబడిన మొసలి ఆకృతియే విష్ణువు యొక్క సర్వదేవతా రూపము. ఈ శింశుమార రూపమును ధ్యానిస్తూ ఈ క్రింది మంత్రమును పఠించాలి.

"నమోనమో జ్యోతిర్లోకాయ కాలాయనాయ అనిమిషాం పతయే మహాపురుషాయ అభిధీమహి..ఇతి."
ఈ మంత్రమును మూడు కాలముల యందుజపిస్తే వారిపాపములు నశించిపోతాయి." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శింశు మార చక్రము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము ఇరువది మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్.

(చివరి మాట: మనం ఇప్పటి దాకా భాగవతంలో వ్యాసుడు చెప్పిన విశ్వరూపం చూచాం. ఇప్పుడు ప్రస్తుత శాస్త్ర పరిజ్ఞానం ప్రకారం ఆవిష్కరింపబడిన విశ్వరూపం చూద్దాం.

“If one looks at the sky on a clear, moonless night, the brightest objects one sees are likely to be planets Venus, Mars, Jupiter and Saturn. There will also be a very large number of stars, which are just like our own Sun but much farther from us. Some of these fixed stars do, in fact, appear to change very slightly their positions relative to each other as the earth orbits around the sun, we see them from different psitions against the background of more distant stars. This is fortunate, because it enables us to measure directly the distance of these stars from us: the nearer they are, the more they appear to move. The nearest star, called Proxima Centauri, is found tobe about four light-years away (the light from it takes about four years to reach Earth), or about 23 million million miles. (23,00,000,00,00,000miles) Most of the other stars that are visible to the naked eye lie within a few hundred light years of us. Our Sun, for com-

parison, is a mere eight light minutes away! The visible stars appear spread all over the night sky, but are particularly concentrated in one band, which we call the Milky Way........Our modern picture of the Universe dates back to only 1924 when the American Astronomer Edwin Hubble demonstrated that ours was not the only galaxy. There were in fact many others, with vast tracts, of empty space between them. .................In this way, Edwin Hubble worked out the distances to nine different galaxies. We now know that our galaxy is only one of some hundred thousand million that can be seen using modern telescopes, each galaxy itself containing some hundred thousand million stars. Figure 3.1 shows a picture of one spiral galaxy (Simsumara Charkra) that is similar to what we think ours must look like to someone living in another galaxy. We live in a galaxy that is about one hundred thousand light years across and is slowly rotating ; the stars in its spiral arms orbit around its centre about once every several hundred million years. Our sun is just an ordinary, average-sized, yellow star, near the inner edge of one of

the spiral arms.......(taken from “A Brief History of Time by Stephen Hawking.).

పైన చెప్పిన దాని ప్రకారము ఇప్పటి వరకు తొమ్మిది గెలాక్సీలు మాత్రం కనుక్కున్నారు. ఇంకా కనుక్కోవలసినవి ఎన్ని ఉన్నాయో తెలియదు. ఒక్కో గెలాక్సీలో లక్షల కొద్దీ నక్షత్రాలు, ఆనక్షత్రాల చుట్టు తిరిగే గ్రహాలు ఉన్నాయి. మన సూర్యుడు ఉన్న గెలాక్సీలోకూడా లక్షల కొద్దీ నక్షత్రాలు, గ్రహాలుఉన్నాయి. ఆ నక్షత్రాలలో మన సూర్యుడు ఒక మామూలు నక్షత్రం. ఆ సూర్యుడికి ఉన్న తొమ్మిది గ్రహాలలో మన భూమి ఒక మామూలు గ్రహం. ఆ జలమయమైన ఆ భూమిలో నాలుగవ  వంతు మాత్రమే భూభాగము. ఆ భూభాగంలో ఆశియా ఖండము. అందులో భారత దేశము. అందులో హైదరాబాదు. అందులో మనం. ఈఅనంత విశ్వంతో పోల్చుకుంటే మనం ఎంత? మన జీవితాలు ఎంత? ఆలోచించండి. అన్నీ మనకు తెలుసు అనుకోవడం అజ్ఞానం కాదా!

మన సూర్యుడి కి ఉన్న గ్రహాల గురించే మనకు తెలియదు. అటువంటిది మన గెలాక్సీలోని  నక్షత్రాలలో ఎన్ని నక్షత్రాలకు ఎన్ని గ్రహాలు ఉన్నాయో,  ఆ గ్రహాల మీద ఎటువంటి జీవులుఉన్నాయో, ఆ జీవులు ఎంతటి మేధాసంపత్తి కలిగిఉన్నాయో మనకేం తెలుసు. కాబట్టి ఈ అనంత విశ్వాన్ని శాసించే ఆ పరమాత్మకు శిరస్సు వంచి నమస్కరించడం తప్ప మనం ఏం చెయ్యగలం. అన్నీ నాకు తెలుసు అనుకోవడం అజ్ఞానం. ఇదంతా నాది, నన్ను మించిన వాడు లేడు అనుకోవడం అవిద్య..)

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము

ఇరువది నాలుగవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో ఇలా చెప్పాడు. "మహారాజా! సూర్యునికి పదిలక్షల యోజనముల దూరంలో రాహు గ్రహము ఉంది. రాహువు ఒక రాక్షసుడు. వాడికి దేవత్వము పొందడానికి కానీ, గ్రహముగా మారే అధికారము కానీ లేదు. కానీ పరమాత్మ అనుగ్రహము వలన వాడు ఒక గ్రహము అయ్యాడు. సూర్యుడు పది వేల యోజనములు, చంద్రుడు పదకొండు వేల యోజనములు విస్తీర్ణము ఉంటే, ఈ రాహువు పదమూడు వేల యోజనముల విస్తీర్ణము కలవాడు.

పూర్వము విష్ణువు మోహినీ అవతారములో దేవ దానవులకు అమృతము పంచుతుండగా, ఈ రాహువు దేవతల వేషంలో దేవతల పక్కన కూర్చున్నాడు. మోహిని వీడికి కూడా అమృతము ఇచ్చింది. వీడు దానిని తాగాడు. ఇంతలో సూర్యచంద్రులు ఇది గమనించి విష్ణువుకు చెప్పారు. విష్ణువు తన చక్రాయుధముతో రాహువు తల ఖండించాడు. అమృతము రాహువు గొంతులోనే ఉండి పోయింది. అందువలన రాహువుకు, సూర్య చంద్రులకు వైరము కలిగింది. ఆ కారణంగా అమావాస్య రోజున కానీ, పూర్ణిమ కానీ ఈ

రాహువు సూర్య చంద్రులకు అడ్డు వస్తాడు. ఆ కారణంగా ఆ సమయాలలో సూర్యుడు, చంద్రుడు భూలోక వాసులకు కనిపించరు. దీనినే గ్రహణము అని అంటారు.

ఈ రాహు గ్రహమునకు పదివేల యోజనముల దూరంలో దిగువ భాగాన సిద్ధులు చారణులు, విద్యాధరులు నివసించే లోకము ఉంది. వారి కింది భాగాన యక్షులు, రాక్షసులు, భూతములు నివసించే లోకము ఉంది. దీనినే అంతరిక్షము అంటారు. ఈ అంతరిక్షము వాయువు ఎంత వరకు ప్రసరిస్తుందో అంతవరకు విస్తరించి ఉంది.

ఇక్కడికి సరిగా నూరుయోజనముల దూరంలో కింది భాగంలో భూలోకము ఉంది. ఆకాశంలో ఏ మేరకు పెద్ద పెద్ద గరుడ పక్షులు, డేగలు, హంసలు ఎగురుతుంటాయో అంతవరకూ ఆకాశంలో భూమికి హద్దుగా చెప్పబడింది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ భూమి లోపల కూడా ఏడు లోకాలు ఉన్నాయి. అవి అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళ లోకములు. ఇప్పుడు ఆ లోకముల గురించి వివరిస్తాను.

ఈ అధోలోకాలు కూడా ఒక విధంగాస్వర్గాలే. ఎందుకంటే ఈ అధోలోకాలలో కూడా పెద్ద పెద్ద భవనములు, ఉద్యానవనములు, విహార స్థలములు ఉన్నాయి. ఇక్కడ కూడా కామ భోగములు,

ఐశ్వర్యములు పుష్కలంగా ఉన్నాయి. ఈ అధోలోకములలో నాగులు, దైత్యులు, అసురులు నివసిస్తూ ఉంటారు. వీరు ఇంద్ర లోకములో కంటే ఎక్కువ భోగాలు అనుభవిస్తూ ఉంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ అధోలోకములలో మయుని చేత నిర్మించబడిన పురములు ఎన్నో ఉన్నాయి. ఆ పురములలో రకరకాల భవనములు, ప్రాకారములు, గోపురములు, సభామంటపములు, దేవాలయములు, విశ్రాంతి గృహములు, ఎన్నో ఉన్నాయి. భూమి మీద ఏమేమి ఉన్నాయో అన్నీ ఈ అధోలోకములలో ఉన్నాయి. ఉద్యానవనములు ఫల పుష్ప లతలతో శోభిల్లుతున్నాయి. జలాశయములు తామర పూలతోనూ కలువ పూలతోనూ శోభాయమానంగా ఉన్నాయి.  అక్కడ కూడా రకరకాల పక్షులు మృగములు ఉన్నాయి. అక్కడ సూర్యుని తేజము ప్రసరించదు. కాబట్టి అక్క రాత్రి పగలు అనే భేదము లేదు. అందువలన అక్కడ కాలము లేదు. కాలము వలన కలిగే పరిణామములు లేవు. అక్కడ నివసించేవారిలో కాలానుగుణంగా మార్పులు రావు. ఎప్పుడూ యౌవనంతో ఉంటారు.

ఈ అధోలోకములలో నివసించే వాళ్లు దివ్యమైన ఔషధమును సేవిస్తారు. ఈ ఔషధ ప్రభావంతో వారికి ఎటువంటి శారీరక బాధలు, రోగములు, ముసలితనము, దేహము కృశించిపోవడం, దేహమునుండి చెడు వాసన రావడం, ఇటువంటివి రావు. ఆఖరుకు యమధర్మరాజుకూడా అక్కడకు వెళ్లలేడు. వారికి చావు లేదు. కాని వారు భయపడేది కేవలం పరమాత్మ ఒక్కడికే.

ఓ మహారాజా! ఇంక ఆ లోకాల గురించి ఒకటి వెంబడి ఒకటిగా వివరిస్తాను. భూతలము కింద ఉండేది అతలము. ఈ అతలములో బలుడు అనే అసురుడు నివసిస్తున్నాడు. వీడికి తొంభైఆరు మాయలు తెలుసు. ఆ లోకములో స్త్రీలు మూడు రకాలు. మొదటి రకం స్వైరిణి. తన వర్ణము వారితోనే ఆమె సంభోగము చేస్తుంది. రెండవ రకం కామిని. ఆమె ఇతర వర్ణముల పురుషులతో కూడా సంభోగిస్తుంది. మూడవ రకం స్త్రీ పుంశ్చలి. అంటే చాలా చంచలమైనమనసు కల స్త్రీ. ఆ లోకములో ఉన్న పురుషులు హాటకము అనే ఔషధమునుసేవించి నేనే దేవుడిని, నేనే సిద్ధుడిని, నాకు అన్నీ తెలుసు. నన్నుమించిన వాడు, నా కన్నా బలవంతుడు ఎవరూ లేరు అని విర్రవీగుతుంటారు. (దీనిని మద్యపానంతో పోల్చవచ్చు.)

ఈ అతలానికి దిగువన వితలము అనే లోకము ఉంది. ఇక్కడ శివుడు తన భార్యతో సహా నివసిస్తుంటాడు. ఇక్కడ ప్రవహిస్తున్న ద్రవంతో బంగారము తయారవుతుంది. ఈవితలమునకు కింది సుతలము ఉంది. ఈ లోకములో బలి చక్రవర్తి నివసిస్తూ ఉంటాడు. ఈ బలిచక్రవర్తి విరోచనుని కుమారుడు. విష్ణు మూర్తి ఇంద్రునికి త్రిలోకాధిపత్యము కట్టబెట్టడానికి అతిథి గర్భవాసాన జన్మించి, వామనుడిగా అవతరించి, బలి చక్రవర్తిని మూడు అడుగుల నేలను దానంగా తీసుకొని, బలి చక్రవర్తిని సుతలానికి అధిపతిని చేసాడు. బలిచక్రవర్తి తన త్రిలోకాధి పత్యము పోయిన దానికి బాధ పడకుండా శ్రీహరిని సేవిస్తూ తరిస్తున్నాడు. బలిచక్రవర్తి సుతలంలో స్వర్గ సుఖములతో సమానమైన సుఖములను అనుభవిస్తున్నాడు. కానీ ఈ

సుఖములు తాను విష్ణువుకు మూడు అడుగుల భూమిని దానం ఇచ్చిన దానికి ఫలితంగా వచ్చింది అని అనుకోలేదు. ఈ అనంత జీవకోటికి జీవన ప్రదాత, సర్వాంతర్యామి, పరమాత్మ అయిన వాసుదేవుడే తనను దానం అడిగినందుకు పొంగిపోయాడు బలిచక్రవర్తి. ఆ పరమాత్మకే దానం ఇవ్వాల్సిన భాగ్యానికి నోచుకున్నాడు. అందుకని తన గురువు శుక్రాచార్యుని మాటకూడా వినకుండా శ్రద్ధతో,పవిత్రహృదయంతో మూడు అడుగులు దానంగా ఇచ్చాడు. తాను చేసిన దానము తనకు మోక్షమార్గముగా భావించాడు బలిచక్రవర్తి. ఈ సుతలములో లభించే సుఖములు అన్నీ తాత్కాలికములు అనీ, మోక్షమే పరమసుఖము అనీ తలంచాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! భూలోకంలో మానవులు తాము చేసే దైనందినకార్యములలో యాదాలాపంగా పరమాత్మను తలచుకొనినా, పరమాత్మ నామమును పలికినా, వారికి కర్మబంధముల నుండి విముక్తి కలిగిస్తాడు పరమాత్మ. యోగులుఅష్టాంగయోగములు అభ్యసించి ఈ కర్మబంధనముల నుండి విముక్తి పొందాలనుకుంటారు కానీ కేవలం పరమాత్మ నామమును పలికినంత మాత్రముననే భూలోక వాసులకు ముక్తిని ప్రసాదిస్తున్నాడు పరమాత్మ. భక్తికి అంత ప్రాధాన్యము ఇస్తాడు పరమాత్మ. నారదుడు మొదలగు భక్తులకు పరమాత్మ తనకు తానుగా అర్పించుకుంటాడు. సనకాదులకు తన స్వరూపమును చూపించి వారికి బ్రహ్మానందమును కలుగజేస్తాడు. అలాగే బలి చక్రవర్తి కూడా పరమాత్మ ఎడల తనకు ఉన్న ప్రేమ, భక్తితో ఆయనను బంధించాడు. కేవలము మూడు అడుగులు దానం ఇచ్చినందుకు బలిచక్రవర్తికి సుతల లోకాధి పత్యమును, ఆ లోకములో

ఉన్న భోగములను కలిగించాడు అన్న మాట నిజము కాదు. ఆపరమాత్మ ఎడల బలి చక్రవర్తికి ఉన్న భక్తి ముందు ఈ భోగములు అన్నీ వ్యర్థములు.

ఓ పరీక్షిత్ మహారాజా! వామన మూర్తి అవతారములో విష్ణువు, బలి చక్రవర్తి నుండి మూడు అడుగులు దానంగా తీసుకొని, అంతటితో ఊరుకోకుండా బలి చక్రవర్తిని వరుణ పాశములతో బంధించాడు. అప్పుడు బలి చక్రవర్తి తనలో తాను ఇలా అనుకున్నాడు.

"ఆ ఇంద్రుడు ఎంతటిమూర్ఖుడు. ఎందుకంటే పరమాత్మ అడిగినప్పుడు మోక్షమును అడగకుండా తుచ్ఛమైన త్రిలోకాధిపత్యమును అడిగాడు. ఇంద్రుడే కాదు ఇంద్రుడి గురువు బృహస్పతి కికూడా తెలివి లేదు. లేకపోతే బృహస్పతి అయినా ఇంద్రునికి జ్ఞానబోధ చేసి ఉండవచ్చు కదా! ఎవరైనా పరమాత్మ ప్రత్యక్షం అయితే, ఆయన పాదదాసుడిగా ఉండాలని కోరుకుంటారుకానీ తుచ్ఛమైన త్రిలోకాధి పత్యమును కోరుకుంటారా! ఇంద్రుడు శాశ్వతముగా త్రిలోకాధి పత్యము అనుభవించడు కదా. ఈ మన్వంతరము కాగానే మరొక ఇంద్రుడు వస్తాడు. కాని పరమాత్మ పాదసేవ శాశ్వతము కదా!

మా తాతగారైన ప్రహ్లాదుని ముందు వీరు ఎవరూ ఎందుకూ పనికిరారు. ఆయనకు తనకు ఏమికావాలో బాగా తెలుసు. పరమాత్మ నృసింహావతారములో వచ్చి హిరణ్యకశిపుని సంహరించి, ప్రహ్లాదునికి అతని తండ్రిరాజ్యమును, మోక్షమును ఇవ్వ దలిచిననూ, ఆయన వాటిని వద్దన్నాడు ప్రహ్లాదుడు. తనకు శ్రీహరి యొక్క

పాదసేవను అర్థించాడు కానీ తుచ్ఛమైన రాజ్యమును, రాజభోగములను కోరుకోలేదు. మేము ఆ మహానుభావుడికి ఎందులోనూ సరిపోము. అందుకే ఈ సుతల లోకమునకు అధిపతిని అయ్యాను."అని తనలో తాను చింతిస్తుంటాడు బలిచక్రవర్తి.

పరీక్షిత్ మహారాజా! సాక్షాత్తు విష్ణు మూర్తి ఆ బలిచక్రవర్తి రాజ ప్రాసాదమునకు గదపట్టుకొని కాపలాకాస్తుంటాడు. ఒకసారి యుద్ధోన్మాదుడు అయిన రావణుడు బలి చక్రవర్తి మీదికి యుద్ధానికి రాగా, ద్వారము వద్ద ఉన్న విష్ణువు ఆ రావణుని తన కాలి గోటితో తన్నగా ఆ రావణుడు పదివేల యోజనముల దూరం ఎగిరిపడ్డాడు. అంతటి మహాత్ముడు బలిచక్రవర్తి.

ఓ పరీక్షిత్మహారాజా! ఈ సుతలము కింద ఉన్నది తలాతలము. దానవ రాజు అయిన మయుడు ఈ లోకానికి అధిపతి. ఈ మయుడు మాయావులు అందరికీ గురువు. ఒకప్పుడు శివుడు ఈ మయుడు నిర్మించిన మూడు పురములను దగ్ధం చేసాడు. కానీ మయుని ఈ లోకానికి అధిపతిని చేసాడు. అప్పటి నుండి మయుడు ఎటువంటి భయం లేకుండా శివుని సంరక్షణలో తలాతలములో నిశ్చింతగా ఉంటున్నాడు.

ఈతలాతలము కింది మహాతలము ఉంది. ఈమహాతలములో కద్రువ సంతానము అయిన సర్పములు నివసిస్తూ ఉంటాయి. ఆ సర్పములలో కుహకుడు, తక్షకుడు, కాళీయుడు, సుషేణుడు ముఖ్యులు. వారు మహాతలములో నివసిస్తున్నా అనుక్షణం

గరుడునికి భయపడుతూనే ఉంటారు.

ఈ మహాతలము కింద రసాతలము ఉంది. ఆ రసాతలంలో పణి అనే పేరుతో ఉన్న దానవులు, దైత్యులు, నివాతకవచులు, కాలకేయులు, అనే తెగల వారు నివసిస్తూ ఉంటారు. వీరుకూడా సర్పముల వలె పుట్టలలో నివసిస్తూ ఉంటారు. వీరుపుట్టుకతోనే మహాబలశాలురు. సాహసవంతులు. కాని వీరు విష్ణువుకు, ఇంద్రునికి భయపడుతుంటారు.

ఈ రసాతలమునకు కింద ఉన్నది పాతాళ లోకము. ఇక్కడ ఉన్నది మహా సర్పములు. అమితమైన కోపస్వభావము కలవారు. వీరిలో శంఖులు, కులికులు, మహాశంఖులు, శ్వేత, ధనంజయ, ధృతరాష్ట్ర, శంఖచూడ, కంబల, అశ్వతర, దేవదత్త, మొదలగు పెద్ద పెద్ద పడగలు కలిగినసర్పజాతులు ముఖ్యులు. ఈ సర్పములలో కొన్నిటికి ఐదు, ఏడు, పది, వేయి పడగలుకలిగిన సర్పజాతులు ఉన్నాయి. ఈ పడగల మీద ఉన్న మణుల కాంతులు ఆ పాతాళ లోకమును దేదీప్యమానంగా ప్రకాశింపజేస్తుంటాయి. అందుకే పాతాళ లోకంలో చీకటి అనే మాట వినిపించదు, కనిపించదు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము ఇరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓంతత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## పంచమస్కంధము
## ఇరువది ఐదవ అధ్యాయము.

శుకమహర్షి పరీక్షిత్ మహారాజుతో ఇలా చెబుతున్నాడు. "మహారాజా! పాతాళ లోకము కింది భాగంలో ముప్పది యోజనముల దూరంలో ఆ పరమాత్మయొక్క తామసరూపమైన అనంతుడు ఉన్నాడు. ఈ అనంతుని రూపము జీవులలో ఉన్న అహంకారమునకు ప్రతీక. అందుకే ఆయనను సంకర్షణుడు అని కూడా అంటారు. ఈ భూమండలమంతా ఆ అనంతుని పడగల మీద చిన్న ఆవగింజంత రూపంలో నిలిచి ఉంది.

(ఇక్కడ గమనించండి. పైన చెప్పుకున్న లక్షలాది నక్షత్రములు, గ్రహములు, ఉపగ్రహములతో కూడిన గెలాక్సీలు ఉన్న అనంత విశ్వంతో పోల్చుకుంటే మన భూమి చిన్న ఆవగింజంత పరిమాణంలో ఉంది అనడంలో అతిశయోక్తిలేదు. దానిని ఇక్కడ కథారూపంలో వర్ణించాడు వ్యాసుడు.)

కల్పాంతంలో అనంతుడు ఈ విశ్వమును అంతా తనలో ఇముడ్చుకుంటాడు. ఆ సమయంలో కోపంతో ముడి పడిన ఆయన నుదుటి నుండి మూడు శిఖలు కలిగిన శూలంతో, మూడు కన్నులతో పదకొండు రుద్రుల రూపములను తనలో ఇముడ్చుకొన్న శివుడు బయటకు వస్తాడు. సంహార క్రియను ఆరంభిస్తాడు.

ఓ మహారాజా! ఈ సంకర్షణుని అక్కడి ఉన్న నాగులు పూజిస్తారు. ఆక్కడ ఉన్న నాగ కన్యలు సంకర్షణుని భక్తి శ్రద్ధలతో కొలుస్తారు. ఆ సంకర్షణుడు అనగా అనంతుడు సహజంగా కోపము గలవాడైనా ప్రజాక్షేమం కోరి తన కోపాన్ని అణుచుకుంటాడు. లోకాలను ప్రసన్న దృష్టితో చూస్తుంటాడు. ఆ లోకములో ఉన్న దేవతలు, అసురులు, నాగులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, మునులు నిరంతరము సంకర్షణుని ధ్యానిస్తుంటారు. తనను ధ్యానిస్తున్న వారి హృదయములలో సంకర్షణుడు ప్రవేశించి, వారు పూర్వజన్మలో చేసిన కర్మలను, వారిలో ఉన్న అజ్ఞానమును, వారియొక్క సంసారమునకు సంబంధించిన కోరికలను, తొందరగా నాశనం చేస్తాడు. వారికి జ్ఞానోదయము కలిగిస్తాడు.

నారదుడు, తుంబురుడు కలిసి బ్రహ్మగారి సభలో ఈ సంకర్షణుని గురించి ఈవిధంగా కీర్తిస్తారు.

"ఎవరు ఈ విశ్వము యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారణమో! ఎవరి ప్రభావంతో సత్త్వరజస్తమోగుణములు తమ కార్యములను సమర్థంగా నిర్వర్తిస్తాయో! ఎవరి స్వరూపము అనాదిగా ఈ విశ్వంలో వెలుగుతూ ఉన్నదో! ఎవరైతే ఈ సమస్త విశ్వమును తనలో ధరించి ఉన్నాడో! ఆ భగవానుడైన పరమాత్ముని తత్త్వమును తెలుసుకోడానికి ఈ మానవులకు సాధ్యమా! ఎవని యందు ఈ సమస్త విశ్వము నిండి ఉన్నదో ఆ పరమాత్మ తన రూపమును ఈ అనంతుని రూపంలో ప్రకటించాడు.

ఎవరైనా సరే ఆ పరమాత్మ నామమును యాదాలాపంగా పలికినా, వారి పాపములు అన్నీ పటాపంచలయిపోతాయి. ఆ కారణంగా యోగులు ఆ పరమాత్మను ఆశ్రయిస్తారు. ఎన్నో పర్వతములు, కొండలు, గుట్టలు, నదులు, అరణ్యములు పురములు కలిగిన భూమిని చిన్న ఆవగింజ మాదిరి తన తలమీద ధరించిన ఆ అనంతుని శక్తిని, ప్రభావమును కీర్తించడం ఎవరి తరము అవుతుంది? ఆ అనంతునికి అంతటి శక్తి ఉంది. ఆయన శక్తికి, పరాక్రమమునకు సాటి మరొకటి లేదు. ఆ అనంతుని గుణములు, మహత్తులు వర్ణింప నలవి కాదు. అటువంటి అనంతుడు ఈ భూమిని విలాసంగా తన తలమీద ధరించి ఉన్నాడు." అని నారదుడు, తుంబురుడు అనంతుని మహత్తును బ్రహ్మలోకంలో కీర్తించారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటిదాకా నీకు ఊర్ధ్వలోకములు, అధోలోకముల గురించి వివరించాను. ఎవరెవరు చేసిన కర్మలను అనుసరించి వారు ఈ లోకములలో జన్మిస్తూ ఉంటారు. వారు తమ తమ కర్మఫలములను అనుసరించి వారు సుఖదు:ఖములను పొందుతూ ఉంటారు.

ఇంకా నీకు ఏమి తెలుసుకోదలచావో అడుగు. వివరిస్తాను." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము ఇరవై ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

పంచమస్కంధము

ఇరవై ఆరవ అధ్యాయము.

పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని ఇలా అడిగాడు.

"ఓశుకయోగీంద్రా! ఈ విశ్వంలో ఇన్ని లోకాలు, ఇన్ని రకాల జీవజాలము ఎందుకు కలిగాయి. నాకంతా అయోమయంగా ఉంది. కొంచెం వివరంగా చెప్పండి." అని అడిగాడు. దానికి సమాధానంగా శుకమహర్షి ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ లోకంలో మానవులు కర్మలు చేస్తుంటారు. ఆమానవులు సాత్వికులు, రాజసికులు, తామసికులు అని మూడు విధములు. ఈ మూడు విధములుగా ఉన్న మానవులు సాత్విక, రాజసిక, తామసిక కర్మలు చేస్తుంటారు. ఆ కర్మలు కూడా రకరకాలుగా ఉంటాయి. ఆ కర్మల వలన ఫలితములు కలుగుతూ ఉంటాయి. ఆ కర్మలు చేసే మానవులు ఆ కర్మఫలములను అనుభవించక తప్పదు. తెలియక చేసిన తప్పుకు ఒక ఫలితము, తెలిసి తెలిసి చేసే అదే తప్పుకు మరొక ఫలితము కలుగుతూ ఉంటుంది.

"అంతా నా ఇష్టం, నా ఇష్టం వచ్చినట్టు చేస్తాను, దేవుడు లేడు ఎవడూ లేడు. అంతా నేనే" అనే నాస్తికుడు అదే తప్పు చేస్తే వచ్చే ఫలితము వేరుగా ఉంటుంది. ఈ ఫలితములను మానవులు వేరు

వేరునరకములలో అనుభవిస్తారు. వాటి గురించి వివరిస్తాను.

ఈ నరకములు కొన్ని ఈ భూమి మీద, మరి కొన్ని భూమిలోపల ఉన్నాయి. ఈనరకము లన్నీ దక్షిణదిక్కున ఉన్నాయి. ఆనరకలోకంలో పితృదేవతలు సమాధిలో ఉండిపరమాత్మను ధ్యానిస్తూ ఉంటారు. ఆపితృదేవతలు భూమి మీద ఉన్న తమ తమ గోత్రముల వారి యోగక్షేమములను ఎల్లప్పుడూకోరుకుంటూ ఉంటారు.

ఈ నరకలోకములకు అధిపతి యమధర్మరాజు. ఈయన సూర్యుని కుమారుడు. ఈశ్వరుని ఆజ్ఞమేరకు కాలము తీరి మరణించిన వారు కానీ, అకాలమరణం చెందిన వారు కానీ యమభటుల చేత ఈ నరకలోకమునకు తీసుకురాబడతారు. యమధర్మరాజు వారు చేసిన తప్పులను, ఆ తప్పులకు అనుభవించవలసిన ఫలములను విచారించి వారికి తగువిధమైన శిక్షలు విధిస్తాడు. ఈ నరకములు అంటేయమధర్మరాజు వేసే శిక్షలను అనుభవించే ప్రదేశములు.
(అంటే మన సెంట్రల్ జైళ్లలాంటివి. కానీ ప్రస్తుతము మన జైళ్లు తప్పుచేసిన వారిని సంస్కరించడానికి ఉద్దేశించబడ్డాయి (రిఫార్మేటరీ). కానీ నరకములు చేసిన తప్పులకు శిక్షించడానికి ఉద్దేశించబడ్డాయి. కొన్ని రాష్ట్రాలలో భూలోక నరకాలుగా ప్రసిద్ధిచెందిన జైళ్లుకూడా ఉన్నాయి.)

ఓ మహారాజా! నరకములు ఇరవై ఒకటిగా చెప్పబడ్డాయి.
1. తామిస్రము 2.అంధతామిస్రము. 3.రౌరవము. 4.మహారౌరవము.

5.కుంభీపాకము. 6.కాలసూత్రము. 7.అసిపత్రవనము
8.సూకరముఖము. 9. అంధకూపము. 10. క్రిమిభోజనము
11.సందంశము 12.తప్తశూర్మి 13.వజ్రకంటకశాల్మలి.
14.పూయోదము 16.ప్రాణరోధము 17.విశసనము 18.లాలాభక్షము
19.సారమేయాదనము 20. అవీచి. 21. అయ: పానము. ఇవి
కాకుండా క్షారకర్దమము, రక్షోగణభోజనము, శూలప్రోతము,
దందశూకము, అవటనిరోధనము, పర్యావర్తనము, సూచీముఖము
అనే ఏడురకములైన నరకములు ఉన్నాయి. మొత్తము ఇరవై ఎనిమిది
రకములైన నరకములు ఉన్నాయి. ఈ నరకములు మానవులు చేసిన
తప్పులను బట్టి వారి యాతనాశరీరములు అనుభవించే యాతనలకు
స్థావరములు.

మొదటిది తామిస్ర నరకము. ఈ నరకమునకు ఇతరుల
ధనమును అక్రమంగా అపహరించిన వారిని, ఇతరుల భార్యలను
పుత్రులను అపహరించిన వారిని (అంటే కిడ్నాపులు చేసేవారిని),
యమదూతలు ఈ నరకములో పడేస్తారు. ఈ నరకములో అంతటా
చీకటిగా ఉంటుంది. కన్నుపొడుచుకున్నా ఏమీ కనిపించదు. ఆ
నరకములో పడేసిన వారికి అన్నం పెట్టరు. నీరు ఇవ్వరు. పైగా ఆకలి
అంటే కొడతారు. భయపెడతారు. ఈ బాధలు భరించలేక ఆ జీవులు
మూర్ఛపోతారు.

తరువాతి నరకము అంధతామిస్రము. ఈ నరకమునకు
భర్తలను మోసం చేసి వారి భార్యలను అనుభవించేవారిని (అడల్టరీ
నేరం చేసిన వారిని) ఈ నరకంలో పడేస్తారు. ఈ నరకానికి

తీసుకురాకముందే యమభటులు వారిని చిత్రహింసలు పెడతారు. ఆ చిత్రహింసలు భరించలేక వారికి స్పృహ తప్పుతుంది. అప్పుడు ఆ జీవులను తీసుకొని వచ్చి ఈ అంధతామిస్రము అనే నరకంలో పడేస్తారు.

తరువాతి నరకము రౌరవము. నేను నియంతను, నా కన్నా మొనగాడు ఎవడూ లేడు అని అహంకరించి, ఇతరులను నానా విధాలుగా బాధలు పెట్టేవారు, హింసించేవారు, ఆ ప్రకారంగా ఎదుటి వారికి హింసించి వారి వద్దనుండి ధనమును లాక్కుని తమను తమ అనుచరులను పోషించుకొనేవారు (ఈ నాడు మనం చూస్తున్న రౌడీలు, గూండాలు, గూండా నాయకులు,కిడ్నాపులు చేసి డబ్బు గుంజేవారు,) ఈ నరకానికి అంటే రౌరవ నరకానికి తీసుకొని రాబడతారు. ఈ నరకములో అంతకు ముందు వీరి చేతిలో మరణించిన వారు రురులు అనే భయంకరమైన ప్రాణులుగా పుడతారు. తమను హింసించి చంపిన వారు రాగానే, ఆ రురులు వారి మీద పడి పీక్కుతింటారు. చిత్రహింసలు పెడతారు. ఈ రురువులు భయంకరమైన పాముల కంటే అధికమైన విషమును చిమ్ముతుంటారు. ఆ కారణం చేతనే ఈ నరకమును రౌరవము అని పిలుస్తారు.

దీని తరువాత నరకము మహారౌరవము. ఈ నరకము కూడా రౌరవ నరకము మాదిరే ఉంటుంది. సాటి వారిని హింసిచేవారిని, చంపేవారిని ఇక్కడకు తీసుకొని వస్తారు. ఈ నరకంలో ఉన్న రురువులు అనే జీవులు పచ్చిమాంసము తింటారు. ఇక్కడకు తీసుకురాబడిన జీవుల యొక్క పచ్చిమాంసమును

పీక్కుతింటారు. చెయ్యి ఒకడుకొరుకుతుంటే కాలు ఒకడు కొరుకుతుంటాడు. ఈ ప్రకారంగా యాతనలుపెడతారు.

దీని తరువాతి నరకము పేరు కుంభీపాకము. ఇంకా తమను తాము పోషించుకోడానికి సాటి మానవులను చంపేవారిని, తమకు ఆహారంగా పక్షులను, పశువులను చంపేవారిని, ఈ నరకానికి తీసుకొనివస్తారు.ఇక్కడ యమభటులు వీరినికూడా ముక్కలు గా నరికి సల సల కాగే నూనెలో వేసి వేయిస్తారు.

తరువాతినరకము పేరు కాలసూత్రము. ఈ నరకము పదివేల యోజనములు విస్తరించి ఉంటుంది. ఈ నరకంలో ఉన్న నేల అంతా రాగి రేకులుపరిచి ఉంటుంది. సూర్యుని ఎండకు ఈ రాగి రేకులు సలా సలా కాగుతుంటాయి. ఇక్కడకు బ్రాహ్మణులను చంపిన వారిని తీసుకొని వస్తారు. అలా తీసుకురాబడిన వారిని ఈ రాగి రేకుల మీదకు తోస్తారు. నడుద్దామంటే రాగి రేకులు కాలుతుంటాయి. కడుపులో ఆకలి మండుతూ ఉంటుంది. దాహం వేస్తుంది. ఆహారం నీరుఇవ్వరు. ఆ బాధకు తట్టుకోలేక బ్రాహ్మణులను చంపినపాపానికి ఆ పాపులు కిందపడి దొర్లుతుంటారు. పరుగెత్తుతుంటారు. కూర్చుంటారు. లేస్తారు. నరకయాతనలు అనుభవిస్తారు. ఈ నరకంలోపాపులు పశువు శరీరం మీద ఎన్ని వెంట్రుకలు ఉంటాయో అన్ని సంవత్సరములు ఈ నరకంలో పడి బాధలు అనుభవిస్తూ ఉంటారు.

తరువాత నరకము అసిపత్రవనము. అసి (కత్తుల్లాంటి) పత్ర (ఆకులు కల) వనము (చెట్లు కల వనము). వేదములు చదివి అధ్యయనం చేయవలసిన వర్ణములో పుట్టి కూడా, వేదమార్గమును

విడిచిపెట్టి, పాషండమార్గమును అనగా నాస్తిక మార్గమును అనుసరించి, వేదవిరుద్ధములైన పనులు చేసేవారిని యమదూతలు ఈ అసిపత్రనరకములో పడేస్తారు. వారిని కర్రలతో విపరీతంగా కొడతారు. ఆదెబ్బలకు తాళలేక వాళ్లు అటుఇటు పరుగెడుతుంటే ఆ సూదుల్లాంటి, కత్తుల్లాంటి ఆ ఆకులు గీచుకొని వాళ్ల యాతనా శరీరములు చీరుకుపోతుంటాయి. అప్పుడు ఆ జీవుడు "అయ్యో! నా ప్రాణాలో పోతున్నాయిరా దేవుడా!" అని ఆర్తనాదాలు చేస్తుంటాడు. ఆ బాధలకు తాళలేక మూర్ఛపోతాడు. స్వధర్మమును విడిచిపెట్టి పరధర్మమును ఆశ్రయించిన వారికి ఈ నరకము వస్తుంది.

తరువాతి నరకముపేరు సూకర ముఖము. ఈ నరకములోకి రాజులు, న్యాయాధికారులు వస్తారు. శిక్షించవలసిన వారిని శిక్షించకుండా వదిలివేసినా, నిరపరాధులను శిక్షించినా, నిరపరాధులైన బ్రాహ్మణులను శిక్షించినా, వారికి తగిన దండన విధింపబడుతుంది. వారిని సూకరముఖము అనే ఈ నరకంలో పడేస్తారు.ఆ నరకంలో ఉన్న యమభటులు యాతనాశరీరంలో ఉన్న జీవుడిని చెరుకు గడనుపిండినట్టు పిండుతారు. అప్పుడు వాడి బాధ వర్ణనాతీతం. బాధతో కేకలు పెడతాడు. ఈ లోకంలో ఎవడైనా నిరపరాధికి శిక్ష వేస్తే ఆ నిరపరాధి ఎంతటి మానసిక, శారీరక వేదన పొందుతాడో, అంతకన్నా వేయిరెట్లు వేదనను ఆ జీవుడు పొందుతాడు.

దీని తరువాతి నరకము అంధకూపము. ఈ సమాజంలో వారి వారి గుణములను బట్టి, వారు చేసే కర్మలను బట్టి నాలుగు వర్ణాలు ఏర్పరచారు. ఆయా వర్ణముల వారికి చేయవలసిన విధులను,

చేయకూడని విధులను ఏర్పరిచారు. ఆ విధులను చేయడానికి, చేయకుండా ఉండటానికీ, వారికి వివేకము, ఆలోచించే శక్తి ఇచ్చారు. ఇన్ని తెలిసీ, మంచి చెడు వివేకము, జ్ఞానము కలిగిఉండి కూడా ఇతరులను క్రూరంగా హింసిస్తూ, నల్లులవలె వారి రక్తం తాగుతూ జీవితం గడిపిన వారిని వారు చచ్చిన తరువాత ఈ అంధకూపము అనే నరకంలోపడవేస్తారు. అందులో ఉన్న నల్లులు, దోమలు, చీమలు, తేళ్లు, పాములు వాడిని కుట్టి కుట్టి చంపుతాయి. వాడికి నిద్ర ఉండదు. విశ్రాంతి ఉండదు. నరకయాతన అనుభవిస్తాడు. (మన దేశంలో కొన్ని జైళ్లు ఇంతకన్నా దారుణంగా ఉన్నాయి.)

తరువాతి నరకము పేరు క్రిమి భోజనము. ఇతరులకు చెంద వలసిన ఆహారమును, ఆహార పదార్థములను వారికి ఇవ్వకుండా తానే భుజించేవారిని, ఇతరులకుపెట్టే శక్తి ఉండి కూడా పక్కవాడికి పెట్టకుండా తినేవాడిని, ఇతరుల నోటి దగ్గర ఆహారమును లాక్కునే వాడిని, ఈ నరకంలో తోస్తారు.
(ఈ విభాగంలోకి అనాధ శరణాలయాల అధికారులు, సంక్షేమ హాస్టల్ల వార్డెన్లు వస్తారు. వారు విద్యార్థులకు, అనాధలకుచెందవలసిన ఆహారపదార్థములను బయట అమ్ముకుంటారు లేక తమ స్వార్థానికి వినియోగించుకుంటారు. వాటికి బదులుగా పురుగులు ఉన్న బియ్యము ముక్కిపోయిన బియ్యము, చాలీచాలని పరిమాణంలో ఇస్తారు.)

అటువంటి వారిని వారు చనిపోయిన తరువాత ఈ క్రిమిభోజనము అనే నరకంలో పడవేస్తారు. అక్కడ ఉన్న క్రిములు ఈ జీవులను తింటాయి. ఈ జీవులకు వేరు ఆహారము లేకపోవడంవలన

ఆ క్రిములనే తింటారు. ఆ నరకంలో ఒకరిని ఒకరు తింటూ బతుకుతారు.

తరువాతి నరకము పేరు సందంశము. దొంగతనములను, ఇతరుల ఆస్తులను, వస్తువులను దోచుకోవడమే వృత్తిగా కలవారిని, ఇతరుల మీద దౌర్జన్యంగా ప్రవర్తించి వారి ఆస్తులను ధనమును అపహరించేవారిని, ఈ నరకంలో పడవేస్తారు. ఇక్కడ ఉన్న యమదూతలు జీవులను బాగా కాల్చిన ఇనపకడ్డీలతో వాతలు పెడతారు. బాగా ఎర్రగా కాలిన పట్టకారులతో వారి చర్మాన్ని పట్టుకొని లాగుతారు. చర్మాన్ని చీలుస్తారు.

తరువాతి నరకము పేరు తప్తశూర్మి. ఈనరకానికి ఇతరుల భార్యలను అనుభవించే పురుషులు, ఇతరుల భర్తలను అనుభవించే స్త్రీలు వస్తారు. (అడల్టరీ నేరం చేసినవారు.). ఈ నరకంలో బాగా ఎర్రగా కాలిన ఇనప స్తంభాలు ఉంటాయి. ఆ పురుషులను తాము పరాయి స్త్రీలను ఎలా కౌగిలించుకున్నారో, అదే ప్రకారంగా కౌగలించుకో మంటారు. అదే విధంగా స్త్రీలనుకూడా వారు పరాయి పురుషులను ఎలా కామంతో కౌగలించుకున్నారో ఆ ప్రకారంగా కౌగలించుకో మంటారు. వారు చెప్పినట్టు చెయ్యకపోతే కొరడాలతో కొడతారు.

తరువాతి నరకము పేరు శాల్మలి నరకము. ఇక్కడకు విచిత్రమైన నేరములు చేసిన వాళ్లు వస్తారు. ఇక్కడకు వచ్చే మానవులకు కామం ఎక్కువ. సాటి స్త్రీలను,పురుషులనే కాదు జంతువులతో కూడా కామక్రీడలు సలుపుతారు. అటువంటి వారిని ఈ నరకంలోపడవేస్తారు. ఈ నరకంలో శాల్మలీ వృక్షములు ఉంటాయి. ఆ

వృక్షముల నిండా ఇనప శూలాల వంటి ముళ్లు ఉంటాయి. ఆ నరకానికి వచ్చిన జీవులను ఆ చెట్టుకు పెట్టి రుద్దుతారు. ఆచెట్ల కొమ్మల మీదపెట్టి లాగుతారు. వారి ఒళ్లంతా చీరుకుపోతుంది.

తరువాతి నరకము పేరు వైతరణి. ఎంతో మంది రాజులు మహారాజులు ఉత్తమ మైన కులములలో జన్మిస్తుంటారు. కాని వారు తమ కులమర్యాదలను విడిచిపెట్టి, అక్రమము, అధర్మము అయినమార్గములలో తిరుగుతూ ఉంటారు. అటువంటి వారిని ఈ వైతరిణి నదిలో పడేస్తారు. ఈ వైతరిణీ నది నరక లోకమునకు ఒక అగడ్త వంటిది. అంటే నరకలోనికి ప్రవేశించాలి అంటే ఈ వైతరిణి నదిని దాటి వెళ్లాలి. ఆ నదిలో ఉన్న నీళ్లు రక్తము, చీము, మలమూత్రములు కలిసి ఉంటాయి.
(అంటే మన డ్రైనేజీ కాలువలు, మూసీనది లాంటివి అన్నమాట).
పాపులు ఆ నదిలోపడి నానాబాధలు అనుభవిస్తుంటారు.

తరువాతి నరకము పూయోదము. ఈ ప్రపంచములో బ్రాహ్మణులుగా పుట్టి కూడా, వర్ణాశ్రమ ధర్మములను వదిలి పెట్టి శూద్రకులములో పుట్టిన స్త్రీలను పెళ్లి చేసుకొని, సిగ్గు ఎగ్గులను వదిలిపెట్టి కామాతురులై స్వేచ్ఛగా సంచరించే వారిని ఈ నరకంలో పడవేస్తారు.
(అది కూడా ఈ డ్రైనేజీ కాలువ లాంటిదే. అందులోకూడా మలమూత్రములు, వ్యర్థపదార్థములు, చీము నెత్తురు పారుతూ ఉంటాయి.)
అందులో పడిన జీవులకు అవే ఆహారము. అంటే ఆ నదిలో పురుగులుగా జీవిస్తారు.

తరువాతి నరకము పేరు ప్రాణరోధ. బ్రాహ్మణులు మొదలగు ఉన్నత వర్ణములలో ఉన్నవారు కుక్కలను, గాడిదలను పెంచుకుంటారు. వారు కూడా క్షత్రియుల వలె వేటకు వెళుతారు. మృగములను, పశు వులను చంపుతారు. తమ స్వధర్మమైన వేదాధ్యయనము విడిచిపెట్టి క్షత్రియధర్మమునుపాటిస్తారు. యధేచ్ఛగా జీవహింస చేస్తారు. అటువంటి వారిని ఈ ప్రాణరోధము అనే నరకములో పడవేస్తారు. ఆ నరకంలో యమదూతలు జీవులను, వారు ఎలా అయితే మృగములను, పశువులను బాణములతో కొట్టి చంపారో, అలాగే వాడి అయిన బాణములతో కొట్టి హింసిస్తారు.

తరువాతి నరకము పేరు వైశసము. ఈలోకంలో ఎక్కువ ఆడంబరంతో జీవించే మానవులు, యజ్ఞములు చేసే పేరుతో పశు వులను చంపేవారు, ఈ నరకానికి వస్తారు. యజ్ఞములు చేసే సమయములో వారు ఎలా పశువులను చంపారో, అలాగే ఈ నరకంలో ఈ జీవులను చంపుతారు. మరలా బతికించి చంపుతారు.

తరువాతి నరకము లాలాభక్షము. ఈ లోకంలో ఎక్కువగా ఉన్న కామాంధులు, ఎప్పుడే స్త్రీసుఖములలో మునిగితేలేవారు, తమ తమ భార్యలచేత తమ వీర్యమును తినిపించేవారు, అటువంటి వారిని యమభటులు ఈ లాలాభక్షము అనే నరకములో పడవేసి వారి వీర్యమును వారిచేతనే తినిపిస్తారు.

తరువాతి నరకము పేరు సారమేయాదనము. దొంగతనాలు, దోపిడీలు చేసేవారు, ఇళ్లు తగలపెట్టేవారు, ఇతరులకు విషం పెట్టి చంపేవారు, రాజులు, రాజభటులు, తమకు ఎదరులేదు అన్న అహంకారంతో, గ్రామములలో నివసించే ప్రజలను, వ్యాపారస్థులను తిట్టి, కొట్టి, హింసించేవారు, అటువంటి వారిని ఈ సారమేయాదనము అనే నరకంలో పడేస్తారు. అక్కడ 720 కుక్కలు ఉంటాయి. ఆ కుక్కలు తమ వాడి అయిన కోరలతో వీళ్లను కరిచి, కండలు ఊడపీకి, పీక్కుతింటాయి.

తరువాతి నరకము పేరు అవీచిమంతము. ఈ లోకంలో తప్పుడు సాక్ష్యాలు చెప్పేవారు, ఇతరుల మీద అక్రమంగా నిందలు వేసేవారు, అమ్మకాలు, కొనుగోళ్లు చేసేటప్పుడు అక్రమాలు చేసేవాళ్లు, అబద్ధాలు చెప్పేవాళ్లు, దానము చేసినట్టు ఆర్భాటంగా చెప్పి, తరువాత తాము ఎటువంటి దానము చేయలేదు అని అబద్ధం చెప్పేవాళ్లు, ఇటువంటి వారిని యమభటులు ఈ నరకానికి తీసుకొని వస్తారు. వీరిని ఎత్తైన కొండల మీదినుండి కిందికి తోస్తారు. కింద నీరు ఉన్నట్టు కనిపిస్తుంది. కానీ అది నీరు మాదిరి కనిపించే కఠినమైన రాయి. దాని మీద పడి ఆపాపుల తలలు పగిలిపోతాయి. శరీరం ముక్కలవుతుంది. కాని వాళ్లు చావరు. మరలా వారిని పైకి తీసుకొని పోయి మరలా కిందికి తోస్తారు.

తరువాతి నరకం పేరు అయ:పానము. బ్రాహ్మణులుగానీ, బ్రాహ్మణ స్త్రీలు గానీ మద్యము సేవిస్తే వారినీ, ఏదైనా వ్రతదీక్షలో ఉండి మద్యపానము చేసిన వారినీ, క్షత్రియులు గానీ, వైశ్యులు కానీ

పొరపాటున మద్యపానము చేసిన వారినీ, ఈ నరకంలో పడేస్తారు. వారిని కిందపడేసి యమభటులు వారి గుండెల మీద కాళ్లతో తొక్కుతారు. ఇనుమును కరిగించి, వారి నోరు తెరిచి సలసలకాగే ఇనప ద్రవమును వారి నోట్లోపోస్తారు.

తరువాతి నరకము పేరు క్షారకర్దమము. తనకు ఏమీ తెలియకపోయినా తనకు అంతా తెలుసు అని తనను తానుపొగుడుకొనేవాడు, (తమకు అర్హత లేకపోయినా, ప్రముఖుల చేత సన్మానాలు చేయించుకొనేవాళ్లు), నేనే గొప్పవాడిని, నా కన్నా గొప్పవాడు ఎవడూ లేడు అని అహంకారంతో విర్రవీగేవాడు, తన కంటే గొప్పవారినీ, విద్యావంతులను, ఆచారవంతులను, అవమానించేవాళ్లు, అటువంటి వారు బతికినా చచ్చిన వారి కింద లెక్క. అటువంటి వారు చనిపోయినతరువాత యమభటులు ఈ నరకానికి తీసుకొని వస్తారు. అక్కడ వారికి మంచి నీటి బదులు ఉప్పునీరు ఇస్తారు. ఆ నీళ్లు మింగాలేక, కక్కాలేక యమయాతనపడతారు.

తరువాతి నరకము పేరు రక్షోగణభోజనము. ఈ లోకంలో మనుషులను, జంతువులను దేవతలకు బలులు ఇస్తుంటారు. ఆ కార్యక్రములో బాగా తాగి చిందులు వేస్తూ, నృత్యములు చేస్తూ, నరబలులు, జంతుబలులు ఇస్తుంటారు. తరువాత ఆ బలి ఇచ్చిన నరులను, పశువులను ఇష్టంగా తింటారు. అటువంటి వారిని ఈ నరకంలో పడవేస్తారు. వాళ్లు ఎవరినైతే బలి ఇచ్చారో ఆ మానవులు,పశువులు వీరి కోసరం కత్తులు పట్టుకొని నిలబడిఉంటారు. వీరు ఈనరకానికి రాగానే, తమను ఎలా బలి ఇచ్చారో అదే మాదిరి

వీళ్లను ముక్కలు ముక్కలుగా నరుకుతారు. వారి రక్తమును తాగుతారు. నృత్యములు చేస్తారు. వీళ్లు ఎలా చేసారో అలాగే చేస్తారు.

తరువాతి నరకము శూలప్రోతము. గ్రామములలో నివసించే ప్రజలు జంతువులను, పశువులను బండ్లకు కట్టి లాగిస్తారు. లాగలేకపోతే కర్రలతో కొడతారు. ఇంకాకొన్ని జంతువులను మచ్చిక చేసుకొని వాటితో ఆడిస్తారు, ఆడకపోతే వాడి బల్లెలతో పొడుస్తారు, కొరడాలతో కొడతారు.
(పులులను,సింహములను, ఏనుగులను, గుర్రములను తిండి పెట్టకుండా కడుపు మాడ్చి వాటిని మచ్చికచేసుకొని దారిలోకి తెచ్చుకొని వినోదంకొరకు ఆడిస్తుంటారు. అవి మాట వినకపోతే హంటర్‌తో కొట్టడంమనం చూస్తూనే ఉన్నాం కదా!)
అటువంటి వారిని ఈ నరకంలో పడవేస్తారు. వీరిని ఇక్కడ యమభటులు శూలాలతోపొడుస్తారు. వీళ్లు ఎలా అయితే జంతువులకు మృగములకు తిండి పెట్టకుండా మాడ్చారో అలాగే వీరికీ తిండి పెట్టరు. వీరి మీదికి వాడి అయిన ముక్కులు కల పక్షులను వదులుతారు. ఆ పక్షులు వీరిని ముక్కులతో పొడిచి పొడిచి చంపుతాయి. అప్పుడు తాము చేసిన పాపములను తలచుకుంటూ ఏడుస్తారు.

తరువాతి నరకము పేరు దందశూకము. ఈ లోకంలో కొంతమందికి పాముల మాదిరి కోపం ఎక్కువ. అందరినీ కరుస్తుంటారు. తేళ్ల మాదిరి కుడుతుంటారు. ఇటువంటి వారిని ఈ నరకంలో పడవేస్తారు. ఈ నరకంలో ఐదు తలలు, పదితలలు కల పాములు, పెద్ద పెద్ద తేళ్లు, ఎలుకలు వీళ్లను కరిచి, కుట్టి

నానాయాతనా పెడతాయి.

తరువాతి నరకము పేరు అవటనిరోధము. ఈ లోకంలో మానవులు సాటి మానవులను అకారణంగా బంధిస్తారు. వాళ్లను చీకటి గదులలో పడవేస్తారు. (గుంటూరులో అనుకుంటాను. ఒక అమెరికాలో పనిచేసే సాఫ్ట్‌వేర్ ఉద్యోగి తన భార్యను అదనపు కట్నం తేలేదని కుక్కల బోనులో మూడురోజులు నిర్బంధించాడు అని వార్త.) ఇటువంటి వారిని, గాలి వెలుతురు లేరి చీకటి గుహలలో పడవేస్తారు. పైగా పొగపెడతారు. ఊపిరి ఆడక గిలా గిలా కొట్టుకుంటారు.

తరువాతి నరకముపేరు పర్యావర్తనము. ఇంటికి వచ్చిన అతిధులకు భోజనం పెట్టడం మర్యాద. కాని కొంతమంది భోజనము పెట్టి తిడుతుంటారు. కోపగించుకుంటారు. ఉన్నదంతా తినేస్తున్నారని కోపంగా తీక్షణం చూస్తుంటాడు.
(నాకు తెలిసి ఒకాయన తద్దినాలు పెడుతూ, "వీళ్లకు పొట్టపగలా తిండి పెట్టేది కాకుండా ఇంకా దక్షిణలు కూడా ఇవ్వాలా" అని బూతులు తిట్టడం చూచాను, విన్నాను.)
ఇటువంటి వారిని ఈ నరకంలో పడవేస్తారు. ఇక్కడ వాడిముక్కులు కల గ్రద్దలు, కాకులు, మొదలగు పక్షులు వారిని పొడిచి పొడిచి వారిమాంసమును తింటాయి. వారి కళ్లను పొడిచి పొడిచి పీక్కుతింటాయి.

తరువాతి నరకముపేరు సూచీ ముఖము. ఈ లోకంలో చాలా మందికి ధనం ఉంటుంది. ధనంతో పాటు, గర్వము, అహం పెరుగుతుంది. నాకన్నా గొప్పవాడు లేడు అని అహంకరిస్తారు. తన దగ్గరున్న ధనాన్ని ఎవరైనా ఎత్తుకుపోతారని అందరినీ అనుమానిస్తాడు. ఎవరినీ దగ్గరకు రానివ్వడు. తాను తినడు, ఒకరిని తిననివ్వడు. తుదకు తల్లి తండ్రులు, గురువులనుకూడా అనుమానిస్తాడు. వాడు శాంతిగా ఉండడు ఎదుటి వారిని శాంతిగా బతకనివ్వడు. ధనపిశాచి మాదిరి ఎప్పుడూ ధనం సంపాదించడానికి వెంపర్లాడుతుంటాడు. ఉన్నధనాన్ని ఎలా అధికం చెయ్యాలా అని ఆలోచిస్తుంటాడు. ఇటువంటి ధనపిశాచులను ఈ నరకంలో పడవేస్తారు. యమభటులు వీరిని పడుకోబెట్టి, వీరి చర్మాన్ని చీల్చి, సూది దారం తీసుకొని మరలా కుడుతుంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ నరకాలు కొన్ని మాత్రమే. పాపాలు పెరిగే కొద్దీ వివిధములైన నరకాలు పుట్టుకొస్తుంటాయి. పుణ్యం చేసుకున్న వారు, స్వర్గానికి వెళితే, పాపం చేసిన వారు ఈ నరకాలకు వస్తుంటారు. ఆ పుణ్యము,పాపము తీరిపోగానే, వారి వారి పూర్వజన్మ వాసనలను బట్టి మరలా ఈ భూమి మీద జన్మఎత్తుతుంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు మోక్ష మార్గము గురించి ఇదివరకే వివరించాను. ఈ బ్రహ్మాండములో పదునాలుగు లోకములు ఉన్నాయి ఊర్ధ్వ లోకములు ఏడు, అధోలోకములు ఏడు. ఈలోకములలో సాక్షాత్తు పరమాత్మ విరాట్ స్వరూపంలో విరాజిల్లుతున్నాడు. శ్రద్ధ భక్తి ఉన్న సాధకుడు ఈ విరాట్ రూపమును,

అనగా పరమాత్మ స్థూలరూపమును ముందు పూజిస్తాడు. ఈ స్థూలరూపము గురించి వర్ణిస్తాడు. తాను చదువుతాడు. ఇతరులకు చెబుతాడు. ఇతరులు చెబితే తానూ వింటాడు. ఈ ప్రకారంగా తనమనస్సును పరిశుద్ధం చేసుకుంటాడు. ఉపనిషత్తులో చెప్పబడిన పరమాత్మ యొక్క స్థూల రూపముయొక్క తత్త్వమును తెలుసుకొనగలడు. ఇది మోక్షమార్గము. ఈ మార్గమును అనుసరించే సన్యాసులు పరమాత్మ యొక్క స్థూల రూపము, సూక్ష్మరూపము రెండింటి తత్త్వములను తెలుసుకుంటారు. వాటి గురించి క్షుణ్ణంగా వింటారు. మొట్ట మొదట పరమాత్మ స్థూల రూపము అనగా విగ్రహారాధన మూలంగా మనస్సులో నిలుపుకుంటారు. తరువాత దానిని విడిచిపెట్టి బుద్ధిని సూక్ష్మరూపంలో నిలుపుతారు. దీనికి భక్తియోగము అవలంబించడం అవసరము. ఓ పరీక్షిత్‌మహారాజా! నీకు ఇప్పటిదాకా ఈ భూమి గురించి, ద్వీపముల గురించి, వర్షముల గురించి, పర్వతములు, సముద్రములు, నదులు గురించి ఆకాశము గురించి, పాతాళము గురించి, దిక్కులు గురించి స్వర్గ నరకముల గురించి, నక్షత్ర మండలము గురించి వివరంగా చెప్పాను. ఇదంతా కలిస్తే పరమాత్మయొక్క స్థూలరూపముగా చెప్పబడింది. ఇదే పరమాత్మ యొక్క విరాట్ స్వరూపము."అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పినట్టు నైమిశారణ్యంలో, సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు మహాభాగవత పురాణమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము పంచమస్కంధము
ఇరువది ఆరవ అధ్యాయము సంపూర్ణము.
పంచమ స్కంధము సర్వం సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము
భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో
యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:
2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060
సెల్:9866140619 ఫోన్:040-24048104

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము

మొదటి అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో, సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు మహాభాగవత పురాణమును ఈ విధంగా వినిపిస్తున్నాడు.

"శౌనకాది మహామునులారా! ఆ ప్రకారంగా శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు భాగవత పురాణమును వినిపిస్తూ ఉండగా, పరీక్షిత్తు శుకమహర్షిని ఈ విధంగా అడిగాడు.

"ఓ మహర్షీ! తమరు నా మీద దయయుంచి, నాకు నివృత్తి మార్గమును అనగా దేవ మార్గమును వివరించారు. ఈ నివృత్తి మార్గము ద్వారా యోగులు పరబ్రహ్మ పదమును పొందుతారు అని చెప్పారు. అలా కాకుండా, ప్రాపంచిక విషయములలో మునిగి తేలుతూ ఎప్పుడూ విషయవాంఛలకు లోబడిన వారిని మాయ ఆవరించి ఉంటుంది. వారు ఒక దేహము పోతే మరొక దేహమును ధరిస్తూ ఉంటారు. వారు చేసినకర్మఫలములను అనుభవిస్తూ ఉంటారు. పుణ్యం చేస్తే స్వర్గానికి, పాపం చేస్తే నరకానికి పోతారు. ఆ పుణ్య పాపములు అయిపోగానే మరలా జన్మ ఎత్తుతూ ఉంటారు. అధర్మ మార్గములో నడచిన వారికి ఫలితంగా వచ్చే నరకములను ఆ నరకములలో పడే బాధలను వివరించారు. ఇవే కాకుండా స్వాయంభువ మన్వంతరము గురించి సృష్టి ఎలా జరిగింది అనే విషయాలు వివరించారు.

## షష్ఠ స్కంధము

స్వాయంభువ మనువు కుమారులైన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, వారి వంశముల గురించి వివరంగా చెప్పారు. ఈ భూమిని ఎన్ని భాగములుగా విభజించినది, అందులో ఉన్న ద్వీపములు, వర్షములు, నదులు, పర్వతములు, మొదలగు వాని గురించి విపులంగా చెప్పారు. అదేవిధంగా భూమండలము, నక్షత్రమండలము, చంద్రమండలము, జ్యోతిశ్చక్రము వాటి గురించి వివరించారు. 14 లోకముల గురించి చెప్పారు.

ఇవన్నీ చెప్పారు కానీ, ఒక విషయం మాత్రం చెప్పలేదు. ఈ లోకంలో మానవులు ప్రతి దినము పుణ్య కర్మలు పాప కర్మలు చేస్తుంటారు కదా! పుణ్యకర్మలకు స్వర్గ సుఖములు అనుభవిస్తారు. పాప కర్మలకు నరకానికి వెళతారు కదా. అలా నరకానికి వెళ్లకుండా, ఈ లోకంలోనే ఆ పాపఫలమును పోగొట్టుకునే మార్గం ఏదైనా ఉందా తెలియజేయండి." అని అడిగాడు పరీక్షిత్తు మహారాజు. శుక మహర్షి ఈ విధంగా సమాధానం చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ జన్మలో మానవులు తమ మనస్సు, వాక్కు, కర్మలతో పాపములు చేస్తుంటారు. కానీ అదే మనోవాక్కాయములతో ఆపాపములకు తగిన ప్రాయశ్చిత్తములు చేసుకొని, నరక బాధలను తప్పించుకోవచ్చు అని ధర్మశాస్త్రములలో చెప్పబడింది. కాబట్టి మానవులు తమ దేహములలో శక్తి ఉన్నప్పుడే తాము చేసిన పాపములకు తగిన ప్రాయశ్చిత్తములు చేసుకొనుటకు ప్రయత్నం చెయ్యాలి. వైద్యుడు ఎలాగైతే రోగి యొక్క బాధలకు అనుగుణంగా తగిన ఔషధములు ఇచ్చి నయం చేస్తాడో, అదే ప్రకారంగా మానవులు కూడా ధర్మశాస్త్రములో చెప్పబడిన

ప్రాయశ్చిత్తములు చేసుకొని నరక బాధలను తప్పించుకోవచ్చును." అని అన్నాడు శుకమహర్షి.

ఆ మాటలను విన్న పరీక్షిత్తుకు ఒకసందేహము వచ్చింది.

"ఓ మునీంద్రా! మీరు చెప్పింది బాగానే ఉంది. కానీ, మానవుల బుద్ధి మంచిది కాదు. తరచుగా పాపములు చేసే మానవులకు, రాజులు దండిస్తారనే భయం, లోకుల చేతిలో నిందలు పడాలనే భయం, చచ్చిన తరువాత నరకానికి పోతామేమో అనే భయం ప్రతి మానవుడికీ ఉంటుంది. పాపం చెయ్యడం ఒంటికి మంచిది కాదు, పాపం అన్ని విధాలా అనర్థకం అని అందరికీ తెలుసు. కానీ, ప్రతి మానవుడూ, ప్రతిరోజూ పాపాలు చేస్తూనే ఉన్నాడు. మీరు చెప్పినట్టు తాను చేసిన పాపములకు ఒకసారి ప్రాయశ్చిత్తము చేసుకున్నా మరలా పాపాలు చేస్తూనే ఉన్నాడు. ఇటు వంటి వారికి ధర్మశాస్త్రములలో చెప్పబడిన ప్రాయశ్చిత్తముల వలన ఏం ప్రయోజనం కలుగుతుంది. తమరు చెప్పినట్టు పాపం చేసిన వాడు ప్రాయశ్చిత్తము చేసుకున్నాడు. వాడి పాపం పోయింది. తరువాత ఊరుకోడు కదా. అదే పాపమును మరలా మరలా చేస్తూనే ఉంటాడు. మరలా ప్రాయశ్చిత్తము చేసుకుంటూనే ఉంటాడు. ఇదంతా ఏనుగుస్నానం చేసినట్టు ఉంటుంది కదా! " అని అడిగాడు.

(ఏనుగు నదిలో దిగి తన తొండంతో నీళ్లు చల్లుకొని శుభ్రంగా స్నానం చేస్తుంది. ఒడ్డుకు వచ్చిన తరువాత మట్టిని తొండంతో ఎత్తి ఒంటినిండా పోసుకుంటుంది. దీనినే గజస్నానం అంటారు.)

దానికి శుకమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీవు ఒక విషయం మరిచి పోతున్నావు. కర్మలు చేస్తే పాపం వస్తుంది. దానికి చేసే ప్రాయశ్చిత్తం కూడా ఒక కర్మ. కాబట్టి ఒక కర్మతో మరొక కర్మను పోగొట్టుకోవడం సాధ్యం కాదు. ఒక పాప కర్మ చేసి, ఆ పాపము మరొక కర్మతో నశిస్తుంది అని చెప్పడానికి వీలులేదు. ఒక కర్మతో మరొక కర్మను ప్రక్షాళన చేయాలని అనుకోవడమే అజ్ఞానము, అవిద్య. బురదను బురదతో కడగలేము. అలాగే మద్యమును మద్యముతో కడగలేము. కాబట్టి, ముందు పాపం చేసిన వాడిలో ఉన్న అజ్ఞానము నశించాలి. ఇంక పాపం చెయ్యను అని అనుకోవాలి. అప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకుంటే ఫలితం ఉంటుంది. పాపం చెయ్యడానికి మూలం అయిన అవిద్యను లోపల పెట్టుకొని ఎన్ని ప్రాయశ్చిత్తములు చేసుకున్నా ఏమీ లాభం లేదు. మనసులో పాపం చెయ్యాలి అనే ఆలోచన ఉన్నంతవరకూ ఎన్ని ప్రాయశ్చిత్తములు చేసుకున్నా పాపాలు చేస్తూనే ఉంటాడు.

ఓ రాజా! నిజమైన ప్రాయశ్చిత్తము అంటే యజ్ఞాలు, వ్రతాలు చెయ్యడం కాదు. ఇంక మీదట పాపం చెయ్యకూడదు అనే ధృడ సంకల్పం మనసులో కలగాలి. భగవంతుని మీద భక్తి ఉండాలి. జ్ఞానం పెంచుకోవాలి. తనలో ఉన్న అవిద్యను పారదోలాలి. అదే నిజమైన ప్రాయశ్చిత్తము.

ఓ రాజా! ప్రతిరోజూ మితంగా ఆహారం తీసుకుంటూ, తినకూడని పదార్థములకు దూరంగా ఉంటే, వాడికి ఎటువంటి రోగములు రావు. పైగా ఇదివరకు ఉన్న రోగములు కూడా

తగ్గిపోతాయి. ఇదే ప్రకారంగా నియమ నిష్ఠలతో జీవితం గడిపేవాడికి తత్త్వజ్ఞానము దానంతట అదే కలుగుతుంది.

నియమ నిష్టలతో .జీవితం గడపడం అంటే బ్రహ్మ చర్యమునుపాటించడం, మనస్సును, ఇంద్రియములను నిగ్రహించుకోవడం, తనకు ఉన్న దానిలో దానం చెయ్యడం, సత్యం పలకడం, శుచిగా ఉండటం, అహింసను పాటించడం (తన మాటలతో కానీ, చేతలతో కానీ ఎదుటి వారిని నొప్పించకుండా ఉండటం). వీటిని పాటిస్తే వారికి ఎటువంటిపాపములు అంటవు. ఒక వేళ వారు తెలియక ఏదైనా పాపం చేసినా అది ఎండిన వెదురు పొదకు నిప్పుఅంటుకుంటే ఎలా కాలి పోతుందో, అలాగే ఆ పాపములు అన్నీ కాలిపోతాయి.

ఓ రాజా! కొంత మంది తపస్సు చేసి తమ పాపములను పోగొట్టుకుంటే, మరికొంతమంది పరమాత్మయందు అచంచలమైన భక్తితో తమ పాపములను పోగొట్టుకుంటారు. తెలిసో తెలియకో ఏవైనా పాపములు చేస్తే, వాటిని పరమాత్మయందు ఉన్న భక్తి  వలన నాశనము చేసుకుంటారు.

ఓ రాజా! మానవులు ఎన్ని పాపములు చేసిననూ, వారు పరమాత్మకు తమను తాము అర్పించుకున్నచో, వారి పాపములు అన్ని నశించి పోతాయి. అంతే కానీ, పరమాత్మ ఎడల అచంచలమైన భక్తిలేనిదే, ఎన్ని  తపస్సులు చేసినా, వారి  పాపములు పోవు. కాబట్టి ఈ లోకములో మంగళకరమైనది, భయం అనేది ఎరుగనిది అయినది అయిన భక్తి మార్గమే శ్రేష్టమైనది. అదే నిజమైన మార్గము.

## షష్ఠ స్కంధము

ఓ పరీక్షిత్ మహారాజా! ఒక కుండలో మద్యం పోసాము. తరువాత ఆ కుండను శుద్ధిచేయడానికి సమస్తనదుల పుణ్యజలములు అయినా సరిపోవు. అలాగే ఎన్ని ప్రాయశ్చిత్తములు చేసుకున్ననూ, పరమాత్మ ఎడల భక్తి లేనిదో, అతని పాపములు నశించవు. అతడు పవిత్రుడు కాడు. జీవితంలో ఒక్కసారి అయినా ఆ పరమాత్మ యొక్క పాదపద్మముల మీద మనస్సును నిలిపితే, ఆ పరమాత్మ గుణగణములను కీర్తిస్తే, దానిని మించిన ప్రాయశ్చిత్తము మరొకటి లేదు. అటువంటి వానికి కలలో కూడా యమభటులు దగ్గరకు రారు.

ఈ సందర్భంలో నీకు నేను ఒక కధ చెబుతాను. సావధానంగా విను. ఈ కథలో విష్ణు దూతలు, యమ దూతల యొక్క సంవాదము చాలా ప్రముఖమైనది. పూర్వము కన్యాకుబ్జ దేశములో అజామీళుడు అనే బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండేవాడు. అతడు ఒక వేశ్యావృత్తిలో ఉన్న శూద్రస్త్రీని వివాహం చేసుకున్నాడు. ఆ వేశ్య వ్యామోహంలో పడి అజామీళుడు బ్రాహ్మణులకు విధింపబడిన కర్మలు అన్నీ విడిచిపెట్టాడు. జూదము, వేట, మాంసము తినడం, దొంగతనాలు చేయడం, దారి దోపిడీలు చేయడం మొదలగు అసాంఘికమైన పనులు చేసి తనను, తన కుటుంబాన్ని పోషించుకోసాగాడు. కేవలం తన స్వార్థం కోసరం ఇతరులను హింసించడం, పీడించడం ఒక వృత్తిగా పెట్టుకున్నాడు.

ఈ ప్రకారంగా అజామీళుడికి 80 సంవత్సరములు నిండాయి. ఆయనకు పదిమంది సంతానము కలిగారు. ఆ సంతానములో ఆఖరి వాడి పేరు నారాయణ. ఆఖరి సంతానము అయిన నారాయణుడు అంటే అజామీళుడికి ఎంతో ప్రేమ. వచ్చీరాని

మాటలతో బుడి బుడి నడకలతో అలరించుచున్న నారాయణను చూచి మురిసిపోయేవాడు. ఇంతే కాకుండా తను మాంసము తింటూ వాడికీ తినిపించేవాడు. తను మద్యం తాగుతూ వాడిచేత తాగించేవాడు.

ఆ ప్రకారంగా అజామీళుడికి 80 ఏళ్లు నిండాయి. మృత్యువు అతనిని ఏక్షణం అయినా కబళించడానికిపొంచి ఉంది. ఈ విషయం తెలియని అజామీళుడు ఎప్పుడూ తన కుమారుడు నారాయణ ఎలా బతుకుతాడో అని దిగులుపడేవాడు. ఇంతలో అజామీళుడికి మరణకాలము ఆసన్నమయింది. యమభటులు వచ్చి అజామీళుడికి అటు ఇటు నిలబడ్డారు. నారాయణ దూరంగా ఆడుకుంటున్నాడు.

మరణం ఆసన్నమవడంతో అజామీళుడి గొంతులో గురగుర మొదలయింది. అలాగే గద్గదస్వరంతో దూరంగా ఆడుకుంటున్న కొడుకును "నారాయణా"... "నారాయణా" అని పిలుస్తున్నాడు. అజామీళుడు నారాయణ నామస్మరణ చేయడం విష్ణుదూతలకు వినబడింది. ఎవరో అవసానకాలంలో నారాయణ నామస్మరణ చేస్తున్నాడు అని తెలుసుకొని విష్ణుదూతలు కూడా అజామీళుడి వద్దకు వచ్చారు. అజామీళుడి కాలం తీరిపోవడంతో యమదూతలు అతని మెడకు పాశం వేసి లాగుతున్నారు. ఇంతలో విష్ణుదూతలు వచ్చి వారిని అడ్డుకున్నారు.

## షష్ఠ స్కంధము

యమదూతలు విష్ణుదూతలతో ఇలా అన్నారు. "అయ్యా! మీరెవరు. ఎందుకు యమభటులమైన మమ్ములను ధిక్కరించే సాహసము చేస్తున్నారు. మీరు చూడబోతే గొప్పవారి లాగా ఉన్నారు. మీ కళ్లు తామర రేకుల వలె ఉన్నాయి. పచ్చని పట్టు వస్త్రములను ధరించి ఉన్నారు. శంఖ చక్రములు కలిగి ఉన్నారు. మీ తలల మీద కిరీటములు కాంతులు వెదజల్లుతున్నాయి. మీ మెడలలో తామరపూల మాలలు అలంకరించుకొని ఉన్నారు. మీ శరీరముల నుండి వచ్చే కాంతితో ఈ ప్రదేశము అంతా ప్రకాశిస్తూ ఉంది. వీడు పాపాత్ముడు. వీడినిమేము యమధర్మరాజు వద్దకు తీసుకొని పోవడానికి వచ్చాము. మా పనికిమీరు ఎందుకు అడ్డుతగులుతున్నారు. " అని అడిగారు.

యమదూతల మాటలు విన్న విష్ణుభటులు వారితో ఇలా అన్నారు. "మా సంగతి అలా ఉంచండి. మీరు యమధర్మరాజు భటులము అని చెప్పుకుంటున్నారు కదా! మీకూ కొంత ధర్మం తెలిసి ఉంటుంది. కాబట్టి మాకు ధర్మము అంటే ఏమిటో, అధర్మము అంటే ఏమిటో తెలియజేయండి. మీరు పుణ్యం చేసిన వారిని, పాపం చేసిన వారిని ఏ ప్రాతి పదికన దండిస్తారు. వాటికి కారణములు చెప్పండి. పాప కర్మలు చేసే వారు అందరూ దండించబడటానికి అర్హులేనా లేక కొంతమంది పాపులు మాత్రమే దండనకు అర్హులా! ఈ విషయాలు అన్నీ తెలుసుకున్న తరువాత, అప్పుడు ఇతడు ధర్మం చేసాడో అధర్మం చేసాడో, పుణ్యం చేసాడో పాపం చేసాడో నిర్ణయించవచ్చును." అని అన్నాడు.

వారి మాటలకు యమధర్మరాజ భటులు ఇలా అన్నారు. "ఓ పుణ్యపురుషులారా! వేదములు అందరికీ ప్రమాణములు. వేదములు

సాక్షాత్తు నారాయణ స్వరూపములు, అపౌరుషేయములు. వేదములలో ఏ పనులు చెయ్యాలని అన్నారో ఆ పనులే ధర్మమైన పనులు. వేదములలో చెప్పబడిన దానికి వ్యతిరేకంగా చేస్తే అది అధర్మము అవుతుంది.

మానవులు చేసే ప్రతిపనికీ ప్రత్యక్ష సాక్షి సూర్యుడు, అగ్ని, ఆకాశము, వాయువు, దేవతలు, రాత్రి పూట చంద్రుడు, సంధ్యాకాలము. ఇంకా మానవులు చేసే పనులకు పగలు, రాత్రి, దిక్కులు, భూమి, నీరు, ఇవి అన్నీ సాక్ష్యములు. ఇంతమంది చూస్తూ ఉండగా పాపం చేస్తే వారికి దండన విధించబడుతుంది. వారు వారు చేసిన పాప కర్మలకు తగిన దండన విధించబడుతుంది.

ఓ మహాపురుషులారా! మానవులు కర్మలు చేయకుండా ఉండలేరు. కర్మలు చేయకుండా జీవించడం అసాధ్యం. మానవులు చేసే కర్మలలో పుణ్య కర్మలు, పాప కర్మలు రెండూ ఉంటాయి. ఎందుకంటే మానవులు తమలో అంతర్గతంగా ఉన్న సత్వ, రజస్, తమోగుణములను అనుసరించికర్మలు చేస్తుంటారు. ఆ కర్మలు మూడు విధములుగా ఉంటాయి. పుణ్య కర్మలు, పాప కర్మలు, పుణ్యము పాపము కలిసిన కర్మలు.  ఒక మనిషి ప్రస్తుతము చేసే కర్మలను బట్టి అతని గత జన్మలలో చేసిన కర్మలను, రాబోవు జన్మలో చేయబోయే కర్మలను ఊహించవచ్చును.

ఈ లోకంలో మానవులు చేసే కర్మలు అన్నిటినీ సమవర్తి అయిన యముడు నిరంతరము గమనిస్తూ ఉంటాడు. వారు

అంతకుముందు ఏమి కర్మలు చేసారో, తరువాతి జన్మలో ఏమేమికర్మలు చేయబోతారో, మరణానంతరము వారికి ఏయే శిక్షలు విధించాలో, మరుజన్మలో వారికి ఏయే దేహములు ఇవ్వాలో ఆలోచిస్తుంటాడు.

కాని మానవులకు పూర్వజన్మ స్మృతి ఉండదు. ఈ జన్మలో ఏ దేహంతో ఉన్నాడో అదే శాశ్వతము అనుకుంటాడు. నేను, నాది అని అహంకరిస్తుంటాడు. గత జన్మలో తను ఎవరో, ఏ కారణం వల్ల అతనికి ఈ జన్మవచ్చిందో తెలుసుకోలేడు. తాను ఈ జన్మలో చేస్తున్న కర్మల ఫలితంగా తనకు ఏ జన్మరాబోతుందో కూడా తెలుసుకోలేడు.

ఐదుజ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు తన్మాత్రలు, మనస్సు వీటితో జీవుడు కర్మలు చేస్తుంటాడు. ఈ ప్రకారం చేసే కర్మలలో పుణ్య కర్మలు, పాప కర్మలు, మిశ్రమ కర్మలు ఉంటాయి. పది ఇంద్రియములు, 5 తన్మాత్రలు, మనస్సు, మూడు గుణములు వీటి కలయికతో మానవుడు కర్మలు చేస్తూ సుఖదు:ఖములకు నిలయమైన సంసారబంధములో చిక్కుకుంటాడు. ఒకసారి సంసారములో పడిన తరువాత ఈ జీవునికి జ్ఞానము వివేకము నశిస్తుంది. ఇంద్రియములు వశము తప్పుతాయి. తనకు ఇష్టం లేకపోయినా కొన్ని కర్మలను విధిలేక చేస్తుంటాడు. పట్టుపురుగు ఎలాగైతే తన చుట్టు పట్టుదారములను అల్లుకొని, ఆ గూటిలో చిక్కుపడి బయటకు రాలేకపోతుందో, ఈ జీవుడు కూడా తాను చేసిన కర్మబంధనములలో చిక్కుపడి, బయటకు రాలేడు. బయటకువచ్చే మార్గము కూడా కనపడదు. ఆ కర్మలనుండి ముక్తి చెందడం ఎలాగో కూడా తెలుసుకోలేడు.

ఏ జీవుడు కూడా ఈ లోకంలో కర్మ చేయకుండా క్షణం కూడా జీవించలేడు. అది సాధ్యం కాదు. ఎందుకంటే ఆ జీవుడు గతజన్మలో చేసిన కర్మల వాసనలు ఈ జన్మలో అతని చేత కర్మలు చేయిస్తాయి. జీవుడు, తాను చేసిన కర్మలు మంచి ఫలితములను ఇస్తే అది తాను చేసుకున్న అదృష్టము అని పొంగిపోతాడు. ఇంకా కర్మలు చేస్తుంటాడు. ఈ జన్మవాసనలే అతని తదుపరి జన్మకు కారణం అవుతాయి.

ఈ లోకంలో పుట్టిన తరువాత, జీవుడు ప్రకృతితో సంబంధం పెట్టుకుంటాడు. నేను,నాది అనే అహంకారంలోపడిపోతాడు. సంసార బంధములో చిక్కుకుంటాడు. ఈ అజామీళుడు కూడా అలాంటి వాడే. అజామీళుడు అనే ఇతడు బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాడు. శాస్త్రములను చదువుకున్నాడు. సాత్విక గుణసంపన్నుడు. మంచి ఆచారములను పాటించాడు. దయ, క్షమ మొదలగు మంచి గుణములను అలవరచుకున్నాడు. ఇతని హృదయము కోమలమైనది. ఇంద్రియములను జయించాడు. పవిత్రంగా జీవించాడు. ప్రతిరోజూ అగ్ని కార్యం చేసేవాడు. అతిధులను పూజించేవాడు. ఇతనికి ఎవరిమీదా అసూయ లేదు. చాలా తక్కువగా మాట్లాడేవాడు.

ఇటువంటి సద్గుణ సంపన్నుడు అయిన ఈ అజామీళుడు ఒక రోజు తండ్రి ఆదేశము మేరకు పండ్లు, దర్భలు, సమిధలు తేవడానికి అడవికి వెళ్లాడు. అక్కడ ఒక నిర్జన ప్రదేశములో ఒక వేశ్య, తన విటునితో శృంగార కలాపాలు సాగించడం చూచాడు. అతని మనస్సు చలించింది. ఆ వేశ్య మీదికి మనసు పోయింది. అంతలో ధైర్యం

తెచ్చుకున్నాడు. తాను నేర్చిన శాస్త్రములు అన్నీ గుర్తుకు తెచ్చుకున్నాడు. తన మనస్సును నిగ్రహించుకోడానికి శతవిధాలా ప్రయత్నం చేసాడు. కానీ అతని వల్ల కాలేదు. అతడు చూస్తున్న దృశ్యం అటువంటిది. అక్కడి నుండి కదలలేకపోయాడు.

క్రమక్రమంగా అతని జ్ఞానము నశించింది. ఆ వేశ్య కావాలని మనస్సు తీవ్రంగా కోరింది. ఆ వేశ్యగురించి ఆలోచించసాగాడు. ఆమె ఇంటికి వెళ్లాడు. ఆమెకు దాసుడయ్యాడు. (చింతామణి నాటకంలో బిల్వమంగళుడి మాదిరి అయ్యాడు.) సర్వస్వాన్ని ఆ వేశ్యకు అర్పించాడు. తల్లి తండ్రులను భార్యను వదిలేసాడు. బ్రాహ్మణ ధర్మమును విడిచిపెట్టాడు. ఆ వేశ్యను వివాహం చేసుకున్నాడు. తండ్రి సంపాదించిన ధనం అంతా ఆ వేశ్యను సంతోష పెట్టడానికి వ్యయం చేసాడు. ఆమె సంతోషమే తన సంతోషం అనుకున్నాడు. ఆమె ఏమి కోరితే దానిని తెచ్చి ఇవ్వడానికి ఏ పని చేయడానికైనా వెనుకాడలేదు. అన్యాయంగా అక్రమంగా ధనం సంపాదించి ఆ వేశ్యను ఆమె కుటుంబాన్ని పోషించసాగాడు. ఆమెతో కూడా మద్యము సేవించేవాడు. మాంసము తినేవాడు. ఆమె కోసరం ఎన్నో పాపాలు చేసేవాడు.అతని జీవితం పాపపంకిలము అయింది. ఇంత జరిగినా అతనికి పశ్చాత్తాపం కలగలేదు. అతడు ఎటువంటి ప్రాయశ్చిత్తము చేసుకోలేదు. ఇప్పుడు ఇతనికి మరణం ఆసన్నం అయింది. అందుకని మేము ఇతనిని యముని వద్దకు తీసుకొని పోవడానికి వచ్చాము.
యమధర్మరాజు ఇతడు చేసిన పాపములకు తగినశిక్షలు విధించి అతనిని పరిశుద్ధుని చేస్తాడు." అని అన్నారు యమభటులు.

శ్రీమద్భాగవతము షష్ఠస్కంధము

మొదటి అధ్యాయము సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము

రెండవ అధ్యాయము.

యమభటులు చెప్పినది అంతాసావధానంగా విన్నారు విష్ణుభటులు. యమభటులతో ఇలా అన్నారు.

"మీరు చెప్పినది వింటుంటే యమధర్మరాజు సభలో కూడా అధర్మము జరుగుతూ ఉంది అనిపిస్తూ ఉంది. ఏ పాపమూచెయ్యని వారినీ, దండిచ తగని వారిని కూడా మీ యమధర్మరాజు దండిస్తున్నాడు అని స్పష్టం అవుతూ ఉంది.

యమధర్మరాజు ప్రజలను వాత్సల్యంతో పరిపాలించాలి. గురువు వలె జ్ఞాన బోధ చెయ్యాలి. అందరినీ సమంగా చూడాలి. కాని మీ యముడు దండించ తగని వారిని దండిస్తున్నాడు. ఇంక ఈ లోకంలో ప్రజలను ఎవరు రక్షిస్తారు. పెద్దవారు, శ్రేష్టమైన వారు ఆచరించిన ధర్మములనే ప్రజలుకూడా ఆచరిస్తారు. వారు దేనిని ప్రమాణంగా స్వీకరిస్తే ప్రజలు కూడా దానినే ప్రమాణంగా స్వీకరిస్తారు. ఎందుకంటే మానవులకు ధర్మాధర్మ విచక్షణ తెలియదు. వారు అమాయకులు. తన యజమాని ఒడిలో పెంపుడుజంతువులు పడుకొని నిశ్చింతగా ఉన్నట్టు ఈ ప్రజలుకూడా తమ యజమాని పాలనలో నిశ్చింతగా ఉంటారు. దయా సముద్రుడు అయిన మీ యమధర్మరాజు, తన మీద విశ్వాసము ఉంచిన అమాయక ప్రజలను ఎలా పీడించగలడు?

ఇంక ఈ అజామీళుడి వ్యవహారానికి వద్దాము. ఇతడు మొదట నిష్ఠాగరిష్ఠుడు. కాని ఒకానొక బలహీనక్షణంలో భ్రష్టుడయ్యాడు. కాని అతడు తన పాపములకు తగిన ప్రాయశ్చిత్తము చేసుకున్నాడు. ఈ జన్మలోనే కాదు గతజన్మలలో చేసిన పాపములను కూడా పోగొట్టుకున్నాడు. ఎలాగంటే ఈ అజామీళుడు తన అవసాన దశలో తన కుమారుని పిలిచే మిషతో నారాయణ నామ స్మరణ చేసాడు. అంతే కాదు ఆ కుమారుడిని భోజనానికి పిలిచేటప్పుడు, దూరంగా ఉన్నప్పుడు పిలిచేటప్పుడు నారాయణా నారాయణా అంటూ పదే పదే నారాయణ నామస్మరణ చేసాడు. దానితో అతని పాపములన్నీ పటాపంచలయ్యాయి. ఆతడు తను చేసినపాపములకు తగిన ప్రాయశ్చిత్తము చేసుకున్నట్టు అయింది.

ఓ యమభటులారా! ఇతరుల ధనమును, బంగారు ఆభరణములను అపహరించువాడు, మద్యపానము చేయువాడు, నమ్మిన మిత్రులకు ద్రోహము చేయువాడు, బ్రాహ్మణులను హత్య చేసినవాడు, గురువు గారి భార్యతో అక్రమ సంబంధము పెట్టుకున్నవాడు, ఆడువారిని అకారణంగా చంపేవాడు, గోవులను చంపి మాంసమును తినువాడు, తల్లి తండ్రులను హత్యచేసేవాడు, రాజద్రోహము చేసే వాడు, రాజునే హతమార్చేవాడు, ఇవే కాదు ఇంకా ఘోరకృత్యములను చేసేవాళ్లకూడా, విష్ణువుయొక్క నామమును పలుమారు భక్తితో పలికితే వారి పాపములకు ప్రాయశ్చిత్తము కలుగుతుంది. ఎందుకంటే తన నామును ఉచ్ఛరించే వారిని నారాయణుడు తన భక్తులుగా స్వీకరిస్తాడు. అక్కున చేర్చుకుంటాడు, కాపాడతాడు.

శ్రీహరి పేరును నిర్మలమైన భక్తితో పలికినంత మాత్రముననే వచ్చే ఫలము ఎన్ని యజ్ఞయాగములు, వ్రతములు, చేసినా కలుగదు. ఎన్ని పాపములుచేసినా, నారాయణనామస్మరణతోనే ప్రాయశ్చిత్తము కలుగుతుంది.

ఓ యమదూతలారా! కేవలము యజ్ఞములు వ్రతములు చేసుకున్నంత మాత్రాన చేసిన పాపములకు ప్రాయశ్చిత్తము కలుగదు. ఎందుకంటే, ఒకసారి ప్రాయశ్చిత్తము చేసుకున్న తరువాత, ఆ మానవుడు మరలా పాపములు చేయడం మొదలు పెడతాడు. అలా చేయకుండాఉండాలంటే శ్రీహరి మీద భక్తి, శ్రీహరి నామమును పలకడం ముఖ్యం. పాపములు చేయడానికి మూలమైన అవిద్య నాశనం కావాలంటే శ్రీహరిమీద భక్తి కలిగి ఉండటం ప్రధానము. శ్రీహరి మీద భక్తి మాత్రమే మనస్సును నిర్మలం చేస్తుంది. మరలా పాపం చెయ్యనివ్వదు.

ఈ అజామీళుడు తాను చనిపోయేసమయంలో తన కుమారుని పిలుస్తూ “నారాయణా నారాయణా” అంటూ శ్రీహరి నామమును చాలా సార్లు పలికాడు. అందువలననే ఇతను చేసిన పాపములకు ప్రాయశ్చిత్తము చేసుకున్నట్టు అయింది. కాబట్టి ఇతడు నరకలోకములకు తీసుకొని పోవుటకు అర్హుడు కాడు. ఇతనిని వదిలెయ్యండి.

ఓ యమభటులారా! అంతేకాదు. నారాయణ నామస్మరణ వలన వచ్చే ఫలము అంతా ఇంతా కాదు. ఏదో ఒక నెపంతో

నారాయణ నామ స్మరణ చేసినా, "నారాయణా నారాయణా" అంటూ పరిహాసంగా మాట్లాడినా, నారాయణ అర్థం వచ్చేటట్టు పాటలు పాడినా, యాదాలాపంగా నారాయణనామ స్మరణ చేసినా, అతను చేసిన పాపములు నశించిపోతాయి. అంతే కాదు ఎవడైనా పైనుండి కిందపడితే "నారాయణా" అంటూ అరుస్తాడు. జారిపడినా, దెబ్బతగిలినా "నారాయణా" అంటాడు. ఏదైనా తేలు,పాము కరిచినా, జంతువు తరిమినా "నారాయణా నారాయణా" అంటూ అరుస్తాడు. రోగంతో బాధపడుతున్నా, ఎవరిచేతనన్నా దెబ్బలు తింటున్నా ఆ బాధను తట్టుకోలేక "నారాయణా నారాయణా" అంటూ ఏడుస్తాడు. ఆ ప్రకారంగా అప్రయత్నంగా "నారాయణ" నామము ఉచ్ఛరించినా అతనికి నరకమునకు వెళ్లవలసిన అవసరం ఉండదు.

యమభటులారా! మహా ఋషులు అందరూ ఆలోచించి మానవులు చేసిన పాపముల యొక్క తీవ్రతను బట్టి ప్రాయశ్చిత్తములను నిర్ణయించారు. పెద్ద పెద్ద పాపములకు పెద్ద పెద్ద ప్రాయశ్చిత్తములను, చిన్న చిన్నపాపములకు చిన్న చిన్న ప్రాయశ్చిత్తములను నిర్ణయించారు. కాని శ్రీహరి నామస్మరణకు పెద్ద చిన్న తారతమ్యములేదు. ఒకసారి ఉచ్ఛరించినా, వేయి సార్లు ఉచ్ఛరించినా అతనిపాపములు హరించిపోతాయి.

యమభటులారా! తపస్సు చేయడం వలనా, దాన ధర్మములు చేయడం వలనా, వ్రతములు చేయడం వలనా చేసిన పాపములకు ప్రాయశ్చిత్తము చేసుకొనవచ్చును. అందులో సందేహము లేదు. కాని దాని వలన అతని హృదయములో ఉన్న మలినము తొలగిపోదు. అతను చేసిన పాపములకు మూలమైన చిత్తవృత్తులు,

చెడ్డ సంస్కారములు తొలగిపోవు. అవి కేవలము పరమాత్ముని ఎడల అచంచల మైన భక్తితోనూ, పరమాత్మ పాదసేవనముతో మాత్రమే తొలగిపోతాయి. ఒక్క చిన్న అగ్గి రవ్వ పెద్ద గడ్డివామిని సమూలంగా కాల్చివేసినట్టు, జ్ఞానముతో గానీ, అజ్ఞానముతోగానీ ఒక్కసారి నారాయణనామస్మరణ చేస్తే చాలు, అతని పాపరాసి దగ్ధము అయిపోతుంది. ఔషధము యొక్క గుణము తెలియకుండా దానిని లోపలకు తీసుకుంటే, అది దాని ప్రభావమును చూపకుండా మానుతుందా! అలాగే తెలిసి కానీ, తెలియకకానీ నారాయణ నామమును ఉచ్ఛరిస్తే, అదికూడా తన ప్రభావమును చూపకుండా ఊరుకోదు. కాబట్టి ఈ అజామీళుడు తనకుమారుని పిలిచే మిషతో నారాయణ నామమును పలుమారు పలికాడు కాబట్టి ఇతను చేసిన పాపములకు ప్రాయశ్చిత్తము చేసుకున్నట్టు అయింది. ఇప్పుడు ఇతడు మీరు అనుకున్నట్టు పాపాత్ముడు కాదు. ఇతనిని నరకమునకు తీసుకొని వెళ్లవలసిన అవసరము లేదు." అని తేల్చిచెప్పారు విష్ణుదూతలు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా విష్ణుదూతలు అజామీళుడిని యమదూతల బారి నుండి కాపాడారు. చేసేది లేక యమదూతలు తిరిగి ఒట్టి చేతులతో యమపురికి వెళ్లారు. అజామీళుడు తన పక్కనే నిలబడి ఉన్న విష్ణుభక్తులకు భక్తితో నమస్కరించాడు. వారిని చూస్తూ పరమానందమును పొందసాగాడు. యమదూతలు వెళ్లగానే విష్ణుదూతలు కూడా అక్కడి నుండి వెళ్లిపోయారు.

ఒక పక్క యమదూతలు మరొక పక్క విష్ణుదూతలు, వీరిరువురి సంవాదన విన్న తరువాత, అజామీళుడిలో అంతర్మధనం మొదలయింది. అతని మనస్సునిర్మలమయింది. శ్రీహరి మీద భక్తి కలిగింది. తాను అప్పటి దాకా చేసిన పాపపు పనులు ఒకటి వెంట ఒకటి గుర్తుకు రాసాగాయి. తనలో తాను ఇలా అనుకోసాగాడు.

"ఆహా! నేను ఎంతటి దుర్మార్గుడను. ఇంద్రియ సుఖములకు వశుడను అయ్యాను. మహాపతివ్రత అయిన భార్యను వదిలి ఒక వేశ్యను వివాహం చేసుకున్నాను. ఆమె వలన సంతానము కూడా పొందాను. నేను పుట్టిన బ్రాహ్మణ జాతికి ద్రోహం చేసాను. ఎంతో మంది సత్పురుషులను అవమానించాను. ఎన్నో పాపము పనులు చేసాను. పుట్టిన కులమునకు కళంకము తీసుకొని వచ్చాను. అనుకూలవతి అయిన భార్యను వదిలి పెట్టి, మద్యముతాగే వేశ్య వెంట తిరిగాను. నా తల్లితండ్రులు వృద్ధులు. వాళ్లకు నేనే దిక్కు. కానీ నేను దయలేకుండా వారిని విడిచిపెట్టాను. వారి ధనమును అపహరించి వేశ్యకు సమర్పించాను. ఎటువంటి దుర్మార్గుడైనా కన్న తల్లి తండ్రులను వారి వృద్ధాప్యములో వదిలిపెడతాడా! కాని ఆ పాపానికి నేను ఒడిగట్టాను. నాలాంటి కాముకుడికి, పాపికి నరకమే సరిఅయిన శిక్ష.

ఇప్పుడు జరిగినది అంతా నాకు కలలో జరిగినట్టు ఉంది. ఆ యమభటులు నన్ను లాగుకొని పోవడం, విష్ణుభటులు అడ్డుపడటం నాకు స్పష్టంగా తెలుస్తూ ఉంది. ఇప్పుడు వాళ్లంతా ఏమయినారు? ఎక్కడకు వెళ్లారు? నన్ను యమభటులు ఈడ్చుకొని పోతుంటే, నన్ను కాపాడిన విష్ణుపార్షదులు కూడా కనిపించడం లేదు. నేను ఎన్నోపాపములు చేసినా, నా పూర్వపుణ్యఫలము చేత విష్ణుదూతల

యొక్క దర్శనభాగ్యము కలిగింది. నా జన్మధన్యమయింది. ఇప్పుడు నా మనస్సు ప్రశాంతంగా ఉంది.

నా పూర్వపుణ్యవిశేషము వలన కాకపోతే, ఎన్నో పాపములు చేసిన నేను, నా అవసాన దశలో నా కుమారుని పిలిచే మిషతో "నారాయణ" నామస్మరణ చేయడం నాకుసాధ్యమా! పాపిని, వంచకుడను, జూదరిని, వంశములో చెడబుట్టినవాడిని నేనెక్కడ! పవిత్రమైన నారాయణ నామము ఎక్కడ! ఒక్కసారి చేసిన నారాయణ నామస్మరణతో నేను చేసిన సమస్త పాపముల నుండి విముక్తి పొందాను. అయినా మరలా అటువంటి పాపములను చేయను. నా మనస్సును, ఇంద్రియములను నిగ్రహించుకుంటాను. ఈసంసారము అనే మోహములో పడను.

ఈ దేహము మీద, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి, అభిమానము ఉండటం వలననే కదా విషయ వాంఛలయందు అనురక్తి కలిగింది. ఇదే జీవునికి బంధము కలుగజేస్తుంది. నేను ఇంక వాటి జోలికిపోను. ఇప్పటి దాకా జరిగినది అంతా ఆ భగవంతుని మాయగా భావిస్తాను. ఆ మాయ మూలంగానే నేను ఆ వేశ్య వలలో పడ్డాను. ఆమెకు వశం అయ్యాను. ఆమె చెప్పినట్టల్లా బొమ్మ మాదిరి ఆడాను. ఆ మాయ నుండి విముక్తుడను అయ్యాను. ఈ ప్రాపంచిక భోగములను, విషయ వాంఛలను అన్నిటినీ విడిచిపెడతాను. అందరికీ మేలు చేస్తాను. అందరి ఎడలా దయకలిగి ఉంటాను. సర్వవేళలా భగవంతునిమీద భక్తితో ఆయననుకీర్తిస్తూ ఉంటాను.

విష్ణుదూతలు చెప్పిన మాటలతో నా మనస్సు పరిశుద్ధమయింది. ఇంక ఈ ప్రాపంచిక ప్రలోభములకు, విషయ వాంఛలకు లొంగను. ఈ పరమాత్మ యందే నా మనస్సు నిలిచిఉంది. ఈ దేహము మీద ఉన్న అహంకారమును, అభిమానమును విడిచిపెడతాను." అని తనలో తాను అనుకున్నాడు అజామీళుడు.

అజామీళునిలో ఇటువంటి వైరాగ్యము అంకురించింది. వెంటనే అతడు హరిద్వారక్షేత్రమునకు వెళ్లాడు. యోగము అవలంబించాడు. పరమాత్మయందు బుద్ధినిలిపాడు. ఇంద్రియములను నిగ్రహించాడు. ఆత్మను దేహము నుండి వేరుచేసాడు. మనసులో భగవంతుని రూపమును నిలుపుకున్నాడు. సమాధిలో మునిగిపోయాడు.

ఆ ప్రకారంగా కొంతకాలం గడిచింది. ఒకనాడు అతని ముందు విష్ణుదూతలు నిలిచారు. అజామీళుడు వారిని చూచి ఆనందంతో నమస్కరించాడు. విష్ణుదూతల దర్శనం కాగానే అజామీళుడు ఈ దేహమును విడిచిపెట్టాడు. ఆకాశమార్గంలో శ్రీహరిని చేరుకున్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! అజామీళుడి కథ ద్వారా నారాయణనామ స్మరణ, భక్తియోగప్రాశస్త్యము తెలిసాయి కదా! అజామీళుడు బ్రాహ్మణకులములో పుట్టి, వేదాధ్యయనము చేసిననూ, వేశ్యాలంపటుడై భ్రష్టుడయ్యాడు. బ్రాహ్మణులకు తగిన ఆచార వ్యవహారములను విడిచిపెట్టాడు. భార్యను, తల్లితండ్రులను వదిలిపెట్టాడు. అనేక పాపపు పనులు చేసాడు. వాడు చేసిన పాపపు

పనులకు నరకమునకు తీసుకొని పోవుటకు యమదూతలు వచ్చారు. కాని శ్రీహరి కింకరులు వారిని అడ్డగించారు. అవసానదశలో నారాయణనామస్మరణ వలన అతని సకలపాపములకు ప్రాయశ్చిత్తము జరిగినది అని చెప్పారు.

కాబట్టి ఓ పరీక్షిత్ మహారాజా! మానవులు కర్మలు చేయడం, అందులోనూ పాప కర్మలు చేయడం సహజం. వాటికి రకరకాలైన ప్రాయశ్చిత్తములు చేసుకొనే కంటే, నిర్మలమైన మనస్సుతో నారాయణ నామస్మరణను మించిన ప్రాయశ్చిత్తము మరొకటిలేదు. శ్రీహరి నామమును జపించడం ద్వారా, శ్రీహరిని కీర్తించడం ద్వారా, జీవుడు తిరిగి పాపపంకిలములో పడడు.

ఎన్ని ప్రాయశ్చిత్తములు చేసుకున్నా, మనసుకు అంటుకొని ఉన్న రజోగుణము, తమోగుణముల ప్రభావము వలన జీవుడు మరలా పాపములు చేస్తూనే ఉంటాడు. నారాయణ నామ స్మరణ మహత్తును తెలిపే ఈ కథను నమ్మి భక్తితో శ్రీహరి నామ స్మరణ చేసేవాడు ఎంతటి పాపి అయినా అతని పాపములు నశించిపోతాయి. అతనికి నరక ప్రాప్తి కలగదు. యమదూతలు అతని వద్దకు రారు. అతడు సరాసరి విష్ణులోకమునకు వెళతాడు.

కాబట్టి ఓ పరీక్షిత్ మహారాజా! నిరంతరము భగవంతుని మీద భక్తితో, ఆయన నామ స్మరణ చేసేవారికి విష్ణుపదము లభిస్తుంది అనడంలో ఏ మాత్రము సందేహము లేదు.

నీవు అడిగిన ప్రశ్నకు ఇదే సరిఅయిన సమాధానము." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు నారాయణనామస్మరణ మహత్తును తెలియజేసాడు.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## షష్ఠస్కంధము
## మూడవ అధ్యాయము.

శుక మహర్షి చెప్పిన అజామీళుని వృత్తాంతము విన్న తరువాత పరీక్షిత్ మహారాజుకు ఇంకొక ఒక అనుమానం వచ్చింది.

"శుకయోగీంద్రా! ఈ లోకము అంతా యమధర్మరాజు అధీనములో ఉంది కదా! యముడు ఈ లోకమునుపాలిస్తున్నాడు కదా! మరి ఆయన ఆజ్ఞకే విలువ లేనపుడు, ఆ విషయం తన దూతల వలన తెలుసుకున్నప్పుడు, యమధర్మరాజు స్పందన ఎలా ఉంది? ఎందుకంటే యమధర్మారాజు ఆజ్ఞను ధిక్కరించడం ఇప్పటికి మనం వినలేదు. అసలు అలా జరుగుతుందని కూడా ఊహించలేము. ఇదినాకే కాదు అందరికీ కలిగే సందేహమే! ఈ సందేహమును తమరు తప్ప వేరు ఎవరూ తీర్చలేరు. కాబట్టి ఈ సందేహమును తీర్చండి." అని అడిగాడు పరీక్షిత్ మహారాజు.

ఆ మాటలు విన్న శుక యోగీంద్రుడు ఇలా సమాధానం చెప్పాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! విష్ణుదూతలచేత అడ్డగింపబడిన యమదూతలు నేరుగా యమధర్మరాజు వద్దకు పోయారు. జరిగినది అంతా ఆయనకు నివేదించారు. తరువాత ఆయమదూతలు యమునితో ఇలా అన్నారు.

"ఓ యమధర్మరాజా! ఈ లోకములో ఉన్న జీవులను శాసించే వాళ్లు ఎంతమంది ఉన్నారు? తమరు ఒక్కరేనా లేక ఇంకా చాలామంది ఉన్నారా? సత్వ, రజస్, తమోగుణములను అనుసరించి జీవులు కర్మలనుచేస్తుంటారు. ఆయాకర్మల ఫలాన్ని జీవులకు అందించే వ్యవస్థలు ఎన్ని ఉన్నాయి? ఈ లోకంలో తమ మాదిరి శాసనకర్తలు చాలా మంది ఉంటే, ఒకరి తీర్పును మరొకరు ఒప్పుకోరు. తరచు భేదాభిప్రాయాలు వస్తుంటాయి. ఒకరు ఒక జీవికి పుణ్యఫలము ఇస్తే మరొకరు అదే జీవికి అదే కర్మకు పాపఫలమును ఇస్తారు. ఈ విధంగా కొనసాగితే జీవులకు అటు పుణ్యఫలం గానీ, ఇటు పాపఫలం గానీ లభించదు. కొందరికి రెండు లభిస్తాయి. అంతా అస్తవ్యస్తము అవుతుందికదా!

ఈ లోకంలో అందరూ కర్మ చేసే వాళ్లే. ఆ కర్మలు చేసే వాళ్ల పాపపుణ్యములను విచారించి తీర్పులు చెప్పవలసిన శాసనకర్తలు చాలా మంది ఉన్నారు. ఇంతమందిని ఒకరే విచారించి తీర్పులు చెప్పలేరు కాబట్టి, చాలా మంది ఉండటం మంచిదే. కానీ, వీరందరూ

తమ పనులు సక్రమంగా నిర్వర్తిస్తున్నారా లేదా అని పర్యవేక్షించే ముఖ్యఅధికారి ఒకరుఉన్నారు కదా! అటువంటి ముఖ్యమైన అధికారి ఒకరే ఉంటారు కానీ, చాలామంది ఉండరు.

ఆ ప్రకారంగా ఈ లోకంలో ఉన్న శాసన కర్తలకు అందరికీ నీవే అధిపతివి. మానవులు చేసే పాపములు, పుణ్యములు విచారించి వారికి తగుఫలములను ఇచ్చు వాడివి నీవు ఒక్కడివే అనడంలో సందేహము లేదు. ఈ విషయం మాకు బాగా తెలుసు. కానీ నీవు ఇచ్చిన తీర్పునే ధిక్కరించడం ఈరోజు మేము చూచాము. ఎవరో నలుగురు సిద్ధపురుషులు వచ్చి మమ్ములను మా కర్తవ్యమును నిర్వర్తించకుండా అడ్డుకున్నారు.

అది ఎలాగంటే, మేము తమరి ఆదేశములను అనుసరించి ఒక పాపాత్ముని ప్రాణములను తీసుకొని రావడానికి వెళ్లాము. మేము ఆ పాపాత్ముని ప్రాణములను అతని శరీరము నుండి వేరుచేసి యాతనా శరీరములో ప్రవేశపెట్టు సమయములో నలుగురు పురుషులు వచ్చి మమ్ములను అడ్డగించి ఆ పాపాత్ముని విడిపించారు. దానికివారు చెప్పిన కారణము, ఆ పాపాత్ముడు తన అవసానకాలమున అతను తన కుమారుని పిలిచే నెపంతో "నారాయణా నారాయణా" అని "నారాయణ" నామస్మరణ చేసాడట. అందుకని ఆ పురుషులు అతనిని విడిపించారు. ఇంతకూ వాళ్లువవరు? ఆ పాపాత్ముని ఏ కారణం చేత మా నుండి విడిపించారు. దయచేసి చెప్పండి." అని అడిగారు.

ఆ మాటలు విన్న యమధర్మరాజుకు నారాయణ శబ్దం వినగానే ఒళ్లు గగుర్పొడిచింది. మనసులోనే శ్రీహరి

పాదములకునమస్కరించాడు. తరువాత తన దూతలతో ఇలా అన్నాడు.

"ఓ దూతలారా! మీ అందరికీ, ఈ యమలోకమునకు నేను అధిపతిని. అందులో సందేహము లేదు. కానీ అందరికంటే నేను అధికుడను అనడం మంచిది కాదు. నేను, ఇంద్రుడు, వరుణుడు, అగ్ని మొదలగు వారము లోకపాలకులము. మా అందరికీ ఈశ్వరుడు ఒకడు ఉన్నాడు. ఆయనే శ్రీహరి. ఆయన తన అంశలతోనే బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడుగా ఏర్పడి, సృష్టి, స్థితి, లయములు అనే కార్యములను నిర్వర్తిస్తున్నాడు. నిజానికి వీరు ముగ్గురూ ఒకరే. వేరు వేరు రూపములలో మనకు కనపడుతున్నారు.

ఈ లోకములో ఉన్న ప్రాణులన్నీ ఆ శ్రీహరి ఆజ్ఞకు లోబడి ప్రవర్తిస్తున్నాయి. ఈ ప్రాణులన్నీ వేదవాక్కులు అనే ఆ శ్రీహరి వాక్కులకు కట్టుబడి ఉన్నారు. రకరకాల పేర్లతో, రూపాలతో ఈ లోకంలో కర్మలు చేస్తున్నారు. బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్య,శూద్రులు అనే వర్ణములతోనూ, ఒక్కొక్కరు ఒక్కోపేరుతోనూ ఆ పరమాత్మ మాయకు లోబడి కర్మలు చేస్తున్నారు. ఆయాదేవతలను కొలుస్తున్నారు. నివేదనలు అర్పిస్తున్నారు.

నిజానికి, ఆ పరమాత్ముని మాయను ఎవరూ తెలుసుకోలేరు. నేను, ఇంద్రుడు, నిరృతి, వరుణుడు, చంద్రుడు, అగ్ని, శివుడు, పవనుడు, బ్రహ్మ, సూర్యుడు, విశ్వావసు, అష్టవసువులు, సిద్ధులు, సాధ్యులు, మరుద్గణములు, రుద్రగణములు, మరీచి మొదలగు బ్రహ్మమానసపుత్రులు, బృహస్పతి, సత్వ, రజస్తమోగుణములకు అతీతులైన భృగువు, మొదలగు సత్త్వగుణ

ప్రధానమైన మహాఋషులు వీరందరుకూడా ఆ పరమాత్మ గురించి పూర్తిగా తెలుసుకోలేకపోయారు. ఇంక ఆ పరమాత్మ మాయలో పడి కర్మలు చేసే సాధారణ జీవులు ఆ పరమాత్మను గురించి ఎలాతెలుసుకోగలరు?

ఈ జీవుల జ్ఞానము పరిమితము. వీరు పరమాత్మఇలా ఉంటాడు అని తమ ఇంద్రియముల ద్వారా చూడలేరు, వినలేరు, మాటలలో వర్ణించలేరు. ఆ శ్రీహరి యొక్క అనుచరులు కూడా శ్రీహరి అంతటి ప్రతిభావంతులు. వారు ఎల్లప్పుడూ ఈ లోకం అంతటా సంచరిస్తూ, భగవంతుని ఎడల అచంచలమైన భక్తి కలిగి ఉన్న వారిని రక్షిస్తూ ఉంటారు. ఈ శ్రీహరి అనుచరులను దేవతలు కూడా పూజిస్తారు, గౌరవిస్తారు.

భటులారా! ధర్మము అనేది ఆ పరమాత్మచే ఏర్పరచబడినది. ధర్మము ఇలా ఉంటుంది, ఇలా ఉండాలి అని భృగువు మొదలగు మహాఋషులే నిర్ణయించలేరు. ధర్మము యొక్క స్వరూపము దేవతలు, సిద్ధులు, అసురులు, మానవులు ఎవరూ నిర్ణయించలేరు. ఈ విశ్వంలో ధర్మమునకు నిర్వచనము తెలిసినవారు పన్నెండు మంది ఉన్నారు. వారు....బ్రహ్మ, నారదుడు, శివుడు, సనత్కుమారుడు, కపిలుడు, స్వాయంభువమనువు, ప్రహ్లాదుడు, జనకుడు, భీష్ముడు, బలి, శుకమహర్షి, ఆఖరున నేను (యముడు). వీరికి మాత్రమే ధర్మము దాని తత్త్వము పూర్తిగా తెలుసు.

ఈ ధర్మము చాలా క్లిష్టంగా ఉంటుంది. ఈ ధర్మము గురించి పూర్తిగా తెలుసుకున్న వాడికి పరమపదము లభిస్తుంది. ఈ ధర్మాన్ని తెలుసుకొనే సులభ మార్గం ఒకటి ఉంది. పరమాత్మ నామమును జపించడం కానీ, పరమాత్మను కీర్తించడం కానీ, పరమాత్మ ఎడల అచంచలమైన భక్తి, విశ్వాసములు కలిగి ఉండటం గానీ, జీవులకు పరమ ధర్మము అని చెప్పబడింది. అందుకు ప్రత్యక్ష ఉదాహరణ ఈ అజామీళుడు. కేవలం తన కుమారుని పిలిచే నెపంతో నారాయణనామ స్మరణ చేయడం వలన అతనిపాపములు అన్నీ నాశనం అయ్యాయి. అతడు మృత్యుపాశం నుండి విముక్తి పొందాడు. కాబట్టి హరినామ జపము, సంకీర్తనమును మించిన ధర్మము మరొకటి లేదు.

కొంతమంది ధర్మశాస్త్రాలు చదువుతారు. వేదములను అధ్యయనం చేస్తారు. అందులో ఉన్న ధర్మసూక్ష్మముల గురించి వాదోపవాదాలు చేస్తారు. ఎంతో ధనమును, కాలమును వెచ్చించి యజ్ఞయాగములను, వ్రతములను చేస్తారు. ఈ కర్మలలో మునిగి తేలుతుంటారు. తమకు అంతా తెలుసు అని విర్రవీగుతుంటారు. కాని వీటన్నిటికి మించినది శ్రీహరి నామ సంకీర్తనము అని తెలుసుకోలేక పోతున్నారు.

కాని బుద్ధిమంతులు, వివేకవంతులు అయినవారు ఆ వాసుదేవుని నామ స్మరణ, నామ సంకీర్తన, వాసుదేవుని ఎడల భక్తి ఇవే మృత్యుభయమునుండి విడిపిస్తాయని, తెలిసో తెలియకో పాపం చేస్తే ఆ పాపములు అన్నీ నశించి పోతాయనీ చెబుతారు.

కాబట్టి ఓ యమభటులారా! మీరు వాసుదేవుని భక్తుల జోలికి వెళ్లకండి. ఎందుకంటే శ్రీహరి భక్తులను శ్రీహరి అనుచరులు ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటారు. శ్రీహరి భక్తులను నేనుకానీ, కాలము కానీ ఏమీ చేయలేము. కానీ నిరంతరము ప్రాపంచిక విషయములలో మునిగితేలుతూ విషయవాంఛాలోలురై శ్రీహరి నామమును కలలో కూడా స్మరించని వారిని వెతికి వెతికి పట్టుకొని తీసుకొని రండి." అనిపలికాడు యమధర్మరాజు. తరువాత యముడు శ్రీహరిని తన మనసులో తలచుకొని తన దూతలు చేసిన తప్పుకు క్షమించమని ప్రార్థించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ అజామీళుని కథ వలన, యముని మాటల వలన ఈ లోకానికి తెలిసింది ఏమిటంటే శ్రీహరి నామ సంకీర్తనమే అన్ని పాపములను నాశనం చేస్తుంది. శ్రీహరిని గురించిన కథలను వినడం వలన శ్రీహరి నామ స్మరణ చేయడం వలన శ్రీహరి మీద అచంచలమైన భక్తి కలుగుతుంది. ఆ భక్తి మానవుల మనసులను శుద్ధిచేస్తుంది. ఈ పని ఎన్ని వ్రతములు చేసినా సాధ్యంకాదు.. తెలిసో తెలియకో చేసిన పాపములు అన్నీ శ్రీహరి నామ సంకీర్తనముతో, శ్రీహరి యందలి భక్తితో నాశనం అవుతాయి.

శ్రీహరియందు భక్తి లేని వారు, తాము చేసిన పాపములను కర్మకాండలు జరిపించడం ద్వారా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి అని అనుకొంటారు. కానీ కర్మకాండల వలన మనస్సు పరిశుద్ధం కాదు. ప్రాయశ్చిత్తము చేసుకోగానే మరలా పాపాలు చేయడం మొదలుపెడతారు. ఎందుకంటే మలినమైన వారి మనస్సు ఎల్లప్పుడూ పాపాలు చేయడం వైపు పరుగెడుతూ ఉంటుంది.

శ్రీహరియందు భక్తితో మనస్సును పరిశుద్ధం చేసుకోనంత కాలము ఎన్ని కర్మకాండలు చేసినా ప్రయోజనం లేదు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ అజామీళోపాఖ్యానమును ఒకసారి  నాకు అగస్త్యుడు వినిపించాడు. దానిని నీకు చెప్పాను." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు అజామీళుని కథ వినిపించాడు.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము మూడవఅధ్యాయము సంపూర్ణము
ఓంతత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

. శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము
నాలుగవఅధ్యాయము.

పరీక్షిత్ మహారాజు శుకయోగీంద్రునితో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! స్వాయంభువ మన్వంతరములో దేవతలు, అసురులు, మానవులు, పశువులు, పక్షులు సృష్టించబడ్డాయి అని చెప్పారుకదా. వాటి గురించి వివరంగా తెలుపండి. ఆ పరమాత్మ ఏ శక్తితో ఈ సృష్టి చేసాడు, ఏ విధంగా చేసాడు వివరించండి." అని అడిగాడు. శు కయోగీంద్రుడు పరీక్షిత్ మహారాజుతో ఇలా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ప్రాచీన బర్హి కుమారులు పది మంది తమ తపస్సును ముగించుకొని సముద్రము నుండి బయటకు వచ్చారు. వారికి లోకమంతా వృక్షములతోనిండి ఉండటం కనిపించింది. వారికి పోవడానికి దారి లేదు. వారికి కోపం వచ్చింది. అప్పటి దాకా తపస్సు చేసి ఉండటం వలన వారి కోపములో నుండి అగ్ని పుట్టింది. వారు నోటి నుండి వాయువు వెలువడింది. అగ్నికి వాయువు తోడై ఆ వృక్షములను కాల్చివేస్తున్నాయి.

ఇది బ్రహ్మ గారికి తెలిసింది. వెంటనే బ్రహ్మ వృక్షములకు, వనస్పతులకు, ఓషధులకు అధిపతి అయిన చంద్రుని ప్రచేతసుల వద్దకు పంపాడు. వారి కోపము శాంతింప జేయమని కోరాడు. చంద్రుడు ప్రచేతసుల వద్దకు వచ్చాడు. వారితో ఇలా అన్నాడు.

"మహాత్ములారా! ఈ విధంగా మీ కోపమును ఈ వృక్షముల మీద చూపించి వీటిని కాల్చడం మంచిది కాదు. మీరు బ్రహ్మ యొక్క ఆదేశము ప్రకారము సృష్టిని కొనసాగించడానికి ఆదేశింపబడ్డారు. కాని మీరు సృష్టిని నాశనం చేస్తున్నారు. ఇది మీకు తగదు. వృక్షములను, మొక్కలను, ఓషధులను పరమాత్మ జీవులకు ఆహారంగా సృష్టించాడు. మీరు ఆ జీవుల నోటిదగ్గర అన్నమును నాశనం చేస్తున్నారు. ఆ పరమాత్మ ఆదేశమును ధిక్కరిస్తున్నారు. ఆహారము ఓషధులు లేకపోతే ప్రజలు చనిపోతారు.  ఇది మీకు మంచిది కాదు.

ఈ సృష్టిలో ఒకటి మరొక దానికి ఆహారము గా నిర్ణయింపబడింది. చెట్లు, మొక్కలు, వాటికి పూచే పూలు, కాయలు, పండ్లు, ధాన్యము, జీవులకు ఆహారంగా నిర్ణయింపబడ్డాయి. గడ్డి,

ఆకులు, మొక్కలు పశువులకు ఆహారంగా నిర్ణయింపబడ్డాయి. కొన్ని చిన్న చిన్న మృగములు పులులు, సింహములు మొదలగు మృగములకు ఆహారంగానిర్ణయింపబడ్డాయి. కొన్ని పశువులు, పక్షులు, మృగములు మానవులకు ఆహారంగా నిర్ణయింప బడ్డాయి. ఈ విధంగా సృష్టిలో అన్ని జీవులకు ఆహారాన్ని ఆ పరమాత్మ సమకూర్చాడు. మీరు ఆ వ్యవస్థను నాశనం చేస్తున్నారు. ఇది మంచిది కాదు.

(ఇక్కడ ఒక విషయం గమనించండి.. ఈ నాడు మనం కూడా ఆ ప్రాచేతసుల మాదిరి సెజ్‌ల పేరుతో అడవులను నరుకుతున్నాము. కాలుస్తున్నాము. అందమైన ఇళ్ల నిర్మాణానికి కావలసిన కలప కోసరం, కూడా చెట్లను నరుకుతున్నాము. ఈ పనులు చేస్తున్నాము. ఈ ప్రకారంగా సృష్టి క్రమాన్ని నాశనం చేయడం మానవులు, మృగముల మనుగడకే ముప్పు అని ఆ నాడు చంద్రుడు చెప్పాడు. ఈ నాడు పర్యావరణ వేత్తలు చెబుతున్నారు. కాని ఎవరూ పట్టించుకోవడం లేదు. స్వార్థపరుడైన మనిషికి ఇవి తలకెక్కడం లేదు.)

ఓ మహాత్ములారా! మీ తండ్రి అయిన ప్రాచీన బర్హి మిమ్ములను సృష్టి చేయమని నియమించాడు. దాని కోసరం మీరు తపస్సు చేసారు. తపస్సునుండి వచ్చిన తరువాత మీరు సృష్టిని కొనసాగించడానికి బదులు ఉన్న సృష్టిని నాశనం చేస్తున్నారు. (ఈ రోజుల్లో కూడా మొక్కలు నాటండిరా బాబూ అంటే ఉన్న చెట్లను నరుకుతున్నారు.) ఇదేనా మీకు మీ పెద్దలు, మీ తండ్రులు, తాతలు ముత్తాతలు నేర్పిన జ్ఞానము? మీకు కోపం వస్తే వృక్షములను నాశనం చేస్తారా? ఇది మీకు తగునా? ఇందుకేనా మీరు తపస్సు చేసి తపశ్శక్తిని సంపాదించింది. తల్లి తండ్రులు తమ బిడ్డలకు రక్షకులు.

కంటి రెప్పలు కంటికి రక్ష, స్త్రీకి భర్త రక్ష. అతిధులకు గృహస్థు రక్ష, అజ్ఞానికి జ్ఞాని రక్ష, అందరకూ జీవితమును ప్రసాదించిన పరమాత్మ అన్ని జీవులకు రక్ష. ఈ సృష్టిలో ఉన్న జీవులకు వృక్షములు, మొక్కలు, ఔషధములు రక్ష. (వృక్షోరక్షతి రక్షిత: మనకు తిరుమలలో కనిపించే నినాదము. ఈ నినాదం ప్రతిచోటా ప్రతినోటా పలకాలి). ప్రజలను రక్షించే వృక్షములను కాల్చడం మీకు ధర్మమా!

ఓ మహాత్ములారా! ఈ సృష్టిలో ఉన్న ప్రతి ప్రాణిలోనూ పరమాత్మ అంతర్లీనంగా వెలుగుతున్నాడు. మీరు ప్రతి ప్రాణిలోనూ పరమాత్మను చూడండి. అంతేకానీ సృష్టిని నాశనం చేయకండి. కోపం అందరికీ వస్తుంది. ఆ కోపమును నిగ్రహించుకున్నవాడే గొప్పవాడు. అటువంటి వానికి దు:ఖములు దూరంగా ఉంటాయి. ఒక్కసారి అటు చూడు. ఈ వృక్షములు తగలబడిపోతూ ఎంతో దీనంగా చూస్తున్నాయి. అవి మీకు ఏమి అపకారం చేసాయని వాటిని తగలబెడుతున్నారు. కనీసం తగలబడిపోగా మిగిలిన వృక్షములను రక్షించండి. ఆ వృక్షములు పెంచి పోషించిన కన్య మారిషను వివాహం చేసుకోండి. అందరికీ శుభం కలుగుతుంది."అని చంద్రుడు ప్రచేతసులకు నచ్చచెప్పాడు.

చంద్రుని మాటలకు ప్రచేతసులు తమ కోపాన్ని వదిలిపెట్టారు. ప్రమ్లోచ అనే అప్సరసకు పుట్టిన ఆ కన్యను వివాహమాడారు. వారికి దక్షుడు జన్మించాడు. ఆ దక్షుడు సృష్టి చేయనారంభించాడు. ఆ దక్షుని సృష్టితో లోకం అంతా నిండిపోయింది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ దక్షుడు ఎలా సృష్టిని కొనసాగించాడో చెబుతాను విను. బ్రహ్మ దక్షుని ప్రజాపతిని చేసాడు. దక్షప్రజాపతి తన మనోబలంతో దేవతలను, అసురులను, మానవులను, ఆకాశంలో తిరిగే పక్షిజాతులను, భూమి మీద తిరిగే జంతువులను,, జలములో నివసించేవాటిని సృష్టించాడు. సృష్టించబడ్డవి అలాగే ఉన్నాయి. పెరిగి పెద్దవి అవుతున్నాయి కానీ మరలా అవి సృష్టిచేయడం లేదు.

దక్షుడికి ఏమీ తోచలేదు. మరలా వింధ్యపర్వతము సమీపంలో శ్రీహరిని గూర్చి తపస్సుచేయసాగాడు. దక్షుడు చేసిన తపస్సుకు శ్రీహరికి సంతోషం కలిగింది. దక్షుడు శ్రీహరిని హంసగుహ్యము అనే స్తోత్రంతో కీర్తించాడు. దానిని నీకు చెబుతాను విను.

ఈ మాయను జయించిన వాడు, సత్వ, రజస్తమో గుణములకు మూలమైనవాడు, ఎవరికీ కనిపించని వాడు, మానవులకు ఉన్న మనస్సు చేత, బుద్ధిచేత తెలియబడనివాడు, స్వయంప్రకాశకుడు, పుట్టుక లేని వాడు అయిన ఆ పరమాత్మకు నమస్కరిస్తున్నాను.

ఎల్లప్పుడూ జీవుల హృదయములలో ఉండి కూడా ఆ జీవులతో తెలియబడని వాడు అయిన ఆ పరమాత్మకు నమస్కారము.

ఈ దేహము, అందులో ఉన్న ప్రాణములు, ఇంద్రియములు, వాటి శక్తులు, మనస్సు, బుద్ధి ఇవన్నీ కూడా ఈ దేహములో నిరంతరము వెలుగుతున్న పరమాత్మను గురించి కొంచెంకూడా తెలుసుకోలేవు. కాని ప్రాణులలో ఉన్న పరమాత్మకు అన్ని విషయములు తెలుసు. ఆయనకు తెలియనిది లేదు. అట్టి పరమాత్మకునమస్కారము.

జీవుడికి జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తావస్థ ఉంటాయి. దాని తరువాతది సమాధి. జీవుడు స్వప్నావస్థలో తాను ఇదివరకు చూచిన విషయములను చూస్తుంటాడు. వింటాడు. సుషుప్తిలో అన్నీ మరిచిపోయి హాయిగా నిద్రపోతాడు. కాని సమాధిలో ఉన్నప్పుడు, తాను జాగ్రవదావస్థలో చూచినవి, విన్నవి అన్నీ మరిచిపోతాడు. కేవలము సచ్చిదానందస్వరూపుడైన  పరమాత్మను దర్శిస్తాడు. జీవుల సమాధి స్థితిలో ప్రకాశించే ఆ పరమాత్మకు నమస్కారము.

కట్టెలో నిప్పు దాగిఉన్నట్టే ప్రతీ జీవిలోకూడా పరమాత్మ అంతర్లీనంగా ఉన్నాడు. వివేకవంతులు, జ్ఞానులు ఆ పరమాత్మను ధ్యానిస్తూ ఉంటారు. ఆ పరమాత్మకు నమస్కారము.

ఈ బాహ్య ప్రపంచంలో ఎన్నో వింతలు విశేషాలు కనపడుతుంటాయి. మానవులు వాటి వెంట పడుతుంటారు. వాటి అన్నిటిలో అంతర్లీనంగా ఉన్న ఆత్మతత్వమును చూడలేరు. ఈ బాహ్యప్రపంచములో ఉన్న విషయములను పక్కకు నెడితే ఆత్మస్వరూపము గోచరము అవుతుంది. ఆ పరమాత్మయే రకరకాల పేర్లతో పిలువడబుతుంటాడు. రకరకాల రూపములతో పూజింపబడుతుంటాడు. రకరకాలుగా కీర్తింపబడుతుంటాడు.

అటువంటి పరమాత్మకు నమస్కరిస్తున్నాను.

మానవులు తమ వాక్కులతో నిరూపించేది, బుద్ధితో ఆలోచించేది, ఇంద్రియములతో చూడబడేది, వినబడేది, తాక బడేది, మనస్సుతో సంకల్పించబడేది..ఏదీ కూడా నీవు కావు, అది నీ స్వరూపము కాదు. నీవు గుణములకు అతీతుడవు. ఎందుకంటే ఈ మూడుగుణములు నీలో పుట్టి నీలోనే లయం అవుతున్నాయి. అటువంటి నీకు నమస్కారము.

ఈ విశ్వము అంతా ఎవని యందు లీనమై ఉన్నదో! ఈ అనంత విశ్వము ఎవని వలన సృష్టింపబడినదో! ఏ కారణముచేత సృష్టింపబడినదో! ఈ విశ్వానికి ఎవరితో సంబంధం ఉందో! ఎవరు ఈ కర్మలను అన్నీ చేయిస్తున్నాడో! ఈ లోకంలో మానవులు చేసే పాప పుణ్య కర్మలకు పరమ కారణము ఎవరో ఆయనే బ్రహ్మము. ఆయన అన్నిటికంటే ప్రాచీనుడు. ఎందుకంటే ఈ లోకంలో కనపడే ప్రతి వస్తువుకు ఆయనే కారణము. ఆయనకు అది ఇది అనే భేదము లేదు. అటువంటి నిర్గుణుడికి నమస్కరించుచున్నాను.

ఎవని శక్తి వలన మానవులు మాట్లాడుతున్నారో, వింటున్నారో, చూస్తున్నారో, వివిధ విషయముల మీద వాదించుకుంటున్నారో, అట్టి అనంతగుణ సంపన్నుడైన పరమాత్మకు నమస్కారము.

కొంత మంది జ్ఞానము మంచిది అంటారు. కొంతమంది కర్మలు చేయమంటారు. కొంతమంది నీవు ఉన్నావు అంటారు. మరి కొందరు నీవు లేవంటారు. వీటన్నిటిని మించిన నీవు నాకు ప్రసన్నుడవు కావాలి.

ఓ దేవా! నీకు జన్మలేదు. నీకు రూపములేదు. దేశ కాలములు నిన్ను బంధించవు. నీకు ఏ ఆకారము లేదు. పేరు లేదు. కానీ నీ భక్తులను అనుగ్రహించడానికి వివిధములైన అవతారములు దాల్చి నీ లీలలను అందరికీ చూపుతున్నావు. అట్టి లీలామానుష విగ్రహుడవైన నీకు నమస్కారము.

నిజానికి గాలికి ఏ రూపమూ లేదు. ఏ వాసనా లేదు. కానీ ఆ గాలి పూల మీది నుండి వీచినప్పుడు సుగంధ పరిమళ భరితంగా ఉంటుంది. చల్లని నీటిమీదినుండి వీచినప్పుడు చల్లగా ఉంటుంది. దుమ్ము మీద ధూళిమీద వీచినప్పుడు ఆ దుమ్ము, ధూళి రేగి ఎర్రగానూ, రకరకాల రంగులలో కనపడుతుంది. అలాగే నీవుకూడా సకల జీవుల దేహములలో ఉండి, నానా రూపములు ధరిస్తావు. అలాగే నీవు వివిధములైన దేవతారూపములను ధరించి, మానవులచేత పూజింపబడతావు. అన్ని దేవతారూపములు నీవే అని, అన్నీ నీ రూపములే అని తెలియని మానవులు నిన్ను వివిధ రూపములతో పూజిస్తుంటారు. అట్టినీకు నమస్కారము." అని దక్షుడు పరమాత్మను స్తోత్రము చేసాడు.

దక్షుడు చేసిన స్తోత్రమునకు మెచ్చిన పరమాత్మ శ్రీమహావిష్ణువుగా దక్షుని ముందు సాక్షాత్కరించాడు. ఆ సమయంలో

విష్ణువు గరుడుని మీద ఎక్కి ఉన్నాడు. ఆయనకు ఎనిమిది భుజములు. ఎనిమిది చేతులలో ఎనిమిది ఆయుధములు ఉన్నాయి. పసుపు పచ్చని పట్టు వస్త్రము. శ్యామల వర్ణముగల దేహము. ప్రసన్నంగా ఉండే ముఖము. కరుణకురిపించే కళ్లు. పాదముల దాకా వేలాడే వనమాల. తలమీద కిరీటము. వక్షస్థలములో శ్రీవత్సము అనే మచ్చ. కంఠసీమలో కౌస్తుభము. చెవులకు మకరకుండలములు. చేతులకు కంకణములు. భుజములకు భుజకీర్తులు. వేళ్లకు ఉంగరములు. కటి ప్రదేశమున బంగారుమొలతాడు. ఈ ఆకారంతో శ్రీమహావిష్ణువు ప్రత్యక్షం అయ్యాడు. విష్ణువు వెంట నారదుడు, ఇంద్రుడు మొదలగు లోకపాలకులు, సిద్ధులు, గంధర్వులు, చారణులు,ఉన్నారు.

ఆ ప్రకారంగా తన ఎదురుగా నిలబడి ఉన్న మహావిష్ణువును చూచాడు దక్షుడు. చేతులు జోడించి నమస్కరించాడు. దక్షుని కళ్ల ఆనంద భాష్పములతో నిండిపోయాయి. ఆయనకు నోటమాటరాలేదు. అప్పుడు శ్రీమహావిష్ణువు దక్షునితో ఇలా అన్నాడు.

"ఓదక్షప్రజాపతీ! నీవు ఎంతో శ్రద్ధతో నా గురించి తపస్సుచేసావు. నీ తపస్సు సిద్ధించింది. లోకమును అభివృద్ధి చేయడానికి నువ్వు తపస్సు చేసావు. నీ వలన సర్వభూతములు అభివృద్ధిచెందుతాయి.

ఓ దక్షా! బ్రహ్మ, శివుడు, లోకపాలకులు, ప్రజాపతులు అందరూ నా అంశ నుండి పుట్టినవారే. దక్షా! తపస్సు అంటే నియమ నిష్ఠలతో ధ్యానం చేయడమే. తపస్సే నా హృదయము. విద్య నా

దేహము. చేతులతో చేసే పనులు, నోటితో చేసే శబ్దములు అన్నీ క్రియలే. ఆ క్రియలే నా ఆకారము. మానవులు చేసే యజ్ఞములు నా అవయవములు. యజ్ఞము చేయడం వలన కలిగే ఫలము నా మనస్సు. ఆ యజ్ఞములో హవిస్సులను స్వీకరించే దేవతలు నా ప్రాణములు. ఇదే నా ఆకారము. నాకు వేరు ఆకారము అంటూ లేదు.

ఈ విశ్వం పుట్టక ముందు నేను ఒక్కడినే ఉన్నాను. అప్పుడు ఈ ప్రకృతి కానీ, విషయవాంఛలు కానీ ఏమీ లేవు. కేవలం చైతన్యం ఉండేది. అది కూడా నిద్రావస్థలో జడంగా ఉండేది. నేను ఈ విశ్వం అంతటా వ్యాపించి ఉన్నాను. అప్పుడు నా నుండి మాయ పుట్టింది. ఆ మాయవలన ఈ విశ్వం అంతా ప్రకటితము అయింది. నా నుండి బ్రహ్మ జన్మించాడు. బ్రహ్మ అయోనిజుడు.స్వయంగా పుట్టినవాడు.

పద్మములో నుండి పుట్టిన బ్రహ్మ సృష్టి చేయ సంకల్పించాడు. కాని ఆయన వల్ల కాలేదు. అప్పుడు బ్రహ్మ నా గురించి తపస్సు చేసాడు. ఆ తపోబలము చేత మరీచి మొదలగు తొమ్మిదిమందిని సృష్టించాడు బ్రహ్మ. ఆ ప్రకారంగా సృష్టి మొదలయింది. ఇప్పుడు  సృష్టిని కొనసాగించవలసినదిగా బ్రహ్మ నిన్ను నియమించాడు. పంచజనుడు అనే ప్రజాపతికి అసిక్ని అనే కుమార్తె ఉంది. ఆమెను నీవు వివాహం చేసుకో. ఆమెను భార్యగా స్వీకరించి, ఆమెతో మైధున క్రియ ద్వారా ప్రజలనుసృష్టించు. నీవు సృష్టించిన ప్రజలు నీ మాదిరి భార్య భర్తలుగా మైధున క్రియలో పాల్గొని, సంతానమును అభివృద్ధి చేస్తారు. ఆ విధంగా ఈసృష్టి నిర్విరామంగా కొనసాగుతుంది.

ఆ ప్రకారంగా సృష్టించబడిన ప్రజలు నన్ను పూజిస్తారు." అని పలికి శ్రీమహావిష్ణువు అంతర్ధానము అయ్యాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము
ఐదవ అధ్యాయము.

శుకమహర్షి పరీక్షిత్ మహారాజుతో ఇలా అన్నాడు.

"మహారాజా! దక్షప్రజాపతి అసిక్ని అనే ఆమెను వివాహం చేసుకున్నాడు అని చెప్పాను కదా! ఆమెకు దక్షుని వలన పదివేల మంది కుమారులు జన్మించారు. వారి పేరు హర్యశ్వులు. వారందరూ దక్షుని మాదిరే ఉన్నారు. ఆ హర్యశ్వుల గుణములు, ఆకారములు అన్నీ దక్షుని పోలి ఉన్నాయి. దక్షుడు తన కుమారులను పిలిచి, వారందరినీ వివాహము చేసుకొని మైధున క్రియ ద్వారా సంతానమును వృద్ధిచేయమనీ, సృష్టినికొనసాగించమనీ ఆదేశించాడు.

తండ్రి ఆదేశము మేరకు వారందరూ సింధు నది సముద్రములో కలిసే చోటికి వెళ్లారు. అక్కడ నారాయణ సరోవరము

ఉంది. అక్కడ సిద్ధులు తపస్సు చేసుకుంటూ ఉంటారు. దక్షుని కుమారులు ఆ నారాయణ సరోవరములో స్నానం చేద్దామని అందులోకి దిగారు. ఆ నీళ్లు వారి శరీరములకు తగలగానే వారి హృదయములలో ఉన్న ప్రాపంచిక విషయములకు సంబంధించిన కోరికలు అన్నీ నశించాయి. వారి బుద్ధి సన్యాసము నందు లగ్నం అయింది. ఇంతలో వారికి తమ తండ్రి ఆదేశము గుర్తుకు వచ్చింది. అందుకని వారు మనస్సును నిగ్రహించుకొని తపస్సు చేయడానికి నిశ్చయించుకున్నారు.

ఆ సమయంలో నారదుడు వారి వద్దకు వచ్చాడు. దక్షుని ఆదేశమును పాటించడానికి, సృష్టిని కొనసాగించడానికి వారు చేస్తున్న తపస్సును చూచాడు. వారితో ఇలా అన్నాడు.

"దక్షుని కుమారులారా! మీకు ఏమి తెలుసని తపస్సు చేస్తున్నారు. మీకు ఈ భూమి ఎంతవరకు ఉందో తెలుసా! నేను చెబుతాను వినండి. ఈ భూమి అంతమయ్యే చోట ఒక రాజ్యము ఉంది. ఆ రాజ్యములో ఒక పురుషుడు ఉన్నాడు. ఆ రాజ్యములో ఒక సొరంగ మార్గము ఉంది. ఆ సొరంగములోకి వెళ్లడమే కానీ బయటకు వచ్చే మార్గము లేదు. ఆ రాజ్యములో ఒక స్త్రీ ఉంది. ఆమె ఎవరితో అంటే వారితో తిరిగే బుద్ధి కలది.

ఆ రాజ్యములో ఒక నది ఉంది. ఆ నది అటు వైపు ఇటు వైపు అంటే రెండు దిక్కులా ప్రవహిస్తూ ఉంటుంది. ఆ రాజ్యములో ఒక ఇల్లు ఉంది. ఆ ఇల్లు 25 వస్తువులచేత నిర్మింపబడింది. ఒక్కడ ఒక హంస ఉంది. ఆ హంస చిత్ర విచిత్రంగా కూస్తూ ఉంటుంది. ఆ రాజ్యంలో ఒక

గుండ్రని చక్రము ఉంది. ఆ చక్రము వజ్రము అంత కఠినంగా ఉంటుంది. ఆ చక్రము దానంతట అదే తిరుగుతూ ఉంటుంది.

కుమారులారా! ముందు మీరు వాటిని చూడండి. వాటి గురించి తెలుసుకోండి. అర్థం చేసుకోండి. ఎందు కంటే మీరు దక్షుని కుమారులైనా, ప్రజాపతి సంతానమైనా మీకు సరిఅయిన జ్ఞానం లేదు. ఈ విషయములు అన్నీ తెలియకుండా మీరు సృష్టిని ఎలా చేయగలరు. మీ తండ్రికి అన్నీ తెలుసు. ఆయన ఏమి చెప్పాడో మీకు సరిగా అర్థం కాలేదు. మీ తండ్రి చెప్పినది అర్థం కాకుండా మీరు సృష్టిని ఎలా చేయగలరు."అని పలికాడు నారదుడు.

నారదుడి మాటలు వారికి ఏమీ అర్థం కాలేదు. వారందరూ ఒక చోట కూర్చుని తమ బుద్ధిని ఉపయోగించి, నారదుని మాటలకు సరి అయిన అర్థం తెలుసుకోడానికి ప్రయత్నం చేయసాగారు. నారదుడు ముందు భూమి అన్నాడు. భూమి అంటే క్షేత్రము. అంటే ఈ శరీరము. ఇది స్థూల శరీరము. ఇందులో సూక్ష్మశరీరము అనేది ఒకటి ఉంది. ఇందులోనే జీవుడు ఉండి సుఖములను, దు:ఖములను అనుభవిస్తూ ఉంటాడు. ఈ శరీరముతో చేయబడే కర్మలే బంధములకు మూలము. ఈ కర్మబంధములను నాశనం చేయకుండా యజ్ఞములు, యాగములు, తపస్సులు, వ్రతములు చేయడం వలన ఏమి ప్రయోజనము లేదు అని నారదుని భావము అని తెలుసుకున్నారు.

# షష్ఠ స్కంధము

తరువాత నారదుడు భూమి అంతమున ఒక రాజ్యము ఉంది అన్నాడు. అక్కడ ఒక పురుషుడు ఉన్నాడు అని చెప్పాడు. ఆ పురుషుడే పరమాత్మ, ఈశ్వరుడు, వాసుదేవుడు. అన్ని ఐశ్వర్యములు ఆయనలోనే ఉన్నాయి. ఆయన అన్నిటినీ సాక్షిగా చూస్తుంటాడు. ఆ పరమాత్మ వేరే ఆశ్రయములో అంటే మరొక స్థానంలో లేడు. తనలో తానే ఉన్నాడు. ఆ పరమాత్మకు తెలియకుండా ఏమీ జరగదు. ఆ పరమాత్మకు సమర్పించని కర్మలు అసలు కర్మలే కావు. అందువలన ఈ కర్మకాండల వలన ఏమి ప్రయోజనము అని నారదుని భావము అని తెలుసుకున్నారు.

తరువాత నారదుడు ఆ రాజ్యములో ఒక సొరంగ మార్గము ఉందని చెప్పాడు. అందులోకి వెళ్లడమే కానీ బయటకు రావడం ఉండదు అని చెప్పాడు. ఆ సొరంగమే పరమాత్మయొక్క స్థానము. బ్రహ్మస్థానము. ఒకసారి అక్కడకు చేరుకుంటే మరలా జన్మ ఉండదు. ఈ జనన మరణ చక్రములో తిరగవలసిన పనిలేదు. ఆ పరమాత్మను చేరుకొనే మార్గము తెలుసుకొనకుండా, స్వర్గ సుఖాలను, ఇతర సుఖాలను కోరుకుంటూ  ఎన్ని తపస్సులు చేసినా ఏమీ ప్రయోజనము లేదు అని నారదుని భావన అని అర్థం చేసుకున్నారు.

అక్కడ ఒక స్త్రీ ఉందని, ఆమె తన ఇష్టం వచ్చినట్టు తిరుగుతుందని  చెప్పాడు నారదుడు. ఆ స్త్రీ యే బుద్ధి. మానవునిలో ఉన్న సత్వ, రజస్ తమోగుణములను అనుసరించి ఆ బుద్ధి తన ఇష్టం వచ్చిన నిర్ణయాలు చేస్తుంటుంది. అందులో మంచి నిర్ణయాలు ఉంటాయి. చెడునిర్ణయాలు ఉంటాయి. చెడ్డ భార్య ఉంటే ఆ పురుషుడు ఎంత బాధ పడతాడో, అలాగే తన ఇష్టం వచ్చిన నిర్ణయాలు

తీసుకునే బుద్ధితో జీవుడు ఎన్నో బాధలు పడతాడు. ఆ బుద్ధి చెప్పినట్టు ఆడతాడు. ఆ బుద్ధిని నియంత్రించకుండా, కర్మలు చేయడం వలనా, తపస్సులు చేయడం వలన ప్రయోజనం ఏమిటి అని నారదుని అభిప్రాయంగా తెలుసుకున్నారు దక్షుని కుమారులు.

తరువాత నారదుడు అక్కడ ఒక నది ఉంది ఆ నది రెండు వైపులా ప్రవహిస్తూ ఉంటుంది అని చెప్పాడు. ఆ నది పరమాత్మ సృష్టించిన మాయ. ఆ నది ఇటు సృష్టి వైపు, అటు ప్రళయం వైపు ప్రవహిస్తుంది. అంటే పుట్టుక, చావు. ఈ నది మధ్యలో పడి మానవులు కొట్టుకుంటుంటారు. ఈ నదిలోనుండి బయటకు వచ్చే మార్గాలు రెండు. ఒకటి తపస్సు (మరలా ఈ జనన మరణ చక్రంలో పడకుండా మోక్షం కోసరం ప్రయత్నించడం), రెండవది విద్య (తెలియనివితెలుసుకోవడం). మానవులు ఈ రెండు పనులు చేయకుండా కేవలము కోరికలు కోరుకుంటూ, స్వర్గ సుఖాల కోసరం తపస్సులు, సాంసారిక సుఖాల కోసరం కర్మలు, వ్రతాలు, చేస్తుంటారు. వీటివలన ఎలాంటి ప్రయోజనము లేదు అని నారదుని భావము అనితెలుసుకున్నారు.

నారదుడు అక్కడ ఒక గృహము ఉందనీ అది 25 వస్తువులతో నిర్మించబడినది అనీ చెప్పాడు. ఆ గృహమే పరమాత్మ. ఆయన 25 తత్త్వములతో నిండిఉన్నాడు. (మహాతత్త్వము, సత్త్వ,రజస్తమోగుణములు, పంచభూతములు, పంచ తన్మాత్రలు, పది ఇంద్రియములు, మనస్సు.) ఈ తత్త్వములు అన్నీ ఆ పరమాత్మలోనుండి పుట్టినవే. వీటి గురించి, ఆ పరమాత్మ గురించి, పూర్తిగా

తెలుసుకోకుండా, అహంకారంతో నేను, నాది అనే భావనతో కర్మలు చేయడం వలన ఏమి ఫలితం ఉంటుంది అని నారదుని అభిప్రాయంగా తెలుసుకున్నారు దక్షుని కుమారులు.

తరువాత నారదుడు ఒక హంస గురించి, అది చిత్ర విచిత్ర ధ్వనులు చేస్తుంది అని చెప్పాడు. ఆ హంసయే వేదములు, శాస్త్రములు. వేదములు,శాస్త్రములు తత్త్వజ్ఞానమును ఉపదేశిస్తాయి. వేదములను, శాస్త్రములను అధ్యయనం చేయకుండా. సృష్టిచేయడానికి ప్రయత్నించడం అవివేకము అని నారదుని భావన అని తెలుసుకున్నారు.

తరువాత నారదుడు వజ్రము వంటి కఠినమైన చక్రము గురించి చెప్పాడు. అదే కాలచక్రము. ఈ విశ్వం అంతా కాలచక్రము వలన నియంత్రింపబడుతూ ఉంటుంది. ఆ కాలచక్రము గురించి తెలుసుకోకుండా సృష్టి అనే కర్మను ఒక తపస్సు లాగా చేస్తాననడం అజ్ఞానముకదా అని నారదుని భావము అని తెలుసుకున్నారు.

ఇది అంతా నారదుడు గమనిస్తున్నాడు. తానుచెప్పింది వారికి అర్థం అయింది అని గ్రహించాడు. ఇంకా ఇలా అన్నాడు. “కుమారులారా! ఉపనయనము మానవునికి రెండవ జన్మతో సమానము. అందుకే ఉపనయనము చేసుకున్నవానిని ద్విజుడు అని అంటారు. ఆ ఉపనయనము శాస్త్ర ప్రకారము జరుగుతుంది. ఆ శాస్త్రమును తండ్రివద్ద నుండి నేర్చుకుంటాడు కుమారుడు. ఉపనయనములో కూడా తండ్రి కుమారునకు గాయత్రి మంత్రమును

ఉపదేశం చేస్తాడు. ఆగాయత్రిమంత్రము ఉపదేశము జన్మరాహిత్యము నకు దారి తీస్తుంది కానీ, జనన మరణ చక్రములో పడటానికి కాదు. మీ తండ్రి మీకు బ్రహ్మోపదేశము చేసాడు.కానీ సంసారములో పడి సంతానమును కనమంటున్నాడు. ఇది ఎలా సాధ్యము అవుతుంది. మీరు ఆలోచించండి." అని ఉపదేశించాడు నారదుడు.

నారదుని మాటలు బాగా అర్థం చేసుకున్నారు దక్షుని కుమారులు. తమమార్గము సన్యాసము కానీ సంసారము కాదు అని నిశ్చయించుకున్నారు. మోక్షమార్గమును వెతుక్కుంటూ వెళ్లిపోయారు. తరువాత నారదుడు హరినామ సంకీర్తన చేసుకుంటూ అక్కడి నుండి వెళ్లిపోయాడు.

తరువాత నారదుడు దక్షుని వద్దకు వెళ్లాడు. "నీవు నీ కుమారులను సంతానోత్పత్తి చేయమని పంపావు. వాళ్లు దానికి విరుద్ధంగా సన్యాసం స్వీకరించారు." అని చెప్పాడు. ఈ మాటలు విన్న దక్షుడు తన కార్యము సఫలంకానందుకు ఎంతో బాధ పడ్డాడు. మరలా తన భార్యయందు వేయి మంది కుమారులను పుట్టించాడు. వారిపేరు సబలాశ్వులు. యధావిధిగా దక్షుడు తన కుమారులను వివాహం చేసుకొని సంతానోత్పత్తి చేసి సృష్టిని కొనసాగించమని ఆదేశించాడు.

వారు కూడా తమ సోదరులు వెళ్లినట్టు సింధు నదీ తీరంలో ఉన్న నారాయణ తీర్థమునకు వెళ్లారు. నారాయణ తీర్థములో మునిగినంతనే వారి మనస్సులో ఉన్న కోరికలు తొలగి పోయాయి.

వారి మనస్సులు నిర్మలం అయ్యాయి. ఆ సమయంలో నారదుడు మరలా వారి వద్దకు వచ్చాడు. హర్యక్షులకు చెప్పినట్టు వారికికూడా మోక్షమార్గమును ఉపదేశించాడు.

"ఓ దక్షుని కుమారులారా! మీరు నా మాటలను శ్రద్ధగా వినండి. మీ అన్నలు కూడా నా మాటలు విని మోక్షమార్గమును అవలంబించారు. మీరుకూడా మీ అగ్రజుల మార్గమును అవలంబించండి. మీకు ధర్మం తెలుసు. ధర్మం తెలిసిన వారు తమ కన్నా పెద్దవారి మార్గమును అనుసరిస్తారు. అటువంటి వారు మరుత్తు మొదలగు బ్రహ్మమానసపుత్రులయొక్క, దేవతల యొక్క అనుగ్రహమును పొందుతారు. తరువాత మీ ఇష్టం." అని చెప్పి వెళ్లిపోయాడు నారదుడు.

నారదుని మాటలను శ్రద్ధగా విన్న సబలాశ్వులు కూడా తండ్రి ఆదేశములను పాటించక, తమ అన్నలు అనుసరించిన మోక్షమార్గమును వెదుక్కుంటూ వెళ్లిపోయారు. సంతానోత్పత్తి చేస్తాము అని వెళ్లిన తన కుమారులు ఎన్నాళ్లకు తిరిగిరాకపోయేసరికి దక్షుడు ఆందోళన చెందుతున్నాడు. ఈ సారి కూడా నారదుడు తన బోధనలతో తన కుమారుల మనసు మార్చి వారిని సంసార మార్గమున కాకుండా మోక్షమార్గము వైపు మళ్లించాడని తెలుసుకున్నాడు దక్షుడు. దక్షుని కోపమునకు అవధులు లేవు. వెంటన నారదుని వద్దకు వెళ్లాడు.

"ఓ నారదా! నీవు కేవలం సాధువు, ముని వేషములో ఉన్న దుర్మార్గుడివి. క్రూరుడివి. నేను ఈ సృష్టిని కొనసాగించడానికి నా కుమారులను నియోగిస్తే నీవు వారిని సన్యాస మార్గములోకి

మళ్లిస్తావా! నాకు అన్యాయం చేస్తావా! నీకు ఒక విషయం తెలుసా! మానవులు పుట్టినంతనే ఋషి ఋణము, దేవఋణము, పితృ ఋణము తీర్చుకోవాలి. నా కుమారులు బ్రహ్మ చర్యము అవలంబించి ఋషి ఋణము తీర్చుకున్నారు. యజ్ఞములు చేసి దేవతల ఋణము తీర్చుకోవాలి. తండ్రి మాటలను పాటించి పితృఋణము తీర్చుకోవాలి.. సంతానమును ఉత్పత్తి చేయడం ద్వారానే మానవులు పితృ ఋణము తీర్చుకోగలరు. నా కుమారులు దేవ ఋణము, పితృఋణము తీర్చుకోకుండా నువ్వు అడ్డుపడ్డావు. నా కుమారులకు ఈ లోకములో కానీ, స్వర్గలోకములో కానీ సుఖము లేకుండా చేసావు. నీవు పాపాత్ముడవు. నీ వలన నీవు నిత్యము స్మరించే కీర్తించే శ్రీహరికి కూడా చెడ్డపేరు తెచ్చావు. నీకు దయా దాక్షిణ్యములు లేవు. సిగ్గు లేదు. ఇంక నీవు  శ్రీహరి అనుచరులతో ఎలా కలిసి మెలిసి తిరుగగలవు. నీకు ఇద్దరి మధ్య కలహములు పెట్టడం, వారి మధ్య శత్రుత్వము కలిగించడం  తప్ప మరొక పని లేదా! తండ్రి కుమారుల మధ్య అన్న దమ్ముల మధ్య, స్నేహితుల మధ్య విబేధములు, వైరము సృష్టించడానికి నీకు సిగ్గుగా అనిపించడం లేదా!

నీవు సన్యాసివి. సన్యాసి వేషంలో ఉండి సంసారుల మధ్య తగవులు సృష్టిస్తున్నావు. అసలు నీకు సంసారము గురించి ఏమి తెలుసు?  దు:ఖములకు, సుఖములకు మూల కారణమైన విషయ సుఖములను అనుభవించనిదే, మానవులకు అందులో ఉన్న విషయ తీక్ష్ణత తెలియదు. విషయ సుఖములు అనుభవిస్తేనే కానీ, సుఖదు:ఖములకు మూలకారణం తెలుసుకోవడం కష్టం. అందుకే మేము కర్మలు చేస్తున్నాము. మేము వైదిక కర్మలను ఆచరించి వైదిక

ధర్మమును రక్షిస్తున్నాము. మేము గృహస్థాశ్రమములో ఉండి జ్ఞానమును సంపాదిస్తున్నాము. కానీ నీవు నా కుమారులను గృహస్థాశ్రమమునకు దూరం చేసావు. సన్యాసుల మార్గము అవలంబించేటట్టు చేసావు. నాకు భరించరాని దు:ఖమును కలుగజేసావు. ఒక సారి చేసావు. సహించాను. రెండవ సారి కూడా అదే పని చేసావు. ఇంక సహించలేను. నీవు పరమమూర్ఖుడవు. పుత్రనాశకుడవు. ఇదే నా శాపము. నీకు ముల్లోకములలో స్థిరనివాసముఉండదు. నిత్యము సంచరిస్తుంటావు. ఎవరూ నీకు ఆశ్రయము ఇవ్వరు. ఎక్కడా నీకు స్థానము లభించదు." అని దక్షుడు నారదుని శపించాడు.

ఆ మాటలు విన్న నారదుడు నవ్వుతూ "నీ వాక్కులు ఫలించు గాక! నాకు కావాల్సింది అదే" అని హరి నామ సంకీర్తన చేసుకుంటూ వెళ్లిపోయాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! నారదునికి తిరిగి దక్షునికి ప్రతి శాపం ఇవ్వడానికి సమర్ధత ఉన్నప్పటికినీ, దక్షుని శాపమును ఒక వరంగా స్వీకరించాడు నారదుడు. అదే నారదుని గొప్పతనము." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకుచెప్పాడు.

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## షష్ఠస్కంధము

## ఆరవ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఇలా చెప్పాడు.

"మహారాజా! ఈ విధంగా తన కుమారులు సృష్టిని కొనసాగించడంలో తన మాట వినకుండా సన్యాసము స్వీకరించిన తరువాత, దక్షుడు చాలా బాధ పడ్డాడు. బ్రహ్మదేవుడు దక్షుని ఓదార్చాడు. తిరిగి ప్రయత్నం చేయమన్నాడు. ఈ సారి దక్షుడు కుమారుల మీద నమ్మకం పెట్టుకోలేదు. మగ వాళ్లు కాబట్టి సన్యాసము పుచ్చుకున్నారు. ఆడువారు అయితే అలా చెయ్యలేరు కదా అని ఈ సారి అరవై మంది కుమార్తెలను కన్నాడు.

ఆ అరవై మంది పుత్రికలను ధర్మదేవతకు పదిమంది కుమార్తెలను, కశ్యపునకు పదముగ్గురు కుమార్తెలను, చంద్రునకు 27 మంది కుమార్తెలను, భూత పతికి ఇద్దరుకుమార్తెలను, అంగిరసునికి ఇద్దరు కుమార్తెలను, కృశాశ్వునికి ఇద్దరుకుమార్తెలను మిగిలిన నలుగురు కుమార్తెలను తార్క్ష్యుడు అని పిలువబడే కశ్యపునకు ఇచ్చి వివాహం చేసాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు ఇప్పుడు ఆ దక్షకుమార్తెల పేర్లను, వారి సంతానము గురించి వివరంగా చెబుతాను. ఈ 60 మంది దక్ష పుత్రికల సంతానము వృద్ధి చెంది స్వర్గలోకము, మానవ

లోకము, పాతాళ లోకములోనూవ్యాపించి ఉన్నారు.

ధర్మదేవతకు పది మంది పుత్రికలను ఇచ్చాడు అని చెప్పాను కదా. వారి పేర్లు 1.భాను, 2.లంబ, 3.కకుద్ 4.యామి, 5.విశ్వ, 6.సాధ్య, 7.మరుత్వతి 8.వసు 9.ముహూర్త, 10 సంకల్ప. వీరికి కలిగిన సంతానము గురించి చెబుతాను విను.

1.భానుకు దేవఋషభుడు జన్మించాడు. దేవ ఋషభునకు ఇంద్రసేనుకు కుమారుడు.

2. లంబకు విద్యోత అనే కుమారుడు, విద్యోతకు మేఘములు జన్మించాయి.

3.కకుదకు సంకటుడు, సంకటునకు కీకటుడు, కీకటునకు దుర్గాదేవిని పూజించే దేవతలు జన్మించారు.

4.యామి కుమారుడు స్వర్గ, స్వర్గ కు నంది జన్మించారు.

5. విశ్వకు విశ్వేదేవులు జన్మించారు.

6.సాధ్యకు అర్థసిద్ధి జన్మించాడు.

7.మరుత్వతికి మరుత్వానుడు, జయంతుడు అనే కుమారులు జన్మించారు. ఈ జయంతుడే వాసుదేవుని అంశ అయిన ఉపేంద్రుడు.

8.ముహూర్త కు మౌహూర్తకులు అనే దేవతలు జన్మించారు. ఆ మౌహూర్తకులే జీవులకు కాలమును బట్టి ఫలితములను ఇస్తుంటారు.

9.సంకల్ప కు సంకల్పుడు జన్మించాడు. సంకల్పునికి కోరికలు కలిగాయి.

10. వసుకు అష్ట వసువులుజన్మించారు. వారి పేర్లు 1.ద్రోణుడు, 2.ప్రాణుడు, 3.ధ్రువుడు. 4.అర్కుడు, 5.అగ్ని, 6.దోషుడు. 7. వాస్తు, 8.విభావసుడు. వీరి సంతానము గురించి వివరిస్తాను.

1.ద్రోణునకు అతని భార్య అభిమతి ద్వారా హర్షము, శోకము, భయము అనే సంతానముకలిగారు.

2.ప్రాణుని భార్యఅయిన ఊర్జస్వతి ద్వారా సహుడు, ఆయువు, పురోజవుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు.

3.ధ్రువునికి అతని భార్య ధరణి ద్వారా అనేకములైన పట్టణములు పురములు ఏర్పడ్డాయి.

4.అర్కుని భార్య వాసన ద్వారా తృష్ట మొదలగు కుమారులు జన్మించారు.

5. అగ్ని భార్య ధార. వారికి ద్రవిణుడు మొదలగు కుమారులకుజన్మనిచ్చింది.

6.దోషుని భార్య శర్వరి. వీరికి శింశుమారుడు జన్మించాడు.

7.వాస్తు అనే వసువు భార్య పేరు అంగిరసి.వారికి విశ్వకర్మ జన్మించాడు. ఈ విశ్వ కర్మ కుమారుడే చాక్షుస మనువు. ఈ మనువు కుమారుడే విశ్వేదేవులు, సాధ్యులు.

8. విభావసుడు అనే వసువు భార్యపేరు ఉష. వారికి వ్యుష్ట, రోచిష, ఆతపుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. ఆతపునకు దినములు జన్మించారు. దినములు ఏర్పడగానే మానవులు తమ తమ పనులను పగలు చేసుకుంటూ రాత్రి విశ్రాంతి తీసుకుంటూ జీవనం సాగించారు.

మహారాజా! దక్షుడు, భూతుడు అనే వాడికి ముగ్గురు కుమార్తెలను ఇచ్చాడు అని చెప్పాను కదా! భూతుడి భార్య పేరు సరూప. వారికి కోటి మంది రుద్రులు సంతానము కలిగారు. ఆ కోటి మందిలో ఏకాదశ రుద్రులు ముఖ్యులు. వారి పేర్లు చెబుతాను విను.

1.రైవతుడు, 2.అజుడు, 3.భవుడు, 4.భీముడు, 5.వాముడు, 6.ఉగ్రుడు, 7.వృషాకపి 8.అజైకపాదుడు, 9. అహిర్బుధ్న్యుడు,10. బహురూపుడు,11.మహత్తు.

ఈ భూతునికి ఇంకొక భార్య ద్వారా ఘోరమైన ప్రేతములు, వినాయకులు కలిగారు.

మహారాజా! అంగిరసునకు స్వధ, సతి అనే ఇద్దరు భార్యలని చెప్పానుకదా! వారిలో స్వధ అనే భార్య పితృగణములను తన పుత్రులుగా స్వీకరించింది. సతి అనే భార్య అథర్వ, అంగిరస అనే వేదమును పుత్రుడుగా స్వీకరించింది.

కృశాశ్వునకు అర్చిస్సు, ధిషణ అనే భార్యలు ఉన్నారు. వారిలో అర్చిస్సునకు ధూమకేతువు, ధిషణకు వేదశిరుడు, దేవలుడు, వయునుడు, మనువు అనే కుమారులు కలిగారు.

మహారాజా! తార్క్ష్యుడు అనే కశ్యపునకు దక్షుడు తన నలుగురు కుమార్తెలను ఇచ్చాడు అని చెప్పాను కదా! వారిపేర్లు వినత, కద్రువ, పతంగి, యామిని. వారిలో పతంగి అనే ఆమె పక్షులకు, యామిని మిడతలకు, వినత గరుడుడు, డేగలు మొదలగు పక్షులకు, కద్రువ నాగులకు జన్మనిచ్చింది. వినత కుమారులే శ్రీమహావిష్ణువు వాహనము గరుడుడు,సూర్యుని రథసారథి అనూరుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! చంద్రునికి  దక్షుడు తన 21 మంది కుమార్తెలను ఇచ్చి వివాహం చేసాడని చెప్పాను కదా! ఆ 21 మందిలో చంద్రుడు రోహిణి అనే ఆమె మీద ఎక్కువ ప్రేమ, అనురాగము చూపించేవాడు. మిగిలిన 20 మందిని నిర్లక్ష్యము చేసేవాడు. దానితో 20 మంది దు:ఖముతో కుమిలిపోతున్నారు. కుమార్తెల బాధను చూచి దక్షుడు చలించిపోయాడు. చంద్రుని పిలిచి మందలించాడు. అందరినీ సమానంగా చూడమన్నాడు. చంద్రుడు బుద్ధిగా సరే అన్నాడు. కానీ మరునాటి నుండి మరలా రోహిణి కొంగుపట్టుకొని తిరగడం మొదలెట్టాడు.

దక్షుడు ఇంక తట్టుకోలేకపోయాడు. చంద్రుని క్షయరోగవ్యాధితో బాధపడమని శపించాడు. అప్పుడుచంద్రునికి జ్ఞానోదయం అయింది. మామగారైన దక్షుని కాళ్ల మీదపడ్డాడు. క్షమించమని వేడుకున్నాడు. దక్షుడు ప్రసన్నుడు అయ్యాడు. తనశాపమును కొంచెం మార్చాడు. తాను ఇచ్చిన శాపము పౌర్ణిమ నుండి మొదలవుతుందనీ, ఆరోజు నుండి చంద్రునికళ లు క్రమ క్రమయంగా క్షీణిస్తాయనీ, అమావాస్యకు పూర్తిగా క్షీణించిపోతాయనీ, మరునాటి నుండి క్రమక్రమంగా చంద్రకళలు పెరుగుతాయనీ, పౌర్ణమి దాకా పెరిగి పౌర్ణమి నాడు చంద్రుడు సంపూర్ణకళలను సంతరించు కుంటాడనీ తన శాపమును మార్పుచేసాడు దక్షుడు. దానితో సంతృప్తి చెందాడు చంద్రుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇంక మిగిలింది కశ్యపుడు. అతనికి దక్షుడు తన పదముగ్గురు కుమార్తెలను ఇచ్చాడు అని చెప్పాను కదా.

వారి పేర్లు.......అదితి, దితి, దనువు, కాష్ఠ, అరిష్ఠ, సురస, ఇల, ముని, క్రోధవశ,. తామ్ర, సురభి, సరమ, తిమి.ఈ పదమూడు మంది కశ్యపుని భార్యలు. వీరి వలన సృష్టి సంపూర్ణం అయింది. వీరి సంతానముతో లోకములు నిండిపోయాయి. వీరే ఈ జగత్తులో ఉన్న జీవజాతులన్నిటికీ తల్లులు. వీరి సంతానము గురించి చెబుతాను విను.

1.తిమిర అనే ఆమెకు జలములో తిరిగే జంతువులు అన్నీ పుట్టాయి.

2.సరమకు సింహము, పులులు, మొదలగు నాలుగు కాళ్ల జంతువులు పుట్టాయి.

3.సురభికి ఆవులు, గేదెలు, రెండు గిట్టలు కల జంతువులు పుట్టాయి.

4.తామ్రకు డేగలు, గ్రద్దలు, మొదలగు ఆకాశంలో ఎక్కువ ఎత్తులో ఎగిరే పక్షులు కలిగాయి.

5.మునికి అప్సరసలు జన్మించారు.

6.క్రోధవశ అనే ఆమెకు దోమలు, సర్వములు పుట్టాయి.

7.ఇలకు వృక్షములు పుట్టాయి.

8.సురసకు రాక్షసులుజన్మించారు.

9.అరిష్ట అనే ఆమెకు గంధర్వులు జన్మించారు.

10.కాష్టము అనే ఆమెకు ఒకే గిట్ట కలిగిన గుర్రములు మొదలగు జంతువులు జన్మించారు.

11.దనువు కు అరవై ఒక్క మంది కుమారులు జన్మించారు. వారిని దానవులు అంటారు. వారిలో 18 మంది ముఖ్యులు. వారి పేర్లు...1.ద్విమూర్ధుడు. 2.శంబరుడు. 3.అరిష్టుడు. 4.హయగ్రీవుడు. 5.విభావసుడు. 6.అయోముఖుడు. 7.శంకుశిరసుడు. 8.స్వర్భానుడు. 9. కపిలుడు.10.అరుణుడు. 11.పులోముడు. 12.వృషపర్వుడు. 13.ఏకచక్రుడు. 14.అనుతాపనుడు. 15.ధూమ్రకేశుడు.

16.విరూపాక్షుడు. 17.విప్రచిత్తి. 18.దుర్జయుడు.

(కశ్యపునకు 13 భార్యలు అని చెప్పుకున్నాము కదా. అందులో దనువు 11వ భార్య. ఇప్పుడు ఆమెసంతానము గురించి చెప్పుకుంటున్నాము. ఇంకా అదితి, దితి అనే వారు ఉన్నారు అని జ్ఞాపకం పెట్టుకోండి చాలు.)

పైన చెప్పిన 18 మందిలో స్వర్భానుడు ఒకడు. వాడికి ఒక కుమార్తె ఉంది. ఆమె పేరు సుప్రభ. ఆమెను నముచి అనే వాడు వివాహం చేసుకున్నాడు.

వృష పర్వుని కుమార్తె శర్మిష్ట. ఆమెను యయాతి వివాహం చేసుకున్నాడు.

దనువుకు వైశ్వానరుడు అనే కుమారుడు ఉన్నాడు. ఆయనకు ఉపదానవి, హయశిర, పులోమ, కాలక అనే నలుగురు కుమార్తెలు ఉన్నారు. వారిలో ఉపదానవిని హిరణ్యాక్షుడు, హయశిరను క్రతువు వివాహం చేసుకున్నారు. కశ్యప ప్రజాపతి వైశ్వానరుని కుమార్తెలు అయిన పులోమ, కాలకలను వివాహం చేసుకున్నాడు. వారికి నివాత కవచులు  అనే 60,000 మంది కుమారులు జన్మించారు. వీరినే పౌలోములు, కాలకేయులు అని పిలుస్తారు. ఈ 60,000 మంది చాలా బలవంతులు, యుద్ధ నిపుణులు. కాని అధర్మపరులు, వారు ఎల్లప్పుడు ఋషులను బాధిస్తూ, ఋషుల యజ్ఞములను పాడుచేస్తుంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! మీ తాతగారు అర్జునుడు,  ఈ 60,000 మందిని చంపి, ఇంద్రుని ప్రశంసలు పొందాడు.

దనువు కుమారుడైన విప్రచిత్తు భార్యపేరు సింహిక. వారికి 101 మంది కుమారులు. వారిలో పెద్దవాడు రాహువు. మిగిలిన 100 మంది కేతువులు. వారందరూ గ్రహములు అయ్యారు.(కేతువు ఒక్కడు

కాదు. అందుకే కేతు గణము అంటారు).

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పుడు అదితి వంశమును గురించి చెబుతాను విను. అదితి వంశములోనే పరమాత్మ అవతరించాడు. అదితి పుత్రులలో వివస్వానుడు, అర్యముడు, పూష, త్వష్ట, సవిత, భగ, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు, శక్రుడు, ఉరుక్రముడు ముఖ్యులు. వీరిలో వివస్వానుడు (సూర్యుడు) భార్య పేరు సంజ్ఞ. ఈమె కుమారుడి పేరు శ్రాద్ధదేవుడు. ఈయన మనువు. ఈమెకు యముడు, యమి అనే కవల పిల్లలు కూడా పుట్టారు. వివస్వానుని కుమార్తె యమికి అశ్వినీ దేవతలు జన్మించారు.

సూర్యుడికి మరొక భార్య ఉంది. ఆమెపేరు ఛాయ. ఛాయకు శని, సావర్ణి అనే కుమారులు, తపతి అనే కుమార్తె కలిగారు. సావర్ణి మనువు అయ్యాడు. తపతి సంవర్ణుని వివాహం చేసుకుంది. అదితి కుమారుడు అర్యముడు. ఆయన భార్య పేరు మాతృక. వారికి చాలామంది కుమారులు కలిగారు. ఆ పుత్రులకు అశేషమైన సంతానము కలిగింది. వారే మానవులు. మానవ జాతి అలా విస్తరించింది.
( కశ్యపుని భార్య పేరు అదితి. అదితి కుమారుడు అర్యముడు. ఆయన భార్య మాతృక. వారి కుమారులే మానవులు. కాబట్టి మన మూలపురుషుడు కశ్యపుడు.).

అదితి కుమారులలో ఒకడైన పూషునికి సంతానము లేదు. అదితి కుమారులలో మరొకడు త్వష్ట ప్రజాపతి. ఆయన ఒక దైత్య

కన్యను వివాహం చేసుకున్నాడు. ఆమె పేరు రచన, వారికి సన్నివేశుడు, విశ్వరూపుడు అనే కుమారులు కలిగారు.

అదితి పుత్రులైన దేవతలకు, దితి పుత్రులైన దైత్యులకు జన్మవైరం ఉంది. కాని అదితిపుత్రుడు త్వష్ట, ఒక దైత్య కన్యను వివాహం చేసుకున్నాడు. ఆ కారణంగా విశ్వరూపుడు దైత్యులకు మేనల్లుడు అయ్యాడు. ఒక సారి ఇంద్రుడికి, దేవతలకు, దేవతల గురువు బృహస్పతికి మనస్పర్థలు వచ్చాయి. ఆ సమయంలో ఇంద్రుడు, దేవతలు కలిసి బృహస్పతికి బదులు విశ్వరూపుని తమ పురోహితునిగా నియమించుకున్నారు." అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము

ఏడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవతమును వినిపిస్తుంటే, పరీక్షిత్ కు ఒక సందేహం కలిగింది.

"శుకమహర్షీ! దేవతల గురువు బృహస్పతి కదా. మరి ఆయన దేవతలను ఎందుకు వదిలిపెట్టాడు. దేవతలు బృహస్పతికి

చేసిన అపరాధము ఏమి? ఈ విషయములు నాకు వివరంగా చెప్పండి." అని అడిగాడు. శుకమహర్షి ఇలా చెప్పసాగాడు.

"పరీక్షిత్ మహారాజా! ఎంతటి వారికైనా ధనము, ఐశ్వర్యము, అధికారము అహంకారాన్ని, మదాన్ని పెంచుతుంది. దేవతల ప్రభువు ఇంద్రుడికి కూడా ఇటువంటి  అధికార మదము, అహంకారము కలిగాయి. దేవతలకు రాజు ఇంద్రుడు. ఆయన మూడులోకములకు అధిపతి. అమితమైన ఐశ్వర్యము, సంపద కలవాడు. పైగా అధికారము. చుట్టు మరుత్తులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, ఋభువులు, విశ్వదేవులు, సాధ్యులు, అశ్వినులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, మునులు మొదలగు వారు చుట్టు చేరి పొగుడుతుంటారు. ఎదురుగా అప్సరసలు, గంధర్వులు, ఆడుతూ పాడుతుంటారు. తలమీద తెల్లటి గొడుగు ప్రకాశిస్తూ ఉంటుంది. అటు ఇటు చామరములు వీస్తుంటారు. తన పక్కనే శచీదేవి కూర్చుని ఉంటుంది. ఇటువంటి భోగములు,ఐశ్వర్యములు అనుభవించే ఇంద్రుడికి  గర్వంతో కళ్లు మూసుకు పోయాయి. అధికార మదముతో అంధుడై పోయాడు.

ఆ సమయంలో దేవతల గురువు బృహస్పతి సభలోకి ప్రవేశించాడు. సాధారణంగా కులగురువు రాగానే ఇంద్రుడు, దేవతలు, సభలో ఉన్న వారు లేచి నమస్కరించాలి. కాని ఇంద్రుడు సింహాసనము మీది నుండి  లేవలేదు. బృహస్పతికి నమస్కరించలేదు. కనీస మర్యాద కూడా చూపలేదు. కనీసం ఆ ప్రయత్నం కూడా చేయలేదు.

బృహస్పతి అక్కడ ఉన్న పరిస్థితులను గమనించాడు. ఇంద్రుడికి అధికార మదము తలకెక్కింది అని అనుకున్నాడు. మౌనంగా అక్కడి నుండి తన నివాసమునకు వెళ్లిపోయాడు. బృహస్పతి వచ్చి తన ఆసనము అలంకరిస్తాడు అని అనుకున్నాడు ఇంద్రుడు. కానీ బృహస్పతి మౌనంగా వెళ్లిపోయాడు అని తెలిసి ఖిన్నుడయ్యాడు. అధికారమదం దిగిపోయింది. తాను గురువును అవమానించాను అని తెలుసుకున్నాడు. గురువును అవమానిస్తే వచ్చే పరిణామాలను తలచుకొని అతని హృదయం తల్లడిలిపోయింది. తనలో తాను ఇలా నిందించుకున్నాడు.

"ఎంత పని చేసాను. కులగురువునే అవమానించాను. ఎంత అన్యాయం జరిగింది. సభలోకి వచ్చిన గురువుకు లేచి నమస్కరించకుండా అవమానించాను. నాకు అధికార మదం, గర్వం తలకెక్కింది. మూడులోకములకు రాజునై ఉండి, సాత్త్వికుడనై ఉండీ, అందరికీ ఆదర్శప్రాయుడుగా ఉండవలసిన వాడిని సాక్షాత్తు గురువునే అవమానించి గురుద్రోహం చేసాను. గురువు లేని నాడు ఈ ధనము, ఐశ్వర్యము నా దగ్గర నిలుస్తాయా!

ఎంతటి మహారాజైనా సభలోకి వచ్చిన బ్రాహ్మణుడికి నమస్కరించడం అతని విధి. కాని కొంతమంది, సింహాసనము మీద కూర్చున్న రాజు బ్రాహ్మణుడు సభలోకి వచ్చినప్పుడు లేచి నమస్కరించనవసరంలేదు, అని చెబుతారు. కానీ అది సరికాదు. వారికి ధర్మం తెలియక అలా చెబుతారు. అజ్ఞానులు. వారి మాటలు నమ్మకూడదు. అటువంటి వారి మాటలు వింటే నరకమునకు పోవడం

తథ్యం. నేను వెంటనే వెళ్లి గురువుగారు బృహస్పతి కాళ్లు పట్టుకొని నా తప్పు క్షమించమని వేడుకుంటాను. అది ఒకటే ప్రస్తుత తరుణోపాయము." అని తనలో తాను అనుకొని వెంటనే బృహస్పతి వద్దకు వెళ్లాడు.

కాని బృహస్పతి కనపడలేదు. ఎక్కడికి వెళ్లాడో తెలియదు. దేవతల చేత దేవలోకము అంతా వెదికించాడు. కానీ బృహస్పతి జాడ తెలియలేదు. దేవ గురువు బృహస్పతి తమను విడిచి వెళ్లిపోయాడు అని తెలుసుకొన్నాడు. ఇంద్రుని మనస్సు అశాంతితో నిండిపోయింది.

దేవతల గురువు బృహస్పతి దేవతలను విడిచిపెట్టి వెళ్లిపోయాడు అని రాక్షసులకు, దైత్యులకు వర్తమానం అందింది. ఇదే మంచి అవకాశము అని రాక్షసులు దేవతలమీదికి దండెత్తారు. మార్గ దర్శకుడైన గురువు లేక పోవడంతో, దేవతలు బలహీనులయ్యారు. రాక్షసులు  దేవతలను తుక్కు కింద కొట్టారు. చావు దెబ్బలు తిన్న దేవతలు బ్రహ్మ దేవుని వద్దకు పోయి మొరపెట్టుకున్నారు. రాక్షసుల చేతిలో చావు దెబ్బలు తిని తన వద్దకు వచ్చిన దేవతలను చూచి బ్రహ్మ దేవుడు వారిని తగురీతిలో ఓదార్చాడు.

"దేవతలారా! మీరు మీ గురువు బృహస్పతిని అవమానించారు. ఆయనకు కనీస మర్యాద కూడా ఇవ్వలేదు. తప్పు చేసారు. శిక్ష అనుభవించారు. మీకు తగిన గురువు లేకపోవడం వలననే ఏ మాత్రం బలం లేని రాక్షసులు మిమ్ములను ఓడించగలిగారు. మీరు బలవంతులై ఉండి కూడా తగిన గురువు లేని కారణంగా

ఓడిపోయారు. పూర్వము రాక్షసులకు తగిన గురువు లేడు. అందుకని మీరు రాక్షసులను సునాయాసంగా జయించగలిగారు. తరువాత వారు శుక్రాచార్యుని గురువుగా నియమించుకొని మీ కన్నా బలవంతులయ్యారు. కానీ మీరు ఉన్న గురువును పోగొట్టుకొని బలహీనులయ్యారు. ఇప్పుడు ఆ రాక్షసులు దేవలోకమునే కాదు బ్రహ్మలోకమును కూడా జయించగలిగిన సామర్థ్యము సంపాదించారు. రాక్షస గురువు శుక్రాచార్యుని సామర్థ్యమువలననే రాక్షసులు ఇంతటి వారయ్యారు.

జరిగిన దానికి చింతించి ప్రయోజనము లేదు. ఇప్పుడు మీకు ఒక గురువు కావాలి. కాబట్టి మీ రందరూ త్వష్ట ప్రజాపతి కుమారుడు అయిన విశ్వరూపుని మీ గురువుగా నియమించుకోండి. వెంటనే మీరు విశ్వరూపుని వద్దకు పోయి మీకు గురువుగా ఉండమని ప్రార్థించండి. మీ ప్రార్థనలను ఆయన మన్నిస్తాడు. ఈ విశ్వరూపుని తల్లి రచన రాక్షస వనిత. అందుకని విశ్వరూపునికి రాక్షసుల మీద పక్షపాతము ఉంటుందని మీరు భయపడకండి.  వెంటనే విశ్వరూపుని వద్దకు వెళ్లండి." అని అన్నాడు.

బ్రహ్మదేవుని మాట ప్రకారము దేవతలు అందరూ విశ్వరూపుని వద్దకు వెళ్లారు. విశ్వరూపుడు దేవతల కన్నా చిన్నవాడు. కాని చేసేది లేక ఆయన కాళ్లు పట్టుకున్నారు. ఆయనను కౌగలించుకున్నారు. ఆయనను ఇలా వేడుకున్నారు.

"ఓవిశ్వరూపా!మేము నీకు పితృసమానులము. అతిథులుగా నీ వద్దకు వచ్చాము. మా కోరిక తీర్చు. ఉపనయనము జరిపించి,

వేదములను నేర్పించి, శిష్యులను సకల విద్యాపారంగతులనే చేసే ఆచార్యుడు వేదములతో సమానము. జన్మనిచ్చిన తండ్రి బ్రహ్మతో సమానము. సోదరుడు ఇంద్రుడితో సమానము. తల్లి సాక్షాత్తు భూదేవి. సోదరి దయాగుణము. అతిథి స్వయంగా ధర్మస్వరూపుడు. అభ్యాగతుడు అగ్నిస్వరూపుడు. భూతములు విష్ణుస్వరూపములు. అందుకని అందరూ పరమాత్మ ముందు సమానులే. నీవుకూడా మమ్ములను నీ వారిగా ఆదరించు.

కుమారా! మేము మా శత్రువులు అయినరాక్షసుల చేతిలో ఓడిపోయాము. నీవు మా గురువుగా ఉండి మమ్ములను ఈ ఆపద నుండి గట్టెంకించు. నీవు బ్రాహ్మణుడవు. నీవు మాకు గురువు కాదగిన వాడవు. మేము నిన్ను గురువుగా భావిస్తున్నాము. నీ తపోబలము చేత మాకు విజయం చేకూర్చు. నీవు మా కన్నా చిన్నవాడవు. అయినా మేము నీ పాదములకు నమస్కరిస్తే ఏ దోషమూ లేదు. సాధారణంగా వయోబేధము పాటించాలి కానీ, వేదవిదుల యందు కాదు. నీవు వేదవేదాంగపారంగతుడవు. కాబట్టి చిన్నవాడివైనా నీకు నమస్కరించినా తప్పులేదు. కాబట్టి నీవు మాగురువుగా ఉండి మాకు విజయం చేకూర్చు." అని ప్రార్థించారు.

దేవతల ప్రార్థనను మన్నించాడు విశ్వరూపుడు. దేవతలతో ఇలాఅన్నాడు. "దేవతలారా! పౌరోహిత్యము వహించడం అంత మంచిది కాదు. అది నాకు ఉన్న బ్రహ్మ వర్చస్సును హరిస్తుంది. అందుకని మునులు సాధారణంగా పురోహితుడుగా ఉండటానికి అంగీకరించరు. కానీ మీరు లోకపాలు. మీ కోరికను కాదనడంమంచిది కాదు.

వాస్తవానికి నేను మీకు శిష్యుడను. మీ చేత శిక్షణ పొందతగిన వాడిని. మీరు నన్ను గురువుగా ఉండమని ఆజ్ఞాపించారు. మీ ఆజ్ఞను శిరసావహిస్తున్నాను. సాధారణంగా మునులు, సన్యాసులు అయిన వారు,  యజమాని తీసుకొని వెళ్లగా పొలములో మిగిలిన ధాన్యపు గింజలను ఏరుకొని, వాటితో జీవించాలి. కాని దుర్మార్గులు అయిన వాళ్లు పౌరోహితమును చేసి దాని వలన ధనమును సంపాదించి, తమను తాము పోషించుకుంటారు. అది తప్పు.  ఆ తప్పును నేను చేయదలచుకోలేదు. కానీ మీరు నా కన్నా పెద్దవారు నాకు గురువులు. మీ మాట కాదనలేను. మీరు అడిగారు కాబట్టి మీకు పౌరోహిత్యము చేయడానికి అంగీకరిస్తున్నాను." అని అన్నాడు విశ్వరూపుడు.

తరువాత దేవతలు విశ్వరూపుని తమ పౌరోహితుడిగా అంగీకరించారు. విశ్వరూపుడు వారికి పౌరోహిత్యము చేయసాగాడు. దేవతలకు రాక్షసుల నుండి రక్షణ కల్పించడానికి విశ్వరూపుడు నారాయణ కవచము అనే మంత్రమును ఇంద్రుడికి బోధించాడు. ఆ నారాయణ కవచ మహిమతో ఇంద్రుడు రాక్షస సేనలను జయించాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు. శ్రీమద్భాగవతము షష్ఠస్కంధము ఏడవ అధ్యాయముసంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్భాగవతము

## షష్ఠస్కంధము

## ఎనిమిదవ అధ్యాయము

ఇప్పుడు పరీక్షిత్‌కు ఒక అనుమానం వచ్చింది.

"శుకయోగీంద్రా! విశ్వరూపుడు ఇంద్రునికి నారాయణ కవచము అనే మంత్రమును ఉపదేశించారు అన్నారు. దాని గురించి వివరించండి. నాకూ తెలుసుకోవాలని ఉంది." అని అడిగాడు. అప్పుడు శుకయోగీంద్రుడు ఇలా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! దేవతల పురోహితుడు అయిన విశ్వరూపుడు ఇంద్రునికి నారాయణ కవచమును ఈ ప్రకారంగా ఉ పదేశించాడు.

"ఓ ఇంద్రా! నీకు ఏ సమయంలో ఏ ఆపద కలిగినా, వెంటనే కాళ్లు చేతులు కడుగుకొని, ఆచమనము చేసి, దర్భలతో చేసిన పవిత్రమును వేలికి ధరించి, ఉత్తర దిక్కుముఖం పెట్టి కూర్చుని, మౌనంగా ఓ నమోనారాయణాయ అనే అష్టాక్షరిని, ఓం నమోభగవతే వాసుదేవాయ అనే ద్వాదశాక్షరి మంత్రముల ద్వారా అంగన్యాస కరన్యాసములను నిర్వర్తించు. ముందు పాదములు, తరువాత పిక్కలు, తొడలు, పొట్ట, హృదయము, వక్షము, ముఖము, తల వీటి యందు ఓంకారముతో మొదలు పెట్టి, తరువాత దానికి వ్యతిరేకముగా ఒక సారి అష్టాక్షరిని న్యాసము చేయాలి.

అనగా శిరస్సు నుండిపాదముల దాకా, తరువాత పాదముల నుండి శిరస్సుదాకా ఓంకారముతో కూడిన అష్టాక్షరిని అంగ న్యాసం చేయాలి. తరువాత ఓంకారముతో కూడిన ద్వాదశాక్షర మంత్రమును కరన్యాసము చేయాలి. తరువాత "ఓం విష్ణవేనమః" అనే మంత్రమును ఈ విధంగా అనుష్టించాలి. హృదయ స్థానములో ఓం, తలయందు వి, నుదుటి భాగమున ష, శిఖ యందు ణ, రెండు కళ్ల యందు వ, మోకాళ్లు, మోచేతుల దగ్గర న, చివరన మ కారమును అస్త్రాయఫట్ అని సర్వదిక్కులను దిగ్బంధనము చేయాలి. దేహమును అంతా మంత్రపూతము చేయాలి.

ఈ విధంగా అంగన్యాస, కరన్యాసములు పూర్తి అయిన తరువాత, పరమాత్మను మనసులో ధ్యానించాలి. అప్పుడు ఈ క్రింది నారాయణ కవచము అనే మంత్రమును జపించాలి.

గరుడునిమీద ఎక్కి, తన ఎనిమిది చేతుల యందు శంఖము, చక్రము, ఖడ్గము, డాలు, గద, బాణము, పాశము ధరించి, అణిమాది అష్టసిద్ధులకు మూలమైన ఆ శ్రీహరి నన్ను రక్షించుగాక!

మత్స్యావతారుడైన ఆ శ్రీహరి నన్ను జలము నుండి అందులో ఉన్న క్రూర జంతువుల నుండి రక్షించుగాక!

వామనావతారము ధరించిన ఆ శ్రీహరి నన్ను నలుదిక్కులనుండి, ఆకాశము, భూమి నుండి రక్షించుగాక!

## షష్ఠ స్కంధము

నృసింహావతారుడైన ఆ శ్రీహరి నన్ను యుద్ధములలో శత్రువుల నుండి, అరణ్యముల నుండి, దుర్గమమైన ప్రదేశముల నుండి నన్ను రక్షించుగాక!

యజ్ఞ వరాహావతార రూపుడైన శ్రీహరి నన్ను అన్ని వేళలా రక్షించుగాక!

పరశురామావతారుడైన శ్రీహరి నన్ను పర్వతముల నుండి రక్షించుగాక!

రామావతారుడైన శ్రీహరి నన్ను ప్రవాసము నందు రక్షించుగాక!

ఆ నారాయణుడు నన్ను అన్ని అభిచారిక హోమముల వలన కలిగే దుష్ఫలితములనుండి రక్షించుగాక! వేదములలో చెప్పబడిన కర్మలను చేయకపోవడం వలన కలిగే పాపముల నుండి నన్ను రక్షించుగాక!

దత్తాత్రేయ అవతారమును ధరించిన నారాయణుడు, యోగభ్రష్టము మొదలగు ఆపదల నుండి రక్షించుగాక!

కపిలావతారము ఎత్తిన శ్రీహరి నన్ను ఈ కర్మ బంధనముల నుండి రక్షించుగాక!

సనత్కుమారుడుగా అవతరించిన శ్రీహరి నన్ను కామ కోరికల నుండి రక్షించుగాక!

హయగ్రీవుడు నేను పోవు మార్గములో నాకు తిరస్కారములు ఎదురు కాకుండా రక్షించుగాక!

దేవర్షి నారదుడు నన్ను భగవంతుని అర్చించకపోవడం వలన కలిగే అన్ని అపరాధముల నుండి రక్షించుగాక!

కూర్మావతారుడైన శ్రీహరి నన్ను అన్ని నరకముల నుండి రక్షించుగాక!

ధన్వంతరి నన్ను అన్ని వ్యాధుల నుండి రక్షించుగాక! ఋషభదేవుడు నన్ను చలి, ఎండ, వాన మొదలగు వాటి వలన కలిగే ఉపద్రవముల నుండి రక్షించుగాక!

యజ్ఞ మూర్తి అయిన శ్రీహరి నన్ను అన్ని లోకాపవాదముల నుండి రక్షించుగాక! బలరామదేవుడు నన్ను జనుల వలన కలిగే బాధల నుండి రక్షించుగాక! అనంతుడు అయిన శేషుడు నన్ను సర్వబాధలన నుండి రక్షించుగాక!

వ్యాస భగవానుడు నాలోని అజ్ఞానమును తొలగించి నాకుజ్ఞానమును కలుగచేయుగాక! బుద్ధావతారుడైన శ్రీహరి నన్ను వేద విరుద్ధములైన ఆచార వ్యవహారములనుండి రక్షించుగాక! కల్కి భగవానుడు నన్ను కలిబాధలనుండి రక్షించుగాక!

పరమాత్మ, కాలస్వరూపుడు అయిన ఆ నారాయణుడు అర్థ రాత్రి నుండి మరలా అర్థ రాత్రి వరకూ నిరంతరము నా వెంట ఉండి నన్ను రక్షించుగాక!

నారాయణుని ఆయుధమైన సుదర్శన చక్రము నా శత్రువులను చించి చెండాడుగాక! నారాయణుని ఆయుధమైన గద నా శత్రువులను నుగ్గు నుగ్గు చేయుగాక! నారాయణుని చేతిలోని పాంచజన్యము అనే శంఖము వలన పుట్టే ధ్వని నా శత్రువుల గుండెలను కంపింపజేయుగాక! నారాయణుని చేతిలోని కత్తి, డాలు నా శత్రువుల సైన్యములను నాశనము చేయుగాక! నా శత్రువుల కళ్లు పీకివేయుగాక!

నవగ్రహముల వలన, ఉల్కలు పడటం వలనా, దుర్మార్గులైన మానవుల వలనా, పాముల వలనా, తేళ్ల వలనా, సింహము, పులి మొదలగు క్రూర జంతువుల వలనా, భూత, ప్రేత, పిశాచాదుల వలనా, పంచభూతముల వలనా, కలిగే అన్ని ఉపద్రవము నుండి ఆ నారాయణుడు నన్ను రక్షించుగాక!

ఆ విష్వక్సేనుడు నన్ను అన్ని దుఃఖముల నుండి కాపాడుగాక! ఆ నారాయణ నామము, రూపము, ఆయన అన్ని వాహనములు, అస్త్రములు, శస్త్రములు, ఆయన పరివారము, నన్ను నా బుద్ధిని, మా బలమును, మా మనస్సును, ప్రాణములను అన్ని రకాలైన ప్రమాదముల నుండి  సర్వదా రక్షించుగాక!

స్థూలము, సూక్ష్మము అయిన ఈ అనంత విశ్వము ఆ నారాయణుని కంటే వేరుకాదు కాబట్టి, ఆ నారాయణుడు నన్ను ఈ విశ్వంలో కలిగే అన్ని బాధలనుండి, ప్రమాదముల నుండి రక్షించుగాక! నారాయణుడు ఎన్నో అవతారములను, రూపములను ధరించాడు. ఆయన ధరించిన అన్ని అవతారములు, అన్ని రూపములు నన్ను రక్షించుగాక! లోకభయంకరమైన నృసింహావతారము ధరించిన నారాయణుడు, ఆయన భక్తుడు ప్రహ్లాదుడు నన్ను అన్ని దిక్కులలోనూ, ఆకాశము, భూమి యందు, అన్ని వస్తువుల లోపలా, బయటా నన్ను రక్షించుగాక!

ఓ ఇంద్రా! నారాయణ కవచమును నీకు ఉపదేశించాను. దీనిని నీవు నిష్ఠతో జపించి, ఈ కవచమును ధరించి నీవు నీ శత్రువులను జయించగలవు. ఈ నారాయణ కవచమును ధరించిన వ్యక్తికి భయమంటే ఏమిటో తెలియదు. అతనికి రాజుల వలనకానీ, కాలము వలన కానీ, గ్రహముల వలన కానీ, వ్యాధుల వలన కానీ భయం ఉండదు.

- ఇంద్రా! ఈ నారాయణ కవచము గురించి ఒక కథచెబుతాను విను. పూర్వము ఈ నారాయణ కవచమును కౌశికుడు అనే బ్రాహ్మణుడు నిష్ఠతో జపించాడు. ఆయనకు కాలం తీరగా, శ్మశానంలో కూర్చుని తన యోగబలంతో శరీరాన్ని విడిచిపెట్టాడు. అతని శరీరమునకు మంత్రపూర్వకముగా దహన క్రియలు జరగలేదు.

చిత్రరథుడు అనే గంధర్వుడు తన ప్రియురాళ్లతో కలిసి విమానం మీద ఆకాశ మార్గంలో వెళుతున్నాడు. అతను ఎక్కిన

విమానము ఈ బ్రాహ్మణుడు మరణించిన ప్రదేశము మీదుగా ఎగురుతూ ఉంది. సరిగా విమానము ఆ ప్రదేశము వద్దకు రాగానే, ఆ చిత్రరథుడు విమానం నుండి తలకిందులుగా కిందపడ్డాడు. అప్పుడు వాలఖిల్యులు అనే మహామునులు ఆ ప్రదేశంలో కౌశికుడు దేహత్యాగము చేసిన సంగతి ఆయన అస్తికలు అక్కడ ఉన్న సంగతి చెప్పారు. వెంటనే చిత్రరథుడు ఆ బ్రాహ్మణుని అస్థికలను మంత్రపూర్వకంగా సరస్వతీనదిలో నిమజ్జనం చేసి శాంతి చేకూర్చాడు. తరువాత తన దారిన తాను వెళ్లిపోయాడు. ఆ బ్రాహ్మణుని అస్థికలలో నారాయణ కవచ ప్రభావము ఉండటం వలన గంధర్వుడు వాటిని దాటి వెళ్లలేకపోయాడు. విమానం నుండి కిందపడ్డాడు. నారాయణ కవచ ప్రభావము అంతటి గొప్పది." అని విశ్వరూపుడు నారాయణ కవచమును ఇంద్రునికి ఉపదేశించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ నారాయణ కవచమును శ్రద్ధతో విన్నా, లేక పఠించినా, అనుష్ఠించినా, ఉపాసన చేసినా, అతనికి ఎవరివలనా, దేనివలనా భయం ఉండదు. అతడు మూడులోకములలో పూజింపబడతాడు. ఆ ప్రకారంగా ఇంద్రుడు విశ్వరూపుని వలన నారాయణ కవచమును ఉపదేశము పొంది, రాక్షసులను జయించాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము ఎనిమిదవ అధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము
తొమ్మిదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో భాగవత పురాణాన్ని ఇలా చెబుతున్నాడు.

"మహారాజా! దేవతలు నియమించుకున్న పురోహితుడు విశ్వరూపునికి మూడు తలలు ఉన్నాయి. ఒక దానితో సోమ రసమును తాగుతాడు. మరొక దానితో సురాపానము చేస్తాడు. మూడవ దానితో ఆహారము తీసుకుంటాడు.
(అంటే అతడు పురోహితుడైనా ఆహారముతోపాటు దేవతలకు ఇష్టమైన సోమరసమును, రాక్షసులకు ఇష్టమైన మద్యమును తాగుతాడు అని అర్థం చెప్పుకోవచ్చు. లేక మూడు తలలు ఉన్నాయి అని కూడా అనుకోవచ్చు.)
విశ్వరూపుడు దేవతల క్షేమం కోరి ఒక యజ్ఞం చేస్తున్నాడు. అప్పుడు దేవతలకు హవిర్భాగములు ఇస్తున్నాడు. కానీ విశ్వరూపుని తల్లి రచనా దేవి ఒక దైత్య వనిత. కాబట్టి విశ్వరూపునికి దైత్యులు అన్నా, రాక్షసులు అన్నా పక్షపాతము. అందుకని ఆ యజ్ఞములో దేవతలకు హవిర్భాగము ఇచ్చినట్టే ఇచ్చి, దానిని దైత్యులకు, అసురులకు అర్పిస్తూ ఉండేవాడు. పైకి మాత్రము దేవతలకు హవిర్భాగములు ఇస్తున్నట్టు మంత్రములు గట్టిగా చదివేవాడు. ఇది గమనించారు దేవతలు. పేరుకు మాత్రము తమ పేర మంత్రోచ్చాటన జరుగుతూ ఉంది. హవిర్భాగములు మాత్రము అసురులకు చేరుతున్నాయి. ఈ విషయం ఇంద్రుడికి చెప్పారు.

## షష్ఠ స్కంధము

దేవతలకు అన్యాయం జరుగుతూ ఉంది అని గ్రహించాడు ఇంద్రుడు. ఇంక ఉపేక్షించి లాభంలేదనుకున్నాడు. ఇదే ప్రకారం జరిగితే అసురులు బలపడటం దేవతలు బలహీనులు కావడం తథ్యం అనుకున్నాడు. వెంటనే ఖడ్గము తీసుకొని విశ్వరూపుని మూడు తలలు ఖండించాడు. ఆ మూడు తలలు నేల పడగానే మూడు పక్షులుగా మారి పోయాయి. సోమరసమును తాగే తల చాతక పక్షిగానూ, సురాపానము చేసే తల పిచ్చుక గానూ, ఆహారము తీసుకొనే తల తిత్తిరి పక్షిగానూ మారి పోయి ఎగిరిపోయాయి. విశ్వరూపుని మొండెము మాత్రము అక్కడ పడిఉంది.

బ్రాహ్మణుని చంపినందుకు ఇంద్రుడికి బ్రహ్మహత్యాపాతకము చుట్టుకుంది. చేసేదిలేక ఇంద్రుడు బ్రహ్మహత్యాపాతకమును స్వీకరించాడు. తరువాత తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాపమును నాలుగు భాగములు చేసి నలుగురికి పంచి పెట్టాడు.

ఒక భాగము భూమికి ఇచ్చాడు. అందువలన భూమిలో కొంత భాగము ఏ పంటలూ పండని చవిటి నేలగా మారి పోయింది. దానికి బదులుగా భూమిలో ఏ గుంతలు, గోతులు పడినా అవి సహజంగానే పూడిపోయే వరమును భూమికి ఇచ్చాడు ఇంద్రుడు.

మరొక భాగమును వృక్షములకు ఇచ్చాడు. ఆ పాపము స్వీకరించడం వలన, అది జిగురు రూపంలో కారుతూ ఉంటుంది. దానికి బదులుగా చెట్టుఎండి పోయినపుడు, నాశనం కాకుండా, మరలా చిగురించే వరం ఇచ్చాడు ఇంద్రుడు.

మూడవ భాగమును స్త్రీలకు ఇచ్చాడు. ఆ పాపము వలన స్త్రీలు నెలా నెలా రక్తస్రావంతో బాధపడతారు. కానీ, స్త్రీలు గర్భం ధరించి ఉన్న సమయంలో కూడా, రతిక్రియ జరిపితే, వారికి గర్భము స్రావము కాదు అనే వరాన్ని ప్రసాదించాడు ఇంద్రుడు.

ఆఖరు భాగమును జలములో విడిచిపెట్టాడు. ఆ పాప ప్రభావంతో జలములో నురుగు, బుడగలు పుట్టి నీటిని కలుషితం చేస్తుంటాయి. కానీ, నీరు ఏ వస్తువుతో కలిసినా, ఆ వస్తువుగా మారిపోతాయి అనే వరం ఇచ్చాడు. (పాలలో నీరు కలిపితే అది పాలు అవుతుంది. నీరు కనపడదు.)

ఈ ప్రకారంగా ఇంద్రుడు తనకు సంక్రమించిన బ్రహ్మ హత్యాపాతకమును నలుగురికీ పంచి పెట్టి తాను ఆ పాపమునుండి విముక్తి పొందాడు.

ఇంద్రుడు తన కుమారుడు విశ్వరూపుని తలలు నరికాడు అన్న విషయం విశ్వరూపుని తండ్రి అయిన త్వష్ట ప్రజాపతికి తెలిసింది. త్వష్ట కోపంతో రగిలిపోయాడు. "కోరి కోరి తన కుమారుని పురోహితునిగా స్వీకరించడం ఎందుకు, మరలా వాడి తల నరకడం ఎందుకు" అంటూమండి పడ్డాడు. ఇంద్రుని నాశనం చేసే కుమారుని కొరకకు ఒకయజ్ఞం చేసాడు.ఆ యజ్ఞంలోమంత్రాలు చదువుతూ హోమం చేస్తున్నాడు. కోపంతో ఉండటం వలన ఆ మంత్రాలు తప్పుగా పలుకుతున్నాడు. "ఇంద్రశత్రో వివర్ధస్వ" అని హోమం చేయాల్సింది అంటే ఇంద్రుని శత్రువా వృద్ధి చెందు. ఇంద్రుని నాశనం చెయ్యి అని పలకాల్సింది పోయి, ఉచ్ఛారణ దోషము చేత ఇంద్రుని చేత

చంపబడేవాడా వృద్ధిచెందు అని అర్థం వచ్చేటట్టు మంత్రోచ్ఛాటన చేసాడు.

ఆ హెూమ గుండం నుండి ఒక భయంకరాకారుడు జన్మించాడు. అతని పేరు వృత్రుడు. ( మంత్రము తప్పుగా ఉచ్ఛరించడం మూలాన  ఇంద్రుని చేతిలో మరణించాడు.) ఆ వృత్రుడు పుట్టగానే పెరగడం మొదలుపెట్టాడు. దిన దినం పెరుగుతున్నాడు. పెద్ద పర్వతం మాదిరి పెరిగిపోయాడు. వాడి వర్ణము నలుపు. వాడివెంట్రుకలు రాగి రంగులో ఉన్నాయి. కళ్లు పిల్లి కళ్ల మాదిరి పచ్చగా ఉన్నాయి. వాడు ఎగురుతుంటే భూమి కంపించింది. వాడు నోరుతెరిస్తే ఆకాశాన్ని మింగుతున్నాడా అన్నట్టు ఉంది.

ఆ భయంకరాకారుడిని చూచి దేవతలు భయపడిపోయారు. భయంతో నాలుగు దిక్కులకుపారిపోయారు. వృత్రుడు మూడు లోకములను స్వాధీనం చేసుకున్నాడు. తన అన్నను చంపిన ఇంద్రుని కొరకు వెదుకుతున్నాడు. ఇంద్రుడు వాడికి కనపడకుండా తన దేవసేనలను వాడి మీదికి పంపించాడు. దేవతలు వాడిమీదికి విసిరిన అస్త్రములు, శస్త్రములు వృత్రుడు అవలీలగా చేత్తోపట్టుకొని విరుస్తున్నాడు. తాము వేసిన ఒక్క అస్త్రము శస్త్రము వృత్రునికి తగలకపోవడంతో దేవతలు హతాశులయ్యారు.

అందరూ కలిసి పరుగు పరుగున విష్ణుదేవుని వద్దకుపోయారు. దేవతలు విష్ణువును ఇలా స్తుతిస్తున్నారు.

"ఓ దేవా! ఈ పంచభూతములతో మూడులోకములు సృష్టించబడ్డాయి. మూడు లోకములకు బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు అధిపతులు. మేమంతా వారి తర్వాత సృష్టించబడ్డాము. అటువంటి వారము ఇప్పుడు వృత్రునికి భయపడుతున్నాము. మమ్ములను రక్షించు. ఓ దేవా! నిర్గుణుడు, నిరాకారుడు, ఆనందస్వరూపుడు, ఆదిమధ్యాంత రహితుడు అయిన నిన్ను శరణు వేడకుండా మేము ఇతరులను ఎందుకు శరణు వేడుతాము? ఆ నాడు మనువును మత్స్యరూపంలో వచ్చి, ఆయన ఎక్కిన పడవను నీకొమ్ముకు కట్టుకొని ఆయనను రక్షించావు. ఈ నాడు మమ్ములను ఈ రాక్షసుని బారి నుండి రక్షించవా!

సృష్టికి ముందు ఈ విశ్వం అంతటా భయంకరమైన వాయువు వీస్తుంటే, జలము ఉవ్వెత్తున ఎగిసిపడుతుంటే, ఆ సమయంలో బ్రహ్మదేవుని రక్షించిన నీవు ఈ ఆపద సమయంలో మమ్ములను రక్షించు. ఓ దేవా! నీవు మాకు కనిపించవు. అందుకని మేమే సర్వాధికారులము అనుకున్నాము. అది కూడా నీమాయ అని ఇప్పుడు తెలుసుకున్నాము. మా గర్వం అణిగిపోయింది. ఈ రాక్షసుని బారి నుండి మమ్ములను రక్షించు.

ఓ దేవా! నీవు దుష్ట శిక్షణకు శిష్ట రక్షణకు ఎన్నో అవతారములు ఎత్తావు. నీవు దేవతలలో, ఋషులలో,మానవులలో, జంతువులలో అవతరించి, లోకములను రక్షించావు. మమ్ము కూడా ఈ ఆపద నుండి రక్షించమని నిన్ను శరణు వేడుతున్నాము." అని దేవతలు పరమాత్మను ప్రార్థించారు.

అప్పుడు పరమాత్మయగు హరి పడమటి దిక్కుగా వారికి కనిపించాడు. ఆయన చుట్టు విష్ణుదూతలు ఉన్నారు. దేవతలు శ్రీహరిని దర్శించి ఆనందంతో సాష్టాంగ ప్రణామము చేసారు. వారందరూ శ్రీహరిని ఈ విధంగా స్తుతించారు.

"యజ్ఞ పురుషుడవు,యజ్ఞఫలములను ఇచ్చేవాడవు, కాలస్వరూపుడవు, దైత్యులను సంహరించేవాడివి, ఎన్నో పేర్లతో పిలువబడేవాడివి అయిన నీకు నమస్కారము. నీవు మోక్షమునకు, స్వర్గ నరకములకు అధిపతివి. నీవు వైకుంఠవాసివి. నీ సృష్టిలో మేము అల్పమైన వారము. నీ గురించి తెలుసుకోవడం మాకు సాధ్యంకాదు. అట్టినీకు నమస్కరిస్తున్నాము.

ఓ భగవానుడా!నారాయణా! వాసుదేవా! ఆది పురుషా! మహాపురుషా! మహానుభావా! మంగళస్వరూపా! పరమకల్యాణమూర్తీ! కారుణ్యనిధీ! జగదాధారా! లోకనాధా! సర్వేశ్వరా! లక్ష్మీనాధా! ఎల్లప్పుడు నిన్ను గురించి చింతనచేయువారి హృదయములలో ఉండేవాడా! పరమానందస్వరూపా! ఎవరిచేతా తెలియబడని వాడా! నీకు నమస్కారము.

ఓ దేవదేవా! నీకు ఎలాంటి ఆశ్రయము లేదు! నీకు శరీరము లేదు! నిరాకారుడవు. నీవు ఈ సమస్త సృష్టికి కారకుడవు. నీ మాయచేత ఈ సృష్టి చేసావు. పాలిస్తున్నావు. లయం చేస్తున్నావు. కానీ నీకు ఏ గుణమూ అంటదు. నీ లీలలు తెలుసుకోవడం మా తరం కాదు. అట్టి నీకు నమస్కారము. ఓ దేవా! నీ చేత సృష్టించబడిన

మానవులు వివిధములైన పేర్లతో పిలువబడుతుంటారు. ఇళ్లు కట్టుకుంటారు. పెళ్లి చేసుకుంటారు. పిల్లలను కంటారు. వాటి వలన సుఖాలు,కష్టాలు పొందుతారు.  నీవు శాంత స్వరూపుడవు అయి ఉండి కూడా, ఆత్మస్వరూపుడవు అయి ఉండి కూడా,  కూడా మానవుడుగా అవతరించి, మానవుల మాదిరి కష్టసుఖాలు అనుభవించావుకదా! అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు పరమేశ్వరుడవు. నీ మహత్తు తెలుసుకోవడం ఎవరి తరమూకాదు! కానీ ఈ మానవులు, దేవతలు, ఋషులు తామే సర్వజ్ఞులమనీ భావించి, నీ గురించి శాస్త్ర చర్చలు, తర్క వితర్కములు చేస్తూ ఉంటారు. కాని,  నీ యొక్క వాస్తవ స్థితిని గురించి ఎవ్వరూ తెలుసుకోలేరు. అటువంటి అహంకారులకు నీవు కనిపించవు. ఈ మాయాప్రపంచమును నీవు దూరంనుండి చూస్తూ ఉంటావు. నీవు ఏ పనీ చేయవు. ఏ పనీ చేయాలని అని అనుకోవు. నీకు సుఖము దు:ఖము లేవు. నీకు అసాధ్యము అంటూ ఏదీ లేదు! నీవు దేనికీ అంటుకోవు.  దేని నుండి విడివడాలని అనుకోవు. నీకు బంధనము, విముక్తి రెండు లేవు.

ఓ దేవా! నీ గురించి సత్యమును తెలుసుకున్నవాడు, తాడును తాడు అనుకుంటాడు. పామును పాము అనుకుంటాడు. నీ గురించి తెలియని వాడు తాడును పాము అనుకొని భయపడు తుంటాడు. నిన్ను నమ్మిన వారికి నీవు అభయము ఇస్తుంటావు. నిన్ను నమ్మని వాడు అజ్ఞానంలో పడి నిత్యమూ భయంతో బతుకుతుంటాడు. నిజానికి భయం అనేది వాడి మానసిక భ్రమ తప్ప వేరు కాదు. నీవు ఎవరికీ మేలు చేయవు అలాగనీ కీడు చేయవు. అందరి ఎడల

సమవర్తిగా ఉంటావు.

ఓ దేవా! నీవు నానారూపములతో కనపడుతున్నావు. అన్ని ప్రాణులలో ఆత్మగా వెలుగొందుతున్నావు. నీవు సర్వేశ్వరుడవు. ఈ జగత్తుకు నీవే కారణము. సకల జీవులలో అంతర్యామిగా ఉన్నావు. నీ వలననే దేవతలలో, మానవులలో ఉన్న మనస్సు, బుద్ధి, చైతన్యం పొందుతున్నాయి. అన్నిటిలో నీవు ఉన్నావు. నీ కన్నా వేరు అయినది ఏదీ లేదు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీ గురించి కించిత్తు తెలుసుకున్నా, నీ మహిమ అనే సముద్రములో ఒక బిందువును తాగినా, మాకు ఈ సంసార సాగరము నుండి విముక్తి కలుగుతుంది. ప్రాపంచిక విషయముల నుండి విషయ వాంఛల నుండి విముక్తి కలుగుతుంది. అటువంటి వారు నీ యందు నిశ్చలమైన భక్తితో పరమానందాన్ని అనుభవిస్తారు. అటువంటి వారు జన్మరాహిత్యమును కలిగించే నీ పాదముల సేవను ఎందుకు విడిచిపెడతారు!

ఓ త్రిభువన స్వరూపా! త్రిభువనకారకా! త్రిభువనపాలకా! త్రివిక్రమా! నీకు నమస్కారము. ఈ దైత్యులు, దానవులు, దేవతలు, రాక్షసులు అందరూ నీ విభూతులే. నీ కన్నా పరమైనవారు ఎవరూ లేరు. కాని దైత్యులు, దానవులు, రాక్షసులు, అసురులు ఆసురీ సంపత్తి కలవారు. వారియొక్క ఆసురీ శక్తులు విజృంభించి లోకములకు ఆపద కలిగినప్పుడల్లా, నీవు దేవతామూర్తులైన వామనుడు మొదలగు అవతారములను ధరించీ, మానవ రూపములైన రాముడు, కృష్ణుడు,

మొదలగు అవతారమును ధరించీ, మిశ్రమ రూపములైన నారసింహుడు, హయగ్రీవుడు మొదలగు అవతారములను ధరించీ, జలచరములైన మత్స్యము, కూర్మము మొదలగు అవతారములను ధరించీ, అసురులను, రాక్షసులను, దైత్యులను శిక్షిస్తుంటావు! అలాగే మమ్ము కూడా ఈ వృత్రాసురుని బారి నుండి రక్షించు దేవా!

ఓ దేవా! మేము నీ పాదములకు నమస్కరిస్తున్నాము. నీ చరణములను మా హృదయంలో నిలుపుకున్నాము. మమ్ములను నీ భక్తులుగా స్వీకరించు. మమ్ములను కరుణించు. నీ మాటలతో మా బాధలను నాశనం చెయ్యి. ఈ వృత్రాసురుని వలన కలిగిన భయం నుండి మమ్ము విముక్తులను గావించు.

ఓ దేవా! నీవు ఈ జగత్తును సృష్టించి పోషించి లయం చేస్తున్నావు. నీవు ఈ జగత్తును నీ మాయలో ముంచి ఆడిస్తున్నావు. ఆనందిస్తున్నావు. అటువంటి నీవు సకల జీవుల హృదయములయందు అంతర్యామిగా వెలుగుతున్నావు. సకల ప్రాణుల లోపలా బయటా నీవే నిండి ఉన్నావు. ఏ దేశములో ఉన్నా, ఏ ప్రాంతములో ఉన్నా, ఏ కాలములో ఉన్నా, శిశువుగా, బాలుడిగా, యవ్వనంలో, వృద్ధాప్యంలో, ఏ దశలో ఉన్నా, అన్నిటిలో నీవే కనపడుతున్నావు. సకల జీవులు చేసే అన్ని పనులకు నీవు సాక్షీభూతుడవై ఉన్నావు. నీవు సత్వ,రజస్తమోగుణముల యొక్క వికారములకు అతీతంగా ఉన్నావు. నీవే పరబ్రహ్మస్వరూపుడవు. చిన్న చిన్న నిప్పురవ్వల వెలుగుతో అగ్నిని ప్రకాశింపచేయలేము. అలాగే నీగురించి మేము స్తోత్రము చేయలేము. అది మాకు సాధ్యం కాదు. మా గురించి నీకు బాగాతెలుసు. మా బాధలు అన్నీ నీకు తెలుసు.

మేము వేరుగా కోరపనిలేదు. ఈ వృత్రుని వలన కలిగే బాధలు తీర్చి మమ్ములను కాపాడు.

నీకు అన్నీ తెలుసు అన్ని నీ నీడకు చేరుకున్నాము. ఈ కార్యమును నెరవేర్చడానికి నీవే సమర్థుడవు. అందుకని నిన్ను వేడుకుంటున్నాము. ఈ వృత్రుడు మా ఆయుధములను, మా శక్తులను, మా తేజస్సును అన్నీ నిర్వీర్యము చేసాడు. నీవే మాకు దిక్కు. నీవు ఆ వృత్రుని సంహరించి మమ్ములను కాపాడు. ఓ దేవా! అనాదివి, యశస్విని, శరణాగతవత్సలుడవు, సర్వాంతర్యామివి అయిన నీకు నమస్కారము." అని దేవతలు శ్రీహరిని ప్రార్థించారు.

దేవతల ప్రార్థనలను విన్న శ్రీహరి ప్రసన్నమైన ముఖంతో ఇలా అన్నాడు. "ఓ దేవతలారా! మీరు సంపాదించుకున్న జ్ఞానముతో నన్ను ఎంతో స్తుతించారు. నేను చాలా ఆనందించాను. కానీ, ఈ జ్ఞానము వలన సంసారము మీద విరక్తి కలుగుతుందేమో కానీ, నా యందు అచంచలమైన భక్తి కలగదు. ఎందు కంటే నా భక్తులకు ఆపదలు రావు. నా భక్తులకు అసాధ్యములేదు. నా యందు భక్తి విశ్వాసము ఉన్న భక్తులు నన్ను కోరుకుంటారు కానీ మీ మాదిరి ఆపదలు తీర్చమని, వాడిని వీడిని చంపమనీ కోరుకోరు.

ఓ దేవతలారా! సత్వ,రజస్తమోగుణముల నుండి పుట్టిన విషయములనే ప్రధానముగా భావించేవాడు, తెలివితక్కువవాడు. వాడికి ఏం కావాలో వాడికి తెలియదు. ఏవేవో కోరుకుంటాడు. అటువంటి వాడి కోరికలు తీర్చిన వాడు కూడా అజ్ఞాని అవుతాడు.

పరమానందమును కలిగించే భగవద్భక్తిని గురించి తెలుసుకున్నవాడు, ఏమీ తెలియని వారికి ప్రాపంచిక విషయముల గురించి చెప్పడు. వారికి భగవంతుని ఎడల భక్తి గురించి ఉపదేశిస్తాడు. రోగికి ఇష్టమని వైద్యుడు అపథ్యము చేయించడు కదా! కాబట్టి మీరు కోరే కోరికలు నేను తీర్చను. కాని మీ కోరికలు తీరే మార్గము చెబుతాను.

దేవేంద్రా! మీరందరూ ఋషి శ్రేష్ఠుడు అయిన దధీచి మహర్షి వద్దకు వెళ్లండి. ఆయన శరీరము ఆయన చేసిన వ్రతముల వలనా, నేర్చుకున్న విద్యలవలనా, చేసిన తపస్సు వలనా చాలా ధృఢంగా అయింది. మీరు ఆయన దేహమును అడగండి. దధీచి  బ్రహ్మ విద్యను ఉపాశించాడు. దధీచి మహర్షి కూడా నా స్వరూపమే. దధీచి నారాయణ కవచము ఉపాసించాడు. ఆ నారాయణ కవచమును త్వష్టకు ఉపదేశించాడు. ఆ త్వష్ట తన కుమారుడు విశ్వరూపునికి ఉపదేశించాడు. విశ్వరూపుని వలన నారాయణ కవచమును నీవు పొందావు. కాబట్టి ఆయన నేర్చిన విద్యల వలన ఉపాశించిన మంత్రముల వలన, చేసిన తపస్సులవలనా ఆయన శరీరము వజ్రము కన్నా కఠినంగా తయారయింది. మీరు ఆయన శరీరమును ఇమ్మని అడగండి. ఆయన ఎముకలతో విశ్వకర్మ వజ్రముతో సమానమైన ఆయుధమును నిర్మిస్తాడు. ఆ ఆయుధముతో నీవు వృత్రుని సంహరించు. దధీచి ధర్మాత్ముడు. మీకు తప్పకుండా సాయం చేస్తాడు. ఆయన శరీరమును మీకు ఇస్తాడు. మీకు శుభం కలుగుతుంది." అని పలికి శ్రీహరి అంతర్ధానం అయ్యాడు.

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## షష్ఠస్కంధము

## పదవ అధ్యాయము.

వెంటనే దేవతలు ఇంద్రునితో సహా దధీచి వద్దకు వెళ్లారు. ఆయనకుజరిగినది అంతా చెప్పి ఆయన దేహమును ఇమ్మని అడిగారు. వారి ప్రార్థన విన్న దధీచి నవ్వుతూ ఇలా అన్నాడు.

"దేవతలారా! మీ కోరిక సమంజలసముగా లేదు. ఎవరైనా కోరి కోరి తమ దేహమును ఇతరులకు ఇస్తారా! ఈ శరీరం అందరికీ ఇష్టమైనదే కదా! దానంతట అది పోవలసినదే కానీ, బలవంతంగా దేహాన్ని విడిచిపెట్టడానికి ఎవరూ ఒప్పుకోరు కదా! పైగా బలవంతంగా దేహమును విడిచి పెట్టాలంటే ఎంత బాధాకరమో మీకు తెలియదా! ఈ ప్రపంచంలో జీవుల కన్నిటికీ వారి దేహాన్ని మించిన ప్రియమైన వస్తువు మరొకటి లేదు. అది అందరికీ తెలుసు. ప్రతి జీవీ తన దేహమును రక్షించుకుంటూ ఉంటాడు. ఆ దేహానికి చిన్న దెబ్బ తగిలినా సహించడు. పైగా ప్రతి జీవికీ తన దేహాన్ని సంరక్షించుకోవడమే పరమ ధర్మము. దానిని మించిన ధర్మము మరొకటి లేదు. కాబట్టి సాక్షాత్తు విష్ణువే దిగివచ్చి ఎవరి దేహమైనా కావాలని అడిగినా, ఎవరూ తమ దేహాన్ని ఇవ్వడానికి ఒప్పుకోరు. కాబట్టి నేను కూడా ఒప్పుకోను." అని అన్నాడు దధీచి.

ఇంక లాభం లేదని కాళ్ల బేరానికి వచ్చారు దేవతలు. "మహాత్మా! మీరుమహాత్ములు. అన్ని ప్రాణుల మీద దయగలిగి ఉంటారు.

చాలా ఉదారమైన మనస్సు కలవారు. అటువంటి మీకు ఇవ్వకూడని వస్తువు అంటూ ఉంటుందా చెప్పండి. స్వార్థ పరులు అయిన వారు ఎదుటి వారి  కష్టముల గురంచి పట్టించుకోరు. యాచించేవాడు కూడా  ఎదుటి వాడు కష్టములలో ఉంటే వాడిని దానం  అడగడు. దానం ఇవ్వడానికి తగిన వస్తువు తన దగ్గర ఉన్నవాడు, దానం ఇవ్వడానికి సమర్థత కలిగిన వాడూ, దానం ఇవ్వడానికి సంకోచించడు. పైగా అటువంటి దానం ఎందుకు అడిగావని విమర్శించడు. కాబట్టి మీరు మీ శరీరమును మాకు దానంగా ఇవ్వండి." అని అడిగారు. దేవతలు.

ఆ మాటలకు దధీచి ఇలా అన్నాడు. "నేను నా శరీరం మీకు దానం ఇవ్వలేక కాదు. మీ మనసులో ఉన్న ఉద్దేశం తెలుసుకోవాలని అలా అన్నాను. ఈ దేహం శాశ్వతము కాదు, ఎప్పుడో ఒకప్పుడు ఈ దేహాన్ని విడిచిపెట్టాలని నాకు తెలుసు. ఎప్పుడో మట్టిలో కలిసి పోయే ఈ దేహము మీకు ఉపయోగపడుతుంది అంటే అంతకన్నా కావాల్సింది ఏముంది. సాటి ప్రాణుల మీద దయ గలవాడు, తన దేహమును సాటి ప్రాణుల కోసరం అర్పించి కీర్తి పొందుతాడు. అటువంటి కీర్తి పొందని వాడు రాయితో సమానము.

ఎదుటి వారు బాధపడుతుంటే ఆ బాధ తనదే అని చింతించేవాడు, ఎదుటి వారు సుఖపడుతుంటే చూచి ఆనందించే వాడు ధర్మాత్ముడు. ఈ క్షణభంగురమైన శరీరము కొరకు, ఈ శరీరముతో పొందిన భార్య, పుత్రులు, ధనము, భోగముల కొరకు వెంపర్లాడుతూ, ఇతరులకు ఉపకారము చేయని వాడి జీవితము వ్యర్థము. వాడు కేవలం భోగాలు, దు:ఖాలు అనుభవించడానికి

మాత్రమే పనికివస్తాడు. కాబట్టి నేను మీకు నా శరీరము అందులో ఉన్న ఎముకలు మీ ఉపయోగార్థము ఇస్తాను." అని అన్నాడు.

వెంటనే దధీచి యోగసమాధిలోకి వెళ్లి పోయాడు. ఆత్మను పరబ్రహ్మలో ఐక్యం చేసి ఈ శరీరాన్ని విడిచిపెట్టాడు. దధీచి శరీరం పడిపోయింది. దేవతలు దధీచి శరీరమును విశ్వ కర్మకు అప్పగించారు. ఆయన దధీచి ఎముకలతో ఒక ఆయుధమును తయారు చేసి ఇంద్రునికి ఇచ్చాడు. ఇంద్రుడు విశ్వకర్మ ఇచ్చిన వజ్రాయుధమును ధరించి ఐరావతమును ఎక్కి వృత్రుని మీదికి యుద్ధానికి బయలుదేరాడు.

ఇంద్రునికి వృత్రునికి కృతయుగము అంతం కాబోయే సమయంలో నర్మదానదీ తీరంలో ఘోరయుద్ధం జరిగింది. వృత్రుడు తన రాక్షస సైన్యంతో యుద్ధానికి సన్నద్ధం అయ్యాడు. ఇంద్రుడు ఆదిత్యులు, అశ్వినులు, పితృదేవతలు, అగ్నిగణములు, మరుత్తులు, ఋభువులు, సాధ్యులు, విశ్వేదేవులు,  మొదలగు దేవతా గణములతో వృత్రుని మీదికి యుద్ధానికి వెళ్లాడు. వృత్రుని సేనాధి పతులు అయిన నముచి, శంబరుడు, అనర్వుడు, ద్విమూర్ధుడు, ఋషభుడు, అసురుడు, హయగ్రీవుడు, శంకుశిరుడు, విప్రచిత్తి, అయోముఖుడు, పులోముడు, వృషపర్వుడు, ప్రహేతి, హేతి, ఉత్కలుడు, ఇంకా వేలకొలది దైత్యులు, అసురులు దేవతల సైన్యాన్ని చించి చెండాడసాగారు. వారు శూలములు, గొడ్డళ్లు, ఖడ్గములు, శతఘ్నులు, మొదలగు అస్త్ర శస్త్రములను దేవతల మీద ప్రయోగించారు. రాక్షసుల చేత ప్రయోగింప బడిన అస్త్రములు అన్నీ దేవతలను కప్పివేసాయి. కాని

దేవతలు ఆ అస్త్రములను మధ్యలోనే ఖండించసాగారు. రాక్షసులు ప్రయోగించిన అస్త్రములను శస్త్రములను ముక్కలు ముక్కలు చేసారు.

రాక్షసుల దగ్గర ఉన్న ఆయుధములు అయిపోయాయి. వారు చెట్లను, రాళ్లను తీసుకొని దేవతల మీద విసరసాగారు. దేవతలు కూడా ఆ చెట్లను రాళ్లను మధ్యలోనే పిండి పిండి చేయసాగారు. దేవతల వద్ద ఉన్న నారాయణ కవచము వారిని రక్షిస్తూ ఉంది. అందువలన రాక్షసులు దేవతా గణములను ఏమీ చేయలేకపోయారు. తమకు ఓటమి తప్పదని గ్రహించిన రాక్షస గణములు పారి పోవసాగారు. తన సైన్యం పారిపోవడం చూచిన వృత్రుడు వారిని చూచి హేళనగా నవ్వి ఇలా అన్నాడు. తన సైనికాధి కారులను పేరు పేరునా పిలుస్తున్నాడు.

“ఓ నముచీ! ఓ పులోమా! ఓ మయుడా! అనర్వుడా! శంబరుడా! పారి పోకండి నా మాటలు ఆలకించండి. ఈ ప్రపంచంలో అందర చావవలసిన వారే! ఎవరూ శాశ్వతంగా ఈ లోకంలో ఉండరు. ఆ సంగతి తెలుసుకోండి. మరణాన్ని తప్పించుకొనే ఉపాయం ఆ బ్రహ్మకు కూడా తెలియదు. మీరు పారి పోతే మీకు మృత్యువు రాకుండా ఉంటుందా! కాబట్టి యుద్ధం చేయండి. యుద్ధంలో ప్రాణాలు అర్పించి వీరస్వర్గము పొందండి. అంతేకానీ పారి పోయి భీరువు అనిపించుకోకండి.

మరణాలు రెండు రకాలు. ఒకటి భగవంతుని ధ్యానం చేస్తూ, భగవంతునిలో ఐక్యం కావడం. రెండవది వీరుడిలా యుద్ధ

రంగంలో మరణించడం. అంతేకానీ భీరువులా పారి పోయి అనామకంగా మరణించడం వీర మరణం అనిపించుకోదు. కాబట్టి యుద్ధంలో మరణించి వీర స్వర్గము, అనంతమైన కీర్తి ప్రతిష్టలు పొందండి." అని తన సైన్యాధి కారులను ప్రబోధించాడు. కాని వాళ్లు వృత్రుని మాట వినకుండా పారి పోయారు." అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము పదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము
పదకొండవ అధ్యాయము.

వృత్రాసురుడు ఈ విధంగా ఎలుగెత్తి అరిచినా అతని సేనాపతులు వినలేదు. అందరూ పారిపోయారు. ఇదే సమయమని దేవతాగణములు రాక్షస గణములను ఆక్రమించారు. అసురులు చెల్లాచెదరయ్యారు. పారిపోతున్న అసురులను దేవతా గణములు తరిమి తరిమి చంపుతున్నారు. అప్పుడు వృత్రుడు దేవతా గణములను చూచి ఇలా అన్నాడు.

"ఓ దేవతలారా! పారిపోతున్న వారిని చంపడం వీరత్వం అనిపించుకుంటుందా! దానివలన మీకు ఏమి లాభము. మీతో యుద్ధమే చేసే వారిని చంపడం వలన మీకు పేరు వస్తుంది.

పారిపోతున్న పిరికివారిని చంపడం వలన అపకీర్తి తప్ప మరేమీ రాదు. మీరు దేవతలు కాదు క్షుద్రదేవతలు. మీరే కనుక నిజంగా దేవతలైతే, మీకే ధైర్యసాహసాలు ఉంటే, క్షణ కాలము నా ఎదురుగా నిలబడి పోరాడండి." అని పలికిన వృత్రుడు భీకరాకారంతో దేవతల ఎదుట నిలిచాడు. ఒక్కసారి పెద్దగా అరిచాడు. ఆ ధ్వనికి దేవతలు మూర్ఛపోయారు. ఇంకొంతమంది గుండె ఆగి చచ్చారు. వృత్రాసురుడు చేతిలో శూలం ధరించి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ రణభూమిలో తిరుగుతుంటే అతని పాదముల కింద పడి దేవతాగణములు నలిగిపోతున్నారు.

ఇది చూచిన దేవేంద్రుడు కోపంతో రగిలిపోయాడు. ఐరావతము అనే ఏనుగు మీద ఎక్కి వృత్రునితో యుద్ధానికి వచ్చాడు. తన చేతిలోని గదను వృత్రుని మీదికి విసిరాడు. వృత్రుడు ఆ గదను తన ఎడమచేతితో పట్టుకున్నాడు. వెంటనే అదే గదతో ఐరావతము తల పగలగొట్టాడు. అతని వేగానికి దేవతా గణములు కూడా ఆశ్చర్యపోయాయి. ఆహా వృత్రాసురా! ఏమీ నీ రణకౌశలము అని పొగిడారు. రాక్షస సేనలు ఆనందంతో గంతులు వేసారు. వృత్రుడు కొట్టిన దెబ్బకు ఐరావతము ముఖం పగిలిపోయింది. వెనక్కు తిరిగి పరుగెత్తింది. కొంచెం దూరం పరుగెత్తి కిందపడి మూర్ఛపోయింది.

ఐరావతము మూర్ఛపోవడం, ఇంద్రుడు వాహనం లేకుండా నిలబడి ఉండటం చూచి, వృత్రుడు ఇంద్రుని మీద మరలా ఆయుధము ప్రయోగించలేదు. ఆ సమయంలో ఇంద్రుడు తన అమృత హస్తంతో ఐరావతమును నిమిరి దానిని మూర్ఛనుండి లేపాడు. మరలా

ఐరావతమును ఎక్కి వజ్రాయుధమును చేతిలో ధరించి వచ్చి వృత్రుని ఎదురుగా వచ్చి నిలబడ్డాడు. తన అన్న విశ్వరూపుని చంపిన ఇంద్రుడు తన ఎదురుగా నిలబడి ఉండటం చూచాడు వృత్రుడు. ఇంద్రుని చూచి వృత్రుడు ఇలా అన్నాడు.

"నా అన్న విశ్వరూపుడు బ్రాహ్మణుడు. నీకు గురువు. నీవే అతనిని గురువుగా నియమించుకున్నావు. కాని అతనిని నిర్దాక్షిణ్యంగా చంపావు. నా అదృష్టం కొద్దీ నా చేతిలో చావడానికి నా ఎదురుగా నిలబడి ఉన్నావు. ఇప్పుడే నేను ఈ శూలముతో నీ గుండెలు చీల్చి నా అన్నకు రక్తతర్పణం చేస్తాను. భ్రాతృఋణము నుండి విముక్తి పొందుతాను.

ఓ ఇంద్రా! నీవు స్వర్గాధి పతివి. నీ స్వర్గలోకమును కాపాడుకోడానికి నా అన్న విశ్వరూపుని నీ పురోహితుడుగా నియమించుకున్నావు. నా అన్న విశ్వరూపుడు మహాజ్ఞాని. నీకు గురువు. బ్రాహ్మణుడు. నీ పురోహితుడు. నీ మీద విశ్వాసంతో నీకు పౌరోహిత్యము చేయడానికి ఒప్పుకున్నాడు. కాని నువ్వు ఏం చేసావు? ఆయన నమ్మకాన్ని వమ్ము చేసి, నా అన్న తలలను నిర్దయగా నీ ఖడ్గముతో ఖండించావు. ఈ పని చేయడానికి నీకు సిగ్గుగా లేదా! ఇన్ని సంపదలు, ఇంత ఐశ్వర్య ము పెట్టుకొని, సద్గుణసంపన్నుడవని చెప్పుకుంటూ ఇటువంటి పాపకార్యము చేస్తావా! ఇటువంటి దుర్మార్గము రాక్షసులు కూడా చేయరే! నీవు ఎందుకు చేసావు. నీవు చేసిన పనికి లోకములు అన్నీ నిన్ను నిందిస్తున్నాయి. నీవు బతకడం వ్యర్థము. నిన్ను ఈ శూలంతో పొడిచి చంపుతాను. నిన్ను అగ్ని కూడా కాల్చదు. నీవు

దిక్కులేని చావు చస్తావు. నీ శరీరాన్ని కాకులు, గ్రద్దలు పీక్కుతింటాయి. నిన్నే కాదు నీవు చేసే పాడుపనులను సమర్థించే దేవతా గణములను కూడా ఈ శూలంతో పొడిచి పొడిచి చంపుతాను. వారి శరీరములతో భూతములు, ప్రేతములు, పిశాచములు విందుచేసుకుంటాయి. అలా కాకుండా నీవే నీ వజ్రాయుధముతో నన్ను చంపితే నేను కూడా భూత,ప్రేతములకు ఆహారము అవుతాను. ఈ కర్మబంధనముల నుండి విముక్తి పొందుతాను.

ఓ దేవేంద్రా! నేను నీ శత్రువును. నీ ఎదురుగా నిలబడి ఉన్నాను. ఇంకా ఆలోచిస్తావెందుకు. నీ వజ్రాయుధాన్ని నా మీద ప్రయోగించు. నన్ను చంపడానికే గదా దధీచిని చంపి వజ్రాయుధాన్ని తయారుచేయించావు. మరి ఆలస్యం ఎందుకు? నా మీద ఒక గదను విసిరావు. దానితో నీ ఏనుగు తల పగల గొట్టాను. ఇప్పుడు వజ్రాయుధం ప్రయోగించి చూడు. కాని ఈ వజ్రాయుధము తన పని తాను చేస్తుంది. నన్ను చంపుతుంది. సందేహము లేదు. ఎందుకంటే, ఈ వజ్రాయుధము శ్రీహరి తేజస్సుతోనూ, దధీచి తపోబలంతోనూ నిండి ఉంది. నీవు కూడా శ్రీహరి చెబితేనే కదా నా మీదయుద్ధానికి వచ్చావు. కాబట్టి వజ్రాయుధాన్ని ప్రయోగించి నన్ను వధించు. నాకు విముక్తిని ప్రసాదించు. ఎందుకంటే శ్రీహరి నీ పక్షాన ఉన్నాడు. శ్రీహరి ఎవరి పక్షాన ఉంటే వారికి జయం కలుగుతుందని అందరూ అంటారు కదా!

ఓ ఇంద్రా! నీవు ఎంత తొందరగా నీ వజ్రాయుధాన్ని ప్రయోగిస్తే,అంత తొందరగా నేను ఈ శరీరాన్ని విడిచి పెట్టి శ్రీహరి పాదపద్మముల వద్దకు చేరుకుంటాను. ఆ భగవంతునికి తమ

చిత్తమును అర్పించిన వారికి శ్రీహరి స్వర్గ సుఖాలను గానీ, మానవ లోక సుఖాలను గానీ, సంపదలను గానీ ప్రసాదించడు. ఎందుకంటే, వాటి వలన గర్వము, కలహములు, దు:ఖము కలుగుతాయి. ఇచ్చిన ధనమును వృద్ధిచేయాలనీ, దాచిపెట్టాలనీ కోరిక కలుగుతుంది. ఆ ధనం పోతే దు:ఖం కలుగుతుంది. అందుకని శ్రీహరి వాటిని తన భక్తులకు ప్రసాదించడు. జన్మరాహిత్యాన్ని ప్రసాదిస్తాడు. తనలో ఐక్యం చేసుకుంటాడు. దీనిని బట్టి శ్రీహరికి తన భక్తుల యందు ఎంతటి ప్రేమ ఉందో అర్థం చేసుకో! ఆ శ్రీహరి ప్రేమ, కరుణ  ఆయనయందు నిష్కల్మషమైనభక్తి ఉన్నవారికే లభిస్తుంది.  నీ వంటి విషయ వాంఛాపరులకు లభించదు.

ఓ దేవా! పరమాత్మా! నేను నీ పాదములను సేవించగలనా! అంతటి భాగ్యానికి నేను తగునా! నా మనస్సు ఎల్లప్పుడూ నీ గుణములను స్మరిస్తూ ఉండుగాక! నా నోటి వెంట నీ గుణకీర్తనములే పలుకు గాక! ఈ శరీరము నీ సేవలో పునీతము అగుగాక! ఓ దేవదేవా! నాకు నీ పాదపద్మముల సేవ కావాలి. అంతే గానీ ఈ స్వర్గలోక సుఖములు, మానవ లోకసుఖములు, బ్రహ్మలోక నివాసము, గ్రహాధి పత్యము ఏవీ నాకు అక్కరలేదు. నీపాదసేవనకు ఇవన్నీ సాటిరావు.

ఓ దేవదేవా! అప్పుడే పుట్టి, ఇంకా రెక్కలు రాని, ఎగురలేని పక్షులు తమ తల్లి కొరకు ఎదురు చూస్తున్నట్టు, తాటితో కట్టబడిన లేగ దూడలు తమ తల్లులు ఇచ్చే పాలకోసరం ఎదురు చూస్తున్నట్టు, దేశాంతరమునకు వెళ్లిన భర్త కొరకు భార్య ఎదురుచూస్తున్నట్టు, నేను కూడా ఈ దేహమును విడిచి పెట్టి నిన్ను చేరుకోడానికి

ఎదురుచూస్తున్నాను.

ఓ దేవా! నేను గత జన్మలలో చేసిన కర్మల ఫలితంగా ఈ రాక్షస జన్మ ఎత్తాను. కానీ నేను ఎల్లప్పుడూ నీ భక్తులతోనే సాంగత్యము పెట్టుకున్నాను. నిన్ను మరిచిపోలేదు. ఇంత కాలము నీ మాయ వలన ఈ దేహము మీద ఆసక్తి పెంచుకున్నాను. ఇప్పుడు నాకు దేహాభిమానము నశించింది. నన్ను నీలో చేర్చుకో." అని వృత్రుడు శ్రీహరిని ప్రార్థించాడు.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము
పండ్రెండవ అధ్యాయము.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా వృత్రుడు యుద్ధము కంటే మృత్యువు శ్రేష్ఠము అని అనుకున్నాడు. ఇంద్రుని తోటి యుద్ధములో తన చావు తథ్యము అని తలంచాడు. కాని ఆఖరు క్షణం వరకూ పోరాడి వీరమరణం పొందాలని నిశ్చయించుకున్నాడు. తన శూలమును తీసుకొని ఇంద్రుని మీదికి లంఘించాడు. "ఓరీ పాపాత్ముడా! ఇంద్రుడా! నా చేతిలో చచ్చావురా!" అంటూ శూలం విసిరాడు. ఇంద్రుడు ఏ మాత్రమూ భయపడకుండా ఆ శూలమును తన వజ్రాయుధముతో రెండుగా నరికాడు. ఆ శూలముతో పాటు

వృత్రుని చేతిని భుజం దగ్గర నరికాడు. ఒక చేయి నరకబడగా, వృత్రుడు ఒంటి చేత్తో యుద్ధం చేస్తున్నాడు. రెండవ చేత్తో ఒక పరిఘను తీసుకొని ఇంద్రుడి దవడ పగలగొట్టాడు. ఆ దెబ్బకు ఇంద్రుడు తూలి పడ్డాడు. ఇంద్రుని చేతిలోని వజ్రాయుధము జారి కిందపడింది.

వృత్రుని యుద్ధ నిరతిని చూచి అటు దేవతలు ఇటు రాక్షసులు కూడా వృత్రుని ప్రశంసించారు. అంతలోనే దేవతలు ఇంద్రుని చేతిలోని వజ్రాయుధము జారిపడటం చూచి బాధ పడ్డారు. వీరుడి చేతిలోని ఆయుధం జారిపడటం అతని వీరత్వానికే మచ్చ అందుకని ఇంద్రుడు కిందపడ్డ ఆయుధమును తీసుకోలేదు. అప్పుడు వృత్రుడు ఇంద్రునితో ఇలాఅన్నాడు.

“ఇంద్రా! భయపడకు. నిన్ను నేను ఏమీ చేయను. ఆయుధం తీసుకో. నన్ను చంపడానికోసరమేగా దానిని తయారు చేయించావు. దానిని తీసుకొని నన్ను సంహరించు. ఇది బాధ పడటానికి సమయం కాదు. యుద్ధములో జయము, అపజయము రెండూ సంభవములే. ఒకరికే విజయం వరిస్తుంది అని చెప్పలేము. ఒకరికి జయము మరొకరికి అపజయము కలుగుతుంటాయి. కానీ, ఎల్లప్పుడూ కేవలం ఆ శ్రీహరికే  విజయం సిద్ధిస్తుంది. మనలాంటి వాళ్ల జయాపజయాలు ఆయన అధీనంలో ఉంటాయి.  మూడులోకములు ఆ శ్రీహరి అధీనంలో ఉంటాయి. కాబట్టి జయాపజయాలను కూడా ఆయనే నిర్ణయిస్తాడు. మనం కేవలం నిమిత్తమాత్రులము. కాని ఈ మూర్ఖమానవులు జయాపజయాలు తమ చేతిలో ఉన్నాయని, అన్నిటికీ తామే కారణమని,  విర్రవీగుతుంటారు.

ఓ ఇంద్రా! మనమందరమూ ఆ శ్రీహరి చేతిలో కీలుబొమ్మలము. ఆయన ఆడించినట్టు ఆడవలసిన వారమే కానీ మన ఇష్టం వచ్చినట్టు ఆడలేము. ఆ ఈశ్వరుని లీలలు తెలుసుకోలేక, జీవుడు తానే స్వతంత్రుడు అని అనుకొంటూ ఉంటాడు. దేవుడు లేడు నేను నా తల్లి తండ్రి కలిస్తే పుట్టాను. బతికినన్నాళ్లు బతికి తరువాత మరణిస్తాను అని అనుకుంటూ ఉంటారు. అదే మూర్ఖత్వము. ఎందుకంటే ఈ చరాచర జగత్తును సృష్టించింది ఆ పరమాత్మ. ఆయన ప్రాణులను సృష్టిస్తాడు. ఆ ప్రాణుల చేతనే సృష్టిని కొనసాగిస్తాడు. ఆ ప్రాణుల చేతనే లయం చేయిస్తాడు. కాబట్టి ప్రాణులకు ఎలాంటి స్వాతంత్ర్యము లేదు.అన్నీ పరమాత్మ ఆజ్ఞకు లోబడి ప్రవర్తించవలసిందే.

ఓ ఇంద్రా! ఎవరికైనా కాలం కలిసిరానపుడు. అతనికి ఉన్న కీర్తి, సంపదలు అన్నీ హరించుకుపోతాయి. అలాగే కాలం కలిసి వచ్చినప్పుడు సంపదలు, కీర్తి కోరకుండానే అప్రయత్నంగా వచ్చి పడతాయి. అదే పరమాత్మ లీల. కాబట్టి సర్వము ఆ పరమాత్మ అధీనము అని అనుకోవడమే మానవ కర్తవ్యము. సుఖం వచ్చినా, దు:ఖం వచ్చినా సమత్వాన్ని ప్రదర్శించడం విజ్ఞుల లక్షణం.

ఇంద్రా! సత్వ, రజస్, తమోగుణములు ప్రకృతికి సంబంధించినవి. అవి ఆత్మను అంటవు. ఈ మూడు గుణములు దేహమును అందులోని జీవుని ప్రభావితం చేస్తాయి. ఆత్మ మాత్రము అన్నీ సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది. ఈ విషయం తెలుసుకున్న జ్ఞాని సుఖదు:ఖములను సమంగా చూడటానికి ఇష్టపడతాడు.

ఇంద్రా! నీవు నా భుజమును ఖండించావు. కానీ నేను ఊరుకోలేదు. ఈ దేహములో ప్రాణములు ఉన్నంతకాలము నా శక్తికొలదీ యుద్ధం చేస్తూనే ఉన్నాను. నిన్ను చంపడానికి ప్రయత్నం చేస్తూనే ఉన్నాను. నా చేయి లేనందుకు నాకు ఎటువంటి దు:ఖము లేదు. అలాగే నీ ఆయుధము కిందపడినందుకు నీవూ దు:ఖ పడవద్దు.

ఓ ఇంద్రా! యుద్ధము, ద్యూతము ఒకే జాతికి చెందినవి. ఈ రెండింటిలో జయాపజయములు మనచేతిలో లేవు. ఈ యుద్ధము అనే జూదములో మన ఇద్దరి ప్రాణములే పందెములు. మనం విసురుకొనే ఆయుధములే పాచికలు. ఏనుగులు, గుర్రములు, రథములు, జూదము ఆడే పలక. ఇంక ఈ ఆటలో గెలుపు ఓటమి మన చేతిలో లేదు. కాబట్టి కిందపడ్డ ఆయుధము తీసుకొని నాతో యుద్ధం చెయ్యి. చేతనయితే నన్ను చంపు. లేకపోతే నాచేతిలో మరణించు." అని ఇంద్రునికి హితబోధ చేసాడు వృత్రుడు.

నిర్మలమైన మనస్సుతో వృత్రుడు పలికిన పలుకులు విన్నాడు ఇంద్రుడు. అతని నిష్కల్మషత్వానికీ, ఆత్మజ్ఞానానికీ ముగ్ధుడయ్యాడు. నవ్వుతూ వృత్రునితో ఇలా అన్నాడు.

"ఓ వృత్రా! ఒక చేయి తెగి పోయి, యుద్ధంలో ఓడిపోతాను, చనిపోతాను అని తెలిసి కూడా, గుండె నిబ్బరంతో నీవు పలికిన పలుకులు నీ ధైర్యాన్ని, స్థైర్యాన్ని సూచిస్తున్నాయి. నీవు వివేక వంతుడవు. నీ భక్తి మెచ్చుకోతగ్గది. నీజన్మ ధన్యమైనది. నీవు ఆ పరమాత్మను అచంచలమైన మనస్సుతో సేవించావు. నీవు ఆ పరమాత్మ యొక్క

మాయను అధిగమించావు. ఈ ప్రాపంచిక విషయముల పట్ల విరక్తి చెందావు. జ్ఞానము, భక్తి, వైరాగ్యము నీలో పుష్కలంగా ఉన్నాయి. పరమాత్మలో ఐక్యం కావడానికి అర్హత సంపాదించావు. నీ వంటి వాడికి ఇటువంటి స్థితి కలగడం అత్యంత ఆశ్చర్యకరమైన విషయము." అని వృత్రుని ప్రశంసించాడు ఇంద్రుడు.

తరువాత ఇంద్రుడు, వృత్రుడు మరలా యుద్ధం చేయడానికి పూనుకున్నారు. ఇద్దరూ  గొప్ప యోధులే. పరాక్రమవంతులే. వృత్రుడు తన ఎడమచేతితో ఒక ఆయుధమును ధరించి దానిని గిరా గిరా తిప్పి ఇంద్రుని మీదికి విసిరాడు. ఇంద్రుడు తన వజ్రాయుధమును వృత్రుని మీదికి విసిరాడు. ఆ వజ్రాయుధము వృత్రుడు విసిరిన ఆయుధమును ఖండించి, దానితో పాటు వృత్రుని ఎడమచేతిని కూడా ఖండించింది. ఇప్పుడు వృత్రుడు రెండు చేతులు లేకుండా నిలబడిపోయాడు. ఆఖరి ప్రయత్నంగా వృత్రుడు తన నోటిని పెద్దగా తెరిచాడు. కింది పెదవి భూమికి, పై పెదవి ఆకాశానికి జోడించాడు. ముందుకు నడిచాడు. ఇంద్రుని ఐరావతముతో సహా మింగాడు.

ఇంద్రుడిని వృత్రుడు మింగడం చూచి దేవతా గణములు హాహాకారాలు చేసాయి. కాని ఇంద్రుడు నారాయణ కవచమును ధరించి ఉండటం వలన, ఆయనకు ప్రాణములకు హాని కలగలేదు. వెంటనే ఇంద్రుడు తన వజ్రాయుధముతో వృత్రుని పొట్టను చీల్చి బయటకు వచ్చాడు. రాగానే వజ్రాయుధముతో వృత్రుని తల నరికాడు. వృత్రుని తలను పూర్తిగా కొయ్యడానికి వజ్రాయుధమునకు ఒక సంవత్సర కాలముపట్టింది. తల తెగి కింద పడగానే,  వృత్రుడు మొదలు నరికిన చెట్టు మాదిరి కిందపడ్డాడు. వృత్రుని మరణం చూచి దేవతలు,

గంధర్వులు హర్షధ్వానాలు చేసారు. దుందుభులు మోగించారు. ఇంద్రునిమీద పూలవాన కురిపించారు. కాని ఇంద్రునికి సంతోషము కలగలేదు.

ఇంతలో వృత్రుని శరీరము నుండి ఒక దివ్యజ్యోతి బయటకు వచ్చి ఆకాశంలోకి ఎగిరి పోయి శ్రీహరిలో లీనం అయింది.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము
పదమూడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో ఇలా చెప్పసాగాడు. "మహారాజా! ఇంద్రుడు తన వజ్రాయుధముతో వృత్రుడిని చంపాడు అని తెలిసి ముల్లోకములు ఆనందసముద్రములో తేలియాడాయి. తరువాత దేవతలు, ఋషులు, దైత్యులు, అసురులు ఎవరి నివాసములకు వారు వెళ్లారు." అని అన్నాడు.

అప్పుడు పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని ఇలా అడిగాడు. "మహాత్మా! వృత్రుని చంపిన తరువాత ఇంద్రునికి సంతోషము కలగలేదు కదా! దానికి కారణమేమి? అందరూ సంతోషించేవేళ

ఇంద్రుడు మాత్రము ఎందుకు విచారంగా ఉన్నాడు. తెలియజేయండి.” అని అడిగాడు. అప్పుడు శుకుడు ఇలా చెప్పసాగాడు.

“మహారాజా! మొట్ట మొదట దేవతలు, ఋషులు వృత్రుని చంపమని అడిగినప్పుడే ఇంద్రుడు ఒప్పుకోలేదు. ఎందుకంటే అప్పటికే ఇంద్రుడు విశ్వరూపుని చంపి బ్రహ్మహత్యాపాతకమును పొందాడు. దానిని నలుగురికి పంచి విముక్తి పొందాడు. మరలా వృత్రుని చంపి బ్రహ్మహత్యాపాతకమును అనుభవించడానికి ఇంద్రుడికి ఇష్టం లేదు. అందుకని వృత్రుని చంపనని చెప్పాడు ఇంద్రుడు. అప్పుడు ఋషులు ఇంద్రునితో ఇలా అన్నారు.

“మహేంద్రా! బ్రహ్మహత్యాపాతకమునకు నీవు భయపడవలసిన పనిలేదు. నీచేత అశ్వమేధ యాగము చేయించి నిన్ను బ్రహ్మహత్యాపాతకమునుండి నివృత్తి చేసెదము. అశ్వమేధ యాగము చేస్తే సర్వపాపములు నాశనం అయి పోతాయి. ఇంక ఈ బ్రహ్మహత్యాపాతకము ఎంత? అంతేకాదు. బ్రాహ్మణుని చంపిన వాడు, తండ్రిని, తల్లిని చంపిన వాడు, గోవులను చంపినవాడు, గురువును చంపిన వాడు, ఇటువంటి వారు కూడా అశ్వమేధ యాగము చేసి ఆ శ్రీహరిని అర్చిస్తే, ఆయా పాపముల నుండి విముక్తి కలుగుతుంది. కాబట్టి నీవు సత్వరమే వృత్రవధ చెయ్యి.” అని కోరారు.

ఋషుల మాట మీద ఇంద్రుడు వృత్రుని చంపడానికి అంగీకరించాడు. వృత్రుని చంపాడు. వెంటనే బ్రహ్మహత్యాపాతకము ఇంద్రుని చుట్టుముట్టింది. ఆ కారణం చేత వృత్రుని చంపిన ఆనందం ఇంద్రునికి కలుగలేదు. మనసులో ఒక బ్రాహ్మణుని చంపాను అదీ

కూడా ఒక తత్త్వజ్ఞానిని చంపాను అన్న బాధ ఇంద్రుని మనసులో తొలుస్తూ ఉంది.

బ్రహ్మహత్యాపాతకము భయంకర రూపంతో తనను తరుముకుంటూ రావడం చూచాడు ఇంద్రుడు. వెంటనే ఇంద్రుడు ఆకాశంలోకి పరుగెత్తాడు. బ్రహ్మహత్య అతనిని తరుముతూ ఉంది. ఇంద్రుడు అన్ని దిక్కులకు పరుగెత్తాడు. తుదకు ఈశాన్య దిక్కున ఉన్న మానస సరోవరమునకు వెళ్లాడు. ఆ సరోవరములో ఉన్న ఒక తామర పూవు యొక్క కాడలోకి దూరాడు. అక్కడ వేయి సంవత్సరముల పాటు ఉన్నాడు.

సాధారణంగా అగ్ని ఇంద్రునికి హవిర్భాగములను తెచ్చి ఇస్తూ ఉంటాడు. ఇప్పుడు ఇంద్రుడు నీళ్లలో ఉన్న తామర తూడులో ఉండటం వలన, అగ్ని నీళ్లలోకి ప్రవేశించడం సాధ్యం కాలేదు. అందువలన ఇంద్రునికి హవిర్భాగములు అందడం లేదు. కాబట్టి ఇంద్రుడు ఎటువంటి భోగములు అనుభవించకుండా వేయి సంవత్సరములు తామర తూడులో పడి ఉన్నాడు.

ఇంద్రుడు తామర తూడులో ఉన్న వేయి సంవత్సరములు నహుషుడు అనే మహారాజు ఇంద్రపదవిని అధిష్ఠించి స్వర్గమును పరిపాలించాడు. స్వర్గాధిపత్యము చేతికి రాగానే, నహుషుడికి ఒక దుర్బుద్ధి పుట్టింది. నహుషుడు ఇంద్రుని భార్య శచీదేవిని కామించాడు. ఆమెను కలుసుకోడానికి సప్తఋషులు లాగే రథంలో బయలు దేరాడు. మధ్యలో బ్రాహ్మణ శాపమునకు గురి అయ్యాడు. బ్రాహ్మణ శాపవశాత్తు

నహుషుడు సర్పముగా భోలోకములో జన్మించాడు. తరువాత దేవేంద్రుడు అశ్వమేధయాగము చేసి శ్రీహరిని కీర్తించి బ్రహ్మహత్యపాతకము నుండి విముక్తి పొందాడు. తరువాత ఇంద్రుడు మరలా స్వర్గలోకాధి పత్యమును పొందాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ వృత్రుని కథ చాలా గొప్పది. దీనిని చదివినా, వినినా సకల పాపములు నశిస్తాయి. ఎందుకంటే ఈ కథలో శ్రీహరి మహత్తు చక్కగా వివరింపబడింది. దీని వలన శరీరము ఆరోగ్యంగా ఉంటుంది. కీర్తి కలుగుతుంది. సకల పాపములు నశిస్తాయి." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు మహాభాగవత కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము

పదునాలుగవ అధ్యాయము.

వృత్రుని వృత్తాంతము పూర్తిగా విన్న తరువాత పరీక్షిత్తు మహారాజుకు ఒక సందేహము కలిగింది.

"మహాత్మా!నాకు ఒక చిన్నసందేహము. వృత్రుడు రజోగుణ సంపన్నుడు కదా! ఎన్నోపాపాలు చేసాడని దేవతలకు హాని చేసాడనీ,

మూడు లోకములను అల్లల్లాడించాడనీ చెప్పారు కదా! మరి అటువంటి వాడికి శ్రీమన్నారాయణుని మీద అపారమైన భక్తి ప్రమత్తులు ఎలా కలిగాయి. సాధారణంగా దేవతలకు, ఋషులకు కూడా ఆ నారాయణుని పాదముల యందు భక్తి కలగటం దుర్లభం. కానీ అసుర ప్రవృత్తి కల వృత్రుడికి శ్రీహరి యందు అచంచలమైన భక్తి కలగడానికి కారణమేమి?

ఈ అనంత విశ్వంలో ఉన్న కోట్లాది ప్రాణులలో మానవులు అత్యంత అల్పసంఖ్య కలవారు. ఆ మానవులలో ధర్మము ప్రకారము నడుచుకొనేవారు చాలా కొద్ది మంది. వారిలో కూడా మోక్షము కొరకు ప్రయత్నం చేసేవారు ఇంకా కొద్దిమంది. ఆ ప్రయత్నం చేసేవారిలో కూడా వేయికి ఒకడు మాత్రమే దేహము మీద, ఇంటి మీద, భార్యాబిడ్డల మీదా, బంధు మిత్రుల మీదా అభిమానము విడిచిపెట్టి ముక్తి పొందుతాడు. అలా ముక్తి పొందిన వారిలో కూడా కొంత మందికి మాత్రమే ఆత్మ తత్త్వము అర్థం అవుతుంది.

భగవంతుని చేరుకోవడం ముక్తి పొందడం ఇంత కష్టంగా ఉంటే, యుద్ధ రంగంలో నిలిచి, ఇంద్రుని ఎదిరించి నిలిచిన వృత్రునికి శ్రీహరి మీద అచంచలమైన భక్తి ఎలాకలిగింది? ఎందుకంటే వృత్రుడు తన భక్తి భావన చేత సాక్షాత్తు ఇంద్రునే ముగ్ధుడిని చేసాడు. అంతటి భక్తి వైరాగ్యములు వృత్రునికి ఎలా సాధ్యం అయ్యాయి. ఇదే నా సందేహము. తమరు దయచేసి నాసందేహమును తీర్చండి." అని అడిగాడు పరీక్షిత్తు మహారాజు. శుక మహర్షి ఇలా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ వృత్రుని చరిత్రను నేను నారదుడు, దేవలుడు, నా తండ్రి వ్యాసునివలన విన్నాను. దానినే నీకు చెబుతున్నాను. శ్రద్ధగా విను.

పూర్వకాలంలో శూరసేన రాజ్యాన్ని చిత్రకేతుడు అనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆ చిత్ర కేతువుకు కోటి మంది భార్యలు ఉన్నారు. కాని ఆ కోటి మందిలో ఎవరి వలన కూడా ఆ చిత్రకేతు మహారాజుకు సంతానము కలగలేదు. చిత్ర కేతువుకు ఏమీ తక్కువలేదు. మంచి అందగాడు. యౌవనంలో ఉన్నాడు. మంచి రాజకులంలో పుట్టాడు. అన్ని విద్యలు నేర్చుకున్నాడు. అపారమైన సంపదలు ఉన్నాయి. అందము, ఆరోగ్యము, యవ్వనము ఉన్న భార్యలు ఉన్నారు. పైగా మంచి గుణవంతుడు. కానీ సంతానము లేదు.

ఆ దిగులుతో నానాటికీ చిత్రకేతువు దిగులుతో కుంగి పోతున్నాడు. అటువంటి చిత్రకేతు మహారాజు దగ్గరకు ఒక రోజు అంగిరసుడు అనే మహాముని వచ్చాడు. చిత్రకేతుడు ఆ మహామునిని సాదరంగా ఆహ్వానించి అర్ఘ్యము, పాద్యము, ఆసనము, ఇచ్చి సత్కరించాడు. ఋషిని ఆసనము మీద కూర్చోపెట్టి మహారాజు కింద కూర్చున్నాడు. మహారాజు వినయం చూసి అంగిరసుడు అతనితో ఇలా అన్నాడు.

"మహారాజా! మీకు క్షేమమే కదా! మీరు ఆరోగ్యంగా ఉన్నారా! నీ రాజ్యలో ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లుతున్నారా! నీ మంత్రులు, దుర్గములు, కోశాగారము, నీ మిత్రులు క్షేమంగా ఉన్నారా! నీవు నేరం చేసిన వారిని దండిస్తూ, నిరపరాధులను రక్షిస్తున్నావు కదా!

నీ రాజ్యంలో ఉన్న జనపదాలు క్షేమంగా ఉన్నాయి కదా! నీ ప్రజలు నీకు న్యాయముగా రావలసిన కప్పములు (పన్నులు) చెల్లిస్తున్నారు కదా! నీ రాజ్యంలో వ్యాపారులు సక్రమంగా వ్యాపారాలు చేసుకుంటున్నారు కదా ఇంక నీ అంతఃపురములో నీ భార్యలు, నీ కుమారులు, నీ బంధువులు, సేవకులు, నీకు అనుకూలంగా ఉన్నారు కదా! నీమాటలు వింటున్నారు కదా! అయినా నీ మొహం చూస్తుంటే నీవు సంతోషంగా ఉండటం లేదనీ, దేని గురించో బాధపడుతున్నావనీ తెలుస్తూ ఉంది. ఈ బాధ నీకు స్వయంగా కలిగినదా లేక ఇతరుల వలన కలిగిందా! నాతో చెబితే నీకు చేతనైనంత సాయం చేస్తాను." అని అన్నాడు అంగిరసుడు. అప్పుడు చిత్రకేతువు అంగిరసునితో ఇలా అన్నాడు.

"మహాత్మా! తమరు సర్వజ్ఞులు. తమరికి తెలియనిది ఏముంది. తమరికీ అన్నీ తెలిసే నన్ను అడుగుతున్నారు. తమరు అడిగారు కాబట్టి నా మనసులో ఉన్న బాధను తమరితో చెప్పుకుంటాను. నాకు ఎంత ఐశ్వర్యము ఉన్నా, సంతానము లేని కారణంగా నా రాజ్యము, నా ఐశ్వర్యము నాకు ఏ మాత్రమూ సుఖాలను ఇవ్వలేకపోతున్నాయి. పైగా నాకు పుత్రులు లేకపోవడం వలన నా పితరులకు నేను ఉత్తమ గతులు కలిగించలేకపోతున్నాను. కాబట్టి నాకు పుత్రులు కలిగే ఉపాయము చెప్పవలసినది." అని అడిగాడు.

చిత్రకేతువు చెప్పిన మాటలు విన్న అంగిరసుడు చిత్రకేతు మహారాజు చేత త్వష్టయాగము చేయించాడు. ఆ యజ్ఞము చివరలో యజ్ఞఫలమును, అంగిరసుడు, చిత్రకేతువు మొదటి భార్య అయిన

కృతద్యుతి అనే ఆమెకు ఇచ్చాడు. “ఓ రాజా! నీకు ఈమె వలన సుఖదు:ఖములను కలిగించే ఒక కుమారుడు జన్మిస్తాడు.” అని చెప్పి వెళ్లిపోయాడు.

యజ్ఞము చేసిన దానికి ఫలితంగా చిత్రకేతువు పట్టమహిషి అయిన కృతద్యుతి గర్భం దాల్చింది. నవమాసములు పూర్తి చేసి, ఒక మగ శిశువును ప్రసవించింది. తనకు కుమారుడు కలిగాడు అన్న వార్త విన్న చిత్రకేతువు ఆనందానికి అవధులు లేవు. రాజ్యం అంతా ఉత్సవాలు చేయించాడు. కుమారుడికి జాతక కర్మలు నిర్వర్తించి, జాతకము రాయించాడు. బ్రాహ్మణులకు బంగారము, వెండి ఆభరణములు, గ్రామములు, ఏనుగులు, గుర్రములు, ఆవులు, దానంగా ఇచ్చాడు. రాజ్యములో ఉండే ప్రజలకు ఎవరు ఏది కోరితే అది దానంగా ఇచ్చాడు.

చిత్రకేతు మహారాజు, రాణి కృతద్యుతి ఇద్దరూ లేకలేక కలిగిన కుమారుని మీద అంతులేని అనురాగం కురిపిస్తున్నారు. మహారాజు ఇతర రాణుల గురించి పట్టించుకోవడం మానేసాడు. తను, తన భార్య కృతద్యుతి, తన కుమారుడు..... వీరి తోడిదే లోకంగా జీవిస్తున్నాడు.

ఇది చూచి ఇతర భార్యలకు అసూయ, ద్వేషం కలిగాయి. తమకు సంతానం లేదు. పైగా భర్త తమ మొహం కూడా చూడటం లేదు. ఏమి చెయ్యాలో తోచక తమను తామే తిట్టుకుంటున్నారు. తమ సవతికి సంతానం కలగడం, తమకు సంతానం లేకపోవడం వారి దు:ఖమును రెట్టింపు చేసింది. సంతానములేని తాము, తన సవతి ముందు చులకన అవుతున్నాము అన్న భావన వారిలో బాగా పాతుకు

పోయింది. వారిలో పెరుగుతున్న అసూయ, ద్వేషము ఆకాశాన్నంటాయి. తమకు లేని సంతానము తమ సవతికి ఉండకూడదు అనుకున్నారు. అంతే. వారంతా కలిసి ఆ చిన్ని బాలునికి విషప్రయోగం చేసారు. విషప్రయోగ ప్రభావంతో బాలుడు శాశ్వతంగా నిద్రలోకి జారుకున్నాడు. ఇది తెలియని కృతద్యుతి బాలుడు నిద్రపోతున్నాడు అని అనుకుంది. కాని కుమారుడు ఎంతకూ లేవక పోవడంతో, అనుమానం కలిగింది. వెంటనే దాసీని పిలిచి తన కుమారుని తీసుకు రమ్మని చెప్పింది.

దాసి పోయి నిర్జీవంగాపడి ఉన్న కుమారుని చూచి పెద్దగా కేకపెట్టింది. కింద పడి మూర్ఛపోయింది. ఇది చూచిన రాణి కంగారుగా కుమారుని వద్దకు వచ్చింది. మరణించి పడి ఉన్న కుమారుని చూచి కింద పడి మూర్ఛపోయింది. మిగిలిన రాణులు గబగబా అక్కడకు వచ్చారు. లేని ఏడుపును తెచ్చి పెట్టుకొని ఏడవసాగారు. లోపల మాత్రము తమ పాచిక పారినందుకు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతున్నారు.

ఈవార్త చిత్ర కేతువుకు తెలిసింది. అతనికి కళ్లు తిరిగాయి. బైర్లు కమ్మాయి. పడుతూ లేస్తూ పరుగు పరుగున కుమారుని వద్దకు వచ్చాడు. ఆ కుమారుని శరీరం మీదపడ్డాడు. కళ్ల నుండి నీరు ధారాపాతంగా కారుతున్నాయి. నోటమాట రావడం లేదు. దు:ఖం పొర్లుకొస్తూ ఉంది. ఇంతలో మంత్రులు, బంధువులు అక్కడకు చేరుకున్నారు. కృతద్యుతి మహారాణిపెద్ద పెట్టున ఏడవసాగింది. ఆమె దు:ఖానికి అంతులేకుండా పోయింది.

"ఓ దేవుడా! అభం శుభం తెలియని నా కుమారుడిని తీసుకుపోయావా! తండ్రి జీవించి ఉండగా పుత్రులు మరణించడం ధర్మమా! ఇది సృష్టికివిరుద్ధము కాదా! ఇంతటి అధర్మానికి ఎందుకు పాల్పడ్డావు? నిన్ను దయామయుడు అంటారు. కానీ నీకు దయ అనేది లేదు. నీవు నిర్దయుడవు. ప్రజలకష్టాలు నీకు తెలియవు. పుత్రుడు జీవించి ఉండగానే తండ్రి మరణించడం, తండ్రి జీవించ ఉండగానే కుమారులు కలగడం సృష్టిధర్మము. కాని వారి వారి కర్మల ననుసరించి జనన మరణాలు సంభవిస్తాయని నిన్ను నీవు సమర్ధించుకోవచ్చు.

మానవులు చేసే కర్మల ఫలితంగా జనన మరణములు సంభవిస్తున్నప్పుడు ఇంక దేవుడు ఎందుకు. దేవుడిని పూజించడం ఎందుకు. మానవులు చేసే అన్ని కర్మలకు నీవే కారణం అంటారు కదా! ఆ కర్మల ఫలితంగా జనన మరణాలు నీకు తెలియకుండానే సంభవించవు కదా! అటువంటప్పుడు తండ్రి జీవించి ఉండగా కుమారుని తీసుకుపోవడం న్యాయంగా ఉందా! నీ సృష్టిని నీవే నాశనం చేసుకుంటావా! ఇలానే కొనసాగుతుంటే ఏ తండ్రీ తన కుమారుని మీద ప్రేమ చూపించడు. ఏ కుమారుడు తన తండ్రిని గౌరవించడు. దీని వలన సృష్టి ధర్మం నశిస్తుంది. ఇటువంటి సృష్టి చేస్తున్న నీకు నిజంగా బుద్ధిలేదు. మూర్ఖుడివి."అని అప్పటి దాకా దేవుడిని దుమ్మెత్తి పోసిన కృతద్యుతి కుమారుని చూచి ఇలా ఏడిచింది.

"కుమారా! నన్ను విడిచి పెట్టి ఎక్కడకుపోయావురా! అటు చూడరా! నీ తండ్రి నీ కోసరం ఎలా ఏడుస్తున్నాడో. మమ్ములను

విడిచి వెళ్లడం నీకు ధర్మమా! ఆ యముడితో పాటు ఎక్కువ దూరం వెళ్లకు. ఆ యముడి నుండి తప్పించుకొని తిరిగి వచ్చెయ్యి.

లే నాయనా! ఇప్పటికే చాలాసేపు నిద్ర పోయావు. నీతండ్రి గారు వచ్చారు లేరా! అదుగో చూడు. నీతో ఆడుకోడానికి చాలా మంది చిట్టి చిట్టి బాలురు వచ్చారు. లేచి వాళ్లతో ఆడుకో. ఆకలేస్తోందా! లేచిరా! అన్నంపెడతాను. కడుపునిండా తిని ఆడుకో. నిన్ను చూడంది నాకు దు:ఖము ఆగడం లేదురా! ఈ తల్లి దు:ఖమును పోగొట్టరా! ఒక్కసారి నవ్వరా! తిరిగిరాని లోకాలకు యముడు నిన్ను తీసుకెళ్లిపోయాడా! మరలా తిరిగి రావా!"అని ఒక మాటకు మరొక మాట పొంతన లేకుండా మాట్లాడుతూ ఏడుస్తూ ఉంది కృతద్యుతి మహారాణి.

భార్య శోకముచూచి చిత్రకేతు మహారాజు తట్టుకోలేక పోయాడు. తనుకూడా భార్యతో కలిసి ఏడవసాగాడు. రాజు రాణి ఏడవడం చూచి అక్కడ ఉన్న వారందరూ ఏడవసాగారు. రాజమందిరం అంతా శోకసముద్రం అయింది.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము
ఓంతత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము

పదునైదవ అధ్యాయము.

ఈ విషయం తెలుసుకున్న అంగి రసుడు నారద మహర్షిని వెంట బెట్టుకొని సాధారణ ముని వేషములలో చిత్రకేతు మహారాజువద్దకు వచ్చారు. ఎదురుగా చనిపోయిన కుమారుని మృతదేహమును పెట్టుకొని శోకించుచున్న భార్య భర్తలను చూచారు. అంగిరసుడు రాజును ఇలా అడిగాడు.

"రాజా! నీవు ఎవరి కొరకు దు:ఖిస్తున్నావు. ఈ బాలుడు నీకు ఏమి కావాలి? ఓహో! ఇతను నీ కుమారుడా! అంటే ఈ జన్మలోనే నీ కుమారుడా లేక ఇంతకు ముందుజన్మలో కూడా నీ కుమారుడేనా! రాబోయే జన్మలో కూడా ఇతడు నీ కుమారుడుగా పుడతాడని నమ్మకం ఉందా! అంటే మీ తండ్రి కుమారుల సంబంధం ఎప్పటి నుండి కొనసాగుతూఉంది? ఎందుకంటే సముద్రములో కోట్లాది ఇసుక రేణువులు ఉంటాయి. అల వచ్చినప్పుడు ఆ ఇసుక రేణువులు నీటితో పాటు  ఒడ్డుకు కొట్టుకు వస్తాయి. అల వెనక్కు పోయినపుడు అప్పటి దాకా సముద్రము ఒడ్డున ఉన్న ఇసుక రేణువులు ఆ అలతో పాటు సముద్రములోకి వెళతాయి. ఇది నిరంతరము జరిగే ప్రక్రియ.

అలాగే ప్రాణులు కూడా పుడుతుంటారు. చస్తుంటారు. ఒక సారి కలుస్తుంటారు. ఒక సారి విడిపోతుంటారు.  ఇదంతా కాలమును బట్టి జరుగుతూ ఉంటుంది. ఒక విత్తనము వేస్తే అందులో నుండి ఒక మొక్క పుట్టి చెట్టు అయి, కాయలు కాచి, పళ్లు అయి, అందులో ఉన్న

విత్తనముల వలన మరలా ఎన్నో మొక్కలు, కాయలు పళ్లు కాస్తాయి. ఇది నిరంతర ప్రక్రియ. ఈ ప్రక్రియలో వేసిన ప్రతి విత్తనము మొలకెత్తదు. మొలకెత్తిన ప్రతి మొక్కా బతకదు. బతికినా కాయలు కాయదు. కాసినా పండదు. పండినా అందులో విత్తనములు అన్నీ సారవంతమైనవి కావు. కొన్ని మొలకెత్తుతాయి. కొన్నిమొలకెత్తవు. అలాగే ప్రాణులు కూడా పుటుతుంటారు, పెరుగుతుంటారు, చస్తుంటారు. కొంతమంది పూర్ణాయుర్దాయము కలిగిఉంటారు. కొంత మంది పుట్టగానే మరణిస్తారు. ఇది అంతా శ్రీహరి మాయ. శాశ్వతము కాని ఈ సంబంధముల గురించి చింతించడం అవివేకము కదా!

ఓరాజా! మేము, నువ్వు, నీ భార్యలు అంతా ఈ ప్రపంచంలో జీవిస్తున్నాము. ఈ జన్మలో నీ భార్యలందరూ పోయిన జన్మలో నీ భార్యలా కాదా అన్న విషయము  నీకు తెలియదు, వారికీ తెలియదు. పోనీ ఈ జన్మలో నీ భార్యలుగా ఉన్న వారందరూ వచ్చేజన్మలో కూడా నీ భార్యలుగా ఉంటారా అన్న నిర్ధారణ లేదు. కాబట్టి ఇదంతా నువ్వు ఈ జన్మలో కంటున్న కల లాంటిది. కలలో కనిపించి మాయమైన వాటిని గురించి మనము బాధ పడము కదా! ఇదీ అంతే!

ఓ రాజా! ఈ సృష్టి చేయవలసిన అవసరము పరమాత్మకు లేదు. కానీ చేస్తున్నాడు. తండ్రి రూపంలో ఉండి వీర్యాన్ని తల్లి గర్భంలో ఉంచుతున్నాడు. తల్లి రూపంలో పరమాత్మ బిడ్డలకు జన్మనిస్తున్నాడు. ఆ పుట్టిన వారిని తనే పోషిస్తున్నాడు. కాలం తీరగానే లయం చేస్తున్నాడు. కాబట్టి నేను పుట్టించాను, నేను పెంచాను అన్న భావన మంచిది కాదు. ప్రాణుల పుట్టుకలకు, చావులకు ఎవరూ కారణం

కాదు. అంతా ఆ శ్రీహరి లీల. కేవలం ఆ శ్రీహరి మాయ వలన జీవుల చావు పుట్టుకలకు తాను కారణం అనుకుంటున్నాడు జీవుడు. ఒక విత్తనం వేస్తే దాని నుండి పది విత్తనాలు పుడతాయి. అలా స్త్రీ పురుషులు కలిస్తే సంతానం కలుగుతుంది. ఆ సంతానానికి మరలా సంతానం కలుగుతుంది. ఇది సృష్టి క్రమము.

ఓ రాజా! దేహములు అశాశ్వతములు కానీ దేహములలో ఉన్న జీవుడు శాశ్వతము. కాని ఈ దేహమే శాశ్వతము అనే మాయలో మానవులు పడి ఉంటారు. అది వారి అజ్ఞానము. కాబట్టి మహారాజా నీవు ఈ అజ్ఞానము వదిలిపెట్టు." అని ఆత్మతత్త్వమును బోధించాడు అంగిరసుడు. వారి మాటలు విన్న చిత్రకేతువు కొంత ఉపశమించాడు. వారితో ఇలా అన్నాడు.

"ఓ మహానుభావులారా! మీరెవరు? మీరు జ్ఞాన సంపన్నులనీ, మహిమాన్వితులు అనీ అనుకుంటున్నాను. మీ వంటి యోగులు మా వంటి వారి అజ్ఞానము పోగొట్టడానికి ఇలా తిరుగుతుంటారు అని విని ఉన్నాను. సనత్కుమారుడు, నారదుడు, ఋభువు, అంగిరసుడు, దేవలుడు, అసితుడు, అపాంతరతముడు, వ్యాసుడు, మార్కండేయుడు, గౌతముడు, వశిష్ఠుడు, కపిలుడు, శుకుడు, దుర్వాసుడు, యాజ్ఞవల్క్యుడు, జాతుకర్ణుడు, ఆరుణి, రోమశుడు, చ్యవనుడు, దత్తాత్రేయుడు, పతంజలి, కపిలుడు, ధౌమ్యుడు, హిరణ్యనాభుడు, కౌశలుడు, శ్రుతదేవుడు, ఋతధ్వజుడు, మొదలగు వారు మానవుల అజ్ఞానమును పోగొట్టే నిమిత్తము ఈ లోకములో వివిధ వేషములలో సంచరిస్తుంటారు అని విని ఉన్నాను. వీరిలో మీరు ఎవరు? నాకు జ్ఞానము ప్రసాదించడానికి

వచ్చిన మహాత్ములా! నేను ప్రస్తుతము పుత్రశోకము అనే మూఢత్వములో, అజ్ఞానములో మునిగి ఉన్నాను. నాకు జ్ఞానోపదేశము చేయండి." అని అడిగాడు. అప్పుడు అంగిరసుడు చిత్రకేతువుతో ఇలా అన్నాడు.

"మీరు ఎవరు అని అడిగావుకదా! నేను నీకు పుత్రుడను ప్రసాదించిన అంగిరసుడను. ఈయన నారద మహర్షి. బ్రహ్మ మానస పుత్రుడు. నీకు పుత్రుడు జన్మించాడనీ, ఆ పుత్రుడు మరణించాడనీ, నీవు ఆ పుత్రశోకములో మునిగి ఉన్నావనీ తెలిసి నీకు జ్ఞానోపదేశము చేయుటకు వచ్చాము.

ఓ చిత్రకేతూ! నీ వంటి వాడు ఈ ప్రకారము శోకించడం తగదు. ఇది వరకు నేను నీ వద్దకు వచ్చినపుడు నీవు పుత్రులు కావాలని అడిగావు. నేను నీ చేత యజ్ఞము చేయించి పుత్రలాభము కలిగించాను. నేను ఆనాడే చెప్పాను, నీకు పుత్రుల వలన సుఖము, దు:ఖము, రెండూ కలుగుతాయని. పుట్టి నప్పుడు సుఖంకలిగింది. పోయినపుడు దు:ఖం కలిగింది. ఇదే కాదు. భార్య, సంపదలు, ఇల్లు, రాజ్యము, శబ్దము వలన, స్పర్శ వలన  కలుగు సుఖము, అన్నీ శాశ్వతములు కావు. వస్తుంటాయి పోతుంటాయి.

నీకు ఉన్న రాజ్యము, సైన్యము, నీ సేవకులు, మంత్రులు, బంధువులు అందరూ నీకు భయాన్ని, మోహాన్ని, దు:ఖమును కలిగించేవారే. వీరంతా ఇప్పుడు ఉన్న వారు రేపు ఉండరు. ఈ రోజు లేని వారు రేపు వస్తారు. ఇవి అన్నీ స్వప్నములో వలే కనపడతాయి.

మెలుకువ రాగానే మాయం అవుతాయి. ఈ సుఖాలు దు:ఖాలు అన్నీ మనం కల్పించుకున్నవే. ఉన్న వస్తువు ఒకటే, దాని వలన జరిగే పని ఒకటే. ఆ వస్తువులతో మనం చేసే పనుల వలన మనం సుఖం అనుకుంటే సుఖం, దు:ఖం అనుకుంటే దు:ఖం కలుగుతాయి. ఒకరికి సుఖం మరొకరికి దు:ఖం అవుతుంది.

నీ మొదటి భార్యకు పుత్రుడు కలిగితే, నీకు ఆమెకూ సుఖం కలిగింది. మిగిలిన భార్యలకు అదే పుత్రుడు తమకు కలగనందుకు దు:ఖము కలిగింది. ఈ ప్రపంచంలో మనం చూచేవన్నీ మన మనస్సు కల్పించినవే. ఇవి శాశ్వతము కాకపోవడం వలననే అవి కాలాంతరంలో మార్పులుచెందుతూ కనపడకుండా పోతున్నాయి. (ఒకనాటి పల్లెలు నేడు పట్టణాలు నగరాలు అవుతున్నాయి. నాటి నగరాలు నేడు మట్టి దిబ్బలు అవుతున్నాయి. రోజూ కోటానుకోట్ల మంది పుడుతున్నారు. అంతే మంది మరణిస్తున్నారు. ఈ ప్రపంచం ప్రతి క్షణం మార్పుచెందుతూ ఉంది.) తాను పూర్వ జన్మలో చేసిన కర్మల వాసనల ఫలితంగా ఈ జన్మలో జీవులు కర్మలు చేస్తున్నారు. విషయ వాంఛలకు లోనవు తున్నారు. తుదకు దు:ఖముల పాలవుతున్నారు.

ఓ రాజా! ఈ దేహము పంచభూతములతో కూడినది. ఈ దేహములో పది ఇంద్రియములు ఉన్నాయి. ఈ దేహమే అన్ని దు:ఖములకు కారణము. అవి దేహమునకు సంబంధించినవి కావచ్చు. మనస్సుకు సంబంధించినవి కావచ్చు. లేక దైవికముగా వచ్చిన దు:ఖములుకావచ్చు. ఏ దు:ఖమైనా జీవుని యొక్క పూర్వజన్మవాసనల ఫలితంగానే కలుగుతుంది. కాబట్టి నీవు నీ శోకమును మాని, ప్రశాంతమైన మనస్సుతో నీ గురించి విచారించు. అసలునీవు ఎవరు?

నీ కుమారుడు ఎవరు? అతని గురించి నీవు ఎందుకు శోకిస్తున్నావు? ఈ ఆత్మవిచారము చెయ్యి. ఆ పరమాత్మ తప్ప మరొక వస్తువు ఈ లోకంలో లేదు అన్న సత్యం తెలుసుకుంటావు. అప్పుడే నీకు శాంతి లభిస్తుంది." అని అంగిరసుడు చెప్పాడు.

ఇంతలో నారదుడు చిత్రకేతుతో ఇలా అన్నాడు. "రాజా! నేను నీకు ఒక మంత్రమును ఉపదేశిస్తాను. దానిని నిష్ఠతో జపించు. నీకు శుభం కలుగుతుంది. నీకు ఆ సంకర్షణుని దర్శనము లభిస్తుంది. ఈ మంత్రమును జపించడం వలన నీవు విద్యాధరత్వమును పొందగలవు." అని పలికాడు.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము
పదునారవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! తరువాత నారదుడు తన యోగ బలము చేత చనిపోయిన చిత్రకేతు మహారాజు కుమారుని పునర్జీవితుని చేసాడు. ఆ కుమారుడు నిద్రనుండి లేచి నట్టు లేచాడు.

నారదుడు ఆ కుమారునికి చిత్రకేతును, అతని తల్లిని, బంధువులను చూపించి ఇలా అడిగాడు.

"ఈ దేహములో ఉన్న ఓ జీవుడా! వీరందరూ నీ కొరకు ఏడుస్తున్నారు. నీవు మరణించావని దు:ఖిస్తున్నారు. వాళ్ల దగ్గరకు పోయి వారి దు:ఖమును ఉపశమింపచెయ్యి.నీవు ఈ రాజ్యమునకు రాజువు. నీవు పెరిగి పెద్దవాడివి అయి ఈ రాజ్యమును పాలించు. రాజభోగములు అనుభవించు." అని అన్నాడు.

ఆ కుమారుని దేహములో ఉన్న జీవుడు చిత్రకేతుని వంక, ఆయన భార్యల వంక, బంధువుల వంక చూచాడు.

"నేను చేసిన కర్మల ఫలితంగా ఎన్నో జన్మలు అనగా దేవతలు, మానవులు, జంతువులు, పక్షులు వంటి ఎన్నో జన్మలు ఎత్తాను. వీరు నాకు ఏ జన్మలో నా తల్లి తండ్రులో నాకు గుర్తురావడం లేదు. ఈ జనన మరణ చక్రంలో తిరుగుతున్న నాకు, నాలాంటి వారికి, ఎంతో మంది తల్లులు, తండ్రులు, బంధువులు, దాయాదులు, మిత్రులు ఉన్నారు. వినిమయమునకు ఉపయోగించు బంగారు నాణెములు ఎంతోమంది చేతులు మారునట్టు, నేను ఈ జనన మరణచక్రంలో ఎన్నో యోనులలో పుట్టాను. ఆయా జన్మలలో సంసార బంధములు పెట్టుకున్నాను. మరణించగానే, ఆయా జన్మలలో పెంచుకున్న బంధనములు తెగిపోయాయి.

నేను ఇన్ని జన్మలు ఎత్తినా, నాలో మార్పు లేదు. నేను నిత్యము, సత్యము. ఈ దేహములు అశాశ్వతములు. ఏ దేహముతోనూ

నాకు సంబంధము లేదు. ఏ జన్మ ఎత్తితే ఆ జన్మలో నాకు తల్లి తండ్రి బంధువులు ఉంటారు. ఆ జన్మ పోగానే వారూ పోతారు. దేహములు పుడతాయి గానీ జీవుడు పుట్టడు. దేహమునకు నేను నాది అనే అభిమానము ఉంటుంది కానీ జీవునకు కాదు. పూర్వజన్మ ఫలితంగా దేహం వస్తుంది. ఆ దేహమును బట్టి తల్లి, తండ్రి, బంధువులు ఉంటారు. ఆ దేహమును వదిలిపెట్టగానే ఆ తల్లి, తండ్రి బంధము పూర్తి అవుతుంది. మరలా మరోజన్మ. మరో బంధము. కాబట్టి ఈ అశాశ్వతములైన బంధముల గురించి దు:ఖించడం వ్యర్థము.

దేహములో ఉన్న జీవుడు శాశ్వతుడు. జీవునికి చావులేదు. దేహము మాత్రమే చస్తుంది. జీవుడు సూక్ష్మశరీరంతో ఉంటాడు. ఎల్లప్పుడూ ఏదో ఒక దేహమును ఆశ్రయించుకొని ఉంటాడు. ఈ దేహమునకు ఇష్టము, అయిష్టము, తన వాడు, మనవాడు, పరాయి వాడు అనే బేధభావము ఉంటుంది కానీ, జీవునకు అటువంటి భేదభావము ఉండదు. జీవునికి అందరూ ఒకటే. జీవునికి దేని మీద కూడా ఆసక్తి ఉండదు. దేహము చేసే పనులను సాక్షీభూతంగా చూస్తుంటాడు. జీవాత్మకు సుఖదు:ఖములు, రాజ్యములు, వాటి సుఖములు, కర్మలు, వాటి ఫలములు ఇవేమీ పట్టవు. కాబట్టి నేను ఎవరి గురించి శోకించను. నా గురించి మీరూ శోకించకండి." అని అన్నాడు ఆ కుమారుని దేహములో ఉన్న జీవుడు. ఆ ప్రకారంగా పలికి ఆ జీవాత్మ దేహమును వదలి పెట్టి వెళ్లి పోయింది.

ఆ మాటలు విన్నచిత్రకేతు మహారాజు ఆయనపట్టపు రాణి, బంధువులు, మంత్రులు నిర్ఘాంతపోయారు. వారందరికీ జ్ఞానోదయము

అయింది. ఆత్మజ్ఞానము కలిగింది. చనిపోయిన బాలుని కొరకు శోకించడం మానుకున్నారు. తరువాత మరణించిన బాలునికి దహన క్రియలు జరిపించారు. అపర కర్మలు జరిపించారు. ఆ బాలుని మీద మోహమును వదిలిపెట్టారు.

తమకు పుత్రులు కలుగలేదనే దు:ఖముతో బాలునికి విషము పెట్టి చంపిన ఆ రాణులు తాము చేసిన క్రూరకృత్యమునకు పశ్చాత్తాప పడ్డారు. పెద్దలు చెప్పిన ప్రాయశ్చిత్తము చేసుకున్నారు. పుత్రులు దు:ఖహేతువులు అన్న అంగిరసుని మాటలు మననం చేసుకుంటూ తమకు కుమారులు కలగలేదని దు:ఖించడం మానుకున్నారు.

తరువాత నారదుడు చిత్రకేతు మహారాజుకు ఒక మహామంత్రమును ఉపదేశించాడు. ఆ మహా మంత్రము ఈ విధంగా చెప్పాడు.

(ఈ మంత్రమును ప్రతిదినము పారాయణము చేస్తే మనకు కూడా సకల శుభాలు కలుగుతాయి. అందుకని ఆ మంత్రములను క్రింద ఇస్తున్నాను. ఇష్టం ఉన్నవారు పారాయణ చేసుకోవచ్చును. లేని వారు అర్థము మాత్రము మాత్రము చదువుకోండి.)

## షష్ఠ స్కంధము

ఓం నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ ధీమహి।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ నమ: సంకర్షణాయ చ॥

నమో విజ్ఞానమాత్రాయ పరమానన్దమూర్తయే।
ఆత్మారామాయ శాన్తాయ నివృత్త ద్వైత దృష్టయే॥

ఆత్మానన్దాను భూత్యైవ న్యస్తశక్త్యూర్మయే నమ:।
హృషీకేశాయ  మహతే నమస్తే అనన్తమూర్తయే॥

వచస్యు పరత్ అప్రాస్య య ఏకో మనసా సహ।
అనామరూపశ్చిన్మాత్ర: సో అవ్యాన్న: సదసత్పర:॥

యస్మిన్నిదం యతశ్చేదం తిష్ఠత్యప్యేతి జాయతే।
మృణ్మయేష్వివ మృజాతిస్తస్మై తే బ్రహ్మణే నమ:॥

యన్న స్పృశన్తి న విదుర్మనోబుద్ధీన్ద్రియాసవ:।
అన్తర్బహిశ్చ వితతం వ్యోమవత్తన్నతో అస్మ్యహమ్॥

దేహేన్ద్రియ ప్రాణమనోధియోఅమీ యదంశవిద్ధా: ప్రచరన్తి కర్మసు।
నైవాన్యదా లౌహమివాప్రతప్తం స్థానేషు తద్ద్రష్టపదేశమేతి॥
ఓం నమోభగవతే మహాపురుషాయ మహానుభావాయ
మహావిభూతిపతయే సకలసాత్వతపరివృఢ నికరకరకమల
కుట్మలోపలాలిత చరణారవిన్దయుగల పరమపరమేష్ఠిన్ నమస్తే॥

ప్రణవస్వరూపుడవైన ఓపరమాత్మా! నీకు నమస్కారము.
ఓ వాసుదేవా! నేను నిన్ను నిర్మలమైన మనస్సుతో ధ్యానిస్తున్నాను.
ఓ ప్రద్యుమ్నా! ఓ అనిరుద్ధా! ఓ సంకర్షణా! నీకునమస్కారము.
ఓ విజ్ఞానస్వరూపా! నిన్ను మనసారా ధ్యానిస్తున్నాను.
ఓ ఆనందస్వరూపా! ఓ ఆత్మారామా! ఓ శాంతమూర్తీ!
జీవుడు పరమాత్మ ఒకడే వేరు కాదు అనే భావన అందరిలో కల్పించేవాడా! నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు పరమానంద స్వరూపుడవు. ఈ రాగద్వేషములు నీ మాయచేత ఉద్భవించాయి. నీమీద అచంచలమైనభక్తి కలిగి ఉంటే, అవి తొలగిపోతాయి. అట్టినీకు నమస్కారము. నీవు హృషీకేశుడవు. అన్ని ఇంద్రియములకు అధిష్టానము నీవే. నీవు అనంతుడవు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నిన్ను వాక్కుతో గానీ, మనస్సుతో గానీ ఎవరూ తెలుసుకోలేరు. నీకు నామము లేదు. రూపము లేదు. నీవు కేవలము జ్ఞానస్వరూపుడవు. పరబ్రహ్మవు. అట్టి నీవు మమ్ములను రక్షించు.

ఓ దేవా! మట్టితో కుండను తయారు చేస్తారు. ఆ కుండ మట్టిలోనే ఉంటుంది. పగిలి పోతే ఆ మట్టిలో కలిసిపోతుంది. అలాగే ఈ విశ్వమంతా నీ నుండి పుట్టింది. నీలోనే నిండిఉంది. నీయందే లీనమై పోతుంది. అట్టి పరబ్రహ్మస్వరూపుడవు అయిన నీకు నమస్కారము. నీవు ఆకాశము వలె ఈ విశ్వము లోపలా బయటా అంతటా నీవే ఉన్నావు. అట్టి నీ గురించి మా బుద్ధితో, మనస్సుతో, వాక్కుతో తెలుసుకోలేము. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! లోహమును అగ్నిలో వేసి కాలిస్తే ఆ లోహమునకు కూడా ఇతర వస్తువులను దహించే శక్తి వస్తుంది. కానీ ఆ లోహము అగ్నిని

దహించలేదు. అలాగే నీ శక్తి వివిధములైన దేహములలో, ఇంద్రియములలో నిండి ఉంది. దేహములు, ఇంద్రియములు నీ శక్తితో పనిచేస్తున్నప్పటికీ, ఆ దేహములు, ఇంద్రియములు నిన్ను చూడలేవు. నీ చైతన్యశక్తి లేక పోతే దేహములు కానీ, దేహములో ఉన్న ఇంద్రియములు కానీ పనిచేయలేవు. కాబట్టి చైతన్యశక్తి అయిన బ్రహ్మమే అన్నిటికీ మూలము. ఆ పరబ్రహ్మస్వరూపుడవైన నీకునమస్కారము.

ఓమహాపురుషా! ఓ మహానుభావా! ఈ అనంత విశ్వంలో ఉన్న అన్ని విభూతులు నీవే కదా! సత్వగుణ సంపన్నులైన నీ భక్తులు నీ చరణారవిందములను తమ కరకమలములతో అనునిత్యమూ సేవిస్తుంటారు. అట్టి నీకు నమస్కారము." అని నారదుడు చిత్రకేతు మహారాజుకు ఈ విద్యను ఉపదేశించాడు.

తరువాత అంగిరసుడు, నారదుడు వెళ్లిపోయారు. చిత్రకేతువు కేవలము జలము మాత్రము ఆహారంగా స్వీకరిస్తూ నారదుడు చెప్పిన మంత్రములను ఏడు రోజులు జపించాడు. ఆ మంత్ర ప్రభావము చేత చిత్రకేతు మహారాజు విద్యాధరుల మీద ఆధిపత్యమును సాధించాడు. అంతే కాదు ఆ మంత్ర ప్రభావము చేత చిత్రకేతుకు సంకర్షణ భగవానుని(అనంతుని) దర్శన భాగ్యం లభించింది.

గౌరకాంతి కలవాడు, నీలాంబరుడు, కేయూరములు, కంకణములు ధరించిన వాడు, ప్రసన్నమైన ముఖము కలవాడు, ఎర్రని కన్నులు కలవాడు, సనత్కుమారుడు మొదలగు మహామునుల చేత పూజింపబడేవాడు, అయిన సంకర్షణ భగవానుని దర్శించాడు.

సంకర్షణుని దర్శనము కలగగానే చిత్రకేతు మహారాజు పాపములు అన్నీ నశించిపోయాయి. అంతని మనస్సు నిర్మలంగా ఉంది. సంకర్షణుని చూడగానే చిత్రకేతుకు నోటమాట రాలేదు. సంభ్రమంతో ఆయన ఒళ్లు గగుర్పొడిచింది. చిత్రకేతు సంకర్షణ భగవానునికి భక్తితో నమస్కరించాడు. సంకర్షణ భగవానుని ఈ విధంగా స్తుతించాడు.

"ఓ భగవాన్! నీవు అజేయుడవు. కాని సాధువులు నిన్ను జయించి తమ వశం చేసుకున్నారు. ఎందుకంటే నీవు వారి మీద నీ దయారసమును కురిపించావు. ఏ కోరికలు లేకుండా నిన్ను పూజించే వారికి నీవు వశుడవు అవుతావుకదా!

ఈ జగత్తులో జరిగే సృష్టి, స్థితి, లయములు నీ లీలలే. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నీ అంశ లే. కాని వారిని వేరు వేరు దైవములుగా మానవులు తలంచడం వారి అవివేకము.

ఓ దేవా! ఈ విశ్వము అంతా పరమాణువుల మయము. ప్రతి పరమాణువు నందు నీవు ఉన్నావు. అలాగే ఈ అనంత విశ్వము అంతా నీవే నిండి ఉన్నావు. ఈ విశ్వము ఆది నుండి అంతము వరకూ నీవే ఉన్నావు. నీవు లేని ప్రదేశము లేదు. అందు వలన నీవు ఒక్కడివే నిత్యుడవు. నీవే సత్యము. నీవు తక్క ఇతరములు అన్నీ అనిత్యములే.

ఓ దేవా! పంచభూతములు, మహత్తత్వము, అహంకారము ఈ ఏడింటిచేత ఈ బ్రహ్మాండము నిండి ఉంది. ఈ ఒక్క బ్రహ్మాండమే కాదు ఈ అనంత విశ్వంలో ఇటు వంటి బ్రహ్మాండములు కోటాను

కోట్లు ఉన్నాయి. ఆ బ్రహ్మాండములు అన్నీ పరమాణు రూపంలో నీలోనే ఉన్నాయి. అందుకే నీవు అనంతుడు అని పిలువబడుతున్నావు.

(ఈ సందర్భంగా మనం ఈనాటి ఖగోళ శాస్త్రవిషయములను అన్వయించుకుందాము. మన భూమి లాంటి గ్రహాలు 9 సూర్యుని చుట్టు తిరుగుతున్నాయి. ఈ సూర్యుడు పాలపుంతలో ఒక మధ్యతరగతి నక్షత్రము. మన సూర్యుడు ఉన్న పాలపుంతలో మన భూమి లాంటి గ్రహాలు 1700 కోట్లు ఉన్నాయని (ఇప్పటిదాకా కనుక్కున్నవి) ఈ నాటి శాస్త్రవేత్తలు తేల్చారు. అమెరికా అంతరిక్ష పరిశోధన సంస్థ (నాసా) కు చెందిన కెప్లర్ టెలిస్కోప్ ను ఉపయోగించి ఈ విషయాలను నిర్ధారించారు. ఈ లెక్క పైన చెప్పిన విషయములతో దాదాపు సరిపోయిందనుకుంటాను.)

ఓ దేవా! ఈ నరులు తమ జీవిత కాలము అంతా ప్రాపంచిక విషయములు, విషయ వాంఛలను తీర్చుకోవడంలో మునిగి తేలుతున్నారు. నీ గురించి పట్టించుకోవడం లేదు. నిన్ను మరిచిపోయి నీ అంశలయిన ఇంద్రుడు మొదలగు దేవతలను తమ కోరికలు తీరడం కోసరం పూజిస్తున్నారు. ఆయాదేవతలు వారికి వరాలు ఇస్తున్నారు. వారి కోరికలు తీరుస్తున్నారు. కాని ఆ సుఖములు అశాశ్వతములు అని నరులు గ్రహించలేకపోతున్నారు. అలా కాకుండా ఎవరైతే నిర్గుణుడవు, జ్ఞానమూర్తివి అయిన నిన్ను ఉపాసిస్తే, వారికి తిరిగి జన్మ ఉండదు.

ఓ దేవా! జీవులు సత్త్వ, రజస్తమోగుణముల వలననే సంసారము, సుఖదు:ఖములు, రాగద్వేషములకు వశులవుతున్నారు. నీలో ఏ గుణములు లేవు కాబట్టి నిన్ను ఉపాసిస్తే, వారు కూడా ఆమూడు గుణముల నుండి విముక్తి పొందుతారు.

ఓ దేవా! నిన్ను చేరుకోడానికి భాగవత ధర్మమే మేలైన మార్గము అని నీవు నాకు బోధించావు. ఋషులు, మునులు ఆ భాగవత మార్గమును అనుసరించి నీలో ఐక్యం అవుతున్నారు. కాని మానవులు ఈ భాగవత ధర్మమును మరిచిపోయారు. వారికి అహంకారము, నాది, నీది అనే భేదభావము మీద ఉన్న అనురక్తి భాగవత భావము మీద లేదు. అందుకే వారు రాగద్వేషములతోనూ. హింసామార్గముతోనూ, విషయవాంఛలను అనుభవించడంతోనూ తమ జీవితమును దు:ఖమయం చేసుకుంటున్నారు. అధర్మ ప్రవర్తనలో మునిగిపోతున్నారు. ఈ అధర్మమును ఆచరించడం వలన మానవులు తమకు తాము ద్రోహం చేసుకుంటున్నారు. ఇతరులకు కూడా ద్రోహం చేస్తున్నారు. దానివలన వారికి ఏ విధమైన లాభము కలగదని తెలుసుకోలేకపోతున్నారు. తనకు తాను ద్రోహం చేసుకోవడం వలనా (ఈవిషయాన్ని ఈనాటికి వర్తింపజేస్తే, మద్యం సేవించడం వలన తన జీర్ణాశయమును తానే పాడుచేసుకుంటున్నాడు, ధూమపానం చేయడం వలన తన ఊపిరి తిత్తులను పొగతో నింపి, తన గుండెను తానే పాడుచేసుకుంటున్నాడు), అలాగే ఇతరులకు ద్రోహం చేయడం వలనా (అంటే ఇతరుల మీద ద్వేషము, శత్రుత్వము పూనడం, వారిని కొట్టడం తిట్టడం చంపడం; ఇతరుల ఆస్తులు అపహరించడం ఇవన్నీ ఇతరులకే చేసే ద్రోహాలు), మానవులు అధర్మానికి పాల్పడుతున్నారు. నీ

చేత చెప్పబడిన భాగవత ధర్మముఅవలంబిస్తే తప్ప వారు బాగుపడరు. అన్ని ప్రాణులను సమంగా చూచేవారు, నియమ నిష్టలు కలవారు, ఉన్నత భావాలు కలవారు మాత్రమే భాగవత ధర్మమును ఉపాసిస్తున్నారు.

ఓ దేవా! నీ దర్శన మాత్రం చేత మానవుల సకల పాపములు నాశనం అవుతాయి అనడంలో సందేహము లేదు. నీ నామము ఒక్కసారి భక్తితో జపిస్తే, వారి సకల పాపములు నశించిపోతాయి. ఇప్పుడు నీవు మాకు నీ దర్శనభాగ్యం కలుగచేసావు. అందువలన మా పాపములు కూడా నశించిపోయాయి. మాలో ఉన్న రాగద్వేషములు అంతరించి పోయాయి. నారదుని ఉపదేశము మూలంగానే మాకు నీ దర్శనభాగ్యం లభించింది.

ఓ అనంతా! ఈ లోకంలో మానవులు ఆచరించే ప్రతి కర్మా నీకు తెలుసు. నీకు తెలియనిది ఏమీ లేదు. నీవు ఈ జగత్తునకే గురువువు. నీకు మా వంటి వారు చెప్పదగినది ఏమీ లేదు. ఎందుకంటే ఈ సకల జగత్తుకు సృష్టికర్తవు, పోషణ కర్తవు, లయకారుడవు నీవే కదా! ఈ విషయం చాలా మందికి తెలియదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వేరు వేరు అనుకుంటూ నీగురించి భేదభావమును కలిగిస్తున్నారు. నీవే, బ్రహ్మ విష్ణు, మహేశ్వరుల రూపాలలో ప్రవర్తిస్తున్న సంగతి వారికి తెలియదు. నీవు పరిశుద్ధుడవు. అన్ని ఐశ్వర్యములు నీ యందే ఉన్నవి. అట్టినీకు నమస్కారము.

నీ చైతన్యము చేతనే బ్రహ్మ మొదలగు దేవతా గణములు తమ తమ కర్తవ్యములను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. నీకు ఉన్న వేయి పడగలమీద ఈ భూమండలము నిలిచి ఉంది. అట్టి నీకు నమస్కారము." అని చిత్రకేతువు సంకర్షణ భగవానుని స్తుతించాడు.

అప్పుడు సంకర్షణుడు విద్యాధరుడైన చిత్రకేతువుతో ఇలా అన్నాడు. "ఓ మహారాజా! నారదుడు నీకు ఉపదేశించిన విద్య ప్రభావంతో నీవు నన్ను చూడగలిగావు. నీకోరికలు అన్నీ నెరవేరాయి. నేను ఈ చరాచర జగత్తులో నిండి ఉన్నాను. సకల భూతములలో ఆత్మస్వరూపుడుగా ప్రకాశిస్తూ  ఉన్నాను. ఆ పరబ్రహ్మము నేనే. వేదస్వరూపుడను నేనే.

ఈ లోకం అంతా ఆత్మ నిండి ఉంది. ఆత్మలోనే ఈ లోకం అంతా ఉంది. ఈ ఆత్మ, లోకము రెండూ నాచే కల్పించబడ్డాయి. నిద్రలో ఉన్న మానవుడు స్వప్నములో కొండలు, నదులు, భవనములు, నగరములు ఎన్నింటినో చూస్తాడు. అంటే వాటిని అన్నిటినీ తన ఆత్మలోనే దర్శిస్తాడు. మెలుకువ రాగానే తాను తన పడక మీద ఉన్నట్టు గ్రహిస్తాడు. అంటే అతడు స్వప్నములో చూచినది అంతా కల్పితమే కదా!

పురుషుడు నిద్రావస్థలో ఉన్నప్పుడు తాను ఈ దేహము కన్నా వేరుగా   ఉన్నట్టు తలుస్తాడు. ఇంద్రియములతో అనుభవించే సుఖం కన్నా ఎక్కువ సుఖమును స్వప్నంలో అనుభవిస్తాడు. ఆ ఇంద్రియములకు అతీతమైన  సుఖమును అనుభవించేది  ఆత్మ అని తెలుసుకో.

పురుషుడికి రెండు అవస్థలు ఉన్నాయి. ఒకటి జాగ్రదావస్థ. అంటే మెలుకువగా ఉండి ఇంద్రియములతో ప్రపంచములో పనులు చేయడం. అప్పుడు కూడా ఆత్మ దేహములో ఉన్న పురుషుడు చేసే పనులన్నీ సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది. రెండవది నిద్రావస్థ. అప్పుడు ఇంద్రియములు పనిచేయవు. శరీరము కదలకుండా పడి ఉంటుంది. లోపల ఉన్న ఆత్మ సుఖమును అనుభవిస్తూ ఉంటుంది. జాగ్రదావస్థలోనూ, నిద్రావస్థలోనూ ఆత్మ ఈ రెండు అవస్థలను అనుభవిస్తూ ఉన్నట్టు మనకు అనిపించినా, నిజానికి ఆత్మ ఏదీ అనుభవించదు. ఈ రెండు అవస్థలకు వేరుగా ఉంటుంది. అదే పరబ్రహ్మము.

మానవుడు ఈ పరబ్రహ్మనుము మరిచి పోయి, తానే జాగ్రదావస్థలో అన్ని పనులు చేస్తున్నాను, నిద్రావస్థలో నిద్రసుఖమును అనుభవిస్తున్నాను అని అనుకుంటున్నాడు. తనను ఆ పరమాత్మ కంటే వేరుగా భావిస్తున్నాడు. ఆ కారణం చేతనే ఈ సంసారమనే మోహంలో పడిపోతున్నాడు. ఈ దేహమే తాను అనుకుంటున్నాడు. నేను, నాది, అనే అహంకారంలో మునిగిపోతున్నాడు. ఆ కారణంగా ఎన్నో జన్మలు ఎత్తుతున్నాడు. జనన మరణ చక్రంలో తిరుగుతున్నాడు.

ఆత్మను గురించి తెలుసుకోడానికి మానవ జన్మ ఉత్తమమైనది. కానీ మానవులు ఆత్మ జ్ఞానముగురించి తెలుసుకోలేకపోతున్నారు. ఆత్మజ్ఞానమును తెలుసుకోలేక పోతే ఈ మానవ జన్మ వృధా అవుతుంది. ఈ లోకంలో ఉండి చేసే వైదిక కర్మలు, కోరికలు తీరడానికి చేసే కర్మలు, వీటి వలన దు:ఖము, బాధలు

కలుగుతాయే తప్ప సుఖం కలగదు. అలా కాకుండా మానవుడు తాను చేసే అన్ని కర్మలను ప్రతిఫలమును ఆశించకుండా చేస్తే, తానుచేసే ప్రతి కర్మను భగవంతుని పరంగా చేస్తే, తానుచేసే కర్మల ఫలమును భగవంతునికి అర్పిస్తే, ఆ మానవునికి సుఖము తప్ప దు:ఖము ఉండదు. కాబట్టి వివేకము కల మానవుడు తాను చేసే అన్ని కర్మలను భగవంతుని పరంగా చేయాలి.

ఈ లోకంలో స్త్రీలు కానీ, పురుషులు కానీ, సుఖములు పొందడానికి కర్మలు చేస్తుంటారు. కానీ ఆ కర్మల వలన వారికి దు:ఖమే గానీ సుఖము కలుగదు. కాబట్టి మానవులు ఆత్మజ్ఞానమును గురించి తెలుసుకోవాలి. ప్రాపంచిక సుఖముల కొరకు పాకులాడటం మానుకోవాలి. అప్పుడే అతనికి నిజమైన జ్ఞానము కలుగుతుంది. అటువంటి మానవులే నా భక్తులు కావడానికి అర్హులు.

ఆత్మ ఒక్కటే. అది ప్రాపంచిక విషయములలో ఆసక్తితో ఉన్న ప్పుడు జీవాత్మ అవుతుంది. అలా కాకుండా పరమాత్మ వైపు ఆసక్తి చూపి నప్పుడు నిర్మలమైన ఆత్మస్వరూపంగాఉంటుంది. పరమాత్మను చేరుకుంటుంది. దానికి మించినపురుషార్థము లేదు.

ఓ రాజా! నీవు కూడా ఈ ప్రాపంచిక విషయముల యందు ఆసక్తిని వదిలి పెట్టి జ్ఞాన విజ్ఞాన సంపన్నుడవై నన్ను చేరుకో."అని సంకర్షణుడు చిత్రకేతు మహారాజుకు ఆత్మతత్త్వమును బోధించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ విధంగా చిత్రకేతు మహారాజుకు ఆత్మ తత్త్వమును బోధించిన తరువాత సంకర్షణుడు అదృశ్యమయ్యాడు." అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు భాగవత కథను చెప్పాడు.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము పదునారవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## షష్ఠస్కంధము
## పదునేడవ అధ్యాయము.

శుక మ హర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత కథను ఇలా చెప్పసాగాడు.

"అనంతుడు అంతర్ధానం అయిన తరువాత చిత్రకేతువు మరలా గగన విహారము చేయసాగాడు. ఆ ప్రకారంగా చిత్రకేతువు లక్షల కొలదీ సంవత్సరాలు ఆకాశయానం చేస్తున్నాడు. అలా చేస్తూ ఉండగా ఒకరోజు చిత్రకేతువు తన విమానము మీద కైలాస పర్వతము మీదుగా వెళుతున్నాడు. ఆ సమయంలో శివుడు నిండు సభలో కూర్చుని ఉన్నాడు. ఆయన ఒడిలో పార్వతీ దేవి కూర్చుని ఉంది. శివుడు పార్వతీ దేవి నడుము చుట్టు చేయి వేసి ఆమెను తన కేసి హత్తుకున్నట్టు కూర్చుని ఉన్నాడు.

ఆ సభలో సిద్ధులు, చారణులు, మునులు ఉన్నారు. అందరూ శాస్త్ర చర్చలలో మునిగి ఉన్నారు. శివుని ఒడిలో ఆయన తొడ మీద కూర్చుని ఉన్న పార్వతీ దేవిని చూచి చిత్రకేతువు ఆమెకు వినపడేటట్టుగా పెద్దగా నవ్వి  ఇలా అన్నాడు.

"ఈ శివుడు లోకానికంతటికీ గురువు. మానవులలో ఉత్తముడు. కాని నిండు సభలో తన భార్యను కౌగలించుకొని కూర్చుని ఉన్నాడు. ఇది చాలా ఆశ్చర్యముగా ఉంది. ఈ శివుడు మహాతపస్సు చేసాడు. జితేంద్రియుడు. బ్రహ్మ జ్ఞానము కలవాడు. అటువంటి వాడు ఈ ప్రకారం సిగ్గు లేకుండా పది మందిలో తన భార్యను కౌగలించుకుంటాడా! ఈ మాదిరి సాధారణ మానవులు కూడా ప్రవర్తించరే! ఈ శివుడు ఇలా ఎందుకు చేస్తున్నాడు. మానవులలో తక్కువ కులము వారు కూడా తన భార్యాభర్తల సంబంధము రహస్యంగా ఉంచుకుంటారు కదా! కానీ ఈ శివుడు మహాతపస్వి అయి ఉండి కూడా నిండు సభలో తన భార్యను తొడమీద కూర్చుండబెట్టుకొని ఆమెను హత్తుకొని కూర్చున్నాడు. ఇతరులకు చెప్పవలసిన వారే ఇలా చేస్తే ఇంక సాధారణ మానవుల మాటేమిటి!" అని అన్నాడు చిత్రకేతువు.

ఈ మాటలు శివుని చెవిని పడ్డాయి. కాని ఆయన ఏమీ అనలేదు. చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.  మహాశివుడే విని ఊరుకుంటే మనదేం పోయిందని సభలో ఉన్న వారు కూడా ఏమీ మాట్లాడలేదు. కానీ పార్వతీ దేవి ఊరుకోలేక పోయింది. ఆమెకు పట్టరాని కోపం వచ్చింది. చిత్రకేతును చూచి ఇలా పలికింది.

"ఓహెూ వీరేనా చిత్రకేతు మహారాజు. మా బోటి సిగ్గు ఎగ్గు లేని వారిని దండించడానికి వచ్చారా! వీరేనా మాకు ప్రభువులు. సాక్షాత్తు బ్రహ్మ, భృగువు, నారదుడు మొదలగు మునులు, సనత్కుమారులు, మనువులు, కపిలుడు వీరందరికీ ధర్మము తెలియదు అనుకుంటాను. లేకపోతే సిగ్గులేని శివుడిని ఎందుకు సేవిస్తారు? వీరందరికీ ధర్మం తెలియకపోబట్టి, ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తున్న శివుడిని ఏమి అనలేకపోతున్నారు. ఈ చిత్రకేతు మహారాజు గారి దృష్టిలో బ్రహ్మ, నారదుడు, భృగు మొదలగు వారు అజ్ఞానులు. అందుకే వారంతా పరమ శివుని సేవిస్తున్నారు. ఆ శివుడినే ఈ చిత్రకేతు ఆక్షేపిస్తున్నాడు. కాబట్టి ఈ చిత్రకేతు దండింపతగినవాడు. ఈ చిత్రకేతుకు తాను విద్యాధరత్వమును పొందాననీ, తనకు విష్ణుపాదముల దగ్గర శాశ్వత స్థానము ఉందనీ గర్వము. ఆ గర్వము నశించాలి. ఇతడు ఎంతమాత్రమూ విష్ణుపాదములను సేవించడానికి అర్హుడు కాడు.

ఓ దుర్మార్గుడా! చిత్రకేతూ! నీవు చేసిన తప్పుకు ఇదే నాశాపము. నీవు రాక్షస కులములో జన్మించు. నీ తప్పుకు ఇదే సరి అయిన శిక్ష. ఇంక ఎప్పుడూ దైవదూషణ, సాధు దూషణ చెయ్యకు." అని చిత్రకేతును శపించింది పార్వతి.

పార్వతీ దేవి వలన శపించబడ్డ చిత్రకేతు మౌనంగా తన విమానం దిగాడు. పార్వతీ పరమేశ్వరుల ముందు నిలబడ్డాడు. పార్వతీ దేవితో ఇలా అన్నాడు.

"అంబికా! నీవు నాకు ప్రసాదించిన శాపమును చేతులు జోడించి స్వీకరిస్తున్నాను. ఈ శాపము నేను నా పూర్వజన్మలో చేసిన నా కర్మల ఫలము అనుకుంటున్నాను. ఎందుకంటే పూర్వజన్మలో చేసిన కర్మల ఫలములు కొన్ని సుఖాన్ని కలుగజేస్తాయి. కొన్ని దు:ఖాన్ని కలుగజేస్తాయి. అవిద్యతో అలమటించే జీవుడు ఈ జనన మరణ చక్రంలో తిరుగుతూ సుఖ,దు:ఖాలను అనుభవిస్తూ ఉంటాడు. అందుకని ఈ జన్మలో సంభవించిన సుఖదు:ఖములకు ఎవరూ బాధ్యులు కారు. ఎవరు చేసిన కర్మలకు వారే బాధ్యులు. కానీ ఈ జ్ఞానము లేని మానవులు, తమకు సంభవించే సుఖదు:ఖములకు ఇతరులను బాధ్యులను చేస్తుంటారు.

నిజానికి ఈ సంసారమే మాయ. మాయా మయమైన ఈ సంసారంలో ఏది శాపము? ఏది అనుగ్రహము? ఏది స్వర్గము? ఏది నరకము? ఏది సుఖము? ఏది దు:ఖము? ఏదీ నిజం కాదు. అంతా మాయ. ఆ పరమాత్మ ఒక్కడే తన మాయతో సృష్టి స్థితి లయములను చేస్తున్నాడు. కాని మానవులు తమ అవిద్యతో ఈ బంధనములను, సత్త్వగుణములో సుఖములను, రజోగుణములో దు:ఖములను కల్పించుకుంటున్నారు. దీనికి ఆ పరమాత్మకు ఏ సంబంధమూ లేదు. ఆయనకు ఒకరు ప్రియుడు, మరొకరు శత్రువు అనే భేదము లేదు. పరమాత్మ దృష్టిలో అందరూ సమానులే.

ఆ పరమాత్మకు ఎటువంటి గుణములు అంటక పోయిననూ. తన మాయాశక్తితో పుణ్య కర్మలను, పాప కర్మలను సృష్టించి, వాటిని చేసినందుకు మానవులకు సుఖ,దు:ఖములను,

పుణ్య పాపములను ప్రసాదిస్తున్నాడు. ఇదంతా ఆ పరమాత్మ మాయ కానీ వేరు కాదు. ఆ కారణం చేత, నా మీద అకారణంగా కోపగించిన ఓ పార్వతీ దేవీ! నీవు ఇచ్చిన శాపమునకు నాకు ఎటువంటి చింతలేదు. సంతోషంతో స్వీకరిస్తున్నాను. నా శాపమును తిరిగి తీసుకోమని కానీ, శాప విముక్తిని ప్రసాదించమని కానీ నిన్ను కోరను. ఒకవేళ నేను అన్నమాటలు నీకు తప్పుగా తోస్తే నన్ను క్షమించు." అని పలికిన చిత్రకేతు తన విమానము ఎక్కి వెళ్లిపోయాడు.

తాను అంతటి భయంకరమైన శాపము ఇచ్చినా కొంచెం కూడా చలించకుండా వెళ్లిపోయిన చిత్రకేతును చూచి పార్వతీదేవి ఆశ్చర్యపోయింది. ఆశ్చర్యపోతున్న పార్వతిని చూచి పరమ శివుడు చిరునవ్వుతో ఇలా అన్నాడు.

"దేవీ! అతడు ఎవరనుకున్నావు? ఆ వాసుదేవుని అనుగ్రహమును పొందిన వాడు. అటువంటి వారు దేనికీ భయపడరు. వారికి భయమనేది తెలియదు. ఎందుకంటే శ్రీహరి భక్తులకు ఈ విషయ వాంఛల మీద కోరికలు ఉండవు. వారు స్వర్గమును, నరకమును, ముక్తిని, సమానంగా భావిస్తారు. ఆ వాసుదేవుని మాయ వలననే ఈసంసార బంధములు, సుఖదు:ఖములు, జనన మరణములు, శాపములు, అనుగ్రహములు  కలుగుతున్నాయి. తాడును చూచి పాము అని ఎలా భ్రమపడి, భయపడతారో, ఇవన్నీ భ్రాంతులనీ శ్రీహరి భక్తులకు తెలుసు. అందుకే వారికి వీటిని చూచి ఎలాంటి భయము కలుగదు.

శ్రీహరి భక్తులకు, జ్ఞానము వైరాగ్యము సమృద్ధిగా కలవారికీ, ఈ లోకములో కోరగదగినది అంటూ ఏదీ లేదు. ఎప్పుడు ఏది లభిస్తే దానిని అనుభవించడమే వారి కర్తవ్యము.

ఓ దేవీ! నేను, బ్రహ్మ, నారదుడు, దేవేంద్రుడు, మునులు, దేవతలు, ఎవరు కూడా ఆ శ్రీహరి మాయను అర్థం చేసుకోలేరు. అందుకని మాకు మేమే  స్వతంత్రులము అని అనుకుంటూ ఉంటాము. మేమంతా ఆ పరమాత్మ అంశలమే అని ఒక్కొక్కసారి మేమే మరిచిపోయి స్వతంత్రంగా ప్రవర్తిస్తుంటాము.

దేవీ! శ్రీహరికి ఇష్టమైనవారు, ఇష్టం లేని వారు అంటూ ఎవరూ లేరు. ఈ చరాచర జగత్తు అంతా ఆ శ్రీహరితో నిండి ఉంది. ఆయన లేని ప్రదేశము అంటూ లేదు. అందుకే ఆయన అందరినీ ప్రియంగా దయతో చూస్తాడు. శుభాలు కలుగజేస్తాడు. ఈ చిత్రకేతు కూడా శ్రీహరి పాదసేవకుడు. ఈయనకు రాగద్వేషములు లేవు. అందరినీ సమంగా చూస్తాడు. ఈయన మాదిరే నేనుకూడా ఆ శ్రీహరికి ప్రియుడను. కాబట్టి చిత్రకేతు ప్రవర్తన చూచి ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు." అని శంకరుడు పార్వతీదేవితో అన్నాడు.

తన భర్త మాటలు విన్న పార్వతీదేవి తన ఆశ్చర్యమును విడిచిపెట్టి స్వస్థత పొందింది.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకో విషయం తెలుసా! చిత్రకేతు తలచుకుంటే పార్వతీదేవికి ప్రతిశాపం ఇవ్వగల సమర్థుడు. కానీ ఆమె శాపమును శిరసావహించాడు. అదే శ్రీహరి భక్తులకు ఉన్న వినయము విధేయత.

ఆ ప్రకారంగా పార్వతీ దేవి చేత శపించబడిన చి త్రకేతువు వృత్రుడుగా జన్మించాడు. తరువాత వృత్తాంతము నీకు తెలిసినదేకదా! నీవు కోరినట్టు వృత్రుని పూర్వజన్మ వృత్తాంతమును నీకు సవిస్తరంగా చెప్పాను. ఈ చిత్రకేతు గురించిన కథను విన్న వారు సంసార బంధనముల నుండి, సకల పాపముల నుండి విముక్తులవుతారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము పదునేడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము

పదునెనిమిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! అదితికి 12 మంది కుమారులు జన్మించారు అని చెప్పాను కదా! అందులో ఐదవ వాడి పేరు సవిత. అతని భార్య పేరు పృశ్ని. ఆమెకు ముగ్గురు కుమార్తెలు కలిగారు. వారి

పేర్లు సావిత్రి, వ్యాహృతి, త్రయి. ఆమెకు అగ్నిహోత్రము, పశుయాగము, సోమయాగము, చాతుర్మాస్య యాగము, పంచమహాయజ్ఞములు అనే కుమారులు కలిగారు.

అదితి ఆరవ కుమారుని పేరు భగుడు. అతని భార్య పేరు సిద్ధి. ఆమెకు మహిముడు, విభుడు, ప్రభువు అనే ముగ్గురు కుమారులు, అతిసుశీల అనే కుమార్తె కలిగారు. అదితి ఏడవ కుమారుడు అయిన ధాత అనే ఆదిత్యుని భార్యపేరు క్రియ. (అదితి కుమారులను ఆదిత్యులు అంటారు. అదితికి 12 మంది కుమారులు. వారినే ద్వాదశాదిత్యులు అని అంటారు. వారి వంశక్రమము మనము చెప్పుకుంటున్నాము.) వారికి పురీషాఖ్యులు అనబడే ఐదు అగ్నులు పుట్టారు. అదితి తొమ్మిదవ పుత్రుని పేరు వరుణుడు. ఆయన భార్య పేరు చర్షణి. వారి కుమారుడే భృగువు (భృగువుమరలా జన్మించాడు.) ఈ వరుణుని కుమారుడే రామాయణ కర్త అయిన వాల్మీకి.

మిత్రుడు, వరుణుడు అనే ఆదిత్యులకు అగస్త్యుడు, వశిష్ఠుడు అనే మహామునులు జన్మించారు. వీరి పుట్టుక విచిత్రమయినది. మిత్రుడు అనే వాడికి ఊర్వశి అనే అప్సరసను చూడగానే రేతస్సు పతనమయింది. మిత్రుడు, వరుణుడు ఆ రేతస్సును ఒక కుండలో ఉంచి కాపాడారు. ఆ కుండలో నుండి ఇరువురు కుమారులు జన్మించారు. వారే అగస్త్యుడు, వశిష్ఠుడు.

అదితి పదవ కుమారుడు మిత్రుడు అనే ఆదిత్యునకు ఆయన భార్య అయిన రేవతి వలన ఉత్సర్గుడు, అరిష్టుడు, పిప్పలుడు

అనే ముగ్గురు కుమారులు కలిగారు.

అదితి పదకొండవ కుమారుని పేరు ఇంద్రుడు. అతడు దేవతలకు అధిపతి. ఇంద్రుని భార్య పేరు పౌలోమి. వారికి జయంతుడు, ఋషభుడు, మీఢుషుడు అనే కుమారులు కలిగారు.

అదితి ఆఖరు కుమారుడే వామనుడు.ఆయనను త్రివిక్రముడు, ఉరుక్రముడు అని కూడా అంటారు. ఈ ఉరుక్రముని భార్య పేరు కీర్తి. వారికి బృహచ్ఛ్లోకుడు అనే కుమారుడు కలిగాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటి వరకు అదితికి జన్మించిన 12 మంది కుమారుల వంశక్రమము గురించి చెప్పాను. ఇప్పుడు కశ్యపుని రెండవ భార్య దితి సంతానము గురించి వివరిస్తాను.

దితి కుమారులను దైత్యులు అని అంటారు. ఆ దైత్యులలోనే ప్రహ్లాదుడు, బలి జన్మించారు. దితి మొదటి కుమారుడు హిరణ్యకశిపుడు. రెండవ వాడు హిరణ్యాక్షుడు. హిరణ్యకశిపుని భార్యపేరు కయాధు (కాని పోతన గారి భాగవతములో హిరణ్యకశిపుని భార్య పేరు లీలావతి అని చెప్పబడింది.)

హిరణ్య కశిపునకు సంహ్లాదుడు, అను హ్లాదుడు, హ్లాదుడు, ప్రహ్లాదుడు, అనే నలుగురు కుమారులు కలిగారు. హిరణ్య కశిపుని కుమార్తెపేరు సింహిక. ఈ సింహిక భర్త పేరు విప్రచిత్తు అనే దానవుడు. వీరి కుమారుడే రాహువు. ఈ రాహువు తలను విష్ణువు తన చక్రముతో

ఖండించాడు.

సంహ్లాదుని భార్య పేరు కృతి. వీరి కుమారుని పేరు పంచజనుడు. అనుహ్లాదుని భార్యపేరు సూర్య. వారికి బాష్కలుడు, మహిషుడు అనే కుమారులు కలిగారు. ప్రహ్లాదుని కుమారుని పేరు విరోచనుడు. ఆ విరోచనుని కుమారుడే బలిచక్రవర్తి.

బలి చక్రవర్తి భార్య పేరు అశన. వారికి నూరుమంది కుమారులు జన్మించారు. వారిలో బాణుడు పెద్దవాడు. ఈ బాణుడు శివుని ఆరాధించాడు. అతని భక్తికి మెచ్చి శివుడు బాణుని పురమునకు పాలకుడుగా ఉన్నాడు అని అంటారు.

తరువాత దితికి 49 మంది కుమారులు కలిగారు. వారి పేరు మరుత్తులు. వారికి సంతానము లేదు. దేవేంద్రుడు వారికి అమరత్వమును ప్రసాదించాడు." అని అదితి, దితి వంశముల గురించి వివరించాడు శుకమహర్షి.

ఇప్పుడు పరీక్షిత్తుకు ఒక సందేహము కలిగింది. "ఓ మహర్షీ! దితికుమారులు దైత్యులు అంటే రాక్షస భావాలు కలవాళ్లు కదా. వారికి ఇంద్రుడు అమరత్వమును ఎలా ప్రసాదించాడు. వారు ఏమి మంచి పనులుచేసారని వారిని దేవతలుగా గుర్తించారు. వివరించండి." అని అడిగాడు పరీక్షిత్తు. శుకమహర్షి ఇలా చెప్పసాగాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! ఇంద్రుడు కోరగా, ఇంద్రునికి సాయం చెయ్యడానికి విష్ణువు, దితి కుమారులైన హిరణ్యాక్ష, హిరణ్య కశిపులను సంహరించాడు. దితి పుత్రశోకమును భరించలేక పోయింది. తన కుమారుల చావుకు కారణమైన ఇంద్రుడిని చంపాలని నిశ్చయించుకుంది. ఇంద్రుడు మరణిస్తే కానీ తనకు కంటి నిండా నిద్రరాదు అని అనుకుంది.

ఇంద్రుని చంపడం ఎలాగా అన్నదే సమస్య. ఇంద్రుడు తన కుమారులను చంపించాడు కాబట్టి, తాను కూడా ఒక కుమారుని కని, వాడితోనే ఇంద్రుని చంపించాలి అని అనుకుంది. తన భర్త దయతోనే ఇది సాధ్యం కావాలి. అందుకని దితి తన భర్త కశ్యపుని అనుదినము సేవించసాగింది. ఆయన అడగకుండానే అన్ని సమకూర్చసాగింది. దితి తన భర్త కశ్యపునకు శుశ్రూషలు చేస్తూ, ఆయన పట్ల అనురాగం చూపిస్తూ, నమ్రతగా, పరమ భక్తితో ఆయననే సేవించసాగింది. అదితి చేస్తున్న సేవలకు కశ్యపుడు సంతోషించాడు. ఆమె మనసులోని ఆంతర్యమును గ్రహించలేకపోయాడు కశ్యపుడు. ఆమె కోరిన వరం ఇవ్వాలని అనుకున్నాడు.

ఒక్క కశ్యపుడే కాదు ఈ లోకంలో అందరూ భార్యవిధేయులే కదా! సృష్టి మొదట్లో బ్రహ్మ మగవాడిని సృష్టించాడు. ఆయనకు తోడుగా స్త్రీని, అర్ధభాగంగా, సృష్టించాడు. ఈ స్త్రీల చేతనే పురుషుల మనస్సులను హరింపచేసాడు. ఇప్పడుకూడా కశ్యపుడు తన భార్య దితి సేవలకు మోహితుడయ్యాడు. ఆమె కోరిన వరం ఇవ్వడానికి సిద్ధపడ్డాడు.

"ఓ సుందరీ! నేను నీ సేవలకు ప్రసన్నుడను అయ్యాను. నీకు ఏం వరం కావాలోకోరుకో ఇస్తాను. భార్య సేవలతో భర్త సంతోషిస్తే ఆ భార్య ఏం కోరుకుంటే అది ఇస్తాడు. స్త్రీకి పతియే ప్రత్యక్ష దైవం. ప్రతి భార్యకు తన భర్త దైవంతో సమానము. సాక్షాత్తు శ్రీహరి తన భర్త రూపంలో ఉన్నాడని ప్రతి భార్య అనుకుంటుంది. వివేకము కల ప్రతీ స్త్రీ తన భర్తను దైవంగా భావించి ఆయనను పూజిస్తుంది. నీవుకూడా నన్ను ఆ పరమాత్మ స్వరూపుడుగా పూజించావు. అందుకని నీవు ఏం కోరితే అది ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను." అని అన్నాడు.

వెంటనే దితి "స్వామీ! నాకు ఇంద్రుని చంపేవాడు కొడుకుగా పుట్టే వరాన్ని ప్రసాదించండి." అని అడిగింది.

ఆ మాట విన్న కశ్యపుడు హతాశుడయ్యాడు. ఇంద్రుడు అదితి కుమారుడు అంటే తన కుమారుడు. తన కుమారుని చంపే వరం తాను ఇవ్వాలా! ముందు వెనకా ఆలోచించకుండా దితికి మాట ఇచ్చినందుకు కశ్యపుడు చింతించాడు. భర్త ఆలోచనలను పసికట్టింది దితి.

"నాధా! ఆలోచించకండి. నా కుమారులైన హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను ఇంద్రుడు చంపించాడు. నా కుమారులు చనిపోయారు. అందుకని ఇంద్రుని చంపే కుమారుడు నాకు కావాలి. నాకు ఆ వరం ఇవ్వండి." అని అడిగింది.

ఇప్పుడు కశ్యపుడు సందిగ్ధంలో పడ్డాడు. "ఇంద్రుని చంపే కుమారుడిని దితికి ప్రసాదించి, అధర్మం ఆచరించాలా! లేక ఆమె కోరికను కాదని ఇచ్చిన మాటను తప్పాలా! స్త్రీ వ్యామోహంలో పడి ఆమె ఏమి కోరుకుంటుందో తెలియకుండా వరం ఇవ్వడం నేను చేసిన పొరపాటు. ఈ పొరపాటుకు నాకు నరకం తప్పదు. ఇందులో నా భార్య దితి తప్పు మాత్రము ఏముంది. తన స్వార్థం తానుచూచుకుంది. ఇంద్రియ నిగ్రహం లేకుండా ఆమె సేవలకు మెచ్చి, ఆమె ఆంతర్యం తెలుసుకోకుండా వరం ఇవ్వడం నా తప్పు.

స్త్రీలు పైకి చాలా అమాయకంగా కనపడతారు. వారి ముఖాలు ఎప్పుడూ పద్మముల మాదిరి  వికసించి ఉంటాయి. వారి మాటలు చెవులకు ఇంపుగా ఉంటాయి. కాని వారి మనసులో ఆలోచనలు మాత్రము ఖడ్గముల వలె చాలా వాడిగా, పదునుగా, తీక్షణంగాఉంటాయి. తమ కోరికలు తీర్చుకోడానికి స్త్రీలు పైకి చాలా ప్రేమ ఉన్నట్టు అభినయిస్తారు. లోపల మాత్రము వారికి ఎటువంటి ప్రేమ ఉండదు. ఇంకా చెప్పాలంటే, స్త్రీలు వారిస్వార్థం కోసరం తన భర్తను, సంతానాన్ని, తోడబుట్టినవారిని కూడా చంపడానికి వెనుదీయరు. తాను స్వయంగా చేయకపోయినా, ఇతరుల చేత చేయిస్తారు. ఇది సత్యము.

(ఇటువంటి సంఘటనలు నేటి సమాజంలో అనుదినం జరుగుతున్నట్టు మనకు మీడియా ద్వారా తెలుస్తూనే ఉన్నాయి కదా! నాటి కశ్యపుని మాటలు అక్కడక్కడా నిజం అవుతున్నాయి.)

ఇంక నా సంగతికి వస్తే నేను దితికి వరం ఇచ్చాను. అది అసత్యం కాకూడదు. అలా అని చెప్పి ఇంద్రుడు చావకూడదు. మధ్యేమార్గంగా ఏదో ఒకటి ఆలోచించాలి." అని అనుకున్నాడు కశ్యపుడు. ఈ ప్రకారం ఆలోచించిన కశ్యపుడు దితిని చూచి ఇలా అన్నాడు.

"భార్యామణీ! నేను నీకు ఒక వ్రతమును ఉపదేశిస్తాను. దానిని నీవు నిష్ఠతో ఆచరించాలి. తరువాత నీకు ఇంద్రుని చంపే కుమారుడు పుడతాడు. కానీ ఆ వ్రత నిష్ఠలో ఏ మాత్రం లోపం జరిగినా, ఆ పుట్టే కుమారుడు ఇంద్రునికి స్నేహితుడు అవుతాడు." అని అన్నాడు. వెంటనే దితి ఇలా అంది.

"నాథా! ఆ వ్రతమును వెంటనే ఉపదేశించండి. అది ఎంతటి కఠిన నియమములు కలది అయినా నేను దానిని ఆచరిస్తాను. ఇంద్రుని చంపే కుమారుని కంటాను. నా పంతం నెరవేర్చుకుంటాను." అని పలికింది.

అప్పుడు కశ్యపుడు వ్రతనియమములు ఈ విధంగా చెప్పసాగాడు. "ఈ వ్రతము చేసేసమయములో జీవ హింస చేయకూడదు. ఎవరినీ తిట్టకూడదు. అబద్ధం చెప్పకూడదు. గోళ్లు గిల్లుకోకూడదు. తల వెంట్రుకలు కత్తిరించరాదు. ఎముకలు మొదలగు వాటిని తాకకూడదు. నీటిలో దిగి స్నానం చేయకూడదు. ఎవరి మీదా కోపం తెచ్చుకోకూడదు. చెడ్డవారితో మాట్లాడకూడదు. ఉతికిన వస్త్రములు మాత్రమే ధరించాలి. ఇతరులు ధరించిన వస్తువులను,

వస్త్రములను ధరించకూడదు. ఒకరు తిన్న ఎంగిలి తినకూడదు. క్షుద్రదేవతలకు నివేదన చేసిన పదార్థములను తినకూడదు. మాంసాహారము తినకూడదు. రజస్వలను చూడకూడదు. ఆమె చూచిన పదార్థములను తినకూడదు. దోసిలితో తీసుకొని నీరు త్రాగకూడదు. సాయంత్రం సమయంలో జుట్టు విరబోసుకొని తిరగకూడదు. బయట తిరుగునప్పుడు శరీరమును పూర్తిగా కప్పుకోవాలి. బయట నుండి వచ్చినపుడు పాదములు, చేతులు శుభ్రంగా కడుగుకోవాలి. కాళ్లు కడుగుకొన్న తరువాత కాళ్లు తుడుచుకోకుండా నిద్రపోకూడదు. ఉత్తర దిక్కుగా కానీ, పడమర దిక్కుగా కానీ తల పెట్టి నిద్రించకూడదు. ఒంటి మీద బట్ట లేకుండా నగ్నంగా నిద్రపోకూడదు. సూర్యోదయము, సూర్య అస్తమయ సమయములలో నిద్రపోకూడదు.

దేవుడికి పూజ చేసేటప్పుడు ఉతికిన తెల్లటి బట్టలు ధరించాలి. భోజనము చేసి దేవుడికి పూజచేయకూడదు. ప్రతిరోజూ గోవులను, బ్రాహ్మణులను, లక్ష్మీదేవిని, విష్ణుమూర్తిని పూజించాలి. విష్ణువును, లక్ష్మిని పూజించిన తరువాత, తన భర్తను భక్తితో పూజించాలి. తన భర్త తన కడుపులో పెరుగుతున్నట్టు భావించి పూజించాలి. ఈ నియమ నిష్ఠలతో నీవు ఒకసంవత్సరము పాటు వ్రతము ఆచరిస్తే నీకు ఇంద్రుని చంపే కుమారుడు పుడతాడు. పైన చెప్పబడిన నియమములు తప్పిన ఆ పుట్టే వాడు ఇంద్రుడికి స్నేహితుడు అవుతాడు." అని అన్నాడు కశ్యపుడు.

దితి ఈ నియమాలు అన్నీ ఆచరిస్తాను అని అంగీకరించింది. వ్రత దీక్షను తీసుకుంది. దితిగర్భం ధరించింది. నియమ నిష్టలతో వ్రతమును చేయసాగింది. ఈ విషయము ఇంద్రుడికి తెలిసింది. తన పినతల్లి దితి వ్రతం పూర్తి అయితే తనకు చావు తప్పదు అనుకున్నాడు ఇంద్రుడు. ఎలాగైనా దితి వ్రతదీక్షను భగ్నం చేయాలని అనుకున్నాడు.

ఇంద్రుడు వెంటనే తన పినతల్లి దితి వద్దకు వచ్చాడు. దితి మనసులో ఏ దుర్బుద్ధి లేదు. ఇంద్రుడూ తన కుమారుడే అనుకుంది. ఇంద్రుడిని తన ఇంటికి ఆహ్వానించింది. ఇంద్రుడు దితి ఆశ్రమములో ఉండి ఆమెకు సేవలు చేయసాగాడు. దితి వ్రతమును ఎలా భగ్నం చేయాలా అని అనుక్షణం ఆలోచిస్తున్నాడు ఇంద్రుడు. పైకి మాత్రము పినతల్లి మీద ప్రేమ నటిస్తున్నాడు. ఆమెకు రోజూ అడవి నుండి పుష్పములు, ఫలములు, కందమూలములు, సమిధలు, దర్భలు, తులసీ దళములు, మారేడు దళములు, నదిలో ఉన్న మట్టి, నదీజలములు తెచ్చి ఇస్తున్నాడు. వేటకాడు తాను వేటాడ వలసిన మృగమును మోసం చేసే విధంగా, ఇంద్రుడు లోలోపల కుటిల భావంతో కూడి కూడా పైకి ప్రేమ నటిస్తూ  దితిని మోసం చేస్తున్నాడు.

ఎన్ని రోజులు గడిచినా ఇంద్రుడు దితిలో ఏ లోపమూ కనిపెట్టలేకపోయాడు. వ్రతం పూర్తి కావస్తూ ఉంది కానీ, దితి చాలా పట్టుదలగా వ్రతమును నియమనిష్ఠలతో పాటిస్తూ ఉంది. ఇంద్రుడికి కంగారు ఎక్కువ అయింది.  ఇంతలో ఒక రోజు దితి ఏమరుపాటున కాళ్లు కడుక్కొని, వాటిని తుడుచుకోకుండా పడుకుంది. అప్పుడే

సూర్యుడు అస్తమించాడు. అది గమనించలేదు దితి. ఇంద్రుడు ఇది గ్రహించాడు. దితి వ్రతదీక్ష భగ్నం అయింది అనుకున్నాడు. సూక్ష్మరూపం ధరించాడు. దితి గర్భంలోకి ప్రవేశించాడు. దితి గర్భంలో పెరుగుతున్న పిండాన్ని తన వజ్రాయుధంతో ఏడు ముక్కలుగా నరికాడు. మరలా ఆ ఏడు ముక్కలను ఒక్కొక్కదానిని ఏడుగా నరికాడు. దితిగర్భంలో ఉన్న పిండము 49 ముక్కలుగా నరికాడు.

ఆ 49 పిండములు చేతులు జోడించి ఇంద్రుని ఇలా ప్రార్థించాయి. "మమ్ములను ఇలా ఎందుకు హింసిస్తున్నావు. మేము నీకు సోదరులము కదా! మేము నీకు ఏమి అపకారం చేసామని మమ్ములను ఇలా 49 ముక్కలుగా నరికావు." అని అడిగారు.

"అయితే మీరు నాకు సోదరులుగా నా మీద ప్రేమతో ఉంటారా" అని అడిగాడు ఇంద్రుడు.

"మేము మరుత్తులము. నీ మీద ప్రేమతో ఉంటాము. నీకుఏ అపకారము తలపెట్టము. మానుండి నీకు ఎలాంటి భయం లేదు." అని అన్నారు.

తరువాత 49 మంది మరుత్తులు, వారి వెంట ఇంద్రుడు ఒకరి వెంట ఒకరు దితి గర్భము నుండి బయటకు వచ్చారు. ఇంతలో దితికి మెలుకువ వచ్చింది. తన ఎదుట 49మంది మరుత్తులు, చేతులు కట్టుకొని ఇంద్రుడు నిలబడి ఉన్నారు. ఇంద్రుని చూచి దితి ఇలా అంది.

"ఇంద్రా! నీకు నా కుమారుడి మరణానికి కారణమయ్యావు. నిన్ను చంపే కుమారుడు కావాలని ఈ వ్రతం చేసాను. నేను కోరింది ఒక కుమారుడిని. కాని నా ముందు 49 మంది కుమారులు నిలబడి ఉన్నారు. ఇది ఎలా జరిగింది? ఇంద్రా! జరిగింది జరిగినట్టు చెప్పు. అసత్యమాడవద్దు." అని నిలదీసింది దితి.

అప్పుడు ఇంద్రుడు దితితో ఇలా అన్నాడు. "అమ్మా! నీకు పుట్టబోయే కుమారుడు నన్ను చంపుతాడని తెలిసింది. నాలో స్వార్థం పెరిగింది. నేను ధర్మం తప్పాను. నీవు వ్రతం చేస్తున్నావని తెలిసీ నీ వ్రతాన్ని భగ్నం చేయడానికి నీ వద్దకు వచ్చాను. నీవు ఈ రోజు వ్రతనియమమును తప్పావు. ఆ దోషం ఆధారంగా నేను నీ గర్భంలో ప్రవేశించి, నీ గర్భంలో పెరుగుతున్న నా మరణ కారకుడైన పిండమును 49 ఖండములుగా నరికాను. కాని నీ వ్రత దీక్ష మహిమ వలన వీరు ఎవ్వరూ మరణించలేదు. ఇది చూచి నేను ఆశ్చర్యపోయాను. ఇది ఆ శ్రీహరి మహిమ తప్ప వేరు కాదు. ఆ శ్రీహరి నన్ను కాపాడాడు. నీ కుమారులు మరణించకుండా రక్షించాడు. అమ్మా! ఈ విషయంలో నేను చాలా మూర్ఖంగా ప్రవర్తించాను. నన్ను క్షమించు." అని దితి కాళ్లమీద పడ్డాడు ఇంద్రుడు.

ఉన్నది ఉన్నట్టు చెప్పి క్షమాపణ కోరిన ఇంద్రుని క్షమించింది దితి. మరుత్తులు తనకు సోదరులు కాబట్టి వారిలో ఉన్న దైత్య భావమును పోగొట్టి వారికి అమరత్వమును ఇచ్చాడు ఇంద్రుడు. అప్పటి నుండి మరుత్తులు దేవతా గణములలో చేరిపోయారు. స్వర్గలోకములో నివసిస్తున్నారు.

ఓపరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా ఇంద్రుడు తన మరణాన్ని తప్పించుకున్నాడు. మరుత్తులకు అమరత్వమును ప్రసాదించాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవతకధను వినిపించాడు.

శ్రీమద్భాగవతము
షష్ఠస్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## షష్ఠస్కంధము
## పంతొమ్మిదవ అధ్యాయము.

పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని పుంసవన వ్రతము ఎలా చెయ్యాలి ఎటువంటి నియమములు ఆచరించాలి చెప్పమని అడిగాడు. శుక మహర్షి ఇలా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ పుంసవన వ్రతమును మార్గశిర శుక్ల పాడ్యమి నాడు మొదలుపెట్టాలి. ఒక సంవత్సరముపాటు చెయ్యాలి. ఈ సంవత్సరము పాటు ఈ క్రింది నియమములు పాటించాలి.

ఈ వ్రతమునకు ముందు ప్రతి స్త్రీ ఈ వ్రతం చేయడానికి తన భర్త అనుమతి తీసుకోవాలి. వ్రతము చేయడానికి ఈ వ్రతము

వలన దితికి పుట్టిన మరుద్గణములను ప్రార్థించాలి. వారి జనన గురించిన కథను చదువుకోవాలి.

కాలకృత్యములను తీర్చుకొని స్నానముచేసి తెల్లని శుభ్రమైన ఉతికిన వస్త్రములు ధరించాలి. బ్రాహ్మణులనురావించి వారిని పురోహితులుగా పెట్టుకోవాలి. ఈ క్రింది శ్లోకములు చదువుతూ విష్ణ మూర్తిని లక్ష్మీదేవిని పూజించాలి.

అలం తే నిరపేక్షాయ పూర్ణకామ నమోస్తుతే।
మహావిభూతి పతయే నమ: సకల సిద్ధయే॥
యథా త్వం కృపయా భూత్వా తేజసా మహిమౌజసా।
జుష్ట ఈశ గుణై: సర్వైస్తతోసి భగవాన్ ప్రభు:॥
విష్ణుపత్ని మహామాయే మహాపురుష లక్షణే।
ప్రీయేథా మే మహాభాగే లోకమాతర్నమోస్తుతే॥
ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ
మహావిభూతి పతయే సహ మహావిభూతిభిర్బలిముపహరామీతి॥

ఈ ప్రకారంగా నిర్మలమైన ఏకాగ్రమైన మనస్సుతో విష్ణుమూర్తిని లక్ష్మీదేవిని ధ్యానించాలి. తరువాత విష్ణుమూర్తిని లక్ష్మీదేవిని షోడషోపచారములతో పూజించాలి అంటే ఆవాహన, పాద్యము, అర్ఘ్యము, ఆసనము, ఆచమనము, స్నానము, వస్త్రము, ఉపవీతము, భూషణము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, నీరాజనము.(ఇవే మనము దేవుడికి చేసే 16 రకములైన ఉపచారములు.) తరువాత స్వామికి నివేదించిన

ఆహుతులను, "ఓం నమో భగవతే వాసుదేవాయ మహా విభూతయే స్వాహా" అనే మంత్రమును జపిస్తూ అగ్నిలో పన్నెండు మార్లు సమర్పించాలి. ఈ ప్రకారంగా విశ్వమునకు అధిపతులు, శక్తి స్వరూపులు అయిన లక్ష్మీనారాయణులను పూజిస్తే వారికి సమస్త సంపదలు కలుగుతాయి

. తరువాత స్వామికి సాష్టాంగ ప్రణామము ఆచరించాలి. క్రింద చెప్పినమంత్రమును పది మార్లు జపించాలి.

యువాంతు విశ్వస్య విభు జగత: కారణం పరమ్।
ఇయం హి ప్రకృతిం సూక్ష్మా మాయాశక్తి ర్దురత్యయా॥
తస్యా అధీశ్వర: సాక్షాత్త్వమేవ పురుష: పర:।
త్వం సర్వ యజ్ఞ ఇజ్యేయం క్రియేయం ఫలభుగ్భవాన్॥
గుణవ్యక్తిరియం దేవీ వ్యంజకో గుణభుగ్భవాన్।
త్వం హి సర్వ శరీర్యాత్మా శ్రీ: వరీరేన్ద్రియాశయా:।
నామరూపే భగవతీ ప్రత్యయస్త్వమపాశ్రయ:॥
యథా యువాం త్రిలోకస్య వరదౌ పరమేష్ఠినౌ।
తథ్యా మ ఉత్తమ: శ్లోక సన్తు సత్యా మహాశిష:॥

ఈ ప్రకారంగా లక్ష్మీనారాయణులనుస్తుతించి అప్పటి వరకు చేసిన పూజలకు సంబంధించిన నిర్మాల్యములను కళ్లకద్దుకొని, తొలగించి, నివేదనలను తీసి పక్కనపెట్టి, మరలా ఆచమనము చేసి పున: పూజ చెయ్యాలి. మరలా పైన చెప్పబడిన స్తోత్రములను చెయ్యాలి.

ఇందాక యజ్ఞము చేయగా మిగిలిన ఉపాహారమును వాసన చూడాలి. ప్రసాదంగా తీసుకోవాలి. మరలా లక్ష్మీనారాయణులను పూజించాలి. తరువాత ఈ స్త్రీ తన భర్తను కూడా నారాయణ స్వరూపంగా భావించి పూజించాలి.

ఈ వ్రతమును భార్య భర్తలు కలిసి చేయాలి. ఏ కారణం చేతనైనా భార్యకు వ్రతం చేయడానికి ఆటంకం కలిగితే ఆ రోజులలో పూజను భర్త చేయాలి.

ఈ వ్రతము చేసే సమయములో ఎవరి మీద కోపగించుకోకూడదు. బ్రాహ్మణులను, ముత్తయిదువులను పూజించాలి. వారికి తాంబూలములు, దక్షిణలు ఇవ్వాలి. తరువాత లక్ష్మీనారాయణులకు ఉద్వాసన మంత్రము పఠించి ఉద్వాసన చెప్పాలి. తరువాత నైవేద్యము పెట్టిన పదార్థములను భుజించాలి.

ఈ ప్రకారంగా 12 నెలలు ఈ వ్రతము ఆచరించాలి. ఈ వ్రతమును మొదలుపెట్టిన తరువాత వచ్చే కార్తీక మాసము నందు వచ్చే పౌర్ణమి నాడు సమాప్తిచేయాలి. కార్తీక పౌర్ణమి నాడు ఉపవాసము ఉండాలి. లక్ష్మీనారాయణులను అర్చించాలి. తరువాత నేయి, పాలు, అన్నము వీటితో పరమాన్నము తయారు చేయాలి. దానిని 12 భాగములుచేసి అగ్నిలో ఆహుతి ఇవ్వాలి. తరువాత బ్రాహ్మణులకు నమస్కరించి వారి ఆశీర్వాదము తీసుకోవాలి. తరువాత భర్తతో, బంధువులతో కలిసి భోజనము చేయాలి. తరువాత పురోహితుడు ఇచ్చిన యజ్ఞశేషమును (అంటే 12 ఆహుతులు ఇవ్వగా మిగిలిన

పరమాన్నమును) భర్త తన భార్యకు ఇవ్వాలి.

ఈ వ్రతమును సక్రమంగా ఆచరిస్తే స్త్రీలకు సత్సంతానము కలుగుతుంది. ఐశ్వర్యము కలుగుతుంది. జీవితాంతం ముత్తయిదువుగా సుఖశాంతులతో జీవిస్తుంది. పెళ్లికాని ఆడ పిల్లలు ఈ వ్రతం చేస్తే వారికి మంచి గుణవంతుడైన భర్త లభిస్తాడు. భర్త, కుమారులు లేని స్త్రీ ఈ వ్రతం చేస్తే ఆమెకు వైకుంఠప్రాప్తికలుగుతుంది. పుట్టిన సంతానము దక్కని స్త్రీ ఈ వ్రతం చేస్తే ఆయుష్మంతుడైన కుమారుడు కలుగుతాడు. ధనము, సౌభాగ్యము, మంచి రూపము కలుగుతుంది. అన్ని రోగములు నశిస్తాయి. సంపూర్ణ ఆరోగ్యవంతులవుతారు. ఈ వ్రత విధానమును చదివినా కూడా వారికి సకల కోరికలునెరవేరుతాయి. ఈ వ్రతమును చేసిన వారి పట్ల లక్ష్మీనారాయణులు ప్రసన్నులవుతారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటిదాకా నీకు పుంసవన వ్రతము ఎలా చెయ్యాలి అని వివరించాను." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

షష్ఠస్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

షష్ఠస్కంధము సర్వం సంపూర్ణం

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

## సంస్కృత మూలము

## భగవాన్ వ్యాసమహర్షి

## తేటతెలుగులో

## యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్:9866140619, 9391134792

లాండ్ ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము
# సప్తమ స్కంధము
# మొదటి అధ్యాయము.

శుక మహర్షి చెబుతున్న భాగవత పురాణమును వింటున్న పరీక్షిత్ మహారాజుకు ఒకసందేహము వచ్చింది. శుక మహర్షిని చూచి ఇలా అడిగాడు.

"మహాత్మా! విష్ణుమూర్తి అందరినీ సమంగా చూస్తాడు, ఆయనకు ఎవరి మీద ఎటువంటి భేదభావము లేదుఅని చెప్పారు కదా! మరి దేవేంద్రుడు కోరగానే తగుదునమ్మా అంటూ వెళ్లి రాక్షసులను ఎందుకు చంపాడు. మరి అది దేవతల మీద పక్షపాతము కదా! ఆ దైత్యులు విష్ణువుకు ఎటువంటి అపకారము చేయకపోయినా, వారిని ఎందుకు చంపవలసి వచ్చింది. అందరినీ సమంగా చూచే విష్ణుమూర్తికి దేవతల మీద పక్షపాత వైఖరి తప్పుకాదా! విష్ణుమూర్తి అటువంటి తప్పు ఎందుకు చేసాడు. అంతే కాదు. విష్ణు మూర్తి సహజంగా పరమానంద స్వరూపుడు అని కదా  చెప్పారు. కేవలము దేవేంద్రుని మాట విని దేవతల మీద పక్షపాతము చూపినంత మాత్రాన విష్ణుమూర్తికి ఏమి ప్రయోజనము కలిగింది. పోనీ ఆయనకు రాక్షసుల వలన ఏమైనా భయం ఉందా అంటే సాక్షాత్తు విష్ణుమూర్తి సత్వ,రజస్,తమో గుణములకు అతీతుడు కదా! మరి ఆయన రాక్షసులకు ఎందుకు భయపడాలి? ఏ కారణము లేకుండా విష్ణు మూర్తి అసురుల మీద ఎందుకు ద్వేషభావము పెంచుకున్నాడు? ఇదంతా చూస్తుంటే శ్రీమహావిష్ణువు యొక్క గుణగణముల మీద మాకు ఎన్నో అనుమానాలు కలుగుతున్నాయి. మా సందేహములను

నివృత్తి చేయడానికి మీరు సమర్థులు. కాబట్టి మా సందేహములు తీర్చండి." అని అడిగాడు పరీక్షిత్ మహారాజు.

పరీక్షిత్ సందేహము విన్న శుకుడు చిరునవ్వు నవ్వాడు. నేను నీకు మొట్ట మొదటనే చెప్పాను. ఆ శ్రీహరి లీలలు ఓ పట్టాన అర్థంకావు. పైకి అధర్మంగా కనిపించినా అంతర్లీనంగా ధర్మం దాగి ఉంటుంది. పైకి రాక్షసులను చంపాడు కదా అని శ్రీహరిని తప్పు పట్టడానికి వీలు లేదు. దైత్యులు అయిన హిరణ్యాక్ష హిరణ్య కశిపులను ఎందుకు చంపవలసి వచ్చిందో నీకు వివరిస్తాను.

శ్రీమహావిష్ణువు సాక్షాత్తు పరమాత్మ స్వరూపము. ఆయన ప్రకృతి ధర్మములకు అతీతుడు. ఆయనను సత్వ,రజస్,తమోగుణములు అంటవు. ఆయనకు జన్మ లేదు. ఆయనకు రాగద్వేషములు లేవు. ఆయనకు దేహము అంటూ లేదు. నిరాకారుడు. అన్ని ప్రాణులలోనూ ఆత్మస్వరూపుడుగా వెలుగుతూ ఉంటాడు. ఆ కారణం చేత సాధారణ మానవుల మాదిరి దుర్మార్గులను బాధించడం, వారిచేత బాధింపబడటం అనే భావములనుపొందుతూ ఉంటాడు.

ఓ రాజా! సత్వగుణము, రజోగుణము, తమోగుణము ప్రకృతికి సంబంధించినవి కాని శ్రీహరికి కాదు. ఈ గుణములు ఒక్కో సారి వృద్ధిపొందు తుంటాయి. మరొకసారి క్షీణిస్తూ ఉంటాయి. అన్ని గుణములు ఒకే సారి వృద్ధి పొందడం కానీ,క్షీణించడం కానీజరగదు. ఓ రాజా! లోకములో సత్వగుణము వృద్ధి చెంది నపుడు, సత్వగుణ సంపన్నులకు మంచి కాలము. దేవతలు, ఋషులు వృద్ధి చెందుతారు.

అదే ప్రకారంగా ప్రకృతిలో రజోగుణము వృద్ధిచెందినపుడు రాక్షసత్వము, యుద్ధోన్మాదము వృద్ధి చెందుతుంది. తమోగుణము వృద్ధి చెందినప్పుడు మానవులు రాక్షస ప్రవృత్తి కలిగి ఉంటారు. క్షుద్రదేవతలను పూజిస్తారు. యక్షులను, రాక్షసులను తమ దేవతలుగా పూజిస్తారు. పరమాత్మ అందరి పట్ల సమభావంతో ఉంటాడు కాబట్టి ఏ గుణము ఎక్కువగా ఉంటే పరమాత్మ కూడా ఆ గుణమును వృద్ధి చెందనిస్తాడు. ఎలాగంటే జలమును ఏ పాత్రలో పోస్తే ఆ పాత్రలో ఒదిగి పోతుంది. ఆ పాత్రరూపంలో ఉంటుంది. ఆకాశము కూడా కుండలోనూ, దేహములోనూ వ్యాపించి ఉంటుంది. అలాగే పరమాత్మ కూడా సత్వగుణము కలవారిలోనూ, రజస్తమోగుణములు కలవారిలోనూ, దేవతలలోనూ, అసురులలోనూ పరమాత్మ సమంగా వ్యాపించి ఉంటాడు. పరమాత్మ తత్వమును పూర్తిగా తెలిసిన వారికి ఈ విషయం బాగా అర్థంఅవుతుంది.

కోరికలను అనుభవించాలంటే, సుఖ దు:ఖాలను, రాగద్వేషాలను పొందాలంటే ఒక దేహం ఉండాలి కదా. అందుకని పరమాత్మ తన మాయాశక్తి చేత దేహములను సృష్టించాడు. ప్రకృతిలో ఉన్న సత్వ, రజస్, తమోగుణముల ను ఆ దేహములలో ప్రవేశ పెట్టాడు. మానవుడు తన సహజ స్థితిలో ఉన్నప్పుడు సత్వగుణమును, పనులు చేసే టప్పుడు రజోగుణమును, నిద్రించే సమయములో ఉన్నప్పుడు తమోగుణమును ఆశ్రయించేటట్టు చేసాడు. ఈ దేహములు అన్నీ కాలమునకు లోబడి ఉంటాయి. ఈదేహముతో చేసే పనులన్నీ జరిగినవి, జరుగుతున్నవి, జరగబోయేవి అని నిర్ణయింప బడ్డాయి. ఈ కాలములో సత్త్వగుణము ప్రధానంగా వృద్ధి చెందుతున్నప్పుడు దేవతలు వృద్ధి చెందుతారు. అప్పుడు దేవతలది పైచేయి అవుతుంది. వారు

తమోగుణ ప్రధానులైన రాక్షసులను, దైత్యులను, హింసిస్తారు, చంపుతారు. అదే తమో గుణము వృద్ధి చెందినపుడు, రాక్షసులు దైత్యులు వృద్ధి పొందుతారు. వారు సత్వగుణ ప్రధానులైన దేవతలను హింసిస్తారు. ఇవి కాలానుగుణంగా జరుగుతుంటాయి. పరమాత్మ కూడా కాలానుగుణంగానే ప్రవర్తిస్తుంటాడు. ఆయనకు పక్షపాతము, రాగద్వేషములు ఉండవు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ సందర్భంలో నీకు ఒక వృత్తాంతమును చెబుతాను శ్రద్ధగా విను. మీ తాతగారు ధర్మరాజు రాజసూయ యాగము చేసాడు. ఆ సమయంలో శ్రీకృష్ణునికి అగ్రపూజ చేసాడు. దానిని ఛేది దేశాధి పతి అయిన శిశుపాలుడు వ్యతిరేకించాడు. శ్రీకృషష్ణుని అనరాని మాటలు అన్నాడు. శ్రీకృష్ణుడు నూరు తప్పుల దాకా ఓపిక పట్టాడు. నూరు తప్పులు పూర్తికాగానే తన చక్రాయుధముతో శిశుపాలుని తల నరికాడు. శిశుపాలుడు మరణించాడు. శిశుపాలుని శరీరములో నుండి అతని ఆత్మజ్యోతి బయటకు వచ్చి శ్రీకృష్ణునిలో లీనం అయింది. ఇది చూచి ధర్మరాజు ఆశ్చర్యపోయాడు. పక్కనే ఉన్ననారదుని చూచి ఇలా అడిగాడు.

"ఓ నారద మునీంద్రా! ఆ పరమాత్మయందు ఏకాగ్రమైన మనసుతో ఉన్న భక్తులు ఎంతో మంది ఉన్నారు. అటువంటి వారికి కూడా ఇంత సులభంగా పరమాత్మలో లీనం కావడం లభించదు. కాని తన జీవితము అంతా శ్రీకృష్ణుని ద్వేషించిన, దూషించిన ఈ శిశు పాలునికి ఇంతటి అదృష్టము ఎలా కలిగింది. ఎంతో ఆశ్చర్యముగా ఉంది. వాసుదేవుని ద్వేషించిన శిశుపాలుడు ఆయనలో ఎలా ఐక్యం

అయ్యాడు. సాధారణ పరిస్థితులలో శిశుపాలుడు నరకానికి పోవలసిన వాడు. ఇలా పరమాత్మలో ఐక్యం కావడం ఏమిటి?

నారదా! ఇప్పుడే కాదు. దమఘోషుని కుమారుడైన ఈ శిశు పాలుడు బాల్యం నుండి కూడా శ్రీకృష్ణుని ద్వేషించాడు. ఇతని అనుచరుడు దంతవక్త్రుడు కూడా శ్రీకృష్ణుని ద్వేషించడంలో శిశు పాలునితో పోటీ పడ్డాడు. శ్రీకృష్ణుని అటువంటి పరుషమైన మాటలు మాట్లాడిన వారి నాలుకల మీద కుష్ఠురోగం రావాలి. వారి నాలుకలు తెగిపోవాలి. వాళ్లు నరకానికి పోవాలి. కానీ ఆశ్చర్యంగా శ్రీకృష్ణునిలో ఐక్యం అయ్యారు. ఇది ఎలా జరిగింది. ఈ చర్య వలన మంచి తనము మీదనే నమ్మకం పోతోంది. నా మనసు వ్యాకులపడుతూ ఉంది. ఈ సందేహమును మీరే తీర్చాలి." అని అడిగాడు ధర్మరాజు. దానికి నారదుడు ఈ విధంగా చెప్పసాగాడు.

"ధర్మనందనా! ఈ శరీరం ఎందుకు పుట్టిందో తెలుసా! స్తుతులు, నిందలు, సత్కారములు, తిరస్కారములు అన్నీ అనుభవించడానికే కదా! సుఖదు:ఖములను, రాగద్వేషములను అనుభవించడానికే ప్రకృతి పురుషుల సంయోగముతో ఈ దేహము ఏర్పడింది. కాని ఈ దేహములో ఉన్న చూచే శక్తి, వినేశక్తి, పనులు చేసే శక్తి అన్నీ ఆ భగవంతుడే. కానీ ఈ మానవుడు అన్నీ తానే చేస్తున్నానుఅని అనుకుంటున్నాడు. నేను, నాది అనే అహంకారంతో విర్రవీగుతున్నాడు. ఈ అహంకారము వలననే లోకంలో హింస, ఒకరిని ఒకరు కొట్టుకోవడం, తిట్టుకోవడం, చంపుకోవడం జరుగుతున్నాయి.

## సప్తమ స్కంధము

విష్ణువు సర్వవ్యాపి. అన్ని ప్రాణులలో ఉన్నాడు. ఈ మానవుల మాదిరి విష్ణువుకు నేను, నాది అనేభావన లేదు. కాబట్టి విష్ణువు ఒకరిని ఆదరించడం, ఒకరిని హింసించడం అనే ప్రశ్నలేదు. ఆయనకు అందరూ సమానమే. అందుకే ఆయన ఒకరిని ద్వేషించడం, ఒకరి చేత ద్వేషించబడటం అనేది ఉండదు. రాక్షసత్వము వృద్ధి చెందినపుడు వారిని శిక్షిస్తాడు. దేవతలు గర్వంతో విర్రవీగినప్పుడు రాక్షసులను వృద్ధిచెందించి, దేవతలగర్వము అణుస్తాడు. ఇదంతా ఆ పరమాత్మ మాయ, లీల. ఎవరిని రక్షించినా, ఎవరిని శిక్షించినా అది వారి మేలుకొరకే కాని వేరు కాదు.

(తల్లి తండ్రులు తమ కుమారులను, కుమార్తెలను వారి మంచి కోరి శిక్షిస్తారు. గురువులు తమ శిష్యులను కూడా శిక్షిస్తారు. ఇదంతా వారి మేలు కోరి చేస్తారే కానీ, వారి మీద ద్వేషంతో కాదు. పరమాత్మకూడా అంతే.)

మానవులు పరమాత్మను ఆరాధించాలంటే ఒక్క భక్తిమార్గమే అవసరం లేదు. పరమాత్మమీద వైర భావంతో కానీ, భక్తిభావంతో గానీ, భయంతో కానీ, స్నేహంతో కానీ, కామంతో కానీ, పరమాత్మను ఆరాధించవచ్చును. ఓ ధర్మరాజా! ఇంకొక రహస్యం చెప్పనా! పరమాత్మ మీద శత్రుత్వము వహించిన వాడు అతడు పరమాత్మను ప్రతిరోజూ ద్వేషభావంతో తలచుకుంటూ ఉంటాడు. పరమాత్మ యందు భక్తి కలవాడు కూడా అన్ని సార్లు పరమాత్మను తలచుకోడు. భ్రమరము ఒక పురుగును తెచ్చి ఒక తొర్రలో పెట్టి దాని చుట్టు ఝుమ్మంటూ రొద చేస్తూ తిరుగుతూ ఉంటుంది. ఆ పురుగు ఈ రొదను భరింతలేక భయంతో వణికిపోతూ ఉంటుంది. కొంత కాలానికి

ఆ భయంతో ఆ పురుగు కూడా ఆభ్రమరము మాదిరి అరుస్తుంది. భ్రమరంగా మారి  పోతుంది. దీనిని భ్రమరకీటకన్యాయము అంటారు. (ఉదాహరణకు చెప్పాలంటే ఇటీవల వచ్చిన చంద్రముఖి సినిమా ఈ సూత్రము మీద ఆధారపడి తీసిందే. కాని వాళ్లు భాగవతము చదివి ఉండకపోవచ్చు.) అలాగే మానవరూపంలో శ్రీకృషుడుగా అవతరించిన ఆ పరమాత్మను జీవితాంతం ద్వేషించిన శిశుపాలుడుకూడా, నిరంతర ద్వేషంతో శ్రీకృష్ణుని తలచుకుంటూ,  తుదకు ఆయన రూపమునే పొందాడు. ఇందు లో ఆశ్చర్యపడవలసినది ఏమీ లేదు.

ఓ ధర్మరాజా! భక్తి భావంతో, పరమాత్మయందు మనసు లగ్నం చేసి ఎంతో మంది ముక్తి పొందారు. వారే కాదు ఆ పరమాత్మయందు కామంతో (గోపకాంతలు), ద్వేషంతో (శిశు పాలుడు),  భయంతో (కంసుడు), స్నేహంతో (అర్జునుడు, ఉద్ధవుడు) శ్రీకృష్ణుని మీద మనస్సు లగ్నం చేసి ముక్తిని పొందారు. గోపికలు కామం చేత, కంసుడు భయం చేతా, శిశుపాలుడు మొదలగు రాజులు ద్వేషం చేతా, వృష్ణి వంశములో వారు బంధుత్వము చేతా, పాండవులు అయినమీరు స్నేహం చేతా, మేము భక్తి చేతా ముక్తిని పొందుతున్నాము.

ఓ ధర్మనందనా! కాబట్టి పరమాత్మను పైన చెప్పిన ఐదు విధములుగా చింతించి ఆయనలో సాయుజ్యమును పొందగలరు. కాని వేనరాజు లాంటి నాస్తికులకు ఆ భాగ్యము లేదు. అందువలన నాస్తికులకు మోక్షము లేదు. కాబట్టి విధానము ఏదైనా ఆ పరమాత్మను స్మరించడమే ముఖ్యము. ఇంక శిశుపాల దంతవక్త్రులు విషయానికి వస్తే, వీరు ఇద్దరూ  నీ పినతల్లికుమారులు. వారు పూర్వజన్మలో

విష్ణుమూర్తి యొక్క అనుచరులు. బ్రాహ్మణ శాపము చేత ఈ మాదిరి మానవులుగా జన్మించారు.” అని చెప్పాడు నారదుడు.

ఆ మాటలు విన్న ధర్మరాజు నారదునితో ఇలా అన్నాడు. “ఓ నారదమహర్షీ! ఇది ఇంకా ఆశ్చర్యము గా ఉంది. సాక్షాత్తు విష్ణుమూర్తి అనుచరులకు శాపం ఇచ్చేంత శక్తి, సాహసము ఏ బ్రాహ్మణునికి ఉంది. ఒక సారి శ్రీహరిని చేరుకున్న తరువాత వారికి మరల జన్మలేదంటారు కదా! మరి వీరు మానవులుగా ఎలా జన్మించారు? ఎందుకంటే, వైకుంఠము చేరుకోవాలంటేవారు శుద్ధసత్వగుణ సంపన్నులు అయి ఉండాలి కదా! అటువంటి వారు బ్రాహ్మణుల ఆగ్రహమునకు ఎలా పాత్రులయ్యారు? దేహధారులైన బ్రాహ్మణులతో వారికి ఎలా సంబంధం కలిగింది. బ్రాహ్మణులు వారిని ఎలా శపించారు. దయచేసి మాకు వివరించండి.” అని అడిగాడు ధర్మరాజు. నారదుడు ఇలా చెప్ప సాగాడు.

“ధర్మనందనా! సనక, సనందన, సనాతన, సనత్కుమారులు బ్రహ్మ మానస పుత్రులు. బ్రాహ్మణులు. వారు మరీచి మొదలగు మహర్షుల కన్నా పూర్వము వారు. వారు దిగంబరులు. ఎప్పుడూ ఐదు సంవత్సరముల బాలుర మాదిరి ఉంటారు. వారు ఒక చోట ఉండరు. మూడులోకములు తిరుగుతుంటారు. వారు ఒక సారి విష్ణుమూర్తిని చూద్దామని వైకుంఠమునకు వెళ్లారు. అప్పుడు జయుడు, విజయుడు అనే ఇద్దరు విష్ణు పార్షదులు వైకుంఠ ద్వారము వద్ద కాపలా కాస్తున్నారు. వీరిని చూచి అడ్డగించారు. చిన్న బాలురకు వైకుంఠములోకి ప్రవేశము లేదు అని అన్నారు. తమను లోపలకు

పోనీయకుండా జయవిజయులు అడ్డగించడంతో వారికి కోపం వచ్చింది.

"మూర్ఖులారా! మీరు శ్రీమహావిష్ణువు యొక్క సన్నిధానములో ఉండి కూడా రజోగుణము, తమోగుణములు వదిలిపెట్టలేదు. మీరు వైకుంఠములో ఉండటానికి అర్హులు కారు. మీరు తక్షణమే ఇక్కడి నుండి వెళ్లి పొండి. భూలోకములో అసురులుగా పుట్టండి." అని శపించారు.

జయవిజయులు తమ తప్పు తెలుసుకున్నారు. ఆ ఋషులకు నమస్కరించారు. అప్పుడు ఆ బ్రాహ్మణులు దయతో వారికి శాప విమోచన కలిగించారు. "మీరు మూడు జన్మలు మాత్రమే అసురులుగా పుడతారు. తరువాత మరలా వైకుంఠము చేరుకుంటారు." అని తమ శాపమునకు కొంత వెసులుబాటు కలిగించారు.

ఓ ధర్మనందనా! వారే మొదటి జన్మలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు, రెండవ జన్మలో రావణ కుంభ కర్ణులు, మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులు. అందుకే వారు విష్ణువులో కలిసిపోయారు. మొదటి జన్మలో దితి గర్భవాసాన హిరణ్య కశిపుడు, హిరణ్యాక్షుడు గా పుట్టారు. వారిలో హిరణ్య కశిపుడు పెద్దవాడు. హిరణ్యాక్షుడు చిన్నవాడు. వారు దైత్యులకు, దానవులకు నాయకులు. వారు పుట్టినప్పటి నుండి శ్రీహరిని ద్వేషించారు. వారిని శాపము నుండి విముక్తి చేయడానికి శ్రీహరి నరసింహ రూపములో హిరణ్యకశిపుని, వరాహ రూపములో హిరణ్యాక్షుని వధించి వారికి

శాపవిమోచన కలుగచేసాడు.

హిరణ్య కశిపుని కుమారుని పేరు ప్రహ్లాదుడు. హిరణ్యకశిపుడు తనకుమారుడు ప్రహ్లాదుని చంపడానికి అనేక విధములుగా ప్రయత్నించాడు. ఎన్నోబాధలు పెట్టాడు. కానీ విష్ణువును నమ్ముకున్న ప్రహ్లాదుని చంపించలేకపోయాడు.

రెండవ జన్మలో జయవిజయులు, విశ్రవసుడు, కేశిని అనే దంపతులకు రావణుడు, కుంభకర్ణుడు అనే పేర్లతోజన్మించారు. వారు మూడు లోకములను నానాబాధలుపెట్టారు. వారిని శాపవిముక్తులుగా చేయడానికి విష్ణువు రామునిగా అవతరించి, వారిని చంపి వారికి శాపవిముక్తి కలుగచేసాడు.

మూడవ జన్మలో జయవిజయులు నీ పినతల్లి కుమారులుగా శిశుపాల దంతవక్త్రుల నామములతో జన్మించారు. వారికి శాపవిమోచన కలిగించడానికి విష్ణువు శ్రీకృష్ణుడిగా అవతరించి శిశుపాల దంతవక్త్రులను చంపి వారికి శాశ్వతంగా శాపవిమోచన కలిగించాడు. వీరంతా శ్రీహరిని ద్వేషంతో వైరంతో ధ్యానించిన వారే. అందుకనే వారికి విష్ణువు వైకుంఠప్రాప్తి కలిగించాడు." అని నారదుడు ధర్మరాజుకు చెప్పాడు.

ఇప్పుడు ధర్మరాజుకు మరొక సందేహము కలిగింది. "నారదా! ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని కుమారుడు అన్నారు కదా! తండ్రి కుమారుని ద్వేషించడం, చంపించడం ఏమిటి? విచిత్రంగా ఉంది

కదా! విష్ణువును ద్వేషించిన హిరణ్య కశిపుని కుమారుడు ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు ఎలా అయ్యాడు? ఇదంతా గందరగోళంగా ఉంది. కాస్తవివరంగా చెప్పండి." అని అడిగాడు ధర్మరాజు.

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము మొదటి అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము

రెండవ అధ్యాయము.

నారదుడు ధర్మరాజుతో ఈ విధంగా చెబుతున్నాడు. "ధర్మనందనా! హిరణ్యాక్షుడు విష్ణువు చేతిలో మరణించాడు. విష్ణువు వరాహ రూపంలో వచ్చి తన తమ్ముడు హిరణ్యాక్షుని చంపాడు అని తెలిసి హిరణ్య కశిపుడు కోపంతో రగిలిపోయాడు. దైత్యులను, దానవులను చూచి ఇలా అన్నాడు.

"ఓ దైత్యులారా! దానవులారా! ద్విమూర్ధుడా! త్ర్యక్షుడా! శంబరా! శతబాహూ! హయగ్రీవా! నముచీ! పాకా! ఇల్వలా! విప్రచిత్తా! పులోమా! నా మాటలు శ్రద్ధగా వినండి. మనకు దేవతలు శత్రువులు. మనకు దాయాదులు. ఎప్పుడూ మన నాశనం కోరుతుంటారు. ఆ కారణం చేత ఇంద్రుడు, విష్ణువు సాయంతో, నా సోదరుని వధించాడు. శ్రీహరి అందరిపట్ల సమభావంతో ఉంటాడని విన్నాను. కాని దేవతల పట్ల పక్షపాతము వహించి, ఇంద్రుని మాటలు విని నా సోదరుడు

హిరణ్యాక్షుని వరాహ రూపంలో వధించాడు. నా శత్రువులకు మిత్రుడైన విష్ణువు నాకూ శత్రువే. అంతకు ముందు విష్ణువుకు ఈ పక్షపాత బుద్ధి లేదు. కానీ ఈ వరాహ అవతారము ఎత్తిన తరువాత అన్నీ ఆ వరాహము బుద్ధులే వచ్చాయి. పక్షపాత బుద్ధి పెరిగింది. చిన్న పిల్లవాడి మాదిరి ఎవరు ఏమి చెప్పినా అది చేస్తున్నాడు. ఇంక విష్ణువును ఉపేక్షించకూడదు. నా శూలముతో ఆ విష్ణువును పొడిచి చంపుతాను. అతని రక్తముతో నా తమ్ముడికి తర్పణము విడుస్తాను. విష్ణువును చంపేస్తే దేవతలు కూడా అనాధలు అవుతారు. చెట్టు వేరు నరికితే చెట్టు ఎలా ఎండిపోతుందో, విష్ణువు అండలేని దేవతలు కూలిపోతారు.

నేను విష్ణువును నాశనం చేసే కార్యక్రమము మీద ఉన్నప్పుడు మీరందరూ ఆ విష్ణుభక్తులను హతమార్చండి. విష్ణువు యజ్ఞపురుషుడు కాబట్టి యజ్ఞములు నాశనం చేయండి. విష్ణువు వేద స్వరూపుడు కాబట్టి వేదాధ్యయనం చేసేవారిని చంపండి. వ్రతములు, దానములు చేసే వారిని సంహరించండి. ఎవరు తపస్సు చేస్తున్నా వారినిచంపండి. విష్ణువు పేరు పలికిన వారిని సర్వనాశనం చేయండి. ఇంకొక విషయం మరచిపోకండి. విష్ణువుకు బ్రాహ్మణులు అంటే ఎంతో ఇష్టం. అందుకని బ్రాహ్మణులను వెదికి వెదికి చంపండి. అప్పుడు విష్ణువు వాళ్లను కాపాడటానికి వస్తాడు. మనం విష్ణువును తేలికగా చంపవచ్చు. కాబట్టి గోవులు, బ్రాహ్మణులు, వేదములు, వేదములో చెప్పబడిన క్రియలు ఎక్కడ జరిగినా వాటిని నాశనం చేయండి. చెట్లను నరికేయండి. బ్రాహ్మణులు నివసించే నగరములు, గ్రామములు, గోవులు ఉండే పచ్చిక బయలులు, గోశాలలు, బ్రాహ్మణుల క్షేత్రములు, ఋషులు నివసించే ఆశ్రమములు, అన్నిటినీ ధ్వంసం

చేయండి. వెళ్లండి." అని ఆజ్ఞాపించాడు హిరణ్యకశిపుడు.

అసలే దానవులు, దైత్యులు, రాక్షసులు దుర్మార్గులు. రజోగుణము, తమోగుణము ప్రధానంగా కలవారు. పైగా రాజాజ్ఞ. దాంతో అంతా రెచ్చిపోయారు. గృహములను తగలపెడుతున్నారు. వృక్షములను నరుకుతున్నారు. ఇళ్లను కూలుస్తున్నారు. యజ్ఞములు నాశనం చేస్తున్నారు. దాంతో దేవతలకు హవిస్సులు లేకుండా పోయాయి. దేవతలందరూ బయట తిరగకుండా స్వర్గలోకమునకు పరిమితమయ్యారు.

ఎన్ని చేసినా హిరణ్యకశిపునికి తమ్ముడు మరణించిన దు:ఖము తీరలేదు. యధావిధిగా తమ్ముడికి అపర కర్మలు చేసాడు. జల తర్పణములు వదిలాడు. తన తల్లి దితిని, హిరణ్యాక్షుని భార్య భానువును, హిరణ్యాక్షుని కుమారులు శకుని, శంబరుడు, ధృష్టి, భూతసంతాపకుడు, వృకుడు, కాలనాభుడు, మహానాభుడు, హరిశ్మశ్రు వు, ఉత్కచుడు ని ఓదార్చాడు. వారితో ఇలా అన్నాడు.

"అమ్మా! మీరు దు:ఖపడకండి. నా తమ్ముడు వీరుడు. వీర మరణం పొందాడు. అది వీరులకు కీర్తికరమైన కార్యము. అమ్మా! చలివేంద్రములలో, రహదారి సత్రములలో, బాటసారులు కలుసుకుంటారు. కాసేపు ఉంటారు. విశ్రాంతి తీసుకుంటారు. తరువాత ఎవరి దోవన వారు పోతారు. అలాగే ఈ ప్రపంచములో జీవులు కూడా కలుసుకుంటారు.(పుడతారు) కొంతకాలము కలిసి జీవిస్తారు. (పెరుగుతారు) తరువాత ఎవరి దోవన వారు పోతారు. (మరణిస్తారు). ఇది లోక సహజము. దీని కోసరం చింతించపనిలేదు. ప్రతి జీవిలోనూ

ఆత్మ ఉంది. దానికి చావు లేదు. అదినిత్యము. దానికి చావు లేదు. ఆత్మ దేహము కంటే వేరైనది. నా తమ్ముడి దేహము పడిపోయింది కానీ ఆత్మకాదు. కాబట్టి ఆత్మ స్వరూపుడైన నా తమ్ముడు మరణించాడు అని అనుకోవడం కేవలం భ్రమ. నా తమ్ముడి మరణానికి దు:ఖించకండి.

అమ్మా! తటాకములో నీళ్లు ఉంటాయి. అందులో చెట్లు, కొండలు ప్రతిబింబిస్తాయి. తటాకములో నీరు కదిలితే ఆ చెట్లు కొండలుకూడా కదులుతున్నట్టు భ్రమకలిగిస్తాయి. నిజానికి ఏవీ కదలవు. అలాగే, మన మనస్సు ప్రకృతిలో ఉన్న గుణముల సంయోగముతో చలిస్తూ ఉంటుంది. లోపల ఉన్న జీవాత్మ మాత్రము చలించదు. స్థిరంగా ఉంటుంది. సుఖదు:ఖములు, శోకమోహములు ఈ దేహానికే కానీ జీవునికి కాదు. కాని మనమంతా ఈ దేహమే నేను, నేనే ఈ దేహము అని అనుకుంటూ ఉంటాము. దాని వలన సుఖదు:ఖములు, రాగద్వేషములు మొదలగు వికారములను అనుభవిస్తుంటాము. మనకు ఇష్టమైన వారు దూరమయినపుడు, మనకు ఇష్టం లేని వారు మనకు దగ్గర చేరినపుడు మనము దు:ఖము అనుభవిస్తుంటాము. ఈ ప్రకారంగా సుఖదు:ఖములను అనుభవించి, వాటి ప్రభావం చేత మరొక జన్మ పొందుతుంటాము.

మనం ఈ జన్మలో చేసే కర్మలే మన మరుజన్మకు కారణమవుతాయి. ఈ కర్మల వలన జనన మరణములు, వివిధములైన సుఖములు, దు:ఖములు, చింతలు కలుగుతుంటాయి. వీటి వలన మనలో ఉన్న వివేకము నశిస్తుంది. అజ్ఞానము వృద్ధిచెందుతుంది. ఈ సందర్భంలో ఒక కథ చెబుతుంటారు. దానిని మీకు చెబుతాను వినండి.

పూర్వము ఉశీనర దేశమును సుయజ్ఞుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఒకసారి ఆయన తన శత్రువులతో యుద్ధం చేస్తూ శత్రువుల చేతిలో మరణించాడు. ఆయన మృత దేహమును రాజభవనమునకు తీసుకొని వచ్చారు. ఆ శవముచుట్టు బంధువులు మిత్రులు చేరి పెద్దగా ఏడుస్తున్నారు. ఆ ఉశీనర మహారాజు భార్యలు శవం చుట్టు చేరి గుండెలు బాదుకుంటున్నారు.

“ఓ రాజా! నిన్ను విడిచి మేము ఉండలేము. మేము కూడా నీతో వస్తాము. అయినా ఆ బ్రహ్మ దేవునికి దయ లేదు. లేకపోతే నిన్ను అర్ధాంతరంగా తీసుకొని పోతాడా! నీవు లేకపోతే మేమేం కావాలి. ఈ రాజ్యంలో ప్రజలు ఏం కావాలి. చూడురాజా! నీ కోసరం ఈ రాజ్య ప్రజలు ఎలా శోకిస్తున్నారో! ఓ రాజా! నీవు ఎక్కడ ఉంటే మేమూ అక్కడే. నీ పాద సేవ చేసుకుంటూ మేమూ నీతో పాటు ఉంటాము. మమ్ములనునీ తోకూడా తీసుకొనిపో!” అంటూ ఏడుస్తున్నారు.

అప్పటికి సాయంత్రం అయింది. శవాన్ని దహనం చేయడానికి తీసుకు పోకుండా వారు అడ్డుపడుతున్నారు. ఇంతలో సూర్యుడు అస్తమించాడు. ఈ వ్యవహారము అంతా యముడు చూస్తున్నాడు. ఉశీనరమహారాజు భార్యలు, బంధువులు శోకించడం చూచాడు. వెంటనే యముడు ఒక బాలుని రూపంలో అక్కడకు వచ్చాడు. వారితో ఇలా అన్నాడు.

“అయ్యలారా! అమ్మలారా! మీరంతా నా కంటే వయసులో పెద్దవారు. కానినాకు ఉన్న జ్ఞానము మీకు ఉన్నట్టు లేదు. ఆశ్చర్యంగా ఉంది కదూ! మీరంతా రోజూ ఎంతో మంది పుట్టడం, చావటం

చూస్తూనే ఉన్నారు కదా! వాళ్ల మాదిరే ఈయన కూడా పుట్టాడు చచ్చాడు. ఇందులో ప్రత్యేకత ఏముంది. ఈ మహారాజు ఎక్కడి నుండి వచ్చాడో అక్కడికే వెళ్లాడు. కొంతకాలం మీ మధ్య ఉన్నాడు. కాస్త ముందు వెనకగా మీరందరూ ఇక్కడి నుండి వెళ్లవలసిన వారే కదా! దాని కోసరం ఇంతగా శోకించాలా! మా వంటి చిన్న పిల్లలకు ఉన్న బుద్ధి జ్ఞానము కూడా మీకు ఉన్నట్టు లేదు.

మనమంతా మన తల్లి తండ్రుల కారణంగా ఈ భూమి మీదకు వచ్చాము. మనల నందరినీ ఆ భగవంతుడే రక్షిస్తున్నాడు. అందుకే ఈ ప్రపంచంలో ఉన్న క్రూర మృగములు మనలను భక్షించడంలేదు. ఎవరూ మనకు అపకారం చేయడం లేదు. ఆ పరమేశ్వరుని ఇష్టప్రకారము సృష్టి, స్థితి, లయములు నిరంతరం జరుగుతున్నాయి. దారిలో నీకు చెందిన ఒక వస్తువు పడిపోయిందను కోండి. దానిని భగవంతుడు రక్షిస్తుంటే, దానిని ఎవరూ తీసుకోరు. తుదకు అది నీకే దక్కుతుంది. అలా కాకుండా ఆ వస్తువు నీది కాదనుకో, నీవు దానిని గుప్తంగా పెట్టెలో పెట్టి తాళం వేసి రక్షించినా, అది ఎవరికి చేరాలో వారికే చేరుతుంది. ఇది పరమాత్మ లీల. పరమాత్మ కరుణ ఉంటే అరణ్యములో ఏ సహాయం లేకుండా తిరుగుతున్న వాడు కూడా క్షేమంగా ఉంటాడు. పరమాత్మ కరుణ లేకుంటే ఇంట్లో ఉన్న వాడు కూడా ఆపదల పాలవుతాడు.

మానవులు తాము చేసిన కర్మల ఫలితంగా దేహములను పొందుతుంటారు. ఆ కర్మల అనుభవం పూర్తి కాగానే, ఆ దేహములు నశించిపోతాయి. కాని ఆత్మ మరొక దేహమును పొందుతుంది. జనన మరణములు దేహ ధర్మములు. వాటికి శోకించి ప్రయోజనము లేదు.

దేహము మరణిస్తుంది కాని దేహము కన్నా వేరైన ఆత్మ మరణించదు కదా! మరణించని ఆత్మగురించి దు:ఖించడం అవివేకము.

ఒకాయనకు ఒక ఇల్లు ఉంది. ఆ ఇంట్లో ఆయన ఉంటున్నాడు. ఆయన వేరు. ఆయన ఇల్లు వేరు. ఇల్లు పాతబడి పోగానే ఆ ఇల్లు కూలగొట్టి వేరే ఇల్లుకట్టుకుంటాడు కానీ, ఆ పాత ఇంటిలోనే ఉండడు కదా! ఎందుకంటే ఇల్లు వేరు, ఇంట్లో ఉండే యజమాని వేరు. అలాగే దేహము వేరు. దేహములో ఉండే ఆత్మవేరు. దేహము శిథిలము కాగానే మరణిస్తుంది కానీ ఆత్మ మరణించదు.

కాబట్టి ఓ మూర్ఖులారా! మీ రాజు మీ ఎదుటనే ఉన్నాడు. ఇన్నాళ్లు ఉన్నట్టే మీ ఎదురుగా పడుకొని ఉన్నాడు. ఎందుకు ఏడుస్తున్నారు. కాకపోతే అతనిలో చైతన్యం లేదు. ఆ చైతన్యమే ఆత్మ స్వరూపము. ఇప్పుడు మరణించింది ఆత్మా లేక శరీరమా! ఈ శరీరము ఇన్నాళ్లు మీ మాట విన్నది. మీతో మాట్లాడింది. మీతో ఆడించి పాడింది. ఇప్పుడు ఈ దేహము మీతో ఆడదుపాడదు మీ మాట వినదు. ఎందుకని. ఈ దేహములో చైతన్యము అంటే ఆత్మలేదు. కాబట్టి మరణించింది దేహమే ఆత్మకాదు. ఈ విషయం తెలుసుకుంటే మీరు దు:ఖించరు.

ఇప్పటి దాకా ఈ రాజు దేహములో ప్రాణములు ఉన్నాయి. అవి ఈ దేహము, దాని అవయవముల కంటే శ్రేష్టమైనవి. ఈ దేహములో ఉన్న ప్రాణములే ఇప్పటి దాకా ఈ రాజు శరీరమును ఆడిస్తున్నాయి. ఇప్పుడు ఆ ప్రాణములు లేవు. అందుకని ఇంద్రియములు

నిస్తేజంగా పడి ఉన్నాయి.

మనకు కనిపించే దేహము స్థూల దేహము. దీనికి చలనము లేదు. ఇందులో లింగ దేహము (సూక్ష్మదేహము ఆస్ట్రల్ బాడీ) ఉంటుంది. ఆ లింగదేహము పంచభూతములు, పది ఇంద్రియ శక్తులు, పంచ తన్మాత్రలు (శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు) మనస్సు, బుద్ధి మొత్తము 17 శక్తులతో నిండి ఉంటుంది. ఇవన్నీ సూక్ష్మరూపంలో ఉంటాయి. ఈ సూక్ష్మశరీరము ఆత్మను కప్పి ఉంటుంది. ఈ సూక్ష్మశరీరమే ఈ దేహముతో సంబంధము పెట్టుకుంటుంది.(తల్లి గర్భములో పెరుగుతున్న పిండములో ప్రవేశిస్తుంది). కొంత కాలము తరువాత ఈ దేహమును వదిలిపెడుతుంది. మరొక దేహము తో సంబంధము పెట్టుకుంటుంది. ఆత్మ, దానిని కప్పి ఉన్న సూక్ష్మశరీరముతో సంబంధము ఉన్నంతవరకు కర్మబంధనములు ఆత్మకు కూడా అంటుకొని ఉంటాయి.

మానవుడు ఈ దేహమే శాశ్వతము అనుకుంటున్నాడు. ఈ దేహముతో అనుభవించే సుఖములు కలకాలము ఉంటాయి అనుకుంటున్నాడు. అది అవివేకము. స్వప్నములో ఎన్నో సుఖాలు, దు:ఖాలు అనుభవిస్తాము. మెలుకువ రాగానే అవన్నీ నిజం కావు అని అనుకుంటాము. అలాగే ఈ దేహముతో అనుభవించే సుఖాలు, దు:ఖాలు నిజం కావు, స్వప్నంలో మాదిరి కల్పితాలు, అని అనుకోవాలి. రాజ్యసుఖాలు ఈరోజు ఉంటాయి రేపు ఉండవు. అలాగే రాజులు ఈ రోజు ఉంటారు రేపు ఉండరు. ఇవన్నీ మనం కల్పించుకున్నవే.

ఆత్మజ్ఞానము కల వారు ఆత్మ సత్యము, దేహము, దేహముతో అనుభవించే భోగాలు, దేహముతో కలిగి ఉండే అనుబంధాలు అసత్యములు అని భావిస్తారు. అటువంటి వారికి శోకము లేదు, సుఖము లేదు. నిర్వికారంగా ఉంటారు. ఈ జ్ఞానము లేని మీలాంటి వారు, పోయిన వారి గురించి, పోయిన రాజ్య సుఖముల గురించి శోకిస్తుంటారు. ఎందుకంటే సుఖాలు వస్తే సంతోషించడం, కష్టాలు వస్తే ఏడవడం మీ సహజలక్షణము.

దీనికి ఒక ఉదాహరణ చెబుతాను వినండి. ఒక బోయవాడు అడవిలోకి వేటకు వెళ్లాడు. ఒక చెట్టు కింద వల పరిచి, బియ్యం గింజలు చల్లి పక్కనే ఉన్న పొద దగ్గర పొంచి ఉన్నాడు. ఒక ఆడపక్షి ఆ బియ్యపు గింజల కోసరం వచ్చి, ఆ వలలో చిక్కుకుంది. ఆడపక్షి వలలో చిక్కుకోవడం మొగ పక్షి చూచింది. ఆ వల పక్కనే కూర్చుని ఈ ప్రకారము ఏడవసాగింది.

"ఆహా! విధి ఎంత నిర్దయగా ప్రవర్తించింది. నా భార్యను ఈ వలలో చిక్కుకునేట్టు చేసింది. నా కోసరం నా భార్య వలలో చిక్కి ఏడుస్తుంటే, నా భార్య కోసరం నేను వల బయట ఉండి ఏడుస్తున్నాను. అయినా నా భార్యను పట్టుకొనిన ఆ బోయవాడికి ఏం ప్రయోజనం కలుగుతుంది. నన్ను కూడా పట్టుకుంటే మా ఇద్దరినీ చంపి తినవచ్చును కదా! భార్య లేని జీవితం దుర్భరంకదా! తన తల్లి వస్తుంది ఆహారం తెస్తుంది అని ఎదురు చూస్తున్న గూటి లోని పిల్లలకు తన తల్లి ఇంక శాశ్వతంగా రాదు అని తెలిస్తే ఎంతగా శోకిస్తారో కదా! వారికి ఇంకా రెక్కలుకూడా రాలేదు. తమ ఆహారమును సంపాదించుకోలేవు. తల్లిలేని పిల్లలను నేను ఎలా పెంచాలి." అని దీనంగా ఏడుస్తున్న ఆ

మొగ పక్షిని పొదచాటున మాటు వేసి ఉన్న బోయవాడు చూచాడు. వెంటనే తన బాణంతో ఆ మగ పక్షిని కొట్టాడు. అప్పటిదాకా భార్య కోసరం ఏడుస్తున్న మగపక్షి బోయవాడి బాణం తగిలి గిలా గిలా కొట్టుకొని మరణించింది. ఇదే సమయమని ఆడ పక్షి వలలో నుండి తప్పించుకొని ఎగిరిపోయి తన గూటిలో ఉన్న పిల్లల దగ్గరకు చేరుకుంది. కాబట్టి విధి విధానములు చాలా విచిత్రంగా ఉంటాయి. వాటి కోసరం మీరు శోకించడం తగదు. ఆ మగపక్షి మాదిరి మీరు కూడా మరణిస్తారు. మీరు ఈ ప్రకారంగా ఎన్ని సంవత్సరములు శోకించినా, చచ్చిన మహారాజు తిరిగిరాడు. కాబట్టి మీ శోకము మానండి." అని బాలుని రూపంలో ఉన్న యముడు ఆ స్త్రీలకు జ్ఞానోపదేశము చేసాడు. తరువాత వెళ్లిపోయాడు.

ఆ బాలుని ఉపదేశమును విన్న రాణులు, రాజ బంధువులు, తమ శోకమును వదిలిపెట్టారు. అందరూ ఏదో ఒక రోజు పోవలసినవారమే, ఈ శరీరములు శాశ్వతములు కావు, ఆత్మయే శాశ్వతము అన్న సత్యాన్ని గ్రహించారు. రాజు శరీరమునకు యధావిధిగా అంత్యక్రియలు జరిపించారు.

కాబట్టి అమ్మా! మీరు కూడా చనిపోయిన హిరణ్యాక్షుని గురించి శోకించకండి. ఎందుకంటే నేనెవరు? ఈ హిరణ్యాక్షుడు ఎవరు? మనం అంతా విధివశాత్తు ఇలాకలుసుకున్నాము. హిరణ్యాక్షుడు ముందు వెళ్లిపోయాడు. కాలక్రమేణా మనంఅంతా వెళ్లిపోతాము. కాస్త ముందూ వెనకా అంతే. కాబట్టి ఈ దేహము మీద అభిమానము పెట్టుకోవడం అజ్ఞానము అవివేకము." అని హిరణ్యకశిపుడు తన తల్లిని,

తన సోదరుని భార్యను, వారి కుమారులను ఓదార్చాడు. హిరణ్య కశిపుడు చేసిన జ్ఞానబోధతో దితి, హిరణ్యాక్షుని భార్యాపుత్రులు తమ శోకమును వదిలిపెట్టారు. (చెప్పడం వేరు. చెయ్యడం వేరు అంటే ఆచరించడం వేరు. హిరణ్యకశిపుడు తన అమ్మకు, మరదలికి ఆత్మజ్ఞానాన్ని బోధించాడు. కాని అందులో ఏ ఒక్కటీ ఆచరించలేదు. పైగా తనకు చావు లేకుండా వరం కోరుకున్నాడు. బ్రహ్మవల్ల చావు లేకుండా వరం పొందాడు. తనకు చావు లేదని, రాదని విర్రవీగాడు. హిరణ్యకశిపుడి కోసరం పరమాత్మ నృసింహావతారము ఎత్తవలసి వచ్చింది. కాబట్టి పురాణాలు, భగవద్గీత చదవడం, వినడం వలన ప్రయోజనము లేదు. అందులో ఉన్న ఒక్క విషయం అన్నా ఆచరించాలి. అప్పుడు చదివిన దానికి, విన్నదానికి సార్థకత.)

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము

మూడవ అధ్యాయము.

తమ్ముడు హిరణ్యాక్షుని అంత్య క్రియలు పూర్తి అయిన తరువాత హిరణ్యకశిపుడు తన నగరమునకు వెళ్లాడు. హిరణ్యకశిపునకు ఏదో ఒక నగరానికి అధిపతిగా ఉండటం ఇష్టంలేదు. ముల్లోకాధిపత్యము కోరుకున్నాడు. తనకు శత్రువులు అంటూ ఎవరూ ఉండకూడదు. తనకు చావు ఉండకూడదు. మూడులోకములు తన

అధినములో ఉండాలి. మూడు లోకములను తాను ఏకచ్ఛత్రాధి పత్యంగా పాలించాలి. ఇవీ హిరణ్యకశిపుని కోరికలు. ఈ కోరికలు తీరడానికి తపస్సు చేయాలని అనుకున్నాడు.

హిరణ్యకశిపుడు  మంధర పర్వత ప్రాంతమునకు వెళ్లాడు. అక్కడ చేతులు పైకెత్తి కుడి కాలి బొటనవేలి మీద నిలబడి బ్రహ్మను గూర్చి తపస్సు చేయడం మొదలెట్టాడు.  అతని తపస్సుకు మూడులోకములు తల్లడిల్లిపోయాయి. దేవతలకు భయం వేసింది. హిరణ్యకశిపుని తల నుండి బయటకు వస్తున్న పొగలు, అగ్ని జ్వాలలు మూడులోకములను దహిస్తున్నాయి. హిరణ్య కశిపుని తపస్సు వలన కలిగిన సంక్షోభంతో సముద్రములు పొంగుతున్నాయి. నదులు తమ తమ మార్గములు తప్పి ప్రవహిస్తున్నాయి. భూమి కంపించింది.

ఈ  ఉత్పాతములను చూచిన దేవతలు వెంటనే బ్రహ్మదేవుని వద్దకు వెళ్లారు. ఆయనను ఇలా ప్రార్థించాచు. "దేవదేవా! నీకు నమస్కారము. దితి కుమారుడు హిరణ్యకశిపుడు అనే దైత్యుడు తమ గురించి ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. స్వర్గము తల్లకిందులవుతూఉంది. మేము స్వర్గములో ఉండలేకపోతున్నాము. అతడు నిన్ను గురించి తపస్సు చేస్తున్నాడు కాబట్టి నీవు సత్వరమే వాడి వద్దకు పోయి వాడికి వావలసిన వరాలు ఇచ్చి వాడి తపస్సు మాన్పించు. వాడు ఎందుకు తపస్సు చేస్తున్నాడో నీకు తెలియకుండా ఉంటుందా! వాడు అడిగేది వాడికి ఇస్తే వాడు తపస్సు మానేస్తాడు. మేము క్షేమంగా ఉంటాము. కాస్త మా ప్రార్థన కూడా ఆలకించు.

వాడి మనసులో ఏముందంటే..... ఈ బ్రహ్మ సకల లోకములు సృష్టించాడు. అందరి కన్నా పైన సత్యలోకమును సృష్టించుకొని అక్కడ కూర్చుని ఉన్నాడు. నేను కూడా తపస్సు చేసి ఆ బ్రహ్మలోకములో స్థానము సంపాదిస్తాను. అంతే కాదు బ్రహ్మ పెట్టిన నియమములు అన్నీ మార్చేస్తాను. ఆ బ్రహ్మనే నా వశంలో ఉంచు కుంటాను. అన్ని లోకములు నశించిన బ్రహ్మలోకము శాశ్వతము కాబట్టి నాకు బ్రహ్మలోకము కావాలి...... అని తపస్సు చేస్తున్నాడు తమరి స్థానమునకే ముప్పు తెస్తున్నాడు. ఇంక తమరు ఏం చేస్తారో తమరి ఇష్టం. ఉన్న విషయం తమరికి విన్నవించుకున్నాము.

ఓ బ్రహ్మదేవా! నీ లోకము అంటేసామాన్యమా! నీది అందరి కన్నా ఉన్నతమైన స్థానము. మహర్షులు అందరూ శాశ్వతబ్రహ్మలోక నివాసము కొరకు తపస్సులు చేస్తుంటారు. అటువంటి నీ లోకము ఒక దైత్యుడి వశం అయితే ఇంక చెప్పేదేముంది. నీవు సృష్టించిన అన్ని లోకములు సర్వనాశనము అవుతాయి. కాబట్టి తమరు ఆలోచించి ఒక నిర్ణయం తీసుకోమని మా ప్రార్థన." అని దేవతల ఉన్నవి లేనివి చెప్పి, బ్రహ్మదేవునితో మొరపెట్టుకున్నారు.

అప్పటికే హిరణ్య కశిపుని తపస్సు గురించి తెలిసిన బ్రహ్మ ఇంక ఆలస్యం చేయడం మంచిది కాదని, వెంటనే హిరణ్యకశిపుడు ఉన్న ఆశ్రమానికి వెళ్లాడు. అక్కడ హిరణ్య కశిపుడు కనపడలేదు. ఒక పుట్ట మాత్రం ఉంది. హిరణ్య కశిపుని దేహము చుట్టు పుట్ట ఆవరించి ఉన్నదని తెలుసుకున్నాడు బ్రహ్మదేవుడు. హిరణ్య కశిపుని దేహము పొదలతోనూ, మొక్కలతోనూ ఆవరించి ఉంది. అతని దేహమును కీటకములు తినివేసాయి. కేవలం ఎముకలు మాత్రము మిగిలి

ఉన్నాయి.

హిరణ్య కశిపుని తపస్సుకు బ్రహ్మదేవుడు ఆశ్చర్యపోయాడు. “ఓ కశ్యప పుత్రా! లే! నేను బ్రహ్మదేవుడను. నీవుకోరిన వరములు ఇవ్వడానికి వచ్చాను. నీకు ఏం కావాలో కోరుకో! నీ తపస్సుకు ధైర్యానికి మెచ్చుకున్నాను. నీ దేహము పూర్తిగా కీటకములు తినివేసాయి. కేవలము ఎముకలు మాత్రము మిగిలి ఉన్నాయి. కాని నీవు జీవించి ఉన్నావు.

పూర్వము భృగువు మొదలగు మహా ఋషులు తపస్సు చేసారు కానీ ఇటువంటి తపస్సు ఎవరూ చేయలేదు. నీరుకూడా తాగకుండా గాలి పీలుస్తూ నీ వలె తపస్సు చేయడం ఎవరికీ సాధ్యం కాదు. నీ తపస్సుకు నేను పూర్తిగా సంతుష్టి చెందాను. నీకు ఏంకావాలో కోరుకో! నీ పూర్వ దేహము నీకు సంప్రాప్తించు గాక!” అంటూ తన కమండలము లోని అమృత జలమును హిరణ్య కశిపుడు తపస్సుచేస్తున్న పుట్టమీద చల్లాడు. వెంటనే హిరణ్య కశిపుడు వజ్రముతో సమానమైన దేహములో ప్రకాశిస్తూ ఆ పుట్టలోనుండి బయటకు వచ్చాడు హిరణ్య కశిపుడు. పైకి చూచాడు. ఆకాశంలో హంసవాహనం మీద ఉన్న బ్రహ్మదేవుడు కనిపించాడు. చేతులెత్తి నమస్కరించాడు హిరణ్యకశిపుడు.

“హే దేవదేవా! నీకు నమస్కారము. తమోగుణ ప్రధానమైన ఈ జగత్తును నీ తేజస్సుతో ప్రకాశింపచేస్తున్న ఓ దేవా నీకు నమస్కారము. ఈ ప్రకృతిలో ఉన్న త్రిగుణముల వలన సృష్టి స్థితి

లయములను కలుగచేస్తున్నావు. ఈ సకల జగత్తుకు మూలకారణము నీవే! మా శరీరములలో ప్రాణములుగానూ, బుద్ధిగానూ, మనస్సుగానూ, ఇంద్రియములు గానూ ప్రకాశిస్తున్న నీకు నమస్కారము.

ఈ సమస్త జగత్తును శాసించే వాడివి నీవే! నీవు ప్రజాపతివి. ఈదేహములలో ఉండే చైతన్యశక్తి నీవే! పంచభూతములు, పంచ తన్మాత్రలు  నీ అధీనంలో ఉన్నాయి. అట్టినీకు నమస్కారము. నీవు వేదమూర్తివి. సకల యజ్ఞములకు అధిపతివి. సకల జీవులలో ఆత్మస్వరూపంగా వెలుగుతున్నావు. నీకు మొదలు, తుది లేదు. సర్వాంతర్యామివి. సర్వజ్ఞుడవు. అట్టి నీకునమస్కారము.

ఈ విశ్వము అంతా వ్యాపించి ఉన్న చైతన్యము నీవే. నీవే సృష్టిస్తున్నావు, పోషిస్తున్నావు,  లయం చేస్తున్నావు. నీవునిరాకారుడవు. సర్వవ్యాపకుడవు. సకలజీవులలో ఉన్నఆత్మ స్వరూపుడవు. అట్టి నీకు నమస్కారము. ఈ చరాచర జగత్తులో ఏది కూడా నీ కంటే స్వతంత్రమైనది లేదు. ఈ సమస్త సృష్టి నీకు లోబడి ఉంది. వేదములు, ఉపనిషత్తులు, షడంగములు, సమస్తశాస్త్రములు,అన్నీ నీ శరీరములో భాగములే. నీవు హిరణ్యగర్భుడవు. పరాత్పరుడవు. నీకు అవసరము లేకపోయినా నీవు అన్ని ప్రాణుల దేహములలో ఆత్మస్వరూపుడుగా ఉండి, నీ లీలలను ప్రదర్శిస్తూ ఉంటావు. (ఇంత వేదాంతము, పరమాత్మ తత్వమును చెప్పిన హిరణ్యకశిపుడు ఏం వరం కోరాడో చూడండి.)

నీవు పరమేష్ఠివి. నీకుసర్వము తెలుసు. నీవు నాకు వరములు ఇవ్వదలచుకుంటే నీచేసృష్టించబడిన ఏ ప్రాణివలనా నాకు చావులేకుండా వరం ప్రసాదించు. అంతేకాదు.......

శా॥గాలిం గుంభిని, నగ్ని, నంబువుల, నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్,ఘస్రములం దమఃప్రబలభూరిగ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్యనరాదిజంతుకలహవ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువు లేని జీవనము లోకాధీశ యిప్పింపవే.

ఓ దేవా! ఇంటి లోపల కానీ, బయట కానీ, రాత్రి కానీ, పగలు కానీ, రుద్రుడు, బ్రహ్మ మొదలగు దేవతాగణముల చేత సృష్టించబడిన వస్తువుల చేతగానీ, అస్త్రముల చేత గానీ, శస్త్రముల చేత గానీ, భూమీ మీద కానీ, ఆకాశము లో కానీ, మనుష్యుల వలనకానీ, మృగములు, పక్షులువలనగానీ నాకు మరణం లేకుండా వరం ప్రసాదించు. అంతే కాదు, సకల ప్రాణుల వలనకానీ, దేవతల వలన కానీ, దైత్యుల వలనకానీ, సర్పముల వలనకానీ, నాకు మరణం లేకుండా వరం ప్రసాదించు. ఇంతెందుకు. నన్ను నీ అంతటి వాడిని చెయ్యి. అణిమాది సిద్ధులు, శక్తులన్నీ నాకు ప్రసాదించు.” అని వరం కోరుకున్నాడు హిరణ్యకశిపుడు.

శ్రీమద్భాగవతము

సప్తమ స్కంధము మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్ .

(హిరణ్య కశిపుడు గొప్పతత్త్వ వేత్త. అన్నీ తెలుసు. కానీ ఏదీ ఆచరించడు. తమ్ముడు చనిపోయినపుడు ఆయన తన తల్లికి, తమ్ముడిభార్యకు, కుమారులకు తత్త్వబోధ చేసాడు. యముడికి సంబంధించినకథ కూడా చెప్పాడు. అందులో కూడా దేహాభి మానము మంచిది కాదనీ,

దేహము వేరు ఆత్మ వేరు, దేహము నశిస్తుంది, ఆత్మకు నాశనము లేదు అని తత్త్వమును బోధించాడు.కాని ఆచరణకు వచ్చేటప్పటికి తనకు చావు లేకుండా వరం కోరుకున్నాడు. అంటే చావు దేహమునకే గానీ, ఆత్మకు కాదు అన్న తత్వమును సమయానుకూలంగా పక్కన పెట్టాడు. చెప్పడం వేరు, ఆచరించడం వేరు. చెప్పింది చేసే వాళ్లు, తాము చెయ్యలేనిది ఇతరులకు చెప్పని వాళ్లు మహాత్ములు. అందుకే గాంధీజి మహాత్ముడు అయ్యాడు.

ఇంక రెండవది. హిరణ్య కశిపుడు ఒట్టి పిరికివాడు. ధైర్యవంతుడయితే కేవలం పాములకు, పక్షులకు, జంతువులకు కూడా భయపడతాడా. రాత్రి సరేసరి, పగలు కూడా భయపడతాడా! మనిషిలో భయం కన్నా ప్రమాదకారి మరొకటి లేదు. అదే భయం, మరణ భయం, హిరణ్య కశిపునిలో ప్రవేశించింది. అందుకే అన్ని రక్షణలు కోరాడు. బ్రహ్మ గారుకూడా తెలివిగా, నీవు కోరినట్టు జరుగుతుంది అన్నాడు కానీ, నీవు చావు లేదు అని వరం ఇవ్వలేదు.)

## శ్రీమద్భాగవతము
## సప్తమ స్కంధము
## నాలుగవ అధ్యాయము

హిరణ్య కశిపుడు తనను కోరిన వరములు అన్నీ శ్రద్ధగా విన్నాడు. "ఓ హిరణ్య కశిపా! నీవు కోరిన వరములు అసాధారణములు. మానవులకు లభించే వరములు కావు. కానీ నీవు కోరావు కాబట్టి నీవు కోరిన వరములు ప్రసాదిస్తున్నాను." అని చెప్పి బ్రహ్మ వెళ్లిపోయాడు.

## సప్తమ స్కంధము

బ్రహ్మ ఇచ్చిన వరములు హిరణ్యకశిపునికి వెంటనే ఫలించాయి. హిరణ్య కశిపుని దేహము స్వర్గము మాదిరి ప్రకాశిస్తూ ఉంది. హిరణ్యకశిపునకు తన తమ్ముడు హిరణ్యాక్షుని చంపిన విష్ణువు గుర్తుకు వచ్చాడు. విష్ణువు మీద పగ తీర్చుకోవాలని నిశ్చయించు కున్నాడు.

హిరణ్య కశిపుడు జైత్రయాత్రకు బయలు దేరాడు. మూడు లోకములను ఆక్రమించాడు. స్వర్గమును తన స్వాధీనం చేసుకున్నాడు. ఇంద్రుని సింహాసనమును ఆక్రమించాడు. గంధర్వులు, గరుడులు, సర్పములు, సిద్ధులను, చారణులను, విద్యాదరులను ఋషులను తన పాద దాసులుగా చేసుకున్నాడు. మనువులు,యక్షులు,రాక్షసులు, పిశాచములు, ఒకటేమిటి సకల జీవరాసులను తన దాసులుగా చేసుకున్నాడు. మూడులోకములలో తనకు తిరుగులేదని ప్రకటించాడు.

ఇంద్రుడు, వరుణుడు, వాయువు, అగ్ని మొదలగు లోక పాలకులను తన అదుపులో ఉంచుకున్నాడు. దేవేంద్రలోకములో సకలసుఖములు అనుభవిస్తున్నాడు. ఇంద్రుడి భవనంలో స్వేచ్ఛగా విహరిస్తున్నాడు. తనివి తీరా స్వర్గములో లభించే సురను తాగుతున్నాడు. మత్తులో తూలుతున్నాడు. అప్సరసల నాట్యములను తిలకిస్తున్నాడు. బ్రహ్మ, విష్ణు, శివులు కాకుండా మిగిలిన దేవగణము లన్నీ హిరణ్యకశిపుని సేవలో మునిగి ఉన్నారు. ఇంతెందుకు నేను(నారదుడు) కూడా హిరణ్య కశిపుని ముందు కూర్చుని ఆయన కీర్తిని గానం చేసాను. నాతో పాటు విశ్వావసుడు, తుంబురుడు,

గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు, అప్సరసలు ఆయనను ఎల్లప్పుడూ సేవిస్తూ ఉండేవారు.

యజ్ఞములు చేసినపుడు హవిర్భాగములు దేవతలకుకాకుండా తనకే అర్పించాలని శాసించాడు. దేవతలకు హవిర్భాగములు లేకుండా పోయాయి. భూదేవి కూడా ఆయనకు భయపడి దున్నకుండానే పంటలుపండించేది. సముద్రుడు తనలో ఉన్న విలువైన రత్నములను తెచ్చి ఆయనకు కానుకలుగా సమర్పించుకొనేవాడు. హిరణ్య కశిపుని ఆజ్ఞ ప్రకారము అగ్ని వరుణుడు వాయువు ఆయన ఇష్టప్రకారము ప్రవర్తించేవి. ఇంద్రుడు ఆయన ఆజ్ఞలకు ఎదురుచూస్తూ ఉండేవాడు.

ఇన్ని భోగములు అనుభవిస్తున్నా, హిరణ్యకశిపుని మనసులో ఏదో వెలితిగానే ఉంది. హిరణ్యకశిపునికి తృప్తిఅనేది లేకుండా పోయింది. ఇంకా ఏదో కావాలి ఏదో చెయ్యాలి అని ఆరాటపడుతూ ఉండేవాడు. అతనికి మనశ్శాంతి కరువయింది.

(అక్రమంగా సంపాదించిన అంతులేని ధనము, సంపదలు ఉన్న వారి పరిస్థితి కూడా ఇలాగే ఉంటుంది. ఎంత సంపాదించినా తృప్తి ఉండదు. మనశ్శాంతి ఉండదు. సౌకర్యాలు ఎక్కువ అవడం వలనరోగాలు చుట్టుముడతాయి. తింటే అరగదు. కడుపునిండా తినలేరు. కంటి నిండా నిద్రపోలేరు. ఎప్పుడూ ఏదో వెలితి. అసంతృప్తి. జీవితాంతం అశాంతితోనే గడుపుతారు. దీనికి తోడు రాజకీయ జీవితం, పదవీ కాంక్ష తోడయితే ఇంక చెప్పనక్కరలేదు. )

హిరణ్య కశిపుని పరిస్థితి ఇలా ఉంటే దేవతలు హిరణ్యకశిపుని బాధలు పడలేక రహస్యంగా సమాలోచనలు చేయసాగారు. హిరణ్యకశిపుని బాధ వదల్చుకోడానికి విష్ణువును శరణువేడుదామని నిర్ణయించుకున్నారు. అందరూ విష్ణువు ఉన్న వైకుంఠము ఉన్న దిక్కుకు తిరిగి నమస్కరించారు. తమ మనసులో ఉన్న కోరికలను విన్నవించుకున్నారు. ఇంతలో ఆ దిక్కునుండి ఒక కాంతి వెలువడింది. ఒక దివ్యమైన స్వరము వినిపించింది.

"దేవతలారా! భయపడకండి. హిరణ్యకశిపుడు చేసే అత్యాచారములను అన్నిటినీ నేను గమనిస్తున్నాను. ఎవరైతే నా భక్తులను, నన్ను నమ్ముకున్న వాళ్లను, బ్రాహ్మణులను, గోవులను, ధర్మమును, దైవమును ద్వేషిస్తాడో, పీడిస్తాడో, అటువంటి వాడు తొందరగా నాశనం అవుతాడు. హిరణ్య కశిపుని కుమారుడు ప్రహ్లాదుడు నా భక్తుడు. నన్ను మనసా, వాచా, కర్మణా నమ్ముకున్నవాడు. నా భక్తుని హిరణ్యకశిపుడు బాధించడం మొదలు పెట్టగానే అతని పతనం మొదలవుతుంది. నేను ఎంత ఓర్పు కలవాడిని అయినా, నా భక్తులను బాధిస్తే సహించను. అందుకని, హిరణ్యకశిపుని త్వరలోనే సంహరిస్తాను. మీకు విముక్తి ప్రసాదిస్తాను." అని వినిపించింది. ఆమాటలు విన్న దేవతలు తమలో తాము ఆనందించారు. హిరణ్య కశిపుని మరణాన్ని కోరుకుంటూ అందరూ తమ దారిన తాము వెళ్లారు.

ఓ ధర్మనందనా! హిరణ్యకశిపునకు నలుగురు కుమారులు. అందులో ప్రహ్లాదుడు అనే వాడు విష్ణుభక్తుడు. మంచి గుణములు కలవాడు.ఎల్లప్పుడూ సత్యమునే పలికేవాడు. ఇంద్రియములను జయించిన వాడు. ఇతరుల మేలు కోరేవాడు. పెద్దలకు భక్తితో నమస్కరించేవాడు. దీనుల మీద ఎంతో ప్రేమచూపించేవాడు. గురువులను పూజించేవాడు. తనకు విద్య ఉన్నా, ధనము ఉన్నా, రాజకుమారుడు అయినా ఏ మాత్రమూ గర్వం లేకుండా ఉండేవాడు. పుట్టడానికి రాక్షస వంశంలో పుట్టినా ప్రహ్లాదునికి విష్ణువు అంటే ఎంతో భక్తి. ఎల్లప్పుడూ విష్ణునామమును జపిస్తుండేవాడు. ప్రహ్లాదునికి వాసుదేవుని యందు భక్తి పుట్టుకతో వచ్చింది కానీ ఎవరూ నేర్పిస్తే వచ్చింది కాదు. అందుకే ప్రహ్లాదుడు ఏ పని చేసినా భగవంతుని పరంగానే చేసేవాడు.

ఇతర బాలుర మాదిరి ప్రహ్లాదునికి ఆటలయందు ఆసక్తి లేదు. విష్ణుకథలను వినడంలో ఆసక్తి చూపేవాడు. ఆ భక్తి పారవశ్యంలో తనలో తానే మాట్లాడుకుంటాడు, ఏడుస్తాడు, నవ్వుతాడు. గొంతెత్తి పాడుతుంటాడు. ఒక్కోసమయంలో నిశ్చలంగా కూర్చుని మనసును విష్ణువు మీద లగ్నం చేసి, సమాధి స్థితిలో ఉంటాడు. ఈ ప్రకారంగా విష్ణుభక్తిలో మునికి తేలుతున్నాడు ప్రహ్లాదుడు. తనకు శత్రువైన విష్ణువును తన కుమారుడు సేవించడం చూచి హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని ద్వేషించసాగాడు. అతనిని చంపించడానికి ప్రయత్నం చేసాడు." అని నారదుడు ధర్మరాజుకు చెప్పాడు.

ఇప్పుడు ధర్మరాజుకుఒక సందేహము వచ్చింది. "ఓ నారద మహర్షీ! కుమారుల మీద తండ్రులు కోపించడం సహజమే. కాని

హిరణ్య కశిపుని మాదిరి బాధలుపెట్టడం చంపించే ప్రయత్నం చేయడం అసహజమే కదా! అలా ఎందుకు జరిగింది? కుమారులను మంచి మార్గంలో పెట్టడానికి తల్లి తండ్రులు పుత్రులను కొడతారు తిడతారు. కానీ ఈ ప్రకారంగా విరోధము పెట్టుకోరు కదా! అయినా గుణవంతుడు, మంచి వాడు అయిన ప్రహ్లాదుడు ఏమీ తప్పుచేయలేదు కదా! మరి ప్రహ్లాదుని మీద అతని తండ్రి ఎందుకు విరోధము పెంచుకున్నాడు. ఎందుకు హింసించాడు. ఇదేదో వింత కథగా ఉంది. నాకు వివరంగా చెప్పండి." అని అడిగాడు ధర్మరాజు.

శ్రీమద్భాగవతము
సప్తమ స్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
సప్తమ స్కంధము
ఐదవ అధ్యాయము.

నారదుడు ధర్మరాజు అడిగిన ప్రశ్నకు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఓ ధర్మరాజా! దైత్యులకు గురువు శుక్రాచార్యుడు. శుక్రాచార్యుని కుమారుల పేర్లు షండుడు, అమర్కుడు. వారిద్దరినీ హిరణ్యకశిపుడు తన కుమారుడు అయిన ప్రహ్లాదునికి విద్య చెప్పడానికి నియోగించాడు. షండుడు, అమర్కుడు ప్రహ్లాదునకు, ఇతర దైత్యులు,

రాక్షసుల బాలురకు రాజనీతి, దండనీతి బోధించసాగారు. గురువులు చెప్పినదే తడవుగా విద్యలు అన్నీ క్షుణ్ణంగా నేర్చుకున్నాడు ప్రహ్లాదుడు. గురువులు కూడా ప్రహ్లాదుని విద్యానైపుణ్యానికి ఎంతో సంతోషించారు.

ఒకరోజు హిరణ్య కశిపుడు తన కుమారుడు ప్రహ్లాదుని దగ్గరకు తీసుకొని ఒడిలో కూర్చుండబెట్టు కొని ప్రేమతో లాలించాడు. “కుమారా! నీవు నీ గురువుల దగ్గర ఏమేమి విద్యలు నేర్చుకున్నావు. ఏదీ ఒకదాని గురించి చెప్పు. చెవులారా వింటాను.” అని ప్రేమగా అడిగాడు. ప్రహ్లాదుడు తండ్రితో ఇలా అన్నాడు.

“తండ్రీ! ఈ లోకంలో ఉన్న మానవులు ఎప్పుడూ నేను, నాది అనే భ్రమలో ఉంటారు. వారి మనస్సు ఈ అహంకార భావన వలన అల్లకల్లోలము అవుతూ ఉంటుంది. నేను, నాది, నాకు అది కావాలి, నాకు ఇది కావాలి అనే భావనల వలన దు:ఖము మాత్రమే కలుగుతుంది కానీసుఖం కలగదు.

తండ్రీ! ఈ సంసారము అనేది ఒక చీకటి గుహ వంటిది. ఇది ఎప్పుడూ చెడును చేస్తుంది కానీ మంచి చెయ్యడు.  ఈ మూర్ఖమానవులు ఈ విషయం తెలుసుకోలేకపోతున్నారు. ఈ భ్రమ తొలగి పోవాలంటే  సంసారము అనే చీకటిని విడిచి పెట్టి, కర్మల యందు ఆసక్తిని వదిలి, అందరూ ఆ శ్రీహరి పాదములను ఆశ్రయించడం తప్ప మరొక మార్గము లేదు.”అని అన్నాడు.

కుమారుడు చెప్పిన మాటలు విని హిరణ్య కశిపుడు నిర్ఘాంతపోయాడు. అంతలోనే పెద్దగా నవ్వాడు.

"కుమారా! నీకు ఎవరో ఈ శ్రీహరి గురించి పొరపాటుగా చెప్పినట్టున్నారు. ఆ శ్రీహరి మనకు శత్రువు. ఆయన గురించి నీవు అలా పలుకరాదు." అని అన్నాడు.

వెంటనే షండుడు, అమర్కుని చూచి "మీరు బాలుని మీ ఇంటికి తీసుకొని వెళ్లండి. బాలునికి ఎవరో దైత్యులకు శత్రువైన శ్రీహరి గురించి చెబుతున్నారు. వారితో బాలుని కలవనీయకండి. జాగ్రత్తగా విద్యలు నేర్పించండి." అని ఆజ్ఞాపించాడు.

షండుడు, అమర్కుడు అలాగే అని హిరణ్యకశిపునకు నమస్కరించి ప్రహ్లాదుని తీసుకొని వెళ్లారు. ఇంటి వెళ్లిన తరువాత వారు ప్రహ్లాదుని తమ వద్ద కూర్చుండబెట్టుకొని

"కుమారా!మేము ఒక విషయం అడుతాము. ఏమీ దాచకుండా నిజం చెప్పు. నీవు ఐదేండ్ల బాలుడవు. కానీ నీ వయసుకు మించిన మాటలు మాట్లాడుతున్నావు. ఎందుకంటే, మన దగ్గర చదువుకుంటున్న బాలురకు అసలు శ్రీహరి విషయమే తెలియదు. నీకు ఈ శ్రీహరి గురించి ఎవరు చెప్పారు. నిజం చెప్పు. ఎవరికీ లేని ఈ విపరీత ధోరణి నీకు ఎలా వచ్చింది. ఈ బుద్ధి నీకు స్వయంగా పుట్టిందా! లేక ఎవరైనా నేర్పించారా! మేము నీకు గురువులం కదా! మాకు నిజం చెప్పు." అని బతిమాలారు.

"గురువుగారూ! నాకు ఎవరూ చెప్పలేదు. ఈ ప్రపంచం అంతా ఎవని మాయాశక్తితో నిండి ఉందో, ఎవని మాయలో పడి

మూర్ఖులైన మానవులు నేను, నాది, నావాడు, పరాయి వాడు అనే భేదబుద్ధితో కలహించుకుంటున్నారో, అట్టి మాయకు అధినేత అయిన ఆ పరమాత్మకు నమస్కరిస్తున్నాను. . ఈ మానవులు అందరూ నేను, నీవు అనే భేదభావంతో, అంతా నాకే కావాలి అనే పశుబుద్ధితో, ఒకరిని ఒకరు ద్వేషించుకుంటున్నారు. ఆ శ్రీహరిని ప్రార్థిస్తే ఈ భేదభావం, పశు బుద్ధి  నశిస్తుంది. ఆ విషయమే నేను తండ్రిగారికి చెప్పాను.

గురువుగారూ! నిరంతరము, వీడు నావాడు, వాడు పరాయి వాడు, అనే భేదబుద్ధితో కొట్టుమిట్టాడే మానవుల సంగతి అటుండనిండు. శాస్త్రములు చదివినవారూ, వేదములు అధ్యయనము చేసినవారూ, బ్రహ్మమొదలగు దేవతలు, వీరు కూడా ఈ మోహములో పడిపోతున్నారు. తన మాయాశక్తితో మీలో 'వీడు నావాడు, వాడు పరాయి వాడు' అనే  భేదబుద్ధిని కలిగించిన ఆ శ్రీహరి, నాలో ఈ భేదభావనలేని, అందరినీ సమంగా చూచే  బుద్ధిని కలిగించాడు. నాలో కలిగిన ఈ సమత్వబుద్ధి మీకు రుచించడం లేదు.

గురువుగారూ! ఇనుమును అయస్కాంతము ఆకర్షించినట్టు, నా మనస్సును ఆ శ్రీహరి ఆకర్షించాడు. తన మీద అచంచలమైన భక్తి కలవారిని, ఆశ్రీహరి తన వైపుకు తిప్పుకుంటాడు. ఆ కారణం చేతనే నా మనస్సు ఆ పరమాత్మయందు లగ్నం అయింది. దీనిలో మీ తప్పుకానీ, ఎవరి తప్పుకానీ లేదు.

## సప్తమ స్కంధము

సీ॥మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు,
నిర్మల మందాకినీ వీచికల దూగు రాయంచ సనునే తరంగిణులకు,
లలిత రసాలపల్లవ ఖాదియై చొక్కు కోయిల సేరునే కుటజములకు,
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకంబరుగునే సాంద్రనీహారములకు,

తే॥ నంబుజోదర దివ్యపాదారవింద, చింతనామృత పానవిశేష మత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు?వినుత గుణశీల! మాటలు వేయునేల!

అని పలికాడు ప్రహ్లాదుడు.

ఆ మాటలు విన్న గురువులు తలలు బాదుకున్నారు. ప్రహ్లాదుని మనసులోనే తిట్టుకున్నారు. పైకి కోపగించుకున్నారు. ప్రహ్లాదుని శిక్షించాలని నిర్ణయించుకున్నారు.

“ఈ ప్రహ్లాదుడు రాక్షస వంశములో చెడబుట్టాడు. పైగా సకల శాస్త్ర పారంగతులమైన మనకే అపకీర్తి తెచ్చాడు. దైత్యులకు పరమ శత్రువైన శ్రీహరిని కీర్తిస్తూ, దైత్యకుల నాశనమునకుకారణము అవుతున్నాడు. చందన వనం లాంటి దైత్య వంశంలోముళ్ల చెట్టులాగా పుట్టాడు. ఇతనికి దండోపాయమే సరిఅయినది.” అని ప్రహ్లాదుని దూషించారు. కానీ శారీరకంగా దండిస్తే, హిరణ్యకశిపుల వారు కోప్పడతారని, కేవలం గట్టిగా కోప్పడి, బెదిరించి వదిలి పెట్టారు. మరలా ప్రహ్లాదునికి శాస్త్రములను బోధించసాగారు.

అలా కొంత కాలం గడిచింది. నాలుగు వేదములు, వేదాంగములు, రాజనీతి, దండనీతి మొదలగు శాస్త్రములను ప్రహ్లాదుని చేత అధ్యయనం చేయించారు. ధర్మము, అర్థము కామము

ల గురించి ఉపదేశించారు. ప్రహ్లాదుడు గురువులు చెప్పిన చదువును శ్రద్ధగాచదివాడు. కానీ హరి భక్తి మానలేదు.

గురువులు ఈ సారి ప్రహ్లాదుని నేరుగా తండ్రి వద్దకు కాకుండా మొదట తల్లి వద్దకు తీసుకొని వెళ్లారు. ఆమె కుమారుడికి అభ్యంగన స్నానం చేయించి, నూతన వస్త్రములు ధరింప జేసింది. కుమారునికి ఇష్టమైనపదార్థములతో భోజనము పెట్టింది. తరువాత గురువులు ప్రహ్లాదుని తండ్రివద్దకు తీసుకొని వెళ్లారు. వెళ్లగానే ప్రహ్లాదుడు తండ్రి కాళ్లకు నమస్కరించాడు. కుమారుని వినయానికి మురిసిపోయాడు హిరణ్యకశిపుడు. కుమారుని ఆశీర్వదించి, లేపి, కౌగలించుకొని, ముద్దాడి, తన తొడమీద కూర్చోపెట్టుకున్నాడు.

"కుమారా! గురువు గారుచెప్పిన పాఠములు శ్రద్ధగానేర్చుకున్నావా! ఏమేమి నేర్చుకున్నావు? నీవు నేర్చుకున్నవాటిలో ఉత్తమమైనది ఒక విషయం చెప్పు. వీనులవిందుగావింటాను." అని అడిగాడు. అప్పుడు ప్రహ్లాదుడు ఈ విధంగా చెప్పాడు.

క॥ చదివించిరి నను గురువులు చదివితి ధర్మార్థ ముఖ్యశాస్త్రంబులు నే
జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మమెల్ల జదివితి దండ్రీ!

"తండ్రీ! ఆ శ్రీహరి కథలు వినుట, శ్రీహరిని కీర్తించుట, విష్ణునామ స్మరణచేయుట, విష్ణువు పాదసేవ చేయుట, అర్చించుట, నమస్కరించుట, ఆయనకు ఉపచారములు చేయుట, విష్ణువును తన మిత్రుని మాదిరి భావించుట, ఆఖరున తన ఆత్మను ఆ శ్రీహరికి అర్పించుట ఇవి పరమాత్మయందు భక్తికల వారికి ఉండవలసిన

**తొమ్మిది లక్షణములు. ఎవరైతే ఆ శ్రీహరి మీద ఈ తొమ్మిది లక్షణములను కలిగి ఉంటాడో, ఈ తొమ్మిది లక్షణములను శ్రద్ధగా ఆచరిస్తాడో, అతడే శ్రీహరికి ఉత్తమమైన భక్తుడు. ఇంతకన్నా ఉత్తమమైన విషయం ఏముంటుంది.**

సీ॥కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

తే॥ దేవదేవుని జింతించు దినము దినము చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు తండ్రి హరి జేరుమనియెడి తండ్రి తండ్రి.

**అంతేకాదు తండ్రీ!**

సీ: కంజాక్షునకు గాని కాయము కాయమే పవనగుంభిత చర్మ భస్త్రిగాక!
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమధ్వనితోడి ఢక్కగాక!
హరి పూజనము లేని హస్తంబు హస్తమే తరుశాఖ నిర్మిత దర్విగాక!
కమలేశు జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాల రంధ్రములుగాక!

ఆ: చక్రి చింతనలేని జన్మంబు జన్మమే తరళ సలిల బుద్బుదంబు గాక!
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే పాదయుగముతోడి పశువుగాక!"

**అని పలికాడు ప్రహ్లాదుడు.**

**ప్రహ్లాదుని మాటలు వింటుంటే హిరణ్యకశిపునకు కోపం మిన్ను ముట్టింది. పెదాలు అదురుతున్నాయి. తల పైకెత్తి షండా,అమర్కుల**

వంక తీక్షణంగా చూచాడు. వారి పైప్రాణాలు పైకి పోయాయి. గజగజ వణుకుతున్నారు. ఈరోజు తమ శిరస్సులు ఖండింపబడటం తథ్యం అనుకున్నారు. హిరణ్యకశిపుడు వారితో ఇలా అన్నాడు.

"ఓరీ బ్రాహ్మణాధములారా! ఇదేనా మీరు చెప్పిన విద్య. నా శత్రువైన విష్ణువును కీర్తించే విద్యను నా కుమారుడికే బోధిస్తారా! ఎవరో దుర్మార్గులు మారు వేషాలలో వచ్చి నా కుమారుడికి నా శత్రువుల గురించి బోధిస్తుంటే చూస్తూ ఊరుకుంటారా! మీకు ఎంత ధైర్యము.

చ॥ పటుతర నీతిశాస్త్రచయపారగుజేసెదనంచు బాలునీ
వటుగొనిపోయి వానికి ననర్థములైన విరోధిశాస్త్రముల్
కుటిలత జెప్పినాడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిం
గటకట బ్రాహ్మణాకృతివిగాక యథార్థపు బ్రాహ్మణుండవే.

మీరు బ్రాహ్మణులు కాదు. బ్రాహ్మణుల వేషంలో ఉన్న నా విరోధులు. మీ కుటిలమైన బుద్ధి ఇప్పుడు బయటపడింది." అని చడా మడా తిట్టాడు హిరణ్యకశిపుడు.

ఆ మాటలకు గురుపుత్రులు ఇలా అన్నారు. "అయ్యా!ఇందులో మా తప్పు ఏమీ లేదు. మేము కావాలని తమరి విరోధి అయిన విష్ణువును గురించి ఎందుకు బోధిస్తాము. ప్రహ్లాదుడు మా దగ్గర కానీ, తన తోటి విద్యార్థుల దగ్గర కానీ ఈ విరోధి శాస్త్రములు నేర్చుకోలేదు. ప్రహ్లాదునికి విష్ణుభక్తి అతని పుట్టుకతోనే, స్వభావ సిద్ధంగానే సంక్రమించినట్టుంది. పుట్టుకతో వచ్చిన బుద్ధులకు మేమే ఏమి

చేయగలము. ఇందులకు మమ్ము నిందించిన ప్రయోజనమేమి?" అని సవినయంగా విన్నవించుకున్నారు. హిరణ్యకశిపుడు ఆలోచనలో పడ్డాడు. వెంటనే తన కుమారుడు ప్రహ్లాదుని చూచి

"కుమారా! గురువులు చెప్పక, తోటి విద్యార్థులు చెప్పక, నీకు ఈ విష్ణుభక్తి ఎలా అలవడింది. నిజం చెప్పు." అని గద్దించాడు హిరణ్యకశిపుడు. అప్పుడు ప్రహ్లాదుడు తండ్రితో ఇలా అన్నాడు.

"తండ్రీ! శ్రీహరి మీద భక్తి ఒకరు చెబితే, ఒకరు బోధిస్తే వచ్చేది కాదు. నాకు ఆ శ్రీహరి అనుగ్రహంతోనే స్వతసిద్ధంగానే కలిగింది. ఈ మానవులు ఎల్లప్పుడూ సంసారకూపములో పడిపోయి, ఇంద్రియ నిగ్రహము కోల్పోయి, ఏవేవో కర్మలు చేస్తూ వాటి వలన లభించుసుఖములు, దు:ఖములు అనుభవిస్తున్నారు. అటువంటి వారు మా గురువుల వంటి  గురువులను ఆశ్రయించి వారి ఉపదేశములు పొందుతూ   ఉంటారు. కానీ ఈ సంసారము నుండి బయట పడటానికి ప్రయత్నించరు. వారిమనసు శ్రీహరి మీద లగ్నం కాదు.

ఓ తండ్రీ! ఎవరి చిత్తములు విషయ వాంఛలతో నిండి ఉంటాయో, ఎవరైతే అనునిత్యమూ ప్రాపంచిక విషయములలో మునిగి తేలుతుంటారో, అటు వంటి వారు శ్రీహరిని గురించి తెలుసుకోలేరు. అటువంటి వారికి శ్రీహరిని గురించి తెలుసుకోవాలని కోరిక కూడా కలుగదు. ఒక గుడ్డివాడు మరొక గుడ్డివాడిని నడిపించినట్టు, ఒకడు తాను నేర్చుకున్నదే ఇతరులకు బోధిస్తాడు. ఇద్దరికీ తెలియదన్న విషయం వారికి తెలియదు. అందుకని ఇద్దరూ

కలిసి ఈ సంసారము అనే కూపంలో పడిపోతుంటారు. ఇటువంటి వారు వేదములలో చెప్పబడిన కర్మకాండలకు, యజ్ఞయాగములకు, వ్రతములకు పరిమితమౌతుంటారు. వారి మనస్సులు ఎన్నటికీ శ్రీహరి మీద నిలువవు.

ఉ॥ అచ్చపుచీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచు బుట్టుచున్ మరల జర్వితచర్వణులైనవారికిం
జెచ్చెర బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైననే
మిచ్చిననైన గానలకు నేగిన నైన హరిప్రబోధముల్.

ఇటువంటి వారు ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి లేని యోగులు, సన్యాసులు, నిరంతరము హరినామ సంకీర్తనము చేసేవారు, స్వలాభాపేక్ష లేని వారు అయిన పుణ్యాత్ములను సేవిస్తే గానీ, వారి పాదధూళిని శిరస్సున ధరిస్తే కానీ, వారి బుద్ధి శ్రీహరి మీద లగ్నము కాదు. ఈ సంసారము నుండి, ప్రాపంచిక విషయముల నుండి బయట పడితేనే గానీ, వారిచిత్తము శ్రీహరి మీద లగ్నము కాదు. నాకు ఈ ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి లేదు. అందు వలన నా చిత్తము శ్రీహరి మీద లగ్నంఅయింది." అని చెప్పి ప్రహ్లాదుడు మౌనంగా ఉన్నాడు.

ప్రహ్లాదుడు ఒక్కొక్క మాట మాట్లాడుతుంటే హిరణ్యకశిపునికి ఒళ్లు మండి పోతోంది. ఒక్క ఉదుటున ప్రహ్లాదుని కిందికి తోసేసాడు. హిరణ్యకశిపుని కళ్లు ఎర్రగా ఉన్నాయి. కోపంతో ప్రహ్లాదుని వంక చూస్తూ పక్కన ఉన్న రాక్షస భటులతో ఇలా అన్నాడు.

" వీడు రాక్షస వంశములో చెడబుట్టాడు. వీడినినా ఎదుటి నుండి తీసుకొని వెళ్లండి. వీడిని వధించండి. వీడు తన పినతండ్రిని చంపిన వాడిని ఆరాధిస్తున్నాడు. నా శత్రువును కీర్తిస్తున్నాడు. వీడు అధముడు. వీడుకేవలము ఐదుసంవత్సరముల బాలుడు గా ఉన్నప్పుడే తల్లి తండ్రులను ఎదిరిస్తున్నాడు. ఇంక పెద్దవాడైతే మాకు బద్ధశత్రువు అవుతాడేమో! తల్లి తండ్రులనే లెక్కచెయ్యని వాడు, ఆ విష్ణువును మాత్రము ఏమి లెక్కచేస్తాడు. ఈ విశ్వాసహీనుడిని వెంటనే వధించండి. మేలు చేసే ఔషధము అడవిలో పుట్టినా దానిని జాగ్రత్తగా రక్షించాలి. మనకు మేలు కలిగించేవాడు పరాయి వాడైనా వాడిని కన్న కుమారుడి వలె ప్రేమించాలి. తన శత్రువును కీర్తించే వాడు కన్నకొడుకైనా వాడిని అవశ్యము వదిలిపెట్టాలి. చెడి పోయిన శరీరభాగమును ఖండించి, బాగుగా ఉన్న శరీర భాగములను కాపాడినట్లు, కులనాశకుడగు వీడిని వధించి, రాక్షస కులమును కాపాడాలి. అందుకని ఈ బాలుని వధించడమే తక్షణ కర్తవ్యము.

శా॥ అంగవ్రాతములో జికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీ యజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవ పక్షపాతి నధముం జంపించి వీరవ్రతో
త్తుంగ ఖ్యాతి జరిన్ చెదం గులము నిర్దోషంబు గావించెదన్॥

సర్వసంగ పరిత్యాగులైన యోగులకు, తమకు వశము కాని ఇంద్రియములు, ఎలా శత్రువులు అవుతాయో, అలాగే నా కుమారుడుగా పుట్టిన ఈ ప్రహ్లాదుడు కూడా నాకు శత్రువే. అందుకని ఇతనిని వధించండి.

ఇతడు ఆహారం తీసుకునేటప్పుడు కానీ, నిద్రలో ఉన్నప్పుడు కానీ, కూర్చున్నప్పుడు కానీ, విషప్రయోగము చేసి చంపండి. ”అని ఆజ్ఞాపించాడు.

హిరణ్యకశిపుని ఆజ్ఞను అమలు పరిచారు రాక్షస భటులు. వికృతాకారులయిన ఆ రాక్షసులు ప్రహ్లాదుని కొట్టుకుంటూ, తిట్టుకుంటూ అక్కడి నుండి తీసుకొని వెళ్లారు. శూలములతో పొడిచారు. విషం పెట్టారు. ఎన్నోరకాలుగా ప్రహ్లాదుని చంపడానికి ప్రయత్నించారు. పుణ్యం చేయని వాడు చేసే మంచి పనులన్నీ ఏ మాదిరిగా మంచి ఫలితాలను ఇవ్వలేవో, అలాగే నిరంతరము శ్రీహరి మీద మనసు లగ్నం చేసిన ప్రహ్లాదుని చంపడానికి చేసిన భయంకరాకారులైన ఆ రాక్షసులు చేసిన ప్రయత్నములన్నీ వ్యర్థములయ్యాయి. .

ఈ విషయము తెలిసిన హిరణ్యకశిపునకు ఆశ్చర్యం కలిగింది. అయినా తనపట్టు వదలలేదు. రకరకాల ఉపాయములతో ప్రహ్లాదుని చంపడానికి ప్రయత్నించాడు. ఏనుగులచేత తొక్కించాడు. పాములతో కరిపించాడు. మంత్ర తంత్రాలు ప్రయోగించాడు. ఎత్తైన పర్వతముల మీది నుండి కిందికి తోయించాడు. రాక్షస మాయలు అన్నీ ప్రయోగించాడు. ఆహారంలో విషం పెట్టించాడు. అసలుకొన్ని రోజులు ఆహారం ఇవ్వకుండా ఆకలితో చంపాలని అనుకున్నాడు. మంచు గడ్డలమీద పడుకోబెట్టాడు. అగ్నిలో తోయించాడు.

ఎన్ని ప్రయత్నములు చేసినా ప్రహ్లాదుడు శ్రీహరి నామ స్మరణ మానలేదు. అతనికి చావు రాలేదు. కుమారుని చంపడానికి ఏ ఉపాయమూ దొరక్క తలపట్టుకున్నాడు హిరణ్యకశిపుడు. హిరణ్యకశిపునిలో అహం పెరిగింది. కోపంతో ఊగిపోతున్నాడు.

ఉ॥ ముంచితి వార్ధులన్ గదల మొత్తితి శైలతటంబులంద ద్రో
బ్బించితి శస్త్రరాజిన్ పొడిపించితి మీద నిభేంద్ర పంక్తితో
ప్పించితి ధిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందు ద్రో
యించితి బెక్కుపాట్ల నలయించితి జావడిదేమి చిత్రమో!

వీడు చిన్న బాలుడు. సరిగ్గా ఐదేళ్లు కూడా లేవు. అయినా ఏమీ భయంలేకుండా నవ్వుతున్నాడు. ఈ బాలుని ఏదో అపూర్వ శక్తి రక్షిస్తూ ఉంది. ఏమి చేసినా వీడు భయపడటం లేదు. ఈ బాలుని శక్తి అమోఘము. ఏం చేసినా వీడు భయపడటం లేదు. చావడం లేదు. వీడికికూడా నా మాదిరి చావులేదేమో. వీడితో విరోధం పెట్టుకుంటే వీడే నా చావుకు కారణం అవుతాడేమో! ! ఏమో! ఏమి చెయ్యాలో తోచడం లేదు." అని తలపట్టుకు కూర్చున్నాడు హిరణ్యకశిపుడు.

అప్పుడు షండుడు, అమర్కుడు హిరణ్య కశిపుని వద్దకు వచ్చి ఇలా అన్నారు. "మహారాజా! తమరు కన్నెర్రచేస్తేనే మూడు లోకాలు గడగడ వణుకుతాయి. ఒంటి చేత్తోమూడులోకాలు జయించిన పరాక్రమవంతులు మీరు. అటువంటిమీరు ఈ చిన్న బాలుని గురించి వ్యధ చెందడం భావ్యం కాదు. మా తండ్రిగారు శుక్రాచార్యులవారు త్వరలో వస్తున్నారు. అప్పటిదాకా ప్రహ్లాదుని బంధించి ఉంచండి.

శుక్రాచార్యుల వారి మాటలు విన్న తరువాత అయినా ప్రహ్లాదుడు తన బుద్ధిమార్చుకుంటాడేమో!" అని అన్నారు.

వారి ఆలోచన బాగానే ఉందనుకున్నాడు హిరణ్యకశిపుడు. ఈ లోపల ఊరికే ఉండటం ఎందుకని ప్రహ్లాదునికి గృహధర్మములు బోధించమని షండుని మార్కుడిని ఆదేశించాడు. హిరణ్యకశిపుని ఆజ్ఞాను సారము షండుడు మార్కుడు ప్రహ్లాదునికి ధర్మము, అర్థము కామము గురించి బోధించసాగారు. ఇవన్నీ ప్రహ్లాదుడు నేర్చుకున్నాడు కానీ, వాటి మీద ఆసక్తి చూపలేదు. ఎందుకంటే తనకు చదువు చెప్పే గురవులు రాగద్వేషములతో నిండిన మనసులు కలవారు. ఇంక వారు తనకేం బోదించగలరు అని అనుకున్నాడు ప్రహ్లాదుడు.

గురువులు బోధించిన తరువాత వారి గృహకృత్యముల కొరకు బయటకు వెళ్లేవారు. ఆసమయములో ప్రహ్లాదుడు తోటి రాక్షసుల బాలురతో ఆటలు ఆడుకొనేవాడు. వారితో కూడా ప్రహ్లాదుడు ఈ సంసారము దాని పరిణామముల గురించి చెప్పేవాడు. ఆ బాలురుకూడా చిన్న వారేకాబట్టి వారికి ఇంకా రాక్షసుల బుద్ధులు రాలేదు. అందుకని ఆ రాక్షస బాలురుకూడా, తమ ఆటపాటలు వదిలిపెట్టి, ప్రహ్లాదుడు చెప్పే విషయాలు శ్రద్ధగా వినసాగారు. ప్రహ్లాదుడు కూడా వారిని తన చుట్టు కూర్చోపెట్టుకొని వారికి ఆత్మజ్ఞానమును బోదించసాగాడు.

శ్రీమద్భాగవతము

సప్తమ స్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## సప్తమ స్కంధము
## ఆరవ అధ్యాయము.

హిరణ్యకశిపుని కుమారుడు అయిన ప్రహ్లాదుడు రాక్షస బాలురను తన చుట్టు కూర్చోబెట్టుకొని వారికి ఈ విధంగా ఉపదేశిస్తున్నాడు.

“మిత్రులారా! జ్ఞానవంతుడైన వ్యక్తి ఈ మానవ జన్మను పొంది, తన చిన్న వయసు లోనే ప్రాపంచిక విషయములను వదిలిపెట్టి, భాగవత ధర్మమును అనుసరిస్తాడు.

భాగవత ధర్మము అంటే.......

1. తాను చేసే ప్రతిపనిని ఆసక్తి లేకుండా, ఫలితాన్ని ఆశించకుండా చేయడం.
2. తానుచేసే ప్రతి పనీ భగవంతుని పరంగా చేయడం.
3. తానుచేసే ప్రతి పని యొక్క ఫలితాన్ని భగవంతునికి అర్పించడం.

ఈ మూడూ ప్రతి వ్యక్తి ఆచరించాలి. ఎందుకంటే ఈ ప్రపంచంలో మానవునిగా జన్మ ఎత్తడం చాలా కష్టము. అది అందరికీ లభించదు. ఈ మానవ దేహము శాశ్వతము కాదు. ఎప్పుడు మరణం వస్తుందో తెలియదు. ఉన్న కొద్ది కాలంలోనే భగవంతునిమీద భక్తితో జీవించాలి. ఎందుకంటే ఈ మానవ జన్మలోనే ప్రతివాడికీ పుణ్యకార్యాలు చేసే అవకాశం లభిస్తుంది.

మానవ జన్మ అత్యంత ప్రయోజనకారి. శ్రీహరి అంటే సకల మానవులకు ఇష్టము. ఎందుకంటే ఆ శ్రీహరి అన్ని ప్రాణులలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఆపరమాత్మ అందరికీ బంధువు. అందుకని మానవ జన్మ ఎత్తిన ప్రతివాడూ శ్రీహరి పాదములనుసేవించాలి. తరించాలి.

ఓ బాలకులారా! మనలో ప్రతివాడూ, సుఖాలు మనం కోరుకుంటే వస్తాయనీ, మనం ఈ ప్రపంచంలో చేసే పనుల వలన మనకు సుఖాలు కలుగుతాయనీ, అనుకుంటుంటాడు. ఇంద్రియాలతో చేసే పనుల వలన మనకు ఎల్లప్పుడూ సుఖం కలుగుతుందని అనుకుంటాడు. కానీ అది నిజం కాదు. ఎలాగైతే దు:ఖాలు మన ప్రమేయం లేకుండా వస్తాయో, అలాగే సుఖాలు కూడా మన ప్రమేయం లేకుండానే వస్తాయి. మనం చేసే పనుల వలననే మనకు సుఖాలు కలుగుతాయి అనడం ఒట్టి భ్రమ. కాబట్టి సుఖాలు కలగడం కోసరం మనము ఎలాంటి ప్రయత్నము చేయనవసరం లేదు. సుఖాల కోసరం పాకులాడి, మన జీవితాలను వృధాచేసుకోవద్దు. శ్రీహరి పాదములను సేవిస్తే ఎటువంటి సుఖము ఆనందము కలుగుతుందో, ఆ ఆనందము, సుఖము, ఈ ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలను తీర్చుకోవడంలో కలుగదు.

కాబట్టి వివేకము కల మానవులు ఈ సంసారమునకు భయపడకుండా, చిన్నతనము నుండి ఆ శ్రీహరి సేవలో నిమగ్నమై ఉండాలి. ఈ శరీరము అశాశ్వతము. ఎప్పుడు రాలిపోతుందో తెలియదు. కాబట్టి సమయం వృధా చేయకుండా ఇప్పటి నుండే అంటే బాల్యము నుండే శ్రీహరి పాదములను సేవించడం మొదలుపెట్టాలి.

అది వివేకవంతుల లక్షణము.

మానవుల ఆయు:పరిమాణము నూరు సంవత్సరములు అనుకుందాము. అందులో బాల్యము, కౌమారము 20 సంవత్సరములు వృధాగా గడిచిపోతాయి. అలాగే వృధ్యాప్యంలో మరొక 20 సంవత్సరాలు గడిచిపోతాయి. ఇంక మిగిలింది 60 సంవత్సరాలు. ఈ అరవై సంవత్సరములు మానవులు సంసారంలో పడి, భార్య పిల్లల వ్యామోహంలో పడి, ప్రాపంచిక సుఖములను, విషయ సుఖములను అనుభవించడంలో కాలం గడిపేస్తాడు. ఇంక శ్రీహరి పాదములను సేవించే సమయం ఎక్కడ ఉంటుంది. సంసారము నందు, భార్య పుత్రులయందు. తన ఇంటి యందు వ్యామోహము కల మానవుడు, ఇంద్రియ నిగ్రహం లేని మానవుడు, ఏ విధంగా ముక్తి పొందుతాడో మీరే చెప్పండి.

ఇంద్రియ నిగ్రహం లేని మానవుడు ధనం మీద వ్యామోహాన్ని ఎలా విడిచిపెట్టగలడు? ఈ లోకంలో, ధనమును సంపాదించడమే జీవితాశయంగా కలవారు, ఆ ధనాన్ని దొంగిలించిన దొంగలు, తాను సంపాదించిన ధనమును, తాను దొంగిలించిన ధనమును, తన ప్రాణముల కంటే ఎక్కువగా ప్రేమిస్తారు.

ఎవరైనా కోరి కోరి చేసుకున్న భార్య యందు, ఆమె వలన కలిగిన సంతానము నందు ప్రేమలేకుండా ఉంటారా చెప్పండి. వివాహము అయినప్పటి నుండి ఆమెతో సుఖంగా గడిపిన మానవుడు ఆమెను విడిచి ఎలా ఉండగలడు? ఆమె వలన కలిగిన సంతానము

యొక్క చిట్టి పొట్టి ముద్దు ముద్దు మాటలను వినకుండా, వారి ఆటపాటలను చూడకుండా ఎలా ఉండగలడు? ఆ ప్రకారంగా తన భార్యా బిడ్డలను, తన అన్న తమ్ములను, అక్క చెల్లెళ్లను, వృద్ధులైన తల్లి తండ్రులను, బంధువర్గమును, స్నేహితులను, కష్టపడికట్టుకున్న గృహమును, ఎంతో శ్రమపడి సంపాదించిన ధనమును, తనను విశ్వాసంతో సేవిస్తున్న సేవకులను, తాను సంపాదించిన పశువులను, వీటినన్నిటినీ విడిచిపెట్టి ఏ మానవుడు బతకగలడు? ఎందుకంటే ఇవన్నీ మానవుడు తనకు తానుగా తనచుట్టు అల్లుకున్న బంధనములు. పట్టుపురుగు తన చుట్టు తాను గూడు కట్టుకుంటుంది. బయటకు వచ్చే మార్గాన్ని కూడా మూసేస్తుంది. ఆ గూడులోనే సుఖం ఉందనుకుంటుంది. తుదకు, పట్టు దారం కోసరం ఆ పట్టు పురుగును చంపుతారు. అలాగే ఈ జీవుడు కూడా భార్య,సంతానము, బంధువులు, ధనము, ఇల్లు, పశువులు ఇలాగా తన చుట్టు తాను గూడును నిర్మించుకుంటాడు. తినడానికి మంచి తిండి, తాగడానికి రకరకాలైన పానీయాలు, అనుభవించడానికి స్త్రీసుఖము వీటి కోసరం జీవితాంతం వెంపర్లాడుతుంటాడు. వాటిమీద మోహంతో, ఆ కోరికలు తీరడం కోసరం చేయరాని పనులు చేస్తాడు. ఇంక ఆ మానవుడికి విరక్తి ఎలా పుడుతుంది?

ఈ ప్రకారంగా ఆ ప్రాపంచిక సుఖములకోసరం, విషయవాంఛలు తీర్చుకోడం కోసరం తన జీవితాంతం పాటుపడే మానవుడి ఆయుర్దాయము దిన దినము క్షీణించిపోతుంది. కాని ఈ విషయం అతనికి తెలియదు. తాను కలకాలం జీవించి ఉంటాను అని అనుకుంటాడు. ధనము సంపాదించడంలోనూ, కోరికలు తీర్చుకోడంలోనూ మునిగిపోయి, భగవంతుని మాత్రము స్మరించడు.

భగవంతుని స్మరించాలి, భగవంతుని ధ్యానించాలి అనే విషయం కూడా మరిచిపోతాడు. తనకు ఉన్న ధనములో కొద్దిపాటి ధనం తగ్గినా విలవిలలాడి పోతాడు. ఆ ప్రకారంగా జీవితాంతం ధనవ్యామోహము అనే దు:ఖములో మునిగిపోతాడు.

మానవుడు ఇంద్రియములను జయించలేడు. ఇంద్రియ సుఖముల కోసరం, కుటుంబపోషణ కోసరం పాకులాడుతుంటాడు. ఎల్లప్పుడూ ధనమును సంపాదించడంమీదనే తన మనస్సును లగ్నం చేస్తాడు. అక్రమ మార్గాలలో ధనం సంపాదించడానికి, ఇతరుల ధనమును అపహరించడానికి కూడా ప్రయత్నిస్తాడు. రాజదండనకు కూడా భయపడడు. తాను చని పోయిన తరువాత నరకములో పడతాడు అని కూడా ఆలోచించడు. తన కోరికలను తీర్చుకోడానికి, ఇతరుల ధనమును అపహరించడానికైనా, ఎటువంటి అక్రమాలు చేయడాని కైనా వెనుకాడడు.

ఓ బాలులారా! ఇదంతా ఎందుకు జరుగుతుందంటే, మానవునిలో నేను, నాది అనే భావన, ఇదినాది, అది నీది, అంతా నాకే కావాలి, అనే భావన చిన్నప్పటినుండి పాతుకుపోతుంది. ఈ భావనలతోనే మానవులు పెరుగుతారు. దానివలన సంసారము మీద, ధనార్జన మీద ఆసక్తి పెరుగుతుంది. తనను తాను తెలుసుకోడానికి, ఆత్మజ్ఞానము సంపాదించడానికి ఎటువంటి ప్రయత్నము చేయడు. పైగా మూర్ఖత్వములోనూ, అజ్ఞానములోనూ పడిపోతాడు.

ఇటువంటి జ్ఞాన హీనులు, ఏ దేశంలో ఉన్నా, ఏ కాలంలో ఉన్నా, తమను తాము ఉద్ధరించుకోలేరు. ఈ సంసారము నుండి

విముక్తి పొందలేరు. ఎందుకంటే కామ కోరికల కోసరం పాకులాడే మానవులు సాధారణంగా స్త్రీల చేతిలో కీలుబొమ్మలుగా ఉంటారు. ఎల్లప్పుడూ స్త్రీల వ్యామోహంలో పడి ఉంటారు. అటువంటి వారికి స్త్రీలు, వారి వలన కలిగే సంతానము బంధనములు కలిగిస్తాయి. కాబట్టి మానవులు భార్యా, సంతానము మీద ఎంత వరకు ప్రేమ కలిగి ఉండాలో అంతవరకే ప్రేమ కలిగిఉండాలి. వారే తనసర్వస్వము అనుకోకూడదు.

మన దైత్యులు అంటే మీ తల్లి తండ్రులు, బంధుమిత్రులు అందరూ ఇటువంటి వారే. కాబట్టి మీరు కూడా వారి యందు అపరిమితమైన ఆసక్తి చూపకుండా ఆ శ్రీహరి మీద మీ మనసులను లగ్నం చేయండి. ఆయన మిమ్ములను తప్పకుండా కాపాడుతాడు.

ఓ అసుర బాలకులారా! శ్రీహరి అంటే ఎవరనుకున్నారు? శ్రీహరి సకల భూతములలో ఆత్మస్వరూపంతో వెలుగుతున్నాడు. మీలో ఉన్నాడు, నాలో ఉన్నాడు, అందరిలో ఉన్నాడు. శ్రీహరిని ఆరాధించ డానికి సేవించడానికి బాలురు, యవ్వనులు, వృద్ధులు అనే భేదము లేదు. ఎవరైనా శ్రీహరిని సేవించవచ్చును. శ్రీహరిని సేవించడానికి ఒక ప్రదేశము అంటూ లేదు. ఏ ప్రదేశములోనైనా సేవించవచ్చును. ఎందుకంటే శ్రీహరి సర్వాంతర్యామి. ఎక్కడంటే అక్కడే ఉన్నాడు.

శ్రీహరిని సేవించడానికి ఏ మాత్రమూ శ్రమ పడనక్కరలేదు. ధనము సంపాదించడానికీ, కోరికలు తీర్చుకోడానికీ ప్రయత్నం చెయ్యాలి, శ్రమ పడాలికానీ, శ్రీహరిని సేవించడానికి ఎటువంటి ప్రయత్నము చెయ్యనక్కరలేదు. శ్రమపడనవసరం లేదు. ఇందాక

చెప్పినట్టు, ఆ శ్రీహరి, పరమాత్మ, దేవదేవుడు సర్వాంతర్యామి, అణువునుండి బ్రహ్మాండము వరకూ అంతటా తానే వ్యాపించి ఉన్నాడు. భౌతికంగా మనం చూచే అన్ని పదార్థాలలో నిండి ఉన్నాడు. పంచభూతములలో, మహతత్త్వములో, సత్వ,రజస్తమోగుణములలో, మనకు కనిపించే ప్రకృతిలో, అహంకారములో, ఆ శ్రీహరి ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. ఆయనే ఈశ్వరుడు, పరమాత్మ, నాశనము లేని వాడు. నిత్యుడు. ఆయనకు భేదభావము లేదు. అందరినీ సమానంగా ఆదరిస్తాడు. ఆ పరమాత్మను జ్ఞానులైన వారు అనుభవించి తెలుసుకోవలసిందే కానీ, ఎవరి కంటికి కనపడడు.

ఆ పరమాత్మ తన మాయతో ఈ జగత్తును కప్పి ఉంచుతున్నాడు. ఆ మాయలో పడి ఈజీవులు ఆ పరమాత్మను భిన్న భిన్న రూపములతో పూజిస్తున్నారు. ఉన్న వస్తువు లేనట్టుగానూ, లేని వస్తువును ఉన్నట్టుగానూ భ్రమపడుతున్నారు. ఆ మాయలో పడకుండా, ఉన్నది ఉన్నట్టు తెలుసుకోవడమే వివేకము.

కాబట్టి, బాలకకులారా, మీరు కూడా మీలో ఉన్న ద్వేషభావమును విడిచిపెట్టండి. అందరినీ దయతో, ప్రేమతో చూడండి. అందరితో స్నేహం చేయండి. భేదభావమును వదిలిపెట్టండి. అప్పుడు పరమాత్మ మీ అందరినీ చూచి సంతుష్టిచెందుతాడు. మనలను చూచి పరమాత్మ సంతోషిస్తే, అంతకంటే మనకు కావాల్సింది ఏముంది. ఈ లోకంలో మనకు దొరకని వస్తువు అంటూ ఏదీ ఉండదు. ఈ ప్రపంచంలో దొరికే వస్తువులను సంపాదించడం, దాచి పెట్టుకోవడం వలన ఏమీ ప్రయోజనము ఉండదు.

మనమందరము ఆ పరమాత్మను అనునిత్యము సేవిస్తూ, పూజిస్తూ, స్తుతిస్తూ, ఆయనకు మన సర్వస్వము అర్పించుకుంటే, మనకు స్వర్గము అక్కరలేదు. మోక్షము అక్కరలేదు. ఆ పరమాత్మ పాదములు చాలును.

ఓ బాలకులారా! ధర్మము, అర్థము, కామము అనే వాటిని త్రివర్గములు అంటారు. వాటికి సంబంధించినవే ఇప్పుడు మనకు మన గురువులు నేర్పించే విద్యలు. ఈ విద్యలన్నీ వేదములలో ప్రతిపాదింప బడ్డవే కానీ ఈ వ్యాకరణము, తర్కము, దండనీతి మొదలగు విద్యలు నేర్చుకున్నందువలన ఏమీ ప్రయోజనము లేదు. ఆ పరమాత్మయందు భక్తి కలిగి ఉండటం, మనం చేసే అన్ని కర్మలు, వాటి ఫలములను పరమాత్మకు, అర్పించడం, మనం చేసే అన్ని కర్మలను భగవంతుని పరంగా చేయడం, ఎటువంటి ఫలాపేక్ష లేకుండా కర్మలనుచేయడం, మనలను మనం ఆ భగవంతుడికి అర్పించుకోవడం, ఇదే నిజమైన విద్య.

ఈ విద్యను పూర్వము నారాయణుడు నారదునికి ఉపదేశించాడు. భగవంతుని మీద అచంచలమైన భక్తి కలవారు, ఏ కోరికలు లేని వారు, భగవంతుని పాదములు తప్ప మరొకటి తెలియని వారు, అటువంటి వారికే ఈ జ్ఞానము కలుగుతుంది. ఈ విద్యను నారదుడు నాకుఉపదేశించాడు. ఈ భాగవత ధర్మమును నేను నారదుడి వద్దనుండి విన్నాను." అని చెప్పాడు ప్రహ్లాదుడు.

ఇదంతా విన్న ఆ అసుర బాలకులకు ఒక సందేహం కలిగింది. వారిలో ఒకడు లేచి ప్రహ్లాదుని ఇలా అడిగాడు.

"ప్రహ్లాదా! నువ్వేమో మా వయసు వాడివి. మనము అందరమూ ఇక్కడే ఈ గురువుల వద్దనే చదువుకున్నాము. మాకు తెలియకుండా నీకు వేరే గురువు ఎవరూ లేరు. పోనీ నీవు మీ అంత:పురములో ఉండి చదువుకున్నావా అంటే, రాక్షసరాజు హిరణ్యకశిపుని అంత:పురములోనికి పరులకు ప్రవేశము లేదు. మరి నీవు ఈ చదువులు అన్నీ ఎక్కడ చదువుకున్నావు. ఎలా చదువుకున్నావు అని మాకు సందేహంగా ఉంది. ఆ విషయములు అన్నీ మాకు చెప్పవా! మా సందేహములు తీర్చవా!" అని అడిగారు అసుర బాలకులు.

శ్రీమద్భాగవతము
సప్తమస్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## సప్తమస్కంధము
## ఏడవ అధ్యాయము.

నారదుడు ధర్మరాజుతో ప్రహ్లాద చరిత్రను ఈ విధంగా చెబుతున్నాడు.

"ధర్మరాజా! ఈ ప్రకారంగా దైత్యబాలకులు అడుగగా, ప్రహ్లాదుడు వారితో ఇలా చెప్పాడు.

"బాలకులారా! మా తండ్రి బ్రహ్మదేవుని గురించి తపస్సు చేయడానికి మందర పర్వతము వద్దకు వెళ్లాడు. నా తండ్రి హిరణ్యకశిపుడు రాజధానిలో లేడని తెలుసుకొన్న దేవతలు, ఇదే సమయమని దైత్యుల మీద యుద్ధం ప్రకటించారు. "తాను చేసిన పాపముల వలన హిరణ్య కశిపుడు మృతి చెందాడు. ఇంక దైత్యులు, రాక్షసులు దిక్కులేని వాళ్లయ్యారు. వారిని జయించడానికి ఇదే సమయము" అని రాక్షసులను తరిమి తరిమి కొట్టారు దేవతలు. దేవతల ధాటికి తట్టుకోలేక రాక్షసులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని తమ భార్య బిడ్డలతో పారిపోయారు.

ఆ సమయంలో నా తల్లి నన్ను గర్భంతో ఉంది. నా తల్లి ఒంటరిగా ఉందని తెలిసిన ఇంద్రుడు, నా తల్లి ఉన్న అంత:పురమునకు వచ్చి ఆమెను బయటకు తీసుకొని వచ్చి రథము మీద కూర్చోబెట్టుకొని తీసుకొని వెళ్లాడు. నా తల్లి తనను విడిచిపెట్టమని దీనంగా ఏడుస్తూ ఇంద్రుడికి వేడుకొంది. కాని ఇంద్రుడు వినకుండా నా తల్లిని తీసుకొని వెళుతున్నాడు.

ఆ సమయంలో నారద మహర్షి మాకు ఎదురుగా వచ్చాడు. ఏడుస్తున్న నా తల్లిని చూచాడు. "ఇంద్రా! ఈమె హిరణ్యకశిపుని భార్య. అతను ఇంటలేని సమయంలో ఆమెను అపహరిస్తావా! ఈమె ఏమి తప్పు చేసిందని ఈమెను తీసుకొని వెళుతున్నావు. దేవతలకు ఇంద్రుడివైన  నీకు తగదు. వెంటనే ఈమెను విడిచిపెట్టు." అని పలికాడు.

అప్పుడు ఇంద్రుడు నారదునితో ఇలా అన్నాడు. "నారదా! ఈమె రాక్షస రాజు హిరణ్యకశిపుని భార్య. ఈమె గర్భంలో ఒక భయంకరమైన రాక్షసుడు ప్రాణం పోసుకుంటున్నాడు. వీడు ఈ లోకంలోకి వస్తే, వీడి తండ్రి మాదిరి మూడులోకములను నాశనం చేస్తాడు. అందుకని వీడు పుట్టగానే చంపుదామని తీసుకొని వెళు తున్నాను. ఈమె ప్రసవించగానే ఈమెకు పుట్టిన శిశువును చంపి ఈమెను వదిలేస్తాను." అని అన్నాడు.

ఆ మాటలు విన్న నారదుడు పక్కున నవ్వాడు. "ఎంత అమాయకుడివి ఇంద్రా! ఈమె గర్భంలో పెరుగుతున్నది విష్ణుభక్తుడు కానీ లోకకంటకుడు కాడు. ఈమె కుమారుడుపాపరహితుడు. భగవద్భక్తుడు. మహాభాగవతుడు. విష్ణువు పాదములు తప్ప మరొకటి ఎరుగని వాడు. నువ్వు వీడిని చంపాలన్నా చంపలేవు." అని అన్నాడు నారదుడు.

ఆ మాటలకు నివ్వెర పోయాడు ఇంద్రుడు. వెంటనే రథం దిగాడు. మా తల్లిని కిందికి దింపాడు. ఆమెకు ప్రదక్షిణ పూర్వకంగా నమస్కారము చేసాడు. "పొరపాటు అయిపోయింది నారదా! ఈమె గర్భమున మరొక రాక్షసుడు జన్మిస్తున్నాడు అనుకున్నాను కానీ పరమభాగవతోత్తముడు ఈమె గర్భంలో ఉన్నట్టు తెలియదు. అమ్మా! తెలియక తప్పు చేసాను. నన్ను క్షమించు."అని అన్నాడు ఇంద్రుడు. తరువాత ఇంద్రుడు తన దారిన తాను వెళ్లిపోయాడు.

నారదుడు నా తల్లిని చూచి "అమ్మా! నీ భర్త వచ్చువరకు నీవు  నా ఆశ్రమములో ఉండెదవు గాక!" అని అన్నాడు. దానికి నా తల్లి సమ్మతించింది. నారదుడు నా తల్లిని తన ఆశ్రమమునకు తీసుకొని వెళ్లాడు. నా తండ్రి వచ్చువరకు మా తల్లి నారదుని ఆశ్రమములో ఎటువంటి భయము లేకుండా నివసించసాగింది. సుఖప్రసవము కోసరం ఎదురు చూస్తూ ఉంది.

ఆ సమయంలో నారదుడు ప్రతి రోజూ నా తల్లికి ధర్మతత్వమును, ఆత్మజ్ఞానమును బోధించసాగాడు. నా తల్లి గర్భములో ఉన్న నేను నారదుని బోధనలను శ్రద్ధతో విన్నాను. స్త్రీ, పైగా గర్భవతి అవడం వలన నా తల్లి నారదుని బోధనలను కాలక్రమేణా మరిచిపోయింది. నేను అత్యంత శ్రద్ధగా వినడంవలన నాకు నారదుని బోధలు ఇంకా జ్ఞాపకం ఉన్నాయి. నాడు నారదుడు ఉపదేశించిన బోధనలను నేను మీకు చెబుతాను శ్రద్ధగా వినండి. మీరు కనుక నా మాటలను శ్రద్ధగా వింటే మీకు, మీ తల్లితండ్రులకు ధర్మము అంటే ఏమిటో ఆత్మ తత్వము అంటే ఏమిటో తెలుస్తుంది.

ఈ కాలము పరమాత్మ స్వరూపము. ఈ కాలమును అనుసరించి ఈ దేహమునకు  ఆరు వికారములు ఉన్నాయి. అవి పుట్టడం, ఈ లోకంలోకి రావడం, పెరగడం, వృద్ధాప్యము రావడం, క్షీణించడం, మరణించడం. . కానీ ఈ ఆరు వికారములు కేవలము దేహమునకు సంబంధించినవేకానీ,  ఆత్మకు లేవు.

ఇంక ఆత్మ యొక్క లక్షణాలు చెబుతాను వినండి. ఆత్మ నిత్యము. దానికి చావు లేదు. ఆత్మ నశించిపోదు. ఆత్మ శుద్ధమైనది.

ఆత్మ ఒకటే. రెండు కాదు. ఆత్మ ఈ క్షేత్రములో (దేహములో) సాక్షిగా ఉంటుంది. అన్ని జీవులకు ఆశ్రయము ఈ ఆత్మ. ఈ ఆత్మకు ఎటువంటివికారములు లేవు. అన్నిటికీ కారణం ఈ ఆత్మయే. ఈ ఆత్మ స్వయంప్రకాశము కలిగినది. అంతటా వ్యాపించి ఉన్నది అంటే అందరిలో ఉంది. ఆత్మకు ఎటువంటి సంగము లేదు. దీనిని ఏ వస్తువూ కప్పిఉంచలేదు. ఈ పన్నెండు లక్షణములు ఆత్మకు ఉన్నాయి. ఈ లక్షణములు దేహానికి లేవు కాబట్టి ఆత్మ దేహము కంటే వేరయినది. ఈ ఆత్మజ్ఞానము కలిగిన వారు, నేను,నాది అనే భావనను, ఈ దేహమే నేను అనే దేహభావనను విడిచి పెట్టి, పరమాత్మ తత్వమును తెలుసుకుంటారు.

గనులలో నుండి తీసిన బంగారము మట్టి రూపంలో ఉంటుంది. దానిని నిపుణులైన పనివారు అనేకరసాయనముల ద్వారా అగ్నిద్వారా, మట్టిని బంగారమును వేరు చేస్తారు. అలాగే ఆత్మతత్వమును తెలిసిన వారు, దేహములో ఉన్న ఆత్మను దేహము నుండి వేరు చేసి చూస్తారు కానీ ఈ దేహమే సర్వస్వము అనుకోరు.

బాలకులారా! ప్రకృతి తత్వములు ఎనిమిది. అవి ప్రకృతి, మహత్తత్వము, అహంకారము, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. ప్రకృతిలో నుండి సత్వరజస్తమో గుణములు పుట్టాయి. ఆ మూడుగుణములకు 16 వికారములు ఉన్నాయి. అవి జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, పంచభూతములు-5, మనస్సు-1, ఇవన్నీ కలిసి దేహంగా రూపొందాయి. ఈ దేహము లో పరమాత్మ ఆత్మ స్వరూపంగా వెలుగుతున్నాడు. ఈ దేహములో ఉన్న

ఆత్మ దేహము చేసే పనులన్నీ సాక్షిగా చూస్తూ ఉంటాడు. కాబట్టి ఆత్మకు దేహమునకు ఎటువంటి సంబంధము లేదు.

ఈ ప్రకృతి అంతా పంచభూతములతో ఏర్పడింది. ఈ ప్రకృతిలో కదిలేవి, కదలనివి అనే రెండు రకాలు ఉన్నాయి. కదిలే వాటిలోనూ కదలని వాటిలోనూ ఆత్మ అంతర్లీనంగా ఉంది. (కదలని వాటిలో ఆత్మ ఎలా ఉంటుంది అని మీకు సందేహము రావచ్చు. ఆత్మ అంటే చైతన్యము. కదలనివి కూడా అనేకానేక అణువుల సముదాయము అని ఈ నాటి సైన్సు చెబుతూ ఉంది. ప్రతి అణువులోనూ చలనం ఉంది. కాబట్టి కదలని వాటిలోకూడా ఆత్మ ఉంది అని వ్యాసుని భావన.

భూమి ఏర్పడి నప్పుడు భూమి ఘనీభవించింది. అంటే పర్వతములు, కొండలు, గుట్టలు, బండరాళ్లు ఏర్పడ్డాయి. . అవి కాలానుగుణంగా మట్టి గా రూపాంతరంచెందాయి. అందులో నుండి చెట్టు పుట్టింది. చెట్టు కదలలేదు. కానీ చెట్టు పెరుగుతుంది. కాయలు కాస్తుంది. అంటే కదలని చెట్టులో పెరగడం అనే చైతన్యం ఆవిర్భవించింది. ఆ చెట్టు ఆకులు జంతువు తింటుంది. అంటే చెట్టుయొక్క ధాతువులతో జంతువులు ఏర్పడ్డాయి. జంతువులలో చైతన్యం మన కంటికి కనపడుతూ ఉంది. జంతువులు నాలుగు కాళ్ల నుండి రెండుకాళ్లతో నడిచి, మనిషిగా రూపాంతరం చెందాడు. మనిషిలో పూర్తి చైతన్యం వచ్చింది. అంటే రాళ్లు మొదలుకొని మనిషి దేహము వరకు అన్నీ అణువులతో కూడినవే. కొన్నిటిలో చైతన్యం మనకంటికి కనపడుతుంటే, రాళ్లు మొదలగు వాటిలో సూక్ష్మంగా ఉంటుంది కాబట్టి కనపడదు.)

కాబట్టి ఆత్మతత్వము తెలిసిన వారు, ప్రతి వస్తువును పరిశీలించి అందులో ఉన్న ఆత్మతత్వమును తెలుసుకొంటారు. మనలో ఉన్న బుద్ధికి మూడు అవస్థలు ఉన్నాయి. (మనస్సును కూడా బుద్ధి అని పిలుస్తుంటారు. మనస్సు, బుద్ధి, చిత్తము, ఇవన్నీ ఒకే అర్థంతో వాడుతూ ఉంటారు.) అవి జాగ్రదావస్థ అంటేమేలుకొని ఉండటం. స్వప్నావస్థ అంటే కలలు కనే స్థితి. మూడవది సుషుప్తావస్థ. గాఢ నిద్ర. ఈ మూడు అవస్థలను అనుభవించేది దేహము కాదు. దేహములో ఉన్న ఆత్మ అని తెలుసుకోవాలి. ఎలాగంటే పక్కగదిలో మంచి పరిమళము కలిగిన పూలు, జాజి పూలు, సంపెంగ పూలు ఉన్నాయనుకుందాము. మనము ఆ పూలను చూడటం లేదు. కానీ ఆ పూలయొక్కసుగంధము గాలిలో కలిసి మన ముక్కు దగ్గరకు వచ్చింది. అప్పుడు మనకు ఆ గదిలో పూలుఉన్నాయి అని తెలుస్తుంది. బుద్ధి యొక్క లక్షణములైన జాగ్రత్త, స్వప్న,సుషుప్తి అవస్తల ద్వారా, కనపడని ఆ ఆత్మస్వరూపమును తెలుసుకోవాలి.

ప్రకృతిలో ఉన్న సత్వ, రజస్, తమోగుణముల ద్వారా, మనలో ఉన్న మనస్సు వికారం చెందుతుంది. అదే కోరికలకు మూలము. ఆ కోరికలే బంధనాలను కలుగజేస్తాయి. దాని వలన సంసారము ఏర్పడుతుంది. మానవునిలోని అజ్ఞానము అవివేకము వలన ఈ సంసారము, సంగమము ఏర్పడుతుంది. ఈ ప్రాపంచిక విషయములన్నీ అశాశ్వతములని తెలుసుకోవడమే జ్ఞానము. కాబట్టి మీరు కూడా ఈ సత్వ, రజస్, తమోగుణములకు లోనై, కోరికలకు దాసులు కాకండి. అశాశ్వతమైన ఈ సంసారంలో పడకండి. మీ ఆసక్తిని ప్రాపంచిక విషయముల మీద కాకుండా, భగవంతుని

మీదకు మళ్లించండి.

మానవులకు భగవంతుని మీద ఆసక్తి ఎన్నోవిధములుగా కలుగుతుంది. వాటిలో కొన్నిటిని గురించి చెబుతాను వినండి. గురువులకుసేవ చేయడం ద్వారా మీకు భగవంతునితో సంగమం కలుగుతుంది. భగవంతుని మీద నిశ్చలమైన భక్తి ద్వారా భగవంతునితో సంగమం కలుగుతుంది. మనకు లభించిన ప్రతి వస్తువును భగవంతునికి అర్పించడం ద్వారా కూడా ఆ పరమాత్మకు దగ్గర అవడానికి అవకాశం ఉంది. అలాగే సాధువులైన భక్తులతో స్నేహం చేయడం ద్వారా కూడా భగవంతునికి దగ్గర కావచ్చును. ఇంకా ఆ భగవంతుని ఆరాధించడం, భగవంతుని కథలను శ్రద్ధగా వినడం, భగవంతుని గుణములను కీర్తించడం, ఎల్లప్పుడూ భగవంతుని పాదములను ధ్యానించడం, భగవంతుని విగ్రహములను భక్తితో పూజించడం, భగవంతుని స్వరూపమును మనసులో నిలుపుకోవడం, ఈ మార్గముల ద్వారా భగవంతునికి దగ్గర కావచ్చును.

ఓ బాలకులారా! పరమాత్మ అందరిలోనూ, అన్ని ప్రాణులలోనూ ఉన్నాడు అని తెలుసుకోవాలి. అందరినీ సమంగా చూడాలి. సకల ప్రాణులయందు దయకలిగి ఉండాలి. అప్పుడే మీరు భగవంతునికి దగ్గరవుతారు. ఇంక భగవంతునికి దగ్గరయిన వారు ఎలా ఉంటారో చెబుతాను వినండి. అటువంటి వారు ఎల్లప్పుడూ పరమాత్మ గుణములను, ఆయన అవతార విశేషములను వింటూ తాదాత్మ్యము చెందుతుంటారు. ఆ సంతోషంలో వారి శరీరం పులకరిస్తుంది. ఆనందంతో నృత్యం చేస్తారు. గొంతెత్తి పాడతారు. ఆడతారు. పిచ్చి వారివలె తమలో తాము నవ్వుకుంటారు. ఏడుస్తారు.

భగవన్నామమును పెద్దగా పలుకుతుంటారు. అందరిలో ఆ పరమాత్మను చూస్తూ అందరికీ నమస్కరిస్తారు. ఒక్కొక్కప్పుడు నిశ్చలంగా ధ్యాన సమాధిలో మునిగిపోతారు. ఈ ప్రకారంగా భగవంతుని చింతనలో మునిగిపోయినవారు బ్రహ్మానందాన్ని అనుభవిస్తారు. ఆ ఆనందము, ఈ ప్రాపంచిక సుఖములు, విషయ సుఖములు ఎన్ని అనుభవించినా కలిగే ఆనందంతో సమానం కాదు. అప్పుడు వారిలో ఉన్న అవిద్య, అవివేకము, అజ్ఞానము పూర్తిగా నశించిపోతాయి. వారి దృష్టిలో తాను, పరమాత్మ తప్ప వారిమధ్య ఏమీ ఉండదు. వారికి ఈ సంసార బంధనములు అన్నీ నశించి పోతాయి. చివరకు మోక్షమును పొందుతారు అని పెద్దలు చెబుతుంటారు. కాబట్టి మీరుకూడా ఆ పరమాత్మకు దగ్గరకావడానికి ప్రయత్నం చేయండి. మీ మనస్సులో ఆ పరమాత్మను ధ్యానించండి.

బాలకులారా! ఆ పరమాత్మ ఎక్కడో లేడు. మనందరిలో ఉన్నాడు. పరమాత్మ కోసరం ఎక్కడా వెదక పని లేదు. పరమాత్మను ధ్యానించడానికి ఎక్కువ శ్రమపడనక్కరలేదు. ఎవరైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా ఆ పరమాత్మను ధ్యానం చేయవచ్చును. కాని ఈ ప్రాపంచిక భోగముల కొరకు, విషయ వాంఛలు తీర్చుకోడానికి మనం ఎంతో శ్రమపడుతున్నాము కదా! ఏ శ్రమా లేకుండా పరమాత్ముని మనం ఎందుకు ధ్యానించకూడదు!

బాలకులారా! తల్లి, తండ్రి, సంతానము, గృహములు, ధనము, పెంపుడు జంతువులు, రాజ్యములు, రాజ్యభోగములు, అన్ని ఐశ్వర్యములు, కోరికలు, ఈ దేహము...ఇవి అన్నీ శాశ్వతములు కావు.

ఈ రోజు ఉండి రేపు నశించి పోయే ఈ వస్తువుల గురించి మనకు ఎందుకు ఇంత తాపత్రయము. రేపు బతికి ఉంటామో లేదో తెలియని ఈ దేహము కొరకు, ఈ దేహంతో లభించేసుఖాల కొరకు, మనం ఇన్ని కష్టాలుపడాలా! ఆలోచించండి.

ఎంతో మంది స్వర్గ సుఖములను కోరి యజ్ఞములు, యాగములు చేస్తారు. స్వర్గానికి పోతారు. కానీ ఆ స్వర్గసుఖములు కూడా శాశ్వతములు కావు. సంపాదించిన పుణ్యం కాస్తా అయిపోగానే, స్వర్గం నుండి గెంటేస్తారు. స్వర్గసుఖములు కూడా నశించి పోయేవే. కాబట్టి ఆ శ్రీహరిని సేవించడం, పూజించడం, ఆయనకు దగ్గర కావడం, అంతులేని, నాశనము లేని ఆనందాన్ని పొందడం మన కర్తవ్యము.

ఓ బాలకులారా! అజ్ఞానులు, అవివేకులే కాదు, బాగా తెలిసినవారు, చదువుకున్నవారు, శాస్త్రజ్ఞానము కలిగిన వారుకూడా, సుఖాలుపొందడానికీ, విషయ వాంఛలు తీర్చుకోడానికీ ఎన్నోకర్మలు చేస్తుంటారు. కాని ఆ కర్మలన్నీ మంచి ఫలితములను ఇస్తాయని నమ్మకం లేదు. మంచి ఫలితములు ఇస్తాయి అని అనుకొని చేసిన కర్మలకు కూడా చెడు ఫలితములు సంభవిస్తాయి. (ఉన్న రోగానికి మందు వేస్తే, ఆ రోగము తగ్గకపోగా, మరొక కొత్త రోగాన్ని తెచ్చి పెడుతుంది.)

సాధారణంగా మానవులు, ఉన్న దు:ఖము, కష్టములు పోవడానికీ, కొత్త సుఖసంతోషాలు రావడానికీ కర్మలు చేస్తుంటారు. కాని, ఆ కర్మలు మొదలుపెట్టేదాకా వారుసంతోషంగానే ఉంటారు. తీరా

మొదలుపెట్టినప్పటినుండి కష్టాలలో కూరుకుపోతారు. అంతులేని దు:ఖమును అనుభవిస్తారు.

(అప్పటిదాకా అద్దె ఇంట్లో సుఖంగా, ఏ బాదరబందీలేకుండా, ఉంటున్న వాడు, స్వంత ఇల్లు లేని వాడు, ఒక ఫ్లాటుకొనుక్కొని అందులో హాయిగా ఉండాలనికోరుకుంటాడు. ఫ్లాటు కొనడానికి ప్రయత్నిస్తాడు. ఆ రోజునుండి వాడి కష్టాలుమొదలవుతాయి. ఫ్లాట్లు కట్టే వాడు డబ్బు అంతాకట్టించుకుంటాడు. కాని ఫ్లాటు పూర్తి కాదు. ఇటు ఇంటి అద్దె కట్టలేక, అటు సొంత ఫ్లాటు పూర్తి కాక, తీసుకున్న లోను ఇన్‌స్టాల్ మెంటు కట్టలేక, సరిగా తిండి కూడా తినలేక, నానా కష్టాలుపడతాడు. ఇది మనం రోజూ చూస్తున్న నగ్నసత్యం.)

ఓ దైత్య బాలకులారా! ఈ దేహం కోసరం, ఈ దేహంతో అనుభవించేసుఖాల కోసరమే కదా మానవులు ఇన్ని కష్టాలు పడుతున్నది. కాని ఈ దేహములో నుండి ప్రాణములుపోగానే ఈ దేహమును కాలుస్తారు, పూడుస్తారు లేక ఈ దేహము కుక్కలకు నక్కలకు ఆహారంగా మారుతుంది. కాబట్టి అశాశ్వతమైన ఈ శరీరం కొరకు ఈ శరీరంతో అనుభవించే భోగాల కొరకు ఇంత తాపత్రయం అవసరమా! ఈ దేహమే అశాశ్వతము అనుకుంటే, ఇంక ఈ దేహముతో సంబంధము కలిగిన భార్య,పుత్రులు, బంధు మిత్రులు, గృహములు,ధనము, రాజ్యము,మంత్రులు, సేవకులు, ఇవన్నీ ఎలా శాశ్వతము అవుతాయి. ఇవన్నీ క్షణములో నశించిపోయేవే కదా! వీటి గురించి మనం చింతపడటం అవసరమా!

ఈ దేహము, భార్య, పుత్రులు, బంధుమిత్రులు, ధనము, రాజ్యము ఇవన్నీ శాశ్వతములు కానప్పటికీ, మన అజ్ఞానం వలన ఇవన్నీ

శాశ్వతములుగా ఉంటాయి అని అనుకుంటున్నాము. వీటి మోహములో పడి, శాశ్వతమయిన ఆత్మానందమును అనుభవించలేకపోతున్నాము.

ఓ దైత్యబాలకులారా! ఈ జన్మలో మనందరికీ ఈ సంసారము, దేహము, భార్యాపిల్లలు, బంధుమిత్రులు, గృహములు, ధనము ఇవన్నీ మనము పూర్వజన్మలో చేసుకున్న కర్మలఫలితంగానే కలుగుతుంటాయి. ఈ జన్మలో ఆ కర్మల ఫలితాన్ని అనుభవిస్తూ, సుఖములను, దు:ఖములను పొందుతూ ఉంటాము. అలా అనుభవిస్తూనే ఈ జన్మలో కూడా కర్మలు చేస్తుంటాము. ఈ జన్మలో చేసిన కర్మఫలములను అనుభవించడానికి మరొక జన్మఎత్తుతాము. ఇలా జనన మరణ చక్రములో పడి కొట్టుకుంటుంటాము. ఇదంతా మన అజ్ఞానం వలన కలుగుతూ ఉంది. మనలో ఉన్న అజ్ఞానం వలననే మనకు ఈ దేహములు, ఆ దేహములతో చేసే కర్మలు ఆ కర్మల ఫలితములను అనుభవించడానికి మరలా దేహములు కలుగుతున్నాయి.

బాలకులారా!  ధర్మము, అర్థము, కామము అనే పురుషార్థములు ఆ పరమాత్మ అధీనంలోఉన్నాయి. కానీ వీటి కోసరం మనం నానా రకాల పాట్లు పడుతున్నాము. దీనికి బదులుగా మనము ఆ శ్రీహరిని ప్రార్థిస్తే, ఆయనే మనకు ధర్మ,అర్థ,కామములు సమకూరుస్తాడు కదా! కాబట్టి మీరందరూ ఆ శ్రీహరిని ప్రార్థించండి. ఎందుకంటే, ఆ శ్రీహరి సర్వభూతములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. ఆయనకు సకల జీవ రాసుల మీద ప్రేమ,కరుణ, వాత్సల్యము ఉన్నాయి.

ఈ పంచభూతములను ఆ పరమాత్మ సృష్టించాడు. ఆ పంచభూతముల కలయిక వలన ఈ దేహము సృష్టింపబడింది. ఆపరమాత్మను అందరూ సేవించవచ్చును, దేవతలు, దానవులు, అసురులు, దైత్యులు, గంధర్వులు, యక్షులు ఎవరైనాసరే ఆ పరమాత్మను సేవించడానికి అర్హులు. ఆయనను సేవిస్తే, ఆయన అందరినీ కరుణిస్తాడు. అంతే కానీ, మేము బ్రాహ్మణులము, మేము దేవతలము, మేము ఋషులము, మేము అన్ని ఆచారములను పాటిస్తున్నాము అనుకున్నందు వలన ఏమీ ప్రయోజనము లేదు. ఇవేవీ ఆ పరమాత్మను తృప్తిపరచలేవు. ఎన్ని దానములు చేసినా, ఎంత తపస్సు చేసినా, ఎన్ని యజ్ఞములు చేసినా, ఎంత శుచిగా ఉన్నా, ఎన్ని వ్రతములు ఆచరించినా, అవి ఏవీ భగవంతునికి ప్రీతి పాత్రములు కావు. కేవలము నిష్కామ భక్తి ద్వారానే పరమాత్మసంతోషిస్తాడు. ఏ కోరికా లేని భక్తి తప్ప మిగిలినవి అన్నీ  పరమాత్మ దృష్టిలో వ్యర్థములే.

కాబట్టి ఓ దానవ బాలకులారా! ఆ శ్రీహరి యందు భక్తి కలిగి ఉండటమే ఉత్తమమైన మార్గము. మీరందరూ ఆ శ్రీహరి యందు ప్రేమ భక్తి కలిగి ఉండండి. మనమే కాదు, ఇంతకు పూర్వము ఎంతో మంది యక్షులు, రాక్షసులు, స్త్రీలు, శూద్రులు, గ్రామీణులు, పశు వులు, పక్షులు, ఎంతో పాపము చేసిన వారు కూడా భగవంతుని ఎడల భక్తితో మోక్షమును పొందారు. కాబట్టి ఈ లోకములో పరమాత్మ యందు ఏకాగ్రమైన భక్తి, ఈ సృష్టిలో ఉన్న సకల ప్రాణుల యందు దయ, ప్రేమ కలిగి ఉండటం, సాటి ప్రాణులలో భగవంతుని దర్శించడం, ఇవే మానవునికి పురుషార్థములు అని సకల శాస్త్రములు ఘోషిస్తున్నాయి." అని ప్రహ్లాదుడు అసుల బాలురకు ఆత్మ తత్వమును,

భగవతత్వమును బోధించాడు." అని నారదుడు ధర్మరాజుకు ప్రహ్లాద చరిత్ర చెబుతున్నాడు.

(భాగవత పురాణ సారము అంతా ఈ ప్రహ్లాదుడు అసుర బాలకులకు చేసిన బోధలో నిండి ఉంది. భాగవతము పూర్తిగా చదవలేనివారు ఈ ప్రహ్లాదుని బోధలను చదువుకుంటే, వింటే, విన్నది కొంత అయిన ఆచరిస్తే, ఆ పరమాత్మ వారిని కరుణిస్తాడు.)

శ్రీ మద్భాగవతము
సప్తమ స్కంధము ఏడవ అధ్యాయముసంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

## శ్రీ మద్భాగవతము
## సప్తమ స్కంధము
## ఎనిమిదవ అధ్యాయము.

అసుర బాలకులు అందరూ ప్రహ్లాదుడు చెప్పిన మాటలను శ్రద్ధగా విన్నారు. ఇంత కాలము గురువులు చెప్పిన మాటలు, చదువులు అన్నీ ఎందుకు పనికి రావు అనుకున్నారు. అందరూ కలిసి షండుడు, అమర్కుని వద్దకుపోయి " మాకు ప్రహ్లాదుడు ఎన్నో విషయాలు చెప్పాడు. మీరెప్పుడన్నా ఆ విషయాలు చెప్పారా! మీకు ఏమీ రాదు. మేము మీ వద్ద చదువుకోము."అని అన్నారు.

గురువులకు విషయం అంతా అర్థం అయింది. ప్రహ్లాదుడు తాను చెడింది కాకుండా తక్కిన అసుర బాలకులను కూడా

చెడగొడుతున్నాడు అని తెలుసుకున్నారు. వారికి ఒంటినిండా చెమటలుపట్టాయి, వణికిపోతున్నారు. పరుగు పరుగున హిరణ్యకశిపుని వద్దకు పోయి జరిగింది అంతా ఆయనకు విన్నవించుకున్నారు.

ఆ మాటలు విన్న హిరణ్యకశిపుడు కోపంతో ఊగి పోయాడు. ఇంక ఉపేక్షించి లాభం లేదనుకున్నాడు. కొడుకు అని కూడా చూడ కుండా వీడిని వెంటనే వధించాలి అని నిశ్చయించుకున్నాడు. వాళ్లకు,వీళ్లకు చెప్పే బదులు తానే ప్రహ్లాదుని వధించాలని అనుకున్నాడు. ఎదురుగా ఉన్న ప్రహ్లాదునితో ఇలా అన్నాడు.

"ఓరీ దుర్మార్గుడా! దుష్టుడా! కులనాశకుడా! మందబుద్ధీ! నేను నీకు తండ్రినే కాదు. దానవ చక్రవర్తిని. నా శాసనాన్నే ధిక్కరిస్తావా! నీకు మరణమే శరణ్యము. నేను క్రీగంట చూస్తేనే మూడులోకములు గడగడలాడి పోతాయి. అటువంటిది, నేను ఎంత కోపించినా నీలో చలనం లేదు. ఎవరి అండ, ఎవరి బలము చూచుకొని, ఎవరున్నారు అన్న ధైర్యంతో ఇంత నిబ్బరంగా ఉన్నావు. చెప్పు" అని నిలదీసాడు. అప్పుడు ప్రహ్లాదుడు ఇలా అన్నాడు.

"తండ్రీ! ఎవరి బలం చూచుకొని నేను ధైర్యంగా ఉన్నానో, ఆ పరమాత్మ నాకు మాత్రమే కాదు, నీకు, బ్రహ్మ మొదలగు దేవతలకు, ఆ లోకములో ఉన్న అందరికీ బలము అతడే. సకల ప్రాణులు ఆయన అధీనములో ఉన్నారు. (ఇక్కడ పోతన గారు ఒక చక్కటి పద్యాన్ని రాసారు.

కం॥ బలయుతులకు దుర్బలులకు,
బలమెవ్వడు, నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వడు ప్రాణులకును
బలమెవ్వండట్టి విభుడు బలమసురేంద్రా?

తండ్రీ! దిక్కులకు,కాలమునకు అతీతుడైనవాడు ఎవరో, అన్ని దిక్కులకు దిక్కు అయిన వాడు ఎవరో, అని ప్రాణులకూ ఆధారభూతుడు ఎవరో, ఆ శ్రీహరి నాకు దిక్కు.

తండ్రీ! నీకు తెలియనిది ఏమున్నది. ఈ జగత్తుకు అంతటికీ విభుడు ఆ శ్రీహరి. కాలాను గుణంగా ఆ శ్రీహరి వివిధ రూపములతో మానవులకు దర్శనం ఇస్తుంటాడు. ఆయన సుగుణఖని. ఆ శ్రీహరి సత్వ,రజస్తమోగుణముల ప్రభావంతో తన వినోదము కొరకు ఈ సృష్టిచేస్తున్నాడు. పోషిస్తున్నాడు, లయం చేస్తున్నాడు. శ్రీహరికి నాశం లేదు. ఈ దేహములు నశించిపోతాయి. వీటి మీద మమకారము వదిలిపెట్టు.  అన్ని ప్రాణులను సమమైన దృష్టితో చూడు.

తండ్రీ!నీకు బయట శత్రువులు ఎవరూ లేరు. శ్రీహరిని ద్వేషించే నీ మనసే నీ ప్రధమ శత్రువు. నీ మనస్సును నిగ్రహించుకో. నీకు శత్రువులు అంటూ ఎవరూఉండరు. ఈ రాక్షస భావాన్ని వదిలి సాత్వికభావాన్ని అలవరచుకో! నీకు భయపడినీకు ఎవరూ బదులు చెప్పడం లేదు. అలాగనీ నీవే గొప్ప పరాక్రమవంతుడివి, జ్ఞానివి అని విర్రవీగకు. నేను నీకు హితబోధ చేస్తున్నాను. నా మాటలు ఆలకించు.

తండ్రీ! నీవు మూడులోకములను జయించావు. కానీ నీలో ఉన్న ఆరుగురు శత్రువులను జయించలేకపోయావు. నీ ఇంద్రియములను గెలువలేకపోయావు. అరిషడ్వర్గముల ముందు, నీ మనస్సు ముందు, నీ ఇంద్రియములముందు నీవు ఓడిపోయావు. నీవు పరాజితుడివి. నీలో ఉన్న ఆరుగురు శత్రువులను, నీ ఇంద్రియములను, నీమనస్సును జయించిన నాడు, నీకు ఈ అనంత విశ్వంలో శత్రువు అంటూ ఎవరూ ఉండరు.

తండ్రీ! నీ మనసు మార్చుకో. నా మాటలు ప్రశాంతంగా విను. నిర్మలమైన మనసుతో ఆలోచించు. ఈ కర్మలు నిన్ను బంధించి ఉంచాయి. ఆ కర్మబంధనములను తెంచుకో. నీ మనసును ఆ పరమాత్మయందు లగ్నం చేయి. బ్రహ్మానందాన్ని పొందు." అని ప్రహ్లాదుడు తండ్రికి హితబోధ చేసాడు.

కాని ప్రహ్లాదుని మాటలు హిరణ్యకశిపునికి రుచించలేదు. పైగా కోపాన్ని తెప్పించాయి. "దుర్మార్గుడా! దుష్టుడా! నీకే ఎదురు తిరిగుతావా! నాకే నీతులు చెబుతావా! నీవు చావుకు కూడా తెగించావు. లేకపోతే ఇంత ధైర్యంగా మాట్లాడవు. నేనెవరో తెలుసా! మూడులోకములకు అదిపతిని. చావును జయించాను. నన్ను మించిన వాడు ఎవరూ లేరు.నీవు చెబుతున్న శ్రీహరి నా తమ్ముడిని సంహరించాడు. ఆ శ్రీహరిని చంపడానికి నేను అన్ని చోట్లా వెతుకుతున్నాను. మూడులోకములు గాలించాను. నాకు భయపడి ఎక్కడో దాక్కున్నాడు పిరికిపంద. ఇందాకటినుండి నువ్వు విష్ణువు, శ్రీహరి అంటున్నావుకదా! ఆయన ఎక్కడ ఉంటాడో తెలిస్తే నాకు చెప్పు.

ఎక్కడ ఉంటాడు! ఎలా ఉంటాడు? ఎక్కడ తిరుగుతుంటాడు? నువ్వు చెప్పకపోతే నిన్ను, ఆ విష్ణువును ఇద్దరినీ కలిపి సంహరిస్తాను. చెప్పు" అని గద్దించి అడిగాడు హిరణ్యకశిపుడు.

తండ్రి అజ్ఞానానికి నవ్వుకున్నాడు ప్రహ్లాదుడు. శ్రీహరిని గురించి చెప్పే అవకాశం వచ్చింది కదా అని నిలువెల్లా పులకించిపోయాడు. మనసులో శ్రీహరికి నమస్కరించాడు. గొంతెత్తి ఇలా అన్నాడు.

మ: కలడంబోధి, గలండు గాలి, గలడాకాశంబునం, గుంభినిం
గల, డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గల, డోంకారంబునం ద్రిమూర్తుల ద్రిలింగవ్యక్తులం దంతటం
గల, డీశుండు గలండు, తండ్రి! వెదకంగా నేల నీ యాయెడన్.

కః ఇందు గల డందులేడని సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,
డెం దెందు వెదకి చూచిన, నందందే కలడు, దానవాగ్రణి! వింటే!

తండ్రీ! భగవంతుడైన విష్ణువు లేని చోటు లేనేలేదు. ఆయన సర్వవ్యాపకుడు. సముద్రంలో, గాలిలో, ఆకాశంలో, భూమిలో, అగ్నిలో, అన్ని దిక్కులలో, పగలు, రాత్రి, సూర్యునిలో, చంద్రునిలో, ఓంకారంలో, త్రిమూర్తులలో, ఆడ,మగ జాతులలో, అక్కడా ఇక్కడా అనేమిటి అంతటా ఉన్నాడు. శ్రీహరి ఒకచోట ఉన్నాడు, మరొక చోట లేడు అని సందేహము వద్దు. ఆయన అన్ని ప్రదేశములలో ఉన్నాడు. నువ్వు ఎక్కడ వెదికితే అక్కడే ప్రత్యక్షం అవుతాడు. నా మాట నమ్ము." అని నమ్మకంగాచెబుతున్న కుమారుని చూచి హిరణ్యకశిపుడు కోపంతో

రగిలిపోయాడు.

"నువ్వు చెప్పేది అబద్ధం. శ్రీహరి ఎక్కడా లేడు. ఉంటే కనిపించడా!" అన్నాడు హిరణ్యకశిపుడు.

"శ్రీహరి అంతటా ఉన్నాడు. నువ్వుఎక్కడ వెదికితే అక్కడే ఉన్నాడు" అని వాదించాడు ప్రహ్లాదుడు.

ఇద్దరికీ పట్టుదల పెరిగింది.

క॥డింభక! సర్వస్థలముల నంభోరుహనేత్రుడుండుననుచు మిగుల సం
రంభంమున బలికెద వీ,స్తంభమున జూపగలవె? చక్రిన్ గిక్రిన్॥

క॥ స్తంభమున జూపవేనియు,గుంభిని నీశిరము ద్రుంచి కూల్చగ రక్షా
రంభమున వచ్చి హరి వి, స్రంభంమున నడ్డపడగ శక్తుండగునే॥

ఓరీ బాలకా! నీ శ్రీహరి అన్ని చోట్లా ఉన్నాడని ఎలుగెత్తి చెబుతున్నావే. ఉంటే ఈ స్తంభంలో చూపించు. లేకపోతే నీ తల నరుకుతాను. నీ శ్రీహరి వచ్చి నిన్ను ఎలా కాపాడతాడో నేనూ చూస్తాను."అనిఅరిచాడు హిరణ్యకశిపుడు.

ఆమాటలకు ఏమాత్రం భయపడకుండా ప్రహ్లాదుడు తగు సమాధానము ఇచ్చాడు.

శా॥అంభోజాసను డాదిగాగ దృణపర్యంతంబు విశ్వాత్ముడై
సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబునం దుండడే?
స్తంభాంతర్గతుడయ్యు నుండుటకు నే సందేహంబును లేదు,ని
ర్దంభత్వంబున నేడు గానబడు బ్రత్యక్ష స్వరూపంబునన్.

ఓ తండ్రీ! చిన్న గడ్డి పరక దగ్గరనుండి బ్రహ్మ పర్యంతము అన్నింటిలోనూ ఆశ్రీహరి నిండి ఉన్నాడు. అలాంటప్పుడు ఈ స్తంభంలో ఎందుకు ఉండడు? ఈ స్తంభంలో శ్రీహరి ఉన్నాడు అనడానికి ఎటువంటి సందేహము లేదు. నీ పూర్వపుణ్యము వలన ఆ పరమాత్మ ఈ స్తంభములో ప్రత్యక్షము అవుతాడు. చూడండి." అని అన్నాడు.

ఆ మాటలకు హిరణ్యకశిపుడు పెద్దగా వికటాట్టహాసం చేసాడు. తన ఆసనం మీది నుండి లేచాడు. ఒరలో నుండి కత్తిని బయటకు లాగాడు. అటు ఇటు తిప్పాడు.

"ఒరేయ్! ఈ స్తంభంలో నీ శ్రీహరి ఉన్నాడు అన్నావు కదరా! ఏడిరా నీ శ్రీహరి! స్తంభం చీల్చుకొని రమ్మనరా!" అని పక్కనేఉన్న స్తంభాన్ని చేతితో బలంగా మోదాడు.

ఆ పిడికిలి దెబ్బకు ఆ స్తంభము నుండి ఈ బ్రహ్మాండం బద్దలయిందా అన్నట్టు ఒక భయంకరమైన శబ్దం వినవచ్చింది. ఆ శబ్దం బ్రహ్మలోకం వరకు వ్యాపించింది. ఆ శబ్దం ఎక్కడి నుండి వచ్చిందా అని హిరణ్యకశిపుడు కలవర పడ్డాడు. నలుదిక్కులు చూచాడు. ఆ సమయంలో శ్రీహరి తాను సర్వవ్యాపి అనే మాట నిజం చేయడానికా అన్నట్టు ఆ స్తంభంలో నుండి భయంకరమైన, అటుమనిషి కాకుండా,

ఇటు జంతువు కాకుండా,ఒక రకమైన వికృత రూపంతో బయటకు వచ్చాడూ. నారసింహ రూపమును చూచి హిరణ్యకశిపుడు ఆశ్చర్యపోయాడు.

"ఏమిటిది! ఇది మనిషా లేక జంతువా! లేక నరుడు, సింహమా! నరసింహమా!"అని ఆలోచిస్తున్న హిరణ్యకశిపున ఎదుట శ్రీహరి నారసింహ రూపంలో ప్రత్యక్షం అయ్యాడు.

ఆ రూపం భయంకరంగా ఉంది. పచ్చటి పసిమి వర్ణంలో ఉంది. కళ్లు ఉగ్రంగా ఉన్నాయి. తలచుట్టు సింహమునకు ఉన్నట్టు జూలు ఉంది. మొహం భయంకరంగా ఉంది. నాలుక పెద్దదిగా లోపలకు బయటకు ఆడుతూ ఉంది. పెద్దపెద్ద చెవులు నిక్కపొడుచుకొని ఉన్నాయి. నోరు పర్వత గుహలాగా తెరుచుకొని ఉంది. ఆ ఆకారము భూమిని ఆకాశమును ఆక్రమించింది. మెడ పొడవుగాఉంది. విశాలమైన వక్షస్థలము, సన్నని నడుము, తెల్లటి వెంట్రుకలు, ఎత్తైన భుజములు, కత్తులవంటి గోళ్లు, నాలుగు చేతులలో శంఖము, చక్రము, గద, పద్మము ఉన్నాయి. దానవ సంహారమునకు ఆవిర్భవించిందా అన్నట్టు ఉన్న ఆ రూపము అత్యంత భయంకరంగా ఉంది.

ఆవికృత రూపమును చూచిన హిరణ్యకశిపుడు ఇలాఅనుకున్నాడు. "ఆ శ్రీహరి నన్ను చంపడానికి ఈ మాయను పన్ని నట్టున్నాడు. అయినా ఏమయింది. ఈ వికృత రూపమును క్షణంలో నాశనం చేస్తాను." అనుకుంటూ తన చేతిలో ఉన్న గదతీసుకొని

నారసింహ్ముని మీదికి అగ్నిలోకి మిడత దూకినట్టు దూకాడు. తన గదతో నారసింహ్ముని బలంగా మోదాడు. కాని నారసింహ్ముడు హిరణ్యకశిపుని చేతిలోని గదను అవలీలగా పట్టుకున్నాడు. అవతలకు విసిరివేసాడు. గరుడుడు సర్పమును పట్టుకున్నట్టు నారసింహ్ముడు హిరణ్యకశిపుని పట్టుకున్నాడు. కాని హిరణ్యకశిపుడు తప్పించుకున్నాడు. పక్కనే ఉన్న ఖడ్గమును, డాలును తీసుకున్నాడు.మరలా నరసింహ్ముని మీదికి ఉరికాడు.

నారసింహ్ముడు మరలా హిరణ్యకశిపుని పట్టుకున్నాడు. నారసింహ్ముడు హిరణ్యకశిపుని ఒక ద్వారము వద్దకు తీసుకొని వెళ్లాడు. గడప మీదకూర్చున్నాడు. హిరణ్యకశిపుని తన తొడల మీద పడుకోబెట్టాడు. కత్తుల వంటి తన చేతి గోళ్లతో హిరణ్యకశిపుని పొట్టను చీల్చాడు. పొట్టలో నుండి పేగులను బయటకు తీసి మెడలో హారంగా వేసుకున్నాడు. నారసింహ్ముడు తన గోళ్లతో హిరణ్యకశిపుని గుండెలు చీల్చాడు. గుండెను తీసి బయటకు విసిరేసాడు.

హిరణ్య కశిపునికి పట్టిన గతిని చూచిన అతని సైన్యాధికారులు సైనికులు ఆ వికృత రూపం మీదికి తమ తమ ఆయుధములతో విరుచుకుపడ్డారు. నారసింహ్ముడు వారందరినీ తనగోళ్లతో చీల్చాడు. వారందరినీ సంహరించాడు.

నారసింహ్ముడు తనజూలు విదిలిస్తుంటే భూమి, ఆకాశము,స్వర్గము కంపించిపోయాయి. ఆ సమయంలో నారసింహ్ముని ఎదిరించే సాహసం ఎవరూ చేయలేక పోయారు. నారసింహ్ముడు అప్పటివరకూ హిరణ్యకశిపుడుకూర్చున్న సింహాసనము

మీద ఠీవిగా కూర్చున్నాడు. అక్కడ ఉన్న వారంతా నారసింహుని ఉగ్రరూపము చూచి గడగడవణుకుతున్నారు. మూడులోకములను గడగడలాడించిన హిరణ్యకశిపుని మరణం చూచిన దేవతలు ఆకాశం నుండి పుష్పవర్షముకురిపించారు. దుందుభులు మోగించారు. గంధర్వులు, సంతోషంతో గానం చేసారు. అప్సరసలు నృత్యం చేసారు.

ఇంతలో బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు, దేవతలు, ఋషులు, పితృదేవతలు, సిద్ధులు, విద్యాధరులు, నాగులు, మనువులు, ప్రజాపతులు, అప్సరసలు, గంధర్వులు, చారణులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, మొదలగు వారు అక్కడకు వచ్చారు. అందరూ ఆ ఉగ్రనరసింహునికి దూరం నుండి సాష్టాంగ దండ ప్రమాణం చేసారు. ముందుగా బ్రహ్మ నారసింహుని ఇలా స్తుతించాడు.

"ఓ దేవా! నీవు అనంతుడవు, అమితమైన శక్తికలవాడవు. పవిత్రుడవు. సత్వ,రజస్తమోగుణముల కలయికతో మూడులోకము లను సృష్టించావు. పోషిస్తున్నావు. లయం చేస్తున్నావు. నీకు నాశము లేదు. అట్టి నీకు నమస్కారము." అని స్తుతించాడు.

తరువాత రుద్రుడు ఇలా స్తుతించాడు. "ఇదేమిటి నారాయణా! యుగాంతంలో రావలసినకోపం ఇప్పుడు ధరించావు. నీ కోపానికి పురుగులాంటి ఈ రాక్షసుడు హతమయ్యాడు. ఇంకనైనా నీ కోపాన్ని వదిలిపెట్టి, ఈ రాక్షసుని కుమారుడు ప్రహ్లాదుని రక్షించు." అని అన్నాడు.

తరువాత ఇంద్రుడు ఇలా స్తుతించాడు. "ఓ దేవా! ఈ హిరణ్యకశిపుడు దేవతలకు రావలసిన హవ్యభాగములను తానే తీసుకుంటున్నాడు. ఈ దైత్యుని చంపి మా యజ్ఞభాగములను మాకు వచ్చేట్టు చేసావు. మా స్వర్గలోకము మా వశమైనది. అయినా నీ పాదపద్మములను సదా మా హృదయములలో నిలుపుకున్న మాకు మాకు ఈ ఐశ్వర్యములతో పనేముంది. ఈ తుచ్ఛమైన ఐశ్వర్యములే కాదు, నీ పాదముల యందు మాకుఉన్న భక్తి ముందు ముక్తి కూడా వ్యర్థమే. ఇంక ఇతర భోగముల గురించి చెప్పేదేముంది." అని అన్నాడు.

తరువాత ఋషులు ఇలా స్తుతించారు. "నీవు మమ్ములను తపస్సుచేయమని ఆదేశించావు. నీ ఆదేశము మేరకు మేము తపస్సు చేసుకుంటున్నాము. ఇంతకాలము ఈ అసురుడు మా తపస్సును భగ్నం చేస్తున్నాడు. ఇప్పుడు నీవు అవతరించి ఈ రాక్షసుని సంహరించి మాకు తిరిగి తపస్సు చేసుకొనేటట్టు అనుగ్రహించావు. అట్టి నీకు నమస్కారము." అని అన్నారు.

తరువాత పితృదేవతలు ఇలా స్తుతించారు. "ఓ దేవా! ఇంతకాలము ఈ రాక్షసుడు మాకు చెందవలసిన పిండములు, తిలోదకములు తానే గ్రహిస్తున్నాడు. ఇప్పుడు నీవు వీడిని సంహరించి మాకు ప్రతిరోజూ ఆహారమును సమకూర్చావు. అట్టినీకు నమస్కారము." అని స్తుతించారు.

తరువాత సిద్ధులు ఇలా అన్నారు. "ఓ దేవా! మేము ఎంతో తపస్సు చేసి అణిమ మొదలగు అష్టసిద్ధులను సంపాదించాము. ఆ

సిద్ధులను ఈ దుర్మార్గుడు తీసేసుకున్నాడు. అటువంటి వాడిని చంపి, మా సిద్ధులు మాకు వచ్చేటట్టు చేసావు. అట్టినీకు నమస్కారము.

విద్యాధరులు ఇలా స్తుతించారు. "మేము ఎన్నో కష్టనష్టములకు ఓర్చి అంతర్ధానము మొదలగు విద్యలను నేర్చుకున్నాము. ఈ మూర్ఖుడు మేము నేర్చుకున్న విద్యలను ప్రదర్శించకూడదని నిషేధించాడు. అట్టి ఈ మూర్ఖుని సంహరించి ఆ నిషేధాన్ని తొలగించావు. అట్టి నీకు నమస్కారము." అనిస్తుతించారు.

తరువాత నాగులు ఇలా స్తుతించారు. "ఓ దేవా! ఈ తస్కరుడు మా పడగలమీద మాకుస్వతసిద్ధంగా ఏర్పడిన మణులను దొంగిలించాడు. అందమైన మా నాగజాతి స్త్రీలను అపహరించాడు. ఇప్పుడు వీడిని సంహరించి మా నాగజాతికి విముక్తి కలిగించావు. అట్టి నీకు నమస్కారము." అని స్తుతించారు.

తరువాత మనువులు ఇలా స్తుతించారు. "ఓ దేవా! మేము నీ ఆజ్ఞప్రకారము  వర్ణాశ్రమ ధర్మములను పరిరక్షిస్తున్నాము. మేము కూడా  ఆచరిస్తున్నాము. కాని ఈ రాక్షసుడు మమ్ములను మా విధులను సక్రమంగా నిర్వర్తించకుండా అడ్డుపడ్డాడు. ఇప్పుడు వీడిని చంపి మాకు వీడి పీడ వదిలించావు. ఇప్పుడు మేము ఏమి చెయ్యాలో మాకు ఉపదేశించమని ప్రార్థిస్తున్నాము."అని అడిగారు.

తరువాత ప్రజాపతులు ఇలా స్తుతించారు. "ఓ దేవా! మేము ప్రజాపతులము. నీవుమమ్ములను సృష్టించావు. సృష్టి చేయమని

మమ్ములను ఆదేశించావు. కాని ఈ దుర్మార్గుడు నీ ఆదేశములను పాటించవద్దని మమ్ము ఆజ్ఞాపించాడు. అందువలన మేము సృష్టి చేయలేకపోయాము. ఇప్పుడు వీడు నీ చేతిలో చచ్చాడు. ఇది మూడులోకములకు శుభసూచకము. ఇప్పటి నుండి మేము సృష్టి చేయడం కొనసాగిస్తాము." అని అన్నారు.

తరువాత గంధర్వులు ఇలా స్తుతించారు. "ఓ దేవా! మేము ఎల్లప్పుడూ నీ లీలలనే గానం చేస్తూ, నీ కొరకేనాట్యం చేస్తున్నాము. కానీ ఈ దుర్మార్గుడు మమ్ములను తనవినోదము కొరకు పాడమని ఆడమని ఆజ్ఞాపించాడు. చేసేదిలేక మేము వీడు చెప్పినట్టు ఆడాము పాడాము. ఇప్పుడు నీవు వీడిని వధించి మాకుస్వేచ్ఛను ప్రసాదించావు. అట్టి నీకు నమస్కారము." అని అన్నారు.

తరువాత చారణులు ఇలా అన్నారు. "ఓ దేవా! మీము ఎల్లప్పుడూ  నీ పాదపద్మములను సేవిస్తుంటాము. ఈ అసురుని బాధనుండి మమ్ములను విముక్తి చేసావు. మీకు నాకునమస్కారము." అని అన్నారు.

తరువాత యక్షులు ఇలా స్తుతించారు. "మేము నీకు అనుచరులము. నీ సేవ చేసుకుంటూ ఉండేవాళ్లము. అటువంటి మమ్ములను ఈ హిరణ్యకశిపుడు తన పల్లకీ మోయమని ఆజ్ఞాపించాడు. చేసేది లేక ఇన్నాళ్లు వాడి పల్లకీ మోసాము. ఇన్నాళ్లకు మాకు విముక్తి లభించింది. నీకు మా నమస్కారము." అని అన్నారు.

తరువాత కింపురుషులు నృసింహదేవుని ఇలా స్తుతించారు. "ఓ దేవా! మేము ఈ సృష్టిలో అల్పులము. నీవు దేవదేవుడవు. ఈ అధముడు ఎప్పుడైతే నిన్ను దూషించాడో అప్పుడే చచ్చాడు. ఇప్పుడు వీడిని నీవు శారీరకంగా చంపావు. అట్టినీకు నమస్కారము." అని అన్నారు.

తరువాత వైతాళికులు ఇలా స్తుతించారు. "ఓ దేవదేవా! నీ అవతార లీలా విశేషములను, నీ యశస్సును సభలలో గానం చేయడం మా వృత్తిధర్మము. అలా చేయడం వలన మాకు ముల్లోకములలో గౌరవ మర్యాదలు లభించాయి. కాని ఈ దుర్మార్గుడు తనను పొగడమని మమ్ములను ఆదేశించావు. వీడినిపొగడడం వలన మా గౌరవ మర్యాదలు మంటగలిసాయి. ఇప్పటి నుండి నీ అవతార లీలా విశేషములను స్తుతిస్తూ పోయిన మా గౌరవ మర్యాదలను మేముపొందుతాము." అని అన్నారు.

తరువాత కిన్నరులు ఇలా స్తుతించారు. "ఓ దేవా! మేము సదా నీ సేవలో నిమగ్నమయి నీ వలన లబ్ధిపొందుతూ ఉండేవాళ్లము. కానీ ఈ దుర్మార్గువు మా అందరిచేత  ఊరికే తన స్వంత పనులు చేయించుకొనేవాడు. చేసిన పనికి ఫలితమును ఇచ్చేవాడుకాదు. మా చేత ఊరికే ఊడిగము చేయించుకున్న పాపముఊరికే పోతుందా! అందుకే వీడు ఇటువంటి చావు చచ్చాడు. వీడిని చంపి నీవు మమ్ములనుకాపాడావు. అట్టి నీకు నమస్కారము." అని స్తుతించారు.

తరువాత వైకుంఠములో ఉండే విష్ణువు యొక్క అనుచరులు ఇలా స్తుతించారు. "ఓ వైకుంఠవాసా! వీళ్లు జయవిజయులు. వీడిని చంపి వీడికి బ్రాహ్మణ శాపము నుండి విముక్తి కలిగించావు. వీడికి తొందరగా శాపము నుండి విముక్తి చేయడానికి ఈ అవతారము ధరించిన దేవా నీకు నమస్కారము." అని స్తుతించారు.

శ్రీమద్భాగవతము

సప్తమ స్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

సప్తమ స్కంధము

తొమ్మిదవ అధ్యాయము.

నారదుడు ప్రహ్లాద చరిత్రను ధర్మరాజుకు ఈ విధంగా చెబుతున్నాడు.

"ధర్మరాజా! బ్రహ్మ మొదలగు దేవతలు నృసింహ దేవుని పైవిధముగా స్తోత్రము చేసినప్పటికినీ, ఆయన ప్రసన్నుడు కాలేదు. దేవతలు ఆయన వద్దకు పోవడానికి భయపడుతున్నారు.

అందరూ లక్ష్మీదేవి వద్దకుపోయి "అమ్మా! మీకే మాకు దిక్కు. మీరు వెళ్లి మీ భర్తను శాంతింపజేయండి." అని ప్రార్థించారు.

"నేను వెళ్లను. నేను ఇప్పటిదాకా చతుర్భుజములు, శంఖుచక్రములతో, మెడలో వనమాలతో, కౌస్తుభమణితో, పీతాంబరముతో జగన్మోహనంగా వెలుగుతున్న శ్రీమహావిష్ణువును చూచాను కానీ ఈ వికృత రూపమును చూడలేదు. చూడటానికే భయంకరంగా ఉంది. నేను వెళ్లను." అని పలికింది లక్ష్మి.

ఇలా కాదని బ్రహ్మదేవుడు ప్రహ్లాదుని వద్దకు వచ్చాడు.

"వత్సా ప్రహ్లాదా! నీవు కోరితేనే కదా నిన్ను రక్షించడానికి విష్ణుమూర్తి ఈ అవతారము ధరించాడు. కాబట్టి ఆయన కోపమును నీవే ఉపశమించచేయాలి." అని ప్రహ్లాదుని నారసింహుని ముందు నిలబెట్టారు.

ప్రహ్లాదుడు చిరునవ్వుతో "మీరు చెప్పినట్టే చేస్తాను." అని అన్నాడు. వెంటనే నడుచుకుంటూ నృసింహదేవుని వద్దకు పోయి ఆయన కాళ్ల మీద పడ్డాడు. దయాళువైన నృసింహదేవుడు ఆ చిన్ని బాలుని తన రెండు చేతులతో లేవనెత్తి తన కుడి చేతిని ప్రహ్లాదుని తలమీద పెట్టి ఆశీర్వదించాడు. నృసింహదేవుని చేతి స్పర్శతో ప్రహ్లాదునికి ఉన్న సక అశుభములు తొలగిపోయాయి. ఆబాలుని శరీరం ఆనందంతో పులకించిపోయింది. కళ్లలో ఆనంద భాష్పాలు నిండాయి. ప్రహ్లాదుడు శ్రీహరి పాదములను తన హృదయములో నిలుపుకొని ఇలా ప్రార్థించాడు.

"ఓ దేవదేవా! బ్రహ్మ మొదలగు దేవతలు ఋషులు, సిద్ధులు, వీరందరు కూడా నిన్ను స్తుతించలేకపోయారు. కాని ఒక అసుర జాతిలో పుట్టిన బాలుడను నేను ఎలా స్తుతించగలను. నా స్తోత్రముతో నిన్ను ఎలా తృప్తిపరచగలను.

ఓ దేవదేవా! నిన్ను స్తుతించుటకు ధనము, ఉన్నత కులంలో జన్మించడం, అందము, తపస్సు చేయడం, శాస్త్ర పాండిత్యము, బలమైన ఇంద్రియములు కలిగి ఉండటం, మంచి తేజస్సు కలిగి ఉండటం, శౌర్యప్రతాపములు కలిగి ఉండటం, మంచి శారీరక బలము కలిగి ఉండటం, పౌరుషవంతుడుగా ఉండటం, బుద్ధి జ్ఞానము కలిగి ఉండటం, యమనియమాది అష్టాంగయోగములు అభ్యసించడం ఈ గుణములు ఏవీ అక్కరలేదు. కేవలం నీ మీద అచంచలమైన, నిష్కామమైన భక్తి ఉంటే చాలు. నీవు వారికి వశుడవు అవుతావు.

ఓ దేవా! వాడు పుట్టుకతో బ్రాహ్మణుడు కావచ్చును, పైన చెప్పిన 12 గుణములు కలిగి ఉండవచ్చును, కాని వాడు నీపాదపద్మములను సేవించకుంటే, వాడికి ఎన్ని మంచి గుణములు ఉన్నా వ్యర్థమే. అటువంటి బ్రాహ్మణుని కంటే, తన మనస్సును, వాక్కును, శరీరమును, తన ప్రాణములను సైతం భక్తితో నీకు అర్పించిన కడజాతి వాడు ఎంతో మేలు. తనకు అన్నీ తెలుసు అనే గర్వాంధుడైన బ్రాహ్మణుడు తాను పుట్టిన కులమును కూడా పవిత్రమే చేయలేడు.

ఓ దేవా! నిన్ను మేము స్తుతిస్తున్నాము అంటే మమ్ములను మేము గౌరవించుకోవడమే. నిజానికి నీకు మా స్తోత్రములు, పూజలు ఏమీ అక్కరలేదు. మమ్ములను మేము ఉద్ధరించుకోడానికి నీకు

పూజలు చేస్తున్నాము. కాబట్టి నేను బాలుడనయ్యునూ నా శక్తి కొలది నిన్ను కీర్తిస్తాను. ఎందుకంటే నీ మహిమలను విన్నా, కీర్తించినా, వారు అవిద్యనుండి విముక్తుడు అవుతాడు. తనకు తాను పవిత్రుడు అవుతాడు.

ఓ దేవదేవా! బ్రహ్మాది దేవతలు నిన్ను నిరంతరము పూజిస్తుంటారు, ధ్యానిస్తుంటారు. కాని మా అసుర కులములో పుట్టిన వారి మాదిరి నిన్ను ద్వేషించరు. నీవు ధరించిన ఈ అవతారము కూడా మా అసురకులమును ఉద్ధరించడానికి, లోక కల్యాణము కొరకు అని భావిస్తున్నాము. కాబట్టి ఓ దేవదేవా! నీ కోపమును, నీ ఉగ్రరూపమును ఉపసంహరించమని ప్రార్థిస్తున్నాను. ఎందుకంటే నీ చేతిలో దుర్మార్గుడు అయిన నా తండ్రి మరణించాడు. ఇంక నీకు ఈ ఉగ్రరూపంతో అవసరం లేదు. నా తండ్రి మరణానికి మూడులోకములు సంతోషం వ్యక్తంచేస్తున్నాయి. కాని నీ యీ రూపమును చూచి మూడులోకములు భయంతో వణికిపోతున్నాయి.

మానవులు తమకు భయం కలిగినప్పుడు నీ స్వరూపమును, నీ నృసింహ నామమును జపిస్తారు. దయచేసి శాంతించు. నేనేదో భయపడుతున్నాను అని నిన్ను అడగడం లేదు. నాకు నీ ఉగ్రరూపము, నీ భయంకరమైన నీ ముఖము, తీక్షణమైన నీ నాలుక, సూర్యుని వలె మండే నీ కళ్లు, వాడిఅయిన నీ కోరలు, నీ ముఖమునకు అంటినరక్తము, నీ భయంకరమైన గర్జనలు, నీ వాడి అయిన గోళ్లు వీటిని చూచి నేనుఏ మాత్రమూ భయపడటం లేదు. కాని ఈ లోకంలో ప్రజలు భయపడుతున్నారు. కాబట్టి శాంతించు.

ఓ దేవదేవా! పూర్వజన్మలలో నేను చేసిన కర్మల ఫలితంగా నన్ను ఈ అసురజాతిలో పుట్టించావు. నేనుఎన్నో జన్మలుఎత్తాను. ఈ సంసార చక్రంలో పడి తిరుగుతున్నాను. నాకు మోక్షమును ప్రసాదించు. నీ పాదములను సేవించుకొనేభాగ్యము కలిగించు.

ఓ దేవా! నేను ఇప్పటి వరకూ ఎన్నో జన్మలు ఎత్తాను. ఎంత మందితోనో బంధములు కలిగి ఉన్నాను. అందులో నాకు ప్రియమైన వారు ఉన్నారు, నాకు శత్రువులుఉన్నారు. వారందరి సాంగత్యములో సుఖములు, దు:ఖములు అనుభవించాను. దేహాభిమానము అన మోహంలో పడిపోయాను. అందు వలన నిన్ను సేవించే ఉపాయము నాకు చెప్పు.

ఓ దేవా! నేను నీకు దాసుడను. నిరంతరము నీ పాదసేవ చేసుకొనే భాగవతుల ద్వారా అవతార విశేషములను, లీలలను, కథలను వింటూ రాగ ద్వేషముల నుండి విముక్తుడను అవుతాను.

ఓ దేవా! బాలురకు వారి తల్లి తండ్రులు, రోగులకు వైద్యులు ఇచ్చే ఔషధములు, సముద్రములో మునిగి పోతున్న వాడికి నావ, ఎలా రక్షణ కల్పిస్తాయో, అలాగే నిరంతరము ఈ సంసారములో పడి కొట్టుకుంటున్న మానవులకు నీవు తప్ప వేరే ఎవరు రక్షణ కల్పిస్తారు.

ఓ దేవా! సత్వగుణ సంపన్నులగు బ్రహ్మ మొదలగు దేవతా గణములు, పితృగణములు, ఎవరిచేత నియమింప బడి వారి వారి పనులు చక్కగా నిర్వర్తిస్తున్నారో,, వారందరూ ఎవరి కొరకు, ఎక్కడెక్కడ, ఏయే సమయములలో, ఎవరి నుండి ఆదేశములు

పొంది,, ఏ ఉద్దేశ్యముతో, ఏయే పనులు ఏ ఏ విధాలుగా చేస్తున్నారో, ఆ పనులన్నీ నీ స్వరూపాలే. అంతటా నీవే నిండి ఉన్నావు.

ఓ దేవా! నీ అంశతో పురుషుడు ఉద్భవించాడు. ఆ పురుషుని అనుమతితో కాలానుగుణంగా ఈ ప్రకృతి మనసును సృష్టించింది. ఆ మనసు గతజన్మ వాసనలతోనూ, కర్మలతోనూ, కర్మఫలములతోనూ నిండి పోయి ఉంది. ఆ మనసును జయించడం చాలా కష్టం. ఆ మనసే ఒక మాయ. ఆ మాయా మయమైన మనసును జయించడం ఎవరికీ సాధ్యం కాదు. కేవలం నీ మీద భక్తితోనూ, నీ పాదసేవనతోనే మానవుడు ఆ మనసును జయించగలడు. నీ అనుగ్రహం లేనిదే ఎవరూ మనసును జయించలేరు.

ఓ దేవా! నీవు కాల స్వరూపుడవు. నీవు బుద్ధిని జయించావు. కార్యము, కారణమూ నీవే అయి ఉన్నావు. నీవు అజేయుడవు. ఈ దేహములో ఉన్న పది ఇంద్రియములు, పంచభూతములు, మనస్సు అనే సంసార చక్రంలో పడి చెరకు గడ వలె నలిగిపోతున్నాను. నేను నీ శరణు వేడుతున్నాను. దేవా! నన్ను రక్షించు.

ఓ దేవా! ఈ లోకంలో మానవులు స్వర్గసుఖాలు అనుభవించడం కోసరం, పూర్ణఆయుష్షు కోసరం  యజ్ఞములు, యాగములు, వ్రతములు చేస్తుంటారు. కాని ఆ స్వర్గసుఖములు శాశ్వతములు కావనీ, ఆ కాస్త పుణ్యం అయిపోగానే మరలా మానవలోకంలోకి నెట్టబడతాడనీ, ఈ శరీరం అశాశ్వతమనీ, ఎన్నాళ్లు

బతికినా చివరకు మట్టిలో కలిసిపోతుందనీ, వారికి తెలియదు. తనకు మరణం లేదనీ, తనకు మూడులోకములలో ఎదురులేదనీ విర్రవీగే నా తండ్రిని త్రుటిలో నీవు సంహరించావు. ఈ సిరిసంపదలు, స్వర్గసుఖములు శాశ్వతములు కావని నిరూపించావు. కాలానుగుణంగా అన్నీ నాశనం అవుతాయని లోకానికి తెలియపరిచావు.

ఓ దేవా! ఇటువంటి అశాశ్వతములైన సుఖములు, భోగభాగ్యములు, అణిమాది అష్టసిద్ధులు నాకు వద్దు. నాకు నీ మీద భక్తి, శ్రద్ధ కుదిరాయి. నిన్ను సేవించుకుంటూ ఉంటాను. నన్ను నీ సేవకుడిగా అంగీకరించు. ఇది చాలునాకు.

ఓ దేవా! ఈ ప్రాపంచిక సుఖములు, విషయసుఖములు అన్నీ వినడానికి, అనుభవించడానికి బాగుంటాయి. కానీ వీటి వలన కలిగే సుఖం ఎండమావి వంటిది. ఈ సుఖాలన్నీ ఈ దేహంతో అనుభవిస్తాము. ఆ సుఖాల వల్లనే ఈ దేహానికి సమస్త వ్యాధులు కలుగుతుంటాయి.. ఈ విషయం తెలిసి కూడా మానవులు ఆ విషయసుఖాల వెంట పరుగెడుతుంటారు. తమలో ఉన్న కోరికలను, కామాగ్నిని ఆర్పివేసే ప్రయత్నం చేయడం లేదు.

ఓ దేవదేవా! ఇక్కడ బ్రహ్మ దేవుడు ఉన్నాడు. లక్ష్మీదేవి ఉంది. పరమశివుడు ఉన్నాడు. కాని వారి తలమీద నీవు ఎప్పుడూ నీ చేయి పెట్టలేదు. కానీ ఒక అసురకులములో పుట్టిన నా తల మీద నీ చేయి పెట్టి ఆశీర్వదించావు. నీ అనుగ్రహానికి నన్ను పాత్రుడిని చేసావు. నాజీవితం ధన్యమయింది.

ఓ దేవా! నీవు ఆత్మస్వరూపుడవు. ఈ ప్రాణులకు అన్నిటికీ నీవు ఆప్తుడవు. నిన్ను సేవించిన వారందరినీ అనుగ్రహిస్తావు. వీడు విద్యావంతుడనీ, వాడు క్షుద్రుడనీ, వీడు ధనవంతుడనీ, వాడు పేదవాడనీ, అనే భేదభావము నీకు లేదు. అందరినీ సమానంగా చూస్తావు.

ఓ దేవా! నేనుకూడా అందరి మాదిరి కామభోగములకు, విషయ వాంఛలకు నిలయమైన ఈ సంసార కూపంలో పడేవాడినే. కాని ఈ నారద మహర్షి దయ వలన నాకు ఆత్మజ్ఞానము కలిగింది. నారదుల వారి వద్దనుండి ఆత్మజ్ఞానము పొందిన నేను నీ పాదములను ఎలా విడువగలను?

ఓ దేవా! నా తండ్రి సామాన్యుడు కాడు. అహంకారి. "ఇప్పుడు నేను నీ తల ఖండిస్తాను. నీ శ్రీహరి ఉంటే రమ్మను. నిన్నురక్షించమను." అంటూ నా మీదికి కత్తితీసుకొని ఉరికాడు. ఆ సమయంలో నీవు వచ్చి నా తండ్రిని చంపి నన్ను రక్షించావు. కానీ నీవు నన్ను రక్షించడానికి నా తండ్రిని చంపావు అని నేను అనుకోవడం లేదు. బ్రాహ్మణశాపగ్రస్తులైన నీ భృత్యులకు శాపవిమోచనం కలిగించడం కోసరమే ఈ పని చేసావు అని నేను అనుకుంటున్నాను.

ఓ దేవా! ఈ చరాచర జగత్తు అంతటా నీవే నిండి ఉన్నావు. నీవే ఈ జగత్తును సృష్టించి పోషించి లయం చేస్తున్నావు. ఈ జగత్తు సృష్టించబడక ముందు నీవు ఉన్నావు. ఈ జగత్ప్రళయం తరువాత కూడా నీవు ఉంటావు. ఈ సృష్టి లయముల మధ్యలో నీవు నీ మాయ

ద్వారా ఈ సృష్టిలో ఉన్న జీవరాసులలో ప్రవేశించి వినోదిస్తున్నావు. రకరకాల రూపములతో ప్రకటితమవుతున్నావు.

ఓ దేవా! ఈ జగత్తు అంతా నీవే. నీకు ఇష్టుడు, శత్రువు అంటూ ఎవరూ లేరు. ఎందుకంటే ఈ జగమే మాయ అని నీకు తెలుసు. విత్తనము లో నుండి చెట్టు వచ్చినట్టు ఈ జగత్తు అంతా నీలో నుండి వచ్చింది. మరలా నీలోనే లీనం అవుతుంది. బీజము,వృక్షము నీవే అయినపుడు, నీకు మిత్రులు, శత్రువులు ఎందుకుంటారు?

ఓ దేవా! ప్రళయకాలంలో ఈ జగత్తు అంతా నీలో లీనమై ఉంటుంది. నీవు యోగనిద్రలోఉంటావు. తురీయావస్థలో ఆత్మసుఖమును అనుభవిస్తూ ఉంటావు. ఆ సమయంలో నీకు తమోగుణము గానీ, విషయవాంఛలు గానీ ఉండవు. నీ కాలశక్తి ద్వారా ఈ ప్రకృతి ప్రేరేపించబడుతుంది. అప్పుడు నీవు తురీయావస్థ నుండి మేల్కొంటావు. నీ నాభిలో నుండి ఒక పద్మము ఉద్భవిస్తుంది. చిన్న బీజము నుండి పెద్ద వటవృక్షము పుట్టినట్టు, నీ నాభి నుండి ఈ ప్రకృతి అనే పద్మము ఆవిర్భవిస్తుంది. ఆ పద్మము మధ్యలో నుండి బ్రహ్మ ఉద్భవించాడు. ఆయన చుట్టు చూచాడు. ఆయనకు తాను ఉన్న పద్మము తప్ప ఏమీకనపడలేదు. వేయి సంవత్సరముల పాటు జలంలో ఉన్నాడు. కానీ నిన్ను చూడలేకపోయాడు. ఎందుకంటే, బీజము లో నుండి వచ్చిన చెట్టు బీజమును చూడలేదు కదా! అలాగే నీ లోనుండి పుట్టిన బ్రహ్మ నిన్ను చూడలేకపోయాడు.

తరువాత బ్రహ్మ ఆ పద్మములో కూర్చుని చాలా కాలము తపస్సు చేసాడు. అప్పుడు బ్రహ్మకు విశుద్ధమైన జ్ఞానము కలిగింది. అప్పుడు బ్రహ్మ తనలోనే ఉన్న నిన్ను దర్శించాడు. అనేక ముఖములు, చేతులు,కాళ్లు, తలలు, తొడలు, ముక్కులు, చెవులు, కళ్లు, అస్త్రములు కలిగిన నీ విరాట్ రూపమును చూచి బ్రహ్మ మహదానందము పొందాడు.

ఓ దేవదేవా! నీవు హయగ్రీవ రూపమును ధరించి రజోగుణము, తమోగుణములకు ప్రతీకలైన మధు, కైటభులను, సంహరించి, వేదములను తిరిగి బ్రహ్మకు అందించావు. ఆ కారణం చేత మహా ఋషులునీవు శుద్ధ సత్వగుణ స్వరూపుడవు అని కీర్తిస్తుంటారు.

(ఇక్కడ ఒక వివరణ. ఈ ప్రకృతిలో మూడు గుణాలు ఉన్నాయి. అందులో రజోగుణము, తమోగుణము ఆసురీ సంపదను కలుగజేస్తాయి. వారే మనలో కోరికల రూపంలో ఉన్న మధు, కైటభులు. శుద్ధసత్వగుణప్రధానుడైన పరమాత్మ హయగ్రీవ రూపంలో, ఆ మధుకైటభులు అనే రజస్తమోగుణములను సంహరించాడు. వేదములను బ్రహ్మదేవునికి ఇచ్చాడు అంటే మనలో జ్ఞానమును పెంపొందించాడు. అంటే మనలో రజోగుణము, తమోగుణముల ప్రభావంతో కలిగే ప్రాపంచిక విషయములు, విషయ వాంఛలు, కోరికలను, సత్వగుణంతో అంటే పరమాత్మ యందలి భక్తితో, పరమాత్మ నామస్మరణతో, నాశనం చేసి, జ్ఞానాన్ని పెంపొందించుకోవాలి అని అర్థం చెప్పుకోవచ్చు.)

ఓ దేవా! నీవు మనుషులలో, ఋషులలో, దేవతలలో, జంతువులలో, జలచరములలో అవతరించి, దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేస్తున్నావు. ఏ యుగములో అవలంబించ వలసిన ధర్మమును ఆ యుగములో రక్షిస్తున్నావు. కాని కలియుగములో మాత్రము నీవు కనపడకుండా ఉన్నావు. అందుకని, నీ అవతారములు అన్నీ మూడుయుగములకే పరిమితము అయ్యాయి.

ఓ దేవా! నా మనస్సు పాపభూయిష్టము అయి ఉన్నది. కామకోరికలచేత నిండి ఉన్నది. హర్షము, భయము, శోకము మొదలగు భావనలతో పీడించబడుతూ ఉంది. అందు వలన నా మనస్సు నీ కథల యందు లీనం కాలేకపోతూఉంది. కాబట్టి నేను భగవత్తత్వమును గురించి ఆలోచించలేకపోతున్నాను.

(ఇక్కడ అందరికీ ఒక సందేహము వస్తుంది. రాబోయే శ్లోకములలో కూడా ఇదే సందేహము వస్తుంది. అదేమిటంటే ప్రహ్లాదుడు 5 ఏళ్ల బాలుడు, మరి అతనికి హర్షము, కామ కోరికలు, పాపములు ఇవన్నీ ఎలా వచ్చాయి అని సందేహము. దీనికి సమాధానము 1. ప్రహ్లాదుడు ఇదివరకే చెప్పాడు. తాను ఇంతకు ముందు వేలవేల జన్మలు ఎత్తాడని. ఆ జన్మలలో చేసిన కర్మలు, హర్షము శోకముల గురించి మాట్లాడుతున్నాడు అని అనుకోవచ్చు. రెండవది ప్రహ్లాదుడు తన గురించే కాకుండా ఈ లోకంలో ఉన్న సకల మానవ జాతి గురించి మాట్లాడుతున్నాడు అని అనుకోవచ్చు. ఈ ప్రకారం అర్థం చేసుకుంటే సందేహములు తలెత్తవు.)

ఓ దేవా! ఒక భర్తకు ఎక్కువ మంది భార్యలుఉంటే, వారు ఆ భర్తను తమ వైపుకు రమ్మంటే తమ వైపుకురమ్మని తలా ఒక దిక్కుకు లాగుతుంటారు. అలాగే మానవ శరీరంలో రకరకాల రుచుల కొరకు నాలుక, విషయసుఖముల కొరకు మనస్సు, అందమైన స్త్రీల స్పర్శకొరకు చర్మము, రకరకాల భోజనములు తినవలెనని ఉదరము (పొట్ట), వీనుల విందైన విషయములు వినవలెనని చెవులు, రకరకాల సువాసనలను చూడాలని ముక్కు, చూడతగ్గవి, చూడకూడనివి చూడాలని ఉవ్విళ్లూరే కళ్లు, చేయవలసినవి, చేయకూడనివి పనులుచెయ్యాలని కర్మేంద్రియములు, జీవుడిని తలా ఒక దిక్కుకు లాగుతుంటాయి. జీవితము నాశనం చేసేవరకూ అవి వదిలిపెట్టవు.

ఓ దేవదేవా! ఈ మానవులు తాము చేసిన కర్మలను అనుసరించి సంసారము అనే వైతరణీ నదిలో పడుతున్నారు. పుడుతూ, పెరుగుతూ, తింటూ, తిరుగుతూ, చస్తూ  ప్రతిరోజూ భయం భయంగా ఈ జీవన చక్రంలో తిరుగుతున్నారు. అంతే కాకుండా జీవితం అంతా మిత్రులను ఆదరించడం, శత్రువులను ద్వేషించడం, సుఖదు:ఖములను అనుభవించడం లాంటి ద్వంద్వాలలో మునిగితేలుతున్నారు. ఈ మూర్ఖులైన మానవులను దయతో చూడు.

హే భగవాన్! అయినా ఇవన్నీ నేను నీకు చెప్పాలా!నేనునిన్ను కోరాలా! నీకు తెలియదా! ఈ జగత్తును సృష్టించి, పోషించి, లయంచేయడానికి శక్తి ఉన్న నీకు దీనులను రక్షించడం పెద్ద పనేమీ కాదులే!

ఓ దేవా! నిరంతరం నిన్ను సేవించే నీ భక్తులను రక్షించడంలో నీ గొప్పతనం ఏముంది. మూర్ఖులు, మూఢులు అయిన ఈ అమాయక మానవకోటిని రక్షించి వారి మీద నీ అనుగ్రహం చూపిస్తేనే, వారికి నీ మీద భక్తి కలుగుతుంది. ఎందుకంటే ఈ మూర్ఖమానవులు సంసారము అనే వైతరణీ నదిలో మునిగి తేలుతున్నారు.  నా వంటి వారు ఈ వైతరణీ నదికి భయపడరు. ఎందుకంటే నేను, నా లాంటి భక్తులు, నీ రూపము, గుణములను, నీలీలలు అనే అమృతసరస్సులో మునిగి తేలుతున్నాము.

కాని నిన్ను ఒక్కరోజుకూడా తలచుకోని వారు ఉన్నారు. వారు ఎంతసేపటికీ ప్రాపంచిక విషయములలోనూ, విషయ వాంఛలలోనూ ఆసక్తి కనబరుస్తూ ఉంటారు. అటువంటి వారి గురించి నేను దు:ఖపడుతున్నాను. వారిని నీ చెంతకు చేర్చుకో!

ఓ దేవదేవా! సాధారణంగా మునులు, ఋషులు ముక్తి కొరకు నీ గురించి తపస్సు చేస్తుంటారు. కాని నేను మాత్రము ముక్తికోరడం లేదు. నాకు నీ పాదములే కావాలి. ముక్తి అక్కరలేదు. నీ ఒక్కడివే నన్ను రక్షించడానికి సమర్థుడవు అని అనుకుంటున్నాను.

ఓ దేవా! మరొక విషయం. ఈ కామసుఖములు చర్మమునకు వచ్చే దురద లాంటివి. గోకుతుంటే హాయిగా ఉంటుంది. కాని అదేపనిగా గోకితే మంట పుడుతుంది. ఈ కామకోరికలు కూడామొదట్లో సుఖంగా ఉంటాయి. కాని అదేపనిగా అనుభవించడం మొదలు పెడితే రోగాలు ముదిరి దు:ఖములకు దారి తీస్తాయి.

విపరీతమైన కామములు అనుభవించడం వలన దు:ఖములే కానీ సుఖము కలుగదు. కానీ మనసును, ఇంద్రియములను నిగ్రహించిన వారు, కామ సంబంధమైన కోరికలనుకూడా అదుపులో పెట్టుకోగలరు.

ఓ దేవా! మనస్సును ఇంద్రియములను జయించడం అందరికీ సాధ్యం కాకపోవచ్చు. అటువంటి వారు ఇతరులతో ఎక్కువగామాట్లాడకుండా మౌనంగా ఉండటం, ముక్తి కొరకు ప్రయత్నించడం, శాస్త్రములను చదవడం, అర్థం చేసుకోవడం, తపస్సు చేయడం, వేదములను అధ్యయనం చేయడం, స్వధర్మమును పాటించడం, ఎక్కువ మంది జనంలో కాకుండా ఏకాంతంగా ఉండటానికి అలవాటుపడటం, భగవంతుని గూర్చి జపం చేయడం, ధ్యానసమాధిలో ఉండటం ఇవన్నీ ముక్తి సాధించడానికి ఉపాయాలు. కాని దంభము దర్పము ఉన్న వారు, బయట ప్రపంచంలో తమ గొప్ప తనాన్ని చాటుకోడానికి నీ మీద భక్తి ఉందని చెప్పుకోడానికి పైవిధంగా ప్రవర్తిస్తూ జనులను మోసం చేస్తుంటారు.

ఓ దేవా! విత్తనము లో నుండి మొక్క వస్తుంది. బీజము కారణము అయితే, మొక్క కార్యము. నిజానికి రెండూ ఒకటే. రెండింటిలోనూ నీవే ఉన్నావు. కేవలం భక్తియోగము అవలంబించిన వారే అన్నిటిలోనూ నిన్నే చూడగలరు.

ఓ దేవా! పంచభూతములలోనూ, పంచతన్మాత్రలలోనూ, ఐదు ప్రాణములలోనూ, (పాన,అపాన,వ్యాన,ఉదాన, సమాన), పది ఇంద్రియములలోనూ, మనస్సు, బుద్ధి, అహంకారము ఈ అన్నింటిలోనూ స్థూలంగానూ, సూక్ష్మంగానూ నీవే నిండి ఉన్నావు.

మనస్సు, వాక్కుతో తెలుసుకోగలిగే ప్రతి వస్తువుకూడా  నీ కంటే భినమైనది కాదు.

ఓ దేవా! సత్వగుణము, రజోగుణము, తమోగుణము, మహత్తత్వము, మనస్సు, వీటితో నిన్ను తెలుసుకోవడం చాలా కష్టం. అలాగే దేవతలు, మానవులు జనన మరణములకు లోబడి ఉన్నవారు. ఆది అంతము కలిగిన వారు. ఆది, అంతము కలిగిన వారు ఆది అంతము లేని నిన్ను ఎలా తెలుసుకోగలరు? అందుకని వారు నీ గురించి తెలుసుకోవడం చాలా కష్టం. ఆ కారణం చేత, జ్ఞానులు ఈ వేదాధ్యయనములు, శాస్త్రములనుచదవడం, తర్కించడం ఇవన్నీ వృధా అనుకుంటారు. కేవలం నీ పాదములసేవయే పరమావధి అనుకుంటారు. ఆ కారణం చేత నేను కూడా ఈ శాస్త్రముల జోలికి పోకుండా నీ మీద అచంచలమైన భక్తితో, నీ పాదములను సేవించే అదృష్టాన్ని నాకు కలిగించు అని ప్రార్థిస్తున్నాను.

ఓ దేవదేవా! నీకు భక్తితో నమస్కరిస్తున్నాను. నిన్ను స్తుతిస్తున్నాను.  నేను చేసిన కర్మలను అన్నింటినీ నీకు అర్పిస్తున్నాను. నిన్నుపూజిస్తున్నాను. నీ పాదములను సేవిస్తున్నాను. నీ లీలలను వింటున్నాను. పై ఆరుసేవల వలన కాకుండా సర్వసంగపరిత్యాగులు ఇంక ఏ విధంగా నీ భక్తినిపొందగలరు?   అందుకని,  ఈ ఆరు తప్ప నాకు మరొక ధ్యాసలేదు."అని ప్రహ్లాదుడు నృసింహదేవుని కీర్తించాడు." అని నారదుడు ధర్మరాజుతో చెప్పాడు.

"ఓ ధర్మరాజా! ఈ విధంగా ప్రహ్లాదుడు నృసింహదేవుని స్తుతించగా, ఆయన తనకోపాన్ని, ఉగ్రరూపాన్ని, ఉపసంహరించు

కున్నాడు. ప్రహ్లాదుని స్తోత్రములకు సంతోషించాడు. ప్రహ్లాదునితో ఇలా అన్నాడు.

"కుమారా! ప్రహ్లాదా! నీకు శుభం కలుగుతుంది. నీ పట్ల నేను ప్రసన్నుడనయ్యాను. నీకుఏం వరం కావాలోకోరుకో. ఏది అడిగినా ఇస్తాను. కుమారా! నన్ను ప్రసన్నుడిగా చేసుకోని వారికి నేను కనిపించను. ఒకసారి నన్ను దర్శించిన మానవునికి పునర్జన్మ ఉండదు. కాబట్టి జ్ఞానులు, మునులు, ఋషులు నన్ను ప్రసన్నుడిగా చేసుకోడానికి తపస్సు చేస్తుంటారు." అని అన్నాడు.

కాని ప్రహ్లాదుడు ఎటువంటి వరము కోరుకోలేదు. ఎందుకంటే ఈ ప్రాపంచిక విషయములకు సంబంధించిన కోరికలు, వరములు తనను ప్రలోభపెడతాయని భయపడ్డాడు. కేవలము భగవంతుని యందు ప్రేమ తప్ప తనకు వేరే ఏదీ అక్కరలేదనుకున్నాడు." అని నారదుడు ధర్మరాజుకు ప్రహ్లాద వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము

పదవ అధ్యాయము.

నారదుడు ధర్మరాజుతో ప్రహ్లాద చరిత్రను ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ ధర్మనందనా! తనను వరములు కోరుకోమన్న నృసింహదేవునితో ప్రహ్లాదుడు ఇలా అన్నాడు.

"దేవదేవా! నేను అసుర బాలకుడను. రాజసము, తామసము అసురులకు పుట్టుకతో వచ్చినగుణములు. నీవు వరములు ఇస్తానని నన్ను ఆశ పెట్టవలదు. ఈ రజస్తమోగుణముల వలలో పడి నేను ఈ ప్రాపంచిక సంబంధ మైన, కామ సంబంధ మైన కోరికలు కోరుకునే ప్రమాదం ఉంది. కానీ నాకు ఈ కామ వాంఛలు అన్నా, సంసారముఅన్నా భయం. నాకు చిన్నతనము నందే వైరాగ్యము అలవడింది. అందుకనే నిన్ను ప్రార్థించాను.నీ పాదములు పట్టుకున్నాను.

నాకు తెలుసు! నీవు నన్ను పరీక్షింప దలచి నన్ను వరములు కోరుకోమన్నావు. నాలో కామ కోరికలను ప్రకోపింప దలచావు. కాని సాక్షాత్తు ఆ దేవదేవుడే నా ఎదుట ప్రత్యక్షమై వరములు కోరుకోమన్నప్పుడు, నేను ఈ తుచ్ఛమైన సాంసారిక సంబంధమైన కోరికలు, ప్రాపంచిక విషయములు, కామమునకు సంబంధించిన కోరికలు కోరుకుంటే నేను నీతో వ్యాపారము చేస్తున్నట్టు అవుతుంది.

నేను నిన్ను ప్రార్థించినందుకు నీ నుండి ప్రతిఫలము కోరినట్టు అవుతుంది. ఎవడైతే నీకు పూజలు, వ్రతములు చేసి, నీకు నివేదనలు అర్పించి, నిన్నుకోరికలు కోరుతాడో, వాడు నీతో వాణిజ్యము చేస్తున్నట్టు అవుతుంది కానీ అది నీ మీద భక్తి కాదు.

తన యజమాని తనకుఏదో చెయ్యాలని ఆశించే భృత్యుడు, భృత్యుడు కాడు. అలాగే తన భృత్యుడు తాను ఇస్తున్న వేతనమునకు తనకు ఏదో చెయ్యాలని ఆశించే యజమాని, యజమానీ కాడు. యజమానీ భృత్యుడు ఒకరికి ఒకరు నిష్కామంగా సేవచేస్తేనే వారు నిజమైన యజమానీ, భృత్యుడు అవుతారు. అలాగే తాను కోరుకున్న కోరికలు తీరడం కోసరం దేవుడిని పూజించేవాడు భక్తుడు కాదు, తన భక్తులు తనను పూజించాలనీ, తనకు నివేదనలు, కానుకలు సమర్పించాలనీ కోరుకొనే దేవుడు దేవుడు కాడు.

(ఇప్పుడు ఒక్కసారిఆలోచించండి. రోజూ ఈ మానవులు చేస్తున్న పనేమిటి. మనం చేసే వ్రతాలు, పూజలు, నివేదనలు, హుండీలో వేసే కానుకలు, ఇచ్చే విరాళాలూ, చేయించే బంగారు తొడుపులూ, వజ్రకిరీటాలూ ఇవన్నీ నిష్కామం గా చేస్తున్నామా లేక భగవంతుడి నుండి ఏదో ఆశించి ఆయన మన కోరికలు తీరుస్తాడని చేస్తున్నామా! అలా చేస్తే అది దేవుడితో చేసే వ్యాపారమే కానీ భక్తి కాదు అని ప్రహ్లాదుడు స్పష్టం చేసాడు.

ఒకాయన తాను చేసే అక్రమాల నుండి తనను రక్షించమని దేవుడికి 7 కోట్లుపెట్టి వజ్రాల కిరీటం చేయించాడు. కాని

చేయించిన కొద్ది రోజులకే ఆయన జైల్లో పడ్డాడు. ఇది వ్యాపారం కాదా! అధికారం లో ఉన్న ఒకాయన ప్రాణాలను బాంబు దాడి నుండి భగవంతుడు కాపాడితే, ఆయన దానిని అడ్డం పెట్టుకొని, "నా మీద బాంబులు వేసారు, నామీద జాలి చూపించి నాకు ఓట్లు వేయండి" అని అర్థాంతరంగా ఎన్నికలలోకి దిగితే, ఉన్న అధికారం ఊడింది. కాబట్టి భగవంతుడు ఇటువంటి వారిని క్షమించడు అని అర్థం అయింది కదా. భగవంతునితో వ్యాపారం చేయడం అనర్థకం అని ప్రహ్లాదుడు ఆనాడే చెప్పాడు. అది ఈనాటికీ వర్తిస్తుంది.)

ఓ దేవదేవా!' నేను నిష్కామ భక్తుడను. నిన్ను ఏమీ కోరను. నువ్వు కూడా నా నుండి ఏమీ ఆశించని భగవంతుడివి. అందువలన నాకూ నీకూ ఈ నాటి  రాజు, భృత్యుడు అనుబంధం లేదు. నీకు నాకు వరాలు ఇవ్వాలని అంతగా అనిపిస్తే, నా హృదయంలో ఎన్నటికీ కామ వాంఛలు, కోరికలు కలగకుండా వరం ప్రసాదించు. నా మనస్సు నీ పాదాల మీద నిరంతరం లగ్నం అయి ఉండేటట్టు వరం ప్రసాదించు.

ఓ దేవా!  మానవునికి హృదయం ముఖ్యం. దాని నుండే కామ వాంఛలు, కోరికలు బయలుదేరుతాయి. ఒకసారి కోరికలు పుట్టడానికి మొదలుపెట్టాయంటే అవి ఇంద్రియములను, మనస్సును, ప్రాణమును, దేహమును, ధర్మమును, ధైర్యమును, బుద్ధిని, సిగ్గును, సంపదలను, కీర్తిని సర్వనాశనం చేస్తాయి. ఏ అనర్థానికైనా మూలం కోరికలే. కాబట్టి మానవులు కోరికలను వదిలి పెడితే, వారు నిన్ను చేరుకోగలరు. మానవులు నిన్ను ఏ కోరికలు కోరకుండా ఉంటే, నీవే వారికి అనంతమైన ఐశ్వర్యములను ప్రసాదిస్తావు. ఈ విషయం తెలియని మూర్ఖులు నిన్ను ప్రతిరోజూ ఎన్నో కోరికలు కోరుతుంటారు.

ఓ దేవదేవా! నీవు ఐశ్వర్య సంపన్నుడవు. పరమ పురుషుడవు. మహాత్ముడవు. మా దు:ఖములను అంతం చేసే శక్తి కలవాడివి. నృసింహావతారంలో మా ముందు ప్రత్యక్షం అయ్యావు. అట్టి నీకు నమస్కరిస్తున్నాను."అని ప్రహ్లాదుడు నృసింహమూర్తికి నమస్కరించాడు.

(పైన చెప్పబడిన విషయములను స్వామి చిన్మయానంద గారు ఒకసారి తన గీతోపన్యాసాలలో చాలా తమాషాగా చెప్పారు. స్వామివారు ఒకసారి విదేశాలలో పర్యటిస్తున్నప్పుడు ఒక విదేశీయుడు స్వామి వారిని ఒక ప్రశ్న అడిగాడట. "స్వామీజీ! మీ హిందూ దేవుళ్లు అందరూ ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతుంటారు. ఏడుస్తున్న దేవుడు, బాధపడుతున్న దేవుడు కనిపించడు. దానికి కారణం ఏమి?" అని అడిగాడట. దానికి స్వామీజీ నవ్వి ఆయనకు సమయస్ఫూర్తితో ఈ క్రింది విధంగా సమాధానం చెప్పాడట.

"ఏమీలేదు. భగవంతుడు ఈ భూమిని సృష్టించాడు. భూమిలో నుండి వజ్రములు, బంగారము, ఖనిజములు ఇచ్చాడు. రకరకాలైన పంటలు పండటానికి వర్షాలను కురిపించాడు. ఆ భూమిని అందరినీ అనుభవించమన్నాడు. మానవుడికి పనులు చేయడానికి చేతులు ఇచ్చాడు. నడవడానికి కాళ్లు ఇచ్చాడు. తినడానికి నోరు ఇచ్చాడు. అరిగించుకోడానికి కడుపు ఇచ్చాడు. అన్నీ అందరినీ సమానంగా అనుభవించమన్నాడు. కానీ ఈ మానవుడు ఏం చేస్తున్నాడు. పొద్దుటే లేచి, వెధవ మొహం వేసుకొని, భిక్షా పాత్ర పట్టుకొని దేవుడి ఎదురుగా నిలబడి "స్వామీ! నాకు అది కావాలి. ఇది

కావాలి. వాడు నాశనం కావాలి. నేను బాగుపడాలి. ఊళ్లో ఉన్న సంపదలు అన్నీ నాకే కావాలి." అంటూ అడ్డమైన కోరికలు కోరుతున్నాడు. అందుకు లంచంగా ఒక పండు కానీ, కొబ్బరికాయ గానీ నైవేద్యంపెడుతున్నాడు. అది చూచిన దేవుడు "నేను నీకు అన్నీ ఇచ్చాను కదా వాటిని, అందరూ సమంగా పంచుకొని, తనివిదీరా అనుభవించకుండా, ఈ దరిద్రం ఏమిట్రా నీకు" అంటూ దేవుడు చిరునవ్వునవ్వుతున్నాడు." అని స్వామీజి చమత్కారంగా సమాధానం చెప్పాడట. ఈ సమాధానం పైన చెప్పిన ప్రహ్లాదుడి సమాధానికి అన్వయించుకుంటే సరిపోతుంది కదూ!)

ఆ ప్రకారంగా ప్రహ్లాదుడు ప్రార్థించిన తరువాత భగవానుడు ప్రహ్లాదుని చూచి ఇలా అన్నాడు. "కుమారా! నీ వలె ఏకాగ్రత కలిగినభక్తులు ఈ లోకములో ఉన్న సుఖములను కానీ, పరలోకములో ఉన్న సుఖములు గాని కోరుకోరు. నీవు అడక్కుండానే నేను నీకు ఒక వరము ఇవ్వదలిచాను. నీవు ఈ మన్వంతరము చివర వరకూ దైత్యులకు అధిపతివై ప్రాపంచిక సుఖములను అనుభవిస్తూ రాజ్యపాలన సాగిస్తావు. కాని నీవు మాత్రము ఈ ప్రాపంచిక సుఖముల పట్ల ఆసక్తి లేకుండా, ఎల్లప్పుడూ నన్ను కీర్తిస్తూ, నా కథలను వింటూ, సర్వభూతముల యందు ఉన్న నన్ను తలచుకుంటూ, నీవు చేసే అన్ని కర్మలను నాకు అర్పిస్తూ, జీవితం గడుపు. నీవు పూర్వజన్మలలో చేసిన పుణ్యమును ఈ జన్మలో సుఖముల రూపంలో అనుభవించు. పూర్వ జన్మలో చేసిన పాపములను ఈ జన్మలో పుణ్య కార్యములు చేయడం ద్వారా పోగొట్టుకో. నీ కీర్తి మూడు లోకములలో వ్యాప్తి చెందుతుంది. నీవు క్రమ క్రమంగా ఈ ప్రాపంచిక బంధనములనుండి విడి వడి

తుదకు నన్ను చేరుకో. ఎవరైతే నీ చరిత్రను, నా చరిత్రను, నీవు చేసిన స్తోత్రమును చదువుతారో, వింటారో, వారికి ఈ కర్మబంధనములనుండి విముక్తి లభిస్తుంది." అని పలికాడు భగవానుడు.

అప్పుడు ప్రహ్లాదుడు నృసింహమూర్తితో ఇలా అన్నాడు.

" ఓ దేవదేవా! నా వంటి కృపణులను రక్షించేవాడా! నా తండ్రి అయిన హిరణ్యకశిపుడు తన అవసాన దశలో నిన్ను చూస్తూ, నీ శరీరాన్ని తాకుతూ మరణించాడు. అందుకని ఆయన పవిత్రుడు అయ్యాడు. కానీ, నా తండ్రి తనజీవితం అంతా నిన్ను ద్వేషిస్తూ గడిపాడు. నీ గురించి, నీ మహత్తు గురించి తెలుసుకోలేక కేవలం నిన్ను తనసోదరుని చంపిన హంతకునిగానే భ్రమించాడు. నిన్నే కాదు, నన్ను కూడా దూషించాడు. హింసించాడు. ఎంతో పాపం చేసాడు. నీవు దయయుంచి నా తండ్రిని క్షమించి, నా తండ్రిని పాపవిముక్తుడిని చెయ్యి. నా తండ్రిని పవిత్రుడిగా అనుగ్రహించు. ఇదే నీవు నా ఇచ్చే వరం." అని కోరాడు ప్రహ్లాదుడు.

ఆ మాటలు విన్న భగవానుడు ఇలా అన్నాడు. "కుమారా! నీవు ఈ అసుర వంశంలో పుట్టడం వలన, నీ తండ్రి ఒక్కడే కాదు, నీ వంశంలో నీతో పాటు 21 తరాల వారు పవిత్రులయ్యారు. నీవే కాదు, నీ వంటి ప్రశాంత మైన మనస్సు కలవారు, అందరినీ సమానంగా చూచేవారూ, సాధువులు, ఆచార, వ్యవహారములను పాటించేవారు, నా మీద అచంచల మైన భక్తి కలవారూ ఎక్కడ నివసిస్తూ ఉంటారో ఆ ప్రదేశములు ఎల్లప్పుడూ పవిత్రంగా ఉంటాయి. పైలక్షణములు కలిగిన నా భక్తులు సకల ప్రాణుల యందు సమబుద్ధికలిగి ఉంటారు. ఎవరికీ

ఏ విధమైన కష్ట నష్టములను కలుగచేయరు. అంతే కాదు! నీ వంటి వారే నాకు అత్యంత ప్రియమైన భక్తులు. ఆ భక్తులలో కెల్లా నీవు శ్రేష్టుడవు. మూడులోకములలో ఉన్న భక్తులకు నీవు ఆదర్శప్రాయుడవు. భక్తుడు అంటే నీ మాదిరి ఉండాలి అని అందరూ అనుకుంటారు.

కుమారా! నా స్పర్శతో పవిత్రమైన నీ తండ్రి శరీరమునకు దహన సంస్కారములు యధావిధిగా నిర్వర్తించు. నీ వంటి గుణవంతుడైన పుత్రుని చేత అంతిమసంస్కారములు చేయించుకున్న నీ తండ్రి ఉత్తమలోకములు పొందుతాడు. తరువాత నీవే ఈ దైత్యులకు అధిపతివి. వేదములలో చెప్పిన మాదిరి సకల కర్మలు నిర్వర్తించు." అని పలికాడు భగవానుడు.

ఇంతసేపూ బ్రహ్మ మొదలగు దేవతా గణములు దూర దూరంగా ఉన్నారు. నృసింహస్వామి శాంతించాడు అని తెలిసిన తరువాత అందరూ స్వామి దగ్గరగా వచ్చారు.

బ్రహ్మ శ్రీహరిని ఈ విధంగా స్తుతించాడు. "ఓ దేవదేవా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! పుట్టుక లేని వాడా! సనాతనుడా! నీ దయ వలన మూడులోకములకు కంటకుడుగా మారిన ఈ హిరణ్యకశిపుడు వధింప బడ్డాడు. ఇదంతానా వలననే జరిగింది. నా చేత సృష్టించబడిన ప్రాణుల చేత చావు లేకుండా ఇతడికి వరం ప్రసాదించాను. అదే ఇంత చేటు తెచ్చింది. నేను ఇచ్చిన వరాలతో గర్వించిన ఈ దైత్యుడు  ధర్మహాని చేసాడు. ముల్లోకవాసులను హింసించాడు. నా చేతనే కాదు, ఎవరి చేతా సృష్టించబడని నీవు ఇతనిని సంహరించావు. ఈ దైత్యుని పుత్రుడు, పరమభాగవతోత్తముడు

అయిన ఈ బాలుడు నీ శరణుజొచ్చాడు. ఇతని తండ్రిని చంపి ఇతనిని కాపాడావు. ఓ దేవా! నిన్ను ఈ నృసింహరూపములో ఎవరు కొలిచినా వారికి భయాందోళనలు దూరం అవుతాయి. వారు అకాల మృత్యువాత పడరు. వారికి సదా నీ రక్షణ కలుగుతుంది." అని బ్రహ్మదేవుడు పలికాడు.

ఆ మాటలు విన్న నృసింహదేవుడు "ఓ పద్మసంభవా! ఎంతో మంది నీ గురించి తపస్సు చేస్తుంటారు. నీవు వరాలు ఇస్తుంటావు. కానీ ఇటువంటి దుర్మార్గులకు వరాలు ఇచ్చేముందు కొంచెం వెనుకా ముందు ఆలోచించి వరాలు ఇవ్వాలి. లేకపోతే ఇటువంటి అనర్థములే కలుగుతాయి. ఇటువంటి వారికి అసాధారణమైన వరాలు ఇవ్వడం పాములు పాలు పోసినట్టు అవుతుంది." అని పలికాడు పరమాత్మ. తరువాత  తన నృసింహ రూపము ఉపసంహరించుకొని అదృశ్యం అయ్యాడు." అని నారదుడు ధర్మరాజుకు ప్రహ్లాద చరిత్ర వినిపించాడు. ఇంకా ఇలా అన్నాడు.

"ఓ ధర్మరాజా! ఆ ప్రకారంగా శ్రీహరి అంతర్హితుడు అయిన తరువాత, ప్రహ్లాదుడు బ్రహ్మ దేవుని, శివుని, ఇంద్రుని, ప్రజాపతులను, దేవతా గణములను  భక్తితోపూజించాడు. తరువాత బ్రహ్మ దేవుడు, శుక్రాచార్యుడు ప్రహ్లాదుని దైత్య, దానవులకు అధిపతిగా రాజ్యాభిషేకం చేసారు. తరువాత అందరూ తమ తమ నివాసములకు వెళ్లిపోయారు.

ఓ ధర్మనందనా! ఈ ప్రకారంగా విష్ణువు యొక్క పార్షదులైన జయవిజయులు తమ తొలి జన్మలో హిరణ్యాక్ష,

హిరణ్యకశిపులుగా జన్మించారు. తమ రెండవ జన్మలో రావణ, కుంభ కర్ణులుగా జన్మించారు. అయోధ్యాధి పతి అయిన రాముని చేతిలో ఇద్దరూ మరణించారు. తమ మూడవ జన్మలో శిశుపాల దంత వక్త్రులుగా జన్మించారు. నీ ముందే వారు శ్రీకృష్ణుని చేతిలో చంపబడ్డారు. జయవిజయులు ఈ మూడు జన్మలలో శ్రీహరిని అపరిమితంగా ద్వేషించి, వారి చేతిలో మరణించి, తొందరలోనే తమ నిజస్వరూపములను పొందారు. ఈ మూడు జన్మలలో వారు శ్రీహరి చేతిలో మరణించడం వలన, ఆయా జన్మలలో వారు చేసిన పాపముల నుండి విముక్తి పొందారు. వారి మూడవ జన్మలో శిశుపాల, దంతవక్త్రులే కాదు, వారి మిత్రరాజులు కూడా శ్రీకృష్ణుని ద్వేషించి, ఎల్లప్పుడూ, జీవితాంతం ఆ శ్రీకృష్ణుని తలచుకుంటూ, చివరకు ముక్తి పొందారు.

ఓ ధర్మనందనా! నీవు ఈ శిశుపాలుడు, దంతవక్త్రుడు ఎందుకు ముక్తి పొందారు అని అడిగావు కదా. నీకు వారి పూర్వ కథ గురించి వివరంగా చెప్పాను. ఇందులో నీకు శ్రీహరి ధరించిన అవతార విశేషములనుకూడా వివరించాను. మహాభక్తుడు అయిన ప్రహ్లాదుని చరిత్రను, అతని భక్తి, జ్ఞాన, వైరాగ్యములను, సృష్టి, స్థితి, లయములకు అధిపతి అయిన ఆ పరమాత్మ యొక్క అవతార విశేషములను, దేవతలు, దానవులు కాలానుగుణంగా ఒక సారి దేవతలు విజేతలైతే, ఒకసారి దైత్య,దానవులు విజేతలు అవుతారు అన్న సత్యాన్ని, నీకు వివరించాను. అంతే కాకుండా, భక్తి తత్వాన్ని, అచంచల మైన భక్తితో ఆ పరమాత్మనుపొందే విధానాన్ని, భాగవత ధర్మాన్ని, ఆధ్యాత్మిక తత్వాన్ని వర్ణించాను. ఈ ప్రహ్లాద చరిత్రను భక్తితో చదివినా, విన్నా, వారు ఈ కర్మబంధనముల నుండి విముక్తిపొందుతారు

అనడంలో సందేహము లేదు. అంతే కాదు నృసింహావతారంలో శ్రీహరి ప్రదర్శించిన లీలావిశేషములను చదివినా, వినినా, వైకుంఠప్రాప్తిని పొందుతాడు.

ఓ ధర్మనందనా! ప్రహ్లాదుని సంగతి అటుండనీ. ఆయనకు కేవలం కొన్ని ఘడియల సేపు భగవంతుని దర్శనం లభించింది. మీకు అలా కాదు. ఆ శ్రీహరి శ్రీకృష్ణపరమాత్మరూపంలో మీ ఇంట్లోనే ఉన్నాడు. ఆయన మీకు అత్యంత ప్రియమైనవాడు. మీకు స్నేహితుడు. మీకు బంధువు. మీకు ఆత్మస్వరూపుడు. మీచే అనునిత్యము పూజలందుకుంటున్నాడు. మీరు చెప్పిన మాట వింటున్నాడు. ఒక్కోసారి మీకు గురువుగా మీకు హితోపదేశం చేస్తుంటాడు. నిత్యమూ ఆ భగవానుని సందర్శన భాగ్యంతో పునీతులవుతున్న మీ అదృష్టం ఏమని చెప్పను!

(ఇక్కడ పోతన గారు ఒక అద్భుతమైన పద్యం రాసారు. దానిని మీకు అందిస్తున్నాను.)

మ॥జలజాతప్రభవాదులున్ మనములో జర్చించి భాషావళిం
బలుకం లేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు నీ యింటిలో
జెలియై మేనమఱందియై సచివుడై చిత్రప్రియుడై మహా
ఫలసంధాయకుడై చరించుటలు నీ భాగ్యంబురాజోత్తమా!

ఆ పరమాత్మ తత్వమును సాక్షాత్తు బ్రహ్మదేవుడు, శివుడు కూడా పరిపూర్ణంగా వర్ణించలేరు. శ్రీకృష్ణరూపములో ఉన్న ఆ

పరమాత్మ, జితేంద్రియుడు, భక్తసులభుడు. తన భక్తులను అనునిత్యం రక్షించే ఆ శ్రీకృష్ణునికి నమస్కారము.

ఓ ధర్మనందనా! పూర్వము మయుడు అదే దానవ శిల్పి ఉండేవాడు. అతడు మాయావి. ఎన్నో మాయలు నేర్చిన వాడు. ఆ మయుని మాయలను ఆ మహాదేవుడు కూడా ఛేదించలేక పోయాడు. తరువాత శ్రీహరి కలుగచేసుకొని మహాదేవుని కీర్తిని నిలబెట్టాడు. " అని అన్నాడు నారదుడు.

ఇప్పుడు ధర్మరాజుకు ఒక సందేహము వచ్చింది. "ఓ నారద మహర్షీ! ఈ మయుడి వలన మహాదేవుని కీర్తికి ఏ విధంగా భంగం కలిగింది. శ్రీహరి  ఏ విధంగా మహాదేవుని కీర్తిని మరలా విస్తరింపచేసాడు. ఈ విషయాలన్నీ నాకు వివరంగా చెప్పవలసినది." అని అడిగాడు. అప్పుడు నారదుడు ధర్మరాజుతో ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ ధర్మనందనా! ఒకసారి దేవతలకు దానవులకు ఘోరంగా యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దానవులు ఓడిపోయారు. వారు దిక్కుతోచక మాయా విద్యలలో గొప్పవాడైన మయుడి వద్దకు వెళ్లారు. దేవతలను జయించే ఉపాయము చెప్పమని కోరారు. అప్పుడు మయుడు దానవులకు మూడు పురములు నిర్మించి ఇచ్చాడు. అవి బంగారుపురము, వెండి పురము, లోహ పురము. ఈ పురములు ఆకాశంలో ఎగరగలవు. వాటిలో ఎన్నో యుద్ధపరికరములు ఉన్నాయి. (ఈ నాడు బాంబులను, మిస్సైల్సును మోసుకొని పోయే యుద్ధవిమానములు మాదిరి విమానములు కావచ్చు.)

ఆ మూడుపురములను దానవులకు ఇచ్చాడు మయుడు. దానవులు ఆ పురములు ఎక్కి దేవతల మీదికి యుద్ధానికి బయలుదేరారు. వారు ఆకాశంలో ఎగురుతూ దేవతల మీద అస్త్ర శస్త్రములను ప్రయోగించారు. మూడు లోకములను అల్లకల్లోలం చేయసాగారు. ఆ అస్త్ర శస్త్రముల ధాటికి తట్టుకోలేక దేవతలు మహాశివుని వద్దకు పోయి ఆయన శరణుజొచ్చారు. తమను ఆ రాక్షసుల బారి నుండి రక్షించమని వేడుకున్నారు.

వెంటనే శివుడు తన పాశుపత అస్త్రమును తీసుకున్నాడు. ఆ మూడుపురముల మీదికి పాశుపత అస్త్రమునుసంధించాడు. ఆ పాశుపత అస్త్రము నుండి నిప్పులు విరజిమ్ముతూ బాణములు ఆ విమానముల మీదికి దూసుకుపోయాయి. (గ్రౌండు టు ఏయిర్ మిసిలి అంటే నేల మీది నుండి పైన ఎగిరే విమానములను ఛేదించే అస్త్రములు కావచ్చు) ఆ పాశుపత అస్త్ర మహిమ వలన ఆ పురములు కనపడకుండా పోయాయి. ఆ పురములలో ఉన్న వారు అందరూ మరణించారు. ఇది చూచాడు మయుడు. చచ్చిన రాక్షసుల శరీరములకు అమృతము నిండిన బావిలో పడవేసాడు. (ఇదే రాక్షస గురువు శుక్రుడు వద్ద ఉన్న మృత సంజీవని అనుకోవచ్చు.) ఆ రాక్షసుల శరీరములు అమృతము నిండిన బావిలో పడగానే మరలా ప్రాణం పోసుకొని, రెట్టించిన బలంతో బయటకు వచ్చాయి.

తాను చంపుతుంటే, మరలా పుడుతున్న రాక్షసులను చూచి ఖిన్నుడయ్యాడు పరమశివుడు. ఇది గమనించాడు విష్ణువు. వెంటనే బ్రహ్మగారిని ఒక ఆవుగానూ, తాను దూడగానూ మారి

పోయారు. ఆవుదూడ రెండూ అమృతము నిండిన బావి దగ్గరకు పోయాయి. ఆ బావిలో ఉన్న అమృతమును పూర్తిగా తాగేసాయి. ఆవుదూడా అమృతమును తాగడం రాక్షసులు చూస్తున్నారు కానీ విష్ణుమాయ వలన ఏమీ అనకుండా అలా  చూస్తూనే ఉన్నారు. ఈ విషయం మాయావి అయిన మయుడికి తెలిసింది. రాక్షసుల పతనం తప్పదనుకున్నాడు. విధివిధానమును తప్పించడానికి తనకు శక్తిలేదనుకొని ఊరుకున్నాడు.

తరువాత పరమశివుడు అస్త్ర శస్త్రములను ధరించాడు. ధర్మాన్ని రథంగానూ, జ్ఞానమును సారథిగానూ, వైరాగ్యమును ధ్వజముగానూ, ఐశ్వర్యములను గుర్రములు గానూ, తపస్సును ధనుస్సుగానూ, విద్యను కవచము గానూ, క్రియలను బాణములు గానూ ధరించి, పరమశివుడు రాక్షసుల మూడు పురములను నాశనం చేసాడు. (ఈ వర్ణన యోగ పరంగా చెప్పబడింది. మూడుపురములు అంటే బంగారు పురము  సత్వగుణమునకు, రజిత పురము రజోగుణమునకు, లోహపురము తమోగుణమునకు సంకేతములు. ఈ గుణముల నుండి పుట్టేవే కోరికలు. అమృతపు బావిలో  వేస్తే మరలా పుట్టడం అంటే ఒక కోరిక చస్తే మరొక కోరిక పుడుతుంది. మరి ఈ కోరికలను తుదముట్టించడానికి పరమశివుడు ధర్మమును, జ్ఞానమును, వైరాగ్యమును, ఐశ్వర్యములను, తపస్సును, విద్యలను, క్రియలను ఆయుధములుగా చేసి కోరికలను నాశనం చేసాడుఅని యోగపరంగా అర్థం చేసుకోవచ్చు.)

మూడుపురములునాశనం కాగానే దేవ దుందుభులు మోగాయి. అప్సరసలు నాట్యం చేసారు. పూల వాన కురిపించారు. మూడుపురములను నాశనం చేసిన వాడు కాబట్టి ఈశ్వరునకు

త్రిపురాంతకుడు అనే పేరు వచ్చింది. ఓ ధర్మనందనా! నీవు అడిగినవి అన్నీ చెప్పాను. ఇంకా ఏమైనా సందేహములు ఉంటే అడుగు." అని అన్నాడు నారదుడు.

శ్రీమద్భాగవతము
సప్తమ స్కంధము పదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
సప్తమ స్కంధము
పదకొండవ అధ్యాయము.

నారదుడు తనను సందేహములు అడగమన్నాడు కదా అని ధర్మరాజు తన సందేహాల చిట్టా విప్పాడు.

"ఓ నారద మహర్షి! ఈ లోకంలో ఇన్ని ధర్మాలు ఉన్నాయి కదా! మరి ఏ ధర్మాన్ని అనుసరిస్తే మానవులు పరమగతిని పొందుతారు. మానవులు ఆచరించవలసిన వర్ణాశ్రమ ధర్మములతో కూడిన సనాతన ధర్మము గురించి నాకు తెలియజేయండి. నువ్వు సాక్షాత్తు ఆ బ్రహ్మగారి కుమారుడివి. నీవుచేసిన తపస్సు ద్వారా, యోగము ద్వారా, సమాధి ద్వారా, నీవు బ్రహ్మగారి ఇతర కుమారుల కన్నా ఉత్తమమైన స్థితిలో ఉన్నావు. ఈ లోకంలో ఉన్న విప్రులు నీ మాదిరి గానే శాంత గుణము, సాధు గుణము, దయాగుణము,

భగవంతుని మీద భక్తి కలిగి ఉన్నారు. అటువంటి విప్రులు అత్యతంత రహస్యమైన పరమ ధర్మమును గురించి తెలుసుకొని ఉన్నారు. కాని నా వంటి వారికి పరమ ధర్మము గురించి ఏమీ తెలియదు. కాబట్టి నాకు పరమ గతి గురించి, సనాతనధర్మము గురించి చెప్పవలసినది." అని ధర్మరాజు నారదుని అడిగాడు.

ధర్మరాజు అడిగిన ప్రశ్నకు సమాధానంగా నారదుడు ఈ విధంగా చెప్పాడు. "ఓ ధర్మనందనా! మంచి ప్రశ్న అడిగావు. నేనుకూడా ఈ సనాతనధర్మము గురించి, పర ధర్మము గురించి సాక్షాత్తు నరనారాయణులలో ఒకరైన నారాయణుని ద్వారా విని ఉన్నాను.

ఈ నారాయణుడు ధర్మునికి, మూర్తి దేవికి కుమారుడిగా జన్మించాడు. వెంటనే బదరికా వనమునకు తపస్సు చేసుకోడానికి వెళ్లిపోయాడు. ఇప్పటికీ నరనారాయణులు బదరికావనములో తపస్సు చేసుకుంటున్నారు.

ఓ రాజా! సర్వధర్మములకు మూలము ఆ పరమాత్మ ఒక్కడే. వేదములలో స్మృ తి ఆయనే. సకల శాస్త్రములకు ప్రమాణము ఆ పరమాత్మే. ధర్మమును ఆచరిస్తే మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. మానవులు ఆచరించ వలసిన ధర్మములు ముప్పది ఉన్నాయి. వాటిని వరుసగా చెబుతాను విను.

1.సత్యము పలకడం.
2.సాటి వారి మీద దయకలిగి ఉండటం.
3. ఏ పని చేసినా ఒక తపస్సు మాదిరి ఏకాగ్రతతో చెయ్యడం.

4. ప్రతిరోజూ స్నానం చేసి, ఉతికిన వస్త్రములు ధరించడం. శుచిగా ఉండటం.

5. ఎంత కష్టము వచ్చినా ఓర్చుకొని ఉండటం.

6.మంచి చెడు విచక్షణ కలిగి ఉండటం.

7.మనస్సు నిగ్రహించుకోవడం.

8.ఇంద్రియములను నిగ్రహించుకోవడం.

9.ఇతరులను మానసికంగా కానీ, శారీరకంగా కానీ హింసించకుండా ఉండటం.

10.బ్రహ్మచర్యము పాటించడం. (గృహస్థులు బ్రహ్మచర్యము పాటించడం ఎలాగా అని సందేహము రావచ్చు. కేవలం సంతానము కొరకు భార్యతో సంగమించడం బ్రహ్మచర్యము కిందికే వస్తుంది.)

11.త్యాగము అంటే తనకు అవసరం లేని దానిని ఇతరులకు అవసరమైన దాన్ని త్యాగం చేయడం.

12.దానం అంటే ఉన్నదానిలో ఇతరులకు దానం చేయడం. అంతా నాకే కావాలి అనే స్వార్థ బుద్ధిని విడిచిపెట్టి, తనకు ఉన్న దానిని ఇతరులతో పంచుకోవడం.

13. వేదములను, శాస్త్రములను చదివి అర్థం చేసుకోవడం.

14. ఇతరులతో నెమ్మదిగా, నిదానంగా మాట్లాడటం, స్నేహభావంతో ఉండటం.

15. ఎల్లప్పుడూ ఉన్నదానితో తృప్తి చెందుతూ సంతోషంగా ఉండటం.

16.భగవంతుని భక్తులనుసేవించడం. వారు చెప్పే మంచి మాటలు వినడం.

17. ఒక్కసారిగా కాకుండా, మెల్ల మెల్ల గా మనస్సును ఈ ప్రాపంచిక విషయములనుండి వెనక్కులాగి, భగవంతుని వైపు మళ్లించడం.

18. అనవసరమైన పనులు చేయడం, వాటి ఫలితములను అనుభవించడం మానుకోవాలి.

19. అనవసరంగా మాట్లాడటం మానుకోవాలి. వీలైనంత వరకు మౌనంగా ఉండాలి.

20. అలా మౌనంగా ఉంటూ ఆత్మ విమర్శ చేసుకోవాలి.

21.తన కడుపుకు మాత్రమే ఎక్కసంగా తినకుండా, సాటి ప్రాణులకు కూడా తాను తినే దానిలో పెట్టడం.

22. ఈ చరాచరజగత్తులోఉన్న అన్ని ప్రాణులలో భగవంతుని దర్శించడం.

23. ముఖ్యంగా సాటి మనుషులలో కుల, మత, ప్రాంత భేదాలు లేకుండా అందరినీ సమానంగా చూడటం.

24. తనకన్నా తెలిసిన వారిని ఆశ్రయించి, తెలియని విషయములను తెలుసుకోవడం.

25.తీరికసమయాలలో భగవంతుని ధ్యానించడం, పరమాత్మ లీలలనుకీర్తించడం, స్మరించడం.

26.పరమాత్మను పూజించడం, సేవించడం.

27.పరమాత్మకు, పెద్దలకు నమస్కరించడం.

28. పరమాత్మకు దాసుడిగా మారడం.

29. పరమాత్మ పట్ల స్నేహంగా ఉండటం.

30.ఆఖరుగా ఆ పరమాత్మకు తన ఆత్మను సమర్పించుకోవడం. తానే పరమాత్మ, పరమాత్మేతాను అనే స్థితికి చేరుకోవడం.

ఇవీ ప్రతి మానవుడూ ఆచరించవలసిన పరమ ధర్మములు అని పూర్వము ఋషులు చెప్పారు. ఈ ధర్మములను పాటించిన వారిపట్ల ఆ పరమాత్మ కూడా దయతో సంతోషంతో ఉంటాడు.

ధర్మరాజా! ప్రతిమానవుడికీ కొన్ని సంస్కారములు విధింపబడ్డాయి. వివాహము అయిన తరువాత వారికి గర్భాదానం అనే సంస్కారముజరుగుతుంది. ఆ విధంగా పురుషుడి బీజము స్త్రీలోకి ప్రవేశించి అండముగా తయారవుతుంది. అది పిండముగా మారి, అవయవనిర్మాణము జరిగి శిశువుగా బయటకు వస్తుంది. అప్పుడు జాతక కర్మ అనే సంస్కారము నిర్వహిస్తారు. తరువాత ఉపనయనము, వివాహము మొదలగు సంస్కారములు నిర్వహిస్తారు. ఈ ప్రకారంగా ఎవరి కైతే అన్ని సంస్కారములు సక్రమంగా నిర్వహింపబడతాయో, అతనిని ద్విజుడు అనగా రెండు సార్లు పుట్టినవాడు అని అంటారు.

ఉపనయనముతో మరొకజన్మ ఎత్తినట్టు అవుతుంది. ఈ ద్విజత్వము కులము చేత, ఆచారముల చేత పరిశుద్ధులయిన బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు..వీరికి సంక్రమిస్తుంది. వీరు యజ్ఞములు చేయుటకు వేదములు అధ్యయనము చేయుటకు, దాన ధర్మములు చేయుటకు, బ్రహ్మ చర్యము మొదలగు ఆశ్రమ నియమములనుపాటించుటకు అర్హులు అవుతారు. బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యులకు పైన చెప్పబడిన కర్మలు విధింపబడ్డాయి. ఇవే కాకుండా బ్రాహ్మణులు అయిన వాళ్లు ఆరు కర్మలను నిర్వర్తించాలి. అవి ఏమిటంటే.... వేదములను అధ్యయనం చేయడం, వేదములను ఇతరులచేత అధ్యయనం చేయించడం, ఇతరుల నుండి దానములు తీసుకోవడం, ఇతరులకు దానం చేయడం, యజ్ఞములు చేయడం, ఇతరుల చేత యజ్ఞములు చేయించడం. ఇవి బ్రాహ్మణులు ఆచరించవలసిన షట్కర్మలు.

క్షత్రియులు కూడా ఈ ఆరు కర్మలు చేయాలి కానీ, ఇతరుల నుండి దానమును తీసుకోరాదు. కానీ ఇతరుల నుండి పన్ను రూపంలో ధనమును తీసుకొన వచ్చును. ఆ పన్నుల రూపంలో వచ్చిన ధనమును మరలా ప్రజలకు సౌకర్యములు కలిగించుటకు వినియోగించి, మిగిలిన దానిలో కొంత ధనమును తన జీవనము నిమిత్తము ఉపయోగించు కోవచ్చును.

వైశ్యులు ఎల్లప్పుడూ బ్రాహ్మణుల అవసరములను తీరుస్తూ ఉండాలి. అంతే కాకుండా వైశ్యులు వ్యవసాయము, పంటలు పండించడం, వ్యాపారము చేయడం, పశుపోషణ, మొదలగు వృత్తుల ద్వారా తమ పోషణను నిర్వహించుకోవాలి.

ఇంక శూద్రులు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను సేవిస్తూ, వారు ఇచ్చిన ధనముతో పోషణ జరుపుకోవాలి. (ఈ శూద్ర ధర్మానికి విపరీత అర్థం చెబుతారు. కాని అసలు అర్థం ఇలా చెప్పుకోవచ్చు. సేవించడం అంటే సర్వీస్ చేయడం. వారు ఇచ్చిన ధనముతో పోషణ జరుపుకోవాలి. అంటే ఉద్యోగం చేయడం. . జీతం తీసుకోవడం. ఉ ద్యోగం అంటే ఐ.ఏ.యస్, ఐ.పి.యస్ దగ్గర నుండి కింది తరగతి ఉ ద్యోగి వరకు వర్తిస్తుంది. వారు ఇచ్చినది అంటే వీరికి జీతాలు అన్నీ ప్రజలు కట్టినపన్నుల నుండి వస్తాయికదా! ఇలా అర్థం చేసుకుంటే ఈ రోజుల్లో వాణిజ్యం, వ్యాపారం, వ్యవసాయం చేసేవాళ్లు అందరూ వైశ్యులు అనీ, మిలిటరీ అంతా క్షత్రియులు, సర్వీస్‌లో ఉన్న వారు అందరూ శూద్రులే అని అనుకోవాల్సివస్తుంది. )

సాధారణంగా మానవులు భూమిని దున్ని పంటలు పండించి జీవిస్తారు. కాని అందులో జీవహింస జరిగే అవకాశం ఉంది. కాబట్టి ఇతరులను యాచించకుండా, ఎవరైనా ఇస్తే తీసుకొని జీవించడం మంచిది. దాని కంటే ఇతరుల నుండి ధాన్యమును యాచించి జీవించడం మంచిది. యాచించడం అవమానకరము అనుకుంటే, కర్షకులు ధాన్యమును ఇంటికి తీసుకొని వెళ్లిన తరువాత, పొలములో కింద పడి పోయిన ధాన్యము గింజలను ఏరుకొని జీవించడం మంచిది.  ఈ ధర్మములను నాలుగు వర్ణముల వారూ పాటించాలి.

కాని కొన్ని క్లిష్టసమయములలో, బ్రాహ్మణ, వైశ్య, శూద్రులు తమ తమ ధర్మములను తప్పి పరధర్మములను ఆశ్రయించవచ్చును. అంటే ఏ వృత్తి అయినా చేయవచ్చును.  కానీ, క్షత్రియులు మాత్రము ఎట్టి పరిస్థితులలో కూడా క్షాత్రమును విడిచి పరధర్మము అయిన యాచించడం మంచిది కాదు. ఆపత్కాలములలో ఎవరైనా ఏ వృత్తి అయినా చేపట్టి జీవించవచ్చును. అది దోషము కాదు.

పైన చెప్పిన వృత్తులలో పొలాలలో గింజలు ఏరుకోవడం, ఇతరుల నుండి ధాన్యమును యాచించడం, ఋతము అంటారు. ఎవరైనా ఇస్తే తీసుకొని జీవించడాన్ని అమృతము అంటారు. ప్రతిరోజూ ఇతరులను యాచించి జీవించడం, కర్షకవృత్తి చేసి ధాన్యమును పండించి, జీవించడం  ప్రమృతము అంటారు. వ్యాపారం చేయడంలో కొంత నిజం చెప్పాలి మరి కొంత అబద్ధం చెప్పాలి. ఇంక సేవకా వృత్తియందు యజమాని చెప్పినట్టు చేయాలి. కాబట్టి ఈ రెండింటినీ

నీచవృత్తులు అని పెద్దలు నిర్వచించారు. అందుకే, బ్రాహ్మణులకు, క్షత్రియులకు వాణిజ్యము, సేవకావృత్తి నిషేధించారు.

ఓ ధర్మనందనా! పుట్టుకతో ఎవరూ బ్రాహ్మణులు కాలేరు. ఈ క్రింది ధర్మములను ఆచరించిన వాడే బ్రాహ్మణుడు అనిపించుకుంటాడు.

బ్రాహ్మణుడు అయిన వాడు ఇంద్రియములను, మనస్సును అదుపులో పెట్టుకోవాలి. ఏ పని చేసినా దానిని ఒక తపస్సులాగా చేయాలి. ఎల్లప్పుడూ శుచిగా ఉండాలి. ఉన్నదానితో తృప్తిగా జీవిస్తూ సంతోషంగా ఉండాలి. అందరినీ క్షమించగలిగే గుణము కలిగి ఉండాలి. సాటి వారితో పరుషంగా కాకుండా ఎంతో సరళంగా మాట్లాడాలి. శాస్త్ర పరిజ్ఞానము కలిగి ఉండాలి. సాటి వారి పట్ల, జంతువుల పట్ల దయకలిగి ఉండాలి. ఎల్లప్పుడూ సత్యమునే పలకాలి. అబద్ధములను చెప్పకూడదు. భగవంతుని మీద భక్తితో, తన సర్వస్వమునూ ఆ పరమాత్మకే అర్పించుకోవాలి. ఇవి బ్రాహ్మణులకు ఉండవలసిన లక్షణములు. ఈ లక్షణములను కలిగిన వారిని బ్రాహ్మణులు అని అంటారు.

శౌర్యము, వీరత్వము, ధైర్యము, తేజస్సు, దానగుణము, ఆత్మ తత్వమును తెలుసుకోవడం, క్షమాగుణము కలిగి ఉండటం, బ్రాహ్మణులను పూజించడం, ఇతరుల ఎడల ప్రసన్నంగా ఉండటం, ఎల్లప్పుడూ సత్యమునే పలకడం ఇవీ క్షత్రియుని లక్షణములు.

దేవతల యందు భక్తి ప్రమత్తులు కలిగి ఉండటం, గురువులనుపూజించడం, భగవంతుని ఎడల అచంచలమైన భక్తి కలిగి ఉండటం, ధర్మంగా ధనం సంపాదించడం, ధర్మంగా కోరికలను తీర్చుకోవడం, వేదముల యందు విశ్వాసము కలిగి ఉండటం, ప్రతిరోజూ ధన సంపాదన మీద లగ్నం చేయడం, ధనం సంపాదించడంలో, వ్యాపారం చేయడంలో నేర్పుగా వ్యవహరించడం, ఇవీ వైశ్యులకు ఉండవలసిన లక్షణములు.

బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యులను గౌరవంగా చూడటం, వారికి నమస్కరించడం, శుచిగా ఉండటం, మనసులో ఎటువంటి దురాలోచన లేకుండా ఇతరులకు సేవచేయడం, ఎల్లప్పుడూ నిజం చెప్పడం, గోవులను బ్రాహ్మణులను పూజించడం, రక్షించడం, ఇవీ శూద్రుల లక్షణములు.

భర్తను పూజించడం, భర్తకు అనుకూలంగా ఉండటం, భర్తయొక్క బంధువులను ఆదరించడం, భర్త చెప్పిన మాట వినడం, ఇవీ పతివ్రతా లక్షణములు. ప్రతి స్త్రీ రోజూ తగినట్టుగా అలంకరించుకోవాలి. మంచి ఉతికిన వస్త్రములు ధరించాలి. ఎల్లప్పుడూ శుభ్రంగా ఉండాలి. ఇంటి శుభ్రంగా ఉంచుకోవాలి. ఉన్నంతలో ఇంటిని చక్కగా అలంకరించాలి. ఇంట్లో ఉన్న వస్తువులను చక్కగా పొందికగా అమర్చుకోవాలి. భర్తయొక్క కోరికలకు అనుగుణంగా నడచుకోవాలి. వినయంగా ఉండాలి. చిత్త చాంచల్యమునకు లోనుకాకుండా మనస్సును, ఇంద్రియములను అదుపులో ఉంచుకోవాలి. ఇతరులతో ప్రియంగానూ, మృదువుగానూ

సంభాషించాలి. ఎప్పుడూ సత్యమునే పలకాలి. ఎల్లప్పుడూ భర్తసేవలో నిమగ్నం అయి ఉండాలి. దొరికిన దానితో, భర్త తెచ్చిన దానితో తృప్తి పడాలి. లేనిది కావాలని ఆరాటపడకూడదు. ఉన్నంతలో ఇతరులకు పెట్టాలి కానీ అంతా నాకే కావాలని అనుకోకూడదు. ఇంటి పనులను నైపుణ్యంతో చక్కదిద్దుకోవాలి. ఏ సమస్య వచ్చినా సామరస్యంతో పరిష్కరించుకోగలగాలి. అందరితో స్నేహంగా ఉండాలి. ఇవీ దుర్మార్గుడు కాకుండా, పాతకుడు కాకుండా, ఒక మంచి లక్షణములు కలిగిన భర్తకు ఇల్లాలిగా ఉన్న స్త్రీకి ఉండవలసిన లక్షణములు. (భర్త దుర్మార్గుడు దుష్టుడు, క్రూరుడు అయితే భార్య కూడా దానికి తగినట్టే ఉండాలి కానీ, పతివ్రతా లక్షణాలు పనికి రావు అని భావము.) మంచి లక్షణములు కలిగిన భర్తను భక్తితో సేవించిన భార్య, వైకుంఠములో భర్తతో సహా సుఖించగలదు.

ఈ నాలుగు వర్ణముల వారు కాకుండా మిగిలిన వారు, వారి వారి కులములకు నిర్దేశించిన వృత్తులు చేసుకుంటూ జీవించాలి. అంతేకానీ, దొంగతనములు, మోసము చేసి జీవించకూడదు. ఒక్కొక్క యుగమునకు ఒక్కొక్క ధర్మం ఉంటుంది. ఆ యా యుగములలో ఆయాధర్మములను పాటించాలి. అప్పుడే వారికి ఈ లోకములో గానీ, పరలోకములోగానీ సుఖము శాంతి లభిస్తాయి.

ఈ లోకములో ఉన్న మానవులు తమకు నిర్దేశింపబడిన కర్మలు చేస్తూ, ఆ కర్మలను ఎటువంటి ఫలాపేక్ష లేకుండా చేస్తూ, చివరకు మోక్షపదమును చేరుకుంటారు.

రాజా! ఇంకొక్క విషయము. కోర్కెలు తీర్చుకోవడం, కామ కోరికలు అనుభవించడం మానవ సహజం. కానీ అది మితంగా ఉండాలి కానీ అతి పనికిరాదు. అదే పనిగా కామ కోరికల మీద ఆసక్తి పెంచుకుంటే, చివరకు ఆ కామకోరికల మీద విరక్తి పుడుతుంది. ఒకే చోట అదే పనిగా విత్తనములు నాటుతుంటే, ఆ నేల బలహీనం అవుతుంది. మొక్కలుమొలవవు. అదే మాదిరి, అగ్నిలో ఒక్క నేతి చుక్క వేస్తే భగ్గున మండుతుంది. కాని అదేపనిగా నెయ్యి అగ్నిలో పోస్తే ఆ అగ్ని ఆరిపోతుంది. కామ కోరికలు కూడా అదేపనిగా అనుభవిస్తుంటే, ఆనందం కలగకపోగా, చివరకు విరక్తి పుడుతుంది.

ఓ రాజా! ఇప్పటి వరకూ నేను నీకు మానవులలో ఉన్న వర్ణముల గురించి చెప్పాను. ఈ వర్ణములు పుట్టుకతో రావు. వారు చేసే పనుల వలన వారి వర్ణము ఏర్పడుతుంది. ఒక వర్ణము వారి లక్షణములు మరొక వర్ణము వారిలో కనపడితే, అతని వర్ణము ఆ లక్షణములతోనే నిర్దిష్టము అవుతుంది. (శూద్ర లక్షణములుఅయిన సేవకా వృత్తి (ఉద్యోగం చేయడం) బ్రాహ్మణునిలో కనపడితే వాడు శూద్రుడిగానే పరిగణింపబడతాడు గానీ బ్రాహ్మణుడిగా కాదు. అదే విధంగా శూద్రుడు వ్యాపారం, వ్యవసాయం చేస్తే, వాడు వైశ్యుడు అవుతాడు కానీ శూత్రుడు కాడు. ఈ విషయాలు తెలుసుకోకుండా నేడు పుట్టుకనే ప్రాతిపదికగా తీసుకొని కులాల మధ్య భేదాలు సృష్టించుకొని కొట్టుకుంటున్నారు.)

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## సప్తమస్కంధము
## పన్నెండవ అధ్యాయము.

నారుదుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

"ధర్మనందనా! బ్రహ్మచారికి ఉండవలసిన లక్షణములను గురించి చెబుతాను శ్రద్ధగా విను. బ్రహ్మచర్యము అవలంబించు వ్యక్తి ఇంద్రియములను జయించాలి. గురువు గారి ఎడల భక్తి, విశ్వాసము కలిగి ఉండాలి. (ఇప్పుడు విద్యార్థులు "ఆ టీచరుకు తెలిస్తే కదా నాకు చెప్పడానికి" అని అంటూ ఉంటారు. అది విద్యార్థి లక్షణము కాదు.). బ్రహ్మచారి తన గురువుగారిని భక్తితో సేవించాలి. గురువు గారితో పాటు గురుకులములోనే నివసించాలి. ఉదయము సాయంత్రము సంధ్యావందనము చేయాలి. గురువు గారిని ఆరాధించాలి.

ప్రతిరోజూ హెూమం చెయ్యాలి. అగ్నిని, సూర్యుని ఆరాధించాలి. విష్ణువును పూజించాలి. గురువు దగ్గర వేదములను అభ్యసించాలి. ప్రతిరోజూ వేదములను అభ్యసించిన తరువాత, గురువుగారి పాదముల మీద తల పెట్టి నమస్కరించాలి. బ్రహ్మచారి అయిన వాడు జింక చర్మమును, నార చీరలను,జటలను, కమండలమును, దర్భలను ధరించాలి. ఉదయము, సాయంత్రము భిక్షాటన చేసి, తాను తెచ్చిన భిక్షను గురువుగారికి సమర్పించాలి. గురువుగారి అనుమతితో ఆ భిక్షను స్వీకరించాలి. ఏకాదశి మొదలగుపుణ్యదినములలో ఉపవాసము చెయ్యాలి. బ్రహ్మచారి

ఎల్లప్పుడూ మితంగా మాట్లాడాలి. మితంగా తినాలి. ఎప్పుడూ చురుకుగా ఉండాలి. గురువు గారు చెప్పిన పనులను శ్రద్ధతో వెంటవెంటనే చెయ్యాలి. స్త్రీలతో ఎక్కువ చనువుగా ఉండకూడదు. స్త్రీలతో అనవసరంగా మాట్లాడకూడదు. ఎందుకంటే స్త్రీసాన్నిహిత్యము ఎటువంటి మగవారినైనా మోహంలో పడవేస్తుంది.

యువకులు అయిన బ్రహ్మ చారులు గురువుగారి భార్యతో తలకు నూనె రాయించుకోవడం, దువ్వించుకోవడం, వీపు రుద్దించుకోవడం లాంటి పనులు చేయించుకోకూడదు. స్త్రీ అగ్నితో సమానము. అగ్ని దగ్గర నేతిపాత్ర పెడితే ఎలా కరిగిపోతుందో అలాగే స్త్రీలకు దగ్గరగా ఉన్న బ్రహ్మచారి మనసు అలాగే కరిగిపోతుంది. అందుకని స్త్రీలతో ఏకాంతంగా గడపకూడదు. మాట్లాడకూడదు. బ్రహ్మచారులే కాదు మామూలు గృహస్థులు కూడా తన కుమార్తెతో కూడా ఒంటరిగా గడపకూడదు. ఎంతవరకు అవసరమో అంతవరకే మాట్లాడాలి.

మనిషికి దేహాభిమానము ఎక్కువ. స్త్రీపురుష భేదములు ఎక్కువ. నేను పురుషుడను, ఆమె స్త్రీ, స్త్రీ నాకు భోగవస్తువు అనే భావన పురుషునిలో ఉన్నంతవరకూ, పురుషుని బుద్ధి పెడదారులు తొక్కుతుంది. దానికి అవకాశం ఇవ్వకూడదు. పైన చెప్పబడిన ధర్మములు బ్రహ్మ చారులే కాదు గృహస్థులు, యతులు కూడా పాటించాలి.

గృహస్థులు తమ భార్యలయందు అనురాగంతో మెలగాలి.

పరస్త్రీలను కన్నెత్తి చూడకూడదు.  అది గృహస్థుయొక్క ధర్మము.

ధర్మనందనా! ఇంకా బ్రహ్మచారులు ఏమేమి చెయ్యాలో చెబుతాను విను. బ్రహ్మ చారులు కాటుక పెట్టుకోకూడదు. తలకు నూనె రాసుకోకూడదు. శరీరమును ఇతరుల చేత ముఖ్యంగా స్త్రీలచేత మర్దనా చేయించుకోకూడదు. స్త్రీలయొక్క బొమ్మలు చూడకూడదు. మద్యమును,మాంసమును ముట్టకూడదు. పూలను, గంధమును, పరిమళ వస్తువులను వాడకూడదు. బ్రహ్మచారి అయిన వాడు పైన చెప్పబడిన ధర్మములను ఆచరిస్తూ గురువు దగ్గర విద్యను అభ్యసించాలి.

వేదములు, ఉపనిషత్తులు, షడంగములు, అధ్యయనము చేయాలి. విద్యాభ్యాసము పూర్తికాగానే, గురువు గారికి తన శక్తి మేరకు గురుదక్షిణ సమర్పించాలి. తరువాత గురువుగారి అనుమతితో గృహస్థాశ్రమమును కానీ, లేక సన్యాసమును కానీ స్వీకరించాలి. వేరే ఎక్కడకూ పోవడానికి వీలులేని శిష్యులు, గురువుగారి దగ్గరే ఉంటూ గురువును సేవించుకుంటూ ఉండాలి.

ఓ ధర్మరాజా! మానవులు ఏ ఆశ్రమములో ఉన్న వారైనా, అందరినీ సమంగా చూడాలి. అగ్నిలోనూ, గురువుగారిలోనూ, తనలోనూ,  అన్ని జీవులలోనూ ఆ విష్ణువు అంతర్లీనంగా ఉన్నాడని భావించాలి. ఈ విధంగా అందరిలోనూ భగవంతుని దర్శించేవాడు పరబ్రహ్మ పదమును పొందుతారు.

ఓ ధర్మనందనా! ఇప్పుడు నీకు వానప్రస్థము ఆశ్రమమును స్వీకరించిన వారు ఆచరించవలసిన ధర్మములను గురించి వివరిస్తాను. ఈ ధర్మములను ఆచరించిన వారు ఎటువంటి శ్రమలేకుండా మహర్లోకమునకు చేరుకుంటారు.

వానప్రస్థములో ఉన్న వారు భూమిని దున్ని ధాన్యమును పండించకూడదు. కాయకూరలు అగ్ని మీద ఉడికించినవి, వండినవి తినకూడదు. పండిపండని దోర కాయలను తినరాదు. సూర్యరశ్మి ఆధారంగా చెట్లమీద పండిన పళ్లను మాత్రమే తినాలి. సహజసిద్ధంగా మొలిచిన మొక్కల నుండి లభించే ఆహారమును, అనగా దుంపలను దంచిన పిండిని తినాలి.

ప్రతిరోజూ అగ్ని కార్యము చేయడానికి చిన్న కుటీరమును కానీ, చిన్న ఇల్లు కానీ నిర్మించుకోవాలి. లేకపోతే అనువైన కొండగుహలలో ఉండాలి. వానప్రస్థాశ్రమములో ఉన్న వారు ఎండకు, వానకు, చలికి తట్టుకోగలగాలి. వాటి వల్ల బాధపడకూడదు. తల వెంట్రుకలను జడల మాదిరి కట్టుకోవాలి. మృగచర్మమును, కమండలమును, నారచీరలను ధరించాలి. ఈ వానప్రస్థ ఆశ్రమ ధర్మమును తన శక్తి కొద్దీ 12, 8, 4, 2 సంవత్సరములు, లేక ఒకసంవత్సరము పాటు ఆచరించాలి.

ఎప్పుడైనా జ్వరము వలన కానీ, వ్యాధి వలన కానీ వానప్రస్థ ధర్మములను నిర్వర్తించలేకపోతే, ఉపవాసములు ఉండి దేహమును కృశింపజేయాలి. తన ఆత్మలో అగ్నిని ప్రజ్వరిల్లచేయాలి. దేహము మీద

మమకారమును వదిలిపెట్టాలి. ఈ దేహమును పంచభూతములలో లీనం చేయాలి.

ప్రాణవాయువును గాలిలోనూ, ఒంటిలో ఉన్న వేడిని అగ్నిలోనూ, శరీరంలో ఉన్న రక్తము మొదలగు ద్రవములను జలములోనూ, ఎముకలు మొదలగు ఘన వస్తువులను భూమిలోనూ విలీనం చేయాలి. వాక్కు శక్తిని అగ్నిలోనూ, చేతులలో ఉన్న శక్తిని ఇంద్రునిలోనూ, పాదములలో ఉన్న తిరిగే శక్తిని విష్ణువులోనూ, జననేంద్రియముల శక్తిని ప్రజాపతిలోనూ లగ్నం చేయాలి.

చెవితో వినే శక్తిని దిక్కులలో లీనం చేయాలి. స్పర్శ శక్తిని వాయువులో లీనం చేయాలి. చూచే శక్తిని అగ్నిలో లీనం చేయాలి. రుచి చూసే శక్తిని జలంలో లీనం చేయాలి. వాసన చూచే శక్తిని భూమిలో కలపాలి. కోరికలతో నిండిన మనో శక్తిని చంద్రునిలో కలపాలి. బుద్ధి శక్తిని బ్రహ్మలో లీనం చేయాలి. అహంకారమును, మమకారమును, పనులు చేసే శక్తిని, సమస్త కర్మలను రుద్రునిలో కలపాలి. శరీరంలో ఉన్న చైతన్యమును క్షేత్రజ్ఞుడు అయిన ఆత్మలో కలపాలి.

తరువాత వరుసగా భూమిని జలములోనూ, జలమును అగ్నిలోనూ, అగ్నిని వాయువులోనూ, వాయువును ఆకాశములోనూ, ఆకాశమును అహంకారములోనూ, అహంకారమును మహత్తత్వములోనూ, మహత్తత్వమును ప్రకృతిలోనూ, ప్రకృతిని పరమాత్మలోనూ లయం చేయాలి. ఇప్పుడు అన్ని ఉపాధులు ఒకదానిలో ఒకటి లయం అయిపోతాయి. ఆత్మ పరమాత్మలో లీనం

అయిపోతుంది." అని నారదుడు ధర్మరాజుకు ఆశ్రమ ధర్మములను వివరించాడు.

శ్రీమద్భాగవతము
సప్తమస్కంధము పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## సప్తమస్కంధము
## పదమూడవ అధ్యాయము.

నారదుడు ధర్మరాజుకు యతి ధర్మముల గురించి ఇలా చెబుతున్నాడు.

"ఓ ధర్మరాజా! యతిధర్మమును అనుష్ఠించిన వ్యక్తి ప్రాపంచిక విషయములమీద ఆసక్తిని, విషయ వాంఛలను వదిలిపెట్టి, కేవలం తన దేహము మాత్రమే తనది అనుకొని, దేశాటన చేయవలెను. ఒక గ్రామములో ఒక రాత్రి మాత్రమే ఉండవలెను. ఇంక వస్త్రధారణ విషయమునకు వస్తే, కేవలము శరీరము కప్పుకొనుటకు మాత్రమే వస్త్రము ధరించవలెను. దండము, కమండలము మొదలగు సన్యాసికి ఉండవలసిన వస్తువులను మాత్రమే తనతో ఉంచుకొనవలెను. ఇతరము లైన ఏ వస్తువును తన దగ్గర ఉంచుకోరాదు. ప్రతిరోజూ భిక్ష ఎత్తి ఆహారము తీసుకొనవలెను. ఎక్కడా గృహము నిర్మించుకొని నిలకడగా ఉండరాదు.

సమస్త జీవుల ఎడల సమభావము కలిగి ఉండవలెను. ఎల్లప్పుడూ శాంతంగా ఉండవలెను. నారాయణ నామస్కరణము చేయవలెను. సన్యాసి అయిన వాడు ఈ బాహ్య ప్రపంచమును గురించి పట్టించుకోరాదు. తనలో ఉన్న ఆత్మలోనే సమస్త విశ్వమును చూడగలగాలి. అలాగే ఈ సమస్త విశ్వం పరమాత్మ స్వరూపమే అన్న జ్ఞానమును కలిగి ఉండాలి. తాను మెలుకువగా ఉన్న స్థితి నుండి సుషుప్తి స్థితికి జారుకునే సమయంలో, జాగృతికి, సుషుప్తికి మధ్యలో ఉన్న స్థితిలో తన మనసునునిలిపి తన ఆత్మలో పరబ్రహ్మ స్వరూపమును దర్శించాలి.

(అంటే అటు మెలుకువ కాదు ఇటు నిద్ర కాదు మధ్య ఉన్న స్థితి. అప్పుడు అర్ధనిమీలిత నేత్రములతో అంటే సగం కళ్లు మూసి సగం కళ్లు తెరిచిన స్థితిలో ఉండాలి.)

సన్యాసి అయిన వాడు మృత్యువుకు భయపడరాదు. చాలా కాలం బతకాలి అని కూడా అనుకోరాదు. మృత్యువును సంతోషంగా ఆహ్వానించగలగాలి. కాలాను గుణంగా కలిగే జనన మరణములను సమానంగా చూడగలగాలి. ఏదో వేదములు శాస్త్రములు చదువుకున్నాము కదా అని వాటి మీద ధనార్జన చేయడం పనికిరాదు. వ్యర్థమైన శాస్త్ర పరిజ్ఞానమును విడిచిపెట్టాలి. ఏదో ఒక పక్షము అవలంబించి, ఎదుటి వాడికి ఏమీ తెలియదు అని దూషించరాదు. ఆడంబరము కొరకు కాషాయములు దండము, కమండలము ధరించరాదు. అలా ధరించే కంటే దండ కమండలములను విడిచిపెట్టడమే మంచిది.

(కొంత మంది సన్యాసులు కాషాయరంగులో ఉండే సిల్కు (పట్టు) వస్త్రములు ధరించడం మనం చూస్తూనేఉన్నాము.)

సన్యాసి తాను ఆత్మజ్ఞానమును, శాస్త్ర పరిజ్ఞానమును కలిగినప్పటికినీ బాహ్య ప్రపంచమునకు ఏమీ తెలియని వాడి వలె కనపడాలి. పిచ్చి వాడి వలె. చిన్న బాలుడి వలె, మూగవాడి వలె కనపడాలి. అంతేకానీ, లేని పోని పటాటోపములను ప్రదర్శించరాదు.

ఓ ధర్మరాజా! ఈ సందర్భంలో నీకు ప్రహ్లాదునకు, అజగరుడు అనే సన్యాసికి మధ్య జరిగిన సంభాషణను నీకు వినిపిస్తాను.

ఒకసారి, ప్రహ్లాదుడు, తన మంత్రులతో, తన రాజ్యంలో పర్యటిస్తున్నాడు. ఆయన కావేరీ నదీ తీరంలో నేల మీద పడుకొని ఉన్న ఒక సన్యాసిని చూచాడు. ఆయన శరీరం అంతా దుమ్ము కొట్టుకొని పోయి ఉంది. ఒంటి మీద బట్టలు కూడా సరిగా లేవు. ఆయన ఆకారము, చేసే పనులు, మాట్లాడే మాటలను బట్టి అతను ఎవరో ఏ ప్రాంతమునకు చెందిన వాడో ఎవరూ తెలుసుకోలేకపోయారు. ఆ ముని కొండచిలువ మాదిరి కదలకుండా పడి ఉన్నాడు. ప్రహ్లాదుడు ఆయనకు భక్తితో నమస్కరించాడు. ఆయనతో ఇలా అన్నాడు.

"మహాత్మా! తమరిని చూస్తుంటే, అన్ని సుఖములను అనుభవిస్తూ, ప్రతిరోజూ దైనందిన కర్మలను చేసే వారికి ఉండతగ్గ ధృడమైన శరీరమును కలిగి ఉన్నారు. ఎందుకంటే, ప్రతిరోజూ ప్రాపంచిక భోగములు అనుభవించేవారూ, ప్రపంచ సంబంధమైన పనులలో నిమగ్నమైన వారు మాత్రమే ఇటువంటి ధృడమైన, కాంతి వంతమైన శరీరమును కలిగి ఉంటారు. వేళకు షడ్రసోపేతమైన

భోజనము, శరీరమునకు తగిన వ్యాయామము లేనిదే ఇటువంటి శరీరం కలిగి ఉండటం సాధ్యంకాదు. కానీ తమరిని చూడబోతే మీరు ఏ పనీ చేస్తున్నట్టు కనిపించడం లేదు. సరిగా భోజనము కూడా చేస్తున్నట్టు లేదు. నీ వద్ద అందుకు తగిన ధనము కూడా లేదు. తమరు ఈ ప్రాపంచిక భోగములను అనుభవిస్తున్నట్టు కనిపించడం లేదు. అటువంటప్పుడు  తమరికి ఇటువంటి ఆరోగ్యవంతమైన, ధృడమైన శరీరం ఎలా వచ్చింది. తమరిని చూడబోతే విద్వాంసుల మాదిరి కనిపిస్తున్నారు. మరి ఇలాగా పిచ్చివాడి మాదిరి తిరగడానికి, ఏ పనీ చేయకుండా ఒకచోట పడి ఉండటానికి కారణం ఏమి?  తమరికి అభ్యంతరము లేకపోతే నాకు తెలియజేయండి." అని వినయంగా అడిగాడు ప్రహ్లాదుడు.

ఆ ముని ప్రహ్లాదుని వంక ఆదరంగా చూచాడు. అతనితో ఇలా అన్నాడు. "మీరెవరో నాకు తెలియును. నీవు అసురులలో శ్రేష్టుడవు.  అచంచలమైన విష్ణుభక్తి కలవాడివి. ఆత్మజ్ఞాన సంపన్నుడవు. ఈ లోకంలో ఎలా మెలగాలో, పరలోక సుఖాలకొరకు ఏమేమిచెయ్యాలో అన్నీ తెలిసినవాడవు. నీ హృదయంలో ఆ శ్రీహరి ప్రకాశిస్తున్నాడు. నీవు అడిగావు కాబట్టి నీ ప్రశ్నలకు అన్నిటికీ సమాధానాలు చెబుతాను.

నేను చేసిన కర్మల ఫలితంగా ఇప్పటికి ఎన్నో జన్మలు ఎత్తాను. అటు మోక్షమార్గమును అవలంబించాలన్నా, ఇటు పతనమై జంతువులు, పక్షుల జన్మలు ఎత్తాలన్నా ఈ మానవ జన్మ ఒక ద్వారము వంటిది. అట్టి మానవ జన్మను ప్రస్తుతము నేను పొందాను. సాధారణంగా మానవ జన్మను పొందిన వారు సుఖములు

అనుభవించడానికి, దు:ఖములు పోగొట్టుకోడానికి  కర్మలు చేస్తుంటారు. కాని ఆ కర్మల వలన మానవులకు దు:ఖమే మిగులు తుంది కానీ సుఖములు కలగడం లేదు. అందుకని నేను కర్మలు చేయడం మానివేసాను.

ప్రహ్లాదా! స్వతాహాగా మానవుడు సుఖస్వరూపుడు. సుఖం కోసరం ప్రత్యేకంగా ఏ కర్మ చేయనవసరం లేదు. కర్మలు చేసినందువలన కలిగే సుఖములు క్షణికములు. అందుకని నేను ఏ కర్మలూ చేయడం లేదు. కాని మానవులు మాత్రము నిరంతరమూ కర్మలు చేస్తూ, కొద్దిగా సుఖము, అపరిమితంగా దు:ఖము అనుభవిస్తూ, ఈ సంసార చక్రంలో గిరగిరా తిరుగుతున్నారు.

ఈ ప్రపంచములో సుఖాలు అనబడేవి ఎండమావుల వంటివి. దూరం నుండి నీరు ఉన్నట్టు భ్రమ కలుగచేస్తాయి. కాని దగ్గరకు పోతే ఏమీ ఉండవు. అలాగే సుఖాలు కూడా మన కళ్లెదుట ఉన్నట్టు కనపడతాయి. కాని అవి సుఖాలు కావు, దు:ఖాలు. కాని సుఖము అనేది గడ్డిచేత కప్పబడిన జలాశయము వంటిది. నీరుపైకి కనపడదు. ఆ గడ్డిని తొలగిస్తే, స్వచ్ఛమైన నీరు కనపడుతుంది. మానవులు కూడా అజ్ఞానము అనే గడ్డిని తొలగిస్తే, నిర్మల జలము అనే శాశ్వతసుఖము లభిస్తుంది.

కేవలం తన శరీరముతో చేసే కర్మల ద్వారానే తనకు సుఖములు కలుగుతాయి, దు:ఖాలు పోతాయి  అనే వాడికి ఈశ్వరుడి మీద నమ్మకం ఉండదు. అటువంటి వాడు చేసిన పనులన్నీ విఫలమై,

చివరకు దు:ఖమే మిగులుతుంది. కాబట్టి కర్మలు చేయడం, దాని వలన ధనం సంపాదించడం, ఆ ధనంతో కోరికలు తీర్చుకోవడం, ఆ కోరికలు తీరకపోతే చింతించడం, చివరకు మరణించడం, వీటి వలన ఎటువంటి సుఖం కలుగుతుంది?

నేను ఈ ప్రపంచం అంతా తిరుగుతున్నాను. ఈ ప్రపంచంలో ధనాన్ని సంపాదించడం, దానిని దాచుకోవడం, ఎవరికీ దానం చెయ్య పోవడం, ఇంద్రియ నిగ్రహం లేకపోవడం, దాచుకున్న ధనం ఎవరైనా ఎత్తుకుపోతారేమో అని భయం భయంగా నిద్రకూడా సరిగా పోకపోవడం, ఇటువంటి కష్టాలను పడుతున్న ధనవంతులను ఎంతోమందిని చూచాను. అంతే కాకుండా ఎక్కువ ధనమును కూడబెట్టిన ధనవంతులకు రాజుల వలన (పన్నుల రూపంలో తన వద్ద ఉన్న ధనాన్ని ఎత్తుకుపోతారని), దొంగల వలనా, శత్రువుల వలనా, బంధువుల వలనా, యాచకుల వలనా, కాలాను గుణంగా సంభవించే భూకంపములు, అగ్నిప్రమాదములు, వరదలు వీటి వలనా, ఎప్పుడూ భయపడుతూనే ఉంటారు.

కాబట్టి బుద్ధిమంతుడు అయిన వాడు ధనమును కూడబెట్టకూడదు. ప్రాపంచిక విషయములలో లీనం కాకూడదు. శోకము, మోహము, భయము, కోపము, అనురాగము, దీనత్వము మొదలగు వాటిని విడిచిపెట్టి శాంతంగా బతకడం నేర్చుకోవాలి.

(మనం ప్రతి దినం ఇలాంటి వారిని చూస్తూనే ఉంటాము. కొంతమంది ఎంత ఉన్నా, ఏమీలేదని, అని ఏడుస్తుంటారు. కొంత మంది ఏ వస్తువు చూచినా అది నాకు కావాలి. నాకు దక్కనిది

ఎవరికీ దక్కడానికి వీలులేదు అని పంతం పడుతుంటారు. కొంత మంది ఎల్లప్పుడూ ఏదో ఒక దానికి భయపడుతూనే ఉంటారు. మరి కొంత మందికి చటుక్కున ఉట్టి పుణ్యానికి కోపం వస్తుంది. ఆ కోపంలో వారు ఏమి చేస్తారో వారికే తెలియదు. అపరిమితమైన కోపంలో, ఆవేశంలో హత్యలు చేసేవారిని కూడా మనం చూస్తూనే ఉన్నాము. మరి కొంద మందికి ప్రతి వాడి మీద వల్లమాలిన ప్రేమ, అభిమానం. అడిగినది కాదనలేడు. మరి కొంత మంది ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్న వాళ్లమాదిరి దీనంగా ఉంటారు. కారణం తెలియదు. ఇవి అన్నీ అవలక్షణాలు. వీటిని వదిలిపెడితే శాంతంగా జీవనం గడపవచ్చు అని ఆ ముని ప్రహ్లాదునికి చెప్పాడు. వీటిలో కనీసం కొన్ని అయినా మనం కూడా పాటిస్తే ఎంత బాగుంటుంది. ఆలోచించండి)

ఓ ప్రహ్లాదా! నేను ప్రకృతిలో రెండు జీవులను పరిశీలించాను. ఒకటి తేనేటీగ. తేనెటీగ కష్టపడి ప్రతి పూవు నుండి బొట్టు బొట్టుగా తేనె సేకరించి తెచ్చి తన పట్టులో దాచుకుంటుంది. కాని ఈ క్రూర మానవులు ఆ తేనేటీగలను తరిమివేసి ఆ తేనెను అపహరిస్తారు. మానవులు కూడా అంతే. కడుపుకు కూడా తినకుండా దాచిపెట్టిన ధనమును మరొకడు అపహరించుకుపోవడం జరుగుతూనే ఉంది. అందుకని కొండచిలువ మాదిరి ఏ పనీ చేయకుండా, ధనం కూడబెట్టకుండా పడి ఉన్నాను. కొండ చిలువ కూడా తన దగ్గరకు వచ్చిన జీవిని ఆహారంగా తీసుకుంటుంది. నేనూ అంతే. నాకు అయాచితంగా లభించిన ఆహారమును తీసుకుంటున్నాను. దొరికితే తింటాను. లేకపోతే లేదు. ఒకప్పుడు ఎక్కువ ఆహారము లభిస్తుంది. మరొకప్పుడు ఏమీ దొరకదు. ఆ

లభించిన ఆహారము కూడా ఒకప్పుడు తినడానికి వీలుగా ఉంటుంది, మరొకప్పుడు ఏమాత్రం రుచి లేకుండా ఉంటుంది. ఒకప్పుడు సువాసనలు వేస్తుంటుంది. మరొకప్పుడు చెడిపోయిన వాసన వేస్తుంది. ఒకప్పుడు శ్రద్ధగా భిక్ష వేస్తారు. మరొకప్పుడు మొహాన విసిరి వేస్తారు.

నాకు ఏ విధమైనా ఆహారము, ఏ రకంగా లభించిన దానిని అమృతంగా స్వీకరిస్తాను. అంతేగానీ, విముఖత చూపను. అలాగే ఎవరైనా పట్టు వస్త్రము ఇస్తే తీసుకుంటాను. నూలు వస్త్రము ఇచ్చినా తీసుకుంటాను. ఏమీ ఇవ్వకపోయినా సంతోషిస్తాను. ఒకప్పుడు పట్టు వస్త్రము కట్టుకుంటాను. మరొకప్పుడు గోచీ ధరిస్తాను. ఏది లభించిన సంతోషంగా, తృప్తిగా ఉంటాను. నేల మీద రాళ్ల మీద పడుకుంటాను. ఎవరైనా నన్ను తీసుకొని వెళ్లి వారి ఇంట్లో పరుపు మీద పడుకోబెడితో పడుకుంటాను. నాకు రెండూ ఒకటే. ఏమీ తేడా ఉండదు.

ఓ ప్రహ్లాదా! నేను ఒకప్పుడు మహారాజును. రోజు స్నానం చేసి, చందనము మొదలగు పరిమళద్రవ్యములను పూసుకొన్నాను. పూల మాలలుఅలంకరించుకున్నాను. గుర్రాల మీద, ఏనుగుల మీద, రథం మీద తిరిగాను. ఇప్పుడు ఏమీ లేని వాడి మాదిరి తిరుగుతున్నాను. నేను ఎవరినీ నిందించను. ఎవరినీ పొగడను. ఈ లోకంలో ఉన్న అందరికీ శ్రేయస్సు కలగాలనీ, అందరూ సుఖంగా, శాంతితో, భగవంతుని మీద అచంచలమైన భక్తితో జీవించాలనీ కోరుకుంటాను.

ప్రతి వాడుకూడా మనస్సులో ఎటువంటి భేదబుద్ధిని పెట్టుకోకూడదు. మనస్సును నిర్మలంగా ఉంచుకోవాలి. మనస్సు ఎప్పుడూ అది కావాలనీ, ఇది వద్దనీ కోరుకుంటూ ఉంటుంది. అది సహజం. దానికి మూలము నేను నాది అనే అహంకారము. కాబట్టి మనసులో కలిగే సంకల్పాలను మనసులోనే నాశనం చేయాలి. మనసును అహంకారంతో కలపాలి. మనసుతో కూడిన అహంకారమును మహత్తత్వములో కలపాలి. ఆ మహత్తత్వమును మాయలోనూ, మాయను భగవంతుని లో లీనం చేయాలి. అప్పుడు ప్రతి మనిషీ ఆత్మానందాన్ని పొందుతాడు. దానిని మించిన ఆనందము ఎక్కడా లభించదు. అప్పుడు మానవునికి ఈ ప్రాపంచిక విషయముల యందు ఆసక్తి నశిస్తుంది.

ఓ ప్రహ్లాదా! నీవు కూడా భగవంతుని ఎడల అచంచలమైన భక్తి కలిగి, ప్రాపంచిక సుఖముల మీద ఆసక్తి లేనివాడవు. అందుకనే నీతో ఇంతసేపు ఈ విషయముల గురించి మాట్లాడాను."అని అన్నాడు.

ఆ మాటలు విన్న ప్రహ్లాదుడు పరమానంద భరితుడు అయ్యాడు. ఆ మునికి నమస్కరించి ఆయన అనుమతి తీసుకొని తృప్తిగా తన గృహమునకు వెళ్లాడు." అని నారదుడు ధర్మరాజుతో ప్రహ్లాద అజగరుని సంవాదము గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము

పదునాలుగవ అధ్యాయము.

ధర్మరాజు నారదునితో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! తమరు అందరి గురించి చెప్పారు. కాని మా బోటి గృహస్థుల గురించి చెప్పలేదు. గృహస్థాశ్రమములో ఉన్న వారు ఏ విధంగా సులభంగా మోక్ష పదమును పొందగలరో వివరంగా చెప్పండి." అని అడిగాడు. నారదుడు ధర్మరాజుతో ఇలా చెప్పసాగాడు.

"ధర్మనందనా! గృహస్థు ఎల్లప్పుడూ గృహములో నివసిస్తూ ఉంటాడు. ప్రతిరోజూ ఏదో ఒక కర్మ చేస్తూ ఉంటాడు. కాని ఆ కర్మలు అన్నిటినీ ఏ కోరికా లేకుండా చెయ్యాలి. ఫలాన్ని ఆశించి ఏ కర్మా చెయ్యకూడదు. తాను చేసిన కర్మలు అన్నీ పరమాత్మ పరంగా చెయ్యాలి. ఆ కర్మలు అన్నిటినీ పరమాత్మకు అర్పించాలి. అప్పుడు ఆ కర్మఫలములు అతనిని అంటవు. ఆ ప్రకారంగా కర్మలు చేస్తూ గురువులను, ఋషులను పూజించాలి.

ఎల్లప్పుడూ సత్పురుషుల సాంగత్యములో గడపాలి. భగవంతుని పూజించడం, స్తోత్రముచేయడం, భగవంతుని కథలు వినడం, దేహము మీద, భార్యాబిడ్డల మీద, ఇంటి మీదా, ఆస్తుల మీదా ఉన్న మమకారాన్ని , బంధాలను మెల్ల మెల్లగా విడిచిపెట్టడం చేయాలి. ఇంకా, తనకు అవసరమైన వస్తువులను మాత్రమే తన వద్ద ఉంచుకోవాలి. దేహాభిమానమును, ప్రాపంచిక విషయములయందు

అనురక్తిని వదిలిపెట్టాలి. కాని సమాజంలో తిరుగుతున్నప్పుడు, సమాజపరంగా చెయ్యాల్సిన పనులు చేస్తూ, వాటిలో ఆసక్తిని వదిలిపెట్టాలి. గృహస్తుకు తల్లి తండ్రులు, భార్యాబిడ్డలు, జ్ఞాతులు, సోదరులు, మిత్రులు, ఉంటారు. వారు అడిగిన కోరికలు అన్నిటినీ తన శక్తిమేరకు తీర్చాలి. కాని తాను వారి కోరికలు తీర్చాను కదా అని వారి మీద అమితమైన మమకారము పెంచుకోకూడదు.

ఓ ధర్మనందనా! భగవంతుడు ఈ భూమిని సృష్టించాడు. వర్షములను కురిపిస్తున్నాడు. భూమిని సస్యస్యామలము చేస్తున్నాడు. కాబట్టి ఆ పండినపంటలను తను జీవించడానికి  ఎంత కావాలో అంతే తీసుకోవాలి. అలాగే భూమిలో దొరికే ఖనిజములను, బంగారమును తనకు అవసరమైనంత వరకే తన వద్ద ఉంచుకోవాలి. అలాగే తనకు అవసరమైనంత వరకే ధనమును సంపాదించాలి. తన యొక్క తన భార్యాపుత్రుల యొక్క కడుపు నింపుకోడానికి ఎంత కావాలో అంత వరకే ధనమును సంపాదించాలి. అంతవరకే గృహస్థుకు అధికారము ఉంటుంది. అంతే కానీ, తనకు అవసరానికి మించి ధనాన్ని, ధాన్యమును, వస్తువులను,  సంపాదించి కూడబెట్టే వాడు దొంగతో సమానము. ఎందుకంటే, ఇతరులకు ఉపయోగపడవలసిన ధనమును, ధాన్యమును, వస్తువులను దాచుకొనే అధికారము ఎవరికీ లేదు. అటువంటి వాడు నేరస్థుడు అవుతాడు.

(ఈ నాడు కూడా ఇది అమలులో ఉంది. ఆదాయానికి మించిన ఆస్తులు కలిగి ఉండటం నేరం. కాని ఇది కేవలం ఉద్యోగస్థులకే పరిమితం అయింది. నారదుడు చెప్పినట్టు దీనిని

అందరికీ వర్తింపజేస్తే, దేశం సుభిక్షంగా ఉంటుంది.)

ఓ ధర్మనందనా! మానవుడు తన సంతానమును అధికంగా ప్రేమిస్తాడు. కాని మన పరిసరాలలో తిరిగే జింక, ఒంటె, గాడిద, కోతి, ఎలుక, పాము, పక్షి ఇవన్నీ కూడా మన సంతానము కన్నా ఎందులో తక్కువ. కాబట్టి గృహస్థు అన్ని ప్రాణులను సమానంగా తన సంతానము మాదిరి చూడాలి. వాటికి కూడా తన శక్తి మేరకు ఆహారము అందించాలి.

ఓ ధర్మనందనా! గృహస్థు అయిన వాడు,కష్టపడి, చెమటోడ్చి ధనమును, ఆస్తులను సంపాదించి, వాటితో తన కోరికలు తీర్చుకోనవసరము లేదు. తనకు ఏమి దొరికితే దానితోనే తృప్తిపడటం నేర్చుకోవాలి. తనకు ఉన్నదానితో తృప్తిపడకపోవడం, తనకు లేని దాని కోసరం పాకులాడటం, గృహస్థు లక్షణం కాదు. గృహస్థు, అతని భార్య ప్రతి దినమూ తమ వారినే కాకుండా, తమ ఇంటికి వచ్చిన అతిధులను, తమ చుట్టుపక్కల ఉన్న ప్రాణులను కూడా పూజించాలి. వాటికి ఆహారము అందచేయాలి. ఎంతసేపటికీ తమ కడుపునింపు కోడానికే ప్రాధాన్యత ఇవ్వరాదు.

సాధారణంగా పురుషులు తన భార్య కోసరం తన ప్రాణములు కూడా ఇవ్వడానికి సిద్ధపడతాడు. ఒక్కోసారి భార్య కోసరం కానీ, ప్రియురాలి కోసరం కానీ తండ్రిని, గురువును కూడా ఎదిరించడం, చంపడం చేస్తుంటాడు. కాని స్త్రీల యందు అంతటి ప్రేమ, అనురాగము, మమకారము చూపనవసరము లేదు. తగుమాత్రము ప్రేమ ఉంటే చాలును. ఈ స్త్రీ నాది, ఈమె కోసరం నేను

ఏమైనా చేస్తాను అనే భావన వదిలిపెట్టిన వాడు, ఈశ్వరుని కూడా జయించగలడు. ఎందుకంటే, మగవాడు స్త్రీయొక్క అందానికీ, ఆమె తనకు ఇచ్చే లైంగిక సుఖానికి లొంగి పోతాడు. కానీ మరణానంతరము భూమిలోపల కీటకములకు ఆహారము అయ్యే ఈ శరీరం కన్నా, అగ్ని కీలలకు ఆహుతి అయి భస్మంగా మారే స్త్రీ శరీరం కన్నా, అన్ని జీవులలో వ్యాపించి ఉన్న ఆ పరమాత్మ గొప్పవాడు కదా! కాబట్టి బుద్ధిమంతుడైన వ్యక్తి ఇటువంటి అనవసరమైన అనురాగ మమకారాలకు దూరంగా ఉంటాడు.

గృహస్థు తనకు దొరికిన ఆహారమును తన సాటి జీవులకు పెట్టి తరువాత తాను భుజిస్తాడు. గృహస్తు తనకు దొరికిన దానిని ముందు దేవతలకు, తరువాత పితరులకు, ఋషులకు, అతిధులకు, తోటి ప్రాణులకు పెట్టి మిగిలింది తాను భుజిస్తాడు. గృహస్థు న్యాయంగా ధర్మంగా ఎక్కువ ధనముసంపాదిస్తే ఆ ధనముతో వేదములలో చెప్పిన ప్రకారము యజ్ఞములు, యాగములు చేసి, బ్రాహ్మణులను, ఋత్విక్కులను తృప్తిపరుస్తాడు.

ఓ ధర్మరాజా! యజ్ఞయాగములలో నేతిని, ఆహార ధాన్యములను హెూమగుండంలో వేసినంత మాత్రమున అవి పరమాత్మకు అందవు. బ్రాహ్మణులకు, ఋత్విక్కులకు, యాగమునకు వచ్చినవారికి, ఇతర ప్రాణులకు  తృప్తిగా భోజనం పెడితేనే, అవి పరమాత్మకు అందుతాయి. ఆ పరమాత్మ బ్రాహ్మణుల ముఖం ద్వారా, ఇతర ప్రాణుల ద్వారా, తాను ఆరగిస్తాడు.

కాబట్టి ఓ ధర్మనందనా! గృహస్థు బ్రాహ్మణులయందు, ఇతర మానవుల యందు, పశుపక్ష్యాదుల యందు ఆ పరమాత్మను దర్శించి, అర్చించాలి.

ఇంకా గృహస్థు చేయవలసిన విధుల గురించి విపులంగా చెబుతాను శ్రద్ధగా విను.

గృహస్థు అయిన వాడు ప్రతి సంవత్సరము భాద్రపద బహుళ పాడ్యమినుండి అమావాస్య వరకు ఉన్న 15 దినములలో, తన తల్లి తండ్రులకు, తల్లి తండ్రుల బంధువులకు శ్రాద్ధకర్మలు చేయాలి. (దీనినే మహాలయము అని మనము అంటుంటాము.) ఇంకా, ఉత్తరాయనము, దక్షిణాయనము లలోనూ, ఉదయం సాయంత్రం వేళలలోనూ, సూర్య గ్రహణము, చంద్రగ్రహణ వేళలలోనూ, ద్వాదశి తిథి యందు, శ్రవణా నక్షత్రము వచ్చిన రోజున, అక్షయ తదియ నాడు, కార్తీక మాసంలో వచ్చే శుక్ల సప్తమి నాడు; మార్గశిర మాసము, పుష్యమాసము, మాఘ మాసము, ఫాల్గుణ మాసము లలో వచ్చే నాలుగు బహుళ అష్టమి తిథులయందు; మాఘమాసములో వచ్చే శుక్ల సప్తమి తిథియందు; మఘ నక్షత్రము తో వచ్చే పౌర్ణమి యందు, ఆ గృహస్థు పుట్టిన మాసము, నక్షత్రము తో కూడిన పౌర్ణమియందు లేక చతుర్దశి యందు; ఏకాదశి తిథితో కానీ, ద్వాదశి తిథితో కానీ కూడిన శ్రవణం, అనూరాధ, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తర భాద్రపద నక్షత్రములయందు; ఇవన్నీ కుదరక పోతే తన జన్మ నక్షత్రము రోజున, లేక పోతే శ్రవణా నక్షత్రము ఏరోజున ఉంటుందో ఆరోజున, తన పితరులకు తర్పణములు విడిచిపెట్టాలి. శ్రాద్ధకర్మ నిర్వర్తించాలి.

ఎందుకంటే పైన చెప్పబడిన కాలములు అత్యంత శుభప్రదమైనవి. ఆ కాలములలో శుభకార్యములు చేయడం ఎంతో మంచిది. దానివలన ఆయుష్షు వృద్ధి చెందుతుంది. (పితృశ్రాద్ధము కూడా శుభకార్యముగానే పరిగణించారు మన పెద్దలు.)

ధర్మనందనా! పైన చెప్పిన రోజులలో స్నానం చేసి, జపం చేసి, హెమంచేసి, దేవతలను, బ్రాహ్మణులను పూజించి, పితృదేవతలకు, బ్రాహ్మణులకు, అతిధులకు, ఇతర ప్రాణులకు భోజనం పెడితే, ఆ గృహస్థుకు ఏ కాలంలోనూ దేనికీ లోటు ఉండదు. అతని గృహము అక్షయంగా ఉంటుంది.

ధర్మరాజా! గృహస్థు అయిన వాడు ఈ క్రింది శుభకార్యములను కూడా శ్రద్ధతో నిర్వర్తించాలి. భార్య గర్భంతో ఉన్నప్పుడు సీమంతోత్సవము, బిడ్డ పుట్టిన తరువాత జాతక కర్మలు, తరువాత ఉపనయనము, బ్రహ్మచర్య దీక్ష, పెద్దవారుచనిపోతే వారికి దహన క్రియలు, ఉత్తర క్రియలు, తరువాత ప్రతి సంవత్సరము శ్రార్థము పెట్టడం మొదలగు కర్మలను యధావిధిగానిర్వర్తించాలి.

ధర్మనందనా! ఇప్పటి వరకూ నీకు గృహస్థుచేయవలసిన కర్మల గురించి చెప్పాను. ఇప్పుడు గృహస్థు సేవించవలసిన తీర్థముల గురించి, పుణ్యకార్యములు చేయవలసిన ప్రదేశముల గురించి వివరిస్తాను. దీనికి ఒకటే గుర్తు. ఏ ప్రదేశములో అయితే మంచి ప్రవర్తన కలవారు, సత్పురుషులు నివసిస్తూ ఉంటారో, ఎక్కడ పరమాత్మను విగ్రహాల రూపంలో ఆరాధిస్తూ ఉంటారో అంటే

దేవాలయాలలో, ఏ ప్రదేశములో అయితే తపస్సు, విద్య, దయాగుణము పెంపొందుతూ ఉంటాయో ఆ ప్రదేశమును పుణ్యమైన ప్రదేశము అని అంటారు.

అంతే కాకుండా ఎక్కడెక్కడ శ్రీహరిని అనునిత్యమూ పూజచేస్తూ ఉంటారో, ఎక్కడైతే గంగ మొదలగు పుణ్యనదులు ప్రవహిస్తూ ఉంటాయో, ఆ ప్రదేశములు సకల శుభములకు నిలయములు అని గ్రహించాలి. ఇవే కాకుండా సరోవరములు, పుణ్యక్షేత్రములు అనగా కురుక్షేత్రము, గయ, ప్రయాగ, పులహాశ్రమము, నైమిశారణ్యము, ఫల్గుణీ నది ప్రవహించే ప్రదేశము, రాముడు సేతువు కట్టిన ప్రదేశము (రామేశ్వరము), ప్రభాస తీర్థము, కుశస్థలి (ద్వారక), వారణాసి, మధుర, సీతారాములు నివసించిన ఆశ్రమ ప్రదేశములు, మహేంద్ర పర్వతము మొదలగు కుల పర్వతములు, ఇవన్నీ కూడా పుణ్య ప్రదేశములు అని చెప్పబడుతున్నాయి. గృహస్థు అయిన వాడు పైన చెప్పబడిన పుణ్యస్థలములను దర్శించాలి. పైన చెప్ప బడిన పుణ్యతీర్థములలో శ్రార్థకర్మలు కానీ, శుభకార్యములు కానీ చేస్తే వారికి వెయ్యిరెట్లు ఫలితము దక్కుతుంది.

ఓ ధర్మనందనా! ఈ లోకంలో శ్రీహరి అవతారమైన శ్రీకృష్ణుని మించిన పుణ్యపురుషుడు ఎవరూ లేరు.అందుకనే ఈ రాజసూయ యాగ సందర్భంలో మీరు  శ్రీకృష్ణునికి అగ్రపూజ చేసారు. మీకే కాదు ఈ చరాచర జగత్తులో శ్రీకృష్ణుని మించిన పుణ్య పురుషుడు లేనే లేడు. సకల జీవరాసులతో నిండి ఉన్న ఈ బ్రహ్మాండము అనే మహా వృక్షమునకు మూలము శ్రీకృష్ణుడే కదా!

శ్రీకృష్ణుని పూజిస్తే సకల దేవతలను పూజించిన ఫలితం దక్కుతుంది.

పరమాత్మ, మానవులు, పశువులు, మృగములు, పక్షులు మొదలగు జీవరాసులకు దేహములను సృష్టించాడు. ఈ దేహములనే పురములు అని కూడా అంటారు. ఈ పురములలో పరమాత్మ కొలువై ఉన్నాడు. అందువలన ఈ పురములలో ఉన్న పరమాత్మను పురుషుడు అని అంటారు.

(పురుషుడు అంటే మగవాడు అని లౌకిక అర్థం. కాని పురుషుడు అంటే కేవలం మగవాడు అనే కాదు. ఆడవారు, పశుపక్ష్యాదులు మొదలగుజీవరాసుల దేహములలో ఉన్న ఆత్మ స్వరూపుడు అని అర్థం.)

అన్ని శరీరములలో పురుషుడిగా ఉన్న పరమాత్మకు ఈ దేహము ఉన్నత వంశంలో జన్మించిందా, లేక నీచ జాతిలో జన్మించిందా అనే భేదములేదు. అన్ని దేహములలో సమానంగా ఉన్నాడు. కాబట్టి, ఈ మానవులందరిలోనూ ఎవరి యందు జ్ఞానము, తపోశక్తి, యోగము మొదలగునవి ప్రకటితమౌతుంటాయో వారే శ్రేష్టులు, సత్పురుషులు అని పిలువబడతారు.

ఓ ధర్మనందనా! కృతయుగములో ఎవరి పని వారు చేసుకొనే వారు. మనుషుల మధ్య ఈర్ష్య, అసూయ, ద్వేషము ఉండేవికావు. అందరూ సమానంగా ఉండేవారు. కృతయుగము పోయి త్రేతాయుగము ప్రారంభం కాగానే, మానవులలో నేను గొప్ప అంటే నేను గొప్ప అనే అహంకారము పెరిగిపోయింది. నాకు అంతా తెలుసు అన్న భావన ప్రతివాడిలోనూ అంకురించింది. ఒకరిని ఒకరు

నిందించుకోవడం, అవమానించుకోవడం మొదలుపెట్టారు. ఈ సమయంలో అందరికన్నా శ్రేష్టుడు అయిన పరమాత్మ ఉన్నాడు అని అందరికీ గుర్తుచేయవలసిన అవసరం ఏర్పడింది. ఆ కారణం చేత ఆ పరమాత్మ యొక్క ప్రతిమలను (విగ్రహములను) పూజించడం మొదలయింది. ఆ విధంగా పరమాత్మ ప్రతిమలను పూజించడం ఆచారంగా ఏర్పడింది.

తరువాత కాలంలో, పరమాత్మను ప్రతిమల రూపంలో, ఎన్నోవిధాలుగా, రకరకాల పూజా విధానములలో, ఉపకరణములతో పూజచేయడం మొదలయింది. పరమాత్మ యందు భక్తి, శ్రద్ధ లేకుండా, కేవలం ఈ విగ్రహములను పూజించినంత మాత్రాన ఏమీ ప్రయోజనం లేదు.

(ఆ ప్రకారంగా విగ్రహారాధన త్రేతాయుగ కాలం నుండి ఒక ఆచారంగా ఏర్పడింది. ప్రస్తుతం మనము విగ్రహారాధన దగ్గరే ఆగిపోయాము. విగ్రహముల వెనుక ఉన్న పరమాత్మను తెలుసుకోడానికి ప్రయత్నించడం లేదు. పరమాత్మ యందు భక్తి కుదరడానికి విగ్రహములను కేవలము ఒక సాధనముగా ఉపయోగించుకోవాలి గానీ, విగ్రహారాధనే పరమార్థంకాదు అనీ, కేవలము విగ్రహములను పూజించినంత మాత్రమున ప్రయోజనము లేదనీ, భాగవతము నిర్ద్వందంగా చెబుతూ ఉంది. )

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
సప్తమస్కంధము
పదునైదవ అధ్యాయము.

ధర్మనందనా! మానవులందరిలోనూ పరమాత్మ ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు అని చెప్పాను కదా. ఆ మానవులందరిలోనూ బ్రాహ్మణులు సత్పురుషులు అని చెప్పబడతారు. కానీ పుట్టుకతో ఎవరూ బ్రాహ్మణుడు కాదు. ఒక మనిషి తాను చేసిన తపస్సు చేతా, నేర్చుకున్న విద్య చేతా, వేదాధ్యయనం చేయడం చేతా, తృప్తిగా జీవితం గడపడం చేతా బ్రాహ్మణుడు అనిపించుకుంటాడు. అటువంటి బ్రాహ్మణులను సాక్షాత్తు శ్రీకృష్ణుడు కూడా భక్తితో పూజిస్తాడు.

ధర్మనందనా! ఆ బ్రాహ్మణులలో కూడా కొంత మంది కర్మలు చేయడం యందే నిమగ్నమై ఉంటారు. మరి కొందరు తపస్సు చేసుకుంటూ ఉంటారు. మరి కొందరు వేదములు, శాస్త్రములు అధ్యయనం చేస్తుంటారు. మరి కొంత మంది జ్ఞానమును, యోగమును అభ్యసిస్తూ ఉంటారు. గృహస్థు అయిన వాడు పితృదేవతల యొక్క మోక్షము కోరుకుంటూ పైన చెప్ప బడిన లక్షణములుకల బ్రాహ్మణులను అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి, పూజించి హవ్య కవ్యములను సమర్పించుకోవాలి.

(దేవతలకు ఇచ్చేవి హవ్యములు, పితరులకు ఇచ్చేవి కవ్యములు. శ్రార్థములలో కూడా ముందు విశ్వేదేవతలను అర్చించి, తరువాత పితృదేవతలను అర్చిస్తారు.)

గృహస్థు తన పితరులకు శ్రార్ధకర్మలు చేసేటప్పుడు తగిన బ్రాహ్మణులు దొరకని పక్షంలో, ఇతర బ్రాహ్మణులకు, వారి వారి జ్ఞానము, తపస్సు, విద్యలో గల తారతమ్యములను బట్టి వారికి హవ్య కవ్యములను సమర్పించాలి.

ధర్మనందనా! దేవతా కార్యములలో ఇద్దరు బ్రాహ్మణులకు, పితృకార్యములలో ముగ్గురు బ్రాహ్మణులకు తృప్తిగా భోజనం పెట్టాలి. అంతమంది బ్రాహ్మణులు దొరకనప్పుడు, కనీసం ఒక్క బ్రాహ్మణుడికైనా తృప్తిగా భోజనం పెట్టాలి. తనకు బాగా ధనము ఉంది కదా అని శ్రార్ధ కర్మలలో ఎక్కువ మంది బ్రాహ్మణులను భోక్తలుగా పిలువరాదు. శ్రార్ధ కర్మలలో ఎక్కువ మంది బ్రాహ్మణులను, ఎక్కువ మంది బంధువులను పిలిస్తే, పితృకార్యములో శ్రద్ధ తగ్గిపోతుంది. సేకరించిన ద్రవ్యము, పదార్ధములు సరిపోవు. అంత మంది బ్రాహ్మణులలో తగిన వారెవరో, తగని వారెవరో గుర్తించడం కష్టం. అంతమంది బ్రాహ్మణులను అర్చించడం, భోజనం పెట్టడం కూడా కష్టంతో కూడుకున్న పని. అందుకని ఇద్దరు, లేక ఒకరు భోక్తలను నియమించుకోవాలి.

గృహస్థు ఇంట్లో లేకుండా ఏ పుణ్యక్షేత్రములోనో, లేక ప్రయాణంలోనో ఉంటే, ఆ యా ప్రదేశములలో దొరికిన పదార్థములతో సత్పురుషుడు అయిన బ్రాహ్మణుని అర్చించి భోజనము పెట్టవచ్చును. అదికూడా అధికమైనఫలమును ఇస్తుంది. గృహస్థు అయినవాడు, ప్రతిరోజూ దేవతలను, పితరులను, ఋషులను, ఇతర ప్రాణులను, అతిథులను పరమాత్మ స్వరూపాలుగా పూజించి, వారి శక్త్యానుసారము భోజనము పెట్టి తరువాత తాను భుజించాలి. అంతే

కానీ దొరికినది అంతా తానే తినకూడదు.

ధర్మము తెలిసిన గృహస్తు, పితృ కార్యములయందు మాంసమును పెట్టకూడదు. తాను కూడా తినకూడదు. కేవలము కాయగూరలతోనే భోజనము పెట్టాలి. ఎందుకంటే అన్ని జీవులలో పరమాత్మ ఉన్నాడు. ఆ జీవులను చంపి ఆ మాంసము పెడితే, పరమాత్మ తృప్తిచెందడు.

ధర్మనందనా! ధర్మచింతన కల మానవుడు తన మనస్సుతో గానీ, వాక్కుతో గానీ, శరీరముతో గానీ ఇతర మానవులకు కానీ, జంతువులకు కానీ, పశుపక్ష్యాదులకు కానీ హాని కలిగించరాదు. లోకములో ఇదే పరమధర్మముగా చెప్పబడింది. దీనితో సమానమైన ధర్మము మరొకటి లేదు.

యజ్ఞము అంటే హెూమగుండంలో ఆహుతులు వేయడం కాదు. ధర్మరహస్యములను తెలిసిన వారు, తమ కోరికలను,తాము చేసే కర్మఫలములను, తనలో వెలుగుతున్న ఆత్మ అనే అగ్నిలో వేసి భస్మం చేస్తారు. వారు నిష్కాములు అవుతారు. అదే నిజమైన యజ్ఞము.

ఓ ధర్మనందనా! ఆర్భాటంగా యజ్ఞయాగములు చేసే వారు, అనేక రకములైన జీవములను, జంతువులను, మృగములను తెచ్చి ఊపస్థంభములకు కట్టి వాటిని బలిఇస్తుంటారు. ఇటువంటి యజ్ఞములు యాగములు చేసేవారిని చూచి మృగములు, జంతువులు "వీడికి దయాదాక్షిణ్యములు లేవు. వీడు నిర్దయుడు. వీడికి

ధర్మం తెలియదు. వీడు తన ప్రాణములను మాత్రం భద్రంగా కాపాడుకోడానికి మనలను యజ్ఞపశువులుగా తీసుకొని పోయి తప్పకుండా చంపుతాడు" అని అనుకుంటూ, వాడిని చూచి భయంతో పారిపోతాయి. కాబట్టి ధర్మము తెలిసిన వారు, యజ్ఞయాగములలో కానీ, దైనందిన జీవితంలో కానీ జీవహింసచేయకుండా దొరికిన వాటితోనే తృప్తి పడాలి.

ధర్మనందనా! ఇప్పటి దాకా నీకు ధర్మం గురించి చెప్పాను. ధర్మం కానిది అధర్మము అంటారు. ఆ అధర్మము అనే వృక్షమునకు ఐదు కొమ్మలు ఉన్నాయి. వాటి పేర్లు విధర్మము, పరధర్మము, ఆభాసము, ఉపమము, కపటము. ధర్మం తెలిసిన వాడు ఈ ఐదింటినీ తక్షణము విడిచిపెట్టాలి. ఓ ధర్మరాజా! ప్రతి వాడికీ తాను ఆచరించ వలసిన ధర్మం ఒకటి ఉంటుంది. దానినే స్వధర్మము అంటారు. (అంటే తనకు నియమింపబడిన పని చేయడం, తనకు అప్పగించిన పని చేయడం, తాను చేయవలసిన పని చేయడం మొదలైనవి.) కాని కొంత మంది తమ స్వధర్మమునకు విరుద్ధమైన పనులు చేస్తుంటారు. దానినే విధర్మము అంటారు.
( ఉదాహరణకు......విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ గా నియమించబడి, ప్రొఫెసర్‌గా జీతం తీసుకుంటూ, ఒక్కరోజుకూడా విద్యార్థులకు పాఠం చెప్పకుండా, రాజకీయాలలో మునిగి తేలేవారు ఈ కోవలోకి వస్తారు.)

మరి కొంత మంది తమ యొక్క ధర్మమును మరిచిపోయి, పరధర్మాచరణంలోనే ఎక్కువగా ఆసక్తి చూపిస్తుంటారు. మరి కొందరు, హంగు, ఆర్భాటాలతో, మెడనిండా రుద్రాక్షలు వేసుకొని

తమను తాము మహాత్ములుగా ప్రచారం చేసుకుంటూ, గర్వంతో మెలిగే వారిని ఉపధర్మము పాటించేవారు అని అంటారు.
(ప్రస్తుతము మహర్షులుగానూ, స్వామీజీలుగానూ పిలువబడే వారు ఈ కోవలోకి వస్తారు.)

వేదములలో, శాస్త్రములలో చెప్పబడిన విషయములను వక్రీకరించి, తమకు తోచిన వక్రభాష్యాలు చేస్తూ జనులను మోసం చేసేవారిని కపటధర్మము ఆచరించేవారు అని అంటారు.
( ఈ రోజుల్లో, ద్రౌపదికి కర్ణుని మీద కోరిక ఉందనీ, నారదుని విదూషకుడుగానూ, దేవతా మూర్తులను అసభ్యంగానూ, సినిమా, ప్రసార మాధ్యమాలలో చూపించేవారు ఈ కోవలోకి వస్తారు.)

ఇంక ఆఖరువారు ఆభాసులు. వారు ఏధర్మాన్ని ఆచరించరు. తమకు ఏది తోస్తే అది చేస్తారు. నోటికి ఏది వస్తే అది మాట్లాడతారు. వారునీతి నియమాల గురించి పట్టించుకోరు. తమకు ఎంతతోస్తే అంత. స్వేచ్ఛాజీవులు. వీరిది ఆభాస ధర్మము.

ఎటువంటి అధర్మానికి లోను కాకుండా స్వధర్మాన్ని పాటించేవారు, దొరికినదానితో తృప్తిగా జీవించేవారు, సుఖంగా జీవితం గడుపుతారు.

ధర్మ నందనా! మోక్షము కోసరం ప్రయత్నించే వాడు, తన దేహమును పోషించుకోడానికి, రక్షించుకోడానికి ఎవరినీ దేని కొరకూ యాచించనవసరం లేదు. కొండచిలువ తన ఆహారము కొరకు

ప్రయత్నించదు. తన దగ్గరకు వచ్చిన జీవిని చంపి తింటుంది. అలాగే అవధూతలైన వారు కూడా తమకు అయాచితంగా లభించిన దానితోనో పొట్టనింపుకోవాలి. దేని మీద కోరికను, మమకారమును పెంచుకోకూడదు.

ఉన్నదానితో తృప్తిగా బతికే వాడు, ఎటువంటి కోరికలు లేని వాడు, ఎల్లప్పుడూ ఆత్మను దర్శించేవాడు, సకల సుఖములను అనుభవిస్తాడు. కాని ఎల్లప్పుడూ ధనమును సంపాదించడంలో మునిగి తేలేవాడు, ధనం కోసం ఆరాటపడేవాడు, ధనం మీద అపరిమితమైన ఆశ కలవాడు ఏ నాడు కూడా సుఖంగా జీవించలేడు. నిరంతరం ఏదో ఒక దు:ఖంతో బాధపడుతుంటాడు.

ఉన్నదానితో తృప్తి చెందేవాడు కంకర రాళ్ల మీద చెప్పులు వేసుకొని నడిచేవాడి మాదిరి సుఖంగా ఉంటాడు.

ఓ రాజా! జీవితంలో తృప్తి కలవాడు, నీరు దొరికినా, దానితో తృప్తి పొందుతాడు. కాని రుచికరమైనా ఆహారం కోసరము, వివిధములైన స్త్రీలతో రతి సుఖము కోసరం ఆరాటపడేవాడు, కుక్కమాదిరి జీవితం గడుపుతాడు. నియమ నిష్ఠలతో జీవితం గడప వలసిన బ్రాహ్మణుడు, ఇంద్రియసుఖములకు లోబడి తృప్తి లేని జీవితం గడుపుతుంటే, ఆ బ్రాహ్మణుని తేజస్సు, నేర్చుకున్న విద్య, చేసిన తపస్సు, సంపాదించిన పేరుప్రతిష్ఠలు, చివరకు అతని విచక్షణా జ్ఞానము అన్నీ సర్వ నాశనం అయిపోతాయి.

ఓ ధర్మనందనా! ఈ లోకంలో ఆకలి దప్పిక లేకపోతే దానికి సంబంధించిన కోరికలు కూడా నశించిపోతాయి. కోపం వచ్చినప్పుడు ఎవరినైనా కొడితే, చంపితే, ఆ కోపం నశిస్తుంది. కాని, నాలుగు దిక్కులు జయించినా, ఈ భూమి యావత్తు తన స్వాధీనం అయినా, లోభి అయిన వాడికి వాడిలో ఉన్న ఆశ నశించదు. లోభికి తృప్తి అంటూ ఉండదు. ఎంత ఉన్నా ఇంకా ఏదో కావాలని తపిస్తుంటాడు.

ఓ రాజా! ఎన్నో విషయములను తెలిసిన విద్యావంతులు, అందరి సందేహములను తీర్చగల సమర్థులు కూడా ఎల్లప్పుడూ ఏదో ఒక కారణంగా దు:ఖపడుతూనే ఉంటారు. నరకయాతన అనుభవిస్తూ ఉంటారు. దీని కంతటికీ ఒకటే మార్గము. కోరికలను విడిచిపెట్టడం ద్వారా, ప్రాపంచిక విషమముల మీద ఆసక్తిని విడిచిపెట్టవచ్చును. అలాగే, అహింసా తత్వమును అలవరచుకుంటే, కోపమును జయించవచ్చును. ధనముసంపాదించడం మీద ఆసక్తి విడిచి పెడితే, లోభత్వమును పోగొట్టుకోవచ్చును. ఈ దేహము, కనపడే వస్తువులు అన్నీ శాశ్వతములు కావు, పరమాత్మ ఒక్కడే శాశ్వతుడు అనే తత్త్వజ్ఞానము కలిగినప్పుడు, భయం అనేది లేకుండా పోతుంది.

ఓ ధర్మరాజా! మానవుడు ఎల్లప్పుడూ భగవంతుని గురించి చింతించడం ద్వారా, ఆత్మతత్త్వమును తెలుసుకోవడం ద్వారా తనలో ఉన్న శోకమును, మోహమును పోగొట్టుకుంటాడు. సాధువులను, సత్పురుషులను, సేవించడం ద్వారా అహంకారమును పోగొట్టుకకుంటాడు. కావలసినంతవరకే మాట్లాడుతూ, మిగిలిన సమయాలలో మౌనంగా ఉండటంద్వారా, యోగ సాధనలో వచ్చే

అడ్డంకులను దాటవచ్చును. కోరికలను, ఆ కోరికలను తీర్చుకోడానికి ప్రయత్నములు....వీటిని విడిచిపెట్టడం వలన హింసను అరికట్టవచ్చును. (అంటే కోరుకున్న కోరికలు తీరకపోయినా, అందుకోసరం చేసిన ప్రయత్నాలు ఫలించకపోయినా, అపరిమితమైన కోపం వస్తుంది. ఆ కోపంలో ఏంచేస్తాడో వాడికే తెలియదు. అది హింసకు దారితీస్తుంది.)

ధర్మనందనా! అందరి ఎడలా స్నేహంగా , ప్రేమగా, దయగా ఉండటం వలన, ఇతరుల నుండి మనకు కలిగే దు:ఖములను నివారించవచ్చును. ఇతరుల ప్రమేయం లేకుండా, విధివశాత్తు వచ్చే కష్టములను, దు:ఖములను, ధ్యానం చేయడం ద్వారా, పోగొట్టుకోవచ్చును. అలాగే, మన శరీరం ద్వారా వచ్చే కష్టములను అంటే రోగములు, ముసలితనమువలన కలిగే కష్టములను, ప్రాణాయామం ద్వారా, యోగసాధన ద్వారా, పోగొట్టుకొనవచ్చును. సాత్వికమైన ఆహారమును, మితంగా భుజించడం వలన, సుఖనిద్ర పొందవచ్చును.

ధర్మరాజా! మానవులను సత్వ, రజస్, తమోగుణములు ప్రభావితం చేస్తుంటాయి. మానవుడు సత్వగుణమును పెంపొందించు కుంటే, రజస్తమోగుణములు దూరంగా ఉంటాయి. నిష్కామ కర్మలను ఆచరించడం వలన, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని విడిచిపెట్టడం వలన, ఆ సత్వగుణమును కూడా దూరంగా పెట్టి, పరమాత్మలో లీనం కావచ్చును.

పైన చెప్పినవి అన్నీ సాధించాలంటే ఎవరైనా గురువును ఆశ్రయించక తప్పదు. గురువు మీద ఉన్న భక్తితోనే పైన చెప్పబడినవి సాధించగలడు. గురువు అనే వాడు సాక్షాత్తు భగవంతుని స్వరూపుడు. జ్ఞాని. అటువంటి గురువును భక్తితో పూజించాలి, సేవించాలి. "ఈ గురువు కూడా నాలాంటి వాడే, గురువుకు ఏమీ తెలియదు" అని అనుకొనే వాడికి, వాడు ఎన్ని శాస్త్రములు చదివినా, ఎంత నేర్చుకున్నా, ఏమీ ప్రయోజనము లేదు. ఎలాగైతే ఏనుగు చెరువులో శుభ్రంగా స్నానం చేసి ఒడ్డుకు వచ్చి మరలా మట్టిని తొండంతో ఒంటి మీద చల్లుకున్నట్టు, గురువు మీద విశ్వాసం లేని వాడు, ఎంత విద్యావంతుడైనా వాడు నేర్చుకున్న విద్య అంతా వ్యర్థము.

రాజసూయయాగ సమయంలో అగ్రపూజనందుకున్న శ్రీకృష్ణుడు సాక్షాత్తు ఆ పరమాత్మ అవతారము. శ్రీకృష్ణుని పాదపద్మములను యోగులు కూడా తన హృదయ కమలములలో పెట్టుకొని పూజిస్తారు. కాని ఈ లోకములో ఉండే మీలాంటి మానవులు, తమ కళ్లెదుట తిరుగుతున్న శ్రీకృష్ణుని తమవంటి సామాన్య మానవుని వలె భావిస్తారు. ఆయన మహిమలను తెలుసుకోలేరు.

మానవుడు జ్ఞానేంద్రియములతోనూ, కర్మేంద్రియములతోనూ, మనస్సుతోనూ ఎన్నోపనులు చేస్తుంటాడు. వాటిని అదుపులో పెట్టుకోడానికి ధ్యానము, ధారణ, సమాధి అవసరము. భగవంతుని మీద భక్తి, విశ్వాసము లేని వాడు, ఎన్ని పూజలు, వ్రతములు, యజ్ఞములు, యాగములు, కర్మలు చేసినా అవి పరమాత్మను చేరుకోవడానికి పనికిరావు. పరమాత్మను

చేరుకోవాలంటే, ముందు మనస్సును జయించాలి. ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని వదిలిపెట్టాలి. హంగు, ఆర్భాటములను వదిలి పెట్టి ఒంటరిగా జీవితం గడపాలి. సన్యాసం తీసుకోవాలి. భిక్షాటన ద్వారా దొరికిన దానితో తృప్తిపడుతూ జీవనం గడపాలి.

ఓ ధర్మనందనా! అటువంటి యోగి శుచి అయిన ప్రదేశములో మంచి ఆసనము ఏర్పరచుకోవాలి. దాని మీద నిటారుగా కూర్చుని, మనస్సును అటు ఇటు పోనీయకుండా, స్థిరంగా నిలిపి, ఓంకారమును జపించాలి. పూరకము, కుంభకము, రేచకము ద్వారా ప్రాణాయామమును చేయాలి. మనస్సులో ఎటువంటి కోరికలకు తావు ఇవ్వకూడదు. అన్ని కోరికలను విడిచిపెట్టాలి. మనస్సును నిర్మలంగా ఉంచుకోవాలి. దృష్టిని ముక్కు కొస యందు అంటే నొసటి యందు నిలపాలి. తన మనస్సును పరమాత్మయందు లగ్నం చేయాలి. ఈ ప్రకారంగా ప్రతి నిత్యము అభ్యాసము చేస్తే, ఆ సన్యాసి చిత్తము కొద్దికాలములోనే నిర్వాణం పొందుతుంది.

ఓ ధర్మనందనా! కోరికలు లేని చిత్తముతో, ప్రాపంచిక విషయములతో కలత చెందకుండా ఉండే  మనస్సుతో ఉన్న సన్యాసి చిత్తము ఎప్పుడూ కూడా విషయ వాంఛలకు లోనుకాదు. ఏ గృహస్థు అయిన ఒక సారి సన్యాసము తీసుకొని, కొంత కాలము సన్యాసిగా జీవితం గడిపి, ఆ సన్యాస జీవితము గడప లేక, మరలా గృహస్థాశ్రమము స్వీకరిస్తే, అటువంటి వాడు కక్కిన కూటికి ఆశపడే వాడి కింద లెక్క. అటువంటి వాడికి సిగ్గు, లజ్జఅనేవి ఉండవు.

సాధారణంగా సన్యాసులకు దేహాభి మానము ఉండదు. ఈ దేహము చివరకు మట్టిలో కలిసి పోతుందని, జంతువులకు ఆహారం అవుతుందనీ భావిస్తారు. కాని కొంతమంది తెలివి తక్కువ వాళ్లు ఈ దేహమే సర్వస్వమని, దేహము ఆత్మ ఒకటే అనీ తమను తాము పొగుడుకుంటూ ఉంటారు. (ఈ నాడు మహర్షి అని పిలిపించుకునేవారు ముఖానికి మేకప్ వేసుకొని టివిలలో దర్శనం ఇస్తున్నారు.)

ఓ ధర్మనందనా! గృహస్థు అయిన వాడు నిత్యము కర్మలు చేయాలి. లేకపోతే భార్య బిడ్డలను పోషించలేడు. గృహస్థు కర్మలు చేయకుండా ఉండటం మంచిది కాదు. అలాగే బ్రహ్మచారి తన బ్రహ్మచర్యమును వదిలిపెట్టకూడదు. అరణ్యములో జీవనం గడప వలసిన వానప్రస్థుడు గ్రామములలో పట్టణములలో నివసింపరాదు. సన్యాసికి ఇంద్రియలోలత్వము పనికిరాదు. తమ తమ ఆశ్రమ ధర్మములను వదిలిపెట్టినవారు ఇతరులను మోసం చేసే వారిగా పిలువబడతారు. అటువంటి వారి మాయలో పడకుండా, వారి మానాన వారిని వదిలిపెట్టడమే పరమధర్మము.

ఆత్మ తత్త్వము తెలుసుకొన్న వాడు, పరమాత్మ గురించి తెలుసుకుంటే, ఇంక అతను తెలుసుకోదగ్గ విషయం అంటూ ఏమీ ఉండదు. అతను తన దేహమును పోషించుకోవడానికి శ్రమపడనవసరం లేదు. ఆ పరమాత్మయే అతని యోగ క్షేమములను చూచుకుంటాడు.

ఓ ధర్మనందనా! జ్ఞానుల దృష్టిలో పరమాత్మ సృష్టించిన ఈ శరీరము ఒక రథము వంటిది. ఇంద్రియములు ఆ రథమునకు కట్టిన గుర్రములు. మనస్సు ఆ గుర్రములకు కట్టిన తాడు వంటిది. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అను తన్మాత్రలు ఆ రథము వెళ్లే ప్రదేశముల వంటివి. ఈ రథమునకు బుద్ధి సారథి వంటి వాడు. ఈ దేహములో ఉన్న చైతన్యము ఆ రథమును గుర్రములను కలిపి కట్టి ఉంచే బంధనము వంటిది. ఈ శరీరములో ఉండే ప్రాణములు ఆ రథమునకు ఇరుసు వంటివి. ధర్మము, అధర్మము ఆ రథమునకు చక్రములు. దేహములో ఉంటే అహంకారమే ఈ రథములో కూర్చున్న రథికుడు. ఓంకారమే అతని చేతిలో ఉన్న విల్లు. శరీరంలో ఉన్న జీవాత్మ ఆ విల్లుకు సంధించిన బాణము. ఈ బాణమునకు లక్ష్యము పరమాత్మను తెలుసుకోవడమే.

రాగద్వేషములు, లోభము, మోహము, శోకము, భయము, మదము, మానము, అవమానము, అసూయ, మాయలో పడటం, హింసచేయడం, మాత్సర్యము, ప్రతి విషయానికీ ఆరాటపడటం, ప్రమాదాలు కొనితెచ్చుకోవడం, ఆకలి దప్పులు, నిద్ర ఇవన్నీ దేహధారికి శత్రువులు. ఈ శత్రువులు అన్నీ రజోగుణము, తమోగుణము కలిసి ప్రకోపించడం వల్ల ఏర్పడతాయి. ఈ శత్రువులే కొన్ని సమయాలలో సత్వగుణ ప్రధానంగా ఉంటాయి.

ఓ ధర్మరాజా! ఈ దేహమే ఒక రథము అని చెప్పాను కదా! ఆ దేహము అనే రథముయొక్క ఉపకరణములు అయిన ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారమును తన వశములో

ఉంచుకుంటూ, గురువుల యొక్క పాదములను సేవించుకుంటూ, జ్ఞానము అనే కత్తిని సంపాదించుకొని, పరమాత్మను తన బలంగా చేసుకొని, ఆ జ్ఞానఖడ్గముతో పైన చెప్పబడిన శత్రువులను నాశనం చేయవచ్చును. అప్పుడు ఆ జీవునికి బ్రహ్మానందం కలుగుతుంది. మనస్సు నిర్మలం అవుతుంది. అటువంటి వాడికి దేహాభి మానము నశిస్తుంది.

అలాకాకుండా, ఈ దేహము అనే రథమును ప్రాపంచిక విషయములు అనే మార్గములో నడిపితే, ఇంద్రియములు అనే గుర్రములు ఆ రథమును తమ ఇష్టం వచ్చిన దిక్కుగా లాక్కొని వెళతాయి. విషయ వాంఛలు అనే దొంగల మధ్యకు తీసుకొని వెళతాయి. తరువాత విషయ వాంఛలు అనే ఆ దొంగలు ఆ రథమును చీకటి, మృత్యుభయముతో కూడిన సంసారము అనే బావిలోకి తోసేస్తారు.

ఓ ధర్మనందనా! మానవులు చేయవలసిన కర్మల గురించి వేదములలో చెప్పబడ్డాయి. ఆ కర్మలు ప్రవృత్తి కర్మ, నివృత్తి కర్మ అని రెండు విధములు. సంసార సంబంధమైన ప్రాపంచిక కర్మలను ప్రవృత్తి కర్మలు అంటారు. వీటి వలన కొద్దిగా సుఖము ఎక్కువగా దు:ఖము లభిస్తుంది. కాని మోక్షము కొరకు చేసే నివృత్తి కర్మల ద్వారా అమృతము లాంటి అపరిమితమైన ఆనందము లభిస్తుంది.

ఇంక ప్రవృత్తి కర్మలు అంటే ఏమిటో వివరిస్తాను. జీవహింసతో కూడిన యజ్ఞములు, యాగములు, అగ్నిహోత్రములు,

చాతుర్మాస్య వ్రతములు, పశువులను వధించే యాగములు, సోమయాగము, ఎక్కువగా ధనం వ్యయం చేసి తమ గొప్పను చాటుకోడానికి నిర్వహించే యాగములు, ఏవేవో కోరికలు తీరడానికి చేసే యాగాలు, వ్రతాలు, మొదలగు కర్మలు, దేవాలయములు కట్టించడం, బావులు, చెరువులు తవ్వించడం, బాటసారులకు నీటి వసతి ఏర్పాటు చేయడం, ఇటువంటి కర్మలన్నీ ప్రవృత్త కర్మలు అని చెప్పబడతాయి. ఈ ప్రవృత్త కర్మలు చేయడం ద్వారా పుణ్యం వస్తుంది. స్వర్గ సుఖం లభిస్తుంది.

ఓ ధర్మనందనా! కాలం తీరగానే మానవుడు చనిపోతాడు. చని పోగానే ఈ స్థూల శరీరం అగ్నికి ఆహుతి అవుతుంది. లేకపోతే భూగర్భంలో మట్టిలో కలిసిపోతుంది. కాని ఈ స్థూల దేహములోనుండి బయటకు వచ్చిన జీవుడు సూక్ష్మదేహమును ధరిస్తాడు. క్రమ క్రమంగా చంద్రలోకము, దేవలోకములకు చేరుకుంటాడు. తాను చేసిన పుణ్యములకు ఫలాన్ని అనుభవిస్తాడు. ఆ పుణ్యఫలాలు అనుభవించడం అయి పోగానే  సూక్ష్మ శరీరంలో ఉండే జీవుడు, ఆకాశంలోనుండి భూమి మీదకు పడే వర్షము ద్వారా,  భూమిని చేరుకుంటాడు. భూమిని చేరుకున్న ఆ జీవుడు, వర్షపు నీటి ద్వారా,  మొక్కలలోకి, ధాన్యపు గింజల లోకి, చెట్లలోకి చేరుతాడు. భూమి మీద ఉన్న మానవులు ధాన్యమును, ఓషధులను, కాయలను, పండ్లను ఆహారంగా తీసుకుంటారు కదా! సూక్ష్మదేహంలో ఉన్న జీవుడు, మనిషి తీసుకున్నఆహారం ద్వారా  ఆహారం ద్వారా మనిషి శరీరంలోకి ప్రవేశిస్తాడు. రక్తంలో కలిసిపోతాడు. తరువాత వీర్యం ద్వారా, స్త్రీ శరీరంలోకి ప్రవేశిస్తాడు. అక్కడు అండంగా మారి, శిశువుగా

మారుతాడు. మాతృ గర్భంనుండి శిశువుగా భూమిమీదికి వస్తాడు. ఈ మార్గమునే పితృయానము అని అంటారు. .

ఓ ధర్మనందనా! ఇంక దేవయానము గురించి చెబుతాను విను. వధూవరులకు వివాహము అయిన తరువాత, భార్య గర్భం ధరిస్తే, ఆమెకు జరిపించే సీమంతము కార్యక్రమము దగ్గర నుండి, ఆమె గర్భంలో నుండి శిశువు బయటకు వచ్చిన తరువాత, జాతక కర్మలు, ఉపనయనము, విద్యాభ్యాసము, వివాహము, చివరకు మరణము వరకూ మానవుడు, జ్ఞానేంద్రియములతోనూ, కర్మేంద్రియములతోనూ ఎన్నో కర్మలను చేస్తుంటాడు. కాని ద్విజుడు అయిన వాడు, ఆ కర్మలను నిష్కామంగా చేస్తాడు. అనాసక్తితో చేస్తాడు. ఆ కారణంగా ఆ కర్మల ఫలితములు తనకు అంటుకోకుండా జాగ్రత్తపడతాడు. అవసానదశలో, ఇంద్రియములను మనస్సులోనూ, మనస్సును వాక్కు యందు, వాక్కును వర్ణములలోనూ అనగా భాషలోనూ, అన్ని వర్ణములను అనగా భాషలను (వాక్కులను) ఓంకారములోనూ, ఓంకారమును ఓంకారము అంతము అయ్యే బిందువు వద్ద, ఆ బిందువును నాదం లోనూ, నాదమును ప్రాణమునందు, ప్రాణమును అనగా జీవాత్మను పరబ్రహ్మయందు విలీనం చేస్తాడు.. (ఓం కారము అంతం అయ్యే బిందువు అంటే, ఓంకారమును ఉచ్ఛరిస్తూ ఆ ఓంకారము అంతము అయ్యే, అంటే మ్‌మ్‌మ్‌మ్ అంతమయ్యే క్షణాన్ని ఓంకారాంత బిందువు అంటారు.)

పరబ్రహ్మయందు లీనం అయిన సూక్ష్మదేహము అక్కడ సుఖాలు అనుభవిస్తుంది. బ్రహ్మలోకములో సుఖములు అనుభవించిన

తరువాత, మరలా స్థూల దేహమును పొందుతుంది.

స్థూల దేహమును పొందిన జీవుడు ప్రాకృత కర్మలలో లీనం కాడు. సాత్వికాహంకారంలో ఉంటాడు. ఎల్లప్పుడూ ధ్యానంలో ఉంటాడు. స్థూల దేహమును సూక్ష్మదేహంలో కలిసి వేస్తాడు. క్రమక్రమంగా సూక్ష్మదేహము కారణ శరీరంలోకి విలీనం అవుతుంది. కారణ శరీరంగా ఉంటాడు. తరువాత క్రమక్రమంగా తురీయావస్థను పొందుతాడు. ఈ మార్గమునే దేవయానము అని పెద్దలుచెబుతారు.

పితృయానములో ప్రయాణించేవాడు, తాను చేసుకున్న పుణ్యం అయిపోగానే మరలా భూలోకంలో కర్మలు చేస్తుంటాడు. సంసార చక్రంలో పడతాడు. కాని దేవయానములో ప్రయాణించేవాడు రాగ ద్వేషములకు లోను కాడు. ఎల్లప్పుడూ పరమాత్మను ధ్యానిస్తుంటాడు. ప్రాపంచిక విషయములలో ఆసక్తి చూపించడు. ధ్యానము,యోగము,సమాధి, తురీయావస్థలు దాటి పరమాత్మలో ఐక్యం అవుతాడు.

ఓ ధర్మనందనా! పైన చెప్పబడిన దేవయానము, పితృయానముల గురించి శాస్త్రదృష్టితో బాగా తెలుసుకొన్న వారు, గృహస్థాశ్రమములో ఉన్నప్పటికినీ, ఎటువంటి ప్రలోభములకు గురి కారు.

ఓ ధర్మనందనా! జననానికి ముందు ఈ దేహం లేదు, మరణం తరువాత ఈ దేహం ఉండదు. కాని జనన మరణాలతో

నిమిత్తంలేకుండా ఆత్మ ప్రకాశిస్తూ ఉంటుంది. అదే నిత్యము, సత్యము. ఈ ప్రపంచంలో జ్ఞానము, జ్ఞానముతో తెలుసుకోదగినది, వాక్కు, వాక్కుతో చెప్పవలసిన విషయము, చీకటి వెలుగు, ఇవన్నీ కూడా ఆ పరమాత్మ స్వరూపాలే. ఈ విషయాలు తెలుసుకున్నవాడు జ్ఞాని అవుతాడు.

అద్దంలో చూచుకున్నప్పుడు మన ప్రతిబింబం అచ్చం మనలాగానే కనిపిస్తుంది. కాని అద్దంలో ఉన్న ప్రతిబింబం నిజం కాదు. అది నిజం కాదు అని తెలిసి కూడా మనం ఆ ప్రతి బింబాన్ని చూస్తూ ఉంటాము. అలాగే జననం ముందు లేనిదీ, మరణం తరువాత కూడా లేనిదీ, కేవలం జనన మరణాల మధ్య కాలంలో కనపడేదీ అయిన ఈ దేహం కూడా అద్దంలో కనపడే ప్రతిబింబం లాంటిదే. కానీ మానవులు ఈ దేహము నిజం అనుకుంటుంటారు.

అలాగే ఈ దేహం లోని కళ్ల తోటి ఎన్నో వస్తువులను చూస్తున్నాము. చెవులతో వింటున్నాము. కాని ఇవన్నీ కల్పితాలునిజం కావు. మనసులో ఏమి సంకల్పిస్తే అదే మనకళ్లకు కనిపిస్తుంది. చీకటిలో తాడును చూచాము. కాని మనసు అది పాము అని భ్రమపడింది. కళ్లు కూడా దానిని పాముగానే చూచాయి. భయం కలిగింది. నిజానికి అది పాము కాదు. తాడు. అంటే మనసులో ఏమి సంకల్పిస్తామో అని మన కళ్లముందు కనపడుతుంది. కానీ అది నిజం కాదు. అలాగే ఈ దేహం కూడా నిజం కాదు.

ఈ దేహము పంచభూతములు అనగా భూమి, ఆకాశము, నీరు, అగ్ని, వాయువు ఈ ఐదింటి తో నిర్మింపబడింది అని మనకందరికీ తెలుసు. పంచభూతములు మూల పదార్థాలు అయితే వాటితో ఏర్పడ్డ ఈ దేహము వాటి ఛాయ మాత్రమే. మరణించగానే దేహము దేనికి అది విడిపోతుంది. పంచభూతములలో కలిసి పోతుంది. అటువంటప్పుడు ఈ దేహమును శాశ్వతము నిత్యము అని ఎలా అనగలవు.

అలాగే ఈ ప్రపంచములో మనం చూచే వస్తువులు అన్నీ కూడా పంచభూతము లతో  పరమాణువులతో కూడినవే. అవి కూడా తుదకు దేనికి అది విడిపోయి పంచభూతములలో కలిసి పోతాయి. (అందమైన సోపాసెట్టు ఫారిన్ మేడ్ కొంటాము. పదేళ్లు వాడాము. స్టోర్ రూములో పారేసాము. అది పాడయి పోయింది. బయట పారేసాము. అది మట్టిలో కలిసిపోయింది. మట్టిగా రూపాంతరం చెందింది.)

ఈ ప్రపంచంలో దొరికే అన్ని వస్తువులు పరమాణువులతో ఏర్పడ్డవే. కొన్ని వేల కోట్ల పరమాణువులు కలిస్తే ఒక వస్తువు ఏర్పడింది. అది జీర్ణావస్థకు చేరుకున్నప్పుడు పరామాణువులు విడిపోతాయి. ఆ వస్తువు కనపడకుండా పోతుంది. కాని పరమాణు రూపంలో ఉంటుంది.

(ఏ వస్తువైనా పరిణామం చెందుతుందే కానీ నశించిపోదు. సూక్ష్మరూపంలో, పరమాణురూపంలో ఉంటుంది. అదే ఈనాటి

శాస్త్రజ్ఞులు కూడా నిరూపించారు.) అలాగే ఈ దేహములు కూడా పంచభూతములలో కలిసి పోతాయి. పరమాణువులుగా మారిపోతాయి. మరలా పరిణామక్రమంలో దేహంగా రూపుదిద్దుకుంటాయి. ఈ విషయం మనం రోజూ చూస్తూనే ఉంటాము కానీ మనం మాత్రం చిరకాలము జీవించి ఉంటాము, మనకు ఉన్న ధనము, ఆస్తులు అన్నీ శాశ్వతంగా మన వెంటనే ఉంటాయి అని అనుకుంటూ ఉంటాము. అందుకే ఈ జగత్తు అంతా మిథ్య అని పెద్దలు చెప్పారు.

ఓ ధర్మనందనా! ఇప్పటి వరకుమనకు ఈ దేహము అనిత్యము అని తెలుసుకున్నాము. ఈ దేహము అంతా అవయవములతో నిండి ఉంది. అందుకే ఈ దేహమును అవయవి అన్నారు. ఈ అవయవములు శబ్ద,స్పర్శ,రస,రూప,గంధములు అనే పంచ తన్మాత్రలతో ఈ ప్రాపంచిక సుఖములు అనుభవిస్తున్నాయి. ఈ దేహమే అనిత్యము అశాశ్వతము అయినప్పుడు ఈ దేహములో ఉన్న అవయవములతో అనుభవించే సుఖములు మాత్రము శాశ్వతములు ఎలా అవుతాయి. కాబట్టి ఈ ప్రపంచములో మనము సుఖములు అనుకొంటున్నవి నిజానికి సుఖములు కావు. అవి కూడా మిథ్య. ఈ సుఖములకు కూడా అస్థిత్వము లేదు. ఒకరికి సుఖం మరొకరికి దు:ఖముగా పరిణమిస్తుంది. ఈ రోజు సుఖంగా ఉన్నది రేపటికి దు:ఖంగా మారిపోతుంది. కాబట్టి ఈ దేహములో ఉన్న అవయవములతో అనుభవించే సుఖములు కూడా అశాశ్వతములు.

ఓ ధర్మనందనా! ఈ ప్రపంచములో అనేక రకములైన మనుషులు, మంచి వారు, చెడ్డవారు, అందమైనవారు, అందవిహీనులు, ధనికులు, దరిద్రులు కనపడుతుంటారు. వీరి దేహములు అన్నీ ఒకటే. అన్నీ పంచభూతములతో నిర్మితమైనవే. ఈ దేహములు అన్నిటిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. కాని మన అజ్ఞానం వలన మానవులలో, జంతువులతో, వస్తువులలో భేదభావమును కల్పించుకుంటున్నాము. కొందరితో స్నేహము, మరి కొందరితో వైరము పెంచుకుంటున్నాము. ఇదే అజ్ఞానము. కాబట్టి పరమాత్మకు వీడి ఇష్టుడు, వాడు అయిష్టుడు అనే భేదము లేదు. అందరూ ఒకటే. అందరూ సమానమే.

ఈ అద్వైత భావము మూడు విధములు. భావాద్వైతము, క్రియాద్వైతము, ద్రవ్యాద్వైతము. మునులు తమ ఆత్మానుభవంతోటి ఈ మూడు అద్వైతములను పాటించడం ద్వారా, పరమాత్మను దర్శించవచ్చును. భావాద్వైతము అంటే మనం చేసే భావనలో భేదభావం ఉండకూడదు. అద్వైత భావన ఉండాలి. ఒక వస్త్రము ఉంది. అది కార్యము. అందులో పడుగు పేకల రూపంలో దారాలు ఉంటాయి. అవి కారణములు. అన్ని దారాలు కలిస్తే వస్త్రము అవుతుంది. వాటిని విడదీస్తే దారాలు విడి విడిగా వస్తాయి. వస్త్రము అదృశ్యం అవుతుంది. దారాలు లేనిది వస్త్రము లేదు. కాబట్టి కార్య కారణములు ఒకటే. దీనినే భావాద్వైతము అని అంటారు.

మనం ఏమన్నా మాట్లాడాలన్నా, ఏ పని అయిన చెయ్యాలన్నా, ముందు మనసులో సంకల్పిస్తాము. ఆ సంకల్పించిన

దానిని మాటల రూపంలో వెలువరిస్తాము. దానినే మన అవయవములతో పనుల రూపంలో చేస్తాము. ఈ మూడింటిలోనూ ద్వైతభావము ఉండకూడదు. మనసులో అనుకున్నది మాట్లాడాలి. మాట్లాడింది చెయ్యాలి. దానినే క్రియాద్వైతము అని అంటారు. (కొందరు మనసులో అనుకున్నది నోటితో చెప్పరు. నోటితో చెప్పింది చేతులతో చెయ్యరు. దీనికి ప్రత్యక్ష ఉదాహరణ రాజకీయనాయకులు).

ఇంక మూడవది ద్రవ్యాద్వైతము. ఈ ప్రపంచంలో వివిధరకాలైన మనుషులు ఉంటారు. వివిధము లైన జంతువులు, వస్తువులు ఉంటాయి. అన్నిటిలోనూ పరమాత్మ ఉన్నాడు అని అనుకోవాలి. ఒకరికి మరొకరికి భేదభావము చూపకూడదు. ప్రతివాడికీ తల్లి, తండ్రి, అన్నదమ్ములు, భార్య, కుమారులు, కుమార్తెలు బంధువులు ఉంటారు. వారి మధ్య భేదభావము చూపకూడదు. ఒకరి మీద ఇష్టము మరొకరి మీద అయిష్టము ప్రదర్శించకూడదు. అందరినీ సమానంగా ఆదరించాలి. అందరిలోనూ పరమాత్మను చూడగలగాలి. దీనినే ద్రవ్యాద్వైతము అని అంటారు. అంటే కనపడే మనుషులలో, వస్తువులలో అద్వైత భావమును పాటించడం. మనిషి అయిన వాడికి ఈ మూడు అద్వైతభావనలు అవసరము.

ఓ ధర్మనందనా! మానవులు ఏ పని చేసినా అది అందరికీ ఆమోదయోగ్యంగా ఉండాలి. తోటి వారికీ, సమాజానికి చెడ్డ చేసే పనులు చెయ్యకూడదు. నిషిద్ధప్రదేశములకుపోకూడదు. నిషిద్ధ ప్రాంతములలో ఎటువంటి పనులు చేయకూడదు. చెయ్యకూడని పనులు అసలే చేయకూడదు. దుర్జనులతో సంగత్వము

పెట్టుకోకూడదు. వారి పక్షమున మాట్లాడకూడదు. తాను చేసే పనుల వలన మరొకరికి కీడు కలుగుతుందనుకుంటే ఆ పనులు చేయకూడదు. కాని ఇవన్నీ కూడా మానవులు సాధారణ పరిస్థితులలోనే చెయ్యాలి. ఏదైనా ఆపద సంభవించినపుడు పైన చెప్పబడిన నియమములను అతిక్రమించవచ్చును.

(సాధారణ పరిస్థితులతో ఎవరికీ హాని చెయ్యకూడదు. కాని తన ధన, మాన, ప్రాణాలకే ఆపద కలిగినపుడు, తన ధన, మాన, ప్రాణములను కాపాడుకోడానికి హింసచేసినా తప్పులేదు. దానినే రైట్ ఆఫ్ ప్రైవేట్ డిఫెన్స్ అంటారు. ఇది ఈ నాడు అమలులో ఉంది.)

కాబట్టి ఓ ధర్మరాజా! గృహస్థు అయిన వాడు వేదములలో చెప్పబడిన కర్మలను ఆచరించడం ద్వారా, తన ఇంట్లో ఉంటూనే, పరమాత్మను చేరుకోవచ్చును. దాని కోసరం అడవులకు పోయి తపస్సు చేయనవసరం లేదు. మీరు అనునిత్యము ఆ కృష్ణపరమాత్మ పాదములను సేవించడం వలననే కదా ఎన్నో ఆపదల నుండి బయట పడ్డారు. ఆ పరమాత్మ అనుగ్రహం వలననే కదా దిగ్విజయయాత్ర చేయగలిగారు. రాజసూయ యాగము నిర్విఘ్నంగా నిర్వర్తించారు. ఇంక మీదట కూడా మీరు ఆ కృష్ణ పరమాత్మను భక్తితో సేవించి, ఈ సంసార సాగరము నుండి విముక్తి పొందండి.

ఓ ధర్మనందనా! ఈ జన్మలో నేను శ్రీహరిని సేవిస్తున్నాను. కాని ఇంతకు ముందు జరిగిన మహా కల్పములో నేను ఉపబర్హణుడు అనే గంధర్వ రాజును. గంధర్వులు అందరూ నన్ను పూజించేవారు.

నేను గంధర్వులందరిలోకీ  చాలా అందంగా ఉండేవాడిని.  అందుకని గంధర్వ కన్యలు, అప్సరసలు నన్ను ప్రేమించేవారు. నా మీద అనురాగం చూపేవారు. నా చుట్టు ఎప్పుడూ చాలా మంది అందమైన స్త్రీలు ఉండేవారు. నేను కూడా స్త్రీలోలుడనే. అందగాడిననే గర్వము, నా చుట్టు అందమైనస్త్రీలు ఉన్నారనే మదము తలకెక్కి, ఉన్మత్తుడనయ్యాను. ఒక సారి దేవతలు యజ్ఞ ము చేస్తున్నారు. ఆ యజ్ఞానికి  ప్రజాపతులు అందరూ వచ్చారు. గంధర్వులను గానం చెయ్యమనీ, అప్సరసలను నాట్యం చెయ్యమనీ ఆదేశించారు. నేను కూడా వారి వెంట వెళ్లాను. నా చుట్టు అప్సరసలు, గంధర్వకన్యలు ఉ న్నారు.

గంధర్వ కన్యలు, అప్సరసలతో నన్ను చూచిన ప్రజాపతులు కోపంతో మండిపడ్డారు.  "మేము అప్సరసలను, గంధర్వ కన్యలను ఆడటానికి పాడటానికి  ఆహ్వానిస్తే వారి మధ్యలో నువ్వు ఎందుకు వచ్చావు. నీకు ఐశ్వర్య మదము, అందగాడిని అనే గర్వం తలకెక్కాయి. నీకు ఉన్న ఈ ఐశ్వర్యము, అందమూ నశించిపోతాయి. నీవు భూలోకములో శూద్రుడుగా జన్మించు." అని శపించారు.

ఆ శాపకారణంగా నేను ఒక దాసికి కుమారుడుగా జన్మించాను. కాని అదృష్ట వశాత్తు నా తల్లి ఒక వేదపండితుడైన బ్రాహ్మణుని ఇంటిలో దాసీగా ఉండింది. ఆ బ్రాహ్మణుల సాంగత్యముతో నాకు బ్రాహ్మణుల లక్షణాలు అబ్బాయి. ఆ కారణం చేత నేను ఈ జన్మలో బ్రహ్మమానస పుత్రుడుగా జన్మించాను.

ఓ ధర్మనందనా! నీవు అడిగిన ప్రకారము నీకు గృహస్థులు కూడా వారి సమస్త పాపములను పోగొట్టుకొని, పరమాత్మను ఎలా చేరుకుంటారో వివరించాను.

మీరు చాలా అదృష్ట వంతులు. మీ ఇంట్లో శ్రీకృష్ణుడు కొలువై ఉన్నాడు. శ్రీకృష్ణుని దర్శనార్థమై గొప్ప గొప్ప ఋషులు, మునులు మీ ఇంటికి వస్తుంటారు. ఆ కారణం చేత మీకు వారి సేవాభాగ్యము లభిస్తూ ఉంది. సాధువులు ముక్తికాంత కొరకు నిరంతరము వెదుకుతుంటారు. ఆ ముక్తిని ప్రసాదించే పరమాత్మ స్వరూపుడు అయిన శ్రీకృష్ణుడు మీకు బంధువుగా, స్నేహితుడుగా, మేనమామ కుమారునిగా, గురువుగా, హితుడుగా, మీ ఇంట్లో ఉన్నాడు

. ఎవరి లీలలను ఆ బ్రహ్మ పరమేశ్వరుడు కూడా పూర్తిగా వర్ణింపలేరో, ఎవరు మునులచేతా, భక్తుల చేతా, పూజింపబడు తున్నాడో, ఆ శ్రీకృష్ణుడు నాకు ప్రసన్నుడగును గాక!" అని దేవర్షి అయిన నారదుడు ధర్మరాజుతో అన్నాడు.

తరువాత పాండవులు శ్రీకృష్ణునికి అగ్రపూజ చేసారు. ధర్మరాజు నారదుని తగురీతిగా సత్కరించాడు. తరువాత నారదుడు అక్కడి నుండి వెళ్లిపోయాడు. తమ ఇంట్లో ఉన్న శ్రీకృష్ణుడే పరమాత్మ స్వరూపుడు అని విన్న ధర్మరాజు ఆశ్చర్యపోయాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు ఇప్పటి దాకా దక్షుని కుమార్తెల వంశ చరిత్రలను, వారు దేవ, అసుర, మనుష్య, జంతు, పక్షులు మొదలైన ప్రాణులను ఎలా సృష్టించారో వివరించాను. " అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుడు భాగవత పురాణమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

సప్తమస్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము

సప్తమ స్కంధము సర్వం సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్: 9866140619, 9391134792

ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము
## అష్టమ స్కంధము
## ప్రథమాధ్యాయము.

పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని ఇలా అడిగాడు.

"ఓ శుకయోగీంద్రా! తమరు నాకు ఇప్పటి దాకా స్వాయంభువ మనువు గురించి ఆయన వంశ చరిత్రను గురించి, వివరించారు. స్వాయంభువ మనువు కాకుండా ఇంకా ఇతర మనువులు కూడా ఉన్నారు కదా! వారి గురించి, వారి వంశ చరిత్రల గురించి వివరించండి. అంతే కాదు, శ్రీహరి యొక్క అవతార విశేషముల గురించి కూడా వివరించండి.

శుకయోగీంద్రా! ఇప్పటికి చాలా మన్వంతరములు గడిచిపోయాయి కదా! పరమాత్మ ఏ మన్వంతరములో ఏ అవతారమును దాల్చాడు. ఏమేమి లీలలు చేసాడు. అంతే కాకుండా, పరమాత్మ, రాబోయే మన్వంతరములలో ఏమే అవతారములు ఎత్తబోతున్నాడు? ఏయేలీలలు చేయబోతున్నాడు? అంతే కాదు. ఆ పరమాత్మ ఈ మన్వంతరములో ఏ అవతారము ధరించాడు? ఏయే కర్మలు చేస్తున్నాడు? ఈ విషయములన్నీ నాకు వివరించండి. వినడానికి కుతూహలంగా ఉంది." అని భక్తితో వినయంగా అడిగాడు పరీక్షిత్ మహారాజు. దానికి శుయయోగీంద్రుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

## అష్టమస్కంధము

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ కల్పంలో ఇప్పటి వరకు స్వాయంభువమనువుతో సహా ఆరుగురు మనువులు ఈ భూమిని పరిపాలించారు. మొట్టమొదటి మనువు అయిన స్వాయంభువ మనువు గురించి నీకు వివరించాను. ఆ మనువు వలననే దేవతలు, దానవులు పుట్టారు. ఆ స్వాయంభువ మనువు కుమార్తెలయిన ఆకూతి, దేవహూతిల కు భగవానుడు కపిల మహర్షిగానూ, యజ్ఞపురుషుడు గానూ, పుత్రులుగా, ఆవిర్భవించాడు. కపిలుడి గురించి నీకు ఇంతకు ముందే చెప్పాను. ఇప్పుడు యజ్ఞేశ్వరుడి గురించి చెబుతాను విను.

స్వాయంభువ మనువు భార్య పేరు శతరూప. కొంతకాలము తరువాత, స్వాయంభువ మనువు సంసారము మీద విరక్తి చెంది తపస్సు చేసుకోడానికి అడవులకు వెళ్లాడు. అతని భార్య శతరూపకూడా ఆయనను అనుసరించి వెళ్లింది. స్వాయంభువ మనువు సునందా నదీతీరంలో నూరు సంవత్సరములు ఘోర తపస్సు చేసాడు. ఆ నూరు సంవత్సరములకాలము, ప్రతిరోజూ, స్వాయంభువ మనువు ఈ విధంగా భగవంతుని ధ్యానం చేసేవాడు.

"ఓ దేవా! నీ వలననే ఈ విశ్వం అంతా చైతన్యవంతం అవుతూ ఉంది కాని, ఈ విశ్వం నిన్ను చైతన్య వంతం చేయలేదు కదా! ఈవిశ్వం అంతా నిద్రావస్థలో ఉన్నప్పుడు నీవు జాగ్రదావస్థలో ఉండి సాక్షీమాత్రంగా చూస్తుంటావు.

ఓ దేవా! నీకు అన్నీ తెలుసు కానీ ఈ దేహములో ఉన్న జీవుడు మాత్రము నిన్ను గురించి తెలుసుకోలేకపోతున్నాడు. ఓ దేవా! ఈ అనంత విశ్వంలో ఉన్న చరాచరజీవజాలము నీ వలననే

చైతన్యవంతమవుతున్నాయి. ఈ విశ్వం అంతా నీవే నిండి ఉన్నావు. ఈ విశ్వం నీ చేత సృజింపబడింది. నీచేత సృష్టించ బడిన ప్రకృతిలోని సంపదలను అనుభవించడానికే మాత్రమే ఈ జీవులకు అర్హత ఉంది. కానీ ఇది నాది, అది నీది, ఇదంతా నాకే కావాలి అనే హక్కు ఈ జీవులకు ఎక్కడిది? ఈ సంపదలు అన్నీ ఎవరి సొమ్మని, నాదీ, అంతా నాకే కావాలి, అని అంటారు?

ఓ దేవా! నీవు అన్నీ చూస్తున్నావు. కానీ నిన్ను ఎవరూ చూడలేకపోతున్నారు. అందుకని నిన్ను అనునిత్యము భజించడం, పూజించడం ఒక్కటే ఉత్తమమైన మార్గము. ఓ దేవా! నీకు ఆది లేదు అంతము లేదు. వాడు వీడు అనే భేదము లేదు. నీకు అందరూ సమానమే. నీవు అందరి లోపలా ఉంటావు. అందరి బయటా ఉంటావు. ఈ చరాచర జగత్తులోని అన్ని వస్తువులు, అన్ని విషయములు నీవు సృష్టించినవే. అంతెందుకు. ఈ విశ్వమంతా నీ స్వరూపమే. నీవే సత్యము. నీవే పరబ్రహ్మస్వరూపము. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీవు విశ్వరూపుడవు. కాని మానవులు నిన్ను వివిధ పేర్లతో పిలుస్తారు. వివిధ రూపములతో కొలుస్తారు. వివిధ రకాలుగా పూజిస్తారు. నీవే సత్యము. నీవు స్వయంప్రకాశకుడవు. నీకు జన్మలేదు. నీకు ఆకారము లేదు. నీవు నీ మాయచేత ఈ విశ్వాన్ని సృష్టిస్తున్నావు. కానీ నీవు ఈ మాయకు అతీతంగా ఉన్నావు. ఈ విశ్వం అంతటా నీవు ఉన్నావు. నీవు అందరిలో ఉన్నావు. వారి ద్వారా అన్నిపనులు చేస్తున్నావు. కానీ నీవు ఏ పనీ చెయ్యనట్టు ఉంటావు. అదేవిధంగా ఋషులు

కూడా అన్ని కర్మలు చేస్తుంటారు. కాని తాము చేసే కర్మలలో ఆసక్తి కనబరచరు. ఆ కర్మఫలములను నీకు అర్పిస్తుంటారు. అదే నిష్కామకర్మ.

ఓ దేవా! నీవు సర్వశక్తిమంతుడవు. ఈ విశ్వమును సృష్టించి, పోషించి, లయంచేస్తుంటావు. కాని ఈ కార్యములలో ఏ మాత్రం ఆసక్తి కనబరచవు. నీవేకాదు, నీ భక్తులు, నిన్ను త్రికరణ శుద్ధిగా నమ్మిన వారు కూడా తాము చేసే కర్మల యందు ఆసక్తి కనబరచరు. అందేచేత, ఆ కర్మలకు వారు బద్ధులు కారు.

ఓ దేవా! సృష్టి,స్థితి,లయకారకా! నిరహంకారా! జ్ఞానవంతా! నిష్కామా! పరిపూర్ణా! స్వతంత్రా! ఆత్మమార్గదర్శకా! ధర్మప్రవర్తకా! నీకు నమస్కారము. నేను సదా నిన్ను శరణు వేడుతున్నాను." అని స్వాయంభువ మనువు సమాధి అవస్థలో ఉండి మంత్రములతో కూడిన ఈ ఉపనిషత్తును ఉచ్ఛరిస్తున్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా తపస్సు చేసుకుంటున్న స్వాయంభువ మనువును భక్షించడానికి రాక్షసులు, అసురులు ఆయన వెంట బడ్డారు. అప్పుడు పరమాత్మ ఆ సమయంలో దేవతలుగా ఉన్న యాములతో కలిసి, ఆ రాక్షసులను, అసురులను సంహరించాడు. స్వాయంభువ మనువును రక్షించాడు.

స్వాయంభువ మనువు తరువాత మనువు స్వారోచిష మనువు. రెండవ మనువైన స్వారోచిష మనువునకు ముగ్గురుకుమారులు. వారి పేర్లు ద్యుమంతుడు, సుషేణుడు,

రోచిష్మంతుడు. స్వారోచిష మన్వంతరములో రోచనుడు అనే వాడు ఇంద్రపదవిలో ఉన్నాడు. తుషితులు మొదలగు వారు దేవతలు. ఊర్జస్థంభుడు మొదలగు వారు ఏడుగురు సప్తఋషులు. ఆ సప్తఋషులలో వేదశిరుడు అనే ఋషి భార్యపేరు తుషిత. ఆ ఇరువురు దంపతులకు పరమాత్మ విభుడు అనే పేరుతో జన్మించాడు. పరమాత్మ అవతారమైన విభుని వద్ద 88,000 మంది ఋషులు ఆచార వ్యవహారముల గురించి శిక్షణ పొందారు.

తరువాతి మనువు అనగా మూడవ మనువు పేరు ఉత్తముడు. ఆయన ప్రియవ్రతుని కుమారుడు. ఉత్తమునికి పవనుడు, సృంజయుడు, యజ్ఞహోత్రుడు మొదలగు వారు కుమారులుగా జన్మించారు. ఆ మూడవ మన్వంతరములో సత్యజిత్తు అనే వాడు ఇంద్రపదవిలో ఉన్నాడు. సత్యులు, వేదశ్రుతులు, భద్రులు మొదలగు వారు దేవతలు. వసిష్ఠుని కుమారులైన ప్రమదుడు మొదలగు వారు సప్తఋషులుగా ఉన్నారు. ఆ మన్వంతరములో ధర్ముడికి సత్యసేన అనే భార్య వలన పరమాత్మ సత్యసేనుడు అనే పేరుతో జన్మించాడు. ఆ సత్యసేనుడితో పాటు సత్యవ్రతుడు మొదలగు దేవతలు కూడా జన్మించారు. సత్యసేనుడికి, అప్పటి ఇంద్రుడు అయిన సత్యజిత్తుకు మంచి స్నేహము ఉండేది. వారు ఇరువురు కలిసి లోకములో అసత్యము చెప్పేవారిని, దుర్మార్గులను, దుష్టులను, ఇతరులను బాధించేవారిని, యక్షులను, రాక్షసులను, భూతములను నాశనము చేసారు. లోక రక్షణ గావించారు.

మూడవ మనువు అయిన ఉత్తముడి సోదరుడు తామసుడు. ఆ తామసుడు నాలుగవ మనువు అయ్యాడు. ఆయన పేరుతో  నాలుగవ మన్వంతరము తామస మన్వంతరము గా పిలువబడింది. తామస మనువునకు పృథువు, ఖ్యాతి, నరుడు,కేతువు మొదలగు పదిమంది  కుమారులు కలిగారు. తామస మన్వంతరములో త్రిశిఖుడు అనే వాడు ఇంద్రపదవిలో ఉన్నాడు. సత్యకుడు, హరి, వీరుడు, విధృతుని కుమారులు అయిన వైధృతులు, మొదలగు వారు  దేవతలుగా ఉన్నారు. జ్యోతిర్ధాముడు మొదలగు వారు సప్తఋషులుగా ఉన్నారు.

ఆ తామస మన్వంతరములో వేదములు ఎవరూ అధ్యయనం చేయని కారణంగా, కాలక్రమేణా, వేద విద్య అంతరించి పోయింది. అప్పుడు దేవతలందరూ కలిసి వేద విద్యను పునరుద్ధరించారు. ఈ మన్వంతరములోనే పరమాత్మ, హరి మేధసుడు, హరిణి అనే దంపతులకు  శ్రీహరి అనే పేరుతో జన్మించాడు. ఒక ఏనుగు కాలును మొసలి పట్టుకొని మడుగులోనికి లాగుతుంటే, శ్రీహరి ఆ మొసలిని సంహరించి, ఏనుగును కాపాడాడు.” అని శుకుడు పరీక్షిత్తు మహారాజుకుచెప్పాడు.

వెంటనే పరీక్షిత్ మహారాజు శుకునితో ఇలా అన్నాడు.

“మహాత్మా! ఏనుగు ఏమిటి? ఏనుగుకాలు  మొసలి పట్టుకోడం ఏమిటి? శ్రీహరి విడిపించడం ఏమిటి? కొంచెంవివరంగా చెప్పండి.” అని అడిగాడు.

పరీక్షిత్ మహారాజు అడిగిన ప్రశ్నకు శుకుడు గజేంద్రమోక్షము కథను సమాధానంగా చెప్పాడు.

శ్రీమద్భాగవతము
అష్టమ స్కంధము ప్రథమ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్. ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
అష్టమ స్కంధము
ద్వితీయ అధ్యాయము.

ఓ పరీక్షిత్ మహారాజా! క్షీరసాగరం మధ్యలో త్రికూటము అనే పర్వతము ఉంది. ఆ పర్వతమునకు మూడు శిఖరములు ఉన్నాయి. ఆ శిఖరములు బంగారము, వెండి, ఇనుము మాదిరి ప్రకాశిస్తున్నాయి. ఆ త్రికూట పర్వతము నుండి ప్రవహించు నదులు ఆ ప్రాంతమును అంతా సస్యశ్యామలంగా చేసాయి.

ఆ త్రికూట పర్వతము నందలి గుహలలో సిద్ధులు, చారణులు, గంధర్వులు,విద్యాధరులు, నాగులు, కిన్నరులు, అప్సరసలు నివసిస్తూ ఉంటారు. ఆ త్రికూట పర్వత ప్రాంతంలో అనేక రకములైన వన్య మృగములు విహరిస్తుంటాయి. ఆ పర్వతము ప్రాంతములలో ఉన్న ఉద్యాన వనములలో ఉన్న చెట్లమీద రకరకాల పక్షులు కిలకిలా రావాలు చేస్తూ నివసిస్తున్నాయి. ఆ పర్వత ప్రాంతములో ఉన్న సరోవరములలో, నదులలో అప్సరస్త్రీలు స్నానాలు చేస్తూ జలక్రీడలు

ఆడుకుంటూ ఉంటారు.

అక్కడ ఉన్న ఉద్యాన వనములలో ఋతు మంతము అనే ఉ ద్యాన వనము మిక్కిలి ప్రసిద్ధి చెందినది. ఆ ఉద్యాన వనములో దేవతా స్త్రీలు వచ్చి వినోదిస్తుంటారు. ఆ ఉద్యానవనములో అనేక పుష్పజాతుల మొక్కలు, అనేక వృక్షములు ఉన్నాయి. వాటిలో పారిజాతములు, మందారములు, అశోకవృక్షములు, చంపకములు, మామిడి చెట్లు, పనస చెట్లు, పోక చెట్లు, కొబ్బరి చెట్లు, ఖర్జూరపు చెట్లు, దానిమ్మ చెట్లు, ఇప్పచెట్లు, మద్దిచెట్లు, తాటి చెట్లు, వేగిస చెట్లు, అర్జున చెట్లు, వేప చెట్లు, మేడి చెట్లు, జువ్వి చెట్లు, రావి చెట్లు, మర్రి చెట్లు, మోదుగ చెట్లు, మంచి గంధపు చెట్లు, రక్త చందన చెట్లు, దేవదారు చెట్లు, ద్రాక్ష తీగలు, చెరకు తోటలు, అరటి తోటలు, నేరేడు చెట్లు, రేగు పళ్ల చెట్లు, ఉసిరిక చెట్లు, మారేడు చెట్లు, వెలగ చెట్లు, నిమ్మ చెట్లు, జీడి మామిడి మొక్కలు మొదలగు నానావిధము లైన చెట్లు, మొక్కలతోనూ నిండి ఉంది. ఆ వనములో తుమ్మెదలు, పక్షులు, జలములో తిరిగే పక్షులు, చేపలు, తాబేళ్లు, వీటితో నిండిన సరోవరములు ఉన్నాయి.

ఆ పర్వత ప్రాంతములో ఒక గజరాజు నివసిస్తున్నాడు. ఆ గజరాజుకు ఎంతో మంది భార్యలు, బంధువులు ఉన్నారు. ఆగజరాజును చూస్తే సింహములు కూడా భయపడి పారిపోతాయి. ఆ గజరాజు రక్షణలో చిన్న చిన్న జంతువులు నిర్భయంగా ఆ వనములో తిరుగుతూ ఉంటాయి.

ఒకరోజు ఆ గజరాజు, ఆడ ఏనుగులతోనూ, గున్న ఏనుగులతోనూ, మదించిన ఏనుగులతోనూ ఆ వనములో ఉన్న ఒక సరోవరములోకి దిగి జలకాలాడుతున్నాడు. ఆ సరోవరములోని నీటిని తాగుతున్నాడు. తొండముతో నీటిని తీసుకొని తన శరీరం మీద చల్లుకుంటున్నాడు. మదించిన ఆ గజరాజు తన ఇష్టం వచ్చినట్లు ఆ సరోవరంలో స్వేచ్ఛగా తిరుగుతున్నాడు. కాని తనకు రాబోవు ఆపదను గుర్తించలేకపోయాడు.

ఆసరోవరములోనే ఒక మొసలి నివసిస్తూ ఉంది. ఈ మదించిన గజరాజు, తన బలగాలతో వచ్చి తన సరోవరమును అల్లకల్లోలము చేయడం సహించలేకపోయింది. నీటి లోపలనే ఈదుకుంటూ వచ్చి ఆ గజరాజు కాలు గట్టిగా పట్టుకుంది. నీటి లోతుల్లోకి లాగుతూ ఉంది. ఈ పరిణామం చూచి మదించిన ఆ గజరాజుతన కాలును బలంగా బయటకు లాగడానికి ప్రయత్నించాడు. కాని నీటి లోని మొసలికి బలం ఎక్కువ. గజరాజు ఎంత ప్రయత్నించినా ఆ మొసలి నోట్లో నుండి తన కాలును విడిపించుకోలేక పోయాడు. మొసలి ఏనుగును నీళ్లలోపలికి లాగుతూ ఉంది. గజరాజు తన కాలును మొసలి నోటి నుండి విడిపించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఈ ఏనుగు మొసలి పోరాటము చూచి ఆ గజరాజు భార్యలు, బంధువులు దీనంగా దు:ఖిస్తున్నారు. గజరాజుకు ఏ విధంగానూ సాయం చెయ్యలేక పోతున్నారు. గజరాజు తన కాలును బయటకు లాగుతుంటే, మొసలి గజరాజు కాలును లోపలకు లాగుతూ

ఉంది. ఈ ప్రకారంగా ఆ గజరాజు, మొసలి మధ్య వేయి సంవత్సరములు పోరాటం జరిగింది. ఆకాశం నుండి దేవతలు కూడా ఈ వింతను చూస్తున్నారు.

గజేంద్రుని యొక్క బలము, మానసిక శక్తి, ఇంద్రియముల శక్తి క్షీణించాయి. కాని నీటి లోపల ఉన్న మొసలికి దినదినమునకు శక్తి పెరుగుతూ ఉంది. గజరాజుకు తాను చనిపోతానేమో అనే భయం పట్టుకుంది. ఆ భయంతో వణికిపోతున్నాడు. చుట్టు చూచాడు. తన భార్యలు కానీ, బంధువులుకానీ తనను విడిపించలేకపోవడం, తనకు సాయం చెయ్యలేక పోవడం చూచి ఖిన్నుడయ్యాడు. ఎంతమంది ఉండి ఏం లాభం సమయానికి సాయం చేయని వాళ్లు అని బాధ పడ్డాడు. ఏ మార్గమూ దొరక్క ఆ పరమేశ్వరుని ప్రార్థించడం మొదలు పెట్టాడు.

(ఈ సందర్భంలో పాఠకులకు ఒక మనవి. ఈ కథ విచిత్రంగా లేదూ! ఒక ఏనుగు. దానికి భార్యాబిడ్డలు, బంధువులు. నీటిలో ఆటలు. మొసలి పట్టుకోవడం. వేయిసంవత్సరాలు యుద్ధం. ఏనుగు బలం క్షీణించడం. మొసలి బలం పెరగడం. చివరకు భగవంతుని ప్రార్థించడం. ఆయన వచ్చి రక్షించడం. ఇదంతా ఏనుగు, మొసలి కథ కాదు. మన కథే! మన దైనందినజీవిత గాధ. ఎలాగంటే, ఈ ఏనుగే సగటు మానవుడు. వాడికి భార్య, బిడ్డలు, బంధువులు, స్నేహితులు ఉంటారు. ఆ పర్వత ప్రాంతమే ఈ ప్రపంచం, ప్రకృతి. మానవుడు తన వారి అండ, తనకు ఉన్న ధనం, ఆస్తులు, హెూదా, పదవి,  చూచుకొని మదించి, తనకంటే గొప్పవాడు లేడనీ, ఈ

ప్రపంచంలో, ప్రకృతిలో ఇష్టం వచ్చినట్టు విహరిస్తుంటాడు. భార్యలతో కేళీవినోదములలో తేలుతుంటాడు. తనకు అడ్డం లేదనుకుంటాడు. సరోవరాన్ని అల్లకల్లోలం చేసినట్టు, ఈ ప్రపంచంలో తన ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తుంటాడు.

సాగినంత కాలం సాగుతుంది. అప్పుడు ఆరంభం అవుతుంది కష్టాల పరంపర. మొసలి రూపంలో కష్టాలు, చుట్టుముడతాయి. అవే వయసు మీద పడటం, ముసలితనం, రోగాలు రావడం. ఆ మొసలి బారినుండి తప్పించుకోడానికి నానా తంటాలు పడతాడు. ముసలి తనం రాకుండా, రోగాలు రాకుండా నానా రకాల మందులు వాడతాడు. డాక్టర్ల చుట్టు తిరుగుతాడు. రోగాలతో, ముసలి తనంతో, గజరాజు మొసలితో పోరాడినట్టు పోరాడతాడు. కాని రోగాల బలం, ముసలి తనం బలం రోజురోజుకూ ఎక్కువ అవుతూ ఉంటుంది. వయసు మీదపడే కొద్దీ మానవుడి బలం క్షీణించిపోతూ ఉంటుంది. చూపు మందగిస్తుంది, చెవులు వినపడవు. అలా జీవితాంతం పోరాడతాడు.

చుట్టు చూస్తాడు. తన భార్యా బిడ్డలు, బంధువులు, మిత్రులు అందరూ చూస్తూ ఉంటారే కానీ ఎవరూ తనకు సాయంచెయ్యడానికి ముందుకు రారు. దిక్కులేని వారికి దేవుడే దిక్కు అని అయ్యగారికి అప్పుడు దేవుడు గుర్తుకు వస్తాడు. మనకూ అంతే కదండీ. సాధారణంగా రిటైర్ అయిన తరువాతనే దేవుడు గుర్తుకు వస్తాడు. కొందరికీ అప్పుడూ గుర్తుకు రాడు. రిటైర్ అయిన తరువాత కూడా ఇంకా పొడిగింపులు, మరొక ఉద్యోగంలో చేరడం, ధనం సంపాదన, కొడుకులు, కూతుళ్లు, మనవళ్లు మనుమరాళ్లు,

వారికోసరం సంపాదించడం, కూడబెట్టడం, నేనులేకపోతే వీరేమైపోతారో అనే బెంగ. ఇవన్నీ తాపత్రయాలు. ఇవన్నీ మొసలిమాదిరి మానవుని కష్టాల ఊబిలోకి లాగుతుంటాయి.

అప్పుడు గజేంద్రుడు నిర్మల చిత్తంతో భగవంతుని ప్రార్థించాడు. ఈ ప్రాపంచిక విషయాలు, విషయ సుఖాలు, తాపత్రయాలు, ముసలి తనం, రోగాలు అనే మొసలి బారి నుండా మనలను మనం రక్షించుకోవాలంటే, మనం కూడా గజేంద్రుని మాదిరి భగవంతుని తలచుకోవాలి. నిర్మలచిత్తంతో ప్రార్థించాలి. గజేంద్రుని శ్రీహరి రక్షించినట్టు, మనలను కూడా ఆ దేవుడు తప్పకుండా కాపాడతాడు. అప్పుడే గజేంద్రమోక్షం కథ చదువుకున్నందుకు సార్థకత. అంతేకానీ గజేంద్రమోక్షం కథ చదివితే పుణ్యం వస్తుంది అనుకోవడం ఒట్టి భ్రమ. )

శ్రీమద్భాగవతము

అష్ఠమ స్కంధము ద్వితీయ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## అష్టమ స్కంధము
## తృతీయ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో భాగవత కథలో అంతర్భాగం అయిన గజేంద్రమోక్ష కథను ఇలా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! మొసలి వాత బడిన గజేంద్రుడు వేరు మార్గము తోచక మనస్సును నిర్మలంగా ఉంచుకొని తన పూర్వజన్మలో చేసిన సుకృతముల ఫలితంగా ఆ పరమేశ్వరుని ఈ విధంగా ప్రార్థించాడు.

(ఇక్కడి నుండి వ్యాస భాగవతములోని శ్లోకములు వాటికి పోతన గారు రాసిన అమృత గుళికల లాంటిపద్యములు ఇస్తున్నాను. కొన్ని శ్లోకాలకు పోతన గారు పద్యాలు రాయలేదు. కొన్ని పద్యాలు అదనంగా రాసారు. అవి అన్నీ కలిపి రాస్తున్నాను. చదవండి.)

శా: నానానేక పయూథముల్ వనములోనం పెద్దకాలంబు స
న్మానింపగన్ దశలక్షకోటి కరిణీనాధుండనై యుండి మ
ద్దానాంభ: పరిపుష్ట చందన లతాంత ఛాయలం దుండ లే
కీ నీరాశ నిటేల వచ్చితి, భయం బెట్లో కదే ఈశ్వరా!

దేవా! నీకు నమస్కారము. నేను సామన్యగజరాజును కాదు. ఈ అడవిలో చాలా కాలంగా అనేక గజముల సమూహములకు

అధిపతిని. వారి గౌరవ, అభిమానములను పొందాను. పదిలక్షల కోట్ల ఆడ ఏనుగులకు నాధుడిగా ఉన్నాను. ఏమిటో నా ఖర్మ కాకపోతే చందన వృక్షముల నీడలలో హాయిగా సేద తీరక, ఈ సరోవరంలో దిగడం ఏమిటి! ఈ మొసలి పట్టుకోవడం ఏమిటి? అసలు నేను ఇక్కడకు ఎందుకు వచ్చాను? నాకేదో భయంగా ఉంది. నన్ను రక్షించు భగవాన్" అని ప్రార్థించాడు.

(ఇంకా గజరాజుకు పొగరు, గర్వము తగ్గలేదు.. తనను గురించి తానే పొగుడుకుంటున్నాడు.) తరువాత గజేంద్రుడు తన బుద్ధిని సమాధాన పరచుకొని, తనపూర్వజన్మలో నేర్చుకున్న స్తోత్రపాఠములను ఈ విధంగా చెప్పసాగాడు.

ఓ భగవాన్ నీకు నమస్కారము. నీ వలననే ఈ దేహములు అన్నీ చైతన్యవంతమవుతున్నాయి. నీవు ఆదిబీజ స్వరూపుడవు. బ్రహ్మ మొదలగు దేవతా గణములకు నీవు అధిపతివి. పరమపురుషుడవు. అట్టి నిన్ను ప్రార్థిస్తున్నాను.

ఈ అనంత విశ్వము ఎవనియందు నిలిచి ఉన్నదో, ఈ విశ్వము ఎవని నుండి ఉద్భవించినదో, ఈ విశ్వము ఎవని వలన సృష్టింపబడినదో, ఈ విశ్వమునకు అంతా కారణము ఎవరో, కార్య కారణముల కంటే ఎవరు భిన్నంగా ఉంటాడో, ఎవరు స్వయంభువుగా వెలుగుతున్నాడో అట్టి పరమాత్మను నేను ఆశ్రయిస్తున్నాను.

.

ఉ॥ ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వని యందు డిందు, బరమేశ్వరుడెవ్వడు, మూలకారణం
బెవ్వ డనాది మధ్య లయు డెవ్వడు సర్వము దానయైన వా
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.

ఓ దేవా! ఈ విశ్వము అంతా ఎవని వలన సృష్టించబడినదో, ఈ విశ్వము అంతా ఎవని యందు లీనం అయి ఉన్నదో, ఈ సమస్త జగము ఎవనిలో కలిసిపోతుందో, ఎవరైతే పరమేశ్వరుడిగా కీర్తింపబడుతున్నాడో, ఈ విశ్వమునకు అనాది, మధ్య, లయుడు ఎవరో, సర్వము తానే అయిన వాడు ఎవరో, అటువంటి వానిని, అందరి హృదయములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్న ఈశ్వరుని శరణు వేడుతున్నాను.

ఓ దేవా! నీ మాయచేత ఈ జగత్తు పుడుతుంది. అంతలోనే మాయం అవుతుంది. నీవు మాత్రము ఈ విశ్వము పుట్టడాన్ని, లయం కావడాన్ని సాక్షీభూతంగా చూస్తూ ఉంటావు. ఓ దేవా! నీవు ప్రకాశానికే ప్రకాశం కలుగ చేస్తావు. అట్టి నీవు నన్ను రక్షించుగాక!

క॥ఒకపరి జగములు వెలినిడి, యొకపరి లోపలికి గొనుచు నుభయము దానై
సకలార్థసాక్షి యగు న య్యకలంకుని నాత్మమూలు నర్థి దలంతున్.

ఓ దేవా! ఒక్కోసారి నీవు ఈ సమస్తజగములను నీలోనుండి బయటకు నెడతావు. మరొకసారి ఈ సమస్త జగములను నీలో ఇముడ్చుకుంటావు. సృష్టి, లయములు ఒక లీలగా చేస్తుంటావు.

అటువంటి ఆత్మస్వరూపుడవైన నిన్ను శరణు వేడుతున్నాను.

క॥ లోకంబులు లోకేశులు లోకస్థులు దెగిన దుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వండేకాకృతి వెలుగు నతని నే సేవింతున్

ఓ దేవా! ఈ లోకాలు, లోకపాలకులు, లోకములలో ఉండే సమస్తజీవులు పూర్తిగా నశించి నపుడు, ఈ అనంత విశ్వం అంతా గాడాంధకారము ఆవరించినపుడు, ఆ పెనుచీకటికి అవతల ఏకాకృతిగా వెలుగుతున్న ఓ పరమాత్మా! నిన్ను నేను ఆశ్రయించాను. నన్ను రక్షించు. .

క॥నర్తకుని భంగి బెక్కగు మూర్తులతో నెవ్వడాడు? మునులు దివిజులుం
గీర్తింప నేర రెవ్వని, వర్తన మొరు లెఱుగ రట్టి వాని నుతింతున్॥

ఓ దేవా! నాటకంలో వివిధ పాత్రలలో నటించే నటుల వలె నీవు కూడా వివిధములైన అవతారములు ఎత్తుతుంటావు. కానీ నీ నిజస్వరూపమును గొప్ప గొప్పఋషులు కూడా తెలుసుకోలేరు. అటువంటప్పుడు నా వంటి సామాన్యులు నీ గురించి ఎలా తెలుసుకోగలరు. నీ గురించి ఏమని ప్రార్థించను. ఎవ్వరికీ తెలియబడని ఆ పరమాత్మ నన్ను రక్షించుగాక!

ఆ॥ముక్తసంగులైన మునులు, దిదృక్షులు సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తునెవ్వని దివ్యపదము వాడు దిక్కునాకు.

ఓ దేవా! సాధుజనులు, ప్రాపంచిక విషయయముల మీద ఆసక్తిని వదిలిపెట్టిన వారు, సకల ప్రాణులను సమంగా ఆదరించే వారు, మంచి హృదయము కలవారు, అయిన మహామునులు నీ పాద పద్మములను సేవించడానికి, దర్శించడానికి అరణ్యములలో ఘోరమైన తపస్సులు చేస్తుంటారు. అటువంటి పరమాత్మ నన్ను కాపాడుగాక!

సీ॥భవము దోషంబు రూపంబు గర్మంబు నాహ్వయమును గుణము లెవ్వనికి లేక
జగముల గలిగించు సమయించు కొఱకునై నిజమాయ నెవ్వడిన్నియును దాల్చు
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ కిద్ధరూపికి రూపహీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికిని బరమాత్మునకు బరబ్రహ్మమునకు

ఆ॥ మాటలను నెఱుకల మనముల జేరంగ గానిశుచికి సత్త్వగమ్యు డగుచు
నిపుణుడైన వాని నిష్కర్మతకు మెచ్చు వాని కే నొనర్తు వందనములు.

ఓ దేవా! నీకు పుట్టుక లేదు, చావు లేదు. ఊరు లేదు. పేరు లేదు. రూపము లేదు, గుణములు లేవు. నీలో మంచి లేదు చెడ్డ లేదు. కానీ, నీవు ఈ సృష్టి చేసేటపుడు రకరకాలైన పేర్లు, రూపాలు, గుణాలు, దోషాలు ధరిస్తూ ఉంటావు. అంతేకాదు, నీకు రూపం అంటూ లేదు. కానీ అన్ని రూపాలు ధరిస్తూ ఉంటావు. నీకు ఏ కర్మా చేయవలసిన ఆవశ్యకత లేకపోయినా, అత్యంత ఆశ్చర్యకరమైన పనులు చేస్తుంటావు. నీవు అన్నిటినీ చూడగలవు. కాని నిన్ను ఎవరూ చూడలేరు. నీవు మాటలకు, ఊహలకు, ఆలోచనలకు అందవు. రజోగుణము, తమోగుణములతో నిండిన వారు నీ గురించి తెలుసుకోలేరు. కేవలము శుద్ధసత్వగుణస్వరూపులు మాత్రమే నిన్ను తెలుసుకోగలరు. ఎవరైతే ఫలాపేక్ష లేకుండా కర్మలు చేస్తుంటారో, తాము చేసిన కర్మఫలములను నీకు సమర్పిస్తుంటారో, వారే నీకు ఇష్టమైన వారు.

అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు ఆత్మ రూపంలో సకలజీవులలోనూ ప్రకాశిస్తున్నావు. ఈవిశ్వం అంతా నీవే నిండి ఉన్నావు. నిన్ను వాక్కుతో గానీ, మనస్సుతో గానీ, తెలుసుకోలేము. అటువంటినీకు నమస్కారము.

ఓ దేవా! నిన్ను నిర్మలమైన పరిశుద్ధమైన భక్తితో మాత్రమే పొందగలరు. నీవు పవిత్రమైన ప్రేమకు ప్రతిరూపము. అందరికీ ముక్తిని ప్రసాదించే వాడివి. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీవు శాంత మూర్తులకు శాంతమూర్తిగానూ, దుర్మార్గులకు దుర్మారుడిగానూ, మూఢులకు మూఢుడిగానూ,. కనిపిస్తావు. నీవు సత్వగుణసంపన్నుల హృదయములలో నిలిచి ఉంటావు. నీలో దుర్గుణములు అంటూ మచ్చుకైనా కనిపించవు. నీకు ఎవరి మీదా వైషమ్యము లేదు. నీవు జ్ఞానానికి నిధివి. అట్టినీకు నమస్కారము.

సీ॥శాంతున కపవర్గసౌఖ్య సంవేదికి నిర్వాణ భర్తకు నిర్విశేష
నకు, ఘోరునకు గూఢునకు గుణధర్మికి సౌమ్యున కధిక విజ్ఞాన మయున
కఖిలేంద్రియ ద్రష్ట కధ్యక్షునకు బహు క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మ మూలున కఖిలేంద్రియ జ్ఞాపకునకు దు:ఖాంత కృతికి

ఆ॥నెఱి నసత్య మనెడి నీడతో వెలుగుచు నుండు నెక్కటికిమహోత్తరునకు
నిఖిల కారణునకు నిష్కారణునకు నమస్కరించు నన్ను మనుచు కొఱకు.

ఓ దేవా! నీవు శాంతమూర్తివి. మోక్షసామ్రాజ్యానికి అధిపతివి. ఆనందస్వరూపుడవు. నీకు నావాడు, పరాయి వాడు అనే భేదం లేదు. అందరూ నీ వాళ్లే. నీవు దుష్టులను శిక్షిస్తావు. మంచి వారిని కాపాడతావు. మూడు గుణములకు అందని వాడివి. విజ్ఞానమయుడవు. మానవులు తమ తమ ఇంద్రియములతో చేసే అన్ని కర్మలను సాక్షీభూతంగా చూచే ఆత్మస్వరూపుడవు. దయాసముద్రుడవు. ఈ అనంత విశ్వమునకు మూలము నువ్వే. అన్ని జీవుల దేహములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. అందరి దు:ఖములను నివృత్తి చేసేవాడివి. నీ మాయతో సృష్టి,స్థితి,లయములను అవలీలగా నిర్వర్తిస్తున్నవాడివి. అందరిలో ఉన్నా ఒంటరివాడివి. కార్య కారణ కారకుడివి. అటువంటి పరమాత్మను నన్ను కాపాడమని ప్రార్థిస్తున్నాను.

ఓ దేవా! నీవు సర్వాంతర్యామివి. ఈ విశ్వమునకు అధిపతివి. సర్వసాక్షివి. నీవే ఈ ప్రకృతియొక్క పుట్టుకకు కారణము. ఆత్మస్వరూపుడవు. పరమాత్మస్వరూపుడవు. అట్టి నీకు నమస్కారము.

నీవు సర్వేంద్రియములకు, సత్వ,రజస్తమోగుణములకు, జ్ఞానమునకు, మాయకు, అన్ని భ్రమలకు నీవే ద్రష్టవు (చూచేవాడివి). అట్టి నీకు నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! అఖిల జగత్తుకు నీవే కారణభూతుడవు. నీకు కారణం అంటూ లేదు. కాని కారణ స్వరూపుడవు. నీవే నాలుగు వేదములకు ఆశ్రయుడవు. నీవే మోక్ష ప్రదాతవు. సాధువులకు శరణాగతుడవు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు జ్ఞానస్వరూపుడవు. నీకు ఏగుణములు అంటవు. కానీ అన్ని గుణములు నీలో నుండి ఉద్భవించాయి. ఆత్మతత్వమును తెలుసుకొన్న వారి హృదయములలో నిలిచి ఉంటావు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నేను మృగమును. నీ శరణాగతి కోరాను. నాలో ఉన్న అవిద్యను నాశనం చెయ్యి. నాకు ముక్తిని ప్రసాదించు. నా మీద నీ కరుణాకటాక్షవీక్షణములను ప్రసరించు. ఇంక ఆలస్యం చేయకు. నన్ను రక్షించు.  నీవు అందరి జీవుల దేహములలో ఆత్మస్వరూపుడుగా ఉన్నావు. అలాగే నాలో కూడా ఉన్నావు. నీవు జ్ఞాన స్వరూపుడవు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! ఈ ప్రపంచంలో ఉన్న మానవులు తమ యొక్క భార్య,  సంతానము, ధనము, గృహము, తన యొక్క సేవకులు, తన బంధువులు, మిత్రులు వీరి యందే ఎక్కువ ఆసక్తిని చూపుతుంటారు. అటువంటి వారికి నీవు లభ్యము కావు. ఎందుకంటే నీకు ఈ ప్రాపంచిక విషయముల మీద ఎటువంటి ఆసక్తి లేదు. ఈ ప్రాపంచిక విషయములను, విషయ వాంఛలను వదిలిపెట్టిన వారే నిన్ను సదా తమ హృదయములలో నిలుపుకుంటారు. నీవు జ్ఞానస్వరూపుడవు. ఈ అనంత విశ్వమునకు పాలకుడవు నీవే. అట్టి నీకు నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! ధర్మము, అర్థము, కామము, మోక్షము అను నాలుగు పురుషార్థములు సిద్ధించాలంటే ఎవరైనా ఎంతటి గొప్పవారైనా నిన్ను పూజించవలసిందే. నీవే మోక్ష ప్రదాతవు. నిన్ను నమ్మిన వారిని

నీలో ఐక్యం చేసుకొని నీ వంటి శరీరమును వారికి ప్రసాదిస్తావు. అట్టినీవునన్నుకాపాడుగాక!

తాము చేసే అన్ని కర్మల ఫలములను నీకు అర్పించి, నీకు పూర్తిగా శరణాగతులైన నీ భక్తులు నిన్ను ఏ కోరికలూ కోరరు. వారికి నీ నుండి కోరదగినది ఏమీ లేదు. వారు సదా నిన్ను పూజిస్తూ, నిన్ను కీర్తిస్తూ, నీ కథలను వింటూ, ఆనంద పారవశ్యంలో మునిగి తేలుతుంటారు. ఎందుకంటే నీవు అందరికీ ఈశ్వరుడవు, నిత్యుడవు, అనంతుడవు, అవ్యక్తుడవు, యోగులకు మాత్రమే లభ్యం అయ్యేవాడివి, మానవుల ఇంద్రియములకు నీవు కనపడవు, ఇంద్రియములకు అతీతుడవు, నీవు ఇటు స్థూలరూపంలో అటు సూక్ష్మరూపంలో కూడా ఉంటావు. అందరికంటే ముందు నుండి ఉన్నవాడివి, పరిపూర్ణ స్వరూపుడవు, పరబ్రహ్మము అయిన నిన్ను స్తుతిస్తున్నాను.

ఓ దేవా! బ్రహ్మ, దేవతలు, నాలుగు వేదములు, వివిధము లైన రూపములతో, పేర్లతో నిండిన ఈ అనంత విశ్వమును సృష్టించడానికి నీలోని అత్యల్పమయిన అంశను మాత్రమే వినియోగించావు. అగ్ని నుండి అగ్ని జ్వాలలు పుడుతుంటాయి. సూర్యుని నుండి కిరణములు పుడుతుంటాయి. కాని అగ్ని జ్వాలలు అగ్నిలోనూ, సూర్య కిరణములు సూర్యునిలోనూ కలిసిపోతుంటాయి. అలాగే నీలో నుండి బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, దేహములు, సత్వ,రజస్తమోగుణములు, పుడుతున్నాయి. మరలా నీలోనే లీనం అవుతున్నాయి. పోనీ నీవు సృష్టించిన మానవులలో స్త్రీలు, పురుషులు, నపుంసకులు, లేక రాక్షసులు, దేవతలు, జంతువులు, పక్షులు, అన్నీ నీవే అందామా అంటే ఇవేవీ నీవు కావు. కానీ అన్నీ నీవే అయి ఉన్నావు. ఈ

పని చెయ్యాలి ఆ పని చెయ్యకూడదు అనే నియమం నీకు లేదు. నీవు ఏదీ చెయ్యవు. అన్నీ చేసినట్టు కనపడతావు. అట్టి సర్వాంతర్యామివైన నిన్ను కాపాడమని ప్రార్థిస్తున్నాను.

ఓ దేవా! నాకు ఈ జీవితంమీద విరక్తి కలిగింది. జీవించ వలెననే కోరిక నశించింది. ఈ ఏనుగు శరీరంలో అజ్ఞానం తప్ప ఏమీ లేదు. ఈ అజ్ఞానాన్ని మోస్తూ ఇంకా ఈ శరీరంలో పడి ఉండటం వలన ఏమీ ప్రయోజనము లేదు. ఓ దేవా! నన్ను ఈ అజ్ఞానము నుండి బయటకు లాగు. నాకు ముక్తిని ప్రసాదించు.

క॥ విశ్వకరు, విశ్వదూరుని, విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు, నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్॥

ఈ విశ్వాన్ని సృష్టించిన వాడిని, ఈ విశ్వం అంతా తానే అయి ఉన్న వాడిని, కాని ఈ విశ్వంలో ఎటువంటి ఆసక్తి లేని వాడిని, జ్ఞానమే స్వరూపంగా కలవాడిని, ఈ విశ్వమే ఆత్మగా కలిగిన వాడిని, పుట్టని వాడిని, బ్రహ్మను, ఈశ్వరుడను, పరమపురుషుడను నేను మనసారా ప్రార్థిస్తున్నాను.

క॥యోగాగ్ని దగ్ధకర్ములు, యోగీశ్వరు లే మహాత్ము నొండెఱుగక స
ద్యోగ విభాసిత మనముల, బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్॥

ఓ దేవా! యోగులు తాము చేసిన కర్మలను, వారు సంపాదించిన జ్ఞానము అనే అగ్నిలో పడవేసి దగ్గంచేసుకున్నారు.

పునీతులు అయ్యారు. అట్టి వారు నిరంతరము వారి హృదయములలో నిన్నే చూస్తుంటారు. అట్టి  పరమాత్మ స్వరూపుడవైన నిన్ను భక్తితో వేడుకుంటున్నాను.

ఓ దేవా! నీవు  ఈ ప్రపంచానికి మానవ రూపంతో అవతారపురుషునిగా వెల్లడి అవుతున్నావు. నిన్ను శరణుజొచ్చిన వారిని రక్షిస్తున్నావు. సాధువులను కాపాడుతున్నావు. దుష్టులను శిక్షిస్తున్నావు. నీ శక్తి అపారము. దానికి అంతము లేదు. కాని ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము లేని మానవులకు నీవు కనిపించవు. అట్టి నిన్ను వేడుకుంటున్నాను.

ఓ దేవా! నేను కూడాముముక్షువుడనే. అందుకనే విశ్వస్రష్టవు, విశ్వరూపుడవు, విశ్వమున కంటే భిన్నమైనవాడివి, విశ్వాత్మవు, విశ్వజ్ఞుడవు, పుట్టని వాడివి, పరమపదమే స్వరూపంగాకలవాడివి బ్రహ్మవు అయిననీకు నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! ఈ మానవులందరూ నీ మాయకు లోబడి తనలో ఆత్మ స్వరూపుడుగా వెలుగొందుతున్న నిన్ను తెలుసుకోలేకపోతున్నారు. అట్టి నిన్ను మనసారా వేడుకుంటున్నాను. నన్ను ఈ ఆపద నుండి కాపాడు.” అని గజేంద్రుడు ఆ పరమాత్మను వేడుకున్నాడు.

(ఇక్కడితో వ్యాస మహర్షి రాసిన శ్లోకాలకు భావమును, పోతన గారి పద్యములను చదివారు.  కాని పోతన గారు భక్తి పారవశ్యంతో గజేంద్రుని ఆవేదనను ఇంకొస్త పొడిగించాడు. అవికూడా ఇక్కడ చెప్పుకుందాము. గజేంద్రుడు ఇప్పటిదాకా చేసిన ప్రార్థనలను మీరు

చదివారు. తన పూర్వజన్మలో చేసినపుణ్యవిశేషము వలన అటువంటి ప్రార్థనలను చేసాడు. కాని అంతలోనే అజ్ఞానంలో పడ్డాడు. మనలో కూడా చాలా మంది బాగా చదువుకున్న వాళ్లు, అందరికీ చెప్పనేర్చిన వాళ్లు, ఏదైనా ఆపద తమకు వచ్చేటప్పటికి, ఏ విషయమైనా తమ దాకా వచ్చేటప్పటికి, తాము అనుకున్నది అనుకున్నట్టు జరగనప్పుడు, కోరుకొన్నది లభించనప్పుడు, తాము కొలిచే దేవుడిని సందేహిస్తారు. అప్పటిదాకా ఆంజనేయుడిని కొల్చినవారు సాయిబాబానుకొలవడం మొదలు పెడతారు. ఆయన వల్ల కూడా కాకపోతే మరొక బతికి ఉన్న బాబా వద్దకు వెళతారు. బాబాల దగ్గరకు వెళ్లేవాళ్లు ఎవరూ అజ్ఞానులు కారు. బాగా చదువుకున్న వాళ్లు. జ్ఞానులు. అక్కడా పనిజరగనప్పుడు అసలు దేవుడు ఉన్నాడా! ఉంటే నాకు ఎందుకు అన్యాయంచేస్తున్నాడు! అనే సందేహంలో పడతారు. సరిగ్గా గజేంద్రుడు కూడా అదే సందేహంలో పడ్డాడు. ఆ సందేహాన్ని పోతన గారు ఎంత అందంగా కందంలో (కంద పద్యంలో) వర్ణించారో చదవండి.

క॥ కలడందురు దీనుల యెడ గల డందురు పరమయోగి గణముల పాలం
గలడందు రన్ని దిశలను గలడు కలండను వాడు కలడో లేడో!

భగవంతుడు దీనులను కాపాడుతాడు, దీనుల వెంట ఉంటాడు అని అంటారు కదా! పరమయోగుల యందు కూడా ఉంటాడు అనిఅంటారు కదా! అంతెందుకు. అన్ని దిక్కులలోనూ ఉంటాడు అంటారు కదా! (దిక్కులేని వాడికి దేవుడే దిక్కు), మరి ఇంతమంది ఉన్నాడు ఉన్నాడు అని అంటుంటారు కదా! మరి ఉన్నాడు ఉన్నాడు అనే వాడు ఉన్నాడో! లేడో! అని సందేహాన్ని వెలి బుచ్చాడు.

గజేంద్రుడు ఆ ప్రకారంగా సందేహం వెలిబుచ్చాడు. గజేంద్రుడు జ్ఞాని కాబట్టి అంతలోనే తేరుకున్నాడు. ఇదేమిటి ఆ పరమాత్మనే సందేహించడం ఏమిటి అని అనుకున్నాడు. వెంటనే మరలా ఆ పరమాత్మను స్తుతించడం మొదలుపెట్టాడు.

సీ॥ కలుగడే నాపాలి కలిమి సందేహింప గలిమిలేములు లేక కలుగువాడు
నా కడ్డపడ రాడె నలి నసాధువులచే బడిన సాధుల కడ్డపడెడువాడు.
చూడడే నా పాటు జూపుల జూడక చూచువారలగృప జూచువాడు;
లీలతో నా మొఱాలింప డే మొఱగుల మొఱ లెఱుంగుచు దన్ను మొఱుగువాడు

తే॥ అఖిల రూపముల్ తన రూపమైన వాడు, నాదిమధ్యాంతములు లేక యడరువాడు
భక్తజనముల దీనుల పాలివాడు, వినడె చూడడె తలపడె వేగ రాడె!

ఇదేమిటి! ఆ పరమాత్మనే అనుమానిస్తున్నాను. అసలు నా విషయంలో ఆ పరమాత్మ ఇలా ఎందుకు చేస్తాడు. ఆ పరమాత్మకు ధనికుడు పేదవాడు అనే భేదము లేదు కదా! అందరినీ కాపాడే గుణము కలవాడు కదా! అలాగే నన్ను కూడా ఈ మొసలి బారి నుండి రక్షిస్తాడు. దుర్మార్గుల చేతిలో సత్పురుషులు బాధలు పడుతుంటే ఆయన చూస్తూ ఊరుకుంటాడా! ఎప్పటికీ ఊరుకోడు. తప్పకుండా వచ్చి నన్ను రక్షిస్తాడు. ఇతరులను నమ్మకుండా, ఎల్లప్పుడూ తననే నమ్మిన వారికి, ఆ పరమాత్మ ఎప్పుడూ అండగా ఉంటాడు. నేను కూడా ఆపరమాత్మనే త్రికరణ శుద్ధిగా నమ్ముకున్నానుకదా! అందుకని నన్ను కూడా తప్పకుండా రక్షిస్తాడు. ఎవడైనా ఆపదలో ఉండి దీనంగా ప్రార్థిస్తే, ఆ దీనుల మొరలను విని తనను తాను మరిచిపోతాడు. అటువంటి పరమాత్మ నా మొర ఆలకించకుండా ఉంటాడా! ఇంతకూ నా మొర

ఆయనకు వినబడిందా లేదా అని అనుకుంటే, అన్ని చోట్లా ఆయనే ఉన్నాడు. ఎందుకంటే ఆయనకు మొదలు, ఆఖరు అని లేవు కదా. అన్నింటిలోనూ, అన్ని రూపాలలోనూ ఆయనే ఉన్నాడు. ఆయనను నమ్మిన భక్తులకు, దీనులకు ఆయనే ఆధారం. కాబట్టి నా మొర ఎందుకువినడు! నా బాధలు ఎందుకు చూడడు! నన్ను గురించి ఎందుకు తలచుకోడు! ఎందుకు వేగంగా వచ్చి నన్ను రక్షించడు!

(భగవంతుని మీద అచంచలమైన భక్తి పారవశ్యం కలిగితే ఆ భక్తుడు భగవంతుని ఇలాగే నిలదీస్తాడు. రామదాసు కూడా "నీకు, నీ భార్యకు, నీ తమ్ముడికి నగలు చేయించాను. దానికి సొమ్ము నీ తండ్రి ఇచ్చాడా! నీ మామగారు ఇచ్చారా! ఎవడబ్బసొమ్మని కులుకుతూ తిరుగుతున్నావు" అని నిలదీసాడు. అలాగే పోతన గారి గజేంద్రుడుకూడా పరమాత్మను ఇలాగే నిలదీసి అడుగుతున్నాడు. అటువంటి భక్తులను చూచి భగవంతుడు పొంగిపోతాడు.)

శా॥లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె బ్రాణంబులున్
ఠావుల్ తప్పె మూర్ఛవచ్చె దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరంబెఱుగ మన్నింపం దగున్ దీనునిన్
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

(ఈ పద్యం తెలుగువారి నోట విరివిగా వినబడే పద్యం. ఈ పద్యంలో మాటలు........ లావొక్కింతయు లేదు అనీ, ప్రాణముల్ ఠావుల్ తప్పె అనీ, నీవే తప్ప నితఃపరంబెరుగ అనీ సామెతలుగా కూడా వాడుతుంటారు.

అంతటి ప్రాచుర్యం పొందిన పద్యం ఇది. ఈ పద్యంతో గజేంద్రుడు పూర్తిగా భగవంతునికి పాదాక్రాంతుడు అయ్యాడు. ఇంక నా వల్ల కాదు. నీవే దిక్కు అని వేడుకున్నాడు. ఈ మూడు పద్యాలు గజేంద్రుని శరణాగతిని తెలుపుతాయి. మనం కూడా మనసా వాచా కర్మణా భగవంతునికి, పరమాత్మకు అర్పించుకోవాలి. అహంకారం వదిలిపెట్టాలి. భారం అంతా భగవంతుని మీద వెయ్యాలి. నిశ్చింతగా ఉండాలి. అన్నీ ఆ పరమాత్మ చూచుకుంటాడు. ఈ భావాన్ని పోతన గారు హృద్యంగా వర్ణించారు. ఈ అమృత గుళికలను మనసారా ఆస్వాదిద్దాం. వీలైనంత వరకు ఆచరిద్దాం. అప్పుడే భాగవతం చదివినందుకు సార్థకత.)

ఓ దేవా! నాకు ఏ మాత్రం శక్తిలేదు. ధైర్యం నశించి పోయింది. ప్రాణాలు అరిచేతుల్లో పెట్టుకొని ఉన్నాను. శరీరం పట్టు తప్పుతూ ఉంది. స్పృహ తప్పుతూ ఉంది. ఇంత బలమయిన భారీ శరీరం కూడా ఈ మొసలితో పోరాడి పోరాడి బాగా అలసి పోయింది. నాకు నువ్వు తప్ప వేరే దిక్కులేదు. ఇటువంటి దీనావస్థలో ఉన్న నన్ను కాపాడటం నీ ధర్మం. ఓ దేవుడా! రావయ్యా! కాపాడవయ్యా! అందరికీ వరాలిచ్చే వాడా నన్ను కరుణించవయ్యా! నన్ను రక్షించవయ్యా అని దీనంగా వేడుకున్నాడు. ఇంకా ఇలా వేడుకుంటున్నాడు.

కం॥వినుదట జీవుల మాటలు చనుదట చనరాని చోట్ల శరణార్థుల కో
యను దట పిలిచిన సర్వము, గనుదట సందేహ మయ్యె గరుణావార్థీ'

మానవుని మనస్సు చంచలమైనది. గజేంద్రుడు ఈ నాటి మానవునికి ప్రతీక. అంతలోనే నమ్మకం, అంతలోనే అపనమ్మకం. గజేంద్రుడు కూడా మరలా అపనమ్మకంలో పడ్డాడు. భగవంతుని

ఉనికినే మరలా సందేహిస్తున్నాడు.ఎలాగంటే....)

ఓ కరుణాసముద్రా! నీవు సకల జీవుల బాధలను ఓపిగ్గా వింటావట కదా! దీనులను కాపాడటం కోసరం పోకూడని ప్రదేశాలకు కూడా వెళ్లి ఆర్తులను రక్షిస్తావట కదా! నిన్ను శరణు కోరిన వారు ఎలుగెత్తి పిలిస్తే ఓయ్ అని బదులు పలుకుతావట కదా! మరి నేను ఇంతగా మొరపెట్టుకుంటున్నా ఉలకవు పలకవు. ఇవన్నీ నిజాలేనా లేక ఉట్టుట్టి మాటలేనా! అని ఆ పరమాత్మ శక్తినే శంకించాడు గజేంద్రుడు.

ఇలాకాదని మరలా పరమాత్మను కీర్తించడం, అంతలోనే అరవడం, దీనంగా  వేడుకోవడం  మొదలు పెట్టాడు.

ఉ॥ ఓ కమలాప్త! యోవరద! యో ప్రతిపక్ష విపక్ష దూర!  కు
య్యో!కవియోగి వంద్య సుగుణోత్తమ! యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విమల ప్రభావ!రా
వే! కరుణింపవే! తలపవే! శరణార్థిని నన్ను గానవే!

నీటిలో ఉండే కమలములకు కూడా ఆప్తుడైన వాడా! కోరిన వారికి కోరినట్టు వరాలు ఇచ్చేవాడా! నిన్ను తిట్టే వాళ్లను కూడా కరుణించేవాడా! (హిరణ్యకశిపుడు, శిశుపాలుడు),  కుయ్యో మంటూ అరుస్తున్నా నామొర వినవా! కవులు, యోగులు నీకు నమస్కారాలుపెడుతుంటారట కదా! నేనూ నమస్కారం పెడుతున్నానయ్య! నీకు అన్నీ మంచి గుణములే అట కదా! నిన్ను శరణు వేడిన వారికి కోరిన కోరికలు కాదనకుండా తీరుస్తావట కదా!

మునీశ్వరుల హృదయాలలో కొలువై ఉంటావట కదా! నీ మహిమ అపారమట కదా! రావయ్యా! నన్నురక్షించవయ్యా! నా గురించి కాస్త ఆలోచించవయ్యా! నిన్నుశరణు వేడానయ్యా! కాపాడవయ్యా!" అంటూ దీనంగా ప్రార్థించాడు గజేంద్రుడు.

( ఇక్కడితో గజేంద్రుడి మొర గురించి పోతన గారు రాసిన పద్యాలు కూడా అయి పోయాయి. తరువాత వ్యాసభగవానుని భాగవతానికి వద్దాము. వ్యాసుల వారు నాలుగు శ్లోకాలలో గజేంద్రమోక్షము కథను ముగించారు. అది ఎలాగో చూద్దాము.)

గజేంద్రుని మొరను శ్రీహరితో పాలు బ్రహ్మ మొదలగు దేవతలు కూడా విన్నారు. బ్రహ్మ కానీ ఇతర దేవతలు కాని ఆ గజేంద్రుని మొసలి బారి నుండి విడిపించడానికి ముందుకు రాలేదు. శ్రీహరి గరుడుని మీద ఎక్కి, చక్రము మొదలగు ఆయుధములను ధరించి, గజేంద్రుడు ఆపదలో ఉన్న ప్రదేశమునకు వచ్చాడు.

ఆకాశంలో గరుడుని మీద ఎక్కి, చక్రాయుధమును ధరించి, తన వైపుకు వస్తున్న శ్రీహరిని చూచాడు గజేంద్రుడు. వెంటనే తన తొండముతో పక్కనే ఉన్న తామర పువ్వును లాగి, ఆ తొండమును పైకి ఎత్తి "ఓ నారాయణా! అఖిలగురో! భగవాన్! నా మొరాలకించి వచ్చావా తండ్రీ! నీకిదే నాభక్తిపూర్వక నమస్కారము" అని తొండము పైకెత్తి ఘీంకారము చేసాడు.

వెంటనే శ్రీహరి గరుడుని మీది నుండి కిందికి దిగాడు. చక్రాయుధమును ప్రయోగించి ఆ మొసలి నోటిని చీల్చాడు. మొసలి నోటిలో చిక్కుకున్న గజేంద్రుని కాలును బయటకు లాగాడు. ఆ ప్రకారంగా మొసలి బారి నుండి గజేంద్రుని కాపాడాడు శ్రీహరి.

శ్రీమద్భాగవతము
అష్టమ స్కంధము తృతీయ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

(పాఠకులకు ఒక మనవి. ఇంతటితో వ్యాసమహర్షి రాసిన గజేంద్రమోక్షము అయిపోయింది. కాని పోతన గారు ఇంకా పొడిగించారు. అది కూడా మనం చదువుకుందాము. సందర్భం వచ్చింది కాబట్టి ఈ ఘట్టంలో ప్రాచుర్యంలో ఉన్న ఒక కథకూడా చెప్పుకుందాము. అది ఎలాగంటే.......

గజేంద్రుడు పైన చెప్పిన ప్రకారము శ్రీహరి గురించి ప్రార్థన చేసాడు. వేడుకుంటున్నాడు. నువ్వు ఉన్నావో లేవో అనే సందేహము కూడా వెలిబుచ్చాడు. కాదు ఉన్నాడు, నన్ను వచ్చి కాపాడతాడు అని రూఢి చేసుకున్నాడు. గజేంద్రుడి మొరను బ్రహ్మదేవుడు, ఇతర దేవతలు విన్నారు. కాని గజేంద్రుడిని రక్షించడానికి ఎవరూ రాలేదు. వాళ్లు అనుకున్న కారణం ఏమిటంటే.....

ఆ॥ విశ్వమయత లేమి వినియు నూరక ఉండి, రంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుడు విభుడు విష్ణుండు జిష్ణుండు, భక్తియుతున కడ్డుపడ దలంచె

గజేంద్రుని మొర విని అతనిని కాపాడదామని బ్రహ్మ మొదలగు దేవతలు అనుకున్నారు కానీ వారికి విశ్వం అంతా వ్యాపించి ఉండే గుణం లేదు. పైగా గజేంద్రుడు ఎక్కడ ఉన్నాడో తెలియదు. అందుకని గజేంద్రునికి సాయపడాలని ఉన్నా సాయపడలేక ఊరుకున్నారు. కాని వైకుంఠవాసి, సర్వవ్యాపి అయిన విష్ణువు మాత్రం గజేంద్రునికి సాయపడదలచుకున్నాడు.

ఇక్కడ పోతన గారికి ఒక సందేహము వచ్చినట్టుంది. గజేంద్రునికి సాయపడదాము అనుకున్న వాడు రావచ్చు కదా! గజేంద్రుడు ఇంతగా ఎలుగెత్తి అరుస్తుంటే వైకుంఠంలో ఉన్న శ్రీహరి ఏం చేస్తున్నాడు అని అనుకున్నాడు.

వైకుంఠంలో  ఉన్న శ్రీహరి ఏంచేస్తున్నాడో చూడాలంటే వైకుంఠం వెళ్లాలి. వైకుంఠం ఎలా ఉంటుందో వ్యాసుడు రాయలేదు. పోతన గారు వైకుంఠం వెళ్లి చూడలేదు. పోనీ చూచిన వారు వచ్చి వైకుంఠం ఇలా ఉంటుంది అక్కడ శ్రీహరి ఫలానా చోట ఉంటాడు అని చెప్పే అవకాశం లేదు.  ఇప్పుడు ఎలాగా అని అనుకున్నాడు పోతన గారు. ఏమైతే అది అయిందని తరువాత పద్యం రాయడం మొదలెట్టారు పోతన గారు.

విష్ణువు ఎక్కడ ఉంటాడు.
వైకుంఠంలో ఉంటాడు.

అంటే మన రాష్ట్రంలో ఉన్న అనంత పురం లాగా వైకుంఠ పురం అని ఒకటి ఉంటుంది కదా అని

"అల వైకుంఠ పురంబులో" అని మొదలెట్టాడు.

మరి వైకుంఠపురం అనే పురములో రాజులు ఉండే ప్రదేశాన్ని "నగరి" అంటారు కాబట్టి "నగరిలో.."అని రెండవ పదం రాసారు.

మరి రాచ నగరిలో విష్ణువు ఎక్కడ ఉంటాడు. ఎక్కడో ఒక భవనంలో ఉంటాడు కదా అని అనుకొని "ఆ మూల సౌధంబు దాపల..." అని రాసారు.

ఇంక ఘంటం నడవలేదు. ఎందుకంటే ఆ సౌధంలోపల ఏం జరుగుతూ ఉందో పోతన గారికి తెలియదు. తెలియని విషయం ఏమి రాయగలడు. ఏమీ తోచలేదు పోతన గారికి. ఘంటం పక్కన పెట్టాడు. కూతురిని పిలిచి "తల్లీ! పద్యం నడవడం లేదు. కాస్త బయట తిరిగి వస్తాను. ఏమన్నా ఆలోచన తడుతుందేమో" అని బయటకు వెళ్లాడు.

పోతన గారు పడే తపన అంతా చూస్తున్నాడు విష్ణు మూర్తి. నిజమే. తన సౌధంలో జరిగే విషయాలు తనకు తెలుస్తాయి గానీ పోతన గారికి ఏం తెలుస్తాయి. అందుకని ఆ పద్యం తనే పూరించాలి అని అనుకున్నాడు విష్ణుమూర్తి. వెంటనే వేషం మార్చాడు. పోతన గారిలాగా మారి పోయాడు. బయట నుండి వచ్చినట్టు ఇంట్లోకి

వెళ్లాడు. కూతురు ఎదురుగా వచ్చి కాళ్లకు నీళ్లు ఇచ్చింది. కాళ్లు కడుగుకొని ఆచమనం చేసి దేవుడి ముందు కూర్చున్నాడు. తాటాకుల కట్ట ఘంటం తీసుకున్నాడు. చకా చకా పద్యం పూర్తి చేసాడు.

పోతన రూపంలో ఉన్న విష్ణుమూర్తి ఒకొక్క పదం రాస్తుంటే, అదే పదం ఊరి బయట చెరువు ఒడ్డున పచారుచేస్తున్న పోతన గారి మెదడులో మెదులుతూ ఉంది. ఇక్కడ విష్ణుమూర్తి పద్యంపూర్తి చేసాడు. అక్కడ పోతన గారి మనస్సులో కూడా పద్యం పూర్తి అయింది. విష్ణుమూర్తి పైకి లేచి తన దారిన తాను వెళ్లిపోయాడు. మనసులో అద్దంలా కనిపిస్తున్న పద్యపాదాలు మననం చేసుకుంటూ గబగబా ఇంటికి వచ్చాడు పోతన. .

కూతురు కాళ్లకు నీళ్లు ఇస్తూ "అదేంటి నాన్నా ఇప్పుడే గా వచ్చావు. పద్యం రాసావు. ఇంతలో బయటకు ఎప్పుడు వెళ్లావు" అని అడిగింది.

పోతన గారికి ఏమీ బోధ పడలేదు. "నేనేంటి. రావడం ఏంటి పద్యం రాయడం ఏంటి. ఇందాక వెళ్లిన వాడిని ఇప్పుడే లోపలకు వస్తున్నానమ్మా" అన్నాడు కాళ్లు కడుక్కుని ఆచమనం చేస్తూ.

"నిజం నాన్నా. నువ్వు ఇప్పుడే వచ్చావు. నేను కాళ్లకు నీళ్లుఇచ్చాను. నువ్వు లోపలకు వెళ్లి పద్యం పూర్తి చేసావు" అంది కూతురు అమాయకంగా.

పోతన గారు ఆశ్చర్యపోయారు. గబగబా లోపలకు వెళ్లాడు. తాటాకుల కట్ట తీసుకున్నాడు. తాను రాసిన మొదటి పాదం కింద మూడు పాదాలు పూర్తి చేసి ఉన్నాయి. తనమనస్సులో మెదిలిన పద్యపాదాలే తాటాకుల మీద ప్రత్యక్షం అయ్యాయి.

అప్పుడు అర్థం అయింది పోతన గారికి. సాక్షాత్తు శ్రీరామచంద్రుడే వచ్చి పద్యం పూరించాడు అని. భక్తితో పరవశించి పోయాడు. గజేంద్రమోక్షం కథనుచకా చకా రాసాడు.
ఈ కథ నిజం కావచ్చు. కల్పితంకావచ్చు. పోతన గారు కడప జిల్లావాడు కావచ్చు వరంగల్ జిల్లావాడు కావచ్చు అది మనకు అనవసరం. మనకు గజేంద్రమోక్షం కథా రూపంలో అమృత గుళికల్లాంటిపద్యాలు అందించాడు. అవి చదువుకుందాము. ఆనందిద్దాము. ఆచరిద్దాము. పోతన పుట్టిన తెలుగు గడ్డ మీద పుట్టినందుకు, తెలుగువాడు అయినందుకు గర్విద్దాము. పోతన భాగవతమును మన సారస్వత సంపదగా దాచుకుందాము.  ఈ కలియుగంలో సాక్షాత్తు శ్రీమహావిష్ణువు పోతన గారి ఇంట మానవ రూపంలో అవతరించి, పద్యాన్ని పూరించినందుకు పొంగిపోదాము. ఆ దేవదేవుడు పూరించిన పద్యం ఇంక చదవండి.

మ॥ అలవైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు దా
పల మందార వనాంతరామృత సర: ప్రాంతేందు కాంతోప లో
త్పల పర్యంక రమా వినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహిపాహి యన గుయ్యాలించి సంరంభియై॥

ఆ వైకుంఠ పురంలో ఉన్న రాచనగరులో ఉన్న ఒక సౌధంలో ఉన్నాడు విష్ణు మూర్తి. విష్ణు మూర్తి ఉన్న సౌధము పక్కన ఒక సరస్సు ఉంది. దానిపక్కన ఒక చంద్రకాంతశిలతో నిర్మించబడిన అరుగు ఉంది. ఆ అరుగు మీద కలువ పూలతో ఒక శయ్య ఏర్పాటు చెయ్యబడి ఉంది. ఆ కలువ పూల శయ్య మీద  విష్ణు మూర్తి, లక్ష్మీదేవి కూర్చుని ఉన్నారు. భార్యాభర్తలు ఇద్దరూ వినోదంగా మాట్లాడుకుంటున్నారు. ఆ సమయంలో విష్ణు మూర్తికి లక్ష్మీదేవికి ఏ విషయం మీదనో వాదోపవాదాలు నడుస్తున్నాయి.  చటుక్కున  లక్ష్మీదేవి పమిట కొంగు స్వామి పట్టుకొన్నాడు. అప్పుడు వినిపించింది గజేంద్రుని కుయ్యో మొర్రో అంటూ అరుస్తున్న అరుపు. ఆ అరుపు విన్ని దిగ్గున లేచాడు స్వామి.

(ఇన్ని వివరాలు పోతన గారికి ఎలా తెలుస్తాయండీ, విష్ణుమూర్తికి తప్ప. కాబట్టి ఈ పద్యం సాక్షాత్తు విష్ణుమూర్తే రాసి ఉంటాడు.సందేహము లేదు. ఆంధ్రసాహిత్యంలో మకుటాయమానమైన పద్యం ఇది.)

మ॥ సిరికిం చెప్పడు శంఖచక్ర యుగముం జేదోయి సంధింప డే
పరివారంబును జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం
తర ధమ్మిల్లము జక్కనొత్తడు వివాద ప్రోత్థిత శ్రీ కుచో
పరి చేలాంచలమైన వీడడు గజప్రాణావనోత్సాహియై.

గజేంద్రుని అరుపులు విన్నాడు స్వామి. దిగ్గున లేచాడు. "ఏమండీ.... ఎక్కడికి..... ఉన్నట్టుండి లేచారు" అంది లక్ష్మీదేవి కంగారుగా. ఆమెతో ఒక్కమాట కూడా మాట్లాడలేదు. "ఏమండీ నా పమిట కొంగు మీ చేతిలో ఉంది వదలండీ" అంది లక్ష్మీదేవి. ఆమె

మాట వినిపించుకోకుండా పమిట కొంగును అలాగే పట్టుకొని లాగుతూ ముందుకు నడిచాడు.  తమ అవసరం ఉంటుందేమో తమను పిలుస్తాడేమో అని శంఖము, చక్రము ఎదురుచూస్తున్నాయి. వాటినికూడా రమ్మని పిలువలేదు. సాయానికి గాను తన పార్షదులను కూడా తన వెంట రమ్మనలేదు. ఎంత దూరం పోవాలో ఏమో కాస్త నా మీద ఎక్కితే తీసుకుపోతాను కదా అని గరుడుడు ముందుకు వచ్చాడు. గరుడుని వంకకూడా చూడలేదు. దిగ్గున లేవడంతో తల అంతా చెరిగిపోయి ముంగురులుమొహం మీదపడుతున్నాయి. వాటిని కూడా పైకి తోసుకోలేదు. విష్ణుమూర్తికి ఒకటే లక్ష్యం. ఎవరో నన్ను ఆర్తితో పిలుస్తున్నారు. ఎలుగెత్తి అరుస్తున్నారు. కుయ్యోమంటూ మొరపెట్టుకుంటున్నారు.  వారిని కాపాడాలి. అదే లక్ష్యంతో ముందుకు నడిచాడు పరమాత్మ.

(ఈ సందర్భంలో కూడా ఒక కథ ప్రచారంలో ఉంది.

పోతన గారి బావగారు మహాకవి శ్రీనాధుడు. శ్రీనాధుడు అప్పటి మహారాజు సర్వజ్ఞసింగభూపాలుని ఆస్థానంలో ఉండేవాడు. మహారాజు పోతన గారి భాగవతం గురించి విన్నాడు. పోతన భాగవతాన్ని తనకు అంకితం ఇచ్చేలా చెయ్యమని శ్రీనాధుని పోతన గారి వద్దకు పంపాడు. శ్రీనాధుడు సామదానభేదోపాయములను ప్రయోగించాడు. రాజుగారు ధన, కనక, వస్తు, వాహనములు ఇస్తాడని ఆశ పెట్టాడు.

కానీ పోతన గారు లొంగలేదు. తాను శ్రీరామచంద్రుని ఆదేశము మేరకు భాగవత రచన చేస్తున్నాను అనీ, భాగవతమును శ్రీరామచంద్రునికే అంకితము ఇస్తానని, నరాధములకు అంకితము ఇవ్వననీ తెగేసి చెప్పాడు.

శ్రీనాధునికి కోపం వచ్చింది. "ఏంటయ్యా నీ భాగవతం నువ్వు. అదొక పెద్ద కావ్యమా.

"సిరికిం చెప్పడు శంఖచక్ర యుగముం జేదోయి సంధింప
డేపరివారంబును జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం
తర ధమ్మిల్లము జక్కనొత్తడు"

ఏమీ లేకుండా ఎందుకు వెళ్లినట్టు చోద్యం చూడటానికా" అంటూ అవహేళన చేసాడు శ్రీనాధుడు. పోతన గారు శ్రీరామా అంటూ చెవులు మూసుకున్నాడు.

ఇంతలో పెరట్లోనుండి పోతన కూతురు పెద్దగా అరిచింది. "నాన్నా నాన్నా శారద వదిన బావిలో పడిపోయింది" అని పెద్దగా అరిచింది. శారద శ్రీనాధుని కూతురు. తన కూతురు బావిలో పడింది అని వినగానే శ్రీనాధుడు గబా గబా పంచె ఊడిపోయేది కూడా తెలియకుండా పెరట్లోకి పరుగెత్తాడు. ఆయన వెంట పోతన గారు, వారి వెంట అక్కడ ఉన్న బ్రాహ్మణులు పరుగెత్తారు. బావి దగ్గర శారద భయం భయంగా నిలబడి ఉంది.

"అది కాదు నాన్నా. శారద ఒదిన కాలుజారి పడింది. ఇది నేల బావి కదా.  బావిలో పడిందేమో అని అరిచాను" అని చెప్పింది పోతన కూతురు. అందరి మనసులు కుదుట పడ్డాయి. అప్పుడు పోతన

గారు తన బావగారు శ్రీనాధుని చూచి

"బావా! మానవ మాత్రులమైన మనమే శారదకు ఆపద కలిగింది అని వినగానే గబగబా పరుగెత్తామే, కనీసం తాడు, బక్కెట కూడాతీసుకొని వెళ్లలేదే, ఈ సకల జగత్తును పాలించే ఆ శ్రీహరి తన భక్తుడు ఆపదలో ఉన్నాడు అని తెలిసి ఎలా ఊరుకోగలడు. అయినా సర్వశక్తిమంతుడు, మనోవేగాన్ని మించి వెళ్లగల సమర్ధుడు అయిన శ్రీహరికి ఆయుధములు, వాహనములు అవసరమంటావా!" అని అడిగాడు.

శ్రీనాధుని కళ్లవెంట నీళ్లు ధారాపాతంగా కారసాగాయి. వెంటనే పోతన గారి పాదాల మీద పడి "బావా నన్ను క్షమించు. అజ్ఞానంతో అవివేకంతో భాగవతాన్ని చులకన చేసి మాట్లాడాను. నీవు కవివి కావు. మహాఋషివి. భాగవతము ఒక మహాకావ్యము. దానిని రామునికే అంకితము ఇవ్వు." అని ప్రార్థించాడు.

అంతటి మహానుభావుడు పోతనగారు. ఆయన పాదాలకు మరొక సారి భక్తితో నమస్కరిస్తూ, ఆయన పుట్టిన ఈ తెలుగు గడ్డ మీద పుట్టినందుకు గర్విస్తూ, మనం ముందుకు సాగుదాం.)

ఇక్కడ పోతన గారు వచనంరాసారు.

వ॥ ఇట్లుభక్తజన పాలన పరాయణుండును, నిఖిల జంతు హృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు కలి కులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులం దగులు సాలించి సంభ్రమించి దిశలు నిరీక్షించి గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయునప్పుడు;

ఈ ప్రకారంగా ఎల్లప్పుడు తన భక్తులను రక్షించడంలో ఆసక్తి కలవాడు, ఈ అనంత విశ్వంలో ఉన్న సకల జీవరాసుల హృదయములలో తిష్టవేసుకొని ఉన్నవాడు, గజేంద్రుని దీనాలాపములు విని లక్ష్మీదేవితో సరసాలు చాలించాడు. ఆ ఆర్తనాదం ఎక్కడి నుంచి వచ్చిందా అని నాలుగు దిక్కులు చూచాడు. ఆ ఆర్తనాదం చేస్తున్న గజేంద్రుని కాపాడాలని నిశ్చయించుకున్నాడు. ఆ అరుపులు వస్తున్న దిశగా పరుగెత్తాడు. ఆ సమయంలో దృశ్యం ఎలా ఉందో పోతన గారు కళ్లకు కట్టినట్టు చెప్పారు. కాదు చూపించారు.

మ॥ తన వెంటన్ సిరి, లచ్చి వెంటనవరోధవ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుడు, వాని పొంతను ధను:కౌమోదకీ శంఖ చ
క్ర నికాయంబును, నారదుండు, ధ్వజినీ కాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

ముందు విష్ణు మూర్తి పరుగెడుతున్నాడు. ఆయన చేతిలో లక్ష్మీదేవి పమిట కొంగు ఉంది. ఆ కొంగును పట్టుకొని లక్ష్మీదేవి పరుగెడుతూ ఉంది. అమ్మగారు ఒంటరిగా వెళుతుంటే ఆమె చెలికత్తెలు దాసీలు ఊరుకుంటారా! వారుకూడా  ఆమె వెంట పరుగెడుతున్నారు.

అయ్యగారు అమ్మగారు పరుగెడుతుంటే, తన అవసరం ఉంటుందేమో అని గరుడుడు వారి వెనక పరుగెడుతున్నాడు. అయ్యగారు ఏ ఆయుధమూ లేకుండా వెళుతున్నాడు, ఎప్పుడు ఏ అవసరం వస్తుందో మో అని గద, శంఖము, చక్రము మొదలగు ఆయుధములు ఆయన వెంట పరుగెడుతున్నాయి.

ఇంతలో నారాయణ నామ స్మరణ చేసుకుంటూ నారదుడు అక్కడకు వచ్చాడు. వైకుంఠము అంతా అలా వరసగా పరుగెత్తడం చూచాడు. ఎందుకో అర్థం కాలేదు. పోతూఉంటే అదే అర్థం అవుతుంది లెమ్మని తను కూడా వారి వెంట పరుగెత్తసాగాడు. ఈ విషయం సైన్యాధి పతి విష్వక్సేనుడికి తెలిసింది. ఎవరైనా రాక్షసుడు దండెత్తి వస్తున్నాడేమో నేను లేకపోతే ఎలాగ అని అనుకుంటూ ఆయన కూడా విషయం తెలుసుకోడానికి వారి వెంట పరుగెత్తాడు. అయ్యగారు, అమ్మగారు లేని వైకుంఠంలోమనం ఎందుకని వైకుంఠ వాసులందరూ, ఆడా, మొగా, పిల్లా పెద్ద అందరూ పరుగెత్తారు.

వ॥తదనంతరంబ ముఖారవింద మకరంద బిందు సందోహ పరిష్యందమానానందదిందిందిర యగు నయ్యిందిరాదేవి గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవ్యానచేలాంచలయై పోవుచూ......

విష్ణుమూర్తి వెంట లక్ష్మీదేవి తన పమిట కొంగును లాగుకుంటూ పరుగెడుతుంటే ఆమె ముఖంమీద చెమట పట్టింది. పద్మమువలె ఉన్న ఆమె ముఖమును నిజంగానే పద్మము అనుకొని తుమ్మెదలు ఆమె

ముఖం మీదవాలుతుంటే ఒక చేత్తో పమిట చెంగు జారకుండా పట్టుకొని మరొక చేత్తో ఆ తుమ్మెదలను తోలుకుంటూ ఇలా తనలో తాను అనుకుంటూ ఉంది.

మ॥తన వేంచేయు పదంబు బేర్కొన డనాథస్త్రీ జనాలాపముల్
వినెనో, మ్రుచ్చులు మ్రుచ్చిలించిరో ఖలుల్ వేద ప్రపంచములన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం
గని చక్రాయుధుడేడి చూపుడని ధిక్కారించిరో దుర్జనుల్.

"ఏమిటో ఈ పెద్దపనిషి ఎక్కడికి పోతున్నదీ చెప్పడు. మరలా ఎవరన్నా స్త్రీలు కాపాడమని పెద్దగా మొరపెట్టుకున్నారా (ద్రౌపది), లేక ఎవరైనా దుర్మార్గులు వేదాలను ఎత్తుకుపోయారా (హిరణ్యాక్షుడు). లేక అసురులు ఇంద్రుడి మీదకు దండెత్తి వచ్చి ఆయనను స్వర్గం నుండి వెళ్లగొట్టారా (వృత్రాసురుడు). లేక దానవులు విష్ణు భక్తులను పట్టుకొని ఏడీ నీ విష్ణువు ఎక్కడున్నాడు అంటూ బాధిస్తున్నారా (హిరణ్యకశిపుడు) ఏంటో ఏవిషయమూ చెప్పకపోతే ఎలా తెలిసేది.." అని తనలో తాను అనుకుంటూ విష్ణువు వెంట పరుగెడుతూ ఉంది లక్ష్మీదేవి.

శా: తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో
శాటీముక్త కుచంబుతో నదృఢచంచత్కాంచితో శీర్ణ లా
లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతో
గోటీంద్రుప్రభతో నురోజభర సంకోచద్విలగ్నంబుతోన్

గజేంద్రుని కాపాడాలనే తొందరలో పరుగెత్తుతున్న విష్ణువు వెంట పరుగెడుతున్న లక్ష్మీదేవి పరిస్థితి ఎలా ఉందంటే...... ఆమె తల అటు ఇటు ఊగుతుంటే ఆమె చెవికి ఉన్న ఆభరణములు ఊగుతున్నాయి. అందంగా ముడి వేసుకున్న వెంట్రుకలు ఊడిపోయి భుజాల మీద జీరాడుతున్నాయి. విష్ణుమూర్తి చేతిలో పమిట ఉండటంతో, ఆమె చీర కొంగు మాటి మాటికీ ఊడిపోతూ ఉంది. పైట తొలగిపోయింది. నడుముకుకట్టుకున్న ఆభరణములు వదులై పోయాయి. నుదుటి మీద ఉన్న కుంకుమ చెదరి పోయింది. ఇన్ని జరుగుతున్నా విష్ణు మూర్తి చేతిలో ఉన్న పమిట కొంగును గట్టిగా పట్టుకొని లాక్కుంటూ పోతున్నాడు. ఆయన వెంట పరుగెడుతున్న లక్ష్మీదేవి సన్నని నడుము వయ్యారంగా ఊగుతూఉంది. కాని ఆ తల్లి ముఖం మాత్రము కోటి సూర్యుల కాంతితో వెలిగిపోతూ ఉంది.

క: అడిగెద నని కడువడి జను నడిగిన దను మగుడ నుడుగ డని నడ యుడుగున్
వెడవెడ చిడిముడి తడబడ నడు గిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్

“తను ఆ ప్రకారంగా ఎంత దూరం వెళ్లాలి. ఏమైనా సరే ఆయన ముందు నిలబడి వ్యవహారం కనుక్కోవాలి” అని అనుకుంది లక్ష్మి. అంతలోనే “ఆ మనకెందుకులే. ఈ గందరగోళంలో ఆయన ముందు నిలబడి అడిగితే ‘నీకెందుకు... నేనెక్కడకుపోతే అక్కడకు రా’ అని కసురుకుంటే ఏం చెయ్యాలి. ఊరుకున్న దాని కంటే ఉత్తమం లేదు.” అని అనుకొని విష్ణువును అడగాలి అన్న ఆలోచన విరమించుకుంది లక్ష్మి.

అంతలోనే చీకాకు పడింది. "ఏమిటో... ఏమీ చెప్పడు... ఇలా ఎంతదూరం ఈయన వెంట పరుగెత్తాలి.... చికాకుగా ఉంది.... ఏమైతే అది అయింది.... అడిగేస్తాను" అంటూ మరలా రెండు అడుగులు ముందుకేసింది. అంతలోనే నాలుగు అడుగులు వెనక్కు వేసింది. ఇలా ముందుకు వెనక్కు నడుస్తూ శ్రీహరి వెంట పరుగెడుతూ ఉంది లక్ష్మి.

నీలమేఘచ్ఛాయుడైన శ్రీహరి వెంట మేలిమి బంగారుఛాయలో మెరిసిపోతున్న లక్ష్మీదేవి పరుగెడుతుంటే నల్లని మేఘాల మధ్య మెరుపు మెరిసినట్టు కనపడుతూ ఉంది. ఆమె ముఖం పద్మం అనుకొని తుమ్మెదలు వాలుతున్నాయి. ఆ తుమ్మెదలను తోలబోతే ఆమె దొండపండు వంటి పెదాలను కొరుక్కు తినడానికి రామచిలుకలు వాలుతున్నాయి. ఆ చిలుకలను తోలబోతుంటే ఆమె కనులను చేపలు అనుకొని సముద్రంలోని పెద్దపెద్ద చేపలు ఎగిసిపడుతున్నాయి. ఆ చేపలను తప్పించుకునేంతలో, లక్ష్మీదేవి దేహాన్ని మెరుపుతీగగా భావించిన ఇతర మెరుపుతీగలు ఆమె దేహాన్ని తాకడానికి ప్రయత్నిస్తున్నాయి. ఈ ప్రకారంగా లక్ష్మీదేవి నానా అవస్థలు పడుతూ శ్రీహరి వెంట పరుగెడుతూ ఉంది.

ముందు శ్రీమహావిష్ణువు, వెనుక లక్ష్మీదేవి, వారి వెనక వారి పరివారము బారులు తీరి పరుగెత్తడం చూచిన దేవతాగణాలు వారికి ఎక్కడికక్కడ స్వాగత సత్కారాలు చేస్తున్నారు. "అడుగో శ్రీమహావిష్ణువు వస్తున్నాడు. ఆయన వెంట లక్ష్మీదేవి కూడా వస్తోంది. వారి వెంటగరుడుడు, ఆయుధాలు కూడా వస్తున్నాయి. అందరూ నమస్కారాలు చెయ్యండి" అని దేవతలు అందరూ అటు ఇటు బారులు తీరి వారికి భక్తితో నమస్కరిస్తున్నారు.

శ్రీహరికి ఇవేమీ పట్టడంలేదు. ఆ ఆర్తనాదం వినవచ్చిన దిక్కుగా పరుగెడుతున్నాడు. తుదకు గజేంద్రుడు ఉన్న సరోవరమునకు చేరుకున్నాడు. తనను ప్రార్థించింది గజేంద్రుడు అనీ, అతని కాలు మొసలి నోట్లో ఉంది అని గ్రహించాడు. వెంటనే మనసులో చక్రాయుధమును తలచుకున్నాడు. వెనుకనే ఉన్న చక్రాయుధము శ్రీహరి ముందు నిలిచింది. ఆ చక్రాయుధంతో శ్రీహరి మొసలి శిరస్సును ఖండించాడు. ఎప్పుడైతే మొసలి పట్టు వీడిపోయిందో గజరాజు ఉత్సాహంగా కాలు విదిల్చాడు. ఆయన వెంట ఉన్న ఆడ ఏనుగులు తమ తమ తొండాలతో నీటిని ఆయనమీద చల్లి తమ ఆనందాన్ని వ్యక్తం చేసాయి. అది చూచి శ్రీహరి పాంచజన్యము అనే శంఖమును పూరించాడు. దేవతలు దుందుభులు మోగించారు. అప్సరసలు నాట్యం చేసారు. దేవతలు జయజయధ్వానాలు చేసారు.

శ్రీహరి తన చేతిని చాచి గజేంద్రుని  బయటకు లాగాడు. ఆయన వీపు నిమిరాడు. శ్రీహరి చేతి స్పర్శతో గజేంద్రుని బాధ అలసట పూర్తిగా పోయాయి. గజేంద్రుడు తన ఆడ ఏనుగులతో కలిసి ఆనందంగా ఘీంకారం చేసాడు. తన పక్కన ఉన్న ఆడ ఏనుగులను తన తొండంతో ప్రేమగా తడిమాడు. వాటి తొండాలతో తన తొండం మెలివేసి తన ఆనందాన్ని వ్యక్తం చేసాడు.

తన చేతిలో తన భార్య లక్ష్మీదేవి పమిట కొంగు ఉన్న సంగతి శ్రీహరికి అప్పుడు గుర్తుకొచ్చింది.  శ్రీహరి వెంటనె వెనక్కు తిరిగి,  తన చేతిలో ఉన్న లక్ష్మీదేవి పమిట కొంగును, వెనుక ఉన్న లక్ష్మీదేవిని చూచిచిరునవ్వు నవ్వాడు.

"దేవీ! నేను నీ పమిట కొంగునుకూడా వదిలిపెట్టకుండా ఆకాశ మార్గాన పరుగెత్తుతుంటే, నా వెనక పరుగెత్తుతున్న నీవు నా గురించి ఏమనుకున్నావు? దేవీ! నాకు ఒక బలహీనత ఉంది. నన్ను మరిచిపోని వారిని నేను కూడా ఎన్నటికీ మరిచిపోను. నీవే నాకు దిక్కు అంటూ నన్ను వేడుకున్న వారిని రక్షించకుండా వదలను. ఈ విషయం నీకు తెలుసు కదా!" అని తన భార్య లక్ష్మిని అనునయించాడు.

దానికి లక్ష్మీదేవి సిగ్గుతో తలవంచుకొని "నాధా! తమరి ఆర్తత్రాణ పరాయణత నాకు తెలియదా! ఎల్లప్పుడు తమరి పాదాలను నా హృదయంలో పెట్టుకొని పూజించే నేను, మీ అడుగులో అడుగు వేసుకుంటూ మీ వెంట రాకుండా ఎలా  ఉండగలను.ఓ దేవా! తమరు దీనులకు బంధువులు. దీనులను రక్షించడమే వ్రతంగాపెట్టుకున్న వారు. దీనుల మొరలను వినడం, వారిని కాపాడటం, దీన పరాధీనత తమరి లక్షణములని నాకు తెలియవా. " అనిపలికింది లక్ష్మీదేవి.  ఇంతలో గరుడుడు వచ్చి స్వామి ముందు నిలబడ్డాడు. శ్రీహరి, లక్ష్మీదేవి గరుడుని ఎక్కారు. అందరూ వైకుంఠం చేరుకున్నారు.

(ఇదీ పోతనగారి భాగవతంలో పోతనగారు రాసిన గజేంద్రమోక్షం ఘట్టం. ఇక్కడినుండి మనం మరలా వ్యాస భాగవతాన్ని చదువుకుందాము.

ఆఖరున ఒక్క మాట.  ఇప్పటి దాకా మనం అందరం గజేంద్రమోక్షం కథ చదువుకున్నాము. దీని వలన పుణ్యం వస్తుందో

లేదో నాకు తెలియదు కానీ ఈ కథలో మనకు ఒక నీతిఅంతర్గతంగా కనపడుతుంది.

ఈ నాడు యువత, విద్యార్థులు సంవత్సరం పొడుగునా ప్రేమ వ్యవహారాలు, బందులు, హర్తాళ్లు అంటూ తిరిగి పరీక్షలు నెల ఉండగా పెన్నులు,పుస్తకాలు, పాడ్లు దేవుళ్ల దగ్గర పెట్టి పూజలుచేయించడాలు, రోజూ దేవాలయాల చుట్టు ప్రదక్షిణాలు చేయడాలు చేస్తుంటారు. అది మంచి పని కాదు. గజేంద్రుడు కూడా తన కాలు మొసలి పట్టుకోగానే దేవా నన్ను రక్షించు అని అరవలేదు. శక్తికొద్దీ పోరాడాడు. తన వంతు కర్తవ్యం తాను చేసాడు. తరువాతే భగవంతుని ప్రార్థించాడు. అలాగే మనం కూడా ఏద్రైనా ఆపద వచ్చినప్పుడు, సమస్య వచ్చినపుడు, మన వంతు కర్తవ్యం మనం చేయాలి. తరువాత దేవుని మీద భారం వెయ్యాలి. అంతేకానీ అంతా దేవుడే చూచుకుంటాడు అని ఊరుకోవడం మంచిది కాదు. సంవత్సరం అంతా శ్రద్ధగా చదివి, పరీక్షల ముందు దేవుడా నాకు మంచి మార్కులు వచ్చేట్టు చెయ్యి అని మొక్కుకుంటే, దేవుడు కూడా చదివిన పాఠాలు గుర్తుకు వచ్చేట్టు చేస్తాడు. మంచి మార్కులు వస్తాయి. కాబట్టి విద్యార్థులు అందరూ ఈ నీతిని గుర్తుపెట్టుకొని సంవత్సరం పొడుగునా బాగా శ్రద్ధతో చదివి ఉత్తీర్ణులు కావాలని నా ఆకాంక్ష

నరుడు క్రియకు అంటే  పనికి ప్రతీక అయితే నారాయణుడు పరమాత్మకు ప్రతీక. మానవుడు తాను చేయవలసిన పనులను శ్రద్ధతో నిర్వర్తిస్తే, సాయపడటానికీ మంచి ఫలితాలు

ఇవ్వడానికి పరమాత్మ పక్కనే సిద్ధంగా ఉంటాడు. అందుకే అన్నారు కృషితో నాస్తి దుర్భిక్షం అని.

కాని ఈ రోజుల్లో ఏ మాత్రం కష్టపడకుండా ఎక్కువఫలితాలు ఆశించే వాళ్ల ఎక్కువ అయ్యారు. అందుకే కష్టాలపాలవుతున్నారు. అటువంటి వారికి గజేంద్రమోక్షము ఒక పాఠము. ఉన్న కష్టాల నుండి గట్టెక్కాలన్నా, కొత్త కష్టాలు రాకుండా ఉండాలన్నా, పరమాత్మ మనకుసాయపడాలన్నా ముందు మనము మన కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. కష్టించి పనిచేయాలి. చేసే పనిని శ్రద్ధతో చెయ్యాలి. అప్పుడు ఫలితాలు వాటంతట అవే వస్తాయి. ఇవ్వడానికి పరమాత్మ మన పక్కనే సిద్ధంగా ఉంటాడు.

మరొక్క విషయం. పరమాత్మ వెంట లక్ష్మీదేవి పరుగెడుతూ ఉంటుంది. పరమాత్మ ప్రసన్నుడయితే లక్ష్మీప్రసన్నం కూడా వెంటనే అవుతుంది. పరమాత్మ ప్రసన్నుడు కావాలంటే కర్తవ్య నిర్వహణ ముఖ్యం. మనం చెయ్యాల్సిన పని మనం శ్రద్ధతో, దీక్షగా చేస్తే, పరమాత్మ కటాక్షం వెంటనే కలుగుతుంది. దాని వెంటనే లక్ష్మీప్రసన్నం కూడా కలుగుతుంది. ఇదే మనం గజేంద్రమోక్షం నుండి నేర్చుకోవాల్సిన సత్యం.

అలాగే ఈ గజేంద్రమోక్షంలో భగవంతుడు ఎవరు అనే దాని మీద వ్యాసుల వారు ఒక శ్లోకం రాస్తే, దానికి పోతన గారు ఒక పద్యంరాసారు. దాని భావము... ఈ విశ్వాన్ని ఎవరు సృష్టిస్తున్నారో, ఈ జగత్తు అంతా ఎవనిలో లీనం అయి ఉందో, ఈ జగత్తు అంత్యకాలంలో ఎవనిలో కలిసిపోతుందో, ఈ విశ్వానికి అంతా నాధుడు ఎవరో, ఈ విశ్వానికి మూలమైన కారణం ఎవరో, ఈ విశ్వానికి ఆది, మధ్య,

అంత్యము ఎవరో, ఈ విశ్వం అంతా తానే అయినవాడు ఎవరో, అతనికి, ఆ ఆత్మస్వరూపునికి, ఈశ్వరునికి నేను నమస్కరిస్తాను.

అంటే మనలో ఉన్న ఆత్మ, పరమాత్మ స్వరూపమే అని తెలియజెపుతున్నారు వ్యాసుడు, పోతన. పరమాత్మ ఆత్మస్వరూపంగా అందరిలో వెలుగుతున్నాడు. మనలో ఉండే ఆత్మ అందరిలోనూ ఉంది. అందుకని అందరూ పరమాత్మ స్వరూపాలే. అందరూ పరమాత్మ స్వరూపాలు అయినప్పుడు ఒకరిని ఒకరు ద్వేషించుకోవడం, ఒకరిని ఒకరు దూషించుకోవడం, చంపుకోవడం తప్పు కదా! సాటి వారిని ప్రేమిస్తే పరమాత్మను ప్రేమించినట్టే పూజించి నట్టే.

అలాకాకుండా, సాటివారిని బాధపెట్టి, వారి నోటి దగ్గర అన్నం దోచుకొని, వాళ్ల కొంపలు కూల్చి, వాళ్లను చంపి, ఆ పాపాలను పోగొట్టుకోడానికి, ఎన్ని పూజలు, వ్రతాలు, యజ్ఞాలు, యాగాలు, దానాలు, ధర్మాలు ఏం చేసినా ప్రయోజనం లేదు. ఈ సత్యాన్ని తెలుసుకోగలిగితే, అందరినీ అందరూ మానవులుగా చూడగలిగితే, మానవుడుగా పుట్టినందుకు మానవత్వం మరిచిపోకుండా, మానవుడు మానవుడుగా బతకగలిగితే, గజేంద్రమోక్షం చదివిన దానికి సార్థకత అని నా అభిప్రాయము. ఇంతటితో గజేంద్రమోక్షము కథాభాగము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## అష్టమ స్కంధము

## నాలుగవ అధ్యాయము.

శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు గజేంద్రుని, మొసలి పూర్వ వృత్తాంతము గురించి  ఈ విధంగా వివరిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా గజేంద్రుని రక్షించిన శ్రీహరిమీద దేవతలుపూలవర్షం కురిపించారు. స్వర్గంలో దుందుభులు మోగాయి. గంధర్వులు నాట్యం చేసారు. ఋషులు, చారణులు స్తోత్రపాఠాలు చదివారు.

ఆ సమయంలో అప్పటి దాకా గజేంద్రుని కాలు పట్టుకొని లాగిన మొసలి ఒక గంధర్వుడు గా మారి పోయింది. ఆ గంధర్వుని పేరు "హూహూ". దేవలుడు అనే ముని శాపంతో మొసలిగా ఆ సరోవరంలో ఉన్నాడు. శ్రీహరి చక్రాయుధ స్పర్శతో ఆ గంధర్వునికి శాపవిమోచనము అయింది. ఆ గంధర్వుడు శ్రీహరికి భక్తిపూర్వకంగా ప్రదక్షిణ నమస్కారము చేసి గంధర్వలోకమునకు వెళ్లిపోయాడు.

ఆ సమయంలో అప్పటి దాకా  మొసలితో బాధింపబడ్డ గజేంద్రుడు శ్రీహరి చేతి స్పర్శతో పునీతుడై, పరమాత్మలో కలిసిపోయాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ గజేంద్రుడు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడు అనే మహారాజు. అతడు పాండ్య దేశమునకు అధిపతి. ఆ మహారాజు ఎల్లప్పుడూ శ్రీహరిని భక్తితో పూజించేవాడు.

ఒకరోజు మహారాజు పూజలో ఉండగా అగస్త్యముని ఆ మహారాజును చూడటానికి వచ్చాడు. శ్రీహరి ధ్యానంలో ఉన్న ఇంద్రద్యుమ్నుడు అగస్త్యుని రాకను గమనించలేదు. లేచి నమస్కరించలేదు. అగస్త్యమునికి కోపం వచ్చింది. తాను వచ్చినా కూడా తన రాకను గమనించకుండా ఏనుగు మాదిరి కదలక మెదలక కూర్చున్న ఇంద్రద్యుమ్నుని చూచి అగస్త్యుడు "నీవు దుర్మార్గుడవు. దురాత్ముడవు. నీకు సరిఅయిన బుద్ధి, జ్ఞానము లేదు. బ్రాహ్మణులను అవమానించావు. నీకు ఉన్న జ్ఞానము నశించి పోతుంది. ఏనుగు వలె స్థబ్ధంగా కూర్చుని ఉన్న నీవు ఏనుగుజన్మ ఎత్తుదువుగాక!" అని శపించాడు అగస్త్యుడు. తరువాత అగస్త్యుడు తన శిష్యులతో అక్కడినుండి వెళ్లిపోయాడు.

ఇదంతా ధ్యానంలో ఉన్న ఇంద్ర్యుమ్నుడికి తెలియదు. ధ్యానంలో నుండి లేచిన తరువాత అక్కడ ఉన్న వారు జరిగింది చెప్పారు. ఇంద్రద్యుమ్నుడు కోపించలేదు. చింతించలేదు. బాధపడలేదు. ఆ శాపాన్ని భగవంతుని ప్రసాదంగా స్వీకరించాడు. అగస్త్యుని శాపము ప్రకారము ఏనుగు జన్మ ఎత్తాడు. కాని శ్రీహరిని అర్చించిన పుణ్యవిశేషము చేత ఇంద్రద్యుమ్నునికి పూర్వజన్మ స్మృతి పోలేదు. అందుకే శ్రీహరిని ఆ ప్రకారంగా ప్రార్థించాడు. ఆ విధంగా శ్రీహరి ఇంద్రద్యుమ్నుని శాపవిముక్తుని చేసాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇదీ గజేంద్రుని వృత్తాంతము. ఈ కథ వినడం స్వర్గం వెళ్లడానికి మెట్టువంటిది. మంచి యశస్సును కలిగిస్తుంది. కలిప్రభావమును నశింపచేస్తుంది. చెడుస్వప్నములను రానివ్వదు. అందుకే తమశ్రేయస్సుకోరుకునే ద్విజులు పొద్దుటే లేచి స్నానం చేసి, శుచిగా ఈ గజేంద్రమోక్షము కథను చదువుతారు. అంతేకాకుండా శాపవిమోచనము అయిన తరువాత శ్రీహరి ఇంద్రద్యుమ్నునితో ఇలా అన్నాడు.

“ఎవరైతే తెల్లవారు జామున లేచి, శుచిగా ఏకాగ్రచిత్తంలో నిన్ను, నన్ను, ఈ సరోవరమును, ఈ పర్వతమును, ఇక్కడ ఉన్న చెట్లను, తీగలను, వృక్షములను, ఈ పర్వత శిఖరములను, క్షీరసాగరమును, శ్వేతద్వీపమును, నా వక్షస్థలము మీద ఉన్న శ్రీవత్సము అనేమచ్చను, కౌస్తుభమణిని, వైజంతీ మాలను, కౌమోదకి అనే గదను, నిన్ను రక్షించిన సుదర్శనము అనే చక్రమును, పాంచజన్యము అనే నా శంఖమును, నా వెంట ఉన్న లక్ష్మీదేవిని, నా వాహనమైన గరుడుని, బ్రహ్మదేవుని, నారదుని, శివుని, నాభక్తుడైన ప్రహ్లాదుని, నా అవతారములైన మత్స్యములను, కూర్మములను, వరాహములను ఆ అవతారములలో నేను చేసిన లీలలను, సూర్య చంద్రులను, అగ్నిదేవుని, ఓంకారమును, సత్యమును, నా మాయను, గోవులను, బ్రాహ్మణులను, సోముని, కశ్యపుని, వారి భార్యలైన దక్షుని పుత్రికలను, గంగా, యమునా, సరస్వతీ నదులను, ఐరావతమును, ధ్రువుని, సప్తఋషులను, సత్పురుషులు అయిన మానవులను, స్మరించుకుంటారో, వారందరూ సకలపాపముల నుండి విముక్తులవుతారు.

అంతేకాదు! నీవు నన్ను స్తోత్రము చేసావు కదా! ఆ స్తోత్రముతో నన్ను ఎవరైతే స్తుతిస్తారో, వారి అవసాన కాలములో నేను వారికి రక్షిస్తాను."అని శ్రీహరి సకల మానవాళికి వరం ప్రసాదించాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు గజేంద్రుడు, మొసలియొక్కపూర్వ వృత్తాంతములను, శ్రీహరి ప్రసాదించిన వరముల విశేషములను వివరించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము

ఐదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవతకథలో అంతర్భాగంగా మనువుల వృత్తాంతమును ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! చదివిన వారికి, విన్న వారికీ పుణ్యము కలిగించేదీ, పాపములను పోగొట్టేదీ అయిన గజేంద్రమోక్షణము అనే కథను నీకు వివరంగా చెప్పాను.

తరువాతి మనువు ఐదవ మనువు. అతని పేరు రైవత మనువు. ఇతడు అంతకు ముందు మనువు అయిన తామసునికి

సోదరుడు. ఇతడు మనువుల వరుసలో ఐదవ మనువు. ఈ రైవత మనువునకు అర్జునుడు, బలి, వింధ్యుడు మొదలగు కుమారులు జన్మించారు.

ఈరైవత మన్వంతరములో విభుడు అనే వాడు ఇంద్రపదవిలో ఉన్నాడు. భూతరయాదులు దేవతలు. హిరణ్యరోముడు, వేదశిరుడు, ఊర్ధ్వ బాహుడు మొదలగు వారు సప్తఋషులు. ఈ మన్వతరములో శుభుడు, వికుంఠ అనే దంపతులకు, పరమాత్మ వైకుంఠుడు అనే పేరుతో జన్మించాడు. ఆ అవతారములోనే శ్రీహరి, లక్ష్మీదేవి కోరిక మేరకు, వైకుంఠ పురమును నిర్మించాడు.

తరువాత వచ్చినది చాక్షుస మన్వంతరము. ఇది ఆరవ మన్వంతరము. చక్షువు కుమారుడైన చాక్షువు ఆరవ మనువుగా ప్రసిద్ధికెక్కాడు. ఆయన పేరుతోనే ఆ మన్వంతరము చాక్షుస మన్వంతరముగా పిలువబడింది.

చాక్షుస మన్వంతరములో ద్రుముడు అనేవాడు ఇంద్రుడు. ఆప్యదుడు మొదలగు వారు దేవతలు. హర్యస్మదుడు, వీరకుడు మొదలగు వారు సప్తఋషులు. ఈ చాక్షుస మన్వంతరములో విష్ణువు తనఅంశతో అజితుడు అనే పేరుతో వైరాజ, దేవసంభూతి అనే దంపతులకు కుమారుడుగా జన్మించాడు. ఈ అజితుడే కూర్మరూపమును ధరించి, మంథరపర్వతమును తన వీపు మీద మోసి, క్షీరసాగరమును మథించి, దేవతల కొరకు అమృతమును సాధించాడు."అని శుక మహర్షి చెప్పాడు.

# అష్టమస్కంధము

అది విన్న పరీక్షిత్ మహారాజు ఇలా అడిగాడు. "శుకయోగీంద్రా! దేవదానవులు క్షీరసాగరమును మథించారు అన్నావు కదా! క్షీర సాగరమును ఎందుకు మథించారు. దేవతలు క్షీరసాగరమును మథిస్తుంటే విష్ణువు మంధర పర్వతమును ఎందుకు తన వీపు మీద మోసాడు. దేవతలకు అమృతము ఏ విధంగా లభించింది. క్షీర సాగరమును మథించినపుడు ఒక్క అమృతమే పుట్టిందా లేక ఇంకా ఇతరములైనవి పుట్టాయా! ఇదంతా వింటుంటే చాలా ఆశ్చర్యముగా ఉంది. నాకు వివరంగా తెలుపండి." అని అడిగాడు. అప్పుడు శుకయోగీంద్రులు ఈ విధంగా చెప్పసాగాడు.

"మహారాజా! ఒక సారి దేవతలకు అసురులకు ఘోరమైన యుద్ధము జరిగింది. ఆ యుద్ధములో దేవతలు దారుణంగా ఓడిపోయారు. చచ్చిన దేవతలు చావగా, మిగిలిన వారు  అసురులకు భయపడి పారిపోయారు. దుర్వాస మహాముని శాపము చేత ఇంద్రుడు స్వర్గసుఖములను కోల్పోయాడు. స్వర్గము కళావిహీనము అయింది.  యజ్ఞయాగములు జరగడం లేదు. అందువలన దేవతలకు హవిర్భాగములు దక్కడం లేదు. (ఇక్కడ మీకు ఒక సందేహము రావచ్చు. దుర్వాసుని శాపం ఏమిటి అని. ఆ విషయం వ్యాసమహర్షి ఇక్కడ రాయలేదు. కానీ దాని గురించి క్లుప్తంగా వివరిస్తాను. ఒక సారి దుర్వాసుడు ఇంద్రుని చూడటానికి వచ్చాడు. అప్పుడే ఇంద్రుడు తన ఐరావతము అనే ఏనుగును దిగి వస్తున్నాడు. దుర్వాసుడు తానుతెచ్చిన పూలమాలను ఇంద్రునికి ఇచ్చాడు. ఇంద్రుడు గర్వంతో ఆ పూలమాలను తనపక్కనే ఉన్న ఐరావతము అనే ఏనుగుకు అందించాడు. ఐరావతము ఆ పూలమాలను తన తొండంతో ఎత్తిపట్టుకొని కిందకు విసిరేసింది. అది చూచిన దుర్వాసునకుకోపం

మిన్నుముట్టింది. “ఐశ్వర్యమదంతో, స్వర్గాధిపతి అనే గర్వంతో నేను ఇచ్చిన పూలమాలను అవమానించినందుకు తొందరలోనే నీ ఐశ్వర్యము అంతా నశించి, స్వర్గాధిపత్యము నుండి తొలగింపబడతావు.” అని ఇంద్రుని శపించాడు. ఆ శాప మహిమ వలన ఇంద్రుడు అసురుల చేతిలో ఓడి పోయాడు.).

ఆ ప్రకారంగా పదవులు ఊడిన ఇంద్రుడు, వరుణుడు, ఇతర దేవతలు అందరూ కలిసి అసురులను ఎలాజయించాలా అని ఆలోచించారు. వారికి ఏ ఉపాయము తట్టలేదు. అందరూ కలిసి సుమేరు పర్వతము మీద ఉన్న బ్రహ్మదేవుని వద్దకు వెళ్లారు. దేవాసుర యుద్ధము గురించి అందులో తాము చిత్తుగా ఓడిపోవడం గురించి బ్రహ్మదేవునికి వివరించారు.

ఇంద్రుడు, దేవతలు చెప్పినది అంతా శ్రద్ధగా విన్న బ్రహ్మదేవుడు వారితో ఇలా అన్నాడు. “ఇందులో నేను చేయదగినది ఏమీ లేదు. నేను కేవలం సృష్టి కర్తను. ఈ జగత్తును పోషించే భారం విష్ణువుదే. రుద్రుడు కేవలం లయకారుడు. నేను, రుద్రుడు, మీరు, మీరు ఎవరిచేతిలో ఓడిపోయారో ఆ అసురులు, మూడులోకములలో ఉన్న చరాచర జీవరాసులు, ఇవి అన్నీ కూడా ఆ విష్ణువు యొక్క అంశలే. కాబట్టి మనం అందరం ఆ విష్ణువుయొక్క శరణు వేడుదాము.

విష్ణువుకు ఇష్టుడు, అయిష్టుడు, ఆదరింపతగినవాడు, ద్వేషింపతగినవాడు, పోనీలే అని ఉపేక్షింపదగినవాడు అంటూ ఎవరూ లేరు. ఆయనకు అందరూ సమానులే. ఆయన ఆయాకాలములలో సత్వ, రజస్తమోగుణములను ప్రకోపింపజేస్తుంటాడు. మీరు అసురులతో

యుద్ధం చేసినపుడు, అసురులకు సహజమైన రజస్తమోగుణములు ఉచ్ఛదశలో ఉన్నాయి. అందుకని వాళ్లు గెలిచారు. మీరు ఓడిపోయారు. ప్రస్తుతము విష్ణువు సత్వగుణమును ధరించి ఉన్నాడు. కాబట్టి మీకు మంచికాలము వచ్చింది. కాబట్టి మనం అందరం వెళ్లి ఆ విష్ణువును శరణుకోరుదాము. ఆయన మనకు శుభాలు కలుగజేస్తాడు." అని అన్నాడు. తరువాత అందరూ కలిసి అజితుడైన శ్రీమహావిష్ణువు వద్దకు వెళ్లారు.

బ్రహ్మదేవుడు శ్రీమహావిష్ణువును ఇలా స్తుతించాడు.

"ఓ దేవా! నీకు ఎటువంటి వికారములు లేవు. నీవు సత్యస్వరూపుడవు. ఆది అంతములు లేని వాడివి. అందరి కంటే ముందునుంచి ఉన్నవాడివి. సమస్తజీవరాసులలో ఆత్మస్వరూపుడుగా ఉన్న వాడివి. తర్కములకు అందని వాడివి. మనోవేగమును మించిన వేగము కలవాడివి. వాక్కుతో వర్ణింపనలవి కాని వాడివి. దేవతలు అందరి కంటేశ్రేష్టమైన వాడివి. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీవు ఆత్మస్వరూపుడవు. ప్రాణము, బుద్ధి, ఇంద్రియములు, పంచ తన్మాత్రలు వీటిని ఉపయోగించి నిన్ను తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తుంటాము. కానీ నిన్నుపూర్తిగా తెలుసుకోలేము. . నీవు జ్ఞాన స్వరూపుడవు నీకు కర్మలు చేయవలసిన అవసరం లేదు. కాని అన్ని కర్మలను చేస్తుంటావు. సాధారణ మానవులకు ఉన్న విద్య, అవిద్య అనేవి నీకు లేవు. నీవు నిత్యుడవు. అంతటా వ్యాపించి ఉన్నవాడివి. మూడు యుగములలో వివిధ

రూపములలో అవతరించి ధర్మమును స్థాపించిన వాడివి. అట్టి నిన్ను శరణువేడుతున్నాము.

ఓ దేవా! నీ చేత ప్రసాదింపబడిన ఈ శరీరము ఒక చక్రం లాంటిది. ఆ శరీరంలో ప్రధానము అయినది మనస్సు. దేహంలో పది ఇంద్రియములు, ఐదు ప్రాణములు (పాన, అపాన, వ్యాన, ఉదాన, సమాన)... ఈ పదిహేను ఆ చక్రమునకు ఆకుల వంటివి. సత్వ, రజస్, తమోగుణములు ఆ చక్రమునకు ఇరుసు వంటివి. పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము, అనే ఎనిమిది ఈ చక్రమునకు చుట్టు ఉన్న చట్రముల వంటివి. నీ మాయచేత ఈ చక్రము గిరా గిరా తిరుగుతూ ఉంది. దీని వేగము విద్యుత్ వేగముకంటే మించి ఉంది. ఈ చక్రమునకు మూలము నువ్వే. అట్టినిన్ను శరణు వేడుతున్నాము.

ఓ దేవా! నీవు కేవలం జ్ఞాన స్వరూపుడవు. ఈ ప్రకృతి కంటే భిన్నమైన వాడివి. మామూలు కళ్లకు కనపడని వాడివి. కనులచేత, వాక్కుచేత వ్యక్తము చేయబడని వాడివి. యోగమార్గము చేతనే తెలియబడేవాడివి. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీ మాయను తెలుసుకోవడం ఎవరి శక్యము కాదు. ఆ మాయ నీ అధీనంలో ఉంటుంది. నీ మాయను తెలుసుకోలేని వారు, ఆ మాయలో పడి కొట్టుకుంటూ ఉంటారు. నీ దృష్టిలో సకల జీవరాసులు సమానమే. ఎక్కువ తక్కువ అనే భేదము నీకు లేదు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నేను, ఈ దేవతలు, ఋషులు అందరూ నీ యొక్క సత్త్వగుణముచేత సృష్టింపబడ్డాము. కానీ నీ యొక్క  తత్వమును ఇప్పటి వరకు అర్థం చేసుకోలేకపోతున్నాము. ఇంక రజస్తమో గుణములతో పుట్టిన ఆ రాక్షసులు, అసురులు నిన్ను ఎలా అర్థం చేసుకోగలరు.

ఓ దేవా! ఈ భూమి నీ యొక్క పాదము. ఈ భూమి మీద సకల చరాచర జగత్తు, సకల జీవరాసులు అనగా గుడ్డునుండి పుట్టినవి, చెమట నుండి పుట్టినవి, భూమినుండి పుట్టినవి, ఇంకా శరీరము నుండి పుట్టినవి అయిన నాలుగురకముల జీవరాసులు నీచేత సృష్టింపబడ్డాయి. నీవు స్వతంత్రుడవు. బ్రహ్మస్వరూపుడవు. అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! ఈ మూడు లోకములు జలము నుండి ఉద్భవించాయి. ఆ జలములోనే జీవిస్తున్నాయి. వృద్ధిపొందుతున్నాయి. (మొట్ట మొదటి జీవి జలచరము. అదే మత్స్యావతారమునకు ప్రతీక) ఈ మూడులోకములకు మూలమైన జలము నీ యొక్క వీర్యశక్తి నుండి ఆవిర్భవించినది. అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! చంద్రుడు సకల జీవ రాసులకు ఆహారమును ప్రసాదిస్తున్నాడు. ఓషధులను, మొక్కలను, సస్యములను పెంపొందింపజేస్తున్నాడు. ఆ సోముడు అనగా చంద్రుడు నీకు మనస్సు.

(చంద్రమా మనసో జాత: ...పురుష సూక్తము) అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! నీవు అగ్నిస్వరూపుడవు. బయట అగ్ని రూపంలో ఉండి యజ్ఞయాగములలో హవిస్సులను స్వీకరించి దేవతలకు అందజేస్తుంటావు. అలాగే జీవుల ఉదరముల లోపల జఠర అగ్ని రూపంలో ఉండి ఈ జీవులు తినే ఆహారమును పచనం చేస్తున్నావు. ఆహారమును అన్ని అవయవములకు అందచేస్తున్నావు. అందుకే ఆ అగ్నియే నీ ముఖము అని అంటారు. అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! నీవు దేవయానమునకు అదిష్ఠాన దేవతవు. వేదమూర్తివి. బ్రహ్మ సదా నిన్ను ఉపాసిస్తుంటాడు. నీవు ముక్తికి ద్వారము వంటి వాడివి. అమృత స్వరూపుడవు. కాల స్వరూపుడవు. అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! వాయువు సకల ప్రాణులకు జీవనాధారము. సకల జీవ రాసులకు వాయువు తేజస్సు, బలము, ప్రాణము ప్రసాదిస్తుంది. అటువంటి వాయువు నీ యొక్క మహా ప్రాణము నుండి పుట్టింది. అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! నీయొక్క చెవుల నుండి దిక్కులు, నీ యొక్క నాభి నుండి ప్రాణములు, ఉప ప్రాణములు, ఇంద్రియములు, మనస్సు, ప్రాణ వాయువు, శరీరము, వీటన్నిటికి అవకాశము కల్పించే వాయువు పుట్టాయి. అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! నీ తేజస్సు నుండి మహేంద్రుడు, నీ ప్రసన్నత్వము నుండి దేవతలు, నీ కోపము నుండి శివుడు, నీ బుద్ధినుండి బ్రహ్మ, నీ దేహము నుండి వేదములు, ఋషులు, ప్రజాపతులు ఉద్భవించారు. అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! నీ వక్షస్థలము నుండి లక్ష్మీదేవి, నీ ఛాయ నుండి పితృదేవతలు, నీ స్తనముల నుండి ధర్మము, నీ వెనుక భాగము అంటే వీపు నుండి అధర్మము, నీ తల నుండి స్వర్గము, నీ యొక్క ఆటపాటలనుండి అప్సరసలు, పుట్టారు. అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!!

ఓ దేవా! నీ ముఖము నుండి బ్రాహ్మణుల వృత్తిధర్మమైన వేదాధ్యయనము, బాహువుల నుండి క్షత్రియుల బలపరాక్రమములు, ఊరువుల నుండి వైశ్యుల వృత్తిధర్మములు, కాళ్ల నుండి శూద్రుల వృత్తి ధర్మములు జన్మించాయి.

(బ్రాహ్మణోస్యముఖమాసీత్ బాహూ రాజన్యకృత:। ఊరూ తదస్యయద్వైశ్య: పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥(పురుష సూక్తం). అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! నీ కింది పెదవి నుండి లోభము, పై పెదవి నుండి ప్రీతి, ముక్కు నుండి కాంతి, నీ స్పర్శ నుండి కామసంబంధమైన కోరికలు (కేవలం స్పర్శతోనే అన్ని విషయవాంఛలు, ఇంద్రియ సుఖములు తీరతాయి కదా! ), రెండు కనుబొమల నుండి యముడు, కనురెప్పల నుండి కాలము జన్మించాయి. (కనురెప్పపాటు నుండి మనం కాలం లెక్కగడతాము. రెప్పపాటును క్షణంగా లెక్కిస్తాము.) అటువంటి మహావిభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

వస్తువులచేత, ద్రవ్యములచేత, పదార్థముల చేత, గుణముల చేత, కర్మల చేత నిండిన ఈ అనంత విశ్వము ఎవని యోగమాయ చేత సృష్టింపబడిందో అటువంటి మహా విభూతులు కలిగిన నీవు మాకు ప్రసన్నుడవు అగుదువు గాక!

ఓ దేవా! నీవు పైకి కనిపించని అనంత శక్తి సంపన్నుడవు, కాని ఈ శక్తుల యందు కానీ, సత్వ,రజస్తమోగుణముల యందు కానీ, నీకు ఏమాత్రం ఆసక్తి లేదు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! మేము నిన్ను శరణు కోరుతున్నాము. నీ దర్శనమును కోరుతున్నాము. నీవు మాకళ్ల ఎదుట ప్రత్యక్షం అయి మా

కోరికలు నెరవేర్చు.

ఓ దేవా! నీవు అవసరం వచ్చినప్పుడల్లా అవతరించి, మాకు కావాల్సిన పనులు చేసిపెడుతున్నావు. మానవులు ఎన్నో యజ్ఞయాగములు చేస్తుంటారు. అవి అన్నీ వాళ్లు ఏవేవో కోరికలతో చేస్తుంటారు. ఆ కర్మల వలన వారికి కష్టములు ఎక్కువ అవుతాయే కానీ సుఖములు కలుగవు. కాబట్టి వారు చేసిన కర్మలన్నీ మంచి ఫలితములను ఇవ్వవు. కాని మానవులు ఆయా కర్మల ఫలములను నీకు అర్పిస్తే వారు చేసిన ఏ చిన్న కర్మఅయినా (అల్పమైన యజ్ఞము, యాగము, వ్రతము ఏదైనా) అది వృధా కాదు.

మానవులు తాము చేసిన కర్మలను నీకు అర్పిస్తే, నీవు వారిని దయతో, ప్రేమతో కరుణిస్తావు. చెట్టు మొదట్లో నీరు పోస్తే ఆ నీరు చెట్టు అన్ని భాగములకు అంటే కొమ్మలకు, ఆకులకు, రెమ్మలకు చేరినట్టు, అలాగే పరమాత్మ స్వరూపమైన నిన్ను ఆరాధిస్తే, సకల దేవతలను ఆరాధించినట్టే అవుతుంది. ఓ అనంతా! సత్వగుణ సంపన్నా! నీకు ఇదే మా నమస్కారము." అని బ్రహ్మదేవుడు విష్ణుమూర్తిని ప్రార్థించాడు.

శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము

ఆరవ అధ్యాయము.

ఆ ప్రకారంగా దేవతలచేత స్తుతింపబడిన విష్ణువు వెయ్యి సూర్యుల కాంతివంటి కాంతితో బ్రహ్మదేవుడు ఇతర దేవతల ముందు ఆవిర్భవించాడు. (అంటే కాంతి రూపంలో దర్శనం ఇచ్చాడు అని అర్థం. ఎందుకంటే విష్ణువుకు రూపం లేదు. ఆకారం లేదు.)

ఆ తేజస్సును చూచి దేవతల కళ్లు బైర్లు కమ్మాయి. వారికి ఏమీ కనిపించడం లేదు. కాంతి స్వరూపుడైన ఆ విష్ణువును తేరిపారచూడలేకపోయారు. అప్పుడు విష్ణువు వారికి సాధారణ మానవాకృతిలో ఈ క్రింద వర్ణించిన రూపంలో దర్శనం ఇచ్చాడు.

ఆయన శరీరం శ్యామల వర్ణంలో ప్రకాశిస్తూ ఉంది. ఆయన నేత్రములు ఎర్రగా ఉన్నాయి. పచ్చని పట్టు వస్త్రము ధరించి ఉన్నాడు. ఆయన అవయవములు అందంగా మనోహరంగా ఉన్నాయి. ఆయన ముఖం ప్రసన్నంగా ఉంది. మణిమయ కిరీటముతో, కేయూరములతో, కుండలములతో, నడుము కట్టిన హారములతో, కౌస్తుభముతో, వక్షస్థలమున లక్ష్మితో, వనమాలతో, నాలుగు చేతులలో శంఖ,చక్ర,గదలతో, తమ ఎదురుగా ప్రత్యక్షం అయిన విష్ణుమూర్తిని చూచి బ్రహ్మదేవుడు, దేవతలు ఆయనకు సాష్టాంగ పడ్డారు. విష్ణువును ఈ విధంగా స్తుతించారు.

బ్రహ్మదేవుడు శ్రీమహావిష్ణువును ఇలా స్తుతించాడు. "ఓ దేవా! నీకు జన్మ లేదు, మరణము లేదు. ఈ ప్రకృతి గుణములు నీకు అంటవు. అందరికీ ముక్తి ప్రదాతవు. అణువులో అణువులాంటి వాడివి. నీ ప్రభావము అనంతము. అట్టి నీకు నమస్కారము.

నీ దయకు పాత్రుడైన వాడు నిన్ను వేదోక్తముగా పూజిస్తుంటాడు. ఈమూడులోకములు నీలోనే ఇమిడి ఉన్నాయి. నీలోనే మమ్ము మేము చూచుకుంటున్నాము.
(యశోదకు చిన్ని కృష్ణుడు తననోట్లో మూడు లోకములు చూపించినపుడు, ఆ లోకములలో యశోద కూడా కనపడిందట. అలాగే విష్ణువులో ఉన్న మూడు లోకములలో బ్రహ్మ, ఆయనతో పాటు ఉన్న దేవతా గణములు కూడా తమను తాము చూచేకుంటున్నారు అని భావము.)

ఓ దేవా! నీవు స్వతంత్రుడవు. ఆది, మధ్య, అంత రహితుడవు. కుండను చేసే ముందు అది మట్టి. కుండ చేసిన తరువాత కూడా కుండ రూపంలో మట్టి ఉంది. కుండ నాశనం అయిన తరువాత కూడా మట్టి మట్టిలో కలిసిపోతుంది. అలాగే ఈ విశ్వం పుట్టినప్పుడు, మధ్యలోనూ, అంత్యములోనూ, విశ్వము అంత్యము అయిన తరువాత కూడా నీవు నిలిచి ఉన్నావు. నీవు నిత్య సత్య స్వరూపుడవు.

ఓ దేవా! నీవు నీ మాయద్వారా ఈ విశ్వమును సృష్టించి, అందులో నీవు ప్రవేశించావు. అందువలన ఈ ప్రకృతిలో ఉన్న

సత్వ,రజస్తమోగుణములు నీలో ఉన్నట్టు మాకు కనిపించినా, యోగులైన వారికి నీవు ఏగుణములు అంటని వాడిగానే కనిపిస్తావు.

ఓ దేవా! కర్రను కర్రతో రాపిడి చేస్తే అగ్నిపుడుతుంది. గోవును పిండితే పాలు ఇస్తుంది. భూమిని దున్ని, సాగు చేస్తే ధాన్యము ఇస్తుంది. భూమిని లోతుగా తవ్వితే భూగర్భజలాలు లభిస్తాయి. మానవులు ఎంతో కష్టపడి, ఎన్నో పనులు చేసి ధనమును సంపాదిస్తారు. అలాగే యోగులు తమ బుద్ధి ద్వారా, జ్ఞానము ద్వారా ఎంతో కష్టపడి నిన్ను తెలుసుకుంటారు అనిపెద్దలు చెబుతారు.

ఓ దేవా! అమితమైన దాహముతో ఉన్న ఏనుగుకు గంగాజలము దొరికినట్టు, నీవుమామీద దయతో మాకు ప్రత్యక్షం అయ్యావు. మాకు నీవు ఈ రూపంలో దర్శనం ఇచ్చి మా చిరకాల కోరికను నెరవేర్చావు. మేము ఏ కోరికలతో నీ దగ్గరకు వచ్చామో నీకు తెలుసు. అఖిల లోక సాక్షివి. నీకు తెలియనిది ఏమున్నది. కాబట్టి మా కోరికలు నెరవేర్చు.

ఓ దేవా! నీవు అగ్ని వంటి వాడివి. నేను శివుడు, ఈ దేవతలు దక్షుడు మొదలగు ప్రజాపతులు, ఆ అగ్నిలో నుండి వెలువడే నిప్పురవ్వల వంటి వారము. అందువలన మాకు ఏం కావాలో మాకే సరిగా తెలియదు. కాబట్టి ఈ దేవతలకు ఏమి చేస్తే శుభం చేకూరుతుందో ఆ పని చెయ్యమని మాకు ఆజ్ఞ ఇవ్వు. నీవు చెప్పినట్టు మేము నడుచుకుంటాము."అని బ్రహ్మదేవుడు, దేవతలు విష్ణువును ప్రార్థించారు.

ఆ ప్రకారంగా బ్రహ్మ, ఇతర దేవతలచేత స్తుతించబడిన వాడై విష్ణు మూర్తి మేఘ గంభీరమైన స్వరంతో ఇలా అన్నాడు. (ఇందాక వేయి సూర్యకాంతులతో సమానమైన వెలుగుకనిపించింది. ఇప్పుడు మేఘ గర్జన వంటి స్వరం వినిపించింది. అంటే విష్ణువు సర్వవ్యాపి. కాంతి స్వరూపుడు. ఈ కిరీటాలు, శంఖచక్రాలు, మానవాకారము మనం కల్పించుకున్నది అని వ్యాసమహర్షి భావన.).

ఈ ప్రకారంగా బ్రహ్మ, శివుడు ఇతర దేవతా గణములతో స్తుతించ బడిన విష్ణువు మేఘగంభీరమైన వాక్కుతో ఇలా అన్నాడు.

“ఓ బ్రహ్మదేవా! మహాశివా! దేవతలారా! నేను మీ శ్రేయస్సుకోరేవాడిగా చెబుతున్నాను. నా మాటలను సావధానంగా వినండి. ప్రస్తుతము మీరు దానవుల చేతిలో ఓడి పోయారు. కాబట్టి మరలా మీరు మీ సైనిక బలమును, ఆయుధసంపత్తిని సమకూర్చుకొనేంతవరకు దానవులతో సంధిచేసుకోండి. అంతకు మించిన మార్గము మరొకటి లేదు. ఏదైనా కార్యము సిద్ధించాలంటే శత్రువుతో నైనా సంధి చేసుకోడానికి వెనుకాడకూడదు. బలము పుంజుకున్న తరువాత శత్రువు మీద దండెత్తి, పోరాడి, జయించవచ్చును.

ఎలాగంటే, ఒకపాముల వాడు ఒక బుట్టలో పాము పెట్టాడు. దానికి ఆహారంగా ఒక ఎలుకను వేసాడు. బుట్ట మూసి వేసాడు. ఆ పాము ఎలుకను తినలేదు. ఎలుకతో సంధి చేసుకొంది. “నేనునిన్ను తినను.నువ్వు ఈ బుట్టను కొరికి రంధ్రం చెయ్యి. ఇద్దరం

తప్పించుకుందాము." అని చెప్పింది. ఎలుక పాము మాటలు నమ్మి ఆ బుట్టకు రంధ్రం చేసింది. వెంటనే ఆ పాము ఎలుకను చంపి తినేసింది. తరువాత ఆ బుట్టలో నుంటి బయటకు వెళ్లిపోయింది. అదేమాదిరి ఇప్పుడు మీరు దానవులతోసంధి చేసుకొని, సమయం రాగానే వారిని మట్టుబెట్టండి

అదీ కాకుండా, ఓ దేవతలారా! ప్రస్తుతము మీకు అమృతము అవసరము. అమృతము తాగిన మానవులు కూడా మృత్యువు లేకుండా చిరకాలము జీవించగలరు. కాబట్టి మీరు ఆ అమృతమును సంపాదించడానికి ప్రయత్నించండి. అమృతము అంత సులభంగా లభించదు. మొక్కలను, గింజలను, తీగలను, ఓషధులను తెచ్చి క్షీరసాగరంలో వెయ్యండి. మంధర పర్వతమును కవ్వముగా చేసుకొని క్షీరసాగరమును చిలకండి. అప్పుడు మీకు అమృతము లభిస్తుంది. ఆ అమృతము పూర్తిగా మీకు దక్కేటట్టు, కేవలము కష్టము, శ్రమ మాత్రమే దానవులకు దక్కేటట్టు, నేను చేస్తాను.

దేవతలారా! కొన్ని కార్యములను సామోపాయముతో నెరవేర్చుకోవాలి. అన్ని కార్యములు కోపంతో, దండోపాయంతో నెరవేరవు. కాబట్టి మీరు అసురుల వద్దకు పోయి వారు పెట్టే నిబంధనలకు మీరు ఒప్పుకొని వారితో సంధిచేసుకోండి. అన్ని పనులు మొదలుపెట్టగానే సిద్ధించవు. మొదట కొంత అవరోధము ఎదురు అవుతుంది.

క్షీర సాగరము చిలికేటప్పుడు మొదట విషము పుట్టవచ్చు. మీరు భయపడవద్దు. ఆ తరువాత కొన్ని ఆకర్షణీయమైన వస్తువులు కూడా బయటకు రావచ్చు. ఆ వస్తువులు మిమ్ములను

ప్రలోభపెడతాయి. కాని వాటికి మీరు ఆశపడకండి. ఆ వస్తువులు మీకు లభించలేదని కోప పడకండి. అమృతము పుట్టేంతవరకు మీ ప్రయత్నమును ఆపకండి. మీకు శుభం కలుగుతుంది." అని పలికాడు.

అంతలోనే ఆ వాక్కు ఆగి పోయింది. భగవానుడు అదృశ్యుడయ్యాడు. వచ్చిన పని అయినందుకు బ్రహ్మ, శివుడు తమ తమ లోకములకు వెళ్లారు. అసురులతో సంధి చేసుకోడానికి దేవతలు, ఇంద్రుడు దానవ చక్రవర్తి అయిన బలి చక్రవర్తి వద్దకు వెళ్లారు.

దేవతలందరూ కట్టకట్టుకొని రావడం చూచి బలి చక్రవర్తి సైనికులు వారిని చంపబోయారు. కాని సంధి కోరి వస్తున్న వారిని చంపడం న్యాయం కాదని, సైనికులను వారించాడు. దేవతల అందరి బదులుగా ఇంద్రుడు బలి చక్రవర్తితో మాట్టాడాడు. విష్ణుమూర్తి ఏ విధంగా సంధి చేసుకోమన్నాడో అవే మాటలను అసురులకు ప్రీతి కలిగేటట్టు మాట్లాడాడు.

"అయిపోయింది ఏదో అయిపోయింది. ఇప్పటి దాకా మనం ఒకరితో ఒకరం వైరంగా ఉన్నాము. ఇంక మీదట సఖ్యంగా ఉందాము. అందరం కలిసి క్షీరసాగరమును మథించి అమృతమును సాధిద్దాము. ఆ అమృతాన్ని అందరం సమానంగా పంచుకుందాము. అందరం అమరులము అవుదాము. దీనికి మనకు శ్రీహరి సహాయం కూడా ఉంటుంది." అంటూ యుక్తియుక్తంగా చెప్పాడు ఇంద్రుడు.

ఇంద్రుడు మాట్లాడిన మాటలు తియ్యటి మాటలు అసురులకు తృప్తి కలిగించాయి. అసురులు కూడా అమృతము కొరకు క్షీరసాగర మధనము చేయడానికి సిద్ధపడ్డారు. ఇంక ఆలస్యం ఎందుకని, దేవతలు, దానవులు అమితోత్సాహంతో మంధర పర్వతము వద్దకు వెళ్లారు. మంధర పర్వతమును సమూలంగా పెకలించారు. అరుచుకుంటూ, కేకలు వేసుకుంటూ ఆమంధర పర్వతమును క్షీరసాగరము వద్దకు మోసుకొని పోయారు. కాని మార్గ మధ్యం లోనే వారికి అలసట వచ్చింది. అంత బరువును మోయలేక దేవతలు దానవులు మధ్యలోనే మంధర పర్వతమును కిందపడేసారు. ఆ మంధర పర్వతము కింద పడి కొంత మంది దేవతలు దానవులు నజ్జు నజ్జు అయ్యారు.  ఈపని మన వల్ల కాదులే అని నిరుత్సాహపడ్డారు.

ఇదంతా చూచిన విష్ణు మూర్తి తనే స్వయంగా అక్కడికి వచ్చాడు. కాళ్లు చేతులు విరిగిన వాళ్లను, గాయాలు తగిలిన వాళ్లను చూచాడు. శ్రీహరి చల్లటి చూపుతో వారందరూ సంపూర్ణ ఆరోగ్యవంతులు అయ్యారు. తరువాత శ్రీహరి ఆ మంధర పర్వతమును ఒక చేత్తో ఎత్తి గరుడుని వీపు మీద పెట్టాడు. గరుడుడు మంధర పర్వతమును అనాయాసంగా మోసుకొని పోయి క్షీరసాగరం దగ్గర దింపి వెళ్లిపోయాడు.

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
అష్టమ స్కంధము
ఏడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు దేవతలు దానవుల చేత జరుపబడిన క్షీరసాగర మధనం గురించి  ఈ విధంగా చెప్పసాగాడు.

" ఓ పరీక్షిత్ మహారాజా! తరువాత దేవతలు దానవులు నాగరాజు వాసుకి వద్దకు పోయి క్షీరసాగర మధనంలో ఆయన సాయం కోరారు. ముందు వాసుకి ఒప్పుకోలేదు. ఆయనకు కూడా అమృతంలో భాగం ఇస్తాను అనడంతో, వాసుకి ఒప్పుకున్నాడు. వాసుకిని తాడుగా చేసుకుని, మంధర పర్వతము చుట్టు వాసుకిని చుట్టి, క్షీరసాగరాన్ని మథించడానికి మొదలు పెట్టారు.

వాసుకి యొక్క తలభాగము విష్ణువు, దేవతలు పట్టుకున్నారు. తోక భాగమును  రాక్షసులు పట్టుకున్నారు. కాని అది రాక్షసులకు అవమానంగా తోచింది. "మేము కూడా వేదములు, శాస్త్రములు చదువుకున్నాము. మేము కూడా మా జన్మలను బట్టి, మేము చేసే కర్మలను బట్టి ప్రఖ్యాతి చెందిన వారమే. అటువంటి మేము ఒక పాము తోక మేము పట్టుకోవాలా.  మాకు ఇష్టంలేదు. మేము అంగీకరించము." అని దైత్యసేనాధి పతులు, అసురులు, రాక్షసులు ఒప్పుకోలేదు.

(దానవులు, అసురులు,రాక్షసులు అంటే మన సినిమాలలో చూపించినట్టు కోరలు, కొమ్ములు, చింపిరిజుట్టు వికృతంగా ఉన్నవారు కాదు. వారు కూడా మనలాంటి మానవులే. కాని వారి ప్రవృత్తి దానవ ప్రవృత్తి, అసుర ప్రవృత్తి కాబట్టి వారిని దానవులు, అసురులు అన్నారు. వారిలో కూడా విద్వాంసులు, వేదవేదాంగ పారంగతులు ఉన్నారు అని ఇక్కడ స్పష్టంగా చెప్పాడు వేదవ్యాసుడు.)

ఈ సంగతి తెలిసిన విష్ణుమూర్తి వారిని సమాధానపరిచాడు. మీరుకోరినట్టే కానివ్వమన్నాడు. వాసుకి తలవైపు భాగమును అసురులకు వదిలిపెట్టి, దేవతలను వాసుకి తోకభాగము పట్టుకోమన్నాడు. ఈ ప్రకారంగా అసురులు నాగరాజు వాసుకి తలభాగము, దేవతలు తోకభాగము పట్టుకొని మంథర పర్వతమును కవ్వంగా చేసుకొని క్షీరసాగరమును మథిస్తున్నారు. ఈ కార్యక్రమాన్ని శ్రీమహావిష్ణువు దగ్గర ఉండి జరిపిస్తున్నాడు.

కొంచెం సేపు అయిన తరువాత, మంథర పర్వతము బరువు కావడంతో, పర్వతము కింద ఏమీ ఆధారము లేకపోవడంతో, మంథర పర్వతము క్షీరసాగరంలో మునిగిపోసాగింది. ఇది చూచిన దేవతలు, దానవులు ఆ మంథరపర్వతమును గట్టిగా పట్టుకున్నారు. మునగ కుండా ఆపడానికి ఎంతో ప్రయత్నించారు. కాని మంథర పర్వతము బరువును ఆపలేకపోయారు.

మంథరపర్వతము క్షీరసాగరంలో మునిగి పోయింది. ఇది చూచి దేవతలు దానవులు ఎంతో దు:ఖించారు. ఏం చెయ్యాలో తోచక దేవతలు దానవులు శ్రీహరి వంక చూచారు. శ్రీహరి చిరునవ్వు

నవ్వాడు. తాను ఒక తాబేలుగా మారి పోయాడు. క్షీర సాగరంలో దిగాడు. మంథర పర్వతము కింద ఎంత వైశాల్యము ఉందో అంతమేరా తన తాబేలు శరీరమును విస్తరించాడు. ఇప్పుడు మంథర పర్వతము శ్రీహరి అవతరించిన తాబేలు డిప్ప మీద నిలబడి ఉంది. ఆ తాబేలు డిప్ప ఒక ద్వీపంలా ఉంది. ఆ ద్వీపం మీద పర్వతం లాగా మంథర పర్వతము నిలబడి ఉంది.

క్షీరసాగరంలో నుండి మంథర పర్వతము బయటపడి తేలడం చూచి దేవతలు దానవులు ఎంతో సంతోష పడ్డారు. మరలా వాసుకిని పట్టుకొని చిలకడం మొదలు పెట్టారు. కాని మాటి మాటికీ అలసి పోతున్నారు. వాసుకి కూడా ఆ ఒరపిడికి తట్టుకోలేక ముఖం నుండి కళ్ల నుండి అగ్ని నిట్టూర్పుల రూపంలో బయటకు వస్తూ ఉంది. ఆ అగ్ని కీలలకు తట్టుకోలేక తల వైపు పట్టుకున్న దానవులు మూర్ఛపోతున్నారు. వాసుకి ముఖం నుండి వెలువడుతున్న అగ్ని కీలలు దేవతలను కూడా చుట్టు ముట్టాయి.

ఇది చూచిన శ్రీహరి మేఘములను పురికొల్పి వర్షమును కురిపించాడు. ఆ వర్షపు ధారలలో దేవతలు దానవులు సేదదీరారు. ఇంతలో వాయుదేవుడు చల్లగా గాలివీస్తున్నాడు. ఇప్పుడు శ్రీహరి అసుర ప్రవృత్తి రూపంలో దానవులలోనూ. అమితమైన ఉత్సాహము రూపంలో దేవతలలోనూ, నిద్రావస్థరూపంలో (అనగా అనస్తీషియా అనుకోవచ్చు) వాసుకిలోనూ ప్రవేశించాడు. అప్పుడు నిద్రావస్థలో ఉన్న వాసుకికి ఏ బాధా తెలియడం లేదు. ఇప్పుడు రెట్టించిన ఉత్సాహంతో దేవతలు, దానవులు క్షీరసాగరాన్ని మధనం చేస్తున్నారు.

దేవతలు దానవులు మంథర పర్వతము వేగంగా తిప్పుతూ ఉంటే, ఆ వేగానికి మంథర పర్వతముపైపైకి లేవసాగింది. ఇది గమనించిన విష్ణువు తన చేతులుపైకెత్తి ఆ మంథర పర్వతమును పైకి లేవకుండా గట్టిగా పట్టుకున్నాడు. ఇప్పుడు మంథరపర్వతము కుదురుగా తిరుగుతూ ఉంది.

ఇప్పుడు సర్వవ్యాపి అయిన విష్ణువు దేవతలోనూ, దానవులలోనూ, వాసుకిలోనూ, మంథర పర్వతము కిందా, మంథర పర్వతము పైనా, అన్నింటా తానే అయి ఉన్నాడు.

దేవతలు, దానవులు ఎంత చిలికినా అమృతము ఉద్భవించలేదు. ఇలా కాదని సాక్షాత్తు విష్ణు మూర్తి స్వయంగా కల్పించుకున్నాడు. మేఘ వర్ణంతో, పీతాంబరధారియై, చెవులకు కుండలములతో, మెడలో వనమాలతో, ఎర్రటికళ్లతో, పొడుగాటి చేతులతో దేవదానవుల ముందు సాక్షాత్కరించాడు. తానుకూడా దేవతలతో పాటు వాసుకి తోకభాగమును పట్టుకొని చిలుకుతున్నాడు. ఇది చూచిన దేవతలు దానవులు రెట్టించిన ఉత్సాహంతో మరింత వేగంగా వాసుకిని తిప్పుతున్నారు.

ఆ ప్రకారంగా మథింపబడుతున్న క్షీరసాగరము నుండి మొట్ట మొదట హాలాహలము అనే ఘోరమైన విషము పుట్టింది. ఆ విషము లోకమంతా వ్యాపించింది. అమృతం కోసరం పోతే విషం ఎదురైందని వ్యాకులపాటు చెందారు దేవతలు, దానవులు. భయంకరమైన ఆ హాలాహలం మూడులోకములలో వ్యాపిస్తూ ఉంది. హాలాహలము యొక్క తీవ్రతను తట్టుకోలేక దేవతలు, దానవులు, ప్రజాపతులతో సహా

అందరూ లయకారకుడైన పరమశివుని వద్దకు పోయి శరణు వేడారు. ఆ సమయంలో పరమ శివుడు తన భార్య ఉమాదేవితో కలిసి కైలాసంలో కూర్చుని ఉన్నాడు. పరమశివుని ప్రజాపతులు ఇలా ప్రార్థించారు.

(ఈ ప్రార్థనలో మీరు ఒకటి గమనించండి. విష్ణువును ఏ యే గుణాలతో ప్రార్థించారో, శివుని కూడా అవే గుణములతో స్తోత్రము చేసారు. అంటే శివకేశవులకు భేదము లేదు. ఇద్దరూ ఒకటే అనే భావన.)

ఓ దేవదేవా!మహాదేవా! నీవు సర్వభూతములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. నీకు తెలియనిది ఏమీ లేదు. విష్ణుమూర్తి ఆదేశము ప్రకారము దేవతలు, దానవులు అమృతము కోసరం క్షీరసాగరమును మథిస్తుంటే, హాలాహలము పుట్టింది. ఈ హాలాహలము మూడు లోకములను దహించేస్తూ ఉంది. దీని బారి నుండి మా అందరినీ రక్షించు.

ఈ జగత్తులోని అందరి దు:ఖములను నీవు పోగొడతావనీ, అందరికీ మోక్షమును ఇస్తావని పండితులు అంటారు. ఓ దేవా! నీవు సత్తగుణ ప్రధానుడవు. నీ లోనుండి ఈ మాయ పుట్టింది. ఆ మాయచేతనే సృష్టిచేసేటప్పుడు బ్రహ్మగాను, పోషించేటప్పుడు విష్ణువుగానూ, లయం చేసేటప్పుడు శివుడుగానూ ప్రకటితమౌతున్నావు. నీవే పరబ్రహ్మవు. కారణము, కార్యము నీవే. నీలో వివిధములైన ఐశ్వర్యములు, శక్తులు ఉన్నాయి. ఈ జగత్తు అంతా నీవే నిండి ఉన్నావు.

ఓ దేవా! వేదములు నీలో నుండి ఉద్భవించాయి. జగత్తులో ఉన్న మహత్తత్వము, ప్రాణశక్తి, క్రియాశక్తి, ఇంద్రియశక్తి, ద్రవ్యములు, స్వభావశక్తి, అహంకారము, కాలము, సంకల్పము, ఋతము, సత్యము, ధర్మము అన్నీ నీవే. ఓంకారమునకు ఆశ్రయుడవు నీవే.

ఓ దేవా! అగ్ని నీకు ముఖమనీ, భూమి నీకు పాదమనీ, కాలము నీ గమనశక్తి అనీ, దిక్కులు నీ చెవులనీ, వరుణుడు నీ నాలుక అనీ, ఆకాశము నీ నాభి అనీ, వాయువు నీ ఉచ్ఛ్వాస నిశ్వాసములు అనీ, సూర్యుడు నీ కళ్లు అనీ, జలము నీ రేతస్సు అనీ, సకల జీవులునిన్ను ఆశ్రయించి ఉండటం నీ అహంకారమనీ, చంద్రుడు నీ మనస్సు అనీ, స్వర్గము నీ తల అనీ పండితులు అంటారు. (బ్రహ్మ కూడా విష్ణువును ఇదే విధంగా స్తోత్రము చేసాడని మనం చదువుకున్నాము.)

ఓ దేవా! ఏడు సముద్రములు నీ పొట్టలో ఉన్నాయనీ, పర్వతములు నీ ఎముకలు అనీ, ఓషధులు నీ శరీరముమీద ఉన్న వెంట్రుకలు అనీ, గాయత్రి మొదలగు ఏడు ఛందస్సులు నీలో ఉన్న ఏడు ధాతువులు అనీ, వేదములో చెప్పబడిన ధర్మములు అన్నీ నీ హృదములో ఉన్నాయనీ పండితులు అంటారు.

ఓ దేవా! పంచఉపనిషత్తులే నీ ముఖము.(పంచ ఉ పనిషత్తులు అంటే తత్పురుషాయ, సద్యోజాతం, అఘోర, వామదేవ, ఈశాన ఈ పదములతో మొదలయ్యేవి. ఈ పంచ ఉపనిషత్తుల నుండి ముప్పది ఎనిమిది మంత్రములు ఉద్భవించాయి.)

ఓ దేవా! నీవు స్వయం ప్రకాశకుడవు. నీ తత్వమును శివ తత్వము అని పిలుస్తారు. నీ నీడ అధర్మము. సత్వ, రజస్, తమోగుణములు నీ మూడు కళ్లు. ఈ వేదములు శాస్త్రములు ఎవరి నుండి పుట్టాయో ఆ ఋషులే నీ చూపులు.

ఓ దేవా! సత్వ, రజస్, తమోగుణములు, ప్రాపంచిక విషయములు నిన్ను అంటవు. నీకు దేవతలు, దానవులు, మనుషులు, జంతువులు అనే భేదము లేదు. అందరూ నీకు సమానులే. నీవు పరబ్రహ్మ స్వరూపుడవు. నీవు జ్యోతిస్వరూపుడవు. నీ గురించి లోకపాలకులైన బ్రహ్మవిష్ణు దేవేంద్రులకు కూడా అర్థం కాదు. . ప్రళయ కాలంలో నీ మూడవ నేత్రముతో ఈ విశ్వము అంతా భస్మము అయి పోతుంది. కానీ దాని గూర్చి నీవు ఆలోచించవు. లయ కార్యము యాదాలాపంగా జరిగిపోతూ ఉంటుంది.

నీవు మన్మధుని దహించావు, దక్షయజ్ఞమును ధ్వసము చేయించావు, త్రిపురాసురులను సంహరించావు. అని పండితులు స్తుతిస్తుంటారు. ఇప్పుడు ఈ హాలాహలము బారి నుండి మమ్ములను కాపాడు.

ఓ దేవా! ఆత్మ తత్వమును తెలిసిన వారు, లోకహితమును ఎల్లప్పుడూ కోరుకునేవారు, నీ పాదములను తమ హృదయములలో నిలుపుకొని ధ్యానిస్తూ ఉంటారు. ఓ దేవా! నీవుఎప్పుడూ ఉగ్రమైన తపస్సు చేస్తుంటావు. నీ భార్య అయిన ఉమా దేవిని సగభాగంగా అంటి పెట్టుకొని ఉంటావు.(అర్ధనారీశ్వరుడు) అందుకని నిన్ను స్త్రీలోలుడవనీ,

ఎప్పుడూ శ్మశానములలో తిరుగుతుంటావనీ, భయంకరుడవనీ, మూర్ఖులైన మానవులు అనుకుంటూ ఉంటారు. కాని, సామాన్య మానవులకు నీ లీలలు అర్థం కావు కదా! సామాన్య మానవులే కాదు బ్రహ్మ మొదలగు దేవతలుకూడా నీ యదార్థతత్వమును తెలుసుకోలేరు. అందువలన బ్రహ్మాది దేవతలు కూడానిన్ను స్తోత్రము చేయలేరు.

ఓ దేవా! మేము కూడా ఆ బ్రహ్మచేత సృష్టించబడిన వారమే కదా! కాని మా శక్తికొద్దీ నిన్ను స్తుతించాము. నీవు ఎలా ఉంటావో నీ రూపం ఎలా ఉంటుందో మాకు తెలియదు. నీవు చేసే కర్మలు కూడా మాకు తెలియవు. కాని నీవు లోకసుఖము కొరకే అన్ని కర్మలు చేస్తుంటావు అని తెలుసు."అని ఊరుకున్నారు.

ప్రజాపతులు ఎందుకు వచ్చారో, ఎందుకు తనను పరమాత్మ స్వరూపుడుగా స్తుతించారో అర్థం చేసుకున్నాడు మహేశ్వరుడు. పక్కనే ఉన్న పార్వతి వంక చూచి ఇలా అన్నాడు.

"దేవీ! దేవతలు దానవులు అమృతం కోసరం క్షీరసాగరమును మథిస్తున్నారు. కాని క్షీరసాగరంలో నుండి అమృతానికి మారుగా హాలాహలము అనే విషం పుట్టింది. ఆ విషం వలన లోకాలన్నీ భయభ్రాంతమవుతున్నాయి. మూడు లోకములలో ఉన్న వారి భయాన్ని పోగొట్టడమే కదా నా కర్తవ్యము. ప్రజల దు:ఖము పోగొట్టడమే కదా ప్రభువు విధి.

దేవీ! సాధారణంగా మానవులు తమ స్వార్థమును తాము చూచుకుంటారు. తమ దేహ సుఖమునకే ప్రాధాన్యం ఇస్తారు. కాని

లోకహితమును కోరే సాధువులు తమ ప్రాణములను సైతం లెక్కచేయక, ఇతరులకు సాయపడుతుంటారు. ఇతరుల ప్రాణములను రక్షిస్తుంటారు. అటువంటి సాధు పురుషులకు లోకపాలకుడైన శ్రీహరి కూడా ప్రసన్నుడవుతాడు. శ్రీహరి ప్రసన్నుడయితే నేను కూడా ఆ సాధుజనుల పట్ల ప్రసన్నుడ నవుతాను.

ఇప్పుడు మూడులోకములలో  ఉన్న సాధుజనులను కాపాడటానికి నేను ఈ హాలాహలమును సేవించవలసి ఉంది. దీని వలన సకల జనులకు శుభం కలుగుతుంది." అని నీవేమంటావు అనే భావనతో పార్వతి వంక చూచాడు.

పరమశివుని మనసులో ఉన్న భావాలను గ్రహించిన పార్వతి పరమశివునితో హాలాహలమును పానము చేయమని తన అంగీకారము తెలిపింది.
(అని వ్యాస మహర్షిరాసాడు. కానీ ఈ సందర్భంలో పోతన గారు ఒక మహత్తరమైన పద్యం రాసారు.)

క॥ మ్రింగెడువాడు విభుండని మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో!

మింగబోయేది విషం అనీ,  మ్రింగుతున్న వాడు సాక్షాత్తు తన భర్త అనీ, అదీతన కోసం కాదు. ప్రజలకోసరం మ్రింగుతున్నాడు అనీ,  ఇన్ని తెలిసి కూడా మూడులోకములను అల్లకల్లోలం చేస్తున్న హాలాహలమును మ్రింగమని తన భర్తకు చెప్పింది పార్వతి. ఆ

మహాతల్లి, ఆ మహాసాధ్వి తన మంగళ సూత్రము గట్టిగా ఉంటుందనీ, తన మాంగల్యానికి, తన ముత్తయిదువ తనానికి ఏ మాత్రం భయం లేదనీ, ఎంతగా నమ్మిందో కదా!
(అజరామరమైన ఇటువంటి పద్యం రాసినందుకు, ఈ పద్యంలో ఇంతటి గంభీరమైన భావాన్ని పొందుపరచినందుకు, పోతన గారికి మనందరం పాదాభివందనములు చేద్దాం.

కొంతమంది కుతర్క వాదులు పార్వతి మెడలో శివుడు మంగళ సూత్రం కట్టాడా, పార్వతి మెడలో అసలు మంగళ సూత్రం ఉందా అని వాదిస్తుంటారు. దానికి ఒకటే సమాధానం. రాసిన వాడు పోతన మన తెలుగువాడు. తెలుగునాట వివాహ సమయంలో మంగళ సూత్రధారణ ఎంతో ప్రాధాన్యత సంతరించుకుంది. అందుకని పోతన గారు పార్వతీదేవిని మన తెలుగు తల్లిగా ఊహించుకున్నాడు. ఇందులో తప్పేముంది.)

భార్య అనుమతి లభించింది. ఇంక పరమశివుడు విజృంభించాడు. హాలాహలమును తన అరిచేతిలోనికి తీసుకున్నాడు. గుట్టుక్కున మింగాడు. కాని అంది గొంతు దిగలేదు. గొంతులోనే ఉండిపోయింది. ఆ విషం ప్రభావం చేత పరమశివుని గొంతు నల్లగా మాడి పోయింది. అప్పటి నుండి పరమశివుడు నీలకంఠుడు, గరళకంఠుడు అని సార్ధకనామధేయు డయ్యాడు.

ఈ విషయం తెలిసిన మహావిష్ణువు ఎంతోసంతోషించాడు. పరమశివుడు విషాన్ని పానంచేసేటప్పుడు కొన్ని విషపు చుక్కలు ఆయన వేలి సందుల్లో నుండి జారి భూమీ మీద పడ్డాయి. వాటిని పాములు,

తేళ్లు, విషపూరితమైన మొక్కలు, తమ ఆత్మరక్షణార్ధము స్వీకరించాయి.

(అవే కాదు, ఆ విషపు చుక్కలు కొంతమంది మానవుల హృదయాలలో కూడా పడినట్టున్నాయి.అందుకే కొంతమంది దుర్మార్గులైన మానవుల హృదయములే కాదు, శరీరము అంతా విషమయం అయింది. విషజంతువులు తమ ఆత్మరక్షణ కొరకుమాత్రమే తమ వద్ద ఉన్న విషాన్ని వినియోగిస్తాయి. ఆ విషయం వాటికి కూడా తెలియదు.కానీ మానవులు తమ మనసులో ఉన్న విషాన్ని సాటి మానవుల మీద కావాలని, బుద్ధి పూర్వకంగా చిలకరించి ఆనందిస్తుంటారు.)

శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము
ఎనిమిదవ అధ్యాయము.

శుక మహర్షి క్షీరసాగర మధనం గురించి పరీక్షిత్ మహారాజుకు ఇలాచెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! క్షీరసాగరమధనంలో మొదట హాలాహలం పుట్టింది. దానిని పరమశివుడు స్వీకరించాడు అని

చెప్పానుకదా. తరువాత రెట్టించిన ఉత్సాహంతో దేవ దానవులు క్షీరసాగరమును మథించసాగారు.

ఆ మథనం ఫలితంగా సురభి అనే ఆవు ఉద్భవించింది. ఆ గోవునుంచి వచ్చే పాలు, ఇతర పదార్థములు తమకు యజ్ఞయాగములలో, అగ్నిహోత్రములలో అవసరము అని తలంచిన ఋషులు తమ యజ్ఞయాగములకు ఉపయోగపడుతుందని తలంచి, ఆ సురభిని ఆనందంగా స్వీకరించారు.

తరువాత ఒక తెల్లటి గుర్రము ఉద్భవించింది. దాని పేరు ఉచ్ఛైశ్రవము. దానిని చూచి ఇంద్రుడు ఆ గుర్రమును తీసుకోడానికి ముందుకు వచ్చాడు. కానీ విష్ణువు వద్దని సైగ చేసాడు. అప్పుడు బలి చక్రవర్తి దానిని స్వీకరించాడు.

తరువాత ఒక తెల్లటి ఏనుగు ఉద్భవించింది. దాని పేరు ఐరావతము. ఆ ఐరావతమును ఇంద్రుడు స్వీకరించాడు.

తరువాత క్షీరసాగరము నుండి కౌస్తుభము అనే ఎరుపు రంగులో ఉన్న మణి ఆవిర్భవించింది. శ్రీమహావిష్ణువు తన హృదయస్థానములో అలంకరించుకోడానికి ఆ కౌస్తుభ మణిని స్వీకరించాడు.

తరువాత పారిజాత వృక్షము ఆవిర్భవించింది. దానిని దేవతల వృక్షంగా భావించి దేవతలు స్వీకరించారు.

తరువాత అప్సరసలు ఉద్భవించారు. అందమైన ఆ అప్సరసలు స్వర్గమునకు వచ్చు వారికి తమ ఒంపు సొంపులతో ఆనందం కలుగచేయడానికి స్వర్గం చేరుకున్నారు.

తరువాత మెరుపు తీగ దిగివచ్చిందా అన్నట్టు శ్రీమహాలక్ష్మి ఉద్భవించింది. ఆమె యొక్క రూపము, సౌందర్యము, ఉదారత్వము, దయా గుణము, మహిమనుచూచి అందరూ ఆమె పట్ల ఆకర్షితులయ్యారు. ఆమె రావడం చూచిన  ఇంద్రుడు ఒక సింహాసనమును సిద్ధం చేసాడు. గంగ మొదలగు నదులు మానవ స్త్రీలరూపములు దాల్చి బంగారు కలశములలో పవిత్రజలములనుసిద్ధం చేసాయి. భూదేవి కూడా స్త్రీరూపము దాల్చి అబిషేకమునకు కావాల్సిన ఔషధములు, గోవులు, వసంత ఋతువులో పుష్పించే పుష్పములు, ఫలములను సిద్ధంగా ఉంచింది.

ఋషులందరూ కలిసి వారు తెచ్చిన పుణ్యనదీ జలములతో శ్రీమహాలక్ష్మికి అభిషేకం చేయడానికి సిద్ధంగా ఉన్నారు.. గంధర్వులు మధురంగా గానం చేసారు. అప్సరసలు  నృత్యం చేసారు. మేఘములు వివిధములైన వాద్యములను మోగించాయి. బ్రాహ్మణులు వేద మంత్రములు చదువుతూ ఉంటే ఐరావతము మొదలగు దిగ్గజములు ఆ పుణ్యజలములను శ్రీలక్ష్మి తల మీద అభిషేకించాయి. సముద్రుడు పచ్చని పట్టువస్త్రములను అమ్మవారికి బహూకరించాడు. వరుణుడు వైజయంతీ మాలను సమర్పించాడు. విశ్వకర్మ అమ్మవారికి చిత్రవిచిత్రములైన ఆభరణములను సమర్పించాడు. సరస్వతీ దేవి ఒక హారమును ఇచ్చింది. బ్రహ్మదేవుడు పద్మమును కానుకగా ఇచ్చాడు. నాగదేవతలు కర్ణాభరణములను సమర్పించుకున్నారు.

తరువాత లక్ష్మిదేవి తన ఆసనము మీది నుండి లేచింది. తనకు తగిన పురుషుడు, తనను స్వీకరించడానికి అర్హుడైన పురుషుడు  ఎవరా అని చుట్టు చూచింది. అక్కడ ఉన్న గంధర్వులు, యక్షులు, అసురులు, దేవతలు, సిద్ధులు, చారణులు, వీరెవ్వరూ ఆమెను స్వీకరించడానికి అర్హులుగా ఆమెకు అనిపించలేదు.

సాక్షాత్తు లక్ష్మిని స్వీకరించడానికి మంచి గుణములు కలవాడు, ఎటువంటి చెడ్డ గుణములకు ఆకర్షితుడు కాని వాడు, పరమ పవిత్రంగా ఉన్న వాడు కావాలి.  గొప్ప తపస్సు చేసినవారు మహాఋషులు, మునులు ఉన్నారు కానీ, వారు  కోపమును జయించలేకపోయారు. జ్ఞానము కలవారు తాము చేసిన కర్మలకు ఫలములను కోరుకుంటారు. వారిలో ప్రతిఫలాపేక్ష నశించలేదు. మరి కొందరు గొప్పవారైనా వారు కామమును జయించలేదు. కామానికి వశులైన వారు లక్ష్మిని స్వీకరించడానికి అర్హులు కారు.  మరి కొందరికి ఎంతటి ఐశ్వర్యము ఉన్నా ఇతరుల ఐశ్వర్యములను చూచి ఓర్వలేరు. (ఉదా: ఇంద్రుడు). తమకు ఇంకా కావాలనే లోభత్వంలో మునిగి ఉంటారు.  కాబట్టి వీరెవ్వరూ లక్ష్మిని గ్రహించడానికి అర్హులు కారు.

ఇంకా కొంత మంది ధర్మపరులే కానీ వారిలో దయాగుణము లేదు. కొందరికి త్యాగబుద్ధి ఉన్నది కానీ  ముక్తి పొందడానికి అది ఒక్కటే చాలదు కదా! కొందరిలో అమితమైన పరాక్రమము ఉంది కానీ, వారు కాలమును జయించలేరు. కాలధర్మం చెందేవారు లక్ష్మీదేవిని ఎలా పొందగలరు. కొంతమందికి  ప్రాపంచిక విషయముల మీద మోహము లేనప్పటికినీ, వారి మనసులు నిష్కల్మషములు కావు. కొందరికి చావులేకుండా  చిరంజీవిగా బతికే

అర్హత ఉంది కానీ, వారు శీలవంతులు కారు. కొందరిలో శీలము ఉన్నా, వారు భయం భయంగా బతుకుతుంటారు. మరి కొందరు చిరాయువులు, శీలవంతులే కానీ వారు చేసే పనులు అన్నీ అశు భాలను సూచిస్తుంటాయి.

అందరిలోనూ ఏదో ఒక లోపం కనిపించింది లక్ష్మీదేవికి. అందుకని, ఏ లోపమూ లేని వాడు, సత్వగుణ సంపన్నుడు, దేనికీ ఆశపడని వాడు, ప్రాపంచిక విషయములకు అతీతంగా ఉండేవాడు, అణిమాది అష్టసిద్ధులు కలవాడు, అందరినీ సమానంగా చూచేవాడు, అయిన శ్రీమహావిష్ణువే తనకు తగిన భర్త అని నిశ్చయించుకుంది లక్ష్మి. వెంటనే లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువు మెడలో తామర పూల మాలను వేసి ఆయనను భర్తగా వరించింది. శ్రీమహా విష్ణువు లక్ష్మిని భార్య స్వీకరించి ఆమెను శాశ్వతంగా తన వక్షస్థలములో నిలుపుకున్నాడు. శ్రీవారి వక్షస్థలము నుండి లక్ష్మి మూడులోకములను కృపాదృష్టితో చూడసాగింది.

శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవిల వివాహ సమయంలో దేవదుందుభులు మోగాయి. దేవతలు శంఖములు, తూర్యములు, మృదంగములు శ్రావ్యంగా మోగించారు. గంధర్వులు పాడారు. అప్సరసలు ఆడారు. బ్రహ్మ, రుద్రుడు, అంగిరసుడు, మొదలగు సృష్టికర్తలు శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవిమీద పూలవర్షమును కురిపించి భగవానుని స్తుతించారు. శ్రీమహాలక్ష్మి చల్లని దృష్టి తమ మీద పడటంతో దేవతలు, ప్రజలు పరమానంద భరితులయ్యారు.లక్ష్మీదేవి కృపాదృష్టి తమ మీద ప్రసరించకపోవడంతో దానవులు, దైత్యులు,

రాక్షసులు నిర్వీర్యులు అయ్యారు. వారిని ఒక రకమైన మోహము ఆవహించంది.

లక్ష్మీదేవిని శ్రీమహావిష్ణువు స్వీకరించిన తరువాత, మరలా దేవతలు, దానవులు క్షీరసాగరమును మథించసాగారు. ఇప్పుడు వారుణి (మద్యము) అనే కన్య ఉద్భవించింది. అప్పటికే మోహావేశములో ఉన్న దానవులు మత్తును కలిగించే వారుణిని చూడగానే తమకు కావాలని ఎగబడ్డారు. దేవతలు అభ్యంతరం చెప్పకపోవడంతో, వారుణిని  దానవులు స్వీకరించారు.

తరువాత క్షీరసాగరము నుండి ఒక అద్భుతమైన పురుషుడు పైకి లేచాడు. ఆయనకు పొడుగైన చేతులు, శంఖము వంటి మెడ, ఎర్రని కళ్లు, నల్లని మేని ఛాయ, యవ్వనవంతుడు, మెడలో వనమాల కలవాడు, ఒంటి నిండా ఆభరణములు కలవాడు, పచ్చని పట్టు వస్త్రమును ధరించిన వాడు, వంకీలు తిరిగిన వెంట్రుకలు కలవాడు, అమితమైన పరాక్రమవంతుడు, సాక్షాత్తు విష్ణువు అంశలో నుండి పుట్టిన వాడు  ధన్వంతరి అనే పేరుతో ప్రఖ్యాతి చెందిన వాడు అయిన ఒక దివ్యపురుషుడు తన  చేతిలో అమృత కలశముతో ఆవిర్భవించాడు. ధన్వంతరి ఆయుర్వేద శాస్త్రమునకు ఆద్యుడు.

(ఇక్కడ ఒక విషయం జ్ఞాపకం చేసుకుందాము. క్షీరసాగరము మథించడానికి ముందు దేవతలు,దానవులు ఓషధులు, రకరకాల మొక్కలు, ఆకులు తెచ్చి పాలసముద్రంలో వేసి మథించారు. అందులో నుండి ధన్వంతరి అమృత కలశంతో ఆవిర్భవించాడు. కథ విషయం పక్కన బెడితే, ఈ రోజుల్లో కూడా ఔషధములకు

సంబంధించిన వేళ్లను, ఆకులను, చెట్టుబెరడులను బాగా దంచి, పాలు అనుపానంగా, ఔషధరూపంలో తీసుకుంటూఉంటారు కదా! ఈ ప్రక్రియ ఆయుర్వేద వైద్యుడు చేస్తాడు. ఈ ప్రక్రియను సూచించేదే ఈ క్షీరసాగర మధనం అని అర్థం చేసుకోవచ్చు. ప్రకృతిలో దొరికే మొక్కలలో, ఆకులలో, వేళ్లలో, చెట్టు బెరడులో ఎన్నో ఔషధగుణాలు ఉన్నాయి, వాటిని వైద్యుడు పాలు అనుపానంతో మథిస్తే, అమృతం లాంటి ఔషధము తయారవుతుంది. దానిని సేవిస్తే మానవుడు ఏ రోగములు లేకుండా చిరాయువుగా ఉంటాడు అని కూడా మనం ఈ క్షీరసాగర మధనం ద్వారా అర్థం చేసుకోవచ్చు. తులసికి ఫ్లోరైడ్ ను హరించే శక్తి ఉందని ఇన్నాళ్లకు కనుక్కున్నారు. ప్రతి ఇంటిలో తులసి మొక్క ఉండాలనీ, దానిని పూజిస్తే మంచిదని, మనపూర్వీకులు ఏనాడో చెప్పారు! ఇక్కడ ఇంకొక విషయం కూడా మనం గ్రహించాలి. ధన్వంతరి సాక్షాత్తు విష్ణు అంశలో నుండి పుట్టిన వాడు. అందుకని ధన్వంతరి వేష ధారణ కూడా అచ్చం విష్ణువు వేషధారణ మాదిరి ఉంది. అందుకేనేమో వైద్యో నారాయణో హరి అంటే వైద్యుడు నారాయణుడితో సమానము అని అంటారు.)

ఎప్పుడైతే ధన్వంతరి అమృత కలశమును చేతిలో పట్టుకొని క్షీరసాగరము నుండి బయటకు వచ్చాడో, దైత్యులు, రాక్షసులు ఆయన మీదికి ఎగబడ్డారు. అమృత భాండము తమకే చెందాలనే తలంపుతో దానవులు, రాక్షసులు దేవతలను పక్కకునెట్టివేసి, అమృత భాండమును ధన్వంతరి చేతిలో నుండి లాక్కుని వేగంగా పరుగెత్తారు. దేవతలందరూ తెల్లమొహాలు వేసుకొని చూస్తున్నారు. దేవతలందరూ శ్రీమహావిష్ణువును ప్రార్థించారు.

దేవతల విషాదమును చూచి శ్రీమహావిష్ణువు వారితో ఇలా అన్నాడు. “దేవతలారా! మీరు చింతించకండి. నేను నా చాతుర్యంతో వారిలో వారికి కలహములను సృష్టిస్తాను. అమృతము మీకు దక్కేటట్టు చేస్తాను.” అని అన్నాడు.

ఇక్కడ ఇలా ఉంటే అక్కడ దానవులు, అసురులు, రాక్షసులు అందరూ “ముందు నాకు, తరువాత నీకు, ముందు నేను తాగాలి తరువాత నువ్వు తాగాలి, అంతా నేనే తాగాలి నీవు తాగడానికి వీలు లేదు” అంటూ వారిలో వారే తగవులాడుకుంటున్నారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ అమృతమునకు కేవలం అసురులే కాదు, వారితో పాటు సముద్రమును మథించిన దేవతలుకూడా అర్హులే కదా! యాగం చేస్తే అందరికీ సమానంగా హవిస్సులు ఎలా ఇస్తారో అలాగే ఇక్కడకూడా క్షీరసాగరమథనం లాంటి యాగం చేస్తే వచ్చిన హవిస్సులాంటి అమృతమును, అందరూ సమానంగా పంచుకోవాలి కదా! కాని దాయాది మాత్సర్యంతో రగిలిపోతున్న దైత్యులు (దితి పుత్రులు), అమృతాన్ని దేవతలతో పంచుకోవడానికి మారుగా, అమృతం మాకు కావాలి అంటే మాకు కావాలి అని తమలో తాము కలహించుకోసారు.

ఇదంతా దూరం నుండి గమనించాడు విష్ణువు. దానవుల వద్దనుండి ఎలాగైనా ఉపాయంతో అమృత కలశమును తీసుకోవాలి అనుకున్న శ్రీమహావిష్ణువు తాను ఒక అందమైన స్త్రీ రూపం ధరించాడు. ఆ స్త్రీ శరీరం లేత నలుపురంగులో ఉంది. ఆమె అన్ని అవయవాలు పొందికగా అందంగా అమరినట్టు ఉన్నాయి. ఆమె

చెవులకు ఉన్న ఆభరణములు అమరినట్టున్నాయి. సుందరమైన చెక్కిళ్లు, అందమైన ముక్కు, గుండ్రటి ముఖకమలము, ఆ ముఖమును పద్మము అనుకొని ముసిరే తుమ్మెదలా అన్నట్టు ముఖంమీద జీరాడుతున్న ముంగురులు, అల్లల్లాడుతున్న కనురెప్పలు, సమ్మోహనమైన చూపులు, కంఠాభరణములు, కాళ్లకు ఘల్లు ఘల్లు మంటూ మనోహరంగా శబ్దం చేసే అందియలు, పెదాల మీద మందహాసము, దైత్యుల గుండెల్లో కామకోరికలు రేపుతున్న సమ్మోహనకరమైన స్త్రీరూపమును ధరించాడు శ్రీమహావిష్ణువు. అదే మోహినీ అవతారంగా ప్రసిద్ధికెక్కింది.

(ఇక్కడ ఒక విషయం గమనించండి. మోహినీ అవతారం ఉద్దేశ్యము దానవుల వద్దనుండి అమృతమును అపహరించి దేవతలకు పంచిపెట్టడం. దానికే అందమైన, ఆకర్షణీయమైన సమ్మోహన కరమైన మోహినీ అవతారము. ఈ కథను ప్రస్తుత పరిస్థితులకు అన్వయించుకుంటే.......

బయట ప్రపంచంలో మనలను ఎన్నో విషయాలు ప్రలోభ పెడుతుంటాయి. కార్లు, ఇతర విలాస వస్తువులు బహుమతులుగా ఇస్తామంటూ, ధరలు తగ్గించామంటూ, దినపత్రికలలో పూర్తి పేజీ ప్రకటనలతో మనలను ఆకర్షించడానికి ప్రయత్నిస్తారు వ్యాపారస్తులు. సినీనటులకు, నటీమణులకు కోట్లాది డబ్బు ఇచ్చి ప్రచారం కూడా చేయిస్తారు.

దాని ముఖ్యఉద్దేశ్యం ఆ ప్రచారాలతో, బహుమతులతో మనలను ప్రలోభపెట్టి మన వద్ద ఉన్న న్యాయార్జితమైన ధనాన్ని లాక్కుని, లబ్ధిపొందడమే. ఈ ప్రలోభాలన్నీ మోహినీ అవతారాలే. ఈ ప్రలోభాలకు లోనైతే మోసపోతారు అని చెప్పడమే ఈ మోహినీ అవతార కధ అని అనుకోవచ్చు కదా! ఆలోచించండి.)

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము

తొమ్మిదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు మోహినీ అవతార కథను ఈ విధంగా చెబుతున్నాడు.

"పరీక్షిత్ మహారాజా! అసురులు, దానవులు, దైత్యులు అందరూ తామస గుణ ప్రధానులే. వారి గుణం ఒకరి దగ్గర ఉన్నది మరొకరు లాక్కోవడం. అందుకనే అమృత కలశాన్ని ఒకరి వద్దనుండి మరొకరు లాక్కోవడానికి ప్రయత్నిస్తూ వారిలో వారే తగవులాడుకుంటున్నారు.

ఈ సమయంలో ఒక అందమైన స్త్రీ వయ్యారంగా నడుచుకుంటూ తమ వైపు రావడం వారు చూచారు. ఆమె

సౌందర్యాన్ని చూచి అందరూ నోళ్లు వెళ్ల బెట్టారు. చొంగ కార్చుకుంటున్నారు.

"ఆహా! ఏమీ ఈ సౌందర్యం. పోతపోసిన బంగారు విగ్రహం లా ఉంది. ఆ అవయవ సంపద, ఆ యౌవనము, ఆ వయ్యారము ఎంత శోభాయమానంగా ఉన్నాయో. దీనిని అనుభవించని జన్మఎందుకు వృధా!" అని లొట్టలు వేస్తున్నారు. నిట్టూర్పులు విడుస్తున్నారు.

అందులో కొంతమంది అమృత కలశం మాట మరిచిపోయి ఆమె వెంట పడ్డారు. విష్ణుమూర్తే మోహిని వేషంలో వచ్చాడని తెలియని దేవతలు కూడా ఆమె వెంట పడ్డారు. అందరూ ఆమెతో మాటా మాటా కలిపారు

"ఓ పద్మాక్షీ! ఓ లోలాక్షీ! నీవు ఎవరవు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? ఎవరి కోసరం వచ్చావు? ఏమిచెయ్యడానికి వచ్చావు? నీకు పెళ్లి అయిందా! అయితే నీవు ఎవరి భార్యవు? కాకపోతే చెప్పు. నేనున్నాను. నిన్ను భార్యగా చేసుకుంటాను. నిన్ను చూడగానే నా చిత్తము నీ యందు లగ్నం అయింది. అసలు దేవతలుకానీ, దానవులు కానీ, సిద్ధులు, గంధర్వులు, చారణులు, లోకపాలకులు ఎవరూ నీకు సాటి రారు. ఇంక మానవుల సంగతి చెప్పనవసరం లేదు. నిన్ను చూస్తుంటేనే ఈ విషయం తెలుస్తూ ఉంది.

అబ్బా! నీ కనుబొమలు చాలు నీవు సాటిలేని అందగత్తెవుఅని చెప్పడానికి. ఆ బ్రహ్మదేవుడికి మా మీద దయకలిగి

నిన్ను సృష్టించి మా దగ్గరకు పంపాడేమో!

ఓ అందమైన నడుము కలదానా! మాలో మాకు ఒక వివాదము వచ్చింది. నీవే దానిని పరిష్కరించ సమర్థురాలవు. మేమంతా దితి పుత్రులము. దైత్యులము. వారు అదితి పుత్రులు దేవతలు. మేము, దేవతలు, కశ్యప ప్రజాపతికి వేరు వేరు తల్లుల వల్ల జన్మించాము. మేము సోదరులమైనా మాకు జన్మవైరము ఉంది. అందుకే మేము ఒకరితో ఒకరం కొట్టుకుంటున్నాము. మేము దేవతలము కలిసి ఈ అమృత కలశమును సంపాదించాము. కాని ఈ అమృతమును ఎలా సమానంగా పంచుకోవాలా తెలియక మాలో మేము కొట్టుకుంటున్నాము. నీవు ఈ అమృతాన్ని మాకు న్యాయంగా, ధర్మంగా, సమానంగా పంచాలి." అని దైత్యులు మోహినిని ప్రార్థించారు.

వారిని చూచి మోహినీ రూపంలో ఉన్న శ్రీహరి సమ్మోహనంగా ఒక్క చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వుతో దేవతలు, దైత్యులు జావకారి పోయారు. మోహినికి దాసోహం అన్నారు. దైత్యులు తన మోహంలో పడ్డారు అన్న విషయం గ్రహించిన శ్రీహరి వారితో ఇలా అన్నాడు.

"దైత్యులారా! నేను ఒక వేశ్యను. ఎవరితో పడితే వారితో వెళుతుంటాను. మీరు కశ్యపుని కుమారులు కదా! బాగా చదువుకున్నవారు. జ్ఞానులు. మరి నాతో సాంగత్యం మీకు ఇష్టమేనా! మీ వంటి జ్ఞానులు నా వంటి వేశ్యాస్త్రీలను నమ్మరుకదా! ఎందుకంటే వేశ్యల మనసులు చంచలమైనవి అనీ, మాకు ప్రతిదినమూ కొత్త కొత్త

పరిచయాలు, కొత్త కొత్త మనుషులు కావాలి అనీ, మేము స్వేచ్ఛగా తిరుగుతుంటాము అనీ పండితులు చెబుతుంటారు కదా!" అని వయ్యారంగా సన్నాయి నొక్కులు నొక్కింది మోహిని.

"ఊరుకో! ఎవరా మాట అన్నది. అన్న వాళ్లకు బుద్ధిలేదు. నువ్వు ఏదో పరిహాసానికి అంటున్నావు. ఇదిగో అమృత కలశం. నీ ఇష్టం. మా అందరికీ సమానంగాపంచు.నువ్వు ఎట్ట చెబితే అట్టా వింటాము. నీ ఇష్టం. మేమంతా నీకు దాసులము" అంటూ అమృత కలశాన్ని మోహిని చేతిలో పెట్టారు దానవులు.

చేజారిన అమృత కలశం మరలా చేజిక్కింది అని అనుకున్నాడు శ్రీహరి. ఎందుకైనా మంచిదని మరొక మాట కూడా అన్నాడు.

"ఇదిగో ఇప్పుడే చెబుతున్నాను. నేను ఈ అమృతాన్ని మీ అందరికీ పంచేటప్పుడు కొన్ని పొరపాట్లు జరగవచ్చు. కొంత మందికి ఎక్కువ, కొంత మందికి తక్కువ రావచ్చు. కొంత మందికి ఏమీ దక్కకపోవచ్చు. మీరు ఏమీ అనుకోకూడదు. నన్ను తప్పు పట్టకూడదు. అలాఅయితేనే నేను ఈపనికి ఒప్పుకుంటాను. లేకపోతే లేదు. నేను ఏం చేసినా మీరు మాట్లాడకూడదు. కోపం తెచ్చుకోకూడదు. అందుకు మీరు ఒప్పుకుంటేనే ఈ అమృతాన్ని మీ అందరికీ పంచుతాను." అని వయ్యారంగా పలికింది మోహిని.

అప్పటికే మోహిని మాయలో పూర్తిగా మునిగిపోయిన దైత్యులు మోహిని అన్న మాటలకు గంగిరెద్దులలాగా తలలు ఊపారు. నీ ఇష్టం వచ్చి నట్టు చెయ్యి అని ముక్తకంఠంతో అరిచారు. మోహిని దేవ దానవులకు అమృతం సమంగా పంచడానికి సమాయత్తమయింది.

దేవతలు, దానవులు అందరూ స్నానాలు చేసి శుచిగా వచ్చారు. హెూమం చేసారు. గోవులకు బ్రాహ్మణులకు ఉపాహారాలు ఇచ్చారు. అందరూ కొత్త బట్టలు ధరించి తూర్పుముఖంగా పరిచిన దర్భాసనాల మీద కూర్చున్నారు. అక్కడికి అమృత కలశమును చేతబట్టుకొని వయ్యారంగా నడుచుకుంటూ వచ్చింది మోహిని. ఆమె అందాన్ని వయ్యారాన్ని చూచి, ఆమె క్రీగంటి చూపుల మత్తులో, దైత్యులు ఒళ్లు మరిచిపోయారు. అప్పటికే ఆమె శ్రీహరి అని తెలిసిపోయిన దేవతలు అప్రమత్తంగా ఉన్నారు.

“సాధారణంగా తామస ప్రవృత్తి కలిగిన ఈ దైత్యులకు అమృతం ఇవ్వడం పాముకు పాలుపోయడం వంటిది.అలా జరగకూడదు.” అని మనసులో అనుకొన్న శ్రీహరి, దైత్యులకు, రాక్షసులకు ఒక్క చుక్కకూడా అమృతమును దక్కనీయకూడదు అని అనుకున్నాడు. దానికి ఒక ఉపాయం పన్నాడు.

అప్పటికే దేవతలు, దానవులు అందరూ ఒకే వరసలో పక్క పక్కన కూర్చుని ఉన్నారు. అలా కూర్చున్న వారిని వేరు వేరు వరుసలలో కూర్చోబెట్టింది మోహిని . దేవతలను ఒక వరసలోనూ, దానవులను కొంచెం దూరంగా వేరే వరుసలో కూర్చోబెట్టింది మోహిని. మోహిని

మీద ఉన్న మోహంతో ఆమె ఎలా ఆడిస్తే అలా ఆడుతున్నారు దైత్యులు, రాక్షసులు.  దేవతల దగ్గరకు వచ్చినపుడు వారి పాత్రలలో అమృతమును పోస్తూ, దానవుల వద్దకు వచ్చినపుడు వారిని తన క్రీగంటి చూపులతో మత్తెక్కిస్తూ, మాయమాటలు చెబుతూ, వారిని మభ్యపెడుతూ ఉంది మోహిని.

మోహిని అందాలను కళ్లతోనే జుర్రుకుంటూ దైత్యులు, దానవులు  అమృతం సంగతి మరిచిపోయారు. ఆమె ఏం చేసినా తమ మంచికే అని అనుకొన్నారు.  ఆమెకు ఎదురు చెప్పకూడదు అని మాట ఇచ్చారు కదా! ఇప్పుడు మాట తప్పితే బాగుండదని, మోహిని ఏమి చేసినా ఏమీ అనకుండా కిక్కురు మనకుండా మౌనంగా ఉన్నారు.

పైగా ఒక  వేశ్య స్త్రీతో తగాదాపడటం తమ కీర్తి ప్రతిష్టలకు భంగం అని గర్వంతో ఉన్నారు. అదీ కాకుండా దైత్యులు, అసురులు అందరూ ఆమె మీద మోహంలో పూర్తిగా మునిగిపోయారు. ఆమెకు ఎదురు చెబితే ఎక్కడ ఆమె తమను కరుణించదేమో, తమ వద్దనుండి వెళ్లిపోతుందేమో  అని భయపడ్డారు. అందుకని ఈమె ఏం చేసినా తలలు ఊపుతున్నారు కాని ఎదురు చెప్పలేదు.

ఇక్కడ దైత్యులు, అసురులు  ఇలా ఉంటే, రాహువు అనే వాడు ఈ విషయాన్ని గ్రహించాడు. వెంటనే వెళ్లి వేషం మార్చుకున్నాడు. దేవతల వేషం వేసుకున్నాడు. దేవతల పక్కన కూర్చున్నాడు. రాహువు కూడా దేవత అనుకొని  మోహిని వాడికి కూడా అమృతం పోసింది.

వాడు అమృతాన్ని నోట్లోపోసుకున్నాడు. ఈ విషయాన్ని సూర్యుడు, చంద్రుడు గమనించారు. వెంటనే మోహిని చెవిలో ఈ విషయం చెప్పారు. అమృతం రాహువు గొంతు దిగక ముందే మోహినీ రూపంలో ఉన్న శ్రీహరి తన చక్రముతో రాహువు కంఠమును నరికాడు. వాడి తల మాత్రము అమృతత్వము పొందింది.  వాడి దేహము నేలమీద పడిపోయింది.

అమృతత్వము సిద్ధించిన రాహువు తలకు గ్రహత్వమును కల్పించాడు బ్రహ్మ. అప్పటి నుండి రాహువు సూర్య చంద్రుల మీద పగ బట్టాడు. పౌర్ణమి, అమావాస్యల రోజులలో సూర్య చంద్రులను మింగుతుంటాడు. కాని వారు బయట పడుతుంటారు. అదే రాహుగ్రస్త సూర్య గ్రహణము, చంద్ర గ్రహణము.

అప్పటికి దేవతలకందరికీ అమృతం పంచడం పూర్తి అయింది. వెంటనే శ్రీమహావిష్ణువు మోహినీ అవతారమును ఉపసంహరించి తన నిజరూపం దాల్చాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! దేశము, కాలము, కారణము, ప్రయోజనము, కర్మ అన్నీ కలిసి వచ్చినా, దానికి తగిన ఫలితం లభించినా, దైవానుగ్రహము లేనిదే ఆ ఫలితం దక్కదు. దానవులు కూడా దేవతలతో సమానంగా క్షీరసాగరమధనం చేసారు. కాని దేవతలకు దైవబలం ఉంది. రాక్షసులకు అది లేదు. అందుకే వారికి అమృతం దక్కలేదు. దేవతలు విష్ణువు పాదపద్మములను నిరంతరము సేవించడం వలన, వారికి అమృతము దక్కింది. అసురులు కేవలం తమ శక్తిని నమ్ముకున్నారు. విష్ణువును విస్మరించారు. అందుకని వారు

కష్ట పడ్డా ఫలితం దక్కలేదు.

ఓ రాజా! మానవులు కూడా అంతా తమే చేస్తున్నాము,, అంతా తమ ప్రతిభ అని విర్రవీగుతూ కర్మలు, చేస్తుంటారు. ఇలా చేయడం చెట్టుకున్న వేళ్లను మరిచిపోయి, కేవలం కాండమును, కొమ్మలను నీటితో తడపడం లాంటిది. దైవము, వేరు తాము చేసే కర్మలు వేరు అనుకోవడం లాంటిది. మూలము లేనిదే చెట్టు లేదు, కొమ్మలు లేవు, ఆకులు, కాయలు లేవు. అలాగే మానవులు చేసే ప్రతి కర్మవెనుక పరమాత్మ ఉన్నాడు. అన్ని కర్మలను తాము చేస్తున్నట్టు కాకుండా పరమాత్మ పరంగా చేస్తే ఫలితం సునాయాసంగా లభిస్తుంది. కాబట్టి  ఎంతటి వారైనా, ఎంత కష్టపడి పనులు చేసినా, దైవానుగ్రహము లేనిదే ఆ కర్మల ఫలితము దక్కదు. " అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు మోహినీ అవతార వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్భాగవతము
# అష్టమ స్కంధము
# పదవ అధ్యాయము .

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు, దేవతలకు, దైత్యులకుజరిగిన యుద్ధము గురించి ఈ విధంగా చెబుతున్నాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! దేవతలు, దైత్యులు క్షీరసాగరమును సమానంగా మథించినప్పటికినీ, అమృతమును సాధించినప్పటికినీ, దైత్యులకు విష్ణువు మీద భక్తి భావము లేకపోవడం వలన, వారికి అమృతము లభించలేదు. విష్ణుమూర్తి దేవతలకు అమృతమును పంచి ఇచ్చి, గరుడ వాహనము ఎక్కి వైకుంఠమునకు వెళ్లిపోయాడు.

తమకు మోసం అన్యాయం జరిగిందని తెలుసుకున్నారు దైత్యులు. అంతే. చేతి కందిన ఆయుధం తీసుకొని దేవతల మీద తిరగబడ్డారు. అప్పటికే అమృతమును సేవించి ఉండటం వలన దేవతలకు రెట్టింపు శక్తి, బలము వచ్చాయి. దేవతలు కూడా దైత్యుల మీద తిరగబడ్డారు. క్షీరసాగరము ఒడ్డున దేవతలకు అసురులకు ఘోరమైన యుద్ధము జరిగింది. అది దేవాసురసంగ్రామంగా ప్రసిద్ధికెక్కింది.

ఇరుపక్షముల వారు కత్తులతోనూ, శూలములతోనూ, బాణములతోనూ కొట్టుకున్నారు. ఆ ప్రదేశ మంతా అశ్వముల గిట్టల చప్పుడుతోనూ, సైనికుల అరుపులతోనూ ప్రతిధ్వనించింది. ఆ

యుద్ధములో రథములు, ఏనుగులు, అశ్వములు, సైనికులు పాల్గొన్నారు. ఇరుపక్షముల సైనికులు ఒంటెలమీదా, ఏనుగుల మీద, గాడిదలమీద, కోతుల మీద, పెద్దపులుల మీద, సింహముల మీద, గ్రద్దలమీద, కొంగలమీద, డేగలమీద, కోళ్లమీద, తిమింగలముల మీద, శరభమృగముల మీద, దున్నపోతులమీద, ఖడ్గమృగముల మీద, ఎద్దులమీద, నక్కలమీద, ఎలుకలమీద, తొండలు, ఊసరవెల్లులమీద, కుందేళ్లమీద, ఇంకా నానారకములైన మృగముల మీద ఎక్కి యుద్ధం చేస్తున్నారు.

ఇరుపక్షముల సేనలు అపారంగా ఉన్నాయి. ఇరు పక్షముల వారి రథముల మీద చిత్రవిచిత్రములైన పతాకములు ఎగురు తున్నాయి. సైన్యాధిపతులు, సైనికులు వివిధములైన కవచములు ధరించి ఉన్నారు. ఇరుపక్షముల సైన్యములు రెండు మహాసాగరముల వలె ఉన్నాయి.

దానవుల పక్షాన బలి చక్రవర్తి అమితమైన పరాక్రమంతో యుద్ధం చేస్తున్నాడు. ఆయన ఒక మాయా విమానమును ఎక్కియుద్ధం చేస్తున్నాడు. దాని పేరు వైహాయసము. ఆ విమానము ఒకప్పుడు కనపడుతుంది, వెంటనే మాయం అవుతుంది. ఇప్పుడు ఇక్కడ ఉంటుంది. ఇంకొక క్షణంలో మరొకచోట ఉంటుంది. బలి చక్రవర్తికి నాలుగు వైపులా రాక్షస సైన్యములు, వాటి సైన్యాధిపతులు మోహరించి దేవతలతో తలపడుతున్నారు.

అసుర సైన్యములో శంబరుడు, నముచి, బాణుడు, విప్రచిత్తి, అయోముఖుడు, ద్విమూర్ధుడు, కాలనాభుడు, ప్రహేతి, హేతి, ఇల్వలుడు, శకుని, భూతసంతాపుడు, వజ్రదంష్ట్రుడు, విరోచనుడు, హయగ్రీవుడు, శంకుశిరుడు, కపిలుడు, మేఘుడు, దుందుభి, తారకుడు, చక్రదృక్కు, శంభుడు, నిశుంభుడు, జంభుడు, ఉత్కలుడు, అరిష్టుడు, అరిష్టనేమి, త్రిపురాధిపుడు, మయుడు, పౌలోముడు, కాలేయగణములు, నివాతకవచులు, మొదలగు వారు దేవతలతో యుద్ధం చేస్తున్నారు. వీరంతా శ్రీమహావిష్ణువు చేతిలో మోసగింపబడ్డవారే. వారంతా విజృంభించి, దేవతలను చంపి సింహనాదములు చేస్తున్నారు. దేవతల మీద కక్షతీర్చుకుంటున్నారు.

అసురుల కోలాహలము చూచి ఇంద్రుడికి కోపం వచ్చింది. ఇంద్రుడు ఐరావతమును ఎక్కి యుద్ధభూమికి బయలుదేరాడు. ఇంద్రునితో పాటు వాయువు, వరుణుడు, అగ్ని మొదలగు లోకపాలకులు, తమ తమ దేవతాగణములను తీసుకొని బయలుదేరారు. దేవతలు దానవులు  ఒకరి ఎదురుగా మరొకరు నిలబడి తిట్టుకుంటున్నారు. కొట్టుకుంటున్నారు. కలయబడుతున్నారు.

బలి చక్రవర్తి ఇంద్రునితో తలపడ్డాడు. కార్తికేయుడు తారకాసురుడితో తలపడ్డాడు. వరుణుడు హేతితోనూ, మిత్రుడు ప్రహేతితోనూ యుద్ధం చేస్తున్నారు. కాలనాభి యముడిని ఎదిరించాడు. మయుడితో విశ్వ కర్మ, త్వష్టతో శంబరుడు, సూర్యునితో విరోచనుడు తలపడ్డారు. అపరాజితునితో నముచి, వృషపర్వునితో అశ్వినీ కుమారులు, బలికుమారులైన బాణుడు మొదలగు వారితో

సూర్యుడు, రాహువుతో చంద్రుడు, పులోమునితో వాయువు, శుంభనిశుంభులతో భద్రకాళి యుద్ధం చేయసాగారు. జంభునితో మహాదేవుడు, మహిషాసురునితో విభావసు, బ్రహ్మపుత్రునితో వాతాపి ఇల్వలుడు, కామదేవునితో దుర్మర్షుడు, సప్త మాతృకలతో ఉత్కలుడు, శుక్రునితో బృహస్పతి, నరకునితో శని, నివాత కవచులతో మరుద్గణములు, కాలకేయులతో విశ్వేదేవులు, క్రోధవశులతో రుద్రులు యుద్ధం చేయసాగారు.

ఆ ప్రకారంగా దేవతలు దానవులు ఘోరంగా యుద్ధం చేస్తున్నారు. నానావిధములైన అస్త్రములతోనూ శస్త్రములతోనూ యుద్ధం చేస్తున్నారు. యుద్ధం తీవ్రరూపం దాల్చింది. ఆ యుద్ధములో ఇరుపక్షములు భుశుండి, చక్రము, గద, ఋష్టి, పట్టిశము, ఉల్ముకము, కుంతము, పరశువు, ఖడ్గము, భల్లము, ముద్గర, భిందిపాలము, పరిఘ మొదలగు ఆయుధములు ధరించి యుద్ధం చేస్తున్నారు. గజములు, రథములు, అశ్వములు ఎక్కి యుద్ధం చేస్తున్నారు. మరి కొందరు నేలమీద నిలబడి యుద్ధం చేస్తున్నారు.

ఆ ప్రకారంగా దేవతలకు దానవులకు యుద్ధం జరుగుతుంటే, సైనికులు, గుర్రములు, ఏనుగుల పాదధూళి గాలిలోకి లేచి ఆకాశం అంతా కప్పివేసింది. కాని చనిపోయిన సైనికుల రక్తంతో యుద్ధ భూమి అంతా తడిసి పోయి, ఆ దుమ్ము అంతా అణిగిపోయింది. ఆ యుద్ధములో ఇరు పక్షములలోనూ చాలామంది మరణించారు. కొంతమందికి కాళ్లు, చేతులు తెగిపోయాయి. రథములు ముక్కలయ్యాయి. తెగిపడిన కాళ్లు చేతులు, మొండెములు, విరిగిన రథములు, అశ్వములు, గజముల కళేబరములతో యుద్ధభూమి

నిండిపోయింది. యుద్ధభూమి నిండా తలలు లేని మొండెములు పడి ఉన్నాయి. సైనికులు పోరాడుతుంటే వారి తలలు తెగి కిందపడు తున్నాయి. కాని తలలు తెగిపడిన తరువాత కూడా, వారి మొండెములు, తెగిపడి ఉన్న తమ యొక్క శిరస్సులకు ఉన్న కళ్లతో చూస్తూ, శత్రువులతో యుద్ధం చేస్తున్నారు.

బలి చక్రవర్తి పదిబాణములతో ఇంద్రుని, మూడు బాణములతో ఐరావతమును, నాలుగు బాణములతో, ఐరావతమునకు నాలుగు కాళ్లకు రక్షణగాఉన్న గుర్రములను, ఒక బాణముతో ఐరావతమును నడుపుతున్న మావటిని కొట్టాడు. దేవేంద్రుడు ఏమీ తక్కువ తినలేదు. బలి చక్రవర్తి వేసిన బాణములను అన్నింటినీ మార్గమధ్యములోనే విరిచాడు. తనబాణములు అన్నీ వ్యర్థము కావడంతో బలికికోపం వచ్చింది. వెంటనే శక్తి అనే ఆయుధమును తీసుకున్నాడు. ఇంద్రుడిమీదికి ప్రయోగించడానికి సిద్ధం అయ్యాడు. కానీ ఇంద్రుడు ఆ శక్తి ఆయుధము బలి చక్రవర్తి చేతిలో ఉండగానే, దానిని రెండుముక్కలుగా నరికాడు.

బలి చక్రవర్తి ఏ మాత్రమూ సహించలేకపోయాడు. శూలము, ప్రాసము, తోమరము, ఋష్టి మొదలగు ఆయుధములను ఇంద్రుడి మీద ప్రయోగించాడు. కాని ఇంద్రుడు ఆ ఆయుధములను అన్నింటినీ మార్గమధ్యంలోనే ఛేధించాడు. ఇంక చేసేది లేక బలి చక్రవర్తి అసుర మాయను ఇంద్రుడిమీద ప్రయోగించాడు. తాను ఎవరికీ కనపడకుండా మాయాయుద్ధం చేస్తున్నాడు. దేవతల సైన్యముల మీద ఒక పెద్ద పర్వతముపడుతోందా అన్నట్టు భ్రమ

కలిగించాడు. ఆ పర్వతము మీది నుండి మండుతున్న వృక్షములు, భగభగమండుతున్న రాళ్లు పడుతున్నాయి.వాటి కింద పడి దేవతా సైన్యములు నుగ్గునుగ్గు అవుతున్నాయి. ఆ పర్వతముల మీది నుండి తేళ్లు, పాములు, సింహములు, పెద్దపులులు, వరాహములు, ఏనుగులు దేవతా సైన్యముల మధ్యకు దూకుతున్న భ్రమకలిగిస్తున్నాయి. రాక్షస సైన్యములలో రాక్షస స్త్రీలు కూడా ఉన్నారు. వారు దిగంబరులై దేవతల మీదికి కొట్టండి చంపండి నరకండి అని అరుస్తూ మీది మీదికి వస్తున్నారు. ఆకాశము నుండి దట్టమైన మేఘములు కుండపోతగా నిప్పులు కురిపిస్తున్నాయి. ఈ ప్రకారంగా బలి చక్రవర్తిచేత సృష్టింపబడిన మాయాసైన్యము దేవతా సైన్యములను నాశనం చేయసాగింది.

అంతలోనే బలి చక్రవర్తి మాయ మరోమలుపు తిరిగింది. పర్వతములు మాయమైపోయాయి. వాటి స్థానంలో ప్రచండ మైన గాలితో ఎత్తుగా ఎగిసిపడుతున్న అలలతోకూడిన  సముద్రములు కనిపిస్తున్నాయి.  ఒక్క బలి చక్రవర్తే కాదు అందరూ రాక్షసులు తమ తమ శక్తి కొద్దీ మాయలను సృష్టిస్తున్నారు. ఈ మాయాయుద్ధము చూచి దేవతలు తీవ్రమైన విషాదమును పొందారు. ఏమి చెయ్యాలో వారికి ఏమీ తోచడం లేదు.

అందుకని వారు మరలా విష్ణుమూర్తిని ప్రార్థించారు. వెంటనే విష్ణుమూర్తి వారి ముందు సాక్షాత్కరించాడు. గరుడునిమీద ఎక్కి, పట్టుపీతాంబరమును కట్టుకొని,తన ఎనిమిది చేతులలో ఆయుధములు ధరించి, రత్నకిరీటంతో, కుండలములతో, దేవతలకు కనిపించాడు. (ప్రతిసారీ ఇలాఎందుకు వర్ణించడం అని మీరు

అనుకోవచ్చు. విష్ణువు పరమాత్మ. నిరాకారుడు. నిర్గుణుడు. కాని ఏదో ఒక ఆకారంలో కనిపించాలి కాబట్టి ఈ ఆకారంలో కనిపిస్తుంటాడు. అందుకని ఆ ఆకారాన్ని వర్ణిస్తుంటాడు వ్యాసమహర్షి. మనం కూడా సాధారణంగా ఇదే ఆకారంలోనే శ్రీమహావిష్ణువును పూజిస్తుంటాము.).

శ్రీమహావిష్ణువు యుద్ధభూమిలో ప్రత్యక్షం కాగానే రాక్షస మాయలన్నీ మాయం అయ్యాయి. ఇంతలో సింహము మీద ఎక్కి యుద్ధం చేస్తున్న కాలనేమి అనే రాక్షసుడు తన శూలమును గిరా గిరా తిప్పి శ్రీమహావిష్ణువు మీదికి విసిరాడు. విష్ణువు ఆ శూలమును ఒడిసి పట్టుకొని ఆ శూలముతోనే కాలనేమి తలను నరికాడు. తరువాత తన చక్రాయుధమును ప్రయోగించి మాలి, సుమాలి అనే రాక్షసుల తలలు ఛేదించాడు. ఇంతలో మాల్యవానుడు తన గదతో గరుడుని తలమీద కొట్టబోయాడు. అంతలోనే విష్ణువు తన చక్రమును ప్రయోగించి మాల్యవానుడి తల త్రుంచాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు దేవాసురయుద్ధవిశేషములను వివరించాడు.

. శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము పదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము

పదకొండవ అధ్యాయము.

శ్రీ మహావిష్ణువు స్వయంగా యుద్ధంలో పాల్గొనడం చూచిన ఇంద్రుడు, వాయువు, వరుణుడు మొదలగు లోక పాలకులు శక్తిని, ధైర్యం పుంజుకున్నారు. రాక్షసుల మీద తిరగబడ్డారు. ఇదివరకు తమ మీద దాడి చేసిన రాక్షసుల మీద తిరగబడివారిని తరిమి తరిమి కొట్టారు. రాక్షసులను సర్వ నాశనం చేసారు. అంతటితో ఆగక ఇంద్రుడు బలి చక్రవర్తిని చంపడానికి తన వజ్రాయుధమును పైకెత్తాడు. బలిని చూచి ఇలా అన్నాడు.

"ఓరి మూఢుడా! మేము అన్ని రకములైన మాయలకు అధిపతులము. అటువంటి మమ్ములనే మాయ చేస్తావా! నీరాక్షస మాయలను మా మీద ప్రయోగిస్తావా! నీ వంటి మాయావులు తమ మాయలు ప్రయోగించి స్వర్గమును ఆపైన మోక్షమును పొందాలని కోరుకుంటారు. అటువంటి అజ్ఞానులను నేను పాతాళానికి తొక్కేస్తాను జాగ్రత్త! ఈ రోజు నువ్వు నా చేతిలో నుండి తప్పించుకోలేవు. ఈ వజ్రాయుధంతో నీ తల నరికి మూడులోకములకు నీ పీడ వదిలిస్తాను." అని పలికాడు ఇంద్రుడు.

ఇంద్రుడి మాటలను విన్న బలి చక్రవర్తి చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు. "లోకపాలకుడవైన నీకు కాల మహిమ గురించి తెలియక పోవడం ఆశ్చర్యంగా ఉంది. ఏమిటంటే.. ఈ యుద్ధరంగంలో ఉన్న వారందరూ తమ తమ పూర్వజన్మలలో చేసిన కర్మలకు ఫలితం

అనుభవిస్తున్నారు. అందువలన కీర్తి, జయము, అపజయము, మరణము సంభవిస్తుంటాయి. ఈ విషయం తెలిసిన నాలాంటి వారు ఈ జగమంతా కాలమునకు అధీనము అని తెలుసుకుంటారు. అందువలన నా వంటి వారు జయాపజయములకు స్పందించరు. జయము వస్తే పొంగిపోరు. అపజయము కలిగితే కుంగి పోరు. నీకు ఈ విషయం తెలియకపోవడం నీ అవివేకము.

ఇందాక నీవు ఓడి పోయావు. దాని కోసరం చింతించావు. ఇప్పుడు నీవు గెలిచావు. ఎగిరెగిరి పడుతున్నావు. ఇదంతా నీ మహిమ అనుకుంటున్నావు. నీ ఈ మూర్ఖత్వమును చూచి జ్ఞానులు నవ్వుకుంటున్నారు. కాబట్టి నీ మాటలను నేను లక్ష్యపెట్టను. నా శరీరంలో ప్రాణాలు ఉన్నంతవరకూ పోరాడతాను." అంటూ తన చేతిలో ఉన్న విల్లుకు బాణం సంధించి ఆకర్ణాంతం లాగి వదిలాడు.

ఉన్న విషయం ఉన్నట్టు మాట్లాడిన బలి చక్రవర్తి ఔన్నత్యమును చూచి ఇంద్రుడు సహించలేకపోయాడు. వజ్రాయుధమును బలిచక్రవర్తి మీద ప్రయోగించాడు. ఆ వజ్రాయుధం తాకిడికి తట్టుకోలేక బలి తన విమానము మీది నుండి  కిందపడి ప్రాణాలు కోల్పోయాడు.  బలిచక్రవర్తి మరణించడం అతని మిత్రుడైన జంభాసురుడు చూచాడు. వెంటనే జంభాసురుడు తన సింహ వాహనం మీద ఇంద్రుని ఎదుర్కొన్నాడు.  జంభాసురుడు తన గదతో ఇంద్రుని గజమును మెడమీద కొట్టాడు. జంబాసురుడి కొట్టిన దెబ్బకు ఇంద్రుడు ఎక్కిన ఏనుగు కిందపడి గిలా గిలా కొట్టుకొని మూర్ఛపోయింది.

ఇదంతా చూస్తున్న మాతలి, వేయి గుర్రములను పూన్చిన రథమును తీసుకొచ్చి ఇంద్రుడి ముందర నిలబడ్డాడు. వెంటనే ఇంద్రుడు ఏనుగును దిగి మాతలి తెచ్చిన రథం ఎక్కాడు. ఇంతలో జంభాసురుడు తన శూలముతో మాతలిని కొట్టాడు. మాతలి ఆ శూలమును తప్పించుకున్నాడు.  ఇది చూచి సహించలేక ఇంద్రుడు తన వజ్రాయుధముతో జంభాసురుని తల నరికాడు.

ఇదంతా దూరం నుండి చూస్తున్న నారదుడు వెంటనే పోయి జంభాసురుని సోదరులైన నముచి, బలుడు,పాకుడు అనే రాక్షసులకు జంభాసురుడు ఇంద్రుని చేతిలో మరణించాడు అని చెప్పాడు. వెంటనే నముచి, బలుడుమొదలగు జంభాసురుని సోదరులు ఆయుధములు తీసుకొని ఇంద్రునిమీదికి పరుగెత్తారు. అందరూ కలిసి తమ బాణములతో ఇంద్రుని ముంచేసారు. బలుడు అనే వాడు ఇంద్రుని రథమునకు కట్టిన వేయి గుర్రములను ఒకే బాణంతో చంపేసాడు. పాకుడు అనేరాక్షసుడు మాతలిని నూరు బాణముల తోనూ, మరో నూరుబాణములతో ఇంద్రుడు ఎక్కిన రథమును విరగ్గొట్టాడు.  ఇంతలో నముచి అనే రాక్షసుడు పదిహేను బాణములతో ఇంద్రుని కొట్టాడు. ఇది చూచిన రాక్షసులు అందరూ ఇంద్రుని మీద బాణవర్షము కురిపించారు. ఆ బాణములు అన్నీ ఇంద్రుని కప్పేసాయి.

ఇంద్రుడు కనపడకపోయేసరికి ఇంద్రుడికి ఏమయిందో అని దేవతలందరూ కంగారు పడసాగారు. ఇంతలోనే ఆ బాణములను ఛేదించుకొని, మబ్బుల్లోనుండి చంద్రుడు బయటకు వచ్చినట్టు, ఇంద్రుడు బయటకు వచ్చాడు. చుట్టు చూచాడు. దేవతల సైన్యమును రాక్షసులు ఊచకోత కోయడం చూచాడు. వెంటనే తన

వజ్రాయుధముతో బలుడు, పాకుడు అనే రాక్షస వీరుల తలలు ఖండించాడు.

బలుడు పాకుడు మరణించడం చూచిన నముచి కోపంతో రగిలిపోయాడు. ఇంద్రుని చంపాలని శతవిధాలా ప్రయత్నించాడు. ఇంద్రుని మీదికి ఒక శూలము విసిరాడు. ఎడతెరపి లేకుండా బాణవర్షము కురిపించాడు. నముచి ప్రయోగించిన శూలమును, బాణములను ఇంద్రుడు మధ్యలోనే విరిచాడు. ఇంద్రుడు తన వజ్రాయుధముతో నముచి కంఠమునకు గురి చూచి కొట్టాడు. వజ్రాయుధము వేటు నముచి మెడ మీద పడింది కానీ అతని పైచర్మము కూడా గాటు పడలేదు.

నముచి నవ్వుతున్నాడు.తన వజ్రాయుధము దెబ్బకు నముచి చావకపోవడం చూచి ఇంద్రుడికి అనుమానం వచ్చింది. వజ్రాయుధము వేటును తప్పించుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. ఆకాశంలో ఎగురుతున్న పర్వతముల రెక్కలను ఈ వజ్రాయుధంతోనే ఇంద్రుడు విరుగ గొట్టాడు. ఈ వజ్రాయుధముతోనే వృత్రాసురుని ఇంద్రుడు చంపాడు. అంతటి మహిమ కలిగిన వజ్రాయుధము నముచిని ఏమీ చేయలేకపోయింది. ఇంద్రునికి అదే ఆశ్చర్యంగా ఉంది. ఒక సాధారణ రాక్షసుని వధింపలేని ఈ వజ్రాయుధము తన చేతిలో ఉండటం వృధా అనుకున్నాడు ఇంద్రుడు.

ఇంతలోనే అతనికి ఒక వాక్కు వినిపించింది. "ఇంద్రా! ఈ నముచి అజేయుడు. ఇతడు నీ వజ్రాయుధము వలన చావడు. ఇతడు

ఎండినది కానీ, పచ్చిది కానీ అయిన ఏ ఆయుధముతో మరణించడు. ఎండినది కానీ పచ్చిది కానీ కాకుండా ఉన్న ఆయుధమును ప్రయోగించి ఇతనిని చంపు." అని వినపడింది.

ఇంద్రుడు ఆలోచించాడు. అటువంటి ఆయుధము ఏమిటా అని. ఒక ఆలోచనతట్టింది. నురగ ఎండినట్టే ఉంటుంది కానీ తడిగా ఉంటుంది. తడిగా ఉన్నట్టు ఉంటుంది కానీ అందులో తడి ఉండదు. నురగ ఎండినది కానీ పచ్చిది కానీ కాదు. అందుకని నురగ మంచి ఆయుధము అనుకున్నాడు. ఈ యుద్ధము సముద్రము ఒడ్డున జరుగుతూ ఉంది. ఇంద్రుడు తన వజ్రాయుధమును సముద్రము జలాల నురగలో ముంచాడు. ఆ నురగను బలంగా నముచి మెడకు తగిలేటట్టు విసిరాడు. ఆ నురగ వేగంగా పోయి నముచి మెడను తాకింది. అంతే. నముచి మెడతెగి భూమి మీద పడింది. ఇంద్రుని ఉపాయమునకు దేవతలు పూలవాన కురిపించారు.

ఇంద్రుడు నముచిని చంపడం చూచిన అగ్ని, వరుణుడు, వాయువుమొదలగు వారు విజృంభించి రాక్షస వీరులను వధింపసాగారు. దేవదానవులు ఒకరితో ఒకరు యుద్ధం చేసుకోవడం, చంపుకోవడం, ఇరుపక్షములలో అపారమైన సైనికనష్టం జరగడం గురించి బ్రహ్మకు తెలిసింది. వెంటనే బ్రహ్మ నారదుని పిలిచి "నువ్వు వెంటనే పోయి దేవదానవుల మధ్య యుద్ధమును నివారించు" అని ఆజ్ఞాపించాడు.

బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు నారదుడు దేవదానవులు యుద్ధం చేసే ప్రదేశానికి వచ్చాడు. నారదుడు ముందు దేవతలను యుద్ధం ఆపమని కోరాడు. తరువాత రాక్షస వీరులను యుద్ధం ఆపమన్నాడు. ఇది బ్రహ్మదేవుని ఆదేశము అని చెప్పాడు. ఇరుపక్షములు నారదుని మాట మన్నించి యుద్ధము ఆపారు.

"దేవతలారా! మీరంతా కష్టపడి క్షీరసాగరమును మథించారు. అమృతమును సాధించారు. ఇంకా ఎందుకు ఈ యుద్ధము." అని దేవతలకు నచ్చచెప్పాడు. దేవతలు యుద్ధం విరమించి దేవలోకమునకు వెళ్లిపోయారు. అప్పటికే తమ సేనలు అపారంగా నష్టం కావడం వలన చేసేది లేక రాక్షసులు కూడా యుద్ధం విరమించారు. రాక్షస గురువు అయిన శుక్రాచార్యుడు యుద్ధభూమి అంతా తిరిగి, చేతులు, కాళ్లు తెగిన వాళ్లకు, చికిత్స చేసి వాళ్ల చేతులు కాళ్లు అతికించాడు. కాళ్లు, చేతులు, తలలు తెగకుండా, మరణించిన వారిని మృత సంజీవనీ విద్యతో బతికించాడు. బలిచక్రవర్తి కూడా తన కుల గురువు శుక్రాచార్యుల వారి ఆశీస్సులతో పునర్జీవితుడయ్యాడు. సంపూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు. చచ్చిబతికిన బలి చక్రవర్తి, యుద్ధంలో ఓడిపోయినా, బలి ఏ మాత్రం విచారించలేదు. జయాపజయములు సర్వసాధారణములు అని అనుకొని వెళ్లిపోయాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత పురాణమును వినిపించసాగాడు.

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము పదునొకండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము

పన్నెండవ అధ్యాయము.

శుకయోగీంద్రుడు పరీక్షిత్ మహారాజుకు మహాదేవుడు మహావిష్ణువు మోహినీ అవతారంతో ఎలా మోహితుడు అయ్యాడో ఈ విధంగా వివరించాడు.

. "ఓ పరీక్షిత్ మహారాజా! దానవులు అమృత కలశమును అపహరించుకొని తీసుకొని పోయినపుడు శ్రీమహావిష్ణువు మోహినీ అవతారమును దాల్చి దానవులను వంచించి అమృతమును దేవతలకు పంచి ఇచ్చాడు అని చెప్పాను కదా. ఈ విషయం మహాదేవుడైన మహాశివునికి తెలిసింది. శ్రీమహావిష్ణువు దాల్చిన మోహినీ రూపము ఎలా ఉంటుందో చూడాలని, మహాదేవుడు  పార్వతీ దేవితోసహా  తన వృషభ వాహనము మీద వైకుంఠమునకు వచ్చాడు.

మహాదేవుని రాకను విని, శ్రీమహావిష్ణువు ఆయనకు ఎదురు పోయి ఆయనను సాదరంగా ఆహ్వానించాడు. అర్ఘ్య పాద్యములతో సత్కరించాడు. ఉచితమైన ఆసనము మీద ఆసీనుడిని చేసాడు. మహాదేవుడు శ్రీమహావిష్ణువును చూచి ఇలా అన్నాడు.

"ఓ దేవదేవా! నీవు సర్వవ్యాపకుడవు. ఈ జగత్తుకే అధిపతివి. ఈ చరాచర జగత్తుకు మూలకారణము నీవే! నీవు అన్నిటిలో ఉన్నావు.

అన్నీ నీలో ఉన్నాయి. చలనము లేని జడపదార్థము నీవే, అనంత చైతన్య మూర్తివి నీవే! ఈ జగత్తులో అన్నీ నియమించేది నీవే!

ఓ దేవా! ఈ జగత్తులో సృష్టి, స్థితి, లయములు నీవే నిర్వహిస్తున్నావు. చూచేదీ, చూడబడేదీ నువ్వే. అహంకారములు, మమకారములు బ్రహ్మచేత సృష్టించబడ్డాయి. కానీ ఆ బ్రహ్మకు జనన మరణములు లేవు. ఆ బ్రహ్మ ఎవరో కాదు నువ్వే! ఆ బ్రహ్మయే సత్యము, జ్ఞానస్వరూపము. ఏ కోరికా లేని మునులు, ఋషులు నీ పాదములను తమ హృదయములలో నిలుపుకొని నిన్ను సదా సేవిస్తుంటారు.

ఓ దేవా! నీవు  పూర్ణుడవు. చిన్మయస్వరూపుడవు. రజస్తమోగుణములు లేని వాడవు. శుద్ధసత్వగుణస్వరూపుడవు. నిత్యము ఆనందసాగరములో తేలియాడుతుంటావు. నీకు శోకము అనేది లేదు. నీ కంటే భినమైన పదార్థము అంటే ఏదీ లేదు. అన్నీ నీవే అయి ఉన్నావు. కానీ, నీవు ఏదీ అంటకుండా, కేవలం సాక్షిగా అన్నీ చూస్తుంటావు.

ఈ విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయములకు కారకుడవు నీవే. జీవులు చేసే కర్మలకు తగిన ఫలములను ఇచ్చేవాడవునీవే. కానీ నీకు ఎవరియందు ప్రేమగానీ, ద్వేషము గానీ లేవు. అందరూ నీకు సమానమే. అందుకే తమ తమ కర్మఫలములకొరకు  ఈ విశ్వం అంతా నిన్ను ఆశ్రయించుకొని ఉంటుంది. కాని నీకు ఎవరిమీద రాగద్వేషములు లేవు.

ఓ దేవా! అన్ని కార్యములకు కారణము నీవే. నీవు ఒక్కడివే అయినను విభిన్నరూపములలో ప్రకటితమవుతుంటావు. ఆభరణములలో ఉన్న బంగారము, ముద్దగా ఉన్న బంగారము ఒకటే. ఆకృతి వేరైనా పదార్థము ఒకటే. అలాగే, ఈ జగత్తుకు కారణమైన నీకు కార్యరూపమైన ఈ జగత్తుకు ఏమీ భేదము లేదు. కేవలము లోకములో ఉన్న మానవుల అజ్ఞానము వలన నిన్ను వివిధ రూపములలో పూజిస్తున్నారు, ఆరాధిస్తున్నారు, స్తుతిస్తున్నారు. నీకు ఒక శరీరం అంటూ లేదు. అన్ని దేహములలో నీవే ఆత్మస్వరూపుడుగా ఉన్నావు. ఈ విషయం తెలియని వారు నిన్ను వివిధ రూపములలో పూజిస్తుంటారు. కాని పరిశుద్ధజ్ఞానము కలిగిన వారు నీకు తప్ప వేరే దేనికీ స్వతంత్రత లేదని తెలుసుకుంటారు.  ఓ దేవా! నీకు ఈ జగత్తుకు ఏమీ భేదము లేదు.

ఓ దేవా! ఈ జగత్తులో నువ్వు ఒక్కడివే సత్యము. మిగిలినవి అన్నీ పరిణామ క్రమంలో నశించిపోయేవే. చివరకు మిగిలేది నువ్వే.  విద్వాంసులు నీవే బ్రహ్మ అని అంటారు. మరి కొందరునీవు ధర్మస్వరూపుడవు అని అంటారు. సాంఖ్యులు నీవు ఈ ప్రకృతి, పురుషుల(జీవాత్మ) కంటే భిన్నమైన వాడివి అని,  నాకు, బ్రహ్మకు కూడా నీవే ఈశ్వరుడవు అనీ అంటారు. మరి కొందరు నీవు మాయకు అతీతుడవని అంటారు. మరి కొందరు నీకు ఒకరు తక్కువ, ఒకరు ఎక్కువ అని లేదు, అందరూ నీకు సమానమే, నీవు నిర్వికారుడవు, స్వతంత్రుడవు, మహాపురుషుడవు అని కీర్తిస్తారు.

ఓ దేవా! నేను, బ్రహ్మ, మరీచాది మహాఋషులు అందరూ నీ సత్వగుణముచే సృష్టించబడ్డవారము. కానీ నీ మాయ మమ్ములను కూడా ఆవరించడం వలన, నీ చేత సృష్టించబడిన ఈ అనంత విశ్వమును గురించి ఏమీ తెలుసుకోలేకపోతున్నాము. మాకే ఈ విశ్వం గురించి అర్థం కాలేదంటే, రజోగుణము, తమోగుణములతో ప్రభావితులైన దైత్యులు, మానవుల గురించి చెప్పేదేముంది.

ఓ దేవా! ఈ అనంత విశ్వంలో జరిగే సృష్టి,స్థితి,లయముల గురించి, ఇందులో ఉన్న సకల ప్రాణుల యొక్క కర్మల గురించి, నీకు బాగాతెలుసు. ఎందుకంటే నీవు ఈ సకల జగత్తు అంతటా వ్యాపించి ఉన్నావు.

ఓ దేవా! నీవు ఇంతకుముందు నృసింహావతారమును ధరించావు. దాని గురించి నాకు తెలుసు. ఇప్పుడు నీవు స్త్రీరూపం ధరించావని విన్నాను. ఆ అవతారమును చూడవలెనని మనస్సు ఉవ్విళ్లూరుతూ ఉంది. నీవు ఏ రూపం ధరించి, దైత్యులను వంచించి, దేవతలకు అమృతమును పంచి ఇచ్చావో, ఆ మోహినీ రూపమును చూడవలెనని కోరికతో ఇక్కడకు వచ్చాను." అని అన్నాడు మహాదేవుడు.

మహాదేవుని మాటలు విన్న శ్రీమహావిష్ణువు చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు. "మహాదేవా! నేను దైత్యులను వంచించలేదు. దైత్యులే అమృత కలశమును అపహరించి తీసుకొని వెళ్లారు. నేను స్త్రీరూపం ధరించి, వారి వద్దనుండి అమృతకలశమును తీసుకొని దేవతలకు ఇచ్చాను. నీవు అడిగావు కాబట్టి నీకు నేను ఆ రూపమును

చూపించగలను." అని చెప్పి ఏదో పని ఉన్నట్టు శ్రీమహావిష్ణువు లోపలకు వెళ్లాడు.

మహాదేవుడు, పార్వతీ దేవితో కలిసి పక్కనే ఉన్న ఉద్యానవనములో విహరిస్తున్నాడు. ఆ సమయంలో మహాదేవునకు దూరంగా ఒక స్త్రీ కనపడింది. ఆ స్త్రీ ఎవరా అని తదేకంగా ఆ వైపే చూస్తున్నాడు మహాదేవుడు.ఆ మె చాలా అందంగా ఉంది. చక్కగా అలంకరించుకొని ఉంది.

ఆమె ఒక పూల బంతితో ఆడుకుంటూ ఉంది. ఆ పూలబంతితో ఆడుకుంటూ ఆమె ఉద్యానవనం అంతా కలయతిరుగుతూ ఉంది. ఎగురుతూ ఉంది. గెంతుతూ ఉంది. అలా తిరుగుతుంటే ఆమె వేసుకున్న పమిట జారిపోతూ ఉంది. ఆమె జుట్టు ముడి వీడిపోతూ ఉంది. ఆమె అప్పుడప్పుడూ మహాశివుని వంక చూస్తూ సిగ్గుతో చిరునవ్వు నవ్వుతూ ఉంది.

మహాశివుని మనస్సు ఆమెయందు చిక్కుకుంది. పక్కన తన భార్య ఉమాదేవి ఉంది అనే మాట కూడా మరిచిపోయాడు మహాశివుడు. ఆ సమయంలో ఆమె చేతిలో ఉన్న బంతి దూరంగా దొర్లుకుంటూ వెళ్లింది. ఆమె కూడా ఆ బంతి కోసరం ఆ వైపు పరుగెట్టింది. వేగంగా ఆమె పరుగెడుతుంటే ఆమెకట్టుకున్న వస్త్రములు జారిపోయాయి. ఆ దృశ్యాన్ని చూచాడు మహాశివుడు. ఆయన మనస్సు ఆమెయందు ఆసక్తిని ప్రదర్శించింది.

ఆ సమయంలో మహాశివుని విష్ణు మాయ ఆవహించింది. ఆయనలో ఉన్న వివేకము నశించింది. ఆమె యొక్క ఒంపుసొంపులకు ముగ్ధుడై మహాశివుడు ఆమె వద్దకు వెళ్లాడు. తన దగ్గరకు వస్తున్న మహాశివుని చూచి వస్త్రములు తొలగిన ఆమె సిగ్గుతో ఒక చెట్టు చాటుకు పరుగెత్తింది. మహాశివుడు కూడా ఆమె ఉన్న చోటికి వెళ్లాడు. ఆమె తప్పించుకొని పోబోతుంటే ఆమె జడ పట్టుకున్నాడు మహాశివుడు. ఆమె వదిలించుకోవాలని చూచినా వదల కుండా ఆమెను కౌగలించుకున్నాడు. తన బాహువుల మధ్య బంధించాడు మహాశివుడు. ఆమె కూడా బలవంతంగా మహాశివుని కౌగిలి విడిపించుకొని పరుగెత్తింది. మన్మథుని దహనం చేసిన మహాశివుడు కూడా ఆమె మీద మోహంతో ఆమె వెంటపరుగెత్తాడు. ఆ సమయంలో కామంతో చలించిపోయిన మహాశివుని రేతస్సు కిందపడింది. ఆ రేతస్సు ప్రభావంతో భూమిలో బంగారు, వెండి ఖనిజములు ఉత్పత్తి చెందాయి.

తన రేతస్సు పతనమైనా లెక్కచేయకుండా మహాశివుడు ఆ వనిత వెంట పరుగెత్తుతున్నాడు. నదులు, సరోవరములు, ముని ఆశ్రమములు దాటుకుంటూ పరుగెడుతున్నాడు. అలసిపోయిన మహాశివుడు ఒక చోట ఆగాడు. అప్పటికి మహాశివుని ఆవహించిన మాయ తొలగి పోయింది. తనగురించి తాను ఆలోచించుకోవడం మొదలుపెట్టాడు.

తనేమిటి, ఒక సామాన్య స్త్రీవెంట పడటం ఏమిటి తనకు వీర్యము స్ఖలనం కావడం ఏమిటి అంతా విచిత్రంగా ఉందే అని అనుకున్నాడు. అప్పటిదాకా ఎవరిమీద మోహంతో

వెంటతరుముతున్నాడో ఆ స్త్రీ పురుష రూపంధరించి మహాశివుని వద్దకు వచ్చాడు. ఆయనే శ్రీమహావిష్ణువు. మహావిష్ణువును చూచి శివుడు సిగ్గుతో తలదించుకున్నాడు.

"మహాదేవా! ఇది కేవలం నా మాయ. ఈ రూపంతోనే, ఈ మాయతోనే నేను దానవుల నుండి అమృత కలశం తీసుకొని దేవతలకు పంచాను. నీవు కోరినట్టు నా మోహినీ రూపము నీకు చూపించాను. నా మాయను దాటడం ఎవరి తరమూ కాదు. నీవు కూడా కొంచెం నా మాయలో పడ్డావు కానీ అంతలోనే తేరుకున్నావు. కాని దేవతలు, దానవులు, మానవులు ఈ మాయలో పడి కొట్టుకుంటున్నారు. నీవు కాబట్టి నా మాయ గురించి తెలుసుకొని వెంటనే బయట పడగలిగావు.

ఇంద్రియములను, మనసును జయించిన వారు మాత్రమే నా మాయ గురించి తెలుసుకోగలరు. దాటగలరు. ఈ సృష్టిని చేయడానికి, కాలస్వరూపుడనైన నేను మూడుగుణములతో కూడిన ఈ మాయను ఆశ్రయించవలసి వచ్చింది. కాని ఆ మాయ నిన్ను ఏమీ చేయలేకపోయింది" అని పలికాడు శ్రీమహావిష్ణువు.

మోహినీ అవతారమును దర్శించిన మహాశివుడు ఆయనకు ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించి, పార్వతీదేవితో సహా అక్కడి నుండి కైలాసమునకు వెళ్లిపోయాడు. మహాశివుడు తన భార్య పార్వతిని చూచి ఇలా అన్నాడు. "దేవీ! విష్ణుమాయను స్వయంగా చూచావు కదా! నేను పరమాత్మ అంశతో ఆవిర్భవించినా,

విష్ణుమాయకు లోబడకుండా ఉండలేకపోయాను. ఆ మాయ అంతటి శక్తివంతమైనది. నేనే ఆ మాయకు లోబడితే ఇంక ఇంద్రియలోలురైన మానవుల సంగతి చెప్పేదేముంది.

దేవీ! నువ్వు అప్పుడప్పుడూ అడుగుతుంటావు. నేను ఎవరి గురించి ధ్యానం చేస్తుంటాను అని. నేను ధ్యానం చేసేది నిర్గుణుడు, నిరాకారుడు, సర్వవ్యాపి అయిన ఈ విష్ణుభాగవానుని గురించే. ఆయన కాలమునకు లోబడడు. ఆయన గురించి వేదములు, శాస్త్రములు నిర్వచింపలేవు. కేవలము భక్తివలననే ఆయన గురించి తెలుసుకోగలము." అని మహాశివుడు పార్వతికి వివరించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీవు అడిగిన ప్రకారము నీకు పరమాత్మ యొక్క కూర్మావతారము గురించి తెలియజేసాను. ఈ క్షీరసాగరమధనం గురించి, విష్ణుభగవానుని మోహినీ రూపం గురించిన కథలను చదివినా వినినా, వారికి సంసార బంధనముల నుండి విముక్తి కలుగుతుంది. తనను నమ్ముకున్న దేవతలకు అమృతాన్ని పంచి ఇవ్వడానికి మోహినీ రూపం దాల్చి వారి కోరికను తీర్చిన ఆ భగవంతునికి, భక్తులకోరికలను తీర్చడమే తన పనిగా పెట్టుకున్న ఆ పరమాత్మకు భక్తితో నమస్కరిస్తున్నాను." అని శు కమహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత పురాణమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

సందర్భంలో మనం ఒక విషయం జ్ఞాపకం చేసుకోవాలి. పరమశివుడు మోహిని యొక్క అందచందాలకు, ఒంపుసొంపులకు ముగ్ధుడై ఆమె వెంట పడి, ఆమెను కౌగలించుకోగా ఆయనకు రేతఃపతనం అయింది అని తెలుసుకున్నాము. కానీ మనకు ఒక కథ ప్రచారంలో ఉంది. మోహినీ రూపంలో ఉన్న శ్రీహరికీ, ఆమె మీద మోహంతో ఆమె వెంట పడ్డ హరునకు ఒక పుత్రుడు జన్మించాడు అనీ, ఆయనే హరిహరసుతుడు అయ్యప్ప స్వామి అనీ మనకు ఒక గాధ ప్రచారంలో ఉంది. (హరిహరసుతనే అయ్యప్పో అని భజనలు చేయడం మనం చూస్తున్నాము.) కాని అయ్యప్ప స్వామి ఆవిర్భావము గురించి ఇక్కడ వ్యాసమహర్షిప్రస్తావించలేదు. మనకు మోహినీ అవతారము మరొక చోట కూడా కనిపిస్తుంది. అది మోహినీ భస్మాసుర కథలో. అక్కడేమన్నా అయ్యప్పస్వామి ఆవిర్భావం గురించి ప్రస్తావించారేమో చూద్దాం.

ఇంకొక విషయం. సాక్షాత్తు పరమశివుడే ఒక సామాన్య స్త్రీ ఒంపుసొంపులకు లోబడి పోయి ఆమె వెంట పరుగెత్తాడా! ఇది నమ్మదగ్గదేనా! అనిమీకు సందేహం రావచ్చు. అది ఒక సందేహంగా కాకుండా సందేశంగా తీసుకుంటే బాగుంటుంది. ఆ సందేహాన్ని మహాశివుడు పార్వతికి చెప్పిన మాటల్లో తీర్చాడు. ఎంతవారలైనా కాంత దాసులే అని త్యాగయ్య గారు చెప్పారు. అది మానవులకు ఒక హెచ్చరిక మాత్రమే.

కాంత అంటే వ్యామోహము అని అర్థంచేసుకోవాలి కానీ స్త్రీలను కించపరచడం కాదు. వ్యామోహము పలురకాలు.

స్త్రీవ్యామోహము. ధనవ్యామోహము. పదవీవ్యామోహము. ఈ వ్యామోహాలకు లోబడి మంత్రులు, పెద్ద పెద్ద ఆఫీసర్లుకూడా తప్పులు చేసి జైలుపాలవడం మనం చూస్తూనే ఉన్నాము. అటువంటి వాటికి దూరంగా ఉండాలి అని ఒక హెచ్చరికను ఈ ఇతివృత్తం ద్వారా మనకు తెలియజేసాడు వ్యాసమహర్షి అని అర్థం చేసుకుంటే సరిపోతుంది.).

## శ్రీమద్భాగవతము
## అష్టమస్కంధము
## పదమూడవ అధ్యాయము.

(ఇప్పటి దాకా మనము ఆరుగురుమనువుల గురించి తెలుసుకున్నాము. ఈ అధ్యాయములో ఏడవమనువు నుంచి పదునాలుగవ మనువు దాకా తెలుసుకుంటాము. అందుకని మీకు మొదటి మనువునుండి ఆరవ మనువు దాకా మరలా ఒకసారిజ్ఞాపకం చేస్తాను.

మొట్ట మొదటిమనువుపేరు స్వాయంభువమనువు.ఆయన తనకు తానుగా బ్రహ్మదేవుని సంకల్పము నుండి ఆవిర్భవించాడు. ఈ మన్వంతరములోనే పరమాత్మ కపిల మహర్షిరూపంలో అవతరించాడు. సాంఖ్యయోగమును ప్రచారం చేసాడు.

రెండవ మనువు పేరు స్వారోచిష మనువు. ఈ మన్వంతరములో పరమాత్మ విభుడు అనే పేరుతో అవతరించి ఎనుబది వేలమంది ఋషులకు ఆత్మతత్వమును బోధించాడు.

మూడవ మనువుపేరు ఉత్తముడు. ఈ మన్వంతరములోనే పరమాత్మ సత్యసేనుడిగా అవతరించి ఇంద్రునితో కలిసి దుర్మార్గులైన యక్షులను, రాక్షసులను సంహరించాడు.

నాలుగవ మనువుపేరు తామసుడు ఈమన్వంతరములో పరమాత్మ హరి అనేపేరుతో అవతరించాడు. ఈ మన్వంతరములోనే పరమాత్మ శ్రీహరి రూపంలో మొసలిని సంహరించి గజేంద్రుని రక్షించాడు. (గజేంద్రమోక్షము).

ఐదవ మనువుపేరు రైవతుడు. ఈమన్వంతరములోనే పరమాత్మ వైకుంఠుడు అనే పేరుతో అవతరించాడు. ఆయనపేరుతోనే వైకుంఠము అని పేరు వచ్చింది..

చాక్షుసుడు ఆరవమనువు. ఆయన పేరుతోనే చాక్షుస మన్వంతరము అని పిలువబడింది. ఈమన్వంతరములోనే పరమాత్మ అజితుడు అనే పేరుతో ఆవిర్భవించాడు. ఈ మన్వంతరములోనే క్షీరసాగర మధనము, పరమాత్మ కూర్మావతారంగా అవతరించడం, మోహినీ రూపంలో అమృతాన్ని పంచడం, దేవాసుర యుద్ధము జరిగాయి.

తరువాత మన్వంతరము ఏడవ మన్వంతరము. దీనినే వైవస్వత మన్వంతరము అంటారు. ఈ మన్వంతరములోనే మనం ఉన్నాము. మనం సంకల్పం చెప్పుకునేటప్పుడు ద్వితీయ పరార్థే, శ్వేతవరాహ కల్పే, వైవస్వతమన్వంతరే అని చెప్పుకుంటాము. ఇది

శ్వేతవరాహ కల్పము. కల్పము అంటే వేయి యుగములు. అంటే బ్రహ్మకు ఒక పగలు. ఈ వేయియుగములలో పదునాలుగు మన్వంతరములు ఉంటాయి. ఇప్పటికి ఆరు మన్వంతరములు గడిచిపోయాయి. ఏడవ మన్వంతరము అయిన వైవస్వత మన్వంతరములో, కలియుగంలో, ప్రథమ పాదంలో మనం జీవిస్తున్నాము. ఇంక చదవండి. )

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు మన్వంతరముల గురించి ఈ విధంగా చెబుతున్నాడు.

"పరీక్షిత్ మహారాజా! నీకు ఇప్పటి దాకా ఆరుగురు మనువుల గురించి వివరించాను. ఇప్పుడు ఏడవ మనువు గురించి వివరిస్తాను. వివస్వతుని కుమారుడు(సూర్యుని కుమారుడు) శ్రాద్ధదేవుడు. ఈయననే వైవస్వతుడు అని కూడా అంటారు. ఆయనే ఏడవ మనువు. ఆయన పేరుతోనే ఈ మన్వంతరము వైవస్వత మన్వంతరముగా పిలువబడుతూ ఉంది.

ఆయనకు పదిమంది కుమారులు. వారు ఇక్ష్వాకువు, నభగుడు, దృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, తరూషుడు, పృషధ్రుడు, వసుమానుడు. ఈ మన్వంతరములో (అంటే ప్రస్తుతము మనం జీవిస్తున్న వైవస్వతమన్వంతరములో) ఆదిత్యుడు, వసువులు, రుద్రులు, విశ్వేదేవులు, మరుద్గణములు, అశ్వినీ కుమారులు, ఋభువులు అనే పేరుగల వాళ్లు దేవతలు. పురందరుడు అనే పేరు కలవాడు ఇంద్రుడు. కశ్యపుడు, అత్రి, వశిష్ఠుడు,

విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు అనే వారుసప్తఋషులు. ఈ మన్వంతరములోనే అదితికి పరమాత్మ వామనుడుగా ఆవిర్భవించాడు. ఆయన ఆదిత్యులలో ఆఖరివాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటి దాకా నీకు ఏడు మన్వంతరముల గురించి వివరించాను. ఇంక రాబోయే మన్వంతరముల గురించి వివరిస్తాను.

సూర్యునికి ఇద్దరు భార్యలు. వారి పేర్లు సంజ్ఞ, ఛాయ. వీరు విశ్వకర్మ కుమార్తెలు. వీరే కాకుండా సూర్యునికి మరొక భార్య కూడా ఉంది. ఆమె పేరు బడబ. ఈ ముగ్గురు భార్యలలో సంజ్ఞ అనే భార్యకు యముడు, శ్రాద్ధదేవుడు అనే కుమారులు, యమి అనే కుమార్తె కలిగారు. ఛాయ అనే భార్యకు సావర్ణి అనే కుమారుడు, తపతి అనే కుమార్తె కలిగారు. తపతిని సంవర్ణుడు అనే రాజు వివాహం చేసుకున్నాడు. ఛాయ యొక్క మూడవ కుమారుని పేరు శనైశ్చరుడు. బడబ అనే ఆమెకు అశ్వినీ కుమారులుజన్మించారు.

సూర్యుని కుమారులలో సంజ్ఞ కుమారుడు శ్రాద్ధదేవుడు ఏడవ మనువు అయితే, ఎనిమిదవ మన్వంతరములో సూర్యుని భార్య ఛాయ కుమారుడు సావర్ణి మనువు అయ్యాడు. సావర్ణికి నిర్మోకుడు, విరజస్కుడు అనే పుత్రులు కలిగారు. ఎనిమిదవ మన్వంతరములో సుతపుడు, విరజుడు, అమృతప్రభుడు అనే వారు దేవతలు. ఆ మన్వంతరములో బలి ఇంద్రపదవిలో ఉంటాడు.

ఇది ఎలా జరిగింది అంటే ఈ మన్వంతరములోనే వామనావతారంలో బలిని మూడు అడుగుల భూమిని ఇమ్మని విష్ణువు యాచిస్తాడు. బలి ఈ భూమినంతా విష్ణువుకు దానంగా ఇచ్చి, ఇంద్రపదవిని వదిలిపెట్టాడు. విష్ణువు బలిని బంధించాడు. తరువాత బలిని సుతలము అనే లోకానికి అధిపతిని చేసాడు. సుతలము స్వర్గము కంటే గొప్పది. తరువాతి మన్వంతరములో అంటే ఎనిమిదవ మన్వంతరములో బలి ఇంద్రుడు అయ్యాడు.

ఈ ఎనిమిదవ మన్వంతరములో గాలవుడు,దీప్తిమానుడు, పరశురాముడు, అశ్వత్థామ, కృపుడు, ఋష్యశృంగుడు, వ్యాసుడు మొదలగు వారు సప్తఋషులుగా ఉంటారు. ఈ ఎనిమిదవ మన్వంతరములోనే పరమాత్మ సార్వభౌముడు అనే పేరుతో అవతరించి, పురందరుని వద్దనుండి స్వర్గాధిపత్యమును తీసుకొని బలిని ఇంద్రునిగా చేస్తాడు.

తరువాత వరుణుని కుమారుడు అయిన దక్షసావర్ణి తొమ్మిదవ మనువు అవుతాడు. ఆయన కుమారులు భూతకేతువు, దీప్తకేతువు మొదలగువారు. ఈ తొమ్మిదవ మన్వంతరములో పారుడు, మరీచిగర్భుడు మొదలగు వారు దేవతలు. అద్భుతుడు అనే వాడు ఇంద్రపదవిని అధిష్టిస్తాడు. ద్యుతిమంతుడు మొదలగు వారు సప్తఋషులుగా ఉంటారు. ఈమన్వంతతరములో ఆయుష్మంతుడు, అంబుధార అనే దంపతులకు పరమాత్మ ఋషభదేవుడు అనే పేరుతో జన్మిస్తాడు.

తరువాత ఉపశ్లోకుని కుమారుడు అయిన బ్రహ్మసావర్ణి పదవ మనువు అవుతాడు. అతనికి భురిషేణుడు మొదలగు వారు కుమారులుగా జన్మిస్తారు. హవిష్మంతుడు, సుకృతుడు, సత్యుడు, జయుడు, మూర్తి మొదలగు వారు సప్తఋషులు. సువాసునుడు, విరుద్ధుడు మొదలగు వారు దేవతలు. శంభువు అనే వాడు ఇంద్రుడు. ఈ మన్వంతరములో భగవానుడు విష్వక్సేనుడు అనే పేరుతో ఆవిర్భవిస్తాడు. విష్వక్సేనుడు అప్పటి ఇంద్రుడైన శంభునితో స్నేహంగా ఉంటాడు.

తరువాత ధర్మసావర్ణి పదకొండవమనువు అవుతాడు. ఆయనకు సత్యము, ధర్మము అనే పదిమింది కుమారులు కలుగుతారు. ఈ మన్వంతరములో విహంగమ గణములు, కామగమ గణములు, నిర్వాణరుచి మున్నగు వారు దేవతలు. వైధృతుడు అనే వాడు ఇంద్రుడు. అరుణుడు మొదలగు వారు సప్తఋషులు. ఈ మన్వంతరములో భగవానుడు ధర్మసేతువు అనే పేరుతో ఆర్యకుడు, వైధృతి అనే దంపతులకు జన్మిస్తాడు. ఈ ధర్మసేతువు, వైధృతుడు అనే పేరుతో మూడులోకములను పాలిస్తాడు. (అంటే ఆ మన్వంతరములో ఇంద్రుడు లేడు. ఈయనే ఇంద్రుడు.)

తరువాత రుద్రసావర్ణి పన్నెండవ మనువు. ఆయనకు దేవవానుడు, ఉపదేవుడు, దేవశ్రేష్టుడు మొదలగు వారు కుమారులు. ఈ మన్వంతరములో ఋతధాముడు ఇంద్రుడు. హరితుడు మొదలగు వారు దేవతలు. అగ్నిధృక్కు మొదలగు వారు సప్తఋషులు. ఈ మన్వంతరములో భగవానుడు సత్యసహునికి, సూనృతకు స్వధామ అనే పేరుతో జన్మిస్తాడు. ఈ మన్వంతరమును ఆయనే పాలిస్తాడు.

తరువాత దేవసావర్ణి పదమూడవ మనువు అవుతాడు. దేవ సావర్ణికి చిత్రసేనుడు, విచిత్రుడు మొదలగు వారు కుమారులు. ఈ మన్వంతరములో సుకర్ముడు, సుత్రాముడు మొదలగు వారు దేవతలు. దివస్పతి అనే వాడు ఇంద్రుడు. నిర్మోకుడు, తత్త్వదర్శుడు మొదలగు వారుసప్తఋషులు. ఈ మన్వంతరములో శ్రీహరి దేవహోతుని కుమారుడుగా జన్మిస్తాడు. ఆయన పేరు యోగీశ్వరుడు.

ఇంద్రసావర్ణి పదునాలుగవ మనువు. ఉరువు, గంభీరుడు, బుధుడు మొదలగు వారు ఇతని కుమారులు. ఈ మన్వంతరములో పవిత్రుడు, చాక్షుషుడు మొదలగు వారు దేవతలు. శుచి అనే పేరు గల వాడు ఇంద్రుడు. అగ్ని, బాహువు, శుచి, శుద్ధుడు, మాగధుడు మొదలగు ఋషులు సప్తఋషులుగా ఉంటారు. ఈ మన్వంతరములో భగవానుడు సత్రాయణుడు, వితాన అనే దంపతులకు పుత్రుడుగా జన్మిస్తాడు. ఆయనపేరు బృహద్భానుడు. ఈయన లోకములో క్రియలను ఎలా చెయ్యాలి అంటే యజ్ఞయాగాదులు ఎలా చెయ్యాలి అనే విషయాలను బోధిస్తాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు జరిగిన, జరుగుతున్న, జరగబోయే మన్వంతరముల గురించి వివరించాను. ఈ పదునాలుగు మన్వంతరముల కాలముతో వేయి యుగములు కలిగిన కల్పము పూర్తి అవుతుంది.

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము

పదునాలుగవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఆయా మన్వంతరముల గురించి చెబుతూ ఉంటే పరీక్షిత్ మహారాజు ఈ విధంగా అడిగాడు.

"మహర్షీ! నీవు పదునాలుగు మన్వంతరముల గురించి చెప్పావు. ఆయా మన్వంతరములలో మనువులు మొదలగు వారు, ఎవరెవరు ఏయే కర్మల యందు నియమింపబడ్డారో వివరంగా తెలియజేయండి." అని అడిగాడు. అప్పుడు శుకమహర్షి ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! మనువులు, మనుపుత్రులు, మునులు, ఇంద్రులు, సకల దేవతాగణములు అందరూ ఆ పరమాత్మయొక్క ఆజ్ఞను అనుసరించి వివిధ కర్మలు చేయడానికి నియమింపబడ్డారు. ఒక్కొక్క మన్వంతరములో భగవానుడు ఒక్కొక్క అవతారం ఎత్తాడు అని చెప్పాను కదా. ఆయా మన్వంతరములలో ఉన్న మనువు, ఇంద్రుడు, దేవతలు, సప్తఋషులు ఆయా మన్వంతరము లలో అవతరించిన పరమాత్మయొక్క అవతారములచే ప్రేరేపింపబడి వారి వారి విద్యుక్త ధర్మములను నిర్వర్తించేవారు. నాలుగు యుగములు అయిపోగానే, కాలానుగుణంగా వేదములు అందరూ మరిచిపోయేవారు. ఆసమయంలో ఋషులు తమ తపోబలముతో,

జ్ఞాపక శక్తితో గుర్తు తెచ్చుకొని మరలా వాటిని రూపొందించేవారు. వేదములు రూపుదిద్దుకోగానే సనాతన ధర్మము కూడా మరలా ప్రతిష్టింపబడేది. మనువులు ఆయా మన్వంతరములలో ధర్మమును నాలుగుపాదములతో నడిపిస్తూ, ప్రజలను కన్నబిడ్డలవలె పాలించేవారు.(నాలుగుపాదములు అనగా తపోధర్మము, శౌచధర్మము, దయాగుణము, సత్యము పలకడం)

మనువుల యొక్క పుత్రులు, పౌత్రులు సృష్టి క్రమమును కొనసాగించేవారు. మనువులు యజ్ఞయాగములు చేసి ఋషులను, యజ్ఞములో భాగములు ఇచ్చి దేవతలను, కవ్యములు ఇచ్చి పితృదేవతలను తృప్తిపరచేవారు. ఆయామన్వంతరములలో నియమింపబడ్డ ఇంద్రులు, దేవలోకమును పరిపాలిస్తూ సురలోక భోగములను అనుభవించేవారు. మానవులకు కావలసిన వర్షములను సకాలంలో కురిపిస్తూ భూమిని సస్యస్యామలము చేసేవారు.

శ్రీహరి ప్రతి మన్వంతరములోనూ సిద్ధులరూపంలో అవతరించి జ్ఞానమును, ఋషులరూపంలో అవతరించి యజ్ఞయాగములు మొదలగుకర్మకాండలను, యోగుల రూపములో అవతరించి యోగశాస్త్రమును బోధించేవాడు. అలాగే భగవానుడు తన అంశలతో మరీచి మొదలగు ప్రజాపతులుగా అవతరించి ప్రజలను సృష్టించేవాడు. క్షత్రియులుగా అవతరించి ప్రజలను పాలించేవాడు. దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేసేవాడు. కాలస్వరూపుడుగా, మానవులకు బాల్య, యౌవన, వృద్ధాప్యములను, మరణమును కలిగించేవాడు. కాని జనులు మాత్రము మాయ అనే మోహములో చిక్కుకొని, ఏ

రూపమూ లేని పరమాత్మకు వివిధ రూపములను కల్పించి, వివిధ శాస్త్రముల ప్రకారము పూజాదికములను సృష్టించి, వివిధ రకములైన భగవత్తత్వములను నిరూపించడానికి ప్రయత్నం చేసేవారు. అటువంటి వారు ఎన్నటికి కూడా పరమాత్మను దర్శించలేరు. పరమాత్మ అనుగ్రహమును పొందలేరు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఒక కల్పములో వచ్చే ఈ పదునాలుగు మన్వంతరములను అవాంతర కల్పములు అని అంటారు. ఈ అవాంతర కల్పముల గురించి నీకు వివరించాను." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు అవాంతరకల్పముల గురించి, ఆయామన్వంతరములలో జరిగిన, జరగబోవు కర్మల గురించి వివివరించాడు.

శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము
పదునైదవ అధ్యాయము.

పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని ఇలా అడిగాడు. "మహాత్మా! ఈ విశ్వమునకు అంతకూ అధిపతి పరమాత్మ అని అన్నారుకదా! మరి ఆ పరమాత్మ అంశ అయిన శ్రీమహావిష్ణువు, మూడులోకములకు అధిపతి అయిన విష్ణువు, ఏమీ లేని వాడిమాదిరి

బలిని మూడుఅడుగులు నేల ఎందుకు అడిగాడు. శ్రీమహావిష్ణువు అంత లేని వాడు  కాదుకదా! పోనీ అడిగాడే అనుకుందాము. మూడు అడుగులు ఇచ్చిన తరువాత కూడా బలి చక్రవర్తిని ఎందుకు బంధించాడు. బలి చేసిన అపరాధము ఏమి! నిరప రాధిని బంధించడం అధర్మము కదా! ఈ విషయములు అన్నీ తెలుసుకొనవలెనని నాకు కుతూహలముగా ఉంది." అని అడిగాడు.

శుకమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు. "పరీక్షిత్ మహారాజా! దేవతలకు దానవులకు యుద్ధం జరిగింది అని చెప్పాను కదా! ఆ యుద్ధంలో దేవతలు జయించడం, దానవులు ఓడిపోవడం, బ్రహ్మదేవుడు నారదుని పంపి, యుద్ధము ఆపించడం గురించి తెలుసుకున్నాము.

దేవతలకు దానవులకు జరిచిన యుద్ధంలో బలి చక్రవర్తి చనిపోయాడు. శుక్రాచార్యుడు తనకు తెలిసిన మృతసంజీవనీ విద్యను ఉపయోగించి బలి చక్రవర్తిని బతికించాడు. ఆ విశ్వాసంతో బలి శుక్రాచార్యుల వారిని తన గురువుగా చేసుకొని, శుక్రాచార్యులవారిని, బ్రాహ్మణులను భక్తితో పూజించాడు.  గురువు గారికి  అపారమైన ధనము, సంపదలు సమర్పించాడు. బలిచక్రవర్తి మనసులో ఎప్పుడెప్పుడు స్వర్గమును జయించి స్వర్గాధిపత్యము స్వీకరిద్దామా అనే బలంగా ఉంది.. సమయం కోసరం వేచి ఉన్నాడు.

భృగు వంశస్థులు అయిన బ్రాహ్మణులకు (శుక్రాచార్యులు, మొదలగువారు) బలి చక్రవర్తిమీద అపారమైన ప్రేమ, మమకారము

పుట్టాయి. బలి చక్రవర్తి మనసులో కోరిక తెలుసుకున్నారు. ముందుగానే బలిచక్రవర్తిని మూడులోకములకు చక్రవర్తిగా అభిషేకించారు. తరువాత, బలిచక్రవర్తికి దేవతలతో జరగబోయే యుద్ధములో జయం కలగడానికి, బలిచక్రవర్తిచేత విశ్వజిత్ యాగము చేయించడానికి సంకల్పించారు. బలిచక్రవర్తి నిర్విఘ్నముగా విశ్వజిత్ యాగమును పూర్తి చేసాడు.

ఆ యజ్ఞకుండములో నుండి ఒక బంగారు రథము, ఇంద్రుని రథమునకు కట్టిన అశ్వముల వంటి ఉత్తమ అశ్వములు, సింహము కేతనంగా ఒక ధ్వజము బయటకు వచ్చాయి. తరువాత ఒక దివ్యమైన ధనుస్సు, రెండు అక్షయ తూణీరములు, ఒక దివ్యమైన కవచము బయటకు వచ్చాయి. ( తూణీరము అంటే బాణములు పెట్టుకొనే పొది. అందులో బాణములనుపెట్టుకొని వీపుకు కట్టుకుంటారు. అక్షయతూణీరము అంటే ఎన్నిబాణాలు తీసినా, ఎప్పుడూ నిండుగా ఉండేది అని అర్థం.)

బలి చక్రవర్తి తాతగారైన ప్రహ్లాదుడు ఒక పుష్పమాలను బహూకరించాడు. శుక్రాచార్యుడు బలికి ఒక శంఖమును బహూకరించాడు. బలి తన తాతగారైన ప్రహ్లాదునికి భక్తితో నమస్కరించాడు. తరువాత బలి చక్రవర్తి యజ్ఞకుండములోనుండి బయటకు వచ్చిన కవచమును, అక్షయ తూణీరమును, విల్లును ధరించి, బంగారు రథమును ఎక్కాడు. దివ్యమైన రథము మీద ఉన్న బలి అగ్నివలె ప్రకాశిస్తున్నాడు. బలిచక్రవర్తి యొక్క సైన్యాధిపతులు అందరూ యుద్ధానికి సర్వసన్నద్ధమై అక్కడకు వచ్చారు. దానవ సైన్యములను యుద్ధమునకు సమాయత్తం చేసారు.

బలి సకల సైన్యములతో కలిసి ఇంద్రపురికి వెళ్లాడు. ఇంద్రుని నగరము అమరావతి. దానినే స్వర్గము, స్వర్గపురి అని అంటారు. ఆ స్వర్గపురము దేవతా వృక్షములతో, ఫలపుష్పములతో శోభిల్లుతూ ఉంటుంది. స్వర్గంలో అప్సరసలు తమ ఆటపాటలతో స్వర్గలోకవాసులను రంజింపజేస్తుంటారు. . ఆకాశ గంగ అక్కడ ప్రవహిస్తూ ఉంటుంది. స్వర్గపురము చుట్టు ప్రాకారములు ఉన్నాయి. వాటిమీద సైనికులు కాపలా కాస్తుంటారు. స్వర్గంలో ఉన్న అన్ని గృహములు బంగారము చేత నిర్మించబడ్డాయి. స్వర్గంలో ఉన్న వీధులు పొడవుగా విశాలంగా సమాంతరంగా ఉన్నాయి. స్వర్గంలో కోట్లకొలది ఎత్తైనభవనములు ఉన్నాయి. స్వర్గములో వజ్రములు, పగడములుతో అలంకరింపబడిన వేదికలు అక్కడక్కడా కనిపిస్తాయి.

విశ్వకర్మ ఈ స్వర్గపురమును నిర్మించాడు. స్వర్గంలో ఉన్న వారందరి రూపము, యౌవనము స్థిరంగా ఉంటుంది. వారికి జరామరణములు లేవు. స్వర్గములో ఎల్లప్పుడూ సంగీత ధ్వనులు, వీణామృదంగ వేణునాదాలు శ్రావ్యంగా వినబడుతూ ఉంటాయి. స్వర్గలోకంలోకి పాపులకు, దుష్టులకు, హింసచేసేవారికి, కాముకులకు, లోభులకు, మూఢులకు ప్రవేశము లేదు.

అటువంటి స్వర్గము మీదికి బలి చక్రవర్తి సైన్యసమేతుడై దాడి చేసాడు. స్వర్గమును నాలుగు వైపుల నుండి ముట్టడించాడు. శుక్రాచార్యుడు తనకు ఇచ్చిన శంఖమును బలిచక్రవర్తి పూరించాడు. ఆ శంఖధ్వని విని దేవతల గుండెలు గుభిల్లుమన్నాయి. అందరూ దేవతల గురువైన బృహస్పతి వద్దకు వెళ్లారు. ఇంద్రుడు బృహస్పతితో

ఇలా అన్నాడు.

"గురువర్యా! ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. మా చేతిలో ఓడిపోయి చావుదెబ్బలు తిన్న బలి, దానవులు ఇంతలో ఎలా పుంజుకోగలిగారు. అసలు బలికి ఇంత ధైర్యం, పరాక్రమము, ఎలా వచ్చాయి. ఎవరైనా సరే ఏదో ఒక ఉపాయం లేనిదే ఇంత త్వరగా బలాన్ని పుంజుకోరు. దేవతల మీద  ప్రతీకారానికి పూనుకోరు. ఈబలి ప్రళయకాల అగ్ని వలె విజృంభిస్తున్నాడు. కారణం ఏమిటో  తెలియడం లేదు. ఏ కారణం చేత బలికి ఇంతటి ధైర్యము, బలము, శక్తి వచ్చాయి. ఎవరి అండ చూచుకొని బలి ఇంతగా విజృంభిస్తున్నాడు. నాకు జన్మశత్రువైన దానవ రాజుకు ఇంతటి బలపరాక్రమములు అకస్మాత్తుగా కలగడం నేను సహించలేకపోతున్నాను." అని తన అక్కసునంతా వెళ్లగక్కాడు ఇంద్రుడు.

దానికి బృహస్పతి ఇలా సమాధానం చెప్పాడు. "దేవేంద్రా! ఇందులో పెద్ద రహస్యం ఏమీ లేదు. ఇది అందరికీ తెలిసిన విషయమే. (నీకు తెలియకపోవడం నీ అహంకారం వలననే అని ఎత్తిపొడిచాడు.) శుక్రాచార్యుడు రాక్షసులకు గురువు. భృగువంశీయులైన బ్రాహ్మణులను పూజించడం వలననే దానవులకు ఇంతటి తేజస్సు కలిగింది. ప్రస్తుత పరిస్థితులలో బలిని ఎదిరించడానికి ఎవ్వరూ సమర్థులు కారు. ఒక్క శ్రీహరి తప్ప నీవు కూడా బలిని ఎదిరించలేవు.

నీవు బలిని జయించాలంటే అతడు అధర్మం చేయాలి. అప్పటి వరకూ నీవు ఓపిక పట్టాలి. కాబట్టి మీరందరూ స్వర్గాధిపత్యమును బలికి అప్పగించి మీరు అజ్ఞాతంలోకి వెళ్లిపొండి. ఎప్పుడైతే బలి బ్రాహ్మణులను అవమానిస్తాడో అప్పుడే అతని బలపరాక్రమములు నశిస్తాయి. ఆ సమయంలో మీరు బలిని జయించవచ్చును. అప్పటి వరకూ వేచి ఉండండి." అని పలికాడు బృహస్పతి.

బృహస్పతి మాట ప్రకారము దేవతలు, ఇంద్రుడు స్వర్గమును వదిలిపెట్టి పారిపోయారు. తనను ఎదిరించే వారు స్వర్గలోకంలో లేకపోవడంతో బలి చక్రవర్తి మూడులోకములను తన  అధీనంలోకి తెచ్చుకున్నాడు. భృగువంశీయులైన బ్రాహ్మణులు బలి చేత నూరు అశ్వమేధయాగములు చేయించారు.

(నూరు అశ్వమేధ యాగములు చేయడం ఇంద్రపదవిని అధిష్ఠించడానికి నిర్ణయించబడ్డ అర్హత. వృత్రాసురుని చంపిన ఇంద్రుని బ్రహ్మహత్యాపాతకము చుట్టుకుంటే ఇంద్రుడు పారిపోయాడు. అప్పుడు సప్తఋషులు అందరూ నూరు అశ్వమేధయాగములు చేసిన నహూషుని తెచ్చి ఇంద్రపదవిలో కూర్చోబెట్టారు. నహూషుని బుద్ధి పెడతోవ బట్టి ఇంద్రుని భార్యను కోరి, పతనమయ్యాడు.  ఇంద్ర పదవిని అధిష్ఠించడానికి అర్హతగా భృగు వంశీయులైన బ్రాహ్మణులు బలి చేత నూరు అశ్వమేధయాగములు చేయించారు.)

నూరు అశ్వమేధయాగములు చేయడం వలన బలి చక్రవర్తి కీర్తి నలుదిక్కులా వ్యాపించింది. ఎల్లప్పుడూ గురువును, బ్రాహ్మణులను పూజిస్తూ ధర్మంగా మూడులోకములను పాలిస్తున్నాడు బలిచక్రవర్తి" అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు బలిచక్రవర్తి స్వర్గలోకాధిపత్యమును పొందిన విధానమును వివరించాడు..

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణ

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము

పదునారవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా దేవతలు, ఇంద్రుడు స్వర్గం విడిచి పారిపోగా, దానవేంద్రుడైన బలి స్వర్గాధిపత్యమును స్వీకరించాడు. ఈ విషయం తెలిసి ఇంద్రునికి తల్లిఅయిన అదితి, తన కుమారులకు సంభవించిన దుర్దశకు ఎంతో చింతించింది. తాను అనాథ అయినట్టు బాధపడింది. తన భర్త అయిన కశ్యపుని రాక కోసరం ఎదురు చూస్తూ ఉంది.

అంతకు ముందే తపస్సుచేసుకోడానికి వెళ్లిన కశ్యపుడు అదితి వద్దకు తిరిగి వచ్చాడు. అదితి తన భర్తఅయిన కశ్యపునికి అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించింది. ఉచితాసనము మీద కూర్చుండబెట్టింది. చాలా కాలం తరువాత వచ్చిన కశ్యపుడు భార్య

అదితితో ఇలా అన్నాడు.

"అదితీ! అందరూ బాగున్నారా! బ్రాహ్మణులకు, మానవులకు, ధర్మమునకు ఎట్టి హానీ జరగడం లేదు కదా! మన గృహములో కూడా ఎటువంటి అశుభము జరగలేదు కదా! నీవు అతిథులను చక్కగా ఆదరించి పూజిస్తున్నావు కదా! ఏ అతిథి కూడా మన ఇంటి నుండి ఆదరింపబడకుండా వెళ్లలేదు కదా! ఎందుకంటే అతిథులను సత్కరించని గృహము శ్మశానముతో సమానముఅంటారు.

అది సరే! నీ ముఖము ఎందుకో చింతాక్రాంతమై ఉంది. మన ఇంటిలో అగ్నికార్యములు, హోమములు సక్రమంగా జరుగుతున్నాయి కదా! అగ్ని, బ్రాహ్మణులు విష్ణుదేవుని ముఖముతో సమానము. అటువంటి అగ్నిని, బ్రాహ్మణులను ఏమరకుండా పూజిస్తున్నావు కదా! ఇంతకూ నీ కుమారులు అయిన దేవతలు క్షేమంగా ఉన్నారా! వారికి ఎటువంటి ఆపద కలుగలేదు కదా! నీ చింతకు కారణం తెలిపి నాకు స్వస్థత కలిగించు." అని అడిగాడు కశ్యపుడు.

అప్పుడు దితి తన భర్త కశ్యపునితో ఇలా అంది. "నాథా! బ్రాహ్మణులు, గోవులు, అగ్నులు,ధర్మము,మానవులు అందరూ క్షేమంగాఉన్నారు. నేను నిత్యము అగ్నిని, బ్రాహ్మణులను పూజిస్తున్నాను. అతిథులను యధోచితంగా సత్కరిస్తున్నాను. ఎవరికీ ఎటువంటి లోపము రానీయడం లేదు. తమరు నా భర్తగా ఉండగా, నా వలన ధర్మహాని ఎలాజరుగుతుంది?

నాథా! దేవతలు, దైత్యులు నీ కుమారులు. వారు వారి వారి ప్రవృత్తులను అనుసరించి, సత్త,రజస్తమోగుణములను ఆశ్రయించి ఉన్నారు. నీవు మాత్రము నీ కుమారులను అందరినీ సమానంగా ఆదరిస్తున్నావు. ఆ పరమాత్మ కూడా అందరినీ సమంగా ఆదరిస్తున్నాడు. కాని నీ కుమారులు అయిన దేవాసురులు ఒకరితో ఒకరు కొట్టుకుంటున్నారు. ప్రస్తుతము నా కుమారుడు అయిన ఇంద్రుడు, అసురుల చేతిలో పరాజయం పొంది, తన ఇంద్ర పదవిని కోల్పోయి, అజ్ఞాతంలో కష్టాలు అనుభవిస్తున్నాడు. మీరు అతనిని రక్షించాలి.

దైత్యులు దేవతల మీద దండెత్తి, వారిని ఓడించి స్వర్గమును స్వాధీనం చేసుకున్నారు. దేవతలు అనాధలయ్యారు. నీవే వారిని రక్షించాలి. బలిచక్రవర్తి నాయకత్వములోని దైత్యులు నా యొక్క నా కుమారుల యొక్క (దేవతలయొక్క) ఐశ్వర్యమును, ముల్లోకముల మీద అధికారమును బలవంతంగా అపహరించారు. నీవు మా అందరినీ రక్షించాలి. మా శత్రువులు అయిన దైత్యులు మా యొక్క సంపదలను, మా కీర్తిని, లాక్కొని మా అందరినీ వెళ్లగొట్టారు. ఆ కారణం చేత నేను నిరంతర దు:ఖములో మునిగిఉన్నాను. మరలా దేవతలకు, ఇంద్రునికి తాము కోల్పోయిన పదవులు తిరిగిపొందేటట్టు చేయడానికి ఏమి చెయ్యాలో అది చేయండి. దానికి తగిన ఉపాయములను ఆలోచించండి." అని పలికింది అతిది.

(కశ్యపుని భార్య అయిన అదితికి కూడా పుత్రవ్యామోహము తప్పలేదు. ప్రస్తుతము కూడా తనకుమారుడు ముఖ్యమంత్రి కావాలని ఒక తల్లి, తన అన్న ముఖ్య మంత్రి కావాలని ఒక చెల్లి ఎంత తపన

పడుతున్నారో, తమ కుటుంబం నుండి ముఖ్యమంత్రి పదవిని లాక్కుని మమ్ములను అనాధలను చేసారని ఎంత ఆవేదన చెందుతున్నారో, మనం రోజూ చూస్తూనే ఉన్నాము. యుగాలు మారినా, మనస్తత్వాలు మారలేదు అంటే ఇదేనేమో!)

తన భార్య అతిది మాటలు విన్న కశ్యపుడు ఆమెతో ఇలా అన్నాడు. "దేవీ! విష్ణుమాయతో కప్పబడి ఉన్న ఈ అనంత సృష్టిలో గెలుపు ఓటములు సహజమే కదా! దానికి ఇంత చింతించాలా! ఈ రోజు ఓడిన వారు రేపు గెలుస్తారు కదా! అయినా! గెలుపు ఓటములు ఈ దేహమునకు సంబంధించినవి. ఈ దేహమే శాశ్వతము కానపుడు, ఈ గెలుపు ఓటమి శాశ్వతమా!

ఈ దేహము పంచభూతములతో ఏర్పడింది. ఆ దేహము లో పరమాత్మ ఆత్మస్వరూపుడై స్థిరంగా ఉన్నాడు. ఆయన ప్రకృతి కంటే అతీతుడు. భార్య, పుత్రులు, గెలుపు, ఓటమి అన్నీ ఈ దేహమునకు సంబంధించినవి. ఈ బంధములు, మోహమే దీని కంతటికీ కారణము. ఈ మోహమును దాటాలంటే భగవన్నామమే శరణ్యము. ఆయనే సృష్టిస్థితిలయకారుడు. సకలభూతములలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఆయనకు అందరూ సమానమే. సమయం వచ్చినప్పుడు ఆయనే నీ కుమారులకు కూడా శుభం చేకూరుస్తాడు. నీవు ఆ శ్రీహరిని ధ్యానించు. ఆయన నీ కోరికను తప్పక తీరుస్తాడు." అని పలికాడు కశ్యపుడు.

ఆ మాటలు విన్న అదితి భర్తతో ఇలా అంది. "నాధా! నన్ను ఆ శ్రీహరిని సేవించమని అన్నారు కదా! ఎలా సేవించాలి. దానికి విధివిధానము ఏమిటి? ఆ శ్రీహరి నా కోరిక ఎలా తీరుస్తాడో వివరించండి. ఆ దైత్యులను నాశనం చేసే కుమారుడు నాకు కలగడానికి ఏం చెయ్యాలో నాకు ఉపదేశించండి." అని ఆదుర్దాగా అడిగింది. అప్పుడు కశ్యపుడు ఈ విధంగా చెప్పాడు.

"దేవీ! ఇంతకు ముందు మనకు సంతానము లేనపుడు, నేను బ్రహ్మదేవుని ఇదే విషయం గురించి అడిగాను. ఆయన నాకు శ్రీహరి ప్రీతి చెందే వ్రతమును ఒక దానిని నాకు ఉపదేశించాడు. అదే వ్రతమును నేను నీకు ఉపదేశిస్తాను. సావధానంగా విను.

(ఈ రోజుల్లోకూడా సంతానము లేని దంపతులు చాలా మంది ఉన్నారు. వారు ఎంతోమంది వైద్యులను ఆశ్రయించి లక్షలు ఖర్చుచేస్తున్నారు. దైవయత్నంగా ఈ వ్రతం చేస్తే ఫలితం ఉంటుందేమో ఆలోచించండి. అందుకే ఈ వ్రతవిధానమును అందులో మంత్రములను వివరిస్తున్నాను.)

"అదితీ! ఈవ్రతము పన్నెండు రోజులు ఆచరించాలి. ఈ పన్నెండురోజులు విష్ణుదేవుని భక్తితో పూజించాలి. అడవులలో అడవిపందులు తిరుగుతుంటాయి. అవి మట్టిని తవ్విపోస్తుంటాయి. ఆ మట్టిని సేకరించి, దానిని ఒంటికి పట్టించుకొని, నేను చెప్పబోయే మంత్రమును జపిస్తూ నదీ ప్రవాహంలో స్నానం చేయాలి. (దీనినే మృత్తికా స్నానము అంటారు. ఈ రోజుల్లో అటువంటి మట్టి దొరకదు కాబట్టి మామూలు మృత్తికా స్నానం చెయ్యవచ్చు.)

త్వం దేవ్యాది వరాహేణ రసాయా: స్థానమిచ్ఛతా।
ఉ ద్దృతాసి నమస్తుభ్యం పాప్మానం మే ప్రణాశయ॥

తరువాతరోజువారీ చేసే పూజలను అన్నీ యథావిధిగా చెయ్యాలి. విష్ణుమూర్తి ప్రతిమను ఒక మండపములో ప్రతిష్ఠించాలి. విష్ణుభగవానుని ఈ విధంగా స్తోత్రం చెయ్యాలి.

నమస్తుభ్యం భగవతే పురుషాయ మహీయసే।
సర్వభూతనివాసాయ వాసుదేవాయ సాక్షిణే॥

నమో అవ్యక్తాయ సూక్ష్మాయ ప్రధానపురుషాయ చ।
చతుర్వింశద్గుణజ్ఞాయ గుణసంఖ్యానహేతవే॥

నమో ద్విశీర్ష్ణే త్రిపదే చతు:శృఙ్గాయతన్తవే।
సప్తహస్తాయ యజ్ఞాయ త్రయీవిద్యాత్మనే నమ:॥

నమశ్శివాయ రుద్రాయ నమశ్శక్తిధరాయ చ।
సర్వవిద్యాధిపతయే భూతానాం పతయే నమ:॥

నమో హిరణ్యగర్భాయ ప్రాణాయ జగదాత్మనే।
యోగైశ్వర్యశరీరాయ నమస్తే యోగహేతవే॥

నమస్తే ఆదిదేవాయ సాక్షిభూతాయ తే నమ:।

## అష్టమస్కంధము

నారాయణాయ ఋషయే నరాయ హరయేనమః॥

నమో మరకతశ్యామవపుషే అధిగతశ్రియే।
కేశవాయ నమస్తుభ్యం నమస్తే పీతవాససే॥

త్వం సర్వవరద: పుంసాం వరేణ్య వరదర్షభ।
అతస్తే శ్రేయసే ధీరా: పాదరేణుముపాసతే॥

అన్వవర్తన్త యం దేవా: శ్రీశ్చ తత్పాదపద్మయోః।
స్పృహయన్త ఇవామోదం భగవాన్ మే ప్రసీదతామ్॥

పై చెప్పిన మంత్రములతో శ్రీహరిని ఆవాహన చేసి శ్రద్ధతో అర్ఘ్యము, పాద్యము, ఆసనము మొదలగు ఉపచారములతో పూజించవలెను. తరువాత గంధము, పూలు, అక్షతలు మొదలగు వాటితో విష్ణువును అర్చించవలెను. తరువాత విష్ణుభగవానుని ప్రతిమకు పాలతో అభిషేకము చేయవలెను. తరువాత వస్త్రము, ఉపవీతము, అలంకారములు, పాద్యము, ధూపము, గంధము మొదలగు ఉపచారములను చేయవలెను. శక్తి కొలదీ నేయి, బెల్లము, బియ్యము తో వండిన పాయసమును నివేదనపెట్టవలెను. తరువాత మూల మంత్రమును జపిస్తూ ఆ పాయసమును హోమాగ్నిలో ఆహుతి చేయవలెను.

(మూల మంత్రము అంటే ద్వాదశాక్షరి...
ఓం నమో భగవతే వాసుదేవాయ
(లేక) ఓం నమో నారాయణాయ).

తరువాత ఆ పాయసమును తనతోటి భక్తులతో కలిసి భుజించవలెను. తరువాత విష్ణుమూర్తికి ఆచమనము ఇచ్చి తాంబూలమును సమర్పించవలెను. తరువాత మూల మంత్రమును (ఓం నమో భగవతే వాసుదేవాయ) 108 సార్లు జపించవలెను. తరువాత విష్ణుమూర్తికి సాష్టాంగ ప్రమాణము ఆచరించవలెను. తరువాత విష్ణుమూర్తిని పూజించిన నిర్మాల్యమును కళ్లకద్దుకొని శిరస్సున ధరించవలెను. విష్ణుమూర్తి ప్రతిమకు ఉద్వాసన చెప్పవలెను. తరువాత నివేదన చేసిన పాయసముతో సహా బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. బ్రాహ్మణులు తృప్తిగా భోజనము చేసిన తరువాత, వారి అనుమతితో బంధువులతో కలిసి భుజించవలెను. ఆ రాత్రికి నేల మీద పడుకోవలెను. బ్రహ్మచర్యమును పాటించలెను.

మరుసటి దినమున ఉదయమే లేచి స్నానాదులు నిర్వర్తించి శుచిగా మరలా విష్ణుమూర్తికి పాలతో అభిషేకమును చేయాలి. పైన చెప్పిన నియమములను పాటిస్తూ వ్రతము చేయాలి. కేవలము పాలను మాత్రమే ఆహారంగా తీసుకుంటూ ఈ వ్రతము చెయ్యాలి. ముందు రోజు మాదిరి అగ్నికి ఆహుతులను ఇచ్చి, తరువాత బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి.

ఈ ప్రకారంగా పన్నెండు దినములు ఈ పాలాభిషేక వ్రతమును చేయాలి. ఈ పన్నెండు రోజులు ప్రతి దినము శ్రీమహావిష్ణువును ఆరాధిస్తూ పూజిస్తూ, హెూమం చేయాలి.

బ్రాహ్మణులకు, అతిథులకు భోజనం పెట్టాలి. ఈ వ్రతమును శుక్లపాడ్యమితో మొదలు పెట్టి త్రయోదశి వరకు చెయ్యాలి.

ఈ వ్రత కాలంలో నేల మీదపడుకోవడం, బ్రహ్మచర్యం పాటించడం, మూడు పూటలా స్నానం చేయడం నియమంగా పెట్టుకోవాలి. ఈపన్నెండు రోజులు అనవసరంగా ఎవరితోనూ మాట్లాడకూడదు. ప్రాపంచిక విషయములను చర్చించకూడదు. అన్ని భోగములను వదిలిపెట్టాలి. ఎల్లప్పుడూ వాసుదేవుని ధ్యానిస్తూ, స్మరిస్తూ ఉండాలి.

శుక్ల త్రయోదశి నాడు విష్ణుమూర్తి ప్రతిమకు పంచామృతములతో అభిషేకము చేయాలి. పూజించాలి. అర్చించాలి. పురుషసూక్తము చదవాలి. ఆరు రుచులతో కూడిన పదార్థములను నివేదించాలి. తరువాత ఈ వ్రతము చేయించిన బ్రాహ్మణులకు వస్త్రదానము, సువర్ణదానము గోదానము చెయ్యాలి. తరువాత బ్రాహ్మణులకు, అతిథులకు భోజనం పెట్టాలి. గురువులకు, బ్రాహ్మణులకు దక్షిణలు ఇవ్వాలి. తరువాత అన్ని కులముల వారికి, కడజాతి వారితో సహా అందరికీ సమంగా సమారాధన చెయ్యాలి అంటే భోజనం పెట్టాలి. దీనులు, గుడ్డివారు, పేదవారు అనే భేదం లేకుండా అందరికీ భోజనం పెట్టాలి. అప్పుడే శ్రీవిష్ణుభగవానుడు తృప్తి చెందుతాడు.

ఈ ప్రకారంగా అందరికీ భోజనము పెట్టిన తరువాత బంధువులతో కూడి భుజించాలి. ఈ పన్నెండు రోజులు సాయంత్ర కాలములో శ్రీవిష్ణుభగవానుని లీలలను నృత్య,గాన,రూపకములతోనూ,

స్తోత్రములతోనూ, స్తుతించాలి.

(ఈ వ్రతమును, బ్రాహ్మణులు మంత్రములు, పురుషసూక్తము చదువుతుంటే దిక్కులు చూస్తూ కూర్చోకుండా, శ్రద్ధతో, భక్తితో, ఏకాగ్రతతో, నిర్మలమైన మనస్సుతో, స్వయంగా చేసుకుంటేనే ఫలితం ఉంటుంది. ఈ రోజుల్లో మానవులు చేసే వ్రతములకు ఫలితం కనపడటం లేదంటే కారణం, ఆయా వ్రతాలు చేయడంలో శ్రద్ధ,భక్తి,ఏకాగ్రత, నిర్మలమైన మనస్సు లేకపోవడం వల్లే అని గమనించాలి.)

అదితీ! దీనినే పయోవ్రతము అంటారు. ఈ వ్రతమును బ్రహ్మదేవుడు నాకు ఉపదేశించాడు. నేనునీకు ఉపదేశించాను. నీవు కూడా నిర్మలమైన చిత్తముతో ఈ వ్రతమును ఆచరించి విష్ణుభగవానుని పూజించు. నీవు కోరిన కోరికలు సిద్ధిస్తాయి. ఈ వ్రతము అంటే విష్ణుభగవానునికి ఎంతో ప్రీతి. ఈ ఒక్క వ్రతమే కాదు, ఏ వ్రతము చేస్తే శ్రీవిష్ణుభగవానుడు ప్రీతి చెందుతాడో ఆ వ్రతమే ఉత్తమ వ్రతము అని పెద్దలు చెబుతారు. కాబట్టి, నీవు కూడా ఈ వ్రతమును శ్రద్ధాభక్తులతో ఆచరించి భగవంతుడిని ప్రసన్నునిగా చేసుకో. నీ కోరిక నెరవేరుతుంది." అని కశ్యపుడు అదితికి ఉపదేశించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము పదునారవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము

పదునేడవ అధ్యాయము

. శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవతపురాణమును ఈ విధంగా చెప్పసాగాడు.

“పరీక్షిత్ మహారాజా! తన భర్త అయిన కశ్యపుడు తనకు ఉపదేశించిన పయోవ్రతము అనే వ్రతమును అదితి పన్నెండు దినములు నిష్ఠతో, శ్రద్ధతో, భక్తితో ఆచరించింది.. ఈ పన్నెండు రోజులు అదితి ఇంద్రియములను నిగ్రహించింది. మనసులో శ్రీమహావిష్ణువును తప్ప మరొకరిని గురించి తలంచలేదు. ఆలోచించలేదు. సదా విష్ణువును తన హృదయములో నిలుపుకొని ఉపాసించింది.

ఆ వ్రతము చేసినన్ని రోజులు అదితికి కళ్లముందు పీతాంబర ధారి, చతుర్భుజములతో శంఖ,చక్ర,గదలను ధరించిన శ్రీమహావిష్ణువు కనపడేవాడు. శ్రీమహావిష్ణువు తన కళ్లముందే ఉన్నట్టు ఊహించుకొని అదితి పన్నెండు రోజులు వ్రతమును భక్తితో ఆచరించింది.

వ్రతము సమాప్తికాగానే శ్రీమహావిష్ణువు ఆమె భక్తికి మెచ్చి ఆమె ముందు సాక్షాత్కరించాడు. తన ముందు ప్రత్యక్షమయిన విష్ణుమూర్తిని చూచి ఈమెకళ్లు ఆనందభాష్పములతో నిండి పోయాయి. ఆమె శరీరము పులకించింది. రెండు చేతులు జోడించి

ఆమె విష్ణువును ఈ విధంగా ప్రార్థించింది.

యజ్ఞేశ, యజ్ఞపురుషాచ్యుతతీర్థపాద తీర్థశ్రవ: శ్రవణమఙ్గళనామధేయ।
ఆపన్న లోకవృజినోపశమోదయాద్య శం న: కృధీశ భగవన్నసి దీననాధ:॥

విశ్వాయ విశ్వభవనస్థితిసంయమాయ స్వైరం గృహీత పురుశక్తిగుణాయ భూమ్నే।
స్వస్థాయ శశ్వదుపబృంహితపూర్ణబోధ వ్యాపాదితాత్మతమసే హరయే నమస్తే॥

ఆయు: పరం వపురభీష్టమతుల్యలక్ష్మీర్ద్యోభూరసా: సకల యోగగుణాస్త్రివర్గ:
జ్ఞానం చ కేవలమనన్తభవన్తి తుష్టాత్ త్వత్తోనృణాం కిము సపత్నజయాదిరాశీ:॥

ఓ దేవాది దేవా! నేను చేసిన వ్రతములతో నీవు సంతృప్తి చెందితే మాకు దీర్ఘాయుష్షును, మేము కోరిన దేహమును, మూడులోకముల మీద ఆధిపత్యమును, అంతులేని సంపదలను, అర్థకామములను, అనంతమైన జ్ఞానసంపదను, ఆత్మజ్ఞానమును, అణిమాది అష్టసిద్ధులను నీవు మాకు ప్రసాదిస్తావు. అంటువంటి నీవు మా శత్రువులను జయించి మాకు తిరిగి స్వర్గలోకాధిపత్యమును ఇప్పించడం నీకు పెద్ద పని కాదు.” అని శ్రీమహావిష్ణువును స్తోత్రం చేసింది అదితి.

ఆమె చేసిన స్తోత్రమునకు సంతోషించి శ్రీమహావిష్ణువు ఆమెతో ఇలా అన్నాడు. “దేవమాతా! నీ మనస్సులో ఉన్న కోరిక నాకు తెలుసు. నీ కుమారుని సమస్తసంపదలను హరించి, నీ కుమారుని ఇంద్ర పదవి నుండి తొలగించి, బలి ఆ పదవిని ఆక్రమించుకున్నాడు. మరలా నీ కుమారుని ఇంద్రపదవిలో చూడాలని నీ కోరిక. నీ శత్రువులైన దైత్యులను, అసురులను యుద్ధములో జయించి, స్వర్గలోకాధిపత్యమును తిరిగి స్వీకరించి, నీకుమారులతో

స్వర్గలోకములో ఉండాలని నీ కోరిక. నీకు, నీ కుమారులకు శత్రువులైన దైత్యుల, అసురుల మరణమును చూడాలని కుతూహలపడుతున్నావు. నీ కుమారులైన దేవతలు మరలా స్వర్గలోకములో ఆనందంగా విహరించడం, స్వర్గ సుఖములు అనుభవించడం చూడాలని ఉవ్విళ్లూరుతున్నావు.

కాని అది ఇప్పట్లో సాధ్యం కాదు. ప్రస్తుతము దైత్యులకు కాలం అనుకూలంగా ఉంది. వారు భృగువంశస్థులైన బ్రాహ్మణులను సేవించి, శుక్రాచార్యులవారి ఆశీర్వాదబలంతో, అపరిమితమైన బలసంపన్నులైనారు. ఈ సమయంలో వారి మీద యుద్ధము చేయడం సరికాదు. అయితే, నీవు నా గురించి అత్యంత భక్తి శ్రద్ధలతో వ్రతం చేసావు కాబట్టి నేను చాలా సంతోషించాను. శ్రద్ధతో, భక్తితో చేసిన ఏ పని అయినా మంచి ఫలితమును ఇస్తుంది. కాబట్టి నీ మనసులో ఉన్న కోరిక తీరడానికి నేను ఒక ఉపాయము ఆలోచించాను.

నీవు నీ శత్రువులను చంపే సంతానము కొరకు ఈ వ్రతము శ్రద్ధాభక్తులతో చేసావు. కాబట్టి నేను నీ గర్భవాసాన కుమారునిగా జన్మిస్తాను. నీ సవతికుమారులైన దైత్యులను శిక్షించి, నీ కుమారులైన దేవతలను రక్షిస్తాను. నీ కుమారుడైన ఇంద్రునికి మరలా స్వర్గాధిపత్యమును అప్పగిస్తాను. అప్పటి వరకూ నీ భర్తను సాక్షాత్తు విష్ణుస్వరూపునిగా ఎంచి పూజించు. దేవమాతా! ఇది దేవ రహస్యము. నీకు నాకు తప్ప ఇంక ఎవరికీ తెలియకూడదు. నీవు ఎవరికీ చెప్పవద్దు. ఎందుకంటే దేవరహస్యములు గుప్తంగా ఉంటేనే ఫలప్రదము అవుతాయి." అని చెప్పి శ్రీమహావిష్ణువు అంతర్ధానము

అయ్యాడు. అదితి కూడా భగవానుడు చెప్పినట్టు కశ్యపునకుసేవలు చేయసాగింది. ఒక రోజు కశ్యపుడు సమాధిలో ఉండగా శ్రీమహావిష్ణువు అంశ ఆయనలో ప్రవేశించింది. అదితి, కశ్యపుల సమాగమ ఫలితంగా అదితి గర్భం ధరించింది. శ్రీమహావిష్ణువు అంశ అదితి గర్భంలో దినదినప్రవర్ధమానంగా పెరుగుతూ ఉంది. ఈ విషయం బ్రహ్మ కు తెలిసింది. వెంటనే బ్రహ్మదేవుడు రహస్య నామములతో భగవానుని ఈ ప్రకారంగా స్తుతించాడు.

జయోరుగాయ భగవన్ను రుక్రమ నమోఽస్తుతే।
నమో బ్రహ్మణ్యదేవాయ త్రిగుణాయ నమోనమః॥

నమస్తే పృశ్నిగర్భాయ వేదగర్భాయ వేధసే।
త్రినాభాయ త్రిపృష్ఠాయ శిపివిష్టాయ విష్ణవే॥

త్వమాదిరంతో భువనస్య మధ్య మనన్తశక్తిం పురుషం యమాహుః॥
కాలో భవానాక్షిపతీశ విశ్వం స్రోతో యథాన్త: పతితం గభీరమ్॥

త్వం వై ప్రజానాం స్థిరజఙ్గమానాం ప్రజాపతీ నామసి సంభవిష్ణుః।
దివౌకసాం దేవ దివశ్చ్యుతానాం పరాయణం నౌరివ మజ్జతోఽప్సు॥

పైవిధంగా బ్రహ్మ నిగూఢ నామములతో శ్రీమహావిష్ణువును స్తుతించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము పదునేడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
అష్టమ స్కంధము
పదునెనిమిదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వామనమూర్తి జననం గురించి ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఆ విధంగా బ్రహ్మగారు స్తోత్రము చేయగా, జనన మరణ రహితుడు, నాలుగు భుజములు కలవాడు, శంఖ,చక్ర,గద,పద్మములను ధరించిన వాడు, పచ్చని పట్టుబట్టలు కట్టుకున్నవాడు, పద్మముల వంటి కన్నులు కలవాడు, శ్యామల వర్ణము కలవాడు, మకర కుండలములను ధరించిన వాడు, వక్షస్థలములో శ్రీవత్సము అనే మచ్చకలవాడు, చేతులకు హస్తభూషణములు, కాళ్లకు కడియములు కలవాడు, కిరీటము ధరించిన వాడు, మెడలో వనమాల ధరించిన వాడు, కంఠమున కౌస్తుభమణి ధరించినవాడు, అయిన  శ్రీమహావిష్ణువు తన కాంతితో కశ్యపుని గృహములో ఉన్న చీకట్లను పారదోలుతూ,  అదితి గర్భము నుండి ఆవిర్భవించాడు.

ఆ శుభసమయములో దిక్కులు ప్రకాశించాయి. ప్రజలంతా అనిర్వచనీయమైన ఆనందంతో పొంగిపోయారు. స్వర్గలోక వాసులు, మానవులు, భూదేవి, గోవులు, బ్రాహ్మణులు, పర్వతములు, ప్రకృతి అంతా పులకించి పోయింది.

భాద్రపదమాసంలో ద్వాదశి తిథి యందు, చంద్రుడు శ్రవణానక్షత్రములో ఉండగా, అభిజిత్ లగ్నములో (అంటే మధ్యాహ్నం 12 గంటలకు), సకల నక్షత్రములు, గ్రహములు శుభస్థానములలో ఉండగా, శ్రీమహావిష్ణువు అవతరించాడు. ఆ సమయంలో సూర్యుడు దినం మధ్యలో ఉన్నాడు. శ్రీమహావిష్ణువు అవతరించిన కారణంగా, ఆ ముహూర్తమున ఉన్న నక్షత్రములు, గ్రహములు అన్నీ శుభప్రదములు అయ్యాయి. ఆ రోజు విజయ ద్వాదశి అనే పేరుతో ప్రసిద్ధి చెందింది.

దేవతలు పుష్పవర్షము కురిపించారు. దేవ దుందుభులు మోగాయి. అప్సరసలు ఆనందంతో నృత్యం చేసారు. గంధర్వులు పాడారు. మునులు, మనువులు, పితరులు పరమాత్మను స్తుతించారు. సిద్ధులు,సాధ్యులు, కింపురుషులు, కిన్నరులు, చారణులు, యక్షులు, సుపర్ణులు, నాగులు, శ్రీహరి గుణములను కీర్తించారు.

సాక్షాత్తు విష్ణుమూర్తి తమ కుమారుడుగా జన్మించడం చూచిన కశ్యపుడు, అదితి దంపతులు ఆనందంతో పొంగిపోయారు. అంతలోనే ఒక ఆశ్చకరమైన సంఘటన జరిగింది. నాలుగు చేతులతో, వనమాలతో, శంఖుచక్ర,గదా,పద్మములతో అవతరించిన శ్రీమహావిష్ణువు, అంతలోనే చిన్న బాహ్మణ వటువుగా మారిపోయాడు. వామనమూర్తి రూపం ధరించాడు. ఉపనయనయన వయసులో ఉన్న వటువుగా సాక్షాత్కరించాడు.

మహర్షులు ఆ కుమారునికి జాతక కర్మలు యధావిధిగా నిర్వర్తించారు. కశ్యపుడు ఆ కుమారునికి ఉపనయనం చేసాడు. ఆ సమయంలో సూర్యుడు సావిత్రి మంత్రమును ఉపదేశించాడు.

బృహస్పతి యజ్ఞోపవీతమును ఇచ్చాడు. కశ్యపుడు నడుము కట్టుకునే మేఖలను ఇచ్చారు. భూదేవి జింక చర్మమును కానుకగా ఇచ్చింది. చంద్రుడు దండమును ఇచ్చాడు. అదితి కౌపీనమును ఇచ్చింది. స్వర్గ వాసులు వామనుడికి ఒక గొడుగు ఇచ్చారు. బ్రహ్మదేవుడు కమండలమును ప్రసాదించాడు. సప్తఋషులు దర్భలను ఇచ్చారు. సరస్వతి జపమాలను ఇచ్చింది. కుబేరుడు బిక్షాపాత్రను ఇచ్చాడు. భవానీదేవి ఆ బిక్షాపాత్రలో స్వయంగా బిక్ష వేసింది. (ఇవన్నీ ఉ పనయన సమయంలో వటువుకు కానుకగా ఇచ్చే వస్తువులు.)

వామనుడు అగ్నిని వెలిగించి,సమిధలతో హెూమం చేసాడు. ఇలా కొంతకాలం గడిచినతరువాత,  ఒక సారి ఇతర దేశముల నుండి వచ్చిన బ్రాహ్మణులను చూచి వామనుడు ఇలా అడిగాడు. "అయ్యా లోకంలో దానం చేసే వాళ్లు ఉన్నారా? దానాలు అందుకోడానికి విప్రులు వెళుతున్నారా? దాతలు బ్రాహ్మణులు కోరిన దానాలు ఇస్తున్నారా! మీరు ఎప్పుడైనా దానాలు తీసుకున్నారా! ఈ లోకంలో విరివిగా దానాలు చేసే వీరుడు ఎవరో చెప్పండి." అని అడిగాడు. దానికి ఆ బ్రాహ్మణులు ఇలా అన్నారు.

"ఓ వటువా! దానం చేసే వాళ్లు ఎంతో మంది ఉన్నారు. బ్రాహ్మణులు ఏం కోరితే దానిని దానంగా ఇస్తున్నారు. ఇటు వంటి దాతలు ఎంతమంది ఉన్నా, బలి చక్రవర్తితో సమానమైన దాత మూడు లోకములలో ఎవరూ లేరు. ఆ బలిచక్రవర్తికి శుక్రాచార్యుడు గురువు. శుక్రాచార్యులు, భృగు వంశ బ్రాహ్మణుల ఆధ్వర్యములో బలి చక్రవర్తి నూరు అశ్వమేధ యాగములు చేసాడు. ప్రస్తుతము ఆ బలి చక్రవర్తి ఒక మహాయాగం చేస్తున్నాడు. నీవు కూడా మాతో రా! నీకూ కోరిన

ధనం లభిస్తుంది." అని అన్నారు.

వెదుకబోయిన తీగ కాలికి తగిలింది అని అనుకున్నాడు వామనుడు. వెంటనే భిక్షాపాత్ర తీసుకొని వారి వెంట బలి యజ్ఞం చేస్తున్న ప్రదేశానికి వెళ్లాడు. నర్మదా నదీ తీరంలో బలి యాగం చేస్తున్న ప్రదేశానికి చేరుకున్నాడు.

యాగ శాల అంతా చాలా సందడిగా ఉంది. దైత్యులు అటు ఇటు తిరుగుతున్నారు. మునులు మంత్రాలు చదువుతున్నారు. వామనుడు యజ్ఞవాటిక దగ్గరకు వస్తుంటే ఆయన తేజస్సును చూచి అందరూ ఇలా అనుకొన్నారు. "ఆహా! ఇతడు సాక్షాత్తు ఈశ్వరుడా! లేక విష్ణువా! కాదు కాదు బ్రహ్మ. లేక సూర్యుడా! అమ్మో అగ్నిదేవుని మాదిరి ఉన్నాడు. ఈ వటువు ఎవరో మారువేషంలో ఉన్న మహానుభావుడు. ఈ మూడులోకములలో ఇంతటి అందగాడు, తేజోవంతుడు ఎవరూ ఉ ండరు." అని వారిలో వారు అనుకుంటున్నారు. కొంత మంది "అదేంకాదు. బలి చక్రవర్తి చేస్తున్న యజ్ఞమును స్వయంగా చూడటానికి సూర్యభగవానుడు... కాదు కాదు... సనత్కుమారుడు వచ్చినట్టున్నాడు. స్వాగతం పలకండి." అని పెద్దగానే అనుకున్నారు.

వీరు ఇలా అనుకుంటుంటే వటువుగా ఉన్న వామనుడు యాగము జరుగుతున్న మండపములోకి ప్రవేశించాడు. ఋత్విక్కులు, యాజ్ఞీకులు, బ్రాహ్మణులు లేచి ఆయనకు స్వాగతం పలికారు. వామనుడు కొంత సేపు సామవేదం పఠించే ఉద్గాతల దగ్గర కూర్చున్నాడు. తరువాత యజ్ఞమంత్రములను చదివే హెూతల దగ్గర

చేరాడు. అక్కడి నుండి హెూమం చేస్తున్న ఋత్విక్కులను చూస్తున్నాడు. తరువాత సభాపతుల వద్దకు వెళ్లాడు. సాక్షాత్తు యజ్ఞస్వరూపుడైన వామనుడు ఆ యాగశాల అంతా కలయతిరుగుతున్నాడు. కొందరితో తర్కశాస్త్రము ను గురించి చర్చించాడు. కొందరితో కలిసి వేదములు చదివాడు. మరి కొందరితో అవీ ఇవీ మాట్లాడాడు. మరికొందరితో వాదనలకు దిగాడు.  అందరితో నవ్వుతూ మాట్లాడాడు. అందరి దృష్టినీ ఆకర్షించాడు. మెల్లి మెల్లిగా బలి చక్రవర్తి ఉండే ప్రదేశానికి వెళ్లాడు.

వామనుడు బలి చక్రవర్తిని చూచి ఇలా అన్నాడు.

"అహెూ! నేను ఎవరి గురించి విన్నానో ఆ బలి ఈయనేనా! ఈయనేనా ఇంద్రుడు మొదలగు లోకపాలకుల గర్వం అణిచి స్వర్గమును జయించినది. ఆశాపాశములకు దూరంగా ఉండే మహానుభావుడు ఇతనేనా! యజ్ఞలు యాగాలు చేస్తూ బ్రాహ్మణులకు దానాలు చేసేది ఈయనేనా! సత్యము, ధర్మము, దయ స్వరూపంగా ప్రకాశించే ఆయన ఇతడేనా!" అని బలిగురించి పొగిడాడు వామనుడు.తరువాత తన కుడిచేతిని పైకెత్తి బలిని ఇలా ఆశీర్వదించాడు.

ఉ॥ స్వస్తి జగత్త్రయీ భువన శాసన కర్తకు, హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు, నుదారపదవ్యవహర్తకున్, మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్ర పరిహర్తకుక, దానవలోకభర్తకున్॥

మూడు లోకములను శాసించే ఓ బలిచక్రవర్తీ నీకు స్వస్తి. దేవేంద్రుని ఓడించిన వాడా! ఇంద్రపదవిని అధిష్టించిన వాడా! మునుల చేత పొగడబడుతున్నవాడా! దేవతలకు అశుభం కలిగించినవాడా! రాక్షస సార్వభౌమా! నీకుశుభం కలుగుగాక" అని స్వస్తివాచకం పలికాడు వామనుడు.

వామనుని చూచాడు బలిచక్రవర్తి. ఎవరో మహానుభావుడు వచ్చాడనుకున్నాడు. వెంటనే బలి వామనుడి కాళ్లు కడిగి అర్ఘ్యము ఇచ్చి సత్కరించాడు. వామనుడి కాళ్లు కడిగిన నీటిని తలమీద చల్లుకున్నాడు. వామనుడిని ఉచితాసనము మీదకూర్చుండబెట్టి బలి ఇలా అడిగాడు.

"ఓబ్రహ్మచారీ! నీ పేరు ఏమి? నీ తల్లితండ్రులు ఎవరు? ఎక్కడి నుండి వచ్చావు? మీ ప్రయాణము సుఖంగా జరిగిందా! నీవు ఎవరైనా నీ పాద స్పర్శతో ఈ యాగవాటిక పునీతమైంది. బ్రహ్మర్షులు అందరూ కలిసిన చేసిన తపస్సు ఒక రూపం ధరించి నడిచివస్తే ఎలా ఉంటుందో తమరు అలా ఉన్నారు. మీరు మా ఇంటికి వచ్చారు. తమరి రాకతో నేను, నా పితృదేవతలు ఎంతో తృప్తిచెందారు. మా వంశము పునీతమయింది. నేను చేస్తున్న ఈ యజ్ఞము కూడా పరిపుష్టమయింది. తమరి పాదస్పర్శతో ఈ యజ్ఞవాటికలో అగ్నులు చక్కగా వెలుగుతున్నాయి. ఈ భూమి అంతా నీ యొక్క చిన్ని చిన్ని పాదముల స్పర్శతో పవిత్రమయింది.

వటువా! నిన్ను చూస్తుంటే ఏదో అడగడానికి వచ్చినట్టున్నావు. నేను నీకు ఏమి ఇవ్వగలను. నీకు ఏం కావాలో కోరుకో ఇస్తాను. నీకు కావాల్సినవి అన్నీ తీసుకో!

మ: వరచేలంబులో మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో, రత్నములో రథంబులో విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండంమొ కాక యేమడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా!

ఓ బ్రాహ్మణోత్తమా! నీకు మేలైన వస్త్రములు కావాలా! ధనమా, మంచి ఫలములా, అడవిలో దొరికే సంపదలా! ఆవులా, గుర్రములా, ఏనుగులా! రథములా, మంచి ఆహార పదార్థములా! అందమైన అమ్మాయిలా, బంగారమా, భవనములా! అగ్రహారాలా, సస్యస్యామలమైన భూములా! ఇవి కాకుండా ఇంకేమైనా కావాలా! నీకు ఇష్టమైనది అడుగు ఇస్తాను." అని బలిచక్రవర్తి అన్నాడు.

శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## అష్టమస్కంధము

## పంతొమ్మిదవ అధ్యాయము.

ఆ ప్రకారంగా బలి పలికిన పలుకులు వినిన వామనుడు ఇలా అన్నాడు.

“ఓ రాజా! నిన్ను ప్రాపంచిక విషయములలో నీ గురువు శుక్రాచార్యుల వారు, ఆధ్యాత్మిక విషయములలో నీ పితామహుడు ప్రహ్లాదుడు ఆశీర్వదిస్తున్నారు. కాబట్టి నీవు సత్యమైన, ధర్మయుక్తమైన, కీర్తివంతమైన, నీ కులమునకు తగిన మాటలనే మాట్లాడావు. నీ వంశములో, బ్రాహ్మణులకు దానం ఇస్తానని చెప్పి ఈయని వాడు, యుద్ధములో శత్రువులకు భయపడి పారిపోయినవాడు, పుట్టలేదు. నీ కులములో నీచుడు, లోభి, దీనుడు పుట్టలేదు. అందరూ పరాక్రమవంతులే.

దానము ఇచ్చే కాలంలో బ్రాహ్మణులకు నేను ఈ దానం ఇవ్వలేను అన్న వాడు, యుద్ధ కాలంలో నేను యుద్ధం చేయలేను అని వెనుదిరిగినవాడు, నీ వంశంలో పుట్టలేదు. నీ తాత గారు ప్రహ్లాదుడు ఇప్పటికీ మూడులోకములచేత కీర్తింపబడుతున్నాడు.

హిరణ్యాక్షుడు నీ వంశములోని వాడే! అతడు ఒంటరిగా గద తీసుకొని యుద్ధానికి బయలు దేరాడు. తనతో సమానంగా యుద్ధం చేసే వీరుడి కోసరం వెదుకసాగాడు. కాని అతనితో

సమానమైన వీరుడు ఎక్కడా కనపడలేదు. ఆ సమయంలో పాతాళంలో ఉన్న భూమిని ఉద్ధరిస్తున్న విష్ణువు కనిపించాడు. హిరణ్యాక్షుడు విష్ణువుతో యుద్ధం చేసాడు. అతి కష్టం మీద విష్ణువు హిరణ్యాక్షుని సంహరించాడు. ఆకారణంగా విష్ణువు విజేత అయ్యాడు.

తన సోదరుని మరణం చూచి తట్టుకోలేకపోయాడు హిరణ్యకశిపుడు. వెంటనే గద తీసుకొని విష్ణువును చంపడానికి వైకుంఠమునకు బయలుదేరాడు. ఆయుధమును ధరించి వస్తున్న హిరణ్యకశిపుని చూచాడు విష్ణువు.

"ఈ హిరణ్యకశిపుడు నేనుఎక్కడకుపోయినా నన్ను వదలడు. కాబట్టి ఎక్కడకో పోవడం ఎందుకు. వీడి హృదయములోనే దాక్కుంటాను. అప్పుడు వీడు నన్ను ఎలా కనుక్కుంటాడు." అని తనలో తాను అనుకున్నాడు. వెంటనే హిరణ్యకశిపుడు పీల్చే శ్వాస ద్వారా హృదయంలో ప్రవేశించి ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. తనలోనే ఉన్న విష్ణువును చూడలేకపోయాడు హిరణ్యకశిపుడు.

(మన పరిస్థితి అంతే కదా! మనలోనే ఆత్మస్వరూపుడుగా ఉన్న పరమాత్మను మనము చూడలేము. బయట ఎక్కడో ఉన్నాడని గుళ్లు, గోపురాలు, స్వామీజీలలో వెతుకుతుంటాము. చంకలో మేకపిల్లను పెట్టుకొని ఊరంతా వెతికినట్టు అవుతుంది.)

హిరణ్యకశిపుడు ఎక్కడకు పోయినా విష్ణువు కనపడలేదు. విష్ణువు కనపడలేదని పెద్దగా అరుస్తున్నాడు. గర్జిస్తున్నాడు. భూమి,

ఆకాశము, స్వర్గము, నాలుగు దిక్కులు, కొండలు, గుహలు, సముద్రములు సమస్తము వెదికాడు. ఎక్కడా విష్ణువు కనిపించలేదు. గర్వంతో ఇలా అన్నాడు.

"నేను అన్ని చోట్లా వెతికాను. విష్ణువు కనపడలేదు. మానవులు ఒకసారిపోతే మరలా తిరిగిరారో, అక్కడకు పోయి ఉంటాడు లేక మరణించి ఉంటాడు" అని అనుకున్నాడు హిరణ్యకశిపుడు. .(విష్ణువుకు పుట్టుక, చావు లేదు అని తెలియదు. అదే అజ్ఞానము).

ఇంక నీ తండ్రి విరోచనుడు పరమ ధార్మికుడు. తనను చంపడానికి దేవతలు బ్రాహ్మణ వేషములలో వచ్చారని తెలిసి కూడా వారికి తన ప్రాణాలు అర్పించాడు. అటు వంటి వంశములో పుట్టిన నీవు అడిగినది లేదనకుండా ఇస్తావు అనడంలో ఆశ్చర్యం ఏముంటుంది.

ఓ బలి చక్రవర్తీ! నీవు నీ పూర్వుల కీర్తిని నిలబెడుతున్నావు. అటువంటి నిన్ను నేను ఒకే ఒక కోరిక కోరుతున్నాను. నాకు, నా పాదములతో మూడు అడుగులు కొలిస్తే ఎంత భూమి వస్తుందో, అంత భూమి నాకు దానంగా ఇమ్ము. అంతకుమించి నేను ఏమీ అడగడం లేదు.
(కాని పోతనగారు మాత్రం ఒకటి, రెండు అడుగుల భూమి ఇమ్మని కోరినట్టు రాసారు. ఆ పద్యం చదవండి.)

ఆ॥ ఒంటివాడ నాకు నొకటి రెండడుగులు మేర యిమ్ము సొమ్ము మేర యొల్ల
గోర్కిదీర బ్రహ్మకూకటి ముట్టెద దాన కుతుక సాంద్ర! దానవేంద్ర!

ఓ దానవేంద్రా! నేను ఒంటరి వాడిని. నాకు ఇవన్నీఎందుకు. కేవలము ఒకటి, రెండు అడుగుల మేర భూమి ఇస్తే చాలు. తృప్తి పడతాను. (ఒకటి రెండు కలిపి మూడు అనుకోవాలా. సాధారణంగా ఇంత అని అడగకుండా ఏవో ఒకటి, రెండు ఇవ్వండి అంటారు. అటువంటి జాతీయం వాడారా పోతన గారు.)

వామనుడు కోరినకోరికలోని అంతరార్థం తెలుసుకోలేక నవ్వాడు బలి. వామనుడితో ఇలా అన్నాడు.

"నీవు అన్నీ సత్యం పలికావు. కానీ మరీ ఇంత చిన్నకోరిక కోరావు. నా వంటి వాడిని కోరిక కోరేటప్పుడు నా గొప్పతనాన్నికూడా చూడాలి కదా! నీవేమైనా భూములను కోరావా, ఏనుగులను, గుర్రాలను, కన్యలను, సంపదలను కోరుకున్నావా! నీవు అవేమీ కోరుకోలేదు. . నీవు బాలుడవు. ఏమి కోరుకోవాలో తెలియని వయసు నీది. అందుకే కేవలం మూడు అడుగుల నేల అడిగావు. నీకు అంతే ప్రాప్తం అనుకుంటాను. కాని నేను రాక్షస చక్రవర్తిని. నా దగ్గరకు వచ్చి యాచించిన వాడు మరి దేని కోరకూ మరొకరి దగ్గరకు వెళ్లనవసరం రానివ్వను. నీవు అల్పంగానే కోరినా అధికంగానే ఇస్తాను. తీసుకో." అని అన్నాడు బలి. అప్పుడు వామనుడు ఇలా అన్నాడు.

"అయ్యా! నేను బ్రహ్మచారిని. నాకు కావాల్సింది ఒక గొడుగు, యజ్ఞోపవీతము, కమండలము, మొలతాడు, ఒక కర్ర. ఇంతే కదా. నీవు భూములు, ఏనుగులు, గుర్రాలు, రథములు, కన్యలు ఇచ్చినా

నేను ఏమి చేసుకుంటాను. అవి నాకు ఉపయోగపడవు కదా! కాబట్టి నా మాట కాదనకుండా నాకు మూడు అడుగుల నేల ఇస్తే చాలు. తృప్తి పడతాను.

ఓ దానవేంద్రా! మనకు దక్కింది కొంచెమైనా, దొరికింది కదా అని ఎగిరి గంతు వెయ్యకుండా, దొరికిన దానితో తృప్తిపడితే చాలు. అంతే కాకుండా, తృప్తి లేని వాడికి ఒక ద్వీపము ఇచ్చినా తృప్తి చెందడు. సప్తద్వీపములు కావాలి అంటాడు. అటువంటి వాడికి ఈ భూమండలము ఇచ్చినా తృప్తి కలుగదు. ఆకాశం కూడా కావాలంటాడు.

ఓ దానవేంద్రా! ఆశాపాశము పెద్ద తాడు వంటిది. దానికి అంతు లేదు. దొరికిన దానితో సంతోష పడే వాడు మూడు లోకములలో గౌరవింపబడతాడు. వాడు ఎల్లప్పుడూ సంతోషంగా ఉంటాడు. ఎవడికి తృప్తి ఉండదో వాడు దొరకని దాని కోసరం వెంపర్లాడుతుంటాడు. ఆకోరికలను తీర్చుకోవడం కోసరం మరలా జన్మఎత్తుతుంటాడు. దొరికిన దానితో తృప్తి పడేవాడికి మోక్షం త్వరగా లభిస్తుంది. దొరికిన దానితో సంతోషపడేవాడికి ఆయుర్దాయము, తేజస్సు పెరుగుతుంది. తృప్తి లేకపోతే సంతోషం లేదు. సంతోషం లేకపోతే తేజస్సు ఉండదు. ఆయుక్షీణము అవుతుంది. నీవు ఇస్తాను అన్నావు కదా అని నాకు అవసరం లేనివి కూడా కోరడం భావ్యం కాదు. నాకు ఎంత కావాలో అంతే కోరుకుంటే, అది సుఖాన్ని సంతోషాన్ని కలిగిస్తుంది. కాబట్టి నేను అడిగిన ఆ మూడు అడుగుల నేల ఇచ్చి నన్ను తృప్తి పరచు " అని అన్నాడు వామనుడు.

వామనుడి మాటలకు బలి నవ్వుకున్నాడు. “వటువా! నీ ఇష్టం వచ్చినట్టే కానిమ్ము. నేను నీకు నీ పాదములతో కొలువగా వచ్చు మూడు అడుగుల భూమిని దానం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను.” అంటూ భూమిని దానంగా ఇవ్వడానికి  జలపాత్ర తీసుకున్నాడు.

ఆ సమయంలో అక్కడే ఉన్న శుక్రాచార్యుడు  బలిని వారించాడు. బలితో ఇలా అన్నాడు. “ఓ బలి చక్రవర్తీ! ఇతను ఎవరనుకున్నావు? దేవతలకు సాయం చెయ్యడానికి వచ్చిన సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. అతిది గర్భంనుండి ఆవిర్భవించిన శ్రీమహావిష్ణువు ఈ వామన మూర్తి రూపంలో నిన్ను దానం అడగడానికి వచ్చాడు. ఈ విషయం తెలియక నీవు ఈయనకు దానం ఇవ్వడానికి సిద్ధపడ్డావు. నీవు కనుక ఈ దానం ఇస్తే నువ్వు, నీ తోపాటు దానవులు సర్వనాశనం అవుతారు.

మూడు అడుగుల దానం తీసుకునే  నెపంతో నీ సకల ఐశ్వర్యములను, సంపదలను, ముల్లోక రాజ్యమును అపహరించడానికి వచ్చాడు. ఈ దానం తీసుకొని స్వర్గలోకాధిపత్యమును ఇంద్రుడికి కట్టబెట్టడానికి వచ్చాడు. మూడు అడుగులు అంటే మూడు లోకములు. మూడులోకములను ఇతనికి ధారపోసి నీవు ఏ విధంగా జీవిస్తావు. ఈ వామనుడు ఒక పాదముతో భూమిని, మరొక పాదముతో ఆకాశమును ఆక్రమించగలడు. మూడవ పాదము ఉంచడానికి  నీవు ఎక్కడ చోటు చూపించగలవు. కాబట్టి నీవు మాట తప్పిన వాడవు అవుతావు. మాట తప్పిన వాడికి, ధర్మం తప్పి వాడికి స్వర్గలోకాధిపత్యము ఉండదు. నీవు స్వర్గమును విడిచి నరకమునకు పోవలసి ఉంటుంది.

ఇదీ విష్ణువు యొక్క ఆలోచన.

కాని ఒక మాట మాత్రము యదార్థము. ఏ దానం చేస్తే తన జీవనం కూడా నశిస్తుందో ఆ దానమును చేయకూడదని పెద్దలు చెబుతారు. ఎవరైనా తనను తాను పోషించుకొన గలశక్తి ఉంటేనే, యజ్ఞములు,యాగములు, దానధర్మములు చేయగలుగుతారు. కాబట్టి తెలివైన వాడు తన సంపదను ఐదు భాగములుగా విభజించి వ్యయం చెయ్యాలి. ఒక భాగము ధర్మము కొరకు, రెండవ భాగము పేరు ప్రతిష్టల కొరకు, మూడవ భాగము తన కోరికలను తీర్చుకొనుట కొరకు, నాలుగవ భాగము తిరిగి ధనము సంపాదించడానికి, ఐదవ భాగము తన వారిని పోషించడానికి ఉపయోగించాలి.

(ఈ శుక్రనీతి సరిగ్గా మన రాజకీయ నాయకులకు సరిపోతుంది. మొదటిభాగము ప్రజలకు సేవ చేసాను అని పించుకోడానికి (ధర్మానికి), రెండవ భాగము తన గురించి ప్రచారం చేసుకొని పేరు ప్రతిష్టలు పెంచుకోడానికి, మూడవ భాగము కోరికలు తీర్చుకోడానికి. నాలుగవ భాగము మరలా ఎన్నికలలో గెలవడానికి ఖర్చుపెట్టడానికి, ఐదవ భాగము తన వారిని పోషించుకోడానికి ఆస్తులు కూడబెట్టుకోడానికి. సరిగా సరిపోయింది కదూ!.)

ఓ బలిచక్రవర్తీ! ఋగ్వేదంలో సూక్తం ఒకటి ఉంది. ఓం అనే మాటకు "అంగీకారము" అని అర్థము. అంటే ఏదైనా వస్తువును ఇస్తాను అని అంగీకరించడం. ఓం అంటే నిజం చెప్పినట్టు. న అనే అక్షరముతో కూడినది అబద్ధము. (న అంటే లేదు అని అర్థం కదా! నహీ, నై, నో, అనే మాటలు వాడుకలో ఉన్నాయి.) అంటే 'న' అంటే

అబద్ధం చెప్పినట్టు. ఎంత సత్యం పలికినా అందులో కొంచెం అసత్యాన్ని జోడిస్తేకానీ పరిపూర్ణత సిద్ధించదు.. (స్వచ్ఛమైన బంగారము కూడా కొంత రాగికలిపితే కానీ మెరవదు.)

ఈదేహమే ఒక చెట్టు అనుకుంటే దానికి పూచిన పూలు, కాచిన పళ్లు, సత్యము పలకడం. అసలు ఈ దేహమే అసత్యము, అనిత్యము అని వేదాంతులు చెబుతారు. దేహమే అసత్యము అయినప్పుడు దానికి సత్యము అనే పూలు, పండ్లు ఎలా వస్తాయి. దేహం ఉంటేనే కదా సత్యంపలకడానికి ఆస్కారం ఉంటుంది. కాబట్టి అసత్యం అనే దేహం అన్నిటికీ మూలం. ఆ అసత్యమే లేకపోతే సత్యానికి ఉనికి లేదు.

ఓం అనే వాక్కు అంగీకారానికి సూచన. ఓం అంటే దానం ఇస్తాను అని చెప్పడం. అంటే తనకు ఉన్న సంపదలను ఇతరులకు ఇవ్వడం. ఓం అనే పదము దాత వద్ద నుండి ధనమును లాక్కుంటుంది. దాతను ధనశూన్యునిగా చేస్తుంది. పోనీ దానం చేసి నందువలన ఆ తీసుకున్నవాడు తృప్తి పడతాడా అంటే అదీ లేదు. ఎంత ఇచ్చినా ఇంకా కావాలనే అంటాడు. కాబట్టి తన శక్తికి మించిన దానము చేయడం వలన దాత సర్వనాశనం అవుతాడు.

కాని ఈ విషయం అన్ని విషయముల యందు అన్వయించకూడదు. ఎదుటి వాడు అడిగిన వస్తువు తన వద్ద ఉన్నప్పటికినీ, దానిని తన స్వప్రయోజనం కోసరం ఉంచుకొని, దానం చేయని వాడు, ఎవరు దేనిని దానం అడిగినా, లేదు అనే మాట తప్ప వేరే మాట చెప్పని వాడు, జీవించి ఉన్నా మరణించినట్టే.

ప్రస్తుతము నీవు ఈ వామనుడికి మూడు అడుగుల భూమి ఇస్తాను అని అన్నావు. కాని నీ దగ్గర అంత భూమి లేదు. ఇప్పుడు లేదు అంటే మాట తప్పినట్టవుతుంది. అసత్యదోషం అంటుకుంటుంది. కానీ దీనికి ఒక మార్గాంతరం ఉంది. స్త్రీ విషయంలో కానీ, పరిహాసానికి కానీ, వివాహ సందర్భములలో కానీ, వివాహ సమయములలో వరుని గుణములను గొప్పగా చెప్పడంలో గానీ, ( వరుడికిక ఏ ఉద్యోగం ఉండదు కానీ మా వాడికి పెద్ద ఉద్యోగం ఐదంకెల జీతం అంటారు.... బి.ఏ కూడా తప్పి ఉంటాడు, యం.బి.ఏ అని అంటారు. పచ్చితాగుబోతును అబ్బే మావాడికి దాని వాసనే గిట్టదు అంటారు. ఇలాగా.....), ఉద్యోగం సంపాదించడానికి, ప్రాణం మీదికి వచ్చినపుడు, గోవులను, బ్రాహ్మణులకు సాయం చేయాల్సివచ్చినపుడు, ఎదుటి వాడు ప్రమాదంలో ఉన్నప్పుడు, ఈ సమయాలలో అబద్ధం చెప్పినా తప్పులేదు. ఎటువంటి పాపము అంటదు.

ఈ దానం ఇచ్చినందువల్ల నీ ధన,మాన,ప్రాణాలు ప్రమాదంలో పడతాయి. నీ రాజ్యము, సంపదలు, భోగములు పరుల పాలవుతాయి. తుదకు నీ ప్రాణాలే పోతాయి. అందువలన ఈ సందర్భంలో అబద్ధం ఆడినా, నేను ఇవ్వను అని చెప్పినా తప్పులేదు. ఎటువంటి పాపమూ రాదు.

(ఈ సందర్భంలో పోతన గారు రాసిన పద్యం ప్రతి తెలుగువాడి నోటా మెదులుతూ ఉంటుంది.)

ఆ॥ వారిజాక్షులందు వైవాహికములందు, బ్రాణవిత్తమానభంగమందు
జకితగోకులాగ్రజన్మరక్షణమందు బొంకవచ్చు నఘము వొంద దధిప॥

స్త్రీల విషయం లో కానీ, వివాహ విషయములలో కానీ, తన ప్రాణానికి, ధనానికి, మానానికి, భంగం వాటిల్లుతుంది అని తెలిసినప్పుడు, గోవులు, బ్రాహ్మణులు ఆపదలో ఉన్నప్పుడు వారిని రక్షించడానికి, ఈ సమయములలో అబద్ధం ఆడినా తప్పులేదు. అసత్యదోషం అంటదు. ఎటువంటి పాపమూ రాదు." అని పలికాడు శుక్రుడు.

శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
అష్టమస్కంధము
ఇరువదవ అధ్యాయము.

తన కులగురువు శుక్రాచార్యులవారు అలా పలుకగా కాసేపు ఆలోచించాడు బలి. తరువాత గురువుగారితో ఇలా అన్నాడు.

"గురువర్యా! గృహస్థధర్మము అంటే తన యొక్క కోరికలకు, తన యొక్క ధనమునకు, కీర్తికి, తన యొక్క జీవనమునకు హాని కలిగించనిది అని తమరు చెప్పారు. తమరు చెప్పినది సత్యము. కాని

నేను ప్రహ్లాదునికి మనుమడను. అటువంటి ధర్మాత్మునకు, భాగవతోత్తమునకు మనుమడిగా పుట్టి ఆడిన మాట తప్పడం ధర్మమా! దానం ఇస్తానని చెప్పి ఇవ్వకపోవడం న్యాయమా! ఆడినమాట తప్పడం కన్నా అధర్మము మరొకటిలేదు.

ఒకసారి భూదేవి "నేను ఎంత బరువునైనా భరిస్తాను కానీ, ఆడిన మాట తప్పినవాడి బరువును మాత్రం భరించలేను."అని పలికింది. గురుదేవా! నేను నరక బాధలను భరించగలను. దారిద్ర్యమును భరించగలను. అపరిమితమైన దు:ఖసాగరమున మునిగి తేలగలను. రాజ్యం పోయినా సంతోషంగా ఉంటాను. ఈ క్షణంలో మరణించమన్నా మరణిస్తాను. కానీ బ్రాహ్మణునికి ఇచ్చిన మాటను తప్పాలి అంటేనే అంతులేని భయం కలుగుతూ ఉంది.

మ: నిరయంబైన, నిబంధమైన, ధరణీనిర్మూలంబైన దు
ర్మరణంబైన, గులాంతమైన నిజమున్ రానిమ్ము, కానిమ్ము పో!
హరుడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నౌ
దిరుగన్ నేరదు నాజిహ్వ వినుమా! ధీవర్య వేయేటికిన్?

గురువరా! ఈ రాజ్యములు, ఈ సుఖములు, ఈ భోగభాగ్యములు అన్నీ ఈ దేహములో ప్రాణం ఉన్నంతవరకే. ఆ కాస్త ప్రాణం పోయిన తరువాత ఈ సుఖములు, భోగములు ఆ మృతదేహమును తాకనుకూడా తాకవు. ఈ తుచ్ఛమైన సుఖముల కోసరం, బ్రాహ్మణునికి ఇచ్చిన మాట తప్పమంటారా! నేనిచ్చే దానం

వలన ఈ బ్రాహ్మణుడు తృప్తి చెందక పోతే, ఆ దానం ఇచ్చి కూడా వృధా కదా!

దధీచి, శిబి చక్రవర్తి మొదలగు వారు, లోకమునకు ఉపకారం జరుగుతుందంటే, తమ ప్రాణములను కూడా దానం చేసారు. అటువంటప్పుడు మూడు అడుగుల నేల ఇవ్వడానికి నేను ఎందుకు సందేహించాలి? ఎంతో మంది దానవ రాజులు ఈ భూమిని పరిపాలించారు. ఎంతో కీర్తిని గడించారు. కాలగర్భంలో కలిసిపోయారు. కాలము వారి దేహములను హరించింది కానీ, వారు సంపాదించిన కీర్తిని హరించలేకపోయింది.

శా॥ కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ! సిరి మూటగట్టుకొని పోవంజాలిరే! భూమిపై
బేరైనం గలదే! శిబిప్రముఖులం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు! వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!

భార్గవ వంశ శ్రేష్ఠా! గురువర్యా! ఈ భూమిని ఎంతో మంది రాజులు పరిపాలించారు. వారికి ఎన్నో రాజ్యాలు ఉన్నాయి. వారు తమకు ఉన్న రాజ్యసంపదలకు గర్వంతో విర్రవీగారు. వాళ్లంతా ఇప్పుడు ఏరీ! చచ్చేటప్పుడు ఈ రాజ్యములు, రాజ్యసంపదలు తమ వెంట మూటగట్టుకొని తీసుకొని వెళ్లారా! లేదే! అన్నీ ఇక్కడే వదిలిపెట్టి కట్టుబట్టలు కూడా విడిచిపెట్టి పరలోకానికి వెళ్లిపోయారు కదా! వాళ్ల పేరైనా ఇప్పుడు ఎవరైనా తలుచుకుంటున్నారా! కానీ శిబి మొదలగు చక్రవర్తులు తమ ప్రాణములనుకూడా దానంగా ఇచ్చి శాశ్వతమైన కీర్తిని సంపాదించలేదా! ఈ నాటికి, ఏనాటికి కూడా వారిని ఈ లోకం మరిచిపోదుకదా!

(30,40 ఏళ్ళు కూడా నిండకుండానే ముప్పై, నలభై వేల కోట్లు సంపాదించిన వాళ్లకు కనువిప్పు కలిగించే పద్యం ఇది. పుట్టిన మరుక్షణం నుంచి సంపాదించడం మొదలుపెట్టినా, సంవత్సరానికి నూరుకోట్లు సంపాదించినా, అంత సంపద సమకూడదు. ఈ సంపదలు అన్నీ వారితో రావుకదా. కానీ చెడ్డ పేరు మాత్రం కలకాలం నిలిచి ఉంటుంది. అంతకంటే వివరణ అనవసరం.)

ఓ బ్రాహ్మణోత్తమా! యుద్ధంలో వెన్నుచూపకుండా పోరాడి మరణించిన వాళ్లు ఎంతో మంది ఉన్నారు. కాని ఒక మంచి బ్రాహ్మణుడు దానం కోరి వస్తే దానం చెయ్యను అనే వాడు ఉండటం చాలా అరుదు. సాధారణంగా యాచకులకు దానం ఇవ్వడంలో ఎన్ని కష్టనష్టాలు కలిగినా, అవి దానం ఇచ్చేవాడికి శుభాన్ని కలుగజేస్తాయి. ఇటువంటి బ్రాహ్మణ వటువు అడిగిన దానిని ఇవ్వడంలో ఎన్ని కష్టాలు వచ్చినా భరించడానికి నేను వెనుకాడను. ఈ వటువు కోరికను తప్పకుండా తీరుస్తాను.

గురువుగారూ! మీరు యజ్ఞములు యాగములు చేస్తారు. ఆ యజ్ఞయాగాదులలో యజ్ఞపురుషుని ఆరాధిస్తారు. ఆ యజ్ఞపురుషుడు ఎవరో కాదు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. మరి ఆ విష్ణువే వచ్చి నన్నుదానం ఇమ్మని అడిగితే కాదని ఎలా అనగలను? ఈవిష్ణువు నాకు మిత్రుడు కానీ, శత్రువు కానీ, అతడు అడిగినది ఇవ్వడం నా ధర్మము.

గురువర్యా! ఈ విష్ణువు ఒట్టి పిరికివాడు. లేకపోతే విష్ణువుగా నాముందుకు రాకుండా ఈ వటువు వేషంలో వచ్చి దానం అడగడం ఏమిటి? అది అధర్మము కాదా! అధర్మంగా ఇతడు నన్ను బంధించినా నేను ఇతనికి ఏ అపకారమూ చెయ్యను. మీరు చెప్పినట్టు ఇతడు విష్ణువే అయితే ఇతడు అధర్మానికి ఒడిగట్టడు. నాతో యుద్ధం చేసి, నన్ను చంపి, స్వర్గాధిపత్యమును తిరిగి తన వశం చేసుకుంటాడు. లేదా నా చేతిలో చస్తాడు. ఈ రెండే జరగాలి. ఇతడు విష్ణువు అయినా, కాకపోయినా, ఈ వటువుకు ఇచ్చిన మాట ప్రకారము మూడు అడుగులు దానంగా ఇచ్చి తీరుతాను." అని పలికాడు బలి చక్రవర్తి.

బలి చక్రవర్తి ఇంకా ఇలా అన్నాడు. "గురువర్యా! మీరు అన్నట్టు ఈ వటువు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అనే అనుకుందాము. ఎంతో మంది మహాత్ములు, యోగులు, ఎంతో తపస్సు చేసినా ఆ శ్రీహరి దర్శనం దొరకదు. అటువంటిది నేను అడగకుండానే శ్రీహరి, వటువు రూపంలో నా దగ్గరకు వచ్చి నన్ను దానం అడుగుతున్నాడు  నా అంత అదృష్టవంతుడు ఎవరు ఉంటారు. నన్ను దానం అడిగే ఆ మహావిష్ణువు కుడి చెయ్యి సామాన్యమయినదా!

శా: ఆదిన్ శ్రీసతి కొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపై గపోలతటిపై బాలిండ్లపై నూత్న మ
ర్యాదం చెందు కరంబు గ్రిందగుట మీదై నా కరంబుంట మేల్
గాదే? రాజ్యంబు గీజ్యమున్ సతతమే? కాయంబు నపాయమే!

ఆ శ్రీమహావిష్ణువు కుడి చెయ్యి సాక్షాత్తు శ్రీలక్ష్మీదేవి తలవెంట్రుకలను ఆప్యాయం నిమిరిందయ్యా! అమ్మవారి శరీరం అంతా లాలనగా తాకిందయ్యా! ఆమె పమిటచెంగును సవరించిందయ్యా! ఒక్కోసారి ప్రణయ కలహంలో అమ్మవారి పాదాలు కూడా తాకింది. అంతలోనే అమ్మవారి చెక్కిళ్లను, వక్షస్థలమును నిమిరింది. అటువంటి మహద్భాగ్యానికి నోచుకొన్న ఆ శ్రీమహావిష్ణువు చెయ్యి కింద ఉండి, నా చెయ్యి మీద ఉండి నేను దానం చెయ్యడంకన్నా ఈ మూడు లోకములలో దీనికి మించిన అదృష్టం ఏముంటుంది. దాని ముందు ఈ రాజ్యములు, సంపదలు, భోగభాగ్యములు ఏ పాటి! ఈ శరీరం పడిపోకుండా శాశ్వతంగా ఇలాగే ఉండిపోదు కదా!

కాబట్టి మహానుభావా! గురోత్తమా! ఈ విషయంలో నేను నరకానికిపోయినా, ఓడి పోయినా, బంధింపబడ్డా, ఈ భూమి మొత్తం నాశనమైపోయినా, నాకు అకాల మరణం ప్రాప్తించినా, నా కులము సర్వనాశనమైనా, మేరు పర్వతము కుంగిపోయినా, సప్తసముద్రములు ఎండిపోయినా, భూమిఅంతా చూర్ణమైనా, ఆకాశం నా మీద పడ్డా, నేను ఈ వటువుకు ఇచ్చిన మాట తప్పను.  ఇదే నా నిశ్చయము. ఏం జరుగుతుందో అది జరగనీ! నాకు ఎలాంటి భయము లేదు. ఇతడు శివుడైనా, విష్ణువైనా, బ్రహ్మఅయినా, ఇంకెవరైనా నేను జంకను. నా నిర్ణయానికి తిరుగు లేదు. నా నాలుక ఆడినమాట తప్పదు.

మత్తకోకిల వృత్తము
ఎన్నడుం బరువేడ బోడట యేకలుండట! కన్నవా
రన్నదమ్ములు నైన లేరట యన్నివిద్యల మూల గో
ష్ఠి న్నెఱింగిన ప్రోడ గుజ్జట; చేతులొగ్గి వసింప నీ
చిన్నిపాపని ద్రోసిపుచ్చగ జిత్తమొల్లదు సత్తమా!

గురువరా! అదంతా అటుండనిండు. ఈ పొట్టివాడు, ఈ వటువు, ఇంతకుముందు ఎవరినీ ఏదీ అడుగలేదట. ఇతనికి నా అనే వాళ్లు ఎవరూ లేరట. తల్లి తండ్రి, అన్న, తమ్ముడు ఎవరూ లేరట. ఏది తెలుసుకుంటే అన్నీ తెలుస్తాయో, ఆ విద్యలన్నీ నేర్చినవాడట. అటువంటి వటువు, చిన్నిపాపడు, నా ముందు చేయిచాచి నిలబడితో, అతను అడిగింది ఇవ్వకుండా ఎలా ఉండగలను." అని ధృడనిశ్చయంతో చెప్పాడు బలిచక్రవర్తి.

తన మాటలను తృణీకరించిన బలిని చూడగానే శుక్రాచార్యులవారికి కోపం మిన్నుముట్టింది. "ఓ బలీ! నీవు నా మాటను వినలేదు. నా ఆజ్ఞను పాటించలేదు. గురుద్రోహం చేసావు. నీవు పదవీభ్రష్టుడవు అవుతావు" అని శపించాడు శుక్రాచార్యులు.

గురువు గారి శాపాన్ని సంతోషంగా స్వీకరించాడు బలి చక్రవర్తి. తనలోతాను ఇలా అనుకున్నాడు బలిచక్రవర్తి.

ఆ॥ బ్రదుకవచ్చుగాక బహుబంధనములైన వచ్చుగాక లేమి వచ్చుగాక
జీవధనములైన జెడుగాక పడుగాక మాటతిరుగలేరు మానధనులు॥

ఈ ప్రకారంగా తనలో తాను అనుకున్న బలి చక్రవర్తి తన భార్య వింధ్యావళిని సువర్ణకలశంలో జలం తీసుకురమ్మన్నాడు. భార్య నీరుపోస్తుంటే బలి చక్రవర్తి ఆ వటువు కాళ్లు కడిగాడు. వామనుడి కాళ్లు కడిగిన నీటిని తల మీద చల్లుకున్నాడు.  తరువాత బలి వామనుడిని పూజించాడు. తరువాత వామనుడితో ఇలా అన్నాడు.

"ఓ బ్రాహ్మణోత్తమా! నీవు సాక్షాత్తు విష్ణు స్వరూపుడవు. వేదాలు అధ్యయనం చేసిన వాడవు. నీవు అడిగిన మూడు అడుగుల నేలను దానంగా ఇస్తున్నాను. "త్రిపాద ధరణీం దాస్యామి. " అంటూ తన చేతిలోని నీటిని వామనుడి చేతిలో ధారగా పోయబోతున్నాడు..

ఇంతలో శుక్రాచార్యుడు ఒక పన్నాగం పన్నాడు. బలి చక్రవర్తి కమండలంలోని నీరు వామనుడి చేతిలో పడకుండా నీరు ధారగా కారే రంధ్రానికి సూక్ష్మరూపంలో అడ్డుపడ్డాడు. ఎంతకూ జల ధార రావడం లేదు. విషయం తెలుసుకున్న వామనుడు పక్కనే ఉన్న ఒక దర్భ పుల్లను తీసుకొని ఆ రంధ్రంలో పొడిచాడు. ఆ దర్భపుల్ల శుక్రాచార్యులవారి కంట్లో గుచ్చుకుంది. అప్పటి నుండి శుక్రాచార్యుడు ఒంటి కంటి వాడయ్యాడు. రంధ్రానికి ఉన్న అడ్డు తొలగడంతో నీరు ధారగాపడింది.  (ఈ కథ కేవలం పోతన గారి భాగవతంలోనే ఉంది. వ్యాస భాగవతంలో లేదు.)

.            వామనుడు బలిచక్రవర్తితో ఇలా అన్నాడు.  "భూమిని దానం చేసిన వానికీ, దానిని స్వీకరించిన వానికీ సకల

పాపాలుపోతాయి. వారికి స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. అన్ని దానములలో కల్లా భూదానము గొప్పది. నాకు భూమిని దానం చేసిన నీకు ఈ లోకంలో పరలోకంలో కీర్తి, పుణ్యము లభిస్తుంది. నేను మూడు అడుగులు ఎందుకు అడిగాను అని కూడా అడక్కుండా నీవు నాకు మూడు అడుగుల నేలను దానంగా ఇచ్చావు. నీవు నాకు ఇచ్చిన మూడు అడుగుల నేల నాకు మూడు లోకములతో సమానము." అని నర్మగర్భంగా అన్నాడు వామనుడు.

వామనుడి మాటలకు బలిమురిసిపోయాడు. "ఇంత చిన్న బాలుడు ఎన్ని మాటలో నేర్చాడో! పుట్టక ముందే నేర్చుకున్నాడా! ఈ బుడతడి పొట్టనిండా మాయలు ఉన్నట్టున్నాయి." అని తనలో తాను నవ్వుకున్నాడు బలి చక్రవర్తి.

తన భార్య జలము ధారగా పోస్తూ ఉండగా, బలిచక్రవర్తి తన త్రిలోకాధిపత్యమును వామనుడికి ధారపోసాడు. బలి చక్రవర్తి ఇచ్చిన దానమును వామనుడు స్వీకరించాడు.

ఆ॥ కమలనాభు నెఱిగి కాలంబు దేశంబు నెఱిగి శుక్రు మాట లెఱిగి నాశ
మెఱిగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి, మహి వదాన్యు డొరుడు మఱియు గలడె!

"తనను యాచించుచున్నది మహావిష్ణువు అని తెలిసీ, శుక్రుని మాటలు యదార్థములు అని తెలిసీ, తనకు ముప్పు వాటిల్లు తుందని తెలిసీ, తాను చేయబోయే దానము యోగ్యము అయినది అని భావించి, బలి చక్రవర్తి మూడు అడుగుల నేలను వామనుడికి

దానంగా ఇచ్చాడు. ఈ బలిచక్రవర్తి ఎంత గొప్పవాడు" అని దేవతలు, దానవులు, గంధర్వులు,సిద్ధులు, చారణులు పొగిడారు. దేవతలు పూలవాన కురిపించారు. దేవ దుందుభులు మోగాయి.

బలిచక్రవర్తి నుండిదానములు స్వీకరించిన తరువాత వామనుడు మెల్ల మెల్లగా ఎదగడం ప్రారంభించాడు. త్రిగుణములు, వాటి తత్వములు వామనుడియందు ఉండటం వలన, పృథివి, ఆకాశము, దిక్కులు, స్వర్గము, పాతాళము, సముద్రములు, పశు పక్ష్యాదులు, మనుష్యులు, దేవతలు, ఋషులు అందరూ ఆ వామనమూర్తిలో కనపడుతున్నారు. యాగశాలలో ఉన్న ఋత్విక్కులు, ఆచార్యులు, సదస్యులు, బలిచక్రవర్తి అందరూ వామనమూర్తి శరీరంలో అఖండ విశ్వమును దర్శించారు.

వామనమూర్తి పాదముల కింద రసాతలము మొదలగు అధోలోకములు, పాదముల దగ్గర భూమండలము, జంఘముల యందు పర్వతములు, జానువుల యందు పక్షులు, ఊరువుల యందు వాయువులు, ఆయన ధరించిన వస్త్రములలో సంధ్యాదేవి, నడుము దగ్గర అసురులు (బలితోసహా), నాభిప్రదేశములో ఆకాశము, పొట్టలో సప్తసముద్రములు, వక్షస్థలములో నక్షత్రమండలము దర్శించారు. వారందరికీ విశ్వరూప సందర్శనము కలిగింది.

శ్రీమహావిష్ణువు అవతారమైన వామన మూర్తి హృదయములో ధర్మము, స్తనములు ఉన్న ప్రదేశములో సత్యవాక్కులు, మనస్సులో చంద్రుడు, వక్షస్థలములో లక్ష్మీదేవి, కంఠములో

సామవేదము, భుజముల యందు ఇంద్రుడు మొదలగు దేవతాగణములు, చెవులయందు దిక్కులు, తలయందు స్వర్గలోకము, తలవెంట్రుకలయందు మేఘములు, ముక్కుయందు వాయువు, కళ్లలో సూర్యుడు, ముఖమునందు అగ్ని, వాక్కుయందు ఛందస్సు, రసములో వరుణుడు, కనుబొమలయందు ఆజ్ఞలు, కనురెప్పలయందు రాత్రి, పగలు, లలాటమునందు కోపము, పెదవులలో లోభము, స్పర్శలో కామము, వీపుయందు అధర్మము, పాదముల యందు యజ్ఞములు, నీడయందు మృత్యువు, చిరునవ్వులో మాయ, శరీరములో ఉన్న వెంట్రుకలలో ఓషధులు, నాడులలో నదులు, గోళ్లలో పెద్దపెద్ద కొండ శిలలు, బుద్ధియందు  బ్రహ్మ, దేవతలు, ఋషులు, అంతేకాకుండా పరమాత్మ శరీరము యందు సమస్తజీవరాసిని బలి చక్రవర్తి దర్శించాడు.

వామన మూర్తి విశ్వరూపము చూచి రాక్షసులకు గుండెల్లో గుబులు పుట్టింది. శ్రీమహావిష్ణువు అనుచరులు స్తోత్రము చేస్తున్నారు. ఆసమయంలో శ్రీమహావిష్ణువు కిరీటముతో, మకర కుండలములతో, శ్రీవత్సముతో, కౌస్తుభముతో, పీతాంబరముతో, వనమాలతో బలి చక్రవర్తి ముందు నిలబడ్డాడు. తన ఒక అడుగుతో భూమిని అంతా ఆక్రమించాడు. తన శరీరముతో ఆకాశముదాకా ఉన్న ప్రదేశమును ఆక్రమించాడు. రెండవ అడుగు భువర్లోకము, స్వర్గలోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము దాటి పోయాడు. మూడవ పాదము పెట్టడానికి బలిచక్రవర్తి వామనుడికి తగినస్థానము చూపించలేకపోయాడు.

శా॥ ఇంతింతై వటుడింతయై మఱియు దా నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువుని పైనంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

వామనుడు ఇంతవాడు అంతవాడయ్యాడు. అంతకంటే మరింతగా పెరిగాడు. అలా అలా పెరిగిపోతున్నాడు. అలా పెరుగుతూ ఆకాశం దాటేసాడు. మేఘమండలం దాటేసాడు. తేజోమండలం కూడా దాటాడు. చంద్రలోకము, ధృవలోకము దాటాడు. మహర్లోకం వరకూ పెరిగాడు. అలా పెరుగుతూ సత్యలోకం కూడా దాటేసాడు. ఆ ప్రకారంగా వామనుడు పెరగడాన్ని పోతన గారు మనముందు కళ్లకు కట్టినట్టు వర్ణించాడు.

మ॥రవిబింబం బుపమింప బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచ ద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.

వామన మూర్తి పెరుగుతుంటే ముందు సూర్యబింబము వామనుడికి గొడుగులాగా కనపడింది. ఇంకొంచెం పెరిగేసరికి అదే సూర్యబింబము తలకు అలంకరించుకొన్న మణిలాగా ప్రకాశించింది. తరువాత అదే సూర్యబింబము చెవి కుండలముగానూ, తరువాత కంఠాభరణంగానూ, తరువాత భుజకీర్తిగానూ, తరువాత చేతికి పెట్టుకున్న కంకణంగానూ, తరువాత మొలకు కట్టిన గంటగానూ, ఆ

తరువాత కాలికికట్టుకున్న బంగారు అందియగానూ, ఆఖరున వామన మూర్తి పాదపీఠముగానూ ప్రకాశించింది. అంటే వామనమూర్తి అలా సూర్యమండలం దాటాడు అని ప్రత్యక్ష ప్రసారంలాగా చూపించారు పోతనగారు.

వామన మూర్తి ఆ ప్రకారం పెరుగుతుంటే ఆయనలో అంతర్గతంగా ఉన్న సత్వ,రజస్తమోగుణములు, వాటి అహంకారములు, వాటి నుండి ఆవిర్భవించిన భూమి, ఆకాశము, దిక్కులు, స్వర్గము, సముద్రములు, సమస్తజీవజాలము, మానవులు దేవతలు, ఋషులు ఆ వామనమూర్తిలో గోచరించారు. యజ్ఞశాలలో ఉన్న ఋత్తిక్కులు, సదస్యులు ప్రకటితమయ్యారు. బలి చక్రవర్తి వామన మూర్తి శరీరంలో పంచభూతములను, పంచతన్మాత్రలను, సకలజీవులను, సత్వ,రజస్తమోగుణ స్వరూపమైన ఈ అనంత విశ్వాన్ని సందర్శించాడు.

బలి చక్రవర్తి వామన మూర్తి పాదముల కింద రసాతలము మొదలగు అధోలోకములను చూచాడు. అంతేకాకుండా వామన మూర్తి పాదముల యందు భూమిని, చీల మండల యందు పర్వతములను, పిక్కల యందు పక్షులను, తొడల యందు వాయువును, వామన మూర్తి ధరించిన వస్త్రములయందు సంధ్యాదేవిని, జననేంద్రియములయందు ప్రజాపతులను, నడుము భాగంలో అసురులను, నాభి యందు ఆకాశమును, ఉదరమునందు సముద్రమును, వక్షస్థలమునందు నక్షత్రమండలమును సందర్శించెను.

అంతే కాకుండా వామన మూర్తి హృదయంలో ధర్మమును, గుండెల భాగంలో ప్రియమైన సత్యవాక్కును, మనస్సులో చంద్రుని, వక్షస్థలములో లక్ష్మీదేవిని, కంఠములో సామవేదగానమును, సమస్త శబ్దములను, భుజములయందు ఇంద్రుని, సమస్త దేవతలను, చెవులయందు దిక్కులను, తలభాగంలో స్వర్గమును, తల వెంట్రుకల యందు మేఘములను, ముక్కునుండి వాయువును, కళ్ల నుండి సూర్యుని, ముఖము నుండి అగ్నిని, వాక్కుల యందు ఛందస్సును, రసములలో వరుణుని, కనుబొమ్మలలో చేయవలసిన, చేయకూడని పనులకు సంబంధించిన ఆజ్ఞలను, కనురెప్పలు తాటించడంలో రాత్రి, పగలును, నుదుటి మీద కోపమును, పెదవులలో లోభమును, స్పర్శలో కామకోరికలను, వీర్యములో జలమును, వెనుకభాగంలో అధర్మమును, పాదముల కదలికలో యజ్ఞకార్యములను, ఛాయలో మృత్యువును, హాస్యసంభాషణములో మాయను, శరీరముమీద వెంట్రుకలలో ఓషధులను, నాడులలో నదులను, గోళ్లయందు రాళ్లను, బుద్ధియందు బ్రహ్మను మొదలగు దేవతాగణములను, ఋషులను, వామన మూర్తి శరీరమునందు అనంత విశ్వమును బలి చక్రవర్తి చూచాడు.

బలి చక్రవర్తి పక్కనే ఉన్న రాక్షస వీరులు అందరూ వామన మూర్తి విశ్వరూపమును చూచి దు:ఖించారు. వామన మూర్తి వారికి పాంచజన్యము అనే శంఖంతో, కౌమోదకి అనే గదతో, విద్యాధరము అనే కత్తితో, అక్షయతూణీరములతో, అనేకమంది పార్షదులతో, కిరీటముతో, మకరకుండలములతో, శ్రీవత్సకౌస్తుభముతో, పీతాంబరముతో, వనమాలతో, దర్శనం ఇచ్చాడు.

అప్పుడు సాక్షాత్తు మహావిష్ణు అవతారము అయిన వామనుడు ఒక కాలి పాదముతో భూమిని మొత్తం కొలిచాడు. మరొకపాదముతో స్వర్గమును ఆక్రమించాడు. మూడవ పాదముతో కొలవడానికి బలి చక్రవర్తి వద్ద భూమి లేదు. ఎందుకంటే వామనుడు త్రివిక్రముడై స్వర్గము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము అన్నిటినీ ఆక్రమించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము ఇరువదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమస్కంధము

ఇరువది ఒకటవ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో వామనావతారకథను ఇలా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! వామనుడు త్రివిక్రముడు అయ్యాడని చెప్పాను కదా. అప్పుడు వామనుని పాదములు సత్యలోకమును తాకాయి. ఆ సమయంలో బ్రహ్మదేవుడు తన తండ్రి అయిన విష్ణువు పాదముల వద్దకు వచ్చాడు. ఆయనతో పాటు మరీచి

మొదలగు మహా మునులు, ఋషులు, యోగులు అక్కడకు చేరుకున్నారు.

విష్ణుమూర్తి పాదముల గోళ్ల కాంతితో బ్రహ్మలోకమంతా ప్రకాశించింది. బ్రహ్మలోక వాసులందరూ విష్ణుమూర్తి పాదములకు భక్తితో నమస్కరించారు. బ్రహ్మ పవిత్ర జలములతో తనతండ్రి విష్ణువు పాదాలు కడిగాడు. పుష్పములతో పూజించాడు.
(అందుకే అన్నమయ్య "బ్రహ్మకడిగిన పాదము" అని తన సంకీర్తనములలో శ్రీవేంకటేశ్వరుని స్తుతించాడు.)

బ్రహ్మ గారు విష్ణువు యొక్క పాదములను కడిగిన జలములు ధారగా ప్రవహించి ఆకాశ గంగగా మారాయి. ఆకాశ గంగ బ్రహ్మలోకము నుండి బయలుదేరి మూడులోకములలో ప్రవహించింది. ఆ ఆకాశ గంగ యే స్వర్గలోకములో మందాకిని అనీ, భూలోకములో గంగా నది అనీ పిలువబడుతూ ఉంది.

బ్రహ్మలోక వాసులందరూ వామన మూర్తి పాదములను భక్తితో సేవించసాగారు. సుగంధ ద్రవ్యములతోనూ, పవిత్రజలముల తోనూ, పూలమాలలతోనూ, చందనము మొదలగు లేపనములతోనూ, ధూప, దీపములతోనూ, లాజలతోనూ (పేలాలు), మధురమైన ఫలములతోనూ, పూజించారు. అనేకవిధములుగా స్తుతించారు. జయజయధ్వానాలు చేసారు. వాద్యములు మోగించారు. పాటలు పాడారు. నృత్యం చేసారు. శంఖములు ఊదారు. పదహారు రకములైన ఉపచారములతో విష్ణుభగవానుని పూజించారు. జాంబవంతుడు

పెద్దగా కేరింతలుకొడుతూ విష్ణుమూర్తి విజయోత్సవమును చాటించాడు.

బ్రహ్మలోకంలో ఇలా ఉంటే భూలోకంలో ఉన్న దైత్యులకు ఒళ్లు మండి పోయింది. వారిలో వారు ఇలా అనుకున్నారు.

" ఈ వామనుడు నిజంగా బ్రాహ్మణుడు కాదు. మాయావి అయిన విష్ణువు. ఒక సారి మోహినీ రూపంలో వచ్చి మనకు దక్కాల్సిన అమృతమును దేవతలకు ఇచ్చాడు ఈ విష్ణువు. ఇప్పుడు వామన రూపంలో వచ్చి మూడు అడుగుల భూమిని దానంగా తీసుకొని, మూడులోకములు ఆక్రమించాడు. ఈ ప్రకారంగా విష్ణువు ప్రతీసారీ దానవులను మోసం చేస్తూనే ఉన్నాడు.

అయినా మా బలి చక్రవర్తి ఏం పాపం చేసాడు. బలి నిత్యసత్యవ్రతుడు. ఎప్పుడూ అబద్ధం చెప్పడు. అయినా యజ్ఞ దీక్షలో ఉన్న వాడిని మోసం చెయ్యడానికి ఆ విష్ణువుకు ఎలా మనసొప్పింది. బలికి బ్రాహ్మణులు అన్నా, దీనులు అన్నా ఎంతో జాలి దయ. కేవలం దైత్య కులములో పుట్టినంత మాత్రాన ఇలా చేస్తాడా. ఇంక లాభం లేదు. ఈ విష్ణువును వధించాలి." అని దానవులు, అసురులు, రాక్షసులు చేతికి అందిన ఆయుధములను, అస్త్రశస్త్రములను తీసుకొని వామనుడిని చంపడానికి పూనుకున్నారు. బలికి ఇష్టం లేకపోయినా, ఆయన అనుచరులు వామనుడిని చంపడానికి నిశ్చయించుకున్నారు.

ఇంతలో విష్ణు మూర్తి అనుచరులు కూడా అక్కడకు చేరుకున్నారు. వారు కూడా అస్త్ర శస్త్రములను ధరించి, రాక్షసులను

ఎదుర్కొన్నారు. విష్ణుమూర్తి సైన్యములో జయవిజయులు, నందసునందులు, బలప్రబలులు, కుముదుడు, కుముదాక్షుడు, విష్వక్సేనుడు, గరుడుడు, జయంతుడు, శ్రుతదేవుడు, పుష్పదంతుడు, సాత్వతుడు మొదలగు మహాబలసంపన్నులు అయిన విష్ణుమూర్తి అనుచరులు రాక్షససైన్యములను నాశనం చేసారు.

ఇదంతా చూచిన బలిచక్రవర్తి తన గురుదేవులు శుక్రాచార్యుని శాపం పనిచేయడం మొదలుపెట్టిందని అనుకున్నాడు. వెంటనే రాక్షస సైన్యమును యుద్ధము చేయవద్దని ఆదేశించాడు. "ఓ రాక్షస సేనానాయకులారా! ఓ విప్రచిత్తీ! రాహువూ! నేమీ! ఆగండి. విష్ణువు అనుచరులతో యుద్ధం ఆపండి. వెనక్కు రండి. ప్రస్తుతము గురువుగారి శాపం మన మీద పనిచేస్తూ ఉంది. ఇది మనకు అనుకూలమైన కాలం కాదు. తక్షణమే వెనక్కు మరలండి. విష్ణువు సర్వవ్యాపి. సకల జనులకు సుఖమును, దు:ఖములు ఆయనే కలిగిస్తాడు. ఆయనను ఎదుర్కోవడం మనకు అలవిమాలిన పని.

ఇంతకు ముందు మనకు అనుకూలమైన కాలము, దేవతలకు ప్రతికూలమైన కాలము కాబట్టి, మనము జయించాము. స్వర్గమును పాలించాము. దేవతలను తలోక దిక్కుగా తరిమికొట్టాము. దేవతలు మనకు భయపడి పారిపోయారు. అప్పుడు విష్ణువు దేవతలకు సాయం చేయలేదు. అందుకని దేవతలు మనచేతిలో ఓడిపోయారు.

ఇప్పుడు కాలము మనకు అనుకూలంగా లేదు. కాలం అనుకూలంగా లేనపుడు పౌరుషము, పరాక్రమము పనిచెయ్యవు.

కాలానికి మనం తలవంచాలి తప్పదు. మనమే కాదు ఈ సృష్టిలో ఎంతటి బలవంతుడైనా, ఎంతటి పరాక్రమవంతుడైనా, కాలమును అతిక్రమించలేడు.
(కోటాను కోట్లు సంపాదించిన వారైనా, బంగారు కుర్చీలలో కూర్చుని బంగారు పళ్లెములో భోజనం చేసేవారైనా, పెద్ద పెద్ద ఉద్యోగస్థులు అయినా కాలం కలిసిరాకపోతే కారాగార వాసం తప్పదు అని ప్రస్తుత కాలంలో నిరూపించబడింది కదా!)

అంతెందుకు. మన సంగతే చూడండి. మనం ఇంతకు ముందు ఎన్ని సార్లు విష్ణుమూర్తి సైన్యమును, దేవతా సైన్యములను యుద్ధములో ఓడించలేదు. కాని వారే నేడు మనలను ఓడించారు. కేరింతలు కొడుతున్నారు. కాలము అనుకూలంగా ఉండబట్టి వారు మనలను ఓడించగలిగారు. కాబట్టి మనము కూడా, మనకు అనుకూలమైన కాలము వచ్చేవరకు ఎదురు చూడ్డం తప్ప చేయగలిగింది ఏమీ లేదు." అని అన్నాడు బలి చక్రవర్తి.

బలి చక్రవర్తి మాటలు విన్న ఆయన సైన్యాధి పతులు తమ తమ సేనలతో పాతాళ లోకానికి వెళ్లిపోయారు. యుద్ధములో ఓడి పోయిన వారిని బంధించడం ఆచారం కాబట్టి, వామన మూర్తి ఆదేశం మేరకు గరుడుడు బలిని వరుణపాశములతో బంధించాడు. బంధింపబడిన బలిని చూచి వామనుడు ఇలా అన్నాడు.

"ఓ బలి చక్రవర్తీ! నీవు నాకు మూడు అడుగుల నేల దానంగా ఇచ్చావు. నేను ఒక అడుగుతో భూమిని, మరొక అడుగుతో

స్వర్గమును ఆక్రమించాను. మూడవ అడుగు ఉంచడానికి స్థానం ఎక్కడ? సూర్య చంద్రులు, నక్షత్రములు ఎంతవరకు తమ కాంతిని విస్తరిస్తాయో అంతమేర భూమి నీఅధీనంలో ఉంది. ఆ భూమి అంతా నేను ఒకే ఒక అడుగుతో ఆక్రమించాను. నా శరీరమును విస్తరించి ఆకాశమును, దిక్కులను ఆక్రమించాను. నీ కళ్లముందే, రెండవ పాదముతో స్వర్గలోకమును ఆక్రమించాను. మూడవ పాదము ఉంచడానికి నీవు స్థానమును చూపడం లేదు. ఆడినమాట తప్పావు.

నీ గురువు శుక్రాచార్యుల వారి శాపము ప్రకారము నీవు రాజ్యభ్రష్టుడవు అయ్యావు. ఆడినమాట తప్పిన వారికి, దానం ఇస్తానని, ఇవ్వకుండా మోసం చేసిన వారికి, నరకలోక ప్రాప్తి కలుగుతుంది. మూడులోకములలో నా కన్నా గొప్ప వాడు, ధనవంతుడు లేడు, నేను ఏమన్నా ఈయగలను అనే గర్వం నీలో ప్రవేశించింది. అందుకే ఆలోచించకుండా మూడు అడుగులు దానంగా ఇస్తానని మాట ఇచ్చావు. కాని ఇచ్చిన మాటను తప్పావు. ఇచ్చిన మాట తప్పినందుకు, కొంత కాలము పాటు దానికి ఫలితం అనుభవించాలి. తప్పదు.” అని అన్నాడు వామనుడు.

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము ఇరవై ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## అష్టమ స్కంధము

## ఇరవై రెండవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వామనావతార కథను ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! బలిచక్రవర్తి వామనుడికి మూడు అడుగులు దానంగా ఇస్తాను అన్నాడు. కాని మూడవ అడుగు పెట్టడానికి స్థానం చూపించలేకపోయాడు. ఆ ప్రకారంగా ఇచ్చిన మాట తప్పాడు. కాని బలి తన మాట నిలబెట్టుకోదలచుకున్నాడు. బలి చక్రవర్తి వామనమూర్తిని చూచి ఇలా అన్నాడు.

"ఓ బ్రాహ్మణోత్తమా! నేను నీకు ఇచ్చిన మాటను తప్పాను అని నీవు అనుకుంటున్నావు. కాని అది నిజం కాదు. నేను నీకు ఇచ్చిన మాటను నిజం చేస్తాను. నేను ఆడిన మాట తప్పను. నీవు నీ మూడవ పాదమును నా తలమీదపెట్టు. నీకు కావలసిన మూడవ అడుగు అదే.

ఓ దేవా! నేను స్వర్గలోక ఆధిపత్యమును ఇంద్ర పదవిని పోగొట్టుకున్నాను. నీ చేత బంధింపబడ్డాను. అపకీర్తి పాలయ్యాను. నేను ఆడినమాట తప్పవలసి వచ్చిందే అని భయపడుతున్నాను కానీ, దాని వలన వచ్చే నరకమునకు కానీ, నీవు బంధించి నందుకు కానీ, నాకు ఉన్న భోగభాగ్యములు నశించాయని కానీ, నాకు నిరంతర దు:ఖము కలిగింది అని కానీ ఏ మాత్రము భయపడటం లేదు.

దు:ఖపడటం లేదు.

లోకంలో తల్లి, తండ్రి, సోదరులు, మిత్రులు కూడా తమ వారికి ఇటువంటి దండన విధించరు. కానీ నేను నీ చేతిలో అటువంటి దండన అనుభవించాను. వరుణ పాశముల చేత బంధింపబడ్డాను. నీవు నాకు విధించిన దండనను నేను సంతోషంతో స్వీకరిస్తున్నాను.

ఓ దేవా! మేము అసురులము. నీవు మాకు శత్రువు అని బయట ప్రపంచానికి తెలుసు. కాని పరోక్షంగా నీవు మాకు ఎంతో మేలు చేస్తుంటావు అని ఎవరికీ తెలియదు. మాకు రజోగుణము, తమోగుణము ఎక్కువ. మాకు శౌర్యము, పరాక్రమము ఉందన్న గర్వము, పౌరుషము ఎక్కువ. వాటితో మాకు కళ్లు మూసుకు పోతాయి. గర్వాంధులము అవుతాము. ఆ సమయములో మమ్ములను తగు రీతిలో శిక్షించి, మాకు కళ్లు తెరిపించి, మమ్ములను సన్మార్గంలో నడిపించే మా ఆప్తమిత్రుడవు నీవే కదా!

అంతే కాదు. జీవితాంతము నిన్ను ద్వేషిస్తూ, ఆ ద్వేషంలో కూడా నిరతంరము నీ నామ స్మరణ చేసిన రాక్షసులు, అసురులు, వారి మరణానంతరము, ఎంతో తపస్సు చేసిన యోగులకు కూడా లభించని మోక్షమును పొందారు. నీలో ఐక్యం అయ్యారు. కాబట్టి నీవు నన్ను వరుణ పాశములతో బంధించి నందుకు నేను వ్యధ చెందడం లేదు. అంతా నా మంచికే అని సంతోషిస్తున్నాను.

నా తాత గారు అయిన ప్రహ్లాదుని తండ్రి హిరణ్యకశిపుడికి నీవు బద్ధశత్రువు. ఆ హిరణ్యకశిపుని చేతిలో నానారకాల బాధలను, యాతనలను అనుభవించిన ఆయన కుమారుడు ప్రహ్లాదుడు మాత్రము నీకు పరమ భక్తుడు. ఆ ప్రహ్లాదుని నీవు కరుణించావు, రక్షించావు. చిత్రంగా ఉంది కదూ!

ఓ దేవా! ఈ శరీరము శాశ్వతము కాదు. జీవుడు ఈ శరీరమును విడిచిపెట్టగానే, శరీరం పడిపోతుంది. ఒక్కక్షణం కూడా దానిని ఉంచరు. అనుభవించడానికి శరీరము లేకపోయినప్పుడు ఈ భోగభాగ్యములు, రాజ్యము ఉండి ఏమి ప్రయోజనము. స్త్రీ సౌఖ్యము అనుభవించడానికి ఈ శరీరమే లేనపుడు ఎంత మంది స్త్రీలు ఉండి ఏమి ప్రయోజనము.

ఓ దేవా! ఈ సంసారము ఏర్పడటానికి మూల కారణము స్త్రీ, ఆమె వలన కలిగిన సంతానము. వీరంతా మానవుని సంపదలను హరిస్తారు. కాబట్టి భార్య, సంతానము వలన ఏమి ప్రయోజనము. రోజు రోజుకూ ఆయువు క్షీణించి పోతుంటే, ఈ గృహములు, రాజసౌధములు ఉండి మాత్రము ఏమి ప్రయోజనము. ఈ శరీరమే అశాశ్వతము అయినపుడు, ఈ ప్రాపంచిక విషయములు శాశ్వతములు ఎలా అవుతాయి?

ఆ కారణం చేతనే మా తాత గారు ప్రహ్లాదుడు అశాశ్వతములైన ప్రాపంచిక సుఖములు, విషయ వాంఛలను వదలిపెట్టి, శాశ్వతములైన నీ పాదములను శరణుజొచ్చాడు. కాని నేను

ఏం చేసాను? ఈ రాజ్యములు, ఈ స్వర్గలోకాధిపత్యము, అప్సరసలతో సౌఖ్యము, కీర్తిప్రతిష్టలు ఇవన్నీ శాశ్వతములు అని నమ్మి మృత్యువు నా వెనుకనే పొంచి ఉన్నదని గ్రహించలేక గర్వంతో మూర్ఖుడిలా ప్రవర్తించాను. నేడు నీ వలన నాలోని గర్వము, మూర్ఖత్వము నశించాయి. ఈ ప్రాపంచిక భోగముల నుండి విముక్తుడనై శాశ్వతములైన నీ పాదములను నా శిరస్సున ధరించుచున్నాను." అని బలి చక్రవర్తి వామనుడికి భక్తితో నమస్కరించాడు.

తన మనుమని త్యాగనిరతికి ముగ్ధుడైన ప్రహ్లాదుడు తన దివ్యరూపంతో అక్కడకు వచ్చాడు. తన ఎదుట నిలబడ్డ తన తాత గారు ప్రహ్లాదుని చూచాడు బలి. కాని వరుణపాశములతో కట్టబడి ఉన్నందున ఆయనకు తగిన సత్కారములను చేయలేక పోయాడు. కేవలము తల వంచి నమస్కరించాడు. సిగ్గుతో తల వంచుకున్నాడు. ప్రహ్లాదుడు తన ఎదుట నిలబడి ఉన్న శ్రీమహావిష్ణుస్వరూపుడగు వామన మూర్తిని చూచాడు. ప్రహ్లాదుని శరీరం పులకించింది. భక్తితో నేల మీద పడి సాష్టాంగ ప్రమాణం చేసాడు. వామన మూర్తిని చూచి ప్రహ్లాదుడు ఇలా అన్నాడు.

"ఓ దేవదేవా! నీవే కదా ఈ బలికి ఇంద్రపదవిని ఇచ్చావు. ఇప్పుడు నీవే దానిని లాక్కున్నావు. ఈ ఇంద్రపదవి ఎన్నోవ్యామోహాలకు కారణం అయింది. అందుకనే బలిమీద ఉన్న ప్రేమతో, అతనిని రక్షించడానికి మరలా దానిని లాక్కున్నావు. ఇది నీ అనుగ్రహమే కానీ ఆగ్రహము కాదు.

ఓ దేవా! మానవుడు ఎంతటి గొప్ప వాడైనా, విద్వాంసుడైనా, వేదవేదాంగ పారంగతుడైనా, అతనికి సంపదలు సమకూరితే, అతనికి గర్వం కలుగుతుంది. మోహంలో పడతాడు. జ్ఞాన మార్గము నుండి భ్రష్టుడు అవుతాడు. సంపదలు, ధనము ఉన్నప్పుడు ఎవరికీ ఆత్మజ్ఞానము గురించి తెలుసుకోవాలనే కోరిక కలగదు. ధనమదంతో విర్రవీగుతుంటారు. జ్ఞానులకు విద్వాంసులకు అటువంటి గర్వము కలిగి నపుడు, వారివద్ద నుండి ఆ సంపదలను లాక్కుని, వారిని మరలా జ్ఞానమార్గంలోకి మళ్లిస్తుంటావు. అలాచెయ్యడం వారికిమేలుచేసినట్టే అవుతుంది.

ఓ దేవా! నీకు అన్నీ తెలుసు. అందరినీ సమంగా చూస్తుంటావు. నీకు ఎవరిమీదా మిత్రత్వము, శత్రుత్వము లేవు. అట్టినీకు నమస్కారము.” అని ప్రహ్లాదుడు వామన మూర్తికి భక్తి నమస్కరించాడు.

అప్పటి దాకా జరిగినది అంతా చూస్తూ ఉన్న బలి చక్రవర్తి భార్య, వరుణ పాశములతో బంధింపబడి ఉన్న తన భర్తను చూచి భయంతో వణికిపోయింది. చేతులు జోడించి వామన మూర్తిని ఇలా ప్రార్థించింది.

“ఓ దేవదేవా! నీకు నమస్కారము. నీవు ఈ జగత్తును ఒక ఆటగా సృష్టించావు. పోషిస్తున్నావు. లయం చేస్తున్నావు. భోగభాగ్యాలు ఇస్తున్నావు. సుఖదు:ఖాలు కలుగజేస్తున్నావు. కాని ఈ మూర్ఖ మానవులు, దేవతలు, దానవులు ఇదంతా తమ ప్రతిభ వలననే

జరుగుతూ ఉందని గర్విస్తున్నారు. ఇదంతా నేను సంపాదించాను, ఇది నాది, దీనిని నీకు దానం ఇస్తున్నాను అని అనుకొంటూ ఉంటారు.

ఓ దేవా! ఈ అనంత విశ్వము అంతా నీది అయినప్పుడు దానం ఇచ్చేదెవరు. పుచ్చుకొనేదెవరు. ఈ మూడులోకములు నీవే అయినప్పుడు నీ భూమి నీకు దానంగా ఇవ్వడం ఏమిటి?ఇది అంతా నీ లీల తప్ప వేరే ఏమీకాదు." అని భక్తితో నమస్కరించింది.

ఇంతలో బ్రహ్మదేవుడు కూడా అక్కడకు వచ్చాడు. వామన మూర్తిని చూచి ఇలా అన్నాడు. "ఓ దేవదేవా! నీకు నమస్కారము. ఈ బలి చక్రవర్తి సంపదలు, త్రిలోకాధిపత్యము నీవు తీసుకున్నావు. ఇంకా ఇతనిని బంధించడం ఎందుకు. వెంటనే విడిచిపెట్టు. ఈ బలి చక్రవర్తి ఒక అడుగుతో భూమిని, మరొక అడుగుతో ఆకాశమును, స్వర్గమును నీకు దానంగా ఇచ్చాడు. మూడవ అడుగు పెట్టడానికి తన శిరస్సు అర్పించి, తనలో ఉన్న గర్వమును, అహంకారమును నీకు సమర్పించుకున్నాడు. ఇంక ఇతనికి ఎటువంటి దండన అవసరము లేదు.

కపటము లేనివాడు, నీ యందు అచంచలమైన భక్తి కలవాడు, నిష్కల్మష హృదయంతో నీ పాదములను నీటితో కడిగి, నిన్ను గడ్డి పూలతో పూజించి, మోక్షమును పొందుతాడు. ఈబలి చక్రవర్తి కూడా నీ పాదముల వద్ద తన సర్వస్వమును, త్రిలోకాధిపత్యమును సమర్పించుకున్నాడు. ఇంకా ఇతడు ఎందుకు బంధింపబడి ఉండాలి. వెంటనే ఇతనిని బంధవిముక్తునిగా చెయ్యి." అని ప్రార్థించాడు.

ఆమాటలన్నీ విన్న శ్రీహరి వారితో ఇలా అన్నాడు. "ఈ లోకంలో ఎవని వద్ద ధనము, సంపదలు ఉంటాయో, వాడికి గర్వంతో, మదంతో ఒక విధమైన మత్తు ఆవరిస్తుంది.. అప్పుడు వాడికి దేవుడు కనిపించడు. అంతా తన మహిమ వలననే జరుగుతోంది అనుకుంటాడు. వాడిని అనుగ్రహించడానికి, వాడిని మరలా మంచి మార్గంలో పెట్టడానికే నేను వాని ధనమును, సంపదలను హరిస్తుంటాను.

ఈ సంసారంలో ఉన్న జీవులు ఎన్నో కర్మలు చేస్తుంటారు. ఆ కర్మఫలములను అనుసరించి రకరకాల జన్మలు ఎత్తుతుంటారు. అందులో ఉత్తమమైనది మానవ జన్మ. ఇతర జీవులకు లేని సౌకర్యాలు మానవులకు ఉంటాయి. మానవులు, వారు పుట్టిన ఉన్నత కులము వలన గానీ, వారు చేసే కర్మల వలన గానీ, వారి వయస్సు వలన గానీ, వారి రూపము వలన గానీ, వారు నేర్చుకున్న విద్య వలన గానీ, వారు సంపాదించిన ధనము, సంపదలు, వాటి వలన లభించే భోగములు, సుఖములు వలన గానీ, మానవులకు గర్వం, మదం కలుగుతూ ఉంటుంది. . కాని పైచెప్పిన వాటి వలన ఎవడైతే గర్వమును, మదమును, అహంకారమును పొందకుండా ఉంటాడో, వాడిని నేను అనుగ్రహిస్తాను.

ఒక్కోసారి ధృవుడు వంటి నా భక్తులకు నేను రాజ్య సంపదలు, భోగభాగ్యాలు ఇస్తాను. దానికీ ఒక కారణం ఉంది. నేను

ప్రసాదించిన రాజ్య సంపదల వలన గానీ, భోగభాగ్యాల వలన గానీ, వారు పుట్టిన పుట్టుక వలన గానీ, వారు నేర్చుకున్న విద్య వలన గానీ వారు మోహితులు అవుతారా అని గమనిస్తాను. కాని నా మీద అచంచలమైన, ఏకాగ్రమైన భక్తి, విశ్వాసములు కలవారు, వారు పుట్టిన ఉన్నత కులము వలన గానీ, నేర్చుకున్న విద్య వలన గానీ, సంపాదించిన ఐశ్వర్యము వలన గానీ లభించిన తుచ్ఛమైన ప్రాపంచిక సుఖములకు, ధనమునకు, సంపదలకు, మోహితులు కారు. వారిని గర్వము, మదము ఆవహించదు.

ఈ దానవ చక్రవర్తి అయిన బలి మహా యశస్వి. దానవులలో కెల్లా శ్రేష్టుడు. ఇతడు ప్రాపంచిక విషయములకు లోబడలేదు. పైగా నా మాయను జయించాడు. ప్రస్తుతము ఇతనికి సంపదలు, ఐశ్వర్యము లేకపోయినా ధర్మమార్గము నుండి అతడు దిగజారలేదు. ఈ బలికి ఇప్పుడు ధనము లేదు. రాజ్యపదవి లేదు. శత్రువులచేత బంధింపబడ్డాడు. బంధువులు మిత్రులు ఇతనిని వదిలేసారు. వరుణపాశములతో బంధింపబడ్డాడు. గురువు చేత శపించబడ్డాడు. ఇన్ని దుర్దశలు దాపురించినా ఈ బలి తన సత్యమార్గమును, ధర్మమార్గమును విడిచిపెట్టలేదు.

నేను అడిగినది మూడు అడుగులే. కానీ నేను మూడులోకములను ఆక్రమించి ఇతనిని మాటతప్పేటట్టు చేసాను. కాని ఇతడు నా మూడవ పాదమును పెట్టడానికి తన తలను అర్పించి తన సత్యనిష్ఠను, ధర్మనిరతిని నిరూపించుకున్నాడు. అందుకే ఈ బలి చక్రవర్తికి ఇంద్ర పదవి కంటే ఎక్కువైన పదవిని ఇస్తున్నాను.

రాబోవు సావర్ణి మన్వంతరములో బలి చక్రవర్తి మరలా ఇంద్రపదవిని చేపట్టగలడు. అప్పటి వరకు ఈ బలి చక్రవర్తి స్వర్గలోకముకంటే గొప్పదైన సుతల లోకమునకు అధిపతిగా ఉండగలడు. ఈ సుతల లోకమును విశ్వకర్మ నిర్మించాడు. ఆ లోకంలో వ్యాధులు ఉండవు. మరణం ఉండదు. అలసట ఉండదు. అవమానము ఉండదు. ఎటువంటి బాధలు, కష్టములు ఉండవు. సుతల లోకము ఇంద్రలోకము కన్నా ప్రశస్తమైనది. బలిని ఆ సుతల లోకమునకు అధిపతిగా చేస్తున్నాను.

ఓ బలిచక్రవర్తీ! నీవు వెంటనే పోయి సుతల లోకాధిపత్యమును స్వీకరించు. సమస్తభోగములు అనుభవించు. అక్కడ నీ అధికారమునకు తిరుగు లేదు. లోక పాలకులుకూడా నిన్ను ఏమీ చెయ్యలేరు. నా సుదర్శన చక్రము అనుక్షణము నీకు రక్షగా ఉంటుంది. నీ ఆజ్ఞమీరిన వారిని అది తక్షణము సంహరిస్తుంది.

అంతెందుకు నేను, నా అనుచరులు, నా ఆయుధములు కూడా ఎల్లప్పుడూ నీ పక్కనే ఉండి నిన్ను రక్షిస్తూ ఉంటాము. నా సాంగత్యమువలన నీ లోని ఆసురీ భావము నశించి, భాగవత భావమును పొందగలవు." అని శ్రీహరి బలి చక్రవర్తిని అనుగ్రహించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము ఇరువది రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత& ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## అష్టమ స్కంధము
## ఇరువది మూడవ అధ్యాయము.

శుకుడు పరీక్షిత్ మహారాజుకు వామనావతార కథను ఇలా చెప్పసాగాడు.

"ఆ ప్రకారంగా వామనుడు పలుకగా, బలి యొక్క రెండుకళ్లలో ఆనంద భాష్పములు నిండి పోయాయి. భక్తితో రెండు చేతులు జోడించి గద్గదమైన కంఠంతో ఇలా అన్నాడు.

"ఓ దేవా! నీకు నమస్కారము. నీకు నేను ఇంకా నమస్కరించక ముందే ఏ కోరికలు కోరకముందే, నాకు అన్ని ఐశ్వర్యములు, సుతల లోక ఆధిపత్యము, అన్ని ఇచ్చావు. ఇంతకన్నా నాకు ఏం కావాలి. కేవలము నీ భక్తుడను కావడం చేతనే అసురుడనైన నా మీద కూడా నీ ప్రేమను కురిపించావు. నీవు దేవతలనే కాదు రాక్షసులకు కూడా ప్రేమతో అనుగ్రహిస్తుంటావు. ఇప్పుడు నీవు నా మీద చూపించిన అనుగ్రహము ఇంతకు ముందు దేవతలకు కానీ, లోకపాలకులకు కానీ, లభించలేదు." అని పలికిన బలి చక్రవర్తి వామన మూర్తికి, బ్రహ్మదేవునికి నమస్కరించాడు. వరుణ పాశముల నుండి విముక్తుడైన బలి చక్రవర్తి. తన అనుచర గణముతో సుతలములో ప్రవేశించాడు.

బలి చక్రవర్తి వెళ్లిపోగానే ఇంద్రుడు తిరిగి తన స్వర్గాధిపత్యమును పొందాడు. ఆ ప్రకారంగా తన తల్లి అదితి కోరికను తీర్చాడు వామనమూర్తి. తన మనుమడైన బలి చక్రవర్తి వరుణపాశముల నుండి విముక్తుడై సుతల ఆధిపత్యమును స్వీకరించాడని తెలిసి ప్రహ్లాదుడు ఆ పరమాత్మను ఇలా ప్రార్థించాడు.

“ఓ దేవా! నీవు మూడులోకముల చేతా నమస్కరింప బడుతుంటావు. బ్రహ్మ, మహాశివుడు కూడా నిన్ను పూజిస్తుంటారు. నీవు దేవతల దు:ఖములనే కాదు, మా వంటి అసురుల దు:ఖములను కూడా  పోగొడుతుంటావు. నీవు మా మామీద చూపించే అనుగ్రహము బ్రహ్మ, లక్ష్మి, మహాశివుడు కూడా పొందలేడు. ఇంక ఇతర దేవతాగణముల సంగతి చెప్పనక్కరలేదు!

ఓ దేవా! బ్రహ్మ మొదలగు దేవతలు నీ పాదపద్మములను కడిగిన మధురజలమును సేవించి తమ సంపదలను అనుభవిస్తున్నారు. పుట్టుకతోనే దుర్మార్గానికి, క్రూరత్వానికి  పెట్టింది పేరైన మా బోటి దానవులు కూడా నీ అనుగ్రహము చేతనే నీ యొక్క దయను, కృపను  పొందగలిగాము.

ఓ దేవా! నీ లీలలు ఆశ్చర్యమును కలిగిస్తుంటాయి.  నీ మాయాశక్తిచేత ఈ జగత్తును సృష్టించావు. పోషిస్తున్నావు. లయం చేస్తున్నావు. సకల భూతములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. నీకు ఎవరిమీదా ప్రేమ గానీ,  ద్వేషము గానీ లేవు. అన్ని జీవులయందు సమదృష్టి కలిగి ఉంటావు.

కానీ నీ భక్తుల ఎడల కాస్త ఎక్కువ ప్రేమ చూపిస్తుంటావు. నిన్ను నమ్మిన వారిని రక్షిస్తుంటావు. ఆ మాత్రం చేత నీవు నీ భక్తుల ఎడల పక్షపాత బుద్ధి ఉన్నవాడివి అనడానికి వీలులేదు. ఎందుకంటే, కామధేనువు కూడా తన వద్దకు వచ్చినవారికే, తనను అర్థించిన వారికే, వారు కోరిన పదార్థములను ఇస్తుంది. అలాగే నిన్ను శరణు కోరిన వారిని నీవు రక్షించడంలో తప్పేముంది.!" అని ప్రహ్లాదుడు శ్రీమహావిష్ణువును ప్రార్థించాడు.

అప్పుడు వామన మూర్తిగా ఉన్న శ్రీమహావిష్ణువు ప్రహ్లాదునితో ఇలా అన్నాడు. "వత్సా ప్రహ్లాదా! నీవు కూడా నీ మనుమడు బలితో కూడా సుతల లోకమునకు వెళ్లు. అక్కడ సకల భోగములను అనుభవించు. ఇప్పుడు నీవు నన్ను దర్శించడం వలన నీ కర్మ బంధనములు అన్నీ తొలగిపోయాయి. నేను కూడా గదాధారినై ఎల్లప్పుడూ మీ వెన్నంటి ఉంటాను. మిమ్ములను రక్షిస్తూ ఉంటాను. నీవుకూడా అనునిత్యము గదాధారినై మీ వెంటనే ఉన్న నన్ను చూస్తూ, నీ కర్మబంధనముల నుండి విముక్తుడవు అవుతావు.." అని పలికాడు విష్ణువు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా మహావిష్ణువు చేత అనుగ్రహింప బడిన బలి చక్రవర్తి, ఆయన తాత గారు ప్రహ్లాదుడు శ్రీమహావిష్ణువుకు ప్రదక్షిణపూర్వకంగా నమస్కరించి, అక్కడి నుండి సుతల లోకమునకు వెళ్లిపోయారు.

తరువాత శ్రీమహావిష్ణువు అక్కడే ఉన్న శుక్రాచార్యులవారిని, ఇతర ఋషులను, ఋత్విక్కులను చూచి ఇలా అన్నాడు. "మీరు బలి చక్రవర్తి లేడని ఈ యజ్ఞమును ఆపవద్దు. యధావిధిగా యజ్ఞమును ఏ లోపమూ లేకుండా పూర్తి చేయండి." అని అన్నాడు.

అప్పుడు శుక్రాచార్యులు శ్రీమహావిష్ణువునుచూచి ఇలా అన్నాడు. "దేవా! నీవే సర్వ కర్మలకు కారణము. నీవే యజ్ఞపురుషుడవు. యజ్ఞస్వరూపుడవు. నీవు ఉండగా యజ్ఞము పరిసమాప్తి కాకుండా ఎలా ఉంటుంది. యజ్ఞములో లోపములు మాత్రము ఎందుకు కలుగుతాయి. నీ ఆజ్ఞ ప్రకారము యజ్ఞము నిర్విఘ్నంగా నెరవేరుతుంది. ఈ యాగములో మంత్రోచ్ఛారణలో గానీ, తంత్రములో గానీ, ఏ విధమైన లోపములు, దోషములు కలిగినా, అవి అన్నీ నీ నామ సంకీర్తనముతో చక్కబడతాయి. ఆ దోషములు అన్నీ దోషరహితములు అవుతాయి. నీ ఆజ్ఞను పాలించడం పురుషుల కర్తవ్యము. నేను కూడా నీఆజ్ఞను శిరసావహిస్తాను." అని అన్నాడు శుక్రాచార్యుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ ప్రకారంగా శుక్రాచార్యులు పలికి, శ్రీహరి ఆజ్ఞానుసారము యజ్ఞమును కొనసాగించాడు. మూడు లోకములను బలి చక్రవర్తి నుండి దానంగా స్వీకరించిన శ్రీమహావిష్ణువు, స్వర్గలోకమును ఇంద్రునికి ఇచ్చాడు. బ్రహ్మ, దేవతలు,ఋషులు, పితరులు, మనువులు, మునులు, దక్షుడు, భృగువు, అంగిరసుడు, సనత్కుమారుడు, మహాదేవుడు, కశ్యపుడు మొదలగు వారి కోరిక ననుసరించి మూడులోకములలో ఉన్న జీవులను శుభమును కోరి, వామనుడు ఉపేంద్రుడు అయ్యాడు. మూడు

లోకములకు, లోకపాలకులకు అధిపతి అయ్యాడు.

ఇంద్రుడు మూడు లోకములకు, లోకపాలకులకు అధిపతి అయినప్పటికినీ, బ్రహ్మాది దేవతలకు, వేదములకు, సకల ధర్మములకు, కీర్తికి, లక్ష్మీదేవికి, సకల మంగళ కార్యములకు, వ్రతములకు, స్వర్గలోకమునకు, మోక్షమార్గమునకు ఆధిపత్యము వహించడంలో నిపుణుడు అయిన కారణంగా, ఉపేంద్రుడు మూడులోకములకు, లోకపాలకులకు అధిపతిగా నియమించబడ్డాడు. ఉపేంద్రుడు లోకపాలకులందరికీ అధిపతి కావడాన్ని సకల ప్రాణులు సంతోషంతో అంగీకరించాయి.

తరువాత ఇంద్రుడు, బ్రహ్మ ఆదేశాను సారము, ఉపేంద్రునితో సహా విమానము ఎక్కి స్వర్గలోకమునకు వెళ్లిపోయాడు. ఉపేంద్రుని రక్షణలో ఇంద్రుడు త్రిలోకాధిపత్యము స్వీకరించాడు. తరువాత బ్రహ్మ, శివుడు, సనత్కుమారుడు, భృగువు, పితరులు, భూతగణములు, సిద్ధులు, ఇతరులు అందరూ కలిసి ఉపేంద్రుని, ఉపేంద్రుని తల్లి అదితిని ప్రశంసిస్తూ తమ తమ స్థానములకు వెళ్లిపోయారు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు ఇప్పటిదాకా విన్న వారి పాపములను ప్రక్షాళనచేసే వామన చరిత్ర చెప్పాను. ఈ వామనుడి కథ వింటే పాపములు అన్నీ నశించిపోతాయి. వారందరూ ఉత్తమ గతులను పొందుతారు. ఈ చరిత్రను దేవాతారాధనలలోగానీ, పితృకార్యములలోగానీ, చదివినా, వినినా, ఆయా ఆరాధనలు,

పితృకార్యములు దోషరహితములు అవుతాయి.

శ్రీమహావిష్ణువు యొక్క మహిమను వశిష్ఠుడు ఇలా కీర్తించాడు." సర్వవ్యాపి అయిన శ్రీమహావిష్ణువుయొక్క మహిమను పూర్తిగా అవగాహన చేసుకున్న వాడు, ఈ భూమిమీద ఉన్న ఇసుక రేణువులనుకూడా లెక్కపెట్టగలడు. కాని అటువంటి వాడు ఇప్పటి దాకా పుట్టలేదు. ఇంకమీదట పుట్టబోడు." అని అన్నాడు వశిష్ఠుడు." అని వామన చరిత్రను శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు వినిపించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము ఇరువది మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్‌ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము

ఇరువది నాలుగవ అధ్యాయము.

వామనావతార చరిత్ర వినిన తరువాత పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని ఇలా అడిగాడు.

"ఓ మహర్షీ! నాకు తమరు ఎన్నో విషయాలుచెప్పారు. కాని శ్రీమన్నారాయణుని అవతారములలో మొట్ట మొదటిది అయిన మత్స్యావతార కథను వినిపించలేదు. జగన్నాధుడయిన శ్రీహరి ఒక చిన్న చేప అవతారమును ఎలా ఎత్తాడు. ఎటువంటి లీలలు చేసాడు.

ఇంతకూ ఏ కార్యమును సాధించడానికి శ్రీహరి చేప అవతారము దాల్చవలసి వచ్చింది. ఎందుకంటే చేప ఎప్పుడూ నీళ్లలో ఉంటుంది. తామస ప్రవృత్తికలది. లోకంలో చేపను ఎవరూ లెక్కచెయ్యరు. పైగా చంపి తింటారు. మరి అటువంటి రూపమును శ్రీహరి ఎలా, ఎందుకు ధరించాడు. నాకు వినవలెనని కుతూహలముగాఉంది. దయచేసి వివరించండి." అని వినయంగా అడిగాడు పరీక్షిత్. శుక మహర్షి ఇలా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీమన్నారాయణుడు ఏ అవతారము ఎత్తినా అది లోకరక్షణార్థమే కదా! ఈ లోకములో ఉన్న గోవులను, బ్రాహ్మణులను, దేవతలను (సాధు జనులను) వేదములను, ధర్మమును, అర్థమును రక్షించడానికే శ్రీమహావిష్ణువు ఇన్ని అవతారములు ఎత్తాడు. అందులో మత్స్యావతారము కూడా ఒకటి.

మహారాజా! భగవానుడు దేవతలలో, మానవులలో, జంతువులలో,పశుపక్ష్యాదులలో, అన్ని జీవులలో ఆత్మస్వరూపంగా వెలుగుతున్నాడు. కాని ఆయనకు ఆయా జీవుల గుణములు ఏవీ అంటవు. ఆయనకు గొప్ప శరీరము అనీ, నీచ శరీరము అనీ, గొప్ప భావము అనీ, నీచ భావము అనీ భేదము లేదు. ఆయనకు అందరూ సమానమే. వాయువు రూపంలో అన్ని జీవులలో విహరిస్తుంటాడు. ఎక్కువ, తక్కువ తేడాలు మనలో మాత్రమే ఉన్నాయి. కాబట్టి భగవానునికి మత్స్యావతారము అని కానీ, నరసింహావతారము అని కానీ భేదభావము లేదు. అన్ని ఆయనకు సమానమే.

ఓ మహారాజా! పోయిన కల్పము అంత్యకాలములో, అనగా బ్రహ్మ గారికి రాత్రి అయిన సందర్భంలో, బ్రహ్మదేవుడు నిద్రపోయాడు. అప్పుడు నైమిత్తిక ప్రళయం సంభవించింది. ఆ సమయంలో అన్ని లోకములు నీటిలో మునిగిపోయాయి. బ్రహ్మగారు నిద్రిస్తున్న సమయంలో హయగ్రీవుడు అనే రాక్షసుడు బ్రహ్మ దేవుని వద్ద ఉన్న వేదములను దొంగిలించుకొని పోయాడు.

( అంటే వేద విద్య కాలక్రమేణా అంతరించి పోయింది అని భావము. ఈ రోజుల్లోకూడా ఎక్కడో కొద్ది మంది తప్ప వేద విద్యను అభ్యసిస్తున్నవారు, వేదములను చదివి అర్థం చేసుకుంటున్న వారు ఎంత మంది ఉన్నారు? చాలా మందికి వేదములు అంటే ఏమిటో, వేదములు ఎన్నో తెలియవు. ఈ పరిణామాలు ప్రతి కల్పంలో జరుగుతుంటాయి. వేదములు చదివితే వచ్చేవి కావు. గురుముఖతా నేర్చుకోవాలి.కంఠస్థం చేయాలి. అవి తరతరాలుగా వంశానుగతంగా వస్తున్నాయి. వేల సంవత్సరాల నుండి వేదవిద్య ఈ విధంగానే రక్షింపబడుతూ ఉంది. )

హయగ్రీవుడు వేదములను అపహరించాడు అన్న విషయం తెలుసుకున్నాడు శ్రీహరి. మూడులోకములు నీటిలో మునిగి ఉన్నాయి కాబట్టి, నీటిలో సంచరించడానికి వీలుగా మత్స్యావతారమును ధరించాడు.

ఓ మహారాజా! జరిగిపోయిన కల్పములో చాక్షుష మన్వంతరములో సత్యవ్రతుడు అనే రాజర్షి ఉండేవాడు. ఆయన

కేవలము నీరు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ గొప్ప తపస్సు చేసాడు. ఆ సత్యవ్రతుడే ప్రస్తుతము జరుగుతున్న శ్వేతవరాహ కల్పములో వైవస్వత మన్వంతరములో  శ్రాద్ధదేవుడు అనే పేరుతో జన్మించాడు. ఆయనే మనువు అయ్యాడు.

జరిగిపోయిన కల్పములో ఒకరోజు ఆ సత్యవ్రతుడు కృతమాల అనే నదిలో స్నానం చేసి పితరులకు తర్పణము విడుస్తున్నాడు. ఆ సమయములో అతని దోసిట్లోకి ఒక చిన్న చేపపిల్లవచ్చింది. సత్యవ్రతుడు  ఆ చేప పిల్లను నదీజలములలో విడిచిపెట్టాడు. అప్పుడు ఆ చేప పిల్ల ఆ రాజుతో ఇలా అంది. "దీనులను రక్షించే ఓ రాజా! నాకు ఈ నదిలో రక్షణ లేదు. పెద్ద చేపలు నన్ను మింగడానికి ఎదురుచూస్తున్నాయి. దయలేకుండా నన్ను ఈ నదిలో ఎందుకు విడిచిపెట్టావు? నేనునీకు భారం అయ్యానా! " అని దీనంగా అడిగింది.

దయాగుణ సముద్రుడు అయిన ఆ మహారాజు ఆ చేపమీద జాలి చూపించాడు. ఆ చేపను రక్షించాలి అని అనుకున్నాడు. వెంటనే ఆ చేప పిల్లను తీసి తన కమండలములో ఉన్న నీటిలో విడిచిపెట్టాడు. తనతో గూడా ఆ చేపపిల్లను తన ఆశ్రమమునకు తీసుకొని వెళ్లాడు. ఆ రాత్రి గడిచింది. తెల్ల వారింది. రాజు ఆ చేప పిల్ల ఎలా ఉందో అని కమండలములోకి తొంగి చూచాడు. ఆ చేప పిల్ల ఆ కమండలమును పూర్తిగా ఆక్రమించింది. దానికి అటు ఇటు తిరగడానికి స్థలం లేదు. అది చూచిన రాజు ఆ చేపను కమండలము లోనుండి తీసి ఒక తొట్టిలో విడిచిపెట్టాడు. ఆ తొట్టిలో విడిచిపెట్టిన కొంచెం సేపటికి ఆ చేప తొట్టి నిండా పెరిగిపోయింది. అప్పుడు ఆ చేప రాజుతో ఇలా అంది.

"ఓ రాజా! ఈ నీటి తొట్టి నాకు చాలడం లేదు. ఎక్కడన్నా విశాలంగా ఉండే నీటివనరులో నన్ను వదిలిపెట్టు." అని అడిగింది. ఇదంతా ఆశ్చర్యంగా గమనిస్తున్న ఆ సత్యవ్రతుడు  ఆ చేపను తీసుకొని పోయి ఒక పెద్ద చెరువులో వదిలిపెట్టాడు. క్షణాలలో ఆ చేప ఆ చెరువు పూర్తిగా ఆక్రమించింది.

"ఓ రాజా! నాకు ఈ చెరువు కూడా చాలడం లేదయ్యా! నేను సురక్షితంగా నివసించగలిగే  జలాశయము మరొకటి చూపించు." అని అడిగింది. సత్యవ్రతుడు  ఆ చేపను అక్కడి నుండి మరొక జలాశయమునకు తీసుకొని వెళ్లాడు. అదీ చాలక పోవడంతో, చివరకు ఆ చేపను సముద్రంలో వదిలిపెట్టాడు.

"అదేమిటయ్యా మహారాజా! ఈ జలచరములకు భయపడికదా నేను నిన్ను శరణు కోరింది. ఇప్పుడు ఈ సముద్రములో ఉన్న మొసళ్లు, తిమింగిలములు మొదలగు జలచరములు నన్ను తినేస్తాయి. కాబట్టి నన్ను వేరే స్థానములో వదిలిపెట్టు." అని ప్రాధేయపడింది.

ఈ చేప ఎవరో తనను ఆటపట్టిస్తూ ఉందని, మోసం చేస్తూ ఉందని  సత్యవ్రతుడికి అనుమానం వచ్చింది. ఆ చేపను నిలదీసి అడిగాడు.

"నీవు ఎవరు? ఈ చేపరూపంలో నన్ను ఎందుకు మోసం చేస్తున్నావు? ఒకే ఒక్క రోజులోనే నీవు నూరు యోజనముల వెడల్పు ఉన్న ఈ సరస్సును వ్యాపించావు. ఇంతకు ముందు నేను నీ వంటి చేపను చూడలేదు. నీ లాంటి చేపగురించి వినలేదు.

ఆ! ఇప్పుడు తెలిసింది. నీవు సామాన్యుడవు కావు. సాక్షాత్తు ఆ మహావిష్ణు స్వరూపానివి. సకల జీవులను సంరక్షించడానికి ఈ మత్స్యావతారము ధరించావు.

ఓ దేవదేవా! నేను నీకు శరణాగతుడను. నీ భక్తుడను. నన్ను కరుణించు. నీకు భక్తితో నమస్కరిస్తున్నాను. ఓ దేవదేవా! నీవు ఏ అవతారము దాల్చినా, ఏ లీల చేసినా అది లోకకల్యాణము కొరకే కదా! ఇంతకూ ఈ మత్స్యావతారము ఎందుకు ఎత్తవలసి వచ్చింది. నాకు వివరించు. ఓ దేవా! నేను ఇన్నాళ్లు నిన్ను భక్తితో సేవించినది వృధా పోలేదు. ఈ మత్స్యము గా అవతరించి నాకు దర్శనం ఇచ్చావు.నా జన్మధన్యం అయింది." అని భక్తితో ప్రార్థించాడు సత్యవ్రతుడు

అప్పుడు మత్స్యముగా ఉన్న శ్రీహరి సత్యవ్రతుడు తో ఇలా అన్నాడు. "ఓ మహారాజా! ఈ రోజునుండి ఏడవ రోజున మహాప్రళయం సంభవిస్తుంది. మూడులోకములు నీటిలో మునిగిపోతాయి. ఆ సమయంలో ఒక పెద్ద ఓడ నీకు కనపడుతుంది. ఈ ఏడు రోజులలో నీవు సాధ్యమయినంత ఎక్కువ సంఖ్యలో సమస్త ఔషధములను, విత్తనములను, ఆ ఓడలోకి చేర్చు. ఆ ఓడలోకి సప్తఋషులను, జంతువులను, మానవులను, చేర్చు. మీరంతా ఎక్కిన ఆ ఓడ

ప్రళయకాలపు జలములలో మీరు మునిగి పోకుండా రక్షిస్తుంది.

ఇంతలో ఝంఝామారుతము వీస్తుంది. మీరు ఎక్కిన ఓడ ఆ గాలికి అటు ఇటు ఊగుతుంది. అప్పుడు ఆ ఓడకు వాసుకి అనే మహాసర్పమును తాడుగా కట్టి ఆ వాసుకిని నా తల మీద ఉన్న కొమ్ముకు కట్టు. నేను ఆ నావను సురక్షితంగా తీసుకొని పోతాను. ఆ ప్రకారంగా నేను మీరు ఎక్కిన నావతో సహా మరలా బ్రహ్మ నిద్రలేచి సృష్టి మొదలుపెట్టేవరకు ప్రళయ కాల జలములలో విహరిస్తుంటాను. ఇప్పుడు తెలిసిందా నేను ఎందుకు ఈ మత్స్యరూపంలో నీ వద్దకు చేరానో. నేను చెప్పినట్టు చెయ్యి. నీకు శుభం కలుగుతుంది." అని పలికిన ఆ మత్స్యము రూపంలో ఉన్న శ్రీహరి అంతర్థానము అయ్యాడు.

సత్యవ్రతుడు  శ్రీహరి చెప్పినట్టు ఓషధులను, విత్తనములను, ఋషులను, జంతువులను, మానవులను సమీకరించి శ్రీహరి చెప్పిన ప్రళయం ఎప్పుడు సంభవిస్తుందా అని ఎదురు చూస్తున్నాడు. సముద్రము ఒడ్డున దర్భలను పరిచి, ఆ దర్భాసనము మీద తూర్పుదిక్కుగా మొహం పెట్టి కూర్చున్నాడు. శ్రీహరి నామ స్మరణ చేస్తున్నాడు.

ఇంతలో శ్రీహరి చెప్పిన సమయం ఆసన్నమయింది. ఆకాశం అంతా నల్లని మేఘాలతో నిండి పోయింది. వర్షం మొదలయింది. గాలి వేగంగా వీస్తూ ఉంది. సరోవరాలు, నదులు, సముద్రాలు పొంగుతున్నాయి. భూమి అంతా జలమయం అయింది. అప్పుడు ఒక నౌక అక్కడకు వచ్చింది. సత్యవ్రతుడు  తాను సేకరించిన ఓషధులు, లతలు, విత్తనములను ఆ ఓడలోకి ఎక్కించాడు. ఋషులు, మునులు,

బ్రాహ్మణులు ఆ ఓడలోకి ఎక్కారు. అందరూ ఆ శ్రీమన్నారాయణ మూర్తిని స్మరిస్తున్నారు.

పైనుంచి కుండపోతగా వర్షము. సముద్రాలు, నదులు అన్నీ కలిసిపోయాయి. ఉవ్వెత్తున పైకి లేస్తున్న అలల తాకిడికి ఓడ ఊగిసలాడుతూ ఉంది. ఇంతలో తల మీద పెద్ద కొమ్ముతో ఒక చేప అక్కడకు ఈదుకుంటూ వచ్చింది. ఆ నీళ్లలో నుండి వాసుకి అనే మహాసర్పము తన తోకచివరన ఆ ఓడను కట్టుకున్నాడు. తలభాగం మత్స్యము తల పైన ఉన్న కొమ్ముకు కట్టాడు. ఓడ బయలు దేరింది.

ఓడలో ఉన్న సత్యవ్రతుడు, భక్తితో శ్రీహరిని ఈ విధంగా ప్రార్థించాడు. "ఓ దేవాది దేవా! ఈ లోకంలో ఉన్న మానవులు తమలో అలుముకున్న అవిద్య అనే చీకటి వలన, వారిలో ఉన్న ఆత్మజ్ఞానము నశించి, సంసారము అనే బంధములో చిక్కుకుంటున్నారు. ఎన్నో కష్టములను అనుభవిస్తున్నారు. కాని ఈ లోకంలో ఉన్న సత్పురుషులు, సాధువులు, జ్ఞానులు తమ శాయశక్తులా ప్రయత్నించి మానవులను సంసార బంధనముల నుండి విముక్తులు కావడానికి సాయం చేస్తున్నారు. ఆ ప్రకారంగా సంసార బంధనముల నుండి విముక్తులు అయిన మానవులకు నీవు మోక్షమును కలుగచేస్తున్నావు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! ఈ మానవులు అజ్ఞానులు. ఎల్లప్పుడూ కర్మలు చేయడంలోనే తమ జీవితాలు వెళ్లబుచ్చుతుంటారు. ఆ కర్మల వలన సుఖములను పొందవలెనని తాపత్రయ పడుతుంటారు. కాని వారికి ఆ

కర్మల ఫలితంగా సుఖం కలగకపోగా, నిరంతర దు:ఖమే మిగులుతూ ఉంటుంది. ప్రాపంచిక విషయములను పొందడానికి కర్మలు చేయకుండా, నీ పాదపద్మములను సేవిస్తే, వారికి నిరంతర సుఖము కలుగుతుందని వారికి తెలియదు. వారికి ఆ జ్ఞానము కలుగచెయ్యి.

బంగారము, వెండి మట్టి పట్టి, మకిల పట్టి ఉంటాయి. వాటిని అగ్నిలో వేస్తే ఆ మట్టి, మకిల అన్నీ పోయి శుద్ధమైన బంగారము, వెండి మిగులుతుంది. అలాగే, జీవిత మంతా ప్రాపంచిక సుఖముల కోసరం కర్మలు చేసి మలినమైన మనస్సులు నీ పాదములు సేవించడం వలన పునీతమవుతాయి.

ఈ లోకానికే గురువు నీవు. అవ్యయుడవు, పరమేశ్వరుడవు, జగద్గురువు అయిన నీకు నమస్కారము. ఈ లోకంలో మానవులు ఎంతో మంది దేవుళ్లను, దేవతలను, గురువులను, తోటి మానవులను దేవుళ్లుగా నమ్మి, పూజిస్తుంటారు. కాని వారు చేసే పూజల వలన కలిగే ఫలము, నిన్ను పూజిస్తే వచ్చే ఫలములో పదివేల వంతు ఫలము కూడా ఉండదు. ఈ విషయం వారికి తెలియదు. అటువంటి నీకు నమస్కారము.

మానవులు, తమ తమ కోరికలు తీరడానికి గాను, తమ తోటి మానవులను దేవుళ్లుగానూ, దేవతలు గానూ నమ్మి పూజలు చేస్తుంటారు. ఇది ఎలా ఉందంటే ఒక గుడ్డివాడు మరొక గుడ్డివాడికి దారి చూపినట్టవుతుంది. ఒక అజ్ఞాని మరొక అజ్ఞానినే గురువుగానూ, దేవుడిగానూ పూజిస్తాడు. కాని నీ పాదములను ఆశ్రయించడానికి

ఎవరూ ప్రయత్నించరు. నీవు స్వయంగా ప్రకాశిస్తుంటావు. నీవు ఈ లోకానికి గురువు. ఆత్మతత్త్వమును తెలుసుకోడానికి నేను నిన్ను ఆశ్రయించాను. నిన్ను గురువుగా స్వీకరించాను.

ఓ దేవా! ఈ లోకంలో ఉన్న గురువులు తమకు తెలిసిన ప్రాపంచిక విద్యనే తమ శిష్యులకు ఉపదేశిస్తారు. దాని వలన శిష్యులలో మరింత అజ్ఞానము పెరుగుతుందే తప్ప ఏమీ ప్రయోజనము లేదు. కాని నిన్ను గురువుగా ఆరాధిస్తే నీవు మాకు వ్యర్థము కాని, సనాతనమైన జ్ఞానాన్ని ఉపదేశిస్తావు. మమ్ములను మోక్షమార్గంలో నడిపిస్తావు. నీ బోధనల వలన మానవుడు తన గురించి తాను తెలుసుకోగలడు. తన కర్తవ్యమును గుర్తించగలడు..

ఓ దేవా! నీవు ఈ సమస్తలోకములను సుహృద్భావంతో చూస్తుంటావు. నీవు అందరినీ సమంగా చూస్తావు. నీవు అందరికీ ప్రియుడవు. ఈ లోకములన్నీ నీ అధీనంలో ఉన్నాయి. నీవు అందరిలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. నీవు అందరికీ హితమును ఉపదేశిస్తావు. నీవు జ్ఞానస్వరూపుడవు. నీవు సత్యస్వరూపుడవు. నీవు తప్ప మిగిలినవి అన్నీ అసత్యాలే!

(అంటే ఆత్మ ఒకటే సత్యము నిత్యము. ఈ ఆత్మ ఉండే దేహము, ఈ ప్రకృతి నిరంతరము మార్పులకు లోనవుతూ ఉంటుంది. మారిపోతూ ఉంటుంది. మారకుండా ఉండేది ఆత్మ ఒకటే.)

నిన్ను నమ్ముకుంటే కోరిన కోరికలు నెరవేరుతాయి. కాని ఈ మానవుల మనసులు అన్నీ చెడ్డ కోరికలతో, చెడ్డ బుద్ధులతో,

చెడుసంకల్పములతో నిండి ఉంది. అందువలన ఈ దేహమే సత్యము నిత్యము అనుకుంటాడు. ఈ దేహములో ఉన్న నిన్ను తెలుసుకోడానికి ప్రయత్నించడు.

ఓ దేవా! నాకు ఆత్మజ్ఞానము ప్రసాదించు. ఆత్మజ్ఞానమును నీవు ఒక్కడివే ప్రసాదించగలవు. అందుకే నిన్ను శరణువేడుతున్నాను. నీ గురూపదేశములతో నాలో ఉన్న అజ్ఞానమును పోగొట్టి నాకు ఆత్మజ్ఞానమును ప్రసాదించు. నీ గురించి తెలుసుకొనేటట్టు చెయ్యి." అని సత్యవ్రతుడు పరమాత్మను ప్రార్థించాడు.

సత్యవ్రతుని ప్రార్థనలకు సంతోషించిన పరమాత్మ, మత్స్యరూపంలో పడవను లాగుతూనే సత్యవ్రతునికి  దివ్యమైన ఆత్మతత్త్వమును, సాంఖ్య యోగమును, పురాణములను  బోధించాడు. ఆ ఓడలో కూర్చున్న సత్యవ్రతుడు, ఋషులు, మునులు,మానవులు మత్స్యరూపంలో ఉన్నపరమాత్మ బోధించిన పరమాత్మతత్వమును, సాంఖ్యయోగమును, పురాణమును శ్రద్ధతో విన్నారు.
(ఈ పురాణమే మత్స్య పురాణముగా లోక ప్రశిద్ధిచెందింది.)

ఇంతలో ప్రళయకాలము అంతరించింది. సముద్రములు శాంతించాయి. బ్రహ్మకు తెల్లవారింది. మత్స్యరూపంలో ఉన్న పరమాత్మ హయగ్రీవుడు అనే రాక్షసుని సంహరించి, వేదములను పునరుద్ధరించాడు.

(ఓడలో ఉన్న మునులు, ఋషులు తాము వల్లె వేసిన వేదములను తమ శిష్యుల ద్వారా మరలా లోకంలో వ్యాప్తిచేసారు అని భావన. హయగ్రీవుడు అంటే మనలో ఉన్న అజ్ఞానము, అవిద్య అనే చీకటి అని కూడా చెప్పవచ్చు. మనలోని అవిద్యను అంతం చేస్తే, జ్ఞానము కలుగుతుంది. (Where ignorance ends awareness begins .......స్వామి చిన్మయానంద.)

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ నాటి సత్యవ్రత మహారాజు తరువాత మన్వంతరములో అనగా వైవస్వతమన్వంతరములో వైవస్వత మనువుగా జన్మించాడు. ఆయన పేరే శ్రాద్ధదేవుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ మత్స్యావతారకథను ఎవరు చదివినా, వినినా, సకల పాపముల నుండి విముక్తికలుగుతుంది. అప్పుడే మానవుల సంకల్పములు అన్నీసిద్ధిస్తాయి. వారు ఉత్తమ గతులను పొందుతారు.

(అంటే కేవలం ఈ కథ చదివి పుస్తకం తలకింద పెట్టుకొని పడుకుంటే ఏమీ కాదు. ముందుగా, కేశవ నామాలు, పురుష సూక్తము, మంత్రపుష్పం కూడా రాని గురువులను, ఆడంబరాలతో, పటాటోపాలతో ప్రజలను మోసం చేసే గురువులను సేవించడం మానుకొని, చిల్లర దేవుళ్లను సేవించడం మానుకొని, "ఓం నమోభగవతే వాసుదేవాయ" అనే ద్వాదశాక్షరి మంత్రం జపిస్తూ, మనలో ఉన్న అజ్ఞానమును అంతం చేసుకొని, జ్ఞానమనే వెలుగులోకి ప్రయాణం చేస్తేనే, ఈ మత్స్యావతారకథను చదివినందుకు సార్థకత.)

ఓ పరీక్షిత్ మహారాజా! మనమందరము, మత్స్యావతార రూపుడు, వేదములను ఉద్ధరించిన వాడు, సత్యవ్రతునకు, మహర్షులకు, మునులకు ఆత్మతత్వమును బోధించిన వాడు, పురాణములను గురించి చెప్పినవాడు అయిన శ్రీమన్నారాయణ మూర్తికి భక్తితో నమస్కారం చేద్దాము." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు మత్స్యావతారకథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

అష్టమ స్కంధము ఇరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము.

అష్టమస్కంధము సర్వం సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

రామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

## సంస్కృత మూలము
## భగవాన్ వ్యాసమహర్షి

## తేటతెలుగులో
## యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:
2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060
సెల్: 9866140619, 9391134792
ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము
# నవమ స్కంధము
# ప్రధమ అధ్యాయము.

శ్రీమహావిష్ణువు యొక్క మత్స్యావతార కథను విన్న తరువాత పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని ఈ విధంగా అడిగాడు.

"ఓ మహర్షీ! తమరు ఇప్పటివరకు మన్వంతరముల గురించి, మనువుల గురించి, ఆ మన్వంతరములలో పరమాత్మ అవతారముల గురించి, ఆయన లీలలను గురించి వివరంగా చెప్పారు. సత్యవ్రతుడు తరువాత జన్మలో అనగా  వైవస్వత మన్వంతరములో శ్రాద్ధదేవుడు అనే పేరుతో జన్మించి మనువు అయ్యాడని కూడా చెప్పారు. ఆ వైవస్వత మనువు గురించి ఆయన వంశములో ఏయే రాజులు పుట్టారు, ఏయే రాజులు పుడుతున్నారు, ఏయే రాజులుపుట్టబోతారు, వైవస్వత మన్వంతరములో ప్రస్తుతము ఏయేరాజులు ఉన్నారు, వారి వంశ చరిత్ర గురించి వివరించండి." అని అడిగాడు.  శుక యోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు వైవస్వత మనువు వంశము గురించి  ఈ విధంగా చెప్పసాగారు.

"ఓపరీక్షిత్ మహారాజా! వైవస్వత మనువు వంశము గురించి వివరంగా చెబుతాను విను. కాని ఈ మనువు వంశమును గురించి ఎంత చెప్పినా ఇంకా మిగిలే ఉంటుంది. కల్పము ఆఖరున ఈ భూమి అంతా జలమయము అయిందని చెప్పాను కదా. అప్పుడు అన్ని జీవులు నశించి పోయాయి. సూక్ష్మ రూపంలో ఉన్న పరమాత్మ అనగా

విశ్వ చైతన్యం తప్ప మరొకటి లేదు. అప్పుడు పరమాత్మ నాభి లోనుండి ఒక పద్మము ఉద్భవించింది. ఆ పద్మములో నుండి బ్రహ్మ ఉద్భవించాడు. ఆయన మనస్సులో పుట్టిన సంకల్పము మేరకు మరీచి పుట్టాడు. మరీచికి కశ్యపుడు, కశ్యపునికి వివస్వానుడు పుట్టారు. వివస్వానుడికి శ్రాద్ధదేవుడు అనే మనువు జన్మించాడు. శ్రాద్ధదేవుని భార్య పేరు శ్రద్ధ, వారికి ఇక్ష్వాకువు, నృగుడు, శర్యాతి, దిష్ఠుడు, ధృష్టుడు, రురూషకుడు, నరిష్యంతుడు, పృషధ్రుడు, నభగుడు, కవి అనే పది మంది సంతానము కలిగారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ పదిమంది సంతానము కలగకముందు శ్రాద్ధదేవునికి సంతానము లేదు. సంతానము కొరకు శ్రాద్ధదేవుడు తనకులగురువు వశిష్ఠుని ఒక యజ్ఞము చేయించమని అడిగాడు. వశిష్ఠుడు ఆయన చేత మిత్రావరుణులను ఆహ్వానిస్తూ యజ్ఞం చేయించాడు.

ఆ యజ్ఞముచేసే సమయంలో మనువు భార్య అయిన శ్రద్ధ ఆ యజ్ఞము చేసే హెూత దగ్గరకుపోయి తనకు పుత్రుడు కలగడం ఇష్టం లేదని, తనకు పుత్రిక కలిగేటట్టు యజ్ఞ చేయమనీ కోరింది. మనువు భార్య అయిన శ్రద్ధ కోరిన కోరికను మనసులో గాఢంగా తలచుకుంటూ హెూత వషట్కార మంత్రములను ఉచ్ఛరిస్తూ యజ్ఞము చేసాడు.

శ్రాద్ధదేవుడు తనకు పుత్ర సంతానము కావాలని యజ్ఞంచేయడానికి సంకల్పించాడు. కానీ ఆయనభార్య శ్రద్ధ తనకు పుత్రిక కావాలని కోరింది. శ్రద్ధ కోరిక ప్రకారము హెూత పుత్రిక కొరకు

యజ్ఞము చేస్తున్నాడు. భర్త కుమారుడు కావాలంటున్నాడు. భార్య కుమార్తె కావాలంటూ ఉంది. ఈ విపరీత పరిణామాల వలన వారికి ఇల అనే కుమార్తె జన్మించింది. తనకు కూతురు పుట్టడం శ్రాద్ధదేవునికి ఇష్టంలేదు. తన గురువు వశిష్ఠుని చూచి ఇలా అన్నాడు.

" గురుదేవా! నేను కుమారుని కొరకు యజ్ఞం చేసాను. కాని నాకు కుమార్తె పుట్టింది. ఇది ఎలా జరిగింది? మీరు బ్రహ్మవాదులు. మీకు తెలియకుండా ఈ విపరీతం జరుగదు. నాకు పుత్ర సంతానము కావాలని మీరు మంత్రములను పఠిస్తే, కుమార్తె ఎలా కలుగుతుంది? దేవతల వాక్కులు అసత్యములు కానట్టు, మహాశక్తి వంతమైన వేద మంత్రములకు ఇటువంటి విపరీత పరిణామము జరుగదు కదా! నాకు తెలియకుండా ఏదో జరిగింది. ఏం జరిగిందో చెప్పండి." అని నిలదీసాడు శ్రాద్ధదేవుడు. వశిష్టునికి ఏమీ అర్థం కాలేదు. అయోమయంగా చూస్తున్నాడు. మరలా శ్రాద్ధదేవుడు ఇలా అన్నాడు.

"మహాత్మా! మీరు బ్రహ్మను గురించి తెలిసిన వారు. గొప్ప తపస్సంపన్నులు. మీ వాక్కు అసత్యము కాదు. మీరు నాకు పుత్ర సంతానము కొరకు యజ్ఞము మొదలు పెట్టారు. కాని నాకు పుత్రిక పుట్టింది. మీ మాట విఫలమయింది. మీవంటి వారు ఒకటి సంకల్పిస్తే, మరొకటి జరగడం అసంభవం! కాని జరిగింది. ఇలా జరగడానికి ఏమి కారణము. నాకు తెలియాలి." అని పట్టుబట్టాడు శ్రాద్ధదేవుడు.

వశిష్ఠుడు జరిగినది అంతా యోగదృష్టితో తెలుసుకున్నాడు. ఇదంతా శ్రద్ధాదేవి మాటలు విని హెూత చేసిన పని అని గ్రహించాడు. జరిగిన విషయం శ్రాద్ధదేవుడికి  చెప్పాడు.

"రాజా! ఇది హెూత వల్ల జరిగింది. జరిగిన దానికి చింతించవద్దు. నా తపశ్శక్తితో నీకు పుత్రుడు కలిగేటట్టు చేస్తాను." అని పలికాడు వశిష్ఠుడు. వెంటనే శ్రద్ధకు పుట్టిన ఆడపిల్లను మగ పిల్లవాడిగా మార్చమని విష్ణువును ప్రార్థించాడు.  వశిష్ఠుని ప్రార్థనకు మెచ్చిన విష్ణువు వశిష్ఠుడు కోరినట్టు అవుతుంది అని వరం ప్రసాదించాడు. ఆ వరప్రభావంతో శ్రాద్ధదేవునికి పుట్టిన ఆడ శిశువు మగశిశువుగా మారి పోయింది. ఆ మగశిశువుకు సుద్యుమ్నుడు అనే నామకరణం చేసారు.

సుద్యుమ్నుడు పెరిగి పెద్ద వాడయ్యాడు. సుద్యుమ్నుడు  ఒక రోజు మంత్రులతో, సేనాపతులతో కలిసి వేటకు వెళ్లాడు. మృగములను వేటాడుతూ ఉత్తర దిక్కుగా పరుగెత్తాడు. ఉత్తర దిక్కున ఉన్న మేరు పర్వత ప్రాంతము దగ్గర ఒక  ఉద్యాన వనము ఉంది. ఆ వనములో మహాశివుడు తన భార్య ఉమాదేవితో కలిసి విహరిస్తున్నాడు. ఈ విషయం తెలియని సుద్యుమ్నుడు మృగాలను తరుముతూ ఆ వనంలోకి ప్రవేశించాడు. ఆ వనంలోకి అడుగు పెట్టగానే సుద్యుమ్నుడు స్త్రీగానూ, ఆయన ఎక్కిన మగ గుర్రము ఆడగుర్రముగానూ మారిపోయారు. అంతే కాదు ఆయన వెంట ఉన్న మంత్రులు, సేనాపతులు, అనుచరులు, పరివారము అందరూ స్త్రీలుగా మారి పోయారు.

వారికి ఈ వింత అర్థం కాలేదు. "ఇదేంటి భగవంతుడా ఇలా జరిగింది. తమకు అకస్మాత్తుగా ఈ స్త్రీత్వము ఎలా వచ్చింది. ఈ ఆడతనంతో జీవితాంతం ఎలా బతకాలి, తమ భార్యాబిడ్డల గతేంటి." అని దు:ఖిస్తున్నారు." అని శుకయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహము కలిగింది. "మహాత్మా! ఆ వనంలోకి అడుగుపెట్టగానే అందరూ స్త్రీలుగా ఎందుకు మారి పోయారు? ఆ ప్రదేశంలో ఉన్న మహత్తు ఏమిటి? ఆ ప్రదేశానికి అంతటి మహత్తును ఎవరు కలుగజేసారు? ఇంతకూ సుద్యుమ్నుడు ఆయన అనుచరులు మరలా మగవాళ్లుగా మారారా! నాకు తెలియజేయండి." అని కుతూహలంతో అడిగాడు. అప్పుడు శుకయోగీంద్రుడు ఇలా చెప్పసాగాడు.

"ఓ రాజా! ఒక సారి ఋషులు, మునులు అందరూ కలిసి మహాశివుని దర్శించుకోడానికి ఆ వనము వద్దకువెళ్లారు. ఆ సమయంలో ఉమా దేవి వివస్త్రగా ఉంది. ఆకస్మికంగా వచ్చిన ఆ ఋషులను చూచి ఉమాదేవి గబగబా బట్టలు కట్టుకుంది. ఇది గమనించిన ఋషులు అక్కడి నుండి బదరికావనము వద్ద ఉన్న నరనారాయణుల వద్దకు వెళ్లిపోయారు. తరువాత ఉమాదేవి భర్తతో ఈ విషయం చెప్పింది. భార్యకు సంతోషాన్ని కలిగించడానికి గాను పరమ శివుడు "ఇప్పటి నుండి నా అనుమతి లేకుండా ఈ వనంలో ప్రవేశించిన వారు వెంటనే స్త్రీలుగా మారి పోతారు."అని నియమం పెట్టాడు. అప్పటి నుండి ఆ వనంలోకి పురుషులు ఎవరూ ప్రవేశించరు. ఈ విషయం తెలియని సుద్యుమ్నమహారాజు, ఆయన అనుచరులు ఆ

వనంలోకి ప్రవేశించి  స్త్రీలుగా మారిపోయారు.

చేసేది లేక సుద్యుమ్నుడు, ఆయనపరివారము ఆ వనంలోనే స్త్రీరూపాలతో తిరుగుతున్నారు. అదే సమయంలో చంద్రుని కుమారుడైన బుధుడు అటుగా వచ్చాడు. స్త్రీ రూపంలో ఉన్న సుద్యుమ్నుడిని చూచాడు. అందంగా ఉందను కొని ఆమెను మోహించాడు. తనను వివాహం చేసుకోమని కోరాడు. స్త్రీగా మారిపోయిన సుద్యుమ్నుడు కూడా బుధుని భర్తగా స్వీకరించడానికి అంగీకరించాడు. వారిద్దరూ వివాహం చేసుకున్నారు. బుధుడికీ, స్త్రీరూపంలో ఉన్న సుద్యుమ్నుడికి (పూర్వపు ఇలాదేవికి)  పురూరవుడు అనే కుమారుడుజన్మించాడు.

ఎన్నాళ్లు ఇలా స్త్రీగా ఉండాలా అని ఆలోచించి సుద్యుమ్నుడు తమ కుల గురువు వశిష్ఠుని వద్దకు వెళ్లాడు. జరిగిన విషయం చెప్పాడు. వశిష్ఠుడు పరమేశ్వరుని ప్రార్థించాడు. సుద్యుమ్నుడిని, అతని అనుచరులను మరలా పురుషులుగా మార్చమని పరమేశ్వరుని కోరాడు. వశిష్ఠుని కోరిక మన్నించి పరమ శివుడు తన శాపమును కొంతమేర సడలించాడు.

"మా ఏకాంతానికి భంగం కలుగుతుందనే ఈ నియమం పెట్టాను. దీనిని అతిక్రమిస్తే శిక్ష తప్పదు. కాని ఈ సుద్యుమ్నుడు మీ వంశము వాడు. మీ గోత్రము వాడు. పైగా మీరు చెబుతున్నారు కాబట్టి కొంచెం సడలిస్తాను. ఈ సుద్యుమ్నుడు ఒక మాసము పాటు పురుషుడుగానూ, మరొక మాసము పాటు స్త్రీగానూ ఉంటాడు." అని వరం ఇచ్చాడు శంకరుడు.

ఆ ప్రకారంగా సుద్యుమ్నుడు మగవాడిగా ఒక నెలపాటు అందరిలో తిరుగుతూ, భార్యలతో కాపురం చేస్తూ, రాజకార్యాలు చక్కబెడుతున్నాడు. తరువాతి మాసము ఎవరికీ కనపడకుండా స్త్రీరూపంలో రహస్యంగా ఉంటున్నాడు.

మగవాడిగా ఉన్న సమయంలో సుద్యుమ్నునికి ఉత్కలుడు, గయుడు, విమలుడు, అనే కుమారులు కలిగారు. ఉత్కలుడు, గయుడు, విమలుడు దక్షిణదేశానికి అధిపతులు అయ్యారు. అంతా బాగానే ఉంది కానీ ప్రజలకు ఒక సందేహము కలిగింది. రాజుగారు ఒక నెల రోజులు రాజ్యం చేస్తున్నారు. మరొకనెలపాటు రాజుగారు మాయంఅవుతున్నారు. రాజుగారు ఎక్కడకు వెళుతున్నారు, ఏమి చేస్తున్నారు అని అందరికీ అనుమానంగా ఉండేది. అందువల్ల సుద్యుమ్నుని పట్ల ప్రజలు అసంతృప్తిగా ఉన్నారు.

ఇంతలో సుద్యుమ్నుడికి ముసలి తనం వచ్చింది. సుద్యుమ్నుడు వానప్రస్థమునకు పోదలచి తన కుమారుడు అయిన పురూరవునికి రాజ్యభారము అప్పగించి, అడవులకు వెళ్లిపోయాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు సుద్యుమ్నుడి వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము మొదటి అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# నవమస్కంధము
# రెండవ అధ్యాయము.

సుద్యుమ్నుడు ఆ ప్రకారంగా వానప్రస్థమునకు వెళ్లిపోగా, వైవస్వత మన్వంతరములో మనువు అయిన శ్రాద్ధదేవుడు శ్రీహరి కరుణ వలన పది మంది సంతానాన్ని పొందాడు. (ఈ పదిమంది పేర్లు ఇదివరకే వచ్చాయి కానీ మరలా జ్ఞాపకం చేస్తున్నాను. 1.ఇక్ష్వాకువు, 2.నృగుడు, 3.శర్యాతి, 4.దిష్టుడు, 5.ధృష్టుడు, 6.రురూషకుడు, 7.నరిష్యంతుడు, 8.పృషధ్రుడు, 9.నభగుడు. 10.కవి.)

ఆ పదిమందిలో ఇక్ష్వాకువు అనే వాడు పెద్దవాడు. పృషధ్రుడు అనే వాడు ఎనిమిదవ వాడు. ఒక రోజు గురువుగారు పృషధ్రుని  గోవులను పరిరక్షించడానికి నియమించాడు. వాడు రాత్రిపూట నిద్ర పోకుండా గోవులను రక్షిస్తూ ఉన్నాడు.. ఆ రోజు అర్ధ రాత్రి ఒక పెద్దపులి గోశాలలో ప్రవేశించింది. పెద్దపులిని చూచిన గోవులు భయంతో లేచి నిలబడి అరుస్తూ అటు ఇటు తిరుగుతున్నాయి. ఇంతలో ఆ పెద్ద పులి ఒక గోవు మీద పడింది. ఆ గోవు పెద్దగా ఆర్తనాదం చేసింది. ఆ  అరుపును విన్న పృషధ్రుడు ఏమి జరిగిందో చూద్దామని అటుగావెళ్లాడు.

అప్పుడు అమావాస్య కావడం వలన, అందులోనూ బాగా మబ్బు పట్టడం వలన కన్నుపొడుచుకున్నా కనపడని చీకటిగా ఉంది. పొడుగాటికత్తిని చేతిలో పట్టుకొని అక్కడకు వచ్చిన పృషధ్రుడికి

శబ్దములను బట్టి పెద్దపులి గోశాలలో ప్రవేశించిందని తెలిసింది. కాని ఆ చీకటిలో పెద్దపులి ఏదో ఆవు ఏదో తెలియడం లేదు. కత్తి ఎత్తి ఒక వేటు వేసాడు. ఆ వేటు పెద్ద పులి మెడ మీద బదులు ఆవు మెడమీద పడింది. ఆవు తల తెగి కింద పడింది. కాని ఆ వేటుకుపెద్ద పులి చెవులు కూడా తెగాయి. పెద్ద పులి పెద్దగా అరుస్తూ అక్కడి నుండి పరుగెత్తింది. పృషధ్రుడు మాత్రము తన కత్తి దెబ్బ పెద్దపులికి తగిలింది అని అనుకున్నాడు.

ఇంతలో తెల్లవారింది. గోవు చచ్చి పడి ఉండటం అందరూ చూచారు. రాత్రి తను చంపినది పెద్దపులిని కాదనీ, గోవును అనీ తెలిసిన పృషధ్రుడు ఎంతో బాధ పడ్డాడు. కాని ఆ అపరాధము అతను తెలిసి తెలిసి చేసింది కాదు. పొరపాటున జరిగింది. కాని వారి కులగురువు వసిష్ఠుడు పృషధ్రుడు గోహత్య చేసినందుకు అతనిని క్షత్రియత్వమును వదిలిపెట్టి, శూద్రునిగా జీవించమని శపించాడు.

చేసిన తప్పుకు శిక్షను సంతోషంగా స్వీకరించాడు పృషధ్రుడు. వెంటనే అన్ని సుఖములను వదిలిపెట్టాడు. సన్యాసము స్వీకరించాడు. మనసును శాంత పరచుకొన్నాడు. ఇంద్రియములను నిగ్రహించాడు. దొరికిన వాటిని తింటూ దేనికీ వెంపర్లాడకుండా కాలం గడుపుతున్నాడు. నిరంతరము శ్రీహరి నామం జపిస్తూ శ్రీహరి మీద ఏకాగ్రమైన భక్తితో పరమాత్మను సేవిస్తున్నాడు. ఒక పిచ్చి వాడి వలె, జడుని వలె, గుడ్డివాడి వలె, చెవిటి వాడి వలె ప్రవర్తిస్తున్నాడు. ఆఖరున అడవిలో పుట్టే దావాగ్నిలో పడి మృతిచెందాడు.

మనువుకు ఆఖరి కుమారుడు అయిన కవి అనే వాడు చిన్నతనంలోనే  రాజ్యం వదిలిపెట్టి సన్యాసం స్వీకరించాడు. అడవులకు వెళ్లిపోయాడు.

మనువు మరొక కుమారుడైన కరూషుడి వలన ఒక క్షత్రియ వంశము పుట్టింది. వారిని కారుష క్షత్రియులు అని పిలుస్తారు. వారు ఉత్తరదేశములను పరిపాలించారు. వారు దైవము మీద అచంచలమైన భక్తితో, ధర్మం తప్పకుండా పరిపాలన సాగించారు.

మనువు మరొక కుమారుడు అయిన ధృష్టుడు అనే వాడి నుండి మరొక క్షత్రియ వంశము ఉద్భవించింది. ఆ వంశముపేరు ధార్ష్ట వంశము. ఆవంశములోని రాజులు అందరూ క్షత్రియ ధర్మమును వదిలిపెట్టి బ్రాహ్మణ ధర్మమును అవలంబించారు.

మనువు మరొక పుత్రుడు నృగుని వలన సుమతి అనే వాడు జన్మించాడు. సుమతి కుమారుడు భూతజ్యోతి. భూతజ్యోతి కుమారుడు వసువు. వసువు కుమారుడు ప్రతీకుడు. ప్రతీకుని కుమారుడు ఓఘవానుడు. వాడి కుమారుడి పేరుకూడా ఓఘవానుడే. ఓఘవానుడి కుమార్తె పేరు ఓఘవతి. సుదర్శనుడు అనే వాడు ఓఘవతిని వివాహం చేసుకున్నాడు.

నరిష్యంతుడు అనే వాడికి చిత్రసేనుడు, చిత్రసేనుడికి ఋక్షుడు, ఋక్షునకు మీఢ్వానుడు, మీఢ్వానునకు పూర్ణుడు, పూర్ణునికి ఇంద్రసేనుడు అనే వారు కుమారులుగా జన్మించారు. ఇంద్ర సేనుడి కుమారుడు వీతిహోత్రుడు. వీతిహోత్రుని కుమారుడు

సత్యశ్రవుడు. సత్యశ్రవుని కుమారుడు ఉరుశ్రవుడు. ఉరుశ్రవుని కుమారుడు దేవదత్తుడు. దేవదత్తుని కుమారుడు అగ్నివేశ్యుడు. ఆ అగ్నివేశ్యుని కుమారుడే అగ్నిదేవుడు. అగ్నివేశ్యుని పేరు మీదనే అగ్నివేశ్యాయ అనే వంశము పుట్టింది.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు ఇప్పటి దాకా అరిష్యంతుని వంశము గురించి చెప్పాను. ఇప్పుడు దిష్టుని వంశము గురించి చెబుతాను.

దిష్టునకు నాభాగుడు అనే కుమారుడు కలిగాడు. నాభాగుడు అనే వాడు మరొకడుఉన్నాడు. వాడు వేరు. వీడికి వాడికి పోలిక లేదు. ఈ నాభాగుడు పుట్టుకతో క్షత్రియుడు అయిన వైశ్యధర్మమును అవలంబించాడు.

(ఇక్కడ ఒక్క విషయం గమనించాలి. పైన ఒక క్షత్రియుడు బ్రాహ్మణ ధర్మము అవలంబించాడు. మరొకడు వైశ్యధర్మము అవలంబించాడు. అంటే చేసే పనులను బట్టి కులము నిర్ణయింపబడుతుంది కానీ ఈ నాటి మాదిరి జన్మతో కాదు. చాలా మంది నాతో సహా, బ్రాహ్మణులుగా పుట్టినా, శూద్రధర్మమును అవలంబిస్తున్నారు. అంటే ఉద్యోగాలు చేస్తున్నారు. సేవ (సర్వీస్) శూద్రధర్మము. పుట్టుకతో ఏర్పడిన కులాల పేరిట మనుషులను విడదీయడం, రిజర్వేషన్లు పేరిట ప్రతిభను అణగదొక్కడం ఎంతటి దారుణమో ఊహించండి.)

నాభాగుని కుమారుడు భలందనుడు. భలందనుడి కుమారుడు వత్సప్రీతి. వత్సప్రీతి కుమారుడు ప్రాంశువు. ప్రాంశువుని కుమారుడు ప్రమతి. ప్రమతి కుమారుడు ఖనిత్రుడు. ఖనిత్రుని కుమారుడు చాక్షుషుడు. చాక్షుషుని కుమారుడు వివింశతి. వివింశతి కుమారుడు రంభుడు. రంభుని కుమారుడు ఖనీనేత్రుడు. ఖనీనేత్రుని కుమారుడు కరంధమ మహారాజు. కరంధముని పుత్రుడు అవిక్షితుడు. అవిక్షితుని పుత్రుడు మరుత్తు.

ఈ మరుత్తు చక్రవర్తిగా భూమండలమును పాలించాడు. ఈ మరుత్తు ఒక యజ్ఞము చేసాడు. దానికి ఋత్విక్కు అంగిరసుని కుమారుడు సంవర్తకుడు. అటువంటి యజ్ఞము అంతకు ముందు ఎప్పుడూ జరగలేదని ప్రతీతి. ఆ యజ్ఞములో వాడిన పాత్రలు అన్నీ బంగారముతో చేయబడ్డాయి. ఆ యజ్ఞములో ఇంద్రునికి సోమరసం అందజేసారు. బ్రాహ్మణులకు అంతులేని దక్షిణలు ఇచ్చారు. ఆ యజ్ఞములో మరుత్తులు, విశ్వేదేవులు సభాసదులుగా వ్యవహరించారు.

ఈ మరుత్తుని కుమారుడి పేరు దముడు. అతని కుమారుడు రాజవర్ధనుడు. రాజవర్ధనుని కుమారుని పేరు సుధృతి. సుధృతి కుమారుని పేరు నరుడు. నరుని కుమారుడు కేవలుడు. కేవలుని కుమారుడు దుంధుమానుడు. అతని కుమారుడు వేగవానుడు. వేగవానుని కుమారుడు బుధుడు. అతని కుమారుడు తృణబిందువు.

తృణబిందువు ఈ భూమండలమును పరిపాలించాడు. ఈ తృణబిందువును అలంబుష అనే అప్సరస వివాహమాడింది. వారికి కొంతమంది కుమారులు, ఇలావిల అనే కుమార్తె జన్మించారు. ఈ ఇలావిల విశ్రవసు అనే వాడిని వివాహం చేసుకుంది. వారి కుమారుడే యక్షరాజు అయిన కుబేరుడు.

తృణబిందువుకు విశాలుడు, శూన్యబంధువు, ధూమ్రకేతు అనే కుమారులు ఉన్నారు. విశాలుడు అనే వాడు ఒక పురమును నిర్మించాడు. ఆ పురము అతని పేరిట వైశాలి నగరం అయింది.

విశాలుని కుమారుడు హేమచంద్రుడు. అతని కుమారుడు ధూమ్రాక్షుడు. ధూమ్రాక్షుని కుమారుడు సంయముడు. సంయమునకు దేవజుడు, కృశాశ్వుడు అనే ఇద్దరు కుమారులు కలిగారు. కృశాశ్వుని కుమారుడు సోమదత్తుడు. ఈ సోమదత్తుడు అశ్వమేధ యాగము చేసి మహావిష్ణువును తృప్తి పరిచాడు. సోమదత్తుని కుమారుడు జనమేజయుడు. ఆ ప్రకారంగా విశాలుని వంశము వృద్ధిచెందింది." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు క్షత్రియుల వంశచరిత్రలు వివరించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# నవమస్కంధము
# మూడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చ్యవనుడు, సుకన్య వృత్తాంతములను  ఈ విధంగా వినిపించసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! మనువు కుమారుడు అయిన శర్యాతి గొప్ప వేదాంతి. తత్త్వవేత్త. రాజనీతిజ్ఞుడు. యజ్ఞయాగములలో చేయవలసిన కర్తవ్య కర్మలయందు నిష్ణాతుడు. ఈ శర్యాతి కుమార్తె పేరు సుకన్య. ఒక రోజు శర్యాతి మహారాజు తనకుమార్తె సుకన్యతో సహా చ్యవన మహర్షి ఆశ్రమమునకు వెళ్లాడు. ఆ ఆశ్రమములో ఎవరూ లేరు. సుకన్య ఆ ఆశ్రమములో ఉన్న వనములో అటు ఇటు తిరుగుతూ అక్కడ ఉన్న మొక్కలు, చెట్లు, లతలు, పక్షులను చూచి ఆనందిస్తూ ఉంది.

ఇంతలో ఆమెకు ఒక పుట్ట కనపడింది. ఆ పుట్టకు రెండు రంధ్రములు ఉన్నాయి. ఆ రంధ్రములలో మిణుగురు పురుగుల మాదిరి రెండు వెలుగులు మిల మిల  ప్రకాశిస్తున్నాయి. సుకన్యకు అదేమిటో తెలుసుకోవాలనే కోరిక కలిగింది. పక్కనే ఉన్న ఒక పుల్లను తీసుకొని ఈ పుట్టకు ఉన్న రంధ్రములలో గుచ్చింది. వెంటనే ఆ పుట్టకు ఉన్న రంధ్రములలో నుండి రక్తం కారడం మొదలయింది. సుకన్య భయపడిపోయింది. సుకన్య భయపడి పరుగుపరుగున తన తండ్రి వద్దకు పోయింది.

ఇంతలో సైనికులలో కల కలం బయలు దేరింది. సైనికులకు భరించలేని కడుపు నొప్పి మొదలయింది. వారికి మల మూత్ర విసర్జన  నిలిచిపోయింది.. ఈ విషయం తెలుసుకున్న శర్యాతి, తన సైనికులను, అనుచరులను చూచి ఇలా అన్నాడు.

"ఇది భృగు మహర్షి కుమారుడు అయిన చ్యవనుని ఆశ్రమము. మీరేమైనా తెలిసి గానీ, తెలియక గానీ ఇక్కడ చేయకూడని పని ఏమైనా చేసారా! మనలో ఎవరో ఈ ఆశ్రమంలో తప్పుచేసారు. లేకపోతే ఇలా జరగదు. ఏం జరిగిందో చెప్పండి." అని అడిగాడు.

అప్పుడు సుకన్య భయం భయంగా తను ఒక పుట్టను చూడటం, దానికి ఉన్న రంధ్రములు ఉండటం,  తాను బాల్య చాపల్యంతో ఆ రంధ్రములలో పుల్లతో పొడవడం, ఆ రంధ్రముల నుండి రక్తం రావడం, జరిగింది జరిగినట్టు చెప్పింది. ఆ మాటలు విన్న శర్యాతి భయంతో వణికిపోయాడు. వెంటనే ఆ పుట్ట వద్దకు పోయి చ్యవన మహర్షిని భక్తితో ప్రార్థించాడు. అప్పుడు ఆ పుట్టలో కూర్చుని తపస్సు చేసుకుంటున్న చ్యవన మహర్షి వెలుపలికి వచ్చాడు.

శర్యాతి ఆయనను తనను, తన కుమార్తెను క్షమించమని కోరాడు. చేసిన అపరాధమునకు ప్రాయశ్చిత్తంగా తన కుమార్తె సుకన్యను చ్యవనునికి ఇచ్చి వివాహం చేయ దలిచాడు. దానికి చ్యవనుడు, సుకన్య తమ అంగీకారము తెలిపారు. శర్యాతి తన కుమార్తె సుకన్యను చ్యవనుని ఆశ్రమంలో వదిలి పెట్టి వెళ్లిపోయాడు.

ఆ రోజునుండి సుకన్య తన భర్త చ్యవనుని మనసు తెలిసి నడుచుకుంటూ, ఆయనకు సకల పరిచర్యలు, సేవలు చేస్తూ ఉంది.

అలా కొంత కాలము గడిచిపోయింది. ఒక రోజు చ్యవనుని ఆశ్రమానికి అశ్వినీ దేవతలు వచ్చారు. వారిని చ్యవనుడు, సుకన్య అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించారు. చ్యవనుడు అశ్వినీ కుమారులను ఇలా అడిగాడు.

“ఓ అశ్వినీ కుమారులారా! నేను వయసు మళ్లిన వాడిని. ముసలి వాడిని. తను చేసిన అపరాధమునకు ప్రాయశ్చిత్తముగా యౌవన వతి అయిన సుకన్య నన్ను వివాహం చేసుకుంది. ఈమెకు ఎలాంటి సుఖసంతోషాలను నేను కలుగచేయలేకపోతున్నాను. మీరు దేవతలకు వైద్యులు. కాబట్టి మీరు నాకు ఎలాగైనా నవయౌవనం ప్రసాదించండి. ఇప్పటి దాకా మీకు యజ్ఞ యాగములలో సోమరసమును తాగే అర్హత లేదు. నేను మీకు ఆ అర్హత కలుగచేస్తాను. ఇక నుండి మీకు యజ్ఞములలో సోమరసమును త్రాగే అర్హత లభిస్తుంది. మీరు మాత్రము నాకు యౌవనము, ఆరోగ్యము సంభోగ శక్తి ప్రసాదించండి.” అని అడిగాడు.

అశ్వినీ కుమారులు చ్యవనుని కోరికను తీర్చడానికి అంగీకరించారు. “ఓ మహర్షీ! మీరు కోరినట్టు మీకు యౌవనం వచ్చేటట్టు చేస్తాము. మీ ఆశ్రమము పక్కనే ఉన్న సరస్సు సిద్ధ సరస్సు. దీనిని సిద్ధులు నిర్మించారు. మీరు ఆ సరస్సులో మునిగితే మీరు యౌవనవంతులౌతారు.” అని అన్నారు.

అప్పటికి  చ్యవనుడు బాగా ముసలి వాడు. చర్మం ముడుతలు పడి వేలాడుతూ ఉంది. నడవలేకుండా ఉన్నాడు. అటువంటి చ్యవనుని పట్టుకొని అశ్వినీదేవతలు ఆ సిద్ధసరస్సులో మునిగారు. ఆ సిద్ధసరస్సు మహిమ వలన ఆ సరస్సులో నుండి నవయౌవనవంతులు, అందమైన వారు, ఒంటినిండా పూలమాలలతో శోభిల్లుతున్నవారు, పట్టుపీతాంబరములు ధరించినవారు, ఒకే రూపం కలవారు అయిన ముగ్గురు పురుషులు బయటకు వచ్చారు.

ఇప్పుడు సుకన్యకు ఒక సందేహం వచ్చింది. వృద్ధుడైన తన భర్త ఇద్దరు అశ్వినులు ఆ సరస్సులో మునిగారు. కాని ఒకే రూపం కల నవయౌవన వంతులు ముగ్గురు బయటకు వచ్చారు. ఈ ముగ్గురిలో తనభర్త ఎవరు అని ఆశ్చర్యంగా చూచింది. ఏమీ తోచక, తన భర్త ఎవరో చెప్పమని అశ్వినీ దేవతలను ప్రార్థించింది. సుకన్య ప్రాతివ్రత్యమునకు సంతోషించిన అశ్వినీదేవతలు, తమ నిజరూపములతో ఆమె ముందు నిలిచారు. నవయౌవనుడుగా మారిన చ్యవనుని ఆమెకు అప్పగించి, అశ్వినీదేవతలు వెళ్లిపోయారు.

ఇది ఇలా ఉండగా, శర్యాతి మహారాజు ఒక యజ్ఞము చేయ సంకల్పించాడు. దానికి తన అల్లుడు చ్యవనుని, కుమార్తె సుకన్యను ఆహ్వానించడానికి అదే సమయంలో శర్యాతి  చ్యవనుని ఆశ్రమానికి వచ్చాడు. చ్యవనుని  ఆశ్రమంలో తన కుమార్తె పక్కన ఒక నవయౌవనుడు, సకలాలంకారభూషితుడు అయిన ఒక సుందరాకారుడు ఉండటం చూచాడు.

తండ్రిని చూడగానే సుకన్య నమస్కరించింది. తన కుమార్తె భర్తను వదిలి పరాయి పురుషుని పక్కన ఉండటం చూచి సహించలేకపోయాడు శర్యాతి. కోపంతో ఇలా అన్నాడు.

"ఓసి దుర్మార్గురాలా! ఏమిటీ పని? నీవు ఏం చేస్తున్నావో నీకు తెలుస్తూ ఉందా! నీ భర్త ఎవరో తెలుసా? మూడులోకములలో ఉన్న వారిచేత పూజింపబడే చ్యవనుడు నీ భర్త అని నీకు తెలుసా! ఆయన మహా జ్ఞాని. నీవు ఆయనను ముసలి వాడనీ, రోగిష్టివాడనీ ఆయనను వదిలేసావా! అంతటితో ఆగకుండా కామాంధురాలివై దారిన పోయేవాడిని ఉంచుకుంటావా! నీవు పుట్టిన వంశం ఎటువంటిది? నీకు ఇటువంటి విపరీత బుద్ధి ఎలా కలిగింది? ఈ ప్రకారంగా ఎందుకు అధోగతి పాలయ్యావు? మన వంశమునకు కళంకము తీసుకొని వచ్చావు? నీవు చేసిన పని వలన ఇటు నీ తండ్రి వంశము, అటు నీ భర్త వంశములో ఏడు తరముల వాళ్లు నరకానికి పోతారు. ఈ విషయం నీకు తెలుసా!" అని గట్టిగా అరిచాడు.

తండ్రి అన్న మాటలు అన్నీ చిరునవ్వుతో విన్నది సుకన్య. తరువాత తన తండ్రితో ఇలా అంది. "తండ్రీ! ఈయన ఎవరో కాదు. మీ అల్లుడు చ్యవన మహర్షి. అశ్వినీదేవతల దయ వలన నవయౌవనుడయ్యాడు." అని జరిగినది అంతా విశదంగా చెప్పింది. జరిగినది అంతావిన్న శర్యాతి ఆనందంతో పొంగిపోయాడు. తొందర పడి కుమార్తెను దూషించినందుకు సిగ్గుపడ్డాడు. ప్రేమతో కుమార్తెను దగ్గర తీసుకున్నాడు.

తరువాత తాను వచ్చిన పని అల్లుడు చ్యవనుడికి చెప్పాడు. చ్యవనుడు యజ్ఞం చేయడానికి ఒప్పుకున్నాడు. ఆ యజ్ఞంలో తాను అన్న మాట ప్రకారము అశ్వినీ దేవతలకు సోమరసపానము చేసే అర్హత కలిగించాడు. అశ్వినీ దేవతలకు ఒక పెద్ద పాత్రనిండా సోమరసం ఇచ్చాడు. ఇది చూచిన ఇంద్రుడు కోపంతో మండిపడ్డాడు. వెంటనే చ్యవనుడిని చంపడానికి వజ్రాయుధమును ఎత్తాడు. నవయౌవనంతో తొణికిసలాడుతున్న చ్యవనుడు వజ్రాయుధంతో సహా ఇంద్రుని చేతిని బలంగా పట్టుకున్నాడు.

"చ్యవనా! ఈ అశ్వినీ దేవతలు మాకు కేవలం వైద్యులు. మాతో సమానంగా వారికి సోమపాన పాత్ర ఇవ్వడం ఉచితం కాదు." అని అన్నాడు ఇంద్రుడు.

"అశ్వినీదేవతలు నాకు నవయౌవనాన్ని ప్రసాదించారు. వారికి నేను చేసే యాగములలో సోమరసం ఇస్తానని వాగ్దానం చేసాను. అందుకే ఇచ్చాను. నేను మాటతప్పను. తరువాతమీ ఇష్టం." అని అన్నాడు చ్యవనుడు. ఆ మాటలకు ఇంద్రుడు శాంతించాడు. ఆ ఘట్టం అలా ముగిసింది.

శర్యాతి మహారాజుకు ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిషేణుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. వారిలో ఆనర్తునకు రేవతుడు అనే కుమారుడు పుట్టాడు. ఈ రేవతుడు సముద్రము మధ్యలో కుశస్థలి అనే నగరమును నిర్మించాడు.

(తరువాతి కాలంలో కుశస్థలి నగరము  ద్వారక అయింది. దానినే బలరాముడు శ్రీకృష్ణుడు తమ నివాసంగా చేసుకున్నారు.)

రేవతుడు  కుశస్థలిని రాజధానిగా చేసుకొని ఆనర్తము మొదలగు దేశములను పాలించాడు. రేవతునకు నూరుగురు కుమారులు కలిగారు. వారిలో పెద్దవాడు కకుద్మి. కకుద్మి కి ఒక కుమార్తె ఉంది. ఆమె పేరు రేవతి. ఆమె చాలా పొడుగ్గా ఉండేది. అందుకని ఆమెకు ఓ పట్టాన వివాహం కాలేదు.  ఆమెకు తగిన వరుడు ఎవరో కనుక్కోడానికి  కకుద్మి బ్రహ్మలోకమునకు వెళ్లాడు.

అప్పుడు బ్రహ్మగారు సభలో ఉన్నారు. గంధర్వులు గానం చేస్తున్నారు. గంధర్వుల గానం పూర్తి కాగానే కకుద్మి లోపలకు వెళ్లాడు. బ్రహ్మగారికి నమస్కరించి తనకుమార్తె రేవతికి ఎవరిని వరునిగా నిర్ణయించారు అని  అడిగాడు.  రేవతిని తాను ఎవరికి ఇవ్వాలని అనుకుంటున్నాడో వారి పేర్లుకూడా చెప్పాడు. అందులో ఒక మంచి వరుని ఎంపిక చేయమని అడిగాడు. అప్పుడు బ్రహ్మదేవుడు నవ్వి ఇలా అన్నాడు.

"మహారాజా! ఇప్పుడు నీవు బ్రహ్మలోకంలో ఉన్నావు. మానవ లోకంలో   ఉన్న కాలమానము, ఇక్కడ కాలమానము వేరు. నువ్వు ఎవరికైతే నీ కుమార్తెను ఇవ్వాలని అనుకున్నావో వారిలో ఎవ్వరూ బతికిలేరు. అందరూ మరణించారు. నీవు మానవ లోకము నుండి బయలు  దేరిన తరువాత 27 మహాయుగములు గడిచిపోయాయి.

(కృత, త్రేత, ద్వాపర, కలి యుగములు నాలుగు కలిపి ఒక మహాయుగము అవుతుంది.) ఇప్పుడు నీవు మానవలోకమునకు వెళితే నీవు నీ కూతురిని ఎవరికి ఇవ్వవలెనని అనుకున్నావో వారి గోత్రముల పేర్లు కూడా ఇప్పుడు నీకు కనపడవు. కాబట్టి వాళ్ల సంగతి మరిచిపో. ఇప్పుడు నీవు మానవ లోకమునకు వెళ్లు. ఇప్పడు ద్వాపర యుగము నడుస్తూ ఉంది. శ్రీకృష్ణపరమాత్మకు అన్నగారైన బలరాముడు నీ కుమార్తెకు తగిన భర్త. ఆయనకు నీ కుమార్తెను ఇచ్చి వివాహం చెయ్యి." అని అన్నాడు.

బ్రహ్మగారు ఇలా ఆజ్ఞాపించగానే, కకుద్మి తన కుమార్తె రేవతిలో కలిసి భూలోకమునకు వచ్చాడు. భూలోకంలో తన రాజ్యము గానీ, తన వారు గానీ ఎవరూ లేకపోవడం గమనించాడు. వెంటనే శ్రీకృష్ణులవారి అన్నగారైన బలరామదేవుల వద్దకు వెళ్లాడు. బ్రహ్మగారి ఆదేశము గురించి చెప్పాడు. తన కుమార్తె రేవతిని బలరామునికి ఇచ్చి వివాహం జరిపించాడు. తరువాత కకుద్మి తపస్సు చేసుకోడానికి బదరికా వనమునకు వెళ్లిపోయాడు. (ఈ కారణం చేతనే రేవతి తన భర్త బలరాముని కంటే వయసులో పెద్దది అని అంటారు.).

శ్రీమద్భాగవతము

నవమస్కంధము మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# నవమస్కంధము

## నాలుగవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత కథను ఇలా చెప్పసాగాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! నభగుని కుమారుడు నాభాగుడు. నాభాగుడు గురు గృహంలో ఉండటం చేత ఆయన ఇంక తిరిగి రాడని అనుకున్నారు. అందువలన నాభాగుని సోదరులు నాభాగునికి వాటా ఇవ్వకుండానే తమ పిత్రార్జితమైన ధనమును పంచుకున్నారు.

తరువాత కొంత కాలానికి నాభాగుడు గురుకులము నుండి తిరిగి వచ్చాడు. తన సోదరులను  పిత్రార్జితములో తన వాటా తనకు ఇమ్మని అడిగాడు. దానికి అతని సోదరులు ఈ విధంగా సమాధానం చెప్పారు. "మా తండ్రి ఆస్తిని మేము పంచేసుకున్నాము. నీవు కావాలంటే నీ వాటా కింద మన తండ్రిని తీసుకో" అని అన్నారు. "అవునా! నా భాగానికి నా తండ్రినే నాకు ఇస్తున్నారా!" అని అన్నాడు.

వెంటనే తండ్రి వద్దకు పోయి "తండ్రీ! నా సోదరులు నిన్ను నా వాటా కింద నాకు ఇచ్చారు." అని అన్నాడు. దానికి నభగుడు ఇలా అన్నాడు. "కుమారా! నీ సోదరులు నిన్ను మోసం చేసారు. నీవు వారి మాటలు నమ్మవద్దు. నన్ను తీసుకుంటే నీకు ఏమి లాభం లేదు. నీ వాటాధనము కొరకు వారిని  గట్టిగా అడుగు." అని అన్నాడు. దానికి నాభాగుడు "వద్దు తండ్రీ. నాకు నువ్వు కావాలి. నా వాటా కింద నిన్నే

తీసుకుంటాను." అని అన్నాడు. ఆ మాటలకు నభగుడు ఎంతో సంతోషించాడు.

"కుమారా! నీకు అపారమైన ధనము వచ్చే ఉపాయం నేను చెబుతాను. అంగిరస గోత్రీకులు ఒక మహాయజ్ఞము చేస్తున్నారు. వారు బాగా తెలిసినవారు, బుద్ధిమంతులు అయినప్పటికినీ, ప్రతి ఆరురోజులకు, మంత్రాలు మర్చిపోతుంటారు. నీవు అక్కడకు పోయి వారు మర్చిపోయిన మంత్రములను జ్ఞాపకం చేస్తూ ఉండు. అంతే కాకుండా, వైశ్వదేవులకు సంబంధించిన రెండు సూక్తములను బోధించు. యజ్ఞము పూర్తి కాగానే, అంగిరస గోత్రీకులు ఆ యజ్ఞములో మిగిలిన ధనము అంతా నీకే ఇచ్చి స్వర్గమునకు వెళతారు." అని అన్నాడు.

తండ్రి మాట ప్రకారము నాభాగుడు అంగిరస గోత్రీకులు చేసే యజ్ఞమునకు వెళ్లారు. వారికి ప్రతి ఆరు రోజులకు వారు మరిచిపోయిన మంత్రములను జ్ఞాపకం చేసాడు. వైశ్వదేవమునకు సంబంధించిన సూత్రములను బోధించాడు. నాభాకుని సేవలకు వారు ఎంతో సంతోషించారు. యజ్ఞ పూర్తికాగానే మిగిలిన ధనమును అంతా నాభాగునికి ఇచ్చి స్వర్గమునకు వెళ్లిపోయారు.

నాభాగుడు ఆ ధనమంతా తీసుకోడానికి ప్రయత్నించాడు. ఇంతలో ఉత్తర దిక్కు నుండి ఒక నల్లటి పురుషుడు అక్కడికి వచ్చాడు. "ఈ ధనమంతా నాది" అని అన్నాడు. దానికి నాభాగుడు "ఈ ధనమును నాకు అంగీరస గోత్రీకులైన ఋషులు నాకు ఇచ్చారు. కాబట్టి ఈ ధనము నాది. దీని మీద నీకు ఎలాంటి హక్కులేదు." అని

అన్నాడు. దాని మీద వారిద్దరి మధ్య వివాదము తలెత్తింది. ఇద్దరూ కలిసి నాభాగుని తండ్రి అయిన నభగుని వద్దకు వెళ్లారు. వారిద్దరి వాదనలను విన్న నభగుడు ఇలా తీర్పు చెప్పాడు.

"ఉత్తర దిక్కునుండి వచ్చిన ఈ నల్లని వ్యక్తి రుద్రుడు. దక్షయజ్ఞము జరిగిన సందర్భంలో, ప్రతి యజ్ఞములోనూ మిగిలిన భాగమును రుద్రునికే చెందవలెనని మహావిష్ణువు శాసించాడు. దాని ప్రకారము యజ్ఞములో మిగిలిన ధనము రుద్రునికే చెందుతుంది." అని అన్నాడు. ఆ మాటలు విన్ని నాభాగుడు రుద్రునికి నమస్కరించి ఇలా అన్నాడు.

"దేవా! నమస్కారము. తమరు ఎవరో తెలియక తమరితో వివాదమునకు దిగాను. ఈ యజ్ఞములో మిగిలిన ధనము అంతా తమరికే చెందుతుందని మా తండ్రిగారు చెప్పారు. నా తండ్రి మాట నాకు శిరోధార్యము. ఈ ధనము మీదే. తీసుకోండి. నన్ను అనుగ్రహించండి." అని తలవంచి నమస్కరించాడు. ఆ మాటలకు సంతోషించినరుద్రుడు ఇలా అన్నాడు.

"నాభాగా! తన కుమారుడు అనే పక్షపాతము చూడకుండా నీ తండ్రి సత్యము పలికాడు. నీ తండ్రి ఆజ్ఞనీవు పాటించావు. నాకు చాలా ఆనందం కలిగింది. ఈ ధనమంతా నీకే ఇస్తున్నాను. తీసుకో. దానితో పాటు నీకు బ్రహ్మజ్ఞానము కూడా ఉపదేశిస్తున్నాను." అని అన్నాడు. తరువాత రుద్రుడు నాభాగునికి బ్రహ్మజ్ఞానమును ఉపదేశించి అక్కడి నుండి వెళ్లిపోయాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ నాభాగుని చరిత్రను ఉదయము, సాయంత్రము చదివితే, వింటే, వారు విద్యావంతులవుతారు. ఉత్తమ లోకములను పొందుతారు.

నాభాగునికి అంబరీషుడు జన్మించాడు. ఆయప పరమభాగవతోత్తముడు. ఎల్లప్పుడూ విష్ణువునే స్మరించేవాడు. సాధారణంగా బ్రాహ్మణుల శాపము వృథా పోదు. అంబరీషుడు ఎంతటి విష్ణుభక్తుడు అంటే ఒక బ్రాహ్మణోత్తముని శాపము కూడా అంబరీషుని ఏమీ చేయలేకపోయింది." అని అన్నాడు.

ఆ మాటలకు పరీక్షిత్ మహారాజు ఇలా అన్నాడు. "మహర్షీ! రాజర్షిఅయిన అంబరీషుడు అంత భక్తుడా. ఆయనను బ్రాహ్మణోత్తముని శాపము కూడా ఏమీ చేయలేదా! ఆశ్చర్యముగా ఉంది. నా మీద దయయుంచి అంబరీషుని చరిత్రను నాకు వినిపించండి." అని అడిగాడు. శుకమహర్షి అంబీషుని చరిత్రను ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నాభాగుని కుమారుడైన అంబరీషుడు ఈ భూమిని జనరంజకంగా పరిపాలించాడు. కాని అంబరీషునికి ఈ రాజ్యభోగముల యందు, విషయవాంఛల యందు వ్యామోహము లేదు. వాటిని గడ్డిపరక మాదిరి చూచేవాడు. ఈ రాజ్యసంపదలు, ఐశ్వర్యములు అన్నీ అశాశ్వతములు అన్నీ నమ్మేవాడు. కాబట్టి వాటి మీద వ్యామోహ పడేవాడు కాదు. అంబరీషుడు ఎల్లప్పుడూ శ్రీహరి నామస్మరణ చేస్తూ శ్రీహరిని సేవిస్తూ, శ్రీహరి మీద అచంచలమైన భక్తి కలిగి ఉండేవాడు.

ఆ భక్తిభావంతో అంబరీషుడు ఈ రాజ్యమును, రాజ్యసుఖములను  అంతా ఒక మట్టిగడ్డ మాదిరి చూచేవాడు. అంబరీషుడు తన మనస్సునుఎల్లప్పుడూ శ్రీహరి పాదపద్మములను స్మరించడంలోనే లగ్నం చేసేవాడు. నోటితో శ్రీహరి నామ స్మరణ తప్ప వేరే వాటిని పలికేవాడు కాదు. తన చేతులతో శ్రీహరి సేవ తప్ప మరొకటి చేసేవాడు కాదు. చెవులతో శ్రీహరి పుణ్యకథలను తప్ప వేరేవాటిని వినేవాడు కాదు. కళ్లతో శ్రీహరిని తప్ప వేరే వస్తువులను చూడటానికి ఆసక్తి కనపరచేవాడు కాదు. శ్రీహరికి అర్పించిన తులసిదళాలను తప్ప వేరే వాటిని వాసనచూచేవాడుకాదు. నోటితోకేవలం భగవంతునికి నివేదన చేసినపదార్థములను తప్ప వేరేవాటిని ఆరగించేవాడు కాదు. తన కాళ్లను శ్రీహరి మందిరములకు తప్ప శ్రీహరి భక్తుల వద్దకు వెళ్లాడానికి తప్ప మరొక చోటికి వెళ్లడానికి వినియోగించేవాడు కాదు.

అంబరీషుడు ఈ ప్రాపంచిక విషయముల పట్ల విషయవాంఛల పట్ట ఏ మాత్రము ఆసక్తి చూపేవాడు కాదు. అంబరీషుడు తాను చేసే ప్రతి పనిని భగవంతుని కోసమే చేసేవాడు. తానుచేసే అన్నిపనులను భగవంతునికే అర్పించేవాడు. తాను చేసిన కర్మలకు ఫలాన్ని ఆశించేవాడు కాదు. ఈవిధంగా అంబరీషుడు తనజీవితమును గడుపుతూ రాజ్యపాలన చేసేవాడు.

అంబరీషుడు ఎడారి ప్రాంతంలో సరస్వతీ నదీతీరంలో అశ్వమేధయాగముచేసాడు. ఆ యాగంలో ప్రధానంగా శ్రీహరిని ఆరాధించాడు. ఋత్విక్కులకు, బ్రాహ్మణులకు దక్షిణలు, దానములు

విరివిగా ఇచ్చాడు. ఆ యజ్ఞానికి వశిష్ఠుడు, అసితుడు, గౌతముడు మొదలగు మునులు విచ్చేసారు. యజ్ఞయాగములు జరుగుతున్నప్పటికినీ, అంబరీషుడు మాత్రము శ్రీహరి ధ్యానములోనే నిమగ్నమయ్యేవాడు. అతని అనుచరులు అన్ని కార్యక్రమములు నిర్వర్తించేవారు. అంబరీషుడు చేస్తున్న ఆ యజ్ఞములో పాల్గొన్న ఋత్విక్కులు దేవతల వలె రెప్ప వాల్చకుండా అత్యంత భక్తిశ్రద్ధలతో ఆ యజ్ఞమును నిర్వర్తించారు. ఆయన పాలనలో ఉన్న ప్రజలు స్వర్గసుఖములు ఇస్తామన్నా వద్దు అనేవారు. తమకు అంబరీషుని పాలనలో జీవించడంకన్నాస్వర్గసుఖాలు ఎక్కువకావు అనేవారు.

ఈ ప్రకారంగా అంబరీషుడు శ్రీహరి మీద భక్తితో, స్వధర్మమైన రాజ్యపాలన సాగిస్తూ, సకలమైన కోరికలను వదిలిపెట్టి నిరాడంబరంగా జీవించేవాడు. అంబరీషునికి తనకు భవనములు కావాలని కానీ, అంతు లేని సంపదలు కావాలని కానీ, ఖరీదైన వస్త్రములు కావాలని కానీ, రత్నాభరణములు ధరించాలని కానీ, అపారమైన ధనరాసులను కూడబెట్టాలనికానీ కోరిక ఉండేది కాదు. అంబరీషుడు తన భార్యాబిడ్డల మీదకూడా అధికమైన వాత్సల్యము చూపించకుండా, పరిమితంగా ఉండేవాడు.

అంబరీషుని భక్తికి మెచ్చి శ్రీహరి అంబరీషునకు భక్తజనులను రక్షించేదీ, శత్రువులను శిక్షించేదీ అయిన తన సుదర్శన చక్రమును ఇచ్చాడు. ఆ సుదర్శన చక్రమును అంబరీషుడు భక్తితో పూజించేవాడు.

ఇలా ఉండగా ఒక సారి అంబరీషుడు ఒకసంవత్సరంపాటు ద్వాదశీ వ్రతమును ఆచరించాడు. వ్రతము పరిసమాప్తి కాలంలో, కార్తీకమాసంలో మూడు రోజులు ఉపవాసము ఉన్నాడు. యమునానదీ తీరంలో మధురాపురంలో, శ్రీహరిని ఆరాధించాడు. పూజలు, అభిషేకములు చేసి నివేదనలు సమర్పించాడు. బ్రాహ్మణులను పూజించాడు. వారికి దక్షిణలు, దానములు ఇచ్చాడు. తరువాత తన స్వగృహమునకు వచ్చాడు. సాధుజనులకు, బ్రాహ్మణులకు అరవైవేల పాడి ఆవులను దానంగా ఇచ్చాడు. తరువాత బ్రాహ్మణులకు తృప్తిగా భోజనములుపెట్టాడు. తరువాత బ్రాహ్మణుల అనుమతి తీసుకొని తను కూడా ద్వాదశిపారణ అంటే ఉపవాసము తరువాత చేసే భోజనము చేయడానికి కూర్చున్నాడు.

ఆ సమయంలో దుర్వాసుడు అనే ముని తన శిష్యులతో అంబరీషుని వద్దకు వచ్చాడు. అంబరీషుడు వెంటనే లేచి ఆ మునిని ఆహ్వానించి, అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి ఆసనం చూపించాడు. తమ ఇంట్లో భోజనము చేయవలసిందిగా దుర్వాసుని ప్రార్థించాడు. దానికి దుర్వాసుడు అంగీకరించాడు. స్నానము చేయడానికి సమీపంలో ఉన్న కాళింది సరోవరమునకు వెళ్లాడు. దుర్వాసుడు ఆ కాళిందీ సరోవరంలో మధ్యాహ్నకాల సంధ్యావందనము ముగించుకొని భగవంతుని గురించి ధ్యానంలో కూర్చున్నాడు.

అంబరీషుడు దుర్వాసుని కొరకు ఎదురు చూస్తున్నాడు. ద్వాదశి ఘడియలు ముగింపుకు వస్తున్నాయి. తాను ద్వాదశి పారణ చేయడానికి కొంత సమయం మాత్రమే మిగిలి ఉంది. కాని

భోజనమునకు పిలిచిన దుర్వాసుడు ఎంతకూ రాలేదు.  ఏం చేయాలా అని అక్కడ ఉన్న బ్రాహ్మణులను అడిగాడు.

సంవత్సరంపాటు చేసిన వ్రతము అంతా ద్వాదశి పారణమీదనే ఆధారపడి ఉంది. ద్వాదశి నాడు పారణ చేయకపోతే చేసిన వ్రతం అంతా వృధా అవుతుంది.  దుర్వాసుని భోజనానికి పిలిచి ఆయనకు భోజనం పెట్టకుండా భోజనం చేస్తే బ్రాహ్మణులకు అపరాధము చేసినట్టు అవుతుంది. అందుకని అటుధర్మం తప్పకుండా, ఇటు వ్రత ఫలం దక్కేటట్టు ఒక ఉపాయం చెప్పమని బ్రాహ్మణులను అడిగాడు అంబరీషుడు.

దానికి బ్రాహ్మణులు బాగా తర్కించుకొని, " నీరు తాగడం అంటే  భోజనం చేసినట్టు కాదు, చేయనట్టు కాదు అని వేదంలో చెప్పబడింది. భోజనం చేయకుండా కేవలం నీళ్లు తాగితే, అటు ద్వాదశి పారణ చేసిన ఫలం దక్కుతుంది, ఇటు దుర్వాసునికి ఇచ్చిన మాట నిలుస్తుంది." అని ఉపాయం చెప్పారు.

అంబరీషుడు కూడా ఆలోచించి బ్రాహ్మణులు చెప్పినది ఉత్తమమైన మార్గము అని నిర్ధారించుకున్నాడు. అంటే నీరు తాగడం ఆహారం తీసుకోడంతో సమానం కాదు. కానీ నీరు తాగితే ద్వాదశిపారణతో సమానం అవుతుంది. అందుకని ఆ నిర్ణయం తీసుకున్నాడు అంబరీషుడు. ద్వాదశిఘడియలు మించకుండా నీళ్లు తాగి ఉపవాసవ్రతమును పూర్తిచేసాడు. దుర్వాసుని రాకకు ఎదురు చూస్తున్నాడు.

దుర్వాసుడు కూడా తన మాధ్యాహ్నిక అనుష్ఠానమును ముగించుకొని అంబరీషుని గృహమునకు వచ్చాడు. అప్పటికే అంబరీషుడు నీళ్లు తాగి ఉపవాసదీక్షను విరమించాడని తన యోగదృష్టితో తెలుసుకున్నాడు. కోపంతో రగిలిపోయాడు. దుర్వాసునికి కోపం వచ్చిందని తెలుసుకొని అంబరీషుడు ఆయన ముందు చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

దుర్వాసుడు వినయంగానిలబడి ఉన్న అంబరీషునితో ఇలా అన్నాడు. "ఓరి దుర్మార్గుడా! బ్రాహ్మణుని భోజనానికి పిలిచి అవమానిస్తావా! బ్రాహ్మణునికి భోజనం పెట్టకుండానే నీవు తింటావా. నీవు రాజువు అనీ, నీకు సంపదలు ఉన్నాయనీ, నీవే దేవుడవనీ నీకు గర్వం పెరిగింది. నీవు దేవుని యందు భక్తిలేదు. అందుకే ధర్మాన్ని అతిక్రమించావు. ఇంటికి వచ్చిన అతిథికి భోజనం పెట్టకుండా, నీవు భోజనం చేసిన దానికి ఫలితం ఇప్పుడే అనుభవిస్తావు." అంటూ దుర్వాసుడు తన తలకు కట్టిన జడల నుండి ఒక జట తీసి దానిలో నుండి ఒక కాలాంతకురాలైన కృత్య అనే శక్తిని సృష్టించాడు. ఆ శక్తిని అంబరీషుని చంపమని ప్రయోగించాడు.

చేతిలో కత్తితో ఆ శక్తి అంబరీషుని మీదికి రాసాగింది. కాని అంబరీషుడు ఏ మాత్రము భయపడలేదు. నిశ్చలంగా ఉన్నాడు. శ్రీహరి అంబరీషునికి ప్రసాదించిన చక్రము, అప్పటి దాకా అంబరీషునితో పూజలందుకుంటున్న చక్రము మాత్రము ఊరుకోలేదు.  ఒక్కసారిగా పైకి లేచింది. అంబరీషుని చంపడానికి వస్తున్న శక్తిని  నాశనం చేసింది. అంతటితో ఆగకకుండా, అంబరీషుని మీదికి శక్తిని

ప్రయోగించిన దుర్వాసుని మీదికి వెళ్లింది.

తన మీదికి వస్తున్న చక్రమును చూచి భయంతో వణికిపోయాడు దుర్వాసుడు. భయంతో పరుగెత్తాడు. చక్రము అతనిని వెంబడించింది. తన ప్రాణాలు రక్షించుకోడానికి దుర్వాసుడు వేగంగా పరుగెడుతున్నాడు. కానీ చక్రము అతనిని విడిచిపెట్టలేదు. దుర్వాసుడు మేరుపర్వతము వంకకు పరుగెత్తాడు. తనను తాను రక్షించుకోడానికి దుర్వాసుడు ఆకాశము, దిక్కులు, భూమి, కొండగుహలు, సముద్రములు, మూడులోకములు, స్వర్గము మొదలగు ప్రదేశములకుపరుగెత్తాడు. ఎక్కడికిపోయినా చక్రము అతనిని వెంబడిస్తూనే ఉంది.

ఇలా కాదని దుర్వాసుడు బ్రహ్మలోకమునకు వెళ్లాడు. "ఓ బ్రహ్మదేవా! నన్ను రక్షించు.ఈ చక్రాయుధము నన్ను చంపడానికి వస్తూ ఉంది. నన్ను కాపాడు." అని ప్రార్థించాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు. "మహర్షీ! ప్రళయ కాలంలో ఈ లోకములు అన్నిటితోపాటు నేను, నా బ్రహ్మలోకము కూడా లయం అయిపోతుంది. ఏమీ మిగలదు. మరొక కొత్త బ్రహ్మ వస్తాడు. నేనే శాశ్వతము కానపుడు, నేను నిన్ను ఎలా రక్షించగలను. నేను, ఈశ్వరుడు, దక్షుడు, భృగువు, మొదలగు ప్రజాపతులు, భూతనాధులు, దేవతా గణములు అన్ని ఆ విష్ణువు యొక్క అధీనంలో ఉన్నాము. ఆయన ఆదేశాలను పాటిస్తూ మామా కర్తవ్యములను నిర్వర్తిస్తున్నాము. అంబరీషుడు విష్ణుభక్తుడు. నీవు ఆ విష్ణుభక్తుని అకారణంగా చంపాలని అనుకున్నావు. ఇప్పుడు నిన్ను చంపడానికి నీ మీదకు వస్తున్నది ఈ విష్ణువు ప్రసాదించిన సుదర్శన చక్రము. ఆ సుదర్శన చక్రమును ఆపడం నా వల్ల కాదు."

అని అన్నాడు బ్రహ్మదేవుడు.

బ్రహ్మవల్ల ఏమీ ప్రయోజనం లేదని దుర్వాసుడు కైలాసానికి వెళ్లాడు. పరమ శివుని కాపాడమని శరణు వేడాడు. దుర్వాసుని చూచి శంకరుడు ఇలా అన్నాడు. “ఓ మహర్షీ! నీకు బ్రహ్మదేవుడు అన్ని చెప్పిఉంటాడు. ఆ బ్రహ్మగారితో సహా సమస్త జీవకోటి, ఆ జీవకోటికి ఆశ్రయంగా ఉన్న ఈ బ్రహ్మాండములు, ఈ అనంత విశ్వము అంతాకూడా విష్ణువు యొక్క అధీనంలో ఉంది. నేను కానీ మేము ఎవరము కానీ విష్ణువు మీద మా పరాక్రమము చూపలేము.
ఓ మహర్షీ! నీకు అన్నీ తెలుసు కదా! ఇటువంటి పని ఎందుకుచేసావు. విష్ణుభక్తుని అకారణంగా ఎందుకు చంపాలని అనుకున్నావు. నేను, సనత్కుమారుడు, నారదుడు, బ్రహ్మగారు, కపిలమహర్షి, వ్యాసమహర్షి, దేవలుడు, యముడు, ఆసురి, మరీచి మొదలగు వారందరూ సర్వజ్ఞులే. అన్నీ తెలిసిన వారమే. కాని మేమంతా ఆ విష్ణుమాయను దాటలేకపోతున్నాము. నీవు కూడా ఆ మాయలో పడి ఈ పని చేసావు. ఏం చేస్తాం. నీకు ప్రస్తుతము ఆ విష్ణువు తక్క వేరే దిక్కులేదు. పోయి ఆ విష్ణువునే శరణు వేడు. నిన్ను తన చక్రము నుండి కాపాడతాడు.” అనిఅన్నాడు.

శివుడు కూడా తన అసహాయతను వ్యక్తం చేయడంతో దుర్వాసుడునిరాశ చెందాడు. చేసేది లేక వైకుంఠమునకు వెళ్లాడు. శ్రీమన్నారాయణ మూర్తి శరణు వేడాడు. “ఓ దేవా! అచ్యుతా! అనంతా! వాసుదేవా! సాధుజనులనురక్షించేవాడా! విశ్వమంతా నిండి ఉన్న వాడా! నీభక్తుల పట్ల అపరాధము చేసాను. నన్ను క్షమించు. నీ

ప్రభావము తెలియక నీ భక్తుడైన అంబరీషునిపట్ల అనుచితంగా ప్రవర్తించాను. నన్ను రక్షించడం నీకు తప్పవేరే ఎవరికీ సాధ్యంకాదు. ఈ చక్రము నన్ను తరుముతూ ఉంది. ఈ చక్రాయుధము బారి నుండి నన్ను కాపాడు." అని శ్రీమహావిష్ణువు కాళ్లమీద పడ్డాడు.

అప్పుడు శ్రీమహావిష్ణువు దుర్వాసునితో ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! నా సంగతి నీకు తెలుసుకదా! నేనుఎల్లప్పుడూ నా భక్తుల అధీనంలో ఉంటాను. నేను కూడా నిన్ను రక్షించలేను. ఏ కోరికా లేని నా భక్తులు నన్ను తమ అధీనంలో ఉంచుకున్నారు. నా భక్తులే కాదు, ఆ భక్తులకు భక్తులు కూడా నాకు ఇష్టులే! నాభక్తులు, ఆ భక్తులకు భక్తుల ముందు నా ఐశ్వర్యములు అన్నీ ఎందుకూ పనికిరావు. నా భక్తుల ఆనందమే నా ఆనందము. వారికి ఏ కష్టం వచ్చినా నేను సహించలేను. ఎందుకంటే. నా భక్తులు అయిన వాళ్లు, తమ భార్య, పిల్లలను, గృహములను, విషయవాంఛలను, ప్రాపంచిక విషయములను అన్నిటినీ వదిలిపెట్టి, నన్ను శరణుజొచ్చారు. అటువంటి నా భక్తులను నేను ఎలా విడిచిపెట్టగలను. ఒక పతివ్రత అయిన స్త్రీ తన భర్తను తన అధీనంలో ఎలా ఉంచుకుంటుందో అలాగే నా భక్తులు కూడా నన్ను తమ అధీనంలో ఉంచుకుంటారు. నా భక్తులు కేవలం నా పాదములను సేవించడం, నా గురించి సత్సంగాలు చేయడం తప్ప వారికి వేరే ధ్యాస లేదు. ఏవేవో కోరికలు తీరడానికి నా భక్తులు నన్ను సేవించరు. వారి భక్తి ఫలాపేక్షలేని భక్తి. అటువంటి వారికి నేను స్వర్గలోకము, ముక్తి ఇస్తానన్నా వారు అంగీకరించరు. కేవలము నా సేవ మాత్రమే కోరుకుంటారు.

కాబట్టి నేను కూడా ఏమీ చేయలేను కానీ ఈ అపాయము తప్పించుకునే ఉపాయము ఒకటి చెబుతాను. నీవు ఎవరికైతే అపకారము చేయబోయి, ఈ ఆపదలో పడ్డావో, ఆ అంబరీషుని వద్దకు వెళ్లు. ఆలస్యం చేస్తే నీకు ఆపద సంభవిస్తుంది. చివరగా ఒక్కమాట.

ఓ మహామునీ! తపస్సు, విద్య, సక్రమ మార్గంలో వినియోగించినంత వరకు మానవులకు శోభను ఇస్తాయి. అదే తపస్సును, విద్యను అక్రమ మార్గంలో వినియోగిస్తే ప్రాణంమీదికి తెస్తాయి. జాగ్రత్త!

కాబట్టి నీవు వెంటనే నా భక్తుడు అంబరీషుని వద్దకు పోయి ఆయనను శరణు వేడు. ఆయననుశాంతి పరచు. నీకు శుభం అవుతుంది." అని పలికాడు శ్రీమహావిష్ణువు.

(శ్రీమహావిష్ణువు మాటలు ఒక్క సారి మననం చేసుకోండి. "తపస్సు, విద్య, సక్రమ మార్గంలో వినియోగించినంత వరకు మానవులకు శోభను ఇస్తాయి. అదే తపస్సును, విద్యను అక్రమ మార్గంలో వినియోగిస్తే ప్రాణంమీదికి తెస్తాయి." ఈ నాడు జరుగుతున్నది ఏమిటి! ఒక్కసారి ఆలోచించండి. ఎంతో మంది అణు శాస్త్రవేత్తలు, తాము చదువుకున్న విద్యను, శాస్త్రవిజ్ఞానాన్ని, తపస్సు మాదిరి చేసిన ప్రయోగాలను మానవ వినాశానికి వినియోగిస్తున్నారు. అణుబాంబులు తయారు చేసి ప్రపంచ వినాశనానికి కారకులవుతున్నారు. తుదకు వారే నాశనం అవుతున్నారు. ఆ

అణుశాస్త్రవిద్యను సక్రమ మార్గంలో వినియోగిస్తే లోకకల్యాణానికి దోహదమౌతుంది. ఇదే నాడు విష్ణుమూర్తి చెప్పిన మాట. ఈఅంబరీషోపాఖ్యానము నుండి మనము నేర్చుకోవలసిన నీతి. ఒక్క అణుశాస్త్ర వేత్తలే కాదు, కంప్యూటర్ ఇంజనీర్లు కూడా తాము నేర్చిన విద్యను హాకింగ్ చెయ్యడానికి కంప్యూటర్లలో నిక్షిప్తమై ఉన్న సమాచారాన్ని నాశనం చేయడానికి దాని వల్ల వికృతానందాన్ని పొందడానికి, క్షణాల్లో యస్ యమ్ యస్ లద్వారా విషప్రచారం చెయ్యడానికీ, మతపరమైన విద్వేషాలు రెచ్చగొట్టడానికి ఉపయోగిస్తున్నారు. తుదకు కటకటాల పాలవుతున్నారు. నేర్చుకున్న విద్యను సాటి మనిషిమంచి కోసరం, సమాజ శ్రేయస్సు కోసరం వినియోగిస్తేనే ఆ విద్యకు సార్ధకత. అలా కాకుండా ఆవిద్యలను సాటిమనిషి వినాశంకోసం, సమాజ విధ్వంసం కోసం వినియోగిస్తే, దుర్వాసుని మాదిరి కష్టాలలో పడతారు. దుర్వాసుడు కూడా ఎంతో తపస్సు చేసాడు. కాని ఆ తపస్సును శాపాలు ఇవ్వడానికి వినియోగించాడు. తుదకు ఆపదలో చిక్కుకున్నాడు. నేటి విద్యావంతులు, శాస్త్రవేత్తలు తమ తమ విద్యలను, పరిశోధనలను (తపస్సును) లోకకల్యాణం కొరకు ఉపయోగిస్తారని ఆశిద్దాం.)

శ్రీమద్భాగవతం

నవమస్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓంతత్సత్ ఓం తత్సత& ఓం తత్సత్

# శ్రీమద్భాగవతం

# నవమస్కంధము

# ఐదవ అధ్యాయము

శుక మహర్షి అంబరీషోపాఖ్యానమును పరీక్షిత్ మహారాజుకు ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్‌మహారాజా! శ్రీహరి ఆదేశము ప్రకారము దుర్వాసుడు పరుగు పరుగున అంబరీషుని వద్దకు వచ్చాడు. ఆయన కాళ్ల మీద పడ్డాడు. క్షమించమని వేడుకున్నాడు. అంతటి మునిసత్తముడు తన కాళ్ల మీదపడటం చూచి నివ్వెరపోయాడు అంబరీషుడు. ఏం జరిగిందో అర్థం కాలేదు కానీ, దుర్వాసుని తరుముతూ వస్తున్న విష్ణుచక్రం అంబరీషుని కంటపడింది. విషయం అర్థం అయింది. వెంటనే అంబరీషుడు కళ్లు మూసుకొని మనసులో శ్రీమన్నారాయణుని నిలుపుకొని భక్తితో ప్రార్థించాడు.

"శ్రీమహావిష్ణువు చేతిని అలంకరించిన ఓ సుదర్శన చక్రమా! నీవు అగ్ని సమానవు. సూర్యతేజంతో సమానమైన దానవు. గ్రహములకు, నక్షత్రములకు అధిపతి అయినచంద్రునితో సమానమైన దానవు. పంచభూతములకు అధిపతి అయిన శ్రీమన్నారాయణుని వశంలో ఉంటావు. నీవు సకల అస్త్రములను నాశనం చేస్తావు. నా ప్రార్థన మన్నించి ఈ బ్రాహ్మణుని విడిచిపెట్టు. ఆయనను కాపాడు.

ఓ సుదర్శన చక్రమా! నీవే ధర్మము. నీవే సత్యము. నీవే యజ్ఞము. నీవే లోకపాలకుడవు. నీవే విష్ణుమూర్తి తేజస్సు. నీ పేరు సుదర్శనము అనగా పరమాత్మ యొక్క మంచి దృష్టి అని అర్థము. ఆ పరమాత్మయొక్క దయతోకూడిన చూపు నీవే. ఎవరి మాయలో నుండి ఈ సమస్త సృష్టి ఉద్భవించిందో, ఆ విష్ణువు, చరాచరజగత్తులో నిండి ఉన్నవాడవు నీవే. ఓ సుదర్శన చక్రమా! నీవు సకల ధర్మస్వరూపుడవు. అధర్మాన్ని రూపుమాపేది నీవే. మూడు లోకములను నీవే పాలిస్తుంటావు. నీవు తేజోమూర్తివి. నీ వేగము మనోవేగమును మించింది. అట్టినీకు నమస్కారము.

ఓ సుదర్శనమా! నీ తేజస్సుతో అంధకారము తొలగి జ్ఞానము ప్రకాశిస్తుంది. నీ ప్రభావము ఎవరికీ దాటరానిది. ఈలోకంలో గొప్పది,నీచమైనది ఉన్నాయి అంటే అవి నీ స్వరూపాలే. శ్రీమహావిష్ణువు ఆదేశము అనుసరించి దేవాసుర యుద్ధంలో దేవతల పక్షాన ఉండి దానవులను సంహరించినది నీవేకదా! శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణ కొరకు నిన్ను వినియోగిస్తుంటాడు. కానీ ఈ బ్రాహ్మణుడు దుష్టుడు కాడు. ఈయనను కాపాడు.

ఓ సుదర్శనమా! నేను చేసిన దానములన్నీ సత్పాత్రదానములు అయితే, నేను నా స్వధర్మమును చక్కగా ఆచరించి ఉంటే, నేను భక్తి శ్రద్ధలతో యజ్ఞయాగములు చేసి ఉంటే, ఈ బ్రాహ్మణునికి శుభం కలుగుగాక! ఈ పరమాత్మ ఈ బ్రాహ్మణుని రక్షించుగాక!" అని ప్రార్థించాడు.

(ఇక్కడ ఒకటి గమనించండి. అంబరీషుడు సుదర్శన చక్రమును ప్రార్థిస్తూ సాక్షాత్తు విష్ణుమూర్తిని ప్రార్థించినట్టు స్తోత్రము చేసాడు. అంటే అంబరీషునకు సర్వం విష్ణుమయం అనే భావన.)

అంబరీషుడు చేసిన ప్రార్ధనలతో చక్రము శాంతించింది. అది చూచిన దుర్వాసుడు మహదానందభరితుడు అయ్యాడు. అంబరీషుని ఈ విధంగా ప్రశంసించాడు.

"అంబరీషా! భగవద్భక్తుల మహిమను ఇప్పుడే చూస్తున్నాను. నీవే నిజమైన భగవద్భక్తుడవు. పట్టరాని కోపంతో, నీ పట్ల నేను క్షమించరాని అపరాధము చేసాను. నన్ను క్షమించు. నేను నీ ప్రాణములు తీయాలని సంకల్పించినా, నీకు అపకారము తలపెట్టినా, నీవు మాత్రము నా ప్రాణములు కాపాడావు. ("అపకారికి నుపకారము నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ!" అని సుమతీ శతక కర్త ఈ విషయాన్నే తేటతెలుగులో చెప్పాడు.)

ఓ అంబరీషా! శ్రీమన్నారాయణుని భక్తులకు ఈ లోకంలో అసాధ్యం అంటూ ఏమి ఉంటుంది! ఎవరి నామం వింటే, ఎవరి నామం ఉచ్ఛరిస్తే, ఎవరి నామం జపిస్తే, మానవుల మనస్సు నిర్మలం అవుతుందో, అటువంటి భగవద్భక్తులు పొందరానిది, పొందలేనిది ఏమి ఉంటుంది? అంబరీషా! నేను చేసిన అపరాధములను మనసులో పెట్టుకోకుండా, నా ప్రాణాలు కాపాడావు. దయతో నన్ను అనుగ్రహించావు." అని అంబరీషునిస్తుతించాడు.

ఇవేమీ అంబరీషుని చెవికి ఎక్కలేదు. "బ్రాహ్మణోత్తమా! మీరు భోజనం చేయలేదు. భోజన సమయం మించి పోయింది. త్వరగా రండి. తమరికి భోజనం వడ్డిస్తారు. తమరు భోజనం చేసిన తరువాత నేను భోజనం చేస్తాను." అని చెప్పి దుర్వాసునికి షడ్రసోపేతమైన భోజనమును స్వయంగా వడ్డించాడు. తృప్తిగా భోజనము చేసిన దుర్వాసుడు అంబరీషుని కూడా భోజనం చేయమని చెప్పాడు. దుర్వాసుని ఆదేశము ప్రకారము అంబరీషుడు భోజనం చేసాడు. తరువాత దుర్వాసుడు అంబరీషుని ఆశీర్వదించి వెళ్లిపోయాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! దుర్వాసుని చక్రం తరమడం, ఆయన అందరి శరణు వేడటం అంతా ఒక సంవత్సరకాలము పట్టింది. ఈ సంవత్సర కాలము అంబరీషుడు కేవలము జలమును మాత్రమే ఆహారంగా తీసుకుంటూ దుర్వాసుని కొరకు వేచిఉన్నాడు. సంవత్సర కాలము గడిచిన తరువాత దుర్వాసుడు వచ్చిన తరువాత ఆయనకు భోజనము పెట్టి, ఆయన తృప్తిగా భోజనము చేసిన తరువాత,ఆయన అనుజ్ఞతీసుకొన్న తరువాతనే తాను కూడా భుజించాడు.

ఇందులో తన మహిమ ఏమీ లేదనీ, అంతా ఆ శ్రీమన్నారాయణునిమీద తనకు ఉన్న అచంచలమైన భక్తి ప్రభావమే అని తలంచాడు అంబరీషుడు. శ్రీమన్నారాయణుని మీద తనకు ఉన్న భక్తి ముందు బ్రహ్మపదముకూడా నరకముతో సమానమని భావించాడు అంబరీషుడు. ఎల్లప్పుడూ ఆ పరమాత్మయందు భక్తి కలిగి ఉండటం చేత, అంబరీషునికి ప్రాపంచిక విషయములయందు, విషయ వాంఛల యందు ఆసక్తి నశించింది. ఆయన తనకుమారులకు రాజ్యమును పంచిఇచ్చి, తను వానప్రస్థమునకు

వెళ్లిపోయాడు. ఓ పరీక్షిత్ మహారాజా! ఈ అంబరీషోపాఖ్యానమును శ్రద్ధతో చదివినా,వినినా, వారికి భగవంతుని మీద భక్తి సునాయాసంగా లభిస్తుంది. ఆ శ్రీమన్నారాయణుని అనుగ్రహానికి పాత్రులు అవుతారు. తుదకు ఆ పరమాత్మలో ఐక్యం అయిపోతారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుడు అంబరీషోపాఖ్యానమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

నవమస్కంధము

ఆరవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుడు భాగవత కథను ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీకు అంబరీషుని కథ చెప్పానుకదా. అంబరీషునికి విరూపుడు, కేతుమానుడు, శంభువు, అనే పేర్లుగల ముగ్గురు కుమారులు జన్మించారు. వారిలో విరూపునకు పృషదశ్వుడు, పృషదశ్వునకు రథీతరుడు జన్మించారు. వారిలో రథీతరునకు సంతానము లేదు. రథీతరుని భార్య,  అంగిరసుడు అనే ఋషి కరుణ చేత బ్రహ్మతేజం ఉట్టిపడే కుమారులను ప్రసవించింది. వారందరూ అంగిరసుని వీర్యము వలన పుట్టినవారవడంచేత అంగిరస

గోత్రీకులుగా పిలువబడ్డారు. వీరందరూ క్షత్రియ వనితకు, బ్రాహ్మణునికి పుట్టిన వారవడం వలన క్షత్రముతోకూడిన బ్రాహ్మణులుగా పరిగణింపబడ్డారు.

ఓ పరీక్షిత్ మహారాజా! వైవస్వత మనువు కుమారులలో మొదటి వాడు ఇక్ష్వాకువు. ఈ ఇక్ష్వాకువుకు నూరుగురుకుమారులు. వారిలో వికుక్షి, నిమి, దండకుడు అనే ముగ్గురు అందరికన్నా పెద్దవారు. ఇక్ష్వాకువుకు కలిగిన నూరుగురుకుమారులలో ఇరవై ఐదుమంది ఉత్తర భారతము అనగా హిమాలయము నుండి వింధ్యపర్వతముల వరకు కల భూభాగములో ఉన్న వివిధ రాజ్యములకు రాజులు అయ్యారు. దానినే ఆర్యావర్తము అని కూడా పిలుస్తారు. అలాగే భారతదేశపు పడమర ప్రాంతములో ఉన్న రాజ్యములకు అనగా పడమటి సముద్రము వరకు ఉన్న రాజ్యములకు మరో ఇరవై ఐదు మంది రాజులు అయ్యారు. అలాగే తూర్పు సముద్రము వరకు విస్తరించిన ప్రాంతమునకు మరో ఇరవై ఐదు మంది రాజులు అయ్యారు. అలాగే భారత దేశపు మధ్యప్రాంతమునకు పెద్ద వాళ్లు ముగ్గురు రాజులు అయ్యారు. దక్షిణ సముద్రము వరకు విస్తరించిన ప్రాంతములో ఉన్న రాజ్యములకు మిగిలిన ఇరవై రెండు మంది రాజులు అయ్యారు. ఈ విధంగా ఇక్ష్వాకు వంశము భారతదేశము నాలుగు వైపులా విస్తరించింది.

ఓ పరీక్షిత్ మహారాజా! పుష్యమాసము, మాఘమాసము, ఫాల్గుణ మాసము లలో వచ్చు బహుళ అష్టమి తిధులలో పితరులకు శ్రాద్ధకర్మలు చేయవలెను. ఇక్ష్వాకువు తన కుమారుడైన వికుక్షిని పిలిచి శ్రాద్ధమునకు కావలసిన పవిత్రమైన మాంసమును తెమ్మని

ఆదేశించాడు. తండ్రి ఆదేశము ప్రకారము వికుక్షి అడవులకు వెళ్లాడు. శ్రాద్ధమునకు పనికి వచ్చే మృగములను చంపాడు. ఇంతలో మధ్యాహ్నము అయింది. వికుక్షికి ఆకలి వేసింది. అందుకని తాను చంపినమృగములలో ఉన్న ఒక కుందేలు మాంసమును తృప్తిగా భక్షించాడు. తరువాతమిగిలిన మృగములను తీసుకొని వచ్చాడు. వాటిని తన తండ్రి ఇక్ష్వాకువుకు ఇచ్చాడు.

ఇక్ష్వాకువు ఆ మృగములను శ్రాద్ధకర్మలు నిర్వర్తించడానికి తన గురువు అయిన వశిష్ఠుని వద్దకు పంపాడు. వశిష్ఠుడు యోగదృష్టితో జరిగిన విషయం గ్రహించాడు. ఆ మాంసము ఎంగిలిపడ్డదనీ, శ్రాద్ధ కర్మకు పనికిరాదనీ చెప్పాడు. ఆ మాటలు విన్న ఇక్ష్వాకువు కోపంతో మండిపడ్డాడు. అపచారము చేసినందుకు తన కుమారుడు వికుక్షిని దేశమునుండి వెళ్లగొట్టాడు. తరువాత ఇక్ష్వాకువు తన గురువు గారైన వశిష్ఠుని వలన పరమాత్మ తత్త్వమును తెలుసుకొని సన్యాసము పుచ్చుకున్నాడు. తరువాత ఉత్తమలోకములకు వెళ్లిపోయాడు.

తండ్రి చనిపోయాడని తెలుసుకున్న వికుక్షి రాజ్యమునకు తిరిగి వచ్చాడు. తండ్రి స్థానంలో రాజయ్యాడు. ఆయనే శశాదుడు అనే పేరుతో ప్రఖ్యాతి చెందాడు. శశాదుని కుమారుడు పురంజయుడు. ఆయనను ఇంద్రవాహుడు, కకుత్స్థుడు అని కూడా అంటారు. వీళ్లకు ఈపేర్లు ఎలా వచ్చాయో చెబుతాను విను.

పూర్వము దేవతలకు, అసురులకు యుద్ధం జరిగింది అని చెప్పాను కదా! అందులో దేవతలు ఓడిపోయారు. వారందరూ కలిసి శశాదుని కుమారుని వద్దకు వచ్చి ఆయన సహాయం కోరారు. శశాదుని కుమారుడు ఇంద్రుడు తనకు వాహనంగా ఉంటే దానవులతోయుద్ధం చేస్తాను అని అన్నాడు. ఒక మానవుడికి వాహనంగా ఉండటానికి ఇంద్రుడు సిగ్గుపడి అంగీకరించలేదు. కానీ విష్ణువు ప్రోద్బలం వలన ఒప్పుకున్నాడు. ఇంద్రుడు ఒక వృషభముగా మారిపోయాడు. శశాదుని కుమారుడు ఇంద్రుని వాహనంగా చేసుకున్నాడు కాబట్టి ఇంద్రవాహుడు అనిపిలువ బడ్డాడు.

ఇంద్రవాహుడు ధనుర్బాణములను ధరించి, మహావృషభంగా మారిన ఇంద్రునిమీద ఎక్కి దాని మూపురముమీద కూర్చున్నాడు. వృషభము మూపురము మీద కూర్చున్నాడు కాబట్టి కకుత్థ్సుడు అనిపిలువబడ్డాడు. తరువాత ఇంద్రవాహుడు దేవతాగణములతో పడమటి దిక్కున ఉన్న దైత్యపురమును చుట్టుముట్టాడు. దేవతలకు దానవులకు భయంకరమైన యుద్ధము జరిగింది. ఆ యుద్ధంలో ఇంద్రవాహుడు దైత్యులను సమూలంగా నాశనం చేసాడు. ఇంద్రవాహుడి పరాక్రమానికి తట్టుకోలేక చావగామిగిలిన దైత్యులు అందరూ పాతాళలోకానికి పారిపోయారు. తరువాత ఇంద్రవాహుడు దైత్యుల పురములను ఇంద్రుడికి స్వాధీనం చేసాడు. దైత్యుల పురములను జయించాడు కాబట్టి ఇంద్రవాహునకు పురంజయుడు అనే పేరువచ్చింది.

ఈ పురంజయుని కుమారుడు అనేనుడు. అనేనుని కుమారుడు పృథువు. పృథువు కుమారుడు విశ్వరంధి. విశ్వరంధి

కుమారుడు చంద్రుడు. చంద్రుని కుమారుడు యువనాశ్వుడు. యువనాశ్వుని కుమారుడు కువలయాశ్వుడు.

ఈ కువలయాశ్వునకు ఇరవైఒక్కవేలమంది కుమారులు. కువలయాశ్వుడు తన కుమారులతో కలిసి దుంధుడు అనే రాక్షసుని చంపాడు. ఆ కారణం చేత కువలయాశ్వునికి దుంధుమారుడు అనే పేరు వచ్చింది. కాని కువలయాశ్వుని కుమారులు అందరూ దుంధువు యొక్క కోపాగ్నికి భస్మం అయ్యారు. కేవలం ధృడాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అనే ముగ్గురు మాత్రంమిగిలారు.

వారిలో ధృడాశ్వుని కుమారుడు హర్యశ్వుడు. హర్యశ్వుని కుమారుడు నికుంభుడు. నికుంభునికి బహులాశ్వుడు, కృతాశ్వుడు అనే కుమారులు కలిగారు. వారిలో కృశాశ్వుని కుమారుడు సేనజిత్తు. సేనజిత్తు కుమారుడు

యువనాశ్వుడు. యువనాశ్వునికి నూరుగురు భార్యలు ఉన్నారు కానీ వారిలో ఒక్కరికికూడా సంతానము లేదు. యువనాశ్వుడు సంతానము కొరకు ఒక యజ్ఞం చేసాడు. దానిపేరు ఇంద్రదైవతము. ఋషులు ఆ యజ్ఞం చేయిస్తున్నారు. యజ్ఞం పూర్తి అయింది. మంత్రజలం సిద్ధం అయింది. మరునాడు ఆ మంత్రజలమును రాణులు సేవిస్తే వారికిసంతానము కలుగుతారు. ఆరోజు రాత్రి ఋత్విక్కులు మంత్రజలమును యజ్ఞకుండము దగ్గర ఒకపాత్రలో ఉంచి నిద్రపోయారు. అక్కడే ఒకపక్క యువనాశ్వుడు కూడా నిద్రపోతున్నాడు.

అర్థ రాత్రి యువనాశ్వునికి దాహం వేసింది. . నిద్రమత్తులో అతడు నీటి కోసం చూచాడు. యజ్ఞకుండము దగ్గర పెట్టిన మంత్రజలము ఉన్న పాత్ర కనపడింది. అదిమామూలు నీరు అనుకొని యువనాశ్వుడు ఆ నీటిని తాగాడు.

మరునాడు ఋత్విక్కులు నిద్ర లేచారు. మంత్రజలము కనపడలేదు. మంత్రజలము ఎవరు తాగారు అని అడిగారు. యువనాశ్వుడు ఆ మంత్రజలమును మామూలు నీరు అనుకొని తాగాను అని చెప్పాడు. మానవుడు ఒకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తుంది. మానవ బలం కన్నా దైవబలం ఎంతోగొప్పది అనుకుంటూ ఋత్విక్కులు ఈశ్వరునకు నమస్కరించారు.

ఆమంత్రజల ప్రభావంతో యువనాశ్వునకు గర్భం వచ్చింది. తొమ్మిది నెలలు నిండాయి. కడుపులో ఉన్న బిడ్డ బయటకు వచ్చే మార్గము లేదు. అందుకని పొట్ట చీల్చి పొట్ట కుడి పక్కనుండి బిడ్డను బయటకు తీసారు. (నేడు చేస్తున్న పెద్ద ఆపరేషన్ లాంటిదేమో!)

ఆ ప్రకారంగా యువనాశ్వునకు ఒక కుమారుడు జన్మించాడు. బిడ్డ పుట్టగానే పాలకు ఏడిచాడు. యువనాశ్వుడు మగవాడు అవడం వలన స్తనములు లేవు. బిడ్డకు పాలు ఇవ్వలేడు. కాని బిడ్డ ఏడుస్తున్నాడు. పాలు ఎవరు ఇస్తారు అని అందరూ కంగారు పడుతున్నారు. ఆ యజ్ఞము ఇంద్రుని గురించి చేసారు కాబట్టి ఇంద్రుడు అక్కడకు వచ్చాడు. బిడ్డ పాల కోసరం ఏడవడం చూచి తన చూపుడు వేలిని బిడ్డ నోటిలో పెట్టాడు. ఆ వేలి నుండిఅమృతము స్రవించింది. ఆ అమృతమును తాగాడు ఆ శిశువు. ఆ శిశువు పేరు

మాంధాత. (నేను నీకు తల్లి మాదిరి పాలు ఇస్తాను అని ఇంద్రుడు అనడం వలన ఆ శిశువునకు మాంధాత (మాం-- ధాత)అనే పేరు వచ్చింది.)

మాంధాతకు త్రసదస్యుడు అని కూడా పేరు ఉంది. త్రసదస్యుడు అంటే రాక్షసులను సంహరించేవాడు అని అర్థం. మాంధాత సప్తద్వీపములతో కూడిన ఈ  భూమిని అంతా పరిపాలించాడు. మాంధాత విష్ణుభక్తుడు. ఆయన ఎన్నో యజ్ఞములు,యాగములు చేసాడు. బ్రాహ్మణులకు ధనము, బంగారము, భూములు దానంగాఇచ్చాడు. సూర్యుని వెలుగు ఎంతమేర పడుతుందో అంతమేర భూమిని మాంధాత పాలించాడు. (రవిఅస్తమించని బ్రిటిషు సామ్రాజ్యము అని అంటారు కదా! అలాంటిదే మాంధాత సామ్రాజ్యము.)

మాంధాత భార్య పేరు బిందుమతి. వారికి పురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడు, అనే పేరుగల ముగ్గురు కుమారులు ఉన్నారు. మాంధాతకు యాభై మంది కుమార్తెలు. ఆ యాభై మంది సౌభరి అనే వాడిని వివాహం చేసుకున్నారు. అది ఎలా జరిగిందంటే.......

సౌభరి అనే మహాముని ఉండేవాడు. ఒక నాడు ఆయన యమునా నదిలో దిగి జలస్తంభన విద్యలో నీటి అడుగున తపస్సు చేసుకుంటున్నాడు.  ఆసమయంలో అతనికి నీటిలో ఒక మగ చేప, ఒక ఆడ చేప మైధున క్రియలో ఆనందం అనుభవించడం కనిపించింది. అప్పటి దాకా బ్రహ్మచారిగా ఉన్న సౌభరికి ఆ చేపలను

చూచి తను కూడా వివాహం చేసుకోవాలని మైథున సుఖం అనుభవించాలని  కోరిక పుట్టింది.

మాంధాతకు యాభైమంది కుమార్తెలు ఉన్నారని తెలుసుకొని, సౌభరి మాంధాత వద్దకు పోయి, వారిలో ఒక కుమార్తెను తనకు ఇచ్చి వివాహం చేయమని కోరాడు. అప్పటికే సౌభరి బాగా ముసలి వాడు. చర్మం అంతా ముడతలు పడిపోయింది. వెంట్రుకలు అన్నీ తెల్లగా మెరుస్తున్నాయి.  అందుకని మాంధాత సౌభరితో ఇలా అన్నాడు. “నాకు యాభై మంది కుమార్తెలుఉన్నారు. వారిలో ఎవరన్నా నిన్ను చూచి వరిస్తే, నిన్ను వారికి ఇచ్చి వివాహం చేస్తాను.” అని అన్నాడు.

మాంధాత మాటల్లోని ఆంతర్యాన్ని గ్రహించాడు సౌభరి. “తాను ముసలివాడు. తల వెంట్రుకలు తెల్లపడ్డాయి. చర్మం అంతా ముడతలుపడింది. తలకూడా వణుకుతూ ఉంది. పైగా నాకు తపస్సు తప్ప మరేమీ తెలియదు. తనను ఏ స్త్రీకూడా వరించదు. ఆ కారణం చేత ఈ రాజు తన కుమార్తెలను నాకు ఇవ్వడానికి ఇష్టపడటం లేదు. దీనికి నేను ప్రతిక్రియ చేస్తాను. ఈ రాచకన్యలే కాదు--- అప్సరసలు కూడా నన్ను చూచి మోహించేటట్టు సుందరమైన రూపం ధరిస్తాను.” అని అనుకున్నాడు సౌభరి. తపస్సమాధిలోకూర్చున్నాడు. తన తపోబలం చేత నవయువ్వనుడుగా, సుందరాంగుడుగా, అందగాడుగా మారిపోయాడు.

మరలా మాంధాత వద్దకు వెళ్లి కన్యను ఇమ్మని అడిగాడు. సౌభరిని అంత:పురములోకి ఆహ్వానించాడు మాంధాత. తన

కుమార్తెలను చూపించాడు. నవయువ్వనుడు, అందగాడు అయిన సౌభరిని చూచి "ఈయన నాకు కావాలి అంటే నాకు కావాలి" అని మాంధాత కుమార్తెలు అందరూ పోటీపడ్డారు. చేసేది లేక సౌభరి ఆ యాభైమందిని వివాహం చేసుకున్నాడు.

తన తపోబలంతో ఉండటానికి అందమైన భవనములు, విహరించడానికి ఉద్యానవనములు, జలకాలాటలకు సరోవరములు, సేవలు చేయడానికి దాసదాసీజనములు, ఆసనములు, శయ్యలు, వస్త్రములు, ఆభరణములు అన్నీ తన తపఃప్రభావంతో కల్పించాడు. తన యాభైమంది భార్యలతో సకల సుఖాలు అనుభవించాడు. ఇన్ని సుఖములు అనుభవిస్తున్నా, అతనిలోని కామ సంబంధమైన కోరికలు చల్లారలేదు. అతని మనసుకు తృప్తి, శాంతి కలగలేదు.

ఇదంతా ఎందుకు జరిగిందని ఆలోచించాడు. "బయట ప్రపంచంలో తపస్సు చేసుకుంటే ఏకాగ్రత కుదరదని, నీటి లోపల కూర్చుని తపస్సు చేసుకొంటున్న నాకు ఆచేపలయొక్క మైధున క్రియ చూడటంవలననే కదా ఈ సంసార బంధనము కలిగింది. సాధుజనుల సాంగత్యంలో తపస్సు చేసుకుంటున్న నేను ఈ చేపల మైథున క్రియ చూడటం వలన భ్రష్టుడనయ్యాను. మోక్షం కోరుకునేవాడు, సంసారంలో ఉన్న వారి మైధున క్రియలు చూడకూడదు. వాటికి లోబడకూడదు. మైధునక్రియ గురించి తలపకూడదు. ఇంద్రియములను, మనస్సును నిగ్రహించుకోవాలి. మనుషులమధ్య ఉండకూడదు. ఏకాంతంలో ఉండాలి. ఎల్లప్పుడూ శ్రీహరిని మనసులో నిలుపుకోవాలి. ఇతర చింతనలుపనికిరాదు.

తనలాంటి సర్వసంగ పరిత్యాగుల స్నేహము మాత్రమే చేయాలి.

నేను మొట్ట మొదటినుండి తపస్సు చేసుకుంటున్నాను. కానీ ఆ రోజు దురదృష్టవశాత్తు ఆ చేపల రతికార్యము చూచాను. పెళ్లిచేసుకోవాలని అనుకున్నాను. దానికోసరం యవ్వనవంతుడ నయ్యాను. ఒకరు కాదు, ఇద్దరు కాదు ఏకంగా యాభైమందికి భర్తను అయ్యాను. ఒక్కొక్కభార్యకు నూరుమంది పుత్రులను కన్నాను. ఇప్పుడు నాకు యాభై మంది భార్యలు, ఐదు వేల మంది సంతానము. ఇదంతా నేను ఆ మత్స్యముల మైథున క్రియ చూడటంవలనజరిగింది. నన్ను కామము అనే మాయ ఆవహించింది. దానితో నాలోని జ్ఞానము, వివేకము నశించిపోయాయి. విషయవాంఛలకు లోనయ్యాను. ఎంత అనుభవించినా, అగ్నిలో నెయ్యి పోస్తే మండినట్టు, నా లోని కోరికలు రోజురోజుకూ పెరుగుతున్నాయి కాని తరగడంలేదు." అని సౌభరి తనలో తాను మథనపడ్డాడు.

ఈ ప్రకారంగా ఆలోచించిన సౌభరి వానప్రస్థమునకువెళ్లాడు. ఆయన యాభై మంది భార్యలుకూడా ఆయన వెంట వనములకు వెళ్లారు. సౌభరి మరలా తపస్సుచేయడం మొదలు పెట్టాడు.చివరకు పరమాత్మలో లీనం అయ్యాడు. ఆయన భార్యలుకూడా భర్తతో కూడా ఉత్తమ లోకములకు వెళ్లారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు మాంధాత, సౌభరి వృత్తాంతములను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(ఈ సందర్భంలో చిన్న మాట. ఇటీవల టీవి9 వాళ్లు ఒక కార్యక్రమం చేపట్టారు. భారత దేశంలోకి ఇంటర్‌నెట్ ద్వారా  పోర్నో సైట్స్ రాకుండా అడ్డుకోవాలని. ఇది మంచి ఆలోచన. సౌభరి లాంటి మహాఋషి కేవలం చేపల మైధున క్రియ చూడ్డం వలన పతనమయ్యాడు. మరి ఈ నాటి బాలురు, యువత ఇంటర్‌నెట్‌లో రకరకాలైన బూతు (సాహిత్యం,దృశ్యం) చూస్తున్నారు. అందుకే వయసుతో సంబంధం లేకుండా తరచుగా  మానభంగాలు జరుగుతున్నాయి.

దృశ్యం మనసుకు తొందరగా హత్తుకుంటుంది. సౌభరి లాంటి వాడు చేపల మైథున క్రియ చూచి ఆ సుఖం అనుభవించాలనుకున్నాడు. అలాంటి దృశ్యాలు చూస్తున్న  నేటియువత కూడా ఆ మోహంలో  పడటంలో ఆశ్చర్యంలేదు. దానికి విరుగుడు ఒకటే.  ఇంటర్‌నెట్ కేవలం విజ్ఞానానికి వినోదానికే కానీ, సమాజవినాశనానికి కాదు అన్నసత్యం అందరూతెలుసుకోవాలి. అటువంటి సైట్లు యువత, బాలురు చూడకుకండా నిషేధించాలి.)

# శ్రీమద్భాగవతము
## నవమస్కంధము
## ఏడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు హరిశ్చంద్రుడు, త్రిశంకు మహారాజుల చరిత్రను ఈ విధంగా వినిపిస్తున్నాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! నీకు ఇంతకు ముందు అంబరీషుని కథ చెప్పానుకదా! ఆ అంబరీషుడు ఎవరో కాదు. అంబరీషుడు ఈ మాంధాత కుమారుడు. మాంధాత కుమారుడైన అంబరీషుని, మాంధాత తండ్రి, అంబరీషుని తాతగారైన యువనాశ్వుడు దత్తపుత్రునిగా స్వీకరించాడు. అందువల్ల అంబరీషుడు యువనాశ్వుని దత్తపుత్రుడు.

యువనాశ్వుని కుమారుడు యౌవనాశ్వుడు అంటారు. యౌవనాశ్వుని కుమారుడు హారీతుడు. ఈ ముగ్గురు మాంధాత గోత్రములో ముఖ్యమైన వారు.

(హరిత గోత్రము వీరి వలననే ఏర్పడి ఉండవచ్చు. . హరిత గోత్రీకుల ప్రవర... హారీత,అంబరీష,యౌవనాశ్వ త్రియాఋషేయ ప్రవరాన్విత.. హరిత గోత్రోద్భవస్య.... అని చదువడం మనం వింటుంటాము.)

మాంధాత పెద్ద కుమారుని పేరు పురుకుత్సుడు అని చెప్పాను కదా. పురుకుత్సుడు నర్మద అనే నాగకన్యను వివాహం చేసుకున్నాడు. పురుకుత్సుడు, నర్మద వాసుకి ప్రోద్బలంతో పాతాళంలో కాపురం పెట్టారు. పురుకుత్సుడు విష్ణుభక్తుడు. పురుకుత్సుడు పాతాళంలో ఉన్న గంధర్వులను యుద్ధంచేసి ఓడించాడు.

గంధర్వులందరినీ చంపాడు. గంధర్వుల బారి నుండి నాగులను రక్షించాడు. దానికి ప్రతిఫలంగా నాగులు, పురుకుత్సుని స్మరించినవారికి సర్వభయం లేకుండా వరంఇచ్చారు.

పురుకుత్సుని కుమారుడు త్రసద్ధస్యుడు. ఇతని కుమారుడు అనరణ్యుడు. అనరణ్యుని కుమారుడు హర్యశ్వుడు. హర్యశ్వునకు అరుణుడు కుమారుడుగా జన్మించాడు. అరుణుని కుమారుడు త్రిబంధనుడు. ఈ త్రిబంధనుని కుమారుడు సత్యవ్రతుడు. ఇతనినే త్రిశంకుడు అని కూడా పిలుస్తారు.

ఈ త్రిశంకువు ఒక బ్రాహ్మణ కన్యను అపహరించాడు. త్రిశంకుని తండ్రి దానికి కోపించి త్రిశంకునికి ఛండాలత్వము కలుగునట్లు శపించాడు. ఛండాలత్వము పొందిన త్రిశంకునికి శరీరంతో పాటు స్వర్గానికి వెళ్లాలని కోరిక కలిగింది. ఆ కోరికను విశ్వామిత్రుడు నెరవేర్చాడు. త్రిశంకుడు ఈ శరీరంతోటి స్వర్గంలో అడుగుపెట్టాడు. కానీ దేవతలు త్రిశంకుని అడ్డగించారు. త్రిశంకుని కిందికి తోసేసారు. త్రిశంకుడు తల్లకిందులుగా భూమి మీదికి పడిపోతుంటే విశ్వామిత్రుడు మధ్యలో ఆపుచేసాడు. త్రిశంకుని కోసరం స్వర్గానికి భూమికి మధ్యలో ఒక స్వర్గమును సృష్టించాడు. దానికి త్రిశంకుని అధిపతిగా చేసాడు. దానినే త్రిశంకు స్వర్గము అంటారు. (అటు ఇటుకాకుండా ఉన్న పరిస్తితులను త్రిశంకుస్వర్గము అని అనడంపరిపాటి.)

ఈ త్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు. ఈ హరిశ్చంద్రుని గురించి విశ్వామిత్రునికి వశిష్టునికి తగాదా ఏర్పడింది.

(దానికి ఒక కథ చెబుతారు. అదేమిటంటే.....ఒక సారి హరిశ్చంద్రుడు రాజసూయ యాగం చేస్తున్నాడు. ఆ యాగంలో విశ్వామిత్రుడు దక్షిణల రూపంలో హరిశ్చంద్రుని వద్దనుండి ధనంఅంతా లాక్కున్నాడు. హరిశ్చంద్రునికి చెప్పలేని కష్టములను కలిగించాడు. ఇది తెలుసుకొన్న వశిష్టుడు విశ్వామిత్రుని పక్షివి కమ్మని శపించాడు. విశ్వామిత్రుడు కూడా వశిష్టుని కొంగవు అగుదువుగాక! అని శపించాడు. పక్షి, కొంగ రూపములలో ఉన్న విశ్వామిత్రుడు, వశిష్టుడు చాలాకాలము కొట్టుకున్నారు.)

ఈ హరిశ్చంద్రునికి సంతానము లేదు. నారదుడు వచ్చి హరిశ్చంద్రుని వరుణుని వద్దకు పంపాడు. హరిశ్చంద్రుడు వరుణుని వద్దకు పోయి "నాకు సంతానము లేరు. నాకు పుత్ర సంతానము కలిగితే, ఆ కుమారుడిని నేను చేయబోయే యజ్ఞములో యజ్ఞపశు వుగా చేసి వధిస్తాను." అని వేడుకున్నాడు. వరుణుడు సరే అన్నాడు.

తరువాత హరిశ్చంద్రునికి రోహితుడు అనే కుమారుడు కలిగాడు. పుత్రుడు కలిగిన వెంటనే వరుణుడు హరిశ్చంద్రుని వద్దకు వచ్చి "నీకు కొడుకుపుట్టాడు కదా! ఎప్పుడు యజ్ఞ చేసి వాడిని బలి ఇస్తావు." అని అడిగాడు. "ఇప్పుడేగా పుట్టాడు. ఇంకా పళ్లుకూడా రాలేదు. పళ్లు రాగానే బలి ఇస్తాను." అని అన్నాడు హరిశ్చంద్రుడు. సరే అని వరుణుడు వెళ్లిపోయాడు.

రోహితుడికి పళ్లు రాగానే వచ్చాడు వరుణుడు. "ఓ హరిశ్చంద్రా! నీ కొడుక్కు దంతాలు వచ్చాయి కదా! ఎప్పుడు యజ్ఞం చేసి నీ కొడుకును బలి పశువుగాచంపుతావు." అని అడిగాడు. "వరుణ దేవా! అవిపాలపళ్లు. పాలపళ్లు ఊడి అసలు దంతములు రాగానే యజ్ఞ చేస్తాను." అని అన్నాడు హరిశ్చంద్రుడు. సరే అని వరుణుడు వెళ్లిపోయాడు.

హరిశ్చంద్రుని కుమారునికి పాల పళ్లు పోయి మంచి పళ్లు వచ్చాయి.మరలా వరుణుడు వచ్చి కుమారుని బలిపశువుగా ఇమ్మని అడిగాడు. "ఇప్పుడేగా కుమారుడు పెద్దవాడవుతున్నాడు. వాడు కత్తి పట్టి యుద్ధం చేస్తుంటే చూడాలని ఉంది. అప్పుడు వాడు పవిత్రుడు అవుతాడు. అప్పుడు బలి ఇస్తాను." అని అన్నాడు. సరే అని వరుణుడు వెళ్లిపోయాడు.

హరిశ్చంద్రునికి కుమారుని మీద ప్రేమ రోజురోజుకూ ఎక్కువ అవుతూ ఉంది. తన కుమారుని యజ్ఞపశువుగా బలి ఇవ్వకుండా ఎలా తప్పించుకోవాలా అని ఆలోచిస్తున్నాడు. వరుణుడు వచ్చినప్పుడల్లా ఏదో ఒక సాకు చెప్పి వరుణుని పంపుతున్నాడు. ఇదంతా హరిశ్చంద్రుని కుమారుడు రోహితుడు గమనిస్తున్నాడు. తన తండ్రి హరిశ్చంద్రుడు తనను ఎప్పటికన్నా యజ్ఞపశువుగా బలి ఇస్తాడు అని తెలిసి, రోహితుడు ఇంటి నుండి పారిపోయాడు. ఒక సంవత్సరం పాటు అక్కడా ఇక్కడా తిరిగాడు.

ఇంతలో వరుణునికి ఇచ్చిన మాట తప్పడంతో హరిశ్చంద్రునికి పొట్ట ఉబ్బరించింది. జలోదరము అనే వ్యాధి వచ్చింది. ఇదితెలిసిన రోహితుడు ఇంటికి పోయి తండ్రిని చూడాలని అనుకున్నాడు. మధ్యలో ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో రోహితుని వద్దకు వచ్చాడు. పుణ్యక్షేత్రములను దర్శిస్తే తండ్రి రోగము తగ్గుతుంది అని చెప్పాడు. ఇంద్రుని మాటలు విని రోహితుడు తీర్థయాత్రలకు వెళ్లాడు.

కాలం గడుస్తూ ఉంది. ఎప్పుడు రోహితుడు తండ్రివద్దకు వెళదామని అనుకున్నా, ఇంద్రుడు వచ్చి ఏదో ఒక మాట చెప్పి రోహితుని తండ్రివద్దకు పోకుండా ఆపుతున్నాడు.ఈ ప్రకారంగా ఐదు సార్లు ఇంద్రుడు రోహితుని తండ్రి వద్దకుపోకుండా ఆపాడు. ఆరవ సంవత్సరంలో రోహితుడు ఇంద్రుని మాట వినకుండా ఇంటికి తిరిగి వచ్చాడు. తన తండ్రి వరుణునికి ఇచ్చిన మాట నిలబెట్టాలని నిశ్చయించుకున్నాడు. తనకు బదులు మరొక బ్రాహ్మణ కుమారుని యజ్ఞపశువుగా బలి ఇవ్వాలని అనుకున్నాడు.

అజీగర్తుడు అనే బ్రాహ్మణుడు ఉన్నాడు. ఆయనకు ముగ్గురు కుమారులు. అజీగర్తుని వద్దనుండి ఆయన రెండవ కుమారుడైన శునశ్శేపుడు అనే బ్రాహ్మణబాలకుడిని ధనం ఇచ్చి కొన్నాడు. శునశ్శేపుని తండ్రికి ఇచ్చి, వరుణుడికి ఇచ్చిన మాట ప్రకారము యజ్ఞము చేసి శునశ్శేపుని బలిఇవ్వమని చెప్పాడు. ఆమాటలకు హరిశ్చంద్రుడు సంతోషించాడు.

హరిశ్చంద్రుడు వెంటనే యజ్ఞం మొదలు పెట్టాడు. వరుణుడుమొదలగు దేవతలను ఆరాధించాడు. హరిశ్చంద్రుడు మాట

నిలబెట్టుకున్నాడు కాబట్టి, ఆయనకు వచ్చిన జలోదర వ్యాధిని పోగొట్టాడు వరుణుడు. ఆయజ్ఞము పేరు పురుష మేధము. ఆ యజ్ఞమునకు విశ్వామిత్రుడు హెూత. జమదగ్ని ఆధ్వర్యువు. వశిష్టుడు బ్రహ్మ. ఆయాస్యుడు ఉద్గాత.
(శునశ్శేపుని విశ్వామిత్రుడు రక్షించాడు అని వేరేచోట చెప్పబడింది. ఆ శునశ్శేపుడే ఋగ్వేదములో కొన్ని సూక్తములు రచించాడు.)

ఆ యాగమునకు సంతోషించి ఇంద్రుడు హరిశ్చంద్రునికి ఒక బంగారు రథమును బహూకరించాడు. అప్పటి నుండి హరిశ్చంద్రుడు ఆడిన మాట తప్ప కుండా సత్యము పలకడమే వ్రతంగా జీవితం గడిపాడు. హరిశ్చంద్రుని సత్యసంధతకు, ధైర్యమునకు మెచ్చుకొని విశ్వామిత్రుడు హరిశ్చంద్రునకు అక్షయ జ్ఞానమును ప్రసాదించాడు. తరువాత హరిశ్చంద్రుడు తపస్సు చేసాడు. ఆత్మజ్ఞానమును పొందాడు. అతనిలో ఉన్న అజ్ఞానము నశించింది. పరమాత్మలో ఐక్యం అయ్యాడు.

(మనకు ప్రచారంలో ఉన్న సత్య హరిశ్చంద్రుని కథకు ఈ కథకు ఎక్కడాపోలిక లేదు కదూ! పైగా వరుణుడికి ఇచ్చిన మాటను హరిశ్చంద్రుడు ఎన్నోసార్లు తప్పినట్టు ఉంది. ఇక్కడ హరిశ్చంద్రుని కుమారుడి పేరు రోహితుడు. నాటకంలో లోహితుడులేక లోహితాస్యుడు. ఆఖరు శ్లోకంలో అంటే "సత్య సారం ధృతిం దృష్ట్వా సభార్యస్య సభూపతే । విశ్వామిత్రో భృశం ప్రీతో దదావ విహితం గతిమ్॥" అంటే హరిశ్రంద్రుని యొక్క, అతని భార్య యొక్క సత్యసంధత, ధైర్యమును చూచి విశ్వామిత్రుడు ఎంతో సంతోషించాడు అని ఉంది.

సత్యహరిశ్చంద్ర నాటకం రాయడానికి బహుశా ఈ శ్లోకం ప్రేరణ కావచ్చు. ఇప్పటి దాకా హరిశ్చంద్రుని భార్యపేరు మనకు తెలియదు. ఎక్కడా చెప్పబడలేదు. ఇక్కడ మాత్రమే హరిశ్చంద్రుని భార్య ప్రస్తావన వచ్చింది. వరుణుడికి ఇచ్చిన మాట తప్పిన హరిశ్చంద్రుడు సత్యసంధుడు ఎలా అయ్యాడో ఇక్కడ చెప్పలేదు. ఒకసారి వరుణుడికి ఇచ్చిన మాటతప్పి జలోదరము అనే వ్యాధితో బాధ పడ్డాడు.  తుదకు కుమారుని వలననే ఆ వ్యాధి నుండి విముక్తి పొందాడు కాబట్టి, హరిశ్చంద్రుడు మిగిలిన జీవితం అంతా సత్యసంధతను పాటించి ఉండవచ్చు . ఇలా అర్థం చేసుకుంటే,  సత్యహరిశ్చంద్రుడు అనే మాట సరిపోతుంది.)

శ్రీమద్భాగవతము
నవమస్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
నవమస్కంధము
ఎనిమిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! హరిశ్చంద్రుని కుమారుడు రోహితుడు అని చెప్పాను కదా. ఆ రోహితుని కుమారుడు హరితుడు. హరితుని కుమారుడు చంపుడు. ఈ చంపుని పేరుతోనే చంపాపురము అనే పురము నిర్మింపబడింది. చంపునకు సుదేవుడు జన్మించాడు. సుదేవుని కుమారుడు విజయుడు. విజయుని

కుమారుడు భరూకుడు. భరూకుని కుమారుడు వృకుడు. వృకుని కుమారుడు బాహుకుడు.

బాహుకుని రాజ్యము శత్రువుల వశము అయింది. అతడు తన భార్యతో కలిసి అడవులకు వెళ్లిపోయాడు. వృద్ధాప్యముతో బాహుకుడు మరణించాడు. బాహుకుని భార్య భర్తతో సహగమనము చేయడానికి నిశ్చయించింది. కాని ఆ సమయానికి ఆమె గర్భవతి. ఆ కారణంచేత ఔర్వుడు అనే ముని ఆమె సహగమన ప్రయత్నమును ఆపుచేసాడు. ఆమె నగరానికి తిరిగి వచ్చింది.

కాని ఆమె సవతులు ఆమె గర్భవతి కావడం ఓర్వలేకపోయారు. ఆమె తినే అన్నములో విషం కలిపారు. ఆమె కడుపులో ఉన్న బిడ్డ ఆ విషమును కూడా జీర్ణించుకున్నాడు. నవమాసాలు నిండిన తరువాత ఆమెకు పుత్రుడు జన్మించాడు. ఆ పుత్రుడే సగరుడు. (విషముతో కూడా పుట్టినవాడు). ఆ సగరుడు చక్రవర్తి అయ్యాడు. ఈ భూమండలమును అంతా పరిపాలించాడు. ఆ సగరుని కుమారుల వలననే సముద్రము తవ్వబడింది. అందుకే సముద్రమునకు సాగరము అనే పేరు వచ్చింది.

అది ఎలా జరిగిందంటే..... సగరుని గురువుగారి పేరు ఔర్వుడు. ఆయన చెప్పిన మాట ప్రకారము సగరుడు తాలజంఘులను, శకులను, హైహయులను, బర్బరులను యుద్ధంలో ఓడించాడు కాని చంపలేదు. వారిని చంపకుండా వారికి తలలు, మీసములు గొరిగాడు. కొందరి వస్త్రములు ఊడదీసాడు. వారికి కప్పుకోడానికి మాత్రమే వస్త్రములు ఇచ్చాడు. మరికొందరికి వస్త్రములు కట్టుకోడానికి మాత్రమే

అనుమతించాడు.

సగరుడు అశ్వమేధ యాగము చేసాడు. యాగాశ్వముగా ఒక ఉత్తమ జాతి అశ్వమును విడిచిపెట్టాడు. ఆ అశ్వమును ఇంద్రుడు అపహరించాడు. ఆ సగరునకు కేశిని, సుమతి అనే ఇద్దరు భార్యలు. సుమతికి 60,000 మంది కుమారులు. వారందరూ  ఆ అశ్వమును వెదుకుతూ బయలుదేరారు. వారికి అశ్వము ఎక్కడా కనిపించలేదు. భూమిని తవ్వనారంభించారు.

అలా తవ్వుతూ తవ్వుతూ, ఈశాన్య దిక్కున కపిల మహర్షి తపస్సుచేసుకుంటున్న చోటికి వెళ్లారు. కపిల మహర్షి సమీపంలో అశ్వము కనిపించింది. ఆ సమయంలో వారి బుద్ధి మందగించి కపిలుడే అశ్వమును అపహరించాడు అని వారు అనుమానించేటట్టు చేసాడు ఇంద్రుడు. ఇంద్రుని మాయకు లోబడ్డ 60,000 మంది సగరుని కుమారులు కపిల మహర్షిని చూచి . "ఇతడు దొంగ సన్యాసి. అశ్వమును అపహరించి ఏమీ తెలియనట్టు కళ్లుమూసుకొని కూర్చుని ఉన్నాడు. వీడిని కొట్టండి, చంపండి, నరకండి" అంటూ కపిల మహాముని మీదికి వెళ్లారు. కపిల మహర్షి కళ్లు తెరవ లేదు. కాని సగరకుమారులు భస్మం అయ్యారు.

ఓ పరీక్షిత్ మహారాజా! కపిల మహర్షి కళ్లలోనుండి పుట్టిన అగ్ని వలన సగరకుమారులు భస్మం అయ్యారు అని కొందరు చెబుతారు. కాని అది నిజం కాదు. కపిలమహర్షి శుద్ధసత్వగుణ సంపన్నుడు. సాక్షాత్తు విష్ణు అంశతో పుట్టినవాడు. లోకములో సాంఖ్యయోగమును వ్యాప్తిచేసినవాడు. మరి తమోగుణ ప్రధానమైన

కోపము కపిలుని ఎందుకు ఆవహిస్తుంది? కపిలునికి వీళ్లు మిత్రులు, వీళ్లు శత్రువులు అనే భేదభావము ఎందుకుంటుంది? కాబట్టి కపిలుని కోపానికి సగరుని కుమారులు భస్మం అయ్యారు అని అనడం అంత సమంజసం కాదు. ఒక సత్వగుణ సంపన్నుడికి అపకారం తలపెట్టడమే వారి చావుకు కారణం అయింది అని నాభావన.

ఓ పరీక్షిత్ మహారాజా! సగరునికి కేశిని అనే భార్యద్వారా అసమంజసుడు అనే కుమారుడు కలిగాడు. ఇతడు పూర్వజన్మలో ఒక మహాయోగి. ఆ జన్మలో దుర్జనుల సాంగత్యము వలన భ్రష్టుడయ్యాడు. సగరుడికి కుమారుడుగా అసమంజసుడు అనే పేరుతో జన్మించాడు. అసమంజసుడికి పూర్వజన్మ స్మృతి ఉంది. ఎలాగైనా ఈ సంసార లంపటం నుండి బయటపడాలని అనుకున్నాడు. తండ్రికి తన మీద విరక్తి కలిగేటట్టు చేసి, దేశంవిడిచి వెళ్లాలని అనుకున్నాడు.

ఆ కారణంగా, అసమంజసుడు దుర్మార్గంగా ప్రవర్తించేవాడు. ప్రజలను హింసించేవాడు. తనతో ఆడుకునే బాలురను సరయూనదిలో పడేసి చంపేవాడు. ఈ అసమంజసుని ఆగడములు భరించలేక ప్రజలు సగరునికి మొరపెట్టుకున్నారు. సగరుడు తన కుమారుడు అసమంజసుని దేశంవిడిచి వెళ్లిపొమ్మన్నాడు. తన కోర్కె నెరవేరింది అనుకున్నాడు అసమంజసుడు. పూర్వజన్మలో తాను సంపాదించిన యోగశక్తి చేత సరయూ నదిలో తాను పడవేసి చంపిన బాలురను అందరినీ మరలా బతికించాడు. ఎవరి పిల్లలను వారికి అప్పగించాడు. తండ్రివద్ద సెలవు తీసుకొని అడవులకు వెళ్లిపోయాడు. అసలు విషయం తెలుసుకున్న సగరుడు, రాజ్యంలోని ప్రజలు, అసమంజసుని అపార్థం

చేసుకున్నందుకు  ఎంతో బాధ పడ్డారు.

అసమంజసుని కుమారుని పేరు అంశుమంతుడు. ఇతడు సత్ ప్రవర్తన కలవాడు. తాతగారైన సగరుని ఆదేశము మేరకు యాగాశ్వమును వెదకడానికి బయలేదేరాడు. తన పినతండ్రులు భస్మం అయిన చోటుకు చేరుకున్నాడు. అక్కడే యాగాశ్వము ఉంది. సమీపంలో కపిల మహర్షి తపస్సు చేసుకుంటున్నాడు. కపిల మహర్షిని చూచిన అంశుమంతుడు అతనికి భక్తితో నమస్కరించాడు. కపిలుని ఈ ప్రకారంగా స్తుతించాడు.

"ఓ దేవదేవా! నీవు సాక్షాత్తు విష్ణ్వంశ సంభూతుడవు. నీ నాభిలో నుండి పుట్టిన బ్రహ్మకూడా నిన్ను గురించి తెలుసుకోలేక పోయాడు. నీ రూపమును చూడలేకపోయాడు. నిన్ను చూడటం, నీ గురించి  తెలుసుకోవడం ఆ బ్రహ్మకే సాధ్యం కానపుడు ఇంక మానవ మాత్రులము మేమెంత! ఆ బ్రహ్మచేత సృష్టించబడిన మేము, సత్వ,రజస్తమోగుణములకు లోబడి,   అజ్ఞానంలో పడి కొట్టుకుంటున్నాము. జ్ఞానస్వరూపుడవైన నిన్ను మేము ఎలా దర్శించగలము.

ఓదేవా! ఈ దేహధారులైన జీవులు నీ మాయలో మునిగిపోయి ఉన్నారు. ఆ కారణం చేత నీ అసలు స్వరూపమును వారు చూడలేరు. నీ మహత్తును తెలుసుకోలేరు. ఈ మానవులకు పైకి కనిపించే వస్తువుల గురించి మాత్రమే తెలుసు. వారు రజోగుణము, తమోగుణము ఎక్కువగా కలవారు. వారు పైకి కనిపించే గుణములను మాత్రమే చూడగలరు. తమ కళ్లతో బయట ప్రపంచమును

చూడటానికి అలవాటుపడ్డ మానవులు, తమ అంతరంగములోనికి చూడలేరు. మానవులు తమ జాగ్రదావస్థలో, స్వప్నావస్థలో కేవలం ప్రాపంచిక విషయములను, విషయ వాంఛల గురించి మాత్రమే తెలుసుకుంటారు. సుషుప్తావస్థలో నిద్రపోతారు. ఆ కారణం చేత ఏ గుణములు లేని నీవు (నిర్గుణ తత్వము) సామాన్యమానవులకు గోచరము కావు.

మాయాగుణములకు అతీతంగా భేదబుద్ధిని నశింపజేసుకున్న సనందనుడు మొదలగు మహర్షులు నిన్ను ఎల్లప్పుడూ స్తుతిస్తుంటారు. అటువంటి శుద్ధసత్వగుణజ్ఞాన సంపన్నుడవైన నిన్ను అజ్ఞానములో ఉన్న నేను ఎలా తెలుసుకోగలను!

ఓ దేవా! నీవు సృష్టి, స్థితి, లయములకు కారకుడవు. నీవే కారణము. నీవే కార్యము. నీకు ఏ రూపమూ లేదు. ఏపేరు లేదు. కేవలము ఈ లోకములో ఉన్న వారికి జ్ఞానమును ఉపదేశించడానికి కపిలుడిగా అవతరించావు. అట్టి నీకు నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! ఈ లోకములో ఉన్న జనులు కామము, లోభము, క్రోధము, మోహము, మదము, మాత్సర్యము వీటికి లోబడి కొట్టుకుంటున్నారు. నీ మాయతో సృష్టించబడిన ఈ జగత్తులో నా భార్య, నా బిడ్డలు, నా ఇల్లు అంటూ సంసారము అనే కూపంలో పడి అల్లాడుతున్నారు. వారిలో నేనూ ఒకడిని. అటువంటి నాకు నేడు నీ దర్శనభాగ్యము కలిగింది. నీ దర్శనముతో నాలోని మోహము నశించింది." అని స్తుతించాడు.

అంశుమంతుడి ప్రార్థనలను విన్న కపిలుడు అతనిని అనుగ్రహించాడు. "కుమారా! అశ్వమేధయాగము కొరకు నీ తాతగారైన సగరుడు వదిలిపెట్టిన  అశ్వము ఇదే. దీనిని స్వీకరించు. నీ పినతండ్రులు భస్మం అయ్యారు. వీరికి ఉత్తమ లోకములు కలిగించడానికి విష్ణువు పాదముల నుండి ప్రవహిస్తున్న గంగాజలము మాత్రమే తగి ఉన్నది. ఇతర జలములతో వారికి ఉత్తమ లోకములు కలుగవు." అని అన్నాడు.

అంశుమంతుడు యాగాశ్వమును తీసుకొని పోయి సగరునికి ఇచ్చాడు. సగరుడు అశ్వమేధయాగమును నిర్విఘ్నముగా జరిపించాడు. తరువాత సగరుడు తన మనుమడు అంశుమంతుడికి రాజ్యము అప్పగించి వానప్రస్థమునకు వెళ్లిపోయాడు. తన గురువుగారైన ఔర్వుడు ఉపదేశించిన మార్గమును అనుసరించి ఉత్తమ గతులను పొందాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు సగర చక్రవర్తి కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# నవమస్కంధము
# తొమ్మిదవ అధ్యాయము.

అంశుమంతుడు తన పినతండ్రులకు ఉత్తమ గతులు కలిగించడానికి, ఆకాశ గంగను భూమి మీదకు తేవడానికి ఎంతో ప్రయత్నం చేసాడు. తపస్సుచేసాడు. కానీ సాధ్యంకాలేదు.

అంశుమానుని కుమారుడు దిలీపుడు. దిలీపుడు కూడా ఆకాశ గంగను భూమి మీదకు తేవడానికి ప్రయత్నించాడు. గొప్ప తపస్సు చేసాడు. కాని దిలీపుని వల్లకూడాకాలేదు.

దిలీపుని కుమారుడు భగీరథుడు. ఇతడు కూడా తన తాత తండ్రుల వలె ఆకాశ గంగను భూమి మీదకు తీసుకురావాలని, గంగా దేవిని గురించి గొప్ప తపస్సు చేసాడు. అతని తపస్సుకు మెచ్చి గంగాదేవి ఆయనకు ప్రత్యక్షంఅయింది.

"భగీరథా! నీ తపస్సుకు మెచ్చాను. ఏం వరం కావాలో కోరుకో!" అని అడిగింది.

"తల్లీ! నీవు భూమి మీదికి రావాలి. భూమి మీద ప్రవహించాలి. భూమిని పునీతం చెయ్యాలి." అని కోరాడు.

"నీవుకోరినట్టే భూమి మీదకు వస్తాను. కాని నా వేగానికి ఎవరూ తట్టుకోలేరు. నేను వేగంగా భూమిమీద పడకుండా మధ్యలోనే ఆపగలిగిన శక్తిమంతుడు ఎవరో చూడు. లేకపోతే నేను భూమిని చీల్చుకొని పాతాళానికి వెళ్లిపోతాను. అయినా నాకు మీ భూలోకంలో ప్రవహించడం ఇష్టంలేదు. ఎందుకంటే, భూమి మీద మానవులు అనేకములైన పాపములు చేస్తున్నారు. వారంతా నాలో మునిగి వారి పాపములను కడిగేసుకుంటున్నారు. వారి పాపము లన్నీ నాకు అంటుకుంటాయి. ఈ పాపాలు అన్నీ నేనెక్కడ పోగొట్టుకునేది. కాబట్టి నేను భూమి మీద ప్రవహించను." అని చెప్పింది గంగాదేవి.

"మాతా! నీవు చెప్పింది సమంజసమే. నీలో మునిగేది పాపాత్ములైన మానవులే కాదు. కర్మఫలములను వదిలిపెట్టినవారు, ప్రాపంచిక భోగములయందు, విషయ వాంఛల యందు ఆసక్తిలేనివారు, పరిశుద్ధమైన చిత్తము కలవారు, వేదవేదాంగ పారంగతులు, ఆచారవ్యవహారములను పాటించేవారు కూడా నీలో స్నానం చేస్తారు కదా. అటువంటి సాధుజనుల హృదయములలో పరమాత్మ, శాశ్వతంగా వెలుగుతుంటాడు. అటువంటి సాధుజనులు నీ పవిత్రజలములతో  స్నానం చేయడంతో నీకు అంటిన పాపాత్ముల పాపములు అన్నీ వాటంతటఅవే నాశనం అయిపోతాయి. నీవు ఎప్పటికప్పుడు పునీతురాలవవుతావు. నేను రుద్రుని ప్రార్థించి, భూమి మీదకు ప్రవహించేటప్పుడు నీ  వేగమును నియంత్రించే ప్రయత్నం చేస్తాను. పరమశివుడు నీ వేగమును భరిస్తాడు." అని అన్నాడు.

ఆ మాటలకు గంగానది సంతోషించింది. తరువాత భగీరథుడు రుద్రుని గురించి తపస్సుచేసి ఆయనను ప్రసన్నం

చేసుకున్నాడు. గంగ యొక్క వేగమును నియంత్రించడానికి రుద్రుని ఒప్పించాడు.

ఆకాశంలో ప్రవహించే గంగానది భూమి మీదికి దిగివచ్చింది. వేగంగా భూమి మీదికి దుముకుతున్న గంగా ప్రవాహాన్ని పరమశివుడు తన జటాజూటములో బంధించాడు. తరువాత మెల్లిగా భూమి మీదికి వదిలాడు. శివుని జటాజూటములో నుండి కిందికి దుముకుతున్న గంగానది భగీరథుని అనుసరించింది.

ముందు ఒక రథం మీద భగీరథుడు వెళుతుంటే, గంగానది ఆయన వెంట పరుగులు తీసింది. ఉత్తర భారత దేశంలో చాలా ప్రదేశములను పవిత్రం చేస్తూ ప్రవహించింది. సగరుని కుమారులు భస్మం అయిన ప్రదేశం మీదుగా ప్రవహించింది. ఆ పవిత్ర గంగాజలముల యొక్క స్పర్శతో సగర పుత్రులు ఉత్తమలోకములను పొందారు.

కేవలము పవిత్రగంగాజలముల స్పర్శతో భస్మముగా ఉన్న సగరపుత్రులు ఉత్తమ లోకములు పొందినపుడు, గంగానదీ పవిత్రజలాలలో  మునిగితే సామాన్యమానవుల పాపాలు ప్రక్షాళితము అవుతాయి అనీ, వారు ఉత్తమ లోకములు పొందుతారు అనీ అనడంలో సందేహము లేదు.

గంగానది శ్రీమహావిష్ణువు పాదముల నుండి పుట్టింది. స్వర్గంలో ప్రవహించింది. భూమిమీదికి దూకింది. పరమశివుని

జటాజూటంలో విశ్రాంతి తీసుకుంది. అక్కడి నుండి ఎన్నో పుణ్యక్షేత్రములను పునీతం చేసింది. అటువంటి గంగానదీ స్నానము సకల పాపములను నాశనం చేస్తుంది. భవబంధములనుండి విముక్తి కలిగిస్తుంది. కర్మఫలములను త్యాగము చేసిన మహామునులు, యోగులు గంగానదిలో స్నానం చేసి ఉత్తమలోకములను పొందారు. అటువంటి గంగానదిని భగీరథుడు భూమి మీదికి తీసుకొని వచ్చి చరితార్థుడు అయ్యాడు.

భగీరథుని కుమారుడు శ్రుతుడు. శ్రుతుని కుమారుడు నాభుడు. నాభుని కుమారుడు సింధుద్వీపుడు. సింధుద్వీపుని కుమారుడు ఆయుతాయువు. ఆయుతాయువు కుమారుడే ఋతుపర్ణుడు.

ఈ ఋతుపర్ణుడు నలమహారాజుకు మిత్రుడు. ఋతుపర్ణుడు నలమహారాజుకు అక్షహృదయము అనే విద్యను, ద్యూతక్రీడలో మెళు కువలను నేర్పాడు. దానికి బదులుగా నల మహారాజు ఋతుపర్ణునికి అశ్వములను నడపడంలో శిక్షణ ఇచ్చాడు.

ఈ ఋతుపర్ణుని కుమారుని పేరుసర్వకాముడు. సర్వకాముని కుమారుని పేరు సుదాసుడు. సుదాసుని కుమారుని పేరు సౌదాసుడు. సౌదాసుని భార్య పేరు మదయంతి. ఈ సౌదాసుని మిత్రసహుడనీ, కల్మాషపాదుడు అని కూడా పిలుస్తారు. ఇతనికి సంతానము లేరు. పైగా వశిష్టునిశాపం వలన రాక్షసత్వము వచ్చింది." అని అన్నాడు శుకమహర్షి.

పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహము కలిగింది. "ఓ మహర్షీ! సౌదాసునికి గురువు అయిన  వశిష్ఠమహర్షి సౌదాసుని శపించడానికి కారణం ఏమి? దయచేసి తెలియజేయండి." అని అడిగాడు. అప్పుడు శుకమహర్షి ఇలా చెప్పసాగాడు.

"పరీక్షిత్ మహారాజా! ఈ సౌదాసుడు ఒకసారి వేటకు వెళ్లాడు. వేటాడే సమయంలో  సౌదాసుడు ఒకరాక్షసుని చంపాడు. ఆ రాక్షసునికి ఒక తమ్ముడు ఉన్నాడు. అతడు సౌదాసునిమీద పగ బట్టాడు. సౌదాసునికి ప్రతీకారం చేయాలని అనుకున్నాడు. సౌదాసుని ఇంట్లో వంటవాడిగా చేరాడు.

ఒక రోజు సౌదాసుని గురువు అయిన వశిష్టుడు సౌదాసుని ఇంట్లో భోజనం చేస్తున్నాడు. ఆ సమయంలో వంటవాడుగా ఉన్న రాక్షసుడు కావాలని వశిష్టునికి నరమాంసము వడ్డించాడు. తనకు వడ్డించింది నరమాంసము అని తెలుసుకున్న వశిష్టుడు తాత్కాలిక కోపానికి గురి అయ్యాడు.  "నీవు నరమాంసభక్షకుడిగా అవుదువుగాక!"అని సౌదాసుని శపించాడు.

అంతలోనే వసిష్ఠుడు శాంతించాడు. ఇందులో సౌదాసుని తప్పు ఏమీ లేదు. అంతా వంటవాడు చేసిన మోసం అని గ్రహించాడు. తాను సౌదాసునికి ఇచ్చిన శాపము కేవలం పన్నెండు ఏళ్లు మాత్రమే వర్తిస్తుంది అని తన శాపాన్ని సవరించాడు వశిష్ఠుడు.

గురువుగారు తనకు శాపం ఇవ్వడం చూచి సౌదాసుడు కోపంతో రగిలిపోయాడు. తిరుగు శాపం ఇవ్వడానికి మంత్రజలం చేతిలోకి తీసుకున్నాడు. కాని సౌదాసుని భార్య మదయంతి ఆయనను వారించింది. తొందరపడవద్దని, ఏం జరిగిందో వివరాలు తెలుసుకోమని కోరింది. ఇదంతా వంటవాడి ప్రతీకార చర్య అని తెలుసుకున్నాడు సౌదాసుడు. గురువుగారిని శపించడానికి తాను చేతిలోకి తీసుకున్న మంత్ర జలం ఎటువైపు చల్లినా జీవకోటి నాశనం అవుతుంది అని తెలుసుకున్నాడు సౌదాసుడు. ఆ మంత్రజలాన్ని ఏమి చెయ్యాలో తెలియక తన కాళ్లమీద పోసుకున్నాడు. ఆ మంత్రజలము ప్రభావానికి సౌదాసుని కాళ్లు పాదాలు నల్లగా అయ్యాయి. ఆ కారణం చేత సౌదాసుడు కల్మాషపాదుడు అని పిలువబడ్డాడు. సరి అయిన సమయంలో సౌదాసుని భార్య మదయంతి అతనికి చెప్పిన మాటలను విన్నందుకు గాను సౌదాసుడు మిత్రసహుడు అని పిలువబడ్డాడు.

వశిష్టుని శాపప్రభావంతో సౌదాసుడు రాక్షసుడుగా మారి పోయాడు. అతడు ఒక రోజు ఆహారం కోసరం తిరుగుతున్నాడు. ఒక ఏకాంత ప్రదేశములో, కొత్తగా వివాహం అయిన బ్రాహ్మణ దంపతులు ఇరువురు సంతానం కొరకు రతిక్రీడలో మునిగి ఉన్నారు. రాక్షసరూపంలో ఉన్న సౌదాసుడు ఆ ఇద్దరిలో భర్తను పట్టుకొని తినబోతున్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుని భార్య తన భర్తను విడిచిపెట్టమని సౌదాసుని వేడుకుంది.

"ఓ వీరుడా! నీవు ఇక్ష్వాకువు వంశములో జన్మించావు. ఇట్టి అధర్మము ఎందుకు చేస్తున్నావు? నా భర్త నేను కేవలము సంతానము కొరకు మైథున క్రియలో పాల్గొంటున్నాము. ఆసమయంలో నా భర్తను

పట్టుకున్నావు. ఇది నీకు న్యాయంకాదు. జీవాత్మ ఈ దేహాన్ని సుఖాలు అనుభవించడానికి, కోరికలు తీర్చుకోడానికి ఉపయోగిస్తాడు. అటువంటి దేహమును నీవు నాశనం చేస్తే జీవాత్మ కోరికలు ఎలా తీరుతాయి. సుఖాలు ఎలా అనుభవించగలదు.

ఓ వీరుడా! నా భర్త విద్వాంసుడు. తపస్సుచేసాడు. మంచి గుణములు కలవాడు. నిత్యము పరమాత్మను సేవిస్తుంటాడు. నా భర్త బ్రహ్మర్షి అయితే నీవు రాజర్షివి. కుమారుడి చేతిలో తండ్రి చంపబడినట్టు, రాజర్షి చేతిలో బ్రహ్మర్షి చంపబడవచ్చునా! అది అధర్మం కాదా! నిరపరాధి, అమాయకుడు, సాధువు, వేదవేదాంగ పారంగతుడు అయిన నా భర్తను చంపడం గోవును చంపడం లాంటిది. నా భర్తలేనిదే నేను క్షణకాలంకూడా బతుకలేను. నేను ఇంతగా ప్రాధేయపడినా, ఇంకా నీవు నా భర్తను చంపి తినదలచు కుంటే, ముందు నన్ను చంపి తిను. తరువాత నా భర్తను చంపు." అనివేడుకుంది.

కాని సౌదాసుడు ఆమె మాటలను వినలేదు. ఆ బ్రాహ్మణుని చంపి తిన్నాడు. తనకళ్లముందే తన భర్తను చంపి తింటున్న సౌదాసుని చూచి ఆ పతివ్రత కోపంతో ఊగి పోయింది. "ఓరి దుర్మార్గుడా! ఎంత వేడుకున్నా నా మాట వినకుండా, మైధునక్రియలో ఉన్న నా భర్తను నా నుండి విడదీసావు. నీవు కూడా ఏ స్త్రీతో కలిసినా, మైధునక్రియలో పాల్గొన్నా, తక్షణమే నువ్వు మరణిస్తావు. ఇదే నా శాపం." అని సౌదాసుని శపించింది. తరువాత ఆమె చితి అంటించుకొని సౌదాసుడు తిని పారవేసిన తన భర్త ఎముకలను చితిమీద పెట్టుకొని, తన భర్తతో

కూడా సహగమనం చేసింది.

ఇంతలో వశిష్టుడు విధించిన పన్నెండు సంవత్సరములు పూర్తి అయ్యాయి. సౌదాసుడు వశిష్టుని శాపం నుండి విముక్తిపొందాడు. సంతానము కొరకు తన భార్య మదయంతిని కలవడానికి ప్రయత్నించగా మదయంతి సౌదాసుకు ఆ పతివ్రత శాపం గుర్తుచేసి వారించింది. ఇంక చేసేది లేక, తన భార్యకు సంతానం కలిగించమని తనగురువుగారైన వశిష్టుని ప్రార్థించాడు. వశిష్టుని దయ వలన మదయంతి గర్భం ధరించింది.

ఆమె ఏడు సంవత్సరములు గర్భం ధరించింది కానీ ఆమె ప్రసవించలేదు. అప్పుడు వశిష్టుడు ఒక పదునైన రాయి తీసుకొని ఆమె గర్భమును చీల్చి శిశువును బయటకు తీసాడు. రాతితో చీల్చబడ్డ గర్భమునుండి పుట్టినవాడు కాబట్టి ఆ కుమారుడు అశ్మకుడు అనే పేరుతో పిలువబడ్డాడు.

అశ్మకుని కుమారుడు బాలికుడు. ఆ సమయంలో పరశు రాముడు ఇరవై ఒక్కసార్లు క్షత్రియుల మీదికి దండెత్తి, క్షత్రియ వంశమును నిర్మూలనం చేసాడు. కానీ ఎప్పుడు బాలికుని మీదికి దండెత్తినా, అప్పుడు బాలికుడు స్త్రీల మధ్యలో ఉండేవాడు కానీ యుద్ధానికి వచ్చేవాడు కాదు. స్త్రీలలో స్త్రీగా స్త్రీలను కవచంగా పెట్టుకొని తనను తాను కాపాడుకుంటున్న బాలికుని సంహరించడం తన పరాక్రమానికే అవమానకరమని వెళ్లిపోయేవాడు పరశురాముడు.. ఆడవాళ్లను కవచంగా వాడుకొని చావు తప్పించుకున్నాడు కాబట్టి బాలికునికి నారీకవచుడు అని పేరు వచ్చింది.

క్షత్రియ వంశానికి వీడు ఒక్కడే మిగిలాడు కాబట్టి క్షత్రియ వంశానికి మూల పురుషుడు కాబట్టి మూలకుడు అనే పేరుతో కూడా పిలువ బడ్డాడు. ఈ మూలకుని కుమారుడే దశరథుడు (రాముని తండ్రి దశరథుడు కాడు).

దశరధుని కుమారుడు ఐడవిడి. ఐడవిడి కుమారుడు విశ్వసహుడు. విశ్వసహుని కుమారుడు ఖట్వాంగుడు. ఈ ఖట్వాంగుడు ఒక మహారాజు. దేవాసుర యుద్ధంలో దేవతలకు సాయం చెయ్యడానికి స్వర్గలోకానికి వెళ్లాడు. వేలాదిదైత్యులను సంహరించాడు. దేవాసురయుద్ధం ముగిసింది. ఇంక మానవ లోకానికి వెళ్లాలి అనుకున్నాడు.

ఖట్వాంగుడు చేసిన సాయానికి ఒకవరం ఇవ్వాలనుకున్నారు దేవతలు. నీకు ఏం వరం కావాలి అని అడిగారు. “నాకు ఏవరమూ వద్దు, నాకు ఇంకా ఎంత ఆయువు మిగిలి ఉంది చెప్పండి” అని అడిగాడు ఖట్వాంగుడు. దేవతలు లెక్కగట్టి “నీకు కేవలం ఒకముహూర్తకాలము (అనగా సుమారు 45 నిమిషములు) ఆయువు మిగిలిఉంది.” అని చెప్పారు.

ఆ మాటలు విన్న ఖట్వాంగుడు వెంటనే భూలోకమునకు తిరిగి వచ్చాడు. మిగిలిన ఆయుష్షు పరమాత్మచింతనలో గడిపాడు. బ్రాహ్మణులను పూజించాడు. రాజ్యమును, భార్యాబిడ్డలను, సంపదలను, కోరికలను వదిలిపెట్టాడు. పరమాత్మ తప్ప ఏదీ సత్యము కాదని తెలుసుకున్నాడు. దేవతలు తనకు అన్ని వరాలు ఇస్తారు అన్నారు కానీ

తన మనస్సు పరమాత్మయందు  లగ్నం అయి ఉండటం వలన తాను దేవతలను ఏ వరమూ కోరలేదు అని అనుకొన్నాడు. ఖట్వాంగుడు తనలో తాను ఇలా అనుకున్నాడు.

" దేవతలవంటి వారే, తమకు ఉన్న ఇంద్రియలోలత్వము వలన తమ దేహములో ఉన్న ఆత్మస్వరూపుడైన పరమాత్మను తెలుసు కోలేకపోయారు. ఇంక నా వంటి సాధారణ మానవులు ఎంత? సాధారణంగా మానవులు ప్రాకృతిక విషయముల మీద, విషయ వాంఛల మీద, ధనము మీద, భోగముల మీద ఆసక్తి కలిగి ఉంటారు. అది మానవ సహజము. కాని నేను ఎల్లప్పుడూ శ్రీహరిని మనసులో స్మరించడం వలన, నాకు ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి నశించింది. త్రికరణశుద్ధిగా నేను శ్రీహరి శరణుజొచ్చాను. " అని అనుకున్నాడు.

ప్రాపంచిక విషయములమీద, విషయ వాంఛల మీద, దేహము మీద ఆసక్తి వదిలిపెట్టాడు. మనస్సును పరమాత్మయందు లగ్నంచేసాడు. నిరంతరము భగవంతుని ధ్యానంలో నిమగ్నమయ్యాడు. చివరకు భగవంతునిలో ఐక్యం అయ్యాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు ఇక్ష్వాకు రాజుల చరిత్రను,  ఖట్వాంగుని చరిత్రను వివరించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

నవమస్కంధము

పదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీరాముని అవతార విశేషములను ఇలా సాగాడు.. "ఓ పరీక్షిత్ మహారాజా! ఖట్వాంగునకు దీర్ఘబాహువు అనే కుమారుడు కలిగాడు. దీర్ఘబాహువు కుమారుడే రఘుమహారాజు. రఘువంశమునకు మూలపురుషుడు.

రఘువు కుమారుడు అజుడు.అజుని కుమారుడు దశరథుడు. దేవతలు ప్రార్థించగా, శ్రీమహావిష్ణువు తన అంశతోనూ, అశాంశల తోనూ (అంటే అంశలో అంశ) దశరథునకు కుమారులుగా జన్మించాడు. వారిపేర్లు రాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు. (రాముడు విష్ణు అంశ అయితే, లక్ష్మణ,భరత,శత్రుఘ్నులు ఆ అంశలో అంశలు అని అర్థం.)

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ శ్రీరాముని కథను నీవు తత్వదర్శులైన ఋషుల వలన చాలాసార్లు వినిఉంటావు. సందర్భంవచ్చింది కాబట్టి క్లుప్తంగా వివరిస్తాను. సావధానంగా విను.

ఒక గొప్ప కార్యము సాధించడానికి, తన తండ్రి దశరథుడు ఆదేశించాడు అనే మిషతో, శ్రీరాముడు, తన భార్య సీత, తమ్ముడు లక్ష్మణునితో సహాఅరణ్యములకు వెళ్లాడు. తనను వరించమని వచ్చిన శూర్పణఖ ముక్కుచెవులు కోసాడు లక్ష్మణుడు. దానికి ప్రతీకారంగా

శూర్పణఖ అన్న అయిన రావణుడు రాముడి భార్య సీతను అపహరించాడు. సీతను వెదుకుతూ రామ లక్ష్మణులు సముద్రం వద్దకు చేరుకున్నారు. సుగ్రీవుడు, హనుమంతుడు మొదలగు వానరుల సాయంతో  సముద్రము మీద సేతువును నిర్మించి, లంకా నగరము ప్రవేశించి, రావణుడు మొదలగు రాక్షసులను చంపాడు రాముడు. అటువంటి రాముడు మనలనందరినీ రక్షించుగాక.

విశ్వామిత్రుని యజ్ఞమును రక్షించే సమయంలో మారీచుడు మొదలగు రాక్షసులను సంహరించిన రాముడు మనలను కాపాడుగాక!

సీతా స్వయంవర సమయంలో మూడువందలమంది కూడా లాగలేని శివధనుస్సును అవలీలగా ఎత్తి, విరిచి, సీతను పరిణయ మాడిన ఆ శ్రీరాముడు మనలను రక్షించుగాక!

ఈ భూమి మీద ఉన్న  క్షత్రియుల మీద ఇరవై ఒక్కసార్లు దండెత్తి, క్షత్రియ కులమును నాశనం చేసిన పరశురాముని గర్వమును హరించిన ఆ శ్రీరాముడు మనలను రక్షించుగాక!

ఓ మహారాజా! శ్రీరామ కథను సంక్షిప్తంగా చెబుతాను విను.

శ్రీరామునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేయడానికి నిశ్చయించేసాడు దశరథుడు. దశరథుని మూడవ భార్య కైక దానికి ఒప్పుకోలేదు. శ్రీరాముని అడవులకు పంపమని కోరింది. తండ్రి ఆజ్ఞమేరకు, రాజ్యమును, సమస్త సంపదలను, ప్రియమైన

బంధువులను, స్నేహితులను సంతోషంగా వదిలిపెట్టి, శ్రీరాముడు, తన భార్య సీతతోనూ, తమ్ముడు లక్ష్మణునితోనూ, అరణ్యములకు వెళ్లాడు.

అరణ్యములో రావణుని చెల్లెలు శూర్పణఖ రామలక్ష్మణులను మోహించింది. అప్పుడు లక్ష్మణుడు, శూర్పణఖ ముక్కు చెవులు కోసి కురూపిని చేసాడు. ఆ అవమానమును తట్టుకోలేక శూర్పణఖ, సోదరులు అయిన ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు, వారి వారి రాక్షస సైన్యములతో శ్రీరాముని మీదికి యుద్ధానికి వచ్చారు. శ్రీరాముడు తన కోదండమును ధరించి, వారితో ఒంటరిగా పోరాడి ఆ రాక్షసుల నందరినీ చంపాడు.

శూర్పణఖ వెంటనే తనసోదరుడు రావణుని వద్దకు పోయి తనకు జరిగిన అవమానమును గురించి చెప్పింది. సీతను గురించి, ఆమె అందచందముల గురించి చెప్పింది. రావణుడు సీతను తన దానిగా చేసుకోవాలని అనుకున్నాడు. సీతను అపహరించడానికి మారీచుని సాయం కోరాడు. ఆశ్రమం నుండి శ్రీరాముని దూరంగా పంపడానికి మారీచుడు బంగారు లేడిగా మారి ఆశ్రమ ప్రాంగణంలో తిరుగుతున్నాడు. సీత కోరిక మేరకు రాముడు ఆ బంగారు లేడిని వెంబడించాడు. తన బాణముతో మాయలేడి రూపంలో ఉన్న మారీచుని చంపాడు.

అదేసమయమని భావించిన రావణుడు రాముని కుటీరంలో ప్రవేశించి, ఒంటరిగా ఉన్న మేకపిల్లను తోడేలు నోటకరచుకొని పరుగెత్తినట్టు, ఒంటరిగా ఉన్న రాముని భార్య సీతను అపహరించి,

తన రాజ్యము అయిన లంకకు తీసుకొని పోయాడు.

స్త్రీల యొక్క అర్ధంలేని కోరికలను తీర్చబోతే ఎదురయ్యే ఆపదలను, దు:ఖమును, లోకానికి తెలుపడానికా అన్నట్లు, రాముడు భార్యమీద విరహంతో, సీతను వెదుకుతూ తన తమ్ముడు లక్ష్మణునితో సహా అడవులలో తిరుగుతున్నాడు. సీతాపహరణ సమయంలో సీతను రక్షించడానికి రావణునితో పోరాడి మరణించిన జటాయువు అనే పక్షికి దహన సంస్కారాలు చేసాడు రాముడు. దారిలో తమను పట్టుకోబోయిన కబంధుడు అనే రాక్షసుని చంపాడు.

సుగ్రీవుడు అనే వానర రాజుతోను, హనుమంతుడు అనే అతని మంత్రితోనూ  స్నేహం చేసాడు. సుగ్రీవుని కోరిక మేరకు అతని అన్న వాలిని చంపాడు రాముడు. సుగ్రీవుని కిష్కింధకు రాజును చేసాడు. హనుమంతుని సాయంతో సీత లంకలో ఉన్నదని తెలుసుకున్నాడు. వానర సైన్యంతో సముద్రతీరానికి వెళ్లాడు. దారి ఇమ్మని సముద్రుని అడిగాడు. సముద్రుడు దారి ఇవ్వలేదు. రాముడు రామబాణప్రయోగానికి సిద్ధపడగా, సముద్రుడువచ్చిరాముని శరణు వేడాడు.

"ఓ దేవా! నీవు ఎవరో తెలుసుకోలేక నీ వద్దకు రాలేదు. నీవు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అంశలో పుట్టినవాడివి. ఈ జగత్తునకు అధిపతివి. నిరాకారుడివి. ఆదిపురుషుడివి. సత్వ,రజస్, తమో గుణములకు అతీతుడివి. నీవు నన్ను దాటి లంకానగరమునకు వెళ్లవచ్చును. రావణునిసంహరించి నీ సీతను తిరిగి పొందవచ్చును. నేనునీ మార్గమునకు ఎలాంటి ఆటంకము కలిగించను. వానరుల

సాయంతో నా మీద ఒక సేతువును నిర్మించి, దాని మీదుగా వానర సైన్యముతో సహా నన్ను దాటవచ్చును. నీకీర్తి మూడులోకములలో వ్యాప్తిచెందుతుంది." అని అన్నాడు సముద్రుడు.

రాముడు వానరులను సేతువు నిర్మించమని ఆదేశించాడు. వానరులు సేతువు నిర్మించారు. రాముడు రావణుని తమ్ముడు అయిన విభీషణునితో స్నేహంచేసాడు. వానర ప్రముఖులతో సహా లంకలో ప్రవేశించాడు. లంకను ముట్టడించాడు. వానరసేనలు లంకా నగరంలో ప్రవేశించి, లంకా నగరమును ఆక్రమించాయి. భవనములను, క్రీడాస్థలములను, ఉద్యానవనములను, నాశనం చేసాయి.

రాముని దండయాత్రను చూచిన రావణుడు తన సైన్యాధిపతులు అయిన కుంభుడు, నికుంభుడు, ధూమ్రాక్షుడు, దుర్ముఖుడు, సురాంతకుడు, నరాంతకుడుమొదలగు వారిని, తన కుమారుడు అయిన ఇంద్రజిత్తును, రాముని మీదికి యుద్ధానికి పంపాడు. తరువాత ప్రహస్తుని, అతికాయుని, వికంపనుని, చివరకు తన తమ్ముడైన కుంభకర్ణుని రాముని మీదికియుద్ధానికి పంపాడు.

లక్ష్మణుడు, సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు, గంధమాధనుడు, నీలుడు, జాంబవంతుడు,పనసుడు మొదలగు వారు, శూలములనూ, ధనుస్సులనూ, ప్రాసములు, శక్తి, బాణములు, తోమరములు, అస్త్ర, శస్త్రములను ధరించిన రాక్షస సైన్యమును ఎదుర్కొన్నారు. ఇరుపక్షములకుపోరు ఘోరంగా సాగింది. అంగదుడు మొదలగు వానరవీరులు వృక్షములను, రాళ్లను తీసుకొని రావణుని

సేనలను సంహరించారు.

సీతాదేవిని అపహరించి అధర్మానికి పాల్పడినందుకు అదృష్టదేవత రావణునికి సాయపడలేదు. రావణుని అపజయం వరించింది. తన సేనలు అన్నీ నాశనం కాగా, తుదకు రావణుడు తన పుష్పకవిమానము ఎక్కి రాముని మీదికి యుద్ధానికి బయలుదేరాడు. రావణుని చూచిరాముడు ఇలాఅన్నాడు. "రావణా! నీవు రాక్షస రాజువు. కానీ నేను ఇంట్లోలేనపుడు కుక్కవలె, దొంగవలె నా ఇంట్లో ప్రవేశించి నా భార్యసీతను అపహరించావు. అధర్మం చేసావు. దానికి తగినఫలము అనుభవిస్తావు. అదీ నాచేతిలో అనుభవిస్తావు." అని పలికిన రాముడు రావణునిపై అస్త్రములనుసంధించాడు. రావణుని సంహరించాడు. రాక్షసులు హాహాకారాలు చేసారు. రావణుని భార్య మండోదరి తన భర్త శవం మీద పడి భోరున ఏడ్చింది. ఇతర రాక్షస స్త్రీలు కూడా యుద్ధభూమికి వచ్చి తమ తమ భర్తల శవాల మీదపడి ఏడ్చారు. తరువాత రావణుని తమ్ముడు విభీషణుడు తన అన్న రావణునికి దహన సంస్కారములు చేసాడు.

తరువాత శ్రీరాముడు లంకా నగరము ప్రవేశించి అశోకవనములో శింశుపా వృక్షము కింద కూర్చుని ఉన్న సీత వద్దకు వెళ్లాడు. శ్రీరామ చంద్రుని చూడగానే సీత మొహం ఆనందంతో వికసించింది. శ్రీరాముడు కూడా చాలా కాలం తరువాత తన భార్య సీతను చూచి పరమానందభరితుడయ్యాడు.

విభీషణుని లంకారాజ్యమునకు రాజుగా పట్టాభిషిక్తుని చేసిన తరువాత శ్రీరాముడు తన భార్య సీతను, తమ్ముడు లక్ష్మణుడు,

సుగ్రీవుడు, హనుమంతుడు, ఇతరవానరుల తో సహా పుష్పక విమానము ఎక్కి అయోధ్యకు చేరుకున్నాడు.

రాముడు అయోధ్యకు వచ్చేటప్పటికి భరతుడు, రాజ్యభోగము లను వదిలిపెట్టి, కాషాయ వస్త్రములను ధరించి, దర్భల మీద పడుకుంటూ, రాముని రాక కోసరం ఎదురుచూస్తున్నాడు. ఇది చూచి రాముడు ఎంతో దు:ఖించాడు. రాముడు అయోధ్యకు వస్తున్నాడని తెలిసి భరతుడు రాముని పాదుకలను తలమీద పెట్టుకొని, మంత్రులు, సేనాధిపతులు, పురప్రముఖులతో సహా శ్రీరామునికి ఎదురువచ్చాడు. వందిమాగధులు శ్రీరామ చరిత్రను గానం చేస్తున్నారు. బ్రాహ్మణులు వేద మంత్రములు చదువుతున్నారు. రామునికి,అతని పరివారమునకు బంగారు రథములు సిద్ధం చేసారు.

శ్రీరాముడు నంది గ్రామము రాగానే భరతుడు ఆయన పాదములమీద పడి నమస్కరించాడు. శ్రీరాముడు తమ్ముడు భరతుని ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. తరువాత భరతుడు వదిన సీతకు, అన్న లక్ష్మణునకు, ఇతర పెద్దలకు నమస్కరించాడు. తరువాత ప్రజలందరూ జయజయధ్వానాలు చేసారు. చాలాకాలం తరువాత అయోధ్యలో అడుగుపెడుతున్న శ్రీరామునికి స్వాగత సత్కారాలు ఘనంగా చేసారు. వీధులను పూలమాలలతో అలంకరించారు. నృత్యం చేసారు.

భరతుడు శ్రీరామ పాదుకలను, సుగ్రీవుడు, విభీషణుడు వింజామరలను, హనుమంతుడు తెల్లగొడుగును, శత్రుఘ్నుడు

ధనుస్సును, సీతాదేవి పూర్ణకుంభమును, అంగదుడు ఖడ్గమును, జాంబవంతుడు బంగారు కవచమును పట్టుకున్నారు. ఆవిధంగా శ్రీరాముడు అయోధ్యానగర ప్రవేశం చేసాడు.

అంతఃపురమునకు పోయి శ్రీరాముడు తన తల్లులు అయిన కౌసల్య, కైకేయి, సుమిత్రలకు పాదనమస్కారాలు చేసాడు. తన స్నేహితులను పలకరించాడు. చాలాకాలం తరువాత తిరిగివచ్చిన కుమారులను కౌసల్య, సుమిత్ర కౌగలించుకొని ఆనంద భాష్పాలురాల్చారు. కుల గురువు వశిష్ఠుడు నాలుగు సముద్రముల నుండి బంగారు కలశములలో జలము తెప్పించాడు. శ్రీరాముని అయోధ్యాధిపతిగా అభిషేకించుటకు ఏర్పాట్లు చేసారు.

శ్రీరాముడు అభ్యంగన స్నానము ఆచరించి, మంచి బట్టలు ధరించాడు. సోదరులతోనూ, భార్య సీతతోనూ ఆనందంగా గడిపాడు. శ్రీరాముడు అయోధ్య సింహాసనమును అధిష్టించడానికి అంగీకరించాడు. కులగురువు వశిష్టుడు శ్రీరాముని అయోధ్యాధిపతిగా పట్టాభిషిక్తుని చేసాడు. శ్రీరాముడు తన రాజ్యములో ఉన్న అన్ని వర్ణముల వారినీ సమానంగా ఆదరించాడు. ప్రజలు కూడా శ్రీరాముని తమ కన్నతండ్రి మాదిరి భావించారు.

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీరాముడు రాజ్యం చేసిన కాలంలో త్రేతాయుగము నడుస్తూ ఉంది. అయినప్పటికినీ, శ్రీరాముని పాలనలో కృతయుగంలో ఉన్నట్టు ధర్మం నాలుగు పాదాలతో నడిచింది. సకాలంలో వర్షాలు కురిసాయి. పంటలు సమృద్ధిగా పండాయి.

జలాశయములు, నదులు అన్నీ జలములతో నిండి పోయాయి. కరువుకాటకములు అసలే లేవు. ప్రజలకు తీరని కోరిక అంటూ ఏమీ లేదు. రామరాజ్యంలో వ్యాధులు లేవు. అకాల మరణాలులేవు. కష్టములు లేవు. దు:ఖము లేదు. శోకము, భయము లేవు.

రామ చంద్రుడు తన భార్య సీతను తప్ప పరాయి స్త్రీలను కన్నెత్తి చూచేవాడు కాదు. ఏకపత్నీవ్రతుడు. శ్రీరామునికి ఒకరి మీద ఇష్టము, మరొకరిమీద అయిష్టము లేవు. ఎవరినీ ప్రేమించడు, ఎవరినీ ద్వేషించడు. వర్ణాశ్రమ ధర్మములను తాను ఆచరించి అందరిచేతా ఆచరింపజేసేవాడు.

రామునికి తగ్గ భార్య సీత. సకలసద్గుణ సంపన్న. భర్త మనసు తెలిసి నడుచుకొనేది. పరమ పతివ్రత. తన ప్రేమతో, పరిచర్యలతో, మంచి స్వభావముతో తన భర్త మనసును హరించింది సీత. తరువాత సీతారాములు ఆనందంగా విహరింపసాగారు."అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీరాముని చరిత్ర వినిపించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము పదవ అధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత& ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# నవమస్కంధము
# పదకొండవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీరామచంద్రుని చరిత్రను ఈ విధంగా చెప్పసాగాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీరామచంద్రుడు తన కులగురువు అయిన వశిష్టుని ఆధ్వర్యంలో ఎన్నో యజ్ఞయాగములు చేసాడు. యజ్ఞఫలంగా ఈ భూమండలమును యజ్ఞములు చేయించిన ఋత్విక్కులకు దానం చేసాడు. రామచంద్రుని వద్దనుండి దానం స్వీకరించిన ఋత్విక్కులు తిరిగి భూమండలమును రామునికి ఇచ్చారు. శ్రీరాముని ఈ విధంగా స్తుతించారు.

“శ్రీరామచంద్రా! నీవు మాకు ఏమీ ఇవ్వలేదు. మేము తీసుకోలేదు. అంతా నీదే. నీ దయ వలన మాలో ఉన్న అజ్ఞానము అహంకారము తొలగిపోయాయి. నీవు పరబ్రహ్మస్వరూపుడవు, జ్ఞానమూర్తివి. ఈ లోకంలో ఉన్న యోగులు, మునులు నీ పాదపద్మములను తమ తమ హృదయములలో పెట్టుకొని ధ్యానిస్తుంటారు.”అని ప్రార్థించారు. తరువాత శ్రీ రాముడు అయోధ్యను జనరంజకంగా పరిపాలించాడు.

ఒక రోజు రాత్రి శ్రీరామచంద్రుడు తన రాజ్యములో ప్రజలు ఎలా ఉన్నారో చూడాలని మారువేషంలో నగరంలో పర్యటించడానికి బయలు దేరాడు. ఒక వ్యక్తి తన గురించి తన భార్య సీత గురించి

తప్పుగా మాట్లాడటం విన్నాడు.

"ఆ రాముడు కాబట్టి, భార్యమీది మోహంతో, పరాయి వ్యక్తి ఇంట్లో సంవత్సరం పాటు ఉన్న భార్యను మరలా తన ఇంటికి తెచ్చుకున్నాడు. నాకు నీ మీద అంత వ్యామోహం లేదు. ఇన్నాళ్లు ఎక్కడెక్కడో తిరిగిన నిన్ను నేను ఇంట్లోకి రానివ్వను." అని తన భార్యతో తగవులాడుతున్న ఒకవ్యక్తి పలికిన మాటలను విన్నాడు రాముడు.

జనవాక్యానికి భయపడ్డాడు రాముడు. ఆ సమయంలో సీత గర్భవతి. అయినా సరే ఏమీ ఆలోచించకుండా, సీతను వదిలిపెట్టాడు. సీతను వాల్మీకి ఆశ్రమంలో విడిచి రమ్మన్నాడు. నెలలు నిండిన సీత వాల్మీకి ఆశ్రమంలో ఇద్దరు కుమారులకు జన్మనిచ్చింది. ఆ ఇరువురు కుమారులు లవుడు, కుశుడు అనే పేరులతో పిలువబడ్డారు. వాల్మీకి మహర్షి ఆ కుమారులకు జాతక కర్మలు నిర్వర్తించాడు. అయోధ్యలో లక్ష్మణునికి ఇద్దరు కుమారులు కలిగారు. వారు అంగదుడు, చిత్రకేతువు. తక్షుడు, పుష్కలుడు భరతుని కుమారులు. సుబాహువు, శ్రుతసేనుడు శత్రుఘ్నుని కుమారులు.

రాముడు అశ్వమేధ యాగం చేసాడు. భరతుడు దిగ్విజయ యాత్ర చేసి కోట్లకొలది గంధర్వులను సంహరించాడు. వారివద్ద ఉన్న ధనమును తెచ్చి శ్రీరామునికి సమర్పించాడు.శత్రుఘ్నుడు కూడా మధువు కుమారుడైన లవణుడు అనే రాక్షసుని సంహరించి, మధువనములో మధురాపురము అనేనగరమును నిర్మించాడు.

శ్రీరామచంద్రునిచే వదిలిపెట్టబడిన సీత పాతాళలోకానికి వెళ్లిపోయింది. ఈ విషయం తెలిసిన రాముడు సీతావియోగానికి ఎంతో బాధపడ్డాడు. తరువాత శ్రీరాముడు పదమూడు వేల సంవత్సరములు రాజ్యపాలన చేసాడు. తరువాత శ్రీరాముడు తిరిగి వైకుంఠము చేరుకున్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీరాముడు అమిత శక్తి మంతుడు. ఆయనకు సేతువు నిర్మించడం, రావణుని సంహరించడం అనేవి గొప్పకార్యములు కావు. వాటిని ఎవరి సాయము లేకుండా అవలీలగా చెయ్యగలడు. అసమాన ప్రభావం కల రామునికి, సేతువు కట్టడానికి, రాక్షస సంహారానికి ఆయనకు వానరుల సాయం అవసరమా! కాని భార్యావియోగంతో ఉన్న వ్యక్తి సాధారణంగా ఎలా ప్రవర్తిస్తాడో ఆ ప్రకారంగా ప్రవర్తించి లోకానికి చూపించాడు. కష్టములు ఎలా ఉంటాయో తాను అనుభవించి చూపించాడు. అందువలననే శ్రీరాముని కీర్తి నలువైపులా వ్యాపించింది.

త్రేతాయుగంలో ఉన్న రాముడిని నేటికి కూడా అన్నిచోట్లా ప్రజలు దేవుడుగా పూజిస్తున్నారు, భవిష్యత్తులో కూడా పూజిస్తారు అంటే, ఆయన తాను నడిచి చూపించిన మార్గము, ధర్మమార్గము తప్ప మరొకటి కాదు. అటువంటిశ్రీరామచంద్రుని నేను శరణువేడుతున్నాను.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ కాలంలో శ్రీరాముని తో పాటు జీవించిన వారు, రాముని సేవించినవారు, రాముని తాకినవారు, రాముని చూచిన వారు, రామునితో స్నేహం చేసినవారు, ఆయన పక్కన కూర్చున్న వారు, రాముని అనుసరించిన వారు అయిన

అయోధ్యావాసులు అందరికీ, భక్తితో పరమాత్మను సేవించిన యోగులకు ఎటువంటి ఉత్తమ గతులు కలుగుతాయో అటువంటి ఉత్తమగతులు కలిగాయి. రాముని చరిత్రను చెవులారా వినువాడు కోపము, మదము, మాత్సర్యము లేకుండా కర్మబంధనముల నుండి విముక్తి పొందుతాడు." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు శ్రీరాముని చరిత్ర వినిపించాడు.

పరీక్షిత్ మహారాజు శుకుని ఒక ప్రశ్నఅడిగాడు. "ఓ మహర్షీ! శ్రీరామ చంద్రుని రాజ్యపాలన ఎలా సాగింది చెప్పగలరా!" అని అడిగాడు. శుక మహర్షి ఇలా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! లంకనుండి అయోధ్యకు తిరిగివచ్చిన తరువాత శ్రీరాముడు భరతుని వద్దనుండి రాజ్యము స్వీకరించాడు అని చెప్పాను కదా! తరువాత శ్రీరాముడు తన తమ్ములను దిగ్విజయ యాత్రకుపంపాడు. అయోధ్యావాసులను కంటికిరెప్పలా కాపాడాడు. శ్రీరాముని పాలనలో అయోధ్య ఎంతో అభివృద్ధిచెందింది. శ్రీరాముడు భవనములు, ప్రాసాదములు, పూజాస్థానములు, దేవాలయములు కట్టించాడు. వాటిలో బంగారు కలశములను ప్రతిష్టించాడు. అయోధ్యానగరము అంతటా ఉద్యానవనములతోనూ, సరోవరముల తోనూ, వ్యాపార వీధులతోనూ, మంగళ తోరణములతోనూ సమృద్ధిగా ఉండేది.

ప్రతిరోజూ శ్రీరాముడు బ్రాహ్మణులను పూజించి వారి ఆశీర్వాదములను పొందేవాడు. అయోధ్యావాసులు ప్రతిరోజూ

శ్రీరాముని దర్శించుకుంటూ పునీతులయ్యేవారు. ప్రజలకు దర్శనం ఇచ్చిన తరువాత శ్రీరాముడు తనగృహమునకు వెళ్లేవాడు.

తరువాత రాముడు తన భార్య సీతతో ఏకాంతంగా విహరించేవాడు. ఆ ప్రకారంగా శ్రీరాముడు ధర్మమార్గము తప్పకుండా రాజభోగములను అనుభవిస్తూ, రాజ్యపాలన చేసాడు." అని శు కమహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీరామచంద్రుని పరిపాలనా విశేషములను వివరించాడు.

శ్రీమద్భాగవతము
నవమ స్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
నవమ స్కంధము
పన్నెండవ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఇక్ష్వాకు వంశములో మిగిలిన రాజుల చరిత్రలను ఈ విధంగా వివరించాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీరామచంద్రుని కుమారుడు అగు కుశునకు అతిథి అనే కుమారుడు జన్మించాడు. అతిథి కుమారుడు నిషధుడు. నిషధుని కుమారుడు నభుడు.నభుని కుమారుడు పుండరీకుడు. పుండరీకుని కుమారుడు క్షేమధన్వుడు. క్షేమధన్వుని కుమారుడు దేవానీకుడు. దేవానీకుని కుమారుడు అనీహుడు.

అనీహుని కుమారుడు పారియాత్రుడు. పారియాత్రుని కుమారుడు బలస్థలుడు. బలస్థలుని కుమారుడు వజ్రనాభుడు. ఈ వజ్రనాభుడు సూర్యునిఅంశతో జన్మించాడు.

వజ్రనాభుని కుమారుడు సగణుడు. సగణుని కుమారుడు విధృతి. విధృతి కుమారుడు హిరణ్యనాభుడు. ఈ హిరణ్యనాభుడు జైమిని మహర్షికి శిష్యుడయ్యాడు. ఈ హిరణ్యనాభునివద్ద యాజ్ఞవల్క్యమహర్షి ఆధ్యాత్మయోగమును అధ్యయనం చేసాడు. హిరణ్యనాభునికి పుష్యుడు అనే కుమారుడు కలిగాడు. పుష్యుని కుమారుడు ధ్రువసంధి. ధ్రువసంధి కుమారుడు సుదర్శనుడు. సుదర్శనుని కుమారుడు అగ్నివర్ణుడు. అగ్నివర్ణుని కుమారుడు శీఘ్రుడు. శీఘ్రుని కుమారుడు మరుడు. ఈ మరుడు యోగసిద్ధిని పొందాడు. ఇతడు  చిరంజీవిగా ఇప్పటికీ కలాప అనే గ్రామంలో జీవించి ఉన్నాడని అంటారు. ఇతడు సూర్యవంశపు రాజు. ప్రళయకాలంలో సూర్యవంశము అంతరించి పోతుంది. ఈ మరుడు మాత్రము జీవించి ఉండి, సృష్టి ప్రారంభంలో మరలా తన సంతానము ద్వారా సూర్యవంశమును పునరుద్ధరిస్తాడు.

ఈ మరునకు ప్రసుశ్రుతుడు జన్మించాడు. ప్రసుశ్రుతుని కుమారుడు సంధి. సంధి కుమారుడు అపర్షణుడు. అమర్షణుని కుమారుడు మహస్వంతుడు. అతని కుమారుడు విశ్వసాహ్వుడు. విశ్వసాహ్వుని కుమారుడు ప్రసేనజిత్తు. ప్రసేనజిత్తు కుమారుడు తక్షకుడు. తక్షకుని కుమారుడు బృహద్బలుడు. ఈబృహద్బలుడు మహాభారత యుద్ధంలో నీ తండ్రి అయిన అభిమన్యుని చేతిలో

మరణించాడు. ఇదీ ఇక్ష్వాకు వంశరాజుల చరిత్ర. వీరంతా కాలగర్భంలో కలిసిపోయారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇక్ష్వాకువంశములో రాబోవు రాజులను గురించి కూడా చెబుతాను విను. నీ తండ్రి అభిమన్యుని చేతిలో మరణించిన బృహద్బలుని కుమారుని పేరు బృహద్రణుడు. బృహద్రణుని కుమారుడు ఉరుక్రియుడు. ఉరుక్రియుని కుమారుడు వత్సవృద్ధుడు. వత్సవృద్ధుని కుమారుడు ప్రతివ్యోముడు. ప్రతివ్యోముని కుమారుడు భానుడు. భానుని కుమారుడు దివాకుడు. దివాకుని కుమారుడు సహదేవుడు. సహదేవుని కుమారుడు బృహదశ్వుడు. బృహదశ్వుని కుమారుడు భానుమంతుడు. భానుమంతుని కుమారుడు ప్రతీకాశ్వుడు. అతని కుమారుడు సుప్రతీకుడు. సుప్రతీకుని కుమారుడు మరుదేవుడు. మరుదేవుని కుమారుడు సునక్షత్రుడు. సునక్షత్రుని కుమారుడు పుష్కరుడు. పుష్కరుని కుమారుడు అంతరిక్షుడు. అంతరిక్షుని కుమారుడు సుతపసుడు. సుతపసుని కుమారుడు అమిత్రజిత్తు. అమిత్రజిత్తు కుమారుడు బృహద్రాజు. బృహద్రాజు కుమారుడు బర్హి. బర్హి కుమారుడు కృతంజయుడు. కృతంజయుని కుమారుడు రణంజయుడు. రణంజయుని కుమారుడు సంజయుడు. సంజయుని కుమారుడు శాక్యుడు. శాక్యుని కుమారుడు శుద్ధోదుడు.  శుద్ధోదుని కుమారుడు లాంగలుడు. లాంగలుని కుమారుడు ప్రసేనజిత్తు. ప్రసేనజిత్తు కుమారుడు క్షుద్రకుడు.  క్షుద్రకుని కుమారుడు రణకుడు. రణకుని కుమారుడు సురథుడు. సురథుని కుమారుని పేరు సుమిత్రుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ సుమిత్రుడే ఇక్ష్వాకు వంశములో చిట్టచివరి రాజు. వీరంతా బృహద్బలుని వంశములోని వారు. ఈ సుమిత్రునితో కలియుగంలో ఇక్ష్వాకు వంశము అంతరించి పోతుంది." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు ఇక్ష్వాకురాజుల వంశచరిత్రను వివరించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము పన్నెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ తత్సత్

శ్రీమద్భాగవతము

నవమస్కంధము

పదమూడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత కథలో భాగంగా నిమిచక్రవర్తి వంశ చరిత్రను ఈ విధంగా వివరిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఇక్ష్వాకు మహారాజుకు నిమి అనే కుమారుడు ఉన్నాడు.

(ఆరవ అధ్యాయమునాలుగవ శ్లోకము గుర్తుకు తెచ్చుకోండి. అందులో "మనువు కుమారుడు ఇక్ష్వాకువు. ఇక్ష్వాకువుకు నూర్గురు కుమారులు. అందులో వికుక్షి, నిమి, దండకుడు అనే ముగ్గురు పెద్దకుమారులు" అని చదివారు కదా! వారిలో నిమి గురించి ఇప్పుడు తెలుసుకుంటున్నాము. ఇంక చదవండి.)

ఇక్ష్వాకువు కుమారుడైన నిమి ఒక యజ్ఞము చేయడానికి సంకల్పించాడు. ఆ యజ్ఞానికి వశిష్టుని ఋత్విక్కుగా నియమించు కున్నాడు. నిమి యజ్ఞము మొదలుపెట్టబోతుంటే వశిష్ఠుడు నిమితో ఇలా అన్నాడు.

“మహారాజా! ఇంద్రుడు ఒక యాగము చేయ సంకల్పించాడు. ఆ యాగమునకు నన్ను ఋత్విక్కుగా నియమించాడు. ఆ విషయం మరిచిపోయి నీ యాగం చేస్తానని ఒప్పుకున్నాను. కాబట్టి ముందు ఇంద్రుని యాగము పూర్తి అయిన తరువాత నీవు చేయబోయే యాగమునకు ఋత్విక్కుగా ఉంటాను. కాబట్టి నేను వచ్చేవరకు నీవు వేచి ఉండు.” అని అన్నాడు.

ఆమాటలకు నిమి ఏమీ సమాధానము చెప్పలేదు. మౌనంగా ఉన్నాడు. తరువాత ఇంద్రుడు యాగము ఆరంభించాడు. ఆ యాగమునకు వశిష్ఠుడు ఋత్విక్కుగా ఉండి యాగము చేయిస్తున్నాడు.

“ఏకాలానికి ఏం జరుగుతుందో తెలియదు కదా. అందుకని వశిష్టుని కొరకు వేచి ఉండకుండా యాగము ఇప్పుడే చేయడం మంచిది” అని తలంచిన నిమి, వశిష్టునికి మారుగా మరొక ఋత్విక్కును నియమించుకొని యాగము మొదలుపెట్టాడు.

ఇంద్రుని యాగము పూర్తి కాగానే వశిష్ఠుడు నిమి దగ్గరకు వచ్చాడు. తను లేకుండానే యాగం జరగడం చూచాడు. కోపంతో మండి పడ్డాడు. “ఓనిమిచక్రవర్తీ! నీకు ఏమీ తెలియదు. కాని నీకు అన్నీ

తెలుసు అని అనుకుంటున్నావు. నీవే గొప్ప పండితుడనని గర్వపడుతున్నావు. అందుకని  నీ దేహము పతనమైపోవుగాక!" అని శపించాడు. తన తప్పు ఏమీ లేకుండా తనను శపించిన వశిష్ఠుని చూచి నిమికూడా ప్రతి శాపం ఇచ్చాడు. "కేవలము ఇంద్రుడు చేసే యాగములో వచ్చే ధనమునకు ఆశపడి, నా యజ్ఞమునకు ఋత్విక్కుగా ఉండటానికి నిరాకరించావు.   నీయొక్క జ్ఞానమును నశింపచేసుకున్నావు. కాబట్టి నీ శరీరం కూడా నా మాదిరే పతనమగును గాక!" అని తిరుగు శాపం ఇచ్చాడు.

ఒకరిని ఒకరు శపించుకోవడం వలన, నిమి, వశిష్ఠుడు వారి వారి దేహములను విడిచిపెట్టారు. వశిష్ఠుడు తన దేహమును విడిచిపెట్టిన వెంటనే, మిత్రా, వరుణుల ద్వారా ఊర్వశికి కుమారుడుగా జన్మించాడు.

యజ్ఞము చేసే సమయంలో నిమి దేహము పడిపోవడం వలన, ఆ యజ్ఞము చేస్తున్న ఋత్విక్కులు, నిమి దేహమును గంధము మొదలగు సుగంధ వస్తువులలో ఉంచి రక్షించారు. తరువాత యజ్ఞమును పూర్తిచేసారు.  నిమి తలపెట్టిన యజ్ఞము పూర్తి అయిన తరువాత ఋత్విక్కులు యజ్ఞమునకు వచ్చిన దేవతలతో ఇలా అన్నారు.

"ఓ దేవతలారా! మీరు ఈ యజ్ఞమునకు వచ్చారు. ఆహుతులు స్వీకరించారు. నిమి ఇచ్చిన ఆహుతులతో మీరు తృప్తి పడితే, ఈ నిమిని తిరిగి బతికించండి." అని వేడుకున్నారు. దేవతలు ఆ వరం ఇవ్వడానికి

ఒప్పుకున్నారు. ఇంతలో సూక్ష్మదేహంలో ఉన్న నిమి వారితో ఇలా అన్నాడు.

"నాకు మరలా ఈ దేహము ధరించవలెనని కోరిక, ఆశ లేదు. నా మనసు ఎల్లప్పుడు శ్రీహరి యందు లగ్నమై ఉంది. ఈ దేహము మీద నాకు వ్యామోహము లేదు. ఎందుకంటే ఈ దేహము శాశ్వతము కాదు. దేహధారులకు  నిరంతరము మృత్యుభయం వెంట తరుముతూ ఉంటుంది. ఎప్పుడో ఒకప్పుడు ఈ శరీరం పడి పోతుంది. అందుకని నాకు శ్రీహరి పాదసేవ చేసుకోవడంలోనే ఎక్కువ మక్కువ. కాబట్టి అశాశ్వతమైన ఈ దేహము నాకు  అవసరము లేదు." అని అన్నాడు నిమి.

అప్పుడు దేవతలు నిమితో ఇలా అన్నాడు. "ఓ నిమి చక్రవర్తీ! నీవు దేహము ధరించనవసరము లేదు. సూక్ష్మదేహముతో ఉండవచ్చును. నీవు మానవుల కనురెప్పల కదలికలలో ఉండు. రెప్పపాటులో ఉండు. స్వేచ్ఛగా కనురెప్పలు కదులుస్తూ ఉండు." అని వరం ఇచ్చారు. దేవతలు ఇచ్చిన వరం కారణంగా నిమి దేహధారుల కంటి రెప్పల మీద నివసించసాగాడు.

నిమి చక్రవర్తి మరలా దేహం ధరించడానికి ఇష్టపడకపోవడంతో, ఋత్విక్కులు  సందేహంలో పడ్డారు. నిమిచక్రవర్తి చనిపోగానే, రాజ్యం అరాచకం అయింది. అందుకని ఋత్విక్కులు నిమి శరీరాన్ని మథించసాగారు. ఆ మథనం ఫలితంగా ఒకకుమారుడు కలిగాడు. మథించడం వలనపుట్టాడు కాబట్టి ఆ కుమారునికి మిథిలుడు అని పేరు పెట్టారు. మామూలుగా కాకుండా

అసాధారణంగా జన్మించాడు  కాబట్టి ఆ కుమారునికి జనకుడు అని పేరు కూడా ఉంది. దేహము లేకుండా జన్మించాడు కాబట్టి వైదేహుడు అని కూడా నామాంతరము ఉంది.  ఆ మిథిలుడు నిర్మించిన నగరానికి మిథిలా నగరము అని పేరు వచ్చింది.

మిథిలుని కుమారుడు ఉదావసువు. ఉదావసువు కుమారుడు నందివర్ధనుడు. నందివర్ధనుని కుమారుడు సుకేతువు. సుకేతువు కుమారుడు దేవరాతుడు. దేవరాతుని కుమారుడు బృహద్రథుడు. బృహద్రథుని కుమారుడు మహావీర్యుడు. మహావీర్యుని కుమారుడు సుధృతి. సుధృతి కుమారుడు ధృష్టకేతువు. ధృష్టకేతువు కుమారుడు హర్యశ్వుడు.  హర్యశ్వుని కుమారుడు మరుడు. మరుని కుమారుడు ప్రతీపకుడు. ప్రతీపకుని కుమారుడు కృతరథుడు. కృతరథుని కుమారుడు దేవమీఢుడు. దేవమీఢుని కుమారుడు విశ్రు తుడు. విశ్రుతుని కుమారుడు మహాధృతి. మహాధృతి కుమారుడు కృతిరాతుడు. కృతిరాతుని కుమారుడు మహారోముడు. మహారోముని కుమారుడు స్వర్ణరోముడు. స్వర్ణరోముని కుమారుడు హ్రస్వరోముడు. హ్రస్వరోముని కుమారుడు శీరధ్వజుడు.

ఈ శీరధ్వజుడు ఒక యాగము చేయ సంకల్పించాడు. ఆ యాగము చేయడానికి భూమి చదును చేస్తున్నాడు. ఆ సమయంలో నాగలి చాలులో ఒక కుమార్తె జన్మించింది. ఆమె పేరు సీత. (నిమి కుమారుడైన జనకుని వంశములోని వారంతా జనకులు, వైదేహులు గానే పిలువబడ్డారు. అందుకని సీత తండ్రి పేరు కూడా జనకుడు, జనకమహారాజు అన్నారు.  వైదేహుని కుమార్తె కాబట్టి వైదేహి అని సీతకు పేరు. మిథిలా నగరంలో పుట్టింది కాబట్టి మైథిలి అనే పేరు

కూడా ఉంది. జనకుని కుమార్తె కాబట్టి జానకి అనికూడా పిలుస్తారు.)

శీరధ్వజునికి కుశధ్వజుడు అనే కుమారుడు కలిగాడు. కుశధ్వజుని కుమారుడు ధర్మధ్వజుడు. ధర్మధ్వజునికి ఇద్దరు కుమారులు. వారు  కృతధ్వజుడు. మితధ్వజుడు. కృతధ్వజుని కుమారుడు కేశిధ్వజుడు. మితధ్వజుని కుమారుడు ఖాండిక్యుడు. కేశిధ్వజునకు భయపడి  ఖాండిక్యుడు పారిపోయాడు.

కేశిధ్వజుని కుమారుడు భానుమానుడు. భానుమానుని కుమారుడు శతద్యుమ్నుడు. శతద్యుమ్నునికి శుచి అనే కుమారుడు కలిగాడు. శుచి కుమారుడు సనద్వాజుడు. సనద్వాజుని కుమారుడు ఊర్ధ్వకేతువు. ఊర్ధ్వకేతువు కుమారుడు అజుడు. అజుని కుమారుడు పురుజిత్తు. పురుజిత్తు కుమారుడు అరిష్టనేమి. అరిష్టనేమి కుమారుడు శ్రుతాయువు. శ్రుతాయువు కుమారుడు సుపార్శ్వుడు. సుపార్శ్వుని కుమారుడు చిత్రరథుడు. చిత్రరథుని కుమారుడు క్షేమాధి.  క్షేమాది కుమారుడు సమరథుడు. సమరథుని కుమారుడు సత్యరథుడు. సత్యరథుని కుమారుడు ఉపగురువు.

ఉపగురువునకు అగ్నిదేవుని అంశతో  ఉపగుప్తుడు అనే కుమారుడు జన్మించాడు.  ఉపగుప్తుని కుమారుడు  వస్వనంతుడు. వస్వనంతుని కుమారుడు యుయుధుడు. యుయుధుని కుమారుడు సుభాషణుడు. సుభాషణుని కుమారుడు శ్రుతుడు. శ్రుతుని కుమారుడు  జయుడు. జయుని కుమారుడు విజయుడు. విజయుని కుమారుడు ఋతుడు. ఋతుని కుమారుడు శునకుడు. శునకుని కుమారుడు వీతహవ్యుడు. వీతహవ్యుని కుమారుడు ధృతుడు. ధృతుని

కుమారుడు బహులాశ్వుడు. బహులాశ్వుని కుమారుడు కృతి. కృతి కుమారుడు మహావశి. వీరంతా మిథిల వంశమునకు చెందిన వారు.

ఈ మిథిల వంశములో పుట్టిన రాజులందరూ ఆత్మజ్ఞానము కలిగి ఉండి, సుఖదు:ఖములు, రాగద్వేషములు లేకుండా, ప్రజల మనస్సులు రంజిల్లేటట్టు పరిపాలించారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇది మిథిలా నగర రాజుల చరిత్ర. వీరితో సూర్యవంశరాజుల చరిత్ర పూర్తి అయింది. ఇంక చంద్రవంశ రాజుల చరిత్ర చెబుతాను విను." అని శుకమహర్షి చంద్రవంశరాజుల చరిత్రను చెప్పడంమొదలుపెట్టాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## నవమస్కంధము

## పదునాలుగవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చంద్రవంశపు రాజుల చరిత్రను ఈ విధంగా వివరిస్తున్నాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటి దాకా సూర్యవంశరాజుల చరిత్రను గురించి విన్నావు. ఇప్పుడు చంద్ర

వంశపు రాజుల చరిత్రను గురించి చెబుతాను. శ్రద్ధగా విను.

ప్రళయ కాలంలో ఈ విశ్వం అంతా జలమయం అయింది. ఆ జలంలో శ్రీమన్నారాయణ మూర్తి యోగసమాధిలో పడుకొని ఉన్నాడు. ఆ సమయంలో శ్రీమన్నారాయణుని నాభిలో నుండి ఒక పద్మము పుట్టింది. ఆ పద్మము మధ్యలో నుండి బ్రహ్మ ఉద్భవించాడు.

బ్రహ్మ యొక్క సంకల్పములోనుండి పుట్టిన వాడు అత్రి. అత్రి కూడా తన తండ్రి బ్రహ్మతో సమానంగా ప్రకాశించాడు. అత్రి మహాముని కంటి చూపు నుండి సోముడు ఉద్భవించాడు. బ్రహ్మగారు ఆ సోముని ఓషధులకు, బ్రాహ్మణులకు అధిపతిని చేసాడు. ఆ సోముడు మూడులోకములకు అధిపతి అయ్యాడు. సోముడికి గర్వం ఆవహించింది.

దేవతల గురువు బృహస్పతి. బృహస్పతి భార్య తార. సోముడు బ్రహస్పతి భార్య తారను కామించాడు. ఆమెను బృహస్పతి వద్దనుండి తీసుకొనివచ్చి తన ఇంట్లో ఉంచుకున్నాడు. బృహస్పతి ఎన్నిసార్లు వచ్చి బతిమాలినా, సోముడు తారను బృహస్పతివద్దకు పంపలేదు. ఈ విషయంలో దేవతలకు దానవులకు యుద్ధం జరిగింది.

రాక్షస గురువు శుక్రునికి దేవతల గురువు బృహస్పతికి మొదటి నుండి శత్రుత్వము. అందువలన శుక్రుడు సోముని పక్షాన చేరాడు. రుద్రునికి దేవతలు అన్నా దేవతల గురువు బృహస్పతి అన్నా అభిమానము. అందువలన రుద్రుడు బృహస్పతి పక్షాన చేరాడు. బృహస్పతి తన గురువు కాబట్టి, ఇంద్రుడు తన దేవతా గణములతో

బృహస్పతి పక్షాన నిలిచాడు. ఈ విధంగా ఒక స్త్రీ గురించి దేవతలకు, రాక్షసులకు యుద్ధం మొదలయింది.

ఈ విషయం బ్రహ్మకు తెలిసింది. అసలు విషయం ఏమిటో తెలుసుకుందామని బ్రహ్మ బృహస్పతి వద్దకు వచ్చాడు. బృహస్పతి బ్రహ్మతో, తన భార్య తారను సోముడు అపహరించి తన గృహములో ఉంచుకున్న విషయం చెప్పాడు. బ్రహ్మకు కోపం వచ్చింది. తన మనుమడు అయిన సోముని పిలిచి మందలించాడు. తారను తిరిగి బృహస్పతికి అప్పగించమని ఆజ్ఞాపించాడు. బ్రహ్మ ఆజ్ఞమేరకు సోముడు తారను తీసుకొని వచ్చి ఆమె భర్త బృహస్పతికి అప్పగించాడు.

అప్పటికే తార గర్భవతి అని తెలుసుకున్నాడు బృహస్పతి. కోపంతో మండి పడ్డాడు. "ఓసీ దుర్మార్గురాలా! నీవు నా భార్యవు. కాని నా వలన కాకుండా నీకు వేరు వాళ్లవలన గర్భం వచ్చింది. ఆ గర్భమును తీసివేయి. లేకపోతే నేను నిన్ను భస్మం చేస్తాను అని అనుకోకు. నా మాట విని ఆ గర్భం తీయించుకో. నాకు నీ వలన సంతానం పొందవలెనని కోరికగా ఉంది." అని బతిమాలాడు బృహస్పతి.

భర్త మాటలు విన్న తార సిగ్గుతో తలవంచుకుంది. నెలలునిండిన తారకు బంగారం మాదిరి ప్రకాశించే అందమైన కుమారుడు కలిగాడు. అందమైన, ప్రకాశవంతమైన బిడ్డను చూచి సోముడు, బృహస్పతి మోజుపడ్డారు. ఈ బిడ్డ నా కొడుకు అంటూ సోముడు, నా భార్యకు పుట్టాడు కాబట్టి నా కొడుకు అంటూ బృహస్పతి

వాదులాడుకుంటున్నారు.

ఇదంతా చూస్తున్న దేవతలు, మునులు, తారను పక్కకు తీసుకెళ్లి "ఇంతకూ ఈ బిడ్డ ఎవరికి పుట్టాడు నిజం చెప్పు." అని తారను అడిగారు. తారసిగ్గుతో సమాధానం చెప్పలేదు. ఇంక లాభం లేదని బ్రహ్మ కలుగజేసుకున్నాడు. తారను తనదగ్గరకు పిలిచాడు. "నిజం చెప్పు. ఈ బిడ్డ ఎవరికిపుట్టాడు." అని నిలదీసి అడిగాడు. తార సిగ్గుపడుతూ సోముడిని చూపించింది. "ఈ బిడ్డ సోముడి బిడ్డ" అని సమాధానం చెప్పింది. సోముడు సంతోషంతో ఆ బిడ్డను తన కుమారునిగా స్వీకరించాడు.

బ్రహ్మ ఆ కుమారుడికి బుధుడు అని నామకరణం చేసాడు. సోముడు తన కుమారుని చూచి సంతోషపడ్డాడు. బుధునికి ఇలాదేవి వలన ఒక కుమారుడు కలిగాడు. అతని పేరు పురూరవుడు.(ఈ పురూరవుడు ఎలా పుట్టింది మనము నవమస్కంధము మొదటి అధ్యాయంలో చదువుకున్నాము.) పురూరవుడు చాలా అందంగా ఉంటాడు.

ఒక రోజు దేవతల సభలో నారదుడు పురూరవుని అందచందములను, గుణగణములను గొప్పగా వర్ణిస్తుంటే, అప్సరస అయిన ఊర్వశి చెవులారా విని, పురూరవుని మీద మనసు పడింది. మన్మథబాధకు తట్టుకోలేక పురూరవుని వద్దకు బయలుదేరింది. మధ్యలో మిత్రుడు, వరుణుడు ఆమెను అడ్డగించి ఆమెను తమ కోర్కెతీర్చమని అడిగారు. ఊర్వశి నిరాకరించింది. ఊర్వశిని మానవ కాంతగా మారిపొమ్మని శపించారు. ఆ శాపవశాత్తు ఊర్వశి మానవ

కాంతగా మారి మానవలోకంలో ఉన్న పురూరవుని వద్దకు వెళ్లిపోయింది.

ఊర్వశిని చూచి పురూరవుడు ఆనందంతో పొంగిపోయాడు. ఆమెతో ఇలా అన్నాడు. "ఓ సుందరీ! నీకు నా హృదయపూర్వక స్వాగతం పలుకుతున్నాను. రా! కూర్చో! నేను నీకు ఏమి సేవచేయగలనో చెప్పు. మనం ఇద్దరం ఈ ఉద్యానవనములో విహరిద్దాము. ఆనందపుటంచుల దాకా వెళ్దాము." అని అన్నాడు.

ఆ మాటలకు ఊర్వశి ఇలా బదులు చెప్పింది. "ఓ మన్మధాకారా! నీ వంటి అందగాడిని ఏ స్త్రీఅయినా వదులుకుంటుందా! నా మనస్సు నీ మీద లగ్నం అయింది. అందుకే నేను నిన్ను వెదుక్కుంటూ వచ్చాను. నేను అప్సరసను. కాని మానవశరీరమును పొందాను. నన్ను నీవు పొందాలంటే కొన్ని నియమాలు ఉన్నాయి. నా వద్ద రెండు మేకలు ఉన్నాయి వాటిని నేను నా కుమారుల మాదిరి పెంచుకుంటున్నాను. వాటిని నీ వద్ద వదులుతున్నాను. వాటిని నీవు పెంచి పోషించు. వాటికి ఏ హానీ కలుగకుండా చూడు. మనం ఇద్దరం రతీమన్మధుల వలె సుఖములు అనుభవిద్దాము. కాని ఒక విషయం గుర్తుపెట్టుకో. మనం ఇద్దరం శారీరకంగా కలిపినప్పుడు తప్ప, నీవు నాకు ఒంటిమీద బట్టలు లేకుండా నగ్నంగా కనపడకూడదు. అలా కనపడిన మరుక్షణం నేను నిన్ను వదిలి వెళ్లిపోతాను." అని చెప్పింది.

పురూరవుడు ఆమె చెప్పిన మాటలకు ఒప్పుకున్నాడు. ఆ మేకల పోషణభారం వహించాడు. ఆ రోజునుండి ఊర్వశీ పురూరవుడు వారి

ఇష్టం వచ్చినట్టు యధేచ్ఛగా విహరించసాగారు. సుఖభోగాలు అనుభవించసాగారు.  వారికి రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి.

ఇది ఇలా ఉండగా,  దేవలోకంలో ఇంద్రుడికి అందరు అప్సరసలు కనపడుతున్నారు కానీ ఊర్వశి కనపడటం లేదు. ఊర్వశి ఏమయిందని ఇతర అప్సరసలను అడిగాడు. వారు ఊర్వశి పురూరవుని మోహించి, అతని వద్ద ఉందని చెప్పారు. వెంటనే ఇంద్రుడు ఇద్దరు గంధర్వులను పిలిచి ఊర్వశిని దేవలోకమునకు తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. ఊర్వశి కోసరం గంధర్వులు మానవలోకానికి వచ్చారు.

అర్ధరాత్రి సమయంలో  గంధర్వులు ఊర్వశి ప్రాణప్రదంగా పెంచుకుంటున్న మేకలను దొంగిలించారు. గంధర్వులు మేకలను తీసుకుపోతుంటే ఆ మేకలు గట్టిగా అరిచాయి. ఆ అరుపులు విని ఊర్వశి నిద్రలేచింది. పక్కనే పడుకొని ఉన్న పురూరవుని నిద్రలేపింది. కాని పురూరవుడు నిద్రలేవలేదు. ఊర్వశి పురూరవుని తిట్టడం మొదలుపెట్టింది.

“ఏ మాత్రం వీరత్వం లేనివాడు, పిరికిపంద, భయస్తుడు, దుర్మార్గుడు నాకు భర్తగా దొరికాడు. నా మేకలను కూడా కాపాడలేకపోతున్నాడు. వీడివల్ల నా మేకలు పోయాయి. వీడు నా మేకలను రక్షిస్తాడని నమ్మి వీడి దగ్గర వదిలిపెట్టాను. ఇప్పుడు ఆ మేకలను దొంగలు ఎత్తుకుపోయారు. నేనేం చెయ్యాలి. సాధారణంగా స్త్రీలే భయస్తులు అనుకుంటాను. కానీ నా మొగుడు ఆడవాళ్లకంటే భయస్తుడు. వీడు పగలే మగాడు మాదిరి మీసాలు మెలివేస్తాడు.

రాత్రిళ్లు ఆడదానికంటే అధ్వాన్నము." అనితిట్టడం మొదలుపెట్టింది. ఊర్వశి మాటలకు పురూరవునికి రోషం వచ్చింది. పడక మీదినుండి లేచాడు. పక్కనే ఉన్న ఖడ్గము అందుకున్నాడు. దొంగల వెంట పడ్డాడు.

ఆ సమయంలో తన ఒంటి మీద బట్టలు లేవన్న సంగతి గమనించలేదు పురూరవుడు. ఇదే సమయమని గంధర్వులు మేకలను వదిలిపెట్టి పురూరవునిమీద వెలుగులు విరజిమ్మారు. పురూరవుడి ఒంటిమీద బట్టలు లేకుండా నగ్నంగా నిలబడి ఉండటం ఊర్వశి చూచింది. అన్నమాట ప్రకారం ఊర్వశి పురూరవుని వదిలిపెట్టి మేకలతో సహా గంధర్వుల వెంట దేవలోకమునకు వెళ్లిపోయింది.

పురూరవునికి దిక్కు తోచలేదు. ఊర్వశి కోసరం ఏడుస్తున్నాడు. నేల మీద పడి దొర్లుతున్నాడు. పిచ్చివాడి వలె తిరుగుతున్నాడు. అలా తిరుగుతున్నప్పుడు ఒక సారి సరస్వతీ నదీతీరంలో ఊర్వశిని ఆమె చెలికత్తెలతో విహరిస్తూ ఉండగా చూచాడు. ఊర్వశితో ఇలా అన్నాడు.

"ఓ లలనామణీ! నన్నుఈ ప్రకారంగా విడిచిపెట్టి వెళ్లిపోవడం నీకు న్యాయమేనా! నీకోసరం నేను ఎంతగా పరితపిస్తున్నానో చూడు! నీవు అంతగా నన్ను వదిలిపెట్టి శాశ్వతంగా వెళ్లిపోవాలనుకుంటే నేను చెప్పే నాలుగు మాటలు ప్రశాంతంగా విను. తరువాత నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి. నీవు నన్ను విడిచిపెట్టి వెళ్లిపోయిన మరుక్షణం నా శరీరం ఇక్కడే పడిపోతుంది. నీ ప్రేమను పొందలేని ఈ శరీరం కాకులకు, గ్రద్దలకు ఆహారం అవుతంది." అని అన్నాడు.

ఆ మాటలు విన్న ఊర్వశి పురూరవునితో ఇలా అంది. “ఓ రాజా!నీవు పురుషుడవు. ఈ ప్రకారంగా బేలగా, దీనంగా మాట్లాడటం నీకు తగదు. నా కోసరం నీ ప్రాణాలు పోగొట్టుకోవద్దు. ధైర్యం తెచ్చుకో. కేవలం ఇంద్రియ సుఖం కోసరం నీ ప్రాణాలు ఎందుకు వదులుతావు. నేను దేవకాంతను. అప్సరసను. మాకు ఒక పురుషుడు అనే నియమం లేదు. ఎవరినంటే వారిని వరించగలము. మేము ఒకే పురుషునితో ఉండాలంటే కుదరదు కదా!

నీకు తెలుసు కదా!సాధారణంగా స్త్రీలు చంచలస్వభావులు. వారికి దయ, జాలి ఉండవు. ఏ చిన్న తప్పును కూడా సహించలేరు. తమ సుఖం కోసరం ఎటువంటి పని చేయడానికైనా వెనుకాడరు. చిన్న చిన్న కారణంగా, స్త్రీలు భర్త ప్రాణాలు, సోదరుల ప్రాణాలు తీయడానికైనా వెనుకాడరు. మేము దేవ వేశ్యలము. మాకు ఎవరి మీదా నిజమైన ప్రేమ ఉండదు. మాది అంతా కపట ప్రేమ. మాకు ప్రతి రోజూ కొత్త కొత్త పురుషుల పొందు కావాలి.

కాని నిన్ను చూస్తే నాకు జాలిగా ఉంది. కాబట్టి సంవత్సరంలో ఒక రోజు మాత్రము నాతో విహరించగలవు. ఆ ఒక్కరోజు నన్ను పొందడం వలన నీకు సంతానం కలుగుతుంది. నీ వంశం వృద్ధిఅవుతుంది.” అనిపలికింది.

ఊర్వశి ఇచ్చిన మాట ప్రకారము ఆ సంవత్సరము ఆఖరులో పురూరవుని వద్దకు వచ్చింది. ఒకరోజు అతనితో సుఖంగా, సంతోషంగా గడిపింది. మరునాడు ఊర్వశి వెళ్లిపోబోతుంటే పురూరవుడు ఆమెను వదలలేదు. ఏడుస్తున్నాడు. పురూరవుని చూచి

ఊర్వశి ఇలా అంది. "మహారాజా! నీవు నా కోసరం ఇంతగా పరితపిస్తున్నావు కాబట్టి నీవు గంధర్వులను వేడుకో. నేను ఇంకా గంధర్వుల అధీనంలోనే ఉన్నాను కాబట్టి వారు నన్ను నీకు ఇవ్వగలరు." అని చెప్పింది.

పురూరవుడు సంతోషంతో గంధర్వులను ప్రార్థించాడు. పురూరవుని ప్రార్థనలకు గంధర్వులు ప్రసన్నులయ్యారు. గంధర్వులు పురూరవునికి ఒక అగ్నిస్థాలిని (అగ్నిని ఉంచే పాత్ర) ఇచ్చారు. పురూరవుడు ఆ అగ్ని స్థాలిని ఊర్వశి అనుకుంటూ ఆ అడవి అంతా తిరిగాడు. .కొన్నాళ్ల తరువాత ఆమె ఊర్వశి కాదు అగ్నిస్థాలి అని తెలుసుకున్నాడు. వెంటనే పురూరవుడు అగ్నిస్థాలిని అడవిలో ఒక చోట వదిలిపెట్టి తన మందిరమునకు వచ్చాడు. ఒంటరిగా కూర్చుని ఊర్వశిని ధ్యానించసాగాడు.

అప్పుడే కృతయుగము అంతరించి త్రేతాయుగము ఆరంభం అయింది. పురూరవుని మనసులో కర్మను గూర్చి బోధించే మూడు వేదములు స్ఫురించాయి. ఆవిధంగా మూడు వేదముల ఆవిర్భావము జరిగింది. జ్ఞానోదయము కలిగిన పురూరవుడు తాను అగ్నిస్థాలిని వదిలిపెట్టిన స్థలమునకు వెళ్లాడు. ఆ ప్రదేశములో ఉన్న శమీవృక్షములో ఒక రావి చెట్టు మొలిచి ఉంది. పురూరవుడు ఆ వృక్షముల యొక్క కొయ్యతో రెండు అరణులను తయారు చేసాడు. (నిప్పు పుట్టించడానికి ఉపయోగించే సాధనములను అరణులు అంటారు). పురూరవుడు ఊర్వశిని స్మరిస్తూ  ఆ అరణులను మధించసాగాడు. అప్పుడు అగ్ని పుట్టింది. పురూరవుడికి అగ్ని పుత్రసమానుడు అయ్యాడు.

ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అనే మూడు అగ్నులు ఉద్భవించాయి. ఆహవనీయాగ్నిని ఉపయోగించి ఊర్వశి లోకము పొందడానికి పురూరవుడు శ్రీహరిని గూర్చి ఒక మహాయజ్ఞము చేసాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! కృతయుగములో ఓంకారము అనగా ప్రణవమే వేదము. అనగా వేదము బీజాక్షర రూపంలో ఉండేది. నారాయణుడే సేవించదగినవాడు. నారాయణుడు కాకుండా సేవించడానికి వేరే ఏ విధమైన దేవతలు కల్పింపబడలేదు. . అగ్ని ద్వారా నారాయణుని సేవించేవారు. ఆ రోజుల్లో ఒకే వర్ణము ఉండేది. అదే బ్రాహ్మణ వర్ణము.

కృతయుగము అంతరించి త్రేతాయుగము ఆరంభం కాగానే పురూరవుని వలన కర్మకాండల సంబంధమైన మూడు వేదములు ఏర్పడ్డాయి. (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము. ఈ మూడు వేదములలో చెప్పగా మిగిలిన విషయములు అధర్వణ వేదంలో చెప్పబడ్డాయి. అందుకని అధర్వణవేదమును వేదశాఖగా పరిగణించలేదు.) అరణులను ఉపయోగించి అగ్నిని సృష్టించాడు కాబట్టి అగ్ని పురూరవునికి పుత్రసమానమయింది. తరువాత పురూరవుడు ఊర్వశి వెంట గంధర్వలోకమునకు వెళ్లిపోయాడు."అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఊర్వశీ పురూరవుల వృత్తాంతమును వినిపించాడు.

(ఈ కథ చదవడానికి వింతగా ఉంది కదూ! ఈ కథ ఋగ్వేదములో 10వ మండలంలో, 95వ అనువాకంలో ఉంది. ఈ మేకల కథను

వేదంలోనూ, భాగవతంలోనూ రాయడం అవసరమా అని సందేహం కలుగుతుంది. మా గురువుగారు దీనికి ఒక వివరణ ఇచ్చారు. దానిని మీకు తెలియజేస్తున్నాను.

ఊర్వశి దేవకాంత. దేవత. అంటే దైవ స్వరూపము. పురూరవుడు మానవుడు. అంటే నరుడు. రెండు మేకలు భక్తి, శ్రద్ధ.

"నన్ను పొందాలంటే నీవు ఈ రెండు మేకలను జాగ్రత్తగా పోషించాలి. నువ్వు నగ్నంగా నాకు కనపడకూడదు." అని నియమాలుపెట్టింది. అంటే భగవంతుని పొందాలంటే భక్తి, శ్రద్ధ ముఖ్యము అని భావన. నగ్నంగా ఉండటం అంటే అజ్ఞానంలో పడిపోవడం.

మనుషులను మాయ, మోహము ఆవరించినట్టే, పురూరవుని కూడా గంధర్వుల రూపంలో మాయ ఆవహించింది. అతని వద్దనుండి రెండు మేకలను అనగా భక్తి, శ్రద్ధలను దూరం చేసింది. ఎప్పుడైతే భక్తి, శ్రద్ధ పోయాయో, పురూరవుని అవిద్య, అజ్ఞానము, అంటే నగ్నంగా ఉండటం, ఆవహించాయి. అదే నగ్నత్వము. ఒంటి మీద బట్ట ఉందో లేదో కూడా తెలియకపోవడం. ఒళ్లు తెలియని అహంకారము.

ఎప్పుడైతే అజ్ఞానము ఆవహించిందో, ఊర్వశి వెళ్లిపోయింది. అజ్ఞానము, అహంకారము ఆవహించిన నాడు, భగవంతుడు మానవుడికి దూరం అవుతాడు.

పురూరవుడు ఊర్వశి కోసరం వెదికినట్టు, మానవుడు భగవంతుని కోసరం గుళ్లగోపురాలు వెదుకుతాడు. కాని భగవంతుడు ఎక్కడా కనిపించడు. తుదకు ఇంటికి తిరిగివచ్చి ఒంటరిగా కూర్చుని నిర్మలమైన మనస్సుతో ధ్యానం చేస్తాడు. పురూరవుడికి మూడు వేదాలు స్ఫురించినట్టు, మానవునికి కూడా ఆత్మసాక్షాత్కారం అవుతుంది.

ఇదీ ఈ కథకు అంతరార్థము. భాగతంలో కథలన్నీ ఇలాగా భావగర్భితంగా ఉంటాయి. వాటిని కథమాదిరి చదివితే లౌకికమైన కథమాత్రమే కనిపిస్తుంది. నేను తెలుసుకున్న విషయాలు మీకు చెప్పాను.)

శ్రీమద్భాగవతము

నవమస్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

నవమస్కంధము

పదునైదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు పరశురాముని వృత్తాంతమును ఈవిధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఇలాదేవి కుమారుడు అయిన పురూరవునకు, ఊర్వశికి ఆరుగురు కుమారులు జన్మించారు. వారి పేర్లు ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయువు, జయ, విజయ.

శ్రుతాయువు కుమారుడు వసుమానుడు. సత్యాయువు కుమారుడు శ్రుతంజయుడు. రయుని కుమారుడు ఏకుడు. జయుని కుమారుడు అమితుడు. విజయుని కుమారుడు భీముడు.

భీముని కుమారుడు కాంచనుడు. కాంచనుడికి హెూత్రకుడు జన్మించాడు. హెూత్రకుని కుమారుడు జహ్నువు. ఆయన తన దోసిలితో గంగను తాగాడు. అందుకని గంగకు జాహ్నవి అనే పేరు వచ్చింది. జహ్నువు కుమారుడు పురుడు. పురుని కుమారుడు బలాకుడు. బలాకుని కుమారుడు ఆత్మజుడు. ఆత్మజుని కుమారుడు కుశుడు.

కుశునికి నలుగురు కుమారులు జన్మించారు. వారి పేర్లు కుశాంబువు, తనయుడు, వసువు, కుశనాభుడు. వారిలో కుశాంభువు కుమారుడు గాధి. గాధి కుమార్తె పేరు సత్యవతి.

ఋచీకుడు అనే బ్రాహ్మణుడు, గాధి వద్దకు పోయి సత్యవతిని తనకు ఇచ్చి వివాహము చేయమని అడిగాడు. తన కుమార్తెను ఋచీకునకు ఇచ్చి వివాహం చేయడానికి ఇష్టం లేని గాధి అతనితో ఇలా అన్నాడు. "విప్రోత్తమా! మీరు బ్రాహ్మణులు. మేము క్షత్రియులము. నా కుమార్తెకు మీకు కన్యాశుల్కముగా రెండు చెవులలో ఒక చెవి నల్లగా ఉన్న వేయి తెల్లటి గుర్రములు, ఇస్తే ఈ వివాహము జరిపిస్తాను." అని అన్నాడు.

ఋచీకునకు అసలు విషయం అర్థం అయింది. వెంటనే ఋచీకుడు వరుణుని వద్దకు వెళ్లాడు. ఒకచెవి నల్లగా ఉన్న వేయి

తెల్లగుర్రములు కావాలని అడిగాడు. వరుణుడు ఆయన కోరికను మన్నించాడు. ఆ గుర్రములను తెచ్చి గాధికి ఇచ్చి సత్యవతిని వివాహం చేసుకున్నాడు ఋచీకుడు.

కొంతకాలం గడిచింది. సత్యవతికి, ఆమె తల్లికి అంటే గాధి భార్యకు మగసంతానము లేరు. అందుకని ఋచీకుడు ఒకయజ్ఞము చేసాడు. తాను బ్రాహ్మణుడు కాబట్టి తన భార్య సత్యవతికి బ్రహ్మ మంత్రములతోనూ; గాధి క్షత్రియుడు కాబట్టి, సత్యవతి తల్లికి అంటే అత్తగారికి క్షత్రియమంత్రములతోనూ యజ్ఞము చేసాడు. అదే ప్రకారము రెండు చరువులను(ఆహుతులను) తయారు చేసాడు. బ్రహ్మ మంత్రములతో వండిన చరువును తన భార్య సత్యవతికి ఇచ్చాడు. క్షాత్ర మంత్రములతో వండిన చరువును తన అత్తగారికి ఇచ్చాడు. ఇద్దరినీ ఆ చరువులో ఉన్న పదార్థమును ఆరగించమని చెప్పాడు. తరువాత స్నానమునకు వెళ్లాడు.

సత్యవతికి కానీ, సత్యవతి తల్లికి గానీ, ఆ చరువులు ఒకటి బ్రాహ్మ మంత్రములతోనూ, మరొకటి క్షాత్ర మంత్రములతోనూ వండినవి అని తెలియదు. ఇవేమీ తెలియని సత్యవతి తల్లికి ఒక దుర్బుద్ధి పుట్టింది. ఋచీకుడు తన భార్య సత్యవతికి శ్రేష్టమైన చరువును తయారు చేసి ఉంటాడు. అది తను తీసుకుంటే తనకు మంచి సంతానము కలుగుతుంది అని అనుకొంది. కుమార్తె సత్యవతిని పిలిచి చరువులు మార్చుకుందాము అని అడిగింది.

ఈ విషయం తెలియని సత్యవతి, తనకు ప్రత్యేకించిన బ్రాహ్మణ మంత్రములతో తయారు చేయబడిన చరువును తల్లికి ఇచ్చింది. క్షాత్ర

మంత్రములతో తయారు చేయబడిన చరువును తను తీసుకొంది. ఇద్దరూ చరువులు మార్చుకొని ఆరగించారు. స్నానము ముగించుకొని వచ్చిన ఋచీకుడు జరిగిన విషయంతెలుసుకున్నాడు. భార్య సత్యవతితో ఇలా అన్నాడు.

"నీవు తప్పు చేసావు. నీకు పరమ సాత్వికుడు అయిన బ్రాహ్మణుడు కుమారుడు కావాలని కోరుకున్నాను. కానీ నీకు పరమకిరాతకుడైన క్షత్రధర్మము అవలంబించే కుమారుడు జన్మిస్తాడు. కాని నీ తల్లికి పరమ నిష్టాగరిష్టుడు బ్రహ్మర్షి అయిన కుమారుడు జన్మిస్తాడు. ఇది మీరు చరువులు మార్చుకున్న దానికి ఫలితము." అని అన్నాడు.

ఆ మాటలకు ఋచీకుని భార్య సత్యవతి ఎంతో బాధ పడింది. తనకు కూడా సాత్వికుడు అయిన కుమారుడు కావాలని అడిగింది. ఋచీకుడు ఆమె మీద దయ తలిచాడు. "నీ విషయంలో చిన్న మార్పు చేస్తున్నాను. నీకు  పరమ సాత్వికుడు అయిన కుమారుడు జన్మిస్తాడు. కానీ నీ మనుమడు మాత్రము క్షాత్రధర్మము అవలంబిస్తాడు." అని అన్నాడు.

కాలం గడిచింది. సత్యవతికి జమదగ్ని అనే కుమారుడు జన్మించాడు. జమదగ్ని రేణుక అనే కన్యను వివాహంచేసుకున్నాడు. వారికి వసుమానుడు మొదలగు వారు పుత్రులుగా జన్మించారు. వారిలో ఆఖరి వాడి పేరు రాముడు. ఈ రాముని పండితులు సాక్షాత్తు విష్ణువు అవతారము అని కీర్తించారు. ఈ రాముడు పరశురాముడై

కార్తవీర్యార్జునుని సంహరించాడు. క్షత్రియుల మీద కోపంతో వారి మీద ఇరవై ఒక్క సార్లు దండెత్తి, క్షత్రియ కులమును సర్వనాశనం చేసాడు.

ఆ రోజుల్లో క్షత్రియులు రజోగుణ ప్రధానులు. అత్యంత గర్వంతో విర్రవీగుతుంటేవారు. అధర్మాన్ని అత్యంత ప్రీతితో ఆచరించేవారు. అటువంటి క్షత్రియులను నిర్మూలించి ధర్మమును నిలబెట్టడానికి పరశు రాముడు క్షత్రియకులమునుసర్వనాశనం చేసాడు." అని చెప్పాడు శుక మహర్షి.

ఇంతలో పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహము కలిగింది. "మునీంద్రా! ఎవరో ఒకరు తప్పు చేస్తే తప్పుచేసిన వారిని శిక్షించాలి కానీ, ఈ ప్రకారంగా క్షత్రియులను అందరినీ చంపడానికి, క్షత్రియ వంశమునిర్మూలించడానికి కారణం ఏమైనా ఉందా!" అని అడిగాడు. దానికి శుకమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"పరీక్షిత్ మహారాజా! ఆ రోజుల్లో కార్తవీర్యార్జునుడు అనే క్షత్రియుడు ఉండేవాడు. అతడు హైహయదేశాధి పతి. ఆయన దత్తాత్రేయుని ఆరాధించేవాడు. దత్తాత్రేయుని ఆరాధించిన ఫలితంగా కార్తవీర్యుడు, వేయి చేతులు, ఎటువంటి శత్రువునైనా జయించే పరాక్రమము, ఇంద్రియ పటుత్వము, అపారమైన ధనము, సంపదలు, తేజస్సు, కీర్తి, అణిమాది అష్టసిద్ధులు, పొందాడు. మూడు లోకములలో తనకు ఎదురు లేదనే గర్వంతో ఇష్టం వచ్చినట్టు తిరుగుతున్నాడు.

ఒక రోజు కార్తవీర్యుడు తన భార్యలతో నర్మదా నదిలో జలకాలాటలు ఆడుతున్నాడు. తన వేయి చేతులు అడ్డు పెట్టి నర్మదా

నదీ ప్రవాహమును ఆపాడు.

ఆ సమయంలో రావణుడు నర్మదా నదీ తీరంలో విడిది చేసి ఉన్నాడు. కార్తవీర్యుడు చేతులు అడ్డు పెట్టడం వలన నర్మదా నదీ ప్రవాహము వెనక్కు తన్ని, ఒడ్డున ఉన్న రావణుని శిబిరము ఆ ప్రవాహములో కొట్టుకుపోయింది. రావణునికి పట్టరాని కోపం వచ్చింది. కార్తవీర్యుని వద్దకు పోయి చెడా మడా తిట్టాడు. తన భార్యల ముందు తనను అవమానించిన రావణుని కార్తవీర్యుడు కట్టి పడేసాడు. తన రాజధానికి ఈడ్చుకొని వెళ్లాడు. కొంతకాలము బంధించి ఉంచి తరువాత విడిచిపెట్టాడు. అంతటి పరాక్రమ వంతుడు కార్తవీర్యుడు.

ఒకరోజు కార్తవీర్యుడు తన పరివారముతో వేటకు వెళ్లాడు. దారిలో జమదగ్ని ఆశ్రమమును చూచాడు. ఆశ్రమానికి వెళ్లి జమదగ్నికి నమస్కరించాడు. జమదగ్ని కార్తవీర్యునికి, అతని పరివారమునకు, తన వద్ద ఉన్న కామధేనువు సాయంతో,  అతిథి మర్యాదలు చేసాడు.

తనకు, తన పరివారమునకు, తన సైన్యమునకు చిటికలో సకల పదార్థము లను సమకూర్చిన కామధేనువును చూచి కార్తవీర్యుడు అసూయ పడ్డాడు. అటువంటి కామధేనువు తన వద్ద ఉండాలని అనుకున్నాడు. జమదగ్నిని తనకు కామధేనువును ఇమ్మని అడిగాడు. జమదగ్ని నిరాకరించాడు. కార్తవీర్యునికి కోపంవచ్చింది. కామధేనువును బంధించితీసుకు రమ్మని తన అనుచరులను ఆదేశించాడు.

సైనికులు తనను బంధించి తీసుకువెళుతుంటే, కామధేనువు దీనంగా అరిచింది. కామధేనువు దూడ కూడా హృదయ విదారకంగా ఏడ్చింది. కాని కార్తవీర్యుడు కనికరం లేకుండా కామధేనువును, దాని దూడను బంధించి తన రాజధాని అయిన మాహిష్మతీ పురమునకు తీసుకొని వెళ్లాడు.

ఇదంతా జరిగిన సమయంలో జమదగ్ని కుమారుడు రాముడు ఆశ్రమంలో లేడు. రాముడు ఆశ్రమానికి వచ్చిన తరువాత జరిగింది అంతా విన్నాడు. కోపంతో ఊగిపోయాడు. ధనుర్బాణములను, గండ్రగొడ్డలిని (పరశువు) తీసుకొని మాహిష్మతి పురమునకు వెళ్లాడు. అప్పుడే తన పురములోకి ప్రవేశిస్తున్న కార్తవీర్యుడు ధనుర్బాణములను ధరించి తన మీదికి వస్తున్న రాముని చూచాడు. వెంటనే రాముని మీదికి తన సైన్యమును పంపాడు.రాముడు ఒంటరి గానే, తన అస్త్ర విద్యా కౌశలంతో, కార్తవీర్యుని పదిహేడు అక్షౌహిణుల సైన్యమును సర్వనాశనం చేసాడు. మిగిలిన వారిని, పారిపోయేవారిని తన పరశు వుతో కాళ్లు చేతులు, తలలు నరికాడు.

ఇదిచూచిన కార్తవీర్యుడు స్వయంగా రామునితో యుద్ధానికి తలపడ్డాడు. తనవేయి చేతులతో ఐదువందల ధనుస్సులు తీసుకొని ఐదువందల బాణములను ఒకేసారి ప్రయోగించాడు. రాముడు ఒకే ధనుస్సు ధరించి ఆ ఐదువందలబాణములను మధ్యలోనే విరిచాడు. అంతటితో ఆగకుండా కార్తవీర్యుని ధనుస్సులను, అమ్ములపొదులను కూడా ధ్వంసం చేసాడు. కార్తవీర్యుడు వృక్షములను పెరికి రాముని మీదికి విసిరాడు. రాముడు తన వాడి అయిన బాణములతో కార్తవీర్యుని చేతులను నరికాడు. చేతులు తెగి కూలబడిన కార్తవీర్యుని

తలను ఒకే బాణంతో ఎగురగొట్టాడు రాముడు. కార్తవీర్యుని సేనలు చెల్లాచెదరు అయ్యారు. కార్తవీర్యుని కుమారులు భయంతో పారిపోయారు. రాముడు కామధేనువును,దూడను తీసుకొని వచ్చి జమదగ్నికి అప్పగించాడు.

రాముడు చేసిన పనికి జమదగ్ని బాధపడ్డాడు. కుమారుడు రామునితో ఇలా అన్నాడు. "రామా! నీవు వేదవేదాంగపారంగతుడైన రాజును చంపావు. నీకుపాపం చుట్టుకుంది. కుమారా! మనము బ్రాహ్మణులము, సత్వగుణ ప్రధానులము. మనకు క్షమ, ఓర్పు ప్రధాన గుణములు. ఆ కారణంచేతనే బ్రాహ్మణులను అందరూ పూజిస్తారు, గౌరవిస్తారు. బ్రహ్మ కూడా ఈ క్షమాగుణముతోనే కదా త్రిమూర్తులలో ఒకడయ్యాడు. కాబట్టి బ్రాహ్మణులయొక్క సంపదలు, కీర్తి అన్నీ ఓర్పు, క్షమాగుణముల వలననే వృద్ధిపొందుతాయి. ఓర్పు, క్షమ ఉన్న బ్రాహ్మణులను శ్రీమహావిష్ణువు కూడా పూజిస్తాడు. అందరినీ పరిపాలించే రాజును చంపడం అంటే బ్రాహ్మణుని చంపడం కంటే పాపం. . నీకు చుట్టుకున్న ఆ పాపం పోవాలంటే నీవు తీర్థయాత్రలు చెయ్యాలి. నీవు పరమాత్మయందు మనస్సు లగ్నం చేసి, తీర్థయాత్రలు చేసి, ఈ పాపము నుండి విముక్తుడివి కా!" అని ఉపదేశించాడు జమదగ్ని." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు పరశురాముని వృత్తాంతమును వివరించాడు.

శ్రీమద్భాగవతము
నవమస్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## నవమస్కంధము
## పదునారవ అధ్యాయము.

శుక మహర్షి పరశురాముని వృత్తాంతమును ఈ విధంగా వివరించసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! తనతండ్రి జమదగ్ని ఆదేశము ప్రకారము రాముడు ఒక సంవత్సరము పాటు అన్ని తీర్థయాత్రలు చేసి తిరిగి ఆశ్రమమునకు వచ్చాడు.

ఒక రోజు జమదగ్ని భార్య రేణుక నీళ్లు తీసుకురావడానికి సమీపములో ఉన్న సరోవరమునకు వెళ్లింది. ఆ సమయంలో ఆ సరోవరములో ఒక గంధర్వరాజు తన భార్యలతో జలకాలాడుతున్నాడు. అందంగాఉన్న ఆ గంధర్వరాజును చూచి రేణుక మనస్సు చలించింది. అతని మీద మోహపరవశురాలయింది. ఆ గంధర్వరాజును చూస్తూ అతని అందాన్ని ఆస్వాదిస్తూ అలాగే నిలబడి పోయింది.

ఇంతలో హెూమం చెయ్యాల్సిన సమయం దాటి పోయింది. అయినా ఆమెకు ఇంటికి వెళ్లాలని తోచలేదు. ఇంతలో ఆ గంధర్వుడు వెళ్లిపోయాడు. రేణుక జలము తీసుకొని ఆశ్రమమునకు వచ్చింది. అప్పటికే జమదగ్ని తన భార్య మనసులో రేగిన కామ కోరికలను, మానసిక వ్యభిచారమును దివ్యదృష్టిద్వారా గ్రహించాడు. వెంటనే తన కుమారులను పిలిచాడు.

"కుమారులారా! ఈమె మీ తల్లి. ఈమె తప్పు చేసింది. ఈమె జీవించడానికి అర్హురాలు కాదు. వెంటనే ఈమెను చంపండి." అని ఆజ్ఞాపించాడు.

తల్లిని చంపడానికి ఎవరూ ముందుకు రాలేదు. జమదగ్నికి ఇంకా కోపం వచ్చింది. ఆఖరు కుమారుడైన రాముని పిలిచాడు. "నీ తల్లి తప్పు చేసింది. నీ సోదరులు నా ఆజ్ఞను ధిక్కరించారు. కాబట్టి నీ తల్లిని, సోదరులను చంపు." అని ఆజ్ఞాపించాడు.

రాముడు తనలో తాను ఇలా ఆలోచించాడు. "నా తండ్రి తపోధనుడు. ప్రభావశాలి. ఏమైనాచెయ్యగలడు. ఇప్పుడు నేను ఆయన మాట వినకపోతే నన్ను శపిస్తాడు. నా తల్లిని, సోదరులను భస్మం చేయగలడు. నా తండ్రి మాట పాటిస్తే ఆయన సంతోషిస్తాడు. నాకు వరాలు ఇస్తాడు. అప్పుడు నా తల్లిని, సోదరులను బతికించుకోవచ్చు. కాబట్టి తండ్రి ఆజ్ఞను పాటించడమే ఉత్తమము" అని అనుకున్నాడు.

వెంటనే తన గండ్రగొడ్డలిని తీసుకున్నాడు. తల్లిని, సోదరుల తలలను ఒక్కవేటుతో నరికాడు. తన ఆజ్ఞను పాటించిన రాముని చూచి జమదగ్ని ఎంతో సంతోషించాడు. "కుమారా! నీకు ఏం వరం కావాలో కోరుకో. ఇస్తాను." అని అన్నాడు. "తండ్రీ! ఇప్పుడు నేను చంపిన వారిని అందరినీ బతికించు. కాని వారికి ఇప్పుడు జరిగింది అంతా జ్ఞాపకం లేకుండా చెయ్యి. అంటే నేను వారిని చంపినట్టు, నీవు వారిని బతికించినట్టు వారికి తెలియకూడదు. అలాంటివరం ప్రసాదించు." అని కోరాడు.

కుమారుని తెలివికి సంతోషించాడు జమదగ్ని. తన భార్యను, కుమారులను మరలా జీవింపచేసాడు. వారు నిద్రనుండిలేచినట్టు లేచారు. ఏంజరిగిందో వారికి గుర్తులేదు. రేణుక నీళ్లు తీసుకొని లోపలకు వెళ్లింది. ఆమె కుమారులు తమ పనులమీద తాము వెళ్లారు.

ఓ పరీక్షిత్ మహారాజా! రాముడికి తన తండ్రి తపోశక్తి గురించి బాగాతెలుసు. వారు తిరిగి బతుకుతారని తెలుసు. అందుకనే తల్లిని, సోదరులనుసంహరించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇక్కడి పరిస్థితి ఇలా ఉంటే, అక్కడ మాహిష్మతీ పురంలో కార్తవీర్యుని కుమారులు, తమ తండ్రిని చంపిన రాముని మీద పగతో రగిలి పోతున్నారు. ప్రతీకారము తీర్చుకోడానికి తగిన సమయం కొరకు ఎదురుచూస్తున్నారు. వారంతా రాముని చంపడానికి జమదగ్ని ఆశ్రమానికి వచ్చారు.

ఆ సమయంలో రాముడు, తన సోదరులతో సహా సమిధల కొరకు అడవిలోకి వెళ్లాడు. ఆశ్రమంలో జమదగ్ని, రేణుక ఉన్నారు. తమ తండ్రి చావుకు కారణమైన జమదగ్నిని చూడగానే వారికి కోపం మిన్నుముట్టింది. వెంటనే వారందరూ కలిసి జమదగ్ని చంపడానికి ప్రయత్నించారు. రేణుక అడ్డుపడింది. భర్తను చంప వద్దని కన్నీటితో ప్రార్థించింది. కాళ్లావేళ్లా పడి బతిమాలింది. తన కుమారుడు వచ్చేదాకా వేచి ఉండమని వేడుకుంది. కాని కార్తవీర్యుని కుమారులు ఆమె మాటలు వినలేదు. జమదగ్ని తల నరికారు. జమదగ్ని తలను తమతో తీసుకొని  మాహిష్మతీ పురమునకు వెళ్లిపోయారు.

కొంతసేపు తరువాత రాముడు తన సోదరులతో సహా సమిధలు తీసుకొని ఆశ్రమానికి తిరిగివచ్చాడు. కుమారులను చూడగానే రేణుక గుండెలు బాదుకుంటూ ఏడుస్తూ జరిగిన విషయం కుమారులకు వివరించింది.

తల్లి చెప్పిన మాటలు, తండ్రి మరణం చూచి తట్టుకోలేక పోయాడు రాముడు. కోపంతో రగిలిపోయాడు. వెంటనే పరశువును తీసుకున్నాడు. మాహిష్మతీ పురమునకు వెళ్లాడు. దొరికిన వాడిని దొరికినట్టు కార్తవీర్యుని కుమారుల తలలు నరికాడు. మాహిష్మతీ పురముమధ్యలో తాను నరికిన తలలను ఒక పెద్దగుట్టగా పోసాడు. బ్రాహ్మణులను ద్వేషించే వారికి భయం కలిగేటట్టు కార్తవీర్యుని కుమారుల రక్తం ఏరులుగా పారించాడు.

ఆ సమయంలో రాజ్యములను పరిపాలిస్తున్న క్షత్రియులు అధర్మపరులు, బ్రహ్మద్వేషులు. అన్యాయంగా ప్రజలను బాధలకు గురిచేయసాగారు. తన తండ్రిని ఒక క్షత్రియుడు చంపాడు అన్న సాకు పెట్టి, రాముడు లోకంలో ఉన్న క్షత్రియుల నందరిమీదా ఇరవై ఒక్క సార్లు దండెత్తి, క్షత్రియుల నందరినీ సంహరించాడు. క్షత్రియ కులమును సర్వనాశనం చేసాడు. తాను నరికిన క్షత్రియుల రక్తముతో ఐదు మడుగులను ఏర్పరిచాడు. ఆ ప్రదేశమునే శమంతక పంచకము అని పిలుస్తారు. అక్కడే భీమునికి సుయోధనునికి గదాయుద్ధము జరిగింది.

తరువాత రాముడు తన తండ్రి తలను ఆయన దేహమునకు అంటించినట్టు పెట్టాడు. ఆ దేహమును దర్భల మీద పడుకోబెట్టాడు. ఎదురుగా కూర్చుని వాయుదేవునిగురించి ఒకయజ్ఞం చేసాడు. ఆ యజ్ఞం పూర్తి కాగానే తాను లోకంలో ఉన్న రాజులను చంపి స్వాధీనం చేసుకున్న రాజ్యములను బ్రాహ్మణులకు, ఋత్విక్కులకు దానం చేసాడు. తరువాత యజ్ఞము ఆఖరున చేసే స్నానము చేసాడు. తాను చేసిన పాపములను అన్నిటినీ పోగొట్టుకున్నాడు.

రాముని తండ్రి జమదగ్ని సప్తఋషులలో ఒకడుగా విరాజిల్లాడు. తరువాత రాముడు సరస్వతీ నదీతీరంలో తపస్సుచేసుకుంటున్నాడు. ఈ రాముడే రాబోవు మన్వంతరములో సప్తఋషులలో ఒక ఋషిగా విరాజిల్లుతాడు. వేదములను లోకములో ప్రచారం చేస్తాడు. రాముడు నేటికి కూడా మహేంద్రపర్వతము మీద తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన చిరంజీవి. సిద్ధులు, చారణులు, గంధర్వులు రాముని సేవిస్తూ ఉంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ ప్రకారంగా శ్రీహరి పరశు రామునిగా అవతరించి, దుష్టులైన, అధర్మపరులైన, భూమికి భారంగా పరిణమించిన క్షత్రియులను సంహరించి తిరిగి ధర్మమును ప్రతిష్ఠించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటి దాకా ఋచీకుని భార్య సత్యవతి కుమారుడు బ్రాహ్మణ్యమును అవలంబించిన జమదగ్ని, ఆయన కుమారుడు క్షాత్రము అవలంబించిన పరశురాముని గురించి చెప్పాను. ఈ విధంగా ఋచీకుడు తన భార్య సత్యవతికి ఇచ్చిన మాట

నెరవేరింది.

సత్యవతి తల్లి, ఋచీకుని అత్తగారు, అంటే గాధి భార్యకు ఒక కుమారుడు కలిగాడు. ఆయన పేరు విశ్వామిత్రుడు. గాధి కుమారుడు కాబట్టి  గాధేయుడు అని కూడా అంటారు. విశ్వామిత్రుడు క్షత్రియుడుగా జన్మించినా, తరువాత తపస్సు చేసి రాజర్షి అయ్యాడు. తరువాత  బ్రహ్మర్షి అయ్యాడు. సృష్టికి ప్రతిసృష్టి చేసినఘనత ఈయనదే.

ఈ విశ్వామిత్రునకు నూరుగురు కుమారులు. ఆ కాలంలో హరిశ్చంద్రుడు అనే చక్రవర్తి ఒక యజ్ఞము చేస్తున్నాడు. యజ్ఞములో బలి ఇవ్వడానికి ఒక పశువును ఊపస్తంభమునకు కట్టారు. హరిశ్చంద్రుడు చేసే యజ్ఞమును భగ్నం చేయడానికి, ఇంద్రుడు ఆ యజ్ఞపశువును అపహరించాడు. యజ్ఞపశువును వెతుక్కుంటూ హరిశ్చంద్రుడు బయలు దేరాడు.

పశువుకు బదులు మనిషినే బలి ఇద్దామని అనుకున్నాడు హరిశ్చంద్రుడు. అజీగర్తుడు అనే బ్రాహ్మణునికి ముగ్గురు కుమారులు. వారిలో మధ్యముడు మధుచ్ఛందసుడు. పెద్దవాడి మీద తండ్రికి ప్రేమ. చిన్న వాడి మీద తల్లికి ప్రేమ. ఎటువంటి ప్రేమకు నోచుకోని మధ్యవాడైన మధుచ్ఛందసుని యజ్ఞ పశువుగా హరిశ్చంద్రునికి అమ్మాడు అజీగర్తుడు. మధుచ్ఛందసుని తీసుకొని హరిశ్చంద్రుడు తన నగరానికి వస్తున్నాడు. మధ్యదారిలో వీరు విశ్వామిత్రుని ఆశ్రమంలో ఒక రాత్రి ఉన్నారు.

మధుచ్ఛందసుడు విశ్వామిత్రునికి తన బాధ చెప్పుకున్నాడు. విశ్వామిత్రుడు మధుచ్ఛందసుని తన  కుమారుడిగా స్వీకరించాడు. విశ్వామిత్రుని ఆదేశము ప్రకారము, మధుచ్ఛందసుడు యజ్ఞములో తనను బలి ఇచ్చే సమయములో బ్రహ్మను, లోకపాలకులను, అగ్నిని భక్తి శ్రద్ధలతో ప్రార్థించాడు. బ్రహ్మ అతని ప్రార్థనలకు మెచ్చి అతనిని బలి ఇవ్వకుండా విముక్తుడిని చేసాడు. అప్పటి నుండి మధుచ్ఛందసుడు దేవరాతుడు అనే పేరుతో పిలువబడ్డాడు.

మధుచ్ఛందసుడు తిరిగి విశ్వామిత్రుని వద్దకు వచ్చాడు. విశ్వామిత్రుడు తనకుమారులను పిలిచి మధుచ్ఛందసుని తన 51వ కుమారుడిగా అంటే మధ్యమ కుమారుడిగా స్వీకరించమని ఆదేశించాడు. కాని విశ్వామిత్రుని మొదటి యాభై మంది కుమారులు దీనికి అంగీకరించలేదు. విశ్వామిత్రుడు వారిని మ్లేచ్ఛులు కమ్మని శపించాడు. విశ్వామిత్రుని మిగిలిన యాభై మంది కుమారులు మధుచ్ఛందసుని తమ అన్నగా స్వీకరించడానికి అంగీకరించారు. విశ్వామిత్రుడు సంతోషించి వారిని పుత్ర,పౌత్రులతో కలకాలం జీవించమని ఆశీర్వదించాడు. విశ్వామిత్రుని పేరు మీద కౌశిక గోత్రము ఏర్పడింది.

ఓ పరీక్షిత్ మహారాజా! విశ్వామిత్రునకు అష్టకుడు, హారీతుడు, జయుడు, క్రతుమంతుడు అనే కుమారులు ఉన్నారు. విశ్వామిత్రుని చేత కొంత మంది శపించబడ్డారు. దేవరాతుని పుత్రునిగా స్వీకరించారు. కొంతమంది విశ్వామిత్రుని అనుగ్రహానికి పాత్రులయ్యారు. కాబట్టి ఈ కౌశిక గోత్రమునకు నానారకాల ఋషులతో ప్రవరలు ఏర్పడ్డాయి. దేవరాతుడు వారిలో చేరడమే దీనికి

కారణము." అని శుక మహర్షి విశ్వామిత్రుని వంశ చరిత్రను వివరించాడు.

శ్రీమద్భాగవతము
నవమస్కంధము పదునారవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
నవమస్కంధము
పదునేడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు పురూరవుని కుమారుల వంశముల గురించి ఈ విధంగా చెప్పాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! పురూరవుడికి ఆయువు అనే కుమారుడు జన్మించాడు. ఆయువుకు నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజి, రంభుడు, అనేనసుడు అనే కుమారులు జన్మించారు. వారిలో క్షత్రవృద్ధుని వంశము గురించి చెబుతాను విను.

క్షత్రవృద్ధుని కుమారుడు సుహోత్రుడు. సుహోత్రునికి కాశ్యుడు, కుశుడు, గృత్సమధుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. వారిలో గృత్సమధునకు శునకుడు, శునకునకు శౌనకుడు జన్మించారు. శౌనకుడు మహాఋషి అయ్యాడు. సుహోత్రుని

కుమారుడు అయిన కాశ్యునకు కాశి అనే కుమారుడు కలిగాడు. కాశి కుమారుడు రాష్ట్రుడు. రాష్ట్రునకు దీర్ఘతమసుడు, దీర్ఘతమసునికి ధన్వంతరి  జన్మించారు. ఈ ధన్వంతరి ఆయుర్వేద వైద్యమునకు ఆద్యుడు. ఈయన సాక్షాత్తు విష్ణ్వంశ సంభూతుడు. ఈయన పేరు స్మరిస్తేనే సకల రోగాలు నశిస్తాయి అని ప్రతీతి.

ధన్వంతరి కుమారుడు కేతుమంతుడు. కేతుమంతుని కుమారుడు భీమరథుడు. భీమరథుని కుమారుడు దివోదాసుడు. దివోదాసుని కుమారుడు ద్యుమంతుడు. ఈ ద్యుమంతునికి శత్రుజిత్తు, వత్సుడు, ఋతధ్వజుడు,  కువలయాశ్వుడు, అనే పేర్లుకూడా ఉన్నాయి.

ద్యుమంతుడి కుమారుడు అలర్కుడు. ఈ అలర్కుడు 60,000 సంవత్సరములు ఈ భూమిని పరిపాలించాడు. ఈవంశములో ఒక్క అలర్కుడే ఇంత కాలము భూమిని పరి పాలించాడు.

అలర్కుని కుమారుడు సన్తతి. సన్తతి కుమారుడు సునీథుడు. సునీథుని కుమారుడు ధర్మకేతువు. ధర్మకేతువు కుమారుడు సత్యకేతువు.  సత్యకేతువు కుమారుడు ధృష్టకేతువు. ధృష్టకేతువు కుమారుడు సుకుమారుడు. సుకుమారుని కుమారుడు వీతిహోత్రుడు. వీతిహోత్రుని కుమారుడు భర్గుడు. భర్గుని కుమారుడు భార్గభూమి. వీరంతా కాశి అనే రాజు సంతానము. వీరంతా క్షత్రవృద్ధుని వంశములోని వారు.

పురూరవుని నాలుగవ కుమారుడు రంభుడు. రంభుని కుమారుడు రభసుడు. రభసుని కుమారుడు గంభీరుడు. గంభీరుని

కుమారుడు అక్రియుడు. అక్రియుని కుమారుడు బ్రహ్మవేత్త.

పురూరవుని ఐదవ కుమారుడు అనేనసుడు. అనేనసుని కుమారుడు శుద్ధుడు. శుద్ధుని కుమారుడు శుచి. శుచి కుమారుడు చిత్రకృత్తు. చిత్రకృత్తుని కుమారుడు శాంతరజుడు. ఇతడు ఆత్మ తత్వమును తెలుసుకున్నాడు. ఇతనికి కుమారులు లేరు.

పురూరవుని మూడవకుమారుడు రజి.  ఈ రజికి 500 మంది పరాక్రమవంతులైన కుమారులు జన్మించారు. దేవతల కోరిక మేరకు ఈ రజి తన కుమారులతో కలిసి దానవులతో యుద్ధం చేసి, ఇంద్రునికి స్వర్గ సింహాసనమును ఇచ్చాడు. కాని దీనికి ప్రహ్లాదుడు మొదలగు అసుర చక్రవర్తులు ఒప్పుకోలేదు. వారికి భయపడి ఇంద్రుడు స్వర్గ సింహాసనమును తిరిగి రజికి అప్పగించాడు. తాను కూడా రజికి దాసుడు అయ్యాడు.

రజి మరణించిన తరువాత రజి పుత్రులు స్వర్గాధిపతులు అయ్యారు. స్వర్గాధిపత్యమును తిరిగి తనకు ఇమ్మని ఇంద్రుడు రజి కుమారులను అడిగాడు. కాని వారు స్వర్గమును వదులుకోడానికి ఒప్పుకోలేదు. ఇంద్రుడికి యజ్ఞములో భాగము మాత్రము ఇస్తామన్నారు.

ఇంద్రుడు దేవ గురువు బృహస్పతిని ఏదైనా ఉపాయం చెప్పమని అడిగాడు. దేవగురువు బృహస్పతి అభిచార హెూమము చేసి రజి కుమారుల బుద్ధి పెడతోవ పట్టేటట్టు అధర్మమార్గంలో ప్రవర్తించేటట్టు చేసాడు. రజి కుమారులు ధర్మం తప్పారు. నీతి తప్పారు. ఇదే అదనుగా భావించి ఇంద్రుడు రజి కుమారులను ఐదువందల

మందినీ, ఒక్కరు కూడా మిగలకుండా, చంపాడు. అలా వారి వంశము అంతరించింది.

క్షత్రవృద్ధుని కుమారుడు సుహోత్రుడు. సుహోత్రుని కుమారుడైన కుశుడు అనే వాడికి ప్రతి అనే వాడు జన్మించాడు. ప్రతి కుమారుడు సంజయుడు. సంజయుని కుమారుడు జయుడు, జయుని కుమారుడు కృతుడు, కృతుని కుమారుడు హర్యబలుడు. హర్యబలుని కుమారుడు సహదేవుడు. సహదేవుని కుమారుడు హీనుడు. హీనుడి కుమారుడు జయసేనుడు. జయసేనుని కుమారుడు సంకృతి. సంకృతి కుమారుడు జయుడు. వీరందరూ క్షత్రవృద్ధుని వంశములోని వారు.

పురూరవునికి ఆయువు, ఆయువు పెద్ద కుమారుడు నహుషుడు అని చెప్పానుకదా. ఆ నహుషుని వృత్తాంతమును చెబుతాను విను." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుడు నహుషుని చరిత్ర చెప్పసాగాడు.

శ్రీమద్భాగవతము
నవమ స్కంధము పదిహేడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# నవమ స్కంధము

## పదునెనిమిదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవతపురాణములో అంతర్భాగమైన యయాతి చరిత్రను ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! పురూరవునికి ఆయువు అనే కుమారుడు, ఆయువుకు నహుషుడు అనే కుమారుడు కలిగారు అని చెప్పాను కదా. నహుషునకు యతి,యయాతి, సంయాతి, ఆయాతి, వియతి, కృతి అనే పేర్లుగల ఆరుగురు కుమారులు కలిగారు. అందులో యతి అనే వాడు రాజ్యము చేయడానికి ఇష్ట పడలేదు. తపస్సుకు వెళ్లి పోయాడు.

వృత్రాసురుని చంపినందుకు గాను ఇంద్రునికి బ్రహ్మహత్యా పాతకము చుట్టుకుంది. ఇంద్రుడు స్వర్గమును వదిలిపెట్టి వెళ్లిపోయాడు. నహుషుడు నూరు అశ్వమేధయాగములు చేసిన కారణంగా ఇంద్రపదవికి అర్హుడయ్యాడు. ఇంద్రపదవిని అలంకరించాడు. ఇంద్రపదవి వలన వచ్చిన అహంకారంతో నహుషుడు ఇంద్రుడి భార్య శచీదేవిని కామించాడు. ఆమె వద్దకు వెళ్లడానికి తాను ఎక్కిన పల్లకీని సప్తఋషుల చేత మోయించి వారిని అవమానించాడు. వారు నహుషుని కొండచిలువగా పడి ఉండమని శపించారు. మీ తాత గారు ధర్మరాజుగారి దయవలన నహుషునికి శాపవిమోచన కలిగింది.

నహుషుని తరువాత యయాతి రాజయ్యాడు. యయాతి తాను చక్రవర్తిగా ఉంటూ తన నలుగురు తమ్ములను నాలుగు దిక్కులకు రాజులుగా చేసాడు. యయాతి క్షత్రియుడు. కాని బ్రాహ్మణుడు, రాక్షస గురువు అయిన శుక్రాచార్యుల వారి కుమార్తె దేవయానిని వివాహం చేసుకున్నాడు." అని చెప్పగానే పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహం తలెత్తింది.

"ఓ శుకమహర్షీ! ఆనాటి ధర్మము ప్రకారము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు తమతమ వర్ణముల లోని కన్యలనే కాకుండా, బ్రాహ్మణులు తరువాతి మూడు వర్ణముల లోని కన్యలను, క్షత్రియుడు తరువాతి రెండు వర్ణముల లోని కన్యలను, వైశ్యుడు తరువాత వర్ణమైన శూద్ర కన్యను వివాహ మాడటం ధర్మం కదా. దానికి విరుద్ధంగా, క్షత్రియుడైన యయాతి బ్రాహ్మణకన్య అయిన దేవయానిని వివాహమాడటంఎలా సంభవించింది. అది ధర్మవిరుద్ధముకదా!" అని అడిగాడు. దానికి శు కుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీవు చెప్పింది నిజమే. కాని ఒకానొక విచిత్ర సంఘటన వలన అలా జరిగింది. వివరంగా చెబుతాను.

వృషపర్వుడు రాక్షస రాజు. ఆయన కుమార్తె పేరు శర్మిష్ట. రాక్షసుల కుల గురువు శుక్రాచార్యుడు వృషపర్వుని వద్ద గురువుగా, పురోహితుడుగా ఉండేవాడు. రాజకుమార్తె శర్మిష్ట, గురుపుత్రిక దేవయాని చాలా స్నేహంగా ఉండేవారు.

ఒక రోజు శర్మిష్ఠ, దేవయాని ఇంకా చెలులు అందరూ కలిసి విహరించడానికి సమీపంలో ఉన్న ఉద్యాన వనానికి వెళ్లారు. కొంత సేపు విహరించిన తరువాత, వారు సమీపములో ఉన్న జలాశయములో జలక్రీడలు ఆడుదాము అని అనుకున్నారు. అందరూ తమ తమ దుస్తులు విప్పి గట్టు మీద పెట్టి నగ్నంగా జలాశయములోకి దిగారు. కొంత సేపు జలక్రీడలు సలిపారు.

ఇంతలో పరమేశ్వరుడు, తన భార్య ఉమాదేవితో తన వాహనము ఐన వృషభమును ఎక్కి అటుగా వచ్చాడు. పరమేశ్వరుని చూచిన వీరుసిగ్గు పడి గబా గబా గట్టు మీదికి వచ్చి తమ తమ దుస్తులు ధరించసాగారు. ఆ కంగారులో చూచుకోకుండా గురుపుత్రిక దేవయాని దుస్తులు రాజకుమార్తె అయిన శర్మిష్ఠ ధరించింది. ఇది చూచిన దేవయాని కోపంతో మండి పడింది.

"నీవు ఒక రాక్షస కన్యవు. నేను బ్రాహ్మణ కన్యను. యజ్ఞములో హవిస్సును కుక్క ముట్టినట్టు, నువ్వు నా దుస్తులు వేసుకుంటావా! బ్రాహ్మణులు అంటే ఎవరనుకున్నావు? సాక్షాత్తు విష్ణువుకు ముఖస్వరూపులు. (బ్రాహ్మణోస్య ముఖమాసీత్). బ్రాహ్మణులకు సాక్షాత్తు విష్ణువే నమస్కరిస్తాడు. బ్రాహ్మణులు మూడులోకముల వారిచేత పూజింపబడతారు. మేము బ్రాహ్మణులమేకాదు. పవిత్రమైన భృగు వంశములోని వారము. రాక్షస రాజైన నీ తండ్రి ప్రతిరోజూ నా తండ్రికి నమస్కరిస్తాడు, పూజిస్తాడు. ఆయన ఆజ్ఞలను పాటిస్తాడు. మీరు మాసేవకులు. అటువంటిది నువ్వు నా దుస్తులు ధరిస్తావా! నీకు ఎంత ధైర్యము."అని తిట్టింది దేవయాని.

దేవయాని మాట్లాడినమాటలకు రాజకుమార్తె శర్మిష్టకు కోపం మిన్నుముట్టింది. దేవయానిని చూచి ఇలా అంది. “ఓసీ భిక్షుకీ! నువ్వు ఎవరో నీ స్థితి ఏమిటో తెలియకుండామాట్లాడుతున్నావు! నీవు, నీ తండ్రి మేము వేసే ఎంగిలి మెతుకులకు ఆశపడి కాకుల వలె మా దగ్గర పడిగాపులు కాస్తున్నారు. నీవు నన్ను దూషిస్తావా! నీకు తగిన శిక్ష విధిస్తాను.” అంటూ శర్మిష్ట దేవయాని దుస్తులు లాక్కొని ఆమెను సమీపములో ఉన్న బావిలో తోసేసింది. తరువాత తనచెలికత్తెలతో కలిసి తన భవనమునకువెళ్లిపోయింది.

అదే సమయానికి వేటకు వచ్చిన యయాతి మహారాజు, దాహంవేసి ఆ బావి వద్దకు వచ్చాడు. బావిలోపలకు తొంగి చూచాడు. బావిలోపల, బట్టలు లేకుండా నగ్నంగాఉన్న దేవయాని కనపడింది. అయ్యోపాపం అనుకొని యయాతి తాను పైన ధరించిన ఉత్తరీయమును దేవయానికి అందించాడు. దేవయాని ఆ ఉత్తరీయమును ధరించింది. తరువాత యయాతి తన కుడి చేతిని ఆమెకు అందించాడు. (అదే ఆయన చేసిన పొరపాటు). దేవయాని యయాతి కుడి చేతిని పట్టుకొని బావి లోనుండి బయటకు వచ్చింది.

దేవయాని యయాతి మహారాజుతో ఇలా అంది.

“ఓ వీరుడా! నీవు ఎవరో నాకు తెలియదు.కాని నువ్వు నా కుడిచేతిని పట్టుకున్నావు. మనకు పాణిగ్రహణము అయింది. నువ్వు పట్టుకున్న నా కుడిచేతిని మరొకరు పట్టుకోడానికి నేను ఇష్టపడను. కాబట్టి నువ్వే నా భర్తవు. ఇది దైవ సంకల్పము. కాబట్టి నన్ను వివాహమాడు.

ఓ వీరుడా! నేను విధివశాత్తు బావిలో పడిపోయాను. నువ్వు నన్ను చూచావు. నాకు నీదర్శనముకలిగింది. ఇది ఈశ్వర సంకల్పమే కాని వేరుకాదు. అంతేకాదు. ఇంతకు పూర్వము నేను, నా తండ్రి వద్ద విద్యాభ్యాసము చేయుచున్న బృహస్పతి కుమారుడైన కచుని ప్రేమించాను. భర్తగా వరించాను. కాని కచుడు నా ప్రేమను తిరస్కరించాడు. నేను కచుని శపించాను. దానికి ప్రతిగా కచుడు, "నీకు బ్రాహ్మణుడు భర్త కాజాలడు." అని తిరుగు శాపం పెట్టాడు. ఆ శాపం ఈనాటికి ఇలా ఫలించింది. కాబట్టి ఈ నాటి నుండి నువ్వే నా భర్తవు." అని పలికింది దేవయాని.

ఒక క్షత్రియుడు బ్రాహ్మణ కన్యను వివాహం చేసుకోవడం శాస్త్ర సమ్మతం కాదు అని తెలిసినా, దైవము అలా రాసిపెట్టి ఉంటే తాను ఏమీచేయలేనని అనుకొన్న యయాతి, దేవయాని మాటలకు అంగీకరించాడు. దేవయానిని భార్యగా స్వీకరించాడు. అక్కడి నుండి రాజధానికి వెళ్లిపోయాడు.

దేవయాని తన ఇంటికి వెళ్లింది. తన తండ్రితో ఏడుస్తూ జరిగిన విషయములు అన్నీ చెప్పింది. శుక్రాచార్యుల వారికి కోపం అంతలో దు:ఖం వచ్చింది.

"ఛీ ఛీ ఈ రాజపురోహితుని పదవిలో ఉండబట్టికదా ఇన్ని మాటలు పడవలసి వచ్చింది. అసలు పౌరోహిత్యము చేయడం కన్నా మహాపాపం మరొకటి లేదు. ఈ రాజపురోహితుని పదవిలో ఉండి రాజుల చేత మాటలుపడుతూ రాజభోగములు అనుభవించేకంటే,

భిక్షాటన చేసి బతకడం మేలు. తనకు తన కుమార్తె దేవయానికి గౌరవం మర్యాద లేని చోట ఉండటం మంచిది కాదు" అని తలంచిన శుక్రాచార్యులు తన కూతురు దేవయానితో సహా నగరం విడిచి వెళ్లిపోయాడు.

ఈ విషయం తెలుసుకున్న వృషపర్వ మహారాజు పరుగు పరుగున వెళ్లి శుక్రాచార్యుల వారి కాళ్ల మీద పడి తన కూతురు చేసిన తప్పు క్షమించమని వేడుకున్నాడు. వృషపర్వ మహారాజు తన కాళ్ల మీద పడగానే, శుక్రాచార్యుల వారి కోపము మంచువలె కరిగిపోయింది.

"మహారాజా! నేను ఏమీ చేయలేను. నీ కుమార్తె నా కుమార్తెను అవమానించింది. నా కుమార్తె దేవయాని ఏమి చెయ్యమంటే అది చేస్తానని మాట ఇచ్చాను. అంతా ఆమెఇష్టం. నాకుమార్తెను విడిచి నేను బతకలేను. ఆమెకు ఇష్టం లేని పనీ ఏది చేయను." అని అన్నాడు.

వృషపర్వుడు దేవయాని వంక చూచాడు. దేవయాని వృషపర్వమహారాజుతో ఇలా అంది. "మహారాజా! తమరి కుమార్తె శర్మిష్ట, ఆమె వేయిమంది దాసీలు, ఈ రోజునుండి నాకు దాసీలుగా ఉండాలి. నేను ఎవరిని వివాహం చేసుకున్నా, నేను ఎవరి ఇంటికి వెళ్లినా, ఆమె నా దాసిగా నా తోపాటు రావాలి. ఇదేనా నిర్ణయం." అని పలికింది దేవయాని.

ఇది అసాధారణము అని అనుకున్నాడు వృషపర్వుడు. కాని కుల గురువు శుక్రాచార్యుని వదులుకోలేడు. శుక్రాచార్యుడు కోపిస్తే తనకు కష్టాలు తప్పవు. అనిఅనుకున్నాడు. తన కుమార్తె శర్మిష్టను ఒప్పించి, ఆమెను దేవయానికి దాసిగా ఉంచాడు. తండ్రి ఆజ్ఞ ప్రకారము శర్మిష్ట తన వెయ్యి మంది చెలికత్తెలతో, దేవయానికి సేవలుచేయసాగింది.

తరువాత దేవయానికి యయాతి మహారాజుతో వివాహం జరిగింది. దేవయానిని యయాతితో పంపేటప్పుడు శుక్రాచార్యుడు యయాతితో ఒక మాట చెప్పాడు.

“మహారాజా! నా కూతురు దేవయానికి, రాజకుమార్తె శర్మిష్టను దాసిగా పంపుతున్నాను. నాకుమార్తెకు దాసి అయిన శర్మిష్టకు నీవుఎన్ని రకాల భోగములు కల్పించినా నాకు అభ్యంతరము లేదు. కాని శర్మిష్టకు నీతో పడక సుఖమును అనుభవించే అవకాశము మాత్రము ఇవ్వకు. శర్మిష్టకు నీ వలన సంతానము కలగటం దేవయానికి ఇష్టం లేదు. ఇది నా ఆదేశము.” అని అన్నాడు. ఆ మాటలకు యయాతి అంగీకరించాడు. దేవయాని యయాతి వెంట ఆయనపురమునకు వెళ్లింది. దేవయాని వెంట శర్మిష్ట కూడా దాసిగావెళ్లింది.

కాలం గడిచింది. యయాతి వలన దేవయానికి యదువు, తుర్వసుడు అనే ఇద్దరు కుమారులు కలిగారు. ఇది చూచిన శర్మిష్ట తనకుకూడా సంతానముకలగ నందుకు బాధ పడింది. శర్మిష్ట ఒక

రోజు ఒంటరిగాఉన్న యయాతినికలిసి, తనకు సంతానము ప్రసాదించమని కోరింది.

"ఒక స్త్రీ వచ్చి తనకు ధర్మబద్ధంగా సంతానము ప్రసాదించమని కోరితే కాదనడం ధర్మం కాదు" అని అనుకొన్నాడు యయాతి. ఇంతలో శుక్రాచార్యుల వారి మాటలు గుర్తుకు వచ్చాయి. "దేవయానిని పెళ్లి చేసుకోవడం దైవ నిర్ణయం అయితే, శర్మిష్టకు సంతానాన్ని ప్రసాదించడం కూడా దైవ నిర్ణయమే" అని మనసును సరిపెట్టుకున్నాడు.

శర్మిష్టను తనపడకమీదికి ఆహ్వానించాడు యయాతి. ఫలితంగా యయాతి వలన శర్మిష్టకు సంతానం కలిగింది. శర్మిష్టకు ద్రుహ్యుడు, అనువు, పూరుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. యయాతి కుమారులందరూ దినదినప్రవర్ధమానంగా పెరుగుతున్నారు.

కొంత కాలానికి దేవయానికి అసలు విషయం తెలిసింది. శర్మిష్టకు తన భర్త యయాతి వలన సంతానం కలిగిందని తెలిసిన దేవయాని, మరుక్షణం తన తండ్రి శుక్రాచార్యులవారి వద్దకు పోయి జరిగింది అంతా వివరంగా చెప్పింది. ఇది తెలిసిన యయాతి కూడా దేవయాని వెంట వెళ్లి ఏదో పొరపాటు జరిగిందని, క్షమించమని బతిమలాడాడు. దేవయాని కాళ్లా వేళ్లా పడ్డాడు. వేడుకున్నాడు. కాని దేవయాని వినలేదు.

దేవయాని మాటలు విన్న శుక్రాచార్యులు కోపంతో మండి పడ్డాడు. "ఓరి దుర్మార్గుడా! నీకు కామంతో కళ్లు మూసుకుపోయి, నా మాటను కూడా లక్ష్యపెట్టకుండా, ఆ శర్మిష్టకు సంతానాన్ని ప్రసాదిస్తావా! అందుకు ఫలితంగా నీవు ఈ రోజునుండి అకాల వృద్ధాప్యంలో పడిపోవుదువు గాక! ఇంక నీవు ఎవరితోనూ కామ సుఖాలు అనుభవించలేవు. ఇదే నా శాపము." అని యయాతిని ముసలితనంతో మగ్గిపొమ్మని శపించాడు.

శుక్రాచార్యులు శాపం ఇవ్వగానే యయాతి శుక్రాచార్యుల వారి కాళ్లమీద పడ్డాడు. "ఆచార్యా! మీరు నాకు శాపం ఇచ్చారు బాగానే ఉంది. కాని నేను, మీ కుమార్తె ఇంకా యవ్వనంలోనే ఉన్నాము. మాకు ఇంకా కామభోగాలు అనుభవించవలెనని కోరికగా ఉంది. నేను ముసలివాడిని అయితే మీ కుమార్తెసంగతి ఏమిటి! మీ కుమార్తె కామకోరికలు తీరడానికి మార్గమేది. మీరు నన్ను కాదు, మీ కుమార్తెనే శపించినట్టు అయింది." అని మెల్లిగా అసలు విషయం చెప్పాడు.

యయాతి చతురతకు శుక్రాచార్యులు సంతోషించాడు. "ఓ యయాతిమహారాజా! నీవు చెప్పినది నిజమే. కాని నా శాపము వెనక్కు తీసుకోలేను. కాని కొంచెం సడలిస్తాను. నీవు నీ ముసలి తనమును ఎవరైనా యవ్వనవంతునికి ఇచ్చి, ఆయన యవ్వనమును నీవు తీసుకో. నీవు నీ ఇష్టం వచ్చినట్టు కామభోగములు అనుభవించిన తరువాత, నీవు తీసుకున్న యవ్వనమును తిరిగి అతనికి ఇచ్చి నీ ముసలితనమును స్వీకరించు."అని అన్నాడు.

ఇదేదో బాగానే ఉందనుకున్నాడు యయాతి. వెంటనే తన కుమారులను పిలిపించాడు. ముందు తన పెద్దకుమారుడు యదువు తో ఇలా అన్నాడు.

"కుమారా! నాకు ఇంకా ఈ కామ భోగములు అనుభవించ వలెనని కోరికగా ఉంది. దానికి ఈ ముసలి తనము అడ్డుగా ఉంది. కాబట్టి నీ యౌవనమును నాకు ఇచ్చి, నా ముసలి తనమును నీవు తీసుకో. నేను నీ యౌవనమును తీసుకొని కొంతకాలము కామభోగములు అనుభవిస్తాను. తరువాత నీ యౌవనము నీకు తిరిగి ఇస్తాను." అని అన్నాడు.

దానికి యదువు ఇలా సమాధానం చెప్పాడు. "తండ్రీ!నీ మాదిరి అకాల వార్ధక్యమును పొందడానికి నేను ఇష్టపడటం లేదు. కామసుఖాలు యౌవనంలో అనుభవించాలి కదా! యౌవనంలో వైరాగ్యాన్ని ఏ మూర్ఖుడూ కోరుకోడు. కాబట్టి మీ కోరిక నేను తీర్చలేను." అని అన్నాడు యదువు.

యయాతి తన ముగ్గురు కుమారులు అయిన తుర్వసుడు, ద్రుహ్యుడు, అనువును కూడా ఇదే విధంగా అడిగాడు. వారందరూ యదువుమాదిరి సమాధానం ఇచ్చారు. అందరూ తమ తండ్రి కోరికను తిరస్కరించారు. ఇంక మిగిలింది ఆఖరి కుమారుడు పూరుడు. యయాతి పూరుని కూడా పిలిచి తన వార్ధక్యమును తీసుకొని అతని యవ్వనమును తనకు ఇమ్మని అడిగాడు. నీ అన్నల మాదిరి నీవు కూడా తిరస్కరించవద్దు అని వేడుకున్నాడు. తండ్రి మాటలకు

కరిగిపోయిన పూరుడు ఇలాఅన్నాడు.

"తండ్రీ! మీరు ఈ దేహమును నాకు ప్రసాదించారు. నా పుట్టుకకు మీరే కారణము. ఈ దేహము మీకు ఉపయోగపడకపోతే ఈ దేహము ఉండీ ప్రయోజనము లేదు. కన్న తండ్రికి ఉపకారము చేయనివాడు లోకంలో ఎవరికి మాత్రం ఉపకారం చేస్తాడు.

తండ్రి మనసు తెలుసుకొని, ఆయన మనసులో ఉన్న కోరికలను  నెరవేర్చువాడు ఉత్తమ పుత్రుడు. తండ్రి ఆజ్ఞాపించిన తరువాత ఆయన ఆజ్ఞలను  పాటించేవాడు మధ్యముడు. తండ్రి ఆజ్ఞలను ఏ మాత్రము శ్రద్ధలేకుండా, యాంత్రికంగా నెరవేర్చేవాడు అధముడు. తండ్రి ఆజ్ఞలను నెరవేర్చని  పుత్రుడు అసలు పుత్రుడే కాదు. కాబట్టి నేను మీ వార్ధక్యమును సంతోషంగా స్వీకరిస్తాను. మీరు నా యవ్వనమును స్వీకరించండి. మీరుకోరినంత కాలము కామభోగములు అనుభవించండి." అని అన్నాడు.

పూరువు మాటలకు ఎంతోసంతోషించాడు యయాతి. తన వార్ధక్యమును తనకుమారునికి ఇచ్చి,  తన కుమారుని నుండి యవ్వనమును స్వీకరించాడు. తన ఇష్టం వచ్చినట్టు కామభోగము లను అనుభవించసాగాడు. దేవయాని కూడా తన భర్తతో కూడి అన్ని సుఖములను అనుభవించింది.

యయాతి తన శరీరముతో కామభోగములను యధేచ్ఛగా అనుభవిస్తున్నా మనసులో మాత్రము శ్రీహరిమీద భక్తి మానలేదు.

మనసులో శ్రీహరిని నిలుపుకొని, ఎన్నో యజ్ఞములు యాగములు చేసాడు. యజ్ఞపురుషుడు అయిన శ్రీహరిని ఆరాధించాడు. కాని యయాతికి ఎన్ని సంవత్సరములు కామ భోగములు అనుభవించినా తృప్తి కలగలేదు. ఇంద్రియములు ఇంకా ఇంకా సుఖాలు అనుభవించాలనే కోరుకుంటున్నాయి." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు యయాతి వృత్తాంతమును చెప్పాడు.

శ్రీమద్భాగవతము
నవమస్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
నవమస్కంధము
పంతొమ్మిదవ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్మహారాజుకు యయాతి మహారాజు వృత్తాంతమును ఈ విధంగా వివరిస్తున్నాడు.

"పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా యయాతి మహారాజు తనభార్యలతో కామ భోగములను అనుభవిస్తున్నాడు. కాని ఎంతకూ తృప్తి చెందడంలేదు. ఒక రోజు యయాతి తన భార్య దేవయానిని చూచి ఇలాఅన్నాడు. "దేవయానీ! నన్ను చూచావా! కామమునకు దాసుడను అయ్యాను. నావలె కామమునకు దాసుడైన ఒకని కథ వినిపిస్తాను. విను.

ఒక అడవిలో ఒకమగ మేక తిరుగుతూ ఉంది. ఒక రోజు ఆ మగ మేక బావిలో పడి ఉన్న ఒక ఆడమేకను చూచింది. తనను బావిలో నుండి బయటకు తీయమని ఆ ఆడమేక మగమేకను వేడుకుంది. మగ మేక ఒక ఉపాయమును ఆలోచించింది. తన కొమ్ముల చివరలతో మట్టిని తవ్వి, ఆడ మేక బావిలో నుండి బయటకు రావడానికి మార్గం చేసింది. ఆడమేక ఆ మార్గము ద్వారా బయటకు వచ్చింది.

మగ మేకను చూడగానే ఆడమేకకు దాని మీద ప్రేమ కలిగింది. ఆడ మేకకు మగ మేక మీద ప్రేమ కలగడం చూచిన ఇతర ఆడ మేకలు కూడా మగ మేక మీద కామంతో దాని దగ్గర చేరాయి. ఆ మగ మేక అన్ని ఆడ మేకలతో కామసుఖములు అనుభవించసాగింది. బావిలోనుండి బయటకు వచ్చిన ఆడు మేక, మగమేక తననే కాకుండా ఇతర ఆడ మేకలతో కూడా కామసుఖములను అనుభవించడం చూచి సహించలేకపోయింది. బావిలో నుండి బయటకు వచ్చిన ఆడ మేక మగ మేకను వదిలిపెట్టి వెళ్లిపోయింది.

ఇది చూచిన మగ మేక ఆడ మేక వెంట పడింది. తనను వదిలి వెళ్ల వద్దని బతి మాలింది.కాని ఆడ మేక తనమంకు పట్టు విడువలేదు. ఇంతలో ఆడమేక యజమాని అయిన బ్రాహ్మణుడు అక్కడకు వచ్చాడు. మగమేక మీద కోపంతో మగమేక మగతనానికి మూలమైన దాని వృషణములను కోసేసాడు. మగమేక ఆ బ్రాహ్మణుని కాళ్ల మీద పడి వేడుకొంది. ఆ బ్రాహ్మణుడు తనయోగశక్తి చేత, ఆ

మగమేక వృషణములను మరలా అంటించాడు. తనను ఎంతగానో బతిమాలుతున్న మగ మేకనుచూచి ఆడమేక కరిగిపోయింది. మరలా దాని వద్దకు చేరింది. మగమేక ఈ ఆడమేకతోనూ, ఇతర ఆడ మేకలతోనూ కలిసి కామసుఖములు అనుభవించసాగింది. చాలా కాలంపాటు కామభోగములు అనుభవించిన మగమేకకు తృప్తి కలుగలేదు.

ఓ దేవయానీ! ఈ కథలో మేకపోతు ఎవరో కాదు. నేనే. బావిలో ఉన్న ఆడమేక నువ్వే. నిన్ను బావిలో నుండి తీసి నిన్ను పెళ్లి చేసుకున్నాను. నిన్నే కాకుండా నీ తోవచ్చి దాసీలు అంటే శర్మిష్ట మొదలగు వారిని కూడా ఇతర ఆడమేకలను మగమేక అనుభవించినట్టు అనుభవించాను. ఇతరమేకలను అనుభవించడం చూచి బావిలోనుండి బయటకు వచ్చిన ఆడమేక వెళ్లిపోయినట్టు నేను శర్మిష్టను అనుభవించడం చూచి నువ్వు కూడా నామీద కోపగించుకొని వెళ్లిపోయావు. బ్రాహ్మణుడు మగమేక వృషణములు కోసినట్టు, నీ తండ్రి అయిన బ్రాహ్మణుడు నా యవ్వనమును హరించాడు. బ్రాహ్మణుడు మరలా మగమేక వృషణములు అతికించినట్టు, నా కుమారుడు నాకు యవ్వనమును ఇచ్చాడు. అప్పటినుండి మగమేక ఆడుమేకలను అనుభవించినట్టు, నేను కూడా నిన్ను నీ దాసీలతోనూ నా కామవాంఛలను తీర్చుకుంటున్నాను.

ఓ దేవయానీ! నీ మీద ప్రేమతోనూ, ఇంకా నీ దాసీల మీద ఉన్న ప్రేమతోనూ, నేను నా ఆత్మస్వరూపమును తెలుసుకోలేక పోయాను. ఈ కామము ఎంత అనుభవించినా మానవునికి తృప్తి

కలుగదు. నేను కూడా ఈ కామమునకు దాసుడనై నా కుమారుని యవ్వనమును స్వీకరించి కామభోగములను అనుభవిస్తున్నాను. నీ ప్రేమకు బందీని అయిపోయాను. ఆత్మతత్వమును తెలుసుకోడానికి ప్రయత్నం చేయడంలేదు.

నా మాదిరి ఎవడి కైనా కామము, కామ సంబంధ కోరికలు ఎక్కువగా ఉంటాయో వాడికి ఇతర సంపదలు ఎన్ని ఉన్నా తృప్తి ఉండదు. స్త్రీ సంపర్కముతోనే ఎక్కువకాలము గడపాలని అనుకుంటాడు. అగ్నిలో నెయ్యి పోస్తే ఎలా భగభగ మండుతుందో అలాగే ఈ కామవాంఛలు కూడా అనుభవించే కొద్దీ ఎక్కువ అవుతాయే కానీ ఇంక చాలు అన్న భావన రాదు.

అలా కాకుండా, సకల ప్రాణుల యందు రాగద్వేషములు లేకుండా సమదృష్టికల వాడు సర్వకాలముల యందు సుఖములను అనుభవిస్తాడు. కామకోరికలమీద ఆసక్తి కలవారు, దుర్బుద్ధికలవారు అయిన మానవులను ఈ కామభోగములను అనుభవించవలెను అనే దాహము శరీరాన్ని రోగాల బారిన పడేస్తుంది. తొందరగా ముసలి తనమును వచ్చేట్టు చేస్తుంది. శరీరం కృశించి పోతుంది.

ఈ లోకంలో సుఖపడదలచుకున్నవాడు, భోగలాలసతను వెంటనే వదిలిపెట్టాలి. ఎంత విద్వాంసుడు అయినా కూడా, కామ భోగములు, కామ సంబంధమైన కోరికలు ఎక్కువగా ఉన్న వ్యక్తి, తన తల్లి, చెల్లి, అక్క, కూతురుతో కలిసి ఒకే ఆసనము మీద కూడా కూర్చోకూడదు. ఎందుకంటే కామ కోరికలు ఎక్కువగా ఉంటే

ఇంద్రియములు అదుపు తప్పుతాయి.(యయాతి మాటలు యదార్థాలు అవుతున్నాయి అనడానికి కారణం ఈ నాడు ప్రపంచ వ్యాప్తంగా ముఖ్యంగా పశ్చిమదేశాలలో వ్యాప్తిచెందుతున్న ఇన్సెస్ట్ అనే జాడ్యం.) అంతెందుకు. నా సంగతేచెప్పు. నేను వేయి సంవత్సరముల నుండి ఈ కామభోగములను అనుభవిస్తున్నాను. కాని నాకు ఏ మాత్రం తృప్తి కలగలేదు. ప్రతిరోజూ కామకోరికల మీద తృష్ణ పెరుగుతూ ఉందేకానీ తగ్గడం లేదు.

అందుకని బలవంతంగా నైనా ఈ కామసంబంధమైన, హేయమైన కోరికలను వదిలిపెట్టి, పరమాత్మ యందు మనసు లగ్నం చేసి, రాగద్వేషములను, సుఖదు:ఖములను, అహంకారమును వదిలిపెట్టి, వానప్రస్థమునకు వెళ్లదలచుకున్నాను. ఎందుకంటే సుఖం ఎక్కడో లేదు. మనలోనే ఉంది. మన మనసులోనే ఉంది. సకల ప్రాణులను సమదృష్టితో చూస్తూ, రాగద్వేషములను విడిచిపెట్టిన వాడికి లోకం అంతా ఆనందమయంగా, సుఖమయంగా కనపడుతుంది.

దేవయానీ! ఈ కామభోగములు నిరంతరము దు:ఖము కలిగిస్తాయి గానీ, ఏ మాత్రం సుఖాన్ని ఇవ్వవు. స్త్రీలతో కామసుఖములు అనుభవిస్తే సుఖంకలుగుతుంది అనుకుంటామే కానీ, నిజానికి కలిగేది దు:ఖమే. జీవితంలో సుఖపడాలి అనుకునే వాడు ఈ కామకోరికలను తక్షణం విడిచిపెట్టాలి. ఇన్నాళ్ల తరువాత నాకు జ్ఞానోదయం అయింది. ఈ కామతృష్ణను విడిచిపెట్టి నేను పరమాత్మయందు మనసును లగ్నం చేస్తాను. ఆత్మతత్వమును తెలుసుకుంటాను. రాగద్వేషములను,

సుఖదుఃఖములను, అహంకారమును వదిలిపెడతాను. ఈ ప్రాపంచిక సుఖములు, విషయవాంఛలు అన్నీ కేవలం మన భ్రమ. ఇవి నిజం కావు. వీటి వల్ల సుఖం కలుగుతుంది అని అనుకోవడం మన అవివేకము. ఈ ప్రాపంచికవిషయములను, విషయ వాంఛలను వదిలిపెడితేనే గానీ, ఆత్మ దర్శనము కలుగదు.

అలా కాకుండా ఈ ప్రాపంచిక విషయముల గురించి ఆలోచిస్తుంటే, సంసారబంధనములు పెరుగుతాయి. ఈ సంసారమే సుఖదాయకము అనుకొని మానవుడు సర్వనాశనం అవుతాడు. కాబట్టి నేను ఈ సంసారబంధనముల నుండి విముక్తుడను కాదలచుకొన్నాను." అని అన్నాడు.

వెంటనే తన ఆఖరు కుమారుడు అయిన పూరుని పిలిచాడు. అతడి యవ్వనాన్ని అతనికి ఇచ్చి, పూరుని నుండి తన వార్ధక్యమును స్వీకరించాడు. తనరాజ్యాన్ని కుమారులకు పంచిపెట్టాడు. తూర్పు దిక్కునకు ద్రుహ్యుని రాజుగా చేసాడు. యదువును దక్షిణ ప్రాంతమునకు రాజుగా చేసాడు. పడమటి దిక్కునకు తుర్వసుని రాజుగా చేసాడు. ఉత్తర దిక్కునకు అనువును రాజుగా చేసాడు. తనకు యవ్వనము ఇచ్చిన పూరుని సమస్త భూమండలమునకు చక్రవర్తిని చేసాడు. తన మిగిలిన కుమారులను పూరుని అధీనంలో ఉంచాడు. యయాతి తపస్సు చేసుకోడానికి అడవులకు వెళ్లిపోయాడు.

(ఈయయాతి చరిత్ర వలన మనము తెలుసుకోదగిన నీతి ఒకటే. అతి సర్వత్ర వర్జయేత్. ఏదీ అతిగా అనుభవించరాదు. తుదకు వెగటు

పుడుతుంది. దీనికి ఉదాహరణగా వేమనను చెప్పుకోవచ్చు. ఆహారంగానీ, మైధునం గానీ, నిద్ర గానీ, మితంగా అనుభవిస్తేనే ఆనందం, సంతోషం కలుగుతుంది.)

యయాతి మహారాజు ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని వదిలిపెట్టాడు. ఆత్మతత్వమును తెలుసుకున్నాడు. పరమాత్మ పాదములను ఆశ్రయించాడు. తుదకు ఆ పరమాత్మలో ఐక్యం అయ్యాడు. యయాతి భార్య దేవయాని కూడా భర్త మార్గమునే అనుసరించింది. భర్త, కుమారులు అందరూ సత్రములో కలుసుకొనే బాటసారుల వంటి వారు అనే సత్యాన్ని గ్రహించింది. ఈ సంసార బంధములు అన్నీ పరమాత్మ కల్పించిన మాయ అని తెలుసుకొంది. దేవయాని కూడా ఇహలోక బంధములు వదిలిపెట్టింది. శ్రీహరి మీద మనసు నిలిపింది. శ్రీహరిని సేవిస్తూ ఈ శరీరాన్ని వదిలిపెట్టింది.

ఓ పరీక్షిత్ మహారాజా! సర్వభూతములకు అధిపతి, వాసుదేవుడు, ఈ జగత్తును సృష్టించి పోషించి లయం చేసేవాడు, పరబ్రహ్మస్వరూపుడు అయిన ఆ పరమాత్మకు నమస్కరిస్తున్నాను." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు యయాతి మహారాజు చరిత్రను వివరించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

నవమస్కంధము

ఇరవయ్యవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు పూరువు వంశము గురించి ఇలా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! యయాతి తన కుమారుడు పూరువును ఈ భూమండలమునకు చక్రవర్తిని చేసాడని చెప్పాను కదా. మీరు, మీ పూర్వీకులు ఆ పూరు వంశమునకు చెందిన వారే. మీ వంశ చరిత్రను గురించి చెబుతాను శ్రద్ధగా విను.

నీవు జన్మించిన పూరువంశములో అనేకములయిన రాజర్షి వంశములు, బ్రహ్మర్షివంశములు ఆవిర్భవించాయి. పూరు వంశమునకు ఆద్యుడు జనమేజయుడు. ఆ జనమేజయునకు ప్రచిన్వంతుడు అనే కుమారుడు కలిగాడు. ప్రచిన్వంతునకు ప్రవీరుడు అనే కుమారుడు కలిగాడు. ప్రవీరునకు నమస్యుడు, నమస్యునకు చారుపదుడు, చారుపదునకు సుద్యుడు, సుద్యునకు బహుగవుడు, బహుగవునకు సంయాతి అనే వారుజన్మించారు.

యయాతి కుమారుడైన అహంయాతికి రౌద్రాశ్వుడు జన్మించాడు. రౌద్రాశ్వునకు ఘృతాచి అనే అప్సరస ద్వారా పది మంది కుమారులు జన్మించారు. వారిపేర్లు..... ఋతేయువు, కుక్షేయువు,

స్థండిలేయువు, కృతేయువు, జలేయువు, సన్తనేయువు, ధర్మేయువు, సత్యేయువు, వ్రతేయువు, వనేయువు. వారిలో ఋతేయువునకు రంతిభారుడు అనే కుమారుడు జన్మించాడు. రంతిభారునకు సుమతి, ధ్రువుడు,అప్రతిరథుడు అనే ముగ్గురు కుమారులు జన్మించారు.

వారిలో అప్రతిరథుని కుమారుడు కణ్వుడు. కణ్వునకు మేధాతిథి, మేధాతిథికి ప్రస్కణ్వుడు జన్మించారు. వీరందరూ పుట్టుకతో క్షత్రియులు అయినా, వారి గుణములు,కర్మలను బట్టి బ్రాహ్మణత్వమును పొందారు. రంతిభారుని కుమారుడు సుమతికి రైభ్యుడు అనే కుమారుడు కలిగాడు. రైభ్యుని కుమారుని పేరు దుష్యంతుడు.

ఈ దుష్యంతుడు ఒకమహారాజు. ఒకరోజు దుష్యంతుడు వేటనిమిత్తము అడవికి వెళ్లాడు. వేటాడి అలసి పోయి కణ్వముని ఆశ్రమమునకు చేరాడు. ఆ ఆశ్రమములో దుష్యంతుడు ఒక అందమైన కన్యను చూచి మోహంలో పడ్డాడు. మెల్ల మెల్లగా ఆ కన్యను మాటలలో పెట్టాడు.

"లలనామణీ! నీవు ఎవరు? నీ పేరు ఏమి? నీ తల్లి తండ్రులు ఎవరు? ఈ అడవిలో ఒంటరిగా ఎందుకు ఉన్నావు? నీ అందము చందము చూడగా నీవు రాచకన్య మాదిరి కనపడుతున్నావు. నాకు నీ మీద మోహం కలిగింది అంటే నీవు తప్పకుండా రాచకన్యవు అయి ఉండాలి. ఎందుకంటే పూరు వంశము రాజులు ఎప్పుడూ అధర్మంగా ప్రవర్తించరు. కాబట్టి నీవు ఎవరో చెప్పు." అని అడిగాడు దుష్యంతుడు.

ఆ మాటలకు ఆ సుందరి ఈ మాదిరి సమాధానం చెప్పింది.

"మహారాజా! నేను విశ్వామిత్రునికి, అప్సరస అయిన మేనకకు పుత్రికను. నా తల్లి తండ్రులు నన్ను వనములో వదిలి వెళ్లిపోయారు. ఈ ఆశ్రమములో ఉన్న కణ్వమహర్షి నన్ను తీసుకొని వచ్చి పెంచి పెద్ద చేసాడు. నా పేరు శకుంతల. ప్రస్తుతము నేను మీకు ఏమి సేవచేయగలనో చెప్పండి. తమరు ఈ ఆసనము స్వీకరించండి. మీకు సన్నని ధాన్యముతో భోజనము సిద్ధం చేస్తాను. వేచి ఉండండి." అని చెప్పింది శకుంతల.

"ఓ కన్యకామణీ! నీవు విశ్వామిత్రుని కుమార్తెవు కాబట్టి నీవు క్షత్రియ కన్యవే. (విశ్వామిత్రుడు మొట్టమొదట క్షత్రియునిగా జన్మించి కొంతకాలము రాజ్యము పాలించి, తరువాత రాజర్షి, బ్రహ్మర్షి అయ్యాడని మనం చదువుకున్నాము). క్షత్రియ కన్యలకు స్వయంవరము అనగా తమ భర్తలను తామే కోరుకోవడం ధర్మం కదా! నీకు ఇష్టం అయితే నేను నిన్ను వివాహమాడదలచుకున్నాను." అని అన్నాడు.

శకుంతల దానికి సమ్మతించింది. దుష్యంతుడు శకుంతలను గాంధర్వవిధిని వివాహం ఆడాడు.
(వధూవరుల తల్లి తండ్రులకు, పెద్దలకు తెలియకుండా, వారి అనుమతి లేకుండా, కేవలం వధూవరులు తమ ఇష్టప్రకారము వివాహం చేసుకోవడం గాంధర్వవివాహము అంటారు. నేటి ప్రేమవివాహాలు ఈ కోవకు చెందుతాయి.).

శకుంతలా దుష్యంతుల కలయికకు నిదర్శనంగా, శకుంతలకు ఒక కుమారుడు కలిగాడు. కణ్వముని ఆ కుమారునికి జాతక కర్మలు నిర్వర్తించాడు. ఆ బాలుడు దిన దిన ప్రవర్ధమానంగా పెరుగుతూ మహా పరాక్రమవంతుడయ్యాడు. చిన్నప్పటి నుండి సింహములను, పులులను మచ్చిక చేసుకొని వాటితో ఆడుకొనేవాడు.

వివాహం అయిన కుమార్తెను తన ఇంట్లో ఎక్కువ కాలము ఉంచుకోవడం భావ్యం కాదని, కణ్వుడు శకుంతలను, ఆమె కుమారుని, కొంతమంది ఋషి కుమారులను తోడు ఇచ్చి దుష్యంతుని వద్దకుపంపాడు. శకుంతల దుష్యంతుని వద్దకు పోయి ఆయనకు తమ గాంధర్వ వివాహమును గుర్తు చేసి, తనను, కుమారుని స్వీకరించమని కోరింది. తనకు ఏమీ గుర్తులేదని, మీరెవరో నాకు తెలియదనీ దుష్యంతుడు చెప్పాడు. అప్పుడు ఆకాశవాణి ఇలా పలికింది. “ఓ దుష్యంతా! ఈమె నీ భార్య శకుంతల. ఇతడు మీ ఇరువురికి పుట్టిన కుమారుడు. ఇదినిజం. నువ్వే నీ పుత్రుడి రూపంలో శకుంతల గర్భంనుండి పుట్టావు. నీ కుమారుడు నిన్ను పున్నామనరకంనుండి ఉద్ధరిస్తాడు. కాబట్టి నీవు నీ భార్యాపుత్రులను స్వీకరించు.” అని పలికింది. తరువాత దుష్యంతుడు శకుంతలను, ఆమె కుమారుడిని స్వీకరించాడు.

కాలక్రమంలో దుష్యంతుడు మరణించాడు. ఆయన కుమారుడు భరతుడు చక్రవర్తి అయ్యాడు. దుష్యంతుని కుమారుడు భరతుడు భగవంతుని అంశనుండి పుట్టినవాడు. ఆ కుమారుని కుడిచేతిలో చక్రము, పాదముల యందు తామర పూల గుర్తులు

ఉన్నాయి.

చక్రవర్తి అయిన తరువాత దుష్యంత కుమారుడు అయిన భరతుడు గంగానదీ తీరంలో యాభైఐదు అశ్వమేధ యాగములు చేసాడు. యమునా తీరంలో డెబ్బది ఎనిమిది యజ్ఞములు చేసాడు. బాహ్మణులకు విరివిగాగోవులను దానం చేసాడు. భరతుడు తాను చేసిన అశ్వమేధ యాగములలో 133 అశ్వములను బంధించాడు. అందరిరాజుల చేతా కీర్తించబడ్డాడు. భరతుడు మష్ణారము అనే నదీతీరంలో ఒక యజ్ఞము చేసి ఆ యజ్ఞములో బంగారు తొడుగులు వేసిన దంతములు కల పదునాలుగులక్షల ఏనుగులను దానం చేసాడు. భరతుడు చేసినటువంటి యజ్ఞ యాగములను అప్పటి వరకూ ఎవరూ చేయలేదని లోకోక్తి.

అంతేకాదు, భరతుడు దుష్టులు, బ్రాహ్మణ ద్వేషులు అయిన కిరాతులను, హూణులను, యవనులను, పౌండ్రులను, కంకులను, ఖశులను, శకులను, మ్లేచ్ఛులను, లోకకంటకులైన క్షత్రియులను హతమార్చి లోకంలో శాంతిభద్రతలను కాపాడాడు. అంతకు ముందు కాలంలో దేవాసుర యుద్ధంలో రాక్షసులు జయించి రసాతలమును స్వాధీనం చేసుకున్నారు. ఆ సమయంలో రాక్షసులు కొంతమంది దేవతాస్త్రీలను అపహరించుకుపోయి రసాతలంలో దాచిపెట్టారు. భరతుడు ఆ రాక్షసులను ఓడించి ఆ దేవతా స్త్రీలను విడిపించాడు. ఆ ప్రకారంగా భరతుడు ఈ భూమిని 27,000 సంవత్సరములు పాలించాడు.

భరతుడు ఆత్మతత్వమును తెలిసినవాడు. రాజ్యము, రాజభోగములు, విషయవాంఛలు, కామభోగములు అన్నీ అసత్యములు, నిజం కావు అని తలచి, వాటి మీద ఆసక్తి చూపించేవాడు కాదు. భరతుడు విదర్భరాజ కుమార్తెలు ముగ్గురిని వివాహం చేసుకున్నాడు. వారికి ముగ్గురు కుమారులు కలిగారు.

కాని ఆ రాణులకు ఒకసందేహము కలిగింది. భరతుడు కామభోగముల మీద విరక్తితో ఉండేవాడు. ఆ కారణం చేత తండ్రి దుష్యంతుని మాదిరి భరతుడు కూడా వీళ్లు నా కుమారులు కారు అని అంటాడేమో అని భయపడి, ఆ తల్లులు తమ కుమారులను చంపేసారు. ఈవిషయం తెలియని భరతుడు తనకు సంతానము లేదని బాధపడుతూ ఉండేవాడు. సంతానము కోసరం మరుత్తు అనే యాగం చేసాడు. ఆ యాగ ఫలితంగా మరుత్తులు భరతునికి భరద్వాజుడు అనే కుమారుని పెంచుకోమని ఇచ్చారు.

ఈ భరద్వాజుని పుట్టుక విచిత్రంగా జరిగింది. బృహస్పతి అన్నగారి పేరు ఉతథ్యుడు. ఉతథ్యుని భార్య పేరు మమత. ఒక రోజు బృహస్పతి గర్భవతిగాఉన్న వదినను (మమతను) అనుభవించాడు. అప్పటికే మమత గర్భంలో ఉన్న శిశువు(ఉతథ్యుని కుమారుడు) బృహస్పతిని తిట్టాడు. బృహస్పతి ఆ శిశువును అంధుడిగా పుట్టమని శపించాడు. ఆ కారణంగా మమత ఒక అంధుడైన శిశువును ప్రసవించింది. బృహస్పతి మమతను అనుభవించిన కారణంగా ఆమెకు మరొక శిశువు జన్మించాడు. ఈ విషయం తెలిస్తే తన భర్త ఉతథ్యుడు తనను వదిలేస్తాడేమో అని భయపడి మమత ఆ బిడ్డను వదిలి

బృహస్పతి వద్ద వదిలి వేసింది. బృహస్పతి కూడా ఆ బిడ్డను తనకు సంబంధం లేదని  వదిలిపెట్టి వెళ్లిపోయాడు. అదేసమయంలో భరతుడు సంతానము కొరకు యజ్ఞం చేస్తున్నాడు.  అనాధ అయిన  ఆ బిడ్డను తీసుకొనివచ్చి మరుత్తులు భరతునికి ఇచ్చారు. ఆ బాలుడు భరతుని వద్ద పెరిగాడు. ఆయనే భరద్వాజుడు. మమత, బృహస్పతి కలిసి "వీడిని నీవు పోషించు అంటే నీవు పోషించు" అని వాదులాడుకున్నారు కాబట్టి వాడికి భరద్వాజుడు అని మరుత్తులు నామకరణం చేసారు." అని భరతుని గురించి శుకుడు పరీక్షిత్తు మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము ఇరవయ్యవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్భాగవతము

## నవమస్కంధము

## ఇరవది ఒకటవ  అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో భరత వంశము ఎలా వృద్ధి చెందింది వివరిస్తున్నాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! మరుత్తులు భరతునికి ఒక బాలుని ఇచ్చారు, అ బాలుని పేరు భరద్వాజుడు అని చెప్పాను కదా. భరద్వాజుడు వితధుడు అని కూడా పిలువబడ్డాడు. వితధుని కుమారుడు మన్యువు. మన్యువుకు బృహత్క్షేత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు అనే ఐదుగురు కుమారులు జన్మించారు. ఈఐదుగురిలో ఒకడైన నరుడు అనే వాడికి సంకృతి అనే కుమారుడు కలిగాడు. ఈ సంకృతికి గురువు, రంతిదేవుడు అనేకుమారులు కలిగారు.

రంతి దేవుడు లోకప్రశిద్ధుడు అయ్యాడు. రంతి దేవుడు జీవితాంతము దేనికోసరము ఆశపడలేదు. దొరికిన దానిని, తనకు లభించిన దానిని తీసుకున్నాడు. దొరకని దాని కోసరం ప్రయత్నించలేదు. తనకు లభించిన ధనమును కూడా రేపటి కొరకు ఉంచుకోలేదు. తన అవసరములకు సరిపోగా మిగిలిన ధనమును దానం చేసేవాడు. ఆ కారణంగా అతడు అతని భార్యాపిల్లలు చాలా కష్టాల పాలయ్యారు. ఒక్కోసారి ఆహారము కూడా దొరికేది కాదు. కేవలం నీరు తాగి కడుపు నింపుకొనేవారు. ఆహారము దొరక్కుండా

కేవలము నీరు తాగి 48 రోజులు గడిపాడు.

ఒకసారి రంతిదేవునికి భగవంతుని దయ వలన నెయ్యి, పాయసము, జలము లభించాయి. రంతి దేవుడు భార్యా పిల్లలతో సహా భోజనానికి కూర్చున్నాడు. ఇంతలో ఒక బ్రాహ్మణుడు అక్కడకు వచ్చాడు. రంతి దేవుడు అతిథిని పూజించి తనకు లభించిన ఆహారములో సగం అతిథికి ఇచ్చాడు. అతిథి భోజనము చేసి వెళ్లిపోయాడు. అతిథికి పెట్టగా మిగిలిన భోజనమును తినడానికి కూర్చున్నాడు రంతిదేవుడు. ఇంతలో ఒక శూద్రుడు మరొక అతిథిగా వచ్చాడు. రంతి దేవుడు తన వద్ద మిగిలి ఉన్న భోజనములో సగము రెండవ అతిథికి పెట్టాడు. రెండవ అతిథి భోజనము చేసి వెళ్లిపోగానే మరొకడు నాలుగు కుక్కలు తీసుకొని వచ్చాడు. "అయ్యా!నా కుక్కలు ఆకలితో అల్లాడుతున్నాయి. వాటికి ఆహారం పెట్టించండి." అని అడిగాడు. రంతి దేవుడు తన వద్ద మిగిలి ఉన్న అన్నమును ఆ కుక్కలకు పెట్టాడు. ఇప్పుడు రంతి దేవుని వద్ద కేవలము నీరు మాత్రమే ఉంది. ఆ నీరు తాగి కడుపు నింపుకుందామని అనుకుంటూ ఉండగా, ఒక ఛండాలుడు వచ్చి అయ్యా చాలా దాహంగా ఉంది. కాస్త నీరు ఇవ్వండి అని అడిగాడు. రంతి దేవుడు తన వద్ద మిగిలిఉన్న నీరు అతనికి ఇచ్చాడు.

ఆ ఛండాలుడితో ఇలా అన్నాడు. "అయ్యా! నేను భగవంతుని నుండి అణిమ, గరిమ మొదలగు సిద్ధులు కానీ, మోక్షమును కానీ కోరుకోను. నా తోటి జీవుల యొక్క బాధలు, ఆకలి దప్పులు తీర్చే శక్తి ఇవ్వమని కోరుకుంటాను. నా సాటి జీవులు ఎటువంటి బాధలు

పడకుండా ఉండాలని నా కోరిక. నీవు దాహముతో ఉన్నావు. నీ దాహము తీర్చడంతో, నా ఆకలి, నా దప్పిక, నా కష్టములు, అలసట, శోకము, విషాదము, మోహము అన్నీ తీరి పోయాయి." అని అన్నాడు. ఆ మాటలు విన్న ఆ ఛండాలుడు ఎంతో సంతోషించాడు.

అప్పటి దాకా అతని వద్దకు అతిథులుగా వచ్చిన బ్రహ్మ, మొదలగు దేవతలు రంతిదేవుని ముందు తమ నిజరూపములతో సాక్షాత్కరించారు. రంతిదేవుడు వారందరికీ భక్తితో నమస్కరించాడు. వాసుదేవుని తన మనసులో నిలుపుకున్నాడు. ప్రాపంచిక విషయముల మీద ఎటువంటి ఆసక్తి లేకుండా దొరికినదానితో సంతృప్తి పడేవాడు. బ్రహ్మ మొదలగు దేవతలు రంతిదేవుని ఆశీర్వదించి వెళ్లిపోయారు.

పరీక్షిత్ మహారాజా! ఇదీ రంతిదేవుని వృత్తాంతము. భరద్వాజుని ఆఖరి కుమారుడైన గర్గునకు శిని, శినికి గార్గ్యుడు జన్మించారు. భరద్వాజుని పెద్ద కుమారుడైన బృహత్ క్షేత్రుడు పుట్టుకతో క్షత్రియుడయ్యును, బ్రాహ్మణత్వమును అవలంబించాడు. భరద్వాజుని మూడవ కుమారుడైన మహావీర్యుడికి దురితక్షయుడు, దురితక్షయుడికి త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అనే కుమారులు జన్మించారు. వీరందరూ క్షత్రియ వంశములో జన్మించినా బ్రాహ్మణత్వమును స్వీకరించారు. బ్రాహ్మణులయ్యారు.

భరద్వాజుని కుమారుడైన బృహత్ క్షేత్రుని కుమారుడు హస్తి. అతని పేరుమీదనే హస్తినాపురము నిర్మించబడింది. హస్తికి అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడు, అనే కుమారులు కలిగారు.

వీరందరూ క్షత్రియ ధర్మమును వదిలి బ్రాహ్మణత్వమును స్వీకరించారు. అజమీఢునకు బృహదిషువు, బృహదిషువునకు బృహద్ధనువు, బృహద్ధనువునకు బృహత్కాయుడు, బృహత్కాయునకు జయద్రథుడు జన్మించారు. జయద్రథుని కుమారుడు విశదుడు. విశదుని కుమారుడు స్యేనజిత్తు. స్యేనజిత్తుకు రుచిరాశ్వుడు. ధృఢహనువు, కాశ్యుడు, వత్సుడు అనే కుమారులు జన్మించారు. రుచిరాశ్వునకు పౌరుడు, పౌరునకు పృథుసేనుడు, నీపుడు అనే పుత్రులు కలిగారు.

నీపునకు నూరుగురుకుమారులు కలిగారు. నీపుని భార్యపేరు కృత్వి. వారి కుమారుడు బ్రహ్మదత్తుడు. బ్రహ్మదత్తుని భార్యపేరు సరస్వతి. వీరి కుమారుడు విష్వక్సేనుడు. విష్వక్సేనుడు యోగశాస్త్రమును రచించాడు. విష్వక్సేనునను ఉదక్సేనుడు, ఉదక్సేనునకు భల్లాటుడు జన్మించారు. వీరందరూ బృహదిషువు అనే వంశమునకు చెందిన వారు.

హస్తియొక్క రెండవ కుమారుడు ద్విమీఢుడు. ద్విమీఢుని కుమారుడు యవీనరుడు. యవీనరుని కుమారుడు కృతిమంతుడు. కృతిమంతుని కుమారుడు సత్యధృతి. సత్యధృతికి ధృఢనేమి అనే కుమారుడు కలిగాడు. ధృడనేమి కుమారుడు సుపార్శ్వుడు. సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమానుడు, సన్నతిమానునకు కృతి జన్మించారు. ఈ కృతి సామవేదములోని ఆరు సంహితలను అధ్యయనం చేసాడు.

కృతి పుత్రుడు నీపుడు. నీపునకు ఉద్గ్రాయుధుడు, ఉద్గ్రాయుధునకు క్షేమ్యుడు, క్షేమ్యునకు సువీరుడు, సువీరునకు రిపుంజయుడు కుమారులుగా జన్మించారు. రిపుంజయునకు బహూరథుడు అనే కుమారుడు కలిగాడు.

హస్తి మూడవ కుమారుడైన పురుమీఢునికి సంతానము లేదు. హస్తి పెద్దకుమారుడైన అజమీఢునికి నీలుడు జన్మించాడు. నీలుని కుమారుడు శాంతి. శాంతి కుమారుడు సుశాంతి. సుశాంతి కుమారుడు పురుజుడు. పురుజుని కుమారుడు అర్కుడు. అర్కుని కుమారుడు భర్మాశ్వుడు. భర్మాశ్వునికి  ముద్గలుడు, యవీనరుడు, బృహద్విశ్వుడు, కాంపిల్యుడు, సంజయుడు అనే కుమారులు జన్మించారు. వారిని పాంచాలురు అని పిలుస్తారు.  ముద్గలుని నుండి మౌద్గల్య బ్రాహ్మణ వంశము పుట్టింది.

ముద్గలునకు ఒక కొడుకు, ఒక కుమార్తె కలిగారు. వారి పేర్లు దివోదాసుడు, అహల్య. అహల్య భర్త పేరు గౌతముడు. వారికి శతానందుడు జన్మించాడు.  శతానందుని కుమారుడు సత్యధృతి. సత్యధృతి ధనుర్విద్య యందు నిపుణుడు. సత్యధృతి కుమారుడు శరద్వానుడు. ఈ శరద్వానుడు ఒక రోజు ఊర్వశిని చూచి కామపరవశుడయ్యాడు. అతని వీర్యము స్ఖలనమయింది. ఆ వీర్యము నుండి ఒక పురుషుడు, ఒక స్త్రీ జన్మించారు.

శాంతనుడు అనే రాజు వేటకు పోయి ఆ బాలుడు, బాలికను చూచాడు. తన వెంట రాజధానికి తీసుకొని వచ్చి పెంచుకున్నాడు. వారి

పేర్లు కృపుడు, కృపి. కృపుడు కౌరవులకు ధనుర్వేదమునునేర్పే ఆచార్యుడు అయ్యాడు. కృపి ద్రోణాచార్యునికి భార్య అయింది. వారి కుమారుడే అశ్వత్థామ." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు భరతవంశ కథను వినిపించాడు.

శ్రీమద్భాగవతము
నవమస్కంధము ఇరవై ఒకటవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
నవమస్కంధము
ఇరవై రెండవ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు పాంచాల రాజులు, కురు వంశము, మగధ వంశము ఎలా వృద్ధి చెందింది వివరిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ముద్గలునకు దివోదాసు, అహల్య అనే కవలలు జన్మించారు అని చెప్పానుకదా! అహల్యను గౌతముడు వివాహం చేసుకున్నాడు. దివోదాసునకు మిత్రాయువు జన్మించాడు. మిత్రాయువుకు చ్యవనుడు సుదాసుడు సోమకుడు జన్మించారు. సోమకునకు నూరుగురు కుమారులు జన్మించారు. వారిలో పృషతుడు ఆఖరి వాడు. ఈ పృషతుని కుమారుడే పాంచాల దేశపు రాజు

ద్రుపదుడు. ద్రుపదుని కుమార్తె ద్రౌపది.  ద్రుపదునకు ధృష్టద్యుమ్నుడు మొదలగు వారు కుమారులు. ధృష్టద్యుమ్నుని కుమారుని పేరు ధృష్టకేతువు. వీరంతా పాంచాల వంశమునకు చెందిన వారు.

హస్తినాపురమును నిర్మించిన హస్తి పెద్ద కుమారుడు అజమీఢుడు అని చెప్పానుకదా. ఆ అజమీఢునికి ఋక్షుడు అనే కుమారుడు కలిగాడు. వాని కుమారుడు సంవరణుడు. సంవరణుడు సూర్యుని కుమార్తె తపతిని వివాహం చేసుకున్నాడు. వారికి కురువు అనే కుమారుడు జన్మించాడు. ఆయన పేరుతోనే కురువంశము మొదలయింది.

కురువునకు పరీక్షిత్తు, సుధనుడు, జహ్నువు, నిషధాశ్వుడు అనే నలుగురు కుమారులు కలిగారు. సుధనుని కుమారుడు సుహోత్రుడు. సుహోత్రుని కుమారుడు చ్యవనుడు. చ్యవనుని కుమారుడు  కృతి. కృతి కుమారుడు ఉపరిచర వసువు. వారి కుమారులు  బృహద్రధుడు, కుశాంబువు, మత్స్యుడు, ప్రత్యగ్రుడు, చేదసి. వీరంతా చేది దేశమునకు రాజులు అయ్యారు.

బృహద్రధుని కుమారుడు కుశాగ్రుడు. కుశాగ్రుని కుమారుడు ఋషభుడు. ఋషభుని కుమారుడు సత్యహితుడు. సత్యహితుని కుమారుడు పుష్పవంతుడు. పుష్పవంతుని కుమారుడు జహుడు.

బృహద్రధుని రెండవ భార్యకు ఒక శిశువుజన్మించింది. కాని నిలువుగా రెండు భాగములుగా జన్మించింది. రాణి ఆ శిశువునుచూచి

భయపడి  ఆ రెండు ఖండములను (ముక్కలను) ఊరి వెలుపల పారేసింది. జర అనే రాక్షసి ఆ రెండు ఖండములను తినవలెనని చేతిలోకి తీసుకొని వాటిని కలిపింది. వెంటనే ఆ రెండు ఖండములు ఒక శిశువుగా మారాడు. జర అనేరాక్షసి చేత సంధింపబడ్డవాడు కాబట్టి ఆ శిశువునకు జరాసంధుడు అనే పేరు వచ్చింది.  జరాసంధుని కుమారుడు సహదేవుడు. సహదేవుని కుమారుడు సోమాపి. సోమాపి కుమారుడు శృతశ్రువుడు.

కురు మహారాజుకు పరీక్షిత్తు అనే కుమారుడు కలిగాడు అని చెప్పానుకదా. ఆ పరీక్షిత్తుకు సంతానము లేదు. కురువుకుమారుడైన జహ్నువుకు సురథుడు అనే కుమారుడు జన్మించాడు. సురథుని కుమారుడు విదూరథుడు. విదూరథుని కుమారుడు సార్వభౌముడు. సార్వభౌముని కుమారుడు జయసేనుడు. జయసేనుని కుమారుడు రాధికుడు. రాధికుని కుమారుడు ఆయుతాయువు. ఆయుతాయువు కుమారుడు అక్రోధనుడు. అక్రోధనుని కుమారుడు దేవాతిథి. దేవాతిథి కుమారుడు ఋక్షుడు. ఋక్షుని కుమారుడు దిలీపుడు. దిలీపుని కుమారుడు ప్రతీపుడు.

ప్రతీపునికి దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అనే కుమారులు జన్మించారు. పెద్దవాడైన దేవాపి సన్యాసం స్వీకరించి తపస్సు చేసుకోడానికి అడవులకు వెళ్లిపోయాడు. ఆ కారణంగా శంతనుడు రాజయ్యాడు. ఈ శంతనుడు పూర్వజన్మలో మహాభిషుడు. ఇతడు చేతితో తాకితే ఎంతటి రోగమైనా తగ్గిపోతుంది. దేవాపి రాజ్యం వదిలి తపస్సు చేసుకోడానికి వెళ్లిన తరువాత, శంతనుడి మంత్రి అయిన

అశ్వవారుడు కొంతమంది బ్రాహ్మణులను దేవాపికి నాస్తికమతమును బోధించమని, దేవాపి వద్దకు పంపాడు. వారు దేవాపికి నాస్తిక మతమును బోధించి దేవాపిని వేద మార్గము నుండి నాస్తికత్వమునకు మళ్లించారు.

ఒక సారి శంతనుడిరాజ్యంలో వర్షములు కురవలేదు. కరువు వచ్చింది. పండితులను పిలిచి దానికి కారణం అడిగాడు. పండితులు పరిశోధించి పెద్దవాడైన దేవాపి రాజ్యం వదిలిపోవడమే కరువుకు కారణం అని తేల్చారు. అన్నగారు ఉండగా నీవు వివాహం చేసుకోవడం, యజ్ఞయాగములు చెయ్యడం శాస్త్రవిరుద్ధము కాబట్టి నీవు వెంటనే నీ అన్నను తీసుకొని రా." అని అన్నారు.

శంతనుడు వెంటనే అన్నను వెతుక్కుంటూ వెళ్లాడు. అన్నను కలుసుకొని రాజధానికి వచ్చి రాజ్యపాలన చేయమని కోరాడు. అప్పటికే నాస్తికమతము పట్ల ఆకర్షితుడైన దేవాపి శంతనుడితో వితండ వాదం చేసాడు. పైగా దేవుడు లేడు, వేదములు అన్నీ అబద్ధములు అని వాదించసాగాడు. వేదములను, దేవుడిని నమ్మని వాడు రాజ్యపాలనకు అర్హుడు కాడని, శంతనుడు వెనక్కువచ్చేసాడు. శంతనుడు ఇంద్రుని ప్రార్థించి వర్షములను కురిపించాడు.

శంతనుడి తమ్ముడు బాహ్లీకునకు సోమదత్తుడు, సోమదత్తునకు భూరిశ్రవసుడు అనే కుమారులు కలిగారు. శంతనుడికి గంగాదేవి వలన భీష్ముడు అనే పేరుగల కుమారుడు జన్మించాడు. ఈ భీష్ముడు మహావీరుడు. ధనుర్విద్యాపారంగతుడు. తన గురువు పరశు రామునితో యుద్ధం చేసి, పరశురాముని ప్రశంసలు పొందాడు.

శంతనుడు దాశరాజుకుమార్తె అయిన సత్యవతిని వివాహం చేసుకున్నాడు. ఈ సత్యవతి ఉపరిచర వసువు వీర్యముచే మత్స్యగర్భములోనుండి పుట్టింది. దాశరాజుచేత పెంచబడింది. సత్యవతి కన్యగా ఉండగా పరాశర మహర్షి వలన భగవదంశ సంభూతుడు అయిన వ్యాసుడు జన్మించాడు. వ్యాసుని కుమారుడగు నేను నా తండ్రివ్యాసుని వద్ద భాగవతమును అధ్యయనం చేసాడు.

(ఈ కథను మీరు భారతములో చదివారు. మీకు గుర్తు చేయడానికి క్లుప్తంగా చెబుతాను. కురు వంశ మూల పురుషుడు కురువునకు సుధనువు అనే కుమారుడు ఉన్నాడు. సుధనువు కుమారుడు ఉపరిచరవసువు. ఆయన ఇంద్రునికి మిత్రుడు. ఆ ఉపరిచర వసువు ఒక రోజు వేటకు వెళ్లాడు. వేటాడి అలసి పోయి ఒక చెట్టు కింద విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఆ సమయంలో అతనికి తన అందమైన భార్య గుర్తుకు వచ్చింది. ఉపరి చరవసువు కామపరవశుడయ్యాడు. అప్పుడు అతనికి వీర్యస్ఖలనం అయింది. తన వీర్యం వృధా కాకూడదని ఉపరిచరవసువు ఆ వీర్యమును ఒక ఆకు దొప్పలో ఉంచి, ఒక డేగను పిలిచి ఆ దొప్పను ఆ డేగ మెడకుకట్టాడు. ఆ దొప్పనుతన భార్యకు ఇమ్మని చెప్పాడు.

ఆ డేగ ఆకాశంలో ఎగురుతూ పోతూ ఉంది. ఆసమయంలో మరొక డేగ ఆ దొప్పలో తినే పదార్థం ఉందని అనుకొని దొప్ప కట్టిన డేగనుండి ఆ దొప్పను లాగుకోడానికి ప్రయత్నించింది. రెండు డేగలకు

మధ్య పోరాటం జరిగింది. ఆ పోరాటంలో ఆ దొప్పలో ఉన్న ఉ పరిచరవసువు వీర్యము కింద ఉన్న గంగానదిలో పడింది. ఆ సమయంలో ఒక చేప నీటి మీద నోరు తెరుచుకొని ఈదుతూఉంది. విధివశాత్తు ఉపరిచరవసువు వీర్యము ఆ చేప నోట్లో పడింది. ఆ చేప ఈ వీర్యమును గుటుక్కునమింగింది. ఆ చేప గర్భం ధరించింది. గంగానదిలో చేపలు పట్టుకుంటున్న జాలరులు ఈ చేపను తమ వల విసిరిపట్టుకున్నారు. పెద్ద చేప కాబట్టి, దానిని తీసుకుపోయి తమ రాజైన దాశరాజుకు బహుమానంగా ఇచ్చారు.

దాశరాజు వంటవాడిని పిలిచి దానిని చక్కగా కోసి వండమని చెప్పాడు. వంటవాడు ఆ చేపను నిలువుగా కోసాడు. ఆ చేప కడుపులోనుండి ఒక ఆడశిశువు బయట పడింది. వంటవాడు ఆశ్చర్యపోయి ఆ శిశువును దాశరాజుకు అప్పగించాడు. పిల్లలు లేని దాశరాజు రాజు ఆ శిశువుకు మత్స్యగంధి (చేపవాసనకలది) అనే నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచుకున్నాడు.

ఒక రోజు మత్స్యగంధి గంగానది మీద పడవ నడుపుతూ ఉంది. పరాశరుడు నది దాటడానికి అక్కడకు వచ్చాడు. మత్స్యగంధిని చూచి మోహించాడు. గంగానదిమధ్యలో ఉన్న దీవిలో ఆమెతో సంగమించాడు. వారికి వ్యాసుడు దండ కమండలములతో జన్మించాడు. నల్లగా ఉండి, నదిమధ్యలో పుట్టాడు కాబట్టి కృష్ణద్వైపాయనుడు అనే పేరు వచ్చింది.

కృష్ణద్వైపాయనుడు తల్లికి నమస్కరించి అవసరం వచ్చినప్పుడు తనను పిలువమని చెప్పి తపస్సుకు వెళ్లిపోయాడు. ఇదీ భారత, భాగవత కర్త  వ్యాసుని జననం కథ.)

శంతనుడు, దాశరాజు కూతురు, సత్యవతిగా పిలువబడే మత్స్యగంధిని వివాహం చేసుకున్నాడు. వారికి చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అనే కుమారులుకలిగారు. చిత్రాంగదుడు ఒక గంధర్వుని చేతిలో మరణించాడు. గంగకు, శంతనుడికి పుట్టిన భీష్ముడు కాశీరాజు కుమార్తెలు అయిన అంబ, అంబిక అంబాలిక అనేకన్యలను బలవంతంగా తీసుకొని వచ్చి విచిత్రవీర్యునకు వివాహం చేయ సంకల్పించాడు. అంబ వేరే యువకుని ప్రేమించినందున ఆమెను సగౌరవంగా తిప్పిపంపాడు.

అంబిక, అంబాలికలను విచిత్రవీర్యునికి ఇచ్చి వివాహం చేసాడు. విచిత్రవీర్యునికి సంతానం లేదు. అతడు అకాల మరణం చెందాడు. కురు వంశము నిలపడానికి సత్యవతి తన కుమారుడు వ్యాసుని పిలిచింది. ఆనాటి దేవర న్యాయము ననుసరించి వ్యాసుని వలన అంబకు, అంబాలికకు సంతానం కలిగింది. వారే ధృరాష్ట్రుడు, పాండురాజు. వ్యాసునికి దాసికి పుట్టిన వాడు విదురుడు.

ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డివాడు. ఆయన భార్య పేరు గాంధారి. వారికి నూరుగురు కుమారులు, ఒక కుమార్తె. దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలగు వారు కుమారులు, దుస్సల కుమార్తె. దుర్యోధనుడు పెద్దవాడు. రెండవ కుమారుడు పాండురాజు

కారణాంతరాల వలన  తన భార్యలు, కుంతి, మాద్రిలతో సహా వానప్రస్థమువెళ్లాడు. పాండురాజు మైధున క్రియలో పాల్గొంటే మరణిస్తాడని ఒక ముని శపించాడు. ఆ కారణం చేత పాండురాజుకు సంతానము లేదు.  కుంతికి  లోకపాలకులైన యముడు, వాయువు,ఇంద్రుడు వలన ముగ్గరు కుమారులు కలిగారు. వారే ధర్మరాజు, భీమసేనుడు, అర్జునుడు. అదేమాదిరి రెండవ భార్య మాద్రికి అశ్వినీదేవతల వలన నకులుడు,సహదేవుడు అనే కవల పిల్లలు పుట్టారు.  ఈ ఐదుగురు పంచపాండవులు అని పిలువ బడ్డారు.

ఈ ఐదుగురికి ఒకే భార్య. ఆమె పేరు ద్రౌపది. ఆమె ద్రుపదరాజ పుత్రిక.  ద్రౌపదికి ధర్మరాజు వలన ప్రతివింధ్యుడు, భీమసేనుని వలన శ్రుతసేనుడు, అర్జునుని వలన శ్రుతకీర్తి, నకులుని వలన శతానీకుడు, సహదేవుని వలన శ్రుతకర్మ అనే కుమారులుకలిగారు.

ఓ పరీక్షిత్ మహారాజా!  వారంతా నీకు పినతండ్రులు. పంచపాండవులకు ద్రౌపది కాక ఇంకా చాలామంది భార్యలు ఉన్నారు. వారి వలన పంచపాండవులకు చాలామంది కుమారులు కలిగారు. వారిలో యుధిష్ఠిరునికి పౌరవి అనే భార్య వలన దేవకుడు, భీమునికి హిడింబివలన ఘటోత్కచుడు, అర్జునునికి సుభద్ర వలన అభిమన్యుడు, ఉలూచి వలన ఇరావంతుడు, మణిపుర రాజకన్యయందు బభ్రువాహనుడు,  నకులునికి కరేణుమతి వలన నరమిత్రుడు,  సహదేవునికి పర్వతరాజ పుత్రిక విజయ యందు సుహోత్రుడు జన్మించారు.

వీరిలో అర్జునునికి, సుభద్రకు జన్మించిన వాడు అభిమన్యుడు. అభిమన్యునికి విరాటరాజ పుత్రిక ఉత్తరకు నీవు జన్మించావు. కురువంశము నిర్మూలించవలెనని అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రము ప్రయోగించాడు. ఆ బహ్మశిరోనామకాస్త్రము ఉత్తర గర్భములో ఉన్న నిన్ను నాశనం చేయడానికి ప్రయత్నించింది. ఆ సమయంలో శ్రీకృష్ణుడు నిన్ను కాపాడాడు. నీకు జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అనే కుమారులు కలిగారు. వారిలో పెద్ద వాడు జనమేజయుడు.

ఇంక జరగబోవు కథను చెబుతాను విను.

నీవు మరణించిన తరువాత, తక్షకుని వలన నీకు మరణం సంభవించినది అనితెలుసుకొన్న నీ కుమారుడు జనమేజయుడు సర్పయాగం చేస్తాడు. ఆ యాగంలో సర్పములు అన్నీ వచ్చి పడి అగ్నికి ఆహుతి అవుతాయి. జనమేజయుడు ఈ భూమండలమును అంతా జయించి అశ్వమేధ యాగము చేస్తాడు.

జనమేజయుని కుమారుడు శతానీకుడు. శతానీకుడు యాజ్ఞవల్క్యుని వద్ద మూడు వేదములను అధ్యయనం చేస్తాడు, విలువిద్య నేర్చుకుంటాడు. శౌనకముని వద్ద ఆత్మజ్ఞానమును నేర్చుకుంటాడు.

శతానీకుని కుమారుడు సహస్రానీకుడు. వాని కుమారుడు అశ్వమేధజుడు. అతని కుమారుడు అసీమ కృష్ణుడు. అతని కుమారుడు నేమిచక్రుడు. ఆ సమయంలో హస్తినాపురము గంగానదిలో మునిగి పోతుంది. అప్పుడు నేమిచక్రుడు కౌశాంబి అనే నగరమును నిర్మించి రాజధానిగా చేసుకుంటాడు.

నేమి చక్రుని కుమారుడు చిత్రరథుడు. అతని కుమారుడు శుచిరథుడు. అతని కుమారుడు వృష్టిమానుడు. అతని కుమారుడు సుషేణుడు. అతని కుమారుడు సునీథుడు. అతని కుమారుడు నృచక్షువు. అతని కుమారుడు సుఖీనలుడు. అతని కుమారుడు పరిప్లవుడు. అతని కుమారుడు సునయుడు. అతని కుమారుడు మేధావి. అతని కుమారుడు నృపంజయుడు. అతని కుమారుడు దూర్వుడు. అతని కుమారుడు తిమి. తిమికి బృహద్రథుడు, బృహద్రథునకు సుదాసుడు, సుదాసునకు శతానీకుడు, శతానీకునకు దుర్దమనుడు, దుర్దమనునకు మహీనరుడు జన్మిస్తారు. మహీనరుని కుమారుడు దండపాణి. అతని కుమారుడు నిమి. అతని కుమారుడు క్షేమకుడు. కలియుగంలో క్షేమకుడితో చంద్రవంశము పూర్తి అవుతుంది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పుడు నీకు మగధ వంశ రాజుల చరిత్రను వివరిస్తాను. జరాసంధుని కుమారుడు సహదేవుడు అని చెప్పాను కదా. ఆ సహదేవుని కుమారుడు మార్జారి. అతని కుమారుడు శ్రుతశ్రవుడు. అతని కుమారుడు అయుతాయువు. అతని కుమారుడు నిరమిత్రుడు. అతని కుమారుడు సునక్షత్రుడు. అతని కుమారుడు

బృహత్సేనుడు. అతని కుమారుడు కర్మజిత్తు. అతని కుమారుడు సుతంజయుడు. అతని కుమారుడు విప్రుడు. అతని కుమారుడు శుచి. అతని కుమారుడు క్షేముడు. అతని కుమారుడు సువ్రతుడు. అతని కుమారుడు ధర్మసూత్రుడు. అతని కుమారుడు సముడు. అతని కుమారుడు ద్యుమత్సేనుడు. అతని కుమారుడు సుమతి. అతని కుమారుడుసుబలుడు. అతని కుమారుడు సునీథుడు. అతని కుమారుడు సత్యజిత్తు. అతని కుమారుడు విశ్వజిత్తు. అతని కుమారుడు రిపుంజయుడు. వీరంతా ఉపరిచర వసువు కుమారుడైన బృహద్రధుని వంశమునకు చెందిన వారు. ఈ బృహద్రధ వంశము ఇంకా వేయి సంవత్సరములు కొనసాగుతుంది." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కురు, పాంచాల, మగధ వంశరాజుల చరిత్రలను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము ఇరవైరెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# నవమస్కంధము
# ఇరవైమూడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు యయాతి కుమారులైన యదువు, అను, తుర్వసుల వంశ చరిత్రలను వివరిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! యయాతి కుమారులలో అనువు అనే వాడికి సభానరుడు, చక్షువు, పరేష్ణువు అని ముగ్గురు కుమారులు కలిగారు. సభానరుని కుమారుడు కాలవరుడు. వాని కుమారుడు సృంజయుడు. వానికి జనమేజయుడు. వానికి మహాశాలుడు, వానికి మహామనసుడు, మహామనసునకు  ఉశీనరుడు మరియు తితిక్షువు అనే కుమారులు జన్మించారు. ఉశీనరునకు శిభి, వనుడు, కృమి, దక్షుడు అనే కుమారులు కలిగారు. శిబికి వృషాదర్భుడు, సుధీరుడు, మద్రుడు, కేకయుడు అనే పేరుగల నలుగురు కుమారులు జన్మించారు. మహామనసుని రెండవ కుమారుడైన తితిక్షునకు రుషద్రథుడు అనే కుమారుడు కలిగాడు. రుషత్రథునకు హేముడు, వానికి సుతపసుడు, వానికి బలి అనేకుమారులు జన్మించారు.

బలియొక్క భార్యకు,  దీర్ఘతమసుడు అనే ఋషిద్వారా అంగ, వంగ, కళింగ, సుహ్మ, పుండ్ర, ఆంధ్ర అనే పేరుగల కుమారులు జన్మించారు. పైన చెప్పిన అంగుడు మొదలగు రాజులు తమ తమ పేర్లతో రాజ్యములను స్థాపించారు. వారి పేరుతోనే అంగరాజ్యము,

వంగరాజ్యము, కళింగరాజ్యము, ఆంధ్ర రాజ్యము మొదలగు రాజ్యములు ఏర్పడ్డాయి. వారిలో పెద్ద వాడైన అంగునకు ఖలపానుడు, వానికి దివిరథుడు అనే కుమారులు కలిగారు. దివిరథునకు ధర్మరథుడు వానికి చిత్రరథుడు పుట్టారు. చిత్ర రథునికి రోమపాదుడు అనే పేరు కూడా ఉంది.

ఈ రోమపాదునికి సంతానము లేదు. రోమపాదునికి దశరథుడు అనే కోసల రాజు మిత్రుడు. దశరథునికి శాంత అనే కుమార్తె ఉంది. దశరథుడు తన కుమార్తె శాంతను రోమపాదునికి పెంచుకోడానికి ఇచ్చాడు. అప్పటి నుండి శాంత రోమపాదునికి పెంపుడు కుమార్తె అయింది. ఒకసారి రోమపాదుని రాజ్యములో వర్షములు కురవక క్షామము ఏర్పడింది. స్త్రీ అంటే ఎవరో తెలియని ఋష్యశృంగుడు ఆ రాజ్యములో అడుగుపెడితే వర్షములు కురుస్తాయని జ్యోతిష్కులు చెప్పారు. రోమపాదుడు అందమైన వారకాంతలనుపంపి ఋష్యశృంగుని ఆకర్షించి తన రాజ్యములో అడుగుపెట్టేటట్టు చేసాడు. వెంటనే రోమపాదుని రాజ్యములో వర్షములు కురిసాయి. రోమపాదుడు తనపెంపుడు కూతురు శాంతను ఋష్యశృంగునికి ఇచ్చి వివాహం చేసాడు.

దశరథునికి పుత్ర సంతానము లేదు. దశరథుడు తన అల్లుడు ఋష్య శృంగుని ఋత్విక్కుగా చేసుకొని సంతానము కొరకు యాగం చేసాడు. యాగఫలితంగా దశరథునికి రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు అనే పేరుగల నలుగురుకుమారులు కలిగారు.

రోమపాదునికి చతురంగుడు అనే కుమారుడు ఉన్నాడు. వాని కుమారుడు పృథులాక్షుడు. పృథులాక్షునికి బృహద్రథుడు, బృహత్కర్మ, బృహద్భానుడు అనే పేరుగల కుమారులు కలిగారు. వారిలో బృహద్రథునకు బృహన్మనుడు, వానికి జయద్రథుడు జన్మించారు.  వారిలో జయద్రథునకు విజయుడు, విజయునకు ధృతి, ధృతికి ధృతవ్రతుడు, ధృతవ్రతునకు సత్కర్ముడు, వానికి అతిరథుడు కుమారులుగా జన్మించారు.

ఒక నాడు ఈ అతిరథుడు గంగానదిలో స్నానం చేస్తున్నాడు. ఆ సమయంలో, కుంతి అనే రాజకుమారి చేత వదలబడి,  గంగానదిలో కొట్టుకొని వస్తున్న పెట్టె కనిపించింది. అతిరథుడు ఆ పెట్టెను జాగ్రత్తగా ఒడ్డుకు చేర్చి తెరిచి చూడగా ఆ పెట్టెలో ఒక మగశిశువు కనిపించింది. అతిరథునికి సంతానము లేరు. ఆ కారణంగా అతిరథుడు ఆ కుమారుని పెంచుకున్నాడు. ఆ కుమారుడే కర్ణుడు అనే పేరుతో ప్రఖ్యాతిచెందాడు. కర్ణునికి వృషసేనుడు అనే కుమారుడు కలిగాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! యయాతి మూడవ కుమారుని పేరు ద్రుహ్యుడు. ద్రుహ్యుని కుమారుడు బభ్రువు.  బభ్రువు కుమారుడు సేతువు. సేతువు కుమారుడు ఆరబ్ధుడు. ఆరబ్ధుని కుమారుడు గాంధారుడు. గాంధారునికుమారుడు ధర్ముడు. ధర్ముని కుమారుడు ధృతుడు. ధృతుని కుమారుడు దుర్మనసుడు. దుర్మనసుని కుమారుడు ప్రచేతసుడు. ప్రచేతసునికి నూరుగురు కుమారులు కలిగారు. వారు ప్రచేతసులు అని పిలువబడ్డారు.   ఈ ప్రచేతసులు మ్లేచ్ఛదేశమునకు

రాజులు అయ్యారు.

యయాతి రెండవ కుమారుని పేరు తుర్వసుడు అని చెప్పాను కదా! తుర్వసునికి వహ్ని, వహ్నికి భర్గుడు, భర్గునికి భానుమంతుడు కుమారులుగా జన్మించారు. భానుమంతునికి త్రిభానుడు, త్రిభానునికి కరంధముడు, కరంధమునికి మరుత్తు, కుమారులుగా కలిగారు. మరుత్తుకు పుత్ర సంతానము లేదు. అందుచేత పురువంశములో జన్మించిన దుష్యంతుని కుమారునిగా స్వీకరించాడు. దుష్యంతుడు మరుత్తుకు దత్తపుత్రుడుగా వచ్చినా, పురువంశములోనే మహారాజుగా కొనసాగాడు. దుష్యంతుని కుమారుడు భరతుని గురించి నీకు ఇదివరకే వివరించాను.

ఇంక యయాతి పెద్ద కుమారుడు అయిన యదువు గురించి చెబుతాను విను. యదువునకు సహస్రజిత్తు, క్రోష్టుడు, నలుడు, రిపుడు అనే నలుగురు కుమారులు కలిగారు. వారిలో పెద్దకుమారుడు సహస్రజిత్తు. సహస్రజిత్తునకు మహాహయుడు, రేణుహయుడు, హైహయుడు అనే కుమారులు కలిగారు. హైహయుని కుమారుడు ధర్ముడు. ధర్ముని కుమారుడు నేత్రుడు. నేత్రుని కుమారుడు కుంతి. కుంతి కుమారుడు సోహంజి. సోహంజి కుమారుడు మహిష్మంతుడు. మహిష్మంతుని కుమారుడు భద్రసేనుడు.

భద్రసేనుడికి దుర్మదుడు, ధనకుడు అనే ఇద్దరు కుమారులు. ధనకునికి కృతవీర్యుడు, కృతాగ్ని, కృతవర్మ, కతౌసుడు అనే కుమారులు కలిగారు. కృతవీర్యుని కుమారుడు అర్జునుడు.

ఈ అర్జునుడు భూమండలములోని ఏడుద్వీపములను పరిపాలించాడు. ఈ అర్జునుడు భగవంతుని అంశలో జన్మించిన దత్తాత్రేయుని వద్ద యోగవిద్యను, అణిమ, గరిమ మొదలగు అష్టసిద్ధులు అభ్యసించాడు. కృతవీర్యుని కుమారుడు కాబట్టి ఇతడు కార్తవీర్యార్జునుడుగా ప్రసిద్ధిచెందాడు. కార్తవీర్యార్జునునికి ఇతర రాజులు ఎవరూ సాటిరారు. ఆయన 80,000 సంవత్సరములు జీవించాడు.

ఈ కార్తవీర్యునికి వేయిమంది కుమారులు. వారిలో చాలా మంది పరశురాముని చేతిలో మరణించారు. ఐదు మంది మాత్రమే బతికి బయట పడ్డారు. వారి పేర్లు జయధ్వజుడు, శూరసేనుడు, వృషభుడు, మధువు, ఊర్జితుడు. వారిలో జయధ్వజునకు తాళజంఘుడు జన్మించాడు. తాళజంఘునకు నూరుగురు కుమారులు. వారిని తాళజంఘులు అని పిలుస్తారు. వీరందరినీ సగరుడు చంపాడు. తాళజంఘుని కుమారులలో వీతిహోత్రుడు పెద్దవాడు.

కార్తవీర్యుని మరో కుమారుడి పేరు మధువు. మధువుకు నూరుగురు కుమారులు. వారిలో పెద్దవాడి పేరు వృష్ణి. యదువు వలన యదువంశము, మధువు వలన మాధవ వంశము, వృష్ణి వలన వృష్ణి వంశము వృద్ధిచెందాయి.

యదువుకు క్రోష్టుడు అనే కుమారుడు ఉన్నాడని చెప్పాను కదా! ఆ క్రోష్టుని కుమారుడు వృజినవానుడు. వృజిన వానుడి కుమారుడు స్వాహి. స్వాహి కుమారుడు విషద్గువు. విషద్గువు కుమారుడు చిత్రవంతుడు. చిత్రవంతుని కుమారుడు శశిబిందువు.

ఈ శశిబిందువు గొప్ప చక్రవర్తి. ఈయన 14మహారత్నములకు అధికారి అయ్యాడు.
(1.హస్తి. 2.అశ్వములు 3.రథములు 4.స్త్రీలు. 5.ధనుర్బాణములు. 6.నిధులు 7.మాలలు. 8.వస్త్రములు. 9.వృక్షములు. 10. శక్తి 11.పాశము. 12. మణులు. 13ఛత్రము. 14.విధానము.)

శశిబిందువుకి పదివేలమంది భార్యలు. వీరి యందు శశిబిందువుకు పదివేల లక్షల సంతానము కలిగింది. వీరందరిలోకీ పృథుశ్రవుడు, పృథుకీర్తి మొదలగు ఆరుగురు కుమారులు ప్రముఖులు. వీరిలో పృథుశ్రవుని కుమారుడు ధర్ముడు. ధర్ముని కుమారుడు ఉశనసుడు. ఈ ఉశనసుడు నూరు అశ్వమేధయాగములు చేసాడు. ఉశనసుని కుమారుడు రుచకుడు. రుచకునికి పురుజిత్తు, రుక్ముడు, రుక్మేషుడు, పృథువు, జ్యామఘుడు అనేకుమారులు కలిగారు.

వారిలో జ్యామఘుని భార్య పేరు శైబ్య. వీరికి సంతానము లేదు. తన భార్య ఏమన్నా అనుకుంటుందేమో అని. తన భార్యకు భయపడి జ్యామఘుడు రెండోపెళ్లి చేసుకోలేదు. ఒక సారి జ్యామఘుడు తన శత్రువును ఓడించి, ఆ శత్రువు వద్ద నుండి ఒక అమ్మాయిని అపహరించి, తన రథం మీద కూర్చోబెట్టుకొని తీసుకొని వచ్చాడు. తాను కూర్చోవలసిన చోట మరొక అమ్మాయి కూర్చుని ఉండటం చూచింది శైబ్య. కోపంతో మండిపడింది.

"ఈమె ఎవరు? నేను కూర్చుండే స్థానంలో ఎందుకుకూర్చోబెట్టావు?" అనినిలదీసింది.

"ఈమె ఎవరో కాదు! నీకుకోడలు అవుతుంది." అని బదులు చెప్పాడు జ్యామఘుడు. శైబ్య ఆశ్చర్యపోయింది. తనకు కుమారులే లేరు కోడలు ఎక్కడి నుండి వచ్చిందా అని విస్తుపోయింది. "నాకు ఇప్పటి వరకు మగ సంతానము లేరు. పోనీ నీకు వేరే భార్యద్వారా కొడుకు పుట్టాడా అంటే అదీ లేదు. అటువంటప్పుడు ఈ కన్య నాకు కోడలు ఎలా అవుతుంది." అని భర్తను నిలదీసింది.

"నీకు ఇప్పుడు కొడుకులు లేకపోతే ఇంకముందు పుట్టరా. నీకు పుట్టబోయే కుమారుడికి ఈమెను ఇచ్చి పెళ్లి చేస్తాను. అప్పుడు నీకు కోడలు అవుతుందికదా!" అని  సమాధానం ఇచ్చాడు జ్యామఘుడు.

ఎలాగైనా తనకు కొడుకు పుట్టబోతున్నాడు కదా అని సంతోషించింది శైబ్య.  అంతకు ముందు కాలంలో జ్యామఘుడు విశ్వేదేవులకు, పితృదేవతలకు చేసిన ఆరాధనల ఫలితంగా జ్యామఘుడు యాదాలాపంగా అన్న మాటలు నిజం అయ్యాయి. దేవతల అనుగ్రహంతో శైబ్య  గర్భం ధరించింది. ఆమెకు ఒక కుమారుడు కలిగాడు. ఆ కుమారుని పేరు విదర్భుడు.

తాను పుట్టక ముందు, తన తండ్రి జ్యామఘుడిచే కోడలిగా తీసుకురాబడిన కన్యను, వివాహం చేసుకున్నాడు విదర్భుడు. ఆ విదర్భునితో విదర్భ వంశము మొదలయింది." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు యదువంశ రాజుల చరిత్రను వివరించాడు.

శ్రీమద్భాగవతము
నవమ స్కంధము ఇరువది మూడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
నవమ స్కంధము
ఇరువది నాలుగవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు విదర్భరాజుల చరిత్రను వివరిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! శైబ్యుని కుమారుని పేరు విదర్భుడు అని చెప్పాను కదా! ఆ విదర్భునికి కుశుడు, క్రథుడు, రోమపాదుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. రోమపాదుని కుమారుడు బభ్రువు. వాని కుమారుడు కృతి. కృతికి ఉశికుడు, ఉశికునికి చేది పుట్టారు. వారు చేది వంశస్థులు అయ్యారు.

విదర్భుని రెండవ కుమారుడు క్రథునికి కుంతి, వానికి వృష్ణి, వృష్ణికి నిర్వృతి, ని ర్వృతికి దశార్హుడు అనే కుమారులు కలిగారు.

దశార్హుని కుమారుడు వ్యోముడు, వానికి జీమూతుడు, వానికి వికృతి, వానికి భీమరథుడు, వానికి నవరథుడు, నవరథునకు దశరథుడు జన్మించారు. ఈ దశరథునికి శకుని, శకునికి కరంభి, కరంభికి దేవరాతుడు, దేవరాతునకు దేవక్షత్రుడు, దేవక్షత్రునకు మధువు, మధువునకు కురువశుడు, కురువశునకు అనువు జన్మించారు. అనుని కుమారుని పేరు పురుహోత్రుడు. అతని కుమారుడు ఆయువు. ఆయువు కుమారుడు సాత్వతుడు.

సాత్వతునకు భజమానుడు, భజి, దివ్యుడు, వృష్ణి, దేవవృధుడు, అంధకుడు, మహాభోజుడు అనే ఏడుగురు కుమారులు కలిగారు. భజమానునకు వేర్వేరు భార్యల యందు నిమ్లోచి, కించనుడు, ధృష్టి, శతాజిత్తు, సహస్రాజిత్తు, అయుతాజిత్తు అనే కుమారులు కలిగారు. దేవవృధుని కుమారుడు బభ్రువు. మానవులలో దేవవృధుడు, బభ్రువు గొప్పవారు. వారి వంశములో  14,065 మంది  ముక్తిని పొందారు.

మహాభోజుడు గొప్ప ధర్మాత్ముడు. ఆయన పేరుతోనే భోజవంశము వృద్ధిపొందింది.

వృష్ణికి సుమిత్రుడు, యుధాజిత్తు అనే కుమారులు కలిగారు. యుధాజిత్తునకు శిని, అనమిత్రుడు అనే కుమారులు కలిగారు. వారిలో అనమిత్రునకు విమ్నుడు అనే కుమారుడు,  విమ్నునకు సత్రాజిత్తు (సత్యభామ తండ్రి), ప్రసేనుడు జన్మించారు. అనమిత్రునికి శిని పేరుతో మరొక కుమారుడు ఉన్నాడు. ఆ శిని కుమారుడు సత్యకుడు. సత్యకుని కుమారుడు యుయుధానుడు. సత్యకుని కుమారుడు కాబట్టి అతనిని

సాత్యకిఅని కూడా అంటారు. యుయుధానుని(సాత్యకి) కుమారుడు జయుడు, జయుని కుమారుడు కుణి, కుణి కుమారుడు యుగంధరుడు.

అనమిత్రుని మూడవ కుమారుడైన వృష్ణికి శ్వఫల్కుడు, చిత్రరథుడు అనే కుమారులు జన్మించారు. శ్వఫల్కునకు గాందిని అనే భార్యయందు అక్రూరుడు మొదలగు పన్నెండు మంది పుణ్యపురుషులు కుమారులుగా జన్మించారు. వారి పేర్లు అక్రూరుడు, సారమేయుడు, మృదురుడు, మృదువిత్తు, గిరి, ధర్మవృద్ధుడు, సుకర్మ, క్షత్రోపేక్షుడు, అరిమర్దనుడు, శత్రుఘ్నుడు, గంధమాదుడు, ప్రతిబాహువు. శ్వఫల్కుని కుమార్తె పేరు సుచార. అక్రూరుడికి ఇద్దరు కుమారులు. వారు దేవవానుడు, ఉపదేవుడు. చిత్రరథునకు పృథువు, విదూరథుడు మొదలగు వారు జన్మించారు. వీరందరూ వృష్ణికులములో పుట్టినవారు.

అంధకునికి కుకురుడు, భజమానుడు, శుచి, కంబబర్హిషుడు అనే కుమారులు జన్మించారు. కుకురుని కుమారుడు వహ్ని. వహ్ని కుమారుడు విలోముడు. విలోముని కుమారుడు కపోతరోముడు. అతని కుమారుడు అనువు. తుంబురుడు ఈ అనువునకు మిత్రుడు. అనువు కుమారుడు అంధకుడు. వాని కుమారుడు దుందుభి. దుందుభి కుమారుడు అవిద్యోతుడు. అవిద్యోతుని కుమారుడు పునర్వసువు. పునర్వసువు కుమారుని పేరు ఆహుకుడు, కుమార్తె పేరు ఆహుకి.

ఆహుకునకు దేవకుడు, ఉగ్రసేనుడు అనే కుమారులు కలిగారు. దేవకునికి దేవవానుడు, ఉపదేవుడు, సుదేవుడు, దేవవర్ధనుడు అనే కుమారులు కలిగారు. దేవకునికి శాంతదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి, ధృతదేవ అనే కుమార్తెలు కలిగారు. వీరందరినీ వసుదేవుడు (కృష్ణుడి తండ్రి) వివాహం చేసుకున్నాడు. ఉగ్రసేనునికి కంసుడు, సునాముడు, న్యగ్రోధుడు, కంకుడు, శంకుడు, సుహుడు, రాష్ట్రపాలుడు, ధృష్టి, తుష్టిమానుడు అనే కుమారులు కలరు. ఉగ్రసేనునికి కంస, కంసవతి, కంక, శూరభూ, రాష్ట్రపాలిక అనే పుత్రికలు కూడా కలిగారు. వీరందరినీ వసుదేవుని సోదరులు వివాహం చేసుకున్నారు.
(ఉగ్రసేనుడు, దేవకుడి కుమార్తెలను, వసుదేవుడు అతని సోదరులు వివాహం చేసుకున్నారు. అక్కచెల్లెళ్లను, అన్నదమ్ములు వివాహం చేసుకున్నారు. కొంచెం పైకి వెళ్లండి. వృష్టికి శ్వఫల్కుడు, చిత్రరథుడు అనే కుమారులు ఉన్నారని చదువుకున్నాము కదా! శ్వఫల్కుడి వంశము గురించి ఇప్పటి దాకా చదువుకున్నాము. ఇంక చిత్రరథుని వంశము గురించి చదువుకుందాము.)

చిత్రరథునకు విదూరథుడు అనే కుమారుడు కలిగాడు. అతని కుమారుడు శూరుడు. శూరుని కుమారుడు భజమానుడు. భజమానుని కుమారుడు శిని. శిని కుమారుడు భోజుడు. భోజుని కుమారుడు హృది. హృదికునికి దేవమీఢుడు, శతధనువు, కృతవర్మ అనే కుమారులు కలిగారు.

దేవమీఢుని కుమారుడు శూరుడు. శూరునికి వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవసుడు, ఆనకుడు, సృంజయుడు, శ్యామకుడు, కంకుడు, శమీకుడు, వత్సకుడు, వృకుడు అనే పది మంది సంతానము కలిగారు. వసుదేవుడు పుట్టినపుడు దేవతలు దుందుభులు మోగించారు. భగవానుడైన శ్రీకృష్ణుడు ఈయనకు కుమారుడుగా పుట్టబోతున్నాడని దుందుభులు మోగించారు. ఆ కారణం చేత వసుదేవునికి ఆనకదుందుభి అనే పేరు సార్థకమయింది.

శూరునికి పది మంది కుమారులతో పాటు ఐదుగురు కుమార్తెలు కూడా కలిగారు. వారి పేర్లు పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవ, దేవి అనే కుమార్తెలు కలిగారు. (అంటే వసుదేవునికి పృథ స్వంత చెల్లెలు.) కుంతిభోజుడు అనే రాజు శూరునకు మిత్రుడు. కుంతిభోజునికి సంతానము లేదు. ఆకారణం చేత తన కుమార్తె పృథను కుంతిభోజుడు అనే రాజుకు పెంపకానికి ఇచ్చాడు. కుంతి భోజుని కుమార్తె కాబట్టి పృథను కుంతీదేవి అనీ పిలుస్తారు. (చాలామందికి శ్రీకృష్ణుడు కుంతిని అత్తా అని ఎందుకు పిలుస్తాడు అని సందేహం. శ్రీకృష్ణుని తండ్రి వసుదేవునకు పృథ చెల్లెలు. పృథ పేరు కుంతి. తండ్రి చెల్లెలు శ్రీకృష్ణునికి మేనత్త. ఆ కారణం చేత శ్రీకృష్ణుడు కుంతిని అత్తా అంటాడు. పాండవులు అందరూ కృష్ణునికి మేనత్తకుమారులు.)

పృథ కుంతి అనే పేరుతో కుంతి మహారాజు ఇంట్లో పెరుగుతూ ఉండగా, ఒక రోజు దుర్వాసుడు అనే మహర్షి వారి ఇంటికి వచ్చాడు. రాకుమారి అయిన కుంతి ఆయనకు సకల పరిచర్యలు

చేసింది. ఆమె చేసిన పరిచర్యలకు సంతోషించిన దుర్వాసుడు కుంతికి దేవతలను ఆహ్వానించే దేవహూతి అనే మంత్రమును ఉపదేశించాడు. దుర్వాసుడు వెళ్లిపోయిన తరువాత కుంతి, ఆ మంత్రము ఎలాపనిచేస్తుందో చూడాలని అనుకొంది. ఏ దేవతను పిలుద్దామా అని అనుకుంటూ యాదృచ్ఛికంగా తల పైకెత్తింది. ఆకాశంలో సూర్యుడు కనపడ్డాడు. సూర్యుడు అయితే బాగుంటుంది అని సూర్యుడిని ఆవాహన చేసింది. సూర్యుడు ఆమె వద్దకు వచ్చాడు.

కుంతికి కంగారు పుట్టింది. సూర్యునికి నమస్కరించి "దేవదేవా! నన్ను క్షమించండి. దుర్వాసమహాముని ఇచ్చిన మంత్రమును పరీక్షించడానికి తమరిని ఆహ్వానించాను. మంత్రము పనిచేసిందని తేలింది. ఇంక తమరు వెళ్లండి. బాల్యచాపల్యంతో ఏ పనీలేకుండా తమరిని ఆహ్వానించి నందుకు నన్ను క్షమించండి." అని వేడుకుంది.

సూర్యుడు నవ్వి ఇలాఅన్నాడు. "దేవతలు ఊరకే రారు. వచ్చిన తరువాత ఊరికే పోరు. దేవతల దర్శనము ఎప్పుడూ వృధా కాదు. ఎటూవచ్చాను కాబట్టి నీ కన్యాత్వము భంగము కాకుండా నీకు ఒక కుమారుని ప్రసాదిస్తాను. స్వీకరించు." అని పలికి కుంతి కన్యాత్వము భంగం కాకుండా ఆమెకు గర్భాదానం చేసి వెళ్లిపోయాడు సూర్యుడు. కుంతి సద్యోగర్భము దాల్చి ఒక కుమారునికి జన్మనిచ్చింది. 'కన్యగా ఉండగా సంతానము ఎలా కలిగింది' అన్న లోకాపవాదమునకు భయపడ్డ కుంతి, ఆ కుమారుని ఒక పెట్టెలో పెట్టి నదీజలములలో విడిచిపెట్టింది. (ఆ కుమారుని మహారథుడు అనే వాడు

పెంచుకున్నాడు. అతని పేరు కర్ణుడు అని ఇదివరకు మనం చదువుకున్నాము.) తరువాతి కాలంలో కుంతిని పాండురాజు వివాహం చేసుకున్నాడు.

పృథ (కుంతి) సోదరి పేరు శ్రుతదేవ. శ్రుతదేవను కరూషరాజ్యమునకు రాజు అయిన వృద్ధశర్మ పెళ్లిచేసుకున్నాడు. వారి కుమారుడు దంతవక్త్రుడు. (ఈ దంతవక్త్రుడు సనకాదులచే శపించబడిన జయవిజయులలో ఒకడు.)

పృథ (కుంతి) రెండవ చెల్లెలు శ్రుతకీర్తిని కేకయవంశపురాజు ధృష్టకేతువు వివాహం చేసుకున్నాడు. వారికి ఐదుగురు కుమారులు కలిగారు.

పృథ మరొక చెల్లెలు దేవిని జయసేనుడు అనే రాజు పెళ్లిచేసుకున్నాడు. వారికి విందుడు, అనువిందుడు అనే కుమారులు కలిగారు.

చేది దేశాధిపతి అయిన దమఘోషుడు పృథ మరొక చెల్లెలు అయిన శ్రుతశ్రవనుపెళ్లి చేసుకున్నాడు. వారికి శిశుపాలుడు అనే కుమారుడు కలిగాడు. (శ్రీకృష్ణునికి మరొక మేనత్త అయిన శ్రుతశ్రవ కుమారుడు శిశుపాలుడు.)

వసుదేవుని సోదరుడు దేవభాగుడు. ఆయన భార్య పేరు కంస. వారికి కేతువు, బృహద్బలుడు అనే ఇద్దరుకుమారులు కలిగారు.

వసుదేవుని మరొక సోదరుడు దేవశ్రవసుడు కంసవతి అనే ఆమెను వివాహం చేసుకున్నాడు. వారికి సుధీరుడు, ఇషుమానుడు అనే కుమారులు కలిగారు.

వసుదేవుని మరొక సోదరుడు కంకుడు అనే వాని భార్య కంక. వారికి బకుడు, సత్యజిత్తు, పురుజిత్తు అనే కుమారులు కలిగారు.

వసుదేవుని మరొక సోదరుడు సృంజయుని భార్యపేరు రాష్ట్రపాలి. వారికి వృషుడు, దుర్మర్షుడు అనే కుమారులు కలిగారు.

వసుదేవుని మరొక సోదరుడు శ్యామకుని భార్యపేరు శూరభూమి. వారికి హరికేశుడు, హిరణ్యాక్షుడు అనే కుమారులు కలిగారు.

వసుదేవుని మరొక సోదరుడు వత్సకుని భార్య పేరు మిశ్రకేసి అనే అప్సరస. వారికి వృకుడు, ప్రభృతి మొదలగు వారు పుత్రులుగా జన్మించారు.

వసుదేవుని మరొక సోదరుడు వృకుని భార్యపేరు దూర్వాక్ష. వారికి తక్షుడు, పుష్కరుడు, శులుడు మొదలగు వారు కుమారులుగా జన్మించారు.

వసుదేవుని మరొక సోదరుడు శమీకుని భార్య పేరుసుదామని. వారికి సుమిత్రుడు, అర్జునపాలుడు మొదలగు వారు కుమారులుగా

జన్మించారు.

వసుదేవుని మరొక సోదరుడు ఆనకుని భార్యపేరు కర్ణిక. వారికి ఋతధాముడు, జయుడు అనే కుమారులు కలిగారు.

వసుదేవునికి దేవకీదేవి కాక ఇంకా పౌరవి, రోహిణి, భద్ర, మదిర, రోచన, ఇలా అనే భార్యలు ఉన్నారు. వీరిలో దేవకీదేవి పట్టపురాణి. వసుదేవునికి రోహిణి యందు బలుడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధ్రువుడు అనే కుమారులు కలిగారు. పౌరవికి సుభద్రుడు, భద్రాబాహువు, దుర్మదుడు, భద్రుడు, భూతుడు, మొదలగు వారు 12 మంది కుమారులు కలిగారు. వసుదేవునికి మదిరయందు నందుడు, ఉపనందుడు, కృతకుడు, శూరుడు అనే కుమారులు కలిగారు. భద్రకు ఒక కుమారుడు కలిగాడు. వసుదేవునికి రోచన అనే భార్య యందు హస్తుడు, హేమాంగుడు మొదలగు వారు కుమారులు. వసుదేవునికి ఇల యందు ఉరువల్కుడు మొదలగు వారు కుమారులుగా కలిగారు. వసుదేవునికి ధృతదేవ అనే భార్యయందు విపృష్ఠుడు అనే కుమారుడు కలిగాడు. వసుదేవునకు శాంతిదేవ అనే భార్య యందు ప్రసముడు, ప్రసితుడు అనే కుమారులు కలిగారు. వసుదేవునకు ఉపదేవ అనే భార్య యందు రాజన్యుడు, కల్పుడు, వర్షుడు మొదలగు పదిమంది కుమారులు కలిగారు. వసుదేవునకు శ్రీదేవ అనే భార్యయందు వసువు, హంసుడు, సువంశు డు, మొదలగు ఆరుగురు కుమారులు కలిగారు. వసుదేవునకు దేవరక్షత అనే భార్య యందు గదుడు మొదలగు తొమ్మిది మంది కుమారులు కలిగారు. వసుదేవునకు సహదేవ అనే భార్యయందు శ్రు

తప్తవరుడు మొదలగు పదిమంది కుమారులు కలిగారు.

వసుదేవునకు దేవకి అనే భార్య యందు ఎనిమిది మంది సంతానము కలిగారు. వారి పేర్లు కీర్తిమానుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సమ్మర్ధనుడు, భద్రుడు. వీరి తరువాత ఏడవ కుమారుడుగా సంకర్షణుడు బలరాముడిగా జన్మించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! మీ పితామహి (పరీక్షిత్ తండ్రి అయిన అభిమన్యుని తల్లి) అయిన సుభద్ర ఈ వసుదేవుని కుమార్తె.

ఓ పరీక్షిత్ మహారాజా! ధర్మమునకు హాని కలిగినప్పుడు, అధర్మము వృద్ధిచెందుతున్నప్పుడు, భగవంతుడు తనకు తానుగా అవతరిస్తాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తాడు. మాయను తన అధీనంలో ఉంచుకునేవాడు, సకల భూతములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నవాడు, అయిన పరమాత్మకు జననమరణములు లేవు. కానీ పరమాత్మ మానవునిగా జన్మ ఎత్తుతున్నాడు అంటే అది తనను నమ్ముకున్న సాధుజనులమీద తనదయను ప్రసరింపజేయడానికేకానీ వేరు కాదు.

రాక్షస ప్రవృత్తి కల క్షత్రియుల చేత, వారి సైన్యాధ్యక్షుల చేత. సైన్యముల చేత ఆక్రమించబడిన ఈ భూమి యొక్క భారము పోగొట్టడానికి పరమాత్మ మానవునిగా అవతరించాడు. తనతో పాటు పుట్టిన సంకర్షణుని సాయంతో భగవానుడు బ్రహ్మ, మొదలగు దేవతలు మనసులో  కూడా తలంచలేని పనులను అవలీలగా చేసాడు.

ఈ కలియుగంలో జన్మించిన తన భక్తుల మీద దయ, కృప చూపడానికి భగవానుడు శ్రీకృష్ణుడుగా అవతరించి, జనులయొక్క శోకమును, మోహమును, తమస్సును పోగొట్టాడు.

శ్రీకృష్ణ పరమాత్మ లీలలను, కీర్తిని ఒక్కసారి ఈచెవులతో వింటే, వాడి సకల పాపములు, కర్మబంధములు నశించిపోతాయి. భోజులు, వృష్ణులు, అంధకులు, మధువులు, శూరసేనులు, దశార్హులు, కురువులు, సృంజయులు, పాండునందనులు శ్రీకృష్ణుని కీర్తిని పొగుడుతుంటే, ఆ శ్రీకృష్ణుడు తన మృదుమధురమైన మాటలతోనూ చతుర సంభాషణములతోనూ, గోవర్ధనోద్ధరణము, రాక్షస సంహారము మొదలగు లీలలతోనూ తనతోటివారికి ఆనందాన్ని పంచిపెట్టేవాడు. శ్రీకృష్ణుని అందమైన ముఖాన్ని ఎన్నిసార్లు చూచినా ఎంతసేపు చూచినా స్త్రీపురుషులకు తనివితీరేదికాదు. పాపాత్ముడగు ఆ నిమి తమ కనురెప్పలమీద కూర్చుని, ఎందుకు రెప్పవేస్తున్నాడా, ఆరెప్పపాటు కాలంకూడా శ్రీకృష్ణుని సుందరవదనారవిందము చూడలేకపోయామే అని బాధపడేవారు.

శ్రీకృష్ణుడు వసుదేవుని గృహంలో పుట్టినా, విధివశాత్తు నందవ్రజమునకు తీసుకొని పోబడ్డాడు. తనబాల్యం అంతా నంద యశోదలతో గడిపాడు. ఆ వ్రజవాసులు ఎంత పుణ్యం చేసుకున్నారో కదా! తన బాల్యంలోనే పూతన మొదలగు రాక్షసులను అవలీలగా సంహరించాడు. తరువాత ఎనిమిది మంది భార్యలనుపెళ్లాడి, వారి వలన అనేకమంది పుత్రులకు జన్మనిచ్చాడు. తరువాత కౌరవ పాండవుల మధ్య రేగిన కలహమును కారణంగా చేసుకొని, కురుక్షేత్ర

సంగ్రామమును జరిపించి భూభారమును తగ్గింపజేసాడు.
కురుక్షేత్రసంగ్రామములో విజయాన్ని తన బావ విజయునికి
(అర్జునునికి) కట్టబెట్టి తాను నిమిత్తమాత్రుడుగా మిగిలిపోయాడు.
తుదకు ఉద్ధవునకు ఆత్మతత్వమును ఉపదేశించి, తాను వైకుంఠము
చేరుకున్నాడు." అని శుకమహర్షి పరీక్షిత్మహారాజుకు
విదర్భవంశరాజుల చరిత్ర, శ్రీకృష్ణఅవతార ప్రాశస్త్యము వివరించాడు.

శ్రీమద్భాగవతము

నవమస్కంధము ఇరువది నాలుగవ అధ్యాయముసంపూర్ణము

నవమస్కంధము సర్వం సంపూర్ణం.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

చివరి మాట. నవమ స్కంధంతో భాగవత పురాణంలో
తొమ్మిది స్కంధములు పూర్తి అయ్యాయి. దశమస్కంధము పూర్తిగా
శ్రీకృష్ణ చరిత్ర. కృష్ణ జననం నుండి నిర్యాణం వరకు జరిగిన కథ
దశమస్కంధము.

భాగవతములో చిన్న చిన్న కథలు ఉన్నాయి. వాటిలో కొన్ని
కథలు మనకు శాస్త్రవిజ్ఞానాన్ని సాంకేతిక పరిజ్ఞానాన్ని
తెలియచెపుతాయి. అటువంటి కథలలో ఒకటి నవమ స్కంధంలో
చెప్పబడిన రేవతి కథ. రేవతి తండ్రి అయిన కకుద్మి, ఆమెకు తగ్గ
వరుడు ఎవరా అని తెలుసుకోడానికి, ఆమెను తీసుకొని బ్రహ్మలోకానికి
వెళ్లాడు. ఆ సమయంలో బ్రహ్మగారు గంధర్వుల గానాన్ని వింటున్నాడు.
ఆ కార్యక్రమం పూర్తి అయిన తరువాత రేవతి తండ్రిని పిలిచాడు. వచ్చిన

విషయం తెలుసుకున్నాడు. అప్పుడు బ్రహ్మ దేవుడు చెప్పిన మాటలు ఆసక్తి కరంగా ఉంటాయి.

"ఓ రాజా! నీవు నీ కూతురిని ఎవరికి ఇవ్వాలని అనుకున్నావో వారందరూ ఇప్పటికే మరణించారు. నీవు భూలోకము నుండి బ్రహ్మలోకమునకు వచ్చిన తరువాత 27 మహాయుగములు గడిచిపోయాయి. నీవుఎవరికైతే నీకుమార్తెను ఇవ్వదలచుకున్నావో వారి గోత్రనామాలు కూడా ఇప్పుడుఎవరికీ తెలియదు. కాబట్టి నీవు నీ కుమార్తె తో కూడా భూలోకమునకు వెళ్లు. ప్రస్తుతము భూలోకములో బలరాముడు ద్వారకలో ఉన్నాడు. ఆయనకు నీ కుమార్తెను ఇచ్చి వివాహం చెయ్యి." అని అన్నాడు. ఇది మనకు కథ మాదిరి కనిపిస్తుంది కానీ ఇందులో ఒక విజ్ఞాన విశేషము దాగిఉంది. మనము లెక్కపెట్టుకునే రోజులు నెలలు, సంవత్సరములు కేవలం మనము భూమిమీద ఉన్నంత వరకే. భూమిని వదిలిపెడితే ఈ లెక్కలు పనిచెయ్యవు. మరి భూలోకములో ఉన్న మనిషికి అంతరిక్షంలోకి వెళ్లిన మనిషికి వయసులోతేడా ఉంటుందా! అతని వయసు మాటేమిటి. ఈ ప్రశ్న కు సమాధానమే ట్విన్ పారడాక్స్ అంటే శాస్త్రవిరుద్ధము. కాని ఇది శాస్త్ర విరుద్ధము కాదు శాస్త్ర సమ్మతమే అని నిరూపించబడింది.

1905 వ సంవత్సరంలో ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ స్పెషల్ రిలెటివిటీ అనే సూత్రాన్ని ప్రతిపాదించాడు. రెండు గడియారములు ఒకే సమయానికి సెట్ చేసి, ఒక గడియారమును భూమీ మీద ఉంచి మరొక గడియారమును అంతరిక్షంలోకి పంపితే, అంతరిక్షంలో ఉన్నగడియారము, భూమి మీద ఉన్న గడియారము కన్నా వెనకబడిఉంటుంది. కాబట్టి అంతరిక్షంలో కాలం భూమీ మీది కన్న మెల్లగా

కదులుతుంది అని నిరూపించారు. దీనిని 1911 మరింత విస్తృతంగా వివరించారు. ఇద్దరు కవలలుఉన్నారనుకుందాము. వారిలో ఒకడు భూమి మీద ఉంటాడు. మరొకడు అంతరిక్షంలోకి వెళతాడు. కొన్ని సంవత్సరాల తరువాత తిరిగి వస్తాడు. అప్పుడే అంతరిక్షంలో ఉన్న వాడికన్నా భూమి మీదున్న కవల ముసలి వాడవుతాడు.

Consider a space ship traveling from Earth to the nearest star system outside of our solar system: a distance d = 4 light years away, at a speed v = 0.8c (i.e., 80 percent of the speed of light).
(To make the numbers easy, the ship is assumed to attain its full speed immediately upon departure—actually it would take close to a year accelerating at 1 g to get up to speed.)
The parties will observe the situation as follows:
The Earth-based mission control reasons about the journey this way: the round trip will take t = 2d/v = 10 years in Earth time (i.e. everybody on Earth will be 10 years older when the ship returns). The amount of time as measured on the ship's clocks and the aging of the travelers during their trip will be reduced by the factor , the reciprocal of the Lorentz factor. In this casee

= 0.6 and the travelers will have aged only 0.6 × 10 = 6 years when they retur



మా గురువుగారు ఫిజిక్సులో పి.హెచ్.డి.చేసారు. వారి సహకారంతోనే ఈ సాంకేతిక విషయాలను మీకు అందించాను. తప్పులుంటే అవి నావే. దయతో క్షమించండి.

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్: 9866140619, 9391134792

ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## ప్రథమ అధ్యాయము.

పదునాలుగు మన్వంతరములు, సూర్య వంశము, చంద్రవంశము లో జన్మించిన రాజుల వంశ చరిత్రలు అన్ని విన్న తరువాత పరీక్షిత్తు మహారాజు శుక మహర్షిని ఇలా అడిగాడు.

"ఓ శుకయోగీంద్రా! తమరు నాకు సూర్య వంశ రాజుల చరిత్రలు, చంద్ర వంశ రాజుల చరిత్రలు వివరంగా చెప్పారు. ఆ వంశములలో ధర్మశీలుడైన యదువు పేరుతో పిలువబడే పరమ పవిత్రమైన యదువంశము గురించి కూడా వివరించారు. ఈ యదువంశములో శ్రీకృష్ణుడు, బలరాముడు ఉద్భవించారు అని అన్నారు.

ఈ విశ్వసృష్టికి మూలమైన వాడు, ఈ విశ్వము అంతా నిండి ఉన్న వాడు అయిన  పరమాత్మ, యాదవ కులములో శ్రీకృష్ణునిగా అవతరించి, ఏయే లీలలు చేసాడో ఆయా  లీలావిశేషములు, నాకు వివరంగా చెప్పమని ప్రార్థిస్తున్నాను. శ్రీకృష్ణుడు పుట్టినప్పటి నుండి ఆయన తన బాల్యములో ఏయే లీలలు చేసాడో సవిస్తరంగా చెప్పండి. ఎందుకంటే, శ్రీకృష్ణుని గుణములను కీర్తించడం, వినడం, చెప్పడం ఇవన్నీ మోక్షము కోరుకునే వారిలో ఉన్న ప్రాపంచిక విషయములు, విషయవాసనలు అనే రోగములను సమూలంగా నాశనం చేసే చక్కని ఔషధము వంటిది.

శ్రీకృష్ణుని చరిత్ర వినడం కృష్ణభక్తులకు చెవులలో అమృతం పోసినట్టు ఉంటుంది. బుద్ధి మంతుడు అయిన వాడు ఎవరైనా శ్రీకృష్ణుని లీలలను వినడానికి ఉత్సాహపడుతుంటాడు. కేవలము ఆహారం సంపాదించుకోవడం, కామసుఖాలు అనుభవించడం నిద్రపోవడం, మాత్రమే తెలిసిన వారు తప్ప, బుద్ధిమంతులగు మానవులు ఎవరైనా శ్రీహరిని కీర్తించకుండా ఉంటాడా!

మా తాతలు అందరూ శ్రీకృష్ణుని ఒక నావగా చేసుకొని, భీష్ముడు మొదలగు తిమింగలములు సంచరిస్తున్న కురుక్షేత్రము అనే మహా సముద్రమును, చిన్న పిల్లకాలువ మాదిరి దాటి, విజయము అనే తీరాన్ని చేరుకున్నారు. పాండవ వంశ నిర్మూలన కొరకు అశ్వత్థామ సంధించిన బ్రహ్మాస్త్రము బారి నుండి శ్రీకృష్ణుడు నా తల్లి ఉత్తర గర్భంలో ఉన్న నన్ను రక్షించాడు.

అన్ని జీవుల లోపల ఆత్మస్వరూపుడు గానూ, బయట కాల స్వరూపుడుగానూ, ప్రకటితమవుతూ, తన మాయచేత సంసార బంధనములను కలుగచేస్తున్న ఆ పరమాత్మ, మనుష్యరూపంలో శ్రీకృష్ణుడిగా అవతరించి దుష్టశిక్షణ చేసాడు గదా! ఆ శ్రీకృష్ణుని అవతార లీలా విశేషములను నాకు విశధంగా చెప్పండి.

ఓ శుకదేవా! తమరు బలరాముడు రోహిణీ కుమారుడు అని చెప్పారు కదా! కాని ఆ బలరాముడు దేవకీదేవి గర్భము నుండి ఏడవ కుమారుడిగా కూడా జన్మించాడు అని చెబుతారు. ఇది ఎలా జరిగింది. దేవకీదేవి గర్భంలో ఉన్న బలరాముడు రోహిణీదేవి గర్భంలోకి ఎలా వచ్చాడు? అంతా అయోమయంగా ఉంది. అంతేకాకుండా, వసుదేవుని

గృహములో జన్మించిన శ్రీకృష్ణుడు, ఏ కారణం చేత, ఎవరి చేత, ఏ ప్రకారంగా నందుని గ్రామమునకు చేరుకున్నాడు. నందుని గ్రామంలో బలరాముడితో కలిసి ఎలా పెరిగాడు. నందుని గ్రామంలోనూ, మధురలోనూ ఎటువంటి లీలలను ప్రదర్శించాడు.

శ్రీకృష్ణుడు తన మేనమామ, మహాబలవంతుడు అయిన కంసుని ఎందుకు, ఎలా వధించాడు. అందుకు కారణమేమి?. శ్రీకృష్ణుడు మధురా నగరములో ఎన్ని సంవత్సరములు నివసించాడు. శ్రీకృష్ణునికి ఎంతమంది భార్యలు? ఇవే కాకుండా శ్రీకృష్ణుడు చేసిన లీలలు ఇంకా ఏవన్నా ఉంటే అవన్నీ కూడా వివరించండి. ప్రాయోపవేశదీక్షలో ఉన్న నేను కనీసము నీటిని కూడా తాగకుండా గడుపుతున్నాను. అయినా తమరి ముఖము నుండి స్రవిస్తున్న శ్రీకృష్ణుని లీలలు అనే అమృతధారలను తాగుతున్న నాకు, ఆకలి, దప్పిక ఎందుకుంటాయి." అని అన్నాడు.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీ బుద్ధి పరమాత్మయందు లగ్నం అయింది. నీవు శ్రీకృష్ణుని యందు ఏకాగ్రభక్తి కలిగి ఉన్నావు. శ్రీమహావిష్ణువు పాదముల నుండి ఉద్భవించిన గంగ మూడులోకము లను పావనం చేసినట్టు, శ్రీకృష్ణుని చరిత్ర గురించిన అడిగిన ప్రశ్నలు, ఆ ప్రశ్నించిన వాడిని, ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పిన వాడిని, శ్రీకృష్ణచరిత్ర విన్న వాడిని, పవిత్రులుగా చేస్తుంది.

ఓ పరీక్షిత్ మహారాజా! ద్వాపర యుగంలో అధర్మం పెచ్చరిల్లి పోయింది. క్షత్రియులు అందరూ ధర్మం తప్పారు. వారిలో రాక్షసత్వం పెల్లుబికింది. ఎవరికి వారు సైన్యములను సమకూర్చుకొని యుద్ధాలు చేసుకుంటున్నారు. ప్రజాక్షేమం మరిచారు. రాక్షసుల్లా ప్రవర్తిస్తున్నారు. దానితో భూమి భారం పెరిగిపోయింది.

ఆ సమయంలో భూదేవి గోవు రూపంలో బ్రహ్మ వద్దకు పోయి ఆయనకు తన కష్టములను చెప్పుకుంది. బ్రహ్మదేవుడు భూదేవిని తీసుకొని మహాశివుని వెంటబెట్టుకొని, దేవతలతో సహా వైకుంఠము నకు వెళ్లాడు. బ్రహ్మదేవుడు పురుషసూక్తమును పఠిస్తూ శ్రీమహా విష్ణువును ప్రార్థించాడు. బ్రహ్మదేవుడు ధ్యానంలో కూర్చున్నాడు. పరమాత్మను ధ్యానించాడు.

సమాధి అవస్థలో ఉన్న బ్రహ్మదేవుని హృదయంలో కొన్ని మాటలు వినిపించాయి. ఆ మాటలను జాగ్రత్తగా విన్నాడు బ్రహ్మ. సమాధిలో నుండి బయటకు వచ్చాడు. తన వెంట వచ్చిన దేవతా గణములతో ఇలా అన్నాడు.

“వైకుంఠవాసుడయిన శ్రీమహావిష్ణువు నా మనసులో గోచరించి ఈ మాటలు చెప్పాడు. ఆయనకు భూదేవి కష్టము ఇంతకు ముందే తెలుసట. ఆయన భూలోకములో అవతరించబోతున్నాడు. ఆయన భూలోకములో సంచరిస్తున్న కాలములో మీరందరూ యాదవ వంశంలో ఆయనకు పుత్రులుగా, పౌత్రులుగా, బంధువులుగా, అనుచరులుగా జన్మించండి. ఆయనకు సహకరించండి.

పరమాత్మ భూలోకంలో వసుదేవుని ఇంటిలో కృష్ణుడు అనే పేరుతో జన్మిస్తాడు. అక్కడి నుండి నందుని గ్రామమునకు తీసుకొని పోబడతాడు. దేవతాస్త్రీలందరూ ఆ గ్రామములో గ్రామస్థులుగానూ, గోప కాంతలుగానూ పుట్టండి. పరమాత్మ రాక కోసరం ఎదురు చూడండి. వాసుదేవుని అంశ అయిన సంకర్షణుడు (ఆదిశేషువు) పరమాత్ముడి కన్నా ముందే పుడతాడు. శ్రీకృష్ణుడికి అన్నగారుగా వ్యవహరిస్తాడు. మూడులోకములను ఏ విష్ణుమాయ ఆవరించి ఉందో, ఆ మాయాశక్తి భగవంతుని ఆదేశము ప్రకారము ఆవిర్భవిస్తుంది. దేవకిని నిద్రావస్థలో ఉంచుతుంది. కంసుని మోసం చేస్తుంది. కాబట్టి మీరందరూ మీ మీ శక్తికి తగ్గట్టు భూలోకములో అవతరించండి. భగవానునికి సహకరించండి." అని పలికి బ్రహ్మదేవుడు దేవతా గణములను ఆదేశించి, భూదేవిని తగువిధంగా ఓదార్చి, తన లోకమునకు వెళ్లిపోయాడు.

(ఇక్కడ ఒక విషయం గమనించండి. పరమాత్మ నిరాకారుడు. బ్రహ్మకు, శివుడికి, దేవతలకు, భూదేవికి ఏ రూపంలోనూ కనపడలేదు. సమాధి అవస్థలో ఉన్న బ్రహ్మకు మనసులో గోచరించాడు. కర్తవ్యమును ఉపదేశించాడు. మనం పూజించే విష్ణుమూర్తి మనం కల్పించుకున్న మూర్తి. మనం ఏ విధంగా సంకల్పిస్తే ఆరూపంలో కనపడతాడు. ఆ పరమాత్మను సాక్షాత్కరింపజేసుకోవాలంటే ధ్యానమే ముఖ్యము. పరమాత్మను దర్శించాలంటే ధ్యానం ఒకటే మార్గము. మనసును నిశ్చలంగా ఉంచుకొని ధ్యానం చేయాలి. ఈ పూజలు అవన్నీ ధ్యానము కుదరడానికి ఉపాయాలు మాత్రమే. కాని మనం మాత్రం పూజలు, వ్రతాలు, తీర్థప్రసాదాల హడావిడి దగ్గరే ఆగిపోయాము.

ధ్యానం సంగతి మరిచిపోయాము.)

ఓ పరీక్షిత్ మహారాజా! పరమాత్మ శ్రీకృష్ణునిగా అవతరించడానికి మూల కారణం ఈ విధంగా పరిణమించింది. ఇంక భూలోకంలో ఏమి జరుగుతూ ఉందో తెలుసుకుందాము.

ద్వాపర యుగంలో శూరసేనుడు అనే యాదవ రాజు మధురా నగరమును రాజధానిగా చేసుకొని, మాధురము, శూరసేనము అనే రాజ్యములను పరిపాలిస్తున్నాడు.

(తొమ్మిదవ అధ్యాయములో చెప్పబడిన యాదవ రాజుల వంశములను అన్వయం చేసుకుంటే అర్థం అవుతుంది. మరొకసారి గుర్తు చేస్తాను. శూరుని కుమారుడు వసుదేవుడు. ఆహుకుడు అనే రాజుకు దేవకుడు, ఉగ్రసేనుడు కుమారులు. దేవకుని కుమార్తె దేవకి. ఉగ్రసేనుని కుమారుడు కంసుడు. దేవకి, కంసుడు పెదతండ్రి, పినతండ్రి సంతానము.ఆ విధంగా అన్న, చెల్లి అయ్యారు. శూరుని కుమారుడు వసుదేవుడు, దేవకుని కుమార్తె దేవకిని వివాహం చేసుకున్నాడు. ఇంక చదవండి.)

మధురా నగరము యాదవ రాజులకు రాజధానిగా ప్రసిద్ధిచెందింది. దేవకీ వసుదేవుల వివాహము మధురా నగరములో వైభవంగా జరిగింది. కొత్త పెళ్లి కూతురు దేవకిని వెంటబెట్టుకొని వసుదేవుడు తన ఇంటి వెళ్లాడానికి రథం ఎక్కాడు. దేవకి తండ్రి అయిన దేవకుడు వివాహ సమయంలో కుమార్తెకు 400 ఏనుగులు, 10,000 గుర్రములు, 1800 వందల రథములు, వివిధ ఆభరణములు,

రెండు వందల మంది దాసీలను కానుకగా ఇచ్చాడు.

ఉగ్రసేనుని కుమారుడు, దేవకి అన్నగారైన కంసుడు, తన చెల్లి మీద ఉన్న ప్రేమతో, దేవకీ వసుదేవులు ఎక్కిన బంగారు రథాన్ని స్వయంగా నడపడానికి రథం ఎక్కి పగ్గములను పట్టుకున్నాడు. శంఖములు, మృదంగములు, తూర్యనాదముల శబ్దం మిన్నుముట్టింది. కంసుడు నడుపుతున్న రథం బయలుదేరింది. కొంత దూరంవెళ్లిన తరువాత ఆకాశంలో నుండి ఒక శబ్దం వినిపించింది.

"ఓరి మూర్ఖుడా! కంసా! నీవు ఎవరి రథం నడుపుతున్నావో తెలుసా! నీ రథంలో ప్రయాణిస్తున్న నీ చెల్లెలికి అష్టమ గర్భంలో పుట్టబోయేవాడి చేతిలో నీవు మరణిస్తావు." అని వినిపించింది.

భోజకులానికి కళంకం తెచ్చేవాడు, పాపాత్ముడు, క్రూరుడు అయిన కంసునికి భయం, కోపం రెండూ ఒకేసారి కలిగాయి. అతని ఆలోచనా శక్తి నశించింది. బుద్ధి పెడతోవ బట్టింది. వెంటనే రథం దిగాడు. కత్తి తీసుకున్నాడు. తన చెల్లెలు దేవకి జుట్టు పట్టుకొని కిందికి లాగాడు.

ఇదంతా చూచి వసుదేవుడు నిర్ఘాంత పోయాడు. తన భార్యను వధించడానికి కత్తిఎత్తిన కంసుని ఆపడానికి ప్రయత్నించాడు. కంసునితో ఇలా అన్నాడు. "నీవు భోజవంశములో పుట్టావు. నీవు వీరుడవనీ, గుణవంతుడవనీ అందరూ నిన్ను పొగుడుతుంటారు. నీ వంటి వీర్యవంతుడు, గుణవంతుడు ఈ ప్రకారంగా ఒక అబలను, ఒక

నూతన వధువును అదీ నీ సోదరిని చంపడం న్యాయమా! ధర్మమా!

ఓ వీరుడా! ఈమెకు కలగబోయే ఎనిమిదవ సంతానము నీ మృత్యుకారకుడు అని కదా ఆకాశవాణి పలికింది. మృత్యువు నిన్నే కాదు ఈ లోకంలో పుట్టిన వారి నందరినీ వరిస్తుంది. అది సహజం. పుట్టినవారు గిట్టక తప్పదు కదా! ఎవరూ కలకాలం జీవించి ఉండరు. మనిషి పుట్టగానే వాడితోపాటు వాడి మృత్యువు కూడా పుడుతుంది. అది ఎప్పుడు వస్తుందో ఎవరికీ తెలియదు. కాకపోతే నీ మరణం గురించి నీకు ముందే తెలిసింది. అంతే!

దేహమును ధరించిన వారందరికీ మరణం ఒక వరం లాంటిది. ఒక దేహము శిథిలము కాగానే ఆ దేహములో ఉన్న జీవుడు, ఎటువంటి ప్రయత్నం లేకుండానే, శిథిలమైన దేహమును వదిలి మరొక కొత్త దేహంలోకి ప్రవేశిస్తాడు. ఇది సహజం. మనము నడిచేటప్పుడు ఒక పాదమును ముందు పెట్టిన తరువాత, వెనుకపాదమును ఎత్తుతాము. గడ్డి పురుగు కూడా తనముందు కాళ్లను ముందుకు చాచి ఒక ఆకు మీద పెట్టిన తరువాతనే, తన వెనుక కాళ్లను ఎత్తుతుంది. అలాగే జీవుడు కూడా తాను ధరించబోయే దేహమును ముందుగానే ఎంచుకొన్న తరువాతనే అంతకు ముందు దేహమును విడిచిపెడతాడు. నూతన దేహంలోకి ప్రవేశిస్తాడు.

ఓ కంసరాజా! మానవుడు ఈ లోకంలో ప్రాపంచిక సంబంధమైన కోరికలు కోరుకుంటూ ఉంటాడు. వాటిగురించి వింటూ ఉంటాడు. ఆ కోరికల యందు తన మనసును లగ్నం చేస్తాడు. ఆ

కోరికలు తీరడానికి సకల ప్రయత్నాలు చేస్తాడు. ఆ కోరికల తాలూకు జ్ఞాపకాలను, తలచుకుంటూ, తాను నిద్రపోయినపుడు కూడా, అవయవములు పనిచేయనప్పుడు కూడా, వాటి గురించి కలలు కంటూ ఉంటాడు. ఈ దేహమును విడిచిపెట్టేటప్పుడు కూడా ఆ తీరని కోరికలను తలచుకుంటూ ఈ దేహాన్ని విడిచిపెడతాడు. మరుజన్మలో కూడా ఆ కోరికలను తీర్చుకోడానికి అనువైన శరీరాన్ని పొందడం కోసం నానా అవస్థలుపడతాడు. తుదకు తన కోరికలను తీర్చుకోడానికి అనువైన దేహాన్నిపొంది, ఆ దేహంలో ఉన్నప్పుడు తానే ఆ కోరికలను తీర్చుకుంటున్నట్టు అహంకరిస్తాడు. ఈ కారణంగానే జనన మరణాలుసంభవిస్తుంటాయి.

ఓ కంసరాజేంద్రా! సూర్యుడు, చంద్రుడు ఆకాశంలో వెలుగుతుంటారు. వారి ప్రతి బింబములు భూమి మీద ఉన్న జలాశయములలో పడుతుంటాయి. ఆ జలాశయములలో ఉన్న నీరు కదిలినపుడు, సూర్యచంద్రుల ప్రతి బింబములు కూడా కదిలినట్టు కనిపిస్తాయి. నిజానికి సూర్యుడు, చంద్రుడు ఆకాశంలో స్థిరంగా ఉంటారు. అదేమాదిరి ఈ దేహము కూడా మన అవిద్య వలన ఏర్పడింది. మనస్సు ఈ దేహాన్ని తన ఇష్టం వచ్చినట్టు ఆడిస్తుంది. దేహధారి అయిన జీవుడు, ఈ దేహమే శాశ్వతము అనీ, ఈ దేహంతో చేసే పనులు అన్నీ తనే చేస్తున్నాను అనే అహంకారంతో ప్రవర్తిస్తుంటాడు. కాని మానవుడు చేసే పనులు అన్నీ అతని పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితంగానే జరుగుతుంటాయి. అలాగే జనన మరణాలుకూడా జీవుడు పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితంగానే సంప్రాప్తిస్తాయి. పూర్వ జన్మలో మంచి కర్మలు చేస్తే తరువాతి జన్మలో మంచి దేహం లభిస్తుంది. పూర్వజన్మలో చెడు కర్మలు చేస్తే తరువాతి

జన్మలో నికృష్టమైన దేహం లభిస్తుంది.

ఓ కంసరాజా! నీకు నీ పూర్వజన్మలో చేసిన సత్కర్మల ఫలితంగా ఈ జన్మలో రాజుగా ప్రజలను పరిపాలించే దేహం లభించింది. ఈ జన్మలో కూడా నీవు సత్కర్మలు చేస్తే, దేవకికి పుట్టబోయే అష్టమ గర్భము వలన గానీ, మరి ఎవరి వలనకానీ, నీకు అకాల మరణం ఎందుకు సంభవిస్తుంది. నీవు చెడ్డ పనులు చేస్తే నీ మరణం నీవెన్నంటి ఉంటుంది. నీ మరణానికి దేవకి అష్టమగర్భమే కారణం కానవసరం లేదు.

ఓ కంసరాజా! దీనంగా చూస్తున్న ఈ నూతన వధువు నీకు వరసకు చెల్లెలు అయినా నీకు కుమార్తె వంటిది. కాబట్టి ఆమెను సంహరించడం నీ వంటి వీరునకు, గుణశీలునకు తగదు." అని అన్నాడు వసుదేవుడు.

పరీక్షిత్ మహారాజా! ఈ కంసుడు మహా క్రూరుడు. రాక్షస అంశలో జన్మించినవాడు. అతడు ఎప్పుడూ దుష్టులైన రాక్షసుల మార్గమునే అనుసరిస్తాడు. దేవ మార్గమును అవలంబించడు. ఆ కారణం చేత వసుదేవుని పలుకులు కంసునిలో ఏ మార్పూ తేలేకపోయాయి. కంసుడు దేవకిని చంపడానికే నిశ్చయించుకున్నాడు.

తను ఎన్ని చెప్పినా కంసుడు తన పట్టు విడవకపోవడం గమనించాడు వసుదేవుడు. తనలో తాను ఈ విధంగా అనుకున్నాడు. "వీడు దుర్మార్గుడు. వీడికి ధర్మసూక్ష్మములు చెబితే తలకెక్కదు. ఏదో ఒక ఉపాయం చేత దేవకిని మృత్యుముఖం నుండి కాపాడాలి. దీనికి

మూడుమార్గాలుఉన్నాయి. ఒకటి. దేవకికి పుట్టిన కుమారుల వలన కదా వీడికి మృత్యువు. పుట్టిన కుమారులను పుట్టినట్టు వీడికి అప్పగిస్తానని చెబుతాను. అప్పుడైనా తన చెల్లెలి వధను ఆపుతాడేమో. దేవకికి సంతానము కలిగినపుడు తీరికగా నచ్చచెప్పవచ్చు. రెండవది. దేవకికి సంతానం కలగక ముందే వీడు చస్తాడేమో! ఎవరు చూసొచ్చారు. మూడవది. నాకు కొడుకులు పుట్టిన తరువాత కూడా కంసుడు చావకుండా బతికి ఉంటే, నాకుపుట్టబోయే కొడుకులే వీడిని చంపుతారేమో! విధిని ఎవరూ మార్చలేరు కదా!

ఒక కట్టెకు నిప్పు అంటుకోవడం, అంటుకోకపోవడం విధి నిర్ణయం కాని వేరు కాదు. (గ్రామములలో ఇళ్లు తగలబడుతున్నప్పుడు, ఒక ఇల్లు కాలుతుంటే పక్కన ఉన్న ఇల్లు కాలదు. దూరంగా ఉన్న ఇంటిమీద నిప్పురవ్వపడి కాలుతుంది.) అలాగే జీవునికి ఒక దేహం వదిలిన తరువాత మరుజన్మలో ఏ దేహం ఎప్పుడు ఎలా లభిస్తుందో ఎవరూ చెప్పలేరు. అంతా విధిలిఖితం. కాబట్టి ప్రస్తుతానికి దేవకికి పుట్టిన బిడ్డలను పురుటిలోనే అప్పగిస్తాను అంటే ఈ మూర్ఖుడు ఈ మారణ కాండను ఆపుతాడు. " అని అనుకున్నాడు వసుదేవుడు. కంసునితో, తన మాటలమీద నమ్మకం కలిగేటట్టు, ఇలా అన్నాడు.

"కంసరాజా! నీవు సౌమ్యుడవు. గుణవంతుడవు. పరాక్రమవంతుడవు. నీకు తెలియని విషయములు లేవు. నీకు నీ చెల్లెలు దేవకికి పుట్టబోయే సంతానం వలన తప్ప, దేవకి వలన ఎటువంటి మరణభయం లేదుకదా! అటువంటప్పుడు ఈమెను ఎందుకు చంపడం! ఒక ఆడుదానిని అదీ సోదరిని చంపాడు అన్న అపకీర్తిని

మూటకట్టుకోవడం ఎందుకు? అయినా, ఈమెకు ఇప్పుడేగా వివాహం అయింది. ఈమె గర్భవతి కావాలి. ఈమెకు మగ సంతానం కలగాలి. అదీ ఎనిమిదవ సంతానం వలన కదా నీకు మృత్యుభయం. ఈమెకు సంతానం కలగగానే, పుట్టిన బిడ్డను పుట్టినట్టు నీకు తెచ్చి నీకు అప్పగిస్తాను. నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో." అని అన్నాడు.

ఇదేదో బాగానే ఉంది అనుకున్నాడు కంసుడు. ఇప్పుడు ఈమెను చంపితే అపకీర్తి వస్తుందే తప్ప ఏమీ లాభం ఉండదు అనుకున్నాడు. కాబట్టి ప్రస్తుతానికి దేవకిని వదిలిపెట్టాడు. బతుకుజీవుడా అనుకుంటూ వసుదేవుడు, దేవకి కంసుని బారి నుండి బయట పడ్డారు. తన ఇంటికి పెళ్లికూతురుతో సహా క్షేమంగా చేరుకున్నాడు వసుదేవుడు.

కాలం గడుస్తూ ఉంది. దేవకి గర్భవతి అయింది. మొదటి సంతానం కొడుకుపుట్టాడు. ఇచ్చిన మాట ప్రకారము వసుదేవుడు పుట్టిన బిడ్డను తీసుకొని పోయి కంసునికి అప్పగించాడు. అప్పటికి కంసుడు ఆకాశవాణి మాటల ప్రభావం నుండి బయట పడ్డాడు. అతనిలోపల ఉన్న ఆలోచనా శక్తి పనిచేయడం ప్రారంభించింది. వసుదేవుడు తీసుకువచ్చిన మగ బిడ్డను చూచి ఇలా అన్నాడు.

"వసుదేవా! ఈ బిడ్డ నాకు అక్కరలేదు. తీసుకొని వెళ్లు. నా మరణకారకుడు నీకు పుట్టబోయే ఎనిమిదవ వాడు. మొదటి వాడి వలన నాకు ఎలాంటి భయం లేదు. నీ కుమారుని తీసుకొని వెళ్లు." అని అన్నాడు. వసుదేవుడుసంతోషంగా తన ప్రథమ సంతానాన్ని తీసుకొనివెళ్లాడు.

తరువాత దేవకికి వరుసగా ఆరుగురు మగబిడ్డలుపుట్టారు. కంసుడు వారిని చంపకుండా వదిలిపెట్టాడు. కంసుడు తనకు కలిగిన సంతానాన్ని చంపకుండా తాత్కాలికంగా వదిలిపెట్టాడు అన్న సంతోషం కలిగింది కాని మనసులో మాత్రం వసుదేవునికి కంసుని మీద నమ్మకం కలగలేదు. ఎప్పుడు ఏ ఉపద్రవం వస్తుందేమో అని భయపడుతున్నాడు.

వసుదేవుడు అనుకున్న ఉపద్రవం నారదుని రూపంలో రానే వచ్చింది. ఒక రోజు నారదుడు కంసుని వద్దకు వచ్చాడు. కంసునితో ఇలా అన్నాడు. “కుమారా! నీవు సామాన్యుడివి కావు. పూర్వజన్మలో నీవు కాలనేమి అనే రాక్షసుడివి. అప్పుడు విష్ణువు నిన్ను చంపాడు. ఈజన్మలో నీవు కంసుడిగాపుట్టావు. ఈ జన్మలో కూడా నిన్ను చంపడానికి నీ చెల్లెలు దేవకి అష్టమ గర్భంలో పుట్టబోతున్నాడు. నీకు ఒక దేవ రహస్యం చెబుతాను విను. భూభారము పెరిగిపోయిందని భూదేవి, బ్రహ్మ, విష్ణువును ప్రార్థిస్తే, విష్ణువు మానవుడిగా అవతరిస్తానని మాట ఇచ్చాడు. దేవతలు అందరూ ఆయనకు సహాయకులుగా ఇప్పటికే ఈ భూమి మీద జన్మించారు. వారే వ్రజములో నివసిస్తున్న నందుడు, అతని భార్యలు, నందుని బంధుమిత్రులు, వసుదేవుడు, నీ చెల్లెలు దేవకి, వృష్ణి వంశము వారు, యాదవులు, వారి బంధువులు, మిత్రులు. వీరందరూ దేవతల అంశలతో జన్మించిన వారే. వీరందరికీ నాయకుడు దేవకి గర్భవాసాన జన్మించి దైత్యులను, రాక్షసులను సంహరిస్తాడు. కాబట్టి నీ జాగ్రత్తలో నీవు ఉండు.” అని చెప్పి నారదుడు వెళ్లిపోయాడు.

కంసునికి విషయం అర్థం అయింది. విష్ణువు మరలా తనను చంపడానికి తన చెల్లెలు గర్భాన పుడుతున్నాడు. ఇంక ఉపేక్షించి లాభం లేదు అనుకున్నాడు. ముందు దేవకీ వసుదేవులను కారాగారంలో బంధించాడు. దేవకీ వసుదేవులకు పుట్టిన ఆరుగురు పిల్లలను సంహరించాడు. విష్ణువు యాదవులలో పుడుతున్నాడు అని తెలిసి యాదవుల మీద విరోధము పెంచుకున్నాడు కంసుడు. యదువులకు, భోజులకు, అంధకులకు  అధిపతి, తన తండ్రిఅయిన ఉగ్రసేనుడిని కారాగారంలో బంధించాడు. తాను మధుర సింహాసనమును అధిష్టించాడు. శూరసేన దేశమును నిరంకుశంగా పరిపాలిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ప్రథమ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ద్వితీయ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు పరమాత్మ దేవకీ గర్భములో ఎలా ప్రవేశించాడో వివరిస్తున్నాడు.

"పరీక్షిత్ మహారాజా! మధురను పరిపాలిస్తున్న కంసుడు మగధరాజు జరాసంధునకు మిత్రుడు, ఆశ్రితుడు. కంసునికి ప్రలంబుడు, బకుడు, చాణూరుడు, తృణావర్తుడు, అఘాసురుడు, ముష్టికుడు, ద్వివిదుడు, పూతన, కేశి, ధేనుకుడు, బాణుడు,

నరకాసురుడు మొదలగు రాక్షసులు మిత్రులు. వారి సాయంతో కంసుడు యాదవులను నానాకష్టాలు పెడుతున్నాడు. కంసుడు పెట్టే బాధలు తట్టుకోలేక  చాలా మంది యాదవులు  కురు, పాంచాల, కేకయ, సాళ్వ, విదర్భ, నిషధ, కోసల దేశాధిపతులను ఆశ్రయించారు. మరి కొంత మంది కంసుడుచెప్పిన మాట వింటూ దినదినగండంగా కాలం గడుపుతున్నారు. వసుదేవుడు కూడా దేవకిని మాత్రం తన దగ్గర ఉంచుకొని, రోహిణి తదితర భార్యలను నందుడు నివసించే వ్రజములో రహస్యంగా ఉంచాడు.

కాలం గడుస్తూ ఉంది. కంసుడు వసుదేవునికి, దేవకికి పుట్టిన ఆరుగురు పుత్రులను సంహరించాడు. కాలక్రమేణా దేవకి మరలా గర్భం ధరించింది. ఇది ఆమెకు ఏడవ గర్భము. తనకు సాయం చెయ్యడానికి యాదవులుగా పుట్టిన దేవతలను కంసుడు కష్టాలు పెడుతున్న సంగతి గమనించాడు శ్రీమహావిష్ణువు. వెంటనే యోగమాయను పిలిచాడు. ఆమెతో ఇలా అన్నాడు.

“యోగమాయా! నీవు వెంటనే నందుడు మొదలగు యాదవులు నివసించే గ్రామమునకు వెళ్లు. అక్కడ వసుదేవుని భార్య రోహిణి , వసుదేవుని ఇతర భార్యలు, కంసునికి భయపడి, ఎవరికీ తెలియకుండా నివసిస్తున్నారు. ప్రస్తుతము దేవకి ఏడవ గర్భం ధరించింది. ఆ గర్భంలో  ఆదిశేషువు పెరుగుతున్నాడు. నీవు దేవకి వద్దకుపోయి ఆమెకు తెలియకుండా, ఆమె  గర్భమును ఏ మాత్రం దెబ్బతినకుండా బయటకు తీసి, ఆ గర్భమును గోకులములో నివసిస్తున్న వసుదేవుని భార్య రోహిణి గర్భంలో ప్రవేశపెట్టు.

తరువాత నేను నా అంశతో దేవకి గర్భంలో ప్రవేశిస్తాను. నీవు నందుని భార్య యశోద గర్భంలో ప్రవేశించు. గర్భసంకర్షణము వలన రోహిణీ గర్భం నుండి జన్మించిన కుమారుని సంకర్షణుడని పిలుస్తారు. ఇతడు గోకులములో పెరుగుతూ గోకులవాసులకు ఆనందాన్ని కలుగచేస్తాడు కాబట్టి ఇతనిని రాముడని, ఇతనికి ఎక్కువ బలము ఉండటం వలన బలరాముడనీ పిలుస్తారు.

ఈ సందర్భంలో నీకు ఒక వరం ఇస్తున్నాను. భూలోకంలో ప్రజలు నిన్ను వాళ్లకు సకల వరాలు, సకల భోగములు, ఐశ్వర్యములు ఇచ్చే దేవతగా వివిధములైన పేర్లతో పూజిస్తారు. నిన్ను దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్య, మాయ,నారాయణి, ఈశాని, శారద, అంబిక మొదలగుపేర్లతో నిన్ను పూజిస్తారు, ఆరాధిస్తారు, నివేదనలు, బలులు సమర్పిస్తారు. నీవు వారికి కోరిన వరాలు ఇచ్చి తృప్తిపరుస్తావు." అని చెప్పాడు.

(ఇదేదో వింతగా ఉందని అనుకుంటున్నారా! కాదు. ఈ రోజుల్లో కూడా జరుగుతూ ఉంది. ఒక స్త్రీ గర్భంలో నుండి పిండాన్ని తీసి మరొక స్త్రీ గర్భంలో ప్రవేశపెట్టడం. ఈఇతివృత్తం మీద సినిమాలు నాటకాలు వచ్చాయి. నాకు తెలిసి గర్భగుడి అనే నాటకం నంది అవార్డుకూడా తీసుకుంది. 11.7.2013 ఈనాడు దినపత్రికలో వచ్చిన వార్త ప్రకారం సినీనటుడు షారుఖ్‌ఖాన్ దంపతులు అద్దెగర్భం ద్వారా మగ సంతానమును పొందారు. దీనిని ఈ రోజుల్లో సర్రొగేటెడ్ మదర్, రెంటల్ మదర్, అని కూడా అంటున్నారు. కాబట్టి ఈ రోజుల్లో జరుగుతున్న ఈ ప్రక్రియ ద్వాపర యుగంలోనే అమలులో ఉంది. కాకపోతే ఈ నాడు టెక్నాలజీ మారింది. అంతే.)

విష్ణువు ఆదేశము మేరకు యోగమాయ దేవకి ఏడవ గర్భము లోనుండి పిండమును ఆమెకు తెలియకుండా జాగ్రత్తగా బయటకు తీసి, దానిని గోకులము లో ఉన్న రోహిణి గర్భంలో ప్రవేశపెట్టింది. దేవకికి గర్భ స్రావము అయిందని అందరూ అనుకున్నారు. రోహిణి నవమాసాలు మోసి పండంటి మగ బిడ్డను ప్రసవించింది.

తరువాత భగవానుడు వసుదేవుని శరీరంలో ప్రవేశించాడు. శ్రీహరి తేజస్సును ధరించిన వసుదేవుడు సూర్యుని వలె ప్రకాశిస్తున్నాడు. కంసునికి కూడా వసుదేవుని తల ఎత్తి చూడటానికి సాహసించలేకపోతున్నాడు. వసుదేవుని ప్రకాశానికి తట్టుకోలేక పోతున్నాడు.

కంసుడికి మనసులో కలవరం మొదలయింది. “ఇప్పుడు దేవకికి వచ్చేది ఏడవ గర్భమా. ఎనిమిదవదా! ఏడవది గర్భస్రావం అయింది కదా! అది లెక్కలోకి వస్తుందా రాదా!” ఈ ఆలోచనలతో, సందేహాలతో  కంసుని మనస్సు ఆందోళన చెందుతూ ఉంది.

వసుదేవునిలో ఉన్న విష్ణుతేజము వీర్య రూపంలో దేవకి గర్భంలోకి ప్రవేశించింది. సకల జగత్తుకు ఆశ్రయభూతుడైన శ్రీమహావిష్ణువును తన గర్భంలో ధరించిన దేవకి, కంసుని కారాగారంలో బంధింపబడిన దేవకి,  కుండలో పెట్టిన అగ్ని వలె ప్రకాశిస్తూ ఉంది.  దేవకి గర్భంలో భగవానుడు పెరుగుతూ ఉండటం వలన, దేవకి శరీరం వింత కాంతితో శోభిల్లుతూ ఉంది. ఆమె ముఖం ఆనందంతో వెలిగిపోతూ ఉంది.

ఇదంతా ఒక కంట కనిపెడుతున్నాడు కంసుడు.

"దేవకి ఇంతకు ముందు గర్భం ధరించి నపుడు ఇంత వింత కాంతితో ప్రకాశించలేదు. కొంపదీసి విష్ణువు దేవకి గర్భంలో పెరగడం లేదు కదా!" అని అనుకున్నాడు.

"విష్ణువు పుట్టాడంటే నన్ను చంపకుండా వదిలిపెట్టడు. ఇప్పుడు ఏం చేయాలి?" ఇదే కంసుని మనసును కలవరపెడుతున్న ప్రశ్న.

"ఇప్పుడే దేవకిని చంపేస్తే! అమ్మో! ఎలాగ! దేవకి ఒక స్త్రీ. తన సోదరి. పైగా గర్భంతో ఉంది. ఆమెను చంపితే తన కీర్తి, తన సంపదలు, తన ఆయుష్షు అన్నీ నశిస్తాయి. తనకు చెడ్డపేరు వస్తుంది. ఇటువంటి క్రూరమైన పని చేసిన తరువాత నేను జీవించినా మరణించినట్టే. దేవకిని వధించి జీవితాంతం ప్రజలచే నిందింపబడలేను. మరణించిన తరువాత కూడా ఒక అబలను చంపినందుకు నాకు నరకవాసము తప్పదు. నన్ను అంధతమస్సు అనే నరకంలో పడేసి చిత్రహింసలు పెడతారు. కాబట్టి ఈ సమయంలో దేవకిని వధించడం క్షేమం కాదు. ఏమయితే అది అయింది. దేవకి ఎనిమిదవ గర్భంలో ఎవరు పుడతారో చూద్దాము." అని అనుకున్నాడు కంసుడు.

దేవకికి ప్రసవం వచ్చే వరకు ఆమెను జాగ్రత్తగా గమనిస్తున్నాడు. కాని కంసునికి విష్ణుభయం పోలేదు. సింహాసనం మీద కూర్చున్నా, భోజనం చేస్తున్నా, నడుస్తున్నా, ఏపని చేస్తున్నా విష్ణువే కనపడుతున్నాడు. విష్ణువు మీద ద్వేషభావంతో సదా విష్ణువునే

స్మరిస్తున్నాడు కంసుడు.

శ్రీమహావిష్ణువు దేవకీ గర్భంలో ప్రవేశించాడు అని తెలుసుకున్న బ్రహ్మ ఇతర దేవతా గణములు, శివుడు, నారదుడు, అందరూ దేవకి ఉన్న కారాగారమునకు వచ్చారు. దేవకీ గర్భంలో ఉన్న శ్రీమహావిష్ణువును ఇలా స్తుతించసాగారు.

“ఓ దేవా! నీవే సత్యము. నీవు సత్యవ్రతుడవు. సత్యస్వరూపుడవు. సత్యమే అన్నిటి కన్నా గొప్పది. భూత,భవిష్యత్ వర్తమాన కాలములలో నీవే సత్యముగా నిలిచిఉన్నావు. సత్యమునకు మూలకారణము నువ్వే. సత్యంలోనే నీవు ఉంటావు. సత్యవాక్కువు నువ్వే. పంచభూతములు నీనుండి ఉద్భవించాయి.  సకల భూతములలో నువ్వే అంతర్యామిగా వెలుగుతుంటావు. ఆ అంతర్యామియే సత్యము.  అటువంటి సత్యాత్మకుడైన నిన్ను శరణు వేడుతున్నాను.

ఓ దేవా! ఈ సంసారము అనే  మహావృక్షం ఈ ప్రకృతిలో ఉంది. సుఖము, దు:ఖము ఆ చెట్టుకు కాచిన రెండు పళ్లు. సత్వగుణము, రజోగుణము, తమోగుణము దానికి వేళ్లు. ధర్మము, అర్థము, కామము, మోక్షము ఆ వృక్షము నుండి స్రవించే రసాలు. శోకము, మోహము,జర, మృత్యువు, ఆకలి, దప్పిక అనే ఆరు ఆ వృక్షముయొక్కస్వభావములు. చర్మము, రక్తము, మాంసము, మేధస్సు, ఎముకలు, మజ్జ, వీర్యము అనేవి ఆ చెట్టు యొక్క బెరడు. పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము దాని కొమ్మలు.

ఆ చెట్టుకు తొమ్మిది రంధ్రములు ఉన్నాయి. శరీరములో ఉన్న పది ప్రాణములు దాని ఆకులు. ఈ సంసారము అనే వృక్షము మీద రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. ఆ పక్షులే జీవాత్మ, పరమాత్మ.

ఓ దేవా! ఈ సంసారము అనే మహావృక్షమునకు నీవే మూలము. అది నీనుండే ఉద్భవించింది. నీ వలననే పోషింపబడుతూ ఉంది. నీలోనే లయం అయిపోతుంది. నీ మాయచేత మోహితులైన ప్రజలు ఈ సంసారములో పడి నిన్ను వివిధములైన రూపములతో పూజిస్తూ ఉంటారు. కాని నీ అసలు తత్వమును తెలిసినవారు అలాచెయ్యరు.

ఓ దేవా! నీవు జ్ఞాన స్వరూపుడవు. ఈ అనంత విశ్వములో ఉండే చరాచర జీవులను పాలించుటకు, ధర్మాత్ములను రక్షించడానికి, దుష్టులను శిక్షించడానికి శుద్ధసత్వగుణస్వరూపములైన వివిధములైన అవతారములను ధరించావు.

ఓ దేవా! జ్ఞానులు, నీ గురించి బాగా తెలిసిన వారు, ధ్యానము, సమాధి వీటి ద్వారా నీ మీద మనసు నిలిపి, నీ పాదములను ఆశ్రయించి ఈ సంసారము అనే సాగరమును అవలీలగా దాటుతున్నారు. అటువంటి జ్ఞానులు, వివేకులు తాము ఈ సంసార సాగరమును నీ పాదములను ఆశ్రయించి దాటడమే కాకుండా, తాము అవలంబించిన మార్గమును ఇతరులకు కూడా చూపి, నీ పాదములను ఆశ్రయించమని వారికి బోధించి, వారిని కూడా ఈ సంసార సాగరము నుండి విముక్తులను చేస్తున్నారు. ఎందుకంటే వారికి సకలజీవుల యందు సమాన మైన ప్రేమ కలిగి

ఉండటం వలననే కదా!

అలా కాకుండా మరి కొందరు ఈ సంసార సాగరమునుండి విముక్తి పొందిన తరువాత, తాము ముక్తి పొందామని, తాము అందరికంటే గొప్పవారి మనీ  అహంకరిస్తుంటారు. గర్విస్తుంటారు. అటువంటి వారు తమ గొప్పతనమును ఇతరులకు చాటి చెప్పుకోడానికే ఆసక్తి చూపిస్తారు కానీ, నీ యందు భక్తి, శ్రద్ధకలిగి ఉండరు. వారి చిత్తములు మలినమై ఉంటాయి. అటువంటి వారు ధ్యానము, సమాధి మొదలగు ప్రక్రియల ద్వారా అత్యంతకష్టములకు ఓర్చుకొని, ముక్తిని పొందినప్పటికినీ, వారు నీ పాదపద్మములను సేవించకపోవడం వలన, ఆ మోక్ష మార్గము నుండి జారిపోతున్నారు.

ఓ దేవా! నీ యందు అచంచలమైన, ఏకాగ్రమైన ప్రేమ, భక్తి ఉన్న భక్తులు ఎన్నటికీ నీ మార్గము నుండి జారిపోరు. వారిని నీవు ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటావు. వారు ఎవరికీ భయపడరు. వారికి ఎటువంటి అనుమానము, శంక ఉండవు. వారికి ఎవరైనా విఘ్నములు కలుగజేస్తే, వారు ఆవిఘ్నములను లెక్కచేయకుండా తమ మార్గములో ముందుకు సాగుతుంటారు.

ఓ దేవా! నీవు ఈ అనంత విశ్వమునకు స్థితి కారకుడవు. శుద్ధసత్వగుణ స్వరూపమైన చైతన్యంగా ప్రకటితమౌతుంటావు. మానవులందరూ  వేదములలో చెప్పబడిన కర్మల ద్వారా, యోగము ద్వారా, తపస్సు ద్వారా నిన్ను పూజిస్తూ ఉంటారు.

ఓ దేవా! నీవే కనుక శుద్ధచైతన్యంగా ప్రకటితం కాకపోతే, మాలో ఉన్న అజ్ఞానము అంతరించి  జ్ఞానము అనేది కలిగేది కాదు. మేము ఇదమిత్థంగా దేనినీ తెలుసుకోలేక పోయేవాళ్లము. నీ చైతన్యము అణువణువునా విశ్వమంతా వ్యాప్తిచెంది ఉంది కాబట్టే మేము ఈ ప్రపంచం గురించి తెలుసుకోగలుగు తున్నాము.  నీ చైతన్యస్వరూపాన్ని పరమాత్మగా తెలుసుకుంటున్నాము.

తరువాత దేవకిని చూచి బ్రహ్మ ఇలా అన్నాడు. "అమ్మా! నీ అదృష్టము వలన నీవు పూర్వజన్మలో చేసుకున్న పుణ్యము వలన భగవానుడు నీ గర్భంలో పెరుగుతున్నాడు. నీకు కంసుని వలన ఎటువంటి భయము లేదు. నీకు పుట్టబోమే భగవానుడు యాదవ కులమును రక్షిస్తాడు."అని చెప్పి బ్రహ్మ మొదలగు దేవతాగణములు తమ తమ స్థానములకు వెళ్లిపోయారు." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు భగవానుడు దేవకి గర్భంలో ప్రవేశించడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ద్వితీయ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## తృతీయ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణ జనన విశేషములను ఈ విధంగా వివరిస్తున్నాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! దేవకీదేవి అష్టమ గర్భం ధరించింది. శ్రీకృష్ణుని జనన కాలము ఆసన్నమయింది. అశ్విని మొదలగు నక్షత్రములు శాంతంగా సంచరిస్తున్నాయి. ఆ సమయంలో రోహిణీ నక్షత్రము ఉంది. దిక్కులన్నీ ప్రశాంతంగా ఉన్నాయి. ఆకాశం నిర్మలంగా ఉంది. నక్షత్రములు దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాయి. భూమి మీద ఉన్న నగరములు పల్లెలె అన్నీ వింతశోభను సంతరించుకున్నాయి. నదులు స్వచ్ఛమైన జలములతో నిండా ప్రశాంతంగా ప్రవహిస్తున్నాయి. అడవులలో, ఉద్యానవనములలో కోయిలలు మొదలగు పక్షులు శ్రావ్యంగా కూస్తున్నాయి. పుష్పముల మీదినుండి సుగంధమును మోసుకుంటూ వాయువు మెల్ల మెల్లగా వీస్తూఉంది. బ్రాహ్మణుల ఇళ్లలో అగ్నిహోత్రములు ప్రజ్వరిల్లుతున్నాయి. దేవతలు దుందుభులు మోగిస్తున్నారు. కిన్నరులు, కింపురుషులు, గంధర్వులు శ్రావ్యంగా పాడుతున్నారు. సిద్ధులు, చారణులు పరమాత్మను స్తుతిస్తున్నారు. అప్సరసలు, విద్యాధర స్త్రీలు ఆనందంతో నృత్యం చేస్తున్నారు. దేవతలు, మునులు పూలవాన కురిపిస్తున్నారు. సాగరఘోషతో సమానంగా మేఘాలు వీనుల విందుగా గర్జిస్తున్నాయి.

అర్ధరాత్రి సమయం అయింది. మధురానగరము అంతా యోగ మాయ ఆవహించింది. మధురానగరములో ఉన్న దేవకీవసుదేవులు ఉన్న కారాగారము వద్ద కాపలాగాఉన్న భటులు అందరూ నిద్రావస్థలోకి జారుకున్నారు. ఆసమయంలో పరమాత్మ దేవకీ గర్భము నుండి ఆవిర్భవించాడు.

కందపద్యములు:

సుతుగనె దేవకి నడురే యతిశుభగతి దారలును గ్రహంబులు నుండన్
దితిసుత నిరాకరిష్ణున్, శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్.

వెన్నుని నతిప్రసన్నుని, గ్రన్ననగని మెఱుగుబోణి గడునొప్పారెం
బున్నమనాడు కళానిధి గన్న మహేంద్రాశ చెలువు గలిగి నరేంద్రా.

శ్రీమహావిష్ణువు దేవకి గర్భాన చిన్ని శిశువుగా అవతరించాడు. అప్పుడే పుట్టిన ఆ బిడ్డను దేవకీ వసుదేవులు ఆశ్చర్యంతో చూచారు. కారణం ఏమిటంటే ఆ చిన్ని శిశువు తామర రేకుల వంటి కన్నులతోనూ, నాలుగు భుజములతోనూ, శంఖ,చక్ర, గద, తామరపూవుతోనూ, గుండెల మీద శ్రీవత్సము అనే మచ్చతోనూ, మెడలో కౌస్తుభమణితోనూ, పీతాంబరములు ధరించి, నీలమేఘచ్ఛాయతో, చెవులకు కుండలములతో, నల్లటి ముంగురులతో, ఇంకా వివిధ అలంకారములతో ప్రకాశిస్తున్నాడు.

అప్పుడే పుట్టిన బాలుడు ఈ విధంగా కనపడటం వారికి ఆశ్చర్యం వేసింది. కళ్లంతా విప్పార్చి ఈ వింతను చూస్తున్నారు. తమకు సాక్షాత్తు ఆ శ్రీమహావిష్ణువు కుమారుడుగా జన్మించాడని ఆనందంతో పొంగి పోయారు. వసుదేవుడు తన మనసులోనే పదివేల ఆవులను

బ్రాహ్మణులకు దానం ఇస్తున్నట్టు ఊహించుకున్నాడు. దేవకీ వసుదేవులు తమకు పుట్టిన కుమారుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణ మూర్తి అని నిర్ధారించుకున్నారు. వసుదేవుడు రెండు చేతులు ఎత్తి నమస్కరిస్తూ పరమాత్మను ఇలా స్తుతించాడు.

"ఓ దేవా! నీవు సాక్షాత్తు పరమాత్ముడవని నాకు తెలుసు. నీవు ప్రకృతి కన్నా భిన్నమైన పురుషుడవు. నీ సచ్చిదానంద స్వరూపమును కేవలం అనుభవంతో తప్ప ఇతర విధములుగా తెలుసుకోలేరు. నీవు జ్ఞానమూర్తివి.

ఓ దేవా! నీవు నీ మాయ ద్వారా త్రిగుణాత్మకమైన ఈ ప్రకృతిని సృష్టించావు. నీవు ఈ ప్రకృతిలో ప్రవేశించకపోయినా ప్రవేశించినట్టు కనపడుతున్నావు. అన్నింటిలోనూ ఉన్నట్టు కనపడుతున్నావు. నిజానికి నీవు దేనిలోనూ లేవు.
(ఇది పరస్పర విరుద్ధభావము. ఈ విరుద్ధభావము ఆ పరమాత్మకే సాధ్యము. వివరంగా చెప్పాలంటే..... పరమాత్మ ఈ విశ్వంఅంతా నిండి ఉన్నాడు. విష్ణువు అంటే సర్వేసర్వత్రా వ్యాపించి ఉన్నాడు అని అర్థం. అటువంటప్పుడు ప్రకృతిలో ప్రవేశించకపోయినా ప్రవేశించినట్టు కనపడటం ఏమిటి? అణువణువునా వ్యాపించి ఉన్నపరమాత్మ ప్రకృతిలో ప్రవేశించడం, ప్రవేశించకపోవడం అంటూఉండదు.
అందుగలడిందులేడను సందేహము వలదు,చక్రి సర్వోపగతుండు)
అందుకే దీనిని విరుద్ధభావము అని అన్నారు.)

ఓ దేవా! మహత్తత్వము, అహంకారము, పంచభూతములు, పంచతన్మాత్రలు మొదలగు మార్పుచెందని వాటితో మార్పు చెందే ఈ బ్రహ్మాండమును సృష్టించావు. తరువాత దానిలో ప్రవేశించినట్టు కనపడుతున్నావు. కాని ఇవన్నీ బ్రహ్మాండ సృష్టికి ముందు నుండి ఉన్నాయి. అటువంటప్పుడు అవి కొత్తగా బ్రహ్మాండంలో ప్రవేశించడం సంభవం కాదు కదా! ఎందుకంటే మార్పుచెందని అహంకారము, మహత్తత్వము మొదలగు వాటితోనే ఈ బ్రహ్మాండము సృష్టించబడింది కాబట్టి.

(ఉదాహరణకు ఒక విత్తనం భూమిలో పాతి పెట్టాము. అందులో నుండి మొక్క వచ్చింది. అది పెరిగింది. చెట్టు అయింది. వటవృక్షము అయింది. విత్తనం మాయం అయింది. అంటే విత్తనం లేదని చెప్పలేము కదా. విత్తనం చెట్టుగామారి విత్తనం కనపించడంలేదు. మహత్తత్వము అహంకారము మొదలగు వాటి నుండి బ్రహ్మాండము పుట్టింది. అవి సూక్ష్మరూపంలో ఉన్నాయి. ప్రకృతి స్థూలరూపంలోఉంది.)

ఓ దేవా! నీవు ఇంద్రియముల చేత గానీ, నీరూపములను పూజించడం చేత గానీ నీవు తెలుసుకోబడవు. కేవలం కళ్లతో నీ రూపం చూడగలడే కానీ నీ గురించి తెలుసుకోలేడు. నీవు ఇంద్రియములకు అగోచరంగా, ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. నీవు లోపల ఆత్మస్వరూపంగానూ, బయట కాల స్వరూపంగానూ ఉన్నావు. నీకు లోపల బయట అనే భేదం లేదు. లోపలా ఉన్నావు బయటా ఉన్నావు. అట్టి నీవు ఈ దేవకీ గర్భంలో ప్రవేశించడం, మాకు కుమారుడుగా జన్మించడం ఆశ్చర్యంగా ఉంది.

ఓ దేవా! దేహములు ఆత్మకన్నా భిన్నమైనవి. కాని మానవులు ఈ దేహములే శాశ్వతములు అనుకుంటుంటారు. రకరకాల పేర్లు పెట్టుకుంటారు. అవి కలకాలం ఉంటాయి అనుకుంటారు. ఇలా దేహమే శాశ్వతము అనుకునేవాళ్లు నిజంగా మూర్ఖులు. నిజానికి ఈ దేహములు మనం సృష్టించుకున్నవే. (స్త్రీపురుషుల సంయోగము చేతనే దేహం ఏర్పడుతుంది.) ఈ దేహాలు రోజూ రాలిపోవడం చూస్తూనే ఉన్నాము. కాని ఇవే శాశ్వతములు అనుకుంటున్నాము. ఈ అజ్ఞానంలో పడి కొట్టుకుంటున్నాము.

ఓ దేవా! నీకు చేయాల్సిన కర్మ అంటూ ఏమీ లేదు. నీకు సత్వ,రజస్తమోగుణములు అంటవు. నీకు రాగద్వేషములు మొదలగు వికారములు లేవు. సృష్టి, స్థితి, లయములు కేవలం క్రీడగా చేస్తున్నావు. నీవు పరబ్రహ్మస్వరూపుడవు. నీయందు విరుద్ధభావములు లేవు. ఇక్కడా ఉంటావు అక్కడా ఉంటావు. లోపలాఉంటావు బయటా ఉంటావు. అన్నిట్లో ఉన్నట్టే ఉంటావు. దేనిలోనూ ఉండవు. అన్ని కార్యములు చేస్తున్నట్టు కనిపిస్తావు. ఏ కార్యము చెయ్యవు. నీకు ఎవరిమీదా, దేని మీద ఆసక్తి లేదు. కాని మానవులు నీవు బ్రహ్మగా సృష్టిస్తున్నావనీ, విష్ణువుగా పోషిస్తున్నావనీ, శివుడుగా లయం చేస్తున్నావనీ, మానవుల సుఖదు:ఖములకు నీవే కారకుడవనీ అనుకుంటూ ఉంటారు. కానీ నీవు అన్నీ కేవలం సాక్షీభూతంగా చూస్తూఉంటావు అని వారికి తెలియదు.

ఓ దేవా! నీవు మూడుగుణములకు అతీతుడవు. కాని సృష్టిచేసేటప్పుడు రజోగుణమును, (బ్రహ్మ రజోగుణ ప్రధానుడు),

లయం చేసేటప్పుడు తమోగుణమును (శివుడు తమోగుణ ప్రధానుడు), పోషించేటప్పుడు సత్వగుణమును (విష్ణువు శుద్ధసత్వగుణ ప్రధానుడు) ధరిస్తున్నావు.

ఓ దేవదేవా!నీవు ఈ మానవ లోకమును ఉద్ధరించడానికి మానవునిగా మా ఇంట్లో అవతరించావా! నీవు మా ఇంట్లో పుడుతున్నావని తెలిసి, రాక్షసప్రవృత్తి కల కంసుడు మాకు పుట్టిన కుమారులను అందరినీ సంహరించాడు. నీవు పుట్టావని తెలిసి, నీ ఏడుపు విని, రాజభటులు ఈ విషయమును కంసునికి చెప్పి ఉంటారు. ఈ పాటికి కంసుడు ఖడ్గము చేతిలో ధరించి నిన్ను చంపడానికి వస్తూ ఉంటాడు. ఏం చెయ్యాలో ఏమిటో!" అని కంసుడు తనలో తాను అనుకుంటూ ఉంటే, దేవకీదేవి చతుర్భుజుడు పీతాంబరధారి అయిన విష్ణుస్వరూపమును చూచి తనలో తాను ఇలా అనుకుంది.

"దేవతలందరూ నిన్ను  జగత్కారకుడివి అనీ, బ్రహ్మస్వరూపుడవు అనీ, జ్యోతిస్వరూపుడవు అనీ, మాయారహితుడవు అనీ, ఏ ఆకారము లేని వాడివి అనీ, ఈ అనంత విశ్వంలో నీవు తప్ప ఇంక ఏమీ లేదనీ, అని వర్ణిస్తూ ఉంటారు.

ఓ దేవా! ప్రళయకాలంలో కాలశక్తి వలన ఈ సమస్త విశ్వము, పంచభూతములు సూక్ష్మరూపం ధరించి నీలో లీనం అయినప్పుడు, నీవు ఒక్కడివే మిగిలి ఉంటావు. నీవు తప్ప మరేమీ మిగలదు.

ఓ దేవా! ఈ అనంత విశ్వము కాలము అధీనములో ఉంది. నిమిషము నుండి సంవత్సరము వరకూ నడిచే కాలము నీ అధీనములో ఉంది. నీవే కాలస్వరూపుడవు. ఇదంతా నీ లీల కాక మరేమున్నది. నీవు ఈ సృష్టిసమస్తానికి ఈశ్వరుడవు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! ఈ మానవలోకము నిరంతరము మృత్యువుకు భయపడుతూ ఉంటుంది. మృత్యువును తప్పించుకోడానికి సకల ప్రయత్నాలు చేస్తుంటుంది. బ్రహ్మమొదలు అందరు దేవతలను ఆశ్రయిస్తుంది. కాని మృత్యుభయం మాత్రం మానవలోకమును వదిలిపెట్టదు. కాని నీ పాదపద్మములను ఆశ్రయించిన నీ భక్తులకు మృత్యువు అంటే ఏ మాత్రం భయం ఉండదు. వారిని చూచి మృత్యువు దూరంగా పరుగెట్టిపోతుంది. ఎందుకంటే నీవు నీ భక్తులయొక్క మృత్యుభయాన్ని దూరంచేస్తావు. అటువంటినీవు మా అందరినీ ఈ దుర్మార్గుడైన కంసుని బారినుండి రక్షించు.

ఇప్పుడు నీవు చతుర్భుజములతో పీతాంబరధారివై మాకు కనిపిస్తున్నావు. ఈ రూపమును నీవు ఇతరులకు చూపవద్దు. వారిని అవిద్య అజ్ఞానము ఆవహించి ఉంది. వారు నిన్ను చూడటానికి అర్హులు కారు. ముఖ్యంగా కంసుడు నిన్ను చూస్తే ఊరుకోడు నిన్ను చంపేస్తాడు. నీ గురించే నా భయం అంతా. నువ్వు పుట్టావని కంసునికి తెలియకపోతే వాడు ఇక్కడకు రాడు. నిన్ను చంపడు. నిన్ను ఈ రూపంలో చూస్తే ఈ భటులు వెళ్లి కంసునికి ఈ వార్త చెబుతారు. కాబట్టి వెంటనే నీ విష్ణురూపమును ఉపసంహరించు. మామూలు

చిన్ని బాలునిగా మారిపో.

దేవదేవా! అయినా నాకు ఒక అనుమానము. ఈ చరాచరబ్రహ్మాండములు నీలోనే ఉన్నాయి కదా. నీవు విరాట్ స్వరూపుడవు కదా! అటువంటి నీవు ఇంతకాలము నా కడుపులో ఎలా ఉండగలిగావు. ఒక సామాన్య మానవకాంతకు నిన్ను భరించడం సంభవమా! ఏమో! నాకు మాత్రం అత్యంత ఆశ్చర్యంగా ఉంది. తల్చుకుంటేనే ఆనందం కలుగుతూ ఉంది." అని దేవకీదేవి పరమాత్మనుస్తుతించింది.

దేవకీ వసుదేవుల స్తోత్రములను విన్న పరమాత్మ వారితో ఇలా అన్నాడు. "దేవకీదేవీ! స్వాయంభువ మన్వంతరములో నీవు పృశ్ని అనే పేరుతో నన్ను ఆరాధించావు. అప్పుడు ఈ వసుదేవుడు సుతపుడు అనే ప్రజాపతి. మీరు ఇద్దరూ భార్యభర్తలు. మీరు ఇద్దరూ బ్రహ్మదేవునిచేత ప్రజలను సృష్టించడానికి నియోగింపబడ్డారు. ఆ కారణంగా మీరు ఇద్దరూ, ఎండను, వానను, చలిని సహిస్తూ, ప్రాణాయామం చేస్తూ, కేవలము గాలిని ఆహారంగా తీసుకుంటూ, తీవ్రంగా తపస్సుచేసారు. 12.000 దివ్య సంవత్సరములు గడిచిపోయాయి. మీ తపస్సుకు మెచ్చి నేను మీ ఇద్దరికి ఇప్పుడు మీరు చూస్తున్న ఈ దేహముతో మీ ముందు సాక్షాత్కరించాను. మీకు ఏం వరం కావాలని అడిగాను. మీరిద్దరూ మోక్షం కోరుకోకుండా, నా వంటి కుమారుడు మీకు పుట్టాలని మూడుసార్లు కోరుకున్నారు. మీ కోరిక ప్రకారంగా నేను మీకు కుమారుడుగా అవతరించాను. ఆ జన్మలో నీ పేరు పృశ్ని కావడం వల్ల నాకు పృశ్ని గర్భుడు అనే పేరువచ్చింది.

మరుజన్మలో నీవు అదితిగా జన్మించావు. ఈ వసుదేవుడు కశ్యప ప్రజాపతిగా జన్మించాడు. అప్పుడు కూడా నీవు నా గురించి గొప్ప వ్రతం చేసావు. ఆ కారణంగా నేను నీకు కుమారుడుగా జన్మించాను. పొట్టిగా ఉండటం వలన నాకు వామనుడు అనే పేరు వచ్చింది. తరువాత నేను ఉపేంద్రుడిని అయ్యాను. లోకపాలకులకు పాలకుడను అయ్యాను.

మూడవ జన్మలో మీరు దేవకి వసుదేవులు అనే పేర్లతో జన్మించారు. ఇప్పుడు కూడా నేను మీకు పుత్రుడుగా .జన్మించాను. ఇది సత్యము. మీకు మీ పూర్వజన్మలు స్ఫురణకు రావడానికే నేను మీకు ఈ రూపంతో సాక్షాత్కరించాను. నేను మామూలు శిశువుగా పుట్టి ఉంటే నేను పలికిన పలుకులు మీరు నమ్మరు. నేను విష్ణువును, మీ ఇంట్లో అవతరించాను అన్న జ్ఞానం మీకు కలుగదు.  మీరు ఇద్దరూ నన్ను మీ పుత్రుడిగా భావించండి. నా మీద అనురాగంతో భగవంతుని స్మరిస్తూ ముక్తిని పొందండి." అని పలికాడు శ్రీమహావిష్ణువు.

తరువాత చతుర్భుజములతో ఉన్న ఆ శిశువు మామూలు మానవ శిశువుగా మారిపోయింది. కేరు కేరు మంటూ ఏడవసాగింది. దేవకి వసుదేవులకు తమ పూర్వజన్మ స్మృతి అంతరించింది. మామూలు మనుషులు అయ్యారు. కాని వసుదేవునికి లోపల నుండి ఏదో శక్తి అది చెయ్యి ఇది చెయ్యి అని ప్రేరేపిస్తూ ఉంది.

మధురలో ఉన్న చెరసాలలో దేవకికి భగవానుడు అవతరిస్తే, నందగోకులంలో నందుని భార్య యశోద కూడా ఒక ఆడబిడ్డను

ప్రసవించింది. ఆమే భగవానుని ఆదేశానుసారము యశోదకు పుట్టిన విష్ణుమాయ. పుట్టీ పుట్టగానే విష్ణుమాయ, ఇటు మధురా నగరములో ఉన్న వారినీ, అటు నందగోకులములో ఉన్న వారినందరినీ తనమాయతో కప్పేసింది. అందరూ గాఢనిద్రలో మునిగిపోయారు. ఒక్క వసుదేవుడు మాత్రం మేలుకొని ఉన్నాడు.

లోపల నుండి ఎవరో చెప్పినట్టు వసుదేవుడు, దేవకికి పుట్టిన మగశిశువును చేతిలోకి తీసుకున్నాడు. ద్వార పాలకులు, కారాగార భటులు గాఢ నిద్రలో ఉన్నారు. కారాగారము తలుపులు వాటంతట అవి తెరుచుకున్నాయి. వసుదేవుడు శిశువును తీసుకొని బయటకు వచ్చాడు. మేఘములు వర్షిస్తున్నాయి. ఆదిశేషుడు తన వేయి పడగలను విప్పి శిశువు రూపంలో ఉన్న భగవానునికి, ఆయనను మోస్తున్న వసుదేవునికి గొడుగుగా వెనక నడిచాడు. వర్షం కురుస్తూ ఉండటంతో యమునా నది గట్టు వరకు ఉధృతంగా పారుతూ ఉంది. నదీఅలలు కొట్టుకుంటున్నాయి. నీరు సుడులు తిరుగుతూ పారుతూ ఉంది. కాని వసుదేవునికి ఇవన్నీ పట్టలేదు.అలా నడుచుకుంటూ వెళుతున్నాడు. యమునా నది వసుదేవునికి దోవ ఇచ్చింది.

వసుదేవుడు యమునను దాటి నదికి ఆవల ఉన్న నందగోకులము చేరుకున్నాడు. నందుని ఇంటికి వెళ్లాడు. నంద గోకులంలో కూడా అందరూ గాఢనిద్రలో ఉన్నారు. ఎవరో చెప్పినట్టు, వసుదేవుడు మగశిశువును యశోద పక్కలో పడుకోబెట్టి, యశోద ప్రసవించిన ఆడశిశువును (విష్ణుమాయ) తీసుకొని తిరిగి మధురకు వచ్చాడు. వసుదేవుడు కారాగారము ప్రవేశించగానే కారాగారము తలుపులు మూసుకున్నాయి తాళాలు వాటంతట అవే వేసుకున్నాయి.

వసుదేవుడు తాను తీసుకువచ్చిన ఆడశిశువును దేవకి పక్కలో పడుకోబెట్టాడు. తన చేతులకు, కాళ్లకు యధావిధిగా సంకెళ్లు తగిలించుకున్నాడు. అందరి మాదిరి వాసుదేవుడు కూడానిద్రలోకి జారుకున్నాడు.

ఇంత జరిగినా నంద గోకులములో ఉన్న యశోదకు తాను ప్రసవించింది అనీ, తనకు ఒక శిశువు పుట్టింది అన్న విషయం తప్ప ఇంక ఏమీ తెలియదు. ప్రసవం అయిన తరువాత గాఢనిద్రలోకి జారుకుంది. యోగమాయ ప్రభావంతో తనకు పుట్టింది ఆడశిశువా, మగశిశువా అన్నసంగతి కూడా ఆమెకు తెలియదు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణజననం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము తృతీయ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

నాలుగవ అధ్యాయము.

దేవకికి పుట్టిన బిడ్డ కేరు కేరున ఏడవడం మొదలు పెట్టింది. అప్పటికి కాపలా దారులను ఆవహించిన విష్ణుమాయ తొలగిపోయింది. అందరూ మేలుకున్నారు. దేవకికి ప్రసవం అయిందని గ్రహించారు. పరుగు పరుగున కంసుని వద్దకు వెళ్లారు. కంసునికి దేవకి

ప్రసవించిన వార్త తెలియజేసారు.

ఆ వార్త కోసరమే కంసుడు ఎదురు చూస్తున్నాడు. దేవకికి అష్టమగర్భం ప్రసవంఅయింది అని తెలియగానే “వీడే నా మృత్యువు. వీడిని వెంటనే చంపెయ్యాలి” అని అనుకున్నాడు.  వెంటనే కంసుడు కరవాలము చేతిలోకి తీసుకొని హుటాహుటిన కారాగారము చేరుకున్నాడు. దేవకి పొత్తిళ్లలో ఉన్న ఆడశిశువును చూచాడు.

కంసుని చూచి దేవకి గజగజవణికి పోయింది. “అన్నా! ఈ శిశువు బాలుడు కాదు. బాలిక. నీ మేనకోడలు. ఒక అబల. స్త్రీని వధించడం అందులోనూ అప్పుడే పుట్టిన బాలికను వధించడం మహాపాపం. అన్నా! నువ్వు ఇప్పటిదాకా నాకు పుట్టిన కుమారులందరినీ చంపావు. ఈమె ఆడుది. ఈమె నిన్ను ఏమి చేస్తుంది. నా కుమార్తెను నాకు విడిచిపెట్టు. ఏడుగురు కుమారులను పోగొట్టుకున్న నేను గర్భశోకంతో బాధపడుతున్నాను. కనీసం ఈ ఆడపిల్లను చూచుకొని నా శోకమును దూరం చేసుకుంటాను.”అనీ దీనంగా వేడుకొంది.

ఉ॥అన్న శమింపుమన్న తగదల్లుడు గాడిదిమేనగోడలౌ
మన్ననసేయుమన్న విను మానిని చంపుట రాచపాడిగా
దన్న సుకీర్తివై మనుగదన్న మహాత్ములు పోవు త్రోవ బో
వన్న భవత్సహోదరిగదన్న నినున్ శరణంబు వేడెదన్॥
కం॥
కట్టా యార్గురు కొడుకుల బట్టి వధించితివి యాడుబడుచిది కోడల్
నెట్టన చంపగవలె నే కట్టడివి గదన్న యన్న కరుణింపగదే॥

దేవకి ఈ ప్రకారంగా పుట్టిన ఆడు బిడ్డను పొత్తిళ్లలో పెట్టుకొని కంసుని దీనంగా ప్రార్థించింది. కాని కంసుని మనసు కరగలేదు. పైపెచ్చు "నన్ను చంపే శిశువును కంటావా!" అని దేవకిని దూషిస్తూ ఆ బిడ్డను దేవకి వద్దనుండి లాక్కొని రెండు కాళ్లు పట్టుకొని తలకిందులుగా వేలాడేట్టు పట్టుకున్నాడు.

ఆ సమయంలో కంసునికి దేవకి తను ప్రాణం కన్నా మిన్నగా ప్రేమించిన తనసోదరి అనీ, ఆ శిశువు తన సోదరి కుమార్తె అనీ మరిచిపోయాడు. కంసునిలో తన ప్రాణం కాపాడుకోవాలన్న స్వార్థబుద్ధి వికటాట్టహాసం చేసింది. కంసుడు ఆ శిశువు రెండుకాళ్లు పట్టుకొని గిరా గిరా తిప్పి ఆ శిశువు తలను బలంగా నేలకేసి కొట్టాడు.

కంసుడు ఎంత వేగంగా కొట్టాడో అంతకన్నా రెట్టింపు వేగంతో ఆ శిశువు రివ్వున పైకి లేచింది. ఒక్కసారిగా ఆ శిశువు భద్రకాళిగా మారిపోయింది. ఆమె ఎనిమిది చేతులలో ఆయుధములు ప్రకాశిస్తున్నాయి. ఆమె దివ్యమైనవస్త్రములతోనూ, మెడలో పూలమాలలతోనూ, ఆభరణములతోనూ, అలంకరించుకొని ఉంది. ఆమె చేతులలో ధనుస్సు, శూలము, బాణములు, ఖడ్గము, శంఖము, చక్రము, గదను ధరించి ఉంది. సాక్షాత్తు విష్ణువు సోదరి అయిన విష్ణుమాయ భద్రకాళి అవతారంలో కంసునితో ఇలా పలికింది.

"మూర్ఖుడా! నీ చావు తథ్యం. నీకు శత్రువు, నిన్ను చంపే వీరుడు, ఇప్పటికే పుట్టాడు. నన్ను చంపితే నీకేం లాభం. నేను నిన్ను చంపదలచుకుంటే ఇప్పుడే ఇక్కడే ఈ క్షణమే చంపగలను. కాని అది

నా పని కాదు. నిన్ను చంపేవాడు వేరే ఉన్నాడు. ఆ శ్రమ నాకెందుకు! కాబట్టి బుద్ధి తెచ్చుకొని  ఇంకనైనా ఈ శిశుహత్యలు మానుకో." అని పలికిన ఆ విష్ణుమాయ అంతర్ధానం అయింది.

దేవి వాక్కులు విని కంసుడు ఆశ్చర్యపోయాడు. ఈ ప్రకారంగా ఆలోచించాడు.  "ఏ అష్టమ గర్భంలో పుట్టేవాడు తనను చంపుతాడని, దేవకికి పుట్టిన అందరు కుమారులను చంపాడో ఆ అష్టమ గర్భంలోనే విష్ణువు జన్మించాడు. ఎక్కడో పెరుగుతున్నాడు. ఇంకా దేవకీ వసుదేవులను కారాగారంలో ఉంచినందు వలన ఏమీ ప్రయోజనంలేదు. పైగా  అది తనకే ముప్పుగా పరిణమించవచ్చు. దీని వలన అనవసరైన అపకీర్తి మూటకట్టుకోవాల్సివస్తుంది."  ఈ ప్రకారంగా ఆలోచించిన కంసుడు  వెంటనే దేవకి వసుదేవులను కారాగారం నుండి విముక్తులను చేసాడు. వారితో ఇలా అన్నాడు.

"అమ్మా దేవకీ! నీవునాకు ప్రియమైనసోదరివి. రాక్షసులు తమ సంతానాన్ని తామే చంపుకుంటారట. అటువంటి రాక్షసత్వము నన్ను ఆవహించి నీ కుమారులను అందరినీ చంపాను. నన్ను క్షమించు. నా పాపములకు ప్రాయశ్చిత్తము లేదు. నేను నిర్దయుడను. క్రూరాత్ముడను. నేను  చేసిన పాపపు పనుల వలన నా బంధువులు స్నేహితులు నాకు దూరం అయ్యారు. నేను చేసినపాపము బ్రహ్మహత్యాపాతకంతో సమానము. చచ్చి ఏ నరకానికి పోతానో నాకే తెలియదు. ఆనాడు ఆ ఆకాశవాణి మాటలు నమ్మి నిన్ను చంపబోయాను. తరువాత నారదుని మాటలు విని  నీ కుమారుల నందరినీ చంపాను. ఈ నాడు దేవి మాటల వలన నాకు జ్ఞానోదయం అయింది.  ఆఖరుకు దేవతలు(ఆకాశవాణి) కూడా అసత్యం ఆడతారని తెలుసుకోలేక

పోయాను.

అమ్మా! జరిగింది ఏదో జరిగిపోయింది. దాని గురించి బాధపడవద్దు. నీ కుమారులు అదృష్టవంతులు. వారి పూర్వజన్మపుణ్య విశేషం చేత పుట్టీ పుట్టగానే ఈ పాపపు లోకం నుండి నా చేతి గుండా విముక్తిపొందారు. వారు దైవసమానులు. మరలా ఎక్కడో శ్రీమంతుల గృహంలో పుట్టి ఉంటారు. వారి కోసరంనీవు శోకించవద్దు.

అమ్మా! కుమ్మరి వాడు కుండలు చేస్తాడు. కొన్ని కుండలు చాలాకాలం పాటు ఉంటాయి. కొన్నికుండలు చేస్తూ ఉంటేనే పగిలిపోతాయి. కొంత మంది మానవులు చిరకాలం బతుకుతారు. కొందరు పుట్టగానే చనిపోతారు. అంతా దైవలీల. మట్టి నుండి కుండ పుడుతుంది. పగిలిపోయిన తరువాత  ఆ కుండ తిరిగి మట్టిలో కలిసిపోతుంది. కుండ ఉండదు కానీ మట్టి ఉంటుంది. అలాగే పంచభూతములతో కూడిన ఈ శరీరం మరణించినా జీవాత్మ శాశ్వతంగా ఉంటుంది కదా! అలాగే నీ కుమారుల శరీరాలు నశించినా,  వారి జీవాత్మలు వెలుగుతూనే ఉంటాయి. కాని సాధారణ మానవులకు ఈ ఆత్మ తత్వము తెలియక, ఈ దేహమే శాశ్వతము అనుకుంటూ పాపాలు చేస్తుంటారు. ఒకరితో ఒకరు విరోధం పెంచుకుంటారు. ఒకరిని ఒకరు చంపుకుంటారు.  వాటివలన దు:ఖము అనుభవిస్తుంటారు.

వివాహంతో భార్యా భర్తలు ఒకటవుతారు. వారికి సంతానం కలుగుతుంది. వారిలో కొందరు ఉంటారు. కొందరు మరణిస్తారు. ఈ

సంయోగ వియోగములు దేహం ఉన్నంత వరకు ఉంటాయి. ఈమె నా భార్య, వీడు నా కుమారుడు అన్న అజ్ఞానం ఉన్నంత వరకు ఈ బంధనములు, సుఖదు:ఖములు తప్పవు. దేహము అశాశ్వతము అనే జ్ఞానం కలిగితే ఈ సంయోగ వియోగములు సుఖదు:ఖాలను కలిగించవు. (కొడుకు పుట్టినపుడు సంతోషించడం, వాడు చనిపోగానే దు:ఖించడం. ఇవే సంయోగ వియోగాలు.)

అమ్మా! ఈ లోకంలో పుట్టిన మానవులు అందరూ తాము పూర్వ జన్మలో చేసుకున్న పుణ్యపాపములకు ఫలితాన్ని అనుభవించ వలసినదే. నీ కుమారులు కూడా తాము చేసు కున్న పురాకృత పుణ్యఫలం చేత పుట్టిన వెంటనే మరణించారు. ఈ పాపపు లోకము నుండి విముక్తి పొందారు. వారి కోసరం నీవు చింతించవద్దు. కేవలం ఆత్మజ్ఞానము లేని వాడు మాత్రమే "నేను చనిపోయాను, నేను చంపబడ్డాను, నేను నాశనము అయ్యాను" అని అనుకుంటూ ఉంటాడు. వాడు దేహమే సత్యము, శాశ్వతము అనుకుంటాడు. అంతే కానీ దేహము వేరు, ఆత్మ వేరు, దేహము నశించిపోయేది, ఆత్మ నశించనిది, అనే జ్ఞాన దృష్టి ఉండదు. అటువంటి వారు మాత్రమే పుడితే సంతోషిస్తారు. మరణిస్తే దు:ఖిస్తారు. మీరు ఆత్మజ్ఞానము కలవారు. దయాగుణము కలవారు. కాబట్టి నేను చేసిన తప్పులను క్షమించండి. మిమ్ములను పాదములు పట్టుకొని వేడుకుంటున్నాను." అని దేవకి వసుదేవుల పాదములు పట్టుకొని ప్రార్థించాడు కంసుడు.

యోగ మాయ మాటలను విన్న తరువాత కంసునిలో వచ్చిన మార్పును గ్రహించాడు వసుదేవుడు. దేవకి మాత్రము తన అన్నలో నిజంగానే మార్పు వచ్చిందని అనుకొంది. కంసుని మీద కోపం

విడిచిపెట్టింది. వసుదేవుడు కంసుని లేవనెత్తి అక్కున చేర్చుకొని ఇలా అన్నాడు.

"బావా! ఈ మాత్రం దానికే మనలో మనకు క్షమాపణలు ఎందుకు. నీవే అన్నావు కదా! జీవులకు నేను, నాది అనే స్వార్థము సాధారణంగా ఉంటుంది అని. అది నిజమే. ఆ బుద్ధి అజ్ఞానము వలన కలుగుతుంది. దాని వలననే నేను, నీవు, వీడు నా వాడు, వాడు నా శత్రువు అనే భేదబుద్ధి కలుగుతుంది. మానవులందరూ ఆ అజ్ఞానములో పడి కొట్టుకుంటున్నారు. నీ ప్రాణాలు కాపాడుకోడానికి నీవు చేయాల్సింది నీవు చేసావు. ఈ దేహమే నేను, ఈ దేహము నాది అనుకునే మానవులు, నేను వేరు, ఆత్మ వేరు అనుకుంటూ ఉంటారు. ఆ అజ్ఞానము చేతనే వారు సుఖదు:ఖములు, భయము, రాగము, ద్వేషము, లోభము, మోహము వీటి ప్రభావానికి లోనవుతుంటారు. ఆ ప్రభావం చేతనే ఒకరిని ఒకరు చంపుకోవాలి, ఒకరికి ఒకరు ద్రోహం చేసుకోవాలి, అపకారం చేసుకోవాలి అనే భావములను కలిగి ఉంటారు. ఆ ప్రకారమే చేస్తుంటారు. అహంకారంతో ప్రవర్తిస్తుంటారు. ఆ అహంకారం ఆవహించినపుడు మానవుడు తానే గొప్పవాడు అనుకుంటూ విర్రవీగుతుంటాడు. తనను జయించేవాడు ఎవడూ లేడనుకుంటాడు. తన పైన దేవుడు ఒకడు ఉన్నాడు, అతడే తాను సృష్టించిన జీవులను, పదార్థాలను, ఒకదానితో మరొక దానిని నాశనం చేయిస్తుంటాడు అన్న నిజాన్ని మరచిపోతాడు. నీవు అన్నట్టు, జరిగింది ఏదో జరిగింది. జరిగిన దానికి నీవు చింతిచవలదు." అని ఓదార్చాడు వసుదేవుడు.

(ఇక్కడ ఒక విషయం గమనించండి. స్వతాహాగా ప్రతి మానవునిలో మంచితనం, మానవత్వం, ఆత్మజ్ఞానము ఉంటుంది. కాని అహంకారము, స్వార్థబుద్ధి, లోభము, ద్వేషము ఈ మంచితనాన్ని మాయం చేస్తాయి. మనిషిని రాక్షసునిగా మారుస్తాయి. కంసుడే కాదు, హిరణ్యకశిపుడు కూడా హిరణ్యాక్షుడు చనిపోయిన సందర్భంలో ఇవే మాటలను హిరణ్యాక్షుని భార్యకు చెప్పి ఓదార్చాడు. మనిషిలోని మానవత్వాన్ని స్వార్థం చంపేస్తే, రాక్షసత్వం ప్రజ్వరిల్లుతుంది. నాకు ఎదురులేదని మానవుడు అహంకరిస్తాడు. అదే అతడి పతనానికి నాంది. ఇక్కడ కూడా కంసుడు వసుదేవునితో ఇన్ని నీతి వాక్యాలు వల్లించాడు. తరువాత మరలా రాక్షసుడిగా మారి పోయాడు. ఆ సమయంలో పుట్టిన పసిబిడ్డలను అందరినీ చంపమని ఆదేశాలు ఇచ్చాడు. శ్మశాన వైరాగ్యాన్ని ప్రదర్శించే కంసులను మనం నిత్యజీవితంలో ఎంతోమందిని చూస్తుంటాము.)

వసుదేవుడు పలికిన మాటలకు కంసుడు సంతోషించాడు. ఎవరి భవనాలకు వారు వెళ్లిపోయారు. కంసుడు తాత్కాలికంగా పశ్చాత్తాప పడ్డాడు కానీ అతనిలోని మరణభయం మాత్రం పూర్తిగా పోలేదు. మరుసటి రోజు రాత్రి తనమంత్రులను అందరినీ సమావేశ పరిచాడు. వారితో ఇలా అన్నాడు.

“నాడు ఆకాశ వాణి చెప్పినట్టే నేడు యోగమాయ కూడా చెప్పింది. నన్ను చంపేవాడు ఎక్కడో పుట్టి పెరుగుతున్నాడట. వాడు ఎవరు? ఎక్కడ ఉన్నాడు?” అని అడిగాడు.

ఆ మాటలకుదైవద్వేషులు, ఏ మాత్రము విచక్షణా జ్ఞానము లేనివారు దేవతలకు శత్రువులు అయిన కంసుని మంత్రులు ఇలా అన్నారు. "మహారాజా! మీరు చెప్పిన దానిని బట్టి మిమ్ములను చంపేవాడు పుట్టి పది రోజులు అయిఉంటుంది. మీరు చెప్పిందే నిజం అయితే, మేము మన దేశం అంతా గాలించి పదిరోజుల వయసు ఉన్న బాలురను అందరినీ సంహరిస్తాము.

ఓ కంసమహారాజా! ఈ దేవతలు అందరూ ఒట్టి పిరికివాళ్లు. నీవు గట్టిగా హుంకరిస్తే చాలు, నీ ధనుస్సు నారి ధ్వనివింటే చాలు, పారి పోతారు. అటువంటి పిరికి వాళ్లు తమరికి ఏం అపకారం చేస్తారని భయపడుతున్నారు. ఇదివరలో తమరి పరాక్రమానికి భయపడి దేవతలందరూ పారిపోయారు. కొందరు దేవతలైతే వారి వారి శక్తులను తమరి పాదాల ముందు పెట్టి తమరి ముందు మోకరిల్లారు. కొందరు దేవతలు తమరి ముందు నిలబడి గజగజవణుకుతూ నిలబడ్డారు. తమరు ఎంతో దయామయులు కాబట్టి భయంతో వణికిపోతున్న దేవతలను క్షమించి వదిలిపెట్టారు.

దేవతలు అక్కడక్కడా ప్రగల్భాలు పలుకుతారు కానీ, నేరుగా యుద్ధరంగంలోకి దిగితే రాక్షసులకు భయపడి పారిపోతారు. అటువంటి దేవతల వలన మనకు భయం ఎందుకు? విష్ణువు నిరాకారుడు. ఎప్పుడూ మానవులహృదయాలలో దాక్కుని ఉంటాడు. ఇంక ఈశ్వరుడు శ్మశానాల వెంట, అడవుల వెంట తిరుగుతుంటాడు. ఇంద్రుడు ఎప్పుడూ అప్సరసల నాట్యం చూస్తూ, ఎవరు హుంక రించినా బెదిరిపోతూ, పిరికి వాడి వలె గజగజ వణుకుతుంటాడు.

బ్రహ్మగారికి తన తపస్సు ఏమిటో తనేమిటో ఎవరి గురించి పట్టించుకోడు. కాబట్టి వీరి వలన మనకు ఏ మాత్రం భయం లేదు.

ఎంత పిరికి వాళ్లయినా దేవతలు మనకు శత్రువులు కాబట్టి మనజాగ్రత్తలో మనం ఉండాలికదా! అందుకని, ఆ శత్రువుల మూలాలు ఎక్కడ ఉన్నాయో కనుక్కొని వాటిని నాశనం చేయడానికి మాకు తగిన ఆదేశాలు ఇవ్వండి. ఆయా పనులలో మమ్ములను నియమించండి. ఎందుకంటే రోగము రాగానే దానిని ఔషధము వేసి నాశనం చేయాలి. రోగాన్ని ముదరనిస్తే, అది ఎటువంటి మందులకు లొంగదు. అలాగే ఇంద్రియములను మొదటి నుండి లొంగదీసుకొని స్వాధీనంలో ఉంచుకోవాలి. ఇంద్రియములను వాటి ఇష్టం వచ్చినట్టు వదిలేస్తే, అవి మన మాట వినవు. అదేవిధంగా శత్రువును పిరికివాడు అని వదిలేస్తే, వాడు బలం పుంజుకొని మనకు ఎదురుతిరుగుతాడు. అప్పుడు శత్రువును గెలవడం చాలా కష్టం అవుతుంది.

మహారాజా! విష్ణువు దేవతలకు మూలము. సనాతన ధర్మము ఉన్నచోట విష్ణువు నివసిస్తుంటాడు. ఆ సనాతన ధర్మమునకు దేవతలు, గోవులు, బ్రాహ్మణులు, తపస్సు, యజ్ఞములు మూలములు. విష్ణువుకు శరీరము లేదు కాబట్టి, బ్రాహ్మణులు, గోవులు, వేదములు, తపస్సు, సత్యము, ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, శ్రద్ధ, దయ, సహనము, యజ్ఞము ఇవే విష్ణువు యొక్క శరీరములు. ఇన్ని రూపములు కల విష్ణువు దైత్యులకు, రాక్షసులకు శత్రువు. ఈ విష్ణువు సకల దేవతా గణములకు నాయకుడు. బ్రహ్మ, మహేశ్వరుడు విష్ణువును ఆశ్రయించుకొని ఉంటారు. విష్ణువు తపస్సులో ఉంటాడు కాబట్టి, తపస్సు చేసేవారిని హింసిస్తే, వారి కోసరం విష్ణువు వస్తాడు.

అప్పుడు విష్ణువు తేలికగా సంహరింపబడతాడు." అని కంసుని మంత్రులు తమ తమ అభిప్రాయములను వెల్లడి చేసారు.

మంత్రులు చెప్పిన దురాలోచనలను సావధానంగా విన్నాడు కంసుడు. యజ్ఞములు, యాగములు, తపస్సు చేసే బ్రాహ్మణులను, మునులను సంహరించడమే మార్గము అని నిశ్చయం చేసుకున్నాడు. వెంటనే కంసుడు కొందరు దానవులను, రాక్షసులను పిలిచాడు. తపోయజ్ఞములు చేసేవారిని దారుణంగా హింసించమని, సంహరించమనీ వారికి ఆదేశాలు ఇచ్చాడు. పది రోజుల లోపల పుట్టిన శిశువులను చంపమని మరి కొంతమందికి ఆదేశాలు ఇచ్చాడు. తరువాత తన అంత:పురమునకు వెళ్లిపోయాడు.

కంసుని ఆదేశానుసారము, రాక్షసులు, అసురులు, బ్రాహ్మణులను, తపోధనులను, యజ్ఞము చేసేవారిని హింసించ సాగారు. సాధువులను, బ్రాహ్మణులను హింసిస్తే అది వారి ధర్మాన్ని, కీర్తిని, సంపదలను, ఆయుష్షును, సకల శుభములను హరిస్తుందని, వారి వినాశనానికి హేతువు అవుతుందనీ అసురులకు, రాక్షసులకు తెలియకపోవడం వారి అజ్ఞానానికి గుర్తు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# దశమస్కంధము

# ఐదవ అధ్యాయము

(యత్రయోగీశ్వర: కృష్ణో యత్ర పార్థో ధనుర్ధర: తత్ర శ్రీర్విజియో భూతి: ధ్రువా నీతిర్మతిర్మమ. ఇది భగవద్గీతలో సంజయుడు చెప్పిన ఆఖరు శ్లోకము. ఎక్కడ శ్రీకృష్ణుడు, ఎక్కడ అర్జునుడు ఉంటారో అక్కడ సకల సంపదలు, ఐశ్వర్యము, సుఖము, శాంతి, సౌభాగ్యము ఉంటాయి. ఇక్కడ కూడా అదే జరిగింది. కృష్ణుడు మధురలో పుట్టినా, నందగోకులానికి వెళ్లిపోయాడు. కృష్ణుడు లేని మధురలో  అశాంతి, అభద్రతాభావము నెలకొన్నాయి. కంసుని మనసులో తను ఎప్పుడు చస్తానో అని భయం. కంసుని అనుచరుల వలన గోవులకు, బ్రాహ్మణులకు, యజ్ఞ చేసేవారికి భయం. వసుదేవునికి, దేవకికి తన కుమారుడు ఎక్కడున్నాడో ఏం చేస్తున్నాడో అనే శోకం. మధురా నగర వాసులంతా కంసుని పాలనలో భయంభయంగా అశాంతి గా అభద్రతాభావంతో  బతుకకుతున్నారు. కాని శ్రీకృష్ణుడు తన చిన్ని పాదాలు మోపిన నందవ్రజంలో ఆనందం, సంతోషం,సౌభాగ్యం వెల్లివిరిసాయి. మనంకూడా ఒక చిన్ని కృష్ణవిగ్రహాన్ని మన ఇంట్లో పెట్టుకుందాము. ఆ కృష్ణుని పాదాల దగ్గర ఒక పువ్వు గానీ, ఒక తులసీ దళం గాని పెడదాము. మనసారా నమస్కరిద్దాము. నందగోకులములో మాదిరి  మన ఇంట్లోకూడా ఆనందము, సౌభాగ్యము వెల్లివిరుస్తుంది.  అదెలాగో చూద్దాం.)

"ఓ పరీక్షిత్ మహారాజా!  నందగోకులంలో తెల్లవారింది. యశోదకు కుమారుడు పుట్టాడు అన్న వార్త పల్లె అంతటా

వ్యాపించింది. నందుడు తనకు కుమారుడు పుట్టాడని సంతోషంతో పొంగి పోయాడు. పొద్దున్నే స్నానం చేసాడు. బ్రాహ్మణులను పిలిపించాడు. స్వస్తివాచకములను పలికించాడు. జాతక కర్మలను, దేవతలకు, పితృదేవతలకు అర్చన చేయమని చెప్పాడు. బ్రాహ్మణులకు వస్త్రములను,బంగారు పాత్రలను గోవులను, తిలలను దానం చేసాడు.

వ్రేపల్లెలో తప్పెట్లు తాళాలు మోగించారు. ఆనందంతో ఆడుతున్నారు. పాడుతున్నారు. పల్లెలో అన్ని ఇండ్లకు మామిడి ఆకుల తోరణాలు కట్టారు. గోపకులు అందరూ తమ ఆవులకు పసుపు నూనె కలిపి ఒళ్లంతా పట్టించారు. పశువులన్నీ పసుపురంగుతో నిగనిగ మెరుస్తున్నాయి. తమకు ఒక చిన్ని నేస్తం వచ్చాడని లేగ దూడలు ఆనందంతో గంతులువేసాయి. ఎద్దులు ఆనందంతో రంకెలు వేసాయి. తమచిన్ని కృష్ణునికి పాలు కావాలేమో అన్నట్టు ఆవులు రోజుకన్నా రెట్టింపు పాలు ఇచ్చాయి.

అందరి కాళ్లు నందుని ఇంటివేపు నడిచాయి. అందరూ చిన్నిబాలుని ఎప్పుడెప్పుడు చూద్దామా అని ఆతురతగా నందుని ఇంటికి వెళుతున్నారు. వచ్చిన వారంతా తమకు తోచిన కానుకలు తీసుకొని వస్తున్నారు. అందరూ పోటీలుపడి బాలుని చూస్తున్నారు. ఆనందంతో కేరింతలు కొడుతున్నారు. వారి ఉత్సాహానికి అంతు లేదు. చేతికి దొరికిన వెన్న పెరుగు నేయి ఒకరి మీద ఒకరు చల్లుకుంటున్నారు. వసంతాలు ఆడుకుంటున్నారు. అంతులేని ఆనందంలో మునిగి తేలుతున్నారు.

(ఇక్కడ పోతన గారు ఒక చమత్కారమైన పద్యం రాసారు.దాని భావం రాస్తాను)

ఏ కష్టము తెలియని శ్రీమహావిష్ణువు ఈ గోకులంలో పశువుల కాపరుల ఇంట్లో ఏం సుఖపడదామని వచ్చాడో! కర్మలు చేయని, కర్మలు చేయనవసరం లేని పరమాత్మ తనకు జాతక కర్మలు చేయించుకుంటున్నాడు కదా! ఈ అనంత విశ్వానికి తల్లి తండ్రి అయిన శ్రీమహావిష్ణువు, తన తల్లి యశోద పక్కలో పడుకొని ఆమె చనుబాలు లొట్టలేస్తూ తాగుతున్నాడు. పెరగటం, తరగటం అంటూ లేని పరమాత్మ, యశోదమ్మ ఒడిలో దినదినప్రవర్ధమానంగా పెరుగుతున్నాడు. ఎన్నో నోములు, వ్రతములు తపస్సులు చేసినా లభ్యం కాని పరమాత్ముడు అనే బంగారుపంట, చిన్నికృష్ణుని రూపంలో నందగోకులంలో విరగపండింది. ఎన్ని వేదాలు, శాస్త్రాలు పురాణాలు చదివినా అర్థంకాని పరమాత్మస్వరూపము, చిన్ని కృష్ణుని రూపంలో నంద గోకులంలో సాక్షాత్కరించింది. చిన్ని కృష్ణుడు చిలిపి చేష్టలు చేస్తుంటే కొత్త కొత్త ఆటలు ఆడుతుంటే సృష్టికర్త అయిన బ్రహ్మలాగా కనిపిస్తాడు. చిన్ని కృష్ణుడు నవ్వుతూ కేరింతలుకొడుతుంటే స్థితి కారుడైన విష్ణువు లాగా కనిపిస్తాడు. కోపంతో చేతికందిన వస్తువును విసిరేస్తూ బుడ్డమూతి పెట్టుకున్న చిన్నిబాలుడు రుద్రుడులాగా కనిపిస్తాడు. హాయిగా, సుఖంగా అమ్మ పొత్తిళ్లలో నిద్రపోతూ చిద్విలాసంగా చిరునవ్వులు చిందిస్తున్న బాలకృష్ణుడు పరబ్రహ్మలాగా గోచరిస్తాడు. ఈ విధంగా కృష్ణుని బాల్యం గడుస్తూ ఉంది. (అని పోతన గారు చమత్కరించారు).

కొడుకు పుట్టిన సంతోషంలో నందుడు శుభ్రంగా స్నానం చేసాడు. చక్కగా కొత్త బట్టలు కట్టుకున్నాడు. అలంకరించుకున్నాడు.

బ్రాహ్మణులను పిలిపించాడు. వారిచేత బిడ్డకు స్వస్తివాచకములు పలికించాడు. కుమారునికి జాతక కర్మలు జరిపించాడు. దేవతలను, పితృదేవతలను అర్చించాడు. గోపకులకు, గోపకాంతలకు వస్త్రములు, రెండు లక్షల గోవులు దానం చేసాడు. ఏడుకుప్పల నువ్వులను దానం చేసాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! కాలం గడుస్తున్నకొద్దీ భూమి, దాని మీద ఉన్న వస్తువులు శుద్ధిచెందుతుంటాయి. అలాగే స్నానం చేస్తే శరీరం శుద్ధిఅవుతుంది. వస్త్రములు మొదలగునవి ఉతికితే శుభ్రపడతాయి. అలాగే గర్భంవచ్చినపుడు సంస్కారములచేత గర్భశుద్ధి చేస్తుంటారు. దానం చేయడం వలన మన దగ్గర ఉన్న వస్తువులు, ధనము శుద్ధిఅవుతాయి అంటే ప్రయోజనం పొందుతాయి. సంతోషంతో మనస్సు శుద్ధిఅవుతుంది. జ్ఞానం కలిగితే ఆత్మ శుద్ధిఅవుతుంది. నందుడు కూడా తమ ఇంట్లో కుమారుడు పుట్టాడని శుద్ధికార్యక్రమాలు ఎన్నో చేసాడు.

ఇంకా బ్రాహ్మణుల చేత స్వస్తి వాచకములు పలికించాడు. తన కుమారునకు శుభం కలగాలని బ్రాహ్మణులకు, వంది మాగధులకు, సూతులకు, పౌరాణికులకు, ధనము, ధాన్యము,గోవులు ఇచ్చి సత్కరించాడు. గాయకులు పాడుతున్నారు. మంగళవాద్యాలు మోగుతున్నాయి. ఊరంతా మామిడి తోరణాలు కట్టారు. రంగురంగుల పతాకములు ఎగురవేసారు. వ్రజములో ఉన్న అన్ని ఇళ్ల ముందర చక్కగా నీళ్లు చల్లి రంగవల్లులు తీర్చిదిద్దారు. ఎద్దులకు, ఆవులకు, ఆవు

దూడలకు పసుపు,నూనెకలిపిన మిశ్రమాన్ని ఒంటికి పట్టించారు. ఆవులు, దూడలు పసుపురంగులో మిలమిల మెరిసిపోతున్నాయి. ఆవులను, దూడలను నెమలి ఈకలతోనూ, పూలతోనూ, రంగురంగుల వస్త్రములతోనూ అలంకరించారు.

నందుడు ఆ పల్లెకు రాజు. నందుని ఇంటిలో బిడ్డ పుడితే అందరి ఇళ్లలో పండగే. అందుకని ఆ పల్లెలో ఉన్న గోపాలురు, గోపకులు మంచి మంచి వస్త్రములను కట్టుకొని, తలపాగాలు చుట్టుకొని, ఆభరణములను ధరించి, తమకు తోచిన ఉపాహారములను తీసుకొని నందుని ఇంటికివచ్చారు. పల్లెలో ఉన్న గోపకాంతలు కూడా యశోదకు బిడ్డ పుట్టాడని తెలిసి, వారుకూడా మంచి మంచి వస్త్రములను, ఆభరణములను అలంకరించుకొని యశోద ఇంటికి వచ్చారు. నందుని ఇల్లు అంతా గోప కాంతలతోనూ, గోపాలురతోనూ కిటకిటలాడిపోతూ ఉంది. అందరూ చిన్నికృష్ణుని చూడటానికిపోటీ పడుతున్నారు. వారందరూ చిన్నికృష్ణుని చిరాయువుగా దీవించారు. గోపకాంతలలో పెద్దవాళ్లు చిన్ని కృష్ణునికి పసుపు, నూనెలతో నలుగుపెట్టి స్నానం చేయించారు. ధూపం వేసారు.

నందుని ఇంట్లో ఇలా ఉంటే, గోపబాలురు సంతోషంతో వాద్యాలు మోగిస్తున్నారు. ఆనందంతో ఆడుతున్నారు. ఒకరి మీద ఒకరు వెన్న, పెరుగు చల్లుకుంటున్నారు. నందుడు కూడా తన ఇంటికి వచ్చిన వారిని సాదరంగా ఆహ్వానిస్తున్నాడు. వారికి తగు సత్కారములు చేస్తున్నాడు. వచ్చిన వారందరికీ బట్టలు, ఒక గోవు ఇస్తున్నాడు. బ్రాహ్మణులకు, నటులకు, నర్తకులకు, సూతులకు, వందిమాగధులకు, లేదనకుండా దానం చేస్తున్నాడు. అలా చేస్తే తన కుమారుడికి

శుభంకలుగుతుందని నమ్ముతున్నాడు. వ్రేపల్లెలో ఉన్న రోహిణి కూడా అన్ని అలంకారములను చేసుకొని హడావిడిగా అటు ఇటు తిరుగుతూ ఉంది.

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీమహావిష్ణువు ఎక్కడ ఉంటే లక్ష్మీదేవి అక్కడే ఉంటుందికదా! నందగోకులంలో జరుగుతున్న కోలాహలం చూస్తుంటే శ్రీకృష్ణునితోపాటు, శ్రీమహాలక్ష్మి కూడా నందగోకులంలో తిష్టవేసిందా అన్నట్టు ఆ పల్లె ఆనందోత్సాహాలతో, సిరిసంపదలతో తులతూగుతూ ఉంది.

ప్రతి సంవత్సరము నందుడు, రాజైన కంసునికి పన్ను చెల్లించాలి. అందుకని నందుడు గోపాలురను, గోపకులను తన ఇంటిని, పల్లెను జాగ్రత్తగా చూడమని చెప్పి, కంసునికి కప్పము చెల్లించడానికి మధురకు వెళ్లాడు. తాను తెచ్చిన కానుకలను, కప్పమును కంసమహారాజుకు చెల్లించాడు.

తన మిత్రుడు నందుడు మధురకు వచ్చాడని వసుదేవుడికి తెలిసింది. నందుని చూడటానికి నందుడు విడిది చేసిన చోటికి రహస్యంగా వెళ్లాడు వసుదేవుడు. వసుదేవుని చూచి నందుడు ఆనందంతో కౌగలించుకున్నాడు. నందుడు వసుదేవునికి పూజలు చేసాడు. ఉపాహారాలు సమర్పించాడు. వసుదేవుడు నందునితో ఇలా అన్నాడు.

"మిత్రమా! ఇంతకాలము నీకు సంతానము లేదని బాధపడుతున్నావు. ఇంతకాలానికి నీకు సంతానం కలిగిందని, నీ ఇంట

పసిపాప తిరుగుతున్నాడని తెలిసి నాకు చాలా సంతోషంగా ఉంది. చాలా కాలం తరువాత నిన్ను కలుసుకోవడం నాకు చాలా ఆనందంగా ఉంది. ఈ జీవన యానంలో మన లాంటి మిత్రులము అప్పుడప్పుడు కలుస్తుంటాము. మరలా విడిపోతుంటాము. బంధువులు అందరము కలిసి ఒకే చోట ఉండటం సాధ్యం కాదు కదా! మనం ఇప్పుడు ఇలా కలుసుకోవడం చాలా సంతోషంగా ఉంది.

అది సరే! ప్రస్తుతము నీవు నివసిస్తున్న ప్రదేశము నీకు, పశు సంపదకు అనుకూలంగా ఉన్నదా! పశువులకు ఎటువంటి రోగములు, బాధలు లేవు కదా! ఆ ప్రదేశంలో నీరు, పచ్చిక సమృద్ధిగా దొరుకున్నాయికదా! నా భార్య రోహిణి మీ పల్లెలో ఉంది కదా! ఆమె, ఆమె కుమారుడు (బలరాముడు) క్షేమంగా ఉన్నారా! నా కుమారుని కూడా యశోద తన కుమారుని వలె లాలిస్తూ ఉందా! బలరాముడు నిన్ను కూడా తన తండ్రి మాదిరి భావిస్తున్నాడా. మిత్రమా! నేను ఇక్కడ, నా భార్య రోహిణి, నా కుమారుడు  అక్కడ, కంసునికి భయపడి రహస్యజీవనం చేస్తున్నాము. అయిన వారికి దూరం అయిన తరువాత ఎన్ని సంపదలు ఉండి ఏమి ప్రయోజనము. ఏం సుఖాన్ని ఇస్తాయి. భార్యపుత్రులు అందరూ ఒక చోట ఉంటేనేకదా  ఆనందము, సుఖసంతోషాలు కలిగేది." అని నందునితో అన్నాడు వసుదేవుడు.

ఆమాటలకు నందుడు వసుదేవునితో ఇలాఅన్నాడు. "మిత్రమా! నీ మనసులో బాధ నాకు అర్థం అయింది. దుర్మార్గుడైన కంసుడు నీ కుమారులను అందరినీ చంపాడు అని విన్నాను. తుదకు కూతురు పుట్టినా ఆమెను కూడా విడిచిపెట్టలేదట ఆ దుర్మార్గుడు. ఆ కుమార్తె కూడా కనపడకుండా పోయిందట. ఎంతటి దురదృష్టము. సుఖం

కలగాలన్నా, సంతోషంగా ఉండాలన్నా, సంపదలు, సంతానము కలగాలన్నా అదృష్టం ఉండాలి. దురదృష్టము వెంటాడుతున్నప్పుడు ఇవేమీ ఉండవు.   నాకేదో రవంత అదృష్టం ఉండి నా ఇంట చిన్నిపాపడు పారాడుతున్నాడు. నీకు ఆ అదృష్టం కరువయింది. పుట్టిన బిడ్డలు కూడా దక్కకుండా పోయారు. అదృష్టం ముఖం చాటేస్తే ఇలాగే జరుగుతుంది. దీనికి నీవు చింతించవద్దు.  నీ అదృష్టం బాగుంటే మరలా నీకు సంతానం కలుగుతారేమో ! ఎవరు చూడొచ్చారు.  మనం సుఖపడాలన్నా, కష్టాలు పాలవాలన్నా, అన్నిటికీ అదృష్టమే మూల కారణము. ఈవిషయం తెలుసుకుంటే మనం దేనికీ చింతించపనిలేదు.  " అని తనకు తోచిన విధంగా వసుదేవుని ఓదార్చాడు నందుడు.

వసుదేవుడు నందునితో ఇలా అన్నాడు. "మిత్రమా! వచ్చిన పని అయింది కదా! కంసునికి కప్పం చెల్లించావు కదా! చాలా రోజుల తరువాత నిన్ను కలుసుకున్నాను. నాకు చాలాసంతోషంగా ఉంది! ఇంక ఎక్కువ కాలం ఇక్కడ ఉండటం మంచిదికాదు. నీవు వెంటనే బయలుదేరు. ఏ రోజు ఏ సమయంలో ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు. నీ శత్రువులు నీకు, నీ బిడ్డకు ఏం అపకారం తలపెడతారో ఏమో! అందుకని నీవు వెంటనే గోకులానికి బయలుదేరు. ఆలస్యం చేయవద్దు." అని నర్మగర్భంగా కృష్ణునికి ఆపద వచ్చే అవకాశం ఉందని తెలియజేసాడు వసుదేవుడు.

వసుదేవుని మాట ప్రకారము నందుడు వెంటనే బయలుదేరి నందవ్రజము చేరుకున్నాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఆరవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! వసుదేవుని మాటలను విన్న నందుడు వెంటనే గోకులము వెళ్లడానికి బయలుదేరాడు. దారిలో ఇలా అనుకుంటున్నాడు. "ఏమో! వసుదేవుడు ఎందుకన్నాడో ఏమో తెలియదు. వసుదేవుని మాటలు ఎప్పుడూ అబద్ధాలు కావు. ఏదో ఉత్పాతము జరగబోతోంది. చాలా జాగ్రత్తగా ఉండాలి. చిన్ని బాలుని జాగ్రత్తగా కాపాడుకోవాలి." అని అనుకుంటూ వడి వడిగా బండిమీద గోకులానికి వెళుతున్నాడు. మనసులో తనకు ఇష్టదేవత అయిన శ్రీమహావిష్ణువును భక్తితో స్మరించుకుంటున్నాడు.

ఇది ఇలా ఉండగా. పూతన అనే రాక్షసిని, తన రాజ్యం అంతా తిరిగి, పుట్టిన బిడ్డలను పురిటిలోనే చంపమని ఆదేశించాడు కంసుడు. కంసుని ఆదేశాల ప్రకారం పూతన అందమైన స్త్రీ రూపం ధరించి ఊరూరా, పల్లె పల్లె తిరుగుతూ ఉంది. అప్పుడు పుట్టిన బిడ్డలను, రోజుల వయసు ఉన్న పసిబిడ్డలను విషపూరితమైన

చనుబాలు ఇచ్చి ఎవరికీ అనుమానం రాకుండా చంపుతూ ఉంది. ఇలా పూతన ఊరూరా తిరుగుతూ నందగోకులం వచ్చింది. నందగోకులంలో జరిగే కోలాహలమును గమనించింది. నందుని ఇంట్లో రోజుల కిందట పుట్టిన బాలుడు ఉన్నాడని తెలుసుకొని నందుని ఇంటికి వెళ్లింది.

పూతన చక్కగా అలంకరించుకొని ఉంది. తలలో నిండుగా పూలుపెట్టుకుంది. మంచి బట్టలు ధరించింది. అందమైన ముఖంతో, మనోహరమైన చిరునవ్వుతో, క్రీగంటి చూపులతో ఆ పల్లె వాసులను మోహంలో ముంచేసింది. ఆమెను చూచిన ఆ పల్లెవాసులు "ఈమె ఎవరో! సాక్షాత్తు లక్ష్మీదేవిలాగా ఉంది. ఎవరో గొప్ప కులంలో పుట్టిన ఆవిడ చిన్ని కృష్ణుని చూడటానికి వచ్చింది" అని అనుకున్నారు గోపకాంతలు. అందరూ కలిసి పూతనను నందుని ఇంటికి తీసుకొని వెళ్లారు.

పూతన నందుని ఇంటిలోకి వెళ్లింది. ఆ సమయంలో చిన్ని కృష్ణుడు పొత్తిళ్లలో పడుకొని చేతులు కాళ్లు ఆడిస్తూ ఆడుకుంటున్నాడు. చిన్ని కృష్ణుని చూచింది పూతన. చిన్ని కృష్ణుడు కూడా పూతనను చూచాడు. ఏమీ ఎరుగనట్టు కళ్లు మూసుకొని చిరునవ్వులు చిందిస్తున్నాడు. పూతన శయ్య మీద కూర్చుని కృష్ణుని తన ఒడిలోకి తీసుకుంది. కృష్ణుని వాత్సల్యంతో ముద్దుపెట్టుకుంది. పూతన కంటి చూపులో ఉన్న తీక్షణతకు భయపడ్డ యశోద, రోహిణి, ఆమెను వారించలేక మౌనంగా చూస్తూ ఉన్నారు.

పూతన కృష్ణునిమీద తన పమిట కొంగు కప్పింది. కాలకూటవిషంతో కూడిన తన స్తనమును కృష్ణుని నోటికి అందించింది. కృష్ణుడు కూడా ఆమె స్తనములు పట్టుకొని చనుబాలు తాగుతున్నాడు. ఉన్నట్టుండి కృష్ణుడు పూతన స్తనములను తన చేతులతో బలంగా అదిమాడు. చనుబాలతో పాటు ఆమె పంచప్రాణములను కూడా తాగేసాడు. పూతన ఒంటి లోనుండి శక్తి అంతా ఒక్కసారిగా తోడేసినట్టు అయింది. "అబ్బా వదలరా. విడవరా. ఇంక చాలు. ఆపు" అంటూ అరుస్తూ ఉంది. కాని కృష్ణుడు ఆమె స్తనమును వదిలిపెట్టలేదు. చేతులతో నొక్కుతున్నాడు. నోటితో పూతన ఒంట్లోని రక్తాన్ని లాగేస్తున్నాడు.

పూతన శరీరం అంతా చెమటలు పడుతున్నాయి. కళ్లు తేలవేసింది. కాళ్లు చేతులు గిలా గిలా కొట్టుకుంటూ ఉంది. బిగ్గరగా ఏడుస్తూ ఉంది. ఆమె ఏడుపుకు దిక్కులు ప్రతిధ్వనించాయి. ప్రాణాలు పోయే సమయంలో రాక్షసులకు అసలు స్వరూపం బయట పడుతుంది. అలాగే పూతనకూడా జుట్టు విరబోసుకొని, పెద్ద నోరు తెరిచి, చేతులు కాళ్లు కొట్టుకుంటూ, కిందపడి పోయింది. కృష్ణుడు ఆమె వక్షస్థలము మీద కూర్చుని ఆడుకుంటున్నాడు.

ఆ పూతన శరీరము ఆరుకోసుల పొడుగు ఉంది. పూతన దంతములు నాగలి కర్రులవలె ఉన్నాయి. ఆమె ముక్కు రంధ్రములు కొండగుహలవలె ఉన్నాయి. ఆమె స్తనములు కొండలమాదిరి ఉన్నాయి. రెండు కళ్లు లోతుగా ఉన్నాయి. ఎర్రటి జుట్టుతో భయంకరంగా ఉంది పూతన శరీరము.

ఆ భయంకర రూపమును చూచి యశోద, రోహిణి, గోపకాంతలు గోపబాలురు భయంతో వణికిపోయారు. కాని ఆ భయంకర శరీరం మీద ఆడుకుంటున్న చిన్నికృష్ణుని చూచి అమ్మయ్య బాలునికి ఏమీ ప్రమాదం లేదనుకున్నారు. వెంటనే కృష్ణునిచేతుల్లోకి తీసుకున్నారు. దిష్టితీసారు. ఆవుతోకను బాలుని చుట్టు తిప్పారు. రక్ష కట్టించారు. ఆవు పంచితముతోనూ (గోవు మూత్రము) గోధూళితోనూ కలిపిన నీళ్లతో స్నానం చేయించారు. కేశవనామాలు చదువుతూ బాలునికి రక్షకలగాలని ప్రార్థించారు.

గోపకాంతలు స్నానం చేసి ఉతికిన బట్టలు కట్టుకొని పరమాత్మను ఇలా ప్రార్థించారు. "అజుడు నీ పాదములను, మణిమంతుడు నీ జానువులను, యజ్ఞుడు నీ ఊరువులను, అచ్యుతుడు నీ కటిభాగమును, హయగ్రీవుడు నీ కడుపును, కేశవుడు నీ హృదయమును, ఈశుడు నీ వక్షస్థలమును, సూర్యుడు నీ కంఠమును, విష్ణువు భుజములను, ఉరుక్రముడు నీ ముఖమును, ఈశ్వరుడు నీ తలను, చక్రి నీ శరీరములో ముందు భాగమును, శ్రీహరి నీ వెనుకభాగమును, మధుసూదనుడు నీ రెండు చేతులను, ఉరుగాయుడు నీ బాహుమూలములను, ఉపేంద్రుడు నీ పైన, గరుడుడు నీ కింద, పురుషుడు నీ అన్ని వైపులా ఉండి నిన్ను రక్షించుగాక అంటూ బాలునికి రక్ష కట్టారు.

హృషీకేశుడు నీ ఇంద్రియములను, నారాయణుడు ప్రాణములను, యోగేశ్వరుడు నీ మనస్సును రక్షించుగాక అని ప్రార్థించారు.

పృశ్నిగర్భుడు నీ బుద్ధిని, పరమేశ్వరుడు నీ ఆత్మను రక్షించుగాక! గోవిందుడు నీ ఆటపాటలయందు, మాధవుడు నీవు నిద్రించేటప్పుటు నిన్ను రక్షించుగాక! నువ్వు నడిచేటప్పుడు వైకుంఠుడు, నీవు కూర్చున్నప్పుడు శ్రీపతి, నీవు బువ్వ తినేటప్పుడు యజ్ఞభుక్కు అయిన విష్ణువు నిన్ను రక్షించుగాక! ఢాకినీ, యాతుదానీ, కూష్మాండ మొదలగు బాలఘాతక గ్రహములు, భూత,ప్రేత,పిశాచములు, యక్షులు, వినాయకులు, రాక్షసులు, కోటరులు, రేవతి, జ్యేష్ట, పూతన, సప్తమాతృకలు, దేహమును,ప్రాణములకు హాని కలిగించే వారు, అపస్మారకము, ఉన్మాదము, మొదలగు రోగములు, కలలో కనిపించే ఉత్పాతములు, వృద్ధ గ్రహములు, బాలగ్రహములుఅన్ని బాలుని చెంత చేరకుండు గాక!" అని కృష్ణునికి రక్ష కట్టారు.

ఈ తంతు అంతా ముగిసిన తరువాత యశోద చిన్ని బాలునికి పాలు ఇచ్చి పడుకోబెట్టింది. ఆ సమయానికి నందుడు తన అనుచరులతో మధురనుండి పల్లెకు చేరుకుంటున్నాడు. దారిలో పూతన భయంకరమైన శరీరం పడి ఉండటం చూచాడు.

"వసుదేవుని మాటలు నిజమైనట్టున్నాయి. వసుదేవుడు గొప్ప తపస్సు అయినా చేసి ఉండాలి లేక యోగి అయినా అయి ఉండాలి. లేకపోతే జరగబోయే విషయాన్ని ఎలాచెప్పగలడు. మధురలో ఆయన చెప్పిన మాటలు గోకులము చేరేటప్పటికి నిజం అయ్యాయి. " అని తన అనుచరులతో చెబుతూ ఇల్లు చేరుకున్నాడు నందుడు.

ఆ ఊరిలో ఉన్న యాదవులు ఆ రాక్షసి శరీరమును ఒక్కసారిగా లేపలేక, ముక్కలు ముక్కలుగా నరికి ఊరి అవతలకు

తీసుకొని వెళ్లి అక్కడ దహనం చేసారు.

ఓ పరీక్షిత్ మహారాజా! పరమాత్ముడగు శ్రీకృష్ణుని స్పర్శతో పునీతమైన పూతన శరీరం కాలుతుంటే సుగంధాలు వెదజల్లుతూ ఉంది. శ్రీకృష్ణునికి తల్లి మాదిరి స్తన్యము ఇచ్చినకారణంగా, రక్తపిపాసి, శిశుహంతకి అయిన పూతనకూడా ఉత్తమగతులు పొందింది. అలాగే శ్రీకృష్ణుని తమ కుమారుడిగా భావించి తమకు ఉన్నది ప్రీతితో, భక్తితో, శ్రద్ధతో సమర్పిస్తే, వారు శ్రీకృష్ణుని కృపకు పాత్రులవుతారు అనడంలో సందేహం లేదు.

శ్రీకృష్ణభగవానుడు తన భక్తుల హృదయములలో కొలువై ఉంటాడు అని తెలుసు కదా! బ్రహ్మ, శివుడు, దేవతలచేత పూజింపబడే శరీరంతో పూతన స్తన్యమును పట్టుకొని ఆమె చనుబాలు తాగాడు చిన్నికృష్ణుడు. పూతన రాక్షసే కావచ్చు. కాని మాతృభావంతో కృష్ణుడికి పాలు ఇచ్చింది. కాబట్టి పూతన కూడా కృష్ణునికి తల్లి అయింది. అందుకే ఉత్తమగతులు పొందింది. ఒక్కపూతనే కాదు ఆ గోకులంలో ఉన్న తల్లులు, గోవులు కూడా కృష్ణునికి పాలు ఇచ్చినందువలన, వారంతా ఉత్తమ గతులు పొందారు.

పూతన కృష్ణునికి ఎలా  స్తన్యము ఇచ్చిందో అలాగే గోకులంలో ఉండే తల్లులు కూడా కృష్ణుడు ఆకలితో ఏడుస్తున్నప్పుడు, యశోదమ్మ పనిలో ఉన్నప్పుడు తమ స్తన్యము ఇచ్చేవారు. కృష్ణుడు కూడా ఆ తల్లులపాలు తృప్తిగా తాగేవాడు. చిన్నికృష్ణుని తమ కుమారుడుగా భావించి తమ స్తన్యము ఇచ్చిన  గోకులంలోని తల్లులకు అజ్ఞానము

నశించి, ఈ సంసారము నుండి విముక్తి పొందారు.

ఓ పరీక్షిత్ మహారాజా! పూతన శరీరం తగలపడుతుంటే చుట్టు నిలబడి చూస్తున్న గోపకులు ఆ చితిలో నుండి సువాసన రావడం చూచిఆశ్చర్యపోతున్నారు.

నందుడు తన గృహమునకు వచ్చి జరిగింది తెలుసుకొని ఆశ్చర్యపోయాడు. వసుదేవుని మాటలు అప్పుడే నిజాలు అవుతున్నందుకు ఆవేదన పడ్డాడు. అయినా చిన్నికృష్ణుడు ఏ ఆపదా లేకుండా ఆ రాక్షసి బారి నుండి బయటపడ్డందుకు ఎంతో సంతోషించాడు. నందుడు తన కుమారునిఒడిలోకి తీసుకొని నుదురు ముద్దుపెట్టుకొని, ఆనందంతో పరవశించిపోయాడు.

బాలకృష్ణుని లీలలు చదివిన వారికి, విన్నవారికి శ్రీహరి యందు భక్తి, శ్రద్ధ కలుగుతాయిఅనడంలో సందేహము లేదు." అని శు క మహర్షి పరీక్షిత్ మహారాజుకు పూతనా సంహార వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఏడవ అధ్యాయము.

శుక మహర్షి చెబుతున్న శ్రీకృష్ణుని బాల్యలీలలను ఆసక్తితో వింటున్న పరీక్షిత్ మహారాజు శుకయోగీంద్రులతో ఇలా అన్నాడు.

"మహాత్మా! తమరు శ్రీహరి యొక్క మత్స్యావతారము మొదలగు అవతారముల గురించి వీనులవిందుగా చెప్పారు. మా మనస్సులు ఆహ్లాదంతో నిండిపోయాయి. శ్రీహరి అవతార కథలను విన్నంత మాత్రముననే మానవుల శారీరక, మానసిక బాధలు అన్నీ తొలగిపోతాయి. ప్రాపంచిక విషయముల యందు, భోగలాలస యందు ఆసక్తి నశిస్తుంది. ముఖ్యంగా శ్రీకృష్ణుని బాల్యలీలలు వింటుంటే మామనసులు పరిశుద్ధము అవుతున్నాయి. శ్రీహరి సర్వవ్యాపి అయినప్పటికినీ, మానవలోకంలో, మానవుల మధ్యలో, మానవుడిగా అవతరించి, సాధారణ శిశువు మాదిరి పెరుగుతున్న శ్రీకృష్ణుడు నందగోకులంలో చేసిన లీలలు అన్నీ మాకు సవిస్తరంగా వివరించవలసింది." అని అడిగాడు.

శుకమహర్షి ఇలా చెప్పసాగాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా చిన్ని కృష్ణునికి మూడో నెలలు నిండాయి. చిన్ని కృష్ణుడు ఒత్తిగిలి పడుకొనడం, పక్కకు తిరగడం, బోర్లపడడం చేస్తున్నాడు. చిన్నికృష్ణుడు బోర్లపడడం చూచిన యశోద గోపకాంతలు ఆనందంతో పొంగి పోయారు. దానిని ఒక ఉత్సవంగా చేసారు.(ఈరోజుల్లోకూడా బోర్లపడితే బొబ్బట్లు, అడుగులేస్తే అరిసెలు, ముత్తయిదువులకు పంచి

పెడతారు కదా. అలాగే!)

ఆ రోజు రోహిణీ నక్షత్రము. శ్రీకృష్ణుని జన్మనక్షత్రము. నందుని ఇంటిలో మంగళ వాద్యాలు మోగుతున్నాయి. నందగోకులంలో ఉన్న స్త్రీలందరూ యశోద ఇంటికి వచ్చారు. చిన్ని కృష్ణునికి నలుగు పెట్టి స్నానం చేయించారు. కొత్త బట్టలు కట్టబెట్టారు. బ్రాహ్మణులు వచ్చి మంత్రములు చదివారు. చిన్నికృష్ణుని ఆశీర్వదించారు. నందుడు బ్రాహ్మణులకు గోవులు, వస్త్రములు, దానంగా ఇచ్చాడు.

వేడివేడినీళ్లతో స్నానం చేసి, అమ్మ పాలు తాగిన చిన్ని కృష్ణుడు కళ్లుమూసుకొని నిద్రలోకి జారుకున్నాడు. యశోద చిన్ని కృష్ణుని ఆరుబయట ఒక బండి కింద నీడలో  పడుకోబెట్టింది. తరువాత, యశోద, రోహిణి కలిసి వచ్చిన గోపకాంతలకు పండ్లు, తాంబూలాలు ఇవ్వడం, కానుకలు ఇవ్వడంలో నిమగ్నమై ఉన్నారు.

ఇంతలో చిన్నికృష్ణుడు నిద్రనుండి లేచి ఏడుస్తున్నాడు. ఈ సందడిలో యశోదకు చిన్నికృష్ణుని ఏడుపు వినపడలేదు. కృష్ణునికి ఆకలి వేసిందేమో చేతులు పైకెత్తి ఉంగా ఉంగా అంటూ అమ్మపాల కోసం ఏడుస్తున్నాడు. కాళ్లు చేతులు ఆడిస్తూ ఏడుస్తున్నాడు చిన్నికృష్ణుడు. అమ్మ వచ్చి తనకు పాలు ఇవ్వలేదనే కోపంతో పక్కనే ఉన్న బండి చక్రాన్ని చాచి ఒక్క తన్ను తన్నాడు చిన్నికృష్ణుడు. ఆ దెబ్బకు ఆ బండి తిరగబడింది. బండి చక్రాలు దొర్లుకుంటూ అవతలపడ్డాయి. ఇరుసు విరిగిపోయింది. ఆబండిలో ఉన్న వస్తువులు, పాత్రలు అన్నీ పెద్ద శబ్దంతో కిందకు దొర్లిపోయాయి.

ఆ శబ్దాలు విన్న యశోద, రోహిణి,గోపకాంతలు పరుగు పరుగున అక్కడకు వచ్చారు. కొద్దిసేపటి కిందట తాము పిల్లవాడిని బండి కింద పడుకోబెట్టారు. ఇప్పుడు ఆ బండి విరిగి ముక్కలయింది. చిన్నికృష్ణుడు మాత్రం చేతులు కాళ్లు చేతులు ఆడిస్తూ ఆడుకుంటున్నాడు. ఇదేం చోద్యమో అనుకుంటూ బుగ్గలు నొక్కు కుంటున్నారు గోపకాంతలు.

"ఇదేమిటి! ఈ బండి తలకిందులుగా ఎలా పడింది. ఈ చిన్ని బాలుడు ఆ పనిఎలా చెయ్యగలడు. లేక ఇదేమన్నా రాక్షసుల పనా! లేక ఏ దుష్టగ్రహమన్నా బాలుడికి సోకిందా!" అని ఒకరితో ఒకరు అనుకుంటున్నారు.

అప్పటి దాకా అక్కడే ఆడుకుంటున్న గోపబాలురు "అమ్మా అమ్మా అదేమీ కాదు. మన చిన్ని కృష్ణుడు ఏడుస్తూ కోపంవచ్చి తన కాలితో ఈ బండిని ఒక్క తన్ను తన్నాడు. బండి విరిగి పోయింది. మేము చూచాము. ఒట్టు." అంటూ మూకుమ్మడిగా పలికారు.

యశోద వారి మాటలు నమ్మలేదు. "పోండిరా! వెధవల్లారా! నిండా మూడునెలలు లేవు. వీడు బండిని తన్నడమేంటి. అది తిరగబడటం ఏంటి. మీరుఅన్నీ అబద్దాలు చెబుతున్నారు." అని వారి మాటలను కొట్టిపారేసింది యశోద.

మొన్న పూతన వ్యవహారం జరిగింది. ఈ రోజు ఈ బండి పడటం. ఇదేదో గ్రహ పీడ అని అనుకొంది యశోద. ఏడుస్తున్న

చిన్నికృష్ణుని ఎత్తుకొని సముదాయించింది. పక్కకు తిరిగి బాలునికి పాలు కుడిపింది. వెంటనే బ్రాహ్మణులను పిలిపించి స్వస్తివాచకము లను చెప్పించి రక్ష కట్టించింది.

తరువాత పది మంది గోపకులు కలిసి ఆ బండిని తిరిగి మామూలుగా నిలబెట్టారు. తరువాత బ్రాహ్మణులు ఆ బండి దగ్గర హెూమం చేసారు. పెరుగుతోనూ, అటుకులతోనూ, దర్భలతోనూ, ఆ శకటమును పూజించారు. జలముతో ఆ శకటమునకు అభిషేకము చేసారు.

ఇంతలో నందుడు అక్కడకు వచ్చాడు. జరిగింది తెలుసుకున్నాడు. బాలకృష్ణుని ఎత్తుకున్నాడు. అసూయ, అసత్యము, ఈర్ష్య, హింస మొదలగు దోషములు లేని వారు, ఎల్లప్పుడూ సత్యమునే పలికెడు ఉత్తములైన బ్రాహ్మణుల ఆశీర్వాదము వృధాపోదు అని అనుకున్నాడు. అటువంటి ఉత్తములైన బ్రాహ్మణోత్తములను పిలిపించాడు. వేదపఠనం చేయించాడు. ఓషధులు కలిపిన జలంతో కుమారునికి అభిషేకం చేయించాడు. ఆయుష్షహెూమం చేయించాడు. ఆ రోజు బ్రాహ్మణులకు, గోకులంలో ఉండే వారికి అందరికీ విందుభోజనాలు పెట్టాడు. తరువాత ఆవులను అలంకరించి, ఆ ఆవులను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు. బ్రాహ్మణులు చిన్ని బాలుని, యశోదా నందులను ఆశీర్వదించారు.

ఓ పరీక్షిత్‌మహారాజా! నిత్యము వేదములను పఠిస్తూ, హెూమం చేస్తూ, పరమ పవిత్రజీవనాన్ని గడుపుతున్న ఆ బ్రాహ్మణుల ఆశీర్వాదం వృధాపోదుకదా!

ఆ సంఘటన జరిగిన తరువాత, ఒక రోజు యశోద చిన్ని కృష్ణుని ఒడిలో పడుకోబెట్టుకొని లాలిస్తూ ఉంది. ఉన్నట్టుండి కృష్ణుడు బరువు పెరగ సాగాడు. చిన్నికృష్ణుని బరువును మోయలేక కృష్ణుని కిందికి దించింది. నేల మీద పడుకోబెట్టింది. ఏడాది బిడ్డ ఏమిటి ఇంత బరువు ఉండటం ఏమిటి! యశోదకు ఏమీ అర్థం కాలేదు. ఇదేదో దైవమాయ అనుకొంది. వెంటనే చేతులు జోడించి శ్రీమన్నారాయణ మూర్తిని మనసులో స్మరించింది. వెంటనే బ్రాహ్మణులను పిలిపించి రక్ష కట్టించింది. చిన్ని కృష్ణుడు మామూలుగా ఆడుకుంటున్నాడు కదా అని యశోద తన పనులు చేసుకోడానికి ఇంటి లోపలకు వెళ్లింది.

(ఇప్పుడు కొంచెం వెనక్కు వెళదాం! కంసుడు అప్పుడే పుట్టిన పసి బిడ్డలను చంపడానికి, బ్రాహ్మణులను, సాధువులను హింసించడానికి, యజ్ఞములు పాడుచెయ్యడానికీ తన అనుచరులకు ఆదేశాలు ఇచ్చాడు. పసిబిడ్డలను చంపడానికి నియమించబడ్డ పూతన రాజ్యం అంతా తిరుగుతూ నందగోకులానికి వచ్చింది. కృష్ణుని చేతిలో మరణించింది. అందరూ వచ్చి తాము చేసిన ఘనకార్యాలు వివరించారు గానీ, పూతన మాత్రం తిరిగా రాలేదు. కంసుడు పూతన గురించి ఆరా తీసాడు. నందగోకులంలో పూతన ఒక పసిబాలుడికి స్తన్యం ఇస్తూ మరణించింది అని తన చారుల ద్వారా తెలుసుకున్నాడు. తనను చంపేవాడు నందగోకులంలో నందుని ఇంటిలో పెరుగుతున్నాడు అని నిర్ధారించుకున్నాడు. వెంటనే తృణావర్తుడు అనే రాక్షసుడిని నందుని కుమారుడిని చంపమని పంపించాడు. తృణావర్తుడు నందవ్రజమునకు చేరుకునే సమయంలో చిన్ని కృష్ణుడు అమ్మఒడిలో పడుకొని ఆడుకుంటున్నాడు. ఇంతలో

తృణావర్తుడు తనను చంపడానికి వస్తున్నాడు అని తెలుసుకున్నాడు కృష్ణుడు. అమ్మ ఒడిలో ఉంటే వాడిని చంపడం కష్టం. అందుకని మెల్లి మెల్లిగా బరువెక్కాడు. బాలుడు ఎందుకు బరువెక్కుతున్నాడో తెలియని యశోద చిన్ని కృష్ణుని నేల మీద పడుకోబెట్టింది. రక్షకట్టించింది. ఇంక ఏమీ భయం లేదని ఇంట్లో పనులు చేసుకోడానికి వెళ్లింది. చిన్నికృష్ణుడు తృణావర్తుని రాకకోసరం చేతులు కాళ్లు ఆడిస్తూ ఎదురుచూస్తున్నాడు.)

తృణావర్తుడు రానే వచ్చాడు. సుడి గాలి రూపంలో వచ్చాడు. చిన్ని కృష్ణుని చుట్టుముట్టాడు. అలాగే చిన్నికృష్ణుని ఎగరేసుకు పోయాడు. ఆ సుడి గాలి ధాటికి  గోపకులు తట్టుకోలేక పోయారు. పల్లె అంతా ధూళితో నిండి పోయింది.  ధూళి కళ్లలో పడి కళ్లు కనపడటం లేదు. ధూళి కళ్లలో పడకుండా కళ్లు చేతులతో మూసుకొని అటు ఇటు పరుగెడుతున్నారు. అంతా అల్లకల్లోలంగా ఉంది.

బయట పడుకోబెట్టిన కృష్ణుడికి ఏమయిందో అని యశోద పరుగు పరుగున వాకిట్లోకి వచ్చింది. ఇంతలో  సుడి గాలి ఉధృతం తగ్గింది.  అందరూ కళ్లు నులుముకుంటూ చూచారు. యశోదకు బయట పడుకోబెట్టిన పసిబిడ్డ కనపడలేదు. కళ్లలో దుమ్ము పడి కళ్లు కనపడకపోవడంతో కృష్ణుడికి ఏమయిందీ ఎవరూచెప్పలేకపోయారు. కళ్లెదుట దూడ చచ్చిపోతే ఆవు ఎలా కిందపడి గిలా గిలా కొట్టుకుంటుందో అలా యశోద కృష్ణుని కోసరం ఏడుస్తూ నేలమీదపడిపోయింది. హృదయ విదారకంగా ఏడుస్తూ ఉంది.

సుడి గాలి ఆగిపోగానే గోప కాంతలు గోపకులు అందరూ పరుగుపరుగున యశోద వద్దకు వచ్చారు. జరిగింది తెలుసుకొని యశోద తో పాటు అందరూ శోకించడం మొదలుపెట్టారు.

ఇది ఇలా ఉండగా సుడి గాలి రూపంలో కృష్ణుని ఎగరేసుకుపోయిన తృణావర్తుడు ఆ బాలుని చాలా ఎత్తుకు తీసుకొని వెళ్లాడు. అక్కడ చంపాలనుకున్నాడు. కానీ కృష్ణుడు అంతకంతకూ బరువెక్కుతున్నాడు. కొండంతబరువయ్యాడు. తృణావర్తుని వేగం తగ్గింది. అంత బరువును మోయలేకపోయాడు తృణావర్తుడు. అప్పుడు కృష్ణుడు తన రెండు చేతులతో తృణావర్తుని మెడను వాటేసుకున్నాడు. మెడను నలిపేస్తున్నాడు.

తృణావర్తునికి ఊపిరి ఆడటం లేదు. పైగా వల్లమాలిన బరువు. తట్టుకోలేక పోతున్నాడు తృణావర్తుడు. కళ్లు తేలవేస్తున్నాడు. గొంతులో గురగుర ధ్వనివస్తూ ఉంది. తుదకు కృష్ణుని చేతిలో ఊపిరి ఆడక మరణించాడు తృణావర్తుడు. బాలకృష్ణునితోసహా తృణావర్తుడు దభాలున నేల మీద ఉన్న పెద్ద బండమీద పడిపోయాడు. పెద్ద రాక్షసుడు నేల మీద పడటం చూచిన గోపకాంతలు, గోపకులు భయంతో వణికిపోయారు. బిగ్గరగా ఏడుస్తున్నారు. బండమీద పడ్డ తృణావర్తుని శరీరము ముక్కలు ముక్కలు అయింది.

తృణావర్తుని మెడకు వేలాడుతూ కేరింతలు కొడుతున్న కృష్ణుని చూచారు గోపకాంతలు. గబగబా కృష్ణుని తీసుకొని యశోదకు అప్పగించారు. యశోద కృష్ణుని అక్కున చేర్చుకుంది. ఆమెకు కన్నీళ్లు

ఆగడం లేదు. మృత్యుముఖం నుండి బయట పడ్డ చిన్ని కృష్ణుని చూచి ఆమె హృదయం ఆనందంతో నిండిపోయింది.

బతికి బయటపడ్డ కృష్ణుని చూచి గోకులంలో వారంతా ఆశ్చర్యపోతున్నారు. “దుర్మార్గుడు కాబట్టి ఆ రాక్షసుడు నశించాడు. చిన్నికృష్ణుడు ఏ పాపము తెలియని వాడు కాబట్టి బతికి బయట పడ్డాడు” అని అనుకొన్నారు.

ఇంతలో నందుడు అక్కడకు వచ్చాడు. ఈ అద్భుతాన్ని చూచాడు.

మ॥గతజన్మంబుల నేమి నోచితిమొ యాగశ్రేణు లే మేమి సే
సితిమో! యెవ్వరి కేమి పెట్టితిమొ యే చింతారతిం బ్రొద్దు పు
చ్చితిమో! సత్యము లేమి పల్కితిమో! యే సిద్ధప్రదేశంబు ద్రొ
క్కితిమో! యిప్పుడు సూడగంటి మిచటం కృష్ణార్భకున్ నిర్భయున్.॥

పూర్వ జన్మలో ఏనోములునోచామో! ఏ యజ్ఞయాగాలు చేసామో! ఎన్ని దానధర్మాలు చేసామో! ఎన్ని పుణ్యకథలను విన్నామో! ఎన్ని నిజాలు పలికామో! ఎన్ని పుణ్యక్షేత్రాలు సేవించామో! ఆ పుణ్యఫలం చేతనే ఈ నాడు నా చిన్ని కృష్ణుడు నిర్భయంగా ఆడుకోవడం చూడగలిగాము. నేను బ్రాహ్మణులకు చేసిన దానములు, పూజలు ఫలించాయి. బాలుడు బతికాడు. వసుదేవుడు పలికిన పలుకులు నిజం అవుతున్నాయి. చిన్నికృష్ణుని జాగ్రత్తగా చూసుకోవాలి” అని అనుకున్నాడు నందుడు.

యశోద మాత్రం తన బిడ్డ తనకు క్షేమంగా దక్కాడని మురిసిపోయింది. బ్రాహ్మణులకు దానాలు, ధర్మాలు చేయడం, బాలుడికి  రక్షకట్టించడంలో మునిగిపోయింది.ఆ రోజు అలా గడిచిపోయింది. గోకులంలో ఉన్న ప్రజలు అంతామరిచిపోయి ఆనందంగా ఉన్నారు.

ఒక రోజు యశోద చిన్ని కృష్ణుని ఒడిలో పడుకోబెట్టుకొని పాలు ఇస్తూ ఉంది. చిన్ని కృష్ణుడు పాలు తాగడం పూర్తి చేసి ఆడుకుంటున్నాడు. చిరునవ్వులు చిందిస్తున్న చిన్నికృష్ణుని చూచి మురిసిపోయిన యశోద బాలుడి నుదురు ముద్దుపెట్టుకుంది. బాలుడితో ముద్దు ముద్దు మాటలు చెబుతూ ఆడుకుంటూ ఉంది. వాడి బాల్యచేష్టలకు మురిసిపోతూ ఉంది.

ఇంతలో కృష్ణుడికి నిద్రవచ్చినట్టుంది. నోరు పెద్దగా తెరిచి ఆవలించాడు. చిన్ని కృష్ణుడి ముంగురులు సవరిస్తూ కృష్ణుని ముఖాన్నే చూస్తున్న యశోదకు బాలకృష్ణుని నోట్లో ఆకాశము, నక్షత్రాలు, గ్రహాలు, స్వర్గము, జ్యోతిశ్చక్రము, భూమి, దిక్కులు, సూర్య చంద్రులు, అగ్ని, వాయువు, సముద్రములు, పర్వతములు, నదులు, అరణ్యములు, మనుషులు, జంతువులు, పక్షులు, జలచరములు  సమస్త విశ్వము కనిపించింది.

ఈ అద్భుతమును చూచినయశోద శరీరం జలదరించింది. భయంతో కళ్లుమూసుకుంది. గజగజవణుకుతూ ఉంది. నెమ్మదిగా కళ్లు తెరిచింది. చిన్ని కృష్ణుడు చిరునవ్వులు చిందిస్తూ తన ఒడిలో

నిద్రపోతున్నాడు. అమ్మయ్య ఇదంతా భ్రమ అన్నమాట అని అనుకుంది యశోద." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణుడు బండిని తన్నడం, తృణావర్తుని చంపడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఎనిమిదవ అధ్యాయము.

ఓ పరీక్షిత్ మహారాజా! వసుదేవుడు రహస్యంగా గర్గుడు అనే పురోహితుడిని పిలిచి నంద గోకులమునకు వెళ్లి నందుని కుమారుడికి జాతక కర్మలు నిర్వర్తించమని పంపించాడు. వసుదేవుడు పంపగా గర్గుడు నందగోకులము వచ్చాడు. నందుని ఇంటికి వెళ్లాడు.

గర్గుని చూచిన నందుడు పరమానంద భరితుడు అయ్యాడు. చేతులెత్తి నమస్కారం పెట్టాడు. అతిథి సత్కారములను చేసాడు. మంచి ఆసనము మీద కూర్చుండబెట్టి ఇలా అన్నాడు. "బ్రాహ్మణోత్తమా! తమరు మహానుభావులు. తమరు  మా ఇంటికి రావడమే మహద్భాగ్యముగా భావిస్తున్నాను. తమరు మా వంటి వారిని ఉద్ధరించడానికే మాబోంట్ల ఇళ్లకు వస్తుంటారు.  తమరికి నేను ఏమి సేవచేయగలను.  జ్యోతిశ్శాస్త్రమును తమరు రచించారనీ,

జ్యోతిశ్శాస్త్రములో తమరు నిష్ణాతులు అనీ విన్నాను. మానవులు ఈ జ్యోతిశ్శాస్త్రమును అనుసరించి, తమ భవిష్యత్తును తెలుసుకుంటూ ఉంటారు. తమరు సద్బ్రాహ్మణులు. ఈలోకమునకే గురువులు. మా ఇంటిలో ఒక చిన్ని బాలుడు జన్మించాడు. మా వసుదేవుని భార్య రోహిణికి కూడా ఒక బాలుడు జన్మించాడు. తమరు వారిరువురికి నామకరణం మొదలగు సంస్కారములు చేసి నన్ను కృతార్థుడిని చెయ్యండి." అని ప్రార్థించాడు.

(ఈ సందర్భంలో పోతనగారు ఒక చిన్ని పద్యం రాసారు. అందులో ఉన్న మొదటి రెండు పదాలు "ఊరకరారు మహాత్ములు" ఈ నాటికీ తెలుగువారి నాలుకల మీద నాట్యమాడుతున్నాయి.)

కం॥ఊరకరారు మహాత్ములు వారధములయిండ్లకడకు వచ్చుటలెల్లన్
గారణము మంగళములకు నీ రాక శుభంబు మాకునిజము మహాత్మా.

నందుని మాటలు విన్న గర్గుడు ఇలా అన్నాడు. "నందా! నేను యదువంశమునకు పురోహితుడను. నీ వన్నమాటలు నిజమే. నాకు జ్యోతిశ్శాస్త్రములో మంచి ప్రవేశం ఉంది. వసుదేవుని కుమారుడు రోహిణి వద్ద పెరుగుతున్నాడు. ఆ శిశువుకు జాతక కర్మలు చేయడంలో ఇబ్బంది లేదు. కాని నీ కుమారునికి జాతక కర్మ చేయడంలోనే ఒక చిక్కు ఉంది.

వసుదేవుని కుమారుడికి నీ కుమారుడికీ ఒకే సారి జాతకకర్మలు చేస్తే నీ కుమారుని కూడా వసుదేవుని అష్టమ గర్భంలో పుట్టిన కుమారుడు అనుకొని కంసుడు నీ కుమారునికి ఆపద తలపెట్టే

ప్రమాదం ఉంది. ఎందుకంటే, వసుదేవుని భార్య దేవకికి అష్టమ గర్భంలో ఆడపిల్ల పుట్టింది కదా! ఆమె శక్తి స్వరూపిణిగా మారి "నిన్ను చంపేవాడు వేరేచోట పెరుగుతున్నాడు" అని చెప్పి అంతర్థానం అయింది. అప్పటి నుండి కంసుడు ఆ బాలుని కొరకు వెదికిస్తున్నాడు. చంపడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. వసుదేవునికి దగ్గర స్నేహితులు ఎవరో ఆరాతీసాడు. పైగా అక్కడ ఆడపిల్ల పుట్టిన సమయంలోనే నీ ఇంట్లో మగపిల్లవాడు పుట్టాడు. ఆ కారణం చేత వసుదేవుని కుమారుడు నీ ఇంట్లో పెరుగుతున్నాడు అని కంసునికి అనుమానము రావచ్చు. యాదవుల పురోహితుడనైన నేను ఈ బాలురకు నామకరణం చేసినట్టు కంసునికి తెలిస్తే, అతని అనుమానము బలపడుతుంది. కంసుడు పరమ దుర్మార్గుడు. ఈ ఇద్దరి బాలురకు తీరని అపకారము తలపెడతాడు. ఈ ఆపద దాటే మార్గం ఎలాగా అని ఆలోచిస్తున్నాను." అని అన్నాడు భర్గుడు.

ఆమాటలకునందుడు ఇలా అన్నాడు. "మహాత్మా! కంసుని వలన నాకు నా కుమారునికి అపకారము జరుగుతుంది అని తమరు తలిస్తే, ఈ నామకరణము రహస్యంగా జరిపించండి. నేను ఎవ్వరినీ పిలువను. నేను నా భార్య యశోద, వసుదేవుని భార్య రోహిణి, తమరు అంతే. మరోకంటికి తెలియకుండా జరిపించండి. అప్పుడు కంసునికి తెలిసే అవకాశం లేదు కదా!" అని అన్నాడు నందుడు.

అసలు గర్గునికి ఈ ప్రకారంగా రహస్యంగా నామకరణం చెయ్యాలని కోరిక. వసుదేవుడు కూడా ఆ మాటే చెప్పి పంపించాడు. కాని నందుడు యాదవుడు. ఆర్భాటం చేస్తాడు. నందుడు ఎటువంటి

ఆర్భాటం చెయ్యకుండా అతని నోటినుండే నేర్పుగా రహస్యంగా నామకరణం చేయించమని చెప్పించాడు గర్గుడు.

నామకరణమునకు రహస్యంగా ఏర్పాట్లు జరిగాయి. నందుడు, యశోద, రోహిణి, గర్గుడు. ఇద్దరు బాలురు. వీరు తప్ప వేరెవరూ లేకుండా జాగ్రత్త పడ్డారు. గర్గుడు ఇరువురు బాలురకు నామకరణంచేసాడు.

"ఈరోహిణీ పుత్రుడు తన గుణగణములచేత అందరికీ ఆనందం కలిగిస్తాడు కాబట్టి ఇతనికి రాముడు అని నామకరణం చేస్తున్నాను. శారీరకంగా ఇతడు బలంగా ఉన్నాడు కాబట్టి బలరాముడు అని కూడా పిలుస్తారు. ఇక నీ కుమారుడు కారణ జన్ముడు. ఈ బాలుడు కృష్ణవర్ణముతో పుట్టాడు కాబట్టి కృష్ణుడు అని పిలువబడతాడు. ఇంకా ఈ బాలుడు చేసే పనులను బట్టి వివిధములైన పేర్లతో పిలుస్తారు. ఈ బాలుడు మీ గోకులములో ఉండే గోవులకు, గోపకులకు, గోపకాంతలకు, అందరికీ ఆనందాన్ని కలుగజేస్తాడు. ఈ బాలుని మహిమతో మీకు అన్ని కష్టములు తొలగిపోతాయి. పూర్వము దేవాసుర యుద్ధములో అసురులు దేవతలను ఓడించారు. అప్పుడు శ్రీహరి వారిని రక్షించాడు. కాబట్టి శ్రీహరిని నమ్ముకున్న వారికి ఎటువంటి ఆపదలు రావు. ఇప్పుడు కూడా మీరు శ్రీహరిని నమ్ముకుంటే ఆ కంసుని వలన మీకు ఎటువంటి ఆపదలు రావు. ఈ బాలుడు గుణములలోనూ, ప్రభావములోనూ, సాక్షాత్తు శ్రీహరితో సమానమైన వాడు. మీరు ఈ బాలుని రక్షించండి. మిమ్ములను ఈ బాలుడు రక్షిస్తాడు." అని గర్గుడు నందుడికి చెప్పాడు. తరువాత గర్గుడు వెళ్లిపోయాడు.

అప్పటికి కృష్ణుడు, బలరాముడు. రెండు చేతులతోనూ, మోకాళ్ల మీద పాకుతున్నారు. ఇల్లంతా కలియ తిరుగుతున్నారు. గోపకులకు, గోపకాంతలకు ఆనందాన్ని కలుగజేస్తున్నారు. వర్షముతో నేలంతా తడిగా ఉంటే ఆ బురదలోనే అటు ఇటు పాకుతున్నారు. ఎవరైనా దారిన పోతుంటే వారి వెంట కొంతదూరం పాక్కుంటూ పోయి, వారు వెనక్కు తిరిగి చూడగానే, వెంటనే భయపడినట్టు వెనక్కు తిరిగి గబగబా తల్లివద్దకు పాక్కుంటూ వస్తున్నారు. ఆ విధంగా బురదలో తిరిగిన రాముడిని, కృష్ణుడిని యశోద ఎత్తుకొని గుండెలకు హత్తుకొని, వారికి తనపాలు తాగించేది. కృష్ణుడు పాలు తాగుతూ, ముందు వచ్చిన రెండు పళ్లతో నవ్వుతుంటే, కృష్ణుని అందమైన ముఖం చూచి యశోద మురిసిపోయేది.

ఆ ప్రకారంగా పెరుగుతున్న బలరామ కృష్ణులు నడవడం మొదలుపెట్టారు. బుడి బుడి నడకలతో పల్లెలో వీధులన్నీ తిరిగేస్తున్నారు. వీధిలో ఆవు దూడలు చెంగు చెంగున ఎగురుతుంటే వాటి తోకలుపట్టుకొని లాగుతున్నారు. అవి వెనక్కు తిరిగి అంబా అని అరిస్తే, అమ్మో అని భయపడి బుడిబుడినడకలతో వెనక్కు పరుగెడుతున్నారు. వీళ్ల ఆటలు చూచి వ్రజములో ఉన్న స్త్రీలు నవ్వుకుంటూ మురిసిపోతున్నారు.

కుమారుల ఆకలిని గ్రహించి యశోద, రోహిణి కృష్ణుడికి, బలరామునికి తమ పాలు పడుతుంటారు. తల్లుల వద్ద పాలు తాగుతూ కేరింతలు కొట్టే బలరామ కృష్ణుల అందమైన ముఖాలు చూస్తూ యశోద, రోహిణి ఆనందంతో పరవశులవుతున్నారు.

నంద గోకులంలో పరమాత్మ ఈ విధంగా ఆడుకుంటూ ఉంటే స్వర్గంలో అప్సరసలు ఆనందంతో నాట్యం చేస్తున్నారు. రామకృష్ణులు మోకాళ్లమీద జోగాడుతూ తలలు ఎత్తి చూస్తుంటే ఆదిశేషుడు తలెత్తి చూచినట్టు ఉంది. వారి తేజస్సు సూర్యచంద్రులవలె దినదిన ప్రవర్ధమానమవుతూ ఉంది. తల్లి ఒడిలో పడుకొని పాలుతాగుతూ కళ్లు మూసుకొని చిరునవ్వు నవ్వుతున్నప్పుడు ఆధ్యాత్మికానందంలో మునిగితేలుతున్న యోగుల లాగా కనిపిస్తారు.

ఆచిన్ని బాలురను చూచి గోకులం అంతా తన్మయత్వంతో పరవశమౌతోంది. చిన్ని కృష్ణుడు చిట్టిపొట్టి మాటలతో అమ్మా అమ్మా అత్తా అంటూ పిలుస్తుంటే యశోద ఆనందసాగరంలో తేలియాడుతూ ఉంది.

జనన మరణములు ఎరుగని శ్రీమన్నారాయణుడు యశోదకు కొడుకుగా పుట్టి మాటలు నేర్చుకుంటున్నాడు. సహస్రపాదుడు అనగా లెక్కలేనన్ని పాదములు కలవాడు, కేవలం రెండు పాదములతో మూడులోకములను ఆక్రమించిన శ్రీహరి, మానవుడుగా పుట్టి తప్పటడుగులు వేస్తున్నాడు. ఒళ్లంతా మట్టిపూసుకొని ఆడుకుంటున్న కృష్ణుడు, ఒంటినిండా విభూతి పూసుకొన్న పరమశివుడులా భాసిల్లుతున్నాడు.

ముఖాన జీరాడే ముంగురులను పైకెత్తి కట్టి ముత్యాల పేరుతో ముడివేసేది యశోద. అప్పుడు బాలకృష్ణుడు చంద్రవంక శిరస్సున ధరించిన శంకరునిలా కనిపించేవాడు. నుదుట పెట్టిన పొడుగాటి ఎర్రని బొట్టు శివుని మూడవకన్నులాగా మెరిసిపోయేది. కృష్ణుని

మెడలో వేసిన నీలమణి, గరళమును మింగిన శివుని మెడలో ఉన్న నల్లని మచ్చలాగా కనిపించేది. యశోదమ్మ చిన్నికృష్ణుని మెడలో వేసిన ముత్యాలహారాలు శివుని మెడలో ఉన్న సర్పముల మాదిరి వేలాడుతుండేవి. ఆ ప్రకారంగా తానూ,శివుడూ ఒకటేనని, శివకేశవులకు భేదము లేదని లోకానికి చాటిచెబుతున్నట్టు ఉండేది చిన్ని కృష్ణుని రూపము.

నందుడు ఆ ఊరికి పెద్ద. నందుని కుమారుడు చిన్నికృష్ణుడు. అందుకని ఊరిలో ఉన్న వారంతా నందుని ఇంట్లో చేరి బాలకృష్ణునితో ఆడుకొనేవారు. ఇంట్లో ఏపనీ చేసేవారు కాదు. ఆ ప్రకారంగా బలరామ కృష్ణులు నందుని ఇంట పెరుగుతున్నారు.

బాలకృష్ణుడు ఊరికే కేరింతలుకొడుతుంటే "ఒరేయ్ అరవకు. నోరుమూసుకొని ఉండు" అని యశోద అరిస్తే, రెండు చేతులతో గబుక్కున నోరుమూసుకొనే వాడు. మరలా యశోద "మానాన్న రావే. నా కన్నరావే" అని పిలిస్తే పరుగు పరుగున వెళ్లి అమ్మ ఒడిలో వాలిపోయేవాడు. తనతోటిబాలురను వెంటేసుకొని అందరి ఇళ్లలో దూరేవాడు. వాళ్ల ఇంట్లో కుండలలో ఉన్న వెన్న తినేవాడు. ఏమీఎరగనట్టు వచ్చి "అమ్మా ఆకలవుతూ ఉంది.బువ్వపెట్టవా" అని అమాయకంగా అడిగేవాడు.

తోటి గోపబాలురతో రకరకాల ఆటలు ఆడేవాడు. "ఒరేయ్ మీరంతా ఆవులు. నేను ఆంబోతును" అని రంకెలు వేస్తూ పరుగెత్తేవాడు. తనుఒక రాయిమీదకూర్చుని మిగిలినవారిని

కిందకూచోబెట్టి రాజు, ప్రజలు ఆట ఆడుకొనేవారు. తాను దొంగ అనీ, మీరంతా నన్ను పట్టుకోండి అనీ దాక్కొనేవాడు. దాగుడుమూతలు, ఉయ్యాల ఆటలు, బంతాలాటలు, దొంగాటలు ఇలా ఎన్నెన్నో ఆటలు ఆడుతూ కృష్ణుడుతన బాల్య చేష్టలతో గోకులంలో ఉండే వారికి నయనానందం కలిగిస్తున్నాడు.

కృష్ణుని అల్లరి మితిమీరి పోయింది. అది గోపకాంతలు సహించలేకపోయారు. వారి ఓర్పు నశించింది.  ఒక రోజు యశోద వద్దకు వచ్చి కృష్ణుని అల్లరిపనులను గురించి ఇలా చెప్పారు.

"అమ్మా! యశోదమ్మా! నీ కుమారుని అల్లరి భరించలేక పోతున్నామమ్మా! మా పసిబిడ్డలకు అసలే పాలు చాలవని మేము అల్లాడుతుంటే, నీ కొడుకు వచ్చి దూడలను విప్పి, పాలంతా దూడలచేత తాగిస్తున్నాడు. ఇంక ఆవులు పాలు ఏమిస్తాయి చెప్పు. అని ఒకామె చెప్పింది.

మరొకామె "ఏవమ్మో యశోదమ్మా! నీ కొడుకు మా కళ్లముందు పుట్టాడు. అప్పుడే దొంగతనాలు మరిగాడమ్మా! ఎత్తుగా ఉట్టి మీద ఉన్న వెన్నకుండలు అందుకోవాలని రోళ్లు, పీటలు,బుట్టలు వేసుకొని ఎక్కుతున్నాడమ్మా! మేము ఇంకా ఎత్తుగా పెడితే, కిందనుండి రాయి తీసుకొని కుండలను కొట్టి పాలు కారుతుంటే తాగేస్తున్నాడమ్మా! అదేంటమ్మా ఇలాంటి కొడుకును కన్నావు!" అని మరొకామె అడిగింది.

"ఏవమ్మోయి! వెన్న, పెరుగు తింటే తిన్నాడు. పోతూ పోతూ ఆ వెన్నచేతిని నా కోడలి మూతికి రుద్దిపోయాడు. విషయం తెలియక, నా

కోడలు వెన్న దొంగతనంగా తిన్నాదని,నా కోడలిని చితకబాదాను. నిజం తెలుసుకొని బాధపడ్డాను. నీ కొడుకు అల్లరితో మా ఇళ్లలో మాలో మాకు తగవులు వస్తున్నాయమ్మా" అంటూ మరొకామె చెప్పింది.

"అదీకాకుండా, పక్క వాళ్ల ఇంట్లో పాలు పెరుగు తిని, ఆ కుండలను మా ఇంటి పెరట్లో పారేసాడు. వాళ్ల పాలు పెరుగు మేము దొంగిలించామని మా పక్కింటి వాళ్లు మాతో తగవుకు వచ్చారు. మాలో మాకు పెద్ద కొట్లాట అయింది.  ఈ ప్రకారంగా మాలో మాకు కొట్లాటలు పెడుతున్నాడమ్మా నీ సుపుత్రుడు" అని మరొకామె మూతి మూడు వంకరలు తిప్పుతూ మాట్లాడింది.

"ఏవమ్మోయి!నీ కొడుకు దేవుళ్లను కూడా తిడుతున్నాడమ్మా. మా ఇంట్లో ఉన్న దేవుడి బొమ్మల దగ్గరకు పోయి వీళ్లేం దేవుళ్లు. నేనే దేవుడిని. మీ నివేదనలు నాకే పెట్టండి అని పీట వేసుకొని నట్టింట్లో కూర్చున్నాడమ్మా. ఏం చెప్పమంటావు" అని చెబుతుంటే యశోద తన కొడుకు చిలిపి చేష్టలకు పకా పకా నవ్వింది.

యశోద అలా నవ్వుతుంటే మరొకామె ముందుకు వచ్చి "నవ్వింది చాలుగానీ, నేను చెప్పేది కూడా వినవమ్మా యశోదమ్మా! మా ఇంట్లో పెళ్లిగాని ఆడపిల్ల ఉంది కదా! మీవాడు దొంగతనంగా వెన్న తింటుంటే చూచి మా ఆడపిల్ల అడ్డం పోయింది. అవ్వ. చెప్పుకుంటే సిగ్గుచేటు. మీ వాడు మా అమ్మాయి పమిట లాగి, గుండెల మీద గిచ్చి పారిపోయాడమ్మా. చిన్నపిల్లవాడు చేసే పనులేనా ఇవి." అని తూలనాడింది మరొకామె.

"అదేం చెప్పావు వదినా! నిన్న మా అమ్మాయి వాకిట్లో నిలబడి కృష్ణుడు అటుగా వెళుతుంటే సరదాగా "నీ పేరేంట్రా!"అని అడిగింది. "నీకెందుకే" అంటూ నాకూతురి బుగ్గకొరికి పారిపోయాడు. ఇదమ్మా నీ కొడుకు అల్లరి." అంటూ మరొకామె వాపోయింది.

"అంతేనా! నిన్న నా కూతురు పెరట్లో స్నానం చేస్తుంటే, ఆమె బట్టలు తీసుకొని పారిపోయాడు. నా కూతురు సిగ్గుతో చచ్చిపోయిందనుకో. చిన్న పిల్లవాడి పనులు ఇవేనటమ్మా!" అని దెప్పిపొడిచింది మరొకామె.

"అదేంచూసావు.నిన్న నా కూతురితో "నాతో వస్తావా. లేచిపోదాము" అని అన్నాడట అని మరొకామె చెప్పింది.

"ఒకామెకు పెళ్లిఅయి ఇంకా పిల్లలు పుట్టకపోతే, నన్ను పెళ్లిచేసుకోనీకు పిల్లలు పుడతారు" అన్నాడట. ఇవి పసిపిల్లవాడు మాట్లాడాల్సిన మాటలేనా ఇవి." అని మరొకామె నిలదీసింది.

"ఏవమ్మోయి! నిన్న నా కొడుకు నిద్రపోతుంటే, నీ కొడుకు వచ్చి ఆటలాడుకోడానికి రాలేదని, నా కొడుకు జుట్టును, లేగదూడ తోకకు ముడిపెట్టాడట. ఆ లేగదూడ మా వాడిని వీధుల్లో ఈడ్చుకొని వెళ్లింది. ఏం చెప్పనమ్మా నీ కొడుకు ఆగడాలు." అని చెప్పింది మరొక ఇల్లాలు.

"అదేం చూసావు. నా కొడుకు వెన్న తింటుంటే, మీ వాడు నా కొడుకు నోటినిండా వెన్న కుక్కాడట. వాడికి ఊపిరి ఆడలేదు. ఏమన్నా జరిగితే నీదే బాధ్యత." అందిమరొక గొల్లవనిత.

"నిన్న మా ఆడపడుచు నిద్రపోతుంటే నీ కొడుకు ఒక తేలును తెచ్చి ఆమె మీద వేసాడట. ఆ తేలు ఆమెను కసిదీరా కుట్టింది. ఆమె లబోదిబోమంటూ వైద్యుడి దగ్గరకు పరుగెట్టింది. ఇవేనమ్మా పసిపిల్లవాడి చేష్టలు. కాస్తఅదుపులో పెట్టుకో నీకొడుకును." అంది మరొకామె.

"అమ్మా యశోదమ్మ తల్లీ! నీ కొడుకు ఆగడాలు భరించలేక, మేము మా ఇళ్లకు తాళాలు వేసుకొని వీధులో కూర్చున్నాము. అయినా ఊరుకున్నాడా. వేసిన తాళాలు వేసినట్టే ఉన్నాయి. ప్రతి ఇంట్లో నీ కొడుకు ప్రత్యక్షం అయ్యాడు. పట్టుకోబోతే పారి పోయాడు. అన్ని ఇళ్లలో ఉన్న వెన్న, పాలు, పెరుగు మాయం అయ్యాయి.  ఏమిటమ్మా ఈ చోద్యం. నీకొడుక్కు ఈ వయసులోనే మాయలు మంత్రాలు కూడా నేర్పించావా!

ఏవమ్మోయి! మీరు ఊరికి పెద్ద కావచ్చు. మీకు సంపదలు ఉ ంటే ఉండవచ్చు. అలాఅని చెప్పి నీ కొడుకును ఊరిమీదికి వదిలితే ఊరుకొనేది లేదు. ఆ!!!

"ఓయమ్మ నీ కుమారుడు మా యిండ్లను బాలుపెరుగు మననీడమ్మా!
పోయెదమెక్కడికైనను మా అన్నల సురభులాన మంజులవాణీ!

"ఏవమ్మోయి యశోదమ్మా!నీ కుమారుడు మా ఇంట్లో పాలు పెరుగు బతకనియ్యడం లేదమ్మా! మా అన్నయ్య నందుడు, మా గోవులమీద ఒట్టేసి చెబుతున్నాము. నీ కొడుకు ప్రవర్తన ఇలాగే ఉంటే,

మేము ఈ గోకులము విడిచిపెట్టి పోవాలిసిందే. మాకు వేరే దారి లేదు." అని గోపకాంతలు యశోదతో మొరపెట్టుకున్నారు.

అప్పుడుయశోద వారితో ఇలా అంది. "అదేంటమ్మా అలా అంటారు. నా కొడుకు నా ఇల్లు తప్ప మరొకరి ఇంటి గడప తొక్కడు. అసలు మా చిన్ని కృష్ణుడికి పక్క ఇల్లు ఎలా ఉంటుందో కూడా తెలియదు. నా కొడుకు ఇంకా కళ్లు తెరవని పసిగుడ్డు. అమాయకుడైన నా చిన్నికృష్ణుని ఇలా అల్లరి పెట్టడం ఏమన్నా బాగుందా చెప్పండి." అని నిష్టూరంగా మాట్లాడింది యశోద.

ఈమెతో ఏమి చెప్పినా లాభం లేదని, విసుక్కుంటూ వెళ్లిపోయారు గోపకాంతలు. గోకులంలో ఉన్న గోపకాంతలు అందరూవచ్చి తన కుమారుని అల్లరి గురించి ఏకరువు పెట్టినప్పుడు, వారిని సముదాయించడానికి ఏదో వారితో అలా అన్నదే కానీ, యశోదకు తన కుమారుని మీద అనుమానంగానే ఉంది. చిన్నికృష్ణుని వంక కోపంతో చూచింది. కృష్ణుడు మాత్రము ఏమీ ఎరగని వాడివలె, అమాయకంగా మొహం పెట్టాడు. చిరునవ్వు నవ్వాడు. గబగబా వెళ్లి తల్లి ఒడిలో పడుకొని, అమ్మ ఒడిలో మొహం దాచుకున్నాడు. యశోద కోపమంతా చప్పగా చల్లారిపోయింది. ఇంకేం చేస్తుంది యశోద. కొడుకు తల నిమురుతూ "అలా చేయకూడదు కన్నా! తప్పు కదూ!"అంటూ అనునయించింది.

ఒక రోజు బలరాముడు, ఇంకా గోప బాలురు యశోద వద్దకు వచ్చి "అమ్మాఅమ్మా కృష్ణుడు మట్టితింటున్నాడు" అని చెప్పాడు. యశోద గబగబా బాలకృష్ణుని వద్దకు వెళ్లింది. కృష్ణుని చేతులు గట్టిగా

పట్టుకుంది.

"ఎందుకు మట్టి తింటున్నావు"అని గద్దించి అడిగింది.

"నేను మట్టి తినలేదు" అన్నట్టు తల అడ్డంగాఊపాడు చిన్నికృష్ణుడు.

"నీ అన్న బలరాముడు, నీ స్నేహితులు చెబుతున్నారు కదా నువ్వు మట్టితిన్నావని. ఎందుకు తిన్నావు" అని మరలా అడిగింది యశోద.

అప్పుడు కృష్ణుని జవాబు పోతన గారు మనోహరంగా చెప్పారు.

శా॥అమ్మా మన్నుదినంగ నే శిశువునో? యాకొంటినో? వెఱ్ఱినో?
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్నన్నీవు కొట్టంగవీ
రిమ్మార్గమ్ముఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే.

అమ్మా! మట్టి తినడానికి నేనేమన్నా పారాడే పసివాడినా! వెర్రివాడినా! లేక ఆకలితో ఉన్నానా! ఇప్పుడేగా కడుపు నిండా పాలుతాగి వెళ్లాను. ఇంకా మట్టి ఎందుకు తింటాను. అమ్మా వీళ్ల మాటలు నమ్మకు. వీళ్లంతా నన్ను ఎలాగైనా నీ చేత కొట్టించాలని చూస్తున్నారు. అందుకే నా మీద చాడీలు చెబుతున్నారు. కావాలంటూ నా నోరు తెరుస్తాను. నానోరు వాసన చూడు.మట్టి వాసన వస్తుందేమో! నీ నోరు

మట్టి వాసన వస్తే నీ ఇష్టం వచ్చినట్టు కొట్టు." అని అన్నాడు కృష్ణుడు.

ఇదేదో బాగానే ఉందనిపించింది యశోదకు.

"సరే అలాగేనోరుతెరువు" అంది యశోద.

కృష్ణుడు నోరుతెరిచాడు.

యశోదకు కృష్ణుడి నోటిలో మట్టి కనపడలేదు.

అనంత విశ్వం కనపడింది.

కం॥ఆ లలితాంగి కనుంగొనె బాలుని ముఖమందు జలధిపర్వతవనభూ
గోళ విఖీతరణి శశిదిక్పాలకాదికరండమైన బ్రహ్మాండంబున్॥

చరాచర జగత్తు కృష్ణుని నోట్లో గోచరించింది. ఆకాశం, దిక్కులు, సముద్రములు, వాటి మధ్యద్వీపములు, భూమి, పర్వతములు, అడవులు, వీచే గాలి, కురిసే వర్షము, మండే అగ్ని, వెలిగే సూర్యుడు, చంద్రుడు, పారే జలములు, మిలమిలమెరిసే నక్షత్రములు, విశ్వం అంతా నిండిన తేజస్సు, పంచభూతములు, మనుష్యులు, వారి ఇంద్రియములు, తన్మాత్రలు, మనో,బుద్ధి,అహంకారములు, సత్వ,రజస్తమోగుణములు, వాటి అహంకారములు, మానవులు చేసే సమస్తకర్మలు, ఒకటేమిటి ఈ అనంత విశ్వం అంతా కృష్ణుని నోటిలో ప్రత్యక్షం అయింది. మరొక అద్భుతంఏమిటంటే నంద గోకులంలో తన ఇంటి ముందు, కృష్ణుడి నోట్లోకి చూస్తున్న యశోద కూడా ఆమెకు కనపడింది. యశోద ఆశ్చర్యపోయింది. వివశురాలయింది.

మ॥కలయో! వైష్ణవమాయయో! యితర సంకల్పార్థమో! సత్యమో!
తలపన్ నేరక యున్నదాననో! యశోదాదేవి గానో! పర
స్థలమో! బాలకుడెంత! యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుటకేమి హేతువొ! మహాశ్చర్యంబు చింతింపగన్॥

ఆ॥బాలమాత్రుడైనబాలునిముఖమందు విశ్వమెల్ల నెట్లు వెలసియుండు
బాలుభంగి నితడు భాసిల్లుగాని సర్వాత్ముడాదివిష్ణుడగుట నిజము॥

ఆ॥ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు గానబడిన బుద్ధి కంపమయ్యె
నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు నార్తులెల్ల బాయ నాశ్రయింతు.॥

"ఇది కలా! నిజమా! లేక నా మతిభ్రమణమా! నేనేమన్నా కలగంటున్నానా! లేక ఏదైనా మాయ నన్ను ఆవహించిందా! లేక వేరే ఏమన్నా భ్రాంతి నన్ను ఆవహించిందా! ఇది నిజమేనా! ఏమీ అర్థం కావడం లేదు. అంతా మాయగా ఉంది. అసలు నేను యశోదనేనా! ఇది మా ఇల్లేనా! లేకపోతే ఈ చిన్ని బాలుడెంత! వీడి నోటిలో ఈ బ్రహ్మాండము కనపడటం ఏమిటి? దీనికి కారణం ఏమై ఉంటుంది? ఆలోచించేకొద్దీ మహదాశ్చర్యంకలుగుతూ ఉంది.

ఓ దేవుడా! నన్ను రక్షించు. ఓ దేవా! నీవు తర్కమునకు అందవు. ఈ సకల జగత్తుకు నీవే ఆశ్రయము. నీ వలననే ఈ జగత్తు పుట్టి, పెరిగి, నీలో లయం అవుతూ ఉంది. అట్టి నీ పాదములకు నమస్కరిస్తున్నాను. నా కేమీ అర్థం కావడం లేదు. నీవే నన్ను రక్షించాలి." అని ఆ శ్రీహరిని మనసులో ప్రార్థించింది యశోద.

( చిన్ని కృష్ణుడి నోటిలో అనంత విశ్వాన్నిసందర్శించినపుడు యశోద మనసులో మెదిలే భావాలను పోతన గారు పైపద్యంలో మనసుకు హత్తుకునేటట్టు వర్ణించారు. "ఊరకరారు మహాత్ములు" అనే పదాల మాదిరి, ఈ పద్యంలోని మొదటి రెండు పదాలు "కలయో, వైష్ణవ మాయయో" కూడా తెలుగువారికి వాడుకపదాలుగా మారి పోయాయి. )

ఇంతలో కృష్ణుడు చటుక్కున నోరుమూసాడు. యశోదను ఆవరించిన మాయ తొలగిపోయింది. తాను యశోద, వీడు నాకొడుకు చిన్ని కృష్ణుడు అనే మోహంలో పడిపోయింది. తాను చూచిందంతా మరిచిపోయింది. కొడుకుమీద వాత్సల్యంతో కృష్ణుని దగ్గరకు తీసుకుంది. కృష్ణుని తల నిమురుతూ ఉంది. కృష్ణుడు కూడా అమ్మ ఒడిలో ఒదిగిపోయాడు.

కాని యశోద మనసులో ఒక మూల "వీడుసామాన్యుడు కాడు. వేదముల చేత, ఉపనిషత్తులచేత, యోగముల చేత శాస్త్రములచేత కీర్తించబడే ఆ శ్రీమహావిష్ణువే నా కుమారుడుగా పుట్టలేదు కదా!" అని అనుకొంది." అని శుకుడు కృష్ణుని బాల్యలీలలను గురించి చెబుతుంటే, పరీక్షిత్తు ఇలా అడిగాడు.

"మునీంద్రా! మూడులోకములను, పుట్టించి, పెంచి, లయం చేసే ఆ పరమాత్మ యశోదా నందుల ఇంటిలో కుమారుడుగా పెరగడానికి వారు ఎంత పుణ్యం చేసుకున్నారో కదా! అంతేకాదు, కృష్ణుడు దేవకీ వసుదేవులకు జన్మించి నప్పటికినీ, వారు కృష్ణుని బాల్యక్రీడలను చూచి ఆనందించే భాగ్యానికి నోచుకోలేదు. ఆ అదృష్టం

అయాచితంగా యశోదానందులకు దక్కింది. ఈయశోదా నందులు పూర్వజన్మలలో ఏదో పుణ్యం చేసుకొని ఉంటారు. అందుకే ఈ జన్మలో వారికి ఈ భాగ్యం దక్కింది." అని అన్నాడు. దానికి శుకమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! అష్టవసువులలో ద్రోణుడు అనేవాడు ఒకడున్నాడు. వాడు ఒక రోజు భార్యతో కలిసి బ్రహ్మదేవుని దర్శనానికి వెళ్లాడు. బ్రహ్మదేవుడు వారిని చూచి "మీరు కొంతకాలము మానవ లోకంలో జన్మించవలసి ఉంటుంది. సిద్ధంగా ఉండండి." అని అన్నాడు. దానికి ద్రోణుడు, ఆయన భార్య ఇలాఅన్నారు. "తమరి ఆజ్ఞ శిరసావహిస్తాము. కాని ఒక విన్నపము. మేము మానవలోకంలో ఉండగా, మాకు దేవదేవుడు అయిన శ్రీహరిమీద అనంతమైన భక్తి కలిగేటట్టు అనుగ్రహించండి. ఎందుకంటే శ్రీహరి మీద భక్తి ఉంటే, దుర్భరమైన మానవజన్మ సంతోషదాయకమవుతుంది." అని అన్నారు. దానికి బ్రహ్మ నవ్వి " అసలు ఆ పనిమీదనే మీ ఇద్దరినీ భూలోకంలో జన్మించమని చెప్పాను. మీకోరిక తప్పకుండా నెరవేరుతుంది. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు మానవునిగా జన్మించబోతున్నాడు. ఆయనను పెంచి పెద్దచేసే బాధ్యతను మీకు అప్పగిస్తున్నాను. మీరే శ్రీమహావిష్ణువుకు పెంపుడు తల్లి, తండ్రి అవుతారు." అని అన్నాడు.

ఆ కారణం చేత ద్రోణుడు అనే వసువు నందుడుగానూ, ఆయన భార్య ధర యశోదగానూ జన్మించారు. ఆ కారణం చేత, కృష్ణుడు దేవకీ వసుదేవులకు జన్మించినా యశోదానందుల వద్ద పెరిగాడు.

ఆ ప్రకారంగా కృష్ణుడు తన లీలలతో యశోదానందులను, గోపకులను, గోపకాంతలను ఆనంద పారవశ్యంలో ఓలలాడిస్తున్నాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణలీలలను వినిపిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## దశమస్కంధము
## తొమ్మిదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుని బాల్య లీలలను ఈ విధంగా వర్ణిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఒక రోజు యశోద తన పరిచారికలను వేరే పనుల మీద పంపింది. తను మాత్రం కుండలో పెరుగు పోసి కవ్వంతో చిలుకుతూ ఉంది. అలా చిలుకుతుంటే వెన్న పైకి తేలుతూఉంది. ఇంతలో చిన్ని కృష్ణునికి ఆకలి అయింది. "అమ్మా అమ్మా పాలు ఇవ్వవా" అంటూ తల్లి ఒడిలోకి చేరాడు. "ఉండరా ఇస్తాను. ఈ కాస్త వెన్న తీసిన తరువాత ఇస్తాను" అని చిలుకుతూ ఉంది యశోద. యశోదను చిలకనివ్వకుండా కృష్ణుడు కవ్వం గట్టిగా పట్టుకున్నాడు. "నాకు ఇప్పుడే పాలు కావాలి" అంటూ మారాం చేయసాగాడు.

"అబ్బబ్బ మరీ అల్లరి పిల్లాడయిపోతున్నాడమ్మా మా గారాలపట్టి" అంటూచిలకడం ఆపి కృష్ణుడిని ఒడిలోకి తీసుకొని పాలు ఇస్తూ ఉంది యశోద. ఇంతలో పొయ్యి మీద పాలు పొంగిపోవడం చూచింది. "అమ్మో పాలు పొంగిపోతున్నాయి కాస్త ఉండరా!" అంటూ కృష్ణుని ఒడిలోనుండి దింపి కింద కూర్చోపెట్టి పాలు పొయి మీది నుండి దింపడానికి వెళ్లింది.

తనకు పాలు ఇవ్వడం సగంలో ఆపినందుకు కృష్ణునికి పిచ్చి కోపం వచ్చింది. పక్కనే ఉన్న కవ్వం తీసుకొని చిలుకుతున్న కుండను ఠపీమని కొట్టాడు. ఆ కుండ పగిలిపోయింది. కుండలో ఉన్న పెరుగు వెన్న కింద ఒలికి పోయింది. అక్కడే కూర్చుని కింద ఒలికి పోయిన వెన్నను తింటున్నాడు కృష్ణుడు.

యశోద పొయ్యి మీది నుండి పాలు దింపి మరలా వెన్న చిలుకుదామని వచ్చింది. పగిలినకుండ కనపడింది. తల్లి వస్తున్న అలికిడి విని కృష్ణుడు అక్కడి నుండి మెల్లగా జారుకున్నాడు. ఇదంతా తన పుత్రరత్నం కృష్ణుడి పని అని తెలుసుకుంది యశోద. ఒక పక్క కోపం, మరొక పక్క నవ్వు వచ్చాయి యశోదకు. ఇంతకూ ఈ వెన్న దొంగ ఎక్కడ ఉన్నాడా అని వెతికింది.

మరొక గదిలో ఉట్టి మీద దాచిపెట్టిన వెన్న కుండను, అక్కడే ఉన్న రోటిమీదికి ఎక్కి, కిందికి దింపి కుండలో ఉన్న వెన్నను కోతులకు పెడుతున్నాడు. కోతులను మేపుతున్న కృష్ణుని చూచింది యశోద. ఇంక లాభం లేదు. వీడిని దండించాలి లేకపోతే దారికి రాడు అని

అనుకొంది. పక్కనే ఉన్న కర్ర తీసుకుంది. తనను తన్నడానికి కర్రపట్టుకొని వస్తున్న అమ్మను చూచి భయంతో రోలు దిగి పారిపోయాడు కృష్ణుడు.

ఎంతో మంది యోగులు ఎంత తపించినా దొరకని ఆ పరమాత్మను పట్టుకోడానికి యశోద కర్ర తీసుకొని కృష్ణుని వెంట పరుగెత్తింది. ఒక పక్క జుట్టు ముడి ఊడిపోతుంటే, అలాగే జుట్టు ముడి వేసుకుంటూ కృష్ణుని పట్టుకోడానికి యశోద పరుగెత్తింది. ఇంక పరుగెత్త లేక ఆగిపోయాడు కృష్ణుడు. కాటుక పెట్టిన కళ్లను నులుముకుంటూ బుంగమూతి పెట్టుకొని  ఏడుస్తున్నాడు కృష్ణుడు.

ముద్దుల కొడుకు కన్నీళ్లను చూచి కరిగిపోయింది యశోద. నవ్వితే కొడుక్కు భయం ఉండదని, కృష్ణుని రెండు చేతులూ పట్టుకొని కర్రతో బెదిరించసాగింది.

"ఏమండీ! తమరెవరు! తమరు కృష్ణులేనా! పాపం ఎప్పుడూ వెన్న మొహం చూడలేదా తమరు. కుండలు పగుల గొట్టి వెన్న తింటున్నారా. తిన్నది చాలక కోతులను కూడా మేపుతున్నారు. పాపం తమరికి దొంగతనంగా వెన్న తినడమే తెలియదు. తమంతటి బుద్ధి మంతులు లేనట్టు అమాయకంగా మొహం పెట్టారు. అవునా!

ఒరేయ్! ఎలారా నీతో వేగేది. పట్టుకుందామంటే దొరకవు. దొరక్కుండా పరుగెడతావు. నిన్ను పట్టుకోవడం పెద్ద పనికాదు తెలుసా! ఈ ఊరిలో గోపికలు అందరూ నువ్వు ఎవ్వరికీ చిక్కవని అంటారు. నిన్ను పట్టు కోవడం నాకు తప్ప ఎవరికీ సాధ్యంకాదు తెలుసా!

అదికాదురా! నీకెందుకురా ఈ తిరుగుళ్లు! ఒక్కచోట బుద్ధిగా ఉండవు కదా! నీ అల్లరికి హద్దు లేకుండా పోతోంది. ఒక్కక్షణం ఏమారితే చాలు ఏదో ఒక తుంటరిపని చేస్తావు. నిన్ను ఇలా కాదు. ఈ రోటికి కట్టేస్తేగానీ కుదురుగా ఉండవు." అని కృష్ణుని కట్టడానికి తాడు కోసరం అటు ఇటు చూడసాగింది.

పక్కనే ఒక తాడు కనపడింది యశోదకకు. ఆ తాడును తీసుకొని ముందు రోటికి కట్టింది. తరువాత కృష్ణుని నడుము చుట్టు చుట్టింది. తాడు రెండు అంగుళాలు పొడవు తక్కువయింది. మరొక తాడు తీసుకొని ఆ తాడుకు కట్టింది. మళ్లీ కృష్ణుడి నడుముకు చుట్టింది. ఇంకా రెండు అంగుళాలు తక్కువగా ఉంది. ఎన్ని తాళ్లు తెచ్చిముడి వేసినా ఇంకా రెండు అంగుళాలు తక్కువ అవుతూ ఉంది. యశోద అవస్థ చూచి అక్కడ చేరిన గోపకాంతలు పకా పకా నవ్వుతున్నారు. తన అవస్థ చూచి యశోదకు కూడా నవ్వు వచ్చింది. కృష్ణుని కట్టడానికి పడిన శ్రమకు యశోద ఒళ్లంతా చెమటతో తడిసిపోయింది.

తల్లి అవస్థ చూచాడు కృష్ణుడు. ఇంక చాలనుకొని "అమ్మా! అమ్మా! నన్ను కట్టమ్మా! ఇదిగో తాడు." అంటూ పక్కనే ఉన్న తాడును యశోదకు అందించాడు. అమ్మ ముందు బుద్ధిగా నిలబడ్డాడు. అప్పటి దాకా చాలని తాడు సరిగా కృష్ణుడు నడుము చుట్టు చుట్టి కట్టడానికి సరిపోయింది. యశోద చిన్ని కృష్ణుని రోటికి కట్టేసింది.

"ఇంక ఎక్కడికి పోతావో చూస్తాను" అని బెదిరించి పనులు చేసుకోవడానికి లోపలకు వెళ్లింది.

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీహరి భక్తపరాధీనుడు, భక్తులకు ఎల్లప్పుడూ వశుడు అవుతాడు, భక్తి అనే పాశములకు కట్టు బడతాడు అని కృష్ణుడు తన బాల్య క్రీడల ద్వారా నిరూపించాడు. యశోదకు పట్టిన అదృష్టము బ్రహ్మ,శివుడు మొదలగు దేవతలకు కానీ, సాక్షాత్తు లక్ష్మీదేవికి గానీ లభించలేదు అంటే అతిశయోక్తి కాదు. పరమాత్మ భక్తికి కట్టుబడినట్టు దేహాభిమానము కల వారికి కానీ, తాపసులకు గానీ, ఆత్మజ్ఞానులకు కానీ కట్టుబడడు.

ఆ ప్రకారంగా యశోద కృష్ణుని రోటికికట్టి, ఇంటి పనులు చేసుకుంటూ ఉండగా, కృష్ణుడు బుద్ధిగా రోటి పక్కనే కూర్చున్నాడు. చుట్టు చూచాడు. తన పెరటి వైపు చూచాడు. పూర్వ జన్మలో కుబేరుని పుత్రులుగా జన్మించి, శాపవశాత్తు తన పెరట్లో మద్ది చెట్ల రూపంలో నిలిచి ఉన్న నలకూబరుడు, మణిగ్రీవులను చూచాడు కృష్ణుడు. వారికి నారదుడు ఇచ్చిన శాపము విమోచనం అయ్యే సమయం ఆసన్నమయిందని అనుకున్నాడు కృష్ణుడు. తాను కట్టబడిన రోటిని లాక్కుంటూ ఆ మద్ది చెట్లవైపు వెళ్లాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు నలకూబరుడు, మణిగ్రీవుల వృత్తాంతమును చెప్పసాగాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# దశమస్కంధము

## పదవ అధ్యాయము.

ఇప్పుడు పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహము వచ్చింది.

"మహాత్మా! నలకూబరుడు, మణిగ్రీవుడు కుబేరుని కుమారులు కదా! వారికినారదుడు శాపం ఎందుకు ఇచ్చాడు. శుద్ధసత్వగుణసంపన్నుడైన నారదుడికి కోపం కలిగించే పని వారు ఏం చేసారు? ఈ విషయాలన్నీ నాకు వివరంగా తెలుపండి." అని అడిగాడు.

శుక మహర్షి ఈ విధంగా చెప్పసాగాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! నలకూబరుడు, మణిగ్రీవుడు కుబేరుని కుమారులు. తాము కుబేరుని కుమారులమని, లోకంలో ఉన్న అందరి కన్నా ధనవంతుల మనీ, అందగాళ్లమనీ, వారికి అంతులేని గర్వము. పైగా వారు మహాశివునికి అనుచరులుగా నియమింపబడ్డారు.

ఆ పదవి లభించేటప్పటికి వారిగర్వము మితిమీరింది. ఎవరినీ లెక్కచేసేవాళ్లు కాదు. ప్రతిరోజూ జంతువులను వేటాడటం, మద్యము సేవించి, స్త్రీలతో ఆడుతూ, పాడుతూ, విహరించడం వారికి నిత్యకృత్యము అయిపోయింది. ఒకరోజు వారు వేటాడి, అలసిపోయి, స్త్రీలతో మద్యం సేవించి, అక్కడే ఉన్న సరోవరములో బట్టలన్నీ విప్పేసి నగ్నంగా స్నానం చేస్తున్నారు.

ఇంతలో నారద మహర్షి అటుగావచ్చాడు. నలకూబరుడు, మణిగ్రీవునితో ఉన్న స్త్రీలుసిగ్గు పడి, గట్టు మీదికి వచ్చి బట్టలు కట్టుకున్నారు. కాని నలకూబరుడు,మణిగ్రీవుడు నారద మహర్షివచ్చినా లెక్కచేయకుండా అలాగే నగ్నంగా జలకాలాడుతున్నారు.. తనముందు సిగ్గులేకుండా దిగంబరంగా జలకాలాటలు ఆడుతున్న ఆ మదోన్మత్తులను చూచాడు నారదుడు. వారితో ఈ విధంగా ఉన్నాడు.

“ఓ యక్షకుమారులారా! పురుషులకు వారు నేర్చుకున్న విద్య వలన, వారు పుట్టిన మంచి కులము వలన కొంచెం గర్వము కలగడం సహజం. అటువంటి గర్వము వారి నాశనానికి కారణం కాదు. కానీ మీరు, మీకు ఉన్న పదవి వలనా, ధనము వలనా గర్వించారు. ఎవరినీ లెక్కచేయడం లేదు.

ఎవడి కైనా ధనం అపరిమితంగా ఉంటే వాడికి స్త్రీసంభోగము, జూద వ్యసనము, మద్యపానము వెంటనే అలవడతాయి. మీమాదిరి ధనమదం కలిగిన వాడు ఎవరినీ లెక్కచేయడు. ఎటువంటి పాడు పని చేయడానికైనా వెనుదీయడు. తాము శాశ్వతంగా ఈ లోకంలో ఉంటాము అనుకొని తమ వినోదం కొరకు, తమ ఆహారం కొరకు అకారణంగా మృగములను వేటాడి  వధిస్తుంటారు.

జీవించి ఉన్నంతవరకు ఎంత ఉన్నతంగా జీవించిందో, కీర్తింపబడిందో, అదేశరీరము, మరణించిన తరువాత మట్టిలో కలిసిపోతుంది. క్రిమికీటకములకు ఆహారము అవుతుంది. లేక అగ్నికి

ఆహుతి అవుతుంది. ఇటువంటి అశాశ్వతమైన శరీరాన్ని పోషించడం కోసరం, తృప్తిపరచడం కోసరం మానవుడు సాటి మానవులను, జంతువులను చంపడానికి కూడా వెనుకాడడు. ఇటువంటి జీవహింస చేయడం వలన వారు మరణం తరువాత నరకానికి పోతారు.

ఓ నలకూబర, మణిగ్రీవులారా! ఈ శరీరము నాది నాది గర్విస్తున్నారు కదా! నా బోటి వారిని కూడా లెక్కచేయడంలేదు కదా! మరి ఈ శరీరము ఎవరిది? ఈ శరీరం నీకు ఎవరిచ్చారు? ఈ శరీరం నీకు జన్మనిచ్చిన తండ్రిదా! నవమాసాలు మోసిన తల్లిదా! ఆ తల్లిని కన్న తండ్రిదా! నీకు అన్నం పెడుతున్న అన్నదాతదా! నీతో పనిచేయించుకుంటున్న యజమానిదా! లేక నీవు చనిపోయిన తరువాత నిన్ను దహనం చేసే కాటికాపరిదా!

మీకు తెలుసో లేదో! ఈ శరీరము ప్రకృతి నుండి పుట్టింది. ఆ ప్రకృతిలోనే కలిసిపోతుంది. అందువలన ఈ శరీరం ఎవరిదీ కాదు! ఎవరిదీ కాని ఈ శరీరం కోసరం ఇంతటి గర్వము, మదము అవసరమా! ధనమదము చేత గర్వించిన వాడికి తగినమందు వాడి దగ్గర ఉన్న  ధనాన్ని లాక్కోవడం. వాడికి దుర్భర దారిద్ర్యం ప్రసాదించడం.

దారిద్ర్యము మానవుని గర్వమును పోగొట్టి, అతనికి తనేమిటో, తాను ఆచరించ వలసిన  ధర్మమేమిటో తెలియజేస్తుంది. దారిద్ర్యమును అనుభవించే వ్యక్తి, సాటివ్యక్తి ప్రాణములను తన ప్రాణముల మాదిరిగానే భావిస్తాడు. అతడు అకారణంగా

జీవహింసచేయడు.

కష్టములను అనుభవించేవాడికే సాటి మానవుల కష్టముల గురించి తెలుస్తుంది. ధనమదంతో విర్రవీగేవాడికి, జీవితంలో కష్టము అంటే తెలియని వాడికి, కష్టజీవుల కష్టాలు తెలియవు. ముల్లు గుచ్చుకుని బాధ అనుభవించిన వాడికే, సాటి వాడికి ముల్లు గుచ్చుకుంటే ఎంత బాధ పుడుతుందో అర్థం అవుతుంది. అసలు జీవితంలో ముల్లు అంటే తెలియని వాడికి, ముల్లు గుచ్చుకోని వాడికి ముల్లుగుచ్చుకున్న వాడి బాధ ఏం తెలుస్తుంది?

ధనమదంతో విర్రవీగే వాడి దగ్గర ఉన్న ధనము పోతే దరిద్రం వస్తుంది. అహంకారము నశిస్తుంది. సహజంగా వాడు అన్నమునకు వస్త్రములకు అలమటిస్తుంటాడు. అన్న వస్త్రములకు వాడు పడే కష్టాలే వాడు చేసే గొప్ప తపస్సు. ఆ తపస్సే వాడిలో ఉన్న గర్వాన్ని పోగొట్టి వాడిని ముక్తిమార్గంలో నడిపిస్తుంది.

ఎల్లప్పుడూ ఆకలితో బాధపడేవాడు, అన్నంకోసరం ఆరాటపడేవాడు, ఎటువంటి ఉద్వేగములకు లోను కాడు. వాడి బుద్ధిస్థిరంగా ఉంటుంది. వాడికి సాటి మనుషుల కష్టసుఖాలు తెలుస్తాయి. అటువంటి వాడికి సాటి మనుషులను కానీ, జంతువులను కానీ హింసించవలెనని ఆలోచనే ఉండదు. లోకంలో ఉండే వారినందరినీ సమంగా చూచే సాధువులు కూడా దరిద్రులతోనే సాంగత్యం పెట్టుకుంటారు. దరిద్రుడికి కూడా ఎటువంటి దురాలోచనలు లేకపోవడం వలన, తనలో ఉన్న విషయ వాంఛలను నాశనం చేసుకొని, తన చిత్తము శుద్ధిచేసుకోడానికి ప్రయత్నిస్తాడు.

ఎల్లప్పుడూ ఏ కాగ్రచిత్తంతో భగవానుని పాదపద్మములను సేవించే సాధువులకు, ధనవంతులతోనూ, దుర్జనులతో సహవాసం చేసేవారితోనూ, అన్నిటినీ తేలిగ్గా తీసుకొనేవారితోనూ, దుష్టులతోనూ, సాంగత్యం పెట్టుకుంటే ఏమి ప్రయోజనం ఉంటుంది.

ఓ మణిగ్రీవ నలకూబరులారా! మీరు ఇరువురూ ధనమదాంధులు. మీరు కుబేరుని కుమారులమనీ, ధనము, పదవి ఉన్నాయనే గర్వంతో విర్రవీగుతున్నారు. అదీకాకుండా మీరు మద్యపాన మదోన్మత్తులు.మీరు వేటయందు, విషయవాంఛలయందు, స్త్రీసంభోగమునందు విపరీతమైన కోరిక ఆసక్తి కలవారు. మీకు ఇంద్రియనిగ్రహము, మనో నిగ్రహము లేదు. మీరు అజ్ఞానము అనే అంధకారంలో పడి కొట్టుకుంటున్నారు.

మిమ్ములను ఈ అజ్ఞానము నుండి బయటకు లాగి మీకు జ్ఞానమార్గమును ఉపదేశింపదలిచాను. మీరు లోకపాలకుడైన కుబేరుని కుమారులు. ఎంతో ఉన్నతంగా ఉండవలసిన వారు. కాని మీరు మద్యపానము చేసి, స్త్రీవ్యామోహంలో పడి, మీకు ఒంటి మీద దుస్తులు ఉన్నాయో లేవో కూడా తెలుసుకోలేని ఉన్మత్తస్థితిలో ఉన్నారు. ఆకారణం చేత మీరు అలాగే జడులుగా, కదలకుండా, చెట్లవలె పడి ఉండండి.

మీకు, చేసిన పాపము అనుభవిస్తున్నాము అని తెలియడానికి మీకు పూర్వజన్మస్మృతి ఉంటుంది. ఆ ప్రకారంగా నూరు దివ్య సంవత్సరములు వృక్షములుగా పడి ఉండండి.

శ్రీకృష్ణుని పాద స్పర్శతో మీకు నిజరూపం వస్తుంది. మరలా మీరు యధాప్రకారంగా దేవత్వమును పొందుతారు." అని మణిగ్రీవ, నలకూబరులను శపించి, నారదుడు తన దారిన తాను వెళ్లిపోయాడు. నారదుని శాపము మేరకు మణిగ్రీవ, నలకూబరులు మద్దిచెట్లుగా పడి ఉన్నారు.

నారదుని మాటలు నిజం చేయడానికి కృష్ణుడు తన పొట్టకు కట్టబడిన రోటిని ఈడ్చుకుంటూ ఆ మద్దివృక్షముల వద్దకు వెళ్లాడు.(దామ అంటే తాడు, ఉదరము అంటే పొట్ట. పొట్టకు తాడు కట్టబడిన వాడు కాబట్టి కృష్ణుడు దామోదరుడు అనిపిలువబడ్డాడు.)

దామోదరుడు రెండు మద్ది వృక్షముల మధ్యలో దూరాడు. అప్పుడు రోలు అడ్డం తిరిగింది. మద్దిచెట్ల మధ్యనుండి రాలేదు. దామోదరుడు బలవంతంగా ఆ రోటిని లాగాడు. వెంటనే బలమైన ఆ మద్దివృక్షములు రెండూ పెళా పెళా విరిగి పడ్డాయి. వేళ్లతో సహా పెకలింపబడ్డాయి. రెండు మద్దిచెట్లు పెద్ద శబ్దం చేస్తూ నేలమీద పడ్డాయి. అప్పుడు ఆ రెండు వృక్షముల లో నుండి మణిగ్రీవ, నలకూబరులు తమ నిజ రూపములతో బయటకు వచ్చారు. తలలు వంచి దామోదరుడికి నమస్కరించారు. తమ అహంకారము, మదము వదలగా, దామోదరుని ఇలా ప్రార్థించారు.

"ఓకృష్ణా! దామోదరా! యోగీశ్వరా! నీ ప్రభావము అనంతము. నీవు పరమపురుషుడవు. ఈ జగత్తునకుమూలకారణము నీవే! స్థూలము, సూక్ష్మము అయిన ఈ జగత్తు నీరూపమే అని పండితులు చెబుతారు. నీవు సర్వభూతముల యొక్క దేహములకు, ప్రాణములకు,

వారిలో ఉన్న అహంకారమునకు, వారి ఇంద్రియములకు ఈశ్వరుడవు. సర్వవ్యాపి అయిన విష్ణుస్వరూపము నీవే! నీకు నాశము లేదు.

ఓ దేవా! నీవు కాలస్వరూపుడవు. త్రిగుణములతో కూడిన ఈ ప్రకృతి నీస్వరూపమే. నీవు అన్నిభూతములలో అంతర్యామిగా వెలుగుతున్నావు. నీవు పరబ్రహ్మ స్వరూపుడవు. అట్టినీకు నమస్కారము. సామాన్యమానవులకు సాధ్యం కాని విధంగా మత్స్య,కూర్మ,వరాహ మొదలగు అవతారములను ధరించి, బలపరాక్రమములను ప్రదర్శించి, మహిమలను చూపుటచే సామాన్య జనులు నీ అవతార మహిమల గురించి కీర్తిస్తున్నారు. ఓ దేవా! నీవు సకలశుభములను ప్రసాదించేవాడివి. ఈ లోకములో ఉన్న మానవులకు సకల సంపదలు ప్రసాదించడానికి, మోక్షమును ఇవ్వడానికి మానవ రూపంలో కృష్ణుడిగా అవతరించావు. దామోదరుడుగా మాకు దర్శనంఇచ్చావు. మాకు శాపవిమోచన కలుగచేసావు.

పరమ కల్యాణమూర్తీ! పరమమంగళాకారా! వాసుదేవా! శాంతస్వరూపా! యాదవకులతిలకా! నీకు నమస్కారము. నారద మహాముని దయ వలన మాకు నీ దర్శనభాగ్యంకలిగింది. మేము పరమశివుని సేవకులము. మేముఇక్కడినుండి పరమశివుని సేవకు వెళ్లడానికి మాకు అనుమతి ప్రసాదించు. మా వాక్కు ఎల్లప్పుడూ నీ గుణగణములను కీర్తిస్తూ ఉండాలి. మా చెవులు నీ లీలల గురించి వింటూ ఉండాలి. మా చేతులు నీకు ప్రీతి కలిగే పనులు చేస్తూ ఉ ండాలి. మా మనస్సుఎల్లప్పుడూ నీపాదపద్మములను స్మరిస్తూ ఉండాలి. మా తల ఎల్లప్పుడూ నీకు నమస్కరిస్తూ ఉండాలి. మా కళ్లు సదా నిన్ను

సేవిస్తూ, నిన్నుపూజిస్తూ ఉండే సాధుజనులను దర్శిస్తూ ఉండాలి. ఆవిధంగా మమ్ములను అనుగ్రహించు." అని వేడుకున్నారు నలకూబర, మణీగ్రీవులు.

ఆ ప్రకారంగా శ్రీమహావిష్ణువును స్తోత్రము చేసిన మణిగ్రీవ, నలకూబరులతో కృష్ణుడు ఇలా అన్నాడు.

"నారదుడు మీకు శాపం ఇచ్చి మీకు ఎంతో మేలు చేసాడు. మీలోని ధనమదమును, అహంకారమును పోగొట్టాడు. మీలోని అజ్ఞానం తొలగిపోయింది. ఇదంతా నాకు ముందే తెలుసు. అందుకే మీకు శాపవిమోచన కలుగచేసాను. సూర్యుడు రాగానే చీకట్లు తొలగిపోయినట్టు, నా దర్శనము చేత మీ గర్వము, మదము, అజ్ఞానము అనే అంధకారము తొలగిపోయింది.

, మణిగ్రీవ, నలకూబరులారా! ఇంక మీరు మీ గృహములకు వెళ్లండి. ఇంకెప్పుడు గర్వమునకు, మదమునకు లోనుకాకండి. అందరినీ మీతో సమానంగా చూడండి." అని పలికాడు కృష్ణుడు.

మణిగ్రీవ, నలకూబరులుకృష్ణుని నమస్కరించి ఉత్తర దిక్కుగా వెళ్లిపోయారు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు మణిగ్రీవ, నలకూబరుల వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము పదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత& ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

పదకొండవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! రెండు పెద్ద మద్ది చెట్లు దబ్బున పడ్డ శబ్దం విని గ్రామంలో ఉన్న వారంతా పరుగు పరుగున అక్కడకు వచ్చారు. కూకటి వేళ్లతో సహా లేచి పడి ఉన్న మద్దివృక్షములను చూచారు. వాటి మధ్య కృష్ణుడు నిలబడిఉన్నాడు. కృష్ణునికి కొంచెం కూడా దెబ్బలు తగలలేదు. ఈచెట్లు ఎందుకుపడ్డాయి? ఎలా పడ్డాయి? చెట్లు మీదపడ్డా కృష్ణుడు క్షేమంగా ఎలా ఉన్నాడు? ఈ సందేహాలతో గ్రామస్థులు బుర్రలు గోక్కుంటున్నారు.

అప్పటి దాకా కృష్ణుని చేష్టలు చూస్తున్న గోప బాలురు తాము చూసింది చూసినట్టు చెప్పసాగారు. "మరేమో యశోదమ్మ కృష్ణుడిని రోటికి కట్టేసింది. కృష్ణుడు రోటిని లాక్కుంటూ ఈ చెట్ల మధ్య నుండి వెళ్లాడు. రోలు చెట్ల మధ్య ఇరుక్కుపోయింది. కృష్ణుడు బలంగా లాగాడు. అంతే. రెండు చెట్లు దభేలుమని పడిపోయాయి. మేము ఇక్కడే ఉండి చూచాము. ఇంతలో ఇద్దరు మనుషులు ఆ చెట్ల నుండి బయటకు వచ్చారు. మేముచూచాము." అని గబా గబా చెప్పారు ఆ బాలురు.

ఇంత విన్నా వారి అనుమానం పోలేదు. బాలుడైన కృష్ణుడు లాగితే ఇంత పెద్ద చెట్లు పడిపోవడమా. అసంభవము. ఇందులో ఏదో మాయ ఉంది. అక్కడ చేరిన వారు అందరూ తలకొకవిధంగా

అనుకుంటుంటే, నందుడు గబా గబా  కృష్ణుని కట్లు ఊడదీసాడు. రోటికి కట్టిన కట్లు విప్పాడు. కృష్ణుని ఎత్తుకొని ముద్దులాడి ఇంటికి తీసుకొని వెళ్లాడు. బ్రాహ్మణులను పిలిచి రక్ష కట్టించాడు.

రోజూ మధ్యాహ్నం వేళ ఆ ఊరిలో ఉన్న వారంతా పనులు ముగించుకొని యశోద ఇంటిలో చేరతారు. కృష్ణుని మధ్య నిలబెట్టి చుట్టుకూర్చుంటారు. "ఒరేయ్ కృష్ణా! నువ్వు నృత్యం చేస్తేనీకు లడ్డు పెడతాను. ఆడరా" అనేవారు. వారి మాటలు విన్న కృష్ణుడు చేతులు కాళ్లు ఊపుతూ వంగుతూ లేస్తూ నవ్వుతూ చిట్టిపొట్టి అడుగులతో నృత్యం చేసేవాడు. అది చూచి గోపకాంతలు చేతులు చరుస్తూ చప్పట్లు కొడుతూ కేరింతలు కొట్టేవారు.

"ఒరేయ్ కృష్ణా! ఆ  కుండ తీసుకురా" అంటే కృష్ణుడు ఆ కుండను మోయలేక మోస్తూ ఆపసోపాలు పడుతూ తీసుకొని వచ్చేవాడు. ఒక్కోసారి మోయలేక దబ్బున కిందపడేసేవాడు. అది చూచి గోపకాంతలు "మా నాయనే బరువుగాఉందా కన్నా" అంటూ ముద్దులాడేవారు.

"ఒరేయ్కృష్ణా! అమ్మో పులి వస్తే ఏంచేస్తావురా!" అంటే ఊ హా ఉమ్ అంటూ హుంకరించేవాడు. "కొడతా" అంటూ చేతులు ఊపేవాడు. ఇటువంటి చిట్టి పొట్టి చేతలతో, మాటలతో ఆ ఊరిలో ఉన్న గోపకాంతలకు సంతోషాన్ని కలుగజేస్తున్నాడు కృష్ణుడు.

ఒకసారి వీధిలోకి ఒక పండ్లు అమ్మే ఆమె వచ్చింది. పండ్లుకావాలా అమ్మాపండ్లు అని అరుస్తూ ఉంది. ఆ అరుపులు విన్న

చిన్ని కృష్ణుడు తన రెండు చిట్టి చేతుల దోసిలితో పట్టినన్ని ధాన్యము తీసుకొని బుడి బుడి నడకలతో పళ్లు కొనుక్కోడానికి వీధిలోకి వెళ్లాడు. (ఇటీవలి కాలం దాకా ధాన్యం, బియ్యం ఇచ్చి పండ్లు, కూరగాయలు, తినే పదార్థాలు కొనుక్కోవడం అలవాటుగా ఉండేది.) అలా వెళుతుంటే చిన్ని కృష్ణుని వేళ్ల సందుల్లోనుండి ధాన్యం కారిపోయి ఆఖరుకు ఒట్టి దోసిలి మిగిలేది. "మా నాయనే.పండ్లు కావాలా" అంటూ ఆ పండ్లు అమ్ముకునే ఆమె కృష్ణుని రెండు చేతుల నిండాపట్టినన్ని పండ్లు అందించేది. ఆ పండ్లు తింటూ తోటివారికి పెడుతూ ఆడుకొనే వాడు. మానవులు చేసినకర్మలకు తగిన ఫలితములను ఇచ్చే పరమాత్మ, ఆ పండ్లు అమ్మే ఆమె దగ్గర పళ్లు తీసుకొని ఆమెకు అంతులేని సంపదలను ఇచ్చాడు.

ఒక రోజుసాయంత్రం యశోద, రోహిణి, బలరామకృష్ణులను, ఇంకా గోపబాలురను తీసుకొని యమునా నదీ తీరానికి వెళ్లారు. బలరామ కృష్ణులు, గోపబాలురు ఇసుకలో ఆటలాడుకుంటున్నారు. పొద్దు కుంకినా వీళ్ల ఆటలు ఎంతకూ ఆగక పోవడంతో రోహిణీ దేవి యశోదను పిలిచి "యశోదా! వాళ్లను పిలువు. వీళ్లకు ఆటల్లో పడి ఆకలి కూడా తెలియడం లేదు. పాలు తాగుతారు." అని చెప్పింది. అలాగేఅక్కా అంటూ యశోద బయటకు వెళ్లి, "రామా, కృష్ణా ఆటలు చాలు గానీ రండిరా పాలు తాగుదురు కానీ. ఎపుడో పొద్దుననగా అన్నం తిన్నారు. ఇంకా ఆకలి వెయ్యడం లేదా. రండిరండి. ఒరేయ్ బలరామా! ఆ కృష్ణుడిని లాక్కునిరా! ఒరేయ్! రండిరా! మీ నాన్న గారు నందుల వారు మీ కోసం ఎదురు చూస్తున్నారు. మీరు రానిది ఆయన భోజనం చేయరు. రండమ్మా! ఒరేయ్ పిల్లలూ! మీరంతా ఇళ్లకు

వెళ్లండి. పోయి బువ్వ తిని మరలా రండి ఈ లోపల కృష్ణుడు, రాముడు కూడా లాలపోసుకొని, బువ్వతిని వస్తారు. సరేనా!" అని కేకలు వేస్తూ ఉంది యశోద.

ఎంతపిలిచినా వాళ్లు ఆటలు మానలేదు. యశోద పోయి కృష్ణుని బలరాముని చెరొక చేత్తో పట్టుకుంది. "అబ్బబ్బ చూడండి మీ శరీరాలు ఎలా మట్టికొట్టుకుపోయాయో. ఏం ఆటలురా బాబూ ఇవి. ఇలా మట్టి పూసుకున్నారు. రండి వచ్చి స్నానం చేయండి. ఒరేయ్ కృష్ణా! ఈ రోజు నీ పుట్టిన నక్షత్రము రా! వచ్చి మీ నాన్నగారితో పాటు గోదానం చెయ్యి. అటు చూడు నీ స్నేహితులు అంతా ఇళ్లకుపోయి స్నానాలు చేసి చక్కగా అలంకరించుకొని బువ్వతింటున్నారు. మీరూ రండిరా!" అని కృష్ణుని బలరాముని ప్రేమగా రెండు చేతులు పట్టుకొని ఇంటిలోకి లాక్కుని వెళ్లింది.

ఇద్దరికీ స్నానాలు చేయించింది. ఉతికిన బట్టలు వేసింది. ఇద్దరినీ కూర్చోబెట్టి వేడి వేడి బువ్వ పెరుగు వెన్న వేసి తినిపించింది. ఆ ప్రకారంగా కృష్ణుడు బలరాముడు నందవ్రజములో ఆనందంగా పెరుగుతున్నారు. (బలరామ కృష్ణులు ఇంకా ఐదేళ్లు లోపు పసివారు. ఇంకా తల్లిపాలు తాగుతున్నారు.)

గోకులంలో అందరూ బలరామకృష్ణుల ఆటపాటలతో ఆనందిస్తుంటే నందుని మనసులో మాత్రము వసుదేవుని మాటలు గింగురుమంటున్నాయి. ఏ వేళప్పుడు ఏ ఆపద ముంచుకొస్తుందో అని భయపడుతున్నాడు. ఈ సందర్భంగా నందుడు ఊరిలో ఉన్న పెద్దలను పిలిచి ఒక చిన్న సభ ఏర్పాటు చేసాడు. ఊరిలో జరుగుతున్న ఉత్పాతాల

గురించి ఆలోచింపసాగారు. వారిలో ఉపనందుడు అనే వృద్ధ యాదవుడు లేచి ఇలా అన్నాడు.

"ఇటీవలి కాలంలో గోకులంలో జరుగుతున్న పరిణామాలను బట్టి చూస్తే, మనం ఈ గోకులంలో ఉండటం అంత మంచిది కాదు, మనపిల్లలకు క్షేమం కాదు అని పిస్తూ ఉంది. రాముడు, కృష్ణుడు ఇంకా గోకులంలో ఉన్న బాలురను చంపడానికి ప్రయత్నాలు ఎన్నో జరగడం మనం కళ్లారా చూస్తున్నాము.

కృష్ణుడు నెలల బిడ్డగా ఉన్నప్పుడు పూతన అనే రాక్షసివచ్చి పాలిచ్చి చంపడానికి ప్రయత్నించింది. ఆ విష్ణుభగవానుని కృపవలన ఎలాగో బతికి బయటపడ్డాడు. కృష్ణుడు బండి కింద పడుకొని ఉన్నప్పుడు బండి విరిగి పడింది. సుడి గాలి రూపంలో ఒక రాక్షసుడు వచ్చి కృష్ణుని చంపడానికి ప్రయత్నించాడు. దైవం అప్పుడూ కృష్ణుని కాపాడింది. మొన్నటికి మొన్న రెండు పెద్ద మద్ది చెట్లు అకారణంగా కూకటివేళ్లతో సహా కూలిపోయాయి. మన కృష్ణుడు దేవుని దయవలన బతికి బయట పడ్డాడు.

ఇప్పటికి ఇవి జరిగాయి. ఇలాంటిదే ఇంకొకటి జరిగి కృష్ణుని ప్రాణాలు ఆపదలో పడకముందే మనం ఇక్కడి నుండి మరొకచోటికి వెళ్లిపోవడం మంచిది. ప్రతిసారీ దేవుడు రక్షిస్తాడని అనుకోలేము కదా! ఇక్కడికి కొంచెం దూరంలో బృందావనము అనే వనము ఉంది. అక్కడ మన ఆవులకు, పశువులకు సమృద్ధిగా గడ్డి, ఆకులు,మేత దొరుకుతుంది. ఆ ప్రాంతం ఎల్లప్పుడూ పచ్చని చెట్లతో, పచ్చికతో

కళకళలాడుతూ ఉంటుంది. చుట్టు పచ్చటి అడవులు, కొండలుఉన్నాయి. మనకు కావలసిన పండ్లు, కాయలు, ఆకు కూరలు సమృద్ధిగా దొరుకుతాయి. కాబట్టి ఇంక ఏ మాత్రం ఆలస్యం చేయకుండా మనం అందరం బృందావనానికి వెళ్లిపోదాము. నా సలహా మీ అందరికీ నచ్చితే బండ్లు కట్టించండి. ముందు ఆవులను తోలుకొని కొంతమంది వెళతారు. తరువాత ఆడవాళ్లు బళ్లలో వెళతారు. ఆ వెనక వారికి రక్షణగా మనం అంతా నడిచి వెళదాము." అని అన్నాడు.

ఉపనందుని మాటలను గ్రామస్థులు అందరూ సమర్థించారు. నందుడు కూడా ఉపనందుని మాటలను పాటించాలని నిశ్చయించుకున్నాడు. అందరూ ప్రయాణ సన్నాహాలు ప్రారంభించారు. గోవులను, దూడలను, ఎద్దులను అన్నిటినీ ఒక చోట చేర్చారు. ముసలివారు, స్త్రీలు, బాలురు బండ్లలోకి ఎక్కారు. యువకులు అందరూ విల్లు అమ్ములు ధరించి రక్షణగా నిలిచారు. మరి కొందరూ కొమ్ములు బూరలు ఊదుతూ ముందు నడిచారు. వీరితో పాటు పురోహితులు కూడా వెళ్లారు.

గోపికా స్త్రీలు అందరూ మంచి మంచి దుస్తులు ఆభరణములు ధరించి బండ్లు ఎక్కారు. అందరూ పాటలుపాడుతున్నారు. యశోద, రోహిణి, బలరాముడు, కృష్ణుడు ఒక బండిలో ఎక్కారు. అందరూ కొంతదూరం ప్రయాణం చేసి బృందావనము చేరుకున్నారు. తమ బండ్లను అర్ధ చంద్రాకారంలో నిలబెట్టారు. మధ్యలో గోవులను, దూడలను కట్టేసారు. బృందావనములో ఉన్న ప్రశాంత వాతావరణము, పక్కనే యమునా నది, పచ్చటి అడవులు చూచి వారందరూ ఎంతో సంతోషపడ్డారు.

క్రమక్రమంగా వారు అక్కడ ఇళ్లు నిర్మించుకొని చిన్న గ్రామంగా ఏర్పడ్డారు.

ఇప్పుడు బలరాముడు, కృష్ణుడు కొంచెం పెద్దవాళ్లయ్యారు అంటే సుమారుగా నాలుగేళ్లు. చిన్నిచిన్ని చర్నాకోలలు తీసుకొని ఆవుదూడలను తీసుకొని, ఎంతో దూరం పోకుండా, పక్కనే ఉన్న అడవిలోకి వెళ్లి మేపుతున్నారు. ఆవు దూడలు కూడా చెంగు చెంగున ఎగురుతూ బలరాముడు, కృష్ణుడు, ఇంకా వారి వయసు గోప బాలురతో కలిసి అడవికి మేతకు వెళుతున్నాయి.

ఆవుదూడలు పచ్చికమేస్తుంటే, బలరామ కృష్ణులు, గోపబాలురు చెట్ల నీడలలో కూర్చుని వేణువులు ఊదుతూ ఉండేవారు. చెట్లకు ఉన్న కాయలను రాళ్లతో కొట్టి రాల్చేవారు. గంతులు వేస్తూ ఆడుకొనేవారు. కొంతమంది తాము ఎద్దుల ఆట ఆడుకుంటూ ఒకరితో ఒకరు కుమ్ముకునేవారు. మరి కొంతమంది పక్షులు, జంతువులు మాదిరి అరుస్తుండేవారు.

ఇలా బృందావనములో రోజులు గడుస్తున్నాయి. కంసుడికి ఈ వర్తమానం చేరింది. కృష్ణుని చంపడానికి మరొక రాక్షసుడిని పంపించాడు. వాడు బృందావనమునకు వచ్చాడు. ఆవుదూడలను మేపుతున్న కృష్ణుని చూచాడు. తానుకూడా ఒక ఆవుదూడగా మారి పోయాడు. ఆవుదూడలలో కలిసిపోయాడు. తోటిబాలురతో ఆడుకుంటున్నప్పటికినీ, ఎంతో అప్రమత్తంగా ఉన్న కృష్ణుడు ఆ రాక్షసుడు ఆవుదూడ రూపంలో రావడాన్ని ఓరకంటితో గమనిస్తున్నాడు.

బలరాముని పిలిచి ఆ రాక్షసుని చూపిస్తూ కనుసైగచేసాడు.

కృష్ణుడు నక్కుతూ నక్కుతూ ఆ దూడ రూపంలో ఉన్న రాక్షసుని వద్దకు వెళ్లాడు. ఆ దూడ వెనక కాళ్లను పట్టుకున్నాడు. తోక మెలిపెట్టాడు. వెనక కాళ్లను పట్టుకొని పైకి లేపాడు. గిరా గిరా తిప్పాడు. పక్కనే ఉన్న వెలగ చెట్టు మాను కేసి బాదాడు. ఆ దెబ్బకు వెలగ చెట్టు విరిగి నేలకూలింది. ఆ రాక్షసుడు కూడా చచ్చి నేలమీద పడ్డాడు.

భయంకరాకారంతో చచ్చిపడి ఉన్న రాక్షసుని చూచి గోప బాలురు "భలే కృష్ణా! చాలా బాగా చంపావు. లేకపోతే మన ఆవుదూడలను తినడానికి వస్తాడా వీడు. చచ్చాడు దొంగ వెధవ" అంటూ కృష్ణుని పొగిడారు. తరువాతఅందరూ తాము తెచ్చుకున్న చద్ది అన్నము తినడానికి ఆకులు తెచ్చుకొని కూర్చున్నారు. అందరూ తాము తెచ్చుకున్న చల్దులను ఒకరితో ఒకరు పంచుకుంటూ ఆరగించారు. ఆ ప్రకారంగా బృందావనంలో రోజులు నిశ్చింతగా గడుస్తున్నాయి.

ఒక రోజు దూడలన్నీ మేత మేసాయి. వాటికి నీరు తాగించడానికి దగ్గరలో ఉన్న మడుగు దగ్గరకు తీసుకెళ్లారు గోపబాలురు. దూడలు నీళ్లు తాగుతున్నాయి. ఆ నీటిలో ఒక పెద్ద కొంగ నిలబడి ఉంది. తపస్సు చేసుకుంటున్న మునిమాదిరి కళ్లు మూసుకొని ఉంది. ఆ కొంగ ముక్కు బాగా పొడుగ్గా ఉంది. వాడు బకుడు అనే రాక్షసుడు. కృష్ణుని చంపడానికి కంసుడు పంపినవాళ్లలో వీడొకడు.

ఇది గమనించిన కృష్ణుడు వీడు ఏమి చేస్తాడో చూద్దామని ఆ కొంగ దగ్గరగా వెళ్లాడు. బకుడు అనే ఆ రాక్షసుడు తన పొడుగాటి ముక్కుతో కృష్ణుని పట్టుకున్నాడు. కృష్ణుడు "అమ్మో అయ్యో చచ్చానురోయ్" అంటూగిలా గిలా కొట్టుకున్నట్టు నటించాడు. ఇంతలో ఆ బకాసురుడు కృష్ణుని గుటుక్కున మింగాడు. కృష్ణుడు కనపడలేదు. ఇది చూచి గోపబాలకులు "అమ్మో కృష్ణుని కొంగ మింగేసింది. ఏం చెయ్యాలి దేవుడోయ్. దేవుడా రక్షించు. .దేవుడా రక్షించు" అంటూకేకలుపెడుతున్నారు.

కొంగ మింగిన కృష్ణుడు కొంగకు మింగుడు పడలేదు. గొంతుకు అడ్డం పడ్డాడు. కొంగకు ఊపిరి ఆడలేదు. వీడితో మనకెందుకని కృష్ణుని బయటకు కక్కేసింది కొంగ. కొంగ నోట్లో నుండి బయట పడ్డ కృష్ణుని చూచి గోప బాలకులు "దేవుడా మా కిష్టయ్యను రక్షించావా" అంటూ దండాలుపెట్టారు. చప్పట్లు కొట్టారు.

తాను మింగినా చెక్కుచెదరకుండా తన ఎదురుగా నిలబడి ఉన్న బాలుని చూచి బకాసురుడు కోపంతో ఊగిపోయాడు. తన ముక్కుతో కృష్ణుని పొడుస్తున్నాడు. కృష్ణుని పొడిచి పొడిచి చంపాలని వాడి ఆలోచన. కాని కృష్ణుడు బకాసురుడి ముక్కుకు అందకుండా అటు ఇటు పరుగెడుతున్నాడు. అదును చూచి బకాసురుడి ముక్కు పట్టుకున్నాడు. వాడి ముక్కును పట్టుకొని రెండుగా పగలదీసి, రెల్లు గడ్డిని చీల్చినట్టు చీల్చాడు. ఆ విధంగా బకాసురుడు చిన్ని కృష్ణుని చేతిలో మరణించాడు.

చిన్ని కృష్ణుని చేతిలో అంత పెద్ద కొంగ చావడం చూచి గోపబాలురు ఆశ్చర్యంతో తలమునకలు అయ్యారు. "ఏమిటీ వింత?" అని గుసగుసలాడుకున్నారు. అంతాతెలిసిన బలరాముడు కృష్ణుని ప్రేమతో కౌగలించుకున్నాడు. కృష్ణుడు నర్మగర్భంగా బలరాముని వంక "మరొకడు చచ్చాడు" అన్నట్టు చూచాడు. బలరాముడు తనలో తాను నవ్వుకున్నాడు.

కృష్ణుడు పేద్ద కొంగను చంపాడు అన్న విషయం బృందావనం అంతా తెలిసిపోయింది. కృష్ణుడు క్షేమంగా ఉన్నాడని తెలిసి అంతా ఊపిరి పీల్చుకున్నారు. "కొంగ కడుపులోకి పోయి బయటకు రావడం మాటలా. మన కృష్ణుడు యముడికే మొగుడు అయ్యాడు" అని ఛలోక్తిగా అనుకున్నారు.

నందుడికి మాత్రము మనసులో భయం ఎక్కువ అయింది. దానికి తోడు మిగిలిన వారు అందరూ ఇలా అనుకున్నారు. "ఇక్కడికి వచ్చినా కృష్ణుడికి ప్రాణ గండం తప్పడం లేదు. అయినా ఇప్పటికి జరిగిన అన్ని సంఘటనలలో కృష్ణుడు క్షేమంగా బతికి బయటపడుతున్నాడు. కృష్ణుని చంపడానికి వచ్చిన రాక్షసులే నాశనం అవుతున్నారు. కృష్ణుడిని చంపడానికి ఎంత మంది వచ్చినా వారంతా అగ్నిలో పడ్డ మిడతలవలె మాడి పోతున్నారు తప్ప కృష్ణుడిని ఏమీ చేయలేకపోయారు. ఏ దేవుడో కృష్ణుని ప్రతిసారీ రక్షిస్తున్నాడు." అని ఆ కనపడని దేవుడికి మొక్కుకున్నారు ఆ అమాయక గోపకులు.

నందుడు మాత్రము "ఆనాడు గర్గుడు చెప్పిన మాటలు అక్షరాలా నిజం అవుతున్నాయి. కృష్ణుడు సామాన్య మానవుడు కాడు." అని అనుకున్నాడు.

ఈ ప్రకారంగా బలరాముడు, కృష్ణుడు తమ బాల్య లీలలతో గోకులంలో వారిని ఆనంద పరుస్తూ తమ బాల్యాన్ని దాగుడు మూతలు, చిక్కుచిక్కుపుల్ల, కోతికొమ్మచ్చి, ఒకరిని ఒకరు ముట్టుకోవడం లాంటి ఆటలు ఆడుకుంటూ గడుపుతున్నారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణలీలలను వీనుల విందుగా వివరిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
పన్నెండవ అధ్యాయము.

"పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా కాలం గడుస్తూ ఉంది. సాధారణంగా కృష్ణుడు, బలరాముడు, గోపబాలురు పొద్దుటే చల్ది అన్నం తిని, మధ్యాహ్నం తినడానికి అన్నం కట్టుకొని, ఆవుదూడలను తోలుకొని సమీపములో ఉన్న పచ్చి బయళ్లకు వెళతారు. ఆరోజు మాత్రం తమ చల్దిభోజనాలను వనంలోనే చెయ్యాలని సంకల్పించాడు కృష్ణుడు.

అంటే  కృష్ణుడు వన భోజనాలుచెయ్యాలని అనుకున్నాడు. ఆ విషయం తన స్నేహితులకు చెప్పాడు. వారంతా సంతోషంగా తలలుఊపారు.

మరునాడు అందరూ పెందరాడే నిద్రలేచారు. కృష్ణుడు తన వేణువు ఊదాడు. ఆ వేణునాదానికి బృందావనములో ఉన్న గోప బాలురు అందరూ నిద్ర లేచారు. ముఖాలు కడుక్కొని స్నానాలు చేసారు. చద్దిమూటలు కట్టుకున్నారు. ఆవు దూడలను తోలుకొని సమీపములో ఉన్న వనములోనికి వెళ్లారు. చేతిలో చిక్కములు, ఆవుదూడలను అదిలించడానికి బెత్తములు, ఊదడానికికొమ్ములు, పిల్లనగ్రోవులు తీసుకొని వెళ్లారు. ఆవు దూడలు ముందు వెళుతుంటే వెనక గోపబాలురు కృష్ణుడితో సహా ఎగురుతూ దుముకుతూ వెళు తున్నారు.

అందరూపచ్చిక ఉన్న చోటికి చేరారు. దూడలను మేతకు విడిచారు. తాము చెట్ల కింద చేరారు. చెట్ల కొమ్మలు ఎక్కుతూ, దుముకుతూ పరుగెడుతూ ఆడుకుంటున్నారు. ఒకడు మరొకడి చర్నాకోల ఎత్తుకుపోతే వాడిని తరుము కుంటూ వీడు వెళుతున్నాడు. ఒకడు మరొకడి చద్దిమూట దాచిపెట్టాడు. అది కనపడక వాడు కుయ్యోమొర్రో అంటున్నాడు. ఒకడు మరొకడి వేణువు దూరంగా విసిరివేసాడు. దాని కోసరం వాడు పరుగెడుతున్నాడు.వాడు దగ్గరగా రాగానే ఆ వేణువును దూరంగా ఉన్న మరొకడి దగ్గరకు విసురుతున్నాడు. ఆ వేణువు కలవాడు వాడి దగ్గరకు పరుగెడుతున్నాడు. అలా కాసేపు వాడిని ఏడిపించి వాడి వేణువును వాడికి ఇస్తున్నారు.

కృష్ణుడు దూరంగా వెళ్లి నిలబడితే కృష్ణుని ముట్టుకోవడానికి గోపబాలురు పోటీలు పడి పరుగెడుతున్నారు. కొంతమంది బూరలు ఊదుతున్నారు. మరి కొందరు వేణువులు శ్రావ్యంగా ఊదుతున్నారు. కొందరు పక్షులు అరుస్తుంటే వాటి మాదిరి అరుస్తున్నారు. కొందరు హంసల నడకను అనుకరిస్తూ వయ్యారంగా నడుస్తున్నారు. మరి కొందరు కొంగలవలె కళ్లుమూసుకొని ఒంటికాలి మీదనిలబడ్డారు. మరి కొందరు నెమలి ఆడినట్టు ఆడుతున్నారు. కొందరు అక్కడు ఉన్న కోతి పిల్లలను పట్టుకొని వినోదిస్తున్నారు. మరి కొందరు కోతులను పట్టుకోడానికి ఒక కొమ్మ మీది నుండి మరొక కొమ్మ మీదికి కోతుల మాదిరి దుముకుతున్నారు. కొందరు కప్పల మాదిరి ఒక చోటినుండి మరొక చోటికి దుముకుతున్నారు. కృష్ణుడు కూడా వారితో కలిసిపోయి ఆడుకుంటున్నాడు. ఆ విధంగా గోపబాలురు అందరూ తమ తమ బాల్యచేష్టలతో ఆనందిస్తున్నారు.

ఓ పరీక్షిత్‌మహారాజా! ఎన్నో జన్మల పాటు యమము, శమము, దమము  మొదలగు నియమములనుపాటిస్తూ, చిత్తమును, శరీరమును అదుపులో పెట్టుకొన్న యోగులు కూడాఆ పరమాత్మ సాన్నిధ్యమును పొందలేకపోతున్నారు. కానీ ఈ అమాయక గోపబాలురు నిరంతరము కృష్ణుని తమ ముందుంచుకొని, ఆయనను తాకుతూ, ఆయనతో ఆడుకుంటూ వినోదిస్తున్నారు. వారి అదృష్టము వర్ణింపనలవికాదు కదా!

పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా గోప బాలురు కృష్ణునితో చేరి ఆడుకుంటూ ఉంటే అఘాసురుడు అనే రాక్షసుడు కృష్ణుని

చంపడానికి అక్కడకు వచ్చాడు. ఈ అఘాసురుడు పూతనకు, బకాసురునికి సోదరుడు.ఈ అఘాసురుని ధాటికి దేవతలు కూడా భయపడతారు. అటువంటి అఘాసురుడు కంసుడు పంపగా తన సోదరిని వెతుక్కుంటూ బృందావనమునకు వచ్చాడు. గోపబాలురతో ఆడుకుంటున్న కృష్ణుని చూచాడు.

"వీడేనా నా సోదరి పూతనను, నా సోదరుడు బకాసురుని చంపింది. ఈ రోజు ఈ బాలుని చంపి నా సోదరీ సోదరులమనస్సుకు శాంతి కలిగిస్తాను. ఈ బాలుని చంపడం నా సోదరీ సోదరులకు తిలోదకాలు ఇవ్వడం లాంటిది. వీడిని, ఈ గోపబాలురను  చంపితే ఈ బృందావనలో ఉన్న వారందరూ చచ్చిన తమ సంతానముతో పాటు చస్తారు. కాబట్టి ముందు ఈ కృష్ణుని చంపాలి." అని నిశ్చయించుకున్నాడు అఘాసురుడు.

ఆ అఘాసురుడు వెంటనే ఒక పెద్ద కొండచిలువగా మారి పోయాడు. వాడి నోరు పెద్ద కొండ గుహలాగా ఉంది. కృష్ణుడు, ఇతర గోపబాలురు ఆడుకునే స్థలం దగ్గర వారికి కనపడేటట్టు తన నోరు కొండ గుహలాగా తెరిచి కదలకుండా పడుకొనిఉన్నాడు. గోపబాలురలో ఒకడు దాని దగ్గరకు పోయి "ఒరేయ్ ఇదేదో కొండగుహ లాగా ఉందిరా. ఇందులో ఏముందో చూద్దామా" అని అరిచాడు. అందరూ అక్కడకు చేరుకున్నారు. వారిలో ఒకడు "ఇదిఅచ్చం పాము నోరు తెరిస్తే ఎలా ఉంటుందో అలా  ఉందిరా!" అని అన్నాడు. మరొకడు "బాగా చెప్పావురా.  కానీ, ఇది నిజంగా కొండ గుహ అంటావా లేక  మనలను చంపడానికి వచ్చిన పెద్ద పాము నోరు తెరిచి పడుకొని ఉందా!  చూడు దాని కోరలు ఎలా కత్తులమాదిరి

ఉన్నాయో. దీనినోరు ఆకాశమంత ఉంది. పైగా ఇది తననాలుక బయటకు చాచి పెట్టింది. దీని నాలుక నున్నని రహదారిలా ఉందిరా. అమ్మో! అది విడిచే గాలి ఎంత వేడిగా ఉంది. మాడిపోయేటట్టు ఉన్నాము. మనం దీని జోలికి పోవద్దు." అని అన్నాడు ఒక గోపబాలుడు. మరొకడు ముందుకు వచ్చి "ఇది మనలనేంచేస్తుందిరా. ఇదివరకు వచ్చిన కొంగ రాక్షసుడి మాదిరి చస్తుంది. కృష్ణుడు మన పక్కనుండగా మనకు భయమేంటిరా. పదండి దీని అంతు చూద్దాము." అని అన్నాడు ధైర్యంగా.

వీరిమాటలను విని కృష్ణుడు నవ్వుతున్నాడు. కృష్ణుడి నవ్వు చూచి అందరికీ ధైర్యము వచ్చింది. అందరూ చప్పట్లు కొట్టుకుంటూ అఘాసురుడు చాచిన నాలుక మీదుగా వాడి నోట్లోకి ప్రవేశించారు. కృష్ణుడు కంగారుపడ్డాడు. " అయ్యో! ఇది మామూలు సర్పంకాదు. నన్ను చంపడానికి వచ్చిన రాక్షసుడు. వీరందరూ తనను నమ్ముకొని ఈ సర్పం నోట్లోకి వెళుతున్నారు. ఇప్పుడు ఎలాగా" అంటూ వారందరినీ వద్దు వద్దు వెళ్లవద్దు అని అడ్డుపడ్డాడు కృష్ణుడు. అప్పటికే ఆలస్యం అయి పోయింది. గోపబాలురు అందరూ పరుగు పరుగున ఆ సర్పం పొట్టలోకి వెళ్లిపోయారు.

అందరూ వచ్చారు కానీ ఇంకా కృష్ణుడు రాలేదు. అందుకని కృష్ణుడు వచ్చేవరకూ, గోపబాలురను మింగకుండా, కృష్ణుని కొరకు ఎదురు చూస్తున్నాడు అఘాసురుడు. అప్పటికే అఘాసుని పొట్టలోకి వెళ్లి పోయిన తన స్నేహితులు జీర్ణం అయిపోయారేమో అని భయపడ్డాడు కృష్ణుడు. "ఇప్పుడేం చెయ్యాలి? వీడిని చంపితే వీడితో పాటు గోప బాలురు మరణిస్తారు. గోపబాలురను కాపాడాలంటే వీడిని

చంపకూడదు. వీడిని చంపాలి కానీ గోపబాలురను కాపాడాలి. ఇది ఎలాగ?"అని ఆలోచిస్తున్నాడు కృష్ణుడు.

ముందు ఈ రాక్షసుని చంపడమే ఉత్తమమైనమార్గము అనుకున్నాడు. వెంటనే తానుకూడా ఆ రాక్షసుని నోట్లోకి ప్రవేశించాడు. కృష్ణుడు తన నోట్లోకి రాగానే అఘాసురుడు నోరు మూసాడు. కాని కృష్ణుడు వాడి గొంతుకు అడ్డం పడ్డాడు. నిలువుగా అడ్డంగా పెరగసాగాడు. కృష్ణుడు అఘాసురుడి గొంతు అంతా నిండి పోయాడు. అఘాసురుడికి ఊపిరి ఆడటం లేదు. గొంతు పగిలిపోయేటట్టు ఉంది. గిలా గిలా కొట్టుకుంటున్నాడు. కృష్ణుడు మాత్రము తన శరీరాన్ని పెంచుతూనే ఉన్నాడు. ఊపిరి ఆడకపోవడంతో అఘాసురుడి ప్రాణాలు, తలను పగులగొట్టుకొని బయటకు వెళ్లిపోయాయి.

అఘాసురుడు మరణించిన తరువాత కృష్ణుడు అఘాసురుని పొట్టలోకి వెళ్లాడు. అక్కడ గోప బాలురు అందరూ చచ్చిపడి ఉన్నారు. వారి నందరినీ తన అమృతతుల్యమైన చూపులతో బతికించాడు. అందరూ గుహ మాదిరి తెరుచుకొని ఉన్న ఆ పాము నోట్లో నుండి బయటకు వచ్చారు. పరమాత్మ చేతిలో మరణించిన ఆ అఘాసురుని శరీరములోనుండి ఒక జ్యోతి బయటకు వచ్చి ఆకాశంలో వెలుగుతూ ఉంది. శ్రీకృష్ణుడు అఘాసురుని శరీరంలోనుండి బయటకు రాగానే, ఆ జ్యోతి కృష్ణునిలో ఐక్యం అయింది.

ఇదంతా పైనుండి చూస్తున్న దేవతాగణములు కృష్ణుని మీద పూలవాన కురిపించారు. జయజయధ్వానాలు చేసారు. కృష్ణుని మహిమను వేనోళ్ల పొగిడారు. ఒక్క స్వర్గలోకమే కాదు బ్రహ్మ లోక

వాసులందరూ కృష్ణుని లీలలను పొగుడుతూ జయజయధ్వానాలు చేస్తున్నారు. అప్సరసలు నృత్యం చేస్తున్నారు. గంధర్వులు పాడుతున్నారు. వివిధములైన వాయిద్యములు వాయిస్తున్నారు. కొందరు స్తోత్రపాఠాలు చదువుతున్నారు.

వారు చేస్తున్న జయజయధ్వానాలు బ్రహ్మదేవుని చెవిని పడ్డాయి. ఆ కోలాహలం ఏమిటో తెలుసుకుందామని బ్రహ్మదేవుడు అక్కడకు వచ్చాడు. జరిగింది తెలుసుకున్నాడు. చిన్నికృష్ణుని మహిమను చూచి ఆశ్చర్యపడ్డాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుడు కొండ చిలువ రూపంలో ఉన్న అఘాసురుని చంపాడు కదా! ఆ కొండ చిలువ శరీరము ఆ అడవిలో అలాగే ఎండకు ఎండి పోయింది. చనిపోయేటప్పుడు అది తెరిచిన నోరు అలాగే పెద్ద కొండగుహలాగా ఉంది. దూడలను మేపడానికి వచ్చిన గోపబాలురు ఆగుహలో దూరి ఆడుకుంటున్నారు. బృందావనములో ఉన్న వారుకూడా అప్పుడప్పుడు వచ్చి ఎండిపోయిన కొండచిలువ శరీరాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుడు అఘాసురుని చంపడం ఆయన ఐదవ సంవత్సరంలో జరిగింది. కాని గోపబాలురు అందరూ ఆ సంఘటన కృష్ణుని ఆరవ సంవత్సరంలో జరిగిందని బృందావనములో రకరకాలుగా వర్ణించి చెప్పారు. ఎలాగంటే, పొద్దుటే చద్ది అన్నాలు కట్టుకొని వెళ్లారు. వనములో తిన్నారు. అఘాసురుడు వాళ్లనుమింగాడు. కృష్ణుడు అఘాసురుని చంపాడు. గోపబాలురను

బయటకు వచ్చారు. మధ్యాహ్న భోజనాలు చేసారు. అదే రోజు సాయంత్రం గోపబాలురు ఇంటి వస్తూ ఆ కొండచిలువ శరీరాన్ని చూచారు. అప్పటికి అది ఎండిపోయి ఉంది. ఉదయం చచ్చిన కొండ చిలువ సాయంత్రానికి ఎండి ఒరుగు ఎలా అవుతుంది!

సాక్షాత్తు పరమాత్మ అవతార మైన కృష్ణుని విషయంలో ఇదేమీ అసాధ్యం కాదు. విచిత్రము అంతకంటే కాదు. అంతెందుకు కృష్ణుని చంపడానికి వచ్చిన అఘాసురుడుకూడా కృష్ణుని స్పర్శచేత తాను చేసిన పాపములను పోగొట్టుకొని మోక్షమును పొందాడు. భగవంతుని రూపమును బలవంతంగానైనా ఒక్కసారి మనసులో నిలుపుకుంటే, అటువంటి జీవుడికి మోక్షం ప్రసాదిస్తాడు పరమాత్మ. పరమాత్మ అనుగ్రహము ఉంటే సకల జీవులకు ఆత్మసుఖానుభూతి కలుగుతుంది. మాయ పూర్తిగా తొలగిపోతుంది. అటువంటిది, పరమాత్మ స్వరూపుడైన కృష్ణుడు స్వయంగా అఘాసురుని శరీరంలోకి ప్రవేశించిన తరువాత, అఘాసురునికి మోక్షం కలగడంలో వింత ఏముంటుంది!" అని అన్నాడు శుకమహర్షి.

అప్పుడు పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహం కలిగింది. శుక మహర్షిని ఈ విధంగా అడిగాడు. "మహర్షీ! ఉదయం చచ్చినకొండ చిలువ సాయంత్రానికి ఎలాఎండి పోయింది. ముందు కాలంలో జరిగిన విషయం తరువాతి కాలంలోజరిగినట్టు ఎలా భ్రమ కలుగుతుంది. కృష్ణుని ఐదవ సంవత్సరంలో జరిగిన అఘాసుర వధ కృష్ణుని ఆరవ సంవత్సరంలో జరిగినట్టు బృందావన వాసులు, గోపబాలురు ఎలా భావించారు. ఆ ఒక్క రోజులో కృష్ణుడి వయసు సంవత్సరం పెరిగిందా! ఈ సంవత్సరం పాటు గోపబాలురు ఎక్కడ

ఉన్నారు! ఏమి చేస్తున్నారు! నాకంతా అయోమయంగా ఉంది. ఈ విషయం నాకు వివరంగా చెప్పండి. వినడానికి చాలా కుతూహలంగా ఉంది." అని అన్నాడు.

పరీక్షిత్ మహారాజు ఆ విధంగా అడగగానే శుకమహర్షి ఒక్కసారిగా తన మనసులో కృష్ణుని ధ్యానించాడు. ఆయన శరీరం అంతా పులకరించింది. కాసేపు సమాధి స్థితిలోకి వెళ్లిపోయాడు. అప్పుడు జరిగిన విషయములను ఒక్కసారి గుర్తుకు తెచ్చుకున్నాడు. నెమ్మదిగాకళ్లు తెరిచాడు. పరీక్షిత్ మహారాజుతో ఇలా చెప్పసాగాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము పన్నెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

పదమూడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పుడు నీవు అడిగిన ప్రశ్న చాలాగొప్పది. నీ వంటి ఏకాగ్రభక్తులు అడగ వలసిన ప్రశ్న అడిగావు. నీ వంటివారు ఎల్లప్పుడు ఆపరమాత్మయొక్క లీలలను వినడంలో ఆసక్తి చూపుతుంటారు అనడంలో సందేహము లేదు. నీవు అడిగిన విషయము భగవంతుని యొక్క తత్వమునకు సంబంధించినది. అతి రహస్యము. కాని, నీవు కృష్ణభక్తుడవు కాబట్టి నీకు చెబుతున్నాను.

ఎందుకంటే, గురువులు తమ ప్రియమైన శిష్యులకు అత్యంత రహస్యములైన విషయములను కూడా చెబుతుంటారు కదా!

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు కృష్ణుడు అఘాసురుని చంపి గోపబాలురను రక్షించాడని, ఆ సాయంత్రం అందరూ ఇళ్లకు వెళ్లారనీ, ఇళ్లకు వెళుతూ ఉంటే వారికి సంవత్సరం పాటు ఎండిపోయి ఉన్న కొండచిలువ శరీరం కనిపించిందనీ, గోపబాలురు అంతా కృష్ణుడు ఆరోజు ఉదయమే కొండచిలువను చంపాడని చెప్పుకున్నారని చెప్పానుకదా! అంటే కృష్ణుడి ఐదవ సంవత్సరంలో జరిగిన సంఘటన వారికి కృష్ణుడు ఆరవ సంవత్సరములో ఉండగా జరిగినట్టు అనిపించింది. అంటే ఒక సంవత్సరము తరువాత తెలిసింది అన్నమాట. అది ఎలా జరిగిందంటే........

కృష్ణుడు కొండచిలువ (అఘాసురుని) చంపిన తరువాత మరలా అందరూ తాము అంతకుముందు ఆడుకుంటూ ఉన్న సరోవర తీరానికి చేరుకున్నారు. అందరికీ ఆకలి వేసింది. బువ్వ తిందామని అనుకున్నారు. అప్పటికే ఆవుదూడలు కడుపు నిండా పచ్చిగడ్డి తిని ఆ సరోవరములో స్వచ్ఛమైన నీటిని కడుపారా తాగుతున్నాయి. ఆవుదూడలు కడుపునిండా నీరు తాగిన తరువాత, గోపబాలురు అందరూ వాటిని ఆడుకోడానికి స్వేచ్ఛగావిడిచి పెట్టారు.

అందరూ చెట్లకింద అన్నాలు తినడానికి కూర్చున్నారు. అందరూ ఒకరి దగ్గరగా ఒకరు గుండ్రంగా కూర్చున్నారు. మధ్యలో చిన్ని కృష్ణుడు కూర్చున్నాడు. అందరూ కృష్ణుని చూస్తున్నారు. చెట్ల ఆకులతో దొప్పలు చేసుకొని ఆ దొప్పలలో అన్నం పెట్టుకొని తింటున్నారు. ఒకరు తెచ్చుకున్న

పదార్థములనుమరొకరు రుచి చూస్తున్నారు. అందరూ తాముతెచ్చిన పదార్థములను కృష్ణునికి పెట్టి తినిపిస్తున్నారు.

"కృష్ణా! ఈ ఊరగాయ చూడు ఎంత రుచిగాఉందో. కాస్త తిను" అంటూ కృష్ణుని నోటికి అందిస్తున్నారు. గోపబాలురు అందరూ తాము తెచ్చినది పక్క వాళ్లకు పెట్టి వారు తెచ్చుకున్నది తాము తింటున్నారు. కృష్ణుడు కూడా తన వేణువును తాను నడుముకట్టుకున్న ధట్టీలో దోపి, ఎడమ చంకలో ఊదుకునే బూరను పెట్టుకొని, కుడి చంకలో దూడలను అదిలించే బెత్తమును పెట్టుకొని, ఎడమచేతిలో ఆకు దొప్ప, ఆ దొప్పలో మీగడ పెరుగు అన్నము పెట్టుకొని, కుడి చేతి వేళ్ల సందున ఊరగాయ ముక్కలు పెట్టుకొని, దొప్పలో అన్నం తింటూ, ఊరగాయ ముక్కలను నంజుకుంటూ, నవ్వుతూ, నవ్విస్తూ, కేరింతలు కొట్టుకుంటూ భోజనం చేస్తున్నాడు చిన్ని కృష్ణుడు. దేవతలు ఈ వింత దృశ్యాన్ని పైనుండి చూసి ఆనందిస్తున్నారు.

వీరందరూ ఈ ప్రకారంగా చెట్ల నీడలో కూర్చుని అన్నం తింటుంటే, ఆవుదూడలు గెంతుతూ గెంతుతూ వారికి దూరంగా వెళ్లాయి. ఈ విషయాన్ని ఒకడు చూచాడు. "కృష్ణా! మన ఆవుదూడలు కనిపించడం లేదు. ఈఅడవిలో ఎక్కడ తప్పిపోయాయో ఏమో!" అని కంగారుగా అన్నాడు. ఆ మాటలు విన్న కృష్ణుడు లేచి "ఏం భయం లేదు. మీరు అన్నాలు తింటూ ఉండండి. నేను వెళ్లి ఆవుదూడలను వెతికి తోలుకొని వస్తాను." అని అంటూ కృష్ణుడు చేతిలో ఉన్న మీగడ పెరుగు అన్నంముద్దను కొంచెం కొంచెంగా తింటూ ఆవులను వెదకడానికి వెళ్లాడు.

ధట్టిలో వేణువు, చంకలో బెత్తము, ఎడమ చేతిలో పెరుగు అన్నం ముద్ద, కుడి చేతి వేళ్ల మధ్య ఊరకాయ ముక్కలు నంచుకుంటూ, పెరుగుఅన్నం తింటూ, తప్పిపోయిన ఆవు దూడలను వెతుక్కుంటూ వెళుతున్నాడు కృష్ణుడు. అడవి అంతా గాలిస్తున్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! కొండచిలువరూపంలో ఉన్న అఘాసురుని చంపినపుడు బ్రహ్మలోక వాసులందరూ పైనుండి చూచి కోలాహలంగా మాట్లాడుకుంటుంటే, అదేమిటో చూద్దామని బ్రహ్మకూడా బయటకు వచ్చాడని చెప్పానుకదా! బయటకు వచ్చిన బ్రహ్మదేవుడు కృష్ణుడు అఘాసురుని చంపడం, చెట్లకింద భోజనాలు చెయ్యడం చూచాడు. లోకపాలకులకు పాలకుడు, అనంత విశ్వాన్ని తన కడుపులో దాచుకున్నవాడు, నిరాకారుడు, నిర్గుణుడు, తనతండ్రి అయిన విష్ణుమూర్తి ఈ ప్రకారంగా లీలలు చేయడం చూచి ఆశ్చర్యపోయాడు. బ్రహ్మదేవుని ఆహంకారం ఆవహించింది. ఈకృష్ణుని శక్తి ఏపాటితో చూద్దామని అనుకున్నాడు. ఆవుదూడలను అన్నిటినీ మాయం చేసాడు. వాటి స్పృహ పోగొట్టి సమీపంలో ఉన్న కొండ గుహలో దాచాడు. ఇప్పుడు కృష్ణుడు ఏ లీల చేసి ఆవుదూడలను రక్షిస్తాడో చూద్దామని ఆతురతగా చూస్తున్నాడు బ్రహ్మదేవుడు.

కృష్ణుడు ఎంత వెదికినా ఆవుదూడలు కనిపించలేదు. ఇంక వెదికి లాభం లేదని తిరిగి తాము అన్నాలు తింటున్న చెట్టు కిందికి వచ్చాడు. ఇప్పుడు బ్రహ్మదేవుడు చెట్టు కింద ఉన్న గోపబాలురను కూడా మాయం చేసాడు. వారికి కూడా స్పృహ తప్పించి, ఆవుదూడలను ఉంచిన కొండ గుహలోనే దాచాడు.

కృష్ణుడికి ఆవుదూడలు కనిపించలేదు. తన స్నేహితులైన గోపబాలురు కూడా కనిపించలేదు. వీళ్లంతా ఎక్కడకు పోయారా అని చుట్టుపక్కల వెదికాడు. ఎక్కడా గోపబాలురు కనిపించలేదు. కృష్ణుడు ఆలోచించాడు. ఇది అంతా తన కుమారుడు బ్రహ్మదేవుని చిలిపి చేష్ట అని తెలుసుకున్నాడు. తాను తలుచుకుంటే వెంటనే బ్రహ్మదేవుడు చేసిన మాయను పటాపంచలు చేసి గోపాలురను, ఆవుదూడలను తిరిగి తన వద్దకు రప్పించుకోగలడు. కాని అలా చేయలేదు. కానీ, బ్రహ్మదేవుడు ఎంతకాలం ఆవు దూడలను, గోపాలురను దాచిపెడతాడో చూద్దాం అనుకున్నాడు.

బ్రహ్మదేవుడు చేసిన మాయకు ప్రతి మాయ చేద్దామని అనుకున్నాడు కృష్ణుడు. ఒకటిగా ఉన్న కృష్ణుడు అనేకం అయ్యాడు. తానే ఆవుదూడలుగానూ, గోపబాలురుగానూ మారి పోయాడు. వారి చేతులలో ఉన్న వేణువులు, బెత్తములు, బూరలు, అన్నము ముద్దలు, ఊరగాయముక్కలు అన్నీ తానేఅయ్యాడు. ఆ గోపబాలకులు ఎలా ఉంటారో,ఎలా ప్రవర్తిస్తారో, ఎలా నడుస్తారో, ఎలా మాట్లాడతారో అలాగే అన్నీ యథాతథంగా అనుకరించసాగాడు. ఇప్పుడు తన చుట్టు గోపబాలురు ఉన్నారు. దూరంగా ఆవుదూడలు పచ్చిక మేస్తున్నాయి. యథాప్రకారంగా వారి మధ్య నిలబడి ఉన్నాడు కృష్ణుడు. కృష్ణుడిని మధ్యలో కూర్చోపెట్టుకొని అందరూ అన్నాలు తింటున్నారు. ఆవుదూడలు పచ్చిక మేస్తున్నాయి. (అంతారామమయం అన్నాడు రామదాసు. ఇక్కడ అంతా కృష్ణమయం అయింది.)

సాయంత్రం కాగానే, అన్నీ తానే అయిన కృష్ణుడు, వేణువు ఊదుకుంటూ, ఏమీతెలియని వాడి వలె, అన్నీ తానే అయిన ఆవుదూడలు, గోపబాలురతో సహా తమతమ ఇళ్లకు వెళ్లాడు. కృష్ణుడు ఒక్కొక్క గోప బాలునికి వాడి ఆవుదూడలను అప్పగించాడు. తాను కూడా గోప బాలుర రూపంతో, ఆవుదూడల రూపంతో వారి వారి ఇళ్లలో ప్రవేశించాడు. ఆ ప్రకారంగా ఎవరి ఇళ్లకు వాళ్లు వెళ్లారు. ఆవు దూడలు కూడా తమ తమ తల్లుల వద్దకు వెళ్లి పాలుతాగుతున్నాయి.

కృష్ణుని వేణు గానం విన్న గోపబాలుర తల్లులు తమ కుమారులు అడవి నుండి తిరిగి వచ్చారని గబ గబా బయటకు వచ్చారు. గోపబాలుర రూపంలో ఉన్న కృష్ణుని అక్కున చేర్చుకొని ముద్దులాడారు. స్నానం చేయించి వేడి వేడి అన్నం తినిపించారు. కృష్ణుడు కూడా గోపబాలుర రూపంలో వారి వారి తల్లులకు సంతోషాన్ని చేకూర్చాడు.

ప్రతిరోజూ ఆ గోపబాలురు ఏమేమి చేస్తారో ఆ పనులన్నీ కృష్ణుడు చేసేవాడు. అదే మాదిరి ఆవుదూడల రూపంలో ఉన్న కృష్ణుడు ప్రతిరోజూ ఆవు దూడలు ఏమేం చేస్తాయో ఆ పనులన్నీ తుచ తప్పకుండా చేసాడు. గోవులు కూడా దూడల రూపంలో ఉన్న కృష్ణుని తమ బిడ్డలు అనుకొని కడుపునిండా పాలు చేపేవి. ఆ ప్రకారంగా బృందావనములో ఉన్న గోప కాంతలకు కృష్ణుని మీద మాతృభావము పొంగి పొరలింది. కృష్ణుడు కూడా బృందావనములో ఉన్న గోపస్త్రీలు అందరూ నా తల్లులు అనే భావనతో వారి మాతృత్వాన్ని మనసారా చవిచూచాడు. బృందావనములో ఉన్న గోపకాంతలకు కూడా కృష్ణుని

మీద మాతృప్రేమ మొదటి నుండీ ఉంది. సాక్షాత్తు కృష్ణుడే తమ కుమారుని రూపంలో తమ వద్ద ఉన్నప్పుడు ఆ పుత్రప్రేమ రెండింతలు అయింది.

ఆ ప్రకారంగా కృష్ణుడు తానే అందరు గోపబాలురుగానూ, ఆవు దూడలు గానూ ఒక సంవత్సరము పాటు ఆడుకున్నాడు. అసలు గోపబాలురు, ఆవు దూడలు బ్రహ్మదేవుని మాయచేత ఆ కొండ గుహలో స్పృహతప్పి పడి ఉన్నారు. ఆ ప్రకారంగా భూమి మీద ఒకసంవత్సరం గడిచింది. బ్రహ్మదేవుడి కాలమానం ప్రకారము తృటికాలము గడిచింది. భూమి మీద సంవత్సరము పూర్తి కావడానికి ఇంకా ఐదు రోజులు మిగిలి ఉంది.

అన్నీ తానే అయిన కృష్ణుడు, ఒకరోజు  తన అన్న బలరామునితో సహా,   అన్నీతానే అయిన గోపబాలురు, ఆవుదూడలతో సహా సమీపములో ఉన్న అడవిలోకి వెళ్లాడు. ఆ సమయంలో ఈ ఆవు దూడలకు తల్లులు అయిన ఆవులను మేపడానికి బృందావనములో ఉన్న గోపకులు ఆవులను పక్కనే ఉన్న గోవర్ధన పర్వతము మీదికి తోలుకెళ్లారు. కృష్ణుడు, అన్నీ తానే అయిన ఆవు దూడలను గోవర్ధన పర్వతము కింద ఉన్న పచ్చిక బయళ్లలో మేతకు వదిలిపెట్టాడు.

ఎత్తైన ప్రదేశములో మేత మేస్తున్న ఆవులు, కింద పచ్చిక తింటున్న తమ దూడలను చూచాయి. కృష్ణుడే ఆవు దూడల రూపంలో ఉన్న  దూడలను చూడగానే ఆ గోవులకు తమ దూడల మీద ప్రేమ పెల్లుబికింది. తమ కాపరులను కూడా లెక్కచెయ్యకుండా ఎగురుతూ

దుముకుతూ తమ దూడల వద్దకు పరుగెత్తాయి.

ఉన్నట్టుండి ఆవులు అలా కొండ కిందికి పరుగెత్తడం చూచిన గోపకులు వాటి వెంట పడ్డారు. వాటిని ఆపడానికి నానాతంటాలు పడ్డారు. కోపంతో వాటిని కొడుతున్నారు. కాని ఆవులు గెంతుతూ దూకుతూ తమ దూడల వద్దకు పరుగెత్తాయి.  తమ దూడలను చూడగానే వాటి పొదుగుల నుండి పాలు కారడం మొదలుపెట్టాయి. ఆవులు తమ తమ దూడల శరీరాలను నాకుతున్నాయి. వాసన చూస్తున్నాయి. దూడలు కూడా తమ తల్లుల పొదుగులను కుడుస్తూ పాలు తాగుతున్నాయి.

ఆ గోవులను పట్టుకునేందుకు వాటి వెంట పరుగెత్తుతూ కిందికి వచ్చిన గోపకులు కూడా   కొండ కింద ఆవు దూడలను మేపుతున్న తమ కుమారులను చూచారు. ఆవుల మీద వారికి ఉన్న కోపం ఎగిరిపోయింది.  వారు కూడా పరుగు పరుగున తమ పుత్రుల వద్దకు వచ్చారు.  వారు తమ కుమారులను కౌగలించుకొని నుదుట ముద్దుపెట్టుకొని తమ సంతోషాన్ని వెల్లడించారు. అలా కొంచెం సేపు ఉన్న తరువాత ఆ గోపాలురు తమ గోవులను తోలుకొని కొండమీదికి వెళ్లిపోయారు.

ఇదంతా చూస్తున్న బలరామునికి ఒక సందేహంకలిగింది. రోజూ చూచే ఆవుదూడలే కదా. మరి ఈ రోజు గోవులకు తమ దూడల మీద ఇంత మమకారం ఎలాకలిగింది. అలాగే గోపాలురకు కూడా తమ పుత్రులమీద ఉన్నట్టుండి ఇంత మమకారం ఎలా పుట్టింది. ఇదంతా అయోమయంగా ఉంది. వీళ్లను ఏదైనా రాక్షస మాయ

ఆవహించిందా! లేక కృష్ణుడే ఈ మాయ సృష్టించాడా. నేను కూడా ఈ మాయలో పడ్డాను ఉంటే ఇది తప్పకుండా విష్ణుమాయ అయి ఉంటుంది." అని అనుకున్నాడు బలరాముడు.

తనజ్ఞాన నేత్రంతో చూచాడు బలరాముడు.. అప్పుడు ఆశ్చర్యంగా గోపబాలురు, ఆవుదూడలు  అందరూ కృష్ణుని రూపంలో కనిపించారు. గోపబాలురు, ఆవు దూడలు అన్నీ కృష్ణుని రూపంలో దర్శనం ఇచ్చాయి. ఇంతమంది కృష్ణులా!  ఇదంతా కృష్ణమాయ అనుకుంటూ వెంటనే కృష్ణుని వద్దకు వెళ్లాడు.

"కృష్ణా! ఇదంతా ఏమిటి! బృందావనములో ఉన్న ప్రజలు అందరూ దేవతాగణములనీ, గోవులు అన్నీ ఋషిగణములు అనీ నాకు తెలుసు. ఈవ్యవహారం చూస్తుంటే నాకు అలా అనిపించడం లేదు. ఇప్పుడు  గోవులు, గోపబాలురు అందరూ నీ రూపంతో కనపడు తున్నారు. నాకేమీ అర్థం కావడం లేదు. ఇంతకూ ఏంజరిగింది. నాకు వివరించు." అని అడిగాడు బలరాముడు.

కృష్ణుడు తాను అఘాసురుని చంపడం, ఇంతలో బ్రహ్మ తన మాయను ప్రయోగించి ఆవుదూడలను, గోపబాలురను మాయం చెయ్యడం, తాను ఆవుదూడలుగా, గోపబాలురుగా వారి రూపాలు ధరించడం, ఒక సంవత్సరం నుండి ఇదంతా జరుగుతూ ఉండటం...అంతా వివరంగాచెప్పాడు కృష్ణుడు.

ఈ సంవత్సరకాలము బ్రహ్మగారికి తృటి కాలం గడిచినట్టుగా ఉంది. తాను మాయం చేసిన ఆవుదూడలు, గోపబాలురు ఎలా ఉన్నారో చూద్దామనుకున్నాడు బ్రహ్మ. తాను దాచిపెట్టిన గుహలో గోపబాలురు, ఆవుదూడలు క్షేమంగా ఉన్నట్టు గ్రహించాడు. కృష్ణుడు ఏంచేస్తున్నాడో అని కృష్ణుని వంక చూచాడు. బ్రహ్మగారికి ఆశ్చర్యం వేసింది. తాను గుహలో దాచి పెట్టిన ఆవుదూడలు, గోపబాలురు యథాతథంగా కృష్ణుని వద్ద ఉన్నాయి.

బ్రహ్మతనలో తాను ఇలా అనుకున్నాడు. "ఏమిటీ మాయ! నేను దాచి పెట్టిన గోపబాలురు, గోవత్సములు అన్నీ గుహలో సుషుప్తావస్థలో ఉన్నాయి. అవే దూడలు, ఆ గోపబాలురు కృష్ణునితో ఆడుకుంటున్నారు. ఇది ఎలా సాధ్యం? ఈ బాలురు, ఆవుదూడలు ఎక్కడి నుండి వచ్చాయి. ఇంతకూ తాను దాచి పెట్టిన వారు అసలైన గోపబాలురా లేక ఇక్కడ కృష్ణునితో ఆడుకుంటున్న వారు అసలైన గోపబాలురా! అసలు ఏదో కల్పితం ఏదో తెలుసుకోలేకపోతున్నాను. ఏమీ అర్థం కావడం లేదు." అని తనలో తాను తర్కించుకుంటున్నాడు బ్రహ్మ.

ఓ పరీక్షిత్ మహారాజా! బ్రహ్మ సాక్షాత్తు విష్ణువు కుమారుడు. ఈ మోహములకు అతీతుడు. అటువంటి బ్రహ్మ కృష్ణుని తన మాయలో పడవేయబోయి తానే కృష్ణుని మాయలో పడ్డాడు. సూర్యుని వెలుగు ముందు మిణుగురు పురుగుల వెలుగు వెలవెలబోయినట్టు, విష్ణుమాయ ముందు బ్రహ్మదేవుని మాయ ఎందుకూ పనికిరాకుండా పోయింది.

ఆ ప్రకారంగా ఆలోచించిన బ్రహ్మ మరొక సారి కృష్ణుని వద్ద ఉన్న  గోప బాలుర వంక, గోవత్సముల వంక చూచాడు. మరలా ఆశ్చర్యపోయాడు. బ్రహ్మకు గోపబాలురు, ఆవు దూడలు కనపడలేదు. వారి స్థానంలో వందలమంది కృష్ణులు కనపడుతున్నారు. అందరూ పీతాంబరములు కట్టుకొని, నెమలి పింఛములు పెట్టుకొని శ్యామల వర్ణంతో మురళి వాయిస్తూ కనపడ్డారు. అందరికీ విష్ణుమూర్తి మాదిరి నాలుగు భుజాలు, శంఖము, చక్రము,గద మొదలగు ఆయుధములు, తలమీద నవరత్నఖచిత కిరీటములు, చెవులకు కుండలములు, మెడలో వనమాలలు, తులసి మాలలు,  కంఠసీమలో కౌస్తుభమణి, చేతులకు కంకణములు, పాదములకు నూపురములు (కడియాలు) ఈ ఆభరణములతో మెరిసిపోతున్నారు. వారందరి పెదవుల మీద మెరిసే చిరునవ్వులో సత్వగుణము, క్రీగంటి చూపులో రజోగుణము కనపడుతున్నాయి. వారందరూ అచ్చు విష్ణుమూర్తులవలె కనపడుతున్నారు. బ్రహ్మగారి కళ్లకు వారంతా భూత,వర్తమాన,భవిష్యత్ కాలములకు అతీతులుగా కనపడ్డారు. వారినుండి వెలువడే ప్రకాశంతో ఆ ప్రదేశం అంతా నిండిపోయింది. లోకంలో ఉన్న కదిలేవి, కదలనివి అన్నీ చేతనత్వము పొంది శ్రీహరి రూపములను ఉపాసిస్తున్నాయి. వారందరూ అణిమాది అష్టసిద్ధులతోనూ, మహత్తత్వము మొదలగు 24 తత్వములతోనూ కూడుకొని ఉన్నారు. కాలము, స్వభావము, సంస్కారము, కామము, కర్మ, సత్వరజస్తమోగుణములు అన్నీ పరమాత్మ స్వరూపములనుసేవిస్తున్నాయి.

ఈ ప్రకారంగా బ్రహ్మ గారు అంతా విష్ణుమయం అయిన గోపబాలురను, గోవత్సములను చూచాడు. బ్రహ్మగారికి మనసులో

కలత, ఆశ్చర్యము ఒకేసారి కలిగాయి. ఆయన కాళ్లు చేతులు ఆడటం లేదు. కదలికలేని మట్టి బొమ్మలాగా నిలబడి పోయాడు.

ఇదంతా ఏమిటో? ఎలా జరిగిందో? బ్రహ్మగారికి అర్థం కావడం లేదు. అంతా అయోమయంగా తోచింది. బ్రహ్మగారు ఒక విధమైన మోహంలో పడిపోయాడు. ఇంకా బ్రహ్మగారిని తన మాయలో ఉంచడం ఇష్టంలేక కృష్ణుడు తన మాయను ఉపసంహరించాడు. బ్రహ్మగారు కళ్లనులుముకొని చూచాడు. అక్కడ గోపబాలురు లేరు. ఆవు దూడలు లేవు. నాలుగు దిక్కులా చూచాడు. ఎవ్వరూ కనపడలేదు. తను గోపబాలురను, ఆవుదూడలను మాయం చేసినప్పటి దృశ్యం కనిపించింది.

కృష్ణుడు ఒక చేతిలో పెరుగు బువ్వపెట్టుకొని, ఊరగాయ ముక్కలను చేతి వేళ్ల మధ్య ఇరికించుకొని, ఆవు దూడలను వెతుక్కుంటూ అటు ఇటు తిరగడం బ్రహ్మగారి కంట పడింది. ఇదంతా కృష్ణమాయ అని బోధపడింది బ్రహ్మగారికి. వెంటనే తన వాహన మైన హంసను దిగి కృష్ణుని ముందు సాష్టాంగ పడ్డాడు. సాక్షాత్తు తన తండ్రి గారైన శ్రీమహావిష్ణువు యొక్క అవతారమూర్తి అయిన బాలకృష్ణుని పాదములను తన ఆనంద భాష్పములతో తడిపాడు. మెల్లిగా పైకి లేచాడు. మోకాళ్ల మీద నిలబడ్డాడు. కళ్లు తుడుచుకున్నాడు. వినయంగా రెండు చేతులుజోడించి నమస్కరిస్తూ గద్గద స్వరంతో ఇలా స్తుతించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
పదునాలుగవ అధ్యాయము.
(దశమస్కధంలో అత్యంత ముఖ్యమైన అధ్యాయము)

"ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణమాయతో మోహం చెందిన బ్రహ్మగారు, ఆ మాయ విడిపోగానే, బాలకృష్ణుని ముందు మోకరిల్లి కృష్ణుని ఈ విధంగా స్తుతిస్తున్నాడు.

"ఓ నీలమేఘశ్యామా! పీతాంబరధారీ! నందనందనా! శిఖిపింఛమౌళీ! వనమాలధారీ! ఆహా! చేతిలో వెన్నముద్ద, ధట్టీలో వేణువు, చంకలో కొమ్ముబూర, ఎంత ముద్దుగా, ముచ్చటగా ఉన్నావయ్యా! నీకు నా నమస్కారము.

ఓ దేవదేవా! నీవు దయామయుడవు. శుద్ధసత్వగుణ స్వరూపుడవు. నీ ఇష్టం కొద్దీ ఈ రూపం ధరించావు. నీ రూపము పంచ భూతములతో, పంచతన్మాత్రలతో ఏర్పడినది కాదు. ఆ కారణం చేత నీ మహిమలను తెలుసుకోవడం మాకు సాధ్యం కాదు. నీగురించి ఈ శరీరంతోనే కాదు మనసుతో కూడా తెలుసుకోలేము. అటువంటి నీకు నమస్కారము.

ఓ దేవా! ఈ మానవులు జ్ఞానం సంపాదించడానికి ఎంతో శ్రమపడుతుంటారు. ఆ శ్రమ అంతా వ్యర్థము. దానికి బదులు

సత్పురుషుల సాంగత్యంలో జీవితం గడుపుతూ, వారు చేసే బోధనలు వింటూ, వాని నోటి గుండా నీ లీలలను, నీ మహిమలను ఆస్వాదిస్తుంటే, నీ మీద భక్తి కలిగి ఉంటే, వారు ఏ జ్ఞానము సంపాదించకపోయినా, ఏ కర్మలు చేయకపోయినా ఎటువంటి నష్టం లేదు. ముల్లోకములచేత జయింపబడని నీవు, అటువంటి వారికి దాసుడవు అవుతావు.

ఓ దేవా! ఈ మానవులు జ్ఞానం సంపాదించడానికి ఎన్నో గ్రంథాలు చదువుతూ ఉంటారు. తర్కవితర్కాలు చేస్తుంటారు. కాని నీ మీద ఏ మాత్రం భక్తి కలిగి ఉండరు. భక్తిలేని జ్ఞానము ఎందుకూ పనికిరాదని వారికి తెలియదు. లోపల గింజలు లేనట్టి ధాన్యమును ఎంత దంచినా పొట్టు మిగులుతుందే కానీ, బియ్యము రావు కదా. దంచిన శ్రమ మాత్రమే మిగులుతుంది. అలాగే భక్తి ఏ మాత్రం లేని జ్ఞానము సంపాదించడం మొదలు పెడితే శ్రమ మాత్రమే మిగులుతుంది కానీ వేరు ఏ ప్రయోజనము కలుగదు.

ఓ దేవా! పూర్వము ఋషులు, యోగులు యోగ మార్గం ద్వారా ఎటువంటి ఫలితములను పొందలేకపోయారు. కాని వారు నీ కథలను వింటూ, నీ మీద భక్తినిపెంపొందించుకొని, వారు చేసిన వైదిక కర్మలను, వాటి ఫలితములను నీకు అర్పించి, ఆత్మజ్ఞానమును సంపాదించారు. తరువాత ఏమాత్రం శ్రమలేకుండా ఉత్తమ గతులు పొందగలిగారు.

ఓ దేవా! నిన్ను తెలుసుకోడానికి ఒకటే మార్గం ఉంది అనుకుంటున్నాను. నిర్గుణము, నిరాకారము అయిన నీ స్వరూపమును ధ్యానము, సమాధి ద్వారా తెలుసుకొని, నీతో తాదాత్మ్యం పొదిన గురువులను ఆశ్రయించి, వారి బోధనలను శ్రద్ధతో విని, ఆ బోధనలను అనుసరించి, ప్రాపంచిక విషయములను, వికారములను వదిలిపెట్టి, నీ మీద భక్తిని పెంపొందించుకొని, నీ గురించి ధ్యానం చేస్తూ, నిర్మల మైన అంత:కరణముతోనే నీ నిర్గుణ స్వరూపము గురించి తెలుసుకోగలరు.

ఓ దేవా! ఈ భూభారమును తగ్గించడానికి, సాధువులను రక్షించడానికి, దుర్మార్గులను శిక్షించడానికి, మానవుడిగా అవతరించావు. నీవు సత్వరజస్తమో గుణములకు అధిపతివి. అటువంటి నీ యొక్క గుణగణములను, నీ సంకల్ప,వికల్పముల గురించి తెలుసుకోవడం ఎవరి తరం కాదు.

ఓ దేవా! ఈ లోకంలో మానవులు వారు చేసిన కర్మల ఫలితంగా కష్టములు, సుఖములు అనుభవిస్తుంటారు. అదంతా నీ అనుగ్రహమే కాని వేరుకాదు. మానవులు తమకు కలిగిన కష్టసుఖములను నీ అనుగ్రహమే అనుకుంటూ, ఎల్లప్పుడూ నీ దయకోసరం పాకులాడుతూ, నిన్ను మనస్సుతో, వాక్కుతో, కర్మలతో స్మరిస్తూ, నీ మీద అనన్యమైన భక్తిని కలిగిఉంటూ, జీవితమును గడిపే వారికి నీవు ముక్తిని ప్రసాదిస్తావు.

ఓ దేవా! నా సంగతే చూడు. నీవు ఎటువంటి మాయలనైనా

మాయచేయగల సమర్థుడివి. ఆది అంతము లేని వాడివి. ఆది పురుషుడివి. అటువంటి నీ మీద నా మాయ ప్రయోగించాను. నీవు ఏమిచేస్తావో అని చూడదలిచాను. కాని అగ్ని నుండి పుట్టిన రవ్వ అగ్నిని ఏమీ చేయలేనట్టు, నీ నుండి పుట్టిన నేను, నా మాయతో నీమీద నా ప్రభావము చూపించలేకపోయాను.

ఓ దేవా! నేను సృష్టికర్తను. రజోగుణము ప్రధానంగా కలవాడను. ఆ కారణం చేత నన్ను అజ్ఞానం ఆవహించింది. మోహంలో పడ్డాను. నేను నీ కన్నా వేరుగా ఉన్నాను, నీ కన్నా గొప్పవాడిని  అని గర్వించాను. ఆ గర్వంతో నా కళ్లు మూసుకుపోయాయి. నీ మీద నా మాయ ప్రయోగించాను. నీవు నన్ను క్షమించాలి. "ఏదోపోనీలే! తెలిసీ తెలియని తనంతో చేసాడు వీడిని క్షమించెయ్యాలి" అని పెద్ద మనసు చేసుకొని నన్ను క్షమించు.

ఓ దేవా! ప్రకృతి, మహత్తత్వము, అహంకారము, పంచ భూతములు, పంచతన్మాత్రలు వీటితో కూడిన ఈ బ్రహ్మాండములో నేను కేవలం ఏడు  జానల పొడుగు కల వాడను. ఈ అనంత విశ్వంలో ఇటు వంటి బ్రహ్మాండములు లెక్కలేనన్ని ఉన్నాయి. ఆ బ్రహ్మాండములన్నీ నీలో ఉన్నాయి. అటువంటి నీవెక్కడ! నీ మహిమ ఎక్కడ! కేవలం పరిమిత జ్ఞానం కలిగిన నేనెక్కడ! నా మహిమ ఏపాటిది!

ఓ దేవా! గర్భిణితో ఉన్న తల్లిని కడుపులో ఉన్న బిడ్డ తన కాళ్లతో తన్నుతూ ఉంటే ఆ తల్లి కోప్పడుతుందా చెప్పు. అది బిడ్డ చేసిన అపరాధంగా తల్లి భావిస్తుందా! ఎన్నటికీ భావించదు. అలాగే, ఈ

అనంతకోటి బ్రహ్మాండములను నీ పొట్టలో ఇముడ్చుకున్న విరాట్ స్వరూపుడివి. మేము ఇలాంటివి ఏవో చిన్న చిన్న తప్పులు చేస్తుంటాము. వాటిని నువ్వు, తల్లి బిడ్డను క్షమించినట్టు, క్షమించాలి గానీ, కోప్పడ కూడదు కదా! అందుకని నేను చేసిన తప్పునుకూడా క్షమించు. నేను నీ కుమారుడినే కదా!

ఓ దేవా! ప్రళయ కాలమందు ఈ విశ్వం అంతా జలమయం అయినప్పుడు, ఆ జలములో పడుకొని ఉన్న నీ బొడ్డులో నుండి ఒక తామర పుష్పం ఉద్భవిస్తే, ఆ తామరపుష్పంలో నుండి నేను ఉద్భవించానని పురాణాలు ఘోషిస్తున్నాయి. ఈ విషయం నిజమే కదా! నీ పొట్టలోనుండి నేను ఉద్భవించాను కదా!

ఓ దేవా! నీవు కేవలం నారాయణుడివే కాదు. ఈ చరాచర జగత్తులోని అన్ని దేహములలో నీవు ఆత్మస్వరూపుడుగా, లోకసాక్షిగా వెలుగుతున్నావు. ఈ లోకంలో  ఉన్న మానవులకు, ప్రకృతికి, జలమునకు, నీవు ఆశ్రయుడివిగా ఉన్నావు. ఇదంతా నీ మాయ వలననే జరుగుతూ ఉంది కాని వేరు కాదు.

ఓ దేవా! నేనుపుట్టినప్పుడు చుట్టు జలం తప్ప మరొకటి లేదు. నాకు ఎవ్వరూ కనపడలేదు.  నేను వెనక్కు తిరిగి నిన్ను వెదుక్కుంటూ ఆ తామర తూడులోకి వెళ్లాను.  నీవు నారాయణుడివి, జలంలోనే ఉంటావు అనే మాట సత్యం అయితే నువ్వు నాకు కనిపించాలి కదా. మరి నువ్వు నాకు ఎందుకు కనిపించలేదు? నువ్వు  మనస్సుకు మాత్రమే కనపడేవాడివి అయితే, నువ్వు నా అంత:కరణమునకు

ఎందుకు గోచరించలేదు. కాబట్టి నువ్వు ఈ శరీరంలో ఉండే కళ్లకు కనిపించవు. అంత:కరణకు గోచరించవు. అందుకే నిన్ను చూడలేక మరలా వెనక్కు తిరిగి వచ్చాను. కళ్లు మూసుకొని తపస్సమాధిలో కూర్చున్నాను. అప్పుడు నా మనసులో నీ రూపం మెరుపులాగా మెరిసింది. కాని అంతలోనే మాయం అయింది. ఇదంతా నీ మాయ కాక మరేమిటి?

ఓ దేవా! నీవు కృష్ణుడిగా దేవకీ దేవి గర్భంలో అవతరించావు. కానీ వెంటనే నందగోకులానికి తీసుకురాబడి యశోద కుమారుడిగా పెరుగు తున్నావు. నీ తల్లి యశోద నోరు తెరవ మంటే నీ నోటిలో ఈ అనంత విశ్వాన్ని చూపించావు. ఆమెను నీమోహంలో పడవేసావు. ఇదంతా నీ మాయ కాక మరేమిటి?

నీవు నీ నోటిలో ఈ అనంత విశ్వాన్ని నీ తల్లి యశోదకు చూపించినప్పుడు, అందులో ఆమె తనను కూడా చూచింది. అంటే ఈ విశ్వం అంతా నీ లోపలా ఉంది, బయట కూడా ఉందన్న మాట. అంటే, ఈ అనంత విశ్వం అంతా నీలో ఉంది. ఈ విశ్వంలో నీవు కూడా ఉన్నావు. ఇదంతా నీ మాయ కాక మరేమిటి?

ఓ దేవా! నీవు నీ మాయను నీ తల్లి యశోదకే కాదు. నాకు కూడా చూపించావు. నేను నీ దూడలను మాయం చేసినప్పుడు చిన్నికృష్ణుడి లాగా, ఒక చేతిలో పెరుగు ముద్ద, ధట్టీలో వేణువు, చంకలో చర్నాకోలతో దర్శనం ఇచ్చావు. నేను నీ దూడలను, గోపబాలురను దాచిన తరువాత వారందరి రూపాలు నీవే ధరించావు.

మరలా నేను చూసినప్పుడు గోపబాలురు, ఆవు దూడలు అన్నీ చతుర్భుజములతో, పట్టుపీతాంబరములతో విష్ణుఅవతారములుగా దర్శనం ఇచ్చావు. ఇప్పుడు మరలా చిన్నికృష్ణుడి లాగా చేతిలో పెరుగు ముద్దతో, ధట్టిలో వేణువుతో దర్శనం ఇచ్చావు. ఇదంతా నీ మాయ కాక మరేమిటి?

ఓ దేవా! నీ మాయ, నీ మహిమ తెలుసుకోలేని వారికి నీవు సృష్టి చేసేటప్పుడు బ్రహ్మగానూ, పోషించేటప్పుడు విష్ణువు గానూ, లయం చేసేటప్పుడు శివుడు గానూ వివిధరూపములతో కనపడు తున్నావు. నిజానికి నీవు ఒక్కడివే. నీమాయచేత బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా లోకానికి వ్యక్తమవుతున్నావు.

ఓ దేవా! నీకు జనన మరణాలు లేవు. కానీ నీవు జలచరములలోనూ, జంతువులలోనూ, పక్షులలోనూ, మానవులలోనూ, దేవతలలోనూ, ఋషులలోనూ జన్మించావు. ఇదంతా దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొరకే కదా!

ఓ భగవాన్! పరాత్పరా! యోగేశ్వరా! నీయోగమాయను ఈ లోకమంతా విస్తరింపజేసి ఎన్నో అవతారాలు ఎత్తావు. నీ లీలలను తెలుసుకోవడం ఈ మూడులోకములలో ఉన్న ఎవరి తరమూ కాదు! అటువంటి నేను నీ మాయను తెలుసుకోవాలని ప్రయత్నించడం మూర్ఖత్వమే అవుతుంది కదా!

ఓ దేవా! నీ మాయచేత ఈ ప్రపంచాన్ని సృష్టించావు. ఈ ప్రకృతిని సృష్టించావు. ఈ మూర్ఖ మానవులు ఈ ప్రపంచము, ఈ

ప్రకృతి అంతా నిజమనీ, ఇందులోనే సుఖం, సంతోషం ఉన్నాయనే భ్రమలోఉన్నారు. ఇదంతా స్వప్నములో మాదిరి కనపడుతూ ఉందని, నిజం కాదనీ, ఇదంతా దు:ఖమయం అనీ, నీ మాయ వలన నిజంగాఉన్నట్టు కనపడుతూ ఉందనీ, ఎవరికీ తెలియదు. ఆమాటకొస్తే నీ మాయ తెలుసుకోవడం నాకే తెలియదు. ఇంక సామాన్య మానవుల మాట చెప్పేదేముంది.

ఓ దేవా! ఈ అనంత విశ్వంలో నీవు ఒక్కడివే (అంటే విశ్వచైతన్యము ఒక్కటే) నిత్యము, సత్యము. నీవు కాక మిగిలింది అంతా అసత్యము, అనిత్యము. అందుకే నిన్ను పురాణ పురుషుడు అనీ, స్వయంప్రకాశకుడివి అనీ, అనంతుడివి అనీ, ఆద్యుడివి అనీ, నాశము లేనివాడివి అనీ, పుట్టుక లేని వాడివి అనీ, నిరంజనుడివిఅనీ, పూర్ణుడివి అనీ, నీవు తప్ప వేరే ఏదీ లేదనీ, శరీరము లేని వాడివి అనీ పిలుస్తారు. కాని నీవు చరాచర జీవరాసులలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. అందుకే నిన్ను పరమాత్మ అన్నారు. నీవు ఈ జీవులలో ఉన్న ఆత్మ స్వరూపాలనే చూస్తావు కానీ, వారి భౌతిక మైన శరీరాలను, పేర్లను కాదు.

మానవులు కూడా గురువు ద్వారా ఆత్మజ్ఞానమును పొందితే, వారు కూడా నీ మాదిరి అన్ని జీవరాసులలోనూ ఆత్మస్వరూపమును మాత్రమే చూడగలరు. ఆ స్థితిని చేరుకున్న వారికి ఈ సంసారము నుండి ముక్తి అనాయాసంగా లభిస్తుంది. (అటువంటి వారు చక్రవర్తినీ, సామాన్యుడినీ, బంగారమునూ మట్టి బెడ్డను సమానంగా చూస్తారు. ఎందుకంటే వారికి అన్నిటిలోనూ ఆ పరమాత్మ స్వరూపమే

కనిపిస్తుంది కాబట్టి.)

కాని ఈ మానవులు దానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. వారిలో ఉన్న అజ్ఞానము, అవిద్య చేత, తమ కళ్ల ఎదురుగా కనపడుతున్న ఈ ప్రపంచాన్ని నిజం అని, ఎప్పటికీ ఇలాగే ఉంటుందనీ, శాశ్వతమనీ అనుకుంటున్నారు. నిజానికి ఈ ప్రపంచం క్షణక్షణానికీ మారుతూ ఉంటుంది. చీకట్లో తాడును చూచి పాముగా భ్రాంతి చెందినట్టు, తాను తనశరీరము, తన భార్యాబిడ్డలు, ధనము, ఆస్తులు అన్నీ శాశ్వతం అనే భ్రమలో ఉంటాడు మానవుడు. ఆ తాడు మీద వెలుగు ప్రసరించినప్పుడు, అదిపాము కాదు దాని నిజరూపము తాడు అని తెలుసుకుంటాడు. అలాగే జ్ఞానము అనే వెలుగు ప్రసరించినపుడు, వాడిలో ఉన్న అవిద్య తొలగిపోయి, భార్యాబిడ్డలు, ఆస్తులు, ధనము, అధికారము ఏదీ నిజం కాదు, అసలు ఈ ప్రపంచం అంతా నిజం కాదు, నిరంతరం మారుతూ ఉంటుంది, ఈ నాడు ఉన్న వాడు రేపు ఉండడు, ఈ నాడు తనవద్ద ఉన్న వస్తువు రేపు వేరేవాడి వద్ద ఉంటుంది, ఏదీ శాశ్వతము కాదు అనే నిజాన్ని తెలుసుకుంటాడు. ఆ జ్ఞానమే మోక్షమునకు మార్గము ఏర్పరుస్తుంది.

ఓ దేవా! నీవు చిదానంద స్వరూపుడవు. నీనుండి వెలువడిన ఈ ఆత్మ కూడా చిదానంద స్వరూపమే. కానీ జీవుని అజ్ఞానము వలన ప్రాపంచిక విషయములలో లీనమై బంధములను ఏర్పరచు కుంటున్నాడు. ఆ బంధములతో చిక్కువడి వాటి నుండి బయట పడటానికి అంటే మోక్షమునకు ప్రయత్నిస్తున్నాడు. నిజానికి ఈ బంధములు, మోక్షము రెండూ అజ్ఞానము వలన కలిగినవే కానీ వేరు

కావు. ఎలాగంటే, మన అజ్ఞానము వలన రాత్రి సూర్యుడు ఉండడు, పగలు సూర్యుడు ఉంటాడు అని అనుకుంటున్నాము. నిజానికి సూర్యుడు ఉండడం, ఉండక పోవడం అంటూ ఉండదు. సూర్యుడు ఎప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటాడు. రాత్రిపూట మనకు కనపడడు కాబట్టి సూర్యుడు లేడు అని అనుకుంటాము. అలాగే ఆత్మకు ఈ బంధములు, మోక్షములు, సుఖదు:ఖములు ఉండవు. ఆత్మ నిత్యానంద స్వరూపము. కాని మానవుడు ప్రాపంచిక విషయములలో పడి బంధములకు, సుఖదు:ఖములకు, రాగద్వేషములకు లోనవుతుంటాడు. మోక్షం కోసం పరితపిస్తుంటాడు. మానవుడు ప్రాపంచిక విషయములకు లోను కాకుండా ఉంటే ఎటువంటి బంధనములు ఉండవు. బంధనములు లేనపుడు వాటినుండి విడివడడము అంటే మోక్షము పొందడం అనే ప్రశ్న తలెత్తదు.

(మనకు పెద్దబాలశిక్షలో ఒకసామెత ఉంది.

అడుసు తొక్కనేల, కాలు కడుగనేల.

అడుసు తొక్కడం అంటే బంధాలు ఏర్పరచుకోవడం.

కాలు కడుక్కోవడం అంటే వాటి నుండి విముక్తి పొందడం, మోక్షం పొందడం.

అడుసు తొక్కకపోతే కాళ్లు కడుక్కునే అవసరమే లేదు.

అలాగే బంధాలు లేకపోతే మోక్షము అనే మాటే లేదు.)

ఓ దేవా! నీవు పరమాత్మవు (విశ్వచైతన్యము).నీవు అందరిలోనూ ఆత్మస్వరూపముగా (పరిమిత చైతన్యము)గా వెలుగుతున్నావు. కాని మానవులు, అజ్ఞానము చేత, తమలో ఉన్న ఆత్మను, సాటి మనుషులలో ఉన్న ఆత్మలను, దర్శించకుండా, బయట

ఉన్న పరమాత్మ కొరకు వెతుకుతుంటారు.
(శివాలయం బయట కూర్చుని ఉన్న భిక్షకత్తె ఒడిలో ఉన్న పసిబిడ్డ గుక్కెడు పాల కోసరం ఏడుస్తుంటాడు. కాని శివాలయంలో మడి కట్టుకొని బిందెలకొద్దీ పాలను శివుడి మీద అభిషేకం చేస్తుంటారు. ఆపాలన్నీ తూములోకి వెళుతుంటాయి. తనలో ఉన్న ఆత్మ, ఆ పసిబిడ్డలో ఉన్న ఆత్మ ఒకటే అని తెలుసుకున్నప్పుడు, ఈ రెండు కూడా ఆ పరమాత్మ స్వరూపాలు అని తెలుసుకున్నప్పుడు, మానవుడు బయట ఉన్న పరమాత్మ కొరకు వెతకడు. పాలాభిషేకాలు చెయ్యడు. ఆ పసిబిడ్డకు కడుపునిండా పాలు పట్టిస్తాడు.  సాటి మనుషుల మీద ప్రేమ చూపిస్తాడు. అందుకనే నితాంత అపార భూతదయను నాకు ప్రసాదించు అని ఒక భక్తుడు భగవంతుని వేడుకున్నాడు.)

ఓ దేవా! ఈ మూర్ఖ మానవులు, లోపల ఉన్న ఆత్మస్వరూపుడవైన నిన్ను వదిలిపెట్టి, పైకి కనిపించే దేహమును మాత్రమే చూస్తుంటారు. ఎలాగంటే, అక్కడ తాడు ఉంది పాము లేదు అని తెలిసి కూడా దానిని పాము అని భ్రమపడినట్టు, ఆత్మ నిత్యము, దేహము అనిత్యము అని తెలిసికూడా ఈ దేహమునకు ప్రాధాన్యము ఇస్తుంటారు. కాని ఆత్మజ్ఞానము తెలిసినవారు, సాటి వారిలో ఉన్న ఆత్మను చూస్తారే కానీ, దేహమునకు ప్రాధాన్యము ఇవ్వరు. అటువంటి ఆత్మజ్ఞానము కలగాలంటే నీపాదములను పట్టుకోవడమే శరణ్యము. ఎన్ని యజ్ఞములు, యాగములు, పూజలు, వ్రతములు చేసినా, నీయందు అచంచలమైన ఏకాగ్రమైన భక్తి లేనిదే ఆత్మజ్ఞానము కలుగదు.

ఓ దేవా! నాకు అన్నీ తెలుసు అని అహంకరించాను కానీ

నాకు ఏమీ తెలియదు అని ఇప్పుడే తెలుసుకున్నాను. నాకు నీ మీద అచంచలమైన భక్తిని, తద్వారా ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించు. నీ మీద భక్తి కలగడానికి నన్ను మానవులలో గానీ, పశుపక్ష్యాదులలో కానీ, నీ భక్తుడిగా పుట్టించు. నిరంతరము నీ పాదములను సేవిస్తూ, నీ మీదఅచంచలమైన భక్తి కలిగి ఉండేటట్టు అనుగ్రహించు.

ఓ దేవా! ఈ గోకులములో ఉన్న గోపకాంతలు, గోవులు ఏమి పుణ్యం చేసుకున్నాయో కదా! నేను నీ ఆవుదూడలను, గోపబాలురను మాయం చేస్తే, ఆ దూడలు గోపబాలురు నీవే అయ్యావు. ఆవు దూడలు గోవుల పాలు తాగాయి. గోపబాలురు వారి తల్లుల పాలు తాగారు. అంటే దూడలరూపంలోనూ, గోపబాలుర రూపంలోనూ నీవే ఆ గోవుల, గోపకాంతల పాలు తృప్తిగా తాగావు. నీ కోసరం మునులు, ఋషులు ఎన్ని యజ్ఞములు యాగములుచేసినా తృప్తి పొందని వాడివి, ఆవుదూడల రూపంలోనూ, గోపబాలుర రూపంలోనూ నందగోకులంలోని ఆవులు, గోపకాంతల వద్ద పాలు తాగి తృప్తి చెందావా మహానుభావా! ఆ ఆవులు, గోపకాంతల జన్మలు ధన్యములు. వారే కాదు, నిన్ను ప్రతిదినము కృష్ణా!కృష్ణా! అంటూ పిలిచి లాలించి, ముద్దులాడే నందుడు, యశోద, నీతో ఆడిపాడే గోపబాలురు, నీవు నడిచినచోట నడిచిన గోపకులు, గోపికలు, అందరూ ధన్యులే కదా! నీ వలన ఈ గోకులమే ధన్యమయింది.

ఓ దేవా! వేదములు కానీ, శాస్త్రములు కానీ పురాణములు కానీ నీ గురించి చెబుతున్నాయి. కానీ పూర్తిగా చెప్పలేక పోతున్నాయి. కానీ నీవు స్వయంగా ఈ నందవ్రజంలో అవతరించావు. ఈ నేల మీద

తిరుగుతున్నావు. ఈ వ్రజములో ఉన్న వారందరికీ నీవు సర్వస్వము అయ్యావు. ఈ వ్రజములో వారంతా నీతో ఆడి పాడీ, నీ సాంగత్యంలో ధన్యులు అయ్యారు. అటువంటి వ్రజవాసుల పాదధూళి సోకిన వారి జన్మలు కూడా ధన్యము అవుతాయి. నీవు సంచరించిన ఈ వ్రజములో కానీ, ఈ వనములో కానీ, ఎటువంటి జన్మ ఎత్తినా, వారికి అది గొప్పఅదృష్టం అవుతుంది.

ఓ దేవా! నిన్ను చంపడానికి వచ్చిన పూతన పాలు తాగి ఆమెకు మోక్షం ఇచ్చావు. అలాగే నిన్ను చంపడానికి వచ్చిన అఘాసురుడు, బకాసురుడు మొదలగు రాక్షసులను నీలో కలుపుకున్నావు. వారంతా నీలో ఐక్యం అయి సద్గతులను పొందారు. ఈ వ్రజంలో ఉన్న గోపకాంతలు, గోప బాలురు తమ తమ ఇళ్లు వాకిళ్లను, బంధుమిత్రులను వదిలిపెట్టి తమ మనసులను, తమ ప్రాణములను, నీకే అర్పించారు. నీవే సర్వస్వం అనుకుంటున్నారు. వారికి నీవు ఏమివ్వగలవు? పూతనకు, అఘాసురుడు మొదలగు రాక్షసులకు ఇచ్చిన దానికన్నా(మోక్షముకన్నా) గొప్పది నీ దగ్గర ఏమి ఉందని ఈ వ్రజవాసులకు ఇవ్వగలవు?

కృష్ణా! ఈ మానవులకు రాగద్వేషములు, సుఖదు:ఖములు దొంగల వంటి వాళ్లు. ఇల్లు వాకిలి, భార్యపిల్లలు కాళ్లకు చేతులకు తగిలించుకున్న సంకెళ్లు. కానీ నిన్ను నమ్ముకున్న వారిని, నీ మీద అచంచలమైన భక్తి కలిగిన వారిని ఇవేవీ బాధించవు. వారు దేనికీ చలించరు. సుఖము వచ్చినా, దు:ఖము వచ్చినా వారు నిశ్చింతగా ఉంటారు. అటువంటి భక్తి నాకు ప్రసాదించు.

ఓ దేవా! నీకుపుట్టుక లేదు. నీవు నీమాయచేత సృష్టించబడిన ఈ ప్రపంచములో పుట్టనవసరము లేదు. కానీ, నీ భక్తులకు, నిన్ను నమ్ముకున్న వాళ్లకు, నీ మీద ప్రేమానురాగాలు కురిపించే వాళ్లకు ఆనందాన్ని కలుగచేయడానికి, నీవు అవతరించావు. నీ లీలలను చూపిస్తున్నావు. ఈ ప్రపంచంలో ఉన్న వాళ్లు ఏమేమి చేస్తారో అవన్నీ చేస్తున్నావు. కాని ఏవీ నీ కోసం చెయ్యడం లేదు. నీ భక్తుల సంతోషం కోసం చేస్తున్నావు. అటువంటి నీకు నమస్కారము.

ఓ దేవా! ఇప్పటి దాకా నాకంతా ఏదో తెలిసినట్టు ఏమేమో మాట్లాడాను. నేనుకాదు, నా మాదిరి చాలామంది, తాము పండితులము అయినట్టు, తమకు అంతా తెలిసినట్టు మాట్లాడుతుంటారు. నిజానికి వారికి ఏమీ తెలియదు. వాళ్లకు తెలియదు అన్న విషయం వారికి తెలియదు. అందుకని తమకు అంతా తెలుసని మాట్లాడుతుంటారు. నేను అలా కాదు. నాకు ఏమీ తెలియదు. నీ మహిమ నా మనస్సుకు కానీ, వాక్కుకు కానీ గోచరము కాదు అని ఒప్పుకుంటున్నాను.

ఓ దేవా! నీకు అంతా తెలుసు. నీవు అంతా చూస్తుంటావు. ఈ జగత్తు అంతా నీ అధీనంలో ఉంది. ఆ అనంత విశ్వంలో నేనూ ఒకడిని. నేను స్వతంత్రుడను కాను. నీలో ఒక భాగము మాత్రమే అని గ్రహించాను. ఇంక వెళ్లడానికి నాకు అనుమతి ప్రసాదించు.

శ్రీకృష్ణ వృష్ణికుల పుష్కరజోషదాయిన్ క్ష్మానిర్జరద్విజపశూదధివృద్ధికారిన్

ఉద్ధర్మశార్వరహర క్షితిరాక్షసధ్రు గాకల్పమార్కమర్హన్ భగవన్ నమస్తే॥"

అని బ్రహ్మ శ్రీకృష్ణుని పాదములకునమస్కరించాడు.

బ్రహ్మ చిన్ని కృష్ణునికి మూడుసార్లు ప్రదక్షిణము చేసి, ఆయన పాదములకు నమస్కరించి వెళ్లిపోయాడు. బ్రహ్మ మాయ అంతరించగానే బ్రహ్మచేత మాయం చేయబడ్డ ఆవు దూడలు, గోపబాలురు ఎవరి స్థానాల్లో వారు ఉన్నారు. ఆవు దూడలు పచ్చిక మేస్తున్నాయి. గోపబాలురు తమ చేతులలో పెరుగు అన్నం పెట్టుకొని ఆవుదూడలను వెతుక్కుంటూ వెళ్లిన కృష్ణుని కోసరం ఎదురుచూస్తున్నారు.

కృష్ణుడు కూడా తన చేతిలో పెరుగుబువ్వను తింటూ, ఆవు దూడలను తోలుకొని గోపబాలురు ఉన్న చెట్టు కిందికి వచ్చాడు. కృష్ణుడు ఆవుదూడలను వెదకడానికి బయలుదేరినప్పటి నుండి, తిరిగి ఆవుదూడలను తీసుకొని గోపబాలుర దగ్గరకు రావడానికి మధ్య ఒక సంవత్సరము కాలం గడిచింది. కాని బ్రహ్మ చేసిన మాయ వలనా, దానికి కృష్ణుడు చేసిన ప్రతి మాయ వలనా, ఆ గోపబాలురకు ఆ కాలము కేవలము కొన్ని నిముషములు గడిచినట్టు భావించారు. కృష్ణుని చూడగానే గోప బాలురు

"కృష్ణా! దూడలు తొందరగానే దొరికినట్టున్నాయో! అవి ఎంతో దూరం పోయి ఉండవులే! నీ కోసరం మేము ఒక్క ముద్ద కూడా తినకుండా కాచుకొని ఉన్నాము. రా! కూర్చో! అందరం కలిసి అన్నాలు తిందాము!" అని ఆ గోపబాలురు కృష్ణుని తమ మధ్యలో కూర్చోబెట్టుకున్నారు. అందరూ కలిసి అన్నాలు తిన్నారు. సాయంత్రం అయింది. ఆవు దూడలను తోలుకొని అందరూ ఇంటి మొహం పట్టారు.

దారిలో  కృష్ణుడు వారికి చచ్చిపడి ఉన్న కొండచిలువ శరీరాన్ని చూపించాడు. అప్పటికి సంవత్సరం గడవడం వలన అది ఎండి పోయి చర్మంమాత్రం మిగిలి ఉంది. మధ్యాహ్నం చచ్చిన పాము సాయంత్రానికి ఎలా ఎండిపోయిందా అని ఆ అమాయక గోపబాలురకు తట్టలేదు.

గోప బాలురు తమ తమ ఇళ్లకు రాగానే వాళ్ల తల్లుల వద్దకు పోయి "అమ్మా అమ్మా మరేమో ఇవ్వాళ మేమంతా ఒకపామునోట్లోకి వెళ్లిపోయాము. కృష్ణుడు మా అందరినీ ఆ పామునోట్లోనుండి బయటకు తీసుకొని వచ్చాడు. తరువాత కృష్ణుడు ఆ పేద్ద పామును చంపాడమ్మా. అది ఇంకా అక్కడే చచ్చి పడిఉంది." అంటూ చెప్పారు.

"అమ్మో! నిజమా! కృష్ణుడు పెద్ద పామును చంపాడా! కృష్ణునికి ఏమీ ప్రమాదం జరగలేదు కదా! ఉండు. నేను వెళ్లి కృష్ణుని చూచి వస్తాను." అంటూ ఆ గోపకాంతలు కృష్ణుని క్షేమం విచారించడానికి యశోద ఇంటికి వెళ్లారు." అని శుకుడు చెప్పగానే పరీక్షిత్తు మహారాజు శుకమహర్షిని ఇలా అడిగాడు.

"శుకయోగీంద్రా! బృందావనములో ఉన్న గోపకాంతలకు తమ సంతానము మీద ప్రేమ ఉండటం సహజమే. కానీ, యశోద కుమారుడైన కృష్ణుని మీద తమ సంతానము మీద కన్నా అధికమైన ప్రేమ ఉండటానికి కారణమేమి? గోప కాంతలకు తన కుమారుల మీది కంటే కృష్ణుని మీద ఎక్కువ ప్రేమ ఎలా కలిగింది? పాము నోట్లో పోయాము అన్న కుమారుల క్షేమం కన్నా, పామును చంపిన కృష్ణుని క్షేమం గురించి ఆ గోపకాంతలు ఎందుకు అంత ఆరాటపడ్డారు." అని

అడిగాడు.

దానికి శుకుడు ఈ విధంగా సమాధానం ఇచ్చాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! ఈ ప్రపంచంలో ఉన్న సమస్త ప్రాణులకు తమ మీద తమకు ఎక్కువ ప్రేమ. ప్రతి వ్యక్తి తనను తాను ప్రేమిస్తాడు. తరువాతనే  తన సంతానము మీద, బంధు మిత్రుల మీద ప్రేమ చూపిస్తారు. తన మీద తనకు ఉన్న ప్రేమ కన్నా, తన సంతానము మీద, భార్య లేక భర్త మీద కానీ, బంధు మిత్రుల మీద కానీ, ఇల్లు, ఆస్తులమీద కానీ ఎక్కువ ప్రేమ ఉండదు. ఈ విషయంలో పురుషులు, స్త్రీలు సమానమే.

పురుషులు కానీ, స్త్రీలు కానీ తమను తాము ప్రేమించినంతగా తమ సంతానమును గానీ, బంధుమిత్రులను గానీ ప్రేమించరు. ఎవడి ప్రాణము వాడికి తీపి. శరీరము రోగంతో చిక్కి శల్యము అయినా, వయస్సు మీద పడటంతో, ముసలి తనంతో, శరీరం కృశించినా, ప్రతి వాడికీ ఇంకా జీవించాలనే ఆశ ఉంటుంది కానీ, తొందరగా మరణించి రోగాలనుండి, వృద్ధాప్యం నుండి విముక్తి పొందుదాము అని అనుకోడు. (అమ్మో అప్పుడే చావడమా! నేం చస్తే ఈ ప్రపంచం ఏమైపోతుందో! నా భార్యాబిడ్డలకు,మనుమలు మనుమరాళ్లు ఎలా బతుకుతారో! అందుకే నేను చావను గాక చావను అని ప్రాణాలను ఉగ్గపట్టుకొనే వాళ్లను మనం చూస్తూనే ఉన్నాము.)  ఇదంతా ప్రతి వ్యక్తికి ప్రాణాల మీద ఆశ చావక పోవడం వలన, ఇంకా జీవించాలనే ఆశ ఉండటం వలన కలుగుతుంది. ఈ ప్రపంచంలో ఉన్న సుఖాలను అనుభవించడానికి ఈ శరీరం అవసరం కాబట్టి ఈ శరీరాన్ని వదలడానికి ఎవడూ

ఒప్పుకోడు.

ఇంక అసలు విషయానికి వస్తాను. కృష్ణుడు ఆత్మస్వరూపుడు. అందరి ఆత్మలలో కృష్ణుడు ఉన్నాడు. మనకు కప్పిన మాయ వలన కృష్ణుడు మన ఎదుట ఒక శరీరంతో కనపడుతున్నాడు కానీ నిజానికి కృష్ణునికి ఏ రూపమూ లేదు. అందరిలోనూ ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. కృష్ణతత్వము తెలిసిన వారికి మాత్రమే ఈ విషయం బాగా అర్థం అవుతుంది.

ఈ అనంత విశ్వం అంతా కృష్ణ మయం. కృష్ణుడు తప్పవేరే వస్తువు అంటూ ఏదీ లేదు. సమస్త జీవరాసులలో కృష్ణుడు ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు అనడం కాదనలేని సత్యం. కృష్ణుడి కన్నా భిన్నమైన  వస్తువు ఏదైనా ఈ అనంత విశ్వంలో  ఉందని నీవు చెప్పగలవా! చెప్పలేవు. ఎందుకంటే కృష్ణుని కంటే భిన్నమైన వస్తువు ఈ ప్రపంచంలో ఏదీ లేదు కాబట్టి. అటువంటి కృష్ణుని పాదములను ఆశ్రయించిన వారికి ఈ సంసార సాగరమును దాటడం,చిన్న పిల్ల కాలువను దాటినంత సులభము. ఆ కారణం చేతనే అందరిలో ఆత్మ స్వరూపుడుగా ఉన్న కృష్ణుని గోప కాంతలు తమ సంతానము కన్నా అధికంగా ప్రేమించారు అనడంలో అతిశయోక్తి లేదు.

ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుడికి ఐదవ సంవత్సరంలో జరిగిన అఘాసురుని వధ, గోపకులకు కృష్ణుని ఆరవ సంవత్సరంలో జరిగినట్టు అనిపించడంలో అసలు కారణం నీకు వివరంగా చెప్పాను. ఈ సంవత్సరం పాటు గోపబాలురు, ఆవుదూడలు అచేతనావస్థలో ఉన్నారు

కాబట్టి వారికి అలా అనిపించింది. కృష్ణుని ఈ లీలలను చదివినవారు, విన్న వారు కృష్ణుని కృపకు పాత్రులవుతారు. వారు కోరిన కోరికలు నెరవేరుతాయి.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా కృష్ణుడు, బలరాముడు తమ ఐదవ సంవత్సరమును దాటి ఆరవ సంవత్సరములోకి ప్రవేశించారు. ఐదవ సంవత్సరము దాకా కౌమారము అంటారు. ఆరవ సంవత్సరము నుండి పౌగండ వయసు అంటారు. బలరాముడు, కృష్ణుడు తమ పౌగండమును బృందావనములో ఆనందంగా గడుపుతున్నారు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
పదునైదవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుని బాల్యలీలలను ఇలా వర్ణిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా కృష్ణుడు ఐదు

సంవత్సరములు నిండి ఆరవ సంవత్సరములోకి అనగా కౌమార దశ నుండి పౌగండము లోనికి ప్రవేశించాడు. కొంచెం పెద్దవాళ్లు అయ్యారు కాబట్టి, వారు ఆవు దూడలను కాకుండా ఆవులను అడవిలోకి తీసుకొని పోయి మేపుతున్నారు.

ప్రతిరోజూ బలరాముడు, కృష్ణుడు, గోప బాలురతో సహా, వేణువు ఊదుకుంటూ ఆవులను తోలుకొని సమీపములోని అడవిలోకి వెళ్లేవారు. ఆవులు పచ్చిక మేసిన తరువాత సమీపములో ఉన్న సరోవరములో నీరు త్రావించేవారు.

ఆ వనములో ఉన్న పూలమొక్కలు తమకు పూచిన పూల బరువుకు నేలమీదకు వాలిపోయి ఉన్నాయి. అలాగే ఫలవృక్షములు తమకు కాచినఫలముల బరువుకు, ఆ వృక్షముల కొమ్మలు నేలకు తాకుతున్నట్టు వాలి ఉన్నాయి. ఆ వనమును, పూల మొక్కలను, ఫలవృక్షములను చూచి కృష్ణుడు బలరామునితో ఇలా అన్నాడు.

"అన్నయ్యా! ఈ వృక్షములు అన్నీ తమ అజ్ఞానం చేత పూర్వ జన్మలో ఏ కర్మలు చేసాయో కానీ, ఈ జన్మలో వృక్షములుగా, మొక్కలుగా పుట్టాయి. నీవు ఈ చెట్లకింద నిలబడి ఉంటే, ఆ మొక్కలు తమకు పూచిన పూలను నీ పాదముల మీద రాల్చి, ఆ వృక్షములు తమకు కాచిన పండ్లను నీ పాదముల వద్ద పెట్టి, నిన్ను పూజిస్తున్నట్టు నీకు నమస్కరిస్తున్నట్టు ఉంది కదూ! అంతే కాదు! ఈ తుమ్మెదలు నీ యొక్క కీర్తిని గానం చేస్తున్నట్టు ఝుమ్మంటూ నాదం చేస్తున్నాయి. ఈ చెట్లు భ్రమరములు పూర్వజన్మలో గొప్పమునులు అయి ఉండవచ్చును.

వారు వృక్షములు గానూ, తుమ్మెదలుగానూ పుట్టినా, మానవ రూపంలో ఉన్న నిన్ను ఈ జన్మలోకూడా వదలకుండా పూజిస్తున్నారు, స్తుతిస్తున్నారు.

అన్నయ్యా! అటు చూడు. ఆ నెమళ్లు ఎంత మనోహరంగా నృత్యం చేస్తున్నాయో! ఆ లేళ్లు గంతులు వేస్తున్నాయి. కోకిలలు మధురంగా కూస్తున్నాయి. ఇవన్నీ నీ గుణగణములను కీర్తిస్తున్నట్టుంది కదూ! ఎందుకంటే మనము ఈ వనమునకు అతిథులము. ఈ వృక్షములు, నెమళ్లు, లేళ్లు, కోయిలలు మనకు ఆతిధ్యము ఇస్తున్నట్టు ఉంది కదూ! అతిథులకు సత్కారము చేయడం సత్పురుషులకు పుట్టుకతో వచ్చిన సంస్కారము కదా! అన్నయ్యా! బృందావనములో ఉన్న ఈ నేల నీపాదస్పర్శతో పునీతమయింది. నీ చేతి స్పర్శతో ఈ చెట్లు, లతలు అన్నీ ధన్యమయ్యాయి." అంటూ బలరామునితో ప్రకృతి సౌందర్యమును గురించి మాట్లాడుతూ, కృష్ణుడు గోపబాలురతో గోవులను తోలుకుంటూ అడవిలోకి వెళ్లాడు.

కృష్ణుడు ఒక చెట్టు కింద కూర్చుని భ్రమరములు ఝుమ్మంటూ నాదం చేస్తుంటే, ఆ నాదానికి తగ్గట్టు వేణునాదం చేసేవాడు. కోయిలలు మధురంగా కూస్తుంటే వాటితో పాటు తానూ వేణువును ఊదేవాడు. నెమళ్ళు ఆడుతుంటే వాటితో పాటు వాటిని అనుకరిస్తూ తానూ నృత్యం చేసేవాడు. తాను మేపుతున్న ఆవులు పక్కదారి పడుతుంటే, వాటిని పేరు పేరునా పిలుస్తూ వాటిని తన వద్దకు రప్పించుకునేవాడు. సింహము, పులి గర్జనలు విని లేళ్లు పరుగెడుతుంటూ, వాటిని అనుకరిస్తూ తానూ పరుగెత్తేవాడు. అది

చూచి గోపబాలురు ఆనందంతో కేరింతలు కొట్టేవారు.

ఎప్పుడైనా బలరాముడు అలసిపోయి గోపబాలుర తొడల మీద తలపెట్టి పడుకుంటే, కృష్ణుడు అన్నగారి కాళ్లు పిసికేవాడు. గోపబాలురు అందరూ ఒకరి చేతులు ఒకరు పట్టుకొని కలిసికట్టుగా నృత్యం చేస్తూ మధ్యలో పడిపోతే, వారిని చూచి రామకృష్ణులు పకాపకా నవ్వేవారు. బలరాముడు, కృష్ణుడు అలసిపోయి చెట్టు కింద విశ్రాంతి తీసుకుంటుంటే, గోపబాలురు పోటీలుపడి వాళ్ల కాళ్లు పట్టేవాళ్లు. మరి కొందరు చెట్ల ఆకులతో విసనకర్రలు తయారు చేసి బలరామకృష్ణులకు విసిరేవారు. అలా కృష్ణునికి సేవచేస్తూ కృష్ణుడు బాల్యంలో చేసిన సాహసకృత్యములను గానం చేసేవారు.

ఓ పరీక్షిత్ మహారాజా! లక్ష్మీదేవి ఏ పాదములను తన ఒడిలో ఉంచుకొని పిసుకుతూ ఉంటుందో, ఆ పాదములనే గోపబాలురు తమ ఒడిలో ఉంచుకొని పిసుకుతున్నారు. వారి భాగ్యముఏమని చెప్పను? కృష్ణుడు కూడా సర్వాంతర్యామి అయి ఉండి కూడా, ఏమీ తెలియని సాధారణ గోపబాలుని వలె, గోపబాలురతో పాటు ఆడుతూ పాడుతూ విహరించేవాడు. కాని అప్పుడప్పుడూ తన మహిమలను ప్రకటించి అందరినీ ఆశ్చర్యములో ముంచేవాడు.

శ్రీదాముడు, స్తోక కృష్ణుడు, సుబలుడు ఇంకా కొంతమంది గోప బాలురు కృష్ణునితో అత్యంత సన్నిహితంగా ఉండేవారు. వారు ఒకసారి కృష్ణునితో ఇలా అన్నారు.

"కృష్ణా! ఇక్కడకు దగ్గరలో ఒక తాటిచెట్ల తోపు ఉంది. ఆ

తాటిచెట్లకు తియ్యగా ఉండే తాటిపండ్లు ఉన్నాయి. అవి బాగాపండి కింద రాలి పడుతుంటాయి. వాటిని తీసుకొని తిందామంటే, అక్కడ ధేనుకుడు అనే రాక్షసుడు ఉన్నాడు. వాడు ఎవరినీ ఆ తాటిచెట్ల దగ్గరకు రానీయకుండా అడ్డగిస్తుంటాడు. వాడు ఎప్పుడూ గాడిద రూపంలో ఉంటాడు. వాడికి తోడు ఇంకా కొన్ని గాడిదలు కూడా ఉన్నాయి. వాడికి భయపడి మానవులు కానీ, పశువులు కానీ ఆ ప్రాంతమునకు వెళ్లవు. అక్కడ రాలి పడిన తాటిపండ్ల సువాసన ఇక్కడకు కొడుతూ ఉంది చూడు. ఆ తాటి పండ్లను తినాలని నోరూరుతూ ఉంది. కాని తినలేము. కేవలము ఆ తాటిపండ్ల సువాసనను అనుభవిస్తున్నాము. నీవు ఎలాగైనా ఆ తాటిపండ్లను మాకు తెచ్చి ఇవ్వాలి. తాటి పండ్లవాసనను బట్టి వాటిని తినాలనే కోరిక మాకు చాలా గాఢంగా ఉంది. మీకు ఇష్టం అయితే మనం ఇప్పుడే ఆ తాటిచెట్ల వద్దకు వెళదాము." అని పలికి కృష్ణుడి ముఖం వంక చూస్తున్నారు.

సాటి గోపబాలుర కోరికను విన్నాడు కృష్ణుడు. "సరే పోదాం పదండి." అంటూ బలరామ కృష్ణులు ముందు నడిచారు. వెనకనే గోపబాలురు ఎగురుతూ గంతులు వేస్తూ ఆ తాటిచెట్ల వద్దకు వెళ్లారు. బలరాముడు ఆ తాటి చెట్లను పట్టుకొని బలంగా ఊపసాగాడు. ఆ ఊపుడుకు తాటి చెట్లకు ఉన్నపండ్లు అన్నీ జలా జలా రాలి కింద పడ్డాయి.

దబదబా తాటిపండ్లు రాలి కిందపడుతున్న శబ్దం విని గార్ధభరూపుడైన ఆ రాక్షసుడు అక్కడకు వచ్చాడు. వెనక్కు తిరిగి వెనక కాళ్లతో బలరాముని గుండెల మీద బలంగా తన్నాడు. కాని

బలరాముడు పక్కకు పరుగెట్టి ఆ దెబ్బను తప్పించుకున్నాడు. ఆ రాక్షసుడు  పెద్దగా ఓండ్రపెడుతూ అటు ఇటు పరుగెడుతున్నాడు. మరలా ఆ గాడిద బలరాముని వద్దకు వచ్చి తన వెనక కాళ్లతో బలరాముని బలంగా తన్నబోయింది..

ఈ సారి బలరాముడు దాని వెనక కాళ్లను రెండింటినీ గట్టిగా పట్టుకున్నాడు. గిరా గిరా తిప్పాడు. ఆ వేగానికి ఆ గాడిద ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. బలరాముడు చచ్చిన ఆ గాడిదను బలంగా వేగంగా తాటిచెట్ల మీదికి విసిరేసాడు. ఆ గాడిద శరీరం తగిలి తాటిచెట్లు ఒకటి వెంట ఒకటి విరిగి పడ్డాయి.

ధేనుకుడు మరణించాడు అన్న వార్త తెలిసి ధేనుకుని బంధువులు అయిన గాడిదలు బలరాముని వైపుకు వేగంగా పరుగెత్తుకుంటూ వచ్చాయి. ఈ సారి కృష్ణుడు కూడా కల్పించు కున్నాడు. రామ కృష్ణులు ఇద్దరూ వచ్చిన గాడిదను వచ్చినట్టు వెనక కాళ్లు పట్టుకొని గిరా గిరా తిప్పి తాటి చెట్ల మీదికి విసిరేసారు. వాటి శరీరములు తాకిన ఆ తాటిచెట్లు మధురమైన ఫలములతో సహా నేలకూలాయి.

ఆ ప్రకారంగా బలరాముడు కృష్ణుడు వ్రజవాసులకు ఆ గాడిదల బాధను తొలగించారు. అప్పటి నుండి పశువులు ఆ తాటితోపులో మేస్తున్నాయి. గోపబాలురు తాటిపండ్లను తృప్తిగా తింటున్నారు. బృందావనములో ఉన్న వారు ఆ తాటితోపులో నిర్భయంగా తిరుగుతున్నారు. సాయంత్రం కాగానే కృష్ణుడు బలరాముడు

గోపబాలురు ఆవులను తోలుకొని తమ పల్లెకు చేరుకున్నారు.

ముఖంమీద ముంగురులు పడుతుంటే, తలమీద నెమలి పింఛము, అడవి పూలు అలంకారంగా మెరుస్తుంటే, ముఖంమీద చిరునవ్వుతో, వేణువు ఊదుతూ, ఒంటినిండా మట్టికొట్టుకుపోయిన కృష్ణుని చూడటానికి వ్రజములో ఉన్న వారంతా వీధులలోకి వచ్చారు. పొద్దుటి నుండి కృష్ణుని చూడలేదు కాబట్టి ఒక్కసారిగా కృష్ణుడు కనపడగానే, వ్రజస్త్రీలు కృష్ణుని వంక కన్నార్పకుండా చూస్తున్నారు.

ఇవేమీ పట్టని కృష్ణుడు గోవులతో సహా గోశాలలోకి వెళ్లాడు. తమ కుమారులు ఇంటికి తిరిగి రాగానే యశోద, రోహిణి వారిని కౌగలించుకొని, నుదుటి మీద ముద్దు పెట్టుకొని వారిని లోపలకు తీసుకొని వెళ్లారు. వారికి స్నానం చేయించారు. మంచి దుస్తులు ధరింపజేసారు. వేడి వేడి అన్నం పెట్టారు. బలరాముని, కృష్ణుని మెత్తటి శయ్యమీద పడుకోబెట్టి లాలించారు. పగలంగా ఆవులను మేపి అలసిపోయిన బలరామ కృష్ణులు సుఖంగా నిద్రపోయారు.

కాలం గడుస్తూ ఉంది. ఒక రోజు బలరాముడు, కృష్ణుడు, తన స్నేహితులతో సహా, యమునా నదీ తీరానికి ఆవులను తోలుకొని వెళ్లారు. అందరూ కాళిందీ మడుగు దగ్గరకు చేరుకున్నారు.

ఎండ తీవ్రత ఎక్కువగా ఉండటం వలన ఆవులకు, గోప బాలురకు బాగా దాహంవేసింది. వారందరూ కాళిందీ మడుగులోని నీటిని తాగారు. అంతే. ఆ నీటిని తాగిన గోవులు, గోప బాలురు స్పృహ తప్పి పడిపోయారు. కృష్ణుడు వారికి సేవలు చేసి వారిని స్పృహ

తెప్పించాడు. వారంతా ఒకరి మొహాలు ఒకరు చూచుకుంటూ ఇలా ఎందుకయిందా అని తర్కించుకుంటున్నారు." అని శుకయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు కాళీయమర్దనము గురించి వివరిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
పదునారవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! తరువాత కృష్ణుడు కాళీయుడు అనే విషసర్పము చేత యమునా నదిలో ఉన్న నీళ్లు విషపూరితములు అవడం చూచి యమునానదీ జలములను శుద్ధిచేయ సంకల్పించాడు. కాళీయుని అక్కడి నుండి వెళ్లగొట్టాడు." అని చెప్పాడు.

ఇప్పుడు పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహం కలిగింది. "శుకయోగీంద్రా! బాలుడైన కృష్ణుడు, ఎన్నాళ్లనుండో యమునా నదీ జలములలో నివసిస్తూ ఉన్న కాళీయుని, ఎలా వెళ్లగొట్టగలిగాడు. ఈ విషయములను నాకు వీనులవిందుగా చెప్పండి." అని అడిగాడు. శుక మహర్షి ఇలా చెప్ప సాగాడు.

(ఈ కాళీయమర్ధనము అనే కథను కేవడం కథగా కాకుండా నేటి సమాజానికి అన్వయించుకుంటే ఎలా ఉంటుందో ఆలోచించండి. కాళీయుడు అంటే ఎవరో కాదు. తామర తంపరగా, నదీతీరములలో, సముద్రతీరములలో వెలిసిన ఫాక్టరీలు. రొయ్యల చెరువులు. కాళీయుడు చిమ్మే విషం అంటే ఆ కర్మాగారాలు విడుదలచేసే విషపూరితమైన వ్యర్థపదార్థాలు. రసాయనాలు. వాటి వలన నదీజలాలు, చెరువులు, కుంటలు, భూగర్భజలాలు కలుషితమవుతున్నాయి. విషపూరితము అవుతున్నాయి. ఆ నీటిని తాగి మానవులు, పశువులు, పక్షులు రోగాల బారిన పడుతున్నారు. చచ్చిపోతున్నారు. ఆ నాడు కృష్ణుడు ఆ కాళీయుని యమున నుండి వెళ్లగొట్టి నదీజలాలను రక్షించాడు. నేడు పొల్యూషన్ కంట్రోల్ బోర్డు, హైకోర్టు, సుప్రీంకోర్టు అనే కృష్ణావతారాలు ఈ దిశగా ప్రయత్నం చేస్తున్నాయి కానీ సఫలం కావడం లేదు. చదువుతూ ఉంటే మీకే అర్థం అవుతుంది.)

శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు ఇలా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! యమునా నది మధ్యలో ఒక నీటి మడుగు ఉంది. ఆ మడుగులో కాళీయుడు అనే పాము తన భార్యాబిడ్డలతో నివసిస్తూ ఉంది. ఆ కారణం చేత దానిని కాళీయమడుగు అని అంటారు. ఆ మడుగులోని జలాలలో ఆ సర్పము, దాని సంతానము అంతా రోజూ విషం కక్కుతూ ఉండేవి. దాంతో ఆ మడుగులోని జలాలు, పరిసర మడుగులలోని జలాలు విషపూరితం అయ్యాయి. ఆ మడుగులోని నీరు సలసలకాగుతున్నట్టు

బుడగలు వస్తూఉండేవి. ఆ విషము ఎంత ప్రభావము కలిగి ఉందంటే ఆ మడుగు పైన ఎగురుతున్న పక్షులు కూడా ఆ విషపు గాలులు సోకి చనిపోయేవి.

ఇదంతా గమనించాడు కృష్ణుడు. ఆ విషసర్పాన్ని యమునా నది నుండి వెళ్లగొట్టాలని సంకల్పించాడు. ఆ మడుగు పక్కనే ఉన్న ఒక చెట్టు ఎక్కాడు. చేతులు చాచి ఆ మడుగులోకి దూకాడు. ఆ మడుగు చాలా లోతుగా ఉంది. కృష్ణుడు ఆ మడుగులోకి దూకగానే ఆ మడుగులో ఉన్న జలాలు పెద్ద శబ్దం చేస్తూ పైకి ఎగిసి పడ్డాయి.

ఈ శబ్దాన్ని, నీటిలో కలిగిన అలజడిని చూచిన కాళీయుడు కోపంతో రగిలిపోయాడు. ఈ ఉత్పాతం ఎవరు కలిగించారా అని చుట్టు చూచాడు. నీటిలో నిర్భయంగా ఈదుతున్న కృష్ణుడు కనిపించాడు. కాళీయుడు కోపంతో రగిలిపోయాడు. కసిదీరా కృష్ణుని కాటు వేసాడు. తన శరీరంతో కృష్ణుని శరీరాన్ని చుట్టాడు. గట్టిగా నలిపేస్తున్నాడు.

కృష్ణుడు మడుగులో దూకడం, కాళీయుడు కృష్ణుని కాటు వేయడం, తన పొడుగాటి శరీరంతో కృష్ణుని చుట్టేయడం చూచి ఒడ్డున ఉన్న గోపబాలురు భయంతో వణికిపోయారు. "కృష్ణా! కృష్ణా!" అంటూ అరుస్తున్నారు. ఏడుస్తున్నారు. గోవులు కూడా ఒడ్డున అటు ఇటు తిరుగుతూ కన్నీళ్లు కారుస్తున్నాయి. అంబా అని అరుస్తున్నాయి.

అప్పుడు బృందావన వ్రజములో ఉన్న వారికి పెద్ద భూకంపం వచ్చినట్టు, శరీరాలు అదిరినట్టు అనిపించింది. "ఈ కృష్ణుడు

బలరాముని తోడుతీసుకొని వెళ్లకుండా ఒంటరిగా ఆవులను తోలుకొని వెళ్లాడు. ఏం జరిగిందో ఏమో!" అనుకుంటూ కలవరపడుతున్నారు. కొంత మందిఅయితే "ఏమో కృష్ణుడు మరణించాడేమో. పుట్టినప్పటినుండి కృష్ణుడికి అన్నీ ఆపదలే!" అని తమలో తాము అనుకుంటున్నారు. కొంతమంది ఏమి జరిగిందో చూద్దామని కృష్ణుడు ఆవులను తోలుకొని వెళ్లిన వైపు ఆడామగా అనే తేడా లేకుండా పరుగులెత్తారు.

బలరాముడు మాత్రం చిరునవ్వు నవ్వుతూ ఇదంతా చూస్తున్నాడు. కృష్ణుని చేతిలో ఈ రోజు ఎవడికో మూడింది అని తనలో తాను అనుకున్నాడు. పైకి మాత్రం ఏమీ మాట్లాడకుండా గంభీరంగా ఉన్నాడు.

బృందావనములో ఉన్న వారంతా, ఆవుమందల గిట్టల గుర్తులు, కృష్ణుని పాదముల యొక్క గుర్తులను అనుసరిస్తూ, యమునాతీరమునకు వెళ్లారు. వాళ్లందరికీ దూరం నుండి కాళిందీ మడుగులో సర్పముతో చుట్టబడిన కృష్ణుడు, ఒడ్డున ఏడుస్తున్న గోపబాలురు, కన్నీళ్లు కారుస్తున్న గోవులు  కనిపించాయి. ఆ దృశ్యం చూచిన బృందావన వాసులు కూడా ఏడవడం మొదలు పెట్టారు.

ఇంతలో కొంత మంది యశోదవద్దకు వెళ్లారు. ఆమెను కౌగలించుకొని కృష్ణునికి పట్టిన దురవస్థకు ఏడుస్తున్నారు. కొంత మంది గోపబాలురు కృష్ణుని రక్షించడానికి ఆ నీటి మడుగులో

దూకడానికి వెళుతుంటే, బలరాముడు వారిని వారించాడు.

ఒడ్డుమీద ఉన్న గోపాలురు, గోపకాంతలు, తన తల్లులు పడుతున్న మనోవేదనను గమనించాడు కృష్ణుడు. వెంటనే తన శరీరాన్ని ఒక్కసారి గట్టిగా విదిల్చాడు. తన శరీరాన్ని విపరీతంగా పెంచాడు.  ఆ పాముయొక్క బంధనములనుండి బయట పడ్డాడు.

ఎప్పడైతే కృష్ణుని శరీరము పెరుగుతూ ఉందో, కృష్ణుని చుట్టుకొని ఉన్న కాళీయుని శరీరములోని ఎముకలు పటపట మంటున్నాయి. "ఇదేందిరా బాబూ, వీడిని పట్టుకొని పచ్చడి చేద్దామనుకుంటే,  నా ఎముకలు విరుగుతున్నాయి." అనుకుంటూ కాళీయుడు కృష్ణుని వదిలిపెట్టాడు. కాళీయుడికి చేతనైన విద్య విషం కక్కడం. అందుకని కృష్ణుని మీద విషం కక్కుతున్నాడు.

కాళీయుని పట్టునుండి విడివడ్డ కృష్ణుడు ఆ పాము చుట్టు తిరుగుతూ దానికి అందకుండా ఆడుకుంటున్నాడు. కాళీయుడు కూడా కృష్ణుని పట్టుకోవాలని, కాటువేయాలని, ప్రయత్నిస్తున్నాడు. అలా కొంచెంసేపు తిరిగేటప్పటికి కాళీయునికి అలసట వచ్చింది. ఇదే అదును అని, కృష్ణుడు, కాళీయుని తోకపట్టుకొని, వాడి పడగ మీద కాలు పెట్టి, కాళీయుని పడగల మీదికి ఎక్కాడు.

మణులతో నిండిన కాళీయుని పడగ కృష్ణుని పద విన్యాసములతో శోభిల్లింది. కృష్ణుడు కాళీయుని తోకపట్టుకొని మెలిదిప్పుతూ, కాళీయుని పడగలమీద ఎగురుతూ నృత్యం చేస్తున్నాడు.

కాళీయుని పడగలను అణగదొక్కుతున్నాడు.

చిన్ని కృష్ణుని ఈలీలా విన్యాసము అంతా దేవలోకము నుండి చూస్తున్న గంధర్వులు, సిద్ధులు, మునులు, చారణులు, అప్సరసలు కూడా సంతోషంతో నృత్యం చేస్తున్నారు. కృష్ణుని నృత్యానికి తగ్గట్టు తాము కూడా ఆడుతున్నారు. పాడుతున్నారు. వాద్యాలు వాయిస్తున్నారు. స్తోత్రాలు చేస్తున్నారు. కొంతమంది చిన్నికృష్ణునికి కానుకలు తీసుకొని ఆయన వద్దకు వెళుతున్నారు.

కృష్ణుడు తన పడగలమీద ఎక్కి తొక్కుతుంటే, కాళీయుడికి చచ్చే పర్యంతం అయింది. కాటేద్దామంటే కృష్ణుడు తన తలమీద ఉన్నాడు. శరీరాన్ని చుట్టేద్దామా అంటే కృష్ణుడు విపరీతంగా శరీరం పెంచుతున్నాడు. చేసేది లేక కాళీయుడు కృష్ణుడి చేత తొక్కించు కుంటూ ప్రాణాలు కళ్లలో పెట్టుకొని రక్తం కక్కుకుంటూ మూర్ఛపోతున్నాడు. కాళీయుడు విషం కక్కుతున్నాడు. రక్తం కక్కుతున్నాడు. కృష్ణుడు వాడి పడగల మీద నృత్యం చేస్తున్నాడు. గంధర్వాదిదేవతలు ఆకాశంలో నిలబడి కృష్ణుని పూజిస్తున్నారు.

కృష్ణుడు చేస్తున్న ఈ చిత్రవిచిత్ర తాండవ నృత్యానికి కాళీయుని పడగలు చితికిపోతున్నాయి. కళ్ల వెంట రక్తం కారుతూ ఉంది. ప్రాణాలు పోయేటట్టుఉన్నాయి. తట్టుకోలేకపోతున్నాడు. అప్పుడు గుర్తుకొచ్చాడు భగవంతుడు. “దేవుడా నువ్వే దిక్కు. నువ్వే నన్ను రక్షించాలి” అని చేతులెత్తి ప్రార్థించాడు.

(నేటి మానవులు కూడా ఇంతే కదా! కాళీయుని సంతతి

ప్రపంచమంతా విస్తరించి ఉన్న ఈ సమాజంలో, మానవులు చెయ్యాల్సిన అక్రమాలు, అకృత్యాలు, దుర్మార్గాలు అన్నీ చేస్తారు. సాగినంత కాలం నాకు ఎదురు లేదనుకొని విర్రవీగుతారు. కాని కాలం వచ్చి, కారాగారంలో పడితే, దేవుడా దిక్కు అంటూ దేవుడిని గుర్తు తెచ్చుకుంటారు. దేవుడి దయవలన నిర్దోషిగా బయటపడతాను అంటూ ప్రగల్భాలు పలుకుతారు. నాడూ అంతే నేడూ అంతే. )

కాళీయుని పరిస్థితి ఇలా ఉంటే, కాళీయుని భార్యలు, తమ భర్తకు పట్టిన దుస్థితికి పరితపిస్తున్నారు. వారందరూ కట్టకట్టుకొని, తమ సంతానముతో సహా, కాళీయుని పడగల మీద ఆడుతున్న కృష్ణుని వద్దకు వెళ్లారు. తమ సంతానమును ముందు ఉంచుకొని, కాళీయుని భార్యలు కృష్ణుని ఈ విధంగా ప్రార్థించారు.

“ఓ దేవాధిదేవా! కృష్ణా! నీవు సామాన్యుడవు కావు. భూభారమును తగ్గించడానికి భూమి మీద అవతరించిన శ్రీమన్నారాయణుడవు. నా భర్త మహాపాపి, దుర్మార్గుడు. ఇన్నాళ్లు ప్రజలను నానా కష్టాలు పెట్టాడు. మా భర్తకు ఈ శాస్తి కావలసిందే. నీవు నీ శత్రువుల పట్ల ఎలా ప్రవర్తిస్తావో, నీ కుమారుని పట్లకూడా అలాగే ప్రవర్తిస్తావు. తప్పుచేసిన వారు భవిష్యత్తులో బాగుపడతారని, వారికి మంచి జరగాలని, నీవు వారిని శిక్షిస్తుంటావు.

నీవు విధించే శిక్ష మా భర్తలాంటి పాపాత్ముల పాపములను సర్వనాశనం చేస్తుంది. నీవు మా భర్తను దండించి మాకు మేలు చేసావు. మమ్ములను అనుగ్రహించావు. మా భర్త, మేము ఏం పాపం

చేసామో ఏమో ఈ జన్మలో పాములుగా పుట్టాము. నీ కోపము కూడా మాకు అనుగ్రహంలాంటిదే కదా!

నీవు నీ భక్తులను, నిన్ను నమ్ముకున్నవారిని, రక్షిస్తుంటావు అని అంటారు. మా భర్త కూడా పూర్వ జన్మలో మంచి వాడు, గర్వము లేని వాడు, బుద్ధిమంతుడు, ఎంతో తపస్సు, ఎన్నో పుణ్యకార్యములు చేసిన వాడు అయి ఉంటాడు. తన తోటి వారికి హితం చేయగోరి ఎన్నో ధర్మకార్యాలు చేసి ఉంటాడు. లేకపోతే, ఇప్పుడు, ఈ ప్రకారంగా, నీ పాద స్పర్శతో ఎందుకు పవిత్రుడు అవుతాడు.

నీ పాద స్పర్శ కోసరం లక్ష్మీదేవి నిరంతరము పరితపిస్తూ ఉంటుంది. అటువంటి నీ పాదరేణువులు నా భర్త తలను అయాచితంగా అలంకరించాయి. నా భర్తకు ఏ పుణ్యవిశేషం చేత ఇంతటి అధికారం కలిగిందో తెలుసుకోలేకపోతున్నాము.

నీ పాదములను ఆశ్రయించిన నీ భక్తులు, నీ పాదధూళి కోరుకుంటారే కానీ, ఈ లోకంలో లభించే రాజ్యసంపదలు, సార్వభౌమ పదవి, పరలోకంలో లభించే స్వర్గసుఖాలు, చివరకు మోక్షమును కూడా కోరుకోరు.

ఓ దేవా! నిరంతరము సంసార చక్రంలో పడి తిరుగుతున్న మానవులు, నీ పాదస్పర్శకోసం పరితపిస్తుంటారు. కాని అమిత క్రోధం కలవాడు, తమోగుణసంపన్నుడు అయిన నా భర్తకు, ఏ ప్రయత్నము లేకుండా, బ్రహ్మాదులకు కూడా లబ్యంకాని, నీ పాదములను శిరస్సున

ధరించే భాగ్యం లభించింది.

ఓ భగవాన్! మహాపురుషా! మహాత్మా! అన్నిభూతములలో నివసించేవాడా! అన్ని భూతములు నీవే అయి ఉన్నవాడా! పరమాత్మా! నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు నిత్యుడవు. కార్యకారణస్వరూపుడవు. కారణములకు అతీతుడవు. పరబ్రహ్మస్వరూపుడవు. నీకు సత్వ, రజస్తమోగుణములు లేవు. నీకు ఎటువంటి వికారములు లేవు. నీవు ఈ ప్రకృతిలో నిరంతరము చరిస్తున్నా, ఈ ప్రకృతి గుణములు నీకు అంటవు. నీ శక్తి అనంతము. జ్ఞానస్వరూపుడవు అయిన నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు కాలస్వరూపుడవు . కాలమునకు మూలము నువ్వే. నీవు కాలమునకు అతీతుడవు. కాలానుగుణంగా జరిగే అన్నిటినీ నీవుసాక్షీభూతంగా చూస్తూ ఉంటావు. ఈ విశ్వమును సృష్టించిన వాడవు నీవే! ఈ ప్రపంచంలో జరిగే అన్ని విషయములను చూచే ద్రష్టవు నీవే! ఈ ప్రపంచంలో జరిగే అని కార్యములకు కారణము, కర్త నీవే. కాని ఈ మానవులు అన్నీ తామే చేస్తున్నాము అనే భ్రమలో ఉంటారు.

ఓ దేవా! పంచభూతములు, పంచ తన్మాత్రలు, పది ఇంద్రియములు, పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, అహంకారము, వీటిలో ఉండే చైతన్యము అన్నీ నీవే. నీవు కానిది ఏదీ ఈ అనంత విశ్వంలో ఏదీ లేదు. నీవు జీవులన్నింటిలోనూ ఆత్మస్వరూపుడుగా

వెలుగుతున్నావు. కానీ మేమంతా మూడుగుణములకు లోబడి, అహంకారంతో కప్పబడిపోయి నిన్ను చూడలేకపోతున్నాము. నీ గురించి తెలుసుకోలేకపోతున్నాము.

ఓ దేవా! నీవు అనంతుడవు. నిరాకారుడవు. నీకు చలనం లేదు. అన్నిటా స్థిరంగాఉంటావు. నీవు జ్ఞానస్వరూపుడవు. నీ గురించి, నీ ఉనికిని గురించి పండితులు ఎన్నో వాదోపవాదాలు చేస్తుంటారు. చెప్పే విషయము, చెప్పబడే విషయము నీవే కాబట్టి, ఆ వాదోపవాదములు అన్నీ నీ స్వరూపాలే. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీవు జ్ఞానస్వరూపుడవు. ఇటు ప్రాపంచిక విషయములలో ప్రవర్తించాలన్నా, లేక మోక్ష మార్గములో పయనించాలన్నా, మూలము వేదములు, శాస్త్రములు. ఆ వేదములు, శాస్త్రములు కూడా నీ స్వరూపాలే. అట్టి నీకు నమస్కారము.

ఓ కృష్ణా! వాసుదేవా!సంకర్షణా! ప్రద్యుమ్నా! అనిరుద్ధా! సాత్వతులకు పతిఅయిన వాడా! నీకు నమస్కారము.

(వీటిని చతుర్వ్యూహములు అంటారు. వాసుదేవుడు చిత్తమునకు, సంకర్షణుడు మనలో ఉన్న అహంకారానికి, ప్రద్యుమ్నుడు బుద్ధికి, అనిరుద్ధుడు మనస్సుకు అధిదేవతలు. ఈ నాలుగే మనిషి శరీరాన్ని నడిపిస్తున్నాయి, శాసిస్తున్నాయి.)

ఓ దేవా! నీవు మూడు గుణములను (సత్వ, రజస్,

తమోగుణములు) ప్రకోపింప చేసేవాడివి! గుణములను నిర్వీర్యం చేసేవాడివి. గుణములను అందరికీ తెలిసేటట్టు చేసేవాడివి. గుణములలో ప్రవర్తిస్తుంటే సాక్షిగా చూస్తూ ఉండేవాడివి. ఆ గుణములకు అతీతుడుగా ఉండేవాడివి. ఏ గుణము అంటకుండా స్వయంగా ప్రకాశించేవాడివి. అన్నీ నువ్వే. అట్టి నీకు నమస్కారము.

ఓ హృషీకేశా! అన్ని వికారములు నీ నుండి పుడుతున్నాయి. కాని నీకు ఏ వికారమూ లేదు. నీవు ఎక్కువ మాట్లాడవు. మౌనంగానే అన్ని పనులు చేస్తుంటావు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! ఈ అనంత విశ్వంలో పరమాణువు మొదలుకొని బ్రహ్మాండము వరకూ అన్నింటా నీవే నిండి ఉన్నావు. నీవు ఈ అనంత విశ్వానికి అధినేతవు. ఈ విశ్వం అంతా నీవే అయి ఉన్నావు కానీ ఈ విశ్వంలో నీవు లేవు. (సముద్రంలో అలలు ఉన్నాయి కానీ అలలలో సముద్రం లేదు.)

ఓ దేవా! నీకు ఏ కోరికా లేదు. కాని సత్వ,రజస్తమో గుణములతోకూడిన ఈ అనంత విశ్వాన్ని సృష్టించావు. ఈ విశ్వంలో ఉండే జీవులలో సత్వగుణము కలిగిన వారికి శాంతి, రజోగుణము కలిగిన వారికి అశాంతి, తమోగుణములు కలిగిన వారికి మూఢత్వము అనే స్వభావములను సృష్టించావు. కానీ నీవు మాత్రము సత్వగుణసంపన్నుడవు. నీవు ఎత్తిన అవతారములన్నీ సత్వగుణ ప్రధానములైనవేకదా! ఆ కారణం చేత సత్వగుణమును అవలంబించిన వారందరూ నీకు ఇష్టమైన వారే!

ఓ శాంతమూర్తీ! మా భర్త తమోగుణము కలిగిన వాడు. మూఢస్వభావుడు. కాని నీకు కుమారుడి లాంటి వాడు. ఎందుకంటే ఈ లోకమంతా నీ సంతానమే కదా! కుమారుడు చేసిన తప్పు తండ్రి క్షమించినట్టు, ఈ కాళీయుడు చేసిన అపరాధమును మన్నించి క్షమించు. మా భర్త ఒట్టి మూర్ఖుడు. నీ శక్తిని తెలుసుకోలేక నిన్ను బంధించాడు. బాధించాడు. కాటు వేసాడు. దయచేసి అతని అపరాధములను మన్నించి క్షమించు.

ఓ దేవా! నీ పాదఘట్టనములచే ఈ కాళీయుడు చచ్చేట్టు ఉన్నాడు. మాకు పతిభిక్ష పెట్టు. మేము ఏ అపరాధము చేయలేదు కదా! ఇంకమీదట నుండి మేమందరమూ బుద్ధిగా ఉంటాము. నీవు ఏం చెబితే అదే చేస్తాము. మమ్ములను ఆజ్ఞాపించు." అని కాళీయుని భార్యలు దీనంగా ప్రార్థించారు.

కాళీయుని భార్యల ప్రార్థనలను విన్న కృష్ణుడు కాళీయుని మీద దయ చూపి ఆయన తలమీది నుండి కిందికి దూకాడు. గట్టున నిలబడ్డాడు.

అప్పటి దాకా నోరువిప్పకుండా కృష్ణుని పాద తాడనాన్ని మౌనంగా భరిస్తూ, ప్రాణాలుపోయేటట్టు ఉన్న కాళీయుడు, కృష్ణుడు తన మీది నుండి దిగేటప్పటికి కాస్త ఊపిరి పీల్చుకున్నాడు. పోయిన ప్రాణాలు తిరిగివచ్చినట్టయింది. ఒళ్లు విదుల్చుకున్నాడు. ఒంట్లో శక్తినంతా కూడగట్టుకున్నాడు. గద్గద స్వరంతో కృష్ణుని ఇలా

ప్రార్థించాడు.

"ఓ దేవా! మేము పాములము. మాకు కోపం ఎక్కువ. దుర్మార్గము ఎక్కువ. తమోగుణ ప్రధానులము. అందరినీ కాటు వేసి చంపుతుంటాము. అది మాస్వభావము. దానికి మేమేం జేయగలము. మేము కూడా నీవు సృష్టించిన ప్రాణులలో భాగమే కదా!

ఓ దేవా! నీవు అన్ని రకాల ప్రాణులను సృష్టించావు. వీరత్వము, శౌర్యము, శాంతము, కోపము, దుర్మార్గము, క్రూరత్వము అనే గుణములతోనూ, రకరకాల ఆకృతులు కల దేహములతోనూ సృష్టిచేసావు. కోరలలో విషంతో కోప స్వభావంతో మమ్ములను సృష్టించావు. మా సర్పజాతి పుట్టినప్పటి నుండి కోపస్వభావంతో ఉన్నవారము. మా గుణములకు తగ్గట్టు మేము నడుచుకుంటున్నాము. మేమందరము నీ మాయలో పడి ప్రవర్తిస్తున్నాము. కాబట్టి మా మీద ఆగ్రహాన్ని చూపించినా, అనుగ్రహాన్ని చూపించిన నీవే సమర్థుడవు." అని ప్రార్థించాడు.

అప్పుడు కృష్ణుడు కాళీయునితో ఇలా అన్నాడు. "సర్పజాతికి ఆత్మరక్షణకొరకు కోరలలో విషం పెట్టాను కానీ అందరి మీదా విషం చిలకరించమని కాదు. నీవు, నీ వాళ్లు, విషం కక్కుతూ, ఈ యమునను విషపూరితం చేస్తున్నారు. ప్రతిరోజూ మనుషులు, పశు వులు, గోవులు తాగే ఈ నీటిని కలుషితం చేయవద్దు. నీవు ఇక్కడ ఉండటానికి వీలు లేదు. నీ జాతి పాములతోనూ, నీ భార్య, సంతానముతోనూ, ఇక్కడి నుండి తక్షణమే వెళ్లిపో. సముద్రంలో

జీవించు.

కాళీయుడా! నీవు గరుడుని బారి నుండి తప్పించుకోడానికి ఈ కాళీయమడుగును నివాసంగా చేసుకున్నావు. నేను నీ తలమీద నా పాదములను పెట్టి తొక్కాను కాబట్టి నా పాదముద్రలు నీ పడగల మీదపడ్డాయి. నా పాదముద్రలు చూచిన గరుడుడు నీ జోలికి రాడు. కాబట్టి నీవు వెంటనే నీ బంధు,మిత్ర,సపరివారసమేతంగా సముద్రానికి వెళ్లిపో." అనిఆదేశించాడు కృష్ణుడు.

ఆ మాటలు విన్న కాళీయుడు, కాళీయుని భార్యలు ఎంతో ఆనందాన్ని పొందారు. కృష్ణుని పూజించారు. స్తుతించారు. తరువాత కాళీయుడు తన వారితో కలిసి సముద్ర మధ్యలో ఉన్న రమణక ద్వీపమునకు వెళ్లిపోయాడు. అప్పటి నుండి యమునా నదీ జలాలు కాలుష్యం నుండి విముక్తి పొందాయి. నదీతీరంలో ఉండే ప్రజలకు, జంతువులకు తాగడానికి యమునా నదీ జలాలు యోగ్యంగా ఉన్నాయి." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కాళీయ మర్దనము వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము పదహారవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

(ఇప్పటి దాకా మీరందరూ కాళీయమర్దనము గురించి చదివారు. నేను మొదట్లో చెప్పిన విషయం సరిపోయిందను కుంటాను. కాళీయుడుని ఈనాటి విషపదార్థాలు, వ్యర్థాలు విసర్జించే

ఫాక్టరీలుగా పోల్చుకుంటే, ఆ ఫాక్టరీలు బయటకు వదిలే వ్యర్థాలు సమీపములోని జలాశయాలను నాశనం చేస్తున్నాయి. భూగర్భజలాలను కలుషితం చేస్తున్నాయి. ప్రతి నగరంలోనూ, పట్టణంలోనూ ఇదే పరిస్థితి. పొల్యూషన్ కంట్రోల్ బోర్డు ఎన్ని మార్లు హెచ్చరించినా, న్యాయస్థానాలు మొట్టికాయలు వేసినా ఈనాటి కాళీయులకు చీమకుట్టినట్టయినా లేదు. ఈ కాలుష్యభూతం నుండి రక్షించడానికి మరలా కృష్ణుడు పుట్టాలేమో అనిపిస్తూ ఉంది.)

## శ్రీమద్భాగవతము
## దశమస్కంధము
## పదునేడవ అధ్యాయము.

శుక మహర్షి కాళీయమర్దనము వృత్తాంతము వినిపించగానే, పరీక్షిత్తు మహారాజుకు ఒక అనుమానము వచ్చింది.

"శుకయోగీంద్రా! కాళీయుడు గరుడుని భయంతో రమణక ద్వీపమును వదిలాడు అన్నారు కదా! అది ఎలా జరిగింది. కాళీయుడు ఏం తప్పుచేసాడు. వివరించండి." అని అడిగాడు. అప్పుడు శుకమహర్షి ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! రమణక ద్వీపము అని ఒక ద్వీపము ఉంది. ఆ ద్వీపములో పాములు ఎక్కువగా ఉండేవి. ఆ పాములు

రమణక ద్వీపములో నివసించే మానవులను కాటువేసి చంపుతూ ఉండేవి. పాముల బాధ నుండి తప్పించుకోడానికి, మానవులు ప్రతినెలా ఆ పాములకు ఆహారంగా గుడ్లు, పాలు, ఉపాహారాలు తెచ్చి చెట్ల మొదళ్లలో పెట్టి వెళ్లేవారు. ఆ ఆహారములను పాములు ఆరగించేవి. (ఈ రోజుల్లో నాగుల చవితికి, నాగపంచమికి పుట్టలో పాలుపొయ్యడం, చలివిడి, వడపప్పు ఆహారంగా పెట్టడం, అనే ఆచారం ఇక్కడి నుండి వచ్చిందేమో!)

నాగులకు గరుడ పక్షులు శత్రువులు. ఈ గరుడ పక్షులు రమణక ద్వీపంలో ఉండే పాములను ఎత్తుకుపోతూ ఉండేవి. వాటి బాధ నుండి తప్పించుకోడానికి పాములు తమకు ప్రజలు ఇచ్చిన ఉపాహారములలో ఒక వాటాను గరుడునికి సమర్పించుకొనేవి.

(వ్యాపారస్థులు వీధి రౌడీకి మాములు ఇస్తే, ఆ వీధి రౌడీ అందులో కొంత పెద్ద రౌడీకి ఇస్తాడు కదా! ఆ పెద్ద రౌడీ అందులో కొంత పోలీసులకు ముట్టచెబుతాడు. అలాగే ఈ నాడు కాంట్రాక్టర్లు ఇచ్చే లంచాలు, కింది స్థాయి ఉద్యోగుల నుండి పైన ఉండే మినిస్టర్ల వరకూ ఎవరి వాటాలు వారికి ఏదోరూపంలో వెళుతుంటాయి కదా! ఈ ఆచారం అప్పటినుండి ఉందేమో!)

ఇది ఇలా ఉండగా కద్రువ కుమారుడు కాళీయుడు అనే సర్పము మహా గర్విష్టి. బలవంతుడు. "నాకు నూరు తలలు, ఆ తలలకు కోరలు, కోరల నిండా విషం ఉంది. నన్ను ఎవరేమి చేస్తారు. అసలు ఈ గరుడుడు ఎవరు? వీడికి వాటాలు ఇచ్చేదేంటి? వీడికి వాటా

ఎందుకివ్వాలి!" అని గరుడినికి వాటాలు ఇవ్వడానికి నిరాకరించాడు.

(మాఫియా గాంగులు కూడా ఇంతే కదా! ఒక పెద్ద గాంగు కింద ఛోటా గాంగులు పనిచేస్తుంటాయి. ఉన్నట్టుండి ఛోటాగాంగులు పైవాడికి వాటా ఇవ్వకుండా స్వతంత్రం ప్రకటిస్తాయి. ఫలితం గాంగ్‌వార్)

ఇక్కడ కూడా కాళీయుడు గరుడునికి వాటా ఇవ్వడానికి నిరాకరించాడు. మానవులు ఇచ్చిన ఉపాహారాలు అన్నీ తానే తినసాగాడు. ఈ విషయం గరుడునికి తెలిసింది. కోపంతో ఊగిపోయాడు. కాళీయుని చంపేయాలి అని అనుకున్నాడు గరుడుడు. రివ్వున ఎగురుతూ కాళీయుడు ఉన్నచోట వాలాడు. కాళీయుడు తన నూరు పడగలను పైకెత్తి గరుడుని కాటు వేసాడు. విషాన్ని చిమ్మాడు.

కాళీయుని పడగ కాటు ఒంటినిండా దట్టంగా ఈకలు ఉన్న గరుడుని ఏమీ చేయలేకపోయింది. గరుడుడు తన రెక్కతో అదీ ఎడమ రెక్కతో, కాళీయుని ఒక్క బాదు బాదాడు. ముక్కుతో పొడిచాడు. ఆ దెబ్బకు కాళీయుడు అదిరిపోయాడు. దిమ్మతిరిగిన కాళీయుడు తన భార్యాబిడ్డలతో పారిపోయాడు. యమునా నదీ జలాలలో దాక్కున్నాడు. యమునానదీ జలాల వద్దకు గరుడుడు రాడని కాళీయునికి తెలుసు.

అది ఎలాగంటే, ఒక సారి సౌభరి అనే మహాముని జలస్తంభన విద్యతో నీటి అడుగున తపస్సు చేసుకుంటున్నాడు. అప్పుడు గరుడుడు

అటుగా వెళుతో యమునా నదిలో ఈదుతున్న ఒక పెద్ద చేపను పట్టుకొని ఎగిరిపోయాడు. ఆ పెద్ద చేపకు పట్టిన గతి చూచి చిన్న చేపలు అన్నీ భయంతో వణికిపోయాయి. ఏడవసాగాయి. అది చూచాడు సౌభరి. కారణం తెలుసుకున్నాడు. "ఈ రోజునుండి గరుడుడు ఈ యమునానదిలో ఉన్న చేపలను ముట్టుకుంటే వెంటనే చస్తాడు." అని శాపం ఇచ్చాడు. అప్పటి నుండి గరుడుడు యమునా నదీ జలాల వైపుకుపోడు.

ఈ విషయం తెలిసిన కాళీయుడు తనకు యమునా నదీజలాలు క్షేమం అని తెలిసి, రమణక ద్వీపంనుండి వచ్చి యమునానదీ జలాలలో తలదాచుకున్నాడు. కాని దుర్మార్గులకు ఏం జరిగినా, ఎక్కడ ఉన్నా బుద్ధిరాదు కదా!

(నేరస్థులు బాగు పడతారని జైళ్లలో పెడితే, బాగుపడడం మానేసి సెల్‌ఫోనుల ద్వారా బయట దందాలు చేస్తుంటారు. నేరప్రపంచాన్ని ఏలుతుంటారు.)

కాళీయుడు కూడా తన విషపు బుద్ధి పోనిచ్చుకోకుండా, యమునలో తన విషాన్ని చిలకరిస్తూ, ఎవరినీ తన వద్దకు రానీయ కుండా, యమునానదీ జలాలను విషపూరితం చేసాడు. ఈ పరిస్థితులలో కృష్ణుడువచ్చి కాళీయుని సపరివార సమేతంగా యమున నుండివెళ్లగొట్టాడు.

కాళీయుడు వెళ్లిపోగానే, కృష్ణుడు యమునా నదీ జలాల నుండి క్షేమంగా బయటకు వచ్చాడు. క్షేమంగా వచ్చిన చిన్ని కృష్ణుని

చూచి యశోద, గోపబాలురు, గోపకాంతలు ఆనందపరవశులయ్యారు. కృష్ణుని చూడగానే వారందరికీ పోయిన ప్రాణాలు మరలా వచ్చినట్టు అయింది. అన్నీ తెలిసిన బలరాముడు కూడా కృష్ణుని గట్టిగా కౌగలించుకొని ఆనందభాష్పములు కార్చాడు.

కృష్ణుడు క్షేమంగా తిరిగి రావడం చూచిన ఆవులు, దూడలు, పశువులు అన్నీ పరమానందమును పొందాయి. తలలను అటు ఇటు తిప్పుతూ తమ ఆనందాన్ని ప్రకటించాయి. దూడలు చెంగు చెంగున గెంతుతూ కృష్ణుని చుట్టు తిరిగాయి.

"అమ్మా! యశోదా! నీ పూర్వపుణ్యఫలము చేత కృష్ణుడు కాళీయుని బారిన పడి కూడా తప్పించుకున్నాడు." అని బ్రాహ్మణులు కృష్ణుని దీవించారు. వారి దీవెనలను అందుకున్న నందుడు బ్రాహ్మణులకు గోవులను, ధనమును దానంగా ఇచ్చాడు. యశోద అయితే కృష్ణుని క్షణం వదలడం లేదు. మాటి మాటికీ కౌగలించుకొని ముద్దులు పెట్టుకుంటూ తలనిమురుతూ ఉంది. ఆ ఆనందంలో సూర్యుడు అస్తమించిన సంగతి కూడా వారికి తెలియలేదు.

రాత్రి అయి వెన్నెల వచ్చింది. బృందావన వాసులు ఆకలి మరిచిపోయి యమునా నదీతీరంలో ఆనందంగా ఆ రాత్రి గడిపారు. కాళీయుని ఉపద్రవము ముగిసిపోయిందనుకుంటే అదే రాత్రి మరొక ఉపద్రవం వారిని చుట్టుముట్టింది. ఆ రోజు అర్ధరాత్రి పెద్ద అగ్నిప్రమాదం సంభవించింది.

యమునా తీరంలో ఉన్న ఎండి పోయిన చెట్లకు నిప్పు అంటుకుంది. ఆ చెట్లకింద పడుకున్న పల్లెవాసులను అగ్ని చుట్టుముట్టింది. వారందరూ ఒక్కసారిగా లేచి గోలగోలగా అరవసాగారు. ఎవరు ఏం చేస్తున్నారో తెలియడం లేదు. అందరూ కృష్ణుని వద్దకు పోయి కాపాడమని వేడుకున్నారు.  కృష్ణుడు నేర్పుగా వారందరినీ ఆ అగ్నిప్రమాదము నుండి రక్షించాడు. కృష్ణుని బుద్ధికుశలతకు వ్రజవాసులు కృష్ణుని కీర్తిని పొగిడారు. లీలామానుష విగ్రహుడైన పరమాత్మకు సాధ్యం కానిది ఏముంటుంది." అని శు కమహర్షి పరీక్షిత్ మహారాజుకు కాళీయుని పూర్వవృత్తాంతమును వివరించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము పదునేడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత& ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
పదునెనిమిదవ  అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు కృష్ణుడు ప్రలంబాసురుని వధించిన వృత్తాంతమును ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! కాళీయుని యమున నుండి

వెళ్లగొట్టిన తరువాత అందరూ బృందావనమునకు చేరుకున్నారు. బలరాముడు, కృష్ణుడు, గోప బాలురతో కలిసి ప్రతిరోజూ ఆవులను సమీపములో ఉన్న అడవిలోకి తీసుకెళ్లిమేపుకుంటూ, ఆటలాడుకుంటూ కాలం గడుపుతున్నాడు.

ఇంతలో ఎండా కాలం వచ్చింది. సూర్యుడు తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. కానీ కృష్ణుని సమక్షంలో  కృష్ణుని చల్లని చూపులలో గోప బాలురు వసంత కాలంలో ఉన్నట్టు అనుభూతి చెందుతున్నారు. బృందావనము చుట్టు  ఉన్న అడవులలో సెలయేళ్లు పారుతున్నాయి. ఆ సెలయేళ్ల నుండి ఎగురుతున్న  నీటి తుంపరలు సమీప ప్రాంతాలను చల్లబరుస్తున్నాయి. ఏపుగా పెరిగిన పచ్చిగడ్డి, పచ్చని చెట్లు, ఫలపుష్పములతో నిండి ఉన్న వృక్షములు, వాటి మీది నుండి వచ్చే చల్లని స్వచ్ఛమైన గాలి, ఎండాకాలములో కలిగే సూర్యతాపమును పోగొడుతున్నాయి.

యమునా నదీ జలములు సమీప ప్రాంతములను తడి తడిగా బురద బురదగా ఉంచుతూ, భూమిని చల్లబరుస్తున్నాయి. ఆవనములో రకరకాల పక్షులు, కీటకములు వింతవింతధ్వనులు చేస్తూ ఎగురుతున్నాయి.

అటువంటి వనములోకి కృష్ణుడు, బలరాముడు, గోపబాలురు ఆవులను మేపడానికి వెళ్లారు. ఆవులు మేస్తుంటే వీరందరూ ఆడుతూ పాడుతూ, నృత్యం చేస్తూ సంతోషంగా ఆటలాడుకుంటున్నారు. కృష్ణుడు మధ్యలో నిలబడి నృత్యం చేస్తుంటే, గోపబాలురు చుట్టు చేరి వేణువు

మొదలగు వాద్యములు వాయిస్తున్నారు. కొందరు పాడుతున్నారు. మరికొందరు లయబద్ధంగా చప్పట్లుకొడుతున్నారు. రాముడు, కృష్ణుడు రెట్టించిన ఉత్సాహంతో గిరా గిరా తిరుగుతూ, ఎగురుతూ, దుముకుతూ ఆడుకుంటున్నారు.  కొంత మంది కప్పలవలె దుముకుతున్నారు. మరి కొందరు చెట్లకు ఉయ్యాలలు వేసి ఊగుతున్నారు. మరికొందరు తాము రాజుల మని ఠీవిగా ఎత్తైన రాళ్ల మీద కూర్చుని లేని మీసములను మెలిబెడుతున్నారు.

వారంతా ఈ విధంగా ఆనందంగా విహరిస్తుంటే, ప్రలంబుడు అనే రాక్షసుడు అక్కడకు వచ్చాడు. వాడు గోపబాలుడి రూపం ధరించి వారిలో కలిసిపోయాడు.  మెల్లి మెల్లిగా ప్రలంబుడు రాముడు, కృష్ణుడు ఆడుకుంటున్నచోటికి చేరుకుని వారితో పాటు ఆడుకుంటున్నాడు.  ఈ విషయమును కనిపెట్టాడు కృష్ణుడు.

వాడిని చంపాలంటే వాడితో స్నేహం చెయ్యాలి. అందుకని కృష్ణుడు గోపబాలుడి రూపంలో ఉన్న ప్రలంబాసురుడి వద్దకు వెళ్లి వాడితో స్నేహం చేసి వాడితో కూడా ఆడుతున్నాడు. వాడిని తన జట్టులో చేర్చుకున్నాడు.  కృష్ణుడు తన వారినందరినీ పిలిచాడు. “ఒరేయ్ రండిరా. మనం ఒక ఆట ఆడుకుందాము. మనం రెండు జట్లుగా విడిపోదాము. ఒక దానికి నేను నాయకుడు. మరొక దానికి బలరాముడు నాయకుడు. గెలిచిన వాళ్లు ఓడిన వాళ్ల మీద ఎక్కాలి. ఓడిన వాళ్లు గెలిచిన వాళ్లను మొయ్యాలి. ఇదీఆట.” అని అన్నాడు.

అందరూ చప్పట్లు కొట్టారు. ఆట మొదలయింది. గెలిచినవారు

ఓడిన వారి మీద ఎక్కుతున్నారు. ఓడినవారు గెలిచిన వారిని మోస్తున్నారు. అందరూ భాండీరకము అనే చెట్టు కిందికి చేరారు. ఒక సారి బలరాముని పక్షంలో ఉన్న సుదాముడు, వృషభుడు మొదలగు వారు గెలిచారు. కృష్ణుడు, ప్రలంబుడు ఓడిపోయారు. ఓడి పోయిన కృష్ణుడు సుదాముని, భద్రసేనుడు వృషభుని మోయడానికి సిద్ధం అయ్యారు. ఆ క్రమంలో గోపబాలుడి రూపంలో ఉన్న ప్రలంబాసురుడు ఎదుటి జట్టులో ఉన్న బలరాముడిని తన మీదికి ఎత్తుకున్నాడు.

అసలు ప్రలంబాసురుడు వచ్చింది కృష్ణుడిని చంపడానికి. కాని కథ అడ్డం తిరిగి బలరాముడిని మోయాల్సివచ్చింది. ముందు బలరాముడిని చంపి, తరువాత కృష్ణుని పనిపడదాము అని అనుకున్నాడు ప్రలంబుడు. బలరాముడిని తన మీద ఎక్కమని పిలిచాడు. బలరాముడు ప్రలంబాసురుడి మీద ఎక్కాడు. ప్రలంబాసురుడు బలరాముని మోసుకుంటూ దూరంగా తీసుకొని పోయాడు. బలరాముడు క్రమక్రమంగా తన బరువును పెంచాడు. తన మీద ఎక్కిన బలరాముని బరువు పెరగడంతో ప్రలంబుడు వేగంగా పరుగెత్తలేకపోయాడు. బలరాముని కిందికి దించి తనరాక్షస రూపము ధరించాడు.

నిప్పుకణికలవలె కణకణలాడుతున్న కళ్లతోనూ, భయంకరమైన కోరలతోనూ, వికృతాకారముతో ఉన్న ఆ రాక్షసుని చూచాడు బలరాముడు. ఈ రోజు వీడు నా పాలబడ్డాడు అని అనుకున్నాడు. గట్టిగా పిడికిలి బిగించాడు. తన శక్తినంతా చేతిలోకి

తెచ్చుకున్నాడు. తన పిడికిలితో బలంగా ప్రలంబుడి తల మీద మోదాడు. ఆ దెబ్బకు ప్రలంబుని తలరెండుగా పగిలిపోయింది. నోటి నుండి రక్తం కారుతూ ఉంది. ప్రలంబుడు పెద్దగా అరుస్తూ నేల మీద పడ్డాడు. గిలా గిలా కొట్టుకొని మరణించాడు.

బలరాముడు ఎక్కడకు పోయాడా అని వెతుకుతూ కృష్ణుడు, గోపాలురు పరుగు పరుగున అక్కడకు వచ్చారు. చచ్చి పడి ఉన్న రాక్షసుని, వాడి పక్కనే నిలబడి ఉన్న బలరాముని చూచారు. అమ్మయ్య అంటూ ఊపిరి పీల్చుకున్నారు. కృష్ణుడు మాత్రం చిరునవ్వు నవ్వుతూ నా పని నువ్వు చేసి నాకు పని తగ్గించావు అన్నట్టు చూచాడు. బలరాముడు కూడా చిరునవ్వుతోనే సమాధానం చెప్పాడు.

అందరూ బలరాముని చేతులతో పైకెత్తుకొని, రాక్షసుని చంపినందుకు బలరాముని ప్రశంసించారు. అందరూ ఆవులను తోలుకుంటూ సాయంత్రానికి తమ తమ ఇళ్లకు చేరుకున్నారు." అని శు క యోగీంద్రులు పరీక్షిత్తు మహారాజుకు ప్రలంబాసుర వధను గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

పంతొమ్మిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ప్రతిరోజూ కృష్ణుడు, బలరాముడు, గోపబాలురు ఆవులను తోలుకొని సమీప అడవిలోకి వెళ్లి ఆవులను మేపేవారు. ఒక రోజు ఆవులు, పశువులు, పచ్చిగడ్డి మేస్తూ, దారి తప్పి దూరంగా ఉన్న ఇషికావనము అనే అడవిలోకి వెళ్లిపోయాయి. ఆవులు ఎక్కడకు పోయాయో తెలియక కృష్ణుడు బలరాముడు గోపబాలురు వాటి కోసరం అడవి అంతా గాలిస్తున్నారు. కాని ఆవులు పశువులు ఎంతకూ కనపడలేదు.

ఆవులు, పశువులు బృందావనములో ఉన్న వారికి జీవనాధారము. ఆవులను, పశువులను తోలుకు రాకుండా ఇంటి వెళితే పెద్దవాళ్లు కోపపడతారు. ఆవులు ఇచ్చే పాలు లేకపోతే పెరుగు, వెన్న, నెయ్యి రాదు. అవి మధురకు తీసుకొని వెళ్లి అమ్మకపోతే జీవనం గడవదు. ఏం చెయ్యాలా అని కృష్ణుడు, బలరాముడు, గోపబాలురు తలలు పట్టుకొన్నారు.

వారందరూ గోవుల పాదముల జాడలు పట్టుకొని వెదుకుతూ వెళుతున్నారు. అలా వెదుకుతూ వెదుకుతూ పోగా పక్కన ఉన్న అడవిలో వారికి ఆవులు కనిపించాయి. అందరికీ పోయిన ప్రాణాలు తిరిగివచ్చినట్టు అయింది. అమ్మయ్య అనుకున్నారు. కృష్ణుడు, బలరాముడు, గోప బాలురు ఆవులను పశువులను పేరు పేరునా

పిలుస్తూ అన్నిటినీ ఒక చోటకు మళ్లిస్తున్నారు.

ఆ అడవిలో అంతా ఎండి పోయిన చెట్లు ఉన్నాయి. ఎండు చెట్లు ఒకదానితో ఒకటి రుద్దుకోవడం వలన అగ్ని పుట్టింది. ఆ అగ్ని ఒక చెట్టు నుండి మరొక చెట్టుకు అంటుకుంటూ అడవి అంతా వ్యాపించింది. కృష్ణుడు, బలరాముడు, గోపబాలురుతో సహా ఆవులను, పశువులను అగ్ని చుట్టుముట్టింది. తప్పిపోయిన ఆవులు దొరికినందుకు సంతోషపడుతుంటే ఇదేమిట్రా భగవంతుడా అని అందరూ కలవరపడ్డారు.   గోపబాలురు అందరూ కృష్ణుడు, బలరాముని చుట్టు చేరారు. భయంతో ఆవులు అంబా అని అరుస్తున్నాయి.

"ఓ కృష్ణా! చూడవయ్యా. అగ్ని మనందరినీ ఆవులను చుట్టుముడుతూ ఉంది. రక్షించవయ్యా. మీమందరము నీ బంధువులము కదా! మా అందరినీ ఇప్పటిదాకా ఎన్నో ఆపదలనుండి రక్షించావు. ఈ ఆపద నుండి కూడా మా అందరినీ రక్షించు. నిన్నే నమ్ముకున్నాము." అని పెద్దగా ఏడుస్తున్నారు.

కృష్ణుడికి పరిస్థితి అర్థం అయింది. కృష్ణుడు అందరినీ భయపడవద్దని, ధైర్యంగా ఉండమని చెప్పాడు. "ఒక్కసారి అందరూ కళ్లుమూసుకోండి. నేను మంత్రం వేసి మంటలను మాయం చేస్తాను." అనిఅన్నాడు. అమాయకులైన గోపబాలురు రెండుచేతులతో గట్టిగా కళ్లు మూసుకున్నారు.

పంచభూతములను సృష్టించిన పరమాత్మ ఆ

పంచభూతములలో ఒకటి అయిన అగ్నిని నోరు తెరిచి, తన యోగశక్తితో, తనలోకి లాక్కున్నాడు. దావానలము అంతా కృష్ణుని నోట్లోకి వెళ్లిపోయింది. "అందరూ కళ్లు తెరవండి" అని అన్నాడు కృష్ణుడు.

గోపాల బాలకులు అందరూ కళ్లు తెరిచారు. ఆశ్చర్యంగా చుట్టు చూచారు. అంతకు ముందు అడవిని దహిస్తున్న అగ్ని మచ్చుకు కూడా కనిపించలేదు. అంతా ప్రశాంతంగా ఉంది. పైగా తాము, ఆవులు అంతకుముందు ఆడుకుంటున్న భాండీరక వృక్షము కింద ఉన్నారు. గోపాలకులు ఆనందంతో చప్పట్లు కొట్టారు. తామందరినీ కాపాడిన కృష్ణుని దేవతగా స్తుతిస్తూ వేనోళ్ల పొగిడారు. కృష్ణుడు చిరునవ్వు నవ్వాడు.

సాయంకాలము కృష్ణుడు, బలరాముడు, గోపబాలురు అందరూ గోవులను, పశువులను తోలుకొని తమతమ ఇళ్లకు చేరుకున్నారు. జరిగిన విషయం తెలుసుకున్న బృందావన వాసులు, కృష్ణుడు, బలరాముడు, గోపబాలురు, గోవులు, క్షేమంగా తిరిగి రావడం చూచి ఎంతో సంతోషించారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణుడు దావానలమును పానము చేసిన విధమును వినిపించాడు.

(ఇది ఇలా జరుగుతుందా అని అందరికీ అనుమానం రావచ్చు. ఒక నటుడు నాటకంలో నటిస్తుంటాడు. ఒక నాటకంలో పెద్ద ఆఫీసరు, నౌకరు వేషం వేసాడనుకుదాము. ఎంతగా పాత్రలో లీనం అయిపోయి నౌకరుగా నటిస్తున్నా, ఆయనలో ఉన్న ఆఫీసరు

అప్పుడప్పుడూ తొంగి చూస్తూ తన అహం ప్రదర్శిస్తుంటాడు. అంతలోనే తాను నౌకరుపాత్ర వేస్తున్నాను అని తెలుసుకొని నౌకరుగా మారి పోతుంటాడు. అలాగే పరమాత్మ మానవుడిగా అవతరించినా, మానవుడిగా సాటి మానవుల మధ్య తిరుగుతున్నా, అప్పుడప్పుడు ఆపదలు కలిగినప్పుడు తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తుంటాడు. అంతలోనే అమాయక గోపాలుడిగా మారిపోతుంటాడు. ఇదే విషయాన్ని 15వ అధ్యాయంలో ఈ క్రింది శ్లోకంలో చెప్పాడు వ్యాసభగవానుడు.

ఏవం నిగూఢత్వగతిః స్వమాయయా
గోపాత్మజత్వం చరితైర్విడమ్బయన్
రేమే రమాలాలిత పాదపల్లవో
గ్రామ్యైః సమం గ్రామ్యవదీశ చేష్టితః

పరమాత్మ తన మాయాశక్తితో, తన శక్తిని నిగూఢంగా ఉంచి, కృష్ణుడిగా, గోపబాలకునిగా తన తోటి గోపబాలుర మాదిరి వ్రజంలో తిరుగుతున్నా, వారితో ఆడుతూ పాడుతున్నా అప్పుడప్పుడు మధ్యమధ్యలో తన శక్తిని, మహిమలను ప్రకటిస్తుంటాడు. కాబట్టి భాగవతంలో ఏదీ అసాధ్యం కాదు అని అనుకోవడమే ఉత్తమం.)

శ్రీమద్భాగవతము
దశమస్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## ఇరువదవ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత కథను ఈ విధంగా వినిపించసాగాడు.

"పరీక్షిత్ మహారాజా! దావానలము నుండి కృష్ణుడు తమను ఎలా కాపాడింది అన్న విషయాన్ని గోపాలురు తమ తల్లులకు, బంధు మిత్రులకు రకరకాలుగా వర్ణించి చెబుతున్నారు. అది విని వారు కృష్ణుడు సామాన్య మానవుడు కాడు. సాక్షాత్తు దేవతా స్వరూపుడు అని అనుకున్నారు. ఆ విధంగా రోజులు గడుస్తూ ఉండగా వర్షఋతువు ప్రవేశించింది. ఆకాశం అంతా మేఘములతో కప్పబడిపోయింది. సూర్యుడు కనిపించడం లేదు. అది ఎలా ఉందంటే, మానవుడి శరీరంలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్న పరమాత్మ, రజోగుణము, తమోగుణములతో కూడిన ప్రాపంచిక విషయములతో కప్పబడి పోయినట్టుంది.

రాజులు ప్రజల నుండి పన్నుల రూపంలో ధనమును తీసుకొని ఆ ధనమును తిరిగి ప్రజల అవసరాలకు ఉపయోగిస్తున్న విధంగా, సూర్యుడు తన తీక్ష్ణ కిరణములతో భూమి మీద ఉన్న సముద్రములు, నదులు, తటాకములు, మడుగుల నుండి నీటిని ఎనిమిది మాసముల పాటు ఆవిరిగా స్వీకరించి తిరిగి

వర్షాకాలములో వర్షముల రూపములో ప్రజలకు ఇస్తున్నాడు.

సాధుజనులు ప్రజల దు:ఖములు పోగొట్టడానికి తమ శాయశక్తులా పాటుపడతారు. వారికి ఏదో విధంగా ఉపకారం చేస్తారు. అదే విధంగా మేఘములు కూడా ప్రజలు వేసవిలో కష్టపడటం చూచి, వర్షాకాలం రాగానే గాలితో కూడిన వర్షములు కురిసి ప్రజల తాపమును పోగొడతాయి. అత్యంత కష్టనష్టములకు ఓర్చి, తమ శరీరమును కృశింపచేసుకొని తపస్సుచేసిన ఋషులు, తాము కోరిన కోరికలు సిద్ధించినపుడు సంతోషపడినట్టు, వేసవి కాలములో తీవ్రంగా తాపమునకు గురి అయిన భూమి, వర్షాకాలములో వర్షములు కురియగానే, సంతోషంతో పులకరించిపోయింది.

కలియుగంలో ధర్మం మరుగునపడిపోతుంది. పాపులు వృద్ధిచెందుతారు. వేదవిద్య అంతరిస్తుంది. నాస్తికత్వము, నాస్తిక మతము ప్రబలి పోతుంది. అదే విధంగా వర్షాకాలములో కమ్ముకున్న మేఘాల చాటున నక్షత్రాలు కప్పబడిపోతాయి. మిణుగురు పురుగులు మిణుకు మిణుకు మంటూ మెరుస్తుంటాయి.
(ఇక్కడ నాస్తికత్వాన్ని వెలిగి ఆరిపోయే మిణుగురు పురుగులతోనూ, ధర్మాన్ని, వేదవిద్యను శాశ్వతంగా వెలిగో నక్షత్రకాంతులతోనూ పోల్చాడు వ్యాసుడు.)

ప్రతిరోజూ అగ్నిహోత్రము మొదలగు నిత్య కర్మలను చేసి మౌనంగా విశ్రాంతి తీసుకుంటున్న శిష్యులు, గురువుగారి పిలుపువిని గబుక్కున లేచి వేదపఠనము మొదలు పెట్టినట్టు, ఎండాకాలములో

భూమి అడుగున విశ్రాంతి తీసుకుంటున్న కప్పలు, వర్షాకాలరాగానే ఆ ఉరుముల శబ్దము విని, వర్షాకాలం వచ్చిందని  బెకబెకమంటూ శబ్దం చేస్తున్నాయి.

కోరికలకు వశులైన మానవులు, ఆ కోరికలు తీర్చుకోడానికి పట్టపగ్గాలు లేకుండా  ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించినట్టు, వర్షాకాలములో నీటితో నిండిన చెరువులు, నదులు గట్టు తెంచుకొని ఇష్టం వచ్చినట్టు ప్రవహిస్తున్నాయి.

వర్షాకాలము రాగానే భూమి అంతా పచ్చని గడ్డి, మొక్కలతోనూ, నిండి పోయి ఆకుపచ్చని తివాచీ పరిచినట్టు ఉంది. తెల్లని పుట్టగొడుగులతోనూ, ఎర్రటి పూలతోనూ భూమి కొత్త కొత్త అందాలు సంతరించుకుంది.

వర్షాకాలములో వర్షములు బాగా కురవడంతో, పంటలు బాగా పండి రైతులకు సంతోషాన్ని కలుగచేస్తాయి. కాని వ్యవసాయము లాభదాయకము కాదని, వ్యవసాయమును వదిలివేసిన దౌర్భాగ్యులు, రైతుల సంతోషాన్ని చూచి పశ్చాత్తాప పడుతున్నారు. వారికి ఆనందం కలిగినా వీరికి దు:ఖము కలిగినా అన్నీ దైవాధీనములే అని మూర్ఖమానవులకు తెలియదు.

మానవులు పరమాత్మ సేవల వలన ఉత్తమ గతులను పొందినట్టు, జలాశయములలో నివసించు జలచరములు, భూమి మీద నివసించు భూచరములు,  వానలు కురవగానే,

జలాశయములు నిండగానే, భూమి చల్లబడగానే, అపరిమితమైన సంతోషాన్ని పొందాయి.

ఒక పక్క యోగిగా సంచరిస్తూ, మరొక పక్క కామ సంబంధమైన కోరికలను, విషయ వాంఛలను, ప్రాపంచిక విషయములను వదలలేక, వ్యాకులపడుతున్న సన్యాసియొక్క మనస్సు మాదిరి, వర్షాకాలములో పొంగుతున్న నదులు, సముద్రమును అల్లకల్లోలం చేస్తున్నాయి.

మనస్సును విష్ణువు మీద లగ్నం చేసి, విష్ణుభక్తిలో లీనమైన మానవులు, ఎన్ని కష్టములు వచ్చిననూ చలించనట్టు, వర్షాకాలములో ఎంత ఉధృతమైన గాలి వీచినా, వాన కురిసినా, పర్వతములు చలించడం లేదు.

వేదములను అధ్యయనము చేయవలసిన బ్రాహ్మణులు వేదాధ్యయనము వదిలిపెట్టి వేరే వృత్తులు చేపట్టడంవలన, అసలు వేదములు ఉన్నాయా లేవా? ఉంటే అవి ఎన్ని? ఎలా ఉంటాయి? అనే స్థితిలో మానవులు ఉన్నట్టు, అప్పటిదాకా మానవులకు ఉపయోగ పడుతున్న మార్గములు, రహదారులు, వర్షములు కురియగానే, గడ్డి, పిచ్చి మొక్కలు మొలిచి, వర్షపు నీటిలో మునిగిపోయి, అసలు అక్కడ రహదారి ఉందా లేదా అనే అనుమానం కలుగుతూ ఉంది.

వేశ్యలకు ఏ ఒక్కరి మీద ప్రేమ మమకారము ఉండదు. వారు చూపే ప్రేమ, మమకారము అన్నీ క్షణికములు, చంచలములు. అలాగే

వర్షాకాలములో మెరిసే మెరుపులు కూడా  క్షణం మెరిసి అంతలోనూ మాయం అవుతున్నాయి.

ఏ రూపము, ఏ గుణము లేని పరమాత్మ లోక కల్యాణము కొరకు మూడుగుణములతో కూడిన శరీరములను దాల్చి, మానవులమధ్య సంచరిస్తున్నట్టు, అల్లెత్రాడు లేని ఇంద్రధనుస్సు వర్షాకాలములో ఏడురంగులతో ప్రకాశిస్తూ ఉంది.

మానవులలో ఉన్న జీవాత్మ అహంకారముతోనూ, ప్రాపంచిక విషయములతోనూ, విషయవాంఛలతోనూ  కప్పబడినట్టు వర్షాకాలంలో చంద్రుడు కూడా మేఘములతో కప్పబడిపోతున్నాడు.

జీవితమంతా సంసారము అనే సాగరంలో పడి కొట్టుమిట్టాడుతున్న మానవులకు, ఒక సత్పురుషుని చూడగానే వారి మనసులు కుదుటపడినట్టు, మేఘములు ఆకాశంలో కనపడగానే నెమళ్లు ఆనందంతో పురివిప్పిఆడుతున్నాయి.

యోగాభ్యాసము చేసి చిక్కి శల్యమైన యోగులు, అణిమాది అష్టసిద్ధులు లభించగానే తమకు లభించిన శక్తులతో నానా రూపములను  ధరించి ప్రజలను మభ్యపెట్టునట్టు, వేసవి కాలములో ఎండి పోయిన చెట్లు, మొక్కలు, వానా కాలము రాగానే చిగుర్చి, మొగ్గతొడిగి, రకరకాలుగా శోభిల్లుతున్నాయి.

ఇంకా ధనం కావాలి, అన్ని సంపదలు తమకే కావాలి అనే

దురాశాపూరితులైన ప్రజలు, తమ కోరికలు తీరడానికి రకరకాల పూజలను, హెూమాలను, వ్రతాలను చేసినట్టు, చక్రవాక పక్షులు మొదలగు పక్షులు, ముళ్లపొదలతోనూ, ఊబితోనూ నిండిన నీటిమడుగులలో తమ ఆహారమును వెదుక్కుంటూ నివసిస్తున్నాయి.

రాజులు, చక్రవర్తులు, పురోహితులు చెప్పిన మాటలను విని, పుణ్యం సంపాదించుకోవడం కోసరం ప్రజలకు విరివిగా దానములు, ధర్మములు చేసి వారి కోరికలు తీర్చినట్టు, మేఘములు కూడా గాలితో చేరి, ప్రజాక్షేమం కోరి వర్షములు కురిపిస్తున్నాయి.

కలియుగంలో నాస్తికులు ఎక్కువైపోయి, తమ తర్క వితర్కములతో వేదమార్గముతో విభేదించునట్లు, మేఘములు వర్షము కురుస్తుంటే, ఆ నీరు నదులలో చేరి, ఆ నదులకు కట్టిన ఆన కట్టలను తెంచుకొని వేగంగా ప్రవహిస్తున్నాయి.

ఈ ప్రకారంగా బృందావనములోకి వర్షఋతువు ప్రవేశించింది. కృష్ణుడు, బలరాముడు, గోపబాలురతో కలిసి తమ ఆవులను, పశువులను తోలుకొని పండ్లు, కాయలతో సమృద్ధిగా ఉన్న అడవిలోకి వెళ్లారు. ఆవులు మేత కోసరం పరుగెత్తుతున్నాయి. వర్షము లేనపుడు కృష్ణుడు, బలరాముడు, గోప బాలురు చెట్లకింద ఆడుకుంటున్నారు. వాన వచ్చినప్పుడు పెద్ద పెద్ద చెట్టు తొర్రలలో గానీ, కొండ గుహలలో గానీ తలదాచుకుంటున్నారు.

ఆవులు గడ్డి మేసిన తరువాత చెట్లనీడలో పడుకొని

నెమరువేస్తుంటే, కృష్ణుడు, బలరాముడు, గోపబాలురు పెరుగు అన్నం తింటున్నారు. ఆ ప్రకారంగా వర్షాకాలము గడిచిపోయి శరదృతువు ప్రవేశించింది.

మొదట మంచి వారుగా ఉండి, విధివశాత్తు చెడుమార్గములో నడిచిన మానవులు, పరమాత్మయందు భక్తిభావమును పెంపొందించుకొని, మంచి వారుగా మారినట్టు, వర్షాకాలములో బురద బురద గా ఉన్న నీరు, శరత్కాలములో పద్మములు పుట్టి వికసించడంతో, తమ మలినములను పోగొట్టుకొని స్వచ్ఛముగా తేరుకున్నాయి.

పరమాత్మ యందలి భక్తి నాలుగు ఆశ్రమముల వారిని అనగా, బ్రహ్మ చర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమములలో ఉన్నవారిని పునీతులను చేయువిధంగా, శరత్కాలమురాగానే, ఆకాశంలో ఉన్న మేఘములు, నేలమీద ఉన్న బురదనీరు, నదులలోనూ, సరస్సులలోను ఉన్న నీరు, తమలో ఉన్న మలినములను పోగొట్టుకొని స్వచ్ఛతను సంతరించుకున్నాయి.

తపస్సు చేసి తమలోని పాపములను పోగొట్టుకున్న మునులు, సంసార బంధనములను, భార్యా బిడ్డల మీద, ధనము మీద మోహమును వదిలిపెట్టినట్టు, శరత్కాలములో మేఘములు తమ గాఢతను వదిలిపెట్టి, తెల్లగా దూది పింజలమాదిరి ప్రకాశిస్తున్నాయి.

జ్ఞానులు అయిన గురువులు యోగ్యులయిన తమ శిష్యులకు

జ్ఞానమును బోధించినట్టు, యోగ్యత లేని వారికి జ్ఞానమును బోధించనట్టు, పర్వతముల మీది నుండి స్వచ్ఛమైనజలము కొన్ని చోట్ల జలా జలా కిందికి దుముకుతూ ఉంటే, మరి కొన్ని చోట్ల అసలు నీటి జాడ కూడా తెలియడం లేదు.

సంసార సాగరంలో పడి భార్య, పిల్లలు, బంధుమిత్రులు శాశ్వతములని భావించి వారి తోడిదే లోకంగా భావించి, తమ ఆయువు క్షణక్షణమూ క్షీణించిపోతూ ఉందని తెలుసుకోలేని మానవులమాదిరి, వర్షాకాలము పోయింది, శరదృతువు వచ్చింది, తాము ఉన్న జలాశయములలో నీరు ఇంకిపోతాయి తాము ప్రమాదంలో పడతాము అని ఆ జలాశయములలో నివసిస్తున్న జలచరములు కూడా తెలుసుకోలేక పోతున్నాయి.

అపరిమితమైన సంతానము కలవాడు, ఇంద్రియములను జయించలేనివాడు, కుటుంబాన్ని పోషించడానికి రేయింబగళ్లు కష్టపడి ధనమును సంపాదించేవాడు, అనుదినము కష్టములను అనుభవిస్తున్నట్టు, రోజు రోజుకూ తాము ఉన్న జలాశయములలో నీరు తగ్గిపోతుంటే, శరత్కాలములో సూర్యుని వేడిమికి తట్టుకోలేక, అందులోని జలచరములు బాధపడుతున్నాయి.

భాగవత ధర్మము పాటించే వారు, "నేను", "నాది" అనే దేహము మీద అభిమానమును, మోహమును విడిచి పెట్టినట్లు, శరదృతువు రాగానే సరస్సులు, నదులలోని నీరు తమలోని బురదను, కల్మషములను విడిచిపెట్టాయి.

పరమాత్మమీద భక్తితో, అన్ని కోరికలను విడిచిపెట్టి, ఆత్మజ్ఞానమును పొందిన మునులు, వేదములలో చెప్పబడిన కర్మలను కూడా చేయకుండా విడిచిపెట్టి, ఆత్మయందు రమిస్తూ, ఆత్మానందము పొందుతూ ప్రశాంతజీవనము గడుపుతున్నట్టు, శరత్కాలములో సముద్రము కూడా ఉధృతమైన అలలు లేకుండా నిశ్చలంగా, ప్రశాంతంగా ఉంది.

యోగులు తాము సముపార్జించిన జ్ఞానము తమ ఇంద్రియముల ద్వారా బయటకు పోకుండా అరి కట్టి, ఆత్మావలోకనము చేసుకుంటున్నట్టు, కర్షకులు వర్షపు నీరు వృధాగా పోకుండా కాలువలకు కట్టలు కట్టి, ఆ నీటిని పంటపొలములకు ప్రవహింపజేస్తున్నారు.

ఆత్మజ్ఞానము, దేహాభిమానము వలన కలిగిన దు:ఖములను పోగొట్టినట్టు, శరత్కాలములో పగలంతా సూర్యుని తాపంతో బాధపడ్డవారు, రాత్రిపూట శరత్కాల వెన్నెలలో సేదతీరు తున్నారు.

శరత్కాలము రాగానే ఆకాశం మేఘాలు లేకుండా, చంద్రుడు, నక్షత్రములతో నిర్మలంగా శోభించినట్టు, సత్వగుణసంపన్నులైన వారి చిత్తము ఓంకార దర్శనముతో ప్రకాశిస్తూ ఉంది.

యదువంశములో జన్మించిన కృష్ణుడు వృష్ణివంశీయుల

మధ్య శోభించినట్టు, నిర్మలమైన ఆకాశంలో చంద్రుడు, తారల మధ్య దేదీప్య మానంగా వెలుగుతున్నాడు.

కృష్ణుని మీద అధికమైన ప్రేమగల గోపికలు సాయంత్రం గోవులను తోలుకొని వచ్చిన కృష్ణుని చూచి రోజంతా తాము పడ్డ విరహబాధను పోగొట్టుకున్నట్టు, శరత్కాలములో బాగా పుష్పించిన పూల మొక్కల మీది నుండి వీచే పిల్లగాలులచేత మానవులు, సూర్యతాపము నుండి సేదతీరుతున్నారు. సమర్ధుడైన రాజు పరిపాలనలో దొంగలు, దుర్మార్గులు తప్ప మిగిలిన ప్రజలు దొంగలభయం, దుర్మార్గుల భయంలేకుండా సుఖంగా జీవించినట్టు, శరత్కాలములో సూర్యుడు ఉదయించగానే, కలువలు ముడుచుకుంటున్నాయి, పద్మములు ఆనందంతో వికసిస్తున్నాయి.

పండిన పంటలు ఇంటికిరాగానే, ఇల్లంతా ధాన్యసంపదతో కళకళలాడినట్టు, యజ్ఞయాగములు జరగడం వలన పురములు, గ్రామములు శోభను సంతరించుకున్నాయి. అందులోనూ బలరామకృష్ణులు సంచరించే బృందావనము సమీప అరణ్యములు, యమునానదీ తీరము మరింత శోభను సంతరించుకున్నాయి.

మునులు, సిద్ధులు, భక్తులు తమ తమ తపస్సులు సాధనలు సిద్ధించినపుడు, దివ్యమైన దేహములు పొందినట్టు, వర్షాకాలములో ఇంటిపట్టున ఉన్న వ్యాపారులు, మునులు, రాజులు, స్నాతకులు, సన్యాసులు, వర్షాకాలము పూర్తి అయి శరదృతువు ప్రవేశించగానే, వ్యాపారులు తమ తమ వ్యాపారములకు, మునులు, సన్యాసులు

లోకసంచారములకు, రాజులు దిగ్విజయ యాత్రలకు, స్నాతకులు (విద్యార్థులు) విద్యాభ్యాసమునకు బయలుదేరారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వర్షఋతువు, శరదృతువు వర్ణనలను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఇరువదిఒకటవ అధ్యాయము.

శుకయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు కృష్ణుడు వేణువుఊదుతుంటే గోపబాలికలు ఎలా పాటలు పాడి ఆనందించారో వినిపించాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! శరత్కాలములో కృష్ణుడు, బలరాముడు గోపబాలురు కలిసి ఆవులను తోలుకుంటూ బృందావనములోకి వెళుతున్నారు. ఆ వనములో ఉన్న సెలయేళ్లలో జలము స్వచ్ఛంగా ఉన్నాయి. తటాకములలో పద్మములు వికసించి ఉన్నాయి. మొక్కలకు పూచిన పూల మీది నుండి వచ్చే గాలి, ఆ పూవుల సుగంధమును మోసుకొని వచ్చి అందరికీ పంచిపెడుతూ ఉంది. ఆవులు మేత మేస్తుంటే, కృష్ణుడు ఒక చెట్టు కింద కూర్చుని తన వేణువును ఊదుతున్నాడు.

మనోహరము, కామప్రకోపము అయిన  ఆ వేణుగానమును విని గోప బాలురు, గోప బాలికలు పరవశులవుతున్నారు. కృష్ణుడు ఊదుతున్న వేణుగానము వ్రజములోని స్త్రీలకు కూడా వినిపిస్తూ ఉంది. ఆ వేణుగానమును విన్న స్త్రీలు తమ తోటి వారికి కృష్ణుని బాల్యలీలలను వర్ణించి చెబుతున్నారు. కృష్ణలీలల గురించి ఎంత చెప్పినా తనివితీరేది కాదు. గోప స్త్రీలు కృష్ణ లీలలను వర్ణించి వర్ణించి ఇంక వర్ణించలేక పోయేవారు.

చిన్ని కృష్ణుడు తలమీద నెమలి పింఛము, చెవులకు గోగుపూలు, నడుముకు పచ్చని పట్టువస్త్రము, మెడలో పూలమాల ధరించి, పెదాలకు వేణువును ఆనించుకొని మనోహరంగా ఊదుతూ బృందావనంలో ప్రవేశించాడు.  మనోహరమైన ఆ వేణు గానమును విన్న  గోపబాలికలు తమలో తాము ఇలా అనుకొనేవారు.

"సఖీ! చూడండే. బాలకృష్ణుడు ఎలా వేణువు ఊదుతున్నాడో. కన్నులు ఉన్న దానికి వేణువును ఊదుతున్న కృష్ణుని చూడటమే ఫలప్రదము కానీ, ఇంక ఏ పని చేసినా ఇటువంటి ఫలము మనకు దొరకదు కదా!  మనమధ్య తిరుగుతున్న కృష్ణుని చూడటమే మన అదృష్టం కదా! దీనికి మించిన అదృష్టం ఏముంటుంది.

కృష్ణుడు, బలరాముడు తమ తమవేణువులు ఊదుతుంటే వారి ముఖపద్మములు, వారి వేణుగానము, వారిరువురి క్రీగంటి చూపులు, ఆహా! ఆ దృశ్యం ఎంత నయనానందకరంగా ఉంది. ఈ

దృశ్యము చూడవలసినదే కాని చెప్పనలవి కాదు కదా!" అని కొంత మంది అంటుంటే, మరి కొంత మంది గోపికలు ఇలా అంటున్నారు.

"సఖులారా! ఈ కృష్ణుడు, బలరాముడు తమ చుట్టు గోపబాలురను కూర్చోపెట్టుకొని వేణువుఊదుతుంటే, ఇద్దరు ప్రఖ్యాత గాయకులు పోటీలు పడి గానం చేస్తున్నట్టుందే! అదీ కాకుండా అప్పుడు బలరామ కృష్ణులు మామిడి చిగుళ్లు, నెమలి పింఛములు, ఆకులు, పూలుకలిపి కట్టిన పూలగుత్తులు, కలువపూలతో కట్టిన పూలమాలలు, ధరించి చిత్రవిచిత్రంగా కనిపించేవారు. వారిని చూస్తుంటే నవ్వు వచ్చేది." అని అనుకొంటున్నారు.

మరికొక గోపిక తన సఖులతో "చూడవే! కృష్ణుని పెదాలకు తగులుతున్న ఆ వేణువు పూర్వజన్మలో ఎంతటి అదృష్టం చేసుకుందో! ఈ వేణువే నిరంతరము కృష్ణుని పెదవులలోని అమృతాన్ని తాగేస్తే, ఈ చిన్ని కృష్ణుని ముద్దుపెట్టుకునే యశోదకు, గోప కాంతలకు ఇంక ఏమి మిగులుతుంది చెప్పు.

సఖీ! ఈ వేణువు పుట్టిన వెదురు పొద నదీతీరంలో ఉండి, ఏ పుణ్యనదుల నీరు తాగి పెరిగిందో కదా! ఆ పుణ్యనదులు తమ మాతృవాత్సల్యంతో, తాము నీరు పోసి పెంచిన వెదురు పొదలను, ఆ వెదురు పొదల నుండి పుట్టి కృష్ణుని చేతిని అలంకరించి ఆయన అధరామృతమును గ్రోలుతున్న వేణువును చూచి పొంగిపోతున్నాయి. వృద్ధులైన తల్లి తండ్రులు ప్రయోజకుడైన తమ కుమారుడిని చూచి ఆనందాశ్రువులు రాల్చినట్టు, ఈ వేణువు పుట్టిన వెదురు పొద, తననుండి పుట్టిన వేణువు కృష్ణుని చేతిని అలంకరించి మధురమైన

స్వరాలను సుమధురంగా పలకడం చూచి, తాను కూడా ఆనందాశ్రు వులు రాలుస్తున్నదా అన్నట్టు ఆ వెదురు ఆకుల నుండి నీరు బొట్టు బొట్టుగా రాలుతూ ఉంది.." అని కవితా ధోరణిలో పలికింది.

మరొక గోపిక తన సఖిని చూచి "సఖీ! ఈ బృందావనమంతా ఈ చిన్ని కృష్ణుని పాద స్పర్శతో మరింత శోభను సంతరించుకుంది. శ్రీకృష్ణుని వేణుగాన ధ్వని విని, దానిని మధురమైన మేఘగర్జనలు అనుకొని నెమళ్లు నాట్యం చేస్తున్నాయి. భూమిమీద ఉన్న ఈ బృందావనము ముందు ఆకాశంలో ఉన్న స్వర్గము ఎందుకు పనికొస్తుంది చెప్పు." అంది.

మరొక గోపిక ఇలా అంది. "సఖీ! అటు చూడవే. ఆ లేళ్లు, తమ భర్తలతో కలిసి వేణువును ఊదుతున్న కృష్ణుని తదేకంగా చూస్తున్నాయి. అవి పశుజన్మ ఎత్తినా, కృష్ణుని వేణుగానమును విని పరవశించి పోతూ  ధన్యజీవులయ్యాయి."

మరొక గోపిక ఇలా అంది. "సఖీ! మనమే కాదే! అటు చూడు. ఆకాశంలో విహరిస్తున్న దేవతలు కూడా బృందావనములో వేణువును ఊదుతున్న కృష్ణుని చూచి, ఆ వేణుగానమును విని, "ఆహా ఎంత మధురంగా ఉంది ఈ మోహనరాగము" అంటూ పరవశులౌతున్నారు."

మరొక గోపిక ఇలా అంది. "సఖీ! అటు చూడవే! గోవులు, ఆ గోవుల పాలు తాగుతున్న దూడలు అన్నీ చెవులు రిక్కించి కృష్ణుని వేణుగానమును ఎలా వింటున్నాయో!"

ఇంకొక గోపిక ఇలా అంది. "అది కాదే! మానవులు జంతువులే కాదు, ఆకాశంలో ఎగిరే పక్షులు కూడా కృష్ణుని వేణుగానానికి పరవశులౌతున్నాయి. బహుశా ఈ పక్షులు పూర్వజన్మలో మునులై ఉంటారు. అందుకే కొమ్మల మీద కదలకుండా మెదల కుండా కూర్చుని కృష్ణుని వేణుగానమును తదేకధ్యానముతో వింటున్నాయి. వాటి చెవులకు మరి ఏ ఇతర ధ్వనులు వినపడటం లేదు. ఆ పక్షులు కూడా తమ సహజధోరణిలో కిచకిచమంటూ అరవ కుండూ మౌనంగా కృష్ణుని వేణుగానామృతమును పానం చేస్తున్నాయి. కృష్ణుని వేణుగానమహిమ అంతటిది కదా!"

మరొక గోపిక ఇలా అంది. "అది కాదే! కేవలం జీవం ఉన్న మానవులు, జంతువులు, పక్షులే కాదు, జీవం లేని నదులు కూడా కృష్ణుని వేణుగానానికి పరవశిస్తున్నాయా అన్నట్టు యమున ఒడ్డున కూర్చున్న కృష్ణుని పాదాలు తాకడానికి నదీజలాలు ఎలా పరవళ్లు తొక్కుతున్నాయో చూడు. కృష్ణుడు బృందావనములో కూర్చుని వేణువు ఊదుతుంటే, యమునా నదీ జలములు కూడా తమలో తాము సుళ్లు తిరుగుతూ, వేగాన్ని తగ్గించుకొని, కృష్ణుని గానామృతమును ఆస్వాదిస్తున్నాయి."

మరొక గోపిక ఇలా అంది. "భూమి మీద ఉన్నవే కాదు! కృష్ణుడు, బలరాముడు వేణువు ఊదుతూ మైమరిచి పోతుంటే, పైనుండి ఎండ మండి పోతుంటే, ఆకాశం నుండి వాన తుంపరలు పడుతూ, కృష్ణునీ మీద పూలవర్షము కురుస్తోందా అన్నట్టు ఉంది

కదూ!".

మరొక గోపిక ఇలా అంది. "సఖీ! కృష్ణుడు, బలరాముడు గోవర్ధన పర్వతము మొదట్లో కూర్చుని వేణువు ఊదుతుంటే, ప్రాణములేని గోవర్ధన పర్వతము కూడా కృష్ణుని పాద స్పర్శచే పులకించి పోతూ ఉంది. తన మీదినుండి పారేజలములతోనూ, పూచే పుష్పములతోనూ, పెరిగే గడ్డితోనూ కృష్ణుని పాదములను అర్చిస్తూ ఉన్నట్టు ఉంది కదా! చూడబోతే ఈ పర్వతమునకు కూడా భక్తిభావముపొంగి పొరలుతున్నట్టు ఉంది!" అని చమత్కరించింది.

"అదికాదే సఖీ! కేవలము మానవులు, జంతువులు, పక్షులు, నదులు, పర్వతములే కాదు, వృక్షములు కూడా కృష్ణుని వేణుగానానికి పరవశించి తమ కొమ్మలను ఊపుతూ, తమ తలలు ఊపుతూ వేణుగానాన్ని ఆస్వాదిస్తున్నట్టు ఉంది కదూ!" అని విచిత్రంగా చూచింది.

ఈ ప్రకారంగా కృష్ణుడు తన వేణుగానాన్ని బృందావనములో వినిపిస్తుంటే, గోపికలు, ఆవులు, ఆవు దూడలు, లేళ్లు, పర్వతములు, నదీజలములు, చెట్లు అన్నీ పరవశించిపోతున్నాయి. ప్రకృతి యావత్తు పులకించి పోయింది." అని శుకయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు కృష్ణుని వేణుగాన మహిమను వేణుగీతిక రూపంలో వర్ణించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువది ఒకటవ అధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# దశమస్కంధము
# ఇరువది రెండవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! అప్పుడు హేమంత ఋతువులో మొదటి మాసము అనగా మార్గశిర మాసము నడుస్తూ ఉంది. మార్గశిర మాసములో బృందావనములో ఉన్న గోప కాంతలు అందరూ కాత్యాయనీ వ్రతము చేసుకుంటున్నారు. వారందరూ పొద్దుటే లేచి, బృందావనము పక్కనే ఉన్న సరస్సులో స్నానాలు చేసి, కాత్యాయనీ అమ్మవారి విగ్రహమును ప్రతిష్టించి, వివిధరకాల పూలతో పూజచేసి, దీపధూపనైవేద్యములు సమర్పించి, ఆ దేవిని ఉపాసించేవారు.

వారందరూ కాత్యాయనీ దేవిని ఇలా ప్రార్థించేవారు. "అమ్మా! కాత్యాయినీ దేవీ! మాయాస్వరూపిణీ! మా నందగోకులంలో కృష్ణుడు అనే చిన్న వాడు ఉన్నాడు. మాకు వచ్చే జన్మలో అయిన కృష్ణుని భర్తగా అనుగ్రహించు." అని ప్రార్థించేవారు.  బృందావనములో ఉన్న గోపికలు అందరూ ఈ ప్రకారంగా మార్గశిర మాసం పూర్తిగా కాత్యాయినీ వ్రతం చేసారు. భద్రకాళి రూపిణి అగు కాత్యాయినీ దేవిని పూజించారు.

ఆ ప్రకారంగా వ్రతము సాగుతున్న మార్గశిరమాసములో పౌర్ణమి రోజున పొద్దునే గోప కాంతలు అందరూ నిద్రలేచి, ఒకరిని ఒకరు పిలుచుకుంటూ యమునానదికి స్నానానికి వెళ్లారు. తాము కట్టుకున్నబట్టలు అన్ని విప్పి ఒడ్డును పెట్టి నీటిలోకి దిగి స్నానాలు

చేస్తున్నారు.

యోగులకు యోగి అయిన కృష్ణుడు ఆ గోపకాంతలు చేస్తున్న వ్రతమునకు తగిన ఫలమును ఇవ్వడానికి, తన స్నేహితులతో కలిసి వారు స్నానం చేస్తున్న చోటికి వెళ్లాడు. కృష్ణుడు, అతని స్నేహితులు కలిసి సరోవరములో స్నానాలు చేస్తున్న గోప కాంతల బట్టలు అన్నీ తీసుకొని పక్కనే ఉన్న కడిమి చెట్టు ఎక్కాడు. కింద ఉన్న గోపికలతో ఇలా అన్నాడు.

"ఓ గోపకాంతలారా! మీ బట్టలన్నీ మా వద్ద ఉన్నాయి. మీరు అలాగే మా వద్దకు వచ్చి మీ మీ వస్త్రములను తీసుకోండి. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. తొందరగా వెళ్లి వ్రతం చేసుకోండి. నేను అబద్ధ చెప్పడం లేదు. ఒట్టు. నిజమే చెబుతున్నాను. ఇది పరిహాసానికి అనడం లేదు. నేను ఇంతకుముందు ఎప్పుడూ అబద్ధం చెప్పలేదు. ఆ విషయం మా స్నేహితులకు అందరకూ తెలుసు. . ఒక్కరొక్కరుగా కానీ, అందరూ ఒక్కసారిగా కానీ,  వచ్చి అన్ని వస్త్రములు తీసుకొని వెళ్లండి." అని పరిహాసంగా అన్నాడు.

కృష్ణుడి మాటలకు వారంతా సిగ్గుపడ్డారు. "ఏంటి కృష్ణా! ఈ అల్లరి. మేము బయటకు ఎలా వస్తాము" అని అన్నారు. "రావాల్సిందే. తప్పదు. మీకు మీ మీ వస్త్రములు కావాలంటే వచ్చి తీసుకోండి." అని అన్నాడు కృష్ణుడు.

అసలే మార్గశిర మాసము. కంఠందాకా నీటిలో మునిగి ఉన్నారు. అప్పుడే సూర్యుడు వస్తున్నాడు.  చలి పుడుతూ ఉంది.  చలిలో

గజగజవణుకుతున్నారు ఆ గోపకాంతలు.

"కృష్ణా! ఇది నీకు మర్యాద కాదు. నీవు గోపకులమునకు పెద్ద అయిన నందుడి కుమారుడవు. అందుకని నిన్ను ఏమీ అనలేక పోతున్నాము. మీ తండ్రిగారిని అందరూ గౌరవిస్తారు. ఆ గౌరవాన్ని నిలుపు. నువ్వు అంటే మా అందరికీ చాలా ఇష్టం. ముద్దుగా ఉంటావు. అల్లరి చేస్తుంటావు. కానీ నీ అల్లరి మితిమీరి పోయింది. మేము చూడు చలికి ఎలా గజగజవణుకుతున్నామో. మేమంతా నీకు దాసీలము అనుకో. మా బట్టలు మాకు ఇవ్వు. మాబట్టలు మాకు ఇచ్చిన తరువాత నువ్వు ఏం చెబితే అది చేస్తాము. సరేనా! మా చిన్ని కృష్ణుడివి కదూ. మా వస్త్రములు మాకు ఇవ్వవా! ఇదుగో నువ్వు ఇలా అల్లరి చేస్తే ఈ విషయం మీ తండ్రిగారు నందునికి చెబుతాము జాగ్రత్త!" అని నయానా భయానా అడిగారు.

కాని కృష్ణుడు కాస్త కూడా బెదర లేదు. పైగా ఇలా అన్నాడు. "ఇప్పుడేగా అన్నారు..... మీరంతా నాకు దాసీలు అనీ నా మాట వింటారు అనీ. అందుకే చెబుతున్నాను. మీరు ఇక్కడకు వచ్చి మీ మీ బట్టలు తీసుకొని వెళ్లండి. లేకపోతే నేను మీ బట్టలు ఇవ్వను. మీకు దిక్కున్న చోట చెప్పుకోండి. మా తండ్రి గారికి చెబితే నాకేమన్నా భయమా!" అంటూ కొంటెగా అన్నాడు కృష్ణుడు.

ఈ మొండివాడితో లాభం లేదని, గోపకాంతలు అందరూ తమ స్తనములు, మర్మాంగములు రెండు చేతులతో మూసుకుంటూ, వంగి వంగి కృష్ణుడు ఎక్కిన చెట్టు వద్దకు వచ్చారు. వారిని చూచి కృష్ణుడు ఇలా అన్నాడు. "గోపకాంతలారా! మీరు కాత్యాయనీ వ్రతం చేస్తున్నారు. కాని బట్టలు లేకుండా స్నానం చేస్తున్నారు. అది తప్పు. దీని వలన

కాత్యాయనీ దేవికి మీరు అపరాధం చేసినట్టయింది. మీరు ఏ ఫలితం కోరి ఈ వ్రతం చేస్తున్నారో, ఈ విధంగా బట్టలు లేకుండా స్నానాలు చేస్తే, ఆ ఫలితం మీకు దక్కదు. కాబట్టి మీరు ఆ పాపాన్ని ప్రక్షాళన చేసుకోండి. దేహాభిమానమును విడిచిపెట్టి చేతులు పైకెత్తి అమ్మవారికి నమస్కరించి మీ మీ వస్త్రములు తీసుకోండి." అని అన్నాడు.

ఆ మాటలకు వారు సిగ్గు పడ్డారు. తమ అనాలోచిత చర్య వలన అమ్మవారికి అపచారం జరిగిందని తెలుసుకున్నారు. ఇంకా చిన్న వాడైన కృష్ణుని ముందు తమకు సిగ్గేమిటని ధైర్యంగా రెండు చేతులు ఎత్తి తమ బట్టలు తమకు ఇవ్వమని అడిగారు. కృష్ణుడు వెంటనే వారి వస్త్రములు వారికి ఇచ్చాడు. కృష్ణుడు తమను ఆటపట్టించడానికి తమ వస్త్రములను తీసుకున్నా, బట్టలు లేకుండా స్నానం చేయడం తప్పు అని వారి తప్పును ఎత్తి చూపాడు. అందుకని కృష్ణుడు చేసిన పనులకు వారికి కోపం రాలేదు. పైగా కృష్ణుని చిలిపి చేష్టలకు మురిసిపోయారు.

గోపకాంతలు తమ తమ వస్త్రములను ధరించారు. కృష్ణుడి జగన్మోహనాకారాన్ని చూస్తూ అలాగే నిలబడిపోయారు. వారందరూ తనను భర్తపొందవలెననే ఉద్దేశ్యంతో కాత్యాయనీ వ్రతం చేస్తున్నారు అని వారి మనసులో ఉన్న కోరికను తెలుసుకున్నాడు కృష్ణుడు. అప్పుడు కృష్ణుడు వారితో ఇలా అన్నాడు.

" ఓ గోపకాంతలారా! మీరు ఏ కోరికతో ఈ వ్రతం చేస్తున్నారో నాకు తెలుసు. మీ కోరిక నాకు సమ్మతమే. అది జరుగుతుంది. వేయించబడిన విత్తనములు మొలకెత్తనట్టు, మీ పవిత్రమైన కోరికలో

కామవాంఛలు మొలకెత్తవు. మీకోరిక తీరుతుంది. మీరు ఇంక పల్లెకు వెళ్లండి. మీరు ఏ ఫలితమును ఆశించి ఈ వ్రతమును చేస్తున్నారో ఆ ఫలితము మీకు లభిస్తుంది." అని అన్నాడు కృష్ణుడు.

కృష్ణుని మాటలకు సంతుష్టులైన గోప కాంతలు కృష్ణుని తమ మనసులో ధ్యానిస్తూ తమ తమ గృహములకు వెళ్లారు. తరువాత కృష్ణుడు, బలరాముడు, గోప బాలురు ఆవులు తోలుకుంటూ సమీపములో ఉన్న వనములోకి వెళ్లారు. ఆవులు గడ్డి మేస్తుంటే, కృష్ణుడు, తన స్నేహితులతో సహా చెట్లకింద కూర్చున్నాడు.

తన చుట్టు ఉన్న గోపబాలురతో కృష్ణుడు ఇలా అన్నాడు. "ఒరేయ్ స్తోకకృష్ణా! సుదామా! సుబలా! అర్జునా! విశాలా! వృషభా! ఓజస్వీ! దేవప్రస్థా! వరూథపా! ఈ చెట్లను చూడండిరా. ఈ చెట్లు కేవలము పరులకు ఉపకారము చేయడం కోసమే జీవిస్తున్నాయి. గాలిని, వర్షమును, ఎండను సహిస్తూ, మనకు నీడను, చల్లగాలిని ఇస్తున్నాయి. ఇవి మనకే కాదు సకల జీవులకు ఆధారమై ఉన్నాయి. ఆహా! వీటి జన్మము ఎంతో ధన్యమైనది కదా! ఇవి తమ ఆకులను, కాయలను, పండ్లను, వేళ్లను, బెరడును, ఎండిన కొమ్మలను, పుష్పములను, వాటి కాండములో నుండి కారే జిగురును, వాటి ఎండిన కట్టెలు కాల్చినందువలనవచ్చే బొగ్గును, ఇవి అన్నీ మానవులకు ఇచ్చి ఎంతో మేలుకలిగిస్తున్నాయి కదా! మానవులు కూడా తమకు ఉన్న ప్రాణముల ద్వారా, బుద్ధిద్వారా, ధనము ద్వారా పరులకు మేలు చేసి నప్పుడే కదా వారు మానవులుగా పుట్టినందుకు వారి జన్మసార్థకము అవుతుంది. లేకపోతే వారి జన్మ వృథా!" అని చెప్పి, ఆవులు తోలుకొని

కృష్ణుడు, తన మిత్రులతో సహా యమునా నదీ తీరానికి వెళ్లాడు. ఆవులు యములో దిగి నీళ్లు తాగుతుంటే, గోపబాలురుకూడా స్వచ్ఛమైన యమునా నదీజలములను తాగారు. ఆకలి నీటితో తీరదు కదా. వాళ్లందరికీ బాగా ఆకలి వేస్తూ ఉంది. వారంతా కృష్ణుని చూచి ఇలా అన్నారు." అని శుకయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు గోపికావస్త్రాపహరణము అనే వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువది రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఇరువది మూడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! యమునా నదీ తీరంలో గోప బాలకులు "కృష్ణా! బాగా ఆకలిగా ఉందయ్యా! తినడానికి ఏమన్నా ఉందేమో చూడు. ఈ చెట్లకు కాచిన పండ్లను తింటే ఈ ఆకలి తీరేటట్టు లేదు." అని అన్నారు. కృష్ణుడు అటు ఇటు చూచాడు. కొస్త దూరంలో యమునా నదీ తీరంలో కొంత మంది బ్రాహ్మణులు ఒక యజ్ఞం చేస్తూ ఉండటం చూచాడు.

కృష్ణుని మనసులో ఒక విషయం స్ఫురించింది. ఆ యజ్ఞము చేసే బ్రాహ్మణులలో ఒకరి భార్య తన అనుగ్రహం కోసరం పరితపిస్తూ

ఉందని తెలుసుకున్నాడు. ఆమెను అనుగ్రహించాలని నిర్ణయించుకున్నాడు. వెంటనే గోపబాలకులను చూచి "గోపాలకులారా! అటుచూడండి. అక్కడ ఏదో యజ్ఞం జరుగుతున్నట్టు ఉంది. అక్కడ భోజన పదార్థాలు కూడా తయారు చేస్తున్నారు. మీరు అక్కడకు పోయి మాకు ఆకలిగా ఉంది అన్నం పెట్టమని అడగండి. నా పేరు, మా అన్న బలరాముని పేర్లు చెప్పి, మేము పంపించామని చెప్పండి." అని అన్నాడు.

వెంటనే ఆ అమాయకులైన గోపబాలురు చెంగు చెంగున ఎగురుకుంటూ ఆ యజ్ఞం జరిగే చోటుకు వెళ్లారు. యజ్ఞం చేస్తున్న బ్రాహ్మణులకు బోర్లాపడి నమస్కారాలు చేసారు. వారిని ఇలా అడిగారు. "బ్రాహ్మణోత్తములారా! మేము, కృష్ణుడు, బలరాముడు అందరం స్నేహితులం. మేమందరం ఆవులను మేపుకోడానికి యమునా నదీతీరానికి వచ్చాము. మాకు అందరికీ బాగా ఆకలిగా ఉంది. కృష్ణుడు మా అందరినీ మీ దగ్గరకు వెళ్లి అన్నం అడగమని చెప్పాడు. అందుకని మీ వద్దకు వచ్చాము. మీకు బలరాముడు, కృష్ణుని ఎడల గౌరవం ఉంటే మాకు అన్నం పెట్టండి. వారు ఇంకా ఇలా చెప్పమన్నారు. 'అగ్నిష్టోమ యజ్ఞము మొదలు పెట్టి, దీక్ష తీసుకున్న తరువాత, యజ్ఞపశువును చంపక ముందు అన్నం తినడం దోషం. కాని, ఇంద్రుడు మొదలగు దేవతలను ఆరాధించే యజ్ఞములు కాకుండా, మామూలుగా చేసే యజ్ఞములలో దీక్ష తీసుకున్నవారు మధ్యలో అన్నం తిన్నా తప్పులేదు.' అని చెప్పమన్నారు. కాబట్టి ఇప్పుడు మీరు మాకు అన్నం పెట్టినా తప్పులేదు. మేము ఆకలితో ఉన్నాము కాబట్టి మాకు అన్నం పెట్టి మా ఆకలి తీర్చండి." అని ప్రాధేయపడ్డారు.

కాని ఆ బ్రాహ్మణులు ఒట్టి మూర్ఖులు. తమకు అన్నీ తెలుసు అని అనుకుంటున్నారు కానీ, తమకు ఏమీ తెలియదు అన్న విషయాన్ని తెలుసుకోలేని పండితులు. వారికి ఎంతసేపటికీ, ఇంద్రుడు, స్వర్గము, స్వర్గ సుఖములు, ఇవే తప్ప వేరే ఏమీ కనపడవు. తాము ఏ పరమాత్మను గురించి యజ్ఞంచేస్తున్నారో ఆ పరమాత్మ స్వయంగా వచ్చి అన్నం అడుగుతున్నాడు అని తెలుసుకోలేని అవివేకులు.అందుకని ఈ గోపబాలుర మాటలను వినీ విననట్లు ఊరుకున్నారు.

ఓ పరీక్షిత్ మహారాజా! విష్ణువుకు ఒక రూపం లేదు. సర్వవ్యాపి. ఆ బ్రాహ్మణులు యజ్ఞం చేస్తున్న ప్రదేశము, యజ్ఞం చేస్తున్న కాలము, యజ్ఞము చేయడానికి సేకరించిన వస్తువులు, యజ్ఞములో చదివే వేదమంత్రములు, చేయించే ఋత్విక్కులు, వెలిగే అగ్ని, చేసే యజమాని, చేస్తున్న యజ్ఞము ఇవన్నీ కూడా ఆ విష్ణుస్వరూపాలే కదా! ఆ బ్రాహ్మణులకు ఆ విషయం తెలియదు. విష్ణువు వేరు, కృష్ణుడు వేరు. ఈ గోపబాలకుడు విష్ణు అంశలో పుట్టడం ఏమిటి! అని కృష్ణుని వారు గౌరవించలేదు. తమను దీనంగా అన్నం కోసరం వేడుకుంటున్న గోపబాలురకు అన్నం పెడతామని కానీ పెట్టమని కానీ చెప్పడం లేదు.

ఆ గోపబాలురు కొంచెం సేపు చూచారు. ఆ బ్రాహ్మణులు ఏమీ చెప్పక పోవడంతో నిరాశ పడి తిరిగి కృష్ణుని వద్దకు వచ్చారు. జరిగింది చెప్పారు. అప్పుడు కృష్ణుడు వారితో ఒక మాట అన్నాడు.

“ఒక కార్యం మీద వెళ్లిన వాడు  దానిని సాధించుకొని

రావాలి కానీ ఫలితం లేకుండా తిరిగి రాకూడదు. అలాగే ఎవరినైనా యాచించడానికి వెళ్లిన వాడు ఒట్టి చేతులతో తిరిగి రాకూడదు. అది లోక ధర్మము. గోపబాలకులారా! ఈ సారి మీరు బ్రాహ్మణుల వద్దకు వెళ్లకండి. ఆ బ్రాహ్మణుల భార్యల వద్దకు వెళ్లండి. నేను, బలరాముడు ఆవులను మేపుకోడానికి వచ్చి ఆకలితో ఉన్నారు. వారికీ మాకూ అన్నం పెట్టమని అడగండి. ఆ బ్రాహ్మణుల భార్యలకు నేను అంటే ఎంతో వాత్సల్యము. వారు మీకు తప్పకుండా అన్నం పెడతారు." అని అన్నాడు.

వెంటనే గోపాలురు మరలా యజ్ఞం జరిగే చోటికి వెళ్లారు. బ్రాహ్మణుల భార్యలు ఆ పక్కనే ఆహార పదార్థాలు వండుతున్న ప్రదేశములో కూర్చుని ఉన్నారు. . గోపబాలకులు వారికి కూడా సాష్టాంగ నమస్కారం చేసారు. "అమ్మా! మీకు నమస్కారం చేస్తున్నాము. దయచేసి మా మాటలు ఆలకించండి. ఇక్కడికి దగ్గరలోనే కృష్ణుడు, బలరాముడు, మేము ఆవులను మేపుకోడానికి వచ్చాము. మాకు అందరికీ ఆకలిగా ఉంది. తినడానికి ఏమీ లేదు. అందువలన మా అందరికీ అన్నం పెట్టండి." అని అడిగారు.

ఆ బ్రాహ్మణ వనితలు  అప్పటి దాకా కృష్ణుని లీలలను విని ఉన్నారు. కాని వారు కృష్ణుని చూడలేదు. ఇప్పుడు ఆ కృష్ణుడే స్వయంగా తమ వద్దకు వచ్చాడు.  సాక్షాత్తు విష్ణుస్వరూపుడు,  నందరాజు కుమారుడు ఐన కృష్ణుడు స్వయంగా వచ్చి అన్నం అడుగుతున్నాడు. ఎంత అదృష్టం అని  వారంతా ఆశ్చర్యపోయారు.  వెంటనే ఖాళీ గిన్నెలలో తాము వండిన మధురమైన పదార్థములను పెట్టుకొని కృష్ణుడు ఉన్న చోటికి వెళ్లారు.

ఇది చూచిన బ్రాహ్మణులు "అయ్యో అయ్యో మడి కాస్తా మంటగలిసి పోయింది. ఇంకా యజ్ఞం పూర్తి కాలేదు. దేవుడికి నివేదన కాలేదు. ఎవరూ తినకూడదు" అంటూ అరుస్తున్నారు. కానీ వారి భార్యలు ఆ మాటలు వినిపించుకోలేదు. కృష్ణుని వద్దకు వెళుతున్నారు. అలా వెళుతున్న వారిని వారి భర్తలు, తండ్రులు, సోదరులు, బంధువులు బలవంతంగా వారిస్తున్నారు. వారిలో శ్రీకృష్ణుడు అనుగ్రహించదలచిన ఆమె కూడా ఉంది. ఆమెను ఆమె భర్త ఇంటిలో పెట్టి బంధించాడు. ఆమె తప్ప మిగిలిన బ్రాహ్మణుల భార్యలు అందరూ, తమ భర్తలను, బంధువులను లెక్కచేయకుండా శ్రీకృష్ణుని వద్దకు వెళ్లారు.

నీల మేఘచ్ఛాయతో, మెడలో వనమాలతో, తలమీద నెమలి పింఛముతో, పీతాంబరధారి అయిన కృష్ణుని చూచారు. వారిని చూచి కృష్ణుడు చిరునవ్వు నవ్వాడు. వారంతా వచ్చి కృష్ణుని పక్కనే కూర్చున్నారు. "నాయనా కృష్ణా! ఆకలిగాఉందా!" అని అడిగారు. అప్పటి దాకా వారు కృష్ణుని గురించి ఆయన లీలల గురించి విన్నారు. ఇప్పుడు స్వయంగా చూస్తున్నారు. వారి చిత్తములు శ్రీకృష్ణుని యందు లగ్నం అయ్యాయి. వారందరూ శ్రీకృష్ణుని తమ మనసులలో నిలుపుకున్నారు. వారు శ్రీకృష్ణుని చూడవలెననే కోరికతో, సకల కోరికలను విడిచిపెట్టి, తమ వారి మాట వినకుండా, కృష్ణుని వద్దకు వచ్చారు. శ్రీకృష్ణుని తదేకంగా తమ కళ్లతోనే తాగేసేటట్టు చూస్తున్నారు.

కృష్ణుడు వారి మనసులోని భావములను గ్రహించాడు. వారిని చూచి ఇలా అన్నాడు. "అమ్మా! మీరు సుఖంగా ఉన్నారా. మీరు

కూర్చోండమ్మా! మీ భర్తలు, మీ బంధువులు వారిస్తున్నా వినకుండా నాకోసరం వచ్చారు. మీకు నేను ఏమి చేయగలనో చెప్పండి.

అమ్మా! నా గురించి తెలుసుకున్నవారు, ఎలాంటి స్వార్థబుద్ధి లేకుండా నా మీద నిరంతర భక్తి కలిగి ఉంటారు. అమ్మా! పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, అహంకారము, ఆత్మీయత, దేహము, భార్య, సంతానము, ధనము, వస్తువులు అన్నీ కూడా ఈ దేహములో వెలుగుతున్న ఆత్మకు సంబంధించినవే కదా! కాబట్టి ఆ ఆత్మకంటే ప్రియమైన వస్తువు ఏముంటుంది చెప్పండి. అమ్మా!మీరంతా నా కోసరం ఆహార పదార్థాలు తీసుకొని వచ్చారు. చాలా సంతోషం. మీ భర్తలు తాము చేస్తున్న యజ్ఞము పూర్తి చేసి, మీ కోసరం ఎదురు చూస్తున్నారు. మీరు వెంటనే వారి వద్దకు వెళ్లడమే మంచిది." అని అన్నాడు కృష్ణుడు.

ఆమాటలకు బ్రాహ్మణుల భార్యలు ఇలా అన్నారు. "కృష్ణా! నీవు సాక్షాత్తు విష్ణుస్వరూపుడవు అని మాకు తెలుసు. ఒక సారి పరమాత్మ దర్శనము అయిన తరువాత మరలా ఆ సంసారసాగరంలో పడమంటావా! మేమంతా నీ భక్తులము. నీ భక్తులను రక్షించడం నీ బాధ్యత కాదా! పరమాత్మస్వరూపుడవైన నీ పాదపద్మములను మేము వదలము. ఇప్పుడు మేము అక్కడకు వెళ్లినా, మా భర్తలు, తల్లితండ్రులు, సంతానము, సోదరులు, బంధువులు మమ్ములను తమ వద్దకు రానీయరు. ఇంక ఈ లోకుల సంగతి చెప్పేదేముంది. మేమంతా నీ పాదములను ఆశ్రయించాము. నీ శరణు కోరుతున్నాము. నీవు తప్ప మాకు వేరు గతి లేదు." అని అన్నారు.

ఆ మాటలకు కృష్ణుడు చిరునవ్వునవ్వి ఇలా అన్నాడు. “అమ్మా! మీరు ఇలా వచ్చినందుకు మీ భర్తలు కానీ, మీ తల్లితండ్రులు కానీ, మీ సంతానము కానీ, మీ బంధువుల కానీ మీ మీద ఏ దోషము ఆరోపించరు. అమ్మా! ఈ మానవలోకంలో, కేవలం శరీరంతో శరీరం కలిస్తేనే ఆనందం కలుగుతుంది అని అనడం అపోహ. నన్ను మనసులో తలచుకుంటే చాలు. నా గుణములను వినడం వలన, నా విగ్రహమును పూజించడం వలన, నా రూపాన్ని మనసులో ధ్యానించడం వలన, నా నామమును కీర్తించడం వలనా, మీకు కలిగే ఆనందం, నా ఎదుట ఉన్నా కూడా మీకు కలుగదు. కాబట్టి మీరు ఇంక మీ మీ గృహములకు వెళ్లండి. మీ భర్తలను కలుసుకోండి. యజ్ఞములను పూర్తిచేయండి.” అని అన్నాడు.

కృష్ణుడు ఈ విధంగా పలుకగా, ఆ బ్రాహ్మణుల భార్యలు, కృష్ణుని విడిచిపెట్టి, కృష్ణనామమును మనసులో తలచుకుంటూ, యజ్ఞము చేసే చోటికి వెళ్లారు. కృష్ణుని మాయ వలన యజ్ఞము చేసే బ్రాహ్మణులు తమ భార్యలను ఏమీ అనలేదు. యజ్ఞము పూర్తి చేసుకొని నివేదన కోసరం ఎదురుచూస్తున్నారు. ఇక్కడ కృష్ణుడు బ్రాహ్మణుల భార్యలు తెచ్చిన ఆహారపదార్థములను, తన సోదరుడు బలరాముడు, తోటి గోపబాలురతో కలిసి తృప్తిగా ఆరగించాడు.

పరీక్షిత్ మహారాజా! అందరు బ్రాహ్మణపత్నులు కృష్ణుని వద్దకు వెళుతున్నప్పుడు ఒక బ్రాహ్మణ పత్నిని గృహములో పెట్టి బంధించారు అని చెప్పాను కదా! ఆ బ్రాహ్మణ స్త్రీ తన మనస్సును కృష్ణుని యందు

లగ్నం చేసి, తదేక ధ్యానంతో ఈ శరీరాన్ని విడిచిపెట్టి కృష్ణునిలో లీనం అయింది. ఆ సంఘటన చూచిన తరువాత ఆ బ్రాహ్మణులకు జ్ఞానోదయం అయింది. సాక్షాత్తు పరమాత్మ, బలరామ కృష్ణుల రూపంలో వచ్చి అడిగినా వారికి అన్నం పెట్టక పోవడం మహాపరాధము అని మనసులో చాలా బాధ పడ్డారు. పశ్చాత్తాపంతో కుమిలిపోయారు. తమ భార్యలకు కృష్ణుని మీద ఉన్న ప్రేమ, భక్తి అలౌకికమనీ, అటువంటి భక్తి తమకు లేకపోయిందనీ బాధపడ్డారు.

"మేము ఎవరి ప్రీతి కోసరం యజ్ఞములు యాగములు చేస్తున్నామో ఆ పరమాత్మ ఎడల మా భక్తిని చూపలేకపోయాము. భగవంతుని మీద భక్తి, శ్రద్ధ లేకుండా మేము చేసే యజ్ఞములు, యాగములు, వ్రతములు, పూజలు అన్నీ వృధా. భక్తిలేని పూజలు వ్యర్థములు. మేము చదువుకున్న చదువులు, ఆర్జించిన విజ్ఞానము, చేసిన కర్మలు అన్నీ నిష్ఫలములు. మేము వేదములు, శాస్త్రములు చదివి కూడా ఆ పరమాత్మ మాయకు లోబడి పోయాము. మహాతపస్సులు చేసిన యోగులే ఆ పరమాత్మ మాయను దాటలేనపుడు మానవమాత్రులము మేమెంత!

మేము పేరుకు బ్రాహ్మణులుగా పుట్టినప్పటికీ, భగవంతుని ఎడల మా కర్తవ్యమును మరిచిపోయాము. ఆచారాలు, వ్యవహారాలు అని పట్టుకొని వేళ్లాడుతున్నాము. ఏమీ చదువుకోని మా భార్యలు ఆ పరమాత్మ యందు నిష్కళంకమైన భక్తితో, ఈ సంసార బంధనము లను ఛేదించుకొని, శ్రీకృష్ణుని వద్దకు చేరుకున్నారు. ఉపనయనము, గురుకులము, తపస్సు, ఆత్మవిచారము, సంధ్యావందనము ఇవేమీ తెలియని మా భార్యలు, కేవలం ఆ కృష్ణపరమాత్మయందు ఉన్న

మూఢభక్తితో, కృష్ణుని అనుగ్రహమునకు పాత్రులయ్యారు. వారు ఎంతటి అదృష్టవంతులో కదా! మేము ఇన్ని శాస్త్రాలు చదివి, రోజూ సంధ్యావందనం, హోమము చేస్తూ కూడా మాకు ఆ పరమాత్మ యందు అటువంటి భక్తి కలుగలేదు.

మేము ఎంత సేపటికీ ఏ యాగం చేద్దామా, ఏ దేవుడిని పూజిద్దామా, కుటుంబానికి కావాల్సిన వస్తువులు ఎలా సంపాదిద్దామా అనే ఆలోచనే తప్ప భగవంతుని ఎడల భక్తి ఉండాలి అనే ఆలోచనే లేదు. కాని ఆ పరమాత్మ స్వరూపుడైన కృష్ణుడు మా కర్తవ్యమును మా కు గుర్తుచేయడానికా అన్నట్టు మా వద్దకు వచ్చి మమ్ములను అన్నం పెట్టమని అడిగాడు. కాని మేము మా మూర్ఖత్వంతో ఆయనను లక్ష్యపెట్టలేదు. ఆయనకు అన్నం పెట్టడానికి నిరాకరించాము.

సకల జీవరాసులకు ఇహలోక సుఖాలను, పరలోకసుఖాలను, చివరకు మోక్షాన్ని కూడా ప్రసాదించే పరమాత్మ మా వద్దకు వచ్చి అన్నం కోసరం యాచించవలసిన అవసరం ఏముంది? అంతెందుకు. మానవులు, దేవతలు తమకు సకల ఐశ్వర్యములను ప్రసాదించమని ఆ లక్ష్మీదేవిని పూజిస్తుంటే, ఆ లక్ష్మీదేవి ఎల్లప్పుడు విష్ణుమూర్తి పాదములను సేవిస్తూ ఉంటుంది. సాక్షాత్తు విష్ణుస్వరూపుడైన ఆ కృష్ణుడే వచ్చి అన్నం పెట్టమని అడిగితే మేము నిరాకరించాము. మేము ఎంతటి పాపాత్ములము. మేము చేసే ఈ యజ్ఞములు, యాగములు, వాటి వలన లభించే ఫలములు అన్నీ ఆ విష్ణుస్వరూపాలే అని తెలిసి కూడా, ఆ విష్ణువే మానవ రూపంతో నందగోకులంలో కృష్ణుడుగా అవతరించాడని తెలిసి కూడా, మా

అజ్ఞానము వలన, అవివేకము వలన, మాయచేత మోహితులమై కృష్ణుని తత్వమును తెలుసుకోలేక పోయాము. అట్టి కృష్ణభగవానునికి భక్తితో నమస్కరిస్తున్నాము. మేమందరమూ విష్ణుమాయలో పడి, మోహానికి లోబడి, కృష్ణుని ప్రభావమును తెలుసుకోలేక పోయాము. ఆ పరమాత్మ మా తప్పులను మన్నించి మమ్ములను క్షమిస్తాడని వేడుకుంటున్నాము." అని ఆ బ్రాహ్మణులు తమలో తాము పశ్చాత్తాపపడ్డారు.

వారందరూ వెంటనే గోకులమునకు వెళ్లి కృష్ణపరమాత్మ దర్శనము చేసుకుందామని అనుకున్నారు. కానీ కంసునికి భయపడి, ప్రాణభయంతో ఆ ప్రయత్నాన్ని మానుకున్నారు. కాని, కృష్ణుని పాదములను నమ్మిన వారికి భయం అంటే ఏమిటో తెలియదు కాబట్టి, వారి భార్యలు మాత్రము వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నారు. కృష్ణపరమాత్మను దర్శించుకొని తమ భక్తిని చాటుకున్నారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణతత్వమును వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువది మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఇరువది నాలుగవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! నందగోకులము లో ఉండే ప్రజలు అందరూ కలిసి ఇంద్రుడి గురించి ఒక యజ్ఞము చేయాలని అనుకున్నారు. ఈ విషయం కృష్ణునికి, బలరామునికి తెలిసింది. ఒక రోజు నందవ్రజములో ఉన్న తన తండ్రి నందుడు, పెద్దలు, ఇతర గోపకులు అందరూ కూర్చుని ఉండగా, కృష్ణుడు వారితో వినయంగా ఇలా అన్నాడు.

"తండ్రీ! మీరేదో యజ్ఞం చేస్తున్నారని విన్నాను. ఎవరి గురించి, దేని కోసరం, ఏమి ఫలితమును ఆశించి ఈ యజ్ఞం చేస్తున్నారు. ఈ యజ్ఞమునకు దేవత ఎవరు? ఈ యజ్ఞమునకు యజమాని ఎవరు? ఈ యజ్ఞమునకు కావలసిన సామగ్రి ఏమిటి? దానికి ఎంత వ్యయం అవుతుంది? దయచేసి చెప్పగలరా?" అని అడిగాడు.

బాణముల వంటి ప్రశ్నలను సంధించి వదిలి, తరువాత తల వంచుకొని మౌనంగా నిలబడ్డాడు కృష్ణుడు. నందుని వద్ద నుండి ఏమీ సమాధానము లేదు. మరలా కృష్ణుడు వారితో ఇలా అన్నాడు.

"తండ్రీ! ఆత్మదృష్టి కలవారు, వీడు తన వాడు, వాడు పరాయి వాడు అనే భేదభావము లేని వారు, ఒకరితో స్నేహము, మరొకరితో

వైరము, ద్వేషము, మరొకరితో ఏమీ పట్టనట్టు ఉండటం, ఇటువంటి భావములు లేనివారు అయిన సాధువులు ఈ ప్రపంచంలో ఏ విషయమునూ దాచి పెట్టరు అని అంటారు కదా! నేను మీకు పరాయి వాడిని కాను. నా నుండి మీరు ఏ విషయమును దాచవలసిన అవసరము లేదు.  నేను అడిగిన ప్రశ్నలకు బదులు చెప్పకుండా, ఏదో విషయమును  దాచి పెట్టినట్టు మౌనంగా ఉండటం తగదు. కాబట్టి నేను అడిగిన ప్రశ్నలకుసమాధానం చెప్పండి. అయినా  నేనేం మీకు శత్రువునుకాదు. నా వద్ద ఏ విషయములు దాచవలసిన పనిలేదు అనుకుంటాను.

తండ్రీ! మరొక మాట! ఈ ప్రపంచంలో అందరూ కర్మలు చేస్తుంటారు. కొందరు తాము చేయబోయే కర్మల గురించి, ఆ కర్మలు చేసినందువలన రాబోయే ఫలితముల గురించి తెలుసుకొని కర్మలు  చేస్తుంటారు. కొందరు తాము ఆ కర్మలు ఎందుకు చేస్తున్నారో, ఎవరి కోసరం చేస్తున్నారో, ఏ ఫలితాన్ని ఆశించి చేస్తున్నారో తెలియకుండా, మన పూర్వీకులు చేసారు మనమూ చేయాలి అనే భావనతో చేస్తుంటారు. అన్నీ తెలిసి చేసిన కర్మలే చక్కని ఫలితములను ఇస్తాయి కానీ,  ఏమీ తెలియకుండా ఏదో చేస్తున్నాము అని చేసే కర్మలు ఎటువంటి ఫలితములను ఇవ్వవు. కాబట్టి మీరు కూడా ఏదో ఒక దారిన పోతున్నాము, ఏదో ఒక యజ్ఞము చేస్తున్నాము అని కాకుండా, మీ మేలు కోరేవారితో ఆలోచించి,చర్చించి తరువాత యజ్ఞం చేయడం మంచిది.

తండ్రీ! ఇంతకూ మీరు చేయబోయే ఈ ఇంద్ర యజ్ఞము వేదములలోనూ శాస్త్రములలో చెప్పబడిన ప్రకారము చేయబడుతూ

ఉందా లేక ఆచార, వ్యవహారములను బట్టి, ఏదో మా పెద్దలు చేసారు, మేము చేస్తున్నాము అని చేయబడుతూ ఉందా! నాకు తెలియజేయండి. ” అని అడిగాడుకృష్ణుడు.

తన కుమారుడైన కృష్ణుడు ఆ ప్రకారంగా నిలదీసి అడుగుతుంటే, ఇంక తప్పదని నందుడు లేచి కృష్ణుడికి ఈ విధంగా సమాధానం చెప్పాడు. “కుమారా! ఇంద్రుడు లోకపాలకుడు. మేఘములు ఆయన అధీనంలో ఉంటాయి. ఆయనే మేఘములు అని కూడా అంటారు. ఆ మేఘస్వరూపుడైన ఇంద్రుడే ఈ ప్రపంచంలో ఉండే చరములు, అచరములు అయిన (కదిలేవి, కదలనివి అయిన) జీవరాసులకు జీవనాధారము. ఇంద్రుడు వర్షాలు కురిపించడం వలననే ఎండా కాలంలో ఎండి పోయిన గడ్డి, మొక్కలు, చెట్లు చిగురిస్తాయి.

కుమారా! మేమే కాదు, ఈ ప్రపంచములో ఉన్న ప్రజలందరూ వర్షం కొరకు ఇంద్రుని ప్రార్థిస్తారు. ఆయన గురించి యజ్ఞములు, యాగములు చేస్తారు. ఆయనను పూజిస్తారు ఆరాధిస్తారు. నివేదనలు సమర్పిస్తారు. అప్పుడు ఇంద్రుడు వర్షములు కురిపించి భూములను సస్యశ్యామలం చేస్తాడు. ఆ అన్నం తిని ప్రజలు  సుఖంగా బతుకుతున్నారు. తమతమ కార్యములు సమర్థవంతంగా చేసుకోగలుగుతున్నారు. ఇది మాకు వంశ పరంపరగా వస్తున్న ఆచారము. ఇంద్రుడి మీద కోపం చేతనో, భయం చేతనో, ద్వేషం చేతనో ఆయనను ఆరాధించకపోతే, మాకు కష్టాలు తప్పవు. పంటలు పండవు. మాకు అన్నం దొరకదు. అందుకని ఇంద్రుని గురించి

ఆనవాయితీగా వస్తున్న ఈ యజ్ఞమును చేయడానికి సంకల్పించాము." అని వివరించాడు నందుడు. ఆ మాటలు విన్న కృష్ణుడు ఇలా అన్నాడు.

"తండ్రీ! మీకు కర్మ సిద్ధాంతం తెలుసు అనుకుంటాను. ఈ లోకంలో మానవులు కర్మలు చేస్తుంటారు. వాటికి తగిన ఫలములను పొందుతుంటారు. ఇహలోకములో చేసిన కర్మల ఫలితంగానే వారికి జనన, మరణములు, సుఖములు దు:ఖములు, రాగద్వేషములు, భయము, కలుగుతున్నాయి. మానవులు చేసిన కర్మలకు ఫలితములను నిరాకారుడు, నిర్గుణుడు అయిన ఈశ్వరుడు ఇస్తాడు. మానవులు మంచి పని చేస్తే మంచి ఫలితాలు వస్తాయి. చెడు పనులు చేస్తే చెడ్డ ఫలితాలు వస్తాయి. ఏపనీ చేయకపోతే ఏ ఫలితము దక్కదు.

ఈ లోకంలో ప్రతి జీవీ ఏదో ఒక కర్మచేస్తుంటాడు. ఏ కర్మాచేయకుండా ఏజీవి బతకలేడు. ఆకర్మలు కూడా వాడి వాడి పూర్వజన్మ సంస్కారములను బట్టి చేస్తుంటాడు. పూర్వజన్మ సంస్కారమువలన చేయబడే కర్మలను మార్చే శక్తి ఎవడికీ లేదు. ఆ ఇంద్రుడికి అసలే లేదు. కాబట్టి ఆ ఇంద్రుడి గురించి యజ్ఞములు, యాగములు చేసి వాడికి ఉపాహారములు, నైవేద్యములు సమర్పించి నందు వలన ప్రయోజనము ఏముంటుంది. ఈ లోకంలో ఉండే ప్రతి జీవి తన పూర్వ జన్మ సంస్కారమునకే అధీనుడై ఉన్నాడు. పూర్వజన్మలో తాను చేసిన కర్మలను అనుసరించి ఈ జన్మలో వాడి వాడి స్వభావాన్ని బట్టి కర్మలు చేస్తుంటాడు. ఇది ఒక్క మానవులకే కాదు, దేవతలకు, అసురులకు, రాక్షసులకు కూడా వర్తిస్తుంది.

జీవుడు ఈ జన్మలో చేసిన కర్మల ఫలితంగానే మరు జన్మలో మనిషిగానో, జంతువుగానో, పక్షిగానో రకరకాలైన దేహములను పొందుతాడు.. ఆ జన్మలో చేసిన కర్మల ఫలితంగానే ఆ దేహాన్ని విడిచిపెట్టి మరొక దేహమును పొందుతాడు. కాబట్టి మానవులకు, దేవతలకు, రాక్షసులకు ఎవరికైనా వారు చేసిన కర్మలే వారికి మిత్రులు, శత్రువులు. వాడు చేసిన కర్మయే వాడికి గురువు, దైవము.

జీవుడు కర్మలయొక్క అధీనంలో ఉంటాడు. అతను చేసే కర్మలు అతనికి తగిన ఫలితాలను ఇస్తాయి కాబట్టి ఎవడు చేసిన కర్మ వాడికి ఈశ్వరుడు. కాబట్టి మానవులు వర్ణాశ్రమ ధర్మములను పాటిస్తూ, ఎవరికి నిర్దేశించిన కర్మలను వారు చేస్తూ సుఖజీవనం చెయ్యాలి. ఎవరి ధర్మం వారు పాటిస్తే, ఆ ధర్మం వారిని రక్షిస్తుంది. ఆ ధర్మమే ఈశ్వరుడు.

భర్తచాటున కాపురం చేసుకుంటున్న ఇల్లాలు, పరపురుషుని పంచన చేరితో ఎన్ని కష్టాలు అనుభవిస్తుందో, అలాగే తనకు నిర్దేశించిన కర్మలను వదిలి పెట్టి, ఇతర వృత్తులను స్వీకరిస్తే, ఇతరులను సేవిస్తే, కష్టాలపాలవడం తప్పదు. బ్రాహ్మణుడు వేదములను చదవాలి, అధ్యయనం చెయ్యాలి. క్షత్రియుడు ప్రజలను పాలించాలి, రక్షించాలి. వైశ్యుడు వ్యవసాయం చేసి పంటలు పండించాలి. పశు వులను వృద్ధిచేసి పాల ఉత్పత్తులను పెంచాలి.  వ్యాపారం చేసి ధనం సంపాదించాలి. అలాగే శూద్రుడు బ్రాహ్మణులను, ఇతరులను సేవిస్తూ జీవనం గడపాలి.

వ్యవసాయము, గోవులను రక్షించడం, వ్యాపారం చేసి ధనం సంపాదించడం, ఇవి వైశ్యవృత్తులు అయినా, మనము గోరక్షణను మాత్రమే వృత్తిగా స్వీకరించాము.

ఈ లోకం అంతా సత్వ, రజస్తమోగుణములతో నిండి ఉంది. ఈ విశ్వం పుట్టడం, వృద్ధి చెందడం, లయం కావడం ఈ మూడు గుణముల వలననే జరుగుతూ ఉంది. ముఖ్యంగా రజోగుణము వలననే ఈ సృష్టి జరుగుతూ ఉంది. అంటే పురుషునిలో ఉత్పత్తి అయిన రేతస్సు స్త్రీ రజస్సుతో కలియడం వలన, సృష్టి జరుగుతూ ఉంది. వివిధ ప్రాణులు పుడుతున్నాయి. మేఘములు కూడా రజోగుణముతో వృద్ధిపొంది, మనకు వర్షాలు కురుస్తున్నాయి. వర్షాలు కురియడం వలన పంటలు పండుతున్నాయి. ప్రజలు సుఖంగా జీవిస్తున్నారు. ప్రకృతి సిద్ధంగా వర్షాలు పడుతుంటే, ఇందులో ఇంద్రుడు ప్రమేయం ఏముంటుంది?

ఓ తండ్రీ! మనం ఈ అడవిని నమ్ముకొని జీవిస్తున్నాము. ఈ అడవులలో, పర్వత ప్రాంతములో, నదీతీరంలో తిరుగుతూ ఉంటాము. మనం నగరాలకు కానీ, పట్టణములము కానీ వెళ్లము. నగర జీవనం మనకు క్షేమకరం కాదు. కాబట్టి మనము గోవులను, బ్రాహ్మణులను, వృక్షసంపదను, అడవులను, పర్వతములను, నదులను రక్షించుకోవాలి. వాటి కోసరం యజ్ఞాలు చేయాలి కానీ ఎక్కడో ఉన్న ఇంద్రుడి కోసరం యజ్ఞాలు ఎందుకు చెయ్యాలి. కాబట్టి మీరందరూ ఆ ఇంద్రుడి యజ్ఞం కోసరం సంపాదించిన వస్తువులతో ప్రకృతిని ఆరాధించండి. రకరకాల

ఆహార పదార్థములను తయారు చేసి ప్రకృతి మాతకు నివేదన చేయండి . బ్రాహ్మణులు హెూమం చేస్తారు. ఆ బ్రాహ్మణులు జీవించడానికి గోదానములు, ఆహారపదార్థములు, ధనమును దక్షిణల రూపంలో ఇవ్వండి. తరువాత మన వద్ద పనిచేసే వారికి, కడజాతి వారికి, చండాలురకు, పతితులకు, వారు ఏ కులంలో పుట్టిన వారైనా సరే, వారికి కడుపునిండా ఆహారం పెట్టండి. వారికి వస్త్రములను, ధనమును దానం చెయ్యండి. పెంపుడు జంతువులకు, ఆవులకు, పశువులకు పచ్చిగడ్డిని, ఇతర ఆహారాన్ని సమృద్ధిగా పెట్టండి. మనకు కాయలను, పండ్లను ఇచ్చే గోవర్ధన పర్వతమునకు పూజలు చేయండి. మీరందరూ మంచి వస్త్రములు ధరించండి. చిన్న, పెద్ద, కులము తేడా లేకుండా, పెంపుడు జంతువులు, ఆవులు, పశువులతో సహా, మనం అందరం ఈ గోవర్ధన పర్వతము చుట్టు తిరిగి ప్రదక్షిణం చేద్దాము. అంతేకానీ, ఎక్కడో ఉన్న ఇంద్రుడికి పూజలు చేయడం, నైవేద్యాలు పెట్టడం అనవసరం. తండ్రీ! ఇదీ నా అభిప్రాయము. మీకు ఇష్టమైతే నేను చెప్పినట్టు చేయండి. గోవులను, బ్రాహ్మణులను, ప్రకృతిని పూజిస్తే మనకుమంచి ఫలితములు లభిస్తాయి.

(ఈ నాటికి కూడా కొండ దేవరను, అడవి తల్లిని పూజించే గిరిజనులు ఎంతో మందిఉన్నారు. కాని నాగరికుల మైన మనం పాలు ఇచ్చినన్నాళ్లు గోవుల పాలు తాగి, పాలు వట్టిపోగానే వధశాలకు అమ్మేస్తున్నాము. ఇంతకన్నా దారుణం ఉంటుందా! బ్రాహ్మణులు అంటే కులం బట్టి బ్రాహ్మణులు కాదు. మంచి మార్గము, నీతి మార్గము బోధించేవాళ్లు. నీతి బోధ చేసేవాళ్లు లేకనే ఈ నాడు మానవులు మృగాలుగా మారుతున్నారు. రోజుకో స్త్రీని మానభంగం చేస్తున్నారు.

ప్రకృతిని యధాశక్తి నాశనం చేస్తూ వేసవి కాలంలో 50 డిగ్రీల ఉష్ణోగ్రతను, వానాకాలంలో ముంచెత్తే వరదలకు కారణం అవుతున్నారు. అందుకే గోవులను, బ్రాహ్మణులను, ప్రకృతిని పూజించమని కృష్ణుడు చెప్పాడు.).

తండ్రీ! ఈ యాగము గోబ్రాహ్మణులకు, ఈ గోవర్ధన పర్వతమునకు, నాకు ప్రియమైనది.” అని కృష్ణుడు తన అభిప్రాయాన్ని చెప్పాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ ప్రకారంగా కృష్ణుడు ఇంద్రునికి యాగము చేయవద్దంటూ, ప్రకృతి పూజ చేయమని తన తండ్రికి, నందవ్రజములోని ప్రజలకు బోధించాడు. ఇదేదో చాలా బాగుందని అందరూ కృష్ణుడి మాటలకు అంగీకరించారు. కృష్ణుడు చెప్పినట్టు ఇంద్రుడి పూజ మాని ప్రకృతి పూజ మొదలుపెట్టారు.

బ్రాహ్మణులను పిలిపించి పుణ్యాహవాచనము చేయించారు. ఇంద్రుడి యజ్ఞమునకు తెచ్చిన వస్తువులను ఉపయోగించి గోవర్ధన పర్వతమునకు పూజలు నిర్వహించారు. బ్రాహ్మణులకు దక్షిణలు ఇచ్చారు. ఆవులకు లేత పచ్చిగడ్డిని పలహారంగా సమర్పించుకున్నారు. గోవులు ముందు నడుస్తూ ఉండగా, గోవర్ధన పర్వతము చుట్టు ప్రదక్షిణం చేసారు. గోపికలు, గోపాలురు చక్కగా అలంకరించుకొని, ఎద్దు బండ్లు ఎక్కి పర్వతం చుట్టు పోటీలు వేసుకొని ప్రదక్షిణం చేసారు.

ఆసమయంలో కృష్ణుడు తన మాయతో, ఒక భారీ కాయంతో పర్వతము మాదిరి ఉన్న మనిషిగా మారాడు. వారి మధ్య చేరి “నేనే గోవర్ధన పర్వతాన్ని నాకు పూజలు చేయండి” అంటూ పర్వతము మాదిరి కదలక మెదలకవారి మధ్య నిలబడ్డాడు. అందరూ నవ్వుతూ కేరింతలు కొట్టుకుంటూ ఆ మహాకాయునికి పూజలు చేసారు. విచిత్రం ఏమిటంటే, కృష్ణుడు కూడా ఆ పూజలలో పాల్గొన్నాడు. ఆ మహాకాయునికి తను కూడా నమస్కరించాడు.

గోవర్ధన పర్వతమునకు పూజలు చేసిన తరువాత కృష్ణుడు నందవ్రజములో ఉన్న ప్రజలతో ఇలా అన్నాడు. “చూడండి. గోవర్ధన పర్వతము మనమీద తన అనుగ్రహమును చూపి మనలను కాపాడుతుంది. మనందరము ఈ గోవర్ధన పర్వతమునకు భక్తితో నమస్కారం చేద్దాము.” అని అన్నాడు. కృష్ణుని మాటలను శిరసావహించిన వ్రజవాసులు గోవర్ధన పర్వతమునకు భక్తితో నమస్కరించి ఎవరి ఇండ్లకు వారు వెళ్లిపోయారు” అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు గోవర్ధన పర్వతమును వ్రజవాసులు ఎలా పూజించింది వివరించాడు.

(ఈ అధ్యాయములో కృష్ణుడు తన తండ్రి నందునికి చిన్నపాటి గీతోపదేశము చేసాడు. ఇందులో రెండు ముఖ్యవిషయాలను చెప్పాడు కృష్ణుడు. మొదటిది కర్మయోగము. రెండవది ప్రకృతి సంపదను రక్షించుకోవడం. ఈరెండూ మనకు ఈ నాటికీ వర్తించే అంశాలే. మానవులు తాముచేసిన కర్మలను బట్టి భగవంతుడు

ఫలితాలను ఇస్తుంటాడు. అంతే గానీ భగవంతుడు తనకు ఇష్టమైనవారికి సుఖాలు, తనకు ఇష్టం లేని వారికి దు:ఖాలు కలిగించడు.

"భగవంతుడు, దేవుడు, విధి (ఏదైనా కానీ) నా మీద పగబట్టింది. అందుకే నాకు ఇన్ని కష్టాలు దాపురించాయి" అని చాలా మంది అనుకోవడం మనం వింటూ ఉంటాము. అది ఉత్త భ్రమ అని కృష్ణుడు స్పష్టం చేసాడు. మానవుడు మంచి కర్మలు చేస్తే మంచి ఫలితాలు ఇస్తాడు భగవంతుడు. చెడు కర్మలు చేస్తే చెడ్డ ఫలితాలు ఇస్తాడు. ఏ కర్మా చెయ్యకపోతే ఎటువంటి ఫలితమూ రాదు.

కర్మలు రెండు రకాలు. ఈ జన్మలో చేసిన కర్మలు. ఇంతకు ముందు జన్మలో చేసిన కర్మలు. ఈ జన్మలో మనం మంచి ప్రవర్తనతో ఉన్నా కొన్ని కష్టాలు చుట్టుముడుతుంటాయి. అవి పోయిన జన్మలలో చేసిన కర్మల తాలూకు ఫలితాలు అనుకుంటే ఏ చిక్కూ ఉండదు. ఏరోజు చెప్పిన పాఠం ఆరోజు చదువుకుంటూ ఉంటే, భగవంతుడు ఆ విద్యార్థిని తప్పకుండా ఉత్తీర్ణుడిని చేసాడు. అంతే కాకుండా సంవత్సరం అంతా చెడ్డ పనులు చేస్తూ, పుస్తకం చేత పట్టుకోకపోతే, చెడ్డ ఫలితాలే వస్తాయి. తుదకు ఆత్మహత్యలే మిగులుతాయి.

అంతే కాకుండా కృష్ణుడు మరొక విషయాన్ని కూడా బోధించాడు. ఎవరి పని వారు చెయ్యాలి. విద్యార్థి పని విద్యార్థి చెయ్యాలి. అధ్యాపకుడి పని అధ్యాపకుడు చెయ్యాలి. విద్యార్థులు, అధ్యాపకులు రాజకీయాలలో దిగి, తమతమ విధులు విస్మరిస్తే, తుదకు

మిగిలేది దు:ఖమే. ఈ సత్యాన్ని మనకు ఈ అధ్యాయంలో బోధించాడు కృష్ణుడు. తరువాతి అంశము ప్రకృతి రక్షణ. మానవులు ప్రకృతి సంపదలు అయిన పర్వతములు, అడవులు, చెట్లు, వన్యమృగములను రక్షించుకోవాలి. ఈ నాడు సెజ్ ల పేరుతో పంటభూముల్ని వ్యాపార వేత్తలకు కట్టబెడుతున్నారు. వారు వాటిని బీడు పెడుతున్నారు. కలప కోసరం అడవులు నరుకుతున్నారు. నదిలో ఉన్న ఇసుకను తవ్విపోస్తున్నారు. చెరువులు ఆక్రమించి భవనాలు కడుతున్నారు. నగరములు పట్టణములు చుట్టుపక్కల భూములను ఇళ్ల స్థలాలుగా మార్చి అమ్ముకుంటున్నారు. ఖనిజాల కోసరం భూమిని తవ్వి డొల్ల చేస్తున్నారు.

ఈ ప్రకారంగా మానవుడు ప్రకృతిని శాయశక్తులా ధ్వసం చేస్తున్నాడు. ఫలితంగా ఆహారధాన్యాల ధరలు, కూరగాయల ధరలు ఆకాశంలో ఉన్నాయి. వేసవి కాలంలో 50 డిగ్రీలు, వర్షాకాలంలో ముంచెత్తే వరదలు. ప్రకృతి సమతుల్యం దెబ్బతింటూ ఉంది. ఇంద్రుడు కోపగించి ముంచెత్తు వర్షాలు కురిపిస్తే, కృష్ణుడు గోవర్ధన పర్వతం ఎత్తి వారిని కాపాడాడు. అలాగే మనం పర్వతములను, కొండలను, గుట్టలను, అడవులను, కాపాడుకుంటే ఎంతటి వర్షం కురిసినా అవి మనలను కాపాడతాయి. అలాగే మంచి పనులుచేస్తే మంచి ఫలితాలు వస్తాయి. చెడు పనులు చేస్తే చెడు ఫలితాలు వస్తాయి. ఏపనీ చెయ్యకపోతే ఏ ఫలితమూ రాదు. మనం చేసే పనే మన దేవుడు.

ఈ సందర్భంలో చిన్న ఉదాహరణ చెప్పుకొని ముందుకు సాగుదాం. ఒక వ్యక్తి శివభక్తుడు. ప్రతిరోజూ శివార్చన చేస్తాడు.

శ్రీవేంకటేశ్వరునికి కోట్లుపెట్టి కిరీటం చేయించాడు. కాని ప్రజాధనాన్ని దోచుకొని చెడ్డపనులు చేసాడు. తాను చేసిన చెడ్డ పనికి చెడు ఫలితం లభించింది. కారాగారవాసం తప్పలేదు. అంతేకానీ నాకు ప్రతిరోజూ పూజలు చేసాడని శివుడు, వజ్రకిరీటం చేయించాడనీ వేంకటేశ్వరుడు ఆయనను కాపాడలేదు.  ఆయన చేసిన చెడ్డ పనులకు చెడు ఫలితం లభించింది. కాబట్టి దేవుడికి ఇష్టుడు అయిష్టుడు అనే భేదం లేదు. మనం చేసిన పనులకు తగిన ఫలితాలు ఇవ్వడమే దేవుని పని అని అర్థం చేసుకోవడమే ఈ కృష్ణసందేశం సారాంశం.)

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఇరువది ఐదవ అధ్యాయము.

"పరీక్షిత్ మహారాజా! గోకులంలో జరిగేదంతా పైనుండి ఇంద్రుడు గమనిస్తున్నాడు. గోకులంలో ఉన్న గోపకులు తనకు పూజలు, యజ్ఞాలు చేయాలని సంకల్పిస్తే, వాటిని చేయవద్దని కృష్ణుడు అడ్డుతగులుతున్నాడని గమనించాడు. ఇంద్రుడికి నందవ్రజములో ఉన్న వారి మీద పట్టరాని కోపం వచ్చింది. వెంటనే తన అధీనములో ఉన్న మేఘములను పిలిచి వారితో ఇలా అన్నాడు.

"ఓ మేఘములారా! ఇప్పటి దాకా భూలోక వాసులు, వ్రజములో ఉన్న వారు మనకు యజ్ఞములు, పూజలు నిర్వహించేవారు. ఇప్పుడు కృష్ణుడి మాటలు విని వారు యజ్ఞములు చేసి మనకు ఆహుతులు సమర్పించడం లేదు. వారికి గర్వం తలకెక్కింది. కృష్ణుని మాటలను విని వారు కర్మను నమ్ముకుంటున్నారు. వారి వారి కర్మఫలములే వారికి సుఖసంతోషాలు తెచ్చిపెడతాయని, భగవంతుని ప్రమేయం ఏమీ లేదనీ నమ్ముతున్నారు.

వారు కర్మసిద్ధాంతాన్ని నమ్మితే, ఇంక మా వంటి లోకపాలకులను వారు లక్ష్యపెట్టరు. పూజలు అసలే చేయరు! అసలు ఈ కృష్ణుడు ఎవరు? కేవలం ఒక బాలుడు. ఊరికే వాగుతుంటాడు. వీడికి నీతి అవినీతికి భేదం తెలియదు. అసలు వీడికి జ్ఞానమే లేదు. కేవలం మానవమాత్రుడు. అటువంటి కృష్ణుడు లోకపాలకుడైన నన్ను ఎదిరిస్తాడా! ఆ బాలుని నమ్ముకొని నందవ్రజములో ఉన్న ప్రజలునాకు యజ్ఞములు చేయకుండా, నాకు ఆహుతులు సమర్పించకుండా, వారి కర్మలను నమ్ముకుంటారా!

వీరికి పశుధనము బాగా ఉంది. ఐశ్వర్యం పెరిగింది. అందువలన గర్వం తలకెక్కింది. పైగా ఈ కృష్ణుడు వారిని రెచ్చగొడుతున్నాడు. కాబట్టి వీరి గర్వాన్ని అణచాలి. వీరి మదాన్ని దించాలి. మీరు వెంటనే వెళ్లి భూమి ఆకాశం ఏకమయిందా అన్నట్టు వర్షం కురవండి. జలప్రళయం సృష్టించండి. ఆ జల ప్రళయంలో వ్రజవాసులు, వారి పశువులు సర్వనాశనం కావాలి. అప్పటికి కానీ వారి

మదం అణగదు. నేను కూడా మీ వెంట వస్తాను. మీరు సృష్టించే విలయాన్ని కళ్లారా చూస్తాను. పదండి." అని మేఘాలను ఆదేశించాడు ఇంద్రుడు.

ఇంద్రుని ఆదేశంతో మేఘాలు రెచ్చిపోయాయి. నందవ్రజములో కుంభవృష్టిని కురిపించాయి. నల్లని మేఘములు వ్రజమును చుట్టుముట్టాయి. ఉరుములు, మెరుపులు, పిడుగులు, గర్జనలతో నందవ్రజము మార్మోగిపోయింది. పెద్ద పెద్ద బండల మాదిరి వడగళ్లు పడుతున్నాయి. దానికి తోడు ప్రచండమైన గాలి తోడయింది. ఆ గాలివాన నందవ్రజములో భయంకర భీభత్సాన్ని సృష్టించింది. భూమి అంతా జలమయం అయింది. ఎక్కడా భూమి కనిపించడం లేదు. అంతా నీటిమయం. వ్రజములో ఉన్న ప్రజలు పశువులు విలవిలలాడిపోయారు. అందరూ బాలుడైన కృష్ణుని వద్దకు పోయి మొరపెట్టుకున్నారు.

"ఓ కృష్ణా! మహాభాగా! మనము ఇంద్రునికి యాగం చేయలేదని, ఉపాహారములు సమర్పించలేదనీ ఇంద్రుడు మన మీద పగబట్టినట్టున్నాడు. అందుకే గాలివాన కురిపిస్తున్నాడు. నీవే మమ్ములను రక్షించాలి. నీవే మాకు దిక్కు." అని వేడుకున్నారు. తన మీద కోపంతో ఇంద్రుడు ఈ జలప్రళయాన్ని సృష్టించాడని తెలుసుకున్నాడు కృష్ణుడు.

"ఈ ప్రజలు ఇంద్రుని గురించి యజ్ఞం చేస్తుంటే నేను అడ్డుకున్నానని కోపించి ఈ వ్రజమును నాశనం చేయడానికి ఈ

గాలివాన సృష్టించాడు ఇంద్రుడు. ఇంద్రుడికి తగిన ప్రతీకారం చెయ్యాలి. లేకపోతే ఇంద్రుడి గర్వానికి హద్దు ఉండదు. తాను లోకపాలకుడననీ, తాను ఏమి చేసినా చెల్లుతుందనీ ఈ ఇంద్రుడికి గర్వం తలకెక్కింది. వీడి గర్వాన్ని అణచకపోతే వీడు ఇంకా రెచ్చిపోతాడు. దేవతలు సత్వగుణ సంపన్నులు. దేవతలకు అధిపతి ఇంద్రుడు. లోకపాలకులే ఇలా చేస్తే, ఇంక దేవతలు కూడా రెచ్చిపోతారు. లోకంలో శాంతి కలగాలంటే వెంటనే ఈ ఇంద్రుని గర్వం అణచాలి. వీడికి బుద్ధిచెప్పాలి. ఈ గ్రామము నాది. ఈ గ్రామములో ఉన్న ప్రజలు, ఆవులు, పశువులు నా వాళ్లు. వీళ్లను రక్షించవలసిన బాధ్యత నాది. వీళ్లను నేనురక్షిస్తాను." అని మనసులో అనుకున్నాడు కృష్ణుడు.

వెంటనే కృష్ణుడు గోవర్ధన పర్వతమును పెకలించాడు. పైకెత్తాడు. పూలగుత్తిని పట్టుకున్నట్టు గోవర్ధన పర్వతమును ఒక చేత్తో ఎత్తి పట్టుకున్నాడు. వెంటనే అందరినీ పిలిచాడు. "అమ్మా! నాన్నా! అందరూ రండి. ఈ గోవర్ధన పర్వతము కిందికిరండి. గోవులను, పశు వులను ఇక్కడకు తీసుకురండి. అమ్మా! నేను బాలుడిని ఈ పర్వతాన్ని మోయలేను. మీమీద పడేస్తాను అని మీరు భయపడకండి. మీకేమీ భయం లేదు. ఈ పర్వతములు, సముద్రములు, అడవులు, కొండలతో నిండిన ఈ భూమి అంతా మీదపడ్డా నా చెయ్యి వణకదు. ఈ పర్వతం కింద ఉంటే ఈ గాలి వాన ఉరుములు, మెరుపులు మిమ్ములను ఏమీచెయ్యవు. నా మాట నమ్మండి. మీ అందరినీ రక్షించడానికే ఈ ఏర్పాటుచేసాను.

కం॥రా తల్లి రమ్ము తండ్రీ వ్రేతలు గోపకులు రండు వినుడీగర్త
క్ష్మాతలమున నుండుడు గోవ్రాతముతో మీరు మీకు వలసిన యెడలన్॥

శా॥బాలుండీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండో యని దీని క్రింద నిలువన్ శంకింపగా బోల దీ
శైలాంభోనిధి జంతుసంయుతధరాచక్రంబు పైబడ్డ నా
కే లల్లాడదు బంధులారా నిలుడీక్రిందం బ్రమోదంబునన్॥

కృష్ణుని మాటలు విన్న నందుడు అతని పరివారము, బంధుజనము, వ్రజవాసులు బిల బిలలాడుతూ కొండకిందికి చేరారు. వారితో పాటు  ఆవులు, దూడలు, పశువులు చిన్ని చిన్ని జంతువులు అంబా అని అరుస్తూ కొండకిందికి చేరాయి.

ఇది చూచాడు ఇంద్రుడు. ఇలా ఎన్నాళ్లు కొండను పట్టుకొని నిలబడతాడు ఈ కృష్ణుడు అని అనుకున్నాడు. ఏడు దినముల పాటు ఏకధాటిగా గాలి, వాన కురిపించాడు. ఆకలి, దప్పిక అనేది ఎరగకుండా కృష్ణుడు తన చేతి మీద కొండను పట్టుకొని నిలబడ్డాడు. తాను నిలబడ్డ చోటునుండి ఒక అంగుళం కూడా కదలలేదు. చేతిని కదపలేదు. నందుడు, గోపకులు, వ్రజములో ఉన్న ప్రజలు ఆశ్చర్యంతో కృష్ణుని వంక చూస్తూ తమ ఆకలిదప్పులు మరిచిపోయారు.

వారంరోజులపాటు అలుపు అనేది ఎరగకుండా కొండను ఎత్తి పట్టుకొని నిలబడ్డ కృష్ణుని మహిమను తెలుసుకున్నాడు ఇంద్రుడు.

ఇంద్రుడి గర్వం, మదం అణిగిపోయింది. వెంటనే మేఘములను వెనక్కు రమ్మన్నాడు. గాలి వాన ఆగిపోయింది. ఆకాశం నిర్మలంగా ఉంది. సూర్యోదయం అయింది. కృష్ణుడు వ్రజవాసులను చూచి ఇలా అన్నాడు.

"గోపాలకులారా! ఇంక మనకు ఏమీ భయం లేదు. మీరందరూ, స్త్రీలు, పురుషులు, పిల్లలు, ఆవులు, పశువులు అందరూ మీమీ గృహములకు వెళ్లండి. ఈగాలి వాన వలన మనకు ఇంక ఎలాంటి భయం లేదు. వరదలు కూడా తగ్గుముఖం పట్టాయి.

కం॥ ఉడిగెను వానయు గాలియు వడిచెడి నదులెల్ల బొలిచె వఱద లిగిరె గొం
దడుగున నుండక వెడలుడు కొడుకులు గోడండ్రు సతులు గోవులు మీరున్.

కృష్ణుడి మాటలు విన్న గోపాలకులు తమ తమ భార్యలు, పిల్లలు, బంధువులతో గోవులను, పశువులను, బండ్లను తోలుకొని గ్రామంలోకి వెళ్లారు. ఎవరి ఇళ్లకు వారు వెళ్లిపోయారు. అందరూ పర్వతము కిందినుండి బయటకు వెళ్లారు అని నిర్ధారించుకున్న తరువాత కృష్ణుడు మెల్లి మెల్లిగా గోవర్ధన పర్వతమును తన చేతి మీది నుండి నేల మీదకు దించాడు. దానిని తన యధాస్థానములో పెట్టాడు.

నందుడు, యశోద, రోహిణి, బలరాముడు, గోపకాంతలు చిన్ని కృష్ణుని గట్టిగా కౌగలించుకొని ఆనంద భాష్పాలు రాల్చారు. అక్షితలు, లాజలు మొదలగు వాటితో అభిషేకించి కృష్ణుని ఆశీర్వదించారు. స్వర్గమునుండి దేవతలు, సిద్ధులు, సాధ్యులు,

గంధర్వులు చారణులు మొదలగు దేవతాగణములు కృష్ణుని మీద పూలవానకురిపించారు. నారదుడు, తుంబురు కృష్ణుని మహిమను గానం చేసారు. కృష్ణుడు వ్రజవాసుల మన్ననలు అందుకుంటూ అందరితో కలిసి వ్రజమునకు వెళ్లాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణుడు గోవర్ధన పర్వతము ఎత్తి వ్రజవాసులను రక్షించడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువది ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఇరువది ఆరవ అధ్యాయము.

"ఓపరీక్షిత్ మహారాజా! నందుడు, వ్రజవాసులు కృష్ణుని మహాత్మ్యము తెలియని వారు అవడం చేత, వారికి గోవర్ధన పర్వతమును కృష్ణుడు ఎత్తడం ఆశ్చర్యంగా కనిపించింది. వారందరూ నందుని వద్దకు పోయి ఇలా అన్నారు.

"నంద రాజా! నీ కుమారుడు కృష్ణుడు కేవలం ఏడేళ్ల పసిబాలుడు. కాని ఆ బాలుడు చేసే పనులు అద్భుతంగా ఉన్నాయి. అతడు ఎవరో మహాత్ముడు. మన పూర్వపుణ్యవశాత్తు, మన కులంలో పుట్టాడు. లేకపోతే  ఏడేళ్ల బాలుడు, పెద్ద ఏనుగు తామర పూవును తన

తొండముతో ఎత్తి పట్టుకున్నట్టు, గోవర్ధన పర్వతమును తన చేతితో ఎత్తిపట్టుకోవడం ఏమిటి? పొత్తిళ్లలో ఉన్న చిన్ని బాలుడు, పూతన స్తన్యము నుండి పాలతో సహా దాని ప్రాణములను హరించడం ఏమిటి? ఈ చిన్ని బాలుడు మూడు నెలల వయసులో తన చిట్టి పాదములతో బండిని తన్ని విరగ్గొట్టడం ఏమిటి? సంవత్సరం వయసులో తృణావర్తుడు అనే రాక్షసుని చంపడం ఏమిటి? వెన్న దొంగిలిస్తున్నాడని తల్లి యశోద రోటికి కట్టేస్తే, రెండు పెద్ద పెద్ద మద్దిచెట్లను కూకటి వేళ్లతో పెకలించడం ఏమిటి? బకాసురుని శరీరం రెండుగా చీల్చడం ఏమిటి? ఆవుదూడ రూపంలో వచ్చిన రాక్షసుని వధించడం ఏమిటి? గాడిద రూపంలో ఉన్న రాక్షసుని దాని బంధువులను చంపడం ఏమిటి? కృష్ణుని అన్నగారైన బలరాముడు ప్రలంబాసురుని చంపడం ఏమిటి? కృష్ణుడు విషం కక్కుతున్న కాళీయుని లొంగదీసుకొని, అతడిని యమున నుండి వెళ్లగొట్టడంఏమిటి? యమునా నదీ జలాలను కాలుష్యరహితంగా చేయడం ఏమిటి? గోవర్ధన పర్వతమును ఎత్తడం సరేసరి. మనం కళ్లారా చూచాము. దీనికి కారణం ఏమై ఉంటుంది.

మా అందరికీ ఈ బాలుని మీద ఎంతో అనురాగము కలిగాయి. మామీద కూడా కృష్ణునికి ఎంతో ప్రేమ అనురాగము ఉంది. అయినా ఈ బాలుడు సామాన్యుడు కాడు అని మాకు అనిపిస్తూ ఉంది. లేకపోతే, ఏడుసంవత్సరముల సాధారణ బాలుడెక్కడ? గోవర్ధన పర్వతమును ఎత్తడం ఏమిటి? అసలు ఈ బాలుడు నీ కుమారుడేనా అని మాకు కొంచెం సందేహంగా ఉంది." అని అన్నారు.

వారి మాటలు విన్న నందుడు వారితో ఇలా అన్నాడు.

"వ్రజవాసులారా! కృష్ణుడి గురించి నాకు ఎటువంటి సందేహములు కలగలేదు. నేను చెప్పేది వింటే మీ సందేహములు కూడా వెంటనే తొలగి పోతాయి. ఎందుచేతనంటే కృష్ణుడికి నామ కరణం చెయ్యడానికి వచ్చిన గర్గుడు అనే మహాత్ముడు నాకు కొన్ని విషయాలు చెప్పాడు. అప్పుడు కంసుని భయం చేత నేను కృష్ణుని నామకరణం అతి రహస్యంగా జరిపించాను. అందుకని మీకు ఈ విషయాలు ఏమీ తెలియవు.

మధుర నుండి గర్గుడు అనే బ్రాహ్మణుడు ఇక్కడకు వచ్చి, బలరామ కృష్ణులకు నామకరణం జరిపించాడు. గర్గుడు గొప్ప జ్యోతిష శాస్త్ర వేత్త. ఆయన కృష్ణుని జాతకం చూసి నాకు కొన్ని విషయాలు చెప్పాడు. ఆ విషయములు మీకు ఆయన మాటలలోనే చెబుతాను.

"కృష్ణుడు పరమాత్మ స్వరూపుడు. ప్రతి యుగంలోనూ వివిధ రూపములలో అవతరిస్తున్నాడు. ఈ ద్వాపర యుగంలో కృష్ణుడిగా నీ ఇంట్లో అవతరించాడు. నిజానికి కృష్ణుడు మీ ఇంట్లో పుట్టలేదు. మధురలో ఉన్న వసుదేవుడి ఇంట్లో పుట్టాడు. ఇతడు వసుదేవుని కుమారుడు. అందుకే వాసుదేవుడు అని కూడా పిలుస్తారు.

కృష్ణుడు చేసే పనులనుబట్టి, కృష్ణుని గుణములను బట్టి కృష్ణుడికి అనేక పేర్లు ఉన్నాయి. అవి నాకు మాత్రమే తెలుసు. కాబట్టి

కృష్ణుడు మనకు శుభములు చేకూర్చేవాడే కానీ, అశుభములు చేకూర్చడు. కృష్ణుని సాయంతో మీరందరూ అన్ని విఘ్నములను దాటి సుఖమైనజీవితాన్ని గడుపుతారు. కృష్ణుడు ఇంతకు ముందు అవతారములలో కూడా రాక్షసులను సంహరించి, మునులను, ఋషులను, సత్పురుషులను కాపాడాడు.

ఈ లోకములో ఉన్న మానవులందరూ కృష్ణుని మీద భక్తి కలిగిఉంటే, వారిని ఎటువంటి రాక్షస శక్తులు ఏమీ చేయలేవు. ఎందు కంటే కృష్ణుడు తన గుణములయందు, కర్మల యందు సాక్షాత్తు శ్రీమన్నారాయణునితో సమానుడు. కాబట్టి మీకు ఆశ్చర్యముగా కనిపించే కృష్ణలీలలు, కృష్ణునికి అతి సామాన్యమైనవి. వీటి గురించి మీరు సందేహించనవసరం లేదు." అని గర్గుడు నాతో చెప్పాడు. ఆ విషయములు అన్నీ మీకు చెప్పాను. కాబట్టి మనం అందరం కృష్ణుని శ్రీమన్నారాయణుని అవతారమనే భావించాలి కానీ సామాన్యబాలునిగా భావించరాదు." అని అన్నాడు.

నందుని మాటలు విన్న వ్రజవాసులు ఆశ్చర్యపోయారు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు తమ గ్రామములో అవతరించాడనీ, తమ మధ్య సామాన్యబాలకునిగా తిరుగుతున్నాడనీ తెలిసి పొంగిపోయారు. అప్పటి నుండి వ్రజవాసులు కృష్ణుని దైవాంశ సంభూతునిగా పూజించారు. వ్రజవాసులందరూ కృష్ణుని ఈ విధంగా ప్రార్థించారు.

" ఓ దేవా! ఇంద్రుడు గాలితోనూ, వడగండ్లతోనూ కూడిన వానను కురిపిస్తే, దానికి ప్రతిగా నీవు గోవర్ధనపర్వతమును ఎత్తి దాని కింద వ్రజవాసులను చేర్చి ఆ భయంకరమైన గాలి వాననుండి

రక్షించావు. ఇంద్రుని గర్వమును అణచి, వ్రజవాసులను, గోవులను రక్షించిన నీవు మా అందరినీ  ఎల్లప్పుడూ కాపాడుగాక!" అని ప్రార్థించారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణమహాత్మ్యమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువదిఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## దశమస్కంధము
## ఇరువదిఏడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుని చేతిలో భంగపడ్డ ఇంద్రుడు, కామధేనువును వెంటబెట్టుకొని స్వర్గలోకము నుండి కృష్ణుడు నివసించే నందవ్రజమునకు వచ్చాడు. ఇంద్రుడు అవమాన భారంతో తలవంచుకొని నిలబడ్డాడు. కృష్ణుని వద్దకు వచ్చి కృష్ణుని పాదములు పట్టుకొని క్షమించమని వేడుకున్నాడు.

"కృష్ణా! నీ మహిమ గురించి, ప్రభావము గురించి బ్రహ్మగారి నోటి వెంట ఇదివరకే విని ఉన్నాను. కాని అధికార మదంతో కన్నుమిన్ను గానక నిన్ను ధిక్కరించాను. ఫలితం అనుభవించాను. ఇప్పుడు నా గర్వం, మదము పూర్తిగా నశించిపోయింది.  నన్ను క్షమించు.

ఓ దేవా! నీవు సాక్షాత్తు విష్ణుస్వరూపుడవు. నీకు రూపం లేదు. మార్పులేదు. ఆది అంతము లేవు. నీవు అనంతమైన జ్ఞానమయుడవు. నిన్ను రజస్సు,తమోగుణములు అంటవు. నీవు శుద్ధసత్వగుణ స్వరూపుడవు. అజ్ఞానముతో, అవిద్యతో కూడిన ఈ సంసార బంధనములు నిన్ను అంటవు.

ఓ దేవా! నీకు అజ్ఞానము, దానికి సంబంధించిన దేహధారణ లేనపుడు, దేహమునకు సంబంధించిన మానవునిలోని అజ్ఞానము లోనుండి పుట్టిన లోభము, మోహము, మొదలగు దుర్గుణములు నీలో ఎలా ఉంటాయి? నీవు దుష్టులను శిక్షించడానికి మాత్రమే మానవుడిగా అవతరించావు.

ఓ దేవా! నీవు ఈ జగత్తుకు తండ్రి లాంటివాడివి. ఈ జగత్తును శాసించేవాడివి. నీవే కాలస్వరూపుడవు. తామే ఈ జగత్తుకు ఈశ్వరులమని భావించే గర్వాంధుల గర్వమును అణిచి, వారికి జ్ఞానోదయము కలిగించడానికే నీవు అంవతరించి నీ లీలలను ప్రకటిస్తున్నావు.

ఓ దేవా! నీ ఆజ్ఞానుసారము లోకమును పరిపాలించవలసిన వాళ్లము మేము. అటువంటి మేము గర్వించి నీకు ఎదురు తిరిగితే, మా గర్వమును పోగొట్టి మాకు జ్ఞానోదయము కలిగిస్తుంటావు. కేవలము మా వంటి అజ్ఞానులకు, అవివేకులకు జ్ఞానోదయము కలిగించుటకొరకే నీవు అవతారములను ఎత్తుతుంటావు. లేకపోతే నీకు

ఇన్ని అవతారములు ఎత్తవలసిన అవసరము లేదు కదా!

ఓ దేవా! నేనే కాదు. నా వంటి మూఢులు, మూర్ఖులు చాలా మంది ఉన్నాము. మేము అప్పుడప్పుడు రజస్తమోగుణములకు లోబడి, మా కంటే గొప్పవారు లేరని అహంకరిస్తుంటాము. నీకు మా వలన ఎటువంటి భయము లేదు. లీలామాత్రంగా మమ్ములనుఎదుర్కొంటావు. మాకు జ్ఞానోదయము కలిగిస్తుంటావు. మాకందరికీ నీ మీద భక్తి కలిగేటట్టు చేస్తుంటావు. ఈ గోవర్ధనపర్వతమును ఎత్తి గోపకులను రక్షించడము, నాకు గర్వభంగము కలిగించడం నీ లీలలో భాగమే.

ఓ దేవా! నేను దేవతలకు అధిపతిని, లోకపాలకుడను అయి ఉండి కూడా, గర్వము తలకెక్కడం వలన నీ గురించి, నీ మహిమా విశేషములను గురించి తెలుసుకోలేకపోయాను. నీ పట్ల, ఈ గోపకుల పట్ల తీరని అపరాధము చేసాను. నా అజ్ఞానమును క్షమించమని వేడుకుంటున్నాను. మరలా ఇటువంటి గర్వాంధకారము నా కన్నులను కప్పకుండా నన్ను ఆశీర్వదించు.

ఓ దేవదేవా! దైత్యుల, రాక్షసుల అంశలలో పుట్టిన క్షత్రియులు అధర్మాన్ని ఆచరిస్తూ భూమికి భారంగా పరిణమించారు. వారి వలన కలిగిన భూభారము తొలగించడానికి నీవు కృష్ణుడిగా ఈ గోకులంలో అవతరించావు. నేను కూడా నీ సేవకుడినే.

ఓ దేవా! నీవు సర్వాంతర్యామివి. ఈ జగత్తు అంతా వ్యాపించి ఉన్నవాడివి. శుద్ధ సత్వగుణసంపన్నుడవు. అట్టి నీకునమస్కరిస్తున్నాను. నన్ను క్షమించు. మేమందరము నిన్ను ప్రార్థిస్తేనే కదా నీవు

భూలోకములో కృష్ణుడిగా అవతరించావు. ఆ విషయము మరిచి పోయి బ్రహ్మగారు, నేను నీ మీద మా మహిమలు ప్రయోగించబోయి విఫలమయ్యాము.

ఓ దేవా! నీవు విశుద్ధమైన జ్ఞానము మూర్తీభవించిన వాడివి. ఈ జగత్తుకు నీవే కారణము. ఈ జగత్తు అంతా నీవేనిండి ఉన్నావు. నీవు సర్వవ్యాపకుడవు.  సకల చరాచర భూతములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. అట్టి నీకు నమస్కారము.

వ్రజవాసులు ఆనవాయితీగా ఆచరించే నా యజ్ఞమును ఆపు చేసావనే కారణంతో కోపంతెచ్చుకొని, తాత్కాలిక అహంకారమునకు లోనై, అధికార మదంతో కళ్లు మూసుకుపోయి, మేఘములను ప్రేరేపించి వ్రజమును వర్షధారలతో ముంచెత్తాను. తీవ్రమైన గాలివానతో ఈ నందవ్రజమును నామరూపాలు లేకుండా చేయాలని అనుకున్నాను. కానీ నీ అసాధారణమైన మహిమతో గోవర్ధన పర్వతమును ఎత్తి, ఈ వ్రజవాసులను, పశువులను రక్షించావు. నా గర్వము అణిచావు. నా మదమును దించావు. ఆ ప్రకారం చేయడం నన్ను అనుగ్రహించడమే అవుతుంది. ఇప్పుడు నేను నీకు శరణాగతుడను. నన్ను క్షమించు." అని వేయివిధముల ప్రార్థించాడు ఇంద్రుడు.

ఇంద్రుని మాటలను విన్న కృష్ణుడు నవ్వి ఇంద్రునితో ఇలా అన్నాడు. "నీకు స్వర్గాధిపత్యమును ఇచ్చాను. లోకపాలకుడిగా నియమించాను. లోకములను సక్రమంగా పాలించడంపోయి,

గర్వించావు. నీ కన్నా గొప్పవాడు లేడనుకున్నావు. ప్రజలు నీకు ఇలా యజ్ఞాలు యాగాలు చేస్తూ పోతే, నీ గర్వం ఇంకా పెరుగుతుంది. అందుకే నీకు యజ్ఞము చేయవద్దని వ్రజవాసులకు చెప్పాను. కేవలము నీకు యజ్ఞం చేయనందుకే ఈ వ్రజవాసులను నాశనం చేయాలని అనుకున్నావు. నీ ప్రతాపం అంతా అమాయకులైన ఈ పల్లె ప్రజల మీద చూపించావు. అది తప్పు. ఒక లోకపాలకుడు చేయతగ్గ పని కాదు. నీ గర్వమును పోగొట్టడానికి, నీ అజ్ఞానమును నశించజేయడానికి, నీవు కల్పించిన గాలివానకు ప్రతి క్రియ చేసాను కానీ, ప్రకృతి సిద్ధంగా కురిసే వానలను నేను ఎందుకు అడ్డుకుంటాను.

ఇంద్రా! నాకు ఎవరి మీద ఇష్టము అయిష్టము లేవు. నాకు అందరూ సమానులే. అధికార మదంతో గానీ, ఐశ్వర్య గర్వంతో గాని కళ్లుమూసుకు పోయిన వాడు, నా గురించి తెలుసుకోలేడు. వారి మీద నా అనుగ్రహమును చూపదలచి, వారి ఐశ్వర్యమును లాగేసుకుంటాను. నీకు కూడా అదే చేసాను. నీవు నీ స్వర్గపురికి వెళ్లు. నీకు శుభం కలుగుతుంది. మీరు లోకపాలకులు. మీకు గర్వం పనికిరాదు. ఎటువంటి గర్వమునకు లోనుకాకుండా లోకాలను పాలించండి." అని అన్నాడు కృష్ణుడు.

అప్పుడు కామధేనువు కృష్ణునికి నమస్కరించి ఇలా అంది. "హే కృష్ణా! విశ్వాత్మా! విశ్వసంభవా! లోకనాధా! నీవు మా వంశమువారైన గోవులను రక్షించావు. నీకు నా నమస్కారము. నీవు పరమ దైవము. నీవు జగత్పతివి. సాధుజనులకు, గోవులకు, బ్రాహ్మణులకు దేవతలకు నీవు అధిపతివి. మూడులోకములకు

అధిపతిగా నిన్ను అభిషేకించమని నన్ను బ్రహ్మదేవుడు ఆదేశించాడు. విశ్వాత్మకుడైన నిన్ను అభిషేకించడానికి మాకు అనుమతి ఇవ్వండి." అని ప్రార్థించింది కామధేనువు.

కృష్ణుడుదానికి అంగీకరించాడు. దేవేంద్రుడు కృష్ణుని అభిషేకమునకు ఏర్పాట్లు చేసాడు. ఐరావతము (తెల్ల ఏనుగు) మందాకినీ నదీ జలములను తీసుకొని వచ్చి కృష్ణుడికి అభిషేకము చేసింది. కృష్ణుని గోవిందుడు అనే నామముతో కీర్తించింది. తుంబురుడు, నారదుడు, గంధర్వులు, దేవ ఋషులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు అందరూ వచ్చి శ్రీహరి కీర్తిని గానం చేసారు. అప్సరసలు నాట్యం చేసారు. దేవతలు కృష్ణుని మీద పారిజాత పుష్పములను వర్షము మాదిరి కురిపించారు. మూడులోకములు ఆనందంతో పులకించి పోయాయి.

ఆవులు తమ పాలను సమృద్ధిగా వర్షించాయి. వృక్షములు తమ పూలను తేనెతో నింపాయి. భూమి ఆహార పదార్థములను పుష్కలంగాపండించింది. పర్వతములు తమలో ఉన్న ఖనిజములను వెలువరించాయి. లోకములో ఉన్న ప్రాణులు అన్నీ తమ సహజ శత్రుత్వమును మరిచి ఐకమత్యంతో విహరించాయి. ఈ ప్రకారంగా ఇంద్రుడు గోవులకు అధిపతి అయిన గోవిందునికి అభిషేక మహోత్సవమును నిర్వహించాడు. తరువాత అందరూ స్వర్గమునకు వెళ్లిపోయారు. కృష్ణుడు మరలా యశోదాకృష్ణుడు అయ్యాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ విధంగా ఇంద్రగర్వభంగము,

శ్రీకృష్ణునికి గోవిందుడు అనే నామము ప్రసిద్ధము అయ్యాయి”
అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఇంద్రుని పశ్చాత్తాపము, కామధేనువు కృష్ణుని అభిషేకించడం, గోవిందుడు అనే నామముతో కీర్తించడం మొదలగు విషయములను వినిపించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము ఇరువది ఏడవ భాగము సంపూర్ణము
ఓం తత్సత్ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
ఇరువది ఎనిమిదవ భాగము

“ ఓ పరీక్షిత్మహారాజా! ఆ ప్రకారంగా కాలం గడుస్తూ ఉంది. గోకులంలో కృష్ణుడు పెరుగుతున్నాడు. ఒక ఏకాదశి రోజున నందుడు ఉపవాసము చేసాడు. మరునాడు ద్వాదశి రోజున ఉదయమే స్నానం చేయడానికి యమునా నదికి వెళ్లాడు. అప్పటికి ఇంకాసూర్యోదయము కాలేదు. చీకటిగా ఉంది. వరుణుని సేవకుడు అయిన ఒక రాక్షసుడు అకాలంలో యమునలో స్నానానికి వచ్చిన నందుని పట్టుకున్నాడు. వరుణుని వద్దకు తీసుకొని పోయి నిలబెట్టాడు.

నందుని తో పాటు వచ్చి గోపకులు, హటాత్తుగా తమ రాజు నందుడు కనిపించక పోయేటప్పటికి కంగారుపడ్డారు. వెంటనే “రామా!కృష్ణా!” అంటూ గట్టిగా కేకలు వేసారు. కృష్ణునికి అసలు

విషయం అర్థం అయింది. తన తండ్రి నందుని వరుణుని సేవకులు తీసుకొని పోయారు అని గ్రహించాడు. వెంటనే వరుణుని వద్దకు వెళ్లాడు.

లోకపాలకుడైన వరుణుడు కృష్ణుని రాకను గమనించి, ఆయనకు ఎదురు వచ్చి, కృష్ణుని సాదరంగా తన లోకమునకు ఆహ్వానించాడు. ఆయనకు ఆసనము సమర్పించాడు. కృష్ణునితో వరుణుడు ఇలా అన్నాడు. "ఓ దేవా! తమరి రాకతో నేను, నా లోకము ధన్యులము అయ్యాము. నా ఐశ్వర్యములు అన్నీ ఒక ఎత్తు, తమరి దర్శన భాగ్యము ఒక ఎత్తు. ఎందరో మహా ఋషులు తమరి యొక్క పాదపద్మములను సేవించి మోక్షమును పొందారు. నాకు కూడా అట్టి భాగ్యమును అనుగ్రహించు.

ఓ దేవా! ఈ లోకములో ఉన్న సకల ఐశ్వర్యములు నీ అధీనములు. నీవు మూడులోకములను శాసిస్తుంటావు. మానవులను ఆవహించే మాయ నిన్ను తాకను కూడా తాకలేదు. మాయా రహితుడవైన నీకు నమస్కారము. నా సేవకులు తెలియక, అజ్ఞానంతో నీ తండ్రిని పట్టుకొని నా వద్దకు తీసుకొని వచ్చారు. నా సేవకులు చేసిన అపరాధమును నా అపరాధముగా భావించి క్షమించమని వేడుకుంటున్నాను. నా మీద దయ చూపించమని అర్థిస్తున్నాను. తమరి తండ్రి నందుడు క్షేమంగా ఉన్నాడు. మీ తండ్రిగారిని మీవెంట తీసుకొని వెళ్లవచ్చు." అని వినయంగా పలికాడు వరుణుడు.

కృష్ణుడు మారు మాటాడకుండా తన తండ్రి నందుని

తీసుకొని నందగోకులమునకు వచ్చాడు. నందునికి ఇదంతా ఆశ్చర్యంగా ఉంది. వరుణుని ఐశ్వర్యమును చూచి నందుడు ఆశ్చర్యపోయాడు. అంతటి ఐశ్వర్యవంతుడు, మహిమాన్వితుడు,లోకపాలకుడు అయిన వరుణుడు తన కుమారుడు కృష్ణుని చూచి భయపడటం, శరణు వేడటం, క్షమించమని కోరడం చూచి ఇంకా ఆశ్చర్యపోయాడు. తాను చూసిన విషయములను తోటి గోపకులకు కథలు కథలుగా వర్ణించి చెబుతున్నాడు.

నందుడు చెప్పిన వృత్తాంతములను విన్న గోపకులు తమలో తాము ఇలా అనుకున్నారు.

"సందేహము లేదు. నంద కుమారుడుసామాన్యుడు కాడు. సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడు. మన అదృష్టము కొద్దీ మన మధ్య తిరుగుతున్నాడు. ఈ కృష్ణుని సేవిస్తే మనకు కూడా ఊర్ధ్వలోక ప్రాప్తి కలుగుతుంది." అని అనుకున్నారు. గోపకుల మనోభావములను పసికట్టాడు కృష్ణుడు. "ఈ అమాయక గోపకులు నా వాళ్లు. నన్ను నమ్ముకున్న వాళ్లు. నాకోసరం అవతరించిన దేవగణములు, కానీ మానవులకు సహజమైన అజ్ఞానము వలన తాము ఎవరో తాము తెలుసుకోలేకపోతున్నారు. తాము కూడా సామాన్య మానవులము అని అనుకుంటున్నారు. అందుకని తాము ఊర్ధ్వలోకమునకు వెళ్లాలని అనుకుంటున్నారు. వీరికి ఒక సారి ఊర్ధ్వలోకములు చూపించాలి." అని అనుకున్నాడు.

అనుకున్నదే తడవుగా గోపకులకు ప్రకృతికి అతీతమైనది,

మహావిష్ణువుకు నిలయమైన వైకుంఠము గోచరమయింది. అదొక చిన్మయ స్వరూపము. దానికి ఆది, అంతము లేదు. సత్యమైనది. నాశము లేనిది. తనకు తానుగా ప్రకాశించేది. అదే బ్రహ్మస్వరూపము. మహా మునులు సత్వరజస్తమోగుణములను విడిచిపెట్టి సమాధిదశలో ఉండి ఆ లోకమును చూడగలరు. అటువంటి విష్ణుపదమును గోపకులు చూచారు.

తరువాత కృష్ణుడు వారిని మరలా మామూలు స్థితికి తీసుకొని వచ్చాడు. విష్ణులోక అనుభవమును పొందిన గోపకులు ఆశ్చర్యచకితులయ్యారు. ఒక్కసారిగా తమను తాము మరిచిపోయి అలౌకికానందమును పొందారు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు నందుడు వరుణలోకమును తీసుకొనిపోబడటం, నందగోకులము లోని గోపకులు విష్ణులోకమును దర్శించడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువది ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

దశమస్కంధము భాగవతపురాణములో నాలుగవ వంతు ఉంది. మొత్తము 90 అధ్యాయములు. సౌలభ్యం కోసరం దానిని మూడు భాగములుగా విభజించి తమకు అందజేస్తున్నాను. మొదటి 28 అధ్యాయములతో దశమస్కంధము మొదటి భాగము పూర్తి అయింది. శ్రీకృష్ణుని రాసలీలా వర్ణనతో దశమస్కంధము రెండవ భాగము మొదలవుతుంది. ఓంతత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్: 9866140619, 9391134792

ఫోన్:040-24048104

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

(ఈ అధ్యాయము నుండి 35వ అధ్యాయము వరకు శ్రీకృష్ణుడు గోపకాంతలతో సలిపిన రాసలీలల గురించి వివరించ బడింది. రాసలీలలు అంటే కృష్ణుడు గోపకాంతలతో సలిపిన శృంగార (రతి)క్రీడలు. అప్పటికి కృష్ణుని వయసు 7,8 సంవత్సరాలు. ఈ వయసులో రతిక్రీడల గురించి అసలు ఆలోచన వస్తుందా. అలా జరిగే అవకాశం ఉందా! అని కొంతమంది వాదన.

కొంత మంది ఈ వాదనను కొట్టి పారేస్తున్నారు. కృష్ణుడు పసి వయసులోనే పూతనను చంపాడు. తరువాత బండిని తలకిందులుగా తన్నాడు. ఎంతో మంది రాక్షసులను సునాయాసంగా చంపాడు. కాళీయుని మర్దించాడు. గోవర్ధన పర్వతమును ఎత్తాడు. ఇవన్నీ 7 ఏళ్ల వయసు లోపలే జరిగాయి. ఇన్నిపనులు చేసిన కృష్ణుడికి అసాధ్యం ఏముంటుంది అని వారి వాదన. రెండు వాదనలు బాగానే ఉన్నాయి.

ఈ రాసలీలలను ఆధారంగా చేసుకొని 12వ శతాబ్దానికి చెందిన జయదేవుడు అనే మహాకవి  గీతాగోవిందం అనే శృంగార కావ్యాన్నిరచించాడు. అది ఈనాటికీ ఆ కావ్యం అష్టపదుల రూపంలో బహుళ ప్రచారంలో ఉన్నాయి.

జయదేవుని అష్టపదులలో నాయకుడు శ్రీకృష్ణుడు. నాయిక రాధ. ఈ రాధ ఎవరు? వ్యాసుడు రాసిన భాగవత పురాణంలో రాధ

అనే మాట ఎక్కడా కనిపించదు. గోపికలలో ఒక గోపిక పేరు రాధ అని పెట్టి ఆమెతో శృంగారకావ్య రచన సాగించి ఉంటాడు జయదేవుడు.

ఈ సందర్భంలో మనకు ఒక సినీగీతం గుర్తుకొస్తుంది. "నారీ నారీ నడుమ మురారీ, హరికీ హరికీ నడుమ వయారీ, తానొకడైనా తలకొక రూపై, సాగెను రాధామాధవ కేళీ లీలా". కృష్ణుడు ఒకడే. కానీ అందరి ఎదుటా తానే ఉన్నట్టు భ్రమకల్పించాడు. అంటే ఈ రాసలీలల ఘట్టం అంతా గోపికల మానసిక భ్రమ అనుకోవచ్చా. శ్రీకృష్ణుని తమ ప్రియుడిగా ఊహించుకొని ఆయనతో రాసలీలలు జరిపారని అనుకోవచ్చా! తాము కృష్ణునితో రమించామని మానసికంగా అనుభూతి చెందారా! లేక ఇదంతా కృష్ణమాయ అనుకోవచ్చా! ఇవన్నీ రాసలీలల గురించి మనకు కలిగే భావనా వీచికలు.

వీటన్నిటికీ సమాధానం వ్యాసుడు ఈ అధ్యాయంలో మొదటి శ్లోకం. మీ సౌలభ్యం కోసరం ఆ శ్లోకాన్ని కింద ఇస్తున్నాను.

శ్లో॥భగవానపి తా రాత్రీ: శరదోత్ఫుల్ల మల్లికా:।
వీక్ష్య రన్తుమనశ్చక్రే యోగమాయాముపాశ్రిత:॥

ఈ శ్లోకంలో రెండు పదాలు మనకు కనిపిస్తాయి. మొదటి పదము "భగవానపి".రెండవ పదము "యోగమాయాముపాశ్రిత:" అంతే భగవంతుడు యోగమాయను ఆశ్రయించాడు. అని అర్థం. ఇక్కడ రాసలీలలు సాగించింది భగవంతుని అంశ అయిన కృష్ణుడు. ఆ కృష్ణుడు యోగేశ్వరేశ్వరుడు. యోగమాయ అంటే మనకు తెలుసు. కృష్ణుడితో పాటుపుట్టింది యోగమాయ. మధురా నగర వాసులను,

నందగోకులంలో ఉన్న వారిని తన మాయతో మోహితులను చేసింది. అదే యోగమాయను ఇక్కడ కూడా ఆశ్రయించాడు భగవానుడు అయిన కృష్ణుడు. యోగ మాయా ప్రభావం చేత గోపికలు అంతా కృష్ణుని మాయామోహంలో పడ్డారు. ఎవరికి వాళ్లు కృష్ణుడు తమ వాడే అని ఊహించుకున్నారు.

ఇదే కృష్ణమాయ మనకు 13,14 అధ్యాయాలలో కనిపించింది. బ్రహ్మదేవుడు గోపబాలురను, గోవత్సములను మాయ చేసి ఒక గుహలో బంధించినపుడు కృష్ణుడు యోగమాయను ఆశ్రయించాడు. తానే అందరు గోపకులుగానూ, గోవత్సములు గానూ మారి పోయాడు. ఆ ప్రకారంగా ఒక సంవత్సరం పాటు గడిపాడు. ఇదే యోగ మాయ రాబోవు అధ్యాయములలో కనపడుతుంది.

ఒక సారి నారదుడు కృష్ణుని సంసారములను చూడాలని కృష్ణుని భార్యల అందరి ఇళ్లకు వెళతాడు. ప్రతి ఇంట్లో కృష్ణుడు కనపడతాడు. నారదునికి మతి పోతుంది. అప్పుడు కృష్ణుడు నారదుని ముందు నిలబడి నేను అంతటా ఉన్నాను కానీ ఎక్కడా లేను అదే యోగ మాయ అని నారదునికి బోధ చేస్తాడు. ఇక్కడా అంతే జరిగింది. గోపికల అందరి ముందు కృష్ణుడు ఉన్నాడు. కాని ఎవరి దగ్గరా లేడు. అదే కృష్ణమాయ.

పరమాత్మ అందరిలోనూ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. దేహములు మాత్రము వేరుగా ఉన్నాయి. మానవ మాత్రులకు నీవు, నేను అనే భేదబుద్ధి ఉంటుంది కానీ, పరమాత్మ స్వరూపుడు అయిన

కృష్ణునికి అందరూ ఒకటే! అందరూ తానే అయినపుడు కృష్ణుడు గోపికలతో రమించడం ఏమిటి? రాసలీల ఏమిటి? అంతా మాయ కాకపోతే! ఇలా అనుకుంటే ఏ చిక్కూలేదు కదా!

ఈ భావనా వీచికల మధ్య విహరిస్తూ మనము వ్యాసుడు అందించిన రాసలీలలను ఆస్వాదిద్దాం.)

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుని రాసలీలల గురించి ఇలాచెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! భగవానుడు అయిన శ్రీకృష్ణుడు తన యోగ మాయను ఆశ్రయించాడు. శరత్కాల వెన్నెల రాత్రులలో వ్రజవాసులకు ఆనందాన్ని కలుగజేద్దామని మనసులో అనుకున్నాడు. ఆ సమయంలో చంద్రుడు నిండుగా ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు. చల్లని వెన్నెలలు కురిపిస్తున్నాడు. శరత్కాలములో పగలంతా సూర్యుని తీక్షణతకు గురి అయిన మానవుల తాపమును పోగొడుతున్నాడు.

మధురమైన ఆ శారదరాత్రులలో కృష్ణుడు బృందావనములో యమునా నదీతీరంలో, ఒక చెట్టు కింద కూర్చుని వేణువును ఊదుతున్నాడు. ఆవేణుగానానికి ప్రకృతి పరవశించిపోయింది. కృష్ణుని అధరముల నుండి వెలువడుతున్న వేణుగానము అలలు అలలుగా గాలిలో తేలుతూ నందవ్రజము నిండా వ్యాపించింది. ఆ వేణుగానమును విన్న గోప కాంతల మనస్సులు కృష్ణుని మీద మోహంతో పరవశించి పోయాయి. వారి మనస్సులు కృష్ణుని మీద పరిపూర్ణంగా లగ్నం అయి ఉన్నాయి.

ఆ చల్లని వెన్నెలలో కృష్ణుని వేణుగానమును విని వారిలో కామం ఉద్దీపనము అయింది. ఒకరికి తెలియకకుండా ఒకరు కృష్ణుడు ఉన్న చోటికి చేరుకుంటున్నారు. పాలు పితుకుతున్న గోపకాంతలు, కృష్ణుని వేణుగానమును విని, ఆ పాలగిన్నె అక్కడే వదిలి కృష్ణుడు ఉన్న చోటికి వెళ్లింది. మరొక కాంత పొయ్యి మీద అన్నం ఉడుకుటూ ఉంటే, దానిని అలాగే వదిలేసి పరుగు పరుగున కృష్ణుని చేరుకోడానికి వెళ్లింది. మరికొందరు భర్తలకు అన్నం వడ్డిస్తూ, వేణుగానము విని, చేతిలో ఉన్న గిన్నె గరిటతో సహా వేణుగానము వినవచ్చిన వంకకు పరుగెత్తారు. అలాగే అలంకారము చేసుకుంటున్న వారు, స్నానం చేసి ఒళ్లు తుడుచుకుంటున్నవారు, కళ్లకు కాటుకపెట్టుకుంటున్న వారు, ఆయాపనులను విడిచిపెట్టి, కృష్ణుని వద్దకు చేరుకుంటున్నారు. వారి వారి తల్లి తండ్రులు, భర్తలు, సోదరులు, బంధువులు వద్దంటున్నా వినకుండా కృష్ణుని వద్దకు పరుగెత్తారు. వారందరి మనసులు కృష్ణుని చేత ఆకర్షింపబడ్డాయి. వేణుగానమును విన్న గోపికలు కృష్ణుని మాయలో పడిపోయారు.

మరి కొందరు గోపకాంతల మనసులు కృష్ణుని మీద లగ్నం అయి ఉన్నప్పటికీ, ఇంటి నుండి బయటకు వెళ్లలేకపోయారు. వారి భర్తలు, తల్లి తండ్రులు వారిని ఇంట్లో పెట్టి బంధించారు. అటువంటి వారు  ఇంటిలోనే ఉండి,  కళ్లుమూసుకొని మనసులోనే కృష్ణుని ధ్యానిస్తున్నారు. వారి శరీరములు ఇంట్లో ఉన్నాయి కానీ వారి మనసులు కృష్ణుని వద్దకు పరుగెత్తాయి.  శ్రీకృష్ణుని మీద ఉన్న విరహతాపాన్ని భరించలేక, వారు  మనసులోనే కృష్ణుని

కౌగలించుకున్న సుఖాన్ని అనుభవిస్తున్నారు. ఆ అనుభవంతో వారి కర్మబంధనములు తొలగిపోయాయి. వారికి ప్రాపంచిక బంధనములు నశించాయి. ఎల్లప్పుడూ శ్రీకృష్ణుని ఆలోచించడం చేత, కృష్ణుని ధ్యానించడం చేత, వారి పుణ్యఫలములు కూడా నశించిపోయాయి. ప్రాపంచిక బంధనములు, పుణ్యఫలములు నశించి పోవడం చేత, వారు నిర్మల మనస్కులైనారు. వారు సత్వ,రజస్తమో గుణములతో కూడిన ఈ దేహమును వదిలి, సూక్ష్మశరీరంతో పరమాత్మను చేరుకున్నారు." అని శుక మహర్షి చెప్పగా పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహం కలిగింది.

"ఓ శుకయోగీంద్రా! నందవ్రజములో ఉన్న గోపికలు, గోపకాంతలు కృష్ణుని తమ ప్రియుడిగా భావించారు అని చెప్పారు. అంటే గోపకాంతలు కృష్ణుని మానవ మాత్రునిగా చూచారే గానీ పరమాత్ముడిగా భావించలేదు. వారి మనసులు రజోగుణము, తమోగుణములతో నిండి ఉన్నాయి. గోపికలకు కృష్ణుని మీద కామవాంఛలు తప్ప మరొకటి లేవు. అటువంటప్పుడు వారు ఎలా ముక్తిని పొందగలిగారు. తెలియజేయండి." అని అడిగాడు.

అప్పుడు శుక మహర్షి ఈ విధంగాసమాధానం చెప్పాడు. "పరీక్షిత్ మహారాజా! శిశుపాలుడు తన జీవితం అంతా కృష్ణుని ద్వేషించాడు. కృష్ణుని నిందించాడు. అంటే కృష్ణుని తన పరమ శత్రువుగా భావిస్తూ కూడా, కృష్ణనామం జపిస్తూనేఉన్నాడు. కృష్ణుని ద్వేషభావంతో తన మనసులో నిలుపుకున్నాడు. అలాగే ఈ గోపికలు కూడా కృష్ణుని యందు కామంతో కూడి కోరికలతో నిరతంరము

కృష్ణుని తమ మనసులలో నిలుపుకొని ధ్యానించారు. ఆ కారణం చేత గోపికలకు ముక్తిలభించింది. ఇందులో ఆశ్చర్యంఏముంది.

ఓ పరీక్షిత్ మహారాజా! పరమాత్మ స్వరూపమైన కృష్ణుడికి ప్రాపంచిక గుణములైన సత్వ గుణము, రజోగుణము, తమోగుణము లేవు. ఈ ప్రపంచంలో ఉన్న ఐశ్వర్యగుణములు అన్నీ ఆయన స్వరూపాలే. ఆయనకు నాశనము లేదు. ఆయన ఎందులోనూ లీనం కాడు. శిష్టరక్షణ, దుష్ట శిక్షణ ఆయన కర్తవ్యము. కాబట్టి మానవులు కామముతో కానీ, క్రోధముతో గానీ, భయముతోగానీ, స్నేహముతోగానీ, బంధుత్వముతోగానీ, భక్తితోగానీ, ఆయనను సేవిస్తే, స్మరిస్తే, ఆయన వారికి ముక్తిని ప్రసాదిస్తాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుడు యోగులకు యోగి. అన్ని ఐశ్వర్యములు ఆయనయందే ఉన్నాయి. ఆయనకు పుట్టుకలేదు. దేవకీదేవి గర్భవాసాన జన్మించడం ఆయన లీల. అటువంటి కృష్ణునికి గోపికలు కామంతో కృష్ణునికి దగ్గర కావడంలోనూ, ముక్తిని పొందడంలోనూ  ఆశ్చర్యం ఏమీ లేదు. కేవలము మానవులే కాదు, పశువులు, పక్షులు, వృక్షములు కూడా ఆయన యందు తమ ప్రేమను ప్రకటించి ముక్తిని పొందాయి.

పరీక్షిత్ మహారాజా! నీసందేహము తీరిందనుకుంటాను. ఆ ప్రకారంగా తమ వారిని విడిచి వచ్చిన గోపికలను, గోప కాంతలను చూచి కృష్ణుడు ఇలా అన్నాడు.

"మహాభాగులారా! నా వద్దకు వచ్చిన మీ అందరకూ స్వాగతం. మీకు నేను ఏమి చేయగలను. వ్రజములో అందరూక్షేమంగా ఉన్నారు కదా! ఇంతకూ ఇంత రాత్రిపూట మీరు ఇక్కడకు రావడానికి కారణం ఏమి? చూడండి. ఇప్పుడు బాగా చీకటి పడింది. రాత్రి భయంకరంగా ఉంది. ఈ అడవిలో క్రూరమృగములు రాత్రిపూట విహరిస్తుంటాయి. మీరు స్త్రీలు. ఇంటి పట్టున ఉండవలసిన వారు. ఈ రాత్రిపూట మీరు ఒంటరిగా ఈ అడవిలో తిరగడం మంచిది కాదు. వెంటనే మీ మీ గృహములకు వెళ్లండి. మీ కోసరం మీ తల్లితండ్రులు, మీ భర్తలు, మీ సంతానము వెదుక్కుంటూ ఉంటారు. మీ బంధువులు మీకు ఏమయిందో అని భయపడుతుంటారు. మీరు ఇక్కడే ఉంటే అక్కడ మీ బంధువులకు, ఇక్కడ నాకూ, మీకూ భయంగా ఉంటుంది. కాబట్టి మీరు తొందరగా ఇళ్లకు వెళ్లండి.

మీరందరూ, శరత్కాలములో ప్రకాశించే చంద్రుని వెన్నెలను, యమునానదీ తరంగముల మీది నుండి వచ్చే చల్లని గాలులను అనుభవించడానికి వచ్చారు కదా! వచ్చారు, అనుభవించారు. ఇంక మీ మీ ఇళ్లకు వెళ్లండి. మీ భర్తలకు సేవచేయండి. మీకోసరము మీ పిల్లలు, గోమాతలు, ఆవు దూడలు ఎదురుచూస్తుంటాయి. మీ పిల్లలకు ఆకలి వేస్తూ ఉంటుంది. వారికిపాలు తాగించండి. దూడలను ఆవుల వద్దకు వదిలి, తరువాత పాలు పితకండి.

మీరు నా మీద అనురాగంతో వచ్చాను అంటున్నారు. మీరే కాదు ఈ జగత్తులో ఉన్న సకల ప్రాణులు నా మీద ప్రేమకలిగి ఉన్నాయి. మీకు నా మీద ప్రేమ ఉండటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఓ

గోపకాంతలారా! నిష్కపట భావంతో భర్తలను, బంధువులను సేవించడం, సంతానమును పొందడం సాధ్వీమణుల పరమ ధర్మము. ఓ గోపకాంతలారా! భర్త దుష్టుడు, దుర్మార్గుడు, ముసలివాడు, ఏ పనీ చేయలేని వాడు, రోగగ్రస్థుడు, పేదవాడు అయి నప్పటికినీ, భర్త పతితుడు కాకపోతే, ప్రతి భార్య తన భర్తను సేవించవలసిందే! అదేలోకధర్మము.

ఓ గోపకాంతలారా! మీరు నన్ను కామించి వచ్చారు. మీ భర్తలు ఉండగా నన్ను కామించడం తగదు. భర్త ఉండగా పరపురుషునితో సుఖించడం లోక విరుద్ధము. దీని వలన మీకు అపకీర్తి వస్తుంది. ఇటువంటి కోరిక తుచ్ఛమైనది, దు:ఖదాయకము. ఇంకా భయాన్ని కలిగిస్తుంది. మీరు పరపురుషుని పొందుకోరితే మీకు ఈ లోకములోనే కాదు పరలోకములో కూడా సుఖము లభించదు. మీకు నా మీద నిజంగా ప్రేమ ఉంటే, నా పేరు స్మరించండి. నా కథలను వినండి. నన్ను మనసులో నిలుపుకోండి. అంతేగానీ నా వద్దకు రావడానికి ప్రయత్నించకండి. నన్ను మానసికంగా స్మరించడం వలన కలిగే ఎటువంటి ఆనందం కలుగుతుందో, నన్ను ప్రత్యక్షంగా చూడటంవలన, నాసమీపములో ఉన్నందువలన, అటువంటి ఆనందం కలుగదు. కాబట్టి నా మాట విని మీరందరూ మీ మీ గృహములకు వెళ్లిపోండి." అని కృష్ణుడు గోపకాంతలకు మంచి మాటలు చెప్పాడు.

కృష్ణుని మీద వల్లమాలిన ప్రేమ, కామము పెంచుకున్న గోపికలకు కృష్ణుని మాటలు రుచించలేదు. పైగా దు:ఖమును కలిగించాయి. వారందరూ కళ్లనీళ్లు కుక్కుకుంటూ, నేల

చూపులుచూస్తూ, కాలి బొటనవేలితో నేల మీద రాస్తూ, కదలకుండా మౌనంగానిలబడ్డారు. కృష్ణునియందు తమ మనసు నిలిపిన వారు, కృష్ణుని కోసం తమ సమస్త కోరికలను వదిలినవారు, అయిన ఆ గోపకాంతలు ఏడుస్తూ, కళ్లుతుడుచుకుంటూ, బొంగురుపోయిన గొంతుకలతో, కృష్ణుడితో ఇలా అన్నారు.

"భగవాన్! నీవు ఇలా మాట్లాడటం బాగా లేదు. మేము మా వారినందరినీ విడిచిపెట్టి నీ పాదములను సేవించడానికి వచ్చాము. కాబట్టి మమ్ము "వెళ్లి పో!" అని మాత్రం చెప్ప వద్దు. మమ్ములను స్వీకరించు. పరమాత్మ ఋషుల మీద తన అనుగ్రహాన్ని చూపినట్టు నీవు కూడా మా మీద నీ కరుణ చూపించు.

ఓ దేవా! నీకు అన్నీ ధర్మాలు తెలుసు. భర్తను సేవించడం, సంతానమును కని పెంచడం, బంధువులను ఆదరించడం, స్త్రీలయొక్క ధర్మము అని చెప్పావు. నీవు సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడవు. నీవు అందరిలోనూ ఆత్మస్వరూపుడుగా ఉన్నావు. మాభర్తలలోనూ, బంధువులలోనూ, సంతానములోనూ నీవే ఉన్నావు కదా! నిన్ను సేవిస్తే వారందరినీ సేవించినట్టే కదా! ఎందుకంటే నీవు సకల ప్రాణులలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు.

ఓ దేవా! ఆత్మతత్వమును తెలిసిన వారు, ఆత్మ స్వరూపుడవు, సచ్చిదానందమయుడవు అయిన నీ మీద అనన్యమైన భక్తి కలిగి ఉంటారు. అటువంటి వారే నీ మీద తమ అనన్య భక్తిని చూపినపుడు, మాబోటి వారము కేవలము భర్త, సంతానము అంటూ వారి మీద మాత్రమే ప్రేమ చూపడం వలన ఏమిఫలము! నిన్ను సేవిస్తే ఫలితం

కలుగుతుంది కానీ, భర్తను సేవిస్తే, పిల్లలను పెంచితే ఏం ఫలితం దక్కుతుంది. ఈ సంసారము, భర్త, సంతానము నిరంతరము దు:ఖములను కలుగజేస్తారు కానీ, వారి వలన ఎటువంటిసుఖము కలుగదు. కాబట్టి నీ మీద మాకు చాలా కాలమునుండి ఉన్న ఆశను పాడుచేయడవద్దు.

కృష్ణా! ఇంత కాలము మేమందరము ఇల్లు, వాకిలి, మొగుడు, పిల్లలు అంటూ వారి తోడిదే లోకంగా గడిపాము. ఈనాటికి నీ సాంగత్యముతో మాకు ఈ సంసార బంధనములు తెగిపోయాయి. మా మనస్సులు నీ యందే లగ్నం అయ్యాయి. మాకు భర్త, పిల్లలు, బంధువుల అక్కరలేదు. మాకు నీవే కావాలి. మా పాదములు ఇక్కడ అతుక్కుపోయాయి. మేము వెళదామన్నా మా పాదాలు కదలడం లేదు. ఇంక మేము వ్రజమునకు ఎలా వెళ్లగలము. మా మనసులను ఇక్కడి విడిచిపెట్టి, కేవలము దేహములు మాత్రము అక్కడకు వెళ్లినందు వలన ఏమి ప్రయోజనము.

కృష్ణా! నీ చిరునవ్వు, నీ వేణుగానము, నీ మీద మాకు ఉన్న ఆసక్తిని, కామాగ్నిని మరింతగా పెంచాయి. మాలో రేగిన కామాగ్నిని నీ అధరామృతముతో చల్లార్చు. లేకపోతే నీ విరహాగ్నిలో పడి మా శరీరాలు కాలిపోతాయి. మా ఆత్మలు మాత్రము సర్వసంగపరిత్యాగులైన యోగుల వలె నీ పాదముల చెంతనే ఉండి పోతాయి.

దేవా! నీ పాదములను లక్ష్మీదేవి క్షణం కూడా విడువదు అని అంటారు. అటువంటి నీ పాదములను క్షణకాలము మేము తాకినా

చాలు మా జన్మలు ధన్యమవుతాయి. మా మనసులు అలౌకికానందాన్ని పొందుతాయి. బ్రహ్మ మొదలగు దేవతాగణములు లక్ష్మీదేవి అనుగ్రహం కోసరం నిరంతరం తాపత్రయపడుతుంటారు. ఆ లక్ష్మీదేవి నిన్ను క్షణకాలం కూడా విడువలేక, నీ వక్షస్థలములో తన నివాసము ఏర్పరచుకొంది. నీవు మాకు లక్ష్మీదేవి వలె నీ వక్షస్థలములో చోటు ఇవ్వనక్కరలేదు. నీ పాదముల చెంత కాస్త చోటు ఇస్తే చాలు. మా జన్మలు ధన్యమవుతాయి.

కృష్ణా! మేమందరము మా ఇళ్లను వదిలిపెట్టి నీ పాదముల వద్ద పడి ఉండటానికి వచ్చాము. నీ సేవను కోరుకుంటున్నాము. మా మీద నీ దయచూపించు. నీ మధురమోహనమైన మందహాసమును మా మీద ప్రసరింపజేయి. నీ మీద కామంతో వేగిపోతున్న మాకు నీకు దాస్యాన్ని చేసే భాగ్యాన్ని ప్రసాదించు.

కృష్ణా! నీ సుందరవదనార విందము ఎంత చూసినా తనివితీరడం లేదు. నీవు ధరించిన కుండలముల కాంతి నీ చెక్కిళ్లమీద పడి మెరిసిపోతుంటే, అధరామృతముతో కూడిన నీ మందహాసము ఈ లోకాన్నే సమ్మోహితము చేస్తుంటే, చెదిరిన నీ ముంగురులు పద్మము వంటి నీ ముఖము మీదపడి అల్లల్లాడుతుంటే, సాధుజనులకు అభయమిచ్చే నీ చేతిని చూస్తుంటే, లక్ష్మీదేవికి మాత్రమే ఆవాసమైన నీ వక్షస్థలమును దర్శిస్తుంటే, మమ్ము మేము మరిచిపోయి, నీకు దాసీలుగా మారిపోయాము.

కృష్ణా! నీ వేణుగానము అమృతతుల్యము. నీ వేణుగానముతో మూడులోకములలో ఉన్న స్త్రీలు మోహపరవశులౌతున్నారు. తమ తమ

పనులను వదిలిపెట్టి నీ యందు తమ మనసులను లగ్నం చేస్తున్నారు. తున్నాయి. నీవేణుగానమును ఆస్వాదించి నీమోహములో పడని ఆడవారు మూడులోకములలో ఎవరుంటారు. నీ వేణుగానమునకు మానవులే కాదు, గోవులు, పశువులు, పక్షులు, వృక్షములు కూడా పులకించి ఎలా తలలు ఊపుతూ నీ వేణుగానమును ఆస్వాదిస్తున్నాయో చూడు.

ఓ భగవాన్! విష్ణువు దేవతలను రక్షించినట్టు, నువ్వు ఈ వ్రజములో అవతరించి, వ్రజవాసులను రక్షిస్తున్నావు. మేము కూడా వ్రజవాసులమే కాబట్టి, మా తల మీద నీ అభయహస్తమును ఉంచి మమ్ములను కరుణించు" అని కృష్ణుని గోపికలు వేడుకున్నారు.

(ఈ ఆఖరి శ్లోకంలో వ్యాసుడు కృష్ణుని "భగవాన్" అని సంబోధించాడు. తరువాతి శ్లోకంలో కృష్ణుని "యోగేశ్వరేశ్వరుడు" అని స్తుతించాడు. ఈ మాటలతో గోపికలు కృష్ణుని మధ్య ఉన్నది కేవలం కామ వాంఛ కాదనీ, అలౌకికమైన ప్రేమ, భక్తి అని అర్థం చేసుకోవాలి.)

వారి మాటలను విన్న యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుడు గోపకాంతల ఆత్మలతో ఆత్మారాముడై రమించాడు. గోపికల మధ్య కూర్చుని వేణువును ఊదుతున్న కృష్ణుడు నక్షత్రముల మధ్య ప్రకాశిస్తున్న చంద్రుని మాదిరి శోభిల్లాడు. మధ్యలో కృష్ణుడు మురళి ఊదుతుంటే, చుట్టు చేరిన గోపికలు కృష్ణుని వంక తదేకంగా చూస్తూ కృష్ణుని మహిమలను గానం చేస్తున్నారు.

యమునా నదీ జలముల మీది నుండి చల్లని గాలులు వీస్తూ వారి శరీరములకు ఆహ్లాదాన్ని కలుగజేస్తున్నాయి. ఆ గాలితో కూడా వారి ముక్కుపుటములు చేరిన సుగంధపుష్పముల పరిమళము గోపకాంతల కామమును మరింతగా పెంచుతున్నాయి. అటువంటి యమునా నదీ తీరంలో గోపికల భుజములను తాకుతూ, ఆలింగనము చేసుకుంటూ, గోపికల ముంగురులు సవరిస్తూ, గోపికల అంగాంగములు తాకుతూ, తనమధురమైన చూపులను వారి మీద ప్రసరిస్తూ, గోపికలలోని కామభావనలను ప్రకోపింపజేస్తూ, కృష్ణుడు గోపకాంతలతో విహరిస్తున్నాడు..

భగవానుడైన కృష్ణుడు తమతో విహరిస్తుంటే, తమ మనోరథములు పూర్తిగా తీరిన గోపికలు, గోపకాంతలు, మూడులోకములలో తమను మించిన భాగ్యశాలురు లేరని గర్వంతో పొంగిపోతున్నారు.  ఇది గమనించాడు కృష్ణుడు. వారిలోని గర్వమును పోగొట్టి వారిని అనుగ్రహించాలని అనుకున్నాడు. అప్పటి దాకా వారి మధ్య ఆడి పాడిన కృష్ణుడు అదృశ్యమయ్యాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుని రాసలీలా విశేషములను వివరిస్తున్నాడు.

(ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. మనలో చాలా మంది బాగా చదువుకున్న వాళ్లు, గొప్పకులములో పుట్టిన వాళ్లు, పండితులు, యోగులు, నేడు మన మధ్య ఉన్న స్వామీజీలు,  వారు తమ ప్రతిభతో సంపాదించిన  విద్యల వలన కలిగిన గర్వంతో అంధులవుతుంటారు. తమకు అంతా తెలుసనీ, తమకంటే గొప్పవారు

లేరనీ విర్రవీగుతుంటారు. అప్పటి దాకా వారికి దగ్గరవుతున్న పరమాత్మ ఎప్పుడైతే వారికి గర్వం కలిగిందో, వారి వద్దనుండి అదృశ్యం అవుతాడు. వారికి దూరం అవుతాడు. గోపికల విషయంలో కూడా అదే జరిగింది. అప్పటి దాకా తమ నిర్మలమైన మనస్సులను కృష్ణుని పరం చేసి "నీవే తప్ప నితఃపరంబెరుగ" అన్న భావనతో ఉన్న గోపికలలో, ఎప్పుడైతే కృష్ణుడు తమ వాడు, కృష్ణుడు తమ చెంతనే ఉన్నాడు, తాము కృష్ణుని అనుగ్రహం పొందామని, తమకంటే గొప్పవారు లేరనే గర్వం కలిగిందో, వెంటనే కృష్ణుడు వారికి కనపడకుండా పోయాడు. ఎంత చదువు చదివినా, ఎంత జ్ఞానం సంపాదించినా, భగవంతుని చేరుకోవాలంటే, వినయం, విధేయత, భగవంతుని మీద అచంచలమైన మనస్సు, ఏకాగ్రత ముఖ్యం అని ఈ శ్లోకం మనకు తెలియజేస్తుంది.)

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఇరువది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ముప్పదియవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! అప్పటిదాకా తమతో ఆడి, పాడి, తమతో రమించి, తమను ఆనందడోలికలలో ఊయలలూగించిన కృష్ణుడు హటాత్తుగా అంతర్ధానం కావడం చూచి గోపికలు హతాశు లయ్యారు. కృష్ణుడు తమతో చేసిన చిలిపి చేష్టలను, శృంగార

భంగిమలను తలచుకుంటూ వారిలో వారు తమ ఎదురుగా కృష్ణుడు ఉన్నాడనుకొని ఆయనతో ఆడటం పాడటం సాగిస్తున్నారు. కొంత మందిగోపికలు తామే కృష్ణుడు అనే భ్రమలో ఉండి, కృష్ణుని హావ,భావములను, కృష్ణుని చేతలను అనుకరిస్తున్నారు. మరి కొందరు గుంపుగా చేరి "కృష్ణా! కృష్ణా! ఎక్కడున్నావయ్యా! రావయ్యా!" అంటూ బిగ్గరగా, పిచ్చిగా అరుస్తూ అటు ఇటు పరుగెడుతున్నారు. కనిపించిన ప్రతివృక్షమును, లతలను కృష్ణుని మీరు చూచారా అని అడుగుతున్నారు.

(ఈ సందర్భంలో పోతన గారు తన ఘంటాన్ని తేనెలోనో, అమృతంలోనూ ముంచి రాసాడా అన్నట్టు ఉన్న ఈ మధురమైన పద్యములను ఆస్వాదించండి.)

సీ॥ పున్నాగ! కానవే పున్నాగవందితు, దిలకంబ! కానవే తిలకనిటలు,
ఘనసార! కానవే ఘనసారశోభితు, బంధూక! కానవే బంధుమిత్రు,
మన్మథ! కానవే మన్మథాకారుని, వంశంబ! కానవే వంశధరుని,
జందన! కానవే చందన శీతలు, గుందంబ! కానవే కుందరదను,
తే॥ నింద్రభూజమ! కానవే యింద్రవిభవు, గువలవృక్షమ! కానవే కువలయేశు,
బ్రియకపాదప కానవే ప్రియవిహారు, ననుచు గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు

ఉ॥ నల్లని వాడు పద్మనయనంబుల వాడు కృపారసంబు పై
జల్లెడివాడు మౌళిపరిసర్పిత పింఛము వాడు నవ్వు రా
జిల్లెడి మోమువా డొకడు చెల్వల మానధనంబు దెచ్చె నో
మల్లియలారా! మీ పొదలమాటున లేడు గదమ్మ చెప్పరే?

(ఇంక వ్యాసభాగవతంలోకి వెళదాము)

ఓ అశ్వత్థ వృక్షమా! ఓ జువ్విచెట్టా! ఓ మర్రిచెట్టా! ఇక్కడ కృష్ణుడు అనే దొంగ మా మనసులను దొంగిలించి

ఎటోపారిపోయాడు. మీరేమన్నా కృష్ణుని చూచారా! ఓ గోరింట చెట్టా! ఓ అశోక వృక్షమా! ఓ గన్నేరు చెట్టా! ఓ పున్నాగా! చంపకమా! మా వంటి స్త్రీల కామముతో కూడిన గర్వాన్ని అణచేవాడు, ఎల్లప్పుడూ నవ్వుతూ హాస్యభరితపలుకులు పలికేవాడు.. అదేనమ్మా..మా చిలిపి కృష్ణుడు... ఈ పక్కకు ఏమన్నా వచ్చాడా!

ఓ తులసీ మాతా! కృష్ణుడు నీ మాలను ఎల్లప్పుడూ ధరిస్తూ ఉంటాడు కదా! కృష్ణుడి జాడ నీకేమైనాతెలుసా! ఓ మాలతీ! మల్లికా! యూథికా! తన చేయిపడితేనే ఒళ్లంతా పులకరించి పోతుందే! ఆ కృష్ణుడిని మీరు చూచారా! ఓ గున్న మామిడి వృక్షమా! పనస చెట్టా! కోవిదారమా! జంబూవృక్షమా! అర్కవృక్షమా, బిల్వవృక్షమా, వకుళవృక్షమా! మామిడి చెట్టా! కదంబ వృక్షమా! ఈ యమునా నదీతీరంలో ఉండే వృక్షములారా! అబ్బా! చెప్పండే! కృష్ణుడు ఎటు వెళ్లాడు. కృష్ణుడు లేకపోతే మేము బతకలేము. కృష్ణుని మీది విరహవేదనతో మేము రగిలిపోతున్నాము. మామనసంతా కృష్ణునితో నిండి పోయింది. ఆ కృష్ణుడు లేకపోతే మా మనసులన్నీ శూన్యంగా ఉన్నట్టు ఉంది.

ఓ భూమాతా! నీవు ఎంతపుణ్యం చేసుకున్నావోకదా! ఎల్లప్పడూ కృష్ణుని పాద స్పర్శను నిరంతరమూ అనుభవిస్తున్నావు. శ్రీకృష్ణుని పాద స్పర్శతో నీకు కలిగే ఆనందము నీకు ఇప్పుడే  కలిగిందా లేక వామనావతారములో విష్ణువు త్రివిక్రముడై తన పాదముతో నిన్ను పూర్తిగా ఆక్రమించినపుడు కలిగిందా! లేక వరహావతారములో స్వామి నిన్ను నీటిలోనుండి బయటకు తీసుకొని వచ్చేటప్పుడు నిన్ను గట్టిగా

కౌగలించుకున్నాడు కదా! అప్పుడు కలిగిందా! ఎప్పుడో ఒకప్పుడు నువ్వు ఎల్లప్పుడూ ఆయన పాదములను తాకుతూనే ఉంటావు కదా! నువ్వు ఎంతటి ధన్యురాలవు. ఇప్పుడు కూడా కృష్ణుని పాదములనునువ్వు తాకుతున్నావు కదా! కృష్ణుడు ఎక్కడ దాక్కున్నాడో కాస్త చెప్పవా!"అని గోపికలు చెట్లను,పుట్టలను,భూమిని అడుగుతూ, అక్కడే బిత్తర చూపులు చూస్తున్న లేళ్లను చూచారు.

"ఏమే! అటు చూడు. ఆ లేళ్లు కృష్ణుని చూచినట్టున్నాయి. అందుకే దొంగచూపులు చూస్తున్నాయి. అవేమన్నా కృష్ణుని జాడ చెబుతాయేమో అడుగుదాము పదండి" అని గోపికలు ఆ లేళ్ల దగ్గర చేరి "ఓ లేడి కూనలారా! నల్లని వాడు, అందమైన వాడు. పొడుగాటి చేతులు కలవాడు, తలమీద పింఛము కలవాడు, ఎవరైనా అమ్మాయితో సరసాలాడుతూ  మీకు కనిపించాడా! ఎందు కంటే శ్రీకృష్ణుడు ధరించిన పూల మాలల వాసనలు ఇక్కడ వస్తున్నాయి. అందుకని అడుగుతున్నాను. చెప్పండే! కృష్ణుడు ఎక్కడ ఉన్నాడు." అని అడిగింది.

ఇంకొక గోపిక ఫలములతో నిండి ఉన్న ఒక వృక్షము వద్దకు పోయి "ఓ వృక్షమా! మీరు మీకు కాచిన ఫలముల భారముతో వంగినట్టు కనపడుతున్నారు. కృష్ణుడు ఈ పక్కగా వెళుతుంటే మీరే మైనా ఒంగి నమస్కారముచేసారా! అయితే కృష్ణుడు ఎటువైపు వెళ్లాడో చెప్పగలరా!"అని అడిగింది.

ఇంకొంత మంది పల్లెపడుచులు తమ సఖులతో ఇలా అంటున్నారు. "ఏమే! ఇటు చూడండే! ఈ తీగలను కృష్ణుడు తాకి

ఉంటాడు. అందుకే అవి పులకించి పోయి ఊగుతున్నాయి. మనం వెళ్లి ఆ తీగలను కృష్ణుని గురించి అడుగుదాము పదండి. ఈ తీగలు చూడండే! ఆ వృక్షములను ఎలాకౌగలించుకొని ఉన్నాయో! మనకు కూడా కృష్ణుని కౌగలించుకొని ఆయన గాఢపరిష్వంగనా సుఖమును ఆస్వాదించే అదృష్టము ఎప్పుడు కలుగుతుందోకదా!" అని కృష్ణునికోసరం వెతుకుతూ, చెట్ల వెంట తిరుగుతూ పిచ్చి పిచ్చిగా మాట్లాడుకుంటున్నారు ఆ గోపకాంతలు.

ఎంతకూ వారికికృష్ణుడు కనపడలేదు. అప్పుడు వారు తమలో తాము కృష్ణలీలలను అనుకరించి అభినయించసాగారు. ఒక గోపిక కృష్ణుని వలె నేలమీదపడుకొంది. మరొక గోపిక పూతన వలె కృష్ణుని పక్కన కూర్చుంది. కృష్ణుని వలె పడుకున్న గోపిక పూతన వలె ఉన్న గోపిక స్తన్యము తాగసాగింది.

మరొక గోపిక తాను కృష్ణుడి వలె అనుకరిస్తూ, మరొక గోపికను కృష్ణుడు బండిని తన్నినట్టు ఒక తాపు తన్నింది. ఆ గోపిక కుయ్యో మని అరుస్తూ ఆ బండి దొర్లినట్టు కిందపడి దొర్లింది.

మరొక గోపిక తానే తృణావర్తుడు అనే రాక్షసుడు అంటూ మరొక గోపికను కృష్ణుడిగా భావించి తన బుజం మీదకు  ఎత్తుకొని పోయింది. కృష్ణుడు మోకాళ్ల మీద జోగాడినట్టు మరొక గోపిక నేలమీద ఉంగా ఉంగా అంటూ జోగాడుతూ ఉంది.

ఇద్దరు గోపికలు తాము బలరాముడు, శ్రీకృష్ణుడు అంటూ అటు ఇటు తిరగసాగారు. మరొక గోపిక తాను వత్సాసురుడిని అంటూ మరొక గోపికను కాళ్లతో తన్నసాగింది. మరొక గోపిక తాను బకాసురుడిని అంటూ ఒంటి కాలి మీద నిలబడింది. ఈ ప్రకారంగా గోపికలు కృష్ణలీలలను అనుకరించసాగారు.

మరొక గోపిక తానే కృష్ణుడిని అంటూ, తన చుట్టు ఆవులను నిలబెట్టుకొని మురళిని మధురంగా వాయించసాగింది. ఆమె వేణుగానమును విని ఆవులు తలలు ఊపుతుంటే, మిగిలిన గోపికలు ఆహా ఏమి వాయిస్తున్నావే! అంటూ పొగుడుతున్నారు.

ఇంకొక సుందరి మరొక సుందరి బుజాల మీద చేతులు వేసి వయ్యారంగా నడుస్తూ "చూడండే నేను కృష్ణుని బుజాల మీద చేతులు వేసి ఎలానడుస్తున్నానో" అంటూ వయ్యారాలు ఒలకబోస్తూ ఉంది. మరొక గోపిక తన పమిటను ఎత్తి పట్టుకొని "ఒసేయ్ ముద్దుల్లారా! నేనే కృష్ణుడను. నాపమిట గోవర్ధన పర్వతము. మీరంతా వచ్చి నా పమిటచాటున దాక్కొండే. నేను మిమ్మల్నదరినీ రక్షిస్తాను." అంటూ అల్లరి అల్లరిగా  పిలుస్తూ ఉంది.

ఇంకొక గోపిక మరొక గోపికను నేల మీద ఒంగోబెట్టి దాని తల మీద తన కాలు పెట్టి "ఓసీ! కాళీయ సర్పమా! నేను కృష్ణుడను. నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. వెంటనే ఇక్కడి నుండి వెళ్లిపో" అని అభినయించసాగింది.

మరొక గోపిక భయంతో అటు ఇటు పరుగెడుతూ "గోపాలులారా! ఈ దావానలమును చూడండి. భయపడకండి. నేనుమీ అందరినీ రక్షిస్తాను." అంటూ కృష్ణుడి లాగా ఇతర గోపికలను తన కౌగిట్లోకి లాక్కుంటూ ఉంది.

మరొక గోపిక ఒక తాడుతీసుకొని అటు ఇటు తిరుగుతూ "ఏడీ! ఈ కొంటె కృష్ణుడు ఏడీ! కుండలు పగులగొట్టి వెన్న తినే వెన్న దొంగ ఏడీ! ఈ రోజు వాడిని కట్టేస్తాను." అంటూ యశోద మాదిరి అటు ఇటు కృష్ణుని కోసరం వెదకసాగింది. కృష్ణుడు తన చేతికి చిక్కినట్టు మరొక గోపికను పట్టుకొంది. ఆ గోపిక నడుముకు తన చేతిలోని తాడును గట్టిగా బిగించి కట్టింది. పక్కనే ఉన్న రాతికి, కృష్ణుని యశోద రోటికి కట్టినట్టు ఆ గోపికను కట్టేసింది. ఆ కట్టబడిన గోపిక కళ్లు నులుముకుంటూ "అమ్మా అమ్మా కట్టకే!" అని కృష్ణుడు ఏడ్చినట్టు ఏడుపును అభినయించింది.

ఈ ప్రకారంగా గోపికలు కృష్ణలీలలను అభనయిస్తూ ఉండగా వారికి కృష్ణుని పాదముల గుర్తులు కనపడ్డాయి. ఆ పాదముల గుర్తులను కృష్ణుడివిగా పోల్చుకున్నారు గోపకాంతలు. కాని ఆ పాదముల గుర్తుల పక్కన మరొక అమ్మాయి పాదగుర్తులు చూచి "అమ్మో!ఈ మానస చోరుడు మరొక అమ్మాయితో ఇటుగా వెళ్లినట్టున్నాడు!" అని అసూయ చెందారు.

మరొక గోపిక "సందేహము లేదు. ఈ వెన్న దొంగ మరొక అమ్మాయితో ఇటుగా వెళ్లాడు. ఆమె బుజాల మీద చేతులు వేసి ఆమె మెడమీద తలపెట్టి నడిచినట్టుగా కనపడుతూ ఉంది." అని తన

మనోభావమును వెలిబుచ్చింది.

మరొక గోపిక "అవునే! నిజమే! కృష్ణుడు ఈ అమ్మాయి మీద ఎక్కువ అనురాగము కలిగినట్టున్నాడు. అందుకే మనందరినీ వదిలిపెట్టి ఈ అమ్మాయిని తీసుకొని ఎవరూ లేని చోటికి వెళ్లిపోయాడు." అని అసూయతో మూతి ముడిచింది.

మరొక వనిత కృష్ణుని మీద భక్తితో "చూచావుటే! కృష్ణుని పాదరేణువులు ఎంత పవిత్రమైనవో! అందుకనే బ్రహ్మ, ఈశ్వరుడు, లక్ష్మీదేవి ఈ పాదరేణువులను తమ శిరస్సుల మీద ధరిస్తారు. కృష్ణుని పక్కన నడిచిన ఈ గోపిక ఎంతటి అదృష్టవంతురాలో కదా!" అని కృష్ణుని మీద తన భక్తిభావాన్ని వెలిబుచ్చింది.

మరొక గోపిక ఇలా అంది. "కృష్ణుని పక్కన నడిచిన ఈమెను చూస్తే, ఆ అదృష్టం నాకు పట్టలేదని నా మనసులో ఎంతో బాధగా ఉంది. మనం ఇంతమంది ఇక్కడ ఉండగా ఆమె ఒక్కత్తే కృష్ణుని అధరామృతమును తాగడం నాకు చాలా అసూయగా ఉ ంది."అని బాధపడింది ఒక పడుచు.

ఇంకొక గోపిక పెద్దగా కేక పెట్టింది. "ఇటుచూడండే. కాస్త ఇటు చూడండి. కృష్ణుని పాదముద్రలు, ఆమె పాదముద్రలు కొంచెం దూరం మాత్రమే ఉన్నాయి. తరువాత ఆమె పాద ముద్రలు కనిపించడం లేదు. అంటే ఆమె కృష్ణుని బుజాల మీద ఎక్కిందన్న మాట. అమ్మో! ఎంత పని చేసింది." అని వాపోయింది ఆ గోపిక.

మరొక గోపిక కలుగజేసుకొని "ఇదే ఎక్కిందంటావా లేక కృష్ణుడే దానిని తనబుజాల మీద ఎక్కించుకున్నాడా!" అని సందేహము వెలిబుచ్చింది మరొక వనిత.

ఆమాటలు విన్న ఇందాకటి వనిత "ఎవరు ఎవరి మీద ఎక్కినా ఒకటి మాత్రం సత్యం. కృష్ణుడు ఆమెను తన బుజాల మీద మోస్తున్నాడు. ఎందుకంటే ఇక్కడ కృష్ణుని పాదముద్రలు బాగా లోతుగా దిగబడి ఉన్నాయి. బరువు మోసే వాళ్ల పాదముద్రలు ఇలా ఇసుకలో దిగబడి ఉంటాయి."అని తనపరిజ్ఞానాన్ని బయటపెట్టింది ఆ గోపిక.

కాస్తముందుకు వెళ్లిన మరొక గోపిక ఒక్క కేకపెట్టింది. అందరూ అక్కడకు పరుగెత్తారు. "చూడండి. ఇక్కడ కృష్ణుని పాదముద్రలు, ఆమె పాదముద్రలు కనపడుతున్నాయి. అంటే ఇక్కడ పూలు కోసుకోడానికి వీలుగా కృష్ణుడు ఆమెను కిందికి దింపి ఉంటాడు. పాపం కృష్ణుడు ఆమెకు కష్టపడి పూలుకోసి ఇచ్చి ఉంటాడు. ఆమె కులుక్కుంటూ సింగారించుకొని ఉంటుంది. మనకు ఎప్పుడన్నా కృష్ణుడు పూలు కోసి తలలోపెట్టాడా"అని నిట్టూర్చింది.

"ఓసిమొద్దూ! పూలుకోసి ఇవ్వడం కాదే. ఇటు చూడండి. ఇక్కడ కేవలం కృష్ణుడి పాదముల వేళ్ల ముద్రలు మాత్రమే కనపడుతున్నాయి. పాదముద్రలు పూర్తిగాలేవు. అంటే ఇక్కడ కృష్ణుడు ఆమెను తన ఒడిలో కూర్చోపెట్టుకొని ఆమె తలలో పూలు తురిమి ఉంటాడు. అందుకే ఇక్కడ కృష్ణుడు కూర్చున్న గుర్తులు, కృష్ణుడి తొడలమీద ఆమె కూర్చున్న గుర్తులు కనపడుతున్నాయి." అని మరొక

గోపిక పాదముద్రలను విశ్లేషించడం మీద తనపరిజ్ఞానాన్ని అందరిముందు ప్రదర్శించింది.

(ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. గోపికలు కృష్ణుని మీద ప్రేమతో, భక్తితో ఆయనలో తాదాత్మ్యం పొందారు. తామే కృష్ణుడు అని అనుకున్నారు. తమ మనసులను ఏకాగ్రతతో కృష్ణుని మీద లగ్నం చేసారు. ఎల్లప్పుడూ కృష్ణనామస్మరణ, కృష్ణుని మనసునిండా నింపుకోవడం, కృష్ణుడు తప్ప వేరే ఎవరూ లేరనుకోవడం, కృష్ణుడే తమకు దిక్కు అనుకోవడం.... ఇవన్నీ ఒక భక్తునికి ఉండవలసిన లక్షణాలు. మానవుడైన వాడు ఈ రకమైన భక్తిని అలవరచుకుంటే మోక్షం దానంతట అదే వస్తుంది. ఎటువంటి పూజలు, వ్రతాలు అక్కర లేదు. కాని మనం పూజలు, వ్రతాల దగ్గరే ఆగిపోతున్నాము. ఎంత ఘనంగా పూజలు వ్రతాలు చేసామో గర్వంగా చెప్పుకుంటున్నాము. అటువంటి వారి మనసులలో నుండి భగవంతుడు మాయం అవుతాడు అని ఈ అధ్యాయం నిరూపించింది.  ఆ గోపికలను చూచి మనం ఎంత నేర్చుకోవాలో ఆలోచించుకోవాలి.)

ఓ పరీక్షిత్ మహారాజా!  ఈ ప్రకారంగా గోపికలు కృష్ణుని మీద కామంతో, వ్యామోహంతో వివేకమును కోల్పోయి నేల మీద పడ్డ పాద గుర్తులు కృష్ణుని పాద గుర్తులుగా భావించి ఇతరులకు చూపిస్తూ ఎవరికి తోచినట్టు వారు వ్యాఖ్యానిస్తున్నారు.

ఇక్కడ ఇలా ఉండగా, గోపికలను అందరినీ వదిలిపెట్టి ఒకేఒక గోపికతో కృష్ణుడు మాయం అయ్యాడు. ఆమెతో కొంచెం సేపు విహరించాడు. "ఆహా! నేను ఎంత అదృష్టవంతురాలిని. కృష్ణుడు

అందరినీ వదిలి పెట్టి నన్నుమాత్రమే వెంటబెట్టుకొని తిరుగుతున్నాడు. అందరిలోకీ నేనే గొప్పదానను." అని గర్వంతో తలఎగరేసింది.

ఆగర్వంతో కృష్ణుని చూచి "కృష్ణా! నేను ఇంక నడవలేను. నన్ను ఎత్తుకొని తీసుకెళ్లవా!" అని ప్రేమగా అడిగింది. ప్రియురాలు అడిగితే కృష్ణుడు కాదంటాడా! "లలనా! నువ్వు నా బుజం మీద ఎక్కు. నిన్ను మోసుకుంటూ తీసుకెళతాను" అని అన్నాడు. ఆ గోపిక పరమ సంతోషంతో కృష్ణుని బుజం మీద ఎక్కబోయింది. అంతే. కృష్ణుడు మాయం అయ్యాడు. బుజం మీద ఎక్కబోయిన ఆ గోపిక దబ్బున కిందపడింది.

(ఈరోజుల్లో కూడా చాలా మంది దేవీ ఉపాసకులము, ఆంజనేయస్వామి ఉపాసకులము, అనీ, మాకు సిద్ధులు సంక్రమించా యనీ, సిద్ధయోగులమనీ, మాతో దేవుడు మాట్లాడతాడనీ, గర్వంగా చెప్పుకుంటూ ఉంటారు. రకరకాల మహిమలు చేస్తుంటారు. ఆ మహిమలు చూచి వాళ్ల వెంట జనం తిరుగుతుంటారు. కాని ఇటువంటి వాళ్ల దగ్గర భగవంతుడు ఉండడని మనకు భాగవతంలో ఈ సంఘటన స్పష్టంగా చెబుతూ ఉంది. గమనించండి.)

ఆ గోపిక అటు ఇటు చూచింది. కృష్ణుడు కనపడలేదు. ఆమెకు ఏడుపు వచ్చింది. ఏడుస్తూ "కృష్ణా! ప్రియా! నాథా! రమణా! నీవు ఎక్కడున్నావు? ఎక్కడికివెళ్లావు? దీనురాలయిన ఈ దాసిని వదిలి వెళ్లిపోయావా!" అంటూ నేలమీద పడి దొర్లుతూ ఏడుస్తూ ఉంది.

ఇంతలో కృష్ణుని పాదముద్రల జాడలను బట్టి వస్తున్న గోపికలు ఆమె వద్దకు వచ్చారు. ఏడుస్తున్న ఆమెను చూచారు. తామందరినీ వదిలిపెట్టి, ఆమెతో వెళ్లిన కృష్ణుడు ఆమెను కూడా వదిలిపెట్టి వెళ్లిపోయాడని తెలిసి ఆశ్చర్యపోయారు. ఆ గోపికతో సహా అందరు గోపికలు ఆ పున్నమి వెన్నెలలో అడవి అంతా కృష్ణుని కొరకు వెదకసాగారు.  కాని దట్టంగా అల్లుకొన్న ఆ చెట్లమధ్య చీకటిగా ఉండటం వలన వారు కృష్ణుని కొరకు వెదకలేకపోయారు. అందరూ వెనక్కుతిరిగి వెళ్లిపోయారు. అందరూ యమునా నదీ తీరంలో ఇసుక తిన్నెల మీదకూర్చుని, ఇల్లు వాకిలి, మొగుడు, సంతానము, బంధువులు అందరినీ మరిచిపోయి, కృష్ణుని మీది మోహంతో, కృష్ణా!కృష్ణా అంటూ కృష్ణనామం జపిస్తూ విరహతాపంతో వేగిపోతున్నారు. కృష్ణలీలలను మధురంగా గానం చేస్తున్నారు." అంటూ శుకమహర్షి పరీక్షిత్‌మహారాజుకు కృష్ణుని కొరకు గోపికలు వనం అంతా వెదకడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పదియవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## ముప్పదిఒకటవ అధ్యాయము

"ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుడు కనపడకపోయేసరికి, గోపికలందరూ యమునా నదీ తీరానికి చేరుకొని, ఇసుక తిన్నెల మీద కూర్చుని కృష్ణుని మహిమలను గానం చేస్తున్నారు.

"కృష్ణా! మా వ్రజములో నీవు పుట్టి, వ్రజమును వైకుంఠముతో సమానంగా చేసావు. నీవు ఎక్కడ ఉంటే అక్కడ మహాలక్ష్మి ఉంటుంది కదా! అందుచేతనేమో నీవు పుట్టినప్పటినుండి ఈ వ్రజము సమస్త సంపదలతో తులతూగుతూ ఉంది. మాకు దేనికీ కొరత లేదు. అన్నీ సమృద్ధిగా దొరుకుతున్నాయి.

ఈ వ్రజములో ఉన్న గోపికలము అందరమూ నీ కోసరము మా ప్రాణాలు కూడా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాము. నీ మీదనే మా ప్రాణాలు పెట్టుకొని బతుకుతున్నాము. నీకోసం వెదకి వెదకి వేసారిపోతున్నాము.

కృష్ణా! మాకు కనిపించవా! మాకు నీ దివ్యదర్శనభాగ్యం కలిగించవా! ఓ కృష్ణా! మేమందరము నీకు వేతనము లేని దాసీలము. ఊరికే నీకు సేవలు చేస్తున్నాము తెలుసా! కాని నువ్వు ఏంచేస్తున్నావు? నీ క్రీగంటి చూపులతో మా అందరినీ చంపుతున్నావు? ఎందుకమ్మా అలా చేస్తావు? మా మనసులను ఇలా బాధపెట్టడం నీకు న్యాయమా!

కృష్ణా! యమునా నదిలో కాళీయుడు అనే సర్పము తన విషాన్ని చిమ్మి నీటిని విషపూరితం చేస్తున్నదని తెలిసి ఆ సర్పమును అక్కడి నుండి వెళ్లగొట్టి వ్రజవాసులను రక్షించావు. అఘాసురుని, తృణావర్తుని మొదలగు రాక్షసులను చంపావు. ఇంద్రుడు కురిపించిన వర్షము నుండి మా అందరినీ రక్షించావు. మాకు ఎప్పుడు ఎవరివలన ఎలాంటి భయం కలిగినా నీవు మా పక్కనే ఉండి మమ్ములను రక్షించావు. ఇప్పుడు మన్మధుడు తన బాణములతో మా అందరినీ వేధిస్తుంటే, మా అందరినీ ఎందుకు రక్షించవు?

ఓ దేవా! నీవు మాకే కాదు ఈ అనంత విశ్వమున కంతకూ ఆనందాన్ని కలిగిస్తున్నావు. అందరిలోనూ అంతర్యామిగా వెలుగుతున్నావు. దేవతల ప్రార్థనలను మన్నించి మా వ్రజములో అవతరించావు. మానవులందరూ ఈ సంసార భయంనుండి తప్పించుకోడానికి నీ పాదములను ఆశ్రయిస్తున్నారు. వారందరికీ నీవు అభయము ఇచ్చి రక్షిస్తున్నావు. వారందరికీ అభయం ఇచ్చిన వాడివి మా తలల మీద కూడా నీ చేతులను ఉంచి మా అందరినీ రక్షించరాదా!

ఓ వీరుడా! నీవు వ్రజవాసుల కష్టములు అన్నీ తీరుస్తున్నావు. నీ చిరునవ్వుతో మేమందరమూ నీ దాసులము అయ్యాము. నీ మీద విరహంతో వేగిపోతున్నాము. ఒక్కసారి నీ అందమైన ముఖపద్మమును మాకు చూపి మాకు ఆనందం కలుగచేయవా!

ఓ దేవా! నీ పాదమును ఆశ్రయించిన వారికి ముక్తిని ప్రసాదించావు అంటారు. ఆ పాదాలే ఈ వ్రజంలో గోవులను

తోలుకుంటూ గోవుల వెంట వెళ్లాయి. ఆ పాదాలే కాళీయుని పడగల మీద నృత్యం చేసాయి. అటువంటి నీ పాదములను మా హృదయముల మీద ఉంచి, మా కామబాధను తొలగించి, మమ్ములను ధన్యులను చేయవా!

కృష్ణా! నీ మధురమైన వాక్కులు విని పండితులు నీ పట్ల ఆకర్షితులవుతున్నారు. నీ మృదుమధురమైన మాటలు విని మేము కూడా నీ మీద ప్రేమను పెంచుకున్నాము. నీ మీద మోహంతో నీకు దాసీలము అయ్యాము. మా మీద కరుణించి నీ అధరామృతమును మాకు పంచి ఇవ్వవా!

ఓ దేవా! నీ గురించి తపించే వారికి నీ కథలను వినడం చెవులకు అమృతం లాంటిది. నీ కథలను వినడం మాత్రం చేతనే పాపములన్నీ నాశనం అవుతాయి. సకల శుభాలు కలుగుతాయి. నీ కథలను విన్న వారు నీ ప్రేమకు పాత్రులవుతారు. అట్టి నీ కథలను మేము కూడా గానం చేసాము.

కాని నీవు ఏం చేసావు? ప్రేమతో కూడిన నీ క్రీగంటి చూపులతో మాలో కామాగ్నిని ప్రజ్వరిల్లచేసావు. మా అందరితో తిరిగావు. ఏకాంతంగా గడిపావు. నీ మనోహరమైన మాటలతో మమ్ములను సమ్మోహితులను చేసావు. ఉన్నట్టుండి కనపడకుండా పోయావు. నీవు కనపడకపోతే మా మనసులు అన్నీ కలతచెంది ఉన్నాయి. మాకు నీ దర్శనభాగ్యము కలుగజేయవా కృష్ణా!

ఓ కృష్ణా! నీకోవిషయంతెలుసా! నీవు గోవులను తోలుకొని అడవికి వెళుతుంటే, నీ పాదములకు రాళ్లు గుచ్చుకొని కందిపోతాయేమో అని మా మనసులు విలవిలలాడిపోయేవి. నీవు సాయంత్రము మరలా గోవులను తోలుకొని వ్రజమునకు వచ్చేదాకా మా ప్రాణాలు నీ కోసరం తల్లడిల్లిపోయేవి. నీముఖపద్మమును చూచిన తరువాత మా మనసులు కుదుటపడేవి.

ఓ దేవదేవా! నీ నాభిలోనుండి వచ్చిన పద్మములో నుండి పుట్టిన బ్రహ్మకూడా నిన్ను పూజిస్తాడు. నీ భక్తులు నిన్ను ధ్యానం చేసినంత మాత్రం చేతనే నీవు వారి బాధలను పోగొడతావు. నిన్ను సేవించిన వారి కోరికలు తీర్చి వారికి  పరమసుఖమును కలుగజేస్తావు. నీ పాదములు ఈ భూమి మీద తిరుగుతుంటే, అవి భూమికే ఆభరణములుగా ప్రకాశిస్తాయి. అటువంటి నీ పాదములను మా హృదయములలో నిలిపి మమ్ము కరుణించవా కృష్ణా!

ఓ కృష్ణా! నీ వేణునాదము వింటుంటే నీ మీద మోహం కలుగుతుంది. అట్టి వేణువు నీ పెదాలకు తగిలి, నీ అధరామృతమును గ్రోలి,  మధురమైన నాదమును సృష్టించి ధన్యమైంది.  ఆ వేణువుకు కలిగిన అదృష్టమును మాకు కూడా ప్రసాదించి, మాకు నీ అధరామృతపానమును అందివ్వవా! కృష్ణా!

పగలంతా నీవు గోవులను మేపుతూ అడవిలో ఉంటావు. నిన్ను తలచుకుంటూ, నీవు ఏమి చేస్తుంటావో అని ఆలోచిస్తూ, నీమీద విరహంతో పగలంతా గడుపుతాము. సాయంత్రం నీవు గోవులను తోలుకొని వ్రజమునకు వచ్చినపుడు, నిన్ను కళ్లారా చూచుకుంటూ

ఆనందాంబుధిలో మునిగిపోతాము. రెప్పపాటు కాలం కూడా వృధా కానివ్వము. కానీ నిన్ను మా కనురెప్పలను కొట్టుకునేటట్టు చేసి ఆ క్షణకాలము కూడా నీ దర్శనభాగ్యమునకు అంతరాయము కలిగిస్తున్న ఆ బ్రహ్మదేవుని ఏమనాలి? ఆ బ్రహ్మ ఒట్టి తెలివితక్కువాడు కదా!

ఓ కృష్ణా!నీ కోసరము మేమందరము మా భర్తలను, పిల్లలను, అక్క చెల్లెళ్లను, అన్నదమ్ములను, అత్తమామలను, ఇతర  బంధువులను, వదిలిపెట్టి వారు వద్దంటున్నా వినకుండా నీమీది మోహంతో నీ వద్దకు వచ్చాము. మేము ఎందుకు వచ్చామో నీకు తెలుసు? నీ మురళీగానమునకు మోహపరవశులమై వచ్చాము కదా! అన్ని తెలిసి కూడా, నీ కోసరం అర్ధరాత్రి అని కూడా చూడకుండా పరుగు పరుగున వచ్చిన మా అందరినీ ఈ రాత్రి పూట అడవిలో, వంటరిగా వదిలి వెళ్లడా న్యాయమా! ధర్మమా! వలచివచ్చిన వనితలను ఎవరైనా ఈ ప్రకారంగా ఒంటరిగా వదిలివెళతారా!

ఓ కృష్ణా! నీ మధురమైన మాటలు వింటుంటే, మనోహరమైన నీ చిరునవ్వు చూస్తుంటే, నీ క్రీగంటి చూపులు మా మీద ప్రసరిస్తుంటే, మాకు నీ మీద మోహం అంతకంతకూ అధికం అవుతూ ఉంది. మా మనసులు నీ యందు లగ్నం అవుతున్నాయి.

ఓ కృష్ణా! నీవు ఈ వ్రజములో మాకోసమే పుట్టావు. మేమందరము నీమీద మోహపరవశులమై ఉన్నాము. మా మనసులో ఉన్న బాధలను తొలగించు. మా కోరికలు తీరే ఓషధము నీవద్దనే ఉంది. నీ అధరామృతము అనే ఓషధమును మాకు ప్రసాదించు. నీ

సుకుమారమైన పాదపద్మములను, కర్కశములైన మా హృదయముల మీద ఉంచు. మాకు జీవితాన్ని ప్రసాదించు. మమ్ములను ఉద్ధరించు. మా మనసులలో ఉన్న  బాధలను తొలగించు." అని గోపికలు కృష్ణుని దర్శనం కోసరం రకరకాలుగా పరితపిస్తున్నారు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు గోపికా గీతికలను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పది ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ముప్పది రెండవ అధ్యాయము

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ ప్రకారంగా గోపికలు కృష్ణుని వెదుక్కుంటూ వనమంతా తిరుగుతూ శోకిస్తున్నారు. ఇంతలో కృష్ణుడు పీతాంబరధారియై, చేతిలో మురళితో, తలమీద నెమలిపించముతో, పెదాల మీద చిరునవ్వుతో, గోపికల ముందు ప్రత్యక్షం అయ్యాడు.

కృష్ణుడు తమ కళ్లెదుట కనపడగానే గోపికలకు కళ్లవెంట ఆనందాశ్రువులు జలా జలా రాలాయి. పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది. అప్పటి వరకూ స్తబ్ధుగా ఉన్న గోపికలలో ఒక్కసారిగా చైతన్యం వచ్చింది. అందరూ ఒకేసారి దిగ్గున లేచారు. కృష్ణుడి వంకకు పరుగెట్టారు.

ఒక గోపిక ఆనందంతో కృష్ణుడి చేతులు పట్టుకుంది. మరొక గోపిక కృష్ణుడి చేతులు తన బుజాల మీద వేసుకుంది. ఒక గోపిక తన చేతిలోని తాంబూలమును కృష్ణుని నోట్లో పెట్టింది. మరొక గోపిక కృష్ణుని కాళ్లను చుట్టేసింది. మరొక విరహిణి ప్రణయకోపంతో మూతి మూడువంకరలు తిప్పింది. నిన్ను కొడతా అంటూ వేలు ఆడించింది.

ఆ గోపికలలో కృష్ణుని ఎడల ప్రేమ, భక్తి రెండూ కలిసిపోయి కృష్ణుని ఎంతసేపు సేవించినా వారికి తనివితీరడం లేదు. అలాగే రెప్పవాల్చకుండా, కృష్ణుని చూస్తూ నిలబడిపోయారు. అయినా వారికి తృప్తి కలగలేదు. ఒక గోపిక కళ్లుమూసుకొని తాను కృష్ణుని తన బాహువులలో గట్టిగా బంధించినట్టు ఆనందంపొందుతూ ఉంది. అప్పటి దాకా కృష్ణుని మీద విరహతాపంతో వేగిపోయిన ఆ గోపికలు ఒక్కసారిగా కృష్ణుడు తమ కళ్లముందు నిలువగానే, వారి విరహం అంతా గాలిలో కలిసిపోయింది.

తమ కళ్లనిండా ఆనందాన్ని, సంతోషాన్ని నింపుకొని తన వంకే కన్నార్పకుండా చూస్తున్న గోపకల మధ్య కృష్ణుడు తారల మధ్య చంద్రుడిలా శోభిల్లాడు. తాను ఒకడే అయినా, అందరిముందు ఒక్కొక్క కృష్ణుడు నిలబడిఉన్నట్టు భ్రమకలిగించాడు. అందరి చేతులు పట్టుకొని చంద్రుడు చల్లని వెన్నెల ప్రసరిస్తుంటే, సుగంధ భరితమైన పిల్ల వాయువులు వీస్తుంటే, ఆ యమునానదీ తీరంలో ఇసుక తిన్నెల మీద విహరిస్తున్నాడు.

కృష్ణదర్శనము కలగగానే గోపికలలో ఉన్న మానసిక వేదనలు తొలగి పోయాయి. వారి మనసులు ఆనందంతో ఓలలాడాయి. కృష్ణుడు కూర్చోడానికి ఇసుక తిన్నెల మీద తాము వేసుకున్న వల్లెవాటులను (పమిటెలను) తీసి పరిచారు. కృష్ణుడు వారు పరిచిన వస్త్రముల మీద కూర్చోగానే గోపికలు కూడా ఆయనచుట్టు గుండ్రంగా కూర్చున్నారు. గోపికల సభలో కృష్ణుడు పూజింపబడుతున్నాడు.

ఒకతె కృష్ణుని చేతులను తనతొడల మీద పెట్టుకుంది. మరొక గోపిక కృష్ణుని పాదములు తన ఒడిలో పెట్టుకొని పిసుకుతూ ఉంది. కృష్ణుడు హటాత్తుగా కనపడకపోవడంతో ఆ గోపికలు అందరూ కృష్ణుని మీద ప్రణయ కోపం చూపించసాగారు.

"కృష్ణా! మానవుల్లో మూడు రకాలు ఉన్నారు. కొంత మంది మానవులు తమను సేవించే వారి వెంట తిరుగుతుంటారు. తనకు సేవలు చేసే వారికి తాము కూడా సేవలు చేస్తారు. ఇంక రెండవ జాతిమానవులు, దీనికి విరుద్ధంగా ఉంటారు. ఎదుటి వాడు తమను సేవించకపోయినా, వారు తమ సేవలను అందరికీ అందిస్తుంటారు. వారికి సేవాభావమే పరమార్థము. ఇంక మూడవ జాతి మానవులు ఉన్నారు. వారు తమను సేవించిన సేవింకపోయినా పట్టించుకోరు. ఎవరికీ తమ సేవలు అందించరు. కేవలం తమ స్వార్థమే చూసుకుంటారు. వీరిలో ఎవరు ఉత్తములో చెప్పగలవా? అని అడిగారు.

(ఈ సందర్భంలో పోతనగారి పద్యం చదవండి.

కం॥కొలిచిన గొలుతురు కొందఱు

గొలుతురు దము గొలువకున్న గొందఱు పతులం

గొలిచినను గొలువకున్నను

గొలువరు మరికొంద ఱెలమి గోపకుమారా!

గోపికల ప్రశ్నకు కృష్ణుడు ఇలా సమాధానం చెప్పాడు. "గోపికలారా! తాము ఎదుటి వారికి సేవచేస్తే, వారు కూడా తమకు సేవచేస్తారనే ప్రత్యుపకారవాంఛతో చేసే సేవ స్వార్థపూరితమైన సేవ. అటువంటి వారు తమకు తాము సాయం చేసుకుంటారే తప్ప ఎదుటి వారికి సాయం చేయరు. అటువంటి సేవ ధర్మబద్ధము కాదు.

కొందరు పుత్రులు, పుత్రికలు ఉంటారు. వారికి తమ తల్లితండ్రులంటే ఇష్టంఉండదు. వార్ధక్యంలో తమ తల్లితండ్రులను నిర్లక్ష్యం చేసారు. కాని అటువంటి వారి పట్లకూడా వారి తల్లితండ్రులు ప్రేమ,ఆప్యాయత చూపిస్తారు. వారి క్షేమం కోసరం తల్లడిల్లిపోతుంటారు. ఇటువంటి సేవనే నిస్వార్థసేవ అంటారు. ఇది ధర్మబద్ధమైన సేవ. సౌహార్ద్రముతో కూడిన సేవ.

వీరి సంగతి అటుంచితే, మరి కొందరు ఉన్నారు. వీరు ఎదుటి వారు తమను సేవించినా వారి మొహం కూడా చూడరు. వారికి ఎటువంటి ఉపకారము చెయ్యరు.

ఒక పేదవాడికి కొంత ధనం లభించింది. లభించిన ధనము వెంటనే పోయింది. అప్పుడు ఆ పేదవాడు పోయిన ధనం కోసరం

వెంపర్లాడతాడు. ఆకలి దప్పిక మర్చిపోయి పోయిన ధనం కోసరం పరితపిస్తుంటాడు. అదే మాదిరి, నేను కూడా నా గురించి పరితపించే సాధకులకు ఓ పట్టాన దర్శనం ఇవ్వను. మీకు కూడా అంతే. మీరందరూ నా కోసరం మీ భర్తలను, సంతానమును, అత్తమామలను, మీ గృహములను వదిలిపెట్టి వచ్చారు. నేను ఎల్లప్పుడూ మీ ఎదుటనే ఉంటే మీకు నా యందు ఆసక్తి ఉండదు. అందుకే వెళ్లిపోయాను. నేను మీకు కనపడకుండా మీ వెంటనే ఉండి మీరు నా గురించి అనుకున్న మాటలన్నీ విన్నాను. మీరు నా గురించి పడే ఆవేదన గుర్తించాను.

నేను ఎల్లప్పుడూ మీ వాడనే. కాబట్టి మీరు నా మీద అలుకపూన పనిలేదు. మీకు నాకు మధ్య ఉన్నది పరిశుద్ధమైన ప్రేమ. దానిలో తుచ్ఛమైన కామమునకు తావు లేదు. ఎవరికీ వీలు కానటువంటి సంసారబంధములను మీరు ఛేదించుకొని నా వద్దకు వచ్చారు. మీరు చేసిన ఈ త్యాగమునకు నేను మీకు ఏమి ప్రత్యుపకారము చేయగలను. అందుకని మీకు, మీమనసులకు ఏది ఇష్టం అయితే అది చేసి మీకు ఆనందం కలుగజేస్తాను." అని అన్నాడు కృష్ణుడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పది రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ముప్పది మూడవ అధ్యాయము.

“ఓ పరీక్షిత్ మహారాజా! ఎప్పుడైతే కృష్ణుడు తమ మనోరథమును తీరుస్తాను అని అన్నాడో గోపకాంతల మనసులు ఆనందడోలికలలో తేలియాడాయి. వారందరూ కృష్ణుని చేతులు కాళ్లు పట్టుకోనడం ద్వారా, కృష్ణుని కౌగలించుకోడం ద్వారా, అప్పటి వరకు కృష్ణుని వియోగం వలన కలిగిన విరహతాపాన్ని పోగొట్టుకున్నారు.

తరువాత కృష్ణుడు గోపికలతో, గోపకాంతలతో యమునానదీ ఇసుకతిన్నెలమీద, పున్నమివెన్నెలలో రాసక్రీడలు సలిపాడు. కృష్ణుడు తన మాయాశక్తిని ప్రదర్శించాడు. తాను అనేకముగా మారి పోయాడు. ఇద్దరు గోపకాంతల మధ్య ఒకడుగా ఉన్నాడు. ప్రతి గోపకాంత పక్కన తాను ఉన్నట్టు భ్రమకలిగించాడు. ఆ కారణంగా ప్రతి గోపికా, గోపకాంతా కృష్ణుడు తమ పక్కనే ఉన్నాడని భ్రమచెందారు. ఇద్దరు గోపికల మధ్య కృష్ణుడు, ఇద్దరు కృష్ణుల మధ్య ఒక గోపిక, అలా అందరూ వలయాకారంలో నిలబడ్డారు. ఆ వలయం మధ్యలో వేణువును ఊదుతూ ఒంటరిగా కృష్ణుడు తన రాసలీలను ప్రదర్శించాడు.

(నారీ నారీ నడుమ మురారీ, హరికీ హరికీ మధ్య వయారీ,
తానొకడైనా తలకొక రూపై, సాగెను రాధామాధవకేళీలీలా).

ఈ రాసలీలను చూడటానికి ఆకాశంలో దేవతాగణములు బారులుతీరారు. దేవ దుందుభులు మోగించారు. పూలవాన కురిపించారు. గంధర్వులు తమ భార్యలతో కూడి శ్రీకృష్ణుని లీలలను గానం చేస్తున్నారు. ఆ రాసలీలలో పాల్గొన్న గోపికల, గోపకాంతల కాలి అందియలు, చేతులకు ధరించిన గాజులు, మెడలో వేసుకున్న ఆభరణములు గలగలమంటూ మధురంగా ధ్వనిచేయసాగాయి. బంగారంతో చేసిన హారం మధ్యలో పొదిగిన నీలమణిలాగా, గోపకాంతల మధ్యలో కృష్ణుడు ప్రకాశిస్తున్నాడు.

గోప కాంతలు, గోపికలు నృత్యం చేస్తున్నారు. చేతులు కాళ్లు ఆడిస్తున్నారు. నవ్వుతున్నారు. తుళ్లుతున్నారు. కళ్లు తిప్పుతున్నారు. అనేక రకములైన నృత్యభంగిమలను ప్రదర్శిస్తున్నారు. వాని నడుములు ఆడుతున్నాయి. పైటలుచెదిరిపోతున్నాయి. చెవికి పెట్టుకున్న లోలాకులు ఊగుతున్నాయి. వారి ముఖములు చెమటతో తడిసిపోయాయి. వారు ముడివేసుకున్న జుట్టు చెదిరిపోయింది.

కాని వారికి ఇవేమీ తెలియడం లేదు. కృష్ణలీలలను గానం చేస్తూ మైమరచిపోయారు. ఆకాశంలో మెరుపులలాగా మెరుస్తున్నారు. రకరకాలైన రాగములతో కృష్ణగీతికలను ఆలాపిస్తున్నారు. తాము నృత్యం చేస్తూ, కృష్ణుని తాకుతూ, ఆ స్పర్శకు పులకించి పోతూ నానావిధములైన నృత్య భంగిమలు ప్రదర్శిస్తున్నారు. గొంతెత్తి పాడుతున్నారు. ఆ ప్రశాంత వాతావరణంలో, నిశ్శబ్ద నిశీథిలో, వారి గొంతుకలు నలుదిక్కులా ప్రతిధ్వనిస్తున్నాయి. వారి గాత్రసౌరభము బ్రహ్మాండమంతా వ్యాపించింది.

ఒక గోపిక షడ్జమంలో స్వరాలాపాన చేస్తూ ఉంది. ఆమె గానామృతమును తాగిన కృష్ణుడు "ఆహా! ఓహో! ఎంతో బాగుంది" అని ప్రశంసిస్తున్నాడు. మరొక గోపిక అదే రాగమును తాళము మార్చి పాడసాగింది. ఆమెను కూడా కృష్ణుడు ప్రశంసించాడు. ఒక గోపిక కృష్ణుడి చుట్టు తిరిగి, ఆడి, పాడి, అలసి పోయింది. ఆమె జుట్టు ముడి వీడిపోయింది. ఆమె పక్కనే ఉన్న కృష్ణుని బుజముల మీద వాలి పోయింది. మరొక గోపిక కూడా అదేమాదిరి కృష్ణుని చేతులను పట్టుకొని వాటేసుకొని ఆ చేతుల మీద ముద్దులు పెడుతూ ఉంది.

మరొక గోపిక తన చెక్కిళ్లను కృష్ణుని చెక్కిళ్లకు చేర్చి, కృష్ణుడు నోటిలో నములుతున్న తాంబూలమును తాను కూడా స్వీకరించింది. మరొక గోపిక ఆడి పాడి అలసి పోయి కృష్ణుని చేతులు తీసి తన గుండెల మీద వేసుకొని సేదతీరుతూ ఉంది. ఇతర గోపికలు, గోప కాంతలు కూడా కృష్ణుని తమ భర్తవలె మనులో తలంచుకొనుచూ, కృష్ణుని కౌగిట్లో ఉన్నట్టు భ్రమిస్తూ తన్మయత్వంలో మునిగిపోయారు.

వారి చుట్టు చేరిన భ్రమరములు ఝుమ్మని నాదం చేస్తూ సంగీతం వినిపిస్తుంటే ఆ సంగీతానికి అనుగుణంగా గోపికలు నృత్యం చేస్తున్నారు. చిన్ని బాలుడు తనను తాను అద్దములో చూచుకొని ఆ ప్రతిబింబముతో ఆడుకున్నట్టు, కృష్ణుడు కూడా ప్రతి గోపికలో ఆత్మస్వరూపంగా ఉన్న తనను తాను చూచుకుంటూ ఆగోపికలతో ఆడుతూ పాడుతూ ఆలింగనము చేసుకుంటూ కరచాలనము చేస్తూ నవ్వుతూ, నవ్విస్తూ వారితో ఆ బృందావనములో విహరిస్తున్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుడు తమను అంగాంగము తాకుతూ ఉంటే ఆ ఆనందములో గోపికల అవయవములు తమతమ పట్టు తప్పాయి. వారు ఇష్టంవచ్చినట్టు ఆడుతుంటే వారి జుట్టు ముడులు వీడిపోయాయి. వారి వస్త్రములుజారిపోతున్నాయి. ఆ తన్మయత్వంలో వారు ఇవేమీ పట్టించుకోవడంలేదు.

కృష్ణుడు గోపికలు ఆడుతున్న ఈ రాసలీల చూచి ఆకాశంలో ఉన్న దేవతలు కూడా మన్మథపరవశులయ్యారు. శ్రీకృష్ణుడు తాను ఒక్కడే అయినప్పటికినీ, తన మాయాశక్తితో, అక్కడ ఎంత మంది గోపికలు, గోపకాంతలుఉన్నారో, తాను కూడా అంతమంది అయిపోయి, వారితో విహరిస్తున్నాడు.

తనతో సాగిస్తున్న రతివిహారంలో గోపికల ముఖములు చెమటతో తడిసిపోగా, కృష్ణుడు ఆప్యాయంగా వారి ముఖములను తుడుస్తున్నాడు. కృష్ణుని చేతులు తమ చెక్కిళ్ల మీద పడగానే, ఆగోపికలు పరమానందము పొందారు. వారి మనసులో కృష్ణుని తమ భర్తగా పూజిస్తున్నారు.

యమునా తీరంలో ఆడిపాడి అలసిపోయిన గోపికలు, గోపకాంతలు, తమ చెంత ఉన్న కృష్ణుడితో కలిసి యమునానదీ జలములలో ప్రవేశించి జలక్రీడలు ఆడసాగారు. గోపికలు కృష్ణుని చుట్టు చేరి ఆయన మీద నీళ్లు చల్లుతున్నారు. కృష్ణుడు కూడా వారిని ప్రేమతో చూస్తూ తాను కూడా వారి మీద జలమును చిమ్ముతున్నాడు. ఆ వనములో ఉన్న సుగంధపుష్పముల మీది నుండి వచ్చే పరిమళమును ఆస్వాదిస్తూ గోపికలు కృష్ణుని తో కూడి

జలకాలాడుతున్నారు. ఆ శరత్కాలములో ప్రసరించే చంద్రకిరణముల కాంతిని సేవిస్తున్నారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడు గోపికలతో సలిపిన రాసలీలలను వివరించాడు.

అప్పుడు పరీక్షిత్తును ఒకసందేహము కలిగింది.

"ఓ శుకయోగీంద్రా! కృష్ణుడు తన అన్న బలరామునితో కలిసి దుష్టరక్షణ శిష్టరక్షణ కొరకు ఈ భూమి మీద అవతరించాడు గదా! ధర్మాని కాపాడేవాడు, ధర్మాన్ని తాను ఆచరించి, ఇతరులకు మార్గదర్శకం కావలసిన వాడు, ఈ విధంగా పరస్త్రీలయిన గోపికలను, గోప కాంతలను ఆలించనం చేసుకోవడం, వారితో ఆడడం, పాడడం, క్రీడించడం మొదలగు అధర్మకార్యములను ఎలా చేయగలిగాడు? కృష్ణుడు పరమాత్మ అవతారము. ఆయనకు కోరికలు కానీ, కోరుకోవలసినవి కానీ ఏమీలేవు కదా! ఆయనకు అనుభవించ వలసినవి ఏమీ లేవు కదా! మరి అటువంటి కృష్ణుడు ఈ విధంగా లోకము నిందించే పనులుఎలా చేయగలిగాడు? మాకు ఈ సందేహములను తీర్చండి." అని అడిగాడు.

మత్తకోకిల:
ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముడు ధర్మ శిక్షయు ధర్మరక్షయు జేయగా
నర్మిలిన్ ధరమీద బుట్టి పరాంగనాజనసంగ మే
ధర్మమంచు దలంచి చేసి సుదాత్తమానస చెప్పుమా!

(ధర్మమును ఆచరించే వాడు, ధర్మమునకు అధిపతి అయిన వాడు, ధర్మమే తన స్వరూపముగా కలవాడు, ఎల్లప్పుడూ సత్కర్మలు ఆచరించేవాడు అయిన కృష్ణుడు, అధర్మమును అణచివేసి, ధర్మమును రక్షించుట కొరకు ఈ భూమి మీద అవతరించిన కృష్ణుడు, ఇతరుల భార్యలతోనూ, ఇతర గోపికలతోనూ ఆడటం, పాడటం, క్రీడించడం ఏ పాటి ధర్మము అంటూ చేసాడు. కొంచెం మాకు చెప్పండి. అని మెత్త మెత్తగా చురక అంటించినట్టు మనందరి పక్షాన అడిగాడు పరీక్షిత్తు.)

అప్పుడు శుక మహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

“అగ్నిలో ఏమి వేసినా కాలి పోతుంది. అగ్ని సర్వభక్షకుడు. కాని అగ్ని పవిత్రుడు. అలాగే కృష్ణుడు పరమాత్మ స్వరూపుడు. స్వయం ప్రకాశకుడు. ఆయన ధర్మమును తప్పినట్టు మనకు కనిపించినా, అది ఆయన పట్ల దోషము కాదు. ఎందుకంటే ఆయన ఈ పనులన్నీ నిర్వికారంగా చేసాడు. గోపికల పట్ల కోరికతో, కామంతో చేయలేదు. కాబట్టి ఆ కర్మఫలము ఆయనకు అంటదు.

మానవులు అంతటి నిర్వికారులు కారు. కృష్ణుడు చేసాడు కాబట్టి మేము అలాగే చేస్తాము అనడం తప్పు. పరస్త్రీలను మనసులో కూడా చెడుగా ఊహించడం తప్పు, దోషము, పాపము. పాలసముద్రములో నుండి హాలాహలముపుట్టింది. దానిని ఈశ్వరుడు తాగాడు. తన కంఠములో నిలుపుకున్నాడు. మరి అటువంటి పని సామాన్య మానవుడు చేయగలడా! కాబట్టి కొన్ని పనులు భగవంతుడు మాత్రమే చేయగలడు. వారిని అనుకరించడం మానవులకు మంచిది కాదు.

కొందరు మానవులు సత్యవాక్కుకు కట్టుబడి ఉంటారు. సత్యం పలకడానికి ఎన్ని కష్టనష్టములు కలిగినా వెనుకాడరు. అటువంటి వారిని మానవులు అనుకరించాలే గానీ, కృష్ణుడు చేసాడు కదా అని మానవులు కూడా అనుకరిస్తే కష్టాలపాలవుతారు.

ఈ లోకంలో అహంకారము లేని వారు, ఏ పని అయినా సమర్థతతో నిర్వహించే వారు, లోక హితము కోరి ఏ ధర్మాన్ని ఆచరిస్తారో, అదే ధర్మాన్ని మానవులు కూడా ఆచరించాలి. ఎందుకంటే అటువంటి వారు ఆచరించే ధర్మములో ఎటువంటి స్వార్థబుద్ధి ఉండదు. అటువంటి వారు ఏదో ఒక సమయమున ధర్మము తప్పి, అధర్మము ఆచరించినా, దానివలన ఎటువంటి అనర్థము కలుగదు.

ఎల్లప్పుడు పరమాత్మను మనసులో ఆరాధించేవారు, అహంకారము లేని వారు, ఏ పని చేసినా ఆ కర్మఫలములు వారికి అంటవు. ఆ కర్మలతో వారికి ఎటువంటి సంబంధము ఉండదు. శ్రీకృష్ణుడు అటువంటి వాడే. కాబట్టి కృష్ణుడు ఇతరుల భార్యలతో తిరిగినట్టు కనపడినా ఆయనకు ఆ కర్మల ఫలితము అంటదు. ఆ కర్మల వలన ఆయనకు పాపము గానీ, పుణ్యము గానీ సంక్రమించదు.

ఏ భగవానుని పాదములను ఆశ్రయించి ముక్తిని పొందుతున్నారో, ఏ భగవానుని ప్రభావముచేత యోగులు సమస్త కర్మబంధనముల నుండి విడివడుతున్నారో, అటువంటి యోగులు, జ్ఞానులు తాము చేసిన కర్మల వలన బంధింపబడరు. అటువంటప్పుడు తనకు అవసరం లేకపోయినా, ధర్మస్థాపన కొరకు తనకు తానుగా

అవతరించిన కృష్ణునికి కర్మబంధనములు ఎలా కలుగుతాయి?

ఓ పరీక్షిత్ మహారాజా! పరమాత్మ అనగా ఎవరు? సాక్షాత్తు విష్ణుస్వరూపుడు. విష్ణువు అనగా సర్వవ్యాపి. అందరిలో ఆత్మ స్వరూపుడుగా వెలుగుతున్నాడు. ఆ విష్ణువే కృష్ణుడు. ఆ కృష్ణుడు ఇటు గోపికలు, గోపకాంతలలోనూ, వారి భర్తలలోనూ, అంతర్యామిగా ఉన్నాడు. అంటే తన ఆత్మతో తానే క్రీడిస్తున్నాడు. సామాన్య మానవులకు కృష్ణుని శరీరం వేరు, గోపికల శరీరాలు వేరు అని కనిపిస్తున్నాయి. కాని వారిలో ఉన్న శుద్ధచైతన్యము అంతా ఒక్కటే. అన్నిటా తానే అయి వెలుగుతూ ఉంది. ఆ శుద్ధసత్వగుణ చైతన్యము అందరిలోనూ ఉంది. మానవులు చేసే పనులను బట్టి ఆ చైతన్యము రజోగుణము, తమోగుణముతో మలినపడుతూ ఉంది. అందుకనే మానవులు కృష్ణుడు, వేరు గోపికలు, గోపకాంతలు వేరు అని భేదభావమును పొంది కృష్ణుడు తప్పుచేసాడు, అధర్మము చేసాడు అని అనుకుంటూ ఉంటారు. అందరిలో తానే ఉన్నాడు అని లోకానికి చాటి చెప్పడానికే కృష్ణుడు ఈ రాసలీలను ప్రకటించాడు.ఈ రాసలీలను పరమాత్మ నిర్గుణత్వంగా అర్థం చేసుకోవాలే గానీ, కామక్రీడగా కాదు. ఇదంతా కృష్ణమాయ అనుకుంటే భగవంతుని మీద భక్తి పెరుగుతుంది. అలా కాకుండా కామదృష్టితో చూస్తే, తాను కూడా అటువంటి పనులను చేసి కష్టాలపాలవుతాడు మానవుడు.

నీకు ఇంకొక రహస్యము కూడా చెబుతాను విను. యమునా తీరంలో ప్రతి గోపిక పక్కన ఒక కృష్ణుడు ఎలా కనిపించాడో, అలాగే ఆ గోపికల, గోప కాంతలు కూడా తమ తమ

భర్తల పక్కన, వారి సంతానము పక్కన, అత్త మామల పక్కన ఉన్నారు. ఆ గోపకాంతల భర్తలు తమ తమభార్యలు తమ పక్కనే ఉన్నట్టు భావించారు కాబట్టి వారికి కృష్ణుని పట్ల ఎటువంటి దోషభావము లేదు.

ఇంతలో తెల్లవారుజాము అయింది. గోపికలు, గోపకాంతలు కృష్ణుని విడిచి తమ తమగృహములకు వెళ్లిపోయారు. కృష్ణుడు కూడా తన ఇంటికి వెళ్లాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! పైన చెప్పబడిన రాసలీలలను శ్రద్ధతో గురువు ముఖతా  అధ్యయనం చేసి, అందులో ఉన్న అంతరార్థమును గ్రహిస్తే, వారిలో ఉన్న తుచ్ఛమైన కామ కోరికలు నశిస్తాయి. వారు పరమాత్మ అనుగ్రహం పొందుతారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుని రాసలీలలను వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పదిమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# దశమస్కంధము

# ముప్పదినాలుగవ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఒక రోజు నందవ్రజములో శివపూజలు జరుగుతున్నాయి. నందుడు, గోపకులు కలిసి ఎద్దుల బండ్లు కట్టారు. ఆ బండ్ల మీద అందరూ అంబికా వనము అనే వనమునకు వెళ్లారు. అందరూ సరస్వతీ నదిలో స్నానం చేసారు. సదాశివుని, అంబికా దేవిని పుష్పములతో పూజించారు. నివేదనలు సమర్పించారు. బ్రాహ్మణులకు గోవులను, బంగారమును, వస్త్రములను దానంగా ఇచ్చారు. అందరికీ షడ్రసోపేతమైన భోజనములు వడ్డించారు. వ్రతం చేసే వాళ్లు మాత్రం కేవలం నీరు ఆహారంగా తీసుకున్నారు. ఆ రాత్రి అంతా సరస్వతీ నదీ తీరంలో గడిపారు.

ఆ రోజు అర్ధరాత్రి అవుతుండగా ఒక భయంకరమైన పాము అక్కడికి వచ్చింది. దానికి ఆకలిగాఉంది. ఆహారము ఎక్కడా దొరకలేదు. నేల మీద పడుకొని ఉన్న నందరాజు కనిపించాడు. ఆయనను పట్టుకుంది ఆ పాము. నందరాజు భయంతో కేకలు వేసాడు. "కృష్ణా! రామా! రండి. నన్ను పాము పట్టుకుంది. రక్షించండి." అని కేకలు వేసాడు.

ఆ కేకలు విన్న గోపకులు పరుగు పరుగున అక్కడకు వచ్చారు. జంతువులు రాకుండా వేసుకున్న నెగడు లో నుండి మండుతున్న

కట్టెలను తీసుకొని ఆ పామును కొట్టసాగారు. ఎంత కొట్టినా ఆ పాము నందుని విడిచిపెట్టలేదు. అసలు విషయం తెలిసిన కృష్ణుడు ఆ పాము దగ్గరకు పోయి ఆ పామును తన పాదముతో తాకాడు. వెంటనే ఆ పాము తన సర్పరూపము వదిలిపెట్టి విద్యాధరుడిగా మారి పోయింది. కృష్ణుడికి నమస్కరించి ఈ విధంగా పలికాడు ఆ విద్యాధరుడు.

"కృష్ణా! నేను ఒక విద్యాధరుడను. నా పేరు సుదర్శనుడు. నేను నా విమానము మీద అన్ని చోట్లా తిరుగుతుంటాను. ఒక చోట కొంత మంది ఋషులు తపస్సు చేసుకుంటున్నారు. నేను చాలా అందగాడిని. గడ్డాలు మీసాలు పెరిగి వికృతంగా ఉన్న ఆ ఋషులను చూచి నేను వారిని పరిహాసం చేసాను. వారికి కోపం వచ్చింది. నన్ను పాముగా బతకమని శపించారు. ఇప్పుడు నీ పాదస్పర్శ సోకగానే నాపాపము పోయి నా నిజస్వరూపము వచ్చింది. నిన్ను చూడగానే నాకు బ్రాహ్మణ శాపము నుండి విముక్తి లభించింది. కేవలం నీ నామము జపించ గానే మానవులు పవిత్రులు అవుతుంటారు. అటువంటిది నీ పాదస్పర్శతోనే నేను పవిత్రుడను అయ్యాను అనడంలో ఆశ్చర్యం ఏముంది! నాకు ఆ ఋషులు మహోపకారం చేసారు. లేకపోతే నాకు నీ పాదములను తాకే అదృష్టం కలగదు కదా! తమరు నా మీద దయయుంచి నా లోకమునకు పోవుటకు అనుమతి ఇవ్వండి." అని ప్రార్థించాడు. కృష్ణుడు చిరునవ్వుతో అలాగే అని తలూపాడు. విద్యాధరుడు తన లోకానికి వెళ్లిపోయాడు.

నందుడు పాము బారి నుండి బయట పడ్డందుకు గోపకులు అందరూ సంతోషించారు. వ్రజవాసులందరూ ఆ అంబికా వనములో

మూడు రోజులు ఉండి పూజలు చేసి, తిరిగి నందవ్రజమునకు చేరుకున్నారు.

తరువాత ఒక రోజు రాత్రి కృష్ణుడు, బలరాముడు యమునా నదీ తీరంలో వన విహారం చేస్తున్నారు. వారిని చూచి వ్రజములో ఉన్న గోపికలు కూడా అక్కడకు వచ్చారు. అందరూ కృష్ణుని మహిమలను గానం చేస్తూ విహరిస్తున్నారు. కృష్ణుడు, బలరాముడు కూడా వారితో గొంతు కలిపిపాడుతున్నారు. కృష్ణుడు, బలరాముడు పాడటం చూచి గోపికలు పరవశించిపోయారు. వారు కూడా ఒళ్లు తెలియకుండా నృత్యగానాలతో వినోదిస్తున్నారు.

ఆ సమయంలో శంఖచూడుడు అనే యక్షుడు అక్కడకు వచ్చాడు. ఆ శంఖచూడుని తలలో ఒకమణి ఉంది. తన శిఖలో మణి ఉందని, తనను ఎవరూ ఎదిరించే వాడు లేడని వాడికి గర్వం ఎక్కువ. వీడి రాకను బలరాముడు, కృష్ణుడు చూచారు కానీ, వీడు ఏం చేస్తాడో చూద్దాం అని గమనిస్తున్నారు. ఆ యక్షుడు రామకృష్ణులను చూచి ఏ మాత్రం భయపడకుండా, వారి ఎదురుగానే గోపికలను పట్టుకొని దూరంగా తీసుకొని పోయాడు. యక్షుని చేత పట్టుబడ్డ గోపికలు పెద్దగా ఏడుస్తున్నారు. కాపాడమని బిగ్గరగా కేకలు వేస్తున్నారు.

అది చూచిన బలరామ కృష్ణులు ఆ యక్షుని వెంబడించారు. “భయపడకండి. మేమున్నాము మిమ్ములను రక్షిస్తాము” అని అరుస్తూ కృష్ణుడు ఆ యక్షుడు పోయిన దిక్కుకు పరుగెట్టాడు. బలరాముడు మాత్రం మిగిలిన స్త్రీలకు రక్షణగా అక్కడే ఉండిపోయాడు.

యక్షుడు ఏ దిక్కుకు పోతే ఆ దిక్కుకు పరుగెడుతున్నాడు కృష్ణుడు. ఆఖరుకు కృష్ణుడు ఆ యక్షుని పట్టుకున్నాడు. వాడిని తల బద్దలు కొట్టాడు. వాడి శిఖలో ఉన్న మణిని తీసుకున్నాడు. ఆ విధంగా శంఖచూడుడు అనే ఆ యక్షుడు తాను చేసిన తప్పుకు కృష్ణుడిచేతిలో శిక్ష అనుభవించాడు. కృష్ణుడు గోపికలను, మణిని తీసుకొని బలరాముడు ఉన్నచోటికి వచ్చాడు. ఆ మణిని తన అన్నగారైన బలరామునికి ఇచ్చాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు, సుదర్శన, శంఖచూడుల వృత్తాంతమును వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పది నాలుగవ అధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## ముప్పదిఐదవ అధ్యాయము.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా రోజులు గడుస్తున్నాయి. కృష్ణుడు, బలరాముడు గోప బాలురు పొద్దుటే ఆవులను తోలుకొని సమీపములోని అడవిలోకి వెళ్లారు. సాయంత్రం దాకా ఆవులను మేపి, సాయంత్రము గోధూళి వేళ ఇంటికితిరిగి వస్తారు. పగలంతా కృష్ణుడు తమ కళ్లకు కనపడడు కాబట్టి, నందవ్రజములో ఉన్న గోపికలు కృష్ణుని మీద విరహ వేదనతో కుమిలిపోతున్నారు. ఆ విరహిణులు అయిన గోపికలు అందరూ ఒక చోట చేరి ఇలా తమ విరహాన్ని ఒకరితో

ఒకరు పంచుకుంటున్నారు. వారిలో ఒకగోపిక ఇలా అంది.

"ఓ గోపికలారా! కృష్ణుడు వేణువును ఊదుతుంటే ఆ మధురమంజుల గానమును విని ఏ స్త్రీ ఊరుకుంటుంది చెప్పు. పరుగు పరుగున కృష్ణుని ముందు వాలిపోదూ! అటువంటిది మనం అంతా కృష్ణుని మీద విరహమును ఎలా సహిస్తున్నామో అర్థం కావడం లేదే!" అని నిట్టూర్చింది.

"అది సరే! మరొక ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే...ఆ కృష్ణుని నవ్వుచూచావు. అచ్చు ముత్యాలహారం మెరిసిపోతున్నట్టు ఉంటుందే! కృష్ణుడు తన పెదాల మీద మురళిని ఆనించి వాయిస్తుంటే, ఒక్క మనుషులే కాదు, ఆవులు, ఎద్దులు, ఆవు దూడలు, దూరం నుండి ఆ మురళీరవమును విని, మోరలెత్తి, ఎలా వింటున్నాయో చూడు! అవి గడ్డి తినడం కూడా మరిచిపోయి, నోటిలో ఉన్న గడ్డి నోటిలో ఉండగా, ఎలా కృష్ణుని వేణుగానం వింటున్నాయో కదా! అసలు అవి పశువుల మాదిరి లేవు. ఎవరో చిత్రకారుడు గీచిన బొమ్మల్లా కదలకమెదలక కృష్ణుని మురళీగానమును వింటున్నాయి." అని ఆశ్చర్యపోయింది మరొక గోపిక.

"ఇదేం చూచావు. కృష్ణుడు ఆవులను, ఆవు దూడలను పిలవడానికి అరవడట. కేవలం వేణువు వాయిస్తాడట. అంటే ఆ వేణుగానము విని ఆ ధేనువులు కృష్ణుని వద్దకు పరుగు పరుగున వస్తాయట. అంతే కాదు. యమునా నదీ తీరంలో నిలబడి కృష్ణుడు వేణువు ఊదుతుంటే, యమునా నదీ తరంగాలు కృష్ణుని మురళీగానమును విని ఎలా ఎగిరెగిరి పడుతున్నాయో చూడు!" అని

కృష్ణుని వేణుగానానికి పశువులే కాదు, నదులు కూడా పరవశిస్తున్నాయి.” అని చెప్పింది మరొక గోపిక.

“ఇదేం చూచావు. మన కృష్ణుడు అడవిలో తిరుగుతూ వేణువు ఊదుతూ పశువులను పేరుపేరునా పిలుస్తుంటే, ఆ పిలుపులు విని పశువులే కాదు, వృక్షములు, తీగలు, మొక్కలు కూడా పులకించి పోయి ఎలా తలలు ఊపుతున్నాయో చూడండే!” అని మురిసిపోయింది మరొక ప్రకృతి ప్రేమికురాలు.

“అక్కడ చూడండే! కృష్ణుని మురళీగానమాధుర్యమునకు మురిసి పోయి, ఆ మడుగులో ఈదుతున్న హంసలు, సారసములు, మొదలగు నీటి పక్షులు, ఈదడం, ఎగరడం మాని, కృష్ణగానామృతాన్ని ఎలా ఆస్వాదిస్తున్నాయో చూడండే!” అంది మరొక వనిత.

“సఖులారా! ఆకాశం వంక చూడండే! కృష్ణుడు కొండలమీద ఎక్కి బండలమీద కూర్చుని మనోహరంగా మురళి వాయిస్తుంటే, ఆకాశంలో కదిలే మేఘాలు కూడా కదలకుండా నిలిచిపోయి కృష్ణుని వేణుగానమును ఆస్వాదిస్తున్నాయి. అంతే కాదు కృష్ణుని వేణుగానానికి ఆటంకం కలిగించడం ఇష్టంలేక, ఆకాశంలో మేఘాలు గర్జించడం కూడా మానుకున్నాయి. ఇంకా చూడండే. ఎక్కడ కృష్ణుని మీద ఎండ పడి కందిపోతాడేమో అని మేఘాలు సూర్యుడికి అడ్డంగా నిలబడి కృష్ణుని మీద ఎండపడకుండా గొడుగుపడుతున్నట్టున్నాయికదూ!” అని తన భావకవితను వినిపించింది మరొక భామ.

"ఇవన్నీ ఒకటైతే మరొక విచిత్రం కూడా జరుగుతూ ఉంది. కృష్ణుని వేణుగానామృతమును విన్న దేవతా గణములు, ఇంద్రుడు మొదలగు లోక పాలకులు, తాము స్వయంగా స్వరజ్ఞానము కలవారయ్యును, కృష్ణుని వేణుగానానికి పరవశించి పోయి, తలలు వంచుకొని తదేకంగా కృష్ణుని గానామృతాన్ని ఆస్వాదిస్తున్నారు. పరవశించిపోతున్నారు." అంది మరొక వనిత.

"అది కాదే! కృష్ణుడు ఆవుల వెంట మురళి ఊదుతూ మెల్లిగా ఏనుగు నడిచినట్టు నడుస్తుంటే, వెనుక నుండి చూచిన వారు, ఆ మనోహరాకారుడి ముగ్ధమోహన గానమును విని ఒంటిమీది బట్టలు జారిపోయేది కూడా తెలియకుండా అలాగే నిలబడి పోతున్నారు." అంది మరొక గొల్లభామ.

"ఆ సమయంలో కృష్ణుడు పక్కనే ఉన్న గోపబాలుని బుజం మీద చెయ్యి ఆనించి వయ్యారంగా నిలబడి వేణువు ఊదుతున్నప్పుడు చూడాలి అబ్బ! కృష్ణుడు ఎంత అందంగా ఉంటాడో! ఆ మోహనాకారుడి మురళీరవమును విన్న లేళ్లు మన మాదిరే తమ వారందరినీ వదిలిపెట్టి కృష్ణుని చుట్టు చేరి, వేణుగానాన్ని ఆస్వాదిస్తు అక్కడి నుండి కదలడం లేదు! అవి కూడా మన మాదిరే ఎంతటి అదృష్టాన్ని చేసుకున్నాయో!" అంది మరొక గోపకాంత.

"నువ్వు మరీనూ! ఆవులు, దూడలు,పక్షులు, లేళ్లు, కొండలు, మేఘములు, నదులు వీటి గురించే చెప్పావు. కృష్ణుడు వేణువు ఊదుతుంటే, గాలి కూడా మెల్లి మెల్లిగా వీస్తూ, వేణువు ఊదే కృష్ణునికి, వినే పశుపక్ష్యాదులకు ఆహ్లాదాన్ని, ఆనందాన్నికలుగ చేస్తూ ఉంది..

పంచభూతములు కృష్ణగానామృతానికి స్పందించడం చూచి, దేవతలు, గంధర్వులు కూడా తాము గొంతు కలిపి పాడుతున్నారు. ఆడుతున్నారు." అంది మరొక వనిత భావోద్వేగంతో.

వీరు ఇలా మాట్లాడుకుంటూ ఉండగా సాయం కాలం అయింది. కృష్ణుడు ఆవులను తోలుకుంటూ, మురళి వాయిస్తూ వస్తున్నాడు. కృష్ణుడిని చూడగానే గోపికలకు ప్రాణాలు లేచి వచ్చాయి. కృష్ణుడి వంక తదేకంగా చూస్తున్నారు.

"అటు చూడండే! కృష్ణుడు మురళివాయిస్తూ ఎలా వస్తున్నాడో! అమ్మో! పెద్ద వాళ్లు కూడా ఆయనకు దండాలు పెడుతున్నారు. పెట్టరూ మరి! కృష్ణుడు ఎన్ని పనులు చేసాడు. ఈ వ్రజ ప్రజలను ఎలాకాపాడాడు. కృష్ణుడు వయసులో చిన్నవాడైనా తాను చేసిన పనులలో పెద్దవాడు. అందుకే దండాలుపెట్టినా తప్పులేదు." అంది ఒక గోప కాంత.

"అవునే! గోవులు ఇంటికి వచ్చే ఆనందంతో పరుగెడుతుంటే, గోవుల కాలిగిట్టల నుండి రేగిన ధూళి కృష్ణుని ముఖం మీదపడుతుంటే ఎలా తుడుచుకుంటున్నాడో చూడండే! అయినా ఆ ముఖంలో కళ, పెదాల మీద చిరునవ్వు మాసిపోలేదే! కృష్ణుని ముఖారవిందమును కనులారా చూస్తుంటే, పగలంతా పడ్డ విరహవేదన క్షణాలలో మటుమాయం అయిందే! మనసంతా ఆనందంతో నిండి పోయింది." అంది మరొక వనిత.

ఇంతలో కృష్ణుడు వారి సమీపానికి వచ్చాడు. ఆ ఆనందానికి తట్టుకోలేక ఒకగోపిక “ఆహా! కృష్ణుడి కళ్లు చూడవే ఎంత మత్తుగా ఉన్నాయో! ఆ నడక, ఆ హొయలు, ఆ చిరునవ్వు, రాత్రి కాగానే వచ్చే పున్నమి చంద్రుడిలా ప్రకాశిస్తున్న ఆ ముద్దు ముఖముతో వస్తున్న నల్లని అల్లరి కృష్ణయ్యను చూస్తుంటే పగలంతా ఈ అల్లరి కృష్ణుడిని చూడలేదే అన్న బాధ తొలగిపోయిందే!” అంది మరొక మాతృమూర్తి.

ఓ పరీక్షిత్ మహారాజా! సాక్షాత్తు విష్ణ్వంశ సంభూతుడైన కృష్ణుని చూచి ఈ వ్రజవాసులు ఆ ప్రకారంగా పరవశించిపోతున్నారు. కృష్ణుని సాహచర్యంలో వారి జీవితాలు ధన్యం అయ్యాయి.” అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు గోపికల మనోభావాలను వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పది ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(ఈ అధ్యాయంతో శ్రీకృష్ణుని రాసలీలలు గోపికలతో విహారాలు, గోపికల విరహ గీతాలు ముగిసాయి. తరువాత కృష్ణుడు మధుర వెళ్లాడు. అక్కడి నుండి ద్వారక వెళ్లాడు. మరలా నందవ్రజమునకు తిరిగి రాలేదు.)

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## ముప్పది ఆరవ అధ్యాయము

" ఓ పరీక్షిత్ మహారాజా! నంద వ్రజములో ఒక రోజు ఒక పొగరెక్కిన ఎద్దు తన గిట్టలతో భూమిని తవ్వుతూ, కొమ్ములతో అడ్డు వచ్చిన వారిని కుమ్ముతూ నందవ్రజములోకి ప్రవేశించింది. ఆ ఎద్దు పెద్ద పెద్దగా రంకెలు వేస్తూ ఉంది. తోక పైకెత్తి కొమ్ముల చివరలతో పొడుస్తూ ఉంది. ఆ ఎద్దుకు భయపడి గోప స్త్రీలు, పిల్లలు భయంతో ఇళ్లలోకి వెళ్లి తలుపులు వేసుకున్నారు. గోప బాలురు, ఆ ఊరి వారు కూడా భయపడి దానిని ఎదుర్కోలేకపోయారు. భయం భయంగా పక్కల నిలబడి చూస్తున్నారు.

మనుషుల పని ఇలా ఉంటే, ఆ ఎద్దు రంకెలకు భయపడి గోశాలలో ఉన్న గోవులు, దూడలు కట్టు తెంచుకొని భయంతో దిక్కు తోచకుండా పరుగెడుతున్నాయి. అంబా అంబా అని తమ భాషలో మమ్ములను రక్షించండి అని అరుస్తున్నాయి. ఈ విషయం కృష్ణునికి బలరామునికి తెలిసింది. వెంటనే ఆ ఎద్దు దగ్గరకు వచ్చారు. అందరినీ భయపడవద్దని అభయం ఇచ్చాడు.  ఆ ఎద్దు వంక చూచాడు.

"ఓసి వృషభమా! అమాయకులైన గోపాలురను ఆడవాళ్లను భయపెడితే లాభం ఏముంటుంది. ఇక్కడ నేను ఉన్నాను, నా మీదికి రా."అంటూ ఆ ఎద్దును పోరాటానికి ఆహ్వానించాడు కృష్ణుడు. ఆ ఎద్దు ఎదురుగా నిలబడ్డాడు. చేతులు చరుస్తూ, బుజాలు చరుచుకుంటూ ఆ ఎద్దు ఎటు తిరిగితే అటు తిరుగుతున్నాడు. ఒక చిన్న బాలుడు తన

మీదికి రావడం చూచి కోపంతో రగిలిపోయింది ఆ వృషభము. . తన తల ముందుకు చాచి కృష్ణుని తన వాడి అయినకొమ్ములతో పొడవబోయింది. కృష్ణుడు ఒడుపుగా ఆ ఎద్దు కొమ్ములు పట్టుకున్నాడు. ఆ ఎద్దు కృష్ణుని వెనక్కు నెట్టింది. కృష్ణుడు వెనక్కు వచ్చినట్టే వచ్చి ముందుకు దూకాడు. ఆ ఎద్దు కొమ్ములనుపట్టుకొని విరిచాడు. దాని తలను తిప్పాడు. కొమ్ములు లాగేసాడు. తల విరిచాడు. ఆ ఎద్దును నేల మీద పడేసి తొక్కాడు. ఆ ఎద్దు గిలా గిలా కొట్టుకుంటూ మరణించింది. ఆ ప్రకారంగా ఎద్దును చంపిన కృష్ణుడు పారిపోయిన ఆవులను తోలుకుంటూ గోశాలలోకి వచ్చాడు. వ్రజములో ఉన్న గోపకులు అందరూ కృష్ణుని రకరకాలుగా స్తుతించారు.

నందవ్రజములో ఇలా ఉండగా, ఒకరోజు మధురా నగరరాజైన కంసుని అంత:పురములోకి నారదుడు ప్రవేశించాడు. కంసుడు నారదుని సాదరంగా ఆహ్వానించి, అర్ఘ్యముపాద్యము ఇచ్చి సత్కరించాడు. ఉచితాసనము మీద కూర్చోపెట్టాడు. అప్పుడు నారదుడు కంసునితో ఇలా అన్నాడు.

(కంసుడు అంటే ఎవరో తెలుసు కదా! మరలా ఒకసారి గుర్తు చేస్తాను. కంసుడు దేవకీదేవి అన్నగారు. కృష్ణునికి స్వయానా మేనమామ. విష్ణువు కంసుడిని చంపడానికి దేవకీదేవి అష్టమ గర్భంలో కృష్ణుడిగా అవతరించాడు. ఈ విషయాన్ని ఆకాశ వాణి పలికితే, దేవకీదేవిని చంపబోయాడు కంసుడు. తరువాత పిల్లల మార్పిడి జరిగింది. కృష్ణుడు నందవ్రజానికి వచ్చాడు. యోగమాయ దేవకీదేవి వద్దకు చేరింది. యోగమాయను కంసుడు చంపబోతే, ఆమె తన నిజరూపంతో కనపడి కంసుని చంపేవాడు పుట్టి పెరుగుతున్నాడు అని

చెప్పింది. కంసునికి తనను చంపేవాడు ఎక్కడు పుట్టి పెరుగుతున్నాడో తెలియదు. అందుకని తనరాజ్యంలో పుట్టిన వారినందరినీ చంపుతున్నాడు కంసుడు. ఇంక చదవండి.)

నారదుడు కంసుని చూచి ఇలా అన్నాడు. "కంసరాజా! నీకు ఒక రహస్యంచెబుతాను. జాగ్రత్తగా విను. దేవకీదేవికి ఎనిమిదవ గర్భంలో ఆడపిల్ల పుట్టిందని అన్నారు కదా! నిజానికి ఆ ఆడపిల్ల నందవ్రజములో ఉన్న నందుని భార్య యశోదకు పుట్టిన బిడ్డ. నీ చెల్లి దేవకీదేవికి ఎనిమిదవ గర్భంలో మగపిల్లవాడు పుట్టాడు. ఆ కుమారుడు ప్రస్తుతము నందవ్రజములో యశోదా నందుల ఇంట్లో కృష్ణుడు అనే పేరుతో పెరుగుతున్నాడు. నీకు ఇంకో విషయం కూడా చెబుతాను విను. దేవకీదేవికి ఏడవ గర్భం పోయిందని అన్నారు కదా! అని నిజం కాదు. దేవకీదేవి ఏడవ గర్భంలో ఉన్న పిండాన్ని తీసి, వసుదేవుని మరొక భార్య రోహిణి గర్భంలో ప్రవేశపెట్టబడింది. అంటే దేవకీదేవి ఏడవ గర్భంలో పుట్టిన వాడు కూడా రోహిణి వద్ద బలరాముడు అనే పేరుతో పెరుగుతున్నాడు. ఇదంతా వసుదేవునికి తెలుసు. నీవు చంపుతావు అని భయపడి వసుదేవుడు తనకు పుట్టిన ఏడు, ఎనిమిదవ కుమారులను రహస్యంగా నందుని ఇంటికి చేర్చి, అక్కడ పెంచుతున్నాడు. అంటే దేవకీవసుదేవుల కుమారులు, బలరాముడు, కృష్ణుడు అనే పేర్లతో నందవ్రజములో నందుని ఇంట పెరుగుతున్నారు. నీవు పంపుతున్న రాక్షసుల నందరినీ ఈ బలరామకృష్ణులే చంపుతున్నారు. నీరాజ్యం అంతా ఎదురులేకుండా తిరిగిన నీ అనుచరులు అందరూ ఆ నందవ్రజములోనే ఎందుకు మరణిస్తారు. ఆలోచించు. ఉన్న విషయం చెప్పాను. తరువాత నీ ఇష్టం."

అని చెప్పాడు నారదుడు.

తన వెనుక ఇంతటి కుట్ర జరిగిందని తెలిసిన కంసుడు కోపంతోమండి పడ్డాడు. వెంటనే కత్తి తీసుకొని వసుదేవుని చంపడానికి బయలు దేరాడు. వెంటనే నారదుడు కంసుని చెయ్యిపట్టుకొని ఆపాడు.

"కంసరాజా! ఈ తొందరపాటే నీకు చేటుతెచ్చింది. ఇప్పుడు నీవు వసుదేవుని చంపావనుకో. అక్కడ నందుడు, బలరామకృష్ణులు పారి పోతారు. నీ శత్రువులు బలరామ కృష్ణులు కానీ, వసుదేవుడు కాదు కదా! అందుకని వసుదేవుని చంపే కార్యక్రమం వద్దు." అని వారించాడు. కంసుని చావు కబురు చల్లగా చెప్పిన నారదుడు అక్కడినుండి వెళ్లిపోయాడు.

తన చావుకు కారకులైన వారికి జన్మనిచ్చినందుకు, దేవకీ వసుదేవులను కారాగారంలో బంధించాడు కంసుడు. బలరామ కృష్ణులను వెంటనే అంతమొందించాలనుకున్నాడు కంసుడు. ఆలస్యం చేయకుండా కేశి అనే రాక్షసుని పిలిచాడు. "నీవు వెంటనే నందవ్రజమునకుపోయి అక్కడ నందుని ఇంటిలో పెరుగుతున్న బలరాముడు, కృష్ణుడు అనే బాలురను చంపెయ్యి."అని ఆజ్ఞాపించాడు.

అంతటితో తృప్తి చెందలేదు కంసుడు. చాణూరుడు, ముష్టికుడు అనే మల్లయోధులను, శలుడు, తోషలకుడు అనే మంత్రులను, ఏనుగులను నడిపే మావటి వాండ్లను పిలిపించాడు. వారితో ఇలా అన్నాడు.

"బలరాముడు, కృష్ణుడు అనే బాలురు మనకు శత్రువులు. వారిని మనం చంపాలి. నేను ఆ బాలకులను ఇక్కడు పిలిపిస్తున్నాను. ఓ చాణూరా! ముష్టికా! వారు రాగానే మీరు వారితో మల్లయుద్ధము చేసి వారిని చంపేయాలి. దానికి తగిన ఏర్పాట్లు చేయండి. మల్లయుద్ధ పోటీలు ఏర్పాటు చేయండి. బలరామకృష్ణులను మల్లయుద్ధమునకు ఆహ్వానించండి. చంపండి." అనిఆదేశించాడు.

మావటి వాడు అయిన భద్రుని చూచి ఇలా అన్నాడు. "మల్లయోధుల నుండి వారు తప్పించుకుంటే నీవు వారిని చంపాలి. ఎలాగంటే......నీవు నీ దగ్గర ఉన్న మదపు టేనుగు కువలయాపీడమును ఆ మల్లయుద్ధము జరిగే స్థలములో నిలుపు. వారు రాగానే నీ ఏనుగును వారిమీదికి ఉసిగొలిపి, ఆ ఇరువురి బాలురను. నీ ఏనుగు కాళ్లకిందపడేసి, తొక్కి, చంపించు.

మంత్రులారా! ఈ కార్యక్రమాలు జరగడానికి ఏదో కారణం ఉండాలి కదా! అందుకని రాబోయే చతుర్థశి నాడు మధురలో ధనుర్యాగము జరిపించండి. ఈశ్వరుని పూజించండి. ఈశ్వరునికి ప్రీతిగా పశువులను బలి ఇవ్వండి. ఈ ధనుర్యాగము చూడటానికి నేను నంద్రవ్రజము వారికి ఆహ్వానము పంపుతాను. వారందరూ వస్తారు. వారితో పాటు బలరామ కృష్ణులు వస్తారు. అప్పుడు వారిని చంపండి." అని ఆజ్ఞలను ఇచ్చాడు కంసుడు.

వారందరూ వెళ్లి పోయిన తరువాత కంసుడు యాదవులలో ప్రముఖుడైన అక్రూరుడిని పిలిపించాడు. అక్రూరుడు వచ్చి కంసుని ముందు చేతులు కట్టుకొని నిలబడ్డాడు. అక్రూరుని చూచి కంసుడు ఇలా అన్నాడు.

"అక్రూరుడా! నీవు నాకు మంచి స్నేహితుడవు. ఆ స్నేహధర్మంలో నాకు ఒక పని చేసిపెట్టు. మన భోజవంశంలో, వృష్ణివంశములో, నిన్ను మించిన స్నేహితులు నాకు ఎవరున్నారు చెప్పు! నా మీద ప్రేమ అభిమానము చూపేవారు, నా మేలు గోరేవారు నీవు తప్ప వేరే ఎవరూ లేరు కదా! నీవు నావాడివి, నా ఆంతరంగికుడివి అని నమ్మి నీ మీద ఒక పెద్దబాధ్యత పెడుతున్నాను. ఆ పని నీవు తప్ప వేరెవ్వరూ సక్రమంగా నిర్వర్తించలేరు అని నా నమ్మకం.

ఏమీ లేదు అక్రూరా! నీవు ఇప్పుడు నందవ్రజమునకు వెళ్లాలి. రథం మీద వెళ్లు. నందవ్రజములో బలరాముడు, కృష్ణుడు అనే ఇద్దరు బాలురు ఉన్నారటా. వారిని మధురకు తీసుకొని రావాలి. అసలు విషయం నీకు తప్ప వేరే ఎవరికిచెప్పకుంటాను. అదేమిటంటే... ఈ బాలురు ఇద్దరూ విష్ణు అంశలో నన్ను చంపడానికి పుట్టారు అని నారదుడు చెప్పాడు. వారు నన్ను చంపక ముందే నేను వారిని చంపుతాను. ముందు ఏనుగును ఉసిగొలుపుతాను. ఏనుగు వారిని తొక్కి చంపుతుంది. అక్కడ తప్పించుకుంటే. ఇద్దరు మల్లయోధులు వారిని మల్లయుద్ధంలో చంపుతారు. ఇదీ ప్రణాళిక.

అక్రూరా! ఆ ఇద్దరినీ తీసుకొని వస్తే అనుమానం వస్తుంది. అందుకని నందుని, అతని పరివారమును ధనుర్యాగమునకు

ఆహ్వానించు. వారిని కానుకలు పట్టుకు రమ్మనిచెప్పు. వారితో పాటు బలరాముడు, కృష్ణుని కూడా తీసుకొని రా!

నీకు ఇంకో రహస్యం కూడా చెబుతాను. ఆ ఇద్దరు బాలురు నందుని కుమారులు కారు. వసుదేవుని కుమారులు. నేను వారిని చంపగానే, సహజంగా వసుదేవుడు, దేవకీదేవి, వృష్ణివంశీయులు, భోజ, దాశార్హ వంశమువారు వారి బంధువులు, మిత్రులు ఏడుస్తారు. తిరగ బడతారు. వెంటనే వారినందరినీ కూడా చంపేస్తాను. తరువాత నా తండ్రి అయిన ఉగ్రసేనుని, అతని తమ్ముడు దేవకుని వారి మిత్రులను అందరినీ చంపేస్తాను. అప్పుడు నాకు ఎదురు చెప్పేవాళ్లు ఉండరు.

ఇంకా ఎవరైనా నా మీద తిరగబడితే, నా గురువుగారు జరాసంధుడు, నా మిత్రుడు ద్వివిదుడు, శంబరుడు, నరకుడు, బాణుడు మొదలగు రాజుల అండతో నాకు ఎదురు తిరిగిన రాజులను సంహరిస్తాను. నా మార్గము నిష్కంటకం చేసుకుంటాను. ఈ భూమినంతా ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలిస్తాను. చూసావా! నీవు బలరామ కృష్ణులను మధురకు తీసుకురావడంతో నాకు ఎన్ని లాభాలు చేకూరుతాయో! నీ మిత్రుడైన నాకు మంచి జరిగితే, నీకూ మంచి జరిగినట్టే కదా! నువ్వు నాకు ఈ పని చేసి పెడితే, నీకు ఉన్నతమైన పదవినిచ్చి గౌరవిస్తాను. కాబట్టి ధనుర్యాగము చూడటానికీ, మధురా నగరంలో పర్యటించడానికి అని చెప్పి నందుని, అతని పరివారమును, బలరామ కృష్ణులను వెంటనే మధురకు తీసుకొని వచ్చే బాధ్యతను నీకు అప్పగిస్తున్నాను." అని ఉన్న విషయాన్ని కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడు

కంసుడు. కంసుని మాటలను సావధానంగావిన్న అక్రూరుడు కంసునితో ఇలా అన్నాడు.

"కంస మహారాజా! బలరాముడు కృష్ణుని చేతిలో చావు తప్పించుకోడానికి మంచి పథకమే వేసావు. చాలా బాగుంది. నీ పథకం ఫలించినా, ఫలించకపోయినా, నీవు ఏమీ చింతించ వద్దు. ఎందుకంటే మనము ఒకటి తలిస్తే విధి మరొకటి తలుస్తుంది కదా! పనులు చేయడమే మన కర్తవ్యం. దానికి తగిన ఫలమును దైవం ఇస్తుంది. మానవుడు ఏమేమో ఊహించుకొని, ఏవేవో కార్యములు చేస్తుంటాడు. ఆ కార్యముల వలన ఒక్కోసారి సుఖం ఆనందం కలుగుతుంది. మరొకసారి అంతులేని దు:ఖం కలుగుతుంది. ఏది ఏమైనా కానీ, నీవు చెప్పావు కాబట్టి నీవు చెప్పిన పని నేను చేస్తాను. ఎలా జరగాలో అలా జరుగుతుంది." అని అన్నాడు అక్రూరుడు. ఆ ప్రకారంగా అక్రూరుని ఆదేశించిన కంసుడు తన అంత:పురమునకు వెళ్లిపోయాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కంసుని అంతరంగాన్ని విపులీకరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పైఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## ముప్పైఏడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! కంసుడు పంపిన కేశి అనే రాక్షసుడు గోకులమునకు వెళ్లాడు. తాను రాక్షసుడిని, తనను ఎవరూ ఏమీ చెయ్యలేరు ఈ గోపకులను చీమలను నలిపినట్టు నలిపేస్తాను, అసలు ఇద్దరు చిన్న బాలురను చంపడానికి కంసమహారాజు నన్ను ఎందుకు పంపాడో ఏమో, అయినా ఏముందిలే చిటికలో పనిముగించుకొని పోవచ్చు  అనుకుంటూ వల్లమాలిన గర్వంతో గోకులంలోకి ప్రవేశించాడు.

కామరూపుడైన ఆ రాక్షసుడు గుర్రం రూపం ధరించాడు. పెద్దగా సకిలించాడు. తోకను పైకెత్తి గిట్టలతో నేలను తవ్వుతూ, ఈ కృష్ణుడు, బలరాముడు అనే బాలురు ఎక్కడ ఉన్నారా అని వెతుకుతూ గోకులం అంతా ఎగురుతూ గెంతుతున్నాడు. వీడెవరో రాక్షసుడు లాగున్నాడు వీడి సంగతి చూద్దాం అనుకుంటూ కృష్ణుడు వాడికి ఎదురు పోయి "నువ్వు వెదుకుతున్న కృష్ణుడు నేనే. ఏం చేస్తావు" అన్నట్టు ధీమాగా వాడికి ఎదురుగా నిలబడ్డాడు.

లడ్డులాగా దొరికాడురా కుర్రాడు అనుకుంటూ కేశి కృష్ణుని మీదికి పరుగెత్తాడు. వెనక్కు తిరిగి తన వెనకకాళ్లతో కృష్ణుని ఒక తాపు తన్నాడు. కృష్ణుడు పక్కకు తిరిగి తప్పించుకున్నాడు. కాని తనను తన్నడానికి ఎత్తిన వాడి రెండు వెనక కాళ్లను రెండు చేతులతో

పట్టుకున్నాడు. గాలిలోకి లేపాడు. గిరా గిరా తిప్పాడు. నేలకేసి బాదాడు. మరలా పైకెత్తి గిరా గిరా తిప్పి దూరంగా విసిరివేసాడు.

కేశికి దిమ్మతిరిగింది. వీడు సామాన్యుడు కాడు. వీడికి తన ప్రతాపం చూపించాల్సిందే అనుకున్నాడు కేసి. కిందపడ్డవాడు లేచి నిలబడ్డాడు. మరలా గిట్టలతో నేలను తన్నాడు. నోరు తెరిచి హా అని అరుస్తూ కృష్ణుని మీదికి పరుగెత్తాడు. ఈసారి కృష్ణుడు, నోరు తెరుచుకొని వేగంగా తన మీదికి వస్తున్న కేశి నోట్లోకి తన ఎడమ చేతిని దోపాడు. దొరికాడు కదా అని కృష్ణుని ఎడమ చేతిని తన పళ్లతో కరా కరా నములుదామనుకున్నాడు కేసి. కాని కృష్ణుని చేయి మండుతున్న ఇనపగుండులాగా వాడి నోటిని కాలుస్తూ ఉంది. ఆ దెబ్బకు వాటి నోట్లోని పళ్లు రాలి కిందపడ్డాయి.

కృష్ణుడు తన చేతిని బాగా పెంచాడు. కేసి నోరు పగిలిపోయేటట్టు ఉంది. నోటినిండా కృష్ణుడు చేయి ఉండటం వలన, కేశికి ఊపిరి ఆడటం లేదు. అటు ఇటు కొట్టుకుంటున్నాడు. వాడి ఒళ్లంతా చెమటతో తడిసిపోయింది. కృష్ణుడి చేయి తీస్తేగానీ వాడికి ఊపిరి ఆడదు. కృష్ణుడు తియ్యడు. కేశి కనుగుడ్లు తేలేసాడు. గిలా గిలా కొట్టుకుంటూ కిందపడి పోయాడు. వాడి ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి.

కిందపడ్డ కేసి నోట్లో నుండి కృష్ణుడు తన చేతిని బయటకు లాగాడు. చేతులు దులుపుకుంటూ ఏమీ ఎరగ నట్టు అక్కడి నుండి వెళ్లిపోయాడు. ఇదంతా అదృశ్యరూపంలో ఉండి గమనిస్తున్న నారదుడు కృష్ణుని వద్దకు వచ్చి ఆయనను ఈ ప్రకారంగా

స్తుతించాడు.

"కృష్ణా! యోగేశా! జగదీశ్వరా! వాసుదేవా! ప్రభో! నీకు నమస్కారము. నీవు పరమాత్మ స్వరూపుడవు. అందరి హృదయాలలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. నీవు మానవుల బుద్ధికి, వాక్కుకు, మనసుకు అందవు. నీవు సర్వసాక్షివి. జగత్తును శాసించేవాడివి. మహాపురుషుడవు. ఈశ్వరుడవు. సత్వ,రజస్తమోగుణములు నీ మాయ చేత సృష్టించ బడ్డాయి. ఆ గుణములతో కూడిన ఈ అనంత సృష్టి స్థితి లయము అనే కార్యములను అవలీలగా చేస్తున్నావు. నీవు ఏదైనా సంకల్పిస్తే అది జరిగి తీరుతుంది. ఎందుకంటే నీవు సర్వశక్తిమంతుడవు. అట్టినీవు, మానవలోకంలో పెరిగిపోయిన పాపములను ప్రక్షాళన చేసి, ధర్మమును స్థాపించడానికి, దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేయడానికి మానవ రూపంలో అవతరించావు.

ఇప్పుడు నీవు చంపిన కేశి సామాన్యుడు కాదు. వాడు ఇప్పటిదాకా దేవతలను కేవలం తన అరుపులతోనే భయపెట్టేవాడు. వాడి అరుపులకు దేవతలు గడగడవణికిపోయేవారు. అట్టి కేశిని నీవు అవలీలగా ఏ మాత్రం శ్రమలేకుండా సంహరించావు. వీడితో నీ శత్రునాశనం మొదలయింది. చాణూరుడు, ముష్టికుడు, కువలయాపీడము, కంసుడు నీ చేతిలో మరణించడం త్వరలోనే చూడగలను.

ఆహా! పరమాత్మా! నీ దయ వలన నాకు భవిష్యత్తు గోచరమౌతూ ఉంది. కంస వధ తరువాత నీవు శంఖుడు, యవనుడు,

ముర, నరకుడు మొదలగు రాక్షసులను సంహరిస్తావు. పారిజాత వృక్షమును దివి నుండి భువికి తీసుకొని వస్తావు. ఇంద్రుడి గర్వము అణుస్తావు. క్షత్రియ కన్యలను వివాహం చేసుకుంటావు. ద్వారకలో నృగమహారాజును శాపవిముక్తుడిని చేస్తావు. శ్యమంతక మణితో సహా జాంబవతిని వివాహం చేసుకుంటావు. చనిపోయిన బ్రాహ్మణ బాలకుని యమలోకం నుండి తిరిగి తీసుకొని వస్తావు. పౌండ్రకుని, దంతవక్త్రుని చంపుతావు. రాజసూయ యాగ సందర్భంలో నిన్ను అకారణంగా దూషించిన శిశుపాలుని నీ చక్రంతో వధిస్తావు. ఈ అవతారములో నీవు చేసే లీలలు అన్నీ నేను కళ్లారా చూడగలను. నీ కథలను కవులు వివిధరూపములతో కీర్తిస్తుంటారు.

పాపభూయిష్టమైన రాజకులమును నాశనం చేయడానికి కురుక్షేత్ర మహా సంగ్రామమునకు బీజం వేస్తావు. నరుడైన అర్జునునికి సారథిగా ఉండి కురుక్షేత్రమును స్వయంగా నడిపిస్తావు. నీవు ఏ ఆయుధము ధరించకుండా, 18 అక్షౌహిణుల సైన్యమును వారిలో వారు కొట్టుకొని చచ్చేట్టు చేస్తావు. నీ ఈ లీలలన్నీ చూచే భాగ్యము నాకు కలగబోతోంది. నీవు విశుద్ధమైన విజ్ఞాన స్వరూపుడవు. నీవు ఏమీ చేయకుండానే కేవలం నీ సంకల్పం చేతనే అన్ని కార్యములు జరిపిస్తుంటావు. నీవు ఏది కోరితే అది జరిగి తీరుతుంది. మూడుగుణములతో నిండిన ఈ జగత్తు నీ కనుసన్నలలో నడుస్తూ ఉంది. అట్టి నిన్ను నేను శరణువేడుతున్నాను.

ఓ దేవా! నీవు సర్వస్వతంత్రుడవు. నీవు అన్ని కర్మలు చేస్తుంటావు. కాని ఆ కర్మఫలములు నీకు అంటవు. వైకుంఠము కైలాసము సత్యలోకము అన్నీ నీవు కల్పించినవే! నీవు నిరాకారుడవు

అయినా ధర్మసంస్థాపన కొరకు మానవుల మధ్య మానవుడిగా అవతరించావు. యదు వంశము, సాత్వత వంశము, వృష్ణి వంశములను  ఉద్ధరించావు. అట్టి నీకు నమస్కారము." అని నారదుడు కృష్ణుని స్తుతించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! కేశి అనే రాక్షసుని సంహరించిన కృష్ణుని చూడగానే నారదుడు పరమానందంతో ఈ విధంగా స్తుతించి, లోక సంచారమునకు వెళ్లిపోయాడు. కృష్ణుడు ఏమీ తెలియనట్టు గోవులను తోలుకొని వాటిని మేపడానికి  గోప బాలురతో సహా అడవిలోకి వెళ్లాడు. తన తోటి గోపబాలురతో ఆడుకుంటున్నాడు. పాడుకుంటున్నాడు. నృత్యం చేస్తున్నాడు. అల్లరి చేస్తున్నాడు.

కేసి మీద నమ్మకం లేని కంసుడు కృష్ణుడిని చంపడానికి మయుడి కుమారుడైన వ్యోముడు అనే దానవుని కూడా పంపాడు. వాడు కృష్ణుని వెతుక్కుంటూ అడవిలోకి వచ్చాడు. ఆ సమయంలో కృష్ణుడు, గోపబాలురు, దొంగను పట్టుకోవడం ఆట ఆడుకకుంటున్నారు. కొంత మంది గోపబాలురు  మేకలను దొంగిలించే దొంగలుగానూ, మరి కొందరు మేకలు గానూ,  మిగిలిన వాళ్లు వాళ్లను పట్టుకునేవారు గానూ ఆడుకుంటున్నారు.

ఈ వ్యోముడు కూడా మేక వేషంలో వారితో కలిసిపోయాడు. వారితో ఆడుకుంటున్నట్టే ఆడుకుంటూ దూరంగా పారిపోయాడు. ఆ మేకను తరుముకుంటూ గోప బాలురు కూడా పరుగెత్తారు. ఆ దైత్యుడు గోపబాలురను అందరికీ ఒక కొండ గుహలోకి తీసుకెళ్లి బంధించాడు.

రాతితో గుహ ద్వారము మూసివేసాడు. కృష్ణుని వద్ద కేవలము నలుగురు బాలురు మాత్రము ఆడుకుంటున్నారు.

కృష్ణుడికి అనుమానం వచ్చింది. తమలోకి వచ్చిన ఆ తోడేలు వంటి మేకను చూచాడు. ఇది రాక్షసుల పని అనుకున్నాడు. మేక రూపంలో ఉన్న రాక్షసుని పీక పట్టుకున్నాడు. కృష్ణుని పట్టు విడిపించుకోడానికి ఆ రాక్షసుడు గిలా గిలా కొట్టుకుంటున్నాడు. వాడి శరీరం అంతకంతకూ బలహీనమై పోతూ ఉంది. కృష్ణుడి పట్టు విడిపించుకోలేక పోతున్నాడు. కృష్ణుడు ఆ రాక్షసుని ఒంటి చేత్తో పైకెత్తి నేలకేసి మోదసాగాడు. ఆ దెబ్బలకు తట్టుకోలేక ఆ రాక్షసుడు రక్తం కక్కుకొని మరణించాడు.

వాడిని అక్కడే వదిలేసి గోపబాలురు బంధించపడ్డ గుహ వద్దకు వెళ్లాడు కృష్ణుడు. గుహకు అడ్డం పెట్టిన బండరాతిని తొలగించి గోపబాలురను బంధవిముక్తులనుచేసాడు. అందరూ కలిసి ఆవులను తోలుకుంటూ సాయంత్రానికి నందవ్రజమునకు చేరుకున్నారు." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు కృష్ణుడు కేశిని, వ్యోముడిని వధించడం గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పది ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ముప్పది ఎనిమిదవ అధ్యాయము.

ం

శుక యోగీంద్రుడు పరీక్షిత్ మహారాజుతో అక్రూరుడు నందవ్రజమునకు వెళ్లిన విషయాన్ని వివరించాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! కంసుని ఆదేశము మేరకు అక్రూరుడు రథం మీద గోకులమునకు వెళుతున్నాడు. అక్రూరుడికి శ్రీకృష్ణుడు అంటే అపరిమితమైన భక్తి. ఆయన తన మనసులో ఎల్లప్పుడూ కృష్ణుని గురించి ఆలోచిస్తుంటాడు. ఇప్పుడూ అక్రూరుని మనసు కృష్ణుని మీదనే లగ్నం అయి ఉంది. ఆయన తనలో తాను ఇలా అనుకుంటున్నాడు.

“ఆహా! నేను పూర్వ జన్మలో ఎన్ని మంచి పనులు చేసానో! ఎంత పుణ్యం మూటగట్టుకున్నానో! ఏమి తపస్సు చేసానో! ఎన్ని దాన ధర్మాలు చేసానో! ఈనాడు నాకు అయాచితంగా శ్రీకృష్ణ పరమాత్మ దర్శనం కలుగబోతోంది. ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలలో మునిగితేలే అధముడికి వేదము చదవడానికి, అధ్యయనం చేయడానికి అవకాశం లేనట్లు, నాకు కూడా ఈ జన్మలో కృష్ణదర్శనం కావడానికి అసలు అవకాశమే లేదు అని అనుకున్నాను. కంసుని దురాలోచన వలన నాకు కృష్ణదర్శన భాగ్యం సిద్ధించింది.

ఎన్నో గడ్డి పరకలు ప్రవాహంలో కొట్టుకుపోతుంటే అందులో ఒక గడ్డిపోచ గట్టుకు చేరినట్టు, అలాగే ఈ కర్మప్రవాహంలో కొట్టుకుబోయే మానవులలో, నావంటి వాడు ఒక్కడైనా కృష్ణసందర్శన భాగ్యంతో ఈ సంసార సాగరాన్ని దాటగలడు కదా! ఈ రోజుతో నేను చేసిన పాపములు అన్నీ నశించిపోయాయి. నేను పుట్టినందుకు నా జన్మ సార్థకం అయింది. నేడు నాకు శ్రీకృష్ణపరమాత్మ పాదపద్మములను సేవించే భాగ్యం కలుగబోతోంది.

ఇదంతా తలచుకుంటేనే ఆశ్చర్యం వేస్తోంది. కంసుడు పరమ దుర్మార్గుడు. దుష్టుడు. కృష్ణుని చంపడానికి ప్రయత్నించాడు. కృష్ణుడికి ఈ విషయం చెప్పడానికి నన్నుపంపించాడు.  అది నాకు మహోపకారంగా పరిణమించింది. ఈ కారణంగా నైనా కలలో కూడా ఊహించని కృష్ణదర్శనభాగ్యం లభించబోతోంది. శ్రీకృష్ణపరమాత్మ పాదపద్మములు అంతులేని ఐశ్వర్యములకు ఆలవాలమని బ్రహ్మాది దేవతలు, పరమసౌభాగ్యప్రదమని లక్ష్మీదేవి, సకలపురుషార్థపధములని మునులు, ఎంతో దయగలవి అని గోకులంలో ఉన్నగోపకులు, అంటూ ఉంటారు. ఆ కారణం చేతనో వ్రజములోని గోపకాంతలు కృష్ణుని పాదపద్మములను సేవిస్తుంటారు.

ఆహా! ఆ కృష్ణుని పద్మము వంటి ముఖము, ఆ ముక్కు, ఎప్పుడూ చిరునవ్వులు చిందించే ఆ పెదవులు, తామరరేకుల వంటికళ్లు, ముఖంమీద పడే ముంగురులు, ఎంత సేపు చూచినా తనివి తీరదు కదా! నాకు అన్నీ శుభశకునములే గోచరిస్తున్నాయి. నా కోరిక తీరే సమయం ఆసన్నం కాబోతోంది. దుష్టశిక్షణ, శిష్ట రక్షణ కొరకు మానవుడిగా ఈ భూమి మీద అవతరించిన ఆ పరమాత్మ

దర్శనం నాకు లభించబోతోంది. నాకు నేత్రానందము కలగబోతోంది.

నిజానికి ప్రతి కార్యానికి, కారణానికి తానే మూలము అయినా ఏ మాత్రము అహంకారము లేని వాడు. తన యొక్క చిచ్ఛక్తి ప్రభావంతో మానవులలోని అజ్ఞానమును పోగొట్టి జ్ఞానమును కలుగచేస్తాడు. ఈ దేహములో ఉండే ప్రాణములు, ఇంద్రియములు, బుద్ధుల రూపంలో ప్రతి దేహంలో ఆత్మస్వరూపంగా వెలుగుతున్నాడు. ఎవరు ఏ రూపంలో కోరుకుంటే ఆ రూపంలో వారికి సాక్షాత్కరిస్తాడు. సాత్వత వంశమును ఉద్ధరించుటకు ఆ వంశములో అవతరించాడు. నందవ్రజములో ఉండే గోపకులను, గోపకాంతలకు సంతోషాన్ని కలుగచేస్తున్నాడు. అటువంటి శ్రీకృష్ణుని కీర్తిని దేవతలు ఎల్లప్పుడూ గానం చేస్తుంటారు.

సాధుజనులకు ఆశ్రయం ఇచ్చేవాడు, లోకానికే గురువు అయిన వాడు, మూడులోకములలో కెల్లా అందగాడు, తన చూపులతోటే ఎదుటి వారిమనస్సులను సంతోషంతో నింపేవాడు, సకలైశ్వర్యములను ఆలవాలమైన లక్ష్మీదేవిని తనవక్షస్థలములో నిలుపుకున్నవాడు, సాక్షాత్తు శ్రీహరి అవతారమైన కృష్ణుని నేను ఈ నాడు దర్శించబోతున్నాను.

ఎవరి దర్శన మాత్రం చేతనే ఎంతటివారైన తమ తమ వాహనముల నుండి దిగి, వారి పాదపద్మములకు ప్రణమిల్లుతారో, ఆ బలరామ కృష్ణుల పాదములను నేను సేవించబోతున్నాను. వారే కాదు, వారి సాన్నిధ్యంలో ప్రతిరోజూ పునీతులవుతున్న గోపబాలుర పాదములకు

కూడా నమస్కరిస్తాను. తన పాదములకు నమస్కరిస్తున్న నా తలమీద కృష్ణుడు తన చేతులు పెట్టి ఆశీర్వదిస్తాడు.

ఏదో ఇదంతా ఆలోచిస్తున్నాను కానీ, ఇప్పుడు నేను కంసుని దూతగా కృష్ణుని వద్దకు వెళుతున్నాను. కంసుడు దుర్మార్గుడు. నేను కూడా అటువంటిదుర్మార్గుడను అని భావించి కృష్ణుడు నన్ను ద్వేషించడుకదా! అలా ఎన్నటికీ జరగదు. ఎందుకంటే కృష్ణుడు సర్వాంతర్యామి. అందరి మనసులలో ఉన్న ఆలోచనలను పసిగట్ట గల నేర్పరి. నా మనసులో ఉన్న కృష్ణభక్తిని తెలుసుకోలేడా! నన్ను తప్పకుండా ఆదరిస్తాడు.

కృష్ణుని చూడగానే నేను వంగి ఆయన పాదములకు నమస్కరిస్తాను. చేతులు జోడించి నిలబడతాను. ఆయన చిరునవ్వుతో నన్ను తన దయగల కనులతో చూస్తాడు. ఆయన చూపులు నా మీద ప్రసరించగానే నేను సర్వపాపముల నుండి విముక్తుడను అవుతాను. నాలో ఉన్న సమస్త భయములు తొలగి పోతాయి. నేను పరమానంద భరితుడను అవుతాను. తరువాత కృష్ణుడు నన్ను తన చేతులు చాచి నన్ను కౌగలించుకుంటాడు. కృష్ణుని దేహము స్పర్శించిన నా దేహము పరమ పవిత్రమౌతుంది. నా కర్మబంధనములు అన్నీ తొలగి పోతాయి.

తన కౌగిలిలో ఒదిగిపోయిన నన్ను కృష్ణుడు “అక్రూరా! నా కోసం వచ్చావా!” అని ప్రేమగా పిలుస్తాడు. ఆ పిలుపుతో నా జన్మ సార్థకం అవుతుంది. శ్రీకృష్ణుని ఆలింగన సౌభాగ్యము పొందని వాడిజన్మ ఎందుకు? వృధా! శ్రీకృష్ణునికి ఒకరు ఇష్టుడు అని కానీ, మరొకడు అయిష్టుడు అని కానీ లేరు. ఆయన దృష్టిలో అందరూ సమానమే.

ఎవరు ఏ రీతిగా ప్రార్థిస్తే వారికి ఆయాఫలములను ప్రసాదిస్తుంటాడు. ఎవరెవరు ఏ యే రూపులతో కొలిస్తే వారి ఆయా రూపములతో సాక్షాత్కరిస్తాడు.

నేను రావడం చూచి బలరాముడు కూడా నా దగ్గరగా వస్తాడు. నేను ఆయనకు చేతులు జోడించి నమస్కరిస్తాను. ఆయన కూడా చిరునవ్వుతో నన్ను ఆలింగనం చేసుకుంటాడు. నన్ను తగురీతిగా సత్కరిస్తాడు. తరువాత నా యోగక్షేమములు, తన తల్లి తండ్రులైన దేవకీ వసుదేవుల యోగక్షేమముల గురించి అడుగుతాడు."

ఈ ప్రకారంగా అక్రూరుడు తనలో తాను ఆలోచిస్తూ రథం మీద మధుర నుండి నందవ్రజమునకు వెళుతున్నాడు. అప్పుడు సాయంత్రం అయింది. అక్రూరుని రథము నందవ్రజము చేరుకుంది. గోశాలలో ఉన్న కృష్ణుని చూచాడు అక్రూరుడు.  అక్రూరుని దృష్టి కృష్ణుని పాదాల మీద పడింది. ఒక్కసారిగా కృష్ణుని పాదములను చూచిన అక్రూరునికి ఒళ్లు పులకరించింది. మనసు అదుపు తప్పింది. శరీరం గగుర్పాటు చెందింది. కళ్ల నుండి కన్నీళ్లు కారుతున్నాయి.

వెంటనే అక్రూరుడు రథం దిగాడు. కాళ్లు తడబడుతుంటే కృష్ణుని వద్దకు వచ్చాడు. శరీరం స్వాధీనంలో లేకపోవడం వలన కింద పడుతున్నాడు. పైకి లేస్తున్నాడు. "ఆహా! ఇవేనా నా ప్రభువు పాదములు." అంటూ కృష్ణుని పాదాల మీద పడ్డాడు. ఆ సమయంలో కృష్ణుడు బలరాముడు గోవుల పాలు పితుకుతున్నారు.

అక్రూరుడు పరుగు పరుగున బలరామ కృష్ణుల వద్దకు వెళ్లాడు. వారి కాళ్ల మీద సాష్టాంగ పడ్డాడు. "నేను అక్రూరుడను మీకు నమస్కరిస్తున్నాను." అని నమస్కరించాడు. కృష్ణుడు అక్రూరుని బుజములు పట్టుకొని పైకి లేవనెత్తి ఆయనను గట్టిగా కౌగలించుకున్నాడు. తరువాత బలరాముడు కూడా అక్రూరుని కౌగలించుకున్నాడు. బలరామ కృష్ణులు అక్రూరుని చెరి ఒక పక్క పటుకొని తమ ఇంటిలోనికి తీసుకొని వెళ్లారు. కాళ్లు కడుక్కోడానికి నీళ్లు ఇచ్చి ఉచిత ఆసనము ఇచ్చి సత్కరించారు. ఒక ఆవును తీసుకొని వచ్చి అక్రూరునికి ఇచ్చారు. బలరామ కృష్ణులు కింద కూర్చుని అక్రూరుని పాదములు వత్తుతున్నారు.

తరువాత నందుడు, బలరామ కృష్ణులు అక్రూరునికి భోజనము వడ్డించారు. భోజనము చేసిన తరువాత తాంబూలము ఇచ్చి అక్రూరుని సుఖమైన ఆసనము మీద కూర్చోబెట్టారు. ఆయనకు గంధము, పుష్పములు ఇచ్చి సత్కరించారు.

నందుడు అక్రూరుని పక్కనే కూర్చుని ఆయనకు విసన కర్రతో విసురుతూ ఈ విధంగా అడిగాడు.

"అక్రూరా! మధురలో అందరూ క్షేమమే కదా! క్రూరుడైన కంసుని పాలనలో మీ వంటి ధర్మాత్ములు ఎలా జీవిస్తున్నారు? కేవలము తనను తాను రక్షించుకోడానికి, తన సోదరి కుమారులను ఏమాత్రము దయాదాక్షిణ్యములు లేకుండా సంహరించిన ఆ క్రూరుని పంచన మీకు శుభం ఎలా జరుగుతుందని ఊహించగలను." అని నందుడు అక్రూరుని క్షేమసమాచారములు అడిగి తెలుసుకుంటున్నాడు."

అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు భాగవత కథను వినిపిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము ముప్పది ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
ముప్పది తొమ్మిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! నందుడు అడిగిన తరువాత కృష్ణుడు అక్రూరునితో ఇలా అన్నాడు.

" మహాశయా! తమరి ప్రయాణము బాగా జరిగిందా! మీరు క్షేమంగా ప్రయాణము సాగించారా! మధురలో మా బంధువులు క్షేమంగా ఉన్నారా! మా మిత్రులు సుఖంగా ఉన్నారా! అయినా ఇలా అడగడం నా పొరపాటు. మా వంశమునకు రాచపుండులా పరిణమించిన నా మేనమామ కంసుడు క్షేమంగా ఉండగా మీరు క్షేమంగా ఎలా ఉండగలరు? మా గురించి మా తల్లితండ్రులు చెరసాలలో మగ్గుతున్నారు. నా అన్నలను పసికూనలుగా ఉండగానే కంసుడు నిర్దాక్షిణ్యంగా చంపాడు. ఇన్నాళ్లు మా బంధువులు ఎవరన్నా కనపడతారా అని ఎదురుచూస్తున్న మాకు నీవు కనపడటం పండుగ లాంటిది. ఇంతకూ తమరు ఇక్కడకు రావడానికి కారణం

తెలుపగలరా!" అని అడిగాడు.

ఆ మాటలు విన్న అక్రూరుడు, కంసుని వద్దకు నారదుడు రావడం, బలరామకృష్ణులు నందవ్రజంలో పెరగడం, వారిని చంపడానికి కంసుడు ప్రయత్నాలు చేయడం గురించి కంసుడు తనతో పలికిన పలుకులు యథాతథంగా చెప్పాడు. "ఆ కారణం చేత నిన్ను బలరాముని మధురకు వెంటనే తీసుకొని రమ్మని కంసుడు నా ద్వారా మీకు సందేశము పంపించాడు." అని ముగించాడు.

కృష్ణుడు తన తండ్రి నందుని పిలిచి కంసుని ఆదేశమును వినిపించాడు. అందరూ మధురకు పోవలెనని నిశ్చయించుకున్నారు. నందుడు ఊరి పెద్దలను పిలిపించాడు. బండ్లు కట్టమన్నాడు. పాలు పెరుగు వెన్న నెయ్యి కుండలలో సిద్ధం చేయమన్నాడు. మంచి మంచి వస్త్రములను సిద్ధం చేయమన్నాడు.

"మనమంతా రేపు ఉదయమే బయలుదేరి మధురకు వెళ్లాలి. కంస మహారాజు ఒక యజ్ఞము చేస్తున్నాడు. మనమందరము ఆ యజ్ఞం చూడటానికి వెళుతున్నాము.  కంస మహారాజుకు మనము తీసుకొని వెళుతున్న కానుకలను సమర్పించాలి. మనతో పాటు మన గ్రామస్థులు కూడా మనతో వస్తున్నారు." అని అన్నాడు నందుడు.

. మధుర నుండి ఎవరో అక్రూరుడు అనే వాడు వచ్చాడు. కృష్ణుని మధురకు తీసుకొని వెళుతున్నాడు అనే వార్త నందవ్రజము అంతా క్షణాల్లో పాకి పోయింది. ఈ వార్త విని గోపికలు గోపకాంతలు చింతాక్రాంతులయ్యారు. వారి ముఖములు వాడిపోయాయి. ఎక్కడ

ఉన్న వారు అక్కడే కూలబడిపోయారు. ఎవరికీ ఒంటి మీద స్పృహ లేదు. కృష్ణుడి మాటలు, కృష్ణుడి శృంగార చేష్టలు తలచుకుంటూ వారిలో వారు మోహపరవశులౌతున్నారు.

శ్రీకృష్ణుని మీదనే తమ ప్రాణములను నిలుపుకున్న గోపికలు కృష్ణుడి నడకను, ఆయన మధురమైన మాటలను, ఆయన చిరునవ్వును, ఆయన ప్రేమతో కూడిన చూపులను, ఆయన చేసిన పనులను తలచుకుంటూ కన్నీరు కారుస్తూ విరహబాధను అనుభవిస్తున్నారు. మరి కొందరు గోపికలు తమలో తాము ఇలా అనుకుంటున్నారు.

"ఆహా! ఈ బ్రహ్మదేవుడికి మా మీద దయ ఉన్నట్టు లేదు. ప్రాణుల మధ్య అంతలోనే స్నేహమును, ప్రేమను కలుగచేస్తాడు. ఆ స్నేహమును ప్రేమను పూర్తిగా ఆస్వాదించక ముందే, విడదీస్తాడు. అంతా చిన్న పిల్లవాడి మాదిరి అర్థం లేని పనులు చేస్తుంటాడు. అందమైన చెక్కిళ్లతోనూ, నుదుటి మీద జీరాడే నల్లని ముంగురులతోనూ, ఆహ్లాదాన్ని కలిగించే చిరునవ్వుతోనూ, ఉన్న కృష్ణుని ముఖపద్మమును మాకు ఒక సారి చూపించి అంతలోనే మాయం చేస్తున్నావు. ఇది నీకు ధర్మమా బ్రహ్మదేవా!

ఆహా! బ్రహ్మ దేవా! కృష్ణుని ఎంత అందంగా సృష్టించావయ్యా! నీవు సృష్టించిన అందమైన కృష్ణుని అందచందాలను తనివిదీరా ఈ కళ్లతో ఆస్వాదిస్తుంటే, అమితమైన క్రూరత్వంతో అక్రూరుడి రూపంలో వచ్చి కృష్ణుని మాకు దూరం చేస్తావా! ఇదేమన్నా

న్యాయంగా ఉందా! " అని బ్రహ్మదేవుని తిట్టుకుంటున్నారు గోపికలు. ఇంకా కొంతమంది గోప కాంతలు వారిలో వారు ఇలా అనుకుంటున్నారు.

"మన సంగతి అటుండనీ! మధురానగరంలో ఉండే అందమైన అమ్మాయిలకు రేపటి నుండి ప్రతిరోజూ సుప్రభాతమే కదా! ఇన్నాళ్లు వారు నోచిన నోములు, పొందిన బ్రాహ్మణుల ఆశీర్వాదములు ఫలించినట్టున్నాయి. నేటి నుండి మధురా నగరములో ఉన్న స్త్రీలందరూ కృష్ణుని అందాలను తమ కళ్లతో జుర్రుకుంటారు అనుకుంటాను. అవునే! నాకు తెలియక అడుగుతాను. మనమా పల్లెపడుచులము. వారా నగర వాసులు. కృష్ణుడు ఒక సారి ఆ నగర వాసుల అందచందాలు, హొయలు, వగలు చూచిన తరువాత మన ముఖాలు చూస్తాడంటావా!" అని మరొక గోపిక పలికింది.

"అవునే! అదీ నిజమే! మధురలో దాశార్హులు, భోజులు, అంధకులు, వృష్ణులు, సాత్వతులు, ఇంకా ఇతర జాతుల వాళ్లు, మధురా నగర వాసులందరూ కృష్ణుని దర్శన భాగ్యము పొందబోతున్నారు. వారి అదృష్టము ఏమని చెప్పాలి? ఇంకమీదట వారికి ప్రతిరోజూ కృష్ణుడు కనువిందు చేస్తుంటాడు." అని పలికింది మరొక గోపిక.

గోపికలందరికీ కృష్ణుడిని తమ నుండి దూరంగా తీసుకొని పోతున్న అక్రూరుడిమీద కోపం వచ్చింది. "క్రూరాత్ముడైన వీడికి అక్రూరుడు అనిపేరు ఎవరు పెట్టారే! కనీసం కృష్ణుడు మన దగ్గరకు వచ్చి మనలను ఓదార్చే సమయం కూడా ఇవ్వకుండా కృష్ణుని మన వద్దనుండి మధురకు తీసుకొని పోతున్నాడు. ఒసేవ్! చూడండే!

కృష్ణుడు రథం ఎక్కుతున్నాడే! మనవాళ్లకేం పుట్టిందే! వాళ్లు కూడా కృష్ణునితో కూడా రథం ఎక్కుతున్నారు. అంటే ఊరంతా కట్టకట్టుకొని మధురకు వెళుతున్నారా! పోనీ ఈ ముసలి వాళ్లయినా కృష్ణుని ఆపవచ్చు కదా! వారు కూడా ఆనందంగా చూస్తూ నిలబడి ఉన్నారు. ఏమే! ఈ సమయంలో దేవుడు ఏదైనా ఆటంకము సృష్టించి కృష్ణుని ప్రయాణము ఆపవచ్చు కదా! అయినా మనకంత అదృష్టమా!" అని తలొక విధంగా మాట్లాడుకుంటూ నిట్టూర్పులు విడుస్తున్నారు.

ఇంతలో మరొక సాహస వనిత ముందుకు వచ్చి ఇలా అంది. "ఎవరో ఎందుకే! మనమే వెళదాం పదండి. కృష్ణుని మధురకు వెళ్లకుండా ఆపుదాము. అసలు కృష్ణుడిని మన నుండి విడదీయడానికి వీళ్లెవరు! కనుక్కుందాం పదండి. ఆ యాదవులు, పెద్దవాళ్లు, ముసలి వాళ్లు మనల్నేం చేస్తారు. కృష్ణుని విడిచి మేము క్షణకాలం కూడా ఉండలేము అని కుండబద్దలుకొట్టినట్టు చెబుదాము. మనకేం భయం. ఏం చేస్తారు. చంపుతారు. అంతేగా. కృష్ణుడే మనలను విడిచి వెళు తుంటే, ఇంక ఈ శరీరంలో ప్రాణాలు ఉన్నా లేకున్నా ఒకటే కదా! పదండి వెళదాం." అని సాహసంతో ముందుకు దూకింది.

ఇంతలో మరొక విరహిణి ఇలా పలికింది. "అబ్బా ఉండండే మీ మాటలు మీరూను. ఆ కృష్ణుని మందహాసము, ఆయన క్రీగంటిచూపులు, ఆలింగనములు, రాసలీలలలో మనం గంటలు క్షణాల్లా గడిపిన రాత్రులు, అవన్నీ గుర్తుకు వస్తుంటే ఏడుపొస్తోందే! ఈ కృష్ణవియోగాన్ని ఎలా తట్టుకోవాలో అర్థం కావడం లేదే!" అంటూ మరొక గోపిక వాపోయింది.

"అవునే! సంధ్యవేళలో మురళి వాయిస్తూ గోవులను తోలుకుంటూ వస్తున్న కృష్ణుని ముఖార విందము ఎన్ని రోజులు చూచినా తనివితీరదే. రేపటి నుండి ఎవరి ముఖం చూస్తాము. కృష్ణుడు వ్రజంలో లేకుండా ఎలా బతకాలో తెలియడం లేదే!" అంటూ తన కళ్లనిండా కృష్ణుని ప్రేమ నింపుకొని విలపిస్తూ ఉంది మరొక గోపకాంత.

గోపికలు గోపకాంతలు ఇంక తట్టుకోలేక "కృష్ణా! మాధవా!"అని పిలుస్తూ బిగ్గరగా ఏడుస్తున్నారు. కృష్ణుడు తన కోసరం విలపిస్తున్న గోపిల వంక కూడా చూడకుండా అక్రూరుడు తెచ్చిన రథం ఎక్కి కూర్చున్నాడు. పక్కనే బలరాముడు కూర్చున్నాడు. గోపకులు బళ్ల నిండా పాలు, పెరుగు, వెన్న నిండిన కుండలను ఎక్కించారు. అందరూ బండ్లు ఎక్కి కూర్చున్నారు. రథం బయలుదేరింది. రథం వెనక బండ్లు బయలుదేరాయి. రథం వెనక గోపికలు, గోపకాంతలు పరుగెడుతున్నారు. కృష్ణుని కడసారి చూచుకుంటున్నారు. కొంత దూరం వెళ్లి ఆగి పోయారు.

కృష్ణుడు వెనక్కు తిరిగి చూచాడు. తన కోసరం పరితపిస్తున్న గోపికలను, గోప కాంతలను చూచి కళ్లతోనే "త్వరలోనే మీ వద్దకు వస్తాను" అని సందేశాన్ని పంపాడు. (కాని కృష్ణుడు తన జీవితకాలంలో మరలా నందవ్రజమునకు తిరిగి రాలేదు.) ఆ సందేశమునే మహాప్రసాదంగా భావించిన గోపికలు రథం కనపడేవరకు అలా చూస్తూనే నిలబడి పోయారు. తరువాత ఎవరి ఇళ్లకు వాళ్లు వెళ్లి పోయారు.

బలరామ కృష్ణులు ఎక్కిన రథము వేగంగా మధుర వైపు పోసాగింది. రథం యమునా నది వద్ద ఆగింది. బలరామ కృష్ణులు, రథం దిగి కాళ్లు కడుక్కొని ఆచమించి, స్వచ్ఛమైన నీటినితాగారు. మరలా రథం ఎక్కారు. తరువాత అక్రూరుడు రథం దిగాడు. యమునా నదిని చూగానే అక్రూరుడికి స్నానం చేయాలని అనిపించింది. యమునా నది వద్దకు వెళ్లాడు. నదిలోకి దిగాడు. వేద మంత్రములు జపిస్తూ నీటిలో మునిగాడు.

అక్రూరునకు నీటి అడుగున బలరామ కృష్ణులు కనిపించారు. అక్రూరుడికి ఆశ్చర్యం వేసింది. “ఇదేమిటి. బలరామకృష్ణులు రథంలో కూర్చుని ఉన్నారు కదా. నీటి అడుక్కు ఎలా వచ్చారు. ఇదేదో వింతగా ఉందే!” అని అనుకున్నాడు. నీటి లో నుండి పైకి లేచాడు. రథం వంక చూచాడు. రథంలో బలరామకృష్ణులు కూర్చుని ఉన్నారు. మరలా నీటిలో మునిగాడు. ఈ సారి వేయి పడగలతో ఉన్న అనంతుడు, ఆ అనంతుని మీద అర్ధనిమీలిత నేత్రాలతో పడుకొని ఉన్న శ్రీమహావిష్ణువును నీటి అడుగున దర్శించాడు.

నీల మేఘశ్యాముడు, పీతాంబరధారుడు, నాలుగు భుజములు కలవాడు, తామర రేకుల వంటి కన్నులు కలవాడు, శుద్ధసత్వగుణ సంపన్నుడు, సుందర మైన ప్రసన్నమైన ముఖము కలవాడు, పెదవుల మీద చిరునవ్వు చిందించేవాడు, వక్షస్థలములో లక్ష్మీదేవిని నిలుపుకున్నవాడు, శంఖము వంటి మెడ గలవాడు, బ్రహ్మకు జన్మస్థానమైన నాభి కలవాడు, మునులకు, ఋషులకు, సత్పురుషులకు ఆశ్రయమిచ్చే  పాదపద్మములు కలవాడు, మణిమయకిరీటము

కలవాడు, కటిసూత్రము, యజ్ఞోపవీతము, హారములు, నూపురములు, కుండలములు ధరించిన వాడు, శంఖు,చక్ర,గదా,పద్మములు నాలుగు చేతులలో కలవాడు, శ్రీవత్సము అనే పుట్టు మచ్చతోనూ, కౌస్తుభమణితోనూ శోభిల్లువాడు, మెడలో వనమాలను ధరించిన వాడు,  ఋషులతోనూ, సనకాది మునులతోనూ, బ్రహ్మ, రుద్రుడు మొదలగు దేవతాగణములతోనూ, మరీచి మొదలగు ప్రజాపతులతోనూ, ప్రహ్లాదుడు, నారదుడు మొదలగు భక్తులతోనూ స్తుతింపబడుతున్న వాడూ, అయిన శ్రీమహావిష్ణువును ఆదిశేషువు మీద దర్శించాడు అక్రూరుడు.

ఆయన శరీరం పులకించింది. తల వంచి చేతులు జోడించి నమస్కరించాడు. శ్రీమహావిష్ణువును ఈ విధంగా స్తుతించాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణుని మధురానగర ప్రయాణాన్ని వర్ణిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ముప్పది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

నలుబదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! అక్రూరుడు తన ఎదుట సాక్షాత్కరించిన విష్ణుమూర్తిని ఈ విధంగా ప్రార్థిస్తున్నాడు.

"ఓ దేవా! ఈ చరాచర జగత్తుకు ఒకే ఒక కారణం నువ్వే! నువ్వు మొట్టమొదటి నుండి ఉన్నావు. నువ్వు నశించేవాడివి కాదు. సాక్షాత్తు నారాయణుడివి. (జలములో ఉండేవాడివి). నీకు నా నమస్కారము. నీ నాభిలోనుండి బ్రహ్మ గారు జన్మించి మా కళ్లకు కనపడుతున్న ఈ సకల జగత్తును సృష్టించాడు.

ఓ దేవా! పంచభూతములు, మహత్తత్వము, ప్రకృతి, పురుషుడు, మనస్సు, పది ఇంద్రియములు, పంచ తన్మాత్రలు అన్నీ కూడా నీ విరాట్ స్వరూపము నుండి పుట్టినవే! మేమంతా ఈ ప్రకృతి విషయములు, విషయవాంఛలు, కాలము, కర్మమునకు లోబడి నీ గురించి తెలుసుకోలేకపోతున్నాము. నీ మాయాగుణము చేత బంధింప బడ్డ మానవుడికే నీ గురించి తెలియనప్పుడు, ఇంక పశు పక్ష్యాదుల గురించి చెప్పేదేముంది!

హిరణ్యగర్భుడు మొదలగు దేవతాగణములు, ఋషులు, సాధువులు, అధ్యాత్మము, అధిభూతము, అధిదైవము అనే పదార్థములకు సాక్షీభూతంగా ఉన్న నిన్ను, సకల జీవులలో

ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్న నిన్ను, నిరంతరము ఉపాసిస్తుంటారు. వేదములలో చెప్పబడిన కర్మకాండలైన యజ్ఞములు, యాగములు చేసే బ్రాహ్మణులు, ద్విజులు, నిన్ను వివిధ రూపములతో, వివిధ నామములతో ఆరాధిస్తున్నారు. వారు చేసే యజ్ఞయాగములు, పూజలు వ్రతములు అన్నీ నీ ఉపాసనే కదా!

అలా కాకుండా, సకల కర్మలను విడిచి పెట్టి , ఈ ప్రపంచము మీద విరక్తి చెంది సన్యాసాశ్రమము స్వీకరించిన సన్యాసులు, యోగులు, జ్ఞానులు, ఏ జ్ఞాన యజ్ఞంతో ఉపాసిస్తారో, ఆ జ్ఞానమూర్తివి నీవే కదా! వీరే కాకుండా నిర్మల చిత్తంతో నీ మీద మనసు లగ్నం చేసి నిన్ను ఉపాసించే వారిని కూడా నీవు అనుగ్రహిస్తున్నావు.

వీరే కాకుండా శివారాధకులు, పాశుపతులు మొదలగు వారు రకరకాల పద్ధతులలో పరమశివుని ఆరాధిస్తుంటారు. ఉపాసిస్తుంటారు. ఆ ఆరాధనలన్నీ నిన్ను ఆరాధించడమే కదా!
ఓ దేవా! పర్వతముల మీద కొండలలో పుట్టిన నదులు, వర్షములతో నిండిన నదులు, అనేక దిక్కుల నుండి వచ్చి సముద్రములో కలిసినట్టు, నిన్ను ఎవరు, ఏ రూపంతో, ఏ పేరుతో, ఏ విధంగా ఆరాధించినా, ఆ ఆరాధనలన్నీ నీకే చెందుతాయి అనడంలో సందేహము లేదు.

(ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం. సర్వదేవ నమస్కార: కేశవం ప్రతిగచ్ఛతి....ఇది ప్రతి దినం సంధ్యావందనం చేసేటప్పుడు చెప్పుకునే శ్లోకము.)

ఓ దేవా! సత్వ గుణము, రజోగుణము, తమోగుణము ఇవి ప్రకృతి గుణములు. ప్రకృతిలో ఉన్న అన్ని జీవరాసులు ఈ మూడు గుణములకు లోబడి ప్రవర్తిస్తున్నాయి. ఈ జీవ రాసులు అన్నింటిలోనూ నీవు ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. నీవే సత్యము. మిగిలినవి అన్నీ మార్పు చెందేవే. అవిద్యతో, అజ్ఞానంతో జీవులు చేసే కర్మలు అన్నింటినీ నీవు సాక్షీభూతంగా చూస్తుంటావు. ఆ కర్మలు నీకు అంటవు.

ఓ దేవా! అగ్ని నీ ముఖము. భూమి నీ పాదములు. సూర్యుడు నీ కంటి చూపు. ఆకాశమే నీ నాభి. దిక్కులే నీ చెవులు. స్వర్గమే నీ తల. దేవతలు నీ బాహువులు. సముద్రములు నీ ఉదరము. వాయువు నీ ఊపిరి. వృక్షములు, ఓషధులు నీ శరీరము మీది వెంట్రుకలు. మేఘములు నీ తలమీది జుట్టు. పర్వతములు నీ ఎముకలు. రాత్రి పగలు నీ కంటి రెప్పల కదలికలు. ప్రజాపతి నీ జననాంగము. ఇదే నీ విరాట్ స్వరూపము.

హే భగవాన్! అత్యంత సూక్ష్మములు అయిన జీవులు నీటిలోనూ, మేడిపండులో ఉన్న సూక్ష్మజీవులు, ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా జీవించినట్టు, నీ విరాట్ స్వరూపములో ఉన్న లోకములు, వాటిని పాలించే పాలకులు, ఒకదానితో ఒకటి సంబంధము లేకుండా ప్రవర్తిస్తుంటాయి. అధర్మప్రవర్తకులైన మధు,కైటభులు మొదలగు దైత్య, దానవులను సంహరించడానికి నీవు ప్రకటించిన అవతార విశేషములను కీర్తించడం ద్వారా మానవుల దు:ఖములు, మోహములు నశించిపోతాయి. ఆ కారణం గానే మానవులు నీ కీర్తిని, నీ లీలలను సదా స్మరించుకుంటూ ఉంటారు.

ప్రళయకాలంలో సంచరించిన మత్స్యావతారా, మధుకైటభులను సంహరించిన హయగ్రీవరూపా! నీకు నమస్కారము. మంథర పర్వతమును వీపుమీద ధరించిన కూర్మావతారా! పాతాళము నుండి భూమిని ఉద్ధరించిన వరహావతారా! నీకు నమస్కారము. సాధుజనులను రక్షించడానికి అవతరించిన నృసింహావతారా! మూడులోకములను ఆక్రమించిన వామనావతారా! నీకు నమస్కారము. గర్వాంధులు, అధర్మపరులు అయిన క్షత్రియులను సంహరించిన పరశురామావతారా! రావణుడు మొదలగు రాక్షస సంహారము చేసిన రామావతారా! నీకు నమస్కారము.

వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపుడవు, సాత్వతపతివి అయిన  నీకు నమస్కారము.  ఓ దేవా! నీవు శుద్ధుడవు. బుద్ధుడవు. దైత్యులను, దానవులను మోహింప జేసినవాడవు. పవిత్రుడవు. అధర్మపరులు, క్రూరులు అయిన క్షత్రియులను నాశనం చేసిన వాడవు అయిన నీకు నమస్కారము.

ఓ దేవా! సకల జీవులు నీ మాయకు లోబడి, మోహితులై, ఈ దేహము శాశ్వతము కాదు అని తెలియక, నేను, నాది అనే అహంకారంతో, ఏదో ఒక కర్మచేస్తూనే ఉంటారు. నేను కూడా నీ మహిమ పూర్తిగా తెలుసుకోలేక, స్వప్నము వలె అస్థిరములైన  భార్య, బిడ్డలు, బంధువులు, స్నేహితులు, మొదలగు వారి మోహములో పడి, వారి యందు ప్రేమ, ఆసక్తి పెంచుకున్నాను. నేను చేసే కర్మలన్నీ అనిత్యములు అనీ, అశాశ్వతము అయిన దేహము శాశ్వతము అనీ, దు:ఖములు తెచ్చిపెట్టే కర్మలు, గృహములు, ధనము, సుఖాలు కలుగచేస్తాయనీ, ఎల్లప్పుడు సుఖము, దు:ఖము అనే ద్వంద్వములలో

పడి కొట్టుకుంటూ, తమోగుణముచేత ప్రభావితుడనుఅయి ఉన్నాను. పరమానంద స్వరూపుడవు అయిన నిన్ను తెలుసుకోలేకపోతున్నాను. నీటి మీద గడ్డి మొలిస్తే నీరు కనపడదు. అక్కడ నీరు లేదు కదా అని ఆ గడ్డిమీద నడుస్తారు. నీటిలో పడి మునిగి పోతారు. అలాగే మాయతో కప్పబడిన నీ అసలు స్వరూపమును చూడలేక, ఈ దేహమే శాశ్వతము అని నమ్మి, అష్టకష్టాల పాలవుతారు.

నీటి కోసరం ఎండమావుల వెంట పరుగెత్తినట్టు, నేను ప్రాపంచిక విషయముల కొరకు పరుగెత్తుతున్నాను. నా మనస్సు, బుద్ధి ప్రాపంచిక విషయములలోనూ, కామ వాంఛలతోనూ నిండి పోయింది. నా మనస్సు, ఇంద్రియములు ప్రాపంచిక విషయముల వెంట పరుగెడుతూ ఉంది. వాటిని ఆపలేకపోతున్నాను. నా వంటి సామాన్యులకు లభ్యం కాని నీ పాదములను ఆశ్రయించాను. నీవు నాకు దర్శనం ఇవ్వడం నా అదృష్టంగా భావిస్తున్నాను. మానవుడికి ఈ సంసారము మీద విరక్తి కలిగినప్పుడే, నీ మీద భక్తి, శ్రద్ధకలుగుతాయి.

ఓ దేవా! నీవు జ్ఞానస్వరూపుడవు. సమస్తజీవులకు సుఖము, దు:ఖము కలిగించే కాలస్వరూపుడవు. పరిపూర్ణుడవు. అనంతశక్తిమంతుడవు. అట్టి నీకు నమస్కారము.

నమస్తే వాసుదేవాయ సర్వభూతక్షయాయ చ
హృషీకేశ నమస్తుభ్యం ప్రపన్నం పాహి మాం ప్రభో అంటూ అక్రూరుడు పరమాత్మను స్తుతించాడు."

అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు అక్రూరుని స్తోత్రమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము నలభయ్యవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
నలభై ఒకటవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! అక్రూరునకు నీటిలో తన స్వస్వరూపమును చూపించిన, పరమాత్మ అంశతో జన్మించిన, శ్రీకృష్ణుడు తన మాయారూపమును ఉపసంహరించాడు. అక్రూరుడు అప్పటి దాకా చూచిన విరాట్ రూపము మాయమైపోయింది. అక్రూరుడు నీటిలో నుండి బయటకు వచ్చాడు. స్నానము, సంధ్య మొదలగు వాటిని నిర్వర్తించుకొని రథం దగ్గరకు వచ్చాడు. రథం ఎక్కికూర్చున్నాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు అక్రూరుని చూచి ఇలా అన్నాడు. "అక్రూరమహాశయా! నీ ముఖకళవళికలు చూస్తుంటే నీవు నీటిలో మునిగినప్పుడు ఏదో ఒక అద్భుతమును చూచినట్టు అనిపిస్తూ ఉంది. నిజమేనా!" అని అడిగాడు.

అక్రూరుడు కృష్ణుని వంక తిరిగి చేతులు జోడించి “కృష్ణా! ఒక్క జలములోనే కాదు, భూమి మీద, ఆకాశంలోనూ, జలములోనూ కనపడే అన్ని చిత్ర విచిత్రములు నీ యందే ఉన్నాయి. నిన్ను చూస్తే అనంతవిశ్వంలోని అన్ని చిత్రవిచిత్రములు చూచినట్టే కదా! ఇంక చూడటానికి ఏమి మిగిలి ఉంటుంది.

ఓ పరమాత్మ స్వరూపా! నీ యందే అన్ని విచిత్రములు దాగి ఉన్నాయి. నిన్ను చూడకపోతే ఏ విచిత్రమునూ చూచినట్టు కాదు. నిన్ను చూస్తే అన్ని విచిత్రములు చూచినట్టే!” అని అన్నాడు. ఆ మాటలకు కృష్ణుడు చిరునవ్వునవ్వాడు.

సాయంకాలానికి రథం మధురానగరము చేరుకొంది. రథం మీద వస్తున్న బలరామ కృష్ణులను మధురా నగర ము సమీపములో ఉన్న గ్రామప్రజలు చూపు మరల్చకుండా చూస్తున్నారు. నందుడు మొదలగు గోపకులు అంతకు ముందే మధురా నగరము పొలిమేరలలో ఉన్న వనమునకు( తోపులు, తోటలు అనుకోవచ్చు) చేరుకున్నారు. అక్కడ వారు బండ్లు ఆపి, బలరామ కృష్ణుల కొరకు ఎదురుచూస్తున్నారు.

కృష్ణుడు రథం మీద నందుడు ఉన్న చోటికి వచ్చాడు. అక్రూరుని చెయ్యిపట్టుకొని ఇలా అన్నాడు. “అక్రూరా! నీవు రథము మీద మధురకు వెళ్లు. నేను ఇక్కడ కొంత సేపు మా వారి దగ్గర విశ్రాంతి తీసుకొని తరువాత మధురా నగరము చూడటానికి వస్తాము.” అని అన్నాడు.

ఆ మాటలు విన్న అక్రూరుడు ఇలా అన్నాడు. "కృష్ణా! నిన్ను విడిచిపెట్టి నేను ఎక్కడకూ పోను. నీ వెంటనే ఉంటాను. నేను నీ భక్తుడను. నన్ను విడిచిపెట్టవద్దు." అని వేడుకున్నాడు. ఇంకా ఇలా అన్నాడు.

"కృష్ణా! మీరందరూ మా ఇంటికి రండి. మీకు నా శక్తికొలది అతిథి సత్కారములు చేస్తాను. నీ పాద ధూళితో మా పితృదేవతలు, దేవతా గణములు, తృప్తిపడతారు. ఓ కృష్ణా! నీ పాదములు మా ఇంట మోపి మా ఇంటిని పవిత్రం చెయ్యి. పూర్వము బలి చక్రవర్తి నీ పాదములను కడిగి పుణ్యచరితుడయ్యాడు. ఇంద్రపదవితో సమానమైన పదవిని పొందాడు. అఖండైశ్వర్యసంపన్నుడయ్యాడు. నీకు భక్తుడయ్యాడు.

ఓ దేవా! నీ పాదముల నుండి పుట్టిన గంగ మూడులోకములనో పవిత్రం చేసింది. ఆ గంగాప్రవాహ స్పర్శతోనే సగర పుత్రులు ఉత్తమగతులు పొందారు.
దేవ దేవ జగన్నాధ పుణ్యశ్రవణ కీర్తన
యదూత్తమ: శ్లోక నారాయణ నమోస్తుతే॥"
అని అక్రూరుడు కృష్ణుని కీర్తించాడు.

అక్రూరుని ప్రార్థనలను మన్నించాడు కృష్ణుడు. "అక్రూరా! నేను, నా అన్న బలరాముడు నీ గృహమునకు తరువాత వస్తాము. యాదవ వంశమునకు ద్రోహము చేసిన ఆ కంసుని బంధువుల ఇళ్లకు వెళ్లడం వారికి ఆనందాన్ని చేకూర్చడం నా కర్తవ్యం కదా! ఇప్పటికి నీవు

నీ గృహమునకు పొమ్ము." అని అన్నాడు.

చేసేది లేక అక్రూరుడు విచారవదనంతో తన గృహమునకు వెళ్లాడు. మధ్యాహ్న భోజనము అయిన తరువాత కృష్ణుడు బలరామునితోనూ, తన స్నేహితులతోనూ కలిసి మధురానగరంలోకి ప్రవేశించాడు.

మధురానగరము సుందరమైన నగరము. పురద్వారము ఎత్తుగా ఉంది. అంతా స్ఫటికములు తాపడం చేసి ఉంది. గృహములకు ద్వారములు ఉన్నాయి. వాటికి బంగారు తలుపులు బిగించి ఉన్నాయి. మధురా నగరము కోట గుమ్మము లోహములతో చేయబడిఉంది. నగరము చుట్టు లోతైన అగడ్త ఉంది. నగరములో అందమైన ఉద్యానవనములు ఉన్నాయి. నగరములో వీధులు పొడవుగా, అక్కడక్కడా నాలుగు వీధులు కలిసే కూడలులు ఉన్నాయి. మేడలు ఎత్తుగా ఉన్నాయి. బాటసారులు విశ్రాంతి తీసుకోడానికి విశ్రాంతి గృహములు నిర్మించబడి ఉన్నాయి. నగరంలో అందమైన కట్టడములు నిర్మించు శిల్పులు ఉన్నారు. ఇంటి పైభాగములు మరకతములు, మాణిక్యములతో పొదగబడి ఉన్నాయి. ఇళ్ల పైభాగముల మీద, ఎత్తైన అరుగుల మీద, కిటికీలలోనూ, పావురాళ్లు, నెమళ్లు తిరుగుతున్నాయి. వీధులన్నీ నీటితో తడుప బడి చల్లగా ఉన్నాయి. పూలమాలలతో అలంకరింపబడి ఉన్నాయి.

రాత్రి కాగానే దీపముల తోరణములతో వెలిగిపోతోంది మధురా నగరము. అక్కడక్కడ అరటిపళ్లగెలలు వేలాడుతున్న అరటి

చెట్లు ఇళ్లముందు ఉన్న స్తంభములకు కట్టబడి ఉన్నాయి. అటువంటి రాజ మార్గములో ప్రవేశించాడు కృష్ణుడు.

నంద వ్రజము నుండి కృష్ణుడు వచ్చాడని తెలియగానే మధురానగరములోని స్త్రీలందరూ వారి వారి ఇళ్ల పైభాగములమీద చేరి ఉత్సాహంతో కృష్ణుని చూస్తున్నారు. వస్త్రములు సరిగా ఉన్నాయో లేదో కూడా చూచుకోకుండా, ఎలా ఉన్నవారు అలాగే గబగబా మేడల మీదికి ఎక్కుతున్నారు. కొంత మంది భోజనం చేస్తూ, కృష్ణుడు వస్తున్నాడని తెలిసి సగం భోజనంలో లేచి వచ్చారు. తైలం మర్దన చేయించుకుంటున్న వాళ్లు స్నానం కూడా చేయకుండా, ఈ కోలాహలం విన్న వాళ్లు సగం నిద్ర నుండి లేచి గబగబా మేడలు ఎక్కారు. కొందరైతే పసిబిడ్డలకు పాలు ఇస్తూ అలాగే బిడ్డలను ఎత్తుకొని కృష్ణుని చూడటానికి ఆతురతగా వచ్చారు.

చిరునవ్వులు చిందిస్తూ విలాసంగా వీధులలో నడుచుకుంటూ వెళుతున్న కృష్ణుడు మధురానగరవాసుల మనసులను ఆకర్షించాడు. వారి కనులకు విందుచేస్తున్నాడు. మధురానగర వాసులు కృష్ణుని గురించి ఆయన లీలలను గురించి, ఆయన సాధించిన విజయముల గురించి వినిఉన్నారు. ఇప్పుడు కృష్ణుని ప్రత్యక్షంగా చూస్తుంటే వారి మనసులు ఆనందంతో నిండిపోయాయి. కృష్ణుని చూపు తమ మీద పడితే చాలు అనుకొని తహతహలాడి పోతున్నారు.

కొంత మంది యువతులు కృష్ణుని శరీరం అంతా తమ చూపులతో తడుముతూ ఆయన తమను ఆలింగనము చేసుకున్నట్టు

అనుభూతి పొందుతున్నారు. ప్రత్యక్షంగా కృష్ణుని కౌగలించుకొనే అవకాశం లేనందుకు మనసులోనే బాధపడుతున్నారు. కొంత మంది స్త్రీలు మేడపైన నిలబడి కింద వీధిలో వెళుతున్న కృష్ణుని మీద పూలు చల్లుతున్నారు.

రాజమార్గములో బ్రాహ్మణులు, అక్షితలు, పూర్ణకుంభములు, పేలాలు, రకరకాల ఉపాహారములు తమ చేతులలో పట్టుకొని కృష్ణుని పూజిస్తున్నారు. ఇదంతా చూస్తున్న మధురానగరమగువలు తమలో తాము ఇలా అనుకుంటున్నారు.

"ఆహా! నందవ్రజములో గోపికలు ఎంత పుణ్యం చేసుకున్నారో కదా! పుట్టినప్పటి నుండి ఇప్పటి వరకూ కృష్ణుని ప్రతిరోజూ కనులవిందుగా చూస్తున్నారు. ఆ అదృష్టం మనకు లేదు కదా" అని ఆవేదన చెందుతున్నారు.

ఆ సమయంలో బలరామ కృష్ణులు దారిలో ఉన్న ఒక రజకుని వద్దకు వెళ్లాడు. ఆ రజకుడు కొత్త వస్త్రములకు చిత్రవిచిత్రములైన రంగులు వేస్తున్నాడు. మాసిన వస్త్రములను ఉతికి నూతనవస్త్రముల మాదిరి చేస్తున్నాడు.కృష్ణుడు ఆ రజకుని వద్దకు పోయి "రజకుడా! మేము రాజదర్శనం కోసరం వచ్చాము. మాకు విలువైన వస్త్రములు ఇమ్ము. మాకు వస్త్రములు ఇస్తే నీకు సకల శుభములు కలుగుతాయి." అని అడిగారు.

దానికి ఆ రజకుడు కోపించి ఇలా అన్నాడు. "ఓరి మూర్ఖులారా! మీరు గ్రామముల నుండి, పర్వతప్రాంతముల నుండి వచ్చినట్టున్నారు. మీరు ఎప్పుడైనా ఇటువంటి విలువైన వస్త్రములను చూచారా! ధరించారా! ఇవి రాజుగారి వస్త్రములు. ఇవి మీకెందుకు? ఇప్పటికే మీరు మహాపరాధం చేసారు. తొందరగా ఇక్కడినుండి వెళ్లిపొండి. బతుకుమీద ఆశ ఉంటే మరలా ఇటువంటి దురాశాపూరితమైన కోరిక కోరకండి. రాజభటులకు తెలిస్తే మీ వంటి అహంకారులను బంధించి మీ వద్దఉన్న వస్తువులను లాక్కుంటారు. మిమ్ములను చంపుతారు." అని అన్నాడు.

ఆ మాటలకు కృష్ణునికి కోపం వచ్చింది. తన చేతిని పైకెత్తి ఆ రజకుని మెడమీద ఒకే దెబ్బ వేసాడు. ఆ దెబ్బకు వాడు చచ్చి కిందపడ్డాడు. ఆ రజకుని అనుచరులు ఇది చూచి వస్త్రములను అక్కడ వదిలి తలోకదిక్కుగా పారిపోయారు. కృష్ణుడు, బలరాముడు ఆ వస్త్రములలో నుండి తమకు కావలసిన వస్త్రములను తీసుకొని ధరించారు. మిగిలిన వస్త్రములను తమతో వచ్చిన గోపాలురకు ఇచ్చారు. వారు కూడా ఆ వస్త్రములను ధరించారు.

తరువాత కృష్ణుడు ఒక ఆభరణములు అమ్మే దుకాణము వద్దకు వెళ్లాడు. రజకునికి పట్టిన గతిని చూసిన ఆ దుకాణాదారు, వారు అడగకుండానే వారికి కావలసిన ఆభరణములు ఇచ్చాడు. రామకృష్ణులు ఆ ఆభరణములను అలంకరించుకున్నారు. పరమాత్మస్వరూపుడైన కృష్ణుడు ఆ దుకాణము యజమానికి సకల ఐశ్వర్యములను ప్రసాదించాడు.

తరువాత బలరామ కృష్ణులు సుదాముడు అనే పూలమాలలు అమ్మేవాడిదగ్గరకు వెళ్లారు. పూలమాలలు అమ్మేవాడు బలరామకృష్ణులను చూచి ఎదురేగి నమస్కరించి, లోపలకు తీసుకొని వచ్చి వారికి అర్ఘ్యము, పాద్యము ఉచితాసనములను ఇచ్చి సత్కరించాడు. ఉపాహారములను సమర్పించుకున్నాడు. వారితో ఇలా అన్నాడు.

"మహానుభావులారా! మీ రాకతో నా గృహము పావనమైంది. దేవతలు, మా పితృదేవతలు, ఋషులు తృప్తిచెందారు. సృష్టి, స్థితి లయములకు కారణభూతులైన మీరు లోకకల్యాణము కొరకు ఈ మానవ రూపములు ధరించారు. మీరు ఆత్మస్వరూపులుగా ఈ జగత్తు అంతా నిండి ఉన్నారు. మీకు నావాడు, పరాయి వాడు అనే భేదములేదు. అందరూ మీకు సమానులే. మా వంటి దీనుల మీద మీరు ఎక్కువ ప్రేమ చూపిస్తున్నారు అనే కారణం చేత మీకు ఇష్టాయిష్టాలు ఉన్నాయి అనడం అవివేకము. తమరికి నేను ఏమి సేవచేయగలనో ఆజ్ఞాపించండి. మీ ఆజ్ఞలను అనుసరించడమే మానవులకు గొప్ప అనుగ్రహము.

ఉ॥ పావన మయ్యె నా కులము పండె దపంబు గృహంబు లక్ష్మికిన్
సేవితమయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిదానమూర్తులై
భూవలయంబు గావ నిటు పుట్టిన మీరలు రాకజేసి నే
నేవిధ మాచరింతు బనులెయ్యని బంట నెఱుంగ జెప్పరే!

అని పలికిన సుదాముడు బలరామకృష్ణులకు చిత్రవిచిత్రములుగా కట్టబడిన పూలమాలలు ఇచ్చాడు. బలరామకృష్ణులు ఆ మాలలు

అలంకరించుకున్నారు. సుదామునికి ఒక వరం ఇవ్వాలని అనుకున్నాడు కృష్ణుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ మాలలు కట్టేవాడు, జ్ఞానము వివేకము లేని వాడు కోరిన వరము వింటే ఆశ్చర్యపోతావు. ఆ సుదాముడు ఏమని అడిగాడో తెలుసా! "కృష్ణా! నాకు ఏవరమూ అక్కరలేదు. నీమీద అచంచలమైన ఏకాగ్రతతో కూడిన భక్తి, నీ భక్తులయందు సుహృద్భావము, సకల భూతముల యందు కరుణ నాకు ఉండేటట్టు నన్ను అనుగ్రహించు" అని ప్రార్థించాడు. (ఈ సందర్భంలో పోతన గారు ఒక అమృతతుల్యమైన పద్యం రాసారు.)

కం॥ నీ పాదకమలసేవయు నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును దాపసమందార నాకు దయసేయగదే॥

నా చిన్న తనంలో, గజేంద్రమోక్షములోని "ఎవ్వనిచేజనించు జగము" అనే పద్యము, ఈ పద్యమూ, మాకు 1వ తరగతి నుండి 5వ తరగతి వరకు ప్రార్థనా పద్యాలుగా ఉండేది. ఐదేళ్లపాటు ఈ పద్యాలు చదివి చదివి జీర్ణించుకుపోయాయి. 70 ఏళ్ల తరువాత ఆ పద్యాలను మీకు అందించే భాగ్యాన్ని నాకు కలిగించిన ఆ పరమాత్మ పాదార విందములకు, ఆదరిస్తున్న మీకు, భక్తితో నమస్కరించి నా జన్మ సార్థకం చేసుకున్నాను.)

కృష్ణుడు నవ్వి సుదాముడు కోరిన వరమును ప్రసాదించి, అంతే కాకుండా వారి వంశములో వారికి అనంత ఐశ్వర్యములను, సంపదలను, ఆయువును, కీర్తిని ప్రసాదించాడు.

తరువాత బలరామకృష్ణులు అక్కడి నుండి వెళ్లిపోయారు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు బలరామకృష్ణుల మధురానగర విహారమును గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము నలభైఒకటవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
నలభైరెండవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుడు సుదాముని అనుగ్రహించిన తరువాత ఆయన ఇంటి నుండి బయలు దేరి రాజ మార్గములో వెళుతున్నాడు. ఆ సమయంలో ఒక కురూపి అయిన వనిత సుగంధ ద్రవ్యములను మోసుకుంటూ వెళుతూ ఉంది. ఆమెను చూచిన కృష్ణుడు ఆమెతో ఇలా అన్నాడు.

"సుందరీ! నీవు ఎవరు? ఎవరి కోసరం ఈ సుగంధ ద్రవ్యములు తీసుకొని వెళుతున్నావు? మాకు ఈ వస్తువులు కావాలి. ఇస్తావా. నీకు శుభం కలుగుతుంది." అనిఅడిగాడు.

ఆ మాటలకు ఆ కురూపి ఇలా అంది. "ఓ సుందరాకారా! నా పేరు త్రివక్ర. నా శరీరం సరిగా ఉండగ మూడు వంకరలు తిరిగి ఉంది.

అందుకే నాకు ఆ పేరు సార్థకం అయింది. నేను ఈ సుగంధ ద్రవ్యములను కంస మహారాజు సేవ కొరకు తీసుకొని వెళుతున్నాను. నేను సుగంధ ద్రవ్యములు తయారు చేయడంలో, వాటిని ఒకదానితో ఒకటి కలిపి కొత్త కొత్త పరిమళములు సృష్టించడంలో నేర్పరిని. నేను తయారు చేసిన పరిమళ ద్రవ్యములు అంటే కంసమహారాజుగారు చాలా ఇష్టపడతారు. అంతటి గొప్పవాడిని నిన్నే చూస్తున్నాను. నీవు కంసుడు తప్ప ఈ అపురూపమైన పరిమళద్రవ్యములను ఉపయోగించడానికి అర్హులు ఇంకెవరుంటారు? మీకు కావలసినవి ఇస్తాను తీసుకోండి." అని ఆ త్రివక్ర తన వద్ద ఉన్న సుగంధ లేపనములు వారికి ఇచ్చింది.

ఆ లేపనములు పూసుకున్న బలరామ కృష్ణులు నూతన కాంతితో ప్రకాశించారు. తీసుకున్న దానికి ఏదో ఒక ప్రతిఫలము ఇవ్వాలి కదా. అందుకని కృష్ణుడు మూడు వంకరలు తిరిగిన త్రివక్ర శరీరమును, సక్రమంగా, అందంగా చేయదలిచాడు. వెంటనే కృష్ణుడు తన కాలి పాదములతో త్రివక్ర కాలి వేళ్లను నొక్కిపట్టి ఆమె గడ్డము కింద చెయ్యిపెట్టి ఆమె శరీరమును నిటారుగా చేసాడు. కృష్ణదివ్యస్పర్శతో ఆమె వంకర శరీరం నిటారుగా అయింది. అప్పటి వరకు వికారంగా ఉన్న ఆమె ఒక అందమైన వనితగా రూపొందింది. ఆమె మనసు కూడా మారి పోయింది. ఆమెకు కృష్ణుని మీద మోహము కలిగింది.

ఆమె కృష్ణుని ఉత్తరీయము పట్టుకొని ఇలా అంది. "నాకు అందమైన రూపము ఇచ్చావు. నేను నీకు ఏమి సేవ చేయగలను. ఒక్కసారి మా ఇంటికి దయచేయండి. నిన్ను దారిలో విడిచి వెళ్లడానికి

నా మనసు ఒప్పుకోవడం లేదు. ఎందుకో నిన్ను చూస్తుంటే నా మనసు నీ వైపే లాగుతూ ఉంది. ఒక్కసారి మా ఇంటికి వచ్చి నన్ను ధన్యురాలిని చేయవా!" అని దీనంగా అడిగింది.

అప్పుడు కృష్ణుడు బలరాముని వంక చూచాడు. పక్కనే ఉన్న గోపాలుర వంక చూచాడు. ఆమెతో ఇలా అన్నాడు. "నీ ఇంటికి రావడానికి మాకు ఎలాంటి అభ్యంతరము లేదు. ఎందుకంటే నీ ఇల్లు పురుషుల మానసిక బాధలను ఉపశమింపజేస్తుంది. ఎంతోమంది బాటసారులు నీ ఇంటికి వస్తుంటారు. నేను కూడా మధుర చూడటానికి వచ్చాను. మధురలో నా పని అయిన తరువాత తప్పకుండా నీ ఇంటి వస్తాను. నీ కోరిక తీరుస్తాను." అని అన్నాడు. అదే మహాప్రసాదము అనుకుంది త్రివక్ర. కృష్ణుడు బలరామునితో సహా అక్కడి నుండి వెళ్లిపోయాడు.

ఇదంతా చూస్తున్న మధురా పుర వాసులు ఆశ్చర్యచకితు లయ్యారు. కృష్ణుని దైవసమానుడిగా పూజించారు. వారి పూజలు అందుకుంటూ కృష్ణుడు ధనుర్యాగము ఎక్కడ జరుగుతుందో అని పురజనులను అడిగి తెలుసుకుంటూ, ఆ ధనుర్యాగము జరిగే ప్రదేశమునకు చేరుకున్నాడు. అక్కడ ఒక విచిత్రమైన ధనుస్సు పెట్టబడి ఉంది. ఆ ధనుస్సును అందరూ పూజిస్తున్నారు. ఆ ధనుస్సును చాలా మంది రాజభటులు చుట్టు ముట్టి రక్షిస్తున్నారు.

శ్రీకృష్ణుడు ఆ ధనుస్సును తాకబోయాడు. రాజభటులు అతనిని వారించారు. భటులను పక్కకు నెట్టి, కృష్ణుడు ఆ ధనుస్సును

పట్టుకున్నాడు. భటులందరూ ఆశ్చర్యంగా చూస్తూ ఉండగా కృష్ణుడు ఆ ధనుస్సును అవలీలగా పైకెత్తాడు. దానికి కట్టిన నారిని లాగి విల్లు సంధించాడు. కృష్ణుని బలానికి తట్టుకోలేక ఆ విల్లు నడిమికి విరిగిపోయింది. ఆ విల్లు విరిగేటప్పుడు వెలువడిన శబ్దానికి భూమి ఆకాశం దద్దరిల్లిపోయింది. ఆ శబ్దం విని కంసుడుకూడా ఒక్కసారిగా ఉలిక్కి పడ్డాడు. అతని మనసు అల్లకల్లోలం అయింది.

అప్పటి దాకా బొమ్మలవలె నిలబడి చూస్తున్న రాజభటులు ఒక్కసారిగా "వీడెవడో రాజుగారి ధనుస్సు విరిచాడు. వీడిని పట్టుకోండి. కొట్టండి. వదలకండి." అని అరుస్తూ కృష్ణుని మీదికి వచ్చారు. వీరి వలన తమకు ప్రమాదం జరుగుతుంది అని భావించిన బలరామకృష్ణులు రెండుగా విరిగి కిందపడి ఉన్న ఆ ధనుస్సు ముక్కలను చెరి ఒకటి తీసుకున్నారు. తమ మీదికి వస్తున్న రాజభటులను ఆ ముక్కలతో బాదారు. ఆ దెబ్బలకు తట్టుకోలేక చచ్చిన వారు చావగా మిగిలిన రాజభటులు పారిపోయారు.

బలరామకృష్ణులు ఆ యజ్ఞముచేసే ప్రదేశమును విడిచిపెట్టి మరలా మధురానగర సౌందర్యమును చూస్తూ రాజమార్గములో వెళుతున్నారు. అప్పటికి సాయంత్రం అయింది. ఈరోజుకు చాలు అనుకొని బలరామకృష్ణులు గోపాలురతో సహా తాము విడిది చేసిన వనమునకు చేరుకున్నారు.

ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుని రాకతో మధురానగరములో మరొక సూర్యుడు ఉదయించినట్టయింది. "ఈ రోజునుంది మధురానగరములో ఉన్న స్త్రీలకు ప్రతిరోజూ సుప్రభాతమే" అన్న వ్రజస్త్రీల

వాక్కులు నిజమయ్యాయి. ఆ రాత్రి బలరామ కృష్ణులు తమ వారితో కలిసి భోజనము చేసి, విశ్రాంతి తీసుకున్నారు.

బలరామ కృష్ణులు మధురా నగరంలో ప్రవేశించడం, తన పరిచారకుడైన రజకుని చంపడం, ధనుస్సును విరవడం, తన సైనికులను చంపడం అన్నీ విన్నాడు కంసుడు. కంసుని మనసులో ఆందోళన మొదలయింది. ఆరాత్రి కంసుడికి నిద్రపట్టలేదు. భయంతో వణికిపోతున్నాడు.

కంసునికి మేలుకొని ఉన్నా, కలత నిద్రలో కలలు కన్నా అందులో తనకు అశుభాన్ని సూచించే లక్షణాలు గోచరిస్తున్నాయి. నీటిలో చూస్తే తల లేకుండా శరీరం మాత్రమే కనపడుతూ ఉంది. కళ్లముందు అన్ని వస్తువులు రెండు రెండుగా కనపడుతున్నాయి. తన నీడ తనకు కనిపించడం లేదు. చెట్లు పచ్చగా కాకుండా బంగారంలా మెరుస్తున్నాయి. తాను నడుస్తుంటే తన పాదముల గుర్తులు కనపడటం లేదు. ఈ బాధలు లేకుండా నిద్రపోదామంటే కలత నిద్రలో కలలు వస్తున్నాయి. ఆ కలలో చచ్చిన శవాన్ని కౌగలించుకున్నట్టు, గాడిదనెక్కి ఊరేగినట్టు, విషమును తిన్నట్టు, ఒంటి మీద బట్టలు లేకుండా, నూనె పూసుకొని తిరుగుతున్న మనుషులను చూస్తున్నట్టు, ఇలా కలలు వస్తున్నాయి. అటు మెలుకువగా ఉండలేక, ఇటు నిద్రపోలేక, కంసుడు ఆ రాత్రి అంతా జాగారం చేసాడు.

మరునాడు సూర్యోదయం కాగానే, కృష్ణుని చంపడానికి ప్రయత్నాలు ముమ్మరం చేసాడు కంసుడు. మొదటి ప్రయత్నంగా

మల్లయుద్ధపోటీలు ప్రారంభించమని ఆదేశించాడు. కంసుని భటులు మల్లయుద్ధపోటీలు జరిగే ప్రాంగణము చేరుకున్నారు. ఆ ప్రాంగణమును చక్కగా అలంకరించారు. ప్రారంభోత్సవానికి తగిన ఏర్పాట్లు చేసారు. మల్లయుద్ధపోటీలు చూడటానికి వచ్చే జనాలు కూర్చోడానికి తగిన ఆసనములను ఏర్పాటు చేసారు. చుట్టు రంగు రంగులపతాకములు, పచ్చని తోరణములు కట్టారు. మంగళవాద్యములు మోగుతున్నాయి.

ఆ పోటీలు చూడటానికి మధురా నగర వాసులు భారీగా తరలి వచ్చారు. తమకు కేటాయించిన ఆసనములలో కూర్చున్నారు. కంసుడు వచ్చి తన సింహాసనము మీద కూర్చున్నాడు. ఆయన మంత్రులు అందరూ తమతమ ఆసనముల మీద కూర్చున్నారు. పైకి చిరునవ్వులు చిందిస్తున్నా, కంసుని మనసులో తెలియని భయం పట్టుకుంది. చాణూరుడు, ముష్టికుడు, కూటుడు, తోశలుడు మొదలగు మల్లవీరులు తమ చేతులు చరుస్తూ రంగంలోకి దిగారు. తమకు కూడా ఆహ్వానం ఉంది కాబట్టి నందుడు, తన పరివారముతో వచ్చి, తాము తెచ్చిన కానుకలు కంసునికి సమర్పించి, తమకు నిర్దేశించిన ఆసనముల మీద కూర్చున్నారు. " అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు త్రివక్ర వృత్తాంతము, ధనుర్భంగము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము నలభైరెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## నలభైమూడవ అధ్యాయము

ఓ పరీక్షిత్ మహారాజా! నందుడు అతని పరివారము ముందు వెళ్లగా, తరువాత బలరాముడు, కృష్ణుడు స్నానము, సంధ్య మొదలగు కార్యక్రమములు నిర్వర్తించుకొని, చక్కగా అలంకరించు కొన్నారు. ఇంతలో మల్లయుద్ధపోటీలు మొదలవుతున్నట్టు దుందుభులు మోగాయి. ఆ శబ్దములు విని, బలరామ కృష్ణులు కూడా మల్లయుద్ధ పోటీలు జరిగే ప్రదేశమునకు బయలు దేరారు.

వారు రంగస్థల ద్వారము వద్దకు చేరుకున్నారు. ద్వారము వద్ద కువలయాపీడము అనే ఏనుగు నిలబడి ఉంది. కృష్ణుడు ఆ ఏనుగును చూచాడు. అక్రూరుని మాటలు గుర్తుకు వచ్చాయి. ఆ ఏనుగు తనను చంపడానికే అక్కడ ఉంచబడినది అని గ్రహించాడు కృష్ణుడు.

మావటివానితో ఇలా అన్నాడు. "ఓ మావటీ! నీ ఏనుగును దోవకు అడ్డంగా నిలబెట్టావు. మేము లోపలకు వెళ్లాలి. నీ ఏనుగును పక్కకు తీస్తే మేమువెళతాము." అని సౌమ్యంగా అడిగాడు. మావటి వాడు నిర్లక్ష్యంగా కృష్ణుని మాటలు వినీ విననట్టు ఉన్నాడు. కృష్ణుడికి కోపం వచ్చింది.

"ఓ మావటీ! ఏమిటా నిర్లక్ష్యం. పోటీలు మొదలయ్యాయి. మేము లోపలకు వెళ్లాలి.  ముందు ఏనుగును పక్కకు తియ్యి లేకపోతే ఈ ఏనుగును నిన్ను ఇద్దరిని కలిపి చంపుతాను. జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

ఇప్పుడు మావటి వానికి కోపం వచ్చింది. "చంపుతావా! చంపు చూద్దాం!" అంటూ ఏనుగును కృష్ణుని మీదికి నడిపించాడు. ఆ మదపుటేనుగు ఘీంకరిస్తూ కృష్ణుని మీదికి వచ్చింది.  కృష్ణుని పట్టుకోడానికి తన తొండము పైకెత్తింది. కృష్ణుడు ఆ తొండము మీద ఒక గుద్దు గుద్ది, దాని తొండమునకు దొరక కుండా దాని ముందరి కాళ్ల వెనక దాక్కున్నాడు.  ఏనుగుకు ముందు చూపు తప్ప వెనక్కు తిరగలేదు. దానిక కంటికి కృష్ణుడు కనపడటంలేదు. మావటి వాడు వెనక్కు తిరగమని అంకుశంతో పొడిచాడు.

ఏనుగుకు కోపం వచ్చింది. విసురుగా వెనక్కు తిరిగింది. తొండము విదిలించి కృష్ణుని మీదికి విసిరింది. కృష్ణుడు ఏనుగు వెనక్కు వెళ్లాడు. దాని తోక పట్టుకొని బలంగా వెనక్కు లాగాడు. ఏనుగు వెనక్కు వెనక్కు వెళుతూ ఉంది. కృష్ణుడు ఆవుదూడను తోకపట్టుకొని లాగుతున్నట్టు ఆ ఏనుగును లాగుతున్నాడు. ఏనుగు ఎటు తిరిగితే అటు తిరుగుతున్నాడు. ఏనుగుకు కృష్ణుడు కనిపించడం లేదు. అది కుడివైపు తిరిగితే కృష్ణుడు ఎడమ వైపుకు, అది ఎడమ వైపుకు తిరిగితే తాను కుడి వైపుకు తిరుగుతూ ఆడుకుంటున్నాడు.

ఉన్నట్టుండి కృష్ణుడు ఏనుగు ముందుకు వచ్చి హేయ్ అని అరిచి దాని ముఖం మీద ఒక గుద్దు గుద్ది మరలా వెనక్కు

పారిపోతున్నాడు. ఏనుగు కూడా కృష్ణుని వెంట పరుగెత్తింది. కృష్ణుడు ఏనుగు తొండానికి అందినట్టే అంది తప్పించుకుంటున్నాడు. ఒక్కోసారి ఏనుగుకు చిక్కినట్టు నటించి కిందపడుతున్నాడు. ఏనుగు దగ్గరకు రాగానే లేచి పరుగెడుతున్నాడు. ఏనుగు కోపంతో తన దంతములతో కృష్ణుడు పడ్డచోట కోపంతో భూమిని తవ్వుతోంది.

తనకు చిక్కకుండా కృష్ణుడు పరుగెత్తడంతో ఏనుగుకు, మావటికి కోపం తారస్థాయికి చేరుకుంది. కృష్ణుని ఏనుగుతో చంపించకపోతే కంసుని చేతిలో తనకు చావు ఖాయం అని భయపడుతున్నాడు మావటీడు. ఏనుగుకు ఆ భయంలేదు కాబట్టి రోషంతో కృష్ణుని వెంట తరుముతూ ఉంది.

ఆట ఇంకచాలు అనుకున్నాడు కృష్ణుడు. ఏనుగు ముందు నిలబడ్డాడు. దాని తొండము పట్టుకొని తిప్పి ఏనుగును కిందపడేసాడు. ఒక కాలు ఏనుగు మెడ మీద పెట్టి అదిమాడు. రెండు చేతులతో దాని దంతములను ఊడపీకాడు. ఆ దంతములనే ఆయుధంగా చేసుకొని కిందపడ్డ మావటి వాడిని చంపాడు. దంతములు పెరకగా గిలగిల కొట్టుకుంటున్న ఏనుగును దాని దంతములతోనే పొడిచి పొడిచి చంపాడు కృష్ణుడు.

రక్తసిక్తములైన దాని దంతములను గదల మాదిరి బుజం మీద పెట్టుకొని మల్లయుద్ధముజరిగే రంగస్థలములోకి ప్రవేశించాడు కృష్ణుడు. కృష్ణుని వెంట బలరాముడు, గోప బాలురు కూడా ఎగురుకుంటూ వెళ్లారు. ఏనుగుదంతములను బుజం మీద పెట్టుకొని

వస్తున్న కృష్ణుని చూచి మల్లయోధులకు మతిపోయింది. ఏనుగునే చంపిన వాడికి మనము ఒక లెక్కా అని మనసులో అనుకున్నారు. దూరంగా కూర్చున్న కంసుడికి ఈ వార్త తెలిసింది. కువలయా పీడమును కృష్ణుడు చంపాడు అన్న వార్త విని కంసుడు కలవరపడ్డాడు. కంసుని మనసంతా అల్లకల్లోలం అయింది. వీళ్లు అంత సులభంగా చావరు అని అనుకున్నాడు.

రామకృష్ణులు రంగస్థలంలో వీరుల మాదిరి నిలబడ్డారు. ప్రేక్షకుల కళ్లన్నీ వారి మీదనే ఉన్నాయి. వారందరూ కృష్ణుని కాళీయమర్దనము, గోవర్ధనోద్ధరణము గురించి వినిఉన్నారు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నారు. అక్కడ ఉన్న స్త్రీలు "అబ్బా ఎంత బాగున్నాడో! ఎంత ముద్దుగా ఉన్నాడో" అని మనసులోనే కృష్ణుని కౌగలించుకున్నారు. కొందరైతే ఇలా అనుకుంటున్నారు.

"ఈ కృష్ణుడు సాక్షాత్తు శ్రీహరి అవతారము. మనలను ఉద్ధరించడానికి వసుదేవుని కుమారుడుగా జన్మించాడు. కంసునికి భయపడి గోకులంలో పెరిగాడు. అవతార పురుషుడు కాకపోతే పూతనను, తృణావర్తుని, శంఖచూడుని, కేశుని, ధేనుకుడిని ఎలా చంపగలడు? దావానలము నుండి గోపబాలురను ఎలా రక్షించగలడు? కాళీయుని ఎలా మర్దించగలడు? గోవర్ధన పర్వతమును ఎత్తి వ్రజవాసులను, గోవులను ఎలా రక్షించగలడు? ఈయనే కాదు ఈయన అన్నగారు బలరాముడు కూడా ప్రలంబుడు, వత్సుడు మొదలగు రాక్షసులను సంహరించాడు. నిజంగా కృష్ణుడు ఆ శ్రీహరి అవతారమే! అటు చూడండి. పెదాల మీద ఆ చిరునవ్వును చూచి కదా గోపకాంతలు కృష్ణుని మీద ప్రేమను పెంచుకున్నారు.

యదువంశము అంతా కృష్ణుని రక్షణలో దినదినప్రవర్ధమానమౌతూ ఉంది." అని మధురా నగర వాసులు తమలో తాము అనుకుంటున్నారు. పెద్దగా అంటే కంసుని ఆగ్రహానికి గురికావలసి వస్తుందని గుసగుసలాడుకుంటున్నారు.

ఇంతలో చాణూరుడు అనే మల్లయోధుడు ఠీవిగా నిలబడి ఉన్న బలరామ కృష్ణులను చూచి ఇలా అన్నాడు. "ఓ వీరులారా! మీరు ఏనుగును చంపడం చూచాము. మీ వీరత్వము వెల్లడయింది. మీరు మల్లయుద్ధములో కూడా ప్రవీణులు అనుకుంటున్నాము. అందుకే మీ ఇద్దరినీ ఈ పోటీలకు పిలిపించారు. మనకందరికీ కంసుడు మహారాజు. మేమందరమూ కంసమహారాజుకు ప్రియమైన పనులే చేస్తుంటాము. మీరు గోవులను మేపుకొనేటప్పుడు ఒకరితో ఒకరు మల్లయుద్ధము చేసుకుంటుంటారని విన్నాము. ఆ యుద్ధ విద్యను ఇక్కడ ప్రదర్శించి కంసమహారాజుకు వినోదం కలిగించండి. దానివలన మీరు కూడా రాజానుగ్రహమునకు పాత్రులవుతారు. రాజు ప్రసన్నుడయితే సకల భూతములు కూడా మనకు ప్రసన్నమవుతాయి కదా!" అని కంసుని పొగుడుతూ బలరామకృష్ణులను చాతుర్యంగా మల్లయుద్ధమునకు ఆహ్వానించాడు చాణూరుడు.

చాణూరుని ఆంతర్యం అర్థం చేసుకున్నాడు కృష్ణుడు. అతని మాటలకు తగిన విధంగా ఇలా అన్నాడు. "మాదేముంది. పల్లెలలో ఉంటూ అడవులలో పశువులను మేపుకొనేవాళ్లము. మీ మీదిరి మేము కూడా కంసుని పాలనలో ఉన్నాము. రాజుకు వినోదం చేకూర్చడం ఆనందాన్ని కలిగించడం మా విధి. దాని వలన మాకు కంసరాజు

అనుగ్రహం లభిస్తుంది. కాకపోతే మేము 10 ఏళ్లు కూడా నిండని బాలురము. మీరు ఆరితేరిన మల్లయోధులు. మీకూ మాకూ సమత్వము లేదు. మేము మా వయసువారితోనే మల్లయుద్ధము చేయగలము. అప్పుడే అది ధర్మయుద్ధము అవుతుంది. ధర్మాత్ముడైన కంసుని సమక్షంలో అధర్మము జరగరాదు కదా!" అని తాను కూడా నేర్పుగా బదులు చెప్పాడు కృష్ణుడు.

ఆ మాటలకు చాణూరుడు నవ్వి "మీరు వయసులో బాలురు కానీ మీరు చేతలలో పెద్దవాళ్లని మించి పోయారు. మీరు చంపిన కువలయాపీడము సాధారణమైన ఏనుగు కాదు. దానికి వేయి ఏనుగుల బలం ఉంది. అటువంటి ఏనుగును మీరు చంపారు. అటువంటి మీకు మాతో మల్లయుద్ధం చేయడం ఒక లెక్కా! ఇక్కడ బలాబలాలు ముఖ్యం కానీ, వయసుకాదు. కాబట్టి మీరు ఇద్దరూ మాతో యుద్ధం చేయడం అధర్మం అనిపించుకోదు. మీ ఇద్దరినీ మేము పోటీకి ఆహ్వానిస్తున్నాము. మీరు మాతో మల్లయుద్ధం చేయండి. ఒకరితో ఒకరమే పోటీకి దిగుదాము. నేను నీతో మల్లయుద్ధం చేస్తాను. బలరాముడు ముష్టికునితో మల్లయుద్ధం చేస్తాడు." అని తన నిర్ణయం ప్రకటించాడు చాణూరుడు." అని శు కమహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణుడు కువలయాపీడమును సంహరించడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము నలభైమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

నలభైనాలుగవ అధ్యాయము.

ఓ పరీక్షిత్ మహారాజా! చాణూరుడు చెప్పిన విధంగా ముష్టికుని బలరాముడు, చాణూరుడిని కృష్ణుడు మల్లయుద్ధంలో ఎదుర్కొన్నారు. మల్లయుద్ధం మొదలయింది. చేతులతో, కాళ్లతో కొట్టుకుంటున్నారు. చేతులు చరుచుకుంటున్నారు. ఒకరి పాదములు ఒకరు పట్టుకొని పైకెత్తి కిందపడవేస్తున్నారు. పిడికిళ్లతో గుద్దుకుంటున్నారు. ఒకరి తలతో ఒకరు ఢీకొట్టుకుంటున్నారు. గుండెలకు గుండెలు గుద్దుకుంటున్నాయి. చుట్టు తిరుగుతున్నారు. ఒకరిని ఒకరు ఎలా దెబ్బతియ్యాలా అని అదునుకోసరం ఎదురుచూస్తున్నారు. నలుగురి దేహములు దెబ్బలతో కమిలిపోతున్నాయి.

చూచే వాళ్లు అయ్యో ఇదేమిటి. వారు బాలురు, వీళ్లు దున్నపోతుల్లా ఉన్నారు. వీళ్లమధ్యపోటీ ఏమిటి దుర్మార్గం కాకపోతే! అని నోళ్లు నొక్కుకుంటున్నారు. కంసుడికి భయపడి ఎవరూ నోరుమెదపడం లేదు. మరి కొందరయితే బాహాటంగా “ఇది అన్యాయం. అధర్మం. చిన్న పిల్లలకు, పెద్ద వాళ్లకు జరిగే ఈ మల్లయుద్ధమును ఆపడానికి రాజు కూడా ప్రయత్నించడం లేదు. ఇదేం రాజ్యం. వీడేం రాజు.” అని విమర్శిస్తున్నారు.

మరి కొందరయితే "బండరాళ్ల వంటి మల్లయోధుల శరీరాలెక్కడ! కోమలమయిన ఈ బాలుర శరీరాలెక్కడ! ఏమైనా పోలిక ఉందా! ఇంకా ఈ యుద్ధాన్ని ఇలాగే కొనసాగనిస్తే సభలో అధర్మం చెలరేగిపోతుంది. ఇటువంటి అధర్మం జరిగే చోట ఉండటం కూడా మంచిది కాదు." అనుకుంటూ కొందరు వెళ్లిపోతున్నారు.

మగవాళ్ల పరిస్థితి ఇలా ఉంటే ఆడవాళ్ల సంగతి మరీ ఘోరంగా ఉంది. వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. మరి కొందరు ఇలా అనుకుంటున్నారు. "ఎక్కడైనా, ఏ సభలోనైనా అధర్మం జరుగుతుంటే, ధర్మం తెలిసిన వాళ్లు, ఆ అధర్మాన్ని అరికట్టాలి. అలాకాకుండా చూస్తూ ఊరుకున్నా, లేక ఆ అధర్మాన్ని సమర్థించినా, ఆ మానవుడు పాపం పొందుతాడు. ఆ కారణం చేత బుద్ధిమంతులు, ధర్మపరులు ఇటువంటి రాజుల సభలకు రారు. అటు చూడండి. పాపం కృష్ణుడు ఆ దున్నలాంటి చాణూరునితో పోరాడి ఎలా అలసిపోయాడో!" అని ఒకామె అంటే "అదేం చూచావు. ఆ ముష్టికుడి చుట్టు తిరిగి తిరిగి అలసి పోయిన బలరాముడిని చూడండే!" అని మరొకామె అంది.

బలరాముడు, కృష్ణుడు, చాణూర ముష్టికులు ఏ మల్లయుద్ధవిధానములను అనుసరించి పోరాడుతున్నారో, అదే క్రమంలో వారికి తమ తమ ముష్టిఘాతములలో సమాధానం చెబుతున్నారు. కృష్ణుడు తన శరీరాన్ని రాయిలాగా, ఉక్కులాగా చేసాడు. కృష్ణుడు బలమైన తన ఉక్కు పిడికిలితో ఒక్కొక్క గుద్దుగుద్దుతుంటే చాణూరుడు హడలిపోతున్నాడు. మెల్లిగా ధైర్యం కూడదీసుకొని రెండు చేతులతో కృష్ణుని గుండెల మీద బలంగా మోదాడు. ఆ దెబ్బ కృష్ణుడికి పూవు మాదిరి తగిలింది. కృష్ణుడు చాణూరుడి రెండు చేతులు

పట్టుకున్నాడు. గిరా గిరా గాలిలో తిప్పాడు. వాడి శరీరాన్ని నేలకేసి మోదాడు. చాణూరుడు నేలకరుచుకున్నాడు. మరి లేవలేదు. ముష్టికుడు కూడా అదే తప్పు చేసాడు. తన రెండు చేతులు కలిపి బలరాముని గుండెల మీదమోదాడు. బలరాముడు వాడి రెండు చేతులను పట్టుకొని కిందపడేసాడు. వాడి గుండెల మీద కూర్చుని తన రెండుచేతులలో వాడి గుండెల మీద మోదాడు. ముష్టికుడి నోటి నుండి రక్తం కక్కుకుని చచ్చాడు.

ఇంతలో కూటుడు అనే మల్లయోధుడు బలరాముని మీదికి వచ్చాడు. బలరాముడు బలంగా పిడికిలి బిగించి కూటుని గుండెలమీద కొట్టగా, వాడు రక్తం కక్కుకొని చచ్చాడు. శలుడు, తోశలుడు అనే వారు కృష్ణుని మీద కలియబడ్డారు. కృష్ణుడు వారిద్దరినీ కిందపడేసి వారి మెడల మీద కాళ్లు పెట్టి తొక్కాడు. వారు ఊపిరి ఆడక మరణించారు. ఈ ప్రకారంగా చాణూరుడు, ముష్టికుడు, కూటుడు, శలుడు, తోలుడు చావగా మిగిలిన మల్లయోధులు పారిపోయారు.

ఇది చూచి కృష్ణుని స్నేహితులు అయిన గోపాలురు కృష్ణుని వద్దకు వచ్చారు. అందరూ ఆనందంతో నృత్యం చేస్తున్నారు. వారిని చూచి వాద్యకారులు వాద్యాలు వాయించారు. అంతా ఆనంద కోలాహలంగా ఉంది. వచ్చినవారు ఆనందంతో కేరింతలు కొడుతున్నారు. బ్రాహ్మణులు బలరామ కృష్ణులను ఆశీర్వదిస్తున్నారు. కంసుని గుండెలు మండిపోతున్నాయి. తాను పంపిన ఏనుగు పీనుగయింది. మల్లయోధులు మట్టికరిచారు. కంసుడికి కన్నీళ్లు

మిగిలాయి.

"ఆగండి. అన్నీ ఆపండి." అని పెద్దగా అరిచాడు కంసుడు. అందరూ ఆగిపోయారు. అంతా నిశ్శబ్దం. "నందుని వాడి కొడుకులను, గోపాలకులను బంధించండి. వారి వద్దనున్న ధనమును లాక్కోండి. నా బావ వసుదేవుని, నా తండ్రి ఉగ్రసేనుని చంపెయ్యండి. వెళ్లండి." అని గట్టిగా అరిచాడు.

అపరిమితమైన దుర్మార్గానికి ఒడిగడుతున్న కంసుని మాటలను విన్నాడు కృష్ణుడు. ఇంక ఊరుకుంటే లాభంలేదనుకున్నాడు. ఒక్క ఎగురు ఎగిరి కంసుని సింహాసనము దగ్గరకు దూకాడు. కంసుడికి మృత్యువు తన ఎదురుగా నిలబడినట్టయింది. వెంటనే తన ఆసనము మీది నుండి లేచి కత్తి చేతిలోకి తీసుకున్నాడు. కృష్ణుని మీదికి ఉరికాడు.  కృష్ణుని చంపడానికి అటు ఇటు కత్తి విసురుతున్నాడు.

గరుడుడు పాము తల పట్టుకున్నట్టు కృష్ణుడు ఒడుపుగా కంసుడి మెడ పట్టుకున్నాడు. కంసుని కిరీటము జారి కింద పడింది. కృష్ణుడు కంసుని జుట్టుపట్టుకొని కిందకు లాగాడు. కంసుడు కింద పడ్డాడు. కృష్ణుడు కంసుడి గుండెల మీద కూర్చున్నాడు. రెండు చేతులతో కంసుని గుండెల మీద మోది కంసుని చంపాడు కృష్ణుడు. చచ్చిన కంసుని జుట్టు పట్టుకొని కిందికి లాగేసాడు. కంసుడు దొర్లుకుంటూ వచ్చి నేలమీద పడ్డాడు.

హటాత్తుగా జరిగిన ఈ సంఘటనను చూచి జనాలు హాహాకారాలు చేసారు. ఇది చూచిన కంసుని తమ్ముళ్లు అయిన కంకుడు, న్యగ్రోధుడు మొదలగు వారు ఎనిమిదిమంది కృష్ణుని మీదికి వచ్చారు. ఇది చూచిన బలరాముడు అక్కడే ఉన్న పరిఘను తీసుకొని వారిని ఎదుర్కొన్నాడు. బలరాముడు ఆ ఎనిమిది మంది తలలను పరిఘతో నరికాడు. దేవతలు దుందుభులు మోగించారు. పుష్పవృష్టి కురిపించారు. అప్సరసలు నృత్యం చేసారు. గంధర్వులు ఆడారు పాడారు.

ఈ విషయం దావానలంలా అంత:పురానికి పాకింది. కంసుని భార్యలు గుండెలు బాదుకుంటూ కంసుడు పడిఉన్నచోటికి వచ్చారు. కంసుని శవం మీద పడి ఏడుస్తున్నారు. “ఓ ప్రభూ!నాధా! మమ్ములని వదిలిపెట్టి పోయావా! మా అందరినీ అనాధలను చేసి వెళ్లిపోయావా!  నీవు లేని మధుర భర్తలేని ప్రియురాలిలా ఉంది.  ఏ పాపమూ చెయ్యని వారిని బాధపెట్టిన ఫలితం వలననే కదా నీకు ఈనాడు ఇటువంటి గతి పట్టింది. అకారణంగా సాటి ప్రాణులను హింసించిన వాడు ఎవరైనా బాగుపడ్డాడా! కృష్ణుడు విష్ణు అంశ అని తెలిసి కూడా ఆయనతో విరోధం ఎందుకు పెట్టుకున్నావు? కృష్ణుని ఎదిరించి ఎవరైనా బతికారా! అంతా మన ఖర్మ.” అంటూ ఏడుస్తున్నారు.

కృష్ణుడు వారిని యధోచితంగా ఓదార్చాడు. కంసునికి రాజలాంఛనాలతో దహన క్రియలు, కర్మకాండలు చేయించాడు. కృష్ణుడు, బలరాముడు వెంటనే కారాగారమునకు పోయి తన తల్లి

తండ్రులను బంధవిముక్తులను చేసారు. వారి పాదాలకు నమస్కరించారు. బలరామ కృష్ణులను చూచిన  దేవకీ వసుదేవులు, వారిని దేవతామూర్తులుగా భావించి,  వారిని లేవనెత్తి, ఆలింగనము చేసుకొంటే ఏమవుతుందో అని, వెనక్కు తగ్గారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కంసవధను గురించి  వివరించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము నలుబది నాలుగవ అధ్యాయము
సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
నలుబది ఐదవ అధ్యాయము.

శ్రీకృష్ణుడు తన తల్లి తండ్రులు అయిన దేవకీ వసుదేవుల వద్దకు వచ్చి వారికి భక్తితో నమస్కరించాడు. "అమ్మా! నాన్నా!" అంటూ ప్రేమతో పలకరించాడు.

"అమ్మా! నేను పుట్టినప్పటి నుండి మీ నుండి దూరంగా ఉండటం వలన మాతృప్రేమకు పితృప్రేమకు నోచుకోలేకపోయాను. మీరు కూడా నా బాల్యము, పౌగండము, కిశోరము మొదలగు అవస్థలను చూచి ఆనందించే అదృష్టాన్ని కోల్పోయారు. అది మీ దురదృష్టమో, యశోద అదృష్టమో కానీ, నేను మీ వద్ద పెరగలేదు. నాకు కూడా నా తండ్రి వద్ద బాల్యంలో అనుభవించే సుఖములను దూరం అయ్యాను. అమ్మా! నాన్నా! ఈ శరీరము మీరు ఇచ్చారు. మీ

వలననే ఏర్పడిన ఈ శరీరముతో నూరు సంవత్సరములు జీవించినను, ఈ నూరు సంవత్సరములు మీకు సేవలు చేసిననూ, జన్మనిచ్చిన తల్లి తండ్రుల ఋణం తీర్చుకోలేదు.

ఏ కుమారుడైనా తనకు శక్తి ఉండి కూడా, తన తల్లి తండ్రులను పోషించకుండా నిర్లక్ష్యం చేస్తే, నరక లోకంలో యమభటులు, వాడి మాంసమును, వాడిచేతనే తినిపిస్తారు. తల్లితండ్రులను, భార్యను, సంతానమును, తన కులములోని వృద్ధులను, గురువుగారిని, బ్రాహ్మణులను, తనను ఆశ్రయించిన వారిని, పోషించే శక్తి ఉండి కూడా, నిర్లక్ష్యం చేస్తే, వారిని పోషించకుండా వారి మానానా వారిని వదిలివేస్తే, అటువంటి వారు, బతికినా చచ్చినట్టే.

అమ్మా! నేను, అన్నగారు ఇప్పటి వరకు కంసుని భయముతో మీ వద్దకు వచ్చి, మిమ్ములను పూజించే అవకాశమును కోల్పోయాము. మా జీవితములో ఇన్ని రోజులు వృధాగా గడిచిపోయాయి. అదీ కాకుండా మేము ఇద్దరమూ యశోదా నందుల గృహంలో పెరుగుతున్నాము. వాళ్లపోషణలో ఉన్నాము. అనుదినము ఏ రాక్షసుడు వచ్చి చంపుతాడో అనే భయంతో బతికాము. ఆ కారణం చేత తల్లితండ్రులయిన మిమ్ములను సేవించలేకపోయాము. మా అపరాధమును క్షమించండి. మమ్ములను ఆశీర్వదించండి." అని బలరాముడు, శ్రీకృష్ణుడు తమ తల్లితండ్రులయిన దేవకీ వసుదేవుల ముందు మోకరిల్లారు.

తమ కుమారులు తమ ఆశీర్వాదము కోరుతూ పలికిన మాటలు విన్న దేవకీ వసుదేవులు తమ కుమారులను ప్రేమతో కౌగలించుకున్నారు. ఒడిలో కూర్చోపెట్టుకున్నారు. వారి తలలు ఆప్యాయంగా నిమిరారు. దేవకీ వసుదేవుల కళ్ల నుండి ఆనందభాష్పాలు ధారగా కారుతున్నాయి. వారి కంఠములు బొంగురుపోయాయి. ఆనందంతో నోటి వెంట మాటలు రావడం లేదు. అలా ఎంతో సేపు ఉండి పోయారు.

తరువాత బలరామ కృష్ణులు తమ తాతగారైన ఉగ్రసేనులవారి వద్దకు పోయి వారి ఆశీర్వాదము తీసుకున్నారు. ఉగ్రసేనుని తిరిగి సింహాసనము మీద కూర్చోబెట్టి రాజుగా అభిషేకించారు. కృష్ణుడు ఉగ్రసేనుని ముందు వినయంగా చేతులు జోడించి నిలబడి ఇలా అన్నాడు. "ఉగ్రసేన మహారాజా! మేము నీ ప్రజలము. మీ సేవకులము. మమ్ములను ఆజ్ఞాపించండి. మీ ఆజ్ఞలను శిరసావహించడానికి సిద్ధంగా ఉన్నాము. యదు వంశము వారికి సింహాసనము మీద కూర్చునే అర్హత లేదు అని యయాతి మహారాజు ఆదేశించాడు. కాని అది తమరికి వర్తించదు. మీరు మా మహారాజులు. దేవతలు కూడా మీకు కానుకలు సమర్పిస్తారు. ఇంక మనుషుల సంగతి చెప్పేదేముంది. తమరు నిర్భయంగా రాజ్యపాలన సాగించండి." అని వేడుకున్నాడు.

తరువాత కృష్ణుడు, కంసుని భయంతో నలుదిక్కులకు పారిపోయి, వివిధ దేశములలో తలదాచుకుంటున్న యాదవులను, వృష్ణులను, అంధకులను, మాధవులను, కుకురులను ఇంకా ఇతర వంశస్థులను అందరినీ తిరిగి మధురకు రావలసినదిగా వర్తమానం

పంపాడు. వారిని అందరినీ పిలిపించి గౌరవించాడు. వారికి అందరికీ పునరావాసము కల్పించాడు. పేరుకు ఉగ్రసేనుడు మహారాజు అయినా, మధురా నగర సంరక్షణను బలరామ కృష్ణులు వహించారు. ప్రజల కోరికలు తీర్చారు. మధురా నగర ప్రజలు కూడా ప్రతిరోజూ కృష్ణుని దివ్యమంగళవిగ్రహమును దర్శిస్తూ ఆనందంతో కాలం గడుపుతున్నారు. మధురా నగరంలో ఉన్న వృద్ధులు కూడా శ్రీకృష్ణుని దివ్యసందర్శన భాగ్యంతో తిరిగి యౌవన్నాని పొందినట్టు అనుభూతి పొందారు.

అప్పటి వరకు నందుడు మధురా నగరములోనే ఉన్నాడు. మధురలో పరిస్థితులు చక్కబడిన తరువాత, బలరామ కృష్ణులు నందుని వద్దకు వెళ్లారు. ఆయనకు నమస్కరించి ఇలా అన్నారు. "తండ్రీ! నీవు, మా తల్లి యశోద, నన్ను, అన్న బలరాముని మీ ప్రేమామృతంలో ముంచారు. లాలించారు. పోషించారు. మేము ఎంత అల్లరి చేసినా భరించారు. సాధారణంగా తల్లి తండ్రులకు తమ శరీరముల మీద కంటే, తమ సంతానము మీద ఎక్కువ ప్రేమ ఉంటుందంటారు. కాని మీరు ఇద్దరూ మా మీద అంతకంటే ఎక్కువ ప్రేమ చూపించారు.

ఏ కారణం చేతనైనా కన్న తల్లి తండ్రులు తమ సంతానమును పెంచడానికి అశక్తులైతే, ఆ పిల్లలను పెంచిన తల్లి తండ్రులను కన్న తల్లి తండ్రుల వలెనే పరిగణించాలి. మీరు మాకు కన్న తల్లి తండ్రుల కంటే ఎక్కువ. మీరు క్షేమంగా వ్రజమునకు వెళ్లండి. మేము ఇక్కడ చేయవలసిన కార్యములను అన్నిటినీ నిర్వర్తించి, తీరిక చూచుకొని, మిమ్ములను తల్లి యశోదను చూడటానికి వస్తాము." అని

అన్నాడు. తరువాత కృష్ణుడు నందునికి, గోపబాలురకు గోపకులకు, వారి పరివారమునకు అనేక విలువైన కానుకలు ఇచ్చాడు. ఆభరణములను, వస్త్రములను, పాత్రలను సమర్పించాడు. నందుడు కూడా బలరామ కృష్ణులను ప్రేమగా కౌగలించుకొని, వారిని వదలలేక వదలలేక వదిలి పెట్టి వ్రజమునకు తన పరివారముతో సహా వెళ్లిపోయాడు.

తరువాత వసుదేవుడు తమ పురోహితుడైన గర్గుని పిలిపించాడు. బలరామ కృష్ణులకు ఉపనయన సంస్కారములు జరిపించాడు. ఆ సమయంలో బ్రాహ్మణులకు గోవులను, వస్త్రములను, ధనమును దానం చేసాడు. శ్రీకృష్ణుడు పుట్టినప్పుడు తాను మనసులో అనుకున్న వేయిగోవుల దానమును గుర్తు చేసుకొని, బ్రాహ్మణులకు వేయి గోవులను చక్కగా అలంకరించి దానం చేసాడు. గర్గముని చేత ఉపనయన సంస్కారమును పొంది, బలరామ కృష్ణులు ద్విజులు అయ్యారు. వారు బ్రహ్మచర్యవ్రతమును స్వీకరించారు.

తరువాత వారు విద్య నేర్చుకోడానికి కాశీపండితుడు అయిన సాందీపుడు అనే ముని ఆశ్రమమునకు వెళ్లారు. అక్కడ గురుకుల వాసము చేస్తున్నారు. తమ గురువైన సాందీపుని భక్తితో సేవిస్తూ విద్య నేర్చుకుంటున్నారు. గురువైన సాందీపముని కూడా వీరి భక్తి శ్రద్ధలకు సంతోషించి, వారికి వేదములు, షడంగములు, ఉపనిషత్తులు, మంత్రములతో సహా ధనుర్వేదము, మనుధర్మశాస్త్రము, తర్కము, మీమాంస, మొదలగు శాస్త్రములను, రాజనీతిని ఉపదేశించాడు. బలరామ కృష్ణులు కూడా గురువుగారు బోధించిన వేదములను, శాస్త్రములను భక్తితో, శ్రద్ధతో, ఏకాగ్రబుద్ధితో, ఒక్కసారి

చెబితే చాలు, ఇట్టే గ్రహించారు. అంతే కాకుండా వారు అరవైనాలుగు కళలను అభ్యసించారు. బలరామ కృష్ణుల విద్యాభ్యాసము పూర్తి అయింది. వారు గురువుగారైన సాందీపని వద్దకు పోయి "గురువుగారూ! తమరికి గురుదక్షిణ సమర్పించుకోవాలని అనుకుంటున్నాము. తమరికి ఏమి కావాలో కోరుకోండి." అని వినయంగా అడిగారు.

సాందీపుడు తన శిష్యులైన బలరామకృష్ణులను వాత్సల్యంతో చూచి "కుమారులారా! నా కుమారుడు ప్రభాసక్షేత్రంలో సముద్రంలో పడిచనిపోయాడు. వాడిని తిరిగి బతికించి ఇవ్వగలరా! అదే మీరు నాకు, మీ గురుపత్నికి ఇచ్చే గురుదక్షిణ." అని అడిగాడు. మారుమాటాడకుండా బలరామ కృష్ణులు రథం ఎక్కి ప్రభాస క్షేత్రం దగ్గర ఉన్న సముద్రతీరానికి వెళ్లారు. సాక్షాత్తు శ్రీహరి అవతారమైన కృష్ణుడు వచ్చాడని తెలుసుకొని సముద్రుడు వారి దగ్గరకు వచ్చాడు.

సముద్రుని చూచిన కృష్ణుడు ఇలా అన్నాడు. "నీవు నీ తరంగములలో మా గురువుగారి కుమారుని ముంచి నీలో కలుపుకున్నావట. మా గురు పుత్రుని తిరిగిమాకు ఇచ్చెయ్యి." అని తాను వచ్చిన పని మూడుముక్కలలో చెప్పాడు. ఆమాటలకు సముద్రుడు ఇలా అన్నాడు. "దేవా! నేను మీ గురుపుత్రుని నాలో కలుపుకోలేదు. ఈ సముద్రంలో పంచజనుడు అనే రాక్షసుడు ఒక శంఖం రూపంలో నివసిస్తున్నాడు. మీ గురుపుత్రుడిని అతడే అపహరించాడు." అని అన్నాడు.

వెంటనే కృష్ణుడు సముద్రజలములలోకి దూకాడు. పంచజనుడికి వెతుక్కుంటూ వెళ్లాడు. వాడిని పట్టుకున్నాడు. కాని వాడి వద్ద గురు పుత్రుడు కనపడలేదు. కృష్ణుడు ఆ అసురుడి నుండి పుట్టిన శంఖమును తీసుకొని యముడి దగ్గరకు వెళ్లాడు. యమపురి ద్వారము వద్ద నిలబడి ఆ శంఖమును గట్టిగా ఊదాడు. ఆ శంఖధ్వనిని విన్న యమధర్మరాజు పరుగు పరుగున శ్రీకృష్ణుని వద్దకు వచ్చాడు. ఆయనకు అర్ఘ్యము పాద్యము ఆసనము ఇచ్చి సత్కరించాడు.

"ఓ మహావిష్ణూ! మీరు ఈ మానవదేహములలో అవతరించారని నాకు తెలుసు. నేను మీకు ఏమి సేవచేయగలనో తెలుపండి." అని వినయంగా అడిగాడు. "ఓ యమధర్మరాజా! నీవు నీ విధి నిర్వహణలో భాగంగా మా గురువుగారి పుత్రుని తీసుకొని వచ్చావు. మా గురువు గారి కుమారుని తిరిగి మాకు అప్పగించు." అని అడిగారు. వెంటనే యమధర్మరాజు గురుపుత్రుని తీసుకొచ్చి బలరామకృష్ణులకు అప్పగించాడు. బలరామకృష్ణులు గురుపుత్రుని తీసుకొని వచ్చి తమ గురువుగారు సాందీపునికి అప్పగించారు. ఇలా అన్నారు. "గురువుగారూ! తమరు ఇంకేమన్నా కోరుకోండి. తమరి కోరిక తీరుస్తాము." అని వినయంగా అడిగారు.

బలరామ కృష్ణుల మాటలకు సంతోషించిన సాందీపుడు వారితో ఇలా అన్నాడు. "కుమారులారా! మీవంటి శిష్యులకు గురువైన నాకు కోరుకోవడానికి ఇంకేం మిగులుతుంది. అయినా మీరు నాకు గురుదక్షిణ ఇచ్చారు. అది చాలు.  మీ విద్యలు పూర్తి అయ్యాయి. ఇంక మీరు మీ గృహమునకు వెళ్లండి. వివాహములు చేసుకొని పుత్రపౌత్రాభివృద్ధి పొందండి.  మీ కీర్తి మూడులోకములలో

వృద్ధిచెందుతుంది." అని ఆశీర్వదించాడు.

గురువుగారి ఆశీర్వాదములను పొందిన బలరామకృష్ణులు రథము ఎక్కి మథురానగరము వెళ్లిపోయారు. తమ విద్యాభ్యాసము పూర్తి చేసుకొని వచ్చిన బలరామకృష్ణులను చూచి దేవకీ వసుదేవులు, మధురా నగర ప్రజలు ఎంతో సంతోషించారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు బలరామకృష్ణుల విద్యాభ్యాసము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము నలభై ఐదవ అధ్యాయము సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## దశమస్కంధము
## నలభై ఆరవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఇలా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! వృష్ణివంశంలో ఉద్ధవుడు అనే ఉత్తమ వ్యక్తి ఉన్నాడు. ఉద్ధవుడు కృష్ణుడికి ఆంతరంగిక మిత్రుడు. ఒకరోజు కృష్ణుడు తన మిత్రుడు ఉద్ధవుని పిలిచాడు. ఎవరూ లేని చోట ఉద్ధవుని చేతులు పట్టుకొని ఇలా అన్నాడు.

"మిత్రమా! నీవు నాకు మారుగా నందుడు మొదలగు గోపకులు గోపికలు నివసించే వ్రజమునకు వెళ్లాలి. నా తల్లి తండ్రులు అయిన యశోదా నందులకు నా క్షేమ సమాచారములు చెప్పి వారి మనస్సులకు సంతోషాన్ని కలుగచెయ్యి. ఆ ఊరిలో ఉన్న గోపకాంతలు గోపికలు నేను లేని విరహంతో బాధపడుతుంటారు. వారికి నా గురించి చెప్పి ఓదార్చు. నందవ్రజములో ఉన్న గోపికలు వారి మనస్సులను నాకు అర్పించారు. నన్ను వారి ప్రాణం కన్నా ఎక్కువగా చూసుకుంటున్నారు. నా కోసరం వారి భర్తలను సంతానాన్ని, బంధువులను కూడా వదిలిపెట్టడానికి సిద్ధపడ్డారు. నన్ను వారి ఆత్మస్వరూపుడుగా భావించారు. నా కోసరము సకల ధర్మములను వదిలిన  వారి యోగక్షేమములు చూడవలసిన బాధ్యత నామీద ఉంది.

ఓ ఉద్ధవా! నేను వారికి అత్యంత ప్రియము చేకూర్చే వాడిని. నేను వారిని వదిలివచ్చి చాలా కాలం అయింది. వారు నన్నే తలచుకుంటూ విరహవేదన చెందుతుంటారు. నేను గోకులము నుండి మధురకు వచ్చేటప్పుడు వారికి త్వరలోనే గోకులమునకు తిరిగి వస్తానని చెప్పాను. నేను మరలా గోకులమునకు వస్తాననే ధైర్యముతోనే తమతమ శరీరములలో ప్రాణములు నిలుపుకొని ఉన్నారు. కాబట్టి నీవు పోయి వారికి నా క్షేమ సమాచారములు చెప్పి వారిని ఓదార్చు." అని అన్నాడు.

కృష్ణుని ఆదేశము మేరకు ఉద్ధవుడు రథం ఎక్కి గోకులానికి బయలుదేరాడు. సూర్యాస్తమయము కాలానికి ఉద్ధవుడు గోకులం చేరుకున్నాడు. అప్పుడు ఆవులు, దూడలు గోశాలలు

చేరుకుంటున్నాయి. గోవుల కాలి గిట్టల నుండి లేచిన ధూళిలో ఉద్ధవుని రథం కప్పబడి పోయింది. అందు గోకులములో ఉన్న వారికి ఉద్ధవుని రాక తెలియదు.

ఉద్ధవుడు నందుని గృహము చేరుకున్నాడు. ఆ సమయంలో గోపికలు గోప కాంతలు చల్ల చిలుకుతూ కృష్ణుని లీలలను గీతములుగా పాడుకుంటున్నారు. నందవ్రజములోని అన్ని గృహములలో అగ్ని, సూర్యుడు, అతిధులు, గోవులు, బ్రాహ్మణులు, పితృదేవతలు నిత్యము పూజింపబడుతున్నారు. సాయంసమయములో దేవతాగృహములలో వేసిన సుగంధ ధూపములతో వ్రజము సుగంధభరితమయింది.

మధురనుండి కృష్ణుడు పంపగా వచ్చిన ఉద్ధవుని రాకను గురించి విన్న నందుడు పరుగు పరుగున ఉద్ధవుని రథం వద్దకు వచ్చాడు. ఉద్ధవుని సాదరంగా ఆహ్వానించాడు. ఆలింగనము చేసుకున్నాడు. అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించాడు. మంచి భోజనం పెట్టాడు. ఆయన సుఖంగా పడుకోడానికి పక్కపరిచాడు. ఉద్ధవుడు పడుకోగానే ఆయన కాళ్లు పడుతున్నాడు. ఆ విధంగా ఉద్ధవుడు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో నందుడు ఇలా అడిగాడు.

"మహాత్మా! కంసుని చెరనుండి విముక్తి పొందిన దేవకీ వసుదేవులు సుఖంగా ఉన్నారా! వారి బంధుమిత్రులు సుఖంగా ఉన్నారా! ఆ కంసుడు ధర్మపరులు, సాధువులు అయిన యాదవుల మీద అకారణంగా విరోధం పెంచుకున్నాడు. అతని పాపమే అతని

మరణానికి కారణం అయింది. కంసుని మరణం యాదవులందరికీ అదృష్టంగా పరిణమించింది.

ఉద్ధవా! మా కుమారుడు కృష్ణుడు, బలరాముడు క్షేమంగా ఉన్నారా! వాళ్లు ఎప్పుడైనా నన్ను, తల్లి యశోదను, గోపాలురను, బంధువులను, మిత్రులను, ఈ వ్రజములోని ప్రజలను, గోవులను, తాను ఆడుకున్న బృందావనమును, గోవర్ధనగిరిని ఎప్పుడన్నా తలచుకుంటూ ఉంటారా! కృష్ణుడు మా అందరినీ, తన ఆత్మీయులను చూడటానికి ఒక్కసారైనా నందగోకులము రావచ్చు కదా! ఉద్ధవా! సుందరమైన ఆ కృష్ణుని ముఖపద్మము మాకు మరలా కనపడుతుందంటావా! ఆ శ్యామసుందరుని మేము ఎప్పుడు చూస్తామో ఏమో!

కృష్ణుడు మా అందరినీ గోవర్ధన పర్వతము ఎత్తి రక్షించడం, కాళీయుని బారి నుండి రక్షించడం, దావానలము నుండి రక్షించడం, రాక్షసుల బారి నుండి రక్షించడం మేము ఎన్నటికీ మరిచిపోలేము. మా చిన్ని కృష్ణుడు ఈ గోకులములో చేసిన అద్భుతమైన లీలలను, కృష్ణుడి మాటలను, చిలిపిపనులను,  తలచుకుంటూ ఉంటే మేము ఆకలి, దప్పులు కూడా మరిచిపోతున్నాము. మా కృష్ణుడు తన పాదములతో నడిచిన ఈ నందవ్రజము, బృందావనము, యమునా తీరము, అడవులు, కొండలు, ఇసుక తిన్నెలు, చూచినప్పుడు ఈ లోకమంతా కృష్ణమయంగా కనిపిస్తుంది.

గర్గమహాముని చెప్పిన దానిని బట్టి, కృష్ణుని మేమందరమూ, దేవతల కార్యము నెరవేర్చడానికి, మా అదృష్టము కొద్దీ,

మా ఇంట పుట్టిన పరమాత్మస్వరూపుడిగా భావించాము. కృష్ణుడు చిన్నప్పటి నుండి, తన వయసుకు మించి చేసిన లీలలు అన్నీ ఆ విషయాన్ని రూఢిచేసాయి. లేకపోతే అమిత బలవంతులైన చాణూర,ముష్టికులను, కువలయాపీడము అనే ఏనుగును, బాలురైన బలరామకృష్ణులు చంపడం సాధ్యమా! అత్యంత బలిష్ఠమైన ఆ ధనుస్సును, ఏనుగు చెరకు గడను విరిచినట్టు, అవలీలగా విరిచారు కదా! ఏడు సంవత్సరముల బాలుడు, ఏడు రోజులు గోవర్ధన పర్వతమును తన చేతి మీద నిలపడం మానవమాత్రులకు సాధ్యమా!

ఇది అంతా ఒక ఎత్తు. దేవతలకు కూడా జయింప అలవి కాని ధేనుకుని, అరిష్టుని, తృణావర్తుని, బకుడిని సంహరించడం మరొక ఎత్తు. ఇవన్నీ చూస్తుంటే బలరామ కృష్ణులు మానవ మాత్రులు కారనీ, అవతార పురుషులు అని తెలుస్తూ ఉంది కదా! తమరేమంటారు?" అని తన మనసులో మాట బయటపెట్టాడు నందుడు.

నందుడు కృష్ణుని పరమాత్మ స్వరూపుడుగా, భగవదవతారంగా భావిస్తుంటే, తల్లి యశోదకు మాత్రము చిన్ని కృష్ణుడు తన ఒడిలో పడుకొని పాలుతాగుతున్న పసిబాలుడులాగా గోచరించాడు. కృష్ణుని ముద్దుమాటలు తలచుకుంటేనే ఆమెకు స్తనములలో నుండి పాలుకారుతున్నాయి. ఆ మాతృహృదయము కృష్ణుని సందర్శనము కోసరం తల్లడిలిపోతూ ఉంది. వారిద్దరికీ కృష్ణుని మీద ఉన్న అనురాగం ఒక్కటే. నందుడికి కృష్ణుని మీద అవతారపురుషుడు అన్న నమ్మకం, భక్తి. యశోదకు కృష్ణుని మీద

మాతృసహజమైన పుత్రప్రేమ.

వారి మాటలు విన్న ఉద్ధవుడు ఇలా అన్నాడు. "మాన్యుడా! సాక్షాత్తు అవతారపురుషుడైన కృష్ణుని మీద మీకు ఉన్న ప్రేమానురాగాల వలన మీరు ఈ లోకంలో పూజనీయులయ్యారు. శ్రీకృష్ణుడు, బలరాముడు పురుషుడు, ప్రకృతి. వీరు సకల జీవులలో ఆత్మస్వరూపులుగా వెలుగుతున్నారు. (31 నుండి 33) శ్రీకృష్ణుడు త్వరలోనే ఇక్కడకు వచ్చి మీకు సంతోషాన్ని కలుగజేస్తాడు. కంసుని సంహరించిన తరువాత కృష్ణుడు మీతో ఏం చెప్పాడో అవన్నీ తప్పకుండా నెరవేరుస్తాడు. మీరు కృష్ణుని గురించి దు:ఖించకండి. కొద్దికాలంలోనే కృష్ణుడు మీ వద్దకు వస్తాడు.

కృష్ణుడు అన్ని ప్రాణుల హృదయములలో ఉన్నట్టు మీ హృదయములలో కూడా ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. ఇంక కృష్ణుడు మీ వద్ద లేడు అన్న భావన మీకు ఎందుకు కలుగుతుంది. నందా! కృష్ణుడికి అందరూ సమానమే. ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ లేదు. ఒకరి మీద మమకారము, మరొకరి మీద ద్వేషము లేదు. ఒకరు గొప్ప వాడు, మరొకడు అధముడు అన్న భావన కృష్ణునికి లేదు. ఆయన దృష్టిలో తల్లి, తండ్రి, భార్య, పుత్రులు, బంధువులు, మిత్రులు, శత్రువులు అందరూ ఒకటే. అసలు ఆయనకు ఈ భౌతిక శరీరం అంటూ ఏమీ లేదు. ఆయనకు జన్మకూడా లేదు. మనమధ్య జన్మించడం, తిరగడం కేవలం ఆయన లీల. అసలు పరమాత్మకు చేయవలసిన కర్మ అంటూ ఏదీ ఉండదు. అన్నీ మనకోసమే చేస్తుంటాడు.

ఆయన దేవతలలో కానీ, మనుష్యులలో కానీ, మత్స్య, కూర్మ, వరాహములు గా అవతరించాడంటే దానికి కారణం కేవలం దుష్టులను శిక్షించి, సాధువులను రక్షించడానికే కానీ వేరు కాదు. ఆయనకు జన్మఅంటూ లేదు. ఆయనను ఏ గుణాలు అంటవు. కాని అన్ని గుణాలలో ఉంటాడు. ఆయనకు ఎవరితోనూ సంగమం లేదు. కానీ తనను నమ్ముకున్న సత్పురుషులను రక్షించడానికి వారి వెంటనే ఉంటాడు. సృష్టి, స్థితి, లయము కేవలం వినోదం కొరకే చేస్తుంటాడు. (41)

కృష్ణుడు మీ ఇద్దరికే కుమారుడు కాదు. ఆయన ఈ అనంత సృష్టిలో ఉన్న తల్లితండ్రులందరికీ కుమారుడు. ఆయనే అందరికీ తల్లి, తండ్రి, కుమారుడు, బంధువు మిత్రుడు. ఎవరు ఏ విధంగా భావిస్తే ఆ విధంగా గోచరిస్తాడు. భూత, భవిష్యత్, వర్తమాన కాలములు, ఉండడం, లేకపోవడం, కాలం గడపడం, అత్యంత పెద్దది, అత్యంత చిన్నది, చూచేది, చూడబడేది, వినేది, వినపడేది ఇవన్నీ ఆ పరమాత్మ స్వరూపాలే. వీటన్నిటికీ మూలం ఆ పరమాత్మ. పరమాత్మ లేనిదే ఇవన్నీ లేవు. ఆ పరమాత్మ కృష్ణుడిగా అవతరించాడు. కృష్ణుడు మీ కుమారుడు కావడం మీ అదృష్టం, నాకు సఖుడు కావడం నా అదృష్టం." అని అన్నాడు ఉద్ధవుడు.

ఆ ప్రకారంగా కృష్ణుని లీలలను గురించి ముచ్చటించుకుంటూ ఆ రాత్రి గడిపారు నందుడు, ఉద్ధవుడు. తెల్లవారుజాము అయింది. గోపికలు, గోపకాంతలు నిద్రలేచారు. కాలకృత్యములు తీర్చుకొని, భూదేవిని, గోమాతలను పూజించి పెరుగు

చిలకడంలో మునిగిపోయారు. వారు అలా పెరుగు చిలుకుతూ కృష్ణలీలలను పాటలుగా పాడుకుంటున్నారు. వారి గాత్రసౌరభముతో ఆ పల్లె అంతా పులకించి పోయింది.

ఇంతలో సూర్యోదయం అయింది. చీకట్లు తొలగిపోయి వెలుతురు వచ్చింది. వారందరూ నందుని వాకిట్లో ఒక రథం నిలబడి ఉండటం చూచారు. (ముందురోజు సాయం సంధ్యాసమయంలో గోధూళిలో వారికి రథం కనపడలేదు అని చెప్పుకున్నాము కదా!)

"ఈ రథం ఎవరిది? నందుని ఇంటికి ఎవరొచ్చారు? తమ మధ్యలో నుండి కృష్ణుని విడదీసి, మధురా నగరమునకు తీసుకొని పోయిర ఆ క్రూరుడైన అక్రూరుడు మరలా రాలేదు కదా! ఆ అక్రూరుడు కంసుని సంతోష పెట్టడానికి  కృష్ణుని మననుండి విడదీసి, మన మనసులను కూడా విడదీసాడు. ఇప్పుడు కేవలం శరీరాలతో బతుకుతున్నాము. ఇప్పుడు ఆ శరీరాలను కూడా ఛిన్నాభిన్నం చేసి మన మాంసంతో ఆ కంసునికి పిండములు పెట్టడు కదా!" అని కసిగా అనుకుంటున్నారు. వీరు ఇలా అనుకుంటూ ఉండగా ఉద్ధవుడు స్నానం సంధ్య మొదలగు అనుష్ఠానములను పూర్తి చేసుకొని, నందుని ఇంటి నుండి బయలు దేరి గోపికల వద్దకు వచ్చాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణుడు పంపగా నందవ్రజమునకు వచ్చిన ఉ ద్ధవుని గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము నలభై ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# దశమస్కంధము
# నలభై ఏడవ అధ్యాయము

ఓ పరీక్షిత్ మహారాజా! పీతాంబరమును ధరించి, పద్మమాలను మెడలో వేసుకొని, చెవులకు కుండలములను ధరించి, ఉద్ధవుడు వ్రజములో ఉన్న గోపకాంతల వద్దకు వెళ్లాడు. ఆయనను చూచి గోపికలు, గోపకాంతలు ఆశ్చర్యపోయారు.

“అచ్చం కృష్ణుడి మాదిరి ఉన్నాడు. ఆ మాదిరి వేషం వేసుకున్నాడు. ఎవరబ్బా ఈయన. ఎక్కడి నుండి వచ్చాడు? ఈ పల్లెలో ఈయనకు ఆత్మీయులు ఎవరు? ఎవరింటికి వచ్చాడు?” అని ఒకరితో ఒకరు గుసగుసలాడుకుంటున్నారు.

ఉద్ధవుడు ఒక ఏకాంత ప్రదేశంలో కూర్చుని ఉంటే, గోపికలు, గోపకాంతలు ఆయన చుట్టు చేరారు. ఉద్ధవునికి నమస్కరించారు. ఆయనతో ఇలా అన్నారు.

“మహాత్మా! మీరు ఎవరో కానీ అచ్చు మా కృష్ణుని మాదిరి ఉన్నారు. మిమ్ములను మా కృష్ణుని స్నేహితునిగా భావించుచున్నాము. శ్రీకృష్ణుడు తన క్షేమ సమాచారములను తన తల్లి యశోదకు, తండ్రి నందునికి తెలుపడానికి తమరిని ఇక్కడకు పంపించాడా! అయినా ఈ వ్రజములో కృష్ణుని గురించి తలచుకోడానికి ఈ వ్రజములో ఆయన

తల్లి తండ్రులు తప్ప వేరే ఎవరున్నారు చెప్పండి. ఆయన తల్లితండ్రులు తప్ప కృష్ణుని గురించి తలుచుకొనే వాళ్లు మా కైతే ఎవరూ కనపడటం లేదు. ఎందుకంటే కృష్ణుని బంధువులు యశోదా నందులే కదా.

మాదంతా, ఒక పురుషుడు, ఒక స్త్రీ మధ్య ఉన్న స్నేహబంధమే కాని వేరు కాదు. తేనె ఉన్న పుష్పముల వద్దకు భ్రమరము వెళుతుంది. తేనె తాగుతుంది. వెళ్లిపోతుంది. మాతో కృష్ణుని అనుబంధము అటువంటిదే! కృష్ణునికి మా మీద ఉన్న అనుబంధాన్ని స్నేహము అనుకోడానికి వీలు లేదు. ఇక్కడ ఉన్నన్ని రోజులు మాతో తిరిగాడు, ఆడాడు, పాడాడు. ఆయన ప్రయోజనము నెరవేర్చుకున్నాడు. వెళ్లిపోయాడు. మాకు కృష్ణునికి ఉన్న స్నేహము ఆయన కోరిక తీరునంతవరకే. తరువాత ఆ స్నేహము నశించిపోతుంది. కృష్ణునికి మాకు ఉన్న స్నేహము, కేవలము స్నేహితులుగా నటించడం వరకే కాని అది నిజమైన స్నేహం కాదు.

డబ్బులేని వాళ్లను వేశ్యలు దగ్గరకు కూడా రానివ్వరు. అసమర్ధుడగు రాజును ప్రజలు తిరస్కరిస్తారు. విద్యాభ్యాసము పూర్తి అయిన తరువాత శిష్యులు గురువును మరిచిపోతారు. తమకు రావలసిన దక్షిణ ముట్టగానే పురోహితులు యజమాని మొహం కూడా చూడరు. పండ్లులేని చెట్టు మీద పక్షులు వాలతాయా చెప్పండి. తృప్తిగా భోజనం చేసిన తరువాత అతిథులు ఆ ఇల్లు విడిచి వెళ్లిపోతారు కదా! దావానలంచే కాలిపోయిన అడవిని మృగములు విడిచిపెట్టి వెళ్లిపోతాయి కదా! వ్యభిచారం అలవాటుగా కల పురుషులు, దొరికిన స్త్రీలను అనుభవించి, తరువాత వారి ముఖం కూడా చూడరు కదా! అలాగే, కృష్ణుడు కూడా ఇక్కడ ఉన్నన్నాళ్లు మాతో ఆడీ పాడీ మా

అవసరం తీరగానే వెళ్లిపోయాడు. ఇన్నాళ్లయినా మా ముఖం కూడా చూడలేదు." అని గోపకాంతలు గోపికలు, పరాయి పురుషుడు అన్న భావన కూడా లేకుండా, సిగ్గు, మర్యాద వదిలిపెట్టి, కృష్ణుని మీద తమకు ఉన్న అక్కసును ఉద్ధవుని ముందు వెళ్లగక్కారు. కృష్ణుని విరహమును తట్టుకోలేక ఏడుపు మొదలెట్టారు.

కొందరు గోపికలు ఆ తోటలో పూలకోసం తిరుగుతున్న ఒక భ్రమరమును చూచి, ఆ భ్రమరము కృష్ణుడు తమ వద్దకు పంపాడని తలచి ఇలా అంటున్నారు. "ఓసి భ్రమరమా! నీవు మమ్ములను తాక వద్దు. నీవు ఆ దుష్టుడైన కృష్ణునికి మిత్రుడవు. మధురలో ఉన్న స్త్రీలవ్యామోహంలో పడ్డాడు నీ మిత్రుడైన కృష్ణుడు. పోనీలే! వాళ్లతో నన్నా సుఖంగా ఉండనీ! నీవు కూడా అంతేకదా! దొరికిన ప్రతిపూవు లోనుండి తేనె తాగుతున్నావు. నీ మాదిరే ఆ కృష్ణుడు కూడా మా అందరి మీదా ప్రేమ నటించి, మా అధరామృతమును తాగి, ఆయన అధరామృతమును మా చేత తాగించి, వెంటనే మా అందరినీ నిర్దాక్షిణ్యంగా వదిలిపెట్టి వెళ్లిపోయాడు. ఇంత చంచలమైన వాడిని ఆ లక్ష్మీదేవి ఎలా భరిస్తూ ఉందో? పాపం ఆ లక్ష్మీదేవి కూడా కృష్ణుడు చెప్పే అబద్ధాలకు మోసపోయి ఉంటుంది. మేము మాత్రము లక్ష్మీదేవి వంటి తెలివితక్కువవాళ్లము కాము కృష్ణుడి మాయమాటలకు మోసపోవడానికి.

ఓ భ్రమరమా! నీవు ఎందుకు ఈ పూల వెంట తిరుగుతూ కృష్ణుని కథలను గానంచేస్తున్నావు? కృష్ణుని మీద నీకంత ప్రేమ ఉంటే కృష్ణుని కథలను మధురలో ఉన్న అమ్మాయిల దగ్గర వినిపించు.

కృష్ణుని పొందులో సుఖాలను అనుభవిస్తున్న మధురానగర కాంతలు నీవు పాడే కృష్ణుడి పాటలను సంతోషంగా వింటారు. నీ కోరికలు తీరుస్తారు.

అయినా మా పిచ్చిగానీ, స్వర్గంలోకంలో, మానవలోకంలో, రసాతలంలో కృష్ణుడు మాయలో, కృష్ణుని మోహంలో పడని వారు ఎవరున్నారు చెప్పు? ఇంతెందుకు! సాక్షాత్తు లక్ష్మీదేవి కూడా ఎప్పుడూ ఆయన పాదపద్మములను సేవిస్తూ ఉంటుంది కదా! అటువంటప్పుడు ఎక్కడో ఈ చిన్ని పల్లెలో ఉన్న మేము ఆయనకు ఎలా జ్ఞాపకం ఉంటాము! ” అని ఈసడింపుగా మాట్లాడింది ఒక గోపిక.

ఇంతలో అక్కడ ఎగురుతున్న భ్రమరము ఒకటి ఆ గోపిక పాదాల మీద వాలింది. ఆ భ్రమరము తనను క్షమించమని వేడుకుంటున్నది అని అర్థం చేసుకున్న ఆ గోపిక ఇలా అంది. “ఓసి భ్రమరమా! మా కాళ్లకు ఎందుకే మొక్కుతావు. విడిచిపెట్టు. నీవు మాత్రము సామాన్యురాలివా! నీ ప్రియమిత్రుడు కృష్ణుడి మాదిరి ఎవరితో ఎలా మాట్లాడాలో బాగా నేర్చావు! నీ సంగతి నీ మిత్రుడు కృష్ణుడి సంగతి మాకు తెలుసులే! నీవు మాకు కృష్ణుడికి మధ్య సంధి కుదర్చడానికి వచ్చినట్టున్నావు. మేమంతా ఆ కృష్ణుడి కోసరం మా తల్లి తండ్రులను, అత్తమామలను, భర్తలను, సంతానమును వదిలివేసాము. కాని కృష్ణుడు మా అందరినీ వదిలివేసాడు. ఇటువంటి స్వార్థపరుడితో మాకు సంధి ఎలా కుదురుతుంది?

ఓ భ్రమరమా! నీ మిత్రుడు కృష్ణుడు ఈ అవతారములోనే కాదు, రామావతారములో కూడా ఒక వేటకాడి వలె చెట్టు చాటున నిలబడి, వాలిని కొట్టాడు. తన భార్య సీత మీద ప్రేమతో అమాయకురాలైన శూర్పణఖ ముక్కు చెవులు కోయించాడు. వామనావతారంలో బలి చక్రవర్తి పెట్టిన తినుబండారములు అన్నీ మెక్కి, ఆ బలిని కాకిని కట్టినట్టు కట్టేసాడు. ఇటువంటి వాడితో స్నేహం చేయడం వల్ల మాకేమీ ప్రయోజనం లేదు.

కాని ఏం చేస్తాం! కృష్ణుని మరిచిపోలేక విరహంతో వేగిపోతున్నాము. కృష్ణలీలలను మరిచిపోలేకపోతున్నాము. కృష్ణుని కథలను గానం చేయకుండా ఉండలేకపోతున్నాము. బుద్ధిమంతులైన వాళ్లు, భగవంతుడైన కృష్ణుని లీలలను వీనులవిందుగా వింటూ, నోరారా పాడుతూ, రాగద్వేషములను విడిచిపెట్టి, దు:ఖభాజనమైన సంసారమును వదిలిపెట్టి, భిక్షాటన చేస్తూ జీవిస్తున్నారు. అటువంటి కృష్ణలీలామృతమును మేము ఎలా విడిచిపెట్టగలము.

జింకలను పట్టుకోవాలని, వేటగాడు వలపన్ని, వేణువు ఊదుతూ వాటిని ఆకర్షిస్తాడు. పాపం ఆ జింకలు ఆ వేణునాదము విని అమాయకంగా వచ్చి వేటగాడి వలలో పడతాయి. మేమూ అంతే. మనోహరమైన కృష్ణుని వేణుగానమును విని, కృష్ణుడి మాయమాటలు నమ్మి, ఆయన వలలో పడి, ఇప్పుడు ఆయన మా అందరినీ వదిలివెళ్లగానే, ఆయన విరహంతో బాధపడుతున్నాము. కాబట్టి నీవు ఇంక ఆ కృష్ణుని కీర్తించడంమాని వేరే గీతికలు ఆలాపించు." అని భ్రమరం మీద పెట్టి కృష్ణుని సూటీపోటీ మాటలు అంటున్నారు ఆ

గోపికలు. ఆ గోపికల గోల భరించలేక, ఆ భ్రమరములు అక్కడినుండి పారిపోయాయి. కాని ఆ భ్రమరములకు కూడా గోపికల విరహవేదనను వినాలని మనసు పీకుతూ ఉంది. అందుకని పోయినట్టే పోయి, అక్కడక్కడా ఎగిరి మరలా ఆ గోపికల వద్దకు వచ్చాయి. మరలా వచ్చిన ఆ భ్రమరములను చూచి గోపికలు ఇలా అంటున్నారు.

"ఏంటి! మీరంతా మీ సఖుడు కృష్ణుని వద్దకు పోయి మరలా కొత్త సంగతులు ఏమైనా మోసుకొచ్చారా! మా అందరినీ కృష్ణుడు మధురాపురమునకు రమ్మన్నాడా! నీకు కృష్ణుడికి ఇష్టం అయితే వెంటనే వచ్చేస్తాము. అయినా మా అందరినీ నీవు మధురకు ఎలా తీసుకెళ్లగలవు? ఇంతకూ కృష్ణుడు ఇప్పుడు ఎక్కడున్నాడు? కృష్ణుడు విద్యాభ్యాసము ముగించుకొని మధురానగరము వచ్చాడని విన్నాము. నిజమేనా! కృష్ణుడు మధురానగరములో, రాచనగరులో, అంత:పురములో, రాజభోగాలు అనుభవిస్తూ, నందుని, యశోదను, మా అందరినీ కనీసం మనసులోనైనా తలుచుకుంటున్నాడా! మా గురించి ఎప్పుడైనా ఒక్క మాటైనా మాట్లాడుతున్నాడా! కృష్ణుడికి ఇక్కడకు వచ్చే ఆలోచన ఏమైనా ఉందా!" అని ఆతురతగా అడిగింది ఒక గోపిక.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ గోపికలు గోపకాంతలు కృష్ణుని మీద ప్రేమతో, భక్తితో అన్న మాటలను అన్నీ ఓపికగా విన్నాడు ఉద్ధవుడు. వారితో ఉద్ధవుడు ఇలాఅన్నాడు.

"ఓ గోపకాంతలారా! మీరందరూ ధన్యజీవులు. మీ మనస్సులు అన్నీ కృష్ణుని యందే లగ్నం అయి ఉన్నాయి. మీరు ముల్లోకములలో పూజనీయులు. మానవులు అందరూ దానములు చేసి, తపస్సులు ఆచరించి, వ్రతములు చేసి, హెూమములు చేసి, జపములు చేసి, వేదములు అధ్యయనం చేసి, ఇంద్రియములను నిగ్రహించి కృష్ణుని మీద భక్తిని సాధిస్తారు. ఇవేమీ చేయకుండానే మీరందరూ కృష్ణుని మీద అచంచలమైన, ఏకాగ్రమైన భక్తిని సాధించారు. ఇంతకన్నా మహద్భాగ్యము ఏముంటుంది? మీరు మీ తల్లి తండ్రులను, అత్తమామలను, భర్తలను, సంతానమును, ఇల్లువాకిళ్లను వదిలిపెట్టి, సాక్షాత్తు పరమాత్మ అవతారమైన కృష్ణుని వరించారు. ఇదికూడా ఒక మహద్భాగ్యమే!

గోపికలారా! మీకు కృష్ణుని మీద అచంచల మైన ఏకాగ్రమైన భక్తి ఉంది. కృష్ణుని ఎడబాటును సహించలేక మీరు పలికిన పలుకులు నాకు అమితానందాన్ని కలుగచేసాయి. కృష్ణుడు నన్ను ప్రత్యేకంగా మీ వద్దకు పంపాడు. మీకు ఒక సందేశమును అందించమని చెప్పాడు. ఆ కృష్ణ సందేశమును నేను మీకు ఆ కృష్ణుడు చెప్పినట్టుగా, కృష్ణుడి మాటలలో వినిపిస్తాను. శ్రద్ధగా వినండి.

"ఓ గోపికలారా! గోపకాంతలారా! నేను అందరిలోనూ ఆత్మస్వరూపుడుగా వెలుగుతుంటాను. మీమనసుల్లో సదా మెదులుతున్నాను. కాబట్టి నేను మిమ్ములను విడిచిపెట్టి వెళ్లాను అన్న ప్రసక్తిలేదు. నేను ఈ పంచభూతములలో ఉన్నాను. అలాగే మీ మనస్సులలో, మీ ప్రాణములలో, మీ ఇంద్రియములలో, మీ గుణములలో

అంతర్లీనంగా ఉన్నాను. నా మాయచేత సృష్టి, స్థితి,లయము అనే కార్యములను చేస్తున్నాను. సమస్తజీవులలో ఉండే ఆత్మ, జ్ఞానము చేత నిండి ఉంది. ఆత్మను సత్వ,రజస్తమోగుణములు అంటవు. ఈ గుణములలో ఆత్మ ప్రవర్తించదు. ఆత్మ శుద్ధసత్వగుణస్వరూపము. జాగ్రదావస్థలోనూ, స్వప్నములోనూ, సుషుప్తిలోనూ ఈ ఆత్మ, మాయచేత మోహితమైన మనస్సు చేసే పనుల ద్వారా వెల్లడి అవుతూ ఉంటుంది. కాని ఆత్మస్వరూపము అది కాదు.

ఈ మానవుడు తన మనస్సు ద్వారా బయట ప్రపంచములో చూడటం, వినడం, తాకడం, అనుభవించడం అనే పనులు చేస్తుంటాడు. కాని అవి అన్నీ మాయతో కూడుకొన్నవి. వాటిని మీరు నమ్మకండి. మీ మనసునునిగ్రహించండి. భూమీ మీద ప్రవహించే నదులన్నిటికీ సముద్రమే హద్దు. అదేమాదిరి వేదములను అధ్యయనం చేయడం ద్వారా, అష్టాంగయోగము, సాంఖ్యయోగము, సన్యాసము, స్వధర్మఆచరణము, ఇంద్రియ నిగ్రహము మొదలగునవి పాటించడం ద్వారా, మనస్సును అదుపులో ఉంచుకోవచ్చును. మీరు కూడా మీకు తోచిన విధంగా మనస్సును అదుపుచేసుకోండి.

వ్రజములో ఉన్నంత కాలము నేను మీ అందరికీ ప్రియుడను. ప్రస్తుతము శారీరకంగా దూరంగా ఉన్నాను. నేను మీ శరీరంలో ఉండే కళ్లకు కనిపించకుండా దూరంగా ఉండటం వలన, నేను మీకు అనుక్షణం స్ఫురణకు వస్తున్నాను. మీ మనసులో నిలిచి ఉన్నాను. మీరు నన్ను ఎల్లప్పుడూ ధ్యానిస్తున్నారు. అందుకనే నేను మీకు దూరంగా ఉన్నాను అని తెలుసుకోండి. ధ్యానము ద్వారా మనసు పరిశుద్ధమవుతుంది. ప్రియుడు దూరంగా ఉన్నప్పుడు స్త్రీలు ఆ

ప్రియుడిని ఎల్లప్పుడ తలచుకుంటూ ఉంటారు. అదే ఎదురుగా ఉంటే పట్టించుకోరు. నేను మీ ఎదురుగా లేకపోవడం వలన, మీరు కూడా మీ మనస్సంతా నా మీద లగ్నం చేసి నన్నే స్మరిస్తున్నారు. మీ ఏకాగ్రమైన మనోచింతన వలన మీరు త్వరలోనే నన్ను పొందగలరు." అని కృష్ణుడు మీతో తన మాటలుగా చెప్పమన్నాడు." అని ఉద్ధవుడు గోపికా స్త్రీలతో చెప్పాడు. కృష్ణుని దివ్యోపదేశమును విన్న ఆ గోపకాంతలు ఉద్ధవునితో ఇలా అన్నారు.

"అందరి అదృష్టములు పండి, యాదవుల కులమునకు కంటకుడుగా మారిన కంసుడు మరణించాడు. మధురానగరములో కృష్ణుడు తన తల్లి తండ్రులతో ఆప్తులతో క్షేమంగా ఉన్నాడా! కృష్ణుడు ఇక్కడ ఉండగా మా మీద చూపిన ప్రేమను ఇప్పుడు మధురానగర స్త్రీల మీద కూడా చూపిస్తున్నాడా! అవునులే! కృష్ణుడిని చూచినా, కృష్ణుడిమాటలు విన్నా, ఏ స్త్రీలు మోహించకుండా ఉంటారు. ఆ మధురా నగర స్త్రీల వ్యామోహంలో పడి, కృష్ణుడు ఎప్పుడైనా గ్రామీణస్త్రీలైన మమ్ములను తలచుకుంటాడా! యమునా నదీ తీరములలో, ఆ ఇసుక తిన్నెల మీద, మాతో విహరించి, రాసలీలలు సలిపాడు కదా! మాతోగడిపిన ఆ రాత్రులను మేము రోజూ తలచుకుంటూ ఉంటాము. కృష్ణుడు ఆ రాత్రుల గురించి కనీసం గుర్తుచేసుకుంటాడా! ఇంతకాలము కృష్ణుని విరహబాధతో వేగిపోతున్నాము. కృష్ణుడు మరలా ఇక్కడకు వస్తాడా! మా కళ్లకు కనిపిస్తాడా! మాకు ఆనందం కలుగజేస్తాడా!" అని కొందరు గోపికలు అంటే, మరి కొందరు గోపికలు ఇలా అన్నారు.

"అవునే! ఎందుకు వస్తాడు? ఇప్పుడు కంసుడు చచ్చాడు. కృష్ణుడు యువరాజు అయ్యాడు. కృష్ణుడిని పెళ్లిచేసుకోడానికి రాజకన్యలు పోటీ పడుతుంటారు. హాయిగా తనకు నచ్చిన రాజకుమార్తెలను పెళ్లాడి సుఖంగా ఉంటున్నాడు.పల్లె మొద్దులం మనకోసం ఇక్కడికి ఎందుకు వస్తాడు?" అని ఈసడింపుగా మాట్లాడింది.

కాని మరికొందరు గోపికలు "అదేమిటే అలా అంటావు! శ్రీకృష్ణుడు సాక్షాత్తు విష్ణుస్వరూపుడు. సకల సంపదలకు అధిష్ఠానదేవత అయిన లక్ష్మీదేవి ఆయన భార్య. ఆయనకు కొదవేముంది. ఈ పల్లెలలో నివసించే మనతోనూ, రాచనగరులో నివసించే రాజకన్యలతోనూ ఆయనకు పనేముంది. ఆయన కోరుకుంటే మనలాంటి వాళ్లు కోటానుకోట్లమంది ఆయన పాదాల మీద వాలుతారు. తెలుసా! కాబట్టి కృష్ణుడు ఇంక రాడు అనే నిరాశతో బతకడంలోనే సుఖం ఉందని తెలుసుకోండి. మూడులోకములలో ఉన్న వాళ్లు ఎల్లప్పుడూ కృష్ణుని తలచుకుంటూ, ఆయనను మనసులో నుండి క్షణకాలం కూడా విడిచిపెట్టరు. ఇంతెందుకు ఆయన తన భార్య లక్ష్మీదేవిని కూడా లక్ష్యపెట్టడు. కాని లక్ష్మీదేవి ఆయన వక్షస్థలంలో స్థిరనివాసము ఏర్పరచుకొని ఆయనను క్షణంకూడా వదిలిపెట్టదు.

కాని కృష్ణుడు ఏకోరికలు లేని వాడు. అన్ని కోరికలు తీరినవాడు. ఆయన అందరిలో ఉన్నాడు. కాబట్టి మనం కూడా కృష్ణుని మరిచిపోకుండా మనసులోనే స్మరించుకుంటూ ఉందాము. కృష్ణుడు తిరిగిన ప్రదేశములలో విహరిద్దాము. ఆయన తన పాదములు పెట్టిన చోట నడుద్దాము. ఆడుదాము. పాడుదాము. ఆయన మాటలను

మననం చేసుకుందాము. కృష్ణుడు మనపక్కనే ఉన్నట్టు భావిద్దాము. ఇంక కృష్ణుని మనం మరిచిపోయాము అనే ప్రశ్న ఉదయించదు. ఉద్ధవ మహాశయా! కృష్ణుడు తన మాటల చేతా, చేతల చేతా మా మనస్సులను హరించాడు. మేము కృష్ణుని మరువలేము. అని మా మాటలుగా కృష్ణునికి చెప్పండి." అని అన్నారు గోపికలు.

ఉద్ధవుని ద్వారా కృష్ణతత్వమును తెలుసుకున్న గోపికలు కృష్ణుని తమ హృదయములలో నిలుపుకొని పూజింపసాగారు. తరువాత ఉద్ధవుడు కొన్నాళ్లు గోకులములోనే ఉంది గోప కాంతలతో మాట్లాడుతూ, కృష్ణుని లీలలను ముచ్చటించుకుంటూ, కృష్ణుడు తిరిగిన వనములలోనూ, పచ్చిక బయళ్లలోనూ, కొండలమీదా తను కూడూ తిరిగాడు. కృష్ణుడు తాకిన లతలను. చెట్లను తనూ తాకాడు. కృష్ణుడి బాల్యచేష్టల గురించి ఎన్నోవిషయములను గోపికలను, గోపకాంతలను అడిగి తెలుసుకున్నాడు. పరమానందభరితుడయ్యాడు. అక్కడ ఉన్నన్ని రోజులు క్షణాల్లా గడిపాడు ఉద్ధవుడు.

ఆ గోపస్త్రీలకు కృష్ణుని మీద ఉన్న ప్రేమకు, భక్తికి, ఆవేశమునకు ముగ్ధుడయిన ఉద్ధవుడు వారికి నమస్కరించి వారితో ఇలా అన్నాడు. "సకలజీవులలో ఆత్మస్వరూపుడుగా ఉన్న శ్రీకృష్ణుని ప్రేమకు నోచుకున్న ఈ అమాయక గోపకాంతల జన్మలు సార్థకమయ్యాయి. మోక్షము కొరకు తపస్సులు చేసే మునులు, మా వంటి భక్తులు ఎల్లప్పుడూ ఈ కృష్ణుడి ప్రేమకోసం పరితపిస్తుంటాము. ఏ తపస్సు చేయకుండా ఈ గోపకాంతలు కృష్ణప్రేమను అపారంగా పొందారు. ఎల్లప్పుడూ కృష్ణుడి మనసులో నిలుపుకొని ధ్యానించే

అమాయక గోపకాంతలకు, గొప్ప కులంలో పుట్టడం, ఉపనయన సంస్కారములు చేయడం, యజ్ఞయాగములు చేయడం దీక్షలు తీసుకోవడం ఏ మాత్రం అవసరం లేదు. అటువంటి వారు బ్రాహ్మణజన్మ ఎత్తనవసరం లేదు. ఏ కులంలో జన్మించినా వారు కృష్ణప్రేమకు అర్హులే!

గ్రామంలో నివసిస్తూ వ్యభిచారులు అనే ముద్రపడిన ఈ అమాయక గోప కాంతలు ఎక్కడ? పరమాత్మ స్వరూపుడైన ఆ శ్రీకృష్ణుని పరమమైన ప్రేమ ఎక్కడ? తాను సేవించేది అమృతం అని తెలియకుండా సేవించినా, అమృతము తనను సేవించిన వారికి సుఖము, సంతోషము కలుగజేస్తుంది. అలాగే కృష్ణతత్వమును ఏమీ తెలియని ఈ గోపికలు, గోపకాంతలు, కృష్ణుని సేవించడం ద్వారా, స్మరించడం ద్వారా, ముక్తిని పొందారు. ఈ గోపికలు చేసుకున్న అదృష్టము, ఆయనను ఎల్లప్పుడూ అంటిపెట్టుకొని ఉండే అప్సరసలు, సాక్షాత్తు లక్ష్మీదేవి  కూడా పొందారో లేదో అని అనుమానంగా ఉంది.

కేవలం వేదాధ్యనముతోనే పొంద దగిన ఆ పరమాత్మ పాదములను, ఈ గోపికలు తమ అమాయక ప్రేమతో పొందగలిగారు. నేను మరుజన్మలో ఈ గోపికలు తమ పాదములతో తిరిగిన ఈ వనములో ఒక చెట్టుగానో, లతగానో పుట్టి నా జన్మ సార్ధకం చేసుకుంటాను. ఎవరి పాదపద్మములను లక్ష్మీదేవి  నిరంతరము సేవిస్తూ ఉంటుందో, ఎవరి పాదములను బ్రహ్మమొదలగు దేవతలు తమ హృదయములలో నిలుపుకొని పూజిస్తూ ఉంటారో, ఆ శ్రీకృష్ణుని పాదములను కౌగలించుకొని వాటిని తమ గుండెలమీద హత్తుకున్న ఈ అమాయక గోపికలు తమ మనసులను పవిత్రం చేసుకున్నారు. శ్రీకృష్ణుని పాదస్పర్శతో పునీతమైన ఈ గోపికల పాదములకు నేను

నమస్కరిస్తున్నాను. వీరి కృష్ణనామస్మరణతో మూడులోకములు పవిత్రం అవుతాయి.” అని తనలో తాను అనుకున్నాడు ఉద్ధవుడు.

తరువాత ఉద్ధవుడు గోపికల దగ్గర, నందుని దగ్గరా, యశోద దగ్గరా సెలవు తీసుకొని మధురకు పోవడానికి రథం ఎక్కాడు. నందుడు మొదలగు గోపాలురు ఉద్ధవుడికి ఎన్నో ఉపాహారాలు తీసుకొని వచ్చి రథంలో పెట్టారు. నందుడు మొదలగు వారు ఉద్ధవునితో ఇలా అన్నారు.

“కృష్ణుడు దైవాంశ సంభూతుడు అని మాకు తెలుసు. మా మనస్సు ఎల్లప్పుడూ శ్రీకృష్ణుని పాదముల యందే లగ్నం అయి ఉండుగాక! మా నోరు ఎల్లప్పుడ కృష్ణునామమును పలుకుగాక! మా చేతులు ఎల్లప్పుడూ కృష్ణునికి నమస్కరించు గాక! మేము ఎక్కడ ఉన్నా, మా మనసులు మాత్రము కృష్ణుని యందే లగ్నం అయి ఉండుగాక!” అని కృష్ణుని కీర్తించారు.

తరువాత ఉద్ధవుడు నందుని వద్ద సెలవు తీసుకొని మధురకు వెళ్లిపోయాడు. మధుర చేరగానే ఉద్ధవుడు కృష్ణుని గృహమునకు వెళ్లాడు. తాను నందవ్రజములో అడుగుపెట్టినప్పటినుండి మరలా మథురకు వచ్చేవరకు జరిగిన విషయములు, గోపికలతోనూ, గోపకాంతలతోనూ తాను ముచ్చటించిన విషయములు అన్నీ వివరంగా చెప్పాడు.

తరువాత ఉద్ధవుడు ఉగ్రసేన మహారాజు దగ్గరకు, వసుదేవుని వద్దకు పోయి నందుడు వారికి పంపిన కానుకలను సమర్పించాడు." అని శుయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు ఉద్ధవుడు నందవ్రజమును సందర్శించడం గురించి తెలియచేసాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము నలభైఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

నలభైఎనిమిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఉద్ధవుని వలన నందవ్రజములో జరిగినది అంతా విని సంతోషించాడు కృష్ణుడు. మధురకు వచ్చినపుడు తనకు సుగంధ ద్రవ్యములను ఇచ్చిన త్రివక్ర అనే ఆమెఇంటికి వస్తానని మాట ఇచ్చాడు కృష్ణుడు ఆ మాట నెరవేర్చడానికి కృష్ణుడు త్రివక్ర ఇంటికి వెళ్లాడు. త్రివక్ర ఇంటి నిండా సుగంధవస్తువులతోనూ, వివిధరకములైన లేపనములతోనూ నిండి ఉంది. ఆమె ఇల్లు అంతా సుగంధ పరిమళములతో గుభాళిస్తూ ఉంది.

తన ఇంటికి వచ్చిన కృష్ణుని చూచి త్రివక్ర సంభ్రమంతో లేచి ఆయనకు ఎదురుగా వచ్చి ఆహ్వానించింది. అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించింది. ఆయనకు ఉచితాసనము ఇచ్చి ఆయనను పూజించింది. కృష్ణుడు ఆమె ఇంట్లో ఒక సుఖాసనము మీద

కూర్చున్నాడు. ఆమె చేసిన పూజలు స్వీకరించాడు. తరువాత ఆమె కృష్ణునికి స్నానము చేయించి, నూతన వస్త్రములను కట్టబెట్టింది. గంధముమొదలగు సుగంధ లేపనములను ఆయన శరీరమునకు పూసింది. పూలమాలలతో అలంకరించింది. తరువాత త్రివక్ర కృష్ణుని పక్కనే కూర్చుంది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ త్రివక్ర కేవలము కృష్ణుడు మధురకు వచ్చినపుడు ఆయనకు సుగంధ లేపనములు ఇచ్చింది. ఆమె వ్రజస్త్రీలు చేసినట్టు ఆయనకు ఏమీ సేవలు చెయ్యలేదు. కాని కృష్ణుడు ఆమె ఇంటి వెళ్లి ఆమెను అనుగ్రహించాడు. త్రివక్ర కూడా కృష్ణుని పాదములను కౌగలించుకొని తాదాత్మ్యము పొందింది. ఆనందస్వరూపుడైన కృష్ణునితో తాను సుఖించినట్టు మనసులోనే భావించింది. తన చిత్తములో ఉన్న సంతాపమును పూర్తిగా పోగొట్టుకుంది. నిర్మల చిత్తంతో కృష్ణుని ఆలింగనము చేసుకొంది.

ఆమె సేవలకు సంతుష్టిచెందిన కృష్ణుడు ఆమెను ఏదైనా వరం కోరుకోమన్నాడు. ఆమె కృష్ణుని తన ఇంటనే కొన్ని దినములు ఉండి తనకు ఆనందము కలుగజేయమని కోరింది. కృష్ణుడు ఆమె కోరినట్టు ఆమెతో కొంత కాలము గడిపి, తరువాత తన మందిరమునకు వెళ్లిపోయాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! త్రివక్ర కృష్ణుని మహిమలను కళ్లారా చూచింది. ఆమె కురూపమును పోగొట్టి అందగత్తెగా చేసింది కృష్ణుడే కదా! అటువంటి కృష్ణుడు వరం కోరుకోమంటే, నిరంతర కృష్ణభక్తి

కోరుకోకుండా, కృష్ణునితో కామసుఖములు అనుభవించాలని కోరుకుంది. దురదృష్టవంతుడికి పెన్నిధి లభించినా, వాడు దానిని అందుకోలేడు. దుష్టబుద్ధి కలవారు, తుచ్ఛులు, తుచ్ఛమైన కామవాంఛలు, ప్రాపంచిక విషయములు కోరుకుంటారే కానీ, పరమాత్మతో సాయుజ్యమును కోరుకోరు. పరమాత్మ కూడా వారి మూర్ఖత్వానికి జాలిపడి, వారు కోరింది ఇస్తాడు. త్రివక్ర కూడా అటువంటి మూర్ఖురాలే.

ఓ పరీక్షిత్ మహారాజా! తరువాత కృష్ణుడు బలరామునితో కలిసి అక్రూరుని ఇంటికి వెళ్లాడు. కృష్ణుడు బలరాముడు తన ఇంటికి రావడం అక్రూరుడు దూరంనుండి చూచాడు. సంభ్రమంతో తొట్రుపాటు పడ్డాడు. అతని మనసంతా సంతోషంతో నిండిపోయింది. వాళ్ల ఎదురు పోయి ఆలింగనం చేసుకున్నాడు. కృష్ణుడి కాళ్లమీదపడి నమస్కరించాడు. ఇద్దరినీ ఇంటిలోనికి తీసుకొని పోయి అర్ఘ్యము పాద్యము ఆసనము ఇచ్చి సత్కరించాడు. తరువాత అక్రూరుడు బలరామకృష్ణుల పాదములను కడిగి ఆ నీళ్లు తల మీద చల్లుకున్నాడు. బలరామకృష్ణుల చేత నూతన వస్త్రములను ధరింపచేసాడు. వివిధ పూజాద్రవ్యములతో పూజించాడు. తరువాత కృష్ణుని కాళ్లు పడుతూ ఇలా అన్నాడు.

"కృష్ణా! మా అదృష్టము పండి, నీ చేతిలో కంసుడు మరణించాడు. యాదవ కులము తన కష్టముల నుండి తేరుకుంది. మీ ఇరువురి దయ వలన యాదవ కులము రక్షింపబడింది. మీరు ఉత్తమ పురుషులు. పరమాత్మ స్వరూపులు. ఈ జగమంతా నిండి ఉన్నారు.

ఓ కృష్ణా! సత్వ రజస్తమోగుణముల కలయికతో నీవు ఈ విశ్వాన్ని సృష్టించావు. ఈ సృష్టిలో ప్రవేశించి పోషిస్తున్నావు. లయం చేస్తున్నావు. కాని ఈ గుణములు ఏవీ నిన్ను అంటవు. నీవు గుణాతీతుడవు. భూమి, ఆకాశము, వాయువు, అగ్ని, నీరు కలిసి వివిధ భౌతిక రూపములలో కదిలేవి, కదలనివి గా వెల్లడి అవుతున్నాయి. అలాగే నీవు కూడా అన్నిజీవులలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు.

ఈ సత్వ,రజస్తమోగుణములు నీ శక్తులు. వీటితో నీవు సృష్టి,స్థితి,లయములను నిర్వహిస్తున్నావు. కాని నీవు ఆ గుణముల చేత గానీ, సృష్టి, స్థితి, లయ కార్యములకు కానీ బద్ధుడవు కావు. మానవులు తమ అవిద్య చేత బంధనములకు లోనవుతున్నారు. ఆ అవిద్య నీలో లేదు కాబట్టి ఏ బంధనములు నీకు లేవు. నీవు మానవుడిగా అవతరించావు. ఏ అవతారములో కూడా నీవు అవిద్యకు లోనయి బంధనములలో చిక్కుకున్నావని ఏ శాస్త్రము, ఏ శాస్త్రకారుడు నిరూపించలేదు.

సాధారణ జీవుల వలె నీకు సంసార బంధములు కానీ, పునర్జన్మలు కానీ లేవు. ఎందుకంటే, జీవులు తమ అవిద్య వలన సంసార బంధనములలో చిక్కుకొని, వివిధములైన కర్మలు చేసి, ఆ కర్మల ఫలితంగా పునర్జన్మ పొందుతుంటారు. అటువంటి అవిద్య నీలో ఉంటే నీవు కూడా మామూలు జీవులవలె ఈ సంసార సాగరంలోనూ, జనన మరణ చక్రములోనూ పడి తిరుగుతూ ఉండేవాడివి కదా!

నీవు నిరాకారుడవు. నీకు దేహము అంటూ లేదు. జన్మ అంటూ లేదు. అందుకని నీకు తల్లి తండ్రి, భార్య, సంతానము అనే బంధములు ఏవీ లేవు. బంధములే లేనపుడు ముక్తి పొందవలసిన అవసరము లేదు.

ఓ దేవా! నీవు జగత్కల్యాణము కొరకు వేదములను సృష్టించావు. వైదిక ధర్మమును, భాగవత ధర్మమును ప్రచారం చేసావు. కాని కొందరు దుర్మార్గులు, అసుర ప్రవృత్తి కలవారు, ఆ సనాతన వైదిక ధర్మమునకు విఘాతం కలిగిస్తున్నారు. ఆ సమయంలో నీవు శుద్ధసత్వగుణ స్వరూపముతో ఆవిర్భవించి, సనాతన వైదిక ధర్మమును మరలా ఉద్ధరిస్తున్నావు.

కృష్ణా! రాజులందరూ అసురప్రవృత్తిచేత సంచరిస్తూ లోకకంటకులుగా మారడంతో, నీవు బలరాముడుతో సహా యాదవ వంశములో ధర్మసంస్థాపన కొరకు అవతరించావు.

ఓ దేవా! నీవు యజ్ఞమూర్తివి. దేవతలు, ఋషులు, పితృదేవతలు, మానవులు అందరూ నీ స్వరూపాలే. అందరిలో నీవు అంతర్లీనంగా ఉన్నావు. నీ పాదముల నుండి పుట్టిన పవిత్ర గంగ మూడులోకములలో ప్రవహించి, తనలో మునిగిన వారి పాపములను ప్రక్షాళనచేస్తూ ఉంది. అటువంటి పరమాత్మ స్వరూపుడవు, జగద్గురువు అయిన నీవు ఈ నాడు నా పూర్వపుణ్యవిశేషము చేత మా ఇంట్లో అడుగుపెట్టావు. మా గృహము పావనం అయింది.

ఓ దేవా! నీకు నీ భక్తులంటే అత్యంత ప్రేమ. నీవు ఎల్లప్పుడు సత్యం పలుకుతావు. నీ హృదయం మంచిది. నీవు అందరిపట్లా కృతజ్ఞతాభావంతో ఉంటావు. అందుకని తెలిసినవారు, బుద్ధిమంతులు నిన్ను తప్ప మరొకరిని ఆశ్రయించరు. ఎవరైనా నిన్ను ఏకాగ్రమైన, నిర్మలమైన మనసుతో నిన్ను కొద్దిగా సేవించినా, వారు కోరిందల్లా ఇస్తావు. నిన్ను నీవే వారికి సమర్పించుకుంటావు. నీవు భక్తపరాధీనుడివి కదా!

ఓ దేవా! నీ గురించి సంపూర్ణంగా తెలుసుకోడానికి సనకాది యోగులకు, బ్రహ్మాది దేవతలకు సాధ్యంకాలేదు. ఇంక నేనెంత. నా వంటి  గృహమునకు నీవు రావడం నా అదృష్టంగా భావిస్తున్నాను. నీ మాయతో కప్పబడిన భార్యాబిడ్డలు, ధనము,గృహములు మొదలైన వానియందు మాకు ఉన్న మోహమును బంధనములను ఛేదించి మాకు ముక్తి ప్రసాదించమని వేడుకుంటున్నాను." అని కృష్ణుని ప్రార్థించాడు అక్రూరుడు.

అక్రూరుని మాటలను విన్న కృష్ణుడు చిరునవ్వులు చిందిస్తూ ఇలా అన్నాడు. "అక్రూరా! నీవు మాకు గురువు. పితృసమానుడవు. మాకు దగ్గర బంధువు.  మేము నిన్ను పూజించాలి. స్తుతించాలి. మేము నిన్ను ఎల్లప్పుడూ పోషించాలి, రక్షించాలి. అది మా విధి కర్తవ్యము. నీవంటి సాధుపుంగవులు, లోక కల్యాణమును కోరుకొనేవారు, మానవులందరి చేతా పూజింసబడతారు. దేవతలకు కేవలము తమ తమ కార్యముల మీదనే ఆసక్తి. కాని మీ బోటి సాధువులకు లోకకల్యాణము మీద ఆసక్తి. మీరు నిరంతరము ఇతరుల

క్షేమమును కోరుతుంటారు.

గంగా మొదలగు పవిత్రమైన తీర్థములు, రాతితోనూ, మట్టితోనూ చేసిన దేవతామూర్తులు అన్నీ పూజింపదగినవే. వాటిని పూజిస్తే ఎంతో కాలానికి కానీ వాటి అనుగ్రహము కలుగదు. కాని మీ వంటి వారిని కేవలం దర్శించుకుంటేనే మానవులు పవిత్రులవుతారు.

అక్రూరా! మా బంధువులలో కల్లా నీవే మంచి హృదయము కలవాడివి, శ్రేష్టమైన వాడివి. నీవు ఎల్లప్పుడూ మా శుభమును కోరుతుంటావు. కాబట్టి నీవు మాకు ఒక పని చేసి పెట్టాలి. నీవు ఇప్పుడు హస్తినాపురము వెళ్లాలి. అక్కడ మా మేనత్త కుంతీదేవి కుమారులు పాండవులు ఉన్నారు. వారికి తండ్రి చనిపోయాడు. అనాధలైన పాండవులు, తమ తల్లి కుంతితో పెదనాన్న ధృతరాష్ట్రుని గృహములో ఉన్నారని విన్నాను.. వారి క్షేమ సమాచారములు తెలుసుకొనిరా.

ధృతరాష్ట్రుడు పుట్టు గుడ్డివాడు. అతని బుద్ధి మంచిది కాదు. అతని కుమారులు కూడా దుష్టబుద్ధికలవారు. ధృతరాష్ట్రునికి కుమారులు ఎంతచెబితే అంతా. వాళ్ల మాటను జవదాటడు. ధృతరాష్ట్రుడు తన కుమారులను, తన తమ్ముడు కుమారులైన పాండవులను సమానంగా చూస్తున్నాడన్న నమ్మకం నాకు లేదు. ఆ కారణం చేత నీవు ఇప్పుడు హస్తినాపురమునకు పోయి, పాండవులు ఎలా ఉన్నారు. ధృతరాష్ణ్రుని ఇంట్లో క్షేమంగా ఉన్నారా! పాండవుల పట్ల ధృతరాష్ట్రుని ప్రవర్తన ఎలా ఉంది? పాండవులను తన కుమారులతో సమానంగా చూస్తున్నాడా లేక పక్షపాతవైఖరి అవలంబిస్తున్నాడా! ఈ విషయములన్నీ తెలుసుకొనిరా. నీవు తెచ్చిన సమాచారమును బట్టి

నేను పాండవులకు శుభం కలిగే విధంగా కార్యములను చక్కబెడతాను." అని అన్నాడు. ఆ ప్రకారంగా అక్రూరుని ఆదేశించి, కృష్ణుడు బలరామునితో సహా తన గృహమునకు వెళ్లిపోయాడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు అక్రూరుని హస్తినకు పంపడం గురించి వినిపించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము నలభై ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## దశమస్కంధము
## నలభై తొమ్మిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు పంపగా అక్రూరుడు హస్తినాపురము చేరుకున్నాడు. వెళ్లగానే ముందు భీష్ముని కలుసుకున్నాడు. తరువాత ధృతరాష్ట్రుని, విదురుని, కుంతిని, బాహ్లీకుని, ద్రోణుని, కృపాచార్యుని, కర్ణుని, దుర్యోధనుని, అశ్వత్థామను, పాండు కుమారులను, ఇతర బంధువులను కలుసుకున్నాడు. వారి క్షేమసమాచారములను తెలుసుకున్నాడు. ధృతరాష్ట్రుడు తన తమ్ముని కుమారులు అయిన పాండవుల పట్ల ఎలా ప్రవర్తిస్తున్నాడో గమనిస్తూ కొంతకాలము హస్తినాపురములో గడిపాడు.

విదురుడు పాండవులను కౌరవ కుమారులు ఎలా అష్టకష్టములు పెట్టింది వివరించాడు. పాండవులకు కురుకుమారులు విషం పెట్టి చంపడానికి ప్రయత్నించారని చెప్పాడు. పాండవులకు ప్రజాదరణ నానాటికీ ఎక్కువ కావడం సహించలేని సుయోధనుడు అతని తమ్ములు పాండవులను అంతమొందించడానికి ప్రయత్నాలు చేసారని వివరించాడు.  తనకు వరుసకు సోదరుడైన అక్రూరునితో కుంతీదేవి కళ్లనీళ్లు కుక్కుకుంటూ ఇలా చెప్పసాగింది.

"సోదరా! నా గురించి మధురలో ఎవరైనా తలచుకుంటున్నారా! మా తల్లి తండ్రులు, నా సోదరులు, అక్కచెల్లెళ్లు, బంధువులు నా గురించి మనసులో స్మరించుకుంటారా! నా మేనల్లుడు అయిన శ్రీకృష్ణుడు, ఆయన అన్నగారు బలరాముడు తన మేనళ్లుళ్ల గురించి ఎప్పుడైనా విచారించాడా!

అక్రూరా! హస్తినలో మా పరిస్థితి తోడేళ్ల మధ్య ఉన్న లేడి పిల్లల మాదిరి ఉంది. ఇక్కడ మా చుట్టు శత్రువులే. మాకు దు:ఖము తప్ప మరొకటి తెలియదు. నా పిల్లలు తండ్రిలేని అనాధలు. మమ్ములను కృష్ణుడు ఓదారుస్తాడంటావా! శ్రీకృష్ణుడు సాక్షాత్తు విష్ణ్వంశ సంభూతుడు. సర్వాంతర్యామి.

శ్రీకృష్ణా! ముకుందా! హస్తినలో పసివారితో కష్టములు అనుభవిస్తున్న నన్ను రక్షించవా! ఓ దేవా! ఈశ్వరస్వరూపుడవైన నీ పాదపద్మములను ఆశ్రయించుకొని ఉన్నాము. నీ పాదములు తప్ప మాకు శరణాగతి మరొకటి లేదు. జ్ఞానస్వరూపుడైన నిన్ను

శరణువేడుతున్నాము. మమ్ములను కాపాడు.” అని కుంతీదేవి అక్రూరునితో మాట్లాడుతూ కృష్ణుని స్మరించుకుంది. దు:ఖము ఆపుకోలేక పెద్దపెట్టున ఏడవసాగింది కుంతి.

తన సోదరి కుంతి దు:ఖము చూచి అక్రూరునికి కూడా దు:ఖము పొర్లుకొచ్చింది. కాని నిగ్రహించుకున్నాడు. కుంతీదేవిని ఓదార్చాడు. “అమ్మా కుంతీదేవీ! నీ కుమారులు సామాన్యులు కారు. దైవాంశ సంభూతులు. వారికి అశుభము ఎన్నటికీ కలుగదు. మీకు త్వరలోనే సకల శుభములు కలుగుతాయి.” అని ఓదర్చాడు.

తరువాత మధురకు ప్రయాణం అయ్యాడు. వెళ్లబోయే ముందు ధృతరాష్ట్రుని కలిసాడు. ఆయనతో ఇలా అన్నాడు. “కురువంశ శ్రేష్టా! ధృతరాష్ట్రా! నీ సోదరుడు పాండు రాజు మరణించిన తరువాత నీవు ఈ కురు సామ్రాజ్యమునకు చక్రవర్తివి అయ్యావు. నీవు ప్రజలను కన్నబిడ్డలవలె ధర్మంగా పాలిస్తున్నావు. అందరినీ సమంగా ఆదరిస్తున్నావు. అలా కాకుండా నీ కుమారులను ఒక తీరునా, నీ తమ్ముని కుమారులను ఒకతీరునా చూస్తే నీకు నరకం సంప్రాప్తిస్తుంది. కాబట్టి దయచేసి నీ కుమారులు అయిన సుయోధనాదులను, నీ తమ్ముని కుమారులు అయిన ధర్మరాజాదులను సమంగా ఆదరించు. అప్పుడు లోకం నిన్ను హర్షిస్తుంది.

మహారాజా! ఈ శరీరములు  శాశ్వతములు కావు. ఎప్పుడో ఒకప్పుడు ఈ శరీరమును వదిలిపెట్టిపోవలసిందే. ఈ శరీరమే శాశ్వతము కానప్పుడు భార్య,పుత్రులు, రాజ్యములు, సుఖములు ఎలా

శాశ్వతము అవుతాయి. శాశ్వతములు కాని శరీరములు, పుత్రుల మీద మమకారం పెంచుకోవడం, ఇతరులను ద్వేషించడం మంచిది కాదు.

ఈ ప్రపంచంలోకి జీవులు ఒంటరిగానే వస్తారు. ఒంటరిగానే పోతారు. ఎవరూ ఎవరి వెంటా రారు. తాను ఈ శరీరములో ఉన్నప్పుడు సంపాదించుకున్న పుణ్యములు, పాపములు ఒంటరిగానే అనుభవిస్తాడు. నీటిలో పుట్టి, నీటిలో పెరిగే చేపలు మొదలగు జలచరములు తమ సంతానమునకు నీటినే తమ ఆస్తిగా ఇస్తాయి. అలాగే మానవులు కూడా తాము అధర్మంగా ఆర్జించిన ఆస్తిని తమ సంతానమునకు వారసత్వంగా ఇస్తారు. ఆ సంతానము కూడా ఆ అక్రమంగా ఆర్జించిన ఆస్తిని హరించి అధర్మవర్తనులు అవుతారు.

తండ్రులు తమ సంతానమును పోషించే నిమిత్తం ఎన్నో అధర్మకార్యములు చేసి ధనము సంపాదిస్తారు. కాని వాని పుత్రులు ఆ ధనమును హరించి, అది చాలదనీ, ఇంకా సంపాదించలేదనీ, ఆ తండ్రులను నిందించి, వెళ్లగొడతారు. ఉన్నధనము, ఆస్తి తన కుమారులు హరించగా, వీధిని పడ్డ తండ్రులు తాము చేసిన అక్రమాలకు ఫలితంగా పాపఫలమును మూటగట్టుకొని, నరకంలో పడతారు.

కాబట్టి ఓ ధృతరాష్ట్రమహారాజా! ఈ రాజ్యము, పుత్రులు శాశ్వతములు కావు. నీవు నడిచే ధర్మమార్గమే నీ వెంట ఉంటుంది. ఈ సంసారము, భార్య పిల్లలు, రాజ్యభోగములు అన్నీ స్వప్నంలో మాదిరి కరిగిపోతాయి. నీ మనసును నిగ్రహించి, ప్రలోభములను వదిలిపెట్టి,

ధర్మంగా పరిపాలించు. అందరినీ సమంగా ఆదరించు. అప్పుడు నీకు శాంతి సౌభాగ్యాలు కలుగుతాయి." అని హితోపదేశం చేసాడు అక్రూరుడు.

ఆ మాటలు అన్నీ విన్న ధృతరాష్ట్రుడు ఇలా అన్నాడు. "అక్రూరా! మానవులకు అమృతం ఇచ్చినా వారికి తృప్తి కలగదు. అలాగే నాకు కూడా నీ హితవచనములు చెవికెక్కడం లేదు. నీవు చెప్పింది అంతా సత్యమే. కాదనడానికి వీలు లేదు. కానీ నాకు అన్నిటి కంటే నా కుమారులు ఎక్కువ. నా శరీరం అంతా వారి మీద ప్రేమతో నిండి పోయి ఉంది. వారి సుఖం కోసరం, వారి సౌభాగ్యం కోసరం నేను ఏమైనా చేస్తాను. నేను స్వంతంగా ఏ నిర్ణయమూ తీసుకోలేని అశక్తుడను.

భూభారమును తగ్గించడానికి ఆ పరమాత్మ కృష్ణుడుగా అవతరించాడని నాకు తెలుసు. ఆయన సంకల్పమును మార్చడానికి ఎవరికీ సాధ్యము కాదు. ఈ కృష్ణుడికి ఇక్కడి నుండి ఒక నమస్కారం చేయడం తప్ప ఇంక ఏమీ చేయలేను." అని అన్నాడు.

ధృతరాష్ట్రుని మనోనిశ్చయము విన్న అక్రూరుడు ఇంక ఏమీ చెప్పి ప్రయోజనము లేదని తెలుసుకొని అక్కడి నుండి వెళ్లిపోయాడు. తరువాత భీష్ముడు మొదలగు పెద్దల అనుమతి తీసుకొని మధురకు ప్రయాణమయ్యాడు. మధురకు తిరిగి వచ్చిన తరువాత విదురుడు, కుంతి, ధృతరాష్ట్రుడు తనలో పలికిన పలుకులు యథాతథంగా కృష్ణునికి, బలరామునికి వివరించాడు అక్రూరుడు." అని శుకమహర్షి

పరీక్షిత్ మహారాజుకు అక్రూరుని హస్తినాపుర పర్యటన గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము నలభైతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
యాభయ్యవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! మధుర దేశమును పరిపాలించు కంసుడు మగధ దేశమును పరిపాలించే జరాసంధునికి స్వయానా అల్లుడు. జరాసంధుడు తన కుమార్తెలు అయిన అస్తి, ప్రాప్తి లను కంసునికి ఇచ్చి వివాహం చేసాడు. ఆ కంసుడు కృష్ణుడికి మేనమామ. జరాసంధుని అండచూచుకొని కంసుడు రెచ్చిపోయాడు. ప్రజలను, బ్రాహ్మణులను, తాపసులను హింసించనారంభించాడు. తుదకు కృష్ణుని చేతిలో మరణించాడు.

కంసుడు మరణించిన తరువాత కంసుని భార్యలు అయిన ప్రాప్తి, అస్తి తమ తండ్రి జరాసంధుని గృహమునకు వెళ్లారు. తమ భర్తను కృష్ణుడు ఎలా చంపాడో, తమకు వైధవ్యము ఎలా ప్రాప్తించిందో తమ తండ్రి జరాసంధునికి వివరించారు. తన అల్లుని చంపి తన కుమార్తెలను విధవలుగా మార్చిన కృష్ణుని మీద జరాసంధునికి అపరిమితమైన కోపం వచ్చింది. భూమి మీద యాదవులు అనే మాట

లేకుండా చేయదలచుకున్నాడు జరాసంధుడు. తన వద్ద ఉన్న 23 అక్షౌహిణీల సైన్యమును యుద్ధమునకు సిద్ధం చేసాడు. ఉగ్రసేనుడు పరిపాలిస్తున్న మధుర మీదికి దండెత్తాడు. మథురను నాలుగు వైపుల నుండి చుట్టుముట్టాడు.

జరాసంధుడు తన అపారమైన సేనావాహినితో మథురను ముట్టడించాడు అన్న వార్త విన్న కృష్ణుడు తనలో తాను ఇలా ఆలోచించాడు. "ఈ జరాసంధుడు తన సేనతో మథురను చుట్టుముట్టాడు. ఇప్పుడు వీడిని యుద్ధంచేసి సంహరిస్తే వీడి వెనక ఎంతమంది రాజులున్నారో తెలియదు. అందుకని వీడితో యుద్ధం చేసి ఓడిస్తాను. వీడిని మాత్రం సంహరించను. అప్పుడు వీడుపోయి తనకు సాయంగా ఉన్న మిగిలిన రాజులను తీసుకొని వస్తాడు. అప్పుడు వారిని కూడా సంహరించవచ్చు. అప్పుడు కానీ దుష్టులైన రాజులను సంహరించడం, సాధుజనులను రక్షించడం, తద్వారా భూభారమును తగ్గించడం అన్న నా అవతార ప్రయోజనమునెరవేరదు. ధర్మమును రక్షించడానికే కదా నేను ఇప్పటి వరకు మత్స్య,కూర్మ,వరాహ అవతారములను దాల్చింది. " అని అనుకున్నాడు కృష్ణుడు.

కృష్ణుడు ఇలా ఆలోచిస్తూ ఉండగానే ఆకాశము నుండి రెండు దివ్యరథములు వచ్చాయి. ఆ రథములు సూర్యుని వలె ప్రకాశిస్తున్నాయి. ఆ రెండు రథములకు హయములు, సారథులు ఉన్నారు. ఆ రథముల నిండా వివిధములైన ఆయుధములు, అస్త్ర, శస్త్రములు ఉన్నాయి. వాటిని చూచిన కృష్ణుడు బలరామునితో ఇలా అన్నాడు.

"అన్నయ్యా! ఇదిగో నీ రథము. సకల అస్త్ర,శస్త్రములతో నిండిన దివ్య రథము.  దుర్మార్గుడు, దుష్టుడు అయిన జరాసంధుడు మన మీదికి తన 23 అక్షౌహిణీల సైన్యముతో దండెత్తి వచ్చాడు. నీవు వాడితో యుద్ధము చేసి వాడి సైన్యమును సర్వనాశనం చెయ్యి. యాదవులను, యాదవ వంశములను కాపాడు. భూభారమును తగ్గించడానికే కదా మనము అవతరించింది. " అని అన్నాడు.

తరువాత బలరాముడు, కృష్ణుడు చెరి ఒక రథము ఎక్కారు. తమ వెంట కొంత మంది సైన్యమును తీసుకొని జరాసంధుని మీదికి యుద్ధమునకు వెళ్లారు. దారుకుడు అనే సారథి తన రథమును నడుపుతుండగా కృష్ణుడు మథుర నుండి బయటకు వచ్చాడు. జరాసంధుని సైన్యము ఎదుట నిలిచి తన శంఖము పాంచజన్యమును పూరించాడు.

బలరాముడు శ్రీకృష్ణుడు తమ దివ్యరథముల మీద రావడం చూచాడు జరాసంధుడు. . "కృష్ణా! నీవు బాలుడవు. నీతో యుద్ధం చేయడం నా వంటి వీరుడికి తగదు. కాబట్టి నీతో యుద్ధం చేయను. నీవు నీ మేనమామను చంపావు. భయంతో మథురలో దాక్కున్నావు. నీ వంటి పిరికి పందతో నేను యుద్ధం చేయను. వెళ్లిపో. ఓ బలరామా! నీవు చాలా బలం కల వాడివని విన్నాను. నీకు నాతో యుద్ధం చెయ్యాలని కోరికగా ఉంటే నాతో యుద్ధానికి సిద్ధపడు. అతిత్వరలోనే నీవు స్వర్గసుఖాలు అనుభవిస్తావు. నీకు బలం, ధైర్యం, పరాక్రమం ఉంటే నన్ను చంపడానికి ప్రయత్నించు" అని ప్రగల్భాలు పలికాడు జరాసంధుడు.

ఆ మాటలు విన్న కృష్ణుడు ఇలా అన్నాడు. “జరాసంధా! వీరులు ఎప్పుడూ తమను గురించి తాము పొగుడుకోరు. కేవలం తమ బలపరాక్రమములు ప్రదర్శిస్తారు. నీవు వీరుడవు కావు. అందుకే ప్రగల్భాలు పలుకుతున్నావు. నీవు చావడానికే ఈ యుద్ధానికి వచ్చావు. అందుకే నీ మాటలు మాకు నచ్చలేదు.” అని అన్నాడు.

కృష్ణుని మాటలు జరాసంధునికి శూలాల్లా గుచ్చుకున్నాయి. వాయువేగంతో తన రథాన్ని కృష్ణుని మీదికి పోనిచ్చాడు. జరాసంధుని సేనలు బలరామకృష్ణులను చుట్టుముట్టాయి. మధురా నగర కోట గోడల మీద నిలబడి చూస్తున్న మధురా నగరవాసులకు, జరాసంధుని సైన్యం మధ్యలో చిక్కుకున్న కృష్ణుడు బలరాముల రథాలు కనిపించలేదు. వారంతా హాహాకారాలు చేస్తున్నారు. జరాసంధుని సైన్యములు యాదవ సైన్యములను విచక్షణా రహితంగా సంహరిస్తున్నాయి.

ఇది గమనించిన కృష్ణుడు తన దివ్యమైన విల్లును తీసుకున్నాడు. ఆ దివ్యమైన ధనుస్సుకు అస్త్రములను సంధించి వదులుతున్నాడు. కృష్ణుడు అస్త్రములను సంధించే వేగానికి ఆ విల్లు గుండ్రంగా ఉందా అని భ్రమకలుగుతూ ఉంది. జరాసంధుని సేనలలో ఉన్న ఏనుగులు, గుర్రాలు, సైనికులు కృష్ణుని బాణములు తగిలి కుప్పలుగా పడిపోతున్నారు. రథాలు, వాటికి కట్టిన ధ్వజములు విరిగి పడుతున్నాయి. సారథులు మరణిస్తున్నారు. కాల్బలము నాశనం అవుతూ ఉంది. ఏనుగులు, గుర్రములు, కాల్బలము శవాలుగామారుతుంటే వాటి శరీరముల నుండి కారే రక్తం ఏరులుగా పారుతూ ఉంది. ఆ రక్తపు

మడుగులలో సైనికుల తలలు తాబేళ్ల మాదిరి తేలుతున్నాయి.

మరొక పక్క బలరాముడు కూడా విజృంభించి జరాసంధుని సేనలను ఊచకోతకోస్తున్నాడు. ఈ అనంత విశ్వాన్ని సృష్టించి పోషించి లయం చేస్తున్న పరమాత్మకు, ఆయనకు తోడుగా ఉన్న ఆదిశేషువుకు,  జరాసంధుని సైన్యాన్ని లయం చేయడం పెద్దవిషయము కాదు. తన సేనలు అన్నీ నశించి పోగా, కేవలం జరాసంధుడు మాత్రం మిగిలిడు. బలరాముడు జరాసంధుని ఎదుర్కొన్నాడు. వారుణాస్త్రముతో జరాసంధుని బంధించాడు. ఇంతలో కృష్ణుడు అక్కడకు వచ్చాడు. జరాసంధుని చంపబోతున్న బలరాముని వారించి జరాసంధుని కట్టు విప్పాడు.

"జరాసంధా! ఇప్పుడు పోయి రేపురా! మరలా సైన్యమును తీసుకొని రా!" అని జరాసంధుని విడిచిపెట్టాడు. అవమాన భారంతో కుంగి పోయిన జరాసంధుడు తల వంచుకొని మగధకు వెళ్లిపోయాడు. సర్వమును వదిలిపెట్టి తపస్సు చేయాలని అనుకున్నాడు. కాని అతని మిత్రరాజులు అతనిని వారించారు.

"మిత్రమా! యాదవ సేన పరిమితము. నీ సేన అపారము. బలరామ కృష్ణుల చేతిలో నీవు ఓడిపోవడం కేవలం పూర్వజన్మ కర్మఫలమే కానీ వేరు కాదు. నీవు అధైర్యపడవద్దు. మరలా సేనలనుసమకూర్చుకొని యాదవులను ఓడిద్దాము." అని ధైర్యం చెప్పారు.

కొద్ది సేనలతోనే అపారమైన సేనావాహిని కల జరాసంధుని ఓడించిన బలరామకృష్ణులమీద పూలవాన కురిపించారు దేవతలు. మథురా నగర వాసులు విజయోత్సవాలు చేసుకున్నారు. బలరామకృష్ణుల బలపరాక్రములను వేనోళ్ల స్తుతించారు. మథురను శోభాయమానంగా అలంకరించారు. వీధులను పన్నీటితో తడిపారు. మామిడి తోరణాలు కట్టారు. బలరామకృష్ణులు నగరంలోకి వస్తుంటే శంఖములు పూరించారు. దుందుభులుమోగాయి. మేడల మీద నిలబడ్డ మథురానగర కాంతలు పూలవాన కురిపించారు. కృష్ణుని అందచందాలను కళ్లతోనే తాగుతున్నారు. బలరామకృష్ణులు తమ తాతగారు అయిన ఉగ్రసేనుని వద్దకు పోయి జరాసంధుని వద్దనుండి తాము తెచ్చిన అమూల్యమైన రత్నాభరణములను సమర్పించారు.

తరువాత జరాసంధుడు ఊరుకోలేదు. మరలా సైన్యమును సమకూర్చుకొని మథుర మీద దండెత్తాడు. కాని ఓడిపోయాడు. ఈ మాదిరి పదునేడు సార్లు మథుర మీద దండెత్తి ఓడిపోయాడు జరాసంధుడు. దానితో జరాసంధుని సమస్త సైన్యము, జరాసంధుని మిత్రరాజుల సైన్యములు సర్వనాశనం అయ్యాయి. జరాసంధుడు తన రాజధానికి తిరుగుముఖం పట్టాడు.

కాని జరాసంధునికి మథురను జయించాలనే ఆశ చావలేదు. పదునెనిమిదవ సారి యుద్ధానికి సన్నద్ధం అయ్యాడు. ఈ సమయంలో నారదుడు జరాసంధుని వద్దకు వచ్చాడు.

"జరాసంధా! నీవు 17 సార్లు ఓడిపోయావు కదా! కృష్ణుని తో యుద్ధం చేయడానికి నీ బలం చాలదని నీకు తెలియదా! కాబట్టి కాలయవనుడు అనే వీరుడు ఉన్నాడు. వాడి సాయం తీసుకో. నీవు గెలుస్తావు." అని హితోపదేశం చేసాడు. నారదుడు చెప్పినట్టు జరాసంధుడు కాలయవనునితో కలిసి మధురను ముట్టడించాడు. కాలయవనుని మూడుకోట్ల సేనలు మధురను ఒక వైపు నుండి ముట్టడించాయి. జరాసంధుని సేనలు మరొక వైపు నుండి ముట్టడించాయి. మధురా నగరము దిగ్బంధం చేయబడింది. బలరాముడు, శ్రీకృష్ణుడు ఈ పరిస్థితిని గమనించారు. ఇప్పుడు వీరితో యుద్ధం చేయడం యాదవులకుసాధ్యంకాదని భావించారు.

"అన్నయ్యా! మధుర నాలుగు పక్కలా ముట్టడించబడింది. మనము ఒక పక్క కాలయవనునితో యుద్ధం చేస్తుంటే మరొక పక్క జరాసంధుడు నగరంలో ప్రవేశించి యాదవులను నాశనం చేస్తాడు లేదా బందీలుగా పట్టుకుంటాడు. కాబట్టి మనం కొంత కాలము వీరితో యుద్ధం చేయకుండా ఉందాము. ఈ లోపల మనము మరొక నగరమును నిర్మించి, యాదవులను, మధురా నగర వాసులను ఆ కొత్త నగరమునకు చేరుద్దాము. తరువాత ఈ కాలయవనునితో యుద్ధం చేసి వీడిని సంహరిద్దాము." అని అన్నాడు.

బలరాముడు సరే అన్నాడు. వెంటనే కృష్ణుడు విశ్వ కర్మ చేత పడమటి సముద్ర మధ్యలో ఒక నగరమును నిర్మింపజేసాడు. ఆ నగరము 12 యోజనముల వైశాల్యము కలిగి ఉంది. నగరం అంతా వాస్తు శిల్పచాతుర్యము కనపడుతూ ఉంది. నగరం నిండా ఉద్యానవనములు, ఎత్తైన మేడలు, భవనములు, బంగారు

శిఖరములతో శోభాయమానంగా ఉన్నాయి. అశ్వశాలలు, ఏనుగుల ఆవాసములు సైనిక శిబిరములతో కళకళలాడుతూ ఉంది ఆ నగరము. ఆ నగరంలో ఉన్న భవనముల మీది శిఖరములు వెండి బంగారు కలశములతో అలంకరింపబడి ఉన్నాయి. దేవతా గృహములు, నాట్యశాలలు నిర్మించబడ్డాయి. నాలుగు వర్ణముల వారికి తగిన గృహవసతి కల్పించబడింది.

ఇంద్రుడు సుధర్మ అనే దేవసభను నిర్మించి ఇచ్చాడు. పారిజాత వృక్షమును ఆ నగరంలో నాటాడు. వరుణుడు కృష్ణుడికి అమితవేగముగల అశ్వములను కానుకగా ఇచ్చాడు. కుబేరుడు కృష్ణునికి నవనిధులను బహూకరించాడు. ఇతర లోక పాలకులు తమ శక్తిమేర కానుకలు సమర్పించారు.

సిద్ధులు తమ వద్దఉన్న శక్తులను, సిద్ధులను కృష్ణునికి సమర్పించారు. వాటి సాయంతో, కృష్ణుడు తన యోగబలంతో మధురా నగర వాసులను అందరినీ నూతనంగా నిర్మించిన నగరానికి తరలించాడు. బలరాముని ఆ నగరములో ప్రభువుగా ప్రతిష్టించాడు. తరువాత కృష్ణుడు ఒంటరిగా మధురకు బయలుదేరాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు బలరామకృష్ణులకు, జరాసంధునికి జరిగిన యుద్ధవిశేషములను వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము యాభయ్యవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

యాభై ఒకటవ  అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! యాదవుల నందరినీ సముద్రము మధ్యలో నిర్మించిన నగరంలో వదిలి వచ్చిన కృష్ణుడు తిరిగి మధురకు వచ్చాడు. నగర ముఖద్వారము వద్ద నిలబడ్డాడు.

శ్యామల వర్ణంతో, పచ్చని పట్టువస్త్రము ధరించి, శ్రీవత్సము అనే మచ్చ వక్షస్థలము మీద శోభను చూకూరుస్తూ ఉండగా, కంఠము నందు కౌస్తుభమణిని ధరించి, ఆజానుబాహువులతో, తామరపూవు రేకుల వంటి కన్నులతో, పెదాల మీద చిరునవ్వుతో, నిలబడి ఉన్న కృష్ణుని చూచాడు కాలయవనుడు. ఇంతకు ముందు నారదుడు తనను కలిసినపుడు కృష్ణుని గుర్తు పట్టడానికి కొన్ని లక్షణాలు చెప్పాడు. ఆ లక్షణాలు, గుర్తులు అన్నీ ఇతనిలో కనిపిస్తున్నాయి. ఇతడు కృష్ణుడే అని మనసులో నిర్ధారించుకున్నాడు కాలయవనుడు.

కాని కృష్ణుని చేతిలో ఏమీ ఆయుధములు లేవు. ఏ ధైర్యంతో నా ముందు నిలబడ్డాడా అని సందేహించాడు కాలయవనుడు. కృష్ణుని చేతిలో ఆయుధములు లేవు కాబట్టి తన చేతిలో కూడా ఆయుధము ఉండడం ధర్మం కాదు, నేను కూడా నా ఆయుధములు వదిలిపెట్టి యుద్ధం చేస్తాను అని  అనుకున్నాడు కాలయవనుడు.
(కాలయవనుడు రాక్షసప్రవృత్తి కలవాడు, దుర్మార్గుడు అయినా యుద్ధ ధర్మం పాటించాడు. నేడు మనం చదువుకున్నాం. నాగరికులం. కాని

బూటకపు ఎన్‌కౌంటర్లు, లాకప్ డెత్‌లు, మాటువేసి మట్టుబెట్టడం, ఆస్తి కోసం, డబ్బుకోసం హత్యలు చేయడం మన దైనందిన చర్యలలో ఒక భాగం అయ్యాయి. ఎందుకంటే మనకు చదువు ఉంది. జ్ఞానం ఉంది. కాని కాలయవనునికి ఉన్న పాటి సంస్కారం మాత్రం లేదు.)

కృష్ణుడు ఒంటరిగా ఉన్నాడు. నిరాయుధుడుగా ఉన్నాడు. నేను ఒక్కడినే కృష్ణుడితో ఆయుధములు లేకుండా యుద్ధం చేస్తాను. మీరంతా ఇక్కడే ఉండండి అని తన సేనాధిపతులకు ఆదేశాలు ఇచ్చాడు. కృష్ణుడు వైపు వెళ్లాడు. ఆయుధములు కింద పెట్టి తన వైపు వస్తున్న కాలయవనుడిని చూచాడు కృష్ణుడు. వెనక్కు తిరిగి పరుగెత్తాడు. కృష్ణుడు పరుగెత్తడం చూచి. కాలయవనుడు కూడా కృష్ణుడి వెంట పరుగెత్తాడు. ఇద్దరూ పరుగెత్తుతున్నారు. కాని కృష్ణుడు అందినట్టే అంది, చిక్కినట్టే చిక్కి మరలా పరుగు లంకించుకుంటున్నాడు.

అలా పరుగెత్తి పరుగెత్తి ఒక పర్వత గుహ వద్దకు చేరుకున్నాడు కృష్ణుడు. కాలయవనుడు తనను అనుసరించి రావడం గమనించాడు. ఆ పర్వతగుహలోకి దూరాడు. కృష్ణుడి వెంట వస్తున్న కాలయవనుడు "కృష్ణా! నీవు యదువంశములో జన్మించావు. పరాక్రమవంతుడవు. ఇలా పరుగెడుతున్నావు ఏమిటి! పైగా జంతువు మాదిరి పర్వతగుహలో దూరావు. ఇదేం బాగాలేదు." అంటూ తను కూడా ఆ గుహలోకి దూరాడు.

లోపల అంతా చిమ్మచీకటిగా ఉంది. దూరంగా ఉన్న బండరాతి మీద ఒక వ్యక్తి పడుకొని ఉండటం చూచాడు. "అమ్మయ్య దొరికాడు. ఇక్కడి దాకా నన్ను నీ వెంట పరుగెత్తించి, ఇక్కడ తీరిగ్గా పడుకున్నావా! ఉండు నీ పనిచెబుతాను." అంటూ దగ్గరగా వెళ్లి తన కాలితో సాచి ఒక తన్ను తన్నాడు. ఆ దెబ్బకు పడుకొని ఉన్న వ్యక్తి కింద పడ్డాడు. లేచి నిలబడ్డాడు. కాలయవనుడి వంక తీక్షణంగా చూచాడు. ఆ చూపుల తీక్ష్ణతకు, కాల యవనుడు మంటలలో మాడి బూడిద అయ్యాడు." అని శుక మహర్షి చెబుతుంటే పరీక్షిత్ మహారాజు అడ్డు తగిలాడు.

"మునివర్యా! ఇంతకూ ఆ వ్యక్తి ఎవరు? ఆయన చూపులకు కాలయవనుడు ఎందుకు మాడి మసి అయ్యాడు? కృష్ణుడు ఏమయ్యాడు? నాకంతా అయోమయంగా ఉంది. వివరించండి." అని అడిగాడు. శుకుడు చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఆ వ్యక్తి ఇక్ష్వాకు వంశములో జన్మించిన మాంధాత కుమారుడు. పేరు ముచుకుందుడు. అతడు నిత్యము సత్యమునే పలికేవాడు. బ్రహ్మజ్ఞాని. పూర్వము రాక్షసులు, అసురులు దేవతలను వేధించేవారు. రాక్షసులను ఎదిరించే శక్తి దేవతలకు లేదు. అందుకని వారు ముచుకుందుని సాయం కోరారు. ముచుకుందుడు వారికి సాయంగా స్వర్గానికి వెళ్లాడు. ముచుకుంది పరాక్రమానికి జడిసి రాక్షసులు దేవతల వంక చూచేవాళ్లు కాదు.

అలా చాలా కాలం గడిచింది. తరువాత మహాశివునికి కార్తికేయుడు జన్మించాడు. దేవతలు కార్తికేయుని (కుమారస్వామిని)

తమ సేనాధిపతిగా నియమించుకున్నారు. ఇంక ముచుకుందుని అవసరం దేవతలకు తీరిపోయింది. వారు ముచుకుందుని చూచి ఇలా అన్నారు.

"మహాత్మా! ఇంతకాలము మీరు మీ వారినందరినీ వదిలిపెట్టి మావద్ద ఉండి మా అందరినీ కంటికిరెప్పలా కాపాడారు. మీకు చాలా కృతజ్ఞులము. ఇంతకాలము మా రక్షణలో నిమగ్నమై ఉండి మీరు ఏ భోగాలు అనుభవించలేదు. మీరు ఇంతకాలము స్వర్గములో ఉండటం వలన భూలోకంలో మీ వారందరూ, మీ దాయాదులు, బంధువులు, మిత్రులు, నీ మంత్రులు, సేనాధిపతులు అందరూ కాలం చేసారు. నీ రాజ్యం కూడా లేదు.  ప్రస్తుతం భూలోకంలో మీకు నా అన్న వాళ్లు ఎవరూ లేరు. మీకు ఏం వరం కావాలో కోరుకోండి. ముక్తి ప్రసాదించడం తప్ప ఏ వరమైనా ఇస్తాము. ఎందుకంటే ఒక్క శ్రీమన్నారాయణుడే ముక్తిని ప్రసాదించడానికి సమర్థుడు. మీ ఇష్టం వచ్చిన వరం కోరుకోండి." అని పలికారు దేవతలు.

ముచికుందుడు ఒక క్షణం ఆలోచించాడు. "దేవతలారా! నేను ఇంతకాలము నిద్రాహారాలు మాని మీకు సేవ చేసాను. బాగాఅలసి పోయాను. నాకు విశ్రాంతి కావాలి. నాకు దీర్ఘనిద్ర ప్రసాదించండి." అని అడిగాడు. అలాగే అన్నారు దేవతలు. ముచికుందుడు ఈ గుహలో పడుకొని నిద్రపోతున్నాడు. కాలయవనుడు కాలితో తన్నడంతో ముచికుందునికి హటాత్తుగా మెలుకువ వచ్చింది. ఒక్క సారి కళ్లు తెరిచాడు. కొన్ని సంవత్సరాల పాటు మూసుకున్న కళ్లు ఒక్కసారిగా తెరవడం వలన ఆ తీక్షణతకు ముచికుందువు భస్మం అయ్యాడు.

కాలయవనుడు కాలి పోగానే పక్కనే దాగి ఉన్న కృష్ణుడు బయటకు వచ్చాడు. కృష్ణుని చూచి ముచికుందుడు ఆశ్చర్యపోయాడు. "జనసంచారము లేని ఈ అరణ్యంలో, ఈ పర్వతగుహలోకి మీరు ఎలా వచ్చారు. మీరు ఎవరు? ఇక్కడ ఎందుకు తిరుగుతున్నారు? మిమ్ములను చూస్తుంటే తేజోమూర్తిలా ఉన్నారు. మీరు అగ్నిదేవులా! సూర్యుడా! సోముడివా! ఇంద్రుడివా! లేక ఇతర లోకపాలకుడివా! కాదు వీరెవరూ కాదు. నీవు సాక్షాత్తు శ్రీమహావిష్ణువే. సందేహము లేదు. ఎందుకంటే నీవు రాగానే ఈ గుహ అంతా వెలుగులతో నిండి పోయింది.

ఓ దేవా! నేను ఇక్ష్వాకువంశీయుడను. యవనాశ్వుని మనుమడిని. మాంధాత కుమారుడను. నా పేరు ముచుకుందుడు. నేను దేవతలను రక్షించడానికి ఎన్నో నిద్రలేని రాత్రులు గడిపాను. బాగా అలసి పోయాను. అందుకని ఈ జనసంచారము లేని ఈ పర్వత గుహలో హాయిగా నిద్రపోతున్నాను. ఎవరో తెలియని వ్యక్తి వచ్చి నా నిద్రకు భంగం కలిగించాడు. నిద్రపోతున్న వాడిని హింసించడం మహాపాపం. వాడి పాపానికి వాడు భస్మం అయ్యాడు. (అందుకనే గాఢంగా నిద్రపోతున్న వాడిని కొట్టి తిట్టి నిద్రలేపడం పాపం అని పెద్దలు చెబుతుంటారు.) తరువాత తమరు నాకు కనపడ్డారు. మీ తేజస్సుముందు నేను నిలబడలేకున్నాను. ఇంతకూ మీరు ఎవరు? మీ పుట్టుక, గోత్రనామాలు తెలియజేయండి." అని అడిగాడు ముచుకుందుడు.

ముచుకుందుని మాటలకు కృష్ణుడు చిరునవ్వుతో ఇలా సమాధానం చెప్పాడు. "ఓ రాజా! నేను లెక్కలేనన్ని జన్మలు ఎత్తాను.

ఎన్నో పేర్లతో పిలువబడ్డాను. అందులో ఇది ఒకటి. ఈ జన్మలో నన్ను కృష్ణుడు అంటారు. ఈ భూమి మీద ఉన్న ధూళికణములను లెక్కపెట్టవచ్చుగానీ, నా జన్మలు ఎన్నో ఎవరూ లెక్కపెట్టలేరు. అది మహర్షులకు కూడా సాధ్యం కాదు. బ్రహ్మ భూలోకములో ధర్మమును రక్షించడానికి, దుర్మార్గులను శిక్షించడానికి, భూభారమును తగ్గించడానికి నన్ను భూలోకములో ఆవిర్భవించమని కోరాడు. బ్రహ్మ కోరిక మేరకు కృష్ణుడు అనే పేరుతో అవతరించాను. వసుదేవుని కుమారుడు కావడం వలన వాసుదేవుడు అని కూడా అంటారు. ఈ అవతారములో చాలామంది రాక్షసులను చంపాను. ఇప్పుడు వచ్చినవాడు కాలనేమి అనే యవనుడు. నీవు విష్ణుభక్తుడవు. నీవు నన్ను అత్యంత భక్తి శ్రద్ధలతో ప్రార్థించేవాడివి. ఆ కారణం చేత నిన్ను అనుగ్రహించడానికి ఇక్కడకు వచ్చాను.

ఓ రాజర్షీ! నీవు నా ఏకాగ్రభక్తుడవు. నీకు వరములు ప్రసాదించడానికి వచ్చాను. నీకు ఏ వరం కావాలో కోరుకో! అన్నీ ఇస్తాను. నన్ను వరాలు కోరిన వాడికి, కోరుకోడానికి ఇంక ఏ వరమూ మిగల కూడదు. అన్ని వరాలు కోరుకో!" అని అన్నాడు కృష్ణుడు.

మచుకుందుడు ఒళ్లు పులకరించింది. తన ముందు నిలబడింది సాక్షాత్తు శ్రీమన్నారాయణ మూర్తి అని తెలుసుకున్నాడు. శ్రీహరికి నమస్కరించి ఇలా స్తుతించాడు.

"ఓదేవా! ఈ లోకంలో ఉన్న స్త్రీలు పురుషులు నీ మాయ చేత మోహితులై నిన్ను సేవించడం మాని, ప్రాపంచిక సుఖములలో

మునిగితేలుతున్నారు. ఇల్లు, భార్య, భర్త, పిల్లలు, బంధువులు, స్నేహితులు, ధనము వీటినే ముఖ్యంగా భావిస్తూ సంసార సాగరంలో పడి కొట్టుకుపోతున్నారు.

ఓ దేవా! ఎన్నోపుణ్యకార్యములు చేస్తే కానీ ఈ మానవ దేహము లభించదు. దుర్లభమైన మానవ శరీరమును పొంది కూడా మానవుడు తనను తాను మరిచిపోతున్నాడు. నీ పాదములను సేవించడం లేదు. పశువుల వలె తినడం, కామసుఖములు అనుభవించడం, నిద్రపోవడం వీటితోనే కాలం గడుపుతున్నాడు. సంసారము అనే చీకటిగుహలో మగ్గిపోతున్నాడు.

ఓ దేవా! నేను కూడా అటువంటి వాడినే. నాకూ ఈ దేహము అంటే ఎంతో ప్రేమ. నాకూ భార్య పిల్లలు ఉన్నారు. నాకూ ధనమునందు, రాజ్యమునందు ఆసక్తి ఎక్కువగానే ఉంది. రాజభోగములు అనుభవించడం అనే మత్తులో పడిపోయాను. ఇప్పటి దాకా నేను నా జీవితమును వృధాగా గడిపాను. నేను రాజును, వీరందరూ నా సేవకులు అనే భ్రమలో ఉన్నాను. నా చతురంగ బలములతో వీర విహారం చేసాను. ఎంతో మందిని యుద్ధంలో ఓడించాను. నిన్ను మాత్రం ఒక్కరోజు కూడా తలంచలేదు. నేను సర్వాధికారిని అని అహంకరించాను. గర్వించాను.

ఓ దేవా! నేను కాదు ఈ లోకంలో ఉన్న మానవులు అందరూ ఇదే బాటలో నడుస్తున్నారు. ప్రతిరోజూ ఏదో ఒక పని చెయ్యడం. ఈ పని తరువాత మరొక పని, ఆ తరువాత మరొక పని. ఇలా

పనికిమాలిన పనులు చేస్తూ జీవితం వ్యర్థం చేసుకుంటున్నారు. మానవుడు ఒక స్త్రీతో సంతృప్తి చెందడం లేదు. కామ దాహంతో అనేకమంది స్త్రీలను అనుభవిస్తున్నాడు. అయినా మానవుడి కామవాంఛలు తీరడం లేదు. తీవ్రమైన అసంతృప్తితో అలమటిస్తున్నాడు.

ఇంతలో ఆకలితో ఉన్న పాము, ఎలుకను పట్టుకున్నట్టు కాలము మానవుని కబళిస్తుంది. మానవుడు మృత్యుముఖంలో పడిపోతాడు. ఈ శరీరం పడిపోతుంది. ఏ దేహంతో అయితే రాజభోగములు, కామసుఖములు అనుభవించాడో ఆ దేహము అగ్నిలో కాలి భస్మం అవుతుంది లేక మట్టిలో కలిసిపోయి క్రిములకు కీటకములకు ఆహారం అవుతుంది.

జీవితం అంతా నాలుగు దిక్కులను జయించడం, సామ్రాజ్యమును విస్తరించడం, యుద్ధాలలో మనుషులను చంపి, అందులో ఆనందం పొందడం, సాటి రాజుల మధ్య చక్రవర్తిలాగా సన్మానింపబడటం, అందరిచేతా జేజేలు కొట్టించుకోవడం, పొగిడించుకోవడం, దొరికిన స్త్రీలను అనుభవించడం, ధనం సంపాదించడం, సుఖాలు అనుభవించడం, జీవితం అంతా వీటితోనే గడిపి తుదకు మట్టిపాలవుతున్నావు మానవుడు. అంతటితో ఆగకుండా చచ్చిన తరువాత కూడా రంభాసంభోగము కోసరం, స్వర్గసుఖాల కోసం, యజ్ఞములు యాగములు చేయడం, తపస్సు చేయడం వీటిలో కాలమును వృధా చేస్తున్నాడు.

ఇటువంటి మానవుడికి సంసార బంధనములు ఎప్పుడు తొలగిపోతాయో అప్పుడే వాడికి సత్సాంగత్యము కలుగుతుంది. సాధువులతో సాంగత్యం ఏర్పడుతుంది. సాధువులతోటి సాంగత్యము ఫలితంగా పరాత్పరుడవైన నీ మీద భక్తి శ్రద్ధ కలుగుతాయి. తుదకు ముక్తి పొందుతాడు.

సాధారణంగా రాజులు వానప్రస్థమునకు పోయి తపస్సు చేసుకుంటుంటారు. లేక గృహములోనే ఉండి నిన్ను ధ్యానిస్తూ, ఈ సంసార బంధనములు తొలగిపోవాలని నిన్ను ప్రార్థిస్తుంటారు. కాని నాకు మాత్రము నా రాజ్య కాంక్ష, సంసారము మీద మమకారము వాటంతట అవే పటాపంచలయ్యాయి. నాకు సంప్రాప్తించిన ఈ వైరాగ్యము నీ అనుగ్రహము వలననే అని తలుస్తాను.

ఓ దేవా! నీవు నన్ను వరములు కోరుకోమన్నావు. నాకు ఏవరములూ వద్దు. నిరంతర నీ పాదసేవను నాకు అనుగ్రహించు. ఏ కోరికలూ లేని వారు నీ పాదసేవ తప్ప మరేమీ కోరుకోరు కదా! సాక్షాత్తు పరమాత్మ సాక్షాత్కరించినపుడు ముక్తిని కోరుకోకుండా, బంధనములకు కారణమైన ప్రాపంచిక సుఖములను ఎవడుకోరుకుంటాడు తెలివితక్కువ వాడు తప్ప. కాబట్టి ఓ దేవా! నేను సంపూర్ణముగా సత్వ, రజస్తమో గుణములను వదిలిపెట్టాను. కోరికలను వదిలిపెట్టాను. నిరాకారుడవు, నిర్గుణుడవు అయిన నిన్ను శరణుజొచ్చాను.

ఓ దేవా! నేను ఇప్పటి దాకా ఎన్నో కర్మలు చేసాను. వాటి ఫలములను అనుభవించాను. సుఖదు:ఖములకు లోనయ్యాను. ఇంద్రియ సుఖములకు లోబడి తీవ్రమైన అశాంతికి లోనయ్యాను. నేడు నీ అనుగ్రహము చేత నీ పాదపద్మములను ఆశ్రయించాను. నన్ను రక్షించు. నాకు ముక్తిని ప్రసాదించు." అని శ్రీకృష్ణుని శరణు వేడాడు ముచుకుందుడు.

ముచుకుందుని మాటలు విన్న శ్రీకృష్ణుడు అతనితో ఇలా అన్నాడు. "ఓ సార్వభౌమా! నీ మనసు, బుద్ధి ఇప్పుడు నిర్మలంగా ఉంది. నీలో ఏ కోరికలూ లేవు. నేను నీకు ఎన్నో వరములు ఇస్తానని ఆశపెట్టినా, ప్రలోభ పెట్టినా, నీవు లొంగలేదు. కాబట్టి నీకు ఈ ప్రాపంచిక విషయముల వలన ఎలాంటి భయము లేదు. నీ వంటి ఏకాగ్రత కలిగిన భక్తులకు ప్రాపంచిక సుఖముల వలనా, విషయ సుఖముల వలనా ఎలాంటి హానీ జరగదు. ఎందుకంటే మీకు వాటి మీద ఎటువంటి ఆసక్తి లేదు కాబట్టి.

ఈ లోకంలో చాలా మంది యోగులు, జ్ఞానులు ఉంటారు. వారు ప్రాణాయామము మొదలగు యోగములు అవలంబించినా, వారిలో ఉన్న కోరికలు, వాసనలు చావవు. వారు ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి కలిగి ఉంటారు. విషయ వాంఛల మీదకు వారి మనసు మళ్లుతూ ఉంటుంది.
(ఈ నాటి స్వామీజీలు, సన్యాసులు అని చెప్పుకునే వాళ్లు, సన్యాసం పుచ్చుకొని కాషాయ వస్త్రములు కట్టి, ప్రాణాయామం మొదలగు యోగాభ్యాసాలు చేసి, సిద్ధగురువుల మని చెప్పుకుంటూ ధార్మిక

ఉపన్యాసాలు ఇస్తున్నా, లోపల మాత్రం ఆస్తుల మీదా, బంగారము, ధనము మీద, కార్లు మొదలగు వాహనముల మీదా వ్యామోహం చావడం లేదు. కొంతమందికి స్త్రీవ్యామోహం కూడా ఎక్కువగానే ఉంది. మరి కొంత మంది రాజకీయనాయకులతో సంపర్కం పెట్టుకుంటున్నారు. టీవీలలో ప్రచారం చేసుకుంటున్నారు. ఈ విషయాలన్నీ కృష్ణుడు ఆ నాడే ఊహించాడు.).

ఓ ముచుకుందా! నీవు నా మీద మనసు లగ్నం చేసి స్వేచ్ఛగా ఈ లోకంలో సంచరించు. అందరికీ జ్ఞానబోధ చెయ్యి. నా మీద నీకు ఉన్న భక్తి కారణంగా ఈ ప్రాపంచిక విషయములు, విషయ వాంఛలు నిన్ను అంటవు. నీవు ఇదివరకు చక్రవర్తిగా ఉండగా ఎన్నో యుద్ధాలు చేసావు. ఎంతో మందిని చంపావు. వేట మిషతో ఎన్నో మృగములను చంపావు. ఇప్పుడు నా గురించి తపస్సు చేసి ఆ పాపములను పోగొట్టుకో. తరువాత జన్మలో బ్రాహ్మణుడవై పుట్టి అనేక పుణ్యకార్యములు చేసి చివరకు ముక్తి పొందు." అని ముచుకుందుని అనుగ్రహించాడు కృష్ణుడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ముచుకుందుని వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము యాభై ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# దశమస్కంధము

# యాభై రెండవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడికి, రుక్మిణికి జరిగిన కల్యాణానికి దారి తీసిన పరిస్థితులను వివరిస్తున్నాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుని అనుగ్రహానికి పాత్రుడయిన ముచుకుందుడు కృష్ణుడి చుట్టు ప్రదక్షిణం చేసి, నమస్కరించి ఆ గుహలో నుండి బయటకు వచ్చాడు. ఉత్తరదిక్కుగా గంధమాధన పర్వతము వద్దకు వెళ్లిపోయాడు. బదరికాశ్రమం చేరుకున్నాడు. అక్కడ శ్రీహరిని గూర్చి తపస్సుచేస్తున్నాడు.

ముచుకుందుని కంటిచూపుతో కాలయవనుడు మరణించగానే, శ్రీకృష్ణుడు మధురకు తిరిగి వచ్చాడు. కాలయవనుని సైన్యాన్ని సునాయాసంగా సంహరించాడు. కాలయవనుని నుండి స్వాధీనం చేసుకున్న సంపదలను, మధురలో ఉన్న గోవులను ద్వారకకు తీసుకొని వెళుతుండగా, జరాసంధుడు తన సైన్యముతో వచ్చి శ్రీకృష్ణుని అడ్డగించాడు.  జరాసంధుని అపారసేనావాహినిని చూచి, శ్రీకృష్ణుడు, బలరాముడు మానవ సహజమైన పిరికితనంతో జరాసంధుని ఏమార్చి పారిపోయారు.

జరాసంధుడు తన సైన్యముతో సహా వారిని తరుముతున్నాడు. బలరామ కృష్ణులు పరుగెత్తి పరుగెత్తి అలసి పోయి

ప్రవర్షణ అనే పర్వతము మీదకు ఎక్కారు. ఆ పర్వతము మీద వర్షపాతము ఎక్కువగా ఉంటుంది. జరాసంధుడు పర్వతము అంతా గాలించాడు కానీ బలరామ కృష్ణుల జాడ తెలుసుకోలేకపోయాడు. విసిగి పోయిన జరాసంధుడు ఆ పర్వతము చుట్టు మంటపెట్టించాడు. మంటలు ఒక పక్క చెలరేగుతుంటే, బలరామ కృష్ణులు ఆ మంటల మధ్యనుండి బయటకు వచ్చి వేగంగా ద్వారకకు చేరుకున్నారు. ఈ విషయం తెలియని జరాసంధుడు బలరాముడు, కృష్ణుడు మంటలలో పడి మాడిమసి అయి పోయి ఉంటారని భ్రమచెంది, అక్కడి నుండి తన సేనలతో మగధకు చేరుకున్నాడు. బలరామ కృష్ణులు ద్వారకలోనూ, జరాసంధుడు మగధలోనూ సుఖంగా ఉన్నారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇదివరలో నీకు ఆనర్తదేశాధి పతి అయిన రైవతుడు అనే మహారాజు తన కుమార్తె రేవతిని బ్రహ్మదేవుని ఆదేశము అనుసరించి బలరామునికి ఇచ్చి వివాహం చేసాడని చెప్పాను కదా! ఆ తరువాత శ్రీకృష్ణుడు శిశుపాలుని, సాల్వుని మొదలగు రాజులను జయించి భీష్మకుని కుమార్తె అయిన రుక్మిణిని వివాహం చేసుకున్నాడు." అని శుక మహర్షి చెప్పగానే పరీక్షిత్ మహారాజు అడ్డు తగిలాడు.

"ఓ మహర్షి సత్తమా! శ్రీకృష్ణుడు భీష్మకుని కుమార్తె రుక్మిణిని రాక్షస విధిలో వివాహం చేసుకున్నాడని ఇదివరలో విన్నాను. ఈ వివాహ సందర్భంలో సాళ్వుడికి, శిశుపాలుడికి కృష్ణుడికి ఎందుకు యుద్ధం జరిగింది. రుక్మిణిని కృష్ణుడు రాక్షస విధిలో వివాహం ఎందుకు చేసుకోవాల్సి వచ్చింది. ఈ వివరాలు దయచేసి చెప్పండి." అని అడిగాడు.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ఈ విధంగా వివరించాడు.

(ఒక మనవి. ఈ అధ్యాయం నుండి రుక్మిణీ కల్యాణం ప్రారంభం అవుతుంది. ఈ రుక్మిణీ కల్యాణం ఘట్టం చదివితే పెళ్లికాని అమ్మాయిలకు త్వరగా వివాహం అవుతుందనీ, గుణవంతుడు, బుద్ధిమంతుడు అయిన భర్త దొరుకుతాడనీ నమ్మకం. ఎన్ని సంబంధాలు చూచినా, ఓ పట్టాన వివాహం కుదరని వాళ్లు రుక్మిణీకల్యాణం పారాయణం చేస్తుంటారు. ఇంక చదవండి రుక్మిణీ కల్యాణం.)

ఓ పరీక్షిత్ మహారాజా! విదర్భదేశమును భీష్మకుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతనికి ఐదుగురు కుమారులు ఒక కుమార్తె. వారిలో రుక్మి అనే వాడు పెద్దవాడు. తరువాత రుక్మరథుడు, రుక్మబాహువు, రుక్మకేశుడు, రుక్మమాలి అనే వారు ఉన్నారు. ఆ ఐదుగురికి ఒకే చెల్లి ఆమె పేరు రుక్మిణి. రూపములో నూ గుణములోనూ రుక్మిణికి ఎవరూ సాటి రారు.

రుక్మిణి తన తండ్రి వద్దకు వచ్చే వారి దగ్గర నుండి శ్రీకృష్ణుని గుణగణములు, ఆయన శౌర్య పరాక్రమములు గురించి ఆయన మీద ప్రేమ పెంచుకుంది. పెళ్లి అంటూ చేసుకుంటే శ్రీకృష్ణుని మాత్రమే పెళ్లి చేసుకోవాలి అని నిశ్చయించుకుంది. ద్వారకలో ఉన్న శ్రీకృష్ణుడుకూడా అన్న గారికి వివాహం అయింది కాబట్టి తను కూడా వివాహం చేసుకోదలిచాడు. తగిన వధువు కొరకు వెదుకుతుంటే రుక్మిణి గురించి ఆమె గుణగణముల గురించి విన్నాడు. రుక్మిణి యొక్క

మంచి బుద్ధి, మంచి లక్షణములు, ఉదార స్వభావము, మంచి రూపము, మృదువైన స్వభావము, సుకుమారత్వము మొదలగు మంచి లక్షణముల గురించి విని రుక్మిణినే వివాహం చేసుకోవాలని అనుకున్నాడు.

కాని రుక్మిణి అన్నగారు అయిన రుక్మి తన చెల్లి రుక్మిణిని తన స్నేహితుడు, చేది దేశపు రాజు అయిన శిశుపాలునికి ఇచ్చి వివాహం చేయాలని నిశ్చయించాడు. రుక్మి తన నిర్ణయాన్ని తన చెల్లి రుక్మిణికి తెలిపాడు. ఆ వార్త విన్న రుక్మిణి హతాశురాలయింది. తీవ్రమైన దు:ఖంతో కుమిలిపోయింది. కాని ధైర్యం చేసింది. తనకు నమ్మకస్థుడైన ఒక బ్రాహ్మణుని పిలిపించింది. తనకు కృష్ణుని మీద ఉన్న ప్రేమ, ఆయననే వివాహం చేసుకోవాలనే కోరిక, ఎలాగైనా తన వివాహం నాటికి కృష్ణుని విదర్భకు రమ్మని ఆహ్వానము, తనను వివాహం చేసుకొని తీసుకొని వెళ్లమని అభ్యర్థన ఇవన్నీ ఒక లేఖ రాసి, దానిని కృష్ణునికి ఇవ్వమని, తన గురించి కృష్ణునికి విన్నవించమని ఆ బ్రాహ్మణునికి చెప్పి ద్వారకకు ప్రయాణం చేసి పంపింది.

ఆ బ్రాహ్మణుడు ద్వారకకు చేరుకున్నాడు. ద్వారపాలకులు ఆ బ్రాహ్మణుని శ్రీకృష్ణుని వద్దకు తీసుకొని వెళ్లారు. సాక్షాత్తు విష్ణుస్వరూపుడైన శ్రీకృష్ణుని కనులారా చూచాడు ఆ బ్రాహ్మణుడు. ఆ బ్రాహ్మణుని చూడగానే శ్రీకృష్ణుడు తన ఆసనము నుండి లేచి ఆయన వద్దకు వచ్చి ఆయనకు అర్ఘ్యము పాద్యము ఆసనము ఇచ్చి సత్కరించాడు. ఆయన పక్కన కూర్చుని ఆయన పాదములు వత్తుతూ ఆయనతో ఇలా అన్నాడు.

"ఓ బ్రాహ్మణోత్తమా! మీరు మీ వారు క్షేమమే కదా! మీరు ప్రాచీనమైన వైదిక ధర్మమును చక్కగా అనుష్ఠిస్తున్నారు కదా! మీ వేదాధ్యయనమునకు ఎటువంటి ఆటంకము లేదు కదా! బ్రాహ్మణులు తమకు దొరికిన దానితో తృప్తి చెందుతూ, స్వధర్మమును పాటిస్తున్నంతవరకూ, వారు నమ్ముకున్న ధర్మమే వారిని కాపాడుతుంది. అన్ని కోరికలు తీరుస్తుంది. అంతేకానీ, తనకు దొరికిన దానితో తృప్తి చెందని బ్రాహ్మణుడికి ఇంద్ర పదవి ఇచ్చినా, ఇంకా ఏదో కావాలని ఒక లోకము నుండి మరొక లోకమునకు తిరుగుతుంటాడు. ఉన్నదానితో తృప్తి చెందే బ్రాహ్మణుడు, కటిక దరిద్రుడైనా, ఏ దు:ఖము లేకుండా సుఖము, శాంతి అనుభవిస్తుంటాడు.

తనకు దొరికిన దానితో తృప్తిపడేవారు, స్వధర్మాన్ని పాటించే వారు, ఇతరుల మేలు కోరేవారు, అహంకారము లేని వారు, ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉండేవారు అయిన బ్రాహ్మణులకు నేను ఎల్లప్పుడూ నా తలవంచి నమస్కరిస్తాను. ఓ బ్రాహ్మణోత్తమా! మీరు ఏ దేశము నుండి వచ్చారు? మీ రాజుగారు సుఖంగా ఉన్నారా? ధర్మాన్ని పరిరక్షిస్తున్నాడా! ఏ రాజుయొక్క రాజ్యములో ప్రజలు సుఖసంతోషాలతో వర్ధిల్లుతుంటారో, అటువంటి రాజులు అంటే నాకు చాలా ఇష్టం. ఇంతకూ తమరు ఎక్కడి నుండి, ఏ పని మీద, ఏ కోరికతో సముద్రం దాటి నా వద్దకు వచ్చారు. ఆ విషయం నాకు చెప్పదగినది అయితే నాకు తెలియజేయండి." అని వినయంతో అడిగాడు కృష్ణుడు.

కృష్ణుడు అంత వినయంతో అడుగుతుంటే ఆ బ్రాహ్మణుడికి ఒళ్లంతా పులకరించి పోయింది. నోట మాట రాలేదు. మనసంతా

ఆనందంతో నిండి పోయింది. వణుకుతున్న చేతులతో తనకు రుక్మిణి ఇచ్చిన లేఖను తీసి కృష్ణుడికి ఇలా చదివి వినిపిస్తున్నాడు.

"ఓ భువన సుందరా! నేను మా తండ్రి గారి వద్దకు వచ్చిన వ్యక్తులద్వారా, వారి సంభాషణల ద్వారా, నీ సౌందర్యమును గురించి, నీ గుణగణముల గురించి, నీ వీరత్వము, పరాక్రమము గురించి విని, నా మనస్సు నీ యందు లగ్నం అయింది. అందుకే సిగ్గువిడిచి ఈ లేఖ రాస్తున్నాను.

ఇదేమిటి! ముక్కు మొహం ఎరుగని కన్య పర పురుషునికి ఇలా లేఖ రాయడం ఏమిటి అని నీవు అన్యథా భావించవలదు. మంచి వంశములో పుట్టిన కన్య, ఉదార గుణము కల కన్య, వివాహమునకు తగిన వయసు వచ్చిన కన్య, ధైర్యము కల కన్య, రూపము, వయస్సు, విద్య, ధనము కల నిన్ను వరించకుండా ఎలా ఉండగలదు. ఆ కారణం చేతనే నేను తమరిని వరించాను. పతిగా చేసుకోదలిచాను. ఆత్మార్పణం చేసుకున్నాను.

నన్ను చేదిదేశాది పతి శిశుపాలునికి ఇచ్చి వివాహం చేయడానికి నా అన్నగారు సంకల్పించారు. కాబట్టి తమరు వెంటనే వచ్చి నన్ను తీసుకొని వెళ్లమని ప్రార్థిస్తున్నాను. నీ కోసమే పుట్టిన నన్ను, నిన్నే పతిగా కోరుకున్న నన్ను, ఆ శిశుపాలుడు తాకక ముందే, నన్ను తీసుకొని వెళ్లు.

ఉ॥ శ్రీయుతమూర్తి యోపురుషసింహము సింహముపాలి సొమ్ము గో
మాయువు గోరు చందమున మత్తుడు చైద్యుడు నీ పదాంబుజ
ధ్యాయినియైన నన్ను వడి దాగోనిపోయెద నంచు నున్నవా
డాయధమాధముం డెఱుగ డద్భుతమైన భవత్ప్రతాపమున్

ఓ దేవా! నేనే కనుక నా పూర్వ జన్మలలో బావులు తవ్వించి ఉంటే, అగ్నిహోత్రము మొదలగు పుణ్య కర్మలు ఆచరించి ఉంటే, గోదానములు, సువర్ణదానములు చేసి ఉంటే, తీర్థయాత్రలు చేసి ఉంటే, వ్రతములు ఆచరించి ఉంటే, దేవతలను, బ్రాహ్మణులను పూజించి ఉంటే, ఇంతెందుకు నేను కనుక నా పూర్వజన్మలలో శ్రీహరిని భక్తితో అర్చించి ఉంటే, నన్ను శ్రీకృష్ణుడు పాణిగ్రహణం చేసుకొనుగాక! శిశుపాలుడు నా చేతిని తాకకుండు గాక!

ఓ కృష్ణా!

ఉ॥ అంకిలి సెప్పలేదు చతురంగ బలంబులతోడ నెల్లి యో
పంకజనాభ నీవు శిశుపాలజరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షస వివాహమునన్ భవదీయ శౌర్యమే
యుంకువ సేసి కృష్ణ పురుషోత్తమ చేకొని పొమ్ము వచ్చెదన్.

కృష్ణా! పురుషోత్తమా! రేపే నా వివాహము. నీవు ఎవరికీ తెలియకుండా విదర్భకు వచ్చి శిశుపాలుని, జరాసంధుని వారి సేనలను జయించి, నీ వీర్యము, ప్రతాపమే నాకు కట్నంగా ఇచ్చి, రాక్షస విధిలో నన్ను వివాహం చేసుకొని నీ వెంట తీసుకొనిపొమ్మని ప్రార్థిస్తున్నాను. నా వారందరినీ విడిచిపెట్టి నీవెంట రావడానికి నేను సిద్ధంగా ఉ న్నాను.

ఓ కృష్ణా! ఈ సందర్భంలో నీకు ఒక సందేహము రావచ్చు. నన్ను తీసుకుపోతుంటే నా అన్నగారు నీకు ఎదురు తిరగవచ్చు. నీతో యుద్ధం చేయవచ్చు. నావారికి హాని చేయకుండా నన్ను తీసుకొని వెళ్లడం ఎలాగా అని నీకు సందేహము రావచ్చు. దానికి ఒక ఉపాయము చెబుతాను.

వివాహానికి ముందు రోజు పెళ్లికూతురు, బంధుమిత్రులలో, ఊరి వెలుపల ఉన్న అమ్మవారి ఆలయమునకు పోయి అక్కడ పూజలు చేయడం ఆనవాయితీ. ఈ సందర్భంలో నేను మా ఊరి వెలుపల ఉన్న పార్వతీ దేవి ఆలయమునకు వస్తాను. ఆ సమయంలో నీవు అక్కడకు వస్తే నేను నీ రథం ఎక్కుతాను. మనం వెళ్లిపోదాము.

కృష్ణా! ఎంతో మంది సాధుపుంగవులు, తపోధనులు నీ పాదములను కడిగి ముక్తి పొందుతుంటారు. నాకు కూడా నీ పాదములు కడిగి ఆ పవిత్రజలములను శిరస్సున ధరించే అదృష్టాన్ని ప్రసాదించు. లేనిచో, నేను అసలు పెళ్లే చేసుకోను. ఉపవాసములతో ఆహారము, నీరు తీసుకోకుండా ఉపవాసములు చేసి ప్రాణత్యాగము చేస్తాను."

ఓ యదుకుల నందనా! ఇవి రుక్మిణి యొక్క లేఖలోని అంశములు. మరొక్క మాట.

ఉ॥ ఆ ఎలనాగ నీకు దగు, నంగనకుం దగుదీవు, మాయుపా
ధ్యాయుల యాన పెండ్లియగు, దప్పదు, జాప్యములేల? నీవు నీ
తోయమువారి గూడుకొని తోయరుహాసన దెత్తుగాన వి
చ్ఛేయుము శత్రులన్ నుఱుముసేయుము, సేయుము శోభనం బిలన్.

శ్రీకృష్ణా! మా పండితుల మీద ఒట్టు. నీకు రుక్మిణికి ఈడూజోడు, ఒకరి కోసరం ఒకరు పుట్టారు. మీ వివాహం తప్పక జరిగితీరుతుంది. ఇంకా ఆలస్యం ఎందుకు? రుక్మిణిని తీసుకొని రావడానికి  వెంటనే నీ చతురంగ బలములతో బయలుదేరు? అడ్డం వచ్చిన శత్రువులను సంహరించు. రుక్మిణి పాణిగ్రహణం చెయ్యి. లోకానికి శుభం చేకూర్చు." అని అన్నాడు ఆ బ్రాహ్మణుడు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు రుక్మిణీకళ్యాణఘట్టం వినిపిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము యాభైరెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
యాభైమూడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! విదర్భనగరం నుండి రుక్మిణి పంపిన లేఖను తీసుకొని వచ్చి తనకు చదివి వినిపించిన లేఖాంశములను, తనకు రుక్మిణికి ఈడూ జోడూ సరిపోయింది వెంటనే బయలుదేరండి అని పలికిన ఆ బ్రాహ్మణుని పలుకులను సావధానంగా విన్నాడు కృష్ణుడు. ఆప్యాయంగా ఆ బ్రాహ్మణుని చేతులను నిమురుతూ ఇలా అన్నాడు కృష్ణుడు.

"బ్రాహ్మణోత్తమా! మీ రాకుమార్తె చిత్తము నా యందు లగ్నం కావడమే కాదు, నా మనసు కూడా మీ రాకుమారి యందు ఎప్పుడో లగ్నం అయింది. మీ రాకుమారి గురించి ఆలోచిస్తూ నాకూ రాత్రిళ్లు నిద్రపట్టడం లేదు. మీ రాకుమారిని, ఆమె అన్నగారు రుక్మి, తనమిత్రుడు శిశుపాలునికి ఇచ్చి వివాహం చేయ నిశ్చయించాడు అని కూడా నాకు తెలుసు. నేను వెంటనే విదర్భకు వచ్చి, శిశుపాలుడు మొదలగు రాజులను ఓడించి, నా మీద మనసుపడ్డ మీ రాకుమారిని పరిణయం చేసుకుంటాను.

కం॥ వచ్చెద విదర్భభూమికి జొచ్చెద భీష్మకుని పురము సురుచిరలీలన్
దెచ్చెద బాలన్ వేల్మిడి వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చిన బోరన్.
అని ప్రతిజ్ఞచేసాడు కృష్ణుడు.

వెంటనే తన సారథి దారుకుడిని పిలిచాడు. రథం సిద్ధం చేయమన్నాడు. శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పము, బలాహకము అనే నాలుగు గుర్రాలు కట్టిన రథాన్ని సిద్ధం చేసాడు దారుకుడు. శ్రీకృష్ణుడు బ్రాహ్మణునితో సహా ఆ రథం ఎక్కాడు. విదర్భకు బయలుదేరాడు.

ఇంక విదర్భదేశంలోని కుండిన నగరంలో భీష్మకుడు, తన కుమారుడు రుక్మి మాటకు ఎదురు చెప్పలేక, తన కుమార్తె రుక్మిణికి వివాహ సన్నాహాలు చేస్తున్నాడు. నగరం అంతా శోభాయమానంగా అలంకరించారు. నగరంలో వీధులు అన్ని శుభ్రంగా చిమ్మారు. పన్నీరు చల్లారు. నగరం అంతా రకరకాల పతాకములతో అలంకరించారు. రుక్మిణి పెళ్లి తమ ఇంట్లో శుభకార్యంగా భావించిన కుండిన నగర

వాసులు తాము కూడా కొత్త బట్టలు కట్టుకొని వివాహ వేడుకలలో పాలుపంచుకుంటున్నారు.

భీష్మకుడు శుభకార్యమునకు ముందు పితృదేవతలను అర్చించాడు. దేవతలను అర్చించాడు. బ్రాహ్మణులకు దానములు చేసాడు. వారికి భోజనములు పెట్టించాడు. బ్రాహ్మణులు రుక్మిణిని సుమంగళిగా ఆశీర్వదించారు. రుక్మిణి చేత నూతన వస్త్రములు ధరింపచేసారు. ఆభరణములతో చక్కగా అలంకరించారు.

బ్రాహ్మణులు నాలుగు వేదములను అనుసరించి వధువుకు మంగళాచరణం చేసారు.  హెూమములు, గ్రహశాంతులు చేస్తున్నారు. ఆ కార్యములు చేసిన బ్రాహ్మణులకు భీష్మకుడు గోవులను, ధనమును, బంగారమును కానుకలుగా ఇచ్చాడు. బెల్లంతో కూడిన నువ్వులను, వస్త్రములను దానం చేసాడు.

ఇంక పెళ్లికొడుకు అయిన శిశుపాలుడు ఉన్న చేదిదేశంలో కూడా శిశుపాలుని తండ్రి దమఘోషుడు పెళ్లి సన్నాహాలు చేస్తున్నాడు. బ్రాహ్మణుల చేత తన కుమారుడు శిశుపాలునికి శుభకర్మలను చేయించాడు. హెూమములు, దేవతార్చనలు, పితృదేవతల పూజలు చేయించాడు. తరువాత ఏనుగులతోనూ గుర్రములతోనూ, రథములతోనూ కూడిన అపార మైన సైన్యముతో, శిశుపాలుడు రుక్మిణిని వివాహం చేసుకొనే నిమిత్తము కుండిన నగరమునకు తరలి వెళ్లాడు.

కుండిన నగర పొలిమేరల వద్దకు రాగానే, భీష్మకుడు పెళ్లికుమారుడు శిశిపాలునికి, దమఘోషునికి స్వాగత సత్కారాలు చేసాడు. సాదరంగా ఆహ్వానించాడు. వారికి తగిన విడిది ఏర్పాటు చేసాడు. శిశుపాలుని మిత్రులైన సాళ్వుడు, జరాసంధుడు, దంతవక్త్రుడు, విదూరథుడు, పౌండ్రకుడు మొదలగు రాజులు, చక్రవర్తులు తమ తమ సేనలతో, రథముల మీద వివాహమునకు వచ్చారు. భీష్మకుడు వివాహమునకు వచ్చిన వారందరికీ స్వాగత సత్కారములు చేసి, తగిన విడుదులు చూపించాడు.

శిశుపాలునికి, కృష్ణునికి జన్మవైరము ఉంది. అందుకని కృష్ణుడు బలరామునితో సహా తన సేనలతో వచ్చి తన పెళ్లి చెడగొడతాడేమో అని భయపడ్డ శిశుపాలుడు, తన మిత్రబృందమును దేనికైనా సిద్ధంగా ఉండమని చెప్పాడు. సాళ్వుడు,జరాసంధుడు మొదలగు వారు తమ తమ సేనలతో ఏ పరిస్థితి నైనా ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నారు. పైకి మాత్రం పెళ్లిసంబరాలు ఘనంగా జరుగు తున్నాయి. లోలోపల యుద్ధసన్నాహాలు కూడా జరుగుతున్నాయి.

బ్రాహ్మణుడు వచ్చి రుక్మిణి గురించి చెప్పి, ఆమె రాసిన లేఖను ఇవ్వగానే కృష్ణుడు వెంటనే తన రథంమీద కుండినకు బయలు దేరాడని తెలుసుకున్నాడు బలరాముడు.

“కృష్ణుడు రుక్మిణిని బలవంతంగా ఎత్తుకురావడానికి ఒంటరిగా వెళ్లాడు. రుక్మిణిని కృష్ణుడు తీసుకొని వస్తుంటే రుక్మి, శిశు పాలుడు అతని మిత్రులు ఊరుకోరు కదా! ఖచ్చితంగా అక్కడ

గొడవలు జరుగుతాయి. యుద్ధంకూడా జరిగే అవకాశం ఉంది." అని భయపడిన బలరాముడు తన సేనలతో కుండిన నగరం బయలు దేరాడు.

వీళ్ల వ్యూహాలు, ప్రతివ్యూహాలు, పెళ్లి సందడి ఇలా ఉంటే, అంత:పురంలో ఉన్న రుక్మిణికి మనసంతా అల్లకల్లోలంగా ఉంది. తాను పంపిన బ్రాహ్మణుడు ఇంకా రాలేదు. ఏమయ్యాడో ఏమో! పెళ్లికి ఇంక ఒక్కరోజే మిగిలింది. శ్రీకృష్ణుడు  వచ్చిన జాడలు కనిపించడం లేదు. ఆ బ్రాహ్మణుడు కూడా తిరిగి వచ్చినట్లు లేదు. కారణం తెలియడం లేదు.

శా॥లగ్నంబెల్లి వివాహంబు గదిసె నేలా రాడు గోవిందు? డు
ద్విగ్నం బయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్; బ్రాహ్మణుం
డగ్నిద్యోతను డేటికిం దడసె? నా యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో! విరించికృత మెబ్బంగిన్ బ్రవర్తించునో?

పెళ్లి ముహూర్తం రేపే! కృష్ణుడు ఇంకా రాలేదు. మనసంతా అల్లకల్లోలంగా ఉంది. ఏమీ తోచడం లేదు. ఇంతకూ నా గురించి కృష్ణుడు అంతా విన్నాడా! ఇంతకూ నేను పంపిన బ్రాహ్మణుడు అగ్నిద్యోతనుడు కూడా రాలేదే! ఏమయ్యాడు? నేను చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయా! బెడిసి కొడతాయా! నా మొహాన ఆ బ్రహ్మదేవుడు ఎవరితో రాసిపెట్టాడో ఏమో!

మ॥ ఘనుడా భూసురుడేగెనో? నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండిది తప్పుగా దలచెనో! విచ్చేసెనో? యీశ్వరుం
డనుకూలింప దలంచునో తలపడో? యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుగదో? నా భాగ్యమెట్లున్నదో?

ఇంతకూ ఈ బ్రాహ్మణుడు ద్వారకకు వెళ్లి ఉంటాడా! లేక నడవ లేక దారి మధ్యలో ఆగిపోయాడా! పోనీ ఎలాగో ఒక లాగా ద్వారకకు వెళ్లి నా సందేశాన్ని వినిపిస్తే, కృష్ణుడు "ఇదేమిటి! పెళ్లి కావలసిన ఆడపిల్ల ఇలా పరపురుషుడికి లేఖ రాయడం తప్పుకాదా!" అని అనుకున్నాడేమో! లేక నా మొర విని కుండినకు వచ్చి అవకాశం కోసరం ఎదురు చూస్తున్నాడేమో! నా ప్రయత్నాలు నేను చేసాను. మరి దేవుడు కూడా నాకు అనుకూలించాలి కదా! అనుకూలిస్తాడో లేదో! నేను పుట్టినప్పటి నుండి పూజించే ఆ పార్వతీదేవి నన్ను కరుణిస్తుందా! నేను ఇలాంటి ఆపదలో చిక్కుకున్నానని ఆ దేవికి తెలుసో తెలియదో! ఇంతకూ నా భాగ్యం ఎలా ఉందో! ఏమిటో!" అని రుక్మిణి పరి పరి విధాల ఆలోచిస్తూ ఉంది.

ఆమె ఆలోచనలు ఎంతకూ ఒక కొలిక్కిరావడం లేదు. అయినా ఇంకా సమయం మించి పోలేదు. ఏ క్షణానైనా కృష్ణుడు రావచ్చు తనను కాపాడవచ్చు అని ధైర్యంగా ఉంది. కళ్లుమూసుకొని కృష్ణుని మనసులో నిలుపుకుంది. ఇంతలో ఆమె ఎడమకన్ను అదిరింది. అది శుభసూచకంగా భావించిన రుక్మిణి మనసంతా ఆనందంతో నిండి పోయింది.

ఇక్కడ ఇలా ఉంటే కృష్ణుడు, అగ్నిద్యోతనుడు అనే బ్రాహ్మణుడు కుండిన నగరం చేరుకున్నారు. తాను వచ్చిన సంగతి చెప్పమని బ్రాహ్మణుని రుక్మిణి వద్దకు పంపించాడు కృష్ణుడు. ఆ బ్రాహ్మణుడు కూడా వెంటనే రుక్మిణి ఉన్న అంతఃపురమునకు వెళ్లాడు. బ్రాహ్మణుని చూడగానే రుక్మిణి ఆతురతగా ఆయన వద్దకు వచ్చింది. వెళ్లినపని ఏమయిందని కళ్లతోనే అడిగింది.

ఉ॥మెచ్చె భవద్గుణోన్నతి, కమేయ ధనావళు లిచ్చె నాకు దా
వచ్చె సుదర్శనాయుధుడు వాడె, సురాసురులెల్ల నడ్డమై
వచ్చిన నైన రాక్షస వివాహమునం గొనిపోవు నిన్ను, నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేడు ఫలించె గన్యకా!

అమ్మా రుక్మిణీ! నీవు చేసిన పూజలు, వ్రతాలు, నీ సద్గుణములు అన్ని ఫలించాయమ్మా! నీ అదృష్టం పండిందమ్మా! ఉన్నతమైన నీ గుణగణములను కృష్ణుడు మెచ్చుకున్నాడమ్మా! ఈ వార్త తెచ్చినందుకు నాకు అంతులేని ధనము బహుమానంగా ఇచ్చాడమ్మా! కృష్ణుడు నా వెంటనే ఇక్కడకు వచ్చాడమ్మా! తాను వచ్చిన విషయం నీకు చెప్పమని నన్ను పంపాడమ్మా! దేవతలు, రాక్షసులు అందరూ ఏకమై వచ్చినా సరే వారిని ఓడించి నిన్ను రాక్షస వివాహ విధిలో తీసుకొని వెళ్లాను అని చెప్పాడమ్మా! నీవు అదృష్టవంతురాలివి తల్లీ! అని ఆశీర్వదించాడు ఆ బ్రాహ్మణుడు.

తన మనవిని విని కృష్ణుడు తన కోసం వచ్చాడు అని వీనుల విందుగా విన్న రుక్మిణి మనసంతా ఆనందంతో పరవళ్లు తొక్కింది.

మ॥ జలజాతేక్షణు దోడి తెచ్చితివి నా సందేశమున్ జెప్పి, నన్
నిలువం బెట్టితి, నీ కృపన్ బ్రదికితిన్, నీ యంత పుణ్యాత్మకుల్
గలరే! దీనికి నీకు బ్రత్యుపకృతిం గావింప నే నేర, నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ!

ఓ బ్రాహ్మణోత్తమా! ఎంతటి చల్లని మాట చెప్పావయ్యా! నాకోసం అంతదూరం వెళ్లి, కృష్ణుడికి నా గురించి చెప్పి, ఇక్కడకు తీసుకొని వచ్చావా! నీ ప్రాణములు నిలబెట్టావయ్యా! నీ దయవల్ల బతికాను లేకపోతే ఈ దేహంలో ప్రాణాలు నిలిచేవి కావు. నీ వంటి పుణ్యాత్ములు ఈ లోకంలో ఉండరు. నాకు ఇంత ఉపకారం చేసిన నీకు నేను ఏమి ప్రత్యుపకారం చెయ్యగలను. నీకు చేతులెత్తి నమస్కరించడం తప్ప ఏమీ చేయలేని అశక్తురాలిని అని ఆ బ్రాహ్మణునికి పాదాభివందనం చేసింది రుక్మిణి.

ఇక్కడ ఇలా ఉంటే తన కుమార్తె వివాహానికి బలరాముడు, శ్రీకృష్ణుడు వచ్చారని భీష్మకునికి తెలిసింది. వెంటనే వారి వద్దకు వెళ్లాడు. మంగళవాద్యములతో, పూజాద్రవ్యములతో వారికి స్వాగతం పలికాడు. అతిథి సత్కారాలు చేసాడు. మధుపర్కములు, వస్త్రములు ఇచ్చాడు. వారికి భోజన సదుపాయములు చేసాడు. వారికి వారి సైన్యమునకు తగిన విడిది గృహములు చూపించాడు.

(కృష్ణుడు ఎవరికీ తెలియకుండా దొంగతనంగా వచ్చి రుక్మిణిని అపహరించి తీసుకొని వెళ్లాడు అని మనకు ఒక అపోహ ఉంది. సినిమాలలో కూడా ఆ విధంగానే చూపిస్తుంటారు. అది అబద్ధం. కృష్ణుడు, బలరాముడు వివాహానికి అతిథులుగా వచ్చారు.

రాజసత్కారాలు పొందారు. రుక్మిణి తన వెంట మనస్ఫూర్తిగా వస్తే తీసుకొని వెళ్లాడు.)

కుండిన నగరంలోకి ప్రవేశించిన శ్రీకృష్ణుని చూచి ఆ నగర వాసులు ఆనందంతో పొంగిపోయారు. ఆయన వంకా అలా చూస్తూ నిలబడి పోయారు. వారిలో వారు ఇలా అనుకుంటున్నారు. "మన మహారాజు సుగుణాల రాసి అయిన రుక్మిణిని ఆ శిశుపాలుడికి ఇచ్చి వివాహం చేస్తున్నాడు. ఏం బాగా లేదు. కాకి ముక్కుకు దొండపండు ఇచ్చినట్టు ఉంది. లక్షణంగా ఈ కృష్ణుడికి ఇచ్చి చెయ్యవచ్చు కదా. ఈడూజోడూ సరిపోయింది.

మ॥ తగు నీచక్రి విదర్భరాజసుతకుం దథ్యంబు వైదర్భియుం
దగు నీ చక్రికి, నింతమంచి దగునే! దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా! దర్పాహతారాతియై
మగడౌ గావుత జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్॥

శ్రీకృష్ణుడికి రుక్మిణికి ఈడూజోడూ సరిపోయింది. కృష్ణుడికి రుక్మిణి, రుక్మిణకి కృష్ణుడు సరిగ్గా సరిపోయారు.
(ఈ రోజుల్లో మేడ్ ఫార్ ఈచ్ అదర్ అనే మాట వాడుకలో ఉంది. కాని ఆ మాటను నాడు పోతన గారు పద్యరూపంలో వాడారు.)
వీళ్లను భార్యభర్తలుగా నిర్ణయించిన ఆ బ్రహ్మదేవుడు ఎంతటి నేర్పరి అయి ఉంటాడు. అదే నిజం అయితే, మా రాకుమారి పూజలు ఫలిస్తే ఈ కృష్ణుడు ఆ దుష్టులు శిశుపాలుడు మొదలగు వారిని ఓడించి రుక్మిణిని పెళ్లి చేసకుంటే ఎంతబాగుంటుందో! మనకు అంతటి

అదృష్టం ఉందంటావా! ఉంటుంది. మనం ఏకొంచెమైనా పుణ్యం చేసుకొని ఉంటే రుక్మిణికి శ్రీకృష్ణుడికి కల్యాణం జరుగుతుంది. ఇది తప్పదు అని వారిలో వారు అనుకుంటున్నారు.

వీళ్లు ఇలా అనుకుంటూ ఉంటే, అక్కడ రాజ మందిరంలో అందరూ వివాహమునకు సిద్ధం అవుతున్నారు. వివాహమునకు ముందు వధువు గౌరీపూజ చేయడం ఆనవాయితీ. అందుకని రుక్మిణి తన చెలులతో కలిసి పార్వతీ దేవి ఆలయానికి బయలుదేరింది. ఆమె వెంట ముత్తయిదువలు, చెలికత్తెలు, కన్యలు, అమ్మవారికి ఉపాహారములను పూజావస్తువులను తీసుకొని బయలుదేరారు. రాకుమార్తెకు రక్షణగా కొంత మంది సైనికభటులు కూడా వెళ్లారు.

రుక్మిణి అమ్మవారి ఆలయమునకు చేరుకుంది. కాళ్లు చేతులు కడుగుకొని అమ్మవారి ముందు నిలబడింది. ఆమెను ఇలా ప్రార్థించింది.

ఉ॥ నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ము బురాణ దంపతుల మేలు భజింతు గదమ్మ! మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరి బతిసేయుమమ్మ నిన్
నమ్మిన వారికెన్నడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ!

అమ్మా! సనాతనులైన పార్వతీపరమేశ్వరులను మనస్ఫూర్తిగా నమ్ముకున్నాను. మీరు పురాణ దంపతులు, మిమ్ములను మనసారా పూజిస్తున్నాను. ఓ దయగల తల్లీ! లోకాని కంతా పెద్ద దిక్కు నీవేనమ్మా! నాకూ కృష్ణునికి వివాహం జరిగేట్టు కరుణించమ్మా! అమ్మా! నిన్ను

నమ్మిన వారికి నిరాశ లేదు కదమ్మా! నా కోరిక మన్నించమ్మా! నన్ను దయచూడమ్మా!" అని ప్రార్థించింది.

తరువాత రుక్మిణి అమ్మవారిని షోడశ ఉపచారములతో పూజించింది. బ్రాహ్మణులకు,ముత్తయిదువులకు, కన్యలకు వస్త్రములు, ధనము, బంగారము, ఉపహారములు ఇచ్చి సత్కరించింది. ఆమెతో వచ్చిన ముత్తయిదువులు కూడా అమ్మవారిని యధోచితంగా పూజించారు. రుక్మిణి ముత్తయిదువులకు నమస్కరించింది. వారు ఆమెను దీర్ఘసుమంగళిగా దీవించారు. తరువాత దేవికి అర్పించిన పూలను భక్తితో తీసుకొని తలలో పెట్టుకుంది. తరువాత తన చెలికత్తెల చేతులను పట్టుకొని హంసగమనంతో ఆలయం నుండి వెలుపలికి వచ్చింది.

ఆలయం వెలుపల రథం మీద పగ్గములు పట్టుకొని ఠీవిగా నిలబడి ఉన్న జగన్మోహనాకారుడైన శ్రీకృష్ణుని చూచింది రుక్మిణి.

మ॥కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేంద్రావ ల
గ్ను నవాంభోజదళాక్షు జారుతరవక్షున్ మేఘసంకాశ దే
హు నగారాతి గజేంద్ర హస్తనిభబాహుం జక్రి పీతాంబరున్
ఘనభూషాన్వితు గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్.

ఆలయం బయటకు వచ్చిన రుక్మిణి రథం మీద ఠీవిగా నిలబడి ఉన్న కృష్ణుని చూచింది. ఆ జగన్మోహనాకారానికి ముగ్ధురాలయింది. నీలమేఘచ్ఛాయతో, పున్నమినాటి చంద్రబింబము వంటి గుండ్రని

ముఖంతో, సన్నని నడుముతో, తామరపూలరేకులవంటి కళ్లతో, విశాలమైన వక్షస్థలముతో, ఏనుగుతొండముల వంటి బాహువులతో, పట్టు పీతాంబరమును ధరించి, రథం మీదనిలబడి ఉన్న మోహనాంగుడిని కనులారా చూచింది రుక్మిణి.

మెల్లిగా నడుచుకుంటూ రథం దగ్గరగా వచ్చింది. కృష్ణుడు చేయి అందించాడు. కృష్ణుని చేతిని పట్టుకొని రథం ఎక్కింది. కృష్ణుడు గుర్రాలను అదిలించాడు. అవి ఒక్కసారిగా ముందుకు దూకాయి. వాయువేగాన్ని అందుకున్నాయి. కృష్ణుని రథం క్షణాల్లో అదృశ్యం అయిపోయింది.

తమ కళ్లముందు జరిగిన ఈ తతంగాన్ని చూచి ఆమె వెంట వచ్చిన చెలికత్తెలు హాహాకారాలు చేసారు. సైనికులు రథం వెంట పరుగెత్తారు. క్షణాలో ఈ వార్త ఇటు భీష్మకునకు, రుక్మికి, అటు శిశు పాల జరాసంధులకు తెలిసిపోయింది. అంతా నిశ్చేష్టులయ్యారు. అంతలోనే తేరుకొని విజృంభించారు.

"ఆయ్! ఇంత ద్రోహమా! మనందరి ముందు పెళ్లికూతురిని హరిస్తాడా ఆ కృష్ణుడు. మన సైన్యాలు ఏమైనట్టు! మన అస్త్రశస్త్రములు ఏమైనట్టు!" అని కలగుండు పడుతున్నారు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు రుక్మిణీకల్యాణ కథను కమనీయంగా వినిపిస్తున్నాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము యాభైమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

యాభైనాలుగవ అధ్యాయము.

“ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని తీసుకొని తన రథం మీద వెళుతున్నాడు అని తెలియగానే జరాసంధుడు, శిశు పాలుడు, రుక్మి మొదలగు వారు తమ తమ సైన్యములతో శ్రీకృష్ణుని రథమును వెంబడించారు. ఇలా జరుగుతుందని ముందే ఊహించిన బలరాముడు తన సైన్యములతో శ్రీకృష్ణునికి జరాసంధుడికి, శిశు పాలుడికి మధ్యగా నిలబడ్డాడు.

బలరాముడికి జరాసంధుడికి పోరు ఘోరంగా జరిగింది. ఒకరి మీద ఒకరు అస్త్రశస్త్రములను జడివానలాగా కురిపించారు. రథము మీద ఉన్న రుక్మిణి వెనక్కుతిరిగి చూచింది. తన కోసరం జరుగుతున్న ఘోరయుద్ధమును గమనించింది. భయాందోళనలకు గురి అయింది. రుక్మిణి ముఖంలో కనపడుతున్న భయమును చూచిన కృష్ణుడు ఆమెతో ఇలా అన్నాడు.

“సుందరీ! భయపడకు. యాదవ సేనలు జరాసంధుని సేనలను త్వరలోనే జయించగలవు.” అని అన్నాడు.

ఆమాటలకు అనుగుణంగానే యాదవ సేనలలో ముఖ్యులైన గదుడు, సంకర్షణుడు మొదలగు వారు శత్రుసేనలను చించి

చెండాడుతున్నారు. ఎంతో మంది సైనికులు తలలు నరకబడి కిందపడి దొర్లుతున్నారు. ఆ ప్రదేశమంతా ఖడ్గములు, గదలు, విల్లులు, బాణములు, రథములు, సైనికుల మృత కళేబరములతోనూ నిండి పోయింది. యాదవుల చేతిలో పరాజయమును పొందిన జరాసంధుని సేనలు తిరుగుముఖం పట్టాయి.

పెళ్లిపీటల దాకా వచ్చిన పెళ్లి పెటాకులు కావడంతో శిశు పాలుని దు:ఖమునకు అంతులేదు. శిశుపాలుని జరాసంధుడు మిగిలిన రాజు ఓదార్చారు.

"ఓ శిశుపాలా! ఎందుకయ్యా దు:ఖిస్తావు. ఈ శరీరములు అందులో ఉన్న ప్రాణములే శాశ్వతములు కానపుడు, ఈ పెళ్లి, భార్య శాశ్వతమా చెప్పు. మనమంతా ఆ పరమాత్మ చేతిలో కీలుబొమ్మలం. నా సంగతే చెప్పు. నేను ఆ కృష్ణుని చేతిలో 17 సార్లు ఓడిపోయాను. చివరకు నేను గెలిచాను. నాకు భయపడి కృష్ణుడు బలరాముడు పారిపోయారు. కాబట్టి జయము పరాజయము దైవాధీనములు. మన చేతిలో లేవు. జయం కలిగినప్పుడు సంతోషించడం, అపజయం కలిగినప్పుడు దు:ఖించడం అవివేకులు చేయవలసిన పని. నా వంటి జగదేకవీరుడు కూడా ఈ యాదవుల చేతిలో ఓడిపోవాల్సివచ్చింది. కాలం కలిసిరానపుడు ఇలాగే జరుగుతుంటాయి. ఇప్పుడు కృష్ణుడు విజయం పొందాడు. మనం కూడా మరొక సారి కృష్ణుని ఓడించి విజయం పొందుదాము అప్పటి దాకా ఓపికపట్టు. ఇంతకూ ఆ రుక్మిణికి నిన్ను భర్తగా పొందే యోగ్యతలేదు అని సరిపెట్టుకోవడం తప్ప మరోమార్గం లేదు.

ఆ॥బ్రతుకవచ్చు నొడల బ్రాణంబు లుండిన, బ్రతుకు గలిగెనేని భార్యగలదు
బ్రతికితీవు; భార్యపట్టు దైవమెఱుంగు, వగవ వలదు చైద్య వలదు వలదు.

"శిశుపాలా! పెళ్లి కావాలన్నా, భార్య రావాలన్నా ముందు మనం బతకాలి కదా. బతకాలంటే శరీరంలో ప్రాణాలు ఉండాలి కదా! బతికి బాగుంటే ఇటువంటి రుక్మిణులు ఎంతమందైనా దొరుకుతారు. కాబట్టి నీవు ఈ రుక్మిణి కోసరం ఏడవడం ఎందుకు చెప్పు. నా మాటవిని ఈ దు:ఖము విడిచిపెట్టు." అని జరాసంధుడు శిశుపాలునికి హితబోధ చేసాడు. జరాసంధుని హితబోధలు విన్న శిశుపాలుడు చేసేది లేక, తన చేది దేశమునకు తిరిగి వెళ్లాడు. అతని మిత్రులు కూడా తమతమ దేశములకు తిరిగి వెళ్లిపోయారు.

శిశుపాలుడు, జరాసంధుడు అయితే వెనక్కు తిరిగారు కానీ, తన చెల్లిని అలా బలవంతంగా కృష్ణుడు తీసుకొని పోతుంటే చూస్తూ ఊరుకోలేకపోయాడు రుక్మిణి అన్నగారైన రుక్మి. "యుద్ధంలో కృష్ణుని జయించి, నా చెల్లి రుక్మిణిని తీసుకొని గానీ తిరిగి కుండిన నగరంలో అడుగుపెట్టను" అని అందరిముందు శపథం చేసాడు. అలా శపథం చేసిన రుక్మి  కృష్ణుడి రథం వెంట తన రథం మీద వెంబడించాడు.

"కృష్ణా! నిలు నిలు పారిపోకు" అని అరుస్తున్నాడు. తన విల్లు ఎక్కుపెట్టి మూడు బాణములతో కృష్ణుని కొట్టాడు. "కృష్ణా! క్షణకాలం నిలబడు. నా ప్రతాపం చూపిస్తాను. కాకి వచ్చి యజ్ఞప్రసాదము ముట్టుకున్నట్టు నీవు నా చెల్లిని అపహరించి పారిపోతున్నావు. ఎక్కడకు

పోతావు. నా నుండి తప్పించుకోలేవు. నా సంగతి నీకు తెలియదు. నాకు మాయాయుద్ధం తెలుసు. క్షణకాలంలో నీ తల నరికి నేల మీద దొర్లిస్తాను. నా బాణములు తగిలి చావకముందే, నా చెల్లిని నాకు అప్పగించు." అని అరుస్తున్నాడు.

సీ॥మా సరివాడవా మా పాప గొనిపోవ? నేపాటి గలవాడ? నేది వంశ?
మెందు జన్మించితి? వెక్కడ బెరిగితి? వెయ్యది నడవడి? యెవ్వడెఱుగు?
మానహీనుడ వీవు? మర్యాదలెఱుగవు, మాయగైకొని కాని మలయరావు
నిజరూపమున శత్రునిహవంబుపై బోవు, వసుధేశుడవు కావు, వావి లేదు.
ఆ॥ కొమ్మనిమ్ము; నీవు గుణరహితుండవు, విడువు, విడువవేని విలయకాల
శిఖిశిఖాసమాన శితశిలీముఖముల, గర్వమెల్ల గొందు గలహమందు.

అని రుక్మి అరుస్తూ, కృష్ణుని తిడుతూ తన రథం మీద పరుగెడుతున్నాడు. కృష్ణుడు రథం నడుపుతూ, రుక్మిణి వంక చూస్తూ, ఆమె అన్నగారు అనే మాటలు సరదాగా వింటున్నాడు. రుక్మి తిట్టడం మొదలు పెట్టడంతో ఇంక ఊరుకోలేక పోయాడు.

రథమునకు కట్టిన గుర్రాల కళ్లెములు రుక్మిణికి ఇచ్చాడు. తాను విల్లు తీసుకున్నాడు. ఎనిమిది బాణములతో రుక్మి రథమునకు కట్టిన గుర్రములను, రెండు బాణములతో సారథిని, మూడు బాణములతో రథమునకు కట్టిన పతాకమును కొట్టాడు. రుక్మికూడా కృష్ణుని మీద ఐదు బాణములను సంధించాడు. కృష్ణుడు ఒకే బాణంతో రుక్మి విల్లు విరగగొట్టాడు. రుక్మి మరొక విల్లు తీసుకోబోతుంటే, ఆ విల్లు కూడా విరిచాడు కృష్ణుడు. రుక్మి రథము మీదికి పరిఘలు, శూలములు, డాలు, శక్తి, తోమరము మొదలగు ఆయుధములు

తీసుకున్నాడు. రుక్మిఏ ఆయుధము పట్టుకుంటే ఆ ఆయుధమును విరగగొడుతున్నాడు కృష్ణుడు. రుక్మి పెద్ద ఖడ్గము డాలు తీసుకొని కృష్ణుని మీదికి ఉరికాడు. కృష్ణుడు తన బాణములతో రుక్మి పట్టుకున్న ఖడ్గమును, డాలును తునాతునకలు చేసాడు.

రుక్మి నిరాయుధుడు అయ్యాడు. అప్పుడు కృష్ణుడు కత్తితీసుకొని రుక్మిమీదికి ఉరికాడు. అప్పుడు రుక్మిణి కృష్ణుని కాళ్లు పట్టుకుంది. తన అన్నను కాపాడమని బతిమాలింది. రుక్మిణి నోరు ఎండి పోయింది. కాళ్లు వణుకుతున్నాయి. శరీరం కంపించింది. రుక్మిణి కృష్ణుని పాదములను పట్టుకొని వదలలేదు. దీనంగా వేడుకుంటూ ఉంది.

రుక్మిణి ప్రార్థన విన్న కృష్ణుడు రుక్మిణి చంపడం మానుకున్నాడు. రుక్మిని పట్టుకొని రెండు చేతులో తన అంగవస్త్రముతో కట్టాడు. రుక్మి మీసములను, తలను అక్కడక్కడా గొరిగాడు. వికృతరూపునిగా చేసాడు. ఈ లోపల బలరాముడు అక్కడకు చేరుకున్నాడు. వికృతరూపుడుగా ఉన్న రుక్మిని చూచాడు. కృష్ణుని మీద మండి పడ్డాడు.

"కృష్ణా! ఎంతపని చేసావు. ఒక క్షత్రియుడి తల మీసములు గొరుగుతావా. యాదవులు చేయదగిన పనేనా ఇది. అసలు ఇటువంటి పని వీరుడైన వాడు ఎవడైనా చేస్తాడా! రుక్మి నీకు దగ్గర బంధువు. బంధువులను ఈ విధంగా అవమానించడం వారిని చంపడం కంటే హేయమైనది." అని కృష్ణుని మందలించాడు.

పక్కనే ఉన్న రుక్మిణిని చూచి బలరాముడు ఇలా అన్నాడు. “అమ్మా రుక్మిణీ! నా తమ్ముడు నీ అన్నను ఈ విధంగా కురూపిని చేసాడని మా మీద కోపం తెచ్చుకోకు. నీ అన్న ఏ జన్మలో ఎవరికి ఏ అపకారం చేసాడో ఈ నాడు ఇటువంటి ఫలితం అనుభవించాడు. ఎవరికైనా కర్మఫలము అనుభవించక తప్పదు కదా! ఎవరి సుఖదు:ఖములకు ఎవరూ కారణం కాదు.” అని రుక్మిణిని ఓదార్చి, కృష్ణుని చూచి

“కృష్ణా! బంధువులు చంపదగిన నేరం చేసినా వారిని చంపకూడదు. వాడి మానాన వాడిని వదిలెయ్యాలి. అతడు చేసిన దారుణమైన పనికి అతడు అప్పుడే చచ్చాడు. ఇంకా నీవు చంపడం ఎందుకు?” అని కృష్ణునితో చెప్పి మరలా రుక్మిణిని చూచి

“అమ్మా! ఈ లోకంలో దుర్మార్గులు పెరిగిపోతున్నారు. ఎవరి ధర్మం వారు పాటించడం లేదు. తోడబుట్టిన సోదరుడే తన సోదరిని చంపడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ నాటి ధర్మం  దారుణంగా తయారయింది. నీ  అన్న కూడా నీకు ఇష్టం లేని పెళ్లి చేయడమే కాకుండా, నీవు స్వతంత్రించి నీకు ఇష్టం అయిన వాడిని పెళ్లిచేసుకుంటే నిన్ను వెంట తరుముతున్నాడు. అందుకనే ఇలా చేయవలసి వచ్చింది. బాధ పడకు.” అని మరలా కృష్ణుని వంక తిరిగి

“కృష్ణా! ధనంతో, ఐశ్వర్యంతో మదించిన వారు రాజ్యము కోసరం, ఆస్తుల కోసరం, ధనం కోసం, స్త్రీల కోసం ఇంకా ఇతర చిన్న చిన్న విషయాల కోసం ఇతరులను హింసిస్తుంటారు. నువ్వు కూడా

వారి మాదిరే చేసావు. ఇది తగునా! రుక్మి నీ భార్యకు అన్నగారు. ఆయనను ఇలా అవమానించడం ధర్మమా! ” అని మరలా రుక్మిణి వంక తిరిగి

“అమ్మా! ఈ రుక్మి నీ సోదరుడు. ఇతను ఎంత దుర్మార్గుడైనా నీవు ఇతని క్షేమం కోరడంలో తప్పులేదు. కాని ఇతడు దుర్మార్గంగా ప్రవర్తించాడు. తన చెల్లి మనసు తెలుసుకొని ఆమె కోరిన వాడిని వివాహం చేయకుండా ఉండడమే కాక, తన చెల్లి వివాహం చేసుకున్న వాడిని తరిమి తరిమి చంపడానికి ప్రయత్నించాడు. అందుకే ఇలా చేయవలసి వచ్చింది. బాధపడకు.

అయినా రుక్మిణీ! ఈ బంధాలు, బాంధవ్యాలు, మిత్రత్వాలు, వీడు నాకు బంధువు, వాడు నాకు శత్రువు అనే భావన, ఈ దేహానికే కాని ఆత్మకు కాదు. కాని ఈ దేహంలో ఉన్నంత కాలం ఆత్మ ఇటువంటి మోహంలో పడుతుంది. తన వారికి ఏదైనా కీడు జరిగితే బాధపడుతుంది. అది సహజం. ఇదంతా భగవంతుని మాయ అని తెలుసుకుంటే ఏ బాధా ఉండదు.

అమ్మా! సకలజీవులలో ఉండే పరమాత్మ తత్వము ఒక్కటే. ఒకే సూర్యుడు, ఒకే చంద్రుడు అన్ని జలాశయములలో వేరు వేరు గా కనపడుతున్నట్టు, ఒకే ఆకాశము కుండ మొదలగు పాత్రలలో పరిమితంగా ఉన్నట్టు, పరమాత్మ కూడా అన్ని జీవులలో ఆత్మ స్వరూపంగా వెలుగుతున్నాడు. అవిద్య వలన పంచభూతముల కలయికతో, సత్వ,రజస్తమోగుణముల మిశ్రమంతో, ఈ దేహం

ఏర్పడింది. ఆ గుణాల ప్రభావం చేత జీవుడు ప్రాపంచిక విషయము లలో పడి, విషయ వాంఛలకు లోబడి, పతనమౌతున్నాడు. (46)

అమ్మా రుక్మిణీ! జననము, మరణము, వీటి మధ్య వచ్చే బాల్య, యౌవన, వృద్ధాప్యములు అన్నీ ఈ శరీరమునకు సంబంధించినవే. ఇవేవీ ఆత్మకు అంటవు. చంద్రుడు మనకు వృద్ధిచెందుతున్నట్టు, క్షీణిస్తున్నట్టు కనపడతాడు. కానీ అది నిజం కాదు. చంద్రునికి వృద్ధి క్షయములు లేవు. కాని భూమి మీది నుండి చూచేవారికి అటువంటి భ్రమ కలుగుతుంటుంది.

మానవులకు నిద్రలో స్వప్నములు వస్తుంటాయి. వాటిలో తాను కూడా ఉంటాడు. ఏమేమో పనులు చేస్తుంటాడు. సంతోషం, సుఖం, దు:ఖం. కష్టములు అనుభవిస్తుంటాడు. నిద్రలేవగానే అవేవి ఉండవు. అలాగే ఈ జీవితం కూడా స్వప్నం వంటిది అనుకుంటే ఈ సంసారము నుండి విముక్తి పొందుతాము. ఆత్మతత్వము తెలియని వాడు మాత్రమే ఈ శరీరము, ఈ ప్రాపంచిక సుఖములు నిజం అనుకొంటాడు.

కాబట్టి ఓ రుక్మిణీ! నీ అన్నగారిని నా తమ్ముడు చేసిన పనికి కలిగిన శోకమును ఈ తత్వజ్ఞానముతో విడిచిపెట్టు. నీ మనసును స్వస్థత పరుచుకో." అని ఒక పక్క తన తమ్ముడు కృష్ణుని మందలిస్తూ, మరొక పక్క తన మరదలు రుక్మిణిని ఓదార్చాడు బలరాముడు.

తన బావగారు బలరాముడు పలికిన మాటలు విన్న రుక్మిణి తన శోకమును వదిలిపెట్టింది. ఆత్మ తత్వమును తెలుసుకొంది. తన మనసును సమాధాన పరచుకొంది.

కృష్ణుని చేతిలో అవమానమును పొందిన రుక్మి అచటి నుండి వెళ్లిపోయాడు. కానీ తానుచేసిన ప్రతిజ్ఞను అనుసరించి కుండిన నగరంలో ప్రవేశించలేదు. (రుక్మిణితోనే నగర ప్రవేశం చేస్తానని ప్రతిజ్ఞచేసాడు కదా!) నగరం బయట తన కోసరం ఒక కుటీరం నిర్మించుకున్నాడు. అందులోనే నివాసం ఉన్నాడు. అది క్రమంగా ఒక నగరంగా మారింది. దానికి భోజకటము అని పేరు.

కృష్ణుడు రుక్మిణితో సహా ద్వారకా నగరం ప్రవేశించాడు. రుక్మిణిని తన అంత:పురమునకు తీసుకొని వెళ్లాడు. పెద్దల సమక్షంలో రుక్మిణిని వేదోక్తంగా వివాహం చేసుకున్నాడు. రుక్మిణీ కృష్ణుల కల్యాణం తమ ఇంట్లో జరిగిన శుభకార్యంగా భావించి ద్వారకా నగర వాసులు సంబరాలు జరుపుకున్నారు. ద్వారకను అందంగా అలంకరించారు. తాము కూడా కొత్త బట్టలు కట్టుకున్నారు. నూతన వధూవరులకు తమకు తోచిన విధంగా కానుకలు ఇచ్చారు.

రుక్మిణీ కృష్ణుల కల్యాణమునకు కురు, సృంజయ, కేకయ, విదర్భ, యదు, కుంతి మొదలగు వంశముల నుండి రాజులు బంధు,మిత్ర,సపరివార సమేతంగా విచ్చేసారు. ఆ రాజులందరూ ఒకరితో ఒకరు ముచ్చటించుకుంటూ ఆనందంగా గడిపారు. ఆ సందర్భంలో వివాహమునకు వచ్చిన, రాజులు, రాచ కన్యలు కృష్ణుడు రుక్మిణిని

తీసుకువచ్చిన వృత్తాంతమును విని ఆశ్చర్యచకితులయ్యారు. ద్వారకా నగర వాసులు   అందరూ రుక్మిణీ కల్యాణమును కనులారా చూచి మహదానందభరితులయ్యారు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహం చేసుకున్న విధానమును వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము యాభైనాలుగవ అధ్యాయము సంపూర్ణము.

రుక్మిణీ కల్యాణ ఘట్టము పూర్తి అయింది.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## యాభైఐదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! పరమశివుడు తపస్సు చేసుకుంటున్నప్పుడు మన్మధుడు శివుని మీద బాణములు వేస్తే, శివుడు కోపించి మన్మధుడిని భస్మం చేసాడు. ఆ ప్రకారంగా భస్మం అయిన మన్మధుడు ఆకారం లేకుండా ఉన్నాడు. శ్రీకృష్ణుడికి, రుక్మిణికి వివాహం అయిన తరువాత రుక్మిణి గర్భం ధరించింది. మన్మధుడు రుక్మిణి గర్భంలోకి ప్రవేశించాడు.  తొమ్మిది నెలలు గడిచిన తరువాత రుక్మిణి పండంటి మగబిడ్డను ప్రసవించింది. ఆ కుమారుని పేరు ప్రద్యుమ్నుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! శంబరుడు అనే రాక్షసుడు ఉన్నాడు. వాడికి మన్మధుడికి విరోధము ఉంది. మన్మధుడు శివుడి చేతిలో భస్మం అయ్యాడని తెలుసుకొని శంబరుడు ఆనందించాడు. కాని మన్మధుడు తిరిగి రుక్మిణీదేవి గర్భంవాసాన జన్మించాడు అని తెలుసుకొని మనసులో కలత చెందాడు. పురిటి గదిలో ఉన్న ప్రద్యుమ్నుని దొంగతనంగా తీసుకొని పోయి సముద్రమధ్యలో పడవేసాడు. ప్రద్యుమ్నుడు మరణించాడు అని ధృవీకరించుకొని తన గృహమునకు వెళ్లాడు శంబరుడు.

కాని సముద్రములో ఒక మహాద్భుతము జరిగింది. పసిబిడ్డగా ఉన్న ప్రద్యుమ్నుడిని ఒక పెద్ద చేపమింగింది. ఆ చేప కొంత మంది జాలరుల వలలో చిక్కుకుంది. జాలరులు ఆ చేపను పట్టుకొని తమకు ప్రభువైన శంబరాసురుని వద్దకు తీసుకొని వెళ్లి ఆయనకు కానుకగా ఇచ్చారు. శంబరాసురుడు ఆ చేపను తన వంట వాడికి ఇచ్చి వండమన్నాడు.

ఇదంతా ఒక కంట కనిపెడుతున్న నారదుడు మన్మధుని భార్య రతీదేవి వద్దకు పోయి, ఆమెకు మన్మధుడు రుక్మిణీదేవికి జన్మించడం, ఆ బిడ్డను శంబరుడు సముద్రంలో పారవేయడం గురించి చెప్పి ఆమెను శంబరుని ఇంట్లో ప్రవేశించమన్నాడు. వెంటనే రతీదేవి వంటలక్క వేషంలో మాయావతి అనే పేరుతో శంబరుని ఇంట్లోకి ప్రవేశించింది.

శంబరుడు తనకు ఇచ్చిన చేపను వంటవాడు కత్తితో రెండుగా నరికాడు. ఆ చేప పొట్టలో నుండి ప్రద్యుమ్నుడు బయట పడ్డాడు. మాయావతి పేరుతో ఉన్న రతీదేవి, నారదుని మాటలు గుర్తు తెచ్చుకొని, ఆ బిడ్డను తన భర్త మన్మధునిగా గుర్తించి, ఆ బిడ్డను తాను పెంచుకుంటాను తనకు ఇవ్వమని అడిగింది. వంటవాడు ప్రద్యుమ్నుడిని మాయావతికి ఇచ్చాడు. మాయావతి ఆ శిశువును అత్యంత ప్రేమతో పెంచసాగింది.

ప్రద్యుమ్ముడు పెరిగి పెద్ద వాడయ్యాడు. యవ్వనవంతుడైన తన భర్తను చూచి మురిసిపోయింది రతీదేవి. తన భర్త మీద ప్రేమను పెంచుకుంది. కాని ప్రద్యుమ్నుడికి ఈ విషయాలు ఏమీ తెలియవు. రతీదేవిని తన తల్లి మాదిరే పూజిస్తున్నాడు. రతీదేవి వింత ప్రవర్తన చూచిన ప్రద్యుమ్నుడు ఆమెతో ఇలా అన్నాడు.

"తల్లీ! ఇటీవల నీ ప్రవర్తన వింతగా ఉంది. నీ బుద్ధి పెడత్రోవ పడుతున్నట్టు ఉంది. నీవు నన్ను నీ కుమారునిగా కాకుండా నీ ప్రియుని మాదిరి భావిస్తున్నావు. దీనికి కారణమేమి?" అని అడిగాడు.

అప్పుడు రతీదేవి ప్రద్మ్యుమ్నుడికి అసలు విషయం చెప్పింది. "కుమారా! నీవు  నీవు మన్మధుడవు. నేను నీ భార్య రతీదేవిని. నిన్ను మహాదేవుడు భస్మం చేసాడు. నేను నీ వియోగమును భరించలేక నిన్ను వెంటాడుతున్నాను. నీవు శ్రీకృష్ణుడు, రుక్మిణి దంపతులకు జన్మించావు. నీ పేరు ప్రద్యుమ్నుడు.  నీవు పురిటిలో ఉండగానే ఈ శంబరాసురుడు నిన్ను సముద్రంలో పారవేసాడు. నిన్ను ఒక చేప

మింగింది. ఆ చేపను జాలరులు శంబరాసురుడికి ఇచ్చారు. నారదుడు నీకు ఈ విషయాలన్నీ చెప్పాడు. నేను శంబరాసురుడి ఇంట్లో వంటకత్తె గాచేరి నిన్ను పెంచి పెద్ద చేసాను. కేవలం నిన్ను నేను పెంచి పెద్ద చేసానే తప్ప నేను నీ భార్యను. మనం ఇద్దరం రతీమన్మథులము.

ఇంక అసలు విషయం చెబుతాను విను. ఈ శంబరాసురుడు నీకు శత్రువు. నీవు మన్మథుడు అని తెలిస్తే నిన్ను బతుకనీయడు. అందుకని వీడిని వెంటనే చంపు. ద్వారకలో నీ తల్లి రుక్మిణి నీ కోసం పరితపిస్తూ ఉంది. ఆమె వద్దకు వెళ్లి ఆమెకు సంతోషము కలిగించు." అని చెప్పింది రతీదేవి.

"నువ్వు చెప్పింది బాగానే ఉంది. శంబరుడు మహా బలవంతుడు. వాడిని నేను ఎలా చంపగలను." అని సందేహము వెలిబుచ్చాడు ప్రద్యుమ్నుడు. అప్పుడు రతీదేవి తన వద్ద ఉన్న మహామాయ అనే విద్యను ప్రద్యుమ్నుడికి ఇచ్చింది. "మన్మథా! ఈ విద్య అత్యంత మహిమ కలది. ఈ విద్య ముందు ఎటువంటి అసుర మాయలు పనిచెయ్యవు. ఈ విద్య సాయంతో నీవు శంబరాసురుని మట్టుబెట్టు." అని చెప్పింది రతీదేవి.

ప్రద్యుమ్నుడు మహామాయ అనే శక్తిని రతీదేవి నుండి తీసుకొని శంబరాసురుని ఎదిరించాడు. శంబరాసురుని నానారకాలుగా తిట్టి రోషం ఉంటే తన మీదికి యుద్ధానికి రమ్మని ఆహ్వానించాడు. తన ఇంట్లో పుట్టి పెరిగిన ఈ అర్భకుడు తనను ఎదిరిస్తున్నాడని తెలుసుకున్న శంబరాసురుడు తన గద తీసుకొని

ప్రద్యుమ్నుని మీదికి వెళ్లాడు. ఆ గదతో ప్రద్యుమ్నుని ఒకే దెబ్బకొట్టాడు. ప్రద్యుమ్నుడు ఆ గదను నేర్పుగా పట్టుకొని తిరిగి ఆ గదను శంబరాసురుని మీదికి విసిరాడు. ఇలా కాదని శంబరాసురుడు ఆకాశంలోకి ఎగిరాడు. శంబరుడు తన మాయావిద్యతో ఆకాశం నుండి అస్త్రములు శస్త్రములు ప్రద్యుమ్నుని మీద వర్షంలా కురిపించాడు.

రాక్షసుడు తన మాయావిద్యను ప్రయోగించగానే, ప్రద్యుమ్నుడు కూడా రతీదేవి తనకు ఇచ్చిన మహామాయను ప్రయోగించాడు. శంబరాసురుడు ప్రయోగించిన మాయలన్నీ పటాపంచలయ్యాయి. తరువాత శంబరుడు తన వద్ద ఉన్న గుహ్యక, గంధర్వ, పిశాచ, సర్ప, రాక్షస విద్యలను ప్రయోగించాడు. ఆ విద్యలను అన్నిటినీ ప్రద్యుమ్నుడు తన మహామాయతో ఛేదించాడు. శంబరుడు నిర్వీర్యుడు అయ్యాడు. అప్పుడు ప్రద్యుమ్నుడు ఒక కత్తి తీసుకొని శంబరుని తల నరికాడు. శంబరుడు నేలమీద పడిపోయాడు.

శంబరుడు మరణించగానే రతీదేవి ప్రద్యుమ్నుని వద్దకు వచ్చింది. ప్రద్యుమ్నుని తనతో ద్వారకకు తీసుకొని వెళ్లింది. రతీదేవి ప్రద్యుమ్నుడు ద్వారకలో ఉన్న శ్రీకృష్ణుని అంతఃపురములో ప్రవేశించారు. ప్రద్యుమ్నుడు కూడా నీలమేఘశ్యాముడు, పీతాంబరధారి, ఆజానుబాహుడు, చెరగని మందహాసము, సుందరమైన గుండ్రని ముఖపద్మము, నుదుటి మీద అల్లల్లాడే ముంగురులు,  ముమ్మూర్తులా శ్రీకృష్ణుని మాదిరే ఉన్నాడు.

అంతా కృష్ణుడే వచ్చాడు అనుకున్నారు. సిగ్గుతో పక్కకు తప్పుకున్నారు. కాని కొంచెం పరీక్షగా చూసి అమ్మయ్య కృష్ణుడు కాదు అని నిర్ధారించుకొని, ధైర్యంగా ప్రద్యుమ్నుని ముందుకు వచ్చారు. ఇంతలో రుక్మిణీదేవి కూడా అక్కడకు వచ్చింది. ఎన్నాళ్ల తరువాతనో తన దగ్గరకు వచ్చిన కుమారుడిని చూచి రుక్మిణిలో పుత్రప్రేమ పొంగి పొరలింది. పురిటిలో అపహరింపబడ్డ తన కుమారుడు ఇలా యవ్వనవంతుడై తిరిగి వచ్చాడా అని క్షణకాలం అనుకుంది రుక్మిణి.

" ముమ్మూర్తులా కృష్ణుని పోలికలతో ఉన్న వీడు నా కుమారుడు కాకపోతే ఇంకెవరు? ఎవరి కుమారుడు? ఇతని తల్లి ఎవరు? వీడికి పెళ్లి అయిందా! అయితే ఎవరా అదృష్టవంతురాలు? అయినా నా కుమారుడు పురిటిలోనే చనిపోయాడు కదా. అంతా ఎవరో రాక్షసుడు తీసుకొని పోయారు అని అన్నారు. అది నిజమో అబద్ధమో తెలియదు.

ఒక వేళ నా కుమారుడే బతికి ఉంటే సరిగ్గా ఈ వయసులో ఉండేవాడు. అయినా నాకు అంత అదృష్టమా! ఏమో! వీడు నా కుమారుడేమో! లేక పోతే అచ్చం కృష్ణుడి పోలికలు ఎందుకుంటాయి? ఆ ముఖము, శరీరము, అందము, చిరునవ్వు అన్నీ కృష్ణుని పోలికలే! సందేహం లేదు. వీడు నా కుమారుడే. నాఅదృష్టం కొద్దీ మరలా నా వద్దకు వచ్చాడు. నా ఎడమ భుజం అదురుతూ ఉంది. శుభ శకునములు గోచరిస్తున్నాయి. వీడిని చూడగానే నా స్తనములలో నుండి పాలు చేపుతున్నాయి. నాలో వీడి మీద పుత్రప్రేమ పొంగి పొరలుతూ ఉంది." అని తనలో తాను పరి పరి విధముల తలపోస్తూ

ఉంది రుక్మిణి. ఇంతలో శ్రీకృష్ణుడు తన తల్లి తండ్రులు దేవకీ వసుదేవులతో సహా అక్కడికి వచ్చాడు.  భూత, భవిష్యత్ వర్తమానములను తెలిసిన కృష్ణుడు ప్రద్యుమ్నుని చూచి మౌనంగా ఉ న్నాడు. ఏమీ మాట్లాడలేదు. ఇంతలో నారదుడు కూడా అక్కడకు వచ్చాడు. రుక్మిణికి విషయం అంతా వివరించాడు. శంబరుడు రుక్మిణి కుమారుడిని పురిటిలోనే అపహరించడం, సముద్రంలో పారెయ్యడం, చేప మింగడం, రతీదేవి ప్రద్యుమ్నుడిని పెంచడం, శంబరాసురుని చంపడం అన్నీ వివరంగా చెప్పాడు.

ఈ విషయాలన్నీ విన్న రుక్మిణి అంత:పుర కాంతలు ఆనందంతో పొంగిపోయారు. రుక్మిణి తన కుమారుని కౌగలించుకొని అక్కున చేర్చుకుంది. శ్రీకృష్ణుని కుమారుడు తిరిగి వచ్చాడన్న వార్త ద్వారక అంతా పాకిపోయింది. అంతా కృష్ణుని అంత:పురం ముందు బారులు తీరారు. "చనిపోయాడు అనుకున్న బాలుడు తిరిగి వచ్చాడు ఎంత అదృష్టం" అనుకుంటూ ఆ బాలుని అందరూ దీవించారు.

ద్వారకానగరవాసులందరికీ ప్రద్యుమ్నుని చూస్తే అచ్చు కృష్ణుని చూచినట్టే ఉంది. అందరికీ కృష్ణుని చూడగానే మన్మధభావాలు మనసులో పొడసూపాయి. ఎందుకంటే ప్రద్యుమ్నుడు మన్మధుని ప్రతిరూపమే కదా!" అని శుకుడు పరీక్షిత్ మహారాజుతో ప్రద్యుమ్నుని వృత్తాంతమును వివరించారు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము యాభైఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

# దశమస్కంధము

# యాభైఆరవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు స్యమంతక మణి వృత్తాంతమును ఈవిధంగా వినిపించాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! పూర్వము సత్రాజిత్తు అనే రాజు ఉండేవాడు. అతడు సూర్యుని గురించి తపస్సు చేసాడు. అతని తపస్సుకు మెచ్చిన సూర్యుడు అతనికి ఒక అద్భుతమైన ప్రకాశవంతమైన మణిని ఇచ్చాడు. ఆ మణి పేరు స్యమంతక మణి. దానిని ధరించిన సత్రాజిత్తు రెండవ సూర్యుని వలె ప్రకాశించాడు.

సత్రాజిత్తు స్యమంతక మణిని ధరించి ద్వారకలో ప్రవేశించాడు. స్యమంతక మణిని ధరించి వస్తున్న సత్రాజిత్తును చూచి ద్వారకానగరంలోని జనం అందరూ సూర్యభగవానుడు భూమి మీదికి వచ్చాడు అని అనుకున్నారు. ఆ సమయంలో కృష్ణుడు పాచికలాట ఆడుతున్నాడు. భటులు పరుగు పరుగున వచ్చి "దేవా! ద్వారకా నగరంలోకి సూర్యభగవానుడు వస్తున్నాడు." అని చెప్పారు. వారి అమాయకమైన మాటలకు కృష్ణుడు నవ్వి "ఆయన సూర్యుడు కాడు. సత్రాజిత్తు మహారాజు. ఆయన మెడలో ధరించిన స్యమంతక మణి అలా ప్రకాశిస్తూ ఉంది." అని అన్నాడు.

సత్రాజిత్తు తన భవనమునకు వెళ్లిపోయాడు. స్యమంతక మణి కోసరం ఒక ప్రత్యేకమైన పేటిక చేయించాడు. అందులో మణిని ఉంచాడు.ఆ పేటికను పూజామందిరంలో ప్రతిష్ఠించాడు. బ్రాహ్మణులను పిలిపించి పూజలు జరిపించాడు. ఉత్సవములు చేసాడు.

స్యమంతక మణి ప్రతి దినము ఎనిమిది బారువలు బంగారము ఇస్తుంది. (వీశ అంటే 1400 గ్రాములు. అటువంటి 8 వీశలు ఒక మణుగు. 20 మణుగులు ఒక బారువ. అంటే 1400 x 8 x 20 = 224 కిలోల బంగారము) ఆ స్యమంతక మణి ఎక్కడ ఉంటుందో అక్కడ రోగములు, ఈతి బాధలు ఉండవు.

అటువంటి మణి ప్రజలకు ఉపయోగ పడాలి కానీ ఒక వ్యక్తికి కాదు, వ్యక్తి క్షేమం కన్నా ప్రజాక్షేమమే ముఖ్యం అని తలచి, కృష్ణుడు ఆ మణిని ద్వారకానగర రాజుకు సమర్పించమన్నాడు. దానికి సత్రాజిత్తు ఒప్పుకోలేదు. కృష్ణుడు కూడా ఏమీ అనలేదు.

సత్రాజిత్తుకు ఒక తమ్ముడు ఉన్నాడు వాడి పేరు ప్రసేనుడు. వాడు ఒక రోజు స్యమంతక మణిని మెడలో ధరించి వేటకు వెళ్లాడు. ఒక సింహాన్ని వేటాడబోయాడు కాని ఆ సింహము ప్రసేనుడిని వేటాడింది. సింహము ప్రసేనుడిని చంపి ఆ మణిని తినే వస్తువని భ్రమించి దానిని నోట కరచుకొని వెళ్లిపోయింది. నోట్లో మణిపెట్టుకొని తిరుగుతున్న సింహాన్ని భల్లూకరాజు అయిన జాంబవంతుడు చూచాడు. ఆ సింహాన్ని సంహరించి ఆ మణిని తీసుకున్నాడు. దానిని

తీసుకుపోయి తన గుహలో ఉన్న ఒక బుల్లి ఎలుగుబంటికి ఇచ్చి ఆడుకోమన్నాడు.

వేటకు పోయిన తమ్ముడు ఎంతకూ తిరిగి రాకపోవడంతో సత్రాజిత్తుకు కంగారుపుట్టింది. పైగా స్యమంతక మణిని మెడలో వేసుకొని వెళ్లాడు. ఏమయ్యాడో ఏమో అని ఆతురత పడుతున్నాడు. వెంటనే సత్రాజిత్తు అనుమానం కృష్ణుని మీదికి పోయింది. "అవును. కృష్ణుడు ఈ స్యమంతక మణిని తనకు ఇమ్మని అడిగాడు. నేను ఇవ్వలేదు. అందుకని నా తమ్ముడు ఒంటరి వాడిని చేసి వాడిని చంపి ఆ మణిని కాజేసి ఉంటాడు. సందేహం లేదు." అని అనుకున్నాడు.

ఈ విషయం ఆనోటా ఆనోటా పాకి పోయింది. "కృష్ణుడు ప్రసేనుడిని చంపి మణిని అపహరించాడట. అయినా ఇమ్మని అడిగితే ఇవ్వడా. దానికి చంపాలా!" అని ద్వారకలో జనం చెవులు కొరుక్కుంటున్నారు. ఈ విషయం కృష్ణుడి చెవి దాకా వచ్చింది. ఇదేదో అపనింద తన మీద పడింది అనుకున్నాడు. దానిని ఖండించడం కన్నా, ఆ అపనింద నిజం కాదు అని నిరూపించదలచుకున్నాడు.

వెంటనే కృష్ణుడు బయలు దేరి ప్రసేనుడు వేటకు వెళ్లిన అడవికి వెళ్లాడు. అతను వెళ్లిన మార్గములో వెళుతుంటే, ఒక చోట ప్రసేనుడి శవం, దాని పక్కనే అతను ఎక్కి వచ్చిన గుర్రం కళేబరము కనపడ్డాయి. అక్కడి నుండి రక్తపు మరకలు జాడలను బట్టి పోగా, ఒక సింహము చచ్చి పడి ఉంది. అక్కడి నుండి రక్తపు మరకలు లేవు. కాని ఒక ఎలుగుబంటి అడుగు జాడలు కనపడ్డాయి. ఆ అడుగు జాడలను

బట్టి పోగా కృష్ణుడు ఒక గుహ వద్దకు చేరుకున్నాడు. తన పరివారమును ఆ గుహ బయటనే ఉంచి కృష్ణుడు ఆ గుహలో ప్రవేశించాడు.

కొంత దూరంపోగానే, ఒకచోట స్యమంతక మణితో ఆడుకుంటున్న ఎలుగుబంటి పిల్లను చూచాడు. అమ్మయ్య మణి దొరికింది కదా అని దానిని తీసుకోడానికి ఆ ఎలుగుబంటి పిల్ల వద్దకు పోయాడు. ఆ పిల్ల ఎలుగు బంటి కృష్ణుని చూచి ఇదేదో వింత మృగము అనుకొని బిగ్గరగా కేకలు పెట్టింది. ఆ కేకలు విని జాంబవంతుడు బయటకు వచ్చాడు. ఎవరో వచ్చి స్యమంతక మణిని అపహరిస్తున్నాడు అని అనుకున్నాడు.

కృష్ణునితో జాంబవంతుడు తలపడ్డాడు. ఇద్దరూ ఆ మణికోసరం ఒకరితో ఒకరు పోరాడుతున్నారు. ద్వంద్వయుద్ధం చేసుకుంటున్నారు. ఇద్దరు సమ ఉజ్జీగా పోరాడుతున్నారు. ఇరవై ఎనిమిది దినములు పోరాడిన తరువాత జాంబవంతుడి శక్తి సన్నగిల్లింది. ఎదుటి వ్యక్తి సామాన్యుడు కాదు అని అనుకున్నాడు. కృష్ణుని చూచి జాంబవంతుడు ఇలా అన్నాడు.

"ఓ దేవా! నీవు సామాన్యుడివి కావు. ఈ లోకములో ఉన్న సకల ప్రాణులకు దేహ బలము నీవే అయినప్పుడు నేను నిన్ను ఎలా గెలువగలను. నీవు సర్వాంతర్యామివి. సాక్షాత్తు విష్ణుస్వరూపుడవు. బ్రహ్మ మొదలగు దేవతాగణములకు సృష్టికర్తవు నీవే. నీవు శుద్ధసత్వగుణ స్వరూపుడవు.  కాలశక్తివి నీవే. పరమ పురుషుడవు నీవే. నాకు ఇప్పుడు

అర్థం అయింది. త్రేతాయుగములో రాముడుగా అవతరించావు. సముద్రము మీద సేతువును నిర్మింపజేసావు. రావణుని చంపావు. నీవు ఆ శ్రీరామచంద్రుడివే సందేహము లేదు. నా అపరాధమును క్షమించు." అని అన్నాడు జాంబవంతుడు.

కృష్ణుడు జాంబవంతుని శరీరం అంతా తన అమృతహస్తముతో నిమిరాడు. జాంబవంతునితో ఇలా అన్నాడు. "జాంబవంతా! ఈ స్యమంతక మణిని నేను అపహరించాను అని నా మీద అపవాదు వచ్చింది. దీనిని వెతుక్కుంటూ నేను నా పరివారము ఇక్కడకు వచ్చాము. నీగుహలో ఈ మణిని చూచాను. నేను ఆ మణిని తీసుకుంటూ ఉండగా నీవు వచ్చావు." అని అన్నాడు. ఆమాటలకు సంతోషించాడు జాంబవంతుడు. స్యమంతక మణిని కృష్ణునికి ఇచ్చాడు. మణితో పాటు తన కుమార్తె జాంబవతిని కూడా కృష్ణునికి ఇచ్చి వివాహం జరిపించాడు.

గుహ లోపల ఇలా జరుగుతుంటే, గుహ బయట ఉన్న కృష్ణుని పరివారము కృష్ణుని కొరకు ఎదురుచూస్తున్నారు. ఎంత కాలానికి కృష్ణుడు బయటకు రాకపోవడంతో వారంతా దు:ఖిస్తున్నారు. తుదకు వారు కృష్ణుడు ఇంక రాడు అని నిశ్చయించుకొని ద్వారకకు తిరిగి వెళ్లారు. కృష్ణుడు ఒక గుహలోకి వెళ్లాడు తిరిగి రాలేదు అని తెలుసుకున్న దేవకి, వసుదేవుడు, రుక్మిణి బంధువులు, యాదవులు శోకింపసాగారు. వారి దు:ఖమునకు అంతులేదు. కృష్ణుని మీద అపవాదు వేసిన సత్రాజిత్తును అందరూ తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టసాగారు. ద్వారకా నగర వాసులు కృష్ణుడు క్షేమంగా తిరిగి

రావాలని దుర్గాదేవిని ప్రార్థించారు.

మణిని వెదుకుతూ వెళ్లిన శ్రీకృష్ణుడు భార్యామణిని (జాంబవతిని) వెంటబెట్టుకొని ద్వారకలో ప్రవేశించాడు. కృష్ణుని రాకతో ద్వారకలో ఆనందోత్సాహాలు వెల్లివిరిసాయి. చచ్చిన వాడు బతికి వచ్చినట్టు, అదీ మణితోనూ, భార్యామణితోనూ వచ్చిన కృష్ణుని చూచి దేవకీవసుదేవులు, రుక్మిణి, బలరాముడు, యాదవులు పరమానంద భరితులయ్యారు.

వెంటనే కృష్ణుడు సత్రాజిత్తును పిలిపించి స్యమంతక మణిని అతనికి ఇచ్చాడు. కృష్ణుని మీద అపవాదు వేసిన సత్రాజిత్తు సిగ్గుతో తలదించుకున్నాడు. సత్రాజిత్తు ఇంటికి వెళ్లాడే కానీ, తాను చేసిన పనికి సిగ్గుతో కుచించుకుపోతున్నాడు. "నేను చేసినది మామూలు అపరాధము కాదు. ఘోరమైన అపరాధము. దానికి ఎలా ప్రాయశ్చిత్తము చేసుకోవాలి. శ్రీకృష్ణుని ఎలా ప్రసన్నం చేసుకోవాలి? ఏమిచేస్తే నా మనసు శాంతిస్తుంది. లోకమంతా నన్ను అపరాధిగానూ, దూరదృష్టిలేని వాడిగానూ, లోభిగానూ ఆడిపోసుకుంటున్నారు. ఈ అపవాదు ఎలా పోగొట్టుకోవాలి?" అని తీవ్రంగా ఆలోచించాడు. తుదకు కృష్ణుని తన అల్లునిగా చేసుకోవడమే దీనికి పరిష్కారము అని అనుకున్నాడు. తన కుమార్తె సత్యభామను కృష్ణుడికి ఇచ్చి వివాహము చేయనిశ్చయించాడు. తన కుమార్తెతో పాటు స్యమంతక మణిని కూడా కృష్ణునికి సమర్పించుకోవాలని అనుకున్నాడు.

అనుకున్నదే తడవుగా సత్రాజిత్తు తన కుమార్తెను, స్యమంతక మణిని తీసుకొని కృష్ణుని వద్దకు వెళ్లాడు. తన కుమార్తెను, స్యమంతక మణిని శ్రీకృష్ణునికి కానుకలుగా  సమర్పించుకున్నాడు. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి అనుమతితో సత్రాజిత్తు కుమార్తె సత్యభామను వేదోక్తంగా వివాహం చేసుకున్నాడు. కాని కృష్ణుడు స్యమంతక మణిని స్వీకరించలేదు.

"రాజా! ఈ మణి మీది. నాకు అవసరము లేదు. మీరు సూర్యుని భక్తులు. సూర్యుడు మీకు ఇచ్చాడు. దీని మీదకానీ, దీనినుండి వచ్చే ఫలితము మీద కానీ మాకు  ఎలాంటి అధికారము లేదు.  కాబట్టి ఈ స్యమంతక మణిని  మీ వద్దనే ఉంచండి. లోకోపకారమునకు వినియోగించండి." అని అన్నాడు కృష్ణుడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు స్యమంతక మణి వృత్తాంతమును, శ్రీకృష్ణ, సత్యభామ, జాంబవతుల వివాహముల గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఏబది ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఏబది ఏడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ముచ్చటగా ముగ్గురు భార్యలతో శ్రీకృష్ణుడు సుఖంగా ఉంటూ ఉండగా, ఆయనకు ఒక దుర్వార్త తెలిసింది. పాండవులను ధృతరాష్ట్రుడు వారణావతమునకు పంపాడనీ, అక్కడ లక్కఇంట్లో వారు కాలిపోయారనీ చారుల వలన తెలుసుకున్నాడు. ఇంతలోనే మరొక చారుడు వచ్చి పాండవులు లక్కఇంట్లో కాలి పోలేదనీ, తప్పించుకున్నారనీ చెప్పాడు. ఆ మాటవిని సంతోషించిన బలరామ కృష్ణులు ఎందుకైనా మంచిదని హస్తినా పురమునకు వెళ్లారు. అక్కడ ధృతరాష్ట్రుని, భీష్ముని, విదురుని, ద్రోణ, కృపాచార్యులను, గాంధారిని కలిసి పాండవులు మరణించిన దానికి సానుభూతి వచనాలు పలికారు. వారితో పాటు బలరామ కృష్ణులు కూడా కాసేపు సంతాపం ప్రకటించారు.

ఇది ఇలా ఉండగా ద్వారకలో అక్రూరుడు, కృత వర్మ మనస్సులలో ఒక దురాలోచన పుట్టింది. వారు శతధన్వుని వద్దకు వెళ్లారు. "నీవు సత్రాజిత్తు నుండి ఆ స్యమంతకమణిని ఎందుకు తీసుకోలేదు. నీకు ఇంకో విషయం తెలుసా. సత్రాజిత్తు మొదట తన కుమార్తె సత్యభామను ఈ కృతవర్మకు ఇచ్చి పెళ్లి చేస్తాను అని నిశ్చయం చేసాడు. ఇంతలో ఆ కృష్ణుని బల పరాక్రమాలు చూచి ఆయన మణి తెచ్చి ఇవ్వగానే, తన కూతురిని కృష్ణుడికి ఇచ్చి వివాహం చేసాడు. ఇది దుర్మార్గం కాదా! కాబట్టి మనము ఆ సత్రాజిత్తు మీద పగ తీర్చుకోవాలి. సత్రాజిత్తును చంపితే మన పగా తీరుతుంది. ఆ మణి దక్కుతుంది. ఆ

మణి తీసుకొని మనం ముగ్గురం పారిపోదాము." అని కృతవర్మ అక్రూరుడు శతధన్వునికి నూరిపోసారు.

వారి మాటలు విన్న శతధన్వుడు సత్రాజిత్తును చంపడానికి నిశ్చయించుకున్నాడు. ఒక రోజు సత్రాజిత్తు నిద్రపోతూ ఉంటే, శతధన్వుడు సత్రాజిత్తును చంపాడు. స్యమంతక మణిని అపహరించాడు. తండ్రి మరణించిన విషయం సత్యభామకు తెలిసింది. వలవలా ఏడుస్తూ తండ్రి వద్దకు వచ్చింది. తండ్రి శవం మీద పడి భోరున ఏడిచింది. మంత్రులు అందరూ సత్రాజిత్తు శవాన్ని తైలములో భద్రపరిచారు.  వెంటనే వార్తాహరులను హస్తినకు పంపి సత్రాజిత్తు మరణించిన విషయాన్ని బలరామ కృష్ణులకు తెలియజేసారు.

ఈ వార్త విన్న బలరామ కృష్ణులు వెంటనే బయలుదేరి ద్వారకకు వచ్చారు. సత్యభామతో కూడా కాసేపు మామగారు చనిపోయినందుకు ఏడ్చి, సత్యభామను ఓదార్చాడు కృష్ణుడు. దీని కంతటికీ కారణం శతధన్వుడు అని తెలుసుకొని వాడిని దండించడానికి పూనుకున్నాడు.

ఈ విషయం తెలిసిన శతధన్వుడు భయంతో వణికిపోయాడు. కృతవర్మ దగ్గరకు పోయి "మీ మాటలు విని నేను సత్రాజిత్తును చంపాను. ఇప్పుడు కృష్ణుడు నన్ను చంపడానికి వస్తున్నాడు. మీరే నన్ను కాపాడాలి." అని అన్నాడు.

"అది కాదు శతధన్వా! మేమేదో ఆవేశంలో అన్నామే అనుకో. నువ్వు వెంటనే పోయి సత్రాజిత్తును చంపాలా! అయినా నువ్వు ఊరికే మాకోసం చంపలేదుగా! సత్రాజిత్తును చంపి మణిని అపహరించావు. అయినా బలరామకృష్ణులు సామాన్యులు కాదు. దైవాంశ సంభూతులు. వారికి మేము ఎదురు నిలిచి పోరాడలేము. వారు కంసుని, చాణూర ముష్టికులను చంపారు. జరాసంధుడు కూడా బలరామకృష్ణుల చేతిలో ఓడిపోయాడు. బలరామకృష్ణులతో విరోధం పెట్టుకొని ఎవడు బతికి బట్టకట్టాడు చెప్పు. కాబట్టి నీకు దిక్కున్న చోటికి వెళ్లు." అని అన్నాడు కృతవర్మ.

ఆ మాటలు విన్న శతధన్వుడు హతాశుడయ్యాడు. "ఏమయ్యా! అక్రూరా! ఆరోజు నువ్వు కూడా ఉన్నావు కదయ్యా! ఆరోజు నన్ను సత్రాజిత్తును చంపడానికి పురిగొల్పి ఇప్పుడు ఇలా మాట్లాడటం న్యాయమా! నువ్వు అయిన చెప్పవయ్యా!" అని అక్రూరుని వేడుకున్నాడు.

"శతధన్వా! బలరామ కృష్ణుల బలపరాక్రమాలు తెలిసిన వాడు ఎవడైనా వారికి ఎదురు నిలువగలడా! మేమూ అంతే. కృష్ణుడు సాక్షాత్తు విష్ణుస్వరూపుడు. సృష్టి, స్థితి లయములు అవలీలగా చేస్తుంటాడు. నిన్ను చంపడం ఆయనకు చిటికలో పని. బ్రహ్మకూడా విష్ణుమాయకు లోబడి ఉంటాడు. ఏడుసంవత్సరముల వయసులోనే కృష్ణుడు గోవర్ధన పర్వతమును గొడుగుపట్టుకున్నట్టు పట్టుకోలేదా! అటువంటి కృష్ణుడికి నమస్కరించాలి గానీ ఎదురు తిరగరాదు. ఎదురు తిరిగితే మనం మిగలం." అని అన్నాడు.

శతధన్వునికి ఆఖరు ఆశకూడా పోయింది. ఈ దుర్మార్గుల మాటలు విని సత్రాజిత్తును చంపి మరణాన్ని ఆహ్వానించి నందుకు తనను తాను తిట్టుకున్నాడు.

"అయ్యా! మీ మాటలు విని మోసపోయాను. నాకు మణీ వద్దు ఏమీ వద్దు. ఈ స్యమంతక మణి మీరే తీసుకోండి. బతికి ఉంటే బలుసాకు తిని బతుకుతాను." అని స్యమంతక మణిని అక్రూరుడి చేతిలో పెట్టి తన గుర్రం మీద పారిపోయాడు శతధన్వుడు. శతధన్వుడు పారి పోతున్నాడు అని తెలిసిన బలరామకృష్ణులు తమ రథముల మీద శతధన్వుని వెంటబడి తరిమారు.

శతధన్వుడు ఎక్కిన గుర్రము మిథిలా నగరము దాకా పరుగెత్తి, ఇంక పరుగెత్తలేక, కూలిపోయింది. శతధన్వుడు గుర్రము దిగి పరుగెత్తాడు. కృష్ణుడు కూడా వాడి వెంటపడ్డాడు. కృష్ణుడు తన చేతిలోని చక్రాయుధమును శతధన్వుని కంఠానికి గురి పెట్టి విసిరాడు. ఆ చక్రాయుధము శతధన్వుని మెడను నరికింది. తల మొండెము వేరుకాగా, శతధన్వుడు మరణించాడు.

కృష్ణుడు శతధన్వుని వద్దకు పోయి స్యమంతక మణి కోసరం అతని దుస్తులన్నీ వెతికాడు. కృష్ణునికి స్యమంతక మణి దొరకలేదు. తరువాత కృష్ణుడు బలరాముని వద్దకు వచ్చి "బలరామా! నేను శతధన్వుని చంపాను. కాని స్యమంతక మణి వాడి వద్దలేదు." అని అన్నాడు.

"కృష్ణా! వీడు సత్రాజిత్తును చంపి మణిని అపహరించాడు. కాబట్టి ఆ మణి వీడి వద్దనే ఉండాలి. లేక ఎవరికైనా ఇచ్చి ఉండాలి. మనం వాడు ఎవరో పట్టుకోవాలి. నీవు ద్వారకకు వెళ్లి ఆ పని చూడు. ఇంతదూరం వచ్చాను కాబట్టి నేను మిథిలా నగరం పోయి, మిథిలాధిపతిని దర్శించి వస్తాను." అని అన్నాడు.

బలరాముడు మిథిలకు వెళ్లాడు. కృష్ణుడు  ద్వారకకు వచ్చాడు. మిథిలా నగర రాజు బలరాముడు వచ్చాడని తెలిసి ఆయనకు ఎదురు పోయి ఆహ్వానించి అర్ఘ్యపాద్యములు ఆసనము ఇచ్చి సత్కరించాడు. బలరాముని యథాశక్తి పూజించి,  ఆహారపానీయాలు సమర్పించాడు. బలరాముడు మిథిలలో కొన్ని సంవత్సరాలు ఉన్నాడు. కృష్ణుడంటే దుర్యోధనునికి భయం. బలరాముడు కృష్ణునికి దూరంగా మిథిలలో ఉన్నాడని తెలిసి,  దుర్యోధనుడు మిథిలకు వచ్చి  బలరాముని వద్ద గదాయుద్ధము నేర్చుకున్నాడు.

బలరాముడు మిథిలకు వెళ్లగానే, కృష్ణుడు ద్వారకకు వచ్చాడు. తాను శతధన్వుని చంపాననీ, కానీ స్యమంతక మణి వాడి వద్ద లేదనీ సత్యభామకు చెప్పాడు. తరువాత కృష్ణుడు తన మామగారైన సత్రాజిత్తుకు అపర కర్మలన్నీ శాస్త్రోక్తంగా చేసాడు.  కృష్ణుడు శతధన్వుని చంపిన వార్త ఆనోటా ఆనోటా పాకి అక్రూరుడు, కృతవర్మచెవిని పడింది. ఎలాగైనా కృష్ణుడు తమ ఇద్దరినీ వెతికి వెతికి చంపుతాడని, అక్రూరుడు, కృతవర్మ స్యమంతక మణితో సహా ద్వారక విడిచి పెట్టి పారిపోయారు.

స్యమంతక మణి ద్వారకను విడిచిపోగానే, ద్వారకానగర వాసులకు రోగాలు, అకాల మరణాలు, ప్రమాదాలు సంభవిస్తున్నాయి. వర్షాలు కురవడం లేదు. పంటలు పండటం లేదు. దీని కంతా అక్రూరుడు ద్వారక విడిచి వెళ్లిపోవడమే కారణం అని జనం అనుకోసాగారు. దానికీ ఒక కారణం ఉంది.

ఒక సారి కాశీ నగరంలో వర్షాలు కురవ లేదు. అప్పుడు కాశీరాజు  అక్రూరుని తండ్రిని కాశీనగరానికి పిలిపించి, ఆయనకు తన కుమార్తెను ఇచ్చి వివాహం చేసాడు. అక్రూరుని తండ్రి శ్వఫల్కుడు కాశీనగరంలో కాలుపెట్టగానే, అప్పటి వరకూ అనావృష్టితో అల్లాడుతున్న కాశీనగరంలో వర్షాలు విస్తారంగా కురిసాయి. ద్వారకా పురి వాసులు ఆ విషయాలు గుర్తుకు తెచ్చుకొని, ఇప్పుడు కూడా అక్రూరుడు వెళ్లిపోవడం వలన అనావృష్టి సంభవించింది అని అనుకోసాగారు.

ఈ విషయం కృష్ణుడికి తెలిసింది. "అక్రూరుడు ద్వారక విడిచి వెళ్లిపోవడం వలన అనావృష్టి సంభవించి ఉండవచ్చు. కాని అదే కారణం కానక్కర్లేదు. స్యమంతక మణి ద్వారక నుండి అపహరింపబడటం కూడా ఒక కారణం కావచ్చు" అని అనుకున్నాడు. ద్వారకానగరవాసుల మాటలు ఎందుకు కాదనాలి అని అనుకున్న కృష్ణుడు వెంటనే అక్రూరుని ద్వారకకు పిలిపించాడు. ఆయనకు స్వాగత సత్కారాలు చేసాడు. ఆయనను పూజించాడు. ఉచితాసనము ఇచ్చి సత్కరించాడు. అప్పుడు అసలు విషయం బయట పెట్టాడు.

"అక్రూరా! శతధన్వుడు సత్రాజిత్తును చంపి స్యమంతక మణిని అపహరించాడు. ఆ స్యమంతక మణిని నీ వద్ద దాచాడని నాకు తెలుసు. ఈ మణి సత్రాజిత్తుకు చెందింది. సత్రాజిత్తుకు మగ సంతానము లేరు. నా భార్య సత్యభామ  ఒక్కతే కూతురు. కాబట్టి సత్రాజిత్తుకు కర్మకాండలు, ఆబ్దికాలు జరిపించవలసినది ఆమె కుమారులే. సత్రాజిత్తు ఆస్తికి వారసులు కూడా సత్యభామ కుమారులే. ఇది ప్రస్తుత న్యాయము. ధర్మము. సత్యభామ కుమారులకు చెందవలసిన స్యమంతక మణిని నీ దగ్గరపెట్టుకోవడం న్యాయం కాదు. కాని నీ వంటి సత్పురుషుల వద్ద ఆ మణి ఉండటం వలన దాని శోభ మరింత పెరుగుతుంది.

ఇక్కడే ఒక చిక్కు వచ్చి పడింది. నా మాటలు నా అన్న బలరాముడు నమ్మడం లేదు. నేను శతధన్వుని చంపి ఆ మణిని అపహరించానని అనుకుంటున్నాడు. ఇప్పుడు నీవు ఆ మణిని అందరికీ చూపించి నా మీద వచ్చిన అపవాదును పోగొట్టు. నా పరువు కాపాడు. లేకపోతే అందరూ నన్ను హంతకుడనీ దొంగ అనీ నిందిస్తారు. అది నీకు సమ్మతమా చెప్పు.

నీ వద్ద మణి ఉంది అన్న దానికి తగిన ఆధారాలు ఉన్నాయి. నీవు కొన్ని రోజులుగా ధనమును విచ్చలవిడిగా వ్యయం చేస్తున్నావు. అన్నీ బంగారు వస్తువులలో యజ్ఞములు చేస్తున్నావు. సామాన్యుడవి అయిన నీ వద్ద ఇంత బంగారము ఉండే అవకాశము లేదు. కాబట్టి నీ వద్ద స్యమంతక మణి ఉంది అన్న విషయం దీని వలన రూఢి అవుతూ ఉంది. కాబట్టి నీ వద్ద ఉన్న ఆ మణిని ఇక్కడ ఉన్న వారందరికీ చూపించి నీ మీద ఉన్న నా మీద ఉన్న అనుమానాలను పటాపంచలు

చెయ్యి" అని బుజ్జగించి, లాలించి, యుక్తిగా అడిగాడు శ్రీకృష్ణుడు.

కృష్ణుడి మాటలకు ముగ్ధుడు అయిన అక్రూరుడు తన వస్త్రములలో దాచి పెట్టిన మణిని తీసి కృష్ణుడికి ఇచ్చాడు. కృష్ణుడు ఆ మణిని అందరికీ చూపించి తిరిగి ఆ మణిని అక్రూరునికే ఇచ్చాడు." అని శుక యోగీంద్రుడు పరీక్షిత్ మహారాజుకు శతధన్వుని మరణము, అక్రూరుని వద్ద ఉన్న మణిని అందరికీ చూపించడం గురించి చెప్పాడు

. శ్రీమద్భాగవతము

దశమస్కంధము యాభైఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

యాభై ఎనిమిదవ అధ్యాయము.

ఓ పరీక్షిత్ మహారాజా! పంచపాండవులు ద్రౌపదిని వివాహం చేసుకొని పాంచాల రాజ్యంలో సుఖంగా అత్తగారి ఇంట్లో ఉన్నారు. ఆ సమయంలో కృష్ణుడు వాళ్లను చూడటానికి వెళ్లాడు. కృష్ణుని చూచిన పాండవులు ఆయనకు స్వాగత సత్కారాలుచేసారు. ఉచితాసనము మీద కూర్చోబెట్టారు. శ్రీకృష్ణుడు తన కన్నా పెద్ద వారైన ధర్మరాజుకు, భీమసేనునికి నమస్కరించాడు. సమ వయస్కుడైన అర్జునుని కౌగలించుకున్నాడు. తన కన్నా చిన్న వారైన నకుల సహదేవుల ప్రణామాలు స్వీకరించాడు. కొత్త పెళ్లికూతురు అయిన ద్రౌపది వచ్చి

కృష్ణుడికి నమస్కరించింది. కృష్ణునితో వచ్చిన సాత్యకి, ఇంకా ఇతర యాదవులు కూడా తమ తమ ఆసనముల మీద కూర్చున్నారు. అందరూ ఇష్టాగోష్టిగా మాట్లాడుకుంటున్నారు.

తరువాత కృష్ణుడు కుంతీ దేవి వద్దకు పోయి ఆమె క్షేమములు విచారించాడు. కృష్ణుని చూడగానే ఆమె కన్నీళ్ల పర్యంతము అయింది. ద్వారకలో ఉన్న వారి క్షేమములు అడిగి తెలుసుకుంది. కృష్ణుని చూడగానే కుంతీదేవికి తమకు కౌరవులు పెట్టిన బాధలు, తమ మీద జరిగిన హత్యాప్రయత్నం అన్నీ గుర్తుకు వచ్చాయి. శోకతప్తురాలయింది. కృష్ణునితో ఇలా అంది.

"కృష్ణా! నీవు మధురకు చేరిన వెంటనే, మా అందరినీ గుర్తుకు తెచ్చుకొని మా అందరి క్షేమములు విచారించి రమ్మని అక్రూరుని హస్తినకు పంపినపుడే నీ దయ వలన మేమంతా క్షేమంగా ఉంటాము అని ధైర్యము కలిగింది. మాకూ ఒక దిక్కు ఉన్నాడు మేము అనాథలము కాము అన్న భావన మాలో పాతుకుపోయింది.

కృష్ణా! నీవు సాక్షాత్తు విష్ణు స్వరూపుడవు. సర్వాంతర్యామివి. వీడు నావాడు, వాడు పరాయివాడు అన్న భావన నీకులేదు. నీకు అందరూ సమానమే. నీ గురించి నిరంతరము ధ్యానం చేసే భక్తుల హృదయాలలో ఎప్పటికీ నిలిచి ఉంటావు. నా కన్నా చిన్నవాడివైనా, నీకు నా నమస్కారము." అని కృష్ణుడికి నమస్కరించింది కుంతి.

యుధిష్ఠిరుడు కృష్ణుడితో ఇలా అన్నాడు. "అధీశ్వరా! ఇంతకు ముందు జన్మలలో మేము ఏం పుణ్యం చేసుకున్నామో గానీ ఈ జన్మలో మాకు నీ దర్శనభాగ్యం లభించింది. మేము సాధారణ మానవులము. ప్రాపంచిక విషయములలో, కామభోగములలో తేలియాడుతుంటాము. అటువంటి మాకు యోగీశ్వరుడవైన నీ దర్శనం కలగడం మా పూర్వజన్మసుకృతంగా భావిస్తున్నాము." అని అన్నాడు.

పాండవుల ఆదరాన్ని అభిమానాన్ని ఆస్వాదిస్తూ కృష్ణుడు వారి దగ్గర కొంతకాలం గడిపాడు. ఒక రోజు అర్జునుడు, కృష్ణుడు రథం మీద సమీపములో ఉన్న వనములోకి విహారముగా వెళ్లారు. అర్జునుడు ఆ అడవిలో ఉన్న క్రూర మృగములను వేటాడి సంహరించాడు. వాటిని తనతో వచ్చిన సేవకులకు ఇచ్చి పంపించాడు. ఇంతలో అర్జునుడికి దాహం వేసింది. యమునా నది వద్దకు నీరు తాగడానికి వెళ్లాడు. అర్జునుడు, కృష్ణుడు యమునా నదిలో స్నానం చేసారు. అలసట తీర్చుకున్నారు. స్వచ్ఛమైన యమునా నదీ జలములను తాగారు. నదీతీరంలో విహరిస్తున్నారు.

ఆ సమయంలో వారు యమునా నదీ తీరంలో విహరిస్తున్న ఒక కన్యను చూచారు. అర్జునుడు ఆ కన్య వద్దకుపోయి ఆమెను ఇలాఅడిగాడు. "సుందరీ! నీవు ఎవరు? ఇక్కడ ఎందుకు ఉన్నావు? నీ తల్లి తండ్రులు ఎవరు? నీకు ఇంకా వివాహం కాలేదనీ, యోగ్యుడైన భర్తకోసం వెదుకుతున్నావనీ తెలుస్తూ ఉంది. నీ గురించి వివరంగా చెప్పు." అని అడిగాడు. ఆ మాటలకు ఆ కన్య ఈ విధంగా సమాధానం ఇచ్చింది.

"నేను సూర్యుని కుమార్తెను. నా పేరు కాళింది. నాకు ఇంకా వివాహం కాలేదు. నేను శ్రీమహావిష్ణువును భర్తగా వరించాను. ఆయన కోసరం తపస్సు చేస్తున్నాను. ఆయన తప్ప వేరే ఎవరినీ వివాహం చేసుకోను. ఇది నా నిర్ణయం. అప్పటి వరకు నేను ఈ యమునా నదీ జలాలలో నివసిస్తూ ఉంటాను." అని పలికింది కాళింది.

అర్జునుడు కృష్ణుడి వద్దకు పోయి ఈ విషయాలన్నీ వివరంగా చెప్పాడు. తరువాత కృష్ణుడు కాళిందిని తన రథము మీద ఎక్కించుకొని యుధిష్ఠిరుని వద్దకు తీసుకొని వెళ్లాడు. ద్వారకకు వెళ్లిన తరువాత, తాను ఆమెను వివాహం చేసుకోదలచినట్లు పాండవులకు చెప్పాడు.

తరువాత పాండవులు కృష్ణుని సాయంతో ఇంద్రప్రస్థము అనే నగరాన్ని నిర్మించుకున్నారు. ఆ నగరంలో సుఖంగా ఉన్నారు. అగ్నిదేవుడు అర్జునుని వద్దకు వచ్చి తనకు ఆహారంగా ఖాండవ వనమును దహించవలెనని కోరికగా ఉందని తనకు సాయం చెయ్యమని కృష్ణార్జునులను కోరాడు. కృష్ణుని తన సారథిగా చేసుకొని అర్జునుడు ఖాండవ వన దహనంలో అగ్నిదేవునికి సాయంగా నిలిచాడు. అందుకు ప్రతిఫలంగా అగ్నిదేవుడు అర్జునునికి గాండీవము అనే ధనుస్సు (విల్లు),. తెల్లని నాలుగు గుర్రములు కట్టిన దివ్యమైన రథము, ఎప్పటికీ అయిపోని బాణములు కల అక్షయతూణీరము, ఎటువంటి అస్త్రములతో కూడా పగులగొట్టబడని దుర్భేద్యమైన కవచమును ఇచ్చాడు.

ఖాండవ వన దహన సమయంలో అర్జునుడు మయుడు అనే దానవ శిల్పిని రక్షించాడు. దానికి ప్రతిఫలంగా మయుడు పాండవులకు ఒక దివ్యమైన మయసభను నిర్మించి ఇచ్చాడు. రాజసూయ యాగ సందర్భంలో ఆ సభను చూడటానికి వచ్చిన దుర్యోధనుడు కనపడని నీటి మడుగులో పడి అవమానాల పాలయ్యాడు.

రాజసూయ యాగము జరిగిన తరువాత, శ్రీకృష్ణుడు, సాత్యకితోనూ యాదవులతోనూ కలిసి, పాండవుల అనుమతి తీసుకొని ద్వారకకు వెళ్లిపోయాడు. ద్వారకకు చేరుకున్న తరువాత తనతో వచ్చిన కాళిందిని శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నాడు కృష్ణుడు.

ఇది ఇలా ఉండగా, విందుడు, అను విందుడు అనే వారు అవంతీ రాజ్యాన్ని పరిపాలిస్తున్నారు. వారు కృష్ణుడి మేనత్త అయిన రాజాధిదేవి కుమారులు.  వారికి ఒక సోదరి ఉంది. ఆమె పేరు మిత్ర వింద.  మిత్రవింద తన బావ శ్రీకృష్ణుని మహిమలను, గుణగణములను విని కృష్ణుని భర్తగా వరించింది. ఇది ఆమె అన్నలకు ఇష్టం లేదు. దానికి తోడు, అవంతీ రాజ్యం హస్తినకు సామంత రాజ్యం. ఆ కారణం చేత విందుడు, అనువిందుడు దుర్యోధనుడు మాట జవదాటరు. దుర్యోధనుడికి మిత్రవిందను పాండవ పక్షాన ఉన్న కృష్ణుడికి ఇచ్చి వివాహం చేయడం ఇష్టంలేదు.  అందుకని విందాను విందులు మిత్రవింద కృష్ణుని పెళ్లిచేసుకోడానికి ఒప్పుకోలేదు. విందాను విందులు తమ సోదరి మిత్రవిందకు స్వయం వరం చాటించారు.

కృష్ణుడు కూడా మిత్రవింద స్వయంవరానికి వెళ్లాడు. అందరు రాజులు చూస్తూ ఉండగా, కృష్ణుడు మిత్రవిందను రథం మీద ఎక్కించుకొని తీసుకొని వెళ్లాడు.

ఇది ఇలా ఉండగా, అయోధ్యా నగరమును నగ్నజిత్తు అనే పరమ ధార్మికుడు అయిన రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయనకు ఒక కూతురు ఉంది. ఆమె పేరు నాగ్నజితి. నగ్నజిత్తు తన కుమార్తెకు స్వయం వరం ఏర్పాటు చేసాడు. ఆయన వద్ద ఏడు ఆబోతు ఎద్దులు ఉన్నాయి. ఆ ఏడు ఆబోతులను లొంగదీసుకున్న వీరుడికి తన కుమార్తెను ఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడు నగ్నజిత్తు.

ఈ వార్త విన్న కృష్ణుడు తన సైన్యముతో అయోధ్యానగరానికి వెళ్లాడు. శ్రీకృష్ణుని రాక గురించి తెలుసుకున్న నగ్నజిత్తు ఆయనకు సకల మర్యాదలు చేసాడు. పూజించాడు. సత్కరించాడు.  నాగ్నజితి కూడా కృష్ణుని చూచింది. కృష్ణుని అందచందాలకు ముగ్ధురాలైన నాగ్నజితి కృష్ణుని తప్ప వేరే ఎవరినీ వివాహం చేసుకోనని మంకు పట్టు పట్టింది.

నాగ్నజితి అగ్నిదేవుని ఆరాధిస్తుంది. తనలో తాను ఇలా అనుకుంది. "నేను అగ్ని దేవుని మనస్ఫూర్తిగా ఆరాధించిన దానను అయితే నాకు కృష్ణుడు భర్తగా లభిస్తాడు. కృష్ణుని భర్తగా పొందాలంటే ఇంకా ఏంచెయ్యాలో తోచడం లేదు." అని అనుకొని  తన మనసులో కృష్ణుని నిలుపుకుంది.

"ఓ దేవా! నేను నీకు ఏమీ చేయలేను. నిన్ను భర్తగా వరించాను. నా కోరిక మన్నించు. నన్ను వివాహమాడు." అని ప్రార్థించింది.

ఈమె పరిస్థితి ఇలా ఉండగా కృష్ణుడు నగ్నజిత్తుతో ఇలా అన్నాడు. "నీ కుమార్తెను వివాహ మాడటానికి నీవు పెట్టిన నిబంధన శాస్త్ర విరుద్ధము. దానిని నేను అంగీకరింపను. నాకు నీ కుమార్తెను వివాహం చేసుకోవాలని కోరికగా ఉంది. నీ కుమార్తె కోసరం నేను నిన్ను యాచించను. అది క్షత్రియ ధర్మం కాదు. నీ కుమార్తెను వివాహం చేసుకోడానికి నేను నీకు ఎటువంటి శుల్కము ఇవ్వను. తరువాత నీ ఇష్టం." అని నీవు నీ కుమార్తెను తనకు ఇచ్చి వివాహం చేయకపోతే బలవంతంగా ఎత్తుకుపోతాను అని నర్మగర్భంగా చెప్పాడు కృష్ణుడు.

ఆ మాటలు విన్న నగ్నజిత్తు ఇలా అన్నాడు. "కృష్ణా! నీ కన్నా గుణవంతుడు, యోగ్యుడు నాకు ఎవరు దొరుకుతారు. నా కుమార్తెకు తగిన వరుడిని నిర్ణయించడానికి ఈ స్వయంవరము, ఈ నిబంధన పెట్టాను కానీ వేరుకాదు. ఇప్పటికి ఎంతో మంది రాజకుమారులు వచ్చి, నా దగ్గర ఉన్న ఎద్దులతో పోట్లాడి, వాడి కొమ్ముల దెబ్బలు తిని వెనుదిరిగి పోయారు. నీవు కూడా నీ శక్తి కొద్దీ ఆ ఎద్దులతో పోరి గెలిస్తే నా కుమార్తెను ఇస్తాను. నీవు గెలవలేవని కాదు. ఏదో ఒక నియమం పెట్టుకున్నప్పుడు దానిని పాటించాలి కదా! పైగా నేనుపెట్టిన నియమాన్ని అతిక్రమించి నా కుమార్తెను నీకు ఇచ్చి వివాహం చేస్తే, ఓడిపోయిన రాజులు నా మీద దండెత్తుతారు. కాబట్టి నా కోసరం, నా

క్షేమం కోసం నీవు ఈ ఎద్దులను లొంగదీసుకుంటే మంచిది." అని నసుగుతూ చెప్పాడు.

వీడి ముచ్చట ఎందుకు కాదనాలి అని కృష్ణుడు తన ధట్టీని బిగించి ఏడు ఎద్దులను ఎదుర్కొన్నాడు. చిన్నప్పటినుండి గోవుల మధ్య ఎద్దుల మధ్య పెరిగిన వాడవడం వల్ల, ఆ ఎద్దులను లొంగదీసుకోవడం కృష్ణుడికి  ఏమంత కష్టం కాలేదు. ఏడు ఎద్దులను తాళ్లతో కట్టాడు. ముక్కుతాళ్లు వేసాడు. వాటిని లాగుకొని వచ్చి నగ్నజిత్తు ఎదుట నిలబెట్టాడు.

శ్రీకృష్ణుని పరాక్రమానికి సంతోషించాడు నగ్నజిత్తు. తన కుమార్తె నాగ్నజితిని కృష్ణునికి ఇచ్చి వైభవంగా వివాహం జరిపించాడు. అయోధ్యలో  గొప్ప ఉత్సవం జరిపించాడు.

నగ్నజిత్తు తన కుమార్తె నాగ్నజితికి పదివేల ఎద్దులు, మూడువేల మంది దాసీలు, తొమ్మిది వేల ఏనుగులు, తొమ్మిది లక్షల రథములు, తొమ్మిది కోట్ల అశ్వములు, నూరు కోట్ల మంది సైనికులను అరణంగా ఇచ్చాడు. వధూవరులను రథం ఎక్కించి సాదరంగా ద్వారకకు పంపాడు నగ్నజిత్తు.

అంతకు ముందు నాగ్నజితిని వివాహం చేసుకోవాలని కోరికతో ఎద్దులతో పోరాడి ఓడి పోయిన రాజులందరూ ఒకటయ్యారు. వారందరూ కృష్ణుని దారిలో ఎదుర్కొన్నారు. అర్జునుడు కృష్ణునితో "కృష్ణా! నీవు నాగ్నజితిని తీసుకొని అయోధ్యకు వెళ్లు. నేను వీళ్ల సంగతి

చూస్తాను." అని అన్నాడు. అర్జునుని అస్త్ర,శస్త్రధాటికి ఆ రాజులు తట్టుకోలేకపోయారు. యధాశక్తి పారిపోయారు. అర్జునుడు కూడా ద్వారకకు చేరుకున్నాడు. కొత్త పెళ్లికూతురు నాగ్నజితి, కాళిందిలతో కృష్ణుడు ఆనందంగా విహరిస్తున్నాడు.

శ్రీకృష్ణునికి మరొక మేనత్త ఉంది. ఆమె పేరు శ్రుతకీర్తి. ఆమె కూతురు పేరు భద్ర. శ్రీకృష్ణుడు తన మేనత్త కూతురు భద్రను కూడా శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నాడు. తరువాత శ్రీకృష్ణుడు మద్రరాజు కుమార్తె తననే భర్తగా వరించిన లక్ష్మణ అనే కన్యను, స్వయంవర మండపము నుండి బలవంతంగా తీసుకొని వచ్చి వివామం చేసుకున్నాడు.
(ఇప్పటికి శ్రీకృష్ణుడు వివాహం చేసుకున్న వారు... రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్ష్మణ. వీరిలో రుక్మిణి, మిత్రవింద, సులక్షణలను బలవంతంగా తీసుకొని వచ్చి వివాహం చేసుకున్నాడు. కాని వీరంతా కృష్ణుని తమ భర్తగా వరించిన వారే! )

ఓ పరీక్షిత్ మహారాజా! తరువాత శ్రీకృష్ణుడు నరకాసురుని సంహరించి వాడి చెరలో ఉన్న వేలకొలది రాజకుమార్తెలను చెర విడిపించి, వారి కోరిక మేరకు వారి నందరినీ వివాహం చేసుకున్నాడు." అని శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు శ్రీకృష్ణుని అష్టభార్యల గురించి వారి వివాహముల గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

యాభై ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

యాభై తొమ్మిదవ అధ్యాయము.

శుక యోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు నరకాసుర వధ వృత్తాంతమును ఈ విధంగా వివరించాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! పూర్వము నరకుడు అనే అసురుడు ఉండేవాడు. వాడు ప్రాగ్జ్యోతిష పురమునకు రాజు. వాడు ఇంద్రుని జయించి అతని వద్ద నుండి వరుణునికి చెందిన ఛత్రమును, అదితి కి చెందిన కుండలములను, మణిపర్వతము అనే ఉద్యానవనమును బలవంతంగా అపహరించాడు. ఈ విషయాన్ని ఇంద్రుడు శ్రీకృష్ణునికి చెప్పాడు. శ్రీకృష్ణుడు తన సేనలతో నరకుని మీదికి యుద్ధానికి వెళ్లాడు. సత్యభామ కూడా శ్రీకృష్ణుని వెంట వెళ్లింది. శ్రీకృష్ణుడు, సత్యభామ గరుడుని మీద ఎక్కి నరకుని మీదికి యుద్ధానికి బయలుదేరారు.

నరకుడు పరిపాలించే ప్రాగ్జ్యోతిష పురము చుట్టు జల దుర్గము అంటే అగడ్తలు ఉన్నాయి. కోట గోడల మీద అగ్నిగోళాలు అమర్చబడి ఉన్నాయి. కోట బురుజుల మీద అస్త్రములు, శస్త్రములతో సాయుధదళాలు కాపలా ఉన్నాయి. అటువంటి నరకాసుర రాజధాని మీదికి యుద్ధానికి వెళ్లాడు శ్రీకృష్ణుడు.

గరుడుని మీద నుండి తనబాణములతో కోట బురుజుల మీద ఉన్న సైనికులను చంపాడు. తరువాత కోట గోడలను అగడ్తలను నాశనం చేసాడు. కోట బురుజుల మీద ఉన్న అగ్ని యంత్రములను, అగ్నిగోళములు (ఫిరంగులు), లోహపు గోళములను (గుండ్లు) విసురు యంత్రములను నాశనం చేసాడు. తన గదతో కోట గోడలను బద్దలు కొట్టాడు. శ్రీకృష్ణుడు విజయసూచకంగా పాంచజన్యమును పూరించాడు.

ఆ శంఖధ్వని విన్న దుర్గ రక్షకుడు అయిన మురుడు అనే రాక్షసుడు పైకి లేచాడు. వాడికి ఐదు తలలు. తన ఐదు తలలను విదిలించాడు. త్రిశూలం తీసుకున్నాడు. కృష్ణుని మీదికి ఉరికాడు. తన త్రిశూలమును గరుడుని మీదికి విసిరాడు. తన ఐదు ముఖములతో వికటాట్టహాసం చేసాడు. ఆ ధ్వనికి మూడులోకములు భయభ్రాంతమయ్యాయి. శ్రీకృష్ణుడు మూడు బాణములు ప్రయోగించి గరుడుని మీదికి వస్తున్న త్రిశూలమును ముక్కలు చేసాడు. తరువాత ఐదు బాణములతో మురుడి ఐదు తలలను కొట్టాడు.

మురుడు తన గదను శ్రీకృష్ణుని మీదికి విసిరాడు. శ్రీకృష్ణుడు తన గదను విసిరి మురుడు విసిరిన గదను ముక్కలు చేసాడు. నిరాయుధుడుగా ఉన్న మురుడు తన చేతులతో శ్రీకృష్ణుని మీదికి దూకాడు. శ్రీకృష్ణుడు తన చక్రాయుధముతో వాడి తలను ఖండించాడు. తల తెగిన మురాసురుడు కోట బయట ఉన్న అగడ్తలో పడిపోయాడు.

మురాసురునికి ఏడుగురు కుమారులు. వారి పేర్లు తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసుడు, వసువు, నభస్వంతుడు, అరుణుడు. తండ్రి మరణ వార్త విన్న ఆ ఏడుగురు కుమారులు శ్రీకృష్ణుని మీద ప్రతీకారం తీర్చుకోడానికి  ఆయన మీదికి యుద్ధానికి బయలుదేరారు.  వీరి యొక్క సేనాధిపతి పీఠుడు తన సేనలతో వారి వెంట బయలుదేరాడు.

మురుడి కుమారులకు, శ్రీకృష్ణుడికి ఘోరయుద్ధం జరిగింది. మురాసురుని కుమారులు వారి సైన్యము ప్రయోగించిన బాణములను, ఖడ్గములను, గదలను, శక్తి మొదలగు ఆయుధములను, ఋష్టులు మొదలగు ఆయుధములను, శూలములను శ్రీకృష్ణుడు తన బాణములతో ముక్కలు చేసాడు. పీఠుడు అతని సేనలు శ్రీకృష్ణుని చేతిలో మరణించారు.

తన సేనాధిపతి పీఠుడు మరణించాడు అన్న వార్త విన్న నరకాసురుడు తన ఏనుగు మీద శ్రీకృష్ణుని మీదికి యుద్ధానికి వచ్చాడు. వచ్చీరాగానే నరకుడు శ్రీకృష్ణుని మీదకు ఒక శతఘ్నిని విసిరాడు. నరకుని సేనాధిపతులుకూడా శ్రీకృష్ణుని మీద నానావిధములైన అస్త్రములు, శస్త్రములు ప్రయోగించారు.

శ్రీకృష్ణుడు తన దృష్టి అంతా నరకుని మీద పెట్టాడు. నరకుడు వేసే బాణములను గరుడుడు అటు ఇటు ఎగురుతూ తప్పించాడు. శ్రీకృష్ణుడు నరకుని రథమును, గుర్రములను, విల్లును ఛేదించాడు. నరకుని గజసైన్యమును, అశ్వ సైన్యమును, సైనికులను తన

బాణములతో చంపాడు. గరుడుడు కూడా అమిత వేగంతో కిందికి దిగి సేనలను తన ముక్కుతో పొడిచి చంపి అదే వేగంతో పైకి ఎగిరేవాడు. శ్రీకృష్ణుని చేతిలో నరకుని సైన్యం అంతా హతం అయింది. మిగిలిన సేనలు పారిపోయారు.

నరకుడు ఒంటరిగా మిగిలాడు. శక్తి అనే ఆయుధమును గరుడుని మీద ప్రయోగించాడు. గరుడుడు ఆ శక్తిని తప్పించుకున్నాడు. తరువాత నరకుడు కృష్ణుని మీదికి తన శూలమును విసిరాడు. ఆ శూలము తన వద్దకు రాక ముందే శ్రీకృష్ణుడు తన చక్రాయుధమును ప్రయోగించి, నరకుని కంఠమును ఛేదించాడు. చెవులకు కుండలములతో, తల మీద మణిమయ కిరీటముతో శోభించే నరకుని తల నేల మీద దొర్లుతూ ఉంది.

అది చూచి నరకుని సేనలు, బంధు మిత్రులు హాహాకారాలు చేసారు. దేవతలు కృష్ణుని మీద పూలవాన కురిపించారు. నరకుని వద్ద ఉన్న అదితి కుండలములను, వైజయన్తిమాలను, వరుణుని ఛత్రమును, ఎవరిది వారికి ఇచ్చాడు కృష్ణుడు. తరువాత భూమాత కృష్ణుని ఈ ప్రకారంగా స్తుతించింది.

"దేవదేవా! శంఖ,చక్ర,గదాధరా! నీవు భక్తుల కోరిక మేరకు కృష్ణుడుగా అవతరించావు. అట్టినీకు నమస్కారము. ఓ పంకజనాభా! పంకజమాలినే! పంకజనేత్రా! పంకజాంఘ్రినే!(తామరపూల వంటి పాదములు కలవాడా!) నీకు నమస్కారము.ఓ భగవాన్! వాసుదేవా! హే విష్ణో! పరమపురుషా! ఆదిదేవా! పూర్ణుడా! నీకు నమస్కారము. ఓ దేవా!

నీకు జన్మ లేదు. కాని బ్రహ్మగా ఈ జగత్తును సృష్టించావు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీవు రజోగుణమును ఆశ్రయించి, బ్రహ్మగా ఈ విశ్వమును సృష్టించావు. జగత్తును లయం చేయడానికి పరమశివుని రూపంలో తమోగుణమును ఆశ్రయించావు. సృష్టి, లయముల మధ్య ఈ జగత్తును పోషించడానికి సత్వగుణమును స్వీకరించావు. కానీ ఈ మూడు గుణములు నీలో లేవు. నీవు గుణాతీతుడవు. కాలస్వరూపుడవు. ఈ ప్రకృతి, పురుషుడు నీవే అయి ఉన్నావు. అట్టి నీకు నమస్కారము.

ఓ దేవా! నాతో కలిపి పంచభూతములు, పంచ తన్మాత్రలు (శబ్దము, రూపము, స్పర్శ,రస,గంధములు), పది ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము, మహత్తత్వము, ఇవన్నీ నీ యందే ఇమిడి ఉన్నాయి. వీటిని వేరుగా, స్వతంత్రంగా చూడటం ఒక భ్రమ తప్ప వేరు కాదు. అన్నీ నీవే అయినప్పుడు, వేటికీ స్వతంత్రత లేదు కదా!

తన తండ్రి నరకాసురుడు నీ చేతిలో మరణించి నందువలన, అతని కుమారుడు చాలా భయంతో ఉన్నాడు. అతనిని నీ వద్దకు తీసుకొని వచ్చాను. ఈ కుమారుడిని నీవు కాపాడు. ఇతనికి అభయం ఇవ్వు. నరకుని కుమారుని నీ దివ్యమైన కరకమలములతో ఆశీర్వదించు." అని కోరింది భూదేవి.

నరకుని కుమారుడు భగదత్తుడు. భూదేవి కోరిక మేరకు, భగదత్తునికి శ్రీకృష్ణుడు అభయం ఇచ్చాడు. ఆశీర్వదించాడు. తరువాత

శ్రీకృష్ణుడు, నరకుని కుమారుడు భగదత్తునితో కలిసి రాజాంత:పురమునకు వెళ్లాడు. నరకుని అంత:పురములో, నరకుడు వివిధదేశాలరాజులను ఓడించి వారి వద్దనుండి బలవంతంగా తెచ్చిన కన్యలు పదహారు వేలమందిని బందీలుగా చూచాడు. వెంటనే వారినందరినీ విడుదలచేయమని భగదత్తుని కోరాడు. శ్రీకృష్ణుని కోరిక మేరకు భగదత్తుడు ఆ కన్యలను విడుదల చేసాడు.

ఆ కన్యలందరూ శ్రీకృష్ణుని చూచి ఆయనే తమ భర్తగా వరించారు. ఆయన మీదనే తమ మనస్సును లగ్నం చేసారు. శ్రీ కృష్ణుడు ఆ రాచ కన్యలను అందరినీ రథముల మీద ఎక్కించి ద్వారకకు పంపాడు. వారితో పాటు భగదత్తుడు ఇచ్చిన ధన,కనక,వస్తు,వాహనములను ద్వారకకు తరలించాడు. నాలుగు దంతములు కలిగి ఐరావతము కులములో పుట్టిన ఏనుగులు 64 భగదత్తుడు కృష్ణునిని కానుకగా ఇచ్చాడు. వాటిని కూడా కృష్ణుడు ద్వారకకు తరలించాడు.

తరువాత శ్రీకృష్ణుడు తన భార్య సత్యభామతో కలిసి ఇంద్రుడి వద్దకు వెళ్లాడు. తన తల్లి అదితిని దర్శించి ఆమెకు కుండలములను ఇచ్చాడు. ఇంతలో సత్యభామ నందన వనములో ఉన్న పారిజాత వృక్షమును చూచి అది తనకు కావాలని కోరింది. తన ముద్దులభార్య సత్యభామ కోరికను మన్నించి, కృష్ణుడు నందన వనములో ఉన్న పారిజాత వృక్షమును పెకలించి గరుడుని మీద పెట్టుకొని తీసుకు పోతూ ఉంటే ఇంద్రుడు తన సేనలతో అడ్డగించాడు. ఇంద్రుని అతని సేనలను ఓడించి, కృష్ణుడు పారిజాత వృక్షమును ద్వారకకు తెచ్చి

సత్యభామ అంత:పురములో నాటించాడు. పారిజాతపుష్పముల వాసనకు అలవాటు పడ్డ భ్రమరములు పారిజాత వృక్షముతో పాటు స్వర్గమునుండి భూలోకమునకు వచ్చాయి.

ఓ పరీక్షిత్ మహారాజా! మొట్ట మొదట ఇంద్రుడు నరకాసురుని బాధలు పడలేక, నరకాసురుని వధించమని కృష్ణుని కోరాడు. ఇంద్రుని కోరిక మేరకు కృష్ణుడు నరకాసురుని వధించాడు. కాని కృష్ణుడు పారిజాతవృక్షమును కోరితే, ఇంద్రుడు యుద్ధానికి దిగాడు. దేవతలు కూడా ఈ రాగద్వేషములకు అతీతులు కారు అనడానికి ఇది ఒక ఉదాహరణ.

తరువాత కృష్ణుడు ద్వారకకు వచ్చి తాను నరకుని చెరనుండి విడిపించిన 16,000 మంది రాజ కన్యలను వివాహం చేసుకున్నాడు. శ్రీకృష్ణుడు అప్పటికే తాను పెళ్లాడిన ఎనిమిది మంది భార్యలను, ఈ 16,000 మందిని అందరినీ సమానంగా ఆదరించాడు, గౌరవించాడు, ప్రేమించాడు, లాలించాడు, అనుగ్రహించాడు. వారందరితోనూ గృహస్థధర్మమైన మైధున క్రియలను కొనసాగించాడు.

శ్రీకృష్ణుని వివాహంచేసుకున్న 16,008 మంది భార్యలు కూడా శ్రీకృష్ణుని మీద అనురాగము కలవారై వారిలో వారికి ఎటువంటి ద్వేషము, మాత్సర్యము లేకుండా కలిసిమెలిసి ఉన్నారు. వారికి ఎంతమంది దాసదాసీజనము ఉన్నప్పటికినీ, వారందరూ శ్రీకృష్ణునికి అన్ని రకాల సేవలు స్వయంగా చేసేవారు. వారందరూ శ్రీకృష్ణుని సేవించడం లోనే ఆనందాన్ని పొందారు. శ్రీకృష్ణుడు తమ

మందిరమునకు రాగానే స్వాగతం పలకడం దగ్గర నుండి, ఆయనకు ఆసనము, స్నానము, వస్త్రధారణ, భోజనము, తాంబూలము., శయ్యను అమర్చడం, విసనకర్రతోవిసరడం అన్ని పనులు తామే స్వయంగా చేసేవారు. ఎన్ని తపస్సులు చేసినా పొందలేని పరమాత్మ సేవలను వారు పొందగలిగారు. వారి అదృష్టము ఏమని చెప్పాలి." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు నరకాసుర వధ గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము యాభైతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
అరువదవ అధ్యాయము.

"పరీక్షిత్ మహారాజా! ఒక రోజు శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవి మందిరంలో ఉన్నాడు. తన శయ్యమీద కూర్చుని ఉన్నాడు. రుక్మిణి పక్కన నిలబడి పరిచారిక చేతిలో ఉన్న వింజామరను తాను తీసుకొని, స్వయంగా విజామర వీస్తూ ఉంది. శ్రీకృష్ణుడు రుక్మిణి ఒకరికి ఒకరు అందచందములలో ఒకరికి ఒకరు తగినట్టుగా ఉన్నారు. తనకు సేవలు చేస్తున్న రుక్మిణిని చూచి కృష్ణుడు ఆమెతో ఇలా అన్నాడు.

"విదర్భరాజకుమారీ! ఈ లోకంలో ఉన్న ఎంతో మంది రాజకుమారులు, వీరులు, శూరులు, నీ అందం గురించి విని, నిన్ను

వివాహమాడటానికి ఉవ్విళ్లూరారు. నీ సోదరుడు, నీ తండ్రి నిన్ను శిశు పాలునికి ఇచ్చి వివాహం చెయ్యడానికి సంకల్పించాడు. కానీ నీవు నన్ను వరించావు. నాకు లేఖ రాసావు. నన్ను పిలిపించుకున్నావు. నా వెంట వచ్చావు.

నిజం చెప్పాలంటే నేను వారికి ఎందులోనూ సాటి రాను. వారందరూ మహారాజులు, చక్రవర్తులు. నేను ఏ దేశానికి రాజును కాను. వారి వద్ద ఉన్న ధనము, సంపదలు నా వద్దలేవు. పైగా నేను జరాసంధుడికి భయపడి ద్వారకలో దాక్కున్న పిరికివాడిని. నా మీద రాజులందరూ ద్వేషంతో ఉన్నారు. (13)

దేవీ! నాకు ఏ కోరికలూ లేవు. నాకు సంపదలు లేదు. నాకు సంపదల మీద ఆసక్తిలేదు. నాకు యోగుల మీద సన్యాసుల మీద ఆసక్తి కానీ ధనవంతుల మీద కాదు. అటువంటి నన్ను రాజులు, ధనవంతులు ఆదరించరు.

ఒక వివాహం జరగాలంటే ఈడూ జోడూ ఉండాలి. వియ్యమైనా కయ్యమైనా సమాన మైన వారి మధ్యనే జరగాలి. కులములో కానీ, ఐశ్వర్యములో కానీ, రూపములో కానీ, మంచి పుట్టుకలో కానీ, ధనము లో కానీ, సమానంగా ఉన్న వారి మధ్యనే వివాహాలు జరుగుతుంటాయి. ధనము,ఐశ్వర్యము, కులములలో హెచ్చుతగ్గులు ఉంటే ఆ వివాహాలు జరుగవు. ఒకవేళ జరిగినా కలకాలం నిలబడవు.

ఆ సంగతి తెలిసి కూడా ఏ మాత్రం దూర దృష్టి లేకుండా నా బోటి వాడిని వరించావు.

అయినా నా సంగతి నీకు పూర్తిగా తెలిసే నన్ను వరించావా! నేను బాల్యంలో గోపికలతో విహరించాను తెలుసా? నాకు యోగులు, సన్యాసులు అంటేనే ఇష్టం. అటు వంటి నన్ను ఎలా వరించావో అర్థం కావడం లేదు. రుక్మిణీ! ఇప్పటికీ మించి పోయింది లేదు. ఇప్పుడైనా నీకు తగిన వాడిని, చక్రవర్తిని, ధనము, సంపదలు కలవాడిని చూచి వివాహం చేసుకో! నీ జీవితం సుఖమయం చేసుకో! ఇంతమంది సవతుల మధ్య ఏం సుఖపడతావు!

పైగా నీ అన్న రుక్మిణి నన్ను నిరంతరము ద్వేషిస్తూనే ఉంటాడు. నీకు నా వలన పుట్టింటి సుఖం దూరం అయింది. పైగా మహా బలవంతులు అయిన జరాసంధ, సాళ్వ,శిశుపాల,దంతవక్త్రులు నాకు శత్రువులు. వారి వల్ల నాకు ప్రమాదం ఎల్లప్పుడూ పొంచి ఉంటుంది. కేవలం ఆ దుష్టుల నుండి కాపాడడానికే నిన్ను తీసుకొని వచ్చాను కానీ, నీ మీద ప్రేమ ఉండి కాదు.

రుక్మిణీ! నేను నీ కు ఒక విషయం స్పష్టం చేయదలిచాను. నాకు ఈ సంసారము, దేహము, ఇల్లు, మొదలగు విషయములు అంటే ఆసక్తి అసలు లేదు. భార్య  పిల్లలు ధనము, ఐశ్వర్యము మొదలగు వాటి మీద ఏ మాత్రం కోరికలేదు. నేను ఎల్లప్పుడూ నా ఆత్మను పరమాత్మతో అనుసందానం చేసి ఆత్మానందం పొందుతుంటాను. నేను ఏ కర్మను ఆసక్తితో చేయను. నేను ఆ కర్మ

చేయాలి కాబట్టి చేస్తుంటాను. ఫలితాన్ని ఆశించి ఏ కర్మ చెయ్యను. అటువంటి నిష్క్రియాపరుడిని నన్ను కట్టుకుని ఏం సుఖపడుతున్నావు. ఆలోచించు." అని అన్నాడు కృష్ణుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! రుక్మిణికి ఇటీవల కొంచెం గర్వం పెరిగింది. తాను అందరి భార్యలకాన్న గొప్పదానిననీ, పట్టపురాణిని అనీ, అందరిలోకీ అందగత్తెననీ గర్వంగా ఉండేది. ఆ గర్వాన్ని పోగొట్టడానికే కృష్ణుడు ఆ విధంగా మాట్లాడాడు. అనవలసినవి అన్నీ అనేసి, రుక్మిణి ఏం అంటుందా అని ఎదురుచూస్తున్నాడు కృష్ణుడు.

కృష్ణుడు శరములు సంధించినట్టు ఒక్కొక్క మాట అంటుంటే రుక్మిణి ఏడుపు ఆగలేదు. వెక్కివెక్కి ఏడుస్తూ ఉంది. ఎక్కడ కృష్ణుడు తనను వదిలేస్తాడేమో అని మనసంతా చింతతో నిండి పోయింది. తన బొటనవేలితో నేల మీద రాస్తూ ఉంది. ఆమె కన్నీళ్లు గుండెలమీదికి ధారాపాతంగా కారుతున్నాయి. నోటి నుండి మాట పెగలడం లేదు. గొంతు బొంగురుపోయింది. చేతిలో నుండి వింజామర జారిపోయింది. దేహంలో ప్రాణం ఉందా పోయిందా అన్నట్టు అలాగే రాయిలాగా నిలబడిపోయింది. ఇంక ఏమాత్రం నిలబడలేక, కుప్పకూలిపోయింది.

అప్పుడు కృష్ణుడికి రుక్మిణి మీద దయ కలిగింది. తన ఆసనము మీది నుండి దిగాడు. రుక్మిణి వద్దకు వచ్చాడు. ఆమె బుజాలు పట్టుకొని లేవదీసాడు. ఆమె జుట్టును ముడివేసాడు. కన్నీళ్లు లాలనగా తుడిచాడు. రుక్మిణిని గట్టిగా కౌగలించుకున్నాడు. రుక్మిణిని ఓదార్చాడు. రుక్మిణి ముంగురులు సవరిస్తూ ఇలా అన్నాడు.

"దేవీ! నా మీద కోపమా! నీకు నా మీద ఎంత ప్రేమ ఉందో తెలుసుకోడానికి అలా అన్నాను కానీ, నీ మీద నాకు నిజంగా ప్రేమలేక కాదు. చూడు. నీమీద ప్రేమ లేకపోతే, నీవు రాసిన లేఖను చూచీచూడగానే అమాంతం ద్వారకనుండి విదర్భకు పరుగెత్తుకొని వస్తానా చెప్పు. నిజం చెప్పనా!

దేవీ! నీవు కోపంలో ఎంతో బావుంటావు. ప్రణయ కోపంతో అందంగా అదిరే పెదాలు, నీకు కోపం వస్తే నీ కళ్లలో కనపడే ఎరుపు జీర, ధనుస్సులాంటి నీ కనుబొమలు పైకి కిందికి ఆడడం, వీటన్నిటితో అలరారే తామర పూవు వంటి నీ ముఖము, వీటిని చూడడానికే నేను అలా అన్నాను. ప్రేమించే భార్యతో సరసాలు ఆడటం, ప్రియురాలికి కోపం తెప్పించడం, ఆ కోపంలో అందమైన ఆమె ముఖాన్ని చూడటం, ప్రియులకు సర్వసాధారణం కదా! ఎప్పుడూ ప్రియంగా మాట్లాడుకుంటే నవ్వుకుంటే ఏం బాగుంటుంది చెప్పు. కాసేపు సరదాగా ప్రణయ కలహములతో గడిపితేను సంసారములో అందం ఆనందం." అని రుక్మిణిని ఓదార్చాడు కృష్ణుడు.

కృష్ణుడు ఎన్ని మాటలు మాట్లాడినా రుక్మిణిలో ఉన్న భయం పోలేదు. కృష్ణుడిని అలాగే కౌగలించుకొని వదలలేదు. కృష్ణుడు తన భార్య రుక్మిణి వీపు నిమురుతూ ఉంటే, రుక్మిణి తల పైకెత్తి కృష్ణుడి ముఖంలోకి చూస్తూ ఇలా అంది.

"నాథా! మూడు గుణములు నీలో ఉన్నాయి. అవి తమ సౌందర్యముతో ప్రకాశిస్తున్నాయి. నీ మహిమలు అద్భుతములు.

అటువంటి నీవు నాకు తగినవాడవు కావు అని అన్నావు.

నీవు చెప్పినది నిజమే. నీవు నాకు తగినవాడవు కావు. ఎందుకంటే, నీవు మూడు లోకములకు అధిపతివి. బ్రహ్మను, శివుని శాసించేవాడివి. సకల ఐశ్వర్యములను అధినేతవు. అటు వంటి నీవు ఎక్కడ! రజోగుణము, తమోగుణములతో కూడిన దానను, ధనం కోసం పనిచేసే నా దాసదాసీల చేత కాళ్లు మొక్కించుకొనే దానను నేనెక్కడ!

నీవు జరాసంధుడు మొదలగు రాజులకు భయపడి సముద్రమధ్యలో నగరమును నిర్మించుకొని ఉన్నావు అనడం కూడా యదార్థమే! దుష్టులైన రాజులకు భయపడి నీ భక్తులయొక్క హృదయ సముద్రములలో పరమాత్మ స్వరూపుడుగా శయనించి ఉన్నావు.

రాజులందరూ నీ మీద వైరంతో ఉన్నారు అని అన్నావు. ఇది కూడా నిజమే. కోపము,లోభము,మోహము,కామము,మదము మాత్సర్యము అనే దుష్టులైన రాజులు నీ మీద వైరంతో ఉన్నారు. మహాబలవంతులై నిత్యము మానవులను హింసిస్తున్న అరిషడ్వర్గములు నీకు శత్రువులు కావడంలో ఆశ్చర్యం ఏముంది.

నీవు మరొకటి కూడా అన్నావు. నీకు రాజ్యము లేదు. రాజ సింహాసనము లేదు అని అన్నావు. అదీ నిజమే. నీవే కాదు, నిన్ను సేవించే భక్తులు కూడా ఈ రాజ్యములు, రాజ సింహాసనములు, రాజభోగములు, స్వర్గలోక సుఖములను కూడా అన్నిటినీ

తృణప్రాయంగా త్యజిస్తారు. నీ పాదసేవకోసం పాకులాడుతుంటారు. అట్టి నీవు రాజసింహాసనం విడిచిపెట్టడంలో విశేషం ఏముంది.

నాధా! నీకు ప్రాపంచిక విషయములు ఇష్టము లేవనియు నిగూఢములైన విషయములందే ఆసక్తి కలిగి ఉంటావని అన్నావు. అదీ నిజమే. నిరంతరము నీ పాదములనే సేవిస్తూ, నీ మీద అచంచలమైన భక్తి కలిగి ఉండే వారికి కూడా నీ గురించి ఏమీ తెలియదు. ఇంక నాబోటి సామాన్య మానవుల సంగతి చెప్పనక్కరలేదు. నువ్వే కాదు, నిన్ను  సేవించే భక్తులు కూడా నీ వలెనే ఎవ్వరికీ అర్థం కారు. ఈ సకల జగత్తులను శాసించే నీవు కూడా ఎవరికీ అర్థంకావు అనడంలో అతిశయోక్తి లేదు.

తమరు మరో మాట కూడా అన్నారు. "నేను ఎవరినుండీ ఏమీ కోరను." అని కూడా అన్నావు. అదీ నిజమే. అందరి చేతా పూజలు అందుకుంటున్న బ్రహ్మ, మహేశ్వరుడు కూడా నిన్నే పూజిస్తూ ఉంటారు. నీవు తప్ప ఏ ఇతర పదార్థము ఈ సృష్టిలో లేదు. అటువంటి నీవు ఇతరుల నుండి ఏదైనా కోరడానికి అవకాశం ఏముంటుంది? నీకు ఏదైనా లేకపోతే కదా ఇతరుల నుండి కోరడానికి!

తమరు ఇంకొక మాట కూడా అన్నారు. "ధనికులు నన్ను పూజించరు" అని అన్నారు. అదీ యదార్థమే. ధనము, సంపదలు ఉన్న వారు గర్వంతో గుడ్డివారైపోతారు. వారికి ప్రాపంచిక విషయములు తప్ప నీ గురించి పట్టదు. అటువంటి వారు నిన్ను ఎలా పూజిస్తారు.

నాథా! సమస్తపురుషార్థములు నీలోనే ఉన్నాయి. సకలఫలములను ఇచ్చేవాడివి నువ్వే! నీ గురించి తెలుసుకోడానికి పండితులు నానాపాట్లు పడుతుంటారు. ఆ కారణం చేత నీవు నీ భక్తులకు మాత్రమే సంబంధం ఉంటుంది. కేవలం ప్రాపంచిక సుఖములలో మునిగితేలుతూ, విషయవాంఛలతో తృప్తిపడేవారికి నీతో ఎలాంటి సంబంధం ఉండదు. ఈ ప్రాపంచిక విషయములను విడిచిపెట్టినవారు మాత్రమే నిన్ను తెలుసుకోగలరు.

నీవు సకల జగత్తులోనూ అంతర్యామిగా వెలుగుతున్నావు. నీ భక్తులకు నిన్ను నీవు అర్పించుకుంటావు. ఈ విషయం నాకు తెలుసు. అందుకనే నేను బ్రహ్మ, శివుడు మొదలగు దేవతలను వదిలిపెట్టి నిన్నే నా హృదయ పీఠంలో నిలుపుకున్నాను.

నీవు పురుషులలో సింహము వంటి వాడివి. సింహము ఇతర జంతువులను జయించినట్టు నీవు కూడా ఇతర రాజులను జయించి, నన్ను తీసుకొని వచ్చావు. అటువంటి నీవు తుచ్ఛులైన రాజులకు భయపడి సముద్రములో దాక్కున్నావు అని అనడం కూడా సమ్మతమే. ఎందుకంటే ఇదంతా నువ్వు నా కోసము, నా ప్రేమకోసరం, నన్ను పెళ్లిచేసుకోవడం కోసమే కదా చేసావు!

తమరు ఇంకొక మాట కూడా అన్నారు. నాకు సన్యాసము, సన్యాసులు అంటే ఇష్టము సంసారము అంటే విరక్తి అని అన్నారు. పూర్వము అంగరాజు, యయాతి, పృథుడు, భరతుడు, గయుడు మొదలగు చక్రవర్తులు, నీ పాదములను సేవించి వానప్రస్థమునకు

వెళ్లారు కదా! వారు నీ మార్గమును అనుసరించి వెళ్లిన వారే! మరి వారు దానికి ఏమీ చింతించలేదు కదా! అన్నిగుణములు నీలో ఇముడ్చుకున్న నీ పాదకమలములు ఆత్మజ్ఞానమును పొందిన వారికి ఆశ్రయములు. లక్ష్మీదేవి కూడా నీ పాదములను ఆశ్రయించి ఉంటుంది. సకల జనులకు మోక్షమును ప్రసాదించేవి నీ పాదపద్మములు. ఇంక మానవలోకములో ఉన్న నా బోటి స్త్రీలకు నీ పాదపద్మముల ఆశ్రయం దొరికితో, వారు వేరే పురుషులగురించి ఎందుకు ఆలోచిస్తారు. పరపురుషులను ఎందుకు ఆశ్రయిస్తారు.

కాబట్టి ఓ నాధా! జగద్రక్షకా! సర్వాంతర్యామీ! అన్ని కోరికలు తీర్చేవాడా! నాకు నీవే శరణ్యము. నిన్ను సేవించిన వారి సంసార బంధనములు ఛేదించి వారిని నీ వద్దకు చేర్చుకుంటావు. అందుచేత ఈ జన్మలోనే కాదు రాబోవు జన్మలలో కూడా నాకు నీ పాదకమలముల సేవను అనుగ్రహించమని కోరుకుంటున్నాను.

ఓ దేవదేవా! బ్రహ్మ మొదలగు దేవతా గణములు కీర్తించే నీ లీలలు ఏ స్త్రీ వినకుండా, సాంసారిక విషయములలో మునిగితేలుతూ ఉంటుందో, వాళ్లు మానవులు కారు. మానవ రూపములలో ఉన్న జంతువులు. జంతువులకు ఆహార, నిద్ర, మైధునములు తప్ప నీ పాదముల మీద ఆసక్తి ఉండదు కదా!  ఇది వరకు నువ్వు చెప్పావే ఆ దుర్మార్గులు అయిన రాజులు వాళ్లకు భర్తలుగా లభిస్తారు. అటువంటి స్త్రీలు దుర్మార్గులు అయిన రాజులతో సంసారంలో పడి మునిగి తేలుతుంటారు. జనన మరణ చక్రంలో గిరా గిరా తిరుగుతుంటారు.

ఓ దేవదేవా! నీ పాదపద్మములను సేవించని స్త్రీలు కేవలము చర్మము, రక్తము, మాంసము, ఎముకలతో కూడిన శరీరములను కలిగి జీవస్తూ కూడా శవముల మాదిరి బతుకుతున్న మగవారిని భర్తలుగా పొందుతారు. అటువంటి జీవచ్ఛవములకు సేవలు చేస్తుంటారు కానీ నీ గురించి తలచుకోరు. కాని ఒక సామాన్య స్త్రీని అయిన నాకు పరమపురుషుడవైన నీవు భర్తగా లభించావు. నాకు నీ పాదముల మీద నిరంతర భక్తి ఆసక్తి కలిగి ఉండేటట్టు అనుగ్రహించు.

ఓ దేవా! నీవు శుద్ధసత్వగుణ సంపన్నుడవు. కాని నాకు సంతానమును అనుగ్రహించే ఉద్దేశములో రజోగుణమును దాల్చి నన్ను కలిసినపుడు అదే నాకు పరమానందాన్ని కలిగిస్తుంది. ఆ ఆనందాన్ని నాకు అనుగ్రహించు.

నాథా! “నీకు తగిన వాడిని చూచి వరించు” అని అన్నావు. అది నిజమే కదా! నేను నా పెళ్లి కాకముందు నాకు తగినవాడిని ఎన్నుకొని వరించాను. వరించిన వాడిని లేఖరాసి పిలిపించుకున్నాను. వివాహం చేసుకున్నాను. నీవు చెప్పినట్టు నాకు తగినవాడినే వివాహం చేసుకున్నాను కదా! అయినా నా ప్రవర్తన బాగా లేకపోతే నీవు నా కోసం రావు. నన్ను పెళ్లి చేసుకోవు. కాబట్టి నేను ఇంక పరపురుషుని మనసులో కూడా తలంచుకొనే ప్రసక్తి లేదు.” అని చెప్పి కృష్ణుడి గుండెల మీద తలవాల్చి మౌనం వహించింది.

రుక్మిణి పలికిన పలుకులు విన్న కృష్ణుడు చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు.

"సాధ్వీ! నేను చెప్పిన ప్రతి మాటకు సానుకూలమైన అర్థము చెప్పావు. నీ నోటి వెంట ఇటువంటి మాటలు వినడానికే నీతో ఆ విధంగా మాట్లాడాను. నా మాటలకు నీ వ్యాఖ్యానము అక్షరసత్యము. కళ్యాణీ! నీకు నా అనుగ్రహము ఆశీస్సులు ఎల్లప్పుడూ ఉంటాయి. నీవు నాకు సహధర్మచారిణివే కాదు. నాకు అనన్యభక్తురాలివి. నిన్ను నేను నా పరుషము లైన మాటలతో నీ మనస్సును చలింపచేయడానికి ప్రయత్నించాను. కానీ నీవు ఏ మాత్రముచలించకుండా, నా మాటలు నాకే అప్పచెప్పావు. నీకు నా మీద ఉన్న ప్రేమ, పాతివ్రత్యము, పతిభక్తి వెల్లడిచేసావు.

ప్రాపంచిక విషయములతోనూ. విషయ వాంఛలతోనూ, ఏవేవో కోరికలతోనూ నన్ను పూజించేవాళ్లు, నా గురించి తపస్సు చేసేవాళ్లు, వారందరూ నా మాయకు లోబడి ఉంటారు కానీ నా అనుగ్రహాన్ని పొందలేరు. కొంత మంది నా గురించి తపస్సు చేస్తారు. నన్ను భక్తితో పూజిస్తారు. కాని వారి కోరికలు మాత్రము ప్రాపంచిక విషయముల మీద, విషయ వాంఛల మీదనే ఉంటాయి. అటువంటి వారు మందభాగ్యులు. వారికి నా అనుగ్రహము లభించదు.

నా ప్రాణేశ్వరీ! నీకు నా మీద ఉన్నది నిష్కామ ప్రేమ. నీవు నన్ను ఏ కోరికలు లేకుండా సేవిస్తున్నావు. కాని ఎల్లప్పుడు కామకోరికలతో సతమతమయ్యే వారు, ఇంద్రియసుఖములకు దాసులు అయిన వాళ్లు, ఎదుటి వారిని మోసం చేయడానికి

ఎల్లప్పుడూ ప్రయత్నించేవారు, ఇటువంటి స్త్రీలకు నా మీద నిష్కామ ప్రేమ ఎన్నటికీ కలుగదు.

దేవీ! నిన్ను వివాహం చేసుకోడానికి ఎంతో మంది రాజులు, చక్రవర్తులు, ధనవంతులు వచ్చారు. వారి నందరినీ కాదని, నన్ను వరించి, నాకే లేఖరాసి, నన్ను నీ వద్దకు రప్పించుకున్నావు. నీ వంటి ప్రణయమూర్తి, ధర్మపత్ని  మూడులోకములలో లేదు. నేను నీ అన్నగారైన రుక్మిని అవమానించాను. నీకు తీవ్రమైన దు:ఖమును కలిగించాను. ఆ దు:ఖమును  నా మీద ఉన్న ప్రేమతో  సహించావు. నీకు ఉన్న మంచి గుణములు, సహనశీలత నాకు నీ మీద ఉన్న ప్రేమను ఇనుమడింపజేసాయి.

దేవీ! నీవు నా వద్దకు ఒక బ్రాహ్మణుని దూతగా పంపావు. కాని ఆ బ్రాహ్మణుడు కానీ, నేను కానీ ఎంతకూ రాలేదు. వివాహ సమయం సమీపిస్తూ ఉంది. అట్టి సమయంలో నీవు పడ్డ మనోవేదన, ఈ లోకం అంతా శూన్యంగా భావించి నీవు అనుభవించిన చిత్తక్షోభ , తుదకు నీవు దేహత్యాగమునకు కూడా సిద్ధపడటం, ఇవన్నీ నాకు తెలియనివి కావు. కాని నేను నిన్ను పెళ్లిచేసుకొని నా ప్రేమను పంచి ఇవ్వడం తప్ప ఇంకేమీ ఇవ్వలేకపోయాను. నీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియడం లేదు. అటువంటి శక్తి సామర్థ్యాలు నాకు లేవు." అని కృష్ణుడు రుక్మిణితో ప్రేమగా ఆర్ద్రంగా మాట్లాడాడు.

రుక్మిణి శోకమంతా దూదిపింజ లాగా ఎగిరిపోయింది. కృష్ణునితో ఆనందంగా విహరించింది. కృష్ణుడు రుక్మిణితోనే కాదు ఇతర భార్యల వద్ద ఉన్నప్పుడూ ఇటువంటి చతురమైన మాట్లాడి వారికి

కోపం తాపం కలిగించి మరలా అనునయిస్తున్నాడు.” అని శుకయోగీంద్రుడు పరీక్షిత్ మహారాజుతో రుక్మిణీ కృష్ణుల సంవాదమును వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము అరువదియవ అధ్యాయము సంపూర్ణము.

దశమస్కంధము రెండవ భాగము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్: 9866140619, 9391134792

ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## అరవై ఒకటవ అధ్యాయము.

“ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు తన పదహారువేల ఎనిమిదిమంది భార్యల యందు ఒకొక్కరికి పది మంది సంతానాన్ని ప్రసాదించాడు. వారంతా కృష్ణునితో సమానమైన బలపరాక్రమములు కలిగిఉన్నారు. శ్రీకృష్ణుడు ఎప్పుడూ ఎవరి గృహములోనూ ఉండే వాడు కాదు. కాని కృష్ణుడు భార్యలందరికీ కృష్ణుడు ఎల్లప్పుడూ తన వద్దనే తన గృహములోనే ఉన్నాడు అనే భ్రమకలిగించాడు. కృష్ణుని భార్యలు అందరూ కృష్ణుడికి తన మీదనే ఎక్కువ ప్రేమ అందుకనే ఎల్లప్పుడూ నా వద్దనే ఉన్నాడు అని అనుకుంటూ ఉండేవారు.

కృష్ణుని భార్యలందరూ కృష్ణుని మనోహరమైన ముఖ కమలమును, దీర్ఘబాహువులను, విశాలమైన వక్షస్థలమును, తామర రేకుల వంటి కళ్లను, ప్రేమతో నిండిన చూపులను, ఆయన మాట్లాడే చతురమైన సంభాషణములను, చూచి మోహంలో పడిపోతుంటారు. కానీ ఎవరు కూడా కృష్ణుని మనసు తెలుసుకోలేకపోయారు. కృష్ణుని చిత్తమును వశం చేసుకోవడానికి ఎవరి తరమూ కాలేదు.

శ్రీకృష్ణుని భార్యలు అందరూ తమ చిరునవ్వుతోనూ, హావభావములతోనూ, మన్మధబాణముల వంటి తమ చూపులతోనూ, కామశాస్త్రములో చెప్పబడిన వివిధరీతుల రతిభంగిమలతోనూ, ఇంకా ఇతర ఉపాయములతోనూ శ్రీకృష్ణుని శరీరమును వశం చేసుకో గలిగారే కానీ, ఆయన మనసును ఏ మాత్రము గెలువలేక పోయారు.

వారంతా శ్రీకృష్ణునికి భార్యలు అయి ఉండి కూడా, ఆయన సన్నిధానములో ఎల్లప్పుడు ఉండికూడా, శ్రీకృష్ణునికి సకల పరిచర్యలు స్వయంగా చేస్తూ ఉండి కూడా, కృష్ణుని గురించి, ఆయన తత్వముగురించి ఏ మాత్రమూ తెలుసుకోలేకపోయారు.

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుని సంతానము గురించి చెబుతాను విను. శ్రీకృష్ణునికి రుక్మిణి ద్వారా, ప్రద్యుమ్నుడు, చారుధేష్ణుడు, సుధేష్ణుడు, చారుదేహుడు, సుచారువు, చారు గుప్తుడు, భద్రచారువు, చారు చంద్రుడు, విచారువు, చారువు అనే పది మంది సంతానము కలిగారు.

శ్రీకృష్ణునికి సత్యభామ వలన భానువు, సుభానువు, స్వర్భానువు, ప్రభానువు, భానుమానుడు, చంద్రభానుడు, బృహద్భానుడు, అతిభానుడు, శ్రీభానుడు, ప్రతిభానుడు అనే పది మంది కుమారులు కలిగారు.

జాంబవతికి సాంబుడు, సుమిత్రుడు, పురుజిత్తు, శతజిత్తు, సహస్రజిత్తు, విజయుడు, చిత్రకేతువు, వసుమానుడు, ద్రవిడుడు, క్రతువు అనే పదిమంది కుమారులు కలిగారు.

నాగ్నజితికి వీరుడు, చంద్రుడు, అశ్వసేనుడు, చిత్రగువు, వేగవానుడు, వృషుడు, ఆముడు, శంకువు, వసువు, కుంతి అనే పది మంది కుమారులు కలిగారు.

కాళింది అనే భార్యకు శ్రీకృష్ణుని వలన శ్రుతుడు, కవి, వృషుడు, వీరుడు, సుబాహువు, భద్రుడు, శాంతి, దర్శుడు, పూర్ణమానుడు, సోమకుడు అనే పది మంది పుత్రులు కలిగారు.

మాద్రి అనే భార్యకు ప్రఘోషుడు, గాత్రవానుడు, సింహుడు, బలుడు, ప్రబలుడు, ఊర్ధ్వగుడు, మహాశక్తి, సహుడు, ఓజుడు, అపరాజితుడు అనే పది మంది సంతానము కలిగారు.

మిత్రవిందకు వృకుడు, హర్షుడు, అనిలుడు, గృధ్రుడు, వర్ధనుడు, అన్నాదుడు, మహాంసుడు, పావనుడు, వహ్ని, క్షుధి అనే పదిమంది కుమారులు కలిగారు.

శ్రీకృష్ణుని ఆఖరి భార్య అయిన భద్రకు సంగ్రామజిత్తు, బృహత్సేనుడు, శూరుడు, ప్రహరణుడు, అరిజిత్తు, జయుడు, సుభద్రుడు, వాముడు, ఆయుడు, సత్యకుడు అనే పేర్లుగల పదిమంది కుమారులు జన్మించారు.

ఓ పరీక్షిత్ మహారాజా! రుక్మిణి అన్నగారు రుక్మి.  ఆయన కుమార్తె పేరు రుక్మవతి. రుక్మవతిని కృష్ణునికి రుక్మిణికి కలిగిన కుమారుడు ప్రద్యుమ్నుడు వివాహం చేసుకున్నాడు. ప్రద్యుమ్నునికి, రుక్మవతికి ఒక కుమారుడు జన్మించాడు. ఆ కుమారుని పేరు అనిరుద్ధుడు.

కృష్ణుని పదహారువేల మంది భార్యలకు ఒక్కొక్కరికీ పదిమంది కుమారులు జన్మించారు. ఆ కుమారులకు కుమారులు జన్మించారు. ఆ ప్రకారంగా కృష్ణుని పుత్రులు, పౌత్రులు కోటాను కోట్లమంది కలిగారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణుని సంతానమును గురించి వివరించాడు.

ఇప్పుడు పరీక్షిత్ మహారాజుకు ఒక అనుమానం వచ్చింది. "మహర్షీ! కృష్ణుడికీ, రుక్మికి విరోధం ఉంది కదా! కృష్ణుడు రుక్మిని అవమానించాడు కదా! రుక్మి సమయం దొరికితో కృష్ణుడిని చంపుదామని ఎదురుచూస్తున్నాడు కదా! మరి తన కుమార్తె రుక్మవతిని కృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నునికి ఇచ్చి వివాహం ఎలా చేసాడు? ఒకరిని ఒకరు ద్వేషించుకొనే కృష్ణుడు, రుక్మి మధ్య ఇచ్చిపుచ్చుకోడాలు ఎలా జరిగాయి. మీరు భూత, భవిష్యత్, వర్తమానములను తెలుసుకోగలిగిన యోగులు. ఈ ప్రపంచంలో జరిగే అన్ని విషయములను చూడగలరు. ఈ విషయాన్ని కూడా నాకు వివరంగా తెలియచేయండి." అని అడిగాడు.

శుకుడు ఇలా చెప్పసాగాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! పరమశివుని చేతిలో భస్మం అయిన మన్మధుడే, శ్రీకృష్ణుడు, రుక్మిణికి కుమారుడుగా ప్రద్యుమ్నుని పేరుతో పుట్టాడు అని చెప్పాను కదా! రుక్మి తన కుమార్తె రుక్మవతికి స్వయంవరం ప్రకటించాడు. ఆ స్వయంవరానికి ప్రద్యుమ్నుడు కూడా వెళ్లాడు. రుక్మవతిని చూచాడు. మోహించాడు. స్వయంవరానికి వచ్చిన రాజులందరినీ ఎదిరించి, జయించి, రుక్మవతిని తనకు ఇమ్మని రుక్మిని అడిగాడు.

రుక్మి కోపం కృష్ణుని మీద కానీ, తన సోదరి రుక్మిణి మీద కాదు. అందుకని రుక్మిణి కుమారుడు, తన మేనల్లుడు అయిన ప్రద్యుమ్నుడికి తన కుమార్తె రుక్మవతిని ఇచ్చి వివాహం జరిపించాడు. రుక్మిణికి ఒక కుమార్తె కూడా ఉంది. ఆమె పేరు చారుమతి. ఆ చారుమతిని కృతవర్మ కుమారుడు బలి వివాహం చేసుకున్నాడు.

ప్రద్యుమ్నునికి రుక్మవతి వలన  ఒక కుమారుడు కలిగాడు. అతని పేరు అనిరుద్ధుడు. తన చెల్లెలు రుక్మిణికి సంతోషాన్ని కలిగించడానికి రుక్మి తన మనుమరాలిని అనిరుద్ధునికి ఇచ్చి వివాహం చేసాడు. ఆ వివాహానికి శ్రీకృష్ణుడు, బలరాముడు, రుక్మిణి, సాంబుడు, ప్రద్యుమ్నుడు మొదలగు వారంతా భోజకటకమునకు వెళ్లారు. వివాహం వైభవంగా జరిగింది.  ఆ వివామానికి కళింగరాజులు కూడా వచ్చారు.

కళింగ రాజులు మహాగర్విష్టులు. వచ్చిన వాళ్లు వివాహం చూచి భోజనం చేసి సత్కారాలు పొంది వెళ్లకుండా, రుక్మిని బలరామునితో పాచికలాగ ఆడమని బలవంతపెట్టారు. బలరాముని ఎలాగైనా పాచికల ఆటలో ఓడించాలని పట్టుబట్టారు. విధిలేని పరిస్థితులలో రుక్మి, బలరాముడు పాచికల ఆట ఆడారు. పాచికల ఆటలో అంతగా నైపుణ్యము లేని బలరాముడు ఓడిపోయాడు. ఓడిపోయిన బలరాముని చూచి కళింగ రాజులు హేళన చేస్తూ పకపకా నవ్వారు. బలరామునికి తీవ్రంగా కోపం వచ్చింది. కాని తమాయించుకున్నాడు.

ఈ సారి రుక్మి లక్ష పణాలు పందెంగా పెట్టాడు. ఆ ఆటలో బలరాముడు గెలిచాడు. ఇన్ని ఆటలు ఓడిన వాడు ఈ ఆట ఎలా గెలుస్తాడు. అంతా మోసం అన్నాడు రుక్మి. బలరాముని కోపం తారస్థాయికి చేరింది. ఈ సారి బలరాముడు పదికోట్ల పణములను పందెంగా పెట్టాడు. మరలా బలరాముడే గెలిచాడు. కాని రుక్మి ఒప్పుకోలేదు. నేను గెలిచాను. బలరాముడు మోసం చేస్తున్నాడు అని గట్టిగా అరిచాడు.

అప్పుడు ఆకాశ వాణి "బలరాముడే ధర్మబద్ధంగా గెలిచాడు" అని పలికింది. రుక్మి ఆకాశ వాణి మాటలు లెక్కచెయ్యలేదు. రుక్మికి కళింగరాజులు తోడయ్యారు. అందరూ కలిసి బలరాముని హేళన చేసి మాట్లాడసాగారు. "ఓ బలదేవా! మీరు ఆవులను కాయడానికి మాత్రమే పనికివస్తారు. అడవుల్లో నివసిస్తుంటారు. మీకు పాచికలాట ఎందుకు చెప్పు? అసలు మీకు పాచికలు ఎలా ఆడాలో తెలుసా! ఏమీ తెలియని వాడివి నాతో పాచికలాట ఎందుకు ఆడావు? కేవలం క్షత్రియులు మాత్రమే పాచికల ఆటలో నైపుణ్యం సాధించగలరు కానీ యాదవులు కాదు. ముఖ్యంగా మీ వంటి పశువులు కాచుకునే వాళ్లకు అసలు పాచికలాట చేతకాదు." అని రుక్మి ఉక్రోషంతో బలరాముని హేళన చేసి నవ్వాడు.

బలరాముడు కోపం ఆపుకోలేకపోయాడు. ఆత్మరక్షణకు ఉంచుకున్న గండ్రగొడ్డలితో రుక్మి తలను ఒకే వేటుతో నరికాడు. ఇది చూచి అప్పటి దాకా బలరాముని హేళన చేసి నవ్విన కళింగ రాజులు పారిపోయారు. కాని బలరాముడు వారిని వెంటబడి పట్టుకొని వాళ్ల పళ్లురాలగొట్టాడు. రుక్మికి సాయంగా వచ్చిన ఇతర రాజుల చేతులు

కాళ్లు నరికాడు బలరాముడు. ఇదంతా చూస్తున్న కృష్ణుడు ఒక్కమాట కూడా మాట్లాడలేదు. అటు బలరాముని గానీ, ఇటు రుక్మిని గానీ సమర్థించలేదు. ఎందుకంటే రుక్మితో కృష్ణునికి ఉన్న సంబంధ బాంధవ్యాలు చెడిపోతాయి కదా! అందుకని.

తరువాత కృష్ణుడు, బలరాముడు, అనిరుద్ధుడు, వారి వెంట వచ్చిన యాదవులు అందరూ  నూతన వధువును తీసుకొని ద్వారకకు వెళ్లారు." అని శుకుడు పరీక్షిత్ మహారాజుకు రుక్మిని బలరాముడు ఎలా సంహరించిందీ చెప్పాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము అరువది ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

అరువది రెండవ అధ్యాయము.

పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహము కలిగింది. శుకమహర్షిని ఇలా అడిగాడు. "శుకయోగీంద్రా! శ్రీకృష్ణుని మనుమడు, ప్రద్యుమ్నుని కుమారుడు అయిన అనిరుద్ధుడు బాణాసురుని కుమార్తె ఉషను కూడా వివాహం చేసుకున్నాడనీ, ఆ సందర్భంగా విష్ణువుకు, శివునికి భయంకర యుద్ధం జరిగిందనీ

విన్నాను. ఆ విషయం కూడా నాకు చెప్పవలసింది." అని అడిగాడు.

శుకమహర్షి ఈ విధంగా చెప్పాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! బలిచక్రవర్తికి నూరుగురు కుమారులు. వారిలో పెద్ద వాడు బాణుడు. అసురత్వము కలిగి ఉన్నాడు కాబట్టి బాణాసురుడు అని కూడా పిలుస్తారు. ఈ బాణాసురుడు గొప్ప శివభక్తుడు. మంచి దాత. అందరిచేతా గౌరవింపబడేవాడు. బుద్ధిశాలి. ఎల్లప్పుడూ సత్యము పలికేవాడు. ఏ పని అయిన తల పెడితే దానిని సంపూర్ణంగా నెరవేర్చేవరకూ విశ్రమించడు. అటువంటి బాణుడు శోణీత పురమును పరిపాలిస్తున్నాడు.

బాణుడికి శివుని అనుగ్రహం ఉంది కాబట్టి ఇంద్రుడు మొదలగు లోక పాలకులు కూడా ఆయనతో స్నేహంగా ఉండేవారు. బాణాసురుడికి వేయి చేతులు. ఆ వేయిచేతులతో తాళాలు మోగిస్తూ, శివుడి ముందు తాండవ నృత్యం చేసేవాడు బాణుడు. బాణుడు ఎంతటి గొప్పవాడంటే, ఒక సారి బాణుని భక్తికి మెచ్చి శివుడు ఏం వరం కావాలో కోరుకో అన్నాడు. అప్పుడు బాణుడు శివుని తన ద్వారపాలకునిగా ఉండమని కోరాడు.

అంతే కాదు ఇంకా ఇలా అన్నాడు. "ఓ పరమ శివా! నీవు మా బోటి వారు కోరిన కోరికలు అన్నీ తీరుస్తావు అని అంటారు. నీవు కల్పవృక్షము. ఈ లోకానికి గురువు. సమస్త జగత్తుకు ఈశ్వరుడవు. అటువంటి నీకు నమస్కారము. నీవు నాకు వేయి చేతులు ప్రసాదించావు. ఈ మూడులోకములలో నువ్వు తప్ప నన్ను

జయించేవాడు మరొకడు లేడు. ఈ అనంత విశ్వంలో నన్ను మించిన వాడు లేడు." అని గర్వంగా అన్నాడు.

ఆ మాటలు విన్న శివుడికి కోపం వచ్చింది. "మూర్ఖుడా! తొందర పడకు. నాతో సమానమైన వాడు మరొకడు ఉన్నాడు. వాడితో నీకు యుద్ధం సంభవిస్తుంది. అప్పుడు నీ ధ్వజముకూలి పోతుంది. నీ గర్వం నశిస్తుంది. నీవు ఓడి పోతావు." అని పలికాడు. నా ధ్వజం కూలి నపుడు కదా నేను ఓడి పోయేది. అదీ చూద్దాం అనుకుంటూ బాణుడు తన గృహమునకు వెళ్లిపోయాడు.

బాణాసురుడికి ఒక కుమార్తె ఉంది. ఆమె పేరు ఉష. ఆమెకు ఒక సారి ఒక అందమైన పురుషుడు కలలో కనిపించాడు. ఆ పురుషుడితో ఆమె ఆడింది పాడింది. స్వర్గలోకభోగములు అనుభవించింది. ఇంతలో ఉషకు మెలుకువ వచ్చింది. "హా ప్రియా ఎక్కడకు పోయావు, రా" అంటూ అరుస్తూ లేచి కూర్చుంది. అక్కడ ఎవరూ లేరు. ఉష అరుపులు విని చెలులు పరుగెత్తుకొని వచ్చారు. వాళ్లను చూచి సిగ్గు పడింది ఆమె. తరువాత తనకు కలలో కనపడ్డ పురుషుని గురించి తలచుకుంటూ మనోవేదనకు గురి అయింది.

బాణునికి ఒక మంత్రి ఉన్నాడు. అతని పేరు కుంభాండుడు. ఆయనకు ఒక కుమార్తె ఉంది. ఆమె పేరు చిత్రలేఖ. చిత్రలేఖ ఉషకు ఆంతరంగిక చెలి. ఉషకు కలిగిన మనోవేదన గురించి అడిగింది చిత్రలేఖ. "సఖీ! నాకు తెలిసి నీవు ఎవ్వరినీ ప్రేమించలేదు. నీకు ఇంకా పెళ్లి కాలేదు. మరి నీవు ఎవరిని గురించి తలచుకుంటూ వేదన

చెందుతున్నావు. నాతో చెప్పవా!" అని అడిగింది చిత్రలేఖ. అప్పుడు ఉష తన మనసులో మాట చెప్పింది.

"చెలీ! నేను ఒక రోజు స్వప్నములో అందగాడు, నీలమేఘచ్ఛాయ కలవాడు, తామర రేకుల వంటి కళ్లు కలవాడు, పచ్చని పట్టుపీతాంబరములు ధరించినవాడు, ఆజానుబాహుడు, అందమైన ఆడపిల్లల మనసులు దొంగిలించేవాడు, ఏ ఆడపిల్ల అయిన వాడిని చూడగానే మనసు పారేసుకునేంత అందగాడు అయిన ఒక యువకుని చూచాను. అతనితో ఆడాను పాడాను, ఆయన అధరామృతమును ఆస్వాదించాను, ఆయనతో క్రీడించాను. ఇంతలో మెలుకువ వచ్చింది. ఎంత ప్రయత్నించినా ఆ యువకుడు మరలా కనపడలేదు. నాకు ఎలాగైనా అతనిని చూడాలని ఉంది." అని చెప్పింది ఉష.

ఆ మాటలకు చిత్రలేఖ నవ్వి "దీనికి ఇంత వేదన పడాలా సఖీ! నీకు అందరి రాజకుమారుల చిత్రపటాలు చూపిస్తాను. వారిలో నీ ప్రియుడు ఎవరో గుర్తించు. వాడు ఎక్కడ ఉన్నా సరే తీసుకొని వచ్చి నీ పక్కన నిలబెడతాను." అని పలికింది. తరువాత చిత్రలేఖనములో అత్యంత ప్రావీణ్యము కల చిత్రలేఖ తనకు తెలిసిన దేవ, దానవ, గంధర్వ, మానవులను చిత్రీకరించి ఉషకు చూపించింది. ఆ చిత్రములలో ప్రద్యుమ్నుని కూడా చిత్రీకరించింది.

"ప్రద్యుమ్నుడు అచ్చు తాను చూసిన యువకుడి పోలికలతో ఉన్నాడు కానీ వయసులో పెద్దవాడు కాబట్టి తనకు కలలో కనిపించిన యువకుడు ప్రద్యుమ్నుని కుమారుడు కాబోలు." అని తనలో తాను

అనుకుంది ఉష. తరువాత చిత్రలేఖ ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుని చిత్రమును వేసింది. ఉష మనసు ఆనందంతో పొంగి పోయింది. "ఇతడే ఈ యువకుడు" అని ఆనందంతో గెంతులు వేసింది.

చిత్రలేఖకు చిత్రలేఖనమే కాదు యోగవిద్యలో కూడా ప్రావీణ్యం ఉంది. అనిరుద్ధుడు శ్రీకృష్ణుని మనుమడు అని తెలుసుకొని, యోగ విద్యతో ఆకాశమార్గంలో ద్వారకకు వెళ్లింది. రాచమందిరంలో నిద్రిస్తున్న అనిరుద్ధుని చూచింది. అనిరుద్ధుడు నిద్రిస్తున్న మంచమును ఎత్తుకొని ఆకాశమార్గంలో శోణితపురమునకు తీసుకొని వచ్చింది. ఉష మందిరంలో దించింది.

ఆ రోజు నుండి ఉషకు అనిరుద్ధునితోనే లోకం అయింది. ఎవరూ లోపలకు రాకుండా చిత్రలేఖ కట్టడి చేసింది. అంత:పురము లోపల ఉషా అనిరుద్ధులు ఆనందంగా విహరించసాగారు. అనిరుద్ధుడు ఏది కోరితే అది క్షణాల్లో సమకూర్చేది ఉష. వస్త్రములు, పుష్పమాలలు, గంధము,అగరు,సువాసనద్రవ్యములు, మంచి ఆసనములు, శయ్యలు, చక్కటిభోజనము, అన్నీ సమకూర్చేది.

ఉషాదేవి అనురాగములో మునిగితేలుతున్న అనిరుద్ధునకు రోజులు క్షణాల్లా గడుస్తున్నాయి. ఇటువంటి రహస్యములు ఎన్నాళ్లో దాగవు కదా! అంత:పురములో ఉన్న పరిచారికలు ఉషయొక్క దుస్తులు, హావభావములు చూచి ఆమె పరపురుషునితో సంభోగిస్తూ ఉందని గ్రహించారు. ఉష కన్యాత్వము హరింపబడినది అని

అనుమానపడి వెంటనే ఈ విషయాన్ని బాణుడికి చెప్పారు.

"రాజా! తమరి కుమార్తె ఉష పరపురుషునితో సంభోగిస్తూ ఉందని మాకు అనుమానంగా ఉంది. మేము అంత:పురమునకు కట్టుదిట్టమైన కాపలా పెట్టాము. కానీ లోపల ఎవరున్నారో, అసలు ఆ పురుషుడు లోపలకు ఎలా వచ్చాడో తెలియడం లేదు." అని చెప్పారు.

ఆ వార్త విన్న బాణునికి విపరీతమైన కోపం వచ్చింది. వెంటనే ఉష ఉన్న అంత:పురమునకు వెళ్లాడు. అక్కడ అనిరుద్ధుని చూచాడు. అందమైన ఆ యువకుని చూచి ఆశ్చర్యపోయాడు బాణుడు. భువన మోహనాకారుడు, నీలమేఘచ్ఛాయ కలవాడు, పీతాంబరధారి, తామరరేకుల వంటి కన్నులు కలవాడు, ఆజానుబాహుడు, ముఖము మీద చిరునవ్వు చెరగని వాడు అయి అనిరుద్ధుని, అతని ఎదురుగా కూర్చుని ఉన్న తన కుమార్తె ఉషను చూచాడు బాణుడు.

ఆ సమయంలో అనిరుద్ధుడు ఉషతో పాచికలాట ఆడుతున్నాడు. సైనికులతో వచ్చిన బాణుని చూచి అనిరుద్ధుడు లేచి నిలబడ్డాడు. పక్కనే ఉన్న పరిఘ అనే ఆయుధమును తీసుకొని బాణుని మీదికి ఉరికాడు. అప్పుడు బాణుని సైనికులు అనిరుద్ధుని పైకి దూకారు. అనిరుద్ధుడు తన చేతిలో ఉన్న పరిఘతో ఆ సైనికులను సంహరించాడు. చావగా మిగిలిన వారు పారిపోయారు.

ఇలా కాదని బాణుడు నాగాస్త్రమును ప్రయోగించి, అనిరుద్ధుని నాగపాశములతో బంధించాడు. తన ఎదురుగా తన తండ్రి తన ప్రియుని నాగపాశములతో బంధించడం చూచి ఉష పెద్దగా

ఏడవడంమొదలెట్టింది. ఆమె కళ్ల వెంట కన్నీరు ధారాపాతంగా కారుతూ ఉంది.

(యుగాలు మారినా, తరాలు మారినా, మనుషుల మనసులు మారవు. వారి ప్రేమకథలు అంతకంటే మారవు అనే దానికి ఇదే ఉదాహరణ. ఈ రోజుల్లో అమ్మాయిలు ప్రేమించిన వారితో పారిపోతున్నారు. ఉష తాను వలచిన ప్రియుని తన ఇంటికే రప్పించుకుంది అంతే తేడా. మిగిలిన కథ మామూలే!)

శ్రీమద్భాగవతము

దశమస్కంధము అరువది రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## అరువది మూడవ అధ్యాయము.

ఓ పరీక్షిత్ మహారాజా! బాణాసురుని రాజధాని అయిన శోణిత పురంలో పరిస్థితి ఇలా ఉంటే ద్వారకలో అనిరుద్ధుడు కనిపించక పోవడంతో అంత:పురంలో కలకలం మొదలయింది. వేటకు వెళ్లాడేమో లేక విహారయాత్రకు వెళ్లాడేమో అనుకుంటూ నాలుగు నెలలు గడిపారు. కాని ఎంతకూ అనిరుద్ధుడు రాలేదు. ఇంతలో నారదుడు వచ్చి అనిరుద్ధుని బాణుడు బంధించాడు అన్న వార్త చల్లగా కృష్ణుని

చెవిని వేసాడు. అనిరుద్ధుడు ఉష ఒకరిని ఒకరు ప్రేమించుకోవడం, అది బాణాసురునికి ఇష్టం లేకపోవడంతో వారిద్దరూ రహస్యంగా కలుసుకోవడం మొదలగు విషయాలు అన్నీ ద్వారక అంతా పాకిపోయాయి.

అనిరుద్ధుని విడిపించి తీసుకురావడానికి  కృష్ణుడు తన సైన్యంతో శోణిత పురానికి వెళ్లాడు. కృష్ణుడి వెంట ప్రద్యుమ్నుడు, సాత్యకి, గదుడు, సాంబుడు, సారణుడు, నందుడు, ఉపనందుడు, భద్రుడు మొదలగు వీరులు వెళ్లారు. కృష్ణుడు తన వెంట వచ్చిన 12 అక్షౌహిణీల సైన్యంతో బాణాసురుని నగరాన్ని ముట్టడించాడు. యాదవ సైన్యము శోణితపురంలో ఉన్న ప్రాకారములను, ఉద్యానవనములను, భవనములను ధ్వంసం చేయసాగారు.

కృష్ణుడు తన సైన్యముతో నగరాన్ని ముట్టడించాడు అన్న వార్త విన్న బాణుడు, కృష్ణుని సైన్యంతో సమానంగా తన వద్ద ఉన్న 12 అక్షౌహిణీల సైన్యమును తీసుకొని శోణితపురం నుండి బయటకు వచ్చాడు. తన భక్తుడు బాణుడు యుద్ధం చేయడం చూచి పరమ శివుడు, తన కుమారుడు కార్తికేయునితోనూ, తన ప్రమథ గణములతోనూ బాణునికి సాయంగా వచ్చి కృష్ణునితో యుద్ధం చేస్తున్నాడు.

కృష్ణుడికి పరమ శివునికి, ప్రద్యుమ్నునికీ కార్తికేయునికి పోరుఘోరంగా సాగుతూ ఉంది. కుంభాండుడు, కూపకర్ణుడు అనే వారితో బలరాముడు, బాణుని కుమారునితో సాంబుడు, బాణునితో సాత్యకి యుద్ధం చేస్తున్నారు. దేవుళ్లమధ్య జరుగుతున్న యుద్ధం

చూడటానికి దేవతలు అంతా ఆకాశంలో తమ తమ విమానముల మీద వచ్చారు.

శ్రీకృష్ణుడు దివ్యమైన తన ధనుస్సు నుండి పదునైన బాణములతో శంకరుని అనుచరులైన ప్రమథ గణములను, భూతములను, శాకినీ ఢాకినులను, వినాయకులను, భేతాళురను, ప్రేతములను, మాతృకలను, పిశాచములను కూష్మాండములను, బ్రహ్మరాక్షసులను, చించి చెండాడుతున్నాడు. శంకరుడు కూడా శ్రీకృష్ణుని మీద తన వద్ద ఉన్న దివ్యాస్త్రములను ప్రయోగించాడు. ఆ అస్త్రములను అన్నింటినీ శ్రీకృష్ణుడు మధ్యలోనే ఛేదించాడు. శంకరుడు బ్రహ్మాస్త్రము వేస్తే, బ్రహ్మాస్త్రమును, వాయవ్యాస్త్రము వేసే, పర్వతాస్త్రమును, ఆగ్నేయాస్త్రము వేస్తే దానికి విరుగుడుగా పర్జన్యాస్త్రమును, శంకరుడు పాశుపతాస్త్రము వేస్తే దానికి ప్రతిగా నారాయణాస్త్రమును శ్రీకృష్ణుడు ప్రయోగించాడు.  శంకరుడు ఏ అస్త్రము వేస్తే దానికి వ్యతిరేకాస్త్రములను ప్రయోగించి, శంకరుడు ప్రయోగించిన అస్త్రములను నిర్వీర్యం చేస్తున్నాడు కృష్ణుడు.

ఇలా కాదని కృష్ణుడు తన వద్ద ఉన్న జృంభణాస్త్రమును ప్రయోగించి, శంకరునికి మోహం కలిగించాడు. శంకరునికి ఏం జరుగుతూ ఉందో తెలియడం లేదు. ఇదే సమయమని కృష్ణుడు రకరకాల ఆయుధములను ధరించి బాణాసురుని సైన్యమును చిందర వందర చేసాడు. ప్రద్యుమ్నుడి ధాటికి తట్టుకోలేక కార్తికేయుడు తన నెమలి వాహనము ఎక్కి పారిపోయాడు. బాణుని సేనాధిపతులైన కుంభాండుడు, కూపకర్ణుడు బలదేవుని ధాటికి తట్టుకోలేక

పారిపోయారు.

తన సేనలు, తనకు సాయంగా వచ్చిన శంకరుని ప్రమథ గణములు ఓడిపోవడం చూచి బాణుడు కోపంతో రగిలిపోయాడు. సాత్యకిని వదిలిపెట్టి రథం మీద కృష్ణుని ఎదుర్కొన్నాడు. ఒకేసారి 500 విల్లులు పట్టుకొని యుద్ధం చేయసాగాడు. (బాణుడికి వేయి చేతులు). కృష్ణుడు ఆ 500 ధనుస్సులను విరగ్గొట్టాడు. బాణుడు ఎక్కిన రథాన్ని విరగ్గొట్టాడు. సారథిని చంపాడు. విజయ సూచకంగా పాంచజన్యం పూరించాడు.

బాణాసురుని తల్లి పేరు కోటర. తన కుమారుడు యుద్ధంలో ఓడి పోయాడు అని తెలుసుకున్న కోటరకు పిచ్చెక్కినట్టయింది. తన కుమారుని ఎలాగైనా రక్షించుకోవాలని, బట్టలన్నీ ఊడదీసుకొని వివస్త్రగా పెద్ద పెట్టున ఏడుస్తూ వచ్చి కృష్ణుని ముందు నిలబడింది. ఆమెను వివస్త్రగా చూడలేక కృష్ణుడు తల పక్కకు తిప్పుకున్నాడు. ఇదే సందని బాణుడు రథం వదిలి నగరంలోకి పారిపోయాడు.

ఇది ఇలా ఉండగా భూతగణములకు అధిపతి అయిన మూడు తలల రౌద్రజ్వరము(రుద్రుని తేజోరూపము) అనే భూతము కృష్ణుని ఎదుర్కొంది. రౌద్రజ్వరము కృష్ణుని మీదికి రావడం చూచి, విష్ణుజ్వరము(విష్ణు తేజస్సు) దానిని ఎదుర్కొంది. ఆ రెండు ఒకదానితో ఒకరు ఎదుర్కొంటున్నాయి. విష్ణుజ్వర ధాటికి రౌద్రజ్వర తట్టుకోలేక పోయింది. తుదకు కృష్ణుని శరణు వేడింది.

రౌద్ర జ్వరము కృష్ణుని ఇలా ప్రార్థించింది. "ఓ దేవా! నీవు అనంత శక్తిమంతుడవు. బ్రహ్మ మొదలగు దేవతలకు అధిపతివి. సర్వాంతర్యామివి. శుద్ధసత్వగుణ సంపన్నుడవు. వేదస్వరూపుడవు. ఈ అనంత విశ్వమును సృష్టించి, పోషించి, లయం చేస్తున్నావు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! కాలము, కర్మము, దైవము, స్వభావము, జీవుడు, సూక్ష్మశరీరము, స్థూలశరీరము, అహంకారము, పది ఇంద్రియములు, మనస్సు, లింగదేహము ఇవన్నీ నీ మాయ వలననే సంభవిస్తున్నాయి. ఆ మాయకు నీవు అతీతుడవు. అట్టి నీకు నమస్కారము. నీవు మత్స్యావతారము మొదలగు అవతారములను దాల్చి లోకంలో ఉన్న సాధువులను రక్షించావు. దుర్మార్గులను, హింసచేసేవారిని శిక్షించావు. ఇప్పుడు భూభారాన్ని నిర్మూలించడానికి ఈ కృష్ణావతారం ధరించావు. నీ తేజస్సును మేము భరించలేము. నీ విష్ణుతేజస్సును తట్టుకోలేక పోయాను. నీ పాదములను శరణు వేడుతున్నాను. నన్ను కాపాడు." అని ప్రార్థించింది రౌద్ర తేజస్సు.

"ఓ మూడు శిరస్సుల రౌద్రతేజమా! నీకు అభయం ఇస్తున్నాను. విష్ణుతేజము నిన్ను ఏమీ చేయదు." అని పలికాడు శ్రీకృష్ణుడు. రౌద్రతేజము కృష్ణుడికి నమస్కరించి వెళ్లిపోయింది. శివుడు కృష్ణుని మోహంలో పడ్డాడు. శివతేజము విష్ణుతేజం ముందు ఓడి పోయింది. బాణుడి సేనలు పారిపోయాయి. బాణుడు ఒంటరిగా యుద్ధభూమిలో మిగిలాడు. అయినా ధైర్యం తెచ్చుకొని కృష్ణునితో తలపడ్డాడు. తన వేయి చేతులతో కృష్ణుడి మీద అస్త్రప్రయోగం చేస్తున్నాడు. శ్రీకృష్ణుడు తన

సుదర్శనము అనే చక్రాయుధమును ప్రయోగించి బాణుడి వేయి చేతులు నరికాడు. ఇంతలో మోహంలో నుండి తేరుకున్న శివుడు, బాణాసురుని చేతులు శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రంతో నరకడం చూచి వెంటనే కృష్ణుని వద్దకు వచ్చాడు. కృష్ణుని తో ఇలా అన్నాడు.

"దేవా! నీవు సాక్షాత్తు విష్ణుస్వరూపుడవు. శుద్ధసత్వగుణ సంపన్నుడవు. ఆకాశమునే నాభిగా, అగ్నిని ముఖముగా, జలము నే రేతస్సుగా, స్వర్గమునే తలగా, దిక్కులే చెవులుగా, భూమి పాదములుగా, చంద్రుడే మనసుగా, సూర్యుడే కన్నులుగా, సముద్రమే పొట్టగా, ఇంద్రుడు మొదలగు లోకపాలకులు నీ భుజములుగా, ఓషధులు నీ వెంట్రుకలుగా, మేఘములే నీ తల మీద ఉన్న జుట్టుగా, బ్రహ్మయే బుద్ధిగా, ప్రజాపతియే జననేంద్రియముగా, ధర్మమే హృదయముగా, ఈ పదునాలుగు భువనములను నీలో ఇముడ్చుకొని విరాట్ పురుష రూపంతో విరాజిల్లుతున్నావు. అటువంటి విశ్వాత్మకుడవైన నీవు ధర్మసంరక్షణార్థము భూలోకములో కృష్ణుడిగా అవతరించావు. నీ ఆజ్ఞాను సారము నేను లయకారుడిగా నా పని నేను చేస్తున్నాను. నీకు నావాడు, పరాయి వాడు అనే భేదములేదు. నీవు స్వయంప్రకాశకుడవు. నీకు జన్మలేదు. నీవు సర్వాంతర్యామివి అయినా నీ మాయచేత వివిధ రూపములతో ప్రకటితమవుతుంటావు.

నిరంతరము ప్రకాశించే సూర్యుడు, మేఘములు ఆవరిస్తే సూర్యుడు మానవులకు కనిపించడు. అలాగే నీవు స్వయం ప్రకాశకుడవై జీవుల హృదయములలో ఆత్మగా వెలుగుతూ ఉన్నప్పటికినీ, ఆ జీవులను అహంకారము అనే మేఘములు కప్పడం వలన, వారికి నీవు కనిపించవు. అత్యంత దుర్లభమైన మానవ

జన్మనుపొందినప్పటికినీ, మానవులు ఇంద్రియలోలత్వమునకు వశులై, నీ పాదములను సేవించడం మరిచిపోతున్నారు. తమను తామే మోసం చేసుకుంటున్నారు.  అది చాలా దురదృష్టము. ఏ మానవుడైతే ఈ ప్రాపంచిక విషయముల మీద, భార్యా, బిడ్డల మీద, సంపదల మీదా ఆసక్తుడై, నిన్నుసేవించడం మరిచిపోతాడో, అతడు అమృతమును విడిచిపెట్టి విషం తింటున్నాడు.

ఓ దేవా! నీవు సృష్టి,స్థితి,లయములను నిర్వర్తిస్తున్నావు. నీవు శాంతమూర్తివి, నీకు ఎవరి మీదా కోపము, ద్వేషము లేదు. అందరూ నీకు సమానమే. ఈ సకల జగత్తుకు నీవే అధినేతవు. నీ మీద భక్తి కలగడానికి మేమందరము నిన్ను ఆరాధిస్తున్నాము.   నేను, బ్రహ్మ, దేవతలు, మునులు అందరమూ నిన్ను శరణువేడుతున్నాము.

ఇంక ప్రస్తుత విషయానికి వస్తే,  ఈ బాణాసురుడు నాకు మిత్రుడు. అంతకు మించి నాకు భక్తుడు.  వీడికి నేను అభయం ఇచ్చాను. అందుకని నీడి పక్షాన నిలిచి నీతో యుద్ధం చేయవలసి వచ్చింది. నీవు పూర్వము దైత్యుడైన ప్రహ్లాదుని మీద ఎటువంటి కరుణ చూపావో అటువంటి కరుణ ఈ బాణాసురుని మీద చూపించు. వీడిని అనుగ్రహించు." అని ప్రార్థించాడు.

పరమశివుడు పలికిన పలుకులు విన్న కృష్ణుడు ఇలా అన్నాడు. "పరమశివా! నీ మాట నేను జవదాటను. నీవు కోరినట్టే చేస్తాను. అంతేకాకుండా ఈ బాణుడు,  నా భక్తుడు అయిన బలి చక్రవర్తి కుమారుడు. "నీ వంశములో పుట్టిన వారిని ఎవరినీ నేను చంపను"

అని నేను బలికి మాట ఇచ్చాను. ఆ కారణం చేత నేను ఇతనిని చంపను, చంపలేను.

ఈ బాణాసురుడు తనకు వేయి చేతులు ఉన్నాయనీ, అపార సైన్యము ఉందనీ గర్వించి అందరిమీదికీ కయ్యానికి కాలు దువ్వుతున్నాడు. అతని గర్వము అణచడానికే ఇతని చేతులు ఖండించాను ఇతని సైన్యమును సంహరించాను. ఇప్పుడు బాణుని గర్వము నశించింది. ఈ బాణుడు తనకు మిగిలిన నాలుగు చేతులతో నీ అనుచరగణములో ఒకడుగా, జనన మరణములు లేకుండా, శాశ్వతముగా నీ వద్దనే ఉండగలడు." అని అన్నాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుని వలన అభయమును పొందిన బాణుడు, తన కుమార్తె ఉషను, అల్లుని అనిరుద్ధుని, దివ్యమైన రథముమీద ఎక్కించి శ్రీకృష్ణుని వద్దకు పంపించాడు. శ్రీకృష్ణుడు శంకరుని వద్ద సెలవు తీసుకొని, అనిరుద్ధ ఉషలతో, బాణుడు వారికి కానుకలుగా ఇచ్చిన దివ్య వస్త్రములు, భూషణములతో, తన అన్న బలరాముడు, సాత్యకి మొదలగు వారితో, తన సైన్యముతో ద్వారకకు చేరుకున్నాడు.

శ్రీకృష్ణుని విజయ వార్త ముందే తెలిసిన ద్వారకా నగరవాసులు ద్వారకను అత్యంత సుందరంగా అలంకరించారు. శ్రీకృష్ణునికి బలరామునికి, ఉషా అనిరుద్ధులకు ఘనంగా స్వాగత సత్కారాలు చేసారు. శ్రీకృష్ణుని బంధువులు, బ్రాహ్మణులు, మంగళ వాద్యములు మోగుతుండగా, కృష్ణునికి ఎదురు వెళ్లి, స్వాగత వచనాలు పలికారు. ఆ ప్రకారంగా శ్రీకృష్ణుడు నూతన వధూవరులతో ద్వారకా నగర ప్రవేశం చేసాడు."

అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణ,పరమశివుల యుద్ధము, ఉషా అనిరుద్ధుల వివాహము, మొదలగు విషయములను వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము అరువది మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

అరువది నాలుగవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఒక రోజు సాంబుడు, ప్రద్యుమ్నుడు, చారుడు, భానుడు, గదుడు మొదలగు యాదవ కుమారులు విహారము కొరకు ఒక ఉద్యానవనమునకు వెళ్లారు. వారు ఆడుకుంటూ ఉండగా వారికి దాహం వేసింది. నీటి కోసరం వెదుకుతూ వారు ఒక పాడుబడ్డ బావి దగ్గరకు వెళ్లారు. ఆ బావిలో వారు ఒక విచిత్రమైన ప్రాణిని చూచారు. ఆ ప్రాణిని ఊసర వెల్లి అని అనుకున్నారు. కాని అది ఊసరవెల్లికన్నా చాలా పెద్దదిగా ఉంది.

యాదవ కుమారులు అతి కష్టం మీద ఆ ప్రాణిని బయటకు తీయడానికి ప్రయత్నం చేసారు కానీ వారి ప్రయత్నములు ఫలించలేదు. వారందరూ శ్రీకృష్ణుని వద్దకు పోయి వారు చూచిన వింత ప్రాణి గురించి చెప్పారు. శ్రీకృష్ణుడు వారి వెంట ఆ బావి వద్దకు వచ్చాడు. ఆ

ప్రాణిని అవలీలగా బయటకు తీసాడు. శ్రీకృష్ణుని చేతి స్పర్శ తగలగానే ఆ వింత ప్రాణి  ఒక దివ్యమైన మనిషి రూపం దాల్చింది.  శ్రీకృష్ణునికి ఆ వింతప్రాణి వృత్తాంతము తెలిసినప్పటికినీ,   అక్కడ ఉన్న యాదవ కుమారులకు కూడా తెలియవలెననే కోరికతో ఆ దివ్యపురుషునితో ఇలా అన్నాడు.

"మహాత్మా! మీరు ఎవరు? మీరు ఈ ఊసరవెల్లి రూపంతో ఈ బావిలో పడి ఉండటానికి కారణం ఏమి? పూర్వజన్మలో మీరు మహా తపస్సంపన్నులుగా ఉండి ఉంటారు. అయినా,  మీకు ఈ నీచ జన్మ రావడానికి కారణం ఏమి? " అని అడిగాడు. కృష్ణుడు ఆ ప్రకారంగా అడుగగా, ఆ దివ్యపురుషుడు కృష్ణుడికి నమస్కరించి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"దేవా! నేను ఇక్ష్వాకు వంశములో జన్మించిన వాడను. నా పేరు నృగ మహారాజు. ఈ లోకంలో దానము చేయు ప్రముఖులను లెక్కించునపుడు, నా పేరు కూడా మీరు వినిఉంటారు. తమరికి తెలియని విషయము లేదు కదా! ఆకాశంలో ఎన్ని నక్షత్రాలు ఉన్నాయో అన్ని ఆవులను, ముఖ్యంగా కపిల గోవులను, వాటి దూడలతో సహా, నేను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాను. అంతే కాకుండా, నేను గుణము, శీలము కల బ్రాహ్మణులకు బాగా అలంకరించిన బంగారు పొన్నులు వేసిన గోవులను, సారవంతమైన భూములను, బంగారు ఆభరణములను, కట్టించిన గృహములను, ఏనుగులను, గుర్రములను, దానంగా ఇచ్చాను. ఎంత మందికో కన్యాదానం చేసాను.  ధన దానము, తిలదానము, శయ్యాదానము, వస్త్రదానము, మొదలగు దానములను ఎన్నింటినో చేసాను. లెక్కకు మించిన యజ్ఞములను,

యాగములను చేసాను. సత్రములు కట్టించాను. బావులు తవ్వించాను.

కాని ఒక సారి ఒక పొరపాటు జరిగింది. నేను ఒక ఆవును ఒక బ్రాహ్మణుడికి దానంగా ఇచ్చాను. ఆ బ్రాహ్మణుడు ఆ ఆవును తీసుకుపోతుంటే అది తప్పించుకొని పోయి, దానములు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్న ఆవులలో చేరిపోయింది. ఆ విషయం తెలియక నేను అదే ఆవును మరొక బ్రాహ్మణుడికి దానంగా ఇచ్చాను.

ఆ బ్రాహ్మణుడు, నేను పొరపాటున రెండవ సారి దానంగా ఇచ్చిన ఆవును తోలుకొని వెళుతుంటే, అంతకు ముందు అదే ఆవును దానంగా తీసుకున్న బ్రాహ్మణుడు ఆ ఆవును గుర్తుపట్టి "మహారాజుగారు ఈ ఆవును నాకు దానంగా ఇచ్చారు, నీవు ఎందుకు తీసుకొని వెళుతున్నావు." అని అడిగాడు. "ఈ ఆవు నీది కాదు. ఈ ఆవును మహారాజుగారు ఇప్పుడే నాకు దానంగా ఇచ్చారు." అని అన్నాడు రెండవ బ్రాహ్మణుడు. ఆ ఆవును గురించి వారి మధ్య వివాదం చెలరేగింది.

వారి వివాదం ఎంతకూ తేలక నా వద్దకు వచ్చారు. వారు చెప్పిన మాటలను విన్న తరువాత నాకు అసలు విషయం అర్థం అయింది. నేను మొదటి బ్రాహ్మణునితో ఇలా అన్నాను. "అయ్యా! ఇది నేను తెలిసీ చేసిన తప్పు కాదు. పొరపాటున మొదట నేను దానంగా ఇచ్చిన ఆవు దానం ఇవ్వవలసిన ఆవులతో కలిసిపోయింది. ఈ ఆవుకు బదులుగా నేను మీ ఇద్దరికీ చెరి ఒక లక్ష ఆవులను దానంగా ఇస్తాను. దయచేసి నన్ను ఆడిన మాట తప్పి వాడిగా చేయకండి." అని

ప్రాధేయపడ్డాను. ఆ మాటలకు మొదటి బ్రాహ్మణుడు "నాకు దానంగా ఇచ్చిన ఆవును మరొకరికి దానంగా ఇచ్చిన తరువాత, మరలా నేను దానిని తీసుకోను" అంటూ వెళ్లిపోయాడు. రెండవ బ్రాహ్మణుడు "మీరు నాకు లక్ష ఆవులు దానంగా ఇచ్చినా, నాకు అక్కరలేదు." అని వెళ్లిపోయాడు. నేను ఏమీ చెయ్యలేక ఊరుకున్నాను.

నాకు అవసాన దశ సమీపించింది. నన్ను యమలోకానికి తీసుకొని వెళ్లారు. అక్కడ యముడు నన్ను చూచి "నీవు ఎన్నో పుణ్యాలు చేసావు. ఒకే ఒక చిన్న పాపం చేసావు. ముందు పుణ్యఫలం అనుభవిస్తావా! లేక పాపఫలంఅనుభవిస్తావా!" అని అడిగాడు. నేను ఆలోచించాను. ఆ పాపఫలం ఏదో ముందే అనుభవిస్తే, తరువాత పుణ్యఫలం అనుభవించవచ్చు అని అనుకున్నాను. అదే మాట యమధర్మరాజుకు చెప్పాను. ఆ మాటలకు యమధర్మరాజు "నీవు పతితుడవు కమ్ము." అని అన్నాడు. అప్పటి నుండి నేను ఈ ఊసరవెల్లి రూపం ధరించి ఈ పాడుబడ్డ బావిలో పడి ఉన్నాను.

ఓ దేవా! నేను బ్రహ్మజ్ఞానము పొందిన వాడను, అనేక దాన ధర్మములు చేసిన వాడను కాబట్టి నాకు పూర్వజన్మ స్మృతి పోలేదు. తమరి దర్శనం కోసం నిరీక్షిస్తున్నాను. నా పూర్వజన్మసుకృతం వలన నేను యాదవ కుమారుల దృష్టిలో పడటం, ఆ విషయం మీకు తెలియడం, తమరు ఇక్కడకు రావడం, తమ దర్శనభాగ్యం నాకు లభించడం, తమరి కరస్పర్శతో నాకు పాపవిమోచన కలిగడం అంతా ఆశ్చర్యంగా ఉంది.

దేవదేవా! జగన్నాథా! గోవిందా! పురుషోత్తమా! నారాయణా! హృషీకేశా! పుణ్యశ్లోకా! అచ్యుతా! అవ్యయా! సృష్టి స్థితి లయ కారకా! నిర్వికారా! అనంత శక్తిమంతా! శ్రీకృష్ణా! వాసుదేవా! నీకు నమస్కారము. నాకు అనుమతి ఇస్తే నేను పుణ్యలోకాలకు వెళ్లిపోతాను. నేను ఎక్కడ ఉన్నా తమరి పాదసేవనము మాత్రము నా మనసులో నుండి తొలగిపోకుండా నన్ను అనుగ్రహించ మని ప్రార్థన!" అని ప్రార్థించి శ్రీకృష్ణునికి ప్రదక్షిణం చేసి నమస్కరించి, స్వర్గము నుండి వచ్చిన విమానము ఎక్కి వెళ్లిపోయాడు నృగుడు.

నృగరాజు వృత్తాంతమును ఉదాహరణగా చూపి, శ్రీకృష్ణుడు యాదవ కుమారులందరికీ ఈ విధంగా చెప్పాడు. "ఎవరు కూడా బ్రాహ్మణులకు చెందిన ధనమును ఏ రూపంలో అపహరించినా, దానికి తీవ్రమైన పాపఫలమును అనుభవించక తప్పదు. సామాన్య మానవులకే ఈవిధంగా ఉంటే రజోగుణ సంపన్నులు, అహంకారులు అయిన రాజుల సంగతి చెప్పేదేముంది! హాలాహలము వంటి విషమునకు విరుగుడు ఉంది. కాని బ్రాహ్మణుల సొత్తు అపహరించడం వంటి పాపమునకు ప్రాయశ్చిత్తము లేదు. ఎందు కంటే విషము తిన్నవారినే చంపుతుంది. కానీ బ్రాహ్మణుల సొత్తు అపహరిస్తే, వారి వంశమును పూర్తిగా నాశనం చేస్తుంది.

ఇంకొక మాట. బ్రాహ్మణుల అనుమతి లేకుండా వారి సొత్తు అనుభవిస్తే, వారి మూడు తరముల వారికి నష్టం చేస్తుంది. కాని బ్రాహ్మణుల సొత్తు వారి వద్దనుండి బలవంతంగా లాగుకొని అనుభవిస్తే, అటువంటి వారు అటు పదితరముల వారు, ఇటు పదితరముల వారు

నాశనం అవుతారు. సాధారణంగా రాజ్యాధికారము, పరులను పాలించు అధికారము  కలదని గర్వముతో అంధులైన రాజులు, బ్రాహ్మణుల వద్దనుండి వారి సొత్తును, భూములను లాగుకొని అనుభవిస్తే, వారు కోరి కోరి నరకద్వారములను తెరిచినట్టే!  అటువంటి వారు తాము అధోగతి పాలవుతున్నారు అని తెలుసుకోలేరు.

రాజుల చేత సర్వస్వము అపహరింపబడిన బ్రాహ్మణుల యొక్క కన్నీటి చుక్కలు ఎన్ని భూమి మీద పడతాయో, అన్ని సంవత్సరముల పాటు కుంభీపాకము అనే నరకంలో పడతారు. తాను బ్రాహ్మణులకు దానం చేసిన ధనమును తిరిగి తీసుకున్నా, ఇతరులు బ్రాహ్మణులకు దానంగా ఇచ్చిన ధనమును ఎవరు తీసుకున్నా, వారు 60,000 సంవత్సరములు మలములో నివసించే క్రిమిగా పడి ఉంటాడు. బ్రాహ్మణుల ధనమును అపహరించే వారు పాములుగా జన్మిస్తారు.

కాబట్టి మీరు ఎప్పుడు కూడా బ్రాహ్మణులను అవమానించడం, వారి సొత్తును అపహరించడం చేయకండి. బ్రాహ్మణులు పొరపాటున తప్పుచేసినా, వారిని దండించ కూడదు. బ్రాహ్మణులు మీమీద కోపించినా, మీరు వారికి వినయంగా నమస్కరించాలే గానీ, వారి మీద కోపపడకూడదు.

సర్వకాల సర్వావస్థలయందు, నేను బ్రాహ్మణులను పూజిస్తాను. మీరు కూడా బ్రాహ్మణుల విషయంలో చాలా జాగ్రత్తగా ఉండండి. మీరు ఎప్పుడైనా బ్రాహ్మణులకు అపకారం చేస్తే వారిని నేను శిక్షిస్తాను. ఈ నృగమహారాజు తన తప్పు ఏమీ లేకపోయినా, తాను దానం చేసిన ఆవును తిరిగి మరొకరికి దానం చేసినందుకు, ఎంతో

తీవ్రమైన శిక్షను అనుభవించాడు. అదే విధంగా బ్రాహ్మణుల ధనమును అపహరించిన వారు తీవ్రమైన శిక్షలను అనుభవిస్తారు. అధఃపతితులవుతారు." అని శ్రీకృష్ణుడు బ్రాహ్మణుల ధనమును అపహరించిన వారికి కలుగబోవు పరిణామాలను వివరించి తన భవనమునకు వెళ్లిపోయాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుడకు నృగమహారాజు చరిత్ర వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము అరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

అరువది ఐదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! బలరామునికి ఒక కోరిక కలిగింది. ఎప్పుడో చిన్నతనంలో ఆడిపాడి తమ బాల్యాన్ని ఆనందంగా గడిపిన గోకులము ఇప్పుడు ఎలా ఉందో చూడవలెనని కోరిక కలిగింది. కోరిక కలగడమే తడవుగా వెంటనే రథము ఎక్కి నంద గోకులమునకు వెళ్లాడు.

బలరాముడు తమ ఊరికి వస్తున్నాడని తెలిసి గోకులములో ఉన్న గోపకులు గోపకాంతలు అందరూ పరమానందభరితులయ్యారు. బలరాముడు రథం దిగి తమ తల్లి తండ్రులు అయిన యశోదా నందుల వద్దకు వెళ్లాడు. యశోద బలరాముని కౌగలించుకొని

శిరస్సును ముద్దుపెట్టుకుంది. బలరాముడు యశోదకు, నందునికి పాదాభివందనము చేసి వారి ఆశీర్వాదములు తీసుకున్నాడు. "బలరామా! నువ్వు, శ్రీకృష్ణుడు ఇద్దరే మాకు దిక్కు. మీ ఇద్దరూ మమ్ములను ఈ పల్లెను కాపాడుతూ ఉండండి." అని పలికాడు నందుడు.

తరువాత బలరాముడు ఆ ఊరిలో ఉన్న వృద్ధులు అయిన గోపకులకు పాదాభివందనము చేసాడు. కొందరిని గౌరవంగానూ, కొందరిని నవ్వుతోనూ పలకరించాడు. తాము బాల్యంలో కలిసి తిరిగిన గోపకుల యోగక్షేమాలు తెలుసుకున్నారు. తరువాత ఆ గోపకులు బలరాముని ఇలా అడిగారు. "బలరామా! ద్వారకలో మా బంధువులు అందరూ క్షేమంగా ఉన్నారా! మీరందరూ ఎప్పుడైనా మా గురించి తలచుకుంటూ ఉంటారా!" అని అడిగారు.

కృష్ణునితో ఆడి పాడి రమించిన గోపకాంతలు బలరామునితో ఇలా అన్నారు. "బలరామా! కృష్ణుడు ఎలా ఉన్నాడు? బాగున్నాడా! ఎప్పుడైనా యశోదా నందులను, ఇక్కడ ఉన్న గోపకులను, కృష్ణుని కోసరం సర్వస్వం అర్పించిన మా అందరినీ ఎప్పుడైనా తలచుకుంటాడా! కనీసం తన తల్లి యశోదను చూడటానికైనా ఒక్కసారి ఇక్కడకు రావచ్చు కదా! కృష్ణుడు మాతో ఆడి పాడిన ఆటలను ఎప్పుడైనా గుర్తుకు తెచ్చుకుంటాడా!

బలరామా! నీకు తెలసుకదా! మేమందరమూ కృష్ణుని కోసరము మా తల్లితండ్రులను, అన్నదమ్ములను, సంతానమును, అక్కచెల్లెళ్లను, బంధుమిత్రులను, విడువరాని వారిని కూడా విడిచి

ఆయన వద్దకు వచ్చాము. కాని కృష్ణుడు మా అందరినీ వదిలిపెట్టి, చెప్పా పెట్టకుండా మధురకు అక్కడి నుండి ద్వారకకు వెళ్లిపోయాడు. మధురకు వెళ్లేటప్పుడు మరలా తొందరలోనే వస్తాను అని చెప్పడంతో కృష్ణుడు మధురకు వెళుతున్నప్పుడు మేము అడ్డురాలేదు. కానీ శ్రీకృష్ణుడే మాట తప్పి మరలా ఒక్కసారి కూడా గోకులమునకు రాలేదు.

మా సంగతి సరే! అక్కడ మధురలో కానీ, ద్వారకలో కానీ, అంతా నాగరికులు విద్యావంతులు కదా! మరి ఏ మాత్రం నమ్మకం లేని కృష్ణుని మాటలను వారు ఎలా నమ్ముతున్నారో ఆశ్చర్యంగా ఉంది." అని కొంత మంది గోపికలు అన్నారు.

ఇంతలో ఒక గోపిక కలుగచేసుకొని "అబ్బా! ఇన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. ఇంకా ఎందుకే ఆ కృష్ణుని గురించి తలచుకోవడం. మానెయ్యండి. ఆయన గురించి తలచుకోవడం, ఆయన గురించి మాట్లాడటం వలన ఏ మాత్రం ప్రయోజనము లేదు. మనల నందరినీ వదిలిపెట్టి కృష్ణుడు ఇన్ని సంవత్సరాలు ఉండగా లేనిది, మనము కూడా కృష్ణుని వదిలిపెట్టి, ఆయన జ్ఞాపకాలను మనసులోనుండి తుడిచివేసి, మిగిలిన జీవితాన్ని గడపలేమా! మనం అనవసరంగా కృష్ణుని గురించి తాపత్రయపడుతున్నాము కానీ, కృష్ణుడు అస్సలు మనగురించి తలుచుకోవడం లేదు. పట్టించుకోవడంలేదు. లేకపోతే ఇన్ని సంవత్సరాలు గడిచినా ఒక్కసారైనా మనలను చూడటానికి ఈ పల్లెకు రావడానికి ఆయనకు తీరిక లేదా!" అని నిష్ఠూరంగా మాట్లాడింది.

ఆ ప్రకారంగా గోపికలు కృష్ణుని గురించి ఆయన లీలల గురించి, ఆయన ఎడబాటును తలచుకుంటూ శోకించారు. బలరాముడు తనకు తోచిన విధంగా వారిని ఓదార్చాడు. బలరాముడు గోకులములో చైత్ర, వైశాఖ మాసములు గడిపాడు.

బలరాముని కోసరం వరుణుడు, వారుణి అనే వృక్షమును భూలోకములో ప్రతిష్ఠించాడు. వరుణుడు పంపిన చెట్టు నుండి తయారు చేయబడిన పానీయమే వారుణి. ఆ వారుణిని సేవించి బలరాముడు మత్తులో తేలియాడుతున్నాడు. గోపకులు, గోపకాంతలు కూడా బలరామునితో కూడా వారుణిని సేవించారు. అందరూ బృందావనములో విహరించారు.

బలరాముడు యమునా నదిలో జలకాలాటలు ఆడదామని అనుకున్నాడు. బలరాముడు బాగా మత్తులో ఉండటం వలన యమునా నది బలరాముని ఆహ్వానించలేదు. దానితో బలరామునికి కోపం వచ్చింది. "ఓ యమునా! నీవు నా ఆజ్ఞను ధిక్కరించావు. స్వేచ్ఛగా ప్రవహిస్తున్న నిన్ను నా హలాయుధముతో వేయి పాయలుగా విభజిస్తాను." అని పలికాడు. బలరాముని మాటలకు యమున గడగడ వణికిపోయింది. బలరాముని కాళ్లమీద పడింది. "బలరామా! నీ గురించి పూర్తిగా తెలుసుకోలేకపోయాను. నన్ను క్షమించు. నిన్ను శరణు కోరుతున్నాను." అని వేడుకుంది. యమున మాటలతో బలరాముడు ప్రసన్నుడయ్యాడు. గోప కాంతలతో సహా బలరాముడు యమునా నదిలో జలక్రీడలు సలిపాడు.

ఆ ప్రకారంగా చిన్న నాటి ఆట పాటలను తలచుకుంటూ, బలరాముడు నందవ్రజములో రోజులు క్షణాల్లా గడిపాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు బలరాముని నందవ్రజవిహారము గురించి తెలిపాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము అరువది ఐదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
అరువది ఆరవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుడు ద్వారకలో ఉన్న కాలంలో కరూష పురమును పౌండ్రకుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. వాడు ఒక అజ్ఞాని. తెలివితక్కువ వాడు. వాడికి కృష్ణుడి గురించి తెలిసింది. తన పేరు కూడా వాసుదేవుడు అని మార్చుకున్నాడు. కృష్ణుడు మాదిరి శంఖు, చక్రము, గద తయారు చేయించుకున్నాడు. కృష్ణుడి మాదిరి పీతాంబరమును ధరించాడు. వక్షస్థలము మీద శ్రీవత్సము మాదిరి ఒక మచ్చ పెట్టుకున్నాడు. మెడలో ఒక మాల వేసుకున్నాడు. తానే వాసుదేవుడను అని ప్రకటించుకున్నాడు.

వీడికి తోడు వీడి మంత్రులు కూడా అజ్ఞానులే. వారు కూడా "తమరే అసలైన వాసుదేవులు. ఈ జగత్తునంతా తమరే పాలిస్తున్నారు. తమరి ముందు ఆ కృష్ణుడు ఎంత?" అని అతని లోని అజ్ఞానాన్ని

రెచ్చగొట్టారు. పౌండ్రకుడు ఇంకా రెచ్చిపోయాడు. ఒక దూతను కృష్ణుని వద్దకు పంపాడు. రాజాజ్ఞ నెరవేర్చాలి కాబట్టి ఆ దూతకూడా విధిలేక కృష్ణుడి వద్దకు వెళ్లాడు. కృష్ణుడు రాజ సభలో కూర్చుని ఉండగా పౌండ్రక వాసుదేవుని సందేశమును ఈ విధంగా వినిపించాడు.

"ఓ కృష్ణా! అసలు సిసలైన వాసుదేవుడను నేనే! నేను ఈ భూమిని ఉద్ధరించడానికి అవతరించాను. ఈ లోకంలో నేను తప్ప మరొక వాసుదేవుడు లేడు. ఉండకూడదు. కాబట్టి ముందు నీవు వాసుదేవుడు అనే నీ పేరును విడిచిపెట్టు. నీవు ఇప్పటి వరకు అజ్ఞానముతో మూర్ఖత్వముతో ధరించిన శంఖు, చక్రము, గద మొదలగు ఆయుధములను వెంటనే విడిచిపెట్టు. నన్ను శరణు వేడి, ఒక సామాన్యుని వలె బతుకు. లేదా నీతో యుద్ధం చేసి, నిన్ను ఓడించి, నీ రాజ్యాన్ని ఆక్రమిస్తాను. జాగ్రత్త!" అని పౌండ్రకుని సందేశమును ఆ దూత కృష్ణునికి వినిపించాడు.

ఆ సమయంలో సింహాసనము మీద కూర్చున్న ఉగ్రసేనుడు, సాత్యకి మొదలగు వారు ఆ సందేశమును విని పెద్దగా పరిహాసంగా నవ్వారు. అప్పుడు కృష్ణుడు ఆ దూతతో ఈ విధంగా అన్నాడు. "నీవు దూతగా వచ్చావు. మీ రాజుగారి సందేశమును వినిపించావు. నేను నా సందేశమును వినిపిస్తాను. నీవు వెళ్లి నా సందేశమును యధాతథంగా మీ రాజుగారికి వినిపించు. "ఓ మూఢుడైన పౌండ్రకా! కేవలము నా పేరు పెట్టుకొని, సుదర్శనము మొదలగు ఆయుధములను తయారు చేయించుకొని, నువ్వే వాసుదేవుడవు అని నిన్ను నువ్వే పొగుడు కుంటున్నావు. ఇతరులచేత పొగిడించుకుంటున్నావు. నేను నీతో యుద్ధానికి వస్తాను. నిన్ను ఓడించి, నీ ఆయుధములను అన్నిటినీ

ధ్వంసం చేస్తాను. నా చేత ఓడించబడ్డ నీవు యుద్ధరంగంలో దిక్కులేకుండా పడి ఉండి గద్దలు, కుక్కలు, నక్కలతో సహవాసం చేస్తావు." అని నా మాటగా మీ రాజుగారికి చెప్పు." అని కృష్ణుడు పలికాడు.

ఆ దూతకూడా బతుకు జీవుడా అనుకుంటూ ద్వారకను విడిచిపెట్టి కరూషపురమునకు చేరుకున్నాడు. కృష్ణుని వాక్కులను యథాతథంగా పౌండ్రకునికి వినిపించాడు. కృష్ణుని మాటలను విన్న పౌండ్రకుడు అగ్గి మీద గుగ్గిలం అయ్యాడు. వెంటనే తన సేనలను సిద్ధం చేసాడు. కృష్ణుని మీదికి దాడి చేయడానికి బయలు దేరాడు.

దూతను అటు పంపించి, కృష్ణుడు కూడా తన రథము ఎక్కి కాశీనగర సమీపమునకు వచ్చాడు. ఇద్దరూ కాశీరాజ్యము సమీపములో కలుసుకున్నారు. కాశీరాజు పౌండ్రక వాసుదేవునికి మిత్రుడు. తన మిత్రుడు కృష్ణుని మీదికి యుద్ధమునకు వెళుతున్నాడు అని తెలిసి కాశీరాజు కూడా పౌండ్రకునికి సాయంగా వచ్చాడు. ఈ పౌండ్రకుడు ఎవడు ఎలా ఉంటాడు అని కృష్ణుడు పౌండ్రకుని వంక చూచాడు. నిజంగానే పౌండ్రకుడు తన మాదిరే ఉన్నాడు అని అనుకున్నాడు. శంఖము, చక్రము, గద, ధనుస్సు, ఖడ్గము, శ్రీవత్సము మొదలగు నవి ధరించి, మెడలో కౌస్తుభమును ధరించి, వనమాల మెడలో వేలాడుతుండగా, పీతాంబరమును కట్టుకొని మకర కుండలములతో రథం మీద వెలిగిపోతున్న పౌండ్రకుని చూచాడు కృష్ణుడు.

నాటకంలో వేషం వేసుకొని వచ్చిన వాడి మాదిరి ఉన్న పౌండ్రకుని చూచి కృష్ణుడు పెద్దగా నవ్వాడు. ఇంతలో పౌండ్రకుని సేనలు కృష్ణుని మీదికి శూలములు, గదలు, పరిఘలు, శక్తి ఆయుధము, తోమరములు, ఖడ్గములు, పట్టిసములు, శరములు విసరసాగారు. కృష్ణుడు కూడా తన గద, చక్రము,ఖడ్గము,విల్లు ధరించి, పౌండ్రకుని సేనలను ఎదుర్కొన్నాడు. పౌండ్రకుని సేనలను చించి చెండాడాడు. రణరంగము భీభత్సంగా ఉంది. కృష్ణుడు పౌండ్రకుని రథము వద్దకు తన రథమును పోనిచ్చి పౌండ్రకునితో ఈ విధంగా అన్నాడు.

"పౌండ్రకా! నీవు నీ దూత ద్వారా నా ఆయుధములను విడిచిపెట్టి నీ శరణు కోరమని నాకు వర్తమానం పంపావు. నీవు ఏయే ఆయుధములను విడిచిపెట్టమన్నావో అవే ఆయుధములను నీ మీద ప్రయోగిస్తున్నాను. ధైర్యం ఉంటే కాచుకో! అయినా, నీవు నా పేరు పెట్టుకున్నంత మాత్రాన, నా ఆయుధముల మాదిరి ఆయుధములను ధరించినంత మాత్రాన, నా అంత వాడివి అవుతావా! నీతో యుద్ధం చేయమని వర్తమానం పంపావు కదా! నీతో యుద్ధం చేయడానికే వచ్చాను. నీ ఆయుధములను నాశనం చేసి, నీ వాసుదేవ నామమును విడిచిపెట్టేటట్టు చేస్తాను. ఒక వేళ నేను ఓడిపోతే, నా ఆయుధములను, నా వాసుదేవ నామమును విడచిపెడతాను. కాచుకో." అని కృష్ణుడు పౌండ్రకుని మీద ముందు తీవ్రమైన బాణములను ప్రయోగించి వాడి రథాన్ని విరగ్గొట్టాడు. రథం విరిగి కిందపడ్డ పౌండ్రకుని మీదికి చక్రం విసిరాడు. ఆ చక్రం గిరా గిరా తిరుగుతూ పోయి పౌండ్రకుని తలను నరికింది. పౌండ్రకుని తలతెగి కిందపడింది.

తన మిత్రుడు అయిన పౌండ్రకుడు కృష్ణుని చేతిలో చావడం చూచిన కాశీరాజు కృష్ణుని మీదికి యుద్ధానికి వచ్చాడు. కృష్ణుడు తన వాడి అయిన బాణములతో కాశీరాజు శిరమును ఛేదించాడు. కాశీరాజు తల కిందపడకుండా, ఆ తలను కాశీరాజు కోట ద్వారం దగ్గర పడేటట్టు కొట్టాడు. కాశీరాజు తల కాశీపట్టణ ద్వారం దగ్గర పడింది. తమ తమ రాజులు చావడంతో వారి సేనలు తలా ఒక దిక్కు పారిపోయాయి. విజయంతో కృష్ణుడు ద్వారకకు తిరిగివచ్చాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! తెలిసో తెలియకో పౌండ్రకుడు వాసుదేవుని మాదిరి వేషం వేసుకొని, ఆయన ఆయుధములు ధరించి, తానే వాసుదేవుడనని నిరంతరం తలచుకుంటూ ఉండటం వలన, శ్రీకృష్ణుని చేతిలో చావడం వలన, పౌండ్రకుని ఆత్మ పరమాత్మలో ఐక్యం అయింది.

కాశీపట్టణము ముఖద్వారము వద్ద పడి ఉన్న తలను చూచి కాశీపట్టణ వాసులు ఇదేమిటి! ఇది ఎవరి తల? అని అనుకోసాగారు. కొంత మంది రక్తంతో మలినమై ఉన్న ఆయన ముఖమును నీటితో కడిగి అది కాశీరాజు తల అని గుర్తించారు. ఈ వార్త దావానలంలా కాశీరాజ్యం అంతా పాకింది. కాశీరాజు భార్యలు, సంతానము ఏడ్చుకుంటూ కాశీరాజు తల పడి ఉన్న చోటికి వచ్చారు.

"మా అందరినీ అనాధలను చేసి వెళ్లి పోయావా! జగద్రక్షకుడైన వాసుదేవునితో ఎందుకు పెట్టుకున్నావు? నీవు ఆయనంత వాడివా! చెప్పుడు మాటలు విని చెడిపోయావు" అని

పెద్దపెట్టున ఏడుస్తున్నారు.

కాశీరాజు పుత్రుడైన సుదక్షితుడు తండ్రికి అంత్యక్రియలు చేసాడు. తన తండ్రిని చంపిన వాడిని చంపకుండా వదలను అని ప్రతిజ్ఞకూడా చేసాడు. వెంటనే తన పురోహితులను పిలిపించాడు. కఠోర నియమములతో మహాదేవుని గురించి హోమాలు చేసాడు. అతని ఆరాధనకు తృప్తి చెందిన శివుడు ఆయనకు ప్రత్యక్షం అయ్యాడు. ఏం వరం కావాలని అడిగాడు. తన తండ్రిని చంపడమే తనకు కావాల్సిన వరం అని అడిగాడు సుదక్షిణుడు.

అప్పుడు శివుడు ఇలా అన్నాడు. "నీవు నీ పురోహితులను సంప్రదించి అభిచార విధానంతో హోమం చెయ్యి. అందులో దక్షిణాగ్నిని ప్రజ్వరిల్లచేయి. అప్పుడు అగ్ని దేవుడు నీ కోరిక నెరవేరుస్తాడు. ఆ అగ్నిని బ్రాహ్మణులకు విరోధముగా ఉన్న వారి మీదనే ప్రయోగించాలి. అప్పుడే నీ కోరిక నెరవేరుతుంది." అని చెప్పి శివుడు అంతర్హితుడు అయ్యాడు.

వెంటనే సుదక్షిణుడు తన పురోహితులను పిలిపించి కృష్ణుడి మరణాన్ని కోరుతూ అభిచార విధానంలో హోమం చెయ్యమని ఆదేశించాడు. దక్షిణాగ్నిని ప్రజ్వరిల్లచేసాడు. ఆ అగ్ని కుండము నుండి రాగి రంగు జుట్టుతో, నిప్పులు కక్కే కళ్లతో, కోర పళ్లతో, క్రూరమైన ముఖంతో, ఒంటిమీద బట్టలు లేకుండా, అతి భయంకరాకారంతో చేతిలో త్రిశూలాన్ని ఊపుకుంటూ ఒక వింత భూతం లాంటి ఆకారం అగ్ని కుండము నుండి బయటకు వచ్చింది. ఆ ఆకారం త్రిశూలము ఊపుకుంటూ ద్వారకానగరం వైపు పరుగెత్తాడు.

ఆ వ్యక్తి ద్వారకా నగరం చేరుకోగానే ద్వారకా నగర వాసులు భయంతో కంపించి పోయారు. ఆ సమయంలో కృష్ణుడు తన భార్యలతో పాచికలాట ఆడుకుంటున్నాడు. ప్రజలంతా "కృష్ణా! ఏదో భూతం ద్వారకానగరం మీదికి వస్తూ ఉంది. దాని బారి నుండి ద్వారకానగరవాసులను రక్షించు." అని మొరపెట్టుకున్నారు. విషయం తెలుసుకున్న కృష్ణుడు భయపడకండి ఆ భూతం మిమ్ములను ఏమీ చేయదు అని అభయం ఇచ్చాడు. వెంటనే తన సుదర్శన చక్రమును ఆ భూతం మీదికి వదిలాడు.

కృష్ణుని చేత ప్రయోగింపబడిన సుదర్శన చక్రము ఆ భూతమును వెంబడించింది. సుదర్శన చక్రము ముందు ఆ భూతశక్తి నిర్వీర్యము అయింది. వెంటనే ఆ భూతము, అభిచార హోమము చేసి తనను ఆవాహన చేసిన వారి వద్దకు వచ్చింది. ఆ యజ్ఞము చేసిన వారి నందరినీ, ఆ హోమము చేయమని చెప్పిన సుదక్షిణుని దహించివేసింది. ఆ భూతము వెంట వచ్చిన సుదర్శన చక్రము ఆ భూతమును, దాని వెంట వారణాసి పురమును దహించి వేసింది. తాను వచ్చిన పని అయిపోగానే సుదర్శన చక్రము తిరిగి శ్రీకృష్ణుని వద్దకు చేరింది." అని శుకయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు పౌండ్రకవాసుదేవుని వృత్తాంతము వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము అరువది ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

అరువది ఏడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు నరకుడు అనే అసురుని చంపాడు అని చెప్పాను కదా. ఆ నరకుడికి ఒకమిత్రుడు ఉన్నాడు. వాడి పేరు మైందుడు. ఆ మైందుడి సోదరుడి పేరు ద్వివిదుడు. వీళ్లు ఇద్దరూ వానరులు. రామాయణ కాలంలో వీరు ఇద్దరూ సుగ్రీవునికి ముఖ్య అనుచరులు, మంత్రులు. వీరు ఇద్దరూ వానరులు.

తమ మిత్రుడు నరకుడు కృష్ణుని చేతిలో మరణించాడు అన్న వార్త విన్న ఆ సోదరులు తమ మిత్రుని ఋణము తీర్చుకోవాలని అనుకున్నారు. వెంటనే వారు ఇద్దరూ కృష్ణుని రాజ్యములో ఉన్న పట్టణములను, గ్రామములను తగులబెట్టడం మొదలు పెట్టారు. దానితో ప్రజలలో అసహనం రేగింది. అది ప్రజలలో తిరుగుబాటుకు దారి తీసింది. ఆ ఇద్దరిలో ఒక వానరుడు పెద్ద పెద్ద వృక్షములను, బండరాళ్లను పెకలించి కృష్ణుడు పరిపాలించే దేశములో ఉన్న గ్రామముల మీద విసర సాగాడు. అంతే కాకుండా సముద్రములోకి దిగి సముద్రము నీటిని అడ్డగించి, తీర ప్రాంతములో ఉన్న గ్రామములను మునిగిపోయేటట్టు చేయసాగాడు. అంతే కాదు యజ్ఞములు యాగములు చేసుకుంటున్న మునుల ఆశ్రమములను ధ్వంసం చేయడం వాటిని అపవిత్రం చేయసాగాడు. ఆడవాళ్లను, మగవాళ్లను బంధించి తెచ్చి పర్వత గుహలలో బంధించి, ఆ గుహలను రాళ్లతో మూసేవాడు. లోపల ఉన్న వాళ్లు ఊపిరి ఆడక, ఆహారము నీరు లేక చనిపోయేవారు.

ఆ సమయంలో బలరాముడు రైవతకము అనే పర్వత ప్రాంతములలో మద్యము తాగి మత్తుతో, స్త్రీలతో విహరిస్తున్నాడు. ఆ సంగతి తెలిసిన వానరుడు రైవతకము దగ్గరకు వెళ్లాడు. బలరాముని చూచాడు. ఆ వానరుడు చెట్ల మీద దుముకుతూ కిచకిచ నవ్వుతూ బలరాముని హేళన చేయసాగాడు. బలరాముని పక్కన ఉన్న స్త్రీలు ఆ వానరుని చూచి నవ్వసాగారు.

ఇది చూచి బలరామునికి కోపం వచ్చింది. వాడు సామాన్య వానరము అనుకొని రాళ్లు తీసుకొని ఆ వానరమును కొట్టాడు. ఆ వానరము రాళ్ల దెబ్బలు తప్పించుకొని, బలరాముడు తాగుతున్న మద్యము పాత్రను ఎత్తుకొని పోయి చెట్టుమీద కూర్చున్నాడు. పళ్లు ఇకిలించి నవ్వసాగాడు. హటాత్తుగా దిగివచ్చి బలరాముని భార్యల వస్త్రములు లాగాడు. బలరాముడు కట్టుకున్న బట్టలు లాగసాగాడు.

వీడు సామాన్య వానరం కాదు అని అనుకున్నాడు బలరాముడు. వెంటనే తన హలాయుధమును, ముసలమును తీసుకున్నాడు. ఇది చూచిన ద్వివిదుడు అనే ఆ వానరము పక్కనే ఉన్న సాలవృక్షమును పెకలించి దానితో బలరాముని తల మీద  మోదాడు. కాని బలరాముడు ఆ చెట్టును మధ్యలోనే పట్టుకొని విరిచాడు. ముసలంతో ఆ వానరుడిని కొట్టాడు. ఆ ముసలం దెబ్బకు ద్వివిదుడి తల పగిలింది. రక్తం కారసాగింది. కాని ఆ వానరుడు ఆ దెబ్బలు లక్ష్యపెట్టకుండా మరొక చెట్టును పీకి దానితో బలరాముని కొట్టాడు. బలరాముడు తన హలముతో ఆ చెట్టును ముక్కలు చేసాడు.

ఈ ప్రకారంగా బలరాముడు ద్వివిదుడు చెట్లతో రాళ్లతో యుద్ధం చేసుకుంటున్నారు. ఆ వనములోని చెట్లు అన్నీ ముక్కలు ముక్కలు అయి కిందపడి ఉన్నాయి. ఆ వనములో పెరకడానికి ఏ ఒక్క చెట్టు లేకపోవడంతో రాళ్లు తీసుకొని బలరాముని మీదికి విసరసాగాడు ద్వివిదుడు. ఆ రాళ్ల దెబ్బలు తప్పించుకుంటున్నాడు బలరాముడు.

ఇలా కాదని ఇద్దరూ ముష్టియుద్ధమునకు దిగారు. ద్వివిదుడు తన పిడికిలి బిగించి బలరాముని గుండెలమీద కొట్టాడు. బలరాముడు ద్వివిదుడు గొంతు పట్టుకున్నాడు. గట్టిగా నులిమాడు. ఊపిరి ఆడక ఆ వానరుడు చచ్చాడు. ఆ ప్రకారంగా ద్వివిదుడు బలరాముని చేతిలో మరణించాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ద్వివిదుని వృత్తాంతమును వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము అరువది ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## అరువది ఎనిమిదవ  అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! తండ్రికి తగ్గ తనయుడు అనే మాట విని ఉంటావు. శ్రీకృష్ణుని కుమారుడు సాంబుడు తండ్రికి తగ్గ తనయుడు అనే మాటను సార్థకం చేసాడు. సుయోధనుడు తన కుమార్తె లక్షణకు స్వయంవరం ప్రకటించాడు. ఆ స్వయంవరానికి శ్రీకృష్ణుని కుమారుడు సాంబుడు కూడా వెళ్లాడు. వెళ్లిన వాడు కుదురుగా ఉండకుండా, శ్రీకృష్ణుడు రుక్మిణిని ఎత్తుకెళ్లినట్టు, సాంబుడు సుయోధనుని కుమార్తె లక్ష్మణను ఎత్తుకెళ్లాడు.

ఇది చూచిన కౌరవులు ఆశ్చర్యపోయారు. "వీడేంది. ఇలా చేసాడు. మన అమ్మాయికి ఇష్టమో లేదో తెలుసుకోకుండా బలవంతంగా తీసుకొని వెళ్లాడు. శ్రీకృష్ణుని కుమారుడు అని ఉపేక్ష చేయకుండా వీడిని వెంటనే బంధించండి.అయినా ఈ యాదవులకు ఇంత గర్వమా! మన చేతి కింద బతుకుతూ, మనం ఇచ్చిన రాజ్యమును ఏలుకుంటూ మనకే ద్రోహం తలపెడతారా!  మన అమ్మాయినే అపహరిస్తారా! ముందు వీడిని బంధిస్తే యాదవులు మన కాళ్ల దగ్గరకు వస్తారు." అని అనుకున్నారు కౌరవులు.

ఈ విషయాన్ని భీష్ముని చెవిని వేసారు. చెప్పినా వినరు అని తెలిసిన భీష్ముడు "మీ ఇష్టం వచ్చినట్టుచెయ్యండి." అని అన్నాడు. వెంటనే సుయోధనుడు, కర్ణుడు, శల్యుడు, భూరిశ్రవసుడు మొదలగు

మహావీరులు సాంబుని వెంబడించి అతనిని బంధించడానికి ప్రయత్నించారు. కాని సాంబుడు అంత పిరికి వాడు కాదు. ధనుస్సు తీసుకొని వారిని ఎదిరించాడు. ఒకరి మీద ఒకరు బాణవర్షం కురిపించుకున్నారు. సాంబుడు ఆరు బాణములతో కర్ణుడు, శల్యుడు మొదలగు వీరులను తుక్కు కింద కొట్టాడు. వాళ్ల రథాలను విరిచాడు. రథాలకు కట్టిన గుర్రములను చంపాడు. సారథిని గాయపరిచాడు.

ఇలా కాదని కౌరవ వీరులు అందరూ ఒక్కసారిగా సాంబుని చుట్టుముట్టారు. ఒకడు రథాన్ని విరగ్గొట్టాడు, మరొకడు గుర్రాలను చంపాడు. మరొకడు సాంబుని విల్లు విరిచాడు. మరొకడు సారథిని చంపాడు. ఇలా అందరూ నాలుగు పక్కలా చుట్టుముట్టి సాంబుని బంధించారు. తమ కుమార్తె లక్ష్మణను అంత:పురానికి చేర్చారు. సాంబుడు హస్తినలో బందీగా ఉన్నాడు.

ఈ విషయాన్ని నారదుడు కృష్ణుని చెవిని వేసాడు. ఈ వార్తను  కృష్ణుడు రాజు ఉగ్రసేనుడికి చెప్పాడు. రాజు అనుమతితో యాదవులంతా కౌరవుల మీదికి యుద్ధానికి సన్నద్ధం అయ్యారు. కాని బలరాముడు వారిని వారించాడు.

"కౌరవులు మనకు బంధువులు. వారితో యుద్ధం ఎందుకు. సుయోధనుడు నా శిష్యుడు. నేను చెప్పినమాట వింటాడు. నేను హస్తినకు పోయి మన సాంబుని తీసుకొని వస్తాను." అని పలికి హస్తినకు వెళ్లాడు బలరాముడు. హస్తినాపురము బయట ఉన్న ఒక ఉద్యాన వనములో విడిది చేసాడు బలరాముడు. తాను వచ్చినట్టు

సుయోధనునికి వర్తమానం పంపించాడు.

బలరాముడు స్వయంగా వచ్చాడు అని విన్న సుయోధనుడు, కౌరవులు పూజాద్రవ్యములు తీసుకొని ఆయన వద్దకు వచ్చారు. ఆయనకు అర్ఘ్యము, పాద్యము ఇచ్చి సత్కరించారు. ఆయనకు పాదపూజ చేసారు. భీష్ముడు మొదలగు వారు బలరాముని ఆశీర్వదించారు. ఒకరిని ఒకరు బంధుమిత్రుల కుశలములు అడిగి తెలుసుకున్నారు.

అప్పుడు బలరాముడు కౌరవులతో ఇలా అన్నాడు. "మీకు మా ఉగ్రసేనమహారాజు ఒక ఆదేశమును పంపించాడు. అదేమిటంటే...... మీరంతా అధర్మ యుద్ధము చేసి బాలుడైన సాంబుని బంధించారు.అది అధర్మము. ఈ విషయం మాకు తెలిసింది. మనము అందరమూ బంధువులము కాబట్టి ఒకరితో ఒకరికి విరోధము కూడదు కాబట్టి మీరు చేసిన అన్యాయమును, అధర్మమును మా ఉగ్రసేన మహారాజుగారు సహించారు. మీరు వెంటనే మా సాంబుని మాకు అప్పగించండి. చేసిన తప్పుకు క్షమాపణ కోరండి. మా ఉగ్రసేన మహారాజుల వారు మీ అందరినీ క్షమిస్తారు." అని గర్వంగా దర్పంగా అన్నాడు.

బలరాముని మాటలకు కౌరవులు నిశ్చేష్టులయ్యారు. అంతలోనే తేరుకున్నారు. పకపకా హేళనగా నవ్వసాగారు. "ఏమీ! ఏమేమీ! యాదవులు కౌరవులను ఆదేశించుటయా! ఎంత ఆశ్చర్యము! ఎంత ఆశ్చర్యము! కాలికి తొడుగుకొనే చెప్పులు సింహాసనము

అధిష్టించవలెనని చూస్తునట్టుంది! అసలు ఈ యాదవులు ఎవరు! కుంతీదేవిని మా పాండురాజు వివాహం ఆడటం వలన వాళ్లకు మాకు బంధుత్వం ఏర్పడింది కానీ లేకపోతే యాదవులు మా పాదధూళికి సరిపోరు. ఆ స్వల్ప బంధుత్వం చేతనే మా మధ్య రాకపోకలు, వారితో కలిసి భోజనం చేయడం, విహరించడం జరుగుతున్నాయి.

అదీ కాకుండా మీ యాదవులు మా దయాధర్మభిక్షతోనే సింహాసనమును అధిష్టించగలిగారు లేకపోతే మీకు రాజ్యాధికారము ఎక్కడిది? మా వలన రాజులైన మీరు మాతో సమానులమని విర్రవీగుతారా! ఎంతటి దుస్సాహసము. మా దయవలన మా ఉపేక్ష వలన మీరు సింహాసనము మీద కూర్చున్నారు. కిరీటము ధరించారు. వింజామరలు వేయించుకుంటున్నారు. రాజభోగములు అనుభవిస్తున్నారు. అటువంటి వారు మాకు ఆదేశములు ఇస్తారా! పాముకు పాలు పోసి పెంచితే పెంచిన వాడినే కాటు వేస్తుందట. అలాగే మేము పాలు పోసి పెంచిన యాదవులు, సిగ్గు ఎగ్గు లేకుండా మాకే ఆజ్ఞలు ఇస్తున్నారు. ఇంక మీరు రాజులుగాఉండ తగరు.

ఓ యాదవా! నీకు ఒక విషయం తెలుసో లేదో! మా భీష్ముడు, మా అర్జునుడు, ఇస్తేనే ఇంద్రుడు కూడా ఏ వస్తువైనా వినయంగా తీసుకుంటాడు. కాబట్టి మీ హద్దుల్లో మీరు ఉండండి. సర్వం సహా చక్రవర్తులకు ఆదేశాలు ఇచ్చే స్థాయికి ఎదగకండి." అని ఘాటుగా అన్నారు కౌరవులు. తరువాత వారు హస్తినాపురమునకు వెళ్లిపోయారు.

బలరామునికి తల తీసినట్టయింది. కృష్ణుడు చతురంగ బలములను తీసుకొని యుద్ధమునకు వెళ్లమంటే కాదని, సంధికి

వచ్చినందుకు తగిన శాస్తి జరిగింది అనుకున్నాడు బలరాముడు. కౌరవుల దురహంకారము, వారు పలికిన పరుషవాక్కులు చూచి బలరామునికి కోపము నవ్వు వచ్చాయి.

"ఈ కౌరవులకు రాజ్యమదాంధత ఎక్కువ అయింది. గర్వం ప్రబలింది. వీరికి మామూలు మాటలతో ప్రయోజనము లేదు. దండోపాయమే సరిఅయిన మార్గము. అయినా నాదే తప్పు. ఎప్పుడైతే సాంబుడిని అక్రమంగా బంధించారు అన్న సమాచారం విన్నప్పుడు వెంటనే కౌరవుల మీద దాడి చేసి సాంబుని విడిపించుకొని వద్దాము అని కృష్ణుడు, యాదవులు అన్నారు. కాని నేను అనవసరంగా కౌరవులు మంచి వాళ్లు, నా మాట వింటారు, సాంబుడిని సగౌరవంగా వదిలిపెడతారు అనే అపోహతో వస్తే కౌరవులు, తనను అవమానించి అనరాని మాటలన్నీ అన్నారు. నాకు తగినవిధంగా బుద్ధిచెప్పారు. ఇంక ఉపేక్షించి లాభం లేదు.

అసలు వీళ్లగురించి వీళ్లు ఏమను కుంటున్నారు? ఇంద్రుడు మొదలగు లోకపాలకులకు కూడా ఆదేశాలు ఇవ్వగల సమర్థత ఉన్న ఉగ్రసేనమహారాజు వీరి దృష్టిలో రాజు కాడా! దేవ లోకము నుండి పారిజాతమును తెచ్చి సత్యభామ పెరటిలో నాటించి, సుధర్మ అనే సభలో కార్యకలాపాలు సాగిస్తున్న కృష్ణుడు వీరి దృష్టిలో కిరీటం పెట్టుకోడానికి అనర్హుడా! ఇంద్రుడు మొదలగు లోక పాలకులు ఎవని పాదములను ఎల్లప్పుడూ శిరస్సున ధరిస్తారో, బ్రహ్మ, శివుడు, నేను, లక్ష్మీ ఎవని అంశలతో జన్మించామో, ఎవని పాదధూళి మా అందరికీ శిరోధార్యమో, అట్టి అవతార పురుషుడు శ్రీకృష్ణుడు వీరి దృష్టిలో

రాజ్యాధికారమునకు అర్హుడు కాడా!

ఏమీ! మేము కౌరవుల దయాధర్మభిక్ష మీద బతుకుతున్నామా! వారు ఇచ్చిన రాజ్యమును అనుభవిస్తున్నామా! మేము వాళ్ల కాళ్ల కింద పాదుకలమా! ఈ కౌరవులు రాజ్యమదముతోనూ, ఐశ్వర్యమదము తోనూ కళ్లు మూసుకుపోయి ఇష్టం వచ్చినట్టు మాట్లాడుతున్నారు. ద్వారకాధీశుడను అయిన నేను వీరి అయోగ్యములు, అసందర్భములు అయిన ప్రేలాపనలు సహించాలా! కుదరదు. వీరికి తగిన శాస్తి చేస్తాను. ఈ భూమి మీద కౌరవులు అనే పదాన్ని వినపడకుండా చేస్తాను. ఈ కౌరవ వంశము నేటితో చరిత్రలో కలిసిపోతుంది." అని నిశ్చయించుకొన్నాడు.

బలరాముడు తన హలాయుధమును తీసుకొని హస్తినాపుర కోట దక్షిణ ద్వారము దగ్గరకు వెళ్లాడు. కోట దక్షిణ భాగము కిందికి తన హలమును జొప్పించాడు. బలంగా కోటను పైకి లేపాడు. అంత కంతకూ హస్తినాపురము కోట పైకి లేస్తూ ఉంది. కోటలో ఉన్న కౌరవులు భయభ్రాంతులయ్యారు. భూకంపం వచ్చినట్టు తల్లడిల్లి పోయారు. బలరాముడు హస్తినాపురము కోటను యమున వైపుకు లాగుతున్నాడు. బలరాముడు లాగుతుంటే హస్తినాపుర కోట అటు ఇటు ఊగుతూ ఉంది.

కాసేపట్లో హస్తినాపుర కోట యమునలో మునుగుతుంది అని తెలుసుకున్న కౌరవులు భయంతో బలరాముని వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చారు. ఆయన కాళ్ల మీద పడి శరణు వేడారు. సాంబుని సగౌరవంగా తెచ్చి బలరాముడికి అప్పగించారు.

"బలరామా! మమ్ములను క్షమించు. నీ బలాన్ని తక్కువ అంచనా వేసాము. నీవు సాక్షాత్తు ఆదిశేషువు అని తెలియక నిన్ను అవమానించావు. ఫలితం అనుభవించాము. మా అపరాధములను క్షమించు. మమ్ములను కాపాడు. ఈ భూమిని నీ వేయిపడగల మీద ఆవగింజ మాదిరిగా ధరించిన నీకు ఈ హస్తినాపురము ఒక లెక్కలోనిది కాదు. నీవు శుద్ధసత్వగుణ సంపన్నుడవు. నీకు ఆవేశము తగదు. శాంతించు. నీకు ఎవరి మీద కోపము కానీ ద్వేషము కానీ లేవు. నీవు అందరినీ సమంగా చూస్తావు. నీకు భక్తితో నమస్కరిస్తున్నాము. నీ శరణు వేడుతున్నాము. మా అందరినీ కాపాడు." అని భక్తితో ప్రార్థించారు.

వారి మాటలకు శాంతించాడు బలరాముడు. హస్తినాపుర కోటను మరలా మామూలు స్థితిలో ఉంచాడు. అందరూ ఊపిరి పీల్చుకున్నారు. మీకేం భయంలేదు అని అభయం ఇచ్చాడు బలరాముడు. సుయోధనుడు తన కుమార్తె సులక్షణను సాంబుడికి ఇచ్చి వైభవంగా వివాహం జరిపించాడు. వధూవరులకు 1200 ఏనుగులు, 10000 గుర్రములు, 6000 రథములు, వేయి మంది దాసీలను కానుకగా ఇచ్చాడు. బలరాముడు నూతన వధూవరులతో హస్తిన నుండి బయలు దేరి ద్వారకకు వెళ్లాడు. ద్వారక చేరిన తరువాత కృష్ణుడికి, ఉగ్రసేనుడికి ఇతర యాదవ ప్రముఖులకు హస్తినలో జరిగిన విషయములన్నీ వివరించాడు బలరాముడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ రోజు బలరాముడు హస్తిన కోటను దక్షిణ దిక్కున  పైకి లేపాడు కదా, దాని ఫలితంగానే ఇప్పుడు కూడా

హస్తినాపుర నగరము  దక్షిణ దిక్కున ఎత్తుగా కనిపిస్తుంది." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు సాంబుని వివాహము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము అరవై ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

(ఈ సందర్భంలో మీకు ఒక సందేహము రావచ్చు. ఒక నాగలితో అంత పెద్ద కోటను ఎత్తడం సాధ్యమా అని. మనకు కావాల్సింది బలరాముడు కోటను ఎత్తాడా లేదా అని కాదు. దాని వెనుక దాగిన అంతరార్థము తెలుసుకోవాలి.   అహంకారపూరితమైన, అనవసరమైన, ఆవేశపూరితమైన, అసందర్భమైన మాటలు,  అన్ని వేళలా పనికి రావు అని వ్యాసుడు చెప్పదలచుకున్నాడు అని గ్రహించాలి.

బలరాముడు తమ వద్దకు వచ్చినపుడు, మీ వాడు తప్పు చేసాడు, మా కన్నను అపహరించడానికి ప్రయత్నించాడు, మీ వాడిని మందలించండి అని కౌరవులు సాంబుని బలరామునికి అప్పగిస్తే సరిపోయేది. వల్లమాలిన అభిమానంతో అహంకారంతో "మీరు మా కాళ్ల కింద చెప్పులు లాంటి వాళ్లు, మా దయాధర్మభిక్ష మీద బతుకుతున్నారు" అని హేళన చేస్తే ఎవరికైనా కోపం వస్తుంది. బలరాముడు తనకు తోచింది చేసాడు. పైగా బలరాముడు భాగవతంలో ఆదిశేషువు అవతారము అని నమ్ముతున్నాము. కాబట్టి ఇందులో ఔచిత్యము లేదు అని భావించనవసరం లేదు.

పెద్దల ముందు అహంకరించరాదు. వినయంగా ఉండాలి. సామరస్యంగా సమస్యలు పరిష్కరించుకోవాలి అనే సత్యాన్ని ఈ వృత్తాంతము నుండి గ్రహించాలి అని మనవి. అంతేకాదు. దీనిని ఈ నాటికి కూడా అన్వయించుకోవచ్చు.

కాంగ్రెసువారు తెలంగాణా రాష్ట్రం ఇచ్చారు. అంతవరకు బాగానే ఉంది. వెంటనే ఒక నాయకుడు "ఆంధ్రా వాళ్లంతా వెళ్లిపోవాలి. ఆప్షన్లు ఏమీ ఉండవు" అని ఆవేశంతో సెలవిచ్చారు. అంతే ఆంధ్ర యన్‌జీవోలు అనే ఆదిశేషువు తన వేయిపడగలు విప్పింది. మరొక భీష్ముడు తిరుమలకు దైవదర్శనానికి వెళ్లి, మీడియా వారి మైకు చూడగానే రెచ్చిపోయి "ఆంధ్రా యన్‌జీవోలు ఆంధ్రా వెళ్లిపోవాలి, లేకపోతే రాజీనామాచేసి ఇక్కడే ఉండాలి." అని ఒక ఉచిత సలహా పారేశారు. దాంతో బలరాముడు నిరధిక సమ్మె అనే హలాన్ని ధరించాడు.

ఇదంతా కేవలం అహంకార పూరితమైన మాటల వల్ల వచ్చిన అనర్థమే కదా! ఇచ్చిన తెలంగాణా వచ్చితీరుతుంది. అందులో సందేహం లేదు. కాని ! ఏ అధికారమూ లేని వాళ్ల మాటల వలన నాడు హస్తినాపురానికి కలిగిన నష్టం ఈ నాడు ఆంధ్రదేశంలో కలుగుతూ ఉంది. కాబట్టి ఏదైనా సమస్య వచ్చినపుడు సామరస్యంగా పరిష్కరించుకోవాలే గానీ ఆవేశపూరితమైన మాటలు మంచివి కావు అనే సత్యాన్ని మనం అందరం గ్రహించాలి అని ఈ కథ సారాంశము.)

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

అరవై తొమ్మిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు నరకుడిని చంపి ఆయన చెరలో ఉన్న 16,000 మంది రాచ కన్యలను విడిపించాడనీ, ఆ రాజకన్యలను తమ తమ ఇళ్లకు వెళ్లమని సూచించాడనీ, ఇప్పుడు తాము ఎక్కడికీ వెళ్లలేమనీ, ఒక వేళ వెళ్లినా తమను తమ తల్లితండ్రులు రానివ్వరనీ, అందుకనీ, అందరూ శ్రీకృష్ణునితోనే ఉంటామని ముక్తకంఠంతో పలికారనీ, విధిలేని పరిస్థితుల్లో శ్రీకృష్ణుడు ఆ 16,000 మందిని వివాహం చేసుకోవలసి వచ్చిందనీ నీకు చెప్పాను కదా!

శ్రీకృష్ణుడు 16,000 మంది రాచకన్యలను వివాహం చేసుకున్న తరువాత వారికి అందరికీ వేర్వేరు భవనములను నిర్మించి ఇచ్చాడు. వారందరితో కాపురం చేస్తున్నాడు. 16,000 మందిని పెళ్లి చేసుకున్న శ్రీకృష్ణుడు, శ్రీకృష్ణుని కోరి చేసుకున్న 16,000 రాచ కన్యలు బాగానే ఉన్నారు. మధ్యలో నారదుడికి ఒక పేద్ద సందేహం వచ్చింది. కృష్ణుడు ఒకడు, భార్యలు 16,008. ఒక్కొక్క భార్య ఇంట్లో ఒక్కొక్కరోజు ఉన్నా 45 సంవత్సరాలకు కానీ ఒక్కొక్కరి వంతు రాదు. అటువంటిది కృష్ణుడు ఇంతమందితో ఎలా కాపురం చేస్తున్నాడో చూద్దామని నారదుడికి కుతూహలం ఎక్కువయింది.

వెంటనే నారదుడు ద్వారకలో వాలి పోయాడు. శ్రీకృష్ణుని అంత:పురములోనికి ప్రవేశించాడు. 16,008 మంది భార్యలకు వేర్వేరు

గృహములు ఉండటం చూచాడు. ముందు రుక్మిణీ దేవి గృహమును ఎంచుకున్నాడు. ఆ గృహములోకి వెళ్లాడు.

ఆ గృహము చక్కగా అలంకరింపబడి ఉంది. ఆ గృహములో శ్రీకృష్ణుడు శయ్యమీద కూర్చుని ఉన్నాడు. ఆయన భార్య రుక్మిణి తన పరిచారికలతో సహా కృష్ణునికి సేవచేస్తూ ఉంది. తానే స్వయంగా వింజామర తీసుకొని వీస్తూ ఉంది. నారదుడు రావడం చూచిన కృష్ణుడు తాను కూర్చున్న ఆసనం మీదినుండి లేచాడు. నారదుడికి నమస్కరించాడు. నారదుని ఉచితాసనము మీద కూర్చుండబెట్టాడు. నారదుడి కాళ్లు కడిగి ఆ నీరు తలమీద చల్లుకున్నాడు.

"నారద మునీంద్రా! తమరి రాకకు కారణమేమి? నేను చేయవలసిన పని ఏదైనా ఉంటే చెప్పండి. తక్షణమే చేస్తాను." అని వినయంగా అడిగాడు. ఆ మాటలకు నారదుడు ఇలా అన్నాడు.

"దేవా! తమరు సత్పురుషులను నిరంతరము రక్షిస్తూ ఉంటారు. వారికి అపకారం చేసేవారిని శిక్షిస్తూ ఉంటారు. ఈ జగత్తులో ఉన్న జీవుల యోగక్షేమములను నిరంతరము పరిరక్షిస్తూ ఉంటారు. ఆ కారణం చేతనే ఈ కృష్ణరూపం ధరించావు. నీ అవతార రహస్యమును నేను చక్కగా తెలుసుకున్నాను. యోగులు అందరూ నీ పాదపద్మములను తమ హృదయములలో నిలుపుకొని ధ్యానిస్తుంటారు. నీ భక్తులకు మోక్షమును ఇచ్చేవి, సంసారములో పడి కొట్టుకుంటున్న వారికి ఆ సంసార కూపము నుండి విముక్తి కలిగించేవి నీ పాదపద్మములే కదా! అటువంటి నీ పాదములను ఈనాడు నేను

దర్శించగలిగాను. నా జీవితము ధన్యమయింది. నీ నామస్మరణ చేస్తూ నేను నిరంతరము లోక సంచారం చేస్తున్నాను. కేవలము తమరిని చూచి పోదామని వచ్చాను." అని అన్నాడు.

తరువాత నారదుడు అక్కడి నుండి వెళ్లిపోయాడు. మరొక మందిరములోనికి ప్రవేశించాడు. అక్కడ కూడా కృష్ణుడు ఉన్నాడు. ఆ మందిరములో ఉన్న భార్యతోనూ, తన స్నేహితుడు ఉద్ధవునితోనూ పాచికలు ఆడుతున్నాడు. నారదుని చూడగానే కృష్ణుడు లేచి నారదునికి నమస్కరించి ఆయనకు ఆసనం ఇచ్చి కూర్చోబెట్టి, అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించాడు.

"నారద మునీంద్రా! తమరు ఎప్పుడు ద్వారకకు వచ్చారు? తమరి రాకకు కారణమేమి?" అని ఏమీ తెలియనట్టు అడిగాడు. నారదునికి అంతా అయోమయంగా ఉంది.

నారదుడు మరొక మందిరములోనికి వెళ్లాడు.ఆ మందిరంలో తన కుమారులను ఒడిలో కూర్చోబెట్టుకొని ముద్దులాడుతున్న కృష్ణుని దూరంనుండి చూచాడు. లోపలకు పోవడం ఎందుకని, మరొక మందిరమునకు వెళ్లాడు. ఆ గృహంలో కృష్ణుడు శుచిగా హెూమం చేస్తున్నాడు. మరొక మందిరములో కృష్ణుడు శ్రద్ధగా యజ్ఞం చేస్తున్నాడు. మరొక మందిరములో కృష్ణుడు బ్రాహ్మణులకు భోజనం పెడుతున్నాడు. మరొక మందిరములో కృష్ణుడు భోజనం చేస్తున్నాడు.

మరొక మందిరములో కృష్ణుడు సంధ్యవార్చుకొని గాయత్రి మంత్రమును జపిస్తున్నాడు. మరొక మందిరములో కత్తియుద్ధమును

అభ్యాసం చేస్తున్నాడు. మరొకమందిరములో కృష్ణుడు రథం ఎక్కి బయటకు వెళ్లడానికి సిద్ధంగా ఉన్నాడు. మరొక మందిరములో తన మంత్రులతో రాచకార్యములు చర్చిస్తున్నాడు. మరొక చోట కొంత మంది భార్యలతో కలిసి జలక్రీడలు ఆడుతున్నాడు. మరొక మందిరములో కృష్ణుడు బ్రాహ్మణులకు గోవులను దానం చేస్తున్నాడు. మరొక మందిరములో తన భార్యతో కూర్చుని పురాణమును వింటున్నాడు. మరొక మందిరములో కృష్ణుడు తన భార్యతో హాస్యంగా మాట్లాడుతూ నవ్వుతూ, నవ్విస్తున్నాడు.

మరొక గృహములో కృష్ణుడు ధార్మిక మైన పనులుచేస్తున్నాడు. మరొక గృహములో ధన సంబంధమైన వ్యవహారములు చర్చిస్తున్నాడు. మరొక ఇంట్లో కృష్ణుడు నిశ్చలంగా కూర్చుని ధ్యానం చేసుకుంటున్నాడు. మరొక గృహములో కృష్ణుడు తన వద్దకు వచ్చిన గురువులకు దక్షిణలు ఇస్తున్నాడు. మరొక ఇంట్లో కృష్ణుడు ఎవరితోనో తగాదా పడుతున్నాడు. మరొక గృహములో కృష్ణుడు ఇరుపక్షములకు మధ్యవర్తిగా ఉండి, వారి మధ్య సంధి కుదురుస్తున్నాడు. మరొక గృహములో, కృష్ణుడు, బలరామునితో కలిసి పరిపాలనా వ్యవహారములను చక్కబెడుతున్నాడు. మరొక మందిరములో కృష్ణుడు తన కుమారులకు వివాహ సంబంధముల గురించి చర్చిస్తున్నాడు. మరొక గృహములో కృష్ణుడు తన కూతుళ్లను, అల్లుళ్లను అత్తవారింటికి పంపే కార్యక్రమంలో తీరికలేకుండా ఉన్నాడు. మరొక ఇంట్లో కృష్ణుడు దేవతారాధన చేస్తున్నాడు. మరొక చోట కృష్ణుడు ప్రజలకు ఉపయోగ పడటానికి బావులు తవ్వించడం, చెట్టు నాటించడం మొదలగు కార్యక్రమములు నిర్వర్తిస్తున్నాడు.

ఇదంతా చూస్తున్న నారదుడికి తల తిరిగి పోయింది. అడవిలోకి పారిపోయాడు. అక్కడ కూడా కృష్ణుడు వేటాడుతూ కనిపించాడు. ఇదేంటి ఎక్కడకు పోయినా కృష్ణుడు కనిపిస్తున్నాడు అని మరలా ద్వారకకు వచ్చాడు. నగరంలో జరిగే కార్యకలాపాలను స్వయంగా తెలుసుకోడానికి కృష్ణుడు  మారు వేషంలో తిరుగుతున్నాడు.

ఇంక తట్టుకోలేక పోయాడు నారదుడు. రెండు చేతులు ఎత్తి శ్రీకృష్ణుడికి నమస్కరించాడు. “ఓ దేవా! నీవు మానవ రూపంలో ఉండి కూడా నీ యోగమాయను ప్రదర్శిస్తున్నావా! అందరినీ, నన్ను నీ మాయలో ముంచెత్తుతున్నావా! నేను కాబట్టి నీ మాయను తెలుసుకోగలిగాను. కాని సామాన్య ప్రజలు నీ మాయను తెలుసుకోలేక అంతా నిజమని నమ్ముతున్నారు. నేను నీ లీలలను ముల్లోకములలోని వారికి పెద్దగా అరిచి, పాడి చెప్పాలని అనుకకుంటున్నాను. నాకు అనుమతి ప్రసాదించు.” అని ప్రార్థించాడు నారదుడు.

ఆ మాటలకు కృష్ణుడు నారదునితో ఇలా అన్నాడు. “మహాత్మా! ధర్మమును ముందు నేను ఆచరించి, తరువాత అందరినీ ఆచరించమని చెబుతాను. ధర్మమును చక్కగా ఆచరించిన  వారి చర్యలను నేను  సమర్థిస్తాను. ధర్మము నేను ఆచరించి చూపించి, అందరి చేతా ఆచరింపచేసి, తద్వారా ధర్మమును మరలా ప్రతిష్ఠింప చేయడానికి  నేను భూలోకములో అవతరించాను. కాబట్టి నా చర్యలను చూచి నీవు మోహంలో పడవద్దు. నేను అంతటా ఉంటాను కానీ ఎక్కడా ఉండను. నేను అందరి ముందు ఉన్నట్టు వారికి భ్రమ కలిగిస్తాను. అంతే.” అని కృష్ణతత్వమును బోధించాడు కృష్ణుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా నారదుడు శ్రీకృష్ణుడు ప్రతి ఇంట్లో ప్రతిచోటా ఉండటం చూచి ఆశ్చర్యపోయాడు. తరువాత కృష్ణుని ద్వారా ఆయన తత్వమును తెలుసుకున్న తరువాత, కృష్ణలీలలను లోకంలో ప్రచారం చేయడానికి వెళ్లిపోయాడు.

ఆ ప్రకారంగా శ్రీకృష్ణుడు తన 16,008 మంది భార్యలతో అందరికీ సంతోషం కలిగిస్తూ విహరిస్తున్నాడు." అని శుకయోగీంద్రుడు పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుని సర్వవ్యాపకత్వము గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము అరువది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## దశమస్కంధము
## డెబ్బదియవ అధ్యాయము.

"పరీక్షిత్ మహారాజా! ఇప్పటి దాకా నీకు శ్రీకృష్ణుడు తన భార్యల అందరి ఇళ్లయందు ఏక కాలంలో ఉండటం, వారితో సరస సల్లాపాలు సాగించడం, అందరి ఇళ్లతో తానుఉన్నట్టు భ్రమ కలిగించడం, ఆ విషయాన్ని నారదుడు గ్రహించడం గురించి చెప్పాను. ఇప్పుడు శ్రీకృష్ణుని రోజువారీ దినచర్య గురించి చెబుతాను విను.

శ్రీకృష్ణుడు ప్రతిరోజూ తెల్లవారుజామున నిద్రలేస్తాడు. కాలకృత్యములు తీర్చుకుంటాడు. ఆచమనం చేస్తాడు. పరమాత్మను ధ్యానం చేస్తాడు. (దీని గురించి వివరణ తరువాత వస్తుంది.) ధ్యానము పూర్తి అయిన తరువాత శుభ్రంగా స్నానం చేస్తాడు. అంటే ముందు ధ్యానంతో మనసును పరిశుద్ధం చేసుకొని, తరువాత స్నానంతో దేహాన్ని శుభ్రపరచుకుంటాడు. శుభ్రమైన దుస్తులు ధరిస్తాడు.

(మనం ఈ నాడు మార్కెట్ తో దొరికే అన్ని రకాల సబ్బులతో శరీరాన్ని రుద్ది రుద్ది స్నానం చేస్తాము. అత్యంత ఖరీదైన బ్రాండెడ్ దుస్తులు ధరిస్తాము. కాని మనసును మాత్రం ఏ మాత్రం శు భ్రపరచుకోము. అందరి మనసులు కల్మషములతో నిండి ఉంటాయి. దానికి విరుగుడు ధ్యానం. అది మాత్రం ఎవరూ చేయరు. కృష్ణుడు తాను ధ్యానం చేసి తన చర్యల ద్వారా మనలను కూడా ధ్యానం చేయమని సూచిస్తున్నాడు.)

తరువాత శ్రీకృష్ణుడు సంధ్యావందనము మొదలగు కార్యములను చేసి తరువాత హెూమం చేస్తాడు. ఔపోసనా కార్యక్రమమును నిర్వర్తిస్తాడు. హెూమం చేసిన తరువాత గాయత్రి మంత్రమును ఏకాగ్రమైన మనసుతో జపిస్తాడు. అప్పటికి సూర్యుడు ఉదయిస్తూ ఉంటాడు. సూర్యోదయం కాగానే శ్రీకృష్ణుడు సూర్యుడిని ఉపాసిస్తాడు. తరువాత దేవతలకు, పితరులకు, గురువులకు, ఋషులకు, చనిపోయిన వృద్ధులకు తర్పణములు వదులుతాడు. తరువాత బయటకు వచ్చి తన దర్శనం కోసరం వేచి ఉన్న బ్రాహ్మణులకు, ఇతరులకు నమస్కరిస్తాడు. వారి ఆశీర్వాదములు తీసుకుంటాడు. వారికి వస్త్రములను, ధనమును, జింక చర్మములను,

పాలు ఇచ్చే ఆవులను, ఎవరికి ఏది అవసరమో దానిని దానంగా ఇస్తాడు. తరువాత గోవులను, బ్రాహ్మణులను, దేవతలను, పెద్దవారిని గురువులను పూజిస్తాడు.

తరువాత తను కూడా ఆభరణములతో అలంకరించు కుంటాడు. తరువాత ప్రజలను కలుసుకుంటాడు. వారి వారి అవసరాలకు తగ్గట్టు వారు కోరిన వస్తువులను దానంగా ఇస్తాడు. ప్రజలు కానుకలుగా తెచ్చిన వస్తువులను స్వీకరిస్తాడు. ఇంతలో కృష్ణుని సారథి రథమును తెచ్చి కృష్ణుని గృహము ముందు నిలబెడతాడు. కృష్ణుడు సాత్యకి తోనూ, ఉద్ధవునితోనూ ఆ రథమును ఎక్కుతాడు. తన భార్యలు, అంత:పుర స్త్రీలు తనకు వీడ్కోలు చెబుతూ ఉంటే రథం బయలు దేరుతుంది. యాదవులందరూ కొలువుదీరి ఉన్న సుధర్మ అనే రాజ సభలోకి ప్రవేశిస్తాడు.

అదొక విచిత్రమైన సభ. ఆ సభలో కూర్చుని ఉంటే ఆకలి, దాహము, విసుగు, కోపము ఏవీ ఉండవు. అందరూ ప్రశాంతంగా వివిధ విషయముల గురించి చర్చిస్తారు. ఆ సభలోకి ప్రవేశించిన కృష్ణుడు తన సింహాసనముమీద కూర్చుంటాడు. నాట్యాచార్యులు, నర్తకులు, గాయకులు, తమ తమ విద్యలను ప్రదర్శిస్తారు. సూతులు, వంగిమాగధులు, మృదంగము, వీణ, వేణువు, శంఖములు, చప్పట్లు మొదలగు వాయిద్యములతో ఆడి పాడి శ్రీకృష్ణుని స్తుతిస్తారు.

తరువాత వేద పండితులు వేదమంత్రముల మీద తమతమ వ్యాఖ్యానములను వినిపిస్తారు. మరి కొందరు వేదములలో చెప్పబడిన

రాజుల చరిత్రలను వినిపిస్తారు. ఆ ప్రకారంగా సభ జరుగుతూ ఉండగా, ప్రతీహారి వచ్చి ఒక నూతన పురుషుడు సభలోకి రావడానికి అనుమతి కోరుతున్నాడు అని తెలిసాడు. శ్రీకృష్ణుని అనుమతి తీసుకొని, ప్రతీహారి ఆ నూతన పురుషుని సభలోకి ప్రవేశపెట్టాడు.

ఆ పురుషుడు శ్రీకృష్ణునికి నమస్కరించి ఇలా అన్నాడు. "దేవా! నేను జరాసంధుని చెరలో ఉన్న రాజుల ప్రతినిధిగా వచ్చాను. జరాసంధుడు మా రాజ్యములను జయించి, ఆ దేశము రాజులను బందీలుగా పట్టుకున్నాడు. వారందరినీ గిరివ్రజము అనే దుర్గములో బంధించి ఉంచాడు. వారి సంఖ్య ఇప్పటికి 20,000. జరాసంధుని ఎదిరించలేక వారంతా జరాసంధుని కారాగారములో మ్రగ్గుతున్నారు. అందుకని వారందరూ మీ శరణు కోరుతున్నారు. జరాసంధుని లాంటి వారు, వారి వారి కోరికలు తీర్చుకోడానికి చేయకూడని పనులు చేస్తూ, శాస్త్రములో చెప్పబడిన ధర్మములను మరిచిపోతున్నారు. అట్టి వారిని శిక్షించడానికే నీవు అవతరించావు. కాలస్వరూపుడవైన నీకు నమస్కారము.

ఓ దేవా! నీవు మూడు లోకములకు అధిపతికి. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కొరకు ఈ లోకములో మానవ రూపంలో అవతరించిన పరమాత్మవు. మాకష్టములు నీకు చెప్పుకున్నాము. ఈ రాజులందరూ బందీలు కావడం వారు చేసుకున్న పూర్వజన్మకర్మఫలితమా లేక జరాసంధుని దురాగతమా అనే విషయాన్ని అర్థం చేసుకోలేక పోతున్నాము. రాజభోగములు అనుభవిస్తూ వారి ప్రజలను పాలించ వలసిన రాజులు జరాసంధుని చెరసాలలో బందీలుగా ఉన్నారు. ఇది వాస్తవము. జరాసంధుడు తమను ఎప్పుడు చంపుతాడో అన్న

భయంతో, తమ భార్య బిడ్డలను విడిచి ఉన్నామన్న దిగులుతో, జీవచ్ఛవాలుగా బతుకుతున్నారు.  ఇదంతా నీ మాయ అనుకోవాలా! నీ మాయచేత మోహితులమై మేము సుఖములకు దూరమై కష్టములను అనుభవిస్తున్నామా! ఏమీ తెలియడం లేదు.

ఓ దేవా! నిన్ను నమ్ముకున్న వాళ్లకు నీ పాద సేవ సుఖ సంతోషాలను కలుగచేస్తుంది. మేమంతా నీ పాదములను నమ్ముకున్నాము. మాకు ఈ జరాసంధుని చెరనుండి విముక్తి కలిగించు. జరాసంధుని చెరలో ఉన్న 20,000 మందిని బంధవిముక్తులను చెయ్యి.

ఓ దేవా! ఆ జరాసంధుని బలపరాక్రమములు నీకు తెలియనివి కావు. నీవు జరాసంధునితో పదునెనిమిది సార్లు యుద్ధం చేసావు. అందులో పదిహేడు సార్లు జరాసంధుడు నీ చేతిలో ఓడి పోయి పారిపోయాడు. ఆఖరు సారిగా నిన్ను జయించి, గర్వంతో అహంతో విర్రవీగుతున్నాడు. మా అందరినీ బాధిస్తున్నాడు.

ఓ దేవా! జరాసంధునిచేత బంధింపబడిన రాజులు 20,000 మంది నీ దర్శనం కోరుతున్నారు. నిన్ను శరణు వేడుతున్నారు. వారిని కాపాడి, వారి జీవితాలలో మరలా సుఖసంతోషాలు కలుగజెయ్యి. ఓ దేవా!  నీకు అన్ని విషయములను వివరించాను. నీకు ఏది ఉచితమో అది చెయ్యి." అని ముగించాడు ఆ ఆగంతకుడు.

ఆగంతకుడు ఈ ప్రకారంగా జరాసంధునిచేత బంధింపబడిన రాజుల యొక్క కష్టములు వివరిస్తూ ఉండగా, నారదుడు ఆ సభకు వచ్చాడు. నారదుని చూచి కృష్ణుడు తన ఆసనము నుండి లేచాడు. సభలోని వారందరూ లేచి నిలబడ్డారు. శ్రీకృష్ణుడు తన ఆసనము నుండి దిగి వచ్చి నారదునికి నమస్కరించాడు. ఆయనకు ఆసనమును చూపించాడు.

నారదుడు ఆసనము మీద కూర్చున్న తరువాత కృష్ణుడు ఆయనకు అర్ఘ్యము పాద్యము ఇచ్చి పూజించాడు. నారదునితో కృష్ణుడు ఇలా అన్నాడు. "నారద మునీంద్రా! తమరు మూడులోకములు తిరుగుతూ ఉంటారు. మీవలన మాకు మూడులోకములలో ఉన్న విషయములు అన్నీ ఎప్పటికప్పుడు తెలుస్తూ ఉంటాయి. తమరు త్రికాలజ్ఞులు. తమరికి తెలియని విషయం అంటూ ఏమీ లేదు. నారదా! అన్ని లోకములు క్షేమముగా ఉన్నాయా! మా పాండవులు క్షేమంగా ఉన్నారా! వారు ఇప్పుడు ఏమి చేస్తున్నారు? వారి గురించి వివరాలు తెలియజేయండి." అని అడిగాడు.

ఆమాటలు విన్న నారదుడు కృష్ణునితో ఇలా అన్నాడు. "ఓ దేవా! నీవు సర్వవ్యాపకుడవు. ఈ విశ్వమును సృష్టించిన వాడవు నీవు. నీ మాయాశక్తి ద్వారా సకల భూతములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నావు. నీ మాయా శక్తిని నేను చాలా సార్లు స్వయంగా అనుభవించాను. ఓ దేవా! ఈ జగత్తు ను అంతా నీవు సృష్టించి పాలిస్తున్నావు. నీ సృష్టిరహస్యమును తెలుసుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. నీకు భక్తి నమస్కరించడం తప్ప ఏమీ చేయలేను.

ఓ దేవా! ఈ అనంత విశ్వంలో జీవులు అన్నీ పుడుతూ, చస్తూ ఒక దేహము నుండి మరొక దేహమునకు సంచరిస్తున్నాయి. కాని ఎవరు కూడా ఈ చావు పుట్టుకల నుండి విముక్తి పొందడం ఎలా అనే విషయాన్ని తెలుసుకోలేక పోతున్నారు. అటువంటి వారికి సులభంగా ముక్తిని ప్రసాదించడం కోసమే నీవు మానవ రూపంలో అవతరించావు. అట్టి నీకు నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! నీవు పాండవుల గురించి అడిగావు. అయినా నీకు తెలియకనా నన్ను అడుగుతున్నావు. నీవు అడిగావు కాబట్టి నాకు తెలిసిన విషయాలు చెబుతున్నాను. యుధిష్ఠిరుడు నీ మేనత్త కుమారుడు. నీ భక్తుడు. ఆయన తన రాజ్యమును విస్తరింప చేసుకోడానికి రాజసూయ యాగము అనే యాగమును చేయవలెనని సంకల్పించాడు. దానికి నీ అనుమతి కోరుతున్నాడు. తమరు వచ్చి యాగమునకు అనుమతి ప్రసాదిస్తే, యుధిష్ఠిరుడు రాజసూయ యాగము నిర్విఘ్నంగా నెరవేరుస్తాడు.

ఆ యాగమునకు నీవు వస్తావు కాబట్టి, నిన్ను చూడటానికి దేశదేశాల రాజులు ఆ యాగమునకు వస్తారు. ఇప్పటి దాకా వారందరూ నీ కథలను విని, నిన్ను కీర్తించి, నిన్ను ధ్యానించి, పవిత్రులవుతున్నారు. ఇప్పుడు నిన్ను స్వయంగా చూచి, నిన్ను తాకి, నీ పాదములను స్పృశించి ధన్యులవుతారు.

ఓ దేవా! నీకీర్తి మూడులోకములలో వ్యాప్తి చెందింది. నీ పాదముల నుండి ఉద్భవించిన జలము దేవలోకంలో మందాకిని

పేరుతోనూ, భూలోకములో గంగ పేరుతోనూ, పాతాళములో భోగవతి పేరుతోనూ ప్రవహిస్తూ, మూడులోకముల వారిని పవిత్రం చేస్తూ ఉంది. " అని అన్నాడు నారదుడు. నారదుని మాటలు విన్న తరువాత, ఇప్పుడు కర్తవ్యం ఏమిటి అని సభాసదులను అడిగాడు. యాదవ ప్రముఖులు అందరూ జరాసంధుని మీదికి యుద్ధానికి పోవటానికి ఉత్సాహపడ్డారు కానీ, పాండవుల వద్ద కు పోవడానికి ఉత్సాహము చూపించలేదు. వారి మాటలకు కృష్ణుడు నవ్వి ఊరుకున్నాడు.

కృష్ణుడు తన స్నేహితుడు ఉద్ధవుని పిలిచాడు. “ఉద్ధవా! నీకు మంత్రాంగము బాలా తెలుసు. నీవు నాకు బంధువు కూడాను. నాకు నేత్రముల వంటి వాడవు. ఇప్పుడు మన ముందు రెండు విషయములు ఉన్నాయి. ఒకటి జరాసంధునితో యుద్ధము చేసి అతనిని ఓడించి అతని వద్ద బందీలుగా ఉన్న రాజులను విడిపించడం. రెండవది పాండవులతో రాజసూయయాగము చేయించడం. యాదవు లందరూ జరాసంధుని మీద యుద్ధానికే ఉత్సాహంగా ఉన్నారు. నీ ఉద్దేశం ఏమిటో చెప్పు. నీవు ఆలోచించి ఏది చెబితే దానిని ఆచరిస్తాము.” అని అన్నాడు కృష్ణుడు. అన్నీ తెలిసిన కృష్ణుడు తనను ఆలోచించి చెప్పమనడం ఆశ్చర్యం కలిగించింది ఉద్ధవునికి. కృష్ణుడు అంతటి వాడు అడిగాడు కాబట్టి, క్షణకాలము ఆలోచించి, ఈ విధంగా బదులు చెప్పాడు ఉద్ధవుడు.” అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కృష్ణుని దినచర్యను కృష్ణుని ముందున్న సమస్యల గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బదియవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## డెబ్బది ఒకటవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఉద్ధవుడు నారదుని మాటలను, అంతకు ముందు వచ్చిన ఆగంతకుని మాటలను శ్రద్ధగా విన్నాడు. కృష్ణునితో ఇలా చెప్పాడు.

"దేవా! తమరి ముందు ఉన్న రెండు సమస్యలు తక్షణము పరిష్కరింప తగ్గవే! జరాసంధుని చెరలో మగ్గుతున్న రాజులను విడిపించడం ఎంత ముఖ్యమో, తమరి మేనత్త కుమారుడు అయిన యుధిష్ఠిరునికి సాయము చేయడం కూడా అంతే ముఖ్యం. ధర్మరాజు రాజసూయ యాగం చెయ్యాలంటే, నాలుగు దిక్కులలో ఉన్న రాజులను జయించాలి. అప్పుడు కానీ రాజసూయ యాగము చేయలేడు. కాబట్టి ఈ దిగ్విజయమును కారణం చేసుకొని పాండవులను జరాసంధుని మీదికి యుద్ధానికి పంపి అతనిని సులభంగా గెలువ వచ్చును. అతని చెరలో బందీలుగా ఉన్న రాజులను విడిపించవచ్చును. ఒకే కార్యము వలన రెండు ప్రయోజనములు నెరవేరుతాయి. తమరి సాయంతో రాజసూయయాగము, తమరి ప్రమేయం లేకుండా జరాసంధ వధ రెండు జరగుతాయి. ఇదీ నా అభిప్రాయము. జరాసంధుని ఓడిస్తే యాదవులకు ప్రబల శత్రువైన జరాసంధునికి పరాజయం కలుగుతుంది. అది మనకు అంటే యాదవులకు లాభము. జరాసంధుని చెరలో ఉన్న రాజులను విడిపించిన కీర్తి నీకు దక్కుతుంది.

ఇందులో ఇంకొక రహస్యంకూడా ఉంది. జరాసంధుని మరణము భీముని చేతిలో ఉంది. భీముని చేతిలో తప్ప జరాసంధుడు మరొకరి చేతిలో చావడు. కాబట్టి జరాసంధుని భీముడు ద్వంద్వ యుద్ధములో ఓడించగలడు. అంతే కాని నూరు అక్షౌహిణీల సైన్యము ఉన్న జరాసంధునితో యుద్ధము చేసి గెలవడం ఎవరికి కూడా సాధ్యం కాదు. కాబట్టి భీమ జరాసంధుల ద్వంద్వయుద్ధమే దీనికి సులువైన మార్గము.

ఇంక వీరి ద్వంద్వ యుద్ధము జరగడానికి మార్గము ఒకటి ఉంది. జరాసంధునకు బ్రాహ్మణులు అంటే అమితమైన భక్తి. బ్రాహ్మణులు మాత్రము జరాసంధుని వద్దకు ఎటువంటి అనుమతి లేకుండా వెళ్లవచ్చును. పైగా జరాసంధుడు తన వద్దకు వచ్చిన బ్రాహ్మణులు ఏది కోరితే అది ఇస్తాడు. అది ఆయన వ్రతము. భీమసేనుడు బ్రాహ్మణుడి వేషంలో జరాసంధుని వద్దకు పోయి తనకు జరాసంధునితో ద్వంద్వ యుద్ధము కావాలి అని అడిగితే జరాసంధుడు కాదనడు. భీమ జరాసంధుని ద్వంద్వ యుద్ధము సమయమున తమరు వారి ఎదురుగా ఉండి భీమునికి తగిన విధంగా సూచనలు ఇస్తూ జరాసంధుని వధించడానికి మార్గం సుగమం చేస్తారు.

ఓ దేవా! సకల చరాచర సృష్టిని సృష్టించి, లయం చేసేది బ్రహ్మ, శివుడు అయినా, వారు కేవలం నిమిత్త మాత్రులు. కాలస్వరూపుడవు అయిన నీవే సృష్టి, స్థితి, లయములు జరిపిస్తున్నావు. ఇక్కడ కూడా జరాసంధుని చంపే వాడవు, చంపించే వాడవు నీవే. భీముడు కేవలం నిమిత్తమాత్రుడు. ఈ విధంగా ఏమాత్రం సైన్య

నష్టము లేకుండా, ఒక్క నెత్తురు బొట్టు నేల రాలకుండా, అత్యంత సులభంగా జరాసంధుని జయించవచ్చును.

ఓ దేవా! జరాసంధుని వధించి ఆయన చెరలో బందీలుగా ఉన్న రాజులను విడిపిస్తే, వారి భార్యలు, సంతానము నీ చరిత్రను, నీ కీర్తిని ఎల్లవేళలా గానం చేస్తారు. నిన్ను కీర్తిస్తారు. తరువాత నీ సాయంతో ధర్మరాజు చేయబోయే రాజసూయ యాగ సందర్భములో శిశుపాలుడు మొదలగు దుష్టులు కూడా సంహరింపబడే అవకాశము ఉంది. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ జరిగే ఈ రాజసూయయాగము తమరికి కూడా ఆమోదయోగ్యమే అవుతుంది. ఈ ప్రకారంగా చేస్తే అందరికీ శుభం కలుగుతుందని నా అభిప్రాయము." అని ఉద్ధవుడు చెప్పాడు.

ఉద్ధవుని మాటలను విన్న కృష్ణుడు, నారదుడు, యాదవులు ఆయనను ప్రశంసలతో ముంచెత్తారు. తరువాత కృష్ణుడు నారదుని తగు విధంగా పూజించాడు. కృష్ణుని వలన పూజలందుకున్న నారదుడు లోక సంచారానికి వెళ్లిపోయాడు.

కృష్ణుడు బందీలుగా ఉన్న రాజులవద్ద నుండి దూతతో ఇలా అన్నాడు. "మీ రాజులను భయపడ వద్దని చెప్పండి. మీకు శుభం కలుగుతుంది. నేను స్వయంగా వచ్చి జరాసంధుని సంహరించి, మీ రాజులకు విముక్తి కలిగిస్తాను అని నామాటలుగా మీ రాజులకు చెప్పండి." అని అన్నాడు. తరువాత ఆ దూత కృష్ణునికి నమస్కరించి వెళ్లిపోయాడు.

తరువాత కృష్ణుడు తాను ఇంద్రప్రస్థమునకు పోవడానికి రథం సిద్ధం చెయ్యమని తన సారథి దారుకుని ఆదేశించాడు. తన అన్న బలరాముడు, తాతగారు ఉగ్రసేన మహారాజు గారి వద్ద అనుమతి తీసుకోవడానికి వారి వద్దకు వెళ్లాడు. వారి వద్ద అనుమతి తీసుకొని కృష్ణుడు రథం ఎక్కాడు. ఆయన వెంట గజ, అశ్వ, రథ, పదాతి దళములతో కూడి యాదవ సైన్యం బయలుదేరింది. కృష్ణుని వెంట ఆయన భార్యలు కూడా పల్లకీలలో, రథములలో బయలుదేరారు.

అంత:పుర స్త్రీలకు రక్షణగా వారి వెంట అంగరక్షకులు బయలు దేరారు. వీరి వెంట పరిచారకులు, పరిచారికలు, వారి భార్యలు, భర్తలు, సంతానము కూడా వారి వారికి తగిన వాహనములలో బయలుదేరారు. సైనికాధికారులకు మొదలగు వారికి వినోదం కలిగించడానికి వారకాంతలు కూడా రథములలో, పల్లకీలలో బయలుదేరారు.

పెద్ద పెద్ద ధ్వజములతోనూ, పతాకములతోనూ, అస్త్ర,శస్త్రములతోనూ, కిరీటములతోనూ, కవచములతోనూ కూడిన యాదవ సైన్యము మహాసముద్రములాగా కనపడుతూ ఉంది. అపార సేనావాహినితో, అంత:పుర కాంతలతో, పరిజనముతో కృష్ణుడు, ప్రయాణం సాగించాడు. ఆనర్తము, సౌవీరము, మరుదేశము, కురుక్షేత్రమును దాటి వెళుతున్నాడు. దారిలో అడవులను, పర్వతముల గుండా ప్రయాణిస్తున్నాడు. దృషద్వతి, సరస్వతి అనే నదులను దాటాడు. పాంచాల దేశము, మత్స్య దేశము దాటాడు. ఇంద్రప్రస్థపురమునకు చేరుకున్నాడు.

కృష్ణుడు ససైన్యంగా, సపరివార సమేతంగా ఇంద్రప్రస్థమునకు వస్తున్నాడనే వార్త ధర్మరాజుకు తెలిసింది. కృష్ణునికి స్వాగత సత్కారాలు చేయడానికి ధర్మరాజు తన పురోహితులతోనూ, బంధువులతోనూ ఇంద్రప్రస్థపురము బయట వేచి ఉన్నాడు.

కృష్ణుడు రాగానే ఆయనకు ఎదురు వెళ్లి ధర్మరాజు కృష్ణుని ప్రేమతో కౌగలించుకున్నాడు. చాలా రోజుల తరువాత కృష్ణుని చూడటంతో ధర్మరాజు కళ్ల నిండా ఆనంద భాష్పాలు నిండాయి. తరువాత భీమసేనుడు కృష్ణుని ప్రేమతో కౌగలించుకున్నాడు. తరువాత కృష్ణుడు అర్జునుని, నకుల సహదేవులను ప్రేమతో కౌగలించుకున్నాడు. నకుల సహదేవులు కృష్ణునికి భక్తితో నమస్కరించారు.

తరువాత కృష్ణుడు బ్రాహ్మణులకు వృద్ధులకు నమస్కరించాడు. కురు వంశము వారు, సృంజయ వంశము వారు, కేకయ వంశము వారు అయిన వృద్ధులకు నమస్కరించాడు. సూతులు, వందిమాగధులు కృష్ణుని కీర్తిని గానం చేసారు. కృష్ణుడు నడుస్తుంటే అతని ముందు గాయకులు పాడుతున్నారు, నర్తకులు నృత్యం చేస్తున్నారు. ఈ ప్రకారంగా కృష్ణుడు ఇంద్రప్రస్థపురంలోకి ప్రవేశించాడు.

కృష్ణుని రాకను పురస్కరించుకొని ఇంద్రప్రస్థ పురమును అత్యంత సుందరంగా అలంకరించారు. చిత్ర విచిత్ర ధ్వజములతోనూ, పతాకములతోనూ, తోరణములతోనూ, పూర్ణకుంభములతోనూ అలంకరించారు. ఇంద్రప్రస్థములో ఉన్న స్త్రీ పురుషులు నూతన వస్త్రములను ధరించి కృష్ణుని దర్శనము కొరకు ఉవ్విళ్లూరుతున్నారు.

రాజ మార్గములలో పూల మాలలతో ఏనుగులు నిలబడి ఉన్నాయి. అన్ని గృహములను దీపములతో అలంకరించారు.

కృష్ణుడు వస్తున్నాడు అనే వార్త తెలియగానే పురస్త్రీలు అన్ని పనులు వదిలిపెట్టి మేడల మీదికి ఎక్కి కృష్ణుని వంక ఆతురతగా చూస్తున్నారు. ఆయనకు మనసులతోనే స్వాగతం పలికారు. కృష్ణుని రూపమును మనసులలో నిలుపుకొని ధ్యానించసాగారు. వారిలో వారు ఇలా అనుకుంటున్నారు.

“ఈ కృష్ణుడు తన చిరునవ్వుతో క్రీగంటి చూపులతో మనకు ఎంతటి ఆనందమును కలుగచేస్తున్నాడో చూడండి. ఇటువంటి దరహాసములను, క్రీగంటి చూపులను ప్రతిరోజూ అనుభవిస్తున్న ఆయన భార్యలు ఎంతటి అదృష్టవంతులో కదా! పూర్వజన్మలలో ఎన్ని పుణ్యకర్మలు చేసుకుంటే కానీ ఈ జన్మలో ఇంతటి అదృష్టం లభించదు.” అని అనుకుంటున్నారు. ఎవరి ఇళ్ల ముందుకు కృష్ణుడు వస్తే ఆ ఇళ్ల వాళ్లు కృష్ణునకు హారతులు ఇచ్చి నివేదనలు సమర్పిస్తున్నారు.
(ఈ రోజుల్లో కూడా దేవుడు ఊరేగింపుగా ఇంటి ముందుకు వచ్చినపుడు టెంకాయలు కొట్టి, హారతులు ఇవ్వడం ఆనవాయితీగా వస్తూ ఉంది.).

పురజనుల హారతులు అందుకుంటూ కృష్ణుడు రాజ మందిరములోకి అడుగుపెట్టాడు. కుంతీ దేవి, తన కోడలు ద్రౌపదితో కలిసి కృష్ణునికి ఎదురు వచ్చింది. తన మేనల్లుడైన కృష్ణుని వాత్సల్యముతో కౌగలించుకొని శిరస్సు మీద ముద్దుపెట్టుకుంది. కృష్ణుడు

తన మందిరమునకు వచ్చాడు అన్న ఆనందంతో ఒళ్లు మరిచిపోయిన ధర్మరాజు కృష్ణునికి అతిథి మర్యాదలు చేయాలి అన్న విషయం కూడా మరిచి పోయాడు. ఉబ్బితబ్బిబ్బు అవుతున్నాడు. కృష్ణుడు కుంతీదేవికి నమస్కరించాడు. ద్రౌపది, సుభద్ర తమ అన్నగారికి నమస్కరించారు. తరువాత అత్తగారైన కుంతీ దేవి అనుమతితో ద్రౌపది శ్రీకృష్ణుని భార్యలైన రుక్మిణి, సత్యభామ, భద్ర, జాంబవతి, కాళింది, మిత్రవింద, శైబ్య, నాగ్నజిత్తి మొదలగు కృష్ణుని భార్యలను సాదరంగా ఆహ్వానించి నూతన వస్త్రములు, లేపనములు,   ఉపాహారములు, ఆసనములుఇచ్చి సత్కరించారు. ధర్మరాజు శ్రీకృష్ణునికి, అతని భార్యలకు, అతని పరివారమునకు, సైన్యాధికారులకు, సైన్యమునకు వారి వారి కి తగినట్టు భోజనము, వసతి సౌకర్యములు కలుగజేసాడు.

ఒక రోజు అర్జునుడు, శ్రీకృష్ణుడు వాహ్యాళికి పోయినప్పుడు అగ్ని దేవుడు వారికి దివ్యాస్త్రములను ఇచ్చి ఖాండవ వనమును దహించమని కోరాడు. ఆ సమయంలో ఖాండవ వనములో నుండి బయట పడిన మయుడు అనే దానవ శిల్పి, ధర్మరాజుకు కానుకగా ఒక అద్భుతమైన భవనమును నిర్మించి ఇచ్చాడు. తరువాత శ్రీకృష్ణుడు తన భార్యలతోనూ, అనుచరులతోనూ ఇంద్రప్రస్థములో కొన్నాళ్లు సుఖంగా గడిపాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్త నగరమునకు రావడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బది ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## డెబ్బది రెండవ అధ్యాయము.

“ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థములో విహరిస్తూ ఉండగా ఒక రోజు ధర్మరాజు సభలో సింహాసనము మీద కూర్చుని ఉన్నాడు. ఆ సభలో బ్రాహ్మణులు, మునులు, ప్రజలు కూర్చుని ఉన్నారు. శ్రీకృష్ణుడు ఒక ఉన్నతాసనము అలంకరించి ఉన్నాడు. ధర్మరాజు శ్రీకృష్ణుని చూచి ఇలా అన్నాడు.

“గోవిందా! నేను రాజసూయము అనే యాగాన్ని చేయవలెనని సంకల్పించాను. ఆ యాగములో లోక పాలకులను, దేవతలను, బ్రాహ్మణులను పూజించవలెనని కోరికగా ఉంది. నీ ఆధ్వర్యములో ఆ యాగమును పూర్తిచేయవలెనని నా కోరిక. ఓ దేవా! నిరంతరము నీ పాదపద్మములను సేవించేవారికి, ధ్యానించేవారికి, కీర్తించేవారికి, ఈ సంసార బంధముల నుండి విముక్తి లభిస్తుంది. ఎల్లప్పుడూ ఏవో కోరికలతో సతమతమయ్యే రాజులకు, చక్రవర్తులకు నీ పాద సేవ చేయడం సాధ్యం కాదు కదా! అందుకని ఈ రాజసూయ యాగానికి వచ్చే రాజులు, చక్రవర్తులు నిన్ను దర్శించుకొని, నీ పాదసేవ చేసుకొని తరిస్తారు. కురువంశపు రాజులు, సృంజయ వంశపు రాజులు, మొదలగు రాజులందరూ వచ్చి నీ సేవలో పునీతులవుతారు.

ఓ దేవా! నీకు రూపం అంటూ లేకపోయినా, లోక కల్యాణార్థము ఈ రూపం ధరించావు. నీవు సర్వాంతర్యామివి. నీకు నావాడు, పరాయివాడు అనే భేదము లేదు. అందరూ నీకు సమానమే.

నీవు ఎల్లప్పుడూ ఆత్మానందంలో తేలియాడుతుంటావు. నిన్ను సేవించే వారి పట్ల నీ అనుగ్రహాన్ని ప్రసరిస్తుంటావు. నిన్ను సేవించే వారికి, వారు నిన్ను సేవించే విధానాన్ని బట్టి వారికి తగిన ఫలములను ఇస్తుంటావు. ఈ విషయంలో ఎటువంటి సందేహము లేదు. కాబట్టి నా ప్రార్థన మన్నించి ఈ రాజసూయ యాగము నిర్విఘ్నముగా జరిపించవలెనని నా కోరిక." అని అన్నాడు ధర్మరాజు.

ఆ మాటలను విన్న కృష్ణుడు ఇలా అన్నాడు. "ధర్మనందనా! నీ సంకల్పము మిక్కిలి ఉత్తమమైనది. నీ సంకల్పబలంతో అది నిర్విఘ్నంగా నెరవేరుతుంది. నీ కీర్తి మూడు లోకములయందు వ్యాపిస్తుంది. నీవు సంకల్పించిన రాజసూయ యాగము దేవతలకు, ఋషులకు, పితరులకు, నీ బంధువులమైన మాకు సకల భూతములకు వాంఛనీయమైనది.

రాజసూయ యాగము చేయబోయే ముందు నీవు దిగ్విజయ యాత్ర చెయ్యాలి. రాజులందరినీ గెలవాలి. ఈ భూమి అంతా నీ వశం కావాలి. కావలసిన యజ్ఞ సంభారములను సమకూర్చుకోవాలి. అప్పుడు రాజసూయ యాగము నిర్విఘ్నంగా నెరవేరుతుంది. ఈ పనులన్నీ నీకు సాధ్యమైనవే. ఈ విషయములలో నా సాయం నీకు పెద్దగా అవసరం ఉండదు. నీ తమ్ములు లోకపాలకుల అంశల నుండి పుట్టినవారు. వారు అజేయులు. నీవు ధర్మస్వరూపుడవు. జితేంద్రియుడవు. అందుకనే నన్ను కూడా నీ వశం చేసుకున్నావు. నా సాయం నీకు తప్పకుండా ఉంటుంది. రాజసూయ యాగము చేయవలెను అనే నీ సంకల్పమును కార్యరూపం దాల్చుగాక!" అని

పలికాడు కృష్ణుడు.

కృష్ణుని మాటలకు ఎంతో సంతోషించాడు ధర్మరాజు. తన తమ్ముళ్లైన భీమార్జున, నకుల, సహదేవులను దిగ్విజయ యాత్రకు నాలుగు దిక్కులకు వెళ్లమని ఆదేశించాడు. సృంజయుల సేనలతో సహదేవుని దక్షిణ దిక్కుకు, మత్స్యదేశ వీరులతో నకులుడు పడమటి దిక్కుకు, కేకయ వీరులతో అర్జునుడు ఉత్తరదిక్కుకు, మద్ర సేనలతో భీముడు తూర్పుదిక్కుకు విజయ యాత్ర సాగించాలని ఆదేశించాడు ధర్మరాజు. భీమార్జున,నకుల సహదేవులు తమ దిగ్విజయ యాత్రను నిర్విఘ్నంగా కొనసాగించారు. ఆయా రాజులను ఓడించి తెచ్చిన ధనమును, సంపదలను, ధర్మరాజుకు సమర్పించారు.

పాండవులు  అందరు రాజులను ఓడించారు కానీ జరాసంధుని మాత్రం ఓడించలేక పోయారు. దాని గురించి ధర్మరాజు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అప్పుడు కృష్ణుడు తనకు ఉద్ధవుడు చెప్పిన మాటలను ధర్మరాజుకు చెప్పాడు. జరాసంధుని యుద్ధం చేసి ఓడించడం సాధ్యం కాదని, ఉపాయంతోనే జయించాలని చెప్పాడు కృష్ణుడు.

కృష్ణుని ఆలోచన ప్రకారము భీమార్జునులు, కృష్ణుడు బ్రాహ్మణ వేషములలో జరాసంధుని నివాస స్థానమైన గిరివ్రజ నగరానికి వెళ్లారు. జరాసంధుడు బ్రాహ్మణ వేషములలో ఉన్న భీమార్జునులు, కృష్ణుని సాదరంగా ఆహ్వానించాడు. అతిథి సత్కారాలు చేసాడు. వారు వచ్చిన పని గురించి అడిగాడు. అప్పుడు భీముడు ఇలా అన్నాడు.

"రాజా! మేము దూర దేశము నుండి వచ్చాము. యాచకులుగా నీ వద్దకు వచ్చాము. మేము కోరినది మాకు ఇచ్చి మమ్ములను సంతోష పెట్టు. నీకు శుభం కలుగుతుంది. బ్రాహ్మణులు నీ వద్దకు వచ్చి ఏది అడిగినా లేదనకుండా ఇస్తావు అని కీర్తి గడించావు. నీవు ఈయతగనిది అంటూ నీ వద్ద ఏమీ లేదు. నీవు ఏమి అడిగినా ఈయగల సమర్ధుడవు.

ఎవరైనా తమ వద్ద ఉన్న వాటిని ఈయగల సామర్థ్యము ఉండి కూడా, వాటిని ఈయకుండా దాచుకుంటే, అటువంటి వాడు నిందించతగినవాడు, శోచనీయుడు. ఇంతెందుకు హరిశ్చంద్రుడు, రంతి దేవుడు, శిబి చక్రవర్తి, బలి చక్రవర్తి, వ్యాధుని బారిన పడ్డ కపోతము, అంతెందుకు పొలములో రాలిన ధాన్యము గింజలు ఏరుకొని కడుపునింపుకొనే బ్రాహ్మణుడు, తమ ప్రాణములను సైతం లెక్కచేయకుండా, తమ వద్ద ఉన్న సర్వస్వమును దానంగా ఇచ్చి అఖండమైన కీర్తి గడించారు. మాకు ఈయదగ్గవి అన్నీ నీ వద్ద ఉన్నపుడు, వాటిని దానంగా ఇవ్వడానికి నీవు సంకోచించనవసరంలేదు." అని అన్నాడు భీముడు.

జరాసంధుడు ఈ ముగ్గురినీ పరీక్షగా చూస్తున్నాడు. "వీరి వాలకములు చూస్తుంటే వీరు బ్రాహ్మణులుగా కనిపించడం లేదు. గంభీరమైన వీరి కంఠధ్వని, వీరి శరీరము మీద ఉన్న అస్త్రశస్త్రములతో ఏర్పడ్డ గాయముల గుర్తులు చూస్తుంటే వీరు క్షత్రియుల మాదిరి కనిపిస్తున్నారు. పైగా ద్రౌపదీ స్వయంవరములో వీరిని చూచినట్టు గుర్తుకు వస్తూ ఉంది. సందేహము లేదు. వీరు నిజంగా క్షత్రియులే.

ఈ కపట బ్రాహ్మణుల వేషములు వేసుకొని నా వద్దకు వచ్చారు. ఏది ఏమైనా వీరు బ్రాహ్మణులుగా నా వద్దకు వచ్చి యాచించారు కాబట్టి నా ప్రాణాలైనా ఇచ్చి వీరు కోరిన కోరిక నెరవేరుస్తాను.

ఇంద్రుడికి తిరిగి స్వర్గాధిపత్యమును ఇప్పించడానికి విష్ణువు వామనుడు అనే బ్రాహ్మణుడుగా వచ్చి బలిని మూడు అడుగులు దానంగా తీసుకొన్నాడు. దానంగా ఇచ్చిన బలి అఖండ కీర్తిమంతుడయ్యాడు. ఆయన యశస్సు మూడులోకములు వ్యాపించింది. ఈనాటికీ ఆయనను అందరూ తలచుకుంటున్నారు. పైగా వామనుడు బ్రాహ్మణుడు కాదు, విష్ణువు అని తెలిసి కూడా, తన గురువైన శుక్రాచార్యుని మాటలు కూడా లెక్కచెయ్యకుండా. మూడు అడుగులు దానం ఇచ్చి బలి లోకారాధ్యుడయ్యాడు.

ఈ శరీరం శాశ్వతం కాదు. ఎప్పుడో ఒకప్పుడు పడిపోవలసిందే. అశాశ్వతమైన ఈ శరీరం కొరకు బ్రాహ్మణులు అడిగింది లేదన్నాడనే అపకీర్తి మూటకట్టుకోలేను. బ్రాహ్మణులకోరిక తీర్చి అంతులేని కీర్తిని పొందని క్షత్రియుడు బతికినా చచ్చినట్టే. కాబట్టి వీరు ఎవరైనా నాకు అనవసరం. వీరు కోరిన కోరిక తీర్చడమే నా తక్షణ కర్తవ్యం." అని అనుకున్నాడు జరాసంధుడు.

భీమార్జున, కృష్ణులను చూచి ఇలా అన్నాడు.
"ఓ బ్రాహ్మణోత్తములారా! మీకు ఏం కావాలో అడగండి. తప్పకుండా ఇస్తాను. తుదకు నా శిరస్సును ఖండించి ఇమ్మన్నా సరే సంతోషంగా ఇస్తాను." అని అన్నాడు జరాసంధుడు.

(బ్రాహ్మణవేషంలో వచ్చిన ఇంద్రుడికి కవచ కుండలాలు ఇచ్చి దానికి ప్రతిగా ఆయన వద్ద నుండి శక్తి అనే ఆయుధమును గ్రహించిన కర్ణుడు గొప్పవాడా, బ్రాహ్మణుల కోరిక తీర్చడానికి, తన తలను కూడా నరికి ఇస్తానన్న జరాసంధుడు గొప్పవాడా! మీరే ఆలోచించండి.)

ఆ మాటలు విన్న శ్రీకృష్ణుడు జరాసంధునితో ఇలా అన్నాడు. " ఓ రాజా! మేము బ్రాహ్మణులకు కాము. క్షత్రియులము. నీతో యుద్ధం చేయాలనే కోరికతో నీ వద్దకు వచ్చాము. నీతో యుద్ధము తప్ప మాకు మరేదీ అక్కరలేదు. కాబట్టి మా తో ద్వంద్వ యుద్ధము చేసి మా కోరిక తీర్చు.

జరాసంధా! ఇంక దాపరికం ఎందుకు. వీరిద్దరూ కుంతీకుమారులు అయిన భీమార్జునులు, నేను నీ చిరకాల శత్రువు అయిన కృష్ణుడను." అని తమను తాము ఎరుకపరచుకున్నాడు కృష్ణుడు. జరాసంధునికి విషయంఅర్థం అయింది.

"మీకు నా తో ద్వంద్వ యుద్ధం చేయడమే మీ కోరిక అనుకుంటే ఆ కోరిక తీర్చడం నాకు సమ్మతమే. కృష్ణా! నాకు భయపడి నీవు మధురను వదిలి పారి పోయి సముద్రంలో దాక్కున్నావు. నీ వంటి పిరికివాడితో నేను యుద్ధం చేయను. అది నా పరాక్రమానికి అవమానము. ఈ అర్జునుడు కూడా ఏ మాత్రం బలం లేని వాడు. నా ముందు నిలువలేడు. ఈ భీముడే నాకు సరిసమానమయిన బలవంతుడు. ఈ భీమునితో ద్వంద్వ యుద్ధం చేయడానికి నాకు అభ్యంతరంలేదు." అని అన్నాడు.

తరువాత జరాసంధుడు రెండు బలమైన గదలు తెప్పించాడు. భీముడికి ఒకటి ఇచ్చి తాను ఒకటి తీసుకున్నాడు. ఇద్దరూ నగరం బయట ఒక విశాలమైన ప్రదేశానికి వెళ్లారు. భీముడు, జరాసంధుడు గదాయుద్ధం చేయడం మొదలు పెట్టారు. గుండ్రంగా తిరుగుతూ అదును చూసి గదలతో మోదుకుంటున్నారు. రెండు మదించిన ఏనుగులు కొట్టుకున్నట్టు కొట్టుకుంటున్నారు. వారి గదలు ఒకదానితో ఒకటి కొట్టుకుంటుంటే కలిగే ధ్వని మారుమోగుతూ ఉంది. భుజముల మీద, నడుముమీద, చేతుల మీద, బలంగా మోదుకుంటున్నారు. వారి గదాఘాతములకు రెండు గదలు విరిగిపోయాయి.

గదలు విరిగిపోవడంతో వారిద్దరూ చేతులతో కొట్టుకోసాగారు. గదాయుద్ధము మల్లయుద్ధముగా మారింది. ఒకరి మీద ఒకరు పిడిగుద్దుల వర్షము కురిపిస్తున్నారు. భీమ జరాసంధులు ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేసుకుంటున్నారు. ఇద్దరూ సమానమైన బలం కలవారే.

ఆ ప్రకారంగా 27 రోజులు గడిచాయి. విజయం ఎవరిదీ తేలలేదు. 28వ రోజు ఉదయం భీముడు శ్రీకృష్ణుని వద్దకు వచ్చి "కృష్ణా! ఇంక నా వల్ల కాదు. ఈ జరాసంధుని నేను జయించలేను." అని అన్నాడు. కృష్ణుడు ఆలోచించాడు.

"ఈ జరాసంధుడు అమిత బలవంతుడు. ద్వంద్వయుద్ధంలో ఇతనిని జయించడం కష్టం. ఇతని పుట్టుక విచిత్రంగా జరిగింది. రెండు నిలువుభాగములను కలపడం వలన ఇతడు పుట్టాడు. మరలా ఇతనిని అదే మాదిరి చీల్చి చంపవచ్చు." అని అనుకొన్నాడు.

భీముడు జరాసంధునితో యుద్ధం చేస్తున్నప్పుడు కృష్ణుడు ఒక చెట్టు కొమ్మను చీల్చి అలా జరాసంధుని చీల్చమని సంకేతం ఇచ్చాడు. వెంటనే భీముడు జరాసంధుని నేలమీద పడవేసాడు. ఒక కాలును తన కాలుతో తొక్కిపెట్టి మరొక కాలుపట్టుకొని జరాసంధుని నిలువునా చీల్చాడు. జరాసంధుని శరీరము నిలువుగా చీలి పోయింది. పుట్టక ముందు ఎలా ఉన్నాడో ఇప్పుడు అలా ఉన్నాడు జరాసంధుడు. ఇప్పుడు రెండు ఖండములను అతకడానికి జర అనే రాక్షసి లేదు. అందుకని జరాసంధుడు ప్రాణాలు వదిలాడు.

ఆనందంతో అర్జునుడు భీముని కౌగలించుకున్నాడు. శ్రీకృష్ణుడు భీముని అభినందించాడు. శ్రీకృష్ణుడు, భీమార్జునులు గిరివ్రజ పురంలోకి ప్రవేశించారు. జరాసంధుని కుమారుడైన సహదేవుని రాజ్యాభిషిక్తుని చేసారు. జరాసంధుని చెరలో ఉన్న రాజుల నందరినీ బంధవిముక్తులను చేసాడు సహదేవుడు. ఆ ప్రకారంగా జరాసంధుని రాజ్యము కూడా ధర్మరాజుకు సామంత రాజ్యం అయింది." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు జరాసంధ వధ గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బది రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

డెబ్బది మూడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! జరాసంధుడు యుద్ధములలో జయించి బందీలుగా పట్టుకొని చెరసాలలో బంధించిన రాజులు ఇరవై వేల ఎనిమిది వందల మంది ఉన్నారు. వారందరికీ సరి అయిన ఆహారం లేక బక్కచిక్కిపోయి ఉన్నారు. జరాసంధుడు చావగానే ఆయన కుమారుడు సహదేవుడు వారి నందరినీ బంధవిముక్తులను చేసాడు.

వారంతా చెరసాలల నుండి బయటకు వచ్చి తమ విముక్తికి కారణమైన నీల మేఘ శ్యాముడు, పచ్చని పట్టుపీతాంబరము కట్టుకున్న వాడు, శ్రీవత్సము అనే మచ్చ కలవాడు, నాలుగు చేతులు కలవాడు, తామర పూరేకుల వంటి కళ్లుకలవాడు, ఎల్లప్పుడు చిరునవ్వు పెదాల మీద కలవాడు, చేతులలో శంఖము, చక్రము, గద, పద్మము కలవాడు, మణిమయకిరీటము ధరించినవాడు, మెడలో కౌస్తుభ మణిని ధరించిన వాడు, అయిన శ్రీకృష్ణపరమాత్మను దర్శించారు. వారంతా శ్రీకృష్ణుని పాదముల మీద పడి సాష్టాంగ నమస్కారం చేసారు.

తమ తమ మనసుల నిండా శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహమును నింపుకొని ఆరాధిస్తున్నారు. శ్రీకృష్ణుని దివ్య దర్శనము కాగానే, వారు అప్పటి దాకా చెరసాలలో పడ్డ కష్టములు అన్నీ మరిచిపోయారు. వారంతా ముక్తకంఠంతో శ్రీకృష్ణుని ఇలా స్తుతించారు.

"దేవ దేవా! పరమాత్మా! ఆర్తత్రాణపరాయణా! నీకు నమస్కారము. మేము సందేశము పంపగానే వచ్చి మా అందరినీ రక్షించావు. మమ్ములను బంధవిముక్తులను చేసావు. అలాగే మా అందరినీ ఈ సంసారము అనే బంధనముల నుండి కూడా విముక్తులను చెయ్యి. మేమంతా నీ శరణాగతులము.

ఓ దేవా! మమ్ములను బంధించిన జరాసంధుని మేము నిందించడం లేదు. యుద్ధం చేయడం, బందీలుగా పట్టుకోవడం, బంధించడం అన్నీ క్షత్రియధర్మాలే! ఆ క్షత్రియధర్మాలు కూడా నీ అనుగ్రహం వల్లనే జరుగుతున్నాయి. రాజ్యాధికారము, అధికార మదము, సంపదలతో కూడిన గర్వము ఈ రాజులను అంధులను చేసాయి. వారి ఇష్టం వచ్చినట్టుఅడ్డు ఆపు లేకుండా వ్యవహరిస్తున్నారు. ఈ రాజ్యములు, ఐశ్వర్యములు, సంపదలు శాశ్వతంగా ఉంటాయని భావిస్తున్నారు. అజ్ఞానంలో పడి కొట్టుకుంటున్నారు. ఎండమావులను జలాశయాలని భావించి నీటి కోసరం వాటి వెంట పరుగెడుతున్నారు. వీరంతా నీ మాయలో పడి కొట్టుకుంటున్నారు.

మేము కూడా ఇందుకు తీసిపోము. మేము కూడా రాజ్యాధికారముతో, దురభిమానంతో, ఐశ్వర్య మదముతో ఇష్టంవచ్చినట్టు ప్రవర్తించిన వాళ్లమే. ఈ రాజ్యములు, సంపదలు శాశ్వతములు కావనీ, మృత్యువు మా వెంట ఉందనీ తెలియని అజ్ఞానులము. మూర్ఖులము. రాజ్యములను విస్తరింపచేయాలనే కాంక్షతో, పరస్పర స్పర్థలతో, అసూయతో, ద్వేషంతో, పొరుగు రాజులతో

యుద్ధములు చేసి, లక్షల కొద్దీ సైన్యములను సంహరించాము. మా ప్రజలను అష్టకష్టముల పాలు చేసాము.

మేము మా కన్నా బలహీనులైన రాజులను జయించి వారి రాజ్యములను ఆక్రమించుకుంటే, ఈ జరాసంధుడు మమ్ములను జయించి, మా రాజ్యములను ఆక్రమించుకొని మమ్ములను బందీలుగా చేసాడు. చేసిన పాపములకు తగిన శిక్ష అనుభవించాము. రాజ్యములు, ఐశ్వర్యములు పోగానే ఈ విధంగా శోకిస్తున్నాము. ఇప్పుడు నీ పాదములను పట్టుకొని ప్రార్థిస్తున్నాము.

ఓ దేవా! ఈ శరీరం శాశ్వతము కాదు, దినదినము క్షీణిస్తూ ఉండేది అనే సత్యాన్ని తెలుసుకున్నాము. ఈ శరీరంతో అనుభవించే రాజ్య సుఖాలు, సిరిసంపదలు మాకు అక్కరలేదు. అవన్నీ ఎండమావుల వంటివి. వాటి వెంట పడి ప్రయోజనము లేదు. మాకు ఇహలోక సుఖాలే కాదు స్వర్గసుఖాలు కూడా అక్కరలేదు. మేము చేసిన పాపాలకు మేము ఇంకా ఎన్నో జన్మలు ఎత్తాలి. ఆ జన్మలలో కూడా మేము నీ పాదపద్మముల స్మరణను మరిచిపోకుండా, సదా నీ పాదములను సేవించే భాగ్యమును మాకు  అనుగ్రహించు. ఓ దేవా! గోవిందా! పరమాత్మా! శ్రీహరీ! వాసుదేవా! శ్రీకృష్ణా! నీకు నమస్కారము." అని ఆ రాజులందరూ శ్రీకృష్ణుని స్తుతించారు.

ఆ రాజుల స్తుతి వాక్యములు విన్న శ్రీకృష్ణుడు వారితో ఇలా అన్నాడు. " మీకు జ్ఞానోదయం అయింది. మీరు కోరిన కోరికలు సిద్ధిస్తాయి. రాజ్యమదము, ధనగర్వము ఎంతటి వారినైనా అంధులుగా చేస్తాయి.  కాని మీ సంకల్పము శుభప్రదము. మీరు నిజాలు చెప్పారు.

మీ అజ్ఞానాన్ని అవివేకాన్ని ఒప్పుకున్నారు. నేను కూడా మీ మాదిరి ధనమదము చేతనూ, అధికార గర్వంతోనూ, రాజ్యాధికారంతోనూ కళ్లుమూసుకుపోయి, తమకు ఏ హద్దు లేదని ప్రవర్తించిన రాజులను ఎంతో మందిని చూచాను.

పూర్వము కార్తవీర్యుడు, నహుషుడు, రావణుడు, నరకుడు ఇంకా దేవతలు, దైత్యులు, మీ వంటి చక్రవర్తులు కూడా రాజ్యాధికారముచేత కలిగిన మదంతో, ఐశ్వర్యము వలన కలిగిన అహంకారంతో తమతమ రాజ్యముల నుండి, సంపదల నుండి భ్రష్టులయ్యారు. మీరు మాత్రము ఈ శరీరము శాశ్వతము కాదు అని తెలుసుకొని, నా యందే మీ మనసులు లగ్నం చేసారు. కాబట్టి మీరు మీ మీ రాజ్యములకు వెళ్లండి. ధర్మంగా, అసూయా ద్వేషాలు లేకుండా రాజ్యపాలన చెయ్యండి. అందరూ సఖ్యంగా ఉండండి. ఒకరితో ఒకరు యుద్ధములు చేసుకోవడం మానండి. శాంతికాములుగా మెలగండి. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించండి. ప్రజాక్షేమమే ముఖ్యంగా భావించండి. మీ మనసులు మాత్రము ఎల్లప్పుడు పరమాత్మయందే లగ్నం అయేట్టు చూడండి. అప్పుడు మీరు ఏ పాపమూ చెయ్యరు. చెయ్యలేరు.

సుఖదు:ఖములను సమానంగా చూడండి. దేని మీదా ఆసక్తి చూపకండి. సుఖములు దు:ఖములు ఒకటి వెంట ఒకటి వస్తుంటాయి పోతుంటాయి. వాటి గురించి ఆలోచించి దు:ఖించి ప్రయోజనము లేదు. సుఖము రాగానే పొంగి పోవడం, దు:ఖము రాగానే కుంగి పోవడం విజ్ఞుల లక్షణం కాదు. సుఖదు:ఖములను సమంగా చూచిన

వాడే జ్ఞాని. ఈ దేహం మీద ఎక్కువ ప్రేమాభిమానములను పెంచుకోకండి. ఈ దేహము ఎప్పటికైనా నశించి పోయేదే! ఆత్మ శాశ్వతము. దేహముతో అనుభవించే ఆనందం కన్నా, ఆత్మానందమే శాశ్వతము అని గ్రహించండి. మీ మనసులను పరమాత్మయందు లగ్నం చేయండి. ఈ ప్రకారంగా మీ జీవితములను గడిపితే, ఈ దేహములను విడిచిపెట్టిన మీకు ముక్తిలభిస్తుంది." అని పలికాడు శ్రీకృష్ణుడు.

తరువాత చాలాకాలం నుండి స్నానపానములు లేక మట్టిగొట్టుకుపోయిన శరీరములతో ఉన్న రాజులకు అభ్యంగన స్నానం చేయించాడు. జరాసంధుని కుమారుడైన సహదేవునిచేత ఆ రాజులకు మంచి వస్త్రములు, ఆభరణములు, కిరీటములు ఇప్పించాడు. వారందరికీ వారి వారి రాజ్యములను తిరిగి ఇప్పించాడు. వారిని రాజులుగా అభిషేకింపజేసాడు. వారందరినీ చక్కగా అలంకరింపబడిన రథముల మీద వారి వారి రాజ్యములకు పంపించాడు. రాజులందరూ శ్రీకృష్ణుని తలచుకుంటూ, తమ తమ మనసుల నిండా కృష్ణ రూపమును నింపుకొని, తమ తమ రాజ్యములకు వెళ్లిపోయారు.

తాము వచ్చిన పని పూర్తి అయినందున, శ్రీకృష్ణుడు, భీమసేనుడు, అర్జునుడు ఇంద్రప్రస్థ నగరమునకు బయలు దేరారు. నగర పరిసరముల వద్దకు రాగానే వారు ముగ్గురూ తమ తమ శంఖములను పూరించారు. ఆ శంఖధ్వనులు వినగానే ధర్మరాజు శ్రీకృష్ణుడు, భీమార్జునులు విజయులై తిరిగి వస్తున్నారని తెలుసుకొని వారికి స్వాగత సత్కారముల ఏర్పాట్లు చేసాడు. వారికి స్వాగతం పలకడానికి ధర్మరాజు స్వయంగా వారికి ఎదురు వెళ్లాడు. ధర్మరాజును

చూడగానే శ్రీకృష్ణుడు, భీమార్జునులు ఆయనకు నమస్కరించారు. తాము జరాసంధుని ఎలా వధించినదీ, రాజులను ఎలా బంధ విముక్తులను చేసిందీ వివరించారు.

శ్రీకృష్ణుని సాయంతో తన తమ్ముల విజయం సాధించారన్న విషయాలు విని ధర్మరాజు కనుల నుండి ఆనందభాష్పాలు జలజలా రాలాయి. ఆయనకు నోట మాట రాలేదు. గొంతు బొంగురుపోయింది. మనసంతా ఆనందంతో నిండి పోగా, ధర్మరాజు శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు జరాసంధ వధ వృత్తాంతమును, బందీలుగా ఉన్న రాజుల విముక్తిని వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బది మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## డెబ్బది నాలుగవ అధ్యాయము .

"పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు, భీమార్జునులు ధర్మరాజుతో జరాసంధ వధ గురించి, ఆయన చేత బంధింపబడ్డ రాజుల విముక్తి గురించి వివరించారు. వారి మాటలు విన్న ధర్మరాజు శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు.

"దేవా! నీ దయ వలన శత్రుసంహారము దిగ్విజయంగా పూర్తి అయింది. తదుపరి కార్యక్రమమును తెలిపితే మేమందరము నీ మాట శిరసావహిస్తాము. సనకాది గురువులు, లోకపాలకులు నీ ఆదేశము కోసం ఎదురు చూస్తుంటారు. అటువంటి నీవు మా ఎదుట నిలబడి మాకు ఆదేశములు ఇవ్వడం కన్నా మహాభాగ్యం ఏముంటుంది. నీవు పరమేశ్వరుడవు. కాని నేను నీ కన్నా వయసులో పెద్ద వాడిని కనుక నా ఆదేశమును నీవు అనుసరిస్తున్నావు. ఇంతకంటే ఆశ్చర్యం ఏముంటుంది.

దేవా! సూర్యుని తేజస్సు నిరంతరం వెలుగుతూ ఉంటుంది. కాని మనకు సూర్యుడు ఉదయించినట్టు, అస్తమించినట్టు కనపడుతూ ఉంటుంది. కాని అది వాస్తవము కాదు కదా! అలాగే నీ ప్రభావమునకు, నీ తేజస్సుకు వృద్ధి క్షయములు లేవు.

ఓ దేవా! అజ్ఞానులైన మానవులలో ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ అనే భేదబుద్ధి ఉంటుంది. కానీ, నీ భక్తులలో మాత్రము నేను, నాది అనే భావన ఉండదు. వారికి అందరూ సమానమే. నీ ఆదేశానుసారము నేను రాజసూయ యాగమును మొదలుపెడతాను." అని పలికాడు ధర్మరాజు.

శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. ధర్మరాజు వెంటనే వేదవేదాంగములలో నిపుణులను పిలిపించాడు. వారిని ఋత్విక్కులుగా నియమించాడు. బ్రాహ్మణులను హోతలుగా నియమించాడు.

ఆ యజ్ఞమునకు వ్యాసుడు, భరద్వాజుడు, సుమంత్రుడు, గౌతముడు, అసితుడు, వశిష్ఠుడు, కణ్వుడు, చ్యవనుడు, మైత్రేయుడు, కవషుడు, త్రితుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, సుమతి, జైమిని, క్రతువు, పైలుడు, పరాశరుడు, గర్గుడు, వైశంపాయనుడు, అధర్వుడు, కశ్యపుడు, ధౌమ్యుడు, పరశురాముడు, ఆసురి, వీతిహోత్రుడు, మధుచ్ఛందసుడు, వీరసేనుడు, అకృతవర్ణుడు అనే మహాఋషులు అతిధులుగా పిలువబడ్డారు.

రాజసూయ యాగానికి ధృతరాష్ట్రుడు, సుయోధనుడు, విదురుడు, భీష్మ,ద్రోణ,కృపాచార్య ప్రభృతులు వచ్చారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో అందరూ యాగము చూడటానికి వచ్చారు. నాలుగు దిక్కుల నుండి రాజులందరూ వచ్చారు. ధర్మరాజు బంగారు నాగలితో యజ్ఞభూమిని దున్నాడు. యజ్ఞదీక్ష తీసుకున్నాడు.

యాగములో ఉపయోగింపబడిన అన్ని పాత్రలు బంగారంతో తయారు చేయబడ్డాయి. ఆ యాగమునకు దేవతలు, గంధర్వులు, లోకపాలకులు, విద్యాధరులు, నాగులు, మునులు, యక్షులు, రాక్షసులు, ఖగములు, కిన్నరులు, కింపురుషులు, చారణులు, ధర్మరాజునుండి ఆహ్వానము అందుకున్న రాజులు, వారి భార్యలు, రాజసూయ యాగమునకు వచ్చారు. ఋత్విక్కులు వేదోక్తంగా ధర్మరాజు చేత యజ్ఞచేయించారు. ధర్మరాజు ఋత్విక్కులను, యాజకులను హోతలను యధావిధిగా పూజించాడు.

రాజసూయ యాగములో ఆఖరు ఘట్టము అగ్రపూజ. అగ్రపూజకు ఎవరు అర్హులు అనే విషయం మీద చర్చ జరిగింది. అగ్రపూజకు ఎవరు అర్హులు అనే విషయం ఎవరూ నిర్ణయించలేకపోయారు. ఆ సందర్భంలో సహదేవుడు ఇలా పలికాడు.

"సభాసదులారా! ఈ సభలో ఉన్న వారందరిలో పూజనీయుడు శ్రీకృష్ణుడు మాత్రమే. ఆయనే అగ్రపూజకు యోగ్యుడు. ఆయన సాక్షాత్తు పరమాత్మ స్వరూపము. ఈ విశ్వానికి అధిపతి. ఈ యజ్ఞములు, యాగములు, హెూమములు, మంత్రములు  అన్నీ ఆయనను ఉద్దేశించి చేయబడుతున్నాయి.

ఆయన తన మాయాశక్తిచేత సృష్టి,స్థితి,లయ కార్యములను నిర్వహిస్తున్నాడు. ఈ జగత్తులో ఉన్న చరాచర జీవులు ఆయన అనుగ్రహము చేతనే తమ తమ కర్మలకు తగిన ఫలములను పొందుతున్నారు.  ఈ లోకంలో దాన,ధర్మములు చేసే వారు, సర్వభూతములలో తానై ఉన్న వాడు, భేదబుద్ధిలేని వాడు, శాంతస్వరూపుడు, అయిన శ్రీకృష్ణుని పరంగా ఆ దానధర్మములు చేస్తే దానికి తగిన ఫలం లభిస్తుంది.  ఈ కారణం చేత శ్రీకృష్ణునికి అగ్రపూజ చేయడమే ఉత్తమము అని నా అభిప్రాయము. శ్రీకృష్ణుని పూజిస్తే లోకములో అందరినీ పూజించినట్లే అవుతుంది." అని సహదేవుడు తన అభిప్రాయాన్ని తెలియజేసాడు.

సభలో ఉన్న వారంతా సహదేవుని మాటలకు తమ హర్షం వ్యక్తం చేసారు. ధర్మరాజు కూడా శ్రీకృష్ణునికే అగ్రపూజ చెయ్యాలని నిర్ణయించాడు. దానికి తగిన ఏర్పాట్లు చేసాడు. ద్రౌపది బంగారు

కలశంతో నీళ్లు పోస్తూ ఉండగా, ధర్మరాజు, తన నలుగురు తమ్ములు శ్రీకృష్ణుని పాదములను కడిగారు. ఆ నీటిని తమ తలల మీద చల్లుకున్నారు. శ్రీకృష్ణునికి పీతాంబరములు, అమూల్యములు అయిన ఆభరణములు ఇచ్చి సత్కరించారు. సర్వమంగళాకారుడైన శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహాన్ని చూస్తూ ఆనంద భాష్పాలు రాల్చారు. సభలో ఉన్న వారంతా వయోభేదం లేకుండా లేచి నిలబడి శ్రీకృష్ణునికి తమ నమస్కారాలు తెలియజేసారు. ఆయన మీద పూలవాన కురిసింది.

ఇదంతా చూస్తున్న శిశుపాలుడికి ఒంటినిండా కారం పూసినట్టయింది. తన ఆసనము నుండి లేచి నిలబడ్డాడు. శ్రీకృష్ణునికి జరుగుతున్న అగ్రపూజను ఆక్షేపిస్తూ ఇలా అన్నాడు.

“మీ కందరికీ తెలుసు. వేదములలో కాలము అన్నింటికన్నా బలమైనది అని చెప్పబడింది. కాల ప్రభావం కాకపోతే బాలుడైన సహదేవుని మాటలకు వృద్ధులైన ఈ సభాసదులు తలలు ఊపడం ఏమిటి? వీరందరికీ మతి చలించినట్టు కనపడుతూ ఉంది. సహదేవుని మాటలకు ఎలాంటి విలువ లేదు. విలువ ఇవ్వ నవసరం లేదు. ఈ గోపాలుడు యాదవ కులంలో చెడబుట్టాడు. అటు వంటి వాడికి అగ్రపూజ ఎలా చేస్తారు?

ఈ సభలో ఋషులు, మునులు, వీరులు, మేధావులు, తత్వవేత్తలు, ఎటువంటి పాపం చెయ్యని వారు, లోకపాలకులచేత పూజింపబడేవారు, ధార్మికులు ఎంతో మంది ఉన్నారు. వారినందరినీ కాదని, దేవతలకు చెందవలసిన పురోడాశము కాకికి పెట్టినట్టు, ఈ

యాదవునికి అగ్రపూజచేయడం పరమ శోచనీయము. వీడికి వర్ణాశ్రమ ధర్మములు లేవు. ధర్మం తెలియదు. గుణహీనుడు, స్వేచ్ఛాజీవి. ఉచ్ఛనీచాలు తెలియని ఇతడు అగ్రపూజకు ఎలా అర్హుడు? యాదవ వంశమునకు మూల పురుషుడు అయిన యదువు యయాతి కుమారుడు. యయాతి యదువును దారుణంగా శపించాడు. యాదవులను సంఘంనుండి బహిష్కరించారు. యాదవులు ఎల్లప్పుడు మద్యం మత్తులో ఉంటారు. అటువంటి వంశంలో పుట్టినవాడు అగ్రపూజకు ఎలా అర్హుడు అవుతాడు? ఈ యాదవులు అందరూ దొంగలు. అందుకే రాజులకు భయపడి పారిపోయి సముద్రంలో దాక్కున్నారు. సముద్రంలో నగరం నిర్మించుకొని సమాజానికి దూరంగా ఉన్నారు. ."

శిశు పాలుని నిందా వాక్ ప్రవాహం అలా సాగుతూనే ఉంది. తనను ఎంత నిందించినా కృష్ణుడు చిరునవ్వుతో వింటున్నాడు. ఒక్కమాట కూడా అనలేదు. కాని సభలో ఉన్న వారు మాత్రము ఊరుకోలేదు. కృష్ణుని ఉద్దేశించి శిశుపాలుడు మాట్లాడుతున్న నిందావాక్యములను వినలేక చెవులు మూసుకున్నారు. కొందరైతే సభను విడిచి వెళ్లిపోయారు.

పాండవుల కుమారులకు, మత్స్య,కేకయ, సృంజయ వీరులకు పట్టరాని కోపం వచ్చింది. కత్తులు దూసి శిశుపాలుని చంపడానికి ఆయన మీదికి దూకారు. శిశుపాలుడు కూడా కృష్ణునికి అండగా నిలబడ్డ రాజులను తీవ్రంగా దూషిస్తూ తన ఖడ్గము దూసి వారికి ఎదురునిలిచాడు.

ఇప్పుడు కృష్ణుడు లేచి నిలబడ్డాడు. ఒకరి మీదికి ఒకరు కత్తులు దూసుకోవడం చూచాడు. అందరినీ వారించాడు. తన చేతి లోని చక్రాయుధమును శిశుపాలుని మీదికి విసిరాడు. ఆ చక్రాయుధము శిశుపాలుని కంఠమును ఖండించింది. శిశుపాలుని దేహము తల నుండి వేరయి కిందపడింది.

సభలోహాహాకారాలు చెలరేగాయి. చేసిన పాపాలకు తగిన శిక్ష అనుభవించాడు అని అందరూ అనుకున్నారు. కొంతమంది భయంలో పరుగులు తీసారు. ఇంతలో ఒక అద్భుతము జరిగింది. శిశు పాలుని దేహమునుండి ఒక జ్యోతి బయటకు వచ్చింది. ఆ జ్యోతి శ్రీకృష్ణుని దేహంలో ప్రవేశించి, ఆయనలో ఐక్యం అయింది.

ఓ పరీక్షిత్ మహారాజా! మునుల చేత శపించబడ్డ జయవిజయులకు ఇది మూడవ జన్మ. అందులో శిశుపాలుడు ఇప్పుడు మరణించి విష్ణుసాయుజ్యము పొందాడు. ఇంక దంతవక్త్రుడు మిగిలి ఉన్నాడు. ఇందులో మరొక విశేషము కూడాఉంది. శిశుపాలుడు శ్రీకృష్ణుని మీద వైరంతో తన అవసాన దశలో ఆయననే తలచుకున్నాడు. మనసంతా అయననే నింపుకొని ఆయనను నిందించాడు. ఆ కారణం చేత శిశుపాలునిలోని జీవుడు పరమాత్మలో ఐక్యం అయ్యాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు జయవిజయుల వృత్తాంతమును ఇదివరకే వివరించాను. రాజసూయ యాగములో అగ్రపూజ ఆ విధంగా ముగిసింది. ధర్మరాజు ఋత్విక్కులకు, బ్రాహ్మణులకు దక్షిణలు

విరివిగా ఇచ్చాడు. యాగమునకు వచ్చిన రాజులందరినీ ఘనంగా సత్కరించాడు. యాగ దీక్ష విడిచిపెట్టిన తరువాత చేయవలసిన కర్మలను అన్నింటినీ యధావిధిగా నిర్వర్తించాడు. రాజసూయ యాగము తరువాత ధర్మరాజు అవబృధ స్నానము చేసి యజ్ఞము పరిసమాప్తి చేసాడు. ఆ విధంగా రాజసూయ యాగము విజయవంతంగా ముగిసింది.

శ్రీకృష్ణుడు పాండవుల కోరిక మీద కొన్ని రోజులు ఇంద్రప్రస్థములో ఉన్నాడు. తరువాత ధర్మరాజు అనుమతి తీసుకొని, సకుటుంబ,సపరివారసమేతంగా ద్వారకకు వెళ్లిపోయాడు. యాగమునకు వచ్చిన రాజులందరూ రాజసూయ యాగ విశేషములను చెప్పుకుంటూ, ధర్మరాజు ఔదార్యమును కీర్తిస్తూ తమ తమ దేశములకు వెళ్లిపోయారు. కాని ఒక్కడు మాత్రము ధర్మరాజు యొక్క వైభవము, సిరిసంపదలు, రాజులు ఇచ్చిన కానుకలు చూచి ధర్మరాజు మీద ద్వేషంతో రగిలిపోతున్నాడు. అతడే ధృతరాష్ట్రుని పెద్దకుమారుడు సుయోధనుడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు రాజసూయ యాగ విశేషములను వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బదినాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
# దశమస్కంధము
# డెబ్బది ఐదవ అధ్యాయము.

పరీక్షిత్ మహారాజు శుక మహర్షితో ఇలా అన్నాడు.

"ఓ శుకయోగీంద్రా! రాజసూయ యాగమునకు వచ్చిన వారంతా ఎంతో తృప్తితో, సంతోషంతో వారి వారి స్వస్థలములకు వెళ్లిపోయారు ఒక్క సుయోధనుడు తప్ప. సుయోధనుడు అసూయతో ద్వేషంతో రగిలిపోయాడు అని చెప్పారు కదా! అలా ఎందుకు జరిగింది. సుయోధనునిలో ప్రజ్వరిల్లిన అసూయాద్వేషాలకు కారణం ఏమిటి?" అని అడిగాడు. దానికి శుక యోగీంద్రులు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీ పితామహుడు అయిన ధర్మరాజు రాజసూయ యాగం చేసాడని చెప్పాను కదా! ఆ యజ్ఞములో తన బంధువులకు, మిత్రులకు ఒక్కొక్కరికి ఒక్కో పని అప్పచెప్పాడు ధర్మరాజు. భీముడు వంటశాలకు అధ్యక్షుడి గానూ, సుయోధనుడు కోశాగారమునకు అధ్యక్షుడి గానూ, సహదేవుడు యాగమునకు వచ్చిన వారిని సాదరంగా ఆహ్వానించి వారికి తగు ఏర్పాట్లు చేయడానికి గానూ, నకులుడు యాగమునకు కావలసిన వస్తువులు సమకూర్చడానికి గానూ, అర్జునుడు వచ్చిన ఋషులకు, మునులకు తగు సదుపాయములు కల్పించి వారికి సేవచేయడానికి గానూ, శ్రీకృష్ణుడు వచ్చిన వారందరికీ అర్ఘ్యము, పాద్యము ఇవ్వడానికి గానూ,

ద్రౌపది వచ్చిన వారందరికీ తగు విధంగా ఆహార పదార్థములను వడ్డించడానికి గానూ, కర్ణుడు వచ్చిన వారందరికీ కానుకలు ఇవ్వడానికి గానూ, యుయుధానుడు, వికర్ణుడు, హార్దిక్యుడు, విదురుడు, భూరిశ్రవసుడు, బాహ్లీకుడు, ఇంకా ఇతర మిత్ర రాజులు వివిధ కార్యములు నిర్వహించడానికి నియమితులయ్యారు.

అగ్రపూజ సమయంతో కృష్ణుని చేతిలో శిశుపాలుడు హతుడయ్యాడు. తరువాత ఋత్విక్కులు, సదస్యులు, శాస్త్రజ్ఞులు, బంధువులు అందరినీ ధర్మరాజు తగు రీతిగా కానుకలు, దక్షిణలు ఇచ్చి సత్కరించాడు. తరువాత అందరూ గంగలో అవబృథస్నానాలు చేసే కార్యక్రమం అత్యంత వైభవోపేతంగా సాగింది. మృదంగములు, శంఖములు, దుంధుభులు మోగుతున్నాయి. నాట్యకత్తెలు, గాయకులు ఆడుతున్నారు పాడుతున్నారు.

రాజులందరూ అమూల్యములైన ఆభరణములను అలంకరించుకొని ఏనుగుల మీద, గుర్రముల మీదా, రథముల మీదా వెళుతున్నారు. ముందు ధర్మరాజు వెళుతుండగా ఆయన వెంట యదు, సృంజయ, కాంభోజ, కేకయ, కురు, కోసల వంశీయులైన రాజులు నడుస్తున్నారు. రాజుల భార్యలు, అంత:పుర స్త్రీలు, రథములను ఎక్కి, అంగరక్షకులు వెంటరాగా, అవబృథ స్నానానికి బయలు దేరారు. వారి వెంట సైన్యం నడుస్తూ ఉంది. వారి ముందు సదస్యులు, ఋత్విక్కులు వేదపఠనం చేస్తూ నడుస్తున్నారు. వీరే కాకుండా చక్కగా అలంకరించుకున్న పురజనులు, స్త్రీపురుషులు కూడా వారి వెంట నడుస్తున్నారు.

అందరూ చందనము మొదలగు లేపనములు ఒంటికి పూసుకొని స్నానాలు చేసారు. ఒకరి మీద ఒకరు నీటిని చిమ్ముకుంటూ ఆనందించారు. పాండవులు అందరూ తమ తమ బంధుమిత్రులతో స్నానాలు చేసారు.

ధర్మరాజు, ద్రౌపది స్నానం చేయడానికి నిలబడ్డారు. ఋత్విక్కులు వారి చేత పత్నీసంయాజము చేయించి, ఇద్దరినీ గంగలో స్నానం చేయించారు. ఆ సమయంలో దుందుభులు, శంఖములు మోగాయి. ధర్మరాజు ద్రౌపది స్నానం చేయగానే వారి బంధువులు అందరూ స్నానాలు చేసారు. తరువాత ధర్మరాజు పట్టు వస్త్రములను ధరించి, ఋత్విక్కులకు, బ్రాహ్మణులకు, సదస్యులకు విరివిగా దక్షిణలు ఇచ్చి వారిని పూజించాడు. తరువాత బంధుమిత్రులకు, ఆప్తులకు ఎన్నోకానుకలు ఇచ్చాడు. ధర్మరాజు ఇచ్చిన విలువైన వస్త్రములను, ఆభరణములను ధరించి వారు మరింత శోభించారు. తరువాత అందరూ వారి వారి స్వస్థలములకు వెళ్లిపోయారు.

రాజసూయ యాగమునకు వచ్చిన వారంతా ధర్మరాజు యాగము చేసిన తీరు, ధర్మరాజు వైభవమును వేనోళ్ల ప్రశంసించుకుంటూ వెళుతున్నారు. ధర్మరాజు కూడా తన తమ్ముళ్లతోనూ, కృష్ణునితోనూ, ఆప్తులతోనూ ఇంద్రప్రస్థము చేరుకున్నాడు. శ్రీకృష్ణుడు వెంట వచ్చిన సాంబుడు మొదలగు వారు ద్వారకకు వెళ్లిపోయారు. శ్రీకృష్ణుడు మాత్రము కొంత కాలము పాండవుల దగ్గర ఉన్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా ధర్మరాజు రాజసూయ యాగమును నిర్విఘ్నంగా నెరవేర్చి తన చిరకాల కోరికను తీర్చుకున్నాడు. కాని వారి వెంట ఉన్న సుయోధనుడు ధర్మరాజు సంపదలను, వైభవమును, ఐశ్వర్యమును చూచి అసూయతో రగిలిపోతున్నాడు. పైకి మాత్రము నవ్వుతున్నాడు.

ఒక నాడు ధర్మరాజు తన తమ్ములు వెంటరాగా, మయుడు నిర్మించిన మయసభ అనే చిత్రవిచిత్ర సభనకు వెళ్లాడు. ఆ మయసభలో ధర్మరాజు సింహాసనము మీద కూర్చుని అష్టదిక్పాలకుల మధ్య ఇంద్రుని మాదిరి శోభిల్లాడు. ఆ సభలో శ్రీకృష్ణుడు కూడా కూర్చుని ఉన్నాడు. ఆ సమయంలో సుయోధనుడు చేతిలో ఖడ్గం ధరించి, ఆ సభలోకి ప్రవేశించాడు.

ఆ మయసభలో నడుస్తూ ఉండగా ఒక చోట నీరు ఉన్నట్టు కనపడింది. సుయోధనుడు తన వస్త్రములు పైకెత్తి పట్టుకొని నడిచాడు కానీ అక్కడ నీటి జాడ లేదు. మరొక చోట సమతలంగా ఉంది. అక్కడధీమాగా నడుస్తూ అక్కడే కనపడకుండా ఉన్న జలాశయములో పడిపోయాడు. అది చూచి ముందు కృష్ణుడు గట్టిగా నవ్వాడు. ఆయనను చూచి భీముడు, పరిచారికలు, ఇతర రాజులు పక్కున నవ్వారు. ధర్మరాజు వారిని వారించాడు. సుయోధనుడు సిగ్గుతో చితికిపోయాడు. తల వంచుకొని నిలబడ్డాడు.కోపంతో బుసలు కొడుతున్నాడు. ఏమీ మాట్లాడకుండా అక్కడి నుండి వెళ్లిపోయాడు. తరువాత హస్తినాపురమునకు వెళ్లిపోయాడు.

ఈ పరిణామము చూచి ధర్మరాజు ఎంతో చింతించాడు. కాని శ్రీకృష్ణుడు ఆనందించాడు. కురుక్షేత్ర మహా సంగ్రామానికి ఒక్కనవ్వుతో బీజం వేసిన కృష్ణుడు, చిరునవ్వుతో మౌనంగా ఉన్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇంతకూ ఏం జరిగిందంటే, శ్రీకృష్ణుడు తన మాయతో సుయోధనుడికి నీళ్లు ఉన్నచోట లేనట్టు, నీళ్లు లేని చోట ఉన్నట్టు భ్రాంతి కల్పించాడు. సుయోధనుడు నీటిలో పడి పోయాడు. శ్రీకృష్ణుడు ముందు తాను హేళనగా నవ్వాడు. కృష్ణుని చూచి అందరూ నవ్వారు. సుయోధనుడు పరాభవాగ్నితో రగిలిపోయాడు. అతనిలో అంకురించిన పరాభవాగ్ని తీవ్రంగా ప్రజ్వరిల్లి మాయాద్యూతమునకు, కురుక్షేత్ర మహా సంగ్రామమునకు దారితీసింది. తద్వారా భూభారము తగ్గించడానికి కృష్ణుడు బీజం వేసినట్టయింది." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు సుయోధనుని పరాభవ వృత్తాంతమును వివరించాడు.
( దుర్యోధనుడు నీటిలో పడ్డప్పుడు ద్రౌపది నవ్వడం, దుర్యోధనుడు పాంచాలీ! పంచభర్తృకా అనిపెద్దగా సినిమాలలో మాదిరి అరవడం అన్నీ కట్టుకధలే కామాల్సు!)

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బది ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

డెబ్బది ఆరవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! రుక్మిణీ కల్యాణము సందర్భంలో సాళ్వుడు, శిశుపాలుడు, జరాసంధుడు మొదలగు రాజులు యాదవుల చేతిలో ఓడిపోయారు అని చెప్పాను కదా! అప్పుడు సాళ్వుడు అనే శిశు పాలుని మిత్రుడు, "నేను ఈ భూమి మీద యాదవులు అనే వాడు లేకుండా చేస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ" అని ఘోరమైన ప్రతిజ్ఞ చేసాడు. అప్పటి నుండి సాళ్వుడు ప్రతిరోజూ ఒక పిడికెడు దుమ్మును ఆహారంగా తీసుకుంటూ శివుని గురించి తపస్సుచేసాడు.

ఇప్పుడు శివుడు సందిగ్ధంలో పడ్డాడు. సాధారణంగా శివుడు ఎవరైనా తనను గురించితపస్సు చేస్తే వెంటనే అక్కడకు వచ్చి వారికి వరాలు ఇస్తుంటాడు. కాని ఇప్పుడు సాళ్వుడు, యాదవులు, శ్రీకృష్ణుడు వీరికి అపకారం తలపెట్టడానికి తపస్సు చేస్తున్నాడు. తన శక్తి విష్ణుశక్తి ముందు నిలువదు. అందుకని సాళ్వుడికి వరాలు ఇవ్వడానికి శివుడు సందేహించాడు. కాని సాళ్వుడు తన పట్టు విడవకుండా తపస్సు చేస్తున్నాడు. ఇంక శివుడికి వరాలు ఇవ్వక తప్పలేదు.

సాళ్వుడి ముందు శివుడు ప్రత్యంక్షం అయి ఏం వరం కావాలో కోరుకో అన్నాడు. "ఓ దేవా! దేవతలు, అసురులు, నాగులు, మనుష్యులు, గంధర్వులు, రాక్షసులు మొదలగు వారి చేత నాశనం కాని వాహనము ఒకటి నాకు ప్రసాదించండి." అని అడిగాడు. అమ్మయ్య అనుకొన్నాడు శివుడు. సాళ్వునికి వెంటనే ఆ వరం

ఇచ్చాడు. సౌభరము అనే ఒక పెద్ద విమానమును లోహముతో నిర్మించి ఇచ్చాడు. సాళ్వుడు సంతోషించాడు. ఆ విమానము ఎక్కి తన నగరము వెళ్లిపోయాడు.

తరువాత సాళ్వుడు యుద్ధ సన్నాహాలు చేసాడు. తన సేనలతో ద్వారకానగరమును ముట్టడించాడు. నగరము వెలుపల ఉన్న భవనములను, ఉద్యానవనములను, ద్వారములను, అన్నింటినీ నాశనం చేయసాగాడు. తన విమానము ఎక్కి ఆ విమానము నుండి ద్వారకా నగరము మీద రాళ్లు, బండలు, చెట్లు, పాములు  వర్షంగా కురిపించాడు.

ద్వారకా నగరము అంతా భయంతో వణికిపోయింది. ఆ సమయంలో శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడు నగర రక్షకుడుగా ఉన్నాడు. ప్రద్యుమ్నుడు తన సేనలతో సాళ్వుని ఎదుర్కొన్నాడు. ప్రద్యుమ్నుడికి సాయంగా సాత్యకి, చారుదేష్ణుడు, సాంబుడు, అక్రూరుడు, హార్దిక్యుడు, భానువిందుడు, గదుడు, శుకుడు, సారణుడు, మొదలగు యాదవ వీరులు సాళ్వునితో యుద్ధం చేస్తున్నారు.

యాదవులకు, సాళ్వుని సేనలకు ఘోర యుద్ధం జరిగింది. ప్రద్యుమ్నుడు రతీ దేవి వద్ద నేర్చుకున్న మాయా విద్య చేత, సాళ్వుని మాయలను అన్నిటినీ ఛేదించాడు. సాళ్వుని సేనలను యాదవ వీరులు తమ అస్త్ర, శస్త్రములతో చించి చెండాడుతున్నారు. ప్రద్యుమ్నుడు నూరు బాణములతో సాళ్వుని కొట్టాడు. ఒక్కో బాణంతో ఒక్కో సైనికుడు చస్తున్నాడు. సేనానాయకుడిని చంపడానికి పది బాణాలు

కేటాయించాడు. ఒక్కో రథాన్ని మూడేసి బాణములతో విరగ గొడుతున్నాడు. ఈ ప్రకారంగా ప్రద్యుమ్నుడు సాళ్వుని సేనలను మట్టికరిపిస్తున్నాడు. ఒక లెక్క ప్రకారం, పద్ధతిగా యుద్ధం చేస్తున్నా ప్రద్యుమ్నుని చూచి అంతా ఆశ్చర్యపోతున్నారు. సాళ్వుని సేనానాయకులు కూడా ప్రద్యుమ్నుని యుద్ధరీతులను మెచ్చుకుంటున్నారు.

ఇది చూచి సాళ్వుడు సహించలేకపోయాడు. సౌభర విమానమును ఎక్కి మాయం అయ్యాడు. తన మాయలను ప్రదర్శించసాగాడు. ఆ విమానము ఒక్కోసారి వెయ్యివిమానములుగా కనపడుతూ ఉంది. అంతలోనే మాయం అవుతూ ఉంది. మరలా కనపడుతూ ఉంది. ఆ విమానం ఎప్పుడు ఎక్కడ ఉంటుందో తెలియక తికమకపడుతున్నారు యాదవ వీరులు. ఆ సౌరభము ఒకసారి భూమి మీద ఉంటుంది. అంతలోనే ఆకాశంలోకి ఎగిరిపోతుంది. మరుక్షణంలో ఒక కొండమీద ఉంటుంది. అంతలోనే జలంలో విహరిస్తూ ఉంటుంది. ఉన్నచోట ఉండకుండా ఆ సౌరభము మాయాయుద్ధం చేస్తూ ఉంది.

సౌరభము కనిపించినప్పుడు వెంటనే దాని మీద శరవర్షము కురిపిస్తున్నారు యాదవులు. సౌరభము కంటే వేగంగా బాణములు వేస్తున్నారు. యాదవులు సాళ్వునితో తాడో పేడో తేల్చుకోవాలని అనుకున్నారు. గెలిస్తే విజయం లేకపోతే వీర స్వర్గం అనే నిశ్చయంతో తెగించి యుద్ధం చేస్తున్నారు.

యాదవ వీరుల దెబ్బకు సాళ్వుని సేనలు తట్టుకోలేక పోతున్నాయి. సాళ్వునికి దిక్కుతోచడం లేదు. ద్యుమానుడు అనే వాడు సాళ్వుని మంత్రి, మహా బలశాలి. వాడిని ప్రద్యుమ్నుడు తుక్కు కింద

కొట్టాడు. వాడు పారి పోయాడు. కాని పౌరుషంతో తిరిగి వచ్చాడు. ఈ సారి ఇనుముతో చేసిన పెద్ద గదను తీసుకొని ప్రద్యుమ్నుని గుండెల మీద మోదాడు. పెద్దగా అరిచాడు. ఆ దెబ్బకు ప్రద్యుమ్నుడు తూలి పడ్డాడు. ఇది గ్రహించిన సారథి ప్రద్యుమ్నుని రథమును పక్కకు తీసుకొని వెళ్లాడు.

అంతలోనే ప్రద్యుమ్నుడు తేరుకున్నాడు. తన సారథితో ఇలా అన్నాడు. "సారథీ! నా రథమును యుద్ధరంగము నుండి ఎందుకు మళ్లించావు. పిరికివాడివలె పారి పోవడం వీరుల లక్షణం కాదు. సారథి కారణంగా పారి పోయిన వీరుడను నేనే అనుకుంటాను. యుద్ధము నుండి పారి పోయిన పాపము నన్ను చుట్టుకుంటుంది. ఎందు కంటే యాదవ వంశంలో పుట్టిన వీరుడు ఎవరూ ఇప్పటి దాకా యుద్ధ రంగము నుండి పిరికి వాని వలె పారిపోలేదు. నేను వినలేదు. ఇప్పుడు నీ వలన నాకు యుద్ధ రంగము నుండి పారిపోయిన అపనింద వచ్చింది. ఇప్పుడు నేను ద్వారకకు పోయి నా తండ్రి శ్రీకృష్ణునికి, పెద తండ్రి బలరామునికి ఏమని సమాధానం చెప్పకోవాలి. మా తల్లి, మా పెద తల్లులు, పినతల్లులు నన్ను చూసి నవ్వుతూ "నీ శత్రువులు ఏం చేస్తే ఇలా పారి పోయి వచ్చావు" అని హేళనగా అడిగితే వారి మొహం ఎలా చూడాలి." అని సారథిని మందలించాడు ప్రద్యుమ్నుడు.

ఆ మాటలకు సారథి క్లుప్తంగా సమాధానం చెప్పాడు. "సారథి చేయవలసిన విధులు తమరికి తెలియనివి కావు. రథికుడు ఆపదలో ఉన్నప్పుడు, అతనిని రక్షించడానికి, సారథి రథమును పక్కకు తీసుకొని పోవడం సారథి ప్రాధమిక ధర్మము. ఆ ధర్మము తెలిసిన

వాడిని అవడం చేత నేను తమరు శత్రువు గదతో కొట్టిన దెబ్బకు మూర్ఛపోయినపుడు, తమరి రథమును యుద్ధరంగము నుండి సురక్షిత ప్రదేశమునకు తీసుకొని వచ్చాను. నేను ఏ తప్పు చేయలేదు. నా ధర్మం నేను చేసాను." అని సమాధానం చెప్పాడు సారథి." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు ప్రద్యుమ్న సాళ్వుల యుద్ధము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బది ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

డెబ్బది ఏడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! సారథి తనను యుద్ధ రంగము నుండి అవతలకు తీసుకు వచ్చిన తరువాత, సారథి మాటలను ఆమోదించిన ప్రద్యుమ్నుడు స్నానము చేసి, విశ్రాంతి తీసుకొని, మరల కవచమును, ధనుస్సు ధరించి యుద్ధరంగమునకు వచ్చాడు. తనను ద్యుముడి వద్దకు తీసుకు పొమ్మని చెప్పాడు. సారథి ప్రద్యుమ్నుని రథమును ద్యుముడి వద్దకు పోనిచ్చాడు.

ప్రద్యుమ్నుడు ద్యుముని ఎనిమిది బాణములతో కొట్టాడు. నాలుగు బాణములతో ద్యుముని రథమునకు కట్టిన గుర్రములను, ఒక బాణముతో సారథిని, రెండు బాణములతో విల్లు విరుగగొట్టాడు. ఒక

బాణముతో పతాకమును కూల్చాడు. మరొక బాణమును ద్యుముని మెడకు గురి పెట్టి కొట్టాడు. అదే సమయంలో యాదవ వీరులైన సాంబుడు, సాత్యకి, గదుడు, మొదలగు వారు సాళ్వుని సేనలను ఊచకోత కోస్తున్నారు. ఆ ప్రకారంగా సాళ్వునికి, ప్రద్యుమ్నునికి ఇరవై ఏడు రోజులు ఘోర యుద్ధం జరిగింది.

ఇక్కడ ఇలా జరుగుతుంటే, అక్కడ హస్తినా పురములో, రాజసూయ యాగము ముగిసిన తరువాత, అందరి అనుమతి తీసుకొని కృష్ణుడు ద్వారకకు బయలుదేరాడు. దారిలో ఇలా అనుకుంటున్నాడు. “నేను, బలరాముడు ద్వారకలో లేకుండా ఉండటం చూచి శిశుపాలుడు అతని మిత్రరాజులు ద్వారక మీదికి దండెత్తే అవకాశం ఉంది. అసలు ఈ పాటికి దండెత్తి ఉంటారేమో!’ అని తనలో తాను అనుకుంటున్నాడు. కృష్ణుడు ద్వారకకు చేరుకున్నాడు.

ద్వారకకు రాగానే సాళ్వుని దండయాత్ర గురించి, యాదవ వీరులు సాళ్వునితో యుద్ధం చేయడం గురించి తెలుసుకున్నాడు. ద్వారకకు రక్షణగా బలరాముని నియమించాడు. తాను రథంమీద వెంటనే యుద్ధభూమికి బయలుదేరాడు. శ్రీకృష్ణుడు యుద్ధభూమిలో ప్రవేశించగానే సాళ్వుని సేనలకు గరుడ ధ్వజము కనపడింది. అది చూచిన సాళ్వుడు కసిగా ప్రద్యుమ్నుని మీదికి శక్తి అనే ఆయుధమును విసిరాడు. శ్రీకృష్ణుడు అది చూచి తన బాణములతో ఆ శక్తిని ముక్కలు ముక్కలు చేసాడు.

తరువాత కృష్ణుడు పదహారు బాణములతో సాళ్వుని చితక్కొట్టాడు. కృష్ణుడు తన బాణ వర్షముతో సౌభరమును ముంచెత్తాడు. సాళ్వుడికి మండి పోయింది. ఒకే ఒక బాణంతో కృష్ణుని భుజాన్ని కొట్టాడు. ఆ దెబ్బకు కృష్ణుని చేతి లో నుండి ధనుస్సు కిందపడింది. అది చూచి సాళ్వుడు కృష్ణుని జయించానని సింహనాదము చేసాడు. కృష్ణుని చూచి ఇలా అన్నాడు.

"కృష్ణా! నీవు, నా ఎదుట, నా మిత్రుడు, శిశుపాలునికి కాబోయే భార్యను అపహరించావు. రాజసూయ యాగంలో ఏకంగా శిశుపాలుని చంపావు. ఇప్పుడు నిన్ను నేను చంపుతాను. కాచుకో." అని అన్నాడు సాళ్వుడు. అప్పుడు కృష్ణుడు నవ్వుతూ ఇలా అన్నాడు.

"రాకుమారా! అనవసరంగా నిన్ను నీవు పొగుడుకోవద్దు. చేతనైన పని చెయ్యి. మృత్యువు నీ ఎదురుగా నిలబడి ఉంది. అది తెలుసుకో. వీరుడైన వాడు తన పరాక్రమాన్ని ప్రదర్శిస్తాడు కానీ గొప్పలు చెప్పుకోడు." అని అన్నాడు.

తరువాత కృష్ణుడు మరొక విల్లు తీసుకొని సాళ్వుని భుజముల మీద, గుండెలమీద కొట్టాడు. సాళ్వుడు రక్తం కక్కుకుంటూ కిందపడ్డాడు. అంతలో సాళ్వుడు తన మాయాజాలంతో మాయం అయ్యాడు.  ఇంతలో ఒక పురుషుడు కృష్ణుని వద్దకు వచ్చాడు. కృష్ణుని చూచి ఇలా అన్నాడు. "దేవా! నేను దేవకీదేవి వద్దనుండి వస్తున్నాను. ఘోరం జరిగి పోయింది. సాళ్వుడు మీ తండ్రి వసుదేవుని పశువును కట్టినట్టు కట్టి తీసుకొని పోయాడు." అని అన్నాడు.

ఆ మాటలు విన్న కృష్ణుని మనస్సు చలించి పోయింది. కాని అంతలోనే అనుమానం వచ్చింది. "ద్వారకకు రక్షణగా బలరాముడు ఉన్నాడు కదా. సాళ్వుడు అజేయుడైన బలరాముని కూడా జయించి మా తండ్రి వసుదేవుని తీసుకొని పోయాడా! బలరాముని బలం ముందు సాళ్వుని బలం ఎందుకూ కొరకాదు! కాని విధి అనుకూలించనపుడు ఏదైనా జరగడానికి అవకాశం ఉంది కదా!" అని తనలో తాను అనుకుంటూ ఉండగా యుద్ధరంగములో సాళ్వుడు వసుదేవుని పట్టుకొని వచ్చి ఇలా అన్నాడు.

"కృష్ణా! ఈయన ఎవరో తెలుసా! నీకు జన్మనిచ్చిన నీ తండ్రి. వసుదేవుడు. నేను వెళ్లి బందీగా తీసుకొని వచ్చాను. నీ కళ్లఎదుటనే వీడిని నరుకుతాను. ఏంచేస్తావో చేసుకో!" అని గట్టిగా అరిచాడు. వెంటనే తన ఖడ్గముతో వసుదేవుని తల నరికాడు. వసుదేవుని తల కిందపడింది. సాళ్వుడు సౌభరము ఎక్కి ఎగిరిపోయాడు.

కృష్ణుడికి ఒక్కసారిగా పితృప్రేమ ఆవరించింది. మోహంలో పడి పోయాడు. నిజంగానే తన తండ్రిని సాళ్వుడు చంపాడు అనే భ్రమలో మునిగిపోయాడు. అదంతా క్షణకాలం. వెంటనే తేరుకున్నాడు. తన ఆలోచనకు పదునుపెట్టాడు. తన చేతిలో చావుదెబ్బ తిన్న ఈ సాళ్వునికి ఇంత బలం ధైర్యం ఎలా వచ్చాయి. ఇది నిజం కాదు. ఇదంతా మాయా కల్పితం. ఇంతకూ తన వద్దకు వచ్చిన దూత ఎక్కడా అని వెదికాడు. వాడు కనపడలేదు. సాళ్వుడు నరికిన తన తండ్రి తల కానీ మొండెము కానీ కనపడలేదు.

ఇదంతా సాళ్వుని మాయ అని రూఢి చేసుకున్నాడు కృష్ణుడు. తల పైకెత్తి చూచాడు. సౌభరంలో ఆకాశంలో తిరుగుతున్న సాళ్వుని చూచాడు. ఇంక ఊరుకుంటే లాభం లేదు. వీడిని చంపాల్సిందే అని అనుకున్నాడు కృష్ణుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇక్కడ ఒక చిన్న వివరణ ఇస్తున్నాను. అ వసుదేవుని వృత్తాంతము అంతా మా తండ్రిగారు రాసిన భాగవతములో లేదు. తరువాత కాలంలో ఉన్న ఋషులు చేసిన కల్పన. మాయకు అధిపతి అయిన కృష్ణుడికి మాయ కమ్మడం అసాధారణం కదా! కాబట్టి ఇది ఋషుల కల్పన అని తెలుస్తూ ఉంది. కాబట్టి దూత రాక ముందు నుండి వివరిస్తాను.

సాళ్వుడు తన అస్త్ర శస్త్రములతో, మాయా యుద్ధముతో యాదవ వీరులతో యుద్ధం చేస్తున్నాడు. అప్పుడు కృష్ణుడు వాడి అయిన బాణములతో సాళ్వుని కవచమును ఛేదించాడు. విల్లు విరగ్గొట్టాడు. తన గదతో సౌరభవిమానమును ధ్వంసం చేసాడు. కృష్ణుడి గద దెబ్బకు సౌరభము వేయి ముక్కలై సముద్రంలో పడిపోయింది. అప్పుడు సాళ్వుడు నేల మీదికి దుమికి గదాయుధంతో కృష్ణుని ఎదుర్కొన్నాడు.

శ్రీకృష్ణుడు ఒక బల్లెం తీసుకున్నాడు. సాళ్వుని భుజానికి గురిపెట్టి విసిరాడు. ఆ బల్లెం అమిత వేగంతో వెళ్లి సాళ్వుని భుజం నరికింది. గదతో సహా సాళ్వుడి భుజం తెగి భూమి మీద పడింది. ఇప్పుడు కృష్ణుడు తన చక్రాయుధం ధరించి సాళ్వుని తల నరకడానికి సిద్ధంగా ఉన్నాడు. కృష్ణుడు తన చక్రాయుధమును గిరా గిరా తిప్పి

సాళ్వుని కంఠానికి గురి పెట్టి విసిరాడు. ఆ చక్రాయుధము అమిత వేగంతో వెళ్లి సాళ్వుని కంఠం ఛేదించింది. సాళ్వుని తల తెగి నేల మీద పడింది. ఇదంతా క్షణాల్లో జరిగిపోయింది. సాళ్వుని మరణం చూచిన సాళ్వుని సేనలు హాహాకారాలు చేసాయి.

సాళ్వుని మరణం కళ్లారా చూచిన దంతవక్త్రుడు కోపంతో ఊగిపోయాడు. కృష్ణుని చంపి తనమిత్రుడు సాళ్వునికి రక్త తర్పణం విడవాలని అనుకున్నాడు. కృష్ణుని మరణమే తన మిత్రునికి అంత్యక్రియలు చేయడం లాంటిది అని నిశ్చయించుకున్నాడు. తన గద తీసుకొని కృష్ణునికి ఎదురుగా వెళ్లాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు సాళ్వుని వధ గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బది ఏడవ భాగము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## డెబ్బది ఎనిమిదవ భాగము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఆ విధంగా దంతవక్త్రుడు గద తీసుకొని కృష్ణుని మీదికి వచ్చాడు. కృష్ణుడు కూడా తన గదను తీసుకొని రథం దిగి దంతవక్త్రునికి ఎదురు వెళ్లాడు. అప్పుడు కరూష దేశాధి పతి అయిన దంతవక్త్రుడు కృష్ణునితో ఇలా అన్నాడు.

"కృష్ణా! ఈ నాడు నీవు నా కంట పడ్డావు. నాకు ఎదురు నిలిచావు. నీవు నా మేనమామ కుమారుడవు. అయినా నా మిత్రుడు సాళ్వుని చంపావు. అంతే కాకుండా నన్ను చంపడానికి గద తీసుకొని నాకు ఎదురు నిలిచావు. నిన్ను చంపక తప్పదు. ఈ గదతో నిన్ను సంహరిస్తాను. కాచుకో!" అని అన్నాడు.

ఆ మాటలకు కృష్ణుడు నవ్వి "తెలివితక్కు వాడా! నీవు నన్ను చంపి నీ మిత్రుని ఋణం తీర్చుకోవాలనుకుంటున్నావు. నేను దుర్మార్గుడవైన నిన్ను చంపి పరలోకంలో ఉన్న నా బంధువుల ఆత్మలకు శాంతి కలిగించాలని అనుకుంటున్నాను." అని అన్నాడు.

ఆ మాటలు విన్న దంతవక్త్రుడు తన గదతో కృష్ణుని తల మీద బలంగా మోదాడు. కృష్ణుడు ఆ దెబ్బను తప్పించుకొని తన గదతో దంతవక్త్రుని గుండెల మీద బలంగా మోదాడు. దంతవక్త్రుడు ఆ దెబ్బను తట్టుకోలేక పోయాడు. రక్తం కక్కుకుంటూ నేల కూలాడు. దంతవక్త్రుని ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. విచిత్రంగా దంతవక్త్రుని శరీరం నుండి ఒక వింత కాంతి బయటకు వచ్చి కృష్ణునిలో కలిసిపోయింది.

తన సోదరుని మరణాన్ని కళ్లారా చూచిన దంతవక్త్రుని సోదరుడు విదూరథుడు కోపంతో రగిలిపోయాడు. పెద్ద ఖడ్గము డాలు ధరించి కృష్ణుని ఎదుర్కొన్నాడు. కృష్ణుడు కూడా ఒక ఖడ్గము చేతిలోకి తీసుకొని తన ఎదురుగా వస్తున్న విదూరథుని కంఠమును అవలీలగా తెగ నరికాడు. ఈ ప్రకారంగా సాళ్వుడు, దంతవక్త్రుడు, విదూరథుడు మరణించారు. యాదవులు హర్షధ్వానాలు చేసారు. శత్రుసేనలు పారిపోయాయి. విజయోత్సాహంతో కృష్ణుడు యాదవ వీరులతో కలిసి

ద్వారకా నగరంలో ప్రవేశించారు.

ఇది ఇలా ఉండగా హస్తినలో మాయాద్యూతము, పాండవుల అరణ్య, అజ్ఞాత వాసములు జరిగిపోయాయి. కౌరవ పాండవుల యుద్ధంలో పాల్గొలనడం ఇష్టంలేని బలరాముడు తీర్థయాత్రలకు వెళ్లిపోయాడు. బలరాముడు తన వెంట బ్రాహ్మణులు రాగా తీర్థయాత్రలు చేస్తున్నాడు.

ముందు ప్రభాస తీర్థమునకు వెళ్లాడు. అక్కడ దేవతలకు, పితరులకు, ఋషులకు, గురువులకు తర్పణాలు విడిచాడు. తరువాత సరస్వతీ నదిలో స్నానం చేసాడు. తరువాత పృథూదకము, బిందుసరోవరము, త్రితకూపము, సుదర్శనము, విశాల, బ్రహ్మతీర్థం, చక్రతీర్థము, గంగ, యమున, మొదలగు తీర్థములలో స్నానాలు చేసి తర్పణాలు విడిచాడు.

తరువాత బలరాముడు నైమిశారణ్యము వెళ్లాడు. అక్కడ సత్రయాగం చేస్తున్న ఋషులు బలరాముని సాదరంగా ఆహ్వానించి అర్చించారు. అక్కడ బలరాముడు వ్యాసుని శిష్యుడైన రోమహర్షణుని చూచాడు. బలరాముని చూచి కూడా రోమహర్షణుడు తన ఆసనము నుండి లేవలేదు. బలరామునికి అభివాదము చేయలేదు. ఇది చూచి బలరాముడు కోపంతో మండిపడ్డాడు. తన కంటే హీనమైన కులములో పుట్టినవాడు తనకు నమస్కారం పెట్టకపోవడం బలరాముని కోపానికి కారణం అయింది.

"ఈ రోమహర్షణునికి తాను వ్యాసుని శిష్యుడననీ, తనకు సకల శాస్త్రములు తెలుసుననీ గర్వము. ఇన్ని చదివినా ఇతనికి వినయము, జితేంద్రియత్వము అలవడలేదు. ఇతని పాండిత్యము అంతా వ్యర్థము. ఇతడు అధ్యయనము చేసిన శాస్త్రములు ఇతనికి ఏ మాత్రము ఉపయోగపడలేదు. ఇతని శాస్త్రాధ్యయనము ఇతని పొట్ట పోసుకోవడానికే తప్ప ఎందుకూ పనికిరాదు. ధర్మాన్ని ధ్వంసం చేసే ఇటువంటి కపట పండితులను చంపడానికే నేను పుట్టాను. సాధారణంగా పాపాలు చేసేవారి కంటే వీరే సమాజానికి ప్రమాదకారులు. ఆ కారణం చేత పెద్దల పట్ల ఏ మాత్రం గౌరవములేని రోమహర్షణుడు వధించతగ్గవాడు." అని అనుకున్నాడు బలరాముడు. వెంటనే బలరాముడు తన చేతిలో ఉన్న దర్భల మొనలతో రోమహర్షణుని చంపాడు.

రోమహర్షణుని మరణం చూచిన ఋషులు, మునులు హాహాకారాలు చేసారు. బలరామునితో ఇలా అన్నారు. "బలరామ దేవా! మీరు చాలా తప్పు చేసారు. ఈ సత్రయాగ సందర్భంలో ఈయనను మేము మా బ్రహ్మగా స్వీకరించాము. ఈయనకు బ్రహ్మాసనము ఇచ్చి గౌరవించాము. పురాణములను వ్యాఖ్యానించడం వలన ఈయనకు శ్రమ కలగకుండా ఈయనకు తగిన బలాన్ని సమకూర్చాము. ఇవన్నీ తెలియకుండా, నిన్ను చూచి లేచి నీకు నమస్కారం చేయలేదనే నెపంతో ఈయనను చంపి బ్రహ్మహత్యాపాతకమునకు ఒడిగట్టావు.

ఓ బలరామ దేవా! నీవు కారణ జన్ముడవు. అన్నిటికీ అతీతుడవు, యోగీశ్వరేశ్వరుడవు. నీకు బ్రహ్మ హత్య పాతకము అంటదు అని మాకు తెలుసు. కాని మీ వంటి వారు ఆచరించి

చూపిస్తేనే కదా లోకులుకూడా ఆచరించేది. మీరే ఆచరించకపోతే లోకులు కూడా ధర్మాచరణ చెయ్యరు. ఆ కారణంగా నీవు ఈ బ్రహ్మహత్యాపాతకము నకు తగిన ప్రాయశ్చిత్తము చేసుకోవాలి." అని అన్నారు.

బలరాముడు కూడా మునుల మాటలను విన్నాడు. "లోకం కోసరమైనా నేను బ్రహ్మహత్యాపాతకమునకు ప్రాయశ్చిత్తము చేసుకుంటాను. కాని దానిని ఎలా చేయాలో, ఎటువంటి నియమములతో చేయాలో నాకు చెప్పండి. నా యోగ మాయా బలంతో ఈ రోమహర్షణునికి కావలసినవి అన్నీ ఇస్తాను." అని అడిగాడు బలరాముడు.

"బలరామ దేవా! మేము నీకు చెప్పతగ్గ వారము కాదు. నీ అస్త్ర,శస్త్రములు, నీ వీరత్వము, వీని మరణము, మేము పలికిన వాక్కులు ఏం చేస్తే సత్యములు అవుతాయో, ఆ పని చెయ్యి." అని అన్నారు.

అప్పుడు బలరాముడు ఇలా అన్నాడు. "ఋషులారా! తండ్రి తన కుమారుని రూపంలో మరలా జన్మిస్తాడు అని అంటారు. ఆ కారణం చేత ఈ రోమహర్షణుని కుమారుడగు ఉగ్రశ్రవసుడికి తన తండ్రికి ఉన్న శక్తులు, శాస్త్రపరిజ్ఞానము అన్నీ సంక్రమిస్తాయి. ఈ రోజునుండి ఉగ్రశ్రవసుడు తన తండ్రి స్థానాన్ని పొందుతాడు. మీరు రోమహర్షణునికి ప్రసాదించిన ఆయుష్షు,బలము అన్నీ ఈ ఉగ్రశ్రవసునికి కూడా సిద్ధిస్తాయి.

ఓ మహామునులారా! ఇంకా మీకు ఏం కావాలో అడగండి. తరువాత నాకు ఈ బ్రహ్మహత్యాపాతకము నుండి విముక్తి కలిగించండి. ఈ విషయంలో నాకు ఏమీ తెలియదు. దీనికి తగిన ఉపాయము ఆలోచించండి." అని అన్నాడు. అప్పుడు ఋషులు ఇలా అన్నారు.

"బలరామ దేవా! ఇల్వలుడు అనే రాక్షసుడు ఉండే వాడు. వాని కుమారుడు బల్వలుడు. వాడు మేము చేసే యజ్ఞయాగములను పాడుచేస్తున్నాడు. వాడిని చంపి మాకు మేలు చెయ్యి. అదే నీవు మాకు చేసే ఉపకారము. తరువాత నీవు కామము, క్రోధమును విడిచిపెట్టి, భారత దేశం అంతా తిరిగి అన్ని తీర్థములను సేవించు. పన్నెండు నెలలు కృచ్ఛవ్రతము చేస్తూ తీర్థస్నానములు చేస్తే నీవు బ్రహ్మహత్యాపాతకము నుండి విముక్తి పొందుతావు." అని అన్నారు." అని శుకయోగీంద్రుడు బలరాముని తీర్థయాత్రావిశేషములను వివరించాడు.

శ్రీమద్భాగవతము.

దశమస్కంధము డెబ్బది ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము.

దశమస్కంధము

డెబ్బది తొమ్మిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఋషుల కోరిక మేరకు బల్వలుని చంపడానికి బలరాముడు సిద్ధంగా ఉన్నాడు. నైమిశారణ్యంలో సత్రయాగం జరుగుతూ ఉంది. మునులు యాగం చేస్తున్నారు.

బల్వలుడు ఎటు వైపు నుండి వస్తాడా అని ఎదురు చూస్తున్నాడు బలరాముడు. ఇంతలో బల్వలుడు యజ్ఞ కుండములను నాశనం చేస్తూ కనిపించాడు. బలరాముడు అటుగా వెళ్లాడు. బల్వలుడు ఒక శూలం ధరించి బలరాముని ఎదురుగా నిలబడ్డాడు.

బల్వలుడు నల్లగా పెద్ద కొండ మాదిరి ఉన్నాడు. కోరలతో భయంకరంగా ఉన్నాడు. బలరాముడు తన ముసలాయుధమును తీసుకున్నాడు. అది చూచి బల్వలుడు పైకి ఎగిరాడు. ఎగిరి కిందికి దూకుతుంటే సరిగా బల్వలుడి తల బలరాముడికి అందుబాటులోకి వచ్చింది. ఆలస్యం చేయకుండా తన ముసలముతో బల్వలుడి తల మీద బలంగా మోదాడు. ఆ దెబ్బకు బల్వలుడి తల రెండుగా చీలింది. వాడు రక్తం కక్కుకుంటూ కిందపడి మరణించాడు. అది చూచిన ఋషులు, మునులు బలరాముని స్తుతించారు. ఆ ఋషులు దివ్వమైన వైజయంతీ మాలను, దివ్య వస్త్రములను, ఆభరణములను బలరామునికి కానుకగా ఇచ్చారు.

తరువాత బలరాముడు మునుల అనుమతి తీసుకొని గంగా నదికి వెళ్లాడు. గంగలో స్నానం చేసి, తరువాత సరయూనది పుట్టిన స్థలమునకు చేరుకున్నాడు. సరయూ నదిలో స్నానం చేసి, అక్కడి నుండి త్రివేణీ సంగమము అయిన ప్రయాగ క్షేత్రమునకు వెళ్లాడు. అక్కడ పితరులకు తర్పణములు విడిచాడు. తరువాత పులహాశ్రమమునకు వెళ్లాడు. పులహ ఆశ్రమము దర్శించిన తరువాత బలరాముడు వరుసగా గోమతి, గండకి, విపాశ, శోణ నదులలో పుణ్యస్నానాలు చేసాడు. గయకు పోయి అక్కడ పితృదేవతలకు

పిండప్రదానము చేసాడు. తరువాత గంగా నది సాగరం కలిసే చోటకు వెళ్లి అక్కడ పుణ్యస్నానం చేసాడు. అక్కడి నుండి మహేంద్ర పర్వతము మీదికి వెళ్లాడు. అక్కడ పరశురాముని దర్శనం చేసుకున్నాడు.

తరువాత సప్త గోదావరులు, వేణి, పంప, భీమరథ మొదలగు తీర్థములలో స్నానం చేసాడు. తరువాత శ్రీపర్వతము (శ్రీశైలం అనుకోవచ్చు) నకు పోయి అక్కడ మహాశివుని దర్శించాడు. తరువాత బలరాముడు ద్రవిడ దేశములో అడుగుపెట్టాడు. వేంకటాచల క్షేత్రమునుసందర్శించాడు. కామకోష్ఠి, కాంచీపురము ను దర్శించాడు. కావేరీ నదిలో స్నానం చేసాడు. శ్రీరంగము అనే పవిత్రక్షేత్రమును దర్శించాడు. తరువాత ఋషభపర్వతమును సందర్శించాడు. తరువాత రాముడు నిర్మించిన సేతుబంధనమును దర్శించాడు. సేతు బంధనము దగ్గర బలరాముడు బ్రాహ్మణులకు పదివేల గోవులనుదానం చేసాడు.

అక్కడి నుండి బలరాముడు కృతమాల, తామ్రపర్ణి, కులాచలము, మలయ పర్వతము అనే ప్రదేశములను దర్శించాడు. మలయ పర్వతము వద్ద తపస్సు చేసుకుంటున్న అగస్త్య మహామునిని దర్శించాడు. ఆయన ఆశీర్వాదము తీసుకున్నాడు. తరువాత దక్షిణ సముద్ర కొసన ఉన్న  కన్య అనే పేరుతో ప్రసిద్ధిచెందిన దుర్గాదేవిని దర్శించాడు (కన్యాకుమారి క్షేత్రము కావచ్చు).

ఇంతలో ఫాల్గుణ మాసము వచ్చింది. ఫాల్గుణము విష్ణువుకు ప్రీతి పాత్రము. ఆ ఫాల్గుణ మాసంలో బలరాముడు విష్ణువుకు నివాసమైన అనంతపురమునకు పోయి అక్కడ ఉన్న తీర్థములలో

స్నానం చేసి, అక్కడ పదివేల ఆవులను దానం చేసాడు. బలరాముడు అక్కడి నుండి కేరళకు వెళ్లాడు. శివుని క్షేత్రమైన గోకర్ణము దర్శించాడు. దుర్గాదేవిని దర్శించాడు. అక్కడి నుండి శూర్పారకము అనే క్షేత్రమునకు వెళ్లాడు. అక్కడి నుండి తాపి, పయోష్ణి, నిర్వింధ్య, నదులలో స్నానం చేసాడు. అక్కడి నుండి దండకారణ్యములో ప్రవేశించాడు. అక్కడ ఉన్న రేవానదిలోనూ, మనుతీర్థములోనూ స్నానం చేసాడు. అక్కడి నుండి తాను ఎక్కడ తీర్థయాత్రలు మొదలుపెట్టాడో ఆ ప్రభాస తీర్థము చేరుకున్నాడు.

ఆ సమయానికి కురుక్షేత్ర యుద్ధం పూర్తి అయింది. భీముడు, సుయోధనుడు గదాయుద్ధం చేసుకోబోతున్నారు అని తెలిసింది. వెంటనే బలరాముడు వారి మధ్య యుద్ధం ఆపడానికి కురుక్షేత్రం వెళ్లాడు. బలరాముని చూచిన ధర్మరాజు, నకుల సహదేవులు, కృష్ణార్జునులు ఆయనను సాదరంగా ఆహ్వానించారు. లోలోపల మాత్రం "ఈయన ఇప్పుడెంకొచ్చాడు. ఏం చెబుతాడో ఏమో" అని గుసగుసలాడుకున్నారు. కాని పైకి మాత్రం మాట్లాడకుండా మౌనంగా ఉన్నారు.

అప్పుడు బలరాముడు గదాయుద్ధము చేయడానికి సిద్ధంగా ఉన్న భీమ, సుయోధనులను చూచి ఇలా అన్నాడు. "సుయోధనా! భీమసేనా! మీరు ఇద్దరు సామాన్యులు కారు. సమానమైన బలం కలవారు. భీముడు దేహబలములో గొప్పవాడు అయితే, సుయోధనుడు గదాయుద్ధములో నైపుణ్యం కలవాడు. మీరు ఇద్దరూ యుద్ధం చేసుకుంటే ఫలితం సమానంగా ఉంటుంది. ఎవరూ గెలవరు, ఎవరూ

ఓడరు. కాబట్టి మీరు యుద్ధం చేసుకోవడం వృథా. వృథా అయిన పనులు చేయడం వ్యర్థం. అందుచేత ఈ యుద్ధం మానండి. సంధి చేసుకోండి. ఇప్పటి వరకు జరగవలసిన అనర్థం జరిగిపోయింది. ఇప్పడి కైనా అందరూ క్షేమంగా ఉండండి." అని అన్నాడు.

కాని అప్పటికే జరగ వలసినది జరిగి పోయింది. భీమ, సుయోధనులు అనవలసిన మాటలు అన్నీ అనుకున్నారు. ఒకరు చేసిన దురాగతాలను మరొకరు గుర్తుకు తెచ్చుకుంటున్నారు. ఒకరి మీద ఒకరు కోపంతో పగతో రగిలిపోతున్నారు. అందుకని బలరాముని శాంతి వచనాలు వారి తలకెక్కలేదు. "మీఖర్మ మీరు అనుభవించండి. విధి నిర్ణయం ఎలా ఉంటే అలా జరుగుతుంది." అని అనుకొన్న బలరాముడు అక్కడి నుండి వెళ్లిపోయాడు.

బలరాముడు ద్వారక చేరుకున్నాడు. ఉగ్రసేన మహారాజును కలిసి, ఆయనకు, తన బంధువులకు, తన యాత్రావిశేషములను వివరించాడు. బలరాముడు తరువాత మరలా నైమిశారణ్యమునకు వెళ్లాడు. అక్కడ ఋషులు బలరాముని చేత యజ్ఞము చేయించారు. బలరాముడు తనకు తెలిసిన ఆత్మజ్ఞానతత్వమును అక్కడి ఋషులకు ఉపదేశించాడు.

ఈ అనంత విశ్వంనిండా పరమాత్మ ఉన్నాడు. ఆ పరమాత్మలో అనంత విశ్వం దాగి ఉంది అన్న పరమసత్యాన్ని అందరికీ వివరించి చెప్పాడు. యజ్ఞము అనంతరము బలరాముడు అవబృథ స్నానం చేసాడు. నూతన వస్త్రములను ధరించాడు.

ఓ పరీక్షత్ మహారాజా! బలరాముని చరిత్రలు ఇంకా అనేకం ఉన్నాయి. బలరాముని చరిత్రలను ఉదయం పూట స్మరిస్తే, వారు శ్రీహరి కరుణకు పాత్రులవుతారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు బలరాముని యాత్రావిశేషములను వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము డెబ్బది తొమ్మిదవ భాగము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఎనభయ్యవ భాగము.

"ఓ శుక యోగీంద్రా! శ్రీకృష్ణుని గాధలను ఎన్ని విన్నా తనివి తీరడం లేదు. ఇంకా ఏమన్నా ఉంటే చెప్పండి. వీనుల విందుగా వింటాను. నిరంతరం ప్రాపంచిక విషయములతో, విషయ వాంఛలతో కొట్టుమిట్టాడుతున్న ఈ మానవులకు ఒక్కసారి శ్రీకృష్ణుని లీలలను వింటేనే చాలు ఇంక దాని నుండి పక్కకు మరల లేడు. ఎల్లప్పుడూ శ్రీకృష్ణగాధామృతమును వినడానికి ఉత్సాహం చూపిస్తుంటాడు.

భగవంతుని లీలలను కీర్తించే నాలుకే నిజమైన నాలుక. నిరంతరము భగవంతుని అర్చించడంలో నిమగ్నమయ్యే చేతులే నిజమైన చేతులు. ఏ చెవులతో అయితే పరమాత్ముని లీలావిశేషములను వింటూ ఉంటాడో అవే నిజమైన చెవులు.

ఏ మనసులో అయితే నిత్యము భగవంతుని ధ్యానం చేస్తుంటాడో అదే నిజమైన మనస్సు. ఈ చరాచర జగత్తు అంతా పరమాత్మ మయము, అందరూ పరమాత్మ స్వరూపాలే అని నమ్మి అందరికీ నమస్కరించే వాడి శిరస్సే నిజమైన శిరస్సు. ఆ పరమాత్మ స్వరూపాలను నిత్యము దర్శించే నేత్రములే నిజమైన నేత్రములు. ప్రతినిత్యము ఆ పరమాత్మ పాదములను అభిషేకించిన నీటిని సేవించే నోరు నిజమైన నోరు. అట్టి పరమాత్మ లీలలను నాకు ఇంకా చెప్పండి." అని అడిగాడు పరీక్షిత్ మహారాజు. అప్పుడు శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో ఇలా అన్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణునికి చిన్ననాటి స్నేహితుడు ఒకడు ఉండేవాడు. వాడి పేరు సుదాముడు. అతడు ఇంద్రియములను జయించిన వాడు. కోరికలను వదిలిపెట్టిన వాడు. ఎల్లప్పుడూ మనస్సును ప్రశాంతంగా ఉంచుకునేవాడు. వేద వేదాంగములను అభ్యసించాడు కానీ ఏ మాత్రం గర్వం లేని వాడు. ఆయన ధనము సంపాదించడానికి ఏ ప్రయత్నమూ చెయ్యడు. భగవంతుడు ఇచ్చిన దానితో తృప్తి పడి జీవనం గడుపుకుంటూ ఉండేవాడు. తన భార్యా బిడ్డలను పోషించుకుంటూ ఉండేవాడు. అతడికి మంచి బట్టలు ఉండేవి కావు. ఎప్పుడూ చినిగిపోయిన వస్త్రములనే ధరించేవాడు.(అందుకనే ఆయనకు కుచేలుడు అని పేరు). ఒక రోజు తింటే రెండు రోజులు తినేవాడు కాదు. ఆ కారణం చేత అతని శరీరం శిథిలమైపోయింది. ఆయన భార్య కూడా ఆయనకు తగినదే. అయ్యో భర్తకు సరిగా ఆహారం సమకూర్చలేకపోయానే అని ప్రతినిత్యము బాధపడుతూ ఉండేది.

ఆ ఇల్లాలు ఒక రోజు తన భర్త దగ్గర కూర్చుని ఇలాఅడిగింది. "శ్రీకృష్ణుడు మీకు చిన్న నాటి మిత్రుడు అని చెప్పేవారు కదా. ఆయన కు బ్రాహ్మణులు అంటే ఎక్కువ ప్రీతి అనీ, శరణాగతవత్సలుడు అనీ, యాదవ కులమునకు అధిపతి అనీ విన్నాను. అటువంటి శ్రీకృష్ణుడు మీకు మిత్రుడు కదా! ఒక్కసారి మీరు మీ స్నేహితుని వద్దకు పోయి కనపడితే చాలు, మీకు కావలసిన ధనం ఇస్తాడు. ఒక సారి మీరు కృష్ణుడి వద్దకు పోయి ఆయనకు మన స్థితి గతులు వివరించండి. ఏమయినా సాయం చెయ్యమని అడగండి.

శ్రీకృష్ణుడు ప్రస్తుతము ద్వారకలోనే ఉన్నాడట. ఆయన భక్తజనవత్సలుడట. తనను నమ్మిన వారికి తన మీద భక్తి కలిగి ఉన్న వారికి ఆయన దాసుడవుతాడట. మీరు ఆయనకు మిత్రులు, భక్తులు. ఇంక చెప్పేదేముంది. మనకు కావలసిన ధనం ఆయన ఇస్తాడు. ఒక్కసారి వెళ్లిరండి." అని భర్తను కృష్ణుని వద్దకు వెళ్లమని సుదాముని భార్య ప్రోత్సహించింది.

భార్య మాటలకు సుదాముడు మెత్త బడ్డాడు. కృష్ణుని వద్దకు పోవడానికే నిశ్చయించుకున్నాడు. అంతలోనే ఒక సందేహము కలిగింది. "నువ్వు చెప్పినట్టు నేను కృష్ణుని వద్దకు వెళతాను. కానీ ఆయనకు కానుకగా ఏం పట్టుకెళ్లాలి. మన ఇంట్లో ఏమీ లేదు! ఎలాగా! పోనీ ఇల్లంతా వెదుకు. ఏదైనా దొరుకుతుందేమో! " అని అన్నాడు సుదాముడు.

ఇంట్లో ఏమీ లేదని ఆమెకూ తెలుసు. చుట్టు పక్కల ఉన్న బ్రాహ్మణ ఇళ్లకు పోయి నాలుగు పిడికిళ్ల అటుకులు యాచించి తీసుకొని వచ్చింది. ఆ అటుకులను సుదాముని వస్త్రములో కట్టింది. సుదాముడు ఆ అటుకులను తీసుకొని ద్వారకకు బయలు దేరాడు. కొన్ని రోజులు ప్రయాణం చేసి ద్వారకకు చేరుకున్నాడు. శ్రీకృష్ణుని అంత:పురములోకి ప్రవేశించాడు.

ఆ సమయంలో శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవి మందరములో ఉన్నాడు. అల్లంత దూరము నుండి సుదాముని చూచాడు శ్రీకృష్ణుడు. తన ఆసనము నుండి లేచాడు. సుదామునికి ఎదురు వెళ్లాడు. సుదాముని ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. చాలా రోజుల తరువాత కలుసుకున్న మిత్రుని కౌగిట్లో కృష్ణుడు అమితమైన ఆనందమును అనుభవించాడు. కృష్ణుని కళ్లనుండి ఆనంద భాష్పాలు జాలువారాయి.

శ్రీకృష్ణుడు సుదాముని ఒక ఆసనము మీద కూర్చోబెట్టాడు. కాళ్లు కడిగి తల మీద చల్లుకున్నాడు. చందనము, కుంకుమ,అక్షితలు తో సుదాముని పాదములను పూజించాడు. సుదామునికి గోవులను దానంగా ఇచ్చాడు. రుక్మిణీదేవి చామరము తీసుకొని సుదామునికి పరిచర్యలు చేస్తూ ఉంది.

అంత:పురములో ఉన్న వారందరికీ ఇదంతా చాలా విచిత్రంగా ఉంది. ఆ బ్రాహ్మణుడు చూడబోతే నిరుపేద. చినిగిన బట్టలు కట్టుకొని ఉన్నాడు. దుమ్ముకొట్టుకొని పోయి ఉన్నాడు. అటువంటి పేద బ్రాహ్మణుడి పాదములను కడిగి ఆ నీళ్లు నెత్తిన చల్లుకున్నాడు కృష్ణుడు. రుక్మిణీ వింజామర వేస్తూ ఉంది. ఈ పేద బ్రాహ్మణుడు ఎటువంటి పుణ్యం

చేసుకున్నాడో కదా! అని అందరూ విస్తుబోయారు.

కృష్ణుడు, సుదాముడు తాము చిన్నప్పుడు గురువుగారి ఆశ్రమంలో ఎలా గడిపిందీ ఆ చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకుంటున్నారు. అప్పుడు కృష్ణుడు సుదామునితో ఇలా అన్నాడు.

"సుదామా! నీవు విద్య ముగించుకొని ఇంటి వెళ్లగానే పెళ్లి చేసుకున్నావా! గృహస్థ జీవితము అనుభవిస్తున్నావా! నిన్ను చూస్తుంటే నీవు గృహస్థజీవనము అనుభవిస్తూ కూడా, నీ మనస్సు విషయ వాంఛలలో తగులుకున్నట్టు లేదు. నీవు ఎటువంటి కోరికలు లేకుండా నిశ్చింతతో ఉన్నట్టున్నావు. విలువైన గృహము, వస్త్రములు, ఆభరణముల మీద నీకు అంత ప్రేమ మమకారము ఉన్నట్టు లేదు. నన్ను చూడు. ఈ సంసార లంపటంలో పడి కొట్టుకుంటున్నాను. ఎన్నో కర్మలు చేస్తున్నాను.

అది సరే! నీకు మనము గురుకులములో గడిపిన రోజులు, మనం చిన్న తనంలో చేసిన చిలిపి పనులు గుర్తు ఉన్నాయా! మన చిన్ననాటి చిలిపి చేష్టలను నీవు స్మరించు కుంటూ ఉంటావా! ఓ సుదామా! నీకు తెలియనిది ఏమున్నది. మనకు జన్మనిచ్చిన తండ్రి మొదటి గురువు. ఉపనయనము తరువాత గురుకులములో వేదములను శాస్త్రములను బోధించిన వాడు రెండవ గురువు. కాని తన శిష్యులకు జ్ఞానమును ఉపదేశించేవాడు గురువులందరిలోకీ ఉత్తముడు. ఆ గురువే పరమాత్మ స్వరూపుడు. లోక గురువు.

ఈ మానవ లోకంలో ఎవరైతే వర్ణాశ్రమ ధర్మములను పాటిస్తూ, పరమాత్మ ఉపదేశములను అవలంబించి, ఈ సంసార సాగరమును దాటుతారో వారే గొప్ప పండితులు. నేను మన గురువుగారి శుశ్రూష ద్వారా పొందిన సంతోషము, బ్రహ్మచర్యము, గృహస్థఆశ్రమము, వానప్రస్థము మొదలగు ఆశ్రమములను అవలంబించినా కూడా లభించదు.

సుదామా! మన చిన్న నాటి ముచ్చట్లు నీకు గుర్తున్నాయా! ఒక రోజు మన గురువు గారి భార్య కట్టెలు తీసుకురమ్మని మన ఇద్దరినీ అడవికి పంపింది. అప్పుడు ఏం జరిగిందో నీకు జ్ఞాపకం ఉందా! అప్పుడు ఒక పేద్ద గాలి వాన వచ్చింది. మేఘాలు గర్జించాయి. ఉరుములు, మెరుపులు.  మనం ఇద్దరం భయపడి  ఒక చెట్టు కింద వణుకుతూ తలదాచుకున్నాము. అప్పటికే చీకటి పడింది. ఆకాశం అంతా మేఘాలతో కప్పబడింది. మనకు ఏమీ కపడటం లేదు. నేలంతా జల మయం అయింది. ఎక్కడ గుంట ఉందో ఎక్కడ ఊబి ఉందో కనపడటం లేదు. నీళ్లతో నిండిన అడవిలో, ఆ కాళ రాత్రి, ఆ గాలివానలో, మనం వచ్చిన మార్గము మరిచిపోయాము. ఒకరి చేతులు ఒకరం పట్టుకొని భయం భయంగా గడిపాము. ఇదంతా నీకు గుర్తుంది కదూ!

ఆ రాత్రంతా అలా వానలో తడుస్తూ చీకట్లో గడిపిన తరువాత తెల్లవారి, మన గురువుగారు, సాందీపుడు గారు, మనలను వెతుక్కుంటూ వచ్చాడు. ఒక చెట్టు కింది మనలను చూచాడు. "కుమారులారా! మీరు నా గురించి కాష్ఠములు తీసుకురావడానికి ఈ అడవిలోకి వచ్చి నానా అవస్థలు పడ్డారు. గురువు గారికి ఇటువంటి

నిస్వార్థచేస్తున్నందుకు నేను మీకు ఏమి ప్రత్యుపకారము చేయగలను. మీ ఇద్దరికీ నాకు వచ్చిన విద్యలు అన్నీ నేర్పిస్తాను. వేదశాస్త్రములు అన్నీ అధ్యయనం చేయిస్తాను. మీ ఇద్దరినీ పరిపూర్ణవిద్యావంతులను చేస్తాను." అని చెప్పాడు కదా.

సుదామా! మన చిన్న నాటి విషయాలన్నీ నీవు గుర్తుచేసుకుంటూ ఉంటావా! మానవుడికి గురువు గారి అనుగ్రహం ఉంటే జీవితం అంతా ప్రశాంతంగా నడుస్తుంది అనడంలో సందేహం లేదు కదా!" అని ఆప్యాయంగా తమ చిన్ననాటి సంగతులు గుర్తుచేసుకున్నాడు కృష్ణుడు.

ఆ మాటలకు సుదాముడు ఇలా అన్నాడు. "మిత్రమా! నీ వంటి మిత్రునితో గురుకులంలో విద్య నేర్చుకోవడం నేను చేసుకున్న పూర్వజన్మ సుకృతము. నీతో పాటు విద్యాభ్యాసము చేయడం కన్నా నాకు జీవితంలో కలిగే అదృష్టము, సంపద, సౌభాగ్యము ఇంక ఏముంటుంది చెప్పు. పరమాత్మ స్వరూపుడవైన నీవు ఒక సామాన్య విద్యార్థిగా గురుకులంలో నా వంటి సామాన్యుడి తోపాటు విద్యాభ్యాసం చేయడం కన్నా విచిత్రం ఏముంటుంది." అని అన్నాడు సుదాముడు. అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు సుదాముడు శ్రీకృష్ణుని వద్దకు రావడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఎనుబదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

### ఎనుబది ఒకటవ అధ్యాయము

"ఓ పరీక్షిత్ మహారాజా! తన చిన్ననాటి మిత్రుడు సుదాముని చూచి కృష్ణుడు పెద్దగా నవ్వుతూ ఇలా అన్నాడు.

"మిత్రమా! నా కోసం నన్ను చూడటానికి ఇంతదూరం వచ్చావు కదా! మరి ఈ చిన్న నాటి మిత్రుడికి కానుకగా ఏమి తెచ్చావు. నీవు నా మిత్రుడవు. నా భక్తుడవు. నీవు నాకు ఎంత చిన్న కానుక తెచ్చినా దానిని అపురూపంగా స్వీకరిస్తాను. నా మీద భక్తి విశ్వాసము లేనివారు నాకు ఎంత పెద్ద కానుకలు ఇచ్చినా వాటిని నేను స్వీకరించను. వాటి వలన నాకు ఎలాంటి సంతోషము కలుగదు. నా యందు అచంచల మైన భక్తితో, విశ్వాసముతో, నిర్మలమైన మనస్సుతో, నా భక్తులు నాకు ఇచ్చిన చిన్న ఆకు గానీ, ఫలము గానీ, పుష్పము గానీ చివరకు దోసెడు నీరు గానీ, నేను ఆనందంతో స్వీకరిస్తాను. కాబట్టి నీవు నా కొరకు ఏమి తెచ్చావో నాకు ఇవ్వు." అని అన్నాడు కృష్ణుడు.

కృష్ణుడు ఆ మాటలు పలుకగానే సుదాముడు సిగ్గుతో తల వంచుకున్నాడు. తాను తెచ్చిన నాలుగు పిడికిళ్ల అటుకులు ఇవ్వడానికి సంకోచించాడు. అప్పుడు కృష్ణుడు తనలో తాను ఇలా అనుకున్నాడు. "నా మిత్రుడు సుదాముడు ఇన్నేళ్లుగా నా దగ్గరకు రాలేదు. నన్ను ఏమీ అడగలేదు. కాని ఇప్పుడు వచ్చాడు. అదీ తన భార్య ప్రోద్బలంతో వచ్చాడు. ఈ పేద బ్రాహ్మణునికి అనంత ఐశ్వర్యములు ప్రసాదించడం నా ధర్మం." అని అనుకున్నాడు కృష్ణుడు.

చిలిపిగా సుదాముని నడుముచుట్టు చేయి పెట్టి తడిమాడు. నడుముకు కట్టుకున్న అటుకుల మూట కనపడింది. "సుదామా! ఇదేమిటయ్యా! నాకోసం ఏదో తెచ్చావు. నాకు ఇవ్వకుండా నన్ను ఊరిస్తున్నావు.  ఉండు నేనే తీసుకుంటాను." అంటూ సుదాముని వద్ద నుండి అటుకుల మూట బలవంతంగా లాక్కున్నాడు. మూట విప్పాడు. అందులో అటుకులు కనపడ్డాయి.

"అబ్బా! సుదామా! ఎన్నాళ్లకు చూచానయ్యా ఇటువంటి అటుకులు. ఈ అటుకులు చూస్తుంటే నాకు ఎంతో సంతోషంగా ఉంది. ఈ అటుకులను నేను తృప్తిగా తింటాను." అని ఒక పిడికెడు అటుకులు తీసుకొని నోటి నిండా పెట్టుకున్నాడు. హాయిగానమిలి తింటున్నాడు. "మిత్రమా! ఎంతో రుచిగా ఉన్నాయయ్యాఈ అటుకులు. ఎన్నాళ్లయిందో అటుకులు తిని" అంటూ మరొక పిడికెడు అటుకులు తీసుకొని తినబోయాడు.

అప్పుడు కృష్ణుని వెనక నిలబడి ఉన్న రుక్మిణి కృష్ణుని చేయిపట్టుకొని ఆపింది. కృష్ణునితో ఇలా అంది. "నాధా! ఒక్క పిడికెడు అటుకులకే ఈ బ్రాహ్మణునికి ఈ లోకములో, పరలోకములో సమస్త సంపదలు లభించాయి. తమరు మరొక పిడికెడు తింటే నేను వారి ఇంట్లో దాసీగా ఉండాలి." అని ఛలోక్తిగా అంది రుక్మిణి. ఆ మాటలు విని కృష్ణుడు నవ్వుకున్నాడు.

సుదామునికి ఇవేమీ తెలియవు. కృష్ణుడు తాను తెచ్చిన అటుకులు ఆప్యాయంగా తిన్నాడు అని సంతోషించాడు. ఆ రోజు రాత్రి

కృష్ణుని మందిరంలోనే నిద్రించాడు. మరునాడు సుదాముడు శ్రీకృష్ణుని వద్ద అనుమతి తీసుకొని తన ఊరికి బయలు దేరాడు. శ్రీకృష్ణుడు కూడా సుదామునితో కొంతదూరం వెళ్లి ఆయనకు నమస్కరించి, వీడ్కోలు పలికి, తిరిగి వచ్చాడు.

ఇంత దూరం వచ్చాడు కానీ సుదాముడు కృష్ణుని ధనసహాయం చేయమని అడుగలేదు. కృష్ణుడు కూడా ఎటువంటి ధనసహాయం చేయలేదు. కేవలం చిన్ననాటి ముచ్చట్లు చెప్పి పంపించాడు. సుదాముడు ఇంటికి వెళుతూ తనలో తాను ఇలా అనుకున్నాడు.

"శ్రీకృష్ణుని ఆప్యాయత, స్నేహభావము నా మనసును ఆనంద పరవశుడిని చేసాయి. ఎల్లప్పుడూ లక్ష్మీదేవిని వక్షస్థలములో ధరించిన పరమాత్మస్వరూపుడైన కృష్ణుడు ఈ పేదవాడిని గట్టిగా ఆలింగనం చేసుకున్నాడు. అంతకంటే అదృష్టం ఏముంటుంది. ఒక రోజు తింటే పదిరోజులు పస్తు పడుకొనే నేను ఎక్కడ. అఖండ ఐశ్వర్యములతో తులతూగే కృష్ణుడు ఎక్కడ! అటువంటి వాడు నన్ను ఆప్యాయంగా కౌగలించుకున్నాడు అంటే అంతకన్నా మహద్భాగ్యం ఏముంటుంది. తను, తన భార్య రుక్మిణి పడుకునే శయ్య మీద నన్ను తన పక్కన కూర్చోపెట్టుకొని నాతో ఆప్యాయంగా మాట్లాడాడు. నన్ను తన స్వంత సోదరుడి మాదిరి చూచాడు. రుక్మిణి కూడా స్వయంగా నాకు వింజామరలు వేసింది. అంతే కాకుండా శ్రీకృష్ణుడు నా కాళ్లు పట్టి నా మార్గాయాసమునుపోగొట్టాడు. నన్ను ఒక దేవత వలె పూజించాడు.

ఈ లోకంలో ఉన్న మానవులకు శ్రీకృష్ణుని పాదములు సేవించినంతనే వారికి ఈ లోకములోనూ, స్వర్గలోకములోనూ ఉన్న అన్ని సుఖములు ప్రాప్తిస్తాయి. చివరకు ముక్తి కూడా లభిస్తుంది. నా వంటి వాడికి ధనం ఇస్తే ఆ ధన గర్వంతో పరమాత్మను స్మరింపను అనే ఉద్దేశ్యంతో కృష్ణుడు నాకు ధనము ఇవ్వలేదు. ఆయన మంచి పనే చేసాడు. మానవుడు దారిద్ర్యంలోనే భగవంతుని నిరంతరం స్మరిస్తూ ఉంటాడు కదా!" అని ఆలోచిస్తూ తన ఊరికి వెళుతున్నాడు.

సుదాముడు తన ఊరు చేరుకున్నాడు. ఎంత వెతికినా సుదాముడికి  తాను నివసిస్తున్న పర్ణశాల కనపడలేదు. అన్నీ ఎత్తైన భవనములు కనపడుతున్నాయి. పరిచారకులు అటు ఇటు తిరుగు తున్నారు. ఇంతలో కొంత మంది స్త్రీలు పురుషులు సుదాముని వద్దకు వచ్చి ఆయనకు అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించారు. ఆయనకు స్వాగత వచనాలు పలికారు.

సుదామునికి ఇదంతా అయోమయంగా ఉంది. ఏమీ అర్థం కావడం లేదు. ఇంతలో ఒక భవనము లోనుండి సకల అలంకారములతో, ఆభరణములతో, విలువైన వస్త్రములను ధరించిన సుదాముని భార్య ఆయనకు ఎదురుగా వచ్చింది. భర్తను ఆప్యాయంగా పలకరించింది. ప్రేమతో ఆలింగనం చేసుకుంది. సుదాముని పాదములకు నమస్కరించింది. సుదాముని భార్యచుట్టు దాసదాసీజనము ఆమెకు సాయంగా నిలబడి ఉన్నారు.

వీరందరినీ చూచి సుదామునికి మతి పోయింది. తన కళ్లను తాను నమ్మలేకపోతున్నాడు. భార్య తన చేయి పట్టుకొని తీసుకొని వెళు తుంటే, తన మందిరంలోకి ప్రవేశించాడు. ఆ భవనములో తెల్లటి పట్టుపరుపులతో కూడిన శయ్యలు, బంగారముతో చేయబడిన ఆసనములు, ఏనుగు దంతములతో చేయబడిన పర్యంకములు (సోఫాలు అనుకోవచ్చు), బంగారు తొడుగులతో ఉన్న చామరములు, సువర్ణమయమైన ఉన్నత ఆసనములు, ముత్యముల మాలలతో శోభిల్లు చాందినీలు, మరకత, మాణిక్యములు పొదిగిన గోడలు, అనేక అలంకారములు చేసుకున్న దాసీలు, వీరితో ఆ భవనము కళకళలాడుతూ ఉంది.

ఇవన్నీ చూచి "నిరంతరం దారిద్ర్యంతో విలవిలలాడే నాకు ఇంత ఐశ్వర్యం ఎలా వచ్చింది. ఇదంతా శ్రీకృష్ణుని మహిమ తప్ప  వేరు కాదు. శ్రీకృష్ణుడు నా మనసులోని భావమును తెలుసుకొని నాకు అనంత ఐశ్వర్యములు ప్రసాదించాడు. మేఘములు మానవులు కోరకుండానే వర్షములు కురిపించినట్టు నేను ఏమీ కోరకుండానే నాకు కృష్ణుడు ఇంతటి సంపదలను ప్రసాదించాడు.

పరమాత్మ, భక్తులు తనకు భక్తితో సమర్పించిన అతి చిన్న వస్తువును కూడా గొప్పగా భావిస్తాడని ఇప్పుడే తెలిసింది. అందుకనే నేను ఇచ్చిన పిడికెడు అటుకులకు నాకు అనంతమైన సంపదలు ఇచ్చాడు. నేను నా రాబోయే జన్మలలో కూడా కృష్ణుని మిత్రుడుగా, హితుడుగా, కనీసం సేవకునిగా జన్మించాలని ఆ పరమాత్మను వేడుకుంటున్నాను. అదీ సాధ్యం కాకపోతే ఆ పరమాత్మను నిత్యం భజించే భక్తుల యొక్క సాంగత్యమును నాకు అనుగ్రహించుమని

ప్రార్థిస్తున్నాను. (నీ పాద కమల సేవయు, నీ పాదార్చకులతోటి నెయ్యమును.) శ్రీకృష్ణుని వివేకము చాలా గొప్పది. మానవులకు మితిమీరిన ధనం ఉంటే, వారు గర్విస్తారనీ, అధ:పతనము చెందుతారనీ గుర్తించి, వారిని కట్టడి చేస్తూ ఉంటాడు. అప్పుడప్పుడు వారి ధనమును లాక్కొని వారికి కష్టములను కలిగిస్తుంటాడు. ఆ కష్టములు కలిగించడం తనమీద భక్తి కలగడానికే గాని వేరు కాదు." అని తనలో తాను ఆలోచిస్తున్నాడు సుదాముడు.

భగవంతుడు తనకు ప్రసాదించిన ఐశ్వర్యముల మత్తులో పడకూడదని నిశ్చయించుకున్నాడు ఆ ఐశ్వర్యములను అనాసక్త భావంతో అనుభవిస్తున్నాడు. ఓ పరీక్షిత్ మహారాజా! చూచావా! తన చిన్న నాటి మిత్రుడికి కృష్ణుడు ఎంత సాయం చేసాడో! పరమాత్ముడికి మంచి ప్రవర్తన కల బ్రాహ్మణులే దైవముతో సమానము. ఆ ప్రకారంగా సుదాముడు కృష్ణుడు ఇచ్చిన ఐశ్వర్యములను ఏ మాత్రం ఆసక్తి, అహంకారము లేకుండా అనుభవించి, మరణానంతరము ముక్తి పొందాడు. ఈ సుదాముని (ఈయననే మనము కుచేలుడు అనగా చిరిగిన వస్త్రములు ధరించిన వాడు అని కూడా అంటాము) చరిత్రను విన్నవారు, అధ్యయనం చేసిన వారు, భగవంతుని మీద భక్తి కలిగి ఉంటారు. ఈ సంసారము నుండి విముక్తి పొందుతారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు సుదాముని వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఎనభైఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

### ఎనభై రెండవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు, బలరాముడు ద్వారకలో సుఖంగా నివసిస్తున్న సమయంలో ఒక సారి సంపూర్ణ సూర్య గ్రహణం సంభవించింది. సూర్య గ్రహణ సమయంలో పుణ్యతీర్థములలో స్నానం చేస్తే పాపాలు నశిస్తాయి అని జనుల నమ్మకం. ఆ కారణం చేత జనులందరూ కురుక్షేత్రానికి, అక్కడికి దగ్గరలోనే ఉన్న శమంతక పంచకానికి చేరుకున్నారు.

పరశురాముడు 21 మార్లు దండెత్తి క్షత్రియ వంశముల నన్నిటినీ నాశనం చేసి, ఆ క్షత్రియుల రక్తంతో ఐదు సరస్సులను ఏర్పాటు చేసాడు. వాటినే శమంతక పంచకము అంటారు. ద్వారక నుండి అక్రూరుడు, వసుదేవుడు, ఉగ్రసేనుడు, గదుడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు మొదలగు యాదవ ప్రముఖులు కూడా కురుక్షేత్రానికి వచ్చారు. అనిరుద్ధుడు, కృతవర్మ ద్వారకా నగర రక్షణ కొరకు ద్వారకలోనే ఉండిపోయారు.

అక్రూరుడు, వసుదేవుడు మొదలగు యాదవులు కురుక్షేత్రములో స్నానం చేసి, ఉపవాసములు ఉన్నారు. బ్రాహ్మణులకు వస్త్రములు, గోవులు దానం చేసారు. మరలా రామహ్రదము అనే తీర్థములో స్నానం చేసి, బ్రాహ్మణులకు, ఇతరులకు అన్న సంతర్పణ చేసారు. అందరూ చెట్లనీడలలో విశ్రాంతి తీసుకుంటున్నారు.

కురుక్షేత్రములో స్నానం చేయడానికి నంద గోకులం నుండి నందుడు, యశోద, రోహిణి, గోపికలు, గోప కాంతలు కూడా వచ్చారు. చాలా రోజుల తరువాత కలుసుకున్నందు వలన అందరూ ఒకరిని ఒకరు కౌగలించుకున్నారు. ఆనంద భాష్పాలు రాల్చారు. కుశల ప్రశ్నలు వేసుకున్నారు. బాగోగులు కనుక్కున్నారు. చిన్న వారు పెద్దలకు నమస్కరించారు. పెద్దవారు తమ కంటే చిన్నవారిని ఆశీర్వదించారు. వారందరూ కృష్ణుడు చిన్నతనంలో నందగోకులంలో చేసిన లీలలను స్మరించుకున్నారు.

కుంతీ దేవి తన తల్లి తండ్రులను, సోదరులను, అక్క చెల్లెళ్లను చూచి ఆనందంతో పొంగి పోయింది. వారందరూ కృష్ణుని బలరాముని చూచి పులకాంకితులయ్యారు. కుంతీ దేవి తన సోదరుడు వసుదేవునితో ఇలా అంది.

“సోదరా! నా అంత అభాగిని మరొకటి లేదు కదా! జీవితంలో నాకు ఏ ఒక్క కోరికా నెరవేరలేదు. మీరు ఎక్కడో ద్వారకలో ఉన్నారు. మేము హస్తినలో ఉన్నాము. మనకు ఒకరి వార్తలు ఒకరికి తెలియడం లేదు. నేను ఒంటరిగా మిగిలిపోయాను. నా బంధువులు, మిత్రులు, జ్ఞాతులు, సోదరులు వీరి క్షేమములు ఏమీ తెలియడం లేదు. ఈ సమయంలో మీ అందరినీ కలుసుకోడం నాకు చాలా ఆనందంగా ఉంది.” అని పలికింది కుంతీదేవి.

ఆ మాటలకు వసుదేవుడు కుంతీ దేవితో ఇలా అన్నాడు. “సోదరీ! మనం మానవ మాత్రులము. దేవుని చేతిలో ఆట బొమ్మలం.

దైవం నిర్ణయించినట్టు జరిగింది.

చాలా మంది తమకు తాముగా పనులు చేస్తుంటారు. మరి కొందరు ఇతరులు చెప్పినట్టు చేస్తుంటారు. కానీ వీరందరూ ఆ దైవము ఆడించినట్టు ఆడేవారే కానీ స్వతంత్రులు కారు. ఆవిషయం వారికి తెలియదు. నీవు నీ తండ్రి వద్ద నుండి మరొక ఇంటికి పెంపుడు కుమార్తెగా వెళ్లావు. మేము కూడా ఆ కంసునికి భయపడి, తలా ఒక దిక్కుగా వెళ్లిపోయాము. నేను, దేవకి, చెరసాలలో నానా బాధలు పడ్డాము. నేను నా ఆరుగురు కుమారులను పోగొట్టుకున్నాను. ఆ భగవంతుని దయవలన అందరం ఇక్కడ కలుసుకోగలిగాము." అని అన్నాడు.

ఆ కురుక్షేత్రమునకు వచ్చిన రాజులు అందరూ శ్రీకృష్ణుని దర్శనము చేత పునీతులయ్యారు. అదే సమయంలో కురుక్షేత్రానికి భీష్మ, ద్రోణ, ధృతరాష్ట్ర, గాంధారి మొదలగు వారు తమ తమ పుత్రులతో, పౌత్రులతో సహా కురుక్షేత్రములో పుణ్య స్నానములు చేయడానికి వచ్చారు. అలాగే పాండవులు, కుంతి, ద్రౌపది, పాండవుల ఇతర భార్యలు, సంజయుడు, విదురుడు, కృపాచార్యుడు, కుంతిభోజుడు, విరాటుడు, భీష్మకకుడు, నగ్నజిత్తు, పురుజిత్తు, ద్రుపదుడు, శల్యుడు, ధృష్టకేతువు, కాశిరాజు, దమఘోషుడు, విశాలాక్షుడు, మైథిలుడు, మద్రుడు, కేకయుడు, యుధామన్యువు, సుశర్మ, బాహ్లికకుడు, సోమదత్తుడు మొదలగు రాజులందరూ వచ్చారు.

వారందరూ ధర్మరాజును ఆయన మిత్ర రాజులను కలుసుకున్నారు. అందరూ శ్రీకృష్ణుని దర్శించుకున్నారు. వారందరూ ఉగ్రసేనుని,

యాదవులను ఈ విధంగా ప్రశంసించారు.

"ఉగ్రసేనా! మీ అందరి జన్మలు సార్ధకం అయ్యాయి. ఎందుకంటే మీరందరూ ప్రతిరోజూ శ్రీకృష్ణుని సందర్శన భాగ్యం వలన పునీతులవుతున్నారు. ఆ శ్రీకృష్ణుని కీర్తి, గంగానది, వేదములు, శాస్త్రములు  ఈ భూమిని పవిత్రం చేస్తున్నాయి. కాల ప్రభావంతో తన పవిత్రతను కోల్పోతున్న భూదేవి, శ్రీకృష్ణుని పాద స్పర్శతో మరలా తన పవిత్రతను సంతరించుకుంది. మీరందరూ శ్రీకృష్ణుని ప్రతి దినము చూస్తున్నారు. తాకుతున్నారు. ఆయనతో కలిసి నడుస్తున్నారు. ఆయనతో కలిసి భోజనం చేస్తున్నారు. ఆయనతో మాట్లాడుతున్నారు. ఆయనతో నిద్రిస్తున్నారు. శ్రీకృష్ణునితో వివాహ సంబంధములు కలుపు కుంటున్నారు. ఈ కారణంగా మీరందరూ దైవమార్గంలో ప్రయాణం చేస్తున్నారు. ప్రాపంచిక కర్మల యందు ఆసక్తిని వదిలిపెట్టి, ముక్తి మార్గంలో నడుస్తున్నారు. ఆ కారణంగా మీ జీవితములు అన్నీ సార్ధకములు అయ్యాయి." అని అన్నారు.

ఓ పరీక్షిత్ మహారాజా! కురుక్షేత్రము చాలా విశాలమయింది. ఎవరు ఎక్కడ ఉన్నారో తెలియదు. నందునికి కూడా శ్రీకృష్ణుడు వసుదేవుడు కురుక్షేత్రానికి వచ్చారని కొంత కాలం తరువాత తెలిసింది. శ్రీకృష్ణుని వెదుక్కుంటూ నందుడు అతని పరివారము తిరిగారు. ఆఖరుకు కృష్ణుడు ఉన్న చోటికి చేరుకున్నారు. శ్రీకృష్ణుని చూడగానే నందుడు ఆనందంతో పొంగిపోయాడు. కృష్ణుని ఆలింగనం చేసుకున్నాడు. కుశల ప్రశ్నలు వేసుకున్నారు. కంసుడు పెట్టిన బాధలను నెమరు వేసుకున్నారు. గోకులంలో చిన్నతనంలో తాము గడిపిన

రోజులు గుర్తుకు తెచ్చుకున్నారు బలరామ కృష్ణులు.

ఎప్పుడో చిన్ని కృష్ణునిగా చూచిన వాడిని, ఇప్పుడు పెరిగి పెద్దవాడుగా చూచిన యశోద ఆనంద సముద్రంలో ఓలలాడింది. కృష్ణుని ప్రేమతో కౌగలించుకుంది. ఆమెలో మాతృవాత్సల్యం పెల్లుబికింది. కృష్ణునికి, బలరామునికి యశోదను చూచిన ఆనందంతో నోటమాటరాలేదు. గొంతు బొంగురుపోయింది. నందుడు, యశోద కృష్ణుని బలరాముని తమ తొడల మీద కూర్చోబెట్టుకొని వారి తలలు ఆప్యాయంగా నిమురుతున్నారు. దేవకీ దేవి, రోహిణీ దేవి యశోదను ఆలింగనం చేసుకున్నారు. చిన్న నాటి ముచ్చట్లు చెప్పుకున్నారు. కృష్ణలీలలను చెప్పుకొని నవ్వుకున్నారు.

దేవకీ దేవి, రోహిణి యశోదతో ఇలా అన్నారు. "అమ్మా యశోదా! నీ ఋణం మేము ఎన్నటికీ తీర్చుకోలేము. నువ్వు, నందుడు మాకు చేసిన మహోపకారము మీకు ఇంద్రపదవి ఇచ్చినా తీరేది కాదు. మీరు మాకు చేసిన మేలును మేము ఎన్నటికీ మరిచిపోలేము. మీరు మా పుత్రులైన బలరామ కృష్ణులను పసిబిడ్డలు గా ఉన్నప్పటి నుండి కంటికి రెప్పలా కాపాడారు. పెంచి పెద్దవారిగా చేసారు. మేము వారిని కన్నామే గానీ, పెరిగింది అంతా నీ దగ్గరే కదా! ఆ చిన్నిబాలుర ప్రేమ, లాలన నువ్వు పొందగలిగావు. నీవు పుణ్య మూర్తివి. నీకు నీ కుమారులు, ఇతరుల కుమారులు అనే భేదభావము లేదు. అందుకే బలరామ కృష్ణులను నీ కన్నబిడ్డలవలె పెంచావు. లాలించావు." అని యశోదను ప్రశంసించారు దేవకీ దేవి, రోహిణి.

ఇంతలో చిన్నప్పుడు కృష్ణునితో ఆడుకున్న గోపికలు కృష్ణుని చూచి ఆయనవద్దకు వచ్చారు. శ్రీకృష్ణుని వంక కనురెప్పలు ఆర్పకుండా

చూస్తున్నారు. వారి కంటికి శ్రీకృష్ణుడు చిన్ని బాల కృష్ణుడి లాగానే కనపడుతున్నాడు. శ్రీకృష్ణుని నిరంతరము చూడకుండా కనురెప్పలు అడ్డుపెట్టిన బ్రహ్మను తిట్టుకున్నారు.

శ్రీకృష్ణుని దగ్గరగా వచ్చారు. ఆయన శరీరం అంతా తడిమారు. పులకించిపోయారు. శ్రీకృష్ణుడు వారితో కూర్చుని వారి యోగక్షేమాలు కనుక్కున్నాడు. వారితో ఇలా అన్నాడు. “నేను నా వారిని రక్షించడానికి ఆ సమయంలో మధురకు అక్కడి నుండి ద్వారకకు వెళ్లవలసి వచ్చింది. ఆ కారణంగా మిమ్ములను మరలా కలుసుకోలేక పోయాను. అది సరే! నేను మీకు జ్ఞాపకం ఉన్నానా! మనం ఆడుకున్న ఆటలు అన్నీ గుర్తున్నాయా! నన్ను ఎప్పుడన్నా తలచుకుంటున్నారా! లేక చెప్పా పెట్టకుండా వెళ్లిపోయి తిరిగి రానందుకు నన్ను తిట్టుకుంటున్నారా!

ఇదంతా కాల మహిమ. మనం అప్పుడు విడిపోయాము. ఇప్పుడు ఇలా ఇన్నాళ్లకు ఈ కురుక్షేత్రంలో కలుసుకున్నాము. ఇందులో ఎవరి తప్పు లేదు. దట్టంగా మేఘాలు ఆవరించినప్పుడు, గాలి విపరీతంగా వీచి ఆ మేఘాలను చెల్లాచెదురు చేస్తుంది. అలాగే గాలికి తేలికైన దూది, దుమ్ము, గడ్డి అన్నీ ఒక చోటికి చేరుతుంటాయి, మరలా ఎగురగొట్టబడి చెల్లాచెదురు అవుతుంటాయి. అలాగే సృష్టి కర్త కూడా మానవులను కలుపుతుంటాడు, విడదీస్తుంటాడు. అంతా దైవ మాయ. మన చేతిలో ఏమీ లేదు. మీకు నా మీద అధికమైన ప్రేమ వాత్సల్యము ఉన్నాయి. అందుకనే మీరు ఇప్పుడు ఇలా నన్ను వెతుక్కుంటూ వచ్చారు. నన్ను కలిసారు.

నేను  పరమాత్మ అంశ అని మీకు తెలుసు కదా! పంచభూతములు ఈ సృష్టికి మూలములు. ఈ పంచభూతముల వలననే సృష్టి, స్థితి, లయములు జరుగుతున్నాయి. అలాగే నేను కూడా సృష్టి,స్థితి,లయములకు కర్తను. నేను అంతటా ఉన్నాను. మీలోనూ ఉన్నాను. అందుకే మీకు నాకు ఎడబాటు అనేది లేదు. నేను ఎల్లప్పుడూ మీ హృదయములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాను.

ఈ ప్రకృతిలో మనకు కనిపించే పదార్థములు అన్నీ పంచభూతములతో ఏర్పడినట్టివే! ఆ పంచభూతములు కూడా సూక్ష్మరూపంలో ఉంటాయి. ఇవన్నీ మార్పుకు లోనవుతుంటాయి. కాని ఆత్మ వీటికి భిన్నమయింది. ఆత్మకు మార్పులేదు. అది నిత్యము, సత్యము. కాని ఆత్మ కూడా ఈ పంచభూతములతో కలిసి దేహము ధరిస్తూ ఉంది. ప్రాపంచిక భోగములను అనుభవిస్తూ ఉంది. కాలాంతరమున మరలా ఆ దేహమును వదిలేస్తూ ఉంటుంది.  ఈ దేహములతో అనుభవించ తగ్గ ప్రకృతి, పంచభూతములతో కలిసి దేహమును పొందిన ఆత్మ, రెండూ నా యందే ఉన్నాయి. మీ అందరూ నా యందే ఉన్నారు. ఇంక మనము విడిపోయాము అనే మాటకు అర్థం లేదు.." అని గోపికలకు కృష్ణుడు ఆత్మస్వరూపాన్ని బోధించాడు.

వారందరూ శ్రీకృష్ణుని ఇలా ప్రార్థించారు. "శ్రీకృష్ణా! నీ పాదపద్మములను యోగులు, మునులు ఎల్లప్పుడూ తమ హృదయము లలో నిలుపుకొని ధ్యానిస్తూ ఉంటారు. ఈ సంసారము నుండి విముక్తి ప్రసాదించేది నీ పాదసేవనము తప్ప మరొకటి కాదు. మేము పామరులము. ప్రాపంచిక విషయములలో  మునిగితేలుతుంటాము.

కోరికలతో సతమతమౌతుంటాము. అటువంటి మాకు ఎల్లప్పుడు నీ పాదపద్మములను మా మనసుల యందే నిలిచి ఉండేటట్టు మమ్ములను అనుగ్రహించు." అని వేడుకున్నారు.

శ్రీకృష్ణుని వలన ఆత్మస్వరూపమును తెలుసుకున్న గోపికలు, నిరంతరము కృష్ణనామమును ధ్యానించడం, స్మరించడం ద్వారా, మరణించిన తరువాత  ఆయనలో కలిసిపోయారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణ గోపికల పునస్సమాగమము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఎనభై రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత& ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఎనభై మూడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! కురుక్షేత్రంలో శ్రీకృష్ణుడు, బలరాముడు గోపికలను కలుసుకొని వారితో ముచ్చటించిన తరువాత ధర్మరాజు వద్దకు వెళ్లాడు. ధర్మరాజు బంధువులనందరినీ కలుసుకొని వారి క్షేమములను విచారించాడు. వారంతా శ్రీకృష్ణుని ఈ విధంగా స్తుతించారు.

"ఓ దేవా! ఈ ప్రపంచములోని జనులంతా ఈ సంసార సాగరంలో పడి అనేక కష్టములు పడుతున్నారు. ఈ సంసారమునకు మూలకారణం వారిలో ఉన్న అవిద్య. నీపాదపద్మములను సేవించిన వారికి వారిలోని అవిద్య అంతమవుతుంది. వారికి ఎటువంటి అమంగళములు కలుగవు.

ఓ దేవా! నీవు సకల ఆనంద స్వరూపుడవు. చిచ్ఛక్తి సంపన్నుడవు. కాలానుగుణంగా వేదములు ఈ లోకంలో నశించిపోయాయి. వాటిని పునరుద్ధరించడానికి నీవు అనేక అవతారములను ధరించావు. వాటిలో మానవ రూపంలో ఉన్న ఈ కృష్ణావతారము ఒకటి. పరమాత్మ స్వరూపుడవు అయిన నీకు భక్తితో నమస్కరిస్తున్నాము." అని పలికారు.

ధర్మరాజు బంధువులు శ్రీకృష్ణుని పైవిధంగా స్తుతిస్తూ ఉండగా, పంచ పాండవుల భార్య అయిన ద్రౌపది, వారి ఇతర భార్యలు, అంత:పుర కాంతలు, శ్రీకృష్ణుని కథలను గానం చేస్తున్నారు. వారిలో ద్రౌపది శ్రీకృష్ణుని భార్యలతో ఇలా అంది.

"ఓ రుక్మిణీ!, జాంబవతీ, నాగ్నజితీ, సత్యభామా! కాళిందీ, శైబ్యా, రోహిణీ, లక్షణా! ఇతర కృష్ణుని భార్యలారా! శ్రీకృష్ణుడు ఒక్కడే కదా మరి మీ అందరినీ ఎలా వివాహం చేసుకున్నాడు. మీతో ఎలా సుఖంగా కాపురం చేస్తున్నాడు. దయచేసి నాకు వివరంగాచెప్పండి." అని అడిగింది.

అప్పుడు రుక్మిణి ముసి ముసి నవ్వులు నవ్వుతూ ఇలా చెప్పింది. “మా అన్న రుక్మి నన్ను శిశుపాలుడికి ఇచ్చి వివాహం చేయదలిచాడు. నాకు కృష్ణుని మీద మనసు ఉంది. వివాహ సమయంలో గొడవ జరుగుతుందని తెలిసి శిశుపాలుని మిత్రుడు జరాసంధుడు మొదలగు వారు యుద్ధానికి సన్నద్ధంగా ఉన్నారు. కాని శ్రీకృష్ణుడు నన్ను రథము మీద ఎక్కించుకొని ద్వారకకు తీసుకొని వచ్చాడు. నన్ను వివాహం చేసుకున్నాడు.” అని చెప్పింది.

తరువాత సత్యభామ ద్రౌపదితో ఇలా అంది. “మా తండ్రి వద్ద స్యమంతక మణి అనే మణి ఉంది. దానిని ధరించి మా పినతండ్రి వేటకు వెళ్లాడు. ఒక సింహము మా పినతండ్రిని చంపి ఆ మణిని ఎత్తుకుపోయింది. ఆ సింహమును చంపి ఒక భల్లూకము ఆ మణిని ఎత్తుకుపోయి ఒక గుహలో దాచింది. ఆ మణిని కృష్ణుడు అపహరించాడని అపవాదు వచ్చింది. ఆ అపవాదు పోగొట్టుకోడానికి కృష్ణుడు భల్లూకరాజైన జాంబవంతుని ఓడించి, ఆ మణిని తెచ్చి నా తండ్రికి ఇచ్చాడు.అప్పటికే నా వివాహము కృతవర్మతో నిశ్చయం అయింది. కానీ నా తండ్రి నన్ను కృష్ణునికి ఇచ్చి వివాహం చేసాడు.” అని చెప్పింది.

తన వంతు రాగా జాంబవతి ఇలా అంది. “సత్య చెప్పిన కథే నాది కూడా. నా తండ్రి జాంబవంతుడు కృష్ణుని చేతిలో ఓడి పోయి, తన వద్ద ఉన్న స్యమంతక మణిని కృష్ణుడికి ఇచ్చాడు. నన్ను కృష్ణుడికి ఇచ్చి వివాహం చేసాడు.” అని చెప్పింది.

"నేను నా చిన్న తనం నుండి కృష్ణుని భర్తగా పొందవలెనని తపస్సు చేస్తున్నాను. నా మనసులో కోరిక గ్రహించిన కృష్ణుడు, తన బావ అర్జునునితో కూడా వచ్చి, నన్ను వివాహం చేసుకున్నాడు." అని కాళింది తెలిపింది.

తరువాత భద్ర ఇలా అంది. "నా కథ రుక్మిణి లాంటిదే! నా స్వయం వరంలో కృష్ణుడు నన్ను స్వయంవర మండపం నుండి తీసుకొని పోయి ద్వారకలో నన్ను వివాహం చేసుకున్నాడు. అడ్డం వచ్చిన రాజులను, వీరులను ఓడించాడు." అని చెప్పింది.

"నా తండ్రి నా వివాహానికి ఒక పరీక్ష పెట్టాడు. ఎవరైతే తన వద్ద ఉన్న ఏడు బలిష్టములైన,  వృషభములను లొంగదీసుకుంటాడో వాడికి నన్ను ఇచ్చి వివాహం చేస్తాను అన్నాడు. శ్రీకృష్ణుడు వచ్చి ఆ ఏడు వృషభములను లొంగదీసుకొని నన్ను వివాహం చేసుకున్నాడు. అప్పటి నుండి ఆయన పాదములు సేవిస్తున్నాను." అంది శైబ్య.

ఇంతలో మిత్రవింద ఇలా అంది. "నా వివాహం చాలా ప్రశాంతంగా జరిగింది. నా తండ్రి తన మేనమామ కుమారుడగు కృష్ణునికి నన్ను ఇచ్చి శాస్త్రోక్తంగా వివాహం జరిపించాడు."

తరువాత లక్షణ ఇలా అంది. "నేను నా చిన్నతనంనుండి నారద మహా ముని వలన కృష్ణుని గుణగణములు విని ఆయన మీద మనసు నిలిపాను. ఆయనే భర్తగా కోరుకున్నాను.  నా తండ్రి నా కోరికను మన్నించాడు. కాని వీర్య శుల్కముగా ఒక పరీక్ష పెట్టాడు. నీ స్వయం వరం మాదిరే ఒక మత్స్య యంత్రము తయారు

చేయించాడు. కాని అది బయటకు కనపడదు. ఆ మత్స్య యంత్రము కట్టబడిన స్తంభము యొక్క మొదలు దగ్గర ఉంచబడిన కుండలో ఉన్న నీటిలో ఆ మత్స్య యంత్రము ప్రతి బింబము మాత్రము కనపడుతూ ఉంటుంది.  వీరుడైన వాడు కింద పెట్టబడిన కుండలో ఉన్న మత్స్యము ప్రతి బింబమును చూచి ఆ మత్స్యమును కొట్టాలి. అదీ పరీక్ష.

నా స్వయం వరానికి చాలా మంది రాజులు వచ్చారు. అందరూ స్వయంవర సభలో కూర్చున్నారు. ధనుర్బాణములను ధరించి మత్స్య యంత్రమును కొట్టడానికి సిద్ధంగా ఉన్నారు. ఒకరొక్కరుగా వెళ్లడం ఆ మత్స్య యంత్రమును కొట్టలేక తిరిగి రావడం జరిగింది. చాలా మందికి ఆ మత్స్యము ఎక్కడ ఉందో కనపడలేదు. కనపడని దానిని ఎలా కొడతాం అనుకుంటూ వెనక్కు మళ్లారు.

ద్రౌపదీ! నీకు ఇంకో విషయం తెలుసా! అర్జునుడుకూడా నన్ను పెళ్లి చేసుకోవాలని ఈ మత్స్య యంత్రం కొట్టడానికి వచ్చాడు కానీ లక్ష్యం ఛేదించలేకపోయాడు. ఇంతలో కృష్ణుడు ధనుస్సుతీసుకొని శరమును సంధించి, సునాయాసంగా మత్స్య యంత్రాన్ని కొట్టాడు. తరువాత నేను పట్టు బట్టలు కట్టుకొని, చక్కగా అలంకరించుకొని, స్వయంవర మండపంలోకి వచ్చాను. కృష్ణుని మెడలో వర మాల వేసాను.

ద్రౌపదీ! ఈ ప్రకారంగా నాతో కృష్ణుని వివాహం జరిగింది. ఇది చూచిన ఇతర రాజులు సహించలేకపోయారు. కృష్ణుడు తన రథము

మీద కూర్చోబెట్టుకొని, తన చేతిలోకి ధనుస్సు తీసుకొని శత్రురాజులతో యుద్ధం చేసాడు. కృష్ణుని రథసారథి దారుకుడు అతి చాకచక్యంగా రథాన్ని నడిపాడు. శత్రు రాజులు కృష్ణుని రథం వెంట పడ్డారు. కాని కృష్ణుడు తన వాడి అయిన శరములతో వారిని ఓడించాడు. కొంత మందికి కాళ్లు చేతులు నరికాడు. కొంత మందిని చంపాడు. మిగిలిన వారు పారిపోయారు. తరువాత నేను కృష్ణునితో సహా ద్వారకలో ప్రవేశించాను. తరువాత నా తండ్రి అనేక అమూల్యమైన కానుకలు తీసుకొని ద్వారకకు వచ్చాడు. ద్వారకలో కృష్ణునితో నా వివాహం వైభవంగా జరిగింది.” అని పలికింది లక్ష్మణ.

శ్రీకృష్ణుని ఇతర భార్యలు కూడా ఇలా అన్నారు. “ద్రౌపదీ! నరకుని సంహరించి, నరకుడు  చెరలో బంధించిన మా అందరినీ కృష్ణుడు విడిపించాడు. అప్పటి వరకు మేము అందరమూ కృష్ణుని పాదములను ధ్యానిస్తున్నాము అని తెలుసుకున్న కృష్ణుడు మా అందరినీ వివాహం చేసుకున్నాడు. ఓ ద్రౌపదీ దేవీ! మేము  16,008 మంది కృష్ణుని భార్యలము నిరంతరము కృష్ణుని పాద సేవను కోరుకుంటు న్నాము. మాకు రాజ్యములు, స్వర్గలోక సుఖములు, ఇంద్ర పదవి, అణిమ మొదలగు అష్ట సిద్ధులు, బ్రహ్మ పదవి, ముక్తి పదవి ఏవీ కూడా శ్రీకృష్ణుని పాద సేవతో సమానం కావు. అందుకని ఎల్లప్పుడు శ్రీకృష్ణుని పాద పద్మములను మా తలమీద ధరించవలెనని మేము ఎల్లప్పుడూ కోరుకుంటున్నాము..

మేమే కాదు కృష్ణుని చిన్న తనంలో వ్రజ స్త్రీలు కూడా కృష్ణుని పాదములను నిర్మలమైన మనస్సుతో సేవించి ధన్యులయ్యారు. శ్రీకృష్ణుని మీద భక్తి ఉంటే ఆయన పాద సేవను మించినది

మూడులోకములలో ఏదీలేదు." అని శ్రీకృష్ణుని భార్యలు ముక్త కంఠంతో ద్రౌపదికి చెప్పారు. అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుని భార్యల పరిణయ వృత్తాంతములను వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఎనభై మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఎనభై నాలుగవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు కురుక్షేత్రంలో ఉన్న సమయంలో వ్యాసుడు, నారదుడు, చ్యవనుడు, దేవలుడు, అసితుడు, విశ్వామిత్రుడు, శతానందుడు, భరద్వాజుడు, గౌతముడు, భృగువు, వశిష్ఠుడు, గాలవుడు, పులస్త్యుడు, కశ్యపుడు, అత్రి, మార్కండేయుడు, బృహస్పతి, ద్వితుడు, త్రితుడు, ఏకతుడు, సనకాది బ్రహ్మమానస పుత్రులు, అంగీరసుడు, అగస్త్యుడు, యాజ్ఞవల్క్యుడు, వామదేవుడు మొదలగు మునులు శ్రీకృష్ణుని దర్శించుకోడానికి వచ్చారు. అక్కడ ఉన్న రాజులందరూ ఆ మహామునులను చూచి భక్తితో నమస్క రించారు.బలరాముడు, శ్రీకృష్ణుడు ఆ మహామునులకు అర్ఘ్యము, పాద్యము, ఆసనము ఇచ్చి సత్కరించారు. పూలమాలలు, ధూపము, చందనములతో పూజించారు. తమ తమ ఆసనములతో సుఖాసీనులైన మునులతో శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

"మహామునులారా! ఈరోజు మా జన్మములు ధన్యములు అయ్యాయి. ఒకే చోట ఇంత మంది మహాత్ములను సందర్శించే మహద్భాగ్యం మా అందరికీ కలిగింది. మీ అందరి దర్శనభాగ్యము దేవతలకు కూడా లభించదు. సామాన్య మానవులకు మీ వంటి మహాత్ములను, యోగీశ్వరులను దర్శించడం, తాకడం, వారిని ప్రశ్నించడం, నమస్కరించడం, పాదములను అర్చించడం మొదలగు అధికారములు లభించవు. మేము కూడా సాధారణ మానవులమైనా మాకు మిమ్ములను దర్శించి, మీ పాదములను అర్చించే భాగ్యం, మీ దయ వలన కలిగింది.

ఈ లోకంలో అన్ని జలాశయములు, సరస్సులు, నదులు తీర్థములు అని చెప్పబడవు. అలాగే మట్టితోనూ, రాతితోనూ చేయబడిన అన్ని విగ్రహములు దేవతా స్వరూపములు అని చెప్పబడవు. ఈ పుణ్య తీర్థములు కానీ, దేవతా విగ్రహములు కానీ, చాలా కాలం తరువాత గానీ తగిన ఫలితములను ఈయవు. కాని, మీ వంటి మహాత్ముల దర్శనభాగ్యంతో మానవులు తక్షణమే పవిత్రులు అవుతారు. కాబట్టి తీర్థములను, దేవతా విగ్రహములను సేవించడం కన్నా మీ వంటి మహాత్ములను సేవించడమే మేలు.

అదే విధంగా మానవులు అగ్ని, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, భూమి, జలము, ఆకాశము, వాయువు, వాక్కు, మనస్సు వీటిని ఉపాసించడం వలన మానవుల పాపములు పోవు. కాని మీ వంటి మహాత్ముల పాదపద్మములను సేవించడం వలన మానవుల పాపములన్నీ తక్షణమే నశించిపోతాయి.

సాధారణంగా మానవులు వాతము, పిత్తము, కఫము తో నిండిన ఈ దేహమును ఆత్మ అని భ్రమ చెందుతుంటారు. దేహమే తాను అని అహంకరిస్తుంటారు. అలాగే భార్య, పుత్రులను తమ ఆత్మీయులుగా, తమ సర్వస్వంగా భావిస్తుంటారు. అలాగే మట్టితోనూ, రాతితోనూ చేయబడిన విగ్రహములను దేవతా మూర్తులుగానూ, నదులు, సముద్రములను పుణ్యతీర్థములు గానూ భావిస్తుంటారు. కాని మీ వంటి మహాత్ములను, సాధువులను, భగవంతుని తత్వము తెలిసిన వారిని సేవించరు. అట్టివారు  గడ్డితినే పశువులతోనూ, ఆ గడ్డిని మోసే గాడిదలతోనూ సమానమైన వారు." అని పలికాడు శ్రీకృష్ణుడు. (ఇక్కడ గడ్డి అంటే ధనము, సంపదలు. మానవులు ధనమును, సంపదలను, విషయ వాంఛలను,  పశువులు గడ్డితిన్నట్టు, అనుభవిస్తుంటారు. గడ్డిని మోసే గాడిదలు అంటే  భార్య, సంతానము, బంధువులు, స్నేహితులు వీరే సర్వస్వము అని భావించే సంసార భారమును మోసే మానవులు అని అర్థం చేసుకోవచ్చు. ఇటువంటి వారు తమ పాపాలు పోగొట్టుకోడానికి రకరకాల దేవతా విగ్రహాలను పూజిస్తుంటారు, తీర్థయాత్రలు చేస్తుంటారు. కానీ పరమాత్మ తమలోనే ఆత్మస్వరూపుడుగా ఉన్నాడని తెలుసుకోలేరు.)

ఈ మాటలు విన్న మహా మునులు కొంచెం సేపు మౌనంగా ఉన్నారు. పరమాత్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడు ఇలా మాట్లాడుతున్నాడు ఏమిటా అని అనుకున్నారు. ఓహెూ! శ్రీకృష్ణుడు ప్రస్తుతము మానవుడుగా, కర్మలకు అధీనుడుగాఉన్నాడు. తన పరమాత్మ స్వరూపమును కప్పిపుచ్చి మామూలు మానవుని వలె ప్రవర్తిస్తున్నాడు. శ్రీకృష్ణుడు ఈ విధంగా మాట్లాడటం కేవలం లోకానికి ఆత్మ తత్వమును

తెలియజేయడం కోసరమే అని నిశ్చయించుకొని, నవ్వుతూ ఇలా అన్నారు.

"దేవదేవా! నీవు నీ పరమాత్మ స్వరూపమును మరుగు పరచి, కేవలం సాధారణ మానవుని వలె మాట్లాడుతున్నావు. మేమందరము మరీచి మొదలగు ప్రజాపతులకు అధిపతులమైనా, నీ మాయను మాత్రము అర్థం చేసుకోలేక పోతున్నాము. నీ మాయలో పడిపోతున్నాము. నీ లీలలు అద్భుతములు కదా!

ఓ దేవా! ఈ భూమి, ఈ మట్టి అంతటా ఒక్కటే. కానీ ఈ మట్టి కుండగానూ, దాని మీద మూతగానూ, వివిధ రూపములు ధరిస్తూ ఉంది. వివిధములైన పేర్లతో పిలువబడుతూ ఉంది. నీవు కూడా ఒక్కడివే. నీకు చేయవలసిన పనులు అంటూ ఏమీలేవు. కాని నీవు అనేక రూపములు ధరించావు. సృష్టి చేసేటప్పుడు బ్రహ్మగానూ, పోషించేటప్పుడు విష్ణువు గానూ, లయం చేసేటప్పుడు విష్ణువు గానూ నీ కర్తవ్యములను నిర్వర్తిస్తున్నావు, కానీ ఈ మానవులు నీవు వేరు వేరు అనే భేదభావాన్ని కల్పిస్తున్నారు.

ఓ దేవా! నీవు ఏ కర్మ చేసినా ఆ కర్మఫలము నీకు అంటదు. నీవు పుట్టడం పెరగడం, లీలలు చేయడం ఏవీ సత్యము కావు. నీవు పరిపూర్ణస్వరూపుడవు. నీవు తప్ప ఈ విశ్వములో మరొకటి లేదు.

ఓ దేవా! ఈ లోకంలో వర్ణాశ్రమ ధర్మములను నీవు ఒక్కడివే రక్షిస్తున్నావు. నీవే పరమ పురుషుడవు. సజ్జనులను రక్షించడానికి,

దుర్మార్గులను శిక్షించడానికి నీవు శుద్ధసత్వమయ మైన శరీరములను ధరిస్తుంటావు. వేదములను రక్షిస్తుంటావు.

ఓ దేవా! మానవులు వేదములను అధ్యయనం చేయడం చేత నీ శుద్ధసత్వమయ స్వరూపమును తెలుసుకోగలుగుతున్నారు. ఎందుకంటే వేదములన్నీ నీ స్వరూపములే కదా! ఓ దేవా! వేదములే నిన్ను తెలుసుకోవడానికి ఏకైక ప్రమాణములు. ఈ లోకంలో సత్వగుణ సంపన్నులు, సదాచార సంపన్నులు అయిన బ్రాహ్మణులు వేదములను ప్రచారం చేస్తున్నారు. ఆ కారణం చేత నీవు సదా బ్రాహ్మణులను సేవిస్తున్నావు. పూజిస్తున్నావు. బ్రాహ్మణుల సాహచర్యంలో నీవు వారి మాదిరే పుణ్యకర్మలను ఆచరిస్తున్నావు.

ఓ దేవా! ఈ రోజు నీ దర్శనభాగ్యం చేత మేము చేసిన తపస్సు, నేర్చుకున్న విద్య ధన్యమయ్యాయి. మా జన్మలు సార్థకం అయ్యాయి. నిన్ను చూచిన మా కన్నులు సఫలతను సంతరించుకున్నాయి. శ్రీకృష్ణా! నీవు యోగబలసంపన్నుడవు. నీ మహాత్మ్యము నిగూఢంగా ఉంటుంది. నీ బుద్ధిబలము అపారము. నీవు సర్వాంతర్యామివి. నీకు తెలియని విషయం లేదు. నీవే పరమ పురుషుడవు. పరమాత్మ స్వరూపుడవు. అట్టి నీకు నమస్కరిస్తున్నాము.

ఓ దేవా! నీ చుట్టు ఉన్న యాదవులు, నీకు మిత్రులైన ఈ రాజులు అందరూ యోగమాయచేత కప్పబడి నీవు పరమాత్మ స్వరూపుడవు, సర్వాంతర్యామివి, కాలస్వరూపుడవు అనే సత్యాన్ని గ్రహించలేకపోతున్నారు.

ఓ దేవా! (25) ఈ మానవులు ఇంద్రియ వ్యామోహములో పడి పోయి, విషయవాంఛలకు లోబడి, మోహంలో మునిగిపోయి, వివేకము నశించి, నీ యొక్క అసలు స్వరూపమును తెలుసుకోలేక పోతున్నారు.

ఓ దేవా! పరమ పవిత్రమైన గంగానదికి నీ పాదములే ఆశ్రయము. పరిపక్వత చెందిన యోగులు నీ పాదములనే తమ హృదయములలో నిలుపుకొని ధ్యానిస్తూ ఉంటారు. అటువంటి నీపాద పద్మములను నేడు మా పూర్వపుణ్యవశమున దర్శింపగలిగితిమి. మా అందరినీ నీ భక్తులుగా చేసుకొని నీ కృపాకటాక్షవీక్షణముల మా మీద ప్రసరింపజేయమని ప్రార్థిస్తున్నాము. నీ మీద అనన్యమైన భక్తితోనే కదా నీ భక్తులు వారి మరణానంతరము నిన్ను చేరుకోగలిగారు. నీ మీద భక్తి లేని ఎవరూ నిన్ను ఎన్నటికీ పొందలేరు అనే మాట యదార్థము." అని ఆ మునులందరూ ముక్తకంఠంతో శ్రీకృష్ణుని కీర్తించారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ విధంగా మునులు అందరూ కృష్ణుని స్తుతించి, ధర్మరాజు వద్ద అనుమతి తీసుకొని తమ తమ ఆశ్రమములకు వెళ్లడానికి నిశ్చయించుకున్నారు. ఇంతలో వసుదేవుడు వారి వద్దకు వెళ్లి వారి పాదములకు భక్తితో నమస్కరించి, వారిని ఇలా ప్రార్థించాడు.

"ఓ మహాఋషులారా! మీరందరూ సకల దేవతా స్వరూపులు. మీ అందరికీ భక్తితో నమస్కరిస్తున్నాను. దయచేసి నా మాటలు కూడా వినండి. ఈ లోకంలో మానవులు ఎన్నోరకములైన కర్మలు చేస్తుంటారు. ఆ కర్మలలో పుణ్య కర్మలు, పాప కర్మలు ఉంటాయి. ఆ కర్మల ద్వారా

మానవులకు బంధనములు కలుగుతుంటాయి. మరి ఆ మానవులు ఆ కర్మ బంధనముల నుండి ఎలా విముక్తి పొందుతారు. నాకు వివరంగా తెలియజేయండి." అని అడిగాడు. ఆ మాటలను విన్న నారదుడు ఇలా అన్నాడు.

" ఓ మునులారా! ఈ వసుదేవుడు సాక్షాత్తు యోగీశ్వరేశ్వరుడు అయిన శ్రీకృష్ణునికి తండ్రి. కాని ఈయన కళ్లకు శ్రీకృష్ణుడు ఒక సామాన్య మానవునిలాగా కనపడుతున్నాడు. అందుకే మానవుల కర్మబంధనముల గురించి మనలను అడిగాడు. దీనికి మీరు ఆశ్చర్యపడవలసిన పని లేదు. ఈ లోకంలో ఉండే మానవులు తమ పక్కనే సర్వజ్ఞులు అయిన మహాత్ములు, మహాపురుషులు ఉన్నా వారిని ఆదరించరు. అసలు పట్టించుకోరు. గంగాతీరంలో నివసించే మానవులు ప్రతిరోజూ గంగలో స్నానం చేస్తూ కూడా, ఇతర పుణ్యతీర్థములలో స్నానం చేసి పుణ్యం సంపాదించుకోవడానికి ఉత్సాహపడుతుంటారు.

శ్రీకృష్ణుని పక్కన ఉంటేనే అన్ని సందేహములు, అనుమానములు తీరిపోతాయి. మహాత్ముల సాహచర్యము అటువంటిది. శ్రీకృష్ణుని పక్కన ఉంటే కలిగే అనుభూతి ఈ రోజు ఉండి రేపు లేకుండా పోయేది కాదు. పళ్లు కాలంగడిచే కొద్దీ పాడయి పోతాయి. ఈ సృష్టి స్థితి లయాలు కూడా కాలాను గుణంగా నడుస్తున్నాయి. సృష్టించ బడ్డ జీవి కాలానుగుణంగా రూపాంతరం చెందుతుంటుంది.

కుండ మట్టితో చేయబడింది. దానికి దెబ్బ తగిలితే పగిలిపోతుంది. చిన్న ముక్కలవుతుంది. తుదకు మట్టిలో కలిసి పోతుంది. మరలా మరొక వస్తువుగా రూపాంతరం చెందుతుంది. కాని శ్రీకృష్ణానుభూతి ఎటువంటి మార్పులేకుండా నిత్య సత్యమై ఉంటుంది.

శ్రీకృష్ణుడు సర్వాంతర్యామి. అద్వితీయుడు. కాని మానవునిలా మనమధ్య తిరుగుతున్నాడు. మేఘములచేత కప్పబడిన సూర్యుని వలె ఆయన మహిమలు మానవ రూపంలో ఉండటం చేత కప్పబడి ఉన్నాయి. ఈ విషయం తెలుసుకోలేక సామాన్య మానవులు కృష్ణుని కూడా తమ వంటి సామాన్య మానవుడనీ, ఆయనకు ప్రాణం ఉందనీ, ఆయనకు కూడా సుఖదు:ఖాలు, రాగద్వేషాలు ఉన్నాయనీ, సత్వ,రజో, తమోగుణములకు లోబడి ఉంటాడనీ భావిస్తుంటారు. వసుదేవుడు కూడా సామాన్య మానవ మాత్రుడే. కాబట్టి ఆయన సందేహములను తీర్చవలసిన బాధ్యత మనకు ఉంది." అని అన్నాడు నారదుడు.

నారదుని మాటలు విన్న ఋషులు వసుదేవునితో ఇలా అన్నారు. "వసుదేవా! మానవులు ఏ కర్మ చేసినా, ఏ యజ్ఞయాగములు చేసినా, అవి అన్నీ విష్ణువు పరంగానే చేయాలని శాస్త్రములు ఘోషిస్తున్నాయి. ఆ ప్రకారంగా అన్ని కర్మలను విష్ణుపరంగా చేస్తే, ఆ కర్మల ఫలములు ఆ మానవులకు అంటవు. ఆ కర్మల వలన కలిగే పుణ్య, పాపములు ఆ మానవులకు సంక్రమించవు. కర్మబంధనముల నుండి విముక్తి పొందడానికి ఇదే మంచి ఉపాయమని మునులు, ఋషులు నిర్ణయించారు.

పరమాత్మ తత్వమును తెలిసిన పండితులు, శాస్త్రములు అధ్యయనం చేసి, ఆ శాస్త్రములలో ఉన్న మంచి చెడులను చక్కగా పరిశీలించి, విష్ణువు పరంగా చేసే అన్ని కర్మలు, యజ్ఞయాగములు, మనసుకు శాంతిని చేకూరుస్తాయనీ, మోక్షసాధనకు అదే సులభమైన ఉపాయమనీ, అదే ఆత్మకు ప్రీతిని కలిగిస్తుందనీ, భావించారు. ఆ కారణంగానే విష్ణుపరంగా చేసే అన్ని కర్మలు ధర్మబద్ధములనీ, ప్రతి మానవుడు అనుసరించవలసిన కర్తవ్యము అనీ బోధించారు.

గృహస్తు అయిన వాడు న్యాయంగా ధనాన్ని సంపాదించాలి. ఆ ధనంతో చేసే పనులన్నీ ఏ విధమైన ఫలితాన్ని ఆశించకుండా చెయ్యాలి. ఆ పనులన్నీ కూడా విష్ణువు పరంగా చెయ్యాలి. ఇదే గృహస్థుకు శ్రేయస్సును కలిగించే ఉత్తమమైన మార్గము.

ఓ వసుదేవా! ఈ లోకంలో ప్రతి మనిషికీ ధనం సంపాదించాలనీ, దానిని దాచుకోవాలనే కోరిక ఉంటుంది. ఆ ధనము మీద కోరికలు పోవాలంటే, తాను సంపాదించిన ధనమును దాన, ధర్మములకు, పుణ్యకార్యములకు, వినియోగించాలి.

అలాగే భార్యా, పుత్రుల మీద అమిత మైన, ప్రేమను, మమకారాన్ని కూడా విడిచిపెట్టాలి. తగుమాత్రంగానే ప్రేమ కలిగి ఉండాలి. (నేను లేకపోతే వీళ్లు ఏమైపోతారో అని దిగులుపడటం అవివేకము.) కాలానుగుణంగా అన్ని నశించి పోయేవే, ఆర్జించిన పుణ్యం అయి పోగానే స్వర్గలోకం నుండి కూడా కిందికి తోయబడతాడనీ (క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి) తెలుసుకొని

మానవులు ప్రవర్తించాలి. ఆ కారణం చేతనే పూర్వ కాలంలో ధీరులైన రాజులు కూడా గృహస్థాశ్రమాన్ని, అందులో కలిగే సుఖాలను విడిచిపెట్టి, సంసార బంధనములను విడగొట్టుకొని, వానప్రస్థమునకు వెళ్లిపోయారు.

ఓ వసుదేవా! మానవుడు ఉపనయన కార్యక్రమంతో ద్విజుడు అవుతాడు అంటే బ్రహ్మచారిగా మరో జన్మ ఎత్తుతాడు. ఆ తరువాత గృహస్థాశ్రమమును స్వీకరిస్తాడు. వీరంతా దేవ ఋణము, ఋషి ఋణము, పితృఋణము తీర్చుకోవలసి ఉంటుంది. ఈ మూడు ఋణములు ప్రతి మనిషికి జన్మతోనే సంక్రమిస్తాయి. ప్రతి మనిషి గృహస్థాశ్రమము స్వీకరించి ఈ మూడు ఋణములను తీర్చుకోవాలి. అలా కాకుండా బ్రహ్మచర్యము నుండి నేరుగా సన్యాసము స్వీకరిస్తే, వాడు ఈ మూడు ఋణములను తీర్చుకోలేక, ఋణగ్రస్తుడవుతాడు.

ఆ కారణం చేత ప్రతి మానవుడు బ్రహ్మచారిగా ఉన్నప్పుడు వేదాధ్యయనము, శాస్త్ర అధ్యయనము చేయాలి. గృహస్థుగా పుత్ర సంతానమును పొందాలి. అప్పుడే ఈ మూడు ఋణములను తీర్చుకోగలడు. గృహస్థాశ్రమమును స్వీకరించకుండా, సన్యాసము స్వీకరించిన వారు దేవ,ఋషి,పితృ ఋణగ్రస్తులై, అధఃపతితులవుతారు.

వసుదేవా! నీవు వేదములను, శాస్త్రములను చదివావు. ఆ కారణంగా ఋషి ఋణము తీర్చుకున్నావు. మంచి సంతానమును పొంది పితృఋణమును తీర్చుకున్నావు. ఇప్పుడు యజ్ఞ,యాగములు చేసి దేవఋణమును తీర్చుకో. తరువాత వానప్రస్థఆశ్రమమును స్వీకరించు.

వసుదేవా! నీవు నీ పూర్వజన్మలలో పరమాత్మను అమితమైన భక్తితో పూజించావు. ఆ కారణం చేత ఆ పరమాత్మ తన అంశతో నీకు కుమారుడుగా జన్మించాడు. నీ జన్మధన్యం అయింది." అని పలికారు.

మహాఋషుల మాటలను శ్రద్ధతో విన్న వసుదేవుడు యజ్ఞము చేయడానికి పూనుకున్నాడు. ఆ మహాఋషులనే ఋత్విక్కులుగా ఉండమని వినయంగా ప్రార్థించాడు. వసుదేవుని ప్రార్థనను మన్నించి నారదుడు మొదలగు మహామునులు వసుదేవుని చేత ఒక యజ్ఞము చేయించారు.

యజ్ఞదీక్షా సమయంలో యాదవులందరూ శుభ్రంగా స్నానాలు చేసారు. నూతన వస్త్రములు ధరించారు. పుష్పమాలలను మెడలో వేసుకున్నారు. వారి భార్యలు కూడా నూతన వస్త్రములు ధరించారు. చక్కగా అలంకరించుకున్నారు. చందనము, అక్షితలు మొదలగు పూజాద్రవ్యములను తీసుకొని యాగశాలలోకి వచ్చారు.

యాగ శాలలో మంగళ వాద్యములు మోగుతున్నాయి. గాయకులు భక్తి పారవశ్యంతో పాటలు పాడుతున్నారు. నాట్యకత్తెలు నృత్యం చేస్తున్నారు. సూతులు, వంది మాగధులు స్తోత్రపాఠాలు చదువుతున్నారు. వసుదేవుడు కూడా నూతన వస్త్రములు ధరించి, తన పన్నెండు మంది భార్యలతో యాగశాలలో ప్రవేశించాడు.

ఋత్విక్కులు వసుదేవునికి యాగ దీక్ష ఇచ్చారు. ఋత్విక్కులు కూడా మంచి పట్టు వస్త్రములు ధరించి ఇంద్రుని

యజ్ఞములో ఋత్విక్కుల వలె ప్రకాశించారు.

బలరాముడు, శ్రీకృష్ణుడు తమ తమ భార్యలతో యాగశాలలో ప్రవేశించారు. తరువాత వసుదేవుడు శాస్త్రము ప్రకారము అగ్ని హెూత్రము వెలిగించాడు. యజ్ఞపురుషుడు అయిన విష్ణువును ఆరాధించాడు. ఋత్విక్కులు వసుదేవుని చేత వేదమంత్రములతో యజ్ఞము చేయించారు.

యజ్ఞము పూర్తి అయింది. వసుదేవుడు ఋత్విక్కులకు, సదస్యులకు, బ్రాహ్మణులకు విరివిగా ధనమును, బంగారమును, గోవులను, భూములను దానం చేసాడు. తరువాత బ్రాహ్మణులు వసుదేవుని చేత పత్నీ సంయాజము, అవభృథ స్నానము మొదలగు కర్మలను పూర్తిచేయించారు. తరువాత అందరూ రామ హ్రదములో స్నానము చేసి దీక్ష విరమించారు.

వసుదేవుడు అన్ని వర్ణముల వారికీ అన్న సంతర్పణ చేసాడు. జంతువులకు, పక్షులకు కూడా వాటికి తగిన ఆహారమును పెట్టాడు. తరువాత వసుదేవుడు తన ఆహ్వానము మేరకు యజ్ఞమునకు వచ్చిన బంధువులకు, విదర్భ, కోసల, కురు, కాశీ, కేకయ, సృంజయ రాజులకు, సదస్యులకు, ఋత్విక్కులకు, దేవతలకు, మనుష్యులకు అందరికీ విరివిగా కానుకలు ఇచ్చి సంతృప్తి పరిచాడు. యాగమునకు వచ్చిన వారంతా వసుదేవుని వద్ద, శ్రీకృష్ణుని వద్ద అనుమతి తీసుకొని తమ తమ రాజ్యములకు వెళ్లిపోయారు.

ధృతరాష్ట్రుడు, విదురుడు, ధర్మరాజు, భీమార్జునులు, భీష్మ, ద్రోణ, ప్రముఖులు, కుంతీ దేవి, నకులసహదేవులు, నారదుడు, వ్యాసుడు మొదలగు ఋషులు, యాదవుల బంధు మిత్రులు, ఒకరిని ఒకరు ఆలింగనము చేసుకొని విడువలేక విడిచి పెట్టి తమ తమ గృహములకు వెళ్లిపోయారు.

తరువాత  వసుదేవుడు, శ్రీకృష్ణుడు, బలరాముడు, ఉగ్రసేనుడు, మొదలగు యాదవ ముఖ్యులు, నందుని, నందవ్రజములో ఉన్న గోపకులను సన్మానించారు.  వసుదేవుడు నందుని చేతులు పట్టుకొని ఇలా అన్నాడు.

"సోదరా! మన ఇద్దరి స్నేహము ఆ పరమాత్మ ఏర్పరచినది. ఎన్ని కష్టనష్టములు వచ్చినా మన స్నేహము మాసిపోదు. చిరకాలము నిలిచి ఉంటుంది. నీ వంటి వారు నాకు చేసిన మహోపకారము మరువలేనిది. నీవు చేసిన ఉపకారమునకు నేను ప్రత్యుపకారము చేయడానికి అశక్తుడను. నీవు నాకు చేసిన ఉపకారము మన స్నేహబంధమును పటిష్టం చేస్తుంది కాని, నశించిపోదు.

నా కుమారులు బలరామ, కృష్ణులు నీ వద్ద ఉన్న రోజులలో మేమందరము కంసునికి భయపడి నీకు ఎటువంటి సహాయ చేయలేకపోయాము. కంసుని మరణం తరువాత మేము రాజ్యాధికారం పొందాము. మాకు ఐశ్వర్యము లభించింది. మాకు రాజ్యము, ఐశ్వర్యము, సంపదలు లభించాయి అన్న గర్వంతో, మదంతో మా కళ్లు మూసుకుపోయి ఇప్పుడు కూడా నీ వంటి సత్పురుషులను మేము

అస్సలు పట్టించుకోలేదు. సాధారణంగా మానవులకు రాజ్యము, సంపదలు కలిగినప్పుడు కళ్లు మూసుకుపోతాయి. అటు వంటి మానవులు తనకు దగ్గరగా ఉన్న బంధువులను గానీ మిత్రులను గానీ గుర్తించడు. ధన మదంతో విర్రవీగుతుంటాడు. మేమందరము దానికి అతీతులము కాము. ఆత్మ తత్వము తెలుసుకోవాలంటే వాడికి ధనము, సంపదలు లభించకుండా ఉంటేనే బాగుంటుంది." అని తన బలహీనతలను వ్యక్తపరిచాడు వసుదేవుడు.

తరువాత వసుదేవుడు తన అవివేకమునకు నందుని చేతులు పట్టుకొని భోరున ఏడ్చాడు. నందుని, యాదవులను, అక్కడి నుండి పోనీయలేదు. వసుదేవుని యొక్క, బలరామ కృష్ణుల యొక్క బలవంతంతో నందుడు, యశోద, గోపకులు, గోపస్త్రీలు వారితో మూడుమాసములు గడిపారు.

తరువాత వసుదేవుడు, ఉగ్రసేనుడు, కృష్ణుడు, ఉద్ధవుడు, బలరాముడు మొదలగు వారు నందుని, యశోదను, గోపకులను, గోప కాంతలను అమూల్యమైన ఆభరణములతోనూ, వస్త్రములతోనూ, ధనముతోనూ ఘనంగా సత్కరించారు. వారు ఇచ్చిన కానుకలు స్వీకరించిన నందుడు, యశోద, గోపకులు, గోపకాంతలు వారిని విడువలేక విడువలేక విడిచి నందవ్రజమునకు వెళ్లిపోయారు.

నందుడు, గోపాలురు, గోపికలు శరీరములు మాత్రము వెళ్లిపోయాయి కానీ, వారి మనసులు మాత్రము శ్రీకృష్ణుని పాదముల వద్దనే ఉన్నాయి. వారు మధురకు వెళ్లిన తరువాత కూడా, వారు శ్రీకృష్ణుని పాదపద్మములను విడిచిపెట్టకుండా అనునిత్యము

మనసులోనే నిలుపుకొని ధ్యానిస్తున్నారు. ఇంతలో వర్షాకాలము ప్రవేశించింది. వసుదేవుడు, శ్రీకృష్ణుడు, బలరాముడు, యాదవ ప్రముఖులు అందరూ ద్వారకకు బయలుదేరారు. ద్వారక చేరుకున్న తరువాత, అక్కడి వారికి తమ తీర్థయాత్ర విశేషములను, వసుదేవుని యజ్ఞము గురించి ద్వారకా నగర వాసులకు వివరించారు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణబలరాముల తీర్థయాత్ర విశేషములను, వసుదేవుని యాగమును, నంద యశోదల సమాగమమును గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఎనభైనాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## దశమస్కంధము

## ఎనభైఐదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఒక రోజు శ్రీకృష్ణుడు, బలరాముడు తమ తండ్రి వసుదేవుని వద్దకు పోయి ఆయన పాదములకు నమస్కరించి, ఆయన ఆశీర్వాదములు తీసుకున్నారు. వసుదేవుడు తన కుమారులను ఇద్దరినీ బుజములు పట్టుకొని పైకి లేపి ఆప్యాయంగా ఆలింగనముచేసుకున్నాడు. వారితో ఇలా అన్నాడు.

"కృష్ణా! మహాయోగీ! సంకర్షణా! సనాతనా! ప్రకృతి, పురుషులకు మీరు ఇరువురు మూల పురుషులు. ఈ అనంత విశ్వంలో ఉన్న అన్ని పదార్థములు ఏ ప్రదేశములో, ఏ కాలంలో, ఎవని ద్వారా, ఎవని వలన, ఎవరి సంబంధముతో, ఎవరి కొరకు పుడుతున్నాయో అట్టి ప్రకృతి పురుషులకు నీవే అధిపతివి. ఈ ప్రకృతిలో ఉన్న అన్ని పదార్థములు నీ స్వరూపములే కదా! ఈ ప్రకృతిలో ఉన్న కార్యములు, కారణములు అన్నీ నీవే.

ఓ అధోక్షజా! పరమాత్మా! నీ మాయ చేత ఏర్పడిన ఈ విశ్వం లోని జీవులలో ప్రాణశక్తి గానూ, క్రియాశక్తి గానూ ఉండి, ఈ విశ్వాన్ని పోషిస్తున్నావు. ఓ దేవా! ఒక బాణము లక్ష్యం వైపుకు దూసుకుపోతూ ఉందంటే ఆ శక్తి బాణానికి లేదు. ఆ శక్తి ఆ బాణం సంధించి వదిలే విలుకానిది. అలాగే ఈ అనంత విశ్వంలో ఉన్న ప్రాణుల యొక్క కార్య కలాపాల యొక్క శక్తి కూడా నీ శక్తియే. నీవే ఆ ప్రాణులలో అంతర్గతంగా ఉండి నడిపిస్తున్నావు.

ఓ దేవా! ఈ విశ్వంలో కొన్ని వస్తువులు కదిలేవి. మరి కొన్ని కదలనివి. కదిలే పదార్థములు స్వతంత్రంగా కదులుతుంటాయి. కదలని పదార్థాలు తమ శక్తిని తమలోనే దాచుకుంటాయి. కదిలే పదార్థముల వలె తమ శక్తిని బయట పెట్టుకోవు. కాని ఇతర శక్తుల ఆధారంగా ఈ కదలని వస్తువులు కదులుతుంటాయి. గాలికి గడ్డి, దూది, మొదలగు తేలికైన కదలని పదార్థములు, కదులుతాయి, ఎగిరిపోతుంటాయి. విలుకాని శక్తితో నిర్జీవమైన బాణము క్రియాశక్తిని పొందినట్టు, పరమాత్మ శక్తి వల్లనే జీవులలో క్రియాశక్తి పుడుతూ ఉంది. కాబట్టి పరమాత్మ శక్తి లేకుండా ఈ అనంత విశ్వంలో ఏ జీవికీ, ఏ పదార్థానికీ

స్వతంత్ర శక్తి లేదు.

ఓ దేవా! చంద్రుని నుండి వచ్చే వెన్నెల కాంతి, అగ్నినుండి పుట్టే వేడి వెలుతురు, సూర్యుని నుండి వచ్చే ఉష్ణము, తేజస్సు, కాంతి, విద్యుత్తు నుండి పుట్టే శక్తి, పర్వతముల యొక్క ధృఢత్వము, స్థిరత్వము, భూమి యొక్క అయస్కాంత శక్తి, అన్నిటికి ఆధారభూతమైన శక్తి, భూమికి ఉండే వాసన శక్తి ఇవన్నీ కూడా నీ స్వరూపాలే కదా!

ఓ దేవా! ఈ భూమి మీద ఉంటే జలము, దానిని తాగితే వచ్చే తృప్తి అనే శక్తి, ఆ జలములో ఉండే జీవశక్తి, దానిలో ఉండే రస శక్తి, గాలి యొక్క తీవ్రత, బలము, గమనము అన్నీ నీ శక్తి స్వరూపాలే! ఈ దిక్కులు, ఆ దిక్కులు కల్పించే అవకాశ శక్తి, ఆ దిక్కులలో పుట్టే శబ్దశక్తి, నాద శక్తి, ఓంకారము, ఈ విశ్వంలో ఉండే పదార్థాలను వర్ణించే, వాటి పేర్లను పలికే రకరకాల శబ్దాల శక్తి, అన్నీ నీవే కదా!

మానవుల ఇంద్రియముల నుండి వెలువడే శక్తి, ఆ శక్తులకు అధిష్ఠానదేవతలు, వారి యొక్క శక్తి, మానవుల యొక్క బుద్ధిశక్తి, జీవుడు తనను తాను బయట ప్రపంచముతో అనుసంధానించుకొనే శక్తి, అన్నీ నీ ప్రతిరూపాలే! ఓ దేవా! భూతములు ఆవిర్భవించడానికి కారణభూతమైన తామసాహంకారము, ఇంద్రియములు బయట ప్రపంచములో ప్రవర్తించడానికి కారణమైన రాజసాహంకారము, తాను పూజించుకోడానికి అనువైన దేవతలను కల్పించుకోడానికి మానవులకు ఉపకరించే సాత్వికాహంకారము, ఈ లోకములో ఉండే జీవులు అన్నీ అనుభవించే సంసారమునకు కారణమైన ప్రకృతి, అన్నీ

నీవే కదా!

ఓ దేవా! కుండ మట్టితో  తయారవుతుంది. బంగారముతో ఆభరణాలు తయారవుతాయి. కుండను చూస్తే మట్టి కనపడదు. అంటే మట్టి కుండగా రూపాంతరం చెందింది. ఆభరణాన్ని చూస్తుంటే అందులో ఉన్న బంగారము కనపడదు. అంటే బంగారము ఆభరణంగా మార్పు చెందింది.   ఈ జగత్తులో అన్ని జీవులలో నీవు ఆత్మ స్వరూపుడుగా ఉన్నా ఎలాంటి మార్పులేకుండా నీ స్వస్వరూపంతో ప్రకాశిస్తున్నావు. ఎందుకంటే ఈ విశ్వంలో మార్పులేని పదార్థము నీ ఆత్మస్వరూపమే.

ఓ దేవా! ఈ విశ్వంలో సత్వరజస్తమోగుణములు, అవి చేసే పనులు అన్నీ నీ యోగమాయచేత కల్పితం అయ్యాయి. ఈ మూడు గుణములు నీచేత కల్పింపబడ్డాయి కాబట్టి, అవి నీలో కూడా ఉన్నాయి కాని వాటికి నీవు వశుడవు కావు. అవి నీ అధీనంలో ఉంటాయి. నీవు ఈ ప్రపంచంలో ఉన్న చరాచర వస్తువులలో అన్నింటిలోనూ ప్రవేశిస్తున్నావు. సాక్షీభూతంగా ఉంటున్నావు. నీవు లేకపోతే ఆ వస్తువులకు ఉనికి లేదు.

(మనిషి శరీరంలో అన్ని అవయవాలు, ఇంద్రియాలు అన్నీ ఉంటాయి. వాటితో పాటు ప్రాణం  ఉంటుంది.  ప్రాణం పోయిన వెంటనే ఆ శరీరం ఎందుకు పనికి రాదు. కాలుస్తారు లేక పూడుస్తారు. ప్రాణానికి మూలమైన  జీవాత్మ లేని శరీరానికి ఎటువంటి ఉనికి లేదు.)

ఓ దేవా!  సత్వ,రజస్తమోగుణముల ప్రవాహములో పడి, సంసార బంధనములలో చిక్కుకున్న మానవులు, దేహం మీద

అభిమానమును పెంచుకుంటారు. ఈ దేహంలో సూక్ష్మరూపంలో నీవు ఉన్నావనీ తెలియక, ఈ దేహమే తాము, తామే ఈ దేహము, ఈ దేహమే తమ సర్వస్వము, తాము కలకాలము జీవిస్తాము అనే భ్రమలో ఉంటారు.

ఓ దేవా! మానవులు తాము పూర్వజన్మలో చేసుకున్న పుణ్యఫలము చేత మానవ జన్మను పొందుతారు. మంచి ఇంద్రియ శక్తిని, గ్రహణ శక్తిని, బుద్ధిశక్తిని కలిగి ఉంటారు. కానీ నీ మాయలో పడి, కేవలం తమ స్వార్థమే చూసుకుంటారు. నీ గురించి మరిచిపోతారు. తమ జీవితాలను ఆహార,నిద్రా,మైథునములతో వృధాగా గడిపేస్తారు.

ఓ దేవా! ఈ మానవులకు నీవు, అందమైన రూపమును, అందమైన భార్యను, చక్కని సంతానమును, అంతులేని ఐశ్వర్యమును ప్రసాదించి వారిలో అహంకారమును రేకెత్తిస్తున్నావు. వారికి భార్య మీదా, సంతానము మీదా, ధనము మీదా మమకారమును పుట్టిస్తున్నావు. ఆ అహంకార మమకారములతో మానవులు బంధింపబడుతున్నారు.

ఓ దేవా! మీరు ఇద్దరు నిజానికి నా కుమారులు కారు. భూమికి భారముగా పరిణమించిన క్షత్రియులను నాశనం చేసి ధర్మమును స్థాపించడానికి మానవ రూపంలో అవతరించిన ప్రకృతి పురుషులు. ఈ విషయం మాకు గర్గమహాముని మీ జనన సమయంలో చెప్పాడు. ఆ కారణం చేత నేను మీకు తండ్రిని అయినా,

నీ పాదపద్మములను ఆశ్రయించాను. ఇంతకాలము నేను మీ ఇద్దరినీ నా కుమారులుగానే చూచాను. నాలోని ఈ పుత్ర మమకారమును పోగొట్టి, నాకు ఆత్మజ్ఞానమును కలిగించారు. అట్టి మీకు నమస్కారము.

ఓ దేవా! నీవు పుట్టగానే మాకు చతుర్భుజములతో దర్శనం ఇచ్చావు. నీవు అవతార మూర్తివి అని అప్పుడే మాకు చెప్పావు. అంతలోనే నీవు పసిబిడ్డగా మారి పోయావు. మమ్ములను పుత్రవ్యామోహం అనే మాయలో పడవేసావు. నీ మాయను తెలుసుకోవడం ఎవరి తరమూ కాదు కదా!" అని భక్తితో అన్నాడు వసుదేవుడు.

తన తండ్రి తమను గురించి అన్నమాటలను విన్న కృష్ణుడు పెద్దగా నవ్వాడు. తండ్రి వసుదేవునికి వినయంగా నమస్కరించి ఇలా అన్నాడు.

"తండ్రీ! నేను నీ కుమారుడనే. నా గురించి నీవు ఏమేమో మాట్లాడావు. అవి అన్నీ నిజాలే. తండ్రీ! నేను, నా అన్న బలరాముడు, మీరు, యాదవులు, ద్వారకానగరవాసులు, ఒకటేమిటి ఈ చరాచర జగత్తు అంతా ఆ పరబ్రహ్మస్వరూపముగా నీవు భావించడం చాలా యుక్తియుక్తముగా ఉంది. ఆ పరమాత్మ, పరంజ్యోతి స్వరూపుడు. తనకు తాను స్వయంగా ప్రకాశిస్తాడు. దేని మీదా ఆధారపడడు. ఆయన నిత్యుడు. ఎప్పటికీ ఉండేవాడు. మార్పులేని వాడు. సత్వ,రజస్తమోగుణములు ఆయనకు అంటవు. ఆయన ఈ ప్రకృతి కంటే భిన్నమైన వాడు. ఆయనతో సమానం ఎవరూ లేరు.

ఆయన ముందు సత్వ,రజస్తమోగుణములను సృష్టించాడు. ఆ మూడు గుణములు, పంచభూతముల కలయికతో ఈ దేహములను సృష్టించాడు. ఆ దేహములలో తాను ఆత్మస్వరూపుడుగా ప్రవేశించాడు. ఈ శరీరములు అన్నీ, భూమి, ఆకాశము, నీరు, వెలుగు, గాలి ఈ ఐదింటి కలయితో పొట్టిగా, పొడుగ్గా, లావుగా, సన్నగా, వివిధ రూపములతో, పుట్టుక, చావు అనే ధర్మములతో ఏర్పడ్డాయి. పరమాత్మ కూడా ఈ దేహములలో ప్రవేశించి ఆ దేహములతో చేసే కర్మలను సాక్షీభూతంగా చూస్తున్నాడు. ఈ ప్రకారంగా మీరు చెప్పిన మాటలన్నీ నిత్యసత్యములు." అని అన్నాడు కృష్ణుడు.

తన కుమారుడు కృష్ణుడు తన గురించి చెప్పిన మాటలను విన్న వసుదేవుడు మౌనంగా విన్నాడు. ఇంతలో వసుదేవుని భార్య శ్రీకృష్ణుని తల్లి అయిన దేవకీదేవి అక్కడకు వచ్చింది. దేవకీ దేవి అంతకు ముందు, కృష్ణుడు చిన్న తనంలోనే తన గురువుగారు సాందీపుని కుమారులను యమలోకం నుండి తెచ్చి ఇచ్చాడు, అన్న విషయం విన్నది. ఇప్పుడు ఆమెకు కంసుని చేతిలో మరణించిన తన ఏడుగురు కుమారులు గుర్తుకు వచ్చారు. కృష్ణుని దైవస్వరూపుడుగా భావించి ఇలా అంది.

" కృష్ణా! యోగేశ్వరేశ్వరా! మీరు సామాన్యులు కారు. సనాతనపురుషులు, పరమాత్మ స్వరూపులు. బ్రహ్మనే శాసించగల వారు. మీరు ఇరువురు ఈ జగత్తునే శాసించగల శక్తి కలవారయ్యును, శాస్త్రనియమములను వ్యతిరేకిస్తూ, పాపకర్మలు చేస్తూ, భూమికి భారంగా పరిణమించిన రాజులను సంహరించడానికి నా గర్భవాసాన

మానవులుగా జన్మించారు.

ఓ సర్వాంతర్యామీ! వైకుంఠనాథా! ఆదిపురుషా! సృష్టి,స్థితి,లయకారకా! నేను నిన్ను ఆశ్రయించాను. నా కోరిక తీరుస్తావని ఆశిస్తున్నాను. నీ గురువుగారైన సాందీపుని యొక్క కుమారులు సముద్రములో మునిగి చనిపోయారనీ, సాందీపుడు, ఆయన భార్య కోరిక మేరకు  యమలోకమునుండి వారి కుమారులను తెచ్చి  గురువు గారికి గురుదక్షిణగా ఇచ్చావనీ విన్నాను. కంసుడు నీ అన్నలైన ఏడుగురు కుమారులను నిర్దాక్షిణ్యంగా చంపాడు. మరి వారిని కూడా నీవు నాకు తెచ్చి ఇవ్వ గలవా! మీ గురువు గారి కోరిక తీర్చిన మీకు ఇది అసాధ్యం కాదు కదా!" అని అడిగింది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ విధంగా దేవకీదేవి తన కుమారులు అయిన బలరామ కృష్ణులను, కంసుని చేతిలో మరణించిన తన ఏడుగురు కుమారులను తెచ్చి ఇవ్వమని కోరగానే, బలరామ కృష్ణులు తల్లి కోరిక తీర్చడానికి సమాయత్తమయ్యారు.

వారు వెంటనే యోగమాయను ఆశ్రయించారు. యోగమాయా ప్రభావంతో సుతలమునకు వెళ్లారు. సుతలమును బలిచక్రవర్తి పరిపాలిస్తున్నాడు. బలరాముడు, కృష్ణుడు తన  లోకానికి వచ్చారు అని తెలిసి వారికి ఎదురు వెళ్లి స్వాగత సత్కారాలు చేసాడు. వారికి భక్తితో నమస్కరించాడు. ఇద్దరికి ఉన్నతాసనములు ఇచ్చి ఆసీనులను చేసాడు.  బలరామ కృష్ణులకు బలి కాళ్లు కడిగి ఆ నీరు నెత్తిన చల్లుకున్నాడు. వారి పాదములను పూలతో పూజించాడు.  బలి చక్రవర్తి తన విభవమునకు తగినట్టు విలువైన వస్త్రములు,

ఆభరణములు, కానుకలు బలరామ కృష్ణులకు సమర్పించుకున్నాడు. చక్కని ఆహారమును సమకూర్చాడు. తరువాత చేతులు జోడించి, కృష్ణునితో ఇలా అన్నాడు.

"నేను మహాత్ముడైన అనంతునికి, సాంఖ్యయోగమును లోకములో విస్తరింపచేసినవాడు, జగత్తునకే ప్రభువు, సర్వాంతర్యామి అయిన కృష్ణునకు భక్తితో నమస్కరిస్తున్నాను. సామాన్య మానవులకు మీ ఇరువురి దర్శనము అసలు దొరకదు. కానీ మీ దయ ఉంటే మీ దర్శనం చాలా సులభంగా దొరుకుతుంది. నా మీద మీయొక్క కటాక్షము ప్రసరించడం వలన నాకు ఈ నాడు మీ ఇరువుని దర్శనభాగ్యం కలిగింది. నాజన్మ ధన్యమయింది.

ఓ దేవా! దైత్యులు, దానవులు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు, చారణులు, యక్షులు, రాక్షసులు, పిశాచములు. భూతములు, ప్రమధులు, మా వంటి వారు, నీ మీద విరోధభావంతో నిన్ను దూషించిన శిశుపాలుడు మొదలగువారు, ఇంకా విశుద్ధమైన సత్వగుణ సంపన్నులు, నీ మీద అచంచల మైన ఏకాగ్రమైన భక్తి కలవారు, నీ మీద అమాయకమైన భక్తి, ప్రేమచూపిన గోపికలు, వారు వీరు అననేల, ఏకాగ్రబుద్ధితో నిరంతరము నీ నామ స్మరణ చేసినవారు, సునాయాసంగా నిన్ను చేరుకోగలిగారు. నీ మీద భక్తితో, శ్రద్ధతో, నిన్ను స్మరించనిదే దేవతలకు కూడా ఇది సాధ్యం కాదు.

ఓ యోగీశ్వరేశ్వరా! బ్రహ్మ మొదలగు దేవతాగణములు కూడా నీ స్వరూపమును గానీ, నీ చేత సృష్టించబడిన యోగమాయను కానీ

తెలుసుకోలేరు. వారికే తెలియనపుడు మాకు మాత్రము నీ యోగమాయావిశేషములు ఎలా తెలుస్తాయి!

మా బోటి వారము నీ పాద కమలములకు, అనన్యభక్తితో సేవించే నీ భక్తులకు దూరంగా, ఈ సంసార కూపంలో పడి కొట్టుకుంటున్నాము. ఈ సంసారము నుండి, ఈ భోగభాగ్యముల నుండి బయట పడి, నీ చరణములను ఆశ్రయించే మార్గము మాకు ఉపదేశించు. మా మనసులకు శాంతి చేకూర్చు. నీ ఆజ్ఞను పాలించి, నిన్ను సేవించి, నీ భక్తిలో మునిగి పోయిన మానవులు ఈ సంసార బంధనముల నుండి విముక్తులవుతున్నారు. మాకు కూడా అటువంటి మార్గమును బోధించి మమ్ములను తరింపజెయ్యి." అని బలి చక్రవర్తి శ్రీకృష్ణుని ప్రార్థించాడు.

బలి చక్రవర్తి చెప్పినది అంతా ఆలకించిన శ్రీకృష్ణుడు బలి చక్రవర్తితో ఇలా అన్నాడు. "ఓ దైత్య రాజా! పూర్వము, స్వాయంభువ మన్వంతరములో, మరీచి మహర్షి భార్య అయిన ఊర్ణాదేవికి ఆరుగురు కుమారులు కలిగారు. ఆ సమయంలో బ్రహ్మ సరస్వతిని సృష్టించాడు. తరువాత ఆమె కావాలని కోరుకున్నాడు. (బ్రహ్మ మొదట వాక్కును సృష్టించాడు. తరువాత ఆ వాక్కును ఆశ్రయించాడు.) బ్రహ్మ తన స్వంత కూతురు అయిన సరస్వతిని కామించాడు అని తెలిసిన మరీచి కుమారులు అది చూచి నవ్వారు. బ్రహ్మ వారిని అసురయోనిలో పుట్టమని శపించాడు. ఆ శాపఫలితంగా మరిచీ కుమారులు అయిన ఆ ఆరుగురు హిరణ్యకశిపునికి కుమారులుగా జన్మించారు. వెంటనే మరణించి ఆ జన్మనుండి విముక్తి పొందారు.

మరలా వారు దేవకీదేవికి ఆరుగురు కుమారులుగా జన్మించారు. వెంటనే కంసుని చేతిలో మరణించి విముక్తి పొందారు. కాని మానవ మాత్రురాలైన నా తల్లి దేవకి మరణించిన ఆరుగురు కుమారుల కోసరం పరితపిస్తూ వారిని తెచ్చి తనకు చూపించమని నన్ను కోరింది. ఆ ఆరుగురు ప్రస్తుతము నీ వద్ద ఉన్నారు. మా తల్లి శోకమును పోగొట్టడానికి నేను వారిని ఒకసారి తీసుకొని వెళ్లి నా తల్లికి చూపిస్తాను. వెంటనే వారికి శాప విమోచన అవుతుంది. వారు మరలా తమ యథాస్థానమైన దేవలోకము చేరుకుంటారు. వారికి సద్గతులు కలుగుతాయి." అని అన్నాడు.

కృష్ణుని కోరిక తీర్చడానికి బలి చక్రవర్తి సంతోషంగా అంగీకరించాడు. స్మరుడు, ఉద్గీథుడు, పరిష్వంగుడు, పతంగుడు, క్షుద్రభృత్తు, ఘృణి అనే ఆరుగు కుమారులను తీసుకొని బలరామ కృష్ణులు ద్వారకకు వచ్చారు. దేవకీ దేవి ఎదుట వారిని నిలబెట్టాడు. చనిపోయిన తన ఆరుగురు కుమారులను చూడగానే దేవకీదేవిలో మాతృప్రేమ పొంగింది. దేవకీ దేవి వారిని ఆలింగనము చేసుకొని వారి తలల మీద ముద్దు పెట్టుకుంది.

శ్రీకృష్ణుని యోగమాయ వలన, దేవకీ దేవికి, ఆ ఆరుగురు కుమారులు, వారు కంసుడు చంపినపుడు ఏ దేహములతో ఉన్నారో అదే దేహములతో కనిపించారు. శాపవిమోచన అయిన ఆ ఆరుగురు తమ తల్లి దేవకీదేవికి, బలరామ కృష్ణులకు నమస్కరించి దేవలోకము వెళ్లిపోయారు. ఇదంతా దేవకీ దేవికి ఒక మాయలాగా గోచరించింది. ఇదంతా పరమాత్మ స్వరూపుడైన తన కుమారుని యోగ మాయ అని

తలచుకొని ఆశ్చర్యపోయింది.

ఓ పరీక్షిత్ మహారాజా! మానవలోకంలో, సామాన్య మానవునిగా పుట్టిన కృష్ణుని లీలలు ఇంకా ఎన్నో ఉన్నాయి. ఈ కృష్ణలీలలను భక్తితో విన్నా, గానం చేసినా, వారి జన్మములు ధన్యమౌతాయి అనడంలో సందేహము లేదు. తుదకు పరమాత్మలో లీనం అవుతారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కంసుని చేతిలో చనిపోయిన దేవకీ దేవి ఆరుగురు కుమారులను మరలా తెచ్చి తల్లికి చూపించి, ఆమె ఋణం తీర్చుకోవడం గురించి విపులంగా చెప్పాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము ఎనభై ఐదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
ఎనభై ఆరవ అధ్యాయము.

"ఓ శుకయోగీంద్రా! తమరు నాకు ఇప్పటి వరకు శ్రీకృష్ణ లీలలను గురించి వీనుల విందుగా  చాలా బాగా వివరించారు. మా పితామహి అంటే మా తండ్రి గారి తల్లి, శ్రీకృష్ణులవారి చెల్లి అయిన సుభద్రను మా తాత గారు అర్జునుల వారు ఎలా వివాహం చేసుకున్నారు. ఆ వివరాలు నాకు చెప్పండి." అని అడిగాడు పరీక్షిత్తు. శుక మహర్షి ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! పాండవుల అరణ్య వాస కాలములో ఒక సారి అర్జునుడు తీర్థయాత్రలు చేయడానికి వెళ్లాడు. ప్రభాస తీర్థము చేరుకున్నాడు. అక్కడ అర్జునునకు ఒక విషయం తెలిసింది. తన మేనమామ కుమార్తె అయిన సుభద్రను బలరాముడు తన శిష్యుడు సుయోధనునకు ఇచ్చి వివాహం చెయ్యాలని నిశ్చయించాడనీ, ఆ వివాహం వసుదేవునికి, కృష్ణునికి, సుభద్రకు ఇష్టం లేదనీ తెలుసుకున్నాడు.

అర్జునుడు వెంటనే ద్వారకానగరానికి వెళ్లాడు. సన్యాసి వేషం వేసుకున్నాడు. త్రిదండి సన్యాసిగా ద్వారకా నగర పరిసరాలలో తిరుగుతున్నాడు. అక్కడ చాతుర్మాస్య వ్రతం గడుపుతున్నాడు. ఈ విషయం బలరామునికి తెలిసింది. బలరామునికి సన్యాసులు అంటే ఎంతో ప్రేమ గౌరవము, భక్తి. వెంటనే బలరాముడు తన పరివారముతో సన్యాసి వేషములో ఉన్న అర్జునుని దర్శనానికి వెళ్లాడు. ఆయనను భిక్షకు తన ఇంటికి ఆహ్వానించాడు. అర్ఘ్యము పాద్యము ఆసనము ఇచ్చి సత్కరించాడు. మధురాన్నములతో భిక్షను సమర్పించాడు.

బలరాముని వెంట వచ్చిన సుభద్రను చూచాడు అర్జునుడు. అపూర్వ సౌందర్యవతి అయిన సుభద్రను చూచి మోహపరవశు డయ్యాడు. ఆమెనే వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆమె దర్శనం కోసరం పరితపిస్తున్నాడు. సుభద్ర కూడా ఆజానుబాహుడు, అందగాడు, తన బావ అయిన అర్జునునికి తన మనసును అర్పించింది. బలరాముడు సన్యాసి వేషంలో ఉన్న అర్జునుని చాతుర్మాస్య వ్రతము తన ఉద్యాన వనములో జరిపించుకోమని కోరాడు. అర్జునుడు

అంగీకరించాడు. బలరాముడు ఎన్ని సౌకర్యాలు కల్పించినా, అర్జునుని మనసు మాత్రం సుభద్ర సన్నిధానాన్ని కోరుతూ ఉంది.

ఇంతలో శ్రీకృష్ణునికి ఈ విషయం తెలిసింది. ఆయన దేవకీ వసుదేవులతో ఈ విషయం చర్చించాడు. సుభద్రను బలవంతంగా తీసుకొని పొమ్మని అర్జునునికి సూచన ప్రాయంగా తెలియజేసాడు. సమయం కోసరం వేచిఉన్నాడు అర్జునుడు.

ఒక రోజు సుభద్ర దేవి పూజకోసరం రథం మీద నగర వెలుపలికి వచ్చింది. అదే సమయం అని అర్జునుడు ఆ రథం ఎక్కాడు. తన నిజ రూపాన్ని సుభద్రకు చూపించాడు. సారథిని పక్కకు నెట్టాడు. రథం నడుపుకుంటూ వేగంగా వెళ్లిపోయాడు. అప్పటి వరకు తాను సేవలు చేసిన సన్యాసి తన బావ అర్జునుడు అని తెలిసిన సుభద్ర మనసు ఆనందంతో పరవళ్లు తొక్కింది.

సుభద్ర వెంట వస్తున్న ఆమె చెలికత్తెలు, రక్షకభటులు ఇది చూచి హాహాకారాలు చేసారు. రక్షకభటులు అర్జునుని రథమును వెంబడించారు. అర్జునుడు తన ధనుస్సు తీసుకొని వారి మీద బాణములను ప్రయోగించాడు. అర్జునుని బాణముల ధాటికి యాదవ వీరులు తట్టుకోలేక పోయారు. తిరిగి వచ్చి బలరామునికి ఈ విషయం చెప్పారు. శ్రీకృష్ణుడు తన అన్న బలరాముని చేతులు పట్టుకొని అసలు విషయం చెప్పి, శాంతింపజేసాడు. వసుదేవుడు, దేవకీదేవి కూడా బలరామునికి నచ్చచెప్పారు.

తరువాత బలరాముడు, కృష్ణుడు అనేకములైన కానుకలను, వస్త్రములను, ఆభరణములను తీసుకొని పోయి అర్జునునకు ఇచ్చారు. సుభద్రా అర్జునుల వివాహం ఘనంగా జరిపించారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ విధంగా నీ పితామహి సుభద్ర వివాహం అర్జునునితో జరిగింది. కృష్ణ మహాత్మ్యమును తెలిపే మరొక వృత్తాంతమును చెబుతాను శ్రద్ధగా విను.

ఆ రోజుల్లో కృష్ణభక్తుడు అయిన బ్రాహ్మణుడు ఒకడు ఉండేవాడు. ఆయనకు తీరని కోరికలు అంటూ లేవు. అమిత శాంత మూర్తి. ప్రాపంచిక విషయములలోనూ, విషయ వాంఛలలోనూ ఏ మాత్రం ఆసక్తి లేని వాడు. దొరికి దానితోనే తృప్తి పడేవాడు. భగవంతుడు ఏది ఇస్తే దానితో కుటుంబ పోషణ జరుపుకునే వాడు. జనకుని వంశములో పుట్టిన  బహులాశ్వుడు అనే రాజు మిథిలా నగరమును పరిపాలిస్తూ ఉండేవాడు. ఆ బహులాశ్వునకు అహంకారము అనేది తెలియదు. బహులాశ్వుడు కూడా కృష్ణభక్తుడు.

శ్రీకృష్ణుడు తన భక్తులైన బహులాశ్వుని, ఆ బ్రాహ్మణుని చూడడానికి తన రథం మీద మిథిలా నగరమునకు బయలుదేరాడు. శ్రీకృష్ణుని వెంట నేను, నారదుడు, వామదేవుడు, అత్రి, వ్యాసుడు, భార్గవుడు, అసితుడు, అరుణి, బృహస్పతి, కణ్వుడు, మైత్రేయుడు, చ్యవనుడు ఆయన వెంట వెళ్లాము. శ్రీకృష్ణుని రాకను విని దారిలో ఉన్న  గ్రామ, పట్టణ, నగర వాసులు వారికి, మాకు అర్ఘ్యము పాద్యము ఇచ్చి సత్కరించారు. రాజమార్గములకు అటు ఇటు నిలబడి శ్రీకృష్ణునికి

ఘనస్వాగతం పలికారు. శ్రీకృష్ణుడు ప్రయాణించే దారిలో గల ఆనర్త, ధన్వ, కురు జాంగల, కంక, మత్స్య, పాంచాల, కుంతి, మధు, కేకయ, కోసల మొదలగు దేశముల ప్రజలు శ్రీకృష్ణుని చూడటానికి ఆయన ప్రయాణించే మార్గమునకు అటుఇటు బారులు తీరి నిలబడి ఆయనను పూజించారు.

శ్రీకృష్ణుడు వారి పూజలు అందుకుంటూ, వారికి తత్వజ్ఞానమును బోధిస్తూ విదేహ రాజ్యమునకు వెళ్లాడు. విదేహ రాజ్య ప్రజలు తమకు తోచిన కానుకలను తీసుకొని కృష్ణునికి ఎదురు వెళ్లి, శ్రీకృష్ణుని అర్చించారు. ఆయనకు పాదాభి వందనము చేసారు. ఆయన వెంట వెళుతున్న మునులకు పాదాభివందనము చేసి అర్ఘ్య పాద్యములు సమర్పించారు.

మిథిలా నగరమును పరిపాలించే బహులాశ్వుడు, ఆ నగరంలో నివసించే శ్రుత దేవుడు అనే బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని పాదముల మీద పడి నమస్కరించారు. వారిద్దరూ శ్రీకృష్ణుని, ఆయన వెంట వచ్చిన మునులను తమ గృహమునకు వచ్చి తమ ఆతిథ్యమును స్వీకరించమని కోరారు. శ్రీకృష్ణుడు వారి ప్రార్థనను మన్నించి వారి ఇద్దరి గృహములకు వెళ్లాడు. ఇద్దరి ఇళ్లకు ఒకే సారి వెళ్లాడు.

బహుళాశ్వుడు శ్రీకృష్ణుని రాకను దూరం నుండి చూచి, వారికి ఎదురు వెళ్లి అర్ఘ్యము పాద్యము ఆసనము ఇచ్చి సత్కరించాడు. శ్రీకృష్ణుని, ఆయన వెంట వచ్చిన మునుల కాళ్లు కడిగాడు. ఆ నీళ్లు తల మీద చల్లుకున్నాడు. గంధము, పుష్పములు, నూతన వస్త్రములు సమర్పించాడు. ధూప,దీప,నివేదనలను సమర్పించాడు. వారికి

ఆవులను కానుకలుగా ఇచ్చి సత్కరించాడు. తరువాత బహుళాశ్వుడు మృష్టాన్నములతో వారికి భోజనము పెట్టాడు. భోజనానంతరము వారు విశ్రాంతి తీసుకుంటూ ఉంటే, వారి పాదములు వత్తుతూ బహుళాశ్వుడు ఈ విధంగా అన్నాడు.

"ఓ దేవా! నీవు సకల జీవ రాసులలో చైతత్య స్వరూపముగా, ప్రకాశస్వరూపముగా వెలుగుతున్నావు. అటువంటి నీవు, నేను నీ చరణములను ఎల్లప్పుడూ ధ్యానం చేయడం వలన నాకు నీ దివ్యదర్శనభాగ్యము కలిగించావు. ఓ దేవా! నీవు అప్పుడప్పుడు అంటుంటావు. "నాకు నా భక్తులకంటే నా భార్య లక్ష్మి గానీ, నా కుమారుడు బ్రహ్మ కానీ ఎక్కువ కాదు" అని. నా పట్ల ఆ వాక్కు నిజం చేసావు.

నీవు ఏ కోరికా లేనివారు, ఎల్లప్పుడు ప్రశాంతంగా ఉండేవారు అయిన మునులయొక్క హృదయములలో నివసిస్తుంటావు, వారిని అనుగ్రహిస్తావు అన్న విషయం తెలిసిన వాడు ఎవరైనా నీ పాదపద్మములను విడిచి పెడతాడా! ఓ దేవా! నీవు యదు వంశములో జన్మించి, ఈ లోకములో ఉన్న మానవుల యొక్క సంసార బంధనములను పోగొట్టడానికి, వారి పాపములను నాశనం చేయడానికి, వారికి ఆత్మజ్ఞానమును కలిగించడానికి అనేకములైన బోధనలను చేస్తున్నావు.

అహింసాపరుడు, శాంతమూర్తి, బదరికాశ్రమములో తపస్సు చేస్తున్న నారాయణ ఋషి నీ కంటే వేరు కాడు. మీరిద్దరూ ఒకటే.

అటువంటి నీకు నమస్కరిస్తున్నాను. ఓ దేవా! నీవు నా ఇంట్లో కొన్ని దినములు ఉండి, నా గృహమును, ఈ మిథిలా నగరమును పావనం చేయమని కోరుతున్నాను." అని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు బహుళాశ్వుని కోరిక మన్నించి ఆయన గృహములో కొన్ని దినములు ఉన్నాడు.

అదే మాదిరి శ్రీకృష్ణుడు శ్రుతదేవుడు అనే బ్రాహ్మణుని ఇంటికి కూడా వెళ్లాడు. శ్రీకృష్ణుని చూచిన శ్రుతదేవునికి శరీరం పులకించింది. ఆనందంతో మైమరచిపోయాడు. కృష్ణుని చూచిన ఆనందంతో, భక్తితో నృత్యం చేసాడు. గడ్డితో చేసిన ఒక చాప మీద శ్రీకృష్ణుని కూర్చోబెట్టాడు. భార్యాసమేతంగా ఆయన పాదములను కడిగాడు. ఆయన పాదోదకము తలలమీద జల్లుకున్నాడు. శ్రీకృష్ణుని పాదోదకమును ఇల్లంతా చల్లుకున్నాడు.

ఆ బ్రాహ్మణుడు నిరుపేద. ఆయన ఇంట్లో ఏమీ లేవు. దొరికిన ఉసిరిక పళ్లు శ్రీకృష్ణునికి ఫలహారంగా పెట్టాడు. నీళ్లు ఇచ్చాడు. తులసి దళములను సమర్పించాడు. తన ఇంట్లో ఉన్న వరి అన్నమును శ్రీకృష్ణునికి సమర్పించాడు. శ్రీకృష్ణునితో పాటు వచ్చిన మునులకు కూడా ఉసిరిక పళ్లు జలము ఇచ్చి సత్కరించాడు. కాని ఆ పేద బ్రాహ్మణునికి ఒక ఆలోచన వచ్చింది.

"ఈ మునులందరూ శ్రీకృష్ణుని వెంట వచ్చారు. వీరి పాదధూళితో నా ఇల్లు పవిత్రమయింది. నేనా ఒక పేదబ్రాహ్మణుడను. భార్యపిల్లలతో నిత్య దరిద్రం అనుభవిస్తున్నాను. ఎల్లప్పుడూ కృష్ణుని మనసులో నిలుపుకొని అర్చిస్తున్నాను. ఇటువంటి నా ఇంటికి ఈ మహా

మునులు, వీరికి ఆశ్రయమును ఇచ్చే సాక్షాత్తు శ్రీకృష్ణుడు నా ఇంటికి రావడం చాలా ఆశ్చర్యంగా ఉంది." అని తనలో తాను అనుకున్నాడు. తన భార్యాపిల్లలతో కృష్ణుని పాదముల వద్ద, ఆ మునుల పాదముల వద్ద కూర్చుని వారి పాదములను వత్తుతున్నారు. మునులతో పాటు సుఖంగా కూర్చుని ఉన్న శ్రీకృష్ణుని చూచి శ్రుతదేవుడు ఇలా అన్నాడు.

"ఓ దేవా! నీవు సత్వ, రజస్తమోగుణములతో కూడిన ఈ అనంత విశ్వమును సృష్టించి అందులో ప్రవేశించావు. నేను కూడా ఆ విశ్వంలో ఒక రేణువు అయినందున, నీవు కూడా నాలో ప్రవేశించావు. అటువంటి నీ దర్శనభాగ్యము నేడు నాకు కలిగింది. ఓ దేవా! మానవులు నిద్రలో అనేక స్వప్నములు కంటుంటారు. తానే అనేక రూపములతో ఎన్నోపనులు చేస్తుంటారు. తెలివి రాగానే స్వప్నం అంతా కరిగిపోతుంది. అలాగే నీవు కూడా ఇప్పుడు మాకు ఒక కల లాగా కనపడుతున్నావు. అంతలోనే వెళ్లిపోతావు. కాని మా హృదయములలో ఎల్లప్పుడూ నిలిచి ఉంటావు. కేవలం మా హృదయములలోనే కాదు, ఎల్లప్పుడూ నీ కథలను వినడం, గానం చేయడం, కీర్తించడం, నిన్ను అర్చించడం, నీకు నమస్కరించడం, అహంకారము, మత్సరము మొదలగు మలినములను వదిలిపెట్టినవారు అయిన మహాత్ముల హృదయ కమలములలో నిరంతరము విరాజిల్లుతుంటావు.

ఓ దేవా! నీవు సకల జీవ రాసులలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నప్పటికినీ, ఆ జీవులు రజో,తమోగుణముల ప్రభావంతో చేసే ఏ కర్మలతోనూ, వారి అహంకారముతోనూ ఎలాంటి సంబంధం పెట్టుకోవు. కేవలము జీవులు చేసే కర్మలను సాక్షిగా చూస్తుంటావు.

మమతానురాగాలకు, రాగద్వేషాలకు, అహంకారానికి ఆమడ దూరంలో ఉంటావు. నీ గురించి వింటూ, నిన్ను కీర్తిస్తూ ఉండే నీ భక్తజనులకు చాలా దగ్గరగా వారి హృదయకుహరములలో శాశ్వతంగా నివసిస్తూ ఉంటావు.

ఓ దేవా! ఎవని దేహములో అహంకారము ఉండదో, వాడికి సులభంగా మోక్షాన్ని ప్రసాదిస్తావు. ఎవని దేహమందు అహంకారము ఉంటుందో, వారిని సంసార బంధనములలో పడవేస్తావు. ఆ సంసార బంధనములను తెంచుకుంటేనే గాని, వాడు నిన్ను చేరుకోలేడు.

నీవు బయట ప్రపంచానికి నీ విరాట్ రూపమును ప్రకృతి రూపంలో ప్రదర్శిస్తూ ఉంటావు. కాని నీకు అసలు రూపమే లేదు. నీవు సచ్చిదానంద స్వరూపుడవు. మా బోటి మానవుల దృష్టి పరిమితము. కాని నీ దృష్టి అపరిమితము. అప్రతిహతము. అటువంటి నీకు భక్తితో నమస్కరిస్తున్నాను.

ఓ దేవా! నీ దర్శనమాత్రము చేతనే నా కష్టములు అన్నీ తొలగి పోయాయి. నాకు కోరుకోడానికి ఏమీ లేదు. నేను నీ సేవకుడను. నేను ఏమి చేయవలెనో ఆజ్ఞాపించు." అని వినయంగా ప్రార్థించాడు శ్రుతదేవుడు అనే ఆ పేద బ్రాహ్మణుడు.

శ్రీకృష్ణుడు ఆ బ్రాహ్మణుని చేతిని తన చేతితో పట్టుకొని లేవదీసి అతనితో ఆప్యాయంగా ఇలా అన్నాడు. "బ్రాహ్మణోత్తమా! ఈ మునులు తమ పాదములకు అంటిన ధూళిని మూడులోకములలో

వ్యాపింప జేసి, పవిత్రం చేస్తున్నారు. వీరంతా నాతోపాటు తిరుగు తుంటారు. ఈ మునులందరూ నిన్ను అనుగ్రహించడానికే నీ ఇంటికి వచ్చారు. ఏ దేవతలను పూజించినా, పుణ్యక్షేత్రములు దర్శించినా, గంగ మొదలగు నదులలో స్నానం చేసినా, చాలా కాలం తరువాత కానీ వారికి మోక్షము కలుగదు. అటువంటి వారు, నీ వంటి బ్రాహ్మణులను పూజిస్తే వెంటనే పవిత్రులవుతారు. కాని ఈ మహా మునులను చూచినంతనే మానవులు పవిత్రలవుతున్నారు.

ఈ లోకంలో బ్రాహ్మణులు వేదాధ్యయనము, శాస్త్రవిజ్ఞానము ద్వారా అన్ని ప్రాణులలో కల్లా శేష్టులు. ఆ బ్రాహ్మణులే తపస్సు, జ్ఞానము, తుష్టి, భగవత్ ఉపాసన మొదలగుని పాటిస్తే ఇంకా ఆ పుణ్యమూర్తులు అయిన బ్రాహ్మణుల గురించి చెప్పేదేముంది. నా కంటే కూడా సత్పురుషులైన బ్రాహ్మణులు గొప్ప అని తలచి నేను వారికి సదా నమస్కరిస్తుంటాను. బ్రాహ్మణులు వేదస్వరూపులు. నేను కూడా వేదస్వరూపుడనే కాబట్టి వారి ముఖముల ద్వారా నేను ప్రకటితమవుతున్నాను. (బ్రాహ్మణోస్యముఖమాసీత్...పురుష సూక్తం).

వివిధ ప్రతిమలను దేవతా స్వరూపాలుగా పూజించేవారు, ఆ ప్రతిమలనే దేవుళ్లుగా నమ్మే వాళ్లు,  కేవలం అసూయతో బాధపడేవారు (అంటే మా దేవుడే గొప్ప మీ దేవుడు అసలు దేవుడే కాదు అంటూ అసూయపడేవారు), వీరెవ్వరూ నేను బ్రాహ్మణుల హృదయాలలో నివాసం ఉంటున్నాననే సంగతి తెలియక, లోకగురువులు అయిన బ్రాహ్మణులను అవమానిస్తుంటారు. ఈ విగ్రహములను పూజించే వారంతా నేను సత్పురుషులైన బ్రాహ్మణుల ముఖము నుండి

ప్రకటితమౌతుంటాను అని గ్రహించాలి. నా కంటే ఈ మహాఋషులు, మహామునులు పూజ్యులు. నేను కూడా వీరినే పూజిస్తాను. వీరిని పూజించకుండా నన్ను పూజిస్తే అది వృథా శ్రమ తప్ప వేరు కాదు.” అని పలికాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుని ఆదేశానుసారము శ్రుతదేవుడు, బహుళాశ్వుడు ఆ మహామునులను పూజించి సద్గతులను పొందారు. ఈ విధంగా శ్రీకృష్ణుడు బహుళాశ్వుడు, శ్రుతదేవుడు ఇళ్లకు వెళ్లి వారికి జ్ఞానోపదేశము చేసాడు.” అని శుక యోగీంద్రుడు పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడు బహుళాశ్వుని, శ్రుతదేవుని ఏ విధంగా అనుగ్రహించిందీ చెప్పాడు.
(ఇక్కడ బ్రాహ్మణులు అంటే కేవలం పుట్టుకతో బ్రాహ్మణులు కాదు. బ్రాహ్మణ కులంలో పుట్టినంత మాత్రాన ఎవరూ బ్రాహ్మణులు కారు. వేదాధ్యయనము చేసినవారు, శాస్త్రములను, పురాణములను చదివినవారు, మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము కలవారు. ఇతరుల ద్రవ్యమునకు ఆశపడని వారు, భగవంతుడు ఇచ్చిన దానితో జీవనం గడుపుకుంటూ తృప్తిగా జీవించే శ్రుతదేవుని వంటి వారే నిజమైన బ్రాహ్మణులు. మనకందరికీ ఈ విషయం తెలయజేయాలనే ఈ శ్రుతదేవుని వృత్తాంతము, భగవాన్ శ్రీకృష్ణుని ముఖతా మనకు అందించాడు వ్యాసుడు.)

శ్రీమద్భాగవతము

దశమస్కంధము ఎనభై ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

దశమస్కంధము

ఎనభై ఏడవ అధ్యాయము.

ఇదంతా విన్న తరువాత పరీక్షిత్ మహారాజుకు ఒక సందేహము కలిగింది. "మునీంద్రా! పరబ్రహ్మము ఈ ప్రకృతి కంటే, సత్వ,రజస్తమోగుణముల కంటే అతీతమైనది కావడం చేత, ఆ బ్రహ్మ తత్వము ఇలా ఉంటుంది అని ఎవరూ నిర్ణయించలేకపోతున్నారు కదా! వేదములు ఆ బ్రహ్మ పదార్థమును ఏ విధంగా నిర్వచించాయి నాకు తెలుపవలసింది." అని అడిగాడు.

శుక యోగీంద్రుడు ఈ విధంగా చెప్పసాగాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! ఆత్మ ప్రాపంచిక విషయముల వైపు మళ్లితే జీవాత్మ అవుతుంది. అదే ఆత్మ పరమాత్మ వైపు మళ్లితే, పరమాత్మలో లీనం అవుతుంది. జీవాత్మ కర్మలు చేయడానికి వీలుగానూ, సుఖభోగములు అనుభవించడానికి గానూ, పంచ భూతములతోనూ, పంచ తన్మాత్రలతోనూ, బుద్ధి, మనస్సు, ఇంద్రియముల తోనూ, ప్రాణములతో కూడిన ఈ శరీరమును సృష్టించాడు.

బ్రహ్మను గురించిన విషయము లన్నీ ఉపనిషత్తులలో వివరింపబడ్డాయి. ఈ ఉపనిషత్తులలో ఉన్న విషయములను సనకాది మహామునులు అధ్యయనం చేసారు. ఆ విషయములను నేను నీకు చెప్పబోతున్నాను. శ్రద్ధగా విను.

ఈ ఉపనిషత్ విద్యలో వితండ వాదమునకు తావు లేదు. శ్రద్ధగా విని ఆచరించడమే ముఖ్యము. అలా ఆచరించిన వాడు, ఈ సంసార బంధనముల నుండి విముక్తుడై పరమానందమును పొందుతాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఒక సారి నారదుడికి నారాయణుడికి సంవాదము జరిగింది.ఆ  సంవాదము ఎలా జరిగింది అనే విషయం గురించి,  అప్పుడు నారాయణ ఋషి చెప్పిన మాటలను నేను నీకు చెబుతున్నాను. శ్రద్ధగా విను.

ఒక సారి దేవ ఋషి అయిన నారదుడు మూడులోకములలో తిరుగుతూ నారాయణ ఋషిని దర్శించడానికి ఆయన ఆశ్రమమునకు వెళ్లాడు. నారాయణ ఋషి ఈ లోకములో ఉన్న మానవుల క్షేమమును గోరి ఈ భరత వర్షములో అవతరించాడు. ఆయన వర్ణాశ్రమ ధర్మములను పాటిస్తూ, తన ఆశ్రమములో తపస్సు చేసుకుంటున్నాడు. ఆ నారాయణ ఋషి చుట్టు మరి కొంత మంది ఋషులు కూర్చుని తపస్సు చేసుకుంటున్నారు.

నారదుడు అక్కడకు వెళ్లాడు. వారందరికీ భక్తితో నమస్కరించాడు. ఇప్పుడు నీవు నన్ను అడిగిన విషయములనే నారదుడు నారాయణ ఋషిని అడిగాడు. అప్పుడు నారాయణ ఋషి నారదునికి, అక్కడ ఉన్న ఋషులకు బ్రహ్మను గురించి ఈ ప్రకారంగా వివరించాడు. నారాయణ ఋషి నారదునితో ఇలా అన్నాడు.

"ఓ బ్రహ్మమానస పుత్రా! నారదా! ఒక సారి నీవు నన్ను చూడడానికి ఏడు ఊర్ధ్వ లోకములలో ఒకటైన జనలోకమునకు వచ్చావు. అక్కడ ఉన్న బ్రహ్మ మానస పుత్రులు అయిన మునుల మధ్య బ్రహ్మను గురించి చర్చ జరుగుతూ ఉంది.

అక్కడ ఉన్న మునులందరూ సమాన మైన శాస్త్ర జ్ఞానము కలిగి ఉన్నారు. వారు అన్నిటి యందు సమభావము కలవారు. వారిలో ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనే భేదభావము లేదు. అందరూ సత్వగుణ సంపన్నులు. వారు తమ మిత్రులను, శత్రువులను సమానంగా చూడగలిగే సమత్వము కలిగినవారు. వారందరూ ఎవరికి వారు వేదముల గురించి, శాస్త్రముల గురించి ప్రవచించగల సమర్థులు. అయినప్పటికినీ, వారందరూ సనందనుని చూచి, బ్రహ్మగురించి చెప్పమని అడిగారు. ఆయన చెప్పిన మాటలను శ్రద్ధగా వింటున్నారు. సనందనుడు ఇలా చెప్పాడు.

"ఓ మునులారా! ప్రళయ కాలంలో ఈ సృష్టి అంతా పరమేశ్వరునిలో లీనం అవుతుంది. ప్రళయ కాలంలో పరమేశ్వరుడు యోగనిద్రలో ఉంటాడు. ప్రళయం ముగిసిన తరువాత మొదటి సారిగా ఆయన విడిచిన ఊపిరి నుండి శ్రుతులు బయటకు వచ్చాయి. పరమాత్మ నుండి బయటకు వచ్చిన శ్రుతులు పరమాత్మను ఇలా కీర్తించాయి. (అందుకే వీటిని శ్రుతి గీతలు అని అన్నారు.)

"దేవదేవాక్షు! నీవు సకల జీవ రాసులకు జ్ఞాన ప్రదాతవు. అన్ని ప్రాణులలోనూ ఆత్మరూపంగా వెలుగుతుంటావు. ఈ అనంత సృష్టిలో

కార్యము నీవే, దానికి కారణమూ నీవే. వేదములు నీ నుండి పుట్టాయి. ఈ ప్రకృతి అంతా సత్వ,రజస్తమోగుణములతో నిండి ఉంది. ఈ ప్రాకృతిక బంధనముల నుండి మానవులను విముక్తి చెయ్యి.

ఓ దేవా! మునులు, యోగులు, జ్ఞానులు అందరూ ఈ ప్రకృతిని అంతా బ్రహ్మ స్వరూపంగానే భావిస్తారు. అంతా బ్రహ్మ మయం అంటారు. మహా ప్రళయం సంభవించినపుడు, ఈ ప్రకృతి అంతా నీలో లీనం కాగా, నీవు ఒక్కడివే మిగిలి ఉంటావు. ఈ అనంత విశ్వము యొక్క పుట్టుక, లయము రెండూ నీ వల్లనే జరుగుతున్నాయి. ఈ సమస్త విశ్వానికి కారణం నువ్వే!

జ్ఞానులు నిన్ను తమ మనస్సు, వాక్కు, శరీరములతో సేవిస్తుంటారు. పునర్జన్మ లేకుండా చేసుకుంటారు. ఎల్లప్పుడూ నీ పుణ్యచరిత్రలను గానం చేస్తుంటారు. ఏకాగ్రమైన మనస్సుతో నిన్నే ధ్యానిస్తుంటారు. అటువంటి మహాత్ములు ఈ సంసారము అనే దుర్భర తాపం నుండి విముక్తి పొందుతారు.  వార్ధక్యము, మరణము అనేవి వారి దగ్గరకు కూడా రావు.

ఈ లోకంలో శాశ్వతమూ, అశాశ్వతము అనే రెండు లక్షణాలు ఉన్నాయి. ప్రతి ప్రాణి, ప్రాణ కోశము, అన్నమయ కోశము, బుద్ధికోశము, విజ్ఞానమయ కోశము, ఆనంద మయ కోశము అనే పంచ కోశముల వల్ల అభివృద్ధి చెందుతుంటుంది. ఈ పంచ కోశములలో ఆఖరిది అయిన ఆనంద మయ కోశములో నీవు ఆత్మస్వరూపంగా వెలుగుతుంటావు.

ఓ దేవా! ఈ ప్రకృతి, అహంకారము, మహత్తత్వము, పంచ తన్మాత్రలు, పంచ భూతములు అన్నీ నీ అధీనములో ఉన్నాయి. వాటి ద్వారా నీవు సృష్టి, స్థితి, లయములను సమర్ధవంతంగా నిర్వహిస్తుంటావు. ఈ దేహధారులు నిన్ను పూజిస్తూ ఈ లోకంలోనూ, పరలోకంలోనూ సుఖసంతోషాలను పొందుతుంటారు. అజ్ఞానంతోనూ, అహంకారంతోనూ నిన్ను సేవించని మానవులు కేవలం తోలు తిత్తిలాగా గాలి పీలుస్తూ వదులుతూ, ఈ దేహమే శాశ్వతము అని భావిస్తూ, ఆహార, నిద్ర, మైధునములతో కాలంగడుపుతుంటారు.

ఓ దేవా! నీ గురించి తెలుసుకున్న వాళ్లు నిన్ను ఈ శరీరంలో వెలిగే అగ్నిగా భావిస్తారు. అరుణులు అనే ఋషులు నిన్ను సుషుమ్న అనే నాడీ మార్గంలో సంచరించే వాడిగా భావిస్తారు. అటువంటి వారు, తమ ప్రాణములను, తమ హృదయ పద్మము నుండి బయలు దేరే మూర్ధన్య నాడి ద్వారా బ్రహ్మరంధ్రానికి చేరుస్తారు. అక్కడి నుండి ఆనంద మయకోశములో వెలుగుతున్న నిన్ను చేరుకుంటారు. అటువంటి వారికి మరలా జన్మ అంటూ ఉండదు.

ఓ దేవా! నీవు అనేక అవతారములను ధరిస్తావు. చిత్ర విచిత్ర శరీరములను దాలుస్తావు. ఆయాశరీరములు చేసే పుణ్య పాపములు నీకు అంటవు. మహాత్ములు అయిన వాళ్లు తమలో ఉన్న రజస్తమోగుణములను వదిలిపెట్టి, సత్వగుణసంపన్నులై నిన్ను ఏకాగ్రబుద్ధితో సేవిస్తుంటారు. ఈ శరీరము, అందులో ఉన్న ప్రాణములు తమవి కావని తెలుసుకుంటారు. అటువంటి వారు నిరంతరము నిన్ను సేవించి జనన మరణ చక్రము నుండి విముక్తిని పొందుతుంటారు.

ఓ దేవా! నీ గురించి తెలుసుకోవడానికి ఎవరికీ సాధ్యం కాదు. నీ గురించి, నీ తత్వము గురించి, మానవులకు తెలియజేయడానికి నీవు రాముడిగా, కృష్ణుడిగా మానవుల మధ్య అవతరించావు. నీ చర్యల వలన మానవులకు తత్వబోధ చేసావు. నీ చరిత్రలను గానం చేసిన వారు, నీ మీద మనసును లగ్నం చేసినవారు మోక్షపదమును కూడా కోరరు. ఎల్లప్పుడూ నీ పాదపద్మములనే ధ్యానిస్తూ ఉంటారు.

ఓ దేవా! ఈ అనంత విశ్వంలో ఉన్న ప్రాణులన్నీ నీ అధీనంలో ఉన్నాయి అని తెలిసిన వారు, ఎల్లప్పుడూ నీ పాదపద్మములనే సేవిస్తుంటారు. అలా కాకుండా, ప్రాపంచిక సుఖముల కొరకు, విషయవాంఛల కొరకు పాకులాడేవాళ్లు, ఆ కోరికలు తీరడానికి పుడుతూ చస్తూ, జనన మరణ చక్రంలో గిరా గిరా తిరుగుతుంటారు.

ఓ దేవా! నిన్ను ధ్యానించడానికి ఒక మార్గ మంటూ లేదు. ఇంద్రియములను జయించిన యోగులు, నిన్ను శత్రువుగా భావించిన శిశుపాలుడు మొదలగు రాజులు, నీ పట్ల మూఢభక్తి కలిగిన గోపికలు, అందరూ నీ కృపకు పాత్రులయ్యారు.

ఓ దేవా! నీవు ఇలా ఉంటావు అని చెప్పడం ఎవరికీ సాధ్యం కాదు. ఏ వేదమూ, శాస్త్రము, పురాణము నీవు ఇలా ఉంటావు అని వర్ణించి చెప్పలేదు. నీవు ఈ సృష్టికి ముందు ఉన్నావు. ఈ సృష్టి లయం అయిన తరువాత కూడా ఉంటావు. నీ నుండి బ్రహ్మ మొదలగు దేవతా గణములు పుట్టాయి. అటువంటి నీవు ఎలా ఉంటావు అని

తెలుసుకోవడం ఎవ్వరికీ సాధ్యం కాదు.

ఈ సృష్టి అంతా అణువులు, పరమాణువులతో నిండి ఉంది అని భావించిన కణ్వుడు, గౌతముడు మొదలగు ఋషులు, ఈ సృష్టికి కారణం ఈ ప్రకృతి దాని తత్వములు అని భావించే సాంఖ్యులు, దేహములు పుడుతుంటాయి, కాలం తీరగానే నశించిపోతుంటాయి, దీనికి కారణం అంటే ఏమీ లేదు, బతికి ఉన్నన్నాళ్లు సుఖాలు అనుభవించడమే మేలైన మార్గము  అనే భౌతిక వాదులు, ఈ ప్రకారంగా వారి వారి తర్క వితర్కాలతో ఒకరితో ఒకరు విభేదిస్తూ కలహించుకుంటున్నారు. నీ గురించి ఏ మాత్రమూ తెలుసుకోలేక పోతున్నారు. కాని మనసులో నిన్ను సాక్షాత్కరింప చేసుకున్న మహాయోగులు "ఈ సృష్టిలో నీవు తప్ప మిగిలినవి అన్నీ నిజం కావు, అన్ని మార్పు చెందేవి, నాశనం అయ్యేవి, నీవు ఒక్కడివే ఎల్లకాలము నిలిచిఉంటావు" అని భావిస్తారు.

నీ గురించి తెలుసుకోలేని అజ్ఞానులు ఇది సత్యము, అది అసత్యము, అంటూ విపరీతంగా ఆలోచిస్తుంటారు. వారి ఆలోచనలతోనే జీవితాన్ని ముగిస్తారు. నీ అసలు స్వరూపాన్ని తెలుసుకోవడానికి కనీస ప్రయత్నం కూడా చెయ్యరు.

ఓ దేవా! బంగారము మూల పదార్థము, అది అన్నిరకాల ఆభరణాలలో అంతర్లీనంగా, వివిధ రూపాలలో ఉంటుంది. మనకు ఆభరణం రూపం కనిపిస్తుంది కానీ బంగారం కనిపించదు. అలాగే నీవు కూడా అన్నీ ప్రాణుల దేహాలలో అంతర్లీనంగా ఉంటావు.

ఓ దేవా! ఈ దేహములలో ఉండే రాగద్వేషములు, ప్రేమానురాగాలు, అహంకారాలు నీకు అంటవు. ఆత్మతత్వాన్ని తెలుసుకున్న వారే నీ గురించి కూడా తెలుసుకోగలరు. నిన్ను చేరుకోడానికి ఒకే ఒక మార్గం నీ పాదములను నిరంతరం సేవించడమే. నీ పాదములను సేవించిన వారు మృత్యువును జయించగలరు. జనన మరణ చక్రం నుండి విముక్తి పొందగలరు. యోగులై మానవులకు జ్ఞానబోధ చేస్తారు. అలా కాకుండా, నీ పాదములను మరిచిన వారు, తమ శరీరములు, తమ రూపములు, తమ పేర్లు శాశ్వతం అనుకుంటూ సంసార సాగరంలో పడి కొట్టుకుంటూ, జనన మరణ చక్రంలో తిరుగుతుంటారు.

ఓ దేవా! నీకు ఒక ఆకారం అంటూ లేదు. బ్రహ్మ మొదలగు దేవతా గణములు నీ వశంలో ఉంటారు. ఈ చరాచర ప్రపంచానికి అధినేతవు నీవే. నీ కృపకు పాత్రులైన వారు మోక్షానికి అర్హులవుతారు. నీ దయకు పాత్రులు కాని వారు దుర్గతి పాలవుతారు. నీటిలో బుడగలు పుట్టి అంతలోనే పగిలి పోయే విధంగా ఈ శరీరాలు కూడా పుడుతూ చస్తూ ఉంటాయి. అటువంటి శరీరములో నీవు ఆత్మగా ప్రకాశిస్తుంటావు. ప్రళయ కాలంలో ఈ ఆత్మలన్నీ నీలో కలిసిపోతాయి. అటువంటి నీవు నీ భక్తుల కష్టములను దూరం చేస్తావు. భవబంధముల నుండి జీవులకు ముక్తిని ప్రసాదిస్తావు.

ఓ దేవా! ఇంద్రియములను జయించాము అనుకుంటున్న మానవులు కూడా ఒక్కోసారి ఇంద్రియ నిగ్రహమును కోల్పోయి, మనస్సును అదుపులో పెట్టుకోలేక, విషయ వాంఛల నుండి ఎలా

విముక్తి పొందాలో తెలియక సతమతమవుతుంటారు. అటువంటి వారికి గురువు పాదములే శరణ్యము. గురువును సేవించని వారు ఈ జనన మరణ చక్రంలో తిరుగుతుంటారు. నావికుడు లేని నావ నడి సముద్రంలో ప్రయాణించినట్టు, వారి జీవితాలు కూడా అల్లకల్లోలమవుతాయి.

ఓ దేవా! ఎల్లప్పుడూ తన భార్య, తన సంతానము, తన ఇల్లు, తన ఆస్తి, అనుకుంటూ ఉండే వాళ్లు ఈ సంసారము అనే సముద్రమును ఎన్నటికీ దాటలేరు. అటువంటి వారికి నా పాదములను సేవించడమే పరమావధి. అందుకే పరమ భాగవతోత్తములు, పుణ్యమూర్తులు, నిన్ను నిరంతరం ఏకాగ్రమైన బుద్ధితో సేవిస్తుంటారు. అటువంటి వారు ఈ సంసార బంధనముల నుండి విముక్తులై ఆనందమయమైన మోక్షమును పొందుతారు.

ఓ దేవా! నీవు సకల జీవరాసులలో ఆత్మస్వరూపుడుగా ఉంటూ, ఆ జీవులు చేసే కర్మల నన్నిటినీ సాక్షీభూతంగా చూస్తుంటావు. మానవులు తమ కంఠములో ధరించిన హారమును తాము చూడలేరు. అలాగే అజ్ఞానులైన వారు తమలో వెలుగుతున్న నిన్ను ఎన్నటికీ చూడలేరు. ఓ దేవా! నీ నుండి వేదాలు పుట్టాయి. అవి నీలోనే ఉన్నాయి. అట్టి నీకు నమస్కారము." అని సనందనుడు మహర్షులకు తెలిపాడు. అని నారాయణ ఋషి నారదునికి తెలిపాడు. ఆ నారదుడు ఆ విషయాన్ని వ్యాసుడికి చెప్పాడు. వ్యాసుడు తన కుమారుడు శుకునికి చెప్పాడు. ఆ విషయమే నేను నీకు చెప్పాను. దీనినే నారాయణోపాఖ్యానం అంటారు.

ఇందులో సకల వేదములు, శాస్త్రములు, పురాణములలోని సారం అంతా ఉంది. ఇది చదివితే ఉపనిషత్తులు చదివినట్టే. ఈ నారాయణోపాఖ్యానం విన్నా, చదివినా, వారి పాపాలు అన్నీ నశించిపోతాయి, ఈ లోకంలో పరలోకంలో అన్ని సుఖాలు కలుగుతాయి" అని శుక మహర్షి పరీక్షిత్తుకు శ్రుతిగీతలు చెప్పాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము ఎనభై ఏడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
ఎనభై ఎనిమిదవ అధ్యాయము..

ఇంత వరకు భాగవత పురాణమును విన్న తరువాత పరీక్షిత్ మహారాజుకు ఒక వింత సందేహము కలిగింది. శుక మహర్షిని ఈ విధంగా అడిగాడు.

"ఓ శుకయోగీంద్రా! దేవతలు, అసురులు, మానవులు శ్రీహరి గురించి, మహాశివునిగురించి తపస్సు చేస్తుంటారు కదా! ఎటువంటి భోగములను అనుభవించని శంకరుని ఉపాసన చేస్తున్నవారు అనేక భోగభాగ్యములతో వర్ధిల్లుతున్నారు. కాని అన్నిభోగములను అనుభవించే శ్రీహరిని ఉపాసించే వారు దారిద్ర్యంతో బాధపడుతున్నారు కదా! ఈ ఇద్దరు దేవుళ్లలో ఒకరు భోగలాలసులు, మరొకరు పరమ దరిద్రులు.

కాని వీరిని కొలిచిన వారికి, విరుద్ధమైన, విలక్షణమైన గతులు కలుగుతున్నాయి. వీటికి కారణమేమి. దయచేసి వివరించండి.” అని అడిగాడు. దానికి శుక మహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! పరమ శివుడు శక్తితో కూడుకున్న వాడు. శివ, శక్తి పక్క పక్కనే ఉంటాయి. శివుడు సత్వ,రజస్, తమోగుణములను ఆశ్రయించిన వాడు. ఆయన పనులన్నీ ఈ మూడుగుణములతో కూడి ఉంటాయి. ఆ కారణం చేత ఆయనలో మూడు రకములైన అహంకారములు అనగా సాత్విక అహంకారము, రాజసిక అహంకారము, తామసిక అహంకారము మూడూ కలిసి ఉంటాయి.

అహంకారము నుండి మనస్సు, పంచభూతములు, పది ఇంద్రియములు, అనగా 16 వికారములు పుట్టాయి. ఈ వికారములతో సుఖాలను అనుభవిస్తున్నారు. అందులో స్త్రీ పురుష జననేంద్రియములతో అనుభవించే సుఖములు, (వీటినే విషయ సుఖములు అని అంటారు) నాలుకతో రుచి చూడటం, అనేక మధుర పదార్థములు తినడం వలన కలిగే సుఖములు, మనస్సుకు సంతోషాన్ని కలిగించే సుఖాలు (నాకు 10 కోట్ల ఆస్తి ఉంది, నాకు 100 గదుల భవనం ఉంది, నాకు చాలా మంది స్త్రీలతో సంబంధం ఉంది, నేను కోరితే ఏమైనా జరుగుతుంది.... ఇవన్నీ మానసిక సుఖాలు. ఎన్ని కోట్ల డబ్బు, ఆస్తి ఉన్నా దానిని వాడు ఏక కాలంలో అనుభవించలేడు. ఎన్ని గదుల భవనం ఉన్నా వాడు ఉండేది ఒకే గదిలోనే. ఎంత మంది స్త్రీలతో సంబంధం ఉన్నా వారి నందరినీ అనుభవించలేడు. వీడు హటాత్తుగా

చస్తే అవన్నీ పరులపాలవుతాయి.)

ఓ పరీక్షిత్ మహారాజా! ఎవరైతే శివుని ఆరాధిస్తారో వారికి ఈ సుఖాలన్నీ శివుడు ప్రసాదిస్తాడు. కాని తను మాత్రం వీటిలో ఏ సుఖాన్ని అనుభవించడు. కాని తాను ఎవరికైతే ఈ సుఖాలను ప్రసాదించాడో, వారు తాను ప్రసాదించిన సుఖాలను అనుభవిస్తూ, ఆ సుఖాలలో మునిగితేలుతూ, ఆఖరుకు పతితులై, లయం కావడం చూస్తూ ఆనందిస్తుంటాడు.

కాని శ్రీహరి అందరినీ పోషించేవాడు. ఆయనకు అన్నీ తెలుసు. సర్వద్రష్ట. అన్నీ సాక్షిగా చూస్తుంటాడు. ఆయన ప్రకృతి కంటే అతీతుడు. సత్వ,రజస్,తమోగుణములు ఆయనకు అంటవు. శ్రీహరిని ఆరాధించినవారు కూడా మూడుగుణములకు అతీతంగా ఉంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ధర్మరాజు అశ్వమేధ యజ్ఞమును పూర్తి చేసిన తరువాత, శ్రీకృష్ణుని వలన ధర్మ సందేహములను తెలుసుకున్నాడు. ఆ సమయంలో ఇటువంటి ప్రశ్ననే అడిగాడు. మానవులకు శ్రేయస్సును కలిగించడానికి పరమాత్మ యదువంశములో శ్రీకృష్ణుడిగా జన్మించాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

“ధర్మనందనా! నేను నా అనుగ్రహమును ఎవరి మీద ప్రసరింపచేయదలచుకున్నానో, వారి సకల సంపదలను వెనక్కు తీసుకుంటాను. కొంత మంది మానవులు ఉంటారు. వారికి విషయ

వాంఛలను వదిలి పెట్టాలని కోరిక ఉంటుంది. కాని వదిలిపెట్టలేరు. అటువంటి వాడికి నేను నిరంతర దారిద్ర్యము, దు:ఖము కలుగజేస్తాను. ఎల్లప్పుడూ సుఖమును, సంతోషమును కోరే వాడి భార్య పిల్లలు బంధువులు వాడిని వదిలేస్తారు. ఆ కారణంగా వాడు సంసార బంధనముల నుండి విముక్తుడవుతాడు.

ఓ ధర్మనందనా! ఇంకా కొంత మంది ఉంటారు. వారు ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలలో మునిగి తేలుతుంటారు. ఆ కోరికలను వదిలిపెట్టాలన్నా వదిలిపెట్టలేరు. తమ కోరికలు తీరడానికి వివిధములైన ఇతర దేవతలను ఆరాధిస్తారు. ఆ దేవతలు వారి ఆరాధనతో సంతుష్టులై వారికి రాజ్యసుఖములకు, సంపదలకు సంబంధించిన కోరికలను తీరుస్తారు.  వారి కోరికలు తీరగానే, వారికి రాజ్యసుఖములు, భోగములు లభించగానే, వారికి గర్వం కలుగుతుంది. అప్పుడు ఏ దేవతల అనుగ్రహము వలన తాను ఆ సుఖములను పొందాడో, ఆ దేవతలనే మరిచిపోతాడు. పైగా ఆ దేవతలు అసలు దేవతలే కాదని అవమానిస్తారు." అని శ్రీకృష్ణుడు ధర్మరాజుతో మానవుల మానసిక స్థితిని వివరించాడు.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో ఇంకా ఇలా అన్నాడు. "ఓ పరీక్షిత్ మహారాజా! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వరాలు ఇస్తారు, శాపములు ఇస్తారు. వారిలో బ్రహ్మ, మహేశ్వరుడు తొందరగా వరాలు ఇస్తారు. అలాగే తొందరగా శాపాలు ఇస్తారు. ఏ కొంచెం తపస్సు చేసినా వారు తృప్తి పొందుతారు. ఏ చిన్న తప్పు చేసినా క్షమించరు. రజోగుణము, తమోగుణము వలన వారు అలా చేస్తుంటారు.

కాని శ్రీహరి అలా కాదు. సత్వగుణ సంపన్నుడు. దేనికీ చలించడు. ఆపదలలో ఆదుకుంటాడు. దానికి సంబంధించిన ప్రాచీనమైన కథ ఒకటి చెబుతాను విను.

పూర్వము శకుని అనే అసురుడు ఉండేవాడు. వాడి కుమారుడి పేరు వృకాసురుడు. (వాడి పేరు భస్మాసురుడు అని వాడుకలో ఉంది.) ఒక సారి వాడికి నారదుడు కనపడ్డాడు.

"నారదా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో ఎవరు తొందరగా ప్రత్యక్షం అయి వరాలు ఇస్తారు" అని అడిగాడు. వానితో నారదుడు ఇలా అన్నాడు.

"నీవు శంకరుని గురించి తపస్సు చేస్తే ఆయన తొందరగా నీ తపస్సుకు మెచ్చి, నీకు ప్రత్యక్షం అయి వరాలు ఇస్తాడు. పూర్వము, రావణుడు, బాణుడు శివుని తమ స్తోత్రములతో మెప్పించి వరాలు పొందారు. అందులో రావణాసురుడు వర గర్వముతో కైలాసాన్ని పెకలించాడు.బాణుడు శివుని తన వాకిట్లో భటుడుగా నిలుపుకున్నాడు. శివుడు వరాలు ఇవ్వగలడు, కష్టాల పాలు కాగలడు. తరువాత నీ ఇష్టం." అని నారదుడు వెళ్లిపోయాడు.

వృకాసురుడు శివుని గురించి తపస్సు చేయాలని నిశ్చయించుకున్నాడు. కేదారక్షేత్రమునకు వెళ్లాడు. హెూమ గుండం తయారు చేసాడు. అగ్నిని రగిల్చాడు. ఆ అగ్నిలో తన శరీరాన్ని కోసి ఆ మాంసంతో హెూమం చేసాడు. ఏడు రోజులు గడిచింది. కాని శివుడు

ప్రత్యక్షం కాలేదు. ఏడవ రోజున తన తలను నరికి అగ్ని గుండంలో హోమం చేయదలచుకున్నాడు. కేదార క్షేత్రంలో ఉన్న సరస్సులో తన తల వెండ్రుకలను తడిపాడు. తన శిరస్సును ఖండించుకోబోయాడు.

వాడి భక్తికి మెచ్చి హోమ గుండము లో నుండి శివుడు ప్రత్యక్షం అయ్యాడు.  వాడి రెండు చేతులు పట్టుకొని వాడు తన తలను ఖండించుకోకుండా ఆపాడు. శివుని చేతి స్పర్శ వలన వృకాసురుడి మరలా పూర్వ రూపం వచ్చింది. (అప్పటి దాకా వాడు తన శరీరములోని అవయవములను కోసి అగ్నిలో హోమం చేసాడు కదా!)

శంకరుడు వృకాసురునితో ఇలా అన్నాడు. "వృకాసురా! నీవు నీ శిరస్సును ఖండించుకోవడం వలన ఎటువంటి ప్రయోజనము లేదు. నీకు ఏం వరాలు కావాలో కోరుకో. నేను ఇస్తాను. నన్ను శరణు కోరిన వారు నాకు జలము ఇచ్చినా దానిని నేను సంతోషంగా స్వీకరిస్తాను. నీవు అనవసరంగా నీ శరీర భాగాలను కోసి అగ్నిలో హోమం చేసి కష్టాల పాలయ్యావు. ఇప్పుడు నీ తలను కూడా నరకబోతున్నావు. ఇంతటి త్యాగము అవసరం లేదు. నీకే వరం కావాలో కోరుకో!" అని అడిగాడు.

అప్పుడు వృకాసురుడు ఇలా అన్నాడు. "నేను ఎవరి తల మీద చెయ్యి పెడితే వాడు తక్షణమే మరణించాలి. అటువంటి వరం ప్రసాదించు." అని అడిగాడు.
(భస్మాసుర కథలో నేను ఎవరి తల మీద చెయ్యిపెడితే వాడు భస్మం కావాలి అని అడిగినట్టు ఉంది. అందుకే వాడికి భస్మాసురుడు అనే పేరు వచ్చింది.)

వాడి కోరిక విన్న శంకరుడికి క్షణకాలం మహా కోపం వచ్చింది. అంతలోనే తమాయించుకున్నాడు. పెద్దగా నవ్వి "నీవు కోరిన వరం ఇచ్చాను. " అని అన్నాడు.

వెంటనే వృకాసురుడు ఇలా అన్నాడు. "మహాదేవా! నీవు ఇచ్చిన వరం పనిచేస్తుందో లేదో తెలిసేది ఎలాగా! అందుకని నీ తల మీద చెయ్యి పెట్టి చూస్తాను. నీవు మరణిస్తే నీ వరం పనిచేసినట్టు. లేకపోతే నీవు ఇచ్చిన వరం అబద్ధం అవుతుంది. ఏదీ నీ తలమీద ఒక సారి చెయ్యిపెట్టనీ!" అని అన్నాడు.

ఆ మాటలతో శంకరుడు హడిలిపోయాడు. ఆ అసురుడి నుండి తప్పించుకోడానికి పరుగు లంకించుకున్నాడు. వృకాసురుడు ఆయన వెంట పడ్డాడు. శంకరుడు మూడు లోకములు తిరిగాడు కానీ వృకాసురుడు ఆయనను వదలలేదు. "ఆగు! ఆగు శివా! ఆగు! ఒక్కసారి నీ తలమీద చెయ్యి పెట్టనీ!" అని అరుస్తూ శివుని వెంట పరుగెడుతున్నాడు.

బ్రహ్మ మొదలగు దేవతా గణములు ఇదంతా చూస్తున్నారు కానీ శివుని వరాన్ని మళ్లించడానికి శక్తి లేని వారు కావడం వలన చూస్తూ ఊరుకున్నారు. ఎక్కడైతే రాగద్వేషములు ఉండవో, ఎక్కడ ప్రశాంతంగా ఉంటుందో, ఎక్కడ సాధువులు, మునులు ప్రశాంతంగా ఆనందాన్ని అనుభవిస్తుంటారో, ఎక్కడకు వెళితే తిరిగి రారో, ఎక్కడైతే శ్రీహరి నివాసం ఉంటాడో, ఆ శ్వేతద్వీపమునకు వెళ్లాడు శంకరుడు.

శంకరుడు పరుగెత్తుకురావడం దూరం నుండే చూచాడు శ్రీహరి. వెంటనే ఒక బ్రహ్మచారి వేషం ధరించాడు. (భస్మాసుర కథలో మోహినీ రూపం ధరించినట్టు ఉంది).

నడుముకు ధర్భతాడు, చంకలో జింక చర్మము, చేతిలో దండము, జపమాల వీటితో చిన్ని వటువుగా మారాడు శ్రీహరి. వృకాసురుడి దగ్గరకు పోయి ఆయనకు వంగి నమస్కరించాడు.

"వృకాసురా! ఏమిటి ఇలా పరుగెడుతున్నావు. బాగా పరుగెత్తి పరుగెత్తి అలసి పోయినట్టున్నావు. కాసేపు ఇక్కడ ఆగి విశ్రాంతి తీసుకో! అయినా ఇలా పరుగెత్తుతూ ఇంత దూరం ఎందుకు వచ్చావు? దేనికోసం వచ్చావు! మనిషికి శరీరం చాలా ముఖ్యమయింది కదా! దానిని మనం జాగ్రత్తగా కాపాడుకోవాలి. ఇలా పరుగెత్తి పరుగెత్తి అలసిపోయేటట్టు చేసుకుంటే ఎలాగ! ఇంతకూ నీవు ఎందుకు పరుగెత్తుతున్నావో నాకు చెప్పతగినది అయితే చెప్పు. నాకు తోచిన సాయం చేస్తాను. పురుషులు ఇతరుల సాయంతో ఎన్నో కార్యములు చక్కబెట్టుకోవడం మనం చూస్తూనే ఉన్నాము కదా! నీకు నేనేమైనా సాయం చేయగలనో చెప్పు." అని మెత్త మెత్తగా సౌమ్యంగా పలికాడు ఆ వటువు.

ఎంతో చక్కగా, మృదుమధురంగా ముద్దు ముద్దుగా ఆ వటువు అడుగుతుంటే, వృకాసురుడు ముచ్చట పడ్డాడు. తాను శంకరుని గురించి తపస్సు చేయడం, ఆయన వరాలు ఇవ్వడం, తాను ఆవరాలను శంకరుని మీదనే పరీక్షింపబోవడం, శంకరుడు

పరుగెత్తడం, తాను వెంబడించడం అన్నీ సవివరంగా చెప్పాడు. అప్పుడు వటువు వేషంలో ఉన్న శ్రీహరి ఇలా అన్నాడు.

"అవును కదా! శివుని మామగారైన దక్షుడు శివుని పిశాచములకు అధిపతివి కమ్మని శపించాడు. అప్పటి నుండి శివుడు పిశాచం మాదిరి ప్రవర్తిస్తున్నాడు. కాబట్టి శివుని వరాలకు, శివుని మాటలకు మేము ఎటువంటి విలువ ఇవ్వము. శివుని వరం అసలు వరమేకాదు. శివుడు ఇచ్చిన వరం అస్సలు పని చెయ్యదు. ఇందులో సందేహం ఏమీ లేదు! ఆ! నువ్వు అనవసరంగా ఆయన మాటలు నమ్మి ఇంతదూరం పరుగెత్తుకుంటూ వచ్చావు.

ఇదుగో వృకాసురా! నీవు శంకరుని జగద్గురువుగా నమ్మితే, ఆయనకు వరాలు ఇచ్చే శక్తి ఉంది అని నీవు నమ్మితే, ఆయన వరాలకు శక్తి ఉందని నీవు నమ్మితే, ఆయన వరాలు పని చేస్తాయి అని నీకు నమ్మకం ఉంటే ఒక పని చెయ్యి. ఎటూ శివుడు నీకు దొరకడు కాబట్టి, ఆ వరాన్ని నీ తలమీద చెయ్యి పెట్టి నీవే పరీక్షించుకో! ఆ వరం పనిచేస్తుందో లేదో ఇట్టే తేలిపోతుంది. నాకు తెలిసీ ఆ శంకరుడి వరం అస్సలు పని చెయ్యదు. నీకా భయం లేదు. శంకరుడి వరం పని చెయ్యలేదు అని తేలిపోయిందనుకో, శంకరుడు అసత్య వాది అని నిరూపణ అవుతుంది కదా! అప్పుడు ఆ శంకరుని నీవు వెదికి వెదికి చంపవచ్చు అప్పుడు నిన్ను ఎవరూ నిందించరు. ఏమంటావు!" అని నమ్మకంగా పలికాడు శ్రీహరి.

ఇదేదో బాగానే ఉన్నట్టు తోచింది. తనలో తాను ఇలా అనుకున్నాడు. "వరాలు ఇచ్చిన శంకరుడికి అంత శక్తే ఉంటే, ఎందుకు పారిపోతాడు. ధైర్యంగా నిలబడేవాడు. తన వరం పని చెయ్యదు అన్న భయంతోనే పరుగెత్తుతున్నాడు. అందుకని, ముందుగా శంకరుని అసత్యవాదిగా నిరూపించగలిగితే, శంకరుని నాశనం చేయడం తేలిక. ఎటూ శంకరుని వరం పని చెయ్యదు కాబట్టి తన నెత్తి మీద తాను చెయ్యి పెట్టుకున్నా ఏమీ అవదు."

ఇలా ఆలోచించిన వృకాసురుడు శ్రీహరి మాటలు నమ్మి శివుడు ఇచ్చిన వరాన్ని పరీక్షించడానికి తన తల మీద తాను చెయ్యిపెట్టుకున్నాడు. వెంటనే శివుని వర మహిమ చేత వృకాసురుని తల పగిలిపోయింది. వృకాసురుడు మరణించాడు.

అమ్మయ్య అనుకుంటూ శివుడు అక్కడకు వచ్చాడు. శ్రీహరి తన నిజ రూపం దాల్చాడు. శివుని వద్దకు పోయి ఇలా అన్నాడు.

"పరమ శివా! ఈ వృకాసురుడు వాడు చేసిన దుర్మార్గాలకు బలి అయ్యాడు. నీకు అపకారం కలిగించడానికి ప్రయత్నించిన వాడు నాశనం కావడం సహజమే కదా! సత్పురుషులకు ఎవరైతే అపకారం తలపెడతారో వారు నాశనం అవడం తథ్యం. ఆ కారణం గానే వీడు వాడి నెత్తి మీద చెయ్యి పెట్టుకొని సర్వనాశనం అయ్యాడు." అని అన్నాడు. తరువాత శివుడు కైలాసమునకు వెళ్లాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ వృకాసురుని వృత్తాంతమును ఎవరు విన్నా, ఇతరులకు చెప్పినా, ఈ సంసార చక్రము నుండి విముక్తి పొందుతారు. వారికి సకల ఆపదల నుండి విముక్తి లభిస్తుంది." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వృకాసురుని వృత్తాంతమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము ఎనభై ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
ఎనభై తొమ్మిదవ అధ్యాయము

"ఓ పరీక్షిత్ మహారాజా! పూర్వము సరస్వతీ నదీ తీరంలో ఋషులు ఒక యజ్ఞం చేస్తున్నారు. ఆ యజ్ఞము చేయు సందర్భంలో అక్కడకు వచ్చిన ఋషులకు "త్రిమూర్తులలో శుద్ధ సత్వ గుణ సంపన్నుడు ఎవరు?" అని ఒక చర్చ జరిగింది. వారిలో వారు తర్కించుకున్నారు కానీ ఒక నిర్ణయమునకు రాలేకపోయారు. ఆ విషయము తెలుసుకోడానికి వారు బ్రహ్మ మానస పుత్రుడు అయిన భృగు మహర్షిని నియోగించారు.

భృగు మహర్షి ముందు సత్యలోకమునకు వెళ్లాడు. తన తండ్రి అయిన బ్రహ్మ తనను ఏ విధంగా గౌరవిస్తాడో చూద్దామని, భృగు

మహర్షి బ్రహ్మకు అభివాదము కూడా చేయలేదు. బ్రహ్మను స్తుతించలేదు. భృగు అహంకారము చూచి బ్రహ్మకు విపరీతమైన కోపం వచ్చింది. భృగు తన కుమారుడు కాబట్టి అంతలోనే తమాయించుకున్నాడు. ఇది గమనించాడు భృగువు. బ్రహ్మ రజోగుణ సంపన్నుడు అని నిర్ధారించుకున్నాడు.

తరువాత శివుని చూడడానికి కైలాసమునకు వెళ్లాడు. భృగువును చూడగానే శివుడు తన ఆసనము నుండి లేచి భృగువును ఆహ్వానించి అతనిని ఆలింగనము చేసుకోడానికి తనచేతులు చాచాడు. కాని ఉన్మత్త వేషధారి అయిన శివుని చూడగానే అతడు తమోగుణముతో నిండిన వాడు అని తెలుసుకున్నాడు భృగువు.

"పరమ శివా! ఏమిటీ వేషము? ఏనుగుచర్మం కట్టుకోవడం ఏమిటి? శ్మశానంలో ఉండే బూడిద రాసుకోవడం ఏమిటి? ఆ పాములు ఏమిటి? ఈ ఉన్మత్త వేషంఏమిటి? ఛీ ఛీ నువ్వు నన్ను ఆలింగనం చేసుకోవద్దు." అని ఛీదరించుకున్నాడు భృగువు.

శివుడికి కోపం వచ్చింది. వెంటనే తన త్రిశూలము తీసుకొని భృగువును చంపడానికి ఆయన మీదికి వచ్చాడు. పక్కనే ఉన్న పార్వతీ దేవి పరమ శివుని అడ్డుకుంది. ఆయనను శాంత పరిచింది. ఇదంతా గమనించిన భృగువు, పరమ శివుడు రజోగుణ,తమోగుణములు కలవాడు అని అనుకున్నాడు.

అక్కడి నుండి విష్ణులోకము వెళ్లాడు. వైకుంఠములో శ్రీమహావిష్ణువు శేష పాన్పు మీద పడుకొని ఉన్నాడు. శ్రీమహాలక్ష్మి ఆయన పాదములు వత్తుతూ ఉంది. విష్ణువు భృగువు రాకను గమనించలేదు. భృగువుకు కోపం వచ్చింది. తన కాలితో విష్ణువు వక్షస్థలము మీద తన్నాడు. వెంటనే శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవి పాన్పు దిగి గబా గబా భృగువు వద్దకు వచ్చారు. ఆయన కాళ్లు కడిగి ఆ నీళ్లు తన తల మీద లక్ష్మీదేవి తల మీద చల్లుకున్నారు. భృగువుతో ఇలా అన్నారు.

"మునివరా! తమరికి హార్దిక స్వాగతం పలుకుతున్నాను. రండి. ఈ ఆసనము అలంకరించండి. తమరు రావడం నేను చూడలేదు. అందుకని క్షణకాలం ఆలస్యం అయింది. నా తప్పును మన్నించండి. నన్ను క్షమించండి. తమరు పాదములు మోపిన ఈ వైకుంఠము పావనమయింది. తమరి పాదములు కడిగిన జలము మా శిరస్సున చల్లుకోడంతో నేను లక్ష్మి పవిత్రులము అయ్యాము. ఈ రోజు నుండి తమరి పాద తాడనముచేత పవిత్రమైన నా వక్షస్థలము నా భార్య లక్ష్మికి శాశ్వత నివాసము కాగలదు." అని వేడుకున్నాడు శ్రీమహావిష్ణువు.

తాను వక్షస్థలమున తన్నినప్పటికీ, తనను ఆదరించి, గౌరవించి, తన పాదోదకమును నెత్తిన చల్లుకున్న శ్రీమహావిష్ణువు శుద్ధ సత్వగుణ సంపన్నుడు అని నిర్ధారించుకున్నాడు భృగువు. శ్రీమహావిష్ణువు మాటలు విన్న భృగువు కళ్లనుండి ఆనంద భాష్పాలు రాలసాగాయి. శ్రీమహావిష్ణువు మాటలకు ఆయనకు నోట మాట రాలేదు. మౌనంగా నిలబడ్డాడు. తరువాత భృగువు వైకుంఠము నుండి

సరస్వతీ నదీ తీరమునకు వెళ్లాడు. అక్కడ ఉన్న మునులకు, ఋషులకు జరిగినది అంతా వివరించాడు. భృగువు మాటలు విన్న ఋషులు ఆశ్చర్యపోయారు. వారి సందేహము తీరి పోయింది.

ఎవరి వలన శాంతి, అభయము, ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, అష్ట సిద్ధులు, అష్ట ఐశ్వర్యములు, కీర్తి, మొదలగు శుభాలు కలుగుతాయో, ఎవరిలో రాగద్వేషములు ఉండవో, ఎవరు అందరి ఎడలా సమానమైన బుద్ధి కలిగి ఉంటారో, ఎవరు మునిధర్మమును పాటిస్తారో, ఎవరు సాధువులకు అనన్యశరణుడో, ఎవరు విశుద్ధమైన సత్వగుణ సంపన్నుడో, ఎవరు సజ్జనులైన బ్రాహ్మణులను దేవతలవలె పూజిస్తాడో, ఎవరికి కోరికలు లేవో, శాంతమూర్తులైన వివేకము కల మానవులు ఎవరిని నిరంతరము సేవిస్తూ ఉంటారో, ఆ శ్రీమహావిష్ణువే త్రిమూర్తులలో  శుద్ధసత్వగుణ సంపన్నుడు అని నిర్ధారించుకున్నారు. ఆయన మాయ చేతనే త్రిగుణములతో కూడిన రాక్షసులు, దేవతలు, మానవులు సృష్టింపబడ్డారు. అయినప్పటికినీ శ్రీమహావిష్ణువు శు ద్ధసత్వగుణ సంపన్నుడు అని తేల్చారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా సరస్వతీ నదీ తీరంలో ఉండే మహాఋషులు తమ సందేహము తీర్చుకున్నారు. లోకంలో ఉండే మానవుల సందేహము కూడా తీర్చినవారయ్యారు. అప్పటి నుండి వారు ఇతర దేవతలతో పాటు శ్రీమహావిష్ణువును సేవించి ముక్తిని పొందారు.

ఈ వృత్తాంతమును ఎవరు విన్నా,చదివినా, వారు ఈ సంసారము వలన కలిగే దు:ఖముల నుండి విముక్తి పొందుతారు."

అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భృగు మహర్షి త్రిమూర్తులను పరీక్షించే విధానమును వివరించాడు.

(ఈ కథ మనకు కలియుగ వైకుంఠము అని ప్రసిద్ధి చెందిన తిరుమల క్షేత్ర మహాత్మ్యములో కనపడుతుంది. భాగవతంలో భృగువు శ్రీమహావిష్ణువును వక్షస్థలము మీద తన్నడం, విష్ణువు ఆయనను పూజించడం వరకు ఉంది. అక్కడి నుండి తిరుమల స్థలపురాణం మొదలవుతుంది. భృగు మహర్షి శ్రీమహావిష్ణువును తనకాలితో తన్నడంతో లక్ష్మీదేవికి కోపం వస్తుంది. ఆమె విష్ణువు మీద అలిగి భూలోకం వెళ్లిపోతుంది. ఆమెను వెతుక్కుంటూ భూలోకం వస్తాడు. లక్ష్మీదేవి పద్మావతిగా ఆకాశరాజు ఇంటిలో జన్మిస్తుంది. ఒక పుట్టలో విశ్రాంతి తీసుకుంటున్న విష్ణువుకు ఆవు పాలు ఇస్తుంది. ఆ ఆవును ఒక గొల్ల వాడు కొడతాడు. విష్ణువుకు దెబ్బతగులుతుంది. వకుళా దేవి విష్ణువును తన ఇంటికి తీసుకొని వెళుతుంది. శ్రీనివాసుడు అనే పేరుతో వకుళాశ్రమంలో ఉంటాడు విష్ణువు. పద్మావతీ శ్రీనివాసులు ఒకరిని ఒకరు కలుసుకుంటారు. ఇష్టపడతారు. వారి వివాహం జరుగుతుంది. శ్రీనివాసుడు తిరుమలలో స్థిరనివాసం ఏర్పరచుకుంటాడు. తిరుమల కలియుగ వైకుంఠంగా ప్రసిద్ధిచెందుతుంది. ఇదీ సంగ్రహంగా తిరుమల స్థలపురాణం.)

"ఓ పరీక్షిత్ మహారాజా! ద్వారకలో ఒక బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండే వాడు. ఒక సారి ఆయన భార్య ఒక మగ బిడ్డను ప్రసవించింది. పుట్టిన వెంటనే ఆ బిడ్డ మరణించాడు. ఆ దు:ఖమును తట్టుకోలేక పోయింది ఆ తల్లి. ఆ బ్రాహ్మణుడు, బ్రాహ్మణుని భార్య ఇద్దరూ కలిసి

మృత శిశువును తీసుకొని రాజద్వారము వద్దకు వచ్చారు. తమకు న్యాయం కావాలి అని ఏడుస్తూ రాజద్వారము దగ్గర కూర్చుని ఇలా అన్నారు.

"మేము సద్బ్రాహ్మణులము. మేము ఏ పాపమూ చేయలేదు. ఇది అంతా మమ్ములను  పరిపాలించే రాజు యొక్క కుటిలత్వము. లోభిత్వము, విషయాసక్తత వలన కలిగింది. హింస స్వభావము కలవాడు, ఇంద్రియ ములను అదుపులో పెట్టుకోలేని వాడు, దుష్టుడు అయిన రాజుపాలనలోనే అకాల మరణాలు, శిశు మరణాలు సంభవిస్తాయి. ప్రజలు దరిద్రులుగా ఉంటారు. వారు నిరంతరము దు:ఖము అనుభవిస్తుంటారు. కాబట్టి ఈ దేశాన్ని పాలించే రాజు గారు నా బిడ్డను తిరిగి నాకు తెచ్చి ఇవ్వాలి. అప్పటి దాకా నేను ఇక్కడి నుండి కదలను." అని ఆ బ్రాహ్మణ దంపతులు రాజద్వారము వద్ద కూర్చుని ఏడుస్తున్నారు.  ఏడ్చి ఏడ్చి వెళ్లిపోయారు.

ఆ ప్రకారంగా వారికి తొమ్మిది మంది సంతానము కలిగారు. తొమ్మిది మంది పుట్టగానే మరణించారు. ప్రతి కుమారుడు మరణించినప్పుడు ఆ బ్రాహ్మణ దంపతులు రాజద్వారము వద్దకువచ్చి తమ కుమారుడిని తమకు తెచ్చి ఇవ్వమని ఏడుస్తున్నారు.  తొమ్మిదవ కుమారుడు మరణించిన తరువాత కూడా ఆ బ్రాహ్మణ దంపతులు అదే ప్రకారము రాజ ద్వారము వద్దకు వచ్చి, బాలకుని శవమును ద్వారము వద్ద పెట్టి ఏడుస్తు, రాజును నానా తిట్లు తిడుతున్నారు.

ఆ సమయంలో అర్జునుడు ద్వారకలో ఉన్నాడు. అర్జునుడు వారి వద్దకు వచ్చి "ఎందుకమ్మా ఏడుస్తున్నావు? నీకు ఏం కష్టం వచ్చింది. మీరు బ్రాహ్మణులు. ఈ నగరంలో మీ కష్టములు తీర్చే క్షత్రియుడు ఒక్కడూ లేడా! కేవలం క్షత్రియులు యజ్ఞములు యాగములు చేయడానికి, బ్రాహ్మణులు యాగములు చేయించడానికే పరిమితం అయ్యారా! క్షత్రియులకు బ్రాహ్మణులను రక్షించవలసిన బాధ్యత లేదా! ఎవరి రాజ్యములో బ్రాహ్మణులు దరిద్రులుగా ఉంటారో, ఏ రాజ్యంలో రాజులు కేవలం తమ సుఖ సంతోషములను మాత్రమే చూచుకుంటూ, ప్రజలను నిర్లక్ష్యం చేస్తారో, వారు రాజులు కారు. కేవలం రాజుల వేషము వేసుకున్న పాషండులు. మీరేమీ దిగులు పడకండి. మీ కుమారుడిని నేను రక్షిస్తాను. నేను రక్షించలేకపోతే నేను అగ్నికి ఆహుతి అవుతాను." అని శపథం చేసాడు అర్జునుడు.

అప్పుడు ఆ బ్రాహ్మణులు ఇలా అన్నాడు. "అయ్యా! ఈ రాజ్యములో వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు ఉన్నారు. వారే నా కుమారులను రక్షించలేకపోయారు. ఇంక నీవెట్లు రక్షిస్తావు. నా కుమారులను రక్షిస్తాను అనడం కేవలం నీ మూర్ఖత్వము. నీ మాటలు నమ్మడానికి మేము సిద్ధంగా లేము. ఇదంతా మా పూర్వజన్మ కర్మఫలము అనుకుంటాము. దు:ఖమును ఆపుకోలేక రాజును తిడుతున్నాము." అని అన్నారు. ఆమాటలకు అర్జునునిలో పౌరుషం చెలరేగింది.

"బ్రాహ్మణోత్తమా! నేను వాసుదేవుడను, సంకర్షణుడను, ప్రద్యుమ్నుడను, అనిరుద్ధుడను కాను. ఈ లోకంలోనే శ్రేష్ఠమైన

ధనుర్ధారి అర్జునుడను. ఇది నా గాండీవము. దీనికి తిరుగు లేదు. నా బల పరాక్రమములు ఆ పరమేశ్వరుడు కూడా మెచ్చుకున్నాడు. కాబట్టి నన్ను తక్కువ అంచనా వేయవద్దు. ఈ సారి నీ భార్యకు ప్రసవం అయేటప్పుడు నాకు చెప్పు. ఆ యముడిని ఎదిరించి అయినా సరే నీ కుమారుని రక్షిస్తాను." అని అన్నాడు అర్జునుడు.

అప్పటికి ఆ బ్రాహ్మణునికి అర్జునుడి మీద నమ్మకం కలిగింది. అలాగే అంటూ ఆ బ్రాహ్మణ దంపతులు తమ ఇంటికి వెళ్లిపోయారు. కొంత కాలము తరువాత ఆ బ్రాహ్మణ పత్ని గర్భం ధరించింది. ప్రసవ కాలం సమీపించింది. ఆ విషయం అర్జునుడికి తెలియజేసాడు ఆ బ్రాహ్మణుడు.  అర్జునుడు ప్రసవం జరిగే ప్రదేశానికి వచ్చాడు. శుచిగా ఆచమనం చేసాడు. పరమేశ్వరునికి నమస్కరించాడు. తన వద్ద ఉన్న దివ్యాస్త్రములను ఆవాహన చేసాడు. గాండీవానికి అల్లెత్రాటిని సంధించాడు. ప్రసవం జరిగే గది చుట్టు బాణములతో ఒక పంజరము మాదిరి నిర్మించాడు.

ఇంతలో ఆ బ్రాహ్మణ పత్ని ప్రసవించింది. పుట్టిన వెంటనే ఆ శిశువు ఆకాశంలోకి ఎగిరాడు. ఎవరికీ కనపడకుండా పోయాడు. ఇది చూచి అర్జునుడు ఆశ్చర్యపోయాడు. బ్రాహ్మణుడు ఏడుస్తూ ఇలా అన్నాడు.

"అయ్యా!తమరు నపుంసకులు కదా! తమరి మాట విని మోసపోయాను. తిరిగి నేను నా భార్య గర్భశోకం అనుభవించాము. అయినా వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు

చేయలేని పని నీవు చేస్తావని నమ్మడం నా తెలివితక్కువ. నువ్వు వారి కన్నా పరాక్రమవంతుడని తలచడం నా భ్రమ. కాని నీవు నీ మూర్ఖత్వముతో, నా కొడుకులను రక్షిస్తానని శపథం చేసావు. ఇప్పుడు ఆ మాట తప్పావు. నీవు అసత్యవాదివి అని తేలిపోయింది. నిన్ను నీవు పొగుడుకోవడం తప్ప నీకు ఏమీ చేతకాదు. నీ చేతిలో ఈ గాండీవం ఉండటం వ్యర్థము." అని అర్జునుని దూషించాడు ఆ బ్రాహ్మణుడు.

ఆ నిందా వాక్యములను తట్టుకోలేక పోయాడు అర్జునుడు. వెంటనే యమపురికి వెళ్లాడు. యమలోకం అంతా వెదికాడు. ఎక్కడా బ్రాహ్మణ కుమారులు కనపడలేదు. తరువాత ఇంద్రలోకము, అగ్నిలోకము, నిర్భతి లోకము, చంద్రలోకము, వాయులోకము, వరుణలోకము, రసాతలము, స్వర్గలోకము, పాతాళము అక్కడా ఇక్కడా అనకుండా పద్నాలుగు లోకములు తిరిగాడు. ఎక్కడా ఆ బ్రాహ్మణ కుమారులు కనపడలేదు.

తల వేలాడేసుకొని మరలా ద్వారకకు వచ్చాడు. చితి పేర్పించుకున్నాడు. అగ్నిలో దూకడానికి సిద్ధం అయ్యాడు. ఇదంతా విలాసంగా చూస్తున్నాడు కృష్ణుడు. అర్జునుడు చితిలోకి దూకబోతుంటే చెయ్యిపట్టుకొని ఆపాడు. కృష్ణుడు అర్జునునితో ఇలా అన్నాడు.

"అర్జునా! నీవు ఎగిరి పోయిన ఆ బ్రాహ్మణ పుత్రుని కొరకే కదా అగ్ని ప్రవేశం చేస్తున్నావు. ఆ కుమారుడిని నేను నీకు చూపిస్తాను. అనవసరంగా అగ్నిలో దూకి ఆత్మత్యాగం చేసుకోవద్దు. ఎవరైతే ఇప్పుడు

నిన్ను అసత్య వాది అనీ, అన్నమాట నిలబెట్టుకోలేని భీరుడవనీ అన్నారో, వారే నిన్ను గొప్పవాడివనీ పరాక్రమ వంతుడవనీ కీర్తిస్తారు." అని అన్నాడు.

తరువాత కృష్ణుడు అర్జునుని తన రథం మీద ఎక్కించుకొని పడమటి దిక్కుగా వెళ్లాడు. కృష్ణార్జునులు అలా వెళ్లి వెళ్లి, ఏడు సముద్రాలు, ఏడు పర్వతాలు దాటారు. సప్తద్వీపములు దాటారు. లోక, అలోక పర్వతములు దాటారు. అలోక పర్వతము ఆవల ఉన్న అంధకారములోకి ప్రవేశించారు. ఆ అంధకారములోకి కృష్ణుని రథము ప్రవేశించలేకపోయింది. రథమునకు కట్టిన అశ్వములు ముందుకు పోమని మొరాయించాయి.

తరువాత కృష్ణుడు సుదర్శన చక్రమును స్మరించాడు. ఆ చక్రము తేజస్సు విరజిమ్ముతూ ముందు వెళుతుంటే ఆ వెనకే వెళ్లారు కృష్ణార్జునులు. అక్కడ వారికి ఒక అఖండమైన జ్యోతి కనిపించింది. ఆ వెలుగు చూడలేక అర్జునుడు కళ్లు మూసుకున్నాడు. అక్కడి నుండి కృష్ణుడు, అర్జునుడు అపార మైన జలరాసిలో ప్రవేశించారు. ఆ జలరాసి అడుగున ఒక అద్భుతమైన నగరం ఉంది.

అక్కడ వేయి పడగలతో, ఆ పడగలమీద మణులతో, రెండువేల కళ్లతో, నల్లని కంఠముతో, తెల్లటి దేహముతో ఉన్న అనంతుడు,ఆదిశేషుని చూచారు. ఆ ఆదిశేషుని మీద పవళించి ఉన్న పరమాత్మను దర్శించారు. ఆ పరమాత్మ స్వరూపము... నల్లని శరీరంతో, ఎర్రని దుస్తులతో, ప్రసన్నమైన ముఖంతో, విశాలమైన కళ్లతో, పెద్ద

కిరీటంతో, పొడవైన తల వెంట్రుకలతో, నాలుగు భుజములతో, కౌస్తుభమణితో, శ్రీవత్సచిహ్నముతో, వనమాలతో, సునందుడు మొదలగు పార్షదులతో, శంఖు,చక్ర,గదలతో, అణిమాది అష్టసిద్ధులతో విరాజిల్లుతున్నాడు.

అర్జునుడు సంభ్రమంతో ఆ విరాట్పురుషునికి నమస్కరించాడు. అప్పుడు ఆ విరాట్పురుషుడు కృష్ణుడు, అర్జునునితో ఇలాఅన్నాడు.

“మీ ఇద్దరినీ చూడటానికే బ్రాహ్మణ పుత్రులను నా వద్దకు తీసుకొని వచ్చాను. మీరు నరనారాయణులు. ధర్మసంస్థాపన కొరకు మానవులుగా అవతరించారు. మీరు అవతరించిన పని పూర్తి చేసుకొని నన్ను చేరుకుంటారు. మీకు తీరవలసిన కోరికలు అంటూ ఏమీ లేవు. కాని ధర్మ రక్షణ కొరకు, దుష్టశిక్షణ కొరకు మానవులుగా ప్రవర్తిస్తున్నారు.” అని అన్నాడు.

కృష్ణార్జునులు ఆ విరాట్పురుషునికి నమస్కరించి అక్కడే ఉన్న బ్రాహ్మణ బాలురను తీసుకొని ద్వారకకు వచ్చారు. ఆ కుమారులను వారి తల్లితండ్రులకు ఇచ్చారు.

శ్రీకృష్ణుని ప్రభావమును కళ్లారా చూచిన అర్జునుడు ఆశ్చర్యపోయాడు. శ్రీకృష్ణుడు ఈ విధంగా మానవ లోకంలో అనేకములైన లీలలను ప్రదర్శించాడు. మానవుడిమాదిరి ఎన్నో యజ్ఞ యాగములు చేసాడు.

ఇంద్రుడు కూడా తగిన కాలములో వర్షములు కురిపిస్తూ భూమిని సస్యశ్యామలం చేసాడు. ఆ ప్రకారంగా కృష్ణార్జునులు "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ధర్మసంస్థాపనార్ధాయ సంభవామి యుగే యుగే" అనే మాటలను సార్థకం చేసారు." అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు భృగు మహర్షి త్రిమూర్తులను సందర్శించడం, కృష్ణార్జునులు విరాట్పురుషుని సందర్శనం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము
దశమస్కంధము ఎనభై తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
దశమస్కంధము
తొంభయ్యవ అధ్యాయము

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ద్వారకా నగరంలో సుఖంగా తన భార్యలతో నివసిస్తున్నాడు. ఆ ద్వారకా నగర శోభ ఈ విధంగా ఉంది.

ద్వారగా నగరంలో మదించిన ఏనుగులు, గుర్రములు, రథములు రాజవీధులలో తిరుగుతూ ఉన్నాయి. నిరంతరము భటులు కాపలా కాస్తున్నారు. ద్వారకా నగరం చుట్టు ఉద్యాన వనములు, చిన్ని చిన్ని అడవులు ఉన్నాయి. నగరంలోనూ నగరం వెలుపలా చక్కగా పుష్పించిన పూలమొక్కలు కనువిందు చేస్తున్నాయి. అటువంటి ద్వారకలో శ్రీకృష్ణువు తన పదహారు వేల ఎనిమిది మంది భార్యలతో

సుఖంగా ఉన్నాడు. ద్వారకా నగరంలో నీటిని విరజిమ్ముతున్న స్నాన కొలనులు ఎన్నో ఉన్నాయి. వాటిలో శ్రీకృష్ణుడు తన భార్యలతో జలక్రీడలు ఆడుతున్నాడు.

శ్రీకృష్ణుడు లలిత కళలను పోషించేవాడు. తన ఆస్థానములో ఉన్న నటులకు, గాయకులకు, నర్తకులకు వస్త్రములను, ఆభరణములను ఇంకా అనేక బహుమతులు ఇచ్చి వారి కళలను ప్రోత్సహించేవాడు. వారిచేత ప్రజల ముందు అనేక ప్రదర్శనలు ఇప్పించేవాడు.

శ్రీకృష్ణుని భార్యలు కూడా ఎల్లప్పుడూ కృష్ణ నామమును స్మరించుకుంటూ కృష్ణుని లీలలను తలంచుకుంటూ, కృష్ణుడే లోకంగా కాలంగడుపుతున్నారు.  వారు ప్రకృతిని ఉద్దేశించి ఇలా మాట్లాడుకుంటున్నారు.

“ఓ కురంగ పక్షీ! శ్రీకృష్ణుడు రాత్రి వేళ నిద్రపోతాడని తెలియదా! నీకు నిద్ర పట్టక అలా రాత్రంతా కూస్తుంటే శ్రీకృష్ణునికి నిద్రాభంగం అవుతుంది కదా! అందుకని నీవు కూడా రాత్రి పూట నిద్రపో! ” అని కురంగ పక్షిని ఉద్దేశించి పలికింది. మరొక భార్య చక్రవాక పక్షిని చూచి “ఎందుకే  రాత్రిపూట అలా ఏడుస్తున్నావు. ఓహో! నీ ప్రియుడు కనపడలేదని ఏడుస్తున్నావా! పైగా కళ్లు మూసుకొని ఏడుస్తున్నావా! మేమంతా శ్రీకృష్ణుని పాదములను సేవిస్తూ ఆయన పాదముల మీద పూజించిన పూలను మా తలలో ధరిస్తున్నాము, అటువంటి అదృష్టము నీకు కలగలేదని ఏడుస్తున్నావా!”

అని చక్రవాక పక్షిని ప్రశ్నించింది మరొక వనిత.

ద్వారక సముద్రము మధ్యలో ఉంది కదా! అందుకని మరొక యువతి సముద్రమును చూచి ఇలా అంది. "ఓ సముద్రమా! ఎందుకు రాత్రంతా అలా అలల చప్పుడు చేస్తూ గర్జనలు చేస్తుంటావు. ఓహో! సముద్రమును మథించేటప్పుడు  నీ లోనుండి లక్ష్మీదేవి, వెళ్లిపోయిందని బాధతో గర్జిస్తున్నావా!" అని భావోద్రేకంతో పలికింది.

మరొకామె చంద్రుడిని చూచి "ఏమయ్యా చంద్రుడా! నీకు క్షయరోగం పట్టింది కదా! నానాటికీ క్షీణించి పోతూ ఈ లోకంలో ఆవరించిన అంధకారాన్ని పారదోలడానికి శక్తి లేని వాడివి, నీ చల్లని వెన్నెలతో మాబోటి విరహిణుల విరహబాధను ఎందుకు ఎక్కువ చేస్తున్నావు?" అని నిష్టూరమాడింది.

ఇంతలో మరొక భామ చల్లగా వీచే గాలిని ఉద్దేశించి "ఓ మలయానిలమా! మేము నీకేం అపకారం చేసాము. నీవు చల్ల చల్లగా మెల్ల మెల్లగా వీస్తూ మాలోని విరహ బాధను ఎందుకు ఎక్కువ చేస్తున్నావు? మమ్ములను ఎందుకు మన్మథబాధకు గురి చేస్తున్నావు? " అని నిలదీసింది.

మరొక భార్య ఆకాశం వంక చూచి "ఓ మేఘమాలా! ఎండలతో మండి పోతున్న మానవులకు నీ చల్లని వానలతో ఆ తాపాన్ని తీరుస్తున్నావు. నీవు కూడా మా కృష్ణుడికి స్నేహితుడవే కదా! నీవు కూడా శ్రీకృష్ణుని సదా స్మరిస్తుంటావు కదా! మామాదిరి శ్రీకృష్ణుని విరహ

బాధను అనుభవిస్తున్నావా! లేకపోతే మేము కన్నీరు కార్చినట్టు నీవు కూడా వర్షధారలను కారుస్తున్నావు కదా! ఆయనతో స్నేహం చేయడం ఎందుకు! ఆయన నీతో మాట్లాడటం లేదని మా మాదిరి బాధపడటం ఎందుకు?" అని తనలోని విషాద భావాలను మేఘమాల పరంగా ప్రకటించింది.

మరొక భామ కోకిలను చూచి ఇలా అంది. "ఓ కోకిలా! శ్రీకృష్ణుడు మృదుమధురంగా మాట్లాడినట్టు నీవు కూడా మృదుమధురంగా కూస్తుంటావు కదా! దానికి ప్రతిగా మేము నీకేం చెయ్యాలో చెప్పు." అని కోకిలను అడిగింది.

మరొక వనిత ఎదురుగా కనపడుతున్న పర్వతము వంక చూచి "ఓ పర్వతరాజమా! నీవు ఉలుకవు. పలుకవు. కదలవు మెదలవు. గంభీరంగా ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటావు. నీవు కూడా నీ శిఖరములతో శ్రీకృష్ణుని పాదములను తాకవలెనని ఉత్సాహ పడుతున్నావా ఏమి? అది మాకే సాధ్యం కావడం లేదు. నీకు ఎలా సాధ్యం అవుతుంది." అని పర్వతాలను నిరుత్సాహపరిచింది.

మరొక భార్య సముద్రములో కలుస్తున్న నదులను చూచి ఇలా అంది. "ఓ నదులారా!ఈ వేసవి కాలంలో మీకు ప్రియుడు అయిన సముద్రుడు తన జలములను మేఘములద్వారా ఆకాశంలోకి పంపి, వర్షము ద్వారా మీ తాపమును పోగొట్టడం లేదా! మేము కూడా శ్రీకృష్ణుని పొందు కోసరం పరితపిస్తూ చిక్కి శల్యం అయ్యాము. నీవు కూడా నీ ప్రియుడైన సముద్రునిపొందు కోసరం చిక్కి శల్యమై చిన్న

చిన్న పాయలుగా మారి పోయావా! నీలో పద్మములు కూడా వికసించడం లేదా! నీ శరీరం చిక్కిపోయిందా!" అని తమతో నదులను పోల్చుకుంది.

ఇంకొక భార్య ఒక హంసను దగ్గరకు తీసుకొని ఇలా అంది. "ఓ హంసరాజమా! నీ ముందు పాలు పెట్టాను. ఈ పాలు తాగి కృష్ణుని గురించి నాలుగు మంచి మాటలు చెప్పు. శ్రీకృష్ణునికి మాకు హంతదౌత్యముచెయ్యి. నువ్వు శ్రీకృష్ణుని వద్ద నుండి వచ్చిన దూతగా అనుకుంటున్నాము. శ్రీకృష్ణుడు ఎక్కడ ఉన్నాడు. సుఖంగా ఉన్నాడా! మా గురించి ఎప్పుడైనా అనుకుంటున్నాడా! అనుకోడం లేదా! మా గురించి అస్సలు తలచుకోని వాడిని మేము ఎందుకు సేవించాలి?

లక్ష్మీదేవి మా అందరినీ మోసం చేసి శ్రీకృష్ణుని తన వద్దనే ఉంచేసుకుంది. మేము ఇలా అన్నామని శ్రీకృష్ణుడికి చెప్పు. కాసేపు ఆ లక్ష్మీదేవిని వదిలిపెట్టి మా దగ్గరకు రమ్మని చెప్పు. చెప్పడం కాదు. నీ వెంటబెట్టుకొని తీసుకొని రా! ఆ లక్ష్మీదేవి ఒక్కత్తేనా శ్రీకృష్ణుని యందు ఏకాగ్రమైన భక్తి, నిష్ట కలిగి ఉండేది? మేమేం తక్కువా! మాకు మాత్రము లక్ష్మీదేవి మాదిరి శ్రీకృష్ణుని ఎడల భక్తి నిష్ఠలు లేవా! మేము లక్ష్మీదేవి మాదిరి కాదా!" అని పలికింది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈవిధంగా శ్రీకృష్ణుని భార్యలు శ్రీకృష్ణుని గురించి తమ అనురాగమును పైవిధంగా ప్రకటించారు. వారు శ్రీకృష్ణుని తమ పాటలతోనూ, సంగీతముతోనూ, కవితలతోనూ తమలో ఉన్న హావభావములను ప్రదర్శించారు. శ్రీకృష్ణుని గురించి ఏ

మాట విన్నా వారి మనసులు పులకిస్తున్నాయి. శ్రీకృష్ణునిదే లోకంగా వారు జీవిస్తున్నారు. శ్రీకృష్ణుని భార్యలందరూ వారి మనస్సులను శ్రీకృష్ణుని పాదములకే అంకితం చేసారు. శ్రీకృష్ణునికి సేవలు చేస్తూ ఆయన పాదములను వత్తుతూ, ఆయనను పూజిస్తున్నారు.

శ్రీకృష్ణుడు కూడా తన భార్యల ఎడల మమతానురాగములను చూపుతూ, గృహస్థాశ్రమమే ధర్మము, అర్థము,కామము అను మూడు పురుషార్థములకు మూలస్థానము అని ప్రపంచానికి వెల్లడిచేసాడు.

శ్రీకృష్ణునికి పదహారు వేల ఎనిమిది మంది భార్యలు ఉన్నారు. వారిలో రుక్మిణి మొదలగు ఎనిమిది మంది ప్రధానమైన భార్యలు. శ్రీకృష్ణునికి ఒక్కొక్క భార్యయందు పది మంది కుమారులు కలిగారు. ఆ కుమారులు అమితమైన పరాక్రమ వంతులు. వారిలో 18 మంది మహారథులు ఉన్నారు. వారు వరుసగా 1.ప్రద్యుమ్నుడు, 2.అనిరుద్ధుడు, 3.దీప్తిమానుడు, 4.భానుడు, 5.సాంబుడు, 6.మధువు, 7.బృహద్భానుడు, 8.చిత్రభానుడు. 9.వృకుడు.10.అరుణుడు. 11. పుష్కరుడు. 12. వేదబాహువు. 13. శ్రుతదేవుడు. 14.సునందుడు. 15. చిత్రబాహువు. 16.విరూపుడు. 17. కవి. 18. న్యగ్రోధుడు.

వీరందరిలోకీ రుక్మిణీ కుమారుడు అయిన ప్రద్యుమ్నుడు సర్వశ్రేష్టుడు. ఈ ప్రద్యుమ్నుడు, తన మేనమామ అయిన రుక్మి కుమార్తెను పెళ్లిచేసుకున్నాడు. ఆమె వలన ప్రద్యుమ్నునికి మహాబలవంతుడైన అనిరుద్ధుడు అనే కుమారుడు కలిగాడు. అనిరుద్ధుడు రుక్మి మనుమరాలిని పెళ్లిచేసుకున్నాడు. ఆమె వలన

అనిరుద్ధునికి వ్రజుడు అనే కుమారుడు కలిగాడు.

యాదవులందరూ ఒకరితో ఒకరు కొట్టుకొని చచ్చారు. యాదవుల వంశము లన్నీ నాశనం అయ్యాయి. వారిలో ఈ వ్రజుడు మాత్రము మిగిలాడు. శ్రీకృష్ణుని వంశములో మిగిలిన వాడు వ్రజుడు ఒక్కడే. ఈ వ్రజునకు ప్రతిబాహువు, ప్రతిబాహువునకు సుబాహువు, సుబాహువునకు శాంతసేనుడు, శాంతసేనునకు శతసేనుడు జన్మించారు. ఈ ప్రకారంగా శ్రీకృష్ణుని వంశము అభివృద్ధిచెందింది.

శ్రీకృష్ణుని వంశంలో దరిద్రులు, అల్పాయుష్కులు, పిరికివారు, బ్రాహ్మణ ద్వేషులు ఎవరూ లేరు. అందరూ శ్రీకృష్ణుని మంచి గుణములు అన్నీ పుణికి పుచ్చుకున్నారు. ఈ యదువంశములో ఉన్న ప్రసిద్ధులను లెక్కించడానికే దాదాపు పదివేల సంవత్సరములు పడుతుంది. శ్రీకృష్ణునికి పుట్టిన పుత్రులు, పౌత్రులకు చదువు చెప్పడానికి మూడుకోట్ల ఎనిమిది వేల ఎనిమిది వందల ఉ పాధ్యాయులు ఉండేవారట.

ఓ పరీక్షిత్ మహారాజా! పూర్వము దేవతలకు అసురులకు జరిగిన యుద్ధంలో మరణించిన క్రూరులైన అసురులే మరుజన్మలో రాజులుగా జన్మించి, రాజసుఖాలలో మునిగితేలుతూ ప్రజలను బాధించారు. వారిని శిక్షించడానికే పరమాత్మ శ్రీకృష్ణుడుగా అవతరించాడు.

శ్రీకృష్ణుడు జన్మించిన యదు వంశము నూటొక్క ఉప వంశములతో విభజింపబడింది. ఆ నూటొక్క ఉపవంశములలోని వారందరూ శ్రీకృష్ణుని పరమాత్మ స్వరూపుడుగా భావించారు. ఆ కారణం చేత యాదవ వంశములన్నీ దినదినాభివృద్ధి చెందాయి. యాదవ వంశములోని వారంతా పడుకున్నా, కూర్చున్నా, నడిచినా, మాట్లాడినా, ఆడుకుంటున్నా, స్నానం చేస్తున్న, ఏ పని చేస్తున్న సదా శ్రీకృష్ణ నామం జపిస్తూ, శ్రీకృష్ణుని మనసులో ధ్యానిస్తూ ఉండేవారు. శ్రీకృష్ణుని కీర్తి ప్రతిష్టలు మూడులోకములలో విస్తరించాయి.

శ్రీకృష్ణుని శత్రువులు కూడా, ఆయన మీద ఉన్న శత్రుత్వముతో కూడా ఆయనను సర్వకాల సర్వావస్థలయందు తలచుకుంటూ ఉండేవారు. బ్రహ్మ మొదలగు దేవతా గణములు లక్ష్మీదేవిని ప్రసన్నం చేసుకోడానికి ప్రయత్నిస్తుంటే, లక్ష్మీదేవిమాత్రము శ్రీకృష్ణుని పాదములను సేవిస్తూఉండేది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఎవని నామమును విన్నా, కీర్తించినా, సకల అమంగళములు నశించిపోతాయో, ఎవని వంశములో ధర్మము వృద్ధిచెందిందో, అటువంటి శ్రీకృష్ణుడు ఈ భూభారమును హరించాడు అనడంలో అతిశయోక్తి ఏమీ లేదు కదా!

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు పరమాత్మ స్వరూపుడు. అందరి దేహములలో ఆత్మగా విరాజిల్లుతున్నాడు. ఆయనకు జన్మ లేదు. కానీ దేవకికి పుత్రుడుగా జన్మించాడు. యాదవులందరూ శ్రీకృష్ణుని పరమాత్మ స్వరూపుడుగా సేవించారు. శ్రీకృష్ణుడు తాను సర్వసమర్థుడయ్యు, తాను ఆయుధము పట్టలేదు. అర్జునుని చేత

భారత యుద్ధముజరిపించాడు. దుష్ట సంహారం చేయించాడు.

శ్రీకృష్ణుడు ఉన్న చోట విజయం తథ్యం అన్నమాట అక్షరాలా నిజం. శ్రీకృష్ణుని మీద భక్తి కలిగిన వారు, ఆయన ధరించిన మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ,వామన,రామ,కృష్ణ అవతార కథలను వినాలి. గానం చేయాలి. అలా చేయడం వలన వారి కర్మబంధనములు తొలగిపోతాయి.

ఓ పరీక్షిత్ మహారాజా! ఎవనిలో సాయుజ్యం పొందడానికి పూర్వము మహారాజులు తమ తమ రాజ్యములను వదిలిపెట్టి అరణ్యములకు వెళ్లి తపస్సు చేసారో, ఏ మానవులు సుందరమైన శ్రీకృష్ణకథలను నిరంతరం గానం చేస్తారో, వారు పరమాత్మలో ఐక్యం అవుతారు." అని శుకయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుని వంశములోని వారి గురించి, యాదవులు శ్రీకృష్ణుని అర్చించడం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

దశమస్కంధము తొంభయ్యవ అధ్యాయము సంపూర్ణము.

శ్రీమద్భాగవతము దశమస్కంధము సర్వం సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్: 9866140619, 9391134792

ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము
## ఏకాదశ స్కంధము.
## ప్రథమ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో భాగవత పురాణమును ఈ విధంగా చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు, బలరాముడు యాదవ వంశములో అవతరించి, అనేక మంది రాక్షసులను సంహరించారు. పాండవులకు కౌరవులకు విరోధము కల్పించి, కురు పాండవ సంగ్రామములో అనేక మంది దుర్మార్గులైన రాజులను, వారి సైన్యములను సంహరింపజేసి భూభారమును తగ్గించారు.

సుయోధనుడు మాయాద్యూతము ఆడించాడు. పాండవులను అవమానించాడు. నిండుసభలో ద్రౌపది వస్త్రములను ఊడదీయించాడు. ఆమెను జుట్టుపట్టి సభలోకి ఈడ్పించాడు. ఇటువంటి అత్యాచారములను ఎన్నింటినో చేసాడు. దానితో పాండవులకు కోపం వచ్చింది. పాండవులకు కౌరవుల మీద ఉన్న కోపమును ఆధారంగా చేసుకొని శ్రీకృష్ణుడు వారిరువురి మధ్య యుద్ధం కల్పించాడు. ఇరుపక్షముల వైపు మోహరించిన రాజులను, వారి సైన్యమును వారిచేతనే సంహరింపజేసి భూభారమును తగ్గించాడు.

కురుక్షేత్ర సంగ్రామము ముగిసింది. కృష్ణుడు తీరికగా కూర్చుని తనలో తాను ఇలా అనుకున్నాడు. "కురుక్షేత్ర మహా సంగ్రామములో ఎంతో మంది దుర్మార్గులైన రాజులు మరణించారు. లోకం దృష్టిలో భూభారం తొలగి పోయింది. కానీ నా దృష్టిలో భూభారం ఇంకా తొలగలేదు. దుర్మార్గులయిన క్షత్రియులు మరణించినా, యాదవులు ఇంకా బతికే ఉన్నారు. వీరు కూడా సామాన్యులు కారు. నా అండ చూచుకొని చెలరేగి పోతున్నారు. వీరిని ఇదే విధంగా వదిలేస్తే, దేవతలకు కూడా వీరిని జయించడానికి శక్యం కాదు. ఇప్పుడు వీరిని నాశనం చేయడానికి వీరి మీదికి యుద్ధానికి వచ్చే వాళ్లు ఎవరూ లేరు. కాబట్టి వీరిలో వీరు కొట్టుకునేటట్టు చేసి, యాదవవంశమును అంతమొందించాలి. అప్పుడు కానీ భూభారము పూర్తిగా తగ్గినట్టు కాదు. యాదవ కుల నాశనంతో నేను వచ్చిన పని పూర్తి అవుతుంది కాబట్టి, తరువాత నా లోకమునకు నేను వెళ్లిపోవచ్చు." అని తనలో తాను అనుకున్నాడు కృష్ణుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ ప్రకారంగా నిశ్చయం చేసుకున్న కృష్ణుడు యాదవులు ఒకరితో ఒకరు ఎలా కొట్టుకొని చస్తారా అని ఆలోచించాడు. ఇంతలో మహామునులు కొందరు యాదవులకు ఇచ్చిన శాపం గుర్తుకు వచ్చింది. ఆ శాపమును ఆధారం చేసుకొని కృష్ణుడు యాదవులు వారిలో వారు కొట్టుకునేటట్టు చేసి, యాదవకులమును సమూలంగా నాశనం చేసాడు.

శ్రీకృష్ణుడు తన బోధనలతో, గీతామృతముతో మానవుల మనస్సులను పరమాత్మవైపు మళ్లించాడు. మానవులకు ఇంద్రియనిగ్రహము మనో నిగ్రహము ఎలా ఆచరించాలో చెప్పాడు.

మానవులను ప్రాపంచిక విషయముల నుండి పరమాత్మ వైపు మళ్లించాడు. తన కీర్తిని మూడులోకములలో వ్యాపింపజేసాడు. మానవులు సులభంగా ముక్తులు అయే మార్గములను బోధించి, తన అవతారమును చాలించి తన లోకమునకు వెళ్లిపోయాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

అప్పుడు పరీక్షిత్తుకు ఒక సందేహము వచ్చింది. "మహర్షీ! యాదవులు సాధారణంగా బ్రాహ్మణభక్తులు అనీ, పెద్ద వారిని గౌరవిస్తారనీ, ఎల్లప్పుడూ శ్రీకృష్ణనామము జపిస్తుంటారనీ, పుణ్యచరితులనీ విన్నాను. కానీ మీరు యాదవులకు బ్రాహ్మణులు శాపం ఇచ్చారు అని అంటున్నారు. అది ఎలా జరిగింది. అసలు ఆ బ్రాహ్మణులు ఎవరు! యాదవులకు శాపం ఎందుకు ఇచ్చారు? ఏం శాపం ఇచ్చారు? ఏ కారణంగా బ్రాహ్మణులు యాదవులను శపించారు? అసలు బ్రాహ్మణులకు యాదవులకు మధ్య వైరం ఎందుకు కలిగింది? ఈ విషయాలన్నీ నాకు వివరంగా చెప్పవలసింది." అని అడిగాడు. అప్పుడు శుక మహర్షి ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ద్వారకలో నివసిస్తున్నాడు అని చెప్పాను కదా! భూభారము తగ్గించడం అనే కార్యక్రమంలో యాదవులు మిగిలిపోయారు అని చెప్పాను కదా! ఆ యాదవులను కూడా సంహరించి, తాను వచ్చిన కార్యము పూర్తి చేయదలచు కున్నాడు భగవానుడు. యాదవులకు బ్రాహ్మణులు ఇచ్చిన శాపం గుర్తుకు వచ్చింది.

అది ఎలా జరిగిందంటే, ఒక సారి విశ్వామిత్రుడు, అసితుడు, కణ్వుడు, దుర్వాసుడు, భృగువు, అంగిరసుడు, కశ్యపుడు, వామదేవుడు, అత్రి, వశిష్ఠుడు, నారదుడు మొదలైన మహాఋషులు ద్వారకా నగరం సమీపంలో ఉన్న పిండారకము అనే తీర్థమునకు వచ్చారు. ఆ సమయంలో ఆ ప్రదేశంలో యాదవ బాలురు ఆడుకుంటున్నారు. అందులో కొంత మంది యాదవ బాలురు, జాంబవతి కుమారుడైన సాంబునికి గర్భిణిగా ఉన్న ఆడవేషం వేసారు. వాడికి చీర కట్టారు. తలలో పూలుపెట్టారు. పొట్ట ఎత్తుగా ఉండటానికి గుడ్డలు చుట్టారు. అచ్చు గర్భిణీ స్త్రీ మాదిరి అలంకరించారు.

ఇంతలో మునులు అక్కడకు వచ్చారు. ఆ మునులను చూచిన యాదవ బాలురు వారిని ఒక ఆటపట్టించాలని ఆడవేషంలో ఉన్న సాంబునితో సహా ఆ మునుల దగ్గరకు వెళ్లారు. యాదవ బాలురు అందరూ ఆ మునుల కాళ్ల మీద పడి నమస్కరించారు. వినయంగా ఇలా అన్నారు. "ఓ బ్రాహ్మణోత్తములారా! ఈ యాదవ స్త్రీ గర్భం ధరించింది. మీరు త్రికాలజ్ఞులు అని తెలిసి ఈ స్త్రీ మిమ్ములను ఒకటి అడగాలని అనుకుంటూ ఉంది. కానీ సిగ్గుతో అడగలేకపోతూ ఉంది. అదేమిటంటే, ఈమెకు పుత్రుడు పుట్టాలని కోరిక. ఈమెకు ప్రసవం అయ్యే సమయం దగ్గర పడింది. ఈమెకు పుట్టబోయే వాడు పుత్రుడా! పుత్రికా! మీ దివ్యదృష్టితో చూసి చెప్పమని కోరుతున్నాము." అని పరిహాసంగా అడిగారు.

మహాత్ములైన మునులకు అసలు విషయం అర్థం అయింది. వారికి తీవ్రమైన కోపం వచ్చింది. వారు ఇలా అన్నారు. "మూర్ఖులారా! లేని గర్భాన్ని ఉన్నట్టు చెప్పి మమ్ములను పరిహసిస్తారా! ఈ బాలుడి

కడుపున యాదవ వంశమును నాశనం చేసే ముసలం (రోకలి) పుడుతుంది." అని అన్నారు. తరువాత వారు తమ దారిన వెళ్లిపోయారు.

యాదవ బాలురకు భయం పట్టుకుంది. వారు గబగబా సాంబుడికి చుట్టిన బట్టలు ఊడదీసారు. ఆ బట్టలో నుండి ఒక ముసలం బయటపడింది. " చాలా పొరపాటు పని చేసాము. బ్రాహ్మణులను అవమానించాము. మనకు తగిన శాస్తి జరిగింది. ఈ విషయం తెలిస్తే మన పెద్దలు, జనం ఏమనుకుంటారు." అని వారిలో వారు భయంతో తర్కించుకున్నారు. తరువాత వారు ఆ ముసలమును తీసుకొని రాజ సభకు వెళ్లారు. సభాసదుల సమక్షములో జరిగిన కథ అంతా వివరించారు.

ఆ మాటలు విన్న యాదవ ప్రముఖులు భయంతో వణికిపోయారు. ఆ ముసలము చూచి వారికి నోటమాట రాలేదు. ఆ యాదవ కుమారులను నానాతిట్లు తిట్టారు. యాదవ రాజైన ఉగ్రసేనుడు మంత్రులతో ఆలోచించాడు. శ్రీకృష్ణుడికి ఈ విషయం తెలియక ముందే, ఆ ముసలమును పొడి పొడి గా చేసి సముద్రములో కలపమని ఆదేశించాడు. ఆయన ఆదేశము ప్రకారము యాదవ భటులు ఆ ముసలమును పొడి పొడి చేసారు. సముద్రంలో కలిపారు. ఒక చిన్ని ముక్క మిగిలిపోయింది. దానిని కూడా సముద్రంలోకి విసిరేసారు. చేతులు కడుక్కొని వెళ్లిపోయారు.

ఆ చిన్ని ముక్కను ఒక చేప గుటుక్కున మింగింది. సముద్రములో కలపబడిన ముసలము పొడి అంతా తెట్టెగా

తయారయి ఒడ్డుకు కొట్టుకు వచ్చింది. ఆ లోహపు పొడి తుంగపొదగా మారి పోయింది. సముద్రతీరమంతా తుంగపొదలతో నిండి పోయింది. చిన్ని ముక్కను చేప మింగింది కదా! చేపలు పట్టేవాడు ఆ చేపను తన వలవేసి పట్టుకున్నాడు. దానిని అడ్డంగా కోసాడు. ఆ చేప పొట్టలోనుండి ముసలం ముక్క బయట పడింది. ఆ ముక్కను ఆ చేపలుపట్టే వాడు తన మిత్రుడైన వేట కాడికి ఇచ్చాడు. ఆ వేటగాడి పేరు జర(ముసలితనము). ఆ వేటకాడు ఆ ముక్కను తన బాణమునకు అమర్చుకున్నాడు. సర్వజ్ఞుడైన శ్రీకృష్ణునికి ఈ విషయం అంతా తెలుసు. కాని ఏమీ చేయలేదు. బ్రాహ్మణ శాపము ప్రకారము ఏంజరగాలో అది జరుగుతుంది అని అనుకున్నాడు.” అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు యాదవులకు బ్రాహ్మణులు శాపం ఇచ్చిన విషయం వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ప్రథమ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

ద్వితీయ అధ్యాయము.

“ఓ పరీక్షిత్ మహారాజా! సర్వకాల సర్వావస్థల యందు శ్రీకృష్ణుని దర్శనము చేసుకోవాలనే కోరిక కలిగిన దేవర్షి నారదుడు కూడా ఎక్కువ కాలము ద్వారకలోనే ఉండేవాడట. మృత్యువు అధీనములో ఉన్న ఏ మానవుడు అయినా శ్రీకృష్ణుని పాదములను

సేవించకుండా ఎలా ఉండగలడు? ఒక రోజు నారదుడు వసుదేవుని గృహమునకు వెళ్లాడు.

వసుదేవుడు నారదుని సాదరంగా ఆహ్వానించి అర్ఘ్యపాద్యములు అర్పించి ఆసనము ఇచ్చి సత్కరించాడు. నారదునితో వసుదేవుడు ఇలా అన్నాడు. "తల్లి తండ్రులు వస్తే వారి సంతానము సంతోషిస్తారు. అలాగే భగవద్భక్తులు వస్తే దీనుల మైన మాకు ఎంతో సంతోషంగా ఉంటుంది. మీరు రావడం మాకు ఎంతో శుభదాయకము. గాలి, వర్షము మొదలగునవి వచ్చినపుడు మానవులకు సుఖము, దు:ఖము రెండూ కలుగుతుంటాయి. కాని, తమవంటి సత్పురుషులు వచ్చినపుడు సకలజీవులకు  సుఖం మాత్రమే కలుగుతుంది. సాధారణంగా మానవులు వివిధ దేవతలను ఆరాధిస్తుంటారు. ఆ దేవతలు కూడా వారు వారు చేసుకున్న కర్మలను బట్టి వారికి తగిన ఫలములను ప్రసాదిస్తుంటారు. కాని మీ వంటి సత్పురుషులు మాత్రము దీనులైన మానవుల మీద తమ వాత్సల్యమును అధికంగా చూపుతుంటారు.

ఓ నారద మహర్షీ! మీ దర్శనభాగ్యము కలగడం చేత మేము ధన్యులము అయ్యాము. మీరు మాకు భాగవత ధర్మములను ఉపదేశించండి. భాగవత ధర్మములను  శ్రద్ధతో వినడం వలన మేము సకల భయముల నుండి విముక్తులము అవుతాము. మునీంద్రా! నేను నా పూర్వ జన్మలో విష్ణుభగవానుని ఆరాధించి నాకు పుత్రులను ప్రసాదించమని కోరాను కానీ నాకు మోక్షం కావాలని కోరుకోలేదు. ఈ జన్మలో భార్యాబిడ్డలతో, బంధువులతో, సంసారసాగరంలో పడి

కొట్టుకుంటున్నాను. ఈ సంసారబంధనముల నుండి తేలికగా ముక్తి పొందే మార్గము తెలియజేయండి." అని అడిగాడు వసుదేవుడు. ఆ మాటలు విన్న నారదుడు వసుదేవునితో ఇలా అన్నాడు.

"వసుదేవా! నీవు భాగవత ధర్మముల గురించి అడిగావు. నాకు చాలా సంతోషమయింది. నీ సంకల్పము చాలా మంచిది. ఈ భాగవత ధర్మములను ఎవరు విన్నా, చదివినా, ఇతరులకు బోధించినా, వారు పవిత్రులవుతారు. ఇంతకు పూర్వము మిథిలానగర మహారాజు జనకునికి, ఋషభుని కుమారులకు, భాగవత ధర్మముల గురించి, ఒక ఆసక్తి కరమైన సంవాదము జరిగింది. ఆ విషయమును నీకు వివరిస్తాను. శ్రద్ధగా విను.

స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతుడు. ఆయన కుమారుడు ఆగ్నీధ్రుడు. ఆయనకుమారుని పేరు నాభి. నాభి కుమారుడు ఋషభుడు. మోక్షధర్మమును మానవ లోకంలో ప్రభోధించడానికి పరమాత్ముడే స్వయంగా ఋషభుడుగా అవతరించాడని శాస్త్రములు చెబుతున్నాయి.

ఆ ఋషభునకు నూరుగురు కుమారులు కలిగారు. వారిలో పెద్దవాడు భరతుడు. భరతుడు గొప్ప విష్ణుభక్తుడు. భరతుని పేరు మీదనే ఈ దేశము భారత దేశము అని ప్రసిద్ధిచెందింది. అంతకు పూర్వము ఈ దేశమును అజనాభము అనే పేరుతో పిలిచేవారు. ఆ భరతుడు రాజుగా ఈ భారత దేశమును అనేక సంవత్సరములు పరిపాలించాడు. రాజ భోగములను తనివితీరా అనుభవించాడు. రాజభోగముల మీద విరక్తి చెందిన భరతుడు, రాజ్యమును

కుమారులకు అప్పగించి తపస్సుచేసుకోడానికి అడవులకు వెళ్లిపోయాడు. శ్రీహరిని గురించి తపస్సు చేసాడు. తరువాత మూడుజన్మలలో కూడా శ్రీహరిని ఆరాధించాడు.

భరతుని సోదరులలో తొమ్మిది మంది ఈ భరత ఖండములోని తొమ్మిది భాగములకు అధిపతులయ్యారు. వాటిని నవఖండములు అంటారు. వారిలో 81 మంది బ్రాహ్మణత్వమును స్వీకరించారు. కర్మమార్గమును అవలంబించారు. తక్కిన తొమ్మిది మంది ముని వృత్తిని స్వీకరించారు. వారి పేర్లు కవి, హవి, అంతరీక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రుమిళుడు, చమనుడు, కరభాజనుడు. వారందరూ ఈ భూమి మీద సంచరిస్తూ ప్రజలకు జ్ఞానబోధ చేసారు.

వారు ఎక్కడికైనా వెళ్లగలిగేవారు. వారికి ఎటువంటి ఆటంకములు ఉండేవి కావు. వారు దేవలోకము, సిద్ధలోకము, సాధ్యలోకము, గంధర్వలోకము, యక్షుల లోకము, నరలోకము, కిన్నెరుల లోకము, నాగలోకము మొదలగు లోకములలో స్వేచ్ఛగా సంచరించేవారు. మునులు, చారణులు, విద్యాధరులు, బ్రాహ్మణులు గోవులు నివసించే ప్రదేశములకు వెళ్లేవారు. కాని వారు ఏ ప్రదేశంలో కూడా ఆసక్తి కలిగి ఉండేవారు కాదు. నిరంతరము సంచరిస్తూనే ఉండేవారు.

ఆ ప్రకారంగా స్వేచ్ఛగా సంచరిస్తూ వారు నిమి చక్రవర్తి చేస్తున్న యజ్ఞమునకు వచ్చారు. వారిని చూచాడు నిమి చక్రవర్తి.

వారికి స్వాగతము ఇవ్వడానికి లేచి నిలబడ్డాడు. ఆయనతో పాటు యజ్ఞము చేస్తున్న ఋత్విక్కులు, సదస్యులు, బ్రాహ్మణులు కూడా లేచి నిలబడ్డారు. నిమి చక్రవర్తి ఆ మునులకు అర్ఘ్యము, పాద్యము, ఆసనము ఇచ్చి సత్కరించాడు. తరువాత నిమి చక్రవర్తి వారితో ఇలా అన్నాడు.

"ఓ మహామునులారా! మీరు సాక్షాత్తు విష్ణుమూర్తి యొక్కపార్షదులుగా తలస్తున్నాను. భగవంతుని పార్షదులు మానవులను మంచి మార్గంలో నడిపించడానికి భూలోకము అంతా తిరుగుతుంటారు కదా! ఓ మహాత్ములారా! ఈ మానవ దేహము లభించడం అత్యంత దుర్లభము. ఈ దేహము లభించిన తరువాత సజ్జనులను కలుసుకోవడం ఇంకా దుర్లభము. నా అదృష్టము కొద్దీ నాకు మీ యొక్క దర్శన భాగ్యము, మీతో మాట్లాడే అపూర్వ అవకాశము లభించాయి. ఈ ప్రపంచంలో పుట్టి నందుకు ఒక్క క్షణమైనా మీ వంటి సత్పురుషుల సమక్షంలో గడపడం పరమానందాన్ని కలుగజేస్తుంది.

నా మనసులో ఒక కోరిక ఉంది. ఏ ధర్మములను అనుష్ఠించడం వలన సాక్షాత్తు విష్ణుభగవానుడు తృప్తి చెందుతాడో అట్టి భాగవత ధర్మములను నాకు ఉపదేశించవలసింది. ఆ భాగవత ధర్మములను వినడానికి నాకు అర్హత ఉంది అని మీరు భావిస్తే, ఆ ధర్మములను నాకు చెప్పండి." అని వినయంగా అడిగాడు. నిమి అడిగిన ప్రశ్నకు మహాముని అయిన కవి ఈ విధంగా చెప్పాడు.

"ఓ నిమి చక్రవర్తీ! ఈ ప్రపంచంలో అనేకమంది దేహధారులు ఉన్నారు. ఈ దేహములు శాశ్వతములు కావు. నీటి బుడగల వంటివి. ఎప్పుడు పగిలిపోతాయో తెలియదు. కాని మానవులు ఈ దేహము శాశ్వతము అని అనుకుంటూ ఉంటారు. ప్రాపంచిక విషయముల కొరకు ఎల్లప్పుడూ తాపత్రయ పడుతుంటారు. అటువంటి వారు విష్ణుభగవానుని పాదములను సేవిస్తే సంసార బంధనముల నుండి విముక్తి పొందుతారు. విష్ణుపాదములను పట్టుకున్నవారికి ఎటువంటి భయము, ఆందోళన ఉండవు.

ఈ లోకంలో ఉండే మానవులు ఎక్కువ మంది అజ్ఞానులు, అవివేకులు. వారికి ఏది చెయ్యాలో, ఏది చెయ్యకూడదో తెలియదు. అటువంటి వారికి జ్ఞానము కలిగించడానికే భాగవత ధర్మములు నిరూపించబడ్డాయి.  ఈ భాగవత ధర్మములను శ్రద్ధగా పాటిస్తే, ఎవరికి కూడా ఎటువంటి ఆపదలు కలుగవు. సుఖశాంతులతో జీవిస్తారు. ఏ పని అయినా కళ్లు మూసుకొని చేయవచ్చు.

మానవుడు తన దైనందిన జీవితంలో, విధి ప్రేరణతో గానీ, తన స్వభావ సిద్ధంగా గానీ, శరీరముతో గానీ, మనస్సుతో గానీ, వాక్కుతో గానీ, ఇంద్రియములతో గానీ, ఎన్నో పనులు చేస్తుంటాడు. ఆ పనులను అన్నిటినీ నారాయణార్పణం అంటూ ఆ శ్రీమన్నారాయణుడికి సమర్పించాలి. ఆ కర్మలతో తనకు ఎటువంటి ఆసక్తి, అనుబంధము పెట్టుకోకూడదు.

ఈ ప్రపంచమునంతా భగవంతుని మాయ ఆవరించి ఉంది. మానవులు ఆ మాయలో పడి, ప్రాపంచిక విషయములకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తూ, తను ఎవరో, ఈ లోకానికి ఎందుకు వచ్చాడో, తాను చేయవలసిన కర్మలు ఏమిటో మరిచిపోతుంటాడు. తాను ఆత్మస్వరూపుడను అనే విషయాన్ని మరిచిపోతాడు ఆ కారణంగా మానవులకు దేహమే నేను, నేనే దేహము అనే భ్రాంతి కలుగుతుంది. అప్పుడు ఈ దేహము నాది, ఈ ఇంద్రియములు నావి, నేను ఈ పనులన్నీ చేస్తున్నాను, నన్ను మించిన వాడు లేడు అనే అహంకారము కలుగుతుంది. ఆ అహంకారంతో పాటు తనను ఎవరైనా ఏమన్నా చేస్తారేమో అనే భయం కూడా కలుగుతుంది. అహంకారము, భయము రెండూ వెంటవెంటే ఉంటాయి.

ఈ అహంకారము, భయము పోవాలంటే మానవుడు మంచి గురువును ఆశ్రయించాలి . ఆయన వలన భాగవత ధర్మములను తెలుసుకోవాలి. కోరికలను వదిలిపెట్టాలి. భక్తితో భగవంతుని ఆరాధించాలి. అప్పుడే అహంకారము నుండి, భయము నుండి విముక్తి పొందుతాడు.

మానవులకు స్వప్నములు వస్తుంటాయి. ఆ స్వప్నములలో ఎన్నో కనపడుతుంటాయి. ఎన్నోపనులు చేస్తుంటాడు. మెలుకువ రాగానే అవన్నీ అసత్యములు, నిజాలు కావు అని తేలుతుంది. అలాగే ఈ ప్రపంచం అంతా నిజం కాదు. కనపడే వన్నీ మార్పుచెందేవే! శాశ్వతములుకావు అని తెలుసుకోవాలి. ఈ జ్ఞానము మానవునకు ధ్యానము, వివేకము వలననే కలుగుతుంది.

ఈ మనస్సు ఎల్లప్పుడు ఏదో ఒక దానిని చెయ్యాలని సంకల్పిస్తుంది. మరుక్షణం వద్దంటుంది. ఈ మాదిరి సంకల్ప వికల్పాలతో చంచలంగా ఉంటుంది. ఆ మనసును నిగ్రహించి, నిశ్చలంగా ఉంచుకోవాలి. అలా మనో నిగ్రహం కలగడానికి వివేకం కావాలి. ఈ ప్రపంచం శాశ్వతం కాదు. స్వప్నంలో మాదిరి అశాశ్వతము అనే వివేకజ్ఞానము కలగాలి. అప్పుడు మానవుడు అన్ని భయముల నుండి విముక్తి పొందుతాడు.

మానవుడు ఈ లోకంలో సంచరిస్తూ ప్రాపంచిక విషయములను అనుభవిస్తుంటాడు. కాని దేని మీదా ఆసక్తి, అనురక్తి పెంచుకోకూడదు. ఏమి జరిగినా సాక్షిగా చూస్తూ ఉండాలి కానీ ప్రాపంచిక విషయములలో లీనం కాకూడదు. దీనికి మార్గము నిరంతరము హరినామస్మరణ, శ్రీహరిని పూజించడం, ఆరాధించడం. శ్రీహరి కథలను వినడం, గానం చేయడం. ప్రాపంచిక విషయములలో ఎటువంటి ఆసక్తి లేకుండా, ఎల్లప్పుడూ శ్రీహరి నామ స్మరణలో మునిగి తేలుతూ, శ్రీహరి కథలను వింటూ, శ్రీహరిని స్మరించే వారు బయట ప్రపంచానికి పిచ్చివాళ్లుగానూ, ఉన్మాదులుగానూ కనిపిస్తారు. వారు ఉన్నట్టుండి ఏడుస్తారు, నవ్వుతారు, ఆడతారు, పాడతారు.

మానవుడు ఈ అనంత విశ్వాన్ని పరమాత్మ స్వరూపంగా భావించాలి. పంచభూతములు, సూర్యచంద్రులు, చరాచర జీవరాసులు, వృక్షములు, నదులు, సముద్రములు, కొండలు, పర్వతములు అన్ని ఆ పరమాత్మ విరాట్ స్వరూపమే అని భావించాలి. అన్నిటిలోనూ పరమాత్మను దర్శించగలగాలి. అప్పుడు అతనిలో భేదభావము అంతరిస్తుంది. మానవులకు తృప్తిగా భోజనము చేస్తే అది

శరీరమునకు పుష్టిని ఇస్తుంది. ఆకలిని తీరుస్తుంది. అలాగే భగవద్భక్తులకు పరమాత్మను ఆరాధిస్తే, పూజిస్తే, భజిస్తే, భగవంతుని మీద ప్రేమ, భక్తి, భగవంతుని సాక్షాత్కారము, ప్రాపంచిక విషయముల యందు వైరాగ్యము కలుగుతాయి.

ఓ రాజా! ఈ విధంగా భాగవత ధర్మములను ఆచరిస్తే, అభ్యసిస్తే, శ్రీహరి పాదములను ప్రతిరోజూ సేవిస్తే, భగవంతుని మీద భక్తి, తత్వజ్ఞానము, వైరాగ్యము కలుగుతాయి. తత్ఫలితంగా ఆ మానవునికి పరమ శాంతి లభిస్తుంది." అని పలికాడు కవి అనే మహాముని.

ఆ మాటలు విన్న నిమి మహారాజు ఇలా అన్నాడు. "మహాత్మా! భగవంతుని మీద భక్తి, శ్రద్ధ ఉన్న వాడు ఏ ధర్మాన్ని ఆచరించాలి? అతడు ఎలా ఉంటాడు? అతని స్వభావము ఎలా ఉంటుంది? అతడు బయట ప్రపంచంలో ఎలా ప్రవర్తిస్తాడు? ఎలా మాట్లాడతాడు? ఏఏ లక్షణములు కలిగి ఉంటాడు? నాకు వివరించండి." అని అడిగాడు. దానికి హవి అనే మహాఋషి ఇలా అన్నాడు.

"ఓ నిమి మహారాజా! భగవద్భక్తుడు అయిన వాడు సకల జీవరాసులలో భగవంతుని దర్శిస్తాడు. తనలో పరమాత్మ ఆత్మ స్వరూపంలో ఉన్నాడని గ్రహించి, అదే ఆత్మస్వరూపమును అన్ని జీవరాసులలోనూ చూస్తాడు. అన్ని జీవరాసులు భగవంతుని స్వరూపమే అని భావిస్తాడు. భగవంతునిలో అన్ని జీవరాసులను చూస్తాడు. ఇటువంటి భక్తుని ఉత్తమభాగవతుడు అని చెప్పబడతాడు.

ఎల్లప్పుడు ఈశ్వరుని మీద ప్రేమ, భగవద్భక్తులతో మైత్రి, అవివేకులను, అజ్ఞానులను దయతో, కృపతో చూడటం, భగవంతుడు లేడు, భగవంతుడు అంటే నాకు పడదు అనేవారిని ఉపేక్షించడం అంటే వారి గురించి ఆలోచించకపోవడం, ఇటువంటి లక్షణములను కల వారిని మధ్యమ భక్తులు అని చెబుతారు.

శ్రీహరిని మెప్పించడానికి, ఆయన ప్రతిమలకు, విగ్రహములకు పూజచేసేవాళ్లు, మేము భగవద్భక్తులము, మేము పూజలుచేస్తున్నాము అంటూ ప్రచారం చేసుకునేవాళ్లు, భగవంతుని మీద భక్తి కలిగి ఉన్న వారిని లెక్కచేయని వాళ్లు, సాధారణభక్తులు అని పిలువబడతారు.

ఇంకా కొంత మంది భక్తులు ఉంటారు. వాళ్లు ఈ ప్రపంచం అంతా భగవంతుని మాయచేత సృష్టించబడింది. ఈ ప్రపంచంలో కనపడేది ఏదీ నిజం కాదు అనే భావనతో ఉంటారు. కేవలం ప్రాపంచిక సుఖములను ఎటువంటి ఆసక్తి లేకుండా అనుభవిస్తుంటారు. వాటి కోసరం వెంపర్లాడరు. ప్రాపంచిక సుఖాలు కావాలని కోరుకోరు అలాగని ద్వేషించరు. ఇటువంటి వారిని ఉత్తమ భాగవతుడు అని అంటారు.

మరి కొందరు అనునిత్యము భగవంతుని స్మరిస్తుంటారు. వారికి ఈ దేహము మీద, ఇంద్రియముల మీద, వాటి వల్ల కలిగే సుఖముల మీద, తనలో ఉన్న ప్రాణముల మీద, ఆకలి, దప్పికల మీద,

సుఖ దు:ఖముల మీద, ప్రాపంచిక విషయముల మీద, ఎటువంటి స్పందన కలిగి ఉండరు. అన్నిటినీ సమానంగా చూస్తారు. వేటి మీద వ్యామోహము, కోరిక చూపించరు. భగవంతుని స్మరించడం తప్ప వేరే దేని మీద ఆసక్తి ప్రదర్శించరు. వీరిని కూడా ఉత్తమ భాగవతులు అని అంటారు.

ఇంకా కొంతమంది ఉన్నారు. వారికి విషయ వాంఛలు అంటే కామ సంబంధమైన, స్త్రీ సంబంధమైన కోరికలు మనసులోకి రావు. ఏ పనీ చేయాలని అనుకోరు. చేయాల్సిన పని చేసి ఊరుకుంటారు. వాటి ఫలితముల గురించి ఆలోచించరు. పట్టించుకోరు. అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ అని అనుకుంటూ ఉంటారు. వారిని భాగవతోత్తములు అని అంటారు.

ఇంకా కొందరు ఉన్నారు. తాము గొప్ప కులంలో పుట్టామనీ, తాము గొప్ప గొప్ప పనులు చేస్తున్నామనీ, (ఉన్నత పదవులలో, ఉన్నత ఉద్యోగాలలో ఉన్నామనీ), తాము ఉన్నత కులమునకు చెందిన వారమనీ, తాము సన్యాసులమనీ, తమను ఎవరూ తాకరాదనీ, తాము ఎక్కువజాతికి చెందిన వారమనీ, అనుకుంటూ ఉంటారు. ఇటువంటి లక్షణములు లేని వారు, దేహాభిమానము ఇసుమంత కూడా లేని వారు, శ్రీహరికి ప్రియులు అని చెప్పబడతారు.

వీరే కాకుండా, "ఇది నాది", "అది నీది", నువ్వు వేరు, నేను వేరు" అనే భేదభావము లేని వారు, సృష్టిలో ఉన్న మానవులందరినీ, జంతువులను, పక్షులను సమభావంతో చూచేవారు, ఎల్లప్పుడూ మనసును ప్రశాంతంగా ఉంచుకొనే వారు, అట్టి వారిని కూడా

భాగవతోత్తములు అని అంటారు.

ఇంకా కొంత మంది ఉన్నారు. వారు శ్రీహరి పాదములు తప్ప వేరే దేనినీ కోరరు. వేటి మీద ఆసక్తి చూపరు. శ్రీహరి పాదపద్మములే మానవులకు శరణ్యములు అనే ధృఢమైన మనస్సుతో ఉంటారు. నీవు శ్రీహరి పాదములను విడిచిపెడితే నీకు స్వర్గలోకాధిపత్యము ఇస్తాను అంటే కూడా దాని మీద ఆసక్తి చూపరు. రెండో మాట లేకుండా వద్దు పొమ్మంటారు. శ్రీహరి పాదములను క్షణకాలం కూడా విడిచి ఉండటానికి అంగీకరించరు. అటువంటి వారిని ఉత్తమ భక్తులు అని అంటారు.

ఓ నిమి చక్రవర్తీ! పగలంతా సూర్యుడు తన ప్రతాపాన్ని చూపిస్తాడు. రాత్రి చంద్రుడు వచ్చి ఆ తాపాన్ని సొంతం పోగొడతాడు. అలాగే శ్రీకృష్ణభగవానుని పాదపద్మముల నుండి వెలువడే చల్లని కిరణములు మానవులలోని సమస్త తాపములను పోగొడతాయి. ఏమీ చేయలేని వాడు, చేయడానికి చేతకాని వాడు, కేవలం నిర్మలమైన మనస్సుతో భగవంతుని స్మరిస్తే చాలు, అతడిని సకల పాపముల నుండి విముక్తుడిని చేస్తాడు. భగవంతుడు భక్తితో, ప్రేమతో బంధింపబడతాడు కానీ గొప్పగా చేసే పూజల వలనా, పురస్కారాల వలనా కాదు. నిర్మలమైన భక్తితో, ప్రేమతో తనను కొలిచే వారి హృదయాలలో కొలువై ఉంటాడు భగవంతుడు." అని హవి అనే మహాఋషి నిమి చక్రవర్తికి వివరించాడు." అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు భగవద్భక్తుని లక్షణాలు వివరించాడు.

శ్రీమద్భాగవతము ఏకాదశ స్కంధము

రెండవ అధ్యాయము సంపూర్ణము ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

మూడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! హవి అనే మహాముని చెప్పిన విషయములను విన్న తరువాత నిమి ఇలా అడిగాడు. "మునులారా! పరమాత్మ సృష్టించిన ఈ మాయలో బ్రహ్మ మొదలగు దేవతా గణములు కూడా పడిపోతున్నారు అని అంటారు కదా! అసలు ఆ మాయ ఎటువంటిది. ఎలా ఉంటుంది. దాని గురించి, మాయాస్వ రూపమును గురించి తెలుపండి." అని అడిగాడు. అప్పుడు అంతరీక్షుడు అనే మహాముని ఇలా చెప్పాడు.

"మహారాజా! ఏ శక్తితో పరమాత్మ ఈ చరాచర జగత్తును సృష్టిస్తున్నాడో, ఏ శక్తి చేత పంచభూతములతో కూడిన ఈ శరీరములను సృష్టించి, వాటితో ప్రాపంచిక విషయమములను, విషయ వాంఛలను అనుభవింపజేస్తున్నాడో, ఆ శక్తియే మాయ. ఓ రాజా! పరమాత్మ పంచభూతములతో కూడిన ఈ శరీరములను సృష్టించి ఆ శరీరములలో అంతర్యామిగా ప్రవేశిస్తున్నాడు.

అంతర్యామిగా శరీరములలో ప్రవేశించిన పరమాత్మ, మనస్సు గానూ, జ్ఞానేంద్రియములు రూపంలోనూ, కర్మేంద్రియ రూపంలోనూ బయట ప్రపంచంలో విహరిస్తున్నాడు. ప్రాపంచిక విషయములను, విషయభోగములను అనుభవిస్తున్నాడు. ఆత్మ ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలలో లీనమై జీవాత్మగా

పిలువబడుతున్నాడు. ఈ దేహమే తాను అనుకుంటున్నాడు. ఈ దేహమే ఆత్మ అనుకుంటున్నాడు. ఈ దేహమే సర్వస్వము అనుకుంటున్నాడు. ఈ దేహమే భోగములను, విషయవాంఛలను అనుభవిస్తూ ఉంది అని ఆనందపడిపోతున్నాడు. ఈ శరీరము మీద విపరీతమైన ప్రేమను, అభిమానమును, ఆసక్తిని పెంచుకుంటున్నాడు.

జీవుడు జ్ఞానేంద్రియములతోనూ, కర్మేంద్రియములతోనూ, మనస్సుతోనూ, వాక్కుతోనూ ఎన్నో కర్మలు చేస్తుంటాడు. ఆ కర్మలన్నీ అతడు పూర్వజన్మలో చేసిన కర్మల వాసనలను బట్టి చేస్తుంటాడు. ఈ శరీరంతో సుఖములు దు:ఖములు అనుభవిస్తూ, ఈ ప్రపంచంలో తిరుగుతూ ఉంటాడు. ఈ జన్మలో చేసిన కర్మలు కూడా వాసనల రూపంలో జీవాత్మలో నిక్షిప్తంఅవుతాయి. ఈ ప్రకారంగా కర్మలు చేయడంలో ఆసక్తి కలిగిన జీవుడు మరణించిన తరువాత తాను చేసిన కర్మల వాసనలను అనుసరించి దేవ,మానవ,పశు,పక్షి,జన్మలను ఎత్తుతుంటాడు. మానవుడు ఈ జనన మరణ చక్రంలో ప్రళయ కాలం వరకు తిరుగుతుంటాడు.

పంచభూతములకు ప్రళయం సంభవిస్తుంది. అప్పుడు కాలశక్తి ప్రకృతిలోని స్థూలము, సూక్ష్మములు అయిన పదార్థములను తనలోకి లాక్కుంటుంది. అప్పుడు వర్షములు కురవవు, సూర్యుని వేడికి మలామలా మాడిపోతారు. తినడానికి తిండి, తాగడానికి నీరు దొరకవు. మూడు లోకములు కరువుతో విలవిలలాడి పోతాయి. భూమి తాపంతో వేడెక్కిన తరువాత, భూమి లోపల నుండి అగ్ని వాయువుతో కూడి పదార్థము బయటకు(లావా రూపంలో) తన్నుకొస్తుంది. భూమి

మీద ఉన్న సమస్తం దగ్ధం అయిపోతుంది. ఆ వేడికి నీరు విపరీతంగా వేడెక్కి మేఘాలుగా మారిపోతాయి. అప్పుడు కుండపోతగా వర్షం కురుస్తుంది. ఏకధాటిగా నూరు సంవత్సరములు వర్షం కురిసి భూమి అంతా జలమయం అవుతుంది. భూమి మీద జలం తప్ప వేరే ఏమీ కనిపించదు. అప్పుడు హిరణ్యగర్భుడు ఈ బ్రహ్మాండమును విడిచిపెట్టి కారణ శరీరంలో ప్రవేశిస్తాడు. అప్పుడు పంచభూతములు ఒకదానిలో ఒకటి కలిసిపోతాయి. భూమి జలంలో కలిసిపోతుంది. జలము తేజస్సుగా మారుతుంది. తేజస్సు వాయువులో కలిసిపోతుంది. వాయువు ఆకాశంలో కలిసిపోతుంది. ఆకాశము  తామస అహంకారంలో కలిసిపోతుంది. తామస అహంకారము రాజసాహంకారములోనూ, రాజసాహంకారము సాత్వికాహంకారములోనూ కలిసిపోతాయి. ఈ అహంకారములన్నీ మహత్తత్వములో కలిసిపోతాయి. ఆ మహత్తత్వము పరమాత్మలో లీనమై పోతుంది. ఇదే మహాప్రళయము. ఇదంతా పరమాత్మ మాయవలన జరుగుతుంది. ఈ మాయయే సృష్టికి, స్థితికి, లయమునకు కారణము. ఈ మాయలోనే సత్వ, రజస్తమోగుణములు ఉన్నాయి. ఓ నిమి మహారాజా! నీకు భగవంతుని మాయ గురించి వివరించాను. ఇంకా ఏమి వినదలచావో అడుగు." అని అన్నాడు అంతరీక్ష మహాముని.

అప్పుడు నిమి మహారాజు ఆ మునులను ఇలా అడిగాడు. "మహర్షీ! మీరు భగవంతుని మాయ గురించి వివరంగా చెప్పారు. కాని ఈ మాయను దాటే మార్గమేలేదా! ఉంటే, ఆ మార్గం ఏమిటి? ఈ మాయను సులభంగా దాటే మార్గం గురించి వివరించండి." అని అడిగాడు. అప్పుడు ప్రబుద్ధుడు అనే ముని ఇలా అన్నాడు.

"ఓ రాజా! ఈలోకంలో ఉన్న మానవులు తమకు ఉన్న దు:ఖములు పోగొట్టుకోడానికి, సుఖములు అనుభవించడానికీ అనేక కార్యములు చేస్తుంటారు. ఆడ మగా జంటలు జంటలుగా తిరుగుతుంటారు. సుఖాలు అనుభవిస్తుంటారు. వారు ఒక్కోసారి సుఖంకోసం ప్రయత్నం చేస్తే దు:ఖము కలుగుతూ ఉంటుంది. మానవులు ఎంతో కష్టపడి, శ్రమకోర్చి, ధనం సంపాదిస్తారు. ఆ ధనమే తనకు మృత్యువును తెచ్చిపెడుతుందని కూడా ఆలోచించకుండా ధనార్జనలో  మునిగిపోతారు.  ఒక గృహమును కానీ, అనేక గృహములు కానీ నిర్మించుకుంటాడు. భూమిని స్వంతం చేసుకుంటాడు. పశు సంపదను కూడబెట్టుకుంటాడు. వివాహం చేసుకుంటాడు, సంతానమును కంటాడు. భార్య సంతానం కోసం ఇంకా సంపాదిస్తాడు. కాని ఈ ధనము, భార్య, సంతానము, ఇవన్నీ శాశ్వతములు కావు అని మాత్రం గుర్తించడు. ఆ ధన సంపాదన వలన మానవుడికి దు:ఖం కలుగుతుందే కానీ సుఖం మాత్రం కలగదు.

ఓ రాజా! ఈ ధన సంపాదన, దాని వలన కలిగే దు:ఖము అనే విపరీత పరిణామము మానవులలోనే కాదు దేవతలతోనూ, అసురులలోనూ కూడా ఉంటుంది. దేవతలు, మానవులు, దానవులు కూడా తమ తోటి వారు బాగుపడితే సహించలేరు. తమ కన్నా ఉన్నత పదవిలో ఉన్న వారి మీద అసూయ ద్వేషము పెంచుకుంటారు.

ఓ రాజా! మనం చేసే కర్మల వలన లభించే ధనము, రాజ్యము, భోగములు, వాటి వలన కలిగే సుఖములు అన్నీ శాశ్వతములు కావు. అనుభవించే కొద్దీ వాటి మీద విసుగుపుడుతుంది. అవి నానాటికీ క్షీణించిపోతాయి అని తెలుసుకోవాలి.

ప్రతి మానవుడు ఈ క్షణికమైన భోగములకు అతీతమైన సుఖము గురించి తెలుసుకోవాలి. దానికి మంచి గురువును ఆశ్రయించాలి. ఆ గురువు కూడా రాగద్వేషములకు అతీతుడుగా ఉండాలి. అతనికి ఇహలోక భోగముల మీద ఎటువంటి కోరికలు ఉండకూడదు. అటువంటి గురువును ఆశ్రయించాలి. ఆ గురువే తనకు బంధువనీ, మిత్రుడనీ, ఆ గురువే సాక్షాత్తు పరమాత్మ స్వరూపమనీ, తన సర్వస్వము అనీ భావించాలి. ఆ గురువు మీద అపారమైన నమ్మకం ఉంచాలి. ఆ గురువును ఎటువంటి కపటం లేకుండా నిష్కల్మషమైన మనస్సుతో సేవించాలి.

ఓ నిమి మహారాజా! మనం ఏ ధర్మమును ఆచరిస్తే పరమాత్మ తృప్తి చెందుతాడో అదే భాగవత ధర్మము అని తెలుసుకో! ముందు దేహము మీద, భార్యాబిడ్డల మీద, ధనము మీద, ఆస్తులమీద, అభిమానమును, ప్రేమను పరిమితం చేసుకోవాలి. అధికమైన, విపరీతమైన ప్రేమాభిమానములు కలిగి ఉండకూడదు.

సత్పురుషులతో సాంగత్యం చేయాలి. సమస్త మానవుల పట్ల, సాటి జీవులపట్ల ప్రేమగలిగి ఉండాలి. అన్ని జీవులలో పరమాత్మ అంతర్యామిగా ఉన్నాడు అని భావించాలి. అందరిలో పరమాత్మను చూడగలగాలి. అందరితో స్నేహం చేయాలి. వినయం అలవరచు కోవాలి. ఎవరినీ ద్వేషించ కూడదు. ఎల్లప్పుడూ శరీరము, మనస్సు శుచిగా ఉండాలి. చేసే ప్రతి పనీ ఒక తపస్సు లాగా చేయాలి. ఓర్పు కలిగి ఉండాలి. సాధ్యమైనంత వరకూ అనవసరంగా మాట్లాడటం తగ్గించాలి. మాని వేయాలి. వేదాధ్యయనం చేయాలి. సరళమైన

భావనలు కలిగి ఉండాలి. బ్రహ్మచర్యము పాటించాలి. హింస చేయకూడదు. చలికి వేడికి, సుఖమునకు, దు:ఖమునకు తట్టుకోవాలి. మంచి జరిగితే సంతోషము, చెడు జరిగితే దు:ఖము పనికిరాదు. సుఖదు:ఖములను సమానంగా అనుభవించగలగాలి. ప్రతిజీవిలో అంతర్యామి రూపంలో పరమాత్మ ఉన్నాడు అని గ్రహించాలి.

సాధ్యమైనంత వరకు ఏకాంతంగా ఉండటానికి ప్రయత్నం చేయాలి. గృహము, ధనము, ఆస్తులు వీటి మీద అభిమానమును వదులుకోవాలి. నిర్జన ప్రదేశములో నివసించాలి. దొరికిన దానితో జీవించాలి. ఎల్లప్పుడూ తృప్తిగా సంతోషంగా ఉండాలి. భగవంతుని, వేదములను, శాస్త్రములను, ఇతర మత గ్రంధములను నిందించకూడదు. మనస్సును, మాటను నిగ్రహించుకోవాలి. ఎల్లప్పుడూ సత్యమునే పలకాలి. ఇంద్రియములను, మనసును అదుపులో పెట్టుకోవాలి.

శ్రీహరి అవతారములను, లీలలను, గుణములను గురించి చెబుతుంటే శ్రద్ధతో వినాలి. భగవంతుని కీర్తించాలి. భగవంతుని ధ్యానించాలి. భగవంతునికి ఇష్టమైన కర్మలు చేయాలి. భగవంతునికి ఇష్టమైన కర్మలనగా..........యజ్ఞములు, యాగములు చేయడం, తనకు ఉన్న దానిలో ఇతరులకు దానం చేయడం, చేసే ప్రతి పనీ ఒక తపస్సు మాదిరి చేయడం, భగవంతుని గురించితపస్సు చేయడం, ప్రతిరోజూ భగవంతుని నామమును జపం చేయడం, చక్కటి ఆచార వ్యవహారములను పాటించడం, తనకు ఏది లభించినా దానిని భగవంతునికి అర్పించడం, తనకు లభించిన భార్య, సంతానమును

భగవంతుని ప్రసాదముగా భావించి, వారిని ఆదరించడం, సర్వం కృష్ణార్పణం అనుకోవడం, భగవద్భక్తులను ఆదరించడం, వారిని పూజించడం, తోటి ప్రాణులను హింసించకుండా ఉండటం, స్వధర్మమును పాటించే సత్పురుషులకు సేవచేయడం, భగవద్భక్తులతో కలిసి సంచరించడం, భగవంతుని లీలలగురించి మాట్లాడటం, ఒకరిని ఒకరు ప్రేమించుకోవడం, దొరికిన దానితో తృప్తి చెందడం, శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా ప్రశాంతంగా ఉండటం, ఎల్లప్పుడూ శ్రీహరి నామమును స్మరించడం, అందరూ కలిసి శ్రీహరి నామమును భజించడం, ఆ భజనలో తాదాత్మ్యం చెందడం. ఇవన్నీ పరమాత్మకు ప్రీతి కలిగించే పనులు. ఈ పనులను సక్రమంగా నిర్వర్తిస్తే పరమాత్మ సంతోషిస్తాడు.

పరమాత్మ సేవలో, స్మరణలో, కీర్తించడంలో మునిగిన మానవులకు ప్రాపంచిక విషయములలో ఆసక్తి ఉండదు. వారికి దేహము మీద ప్రేమ అభిమానము ఉండదు. నిరంతరము భగవంతుని నామ స్మరణ చేస్తుంటారు. వారిలో వారు ఆనందిస్తుంటారు. ఏడుస్తుంటారు. నవ్వుతుంటారు. ఆనందంతో నృత్యం చేస్తుంటారు. పాడుతుంటారు. శ్రీహరి లీలలను అభినయిస్తుంటారు. వారి మనసులో శ్రీహరి సాక్షాత్కారం కాగానే ఆ చేష్టలన్నీ మానివేసి మౌనంగా, ప్రశాంతంగా ఉంటారు. ఈ ప్రకారంగా భాగవత ధర్మములను పాటించేవాడు, ఈ మాయను కూడా అనాయాసంగా జయించగలడు." అని పలికాడు ప్రబుద్ధ మహాఋషి.

తరువాత నిమి చక్రవర్తి ఇలా అడిగాడు. "మహాఋషులారా! పరబ్రహ్మను, బ్రహ్మను నారాయణుడు అని అంటారు కదా. ఆ

నారాయణ స్వరూపమును గురించి నాకు తెలియజేయండి.” అని అడిగాడు. ఆ ప్రశ్నకు పిప్పలాయనుడు అనే మహాఋషి ఈ విధంగా చెప్పాడు.

“ఓ మహారాజా! ఈ ప్రపంచంలో జరిగి సృష్టి స్థితి లయములకు ఎవరు కారకుడో, ఏ కారణం లేకుండా ఎవరుఉన్నారో ఆ పరమాత్మయే నారాయణుడు అని పిలువబడతాడు. ఆయన తత్వమే నారాయణ తత్వము. జాగ్రదావస్థలోనూ, స్వప్నావస్థలోనూ, సుషుప్తావస్థలోనూ, సమాధి స్థితిలోనే ఎవరైతే స్థిరంగా నిలిచి ఉంటాడో ఆయనే పరబ్రహ్మ, పరమాత్మ అని తెలుసుకో. ఈ దేహమును, ఇంద్రియములను, ప్రాణములను, మనసును నడిపించడానికి ఎవరు శక్తిని ఇస్తున్నారో, ఆయనయే పరమాత్మ అని పిలువబడుతున్నాడు.

అగ్నిలో నుండి నిప్పురవ్వలు పుడతాయి. కాని ఆ నిప్పు రవ్వలు నిప్పును ప్రకాశింపజేయలేవు. అలాగే ఆ పరమాత్మ నుండి పుట్టిన ఈ దేహము, ఇంద్రియములు, మనస్సు బుద్ధి ఇవి ఏవి కూడా ఆ పరమాత్మను ప్రకాశింపచేయలేవు. ఆ పరమాత్మకు ప్రమాణము వేదము. కాని వేదము కూడా పరమాత్మ గురించి సాకల్యంగా చెప్పలేదు. ఎందుకంటే ఆ వేదము కూడా పరమాత్మ నుండి పుట్టినది కాబట్టి.

ఈ బ్రహ్మ తత్వము మొదట ఒకటిగా ఉంటుంది. తరువాత అనేవ విధములుగా రూపుదిద్దుకుంటుంది. సత్వ, రజస్తమో గుణములతో కూడిన ప్రకృతి అనే పేరుతో ప్రకటితమౌతుంది. క్రియా

శక్తితో కూడి నపుడు సూత్రం అనే పేరుతో ప్రకటితమౌతుంది. జ్ఞాన శక్తితో కూడినపుడు మహత్తత్వము అనే పేరుతో పిలువబడుతుంది. జీవుడు దేహములో ఉన్నప్పుడు అహంకారము అని పిలువబడుతుంది. కాబట్టి ఆ పరబ్రహ్మమే, పరమాత్మ తత్వమే ఇన్ని విధములుగా ప్రకటితమౌతుంది. ఈ చరాచర జగత్తుకు కారణమైన ఆ పరమాత్మయే స్థూలము, సూక్ష్మము అయిన సకలవస్తువుల రూపములలో వెలుగుతుంటాడు.

(సృష్టి లేనపుడు పరమాత్మ అత్యంత సూక్ష్మముగా పరామాణువుగా ఉంటాడు. అందులో నుండి బిగ్ బాంగ్ అంటే మహావిస్ఫోటం జరిగింది. అప్పుడు ఈ అనంత విశ్వం ఆవిర్భవించింది. ఆ అనంత విశ్వం ఈ నాటికీ విస్తరిస్తూనే ఉంది. ఈ విషయాన్నే స్టీఫెన్ హాకిన్సు అనే శాస్త్రజ్ఞుడు తన బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైమ్ అనే గ్రంథంలో చెప్పాడు. ఆ విషయాన్నే ఇక్కడ భాగవతంలోకూడా చెప్పడం జరిగింది. మొదట ఒకటిగా ఉన్న పరబ్రహ్మము అనేకం అయ్యాడు. ప్రకృతి, క్రియ, దేహము, అహంకారము, మహతత్వము, త్రిగుణములు ఇలా అనేక రూపాలలో ప్రకటితమయ్యాడు. ఇంకా వివిధ రూపములలో ప్రకటితమౌతూనే ఉన్నాడు. బ్రహ్మ శక్తి అనంతము. సర్వము ఆ పరబ్రహ్మమే.)

ఈ పరబ్రహ్మ పదార్థమునకు పుట్టుక, పెరగడం, చావడం అంటూ ఏమీ లేవు. ఈ దేహమునకు, అందులో ఉన్న ప్రాణములకు మూలకారణమైన పరబ్రహ్మకు పుట్టుక, పెరుగుదల, చావు ఎందుకుంటాయి. ఆ పరబ్రహ్మ ఆత్మగా అన్ని జీవులలో సాక్షిగా ఉంటాడు. ఈ దేహములో ఉన్న ఇంద్రియముల ద్వారా బయట ప్రపంచంలో ప్రకటితమౌతున్నా ఆ దేహంలో ఆత్మస్వరూపుడుగా స్థిరంగా ఉంటాడు.

(పరబ్రహ్మ విశ్వ చైతన్యం అయితే, ఆత్మ పరిమిత చైతన్యం. ఆ చైతన్యం లేనపుడు శరీరం శవం అవుతుంది. విశ్వచైతన్యం లేనపుడు అనంత విశ్వం లయం అవుతుంది. పరమాణువుగా ఉన్న పరబ్రహ్మలో చేరిపోతుంది) అందుకే పరబ్రహ్మ ఒకటే సత్యం. మిగిలినవి అన్నీ మార్పుచెందేవే. నాశనం అయ్యేవే (బ్రహ్మసత్యం జగన్మిథ్య).

ఈ సృష్టిలో అనేక రకములైన పుట్టుకలు జరుగుతుంటాయి. గర్భంలోనుండి పుట్టేవి, గుడ్డునుండి పుట్టేవి, చెమట నుండి పుట్టేవి. విత్తు నుండి పుట్టేవి. వీటి అన్నిటిలోనూ ప్రాణం ఉంటుంది. ఆ ప్రాణము ఎటువంటి వికారమునకు లోను కాదు. మనకు మూడు అవస్థలు ఉన్నాయి. జాగ్రవదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తావస్థ. సుషుప్తావస్థలో ఇంద్రియములు పనిచేయవు. నేను నాది అనే అహంకారము ఉండదు. శరీరంలో అవయవములు మాత్రం పనిచెయ్యవు. ఆత్మ నిర్వికారంగా ఉంటుంది. కానీ శరీరం తన చైతన్యమును కోల్పోదు. అలా చైతన్యం కోల్పోతే అదే మరణము.

సుషుప్తిలో నుండి జాగ్రదావస్థలోకి వచ్చినపుడు “ఎంతో సుఖంగా ఉంది” అని అనుకుంటాడు. ఆ సుఖం ఎలా వచ్చింది. సుషుప్తిలో ఆత్మ ఒకటే నిర్వికారస్థితిలో ఉంటుంది. ఆత్మకు సహజ స్థితి అయిన ఆనందాన్ని, సుఖాన్ని అనుభవిస్తుంది. మరలా జాగ్రదావస్థకు రాగానే లౌకికమైన విషయములలో పడిపోతుంది.

మానవులు జాగ్రదావస్థలోనే ఆత్మకు అనుసంధానం కావాలంటే, ఆత్మానందాన్ని అనుభవించాలంటే, శ్రీహరి పాదపద్మములను భక్తితో, శ్రద్ధతో, ఏకాగ్రమైన మనసుతో సేవించడం ఒకటే మార్గము. అటువంటి భక్తి మానవునిలో ఉన్న మూడు గుణములను, వాటి వలన పుట్టిన కోరికలను, ఆ కోరికలు తీరిన తరువాత కలిగా వాసనలను నాశనం చేస్తుంది. అప్పుడు ప్రతి మానవుడు ఆత్మసాక్షాత్కారం పొందగలడు." అని పిప్పలాయనుడు వివరించాడు.

ఆమాటలు విన్న నిమి చక్రవర్తి మరలా ఇలా అన్నాడు. "ఓ మహామునులారా! మానవులు ఎన్నో కర్మలు చేస్తుంటారు కదా! ఏ కర్మ చేస్తే, మోక్షము పొందడానికి కావలసిన జ్ఞానం కలుగుతుందో, ఏమి చేస్తే, మోక్షము పొందడానికి అడ్డుగా ఉన్న  అడ్డంకులను అధిగమించగలడో, దేని వలన మానవులు చేసిన కర్మల ఫలితము వారికి అంటుకోదో, ఆ కర్మయోగము గురించి నాకు చెప్పండి." అని అడిగాడు.

ఆవిర్హోత్రుడు అనే మహాముని ఈ విధంగా చెప్పాడు. "మహారాజా! వేదములో మూడు రకములైన కర్మల గురించి వివరించారు. మొదటిది మానవులు చేయవలసిన, చేయతగిన కర్మలు. రెండవది. మానవులు చేయవలసిన కర్మలు చేయక పోవడం. మూడవది. చేయకూడని కర్మలు చేయడం. ఆచరించవలసిన కర్మలు ఏవి; ఆచరించకూడని కర్మలు ఏవి, అనేవి వేదములలో ప్రతిపాదించబడ్డాయి. అంతే గానీ, లోకరీతితో ఏవి చేయాలో ఏవి చేయకూడదో మనకు గాను మనం నిర్ణయించుకోకూడదు.

మహారాజా! వేదము ఏ విషయాన్ని సూటిగా చెప్పదు. దానిని కథారూపంలో వర్ణిస్తుంది. ఆ కథలోనే చెప్పవలసిన విషయాన్ని చక్కగా వివరిస్తుంది. వేదములను ఇలా అర్థం చేసుకోవాలి. కొన్ని చెడుకర్మల గురించి చెప్పి, ఆ చెడు కర్మల ప్రభావము నుండి విముక్తి పొందడానికి మరిన్ని మంచి కర్మల గురించి చెబుతుంది. బాలుడి చేత చేదు మందు తాగించాలంటే, నీకు తీపి తినుబండారములు ఇస్తాను అని ఆశపెట్టి, చేదు మందు తాగించాలి. వేదములు కూడా నీకు ఈ పని చేస్తే స్వర్గం వస్తుంది, స్వర్గసుఖాలు అనుభవించవచ్చు అని ఆశ చూపించి, మానవులను మంచి కర్మలను శ్రేష్ఠమైన కర్మలను చేయడానికి పురికొల్పుతుంది. చంచల బుద్ధి కల మానవుడు ఈ విధంగానైనా మంచి కర్మలు చేస్తాడని వేదం ఆ విధంగా చెబుతుంది.

ఇంద్రియలోలుడు, విషయలోలుడు అయిన మానవుడు వేదములో చెప్పబడిన కర్మలను చేయడానికి విముఖత చూపిస్తాడు. చేయకూడని కర్మలు చేయడానికే ఆసక్తి చూపిస్తాడు. ఆ కారణంగా అతనిలో అధర్మము ప్రజ్వరిల్లుతుంది. ఎన్నో చేయకూడని పనులు చేస్తాడు. పాప వాసనలు మూటగట్టుకుంటాడు. వాటి ప్రభావంతో ఈ సంసార సాగరంలో, జనన మరణ చక్రంలో పడి తిరుగుతుంటాడు.

తాను చేసినకర్మల పట్ల ఎటు వంటి ఆసక్తి కనపరచకుండా, తాను చేసిన కర్మల ఫలితములను పరమాత్మకు అర్పిస్తూ, వేదములలో చెప్పబడిన కర్మలను ఆచరించే వారు, కైవల్యస్థితిని పొందుతాడు. కాబట్టి ఓ మహారాజా! నిజానికి స్వర్గం

నరకం అంటూ లేవు. మానవులకు వేదవిహిత కర్మల పట్ల ఆసక్తి కలుగచేయడానికి, చేయకూడని కర్మల పట్ల విముఖత కలిగించడానికి, మంచి పనులు చేస్తే స్వర్గ సుఖములు అనుభవించవచ్చనీ, చెడు పనులు చేసే నరకయాతనలు అనుభవించాలనీ వేదములో చెప్పబడింది.

మానవుడు తనలో ఉన్న అహంకారమును, దేహాభి మానమును పోగొట్టుకోవాలంటే, వేదములో చెప్పబడిన విధుల ననుసరించి శ్రీహరిని పూజించాలి. ధ్యానించాలి. ఈ పనులు చేయడానికి మంచి గురువు కావాలి. గురువు చెప్పిన పద్ధతిలో చేయాలి. వేదములో చెప్పబడిన కర్మలు చేయాలంటే దానికి తగిన అధికారము పొందాలి. ఆ అధికారము ఉపనయనము వలన లభిస్తుంది. తరువాత భగవంతుని ఎలా అర్చించాలో గురువుగారి వలన తెలుసుకోవాలి. ఆ పద్ధతిలో శ్రీహరిని పూజించాలి.

ముందు స్నానం చేసి ఉతికిన వస్త్రములు ధరించాలి. మనసును పవిత్రంగా ఉంచుకోవాలి. తనకు ఇష్టమైన దేవుని విగ్రహం ముందు కూర్చోవాలి. ప్రాణాయామం చెయ్యాలి. అంగన్యాసము, కరన్యాసములను ఆచరించాలి. తరువాత శ్రీహరిని పూజించాలి. ముందు శ్రీహరిని ఆవాహన చేసి, ఆసనము, అర్ఘ్యము, పాద్యము సమర్పించాలి. తరువాత పుష్పములను మొదలగు పూజాద్రవ్యములను, ఆసనమును, భూమిని, తనను, దేవతా మూర్తిని ప్రోక్షణ చెయ్యాలి. శుద్ధిచేయాలి. తరువాత శ్రీహరిని ఏకాగ్రచిత్తంతో అర్చించాలి.

ఇన్ని పనులు చేయడానికి శక్తి చాలకపోతే, తన హృదయము నందు భగవానుని స్మరించి, ఏకాగ్రచిత్తంతో ధ్యానించాలి. హృదయములోనే భగవంతుని ఆవాహన చేసి, తన హృదయమునే ఆసనముగాచేసి, తన హృదయములో శ్రీహరిని ప్రతిష్ఠింపజేసి, మూల మంత్రముతో ధానం చేసి, హృదయములోనే అన్నివిధములైన ఉపచారములను చేయాలి.

తరువాత శ్రీహరికి హృదయము మొదలగు అంగములతోనూ, సుదర్శన చక్రము మొదలగు ఉపాంగములతోనూ (అందుకే పూజా విధానములలో సాంగోపాంగముగా, సపరివారసమేతంగాఆవాహన చేస్తారు.) పరివారముతోనూ, మూలమంత్రములను అనుసరించి పూజించాలి. అర్ఘ్యము, పాద్యము, ఆచమనము, స్నానము, వస్త్రము, అలంకారము, గంధము, పుష్పము, మాలలు, అక్షతలు, ఆభరణములు, ధూపము, దీపము, నైవేద్యముమొదలగు వాటిని ఆయావిగ్రహములకు సమర్పించాలి. తరువాత పరమాత్మను స్తుతించాలి. భక్తితో నమస్కరించాలి.

ఓ మహారాజా! ప్రతి మానవుడు తన ఆత్మను పరమాత్మ స్వరూపంగా భావించి శ్రీహరి విగ్రహాన్ని పూజించాలి. తరువాత పూజించిన పూజావస్తువులను శిరస్సున ధరించాలి. పూజ చేసేంత వరకు పరమాత్మను మనసులో నిలుపుకోవాలి. ఇతర ఆలోచనలు మనసులోకి రానీయకూడదు. ఏ మానవుడైతే అగ్నిని, సూర్యుని, జలమును, అతిథిని, తన హృదయములో ఉన్న ఆత్మస్వరూపుడైన పరమాత్మను పూజిస్తాడో అతడు ముక్తిని పొందుతాడు."అని

ఆవిర్హోత్రుడు అనే ఋషి నిమి చక్రవర్తికి చెప్పాడు అని శుక మహర్షి పరీక్షిత్‌మహారాజుకు వివరించాడు.

శ్రీమద్భాగవతము
ఏకాదశస్కంధము మూడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ఏకాదశస్కంధము
నాలుగవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారా.జా! నిమి చక్రవర్తి తన గృహమునకు వచ్చిన మహాఋషులతో ఇలా అన్నాడు.

"మహాఋషులారా! శ్రీహరి తనకు తాను ఎన్నో అవతారము లను ధరించాడు. ఈ లోకంలో దుష్ఠ శిక్షణ శిష్ట రక్షణ కొరకు ఎన్నో పనులను చేసాడు. ఇంకా ఎన్నో పనులు చేస్తున్నాడు. భవిష్యత్తులో కూడా శ్రీహరి ఎన్నో అవతారములను ఎత్తగలడు. వాటి గురించి నాకు వివరంగా తెలియజేయండి." అని అడిగాడు. అప్పుడు శ్రీద్రుమిళుడు అనే మహాముని నిమి చక్రవర్తితో ఇలా అన్నాడు.

"మహారాజా! శ్రీహరి గుణములను ఆయన అవతార విశేషములను ఇవి అని వర్ణించడానికి వీలు లేదు.అవి లెక్కకుమీరి ఉంటాయి. ఈ భూమి మీద ఎన్ని దుమ్ముకణాలు ఉన్నాయో లెక్కబెట్టడం సాధ్యం అవుతుందేమో కానీ, శ్రీహరి లీలలను, ఆయన

గుణములను లెక్కబెట్టడం సాధ్యం కాదు.

ఈ సృష్టి రెండు రకాలు. ఒకటి బ్రహ్మాండ సృష్టి. రెండవది జీవుల సృష్టి. ఈ సృష్టికి కారణం విశ్వం అంతా విస్తరించి ఉన్న శ్రీహరి మాయ. ఆ మాయ నుండి పంచభూతములు ఆవిర్భవించాయి. ఆ పంచభూతములతో ఈ బ్రహ్మాండము ఏర్పడింది. ఆ పంచభూతముల తోనే మన శరీరము కూడా ఏర్పడింది. శ్రీహరి అంతర్యామి రూపంలో ఈ బ్రహ్మాండంలో ప్రవేశించాడు. అలాగే ఆత్మ స్వరూపుడుగా ప్రతిజీవిలోనూ ప్రవేశించాడు.

దేహములో ఉన్న జీవుడిని పురుషుడు అన్నారు. (పురుషుడు అంటే మగవాడు అనే అర్థం కాదు. ఈ దేహము అనే పురములో ఉన్న జీవుడు అని అర్థం. అలాగే ఈ బ్రహ్మాండం లో విస్తరించి ఉన్నవాడు. అందుకనే పురుష సూక్తము అని పేరు వచ్చింది. ఆ పురుష సూక్తంలో మొదటి పదం సహస్రశీర్షా పురుష:. అంటే వేయితలలు గల పురుషుడు. విరాట్ పురుషుడు అని అర్థం. వివరంగా చెప్పాలంటే అందరిలో ఉన్నది ఒకే చైతన్యము అది ప్రాపంచిక విషయములలో లీనం అయితే జీవుడు అంటారు. అలా కాకుండా పరమాత్మ వైపు తిరిగితే ఆత్మ అంటారు.)

ఈ విరాట్ ప్రపంచంలో అనగా విస్తరించి ఉన్న విశ్వంలో మూడు లోకాలు ఉన్నాయి. అవే భూలోకము, భువర్లోకము, సువర్లోకము. ఆ విరాట్ స్వరూపములో నుండి ఈ సృష్టి ఆవిర్భవించింది. సర్వదేహధారులు జన్మించారు. ఆ దేహములలో

అవయవములు ఆవిర్భవించాయి. వాటినే జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అంటారు. విరాట్ పురుషుని ఉచ్ఛ్వాస నిశ్వాసల వలననే జీవుల దేహములలో శక్తి బలం ఏర్పడుతూ ఉంది. ఇంద్రియములకు పని చేసే శక్తి కలుగుతూ ఉంది. విరాట్ పురుషుని లోని సత్వ, రజస్తమోగుణముల ప్రభావంతో ఈ సృష్టిజరుగుతూ ఉంది.

ఈ విరాట్ శరీరమునకు అధిపతి శ్రీమన్నారాయణుడు. ఆయనే ఆది పురుషుడు. ఆయనే సృష్టి చేసే టప్పుడు రజోగుణమును ధరించి బ్రహ్మగానూ, పెంచి పోషించేటప్పుడు సత్వగుణమును ధరించి విష్ణువు గానూ, లయం చేసేటప్పుడు తమోగుణమును ధరించి శివుడు(రుద్రుడు) గానూ వ్యవహరిస్తున్నాడు.
(మనం మాత్రం శివకేశవులకు భేదం కల్పించి, నిలువు బొట్లు అడ్డబొట్లులు ధరించి, వీర శైవులు, శ్రీ వైష్ణవులు అని పేర్లుపెట్టుకొని కొట్టుకుచస్తున్నాము.) ఈ విరాట్ స్వరూపంలో ఎలా సృష్టిస్తితిలయములు జరుగుతున్నాయో అలాగే మానవులలో కూడా సృష్టి,స్థితి,లయములు(పుట్టుక, పెరగడం, మరణం) జరుగుతున్నాయి.

పూర్వము ధర్ముడు అనే ఋషి ఉండేవాడు. ఆయన భార్య పేరు మూర్తి. వారికి నరుడు, నారాయణుడు అనే ఇద్దరు ఋషులు జన్మించారు. వారు ఆత్మ తత్వమును ప్రజలకు ప్రబోధించారు. ఆత్మస్వరూపమును తెలుసుకోడానికి ఏమేం చెయ్యాలో ముందు వారు ఆచరించి తరువాత మానవులకు చెప్పారు. ఆ నరనారాయణులు ఇంకా జీవించి ఉన్నారు.

ఎప్పుడు ఎవరు ఏ మంచి పని చేసినా, ఇంద్రునికి కంటగింపుగా ఉంటుంది. తన పదవికి చేటు వస్తుందని నిరంతరం

భయపడుతుంటాడు.
(పదవులు పట్టుకొని వేలాడుతూ, ఆ పదవులు ఎప్పుడు ఊడతాయో అని భయపడుతూ, ఆ పదవి కోసం ఎటువంటి పాడు పనులు చెయ్యడానికి కూడా వెనుకాడని నేటి రాజకీయ నాయకులకు ఇంద్రుడు ప్రతీక).
ఈ నరనారాయణులు తన పదవికి చేటు తెస్తారేమో అనీ, తమ తపోబలముచేత తనను ఇంద్రపదవి నుండితొలగించి వారు ఆ ఇంద్రపదవిని అధిష్టిస్తారేమో అని భయపడ్డాడు ఇంద్రుడు. వారి తపస్సును భగ్నం చేయడానికి మన్మధుడిని పంపించాడు. ఆ మన్మధుడికి అప్సరసలు, వసంతఋతువు, మలయమారుతములు, చంద్రుని చల్లని వెన్నెల, ఇవే ఆయన పరివారము. ఈ పరివారమును వెంటబెట్టుకొని నరనారాయణులు తపస్సుచేసుకొనే బదరికాశ్రమము అనే ప్రదేశమునకు వెళ్లాడు మన్మధుడు. వారి చుట్టు అప్సరసలను మోహరించాడు. వసంతము, మలయానిలము వీటితో వారిని ప్రలోభ పెట్టడానికి ప్రయత్నించాడు.

నారాయణ ఋషి కళ్లు తెరిచాడు. మన్మధుని చూచాడు. మన్మధుడు గజగజవణుకుతున్నాడు. ఈ రోజుతో నా పని అయిపోయింది అనుకున్నాడు మన్మధుడు. కాని నారాయణ ఋషి మన్మధుని చూచి చిరునవ్వు నవ్వాడు. "మీరేమీ భయపడకండి. నేను మీకు ఎటువంటి శాపము ఇవ్వను. మిమ్ములను శపించి నా తపస్సును వృధా చెయ్యను." అని అన్నాడు. మన్మధుడికి మరలా ప్రాణం వచ్చినట్టయింది. సిగ్గుతో తల వంతుకొని నారాయణ ఋషితో ఇలా అన్నాడు.

"ఓ మహాఋషీ! మీరు ఎల్లప్పుడు మీ ఆత్మలో రమిస్తుంటారు. మీకు ఈ ప్రాపంచిక విషయముల పట్ల ఆసక్తి లేదు. ఈ విషయం తెలుసుకోలేక అజ్ఞానంతో మీ వద్దకు వచ్చాను. నన్ను క్షమించండి. దేవా! నీవు పరమాత్మ స్వరూపుడవు. నీలో కామము, క్రోధము మచ్చుకైనా లేవు. మునులందరూ నిన్ను పూజిస్తారు. నీ పాదములకు నమస్కరిస్తారు. నీవు మా మీద నీ ఆగ్రహం చూపించకపోవడంలో ఆశ్చర్యం లేదు. కొంతమంది మానవులు దేవతలను పూజించకుండా నిన్నే పూజించి ముక్తి పొందుదామని అనుకుంటారు. అటువంటి వారికి దేవతలు ఎన్నో విఘ్నాలు కల్పిస్తుంటారు. కానీ, ఆ దేవతలను ఉద్దేశించి యజ్ఞములు, యాగములు మొదలగు కర్మకాండలు చేస్తూ దేవతలకు ఆహుతులు అర్పించే వారికి ఏ విఘ్నములు కల్పించరు. అయినా నిన్ను భక్తితో సేవించే భక్తులను ఆ దేవతలు ఏమీచేయలేరు. నీ భక్తులు అయిన వారు, దేవతలు కల్పించే విఘ్నములను అధిగమించి, కార్యసిద్ధిని పొందుతుంటారు.

ఓ దేవా! కొంత మంది మానవులు తమ ఇంద్రియములను, విషయ వాంఛలను, రాగద్వేషములను జయిస్తారు. కానీ కోపమును జయించలేరు. జితేంద్రియులైన గొప్ప గొప్ప ఋషులు కూడా క్రోధావేశంతో శాపాలు ఇస్తుంటారు. సప్తసముద్రములను దాటిన వాడు, ఇంటి ముందు చిన్న గుంటలో జారిపడినట్టు, అన్నిటినీ జయించిన వారు కోపాన్ని, ఆవేశాన్ని జయించలేకపోతున్నారు. వారు ఎంత గొప్ప తపస్సుచేసినా, కోపాన్ని జయించలేకపోతే, ఆ తపస్సు వృథా అవుతుంది. వారి తపశ్శక్తి అంతా శాపాలు ఇవ్వడానికే సరిపోతుంది. తమరు మాత్రం మామీద ఏవిధమైన కోపం ప్రదర్శించకుండా,

శాంతచిత్తులై ఉన్నారు. అది మీ యొక్క గొప్పతనము కానీ వేరు కాదు." అని మన్మధుడు నారాయణ ఋషిని స్తుతించాడు.

నారాయణ ఋషి తన యోగ బలంతో కొంత మంది దేవతా స్త్రీలను సృష్టించాడు. వారు లోకోత్తర సౌందర్యముతో దివ్యమైన వస్త్రములతో, అలంకారములతో వెలిగిపోతున్నారు. మన్మధుని వెంట వచ్చిన అప్సరసలు వారి ముందు సూర్యుని ముందు దివిటీలవలె వెల వెల బోతున్నారు. నారాయణ ఋషి మన్మధుని చూచి "వీరిలో ఒక అందమైన, సౌందర్యవతి అయిన, ఉత్తమమైన, అప్సరసను ఎన్నుకొని ఆమెను స్వర్గానికే ఆభరణంగా చెయ్యండి." అని అన్నాడు.

తరువాత మన్మధుడు నారాయణ ఋషిని సేవించు చున్న వారిలో ఊర్వశి అనబడే దేవకాంతను ఎన్నుకొని ఆమెతో పాటు స్వర్గమునకు వెళ్లాడు. ఇంద్రసభలో మన్మధుడు నారాయణ ఋషి మహిమను కీర్తించాడు. ఆయన చెప్పిన మాటలను ఇంద్రుడికి చెప్పాడు. ఆ మాటలు విన్న ఇంద్రుడు ఆశ్చర్యపోయాడు. నారాయణ ఋషిని సాక్షాత్తు శ్రీహరి అవతారము అని తలంచాడు. తన అవివేకమునకు చింతించాడు.

ఓ నిమి మహారాజా! శ్రీహరి విశ్వకల్యాణము కొరకు ఎన్నో అవతారములను ధరించాడు. హంసగానూ, దత్తాత్రేయుడు గానూ, సనకాది ఋషులు గానూ, ఋషభుడు గానూ, అవతరించి మానవులకు ఆత్మజ్ఞానాన్ని ప్రబోధించాడు. హయగ్రీవుడుగా అవతరించి మధు అనే రాక్షసుని సంహరించాడు. వేదములను పునరుద్ధరించాడు.

ప్రళయ కాలంలో మత్స్యావతారం ధరించి ఈ ప్రకృతిని, ధాన్యములను, బీజములను, సత్యవ్రతుడు అనే మనువును రక్షించాడు. వరహావతారంలో పాతాళంలో ఉన్న పృథివిని ఉద్ధరించి, హిరణ్యాక్షుడు అనే రాక్షసుని సంహరించాడు. కూర్మావతారమును ధరించి మంధర పర్వతమును వీపున ధరించాడు.

శ్రీహరి అవతారంలో మొసలిని సంహరించి గజేంద్రుని రక్షించాడు. వాలఖిల్యులు అనే ఋషులు అంగుష్టమాత్రంగా ఉండేవారు. వారు ఒకపారి చిన్న పిల్లకాలువలో పడితే వారిని రక్షించాడు. వృత్రాసురుని చంపిన ఇంద్రుడికి బ్రహ్మ హత్యాపాతకము చుట్టుకుంటే, శ్రీహరి ఆయనను రక్షించాడు. శ్రీకృష్ణుడుగా అవతరించి నరకాసురుని చెరలో ఉన్న రాచకన్యలను విడిపించాడు. నృసింహావతారములో హిరణ్యకశిపుని సంహరించి తన భక్తుడు ప్రహ్లాదుని రక్షించాడు. దేవాసుర యుద్ధములో దైత్యులను సంహరించి, దేవతలకు స్వర్గాధిపత్యము కలిగించాడు.

వామన రూపంలో బలి చక్రవర్తి నుండి మూడు అడుగుల దానమును గ్రహించి, అదితి కుమారుడైన ఇంద్రుడికి ఇచ్చాడు. పరశు రామునిగా అంతరించి, 21 మార్లు క్షత్రియుల మీద దండెత్తి, అధర్మపరులైన క్షత్రియులను నాశనం చేసాడు. శ్రీరామునిగా అవతరించి సేతువును నిర్మించి, రావణుని సంహరించి, సీతను రక్షించాడు. భూభారమును తగ్గించడానికి శ్రీహరి శ్రీకృష్ణుడుగా అవతరించి అనేక లీలలను ప్రదర్శించాడు. కల్కిరూపంలో కలియుగంలో అవతరించి, దుష్టులను శిక్షిస్తాడు.

ఓ నిమి చక్రవర్తీ! ఈ విధంగా శ్రీహరి అవతార లీలలు ప్రకటితమయ్యాయి." అని శ్రీద్రుమిళుడు అనే మహాముని నిమి చక్రవర్తికి శ్రీహరి అవతార విశేషములను వివరించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు, ఋషులకు, నిమికి జరిగిన సంవాదమును వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

ఐదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ద్రుమిళుడు చెప్పిన విషయాలు విన్న తరువాత నిమి మహారాజు మరొక ప్రశ్న అడిగాడు. "ఓ మునీంద్రులారా! తమరు ఇంతవరకు మానవులలో భగవంతుని ఆరాధించే వారి గురించి మాత్రమే చెప్పారు. కాని ఎందరో మానవులు అసలు భగవంతుని ఆరాధించడం లేదు. మరి కొందరు అసలు దేవుడే లేడు అంటున్నారు. వారు ఎంత సేపటికీ ఇంద్రియ సుఖములు, కామభోగములు తీర్చుకోవడంలోనే తమ జీవితమును వృథా చేసుకుంటున్నారు. అటువంటి వారికి ఎటువంటి గతులు కలుగుతాయి. వివరించండి." అని అడిగాడు. దానికి చమసుడు అనే మహర్షి ఈ విధంగా చెప్పాడు.

"మహారాజా! విరాట్ పురుషుడు అని చెప్పారు కదా! ఈ అనంత విశ్వమే విరాట్ పురుషుడుగా మనం కల్పించుకున్నాము. ఈ విరాట్ పురుషుని ముఖం నుండి సత్వగుణ ప్రధానులైన బ్రాహ్మణులు, భుజముల నుండి సత్వ, రజో గుణము కలిగిన క్షత్రియులు, తొడల నుండి రజస్సు తమస్సు ప్రధానంగా గల వైశ్యులు, పాదముల నుండి తమోగుణము ప్రధానంగా గల శూద్రులు జన్మించారు. వాటితో పాటు బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము అనే నాలుగు ఆశ్రమములు కూడా ఏర్పడ్డాయి. ఆ ప్రకారంగా మానవ సృష్టి జరిగింది.

మానవులు పైన చెప్పబడిన నాలుగు వర్ణములుగా అంటే నాలుగు భాగములుగా వారు చేసే కర్మలను బట్టి గుణములను బట్టి విభజింపబడ్డారు. ఆ మానవులలో ఎవరైనా అజ్ఞానము వలన గానీ, అవివేకము వలన గానీ తాము ఎక్కడి నుండి వచ్చారో ఆ పరమాత్మను ఆరాధించకపోయినా, మరిచిపోయినా, ఆ పరమాత్మ గురించి తెలిసి కూడా ఆయనను అవమానించినా, వారు పతితులు అవుతారు.

కాని శూద్రులు, స్త్రీలు హరికథలను వినడానికి గానీ, వేదములు, శాస్త్రముల గురించి తెలుసుకోడానికి ప్రయత్నించక దూరంగా ఉండిపోయారు. ఎందుకంటే వారికి వారి దైనందిన కృత్యములతోనే వారి కాలం గడిచిపోతూ ఉంది. అటువంటి వారు భగవంతుని భక్తులు అయిన మీవంటి వారు చెప్పే మంచి మాటల కొరకు ఎదురుచూస్తుంటారు.

బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు ఉపనయనము మొదలగు సంస్కారములు ఏర్పాటు చేసారు. ఉపనయనము తరువాతనే వారు వేదములలో చెప్పబడిన బ్రహ్మ కర్మలకు యోగ్యులవుతారు. బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యులు వేదములలో చెప్పబడిన కర్మలకు యోగ్యులై ఉండి కూడా ఆ కర్మలు చేయడం లేదు. వారు వేదముల గురించి, శాస్త్రముల గురించి తర్కించడం చేస్తున్నారు. అనవసరమైన వాదోపవాదములతో కాలం గడుపుతున్నారు. భగవంతుని ఆరాధించడం మానివేసారు. ఏ యజ్ఞంచేస్తే మనకు లాభం కలుగుతుంది. ఏ యాగం చేస్తే మనకు స్వర్గసుఖాలు లభిస్తాయి అని లెక్కలు వేసుకుంటూ తమకు సుఖభోగములను, శక్తులను, స్వర్గసుఖములను ఇచ్చే కర్మలను మాత్రమే చేస్తున్నారు. పరమాత్మ తత్వమును తెలుసుకోడానికి ప్రయత్నించంచడం లేదు.

ఇటువంటి వారికి అసలు కర్మ అంటే ఏమిటో తెలియదు. వేదంలో ఏం చెప్పారో తెలియదు. వితండ వాదం చేస్తుంటారు. అవినీతికి పాల్పడుతుంటారు. మూర్ఖంగా ప్రవర్తిస్తుంటారు. వీరు అంతా తాము చదువుకున్న పండితులము అనుకుంటారు కానీ, వీరికి ఏమీ తెలియదు. వారికి ఏమీ తెలియదు అన్న విషయం వారికి తెలియదు. అంతా తమకు తెలుసు అన్న గర్వంతో విర్రవీగుతుంటారు. ఇటువంటి వారు ఆడంబరంగా యజ్ఞయాగములు చేస్తూ తమ కోరికలను తీర్చే తమ ఇష్టదేవతలను పొగుడుతూ ఉంటారు.

ఇటువంటి వారు బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్యులలో పుట్టినా వారికి రజోగుణం ఎక్కువగా ఉంటుంది. వారికి జంతు హింస మీదా,

ఇతరులను శారీరకంగా, మానసికంగా హింసించి ఆనందించే ప్రవృత్తి కలిగి ఉంటారు. అటువంటి వారు తమకు వ్యతిరేకంగా ఒక చిన్న మాటను కూడా సహించలేరు. మహా కోపంగా ఉంటారు. వారిలో పాముకన్నా కోపం ఎక్కువగా ఉంటుంది. వారు ఎల్లప్పుడూ డాంబికాల కోసం, ప్రచారం కోసరం వెంపర్లాడుతుంటారు. తమను గురించి అందరూ పొగడాలని ఆతురత పడుతుంటారు. తమను ఎవరన్నా పొగిడితే ఆనందిస్తారు. లేకపోతే తిడతారు.

వారికి దురభిమానము ఎక్కువ. తమను గురించి తాము ఎక్కువగా ఊహించుకుంటూ ఉంటారు. తమ కంటే గొప్పవారు, తెలిసినవారు, ధనవంతులు, భాగ్యవంతులు లేరని ఊహించుకుంటూ ఉంటారు. ధనమదంతో, ఐశ్వర్యగర్వంతో, తమకు అన్నీ తెలుసనే అహంభావంతో వారు ఎన్నో పాపాలు చేస్తుంటారు. ప్రశాంతంగా భగవంతుని ధ్యానించే భగవద్భక్తులను చేతకాని వారని అపహాస్యం చేస్తుంటారు. అటువంటి వారికి స్త్రీ సాంగత్యము మీద మక్కువ ఎక్కువ. వివాహానికి ప్రాధాన్యత ఇస్తారు. ఎల్లప్పుడూ స్త్రీలకు సంబంధించిన, కామకోరికలకు సంబంధించిన విషయములను మాట్లాడుకుంటూ ఉంటారు.

తమకు ఎంత ఉన్నా ఇతరులకు ఏమీ దానం చెయ్యరు. అన్నీ తమకే కావాలని అనుకుంటూ ఉంటారు. వారు తమ గొప్ప కోసం యజ్ఞములు యాగములు చేస్తారు. కాని యజ్ఞయాగములు చేసిన వారికి దక్షిణలు ఇవ్వరు. అన్నదానం చెయ్యరు. వారికి హింస యందు మక్కువ ఎక్కువ. తమ స్వలాభం కోసం, తమకు ఆహారం కోసం పశు

వులను, జంతువులను, పక్షులను చంపుతారు. జీవహింస చేయడంలో ఆసక్తి కలిగి ఉంటారు.

ఓ మహారాజా! అటువంటి క్రూరస్వభావము గల వారు ధనమువలన, ఐశ్వర్యము వలన, విద్యవలన, అగ్రకులములో పుట్టినందువలన, మంచి రూపము, అందకు కలిగి ఉన్నందు వలన, మంచి దేహధారుడ్యము కలిగి ఉన్నందువలన, యజ్ఞయాగములు చేసినందువలన, దానధర్మములు చేసినందువలన, కలిగిన గర్వముతో, అహంభావముతో, తమ వివేకమును కోల్పోయి, పరమాత్మను, ఆయన భక్తులను, సాధువులను అవమానిస్తూ ఉంటారు. అటువంటి వారు పరమాత్మను గురించి తెలుసుకోవడానికి ఇష్టపడరు. ఆయన కథలు, ఆయన గుణగణములను కీర్తించరు. తమ మనసుకు తోచిన విషయములనే మాట్లాడుతారు. కేవలం ప్రాపంచిక విషయములు, సాంసారిక విషయముల గురించి, కామ సంబంధమైన విషయముల గురించి మాట్లాకుంటూ కాలం గడుపుతారు.

మహారాజా! ఈ లోకంలో ఉన్న మానవులకు స్త్రీలతో సంగమించి కామకోరికలు తీర్చుకోవడం, మాంసము తినడం, మద్యము సేవించడం అత్యంత సహజమైన అలవాట్లు. ఇవి ఎలా చెయ్యాలి అనే విషయం గురించి ఏ శాస్త్రము చెప్పలేదు. ఈ అలవాట్లను మానుకుంటే మంచిదే. కాని ఇవి మానవ సహజం కాబట్టి వీనిని ఎవరూ పూర్తిగా మానలేరు. కాబట్టి వీటికి కొన్ని నియమములు విధించింది. వివాహం చేసుకోవడం ద్వారా ఒకే స్త్రీతో సుఖం అనుభవించడానికి వీలు కల్పించింది. యజ్ఞములు

యాగములలో పశువులను చంపడం ద్వారా, మాంసభక్షణకు వీలు కల్పించింది. సౌత్రామణి అనే యజ్ఞము మొదలగు యజ్ఞములలో సురాపానము చేయడానికి వీలు కల్పించింది. ఈ విధంగా ఎవరికి వారు నియమములను విధించుకొని, క్రమక్రమంగా ఈ అలవాట్లను మానివేయడమే వేదముల ఉద్దేశ్యము అంతేకానీ, ఎక్కువ మందిని పెళ్లిచేసుకొని విచ్చలవిడిగా స్త్రీసుఖములను అనుభవించడం, యజ్ఞయాగముల పేరుతో అడ్డు ఆపు లేకుండా జీవహింసచేయడం, మద్యమును సేవించడం చెయ్యమని వేదములు చెప్పలేదు. వేదములకు మనకు అనుకూలంగా భాష్యం చెప్పుకోవడం మానవుల స్వార్థబుద్ధికి, అవివేకమునకు నిదర్శనము.

ఓ మహారాజా! ఏ ధర్మమును అనుసరిస్తే విజ్ఞానము, మోక్షము కలుగుతుందో అట్టి ధర్మము ఆచరించడానికి అనువుగా ఉన్న పనులకు ఉపయోగపడే ధనమును మాత్రమే సంపాదించాలి. సంపాదించిన ధనముతో తృప్తి పడాలి. తన ఆత్మ తృప్తికొరకే ఆ ధనమును ఖర్చుపెట్టాలి. ఇలా చేసేవాడు మృత్యువుకు కూడా భయపడడు. నిరంతరము సుఖంగా, ఆనందంగా ఉంటాడు.

ఓ నిమి మహారాజా! నీకు ఇంకా కొన్ని ధర్మ సూక్ష్మాలు చెబుతాను విను. నీకు సౌత్రామణి యాగం గురించి చెప్పాను కదా! ఆ యజ్ఞంలో సురను అంటే మద్యమును కేవలం వాసన చూడమని చెప్పారు కానీ తాగమని చెప్పలేదు. అలాగే యజ్ఞయాగములలో పశు వులను ఊపస్థంబమునకు కట్టి వాటిని తాకమని చెప్పారు కానీ కత్తితో నరకమని చెప్పలేదు. తాను వివాహం చేసుకున్న భార్యతో కేవలం

సంతానమును కనడం కోసమే సంభోగించాలి కానీ, విషయవాంఛలు తీర్చుకోడానికి కాదు. కాని, మాంసము, మద్యము, స్త్రీల మీద కోరికలు కలవారు వేదమునకు విపరీతమైన అర్థములు చెప్పి, వేదములలో చెప్పారని మాంసం తింటున్నారు, మద్యం తాగుతున్నారు, స్త్రీలను అనుభవిస్తున్నారు.

వేదములలో చెప్పబడిన ధర్మముల గురించి ఏ మాత్రమూ తెలియని వారు, అవినీతి పరులు, తాము సాధువులము అని చెప్పుకొనేవారు, తమ ఆహారం కోసరం విచ్చలవిడిగా పశువులను, పక్షులను చంపి తింటున్నారు. ఏ పశువులను అయితే వారు యజ్ఞయాగాదులలో చంపుతున్నారో, ఆ పశువులు నరకంలో వీరి కోసం కాచుకొని ఉంటాయి. వీరు నరకానికి రాగానే వీరిని పొడిచి పొడిచి హింసిస్తాయి. ముక్కముక్కలుగా చేసి తింటాయి.

ఓ నిమి మహారాజా! ఈ దేహము శవం లాంటిది. ప్రాణం ఉన్నంతవరకే దీనికి విలువ. ఆ గాలి పోగానే కుళ్లిపోతుంది. క్షణం కూడా ఉంచరు. ఇటువంటి దేహం మీద ఆసక్తితో మానవులు తమ సుఖం కోసరం ఇతర జీవాలను హింసిస్తుంటారు. ఆ జీవాలలో ఉన్న పరమాత్మను ద్వేషిస్తుంటారు. జీవహింస చేయడం వలన వారు నరకలోక ప్రాప్తి పొందుతున్నారు.

ఇటువంటి వారికి ఆత్మతత్వజ్ఞానము ఏమాత్రము ఉండదు. కేవలం దేహమే ప్రధానము అనుకుంటూ ఉంటారు. వారిలో జడత్వము ఎక్కువగా ఉంటుంది. మత్తుగా ఉంటారు. ఎల్లప్పుడూ ధనం సంపాదించడం, వాటితో కోరికలు తీర్చుకోవడం వీటితో క్షణం కూడా

తీరికలేకుండా కాలం గడుపుతుంటారు.

ఇటువంటి వారు తమను తాము నాశనం చేసుకుంటూ ఉంటారు. తుదకు నరకానికి చేరుకుంటారు. ఇటువంటి వారంతా కర్మలు చేయడం వలన జ్ఞానం వస్తుందని వితండ వాదం చేస్తుంటారు. అలా అని మంచి కర్మలు చేయరు. చేయకూడని పనులు చేస్తుంటారు. పోనీ వాటితో వారి కోరికలు తీరతాయా అంటే అదీ లేదు. ఒక కోరిక పోతే మరొకటి. అది తీరితే మరొకటి. నిరంతరం కోరికల వలయంలో పడి సతమతమౌతుంటారు. వారికి ఎన్నటికీ తృప్తి అనేది కలగదు. జీవితమంతా కోరికలు తీర్చుకోవడంలోనే గడిపి తుదకు నరకానికి చేరుకుంటారు.

అటువంటి వారు మృత్యువు అంటే భయపడతారు. తాము చావడానికి ఒప్పుకోరు. చావంటే భయపడతారు. కాని మృత్యువు ఊరుకోదు కదా! మృత్యువు అంటే వారికి ఇష్టం లేకపోయినా, కాలం తీరగానే మృత్యువు వారిని కబళిస్తుంది. అప్పటి దాకా తాము అత్యధికంగా ప్రేమించిన, కామించిన భార్యను, బిడ్డలను, ధనమును ఐశ్వర్యమును ఆస్తులను విడిచి పెట్టి నరకానికి ప్రయాణం కడతారు.

నిమి మహారాజా! భగవంతుని పూజించకుండా కేవలం ప్రాపంచిక విషయములలో, విషయవాంఛలలో పడి సతమతమయ్యేవారు నరక గతినిపొందుతారు." అని చమస మహాముని వివరించాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! చమస మహాముని చెప్పిన మాటలు విన్న తరువాత నిమి చక్రవర్తి ఆ మహాఋషులతో ఇలా అన్నాడు. "పరమాత్మ ఎన్నో అవతారములను ధరించాడు అని అంటారు కదా. పరమాత్మ ఏ సమయంలో, ఏ వర్ణములో, ఎటువంటి ఆకారంతో, ఏ ఏ పేర్లతో, ఏ ప్రకారంగా పూజించ బడ్డాడు నాకు తెలియజేయండి." అని అడిగాడు. అప్పుడు కరభాజనుడు అనే మహాముని నిమి చక్రవర్తితో ఇలా అన్నాడు.

"మహారాజా! మనకు నాలుగు యుగాలు ఉన్నాయి. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపర యుగము, కలియుగము. ఈ నాలుగు యుగములలో శ్రీహరి వివిధములైన పేర్లతో వర్ణములతో, ఆకారములతో, వివిధరీతులలో పూజింపబడ్డాడు. కృతయుగంలో భగవానుడు తెల్లని వర్ణంతోనూ, నాలుగు భుజములతోనూ, జటాజూటములతోనూ, నారచీరలు, జింక చర్మమును, యజ్ఞోపవీతమును, అక్షమాలను, దండ కమండలము లను ధరించి, బ్రహ్మచారి వేషముతో సంచరించాడు. కృతయుగంలో మానవులు ధర్మపరులు. ఎల్లప్పుడు శాంతంగా ఉండేవారు. ఒకరితో ఒకరికి విరోధము ఉండేది కాదు. అందరినీ సమంగా చూచేవారు. ఇంద్రియములను, మనస్సు అదుపులో ఉంచుకునేవారు. ఎల్లప్పుడు భగవంతుని గురించి ధ్యానం చేసేవారు. మానసిక పూజ చేసేవారు. ఆ కృతయుగములో భగవంతుడు హంస, సుపర్ణుడు, వైకుంఠుడు, ధర్ముడు, యోగీశ్వరుడు, అమలుడు, ఈశ్వరుడు, పురుషుడు, అవ్యక్తుడు, పరమాత్మ అనే పేర్లతో పిలువబడేవాడు.

కృతయుగము తరువాత త్రేతాయుగము వచ్చింది. త్రేతాయుగంలో పరమాత్మ ఎరుపు రంగును ధరించాడు. అప్పుడు కూడా భగవంతుడు నాలుగు భుజములు, మొలతాడు, బంగారు రంగు జుట్టు, వేదములతో చెప్పబడిన లక్షణములతో విగ్రహముల రూపము, యజ్ఞములు యాగములు చేయడానికి ఉపయోగించే స్రుక్కు మొదలగునవి ధరించేవాడు. అప్పుడే వేదములు ఆవిర్భవించాయి. వేదములను అధ్యయనము చేసిన వారు, ధార్మికులు అయిన మానవులు మూడు వేదములలో చెప్పబడిన కర్మలను చేయడం ద్వారా శ్రీహరిని ఆరాధించేవారు. (విగ్రహారాధన, యజ్ఞయాగములు త్రేతాయుగములో ఆరంభం అయ్యాయి అని తెలుస్తూ ఉంది.) ఈ త్రేతాయుగంలో భగవానుడు విష్ణువు, యజ్ఞేశ్వరుడు, పృశ్నిగర్భుడు, సర్వదేవుడు, ఉరుక్రముడు, వృషాకపి, జయంతుడు, ఉరుగాయుడు అనే పేర్లతో పిలువబడ్డాడు.

త్రేతాయుగము అయిన తరువాత ద్వాపర యుగము వచ్చింది. ఈ ద్వాపరయుగంలో పరమాత్మ శ్యామల వర్ణము, పీతాంబరము, శంఖు, చక్రము, గద మొదలగు ఆయుధములను ధరించాడు. శ్రీవత్సము, కౌస్తుభము, మొదలగు లక్షణములతో విరాజిల్లాడు. ద్వాపర యుగములో భగవానుడు శ్రీకృష్ణుడు అనే పేరుతో పిలువబడ్డాడు. ద్వాపర యుగంలోని మానవులు పరమాత్మను మహారాజ లక్షణములతో, అనేక ఆభరణములతో, అలంకారములతో పూజించారు. వేదములలో చెప్పబడిన వైదిక విధులు, ఇతర శాస్త్రములలో చెప్పబడిన తంత్రశాస్త్ర విధులతో పూజించారు. ద్వాపర యుగంలో పరమాత్మను వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, అనే నాలుగు అంశలతో పూజించారు. ద్వాపర యుగంలో

మానవులు పరమాత్మను ఈ విధంగా ఇన్నిపేర్లతో ఆరాధించారు.

ద్వాపర యుగము తరువాత కలియుగము వస్తుంది. ఈ కలియుగంలో వేదప్రమాణములు, వేదవిధులు తగ్గిపోయి, తాంత్రిక విధులు ఎక్కువ అవుతాయి. కలియుగములో పరమాత్మను విగ్రహ రూపంలో ఆరాధిస్తారు. ఆ విగ్రహములు నల్లని రూపంలో ఉంటాయి. ఆ విగ్రహముల నుండి ఉజ్జ్వలమైన కాంతి వెలువడుతూ ఉంటుంది. ఆ విగ్రహములకు అనేకములైన అలంకారములను చేస్తారు. కౌస్తుభంతో అలంకరింపబడి ఉంటాడు. సుదర్శన చక్రము, పాంచజన్యము అనే శంఖము, గద మొదలగు ఆయుధములు కలిగి ఉంటాడు. సునందుడు మొదలగు పార్షదులు ఆయనను సేవిస్తూ ఉంటారు. కలియుగంలో ఉన్న పండితులు, బుద్ధిజీవులు పరమాత్మను యజ్ఞములతోనూ, యాగములతోనూ, సంకీర్తనలతోనూ, పూజలతోనూ ఆరాధిస్తారు.

ఓ రాజా! ఈ విధంగా పరమాత్మ అన్ని యుగములలోనూ ఆయాయుగములకు అనువైన పేర్లతో, మూర్తులతో పూజింపబడ్డాడు. ఏ యుగములో ఏ విధంగా పరమాత్మను ఆరాధించినా, కలియుగంలో శ్రీహరి నామసంకీర్తనమే ముఖ్యంగా మానవులు అనుసరించారు. శ్రీహరి నామ సంకీర్తనము వలననే అన్నికోరికలు సిద్ధిస్తాయని భావించారు. నిరంతరము ప్రాపంచిక విషయములలో, సాంసారిక బంధనములలో మునిగితేలుతున్న మానవులకు శ్రీహరి నామ సంకీర్తనమే పరమౌషధంగా కలియుగంలో మానవులు విశ్వసించారు. శ్రీహరి నామ సంకీర్తనము తప్ప మరొకటి మానవులకు ఏ విధమైన లాభమును కలిగించదు అని విశ్వసించారు. నిరంతరము

శ్రీహరి నామ సంకీర్తనము వలన మానవులకు పరమ శాంతి కలుగుతుంది. ప్రాపంచిక విషయముల వలన కలిగే దు:ఖములు నశిస్తాయి.

ఈ కలియుగంలో మానవులకు భగవంతుని మీద భక్తి ఎక్కువగా ఉంటుంది. మానవులలో ఎక్కువ మంది భక్తులుగా జన్మిస్తారు. కలియుగంలో పుణ్యనదులలో స్నానం ముక్తిదాయకము అని చెప్పబడింది. పుణ్యనదులలో గంగా,యమునల తోపాటు, దక్షిణ దేశంలో కృష్ణ,గోదావరి,కావేరి,తామ్రపర్ణి,మహానది పవిత్రమైనవి. ఈ నదులలో స్నానం చేసినా, ఆ నీరు తాగినా పరమాత్మ ఎడల భక్తి పెంపొందుతుంది అని మానవుల విశ్వాసము.

మానవులు దేవఋణము, పితృఋణము, ఋషిఋణము, భూతఋణము, బంధు ఋణము ఈ ఋణముల నుండి విముక్తి కావాలంటే ముందు నేను, నాది, ఈ దేహము నాది అనే అహంకారమును వదిలిపెట్టాలి. తరువాత పరమాత్మ ఎడల అచంచలమైన భక్తి, విశ్వాసములు కలిగి ఉండాలి. ఆ పరమాత్మనే శరణు వేడాలి. అప్పుడు అతడు స్వతంత్రుడు. ఎవరికీ భయపడడు. ఎవరికీ సేవచెయ్యడు. పరమాత్మను తప్ప వేరే ఎవరినీ శరణు వేడని భక్తుని హృదయంలో భగవంతుడు తిష్ఠవేసుకొని కూర్చుని ఉంటాడు. ఆ భక్తుని హృదయంలోకి పొరపాటున ఏ దుష్టభావము ప్రవేశించినా దానిని సమూలంగా నాశనం చేస్తాడు పరమాత్మ. ఆ భక్తుని యోగక్షేమములు తానే వహిస్తాడు పరమాత్మ." అని కరభాజనుడు నిమిచక్రవర్తికి యుగధర్మములను, ఆయాయుగములలో పరమాత్మయొక్క రూపములను వివరించాడు." అని నారదుడు

వసుదేవునికి వివరించాడు.

ఓ వసుదేవా! ఈ విధంగా నిమిచక్రవర్తికి ఆ మహాఋషులు చెప్పగా, నిమి చక్రవర్తి ఆ ఋషులనుండి భాగవత ధర్మములను విని తృప్తిచెందాడు. తరువాత ఆ తొమ్మిదిమంది ఋషులను యధావిధిగా పూజించి అర్చించాడు. తరువాత ఆ మహాఋషులు అక్కడి నుండి వెళ్లిపోయారు. నిమి చక్రవర్తి ఆ మహాఋషులు చెప్పిన భాగవత ధర్మములను ఆచరించి ఉత్తమగతులను పొందాడు.

ఓ వసుదేవా! సాక్షాత్తు భగవంతుడు తన అంశతో మీ దంపతులకు కుమారుడుగా జన్మించాడు. ఆ కారణంగా మీ పేరుతో వాసుదేవుడు, దేవకీ నందనుడు అని పిలువబడ్డాడు. ఈ విధంగా మీ ఇరువురి కీర్తి మూడులోకములలో వ్యాపించింది. మీ దంపతులు ఇద్దరూ కృష్ణుని మీ కుమారునిగా ఆయన మీద పుత్రప్రేమను వర్షిస్తున్నారు. శ్రీకృష్ణుని చూడటం, ఆలింగనం చేసుకోవడం, ఆయనతో మాట్లాడటం, ఆయనతో పాటు ఒకే ఆసనం మీద కూర్చోవడం,ఆయనతోపాటు భోజనం చేయడం, ఆయనతో పాటు నిద్రించడం, ఈ విధంగా చేయడం వలన మీ జన్మలు పవిత్రం అయ్యాయి.

శిశుపాలుడు, పౌండ్రకుడు, సాల్వుడు, మొదలగు రాజులు పరమాత్మమీద ద్వేషభావంతో సర్వకాల సర్వావస్థల యందు, నిలబడ్డా, కూర్చున్నా, భగవంతుని మీద వైరభావంతో ఆయన గురించి ఆలోచించి, ఆయన నామమునే స్మరించి, తుదకు ఆయనలో ఐక్యం అయ్యారు. కృష్ణుని మీద ద్వేషభావం ఉన్నవారే అటువంటి ఉత్తమ

గతులు పొందితే, ఇంక నిరంతరము కృష్ణభక్తిలో మునిగితేలేవారి సంగతి చెప్పేదేముంది?

వసుదేవా! శ్రీకృష్ణుడు పరమాత్మ స్వరూపుడు. సర్వాంతర్యామి. నాశనము లేని వాడు. పురుషులలో ఉత్తముడు. తన మాయను ఈ లోకంలో ప్రయోగించాడు కాని తాను ఆ మాయకు అతీతంగా ఉన్నాడు. తాను మనుష్యుడిగా పుట్టి, మనుష్యుడుగా ప్రవర్తించి, భగవత్తత్వమును లోకానికి ప్రబోధించాడు. కాబట్టి ఓ వసుదేవా! మీరు శ్రీకృష్ణుని సాధారణ మానవునిగా భావించవద్దు. శ్రీకృష్ణుని అవతార ఉద్దేశ్యమే దుష్ట శిక్షణ, శిక్ష రక్షణ. జీవులకు ముక్తి మార్గము ఉపదేశించడం. ఈ కారణంగా శ్రీకృష్ణుని కీర్తి మూడులోకములలో వ్యాపించింది." అని నారదుడు వసుదేవునితో శ్రీకృష్ణుని ప్రశంసించాడు. ఓ పరీక్షిత్ మహారాజా! ఈ విధంగా నారదుని వలన శ్రీకృష్ణ తత్వము విన్న దేవకీ వసుదేవులు ఆశ్చర్యపోయారు. అప్పటి వరకూ తమలో ఉన్న అజ్ఞానమును విడిచిపెట్టి శ్రీకృష్ణుని భగవదవతారంగా భావించారు.

ఓ పరీక్షిత్మహారాజా! నారదునికి వసుదేవునికి జరిగిన సంవాదమును ఎవరు విన్నా, చదివినా, వారు ఇహలోక మోహములు వదిలి ఆత్మతత్వము తెలుసుకుంటారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు నారద,వసుదేవుల సంవాదమును వినిపించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# శ్రీమద్భాగవతము
# ఏకాదశ స్కంధము
# ఆరవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! దేవర్షి నారదుడు వసుదేవునికి, దేవకీదేవికి భగవద్భక్తి గురించి, భగవంతుని ఎలా పూజించాలి, అర్చించాలి అనే విషయములను చెప్పి వెళ్లిపోయిన తరువాత, బ్రహ్మదేవుడు, తన మానస పుత్రులు అయిన సనక, సనంద, మొదలగు మహామునులతోనూ, ఇంద్రుడు మొదలగు దేవతాగణములతోనూ, మరీచి మొదలగు ప్రజాపతులతోనూ, శంకరుడు మొదలగు భూతగణములతోనూ, కలిసి ద్వారకానగరమునకు వచ్చాడు. ఇంద్రుడు, మరుద్గణములు, ద్వాదశ ఆదిత్యులు(అదితి కుమారులను ఆదిత్యులు, దితి కుమారులను దైత్యులు అంటారు. అదితి, దితి కశ్యప ప్రజాపతి భార్యలు), అష్టవసువులు, (ఈ అష్టవసువులలో ఎనిమిదవ వసువు భీష్ముడు), అశ్వినీ కుమారులు (దేవతలకు వైద్యులు), ఋభువులు, అంగిరసులు, ఏకాదశ రుద్రులు, విశ్వేదేవులు, సాధ్యులు, దేవతలు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, సిద్ధులు, చారణులు, గుహ్యకులు, ఋభులు, పితరులు, విద్యాధరులు, కిన్నరులు మొదలగు వారు శ్రీకృష్ణుని దర్శనార్థము ద్వారకానగరమునకు వచ్చారు.

బ్రహ్మ మొదలగు వారు శ్రీకృష్ణుని జగన్మోహనాకారమును కనులారా దర్శించారు. ఆయనను దేవతలు ఈ విధంగా స్తుతించారు. "ఓ దేవా! తమ కర్మబంధనములనుండి విముక్తి పొందడానికి, యోగులు నీ పాదములను ఆశ్రయించుచున్నారు. అటువంటి నీ పాదములకు మేము మా బుద్ధితోనూ, ఇంద్రియములతోనూ,

ప్రాణములతోనూ, మనస్సుతోనూ, వాక్కుతోనూ నమస్కరిస్తున్నాము.

ఓ దేవా! త్రిగుణములతోనూ, మాయతోనూ కూడిన ఈ అనంత విశ్వమును నీలో నీవే సృష్టించుకొని, పాలించి, నీలోనే లయం చేసుకుంటున్నావు. ఈ అనంత విశ్వం అంతా నీలోనే ఇమిడి ఉంది. కాని నీవు త్రిగుణముల లక్షణములైన రాగ ద్వేషములకు అతీతంగా ఉన్నావు. నీవు నిర్గుణుడవు, నిరాకారుడవు, ఆనందస్వరూపుడవు. ఈ జీవులు చేసే ఏ కర్మలు, వాటి ఫలములు నీకు ఏ మాత్రం అంటవు. అట్టి నీకు నమస్కారము.

ఓ పురుషోత్తమా! నీ కీర్తి గురించి నీ లీలల గురించి విన్న సత్పురుషుల మనస్సులు పరిశుద్ధమవుతున్నాయి. నీ కీర్తిని, నీ లీలలను వినడం వలనా, గానం చేయడం వలనా కలిగే పరిశుద్ధత్వము, సామాన్య మానవులు తాము చేసే పూజల వలనా, వ్రతాల వలనా, ఉపాసనల వలనా, వేదాధ్యయనముల వలనా, వేదములను వినడం వలనా, దాన ధర్మములు చేయడం వలనా, తపస్సుచేయడం వలనా పొందలేరు. (అంటే పైవన్ని చేస్తున్నా, భగవంతుని ఎడల భక్తి శ్రద్ధ లేక పోతే, ఇవి ఎందుకూ పనికిరావు. ఆ భక్తి శ్రద్ధ నిరంతరము భగవంతుని గురించి స్మరించడం, వినడం వలననే కలుగుతాయి.) నిరంతరము నిన్ను పూజిస్తూ నిన్ను స్మరించే ముముక్షువులకు, నిన్ను ఆశ్రయించుకున్న భక్తులకు, నీ చతుర్ వ్యూహములు అనగా వాసుదేవ, సంకర్షణ,ప్రద్యుమ్న, అనిరుద్ధులు....వీరిని ఆరాధించేవారికి, ఇంద్రియములను జయించిన వారికి, స్వర్గసుఖములు కూడా లెక్కచేయకుండా, వైకుంఠములో నీ సామీప్యములో ఉండటానికి

ఇష్టపడేవారికి, నీ పాదపద్మములే శరణ్యములు. మూడుకాలముల యందు నీ పాదపద్మములను అర్చించేవారి సంసార బంధనములు, విషయ వాసనలు దగ్ధం అయిపోతాయి.

ఓ దేవా! వేటి గురించి, యాజ్ఞికులు, మూడు వేదములలో చెప్పబడిన విధంగా యజ్ఞములు, యాగములు చేస్తూ తమ తమ చేతులలో హవిర్భాగములను ధరించి, వాటిని దేవతలకు అర్పించడానికి హెూమకుండములో ఆహుతి ఇస్తున్నారో, యోగులు అణిమ,గరిమ,మొదలగు అష్టసిద్ధులను పొందడానికి నిన్ను నిరంతరము ధ్యానిస్తున్నారో, భాగవత ధర్మములను పాటించేవారు వేటిని అర్చిస్తున్నారో, అట్టి నీ పాదములను మేము శరణుజొచ్చాము. నీ పాదసేవతో మా విషయవాసనలు నశించిపోతాయి.

ఓ అనంతా! బలి చక్రవర్తి వలన దానంగా పొందిన భూమిని కొలవడానికి నీవు పైకెత్తిన పాదము మూడులోకములలో వ్యాపించి, విజయధ్వజము మాదిరి ప్రకాశిస్తూ ఉంది. నీ పాదముల నుండి పుట్టిన గంగ, మూడు లోకములలో ప్రవహించి ఆయాలోకములను పునీతం చేస్తూ ఉంది. నీ పాదములు దేవతలకు అభయమును, అసురులకు భయమును కలుగజేస్తాయి. నీ పాదములు సాధువులకు వైకుంఠప్రాప్తి, దుష్టులకు అధోగతి కలుగచేస్తాయి. అట్టి నీ పాదపద్మములు మా తాపములను నశింపజేయుగాక! ఓ దేవా! మూడులోకములలో ఉండే జీవులు అందరూ కాలపురుషుడవైన నీ అధీనంలో ఉన్నారు. అట్టి నీ చరణకమలములు మాకు శుభాలను ప్రసాదించు గాక!

ఓ దేవా! నీ నుండి ఈ ప్రకృతి, మహతత్వము, విరాట్ స్వరూపము వచ్చాయని వేదములు కీర్తిస్తున్నాయి. నీవే ఈ జగత్తులో జరిగే సృష్టి, స్థితి, లయములకు కారణము. మూడుకాలములతో (వేసవి, వర్ష, శీతాకాలములు) నిండిన ఈ జగత్తును లయంచేసే కాలపురుషుడివి నీవే! శ్రీమహావిష్ణువు కూడా నీ వలన శక్తిని పొంది మహత్తత్వమును సృష్టించాడు. . దానిని నుండి మూడు గుణములతో కూడిన ప్రకృతి ఆవిర్భవించింది.

ఓ దేవా! నీవు నీ ఇంద్రియములతో ఏ కర్మలు చేసినా, ఎన్ని సుఖములు అనుభవించినా, నీవు వాటి యందు ఆసక్తుడవు కావు. ఈ చరాచర జగత్తుకు నీవు అధిపతివి. ఈ విషయ వాంఛలు, ప్రాపంచిక విషయములు తమను ప్రలోభపెడతాయేమో అని మునులు, ఋషులు భయపడుతుంటారు. వాటిని జయించడానికి నీ పాదములను ఆశ్రయిస్తుంటారు.

ఓ దేవా! నీకు పదహారువేల ఎనిమిది మంది భార్యలు. అందులో రుక్మిణీ దేవి నీ పట్టమహిషి. నీ భార్యలు నీతో కామ భోగములు అనుభవిస్తున్నారు. కాని నీ మనసు మాత్రము ఎటువంటి కామవికారములు లేకుండా నిర్మలంగా ఉంటుంది. ఓ దేవా! ఈ మూడులోకములలో ఉన్న జీవుల పాపములను ప్రక్షాళన చెయ్యడానికి రెండు పవిత్రనదులు ప్రవహిస్తున్నాయి. అందులో ఒకటి నీ లీలామృతము ప్రవహించే నది. మరొకటి నీ పాదముల నుండి పుట్టి మూడులోకములను పావనం చేసే గంగ. బుద్ధిమంతులు, సత్పురుషులు అయిన వాళ్లు నీ లీలలను వింటూ, గానం చేస్తూ, నీ

కథామృతము అనే నదిలో మానసికంగా స్నానం చేసి, నీ పాదముల నుండి పుట్టిన గంగానదిలో శారీరకంగా స్నానం చేసి పునీతులవుతున్నారు." అని దేవతలు శ్రీకృష్ణుని స్తుతించారు.

తరువాత బ్రహ్మదేవుడు శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు. "ఓ దేవా! భూభారము తగ్గించడానికి భూలోకంలో అవతరించమని మేమందరము నిన్ను ప్రార్థించాము. మా ప్రార్థనలను మన్నించి నీవు మానవుడిగా యదువంశములో అవతరించి, భూభారమును తగ్గించి, వచ్చిన కార్యమును నెరవేర్చావు. సత్పురుషులను రక్షించడానికి ధర్మమును ప్రతిష్ఠించావు. నీ కీర్తి మూడులోకములలో వ్యాపించింది. కలియుగములోని మానవులు నీ లీలలను స్మరించడం, కీర్తించడం ద్వారా తమ అజ్ఞానము అనే చీకటిలో నుండి బయటపడగలరు. నీవు మానవ లోకంలో అవతరించి ఇప్పటికి నూట ఇరవై ఐదు సంవత్సరములు గడిచాయి. నీ అవతార కాలము, మానవలోకంలో నీవు చేయవలసిన పనులు అన్నీ పూర్తిఅయ్యాయి. బ్రాహ్మణుల శాపము వలన నీ యదువంశము కూడా అతి త్వరలో సర్వనాశనం కాబోతూ ఉంది. నీవు నీ ధామమునకు తిరిగి వచ్చే సమయం ఆసన్నమయింది. కాబట్టి నీవు ఈ మానవలోకంనుండి నీ లోకమునకు తిరిగి రాదలచుకుంటే, వెంటనే నీ లోకమునకు రావలసిందిగా ప్రార్థిస్తున్నాము. మా అందరినీ కాపాడటానికి నీ లోకమునకు తిరిగి చేరుకోవాలని మా కోరిక." అని ప్రార్థించారు.

బ్రహ్మ మొదలగు దేవతలు చెప్పిన విషయములు అన్నీ విన్నాడు కృష్ణుడు. వారితో ఇలా అన్నాడు. "మీరు చెప్పినది అంతా నిజమే. నేను వచ్చిన పని పూర్తి అయింది. మీరందరూ కోరినట్టు

దుర్మార్గులైన క్షత్రియులను వారిలో వారు కొట్టుకునేటట్టు చేసి, వారి నందరినీ సంహరించాను. లోకములో ధర్మస్థాపన చేసాను. నా అవతారమును చాలించవలసిన సమయం వచ్చింది. కాని యదువంశము మాత్రము మిగిలి ఉంది. యదువంశీయులు తాము అత్యంత బలవంతులమనీ గర్వంతో విర్రవీగుతున్నారు. వారు తమ బల పరాక్రమములతో, క్షత్రియులు లేని ఈ భూమి నంతటినీ ఆక్రమించ వలెనని ఉర్రూతలూగుతున్నారు. నేను ఉన్నాను కాబట్టి వారు ఆ సాహసం చేయడం లేదు. కాబట్టి ఈ యదువంశము కూడా సర్వనాశనం కావాలి. వీరిని సంహరించకుండా, నేను నా వైకుంఠమునకు వెళితే, యాదవులు చెలరేగి, భూమికి భారంగా పరిణమిస్తారు. వీరి కోసరం మరలా నేను మరొక అవతారము ఎత్తవలసిన అవసరం వస్తుంది. యాదవ వంశ నాశనానికి బ్రాహ్మణ శాపం అనే బీజం పడింది. ఈ యాదవకుల నాశనము చూచి నేను వైకుంఠమునకు తిరిగివస్తాను." అని అన్నాడు. కృష్ణుని మాటలను శిరసావహించిన బ్రహ్మ మొదలగు దేవతాగణములు ఆయనకు నమస్కరించి తమ తమ లోకములకు వెళ్లిపోయారు.

తరువాత ద్వారకా నగరములో ప్రతిదినము ఎన్నో అపశకునములు కనపడసాగాయి. ఈ అపశకునకులను చూచిన యాదవ ప్రముఖులు కృష్ణుని వద్దకు వచ్చి ఈ అపశకునములు కనపడటానికి కారణం అడిగారు. వారికి కృష్ణుడు ఇలా సమాధానం చెప్పాడు. "యాదవులారా! ప్రస్తుతము ద్వారకలో ఎటు చూచినా ఉత్పాతములు కనపడుతున్నాయి. ఈ సందర్భంలో బ్రాహ్మణులు యాదవులకు ఇచ్చిన శాపం మనం గుర్తుకు తెచ్చుకోవాలి. ఆ శాపము

దాటడం మనకు శక్యంకాదు. ఈ సమయంలో మనం ద్వారకలో ఉండటం క్షేమం కాదు. కాబట్టి మనం అందరం ద్వారకను వదిలిపెట్టి ప్రభాస క్షేత్రమునకు వెళ్లుదాము. పూర్వ కాలంలో దక్షుడు తన అల్లుడు చంద్రుని క్షయరోగపీడితుడు కమ్మని శపిస్తే, చంద్రుడు ఈ ప్రభాస క్షేత్రంలో స్నానం చేసి క్షయరోగం నుండి విముక్తి పొందాడు అని పురాణాలు చెబుతున్నాయి. కాబట్టి మనం అందరం ప్రభాస క్షేత్రమునకు పోయి అక్క పుణ్యస్నానాలు చేద్దాము. దేవతలకు, పితరులకు తర్పణములు వదులుదాము. తరువాత బ్రాహ్మణులకు తృప్తిగా భోజనము పెడదాము. దక్షిణలు ఇచ్చి వారిని తృప్తికలిగిద్దాము. వారి ఆశీర్వాద బలంతో మనం అందరం ఈ సంసారము అనే సాగరమును దాటగలము." అని అన్నాడు.

శ్రీకృష్ణుని ఆదేశము మేరకు యాదవులు అందరూ ప్రభాస క్షేత్రమునకు పోవాలి అని నిశ్చయించుకున్నారు. రథములు, శకటములు సిద్ధం చేసారు. ద్వారకలో ఉద్ధవుడు అనే పుణ్యాత్ముడు ఉన్నాడు. ఆయన శ్రీకృష్ణుని నిరంతరం ఆరాధిస్తుంటాడు. కృష్ణ ప్రేమలో మునిగితేలుతుంటాడు. ఆయన కూడా ద్వారకలో కనపడుతున్న అపశకునములను చూచి ద్వారకకు ఏదో ఆపద రాబోతూ ఉందని మనసులో అనుకున్నాడు. వెంటనే శ్రీకృష్ణుని వద్దకు వెళ్లాడు. ఆయన పాదముల మీద తన తల పెట్టి నమస్కరించాడు. శ్రీకృష్ణుని ఉద్ధవుడు ఇలా ప్రార్థించాడు.

"ఓ యోగీశ్వరేశ్వరా! నీవు దేవ,మానవ,అసురులకు అధిపతివి. నీ లీలలను విన్నా, కీర్తించినా, వాళ్లు పవిత్రులవుతారు. నీవే పరమేశ్వరుడవు. ఈ బ్రాహ్మణులు యాదవులకు ఇచ్చిన శాపమును

మళ్లించడానికి నీవు సర్వసమర్ధుడవు. కాని నీవు బ్రాహ్మణ శాపమును అమలు చేయడానికే నిశ్చయించుకున్నావు. నీవు యదువంశ నాశనమును చూచి తిరిగి నీ ధామమునకు వెళ్లదలచుకున్నావు అని అర్థం అయింది. ఓ కేశవా! నేను నీ పాదదాసుడను అని నీకు తెలుసు. నేను నీ పాదములను విడిచిపెట్టి క్షణకాలం కూడా జీవించలేను. నన్ను కూడా నీ వెంట నీ ధామమునకు తీసుకొని వెళ్లు. నీ లీలలను విన్న మానవులు, ప్రాపంచిక విషయములను, విషయవాసనలను తృణప్రాయంగా వదిలిపెడతారు. పడుకోవడం, కూర్చోవడం, తిరగడం, నిలబడటం, స్నానం చేయడం, క్రీడించడం, భోజనం చేయడం ఇంకా ఇతర పనులు చేయడం కంటే నిన్ను సేవించడం నాకు అత్యంత ప్రియము. నీవు అందరి ఆత్మలలో ఉన్నావు. నిన్ను నేను ఎలా విడువగలను.

కృష్ణా! నేను ఇంతకాలము నీతోనే ఉన్నాను. నీతో తిన్నాను, తిరిగాను. నీవు కట్టుకున్న వస్త్రములను కట్టుకున్నాను. నేనే నీపై మెలిగాను. కాబట్టి నీ మాయను గురించి కూడా కొంచెం తెలుసుకోగలిగాను. కృష్ణా! యోగులు, సన్యాసులు, ఋషులు, మునులు నీ గురించి తపస్సు చేసి, బ్రహ్మ చర్యము మొదలగు కఠినసాధనముల ద్వారా బ్రహ్మలోకము చేరుకుంటున్నారు.

యోగీశ్వరేశ్వరా! మేమందరము ఈ లోకంలో, ప్రాపంచిక విషయములలో నిరంతరము తిరుగుతున్నా, నీలీలలను, నీ మహిమలను కీర్తించడం చేస్తున్నాము. మానుష రూపంలో నీవు ప్రదర్శించిన లీలలను, నీ పనులను, నీ మందహాసమును, నీవు చేసిన

ఉపదేశములను (భగవద్గీత మొదలైనవి) స్మరించుకుంటూ, ఈ సంసారము అనే సాగరమును దాటగలుగుతున్నాము." అని అన్నాడు ఉద్ధవుడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ ప్రకారంగా ఉద్ధవులు తనను ప్రార్థించగా, కృష్ణుడు ఉద్ధవునితో ఇలా అన్నాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో బ్రహ్మ మొదలగు దేవతాగణములు కృష్ణుని తన అవతారము చాలించి వైకుంఠధామమునకు రమ్మని ఆహ్వానించడం గురించి తెలియజేసాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

ఏడవ అధ్యాయము

"ఓ పరీక్షిత్ మహారాజా! ఉద్ధవుడు ఆ మాదిరి పలకగానే, శ్రీకృష్ణుడు ఉద్ధవునితో ఇలా అన్నాడు. "ఉద్ధవా! యాదవ కులము నాశనము అయిన తరువాత నేను వైకుంఠమునకు పోవలెనని అనుకుంటున్నాను అని అన్నావు. అది అంతా నిజమే. బ్రహ్మ మొదలగు దేవతాగణములు కూడా నా దగ్గరకు వచ్చి నన్ను వైకుంఠమునకు వెళ్లవలసినదిగా కోరారు. భూలోకములో నాకు సాయం చేయుటకు గాను అవతరించిన దేవతల పని కూడా పూర్తిఅయింది. వారు కూడా

తమ తమ దేహములను చాలించి దేవలోకమునకు పోవుటకు సిద్ధంగా ఉన్నారు.

ఒక సారి బ్రహ్మ నా దగ్గరకు వచ్చి "భూభారము పెరిగిపోయింది, పాపకర్ములు విపరీతంగా పెరిగిపోయారు, అరాచకం ప్రబలిపోయింది" అని చెప్పగానే నేను, అనంతుడు కృష్ణ,బలరాములు గా అవతరించాము. భూభారము తగ్గించాము. యాదవులకు బ్రాహ్మణులు ఇచ్చిన శాపం కారణంగా యాదవులు ఒకరితో ఒకరు కొట్టుకొని మరణిస్తారు. నేటికి ఏడవ రోజున నేను నిర్మించిన ఈ ద్వారక సముద్రములో మునిగిపోతుంది. నేను మానవలోకము వదిలిపెట్టగానే, ఈ నగరంలో ఉన్న శోభ అంతరించి పోతుంది. సముద్రంలో కలిసిపోతుంది. తరువాత కొన్ని దినములకు కలియుగ ప్రవేశం జరుగుతుంది.

కలియుగంలో మానవులు ధర్మము ఆచరించడం కంటే అధర్మము ఆచరించడానికే ఎక్కువ ప్రాధాన్యము ఇస్తారు. నేను లేని ఈ భూమి మీద నీవు నివసించడం మంచిది కాదు. కాబట్టి నీవు ఈ భవబంధములను తెంచుకో. నీ ఆత్మీయులను, బంధుమిత్రులను, భార్యా బిడ్డలను వదిలిపెట్టి ఈ భూమి అంతా స్వేచ్ఛగా విహరించు.

ఉద్ధవా! నీవు బయట కనపడే ఈ ప్రపంచాన్ని నీ కళ్లు, ముక్కు, చెవులు, నాలుక చర్మము మొదలగు ఇంద్రియముల ద్వారా తెలుసుకుంటావు. ఇంద్రియముల ద్వారా వీటిని నీ మనసు తెలుసుకుంటుంది. మనసు బయట ప్రపంచమును ఎలా చూడమంటే కళ్లు అలా చూస్తాయి. కాబట్టి ఈ బయట ప్రపంచం యావత్తూ

మనస్సు కల్పించుకున్నదే. ఈ ప్రపంచం అంతా శాశ్వతముకాదు. నిరంతరము మార్పుకు లోనవుతూ ఉంటుంది. దానివలన మనస్సులో అశాంతి కలుగుతుంది. వికలమైన మనస్సు, శాంతిలేని మనస్సుతో చూస్తే ఈ ప్రపంచం అంతా రకరకాల వస్తువులతో కూడినది అనే భ్రమ కలిగిస్తుంది. ఈ భ్రమకు మూడు గుణములు తోడు అవుతాయి. సత్వ,రజస్,తమోగుణములతో ప్రభావితమైన ఇంద్రియములు, ఈ ప్రాపంచిక విషయములను అనుభవించడానికి, వివిధములైన కర్మలు చేస్తాయి.

ఆ కర్మలు మూడు రకాలు. చేయవలసిన కర్మలు చేయడం. చేయవలసిన కర్మలు చేయక పోవడం. చేయకూడని కర్మలు చేయడం. కర్మలు చేయడం వలన వాసనలు కలుగుతాయి. ఆ వాసనలే మరుజన్మకుకారణం అవుతాయి. కాబట్టి ముందు ఇంద్రియములను నిగ్రహించాలి. తరువాత మనసును కట్టడి చేయి. ఈ జగత్తు అంతా పరమాత్మ స్వరూపమనీ, అందరిలోనూ పరమాత్మ ఆత్మ స్వరూపుడుగా ఉన్నాడనీ తెలుసుకో. అప్పుడు ఎవరిమీదా నీకు కోపము, ద్వేషము కలుగవు. అందరినీ సమానంగా చూస్తావు. అప్పుడు నీకు కలిగిన జ్ఞానము నిశ్చయంగా ఉంటుంది. ఆ జ్ఞానాన్ని అనుభవంలోకి ఆచరణలోకి తేవడం వలన అనుభవ జ్ఞానం కలుగుతుంది. దానినే విజ్ఞానము అని అంటారు. అప్పుడు నీవు ఆత్మానందాన్ని పొందుతావు. ఆ ఆనందం ఈ ప్రాపంచిక విషయములను అనుభవించినందువలన కలుగదు.

జ్ఞాన, విజ్ఞానవంతుడవైన నిన్ను దేవతలు, మానవులు, అసురులు అందరూ గౌరవిస్తారు. నీకు శత్రువులు అంటూ ఎవరూ

ఉండరు. నిన్ను ఎవరూ బాధించరు. నీకు ఎవరూ విఘ్నములు కలిగించరు. నీలో ఉన్న ఆత్మ మూడు గుణములకు, అన్ని రకముల దోషములకు అతీతుడు. నీవు ఆత్మానుసంధానం చేసుకుంటే ఎల్లప్పుడు చేయదగిన కర్మలనే చేస్తావు. చేయకూడని కర్మలు చేయవు. వేదములను, శాస్త్రములను చదివిన వాడికి జ్ఞానము వస్తుంది. ఆ జ్ఞానమును ఆచరిస్తే వాడు విజ్ఞానవంతుడవుతాడు. విజ్ఞాన సంపన్నుడు అయిన వాడికి పరమ శాంతి లభిస్తుంది. సకల జీవరాసులను సమదృష్టితో చూస్తాడు. అతడు చేసిన కర్మల వాసనలు అతడికి అంటవు. వాసనలు లేని నాడు అతడు ఈ జనన మరణ చక్రము నుండి బయటపడతాడు." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి జ్ఞానోపదేశం చేసాడు.

అప్పుడు ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఇలా అడిగాడు. "ఓ దేవా! నీవు యోగులకు ఈశ్వరుడవు. యోగులు ఏమేమి తెలుసుకోవాలని అనుకుంటున్నారో అటువంటి నిక్షేపములు నీ దగ్గరే ఉన్నాయి. యోగులకు ఆధారభూతుడవు నీవే. నీవే యోగస్వరూపుడవు. నీవు నా మీద దయతో నాకు సన్యాసుల లక్షణాలు చెప్పావు. కాని ఈ లోకంలో ఉన్న మానవులు బయట ప్రపంచంలో తిరుగుతూ, విషయముల మీద ఆసక్తి కలిగి ఉంటారు. అటువంటి వారు విషయ భోగములను, కోరికలను ఒక్కసారిగా విడిచిపెట్టడం కష్టం కదా! సామాన్య మానవులకే ప్రాపంచిక విషయసంబంధమైన కోరికలను విడిచిపెట్టడం కష్టంగా ఉన్నప్పుడు, దేవుడు అంటే భక్తి లేని వాళ్లు, అసలు దేవుడే లేడు అనే వాళ్లు, దేవుని పట్ల విముఖత కలిగిన వాళ్లు, కోరికలను, విషయవాంఛలను విడిగిపెట్టడం పూర్తిగా అసంభవం అని

నేను అనుకుంటాను. అంతెందుకు. నేను కూడా ఇప్పటి వరకు, ఈ అశాశ్వతము అయిన దేహంతో, భార్య, సంతానము, ధనము, ఆస్తులు వీటి విషయంలో నేను, నాది అనే స్వార్థభావం కలిగి ఉన్నాను. నా వంటి మూఢుడు ఎవడూ ఉండడు. నాకు కూడా సన్యాసతత్వమును ఆచరించవలెనని కోరికగా ఉంది. ఇప్పుడు నీవు సంగ్రహంగా చెప్పిన సన్యాసతత్వమును వివరంగా చెప్పు. ఈ విషయం చెప్పడానికి నీవే సమర్థుడివి.

ఓ దేవా! నీవు సత్యస్వరూపుడవు. భూత,వర్తమాన,భవిష్యత్ కాలముల కారణంగా నీలో మార్పులు కలుగవు. నీకుగా నీవు ప్రకాశిస్తుంటావు. ఆత్మ తత్వమును ఉపదేశించడానికి నీవు తప్ప సమర్థులు దేవతలలో కూడా ఎవ్వరూ లేరు. ఎందుకంటే బ్రహ్మ మొదలగు దేవతాగణములుకూడా నీ మాయలో పడిన వారే. వారి బుద్ధి కూడా మాయామోహితమై ఉంది. వారు కూడా రజోగుణము, తమోగుణములకు వశులై, దేహము, భార్య,పుత్రులు, ప్రాపంచిక విషయములే ముఖ్యము అని భావిస్తుంటారు.

ఓ దేవా! నేను దు:ఖ సముద్రములో మునిగిఉన్నాను. వైరాగ్యము కొరకు పరితపిస్తున్నాను. కాని నీవు దేశ,కాలములకు అతీతుడవు. నీకు తెలియని విషయం లేదు. నీవు సర్వశక్తిమంతుడవు. నీకు ఎటువంటి దోషములు అంటవు. సకల జీవులను సమంగా చూడగల సమర్థుడవు. నాకు మిత్రుడవు. ఆకారణం చేత నేను నీ శరణు వేడుతున్నాను. నాకు సన్యాస లక్షణములను సమగ్రంగా ఉపదేశించు." అని ప్రార్థించాడు ఉద్ధవుడు.

ఉద్ధవుని ప్రార్థన మన్నించిన శ్రీకృష్ణుడు ఈ విధంగా చెప్పసాగాడు. "ఉద్ధవా! బాగా తత్వం తెలిసిన మానవులు తమ యొక్క బుద్ధి బలంతో, వివేకంతో, తమ తమ మనసులలో నిండి ఉండే విషయ వాసనలను తొలగించుకొని తమను తాము ఉద్ధరించుకుంటారు. మానవుడికి తనను గురించి తాను తెలుసుకొనే శక్తి, తనకు ఏది మంచిదో, ఏది చెడ్డదో నిర్ణయించుకోగల శక్తి ఉంది. ప్రతి మానవునికి తనలో ఉన్న ఆత్మయే తనకు గురువు. వేరే గురువు అవసరము లేదు. సాంఖ్య యోగమును అభ్యసించిన వారు, ఈ జన్మలోనే సర్వ శక్తులతో కూడిన నా విరాట్ రూపమును దర్శిస్తారు.

ఈ ప్రపంచములో ఒక కాలుతో నడిచేవి, రెండు కాళ్లతో నడిచేవి, మూడు కాళ్లతో నడిచేవి, నాలుగు కాళ్లతో నడిచేవి, చాలా కాళ్లతో నడిచేవి, అసలు కాళ్లులేకుండా పాకేవి మొదలగు జంతువులు సృష్టించబడ్డాయి. అన్ని జంతువులలో మానవుడు శేష్టమైన జీవి. ఓ ఉద్ధవా! నాకు రూపం ఉంది అనేవాళ్లకు రూపంతో కనిపిస్తాను. లేని వాళ్లకు రూపం లేని వాడిగానే ఉంటాను. కాని ఈ మానవులు వారిలో ఉన్న బుద్ధితో తమ తమ మనస్సులలో నన్ను దర్శించి, నేను ఇలా ఉంటాను అని అనుకొని, ఆ రూపమును ఏర్పరచుకొని, నిరంతరము నా కోసం వెదుకుతుంటారు. ఈ విషయంలో యదుమహారాజుకు, ఒక అవధూతకు జరిగిన సంవాదమును నీకు వినిపిస్తాను, శ్రద్ధగా విను.

మా పూర్వీకుడు, మా వంశ కర్త అయిన యదు మహారాజు పరమ ధర్మాత్ముడు. వివేకవంతుడు, ఎక్కడికైనా నిర్భయంగా వెళ్లగలిగేవాడు, యవ్వనంలో ఉన్నవాడు, బ్రాహ్మణుడు అయిన ఒక

అవధూతను చూచాడు యదుమహారాజు. ఆయనను ఇలా అడిగాడు.

"ఓ బ్రాహ్మణోత్తగా! నీవు చాలా చిన్న వయసులో ఉన్నావు, యజ్ఞయాగములు చేసినట్టు లేదు. మంచి కర్మలు చేసినట్టు కూడా కనపడదు. మరి నీకు ఈ లోకములను విలక్షణంగా ఆత్మ స్వరూపంగా చూచే బుద్ధి ఎలా కలిగింది (అంటే మనం ఈ లోకంలో కనపడే వస్తువులను వాటి వాటి స్వరూపములతో చూస్తాము. కాని అవధూతలు ప్రతి వస్తువులోనూ పరమాత్మను దర్శిస్తారు.) చూడబోతే నీవు సకల శాస్త్రములను చదివినట్టున్నావు. కాని నీకు అంతవయసు లేదు. ఏ బుద్ధిబలంతో ఈ జగత్తులో నిర్భయంగా తిరుగుతున్నావు.

సాధారణంగా ఈ లోకంలో జీవించే మానవులు తాము ఎక్కువ కాలం బతకాలనీ, ఎక్కువ పేరు ప్రతిష్టలు ఆర్జించాలనీ, ఎక్కువ ధనము, ఐశ్వర్యము సంపాదించాలనీ, రకరకాల కోరికలు అనుభవించాలనీ తాపత్రయ పడుతుంటారు. మరి కొందరు ఆత్మ తత్వమును తెలుసుకోడంలో నిమగ్నమై ఉంటారు. నీవు చూడబోతే జ్ఞానివి, సుందరాకారుడవు, చక్కగా మాట్లాడుతున్నావు. అయినా ఎటువంటి ఏపనీ చేయడం లేదు. కేవలం జడపదార్థము మాదిరి ఊరికే తిరుగుతున్నావు. నీగురించి, నీ శరీరము గురించి నీవు పట్టించుకోవడం లేదు. ఈ లోకంలో ఉండే ధనము, సంపదలు కోరుకోవడం లేదు.

ఈ లోకంలో ఉండే జనులు ఎల్లప్పుడూ దావానలముల వంటి కోరికలతో, ధన సంపాదన, ఆ డబ్బును దాచిపెట్టుకోవడం, అంతా నాకే కావాలి అనే లోభత్వం, వీటిమధ్య, నిరంతరము తమను

తాము దహించుకుంటున్నారు. కాని నీవు మాత్రము గంగాజలము మధ్య కూర్చుని ఆ చల్లదనాన్ని అనుభవిస్తున్న ఏనుగు మాదిరి, మాదిరి నిశ్చలంగా ఉన్నావు. నీకు భార్య, బిడ్డలు, బంధువులు, సంసారము ఏవీ ఉన్నట్టు లేదు. అయినా నీవు ఇంతటి ఆత్మానందము ఎలా అనుభవించగలుగుతున్నావు. దీనికి కారణములు ఏవి? దయచేసి నాకు చెప్పండి." అని అడిగాడు. అప్పుడు ఆ అవధూత ఇలా చెప్పసాగాడు.

"ఓ రాజా! నేను నా బుద్ధిబలంతో ఎంతో మంది గురువులను ఆశ్రయించాను. వారు ఉపదేశించిన జ్ఞానంతోనే నేను ఈ మాదిరి నిర్భయంగా, ఏ కోరికలు లేకుండా స్వేచ్ఛగా తిరుగుతున్నాను. నాకు గురువులు ఎవరో, వారు నాకు ఏమేమి ఉపదేశించారో, నేను వారి నుండి ఎటువంటి జ్ఞానమును సంపాదించానో చెబుతాను. శ్రద్ధగా విను.

నాకు ఈ లోకంలో 24 మంది గురువులు ఉన్నారు. వారి పేర్లు 1.పృథివి. 2.వాయువు, 3.జలము, 4.ఆకాశము, 5.అగ్ని, 6.చంద్రుడు, 7.సూర్యుడు. 8.పావురము, 9.అజగరము (కొండచిలువ), 10.సముద్రము. 11.పతంగము 12.తేనెటీగ. 13.ఏనుగు 14. తేనె పట్టులో నుండి తేనెను సేకరించేవాడు. 15. జింక 16.చేప 17. వేశ్య 18.కురుర అనే పక్షి. 19.బాలుడు 20. కన్య 21. విలుకాడు 22.సర్పము 23.సాలెపురుగు 24. తుమ్మెద.

ఈ లోకంలో నాకు పైన చెప్పబడిన 24 మంది గురువులు ఉన్నారు. వారి నుండి నేను జ్ఞానమునుపొందాను. ఈ 24 మంది నుండి నేను ఎవరి నుండి ఎటువంటి జ్ఞానమును పొందానో వివరిస్తాను.

సాధారణంగా మానవుడు దు:ఖములలో మునిగి తేలుతుంటాడు. అప్పుడప్పుడు సుఖమును అనుభవిస్తుంటాడు. ఈ లోకంలో ఉన్న జంతువులు వాటి సహజ ప్రవృత్తులతో సంచరిస్తుంటాయి. అప్పుడప్పుడు మానవులకు అపకారము చేస్తుంటాయి. అది వాటి సహజ ధర్మము. ఆ జంతువులు మనకు అపకారం చేసాయి కాబట్టి మనం కూడా ధర్మము తప్పి వాటికి అపకారము చేయకూడదు.

ఉదాహరణకు భూమి ఉంది. మనం రోజూ భూమిని తొక్కుతుంటాము. తవ్వుతుంటాము. నానారకాలుగా హింసిస్తుంటాము. కాని భూమి క్షమాగుణంతో అన్నిటినీ ఓర్చుకుంటుంది. కాని మనకు ఏ విధమైన అపకారము చెయ్యదు. పైగా మనకు ఉపకారం చేస్తుంది. ఈ సహనాన్ని ఓర్పును నాకు భూమి నేర్పింది.

మానవుడు సాటి జీవులకు ఉపకారం చెయ్యాలి అనే బుద్ధికలిగి ఉండాలి. అందరూ బాగుండాలి అని ఎల్లప్పుడూ కోరుకోవాలి. ఇతరుల మీద కోపం, ద్వేషం పెంచుకోకూడదు. ఈ లక్షణాలను నేను పర్వతములనుండి, వృక్షముల నుండి నేర్చుకున్నాను. వృక్షములు నీడను ఇస్తాయి, ఆకులను, పండ్లను, ఎండి పోయిన తరువాత కలపను ఇస్తాయి. ఎవరికీ అపకారం చెయ్యవు. అలాగే

పర్వతముల మీదినుండి సెలయేళ్లు ప్రవహించి మనకు స్వచ్ఛమైన జలములను అందిస్తాయి. పశువులకు గడ్డి, మానవులకు అటవీ సంపదను ప్రసాదిస్తాయి. ఆ ప్రకారంగా నేను వృక్షముల నుండి, పర్వతముల నుండి పరోపకార బుద్ధిని నేర్చుకున్నాను.

ఓ రాజా! మానవునికి జ్ఞానము, వాక్కు, మనస్సు ముఖ్యము. వీటిని కాపాడుకోవాలంటే ప్రాణం, అందుకు అవసరమైన ప్రాణవాయువు ముఖ్యం. అంతే కానీ ఇంద్రియములతో పొందే సుఖాలు కాదు. మానవుడు తన ప్రాణములను కాపాడుకునే ప్రయత్నం చేయాలే గానీ, ఇంద్రియసుఖములకొరకు వెంపర్లాడకూడదు. యోగులకు కూడా రజస్తమోగుణముల వలన సుఖము దు:ఖము కలుగుతుంటాయి. యోగులు సుఖ దు:ఖములను అనాసక్తంగా అనుభవించాలి. సుఖం వచ్చిందనిపొంగిపోవడం, దు:ఖం వచ్చిందని కుంగి పోవడం చెయ్యకూడదు. దీనికి మానవుడు గాలిని గురువుగా స్వీకరించాలి. గాలిలో ఎన్నో మంచి వాసనలు, చెడు వాసనలు చేరుతుంటాయి. కాని గాలి వాటికి స్పందించదు. తన పాటికి తాను మానవులకు ప్రాణవాయువు అందిస్తుంది. అలాగే యోగి కూడా ఈ దేహములో బాల్యము, యౌవనము, వృద్ధాప్యము సంభవించిననూ వాటిమీద ఆసక్తి చూపించడు. మునులు ఈ దేహమును ధరించినను, దేహములో ఉన్న ఆత్మను దర్శిస్తారు కానీ దేహము మీద అభిమానము, మమకారము కలిగి ఉండరు. దేహాభిమానము ఆత్మకు ఉండదు. గాలి గట్టిగా వీచినప్పుడు మేఘములు మాత్రము చెల్లాచెదరు అవుతుంటాయి. కాని మేఘములు ఉన్న ఆకాశము నిశ్చలంగా ఉంటుంది. ఏ ఒడుదుడుకులకు లోను కాదు. అలాగే ఈ దేహము ఈ

దేహములో ఉన్న పదార్థములు, వాటి వలన కలిగే వ్యాధులకు యోగి చలించడు.

ఓ రాజా! నిర్మలమైన మనస్సు కలవాడు, అందరి పట్ల స్నేహభావం కలవాడు, మృదువుగా మాట్లాడేవాడు అయిన యోగి మానవులకు దైవస్వరూపుడుగా కనపడతాడు. కేవలం ఆయన దర్శనం, స్పర్శ చేతనే మానవులు పవిత్రులు అవుతారు. మంచి తేజస్సు కలవాడు, తపస్సు చేసినవాడు, ఎవరి నుండి ఎటువంటి వస్తువులు పుచ్చుకోని వాడు, అన్ని కోరికలను వదలిపెట్టినవాడు, అయిన ముని ఏపని చేసినా, ఏదితిన్నా, ఆ దోషము అతనికి అంటదు. అగ్నిలో వేసిన ప్రతి వస్తువు దహింపబడినట్టు, ఆముని చేసిన ఎటువంటి పని అయినా, తిన్న ఏ పదార్థమైనా దహించుకుపోతుంది. ఆ మునికి ఎటువంటి దోషము, మాలిన్యము అంటదు.

అగ్ని కొన్ని సమయాలలో ప్రజ్వరిల్లుతుంది. కొన్ని సమయాలలో బూడిదలో కప్పబడి ఉంటుంది. అలాగే ముని కూడా కొన్ని సమయాలలో తన ఉనికిని నిగూఢంగా ఉంచుతాడు. కొన్ని సమయాలలో మానవులు తనను ఉపాసించడానికి వీలుగా బహిరంగంగా ప్రకటింపబడతాడు. దాతలు ఇచ్చిన ఆహార పదార్థములను స్వీకరిస్తాడు.

ఓ రాజా! పరమాత్మ ఈ జగత్తు అంతా వ్యాపించి ఉన్నాడు. అన్ని జీవులలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. కాని బయటకు కనపడడు. కేవలం దేహము మాత్రమే కనపడుతుంది. ఎలాగంటే, ప్రతి కట్టెలో నిప్పు ఉంటుంది. కాని నిప్పు బయటకు కనపడదు. కేవలం కట్టె మాత్రము కనపడుతుంది. రెండు కట్టెల మధ్య ఘర్షణ కలిగినపుడు

అగ్ని కనపడుతుంది.

ఓ రాజా! మనకు రోజుల రూపంలో కాలం గడుస్తుంది. పదిహేను రోజుల పాటు చంద్రుడు వృద్ధి చెందుతాడు. పదిహేను రోజుల పాటు చంద్రుడు క్షీణిస్తాడు. ఇది మనకు కనపడుతుంది. కాని చంద్రునికి ఎటువంటి వృద్ధిక్షీణతలు లేవు. అలాగే ఈ దేహమునకు బాల్యము, యవ్వనము, వృద్ధాప్యము, మరణము ఒకటి వెంట ఒకటి కలుగుతాయి. కాని దేహములో ఉన్న ఆత్మకు ఈ వికారములు ఏవీ లేవు. ఆత్మ నిత్యము. మార్పులేనిది. ఇదే విషయము నేను చంద్రుడి నుండి నేర్చుకున్నాను.

ఓ రాజా! అగ్ని మండుతున్నప్పుడు అగ్నికీలలు ఎగిసి పడుతుంటాయి. అంతలోనే ఆరిపోతుంటాయి. మరలా ఎగిసిపడుతుంటాయి. అలాగే కాల ప్రభావంతో మానవుల దేహములలో ఉన్న జీవకణాలు ప్రతిక్షణం చస్తుంటాయి. కొత్త కణాలు పుడుతుంటాయి. కాని ఆ విషయం మనకు తెలియదు. (ఈ విషయమును నేటి వైద్యులు కూడా ధృవీకరించారు). అలాగే ఈ అనంత విశ్వం నిరంతరం మార్పు చెందుతూ ఉంటుంది కానీ మన కళ్లకు కనపడదు.

ఓ రాజా! సూర్యుడు వేసవి కాలములో నీటిని ఆవిరి రూపంలో సేకరిస్తాడు. తిరిగి వర్షాకాలంలో వర్షము రూపంలో మానవులకు తిరిగి అందిస్తాడు. అలాగే యోగి బయట ప్రపంచము నుండి తన ఇంద్రియములతో విషయములను సేకరిస్తాడు. తిరిగి

వాటిని మానవులకు పంచి పెడతాడు. కాని తాను సేకరించిన విషయములయందు ఏ మాత్రము ఆసక్తుడు కాడు.

ఓ రాజా! సూర్యుడు ఒక్కడే. కాని భూమి మీద ఉన్న చిన్న మడుగులో, సరస్సులలో, నదులలో, సముద్రములో, ఆఖరుకు మన ఇంట్లో ఉన్న చిన్ని పాత్రలో ఉన్న నీటిలో కూడా కనపడుతుంటాడు. అంత మాత్రంచేత అనేక మంది సూర్యులు ఉన్నారని అనగలమా! అలాగే ఈ అనంత విశ్వంలో ఉన్న జీవరాసులలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఆ జీవుల శరీరములు వేరు అయినప్పటికినీ, వేరు వేరు ఆకారములలో కనపడినప్పటికీ, వాటిలో వెలుగుతున్న ఆత్మ ఒకటే.

మహారాజా! మరొక మాట. అతి సర్వత్రవర్జయేత్ అన్నది ఆర్యోక్తి. ఎవరితోనూ అతిగా స్నేహం చేయరాదు. ఎవరితోనూ అతిగా మాట్లాడకూడదు. ఈ సందర్భంలో నీకు ఒక పావురము కథ చెబుతాను శ్రద్ధగా విను.

ఒక అడవిలో ఒక పావురము తన భార్యతో కూడా ఒక చెట్టు మీద చాలా సంవత్సరములనుండి కాపురం ఉంటూ ఉంది. ఆలుమగలు అయిన ఆ పావురములు ఒకరి మీద ఒకరు అన్యోన్యప్రేమాను రాగములతో కాలం గడుపుతున్నాయి. కలిసి తింటున్నాయి, తిరుగుతున్నాయి, ఆహారం సంపాదించుకుంటున్నాయి. అన్ని పనులు కలిసి చేస్తున్నాయి. ఆడపావురము ప్రేమలో మగ పావురము పూర్తిగా మునిగిపోయింది. ఆడపావురము ఏది కోరితే అది ఎంత కష్టమైనా తెచ్చిఇచ్చేది. కొంత కాలానికి ఆడపావురము కొన్ని గుడ్లు పెట్టింది. వాటిని పొదిగిపిల్లలు చేసింది. దంపతులైన ఆ పావురములు తమ బిడ్డల

ముద్దు ముచ్చట్లు చూచి ఆనందంతో పరవశించిపోతున్నారు. ఆ పక్షికూనలు కూడా తమ చిట్టిపొట్టి అడుగులతో, కూతలతో తమ తల్లి తండ్రులకు ఆనందం కలుగజేస్తున్నాయి. ఆ పావురము దంపతులు, వారి సంతానము ఒకరి మీద ఒకరు ప్రేమానురాగాలు పెంచుకొని సంసార సాగరంలో మునిగిపోయారు.

ఒకరోజు ఉదయము ఆ పావురములు రెండు, తమ బిడ్డలను గూటిలో ఉంచి, ఆహారం కొరకు అడవిలోకి వెళ్లాయి. ఆహారం కోసరం తిరుగుతున్నాయి. ఇంతలో ఒక బోయవాడు వల తీసుకొని పక్షులను పట్టుకోడానికి ఆ చెట్టు కిందికి వచ్చాడు. చెట్టు మీద కువ కువ లాడుతూ అటు ఇటు తిరుగుతున్న పావురము కూనలను చూచాడు. వలపన్ని వాటిని పట్టుకున్నాడు.

ఇంతలో ఆహారమును ముక్కున పెట్టుకొని పావురము దంపతులు, అయ్యో పిల్లలు ఒంటరిగా ఉన్నాయే అనుకుంటూ వేగంగా తమ చెట్టు వద్దకు వచ్చాయి. కాని తమ పిల్లలు గూటిలో లేవు. అటు ఇటు వెదికాయి. చెట్టుకింద బోయవాడి వలలో ఉన్న తమ పిల్లలను చూచాయి ఆ పావురములు. ఇది చూచిన ఆడపావురము తట్టుకోలేక పోయింది. పిల్లలు లేని తన జీవితం ఎందుకని తాను కూడా పోయి ఆ బోయ వాడి వలలో చిక్కుకుంది. పిల్లలు బోయవాడి వలలో పడ్డందుకే ఏడుస్తుంటే, ఇప్పుడు తన భార్య కూడా బోయవాడి వలలో చిక్కుకోడంతో తల్లడిల్లిపోయింది మగపావురము. దు:ఖము ఆపుకోలేక పెద్దగా ఏడుస్తూ ఉంది.

"పిల్లలే బోయవాడి వలలో పడ్డారనుకుంటే నువ్వు కూడాపోయి వాడి వలలో చిక్కుకున్నావా! నాకు ఇంకా ఈ ప్రాపంచిక విషయముల మీద మోహము, మోజు తీరలేదు. ఈ సంసార సాగరంలో పడి ఈ  జన్మలో నేను పుణ్యం కూడా ఏమీ చేసుకోలేదు. నేను అటు పరలోకసుఖములకు, ఇటు ఇహ లోక సుఖములకు దూరం అయ్యాను. నా గృహస్థ ఆశ్రమము నాశనం అయింది. పతివ్రత, నన్ను ఎల్లప్పుడు అనుసరించి ఉండేది అయిన నా భార్య, నన్ను విడిచిపెట్టి, తన పిల్లలతో స్వర్గానికి పోతూ ఉంది. నా భార్యాబిడ్డలను పోగొట్టుకొని నేను ఎవరి కోసం బతకాలి. ఎందుకు జీవించాలి. నిస్సారమైన ఈ బతుకు ఎందుకు. ఎవరూ లేని ఈ గూటిలో నేను ఒంటరిగా ఎలా ఉండగలను." అని చింతించింది మగ పావురము.

ఆ దు:ఖములో తన బుద్ధి,వివేకము కోల్పోయింది. ఆవేశంతో తాను కూడా పోయి ఆ బోయవాడి వలలో చిక్కుకుంది. పావురము పిల్లలకు వల వేస్తే, పావురములు కూడా చిక్కాయి అన్న సంతోషంతో, ఆ బోయవాడు, ఆ పావురములను, పావురము పిల్లలను తీసుకొని ఇంటికి పోయాడు.

రాజా! ఆడ పావురము, మగ పావురము చేసిన పని ఏమిటి. కష్టం వచ్చినప్పుడు, ధైర్యం కోల్పోకుండా, ఏదో ఒక ఉపాయం చేత తన పిల్లలను విడిపించే ప్రయత్నం చేయాలి కాని, పిల్లల మీద అమితమైన ప్రేమ తో తల్లి, పిల్లలమీద, తల్లి మీద అనురాగంతో మగ పావురము వలలో చిక్కుకున్నాయి. తమ ప్రాణాలు పోగొట్టుకున్నాయి. కాబట్టి ఎవరిమీదా అమిత మైన ప్రేమ అనురాగాలు మంచివి కావు. ఏవైనా మితంగా ఉంటేనే రాణిస్తాయి. అలాగే మానవులు కూడా, దుర్లభమైన

మానవ శరీరమును పొంది కూడా, భార్య, సంతానము, ఆస్తులు, ధనము, గృహము, వీటి మీద అమితమైన ప్రేమ, అనురాగం పెంచుకొని, "ఇదంతా నాది, అంతా నాకే కావాలి" అనే లోభత్వంలో మునిగిపోయి, "నేనే గొప్పవాడిని, నన్ను ఎదిరించే వాడే లేడు" అనే అహంతో విర్రవీగుతూ, జీవితం అంతా దు:ఖమయం చేసుకుంటున్నారు.

ఓ రాజా! మానవుడికి ఈ శరీరం పొందడం ముక్తికి ద్వారం లాంటిది. మానవ శరీరంతో తప్ప మరి దేనివలనా జీవుడు ముక్తి పొందలేడు. అటువంటి శరీరాన్నిపొంది కూడా పావురము మాదిరి గృహస్థ ధర్మములో ఎక్కువ ఆసక్తి కనపరచి, భార్యాపిల్లలదే లోకంగా జీవిస్తూ, ముక్తిని పొందలేకపోతున్నాడు. ఇదే నేను ఆ పావురముల జంట నుండి నేర్చుకున్న పాఠము." అని అవధూత యదుమహారాజుకు చేసిన బోధను శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## ఏకాదశ స్కంధము

## ఎనిమిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఆ అవధూత అయిన బ్రాహ్మణుడు యదు మహారాజుతో ఇంకా ఇలా అన్నాడు.

"రాజా! సుఖము, దు:ఖము, స్వర్గము, నరకము అన్నీకూడా జీవులకు కోరకుండానే లభిస్తుంటాయి. కాబట్టి వివేకము కల మానవుడు సుఖము కోసం కానీ, దు:ఖము కోసం కానీ ఎట్టి ప్రయత్నములు చేయకూడదు. సుఖదు:ఖములు వాటంతట అవే లభిస్తాయి. మానవుడు తనకు లభించిన దానితోనే జీవనము సాగించాలి. దొరికిన పదార్థము రుచిగా ఉన్నా, లేకపోయినా, కొంచెం ఉన్నా, ఎక్కువగా ఉన్నా, ఎలా ఉన్నప్పటికీ దానిని వద్దనకుండా తీసుకోవాలి. ఒక్కోసారి ఏమీ దొరకదు. అది కూడా భగవంతుని ఇచ్ఛఅని సరిపెట్టుకోవాలి కానీ దొరకని దాని కోసరం ప్రయాసపడి పోకూడదు.

తనకు మంచి దేహబలము ఉన్నప్పటికినీ, మనస్సును, ఇంద్రియములను నిగ్రహించుకోవాలి. నిద్రా సమయములో నిద్ర రాకపోయినా, కళ్లుమూసుకొని పడుకోవాలి. ఎటువంటి పనులు చేయరాదు. ఇవన్నీ కూడా కొండచిలువ చేసే పనులు. కొండచిలువ నుండి నేను ఇటువంటి పాఠములు నేర్చుకున్నాను.

ముని అయిన వాడు ఎల్లప్పుడూ ప్రసన్నంగా ఉండాలి. గంభీరంగా ఉండాలి. సుఖము వచ్చినపుడు పొంగి పోవడం, ఆపదలు వచ్చినపుడు కుంగి పోవడం చేయకూడదు. ఎల్లప్పుడూ ఆటుపోట్లు లేని సముద్రము వలె నిశ్చలంగా ఉండాలి. రాజా! వర్షాకాలంలో సముద్రములో ఎన్నో నదులు ఉధృతంగా ప్రవహిస్తూ వచ్చి కలుస్తుంటాయి కాని సముద్రము చెలియలి కట్ట దాటి ముందుకు రాదు. ఎండా కాలంలో నదులన్నీ ఎండి పోయి చుక్కనీరు సముద్రములో కలవదు. కాని సముద్రము ఎండిపోదు. అలాగే మానవుడు కూడా సుఖములు కలిగినప్పుడు పొంగి పోవడం, దు:ఖములు వచ్చినపుడు కుంగి పోవడం చేయకూడదు.

మానవులు ఎల్లప్పుడూ పర స్త్రీలవైపు అమితంగా ఆకర్షితుడు కాకూడదు. అలా ఆకర్షితుడు అయితే అగ్నిలో పడ్డ శలభంలా మాడిపోతాడు. మూఢులు అయిన మానవులు ఎల్లప్పుడూ పరస్త్రీలయందు, బంగారమునందు, ధనమునందు, విలువగల వస్త్రముల యందు, వస్తువుల యందు అమితమైన కోరిక కలిగి అవన్నీ తమకు కావాలని కోరుకుంటూ ఉంటారు. ఆ కోరికలు తీరక పోవడంతో అమితమైన దు:ఖమునకు లోనై, తుదకు మరణిస్తారు. (ప్రేమించిన అమ్మాయితో కానీ, అబ్బాయితో కానీ పెళ్లి కాలేదనో, ప్రేమించిన అమ్మాయి, అబ్బాయి తనను తిరస్కరించారనో, తమ అభిమాన రాజకీయ నాయకుడు మరణించాడనో, ప్రత్యేకరాష్ట్రం రాలేదనో, ఉన్న రాష్ట్రం విడిపోతోందనో, ఇటువంటి అసందర్భమైన కోరికలతో ప్రాణాలు తీసుకొనే వాళ్లము ఎంతో మందిని మనం చూస్తున్నాము.)

ఓ రాజా! సన్యాసి అయిన వాడు తనకు ఆ పూటకు ఎంత కావాలో అంతే భిక్షను సంపాదించుకోవాలి కానీ, కూడపెట్టుకోకూడదు. (ఈ నాటి స్వామీజీలు, సన్యాసులు కోట్లకొలది ఆస్తులు కూడపెట్టుకుంటున్నారు. ఎందుకో మరి! వాళ్లంతా భాగవతం చదివినవారే కానీ ఆచరణ మాత్రం శూన్యం.) తుమ్మెదకు చిన్న పుష్పము పెద్దపుష్పము అనే తేడాలేదు. అన్ని పుష్పముల నుండి తేనె గ్రహిస్తుంది. అలాగే బుద్ధిమంతుడగు మానవుడు చిన్ని చిన్ని పుస్తకములను, పెద్ద పెద్ద పురాణ గ్రంధముల ను చదివి వాటి నుండి సారమును గ్రహించాలి.

మునులు, సన్యాసులు ఏపూటకు ఆ పూట ఆహారమును సంపాదించుకోవాలి కాని కూడబెట్టుకోకూడదు. తన చేతినే భిక్షాపాత్రగా భావించి, తన కడుపు పట్టినంతవరకు కావలసిన ఆహారమును సంపాదించుకొని తినాలి. అలా కాకుండా సన్యాసులు, మునులు ధనమును, ఆహారమును కూడబెడితే, అది పరుల పాలవుతుంది.

సన్యాసులకు, మునులకు స్త్రీసంగమము నిషిద్ధము. సన్యాసులు, మునులు స్త్రీబొమ్మలను కానీ, చిత్రపటములను కాని తాకరాదు, చూడరాదు. అలా చూస్తే వెంటనే ఆ సన్యాసి, ముని విషయవాంఛలకు బందీ అవుతాడు. సన్యాసులు, మునులు స్త్రీలతో సంపర్కము పెట్టుకుంటే, ఆ స్త్రీల బంధువులు, స్నేహితులు ఆ సన్యాసులను, మునులను చంపుతారు. లోకులు కూడా ఆ సన్యాసుల ప్రవర్తనను అసహ్యించుకుంటారు. కాబట్టి వివేకము కల సన్యాసి, ముని

స్త్రీలకు దూరంగా ఉండాలి. మునులు, సన్యాసులు స్త్రీలగురించి గానీ, కామప్రకోపము కలిగించే సాహిత్యమును, బొమ్మలను, సంగీతమును చూడరాదు, వినరాదు. అలా వింటే, వేటకాడు పన్నిన వలలో చిక్కుకున్న జింక మాదిరి కామవాంఛలు అనే వలలో చిక్కుకుపోతాడు. దీనిని సన్యాసులు, మునులు వేటకాడి వలలో పడ్డ జింకల నుండి నేర్చుకోవాలి.

ఈ ప్రపంచంలో లోభి అయిన మానవుడు ధనమును సంపాదించి, తాను అనుభవించకుండా, కూడబెట్టుకుంటాడు. లోభి తాను కూడబెట్టిన ధనమును తాను అనుభవించడు. ఇతరులకు దానం చెయ్యడు. తుదకు ఆ లోభి ధనము పరుల పాలవుతుంది. ఎలాగంటే, తేనెటీగ కష్టపడి ప్రతి పువ్వు మీదా వాలి, తేనెను సేకరిస్తుంది. దానిని తేనెపట్టులో దాచి పెడుతుంది. లోభిధనమును లోకులు అనుభవించినట్టు, తేనెను సేకరించేవాడు, ఆ తేనెటీగలను తరిమి, ఆ తేనెను పట్టుకుపోతాడు. ఈ విషయమును మనము తేనెటీగల నుండి నేర్చుకోవాలి.

చేపలను పట్టుకోడానికి జాలరి, తన గాలానికి ఒక మాంసపు ముక్కను ఎరగా కడతాడు. ఆ మాంసపు ముక్కను చూచి, నోరు ఊరిన చేప, జిహ్వాచాపల్యముతో ఆ గాలానికి చిక్కుకుంటుంది. అలాగే, జిహ్వాచాపల్యము ఉన్న మానవులు, తినకూడని వన్నీ తిని రోగాల పాలవుతారు. మానవుడు అన్ని ఇంద్రియములను నిగ్రహించుకోగలడు కానీ, నోరుకట్టుకోలేడు. కొంత మంది నోరు కట్టుకోడానికి ఉపవాసము ఉంటారు. ఆ ఉపవాస కాలంలో ఇంకా

ఎక్కువ తింటారు. (గురువారాలు, శనివారాలు ఉపవాసం పేరుతో కోరిన ఫలహారాలు చేసుకొని ఆరగించడం మనం చూస్తూనే ఉన్నాము కదా!) కాబట్టి మానవుడు అన్ని ఇంద్రియములను జయించినా, జిహ్వను జయించక పోతే, జితేంద్రియుడు కాలేడు. ఒక్క జిహ్వను జయిస్తే, అన్నిటినీ జయించినట్టే!

రాజా! పూర్వకాలంలో మిథిలా నగరంలో పింగళ అనే వేశ్య ఉండేది. నేను ఆమెను చూచి కొంత జ్ఞానమును సంపాదించాను. పింగళ అనే వేశ్య వేశ్యావృత్తితో జీవనం గడుపుతూ ఉండేది. ఒకరోజు సాయంకాలము, ఆమె చక్కగా అలంకరించుకొని, వాకిటి దగ్గర నిలబడి విటుల కోసం ఎదురు చూస్తూ ఉంది. ఆమె దారినపోయే ధనవంతులను చూచి, "వీడి దగ్గర బాగా డబ్బు ఉంది. వీడు నన్ను అనుభవించి బాగా ధనం ఇస్తాడు" అని ఆశగా ఎదురుచూస్తూ ఉండేది. ఆ వీధిలో ధనవంతులు వస్తున్నారు పోతున్నారు. ప్రతివాడూ తన దగ్గరకు వస్తాడని ఆ వేశ్య అనుకుంటూ ఉండేది. కాని ఎవ్వరూ ఆమె దగ్గరకు రాలేదు. ఆమెలో ఆశ పెరిగిపోయింది. ఇంకా వస్తారు ఇంకా వస్తారు అని రాత్రి పొద్దుపోయేవరకు ఎదురు చూచింది. ఆమె నిద్రకూడా పోకుండా విటుల కొరకు ఎదురుచూచింది. బయట నిలబడితే ఏమన్నా అనుకుంటారని కాసేపు లోపలకు పోయి మరలా బయటకు వచ్చి నిలబడేది. ఇలా రాత్రంతా లోపలకు బయటకు తిరుగుతూనే ఉంది.

ఇంతలో అర్ధరాత్రి అయింది. ఆమె ముఖం వాడి పోయింది. ధనం సంపాదించాలి అనే కాంక్ష ఎక్కువ అయింది. ఆఖరుకు ఆమెకు వైరాగ్యం కలిగింది. ఆ వైరాగ్యం కలగగానే ఆమెలో ఉన్న ఆశ

పటాపంచలయింది. ఆశపడితే ఏదీ లభించదు అన్న సత్యాన్ని గ్రహించింది. మానవులు ఆశాజీవులు. ప్రతి దాని కోసరం ఆశపడుతుంటారు. అలాగే వైరాగ్యం కలగని వారు దేహము మీద ప్రేమను పెంచుకుంటారు. ఈ దేహమే సర్వస్వము అనుకుంటారు. ఎంతకూ తన వద్దకు ఒక్క విటుడు కూడా రాకపోవడంతో, ఆ వేశ్య తనలో తాను ఇలా అనుకుంది.

"నా వద్దకు విటులు వస్తారు. నన్ను అనుభవిస్తారు. నాకు అపరిమితమైన ధనం ఇస్తారు అని నేను ఆశపడ్డాను. ఇంద్రియములకు వశురాలనై మోహంలో పడిపోయాను. నా పిచ్చిగానీ, వీళ్లకే దిక్కులేదు. వీళ్లు నన్ను అనుభవించి నాకు ఏం ధనం ఇస్తారు. నేను ఎంతటి భ్రమలో పడ్డానో తల్చుకుంటే నా మూర్ఖత్వానికి నాకే నవ్వు వస్తోంది. అన్ని సుఖములను, ఐశ్వర్యములను ఇచ్చేవాడు పరమాత్ముడు. నేను ఆ పరమాత్ముని సేవలను వదిలిపెట్టి కోరికలను తీర్చడంలో అసమర్థులు, దు:ఖమును, భయమును, రోగాలను, శోక, మోహములను కలుగజేసే ఈ తుచ్ఛమానవుల వెంట పడటం ఎంత అవివేకము.

జానెడు పొట్ట నింపుకోడానికి వేరే ఏ పనీ చేత కాక ఈ వేశ్యావృత్తిని స్వీకరించాను. నా శరీరాన్ని కష్టాలపాలు, రోగాల పాలుచేసుకున్నాను. భగవంతుని సేవకు వినియోగించవలసిన ఈ శరీరాన్ని ధనం కోసరం విటులకు అమ్ముకుంటున్నాను. నీచులు, లోభులు, కామాంధులు అయిన మానవులు నా శరీరాన్ని ధనం ఇచ్చి కొనుక్కుంటున్నారు. నేను పరమ మూర్ఖురాలను కాబట్టి నా శరీరాన్ని

ధనం కొరకు, సుఖం కొరకు అమ్ముకుంటున్నాను.

నేను ఉన్న ఇల్లు ఎటువంటిదో ఈ శరీరం కూడా ఒక ఇల్లు వంటిది. ఇంటిని వెదురు కర్రలతో నిర్మిస్తే, ఈ శరీరంలో కూడా కర్రల వంటి ఎముకలు ఉన్నాయి. కర్రల వంటి ఎముకలను చర్మము కప్పి ఉంచుతుంది. నా ఇంటికి ద్వారములు ఉన్నట్టే, ఈ శరీరము అనే ఇంటికి కూడా తొమ్మిది ద్వారములు ఉన్నాయి. అందులో కింద ఉన్న రెండు ద్వారముల నుండి మల మూత్రములు వెలువడుతుంటాయి. నేను, నా శరీరమును అమ్మి, ఆర్జించి, తినే ఆహారం, నీరు అంతా మలమూత్రములుగా మారిపోతూ ఉంది. మలమూత్రములతో కూడిన ఈ శరీరాన్ని విటులు మోహిస్తారు, కామిస్తారు, అనుభవిస్తారు. ఎంత విచిత్రం!

ఆ మాటకొస్తే నాకూ నా శరీరం అంటే విపరీతమైన అభిమానమే కదా! ఈ శరీరంలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్న పరమాత్మను వదిలిపెట్టి నేను, నా దగ్గరకు వచ్చే విటుల నుండి ధనమును కోరుకుంటున్నాను. ఈ మిథిలా నగరంలో నా వంటి మూర్ఖురాలు ఎవరుంటారు? ఈ దేహములో ఉండే ఆత్మస్వరూపుడైన పరమాత్మ ఒక్కడే జీవుల కందరికీ ప్రియతముడు, ప్రభువు, స్నేహితుడు. నా శరీరాన్ని ఆయనకే అర్పిస్తాను. ఈ జగత్తులోని కోరికలు, విషయవాంఛలు అన్నీ కాల గర్భంలో కలిసిపోయేవే! ఏదీ శాశ్వతం కాదు.

ఇన్నాళ్లు నేను నా శరీరాన్ని ఈ నగరంలో ఉన్న మగవారికి పంచి ఇచ్చాను. నేనేం సుఖపడ్డాను. నేను చేసుకున్న పూర్వపుణ్య

విశేషము చేత నాకు ఈ నాటికి జ్ఞానోదయం కలిగింది. వైరాగ్యము నన్ను ఆవరించింది. ఈ వైరాగ్యమే నాకు సకల సుఖములు కలుగజేస్తుంది. ఏ మానవుడికైనా వైరాగ్యము వలననే సంసార బంధనముల నుండి విముక్తి కలుగుతుంది. నేను కూడా ఈ వేశ్యావృత్తి నుండి విముక్తి పొందుతున్నాను. ఆ భగవంతునికి శిరస్సు వంచి పాదాభివందనము చేస్తున్నాను. నేను ఈ రోజునుండి కోరికలను వదిలిపెట్టి ఆ దేవదేవుని శరణు వేడుతున్నాను. నేను ధన సంపాదన కొరకు ఎటువంటి చెడ్డపని చెయ్యను. దొరికిన దానితోనూ తృప్తి పడతాను. సంతోషంగా ఉంటాను. నా మనసులో శ్రీహరిని నిలుపుకొని ఆయనతోనే విహరిస్తాను. ఈ సంసారం అనే బావిలో పడి పైకి రాలేని వాడిని, ఈ ప్రపంచంలో ఉన్న వస్తువుల, మనుషుల రూపమునకు, రుచికి బానిస అయిన వాడిని, కాల సర్పము చేత చుట్టబడినవాడిని, ఆ శ్రీహరి తప్ప వేరే ఎవరూ రక్షించలేరు. ఈ జగత్తు అంతా కాలము అనే సర్పము చేత ఆవరించబడి ఉంది. విషయ వాంఛలకు, ప్రాపంచిక సుఖములకు లోబడటం అంటే, కాలసర్పము నోట్లో బడటమే కాని వేరుకాదు. అలా కాలసర్పము నోట్లో పడకుండా ఉండాలంటే, వైరాగ్యము ఒకటే మార్గము." అని పింగళ అనే వేశ్య తనలో తాను తలచుకొని ఒక నిర్ణయానికి వచ్చింది. వేశ్యావృత్తిని విడిచిపెట్టింది. విటులకు సుఖాన్ని పంచి ధనాన్ని సంపాదించాలి అనే దురాశను వదిలిపెట్టింది. అప్పుడు ఆమె మనస్సు పరమ శాంతితో నిండి పోయింది. సుఖంగా నిద్రపోయింది.

కాబట్టి ఓ రాజా! దురాశ పడటం దు:ఖమునకు మార్గము. దురాశ వలన దు:ఖం కలుగుతుంది. మనశ్శాంతి కరువవుతుంది.

అనవసరంగా ఆశలు పెంచుకోకపోతే, సుఖంగా జీవించవచ్చు. ఈ విషయాన్ని నేను పింగళ అనే వేశ్యనుండి గ్రహించాను." అని ఆ బ్రాహ్మణుడు యదుమహారాజుకు వివరించాడు అని కృష్ణుడు ఉద్ధవునికి చెప్పిన వృత్తాంతమును శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు వివరించాడు.

శ్రీమద్భాగవతము
ఏకాదశ స్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ఏకాదశ స్కంధము
తొమ్మిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! యదుమహారాజుతో అవధూత అయిన ఆ బ్రాహ్మణుడు ఇంకా ఇలా అన్నాడు.

"రాజా! మానవులకు దు:ఖము ఎందుకు వస్తుందో తెలుసా! ఏదైనా ఒక వస్తువు మీద అధికమైన ప్రేమ, కోరిక, ఆసక్తి కలిగి ఉండటమే అన్ని దు:ఖములకు కారణము. ఏదీ నాది కాదు. అంతా పరమాత్ముడిది నేను నిమిత్తమాత్రుడిని అని అనుకుంటే అంతా సుఖంగానే ఉంటుంది. ఒక పక్షి నోట్లో ఒక మాంసపు ముక్క ఉంది. మరొక బలమైన పక్షి ఆ ముక్కను చూచి ఆ పక్షిమీద దాడి చేసింది. మొదటి పక్షి ఆ ముక్కను కింద పడవేసింది. రెండవ పక్షి ఆ ముక్కను ఎత్తుకొని పోయింది. మొదటి పక్షి సుఖంగా ఉంది. అలా కాకుండా ఆ

మాంసపు ముక్కకొరకు రెండు పక్షులు కొట్లాడుకుంటే, ఇద్దరూ దు:ఖిస్తారు.

నేను దేని కొరకూ ఆశపడను. నన్ను ఒకరు పొగిడారని సంతోషించను. మరొకరు తిట్టారని బాధపడను. నాకు భార్య, సంతానము లేరు. నేను పసిబాలుని వలె నిత్యము ఆనందంగా ఉంటాను. తృప్తిగా జీవిస్తాను.

ఈ ప్రపంచంలో ఇద్దరు మాత్రమే నిత్యము సంతోషంగా, ఆనందంగా ఉంటారు. ఒకరు ఏమీ తెలియని వాడు, బాలుడు. మరొకడు అన్నీ తెలిసిన వాడు అంటే యోగి, సర్వసంగపరిత్యాగి. తెలిసీ తెలియని వాడే అన్ని బాధలు పడుతుంటాడు. ఈపని చేస్తే ఏమవుతుందో అనీ బాధ. ఆ పని చేయకపోతే ఏమి కీడు మూడుతుందో అని బాధ. తెలిసీ తెలియని జ్ఞానంతో నిత్యమూ బాధపడుతుంటాడు. అలా అని పరమాత్మ తత్త్వం తెలుసుకోడానికి ప్రయత్నించడు. అజ్ఞానంలో పడి అలమటిస్తుంటాడు.

ఒక ఊరిలో ఒక పెళ్లికాని అమ్మాయి ఉంది. ఆ అమ్మాయి వివాహ సంబంధం మాట్లాడటానికి కొంత మంది ఆ అమ్మాయి ఇంటికి వచ్చారు. వారిలో నేను కూడా ఉన్నాను. ఆ సమయంలో ఆమె తల్లి తండ్రులు ఇంట్లో లేరు. ఆ అమ్మాయి వచ్చిన వారికి అతిథి సత్కారాలు చేసింది. ఆ సమయానికి ఇంట్లో బియ్యం లేవు. ఆ అమ్మాయి వడ్లు రోట్లో పోసి దంపుతూ ఉంది. ఆమె దంపుతూ ఉంటే ఆమె చేతి గాజులు గలగలలాడుతున్నాయి. ఆ విషయం గ్రహించింది. అతిథులను చూచి

ధాన్యం దంపడం అంటే ఇంట్లో బియ్యం లేకపోవడం. అంటే దరిద్రం. తన చేతికి ఉన్న గాజులు చప్పుడయితే తాను ధాన్యం దంపుతున్నట్టు వారికి తెలుస్తుంది. అందుకని, తాను ధాన్యం దంపడం వారికి తెలియకుండా, గాజులు గలగలలాడకుండా అన్ని గాజులు తీసివేసింది. ఒకే ఒక్క గాజు ఉంచుకొని, చప్పుడు కాకుండా దంపుతూ ఉంది. ఆ వెళ్లిన వారిలో నేనూ ఉన్నాను. ఆమె చేసిన పని నాకు ఒక కొత్త పాఠం నేర్పింది. చాలా మంది ఒకేచోట ఉంటే అందరూ ఒకేసారి మాట్లాడతారు. వారిలో వారు కొట్లాడుకుంటారు. ఒక్కడే ఉంటే ఎలాంటి చర్చలు ఉండవు. తగాదాలు ఉండవు. కాబట్టి సన్యాసి, సాధకుడు సాధ్యమైనంత వరకు ఒంటరి జీవితంగడపాలి.

ఇంకా సన్యాసి అయిన వాడు ధ్యానము చేయాలి. ప్రాణాయామము చెయ్యాలి. కోరికలను వదిలిపెట్టాలి. వైరాగ్యము అవలంబించాలి. ఇవి పాటిస్తే సన్యాసి మనసు అతని  వశంలో ఉంటుంది. సన్యాసి దృష్టి ఎల్లప్పుడూ భగవంతుని మీదనే ఉండాలి కానీ ప్రాపంచిక విషయముల మీద ప్రసరించకూడదు. భగవంతుని మీద ఏకాగ్రమైన భక్తి కలిగి ఉంటే, వాడు చేసిన కర్మ వాసనలనుండి విడివడతాడు. సత్వగుణమును అలవరచుకుంటే, రజోగుణము, తమోగుణము వాటంతటవే వదిలిపోతాయి. అప్పుడు మనస్సులో ఎటువంటి కల్మషము లేకుండా, పరమ శాంతిని పొందుతాడు.

యోగిఅయిన వాడు పరమాత్మను ధ్యానం చేసేటప్పుడు తనపరిసరములలో ఏమి జరుగుతున్నదీ పట్టించుకోడు. అతని మనస్సు పరమాత్మయందే లగ్నం అయి ఉంటుంది. తన పక్కన ఏం జరుగుతున్నా పట్టించుకోడు. సన్యాసి అయినవాడు ఒక్కచోట స్థిర

నివాసము ఏర్పరచుకోకూడదు. ఈ దేహమే శాశ్వతము కానపుడు, శాశ్వతమయిన గృహమును నిర్మించుకోవడం అవివేకమే అవుతుంది. సాధ్యమయినంతవరకు దేవాలయములలో, ఊరి వెలుపల మఠములలో ఉండాలి. గృహస్థుల గృహములలోకి ప్రవేశించరాదు. మితంగామాట్లాడాలి. అనవసరమైన విషయాలలో జోక్యం కల్పించుకోకూడదు. (ఉదాహరణకు కంచికామకోటి పీఠాధిపతి అయిన శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతి స్వామి అనవసరమైన రాజకీయ వ్యవహారాలలో తలదూర్చి అవస్థలపాలయ్యాడు అన్న విషయం మనందరికీ తెలుసు.)

పరమాత్మ తన మాయతో ఈ విశ్వమును సృష్టించి, పాలించి, లయం చేస్తున్నాడు. మనం నిమిత్తమాత్రులము. పరమాత్మకు ఎటువంటి భేదబుద్ధి లేదు. మనమే పరమాత్మకు అనేక రూపాలను ఆ రూపాల మధ్య భేదములను కల్పించి, మనలో మనం కలహించుకుంటున్నాము అనే నిజాన్ని తెలుసుకోవాలి.

పరమాత్మ నుండి ప్రకృతి అందులో నుండి మహాతత్వము, సత్వరజస్తమో గుణములు ఉద్భవించాయి. మొదట అవి అన్నీ కదలిక లేకుండా ఉన్నాయి. ఆసమయంలో కేవలం పరమానంద స్వరూపుడు అయిన పరమాత్మ ఒక్కడే ప్రకాశిస్తున్నాడు. ఆ పరమాత్మ సృష్టి చేయ సంకల్పించాడు. సత్వ, రజస్తమోగుణములతో కూడిన తన మాయను ప్రకృతిలో ప్రవేశపెట్టాడు. అప్పుడు ప్రకృతిలో చైతన్యం వచ్చింది. క్రియాశక్తితో ప్రకృతి చైతన్యవంతమయింది. అదే మహత్తత్వము. ఈ మహత్తత్వము మూడుగుణముల నుండి పుట్టినదని పెద్దలుచెబుతారు.

అందుకే ఈ ప్రకృతి మూడుగుణముల మిశ్రమము అని అంటారు. సాలె పురుగు తనలో నుండి ఒక రకమైన జిగురు పదార్థమును స్రవిస్తుంది. ఆజిగురు దారంగా మారుతుంది. ఆ దారముతో సాలీడు తనచుట్టు తాను గూడు కట్టుకుంటుంది. ఆగూడు మధ్యలో తాను బందీ అయిపోతుంది. మరలా ఆ దారమును తనలోకి లాక్కుంటుంది. అలాగే పరమాత్మ తనలో నుండి అనంతవిశ్వమును సృష్టిస్తాడు. పోషిస్తాడు. చివరకు తనలోనే లయం చేసుకుంటాడు.
(ఈ నాటి శాస్త్రజ్ఞులు కూడా మొట్టమొదట ఈ విశ్వం ఆవగింజంత పరిమాణంలో అణువుగా ఉందనీ, ఆ అణువులో ఒక మహావిస్ఫోటము(బిగ్ బాంగ్) సంభవించినదనీ, ఆ విస్ఫోటం నుండి ఈ అనంత విశ్వం ఆవిర్భవించిందనీ, మిలియన్ సంవత్సరాల నుండి విశ్వం విస్తరిస్తూ ఉందనీ, తుదకు అనంత విశ్వం కుచించుకుపోయి, ఒకదానిలో ఒకటి లీనం అవుతూ, సూక్ష్మంగా మారిపోతుందనీ తేల్చారు. ఈవిషయాన్నే వేల సంవత్సరాల కిందట భాగవతంలో చెప్పారు.(స్టీఫెన్ హాకిన్స్ రాసిన "ఎ బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైమ్" చూడండి.)

రాజా! ఏదైనా ప్రాణి భయము చేతగానీ, స్నేహము చేత గానీ, ద్వేషము చేతగానీ, తన మనస్సును మరొక ప్రాణి మనస్సుతో ఏకాగ్రంగా లగ్నం చేస్తే, మొదటి ప్రాణి రెండవ ప్రాణి లక్షణాలను సంతరించుకుంటుంది. దీనినే భ్రమర కీటక న్యాయం అంటారు. ఒక భ్రమరము ఒకకీటకము చుట్టు ఏకాగ్రబుద్ధితో గిర్రున తిరుగుతుంటే, కొంత కాలానికి ఆ కీటకము కూడా భ్రమరము యొక్క లక్షణాలను సంతరించుకుంటుంది. రాజా! భ్రమరమును చూచి నేను ఈ జ్ఞానమును సంపాదించుకున్నాను. (ఎంతటిమంచి వాడైనా దుష్టుడి

స్నేహం చేస్తే, దుష్టుడిలక్షణాలు మంచి వాడికి సంక్రమించి, మంచి వాడు కూడా దుష్టుడుగా మారిపోతాడు. దుష్టుడు మంచి వాడితో స్నేహం చేసి మంచి వాడిగా మారడం కూడా ఉంది కానీ అరుదు. ఎందుకంటే మనసు చెడును గ్రహించినంత సులభంగా మంచిని గ్రహించదు.).

రాజా! నేను ప్రకృతిలో ఉన్న జీవుల నుండి పైవిషయముల గురించి జ్ఞానమును సంపాదించుకున్నాను. వీరందరూ నా గురువులు. ఓరాజా! నేను నా శరీరము నుండి కూడా కొన్ని విషయములను తెలుసుకున్నాను. ఆ విషయముల గురించి చెబుతాను విను.

ఈ శరీరంలో నిరంతరము దు:ఖము, దాని వెంట సుఖము, మరలా దు:ఖము కలుగుతుంటాయి. ఈ శరీరములు పుడుతుంటాయి, పెరుగుతుంటాయి, రాలిపోతుంటాయి. అందుకని ఈ మానవ శరీరం కూడా నాకు గురువుతో సమానము. ఈ శరీరములో నుండి జీవము పోయిన తరువాత, ఈ శరీరమును కాలుస్తారు, పూడుస్తారు, లేక కుక్కలకు, నక్కలకు ఆహారం అవుతుంది. కాబట్టి ఈదేహము మీద అభిమానము, ఆసక్తి పనికిరాదు అని తెలుసుకున్నాను.

ఓ రాజా! ఈ శరీరముతో జ్ఞానం సంపాదించ వచ్చును. ధ్యానం చేయవచ్చును. తత్వవిజ్ఞానమును అనుసంధానించుకోవచ్చును. ఆ కార్యములకు మాత్రమే ఈ శరీరము ఉపయోగపరచుకోవాలి. అంతే

కానీ, ఈ శరీరమును సుఖపెట్టడానికి కష్టపడి ధనమును సంపాదించడం, ధనమును కూడబెట్టడం, భార్య సంతానమును సంతోషపెట్టడం, సంపదలను పోగుచేయడం, పశువులను పోషించడం, సేవకులతో సేవలు చేయించుకోవడం, శాశ్వతంగా ఇళ్లు కట్టుకోవడం, ఇవన్నీ చేస్తుంటారు. కానీ ఈ శరీరము కాలం తీరగానే నశించిపోతుంది. జీవుడు మరొక శరీరంలో ప్రవేశించి, అక్కడకూడా ఆ శరీరాన్ని సుఖపెట్టడానికి నానాపాట్లుపడతాడు. ఈశరీరము శాశ్వతము కాదు అని భావిస్తే ధన సంపాదన కొరకు ఇన్ని పాట్లుపడనవసరం లేదు.

ఒకనికి ఎక్కువమంది భార్యలు ఉన్నారనుకుందాము. వారు ఆ పురుషుని తమ వైపుకు ఆకర్షించడానికి నిరంతరము ప్రయత్నిస్తుంటారు. అలాగే ఈ శరీరంలో ఉన్న నాలుక (జిహ్వ), జననేంద్రియము, చర్మము, పొట్ట, చెవులు, ముక్కు, కళ్లు, అన్నీ కూడా జీవుని తమ వైపుకు లాగడానికి, ఆకర్షించడానికి, నిరంతరము ప్రయత్నిస్తుంటాయి. ఆ ఆకర్షణలకు లోనుకానంత వరకు జీవుడు సంతోషంగా ఉంటాడు.

ఓ రాజా! పరమాత్మ తన మాయా శక్తితో ఈ ప్రకృతిని అందులో వృక్షములను, జంతువులను, పశువులను, పక్షులను, ఎన్నిటినో సృష్టించాడు. అయినా ఆయనకు సంతోషము కలుగలేదు. అప్పుడు పరమాత్మ బుద్ధి, మనసు కలిగిన మానవులను సృష్టించాడు. మానవుడు తమ బుద్ధితో, జ్ఞానముతో, ఆ పరమాత్మను తెలుసు కోడానికి ప్రయత్నిస్తాడు అని అనుకున్నాడు. కాని అలా జరగడం లేదు. ఎందుకంటే, ఈ మానవ జన్మ ఎన్నోజన్మల తరువాత కానీ లభించదు.

మానవుడు, మృత్యువు అనునిత్యము వెంటాడే ఈ మానవ జన్మను సార్థకం చేసుకోడానికి ప్రయత్నించాలి. కాని మానవులు పశువుల మాదిరి విషయ సుఖముల కొరకు పాకులాడుతున్నారు. ఈవిషయసుఖములు (కామ వాంఛలు) పశువులకు కానీ మానవులకు కాదు కదా!

ఓ మహారాజా! నేను ఈ ప్రకృతిలో ఉన్న మానవుల నుండి, జంతువులనుండి, అనేక పాఠములు నేర్చుకున్నాను. వైరాగ్యమును పొందాను. సంగములను, అహంకారమును వదిలిపెట్టాను. పరమాత్మయందు మనసును లగ్నం చేసాను. కేవలం విషయములను తెలుసుకోడానికి ఈ భూమి మీద తిరుగుతున్నాను.

ఓ రాజా! పరబ్రహ్మ పదార్థము ఒక్కటే. రెండు కాదు. కాని ఋషులు పరబ్రహ్మను అనేక రూపములతో వర్ణించారు. కాబట్టి మానవులు కూడా ఒకే గురువు వద్ద కాకుండా ఈ ప్రకృతిలో ఉన్న అందరి వద్ద నుండి పాఠములు నేర్చుకోవాలి." అని దత్తాత్రేయుడు అనిపిలువబడే ఆ అవధూత బ్రాహ్మణుడు యదు మహారాజుకు వివరించాడు.

యదుమహారాజు దత్తాత్రేయుని పూజించి అర్చించాడు. తరువాత దత్తాత్రేయుడు అనే ఆ అవధూత తన దారిన తాను వెళ్లిపోయాడు. దత్తాత్రేయుని మాటలను విన్న యదుమహారాజు, ఆయన ఉపదేశములను నిష్ఠతో పాటించి ఉత్తమగతులను పొందాడు." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి వివరించాడు అని శుకమహర్షి

పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణ ఉద్ధవ సంవాదమును గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## ఏకాదశ స్కంధము
## పదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఇంకా ఇలా ఉపదేశిస్తున్నాడు. "ఉద్ధవా! సాధకుడు పరమాత్మను శరణు జొచ్చి భాగవత ధర్మములను శ్రద్ధగా పాటించాలి. కోరికలను విడిచిపెట్టాలి. తాను చేసే కర్మలను అన్నింటినీ ఎటువంటి ఫలితాన్ని ఆశించకుండా చెయ్యాలి. ఆచారములను పాటించాలి.

సాధారణంగా పురుషులు కామ సంబంధమైన, స్త్రీ సంబంధమైన కోరికలను, వారితో అనుభవించే సుఖమును నిజమని నమ్ముతుంటారు. తాను కోరుకున్న స్త్రీలను పొందడానికి, అనుభవించడానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తుంటారు. కానీ ఆ ప్రయత్నాలన్నీ ఫలించవనీ, వికటిస్తాయనీ వారికి తెలుసు. తుదకు ఆ కామసుఖముల మీద విరక్తి పుట్టి, విరాగి అవుతాడు. (ఉదాహరణకు భోగిగా ఉన్న వేమన యోగిగా మారడాన్ని చెప్పుకోవచ్చు.)

ఎల్లప్పుడూ కామ కోరికలతో నిద్రపట్టకుండా సతమతమయ్యే వాడికి ఎక్కువగా కలలు వస్తుంటాయి. ఆ కలలలో రకరకాల భోగ్యవస్తువులు కనపడుతుంటాయి వాటిని తనివితీరా అనుభవించి నట్టు కలలు కంటాడు. మెలుకువ రాగానే అవి అన్నీ నిజం కాదని తెలుసుకుంటాడు. అలాగే నిజ జీవితంలో కూడా అనుభవించే సుఖాలు కలలో అనుభవించిన సుఖాల మాదిరి క్షణాల్లో మాయం అయిపోతాయి అని మాత్రం తెలుసుకోలేడు. ప్రాపంచిక సుఖాల కోసరం వెంపర్లాడుతుంటాడు.

కాని పరమాత్మ మీద మనస్సు నిలిపిన వారు ఈ కామ సంబంధమైన కోరికలను, కర్మలను వదిలిపెట్టాలి. ఈ శరీరానికి ఏం అవసరమో ఆ కర్మలే చెయ్యాలి. తరువాత ఆ కర్మలను కూడా వదిలెయ్యాలి. ఎల్లప్పుడూ ఆత్మను గురించి మాత్రమే ఆలోచించాలి. పరమాత్మయందే మనసును లగ్నం చెయ్యాలి. అహింస మొదలగు యమములు పాటించాలి. శౌచము మొదలగు నియమములను శక్తికొద్దీ పాటించాలి. మంచి గురువును ఆశ్రయించాలి. ఆ గురువును పరమాత్మ స్వరూపుడుగా పూజించాలి. (గురు బ్రహ్మ, గురు విష్ణు, గురు దేవో మహేశ్వర: గురుసాక్షాత్ పరబ్రహ్మ). గురువుకు సేవచేసేవాడికి అభిమానము ఉండకూడదు. అహంకారము ఉండకూడదు. అసత్యము పలకకూడదు. విషయ వాంఛల యందు కోరిక ఉండకూడదు. గురువు మీద అచంచల మైన భక్తి విశ్వాసము కలిగిఉండాలి. కోపం అసలు పనికిరాదు. ఎల్లప్పుడు గురువు వద్ద నుండి ఆత్మతత్వమును గురించి తెలుసుకోడానికి ప్రయత్నం చేయాలి. అనవసరమైన సంభాషణలను చేయరాదు. జీవులందరినీ సమంగా చూడాలి,

ఆదరించాలి. భార్య, సంతానము, బంధువులు, మిత్రుల మీద, ధనము మీద ఎక్కువ ఆసక్తి చూపించకూడదు. తగుమాత్రంగానే ప్రేమ, అభిమానము కలిగి ఉండాలి.

అగ్ని మండుతుంది. ప్రకాశము కలిగి ఉంటుంది. కానీ, అది కట్టెలో దాగిఉంటుంది. మన కంటికి కనిపించదు. అలాగే ప్రతి శరీరములోనూ ఆత్మ దాగి ఉంటుంది. తనకు తానుగా ప్రకాశిస్తూ ఉంటుంది. కట్టెలో అగ్నిని చూచినట్టు మానవుడు ఆత్మను దర్శించాలి.

అగ్ని తనకు తానుగా మండదు. అగ్ని కట్టెతో కానీ, లోహముతోగానీ, ఇతర వస్తువులతో కానీ కలిసి మండుతుంది. కానీ అగ్ని, కట్టె, లోహము, ఇతర వస్తువుల గుణములను కలిగిఉండదు. అలాగే ఆత్మకూడా వివిధ శరీరములలో అంతర్గతంగా ఉంటూ కూడా, ఆ శరీరముల యొక్క గుణములను, లక్షణములను కలిగిఉండదు. ఆ దేహములతో చేసే పనులతో ఎటువంటి సంబంధముపెట్టుకోదు. కేవలము సాక్షిగా చూస్తూ ఉంటుంది.

ఈ దేహములు రెండు విధములు. సూక్ష్మ దేహము, స్థూలదేహము. ఈ రెండు పరమాత్మ మాయ వలన ఏర్పడినవే. ఈ ప్రపంచంలో పుట్టడం, పెరగడం, చావడం అంతా భ్రమ. ఏదీ నిజం కాదు. ఈ దేహమే శాశ్వతము అనే భ్రమ పోవాలంటే ఆత్మజ్ఞానము కావాలి. ఆత్మజ్ఞానమే ఈ ప్రాపంచిక విషయముల నుండి విముక్తి కలిగిస్తుంది. కాబట్టి ప్రతి మానవుడు ఆత్మను గురించి తెలుసుకోవాలి. దేహములు అనిత్యములు, అశాశ్వతములు అని గ్రహించాలి. ఈ ప్రపంచంలో దొరికే వస్తువులు, కలిగే సుఖములు శాశ్వతములు కావు,

సుఖం వెంటనే దు:ఖం ఉంటుంది అనే జ్ఞానాన్ని కలిగి ఉండాలి. పరమాత్మ ఒక్కడే నిత్యము అని తెలుసుకోవాలి.

ఉద్ధవా! కింద ఒక కొయ్య దిమ్మనుపెట్టి అందులో ఒక అరణిని అంటే మరొక కొయ్యను పెట్టి మథిస్తే నిప్పుపుడుతుంది. (ఇది వరకు యజ్ఞాలు చేసే ముందు ఈ ప్రక్రియ ద్వారానే నిప్పు రగిల్చి హెూమం చేసేవారు). ఈ ప్రక్రియలో కింద ఉన్న కొయ్య దిమ్మ గురువు. పైన ఉన్న కొయ్య అరణి శిష్యుడు. గురువు చేసే ఉపదేశమే ఆ నిప్పును గ్రహించే చిన్ని చిన్ని చితుకులు. అరణితో చేసిన మధనం వలన పుట్టే అగ్ని జ్ఞానము. ఈ జ్ఞానమే మనలో ఉన్న భ్రమలను నాశనం చేసి ఆత్మజ్ఞానం కలుగజేస్తుంది. సద్గురువు చేత ఉపదేశింపబడ్డ జ్ఞానము, మానవుని ఆవరించిన మాయను తొలగిస్తుంది. మూడు గుణములను, వాటి వలన పుట్టిన కోరికలను నాశనం చేస్తుంది. శుద్ధమైన అగ్ని వలె ప్రకాశిస్తుంది.

ఓ ఉద్ధవా! ఎంతో జాగ్రత్తగా, నైపుణ్యంతో కర్మలను చేసే వారికి కూడా ఎల్లప్పుడూ సుఖము లభించదు. ఏమీ తెలియని వారికి మూఢులకు ఎల్లప్పుడూ దు:ఖమే లభించదు. సుఖదు:ఖములు ఎటువంటి వారికైనా వెంట వెంటనే వస్తుంటాయి పోతుంటాయి. ఆ కారణం చేత సుఖము కలిగినపుడు ఎగిరి పడటం, దు:ఖము కలిగినపుడు కుంగి పోవడం తగదు. సుఖదు:ఖములు సమానంగా అనుభవించిన వాడే ఉత్తముడు.

ఇంకొంత మంది, తమకు సుఖము ఎలా వస్తుందో తెలుసని, దు:ఖము ఏ కారణం చేత వస్తుందో తెలుసని గొప్పలు చెప్పుకుంటూ ఉంటారు. కానీ వారు తమకు అత్యంత దు:ఖమును కలిగించే మృత్యువు రాకుండా ఎటువంటి ఉపాయము కనిపెట్టలేరు. ప్రతిజీవికి మృత్యువు దాని వెనువెంటనే తిరుగుతూ ఉంటుంది. కాలము తీరగానే కబళిస్తుంది. మృత్యు శయ్య మీద ఉన్న వాడికి ఎటువంటి భోగ్య వస్తువులు కూడా సుఖమును కలిగించలేవు. (ఉరిశిక్ష వేసిన వాడిని ఉరి కంబమునకు తీసుకొని వెళ్లబోయే ముందు వాడికి ఇష్టమైన కోరిక ఏమిటో అడుగుతారు. ఇంకాసేపట్లో మరణించే వాడికి ఏం కోరికలు ఉంటాయి, ఏం సుఖం కలుగుతుంది. అలాగే ఇది కూడా.)

ఉద్ధవా! ఈ కనపడే ప్రపంచంలో దొరికే సుఖములు అటుంచు. మనకు కనపడని స్వర్గలోకములో కూడా ఒకరిమీద ఒకరికి స్పర్థ, ద్వేషము, అసూయ, అనే దోషాలు ఉంటాయి. కాబట్టి స్వర్గలోక సుఖములు కూడా భూలోకసుఖముల మాదిరి దు:ఖములను కలిగిస్తాయి. ఈ స్వర్గలోక సుఖములు పొందడానికి యజ్ఞములు, యాగములు చేస్తుంటారు. ఆ యజ్ఞములకు ఎన్నో విఘ్నాలు కలుగుతుంటాయి. ఆ విఘ్నాల వలన దు:ఖము కలుగుతుంటుంది. కాబట్టి విఘ్నములతో కూడిన యజ్ఞయాగములు ఎటువంటి ఫలితములను ఇవ్వవు. ఉద్ధవా! ఏదో విధంగా ఎటువంటి విఘ్నములు లేకుండా యజ్ఞములు, యాగములు పూర్తిచేసినా, వాటి వలన లభించే స్వర్గ సుఖములు ఏ ప్రకారంగా నశించిపోతాయో చెబుతాను విను.

ఉద్ధవా! ఈ లోకంలో మానవులు యజ్ఞములు చేసి, దేవతలను ఆరాధించి, వారికి హవిస్సులు అర్పించి, పుణ్యము సంపాదించి, ఆ పుణ్యముతో స్వర్గలోక సుఖములను, దేవతల మాదిరి అనుభవిస్తారు. చక్కని వేషము ధరించి, దేవతలతో తిరుగుతూ, విమానముల మీద ఊరేగుతూ, దేవతా స్త్రీలు చుట్టు కూర్చుని ఉండగా, గంధర్వులు ఆడుతూ పాడుతుంటే, స్వర్గ సుఖములు అనుభవిస్తారు. విమానములు ఎక్కి స్వర్గలోకములో ఉన్న నందన వనములో విహరిస్తారు. దేవతా స్త్రీలతో ఆడతారు, పాడతారు, రమిస్తారు. కాని తాము ఆర్జించిన పుణ్యము అయిపోగానే, దేవతలు తమను నిర్దాక్షిణ్యంగా మానవ లోకమునకు తోసివేస్తారని కలలో కూడా అనుకోరు. ఉద్ధవా! పుణ్యము ఉన్నంతవరకే మానవునికి దేవలోకములో స్వర్గసుఖములు లభిస్తాయి. పుణ్యము క్షీణించగానే, వాడునేను వెళ్లను మొర్రోఅంటున్నా, కిందికి తోసేస్తారు. (క్షీణే పుణ్యేమర్త్యలోకం విశంతి..............భ.గీ.)

ఉద్ధవా! భూలోకములో మానవుడు దుష్టులతో సహవాసం చేస్తాడు. అధర్మం ఆచరిస్తాడు. ఇంద్రియములకు వశుడవుతాడు. తన ఇష్టం వచ్చినట్టు విచ్చలవిడిగా కామభోగములు అనుభవిస్తాడు. ధనం దాచి పెట్టుకుంటాడు. ఎవరికీ దానంచెయ్యడు. ఇంకా డబ్బు సంపాదించాలి అనే యావతో ఉంటాడు. తన ఆహారం కోసరం, వినోదం కోసరం జీవహింస చేస్తాడు. తన కోరికలు తీరడం కోసరం భూత,ప్రేత,పిశాచములను ఉపాసిస్తాడు. వాటి ప్రీతి కోసరం జంతు బలులు, వీలైతే నరబలులు ఇస్తాడు. పశువు కంటె హీనంగా ప్రవర్తిస్తాడు. జీవితమంతా అజ్ఞానము, అవివేకము అనే చీకటిలో పడి

బతుకుతుంటాడు. మరణించిన తరువాత అంధకూపము అనే నరకంలో పడతాడు.

ఉద్ధవా! ఈ దేహంతో మానవులు చేసే కర్మలు అన్నీ దు:ఖమును కలిగిస్తాయి. ఆ కర్మల వలన వాసనలు అంటుకుంటాయి. ఆ వాసనలు మరలా జన్మకు కారణం అవుతాయి. ఈ ప్రకారంగా మానవుడు జనన మరణ చక్రంలో పడి తిరుగుతుంటాడు. జనన మరణ చక్రంలో పడి తిరుగుతున్న వాడికి సుఖం ఎలా లభిస్తుంది. ఉద్ధవా! ఈ అనంత విశ్వంలో ఏదీ శాశ్వతం కాదు. ఈ లోకములు, లోక పాలకులు అందరూ ఒక కల్పము వరకే ఉంటారు. తరువాత మారి పోతారు. బ్రహ్మ కూడా కేవలము రెండు పరార్థములు మాత్రమే సృష్టికర్తగాఉంటాడు. అంటే బ్రహ్మలోకము కూడా శాశ్వతము కాదు.

ఉద్ధవా! మానవునిలోని ఇంద్రియములు అన్నీ పుణ్య కర్మలు, పాప కర్మలు చేస్తుంటాయి. ఈ కర్మలు చేయడానికి సత్వ,రజస్, తమో గుణములే కారణము. అవే ఇంద్రియములచేత కర్మలు చేయిస్తుంటాయి. ఈ కర్మలన్నీ తానే చేసాను, తానే చేస్తున్నాను అనే అహంకారంతో జీవుడు, ఆ కర్మఫలములకు తానే కర్త అనే భ్రమలో ఉంటాడు. కాబట్టి మూడు గుణములను అనుసరించి మానవుడు కర్మలు చేస్తాడు. ఆ కర్మల వలన వచ్చే ఫలములు వాసనలను కలిగిస్తాయి. ఆ వాసనలు మానవుడు, తన మరణానంతరము, మానవ, పక్షి, జంతువులుగా జన్మించడానికి కారణం అవుతాయి. అన్ని జన్మలలోనూ జీవుడు కర్మలు చేస్తూనే ఉంటాడు. జీవుడు కర్మలు చేస్తూ ఉన్నంత వరకు జీవుడు సంసారంలోపడి కొట్టుకుంటూ ఉంటాడు. ఆ సంసారంలో ఉండే సుఖములను, దు:ఖములను అనుభవిస్తూ, మరలా

మరలా కర్మలు చేస్తూ మానవులు మోహంలో పడి పోతాడు." అని కృష్ణుడు ఉద్ధవునితో పలికాడు.

ఆ మాటలు విన్న ఉద్ధవుడు కృష్ణునితో ఇలా అన్నాడు. "దేవా! జీవుడు దేహంలో ఉంటాడు కదా! దేహంలో ఉన్న జీవుడు, సత్వ, రజస్తమో గుణముల వలన కలిగే సుఖమునకు, దు:ఖమునకు ఏల బద్ధుడు కాడు? మూడుగుణములకు బద్ధుడైన వాడు, బద్ధుడు కానివాడు, ఎలా ఉంటారు? అతడు ఈ లోకంలో ఎలా ప్రవర్తిస్తాడు? అతడిలో ఏ లక్షణములను బట్టి అతడు బద్ధుడు, ముక్తుడు అని గుర్తించాలి. అతడు ఏ ఆహారం తీసుకుంటాడు. అతడి దైనందిన కర్మలు ఎలాఉంటాయి. దయచేసి నాకు ఈ విషయములు వివరించండి. నా భ్రమలను తొలగించండి." అని వేడుకున్నాడు ఉద్ధవుడు" అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చేస్తున్న ఉపదేశములను వివరించాడు.

శ్రీమద్భాగవతము
ఏకాదశ స్కంధము పదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## ఏకాదశ స్కంధము

## పదకొండవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఈ ప్రకారంగా ఉపదేశిస్తున్నాడు.

"ఉద్ధవా! నాచే సృష్టించబడిన, నా అధీనములో ఉన్న సత్వ,రజస్, తమోగుణముల వలననే జీవులలో ఉన్న ఆత్మ బంధింపబడటం కానీ, విముక్తి చెందడం కానీ జరుగుతూఉంటుంది. నిజానికి ఆత్మకు బంధింప బడటం కానీ, ఆ బంధనముల నుండి విముక్తి పొందడం కానీ లేవు. మూడు గుణములు నా చేత సృష్టించ బడ్డాయి కాబట్టి ఆ గుణములు నన్ను బంధించలేవు. బంధనము లేదు కనుక నాకు విముక్తి కూడా లేదు.

స్వప్నములో కనపడ్డవి అన్నీ మనస్సుతో కల్పించబడతాయి. అలాగే జాగ్రదావస్థలో జరిగే అన్ని పనులు, వాటి వలన కలిగే సుఖదు:ఖములు, దేహమునకు ప్రాప్తించే జనన, మరణములు, అంతా స్వప్నము మాదిరి మాయగా జరుగుతున్నాయి. అన్ని మనస్సు కల్పితాలే. నిజాలు కావు. ఎవరూ పుట్టడం లేదు. చావడం లేదు. సుఖము లేదు, దు:ఖము లేదు. అంతా మనస్సు చేసే మాయాజాలం. జనన మరణాలకు కానీ, సుఖదు:ఖములకు కానీ ఎటువంటి ఉనికి లేదు.

ఉద్ధవా! ఈ లోకంలో ఉండేవి రెండే రెండు. ఒకటి విద్య. అంటే ఉన్నది ఉన్నట్టుగా తెలుసుకోవడం. రెండవది అవిద్య అంటే లేనిది ఉన్నట్టుగా అనుకోవడం.(తాడును చూచి పాము అనుకొని భ్రాంతి చెందడం. కాలం తీరగానే పడిపోయే ఈ శరీరాన్ని శాశ్వతం అనుకోవడం.) ఇదే మాయ. ఈ జీవులు అవిద్య చేత బంధింపబడతారు. అవిద్య తొలగి పోగానే, ఉన్నది ఉన్నట్టు గా తెలుసుకోగానే మోక్షం పొందుతారు.

ఉద్ధవా! ఈ లోకంలో అందరూ ఒకే విధంగా పుడుతున్నారు. అందరి శరీరాలు ఒకటిగానే ఉన్నాయి. కానీ కొందరు సుఖాలు అనుభవిస్తున్నారు. మరి కొందరు దు:ఖమును అనుభవిస్తున్నారు. కొందరు బంధింపబడుతున్నారు. మరి కొందరు విముక్తి పొందుతున్నారు.

ఉద్ధవా! ఈ దేహము అనే అశ్వత్థ వృక్షము(రావి చెట్టు) మీద రెండుపక్షులు వాల్తాయి. హృదయము అనే గూటిలో నివసిస్తుంటాయి. అవే జీవాత్మ, ఆత్మ. ఆ పక్షులు రెండూ ఒకటే. కాని మనం రెండుగా ఉన్నాయి అన్న భ్రమలో ఉన్నాము. అవి రెండూ సఖ్యంగా ఉంటాయి. జీవాత్మ అనే పక్షి అన్ని రకములైన ఆహారములను తీసుకుంటూ ఉంటుంది కాని బలహీనంగా ఉంటుంది.. రెండవది పరమాత్మ స్వరూపమైన ఆత్మ అనే పక్షి. ఈ పక్షికి జ్ఞానము ఉంటుంది. జ్ఞానమునే ఆహారంగా స్వీకరిస్తూ చాలా బలంగా ఉంటుంది. ఈ పక్షికి, శరీరముతో, మనసుతో చేసే కర్మలుగానీ, కర్మఫలములు గానీ, అంటవు. అన్నిటినీ సమానంగా, ఒక సాక్షిలాగా, చూస్తూ ఉంటుంది. ఈ

ఆత్మ అనే పక్షికి తాను ఎవరో, జీవాత్మ ఎవరో బాగా తెలుసు. కాని, ఈ శరీరములో ఉండి, మనోబుద్ధిఅహంకారములతోనూ, పది ఇంద్రియములతోనూ కర్మలు చేస్తూ, ఆ కర్మ ఫలములను అనుభవిస్తున్న, జీవాత్మకు తాను ఎవరో, తన స్వరూపము ఏమిటో, తెలియదు. ఎందుకంటే జీవాత్మను అవిద్య ఆవరించి ఉంటుంది. ఆ కారణం చేత కర్మలచేత బంధింపబడుతుంటుంది. ఆత్మకు అవిద్య లేదు కాబట్టి, ఆత్మకు ఎటువంటి కర్మబంధనములు లేవు. బంధనములు లేనపుడు విముక్తి అనే ప్రశ్నలేదు కదా!

అవిద్య నుండి విముక్తి చెందిన వాడు రాగ ద్వేషములకు లోనుకాడు. అతడు ఈ ప్రపంచంలో తిరుగుతున్నా, సాటి వారితో కలిసి కర్మలు చేస్తున్నా, "నేను చేస్తున్నాను, నేను చదువుకున్నాను, నేను పెద్దవాడిని" అనే అహంకారానికి లోను కాడు. కర్మలు చెయ్యాలి కాబట్టి చేస్తుంటాడు. ఆకర్మల ఫలితముల గురించి పట్టించుకోడు. కాని అవిద్యతోనూ, అవివేకముతోనూ ఆవరింపబడ్డ మానవుడు, "నేను, నాది, ఇదంతా నేను చేసాను, ఈఆస్తి అంతా నాది, నేను చేసే కర్మలకు కర్తనే నేనే" అని అహంకరిస్తాడు. అతడు చేసే కర్మలచేత బంధింపబడతాడు. ఆ కర్మల వలన కలిగే సుఖదు:ఖములను అనుభవిస్తుంటాడు. వాసనలు పోగుచేసుకొని ఆ వాసనల ఫలితంగా, జనన మరణ చక్రంలో తిరుగుతుంటాడు.

అవిద్య చేత ఆవరింపబడని మానవుడు, వివేకము కల మానవుడు, ఈ దేహము తో ఏ పని చేసినా అంటే తిన్నా, పడుకున్నా, చదివినా, తిరిగినా, స్నానం చేసినా, పుణ్యక్షేత్రములు దర్శించుకున్నా, ఎవరినన్నా తాకినా (పురుషుడు అయితే స్త్రీని, స్త్రీ అయితే పురుషుడిని),

మంచి వాసన, చెడ్డ వాసన చూచినా, భోజనము చేసినా, మంచి మాటలు చెడు మాటలు విన్నా, వాటిని కేవలము ఇంద్రియములకే పరిమితం చేస్తాడు. మనసులోకి రానివ్వడు. వాటి కోసం వెంపర్లాడడు. వాటిని మాటి మాటికీ కావాలని కోరుకోడు. ఏమీ పట్టనట్టు ఉంటాడు. ఒక మాటలో చెప్పాలంటే తాను చేసిన కర్మలతో, ఆ కర్మఫలములతో తాను బంధింపబడడు.

సూర్యుడు గంగా జలములోనూ, మురికి నీటి గుంటలోనూ సమానంగా ప్రతిఫలిస్తాడు. అలాగే గాలి పూలమీది నుండి, పెంట కుప్పలమీది నుండి సమానంగా వీస్తుంది. కాని దేనీ మీదా ఆసక్తి చూపించదు. అలాగే విద్వాంసుడు అయిన పురుషుడు, స్త్రీ, ఈ ప్రపంచంలో సంచరిస్తున్నా, వేటి మీద ఆసక్తి చూపించరు. మానవుడు ఈ ప్రాపంచిక విషయములను, వాటిని అనుభవించడం వల్ల కలిగే వాసనలను, వైరాగ్యము అనే కత్తితో నరుకుతుంటాడు. తనకు కలిగిన సందేహములను, ఆత్మజ్ఞానముతో తీర్చుకుంటూ ఉంటాడు. స్వప్నము నుండి మేలుకున్న వాడు, తనకు వచ్చిన స్వప్నము అంతా నిజం కాదు, భ్రమ అని ఎలా అనుకుంటాడో, అలాగే ఈ ప్రపంచంలో కనపడేవన్నీ నిజం కాదు, అంతా భ్రమ అని అనుకుంటాడు.

ఉద్ధవా! ఏ మానవుని ప్రాణములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఈ ప్రాపంచిక విషయములలోనూ, కామ సంబంధమైన కోరికలతోనూ ఆసక్తి కలిగి ఉండవో, ఆ మానవుడు నిరంతరము ఈ దేహముతో ప్రపంచములో సంచరించినా, అతడు దేని చేతా బంధింపబడడు. ఎల్లప్పుడూ సంతోషంగా, ఆనందంగా ఉంటాడు.

అటువంటి వాడికి ఈ శరీరంతో సంబంధం లేదు. తన శరీరాన్ని ఎవరు కొట్టినా, తిట్టినా, హింసించినా బాధ పడడు. నవ్వుతూ ఉంటాడు. ఎవరైనా తనను పూజిస్తే పొంగిపోడు. ఎవరైనా తనను నిందిస్తే కుంగిపోడు. నిర్వికారంగా ఉంటాడు. అటువంటి వాడే జీవించి ఉండి కూడా ముక్తిని పొందినవాడు అని చెప్పబడతాడు.

ఎవరైతే ఈ ప్రాపంచిక విషయములయందు ఆసక్తిని చూపడో అతడు దూషణములను, భూషణములను, తిరస్కారములను సమానంగా భావిస్తాడు. తన గురించి నాలుగు మంచి మాటలు చెబితే పొంగి పోడు, అలాగే తనను ఎవరైనా తిడితే కుంగిపోడు. ఎల్లప్పుడూ నవ్వుతూ ఉంటాడు. అటు వంటి వాడిని ముక్త పురుషుడు అని అంటారు.
(ఇక్కడ పురుషుడు అంటే మగవాడు అని కాదు. స్త్రీలు కూడా పురుషులే. పురుషుడు అంటే ఈ దేహము అను పురములో ఉండేవాడు అని అర్థం చెప్పుకున్నాము కదా!)

అటువంటి ముక్త పురుషుడు తనకోసం కానీ, తన దేహం కోసం కానీ ఏ పనీ చెయ్యడు. అంటే మంచి పనీ చెయ్యడు. చెడ్డ పనీ చెయ్యడు. (పెడితే తింటాడు లేకపోతే లేదు. దొరికినదానితో తృప్తి పడతాడు.) దేనిని గురించీ అనవసరంగా మాట్లాడడు. దేని గురించీ అతిగా ఆలోచించడు. దేనినీ పట్టించుకోడు. తనలో తాను ఆనందిస్తుంటాడు. ఆత్మానందాన్ని అనుభవిస్తుంటాడు. ప్రపంచం దృష్టిలో ఇటువంటి వారిని పిచ్చివాళ్లు అని అనుకుంటారు.

ఉద్ధవా! వేదములు, శాస్త్రములు, పురాణములు అన్నీ చదివినా, తన గురించి, భగవంతుని గురించి, తెలుసుకోని వాడు, పాలు వట్టి పోయిన ఆవును పెంచుతున్న గొల్లవాడితో సమానము. అటువంటి వాడి విద్య, జ్ఞానము, పాండిత్యము వలన వాడికి కానీ, ప్రపంచానికి కానీ, ఎటువంటి లాభములేదు. అతని పాండిత్యము అంతా బూడిదలో పోసిన పన్నీరు మాదరి వ్యర్థము. పాలు వట్టి పోయిన ఆవు, వ్యభిచారిణి అయిన స్త్రీ, మరొకరి వద్ద ఉద్యోగం చేస్తున్న వారు, దానము చేయకుండా కూడబెట్టిన ధనము, భగవంతుని కీర్తించని వాక్కు, ఎందుకూ పనికి రావు. అటువంటి వారు కేవలం తమ శరీరాన్ని అందంగా కనిపించడం కోసం, ధనాన్ని కాపాడుకోవడం కోసం నానా తంటాలు పడుతుంటారు. కష్టాలు అనుభవిస్తుంటారు.

ఉద్ధవా! భగవంతుని గురించి స్తుతించని నాలుక, నోరు వ్యర్థము. బుద్ధిమంతుడు అయిన వాడు అనవసరమైన మాటలతో కాలక్షేపం చేయకుండా, భగవానుని స్తుతించడంలోనూ, కీర్తించడంలోనూ ఆసక్తి చూపించాలి. ఇటువంటి నిశ్చయమైన ఆలోచనలతో ఉన్నవాడు దేహము మీద ఆసక్తిని విడిచిపెట్టి, భగవంతుని మీద మనస్సు లగ్నం చేసి, పరమ శాంతిని పొందుతాడు.

ఉద్ధవా! అందరికీ పైన చెప్పిన వైరాగ్యము, ఆత్మజ్ఞానము, ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం, మనస్సును పరమాత్మయందు లగ్నం చేయడం సాధ్యం కాకపోవచ్చు. అటువంటి వారు, తాము చేసే పనులు అన్నిటినీ కూడా, తాము చేస్తున్నాము అనే అహంకారంతో కాకుండా, భగవంతుని

పరంగా చేస్తున్నాము అని అనుకుంటూ, ఆ కర్మల ఫలములను భగవంతునికి అర్పించాలి. ఆ కర్మలు చేసేటప్పుడు వాటి నుండి కలిగే ఫలముల  మీద ఎటువంటి ఆసక్తి లేకుండా చెయ్యాలి. తీరిక వేళల్లో భగవంతుని లీలలను వినాలి. గానం చెయ్యాలి. భగవంతుని స్మరించాలి.

ఉద్ధవా! మానవులు అందరూ ఎల్లప్పుడూ భగవంతుని ఆశ్రయించాలి. భగవంతుని కొరకే ధర్మంగా ధనం సంపాదించాలి. ధర్మం బద్ధంగా సంపాదించిన ధనముతోనే, ధర్మబద్ధమైన కోరికలను తీర్చుకోవాలి. తుదకు, ఆ కోరికలను కూడా విడిచిపెట్టాలి. అప్పుడే భగవంతుని మీద అచంచలమైన భక్తి, శ్రద్ధ కలుగుతాయి. అటువంటి భక్తులు సత్పురుషుల సంగంలో ఎల్లప్పుడూ నామీద భక్తి కలిగి, నన్నే ధ్యానిస్తుంటారు. తుదకు నన్నే పొందుతారు." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఆత్మ జ్ఞానమును ఉపదేశించాడు.

శ్రీకృష్ణుడు చెప్పినది అంతా విన్న తరువాత ఉద్ధవునికి ఒక సందేహము కలిగింది. "కృష్ణా! పరమాత్మ కీర్తిని ఎందరో గానం చేస్తుంటారు కదా! మరి వారిలో సాధువులు అని ఎవరిని అంటారు? సత్పురుషులు నీ యందు ఎటువంటి భక్తిని కలిగి ఉంటారు? ఓ దేవా! నీవు పురుషులలో శ్రేష్ఠుడవు. ఈ సకల జగత్తుకు అధిపతివి. అటువంటి నీకు ప్రణమిల్లుతున్నాను. నేను అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పి నా సందేహాలు తీర్చు.

ఓ దేవా! నీవు ఈ ప్రకృతికి అతీతుడవు. నిర్వికారుడవు. నిరాకారుడవు. కేవలము నీ భక్తులను అనుగ్రహించడానికి శ్రీకృష్ణుడిగా

మానవ రూపంలో అవతరించావు. నీతో కలిసి ఈ యుగంలో ఈ భూమి మీద తిరగడం మా భాగ్యంగా భావిస్తున్నాము." అని వేడుకున్నాడు ఉద్ధవుడు. ఉద్ధవునికి శ్రీకృష్ణుడు ఈ విధంగాసమాధానం చెప్పాడు.

"ఉద్ధవా! ఎవరైతే నా మీద అపారమైన భక్తి శ్రద్ధ కలిగి ఉంటాడో అతడు ఇతర ప్రాణుల మీద కూడా దయ కలిగిఉంటాడు. అతడికి ఎవరిమీదా విరోధము గానీ, శత్రుత్వము కానీ ఉండదు. అతనికి ఎన్ని కష్టాలు వచ్చినా సంతోషంతో భరిస్తాడు కానీ ఎవరినీ నిందించడు. అతడు ఎల్లప్పుడూ సత్యమునే పలుకుతాడు. అతని మనసులో ఎటువంటి పాపచింతన ఉండదు. అతడు అందరినీ సమంగా చూస్తాడు. కులముల మధ్య, జాతుల మధ్య, ప్రాంతముల మధ్య భేదభావము చూపడు. అందరికీ తనకు చేతనైన మేలు చేస్తాడు. అతని మనసు బుద్ధి కామవాంఛలతో నిండి ఉండదు. అతని మాట మృదువుగా ఉంటుంది. ఎల్లప్పుడూ తన శరీరమును, మనసును పవిత్రంగా ఉంచుకుంటాడు. ఇతరుల సొత్తుకు ఆశించడు. ప్రాపంచిక విషయములలో ఆసక్తి కనపరచడు. ఆహారం మితంగా తనకు కావాల్సినంత వరకు తీసుకుంటాడు. ఎల్లప్పుడూ పరమ శాంతంగా, స్థిర చిత్తంతో ఉంటాడు. అటువంటి వాడికి ఎటువంటి ప్రమాదములు జరగవు. గంభీరంగా ఉంటాడు. అతడికి ధైర్యము ఎక్కువ. ఎవరికీ భయపడడు. ఆకలి, దాహం వేసినపుడు ఆహారం, నీరు కోసరం ఆరాటపడటం, శోకము కలిగినపుడు ఏడవడం, మోహము కలిగినపుడు దాని కోసరం వెంపర్లాడటం, పుట్టినపుడు సంతోషించడం, చచ్చినపుడు దు:ఖించడం, ఇటువంటి వికారములకు లోనుకాడు. నిర్వికారంగా ఉంటాడు. ఎవరినుండి పొగడ్తలను, సన్మానాలను

ఆశించడు. అందరినీ గౌరవిస్తాడు. భగవంతుని గురించి తనకు తెలిసిన విషయములను ఇతరులకు వివరిస్తాడు. అందరితో స్నేహంగా కలిసి మెలిసిఉంటాడు. అటువంటి నా భక్తుడు భగవత్తత్వమును బాగా తెలిసి ఉంటాడు.

ఉద్ధవా! పైన చెప్పబడిన గుణములను, దోషములను బాగా అర్థం చేసుకొని, సకల ధర్మములను విడిచిపెట్టి, నన్నే సేవించే వాడిని సత్పురుషుడు అని అంటారు. శుద్ధ సత్వ గుణ స్వరూపుడను, అనంతుడను, సర్వాంతర్యామిని అయిన నా స్వరూపమును చక్కగా తెలుసుకొనిగానీ, లేక నా గురించి ఏమీ తెలియక పోయినాగానీ, నన్ను ఏకాగ్రబుద్ధితో, అచంచలమైన మనస్సుతో సేవించిన వారిని ఉత్తమభక్తులు అని అంటారు.

ఉద్ధవా! నీవు కూడా నా మూర్తిని ప్రతిష్టించి పూజించు. నా భక్తులను పూజించు. సేవించు. ఆరాధించు. నమస్కరించు. నాకథలను అందరికీ చెప్పు. నన్నే ధ్యానించు. నీకు దొరికిన పదార్థములను నాకు నివేదించి తరువాత ఆరగించు. నీ ఆత్మను నాకు అర్పించు. నా జననము, నా లీలలను గురించి చర్చించు. నా పుట్టిన రోజు మొదలగు పండుగలను ఆనందంగా జరిపించు. నా మందిరములలో నా గురించిన పాటలను పాడించు. కీర్తనలను గానం చేయించు. ఉత్సవములను చేయించు. సంవత్సరమునకు ఒక సారి వచ్చే నా జన్మదినము నాడు కానీ, ఇతర పండుగరోజులలోగానీ, పుణ్యతీర్థయాత్రలను చెయ్యి. వేదములలో చెప్పబడిన పద్ధతులలో కానీ, తంత్రశాస్త్రములలో చెప్పబడిన పద్ధతులలో గానీ దీక్షలు స్వీకరించు. నా గురించి చెప్పబడిన వ్రతములను ఆచరించు. ఆలయములను కట్టించి

అందులో నా విగ్రహములను ప్రతిష్టించు. ఈ పనులన్నీ నీవు ఒంటరిగా చేయడానికి నీకు శక్తి చాలక పోతే ఇతరులతో కలిసి సమిష్టిగా చెయ్యి. అందరూ కలిస్తే చేయలేని పని అంటూ ఏమీ లేదు. ఉద్యానవనములు, క్రీడా స్థలములు, పుష్పవనములు, నగరములు, ఆ నగరములలో దేవాలయములు నిర్మింపచేయి. ఆ ఆలయములను శుభ్రం చేయడం అంటే ఊడ్చడం, కడగడం, ముగ్గులుపెట్టడం, అలంకరించడం మొదలగు పనులను ఏ మాత్రం కపటం లేకుండా చెయ్యి. ఇతరులచేత చేయించు.

ఆలయములలో సేవచేయడంలో ఎటువంటి అభిమానము, దురహంకారము, దంభము, డాంబికము, పనికిరాదు. నీవు చేయు శుభకార్యములను అందరికీ తెలియాలని ఆరాట పడరాదు. ఒక దేవతకు సమర్పించిన నివేదనలను, ఆ దేవత ప్రసాదంగా స్వీకరించు. అంతేకానీ, వాటిని మరలా నాకు సమర్పించకూడదు.

ఉద్ధవా! నీకు ప్రియం అయినది, నీవు ఎక్కువ ఇష్టపడేది అయిన పదార్థములనే నాకు సమర్పించు. అటువంటివి నాకు సమర్పించినపుడే నీకు అనంతమైన ఫలితం దక్కుతుంది. ఉద్ధవా! సూర్యుడు, అగ్ని, బ్రాహ్మణులు, ఆవులు, నా భక్తులు, ఆకాశము, వాయువు, జలము, భూమి, అందరిలో ఉన్న ఆత్మ, సకల జీవరాసులు..ఇవన్నీ నా పూజకు అర్హులే. వీటిలో దేనిని పూజించినా నన్ను పూజించినట్టే!

ఉద్ధవా! నాలుగు వేదములలో చెప్పబడిన మంత్రములతో సూర్యుని పూజించాలి. అగ్నిలో హవిస్సులను వేయడం ద్వారా అగ్నిని పూజించాలి. ఆహ్వానించి, అర్చించి, భోజనం పెట్టడం ద్వారా బ్రాహ్మణులను పూజించాలి. పచ్చిగడ్డిని గోవులకు పెట్టడం ద్వారా గోవులను పూజించాలి. సాటి ప్రాణులను తన బంధువుల మాదిరి ఆదరించడం ద్వారా, మన:పూర్వకంగా ధ్యానం చేయడం ద్వారా, ప్రాణాయామం ద్వారా, నీటిని అభిషేకం చేయడం ద్వారా, పుష్పములను అర్పించడం ద్వారా, నన్ను పూజించ వచ్చును. మట్టితో నిర్మించబడిన వేదిక మీద నా విగ్రహములను ఉంచి, వాటిని రహస్య మంత్రములతోనూ, ఇతర జీవులకు ఆహారము మొదలగునవి ఇవ్వడం ద్వారాను, సకల భూతములను సమానంగా చూడటం ద్వారాను, సర్వాంతర్యామి నైన నన్ను పూజించవచ్చును.

ఉద్ధవా! ఇంక నన్ను ఏ రూపంతో పూజించ వచ్చును అని కదా నీ సందేహము. నన్ను చతుర్భుజములతో, శంఖ,చక్ర,గద, పద్మములతో కూడిన, శాంత స్వరూపమైన విగ్రహమును ప్రతిష్ఠించి పూజించవచ్చు. ఏ రూపంతో పూజించినా ఏకాగ్రమైన మనస్సు ముఖ్యము. ఏకాగ్రమైన భక్తితో, శ్రద్ధతో, ఏ యజ్ఞము చేసినా, యాగము చేసినా, ఇష్టమైన ఏ కర్మ చేసినా, ఇతరులకు ఉపయోగపడే చెఱువులు, బావులు తవ్వించినా, సత్రములు కట్టించి అన్నదానము చేసినా, వారికి నామీద భక్తి లభిస్తుంది. సత్పురుషులనుసేవించడం ద్వారా, సత్సంగముల ద్వారా ఆత్మజ్ఞానము కలుగుతుంది.

ఉద్ధవా! సత్పురుషులు ఎక్కడుంటారో, నేను వారి వెంటనే ఉంటాను. కాబట్టి సత్సంగము ముఖ్యము. సత్సంగము

వలన తప్పితే మరొక మార్గంతో ఈ సంసారము అనే సాగరమును దాటడం అసాధ్యము. ఉద్ధవా! నీవు నాకు స్నేహితుడవు. మంచి హృదయము కలవాడవు. నాకుసేవకుడవు. కాబట్టి నీకు అతి రహస్యమైన మరొక విషయమును కూడా చెబుతాను శ్రద్ధగా విను." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి బోధించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చేసిన ఆత్మబోధలను, జ్ఞానబోధలను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

పన్నెండవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణ భగవానుడు ఉద్ధవునికి తన ఉపదేశమును కొనసాగించాడు.

"ఉద్ధవా! సత్సంగము అనేది ప్రతి మనిషికి ఆవశ్యకము. సత్సంగము ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని సమూలంగా నాశనం చేస్తుంది. కేవలము సత్సంగము తోనే నేను నా భక్తులకు వశము అవుతాను. అంతే కానీ, యోగము, సాంఖ్యము, ధర్మాన్ని

అనుష్ఠించడం, వేదములను అభ్యసించడం, తపస్సుచేయడం, సన్యాసం పుచ్చుకోవడం, దేవతలను పూజించడం, రహస్యమైన నా మంత్రములను జపించడం, తీర్థయాత్రలు చేయడం, యమ, నియమములు పాటించడం, వీటిని ఆచరించడం ద్వారా కూడా నేను ఎవరికీ వశం కాను. పైన చెప్పబడినవి ఏవీ నన్ను వశం చేసుకోలేవు. కేవలం సత్సంగము ద్వారానే నేను నా భక్తులకు దగ్గర అవుతాను. (అంటే అవి చేయకూడదు అని కాదు. వాటితో పాటు సత్సంగము మంచిది. సత్సంగము లేకపోతే పైన చెప్పబడిన పుణ్య కార్యములు చేస్తున్నా అతడి మనసు పెడదోవ పట్టే ప్రమాదం ఉంది. అందుకని సత్సంగమును ముఖ్యము అని చెప్పాడు పరమాత్మ.)

ఉద్ధవా! ప్రతి యుగంలోనూ రజోగుణము కల వారు, తమోగుణము కలవారు అయిన దైత్యులు, రాక్షసులు,పక్షులు, మృగములు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, సిద్ధులు, చారణులు, గుహ్యకులు, విద్యాధరులు, మానవులలో నాలుగు వర్ణముల వారు, స్త్రీలు, కడజాతిలో పుట్టినవారు, ఇంకా పైన చెప్పబడిన జాతులలో ముఖ్యులైన  వృత్రాసురుడు, ప్రహ్లాదుడు, వృషపర్వుడు, బలి చక్రవర్తి, బాణుడు, మయుడు, విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, గజేంద్రుడు, జటాయువు, తులాధరుడు అనే వ్యాపారి, మాంసము వ్యాపారం చేసే ధర్మవ్యాధుడు, సైరంధ్రి వృత్తిలో ఉన్న కుబ్జ, అమాయకులైన వ్రజవాసులు(గోపికలు, గోపకాంతలు), యజ్ఞములు, యాగములు నిష్ఠతో చేసిన బ్రాహ్మణుల భార్యలు, వీరందరు కూడా కేవలము సత్సాంగత్యము, సత్సంగముల చేతనే నా దగ్గరకు చేరుకున్నారు. వారందరూ ఏ వేదములను చదవలేదు. ఏ వ్రతములను ఆచరించలేదు. ఏ తపస్సు చేయలేదు. కేవలమునా మీద

అచంచలమైన భక్తి, నా భక్తుల యొక్క సత్సంగము వలననే నన్ను పొందగలిగారు.

అంతే కాదు, గోపికలు, గోపకాంతలు, నందుని ఇంటి పెరడులో ఉన్న మద్దిచెట్లు, కాళీయుడు, బృందావనములో ఉన్న చెట్లు, లతలు, వీరందరికీ ఏ శాస్త్రపరిజ్ఞానము, వేదాధ్యయనము తెలియదు. కేవలము సత్సంగము వలన, నిర్మలమైన మనస్సుతో ఎల్లప్పుడు నన్ను స్మరించడం వలన ముక్తి పొందారు. అంతేకానీ, ఎన్నో కష్టాలుపడి, ఎంతో ధనము వినియోగించి, యోగాభ్యాసము చేసి గానీ, సాంఖ్యయోగము అవలంబించి కానీ, దాన ధర్మములు చేసికానీ, వ్రతములు ఆచరించి కానీ, తపస్సు చేసి కానీ, యజ్ఞ,యాగములు చేసి కానీ, వేదములను అధ్యయనం చేసికానీ, నన్నుపొందలేరు. కేవలము సత్సంగము వలననే నన్ను పొందగలరు.

ఉద్ధవా! నేను, బలరాముడు అక్రూరుని వెంట మధురకు వెళ్లినపుడు, నా మీదనే తమ ప్రాణములను నిలుపుకున్న గోపికలు, గోపకాంతల యొక్క హృదయములు నా యందు లగ్నం అయి ఉన్నాయి. నా వియోగము వలన కలిగిన విరహంతో వారు చాలా బాధపడ్డారు. నేను వారి దగ్గరకు రావడం తప్ప వేరే ఏదీ వారికి సుఖమును కలిగించలేకపోయింది. ఎందుకంటే యమునా తీరంలో వారు నాతో గడిపిన రాత్రులు, యుగాలు క్షణాల్లా గడిపారు. వారి మధ్య నేను లేకపోయేసరికి, వారికి క్షణము ఒక యుగంగా గడిచింది. ఆ గోపికలు నా మీద ఉన్న ప్రేమతో ఈ ప్రపంచాన్నే మరిచిపోయారు. వారి మనస్సులు నా మీదనే లగ్నం చేసారు. నన్నే స్మరించుకుంటున్నారు.

కాని ఈ గోపికలకు నా గురించి కానీ, నా తత్వమును గానీ తెలియదు. గోపికలు నన్ను కేవలం తమ ప్రియునిగానే తలంచారు కానీ ఒక పరమాత్మ స్వరూపుడిగా భావించలేదు. కేవలము నన్ను ఒక ప్రియుడిగానే నన్ను కలవడానికి నాతో సంగమించడానికి ప్రయత్నిస్తున్నారు. వారికి ఆత్మజ్ఞానము, పరమాత్మ తత్వము తెలియదు. కేవలము శారీరక సుఖము మాత్రమే తెలుసు. కానీ నా మీద ఉన్న అచంచలమైన ఏకాగ్రమైన ప్రేమతో, భక్తితో నన్ను పొందగలిగారు.

ఉద్ధవా! నీవు కూడా ఈ వేదములు, శాస్త్రములు, పురాణములు, శాస్త్ర చర్చలు, వ్రతాలు అన్నీ మానేసి, కేవలం నా మీద భక్తితో నన్ను శరణు వేడు. సకల ప్రాణులలో అంతర్యామిగా ఉన్న నన్ను ధ్యానించు. ఈ ప్రపంచములో నీకు ఎదురు లేదు. నీవు నిర్భయంగా అన్ని చోట్లా సంచరించగలవు." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఉ పదేశించాడు.

ఆమాటలు విన్న ఉద్ధవుడు ఇలా అన్నాడు. " ఓ దేవా! యోగేశ్వరేశ్వరా! నీ ఉపదేశములు ఎన్ని విన్నా నాలో ఇంకా సందేహాలు మొలకెత్తుతున్నాయి. నాలో ఉన్న భ్రాంతి పోవడం లేదు. అంతా అయోమయంగా ఉంది. నాలో ఉన్న ఈ భ్రాంతిని పోగొట్టవా!" అని వేడుకున్నాడు ఉద్ధవుడు.

అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మ ఇలా అన్నాడు. "ఉద్ధవా! ప్రతి మనిషిలో ఆరు చక్రాలు ఉన్నాయి. అన్నిటి కన్నా మూలము ఆధార చక్రము. స్త్రీగర్భంలో పిండం ఏర్పడగానే, ప్రాణములు ముందు ఆధార చక్రంలో ప్రవేశిస్తాయి. తరువాత మణిపూరము, విశుద్ధ చక్రములలో మనస్సు సూక్ష్మరూపంలో ఏర్పడుతుంది. తరువాత ముఖము, పొడుగు,

పొట్టి, లావు, సన్నము, కంఠధ్వని, ఆకారము, అన్నీ క్రమంగా ఏర్పడతాయి. ఇవన్నీ స్థూల శరీరమునకు సంబంధించినవి.

అగ్ని కట్టెలో సూక్ష్మరూపంలో ఉంటుంది. ఒక కట్టె మరొక కట్టెతో మథించినపుడు, నిప్పురవ్వల రూపంలో బయటకు వస్తుంది. ఆ నిప్పురవ్వలు నిప్పుగా మారుతుంది. ఆ నిప్పులో ఆహుతుల రూపంలో నెయ్యి, సమిధలు వేసినపుడు ప్రచండ రూపం దాలుస్తుంది. ఆ ప్రకారంగానే వేదములలో నా గురించిన వివరములు సూక్ష్మంగా ఉంటాయి. వాటిని విద్వాంసులు వివరిస్తే గానీ, స్థూలరూపంలో అర్థం కావు.

ఉద్ధవా! ఈ ప్రపంచం అంతా సత్వ, రజస్, తమోగుణములతో నిండి ఉంది. ఈ ప్రపంచం అంతా నా స్వరూపమే. విత్తనములు భూమిలో నాటితో, ఆ విత్తనములు వివిధ మొలకల రూపములలో బయటకు వస్తాయి. అలాగే పరమాత్మ కూడా మొదట అవ్యక్తంగానే అదృశ్యరూపంలో (అండముగా) ఉంటాడు. తరువాత క్రమక్రమంగా తల, ఇంద్రియములతో స్థూల రూపాన్ని సంతరించుకుంటాడు (పిండంగా మారి శిశువుగా రూపొందుతాడు.)

ఉద్ధవా! నీకంటికి వస్త్రము ఒకటిగా కనపడుతూ ఉంటుంది. కానీ ఆ వస్త్రము ఎన్నో దారపు పోగుల సముదాయము. అలాగే పరమేశ్వరుడు సకల జీవులలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. ఈ సంసారము అనే మహా వృక్షమునకు భోగములు, కోరికలు, పుష్పములు, ఫలముల రూపములో కాస్తాయి.

ఈ సంసార వృక్షము పాపము, పుణ్యము అనే రెండు విత్తనముల ద్వారా మొలుస్తుంది. జీవుని వెంట ఉండే వాసనలు ఈ వృక్షమునకు వేళ్లు. సత్వ,రజస్తమోగుణములు దీని కాండము. పంచభూతములు ఈ చెట్టు కొమ్మలు. పది ఇంద్రియములు, మనస్సు మొత్తం పదకొండు దీనికి శాఖలు. శబ్దము మొదలగు శక్తులు ఈ చెట్టులో నుండి కారే రసాలు. వాతము, పిత్తము, శ్లేష్మము అనే మూడు శరీర ధాతువులు ఈ చెట్టుకు బెరడు. ఈ చెట్టుకు రెండే రెండుపండ్లు కాస్తాయి అవేసుఖము, దు:ఖము. ఈ చెట్టు మీద జీవుడు, ఆత్మ అనే రెండు పక్షులు నివాసం ఉంటాయి.(నిజానికి ఈ రెండుపక్షులు ఒకటే) ప్రాపంచిక విషయములలో మునిగి తేలేవారు దు:ఖము అనే రూపములో ఉన్న ఫలములను తింటుంటారు. వివేకము కల వారు సుఖము అనే రూపములో ఉన్న ఫలములను తింటారు.

ఉద్ధవా! నిజానికి నేను ఒక్కడినే. కాని నామాయాశక్తి చేత మీకు అనేకరూపాలలో కనపడుతున్నాను. ఈ విషయములను ప్రతి వాడు తన గురువు నుండి తెలుసుకోవాలి. అప్పుడే అతనికి ఆత్మజ్ఞానము కలుగుతుంది. ఉద్ధవా! నీవు కూడా మంచి గురువును ఆశ్రయించు. నా మీద ఏకాగ్రమైన భక్తి కలిగి ఉండు. జ్ఞానము అనే కత్తితో ఈ సంసార వృక్షమును నరికెయ్యి. అప్పుడు నీకు పరమాత్మ తత్వము అర్థం అవుతుంది. తుదకు నన్ను చేరుకుంటావు." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి జ్ఞానబోధ చేసాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము పన్నెండవ అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

పదమూడవ అధ్యాయము.

“ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి తన జ్ఞానబోధను కొనసాగించాడు.

“ఉద్ధవా! ప్రతి జీవిలోనూ మూడు గుణాలు అంటే సత్వ,రజస్,తమోగుణములు ఉన్నాయని చెప్పాను కదా! అవి కేవలము మనసుకు బుద్ధికి సంబంధించినవి కానీ ఆత్మకు సంబంధించినవి కావు. ఈ మూడు గుణములను ఒక దానితో ఒకటి జయించవచ్చును. ఉదాహరణకు సత్వ గుణమును ఎక్కువగా పెంపొందించుకోవడం ద్వారా రజస్త, తమోగుణములను జయించవచ్చును. తరువాత సత్వగుణమును కూడా శాంతింప జేసి, నిర్గుణ స్థితికి చేరుకోవచ్చును. అదేపరమాత్మ స్థితి. జీవునిలో ఎప్పుడైతే సత్వగుణము ఎక్కువగా అభివృద్ధి చెందుతుందో, అప్పుడు నా యందు భక్తి ఎక్కువ అవుతుంది. ధర్మజీవనము అలవాటు అవుతుంది. నిరంతరము సాత్విమైన పదార్థములను తినడం ద్వారా సత్వగుణము అభివృద్ధి చెందుతుంది. (అందుకే బ్రాహ్మణులకు సాత్వికాహారము అంటే శాకాహారము తినమని చెప్పారు. మాంసాహారము నిషేధించారు. క్షత్రియులకు రజోగుణము ఎక్కువ. అందుకని వారిని మాంసాహారము తినమని చెప్పారు. వైశ్యులు వ్యాపారము, వాణిజ్యము ధన సంపాదన చేయాలి. కాబట్టి వారి బుద్ధి చాలా నిశితంగాఉండాలి.కాబట్టి వారికి

సాత్వికాహారము విధించారు. శూద్రులు కష్టపడి పని చేయాలి. కాబట్టి వారికి మాంసాహారము తినమని చెప్పారు.  కాబట్టి మనం తినే ఆహారాన్ని బట్టిమన గుణములుకూడా వృద్ధిచెందుతాయి.)

ఉద్ధవా! సత్వగుణముతో ధర్మము వృద్ధి చెందుతుంది. సత్వగుణముతో వృద్ధి చెందిన ధర్మము రజస్తమోగుణములను నాశనం చేస్తుంది. వాటితో పాటు అధర్మము కూడా నాశనం అవుతుంది. ఉద్ధవా! ఈ మూడు గుణములు వృద్ధి చెందడానికి కారణమైన వస్తువులు.......శాస్త్రములు, నీరు, ప్రజలు, ఉన్న ప్రదేశము, జరుగుతున్న కాలము, చేసే కర్మలు, అతడు ఎత్తిన జన్మ, మంత్రములు, ధ్యానము, సంస్కారము.... ఈ పది వస్తువులు జీవులలో గుణములు వృద్ధి చెందడానికి కారణం అవుతాయి. ఈ పది వస్తువులలో ఋషులచేత ఆచరించబడినవి సాత్వికములు, నిషేధించబడినవి తామసికములు, పక్కన పెట్టబడినవి రాజసములు.

ఆత్మ సాక్షాత్కారము కావాలంటే ముందు ఈ స్థూల దేహము, దానిలో ఉన్న  సూక్ష్మదేహము, ఈ దేహములు రావడానికి కారణమైన మూడు గుణములు  నశించాలి. ఇవి జరగాలంటే జీవుడు సత్వగుణమును అభివృద్ధి చేసుకోవాలి. సాత్విక విషయముల యందు మనసును లగ్నం చేయాలి. జీవునిలో సత్వగుణము వృద్ధి చెందితే, ధర్మం కూడా వృద్ధి చెందుతుంది. ధర్మం ఎప్పుడైతే వృద్ధి చెందుతూ ఉందో, పరమాత్మ జ్ఞానం కూడా అభివృద్ధి చెందుతుంది. రెండు వెదురు గడలు రాచుకుంటే నిప్పుపుట్టి ఆ వెదురు పొదలను కాల్చి బూడిద చేస్తుంది.  అలాగే జీవునిలో పుట్టిన సత్వగుణము, దాని వలన వృద్ధి చెందిన ధర్మము, అతనిలోని రజస్తమోగుణములను నాశనం

చేస్తాయి. తుదకు సత్వగుణము కూడా నశించిపోయి, నిర్గుణత్వము కలుగుతుంది." అని శ్రీకృష్ణ భగవానుడు ఉద్ధవునికి ఆత్మతత్వమును బోధించాడు.

(ఇక్కడ మీకు ఒక విషయం గుర్తు చేయాలి. పైన స్థూల దేహము, సూక్ష్మ దేహము అని రెండు చెప్పాము. మనలో చాలా మంది ఈ దేహమే ముఖ్యము అనుకుంటూ ఉంటారు. చిన్న ఉదాహరణతో దీనిని అర్థం చేసుకోవచ్చు. ఇది కంప్యూటర్ యుగం కదా. కంప్యూటర్ భాషలో చెప్పాలంటే మనకు పైకి కనిపించే హార్డ్‌వేర్ కాంపోనెంట్స్ అనగా సిపియూ, మదర్‌బోర్డు, రామ్, హార్డ్ డిస్క్, వగైరా అన్నీ స్థూల దేహము అనుకుంటే, వీటిలోకి లోడ్ చేయబడే విండోస్ ఆపరేటింగ్ సిస్టమ్, యం యస్ ఆఫీస్ పాక్, ఆడియో విడియో ప్లేయర్స్, పేజ్ మేకర్, తెలుగు సాఫ్ట్‌వేర్‌వగైరా అన్నీ సూక్ష్మశరీరాలు. మన కంటికి కనపడవు. కాని ఇవి లేకపోతే కంప్యూటర్ పని చేయదు. అలాగే శరీరం శిథిలం అయిపోతే సూక్ష్మశరీరం అయిన మనో,బుద్ధి,అహంకారాలు శరీరాన్ని విడిచిపెట్టి పోతాయి. ఆపరేటింగ్ సిస్టమ్ చేసినంత కాలం పని చేసి తుదకు క్రాష్ అవుతుంది. సిష్టం నుండి తప్పుకుంటుంది. అప్పుడు కంప్యూటర్‌ను తుక్కు కింది అమ్మినట్టు, శరీరాన్ని పాతి పెట్టడమో, కాల్చివేయడమో చేస్తాము. కంప్యూటర్‌లో ఉన్న ముఖ్యమైనవి సూక్ష్మరూపంలో బాక్ అప్ చేసి మరలా కొత్త సిస్టమ్ లో లోడ్ చేసినట్టు ఈ శరీరంలో మనం చేసినకర్మల వాసనలు సూక్ష్మరూపంలో జీవాత్మలో భద్రపరచబడతాయి. జీవాత్మ మరొక శరీరంలో ప్రవేశించినపుడు అంటే మరుజన్మలో, అవేవాసనలు ఆ శరీరాన్ని ప్రభావితం చేస్తాయి.)

శ్రీకృష్ణుడు చెప్పినది అంతా విన్న ఉద్ధవుడు మరలా మరొక ప్రశ్న (మనకోసరం, మనకు అర్థం కావడం కోసరం) అడిగాడు.

"కృష్ణా! మానవులు ఈ ప్రపంచంలో తిరుగుతుంటారు. ప్రాపంచిక విషయములు అనుభవిస్తుంటారు. అవి దు:ఖమునకు కారణం అవుతుంటాయి. అవి దు:ఖ కారణములు అని తెలిసి కూడా మరలా మరలా వాటినే చేస్తుంటారు. ఫలితాన్ని అనుభవిస్తుంటారు. దీనికి కారణం ఏమి?"అని అడిగాడు.
(ఈ ప్రశ్న ఈ నాటికికూడా వర్తిస్తుంది. ఇటీవలఢిల్లీలో ఒకఅమ్మాయిని బస్సులో ఎక్కించుకొని అమానుషంగా రేప్ చేసి చిత్రవధ చేసి చంపేసారు. దానికి నిర్భయచట్టం తెచ్చారు. నిందితులకు ఉరి శిక్ష వేసారు. మూడు రోజుల తరువాత హైదరాబాదులో మరలా అటువంటి సంఘటనే జరిగింది. కాకపోతే అక్కడ బస్సు ఇక్కడ కారు. అక్కడ మెడికల్‌స్టూడెంట్ ఇక్కడ సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని. మిగిలింది సేమ్ టు సేమ్. ఆ మృగాళ్లకు తాము చేసేది తప్పు అనీ, నిర్భయచట్టం ఉందనీ, తమకు ఉరిశిక్ష పడుతుందనీ, తెలియదా! తెలుసు. కానీ చేసారు. చేస్తుంటారు. చేస్తూనే ఉంటారు. అదే రజస్తమోగుణముల విజృంభణతో కలిగిన కామ ప్రకోపం. ఇదే ప్రశ్న మనకోసరం ఉద్ధవుడు కృష్ణుని అడిగాడు.)

ఉద్ధవుడు అడిగిన ప్రశ్నకు శ్రీకృష్ణుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. "ఉద్ధవా! సాధారణంగా మానవులు అవివేకులు. వారిని అవిద్య ఆవరించి ఉంటుంది. లేనిది ఉన్నట్టుగా భ్రమ చెందుతుంటారు. దేహము మీద విపరీతమైన అభిమానము పెంచుకుంటారు. దేహముతో అనుభవించే సుఖముల కొరకు

పాకులాడుతుంటారు. మానవునిలో పుట్టిన ఈ దేహాత్మ బుద్ధి అంటే ఈ దేహమే నేను అని అనుకోవడం, కేవలం భ్రమ. కాని అది భ్రమ అని తెలుసుకోలేక పోవడమే అవిద్య. ఈదేహమే నేను ఈ దేహముతో అన్నిసుఖములు అనుభవించాలి అని అనుకోవడంతోనూ రజోగుణము వృద్ధిచెందుతుంది. అప్పుడు అతనిలో ఉన్న సత్వగుణము అంటే మంచి తనము మరుగున పడి పోతుంది. ఎప్పుడైతో మనసు నిండా రజోగుణము ఆవరించిందో, విపరీతమైన కోరికలు పుడతాయి. అది చేసెయ్యాలి, ఇది చేసెయ్యాలి అని ఊగిపోతుంటాడు. అప్పుడే అతనిలో కామ సంబంధమైన కోరికలు విజృంభిస్తాయి. తనకంటబడ్డ స్త్రీని అనుభవించాలనీ, తాను కోరుకున్న వస్తువులను పొందాలనీ, ఇతరుల ధనమును అపహరించాలనీ విపరీతంగా ఆలోచిస్తాడు. ఆచరిస్తాడు. తుదకు మనశ్శాంతి నశించి, నానాకష్టాలపాలవుతాడు. అయినా ఆ పనులు చేయడంమానడు. విషయ వాంఛలు, కామకోరికలు, వాటి వలన చేసే కర్మలు తనకు కష్టాలు కలిగిస్తున్నాయి అని తెలిసినా కూడా, ఆ కర్మల వలన తీరని దు:ఖం కలుగుతుంది అని తెలిసికూడా, మరలా మరలా ఆ పనులనే చేస్తుంటాడు. కష్టాలు, దు:ఖాలు అనుభవిస్తుంటాడు.

కాని వివేకము కల పురుషుడు, తనలో రజోగుణము, తమోగుణము ప్రధానంగా ఉన్నప్పటికినీ, ఏపని అయినా చేయబోయే ముందు, మనస్సును అదుపులో పెట్టుకొని, బుద్ధితో ఆలోచిస్తాడు. తాను చేయబోయే పనిలో ఉన్న దోషములను విచారిస్తాడు. ఆ పని చేయవచ్చా, చేయకూడదా, చేస్తే వచ్చే కష్టనష్టములు ఏమిటి అని లెక్కవేసుకుంటాడు. తాను చేయబోయే పని తనకు దు:ఖమును

కలిగిస్తుంది అని తెలుసుకొంటే ఆ పని చేయడు.

(పైన మనం చెప్పుకున్న ఉదాహరణకు కృష్ణుడు చెప్పిన సమాధానాన్ని అన్వయించుకుందాము. ఢిల్లీలో జరిగిన సంఘటన, హైదరాబాదులో జరిగిన సంఘటన, అనునిత్యం ప్రపంచంలో జరుగుతున్న ఇటువంటి సంఘటనలువాటికి సంబంధించిన పనులు (అంటే  ఆడపిల్లలను అల్లరి పెట్టడం, అవమానించడం, రేప్‌చేయడం లాంటివి) చేయబోయే ముందు ఆ చేసేవాళ్లు వారి విపరీత మనస్సును పక్కన బెట్టి, బుద్ధితో ఆలోచించి ఉంటే, ఈ సంఘటనలు జరిగేవికావు. అప్పుడు ఏ నిర్భయ చట్టము అవసరం లేదు. మగాళ్లమృగాళ్లుగా మారే అవకాశము లేదు. వాళ్లను ఉరితీసే అవసరం అంతకన్నా లేదు. దాన్ని ఖండిస్తూ రాజకీయ నాయకులు గొంతు చించుకొని అరవాల్సిన అవసరం అంతకన్నా లేదు.  ప్రపంచంలో ఆడవాళ్లందరూ నిర్భయంగా బతుకుతారు. స్త్రీ నిర్భయంగా ఒంటరిగా అర్ధరాత్రి తిరగ గలిగినపుడే మనకు నిజమైన స్వతంత్రం వచ్చినట్టు అన్న గాంధీజి మాటలు నిజం అవుతాయి. దీని కంతా మూలం భాగవతంలో శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు అందరికీ ఆచరణీయం, అనుసరణీయం.)

ఉద్ధవా! మానవులు ఎల్లప్పుడు తాము చేసే పనులయందు చాలా అప్రమత్తంగా ఉండాలి. అనవసరమైన భావోద్వేగాలకు లోను కాకూడదు. ముఖ్యంగా తనలో ఉన్న ఆవేశాన్ని, శ్వాసను, అదుపులో పెట్టుకోవాలి. మనస్సులో ఎల్లప్పుడూ భగవంతుని ఎడల భక్తి కలిగి ఉండాలి. భగవంతుని ఎడల ఏకాగ్రమైన భక్తి కలిగిఉండాలి. మనస్సును ప్రాపంచిక విషయముల నుండి వెనక్కు లాగి, భగవంతుని వైపు

మళ్లించాలి. దీనినే యోగము అంటారు. ఈ యోగమును పూర్వము నా శిష్యులైన సనకాది మహర్షులకు నేను వివరంగా చెప్పాను. ." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి మానవునిలో దు:ఖభూయిష్టమైన కోరికలు ఎందుకు పుడతాయో, దానికి తరుణోపాయము ఏమిటో వివరించాడు. మరలా ఉద్ధవునికి మరొక సందేహమం కలిగింది.

"కృష్ణా! నీవు ఇప్పుడు ఈ యుగంలో మాతోపాటు ఉన్నావు కదా! సనకాది మహామునులు చాలా పురాతనమైన వారు కదా! వారు నీకు శిష్యులు ఎలా అయ్యారు? వారికి నీవు ఏ కాలంలో, ఏ రూపంలో ఈ యోగమును బోధించావు? కాస్త వివరంగా చెప్పు." అని అడిగాడు. దానికి శ్రీకృష్ణుడు ఈ విధంగాసమాధానం చెప్పాడు.

"ఉద్ధవా! సనకాది మహామునులు బ్రహ్మ యొక్క మనసులో కలిగిన సంకల్పము నుండి జన్మించారు. అందుకే వారికి బ్రహ్మ మానస పుత్రులు అని పేరు. వారు ఒక సారి వారి తండ్రి అయిన బ్రహ్మ వద్దకు పోయి "యోగము అంటే ఏమిటి? దాని స్థితి ఏమిటి? అది ఎలా ఉంటుంది? మానవుల చిత్తములు సాధారణంగా ప్రాపంచిక విషయముల వైపు, కామ సంబంధమైన కోరికలవైపు ఆకర్షింపబడుతూ ఉంటుందికదా! ఆ కోరికల ఫలితంగా మానవులు కర్మలు చేస్తారు. ఆ కర్మల ఫలితములను అనుభవిస్తారు. ఆ కర్మఫలములు వాసనల రూపంలో వారి చిత్తము వెంటనంటి ఉంటాయి కదా! వాసనలను పుట్టించే విషయ వాంఛలను, కామకోరికలను, ఎలా అదుపులో పెట్టుకోవాలి. ఈవిషయ వాసనలు చిత్తమునకు అంటకుండా ఉండాలంటే ఏం చెయ్యాలి?" అనిఅడిగారు.

ఉద్ధవా! బ్రహ్మ అంటే నీకు తెలుసుకదా! ఆయన స్వయంభువు. ఆయన పుట్టుకకు కారణం లేదు. ఆయనే అన్ని జీవుల పుట్టుకకు కారణము. కాని సృష్టికార్యము నిర్వర్తించడానికి నిరంతరము ఏదో ఒక కర్మ చేస్తూనే ఉంటాడు. తానే కర్మలు చేస్తూ వాటి ఫలములను అనుభవిస్తున్నప్పుడు, కర్మల వలన కలిగే వాసనలు మనస్సుకు అంటకుండా ఉండాలంటే ఏం చెయ్యాలి అనే విషయం ఆయనకు ఎలా తెలుస్తుంది. ఎంత ఆలోచించినా బ్రహ్మదేవుని బుర్రకు సనకాదులు అడిగిన ప్రశ్నకు సమాధానం దొరక లేదు.

ఆ బ్రహ్మ దేవునికి తండ్రిని నేను (విష్ణువు బొడ్డులోనుండి పుట్టిన తామర పుష్పములోనుండి బ్రహ్మ ఉద్భవించాడు అని చెప్పుకున్నాము కదా). అందుకని బ్రహ్మ నన్ను స్మరించాడు. నేను బ్రహ్మ దేవుని ముందు హంస రూపంలో సాక్షాత్కరించాను. నేను ఎవరో సనకాదిమునులకు తెలియ లేదు. బ్రహ్మతో సహా వారందరూ నా వద్దకు వచ్చి "నీవు ఎవరు?" అని నన్ను అడిగారు. ఉద్ధవా! వారు అడిగిన ప్రశ్నకు సమాధానంగా నేను ఏమి చెప్పానో నీకు వివరిస్తాను. సావధానంగా విను.

"బ్రాహ్మణోత్తములారా! మీకు అందరికీ తెలుసు. పరమాత్మ ఒక్కడే. ఆయనకు ఏ రూపమూ లేదు. రకరకాలైన రూపములు అసలే లేవు. మరి మీరు నన్ను "నీవు ఎవరు?" అని అడగడంలో అర్థం లేదు కదా! "నేను ఫలానా వాడిని" అని చెప్పడానికి అసలు నేను ఏ గుణమునకు, ఏ జాతికి, ఏ క్రియకు సంబంధించినవాడిని అని చెప్పగలను. దేవతలు కానీ, దైత్యులు కానీ, మనుషులు కానీ వారి

శరీరములు అన్నీ పంచభూతములతో తయారు కాబడినవే! కాబట్టి రూపములలో భేదముఉన్నా పదార్థము ఒకటే!

(బంగారముతో రకరకాల ఆభరణములు తయారు చేసినా, అందులో ఉన్న మూల పదార్థము బంగారమే కదా!)

కాబట్టి జీవరాసులు వేరు వేరుగా ఉన్నా వారిలో ఉన్న ఆత్మస్వరూపము ఒకటే కదా! అటువంటప్పుడు అన్నీ తెలిసిన మీరు నన్ను 'నీవు ఎవరు?" అని అడగడంలో అర్థం లేదు కదా! ఇలా అడగడం మీ వాచారంభము (నోటి దూల) తప్ప వేరు కాదు.

బ్రాహ్మణులారా! ఈ ప్రపంచంలో ఎన్నో వస్తువులు ఉన్నాయి. అవి సుఖాలను, దు:ఖాలను కలిగిస్తుంటాయి. వాటిలో కొన్నిటిని మానవులు మనసుతోనూ, వాక్కుతోనూ, వినడం ద్వారాను, చూడడం ద్వారాను, ఇంకా ఇతర ఇంద్రియములతోనూ అనుభవిస్తుంటారు. మానవులకు సుఖములను, దు:ఖములను కలిగించే అన్ని పదార్థములు నా స్వరూపాలే! వాటికి నాకూ భేదములేదు. ఆత్మ తత్వము అర్థం అయితే సర్వం పరమాత్మ మయం అనే విషయం మీకు అర్థం అవుతుంది.

ప్రతి మానవుడికి మనస్సు బుద్ధి రెండు ఉంటాయి. ఆ రెంటిని కలిపి చిత్తము అంటారు. ఆ చిత్తము బయట ప్రపంచములో ఉన్న విషయములను ఆకర్షిస్తూ ఉంటుంది. బయట ప్రపంచములోని విషయములు కూడా చిత్తాన్ని ఆకర్షిస్తుంటాయి.(ఎగ్జిబిషన్‌కు వెళతాము. అక్కడున్న వస్తువులు రా రా నా దగ్గరకు రా. నన్ను కొనుక్కో. ఇంటికి తీసుకెళ్లు అంటూమనలను ఊరిస్తాయి. మన

మనసుకూడా అబ్బా ఆ వస్తువు ఎంతబాగుందో.కొంటే బాగువడు ఇలాగా చిత్తము, విషయములు ఒకదానిని ఒకటి ఆకర్షించుకుంటూ ఉంటాయి. జీవాత్మకు ఈ చిత్తము, విషయములు రెండూ అనుభవించతగ్గవే. అంతే కానీ చిత్తమే జీవుడు కాదు. అలా అని విషయములు అన్నీ జీవుడు కాదు.

(కొంత మంది అంటూ ఉంటారు. ఆమె అంటే నాకు ప్రాణం, వాడు అంటే నాకు ప్రాణం. ఆ వస్తువు లేకపోతేనేను బతక లేను. చచ్చి పోతాను. ఇలా రకరకాలుగా అంటుంటారు. అదంతా పచ్చి అబద్ధం. వాడు, ఆమె,వస్తువులు అన్నీ బాహ్యంలో ఉండేవి. జీవాత్మ అంతర్గతంగా ఉండేది.)

కాబట్టి ఓ బ్రాహ్మణోత్తములారా! మానవులు బాహ్య ప్రపంచంలో ఉన్న వస్తువుల మీద ఆసక్తి చూపినంత వరకు, వారి చిత్తము ఆ వస్తువులయందు లగ్నం అవుతుంది. అవి కావాలని కోరుకుంటుంది. వాటి కొరకు నానాపాట్లు పడుతుంది. ఆ వస్తువులు తనకు కావాలనే కోరిక కూడా చిత్తము నుండి పుట్టినదే! కాబట్టి వివేకము కల మానవుడు చిత్తమును నిగ్రహించుకోవాలి. బాహ్య ప్రపంచములోని వస్తువుల మీద ఆసక్తిని తగ్గించుకోవాలి.

ఓ బ్రాహ్మణోత్తములారా!మానవునికి జాగ్రదావస్థ (మెలుకువ కలిగి ఉండటం), స్వప్నావస్థ (నిద్రపోతూ కలలు కనడం, దానినే కలత నిద్ర అంటారు), సుషుప్తావస్థ (గాఢంగా నిద్రపోవడం). ఈ అవస్థలు మూడూ మనలో ఉన్న సత్వగుణము, రజోగుణము, తమోగుణము ప్రభావంతో కలుగుతుంటాయి. ఈ మూడు అవస్థలను జీవుడు సాక్షిగా చూస్తుంటాడు. కాబట్టి జీవుడికి మెలుకువ, నిద్ర, కలలు అంటూ ఏమీ

లేవు. జీవుడు ఆత్మ స్వరూపమును పొంది నపుడు ఈ మూడు అవస్థలను అధిగమించి తురీయావస్థకు చేరుకుంటాడు. అదే బ్రహ్మానందము. పరమాత్మ స్వరూపము.

ఓ బ్రాహ్మణోత్తములారా! మనస్సు ద్వారా, బుద్ధి ద్వారా మానవులు బాహ్య ప్రపంచములోని వాటితో సంబంధము పెంచుకొని సంసారములో చిక్కుకుంటారు. (పుట్టగానే మూడేళ్ల పాటు ఏమీ తెలియని బ్రహ్మానంద స్థితి. మూడేళ్ల తరువాత స్కూలు, టీచర్లతో, తోటి వారితో సంబంధం. తరువాత వివాహము. మరొక స్త్రీతో సంబంధము, ఆమె వలన సంతానము. వారిని పోషించడానికి ధనము. ఇల్లు, ఆస్తి. ఇదే సంసారము.) ప్రతి వాడూ ఈ సంసార బంధనములలో చిక్కుకోవలసిందే తప్పదు. కాని సంసారంలో ఉండి కూడా అంటీ అంటనట్టు ఉంటూ, ఎక్కువగా సంబంధములు పెంచుకోకుండా, పరమాత్మ మీద మనసు లగ్నం చేసిన వాడిని ఈ సంసార బంధనములు అంటవు. అప్పుడు చిత్తము విషయ వాంఛల జోలికిపోదు. చిత్తము మానవుని అధీనంలో ఉంటుంది.

బ్రాహ్మణోత్తములారా! అసలు ఈ సంసార బంధనములు ఎలా కలుగుతాయి అని ఆలోచిస్తే దీని కంతటికీ మూల కారణం మనిషిలోని నేను, నాది అనే అహంకారము. ఈ అహంకారమే అన్ని బంధనము లను కలుగచేస్తుంది. అనర్థాలకు కారణం అవుతుంది. జీవితంలో మానవుని ఆనందాన్ని సమూలంగా హరించి వేస్తుంది. దు:ఖసాగరంలో ముంచుతుంది.

(చిన్న విషయం. బాలుడు చిన్నప్పుడు ఆడుకుంటున్నప్పుడు వాడికి తల్లి తండ్రులు ఒక వస్తువు కానీ, ధనం కానీ ఇచ్చి “నాన్నా ఇది నీదే

దాచుకో!" అంటారు. వెంటనే వాడు "ఇదినాది. ఎవ్వరికీ ఇవ్వను" అని అంటాడు. పెద్ద అయిన తరువాత వాడు, "అమ్మ నాన్న నన్ను దాచుకోమన్నారు, ద కు దీర్ఘం కాకుండా ఓత్వము ఇస్తాను. దోచుకొని, దాచుకుంటాను అని అలా ఫిక్స్ అయి పోతాడు. ఉగ్గుపాలతో నేర్పిన అహంకారము, స్వార్థం, ఇలా వెర్రితలలు వేస్తుంది. అలా కాకుండా తల్లి తండ్రులు తమ పిల్లలకు తమ దగ్గర ఉన్న దానిని ఇతరులతో పంచుకోవాలని నేర్పాలి.)

కాబట్టి తెలివి కల వాళ్లు ఈ విషయమును తెలుసుకొని అహంకారాన్ని, స్వార్థాన్ని అంతం చేయాలి. అహంకారమును, స్వాభిమానమును వదిలిపెట్టాలి. భోగముల మీద ఆసక్తిని తగ్గించుకోవాలి. భగవంతుని మీద చింతన పెంచుకోవాలి. దు:ఖముల నుండి విముక్తి పొందాలి.

బ్రాహ్మణోత్తములారా!మానవునిలో నిరంతరం సుడులు తిరుగుతున్న ఆలోచనలే మనిషి మనిషికి మధ్య భేద భావమును కలుగజేస్తాయి. వాడు వేరు నేను వేరు అని అంతరాలు సృష్టిస్తాయి. ఈ భేదభావమునకు సంబంధించిన ఆలోచనలు అంతం కాకపోతే, వాడు ఎంతటి వాడైనా, పతనం తప్పదు.

బ్రాహ్మణోత్తములారా! ఈ జగత్తులో పరమాత్మ తత్వము ఒక్కటే సత్యము. మిగిలినవి అన్నీ అసత్యములే. దేనికీ అస్థిత్వము లేదు. నిరంతరము మారి పోయేవే. దేహములు కూడా పుట్టినప్పటి నుండి చచ్చే దాకా బాల్య, యవ్వన, వృద్ధాప్యములు అనే అవస్థలను, మార్పులను పొందుతూ ఉంటుంది. ప్రకృతిలో ఉన్న మొక్కలు,

వృక్షములు అన్నీ నిరంతరము మార్పు చెందుతుంటాయి. ఏదీ శాశ్వతముగా నిలువదు. ఈదేహములకే శాశ్వతత్వము లేనపుడు, దేహములు పాటించే వర్ణము,ఆశ్రమము మొదలగు ధర్మములకు అస్థిత్వము ఏముంటుంది. స్వర్గం నరకం ఏముంటాయి.

సుఖదు:ఖాలకు మూలమైన కర్మలు కూడా తాత్కాలికమే. అన్నీ స్వప్నంలో జరిగినట్టు జరుగుతుంటాయి. కాబట్టి ఈ అనంత విశ్వంలో ఉన్న అన్ని వస్తువులు, విషయములు అన్నీ మిథ్య. దేనికీ అస్థిత్వములేదు అని తెలుసుకోవాలి.

మానవుడు మెలుకువగా ఉన్నప్పుడు ఈ ప్రపంచంలో కనపడే ఎన్నో విషయాలను తన ఇంద్రియములతో చూస్తుంటాడు. వింటుంటాడు. అనుభవిస్తుంటాడు. బాల్యము, యౌవనము, వృద్ధాప్యము అనే అవస్థలను పొందుతుంటాడు. అలాగే స్వప్నంలో ఉన్నప్పుడు, ఇంద్రియములు పనిచేయనపుడు, మనసుతోనే అన్నిపనులు చేస్తుంటాడు. సుషుప్తావస్థలో ఉన్నప్పుడు మనసు కూడా పనిచేయదు. గాఢ నిద్రలో ఉంటాడు. జీవుడు తన ఆత్మతో అనుసంధానం అవుతాడు. బ్రహ్మానంద స్థితిని అనుభవిస్తాడు. ఆ స్థితిలో ఈ ప్రపంచములోని వస్తువులు, వాటికి సంబంధించిన కోరికలు, సుఖదు:ఖాలు. కలలో కనపడ్డ వస్తువులు మాదిరి అన్నీ నశించిపోతాయి. అలౌకిక స్థితిలో ఉంటాడు.

మానవునిలోని ఈ మూడు అవస్థలు నాచేతనే కల్పించబడ్డాయి. ఈ అవస్థలు అన్నిటికీ మూల కారణం మీలో ఉన్న

అహంకారమే. ఈ విషయం తెలుసుకున్న మీరు, జ్ఞానము అనే ఖడ్గము చేత మీలో ఉన్న అహంకారమును ఖండించండి. అప్పుడు మీ హృదయములలో ఉన్న నేను మీకు కనపడతాను. నన్ను సేవించి ముక్తిని పొందండి.

ఓ బ్రాహ్మణోత్తములారా!ఈ జగత్తు అంతా మీ మనస్సు చేత మీరు కల్పించుకున్నదే. మీ మనసుతో మీరు ఎలా చూస్తే అలా కనపడుతుంది. మీ మనస్సు చంచలంగా ఉంటే జగత్తులోని విషయాలు కూడా చంచలంగానే కనపడతాయి. కాబట్టి ఈ ప్రపంచం, ప్రాపంచిక విషయాలు, విషయభోగాలు, కామవాంఛలు అన్నీ మీ మానసిక భ్రమ. ఉన్నాయి అని అనుకుంటే ఉంటాయి. లేవు అనుకుంటే లేవు.

(ఇక్కడ ఒక ఉపమానము వాడారు. అలాతచక్రతుల్యము అంటే ఒక మండుతున్న కొరివి కట్టెను గిర్రున తిప్పితే మండుతున్న వలయం (చక్రం) లాగా కనపడుతుంది. నిజానికి అక్కడ ఒక్క కొరివి కట్టె మాత్రం ఉంది. కాని మన భ్రమతో వలయం(చక్రం) లాగా కనపడుతూ ఉంది.)

విజ్ఞానస్వరూపుడు అయిన పరమాత్మ ఒక్కడే సత్యం. ఆ పరమాత్మయే నానారకాలుగా ప్రపంచంలో ప్రకటితం అవుతున్నాడు. కాని వాస్తవానికి పరమాత్మఒక్కడే. మానవుల మనోభావాలను బట్టి, చిత్త చాంచల్యమును బట్టి, వారుకోరుకున్న విధంగా, కోరుకున్న రూపాలలో కనపడుతున్నాడు. ఇదంతా మాయ అని తెలుసుకొని, అన్నిటిలో పరమాత్మను చూడడమే మానవుని కర్తవ్యం.

కాబట్టి మానవులు ఈ కనపడే ప్రాపంచిక విషయముల నుండి తమ దృష్టిని మరల్చుకోవాలి. విషయ వాంఛలయందు, కామ సంబంధ మైన కోరికల యందు ఆసక్తిని వదలిపెట్టాలి. అనవసరంగా మాట్లాడకుండా మితంగా మాట్లాడాలి. మనస్సు, వాక్కును, ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. అప్పుడే నిరంతర సుఖమును అనుభవించగలడు. లేకపోతే అతని జీవితం అంతా దు:ఖమయం అవుతుంది. కాని ప్రతి మానవునికి ఆహారం తీసుకోవడం, శరీరం శుభ్రం చేసుకోవడం, నిద్రపోవడం శారీరక ధర్మములు. ఆ సందర్భములలో మాత్రమే బాహ్య ప్రపంచముతో సంబంధంపెట్టుకోవాలి. అప్పుడు కూడా ఈ ప్రపంచం అంతా మాయ, మిధ్య, పరమాత్మ ఒక్కడే సత్యము అనే భావననుకలిగి ఉండాలి.

బ్రాహ్మణోత్తములారా! సిద్ధిపొందిన పురుషుడు, ఈ దేహము శాశ్వతము కాదు అని తెలుసుకుంటాడు. కర్మవశాత్తు ఈ దేహము వచ్చింది. కాలం తీరగానే పోతుంది అనే జ్ఞానమును కలిగి ఉంటాడు. అతనికి దేహము మీద ప్రేమ, అభిమానము, ఆసక్తి ఉండదు. దేహము ఉన్నంత వరకు కర్మలు చేస్తుంటాడు. కాని ఏ కర్మ మీద ఆసక్తి కనబరచడు. చేయాలి కాబట్టి చేస్తుంటాడు. దేహములో ప్రాణములు ఉన్నంతవరకు జీవించి ఉంటాడు. ఈ దేహమును, కలలో వచ్చి మెలుకువ రాగానే మాయం అయ్యే దేహం మాదిరి, భావిస్తాడు.

ఓ బ్రాహ్మణులారా! మీకు అత్యంత రహస్యములైన సాంఖ్యయోగ విషయములను వివరించాను. నేను ఎవరో కాదు.

హంసరూపంలో వచ్చిన విష్ణువును. మీకు ధర్మోపదేశము చేయడానికే వచ్చాను. నాలోనే అన్ని యోగములు అంటే సాంఖ్యము, యోగము, సత్యము, ఋజుప్రవర్తన, తేజస్సు, ఐశ్వర్యము, కీర్తి, నిగ్రహము అన్నీ ఉన్నాయి. అన్ని గుణములు నన్నే సేవిస్తుంటాయి. నేను అన్ని గుణములకు అతీతుడను. నాకు రాగద్వేషములు లేవు. మానవుల హితమును కోరుతుంటాను. నాకు అందరి మీద ప్రేమ తప్ప ద్వేషము లేదు. నేను ఈ విశ్వంఅంతా నిండి ఉన్నాను." అని ఉపదేశించాడు హంసరూపంలో ఉన్న విష్ణువు.

విష్ణువు బోధనలు విన్న తరువాత ఆ మునుల సందేహములు అన్నీ తొలగి పోయాయి. వారందరూ విష్ణువును భక్తి శ్రద్ధలతో పూజించారు. కీర్తించారు. తరువాత నేను నా లోకమునకు వెళ్లిపోయాను." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఉపదేశించాడు అని శుక మహర్షి పరీక్షిత్తు మహారాజుకు ఉద్ధవునికి శ్రీకృష్ణుడు చెప్పిన పరమాత్మ తత్వమును గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

పదునాలుగవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణ పరమాత్మ ఉద్ధవునికి తన ఉపదేశములను కొనసాగించాడు. ఇంతలో ఉద్ధవునికి మరొక సందేహము కలిగింది. శ్రీకృష్ణుని ఇలా అడిగాడు.

"కృష్ణా! బ్రహ్మ తత్వమును తెలిసిన మహా ఋషులు ఎన్నో రకముల శ్రేయస్సులను, శ్రేయోమార్గముల గురించి చెబుతుంటారు. అవి అన్నీ ఒకటేనా లేక వేరు వేరుగాఉంటాయా! అన్ని మంచివేనా లేక వాటిలో కొన్ని మాత్రమే మంచివా! లేక ఒకటి మాత్రమే మంచిదా! లేక వేటికవే మంచివా లేక ఒకదానిని మించి ఒకటిమంచివా! నీవు భక్తి యోగము గురించి నాకు చెప్పావు కదా! నీవు ఉపదేశించిన నిష్కామ భక్తి యోగమును సక్రమంగా ఆచరిస్తే, మానవులకు ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి నశించి, మనస్సు నీ యందే లగ్నం అవుతుంది. అసలు ఈ నిష్కామ భక్తి యోగము అందరికీ ఆచరణయోగ్యమేనా! నాకు వివరించు." అని అడిగాడు.ఆ ప్రశ్నకు శ్రీకృష్ణుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఉద్ధవా! వేదములు అన్నీ కాలప్రభావంతో నశించి పోతాయి. వేదములను ఎవరూ అధ్యయనం చెయ్యరు. వేదములలో చెప్పబడిన ధర్మములను ఎవరూ పాటించరు. అధర్మం పెచ్చరిల్లుతుంది. అప్పుడు ప్రళయం వస్తుంది. ఆ ప్రళయంలో ఈ సృష్టి అంతరించి పోతుంది.

బ్రహ్మ మరలా సృష్టి మొదలు పెట్టినపుడు నేను బ్రహ్మకు వేద విద్యను ఉపదేశించాను. ఆ వేదములను అనుసరించి సృష్టి కొనసాగింది.

నేను బ్రహ్మకు ఉపదేశించిన వేదములను, బ్రహ్మ తన మొదటి కుమారుడైన స్వాయంభువ మనువుకు ఉపదేశించాడు. తనకు బ్రహ్మ ఉపదేశించిన వేద విద్యను స్వాయంభువ మనువు తన తరువాతి వారైన భృగువు, అంగిరసుడు, మరీచి, పులహుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అను ఏడుగురు ఋషులకు ఉపదేశించాడు. సప్తఋషుల నుండి వేద విద్య దేవతలకు, దానవులకు, గుహ్యకులకు, మనుష్యులకు, సిద్ధులకు, గంధర్వులకు, విద్యాధరులకు, చారణులకు, కింపురుషులకు, కిన్నరులకు, నాగులకు, రాక్షసులకు, మొదలగు వారికి ఉపదేశింప బడింది.

ఈ లోకములో జీవుల యొక్క స్వభావములు సత్వ, రజస్, తమోగుణముల ఆధారంగా ఉంటాయి. వీటినే పూర్వజన్మ వాసనలు అంటారు. ప్రతి జీవి తన పూర్వ జన్మ వాసనలకు అనుగుణంగానే ఈ లోకంలో ప్రవర్తిస్తుంటాడు. ఈ వాసనల వలననే దేవతలు, అసురులు, జంతువులు, మనుష్యులు రకరకాలుగా ప్రవర్తిస్తుంటారు. వారి రకరకాల ప్రవృత్తుల వలననే వేదములు వివిధరకములుగా వ్యాఖ్యానింపబడ్డాయి.

ఇంక మానవుల సంగతికి వస్తే, మానవుల స్వభావములను అనుసరించి వారి బుద్ధి, మనసు వివిధ రీతులలో ప్రవర్తిస్తూ ఉంటుంది. కొంత మంది వేదములు అభ్యసించి వేదములలో చెప్పిన మాదిరి నడచుకుంటారు. మరి కొందరు వేదములను చదవరు. కాని

వారికి వారి పెద్దలనుండి వంశానుగతంగా వస్తున్న ఆచారములను, వ్యవహారములను, అలవాట్లను అనుసరిస్తూ ఉంటారు. వాటినే వేదము అనుకుంటారు. మరి కొందరు అది కూడా చెయ్యరు. తమకు ఏది తోస్తే అదే ధర్మము అదే వేదము అని వితండ వాదము చేస్తుంటారు. వారిని పాషండులు అని అంటారు. వారిది పాషండ మతము (వితండ వాదము). ఇదంతా నా మాయ వలన జరుగుతూ ఉంటుంది.

మానవులంతా మాయా మోహితులై తమకు ఇష్టం అయిన కర్మలను చేస్తూ, తమకు ఏది శ్రేయస్సు కలుగ జేస్తుందో, తమకు నచ్చిన శ్రేయోమార్గములు ఏమిటో నిర్ణయించుకుంటారు. కొంత మంది మానవులు ధర్మమును ఆచరించడం శ్రేయోమార్గము అనుకుంటారు. మరికొందరు కీర్తిని సంపాదించడం శ్రేయస్సు అనుకుంటారు. మరి కొందరు తమ కోరికలను తీర్చుకోవడంలోనే తమ శ్రేయస్సు ఉందని అనుకుంటారు. కొంతరు సత్యవ్రతమును, మరి కొందరు మనో నిగ్రహమును, ఇంద్రియ నిగ్రహమును తమ తమ శ్రేయోమార్గములుగా తలుస్తారు. మరి కొందరు ధనము, ఆస్తులు, భోగములు, ఉండటమే శ్రేయస్సు అనుకుంటారు. మరి కొందరు యజ్ఞములు,యాగములు, తపస్సు చేయడమే శ్రేయస్సు అనుకుంటారు. ఎవరికి తోచినట్టు వారు తమ తమ శ్రేయోమార్గములను అవలంబిస్తారు.

అసలు సత్యం ఏమిటంటే ఈ లోకమే అనిత్యము, అశాశ్వతము, దు:ఖములతో నిండి ఉంది. నిరంతరము పరిణామం(మార్పు) చెందుతూ ఉంటుంది. మానవులు ప్రాపంచిక

విషయములయందు ఆసక్తి కలిగి ఉంటారు. ప్రాపంచిక విషయములు అన్నీ మోహమును పుట్టిస్తాయి. క్షుద్రమైనవి. హీనమైనవి. నిరంతరము శోకమును కలిగిస్తాయి. నిరంతరము దు:ఖములతో, శోకములతో నిండి ఉన్న ఈ ప్రపంచంలో సుఖం పొందాలంటే ఒకే ఒక మార్గం ఉంది. నాయందు మనసు లగ్నం చేయాలి. ప్రాపంచిక విషయముల మీద, విషయ వాంఛల మీద ఆసక్తిని వదిలిపెట్టాలి. పరమాత్మను మనసులో నిలుపుకొని, నిర్మలమైన మనస్సుతో పరమాత్మను ధ్యానిస్తేనే సుఖం కలుగుతుంది కానీ మరి దేని వలనా సుఖం కలుగదు.

నిరంతరము ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలతో సతమతమయ్యేవారికి సుఖం ఎలా ఉంటుంది? ఇతరుల సొత్తుకు ఆశపడని వాడికి, మనస్సును, ఇంద్రియములను నిగ్రహించిన వాడికి, అందరిపట్లా సమానమైన భావము కలిగిన వాడికి, అందరూ తనతో సమానమే అని తలచేవాడికి, ఉన్నదానితో తృప్తి పడేవాడికి, ఈలోకమంతా సుఖమయంగానే కనిపిస్తుంది.

ఉద్ధవా! నా యందే మనసు నిలిపిన వాడికి, నా యందు భక్తి కలిగిన వాడికి, బ్రహ్మ పదవి, ఇంద్ర పదవి ఇచ్చినా, ఒక రాజ్యానికి రాజును చేసినా, అణిమాది అష్టసిద్ధులు ప్రసాదించినా, నిరాకరిస్తాడు. మోక్షము ఇచ్చినా వద్దంటాడు. ఎందుకంటే పైన చెప్పబడినవి అన్నీ శాశ్వతములు కావు. పరమ పదము ఒక్కటే శాశ్వతము.

నేను నా భక్తులను ఇష్టపడినంతగా ఎవరినీ ఇష్టపడను. నేను నా భక్తుల పాద ధూళిని శిరస్సున దాలుస్తాను. వారి కోసరం ఏమైనా చేస్తాను. వారి యోగక్షేమములను వహిస్తాను. నా మీద భక్తితో

నన్ను సేవించేవారు ఇతరుల సొత్తుకు ఆశపడరు. దొరికిన దానితో తృప్తిపడతారు. శాంతంగా ఉంటారు. వారికి స్వాభిమానము ఉండదు. అందరినీ సమంగా ఆదరిస్తారు. వారిలో భేదభావము ఉండదు. వారికి రాగద్వేషములు ఉండవు. విషయ వాంఛలు ఉండవు. వీరంతా నాయందు ఏకాగ్రమైన భక్తి కలిగి ఉంటారు. అటువంటి వారు ఈ లోకంలో నిరంతర సుఖమును పొందుతారు. వారికి దు:ఖము అంటే ఏమిటో తెలియదు. పైలక్షణములు లేని వారు ఎవ్వరూ సుఖమును పొందలేరు.

ఉద్ధవా! ఇంద్రియములను, మనస్సును జయించలేని వారు నా మీద భక్తి కలిగి ఉన్నా, ప్రయోజనం లేదు. వారు నా మీద భక్తి ఉందని లోకానికి చూపి, దానితో సొమ్ముచేసుకుంటారు. నా మీద భక్తి ఉందని గొప్పలు చెప్పుకుంటారు. కాని మరి కొందరు, నా మీద ఉన్న భక్తి ప్రభావంతో ప్రాపంచిక విషయములకు, విషయ వాంఛలకు దూరంగా ఉంటారు.

ఉద్ధవా! బాగా మండుతున్న అగ్నిలో ఒక కర్రపుల్ల వేస్తే అది భస్మం అయినట్టు, నామీద అచంచలమైన భక్తి కలిగి ఉంటే, ఆ భక్తి అనే అగ్నిలో అతని పాపములు అన్నీ భస్మం అయిపోతాయి. ఉద్ధవా! నిరంతరమైన సాధనతో నా మీద భక్తి పెరుగుతుంది. ఆ సాధనా భక్తితోనే మానవులు నన్ను వశం చేసుకోగలరు. అంతేకానీ, కేవలం యోగముచేతా, సాంఖ్యము చేతా, ధర్మాచరణము చేతా, వేదములను అధ్యయనం చేయడం చేతా, తపస్సు చేయడం చేతా, దానం చేయడం చేతా నన్ను వశం చేసుకోలేరు.

పై చెప్పబడినవి అన్నీ నా మీద భక్తి కలిగి ఉన్నపుడే రాణిస్తాయి. విడివిడిగా రాణించవు. నా మీద ఉన్న భక్తి, శ్రద్ధ.... వీటి వలననే నేను సాధువుల హృదయములలో తిష్టవేసుకొని కూర్చుంటాను. నా మీద భక్తి కలిగి ఉండటానికి కుల, జాతి భేదములేదు. నా మీద శ్రద్ధ, భక్తి ఉన్న ఛండాలురు కూడా పవిత్రం అవుతారు. నా మీద భక్తి, శ్రద్ధ లేని మానవుల యొక్క చిత్తము, దయాగుణము, వారు ఆచరించే ధర్మము, చేసే తపస్సు, ఆర్జించిన జ్ఞానము, ఇవి ఏవి కూడా ఆ మానవులను పవిత్రం చేయలేవు.

నా మీద భక్తి, శ్రద్ధ ఉన్న దానికి ఋజువు నన్ను తలచుకోగానే వారి శరీరములు పులకించాలి. వారి చిత్తము ద్రవించాలి. వారిగొంతు బొంగురుపోవాలి. వారి కళ్లలో నుండా ఆనంద భాష్పములు జలాజలా రాలాలి. ఆనందం పట్టలేక ఏడుస్తారు. అంతలోనే నవ్వుతారు. గుండెల నిండా నన్నే నింపుకుంటారు. పెద్దగా పాడతారు. ఆడతారు. అదే నా మీద ఉన్న అచంచలమైన గాఢమైన భక్తికి నిదర్శనము. ఇటువంటి భక్తులు మూడులోకములను పవిత్రం చేస్తారు. నా మీద భక్తిలేకపోతే వారి చిత్తము ఎన్నటికీ పరిశుద్ధము కాదు.

మకిల పట్టిన బంగారమును అగ్నిలో వేసి కాలిస్తే ఆ మకిల అంతా పోయి ప్రకాశిస్తుంది. అలాగే నా మీద ఉన్న అచంచలమైన భక్తితో వారిలో ఉన్న పూర్వ జన్మ వాసనలు అన్నీ నశించిపోతాయి. వారి హృదయములు పవిత్రం అవుతాయి. కంటికి జబ్బు వస్తే ఎదురుగా ఉన్న వస్తువులు కూడా సరిగా కనపడవు. ఆ కంట్లో మందు వేస్తే, కంట్లో ఉన్న వ్యాధి పోయి, కళ్లు సరిగా కనపడతాయి. అలాగే నన్ను కీర్తించడం

ద్వారా, నా లీలలను వినడం ద్వారా, మానవుల మనసులలోని మాలిన్యం తొలగి పోయి, పవిత్రం అవుతాయి.

ఉద్ధవా! ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయముల గురించి విషయ వాంఛల గురించి, కామ సంబంధ మైన వాటి గురించి ఆలోచించే వాడి మనస్సు నిరంతరము ప్రాపంచిక విషయముల యందు, విషయ వాంఛల యందు లగ్నమై ఉంటుంది. అలా కాకుండా ఎల్లప్పుడూ నా గురించి ఆలోచిస్తూ నన్నే స్మరిస్తూ ఉన్న వాడి మనసు నిరంతరము నాయందే లగ్నం అయి ఉంటుంది. విషయ వాంఛల యందు మనసు నిలిపితే దు:ఖం కలుగుతుంది. నా యందు మనసు నిలిపితే సుఖం కలుగుతుంది. ఇంతే తేడా! కాబట్టి నువ్వు కూడా ప్రాపంచిక విషయముల యందు మనసు నిలపకుండా, నన్నే ధ్యానించు, స్మరించు, కీర్తించు. నీ చిత్తము నా యందే నిలుపు.

ఉద్ధవా! మరొక విషయం.పర స్త్రీలతో కానీ, ఎల్లప్పుడూ పర స్త్రీల పొందు కోరేవాడితో కానీ స్నేహం చేస్తే, సంసారంలో చిక్కుకుంటావు. సంసారము నుండి విముక్తుడవు కావాలంటే ఎల్లప్పుడూ ఒంటరిగా ఉండటానికి ప్రయత్నించు. ఎందుకంటే పర స్త్రీలతో సాంగత్యము వలనా, ఎల్లప్పుడూ పర స్త్రీలతో సుఖములు అనుభవించే వారి సాంగత్యము వలనా, జీవులకు అనేక విధములైన కష్టములు, నష్టములు, బాధలు కలుగుతాయి. పర స్త్రీ సాంగత్యము మానవుని సంసార బంధనములలో పడవేస్తుంది. పర స్త్రీ సాంగత్యము వలన కలిగే కష్ట నష్టములు ప్రపంచములోని ఏ ఇతర విషయముల వలన కలుగవు." అని ఉపదేశించాడు కృష్ణుడు. (అందుకేపురాతన

కాలం నుండి వివాహ వ్యవస్థ మానవ సమాజంలో ధృఢంగా ఉంది.)

అప్పుడు ఉద్ధవుడు కృష్ణునితో ఇలా అన్నాడు. "కృష్ణా! నిన్ను స్మరించాలి, పూజించాలి, ధ్యానించాలి అని అన్నావు కదా. నిన్ను ఏ రూపంలో స్మరించాలి. కాస్త వివరంగా చెప్పు." అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు ఈ విధంగా చెప్పాడు.

"ఉద్ధవా! ధ్యానంలో కూర్చునే ముందు నువ్వు మంచి ఆసనమును ఏర్పాటు చేసుకోవాలి. అది ఎక్కువ ఎత్తు అయినది, ఎక్కువ కిందగా ఉండేదీ కాకుండా, సమంగా ఉండేది, నీకు కూర్చోడానికి సుఖంగా ఉండేది అయిన ఆసనమును ఏర్పాటు చేసుకొని దానిమీద నిటారుగా కూర్చోవాలి. చేతులు ఒడిలో పెట్టుకోవాలి. దృష్టిని ముక్కు కొసన నిలపాలి. ప్రాణాయామం చెయ్యాలి. గట్టిగా గాలి పీల్చి, నిలపగలిగినంత సేపు నిలిపి మరలా నెమ్మదిగా వదిలిపెట్టాలి. శ్వాసను క్రమబద్ధం చేయాలి. రోజు రోజుకూ ప్రాణాయామం చేసే సమయమును పెంచుకుంటూ పోవాలి.

మూలాధార చక్రము నుండి ప్రారంభించి, ఓంకార ధ్వనిని పైపైకి తీసుకొని వెళ్లాలి. అంటే ఓంకారమును మెల్లగా ఆరంభించి పైపైకి తీసుకొని వెళుతూ ఆ ధ్వనిని స్వరంతో కలపాలి. (ఓం తో ప్రారంభించి మ్మ్మ్ అంటూ దీర్ఘంగా కలపాలి) ఈ మాదిరి ప్రతిరోజూ మూడుసార్లు చెయ్యాలి. ఈ మాదిరి చేస్తే ఒక నెల రోజులలో శ్వాస స్వాధీనం అవుతుంది. మనసులో పైకి లేచి ఉన్న, ముడుచుకొని ఉన్న, ఎనిమిది దళములు ఉన్న, మెల్ల మెల్లగా వికసిస్తున్న పద్మమును మనసులో ధ్యానించాలి. ఆ పద్మము మధ్యలో సూర్యుని, చంద్రుని,

అగ్నిని ఉంచాలి. వాటి మధ్య నా స్వరూపమును ప్రతిష్ఠించాలి.

ఉద్ధవా! నా రూపం ఎలా ఉంటుందంటే............ప్రశాంతంగా ఉంటుంది. అవయవాలు సమంగాఉంటాయి. ప్రసన్నమైన ముఖంతో ఉంటుంది. పొడవైన చేతులు కలిగిఉంటుంది. మెడ అందంగా ఉంటుంది. చెక్కిళ్లు నిండుగా ఉంటాయి. ముఖాన చిరునవ్వు మెరుస్తూ ఉంటుంది. చెవులకు ప్రకాశిస్తున్న మకరకుండలములు ఉంటాయి. బంగారు రంగులో ఉన్న పచ్చని పట్టు బట్ట కట్టుకొని ఉంటాను. వక్షస్థలములో శ్రీవత్సము అనే పుట్టు మచ్చ ఉంటుంది. నాలుగు చేతులలో శంఖము, చక్రము, గద, తామర పుష్పము ఉంటాయి. మెడలో వనమాల వేలాడుతూ ఉంటుంది. కాళ్లకు అందియలు ఉంటాయి. కంఠములో కౌస్తుభ మణి ప్రకాశిస్తూ ఉంటుంది. మణిమయ కిరీటము, ముత్యాల మొలనూలు ఉంటాయి. నా రూపము మనోహరంగానూ, హృద్యంగానూ, సర్వాంగ సుందరంగానూ, ప్రసన్నమైన ముఖంతోనూ, అతి కోమలంగానూ ఉంటుంది.

ఇటువంటి నా రూపములో ఉన్న అన్ని అవయవముల యందు నీ మనసును లగ్నం చెయ్యి. బుద్ధిమంతుడైన వాడు, తన మనస్సును ప్రాపంచిక విషయముల నుండి వెనుకకు లాగి, నా యొక్క అన్ని అవయవముల యందు లగ్నం చేస్తాడు. తరువాత తన ఇష్టం అయిన అవయవమునందు మనసును నిలుపుతాడు. ఉదాహరణకు నా యొక్క సుందర మైన ముఖము నందు కానీ, నా పాదముల యందు కానీ మనసును నిలిపితే, మిగిలిన అవయవము

లను విడిచి పెట్టి నా ముఖమునుకానీ, పాదములను కానీ మనసులో నిలుపుకోవాలి. వాటినే ధ్యానించాలి. క్రమ క్రమంగా తన మనసును అక్కడి నుండి శూన్యంలోకి మళ్లించాలి.

(మనం పూజించే విగ్రహాలు మన మనసును నిశ్చలంగా నిలపడానికి, పరమాత్మ యందు భక్తి కలగడానికి, మనలను పరమాత్మ దగ్గరకు చేర్చడానికి పనికి వస్తాయి అని వ్యాసుల వారి అభిప్రాయము. కాని మనం ఆ విగ్రహాలకు అలంకారాలు చేయ్యడం, వజ్రకిరీటాలు సమర్పించడం, రకరకాల నివేదలను అర్పించడం, మేం అవి చేసాము, ఇవి చేసాము అని గొప్పలు చెప్పుకోవడం, వీటితోనే ఆగిపోతున్నాము. ముందుకు సాగడం లేదు.)

తరువాత ఆ అవయవమును, శూన్యమును విడిచిపెట్టి, కేవలము శుద్ధబ్రహ్మమును మాత్రమే ధ్యానించాలి. బ్రహ్మము మీదనే మనసును లగ్నంచేయాలి. ఇంక ఏ ఇతర వస్తువు గురించి తలంచ కూడదు, ఆలోచించకూడదు. ధ్యానించకూడదు. అప్పుడు పురుషుడు తన లో ఉన్న జీవాత్మలో పరమాత్మను, పరమాత్మలో జీవాత్మను దర్శిస్తాడు. ఇది తీవ్రమైన ధ్యానముతో కానీ సిద్ధించదు.

పరమాత్మ యందు మనసును లగ్నం చేసిన వానికి ఈ ప్రపంచంలో దొరికే వస్తువుల మీద, ఆ వస్తువులతో చేసే పనుల మీద, ఆ వస్తువులను సంపాదించాలనే కోరికలమీదా ఎటువంటి ఆసక్తి ఉండదు. ప్రాపంచిక విషయములు మీద ఉన్న భ్రమలు అన్నీ తొలగి పోతాయి. ప్రాపంచిక విషయములు, విషయ వాంఛలు అన్నీ అసత్యములు, పరమాత్మ ఒక్కడే సత్యము అనే జ్ఞానం సిద్ధిస్తుంది." అని

శ్రీకృష్ణుడు ఉద్ధవునికి జ్ఞానోపదేశం చేసాడు అని శుకయోగి పరీక్షిత్ మహారాజుకు వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

పదునైదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి తన ఉపదేశాన్ని కొనసాగించాడు.

"ఉద్ధవా! ఇంద్రియములను జయించిన వాడు, ప్రాణాయామము ద్వారా శ్వాసను నియంత్రించిన వాడు, స్థిరమైన చిత్తము కలవాడు అయిన యోగి తన మనస్సును నిరంతరము నా యందే నిలిపి ఉంచుతాడు. అటువంటి యోగికి అణిమ మొదలగు ఎనిమిది సిద్ధులు వాటంతట అవే సిద్ధిస్తాయి." అని అన్నాడు.

ఇంతలో ఉద్ధవుడు కలుగచేసుకొని కృష్ణునితో ఇలా అన్నాడు. "కృష్ణా! నువ్వు యోగుల సంగతి, సిద్ధుల సంగతి చెప్పావు కదా! వారు ఎలా ఉంటారు. వారి వేష భాషలు ఎలాఉంటాయి. వారికి సిద్ధులు ఎలా వస్తాయి. అసలు సిద్ధులు ఎన్ని. వీటి గురించి నాకు

తెలియజెయ్యి." అని అడిగాడు. దానికి సమాధానంగా శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

"ఉద్ధవా! యోగులు 18 సిద్ధులు ఉన్నాయని చెప్పారు. వాటిలో 8 సిద్ధులు ప్రసిద్ధమైనవి. ఆ సిద్ధులు పరమాత్మ యందే ఉన్నాయి. ఆ ఎనిమిది సిద్ధులకు పరమాత్మ అధిష్టానము. మిగిలిన 10 సిద్ధులు మూడు గుణములతో ప్రభావితమౌతున్నాయి. నేను చెప్పిన ఎనిమిదిసిద్ధులలో అణిమ, మహిమ, గరిమ మొదటివి. ఇవి శరీరమునకు సంబంధించినవి. తరువాతది ప్రాప్తి. ఇది ఇంద్రియములకు, ఆ ఇంద్రియముల అధిష్ఠాన దేవతలకు సంబంధించినది. ప్రాకామ్యము అనే సిద్ధి లౌకికమైన వాటికి, పరలోకములో ఉండే వాటికి సంబంధించినది. వాటిని ఇష్టం వచ్చినట్టు అనుభవించడానికి అనువైనది. ఈశితము అనేసిద్ధి శరీరములో ఉన్న శక్తులకు ప్రేరణ ఇస్తుంది. తరువాతది వశిత. ఈ సిద్ధి పొందిన వాడు ప్రపంచంలో విహరిస్తున్నా విషయ సుఖములు అనుభవిస్తున్నా వాటి యందు ఏ మాత్రం ఆసక్తి లేకుండా ఉంటాడు. కామావసాయిత అనేది ఎనిమిదవ సిద్ధి. ఈ అష్టసిద్ధులు నాకు సహజంగానే సిద్ధించాయి. ఇవి ఉన్నాయి అని నేను ఎన్నడూ గర్వాన్ని పొందలేదు.

ఇవి కాక ఇంకా 10 సిద్ధులు ఉన్నాయని చెప్పాను కదా! ఈ సిద్ధులు మూడు గుణముల కలయిక వలన సిద్ధిస్తాయి. అవి ఏమిటంటే... శరీరంలో కలిగే ఆకలి, దప్పిక మొదలగు వాటిని నియంత్రించడం, దూరములో జరిగే విషయములను చూచేశక్తి, దూరంగా మాట్లాడుకునే మాటలను వినేశక్తి కలిగి ఉండటం. ఇష్టమైన

ప్రదేశమునకు, ఈ శరీరముతో, మనోవేగముతో వెళ్లగలిగి ఉండటం, తనకు ఇష్టం వచ్చిన రూపమును ధరించడం (కామరూపులు), పరకాయ ప్రవేశం చేయడం (తన శరీరములో ఉన్న చైతన్యాన్ని మరొక శరీరంలోకి ప్రవేశపెట్టడం), తనకు ఇష్టం వచ్చినపుడు మరణించే శక్తి కలిగి ఉండటం (స్వచ్ఛంద మరణం...భీష్మునికి ఉన్న శక్తి), దేవలోకంలో దేవతలు, దేవతా స్త్రీలు సలిపే క్రీడలను చూడగలిగి ఉండటం, తాను ఏమి సంకల్పిస్తే అది సిద్ధించడం, తాను ఏ మాట అంటే అది జరిగి పోవడం. ఈ పది సిద్ధులు మానవుని రజోగుణము, తమోగుణముల నుండి పుట్టినవి. ఈ గుణములకు అనుగుణంగా పై సిద్ధులు సంక్రమిస్తాయి.

ఇవి కాక క్షుద్ర శక్తులు కొన్ని ఉన్నాయి. జరిగినది, జరుగుతున్నది, జరగబోయేది తెలుసుకోవడం, శరీరం ఎండ, వాన, చలికి తట్టుకునే శక్తి కలిగి ఉండటం, ఇతరుల మనసులో మెదిలే ఆలోచనలను పసికట్టడం, అగ్ని స్తంభన, వాయుస్తంభన, జలస్తంభన మొదలగు విద్యలు, విషం తిన్నా తట్టుకోగలిగే శక్తి కలిగి ఉండటం, ఎదుటి వారిని సులభంగా జయించే శక్తి. ఇవి క్షుద్రశక్తులు.

ఉద్ధవా! ఇప్పటి దాకా నీకు సిద్ధులు పేర్లు వాటి లక్షణముల గురించి చెప్పాను. ఏ యోగము అవలంబిస్తే ఏ సిద్ధి లభిస్తుందో వివరంగా చెబుతాను విను.

నేను సూక్ష్మరూపంలో ఉంటాను. నాకు స్థూల శరీరం లేదు. అటువంటి నాలో ఎవరైతే తమ సూక్ష్మశరీరంతో ప్రవేశించి,

పంచతన్మాత్రలను ఉపాసిస్తాడో , అతడు అణిమ అనే సిద్ధిని పొందుతాడు.

మహత్తత్వ రూపంలో అంటే అనంత విశ్వరూపంలో ఉన్న నాలో ఎవరైతే తన చిత్తమును ప్రవేశపెట్టి నన్ను ఉపాసిస్తాడో, అతడు మహిమ అనే సిద్ధిని పొందుతాడు. ఇదేవిధంగా, ఆకాశము మొదలగు భౌతిక ఉపాధులలో తన చిత్తమును ప్రవేశపెట్టిన వాడు, దానికి తగిన మహిమలనే పొందుతాడు.

అగ్ని, వాయువు, జలము, భూమి ఇవి అన్నీ పరమాణు రూపంలో ఉండే భూతములు. పరమాణువులు అన్నీ కలిస్తేనే ఈ భూతాలు ఏర్పడతాయి. యోగి ఈ నాలుగు భూతములలో తన చిత్తమును ప్రవేశపెడితే, తాను కూడా ఆ భూతముల మాదిరి సూక్ష్మమైన పరమాణువులతో సమాన మైన శక్తులను పొందుతాడు. దానినే లఘిమ అంటారు.
(వివరంగా చెప్పాలంటే మన శరీరం స్థూల రూపము. కాని ఈ శరీరం కూడా అనేక పరమాణువుల కలయిక. అలాగే ప్రపంచంలో ఉండే అన్ని వస్తువులు కూడా అనేక పరమాణువుల కలయిక. యోగి తన శరీరమును పరమాణువులుగా విభజిస్తాడు. అంటే మాయం అవుతాడు. కనపడకుండా పోతాడు. గోడలలో నుండి, తలుపులలో నుండి చెట్లలో నుండి రాళ్లలో నుండి, పర్వతములలో నుండి, జలములో నుండి వెళ్లగలడు. రాగలడు. మరలా తన ఇష్టం వచ్చినపుడు ఆ పరమాణువులను ఒకటిగా చేసి స్థూల శరీరం పొందుతాడు.

ఉదాహరణకు మీ చేతిలో ఒక ఫోటో ఉంది. దానిని స్కాన్ చేసారు. మైల్ లో అమెరికాకు పంపారు. ఏం జరుగుతుంది. ఆ ఫొటో చిన్న చిన్న బైట్సుగా విడి పోతుంది. మైల్‌ద్వారా వెళుతుంది. అక్కడ ప్రింటర్ లో మరలా అవన్నీ కలిసిపోయి ఫోటోగా మారుతుంది. ఇదీ అలాగే అనుకోవచ్చుకదా! ఏమంటారు? ఆలోచించండి.)

ఉద్ధవా! నేనుసత్వగుణ ప్రధానుడను. అటువంటి నన్ను ఏకాగ్ర చిత్తంతో నిర్మల మైన మనస్సుతో ధ్యానిస్తే, అన్ని ఇంద్రియములకు అధిష్టానముగా ఉన్న "ప్రాప్తి" అనే సిద్ధిని పొందుతాడు.

మహత్తత్వము క్రియాశక్తికి ప్రధానము. అటువంటి మహత్తత్వములో తన మనస్సును లగ్నం చేసి నన్ను ఉపాసిస్తే, "ప్రాకామ్య" అనే సిద్ధిని పొందుతాడు.

త్రిగుణములతో కూడిన మాయకు అధిపతిని అయిన నా యందు మనస్సును లగ్నం చేసిన వారికి "ఈశిత్వము"అనే సిద్ధి లభిస్తుంది.

భగవంతుడను, నారాయణ స్వరూపుడను అయిన నాయందు మనస్సును లగ్నం చేస్తే, నా ధర్మములతో కూడిన "వశిత్వము" అనే సిద్ధి లభిస్తుంది.

పరబ్రహ్మ స్వరూపుడు అయిన నా యందు మనస్సు, బుద్ధి లగ్నం చేస్తే, అతడికి సకల కోరికలు నశించి, పరమానంద స్థితిని పొందుతాడు. సాత్విక ధర్మమును నిరంతరము అనుష్ఠించేవాడిని అయిన నా యందు మనసును లగ్నం చేస్తే, అప్పుడు అతనికి ఆకలి, దప్పిక, కోరికలు, వీటి మీద ధ్యాస ఉండదు. పరిశుద్ధమైన ఆత్మస్వరూపమును పొందుతాడు.

ఉద్ధవా! నేనే ఆకాశమునే ఆత్మగా కల వాడను. అటువంటి నా యందు మనసు ఉంచి ఓంకారమును జపిస్తే అటు వంటి వాడికి ఆకాశంలో కానీ, ఇంకా దూరంలో కానీ చేయబడే శబ్దములను, దూరం నుండి వినే శక్తి లభిస్తుంది.

యోగి తన నేత్రములను సూర్యమండలములోనూ, తననేత్రములలో సూర్యుని లగ్నం చేసి, ఈ రెండింటి సంయోగము ద్వారా పరమాత్మను ధ్యానిస్తే, అతనికి దూర ప్రాంతములలో జరిగే విషయములను, దూరంగా ఉన్నసమస్త వస్తువులను, ప్రాణులను స్పష్టంగా చూచే శక్తి లభిస్తుంది.

యోగి తన శరీరమును, మనస్సును, ప్రాణములను నాలో లగ్నం చేసి నన్ను ధ్యానిస్తే, అతనికి "మనోజవము" అనేసిద్ధి లభిస్తుంది. ఈ శక్తితో ఆ యోగి తాను కోరుకున్న చోటికి క్షణాల్లో పోగలడు. అలాగే యోగి, పరమాత్మ యందు మనస్సును లగ్నం చేస్తే, తన మనస్సుకు అనుకూలంగా తాను ఎవరి రూపం ధరించాలి అని అనుకుంటాడో ఆ రూపం ధరించగలడు. అంటే కామరూప శక్తిని పొందగలడు.

యోగి తాను ఇతరుల శరీరములో ప్రవేశించాలి అని అనుకున్నప్పుడు, తన మనస్సులో తాను ఆ శరీరంలో ఉన్నానని గాఢంగా సంకల్పిస్తాడు. తుమ్మెద ఒక పూవు మీది నుండి మరొక పూవు మీదికి వాలే విధంగా, ప్రాణములు ప్రధానంగా కలిగి, సూక్ష్మశరీరం కలిగిన అతని ఆత్మ, అతని శరీరం నుండి మరొక శరీరంలోకి వాయు మార్గం ద్వారా ప్రవేశిస్తుంది.

మరణ కాలములో యోగి, తన కాలి మడమతో అపాన మార్గమును మూసి (అంటే అపాన మార్గము గుండా ప్రాణములు పోకుండా ఆపి). తన ప్రాణములను పైపైకి తీసుకొని వెళ్లి, హృదయములో నిలిపి, అక్కడి నుండి తల మీది భాగము వరకు తీసుకొని వెళ్లి, అక్కడి నుండి తల మీద ఉన్న బ్రహ్మ రంధ్రమును ఛేదించుకొని అనంత విశ్వంలో కలపాలి. అప్పుడు ఈ స్థూల శరీరం నుండి ప్రాణములు వెళ్లిపోయి, శరీరం పడిపోతుంది.

యోగి మానవ లోకము విడిచి దేవలోకములోకి ప్రవేశించి అక్కడ ఉన్న దేవతల, దేవతాస్త్రీల విహార స్థలములలో తిరగాలి అని అనుకుంటే. నన్ను శుద్ధసత్వగుణముతో ధ్యానించాలి. అప్పుడు సత్వగుణ ప్రధానులు అయిన దేవతా గణములు అతని వద్దకే వస్తారు.

ఏ యోగి అయినా తన చిత్తమును నా యందు లగ్నం చేసి ఏకాగ్రచిత్తంతో నన్ను ధ్యానం చేస్తే, అతడు సంకల్పించిన పనులు అన్నీ నెరవేరుతాయి. అదేవిధంగా అతడు ఏమి కోరితే అది

జరుగుతుంది. అతడు ఏ ఆజ్ఞ ఇస్తే ఆ ఆజ్ఞ అమలు చేయబడుతుంది. (శాపం ఇవ్వడం ఇదే కావచ్చు).

ఉద్ధవా! నేను ఈ అనంత విశ్వమునకు అధిపతిని. సకల శక్తులు నా వశంలో ఉన్నాయి. అటువంటి నన్ను మనసారా ధ్యానిస్తే, అతనికి ఈశిత్వము అనే సిద్ధి లభిస్తుంది. అప్పుడు ఆ యోగి ఏ మాట అంటే ఆ మాట జరుగుతుంది. ఆ యోగి ఆజ్ఞ నా ఆజ్ఞవలె ఈ విశ్వంలో అప్రతిహతంగా వ్యాపిస్తుంది.

యోగి అయిన వాడు నా యందు మనస్సు లగ్నం చేస్తే, నా మీద భక్తి, శ్రద్ధ కలిగి ఉంటే, అతని మనసు కూడా సత్వగుణమును సంతరించుకొని శుద్ధి అవుతుంది. అతడికి తన యొక్క, ఇతరుల యొక్క జనన మరణముల గురించి, లోకంలో జరిగినవి, జరుగుతున్నవి, జరగబోయేవి అన్ని విషయములు తెలుస్తాయి. (దివ్యదృష్టి అని అంటారు కదా!)

ఉద్ధవా! మనిషి నీళ్లలో పడితే ఊపిరి ఆడక మరణిస్తాడు. కాని నీటిలో ఉన్న చేపలు మొదలగు జలచరములు అలా మరణించవు. అలాగే భక్తియోగముతో నన్ను ఉపాసించిన యోగి, శాంత చిత్తుడవుతాడు. యోగము ఫలించిన తరువాత అతని శరీరము యోగముతో పరిపక్వమౌతుంది. అప్పుడు అగ్ని మొదలగు పంచభూతములు కూడా అతనిని ఏమీ చేయలేవు.

ఇంతెందుకు నన్ను చతుర్భుజములతోనూ,

శంఖు,చక్ర,గద,తామర పుష్పములతోనూ, వనమాలతోనూ, శ్రీవత్సముతోనూ, కౌస్తుభముతోనూ అలంకరింపబడిన నా మూర్తిని ధ్యానించే యోగికి ఈలోకములో అసాధ్యము అంటే ఏమి లేదు. పైన చెప్పిన విధంగా నన్ను ఉపాసించిన యోగికి అష్టసిద్ధులు సిద్ధిస్తాయి. ఇంద్రియములను, మనస్సును జయించిన వాడికి, ప్రాణాయామంతో శ్వాసను నియమించిన వాడికి, లభించని సిద్ధి అంటూ ఏదీ ఉండదు.

ఉద్ధవా! ఈ సిద్ధులు అన్నీ ప్రాపంచిక సుఖములు అనుభవించడానికే పనికి వస్తాయి. ఉత్తమమైన భక్తిమార్గములో నడిచేవాడికి, నాలో ఐక్యం కావడమే లక్ష్యంగా కల యోగికి, ఈ సిద్ధులు అడ్డం వస్తాయి. ఈ సిద్ధులను పొందడానికి తన సమయం వృధా చేసుకుంటాడు యోగి. ఈ లోకములో పుట్టడం, ఓషధుల గురించి తెలుసుకోవడం, తపస్సు చేయడం, మంత్రశాస్త్రములను అధ్యయనం చేయడం ఇవన్నీ ధారణ అనే యోగం ద్వారా లభిస్తాయి. కాని ఆ యోగికి ఈ ఉపాయముల చేత కానీ, ఇతర ఏ ఉపాయములచేత కూడా నన్ను చేరుకొనే సిద్ధి లభించదు.

ఉద్ధవా! నాలోనే అన్ని సిద్ధులు ఉన్నాయి. అన్ని యోగములు నాలోనే ఉన్నాయి. సాంఖ్యయోగమునకు, నిష్కామ కర్మలకు, కారణం నేనే. ఈ లోకమును పాలించేవాడిని నేనే. నాలోనే సకల చరాచర సృష్టి ఉంది. ప్రతి జీవునిలోనూ స్థూల శరీరంగానూ, అంతర్యామిగానూ నేను విరాజిల్లుతున్నాను. నన్ను స్మరించడం, పూజించడం, ఆరాధించడం, నా మీద భక్తి శ్రద్ధ కలిగి ఉండటం నన్ను చేరుకొనే మార్గాలు.”

అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి వివిధ సిద్ధుల గురించి ఉపదేశించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము పదునైదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

పదునారవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో శ్రీకృష్ణ ఉద్ధవ సంవాదమును ఈ విధంగా వివరిస్తున్నాడు.

ఉద్ధవుడు శ్రీకృష్ణునితో ఇలా అంటున్నాడు. "కృష్ణా! నీవు మానవ రూపంతో మా ముందు కృష్ణుడుగా నిలబడి ఉన్నా, నీవు పరమాత్మ స్వరూపుడవు. నీవు ఎప్పటినుండో ఉన్నావు. నీకు ఆది, అంతము లేదు. నీకు ఒక ఆవరణం అంటూ లేదు. అంతటా ఉన్నావు. సాక్షాత్తు పరబ్రహ్మ అంటే నీవే తప్పవేరు కాదు. ఈ అనంత విశ్వంలో సకల చరాచర జీవ రాసులను పుట్టించి, పోషించి, లయం చేసేది నీవే! ఉత్తమ మైన ప్రాణులలో ఉన్నావు. అలాగే నీచమైన ప్రాణులలో కూడా ఉన్నావు. (దానిని నిరూపించడానికే మనం హీనంగా తలిచే చేప, అసహ్యించుకునే వరాహము, అతి నెమ్మదిగా నడిచే కూర్మము,

మృగరాజుగా చెప్పబడే సింహము, ఉత్తమా మానవుడిగా చెప్పబడే రాముడు ఈ అవతారములు అన్నీ పరమాత్మవే. కాబట్టి పరమాత్మకు ఉన్నతము నీచము అనే తేడాలేదు. అన్నీ మనలోనే ఉన్నాయి.)

ఈ విషయం అందరికీ తెలుసు. కానీ అందరూ తెలియనట్టే వాడు గొప్ప, వీడు పేద అనే భేదభావంతో ఉంటారు. కేవలము నీ మీద భక్తి శ్రద్ధ ఉన్న వారు మాత్రమే నీ గురించి తెలుసుకోగలరు. మేము సరే పామరులము. నీ గురించి పూర్తిగా మాకు తెలియదు. మాకు తోచినట్టు ఏదో ఒక విగ్రహము రూపంలో నిన్ను ఆరాధిస్తుంటాము. కానీ పరమ యోగులు, మహా ఋషులు నిన్ను ఎలా భావిస్తారు? ఎలా పూజిస్తారు? ఎలా ఆరాధిస్తారు? వారి భక్తి ఎలా ఉంటుంది?

ఓ దేవా! నీవు సర్వాంతర్యామివి. చరాచర జగత్తు నీ మాయ అనే మోహంలో పడి ఉంది. నీవు అన్నిటినీ సాక్షిగా చూస్తుంటావు కానీ నిన్ను మేము చూడలేకపోతున్నాము. ఓ దేవా! మూడులోకములలోనూ, నాలుగు దిక్కులలోనూ, నిండి ఉన్న నీ విభూతుల గురించి నాకు చెప్పు. నీ పాదములను పట్టుకొని ప్రార్థిస్తున్నాను." అనిఅడిగాడు ఉద్ధవుడు. ఉద్ధవుడు అడిగిన దానికి శ్రీకృష్ణ పరమాత్మ ఈ విధంగా సమాధానం ఇచ్చాడు.

"ఉద్ధవా! ఇప్పుడు నువ్వు నన్ను అడిగిన ప్రశ్న కురుక్షేత్ర మహా సంగ్రామం జరగబోయే ముందు అర్జునుడు నన్ను అడిగాడు. ఇంకాసేపట్లో యుద్ధం ప్రారంభం కాబోతూ ఉండగా, అర్జునుడికి ఒక విపరీతమైన ధోరణి పుట్టింది. "వీరందరూ నా బంధువులు. నేను యుద్ధం చేసి వీరిని చంపాలా! వీరి నాశనానికి నేను కారణం కావాలా!

నా చేతిలో వీరంతా చనిపోతారు కదా! నేను ఎవరి కోసరం జీవించాలి?" అని ఒక సామాన్య మానవుని మాదిరి విలపించాడు. నేను యుద్ధం చేయను అని ధనుర్బాణములు కింద పెట్టి రథం మీద చతికిల బడి కూర్చున్నాడు. ఉద్ధవా! ఆ సమయంలో నేను సమయోచితంగా యుక్తియుక్తంగా ఉపదేశించి, అర్జునుడికి తత్వబోధ చేసాను. ఇప్పుడు నువ్వు అడిగిన ప్రశ్నే అర్జునుడు కూడా అడిగాడు. ఆనాడు అర్జునునికి నేను చెప్పిన సమాధానమే నేడు కూడా నీకు చెబుతున్నాను.

ఉద్ధవా! నేను పరమాత్మ స్వరూపుడను. అందరికీ హితమును చేకూర్చే వాడిని. సకల వ్యవహారములకు నేను మూలము. సృష్టి,స్థితి,లయములను నేను నిర్వహిస్తున్నాను. నిరంతరము కదిలే పదార్థములలోనూ, జీవులలోనూ ఉన్న కదిలే శక్తిని నేనే. నేను కాల స్వరూపుడను. మూడుగుణములలో సత్వగుణము నేను. ఈ ప్రకృతి అంతా నేనే. ఈ ప్రకృతిలో ఉన్న గుణములు అన్నీ నా స్వరూపాలే. నేను అన్ని జీవులలో, మణిహారంలో దాగి ఉన్న దారం మాదిరి, కనపడకుండా ఉన్నాను. అత్యంత స్థూల పదార్థములలో మహత్తత్వమును నేను! అత్యంత సూక్ష్మ పదార్థములలో జీవాత్మను నేను. జయింపరాని వాటిలో మనస్సును నేను.(మానవులు దేనినైనా జయింపగలరుకానీ మనసును జయించలేరు)

ఓ ఉద్ధవా! నేను వేదములను బోధించే వారిలో బ్రహ్మ వంటి వాడిని. (గురు: సాక్షాత్ పరబ్రహ్మ అని అన్నారు కదా!) అన్ని మంత్రములకు మూలమైన ఓంకారమును నేనే! అక్షరములలో మూలమైన 'అ' కారమును నేను. ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు

నేనే! దేవతలలో ఇంద్రుడను, అష్టవసువులలో అగ్నిని, ఆదిత్యులలో విష్ణువు, రుద్రులలో నీలలోహితుడను నేనే! బ్రహ్మ ఋషులలో భృగువు, రాజర్షులలో మనువు, దేవ ఋషులలో నారదుడు నేను. ఆవులలో కామధేనువు నేనే! సిద్ధులలో కపిలుడు, పక్షులలో గరుడుడు, ప్రజాపతులలో దక్షుడు, పితృగణములలో అర్యముడు నేనే.

దైత్యులలో ప్రహ్లాదుడు, ఓషధులు ఇచ్చే నక్షత్రములలో చంద్రుడు, యక్షులు రాక్షసులలో కుబేరుడు నేనే. ఏనుగులలో ఐరావతము, జలచరములలో జలమునకు అధిదేవత అయిన వరుణుడు, ప్రకాశించే వారిలో తాపం కలుగచేసే వారిలో సూర్యుడు, మానవులలో రాజును నేనే (నా విష్ణు: పృథివీ పతి: అంటే విష్ణువు కాని వాడు, విష్ణు అంశ లేని వాడు రాజు కాలేడు అని ఆర్యోక్తి) అశ్వములలో ఉచ్ఛైశ్రవము, ధాతువులలో బంగారము, దండనాధి కారము కలవారిలో యమధర్మరాజును, సర్పములలో వాసుకిని నేనే. నాగులలో అనంతుడను, మృగములలో సింహమును, నాలుగు ఆశ్రమములలో సన్యాస ఆశ్రమము, నాలుగు వర్ణములలో బ్రాహ్మణ వర్ణము నేనే.

నదులలో గంగానది, జలాశయములలో సముద్రము, ఆయుధములలో ధనుస్సు, ఆ ధనుస్సును ధరించేవారిలో శంకరుడను నేనే. నివసించడానికి యోగ్యమైన స్థానములలో మేరు పర్వతము నేనే. (దేవతలు త్రిమూర్తులు అక్కడే నివాసం ఉంటారని సూర్యుడు మేరు పర్వతం చుట్టు తిరుగుతాడనీ పురాణాలు చెబుతున్నాయి.) పర్వతములలో హిమాలయము, వృక్షములలో అశ్వత్థము, ఓషధులలో యవలు నేనే. పురోహితులలో వశిష్టుడు, వేదవిదులలో బృహస్పతి,

సేనాధిపతులలో కార్తికేయుడు, నేనే. యజ్ఞములలో యజ్ఞస్వరూపుడను, వ్రతములలో అహింసావ్రతము, ప్రపంచములో అన్ని పదార్థములను శుద్ధిచేయు వాటిలో అగ్ని, జలము, వాయువు, వాక్కు నేనే.

అష్టాంగ యోగములలో సమాధి యోగము, నేనే. స్త్రీలలో శతరూపను, పురుషులలో స్వాయంభువ మనువును, మునులలో నారాయణమునిని, బ్రహ్మచారులలో సనత్కుమారుడను నేనే. ధర్మములలో అభయ స్వరూపుడను, ప్రియంగా మాట్లాడేవాడిని, మౌనంగా ఉండేవాడిని, నేనే. దంపతులలో సృష్టించే శక్తి నేనే. ఋతువులలో వసంత ఋతువును, మాసములలో మార్గశిర మాసము, నక్షత్రములలో అభిజిత్ నక్షత్రము నేనే. యుగములలో కృతయుగము, ధీరులలో దేవలుడు, అసితుడు నేనే. వేదములను విభజించిన వ్యాసుడను నేనే. (వ్యాసాయ విష్ణు రూపాయ).

ఆచార్యులలో శుక్రాచార్యుడను నేనే. భగవాన్ అని చెప్పబడే వారిలో వాసుదేవుడను నేనే. భగవద్భక్తులలో ఉద్ధవుడను నేనే! కింపురుషులలో హనుమంతుడను నేనే. విద్యాధరులలో సుదర్శనుడను నేనే. రత్నములలో పద్మరాగము, పుష్పములలో తామర పుష్పము, గడ్డి జాతులలో దర్భలు, హోమం చేసే పదార్థములలో ఆవు నెయ్యి నేనే. ధనాధిపతులలో లక్ష్మిని, కపటంగా ప్రవర్తించే వారిలో జూదరిని, ఎటువంటి కష్టములు వచ్చినా ఓర్చుకునే వారిలో క్షమాగుణమును, సాత్వికులలో సత్వగుణమును నేనే. బలవంతులలో ఉండే ఉత్సాహము, పరాక్రమము నేనే. భగవద్భక్తులలో ఉండే భక్తిభావము నేనే!

సాత్వికులైన నవమూర్తులలో అనగా వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, నారాయణుడు, హయగ్రీవుడు, వరాహుడు, నృసింహుడు, బ్రహ్మ వీరిలో శ్రేష్టమైన వాసుదేవుడు అనే మూర్తి నేనే! గంధర్వులలో విశ్వావసుడు, అప్సరసలలో పూర్వచిత్తి, పర్వతములు, కొండలలో ఉన్న మహా స్థైర్యమును(చలనం లేకుండా నిలిచే శక్తి), పృథివిలోని మట్టి వాసనను నేనే. జలములో ఉన్న రుచిని, తేజస్సు కల వారిలో సూర్యుడను, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములలో వెలిగే శక్తిని, ఆకాశము నుండి పుట్టే శబ్దమును నేనే.

నా భక్తులలో బలిచక్రవర్తిని, వీరులలో అర్జునుడను నేనే. కాళ్లలో ఉండే నడిచే శక్తిని, వాక్కులో ఉండే మాట్లాడే శక్తిని, అపానములో ఉండే మల విసర్జన శక్తిని, చేతులలో ఉండే పట్టుకునే శక్తిని, జననేంద్రియములలో ఉండే సంభోగ శక్తిని, చర్మములో ఉండే స్పర్శ శక్తిని, కళ్లలో ఉండే చూచే శక్తిని, నాలుకలో ఉండే రసాస్వాదన శక్తిని, చెవులలో ఉండే వినికిడి శక్తిని, ముక్కులో ఉండే వాసన చూచే శక్తిని నేనే. (మనిషి చని పోయిన తరువాత అన్ని అవయవాలు ఉంటాయి కానీ వాటిలో ఉండే శక్తి ఉండదు. అందుకని శవం వినలేదు, చూడలేదు, కదలలేదు. మనిషి బతికి ఉన్నా అవయవాలలో ఉండే శక్తులు పని చేయక పోతే ఆయా అవయవములు కూడా పనిచేయవు. అదే ఇక్కడ చెప్పింది.)

ఉద్ధవా! రూప, స్పర్శ, రస, శబ్ద, గంధములు అనే పంచ తన్మాత్రలు నేనే. మానవులలో ఉన్న మనస్సు, బుద్ధి, అహంకారము నేనే. మహతత్వము, పంచభూతములు, పదకొండు ఇంద్రియములు (జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5 మనసు 1 మొత్తం 11), లోపల ఉన్న పురుషుడు, బయట ఉన్న ప్రకృతి, ప్రకృతిలో ఉన్న సత్వ, రజస్, తమోగుణములు, వీటికిఅతీతంగా ఉన్న బ్రహ్మము అన్నీ నేనే. సకల పదార్థముల గురించి తెలుసుకొనే శక్తి, జ్ఞానము, తత్వనిర్ణయము నేనే.

ఉద్ధవా! మూడు గుణములు నేనే, ఆ గుణములు అనుభవించే వాడిని నేనే. క్షేత్రము నేనే క్షేత్రజ్ఞుడను నేనే! పరమాత్మను నేనే. సకలజీవులలో ఆత్మస్వరూపుడను నేనే! నేనే లేని చోటు లేదు. ఈ అనంత విశ్వములలో ఉండే పరమాణువులను అయినా లెక్కించవచ్చు కానీ నా విభూతులను లెక్కపెట్టడం అసాధ్యం.

ప్రతి వస్తువులో ప్రతి జీవిలో ఒక రకమైన తేజస్సు ఉంటుంది.. ఐశ్వర్యం ఉంటుంది. పేరు ఉంటుంది. సిగ్గు ఉంటుంది. త్యాగబుద్ధి ఉంటుంది. అందం ఉంటుంది. సౌభాగ్యం ఉంటుంది. పరాక్రమము ఉంటుంది. ఓర్పు ఉంటుంది. జ్ఞానము విజ్ఞానము ఉ ంటాయి. ఆ గుణములు అన్నీ నాలోని అంశలే. ఉద్ధవా!

నేను నాడు అర్జునుడికి చెప్పిన విభూతులు అన్నీ నీకు చెప్పాను. (భగవద్గీత 10 వ అధ్యాయము విభూతి యోగము) కానిఈ విభూతులు అన్నీ కేవలం మనస్సులో కలిగే వికారములు మాత్రమే! వాక్కుకు అందనివి. ఉన్నాయి అనుకుంటే ఉన్నాయి. లేవు అనుకుంటే

లేవు. కాబట్టి వీటినే పరమార్థంగా, ప్రామాణికంగా భావించకూడదు. మానవులు చేయవలసినది ఏమిటంటే వాక్కును, మనస్సును, ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. ప్రాణాయామం ద్వారా శ్వాసను నియంత్రించాలి. సంయమనం పాటించాలి. సాత్వికమైన బుద్ధిని అలవరచుకోవాలి. ఈ విధంగా చేస్తే మరలా మరలా సంసార చక్రంలో పడే అవకాశం, అవసరం ఉండదు.

ముందు బుద్ధిని బాగుపరచుకోవాలి. బుద్ధి ద్వారా మనస్సును, వాక్కును అదుపులో పెట్టుకోవాలి. మనస్సు, వాక్కు నిగ్రహించుకోకపోతే, ఎన్ని వ్రతాలు చేసినా, ఎంత తపస్సు చేసినా, ఎన్ని దాన ధర్మాలు చేసినా అవి అన్నీ పచ్చికుండలో పోసిన నీరు మాదిరి వృథా అవుతాయి.

ఉద్ధవా!నా భక్తుడు అయిన వాడు, నా మీద అచంచల మైన భక్తి కలిగి ఉండాలి. భక్తితో కూడిన బుద్ధి ద్వారా మనస్సును, వాక్కును నిగ్రహించుకోవాలి. శ్వాసను ప్రాణాయామం ద్వారా నియంత్రించాలి. అప్పుడే అతడు తాను చేసే సాధనలో పరిపూర్ణత్వం సాధించగలడు." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి పరమాత్మ విభూతుల గురించి వివరించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు విభూతి యోగం గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము పదునారవఅధ్యాయముసంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## ఏకాదశ స్కంధము
## పదునేడవఅధ్యాయము.

"పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి తన ఉపదేశాన్ని కొనసాగించాడు. ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఇలా అడిగాడు.

"కృష్ణా! నీవు ఇంతకు ముందు వర్ణాశ్రమ ధర్మముల గురించి, ఆచార వ్యవహారముల గురించి, వర్ణాశ్రమ ధర్మములను పాటించని వారి గురించి, అటువంటి వారి భక్తి శ్రద్ధల గురించి, వివరించావు. ఎవరైతే తమ తమ ధర్మములను నియమం తప్పకుండా పాటిస్తారో, వారికి నీ మీద భక్తి ఎలా లభిస్తుందో వివరంగా చెప్పు. ఈ విషయం నీవు ఇదివరకే హంస రూపంలో బ్రహ్మాదులకు వివరించావు అని చెప్పావు. కాని నీవు చెప్పిన ధర్మములు కాలానుగుణంగా అందరూ మరిచిపోయి ఉంటారు. ఈ రోజుల్లో ధర్మం గురించి ప్రవచనం చేసే వారు గానీ, వినే వారు గానీ లేరు. మూడులోకములలో నిన్ను మించిన ధర్మప్రవచనములు చేసే ప్రవక్త మరొకడు లేడు. ధర్మము గురించి చెప్పినా, ధర్మమును ఆచరించినా, ధర్మమును ఇతరులతో ఆచరింపచేసినా, నీకు నువ్వే సాటి. అటువంటి నీవు ఈ భూమిని విడిచిపెట్టి నీ లోకమునకు వెళ్లిపోయిన తరువాత, భూలోకంలో ధర్మం గురించి చెప్పే వాళ్లు ఎవరుంటారు? నీతో పాటు ధర్మములు అన్నీ నాశనం కావలసిందేనా! కాబట్టి, మానవులలో దైవ భక్తి, దాని లక్షణములు, దాని ధర్మములు ఎవరికి ఏ విధంగా హితము అవుతుందో వివరించండి." అని అడిగాడు ఉద్ధవుడు.

ఉద్ధవుడు ఈ మాదిరి అడగగానే శ్రీకృష్ణుడు, మానవ లోకంలో, సకల ప్రాణుల హితం కోరి, సనాతనమైన భాగవత ధర్మములను ఈ విధంగా ఉపదేశించాడు.

"ఉద్ధవా! నీవు అడిగిన ప్రశ్న ధర్మసమ్మతంగానూ, వర్ణాశ్రమ ధర్మములను పాటించే మానవులలో భక్తిని పెంపొందించేది గానూ ఉ ంది. అందుకని సమాధానం చెబుతాను విను. యుగములలో మొదటిది కృతయుగము. దాని వర్ణము హంస మాదిరి స్వచ్ఛమైన తెలుపు. కృతయుగంలో మానువుల మనసులు కూడా తెల్లగా స్వచ్ఛంగా ఉండేవి. ఆ యుగంలో వారు పుట్టగానే ధర్మపరులై ఉండేవారు. అధర్మము అనే మాట మచ్చుకైనా వినిపించేది కాదు. వారికి భక్తి, శ్రద్ధ, విశ్వాసము మెండుగా ఉండేవి. ధర్మంగా నడుచుకోమని ఒకరు చెప్పవలసినపనిలేదు. అందుకని ఆ యుగమును పండితులు కృతయుగము అని అన్నారు. కృతయుగంలో వేదము ఒక్కటే. అదే ఓంకారము. అప్పుడు ధర్మము, సత్యము, దయ, శౌచము, తపస్సు అనే నాలుగు పాదములతో వృషభ రూపంలో ఉండేది. అప్పుడు ఈ యజ్ఞ యాగములు, జీవ హింస లేవు. మానవులు ఎక్కువగా తపస్సు చేసేవారు. పరమాత్మను హంస రూపంలో ధ్యానించేవారు.

తరువాత మానవులలో మార్పు వచ్చింది. త్రేతాయుగము మొదలయింది. అప్పుడు నాలో నుండి మూడు వేదములు ఆవిర్భవించాయి. అంటే ఓంకార స్వరూపంలో ఒకటిగా ఉన్న వేదము

మూడుగా విభజింపబడింది. దానినే త్రయీ విద్య అని అంటారు. వేదములలో చెప్పబడిన విధంగా యజ్ఞములు, యాగములు చేయడం మొదలయింది. ఆ యజ్ఞస్వరూపుడను నేనే. త్రేతాయుగము లోనే మానవులు వారి వారి గుణములను బట్టి, రూపములను బట్టి, లక్షణములను బట్టి, చేసే కర్మలను బట్టి నాలుగు వర్ణములుగా విభజింప బడ్డారు. విరాట్పురుషుని ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు, పాదములనుండి శూద్రులు పుట్టినట్టు చెప్పబడింది. మానవులు నాలుగు వర్ణములు గా విభజింపబడిన తరువాత వారు ఆచరించవలసిన ఆశ్రమ ధర్మములు కూడా ఏర్పడ్డాయి. విరాట్పురుషుని హృదయము నుండి బ్రహ్మ చర్యము, జఘన (నడుము) భాగమునుండి గృహస్థాశ్రమము, వక్షస్థలము నుండి వాన ప్రస్థము, తలభాగము నుండి సన్యాసము పుట్టాయి.

వర్ణములు కానీ, ఆశ్రమములు కానీ మనవుల స్వభావములను బట్టి, అవి పుట్టిన ప్రదేశములను బట్టి ఏర్పడ్డాయి. (పుట్టుకను బట్టి కాదు). మనిషి స్వభావములను బట్టి గుణములను బట్టి, చేసే కర్మలను బట్టి వర్ణములు ఏర్పడ్డాయి అని చెప్పాను కదా! ఒకొక్క వర్ణము వారి స్వభావముల గురించి వివరిస్తాను.

మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము, తపస్సు, శుచిగా ఉండటం, ఎల్లప్పుడూ సంతోషంగా ఉండటం, క్షమాగుణము కలిగి ఉండటం, సరళంగా ప్రవర్తించడం, దేవునియందు భక్తి, శ్రద్ధ కలిగి ఉండటం, దయ, సత్యము పాటించడం ఇవి అన్నీ బ్రాహ్మణుని

స్వభావములు. (ఈ లక్షణములు ఉన్న ఎవరైనా బ్రాహ్మణులే. ఈ లక్షణములు లేని వాడు బ్రాహ్మణుడు కాడు. పుట్టుకతో కులం సంక్రమించదు అని శ్రీకృష్ణుడే చెబితే, కులాల పేరుతో మానవులను విభజిస్తున్నారు నేటి మానవులు.)

ఉద్ధవా! ఇంక క్షత్రియునికి ఉండవలసిన స్వభావములు, లక్షణముల గురించి చెబుతాను విను. తేజస్సు, బలము, శౌర్యము, ఐశ్వర్యము, ధైర్యము, ఔదార్యము, ముందుకు దూకే శక్తి, స్థైర్యము, బ్రాహ్మణులను పూజించడం, బ్రాహ్మణుల మేలు కోరే లక్షణము, ఇవి క్షత్రియుని స్వభావములు.

ఇంక వైశ్యులకు ఉండవలసిన లక్షణములు ఏవంటే.... ఆస్తులు సంపాదించడం, దానాలు చెయ్యడం, పొగరుగా ఉండక పోవడం, బ్రాహ్మణులనుసేవించడం, ధనమును పోగుచేయడం, వ్యాపారం, వాణిజ్యం, పశుపోషణ ఇవి అన్నీ వైశ్యుల స్వభావములు.

ఇంక శూద్రుల లక్షణములు.... కపటం లేకుండా మనసును నిష్కల్మషంగా ఉంచుకోవడం, బ్రాహ్మణులను, దేవతలను, గోవులను పూజించడం, దాని వలన సంపాదించిన ధనముతో జీవించడం, ఉన్నదానితో తృప్తి చెందడం శూద్రుల ధర్మములు.

వీరి కన్నా కింద మరొక వర్ణం ఉంది. వారు శుచిగా ఉండరు. సత్యము పలకరు. దొంగతనాలు చేసి ధనం సంపాదిస్తారు. దేవుడిని, వేదములను నమ్మరు. అనవసరంగా అందరితో

తగవులాడతారు. వారికి కామ సంబంధమైన కోరికలు ఎక్కువ. కోపం ఎక్కువ. విషయ వాంఛల మీద, స్త్రీసంభోగము మీద మక్కువ ఎక్కువ. వీరిని అంత్యజులు అని అన్నారు. అంటే ఆఖరు వర్ణము. దీనినే తరువాతి కాలంలో పంచమ వర్ణము, పంచములు అని పిలిచేవారు. వీరు అసాంఘిక, సంఘ విద్రోహ శక్తులు కాబట్టి, ఈ వర్ణము వారిని దూరంగా ఉంచారు. (అది తరువాతి కాలంలో అంటరాని తనంగా మారి, కులాల మధ్య అంతరాలు పెంచింది.)

ఇంక మానవుడుగా పుట్టిన ప్రతివాడు ఆచరించ వలసిన సామాజిక ధర్మము ఏమిటంటే.... అహింస (మనస్సుతో గానీ, వాక్కుతో గానీ, చేతలతో కానీ ఎదుటి వారి మనసును గానీ, శరీరమును గానీ హింసించక పోవడం), ఎల్లప్పుడూ సత్యమునే పలకడం, ఇతరుల ఆస్తులను హరించకపోవడం, కోరికలను అదుపులో పెట్టుకోవడం, అంతా నాకే కావాలనే లోభత్వం లేకుండా ఉండటం, సకల భూతముల యందు దయకలిగి ఉండటం, సాటి వారి మేలును కాంక్షించడం చేతనైతే సాటి వారికి మేలు చేయడం, ఇవి సకల మానవులు ఆచరించవలసిన ధర్మములు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను ద్విజులు అని అంటారు. గర్భాదానము, సీమంతము, జాతక కర్మలు, ఉపనయనము మొదలగు కర్మలను ఆచరించిన తరువాత మానవుడు రెండవ జన్మ ఎత్తుతాడు. అందుకే మానవుని ద్విజుడు అని అంటారు. (రెండవ సారి పుట్టిన వాడు.) ద్విజుడు అయిన తరువాత ఆచార్యుని వద్ద బ్రహ్మచర్యదీక్ష స్వీకరిస్తాడు. గురుకులములో చేరుతాడు. ఇంద్రియ నిగ్రహము

పాటిస్తాడు. వేదములను అధ్యయనము చేస్తాడు. బ్రహ్మచర్య దీక్షలో ఉన్నప్పుడు జడలను, మేఖలను, కృష్ణాజినమును, దండమును, అక్షమాలను, యజ్ఞోపవీతమును, కమండలమును, దర్భలను, ధరిస్తాడు. ఎటువంటి అలంకారములను చేసుకోకూడదు. దర్భాసనము మీద కూర్చోవాలి. స్నానము, భోజనము, హెూమము, జపము చేసేటప్పుడు మౌనంగా ఉండాలి. స్త్రీలతో మాట్లాడంకానీ, స్త్రీసాంగత్యము కానీ చేయకూడదు. వీర్యస్థలనము చేయకూడదు. స్వప్నస్థలనము అయితే స్నానం చేసి ప్రాణాయామం పాటించి,గాయత్రిని జపించి, మనసును అదుపులో పెట్టుకోవాలి.

బ్రహ్మచర్యము అవలంబించేటప్పుడు పవిత్రంగా ఉండాలి. ఏకాగ్రమైన చిత్తంతో ఉండాలి. మౌనంగా ఉండాలి. ఉదయము, సాయంత్రము సంధ్యావందనము చేయాలి. గాయత్రి మంత్రమును ఉపాశించాలి. అగ్నిని, సూర్యుని, గురువును, గోవును, బ్రాహ్మణులను, వృద్ధులను, దేవతలను పూజించాలి.

విద్య చెప్పే ఆచార్యుని విష్ణు స్వరూపంగా భావించాలి. ఆచార్యుని అవమానించకూడదు. ఆయన యందు దోషములను ఆపాదించరాదు. ఎల్లప్పుడూ ఆచార్యుని దేవతా స్వరూపుడుగా భావించాలి. బ్రహ్మచారి మధ్యాహ్నము, సాయంత్రము భిక్షాటనచేసి భిక్షను స్వీకరించాలి. భిక్షగా తెచ్చిన ఆహార పదార్థములను గురువుగారికి సమర్పించాలి. గురువు గారి అనుమతితో భిక్షను భుజించాలి. గురువు ఎక్కడకు వెళితో శిష్యుడు ఆయన వెంట సేవకుని మాదిరి వెళ్లాలి. నిద్రాసమయములో గురువు గారి పక్కనే నిద్రించాలి.

గురువుగారు విశ్రాంతి తీసుకుంటుంటే ఆయనకు పాదములను పట్టాలి. గురువుగారు కూర్చుని ఉన్నపుడు శిష్యుడు కొంచెం దూరంలో చేతులు కట్టుకొని నిలబడి గురువుగారి ఆదేశముల కొరకు ఎదురు చూడాలి. సర్వకాల సర్వావస్థలయందు గురువుగారిని సేవించాలి.

గురుకులములో ఉన్నంత కాలము వేదములను అభ్యసించాలి. బ్రహ్మ చర్యము పాటించాలి. భోగ వస్తువులను విడిచిపెట్టాలి. అటువంటి బ్రహ్మచారి మహర్లోకము గుండా బ్రహ్మలోకమునకు వెళతాడు. గురుకులములో ఉన్నబ్రహ్మచారి బ్రహ్మ తేజస్సుతో వెలుగుతుంటాడు. అతడు పాప రహితుడు అంటే ఎటువంటి పాపములను చేయనివాడు. అతడు తనను, అగ్నిని, గురువును, సకల భూతములను పరమాత్మ స్వరూపాలుగా భావించాలి. అందరి ఎడలా సమబుద్ధి కలిగి ఉండాలి. భేదభావమును చూపకూడదు.

.

తరువాతది గృహస్థాశ్రమము. గృహస్థాశ్రమములో తప్ప మిగిలిన ఆశ్రమములు అనగా బ్రహ్మ చర్యము, వాన ప్రస్థము, సన్యాసము వీటిలో ఉన్నప్పుడు స్త్రీలను చూడటం, మాట్లాడటం, వారితో హాస్యంగా ప్రవర్తించడం, వారిని తాకడం, మొదలగు పనులు చేయరాదు. ఇతరులు మైథునక్రియలో ఉండగా చూడకూడదు.

ఇంతే కాకుండా, అన్ని వర్ణములవారు, అన్ని ఆశ్రమములలోని వారు ఈ క్రింది నియమములను విధిగా పాటించాలి. ఆచమనం చేయడం, శుచిగా ఉండటం, ప్రతిరోజూ స్నానం చేయడం, సంధ్యోపాసన చేయడం, విష్ణువును పూజించడం, పుణ్య

తీర్థములనుసేవించడం, జపం చేసుకోవడం, తినకూడని పదార్థములను తినకపోవడం, అనవసరమైన మాటలను మాట్లాడకపోవడం, మనం మాట్లాడకూడని వారితో మాట్లాడకుండా మౌనంగా ఉండటం, సకల జీవరాసులలో పరమాత్మ అంతర్యామిగా ఉన్నాడు అని తెలుసుకోవడం, మనస్సును, వాక్కును, ఇంద్రియములను అదుపులో పెట్టుకోవడం. ఈ నియమములు అన్ని వర్ణముల వారికి, అన్ని ఆశ్రమముల వారికి ఆచరించతగ్గవి.

పైన చెప్పబడిన నియమములను ఆచరించిన బ్రాహ్మణుడు అగ్ని వలె ప్రకాశిస్తాడు. బ్రాహ్మణులు తాము చేసిన తపస్సు వలన అతని పూర్వజన్మ వాసనలు అన్నీ నాశనం అవుతాయి. తానుచేసిన పనులకు ఫలితం ఆశించకుండా, నిష్కామ కర్మను పాటిస్తూ, నాయందు అచంచలమైన భక్తి కలిగి ఉంటాడు.

ఉద్ధవా! బ్రహ్మచర్యము తరువాత గృహస్థాశ్రమము. గృహస్థాశ్రమములో ప్రవేశింప తలచిన బ్రహ్మచారి, వేదములను అధ్యయనముచేసిన తరువాత, అన్ని విద్యలు పూర్తిగా నేర్చుకున్న తరువాత, గురువు గారికి గురుదక్షిణ సమర్పించుకొని, గురువుగారి అనుమతి తీసుకొని, తరువాత వివాహముచేసుకోవాలి. కామ కోరికలు, సంతాన వాంఛ కలవాడు గృహస్థ ఆశ్రమములోకి ప్రవేశిస్తాడు. అటువంటి కోరికలు లేని వాడు బ్రహ్మచర్యము నుండి వానప్రస్థమునకు కానీ లేక సన్యాసఆశ్రమము కానీ స్వీకరిస్తాడు. కేవలము బ్రాహ్మణులు మాత్రమే సన్యాస ఆశ్రమము స్వీకరించాలి.

(దీనికి విపరీత అర్థములు తీస్తారు. ఏం బ్రాహ్మణులేనా సన్యాసము స్వీకరించేది మాకు అర్హత లేదా! అని అంటారు. అసలు ఆంతర్యము అదికాదు. బ్రాహ్మణులకు వేద అధ్యయనము, ధర్మ బోధ వారి కర్మలుగా విధించారు. అందుకని వారు సన్యాసము స్వీకరించిన తరువాత కూడా వేదాధ్యయనము, ధర్మబోధలు చేయవచ్చును. కాబట్టి బ్రాహ్మణులు సన్యాసము స్వీకరించినందువలన సమాజానికి ఎలాంటి నష్టం లేదు. అలా కాకుండా క్షత్రియులు స్వీకరిస్తే, రక్షించే వారు లేక సమాజం అరాచకమవుతుంది. అలాగే వైశ్యులు సన్యాసులు అయితే వ్యవసాయము, వాణిజ్యము, పశుపోషణ దెబ్బ తింటాయి. అలాఅని శూద్రులు సన్యాసము స్వీకరిస్తే సాధారణ పరిపాలన దెబ్బతింటుంది. అందుకని బ్రాహ్మణులకు మాత్రమే సన్యాస ఆశ్రమమును వీలు కల్పించారు. దానిని మనం అపార్థం చేసుకుంటున్నాము.)

ఉద్ధవా! అలాకాకుండా, ఒక ఆశ్రమము నుండి మరొక ఆశ్రమమునకు అనగా బ్రహ్మచర్యము నుండి, గృహస్థ ఆశ్రమము, తరువాత వానప్రస్థము, తరువాత సన్యాసము తీసుకోవచ్చును. ఎక్కువగా క్షత్రియులు ఈ విధంగా చేస్తుంటారు. నా మీద భక్తి శ్రద్ధ ఉన్న వారు ఈ వర్ణాశ్రమధర్మములను సక్రమంగా పాటిస్తారు. గృహస్థ ఆశ్రమములో ప్రవేశించదలచిన వారు, తనకు తగినట్టి, మంచి శీలము కలిగిన కన్యను భార్యగా స్వీకరించాలి. ఆ కన్య వయసులో వరుని కంటే చిన్నదిగా ఉండాలి. ఒకే వర్ణము కలవారు అయి ఉండాలి. సాధారణంగా ఏ వర్ణము వారు ఆ వర్ణము వారి కన్యలనే వివాహం చేసుకోవడం శ్రేష్టము. అలా కాకుండా కేవలం కామ కోరికలు

తీర్చుకోడానికి వివాహాలు చేసుకోవాలనుకుంటే తన కంటే కింది వర్ణములోని కన్యలను వివాహం చేసుకోవాలి. తన కంటే పైవర్ణము వారిని చేసుకుంటే అది విపరీత పరిస్థితులకు దారితీస్తుంది.

యజ్ఞములు చేయడం, యాగములు చేయడం, వేదములను అధ్యయనం చేయడం, దాన ధర్మములు చేయడం అనే అధికారాలు బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్య వర్ణములకు ఉన్నాయి. శూద్రులు పరిపాలనా వ్యవహారాలు చూస్తారు కాబట్టి ఈ అధికారము వారికి లేదు. దానములు తీసుకోవడం, వేదములను అధ్యయనం చేయడం, యజ్ఞములు చేయడం, చేయించడం బ్రాహ్మణులకు అధికారము. ఎందుకంటే ఈ మూడు పనులు బ్రాహ్మణులకు విధింపబడిన ధర్మములు. కొంత మంది బ్రాహ్మణులు ఇతరుల నుండి దానమును తీసుకోరు. అటువంటి వారు యజ్ఞములు చేసి, వేదములను అధ్యయనము చేసి, ఇతరులకు బోధించి, తాము చేయించిన యజ్ఞములకు, యాగములకు దక్షిణలు స్వీకరించి, తమ జీవనమును గడుపుకుంటారు. అదే వారి జీవనాధారము. ఇంకా కొంత మంది బ్రాహ్మణులు ఈ ప్రకారంగా కూడా ఇతరుల నుండి ధనం తీసుకోవడం దోషము అని భావిస్తారు. అటువంటి వారు ఎవరినీ యాచించకుండా, ఎవరి వద్ద నుండి ధనము తీసుకోకుండా, పంట పొలములలో గింజలు ఏరుకొని, వాటితో కడుపునింపుకుంటారు. సహజంగా దొరికేపండ్లు, కాయలు, ఆకులు తిని బతుకుతారు.

బ్రాహ్మణులు తమ దేహములు కామ సుఖములు అనుభవించడానికి కాదు, తపస్సు చేయడానికి, ధర్మబోధ

చేయడానికిఅని తెలుసుకోవాలి. ఏ బ్రాహ్మణుడైతే ఎవరినీ ఏదీ యాచించకుండా, పొలములో గింజలు ఏరుకొని బతుకుతూ, మనస్సు పరమాత్మయందు లగ్నం చేసి, అతిథులను పూజిస్తూ ఏ కోరికలు లేకుండా బతుకుతాడో, అతడు గృహస్థాశ్రమము నుండి నేరుగా నన్ను చేరుకుంటాడు. మోక్షమును పొందుతాడు. దారిద్ర్యములో చిక్కుకొని అలమటించేవారిని, ఆపదలలో ఉన్న వారిని రక్షించేవారిని, నేను రక్షిస్తుంటాను. రాజు రూపంలో నేను ప్రజలను రక్షిస్తూ ఉంటాను. (నా విష్ణు: పృథివీ పతి: విష్ణు అంశ లేనిది రాజు కాలేడు.) తన ప్రజలను ఆపదల నుండి రక్షిస్తూ, కన్న బిడ్డలవలె కాపాడే రాజు, సకలపాపముల నుండి విముక్తుడు అవుతాడు. ప్రజారక్షణలో అతను చేసిన ఏ పనీ పాపం కాదు. (దోషులను శిక్షించే రాజులు, నేటి న్యాయమూర్తులు, ఉరిశిక్షను అమలు చేసే తలారికి ఏ పాపము అంటదు.)

నిష్పక్షపాతంగా ప్రజలను పాలించే రాజులు, స్వర్గలోక సుఖములను అనుభవిస్తారు. దారిద్ర్యము వలన గానీ, వేరే ఇతరములైన బలవత్తరములైన కారణముల వలనగానీ, బ్రాహ్మణులు వైశ్య వృత్తిని, క్షత్రియ ధర్మములను స్వీకరించవచ్చును. క్రయ విక్రయములు చేయడం ద్వారా వైశ్య వృత్తిని, కత్తి పట్టడం ద్వారా క్షత్రియ ధర్మమును అవలంబించవచ్చును. అంతేకానీ, బ్రాహ్మణుడు శూద్రవృత్తి అయిన పరిపాలనా వ్యవహారములను, సేవకా వృత్తిని స్వీకరించరాదు. ఈ ప్రకారంగా వృత్తులు మారడం కేవలం దారిద్ర్యబాధ నుండి విముక్తి పొందడానికే పరిమితము. తన జీవనమునకు తగిన ధనమును సంపాదించగానే పర ధర్మమును వదిలిపెట్టి మరలా తన స్వధర్మ వృత్తులను స్వీకరించాలి. అంతేకానీ, ధనం వస్తుంది కదా అని ఆ వృత్తులలో ఉండిపోకూడదు.

గృహస్థు అయిన వాడు ప్రతిరోజూ వేదములను అధ్యయనము చేయాలి. దేవతలను, పితృదేవతలను, అతిథులను పూజించాలి. భోజనము పెట్టి మనుషులను, తగిన ఆహారములనుపెట్టి జంతువులను, పక్షులను తృప్తిపరచాలి.

గృహస్థు ఇతరులను పీడించి ధనం సంపాదించరాదు. తనకు లభించిన దానితో తృప్తి పడి జీవనం సాగించాలి. గృహస్తులు అయిన క్షత్రియులు ప్రజల వద్ద నుండి పన్ను వసూలు చేసి దానితో జీవిక సాగించాలి. తన కింద పనిచేసేవారిని కూడా పోషించాలి. తనకు ఉన్నదానిలో యజ్ఞయాగములు చేయాలి.
(ఆ రోజుల్లో క్షత్రియులు ప్రజలను రక్షించేవాళ్లు, పాలించేవాళ్లు. దానికి ఆరవ వంతు పన్నురూపంలో తీసుకొనే వాళ్లు. దానితో జీవనం గడుపుకుంటూ మరలా ఆ ధనమును యజ్ఞయాగముల రూపంలో దానధర్మముల రూపంలో ప్రజలకుఇచ్చేవాళ్లు. ఈ ప్రకారంగా ధనం చేతులు మారుతూ ఉండేది.)

గృహస్థు అయిన వాడు సంసారము మీద ఆసక్తి కలిగి ఉండకూడదు. నిర్లిప్తంగా ఉండాలి. భగవంతుని సేవ చేసుకుంటూ ఉండాలి. ఈ లోక సుఖములు, పరలోక సుఖములు అశాశ్వతములు అని తలచి, నిష్కామ కర్మలు ఆచరించాలి. భార్య, సంతానము, బంధువులు, మిత్రులు అందరూ సత్రములో కలుసుకొనే బాటసారులు అని భావించాలి. ఈ లోకములో అనుభవించే సుఖములు అన్నీ క్షణికములు అని భావించాలి. స్వప్నములో కనిపించిన వస్తువులు అన్నీ

మెలుకువ రాగానే కనపడకుండా పోయినట్టు, భార్యాపుత్రులు, బంధు మిత్రుల సంబంధము కూడా ఈ శరీరం ఉన్నంత వరకే ఉంటాయి అని భావించాలి. ఈ ప్రకారంగా ఆలోచించి సంసారము మీద ఏ మాత్రం ఆసక్తి లేకుండా, నిష్కామ కర్మలు చేస్తూ, అహంకార మమకారములను వదిలిపెట్టి, గృహస్థ ధర్మమును ఆచరించాలి.

నా భక్తులు అయిన వారు గృహకృత్యములను ఆచరిస్తూనే నన్ను పూజిస్తూ ఆరాధిస్తూ గృహస్థుగా జీవనం గడప వచ్చును. లేకపోతే వానప్రస్థమునకు వెళ్ల వచ్చును. పుత్రులు ఉన్న వారు సంసార బాధ్యతలు పుత్రులకు అప్పగించి సన్యాసమును స్వీకరించవచ్చును. అలా కాకుండా, గృహస్థు అయిన వాడు, కేవలము స్త్రీలకు సంబంధించిన సుఖములను అనుభవిస్తూ, కామసంబంధమైన కోరికలు తీర్చుకుంటూ, స్త్రీల వశములో ఉంటూ, మూఢుడుగానూ, అవివేకి గానూ, భార్యా పుత్రులదే లోకంగా జీవిస్తూ, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తుడై ఉంటే, వాడు అహంకారము చేత, మమకారము చేత బంధింపబడతాడు. సంసారము అనే సాగరంలో చిక్కుకుపోతాడు.

ఉద్ధవా! చాలా మంది మానవులు "నేను లేకపోతే నా భార్య పిల్లలు, నా తల్లి తండ్రులు, నా బంధు మిత్రులు ఏమైపోతారు! ఎలా బతుకుతారు? ఈ లోకం అంతా ఏమైపోతుంది? అంతా నా వల్లనే జరుగుతూ ఉంది." అనే భ్రమలో ఉంటారు. ఇది కేవలము వారి అవివేకము. ఎవరి వల్లా ఏమీ జరగదు. ఎలా జరగాలంటే అలా జరుగుతుంది. అందరూ నిమిత్తమాత్రులే! ఈ సత్యమును తెలుసుకున్న

వాడు సుఖమునుపొందుతాడు.

అలా కాకుండా ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయముల మీదా, ధన సంపాదన మీదా, స్త్రీసుఖము కోసరం వెంపర్లాడే వాడు, ఎల్లప్పుడూ తన భార్యా బిడ్డల గురించి, బంధుమిత్రుల గురించి, తాను సంపాదించిన ధనము గురించి ఆలోచిస్తూ, మరణించేటప్పుడుకూడా ఇదే ఆలోచనలతో దేహము విడిచిపెట్టి, అంధ తమస్సు అనే నరకానికి పోతాడు." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి బ్రహ్మచర్య, గృహస్థ ఆశ్రమ ధర్మముల గురించి వివరించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము పదునేడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

పదునెనిమిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునితో వర్ణాశ్రమ ధర్మముల గురించి ఇలా వివరిస్తున్నాడు.

"ఉద్ధవా! గృహస్థ ఆశ్రమము తరువాతది వానప్రస్థము. వానప్రస్థమునకు పోవాలని అనుకునే వ్యక్తి తన భార్యను కుమారుల

రక్షణలో ఉంచాలి. అలా కాకపోతే భార్యను తన వెంటబెట్టుకొని, తన జీవితములో మూడవ భాగము గడపడానికి వానప్రస్థమునకు వెళ్లాలి. (మనకు నిండునూరేళ్లు అనుకుంటే, మొదటి 25 సంవత్సరములు బాల్యము, యౌవనము. 25 ఏళ్ల దాకా గురువు గారి దగ్గర బ్రహ్మచర్యదీక్షలో ఉండాలి. తరువాత 25 నుండి 50 దాకా గృహస్థజీవితం గడపాలి. 50 నుండి 75 దాకా అంటే జీవితములో మూడవ భాగము వానప్రస్థములో గడపాలి. ఆ పైన జీవించి ఉంటే, మిగిలిన 25 ఏళ్లు సన్యాస ఆశ్రమములో గడపాలి.)

వానప్రస్థము అంటే నగరమును వదిలిపెట్టి అడవిలో జీవించడం. అడవులలో లభించే ఆకులను, (ఇప్పుడు మనం తినే ఆకు కూరలు), వేళ్లను(అంటే భూమిలో లభించేవి అంటే వేరుశెనగ, బంగాళా దుంప, కంద, కారెట్, చిలగడ దుంపలు మొదలైనవి), కాయలను, పండ్లను తిని జీవించాలి. (ప్రతిరోజూ మనం తినేవి ఇవేగా! కాకపోతే ఇక్కడ కొనుక్కుంటాము. అక్కడ ఫ్రీగా దొరుకుతాయి. అంతే!), అగ్ని మీద పచనం చేసిన పదార్థములను, చెట్టుకు పండిన పండ్లను తినాలి. ధాన్యమును దంచుకొని తినాలి. దంతములతో నమిలి తినాలి. చర్మములను గానీ, నార చీరలను గానీ, ధరించాలి. మూడు వేళలా స్నానం చేయాలి. భూమి మీద పడుకోవాలి.

ఎండాకాలంలో పంచాగ్నుల మధ్య, వానాకాలంలో వానలోనూ, చలి కాలంలో మెడలోతు నీటిలోను తపస్సు చేయాలి. తనకు అవసరమైన వస్తువులను తానే సంపాదించుకోవాలి. ఏవీ కూడబెట్టుకోకూడదు. ఎప్పటి కప్పుడు సంపాదించుకొని

కడుపునింపుకోవాలి. ఉన్నదానితో తృప్తిగా జీవించాలి. ప్రతిరోజూ హోమం చేయాలి. అగ్నిని పూజించాలి. తాను వండుకున్న పదార్థములను దేవతలకు ఆహుతులుగా సమర్పించాలి.

వేదములలో చెప్పబడినప్పటికినీ, మాంసమును అగ్నిలో హోమం చేయకూడదు. మాంసాహారము తినకూడదు. అడవులలో పండే ధాన్యముతో వండినపదార్థములనే అగ్నిలో హోమం చేయాలి. గృహస్థాశ్రమములో మాదిరి చాతుర్మాస్య వ్రతము మొదలగు వ్రతములను చేయాలి. ఈ ప్రకారం జీవించడం ద్వారా దేహం శుష్కించిపోతుంది. తపస్సు చేస్తూనే శరీరమును విడిచిపెట్టి ఋషిలోకం చేరుకుంటాడు. తరువాత పరమాత్మలో లీనం అయిపోతాడు.

వానప్రస్థములో ఉన్నప్పుడు చేసే తపస్సు నిష్కామంగా చెయ్యాలి. స్వర్గ సుఖాల కోసమో లేక ఏవేవో సిద్ధుల కోసమో, మహిమల కోసమో తపస్సు చేయకూడదు. వాన ప్రస్థములో కూడా కోరికలు వదలకపోతే అంతకన్నా మూర్ఖత్వము మరొకటి ఉండదు. వానప్రస్థములో ఏ పని చేసినా నిష్కామంగా చెయ్యాలి.

వానప్రస్థములో ఉన్నప్పుడు ముసలి తనం వస్తుంది. శరీరం సహకరించదు. అప్పుడు సంధ్యావందనము, అగ్నిహోత్రము, తపస్సు చేయలేడు. అటువంటి పరిస్థితులతో కేవలం మానసికంగా అన్నీ చేయాలి అంటే మనసులోనే హోమం చేస్తున్నట్టు, తపస్సు చేస్తున్నట్టు ఊహించుకోవాలి. తరువాత తనలో తాను అగ్నిని సృష్టించుకోవాలి.

అందులో ప్రవేశించాలి. తనకు తానుగా యోగాగ్నిలో ఆహుతి అయిపోవాలి.

తరువాతది సన్యాసము. పూర్వజన్మనుండి సంక్రమించిన వాసనలను, దు:ఖపూరితములైన ప్రాపంచిక విషయములను, విషయ వాంఛలను, వదిలిపెట్టి, అన్నిటి మీద వైరాగ్యము కలిగినప్పుడు సన్యాసము స్వీకరించవచ్చును. సన్యాసము స్వీకరించే ముందు యథావిధిగా యజ్ఞయాగములు చేయాలి. ఋత్విక్కులకు తనది అన్న ప్రతి వస్తువు దానంగా ఇవ్వాలి. తన ఆత్మయందు అగ్నిని ఆరోపించుకోవాలి. ఎటువంటి కోరికలు లేని మనస్సుతో సన్యాసము స్వీకరించాలి.

మానవులు సన్యాసము స్వీకరిస్తే దేవతలకు యజ్ఞయాగములు జరగవు. ఆహుతులు అందవు. ఆ కారణం చేత దేవతలు సన్యాసాశ్రమము స్వీకరించే వారికి భార్యా పుత్రుల రూపంలో, కామకోరికల రూపంలో ఎన్నో అడ్డంకులు కల్పిస్తుంటారు. సన్యాసి ఆ అడ్డంకులను వైరాగ్యము అనే కత్తితో ఖండించాలి. సన్యాసి కేవలం కౌపీనము (గోచీ గుడ్డ) ధరించాలి. పైన ఒక అంగవస్త్రమును నడుము కట్టుకోవాలి. ఒక చేతిలో దండము, మరొక చేతిలో కమండలము (నీటిని తీసుకొని పోయే ఒక పాత్రవంటిది. ఎండిన కాయతో చేసుకోవాలి. ఆనప కాయ పెద్దదిగా పొడుగ్గా ఉంటుంది కాబట్టి, ముదిరిపోయిన ఆనపకాయను ఎండబెట్టి లోపల పదార్థము తీసివేసి తయారు చేస్తారు.) ఇవి తప్ప సన్యాసికి నాది అన్న ఏ వస్తువు ఉండకూడదు. శరీరమునకు ఆపద సంభవించినపుడు ఈ

నియమములు సడలించవచ్చును.

సన్యాసి పవిత్రమైన ప్రదేశములలోనే సంచరించాలి. జనపదములలో సంచరించరాదు. పవిత్రమైన దేవాలయములలో, ఆశ్రమములలో ఉండాలి. నీటిని వస్త్రముతో వడగట్టి తాగాలి. ఎల్లప్పుడూ సత్యమే పలకాలి. నిర్మలమైన మనస్సుతోనే కర్మలు చేయాలి.

సన్యాసికి మూడు దండములు ఉంటాయి. (త్రిదండి అనే పదం సన్యాసులు, స్వామీజీల పేర్లముందు ఉండటం చూచే ఉ ంటారు). త్రిదండి అంటే మూడు దండములు(కర్రలు). వాక్కునకు దండము మౌనము. శరీరమునకు దండము కోరికలను త్యాగం చేయడం. మనస్సునకు దండము ప్రాణాయామము. మూడు దండములు అంటే ఇవీ. అంతే కానీ మూడు వెదురు కర్రలు ధరించడం కాదు. కేవలం వెదురు కర్రలు దండములు గా ధరించినంత మాత్రాన సన్యాసి కాజాలడు.

సన్యాసి నాలుగు వర్ణముల వారిలో ఏడు ఇండ్లనుండి భిక్షను స్వీకరించాలి. ఎంత లభిస్తే అంతే తినాలి. తృప్తిగా జీవించాలి. గ్రామమునకు వెలుపల ఉన్న చెరువులో స్నానం చేసి సంధ్య మొదలగు కార్యములు నిర్వర్తించుకోవాలి. తెచ్చుకున్న భిక్షను ప్రోక్షణ చేసి పరమాత్మకు నివేదించాలి. దేవతలకు, భూతములకు విడిచిపెట్టి మిగిలినది తాను భుజించాలి. సన్యాసి ఎల్లప్పుడూ తన ఆత్మయందు తాను రమించాలి. ధైర్యంగా ఉండాలి. నియమంగా ఉండాలి. అందరినీ సమానంగా చూడాలి. ఎవరితోనూ సంగమం (అటాచ్‌మెంట్)

పెట్టుకోకూడదు. ఎల్లప్పుడూ ఒంటరిగానే తిరగాలి. ఒకచోట స్థిరనివాసం ఏర్పరచుకోకూడదు. సాధ్యమైనంత వరకు జనులు లేని ప్రదేశములో ఉండాలి. భయం లేకుండా ఉండాలి. ఎల్లప్పుడూ పరమాత్మనే ధ్యానించాలి. స్మరించాలి. అందరిలో పరమాత్మను చూడాలి. పరమాత్మ అందరిలో ఉన్నాడన్న ఆత్మతత్వమును తెలుసుకోవాలి.

సన్యాసి అయిన వాడు తనకు ఉన్న బంధనముల గురించి వాటి నుండి మోక్షము పొందడం గురించి ఆలోచించాలి. ఇంద్రియ చాంచల్యము వలన బంధనములు కలుగుతుంటాయి. ఇంద్రియములను నిగ్రహించి, పరమాత్మయందు మనసు లగ్నం చేయడమే మోక్షము. కాబట్టి సన్యాసి అయిన వాడు కోరికలను, కోపమును, మోహమును వదిలిపెట్టాలి. విషయ సుఖములను వదిలిపెట్టాలి. రక్తి అనేది వదిలిపెట్టాలి. ఎల్లప్పుడూ ఆత్మయందు మనసును లగ్నం చేసి ఆనందం పొందాలి. శారీరక ఆనందం విడిపెట్టాలి. ఆత్మానందం ముఖ్యము అని తలంచాలి.

సన్యాసులు దేవాలయములు, నదీ తీరములు, కొండలు, పర్వతములు, వీటిలో సంచరించాలి. కేవలము భిక్ష కోసరము మాత్రమే గ్రామములలోకి, పట్టణముల లోకి ప్రవేశించాలి. సన్యాసులు ఎక్కువగా వానప్రస్థుల ఆశ్రమములనుండి భిక్షను స్వీకరించాలి. సాత్వికమైన ఆహారం తింటేనే మనస్సు పరిశుద్ధంగాఉంటుంది. కోపము, మోహము మనసులోకి ప్రవేశించవు. దానివలన మోక్షము తొందరగా వస్తుంది.

వానప్రస్థాశ్రమములో ఉన్న వాళ్లు, ఈ ప్రపంచములో దొరికే వస్తువులు అన్నీ పరిణామం చెందేవే, నాశనం అయ్యేవే అనే భావనతో ఉండాలి. వాటిమీద ఆసక్తి, వాటిని దాచుకోవాలనే ఆసక్తి వదిలిపెట్టాలి. విషయవాంఛలకు కామసంబంధమైన కోరికలకు దూరంగా ఉండాలి. ఈ లోకములో దొరికే విషయములయందు గానీ, పరలోకములో లభించే స్వర్గసుఖముల మీద గానీ ఎటువంటి ఆసక్తి కలిగి ఉండరాదు. ఏ పని చేసినా ఏకోరికా లేకుండా, ఎటువంటి ఫలితమును ఆశించకుండా చెయ్యాలి.

ఉద్ధవా! ఈ ప్రపంచం మమత, అనురాగములతో నిండి ఉంటుంది. ఈ శరీరము మనస్సు, వాక్కు, ప్రాణములతో నిండి అహంకార పూరితమై ఉంటుంది. వాటి వలన కలిగే సుఖ దు:ఖములు స్వప్నములో కనపడే వస్తువుల మాదిరి అశాశ్వతములు అని తెలుసుకోగలిగిన వాడు ప్రాపంచిక విషయములను కూడా కలలో కనిపించే వస్తువుల మాదిరి భావిస్తాడు. వాటిని వదిలిపెడతాడు. వాటి గురించి ఆలోచించడు. ఆత్మ ఒక్కటే సత్యము అనే ఆత్మ తత్వమును తెలుసుకోగలుగుతాడు. ప్రాపంచిక విషయముల యందు, విషయ వాంఛల యందు విరక్తుడై, వీటినుండి మోక్షమును పొందే మార్గములను వెదుకుతుంటాడు. నా యందు భక్తి, శ్రద్ధ పెంపొందించుకుంటాడు. ఆ స్థితికి చేరుకున్న వాడికి సన్యాసి గుర్తులు అయిన దండము మొదలగు వాటితో అవసరం లేదు. సన్యాస ధర్మములను పాటించవలసిన అవసరం లేదు. అటువంటివాడు ఎంతటి జ్ఞాని అయినా కూడా కేవలం బాలుని మాదిరి ప్రవర్తిస్తాడు. ఒక జడుని మాదిరి ఉంటాడు. ఎన్నో విద్యలు తెలిసి కూడా

పిచ్చివాడిమాదిరి ప్రవర్తిస్తాడు. వేదముల అర్థములు తెలిసి కూడా ఎటువంటి నియమములను ఆచరించడు. ఎవరినీ అవమానించడు. ద్వేషించడు. విమర్శించడు. ఎవరు ఏది చెప్పినా స్వీకరిస్తాడు. వితండ వాదము చెయ్యడు. నాస్తికుడు కాడు. ఎవరి పక్షమునా మాట్లాడడు. అటువంటి సన్యాసి ఎవరికీ భయపడడు. ఎవరినీ భయపెట్టడు. తనను ఎవరైనా దూషించినా, అవమానించినా సంతోషంగా చిరునవ్వుతో స్వీకరిస్తాడు. ప్రతీకార వాంఛ ఉండదు. ఎవరితోనూ విరోధము పెట్టుకోడు. కోపగించడు. ఎక్కువ భిక్ష దొరికిన రోజు సంతోషించడు. భిక్ష దొరకని రోజు దు:ఖించడు. భిక్ష దొరకడం, దొరక్క పోవడం దైవాధీనం అని సరిపెట్టుకుంటాడు. కాని ఆహారము ప్రాణం నిలుపుకోడానికి అవసరం కాబట్టి, ఆహారం ఏదోవిధంగా ధర్మమార్గంలో సంపాదించుకుంటాడు. ప్రాణాలు శరీరంలో ఉంటేనే కదా తత్వవిచారము చేయడానికి, దానివలన ముక్తి పొందడానికి అవకాశం ఉండేది.

ఉద్ధవా! సూర్యుడు, చంద్రుడు ఒక్కరే. కాని భూమి మీద ఉన్న అన్ని పాత్రలలోనూ, జలాశయములలోనూ, రకరకాల రూపములతో కనపడుతుంటాడు. కదిలినట్టు కనిపిస్తుంటాడు. అలాగే పరమాత్మ కూడా ఆత్మస్వరూపుడుగా వివిధములైన శరీరములలో అంతర్యామిగా ఉంటాడు. ఈ దేహములలో ఉన్న ఆత్మలన్నీ ఆ పరమాత్మ స్వరూపాలే. ఉద్దవా! సన్యాసికి ఒక్కోసమయంలో మంచి ఆహారం లభిస్తుంది. పడుకోడానికి మంచి స్థలం లభిస్తుంది. ఒక్కోసారి మంచి ఆహారము, మంచి స్థలము లభించదు. కాని దొరికిన దానిని స్వీకరించడమే సన్యాసి లక్షణము.

ఉద్ధవా! నేను పరమాత్మ అవతారము అయినప్పటికినీ, ఏకర్మలు చేయవలసిన అవసరం నాకు లేనప్పటికినీ, నేను లౌకిక కర్మలు అన్నీ ఆచరిస్తున్నాను. అదే ప్రకారంగా జ్ఞాని అయిన మానవుడు ఎంతటి జ్ఞాని అయినప్పటికినీ, లోకుల కోసరం శౌచము, అనుష్ఠానము మొదలగు కర్మలను ఆచరించాలి. ఇతరుల చేత ఆచరింప చేయాలి. జ్ఞాని అయిన వాడికి వాడు వీడు అనే భేదబుద్ధి ఉండదు. అందరినీ సమానంగా భావిస్తాడు. ఒక వేళ ఉన్నా, అతనికి పరమాత్మ జ్ఞానము కలుగగానే, అతనిలో ఉన్న భేదబుద్ధి నశిస్తుంది. మరణకాలంలో నిర్వికారుడై నన్నేపొందుతాడు.

పురుషులలో ఇంద్రియములను జయించిన వాళ్లు ఉంటారు. వాళ్లందరూ ఈ ప్రాపంచికవిషయములు అన్నీ అశాశ్వతములు అని నమ్మి, వాటి వలన కలిగే ఫలితములు దు:ఖమును కలుగజేస్తాయి అని తెలుసుకొని, ప్రాపంచిక విషయములమీద విరక్తి చెందుతారు. కాని నా గురించి తెలుసుకోడానికి ఎటువంటి ప్రయత్నము చెయ్యరు. అటువంటి వారు ఆత్మతత్వమును గురించి తెలిసిన గురువు దగ్గరకు పోయి ఆ గురువు నుండి బ్రహ్మజ్ఞానము గురించి తెలుసుకోవాలి. గురువు యందు భక్తి, శ్రద్ధ కలిగి ఉంటాలి. అసూయను, ద్వేషమును వదిలిపెట్టాలి. బ్రహ్మజ్ఞానము కలిగేంత వరకు గురువును దైవ సమానుడుగా భావించి సేవించాలి.

ఉద్ధవా! వీళ్లు కాకుండా కొంత మంది సన్యాసులు ఉంటారు. వారికి జ్ఞానము ఉండదు. వైరాగ్యము కలుగదు. ఎల్లప్పుడు కామ

కోరికలతో, ప్రాపంచిక విషయముల మీద మోహముతో, ఉంటారు. ఇంద్రియములను, మనసును జయించలేరు. ఇంద్రియములకు వశుడై ఉంటాడు. కేవలం పొట్ట కూటి కోసరమే సన్యాసము స్వీకరిస్తారు. ఎల్లప్పుడూ విషయ వాంఛలలో మునిగితేలుతుంటారు. వాడికి ధర్మం తెలియదు. పైగా ధర్మ విరుద్ధమైన పనులు చేస్తుంటారు. ఇటువంటి వారు తమను తాము మోసం చేసుకుంటారు. లోకాన్ని మోసం చేస్తుంటారు. ఆత్మవంచనకు పాల్పడతారు. వారికి ఈ లోకములో గానీ, పర లోకములోగానీ ఎటువంటి సుఖమూ లభించదు. ఉభయత్రా భ్రష్టులు అవుతారు.

ఉద్ధవా! ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము, అహింస క్లుప్తంగా ఇవి సన్యాసి ధర్మములు. తపస్సు చేయడం, ఆత్మ, అనాత్మ వీటి గురించి తెలుసుకోవడం వానప్రస్థుని ధర్మములు. యజ్ఞయాగములు చేయడం, సాటి ప్రాణులను రక్షించడం గృహస్థు ధర్మము. గురువుకు సేవచేయడమే బ్రహ్మచారి ధర్మము.

గృహస్థు అయిన వాడు కేవలము సంతానము కొరకు మాత్రమే భార్యతో సంగమించాలి. రతిసుఖము కొరకు కాదు. బ్రహ్మచర్యము, తపస్సు, శుచిగా ఉండటం, సంతోషంగా ఉండటం, సర్వభూతముల మీద దయ కలిగి ఉండటం అనేవి గృహస్థు ప్రధాన ధర్మములు.

ఈ ప్రకారంగా వర్ణాశ్రమ ధర్మములను పాటిస్తూ అనన్యభావంతో నన్ను సేవించేవాడు, సకల జీవరాసులలో నన్ను

అంతర్యామిగా చూచేవాడు, నామీద ధృఢమైన భక్తి కలిగి ఉంటాడు. అతని భక్తి నానాటికీ వృద్ధిపొందుతూ ఉంటుంది. చివరకు నాలో ఐక్యం అయిపోతాడు.

ఎవరైతే తనకు నియమింపబడిన ధర్మమును అంటే స్వధర్మమును నియమబద్ధంగా పాటిస్తూ, పరిశుద్ధమైన చిత్తముతో, నాగురించి తెలుసుకుంటారో, అతనికి జ్ఞానము లభిస్తుంది. తనకు లభించిన జ్ఞానమును ఆచరణలో పెట్టడం ద్వారా అతడు త్వరలోనే నన్ను పొందుతాడు. ఉద్ధవా! నీకు వర్ణముల గురించి ఆశ్రమముల గురించి, వాటికి సంబంధించిన ధర్మముల గురించి వివరించాను. ఈధర్మములు ముక్తిని ప్రసాదిస్తాయి.

ఉద్ధవా! తన ధర్మములను నిష్టగా పాలించే వ్యక్తి నన్ను ఎలా పొందగలడో నీకు వివరించి చెప్పాను." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి వానప్రస్థము, సన్యాసము ఆశ్రమ ధర్మములను వివరించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వర్ణాశ్రమ ధర్మముల గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## ఏకాదశ స్కంధము
## పంతొమ్మిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి తన ఉపదేశములను ఇలా కొనసాగిస్తున్నాడు.

"ఉద్ధవా! ఆత్మ తత్వమును తెలిసిన వాడు, కేవలం శాస్త్రములు చదవడమే కాదు, వాటిని అనుభవపూర్వకంగా తెలుసుకున్న వాడు, ఎవరో చెప్పినది వినడం కాకుండా, తానుస్వయంగా అనుభవించి తెలుసుకున్న వాడు అయిన మానవుడు, ఈ ప్రపంచం అంతా మాయ, మిథ్య, అని నమ్ముతాడు. ఈ ప్రపంచములో ఉన్న వస్తువుల మీద ఆసక్తి చూపించడు. ప్రాపంచిక విషయముల గురించి తెలుసుకోడానికి ప్రయత్నించడు. జ్ఞానులు కోరుకునే ఫలములు, ఆ ఫలములు లభించడానికి చేసే కర్మలు (యజ్ఞయాగములు, తపస్సులు, దానములు), స్వర్గ, మోక్షములు..... అన్నీ నేనే కాబట్టి నన్ను తప్ప వేరే దేనినీ కోరుకోరు.

జ్ఞానము, విజ్ఞానము పరిపూర్ణంగా కలిగిన వారు పరమాత్మ పాదములను మాత్రమే శ్రేష్టము అని భావిస్తారు. వారికి ఉన్న జ్ఞానమే నాకు సుఖమును కలిగిస్తుంది. అటువంటి వారు నాకు ప్రియులు. ఏ కొంచెం ఆత్మ తత్వజ్ఞానము కలిగినా చాలు, దాని వలన కలిగే సిద్ధి, ఎంతో తపస్సు, తీర్థ సేవనము, జపము, దానములు చేయడం వలన కూడా కలగదు. కాబట్టి ఉద్ధవా! నీవు కూడా నీ కున్న జ్ఞానముతో ఆత్మ

తత్వమును తెలుసుకో. జ్ఞానమును, విజ్ఞానమును సంపాదించి, భక్తిభావంతో నన్ను ఆరాధించు. పూర్వ కాలంలో కూడా మహాఋషులు జ్ఞాన యజ్ఞము ద్వారా, ఆత్మ యందు నన్ను నిలిపుకొని, పూజించి, ఆరాధించి నాలో ఐక్యం అయ్యారు.

ఉద్ధవా! ఆధ్యాత్మికము, ఆధి దైవికము, ఆధిభౌతికము, ఈ మూడు వికారములు కేవలం నా మాయ వలన కల్పించబడినవి. చీకటిలో తాడును చూచి పాము అనుకుంటాము. అంతే కానీ అక్కడ పాము అంతకు ముందు లేదు, ఇంక ఉండబోదు. అక్కడ ఉన్నది తాడు మాత్రమే. పాము అనేది మన భ్రమ. అలాగే ఈ మూడు వికారములు ముందు నుండి లేవు. ఇంక ఉండబోవు. మధ్యలోనే ఉంటాయి. అంతా మాయాకల్పితాలు. పుట్టుక, చావు ఈ శరీరమునకే గానీ, శరీరంలో ఉన్న ఆత్మకు కాదు.ఈ శరీరము నేను కాదు, నేను ఆత్మస్వరూపుడను అనే ఆత్మ తత్వము తెలుసుకున్న నీకు ఎటువంటి నాశనము లేదు. నీవు ఎల్లప్పుడూ ఉంటావు. నీ దేహము మాత్రమే పోతుంది. ఇందాక చెప్పినట్టు అక్కడ తాడు మాత్రమే ఉంటుంది. పాము ఉండదు. ఈ వికారములు అన్నీ తాడులో పామును చూడటం వంటిది. వీటికి ఎటువంటి ఉనికి లేదు." అని పలికాడు కృష్ణుడు.

అప్పుడు ఉద్ధవుడు శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు. "కృష్ణా! నీవు దేవదేవుడవు. ఈ విశ్వం అంతా నీ రూపమే. నీకు ఉన్న జ్ఞానము శుద్ధమైనది, పురాతనమైనది, వైరాగ్యముతో కూడుకున్నది. నీయందు భక్తి కలిగి ఉండాలి అని చెప్పావు కదా! ఆ భక్తి యోగము గురించి కొంచెం వివరించు. తెలుసుకోవాలని ఉంది.

దేవా! నాతో సహా ఈ ప్రపంచంలో ఉన్న మానవులు అందరూ సంసారము అనే బావిలో పడి, బయటకు రాలేక, తాపత్రయ పడుతున్నారు. నిరంతరం దు:ఖముతో పీడింపబడుతున్నారు. అటువంటి మాకు అమృతమును వర్షించే విధంగా, నీ పాదపద్మములు అనే గొడుగు తప్ప వేరే మార్గము మరొకటి లేదు.

ఓ దేవా! సంసార సాగరంలో పడి ఈదుతూ, ఒడ్డుకు చేరలేక, కాల సర్పం చేత నిరంతరం కఱవబడుతూ, విషయ వాంఛలతో, ఆశాపాశములతో కట్టబడి ఉన్న మా వంటి జీవులను ఉ ద్ధరించు. మోక్షమునకు మార్గముచూపే నీ బోధనలు అనే అమృత వర్షమును మా మీద కురిపించు." అని ప్రాధేయపడ్డాడు ఉద్ధవుడు.

అప్పుడు శ్రీకృష్ణుడు ఉద్ధవునితో ఇలా అన్నాడు. "ఉద్ధవా! కురుక్షేత్ర సంగ్రామం ముగిసిన తరువాత, యుద్ధంలో తన బంధువులను, మిత్రులను చంపినందుకు ధర్మరాజు ఎంతో చింతించాడు. భీష్ముని వద్దకు వెళ్లాడు. ధర్మరాజు వెంట నేను, పాండవులు అందరం వెళ్లాము. అప్పుడు ధర్మరాజు భీష్ముని వలన ఎన్నో ధర్మములను విన్నాడు. తరువాత ధర్మరాజు భీష్ముని మోక్ష ధర్మము గురించి అడిగాడు. ఆ సమయంలో భీష్ముడు చెప్పిన ధర్మములను నేను నీకు వివరిస్తాను. ఆ ధర్మబోధనలు జ్ఞానము, విజ్ఞానముతోనూ, వైరాగ్యముతోనూ, శ్రద్ధ, భక్తితోనూ కూడుకొన్నట్టివి.

ఉద్ధవా! బ్రహ్మలోకము మొదలు కొని భూలోకము వరకు ఉన్న అనంత సృష్టిలో ప్రకృతి, పురుషుడు, మహత్తత్వము, అహంకారము, పంచతన్మాత్రలు, పంచభూతములు, పది ఇంద్రియములు, మనస్సు, సత్వ,రజస్,తమగుణములు ఇవి అన్నీ కలిపి ఇరవై ఎనిమిది తత్వాలు ఉన్నాయి. వీటిని వేరు వేరుగా చూడటం అజ్ఞానము. వీటి అన్నిటిలో పరమాత్మను చూడడం జ్ఞానము. ఆ జ్ఞానాన్ని ఆచరించడం విజ్ఞానము. ఈ జ్ఞాన విజ్ఞానములు కూడా నా స్వరూపాలే. పైన చెప్పబడిన 28 తత్వములకు మూల తత్వము బ్రహ్మము. ఆ బ్రహ్మమును వివిధ రూపములతో, పేర్లతో చూడకూడదు. ఆ బ్రహ్మ పదార్థమును కేవలం జ్ఞానముతో మాత్రమే తెలుసుకోగలము. బ్రహ్మను తెలుసుకోవడమే విజ్ఞానము అని అంటారు. అవయవములతో కూడిన ఈ దేహము, ప్రకృతిలో మనకు కనిపించే అన్ని పదార్థములు పుడతాయి, ఉనికిని కలిగి ఉంటాయి, నాశనం అవుతాయి. వీటికి స్థిరమైన అస్థిత్వము లేదు. సృష్టి మొదలు పెట్టకముందు, ప్రళయం తరువాత ఈ ప్రకృతి కారణరూపంలో ఉంటుంది. (అంటే సంకల్పస్థితి). సృష్టి తరువాత, ప్రళయానికి ముందు అస్థిత్వమును కలిగి ఉంటాయి. ఏదో ఒకరూపంతో, పేరుతో ప్రకటితమౌతుంది. నిరంతరము రకరకాల పనులు జరుగుతుంటాయి. ప్రళయకాలంలో అన్ని వస్తువులు, ప్రాణులు నశిస్తాయి. కాని ఒకే ఒకటి నిలిచి ఉంటుంది. అదే పరబ్రహ్మము.

సృష్టికి ముందు, ప్రళయం తరువాత ఏదైతే నిలిచి ఉంటుందో అదే పరమాత్మ. అదే సత్యము. వేదములను అధ్యయనం చేయడం వలనా, ప్రత్యక్షంగా చూడటం వలనా, ఇతిహాసములు చదవడం వలనా, ఇది ఉందా లేదా అనే అనుమానము తీర్చుకోడం

వలనా, మానవుల మధ్య, ప్రాణుల మధ్య ఉన్న భేదభావము నశిస్తుంది. ఈ ప్రకృతి, ఇందులో వస్తువులు, విషయ సుఖములు, స్వర్గ సుఖములు అన్నీ మాయ,మిథ్య. నిజాలు కావు, పరమాత్మ తత్వము ఒక్కటే సత్యము అని తెలుసుకోగలుగుతాడు. ఆత్మ తత్వమును దర్శిస్తాడు. ఆ తరువాత అన్నింటినీ వదిలిపెట్టి పరమాత్మలో ఐక్యం అవుతాడు.

ఉద్ధవా! వివేక వంతుడైన మానవుడు స్వర్గసుఖములను ఆశించి చేసే యజ్ఞములు, యాగములు, మొదలగునవి తాత్కాలికమైనవనీ, చేసుకున్న పుణ్యం కరిగిపోగానే మరలా జన్మ ఎత్తాలనీ, (క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి) ఆ మాటకొస్తే బ్రహ్మలోకం కూడా శాశ్వతం కాదనీ, ఇవన్నీ అమంగళ కరములు, దు:ఖభాజనములు అనీ తెలుసుకోవాలి.

ఉద్ధవా! నీకు ఇదివరకే భక్తియోగము గురించి చెప్పాను. మరలా అడిగావు కాబట్టి భక్తిని పొందడానికి కావలసిన సాధనముల గురించి వివరిస్తాను. నా యందు భక్తి, శ్రద్ధ కలగాలంటే ముందు నాగురించి తెలుసుకోవాలి. నా కథలను అవతార విశేషములను వినాలి. నా గుణములను, నా లీలలను, నా నామములను కీర్తించాలి. నన్ను నిష్ఠగా పూజించాలి. నా గురించి స్తోత్రము చేయాలి. నన్ను సేవించాలి. నాకు నమస్కరించాలి. నన్నే కాదు నా భక్తులను కూడా పూజించాలి. సకల ప్రాణులలో నన్ను చూడగలగాలి. ఈ శరీరంతో ఏపని చేసినా నా పరంగా చేయాలి. ఫలితం మీద ఆసక్తి లేకుండా కర్మలు చేయాలి. నన్ను కీర్తించాలి. మనస్సును నా మీద

లగ్నంచేయాలి. కోరికలను వదిలిపెట్టాలి. ధనమును, భోగములను, విషయ వాంఛలను నా కొరకు వదిలిపెట్టాలి. యజ్ఞము యాగములు, దానములు, ధర్మములు, హోమములు, వ్రతములు, తపస్సు అన్నీ నా కొరకేచేయాలి. ఇతర కోరికలు తీరడం కోసం చేయకూడదు.

ఉద్ధవా! ఈ ధర్మములను పాటించేవాడు, తన ఆత్మను నాకు నివేదించేవాడు నాకు ప్రీతి పాత్రుడు. అటువంటి మానవునికి నా మీద భక్తి నిలుస్తుంది. అటువంటి భక్తునికి ఈ లోకంలో లభించని వస్తువు ఇంక ఏమీ ఉండదు. సత్వగుణముతో కూడినది, ప్రశాంతమైనది అయిన తన చిత్తమును నాకు అర్పించినపుడు, మానవుడు భక్తి, జ్ఞానము, వైరాగ్యము అనే ఐశ్వర్యములను పొందుతాడు.

అలా కాకుండా మనస్సు రజోగుణ ప్రధానమైతే, అది విషయ వాంఛల వైపు, ప్రాపంచిక సుఖముల వైపు పరుగెడుతుంటుంది. ఈ దేహము, ఈ గృహము, ఈ ఆస్తి నాది అనే భావన కలుగుతుంది. అప్పుడు అతని మనసు అజ్ఞానంతో నిండిపోతుంది. అధర్మం వైపు ప్రయాణం చేస్తుంది. ఈ దేహము ఈ దేహములో అనుభవించే సుఖములు అన్నీ శాశ్వతములు అనే మోహంలో పడిపోతాడు.

ఉద్ధవా! క్లుప్తంగా చెప్పాలంటే నా యందు భక్తిని కలిగించే ఏ కార్యము అయినా అది ధర్మ కార్యము. అందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అని తెలుసుకోవడమే జ్ఞానము. ప్రాపంచిక సుఖముల యందు, విషయ వాంఛల యందు విముఖత్వము కలిగి

ఉండటమే వైరాగ్యము. అణిమ, మహిమ మొదలగు సిద్ధులే పొందతగిన ఐశ్వర్యములు." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఉపదేశించాడు.

ఇప్పుడు ఉద్ధవునికి ఒక సందేహము కలిగింది. " కృష్ణా! యమ నియమములు, శమ దమములు, తితిక్ష, ధృతి,  అని చెప్పారు కదా! వాటి గురించి వివరించండి. అలాగే దానము, తపస్సు, శౌర్యము, సత్యము, ఋతము, త్యాగము, ఇష్టము, ధనము, యజ్ఞము, దక్షిణ వీటి అర్థములు కూడా వివరించండి. పురుషుడు అంటే ఎవరు అతని బలం ఎట్టిది? దయ, లాభము, విద్య, లజ్జ, శ్రీ, సుఖము, దు:ఖము అనగా నేమి? పండితుడు ఎలా ఉంటాడు? పండితుని లక్షణములు ఏమి? మూర్ఖుడు ఎలా ఉంటాడు? మంచి లక్షణములు, చెడ్డ లక్షణములు ఏవి? స్వర్గ నరకములు అంటే ఏమిటి? బంధువులు అంటే ఎవరు? గృహము అంటే ఏమిటి? ధనవంతుడు అంటేఎవరు? దరిద్రుడు అంటేఎవరు? లోభి అంటే ఎవరు? ఈశ్వరుడు అని ఎవరిని అంటారు? నా మనసులో ఈ ప్రశ్నలు తొలుస్తున్నాయి. దయచేసి వీటికి సమాధానాలు చెప్పండి. వీటినే కాకుండా వీటికి వ్యతిరేకముగాఉండే లక్షణములను కూడా వివరించండి." అని అడిగాడు ఉద్ధవుడు. ఉద్ధవుని సందేహములకు శ్రీకృష్ణుడు ఈ విధంగా సమాధానాలు చెప్పాడు.

"ఉద్ధవా! అహింస, సత్యము, అస్తేయము, అసంగము, హ్రీ, అసంచయము, ఆస్తిక్యము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము, క్షమ, అభయము, ఈ పన్నెండు యమములు అంటారు. బాహ్యశౌచము,

అభ్యంతర శౌచము, జపము, తపము, హోమము, శ్రద్ధ, ఆతిథ్యము, అర్చన, తీర్థాటనము, పరహితములైన పనులు చేయడం, తృప్తి, గురుసేవ, ఈ పన్నెండు నియమములు అని అంటారు. యోగులు, సాధకులు ఈ యమ నియమములు పాటించి, అనంత ఐశ్వర్యములు పొందుతారు.  వీటిని వివరిస్తాను.

మనస్సును నిగ్రహించడం. మనసును నా యందు లగ్నం చేయడం శమము అంటారు. ఇంద్రియములను నిగ్రహించడం దమము అంటారు.  దు:ఖమును జయించడం, దు:ఖములను ఓర్చుకోవడం తితిక్ష అంటారు. స్త్రీపురుషులు ఒకరితో ఒకరు కామవాంఛలను తీర్చుకోవడాన్ని అదుపులో ఉంచుకోవడం ధైర్యము అంటారు. ఇతరులనుహింసికచపోవడం, ఇతరులకు ద్రోహం చేయకపోవడం, తనకు ఉన్నది ఇతరులతో పంచుకోవడం దానం అంటారు. కోరికలను వదిలిపెట్టడం తపస్సు అంటారు. మనం చేసే కర్మల వలన కలిగా వాసనలను నిరోధించడమే శౌర్యము. బ్రహ్మ జ్ఞానము కలిగి      ఉండటం, అందరిపట్ల సమభావం కలిగి ఉండటమే సత్యము. ప్రకృతి శాసనాన్ని అనుసరించడం ఇతరులకు ప్రియమైన వాక్కులు పలకడమే ఋతము.(చాలామంది ప్రకృతి విరుద్ధమైన పనులు చేయడం మనం చూస్తూనే ఉన్నాము.) అడ్డమైన పనులు చేయకుండా ఉండటము, చేసే కర్మల పట్ల ఆసక్తి లేకుండా ఉండటమే శౌచము అంటే పవిత్రంగా ఉండటం అని అంటారు. అన్ని కోరికలను వదిలిపెట్టడమే  నిజమైన సన్యాసము. ధర్మం పాటించడమే అంతులేని ధనం సంపాదించడం. ధర్మాచరణమునుమించిన ధనము, సంపద లేదు.

ఉద్ధవా! నేనే యజ్ఞ స్వరూపుడను. నీకున్న జ్ఞానమును ఇతరులకు ఉపదేశించడమే దక్షిణ ఇవ్వడం. ప్రాణాయామం చేయడం అత్యంత బలసంపన్నమైనది. భగము అంటే నా యొక్క ఐశ్వర్యము. నా మీద భక్తియే మానవునికి లభించు ఉత్తమమైన లాభము. మనుషుల మధ్య, సాటి జీవుల మధ్య భేదభావము లేకుండా అందరినీ సమానంగా చూడటమే నిజమైన విద్య. చేయకూడని కర్మల యందు ద్వేషమును కలిగి ఉండటమే నిజమైన సిగ్గు అంటే లజ్జ అంటే హ్రీ అంటారు. సుఖము వచ్చినపుడు పొంగి పోకుండా, దు:ఖము వచ్చినపుడు కుంగిపోకుండా సమానత్వము ప్రదర్శించడమే నిజమైన సుఖము. అలా కాకుండా విషయ వాంఛల యందు మనసును లగ్నం చేయడమే నిజమైన దు:ఖము. ఏ కర్మలు తనను బందిస్తాయో, ఆ బంధనముల నుండి ఎలా విడివడాలో తెలిసిన వాడే పండితుడు. "ఈ శరీరం నాది, ఇది అంతా నాది, నేనే ఇదంతా చేస్తున్నాను, నా వలననే ఇదంతా జరుగుతూ ఉంది" అని భావించే వాడే మూర్ఖుడు. ప్రాపంచిక విషయముల నుండి మనస్సును బుద్ధిని పరమాత్మవైపు మళ్లించడమే మంచి మార్గము, సత్పథము. అలా కాకుండా కేవలం ప్రాపంచిక విషయముల మీద, విషయ వాంఛల మీద మనస్సును నిలపడమే చెడుమార్గము. సాత్విక గుణము కలిగి ఉండటమే స్వర్గము. తమోగుణము ఎక్కువగా ఉండటమే నరకము. సకల జీవరాసులకు నేనే ప్రియమైన బంధువును. మానవ శరీరమే గృహము. మంచి గుణములు కలిగిన వాడే ధనవంతుడు. తృప్తి లేని వాడు దరిద్రుడు. ఇంద్రియములను జయించని వాడే పరమలోభి (అన్నీనాకే కావాలంటాడు). విషయ వాంఛలకు లోబడని వాడే స్వతంత్రుడు.

ఎల్లప్పుడు ప్రాపంచిక విషయములలో వర్తిస్తూ విషయ వాంఛలకు లోబడ్డవాడే అస్వతంత్రుడు.

ఉద్ధవా! వీడు మంచి వాడా, చెడ్డ వాడా, వీడు గుణవంతుడా లేక వీడు గుణహీనుడా అని ఆలోచించడమే దోషము. అందరూ మంచి వాళ్లు, గుణవంతులు అని అనుకోవడమే మంచితనము." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునితో చెప్పాడు అని శుకయోగీంద్రుడు పరీక్షిత్ మహారాజుకు భక్తి, జ్ఞానము, యమ, నియమము మొదలగు వాటి గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము
ఏకాదశ స్కంధము పంతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ఏకాదశ స్కంధము
ఇరువదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఇలా అడిగాడు.

"కృష్ణా! ఏమి చెయ్యాలో ఏమి చెయ్యకూడదో నిర్దేశించేది వేదము. ఆ వేదస్వరూపుడవు నువ్వు. వేదములు మనం చేసే కర్మలు మంచివా, చెడ్డవా, పాపము పుణ్యము వీటి గురించి చెబుతున్నాయి.

వేదములె వర్ణాశ్రమములలో భేదములను, గుణదోషములను, ద్రవ్యము, దేశము, వయస్సులను, కాలానుగుణంగా వచ్చే యోగ్యతలను, అయోగ్యతలను స్వర్గ నరకములను గురించి వివరించాయి. మానవునిలోని గుణములు, దోషములు వాటి మధ్య భేదములు వీటి గురించి తెలుసుకోకుండా, ఇది చెయ్యాలి, ఇది చెయ్యకూడదు అని నిర్ణయించలేము. ఏది చెయ్యాలో ఏది చెయ్యకూడదో తెలుసుకోకుండా ముక్తి కలగడం అసంభవము. స్వర్గము, నరకము మొదలగు వాటి గురించి, సాధనతో కూడిన జ్ఞానము గురించి తెలియజేసే నీ వాక్కే వేదము. నీ వాక్కే మానవులకు, పితరులకు ప్రమాణము.

కృష్ణా! ఒక పక్క వేదములు వర్ణాశ్రమ ధర్మములను, వాటిలో గుణదోషములను, భేదబుద్ధితో చెబుతున్నాయి. అదే వేదము అందరినీ సమానంగా చూడాలి, భేదబుద్ధి చూపించకూడదు అని చెబుతూ ఉంది. ఇది ఒకదానికి మరొకటి విరుద్ధంగా ఉన్నాయి. ఈ పరస్పర విరుద్ధభావాలు వేదములలో ఎందుకు ప్రతిపాదించబడ్డాయో వివరించండి." అని అడిగాడు. శ్రీకృష్ణుడు ఈ విధంగా సమాధానం చెబుతున్నాడు.

"ఉద్ధవా! మానవుల శ్రేయస్సు కోరి నేను జ్ఞాన యోగము, కర్మ యోగము, భక్తి యోగము అనే మూడు యోగములను ఉపదేశించాను. మానవులు ముక్తి పొందడానికి ఇంతకంటే మంచి ఉపాయము మరొకటి లేదు. ఉద్ధవా! మానవులు తాముచేసే కర్మల నుండి, కర్మ ఫలముల నుండి విరక్తి చెందిన వారు, కర్మలను

వదిలిపెట్టినవారు, జ్ఞానయోగము అవలంబించడానికి అర్హులు. తాము చేసే కర్మలను వదిలిపెట్టలేని వారు, కర్మఫలముల మీద విరక్తి చెందని వారు. కర్మలుచే స్తే సుఖం కలుగుతుంది అని నమ్మినవారు, కర్మలు చేయడం దు:ఖములకు మూలకారణం అని తెలియనివారు, అటువంటి వారు ఏపని చేసినా ఏదో ఒక కోరికతో చేస్తుంటారు. వీరు కర్మయోగము అవలంబించ డానికి అర్హులు.

ఎల్లప్పుడు నా యందు మనస్సును లగ్నం చేసేవారు, నా కథలను వినేవారు, సదా నన్ను కీర్తించేవారు, ప్రాపంచిక విషయముల యందు, విషయ వాంఛల యందు వైరాగ్యముకలవారు లేక అమితమైన ఆసక్తిలేని వారు, భక్తియోగము అవలంబించడానికి యోగ్యులు.

కర్మలు చేస్తే దు:ఖము కలుగుతుంది కానీ సుఖం కలుగదు అనే జ్ఞానం కలిగేంతవరకు, లేక నా కథలను వినడంలో శ్రద్ధకలిగేంతవరకు, మానవులు రోజూ చేసే కర్మలు (సంధ్యావందనము, హెూమము, తర్పణములు, పూజలు, వ్రతములు, మొదలైనవి), ఏదో నిమిత్తంతో చేసే కర్మలు, అనగా శ్రాద్ధములు మొదలగునవి, చేస్తూ ఉండవలసిందే.

ఉద్ధవా! ఎల్లప్పుడూ తన ధర్మాన్ని ఆచరిస్తూ, ఫలం కోరకుండా కర్మలు చేస్తూ, ఉండే పురుషుడు, యజ్ఞముల ద్వారా దేవతలను ఆరాధిస్తూ, అటు కోరికలతో కూడిన కర్మలను కానీ, ఇటు చేయకూడని కర్మలను కానీ చేయకుండా ఉంటే, అటువంటి వారికి,

అటు స్వర్గము రాదు, ఇటు నరకము రాదు. చేయకూడని పనులను వదిలిపెట్టిన వాడు, పరిశుద్ధమైన చిత్తము కలవాడు, స్వధర్మమును ఆచరించే వాడు, అనునిత్యం ప్రపంచంలో తిరుగుతున్నా, అతడి మనసు నా మీద లగ్నం అయి ఉంటుంది. ఎల్లప్పుడు అతడు ఆత్మజ్ఞానమును,  నామీద భక్తిని కలిగి ఉంటాడు. స్వర్గంలో ఉండే వారు, నరకంలో ఉండే వారు కర్మలు చేయడానికి అర్హులు కారు. వారు జ్ఞానమును సంపాదించడానికి కానీ, నా మీద భక్తి కలిగి ఉండటానికి కానీ యోగ్యతలేదు. అందుకని జ్ఞానము సంపాదించడానికి, భక్తి కలిగి ఉండటానికీ మానవ జన్మమే ఉత్తమమైనది. అందుకే స్వర్గ, నరక వాసులు ఎల్లప్పుడూమానవ జన్మ పొందాలని కోరుకుంటూ ఉంటారు.

కాని ఉద్ధవా! దేహము మీద అభిమానము ఎల్లప్పుడూ ప్రమాదమును కలిగిస్తుంది. కాబట్టి బుద్ధిమంతుడు అయిన మానవుడు అటు స్వర్గమును కానీ, ఇటు నరకమును కానీ, కోరుకోడు. దేహాభి మానము కల మానవజన్మను కూడా కోరుకోడు.

ఇక్కడ ఇంకొకవిశేషము ఉంది.  మానవుడు కేవలము మానవ దేహముతో మాత్రమే జ్ఞానమును సంపాదించగలడు. ధర్మము, అర్థము, కామము వీటిని సంపాదించాలంటే దేహము కావాలి. కాని ఈ దేహము శాశ్వతము కాదు. కాలము తీరగానే రాలిపోతుంది. పైగా దేహాభిమానము అత్యంత ప్రమాదకరము.  ఈ విషయం తెలిసిన జీవుడు ఈ దేహమునుండి వెళ్లిపోకముందే ముక్తి కొరకు ప్రయత్నాలు చేస్తాడు.

ఎలాగంటే, ఒక చెట్టు మీద ఒక పక్షి గూడు కట్టుకొని నివసిస్తూ ఉంటుంది. దయాదాక్షిణ్యములు లేని మానవుడు తన స్వార్థం కోసరం ఆగూడును నాశనం చేస్తాడు. అది గ్రహించిన పక్షి ఆ గూడును వదిలిపెట్టి వెళ్లిపోతుంది. అలాగే ఈ దేహము క్షీణించి పోగానే, లేక ఏ కారణం చేతనైనా నాశనం కాగానే, జీవుడు మరో దేహమును వెతుక్కుంటూ వెళ్లిపోతాడు.

ఉద్ధవా! ఒక్కో సంవత్సరము గడిచే కొద్దీ మానవుని ఆయువు క్షీణించిపోతుంది. ఈ విషయం తెలుసుకున్న మానవుడు భయంతో వణికి పోతాడు. ప్రాపంచిక విషయముల మీద, విషయ వాంఛల మీద ఆసక్తిని వదిలిపెట్టి, పరబ్రహ్మము గురించి తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తాడు. పరమ శాంతిని పొందుతాడు. (కాని మనం మాత్రం ఆనందంగా పుట్టినరోజు పండుగలు జరుపు కుంటాము. అందరినీ ఉద్ధరించడానికి పుట్టినట్టు ఫీల్ అవుతుంటాము. చావుకు దగ్గర అవుతున్నాము అనే విషయాన్ని మరిచిపోతాము.)

ఉద్ధవా! మంచి పనులు చేయడానికైనా, చెడ్డ పనులు చేయడానికైనా, ఆ పనుల వలన మంచి,చెడు ఫలములు పొందడానికైనా ఈ మానవ దేహము అత్యంత అవసరము. ఒక్క మానవ శరీరములోనే మనం చేసిన కర్మలకు ఫలితమును అనుభవించగలము. మానవ శరీరము లభించడం చాలా కష్టం. కాని చాలా సులభం కూడాను. సంసారము అనే సాగరమును దాటడానికి ఈ శరీరము ఒక ధృఢమైన నావలాంటిది. గురువు ఈనావకు

చుక్కానిపట్టే వాడు. గురువు శరణు కోరితే, ఆయన ఈ నావకు చుక్కానిగా నిలిచి శరీరము అనే ఈ నావను సంసారము అనే సాగరంలో సక్రమంగా నడిపిస్తాడు. నా నామస్మరణ చేసినంత మాత్రం చేతనే, నేను, అనుకూలమైన వాయురూపంలో, ఈ నావను సక్రమంగా సరి అయిన మార్గములో నడిపించి, మోక్షము అనే లక్ష్యము చేరుస్తాను. ఇంత చక్కని ఏర్పాటు చేసినా, మానవుడు ఆ ఏర్పాటును సక్రమంగా ఉపయోగించుకోడు. నన్ను స్మరిస్తూ నా మీద భక్తిని పెంపొందించుకొని ఈ సంసార సాగరమును దాటడానికి ప్రయత్నించడు. ప్రాపంచిక విషయములలో నిమగ్నుడైన మానవుడు తన చేజేతులా తన జీవితమును నాశనం చేసుకుంటున్నాడు. పతితుడౌతున్నాడు.

ప్రాపంచిక విషయములలో కేవలం దు:ఖమే మిగులుతుంది అని తెలుసుకొన్న యోగి, విరక్తుడై ఇంద్రియములను జయించి తన మనస్సును ఆత్మకు అనుసంధానము చేసి, నిశ్చలంగా ఉంటాడు.

ఉద్ధవా! మానవుల మనస్సు అతి చంచలమైనది. బలవంతంగా మనస్సును కట్టడి చేసినా, అది ఒక చోట నిలకడగా ఉండదు. అటు ఇటు పరుగెడుతుంటుంది. అప్పుడు మానవుడు నిరాశ పడక, ప్రశాంత చిత్తంతో, మనసుకు నచ్చిన మార్గమును అనుసరించి, మనసును ప్రాపంచిక విషయముల మీదకు పోకుండా తన స్వాధీనంలోకి తెచ్చుకోవాలి. . ఇది సాధన వలననే సాధ్యం అవుతుంది.

ఉద్ధవా! మనస్సు యొక్క గతిని ఉపేక్ష చేయకూడదు. మనస్సును నిలకడగా ఉంచాలంటే ముందు ఇంద్రియములను నిగ్రహించాలి. ప్రాణాయామంతో శ్వాసను అదుపులో ఉంచాలి. బుద్ధిని మనసుతో అనుసంధానం చేయాలి. అప్పుడు మనస్సు ఆత్మలో స్థిరంగా నిలిచి ఉంటుంది.

ఉదాహరణకు ఒక అశ్వము ఉంది. ఆ అశ్వమును ఎక్కి స్వారీ చెయ్యాలంటే, అశ్వమును తన ఇష్టం వచ్చినట్టు నడిపించాలంటే, ముందు ఆ అశ్వమును మచ్చిక చేసుకోవాలి. తన మనోభావములను తెలుసుకొని వాటికి తగ్గట్టు నడిచే విధానమును ఆ అశ్వమునకు నేర్పాలి. అప్పుడే ఆశ్వికుడు అశ్వమును తన ఇష్టం వచ్చినట్టు నడపగలడు. అశ్వమును ఎక్కినపుడు ఆశ్వికుడు పగ్గములను చేతిలో పట్టుకొని అశ్వమునకు సూచనలు ఇస్తూ, అదిలిస్తూ తన మనసుకు నచ్చిన విధంగా నడిపిస్తుంటాడు. మంచి మాటలతో తన స్వాధీనంలోకి తెచ్చుకుంటాడు.

మనస్సు కూడా అశ్వం లాంటిది. మనస్సును కూడా బుద్ధి అనే పగ్గములు పట్టుకొని, మంచి మాటలతో స్వాధీనం చేసుకోవాలి. అప్పుడే మనస్సు మన ఇష్టంవచ్చినట్టు నడుస్తుంది. కాని ఇది అంత సులభ సాధ్యం కాదు. కానీ మనస్సు తన స్వాధీనములోకి వచ్చి నిశ్చలంగా ఉండేంతవరకు, మానవుడు తత్వజ్ఞానమును, సాంఖ్యయోగమును అభ్యసించాలి. దానికి గురువు యొక్క ఉపదేశములు చాలా అవసరము. గురువు యొక్క ఉపదేశములను

అనుసరించి మానవుడు వైరాగ్యమును అవలంబించి, దేహము మీద అభిమానమును వదిలిపెట్టాలి. యమ నియమములను అనుసరించాలి. ప్రపంచములోని వస్తువులను, వాటి తత్వములను నిశితంగా పరిశీలించాలి. నా ప్రతిమను పెట్టుకొని పూజించాలి, ధ్యానించాలి. మనస్సును నా మీద లగ్నం చేయాలి. అప్పుడు మనస్సు పరమాత్మ వైపు మళ్లుతుంది. ఈ మార్గము తప్ప వేరే ఏ ఇతర మార్గముల ద్వారా మనస్సు పరమాత్మవైపు మళ్లదు.

యోగి అయిన వాడు అప్పుడప్పుడు ప్రమాద వశాత్తు చేయకూడని కర్మలు చేయడం సంభవిస్తుంది. అప్పుడు యోగి యోగమార్గము ద్వారా ఆ పాపములను పోగొట్టుకోవాలి. అంతేకానీ ప్రాయశ్చిత్తముల కొరకు ప్రయత్నించకూడదు.

మానవుడు ప్రపంచంలో సంచరిస్తూ ఏవేవో కర్మలు చేస్తుంటాడు. కర్మలు ఎల్లప్పుడూ అనర్థములను, దు:ఖములను తెచ్చిపెడతాయి. కాబట్టి వీలైనంత వరకు జీవించడానికి అవసరమైన కర్మలు తప్ప ఇతర కర్మలు చేయడం మానుకోవాలి. ఎల్లప్పుడూ నా కథలను వింటూ, నన్ను స్మరించే మానవుడు, ప్రాపంచిక కర్మల యందు విముఖుడై ఉంటాడు. విషయ వాంఛలు అన్నీ దు:ఖమును కలిగిస్తాయి అని తెలుసుకుంటాడు. కానీ ప్రాపంచిక విషయములను, విషయ వాంఛలను విడిచిపెట్టడానికి అతని శక్తి చాలదు. అటువంటి సమయంలో మానవుడు నా మీద భక్తిని కలిగి ఉండాలి. ప్రాపంచిక సంబంధమైన కర్మలు చేస్తున్నా, వాటివలన దు:ఖము కలిగినా, వాటియందు ఆసక్తి లేకుండా ఉండాలి. ఎల్లప్పుడూ నా మీద భక్తి కలిగి

నన్ను ధ్యానిస్తూ ఉండాలి. అప్పుడు ఆ కర్మలు, కర్మఫలములు అతనిని ఏమీ ప్రభావితం చేయలేవు.

ఇటువంటి భక్తి యోగమును అవలంబించే మానవుని, నన్ను సతతం ఆరాధించే మానవుని హృదయంలో నేను ఎల్లప్పుడూ నిలిచి ఉంటాను. నేను ఉన్న చోట విషయ వాసనలకు చోటు లేదు. అతని మనస్సు నిర్మలంగా నా మీద లగ్నం అయి ఉంటుంది. నన్ను మనసులో సాక్షాత్కరింప చేసుకున్న మానవునిలో అహంకారము మాయమై పోతుంది. అతని కర్మ వాసనలు నశించి పోతాయి. అతనిలోని సకల సంశయములు తీరిపోతాయి. కాబట్టి నా భక్తుడు ఎల్లప్పుడు నన్నే స్మరించే వాడికి జ్ఞానము, వైరాగ్యముతో పనిలేదు. నా మీద భక్తి, శ్రద్ధ కలగడానికి జ్ఞాన వైరాగ్యములు పనికివస్తాయి కానీ, ఒకసారి నా మీద అచంచలమైన భక్తి కలిగిన తరువాత, జ్ఞాన వైరాగ్యములు అతనికి ఏ విధమైన మేలు చేయలేవు.

ఉద్ధవా! పుణ్య కర్మలు, తపస్సు, జ్ఞానము వైరాగ్యము, యోగాభ్యాసము, దానము, ధర్మము, తీర్థయాత్రలు, వ్రతములు ఇవి అన్నీ ఆచరిస్తే వచ్చే ఫలితములను, మొదలైన వాటిని, మానవుడు భక్తి యోగమును అవలంబించి నా యందు అచంచలమైన భక్తివిశ్వాసములను కలిగి ఉండటం ద్వారా పొందుతాడు. నా భక్తులకు కోరికలు ఏమీ ఉండవు. నా భక్తుడు కావాలనుకుంటే స్వర్గము, మోక్షము, వైకుంఠము అతనికి అనాయాసంగా లభిస్తాయి. నా యందు అచంచలమైన ప్రేమ కలవారు, సాధువులు, యోగులు అయిన నా భక్తులు, నేను మోక్షము ఇస్తానన్నా వద్దంటారు. నిరంతరం నా పాదసేవను మాత్రమే కోరుకుంటారు. దేనిమీదా ఆసక్తి, అపేక్ష

లేకుండా ఉండటమే అన్నిటి కన్నా మేలైనది. ఏ కోరికలు లేని వాడు, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి లేనివాడు మాత్రమే నా యందు భక్తి కలిగి ఉండటానికి అర్హుడు.

ఉద్ధవా! రాగము ద్వేషము లేని వారు, అంతటా సమ బుద్ధి కలవారు, అందరినీ సమానంగా చూచేవారు, నాయందు ఏకాగ్రమైన భక్తి కలవారు, మాయకు అతీతుడైన భగవంతుని మనసులో నిలుపుకున్న వారు, అటువంటి వారు పుణ్య కార్యములు చేసినా, చేయకూడని పనులు, శాస్త్ర విరుద్ధమైన పనులుచేసినా, వారికి ఎటువంటి పుణ్యము, పాపము అంటదు. ఎందుకంటే వాళ్లు ఏపని చేసినా నా పరంగానే చేస్తారు. కర్మఫలములను ఆశించరు. కర్మఫలములను నాకు అర్పిస్తారు.

ఉద్ధవా! నేను నీకు జ్ఞాన మార్గము, కర్మమార్గము, భక్తిమార్గము వీటి గురించి చెప్పాను. ఈ మార్గముల ద్వారా నన్ను ఆశ్రయించిన వారు, కాలమునకు అతీతమైనది, నామాయకు లోబడనిది అయిన నా నివాసమును చేరుకుంటారు. దానినే పండితులు పరబ్రహ్మపదముఅని అంటారు.” అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి కర్మ,జ్ఞాన,భక్తిమార్గముల గురించి వివరించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఇరువదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్: 9866140619, 9391134792

ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము

## ఏకాదశ స్కంధము

## ఇరవై ఒకటవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చేసిన జ్ఞానబోధను వివరిస్తున్నాడు.

“ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి గుణములు వాటిలో ఉన్న దోషముల గురించి ఈ విధంగా వివరిస్తున్నాడు.

“ఉద్ధవా! నేను ఇప్పటి దాకా నీకు భక్తి యోగము, జ్ఞాన యోగము, కర్మయోగము గురించి వివరించాను. కాని మానవులు వీటి గురించి ఆలోచించకుండా, ఈమార్గములలో నడవకుండా, కేవలము ఇంద్రియముల చేత భోగములు అనుభవిస్తూ విషయ వాంఛలలో మునిగి తేలుతూ, సకల దోషములను కొనితెచ్చుకుంటూ, ఈ జననమరణ చక్రంలో తిరుగుతుంటారు.

ఎవరైతే తమకు అప్పగించిన పనులను శ్రద్ధతో చేస్తారో, తమ తమ ధర్మములను సక్రమంగా నిర్వర్తిస్తారో, వారే గుణవంతులు. తమకు అప్పగించిన ధర్మములను అధికారములను కాదని పరాధికారములను పైన వేసుకొనేవారు దోషులు. వారి చర్యలు దోషముతో కూడుకున్నవి. ఇదే ఒకమనిషిలోని గుణములను, దోషములను నిరూపణ చేసే ప్రక్రియ.

ఉద్ధవా! ఈ ప్రకృతిలో దొరికే వస్తువులు, పదార్థములు అన్నీ ఒకేవిధంగా ఉంటాయి. కాని మానవులు ఇది యోగ్యమా, కాదా, ఇది శుద్ధమైనదా, కాదా, ఇది శుభమైనదా, కాదా  అని సందేహిస్తుంటారు. ఇదంతా ధర్మాచరణము కొరకు, తమయొక్క దేహమును సంరక్షించుకోడానికి చేస్తుంటారు. ధర్మాచరణము గురించి, మానవుల శ్రేయస్సు గురించి,  ఈ ఆచారాన్ని నేనే మానవులకు చూపించాను.

ఉద్ధవా! ఈ ప్రకృతిలో ఉండే ప్రతి వస్తువు పంచభూతములతో చేయబడిందే. సకల ప్రాణుల శరీరములు ఏర్పడడానికి  ఈ పంచభూతములే కారణములు. ఈ పంచభూతములు పరమాత్మ నుండి ఉద్భవించినవే!  ఈ ప్రాణుల దేహము లన్నీ పంచభూతములతో నిర్మితమైనప్పటికినీ, అన్ని దేహములు సమానమైనప్పటికినీ, ధర్మ, అర్థ, కామములు పొందడానికి, వేదము వారికి వివిధములైన నామములను, రూపములను కల్పించబడ్డాయి. అదే ప్రకారంగా వివిధ ప్రదేశములకు, వివిధ కాలములకు, వివిధ పదార్థములకు, ధాన్యము మొదలగు వస్తువులకు, ఇవి మంచివి, ఇవి చెడ్డవి అనే భేదములు విధించబడ్డాయి.

ఏయే ప్రదేశములలో భగవంతుని మీద, బ్రాహ్మణుల మీద భక్తి ఉండదో, ఆ దేశములు అపవిత్రమైనవి. ఇదే విధంగా కాలములో కూడా ఈ భేదములు ఉన్నాయి. స్వయముగా గానీ, ఏద్రైనా పదార్థమును ఉపయోగించి కానీ ఒక పని చెయ్యాలంటే, దానికి పవిత్రమైన కాలము కావాలి. ( ఈ రోజుల్లో కూడా మనం మంచి ముహూర్త నిర్ణయం చేసి కానీ ఏ పనీ చేయము.) ఎందుకంటే కాలం

కాని కాలంలో ఒక పని తలపెడితే, తాను తల పెట్టిన కార్యము చేయడానికి కావలసిన వస్తుసామగ్రి లభించదు. అందుకని ఆ పని చేయడానికి వీలుపడదు. కాబట్టి అటువంటి కాలము అపవిత్రమైనది.

ఒక పదార్థము శుచిగా ఉందా లేదా అనే విషయం ఆ పదార్థము యొక్క పరిమాణము, ద్రవ్యము (ఖరీదు), వచనము (దాని గురించి మాట్లాడుకోవడం), కాలము (అది దొరికే కాలము), అది చిన్నదా, పెద్దదా(పరిమాణము)...వీటిని బట్టి నిర్ణయింపబడుతుంది. ఒక వస్త్రము ఉంది. దానికి మకిల అంటినా, మూత్రంపోసినా అపవిత్రం అవుతుంది. దానిని ఉతికితే శుభ్రం అవుతుంది. గుడిలో విగ్రహాలు ఏ కారణం చేతనైనా అపవిత్రం అయితే సంప్రోక్షణ మంత్రములతో పవిత్రం అవుతాయి.

ఏది పవిత్రము ఏది అపవిత్రము అని నిర్ణయించడానికి బ్రాహ్మణులు, పండితులు చెప్పిన దానినే అనుసరించాలి. ఒకసారి పూజకు ఉపయోగించిన పువ్వులు, వాసన చూచిన పువ్వులు, మురికి మడ్డితో ఉన్న నీరు, అపవిత్రములు. కాని ఈ నియమము పారే నీరు ఉన్న నదులకు, వర్తించదు.

జీవులు తమ యొక్క శక్తి, సామర్థ్యములను బట్టి, బుద్ధిని బట్టి, వారికి ఉన్న సంపదలను అనుసరించి, పాపములు చేస్తుంటారు. ఈ పాప కార్యములకు దేశ, కాల పరిస్థితులు వర్తిస్తాయి. ఒక ప్రదేశములో చేసిన కార్యము పాపం అయితే మరొక ప్రదేశములో చేసిన అదే కార్యము పాపం కాదు. ధాన్యము, కర్రలు, దంతములు, తైలములు,

బంగారము, చర్మము, మట్టితో చేసిన కుండలు, ఇవి అన్నీ కాలము, వాయువు, అగ్ని, నీటితో పవిత్రం చేయవచ్చును. ఉదాహరణకు కుండలు నీటితో కడగవచ్చు. బంగారము అగ్నిలో వేసి మెరుగుపెట్టవచ్చు. కొన్ని గాలిలో ఆరబెట్టవచ్చు. కొన్ని పదార్థములకు ఏదైనా అంటుకుంటే అక్కడ ఆ పదార్థమును చెక్కడం వలన, రుద్దడం వలనా అపవిత్రం అయిన భాగమును తీసేయవచ్చు. చెక్కిన తరువాత, రుద్దిన తరువాత, మిగిలిన వస్తువు పవిత్రంగా ఉంటుంది.

మానవుడు స్నానము, దానము, తపస్సు, వయస్సు, శక్తి, ఉపనయనము మొదలగు సంస్కారములతో, సంధ్యావందనము మొదలగు కర్మలతో, మానవుడు పరిశుద్ధుడు అవుతాడు. ఉపనయనంతో మానవుడు ద్విజుడుగా మారి, పరిశుద్ధుడయి వేదములను చదవడానికి అర్హుడవుతాడు. మంచి గురువు ముఖతా మంత్రములను అభ్యాసం చేస్తే ఆ మానవుడు పవిత్రుడవుతాడు. ఏ కర్మ చేసినా దానిని నాకు అర్పిస్తే ఆ కర్మ పవిత్రమౌతుంది. దేశము, కాలము, ద్రవ్యము, కర్త, మంత్రము, కర్మ ఈ ఆరూ పవిత్రంగా ఉంటే అది ధర్మము అనిపించుకుంటుంది. ఈ ఆరు అపవిత్రం అయితే అదే అధర్మము.

ఉ ద్ధవా! కొన్ని సమయాలలో మనకు గుణము గా అనిపించింది దోషముగా ఉంటుంది. అలాగే మనకు దోషముగా కనిపించింది గుణముగా ఉంటుంది. గుణ దోషములు మనము ఆ వస్తువును చూచే తీరును బట్టి, మన మనసును బట్టి ఉంటుంది. సురాపానము నిషిద్ధము. సురాపానము వలన మంచి వాడు కూడా పతితుడు అవుతాడు. కాని అప్పటికే పతితుడు అయిన వ్యక్తి

సురాపానం వలన కొత్తగా పతుతుడు అయ్యే అవకాశం లేదు. కాబట్టి అప్పటికే పతితుడు అయిన వ్యక్తి సురాపానం చేస్తే అది దోషంగా అనిపించదు. భార్యతో కలవడం యతులకు దోషము. కానీ గృహస్థుకు దోషం కాదు. పైగా అది గృహస్థ కర్తవ్యము.

మానవుడు ఏయే విషయముల నుండి వెనుకకు తగ్గుతాడో, ఆయా విషయముల నుండి అతనికి విముక్తి కలుగుతుంది. కాబట్టి విషయముల వంక మొగ్గు చూపకుండా, వాటి నుండి వెనుకకు తగ్గడమో లేక వాటి వంక చూడకపోవడమో సుఖదాయకమైన మార్గము. అలా విషయ వాంఛలకు, కోరికలకు దూరంగా ఉండటమే శోకాన్ని భయాన్ని, మోహాన్ని నాశనం చేస్తుంది. శాంతిని కలిగిస్తుంది. అలా కాకుండా ఎప్పుడూ విషయ వాంఛల గురించి ఆలోచిస్తుంటే, వారిని విషయవాంఛలు తమ వైపుకు లాక్కుంటాయి. వాటి మీద అంతులేని ఆసక్తిని కలిగిస్తాయి. విషయ వాంఛల మీద ఉన్న ఆసక్తి క్రమేణా ఆ కోరికలు తీరాలనే బలమైన పట్టుదల కలుగుతుంది. దాని వలన అనవసరమైన కలహములు సంభవిస్తాయి. చిన్న చిన్న కలహములు అంతులేని కోపాన్ని కలిగిస్తాయి. క్రోధంలో నుండి మోహం పుడుతుంది. ఆ మోహ ప్రభావంలో పడి మానవుడు ఏది చెయ్యాలి ఏది చెయ్యకూడదు అనే విచక్షణా జ్ఞానమును కోల్పోతాడు. విచక్షణా జ్ఞానమును కోల్పోయిన వ్యక్తి తాను ఏమి చేస్తున్నాడో తెలియకుండా చెయ్యకూడని పనులు అన్నీ చేసేస్తాడు. తుదకు కష్టాల పాలవుతాడు.(భగవద్గీతలోని రెండవ అధ్యాయము 62,63 శ్లోకాలు ఇదే విషయాన్ని చెబుతాయి).

విచక్షణా జ్ఞానము కోల్పోయిన వ్యక్తికి ఎల్లప్పుడు విషయవాంఛల యందు ఆసక్తి ఉంటుంది కానీ, పరమాత్మయందు భక్తి ఉండదు. కేవలము తన కోరికలను తీర్చుకోడానికే ప్రయత్నిస్తాడు. అనవసరమైన ఆవేశానికి లోనవుతాడు. ఆవేశంతో ఊగి పోతాడు. ఒళ్లు తెలియకుండా పడిపోతాడు.

ఉద్ధవా! మానవుడు యజ్ఞయాగములు దానధర్మములు చేసి స్వర్గలోక సుఖములను కోరుకుంటాడు. ఈ ప్రకారంగా వేదములలో కూడా చెప్పబడినది అని నిరూపిస్తాడు కానీ అసలు విషయం అర్థం చేసుకోడు. చిన్న పిల్ల వాడికి చేదు మందు తాగించడానికి వైద్యుడు ముందు తీపి పదార్థమును తినిపించి తరువాత చేదుమందు తాగిస్తాడు. అలాగే ముందు స్వర్గసుఖముల ఆశ చూపించి, తరువాత కఠినతరమైన మోక్షమార్గమును ఉపదేశించాయి వేదములు. మానవులు మాత్రము స్వర్గసుఖముల దగ్గరే ఆగిపోతున్నారు. మోక్షమార్గము కొరకు ప్రయత్నించడం లేదు.

ఉద్ధవా! మానవులు సహజంగా తమకు ఉన్న పశు సంపద, ఆస్తులు, పుత్రులు, ధనము తమకు దు:ఖములు కలిగిస్తాయి అని తెలిసినా, వాటి మీద ఆసక్తిని పెంచుకొని, వాటిని పొందడం కోసమే పాకులాడుతుంటారు. అలాగే వేదవాక్యములను నమ్మినవాడు యజ్ఞయాగములు చేసి స్వర్గసుఖముల కొరకు పాకులాడుతుంటాడు. ఉద్ధవా! వేదములు పరమాత్మను గురించి, ముక్తి మార్గమును గురించి ఉపదేశిస్తాయి కానీ, తుచ్ఛమైన స్వర్గసుఖములు పొందడానికి మానవులను ఎందుకు ప్రేరేపిస్తాయి? కాని కొంత మంది

వేదములకు విపరీత వ్యాఖ్యానాలు చేసి, మానవులను స్వర్గసుఖముల పొందడానికి తగిన కార్యములను చేయమని పురికొల్పుతున్నారు. వేదమును సరిగా అర్థం చేసుకున్న వేదవిదులు ఈ విధంగా బోధించరు.

కేవలము కర్మలను ప్రోత్సహించేవారు, కాముకులు, ఎల్లప్పుడూ దీనంగా ఉండేవారు, అన్నీ తమకే కావాలని కోరుకునేవారు, వేదములలో చెప్పబడిన యజ్ఞయాగములను చేయమనీ వాటి వలన స్వర్గ సుఖములు, ఇంకా ఇతర శక్తులు సంపాదించవచ్చని చెబుతుంటారు. ఆమాటలు నమ్మిన అవివేకులు, కర్మప్రధానమైన యజ్ఞయాగముల మీద ఆసిక్తి కలిగి ఉంటారు కానీ, ఎన్నటికీ జ్ఞాన ప్రధానమైన పరమాత్మ తత్వమును, ఆత్మ తత్వమును తెలుసుకోలేరు.

ఉద్ధవా! చీకటిలో ఉన్న వాడు తన సమీపంలో ఉన్న వస్తువును కూడా చూడలేడు. అలాగే హింసతో కూడిన యజ్ఞయాగములను ప్రోత్సహించే వారు, ఈ సకల జగత్తుకు కారణమైన వాడిని, అందరి హృదయములలో అంతర్యామిగా ఉన్న నా గురించి తెలుసుకోలేరు. ఉద్ధవా! ఈ రోజుల్లో కేవలం మాంసం తినడానికే యజ్ఞములు యాగములు చేస్తూ, ఆ యజ్ఞయాగములలో పశువులను చంపుతూ, మాంసము తింటున్నారు. అంతే కాదు యజ్ఞయాగములలో చంపిన పశువుల యొక్క మాంసమును దేవతలకు, పితృదేవతలకు, భూతములకు ఆహుతులుగా ఇస్తూ, వారిని ఆరాధిస్తున్నారు. అంతేగానీ పరమాత్మ తత్వమును తెలుసుకోడానికి ఏమాత్రం ప్రయత్నించడం లేదు. అటువంటి అవివేకులు, మందబుద్ధులు అయిన మానవులు ఈ

లోకములో ఉండే రాజ్యసుఖముల గురించి, ఉందో లేదో తెలియని, కేవలం వినడానికి మాత్రమే శ్రావ్యంగా ఉండే, స్వర్గలోకము గురించి, అక్కడ లభించే స్వర్గ సుఖముల గురించి, వెంపర్లాడుతూ ఎంతో ధనమును వ్యయం చేసి యజ్ఞములు, యాగములు చేస్తుంటారు. వారికి అటు స్వర్గ సుఖములు లభించవు. ఇటు ధనమూ నష్టపోతారు. రెండు విధముల చెడిపోతారు.

ఉద్ధవా! ఇటువంటి వారు ఎక్కువగా రజోగుణము, తమోగుణము కలిగి ఉంటారు. అటువంటి గుణములు కలిగిన ఇంద్రుడు మొదలగు దేవతలను ఆరాధిస్తుంటారు. కాని ఎటువంటి గుణములు లేని, గుణములకు అతీతుడను అయిన నన్ను మరిచిపోతారు. “మేమంతా యజ్ఞయాగములు చేసి, ఇంద్రుడు మొదలగు దేవతలకు హవిస్సులు అర్పించి, స్వర్గలోకమునకు పోయి అక్కడ అమర సుఖములు అనుభవిస్తాము, మేము చేసుకున్న పుణ్యం అయిపోయిన తరువాత మరలా భూమి మీద మంచి కులము కలవారు, ధనవంతుల కుటుబంలో జన్మించి మరలా యజ్ఞ యాగములు చేసి పుణ్యము సంపాదించి, మరలా స్వర్గసుఖములు అనుభవిస్తాము” అని అనుకుంటూ ఉంటారు. వేదములలో చెప్పబడిన ఈ మాటలు వినడానికి ఇంపుగా, మనోహరంగా ఉంటాయి. స్వర్గసుఖముల కోసం అలమటించేవారికి ఈ వాక్యములు ఆసక్తిని కలిగిస్తాయి. అటువంటి వారు నా గురించి గానీ, నా లీలల గురించి గానీ కీర్తించరు. నా మీద ఎటువంటి ఆసక్తి కనబరచరు.

ఉద్ధవా! వేదములలో మూడు కాండలు ఉన్నాయి. 1.కర్మకాండ. ఉపాసనా కాండ. 3.జ్ఞాన కాండ. వీటిలో ఏది

అవలంబించినా తుదకు పరబ్రహ్మను చేరుకోవడమే లక్ష్యం. ఆ బ్రహ్మయే ఆత్మ. వేదములలో ఉన్న అన్ని మంత్రములు ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా కానీ ఇదే విషయాన్ని ప్రతిపాదించాయి. నేను కూడా ఇదే విషయాన్ని నీకు వివరించాను. మంచి మనసు కలవారు, వివేకులు, బుద్ధిమంతులు ఈ విషయాలను తెలుసుకోడానికి అర్హులు.

వేదము అంటే శబ్దబ్రహ్మము. దాని అర్థం అంత సులభంగా తెలుసుకోలేరు. ప్రాణాయామం చేతా, ఇంద్రియ నిగ్రహం చేతా, మనో నిగ్రహం చేతనే వేదములను దాని అర్థములను తెలుసుకోగలరు. ఈ వేదములు, వేదార్థములు అనంతములు. అపారములు. సముద్రము వలె గంభీరముగా ఉంటాయి. శబ్దబ్రహ్మమే వేదము. అదే ఓంకారము. ఈ అనంత విశ్వంలో మొట్ట మొదట పుట్టిన శబ్దము ఓంకారము. ఈ శబ్దమునకు ఒక రూపము అంటూ లేదు. ఈ ఓంకారము నుండి వేదములు ఉద్భవించాయి. ఆ ఓంకారము సర్వవ్యాపకుడను అయిన నా నుండి ఉద్భవించింది. ఈ శబ్దబ్రహ్మము తామరతూడులోని నాళము వలె, సకల ప్రాణుల యందు నాద రూపంతో లక్షితమౌతూ ఉంటుంది.

వేదములలో చెప్పబడిన కర్మకాండలలో ఏది మంచిది, ఏది ఆచరించ తగ్గది, ఏది ఉపాసించతగ్గది, జ్ఞానకాండలో ఏది చేయ తగ్గది, ఏది చేయకూడనిది ఇవి అన్నీ నాకు తప్ప వేరెవరికీ తెలియవు. వేదములలో చెప్పబడిన కర్మకాండలు అన్నీ నా పరంగానే చెప్పబడ్డాయి. ఉపాసనా కాండలు కూడా నన్నే ఉపాసనా దేవతగా వర్ణిస్తున్నాయి. జ్ఞాన కాండలో కూడా నాగురించి తెలుసుకోమంటున్నాయి. వేదములు

శ్రుతులు నాగురించి చెబుతున్నాయి. నన్ను వివిధ రూపములతో ఆవిష్కరిస్తున్నాయి. చివరకు అన్ని రూపములు విడిచిపెట్టి నన్నే స్మరించి శాంతిని పొందమంటున్నాయి. తుదకు నేను ఒక్కడినే మిగులుతున్నాను." అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి జ్ఞాన బోధ చేసాడు" అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వివరించాడు.

శ్రీమద్భాగవతము ఏకాదశ స్కంధము

ఇరువది ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

ఇరువది రెండవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు చెప్పినది అంతా విన్న ఉద్ధవుడు ఇలాఅడిగాడు. "కృష్ణా! ఋషులు తత్వములు గురించి ఏమని చెప్పారు? నీవేమో 28 తత్వములు అని చెప్పావు. కాని మరి కొందరు ఈ తత్వములు 26 అంటారు, కొంత మంది 25 అంటారు. ఇంకా కొందరు ఏడు అంటారు. మరి కొందరు 9 అనీ, 6 అనీ, 4 అనీ, మరి కొందరు 11 అనీ అంటారు. ఇంతే కాదు మరికొందరు ఋషులు 17 అంటారు. మరి కొందరు ఋషులు 16 అంటారు. మరి కొందరు 13 అంటారు. ఈ ఋషులలో ఇన్ని భేదాలు ఎందుకు వచ్చాయి. ఎందుకు ఇన్ని విధాలుగా చెబుతున్నారు. దీనిని గురించి వివరించు?" అనిఅడిగాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా కృష్ణుడు తత్వముల గురించి

వివరించాడు.

"ఉద్ధవా! ఋషులు, బ్రాహ్మణులు, పండితులు చెప్పినవి అన్నీ సత్యములే. ఈతత్వములు అన్నీ ఒకదానితో ఒకటి కలిసి ఉన్నాయి. విడదీయడంలోనే ఈ భేదాలు కనపడుతున్నాయి. వీరందరూ నా మాయాతత్వమునకు అనుగుణంగా తత్వముల నిర్ణయం చేసారు. కాని కొంత మంది పండితులు ఒకరు చేసిన తత్వనిర్ణయమును మరొకరు తప్పుపడుతున్నారు. దీని కంతటికీ మూల కారణము వారిలో ఉన్న మూడుగుణములు ఒకదానితో ఒకటి విభేదించడమే. ఈ మూడుగుణములలో కలిగిన క్షోభవలన తత్వనిర్ణయంలో ఈ విధంగా భిన్నమైన విధానాలు వచ్చాయి. ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము పాటించి, ఆలోచించగలిగితే ఈ భేదభావాలు నశించిపోతాయి. భేదభావాలు ఎప్పుడు నశించిపోయాయో. వాదోపవాదాలకు అవకాశం ఉండదు.

ఉద్ధవా! జీవుడు అనాదిగా అవిద్యతో బాధ పడుతున్నాడు. తాను ఎవరో తాను తెలుసుకోలేకపోతున్నాడు. జీవునికి ఆత్మబోధ అవసరము. దానికి భగవంతుడే సరి అయిన గురువు. జీవుడికి, ఆత్మకు ఎటువంటి భేదము లేదు. జీవుడు వేరు, ఆత్మ వేరు అనడం అవివేకము. సత్వము, రజస్సు, తమస్సుల కలయికే ఈ ప్రకృతి. ఈ ప్రకృతిలో ఈ మూడు గుణములు సామ్య స్థితిలో అంటే సమంగా ఉంటాయి. ఈ మూడు గుణములే ప్రకృతిలో సృష్టి, స్థితి, లయములకు కారణము. కాబట్టి ఈ మూడు గుణములు ప్రకృతిని ప్రభావితం చేస్తాయి కానీ ఆత్మను కాదు. ఆత్మకు ఈ సత్వ,రజస్తమోగుణములకు సంబంధము లేదు.

సత్వగుణము జ్ఞానమునకు, రజోగుణము కర్మకు, తమోగుణము అజ్ఞానమునకు ప్రతీకలు అని చెప్పబడ్డాయి. కాల స్వరూపుడు అయిన పరమాత్మ ఈ మూడు గుణములలో హెచ్చుతగ్గులు కలుగ చేస్తుంటాడు. ఈ మూడు గుణముల యొక్క స్వభావము మహతత్వము.

ఉద్ధవా! నేను నీకు తొమ్మిది తత్వముల గురించి వివరిస్తాను. అవి జీవుడు, ప్రకృతి, మహత్తు, అహంకారము, ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి. ఇవి తొమ్మిది తత్వములు.

చెవి, చర్మము, కళ్లు, ముక్కు, నాలుక ఇవి జ్ఞానేంద్రియములు. వాక్కు, చేతులు, కాళ్లు, జననాంగములు, విసర్జకావయవములు, ఇవి కర్మేంద్రియములు, మొత్తం పది. మనస్సు పదకొండవది. ఇవి కాక, జ్ఞానేంద్రియములకు ప్రేరణ కలిగించేవి పంచ తన్మాత్రలు. ఇవే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. ఇవి ఐదు. ఇవన్నీ కాక ప్రకృతి మనం చేసే కార్యములకు కారణం అయి ఉంది. సత్వ,రజస్,తమోగుణముల వలన ప్రకృతిలో సృష్టి, స్థితి, లయములు జరుగుతున్నాయి. ఈ విషయాలన్నిటినీ పురుషుడు అవ్యక్తముగా అంటే కనపడకుండా ఉండి సాక్షీభూతంగా చూస్తున్నాడు. ఈ పురుషుని పర్యవేక్షణలో ఈ ప్రకృతిలో నుండి పుట్టిన మహతత్వము మొదలగు ధాతువులు అన్ని ఒకదానితో ఒకటి కలిసి సృష్టి చేస్తున్నాయి.

ఇంక ఏడు తత్వముల గురించి చెబుతాను విను. పంచభూతములు, జీవుడు, పరమాత్మ. ఇవే ఏడు తత్వములు.

శరీరము, ఇంద్రియములు, ప్రాణము అన్నీ ఈ ఏడుతత్త్వముల నుండి వచ్చాయని చెబుతారు. ఇంక ఆరు తత్త్వములు అని వాదించేవారి ప్రకారము పంచభూతములు, పరమాత్మ. ఈ ఆరు తత్త్వములు మాత్రమే ఉన్నాయి అని అంటారు. పరమాత్మలోనుండి పంచభూతములు ఆవిర్భవించాయనీ, పరమాత్మ పంచభూతముల ద్వారా సృష్టిని చేసి ఆ సృష్టిలో తాను ప్రవేశిస్తున్నాడనీ అంటారు. ఇంక నాలుగు తత్త్వములు ఉన్నాయి అనే వారు భూమి, జలము, అగ్ని, ఆత్మ ఈ నాలుగు తత్త్వముల నుండి యావత్తు సృష్టి జరిగిందనీ అంటారు. (మూడుకనపడేవి, ఆత్మ కనపడనిది). వీరు కాకుండా తత్త్వములు 17 అనేవారున్నారు. వారి ప్రకారము పంచభూతములు 5, పంచ తన్మాత్రలు 5, జ్ఞానేంద్రియములు 5, మనస్సు, ఆత్మ. ఇవి 17. వీటితోనే సృష్టి జరిగింది అని అంటారు. ఇంక తత్త్వములు 16 అని చెప్పేవారు ఆత్మ, మనస్సు ఒకటే అని నమ్ముతారు.అందుకే వారి దృష్టిలో తత్త్వములు 16 అయ్యాయి. ఇంక పదమూడు తత్త్వముల వారి విషయానికి వస్తే, పంచభూతములు 5, జ్ఞానేంద్రియములు 5, మనస్సు, జీవాత్మ, పరమాత్మ. మొత్తం 13. ఇంక పదకొండు తత్త్వములు అని నమ్మేవారు, పంచభూతములు 5, జ్ఞానేంద్రియములు 5, ఆత్మ. ఇవి పదకొండు అని అంటారు. ఇంక తొమ్మిి తత్త్వముల వారు, పంచభూతములు, మనస్సు, బుద్ధి అహంకారము ఆత్మ. మొత్తం 9. కేవలం ఎనిమిది తత్త్వములు అనే వారు ఆత్మను తీసేసి 8 తత్త్వములు అనిఅంటారు. ఈ ప్రకారంగా ఋషులు తత్త్వములను వివిధ రీతులలో లెక్కించారు. వారు చెప్పినది అంతా సత్యమే. అందులో సందేహము లేదు." అని చెప్పాడు కృష్ణుడు.

ఇప్పుడు ఉద్ధవునికి మరొక సందేహము తలెత్తింది. "కృష్ణా! ప్రకృతి, పురుషుడు ఇద్దరూ వేరు వేరు లక్షణములు కలవారు కదా! కాని ఇద్దరూ కలిసిఉన్నట్టు కనిపిస్తారు. ఈ శరీరము ప్రకృతిలో నుండి వచ్చింది. ఈ శరీరంలో ఆత్మ ఉంది. అంటే ఆత్మ ప్రకృతిలో ఉన్నట్టే కదా! ప్రకృతి కూడా ఆత్మలో ఉన్నట్టే కదా! ఇది ఎలా సాధ్యం. ఓ దేవదేవా! మానవులలో జ్ఞానము పుట్టాలన్నా, ఉన్న జ్ఞానము పోవాలన్నా నీ అనుగ్రహమే మూలము. ఇదంతా నీ మాయవలననే జరుగుతూ ఉంది. ఆ మాయను నీవు తప్ప ఇతరులకు తెలియదు. కాబట్టి నీ మాయతో కలిగిన నా సందేహాలను నీవే తీర్చాలి." అని అడిగాడు.

అప్పుడు భగవానుడు అయిన కృష్ణుడు ఇలా చెబుతున్నాడు. "ఉద్ధవా! ప్రకృతి పురుషుడు ఒకటి కాదు. ఆ రెంటిమధ్య చాలా భేదము ఉంది. ఈ దేహములు మూడుగుణములలో కలిగిన హెచ్చుతగ్గుల వలన, వాటి మధ్య కలిగిన సంఘర్షణ వలన (క్షోభవలన) ఏర్పడుతున్నాయి. నామాయ వలన ప్రభావితములైన సత్వ, రజస్తమోగుణములు దేహములలో భేదబుద్ధిని సృష్టిస్తున్నాయి. అందుకే మానవులు వివిధము లైన గుణములతోనూ, ఆకారములతోనూ పుడుతున్నారు. వీరిలో అధ్యాత్మము, అధిభూతము, ఆధిదైవము అనే భేదములు కూడా కనపడుతున్నాయి. మనం చూచే కళ్లు అధ్యాత్మము అయితే మనం దేనిని చూస్తున్నామో అది అధిభూతము. కళ్లకు అధి దేవత అయిన సూర్యుడు అధి దైవము. ఈ మూడు కూడా ఒకదానిని ఒకటి ఆశ్రయించుకొని ఉంటాయి. కాని ఆకాశములో ప్రకాశిస్తున్న సూర్యుడు స్వయంగా ప్రకాశిస్తున్నాడు. ఎవరి ప్రమేయం, ఎవరి సహాయం, ఎవరి ప్రభావం లేకుండానే

తనంతట తానే వెలుగుతున్నాడు. ఆత్మ కూడా ఇదే పద్ధతిలో వెలుగుతూ ఉంటుంది. ఆత్మ వెలగడానికి ఇతరుల సాయం అవసరం లేదు. ఆత్మకు ఒకటే రూపము. అది రెండుగా లేదు. ఆత్మ తన ప్రకాశము ద్వారా ప్రపంచములోని ఇతర వస్తువులను ప్రకాశింపచేస్తూ ఉంది. ఆత్మ శక్తి వలననే మనం అన్నిటినీ చూడగలుగుతున్నాము. ఎలాగైతే కళ్లకు మూడు దశలు ఉన్నాయో అలాగే చర్మము, చెవి, నాలుక, ముక్కు మొదలగు వాటికి కూడా మూడు దశలు ఉన్నాయి.

| | | |
|---|---|---|
| కళ్లు | చూడటం | సూర్యుడు |
| చర్మము | స్పర్శ | వాయువు |
| చెవులు | శబ్దము | దిక్కులు |
| నాలుక | రసము | వరుణుడు |
| ముక్కు | వాసన | అశ్వినులు |

ఉద్ధవా! ప్రకృతి మూలంగా మహతత్వము ఉద్భవించింది అని చెప్పాను కదా! ఆ మహతత్వములోనుండి అహంకారము పుట్టింది. ఆ అహంకారము మూడా విధములు. సాత్విక అహంకారము. రాజస అహంకారము, తామసాహంకారము. కాబట్టి జ్ఞానస్వరూపమైన ఆత్మ ఉందా లేదా అన్న వాదనలు అనవసరము. కాని మానవులు దీని గురించి ఎప్పుడూ వాదించుకుంటూనే ఉంటారు. కనపడని వస్తువు లేదు అనుకోవడం, కనపడే వస్తువు ఉంది అనుకోవడం మానవ సహజము." అని పలికాడు భగవానుడు.

అప్పుడు ఉద్ధవుడు ఇలా అన్నాడు. "దేవా! మానవులు అందరూ నీ చేత సృష్టించబడ్డారు కదా! కాని వారందరూ తమ ఇష్టం వచ్చిన కర్మలు చేసి గొప్పవి, నీచమైని అయిన జన్మలను వారి వారి కర్మల

వాసనలను బట్టి పొందుతున్నారు. జనన మరణ చక్రంలో తిరుగుతూ దేహధారులు అవుతున్నారు. వారికి ఆత్మ తత్వము ఏ మాత్రమూ తెలియదు. వాళ్లకు కూడా తెలియని ఆత్మ తత్వమును నాకు వివరించు. ఈ జగత్తులోని జీవులన్నీ నీ మోహములో పడి ఉన్నాయి. అందు వలన నీ తత్వము తెలిసిన వారు ఎవ్వరూ లేరు." అని అడిగాడు ఉద్ధవుడు.

ఉద్ధవుడు అడిగిన ప్రశ్నకు భగవానుడు ఇలా సమాధానం చెబుతున్నాడు. "ఉద్ధవా! మానవుల దేహము పంచభూతములతోనూ, ఇంద్రియములతోనూ నిర్మితమైంది. ఆ దేహములతో మానవులు కర్మలు చేస్తున్నారు. ఆ కర్మవాసనల ఫలితంగా వారు ఒకదేహము నుండి మరొక దేహమునకు ప్రయాణం చేస్తున్నారు. ఆత్మకు దేహమునకు ఏమీ సంబంధము లేకపోయినప్పటికీ, దేహికి ఉన్న అహంకారము వలన ఆత్మ మనసుతో పాటు వెళుతూ ఉంటుంది.

మనస్సు కర్మల అధీనంలో ఉంటుంది. మనస్సు ఎల్లప్పుడు ప్రాపంచిక విషయములలో మునిగిపోయి వాటికి తగిన కర్మలు చేస్తూ ఉంటుంది. ఆ కర్మల ఫలితంగానే దేహములు లభిస్తుంటాయి. ఈ దేహములతో మానవుడు సుఖములు దు:ఖములు అనుభవిస్తుంటాడు. ఈ సుఖ దు:ఖముల యందు ఎక్కువ ఆసక్తి ఉండటం వలనా. చేసే కర్మల యందు విపరీతమైన అనుబంధం పెంచుకోడం వలనా, జీవుడు తన పూర్వ జన్మ స్మృతిని కోల్పోతాడు. అలా పూర్వ జన్మ స్మృతిని కోల్పోవడమే మృత్యువు.

దేహము మీద ఉన్న అభిమానమే జన్మకు కారణము అవుతూ ఉంది. కాని జీవుడు తన పూర్వజన్మ గురించి స్మరించడు. జ్ఞాపకమునకు తెచ్చుకోడానికి ప్రయత్నించడు. ఎలాగైతే స్వప్నములో జరిగిన విషయములను మెలుకువ రాగానే మరిచిపోతాడో, అలాగే గతజన్మ విషయములను కూడా మరిచిపోతాడు. ఎలాగంటే, మనము స్వప్నములో ఎన్నో దేహములతో కనపడతాము. అవి అన్నీ మన మనసు సృష్టించినవే కానీ నిజం కాదు. స్వప్నములో ఉన్నంత కాలము వాటిని చూస్తుంటాము. వాటితో సంబంధం పెట్టుకుంటాము. అదేమాదిరి మెలుకువలో కూడా అంటే జాగ్రదావస్థలో కూడా మనసే ఈ ప్రపంచంలో ఉన్న వస్తువులను, విషయములను మనకు సృష్టించి చూపుతుంది. వాటిని మానవులు మంచివి, చెడ్డవి, మధ్యస్తమైనవి అనీ విభజించి చూస్తుంటారు, అనుభవిస్తుంటారు, దు:ఖిస్తుంటారు. దీని కంతటికీ మనసే కారణం.

కాల ప్రభావం చేత జనన మరణములు సంభవిస్తున్నాయి. మనిషి శరీరం పుట్టిన తరువాత వాడి ఆయువు కాలం రూపంలో మొదలవుతుంది. ఆయువు తీరి పోగానే మరణం సంభవిస్తుంది. ఈ కాలము యొక్క స్వరూపం తెలియక పోవడంతో, మానవులు మృత్యువును గుర్తించలేకపోతున్నారు. పుట్టుకకు, చావుకు తామే కారణం అనుకుంటున్నారు. దీనికంతటికీ వారి అవివేకమే కారణము.

ఈ కాల పరిణామము ఒక్క మానవులకే కాదు వృక్షములకు, పర్వతములకు, జంతువులకు కూడా వర్తిస్తుంది. ఈ వయో పరిమితి సకల దేహములకు ఒకటిగానే ఉంటుంది. వయసు తీరగానే

పతనమైపోవడం అత్యంత సహజం. కాని అవివేకులు అయిన మానవులు జనన మరణాలకు తానే కారకుడననీ, అన్ని తనవలననే జరుగుతున్నాయనీ అపోహలో ఉంటాడు. నిజానికి జీవాత్మయే ఆత్మ, ఆత్మయే జీవుడు. ఆత్మకు పుట్టుక, మార్పు, చావు లేనట్టు, జీవాత్మకు కూడా లేదు. కానీ తానే ఈ శరీరము అనే భ్రాంతి వలన, తాను పుడుతున్నాడు, పెరుగుతున్నాడు మరణిస్తున్నాడు అన్న భ్రాంతిలో ఉంటాడు.

ఉద్ధవా! ఈ శరీరమునకు తొమ్మిది అవస్థలు ఉన్నాయి. వివాహం అయిన తరువాత భార్యాభర్తలు శారీరకంగా ఒకటి అవడం అంటే నిషేకము, గర్భం దాల్చడం, జననం, బాల్యము, కౌమారము, యౌవనము, ప్రౌఢత్వము, వార్ధక్యము, మరణము. ఇవి తొమ్మిది అవస్థలు. మానవుడు ఈఅవస్థలు అన్నీ తాను, తన శరీరము అనుభవిస్తున్నాను అని భ్రమపడుతుంటాడు. అవి శరీరమునకు సహజము అని తెలుసుకోడు. అదే అతని అవివేకము.

ఒక తండ్రి ఉంటాడు. ఆ తండ్రి నుండి పుత్రుడు జన్మిస్తాడు. అంటే తండ్రి లోనుండి పుత్రుడు జన్మించాడు. తరువాత తండ్రి మరణిస్తాడు. అంటే తాను ఎవరి నుండి పుట్టాడో అతను మరణించాడు. ఇప్పుడు ఎవరు పుట్టినట్టు ఎవరు మరణించినట్టు. ఈదేహము మరొక దేహమును ఉత్పత్తి చేస్తుంది. తరువాత నశించి పోతుంది అని తెలుసుకుంటే. దేహాభిమానము ఉండదు. అంతా నా వలననే జరుగుతూ ఉంది అనే అహంకారమూ ఉండదు.

ఒకడు ఒక విత్తనం భూమిలో పాతి పెడతాడు. ఆ విత్తనంలో నుండి మొక్క మొలుస్తుంది. పెద్దది అవుతుంది. వృక్షము అవుతుంది. కాలం తీరగానే ఎండి పోతుంది. పడి పోతుంది. ఈ ఉత్పత్తి నాశనములను చూడగలిగితే, మానవునికి శరీర జనన మరణములు కూడా ఇంతే అని అర్థం అవుతుంది. తనలో ఉన్న ఆత్మ స్వరూపమును తెలుసుకోలేని మానవుడు, బయట ప్రపంచం వేరు, తనలో ఉన్న ఆత్మ వేరు అని అనుకుంటూ, ప్రాపంచిక విషయములయందు, విషయ వాంఛల యందు, ఆసక్తుడై సంసార సాగరంలో పడి కొట్టుకుంటూ ఉంటాడు.

ఉద్ధవా! జీవునకు జన్మలు ఎలావస్తాయో తెలుసా! జీవుడు ఈ దేహములో ఉండి, అహంకారమునకు లోబడి కర్మలు చేస్తుంటాడు. సత్వగుణము అధికంగా ఉన్నవారు, సాత్వికమైన కర్మలు చేస్తే వారు ఋషులు గానూ దేవతలు గానూ జన్మిస్తారు. అలాగే రజోగుణము అధికంగా ఉన్న వారు రజోగుణ ప్రాధాన్యంగా చేసే కర్మలను బట్టి వారికి మనుష్య జన్మ, అసుర జన్మ వస్తుంది. తమోగుణము అధికంగా కలవారు, తమోగుణ ప్రాధాన్యము కల కర్మలు చేస్తే వారు పశు వులుగానూ, పక్షులుగానూ, వృక్షములుగానూ జన్మిస్తారు.

మనలో ఉన్న కోరికలు, మనకు స్వప్నములో కనపడే వస్తువులు అన్నీ మిథ్య. నిజాలు కావు అలాగే ఈ లోకంలో మానవుడు అనుభవించే ప్రాపంచిక విషయములు, కామభోగములు అన్నీ కూడా నిజాలు కావు. అసలు ఈ సంసారమే మిథ్య అని తెలుసుకోవడం ఉత్తమం. ప్రపంచంలో ఉన్న వస్తువులను చూస్తూ, అనుభవిస్తున్న వ్యక్తికి అవే విషయాలు స్వప్నంలోకూడా వస్తాయి. వాటిని అనుభవిస్తున్నట్టు

భ్రమచెందుతుంటాడు. కాని అవి నిజం కాదు. మెలుకువ రాగానే మాయం అవుతాయి. అలాగే ఈ సంసారబంధములు కూడా నిజం కాదు అని తెలుసుకున్నవాడికి సుఖము, దు:ఖములకు లోనుకాడు. నిశ్చింతగా ఉంటాడు. కాబట్టి ప్రతిమానవుడు ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. కనపడేదంతా భ్రమ అని తెలుసుకోవాలి. స్వప్నం మాదిరి కరిగిపోతుంది అని తెలుసుకోవాలి. ఇటువంటి మానవునకు దైనందిన జీవితంలో ఎన్నో కష్టాలు ఎదురవుతాయి. దుర్మార్గులు అతనిని హింసిస్తారు. అవమానిస్తారు, పరిహసిస్తారు. బంధిస్తారు. అతడికి అన్నం, నీరు దక్కనివ్వరు. కాని ఆత్మ తత్వము తెలుసుకున్న అతడు పరమేశ్వరుని ధ్యానము వదిలిపెట్టడు. తన సొంత బుద్ధితో భగవంతుని శరణు వేడుతాడు. తనను తాను రక్షించుకుంటాడు." అని కృష్ణుడు చెప్పగా ఉద్ధవునికి మనసుకు బాధ కలిగింది.

"కృష్ణా! నీవు చెప్పేది వింటుంటే సజ్జనులకు ఇటువంటి కష్టములు కలుగుతాయా అనిపిస్తూ ఉంది. నీ కథలు వినే వారు, నిన్ను కీర్తించేవరు, నీ పాదములను ఆశ్రయించిన వారు, శాంతమూర్తులు అయిన నీ భక్తులకే ఇన్ని బాధలు తప్పకుంటే, ఇంక పండితులు, జ్ఞానుల సంగతి చెప్పవలెనా! వారి కష్టములను తలచుకుంటే మనసు వికలం అవుతూ ఉంది." అని బాధ పడ్డాడు ఉద్ధవుడు" అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చేసిన తత్వబోధను వినిపించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఇరువది రెండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## ఏకాదశ స్కంధము
## ఇరువది మూడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఒక భిక్షకుని వృత్తాంతమును వినిపించాడు. అది ఎలాగంటే..... "ఉద్ధవా! మంచి వాళ్లను దుర్జనులు అనేకమైన చెడ్డమాటలు అంటుంటారు. ఆ మాటలు విన్న మంచి వారి మనసు కలత చెందడం సహజం. కాని వారు ప్రతీకారం చేయకుండా, తమ మనసులను శాంత పరచుకోవాలి. అటువంటిసాధువులు ఈ లోకంలో చాలా తక్కువగా ఉంటారు. దుర్జనుల మాటలు మంచివారి మనసులను బాధించినట్టు వాడిఅయిన బాణములు కూడా శరీరమును బాధించవు. ఈ సందర్భంలో నీకు ఒక భిక్షుకుని కథ వినిపిస్తాను విను.

ఒక భిక్షువును చాలా మంది చెడ్డవాళ్లు ఘోరంగా అవమానించారు. ఆ బాధలను తట్టుకున్న ఆ భిక్షువు అదంతా ఆ చెడ్డ వారి తప్పు కాదనీ, తన పూర్వ జన్మ ఫలమనీ భావించి, ఈవిధంగా గానం చేసాడు.

"మాళవ దేశంలో సంపన్నుడు, వ్యవసాయము, వ్యాపారము, వాణిజ్యము పుష్కలంగా ఉన్న ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. వాడికి కోపం ఎక్కువ. చాలా కోపిష్టి. పైగా పరమ లోభి. ఎవరికీ సాయం చేసే వాడు కాదు. డబ్బు కూడబెట్టే వాడు. భార్యా పిల్లలను హింసించి

బాధపెట్టి ఆనందించే స్వభావం కల వాడు. (ఈ లక్షణాలు ఉన్న వాళ్లు ఈ నాడు కూడా మన సమాజంలో చాలా మంది కనిపిస్తారు. గమనించండి.) వాడు తన బంధువులతో కానీ, తన ఇంటికి వచ్చిన వారితో గానీ ఒక్క మంచిమాట కూడా మాట్లాడి ఎరుగడు. అతడి ఇంట్లో ఏ శుభకార్యంకానీ, దేవ కార్యం కానీ జరగలేదు. పోనీ తనన్నా కడుపు నిండా తింటాడా అంటే అదీ లేదు. తను తినడు, మరొకరికి పెట్టడు.

ఆ కారణం చేత అతని భార్యా, కుమార్తెలు, సేవకులు అతనిని ఏమీ చేయలేక అతనితో మాట్లాడే వారు కాదు. అతను చెప్పిన పనులు చేసేవారు కాదు. కాని పుత్రులు, బంధువులు, మిత్రులు అతనిని ద్వేషించేవారు. సమయం దొరికితే అతనికి ద్రోహం చెయ్యడానికి వెనుకాడేవారు కాదు. ఈ ప్రకారంగా కేవలం ధనము సంపాదించడం, దానిని దాచిపెట్టడం మాత్రమే తెలిసినవాడు, ధర్మం అంటే తెలియని వాడు అయిన ఆ బ్రాహ్మణుని చూచి దేవతలు కూడా అతని మీద చాలా కోపంగా ఉండేవారు.

దేవతల కోపాగ్నికి అతని పుణ్యం అంతా క్షీణించి పోయింది. అతడు సంపాదించిన ధనం అంతా నష్టమైంది. అతని మీద ద్వేషంతో ఉన్న దాయాదులు కొంత ధనం లాక్కున్నారు. ఇదే సందని దొంగలు మరి కొంత ధనం దొంగిలించారు. విధి వశాత్తు, అతను చేసిన వ్యాపారాలలో నష్టం రాగా, కొంత ధనం నష్టం అయింది. ఇంతలో రాజులు అతను సంపాదించిన ధనానికి పన్ను రూపంలో కొంత ధనం లాక్కున్నారు.

ఈ ప్రకారంగా తాను సంపాదించి కూడబెట్టిన ధనం అంతా నష్టం కాగా ఆ బ్రాహ్మణుడు దు:ఖించాడు. అతని మనస్సు శోకంతో నిండి పోయింది. నోటినుండి మాట రావడం లేదు. ఏడుస్తూ కూర్చున్నాడు. ఉన్నదంతా పోవడంతో వైరాగ్యం పుట్టింది. ఆ బ్రాహ్మణుడు తనలో తాను ఇలా అనుకున్నాడు.

“నేను ఎంతో ధనం సంపాదించాను. కాని అది అంతా వ్యర్థంగా పోయింది. నేను అనుభవించిందీ లేదు. కడుపుకు తిన్నదీ లేదు. అనవసరంగా ధనం సంపాదించడం కోసరం నిద్రాహారాలు మానుకున్నాను. శరీరాన్ని ఎంతో కష్ట పెట్టాను. నిజమే! లోభులు కూడ బెట్టిన ధనము ఎప్పుడూ నిలువదు. సుఖాన్ని ఇవ్వదు. ధనం కూడబెట్టడం దు:ఖమునకు కారణము. ఎంత ఎక్కువ ధనం కూడబెడితే అంతకన్నా రెట్టింపు దు:ఖం ఈ లోకంలో కలుగుతుంది. ఇతరులను పీడించినందుకు పరలోకంలో నరకం వస్తుంది.

లోభత్వము పనికిరాదు. అది ఏకొంచెం మానవునిలో ఉన్నా, ఆ లోభత్వము అతని కీర్తిని, అతనిలో ఉన్న మంచి గుణములను, తుదకు అతని ప్రాణములను హరిస్తుంది. ధనం సంపాదించడంలో గానీ, దానిని ఇంకా వృద్ధిచేయడంలోకానీ, దానిని పరుల కంట పడకుండా దాచిపెట్టడంలో కానీ, దానిని ఖర్చు పెట్టడంలోకానీ, అనుభవించడంలో కానీ, మానవునికి ఎక్కువ శ్రమ, భయము, చింత కలుగుతుంటాయి. ఒక విధమైన భ్రమలో బతుకుతుంటాడు.

మానవుని వద్ద ఎంత ఎక్కువ ధనం ఉంటే అంత ఎక్కువగా ఈ భయాలు కలుగుతుంటాయి. దొంగల భయం, హింస, అసత్యము, గొప్పలు చెప్పుకోవడం, కామము, కోపము, గర్వము, ఎవరితోనూ కలవకపోవడం, విరోధము, ఎవరినీ నమ్మకపోవడం, ద్వేషము, స్త్రీ, జూదము, మద్యము, మొదలగు వ్యసనములకు బానిస అవడం, ఇవి అన్నీ ధనం ఎక్కువగా ఉండటం వలన కలుగుతుంటాయి.

ఎల్లప్పుడూ సుఖంగా ఉండాలి అనుకునే వ్యక్తి ఈ వ్యసనములకు దూరంగా ఉండాలి. ధనం ఎక్కువగా సంపాదించినా, తక్కువగా సంపాదించినా, ధనం ఉంటే చాలు, సోదరులు, భార్య, తల్లి తండ్రులు, బంధువులు, మిత్రులు శత్రువులు అవుతారు. ఒకరంటే ఒకరికి పడదు. ధనం కోసరం కుమ్ములాడుకుంటారు. ధనం ఉన్న మానవుడు దానిని కాపాడుకోవడానికి బంధువులను, మిత్రులను కూడా వదిలిపెడతాడు. ఒకరి మీద ఒకరికి స్పర్థలు పెరిగి చంపుకోవడం వరకూ వస్తుంది.

మానవ జన్మ అతి దుర్లభము. అందులోనూ బ్రాహ్మణ జన్మ ఇంకా పవిత్రమైనది. అటువంటి బ్రాహ్మణుడుగా పుట్టి, ధనము అమితంగా సంపాదించి తనను తాను నాశనం చేసుకొనేవాడు ఎన్నటికీ శుభములను పొందలేడు. స్వర్గ సుఖములు పొందడానికి కానీ, మోక్షపదమును చేరుకోడానికి కానీ, ఈ దేహమే ముఖ్యము. అటువంటి దేహమును పొంది కూడా ధనార్జన యందు ఆసక్తి పెంచుకొని తన మరణాన్ని తాను కొని తెచ్చుకుంటాడు మానవుడు.

పోనీ ధనం సంపాదించాడే అనుకుందాము. ఆ ధనమును దేవతలకు, ఋషులకు, పితరులకు, సాటి ప్రాణులకు, అన్నతమ్ములకు, బంధువులకు, భార్య పిల్లలకు ఎవరి భాగం వాళ్లకు ఇస్తే, వాళ్లూ తృప్తి పడతారు. వీడూ సుఖంగా ఉంటాడు. అలా చెయ్యకుండా అంతా నాకే అని దాచుకుంటే, చివరకు ఆ డబ్బు దొంగలపాలు, రాజు పాలు చేసి నాశనం అవుతాడు.

నేను నా జీవితం అంతా ధనం సంపాదించడం, దానిని దాచడంలోనే గడిపాను. నా వయస్సు క్షీణించి పోయింది. బలము కూడా తగ్గిపోయింది. ముసలి తనం వచ్చింది. ఇప్పుడు ఏమి చెయ్యాలన్నా చేయలేని పరిస్థితి. మానవుడు ఎంతటి విద్వాంసుడు అయినా ఈ ధన సంపాదనపిచ్చి పట్టుకుంటే, వాడు దానితో పీడించబడతాడు. ధన సంపాదన అనేది ఒక మోహము. ఈ లోకం అంతా ఈ ధనసంపాదన అనే మోహంలో పడి సతమతమౌతూఉంది.

ప్రతి మానవుడికీ మృత్యువు అతని వెన్నంటి ఉంటుంది. ఎప్పుడు మీద పడి కబళిస్తుందో తెలియదు. ఆ సమయంలో అతడు సంపాదించిన ధనము, ఆ ధనముతో కొన్న ఖరీదైన వస్తువులు, అనుభవించిన భోగములు, భోగవస్తువులు, మరణ సమయంలో ఎందుకూ పనికిరావు. అతని మరణాన్ని ఒక్క క్షణం కూడా ఆపలేవు. ఈ ధన సంపాదన, కూడబెట్టడం, ఖర్చుపెట్టడం, అనుభవించడం ఇవన్నీ మరుజన్మ రావడానికి తగిన వాసనలలను పెంపొందిస్తాయి కానీ, మోక్షమును ఇవ్వలేవు.

ఆ పరమాత్మ దయవలననే నేను ఇంత ధనం సంపాదించాను. ఆ పరమాత్మ దయవలననే ఆ ధనం అంతా పోయింది. ఆ పరమాత్మ దయవలననే నాకు ఈ వైరాగ్యం కలిగింది. ఇన్నాళ్లకు ఆ పరమాత్మ నాకు ప్రసన్నమైనాడు. నేను నా మిగిలిన జీవితమును ధర్మకార్యముల కొరకు వినియోగిస్తాను. దొరికిన దానితో తృప్తిగా జీవిస్తాను. పరమాత్మ గురించి తపస్సు చేస్తాను. ఇదే నా నిశ్చయము. ఈనిశ్చయాన్ని అమలు చేయడానికి నాకు దేవతలు సహకరింతురు గాక!"

ఉద్ధవా! ఆ బ్రాహ్మణుడు ఈ విధంగా నిశ్చయించుకొని అహంకార మమకారములను వదిలిపెట్టి, మనస్సు నిండా శాంతమును నింపుకొని, సన్యాసము స్వీకరించాడు. మౌనంగా ఉన్నాడు. ఆ సన్యాసి తన మనస్సును, ఇంద్రియములను నిగ్రహించుకొని, దొరికిన దానిని తింటూ తిరుగుతున్నాడు. దేని మీదా ఆసక్తి చూపించేవాడు కాదు. భిక్షాటన చేస్తూ ఊరూరా తిరుగుతున్నాడు.

అప్పటి దాకా పరమ లోభిగా ఉంటూ తమను కష్టములకు గురిచేసిన వాడు ఇలా సన్యాసిగా తిరుగుతుంటే ఆ ఊరి వాళ్లకు చోద్యంగాఉంది. వాడి మీద రాళ్లు వేస్తూ, కొడుతూ, ఆట పట్టిస్తూ అవమానించసాగారు. కొందరు వాడి కర్రను లాక్కున్నారు. కొందరు భిక్షాపాత్రను, కమండలాన్ని, చాపను, జపమాలను లాక్కున్నారు. కొందరు వాడు కట్టుకున్న చిరిగిన వస్త్రమును లాగుతున్నారు. వాడు భిక్ష అడుక్కుని వచ్చి తినబోతుంటే ఆ అన్నములో ఉమ్మివేసేవారు. కొందరు వాడి దగ్గర కూర్చుని అర్థంలేని ప్రశ్నలు వేసి వాడిని సమాధానాలు చెప్పమని వేధించేవారు. చెప్పకపోతే కర్రలతో కొట్టేవారు.

మరి కొందరు “ఇంకా మా దగ్గర ఏమి ఉందని లాక్కుంటాడు, నీవు దొంగవు, వీడిని కొట్టండి, కట్టండి” అని బెదిరించేవారు. మరికొందరు వాడిని స్తంభములకు కట్టి ఆనందించేవారు. మరి కొందరు ‘వీడు దొంగ సన్యాసి. మరలా మనలను మోసం చెయ్యడానికి వచ్చాడు. వీడు మనలనే కాదు లోకాన్నే మోసం చేసాడు. వీడి దగ్గర ఉన్న ధనం అంతా పోగానే బంధువులు అందరూ వదిలేసారు. ఇప్పుడు ఊరి మీద పడ్డాడు. కొంగ జపం చేస్తున్నాడు. అడుక్కుతింటున్నాడు” అని తిట్టసాగారు.

కాని ఆ సన్యాసి వాటిని ఏమీ పట్టించుకోవడం లేదు. అంతా తన కర్మఫలము అనుకొని మౌనంగా భరించసాగాడు. ఇదంతా దైవనిర్ణయం, తప్పించుకోతగ్గవి కాదు, అనుభవించడం తప్ప మరొక మార్గము లేదు అని మనసులో నిశ్చయించుకున్నాడు. తనలో తాను ఈ విధంగా అనుకోసాగాడు.

“ఈ లోకంలో ఉన్న జనులు గానీ, పైన ఉన్న దేవతలు కానీ, నాలో ఉన్న ఆత్మగానీ, తిరిగే గ్రహాలు కానీ, చేసే కర్మలు గానీ, నడుస్తున్న కాలము కానీ నా సుఖదు:ఖములకు కారణము కావు. నాలో ఉన్న మనస్సే నా సుఖదు:ఖములకు కారణము. ఈ మనస్సు సత్వ, రజస్, తమోగుణములచేత ప్రభావితమై కర్మలు చేస్తూ ఉంది. ఆ కర్మల ఫలితంగానే మరుజన్మ వస్తూ ఉంది. దేవ,మానవ,పశు జన్మలు ఎత్తుతున్నాము. మానవుడు చేసే ప్రతి కర్మను ఆత్మస్వరూపుడు అయిన పరమాత్మ సాక్షీభూతంగా చూస్తుంటాడు.

ఆత్మ ప్రాపంచిక విషయములలోనూ, సంసారములోనూ లీనమై జీవాత్మగా వ్యవహరింపబడుతూ ఉంది. మనస్సుతో సంకల్పిస్తూ దేహములో పనులు చేస్తూ, ఈ సంసారముమీద ఆసక్తి కలిగి ఉంటూ ఉంది. కాబట్టి మనసును నిగ్రహించడమే ఈ సంసారము నుండి విముక్తి చెందడానికి తరుణోపాయము. మనసును నిగ్రహించడానికి దానము, స్వధర్మమును పాటించడం, యమ,నియములను పాటించడం, శాస్త్రములు చదవడం, వినడం, మంచి పనులు చేయడం, వ్రతములు మొదలగునవి చేయడం, ఇవి అన్నీ మనస్సును నిగ్రహించడానికి మార్గాలు. మనస్సును తన అదుపులో పెట్టుకున్న వాడికీ, ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉండేవాడికి దానధర్మములతో అవసరం లేదు. అలాగే అదుపు తప్పిన మనసు కలవాడికి, అలసత్వము, కలిగిన వాడికి ఎన్ని దాన ధర్మములు చేసినా ప్రయోజనము లేదు.

శరీరములో ఉన్న పది ఇంద్రియములు, మనసు అధీనంలో ఉంటాయి. మనసు ఏది సంకల్పిస్తే ఇంద్రియాలు ఆ పనిని చేస్తుంటాయి. కాని మనస్సు ఏ ఇంద్రియము వశములో లేదు. మనస్సు చాలా బలమైనది. అత్యంత బలవంతుని కంటే బలమైనది. యోగులు కూడా మనస్సు బలానికి భయపడుతుంటారు. మనసును తన వశంలో ఉంచుకున్నవాడే దేవుడు. ఇంద్రియములను జయించడం సులభం. మనసును జయించడం చాలా కష్టం. ఈ మనస్సు ప్రతి వాడికీ శత్రువు. ఇది రాగద్వేషములతో నిండి ఉంటుంది. ఈ మనస్సు శరీరములో ఉన్న మర్మస్థానములలో కూడా చేరి బాధపెడుతుంది. ఈ మనస్సు జయించడం ఎవరి వల్లా కాదు. ఇటువంటి శత్రువును తన శరీరంలోనే పెట్టుకొని, దానిని

జయించలేక, బయట  ఉన్న శత్రువులతో అనవసరంగా కలహిస్తుంటారు మానవులు. కొంత మందిని మిత్రులుగానూ, మరి కొంత మందిని శత్రువులుగానూ, మరి కొంతమందిని తటస్థులు గానూ భావిస్తుంటారు. కానీ, లోపల ఉన్న మనస్సు అనే శత్రువు గురించి మరిచిపోతారు. ఇటువంటి వారు పరమ మూర్ఖులు.

ఈ మానవులకు వివేకము లేదు. మనస్సుతో కల్పించబడిన ఈ దేహము నేనే అనుకుంటారు. ఈ ప్రపంచములో కనిపించే ప్రతి వస్తువు నాది అనుకుంటారు. అన్నీ నాకే కావాలి అని అనుకుంటాడు. ఆ వస్తువులు సంపాదించడం, విషయ వాంఛలు తీరడం కొరకు ఎన్నో అకృత్యములు చేస్తుంటారు. సంసార సాగరంలో పడి కొట్టుకు పోతుంటారు.

మానవుడే తనకు కలిగిన సుఖములకు, దు:ఖములకు కారణము అని అనుకొందాము. అటువంటప్పుడు ఆత్మకు ఎటువంటి సంబంధము లేదు కదా! ఏ పని చేసినా, ఆ పనికి తగిన ఫలితము అనుభవించినా, దానికి కారణము ఈ స్థూల శరీరము(పది ఇంద్రియములు), అందులో ఉన్న సూక్ష్మ శరీరము(మనో బుద్ధి అహంకారాలు). అన్నం తినేటప్పుడు తన పంటితో తన నాలుక కొరుక్కుంటే దానికి ఎవరి మీద తన కోపం చూపిస్తాడు.

పోనీ, దేవతలే మానవునికి కలిగేసుఖములకు, దు:ఖములకు కారణం అనుకుంటే, ఈ సుఖదు:ఖముల వలన ఆత్మకు ఎటువంటి నష్టము కలుగదు కదా! ఈ శరీరముతో ఏపని చేసినా, ఆ పనికి తగిన

ఫలితము అనుభవించినా, అది ఇంద్రియములకు అధిష్ఠాన దేవతలకు సంబంధించినది. ఈ శరీరములో ఉన్న పది ఇంద్రియములకు పది మంది అధిష్టాన దేవతలుఉంటారు. ఈ దేవతలు అందరి శరీరములో ఒకే విధంగా ఉంటారు. మానవుడు తన శరీరములోని ఇంద్రియము లతో చేసే పనులు అన్నీ ఈ దేవతలకు సంబంధించినవి. ఇందాక చెప్పినట్టు ఒక అవయవము వలన మరొక అవయవమునకు దెబ్బతగిలితే అది ఎవరి తప్పు. ఎవరిని నిందించాలి.

పోనీ మానవునికి కలిగే సుఖదు:ఖములకు ఆత్మ కారణం అనుకుంటే, మనసును, దేవతలను, కర్మలను నిందించడం దేనికి? సుఖ దు:ఖములు కలిగించడం ఆత్మ స్వభావము అనుకుంటే సరిపోతుంది కదా! ఆత్మకంటే వేరైనది ఏది లేదు కదా! ఒకవేళ ఉంటే అది మిథ్య అవుతంది కానీ సత్యము కాదు. సుఖదు:ఖాలు లేకుంటే మానవుడికి కోపము రావడానికి కారణం ఏమిటి?

పోనీ మానవుని సుఖదు:ఖములకు గ్రహములు కారణము అని అనుకుందాము. దీనివలన జనన మరణములు, వృద్ధిక్షయములు లేని ఆత్మకు ఏమి నష్టం. గ్రహముల ప్రభావము జననమరణములకు లోబడ్డ శరీరమునకు కానీ జననమరణములు లేని ఆత్మకు కాదు కదా! అందుకే జోతిష శాస్త్రజ్ఞులు ఆకాశంలో ఉన్న గ్రహ ప్రభావము శరీరము మీద పడుతుంది అంటారు. అటువంటప్పుడు శరీరంలో అంతర్గతంగా ఉన్న జీవాత్మ మీద కోపం ఎందుకు?

పోనీ మనం చేసే కర్మలే సుఖములకు దు:ఖములకు కారణం అనుకుంటే, దాని వలన జీవాత్మకు ఏమి ప్రయోజనము? ఎందుకంటే

కర్మలు చెయ్యాలంటే కదలని పదార్థాలు, కదిలే పదార్థాలు ఉండాలి. కాని దేహము జడపదార్థము. లోపల చైతన్యము లేనిదే ఏ పనీ చేయలేదు. లోపల ఉన్న జీవాత్మ శుద్ధమైన జ్ఞానము. ఇంక కర్మలు చేయడం ఎలా సాధ్యం. కర్మలే లేనపుడు ఎవరి మీద కోపించాలి.

పోనీ మనకు కలిగే సుఖ దు:ఖములకు కాలమే కారణము అని అనుకుందాము. కాలమునకు అతీతమైన ఆత్మ మీద కాల ప్రభావం ఎలా ఉంటుంది. అటువంటప్పుడు ఆత్మకు సుఖము దు:ఖము ఎలా ఉంటాయి. కాబట్టి మనకు కలిగే సుఖదు:ఖములకు ఎవరి మీద కోపం చూపించాలి. మానవునకు కలి గే సుఖ దు:ఖములకు మానవునిలో ఉన్న అహంకారమే కారణం కానీ, అన్నిటికీ అతీతమైన ఆత్మ ఎన్నటికీ కాదు. ఆత్మకు సుఖములతోనూ దు:ఖములతోనూ ఎటువంటి సంబంధము ఉండదు. ఈవిషయం తెలుసుకుంటే మానవుడు ఎవరికీ భయపడడు.

కాబట్టి నేను కూడా మన ప్రాచీనులైన మహాఋషులు చెప్పిన బోధనలను అనుసరించి శ్రీహరి పాదసేవలో నిమగ్నమై ఈ సంసారము అనే సాగరమును దాటుతాను." అని తనలో తాను అనుకున్నాడు ఆ బ్రాహ్మణుడు.

ఉద్ధవా!ఆ ప్రకారంగా ఉన్న ధనం పోయి వైరాగ్యం పుట్టిన ఆ బ్రాహ్మణుడు,సన్యాసం పుచ్చుకొని, ఉన్నచోట ఉండకుండా భూమి అంతా తిరుగుతూ, అందరిచేతా చీత్కారములను అనుభవిస్తూ, తన జీవిత గాధను ఇలా చెప్పుకున్నాడు.

ఉద్ధవా!ఈ కథ విన్నావు కదా! ఇందులో ఉన్న బ్రాహ్మణుని సుఖములకు దుఃఖములకు ఎవరు కారణము? అసలు సుఖములు కానీ, దుఃఖములు కానీ, ఏమీ లేవు. ఇది అంతా భ్రమ. ఒక విషయాన్ని మనం సుఖం అనుకుంటూ సుఖం. దుఃఖం అనుకుంటే దుఃఖం. ఈ సంసారమే మన అజ్ఞానము లోనుండి పుట్టిన కల్పన. అజ్ఞాన కల్పితమైన ఈ సంసారములోని సుఖదుఃఖములకు ఉనికి ఎలా ఉంటుంది.

కాబట్టి ఉద్ధవా! నీవు నీ మనసును బుద్ధిని నా యందు లగ్నం చెయ్యి. మనస్సును నిగ్రహించు. అన్ని యోగముల సారము ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము, శ్రీహరి పాదసేవనము, సత్సంగము అని తెలుసుకో!" అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి సుఖదుఃఖముల గురించి వివరించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఇరువది మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

ఇరువది నాలుగవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి సాంఖ్యయోగము గురించి ఇలా వివరిస్తున్నాడు.

"ఉద్ధవా! ప్రాచీనులైన మహా ఋషులు పూర్వము సాంఖ్యయోగము గురించి చెప్పారు. ఆ సాంఖ్యయోగమును నేను నీకు వివరిస్తాను. ఈ సాంఖ్యయోగము వింటే మానవుడు సుఖదు:ఖములను వదిలిపెడతాడు.

కృతయుగము నుండి నేటి దాకా మానవులు ఈ భూమి మీద జీవిస్తున్నారు. వారిలో పురుషులు, స్త్రీలు ఉన్నారు. వారిలో వివేకము కలిగిన వారు ఉన్నారు. అటువంటి వారిలో జ్ఞానము ఒకే రూపంలో ఉంటుంది. ఆ జ్ఞానమే పరబ్రహ్మ స్వరూపము. పరబ్రహ్మను గురించి తెలుసుకోవడమే జ్ఞానము. ఈ పరబ్రహ్మ స్వరూపము కనపడదు. వినపడదు. తాకబడదు. మనసుతో తెలుసుకోలేము. వృద్ధిక్షయములు లేనిది. భేదబుద్ధిలేనిది.

ఈ పరబ్రహ్మ స్వరూపము ఒకటే. రెండు కాదు. అది సత్యమైనది. కాని మాయలో పడ్డ మానవునికి రెండుగా కనిపిస్తుంది. ఈ రెండు ఏమిటంటే ఒకటి ప్రకృతి. రెండవది జ్ఞానము. దానినే పురుషుడు అంటారు. ఆ ప్రకృతిలో క్షోభ కలిగింది. ఆ క్షోభనుండి

మూడు తత్వములు పుట్టాయి. అవే సత్వ, రజస్, తమోగుణములు. ఆ గుణముల నుండి జ్ఞాన శక్తి(ఆలోచన, వివేచన), క్రియా శక్తి (ఆలోచించినదాన్ని ఆచరించడం) ఉద్భవించాయి. జ్ఞాన శక్తి ప్రధానంగా ఉండే మహతత్త్వము ఆవిర్భవించింది. ఆ మహత్తత్వము లోనుండి జీవులకు భ్రమ కలిగించే అహంకారము ఉద్భవించింది. ఈ అహంకారము మూడు విధములు. వైకారికము (సత్వగుణ ప్రధానమైన అహంకారము), తైజసము (రజోగుణ ప్రధానమైన అహంకారము.) తామసము (తామస గుణ ప్రధానమైన అహంకారము). ఈ అహంకారము నుండి (నేను అనే స్వభావము నుండి) శబ్ద, స్పర్శ, రస, రూప, గంధము మొదలగు పంచ తన్మాత్రలు, భూమి, అగ్ని, నీరు, గాలి, ఆకాశము అనే పంచభూతములు, పది ఇంద్రియములు, మనస్సు ఉద్భవించాయి. పంచ తన్మాత్రలు, పంచభూతములు తామస అహంకారము నుండి ఉద్భవించాయి. అలాగే రాజస అహంకారము నుండి పది ఇంద్రియములు పుట్టాయి. సాత్విక అహంకారము నుండి, జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనస్సు 1 ఈ పదకొండింటికి అధిష్టాన దేవతలు ఉద్భవించాయి.

తరువాత, పరమాత్మ ఈ తత్వములు అన్నింటిలో ప్రవేశించి చైతన్యవంతులను చేసాడు. ఈ తత్వములు అన్నీ కలిసి, మిళితమై, క్రియాశీలములై, ఈ బ్రహ్మాండమును సృష్టించాయి. ఈ బ్రహ్మాండము మొదట జలములో ఉండింది. ఆ అండములో నారాయణ స్వరూపమైన పరమాత్మ వెల్లడి అయ్యాడు. నారాయణుడి నాభి నుండి ఒక పద్మము పుట్టింది. దాని పేరే విశ్వము.

ఆ పద్మములో నుండి బ్రహ్మ ఆవిర్భవించాడు. ఆ బ్రహ్మ రజోగుణ సంపన్నుడు. బ్రహ్మ నా గురించి తపస్సు చేసాడు. అప్పుడు లోక పాలకులను, భూలోకము, భువర్లోకము, సువర్లోకమును సృష్టించాడు. భూలోకములో మానవులను, జంతువులు, పశుపక్ష్యాదులను, భువర్లోకములో భూతగణములను, సువర్లోకములో దేవతలను సృష్టించాడు. ఈ మూడు లోకముల పైన మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము అనే నాలుగు లోకములను సృష్టించాడు. ఆ లోకములు సిద్ధులకు, మహర్షులకు నివాసమైంది. భూమికి కిందుగా అధోలోకములను కూడా సృష్టించాడు బ్రహ్మ. అవే అతల, వితల, సుతల, రసాతల, తలాతల, పాతాళ లోకములు. ఆ లోకములు రాక్షసులకు, నాగులకు నివాసస్థానములు అయ్యాయి.

జీవులు వారి వారి కర్మఫలములను అనుసరించి మానవులుగా, పశుపక్ష్యాదులుగా, దేవతలుగా మూడు లోకములలో జన్మ ఎత్తుతూ ఉంటారు. యోగులు, సిద్ధులు వారి వారి తపస్సుల ఫలితంగా మహర్లోకము, జన లోకము, తపోలోకము, సత్యలోకము అనే ఉత్తమ లోకములను పొందుతుంటారు. నా మీద భక్తి శ్రద్ధ కలిగిన జీవులు నా యొక్క పరమ ధామమును పొందుతారు.

ఓ ఉద్ధవా! నేనే కాలస్వరూపుడను, పరమేశ్వరుడను. ఈ జగత్తు అంతా నా చేత ప్రేరేపింపబడి కర్మలు చేస్తూ ఉంది. మూడు గుణములతో కూడిన ఈ సంసారసాగరంలో జీవుడు మునుగు తున్నాడు. తేలుతున్నాడు. ఒడ్డుకు చేరుకుంటున్నాడు. అంటే ఒకప్పుడు ఉత్తమ గతులను, మరొకప్పుడు అధోగతులను పొందుతున్నాడు.

ఉద్ధవా! ఈ ప్రపంచంలో చిన్నవి, పెద్దవి, కళ్లకు కనపడేవి, కళ్లకు కనపడనివి అనేకమైన పదార్థములు, వస్తువులు ఉన్నాయి. ఇవన్నీ ప్రకృతి, పురుషుల సంయోగము వలన ఏర్పడ్డాయి. ఏ పదార్థమైతే ఒకకార్యము యొక్క ఉత్పత్తికి, నాశనానికి కారణం అవుతుందో ఆ పదార్థమే ఆ కార్యమునకు వర్తమాన స్వరూపము అవుతుంది. మట్టి నుండి రకరకాల కుండలు తయారవుతాయి. మరలా మట్టిలో కలిసిపోతాయి. అలాగే బంగారము నుండి రకరకాల ఆభరణాలు తయారవుతాయి. మరలా కరిగిస్తే బంగారం అవుతుంది. ఇక్కడ మట్టి బంగారము కారణము. కుండలు, ఆభరణములు కార్యములు. కాబట్టి కారణములే సత్యములు అనగా నిలిచి ఉండేవి. కార్యములు వ్యవహారికములు. కాబట్టి మహతత్త్వము, అహంకారము ఎక్కడి నుండి వచ్చాయో ఆ పరమాత్మయే కారణ స్వరూపుడు. అదే సత్యము.

ఉద్ధవా! ఈ జగత్తుకు కారణమైన ప్రకృతి, ఆ ప్రకృతికి అధిష్ఠానదేవత పురుషుడు, మూడు గుణముల కదలిక ద్వారా ఉద్భవించిన కాలము ఈ మూడూ నాస్వరూపాలే. నాకంటే వేరు అయినది ఏదీ లేదు. ఈ జగత్తును అంతా పరమేశ్వరుడు సాక్షీభూతంగా చూస్తున్నాడు. జీవులందరూ మూడుగుణములతో ప్రభావితులై తమ సంతోషము కొరకు ఆనందము కొరకు ఎన్నో పనులు చేస్తున్నారు. తాతలు, తండ్రులు, కుమారులు, మనుమలు ఈ విధంగా సృష్టి చక్రము నిరంతరము తిరుగుతూ ఉంది.

నేనుకాల స్వరూపుడను అని చెప్పాను కదా. కాలం గడిచే కొద్దీ ఈ సృష్టి, స్థితి లయం, అను నిత్యం జరుగుతూ, తుదకు ఈ బ్రహ్మాండం అంతా నాశనమై పోతుంది. అప్పుడు ప్రళయం సంభవిస్తుంది. అప్పుడు ఈ మానవ శరీరములు అన్నము నందు, అన్నము బీజముల యందు, బీజములు భూమి యందు. భూమి వాసన యందు, వాసన జలములోనూ, జలము రసములోనూ, రసము తేజస్సులోనూ, తేజస్సు రూపములోనూ, రూపము వాయువులోనూ, వాయువు స్పర్శలోనూ, స్పర్శ ఆకాశములోనూ, ఆకాశము శబ్దములోనూ, లీనమై పోతాయి. ఇంద్రియములు అన్నీ తమ తమఅధిష్ఠాన దేవతలలో లీనమై పోతాయి. ఈదేవతలు మనస్సులోనూ, మనస్సు అహంకారములోనూ, అహంకారము మహత్తత్వములోనూ, మహత్తత్వము మూడు గుణములలోనూ, మూడు గుణములు అవ్యక్తమైన ప్రకృతిలోనూ, ఈ ప్రకృతి కాలములోనూ లీనమై పోతుంది. కాలము మాయతో కూడిన జీవుని లోనూ, జీవుడు ఆత్మస్వరూపుడుగా నా యందు లీనమై పోతాడు.

ఉద్ధవా! ఈ అనంత విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయములకు నేను కారణము. ఈ సృష్టి అంతా నాలోనుండి బయటకు వచ్చి తుదకు నాలోనే లీనమై పోతుంది. (ఈ విషయాన్ని స్థూలంగా నేటి శాస్త్రవిజ్ఞానానికి అన్వయించుకుంటే, మొట్ట మొదట చిన్ని అణువునుండి పెద్ద విస్ఫోటము సంభవించింది. దానినే బిగ్ బాంగ్ అంటారు. అందులో నుండి అనంత విశ్వం ఉద్భవించింది. అది నిరతంరం వ్యాపిస్తూనే ఉంది. అలా వ్యాపించి, వ్యాపించి తుదకు మరలా యధాస్థానానికి చేరుకుంటుంది. సాంఖ్య సిద్దాంతంలో

స్థూలంగా ఇదే చెప్పబడింది. ఈ సందర్భంలో మేటి శాస్త్రజ్ఞుడు స్టీఫెన్ హాకింగ్ రాసిన "ఎ బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైమ్" అనే పుస్తకం లోని కొన్ని మాటలు సందర్భోచితంగా ఉన్నాయి.

(With the success of scientific theories in describing events, most people have come to believe that God allows the universe to evolve according to a set of laws and does not intervene in the universe to break these laws. However, the laws do not tell us what the universe should have looked like when it started--it would still be upto God to wind up the clock work and choose how to start it off. So long as the universe had a beginning we could suppose it had a creator. But if the universe is really completely self-contained, having no boundary or edge, it would have neither beginning nor end. It would simply be. What place, then, for a creator)

ఉద్ధవా! ఉదయం సూర్యుడు ఉదయించగానే చీకటి మాయం అయిపోతుంది. అలాగే ఈ సాంఖ్యయోగమును గురించి తెలుసుకోగానే అన్ని భ్రమలు తొలగిపోతాయి. ఒక వేళ భ్రమ కలిగినా అది ఎక్కువ కాలం నిలిచి ఉండదు. ఉద్ధవా! సకల కార్యములకు కారణభూతుడను అయిన నేను నీకు సాంఖ్య యోగము గురించి

సంగ్రహంగా వివరించాను.” అని శ్రీకృష్ణుడు సాంఖ్యయోగం గురించి ఉద్ధవునికి చెప్పినట్టు శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు వివరించాడు.

శ్రీమద్భాగవతము
ఏకాదశ స్కంధము ఇరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## ఏకాదశ స్కంధము
## ఇరువది ఐదవ అధ్యాయము.

“ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునికి మూడు గుణముల గురించి వివరిస్తున్నాడు.

“ఉద్ధవా! సత్వ, రజస్, తమోగుణములు ఒకదానితో ఒకటి కలవకుండా ఉంటే అవి మానవుల మీద ఎటువంటి ప్రభావాన్ని కలిగి ఉంటాయో వివరిస్తాను.

మనస్సును నిగ్రహించుకోవడం, ఇంద్రియములను నిగ్రహించడం, ఓర్పుతో ఉండటం, జ్ఞానము, వివేకము కలిగి ఉండటం, ఎల్లప్పుడూ సత్యమునే పలకడం, సాటి ప్రాణుల మీద దయకలిగి

ఉండటం, ఎల్లప్పుడూ సంతోషంగా ఉండటం, తనకు ఉన్న దానిలో ఒకరికి పెట్టే బుద్ధి కలిగి ఉండటం, ప్రాపంచిక విషయముల మీద అధికమైన వ్యామోహాన్ని కలిగి ఉండకపోవడం, చేసే పని మీద శ్రద్ధ కలిగి ఉండటం, నమ్రతగా ఉండటం, తనలో తాను ఆనందించడం, ఇటువంటి గుణములను సత్వగుణములు అని అంటారు. సత్వగుణము ప్రధానంగా కలవారు ఇటువంటి పనులు చేయడంలో ఆసక్తి కలిగి ఉంటారు.

కోరికలు ఎక్కువగా కలిగి ఉండటం, ఆ కోరికలు తీరడానికి ప్రయత్నం చేయడం, మదము, తృష్ణ, గర్వము కలిగి ఉండటం, ఎల్లప్పుడూ దేవతలను ఏదో ఒక కోరిక కోరడం, పెద్ద వాళ్లు చిన్న వాళ్లు, ధనికులు పేదలు అనే భేదబుద్ధి కలిగి ఉండటం, ఎల్లప్పుడూ సుఖంగా ఉండాలని కోరుకోవడం, సుఖాలు అనుభవించడం, ఇతరుల మీదికి తగవుకు, కలహానికి కాలు దువ్వడం, పేరు ప్రతిష్టల కోసరం పాకులాడటం, ఎదుటి వారిని అపహాస్యం చేసి మాట్లాడటం, బల పరాక్రమములు కలిగి ఉండటం, అనుకున్నది సాధించేవరకూ పట్టు విడువకపోవడం, ఇవన్నీ రజోగుణము అధికంగా కల వారి లక్షణములు.

ఎక్కువగా కోపము కలిగి ఉండటం, అంతా నాకే కావాలని అనుకోవడం, ఎప్పుడూ అబద్ధాలు చెప్పడం, ఎదుటి వారిని శారీరకంగా మానసికంగా హింసించడం, ప్రతిదానికీ ఒకరిమీద ఆధారపడటం, డాంబికంగా కనిపించడం, ప్రతి దానికీ ఎక్కువగా కష్టపడిపోవడం, ఎదుటి వారితో కలహములు పెంచుకోవడం, అనుకున్నది కాకపోతే దు:ఖంలో మునిగిపోవడం, అన్ని కష్టాలు నాకే వచ్చాయని బాధపడటం,

ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్న వాడి మాదిరి ఉండటం, నిరాశ, నిస్పృహలతో ఉండటం, ఎప్పుడూ నిద్రపోవడానికి ఇష్టపడటం, ప్రతి దానికీ ఆశపడటం, భయపడటం, తనకు ఏదో రోగం ఉందని, లేని రోగం గురించి  బాధపడి పోవడం,  ఇవన్నీ తమోగుణ లక్షణములు.

ఉద్ధవా! పైన చెప్పబడిన లక్షణములు సత్వ, రజస్ తమోగుణములు విడివిడిగాఉంటే ఏర్పడేవి. ఇప్పుడు వీటి కలయికవలన కలిగే లక్షణాలను వివరిస్తాను.

ఉద్ధవా! జీవులలో ఉన్న  నీది, నాది, అనే భేద బుద్ధి ఈ మూడు గుణముల కలయిక వలన సంభవిస్తుంది. ఈమూడు గుణములకు సంబంధించిన లక్షణములు మనస్సు నుండి, బయట నుండి వినబడే శబ్దము, కనపడే దృశ్యములు మొదలగు విషయముల నుండి, ఇంద్రియముల సంయోగము వలన, పుడుతుంటాయి. ఇవి అన్నీ సత్వ, రజస్, తమోగుణముల ప్రభావం చేత ఏర్పడేవే. పురుషుడు ధర్మంగా ప్రవర్తించడం,  ధనం మొదలగు వాటిని సంపాదించడం,  కోరికలను తీర్చుకోవడం వీటిమీద ఆసక్తి కలిగిఉన్నప్పుడు, వాటి మీద శ్రద్ధ, అనురక్తి ఈ మూడు గుణముల వలననే కలుగుతాయి.

కోరికలు తీర్చుకోడానికి కర్మలు చేయాలి అనే ఆసక్తి ఉన్న మానవుడు గృహస్థ ధర్మమును స్వీకరిస్తాడు. గృహస్థ ఆశ్రమమును స్వీకరించిన తరువాత తన స్వధర్మమును, నిత్యము చేయతగిన పూజలు, సంధ్యావందనము అగ్నిహోత్రము, పితృదేవతలను పూజించడం, అతిథులను ఆదరించడం  మొదలగు వాటి యందు

ఆసక్తి కలిగి ఉంటాడు. ఇలాచేయడం కూడా మూడు గుణముల కలయికతోనే జరుగుతుంది.

ఉద్ధవా! పైన చెప్పబడిన ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము మొదలగు లక్షణములు కలవారిని సత్వగుణము కలవారి గానూ, కోరికలు మొదలగు లక్షణములు కలవారిని రజోగుణము కలవారి గానూ, కోపము, లోభము మొదలగు లక్షణములు కలవారిని తమోగుణము కలవారిగానూ గుర్తించాలి. పరమాత్మ యందు భక్తి కలిగి ఉండి, తానుచేసే కర్మలకు ఫలం ఆశించకుండా కర్మలు చేసే స్త్రీ,పురుషులను, సత్వగుణము కలవారిగా గుర్తించాలి. ఎల్లప్పుడూ కోరికలుకోరుతూ అవి తీరడానికి సతమతమయ్యే వారిని రజోగుణము కల వారిగా, పరమాత్మను ఆరాధించడంలో కూడా హింస చేసే వారిని (బలులు మొదలగు వాటిని సమర్పించేవారిని) తమోగుణము కలవారిగా గుర్తించాలి.

ఉద్ధవా! ఈ సత్వ, రజస్, తమోగుణములు మానవుని మనసుకు సంబంధించినవి కానీ ఆత్మకు సంబంధించినవి కావు. ఈ గుణములద్వారా జీవుడు ప్రాపంచిక విషయములు, విషయ వాంఛల యందు ఆసక్తుడై సంసారంలో పడిపోతున్నాడు. ఎప్పుడైతే సత్వగుణము, రజస్, తమోగుణములను జయిస్తుందో, అప్పుడు జీవుడు సుఖంగా, శాంతంగా, జీవించగలుగుతాడు. జ్ఞానవంతుడవుతాడు. జీవునిలో ఉన్న రజోగుణము, సత్వగుణ, తమోగుణముల కన్నా అధికంగా ఉంటే, అతడు ఎక్కువ దు:ఖముతోనూ, కర్మలు చేయడంలోనూ, కీర్తిని సంపాదించడంలోనూ నిమగ్నమై ఉంటాడు. ఎవరిలో అయితే సత్వ,రజోగుణముల కన్నా

తమోగుణము ఎక్కువగా ఉంటుందో, ఆ మానవుడు శోకము, మోహము, నిద్ర, హింస, ఆశ వీటికి వశుడై ఉంటాడు. ఎవరి మనస్సు నిర్మలంగా ఉంటుందో, ఎవరి ఇంద్రియములు ప్రశాంతంగా ఉంటాయో, ఎవరిలో భయము ఉండదో, ఎవరి మనస్సు అనవసర విషయములను, కోరికలను కలిగి ఉండదో, అతడు సత్వగుణమును ఎక్కువగా కలిగిఉంటాడు. అతడికి పరమాత్మను పొందడం సులభం.

ఎల్లప్పుడూ ఏదో ఒక పని చేస్తూ, దాని వలన వచ్చే ఫలితములను అనుభవిస్తూ, మనస్సు అల్లకల్లోలం చేసుకుంటూ, ఎల్లప్పుడూ అసంతృప్తితో ఉన్న బుద్ధిని కలిగి ఉంటూ. చేతులు కాళ్లు అసహనంగా కదిలిస్తూ, మనస్సులో ఏదో ఒక ఆలోచనతో సతమతమౌ ఉండేవారు రజోగుణముతో ప్రభావితమౌతున్నారు అనితెలుసుకో!

ఎవరి బుద్ధి, మనస్సు ఎల్లప్పుడూ కలత చెంది ఉంటుందో, భగవంతుని గురించి తెలుసుకోడానికి ప్రయత్నించదో, ఎవనిలో అజ్ఞానము, అవివేకము, విషాదము, సమృద్ధిగా ఉంటుందో, అతడు తమోగుణ ప్రధానుడు అని తెలుసుకో.

ఉద్ధవా! సత్వగుణము ఎక్కువగా ఉంటే దేవతలకు, రజోగుణము ఎక్కువగా ఉంటే అసురులకు, తమోగుణము ఎక్కువగా ఉంటే రాక్షసులకు బలం పెరుగుతుంది. సత్వగుణ ప్రధానులు ఎక్కువగా మెలుకువగా ఉండటానికి ప్రయత్నిస్తారు. రజోగుణ ప్రధానులు ఎక్కువగా కలలు, పగటి కలలుకంటుంటారు. తమోగుణ ప్రధానులు ఎక్కువగా నిద్రపోతుంటారు. ఈమూడు అవస్థలలో కూడా

ఆత్మ సాక్షిగా చూస్తూ ఉంటుంది.

వేదములను, శాస్త్రములను అధ్యయనం చేసిన బ్రాహ్మణులు సాత్విక బుద్ధి కలిగి ఉండి, బ్రహ్మలోకము వరకు వెళతారు. రజోగుణము కలిగిన వారు మానవులుగా పుడతారు. తమోగుణము కలిగిన వారు అధోగతినిపొందుతారు అంటే పశు,పక్షి జన్మలు ఎత్తుతారు. సత్వగుణము ఎక్కువగా ఉన్న వారు మరణించిన తరువాత స్వర్గలోకమునకు వెళుతారు. రజోగుణము ఎక్కువగా ఉన్న వారు మరణిస్తే మానవులుగా జన్మిస్తారు. తమోగుణము ఎక్కువగా ఉన్న వారు నరకలోకమునకు వెళ్తారు. ఏగుణము లేకుండా ఉన్నవారు మరణించిన తరువాత పరమాత్మ గతిని పొందుతారు.

ఉద్ధవా! ఇంక మానవులు చేసే కర్మల గురించి చెబుతాను. నా గురించి, నన్ను ఉద్ధేశించి, నాకు ప్రీతి కలగడానికి చేసే కర్మలు, సంధ్యావందనము, అగ్నిహెూత్రము మొదలగు నిత్యము చేసే కర్మలు, ఫలమును ఆశించకుండా చేసే అన్ని కర్మలు సాత్విక కర్మలు అని అంటారు. ఏదో ఒక ఫలమును ఆశిస్తూ చేసే కర్మలు, రాజస కర్మలు అంటారు. గొప్ప కోసరం, ఎదుటి వారికి హాని కలిగించడానికి చేసే కర్మలు, హింసతో కూడిన యాగములు, అన్ని తామస కర్మలు అని అంటారు.

ఉద్ధవా! పరమాత్మను గురించిన జ్ఞానమును సాత్విక జ్ఞానము అంటారు. దేహమును గురించి, ప్రాపంచిక విషయముల గురించి తెలుసుకున్న జ్ఞానము రాజసము. కోరికల గురించి, విషయ వాంఛల గురించి, కామ వాంఛల గురించి తెలుసుకున్న జ్ఞానమును తామస

జ్ఞానము అంటారు.

కేవలము పరమాత్మను తప్ప వేరే ఏ విషయమును గురించి ఆలోచించని జ్ఞానము నిర్గుణ జ్ఞానముఅంటారు. అడవులలో ఉంటూ తపస్సు చేసుకోవడం సాత్వికము. గ్రామములలో పట్టణములలో ఉంటూ ప్రాపంచిక విషయములు అనుభవించడం రాజసం. పానశాలలు, జూదగృహములలో ఉంటూ మత్తులో ఉండటం తామసం. దేవాలయములలో ఉంటూ పరమాత్మను గురించి ధ్యానించడం నిర్గుణం.

ఇంతే కాకుండా తాను చేసే కర్మల మీద ఏ విధమైన ఆసక్తి లేకుండా కర్మలు చేసే వాడు సాత్వికుడు. తాను చేసే కర్మల మీద ఎక్కువ ఆసక్తితో, ఫలితములనుఆశించి కర్మలు చేసేవాడు రాజసికుడు. తాను చేసే కర్మల గురించి ఆలోచించకుండా, తాను చేసే కర్మలకు మంచి ఫలితం వస్తుందో చెడ్డ ఫలితం వస్తుందో తెలియకుండా తనకు తోచిన కర్మచేసే వాడు తామసికుడు. కేవలం నా కోసమే కర్మలు చేసేవాడు నిర్గుణుడు.

భక్తితో, శ్రద్ధతో, భగవంతుని పరంగా చేసేకర్మ సాత్వికము. తాను చేసే కర్మల మీదనే శ్రద్ధ పెట్టి ఫలితం కోసరం చేసే కర్మ రాజసము. అధర్మయుక్తంగా, చెడ్డ ఫలితములను ఆశిస్తూ చేసే కర్మ తామసికము. నేను తప్ప మరొక విషయం మీద దృష్టి లేకుండా, నా మీద శ్రద్ధా భక్తులతో చేసే కర్మ నిర్గుణ కర్మ.

ఉద్ధవా! తినదగినది, పరిశుద్ధమైనది, ఎటువంటి ప్రయత్నం చేయకుండా లభించినది, అయిన ఆహారము సాత్వికాహారము. రుచికరమైనది, ఇంద్రియములకు సుఖం కలిగించేది, పులుపు, వగరు, ఉప్పు, కారం కలిగినది అయిన ఆహారము రాజసాహారము. అపవిత్రమైనది, పులిసిపోయినది, అయిన ఆహారము తామసికము. పరమాత్మకు నివేదించిన ఆహారము నిర్గుణము.

ఎల్లప్పుడు ఆత్మయందు రమించడం సాత్వికము. విషయ వాంఛలను, కామ కోరికలను, స్త్రీసుఖములను అనుభవించడం రాజసం. మోహము, భ్రమ, దీనత్వము కలిగి ఉన్న సుఖము తామసికము.

(కొంతమంది ఎంత ఉన్నా నాకేం ఉంది నా మొహం అంటూ ఏడుస్తుంటారు. తాము అనుభవించరు. మరొకరిని అనుభవించ నీయరు. లోభత్వంతో ఉంటారు.)

ఎల్లప్పుడు నన్ను కీర్తించడం, దానివలన అనుభవించే సుఖం నిర్గుణ సుఖం. తాను సంపాదించే ధనము, ఉంటున్న ప్రదేశము (గృహము), చేసిన పనులకు వచ్చే ఫలితము, చేసే కర్మ, కర్మల మీద శ్రద్ధ, కర్మలు చేయడం కోసం, ధనం సంపాదించడం కోసం పడే అవస్థ, శారీరక సౌష్టవం, అందం, రూపం, చేసే పనులమీద శ్రద్ధ నిష్ట ఇవి అన్నీ సత్వ,రజస్,తమోగుణముల ప్రభావంతోనే లభిస్తాయి.

ఉద్ధవా! మనం చూచేవి, వినేవి, ఆలోచించేవి, తాకేవి, అన్నీ కూడా ఈ మూడుగుణములకు లోబడే ఉంటాయి. మానవుడికి సంసారము ఈ మూడు గుణముల కలయిక వలననే లభిస్తుంది. ఈ

గుణములన్నీ మనసులో నుండి పుడతాయి. మనసును జయిస్తే ఈ మూడుగుణములను జయించి నట్టే. మానవుడు భక్తి యోగముతో ఈ మూడు గుణములనుజయించి, నిర్గుణత్వమును పొంది నన్ను చేరుకోగలడు.

కాబట్టి ఓ ఉద్ధవా! విచక్షణా జ్ఞానం కల మానవులు జ్ఞానము, విజ్ఞానము సంపాదించడానికి అనువైన మానవదేహమును పొంది, ఈ మూడు గుణముల యందు ఆసక్తిని విడిచిపెట్టి, నన్ను సేవిస్తే వారు ఉత్తమగతులను పొందుతారు. జ్ఞానము, వివేకము కల మానవుడు, ప్రాపంచిక విషయములలో అప్రమత్తంగా ఉండి, ఇంద్రియములను జయించి, ప్రాపంచిక విషయముల మీదా, విషయ వాంఛల మీదా, కామ భోగముల మీద ఆసక్తిని వదిలిపెట్టి, సాత్వికుడై రజస్తమో గుణములను జయించవలెను. తరువాత శాంతముతో కూడిన మనస్సుతో ఉన్న వ్యక్తి, సత్వగుణమును కూడా వదిలిపెట్టి, నిర్గుణుడై, వాసనలతో కూడిన సూక్ష్మదేహమును వదిలి పెట్టి పరమపదమును పొందుతాడు.

ఈ ప్రకారంగా సూక్ష్మదేహమునుండి, మనస్సులో నుండి పుట్టిన మూడుగుణములనుండి విముక్తుడై, పరబ్రహ్మస్వరూపుడనైన నా అనుభూతిని పొందుతాడు. అటువంటి వాడికి బాహ్య ప్రపంచము లోని విషయభోగములు, మనసులోని విషయ వాంఛలు ఏ మాత్రము తమ ప్రభావమును చూపించవు."

అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి మూడుగుణముల గురించి వివరించాడు" అని శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఇరువది ఐదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

ఇరువది ఆరవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు ఉద్ధవునితో ఇంకా ఇలా అన్నాడు. "ఉద్ధవా! పరమాత్మ తత్వమును తెలుసుకోడానికి జ్ఞానము, వివేకము కావాలి. అవి కావాలంటే మానవ శరీరం కావాలి. కాబట్టి మానవ శరీరంతోనే పరమాత్మ తత్వమును తెలుసుకోగలరు. తుదకు పరమాత్మ అయిన నన్ను పొందగలరు. జ్ఞానం సంపాదించడం ద్వారా మానవుడు, సత్వ,రజస్,తమో గుణములు, వాటి వలన కలిగిన అహంకారము, ప్రాపంచిక విషయములు, విషయ వాంఛలు అన్నీ నిజాలు కావు, అంతా మాయ అని తెలుసుకొని వాటిలో సంచరిస్తున్నప్పటికినీ, వాటి మీద ఆసక్తి కలిగి ఉండడు. తుదకు వాటిని కూడా విడిచిపెడతాడు.

సాధారణంగా మానవుడు కేవలము పొట్ట పోసుకోడానికి ప్రాపంచిక విషయములలో మునిగి తేలుతున్న స్వార్థపూరితమైన మానవులతో స్నేహం చేయకూడదు. ఎందుకంటే వారితో స్నేహం

వలన స్వార్థం, లోభబుద్ధి అలవడుతుందే కానీ ఏమీ ప్రయోజనము ఉండదు. గుడ్డి వాడికి గుడ్డివాడు దారి చూపినట్టు అవుతుంది. అప్పుడు ఇద్దరూ అంధకారంలో పడి పోతారు.

పూర్వము ఇల కుమారుడు పురూరవుడు అనే రాజు ఉండేవాడు. అతడు మహా కీర్తిమంతుడు. అటువంటి వాడు ఊర్వశి అనే అప్సరస మోహంలో పడిపోయాడు. దు:ఖముల పాలయ్యాడు. కొన్నాళ్ల తరువాత ఆ శోకమును విడిచి పెట్టి వైరాగ్యమును పొందాడు. ఆయన గురించి క్లుప్తంగా చెబుతాను విను.

(పురూరవుడి కథ ఇంతకు ముందు మనం చదువుకున్నాము. తన ముందు బట్టలు లేకుండా కనపడితే తాను వెళ్లిపోతాను అని ఉర్వశి నిబంధన పెట్టింది. అనుకోని పరిస్థితులతో పురూరవుడు దిగంబరంగా ఊర్వశికి కనపడ్డాడు. ఊర్వశి వెళ్లిపోయింది. అప్పుడు పురూరవుడు ఆమెను పిలుస్తూ ఆమె వెంట పడ్డాడు. ఇంక చదవండి.)

పురూరవుడు దిగంబరుడై పిచ్చి వాడి వలె తనను విడిచి పోతున్న ఊర్వశిని పిలుస్తూ ఆమె వెంట పరుగెత్తాడు. "దేవీ! ఊర్వశీ! నిలువు. వెళ్లిపోకు." అని ఏడవడం మొదలుపెట్టాడు. ఊర్వశి పురూరవుని హృదయమును అంతగా కొల్లగొట్టింది. ఆమె మోహంలో పడి పురూరవుడు కేవలం ఆమెతో శారీరక వాంఛలు తీర్చుకోవడంలో నిమగ్నమయ్యాడు. అయినా పురూరవుడికి తృప్తి కలుగలేదు. ఇప్పుడు ఆమె తనను విడిచి పోగానే ఇలా ఏడుస్తున్నాడు.

"ఊర్వశీ! నా ప్రేయసీ! నీ మోహంలో పడి నేను నీ కౌగిట్లో నా ఆయుర్దాయము కరిగిపోతూ ఉన్నదని గమనించలేకపోయాను. నీ చేత మోసగింప బడ్డాను. నీ కౌగిట్లో రోజులు క్షణాల్లా గడిపాను. ఆ ప్రకారంగా రోజులు, మాసములు, సంవత్సరములు గడిపాను. అయినా నీకు నా మీద దయలేదు. నన్ను విడిచిపెట్టి వెళ్లిపోయావు. నేను చక్రవర్తిని, రాజులలో కీర్తిమంతుడను, అయినా నీ చేతిలో కీలుబొమ్మను అయ్యాను. నీవు ఆడుకొనే ఆటవస్తువుగా మారిపోయాను. నీ పెంపుడు జంతువుగా వ్యవహరించాను. నా రాజ్యమును, నా ప్రజలను, నా కీర్తిని గడ్డిపోచ మాదిరి విడిచిపెట్టి బట్టలు లేకుండా ఏడుస్తూ నీ వెంట పరుగెత్తుతున్నాను.

నేను ఎంత అవివేకిని. నీవు నన్ను గాడిద తన వెనుక కాళ్లతో తన్నినట్టు తన్నినా, సిగ్గు లేకుండా నీ కోసం నీ వెంట పరుగెడుతున్నాను. నా కీర్తి, నా రాజసము, నా తేజస్సు ఏమయ్యాయి? అపరిమితమైన స్త్రీల సాంగత్యంలో ఉన్న పురుషుడు తన విద్య, తపస్సు, సన్యాసము, వేదాధ్యయనము అన్నీ మరిచిపోతాడు. అతని పట్ల పైన చెప్పినవి అన్నీ పనికిరాకుండా పోతాయి. నేను చక్రవర్తిగా నా ప్రజలను, నా సామంత రాజులను, ఈ భూమిని నా కనుసన్నలలో పాలించాను. కానీ ఈ నాడు నీకు వశుడనై నీ వెంట ఆవు వలె, గాడిద వలె పరుగెడు తున్నాను.

ఊర్వశీ! నేను గర్విష్టిని. నాకు అన్నీ తెలుసు అనీ, నేను సర్వజ్ఞుడను అనీ అహంకరించాను. నీ మోహంలో పడి భ్రష్టుడనయ్యాను. నా వంటి మూర్ఖుడు ఎవరుంటారు? అగ్నిలో నెయ్యి పోస్తే ఆరి పోదు. ఇంకా ప్రజ్వరిల్లుతుంది. అలాగే నాలోని కామాగ్ని

కూడా నీ అధరామృతము ఎంత పోసినా, చల్లారక ఇంకా ప్రజ్వరిల్లుతూ ఉంది. జారిణి (ఎంతో మంది పురుషులతో తిరిగేది) అయిన స్త్రీ చేత అపహరింప బడిన మనసును తిరిగి పొందడానికి దేవతలకు, మానవులకు ఎవరికీ సాధ్యము కాదు.

అయినా నిన్ను అనుకొని ఏమి ప్రయోజనము. నీవు నాకు ఎన్నో విధములుగా హిత బోధలు చేసావు. కాని నీ మీద అపరిమితమైన మోహంతో నేను నీ హితబోధలు పెడచెవిని పెట్టాను. అధోగతి పాలయ్యాను. అయినా ఊర్వశి నాకు ఏం అపకారం చేసింది. ఎవరైనా మెలికలు తిరిగిన తాడును చూచి పాము అనుకొని భ్రాంతి పడితే, అది చూచిన వాడి తప్పుకానీ తాడు తప్పుకాదు కదా! నేను కూడా ఇంద్రియములను జయించాను అని ప్రబల్భాలు పలికి, నిన్ను చూడగానే నీ మోహంలో పడి పోయాను. అది నా తప్పుకానీ నీది కాదు.

అయినా ఊర్వశీ! అందమైన స్త్రీ శరీరం చూచి అందరూ మోజుపడతారు కానీ, స్త్రీశరీరంలో ఏముంది? రక్త మాంసములు, ఎముకలు, దుర్గంధము, మలమూత్రములు తప్ప. ఇటువంటి స్త్రీ శరీరమును చూచి మోహంలో పడిపోతున్నారు అంటే అది కేవలము వారి అజ్ఞానము, అవివేకము, భ్రమ తప్ప వేరుకాదు.

అయినా ఈ శరీరము నాకు నా తల్లి తండ్రులు ఇచ్చారు. ఈ ఊర్వశి ఇప్పుడు వచ్చింది. నా శరీరం మీద ఊర్వశికి ఏం హక్కు ఉందని నన్ను ఇంతగా ప్రభావితం చేసింది. నేను ఇంతగా ప్రేమించిన ఊర్వశి కూడా, నేను మరణించిన తరువాత ఈ శరీరాన్ని కాల్చేస్తుంది,

పూడ్చిపెడుతుంది అంతే కానీ పక్కన పెట్టుకోదు కదా! కాబట్టి ఈ శరీరం ఎవరిది? కన్న తల్లి తండ్రులదా! కట్టుకున్న భార్యదా! బంధు మిత్రులదా! తుదకు పీక్కుతినే కాకులు, గద్దలదా! ఎవరిది? ఏమీ అర్థం కావడం లేదు. పురుషుడి శరీరం మాదిరే అందమైన స్త్రీ శరీరం కూడా మలమూత్రములు, రక్తమాంసములతో, దుర్గంధముతోకూడి ఉంటుంది. కానీ పురుషులు స్త్రీలు అంటే మోజుపడతారు. వారి వెంట పడతారు. వారి కోసం ఏమైనాచేస్తారు. స్త్రీసుఖం కోసం ఏమి చెయ్యడానికైనా వెనుదీయరు. పైగా "ఆహా ప్రేయసీ! నీ ముఖం, నీ ముక్కు, నీ పెదాలు, నీ శరీరం ఎంత అందంగా ఎంత మనోహరంగా ఉంది" అని పొగుడుతుంటారు. చర్మము, మాంసము, రక్తము, మలమూత్రములు, ఎముకలు మొదలగు వాటితో కూడిన ఈ స్త్రీ శరీరమును అనుభవించే వారికి, ఆ మలమూత్రములలో ఉండే పురుగులకు తేడా ఏముంటుంది.

కాబట్టి జ్ఞాని, వివేక వంతుడు అయిన మానవుడు స్త్రీలకు దూరంగా ఉండాలి. స్త్రీలతో సంపర్కముపెట్టుకోకూడదు. విషయ వాంఛల వలన మనస్సు చంచలమౌతుంది. కాబట్టి ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము ప్రతి వాడూ అలవరచుకోవాలి. అప్పుడే మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. కాబట్టి వివేకి అయిన వాడు స్త్రీలతోనూ, స్త్రీ సంపర్కము కలిగిన వారితోనూ, స్నేహము చేయరాదు. ఎందుకంటే జ్ఞానులు, వివేకులు యొక్క మనస్సు, ఇంద్రియములు వారిని మోసం చేస్తుంటాయి. విషయ వాంఛల వైపు, స్త్రీసుఖం వైపు లాగుతుంటాయి. అటువంటి జ్ఞానులు, వివేకులే అలా అయినప్పుడు ఇంక నా వంటి సామాన్యుడి విషయం చెప్పేది ఏముంది?" అని అనుకున్నాడు పురూరవుడు.

ఓ ఉద్ధవా! ఇలా తనలో తాను ఆలోచించిన పురూరవుడు ఊర్వశీలోకమును వదిలిపెట్టాడు. (ఊర్వశి ఒక వ్యక్తి కాదు. ఊర్వశీ లోకము అంటే వల్లమాలిన వ్యామోహము. దానిని వదిలిపెట్టాడు పురూరవుడు.) తరువాత పురూరవుడు మనస్సును పరమాత్మ యందు లగ్నం చేసాడు. తనలో ఉన్న అజ్ఞానమును విడిచిపెట్టాడు. మనస్సు ప్రశాంతంగా ఉంచుకున్నాడు.

కాబట్టి ఉద్ధవా! బుద్ధిమంతుడు, వివేకి అయిన మానవుడు దుష్టుల సహవాసమును వదిలిపెట్టాలి, మంచి వారి సాంగత్యము పెంపొందించుకోవాలి. సత్సాంగత్యములో కాలం గడపాలి. సత్పురుషులు తమ అమృత వాక్కులతో అజ్ఞానాన్ని అవివేకాన్ని నాశనం చేసి, జ్ఞానోదయం కలుగజేస్తారు. ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని వదిలిపెట్టేటట్టు చేస్తారు. ఎందుకంటే సత్పురుషులకు కోరికలు ఉండవు. వారు నిష్కాములు. ఎల్లప్పుడూ పరమాత్మ ధ్యానంలో నిమగ్నమై ఉంటారు. ప్రశాంత చిత్తంతో ఉంటారు. సుఖ దు:ఖములను సమంగా చూస్తారు. వారికి మనుషులలో పేద ధనిక భేదములు కనపడవు. నాది, నీది అనే భేదము ఉండదు. వారిలో అహంకారము ఉండదు. వారు తనకు కావాల్సిన దాని కంటే ఎక్కువ ఎవరి వద్ద నుండీ తీసుకోరు. ఉన్నదానితో తృప్తిగా జీవిస్తారు. అటువంటి సత్పురుషుల సాంగత్యం ఎల్లప్పుడూ కోరుకోవాలి.

ఉద్ధవా! అటువంటి వారు నా కథలను ఎల్లప్పుడూ కీర్తిస్తూ ఉంటారు. ఆ కథలను శ్రద్ధగానూ, ఏకాగ్రమైన మనసుతో వింటే వారు

చేసిన పాపములు నాశనం అవుతాయి. వారికి నా యందు భక్తి కలుగుతుంది. నా యందు ఏకాగ్రమైన భక్తి కలిగి ఉంటే చాలు వారు ఈ లోకంలో ఇంక పొందవలసినది ఏదీ ఉండదు. అగ్ని ప్రజ్వరిల్లుతుంటే శీతలము కానీ, చీకటి కానీ దరిదాపులలో ఉండదు. అలాగే నా యందు భక్తి కలిగి ఉన్న వాడికి సంసార భయం అనేది ఉండదు. నీటి యందు మునిగిపోయే వ్యక్తి ఏదో ఒక పడవను పట్టుకోడానికి ప్రయత్నించినట్టు భయంకరమైన సంసార సాగరంలో మునుగుతున్న వ్యక్తులు ప్రశాంతమైన మనసు కలవారు, బ్రహ్మజ్ఞానము కలవారు అయిన సత్పురుషుల సాంగత్యము అనే పడవను పట్టుకోవాలి.

అలాగే ఆపదలలో ఉన్న వారిని రక్షించేవాడిని నేనే. ఈ లోకంలో ధర్మం ఆచరించిన వారికి పరలోకంలో అది ధనం మాదిరి ఉపయోగపడుతుంది. అలాగే సంసారంలో పడి ఉన్న వారికి సత్పురుషులు రక్షకులు. ఉదయం కాగానే సూర్యుడు తూర్పుదిక్కున కనపడి ఈ లోకంలో ఉన్న అన్ని వస్తువుల మీద తన వెలుగును ప్రసరింపచేసి ఆ వస్తువులను మన కళ్లకు చూపుతున్నాడు.

అలాగే సత్పురుషులు భగవంతుని చూడటానికి తగిన వెలుగును మానవులకు ప్రసాదిస్తారు. భగవంతుని మనము ఈ కళ్లతో చూడలేము కాబట్టి మానవులకు సత్పురుషులు జ్ఞానము అనే కళ్లను ప్రసాదిస్తారు. దేవతలు అంటూ ఎక్కడా లేరు. అటువంటి సత్పురుషులే దేవతలు. నేను కూడా అటువంటి సత్పురుషుడనే.”

అని శ్రీకృష్ణుడు  ఉద్ధవునికి పురూరవుని వృత్తాంతం వినిపించాడు అని శుక యోగీంద్రుడు పరీక్షిత్తు మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఇరువది ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

ఇరువది ఏడవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు చెప్పిన పురూరవుని వృత్తాంతము విన్న ఉద్ధవుడు కృష్ణుని ఇలా అడిగాడు.

"కృష్ణా! సాత్వికులు అయిన నీ భక్తులు నిన్ను ఏ విధంగా పూజిస్తారో ఆ క్రియాయోగం గురించి నాకు వివరంగా తెలుపవలసింది. ఎందుకంటే, నారదుడు, వ్యాసుడు, బృహస్పతి మొదలగు మహర్షులు నిన్ను అర్చించడమే అధికమైన శ్రేయస్సును కలిగిస్తుంది అని చెబుతుంటారు. ఈ క్రియాయోగమును  ప్రథమంగా నువ్వు బ్రహ్మకు బోధించావు. బ్రహ్మదేవుడు తన కుమారుడు భృగువుకు ఉపదేశించాడు. తరువాత శంకరుడు ఈ క్రియా యోగమును తన భార్య పార్వతికి చెప్పాడు. ఆ ప్రకారంగా ఈ క్రియాయోగము మానవలోకంలో విస్తరించింది.

కృష్ణా! నిన్ను ఉపాసించడమే నాలుగు వర్ణముల వారికీ, నాలుగు ఆశ్రమములలో ఉన్న వారికీ స్త్రీలకు, అన్నిజాతుల వారికీ, అగ్ర,నిమ్నకులముల వారికి, సకల మానవాళికి శ్రేయోదాయకము. మా మీద దయయుంచి మాకు కూడా ఈ కర్మబంధముల నుండి విముక్తి చెందే మార్గమును ఉపదేశించి మమ్ములను తరింపచెయ్యి. " అని అడిగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ఉద్ధవునికి క్రియాయోగం గురించి ఇలా చెప్పాడు.

"ఉద్ధవా! ఈ కర్మ కాండ అనంతము. దీనికి అంతు లేదు. నీవు అడిగావు కాబట్టి ఈ కర్మయోగమును క్లుప్తంగా వివరిస్తాను. పూజలు మూడు రకాలు. వేదములలో చెప్పబడిన మంత్రములతో చేయు పూజలు. తాంత్రిక పూజలు అంటే క్రియలతో చేసే పూజలు. మంత్రములు, తంత్రములతో చేసే పూజలు అంటే మిశ్రమ పూజలు. బ్రహ్మ, క్షత్రియ, వైశ్యజాతుల వారు తగిన వయసులో ఉపనయన సంస్కారము శాస్త్రోక్తంగా పొందాలి. తరువాతనే పూజలుచేయడానికి అధికారము లభిస్తుంది.

ఉపనయన సంస్కారము పొందిన ద్విజుడు (అనగా రెండవ సారి జన్మించిన వాడు. ఉపనయనము రెండవ జన్మతో సమానము) భక్తితో భగవంతుని ప్రతిమను పెట్టి పూజించాలి. లేకపోతే భూమిని, అగ్నిని, సూర్యుని, జలమును పరమాత్మ తత్వముగా పూజించాలి. అదీ వీలు కాకపోతే తనహృదయములో పరమాత్మను నిలుపుకొని పూజించాలి. పరమాత్మను తన ఇష్టదేవతా రూపములో పూజించాలి.

పూజచేయడానికి కింది నియమములను పాటించాలి. ఉదయమే లేచి, కాలకృత్యములు తీర్చుకొని, దంతధావనము చేసి, స్నానము చేయాలి. స్నానం చేసేటప్పుడు, వేదములో చెప్పబడిన విధానములో కానీ, తాంత్రిక విధానములో కానీ, చెప్పబడిన మంత్రముల ప్రకారము ఒంటినిండా మట్టి పూసుకొని స్నానం చేయాలి. తరువాత సంధ్యావందనము మొదలగు నిత్య కర్మలు చెయ్యాలి. తరువాత పరమాత్మకు భక్తితో పూజ చేయాలి. అటువంటి పూజ మానవుని కర్మబంధనములు తెంచివేస్తుంది.

ఈ పూజ ఎలా చెయ్యాలంటే.... ముందు పరమాత్మ యొక్క రూపమును, కొయ్యతో గానీ, రాతితోగానీ, బంగారు, వెండి,రాగి మొదలగు లోహములతో కానీ,మణులు, రత్నములు, వజ్రములతో పొదిగి కానీ, లేక మట్టి, గంధము, పసుపు మొదలగు వాటితో గానీ, ఇసుకతో గానీ, లేక చిత్రముతో గానీ, ఇవన్నీ కుదరకపోతే మనస్సులో గానీ, ఈ విధంగా ఎనిమిది వస్తువులతో పరమాత్మ యొక్క విగ్రహమును తయారు చేయవచ్చును అని శాస్త్రములలో చెప్పబడింది.

పైన చెప్పబడిన విగ్రహములు రెండు విధములు. ఒకటి కదలనిది. రెండు కదిలేది. కదలనిది అంటే దేవాలయములలో స్థిరంగా ప్రతిష్ఠింపబడినది. దీనికి ఒకసారి ప్రాణ ప్రతిష్ట, ఆవాహన చేస్తేచాలు. ప్రతి దినము ఆవాహన, విసర్జన చేయనవసరం లేదు. అచల ప్రతిమలకు అంటే ఉత్సవిగ్రపములకు, తాత్కాలికంగా పూజల కొరకు పెట్టే ప్రతిమలకు కొన్నిచోట్ల ప్రతిసారీ ఆవాహన చెయ్యాలి విసర్జన

చేయాలి. కొన్ని చోట్ల చెయ్యరు. ఇంక విగ్రహములకు స్నపనం అంటే స్నానం విషయానికి వస్తే మట్టి, చిత్రింపబడిన చిత్రములకు తప్ప మిగిలిన అన్నింటికీ స్నపనం చేయించవచ్చు. మట్టితో చేసినవి, చిత్రములుగా వేసినవి వీటిని తడి వస్త్రముతో తుడిస్తే సరిపోతుంది.

ఈ ప్రతిమలకు పరిశుద్ధమైన పదార్థములతోనే పూజ చేయాలి. ఎటువంటి కోరికలు లేకుండా, నిష్కామ యోగంతో పూజించే భక్తుడు, భగవంతుని రూపమును హృదయములో నిలుపుకొని, భావనలతోనే పూజింపవచ్చును. ప్రతిమలను పూజించేవారు స్నానము, అలంకారము, నివేదన చేయడం నాకు ఇష్టము. భూమి మీద, మట్టితో చేసిన ప్రతిమలను పూజించేవారు, వేదములలో, శాస్త్రములలో చెప్పబడిన మంత్రముల ద్వారా పూజ చేయాలి.

అగ్నిని పూజించేవారు నేతితో కలిపిన తిలలను, ఇతర హోమద్రవ్యములతో హోమం చేయాలి. (నేడు టివిలలో వస్తున్నట్టు, కొంత మంది చేస్తున్నట్టు, మిరప కాయలు, ఆవకాయ ముక్కలు వీటితో హోమం చేయమని ఇక్కడ చెప్పబడలేదు.) సూర్యునికి అర్ఘ్యము ఇవ్వడం చాలా ఇష్టము. జలముతో అర్ఘ్యమును, తర్పణములను ఇవ్వడం కూడా పూజ కిందికే వస్తుంది. ఇంతెందుకు, భక్తుడు ఏకాగ్రమైన మనస్సుతో నాకు అర్పించిన జలం కూడా నాకు ఎంతో ప్రియమైనది. నా మీద భక్తి లేని వాడు, నా మీద మనస్సు నిలుపని వాడు, ఎన్ని విలువైన పదార్థములు నాకు సమర్పించినా, నాకు ఏ మాత్రము తృప్తి కలుగదు. కాబట్టి నా యందు ఏకాగ్రమైన భక్తి శ్రద్ధ కలిగిన భక్తులు నాకు అర్పించిన దీప, ధూప, నివేదనలతో

నేను సంతృప్తి చెందుతాను.

ఉద్ధవా! ఇంక పూజలు ఎలా చేయాలో చెబుతాను. ముందు శుభ్రంగా స్నానం చేసి శుచిగా పూజకు కావలసిన సామగ్రిని సమకూర్చుకోవాలి. దర్భలను తూర్పువైపు కొసలు ఉండేటట్టు నేలమీద పరవాలి. దాని మీద కూర్చుని అంగన్యాసము, కరన్యాసము చేయాలి. (అంటే శరీరంలో ఉన్న పది ఇంద్రియములందు భగవంతుని ఉంచాలి, నిలుపుకోవాలి. అందుకే రుద్రాభిషేకము ముందు మహా న్యాసము చేస్తారు.) తరువాత విగ్రహములను మంత్రములతో న్యాసము చేయాలి. తరువాత అప్పటి వరకు చేసిన పూజల నిర్మాల్యమును(పూలు, పత్రి మొదలగునవి) భక్తితో తొలగించాలి.

తరువాత విగ్రహముల ప్రోక్షణ కొరకు నీటితో నిండిన పాత్రను చందనము, పుష్పములతో శుద్ధి చేయాలి. ప్రోక్షణ పాత్రలోని నీటితో పూజచేసే స్థలమును, పూజాద్రవ్యములను, తన శరీరమును ప్రోక్షణ చేసుకోవాలి. తరువాత ఆచమనము, అర్ఘ్యము, పాద్యము ఈ మూడు పనులకు మూడు పాత్రలలో నీరు సిద్ధం చేసుకోవాలి. (మూడు పాత్రలు మనకు దేవాలయములలో కనిపిస్తాయి. ఇంట్లో చేసే పూజలలో ఒకే పాత్రలో ఉన్న జలంతోనే అన్నీ చేస్తుంటాము.) ఈ మూడు పాత్రలను గంధము, పుష్పములు, అక్షతలు వీటితో అలంకరించాలి. పాద్యము, ఆచమనము, అర్ఘ్యము కొరకు పెట్టబడిన పాత్రలను హృదయ మంత్రములతోనూ, శిరోమంత్రముతోనూ, శిఖా మంత్రముతోనూ, గాయత్రి మంత్రముతోనూ అభిమంత్రించాలి. తరువాత నిర్మలమైన ఏకాగ్రమైన మనస్సుతో ఓంకారమును జపించాలి.

ఆత్మలో పరమేశ్వరుని ధ్యానించాలి. ఎదురుగా ఉన్న ఇష్టదేవతా ప్రతిమను మనసునిండా నింపుకోవాలి. మనసులోనే ఆ ప్రతిమను పూజించాలి. (పూజకు ముందు ధ్యానం అని ఒక మంత్రం ఉంటుంది.) భగవంతుని భావనలతో తన్మయత్వం చెందాలి.

తరువాత భక్తితో ఇష్టదైవాన్ని ఆ ప్రతిమలయందు ఆవాహన చెయ్యాలి. స్థాపించాలి. పూజించాలి. (ఆవాహయామి, స్థాపయామి, పూజయామి అనే మాటలు మీరు వినే ఉంటారు.) తరువాత ఆసనం సమర్పించాలి. ఆ ఆసనం మీద అష్టదళములతో ఒక పద్మమును వేయాలి. తరువాత పాద్యము, అర్ఘ్యము, ఆచమనము మొదలగు ఉపచారములు సమర్పించాలి. తరువాత సుదర్శనమును, పాంచజన్యమును, గదను, ఖడ్గమును, ధనుర్బాణములను, హలమును, కౌస్తుభమును, శ్రీవత్సమును పూజించాలి. ఎనిమిది దిక్కులతో ఉన్న విష్ణు పార్షదులు అయిన నందుడు, సునందుడు, ప్రచండుడు, చండుడు, మహాబలుడు,బలుడు, కుముదుడు, కుముదేక్షణుడు, (వీళ్లు జంటలుగా ఉన్నారు గమనించండి. చండప్రచండులు, నందసునందులు, బలమహాబలులు, కుముదకుముదేక్షణులు...అంటే నాలుగు దిక్కులు, నాలుగు మూలలు.) తరువాత వినాయకుని, దుర్గను, విష్వక్సేనుని, వ్యాసుని , గురువును, లోకపాలకులను ప్రోక్షణ మొదలగు ఉపచారములతో పూజించాలి. వీరిని ప్రతిష్టించేటప్పుడు వీరందరూ ఇష్టదేవతను చూస్తూ ఉండేటట్టు పెట్టాలి. (సత్యనారాయణస్వామివారి వ్రతము చేసేటప్పుడు, ముందు లోకపాలకులను, పూజిస్తారు. అప్పుడు ఈ విధానమును గమనించవచ్చు.)

పూజించేవారు ధనవంతులు, సంపన్నులు అయితే, ప్రతిరోజూ బంగారు కలశములతో, చందన, అగరు, వట్టివేళ్లు, కర్పూరము, కుంకుమ, అగరు వత్తులు మొదలగు సుగంధ ద్రవ్యములతో స్నానం చేయించవచ్చు. అప్పుడు పురుష సూక్త మంత్రములు చదువుతూ స్నానం చేయించాలి. స్నానం అయిన తరువాత వస్త్రము, ఉపవీతము, ఆభరణము, తులసీ మాల, పుష్పములు, గంధము మొదలగు వాటితో అర్చించాలి. ఇవన్నీ యథాశక్తి సమర్పించాలి. పాద్యము. ఆచమనీయము, అర్ఘ్యము, గంధము, పుష్పము, అక్షతలు, ధూపము, మొదలగు ఉపచారములు భక్తితో, శ్రద్ధతో చేయాలి కానీ యాదాలాపంగా చేయరాదు.

తరువాత నివేదన. బెల్లంతో చేసిన పాయసము, నేతితో వండిన పదార్థములు, మోదకములు, అన్నము, పెరుగు,పప్పు మొదలగు ఆహార పదార్థములను నివేదనగా సమర్పించాలి. పండుగలు, పర్వ దినముల యందు లేదా వీలుగా ఉంటే ప్రతి దినము కూడా భగవంతుని విగ్రహమునకు అభ్యంగన స్నానము, శరీర మర్దనము, అభిషేకముచేసి, అన్న పదార్థములను నివేదనములుగా సమర్పించి, నృత్యగీతములతో అర్చించవలెను. అగ్నికుండము ఏర్పరచి, అందులో అగ్నిని వేల్చి, హెూమం చేయాలి.

అగ్ని ముందు దర్భలను పరిచి, వాటి మీద సమిధలను ఉంచవలెను. అగ్నిలో హెూమము చేయతగిన ద్రవ్యములను ప్రోక్షణ పాత్రలో ఉన్న జలముతో ప్రోక్షణము చేసి, ఉత్తర దిక్కునుండి అగ్నిలో హెూమం చేయవలెను. తరువాత అగ్నికీలలలో కూడా నా విగ్రహమును

చూడగలగాలి. చతుర్భుజములతో, శంఖ,చక్ర,గద,తామర పూవులతో, పసుపు పచ్చని పట్టు వస్త్రముతో, కిరీటముతో, శ్రీవత్సముతో, కౌస్తుభముతో, వనమాలతో ఉన్న నా రూపమును దర్శించాలి. తరువాత సమిధలను నేతిలో ముంచి అగ్నిలో హోమం చేయాలి. తరువాత కూడా నేతితో హోమం చేయాలి.

తరువాత మూలమంత్రమును జపించాలి. (ఓం నమోనారాయణాయ అనేది మూల మంత్రము) తరువాత పురుష సూక్త మంత్రములతో హోమం చేయాలి. స్వాహా మంత్రములతో హోమం చేయాలి. తరువాత అగ్నిలో భగవానుని దర్శించాలి. నమస్కరించాలి. నందుడు మొదలగు పార్షదులకు బలులు సమర్పించాలి. నారాయణ మంత్రమును జపించాలి.తరువాత విష్వక్సేనుడికి నివేదనలు సమర్పించాలి. పుష్పములను, తాంబూలమును సమర్పించాలి.

తరువాత భగవత్కథలను వినాలి, వినిపించాలి. భగవంతుని లీలలను అభినయించాలి. నృత్యం మొదలగు ఉత్సవములు చేయాలి. తరువాత భగవంతునికి సాష్టాంగ ప్రణామము చేయాలి. నా పాదముల మీద శిరస్సును ఉంచి, ఈ సంసార సముద్రము నుండి విముక్తి కలిగించమని ప్రార్థించాలి.

తరువాత ఇష్టదేవతను పూజించిన పూలను శిరస్సున ధరించాలి. ఉద్వాసన చెప్ప దలచుకుంటే, ప్రతిమలో ప్రతిష్ఠించిన ప్రాణమును తన హృదయములో నిలుపుకోవాలి. ఈ పూజ చేసేటప్పుడు పూజచేసే ప్రతిమ మందు పరమాత్మను చూడాలి కానీ ప్రతిమను

కాదు. ఎందుకంటే ఈ చరాచర జగత్తు అంతా పరమాత్మ సర్వాంతర్యామిగా నిండి ఉన్నాడు కదా! ఈ ప్రకారంగా వేదములలో చెప్పబడిన విధానముతోనూ, తాంత్రిక విధానముతోనూ పూజించి, ఈ లోకములోనూ పర లోకములోనూ శ్రేయస్సును పొందవలెను.

భక్తులకు శక్తి ఉంటే, నా కొరకు ఆలయములను నిర్మించి అందులోనా ప్రతిమలను ప్రతిష్ఠించవచ్చును. దేవాలయముల చుట్టు పూలతో కూడిన ఉద్యాన వనములు నెలకొల్పాలి. నిత్య పూజలు, ఉత్సవములు జరిపించాలి. పండుగల యందు, పర్వదినముల యందు విశేష పూజలు, ఉత్సవములు జరిపించడానికి భక్తులు దేవాలయములకు భూములు, ధనము దానంగా ఇవ్వాలి. అటువంటి వారికి వారు దానం చేసినదాని కంటే ఎన్నో రెట్లు ఐశ్వర్యము లభిస్తుంది. దేవాలయములు కట్టించి విగ్రహములను ప్రతిష్ట చేయిస్తే సార్వభౌమ పదవిలభిస్తుంది. మందిరములు నిర్మాణం చేయిస్తే మూడులోకముల ఆధిపత్యము, నిత్య పూజలు చేయిస్తే బ్రహ్మలోకవాసము, ఈ మూడు చేయిస్తే నాలో సాయుజ్యము పొందుతారు. ఇవన్నీ కాకుండా కేవలం నిష్కామ భక్తిని అవలంబిస్తే కూడా నన్ను పొందుతారు.

అలాకాకుండా, బ్రాహ్మణవృత్తిని, దేవతారాధనను చేయని వాడు కోట్ల కొలది సంవత్సరములు క్రిమిగా పుడుతూ చస్తుంటాడు. అంతే కాకుండా ఎవరి వస్తువులు అయినా అపహరించినా, అపహరించడానికి సాయం చేసినా, అపహరించమని ప్రేరేపించినా, అపహరించిన వస్తువును తీసుకున్నా వారి మరణానంతరము తగిన ఫలితమును అనుభవిస్తారు."

అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి క్రియాయోగమును వివరించినట్టు శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము
ఏకాదశ స్కంధము ఇరువది ఏడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ఏకాదశ స్కంధము
ఇరువది ఎనిమిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఇలా అడిగాడు.

"కృష్ణా! ఆత్మ అనేది స్వతస్సిద్ధమైన జ్ఞానము కల చైతన్యము. దేహము జడపదార్థము. ఆ కారణం చేత అటు ఆత్మకు కానీ ఇటు దేహమునకు కానీ సుఖము దు:ఖము అనేవి అనుభవంలోకి రావు. మరి ఈ సుఖము దు:ఖము ఎవరు అనుభవిస్తుంటారు. కృష్ణా! ఆత్మకు నాశనము లేదు. అది నిత్యము సత్యము. దానికి రాగ ద్వేషములు అంటవు. పుణ్యపాపములు అంటవు. ఆత్మపరిశుద్ధమైనది. ఆత్మ దానంతట అది ప్రకాశిస్తుంది. అపరిమితమైనది. కాని దేహము కట్టె మాదిరి చేతనము లేనిది. జడపదార్థము. ఈ రెండింటిలో దేనికి సుఖములు దు:ఖములు అనుభవంలోనికి వస్తాయి. నాకు వివరించు." అని అడిగాడు ఉద్ధవుడు. ఉద్ధవుని ప్రశ్నకు శ్రీకృష్ణుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఉద్ధవా! దేహము, ఇంద్రియములు, ప్రాణము ఈ మూడింటికీ ఆత్మతో సంబంధము ఉన్నది అని నమ్మే వారికి ఈ ప్రపంచము కూడా సత్యముగానే కనిపిస్తుంది. వారు ఈ ప్రపంచము ఒక మాయ, మిథ్య అని తెలుసుకోలేరు. మానవుడు కల కంటున్నప్పుడు అందులో పాములను, పులులను చూచి భయంతో వణికిపోతాడు. అలాగే ఈ ప్రపంచములో ఉన్న జీవులు కూడా విషయవాంఛలతో, ఎల్లప్పుడూ కోరికల గురించి, ఆ కోరికలను ఎలా తీర్చుకోవాలి అని ఆలోచిస్తూ, ఈ ప్రపంచములో కనపడే వస్తువులు అన్నీ మాయ, వీటికి అస్థిత్వము లేదు, నిరంతరము మార్పుకు లోనవుతుంటాయి అని తెలిసికూడా, వాటిని నిజమని నమ్ము తుంటారు. స్వప్నావస్థలో ఉన్నవాడు ఆ స్వప్నములో కనపడే వాటిని చూచి భయపడుతుంటాడు, దు:ఖపడుతుంటాడు. మెలుకువ రాగానే అదంతా స్వప్నము అని తెలిసి ఆ దు:ఖమును వదిలిపెడతాడు. స్వప్నములో కనపడిన వస్తువులు మెలుకువ వచ్చిన తరువాత అతని మీద ఎటువంటి ప్రభావమును చూపవు. అలాగే మానవుడు తన నిజ జీవితంలో అనుభవించే శోకము, హర్షము, కోపము, లోభము, మోహము, జనన మరణములు అన్నీ అతని అహంకారము నుండి పుట్టినవే కానీ, వాటికి ఆత్మకు ఎటువంటి సంబంధము లేదు. వాటికి ఆత్మ కారణం కాదు.

తన దేహమును, ఇంద్రియములను, మనస్సును అభిమానించే మానవుడు, కాలమునకు అధీనుడు అయిన మానవుడు, సంసారము వెంట, సంసార సుఖముల వెంట పరుగెడుతుంటాడు. ఈ సంసార బంధనములు అన్నీ నేను, నాది అనే

అహంకారము వలన ఏర్పడినవే. నిజానికి ఈ సంసారమునకు ఒక కారణం అంటూ లేదు. కాని మానవుని అజ్ఞానము వలన, అది వివిధ రూపములతో కనపడుతూ ఉంటుంది. మానవుని మాయలో పడవేస్తుంది. మనస్సుచేత, వాక్కు చేత, శరీరము చేత అనేక పనులు చేయిస్తూ ఉంటుంది. అహంకారము వదిలిపెడితే సంసారము దానంతట అదే వదిలిపోతుంది.

ఈ అహంకారము అనే వృక్షమును జ్ఞానము అనే కత్తితో సమూలంగా నరికెయ్యాలి. ఆ జ్ఞానము అనే ఖడ్గము మంచి గురువును ఆశ్రయించి పొందాలి. అప్పుడు ఆ మానవుడు ప్రపంచములో తిరుగుతున్నా అతనికి ఎటువంటి గుణములు, వాసనలు, కోరికలు అంటవు. ఆత్మను గురించి, అనాత్మను గురించి తెలుసుకోవడమే జ్ఞానము. ఈ జ్ఞానమును వేదాధ్యయనము తోనూ, తపస్సు తోనూ, స్వధర్మమును ఆచరించడం వలనా, స్వయంగా అనుభవించడం వలనా, శాస్త్రములు చదివి తెలుసుకోవడం వలనా, తర్కము మొదలగు ప్రమాణముల ద్వారా తెలుసుకోవచ్చును.

దేనికి ఆది అంతము లేదో, ఏది ఈ విశ్వం అంతటా నిండి ఉందో, ఏది నాశము లేనిదో అదే పరమాత్మ. ఆ పరమాత్మ ఆత్మగా అన్నిజీవులలో అంతర్యామిగా వెలుగుతున్నాడు. ఇదే జ్ఞానము. బంగారముతో ఆభరణములు తయారు చేస్తారు. ఆభరణములు తయారు చేయక ముందు, ఆ ఆభరణములు కరిగించిన తరువాత, కేవలం బంగారము మాత్రమే మిగులుతుంది. ఆభరణములు మధ్యలో వచ్చి మధ్యలోనే పోతాయి. కాబట్టి బంగారము సత్యము. ఆభరణములు మిథ్య. అలాగే ఈ విశ్వం అంతా నిండి ఉన్నది పరమాత్మ తత్వము.

శరీరములు మిథ్య.

ఉద్ధవా! సృష్టికి ముందు లేనిది, సృష్టి లయం అయిన తరువాత కూడా ఉండదు. మధ్య ఉన్న స్థితి అంటే కాలములో కూడా వేరుగా ఉండదు. ఈ పదార్థములు అన్నీ దేని నుండి పుట్టి, పెరిగి. లయం అవుతున్నాయో అదే సత్యము. అదే పరమాత్మ. మనకు కంటికి కనపడేది అంతా, వాస్తవానికి  లేకపోయినా మన కళ్లకు ఉన్నట్టు భ్రమకలిగిస్తూ ఉంటుంది. ఇదే రాజస అహంకారము. దీనికి కారణము శరీరము, ఇంద్రియములు, మనసు, పంచభూతములు, పంచతన్మాత్రలు. వీటితో నిర్మితమైన ఈ కనపడే ప్రపంచం అంతా కూడా ఆ పరమాత్మ స్వరూపమే.

పరమాత్మ కన్నా భిన్నమైన వస్తువు ఏదీ లేదు. ఆత్మజ్ఞానము వింటే వచ్చేది కాదు. గురువు ముఖతా తెలుసుకోవాలి. దాని కంటే ముందు దేహము, ఇంద్రియములు, మనసు వీటిని నియంత్రించి, వాటి మీద అభిమానమును పోగొట్టుకోవాలి. ఎల్లప్పుడు ఆత్మయందే రమిస్తూ ఉండాలి. ప్రాపంచిక విషయముల మీద, ఇంద్రియ సుఖముల మీద ఆసక్తిని వదిలిపెట్టాలి. భౌతికమైన, కంటికి కనపడే ఈ శరీరము ఆత్మకాదు అని తెలుసుకోవాలి. ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, బుద్ధి, అహంకారము మొదలగునవి కూడా ఆత్మ స్వరూపములు కావు. అవి కేవలము వికారములే.

పంచ భూతములు అనగా వాయువు, భూమి, అగ్ని, జలము, ఆకాశము, వాని గుణములు అయిన శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు

ఇవి అన్నీ మనకు కనపడేవి కాబట్టి ఇవి కూడా ఆత్మస్వరూపములు కావు.

ఈ మాదిరి ఇది కాదు ఇది కాదు అంటూ, అనాత్మలను పరిహరించి నిత్యము, సత్యము అయిన ఆత్మస్వరూపము గురించి తెలుసుకోవాలి. ఒక సారి నా గురించి, తెలుసుకొనిన వానికి ఈ ఇంద్రియములు, శరీరము, చుట్టు ఉన్న ప్రాపంచిక విషయముల వలన ప్రభావితము కావు. ఎటువంటి దోషములు అంటవు.

సూర్యుడు ఎల్లప్పుడూ ప్రకాశిస్తుంటాడు. ఆయనను మేఘములు ఆవరించినా, ఆవరించకపోయినా, సూర్యుడు ఎటువంటి మార్పు చెందడు. అలాగే ఈ పంచభూతముల వలనా, వాటి గుణముల వలనా, వచ్చి పోయే వేడి, చలి మొదలగు వాతావరణ మార్పుల వలనా, నేను, నాది అనే అహంకారము వలనా, సత్వ, రజస్తమో గుణముల వలనా పరమాత్మ ఎటువంటి మాలిన్యమును పొందడు. నిశ్చలంగా ప్రకాశిస్తుంటాడు. కాబట్టి మానవుడు నా మీద ధృడమైన భక్తి కలిగి ఉంటూ, ప్రాపంచిక విషయములు, విషయ వాంఛలు వీటి మీద ఆసక్తిని పూర్తిగా విడిచిపెట్టి, మనస్సును వీటి నుండి దూరం చెయ్యాలి.

ఉద్ధవా! ఎవరికైనా ఒక వ్యాధి వస్తే అది పూర్తిగా తగ్గిపోయేవరకూ మందులు వాడాలి. లేకపోతే ఆ వ్యాధులు మాటి మాటికీ తిరగబెట్టి బాధను కలుగజేస్తుంటాయి. అలాగే మానవులు చేసిన కర్మల ఫలంగా సంక్రమించిన వాసనలు మనసును అంటిపెట్టుకొని ఉంటాయి. వాసనలు, వాటికి కారణమైన కర్మలు

పూర్తిగా విడిచిపెట్టకపోతే, అవి మాటి మాటికీ మానవులను వేధిస్తుంటాయి. భార్య, పుత్రులు, ధనము, ఆస్తులు, విషయ వాంఛలు వీటి మీద ఆసక్తినిపెంపొందించి స్వార్థబుద్ధిని పెంచి అజ్ఞానులు అయిన మానవులను భ్రష్టులను చేస్తాయి. అలాకాకుండా పూర్వజన్మలో యోగవిద్యను సాధన చేసినప్పటికినీ, బంధు మిత్రుల వలన పతనమైన యోగభ్రష్టులు, మరుజన్మలో పూర్వజన్మ సంస్కార బలం చేత, ఆ యోగమును కొనసాగిస్తారు. అటువంటి వారు ప్రాపంచిక కర్మల యందు విముఖత కలిగి ఉంటారు.

ఉద్ధవా! ప్రతి మానవుడూ తన పూర్వ జన్మలలో చేసిన కర్మల యొక్క సంస్కార బలము చేత ఈ జన్మలో, పుట్టినది మొదలు మరణించే వరకూ, కర్మలు చేస్తుంటాడు. ఆ కర్మలు చేసిన ఫలితంగా సుఖము దు:ఖము మొదలగు వికారములను పొందుతుంటాడు. వారిలో శాస్త్రములను చక్కగా చదువుకున్న వాళ్లు, ఆత్మ తత్వమును తెలిసిన వాళ్లు, బాహ్య సుఖములు కాక, ఆత్మానందాన్ని అనుభవిస్తుంటారు. అహంకారమును విడిచిపెట్టి, ప్రాపంచిక సుఖములపట్ల విముఖులుగా ఉంటారు. ఈ ప్రకారంగా ఆత్మానందాన్ని అనుభవించే వారు, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి చూపరు. వారినే అవధూతలు అంటారు.

ఉద్ధవా! మానవుడు స్వప్నములో ఎన్నో విషయములను చూస్తుంటాడు. అనుభవిస్తుంటాడు. నిద్రనుండి మెలుకువ రాగానే స్వప్నము చెదిరిపోతుంది. తాను స్వప్నములో చూచిన అన్ని విషయములు అసత్యములు అని భావిస్తాడు. అలాగే వివేకము కల

మానవుడు తనలో ఉన్న ఆత్మ తప్ప ఇతర ప్రాపంచిక విషయములు అన్నీ అసత్యములు అని భావిస్తాడు. వాటి పట్ల ఆసక్తి చూపడు.

ఉద్ధవా! మానవుడు మూడు గుణముల ప్రభావంతో ఎన్నో కర్మలు చేస్తుంటాడు. ఆ కర్మలన్నీ తానే చేస్తున్నట్టు భావిస్తాడు. జ్ఞానవంతుడు అయిన మానవుడు తాను చేసిన కర్మలకు తనలో ఉన్న ఆత్మకు ఎటువంటి సంబంధము లేదు అని గ్రహిస్తాడు. తనలో ఉన్న ఆత్మ ఎటు వంటి కర్మలను కానీ, వాటి ఫలములను కానీ, తీసుకోదు విడిచిపెట్టదు అని తెలుసుకుంటాడు.

ఉద్ధవా! బయట ప్రపంచములో ఎన్నో వస్తువులు పదార్థములు ఉన్నాయి. అవి అన్నీ పగలు సూర్యుని వెలుగులో మన కళ్లకు కనపడతాయి. రాత్రి కాగానే చీకటి అలుముకుంటుంది. మన కంటికి, వస్తువులకు మధ్య చీకటి అడ్డువస్తుంది. అందుకని మనకు చీకట్లో వస్తువులు కనపడవు. మరునాడు సూర్యోదయము కాగానే సూర్యుని వెలుగులో చీకట్లు తొలగిపోయి, అన్ని వస్తువులు కనపడతాయి. సూర్యుని నుండి వచ్చిన వెలుగు, మనకు ఉన్న వస్తువులు కనపడేటట్టు చేస్తుంది కానీ కొత్త వస్తువులను ఉత్పత్తి చేయదు. అలాగే ఆత్మ విద్య కూడా జీవుని లో ఉన్న అజ్ఞానమును అవివేకమును నాశనం చేస్తుంది కానీ, కొత్తగా దేనినీ సృష్టించదు. ఆత్మ అనేది అంతకుముందు ఉంది. తరువాతా ఉంటుంది.

ఉద్ధవా! పరమాత్మ నిత్యము, సత్యము, అవినాశము. స్వయంప్రకాశము. దానికి పుట్టుక, చావు లేవు. వాక్కు చేత గానీ,మనసు చేత గానీ తెలియబడదు. విశ్వం అంతా వ్యాపించి

ఉంది. దానికి తెలియని విషయం లేదు. నావాడు పరాయి వాడు, నాది నీది అనే భేదబుద్ధి లేదు. ఆ పరమాత్మయే ఆత్మగా ప్రతి జీవిలో ఉంటూ, ప్రాణములను, ఇంద్రియములను కర్మలు చేయడానికి ప్రేరేపిస్తుంటుంది. ఇటువంటి లక్షణములు కలిగిన ఆత్మకు భేదబుద్ధిని, వికారములను కల్పించడం మానవుని అజ్ఞానము. మానసిక భ్రమ. అటు వంటి భ్రమకు ఆధారము ఏమీ ఉండదు.

ఉద్ధవా! ఈ ప్రపంచము, అందులోని జీవరాసులు, పదార్థములు  అన్నీ పంచభూతములతో తయారుకాబడ్డవే. అవి కొన్ని కనపడతాయి, కొన్ని కనపడవు(కంటికి కనపడని సూక్ష్మజీవులు) ఈ ప్రకృతిలో ఉన్న వాటిని వాటి పేర్లతో, రూపములతో తెలుసుకుంటాము. తమకు అన్నీ తెలుసు, తాము పండితులము అని అనుకునే కొందరు ఈ ప్రపంచమే సత్యము, ప్రాపంచిక సుఖములే సత్యములు అని ప్రచారం చేస్తుంటారు. (వారినే మెటీరియలిస్టులు,భౌతిక వాదులు అని అంటారు.) వారిది వాగాడంబరమే గానీ నిజం కాదు. వారి మాటలకు ఎటువంటి అర్థమూ ఉండదు.

ఉద్ధవా!  కొంతమంది యోగమును అభ్యాసము చేస్తుంటారు. వారికి మధ్యలో వ్యాధులు వస్తుంటాయి. అటువంటి యోగి ఈ క్రింది ఉపాయములను అవలంబించాలి. శీతలము మొదలగు వాటి వలన వచ్చే వ్యాధులను సూర్య,చంద్ర ధారణ యోగము ద్వారానూ, వాతము,పిత్తము,పైత్యము ద్వారా వచ్చే వ్యాధులను ప్రాణాయామము ద్వారానూ, గృహములో కలిగే కలహములు, సర్పము మొదలగు విషజంతువుల వలనకలిగే బాధలను, తపస్సు చేత, మంత్రముల చేతా,

ఔషధములచేతా నివారించుకోవాలి. కామ సంబంధమైన కోరికలు కలిగినపుడు, భగవంతుని ధ్యానించాలి. నామసంకీర్తన చేయాలి. అప్పుడప్పుడు మానవునిలో చెలరేగే డాంబికము, దంభము, గర్వము, మదము, మొదలగు వాటిని గురువులను, యోగులను ఆశ్రయించి పోగొట్టుకోవాలి.

కొంత మంది యోగులు, సిద్ధులు తమ శరీరములను రోగాలు రాకుండా, ముసలి తనం రాకుండా, స్థిరమైన యౌవనంతో ఉండేటట్టు చేసుకుంటారు. పరకాయ ప్రవేశము మొదలగు సిద్ధులను సంపాదిస్తారు. కాని ఆత్మజ్ఞానము కల వారు ఇటువంటి సిద్ధులయందు ఆసక్తి చూపరు. ఈ సిద్ధులన్నీ కేవలము శరీరమునకు సంబంధించినవి. ఈ శరీరమే శాశ్వతము కానపుడు ఈ సిద్ధుల వలన ఏమి ప్రయోజనము అని ఆలోచిస్తారు. కాబట్టి అటువంటి సిద్ధులను పొందడానికి ఏ ప్రయత్నమూ చెయ్యరు.

ఉద్ధవా! ప్రతిరోజూ యోగాభ్యాసముచేసే వ్యక్తి శరీరం ధృఢంగా ఉంటుంది. అతనికి ఏ రోగమూ రాదు. ముసలితనము రాదు. కాని ఎంత కాలము ఉంటాడు. ఏదో ఒక రోజు మరణించవలసిన వాడే. కాబట్టి, ఆత్మజ్ఞానము కలవారు ఈయోగాభ్యాసముల పట్ల ఆసక్తి చూపరు. నాయందు భక్తి శ్రద్ధలు కలిగి, నన్నే ఆశ్రయించుకున్న వారికి, ఈ యోగాభ్యాసముల వలన కలిగిన సిద్ధులు ఎటువంటి ప్రయోజనమును కలిగించవు."

అని శ్రీకృష్ణుడు ఉద్ధవునికి పరమార్థ తత్త్వమును బోధించాడు అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఇరువది ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము

## ఏకాదశ స్కంధము

## ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఈ విధంగా అడిగాడు.

"కృష్ణా! మనస్సు చంచలమైనది. అది మానవుని అధీనంలో ఉండదు. అటువంటప్పుడు మానవుడు నీవు చెప్పిన యోగములను పాటించడం చాలా కష్టం కదా! కాబట్టి ఈ విధంగా కాకుండా సులభంగా అనాయాసంగా మానవుడు ఉత్తమ లోకములను పొందే మార్గము ఉంటే నాకు చెప్పు. ఎందుకంటే, సాధారణ మానవులే కాదు యోగులు కూడా తమ మనస్సును అదుపులో పెట్టుకోడానికి చాలా కష్టములు పడుతుంటారు. కాని వారి మనసు వారి స్వాధీనములో ఉండదు. అటు ఇటు పరుగెడుతూ ఉంటుంది. ఆ కారణం చేతనే వివేకము కల వారు నీ పాదపద్మము

లను ఆశ్రయిస్తారు.

కాని యోగులు అని పిలిపించుకోడానికి తాపత్రయపడేవారు నిజంగా యోగులు కారు. అటువంటి వారు నీ పాదములను ఆశ్రయించడానికి ఇష్టపడరు. నీ మాయలో పడి ప్రాపంచిక విషయములలో మునిగితేలుతుంటారు. వారికి ఎన్నటికీ ముక్తిని పొందలేరు.

కృష్ణా! బ్రహ్మ మొదలగు దేవతా గణములు కూడా నీపాదములకు తలలు వంచి నమస్కరిస్తున్నారు. నీవు రామావతారంలో కోతులతో స్నేహం చేసావు. ఈ యుగంలో గ్రామీణులు, ఏమీ తెలియనివారు అయిన గోపికలతో స్నేహం చేసావు. ఇందులో ఆశ్చర్యపడవలసినది ఏమీ లేదు. రాక్షసులైన బలి చక్రవర్తి, ప్రహ్లాదుడు మొదలగు వారిని అనుగ్రహించావు. సమస్త జగత్తులోనూ అంతర్యామిగా అంతటా నిండి ఉన్నావు. అందరికీ ప్రియము చేకూరుస్తున్నావు. నిన్ను ఆశ్రయించిన వారి కోరికలు తీరుస్తుంటావు. అటువంటి నీ పాదపద్మములను ఎవరు వదులుకుంటారు. నీ పాద పద్మముల ముందు స్వర్గ సుఖాలు, ఇంద్రియములతో అనుభవించే భోగములు ఎందుకూ పనికిరావు. నీ పాదములు ఆశ్రయించిన వారు స్వర్గసుఖాలను, ఇంద్రియ సుఖాలను గడ్డిపోచ మాదిరి భావిస్తారు. నీ పాదములను ఆశ్రయించిన వారికి ఈ లోకంలో దొరకనిది అంటూ ఏదీ ఉండదు.

ఓ దేవా! నీవు కృష్ణునిగా, గీతాచార్యునిగా లోకానికి ఆధ్యాత్మిక బోధ చేసావు. అంతర్యామిగా అందరి శరీరములలో వెలుగుతున్నావు. నీ

బోధనల వలన జీవులను అంటిపెట్టుకొని ఉన్న పూర్వజన్మ వాసనలను నాశనం చేస్తున్నావు. నీ నిజస్వరూపమును గోచరింపజేస్తున్నావు. నీమీద భక్తి ఉన్న వారికి జీవితంలో ఆనందం తప్ప వేరే ఏమీ ఉండదు. అటువంటి ఆనందం అనుభవిస్తున్న బ్రహ్మజ్ఞానులు ఈ కల్పము అంతం అయ్యేవరకూ నిన్ను సేవిస్తూ ఉంటారు. నీవు చేసిన ఈ ఉపకారమునకు ఎంత చేసినా నీ ఋణము తీర్చుకోలేరు." అని పలికాడు ఉద్ధవుడు. అప్పుడు కృష్ణుడు ఉద్ధవునితో ఇలా అన్నాడు.

"ఉద్ధవా! మానవునికి మృత్యువు వెన్నంటి ఉంటుంది. అటువంటి మానవుడు ఏధర్మములను శ్రద్ధతో ఆచరిస్తే మృత్యువును కూడా జయించడానికి సమర్థుడవుతాడో, ఆ ధర్మములను నీకు ఉపదేశిస్తాను. మానవుడు తనకు నిర్దేశించిన కర్మలను, వర్ణ ఆశ్రమ ధర్మములను మాత్రమే ఆచరించాలి. ఎల్లప్పుడూ మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి. మృదుస్వభావంతో ఉండాలి. తాను చేసే ఏపని అయినా నా గురించి చేయాలి. ఎల్లప్పుడూ నన్నే ధ్యానించాలి. ఎల్లప్పుడూ సత్సంగములో ఉండాలి. సాధువులు ఉండే ప్రదేశంలోనే నివసించాలి. నా భక్తుల అడుగుజాడలలో నడవాలి. నా గురించి ఆడాలి. పాడాలి. నృత్యం చేయాలి. నా ఉత్సవాలు చేయాలి. నా ఉత్సవాలలో పాల్గొనాలి. నన్ను  తనలోనూ, సకల భూతములలోనూ దర్శించాలి. అంతటా నేను ఉన్నాను అనే అనుభూతికి లోనుకావాలి. ప్రతి మానవుడు ఈ జ్ఞానము అలవరచుకోవాలి. సకల భూతములలో నా రూపమే ఉందని భావించాలి. బ్రాహ్మణునియందు, ఛండాలుని యందు, సూర్యుని యందు, స్వల్పమైన నిప్పు రవ్వయందు, శాంతచిత్తుని యందు, అత్యంత క్రూరుని యందు, నేను ఉంటాను

అనే జ్ఞానం అలవరచుకోవాలి. ఈ సమత్వం జ్ఞానము కలవాడినే పండితుడు అని అంటారు.
ఉత్తములలోనూ, హీనులలోనూ, సమభావం కలిగిన వారిలోనూ అందరిలోనూ నేను ఉన్నాను అని భావించే పురుషుడు తనలో ఉన్న అహంకారమును, స్పర్థలను, అసూయను, కోపమును త్వరలోనే విడిచిపెడతాడు.

ఏ మానవుడు కూడా అందరిలో తానే గొప్పవాడు అని అనుకోరాదు.ఎవరు ఏ విధంగా తనను పరిహసించినా సిగ్గు పడకూడదు. సకల భూతములలో నేను ఉన్నాను అనే భావన కలిగి ఉండాలి. కుక్క, ఛండాలుడు, గోవు, గాడిద మొదలగు జీవులకు అన్నిటికీ నమస్కరించాలి. దేనినీ కించపరచకూడదు. ఈ ప్రకారంగా సకల ప్రాణులయందు నేను ఉన్నాను అనే భావన కలిగే వరకూ, మనస్సుతోనూ, వాక్కుతోనూ, కర్మతోనూ నన్నే ధ్యానించాలి, ఉపాసించాలి, పూజించాలి. సమత్వభావన కలిగిన తరువాత, సకలము బ్రహ్మ మయం అని గుర్తించాలి. అన్ని సందేహములను వదిలిపెట్టాలి. అన్ని పనులను ఫలాపేక్షరహితంగా చేయాలి. ఫలితమును ఆశించి ఏపనీ చేయకూడదు.

ఉద్ధవా! మోక్ష ప్రాప్తికి ఎన్ని ఉపాయాలు ఉన్నా, మనస్సుతోనూ, వాక్కుతోనూ, సకల భూతముల యందు పరమాత్మను దర్శించడమే సరి అయిన ఉపాయము అని నా అభిప్రాయము. అప్పుడే సమత్వము సిద్ధిస్తుంది. ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము అలవడుతుంది. ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి నశిస్తుంది. అన్ని కర్మలను

ఫలాపేక్ష లేకుండా చేయగలిగే శక్తి వస్తుంది. ఇదే భాగవత ధర్మము. దీనిని అవలంబిస్తే మూడు గుణముల ప్రభావము మానవుల మీద ఉండదు. ఈ ధర్మము మానవులకు మేలుచేస్తుందే కానీ హాని చెయ్యదు.

ఉద్ధవా! ఇంకొక మాట. సాధారణంగా ఏదైనా భయం కలిగితే మానవుడు అక్కడి నుండి పారిపోతాడు. ఏదైనా శోకం కలిగితే పెద్దగా ఏడుస్తాడు. ఇది మానవుల సహజ లక్షణములు. కాని వీటి వలన ఎటువంటి ప్రయోజనము లేదు. భయపడి పారిపోతే సమస్య తీరి పోదు. పెద్దగా ఏడిస్తే దు:ఖము పోదు. సమస్యలను ధైర్యంతో ఎదుర్కోవాలి. ఆ ధైర్యం కావాలంటే నిష్కామ కర్మ ఒకటే మార్గము. అన్ని కర్మలను నా పరంగా చేస్తూ, ఆ కర్మఫలములను ఆశించకుండా ఉంటే, అటువంటి మానవునికి భయం కానీ, శోకం కానీ ఉండవు. అతని మనస్సు నిశ్చలంగా ఉంటుంది.

బుద్ధిమంతులలో ఉన్న బుద్ధి, చతురులలో ఉన్న చాతుర్యము, నా నుండే లభిస్తాయి. వాటిని సంపాదించడానికి ఈ శరీరం ఒక సాధనము మాత్రమే. అంతే కానీ ఈ శరీరం వలన ఏమీ జరగదు. సత్యమైన, నాశము లేని ఆత్మ ప్రబోధము వలననే ఈ విద్యలు అలవడతాయి.

ఉద్ధవా! ఇప్పటి దాకా నీకు నేను బోధించిన ఈ బ్రహ్మ విద్య దేవతలకు కూడా సరిగా తెలియదు. నీకు కూడా కేవలం సంక్షిప్తంగానే వివరించాను. ఏ మానవుడు అయితే ఈ బ్రహ్మ జ్ఞానమును పొందుతాడో అతడికి సందేహములు అంటూ ఏమీ

ఉండవు. అతడు ఈ జనన మరణ చక్రము నుండి ముక్తి పొందుతాడు. నీవు నన్ను అడిగిన ప్రశ్నలను, వాటికి నేను చెప్పిన సమాధానములను చక్కగా పరిశీలించిన వారికి, వేద రహస్యములు తెలుస్తాయి. వారికి పరబ్రహ్మ పదము పొందడానికి అర్హత లభిస్తుంది. నేను నీకు చేసిన ఈ తత్వ,జ్ఞాన ఉపదేశములను ఎవరైతే నా భక్తులకు ఉపదేశిస్తారో, నేను వారి వెంట ఉండి నన్ను నేను వారికి సమర్పించుకుంటాను. పరమ పవిత్రమైన ఈ ఆత్మ తత్వమును చదివిన వాడు, విన్న వాడు, జ్ఞానదీపంతో వెలుగుతుంటాడు. ఆ దీపము వెలుగులో ఇతరులకు దారి చూపుతాడు. తనకు తాను పవిత్రుడు అవుతాడు. ఎవరైతే శ్రద్ధతో, భక్తితో దీనిని వింటాడో, అతడు ప్రాపంచిక కర్మలచేత కానీ, వాటి ఫలముల చేత కానీ, బద్ధుడు కాడు.

ఉద్ధవా! నేను నీకు ఇప్పటి వరకూ ఉపదేశించిన బ్రహ్మ తత్వము నీకు బాగా అర్థం అయిందా! నీ సందేహములు అన్నీ తొలగిపోయాయా! నీలో ఉన్న మోహము, శోకము నశించాయా! ఉద్ధవా! నీవు ఈ తత్వజ్ఞానమును అందరికీ ఉపదేశించు. కానీ, గొప్పలకు పోయే వాడికి అంటే అన్నీ నాకు తెలుసు అని దంభములు పలికే వాడికి వేదముల మీద, దేవుని మీద నమ్మకము లేని వానికీ, దేవుని పేరు చెప్పి ఇతరులను మోసం చేసేవాడికీ, వినడానికి ఇష్టం లేకుండా, బలవంతంగా వినేవాడికీ, భక్తి, శ్రద్ధ లేని వానికీ, నీతి లేని వాడికీ ఎట్టి పరిస్థితులతోనూ ఉపదేశించ వలదు.

పైదోషములు ఏవీ లేని బ్రాహ్మణులకు, శుభ్రంగా ఉండే అన్ని జాతులు, వర్ణముల వారికీ, సాధు స్వభావము కల వారికీ

ఉపదేశించు. శూద్రులు, స్త్రీలకు కూడా ఎటువంటి నిషిద్ధము లేదు. వినడానికి భక్తి, శ్రద్ధ ఉన్న శూద్రులు, స్త్రీలకు కూడా ఉపదేశింప వచ్చును. ఉద్ధవా! అమృతము తాగిన వాడికి ఇతర పానీయములు రుచించవు.అలాగే ఈ తత్వము తెలుసుకొన్న వారికి ఇంక తెలుసుకోతగ్గది అంటూ ఏమీ మిగలదు.

ఉద్ధవా!మానవులు సాధారణంగా ధర్మ, అర్థ,కామ, మోక్షములు అనే పురుషార్థములు సాధించడానికి, జ్ఞానము, కర్మ, యోగము, వాణిజ్యము, దండనీతి మొదలగు శాస్త్రములను అభ్యసిస్తారు. కాని నా మీద విశ్వాసము కలిగిన నీ వంటి భక్తులకు ఈ పురుషార్థములు, వాటి వలన కలిగే ఫలములను  నేనే ప్రసాదిస్తాను. ఓ ఉద్దవా! సర్వ కర్మలను వదిలిపెట్టి, తన ఆత్మను నా యందు అర్పణ చేసిన వారు, యోగుల కంటె, జ్ఞానుల కంటే ఎక్కువ జ్ఞానమును పొందుతారు. తరువాత నాతో సమానులవుతారు. నన్నే పొందుతారు.” అని శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవునికిజ్ఞానోప దేశం చేసాడు.

పరీక్షిత్ మహారాజా! ఈ ఉపదేశములను విన్న ఉద్ధవునకు కళ్లవెంట నీళ్లు జలజలా రాలుతున్నాయి. ఆనందంతో పొంగి పోయాడు. గొంతు బొంగురుపోయింది. రెండు చేతులు జోడించి నమస్కరిస్తున్నాడు. కాసేపు తనను తాను సంబాళించుకొని, తాను కృతార్థుడైనట్టు భావించి, శ్రీకృష్ణుని పాదముల మీద తల పెట్టి నమస్కరించి ఇలా అన్నాడు.

"ఆది దేవా! ఇప్పటి వరకు నేను మోహము అనే చీకటిలో పడి కొట్టుకుంటున్నాను. నాలో జ్ఞానము అనే దీపాన్ని వెలిగించి నాకు మోక్షము అనే దారి చూపించావు. ఆ దారిలో నేను పరుగెడుతున్నాను. సూర్యుని వెలుగులో ఉన్న వాడికి చలి, చీకటి, భయము లేనట్టు నీ అండ ఉన్న వాడికి ఎటువంటి భయమూ లేదు. అందరి మాదిరి నేనూ మాయలో పడ్డాను. నీవు ఆ మాయను నాలో నుండి తీసి వేసావు. నన్ను నీ సేవకుడిగా చేసుకొని నాలో జ్ఞానజ్యోతిని వెలిగించావు. నీవు చేసిన ఈ ఉపకారమును నేను ఎన్నటికీ మరువలేను. నీ పాదపద్మములను తప్ప వేరే దేనినీ ఆశ్రయించను.

కృష్ణా! నీవు, నేను, చిన్ననాటి నుండి స్నేహితులము. నీవు పరమాత్మ స్వరూపుడవు అయి ఉండి కూడా యాదవ వంశంలో కృష్ణుడిగా అవతరించి నన్ను నీ స్నేహ బంధంతో బంధించివేసావు. ఇప్పుడు నీవు జ్ఞానము అనే కత్తితో ఆ స్నేహ బంధమును ఖండించావు. నన్ను బంధ విముక్తుడిని చేసావు. అట్టి నీకు నమస్కారము. జన్మజన్మలకు నీ పాదములను వదలకుండా ఉండే నీ పాదముల యందు అనన్యభక్తిని నాకు ప్రసాదించు." అని ప్రార్థించాడు ఉద్ధవుడు. ఉద్ధవుని మాటలువిన్న భగవానుడు ఇలా అన్నాడు.

"ఉద్ధవా! నీవు ఇప్పుడు బదరికా వనమునకు వెళ్లు. అది నా ఆశ్రమము. (నరనారాయణులు బదరికా వనంలో తపస్సు చేసారు.) అక్కడ ఉన్న తీర్థములో స్నానం చెయ్యి. నారతో చేసిన వస్త్రములు ధరించు. కందమూలములు ఆహారంగా తీసుకుంటూ, ప్రాపంచిక సుఖముల మీద, విషయ వాంఛల మీద ఆసక్తి లేకుండా, శీతలము, ఉ

ష్ణములను సహిస్తూ, ఇంద్రియములనుజయించి, ప్రశాంతమైన మనస్సుతో, నేను నీకు బోధించిన ఆత్మ తత్వమును, జ్ఞానబోధను మననం చేసుకుంటూ, మనస్సు, వాక్కు, శరీరము నా యందు నిలిపి, ఏకాగ్రబుద్ధితో తపస్సు చేయి. తుదకు నన్ను చేరుకో." అని అన్నాడు కృష్ణుడు.

పరీక్షిత్ మహారాజా! ఆ ప్రకారంగా భగవానుని చేత ఆజ్ఞాపింప బడిన ఉద్ధవుడు, శ్రీకృష్ణభగవానుని చుట్టు తిరిగి, ప్రదక్షిణ పూర్వకముగా నమస్కారము చేసి, ఆయన పాదముల మీద తల పెట్టి నమస్కరించి, తన కన్నీటితో భగవానుని పాదములను అభిషేకించాడు. శ్రీకృష్ణుని వదిలిపెట్టి వెళ్లిపోవాలి అనే భావనను తట్టుకోలేక పోయాడు. మాటి మాటికీ కృష్ణుని వంక చూస్తున్నాడు. కన్నీరు కారుస్తున్నాడు. తుదకు కృష్ణుడు ధరించిన పాదుకలను తీసుకొని తన తలమీద పెట్టుకున్నాడు. కృష్ణుని విడువ లేక విడువలేక విడిచిపెట్టి బదరికావనమునకు వెళ్లిపోయాడు ఉద్ధవుడు. బదరికా వనములో ఉద్ధవుడు శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్టు ఆయనను తన మనసులో నిలుపుకొని తపస్సు చేసాడు. తుదకు భగవంతునిలో ఐక్యం అయ్యాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఎవరైతే ఉద్ధవునికి, శ్రీకృష్ణుని మధ్య జరిగిన సంవాదము అనే జ్ఞానామృతమును భక్తి, శ్రద్ధలతో ఆస్వాదిస్తారో, వారు ముక్తి పొందుతారు. అటువంటి వారు ఉన్న ఈ జగత్తు కూడా పవిత్రతను సంతరించుకుంటుంది.

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణ పరమాత్మ, వేద స్వరూపుడు, జీవుల యొక్క సంసారము అనే భయమును పోగొట్టడానికి, సకల వేదములలోని సారమును, జ్ఞానముతో కూడిన భక్తిని సేకరించి, తన భక్తులకు పంచి పెట్టాడు. అట్టి దేవదేవునికి భక్తితో నమస్కరిస్తున్నాను." అని శుకయోగీంద్రులు పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణునికి ఉద్ధవునికి జరిగిన సంవాదమును, ఉద్ధవుని బదరికావన ప్రవేశము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ఇరవైతొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము

ముప్పదియవ అధ్యాయము..

"ఓ శుకమహర్షి! ఉద్ధవుడు బదరికా వనమునకు వెళ్లిపోయిన తరువాత, శ్రీకృష్ణుడు ఏమి చేసాడు? ద్వారకలో ఎటువంటి పరిణామాలు సంభవించాయి? యాదవులకు బ్రాహ్మణులు ఇచ్చిన శాపము ఏ విధంగా తన ప్రభావాన్ని చూపింది. శ్రీకృష్ణుడు తన అవతారమును ఎలా చాలించాడు. ఓ మహర్షి! స్త్రీలు ఎవరి సుందర విగ్రహము నుండి తమ చూపు మరల్చకుండా రెప్పవాల్చకుండా చూస్తుంటారో; ఎవని నామ స్మరణ సాధువుల చెవుల ద్వారా వారి హృదయములలో ప్రవేశించి అక్కడ స్థిరంగా ఉంటుందో; ఎవని

సౌందర్యము కవుల ఘంటములకు, వాక్కులకు మరింత శోభను సమకూర్చిందో, యుద్ధసమయములో, అర్జునుని రథంమీద ఉన్న ఎవరి విగ్రహమును చూస్తూ, యుద్ధములో, అర్జునుని చేతిలో మరణించిన వారు, ఆయనలో లీనం అయ్యారో, ఆ శ్రీకృష్ణుని మనోహరమైన సుందర రూపము ఈ లోకమును ఏ విధంగా వదిలిపెట్టిందో నాకు వివరించండి." అని అడిగాడు. శుక మహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! బ్రాహ్మణుల శాపము ఫలించే సమయం దగ్గర పడుతున్న కొద్దీ ద్వారకలో అనేక ఉత్పాతాలు సంభవించాయి. అది చూచిన కృష్ణుడు ఒక సభను ఏర్పాటు చేసాడు. ఆసభలో యాదవ ప్రముఖులను సమావేశ పరచి, వారితో ఇలా అన్నాడు. "యాదవ శ్రేష్టులారా! ఇప్పుడు ద్వారకలో అనేక ఉత్పాతములు కనపడుతున్నాయి. ఇవి అశుభమును కలిగించు సంకేతములు. ద్వారకకు ఏదో ప్రమాదం వాటిల్లబోతోంది అని తెలుస్తూ ఉంది. కాబట్టి ఈ ద్వారకలో మనం ఒక్క క్షణం కూడా ఉండకూడదు. అందుచేత, ద్వారకా నగరంలో ఉన్న బాలురు, వృద్ధులు, స్త్రీలతో సహా వీలైనంత మంది అందరం ప్రభాస తీర్థమునకు వెళ్దాము. అక్కడ సరస్వతీ నది పడమటి దిశగా ప్రవహిస్తూ ఉంటుంది. మనం అందరం ఆ ప్రభాస క్షేత్రములో పుణ్య స్నానములు చేసి, ఉపవాసము ఉందాము. మన ఇష్ట దేవతలను పూజిస్తాము. బ్రాహ్మణులు శాంతి హెూమములు చేస్తారు. మనం ఆ బ్రాహ్మణులను పూజిద్దాము. రాబోయే విఘ్నములు నివారించడానికి సకల శుభాలు కలగడానికీ ఇదే ఉత్తమమైన మార్గము. దేవతలను, బ్రాహ్మణులను, గోవులను పూజిస్తే మనకు

ఉత్తమ లోకములు కలుగుతాయి అని శాస్త్రములు చెబుతున్నాయి." అని అన్నాడు.

శ్రీకృష్ణుని మాటలకు యాదవ శ్రేష్టులు అందరూ ఆమోదించారు. ద్వారకా నగరంలోని ప్రజలందరూ ప్రభాస క్షేత్రము చేరుకున్నారు. అక్కడ సరస్వతీ నదిలో పుణ్య స్నానములు చేసి అనేక పుణ్య కార్యములు ఆచరించారు. బ్రాహ్మణులు హెూమములు వ్రతములు చేయించారు.

సాయంత్రం కాగానే యాదవులు అందరూ మద్యం సేవించారు. బ్రాహ్మణశాపం పనిచేయడం మొదలయింది. మద్యంమత్తులో ఒకరిని ఒకరు తిట్టుకున్నారు. ఆవేశంలో కొట్టుకున్నారు. ఆయుధములతో యుద్ధానికి దిగారు. రధాల పైన ఎక్కి యుద్ధం చేసుకున్నారు. అనేకములైన అస్త్ర శస్త్రములను ఒకరి మీద ఒకరు ప్రయోగించుకున్నారు. ఒకరిని ఒకరు దారుణంగా చంపుకుంటున్నారు. ప్రద్యుమ్నుడు, సాంబుడు, అక్రూరుడు, భోజుడు, అనిరుద్ధుడు, సాత్యకి, సుభద్రుడు, సంగ్రామజిత్తు, గదుడు, సుమిత్రుడు, సురధుడు, సహస్రజిత్, శతజిత్తు, భానువు మొదలగు వారు ఒకరితో ఒకరు యుద్ధం చేసుకుంటున్నారు. వీరే కాక దాశార్హులు, భోజులు, సాత్వతులు, మధువులు, అర్బుదులు, శూరసేనులు, విసర్జనులు, కుకురులు, కుంతి వంశులు, తాము బంధువులము అన్న సంగతి మరిచిపోయి, ఒకరి మీద ఒకరు కోపంతో, ద్వేషంతో రగిలిపోతూ ఒకరిని ఒకరు చంపుకుంటున్నారు. పాత కక్షలు తీర్చుకుంటున్నారు. తండ్రి కొడుకులు, సోదరులు, మేనమామలు, మేనళ్లుల్లు,

మాతామహులు, మనుమలు, మిత్రులు ఒకరితో ఒకరు యుద్ధం చేసుకుంటున్నారు. ఒక రకమైన ఆవేశంతో రగిలిపోతున్నారు.

వారి వద్ద ఉన్న బాణములు, అస్త్రములు, శస్త్రములు అన్నీ అయిపోయాయి. ధనుస్సులు విరిగిపోయాయి. ఆ కారణంగా ఒకరితో ఒకరు ముష్టియుద్ధమునకు సిద్ధపడ్డారు. చేతులతో కాళ్లతో తన్నుకుంటున్నారు. సాంబుడికి వచ్చిన కృత్రిమ గర్భంతో పుట్టిన ముసలాన్ని అరగదీస్తే, ఆ పొడి నుండి పుట్టిన తుంగ గడ్డి సమీపంలో పెరిగి ఉంది. ఏ ఆయుధము దొరక్క యాదవులు ఆ తుంగ గడ్డిని పీకి దానితో కొట్టుకోసాగారు. అదే వారి పట్ల మారణాయుధంగా తయారయింది.

శ్రీకృష్ణుడు ఇదంతా చూస్తున్నాడు. నామ మాత్రంగా వారిని వారించాడు కానీ వారు ఈయన మాట వినలేదు. పైగా బలరాముని చంపడానికి ఆయనమీదికి వెళ్లారు. బలరాముడు, శ్రీకృష్ణుడు కూడా చెరి ఒక పరిఘ ధరించి యాదవులను చంపడం మొదలెట్టారు. బ్రాహ్మణ శాప ఫలం తీవ్ర రూపం దాల్చి యాదవులను ఒకరితో ఒకరు కొట్టుకునేటట్టు చేసింది. యాదవ వంశము క్షయమయింది. శ్రీకృష్ణుడు బలరాముడు ఇద్దరే మిగిలారు..

యాదవులు అందరూ మరణించారు అని తెలుసుకున్న శ్రీకృష్ణుడు భూభారము సమూలంగా తగ్గిపోయింది అని అనుకున్నాడు. బలరాముడు సముద్రతీరంలో ధ్యానంలో కూర్చుని యోగ మార్గంలో పరమాత్మ యందు మనసు లగ్నం చేసి, తన ఆత్మను పరమాత్మలో ఐక్యం చేసాడు. బలరాముడు ఈ లోకమును వదిలి, తన

నిజనివాసమునకు చేరుకున్నాడు అని తెలుసుకున్న శ్రీకృష్ణుడు ఒక రావి చెట్టు కింది మౌనంగా కూర్చున్నాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! అప్పుడు శ్రీకృష్ణుని రూపం ఈవిధంగా ఉంది. శ్రీకృష్ణుడు తన ప్రకాశంతో నలుదిక్కులను ప్రకాశింపజేస్తున్నాడు. నాలుగు భుజములతోనూ, శ్రీవత్స చిహ్నముతోనూ, నీలి రంగుతోనూ, పీతాంబర ధారియై, పెదాల మీద చిరునవ్వు చిందిస్తూ, ఒంటి నిండా ఆభరణములతోనూ, తలమీద కిరీటముతోనూ, మెడలో వనమాలతోనూ, కౌస్తుభముతోనూ, వెలిగిపోతున్నాడు. తన కుడి తొడమై ఎడమ కాలు పెట్టుకొని విలాసంగా ఊపుతూ కూర్చున్నాడు.

పరీక్షిత్ మహారాజా! సాంబుడికి పుట్టిన ముసలమును అరగదీస్తే మిగిలిన చిన్న ములికి లాంటి ముక్క జర అనే వేటగానికి దొరికింది అని చెప్పాను కదా! ఆ వేటగాడు ఆ ముక్కను తన బాణమునకు అమర్చుకున్నాడు. రావిచెట్టు కింద కూర్చుని ఉన్న శ్రీకృష్ణుని కాలును చూచి అది మృగము అనుకున్నాడు ఆ వేటగాడు. ముసలము ములికను అమర్చిన బాణమును తన వింటికి సంధించి విడిచాడు. ఆ బాణము వేగంగా పోయి శ్రీకృష్ణుని కాలికి తాకింది. తానుకొట్టిన మృగము ఏదో తెలుసుకుందామని వచ్చిన వేటగానికి చతుర్భుజములతో వెలిగిపోతున్న శ్రీకృష్ణుడు కనిపించాడు. వేటగాడు ఆయనపాదముల మీద పడి క్షమించమని వేడుకున్నాడు.

"మహానుభావా! నేను దుర్మార్గుడను. అజ్ఞానంతో మహా పాపం చేసాను. నాఅపరాధమును మన్నించి నన్ను కరుణించు.

జ్ఞానులు, మునులు, యోగుల చేత పూజింపబడే నిన్ను నా బాణముతో కొట్టాను. తీరని అపరాధం చేసాను. నేను ఇటువంటి అపరాధము మరలా చేయకుండా నన్ను చంపెయ్యి. నీకు అపకారం చేసిన నేను బతకడానికి అనర్హుడను. ఓ దేవా! సాక్షాత్తు బ్రహ్మ మొదలగు దేవతాగణములే నీ మాయలో పడి నీ నిజ స్వరూపం తెలుసుకోలేకపోతున్నారు. ఇంక పామరుడను నేనెంత?" అనిపరి పరి విధాల వేడుకున్నాడు. ఆ వేటగాని ప్రార్థన విన్న కృష్ణుడు ఇలా అన్నాడు.

"వ్యాధుడా!(వేటకాడా!) లే! నీవు ఏ అపరాధము చేయలేదు. ఇది నాకు ఇష్టమే. జరగాల్సింది కాబట్టి జరిగింది. నీవు బాధపడవలసిన పని లేదు. నీవు పుణ్యాత్ముడవు.పుణ్యలోకములకు వెళ్లు." అని అన్నాడు. ఆ వేటగాడు శ్రీకృష్ణుడికి మూడుసార్లు ప్రదక్షిణము చేసి, పుణ్యలోకములకు వెళ్లిపోయాడు.

ఇంతలో దారుకుడు అనే శ్రీకృష్ణుని సారది, శ్రీకృష్ణుని రథం మీద ఆయనను వెతుక్కుంటూ ఆ ప్రదేశమునకు వచ్చాడు. రావిచెట్టు మొదట్లో కూర్చుని ఉన్న కృష్ణుని చూచాడు. వెంటనే రథం దిగిన దారుకుడు ఆయన పాదాల మీదపడ్డాడు.

"ఓ దేవా! నేను ధన్యుడను.  ఇన్నాళ్లు నేను అంధకారంలో అలమటిస్తున్నాను. నా మనసుకు శాంతి లేదు. నాకు కర్తవ్య బోధ చేయండి." అని వేడుకున్నాడు. ఇంతలో దారుకుడు ఎక్కి వచ్చిన కృష్ణుని రథం ఆకాశంలోకి ఎగిరిపోయింది. అప్పుడు కృష్ణుడు దారుకునితో ఇలా అన్నాడు.

"దారుకా! నీవు ఇప్పుడు ద్వారకకువెళ్లు. అక్కడ ఉన్న యాదవలకు, వారి బంధువులకు, ప్రభాస తీర్థంలో యాదవ ప్రముఖులు అందరూ ఒకరితో ఒకరు కొట్టుకొని మరణించారని చెప్పు. బలదేవులు కూడా తన శరీరమును వదిలిపెట్టి వైకుంఠమునకు చేరుకున్నాడని చెప్పు. త్వరలో ద్వారకా నగరము సముద్రంలో మునిగిపోతుంది. కాబట్టి నీవు యాదవులందరినీ ద్వారక వదిలిపెట్టి వెళ్లమని చెప్పు. అర్జునుడు ద్వారకలో ఉన్నాడు. నా తల్లి తండ్రులను, యాదవులను, అంతఃపుర స్త్రీలను అర్జునుడు రక్షిస్తాడు. వారందరూ ఇంద్రప్రస్థము వెళ్లిపోతారు. నీవు, నేను ఉపదేశించిన భక్తియోగము అవలంబించి శాంతిని పొందు. ఇదంతా నా మాయ. నీవేమీ చింతించవలసిన పని లేదు." అని అన్నాడు. తరువాత దారుకుడు శ్రీకృష్ణునికి మూడుసార్లు ప్రదక్షిణము చేసి నమస్కరించి అక్కడి నుండి ద్వారకకు వెళ్లిపోయాడు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు యాదవుల పరస్పరము కొట్టుకొని మరణించడం మొదలగు విషయములు వివరించాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ముప్పదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## ఏకాదశ స్కంధము

## ముప్పది ఒకటవ అధ్యాయము.

"ఓ పరీక్షిత్ మహారాజా! కృష్ణుని ఆదేశము మేరకు ఉద్ధవుడు బదరికావనమునకు తపస్సు చేసుకునే నిమిత్తం వెళ్లిపోయాడు. వేటగాని చేతిలో దెబ్బతిన్న కృష్ణుడు ఒంటరిగా రావి చెట్టుకింద కూర్చుని ఉన్నాడు. అక్కడ అంతా నిర్మానుష్యంగా ఉంది. అప్పుడు బ్రహ్మ, శివుడు, పార్వతి, మహేంద్రుడు మొదలగు దేవతా గణములు, మరీచి మొదలగు ప్రజాపతులు, సనకాది మహామునులు, పితృ దేవతలు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, మహానాగులు, చారణులు, యక్షులు, రాక్షసులు, కిన్నరులు, అప్సరసలు, గరుడుడు అందరూ కలిసి శ్రీకృష్ణుని వద్దకు వచ్చారు. శ్రీకృష్ణుని లీలలను కొంతమంది గానం చేస్తున్నారు. కొంత మంది కృష్ణుని మీద పూల వర్షం కురిపిస్తున్నారు.

వారంతా ఎందుకు వచ్చారో తెలుసుకున్నాడు కృష్ణుడు. వారంతా తనను మరలా తన నిజధామమునకు రమ్మని ఆహ్వానించడానికి వచ్చారని గ్రహించాడు. తన కళ్లు మూసుకున్నాడు. ధ్యానంలో నిమగ్నం అయ్యాడు. ఆయన తన దేహమును విడిచిపెట్టి వైకుంఠమునకు వెళ్లిపోయాడు. అప్పుడు దేవతలు దుందుభులు మోగించారు. ఆకాశము నుండి పుష్ప వర్షము కురిసింది. అప్పటి వరకూ కృష్ణునితో సహజీవనం చేసిన సత్యనిష్ఠ, ధర్మనిష్ఠ, కీర్తి, సంపదలు అనే గుణములు శ్రీకృష్ణుని పాటు ఈ లోకమునుండి

అదృశ్యం అయ్యాయి. శ్రీకృష్ణుని వెంటవెళ్ళిపోయాయి. ఇదంతా కళ్లారా చూచిన బ్రహ్మాది దేవతలు ఆశ్చర్యపోయారు. ఆకాశంలో మెరిసిన మెరుపు అలా మెరిసి ఇలా మాయం అయినట్టు శ్రీకృష్ణుడు ఎలా వెళ్లాడో దేవతాగణములు తెలుసుకోలేకపోయారు. బ్రహ్మ, రుద్రుడు మొదలగు వారు శ్రీకృష్ణుని యోగ ప్రభావమును చూచి ఆశ్చర్యపోయారు. శ్రీకృష్ణుడు తన ధామమును చేరుకున్నాడు కాబట్టి, వారు కూడా తమతమ లోకములకు వెళ్లిపోయారు.

ఓపరీక్షిత్ మహారాజా! ఈ విధంగా పరమాత్మ శ్రీకృష్ణ అవతారమును చాలించి తన నిజధామమునకు వెళ్లిపోయాడు. రంగస్థలము మీద నటుడు, తన నిజరూపమును ఎలాంటి మార్పుచేయకుండా, వివిధ వేషములతో, పుట్టడం, పెరగడం, చావడం లాంటి పాత్రలను, పాత్రోచితంగా ఎలా నటిస్తాడో, అలాగే పరమాత్మ భూలోకంలో, యాదవ కులంలో శ్రీకృష్ణుడు గా అవతరించి, పెరిగి, తిరిగి అన అవతారమును చాలించాడు.

పరమాత్మ యొక్క ఈ ఆవిర్భావము, తిరోభావము కేవలము పరమాత్మ యొక్క మాయ తప్ప వేరు కాదు. పరమాత్మ ఈ జగత్తును సృష్టించాడు. తాను అందులో ప్రవేశించాడు. సకల జీవరాసుల అంతరంగములలో ఆత్మస్వరూపుడుగా నిలిచి ఉన్నాడు. విహరిస్తున్నాడు. మరలా ప్రళయ కాలంలో తను చేసిన సృష్టిని ఉపసంహరించుకుంటున్నాడు.

శ్రీకృష్ణుడు తన అవతార సమయంలో గురుదక్షిణగా, యమలోకములో ఉన్న గురు పుత్రుని తీసుకొని వచ్చి గురు పత్నికి

ఇచ్చాడు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రము బారి నుండి ఉత్తర గర్భంలో ఉన్న నిన్ను రక్షించాడు. కాని అటువంటి వాడు కేవలము ఒక వేటగాడు కొట్టిన బాణము చేత ఈ లోకమును విడిచిపెట్టి వెళ్లిపోయాడు. ఆయన తనను తాను రక్షించుకోలేక కాదు. ఈ లోకమును విడిచిపెట్టి వెళ్ల వలసిన సమయం ఆసన్నమైనందున వెళ్లిపోయాడు.

ఓ పరీక్షిత్ మహారాజా! పరమాత్మ మూడులోకములలో సృష్టి స్థితి లయ కార్యములను నిర్వహిస్తున్నాడు. కాని ఆయనకు ఈ మానవ దేహముతో అవసరము లేదు. ఆత్మ నిష్ఠ కలిగి ఉండటమే పరమమైన మార్గము అని లోకానికి తెలియజేయడానికే యాదవ కులము సమూలంగా నాశనం అయిన తరువాత కూడా తన శరీరమును ఈ లోకములో మిగిల్చి ఉండటానికి ఇష్టపడలేదు. శ్రీకృష్ణుని దివ్యనిర్యాణమును గురించి ప్రతిరోజూ ఉదయము మననం చేసుకొనే వారికి ఉత్తమ గతులు కలుగుతాయి.

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుని ఆదేశము మేరకు ద్వారక చేరుకున్న దారుకుడు, వసుదేవుడు ఉగ్రసేనుడి వద్దకు వెళ్లాడు. వారి పాదములపై బడి ఏడ్చాడు. దారుకుడు వారికి యాదవులందరూ నిర్యాణం చెందడం గురించి వివరించాడు. ద్వారకలో ఉన్న యాదవులందరూ తమ బంధు మిత్రులు ఒకరితో ఒకరు కొట్టుకొని మరణించారు అన్న వార్త దారుకుని వలన విని, ఏడుస్తూ ప్రభాస తీర్థమునకు వెళ్లారు.

అక్కడ బలరాముడు, శ్రీకృష్ణుడు వారికి కనపడలేదు. వసుదేవుడు, దేవకీదేవి, రోహిణి మొదలగువారు దు:ఖం ఆపుకోలేక పెద్దపెట్టున ఏడ్వసాగారు. శ్రీకృష్ణుని విడిచి ఉండలేని దేవకీదేవి, మొదలగు వారు అక్కడికక్కడే ప్రాణములు విడిచిపెట్టారు. మరికొంత మంది యాదవ స్త్రీలు, మరణించిన తమ తమ భర్తలతో, చితులు ఎక్కి, సహగమనం చేసారు. అదే విధంగా బలరాముని భార్యలు, వసుదేవుని భార్యలు, శ్రీకృష్ణుని కోడళ్లు అందరూ, తమ తమ భర్తల యొక్క దేహములతో పాటు సహగమనం చేసారు అంటే వారి వారి భర్తల చితులలో పడి కాలిపోయారు. శ్రీకృష్ణుని భార్యలు అయిన రుక్మిణి మొదలగు వారు కూడా అగ్ని ప్రవేశము చేసారు.

అర్జునుడు శ్రీకృష్ణుని ఎడబాటును భరించలేకపోయాడు. కాని శ్రీకృష్ణుడు తనకు ఉపదేశించిన గీతామృత సారమును గుర్తుకు తెచ్చుకొని తనను తానుసమాధాన పరచుకున్నాడు. తరువాత యాదవులందరికీ సామూహికంగా కర్మక్రతువులు చేసాడు. తరువాత కొన్ని దినములకు సముద్రము పొంగి, ద్వారకానగరము సముద్రములో మునిగి పోయింది. శ్రీకృష్ణుడు నివసించిన మందిరము మాత్రము సముద్రములో మునిగిపోకుండా నిలిచి ఉంది. శ్రీకృష్ణుడు ద్వారకానగరములో నివసించిన తన మందిరములో ఇప్పటికీ ఉన్నాడని భక్తుల నమ్మకము.

పరీక్షిత్‌మహారాజా! మరణించగా మిగిలిన యాదవులను స్త్రీలను, బాలురను, వృద్ధులను తన వెంట తీసుకొని అర్జునుడు ఇంద్రప్రస్థమునకు వెల్లాడు. అనిరుద్ధుని కుమారుడు, శ్రీకృష్ణుని

మునిమనుమడు అయిన వ్రజుడు అనే వానిని ఇంద్రప్రస్థమునకు రాజుగా చేసాడు. తరువాత పాండవులు నిన్ను (పరీక్షిత్ మహారాజును) హస్తినాపురమునకు రాజుగా పట్టాభిషిక్తుని చేసి, వారందరూ మహాప్రస్థానము చెందారు.

ఓపరీక్షిత్ మహారాజా! దేవదేవుడు అయిన శ్రీకృష్ణుని లీలలను ఎవరైతే శ్రద్ధాభక్తులతో గానం చేస్తారో వారు సకలపాపముల నుండి విముక్తులు అవుతారు.  భాగవత పురాణములో చెప్పబడిన శ్రీకృష్ణుని అవతార చరిత్రను, శ్రీకృష్ణుని బాల్యలీలలను చదివినా, వినినా, వారు శ్రీకృష్ణుని యందు అమితమైన భక్తిని పొందుతారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు శ్రీకృష్ణ నిర్యాణము గురించి చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ఏకాదశ స్కంధము ముప్పది ఒకటవ అధ్యాయము సంపూర్ణము

ఏకాదశ స్కంధము సర్వం సంపూర్ణం.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# శ్రీమద్భాగవతము

సంస్కృత మూలము

భగవాన్ వ్యాసమహర్షి

తేటతెలుగులో

యం.వి.సుబ్రహ్మణ్యం

చిరునామా:

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

సెల్: 9866140619, 9391134792

ఫోన్:040-24048104

# శ్రీమద్భాగవతము

## ద్వాదశ స్కంధము

## మొదటి అధ్యాయము

. నైమిశారణ్యంలో, సత్రయాగ సందర్భంలో, సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహాఋషులకు, శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు చెప్పిన భాగవత పురాణ కథను ఇలా వినిపిస్తున్నాడు.

"ఓ మునీంద్రులారా! శుక మహర్షి పరీక్షిత్ మహారాజుతో కలియుగంలో జరగబోయే పరిణామాల గురించి ఇలా వివరిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! నీకు ఇదివరలో రిపుంజయుడు అనే రాజు కథ చెప్పాను. అతనికి పురంజయుడు అనే పేరు కూడా ఉంది. అతడు జరాసంధుని వంశములో జన్మించాడు. పురంజయునికి శునకుడు అనే మంత్రి ఉండేవాడు. ఆ మంత్రి రాజు మీద తిరుగుబాటు చేసి, రాజును చంపి, తన కుమారుడు అయిన ప్రద్యోతనుని రాజుగా చేస్తాడు. (ఇక్కడి నుండి భవిష్యత్తులో జరగబోయే పరిణామాల గురించి చెప్పబడుతూ ఉంది. గమనించండి.)

తరువాత ప్రద్యోతనుని కుమారుడు అయిన పాలకుడు, పాలకుని కుమారుడు విశాఖయూపుడు, వాని కుమారుడు రాజకుడు అనే వారు రాజ్యమును పరిపాలిస్తారు. రాజకుని కుమారుడు నందివర్ధనుడు. వీరందరూ 138 సంవత్సరములు రాజ్యపాలన చేస్తారు.

నంది వర్ధనుడికి శిశునాగుడు, శిశునాగునికి కాకవర్ణుడు, కాకవర్ణునకు క్షేమధర్ముడు, క్షేమధర్మునకు క్షేత్రజ్ఞుడు జన్మిస్తారు. క్షేత్రజ్ఞునకు విధిసారుడు, విధిసారునకు అజాత శత్రు, వానికి దర్భకుడు, దర్భకునకు అజయుడు జన్మిస్తారు. అజయునకు నంది వర్ధనుడు, నందివర్ధనునకు మహానంది జన్మిస్తారు. వీరందరినీ శిశునాగ సంతతి అంటారు. ఈ పది మంది రాజులు 360 సంవత్సరములు రాజ్యపాలన చేస్తారు.

మహానందుడికి ఒక శూద్రస్త్రీయందు మహాపద్మనందుడు అనే వాడు జన్మిస్తాడు. ఆ మహాపద్మనందుడు అధార్మికుడు, మహా బలవంతుడు, క్రూరుడు. అతడు రాజ్యమును నిరంకుశంగా పాలిస్తారు. వానికి ఎనిమిది కుమారులు.  వారు 100 సంవత్సరములు పరిపాలిస్తారు. చాణక్యుడు అనే బ్రాహ్మణుడు నంద వంశమును నిర్మూలిస్తాడు. మౌర్యవంశమును స్థాపిస్తాడు. మౌర్య వంశమునకు ప్రథముడైన చంద్రగుప్తుని చాణక్యుడు రాజ్యాభిషిక్తుని చేస్తాడు.

చంద్రగుప్తుని కుమారుడు వారిసారుడు, అతని కుమారుడు అశోకవర్ధనుడు పరిపాలిస్తారు. అశోకవర్ధనుని కుమారుడు సుయశసుడు, వాని కుమారుడు సంగతుడు, వాని కుమారుడు శాలిశూకుడు, అతని కుమారుడు సోమశర్మ, అతని కుమారుడు శతధన్వుడు, అతని కుమారుడు బృహద్రథుడు రాజ్యపాలన చేస్తారు. వీరంతా మౌర్యవంశము వారు. మీరు 137సంవత్సరములపాటు రాజ్యపాలనచేస్తారు.

బృహద్రథుని సేనాపతి పేరు పుష్యమిత్రుడు. అతడు బృహద్రథుని వధించి, సింహాసనము ఆక్రమిస్తాడు. అతనితో శుంగవంశము మొదలవుతుంది. పుష్యమిత్రుని కుమారుడు అగ్నిమిత్రుడు, వాని కుమారుడు సుజ్యేష్టుడు, అతని కుమారుడు వసుమిత్రుడు, వాని కుమారుడు భద్రకుడు, వాని కుమారుడు పుళిందుడు, వాని కుమారుడు ఘోషుడు, వాని కుమారుడు వజ్రమిత్రుడు, వాని కుమారుడు భాగవతుడు, వాని కుమారుడు దేవభూతి. వీరంతా శృంగవంశపు రాజులుగా 100 సంవత్సరములు రాజ్యపాలన చేస్తారు.

తరువాత రాజ్యము కణ్వుల వశం అవుతుంది. దేవభూతి మంత్రి వసుదేవుడు కణ్వవంశమునకు చెందిన వాడు. దేవభూతి స్త్రీలోలుడు. వసుదేవుడు దేవభూతిని చంపి రాజయ్యాడు. వసుదేవుని కుమారుడు భూమిత్రుడు, వాని కుమారుడు నారాయణుడు, వాని కుమారుడు సుశర్మ. వీరందరూ కణ్వవంశము వారు. వీరు 345 సంవత్సరముల పాటు రాజ్యపాలన చేస్తారు.

తరువాత ఆంధ్రులు అనే జాతి రాజ్యపాలన చేస్తుంది. సుశర్మ దగ్గర సేవకునిగా పని చేసే బలి అనేవాడు సుశర్మను చంపి, తాను రాజుగా ప్రకటించుకున్నాడు. బలి సోదరుడు కృష్ణుడు, వాని కుమారుడు శ్రీకాంతకర్ణుడు, వాని కుమారుడు పౌర్ణమాసుడు, వాని కుమారుడు లంబోదరుడు, అతని కుమారుడు చివిలకుడు, అతని కుమారుడు మేఘస్వాతి, అతని కుమారుడు అభిమానుడు, అతని కుమారుడు అనిష్ట కర్ముడు, వాని కుమారుడు హారేయుడు, వాని

కుమారుడు తలకుడు, వాని కుమారుడు పురీషభీరువు, వాని కుమారుడు సునందుడు, వాని కుమారుడు చకోరుడు రాజ్యపాలన చేస్తారు. తరువాత ఆంధ్ర వంశము అంతరిస్తుంది.

తరువాత బహు అనేవంశము వారు పాలిస్తారు. వారిలో ఎనిమిదవ వాడు శివస్వాతి. వాని కుమారుడు గోమతి, వాని కుమారుడు పురీమానుడు, వాని కుమారుడు వేదశిరుడు, వాని కుమారుడు శివస్కంధుడు, వాని కుమారుడు యజ్ఞశ్రీ, వాని కుమారుడు విజయుడు, వాని కుమారుడు చంద్రవిజ్ఞుడు. వీరందరూ 456 సంవత్సరములు భూమిని పరిపాలిస్తారు.

తరువాత అభీరజాతి వారు ఏడుగురు, తరువాత కంకులు అనే జాతి వారు 16 మంది రాజులు అవుతారు. వారి తరువాత యవనులు, తురుష్కులు, గురుండులు, మౌలులు రాజ్యపాలన చేస్తారు. వీరంతా 1309 సంవత్సరములు భారతదేశమును పరిపాలిస్తారు. వారి తరువాత భూతనందుడు, వంగిరి, శిశునంది, యశోనంది, ప్రవీరకకుడు 106 సంవత్సరములు రాజ్యపాలన చేస్తారు. వీరి వంశములోని వారైన బాహ్లీకులు 13 మంది, వారి తరువాత పుష్యమిత్రుడు, వాని కుమారుడు దుర్మిత్రుడు, వారి తరువాత ఆంధ్రులు ఏడుగురు, వారి తరువాత కోసల దేశము వారు 7 మంది, విదూరులు, నిషధ దేశాధిపతులు, భారత దేశములోని వివిధ రాజ్యములను పాలిస్తారు. అప్పుడు భారత దేశము ముక్కలు ముక్కలుగా విడిపోతుంది.

తరువాత పురంజయుడు అనే రాజు మగధ దేశమునకు రాజు అవుతాడు. వాడు బ్రాహ్మణులను మొదలగు వర్ణముల వారిని ఇతర హీనవర్ణముల లోకి మారుస్తాడు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను నిర్మూలించి అంతా శూద్ర వర్ణము వారితో నింపుతాడు. క్షత్రియులను పూర్తిగా నాశనం చేస్తాడు. ఉత్తర భారతము అంతా తన పాలన కిందికి తీసుకొని వస్తాడు.

తరువాత సౌరాష్ట్రులు, అవంతులు, ఆభీరులు, శూరులు, అర్బుదులు, మాళవులు మొదలగు వారు ఉపనయన సంస్కారము లేకుండా, శూద్రులుగా బతుకుతారు. వీరు వేదములలో చెప్పబడిన ఆచారములను పాటించరు. సంస్కారము ఉండదు. వీరిలో బ్రాహ్మణులు సింధు తీరమును, చంద్రభాగ తీరమును, కాశ్మీరమును పరిపాలిస్తారు. వీరు పుట్టుకతో బ్రాహ్మణులు అయినప్పటికినీ మ్లేచ్ఛులతో సమానంగా .జీవిస్తారు. వీరికి ధర్మం అంటే ఏమిటో తెలియదు. నిజం చెప్పరు. ఎవరికీ దాన ధర్మాలు చెయ్యరు. అమితమైన కోపం కలిగి ఉంటారు.

వీరి కాలములో మ్లేచ్ఛులు విజృంభిస్తారు. మ్లేచ్ఛులు అంటే స్త్రీలను, బాలురను, గోవులను, బ్రాహ్మణులను నిర్దాక్షిణ్యంగా చంపేవారు. బాలురను, స్త్రీలను అపహరించేవారు. ఇతరుల ధనమును కొల్లగొట్టేవారు. వీరికి సంతోషము వచ్చినా, దు:ఖము వచ్చినా పట్టలేము. వీరికి కండపుష్టి ఉంటుందే కానీ వీరత్వము తక్కువ. పిరికివారు. వీరి ఆయుష్షు కూడా తక్కువే. ఎవరు, ఎప్పుడు, ఎవరి చేతిలో చస్తారో తెలియదు. వీరు గర్భాదానము, జాతక కర్మలు

మొదలగు సంస్కారములు నిర్వర్తించరు. యజ్ఞములు, నిత్య కర్మలు చేయరు. ఎక్కువగా రజోగుణము, తమోగుణము కలిగి ఉంటారు. పైకి వీరు రాజులుగా ఉన్నా వీరికి క్షత్రియ లక్షణములు ఏవీ ఉండవు. ఈ రాజులకు ప్రజలను పీడించి ధనం సంపాదించడమే ప్రథమ కర్తవ్యము. వీరి పాలనలో ఉన్న ప్రజలు కూడా వీరినే అనుసరిస్తారు. వారిలో వారు కొట్టుకొని, అకారణ యుద్ధములలో రాజులచేత చంపబడి, నశించిపోతారు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు రాబోవు కాలములో జరిగే పరిణామాలగురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము మొదటి అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము

రెండవ అధ్యాయము

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కలియుగ ధర్మముల గురించి వివరిస్తున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! కలియుగములో కలి ప్రభావంతో మానవులలో ధర్మచింతన, సత్యవాక్కు, పరిశుభ్రత, ఓర్పు, దయాగుణము, ఆయుష్షు, బలము, జ్ఞాపక శక్తి క్రమక్రమంగా నశించిపోతాయి. కలియుగములో మానవులకు ధనము ముఖ్యము.

ధనం కోసరం ఏమైనా చేస్తారు. ధనం కోసమే పుట్టామనీ, ధనం కోసరమే ఆచారాలను అనుసరిస్తున్నామనీ ప్రవర్తిస్తారు. బలం ఉన్న వాడిదే రాజ్యము అవుతుంది. ధర్మము, న్యాయము, స్త్రీలు బలము ఉన్న వాడి వశం అవుతారు.

భార్యభర్తలలో ఒకరి మీద ఒకరికి అనురాగం తగ్గిపోతుంది. అమ్మకాలు, కొనుగోళ్లలో ఎక్కువగా మోసం జరుగుతుంది. స్త్రీ, పురుషులలో ఎవరు గొప్పవారు అంటే ఎవరైతే ఎక్కువగా రతికార్యము నిర్వర్తిస్తారో వారే గొప్పవారు అనిపించుకుంటారు. యజ్ఞోపవీతం వేసుకున్న వాడే బ్రాహ్మణుడుగా చలామణి అవుతాడు. బ్రహ్మచర్యము, సన్యాసము మొదలగు ఆశ్రమములు స్వీకరించడానికి, సన్యాసులుగా గుర్తించడానికి కేవలం కాషాయాలు కట్టి దండం పట్టుకుంటే వాడు స్వామీజీ, సన్యాసి అవుతాడు. అంతే కానీ, వాడికి సన్యాసి లక్షణాలు ఏమీ ఉండవు.

ధనం లేని వాడికి న్యాయం కూడా దొరకదు. ధనం ఉన్న వాడి పక్షాన న్యాయం ఉంటుంది. ఎటువంటి శాస్త్ర పరిజ్ఞానము, పురాణ పరిజ్ఞానము లేకపోయినా, వాక్చాతుర్యము కలవాడే పండితుడు అనిపించుకుంటాడు. ఆడంబరము కలవాడే సాధువు. దరిద్రుడిని సాధువుగా పరిగణించరు. నేను నిన్ను పెళ్లి చేసుకుంటాను అన్న మాటలతోనే వివాహం జరుగుతుంది. నీకు విడాకులు ఇస్తాను అన్న మాటలతోనే వివాహం విచ్ఛిన్నమవుతుంది. మానసిక శౌచము లేకపోయినా, స్నానం చేసి మంచి బట్టలు కట్టుకుంటే వాడిని గౌరవిస్తారు.

దగ్గరలో ఉన్న జలాశయము పుణ్య తీర్థము కాదు. దూరంగా ఉన్న ఏ నది అయినా అది పుణ్యతీర్థము అవుతుంది. కురులను తీరుతీరుగా ముడుచుకుంటేనే అందం, లావణ్యం వస్తుంది. తన కడుపునింపుకొనేదానికి మానవుడు స్వార్థపరుడు అవుతాడు. ఎవరైనా గట్టిగా దబాయించి మాట్లాడితే అదే సత్యంగా పరిగణింపబడుతుంది.

ప్రతివాడూ తాను, తన కుటుంబము, ఇవి బాగుంటే చాలు అని అనుకుంటారు. కీర్తి,పేరు,ప్రతిష్టలు పొందడానికే ధర్మకార్యాలు చేస్తారు. ఈ ప్రకారంగా భూమి అంతా దుష్టులతో నిండి పోతుంది. అన్నివర్ణములలో ఉన్న వారిలో ఎవరికి బలం, పరాక్రమము ఉంటే వాడే రాజవుతాడు. అటువంటి రాజులు నిరంకుశులు అవుతారు. వారికి దయ, దాక్షిణ్యము ఉండదు. పరమ లోభులుగా ఉంటారు. ప్రజల ధనమును పన్నులరూపంలో కొల్లగొడతారు. స్త్రీలకు రక్షణ ఉండదు. వీరి బాధలు తట్టుకోలేక ప్రజలు అడవులలోకిపారిపోతారు. (నేటి నక్సలైట్ వ్యవస్త అటువంటిదేమో!)

కరువు కాటకాలు సంభవిస్తాయి. ఒక పక్క కరువు మరొక పక్క పన్నుల భారము, వీటిని తట్టుకోలేక ప్రజలు అడవులలోకి పారి పోయి జంతువులను వేటాడి, వాటి మాంసము తోనూ, కందమూలములతోనూ కడుపునింపుకుంటారు. మరి కొంతమంది ఆకలి బాధకు తట్టుకోలేక మరణిస్తారు.

వాతావరణములలో పెనుమార్పులు సంభవిస్తాయి. ఎక్కువ ఎండ, ఎక్కువ చలి, అకాల వర్షాలు, విపరీతమైన మంచు, అకారణ

కలహాలు, ఆకలి, వ్యాధులు, దిగులు, వీటి వలన ప్రజలు బాధపడుతూ ఉంటారు.

కలియుగములో మానవులకు సగటున 50సంవత్సరాల ఆయుర్దాయము ఉంటుంది. కలియుగ ప్రభావము వలన మానవులకు 40 ఏళ్ల నుండి శరీరం క్షీణించడం మొదలవుతుంది.
(ఇప్పుడుకూడా డాక్టర్లు 40 దాటగానే కంటి పరీక్ష చేయించుకొని కళ్లద్దాలు వేయించుకోమంటారు. అంటే 40 నుండి శరీరంలో ఒకొక్కక్క అవయవము క్షీణించడం మొదలవుతుంది అన్నమాట.)
వేదములలో చెప్పబడిన ధర్మలను పాటించరు. ధర్మాలను తమ ఇష్టం వచ్చినట్టు నిర్వచిస్తారు. రాజులు దొంగల మాదిరి తయారవుతారు. మానవులు కూడా ఒకరిని ఒకరు దోచుకోవడం, అబద్ధాలు చెప్పడం, అనవసరంగా సాటి మానవులను, ప్రాణులను హింసించడం వీటితో బతుకుతుంటారు.

బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యులు అందరూ తమ తమ వర్ణ ధర్మములను వదిలిపెట్టి శూద్ర ధర్మమునుస్వీకరిస్తారు. (ఉద్యోగాలకు ఎగబడతారు.) ఆవులు పాలు ఇవ్వడం తగ్గిస్తాయి. ఆశ్రములు గృహముల మాదిరి మార్పుచెందుతాయి.
(ఆశ్రమములలో సన్యాసులు ఉంటారు. పైకి సన్యాసులుగా ఉన్నా లోపల గృహస్థజీవనం (బంగారం, వెండి, డబ్బు, ఎసిరూములు, విలాసవంతమైన జీవనం) గడుపుతారు అని అనుకోవచ్చు.)
బంధుత్వములు వివాహ సంబంధముల మాదిరి తయారవుతాయి. ఓషధులు అణుప్రాయములు అవుతాయి

(అంటే ఇదివరకు ఆహారపదార్థములనే ఓషధులుగా ఎలా ఉంటే అలా తీసుకొనే వారు. ఇప్పుడు వాటిని సూక్ష్మరూపంలోకి మార్చి బిళ్లలు, కాప్సూల్సు రూపంలో తీసుకుంటున్నారు.)

మేఘములు ఎక్కువగా ఉరమడం, మెరవడం చేస్తాయి కానీ తక్కువ వర్షపాతం ఉంటుంది. గృహములలో ధర్మకార్యాలు నడవవు. కేవలం ఆహారం వండుకోవడం, తినడం, నిద్రించడం ఇవే జరుగుతాయి. జనులు గాడిదలమాదిరి ఎప్పుడూ ఏదో బరువు మోస్తున్నట్టు ఈసురో మంటూ ఉంటారు.

ఈ కలియుగం అంత్యం అయ్యేసమయంలో, ధర్మరక్షణ కొరకు పరమాత్మ సత్వగుణ ప్రధానుడై అవతరిస్తాడు. సాధువులను రక్షిస్తాడు, ధర్మాన్ని రక్షిస్తాడు. పరమాత్మ శంభల అనే గ్రామములో, విష్ణుయశుడు అనే బ్రాహ్మణుని ఇంట్లో కల్కి రూపంలో జన్మిస్తాడు. ఆయన పేరు దేవదత్తుడు. ఆయనకు అన్ని ఐశ్వర్యములు ఉంటాయి. కాంతి వంతంగా ఉంటాడు. ఆయన నొక అశ్వమును ఎక్కి లోకం అంతా తిరుగుతాడు. దుర్మార్గులను నాశనం చేస్తాడు. రాజుల వేషంలో ఉండే దొంగలను నాశనం చేస్తాడు. ఆయనను చూడగానే, ఆయన దగ్గరకు రాగానే, ఆయన మీదినుండి వీచే గాలి వీరికి తగలగానే, సత్పురుషులు అయిన మానవులు పవిత్రులు అవుతారు. అప్పుడు వారంతా ఆయనను మనసులో నిలుపుకొని ధ్యానిస్తారు. వారికి మంచి సంతానము కలుగుతుంది.

పరమాత్మ దేవదత్తుడు అనే నామంతో జన్మించగానే, కలియుగం అంతమౌతుంది. కృతయుగం మొదలవుతుంది. ప్రజలు

సాత్వికులుగా ఉంటారు. చంద్రుడు, సూర్యుడు, పుష్యమీ నక్షత్రము, బృహస్పతి ఒకే రాశిలో ఉండగా కలియుగం అంతరించి పోతుంది. కృతయుగం మొదలవుతుంది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటి వరకు చంద్రవంశ రాజులు, సూర్యవంశ రాజులు, వారి గురించి, ఎవరెవరు ప్రస్తుతం ఉన్నారో, ఎవరెవరు గతించిపోయారో, భవిష్యత్తులో ఎవరెవరు ఈ భూమిని పాలిస్తారో వివరంగా చెప్పాను.

ఓ పరీక్షిత్ మహారాజా! నీవు పుట్టినప్పటినుండి, నంద మహారాజు కాలం వరకు 1115 సంవత్సరములు కాలం పడుతుంది. ఆ సమయములో ఆకాశంలో ఉన్న సప్తర్షి మండలంలో పులహుడు క్రతువు అనే రెండు నక్షత్రములు సూర్యోదయ సమయంలో కనిపిస్తాయి. రాత్రి సమయంలో దక్షిణం నుండి ఉత్తరానికి సమంగా ఉ న్న రేఖ మీద మధ్యలో ఏ నక్షత్రం ఉంటుందో ఆ నక్షత్రముతో కూడి సప్తర్షులు నూరు మానవ  సంవత్సరములు ఉంటారు. (దేవతల కాలమానము వేరు. వాటిని దివ్య సంవత్సరములుఅంటారు. మానవులకు 365 రోజులు ఒక మానవ సంవత్సరము.  ఒక మానవ సంవత్సరము దేవతలకు ఒక రోజుతో సమానము.).

ఓ రాజా! ఈ సమయంలో సప్తర్షులు మఘ నక్షత్రంలో ఉన్నారు. శ్రీకృష్ణుడు భూలోకమును వదిలిపెట్టిన మరుక్షణమే కలియుగము ఆరంభమైంది. అప్పటికే మానవులు పాపము చేయడంలో అధికమైన ఆసక్తి చూపుతున్నారు. కాని శ్రీకృష్ణుడు

తనపాదములను భూమి మీద మోపి ఉన్నంత కాలము కలియుగము భూమి మీదకు ప్రవేశించలేకపోయింది.

ఓ రాజా! మఘ నక్షత్రములో సప్తర్షులు ఉన్నప్పుడు దేవతల కాలమానము అనుసరించి 1200 సంవత్సరములు అనగా మానవుల కాలమానము ప్రకారము 4,32,000 సంవత్సరములు పాటు ఉండే కలియుగము ప్రవేశించింది. ఆకాశంలో ఉన్న సప్తర్షి మండలము పూర్వాషాఢ నక్షత్రములో ప్రవేశించగానే ఈ భూమిని ప్రద్యోతనుడు అనే రాజు పరిపాలిస్తాడు. అప్పటి నుండి కలియుగము ప్రారంభం అయి నందరాజు పాలించు వరకు వృద్ధి చెందుతుంది.

ఓ పరీక్షిత్ మహారాజా! శ్రీకృష్ణుడు తన అవతారమును చాలించి వైకుంఠము చేరగానే భూలోకము మీద కలియుగము మొదలయింది. ఈ విషయం పురాతత్వశాస్త్ర వేత్తలు కూడా ధృవపరిచారు. కలియుగము వేయి దివ్య సంవత్సరముల పాటు నడుస్తుంది. తరువాత మరలా కృతయుగము మొదలవుతుంది. అప్పుడు మానవుల చిత్తములు ఆత్మను గురించి ఆలోచించడం మొదలెడతాయి. భూమిని పరిపాలించిన రాజులలో ఉన్న గొప్ప, బీద అనే తేడా బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యులలో కూడా కనపడుతుంది.

ఇప్పటి దాకాక నేను చెప్పిన మహారాజుల పేర్లు, వారి కీర్తి మాత్రమే వినపడుతూ ఉంది. పౌరాణిక కథలలో మాత్రమే వారి గురించి చెప్పబడింది. వారి జీవితముల గురించి, వారి సంతానము గురించి, ఏ విధమైనవివరాలు ప్రస్తుతము ఎవరికీ తెలియడం లేదు.

ఓ పరీక్షిత్ మహారాజా! చంద్రవంశపు రాజులు అయిన శంతన మహారాజు, అతని సోదరుడు దేవాపి ఇద్దరూ ప్రస్తుతము కలాప అనే గ్రామంలో ఉంటున్నారు. వీరు తమ యోగబలంతో ఎల్లకాలము ఉంటారు.(శంతనుడు భీష్ముని తండ్రి. వీరితోనే మహాభారత కథ మొదలయింది.) వీరు కలియుగము అంతము వరకు జీవించి ఉంటారు. కలియుగము అంతమై కృతయుగము మొదలు కాగానే, పరమాత్మఆదేశాను సారము వీరిరువురు భూలోకములో వర్ణాశ్రమ ధర్మములను ప్రచారం చేస్తారు. ఈ ప్రకారంగా కృత యుగము, త్రేతాయుగము, ద్వాపర యుగము, కలి యుగము అనే నాలుగు యుగములు వస్తూపోతూ ఉంటాయి.

ఓ రాజా! పూర్వపు రాజులు, బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్య,శూద్రులు అందరూ ఒకరిమీద రాగద్వేషములతో జీవించి మరణించారు. వారు ఈ భూమి మీద కొద్దికాలము మాత్రమే ఉన్నారు. ఆ కొద్దికాలములో వారు ఎన్నో పాపాలు చేసారు. ఎందరినో హింసించారు. దాని ఫలితంగా వారు క్రిమి కీటకములుగా పుట్టి అనేక బాధలను అనుభవించారు. మానవులుగా ఉన్న కొద్ది కాలంలో, ఎవరైతే సాటి ప్రాణులను హింసిస్తారో, వారు ఏ విధమైన ప్రయోజనమును పొందడు. అలా హింస చేయడం వలన నరకం మాత్రం వస్తుంది. వారంతా అజ్ఞానంతో బాధపడుతుంటారు. ఈ దేహమే శాశ్వతమని నమ్ముతారు. ఈ భూమి మీద కనపడే వస్తువులు, ధనము, ఆస్తులు అన్నీ శాశ్వతము అనుకుంటారు. మరణించేటప్పుడు ఇవేవీ వారి వెంట రావు అని తెలుసుకోలేరు. అదే అజ్ఞానము.

ఓ మహారాజా! పూర్వకాలంలో ఒక వెలుగు వెలిగి, ఎన్నో యుద్ధములను చేసి, రాజ్యములను సంపాదించి, ధనమును సంపాదించి, రాజ్య భోగములను అనుభవించి, తాము శాశ్వతంగా ఈ భూమి మీద ఉంటాము అనే మదంతో, గర్వంతో విర్రవీగిన వారంతా కాల గర్భంలో కలిసిపోయారు. ఎవరూ ఈ భూమి మీద శాశ్వతంగా లేరు. చివరకు వారి పేర్లుకూడా చాలామందికి గుర్తులేవు. కేవలం పౌరాణిక కథలలో మాత్రం వారి గురించిన ప్రస్తావన ఉంది. ఇతర గుర్తులు ఏమీ లేవు." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కలియుగము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము
ద్వాదశ స్కంధము రెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ద్వాదశ స్కంధము
మూడవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు కలియుగంలో కలిగే దోషములు, వాటికి నివారణోపాయముల గురించి చెబుతున్నాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఒక్కోసారి ఈ భూదేవి తనను పాలించే మహారాజులను, వారి గర్వమును, మదమును చూచి ఈ ప్రకారంగా పరిహాసంగా తనలో తాను ఇలా అనుకుంటూ ఉంటుంది.

"ఆహా! ఏమి విచిత్రము. ఈ రాజులందరూ మృత్యువు చేతిలో ఆటవస్తువులు అయి ఉండి కూడా, తామే అమితమైన పరాక్రమ వంతులమని విర్రవీగుతూ నన్ను జయించడానికి అనేకములైన యుద్ధములు చేస్తూ, ఒకరిని ఒకరు చంపుకుంటున్నారు." అని అనుకుంటూ ఉంది.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ రాజులకు తమ జీవితములు నీటి బుడగలు అని తెలియదు. ఈ శరీరము శాశ్వతము, తాము పాలించే రాజ్యము శాశ్వతము అనే భ్రమలో ఉంటున్నారు. పోనీ వారేమన్నా చదువుకోని మూర్ఖులా అంటే అదీ కాదు. వారు అన్నిశాస్త్రములు చదివిన వారు. కాని ఈ శరీరము శాశ్వతము అనే భ్రమలో ఉంటారు. శాశ్వతంగా ఈ భూమిని పాలించాలి అనే కోరిక ఎన్నడూ తీరదుకదా! రాజ్యాలు జయించాలి, ఇతర రాజ్యాలను తమ రాజ్యంలో కలుపుకోవాలి, ఈ భూమినంతా తానొక్కడే ఏలాలి, ఎవరూ తనకు ఎదురు చెప్పకూడదు అనే ఆశావహ మైన చిత్తంతో రాజ్యపాలన చేస్తున్న రాజులు, చక్రవర్తులు, తాము కేవలం కాలమునకు పరిమితమైన వారనీ, ఏ క్షణంలో అయినా తమను మృత్యువు కబళిస్తుందని తెలుసుకోలేకపోతున్నారు. సముద్రం ఎంతవరకు ఉంటుందో అంతవరకు ఉన్న భూమిని జయిస్తున్నారు. పడవలమీద, ఓడలమీద సముద్రమును దాటి ఆవల ఉన్న భూమిని కూడా ఆక్రమిస్తున్నారు.

వీరంతా ఒక విధమైన మూర్ఖత్వంలో ఉన్నారు. ఎందుకంటే, యోగులు, మునులు తమ తమ ఇంద్రియములను, మనస్సును

జయించి ముక్తి మార్గంలో ప్రయాణిస్తుంటే, వీరు కేవలము కొద్దిపాటి భూమి కోసరం సముద్రాలు దాటుతున్నారు. అటువంటి వారు ఆత్మ నిగ్రహాన్ని పాటిస్తూ కూడా తుచ్ఛమైన రాజ్యాధి కారముల కోసం నానాశ్రమ పడుతున్నారు.

మనువు మొదలగు మహారాజులు ఈ రాజ్యభోగములు తుచ్ఛమని తలంచి యోగులై ముక్తిని పొందారు. కాని అజ్ఞానులైన రాజులు ఈ భూమి అంతా తమదే అని యుద్ధములు చేస్తూ రాజ్యములను ఆక్రమించుకుంటున్నారు. ఈభూమి మీద మమకారంతో తండ్రులను, అన్నదమ్ములతో వివాదములు పెంచుకుంటున్నారు. తుదకు వారిని కూడా చంపుతున్నారు. “ఈభూమి అంతా నాది, నీది కాదు” అంటూ గర్వంతో విర్రవీగుతున్న రాజులు, యుద్ధములు చేసి ఇతర రాజులను చంపి తుదకు వారూ చస్తున్నారు.

పృథువు, పురూరవుడు, గాధి, నహుషుడు, భరతుడు, కార్తవీర్యార్జునుడు, మాన్ధాత, సగరుడు, రాముడు, ఖట్వాంగుడు, దుంధుహుడు, రఘువు, తృణబిందువు, యయాతి, శర్యాతి, శంతనుడు, గయుడు, భగీరథుడు, కువలయాశ్వుడు, కకుత్సుడు, నలుడు, నృగుడు, హిరణ్యకశిపుడు, వృత్రుడు, రావణుడు, నముచి, శంబరుడు, నరకుడు, హిరణ్యాక్షుడు, తారకుడు మొదలగు రాక్షసులు, మహారాజులు, సర్వం తెలిసినవారు, శూరులు, వీరులు, సకలం జయించిన వారు, ప్రతిచోటా ఓడిన వారు, ఎవరైనా సరే వీరంతా ఈ భూమి మీద మమకారం కలిగిన వారే. కాని ఎవరూ ఈ భూమిని శాశ్వతంగా పొందలేదు. అందరూ తమ కాలం తీరగానే తమ కోరికలు తీరకుండానే మరణించారు. కేవలం పురాణాలలో, చరిత్రలో

మిగిలిపోయారు.

ఓ పరీక్షిత్ మహారాజా! నేను నీకు పూర్వము ఈ భూమిని పాలించిన మహారాజులు, చక్రవర్తుల గురించి చెప్పాను. ఇంకా ఏ విషయం తెలుసుకోదలిచావో అడుగు!" అన్నాడు శుకమహర్షి. అప్పుడు పరీక్షిత్ మహారాజు ఇలా అడిగాడు.

"ఓ మునీంద్రా! కలి ప్రభావం కలి యుగంలో ఎక్కువగా ఉంటుందని చెప్పారు కదా! మానవులు ఏయేమార్గములను అనుసరించి ఈ కలిప్రభావం నుండి తప్పించుకోగలరు నాకు తెలియచెయ్యండి. ఓ మహర్షీ! యుగాల పేర్లు, యుగముల ధర్మములు, ఈ యుగముల స్థితి, ప్రళయము, ఈ యుగముల యొక్క కాల పరిమాణము, కాలస్వరూపుడు అయిన భగవానుని స్వరూపము వీటి గురించి నాకు తెలియజేయవలసినది." అని వినయంగా అడిగాడు. అప్పుడు శుక యోగీంద్రులు ఈవిధంగా చెప్పసాగాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! కృతయుగములో ఆ నాడు నివసిస్తున్న మానవులు అనుష్ఠించిన ధర్మము నాలుగు పాదములతో నడిచింది. ఆ నాలుగు పాదములు ఏవంటే....సత్యము (సత్ పదార్థము,అసత్ పదార్థము ఈ రెండింటికీ భేదము తెలుసుకున్న వాళ్లు,). దయ (అన్ని జీవులలో పరమాత్ముడు ఆత్మస్వరూపుడుగా ఉ న్నాడని నమ్మి, సాటి మనుషుల మీద, సాటి జంతువులు, పక్షుల మీద దయతో ఉండేవాళ్లు), తపస్సు (పరమాత్మ గురించి తపస్సు చేసే వాళ్లు. తాము చేసే ఏ ధర్మ కార్యమైనా ఒక తపస్సుమాదిరి చేసేవాళ్లు.)

దానము (తమకు ఉన్న సంపదను, వస్తువులను ఇతరులతో పంచుకొనేవాళ్లు. తమ శక్తి మేరకు దానములు చేసేవాళ్లు.) ఇవీ ధర్మము యొక్క నాలుగు పాదములు. అవి కృతయుగములో చక్కగా అనుష్ఠింపబడేవి.

కృతయుగములో మానవులు తృప్తిగా జీవించేవారు. ఉన్నదానితో సంతుష్ఠిగా ఉండేవాళ్లు. సాటి మానవుల మీద, ప్రాణుల మీద దయగలిగి ఉండేవాళ్లు. అందరితో మిత్రత్వము, ప్రేమ, సౌహార్ద్రత్వము పంచుకొనేవాళ్లు. ఎల్లప్పుడూ మనస్సును ప్రశాంతంగా ఉంచుకొనే వాళ్లు. ఓర్పుకలిగి ఉండేవాళ్లు. ఉన్నదానితో తృప్తి పడేవాళ్లు. లేని దాని కోసం తాపత్రయపడేవాళ్లు కాదు. లోకంలో ఉన్న అందరినీ గొప్ప, బీద తేడా లేకుండా సమానంగా ఆదరించేవారు. ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయములలో కాకుండా, ఆత్మను గురించి తెలుసుకోవడంలో ఎక్కువ సమయం గడిపేవారు.

తరువాత త్రేతాయుగము ప్రవేశించింది. త్రేతాయుగములో మానవులు అసత్‌పదార్థములను సత్ పదార్థములుగా నమ్మడం, అబద్ధాలు చెప్పడం మొదలు పెట్టారు. హింస చేయడం పరిపాటిగా మారింది. ఏదో ఒక దు:ఖంతో బాధపడేవారు. మనసుకు సంతోషం అనేది లేదు. ఒకరితో ఒకరు తగవులాడుకోవడం, కలహించుకోవడం యుద్ధాలు చేసుకోవడం మొదలయింది. ఈ అవలక్షణములతో కూడిన త్రేతాయుగములో ధర్మము యొక్క ఒక కాలు క్షీణించింది. త్రేతాయుగములో మానవుడు యజ్ఞములు యాగములు చేసేవారు. వాటిలో జంతువులను చంపేవారు. కాని సత్వగుణము ప్రధానంగా కల బ్రాహ్మణులు మాత్రం తపస్సు చేసుకొనే వారు. హింస చేసేవారు కాదు.

ప్రాపంచిక విషయములను పట్టించుకొనేవారు కాదు. వేదములను అధ్యయనం చేసేవారు. త్రేతాయుగంలో బ్రాహ్మణులు ప్రధాన పాత్ర వహించేవాళ్లు.

తరువాత ద్వాపర యుగము ప్రవేశించింది. ద్వాపర యుగములో హింస, దుఃఖము, మాయలు చేయడం, మోసగించడం, ఒకరి మీద ఒకరు ద్వేషభావంతో ఉండటం మొదలయింది. దానితో ద్వాపర యుగంలో మరొక పాదము క్షీణించింది. అంటే ధర్మంలో సగ భాగము తగ్గిపోయింది. ద్వాపరంలో బ్రాహ్మణులతో పాటు క్షత్రియులు కూడా ప్రధాన పాత్ర వహించారు. వర్ణాశ్రమ ధర్మములను ఆచరించే వారు. మానవులు ఎక్కువగా కీర్తి కొరకు పాకులాడేవాళ్లు. మంచి స్వభావంతో ఉండేవాళ్లు. వేదములను అధ్యయనం చేసేవాళ్లు. ధనం, బంగారము సమృద్ధిగా ఉండేది. ఉమ్మడి కుటుంబాలు ఉండేవి. అంతా కలిసి ఉండేవాళ్లు. వీరు ఎక్కువగా బ్రాహ్మణులు, క్షత్రియులు.

తరువాత కలియుగము ప్రవేశించింది. కలియుగంలో మూడవ పాదం కూడా క్షీణించి, ధర్మం ఒక పాదంతో నడుస్తుంది. ఆ ఒక్కపాదం కూడా కాలక్రమేణా క్షీణించిపోతుంది. కేవలం అధర్మమే రాజ్యమేలుతుంది. కలియుగంలో మానవులు లోభత్వము (అంతా నాకే కావాలనే కాంక్ష), దుర్మార్గము, దురాచారము ఎక్కువగా ఉంటుంది. అనవసరంగా ఒకరితో ఒకరు తగవులాడుకుంటారు. ఎన్ని సంపదలు ఉన్నా సంతోషం అనేది ఉండదు. ఇంకా ఏదో కావాలని ఏడుస్తుంటారు. కోరికలు ఎక్కువ. అవి తీరకపోతే కోపము. విషయ వాంఛలు, స్త్రీలోలత్వము ఎక్కువ.

కలియుగంలో బ్రాహ్మణ, క్షత్రియుల ప్రాబల్యముతగ్గి శూద్రులు ప్రధానంగా గౌరవింపబడతారు. మానవులలో ఉన్న సత్వ,రజస్తమోగుణముల ఎక్కువ తక్కువల వలన యుగధర్మములు మారుతుంటాయి.

కాబట్టి ఏ రోజుల్లో అయితే మనస్సు బుద్ధి ఇంద్రియములు సాత్విక గుణములను సంతరించుకుంటాయో, మానవులు సత్వగుణ ప్రధానులుగా ఉంటారో, ఏ కాలంలో మానవులు జ్ఞానము సంపాదించడానికి తపస్సు చేయడానికి ప్రాధాన్యత ఇస్తారో దానినే సత్యయుగము అని అంటారు.

ఏ కాలంలో కోరికలతో కూడిన కర్మల యందు మానవులు ఆసక్తి కలిగి ఉంటారో, కీర్తి కోసం పాకులాడుతుంటారో, ఎప్పుడైతే మానవులు రజోగుణ ప్రధానులుగా ఉంటారో, ఆ కాలమును త్రేతాయుగము అని అనవచ్చు.

ఏ కాలంలో లోభము, దు:ఖము, దాంభికము, మాత్సర్యము, అధికమైన కోరికలు వీటిమీద మక్కువ పెరుగుతుందో, ఆ కాలమును రజోగుణము తమోగుణము కలిసిన ద్వాపరయుగము అని తెలుసుకోవచ్చు.

ఏ కాలంలో మోసము, ద్రోహము, అసత్యము, సోమరితనము, నిద్ర, హింస, నిరంతర విషాదము, ఏడుపు, మోహము, భయము, దీనత్వము, ఏర్పడతాయో అదే తమోగుణ ప్రధానమైన

కలియుగము అని తెలుసుకోవచ్చు.

కలియుగములో మానవులు బుద్ధి మందగిస్తుంది. వారు ఎప్పుడూ దేనికో ఒక దానికి ఏడుస్తుంటారు. సంతోషం అనేది ఉండదు. ఉన్నా ఎక్కువ కాలం ఉండదు. ఎక్కువగా ఆహారం వేళాపాళా లేకుండా తింటూనే ఉంటారు. సంపద కొంతమంది వద్దనే ఉంటుంది. అధికభాగం దరిద్రంతో బాధపడుతుంటారు. ఎక్కువగా స్త్రీ సుఖం కోసం ఆరాటపడుతుంటారు.

స్త్రీలు కూడా స్వేచ్ఛగా జీవించడానికి మొగ్గుచూపుతారు. శీలము గురించి ఆలోచించరు. దొంగతనాలు ఎక్కువగా ఉంటాయి. వేదములను శాస్త్రములను విమర్శించడం ఎక్కువగా చేస్తారు. వేదములను అధ్యయనం చేయడం మీద ఆసక్తి చూపరు. రాజులు, ప్రజాపాలకులు ప్రజలను దోచుకుంటారు. బ్రాహ్మణులు ఎక్కువగా తమ పొట్ట పోసుకోవడానికి స్త్రీసుఖములు అనుభవించడానికి ప్రాధాన్యం ఇస్తారు. పెళ్లి కాని యువకులు, యువతులు నీతి నియమాలు లేకుండా ప్రవర్తిస్తుంటారు.

గృహస్థులు అతిధులకు ఆతిథ్యం ఇవ్వడం  మరిచిపోయి, వారే మరొకరి దగ్గర అడుక్కుంటారు. వానప్రస్థ ఆశ్రమం స్వీకరించినవారు, సన్యాసులు ఎక్కువగా పట్టణాలలో, నగరాలలో నివసిస్తూ, ధనం కోసం, ఆస్తులకోసం పాకులాడుతూ విలాసాలలో మునిగి తేలుతుంటారు. మానవులు పొట్టిగా ఉంటారు. ఎక్కువగా వేళాపాళా లేకుండా తింటుంటారు. స్త్రీలు ఎక్కువగా సంతానాన్ని

కంటారు. స్త్రీలలో సహజమైన సిగ్గు, బిడియం ఉండదు. మృదువుగా మాట్లాడవలసిన స్త్రీలు కటువుగా, అనరాని మాటలు మాట్లాడతారు. స్త్రీలు కూడా దొంగతనాలు, మోసాలు, సాహసం చేయడం ఇటువంటి వాటిల్లో ప్రావీణ్యం సంపాదిస్తారు.

వ్యాపారం చేసేవారు అధర్మానికి మోసానికి పాల్పడతారు. కొనుగోళ్లు అమ్మకాలు కపటం ప్రదర్శిస్తారు. మానవులు చేయకూడని పనుల మీద ఎక్కువ మక్కువ చూపుతారు. వాటినే ఉత్తమమైనవి అనుకుంటూ చేయకూడని పనులు చెడ్డ పనులు చేస్తుంటారు. పరిపాలకులు ధర్మంగా పరిపాలిస్తున్నా, వారి వద్ద ధనం లేకపోతే, వారి వద్ద పనిచేసేవాళ్లు పాలకులను వదిలి వెళ్లిపోతారు.

ఉద్యోగులు తమ వృత్తుల మీద సామర్థ్యము చూపక పోతే, యజమానులు వారిని ఉద్యోగముల నుండి తీసివేస్తారు. కలి యుగంలో ఆవులు పాలు ఇచ్చినన్నాళ్లు తాగి, పాలు వట్టిపోగానే, ఆవులను వధశాలకు అమ్మేస్తారు. కలియుగంలో మానవులు కన్న తల్లి తండ్రులను, తోడబుట్టిన వారిని వదిలిపెట్టి, భార్య వైపు బంధువులైన బావమరుదులు, మరదళ్ల మీద ఎక్కువ మక్కువ చూపుతారు. మరదళ్లతో కామసంబంధములు కలిగి ఉంటారు. శూద్రులు తపస్సు చేస్తారు. సన్యాసం స్వీకరిస్తారు. కాని ఇతరుల వద్ద నుండి ధనం తీసుకుంటూ ఉంటారు. ధర్మము అంటే ఏమీ తెలియని వారు కూడా ఉన్నత ఆసనములు ఎక్కి ధర్మము గురించి ఉపన్యాసములు, ఉపదేశములు ఇస్తుంటారు.

ఓ రాజా! కలియుగంలో అన్నానికి (ధాన్యానికి) కరువు ఏర్పడుతుంది. ప్రజలు అనావృష్టి (కరువు)తో బాధపడతారు. మానవులు ఎల్లప్పుడూ ఏదో ఒక విధంగా మానసిక ఒత్తిడికి గురి అవుతుంటారు. కరవు కాటకములలో కూడా రాజులు, పాలకులు అధికమైన పన్నులు వసూలు చేస్తుంటారు. ఆ పన్నులు కట్టలేక ప్రజలు నానాబాధలు పడుతుంటారు. తినడానికి తిండి, కట్టడానికి గుడ్డ లేకుండా బాధలు పడతారు. ఆభరణములు సామాన్యులకు అందుబాటులో ఉండవు. ఎక్కువగా మానవులు ఆహార, శయ్యా, మైథునాలు అంటే తినడం, పడుకోవడం, స్త్రీసుఖం అనుభవించడం వీటి మీదనే మక్కువ చూపుతారు. స్నానం కూడా చెయ్యరు. పిశాచాల మాదిరి అర్ధరాత్రి వరకు వీధుల్లో తిరుగుతుంటారు.

ఓ రాజా! కలికాలంలో కొద్ది పాటి ధనం కోసరం బంధుత్వాలు కూడా మరిచిపోయి ఒకరితో ఒకరు తగవులాడుకొని, ఒకరికి ఒకరు చంపుకుంటారు. (ఈ విషయాలు మనం ప్రతిరోజూ వార్తలలో చదువుతుంటాము. నేను మేజిస్ట్రేటుగా చేస్తున్న రోజుల్లో ఒకడు తండ్రిని బీడి ఇమ్మని అడిగాడు. తండ్రి ఇవ్వలేదు. కొడుక్కు కోపం వచ్చింది. తండ్రి అని కూడా చూడకుండా పక్కనే ఉన్న రోకలి తీసుకొని తండ్రి తలమీద మోదాడు. తండ్రి కుప్పకూలి మరణించాడు. డబ్బు కోసం కన్నబిడ్డలను అమ్ముకోవడం, చంపుకోవడం గురించి మనం వింటున్నాము. అంతా కలి ప్రభావము.)

ఎంత సేపూ తను, తన భార్య, బిడ్డలు వీరు తప్ప మరో ప్రపంచం ఎరుగని మానవులు, కేవలం ధన సంపాదన కోసరం,

శారీరక సుఖముల కోసరం, స్త్రీసుఖముల కోసం జీవిస్తారు. వృద్ధులైన కన్న తల్లి తండ్రులను పట్టించుకోరు. మరి కొంతమంది భార్యా సంతానమును వదిలివేసి, మరొక స్త్రీతో సంబంధం పెట్టుకుంటారు. కేవలం వారి సుఖము తప్ప ఎదుటి వారి కష్టసుఖములు పట్టించుకోరు.

ఓ రాజా! కలియుగములో చాలా మంది నాస్తిక మతమును అవలంబిస్తారు. దేవుడు లేడంటారు. భగవంతుని ఆరాధించరు. కనీసం మరణ సమయంలో, మాట కూడా సరిగా రాని సమయంలో, గొంతుకు కఫం అడ్డుపడి శ్వాస ఆడని సమయంలో కూడా కేవలం ధనము, ఆస్తులు, భార్య,సంతానము, బంధువులు, వీరి గురించి ఆరాటపడతాడే కానీ పరమాత్మను గురించి తలచుకోడు.

రాజా! అందరూ అలా ఉండరు. బహు కొద్దిమంది భగవంతుని గురించి చింతిస్తారు. అటువంటి వారిని భగవంతుడు రక్షిస్తాడు. కలియుగంలో సకల జీవులలో అంతర్యామిగా ఉండే పరమాత్మను గురించి వినడం, కీర్తించడం, ధ్యానించడం, పూజించడం, మొదలగు విషయములలో నిమగ్నమై ఉంటేచాలు, మానవుల పాపములన్నీ నశించిపోతాయి.

రాజా! బంగారములో రాగి కలుపుతారు. ఆ రాగిని బంగారము నుండి వేరు చెయ్యాలంటే నీటితో కడిగితే పోదు. అగ్నిలో కాల్చి రాగిని వేరు చేయాలి. అలాగే మానవులు భగవంతుని ధ్యానించడం, కీర్తించడం, స్మరించడం ద్వారానే తమలోని పాపములను పోగొట్టుకోగలరు కానీ ఇతరముల వలన కాదు. కాని

మానవులు చిత్త శుద్ధి లేకుండా, నిర్మలమైన మనస్సు లేకుండా, దేవతారాధన, తపస్సు, ప్రాణాయామము, తీర్థస్నానములు, వ్రతములు, జపము మొదలగునవి ఎన్ని చేసినా ఎటువంటి ఫలితము ఉండదు. (చిత్తశుద్ధిలేని శివపూజలేలరా విశ్వదాభిరామ వినురవేమా అని వేమనగారు చెప్పారు.)

కాబట్టి ఓ పరీక్షిత్ మహారాజా! నీవు కూడా ఆ పరమాత్మను హృదయం నిండా నిలుపుకో. మరణ కాలములో కూడా పరమాత్మను ధ్యానిస్తే, ఉత్తమ గతులు పొందుతావు. ప్రతి మానవుడు కూడా మరణ కాలములో శ్రీహరిని ధ్యానించాలి. శ్రీహరి మీదనే మనసు నిలపాలి. మరణించిన తరువాత ఆ మానవుడు శ్రీహరిలో ఐక్యం అయ్యేఅవకాశం ఉంది. ఈ కలియుగములో ముక్తి పొందడానికి శ్రీహరి నామ స్మరణ ఒక్కటే ఏకైక మార్గము. మరొకటి లేదు. ఓ పరీక్షిత్ మహారాజా! మరలా చెబుతున్నాను విను. కృతయుగంలో పరమాత్మను ధ్యానించడం, త్రేతాయుగంలో యజ్ఞయాగముల ద్వారా ఆయనకు ఆహుతులు అర్పించడం, ద్వాపరంలో పరమాత్మను అర్చించడం, ద్వారా ఏయే ఫలములు కలిగాయో, ఆ ఫలములు అన్నీ  కలియుగంలో కేవలం శ్రీహరి నామ సంకీర్తనం ద్వారా కలుగుతాయి." అని శుక మహర్షి మహారాజుకు కలియుగమును గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము మూడవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము

నాలుగవ అధ్యాయము.

శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు నాలుగు విధములైన ప్రళయముల గురించి వివరించాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఇప్పటి వరకు నీకు పరమాణువు నుండి బ్రహ్మాండము వరకు వివరించాను. ఇప్పుడు నీకు కల్పములు, వాటి లయము గురించి వివరిస్తాను. ఓ పరీక్షిత్ మహారాజా! మానవులకు 365 రోజులు ఒక సంవత్సర కాలము. ఈ ప్రకారంగా 1200 దివ్య సంవత్సరములు ఒక యుగము. అటువంటి యుగములు నాలుగు కలిపి ఒక మహాయుగము అంటారు. అటువంటి 1000 మహాయుగములు అంటే 4000 యుగములు బ్రహ్మకు ఒక పగలు. దానినే కల్పము అంటారు.

ఈ కల్పము 14 మన్వంతరములుగా విభజించబడింది. ఒక్కొక్క మన్వంతరమును ఒక్కొక్క మనువు పరిపాలిస్తాడు. కల్పము ఆఖరున అంటే 14 మనువుల కాలము పూర్తి అయిన తరువాత అంటే బ్రహ్మకు పగలు అయిపోయి రాత్రి కాగానే ప్రళయం వస్తుంది. ఈ సృష్టిని అంతా బ్రహ్మ తనలోకి లాక్కుంటాడు. మూడులోకములు అంటే మానవ లోకము, భువర్లోకము, సువర్లోకము అన్నీ బ్రహ్మలో లయం అయి పోతాయి. అప్పుడు నారాయణ మూర్తి ఒక్కడే మిగులుతాడు. బ్రహ్మకూడా నారాయణునిలో కలిసిపోయి నిద్రపోతాడు. దీనినే

నైమిత్తిక ప్రళయము అని అంటారు.

ఈ ప్రకారంగా బ్రహ్మకు నూరేళ్లు నిండగానే ఈ అనంత విశ్వం అంతా లయం అయిపోతుంది. దానినే ప్రాకృతిక ప్రళయం అంటారు. అంతా శూన్యం అవుతుంది. ఈ అనంత విశ్వం అంతా పరమాణువులోకి లయం అవుతుంది. (అదే బిగ్ బాంగ్ కు ముందు ఉన్న దశ.) అప్పుడు భూమి పరిస్థితి ఎలా ఉంటుంది అంటే నూరు సంవత్సరముల పాటు వర్షములు కురవవు. అన్నం, నీరు లేక జనం ఒకరిని ఒకరు తింటూ, నశించిపోతారు.

ఆ కాలంలో ఉన్న సూర్యుని పేరు సంవర్తకుడు. మహాసముద్రములలోని నీరు ఆవిరి అయిపోతాయి గానీ, వర్షాలు మాత్రం కురవవు. సంకర్షణుని ముఖం నుండి అగ్నిజ్వాలలు లేస్తాయి. అవి భూమండలమును నాశనం చేస్తాయి. భూమి పైన సూర్యుని ప్రచండ కిరణములు, భూమి లోపల నుండి అగ్ని భూమిని తపింప చేస్తాయి. భూమి ఒక అగ్నిగోళంగా మారుతుంది. అప్పుడు వేడి గాలులు ప్రచండంగా వీస్తాయి. ఆ విధంగా నూరు సంవత్సరములు గడుస్తాయి. ఆకాశం అంతా ఎర్రగా అవుతుంది.

ఆ తరువాత మొదలవుతుంది అతివృష్టి. అప్పటికే ఆకాశములో చేరిన మేఘములు పేరుకొని ఉండటం వలన ఆ మేఘాలు వర్షించడం మొదలు పెడతాయి. ఆ విధంగా ఎడతెరిపి లేకుండా నూరు సంవత్సరముల పాటు వర్షం కురుస్తుంది. ఈ భూమి మొత్తం జలమయం అవుతుంది. ఎక్కడ చూచినా నీరు. భూమి అనేది

కనపడదు. అదే భూమికి వచ్చే మహా ప్రళయము. భూమికి ఉన్న వాసన అనే గుణమును అప్పటి దాకా భగభగమండించిన అగ్ని హరిస్తుంది. అప్పుడు వాయువు అగ్నిని తనలో కలుపుకుంటుంది. వాయువు అనంత విశ్వంలో కలిసిపోతుంది. అప్పుడు ఆకాశం అహంకారంలో కలిసిపోతుంది. (అంటే ఆకాశంలో వస్తువు అనే పదార్థం అనేది ఏదీ ఉండదు. అంతా శూన్యం అయిపోతుంది.) అహంకారము అంటే సాత్విక, రాజసిక, తామసిక అనే మూడు గుణములతో కూడిన అహంకారములు మహా తత్వములో కలిసిపోతాయి. మహాతత్వము ప్రకృతిలోనూ, ప్రకృతి పురుషునిలోనూ కలిసిపోతుంది. (ఇక్కడ ఒక విషయం గమనించాలి. ఈ అనంత విశ్వం ఎలా ఆవిర్భవించిందో అదే క్రమంలో ఒక దానిలో ఒకటి లయం అయిపోతూ ఉంది.) దీనినే ప్రాకృతిక ప్రళయము అని అంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! ఈ సృష్టికి మూలము బ్రహ్మము. ఈయన నుండి బుద్ధి,మనస్సు, ఇంద్రియములు, విషయములు గా ఆవిర్భవిస్తాయి. దీనినే ప్రపంచము అంటారు. ఈ ప్రపంచములోనే ఉత్పత్తి, స్థితి, లయములు జరుగుతుంటాయి. బయట ఉన్న దృశ్యములకు అనుగుణంగా శరీరం ప్రవర్తిస్తుంది. కాని బయట కనపడే ఈ ప్రపంచమునకు అస్థిత్వము లేదు. నిరంతరము మారుతూ ఉంటుంది. కాబట్టి ఈ బాహ్య ప్రపంచము అసత్యము. అశాశ్వతము.

మనస్సు బుద్ధి కలిసి బాహ్య ప్రపంచములో ఉన్న విషయములను గ్రహిస్తుంటాయి. ఈ బుద్ధికి మనస్సుకు మూడు అవస్థలు ఉన్నాయి. జాగ్రదావస్థ అంటే మేలుకొని ఉండటం. స్వప్నావస్థ అంటే నిద్రపోతూ కలలు కనడం. సుషుప్తావస్థ అంటే కలలు కూడా

లేకుండా గాఢంగా నిద్రపోవడం. మరలా మేల్కొనడం. ఈ మూడు అవస్థలలో మనోబుద్ధులు సంచరిస్తుంటాయి. ఆకాశంలో మేఘాలు పుట్టి, నశించునట్టు ఈ ప్రపంచం అంతా పరబ్రహ్మ తత్వము నుండి పుట్టి, పెరిగి, నశించిపోతుంది. కాబట్టి ఈ బాహ్య ప్రపంచము సత్ పదార్థము కాదు. పుట్టి, నశించి పోయేవి ఏవీ సత్ పదార్థములు కావు. (సత్ పదార్థము అంటే మార్పులేకుండా ఉండేది.) మరి సత్ పదార్థము ఏమిటంటే, మార్పులేకుండా ఉండేది. అదే ఈ అనంత విశ్వ సృష్టికి మూలమైన పరబ్రహ్మ తత్వము. కాబట్టి ఓ పరీక్షిత్ మహారాజా! ఈ అనంత విశ్వములో కనపడే ప్రతిపదార్థము మార్పు చెందేదే, నశించి పోయేదే. దేనికీ శాశ్వతత్వము లేదు.

ఓ రాజా! మరొక విషయం. ఈ ప్రపంచం అంతా మనకు కనపడుతూ ఉంది అంటే ఏదో ప్రకాశము మన కళ్లకు ఈ ప్రపంచాన్ని చూపిస్తూ ఉంది. ఆ నిత్యమైన ప్రకాశమే పరబ్రహ్మము. ఆ ప్రకాశము లేకుండా మనము ఒక అణువును కూడా చూడలేము.

ప్రపంచంలో ఉన్న వస్తువులను చూడటానికి ఏ ప్రకాశము అవసరం లేదు. ప్రతి వస్తువుకు దానికి స్వయం ప్రకాశం ఉంటుంది. దాని వలన చూడగలము అని చాలా మంది వితండ వాదం చేస్తుంటారు. అది తప్పు. ఈ ప్రపంచమే జడము. దీనికి స్వయం ప్రకాశము లేదు. ఏదో ఒక ప్రకాశము దాని మీదపడి ఆ వస్తువును మన కంటికి చూపిస్తూ ఉంది. దానినే బ్రహ్మవస్తుప్రకాశము అని అంటాము.

ఆత్మ నిత్యము, సత్యము. దానికి నాశము లేదు అని అందరికీ తెలుసు. కాని ఆత్మ ఒక్కటే. దానికి నానాత్వము లేదు అనేవాడు అవివేకి. ఆత్మ ఒక్కటైనా అందరిలోనూ వెలుగుతూ ఉంటుంది. సూర్యుడు ఒక్కడే అయినా భూమి మీద ఉన్న అన్నిజలాశయములలోనూ అంటే సముద్రములోనూ, నదిలోనూ సరస్సులోనూ, చిన్న కుంట లోనూ, పాత్రలోనూ ప్రతిఫలిస్తుంటాడు. అనంతమైన వాయువు బయట ఉన్నా ప్రతి శరీరంలోనూ ఉఛ్వాస నిశ్వాస రూపంలో తిరుగుతూ ఉంటుంది.  ఇవన్నీ కేవలము ఆశ్రయాలు. అలాగే ఆత్మ ఒకటే అయినా అన్ని శరీరములను ఉపాధిగా చేసుకొని వెలుగుతూ ఉంటుంది.

బంగారము ముద్ద ఒకటే. కాని ఆ బంగారముతో వివిధ రకములైన ఆభరణములను చేసుకొని ధరిస్తుంటాము. అలాగే అహంకార పూరితులైన మానవులు తమ తమ కోరికలకు, తమతమ భావాలకు అనుసరించి పరమాత్మకు అనేక రూపములను నామములను కల్పించి పూజిస్తూ ఉంటారు.

సూర్యుని కిరణముల వేడి చేత భూమి మీద ఉన్న నీరు ఆవిరి అయి మేఘములుగా మారుతుంది. అవే మేఘములు సూర్యునికి అడ్డుగా వచ్చి భూమి మీద సూర్యరశ్మి పడకుండా చేస్తాయి. మనకు సూర్యుడికి అడ్డుగా నిలుస్తాయి. అలాగే పరమాత్మ నుండి ప్రకృతి, మహత్తత్వము, అహంకారము పుట్టాయి. అదే అహంకారము మానవునిలో ప్రవేశించి, పరమాత్మను చూడకుండా చేస్తాయి. మానవునికి పరమాత్మకు మధ్య అడ్డంగా నిలుస్తాయి.

ఎప్పుడైతే గాలి బలంగా వీచి మేఘాలు చెల్లాచెదరు అయినప్పుడు మనకు సూర్యుని వెలుగు కనపడుతుందో, అలాగే జ్ఞానము, పరమాత్మను తెలుసుకోవాలనే జిజ్ఞాస  మానవునిలో కలిగినపుడు, అహంకారము అనే మేఘములు చెల్లాచెదరు అయి పోయి మనకు పరమాత్మ సాక్షాత్కారం లభిస్తుంది. ఎప్పుడైతే జీవాత్మ తాను సంపాదించిన జ్ఞానము అనే కత్తితో మాయను, అహంకారమును, సంసారబంధనములను ఛేదిస్తాడో అప్పుడు జీవాత్మ పరిపూర్ణమైన ఆత్మస్వరూపుడుగా మారుతాడు. దానినే ఆత్యంతిక ప్రళయము అని అంటారు.

ఓ పరీక్షిత్ మహారాజా! కొందరుజ్ఞానులు ఈ సృష్టిలో అనుక్షణం ఈ భూతకోటికి ప్రళయం సంభవిస్తూ ఉంటుంది అని అంటుంటారు. (ప్రతీక్షణం మన శరీరంలో కూడా కొన్ని జీవకణాలు చనిపోయి కొత్త కణాలు పుడుతుంటాయని మన శాస్త్రవేత్తలు నిరూపించారు.) నదులలో నీరు ఒక చోట ఉండదు. అనుక్షణం ప్రవహిస్తూనే ఉంటుంది. అలాగే మండుతున్న అగ్ని కీలలు అలా అలా పైపైకి ఎగిసిపడుతుంటాయి. అలాగే జీవులు కూడా అనుక్షణం పెరుగుతుంటారు. తగ్గుతుంటారు. పుడుతుంటారు. మరణిస్తుంటారు. ఇది నిరంతరంగా జరిగే పరిణామము. ఆకాశంలో నక్షత్రాలు, పాలపుంతలు ఉన్నాయి. మన కంటికి అవి స్థిరంగా ఉన్నట్టు కనపడతాయి. కాని అవి అనుక్షణం చలిస్తూనే ఉంటాయి. (భూమి కూడా స్థిరంగా ఉన్నట్టు మనకు కనపడినా అది తన చుట్టు తాను తిరుగుతూ ఉందని మనకు తెలుసు.) అలాగే కాల ప్రభావము చేత జీవులలో కూడా ప్రతి క్షణం కంటికి కనపడని మార్పులు చోటు

చేసుకుంటూ ఉంటాయి.

ఓ పరీక్షిత్ మహారాజా! నీకు నేను నిత్య, నైమిత్తిక, ప్రాకృతిక, ఆత్యంతిక ప్రళయముల గురించి వివరించాను. ఓ పరీక్షిత్ మహారాజా! పరమాత్మయొక్క అవతార లీలా విశేషములను సంపూర్ణంగా వర్ణించడానికి బ్రహ్మకు కూడా సాధ్యము కాదు. నాకు తెలిసినంతవరకు నీకు చెప్పాను. ఈ ప్రపంచములో ఉన్న మానవులు తమ తమ దు:ఖములను పోగొట్టుకోడానికి, సంసారము అనే సాగరమును దాటడానికి, ఒకే ఒక మార్గము ఉంది. అదే శ్రీహరి లీలలను వినడం, మననం చేసుకోవడం, కీర్తించడం. ఇది తప్ప మరొక మార్గము లేదు.

ఈ భాగవత పురాణమును పూర్వము నారాయణుడు అనే ఋషి నారదునికి ఉపదేశించాడు. నారదుడు ఈ భాగవత పురాణమును వ్యాసునికి ఉపదేశించాడు. నా తండ్రి అయిన వ్యాసుడు ఈ భాగవత పురాణమును నాకు ఉపదేశించాడు. రాబోవు కాలములో నైమిశారణ్యములో శౌనకుడు మొదలగు మహామునులు గొప్ప సత్రయాగం చేస్తారు. ఆ యాగ సందర్భంలో సూతి అనే పౌరాణికుడు ఈ భాగవత పురాణమును అక్కడ ఉన్న మహామునులకు వివరిస్తాడు. ఆ ప్రకారంగా ఈ భాగవత పురాణము లోకంలో వ్యాప్తిచెందుతుంది." అని శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవతపురాణమును గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము నాలుగవ అధ్యాయము సంపూర్ణం.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము

## ద్వాదశ స్కంధము

## ఐదవ అధ్యాయము.

(పాఠకులకు ఒక మనవి. ఈ భాగవతపురాణమును నైమిశారణ్యంలో, సత్రయాగ సందర్భంలో, సూతి అనే పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు ఈ విధంగా వినిపిస్తున్నాడు అని మనం మొదట్లో చదువుకున్నాము. ఇంతకు ముందు అధ్యాయంతో శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత పురాణం చెప్పడం పూర్తి చేసాడు. ఈ అధ్యాయంలో తన యొక్క ఆఖరి సందేశమును శుకుడు పరీక్షిత్తుకు వినిపిస్తున్నాడు. ఇక్కడ నుండి సూతి శౌనకాది మహామునులకు భాగవత పురాణముచెబుతున్నట్టు నడుస్తుంది. గమనించండి.)

నైమిశారణ్యంలో, సత్రయాగ సందర్భంలో, సూతి అనే పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు భాగవత పురాణమును ఈ విధంగా వినిపిస్తున్నాడు.

"ఓ శౌనకాది మహామునులారా! శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు తన అంతిమ ఉపదేశము ఈ విధంగా చేసాడు.

"ఓ పరీక్షిత్ మహారాజా! ఈ భాగవత పురాణములో శ్రీహరి నిరంతరము కీర్తించబడ్డాడు. అందువలన ఈ భాగవత పురాణమును చదివిన వాడికి భయము, ఆందోళన అనేవి ఉండవు. నీవు కూడా

"నేను మరణిస్తాను" అనే భయాన్ని విడిచిపెట్టు. "నేను ఆత్మ స్వరూపుడను. ఈ దేహము నశిస్తుంది కాని ఆత్మ నశించదు. నేను వేరు ఈ దేహము వేరు." అని తెలుసుకో. ఒక విత్తనము నుండి మరొక విత్తనము పుట్టినట్టు, నీవు, నీ కుమారుల రూపంలో జన్మించావు అనడం పొరపాటు. నీ శరీరం నుండి నీ కుమారుని శరీరం వచ్చి ఉండవచ్చు కాని నీలో ఉన్న ఆత్మవేరు. నీ శరీరం వేరు.

నీకు స్వప్నము వచ్చినపుడు ఆ స్వప్నములో ఎవరో నీ తలను నరికినట్టు కనపడుతుంది. నిద్రలేవగానే నీ తల మామూలుగానే ఉంటుంది. అలాగే ఈ దేహములు వస్తుంటాయి పోతుంటాయి. ఆత్మ నిత్యము. జనన మరణములు ఏది జరిగినా ఈ దేహమునకే కానీ ఆత్మకు కాదు. ఒక కుండ ఉంది. అందులో ఆకాశము (స్పేస్) పరిమితంగా ఉంటుంది. ఆ కుండ పగిలిపోయినపుడు పరిమితంగా ఉన్న కుండ ఆకాశం అనంతాకాశంలో కలిసిపోతుంది. అలాగే ఈ దేహములో పరిమితంగా ఉన్న జీవాత్మ, దేహము పోగానే మరొక దేహములో ప్రవేశిస్తాడు.ఈ వాసనల నుండి శాశ్వతంగా ముక్తి పొందితే పరమాత్మలో లీనం అవుతాడు. నశించేది దేహమే కాని ఆత్మ కాదు.

అన్నిటికీ మూలం మనస్సు. ఈ మనస్సు దేహమును, సత్వ,రజస్తమోగుణములను, కర్మలను సృష్టిస్తుంది. ఆ మనస్సును మాయ సృష్టిస్తుంది. ఈ మాయవలననే జీవునికి సంసార బంధనములు కలుగుతుంటాయి. నీవు ఒక దీపం పెట్టావు. అంటే ప్రమిదలో నూనె పోసి వత్తి వేసి దీపం వెలిగించావు. ప్రమిదలో నూనె ఉన్నంత వరకు దీపం జ్వాజ్వల్యమానంగా వెలుగుతుంది. నూనె

అయిపోగానే కొడి గట్టి ఆరి పోతుంది. అదే ప్రకారము రజోగుణము, తమోగుణముల వలన జీవుడు ప్రాపంచిక విషయములలో సంచరిస్తుంటాడు. కర్మలు చేస్తుంటాడు. బంధనములు అతనిని చుట్టుముడతాయి. ఆ జీవుడే ఆత్మజ్ఞానము సంపాదించుకుంటే అతని కర్మబంధనములు నూనె లేకపోతే దీపం కొడిగట్టి ఆరిపోయినట్టు, అతని సంసార బంధనములు నాశనం అయిపోతాయి. కాబట్టి ఆత్మజ్ఞానము  ముఖ్యము.

ఈ దేహమునకంటే భిన్నమైన ఆత్మ కు నాశనము లేదు. కేవలం దేహం మాత్రమే నాశనం అవుతుంది. ఆత్మకు చావు లేదు పుట్టుక లేదు. అది నిర్వికారము. అనంతము. నిరుపమానము. కేవలము దేహములో ఉండటం చేత దేహముగా ప్రకటితమౌతూ ఉంది.

ఓ పరీక్షిత్ మహారాజా! తక్షకుని కాటు చేత నీ శరీరం మాత్రమే పోతుంది. నీవు ఆత్మస్వరూపుడుగా ఉంటావు. కాబట్టి ఆ ఆత్మ స్వరూపమును గురించి ఆలోచించు. ఈ అశాశ్వతమైన దేహమును గురించి మరిచిపో. నీవు ఎప్పుడైతే నేను ఆత్మస్వరూపుడను అని అనుకున్నావో ఆ తక్షకుడు కాదు ఎవరైనా నిన్ను ఏమీ చేయలేరు. ఆ మృత్యువు నీ దగ్గరకు కూడా రాదు. ఎందుకంటే ఆత్మకు చావులేదు. "నేను బ్రహ్మ, ఆ బ్రహ్మయే నేను" ఈ భావనను అలవరచుకో. నీ చిత్తమును ఆ పరమాత్మయందు లగ్నం చెయ్యి. అప్పుడు నీకు తక్షకునిలో కూడా పరమాత్మ కనిపిస్తాడు. నీవు, ఆ తక్షకుడు ఇద్దరూ ఆత్మస్వరూపులు అయినపుడు ఒకరిని ఒకరు చంపుకోవడం అంటూ ఏమీ ఉండదు. ఇదే ఆత్మజ్ఞానము.

ఓ పరీక్షిత్ మహారాజా! నీవు నన్ను ఆ పరమాత్మయొక్క లీలావిశేషములను గురించి అడిగావు. నేను భాగవత పురాణమును నీకు వివరంగా చెప్పాను. నీకు ఇంకా ఏమి కావాలో అడుగు." అని అన్నాడు శుకమహర్షి.

శ్రీమద్భాగవతము
ద్వాదశ స్కంధము ఐదవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ద్వాదశ స్కంధము
ఆరవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహాఋషులకు ఇలా వివరిస్తున్నాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! వ్యాస మహర్షి కుమారుడైన శుక మహర్షి పరీక్షిత్ మహారాజును ఈ విధంగా అడిగిన తరువాత, పరీక్షిత్ మహారాజు శుకునితో ఇలా అన్నాడు.

"మునిపుంగవా! నీవు నాకు శ్రీహరి చరిత్రను సాకల్యంగా వివరించావు. నన్ను అనుగ్రహించావు. మీ వంటి మహాఋషుల బోధనలతో సాంసారిక తాపత్రయములలో, కేవలము శరీర

పోషణమునందే నిమగ్నము అయి ఉన్న మా వంటి అవివేకులకు, జ్ఞానోదయం కలుగుతుంది అనడంలో ఆశ్చర్యం లేదు. ఏ పురాణములో శ్రీహరిని గురించి వివరంగా చెప్పారో ఆ భాగవత పురాణమును తమరి ముఖతా నేను పూర్తిగా విన్నాను. నా జన్మ ధన్యం అయింది. ఇప్పుడు నేను మృత్యువుకు భయపడటం లేదు. భయం అంటూ లేని ఆ బ్రహ్మ పదం నాకు దొరికింది. నేను నా మనసును బుద్ధిని పరమాత్మయందు లగ్నం చేసాను. విషయ వాసనలను, ప్రాపంచిక విషయములను, శరీరం మీద ఉన్న మమత మమకారాలను విడిచిపెట్టాను. ఈ శరీరములో నుండి నా ప్రాణములను సునాయాసంగా విడిచిపెడతాను. దానికి నాకు తమరు అనుమతి ప్రసాదించండి. తమరు ఉపదేశములతో కలిగిన జ్ఞానము చేత నాలో ఉన్న అవిద్య తొలగిపోయింది. నా కళ్లకు ఇప్పుడు కల్యాణ స్వరూపుడు అయిన పరమాత్మ ఒక్కడే కనపడుతున్నాడు." అని అన్నాడు పరీక్షిత్ మహారాజు.

పరీక్షిత్ మహారాజుకోరిక మేరకు శుక మహర్షి ఆయనకు తన ప్రాణములను విడిచిపెట్టడానికి అనుమతి ఇచ్చాడు. తరువాత పరీక్షిత్ మహారాజు శుక మహర్షిని యధోచితంగా పూజించాడు అర్చించాడు. మహారాజు పూజలందుకున్న శుకుడు తన శిష్యులతో అక్కడినుండి వెళ్లి పోయాడు.

తరువాత పరీక్షిత్ మహారాజు దర్భాసనం మీద ఉత్తర దిక్కుగా ముఖం పెట్టి కూర్చున్నాడు. బుద్ధిని మనస్సును ఆత్మలో లగ్నం చేసాడు. నిశ్చలంగా కూర్చుని పరమాత్మను ధ్యానం చేస్తున్నాడు.

ఓ శౌనకాది మహా మునులారా! ఇక్కడ పరిస్థితి ఇలా ఉండగా, బ్రాహ్మణ శాపముచేత ప్రేరితుడైన తక్షకుడు పరీక్షిత్ మహారాజును కాటు వేసి చంపడానికి వస్తున్నాడు. దారిలో కశ్యపుడు అనే బ్రాహ్మణుడు కనిపించాడు. కశ్యపుడు పాము విషమును విరుగుడు చేయడంలో అపారమైన పరిజ్ఞానము కలవాడు. తక్షకుడు ఆ బ్రాహ్మణునకు అపారమైన ధనమును ఇచ్చి వెనక్కు పంపాడు. తాను బ్రాహ్మణ వేషంలో పరీక్షిత్ మహారాజు వద్దకు వెళ్లాడు. పరీక్షిత్తును కాటు వేసాడు. తక్షకుని విషాగ్నికి పరీక్షిత్ మహారాజు శరీరం భస్మం అయింది.

పరీక్షిత్ మహారాజు కాలధర్మం చెందడంతో ఆయన కుమారుడు జనమేజయుడు రాజయ్యాడు. తన తండ్రిని తక్షకుడు అనే సర్పము కాటువేసి చంపింది అన్న విషయం తన మంత్రుల ద్వారా తెలుసుకున్నాడు. జనమేజయుని కోపం తారస్థాయికి చేరింది. లోకంలో ఉన్న పాములను అన్నింటినీ నాశనం చేయడానికి సంకల్పించాడు. సర్పయాగము అనే అభిచార హెూమమును చేయమని ఋత్విక్కులను ఆదేశించాడు.

ఆ హెూమములో లోకంలో ఉన్న పాములు అన్నీ వచ్చి ఆహుతి అవుతున్నాయి. అన్ని రకాల పాములు వస్తున్నాయి కానీ తక్షకుడు రావడం లేదు. తక్షకుడు జనమేజయుడు చేస్తున్న హెూమానికి భయపడి ఇంద్రుని వద్ద దాక్కున్నాడు.

ఈ విషయం తెలుసుకున్న జనమేజయుడు ఋత్విక్కులతో

"మీరు ఎందుకు తక్షకుని ఆహ్వానించడం లేదు. తక్షకుడు ఎందుకు ఆహుతి కాలేదు" అని అడిగాడు.

దానికి ఋత్విక్కులు "మహారాజా! ఈ యాగానికి భయపడి తక్షకుడు ఇంద్రుని వద్ద దాక్కున్నాడు" అని బదులు చెప్పారు. "అయితే ఆ ఇంద్రునితో సహా తక్షకుని ఈ యాగాగ్నిలో ఆహుతి కమ్మని ఆహ్వానించండి." అని ఆదేశించాడు.

ఋత్విక్కులు ఇంద్రునితో సహా తక్షకుని వచ్చి హెూమాగ్నిలో దగ్ధం కమ్మని మంత్రాలు పఠించారు. ఇంద్రుని సింహాసనమునకు చుట్టుకున్న తక్షకునితో సహా ఇంద్రుడు గిరా గిరా తిరుగుతూ హెూమాగ్నిలో పడబోతున్నాడు. ఈ విషయం తెలుసుకున్న దేవగురువు బృహస్పతి వెంటనే జనమేజయుని వద్దకు వచ్చాడు. "రాజా! ఈ తక్షకుడు అమృతమును తాగి అమరుడు అయ్యాడు. కాబట్టి వీడు చావడు. వాడి ఖర్మ వాడు అనుభవిస్తాడు. నీవు ఈ యాగమును నివారించు. సర్పకులమును రక్షించు." అని ప్రార్థించాడు.

బృహస్పతి ప్రార్థనను మన్నించి జనమేజయుడు సర్పయాగమును ఆపమని ఆదేశించాడు. ఆ విధంగా తక్షకుడు, ఇంద్రుడు తమ ప్రాణాలు కాపాడుకున్నారు. జనమేజయుడు బృహస్పతిని అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి పూజించాడు.

ఓ శౌనకాది మహామునులారా! ఈ విధంగా జనమేజయుని

సర్వయాగం సగంలో ఆగి పోయింది. జీవులన్నీ ఆ పరమాత్మ అంశనుండి పుట్టినవారే. జీవులలో సహజంగా ఉన్న సత్వ, రజస్తమో గుణముల ప్రభావంతో వారికి కోపము, మోహము, లోభము మొదలగు గుణములు ఉంటాయి. వాటితో వివిధములైన కర్మలను చేస్తూ కర్మబంధనములలో బంధింపబడతారు. దానినే మాయ అంటారు. దానిని తెలుసు కోవడం ఎవరికీ సాధ్యం కాదు.

ఈ మాయ మానవులను మోహంలో పడేస్తుంది. మానవులలో కపట బుద్ధికి కారణం అవుతుంది. మానవులు ప్రాపంచిక విషయములను, విషయవాంఛలను వదిలిపెట్టి, ఎల్లప్పుడూ ఆత్మ విచారము చేస్తుంటారు. వారి యందు ఈ మాయ ఉండటానికి భయపడుతుంది. అటువంటి వారి మనస్సు సంకల్ప, వికల్పములను విడిచిపెట్టి నిశ్చలంగా ఉంటుంది. నేను ఈ కర్మలు చేస్తున్నాను, ఈ కర్మ ఫలములు నేను అనుభవిస్తాను, అనే అహంకార పూరితమైన భావన ఎవరిలో ఉండదో, అతడే ఆత్మజ్ఞానము కలిగిన వాడు.

మోక్షము కోరుకునే వారు తమ మనస్సును ఆత్మయందు లగ్నం చేసి, ఆత్మానందాన్ని అనుభవించాలి. ధ్యానము, సమాధి వీటి యందు మనస్సును లగ్నం చేసిన పురుషుల హృదయములలో ఏదైతే నిశ్చలంగా ఉంటుందో, "ఇది కాదు ఇది కాదు" అంటూ అనిత్యములైన వాటిని అవతలకు నెట్టి, నిత్యము సత్యము అయిన ఆత్మస్వరూపమును తెలుసుకుంటారో, దానినే విష్ణుపదము అని అంటారు.

ఈ దేహమును, ప్రాపంచిక విషయములను, అహంకార

మమకారములను విడిచిపెట్టిన వారే పరమాత్మ యొక్క అసలు స్వరూపమును తెలుసుకోగలరు. ఇటువంటి వారు నిందలను, ప్రశంసలను సమానంగా స్వీకరించాలి. ఎదుటి వారిని అవమానించకూడదు. ఎవరితోనూ విరోధము పెట్టుకోకూడదు. నిరంతరము శ్రీకృష్ణుని పాదపద్మములను సేవిస్తూ ఉండాలి. అటువంటి శ్రీకృష్ణుని పాదములకు నేను నమస్కరిస్తున్నాను." అని సూత పౌరాణికుడు భక్తితో నమస్కరించాడు.

అప్పుడు శౌనకుడు ఇలా అడిగాడు. "మహాత్మా! వ్యాస మహర్షికి పైలుడు మొదలగు వారు శిష్యులు అని చెప్పారు కదా! వ్యాసుడు వేదములను విభజించాడు అని కూడా చెప్పారు. వ్యాసుని శిష్యులు ఈ విభజింప బడిన వేదములను ఏ విధంగా అనుష్ఠానము చేసారో వివరించండి." అని అడిగాడు. దానికి సూత పౌరాణికుడు ఈ విధంగా చెప్పసాగాడు.

"విష్ణువు నాభి నుండి ఒక పద్మము పుట్టింది. దానిలో నుండి బ్రహ్మ పుట్టాడు అని చెప్పాను కదా. ఆ బ్రహ్మ పరమాత్మ తత్వమును తెలుసుకోడానికి సమాధిలో కూర్చున్నాడు. అప్పుడు బ్రహ్మగారి హృదయం నుండి ఒక శబ్దము వినిపించింది. మనకుకూడా చెవులు మూసుకుంటే ఈ నాదం వినిపిస్తుంది. ఆ నాదము నుండి మూడు అక్షరములతో కూడిన ఓంకారము పుట్టింది. ఆ ఓంకారమే పరమాత్మయొక్క రూపము. వాక్కుకు అదే మూలము.

పరమాత్మ ఓంకార స్వరూపుడు. పరమాత్మకు శరీరము,

ఇంద్రియములు లేవు. ఒక రూపం అంటూ లేదు. కాని ఆయనకు స్వభావ సిద్ధమైన జ్ఞానము ఉంది. ఆయన ఈ ఓంకార ధ్వనిని వింటూ ఉంటాడు. ఈ ఓంకారము ఆత్మ స్వరూపంగా అందరిలో ఉంటుంది. ఆ ఓంకారము నుండి శబ్దము పుట్టింది. అదే వాక్కు. పరమాత్మయే వాక్కు రూపంతో ప్రకటింపబడ్డాడు. వేదములు పుట్టడానికి ఈ వాక్కు మూలము. ఆధారము. ఓంకారములో మూడు వర్ణాలు ఉన్నాయి. అకారము, ఉకారము, మకారము. ఈ మూడు వర్ణములే సత్వ, రజస్, తమోగుణములకు ప్రతీకలు. ఇవే ఋగ్వేదము, సామ వేదము, యజుర్వేదములు అనే పేర్లతో పిలువబడ్డాయి. ఈ మూడు వర్ణములే భూలోకము, భువర్లోకము, సువర్లోకము. ఈ మూడు వర్ణములే మనలో ఉన్న జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తావస్థ.

బ్రహ్మ దేవుడు ఓంకారము నుండి అంతస్థములు, ఊష్మములు, స్వరములు, స్పర్శములు, హ్రస్వములు, దీర్ఘములు అనే అక్షరములను సృష్టించాడు. (వీటినే అచ్చులు, హల్లులు అని అంటాము. ఇవి ప్రపంచములో ఉన్న అన్ని భాషలలో ఒకటిగానే ఉన్నాయి.)

తరువాత బ్రహ్మ తన నాలుగు ముఖముల నుండి ఓంకార సహితంగా నాలుగు వేదములను సృష్టించాడు. ఉచ్ఛారణలో నిపుణులు అయిన మరీచి మొదలగు బ్రహ్మ మానస పుత్రులకు ఈ వేదములను బోధించాడు. మరీచి మొదలగు వారు తమ కుమారులకు ఈ వేద విద్యను బోధించారు. ఆ ప్రకారంగా వేద విద్య గురుశిష్య పరంపరగా నాలుగు యుగములలో అభివృద్ధి చెందింది.

యుగాలు గడుస్తుంటే, కాల ప్రభావంచేత మానవుల

ఆయు: ప్రమాణము, శక్తి, బుద్ధికుశలత తగ్గిపోసాగింది. వేద విద్యను అంతా ఒకే జీవిత కాలంలో నేర్చుకోవడం అసాధ్యం అయింది. ఆ కారణంగా, ద్వాపర యుగము చివరలో వ్యాసమహర్షి అప్పటి వరకు ఒకటిగా కలగా పులగంగా ఉన్న వేదములను ఋగ్వేదము, యజుర్వేదము, సామ వేదము, అధర్వణ వేదము అనే నాలుగు వేదములుగా విభజించాడు.

అది ఎలాగంటే, ప్రస్తుతము మనకు వైవస్వత మన్వంతరము నడుస్తూ ఉంది. ఈ మన్వంతరములో పరమాత్మ ధర్మమును ఉద్ధరించడానికి, వేదములను విభజించడానికి, సత్యవతి పరాశరులకు, సత్వగుణ సంపన్నుడైన వ్యాసుడుగా జన్మించాడు. అప్పటి వరకు ఒకటిగా ఉన్న వేదములను నాలుగు వేదములుగా విభజించాడు. భూమి పొరలలో నిక్షిప్తమై ఉన్న రత్నములను, మణులను బయటకు తీసి వేటికవి విభజించినట్టు, అప్పటి వరకు ఒకటిగా ఉన్న వేద మంత్రములను ఋక్కు, అధర్వ, యజు, సామ వేదములుగా, ప్రకరణములుగా విభజించి, రచించాడు. వాటినే వేద సంహితలు అని అంటారు.

వ్యాస భగవానుడికి నలుగురు శిష్యులు. వారి పేర్లు పైలుడు, వైశంపాయనుడు, జైమిని, సుమంతుడు. వ్యాసభగవానుడు ఋగ్వేద సంహితను పైలునికి, యజుర్వేద సంహితను వైశంపాయనునికి, సామవేదమును జైమినికి, అథర్వ వేద సంహితను సుమంతునికి బోధించాడు.

తరువాతి కాలంలో పైలుడు ఋగ్వేద సంహితను రెండుగా విభజించాడు. ఆ రెండు సంహితలను తన శిష్యులైన ఇంద్రమితి, భాష్కలుడు అనే వారికి ఒక్కొక్కరికి ఒక్కొక్క సంహితను బోధించాడు.

బాష్కలుడు తనకు వ్యాసుడు బోధించిన సంహితను మరలా నాలుగు భాగములుగా విభజించాడు. ఆ నాలుగు భాగములను తన శిష్యులైన భోద్యుడు, యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు, అగ్నిమిత్రుడు అనే వారికి ఉపదేశించాడు.

పైలుడు ఋగ్వేదములో ఒక భాగమును ఇంద్రప్రమితి అనే ఋషికి బోధించాడు అని చెప్పాను కదా. ఆ ఇంద్రప్రమితి ఆ ఋగ్వేదభాగమును మాండుకేయఋషికి ఉపదేశించాడు.

మాండుకేయ ఋషి ఆ ఋగ్వేద సంహితను (ఒక భాగమును) తన కుమారుడైన శాకల్యునికి తన శిష్యులైన దేవ మిత్రుడు, సౌభరి, మొదలగు ఋషులకు ఉపదేశించాడు.

మాండూకేయుని కుమారుడు శాకల్యుడు, తనకు ఉపదేశింపబడిన సంహితను మరలా ఐదుభాగములుగా విభజించాడు. ఆ ఐదు సంహితలను తన శిష్యులైన వాత్స్యుడు, ముద్గల్యుడు, శాలీయుడు, గోఖల్యుడు, శిశిరుడు అనే ఐదుగురు శిష్యులకు ఉపదేశించాడు.

శాకల్యునికి మరొక శిష్యుడు ఉన్నాడు. అతని పేరు

జాతుకర్ణ్యముని. అతడు తనకు ఉపదేశింపబడిన సంహితను మూడు భాగములుగా విభజించాడు. దానికి తోడు నిరుక్తశాస్త్రమును రచించాడు. (నిరుక్తము అంటే వేదములలో ఉన్న క్లిష్టమైన పదములకు అర్థమును, వ్యుత్పత్తి అర్థములను సూచించే ప్రక్రియ). మూడు సంహితలను, నిరుక్తమును తన నలుగురు శిష్యులైన బలాకుడు, పైలుడు, జాబాలుడు, విరజుడు అనే వారికి ఉపదేశించాడు.

పైన చెప్పబడిన బాష్కలుని కుమారుడు ఈ వేద శాఖల నుండి వేద మంత్రములను ఏరి కూర్చి, వాలఖిల్య సంహిత అనే వేద సంహితను రచించాడు. వాలఖిల్య సంహిత అనే ఈ వేద సంహితను అతని శిష్యులైన బాలాయని, భజ్యుడు, కాశారుడు అనే వారికి బోధించాడు.

ఈ ప్రకారంగా వేద విద్య గురు శిష్య పరంపరగా అనేక శాఖలుగా విస్తరించింది. ఋషులు ఈ ఋగ్వేద సంహితలను అధ్యయనము చేసారు.

ఒకసారి వైశంపాయనునికి బ్రహ్మ హత్యాపాతకము చుట్టుకుంది. వైశంపాయనుని ఆ పాతకము నుండి విముక్తి గావించడానికి ఎన్నో వ్రతములను ఆచరించారు. ఆ వ్రతములను ఆచరించిన వారు యజుర్వేదమును అవలంబించారు. వారినే చరకులు అంటారు.

వైశంపాయనుని శిష్యుని పేరు యాజ్ఞవల్క్యుడు. ఆయన

వైశంపాయనునితో ఇలా అన్నాడు. “గురుదేవా! మీ శిష్యులు అయిన చరకులకు ఎక్కువ శక్తి లేదు. వారు  చేసే వ్రతములతో కొద్దిపాటి ప్రయోజనము మాత్రమే కలుగుతుంది. నేను వీరికంటే శక్తి మంతుడను. వీరు చేసే వ్రతముల కంటే ఎక్కువ ఫలితములను ఇచ్చే వ్రతములను ఆచరిస్తాను.” అని అన్నాడు.

ఆ మాటలకు వైశంపాయనునికి కోపం వచ్చింది. “నీవు సాటి బ్రాహ్మణులను అవమానిస్తున్నావు. నీవు శిష్యుడుగా ఉండటం వలన నాకు ఎలాంటి ప్రయోజనము లేదు. నీవు నా వద్దనుండి తక్షణమే వెళ్లిపో. పోయేటప్పుడు నీవు నా వద్ద నుండి నేర్చుకున్న విద్యలను అన్నీ ఇక్కడనే విడిచి వెళ్లు.” అని ఆదేశించాడు.

గురువు గారి మాట ప్రకారము యాజ్ఞవల్క్యుడు, అప్పటి వరకు తాను నేర్చుకున్న యజుర్వేద సంహితలోని మంత్రములను అక్కడనే కక్కి వెళ్లిపోయాడు. వైశంపాయనునితో ఉన్న మునులు వెంటనే తిత్తిరి పక్షుల రూపములు ధరించి, యాజ్ఞవల్క్యుడు కక్కిన యజుర్వేద మంత్రములను తినేసారు. ఆ ప్రకారంగా యజుర్వేదములో కూడా వివిధ శాఖలు  ఏర్పడ్డాయి. తిత్తిరి పక్షుల వలన వచ్చినవి కాబట్టి వాటిని తైత్తిరీయములు అని పేరు వచ్చింది.

వైశంపాయనుడు యాజ్ఞవల్క్యునికి యజుర్వేద సంహితను ఉపదేశించాడు కానీ, చంధస్సును ఉపదేశించలేదు. కాబట్టి యాజ్ఞవల్క్యుడు ఛందస్సును నేర్చుకోవాలని సూర్యదేవుని ఉపాశించాడు. యాజ్ఞవల్క్యుడు సూర్యుడిని ఈ విధంగా

ప్రార్థించాడు.

"ఓ సూర్యదేవా! నీకు నమస్కారము. నీవు కాలస్వరూపుడవు. నీ చలనము గమనము వలననే దినములు, సంవత్సరములు గడుస్తున్నాయి. నీవు నీటిని ఆవిరిగా మార్చి, మేఘములుగా ఏర్పడజేసి మరలా ఆ మేఘములను వర్షముగా కురిపించి ప్రాణులకు జీవనాధారమైన నీటిని ప్రసాదిస్తున్నావు. మానవులు ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం నిన్ను ఉపాశించి, వారి యొక్క పాపములను పోగొట్టుకుంటున్నారు. నీవు నిన్ను ఉపాశించే వారిలో ఉన్న అజ్ఞానమును నాశనం చేస్తున్నావు.

ఓ దేవా! నేను నీ ఎదుట నిలబడి ప్రార్థిస్తున్నాను. నీవు ఈ చరాచర జగత్తులోని జీవులలో ఉన్న మనస్సును, ఇంద్రియములను, ప్రాణములను చైతన్యవంతముగా చేస్తున్నావు. నీవు ప్రతిరోజూ ఉదయమే నీ కిరణములతో ఈ జగత్తును మేలుకొలుపుతున్నావు. జీవులలో చైతన్యమును నింపుతున్నావు. మూడు సంధ్యలలో నిన్ను పూజించడం ద్వారా వారిలోని ఆత్మతత్వమును ప్రవర్తింపజేస్తున్నావు. నీవు సంచరించే మార్గములో లోకపాలకులు అటు ఇటు నిలబడి నిన్ను స్తుతిస్తుంటారు. నీవు దుర్మార్గులకు భయం కలిగిస్తూ సంచరిస్తుంటావు. (అందుకేనేమో ఎక్కువ శాతం నేరాలు, ఘోరాలు, సూర్యుడికి భయపడి, రాత్రిళ్లు జరుగుతుంటాయి.)

ఓ దేవా! నేను ఇప్పుడు ఇతరులకు తెలియని యజుర్వేద మంత్రములను అధ్యయనం చేయాలని సంకల్పించాను. అందుకే నీ

పాద పద్మములను ఆశ్రయించాను." అని ప్రార్థించాడు. సూర్యునికి భక్తితో నమస్కరించాడు.

అప్పుడు సూర్యుడు అశ్వరూపమును ధరించి యాజ్ఞవల్క్యుని వద్దకు వచ్చాడు. ఇతరులకు తెలియని యజుర్వేద మంత్రములను యాజ్ఞ వల్క్యునికి ఉపదేశించాడు.

సూర్యుని వలన తాను నేర్చుకున్న యజుర్వేదమును యాజ్ఞవల్క్యుడు 15 శాఖలుగా విభజించాడు. ఆ 15 శాఖలను తన శిష్యులైన కాణ్వుడు, మాధ్యందినుడు మొదలగు ఋషులకు ఉపదేశించాడు.

వ్యాసుడు సామ వేదమును తన శిష్యుడైన జైమినికి ఉపదేశించాడు అని చెప్పుకున్నాము కదా! సామవేదమును జైమిని రెండు శాఖలుగా విభజించాడు. ఒక శాఖను తనకుమారుడైన సుమంతునికి, మరొక శాఖను తన మనుమడు, సుమంతుని పుత్రుడు అయిన, సుత్వానునకు ఉపదేశించాడు.

జైమిని శిష్యుడైన సుకర్మ ఈ సామవేదమును వేయిశాఖలుగా విభజించాడు. ఆ వేయి శాఖలను సుకర్మ శిష్యులైన హిరణ్యనాభుడు, అవంత్యుడు, పౌష్యంజి అనే వారు స్వీకరించారు.

సుకర్మ శిష్యులైన హిరణ్యనాభుడు, అవంత్యుడు, పౌష్యంజికి 500 మంది శిష్యులు ఉన్నారు. వారంతా ఈ సామవేదమును అధ్యయనం చేసారు.

పౌష్యంజి శిష్యులైన లౌగాక్షి, మాంగలి, కుల్యుడు, కుశీలుడు, కుక్షి అనేవారు ఒక్కొక్కరు 100 సంహితలను స్వీకరించారు.

హిరణ్య నాభుని శిష్యుడైన కృతుడు తన శిష్యులకు 24 సంహితలను, అవంత్యుడు తన శిష్యులకు ఇతర సామవేద శాఖలను ఉపదేశించాడు. ఆ విధంగా సామవేదము శాఖోపశాఖలుగా ఈ లోకములో విస్తరించింది." అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు వేదములు, వాటి శాఖలు, విస్తరణ గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము ఆరవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

## శ్రీమద్భాగవతము

## ద్వాదశ స్కంధము

## ఏడవ అధ్యాయము

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు ఇలా చెబుతున్నాడు.

"బ్రాహ్మణోత్తములారా! వేద విభజన తరువాత వ్యాసుడు అథర్వణ వేదమును సుమంతుడు అనే తన శిష్యునికి ఉపదేశించాడు అని తెలుసుకున్నాము కదా! ఆ సుమంతుడు తన శిష్యుడైన కబంధుడికి అథర్వణ వేద సంహితను ఉపదేశించాడు.

కబంధుడు అథర్వణ వేదమును రెండుగా విభజించి పథ్యుడు, వేదదర్శుడు అనే తన శిష్యులకు బోధించాడు.

వేద దర్శునికి నలుగురు శిష్యులు. వారి పేర్లు శౌక్లాయని, బ్రహ్మబలి, మోదోషుడు, పిప్పలాయని అనే వారు. పథ్యునికి కుముదుడు, శునకుడు, జాజలి అనే వారు శిష్యులు. పథ్యుడు, వేద దర్శుడు అథర్వణ వేదమును తమ తమ శిష్యులకు ఉపదేశించారు.

శునకునికి బభ్రువు, సైంధనాయనుడు అనే వారు శిష్యులు. శునకుడు తాను అభ్యసించిన అథర్వణ వేదమును రెండు భాగములుగా విభజించి తన ఇద్దరు శిష్యులకు ఉపదేశించాడు.

సైంధనాయునుడు తాను అభ్యసించిన అథర్వవేద భాగమును తన శిష్యులైన సావర్ణుడు మొదలగు వారికి నేర్పారు. తరువాత అథర్వణ వేదమును నక్షత్రకల్పుడు, శాంతి కల్పుడు, కశ్యపుడు, అంగిరసుడు, మొదలగు వారు అభ్యసించారు. వారంతా అథర్వవేదాచార్యులుగా ప్రసిద్ధిచెందారు.

బ్రాహ్మణోత్తములారా! ఇప్పుడు నేను పురాణముల గురించి చెబుతాను. త్రయ్యారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృత వర్ణుడు, వైశంపాయనుడు, హారీతుడు అనే ఈ ఆర్గురు పౌరాణిక ఆచార్యులు. ఈ ఆరుగురు ఆరు పురాణ సంహితలను, ఒకొక్కరు ఒక్కొక్క పురాణ సంహిత చొప్పున అధ్యయనం చేసారు. నా తండ్రి రోమహర్షణుడు వ్యాస మహర్షికి శిష్యుడు. నా తండ్రి వద్ద పైన చెప్ప బడిన ఆరుగురు పౌరాణికాచార్యులు శిష్యరికం చేసారు. నాకు ఈ ఆరుగురు ఆచార్యులు. నేను వారి శిష్యుడిగా ఉండి వారి వద్దనుండి ఆరు పురాణసంహితలను నేర్చుకున్నాను.

బ్రాహ్మణోత్తములారా! పురాణము అంటే ఏమిటి? పురాణమునకు ఎలాంటి లక్షణములు ఉండాలి అనే విషయాన్ని వేదములలో చెప్పబడింది. ఆ ప్రకారము బ్రహ్మర్షులు పురాణ లక్షణములను ఈ విధంగా నిర్ణయించారు.

పురాణమునకు పది లక్షణములు ఉండాలి. అవి సృష్టి, వృత్తి, రక్ష, మన్వంతరము, వంశము, వంశానుచరితము, సంస్థ, హేతువు, అపాశ్రయము. ఈ పది లక్షణములు కల శాస్త్రమును పురాణము అని అంటారు. పైన చెప్పబడిన పది లక్షణములు కలిగిన శాస్త్రమును మహా పురాణము అంటారు. కేవలము ఐదు లక్షణములు కలిగిన గ్రంథమును ఉపపురాణము అని అంటారు.

మొదటి లక్షణము సృష్టి అంటే ఏమిటో వివరిస్తాను. మొట్ట మొదట ప్రకృతి ఆవిర్భవించింది. ఆ ప్రకృతి లోనుండి మహత్తత్వము, దానిలో నుండి సత్వ,రజస్తమోగుణములు, మూడు అహంకారములు

ఉద్భవించాయి. వాటి నుండి పంచ తన్మాత్రలు, పంచభూతములు, ఇంద్రియములు, విషయములు, వాటికి అధిష్ఠాన దేవతలు ఉద్భవించారు. ఇవి అన్నీ కలిపి సృష్టి అని అంటారు.

ఇంతకు ముందుజన్మలలో చేసిన కర్మల వాసనల ప్రభావంచేత, ఒక విత్తనము నాటితే అది చెట్టుగా మారి మరలా ఎలా విత్తనములను సృష్టిస్తుందో, జీవులు కూడా ఒకరి నుండి ఒకరు పుడుతుంటారు. ఈ చరాచర జీవ ప్రవాహమునే విసర్గ అని అంటారు.

మానవులు కానీ, జంతువులు కానీ ఇతర జీవులు కానీ, తమను తాము పోషించుకోడానికి తమతమ శక్తిని బట్టి వృత్తులను ఏర్పరచుకుంటాయి. దానినే వృత్తి అంటారు.

ప్రతి యుగంలో మానవులు, ఋషులు, దేవతలు, దానవులు, జంతువులు, పక్షులు మొదలగు జీవజాతులు పుడుతుంటాయి పెరుగుతుంటాయి. ఆయా యుగములలో అధర్మము పెరిగిపోయినపుడు పరమాత్మ అవతరించి అధర్మమును నాశనం చేసి ధర్మమును రక్షిస్తూ ఉంటాడు. దీనినే రక్ష అని అంటారు.

మనువు, దేవతలు, మనువు కుమారులు, ఇంద్రులు, ఋషులు, పరమాత్మ అవతారములు సంభవించే కాలములను మన్వంతరములు అని అంటారు.

ఒక్కొక్క మన్వంతరమునకు ఒక్కొక్క మనువు ఉంటాడు. ప్రతి మన్వంతరమునకు మనువు, ఇంద్రుడు, దేవతలు, సప్తఋషులు మారుతుంటారు. ఇప్పటికి ఆరు మన్వంతరములు గడిచాయి. ప్రస్తుతము వైవస్వత మన్వంతరము నడుస్తూ ఉంది. బ్రహ్మ పుట్టిన దగ్గర నుండి ఇప్పటి వరకు క్షత్రియుల వంశములు వృద్ధి చెందాయి. ఆ వంశములను గూర్చి చెప్పడాన్నే వంశములు, వంశ చరిత్రలు అని అంటారు.

ప్రళయముల గురించి చెప్పాను కదా! నైమిత్తికము, ప్రాకృతికము, నిత్యము, ఆత్యంతికము అనే నాలుగు ప్రళయముల గురించి చెప్పడాన్నే సంస్థ అని అంటారు.

పరమాత్మ అంశయే ఆత్మ. ఆ ఆత్మ ప్రాపంచిక విషయములతో చేరితో జీవాత్మ అవుతుంది. అతనిని అవిద్య ఆవరించి ఉంటుంది. ఈ సృష్టికి అతడే హేతువు. ప్రతి జీవికి జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తావస్థ అనే మూడు అవస్థలు ఉన్నాయి. జాగ్రదావస్థలో ఉన్నప్పుడు జీవులు తమ తమ వృత్తులయందు నిమగ్నమై ఉంటాయి. దీనికంతా ఆశ్రయము ఆ పరబ్రహ్మము. దానినే అపాశ్రయము అని అంటారు.

వివరంగా చెప్పాలంటే మట్టితో కుండను చేస్తారు. కుండ తయారు అయిన తరువాత దానిని కుండ అంటారు కానీ మట్టి అనరు. కుండ పగిలి పోగానే అది మట్టిలో కలిసిపోతుంది. అప్పుడు దానిని మట్టి అంటారు కానీ కుండ అనరు. కాబట్టి మట్టి కుండకు ఆశ్రయము. అలాగే జీవులు పుట్టినప్పటి నుండి మరణించేవరకు, దేహములో జరిగే

అన్ని అవస్థలకు సాక్షీభూతంగా చూస్తూ ఉన్నాడో, అధిష్టానంగా ఉన్నాడో, ఆ ఆత్మస్వరూపుడినే అపాశ్రయము అని అంటారు.

ఓ బ్రాహ్మణోత్తములారా! జీవుల చిత్తము మూడు అవస్థలలో ఉంటుంది. అవే జాగ్రత్త, స్వప్న, సుషుప్తావస్థలు. ఈ మూడు అవస్థలు దాటిన తరువాత వచ్చే అవస్థ అతి సహజమైనది. అది యోగము వలన సిద్ధిస్తుంది. అప్పుడు ప్రాపంచిక విషయములు, మానసిక వికారములు ఉండవు. ఆత్మ ఆత్మలో రమిస్తుంటాడు. జీవుడు ఆత్మస్వరూపంలో లీనమై పోతాడు. పరమానందాన్ని పొందుతాడు. మీరందరూ ఆ ఆత్మస్వరూపమును తెలుసుకోవాలి. పరమాత్మలో లీనం అవ్వాలి. దాని కొరకు ప్రయత్నం చేయండి.

పైన చెప్పబడిన అన్ని లక్షణములను కలిగిన శాస్త్రములను పురాణములు అని చెప్పారు. మహాపురాణములు 18, ఉపపురాణములు 18 ఉన్నాయి.

18 మహాపురాణములు ఏవంటే బ్రాహ్మ పురాణము, పద్మ పురాణము, విష్ణు పురాణము, శివ పురాణము, లింగపురాణము, గరుడ పురాణము, నారద పురాణము, భాగవత పురాణము, అగ్ని పురాణము, స్కంద పురాణము, భవిష్య పురాణము, బ్రహ్మ వైవర్త పురాణము, మార్కండేయ పురాణము, వామన పురాణము, వరాహ పురాణము, మత్స్య పురాణము, కూర్మ పురాణము, బ్రహ్మాండ పురాణము. వీటినే అష్టాదశ పురాణములు అంటే 18 పురాణములు అని అంటారు.

ఈ పురాణములను అన్నింటినీ భగవాన్ వేదవ్యాసుడు రచించాడు అని పెద్దలు చెబుతారు. వాటి గురించి మీకు వివరించాను. ఈ పురాణములు అన్నీ గురు శిష్య పరంపరగా ఈ లోకంలో వ్యాప్తిచెందాయి." అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు వివరించాడు.

శ్రీమద్భాగవతము
ద్వాదశ స్కంధము ఏడవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము
ద్వాదశ స్కంధము
ఎనిమిదవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకాది మునులకు భాగవత పురాణమును ఇలా వినిపిస్తున్నాడు. శౌనకుడు సూత పౌరాణికుని ఇలా అడిగాడు. "మహాత్మా! మానవులు మార్కండేయుని చిరంజీవి అని భావిస్తుంటారు. ప్రళయ కాలంలో ఈ విశ్వం అంతా నీట మునిగి పోగా మార్కండేయుడు ఒక్కడే మిగిలాడు. ఈ కల్పంలోనే కదా మార్కండేయుడు జన్మించాడు. ఈ కల్పం ఇంకా పూర్తి కాలేదు. ప్రళయం రాలేదు. కాని మార్కండేయుడు ప్రళయ కాలంలో అనంత జలములలో వటపత్రము మీద శయనించి ఉన్న పరమాత్మను దర్శించాడు అని వింటున్నాము. ఇది ఎలా సంభవం అయింది. ఈ

విషయంలో మాకు కలిగిన సందేహములను తీర్చండి. నీవే మా సందేహములను తీర్చడానికి సమర్థుడవు." అని అడిగాడు. శౌనకుడు అడిగిన ప్రశ్నకు సూతపౌరాణికుడు ఇలా చెప్పసాగాడు.

"బ్రాహ్మణోత్తమా! మీరు మంచి ప్రశ్న అడిగారు. ఇది తత్వవిచారమునకు సంబంధించిన ప్రశ్న. మార్కండేయుడు జన్మించిన తరువాత అతని తండ్రి మార్కండేయునికి ఉపనయనం చేసాడు. మార్కండేయుడు బ్రహ్మచర్యమును స్వీకరించాడు. వేదములను అధ్యయనము చేసాడు. బ్రహ్మ చర్యము అవలంబించాడు. శాంతచిత్తంతో శాస్త్రములను అభ్యసించాడు. నారచీరలు, జింక చర్మము ధరించేవాడు. ఉదయము సాయంత్రము హెూమం చేసేవాడు. సూర్యునికి అర్ఘ్యము విడిచేవాడు. గురువులకు సేవ చేసేవాడు. భిక్షాటన చేసి భిక్షను తీసుకొని వచ్చి గురువుగారికి ఇచ్చి మిగిలిన దానిని తాను భుజించేవాడు. మిగలకపోతే ఉపవాసము చేసేవాడు.

ఈ ప్రకారంగా మార్కండేయుడు కొన్ని వేల సంవత్సరములు జీవించాడు. మృత్యువును జయించాడు. మార్కండేయుని చూచి బ్రహ్మ, భృగువు, శివుడు, బ్రహ్మమానస పుత్రులు, దేవతాగణములు, పితృదేవతలు, మానవుడు అందరూ ఆశ్చర్యపోయారు. యోగిగా మారిన మార్కండేయుడు తన తపస్సు చేత, వేదాధ్యయనము చేత, సంయమనము చేతా, నిష్టతో కూడిన బ్రహ్మ చర్య వ్రతము చేతా, రాగము, ద్వేషము మొదలగు వాటిని దూరంగా ఉంచి మనసును నిశ్చలంగా ఉంచి, పరమాత్మను సేవించేవాడు.

ఈ ప్రకారంగా మార్కండేయుడు ఆరు మన్వంతరములు గడిపాడు. ఏడవ మన్వంతరము అయిన వైవస్వత మన్వంతరములో ఉన్న ఇంద్రుడు మార్కండేయుని గూర్చి తెలుసుకున్నాడు. మార్కండేయుడు ఎక్కడ తన ఇంద్రపదవిని కోరుకుంటాడేమో అని భయపడ్డాడు. మార్కండేయుని తపస్సుకు భంగం కలిగించాలి అని అనుకున్నాడు. ఆ పని కోసం గంధర్వులను, అప్సరసలను, మన్మథుని, వసంతుని, రజోగుణ ప్రధానులైన లోభమును, మదమును మార్కండేయుని తపస్సు భగ్నం చేయడానికి పంపించాడు.

ఆ సమయంలో మార్కండేయుడు హిమాలయ పర్వతములకు ఉత్తరంగా పుష్పభద్రానదీ తీరాన ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేసుకుంటున్నాడు. ఇంద్రుడు పంపిన కామప్రకోపిత సైన్యము మార్కండేయుని ఆశ్రమానికి చేరుకున్నారు. కామ కోరికలను మనసులో ఉద్దీపింపజేసే మలయ మారుతం వీచసాగింది. వసంత ఋతువు ఆ ఆశ్రమంలో ప్రవేశించింది. పూల మొక్కలు చిగురించాయి. పూల మీది నుండి సుగంధము మార్కండేయుని నాసికాపుటములకు సోకుతూఉంది. చంద్రుడు చల్లని వెన్నెలలు కురిపిస్తున్నాడు. గంధర్వులు మధురంగా గానం చేస్తున్నారు. అప్సరసలు మనోహరంగా ఆడుతున్నారు. పూలబాణములను ధరించిన మన్మథుడు సమయం కోసం వేచిఉన్నాడు.

మూర్తీభవించిన అగ్ని దేవుని మాదిరి వెలిగిపోతున్న మార్కండేయుని చూచారు ఇంద్రుని అనుచరులైన మన్మథుడు

మొదలగువారు. అప్సరసలు రెట్టించిన ఉత్సాహంతో కామభావలను రేకెత్తించే విధంగా అంగాంగ ప్రదర్శన చేస్తూ నృత్యం చేస్తున్నారు. గంధర్వులు పాడుతున్నారు. మన్మధుడు తన పూలబాణములను ఎక్కుబెట్టాడు. లోభము, మదము మార్కండేయుని మనసును చలింపజేయడానికి ప్రయత్నం చేస్తున్నాయి.

ఆ సమయంలో పుంజికస్థలి అనే ఒక అప్సరస పూల బంతితో ఆడుతూ ఉంది. తన వాలు చూపులను మార్కండేయుని మీద ప్రసరింపచేస్తూ ఉంది. ఆమె ఎగురుతున్న పూలబంతి వెంట పరుగెడుతుంటే ఆమో ధరించిన వస్త్రములు జారిపోయాయి. మార్కండేయుని చూపు ఆమె నగ్న దేహం మీద పడింది.

ఇదే సమయమని మన్మథుడు తన పూల బాణములను మార్కండేయుని మీదికి ప్రయోగించాడు. కాని మార్కండేయుడు చలించలేదు. నిశ్చలంగా ఉన్నాడు. తాము చేసిన అన్ని ప్రయత్నములు ఫలించకపోవడంతో ఇంద్రుని కామకోరికల సేన వెనక్కు మళ్లింది. కాని మార్కండేయుడు వారిమీద కోపగించలేదు. శాంతంగా చిరునవ్వుతో అందరినీ చూస్తున్నాడు.

మార్కండేయుని ప్రలోభపెట్టడానికి మన్మథుడు చేసిన ప్రయత్నములు అన్నీ భగ్నం కావడం చూచిన ఇంద్రుడు ఆశ్చర్యపోయాడు. మార్కండేయుని ప్రభావానికి మనోనిగ్రహానికి చలించిపోయాడు. ఆ సమయంలో శ్రీమన్నారాయణుడు, నర నారాయణ స్వరూపములతో, మార్కండేయుని అనుగ్రహించడానికి

అక్కడకు వచ్చాడు.

నరుడు, నారాయణుడు తెల్లని, నల్లని వర్ణంతో ఉన్నారు. వారి కళ్లు తామర పూల రేకుల మాదిరి ఉన్నాయి. ఇద్దరికీ నాలుగు భుజములు ఉన్నాయి. వారు జింకచర్మములు, నారచీరలు ధరించి ఉన్నారు. మెడలో యజ్ఞోపవీతములు వేలాడుతున్నాయి. చేతులలో దండములను, దర్భలను ధరించి ఉన్నారు.

తపస్సంపన్నులైన నరనారాయణులు మార్కండేయుని ముందు ప్రత్యక్షం అయ్యారు. వారిని చూచిన మార్కండేయుడు వారికి సాష్టాంగ నమస్కారము చేసాడు. వారిని చూచిన ఆనందంలో మార్కండేయుని శరీరం పులకించి పోయింది. కళ్లనిండా నీరు కమ్మింది. శ్రీహరిని సరిగా చూడలేకపోయాడు. మార్కండేయుడు పైకి లేచి నరనారాయణులను కౌగలించుకొని నమోనమ: అంటూ గద్గదంగా పలికాడు. తరువాత మార్కండేయుడు తేరుకొని నరనారాయణులకు అర్ఘ్యము, పాద్యము, ఆసనము ఇచ్చి సత్కరించాడు. ధూపదీపనివేదనలతో పూజించాడు, సత్కరించాడు. తరువాత మార్కండేయుడు వారి పాదములకు భక్తితో నమస్కరించి వారితో ఇలా అన్నాడు.

“ఓ దేవా! మీ ప్రేరణ వలననే ఈ జగత్తులో ఉన్న నాతో సహా అన్ని ప్రాణులయొక్క, ప్రాణములు స్పందిస్తున్నాయి. ఆ ప్రాణముల ద్వారా వాక్కు, చూపు, వినికిడి, స్పర్శ కలుగుతున్నాయి. నీ భక్తులకు నీవుసదా ఆప్తుడవు. అట్టినీకు నమస్కారము.

ఓ దేవా! నీవు నరనారాయణుల రూపములలో అవతరించి మూడు లోకములను పాలిస్తున్నావు. మూడులోకములలో ఉన్న జీవుల దు:ఖములను పోగొడుతున్నావు. వారికి మోక్షమార్గమును చూపుతున్నావు. దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు నీవు ఎన్నో అవతారములను ఎత్తావు. సాలెపురుగు ఎలాగైతే తనలో నుండి దారమును బయటకు తీసి గూడును నిర్మించి, మరలా ఆ దారమును తనలోకి ఎలా లాక్కుంటుందో, అలాగే నీవు ఈ జగత్తును సృష్టించి మరలా నీలో లయం చేసుకుంటున్నావు. నిన్ను భక్తితో ఉపాశించే వారికి, సత్వ,రజస్తమోగుణముల ప్రభావంతో వారు చేసే కర్మల వలన పుట్టిన పాపములు వారిని ఏమీ చేయలేవు. వేదములలో ఉన్న రహస్యములను బాగుగా తెలుసుకున్న ఋషులు నిరంతరము నిన్ను స్తుతించడం, నీకు నమస్కరించడం, నిన్ను ఆరాధించడం, నిన్ను ధ్యానించడం వీటి ద్వారా నిన్ను పొందడానికి ప్రయత్నం చేస్తున్నారు. వారంతా నీ పాదములను నిరంతరము ధ్యానిస్తున్నారు. వారి పరిస్థితి అలా ఉంటే, ఈ ప్రాపంచిక విషయ వలయములో పడి నిరంతరము దు:ఖముతో బాధపడే మానవులకు నీ పాదములు తప్ప వేరే మార్గము ఏముంటుంది.

ఒక కల్పము అంతా అంటే రెండు పరార్థములు ఉండే బ్రహ్మ కూడా నీకు లోబడే సృష్టి కార్యమును నిర్వర్తిస్తున్నాడు. బ్రహ్మ సంగతే అలా ఉంటే, ఇంక ఆ బ్రహ్మ సృష్టించిన ప్రాణుల సంగతి చెప్పేదేముంది. ఓ దేవదేవా! నేను కూడా తుచ్ఛము, అశాశ్వతము అయిన ఈ శరీరము మీద వ్యామోహమును విడిచిపెట్టి, శాశ్వతుడవు అయిన నీ పాదములను పూజిస్తున్నాను. మానవులు కూడా నీ పాదములను

భజిస్తే వారికి ఎటువంటి భయాందోళనలు ఉండవు.

ఓ దేవదేవా! నీకు పుట్టడం అవసరం లేకపోయినప్పటికీ, నీవు లోక కల్యాణము కొరకు సత్వ, రజస్తమోగుణములతో కూడిన మానవులుగా అవతరించావు. నీ లీలలను లోకాలకు ప్రకటించావు. సాత్వికమైన నీ లీలలను స్మరిస్తే, అదే మోక్షానికి దారి చూపుతుంది. కాని మానవులు నీ యొక్క రాజస, తామస లీలలనే తలచుకుంటూ, మోహంలో పడిపోతున్నారు.

ఓ దేవా! సత్వగుణము అవలంబించినందువలన నిర్భయత్వము, ఆత్మానందము, వైకుంఠప్రాప్తి కలుగుతాయి. కాని రజస్, తమోగుణములను అవలంబించినందువలన, అవేవీ కలగకపోగా, బంధనములు కలుగుతాయి. కాబట్టి మూడులోకములలో ఉన్న వారు శుద్ధ సత్వ గుణ ప్రధానమైన నీ నారాయణ స్వరూపమునే ధ్యానిస్తుంటారు. ఆ కారణం చేత నేను కూడా విశ్వరూపుడు, విశ్వమునకు అంతా గురువు, మూడులోకములలో వ్యాపించి ఉన్న వాడు, నరనారాయణ స్వరూపములలో ఉన్న ఆ పరమాత్మకు నమస్కరిస్తున్నాను.

నిరంతరము ప్రాపంచిక విషయములలో మునిగి తేలుతూ, ఇంద్రియ సుఖముల కొరకుపాకులాడుతూ, చలించిన మనస్సు, బుద్ధి కలిగిన వారు నీ గురించి ఏ మాత్రము తెలుసుకోలేరు. ఓ దేవా! నీ గురించి తెలుసుకోవాలంటే వేదములు, అందులో ఉన్న జ్ఞానమే ప్రమాణము. బ్రహ్మ మొదలగు వారు కూడా సాంఖ్యయోగము మొదలగు మార్గములను అవలంబించి, నీ గురించి పూర్తిగా

తెలుసుకోలేకున్నారు. సాంఖ్యవాదులు నీ గురించి వివిధ రకములైన వాదనలను అనుసరిస్తూ, వారి వారి భావములను వెల్లడి చేస్తున్నారు. కానీ నీ గురించి నీ స్వరూప జ్ఞానము గురించిన విషయం చాలా నిగూఢంగా ఉంటుంది, బ్రహ్మమొదలగు వారికి కూడా తెలుసుకోడానికి వీలు కాదు అన్న విషయం ఎవరికీ తెలియదు. అటువంటి నీకు నమస్కరిస్తున్నాను." అని మార్కండేయుడు నర నారాయణులను భక్తితో కీర్తించాడు." అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు మార్కండేయ మహర్షి గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత& ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము

తొమ్మిదవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు మార్కండేయ వృత్తాంతమును ఇలా వినిపిస్తున్నాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! ఈ ప్రకారంగా తనను కీర్తించిన

మార్కండేయుని చూచి నర నారాయణులలో నారాయణుడు ఇలా అన్నాడు.

"ఓ బ్రహ్మర్షివరేణ్యా! నీవు ఏకాగ్రమైన చిత్తంతో, చలించని భక్తితో, తపస్సుతో, వేదాధ్యయనంతో, ఇంద్రియ నిగ్రహముతో, నా తత్వమును గ్రహించి సిద్ధి పొందావు. నేను నీ భక్తికి నీ బ్రహ్మచర్య దీక్షకు, తృప్తి చెందాను. నీకు ఏ వరం కావాలో కోరుకో. ఇస్తాను." అని అన్నాడు. అప్పుడు మార్కండేయ ఋషి ఇలా అన్నాడు.

"దేవా! నిన్ను శరణు జొచ్చిన వారి దు:ఖములను పోగొట్టే వాడా! నీవు నన్ను వరాలు కోరుకోమన్నావు. నీవు నా ఎదురుగా నిలబడి ఉండటమే నాకు గొప్ప వరము. నిన్ను చూచిన తరువాత ఇంకా కోరుకోడానికి ఏముంటుంది. ఎంతో మంది యోగులు నీ పాదములనుసేవించి ముక్తి పొందుతున్నారు. అటువంటి పాదములను నేను ఈనాడు ప్రత్యక్షంగా చూస్తున్నాను. ఇంతకన్నా కావాల్సింది ఏముంది. నీవు నీ మాయతో ఈ లోకంలో ఉన్న జీవుల మధ్య నామ, రూపములతో భేదభావమును కల్పిస్తున్నావు. లోకపాలకులు కూడా మూడు లోకములను భేదబుద్ధితో చూస్తున్నారు. ఇదంతా నీ మాయ అని నాకు తెలుసు. ఆ మాయను పరిపూర్ణంగా చూడాలని ఉంది. ఆ వరం ప్రసాదించు." అని అడిగాడు. నారాయణుడు "నీవు కోరినట్టు జరుగుతుంది." అని వరం ఇచ్చాడు. తరువాత నరనారాయణులు బదరికాశ్రమమునకు వెళ్లిపోయారు.

మార్కండేయుడు తన ఆశ్రమములో ఉంటూ అగ్ని, సూర్యుడు, భూమి, జలము, వాయువు, ఆకాశము, ఆత్మ వీటి యందు

ఆత్మస్వరూపుడైన పరమాత్మను దర్శిస్తూ, మనసులోనే పరమాత్మకు సకల ఉపచారములనుచేస్తూ, పూజలు చేస్తూ ఆత్మానందాన్ని పొందుతున్నాడు.

ఒకరోజు మార్కండేయుడు సంధ్యావందనము చేసకుంటుంటే ప్రచండంగా గాలి వీచింది. నల్లని మేఘములు ఆకాశంలో కమ్ముకున్నాయి. ఉరుములు మెరుపులతో ప్రచండ వర్షధారలతో ధారాపాతంగా వర్షం కురవ సాగింది. సప్తసముద్రాలు కలిసిపోయాయి. భూమండలము అంతా జలమయం అయింది. ఇది చూచి మార్కండేయుడు ఆశ్చర్యపోయాడు. అంతలోనే భయం, దు:ఖం ఆవరించింది.

ఈ జలమయమైన భూమండలాన్ని దూరం నుండి చూస్తున్నాడు. భూమి మీద జలరాసి తప్ప జీవరాసి లేదు. చెట్టు పుట్టలు పర్వతాలు నదులు అన్నీ ఏకం అయ్యాయి. నీరు తప్ప మరేమీ కనిపించడం లేదు. మార్కండేయుడు ఒక్కడే ఆ జలరాసిలో అటు ఇటు తిరుగుతున్నాడు. ఆకాశం భూమీ ఏమీ కనిపించడం లేదు. ఆకలితో దాహంతో అల్లల్లాడిపోతున్నాడు మార్కండేయుడు. మరణయాతన అనుభవిస్తున్నాడు. ఈ ప్రకారంగా వేలాది సంవత్సరములు గడిచిపోయాయి. ఆ జలరాసిలో ఒక రావి చెట్టును చూచాడు మార్కండేయుడు. ఆ వటవృక్షము మధ్యలో, ఒక రావి ఆకు మీద ఒక చిన్ని బాలుడు పడుకొని ఉన్నాడు. ఆ బాలుని శరీర కాంతితో భూమండలము వెలిగిపోతూ ఉంది. ఆ బాలుడి శరీరం శ్యామల వర్ణంలో ఉంది. అందమైన ముఖము, శంఖము వంటి కంఠము.

విశాల వక్షస్థలము, చక్కని ముక్కు, విల్లులాంటి కనుబొమలు, నుదుటిమీద అల్లల్లాడే ముంగురులు, ఎర్రని పెదాలు, అమృతాన్ని పంచిపెడుతున్నదా అన్నట్టు ఉన్న చిరునవ్వు, చల్లని చూపులు, తన రెండు చేతులతో తన కాలిని పట్టుకొని నోటి దగ్గరపెట్టుకొని కాలి బొటన వేలిని చీకుతూ ఉన్న ఆ చిన్నిబాలుని చూచాడు మార్కండేయుడు. ఆశ్చర్యపోయాడు.

ఈ బాలుని చూడగానే మార్కండేయునికి అంతవరకు పడ్డ శ్రమ తొలగి పోయింది. ఆకలి దప్పిక నశించిపోయాయి. నూతన ఉత్సాహం ఉరకలు వేసింది. మార్కండేయుని ఒళ్లంతా పులకించింది. నెమ్మదిగా ఆ బాలుని వద్దకు వెళ్లాడు. ఆ శిశువు ఊపిరి పీల్చినపుడు ఆ ఊపిరితో కూడా మార్కండేయుడు ఆ శిశువు పొట్టలోకి వెళ్లిపోయాడు. ఆ శిశువు పొట్టలో ప్రళయానికి ముందు ఈ విశ్వం ఎలా ఉందో అటువంటి విశ్వాన్ని చూచాడు మార్కండేయుడు. ఇంకా ఆశ్చర్యపోయాడు. ఆ శిశువు పొట్టలో ఆకాశము, స్వర్గము, భూమి, జ్యోతిర్మండలము, పర్వతములు, నదులు, సముద్రములు, వర్షములు, లోకములు, దిక్కులు, దేవతలు, అసురులు, వనములు, నగరములు, పట్టణములు, గ్రామములు, ఆశ్రమములు, జాతులు, వర్ణములు, వృత్తులు, పంచభూతములు, భౌతికపదార్థములు, అన్నీ ఆ బాలునిపొట్టలో ఉన్నాయి. ఆ బాలుని పొట్టలో తన ఆశ్రమమును కూడా చూచాడు. ఇంతలో ఆ శిశువు తనలో నుండి శ్వాసను బయటకు వదిలాడు. ఆ శ్వాసతో పాటు మార్కండేయుడు శిశువు పొట్టలోనుండి వేగంగా బయటకు విసిరివేయబడ్డాడు. అమాంతం వచ్చి అనంత జలరాసిలో పడ్డాడు.

మార్కండేయుని చూచి ఆ బాలుడు చిరునవ్వునవ్వాడు. మార్కండేయుని మీద ప్రేమతో కూడిన చూపులు ప్రసరించాడు. ఆ చూపులతో పాటు మార్కండేయుడు ఆ బాలుని కళ్లగుండా హృదయములోనికి ప్రవేశించాడు. అక్కడ శ్రీహరిని దర్శించాడు మార్కండేయుడు. శరీరం పులకించిన మార్కండేయుడు శ్రీహరి దగ్గరగా వెళ్లాడు. అంతలోనే శ్రీహరి మాయం అయ్యాడు. ఆ స్థానంలో ఒక వెలుగు కనిపించింది. ఆ వెలుగు చూడలేక మార్కండేయుడు గట్టిగా కళ్ళుమూసుకున్నాడు.

కళ్లుతెరిచేటప్పటికి మార్కండేయుడు తన ఆశ్రమంలో ఉన్నాడు. అర్ఘ్య పాత్ర ఎదురుగా ఉంది. సంధ్యావందనం చేసుకుంటున్నాడు. చుట్టు చూచాడు. లోకం అంతా ప్రశాంతంగా ఉంది. ఆ జలరాసి లేదు. వటవృక్షము లేదు. ఆకు లేదు. దాని మీద బాలుడు లేడు. ఇదంతా పరమాత్మ మాయగా గుర్తించాడు. శ్రీహరి లీలలకు మార్కండేయుడు ఆశ్చర్యపోయాడు." అని సూత పౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు మార్కండేయుని ప్రళయకాల సందర్శనమును వివరించాడు.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము

పదవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు మార్కండేయ చరిత్రను వినిపిస్తున్నాడు.

"బ్రాహ్మణోత్తములారా! మార్కండేయుడు శ్రీహరి సృష్టించిన మాయను కళ్లారా చూచాడు. ఆశ్చర్యపోయాడు. శ్రీహరిని శరణుజొచ్చాడు. "ఓ దేవా! నీవు జ్ఞానస్వరూపుడవు. నీ మాయకు బ్రహ్మ మొదలగు దేవతాగణములు కూడా అతీతులు కారు. అందరినీ నీ మాయ మోహంలో పడేస్తుంది. నేను నీ పాదములను ఆశ్రయిస్తున్నాను. నన్ను కరుణించు." అని ప్రార్థించాడు.

ఆ సమయంలో ఈశ్వరుడు, పార్వతి ఆకాశ మార్గంలో వెళు తున్నారు. కింద తన ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్న మార్కండేయుని చూచారు. పార్వతి పరమేశ్వరునితో ఇలా అంది. "నాథా! అటు చూడండి. తన దేహమును, ఇంద్రియములను జయించి, నిశ్చలంగా కూర్చుని తపస్సు చేసుకుంటున్న ఆ బ్రాహ్మణుని గమనించండి. అతని ముఖంలో ప్రశాంతత గమనించండి. మరి ఆయన అంతటి తపస్సు చేస్తున్నాడు కదా. మీరు వెళ్లి ఆయన తపస్సుకు సిద్ధిని కలిగించండి." అని అడిగింది. ఆ మాటలకు ఈశ్వరుడు ఇలా అన్నాడు.

"దేవీ! ఈయన మార్కండేయుడు అనే బ్రహ్మర్షి. ఈయన శ్రీమహావిష్ణువు అనుగ్రహాన్ని పొందిన వాడు. ఆయన మీద అచంచలమైన భక్తి కలవాడు. ఈయనకు ఏ వరములు అవసరము లేదు. స్వర్గసుఖములు కానీ చివరకు ముక్తిని కానీ కోరుకోడు. అయినా సరే నీ కోరిక మేరకు నేను ఆయన వద్దకు పోయి ఆయనతో మాట్లాడతాను. ఇటువంటి మహాఋషులను కలుసుకోవడం వలన నాకు మేలు జరుగుతుంది." అని అన్నాడు.

వెంటనే పరమేశ్వరుడు మార్కండేయుని వద్దకు వెళ్లాడు. మార్కండేయుని ముందు నిలబడ్డాడు. నిశ్చలంగా కూర్చుని తపోసమాధిలో ఉన్న మార్కండేయుడు పరమేశ్వరుని రాకను గమనించలేదు. లేవలేదు. ఇలా కాదని పరమేశ్వరుడు మార్కండేయుని హృదయంలో ప్రవేశించాడు.

తన హృదయంలో ప్రవేశించిన పరమేశ్వరుని చూచాడు మార్కండేయుడు. సంభ్రమంతో కళ్లు తెరిచాడు. తన హృదయంలో కనిపించిన పరమేశ్వరుడు తన కళ్లముందు కనపడటం చూచి ఆశ్చర్యపోయాడు మార్కండేయుడు.  పరమేశ్వరుడు మెరుపులా ప్రకాశిస్తున్నాడు. జటాజూటములతో, మూడు నేత్రములతో, శూలమును ధరించి, జపమాలను చేతబూని, కపాల ధారియై తన ఎదుల నిలబడి ఉన్న పరమేశ్వరుని చూచాడు మార్కండేయుడు.

సమాధి స్థితిలోనుండి బయటకు వచ్చాడు. పార్వతీ సమేతంగా తన ఎదుట నిలిచిఉన్న పరమేశ్వరుడికి నమస్కరించాడు. పార్వతీ పరమేశ్వరులను స్వాగతించి సత్కరించాడు. అర్ఘ్యము, పాద్యము, ఆసనము సమర్పించాడు. గంధము, ధూపము, నివేదన సమర్పించాడు. పార్వతీ పరమేశ్వరులను శక్తిమేరకు పూజించాడు. తరువాత చేతులు జోడించి పరమేశ్వరునితో ఇలా అన్నాడు.

"దేవా! నీవు ఆత్మానందాన్ని అనుభవించే పూర్ణ కాముడవు. నీకు కోరదగినది అంటూ ఏమీ లేదు. ఈ చరాచర జగత్తు నీ వలననే ప్రశాంతంగా ఉంది. నీవు నిర్గుణుడవు. ఆనంద స్వరూపుడవు. సత్వగుణమును ధరించి ప్రమృడరూపుడుగను, రజోగుణమును ఆశ్రయించి ఘోరరూపుడుగను, తమోగుణములు ఆశ్రయించి రుద్రుడుగను ప్రకటితమౌతున్నావు. అట్టి నీకు నమస్కారము. ఓ దేవా! మానవ మాత్రుడను నేను నీకేమి సేవ చేయగలను." అని అడిగాడు.

మార్కండేయుడు చేసిన అతిథి సత్కారములకు, పూజలకు సంతుష్టుడైన ఈశ్వరుడు మార్కండేయునితో ఇలా అన్నాడు. "మునివర్యా! నీ తపస్సుకు మెచ్చాను. నీకు ఏం వరం కావాలో కోరుకో ప్రసాదిస్తాను. త్రిమూర్తులు అయిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వరములు ఇవ్వడంలో శ్రేష్టమైన వారు. నీవు సత్వగుణ సంపన్నుడవైన బ్రాహ్మణుడవు. సదాచార సంపన్నులు, శాంత చిత్తులు, కోరికలు లేని వారు, భూత దయ కలవారు, ఇతరుల మీద వైరము శత్రుత్వము లేని వారు, అందరినీ సమంగా ఆదరించేవారు అయిన బ్రాహ్మణులు మాయందు ఏకాగ్రమైన భక్తి కలిగి ఉంటారు. లోకపాలకులు కూడా బ్రాహ్మణులను పూజిస్తుంటారు. త్రిమూర్తులము అయిన మేము కూడా

మీ వంటి సద్బ్రాహ్మణులను గౌరవిస్తాము. మీరు మా త్రిమూర్తులలో ఎటువంటి భేదభావమును కలిగి ఉండరు. మాలోనే కాదు సమస్త భూతములను సమంగా చూస్తారు, ఆదరిస్తారు. అందుకే మీ వంటి బ్రాహ్మణులు అంటే మాకు గౌరవము.

భూలోకంలో ఎన్నోపుణ్య తీర్థములు, నదులు ఉన్నాయి. ఆ తీర్థములలో ఎన్నో ఆలయములు, అందులో మట్టితో చేసినవి, రాతితో చేసినవి అయిన ఎన్నో విగ్రహములు పూజింపబడుతున్నాయి. ఆ విగ్రహములను పూజిస్తే ఎంతో కాలానికి కానీ ఫలితములు లభించవు. కానీ మీ వంటి సత్పురుషులు, మిమ్ములను కేవలం దర్శించినంత మాత్రమే చేతనే మానవులను పవిత్రం చేయగలరు. మీ వంటి సత్పురుషులు సమాధి చేత, తపస్సు చేత, స్వాధ్యాయము చేత (వేదాధ్యయనము చేత), ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము చేతా, మమ్ములను దర్శిస్తుంటారు. అటువంటి బ్రాహ్మణోత్తములైన మీకు మేము నమస్కరిస్తున్నాము. ఎన్నో పాపములు చేసిన వారు, కడజాతిలో పుట్టిన వారు, నీచ కులజులు కూడా మీ దర్శనము చేతనే పవిత్రులు అవుతున్నారు. అట్టి నీవు ఏదో ఒక వరము కోరితే ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను." అని అన్నాడు పరమేశ్వరుడు.

పరమేశ్వరుని నోటి నుండి ఆమాటలు విన్న మార్కండేయుడు ఇలా అన్నాడు. "ఓ దేవా! మీ త్రిమూర్తుల గురించి వినడం, తెలుసుకోవడం మా వంటి దీనులకు ఎల్లప్పుడూ అవసరమే. కానీ జగదీశ్వరులైన మీరు మీ అధీనములో ఉన్న మాబోటి వారికి నమస్కరించడం, స్తుతించడం జరుగుతూ ఉంటుంది. త్రిమూర్తులైన

మీకు తెలియని ధర్మం లేదు. కాని జీవులకు ధర్మబోధ చేయడానికి, వారిని మంచి మార్గంలో పెట్టడానికీ, ఇటువంటి పనులు చేస్తుంటారు. తద్వారా జీవులకు ధర్మబోధ చేస్తుంటారు. మా వంటి వారు చేసే కార్యములను ధర్మకార్యములుగా ఆమోదిస్తుంటారు. మాయ మీ అధీనంలో ఉంటుంది. మేము ఆ మాయచేత మోహితులమై ఉంటాము. మీరు నాకు నమస్కరించడం, నన్ను స్తుతించడం ఆ మాయలో భాగమే అనుకుంటున్నాను. కేవలము నాకు నమస్కరించి నన్ను కీర్తించి నంత మాత్రాన తమయొక్క మహత్తుకు ఏమీ లోపం కలుగదు. మీరు పరమాత్మ స్వరూపులు. కేవలం సంకల్ప మాత్రం చేత ఈ జగత్తును సృష్టించి, ఆ జగత్తులో ఉన్న జీవులలో ఆత్మస్వరూపుడుగా ప్రవేశిస్తారు. మీకు ఏ కర్మ చేయవలసిన అవసరము లేక పోయినా, ప్రకృతి గుణములైన సత్వ, రజస్, తమోగుణములను అనుసరించి దేహములు ధరించి కర్తృత్వభావనలేకుండా కర్మలు చేస్తూ, ప్రకాశిస్తుంటారు. అది మీకు వినోదము. త్రిగుణమయుడు, త్రిగుణములను శాసించేవాడు, విశుద్ధుడు, పరబ్రహ్మ స్వరూపుడు అయిన ఆ పరమాత్మకు నమస్కరిస్తున్నాను.

దేవా! నీ దర్శనభాగ్యం చేతనే నాకు అన్ని కోరికలు సిద్ధించాయి. ఇంక కోరడానికి ఏమీ లేదు. కాని ఒక్క వరం కోరుతున్నాను. నాకు ఆ పరమాత్ముని యందు, ఆయన భక్తుల యందు, అచంచలమైన భక్తి ఎల్లప్పుడూ కలిగి ఉండాలని కోరుకుంటున్నాను." అని అన్నాడు.

మార్కండేయుని వినయపూర్వకమైన మాటలకు పార్వతీ పరమేశ్వరులు పరమానంద భరితులయ్యారు. మార్కండేయునితో

ఇలా అన్నారు. "ఓ మహర్షీ! నీవు శ్రీహరి మీద అచంచలమైన భక్తిని కలిగి ఉన్నావు. ఆ భక్తి ప్రమత్తులే నీ కోరికను సఫలం చేస్తాయి. ఈ కల్పము అంతము వరకు నీవు జీవించి ఉంటావు. నీ కీర్తి అజరామరమై, అమరత్వము కలిగి ఉంటుంది. నీ చరిత్ర పురాణంగా చెప్పుకుంటారు." అని ఆశీర్వదించాడు మహేశ్వరుడు. తరువాత పార్వతీ పరమేశ్వరులు అక్కడి నుండి వెళ్లిపోయారు.

ఓ బ్రాహ్మణోత్తములారా! పరమేశ్వరుని వర ప్రభావంతో మార్కండేయుడు నేటికినీ జీవించి ఉన్నాడు. మార్కండేయుని చరిత్రను మీకు వివరించాను. పరమాత్మ తన మాయచేత సృష్టి, ప్రళయము రూపములో ఉన్న ఈ సంసారమును కల్పించాడు. ఈ సత్యాన్ని తెలుసుకోలేని మానవులు, మార్కండేయుని వృత్తాంతమును విని, ప్రళయము ఎప్పుడో కల్పాంతంలో వస్తుంది అని చెప్పుకుంటూ ఉ ంటారు. నిజానికి ఈ సంసారంలో ప్రతిరోజూ ఒక ప్రళయమే. కళు ్లమూస్తే ప్రళయం. కళ్లు తెరిస్తే సృష్టి. ఈ రెండి మధ్య ఉన్నదే మాయాకల్పిత సంసారం. ఈ మార్కండేయుని చరిత్రను చదివేవారు, విన్న వారు, ఇతరులకు చెప్పేవారు, కర్మవాసనల నుండి సంసార భయంనుండి విముక్తులవుతారు." అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు మార్కండేయ చరిత్రను వివరంగా చెప్పాడు.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము పదియవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# శ్రీమద్భాగవతము
## ద్వాదశ స్కంధము
## పదకొండవ అధ్యాయము.

నైమిశారణ్యంలో, సత్రయాగ సందర్భంలో, సూతపౌరాణికుడు శౌనకుడు మొదలగు మహామునులకు మార్కండేయ పురాణమును వినిపించిన తరువాత శౌనకుడు ఇలా అడిగాడు.

"మహాభాగా! నాకు ఈ కింది విషయములు తెలుసుకోవాలని ఉంది. దయచేసి చెప్పండి. మంత్ర తంత్రములతో శ్రీహరిని విగ్రహ రూపంలో, ఆయన వివిధ అంగములను, ఉపాంగములను, ఆయన ధరించిన ఆయుధములను, ఆయనకు వివిధ వేషములను కల్పించి, ఆరాధించే తాంత్రికులు ఏ యే తత్వములతో ఆరాధిస్తారు, వారి ఆరాధనా పద్ధతులు ఏమిటి? అలాగే మానవులు కూడా ఎన్నో క్రియలతో వివిధములైన రూపములతో పరమాత్మను ఆరాధిస్తారు. మాకు ఆ క్రియాయోగముల గురించి తెలుపవలసినది." అని అడిగాడు.

దానికి సౌత పౌరాణికుడు ఇలా చెప్పసాగాడు.

"మహామునులారా! బ్రహ్మ మొదలగు దేవతాగణములు వేదముల ద్వారా, తంత్రముల ద్వారా వర్ణించిన విష్ణువు యొక్క విభూతులను మీకు నేను వివరిస్తాను. ఈ అనంత విశ్వము చేతన స్వరూపము. దానికి మనము విరాట్ స్వరూపమును కల్పించుకున్నాము. ఆ విరాట్ స్వరూపములో మూడు లోకములను చూస్తున్నాము. ప్రకృతి,

సూత్రము, మహత్ తత్వము, అహంకారము, పంచ తన్మాత్రలు అంటే శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు, ఈ తొమ్మిది తత్వముల ద్వారా, ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, మనస్సు మొత్తము పదకొండు ఇంద్రియముల ద్వారా, ఈ విరాట్పురుషుడు ప్రకటితమయ్యాడు. ఈ వికారములు అన్నీ కలిస్తేనే సృష్టి. ఆ సృష్టియే విరాట్ స్వరూపము.

ఈ భూమి ఆ విరాట్ పురుషుని పాదములు. స్వర్గము తల. ఆకాశము నాభి. సూర్యుడు కళ్లు. వాయువు ముక్కు. దిక్కులు రెండు చెవులు. ప్రజాపతి జననాంగము. యముడు విసర్జకావయవము. లోకపాలకులు చేతులు. చంద్రుడు మనస్సు. యముడు కనుబొమ్మలు. లజ్జ పైపెదవి. లోభము కింది పెదవి. దంతములు వెన్నెల. చిరునవ్వు మాయ. వృక్షములు చర్మము మీది వెంట్రుకలు. మేఘములు తలమీద ఉన్న కేశములు. పరమాత్మను మనం ఈ విధంగా విరాట్ స్వరూపునిగా ఊహించుకుంటున్నాము. మానవులు ఎలాగైతే అవయవములతో కూర్చబడి ఉన్నాడో, అలాగే విరాట్పురుషుడు కూడా ఈ ప్రకృతే అవయవములుగా కూర్చబడి ఉన్నాడు.

ఈ విరాట్ పురుషుని పరిమాణము ఊహించలేనిది. మనలో ఉన్న చైతన్యమే శ్రీహరి వక్షస్థలములో ప్రకాశిస్తున్న కౌస్తుభ మణి. దాని నీడయే శ్రీవత్సము అనే పుట్టు మచ్చ. ఆయన మాయయే ఆయన ధరించిన వనమాల. వాక్కు, ఛందస్సు ఆయన ధరించిన పట్టు వస్త్రము. ఆయన ధరించిన యజ్ఞోపవీతము ఓంకారము. సాంఖ్యము, యోగము అనే శాస్త్రములు ఆయన చెవికి ధరించిన

మకరకుండలములు. బ్రహ్మలోకమే ఆయన కిరీటము. ఈ ప్రకృతియే ఆయన కూర్చునే ఆసనము. సత్వగుణమే ఆయన చేతిలో ఉన్న పద్మము. ఆయన చేతిలోని గద, మానవుని లోని ఓజస్సు, సహనము, బలము వీటితో కూడిన ప్రాణతత్వము. శంఖము జలతత్వము. సుదర్శన చక్రము తేజస్సు. ఖడ్గము ఆకాశము. తమస్సు చర్మము. ధనుస్సు కాలము. కర్మలు... బాణములు. సంకల్పవికల్పములతో కూడిన మనస్సు రథము. పంచతన్మాత్రలు రథము యొక్క బయట భాగము. సూర్యమండలము పూజావిధానము, యజ్ఞము; దీక్ష, భగవంతుని సేవ.

భగవానుడు అనే పదంలో భగ అంటే ఐశ్వర్యము. దానికి ప్రతీక ఆయన చేతిలోని కమలము. ధర్మము, యశస్సు ఆయన చామరము, వ్యజనము. శ్రీహరి పరుండిన ఆత పత్రమే వైకుంఠము. వేదములు గరుడుడు. వేదములతో కూడిన యజ్ఞరూపుడే విష్ణువు. నిరంతరము పరమాత్మను అంటి పెట్టుకొని ఉన్న శ్రీలక్ష్మి భగవంతుని నిత్యశక్తి స్వరూపము. విష్ణుపార్ష్వదులలో ముఖ్యుడైన విష్వక్సేనుడు పాంచరాత్రములు అనే ఆగమముల స్వరూపము. నంద సునందులు మొదలగు ఎనిమిది మంది ద్వారపాలకులు అణిమ గరిమ మొదలగు అష్టసిద్ధులు. శ్రీమన్నారాయణుడు స్వయముగా వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే నాలుగు విధములైన రూపములు అనే వ్యూహములగా చెప్పబడుతున్నాడు. (కృష్ణుడి పేరు వాసుదేవుడు, ఆయన అన్నగారు బలరాముడు (సంకర్షణుడు), ఆయన కుమారుడు (ప్రద్యుమ్నుడు), ఆయన మనుమడు (అనిరుద్ధుడు). ఈ రూపములన్నీ పరమాత్మ స్వరూపాలే, కేవలం రూపములే వేరు అని భావన.) ఈ పరమాత్మయే విషయములు,

ఇంద్రియములు, ఆశయములు, జ్ఞానము వీటితో కూడిన కర్మలద్వారా, స్థూల, సూక్ష్మ, కారణ, తురీయ, శరీరములుగా భావించబడుతున్నాడు. పరమాత్మ వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ రూపములతో నాలుగు వ్యూహములుగా ఎలా భావించబడుతున్నాడో అలాగే స్థూల, సూక్ష్మ, కారణ, తురీయ అవస్థల ద్వారా ధ్యానించబడుతున్నాడు. శబ్ద,స్పర్శ,రస,రూప,గంధములు అనేవి ఐదు తన్మాత్రలు ఇవి బాహ్యంగా కనపడేవి. అంటే స్థూల శరీరము. ఇంద్రియములకు అధిపతి మనస్సు అంటే సూక్ష్మశరీరము. ఈ రెండింటటినీ అంటే స్థూల, సూక్ష్మ శరీరములకు కారణము అహంకారము. అదే కారణ శరీరము. ఈ మూడింటినీ చూస్తూ ఉండేది జ్ఞానము. అదే తురీయావస్థ. ఈ నాలుగు అవస్థలకు ఉపయోగపడే రూపము అదే భగవంతుని ఉపాసన. ఈ రూపమును పరమాత్మ ధరించి ఈ అనంత విశ్వమును నడుపుతున్నాడు. పైన చెప్పబడిన నాలుగు వ్యూహములలో వాసుదేవుడు అంగము, సంకర్షణుడు ఉపాంగము. ప్రద్యుమ్నుడు అస్త్రము. అనిరుద్ధుడు పార్షదుడు. సాక్షాత్తు పరమాత్మ ఈ నాలుగు మూర్తులను ధరించాడు. సూక్ష్మంగా చెప్పాలంటే పరమాత్మ అన్నీ తానే అయి, అనేక రూపములు ధరించి ఈ అనంత విశ్వమును పాలిస్తున్నాడు. మన అజ్ఞానంతో పరమాత్మకు అనేక రూపములు, పేర్లు పెట్టి, వారి మధ్య భేదభావమును కలిగిస్తున్నాము. పరమాత్మ ఒక్కడే. ఇద్దరు కాదు. అనేకం అసలే కాదు కాని సమస్త ప్రాణకోటిలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అన్న సత్యమే భాగవత ధర్మము.

పరమాత్మ తన భక్తులకు ఆత్మస్వరూపంతో, స్వయం ప్రకాశకుడుగా కనపడతాడు. పరమాత్మ జ్ఞాన స్వరూపుడు. ఆయన

తన మాయాశక్తి చేత ఈ జగత్తులో సృష్టి, స్థితి లయములను కలుగజేస్తున్నాడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు అనే పేర్లతో వేరు వేరుగా పిలువబడుతున్నాడు. నిజానికి పరమాత్మ ఒక్కడే. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు అని సృష్టి, స్థితి, లయకారులుగా మనం పిల్చుకుంటున్నాము. అటువంటి పరమాత్మను పొద్దుటే లేచి, శుచిగా, ఈ కింది మంత్రమును జపిస్తే, అతని మనసులో భగవంతుడు కొలువుంటాడు.

శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృ భావనిధ్రు గ్రాజన్యవంశదహనాపవర్గ వీర్య।
గోవిన్ద గోపవనితావ్రజభృత్యగీత తీర్థశ్రవ: శ్రవణమఙ్గల పాహి భృత్యాన్॥"

అని సూతపౌరాణికుడు పరమాత్మను ధ్యానించే మంత్రమును ఉపదేశించాడు. అంతా విన్న తరువాత శౌనకుడు ఇలా అన్నాడు.

"పౌరాణికా! సౌరగణములు ఏడు ప్రతి మాసములోనూ వేరు వేరు ప్రదేశములలో ఉంటారు అని అన్నారు కదా! నాకు ఆ సౌరగణముల పేర్లు, వారు చేసే పనులు, మాకు వివరించండి." అని అడిగాడు. దానికి సూత పౌరాణికుడు ఇలా చెబుతున్నాడు.

"బ్రాహ్మణోత్తములారా! సూర్యుడుకూడా పరమాత్మ సృష్టిలో ఒక భాగమే. లోకములకు వెలుగు నివ్వడానికి సూర్యుడు నియమితుడయ్యాడు. ఆ పరమాత్మయే సూర్యుడుగా వెలుగుతున్నాడు అని శాస్త్రములు చెబుతున్నాయి. వేదములలో చెప్పబడిన సకల వైదిక కర్మలకు సూరుడే మూలము. సూర్యుని ఋషులు వివిధ

రూపములతో ఉపాసిస్తున్నారు. అవి తొమ్మిది విధములు.
(1)కాలము(ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము),
(2)దేశము(యజ్ఞము చేసే ప్రదేశము),
(3) క్రియ( దేవతారాధనలు),
(4) కర్త(యజ్ఞయాగములు చేసేవారు, చేయించే ఋత్విక్కులు),
(5)కరణము(యజ్ఞము చేయడానికి కావలసిన సాధనములు),
(6)కార్యము(యజ్ఞయాగములు),
(7)ఆగమము(యజ్ఞయాగములలో పఠించే వేదమంత్రములు),
(8)ద్రవ్యము(యజ్ఞములు చేయడానికికావలసిన సామగ్రి,
హెూమద్రవ్యములు),
(9)ఫలము(యజ్ఞయాగములు చేసినందువలనకలిగే ఫలము)
అని తొమ్మిది విధములుగా సూర్యుడు ఉపాధి భేదములతో
ఉపాసింపబడుతున్నాడు.

కాలస్వరూపుడు అయిన సూర్యుడు పన్నెండు గణములతో కూడి పన్నెండు మాసములలో సంచరిస్తున్నాడు.

చైత్రమాసంలో సూర్యుడు ధాత అనే రూపంలో కృతస్థలి అనే అప్సరస, హేతి అనే రాక్షసుడు, వాసుకి అనే నాగరాజు, రథకృత్తు అనే యక్షుడు, పులస్త్యుడు అనే ఋషి, తుంబురుడు అనే గంధర్వుడు వీరితో కూడి చైత్రమాసంలో సంచరిస్తాడు.

వైశాఖ మాసంలో సూర్యుడు, అర్యముడు అనే పేరు ధరించి, పులహుడు అనే ఋషితో, అథౌజుడు అనే యక్షునితో, ప్రహేతి

అనే రాక్షసునితో, పుంజికస్థలి అనే అప్సరసతో, నారదుడు అనే ఋషితో, కచ్ఛనీరము అనే పాముతో, వైశాఖమాసమును నిర్వహిస్తాడు.

జ్యేష్ఠమాసములో సూర్యుడు మిత్రుడు అనే పేరుతో, అత్రి అనే ఋషితో, పౌరుషేయుడు అనే రాక్షసునితో, తక్షకుడు అనే నాగముతో, మేనక అనే అప్సరసతో, హాహా అనే గంధర్వునితో, రథస్వనుడు అనే యక్షునితో జ్యేష్ఠమాసమును నిర్వహిస్తాడు.

ఆషాఢమాసంలో సూర్యుడు వరుణుడు అనే పేరుతో, వశిష్ఠుడు అనే ఋషితో, రంభ అనే అప్సరసతో, సహజన్యుడు అనే రాక్షసునితో, హుహూ అనే గంధర్వునితో, శుక్రము అనే నాగముతో, చిత్రస్వనుడు అనే యక్షునితో, ఆషాఢ మాసమును నిర్వహిస్తాడు.

శ్రావణ మాసములో సూర్యుడు ఇంద్రుడు అనే పేరుతో, విశ్వావసుడు అనే గంధర్వునితో, శ్రోత అనే యక్షునితో, ఏలాపత్ర అనే నాగముతో, అంగిరసుడు అనే ఋషితో, ప్రమ్లోచ అనే అప్సరసతో, వర్యుడు అనే రాక్షసునితో, శ్రావణ మాసమును నిర్వహిస్తాడు.

భాద్రపదమాసములో సూర్యుడు వివస్వానుడు అనే పేరుతో ఉగ్రసేనుడు అనే గంధర్వునితో, వ్యాఘ్రుడు అనే రాక్షసునితో, ఆసారణుడు అనే యక్షునితో, భృగువు అనే ఋషితో, అనుమ్లోచ అనే అప్సరసతో, శంఖపాలుడు అనే నాగముతో భాద్రపద మాసమును నిర్వహిస్తుంటాడు.

ఆశ్వయుజ మాసంలో సూర్యుడు త్వష్ట అనే పేరుతో, జమదగ్ని అనే ఋషితో, కంబలుడు అనే నాగముతో, తిలోత్తమ అనే అప్సరసతో, బ్రహ్మేపేతుడు అనే రాక్షసునితో, శతజిత్తు అనే యక్షునితో, ధృతరాష్ట్రుడు అనే గంధర్వునితో ఆశ్వయుజమాసమును నిర్వహిస్తాడు.

కార్తీక మాసములో సూర్యుడు విష్ణువు అనే పేరుతో, అశ్వతరము అనే నాగముతో, రంభ అనే అప్సరసతో, సూర్యవర్చుడు అనే గంధర్వునితో, సత్యజిత్తు అనే యక్షునితో, విశ్వామిత్రుడు అనే ఋషితో, సుఖాపేతుడు అనే రాక్షసునితో కార్తీకమాసమును నిర్వహిస్తాడు.

సూర్యుడు మార్గశీర్ష మాసములో అంశువు అనే పేరుతో, కశ్యపుడు అనే ఋషితో, తార్క్ష్యుడు అనే యక్షునితో, ఋతుసేనుడు అనే గంధర్వునితో, ఊర్వశి అనే అప్సరసతో, విద్యుచ్ఛక్రుడు అనే రాక్షసునితో, మహాశంఖము అనే నాగముతో, మార్గశీర్షమాసమును నిర్వహిస్తాడు.

పుష్యమాసములో సూర్యుడు భగుడు అనే పేరుతో, స్ఫూర్జుడు అనే రాక్షసునితో, అరిష్టనేమి అనే గంధర్వునితో, ఊర్ణుడు అనే యక్షునితో, ఆయువు అనే ఋషితో, కర్కోటకుడు అనే నాగముతో, పూర్వచిత్తి అనే అప్సరసతో, పుష్యమాసమును నిర్వహిస్తాడు.

మాఘ మాసంలో సూర్యుడు పూషుడు అనే పేరుతో ధనంజయ అనే నాగముతో, వాతుడు అనే రాక్షసునితో, సుషేణుడు

అనే గంధర్వునితో, సురుచి అనే యక్షునితో, ఘృతాచి అనే అప్సరసతో, గౌతముడు అనే ఋషితో, మాఘమాసమును నిర్వహిస్తాడు.

ఫాల్గుణ మాసములో సూర్యుడు పర్జన్యుడు అనే పేరుతో, ఋతువు అనే యక్షునితో, వర్చుడు అనే రాక్షసునితో, భరద్వాజుడు అనే ఋషితో, సేనజిత్తు అనే అప్సరసతో, విశ్వుడు అనే గంధర్వునితో, ఐరావతము అనే నాగముతో, ఫాల్గుణ మాసమును నిర్వహిస్తాడు.

ఆదిత్యుని రూపముతో ఉన్న శ్రీహరి విభూతులను ఉదయము, సాయంత్రము స్మరించే మానవుల సకల పాపములు నశించిపోతాయి. పైన చెప్పిన విధంగా సూర్యుడు గంధర్వులతో, ఋషులతో, అప్సరసలతో కూడి పన్నెండు మాసములలో భూమండలము అంతా సంచరిస్తుంటాడు. భూమి మీద ఉండే జీవరాసులకు ప్రాణశక్తిని ప్రసాదిస్తుంటాడు.

ఈ పన్నెండు మాసములలో సూర్యునితో పాటు ఉన్న ఋషులు వేదములలో చెప్పబడిన స్తోత్రములను పఠిస్తుంటారు. గంధర్వులు ఆయన మహత్తును గానం చేస్తుంటారు. అప్సరసలు ఆయన ఎదురుగా నృత్యం చేస్తుంటారు. నాగులు అతని రథమునకు పగ్గములుగా ఉంటారు. యక్షులు సూర్యరథమునకు అలంకారములుగా ఉంటారు. రాక్షసులు సూర్యరథమును నడుపుతుంటారు. వాలఖిల్యులు అనే బ్రహ్మఋషులు అరవై వేల మంది ఆయనకు ఎదురుగా నడుస్తూ సూర్యుని స్తుతిస్తుంటారు.

ఓ బ్రాహ్మణోత్తములారా! ఈవిధంగా పరమాత్మ త్రిమూర్తుల రూపంలోనూ, సూర్యుని రూపంలోనూ తనను తాను కల్పించుకొని లోకపాలన చేస్తుంటాడు." అని సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు సూర్యదేవుని మాససంచారము గురించి వివరించాడు.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము పదకొండవ అధ్యాయము సంపూర్ణము

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము

పన్నెండవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో, సూతపౌరాణికుడు శౌనకాది మహామునులకు భాగవత పురాణములోని విషయములను గురించి మరలా ఒక సారి సింహావలోకనం చేస్తున్నాడు.

"ఓ మహామునులారా! బ్రాహ్మణోత్తములారా! మీరు మానవులు వినతగిన విషయములను గురించి నన్ను అడిగారు. నేను మీకు భాగవతపురాణమును చెప్పాను. ఈ భాగవత పురాణములో శ్రీమహావిష్ణువు గురించి ఆయన అవతార విశేషములను గురించి

వివరింపబడింది.

సృష్టి ఎలా జరిగింది, ఎలా లయం అయింది, నిర్గుణ పరబ్రహ్మము గురించి, జ్ఞానముగురించి విజ్ఞానము గురించి దానిని ఎలా సాధించాలి అనే విషయం గురించి వర్ణించాను.

ఇంకా భక్తి యోగము, వైరాగ్యము గురించి కూడా చెప్పాను. పరీక్షిత్తు కథ, నారదుని కథ చెప్పాను. తరువాత ముని శాపము వలన పరీక్షిత్ ప్రాయోపవేశము చేయడం, శుక మహర్షి ఆయన వద్దకు రావడం, పరీక్షిత్తుకు భాగవత ధర్మముల గురించి చెప్పడం వర్ణించాను.

తరువాత యోగధారణ, బ్రహ్మనారదుని సంవాదము, అవతారముల గురించి కీర్తించడం, మహత్తత్వము మొదలగువాటి గురించి, ప్రకృతి ఆవిర్భావము గురించి చెప్పాను. విదురుని, ఉద్ధవుని సంవాదము, విదుర మైత్రేయ సంవాదము, పురాణముల గురించి మహాపురుషుల గురించి వివరించాను.

తరువాత ప్రాకృతిక సృష్టి, సప్తవికారములతో కలిగిన సృష్టి, బ్రహ్మాండము ఎలా పుట్టింది, విరాట్పురుషుడు వీటి గురించి వివరించాను. ఇంకా నేను చెప్పిన విషయములను వరుసగా చెబుతాను.

స్థూల కాలము, సూక్ష్మకాలము వాటి గమనములు, నాభిలో నుండి కమలం పుట్టడం, అందులోనుండి బ్రహ్మ పుట్టడం, ప్రళయ జలములనుండి భూమిని ఉద్ధరించడం, హిరణ్యాక్ష వధ, ఊర్ధ్వ లోకాలు, అధోలోకాలు  సృష్టి, జంతువుల సృష్టి, రుద్రుల సృష్టి, స్వాయంభువ మనువు యొక్క ఉత్పత్తి, అర్ధనారీశ్వర సృష్టి, శతరూప కథ, కర్దమప్రజాపతి సంతానము సంతానము విస్తరించడం, కపిలుని అవతారము, కపిల దేవహూతుల సంభాషణ, మరిచి మొదలగు నవబ్రహ్మల ఉత్పత్తి, దక్షయజ్ఞము, ధ్రువచరితము, పృథు చరితము, ప్రాచీన బర్హిచరితము, నారద సంవాదము, ప్రియవ్రతుని చరిత్ర, నాభి చరిత్ర, ఋషభచరిత్ర, భరతుని చరిత్ర వర్ణించాను.

ఇంకా, ద్వీపములు, వర్షములు, సముద్రములు, పర్వతములు, నదులు  వర్ణనము, జ్యోతిర్మండలము, పాతాళము, నరకముల ఉనికి వర్ణించాను. తరువాత దక్షుని మరలా పుట్టుక, ప్రచేతసుల వలన దక్షకన్యలు సంతానవతులగుట, దేవతలు, అసురులు, నరులు, జంతువులు, వృక్షములు, పక్షులు, మొదలగు వాటి పుట్టుక వర్ణించాను.

తరువాత వృత్రాసురుని కథ, హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల వృత్తాంతము, దైత్యుల మహత్తు, ప్రహ్లాదచరిత్ర, మన్వంతరములు వాటి వర్ణన, గజేంద్రమోక్షము, శ్రీహరి, హయగ్రీవుడు మొదలగు మన్వంతరముల అవతార విశేషములు, తరువాత కూర్మ, మత్స్య, నారసింహ, వామన అవతారములు, కూర్మఅవతార కథ, క్షీరసాగర మథనం, మోహినీ అవతారము, దేవాసుర యుద్ధము, రాజుల వంశ

వర్ణన, ఇక్ష్వాకువు జననము ఆయన వంశము, సుద్యుమ్నుని వంశము. ఇలోపాఖ్యానము, తారోపాఖ్యానము, సూర్యవంశ పుట్టుక, శశాదుడు, నృగుడు మొదలగు రాజుల చరిత్రలు, సుకన్య, శర్యాతి, కకుత్సుడు, ఖట్వాంగుడు, మాంధాత, సౌభరి, సగరుడు అనువారి చరిత్రలు, శ్రీరామచంద్రుడు, నిమి చరిత్ర, జనకుని జననము గురించి వివరంగా చెప్పాను.

ఓ బ్రాహ్మణోత్తములారా! తరువాత పరశురాముని చరిత్ర, క్షత్రియ సంహారము, చంద్రవంశము, ఐలుడు, యయాతి, నహుషుడు, దుష్యంతుడు, భరతుడు, శంతనుడు, అతని కుమారుడు దేవవ్రతుడు, యయాతి పెద్దకుమారుడు యదువు నుండి యాదవ వంశము పుట్టుక, యదువంశములో పరమాత్మ అవతరించడం, వసుదేవుని ఇంట్లో జన్మించడం, గోకులంలో పెరగడం మొదలగు విషయములను చెప్పాను.

తరువాత శ్రీకృష్ణ లీలలు, పూతన సంహారము, శకటాసుర సంహారము, తృణావర్తుడు,బకాసురుడు,అఘాసుర వధ, బ్రహ్మగోవులు మాయం చేయడం మరలా ఇవ్వడం గురించి చెప్పాను. తరువాత కాళీయ మర్దనము, మహాసర్పము బారి నుండి నందుని రక్షించడం, గోపకన్యలు కృష్ణుని కొరకు వ్రతం చేయడం, యజ్ఞము చేయు బ్రాహ్మణుల భార్యలను కరుణించడం, బ్రాహ్మణులు పశ్చాత్తాపపడటం, గోవర్ధనోద్ధరణము, కృష్ణుడికి కామధేనువు అభిషేకము, రాసక్రీడలు, శంఖచూడుని, అరిష్టుని, కేశిని సంహరించడం అనే విషయాలు చెప్పాను.

ఓ బ్రాహ్మణోత్తములారా! తరువాత అక్రూరుని వృత్తాంతము, బలరామ కృష్ణులు మధురకు వెళ్లడం, రామకృష్ణులు కువలయాపీడము అనే పేరుగల ఏనుగును, చాణూర ముష్టికులు అనే మల్లయోధులను చంపడం, కంసుని చంపడం, దేవకీవసుదేవులను చెరనుండి విడిపించడం, ఉపనయనం, గురుకులము, గురువుగారి కుమారుని తెచ్చిఇవ్వడం, మధురలో విహరించడం, 17 సార్లు జరాసంధుని జయించడం, ద్వారకా నగరం నిర్మిచడం, అక్కడకు పారిపోవడం, రుక్మిణీ కల్యాణము, బాణాసురుని గర్వభంగము, నరకాసుర వధ, పారిజాతాపహరణము, పదహారువేల మందిని వివాహం చేసుకోవడం, శిశుపాల, పౌండ్రక,సాళ్వ, దంతవక్త్ర,శంబర,ద్వివిద,పీఠ,ముర,పంచజన మొదలగు వారిని వధించడం, కాశీనగరం దహించడం, కురుక్షేత్రసంగ్రామము, యాదవ వంశ నాశనము, ఉద్ధవునికి గీతోపదేశము, శ్రీకృష్ణుని అవతార త్యాగము, మొదలగు విషయములను చెప్పాను.

తరువాత యుగ లక్షణములు, కలియుగ లక్షణము, నాలుగు విధముల ప్రళయములు, మూడు సృష్టులు, గురించి చెప్పాను. తరువాత పరీక్షిత్ మహారాజు నిర్యాణము, వ్యాసుడు వేదములను విభజించుట, వేదములు లోకములలో విస్తరింపజేయుట, మార్కండేయ పురాణము, మహాపురుషుడు, సూర్యుడి వృత్తాంతములు వర్ణించాను.

ఓ బ్రాహ్మణులారా! మీరు నన్ను అడిగిన విషయములు అన్నీ మీకు చెప్పాను. ఈ భాగవత పురాణములో పరమాత్ముని లీలావతారములు అన్నీ వివరించాను. పాపకూపంలో పడ్డ వాడు, పొరపాటున ప్రమాదంలో చిక్కుకున్న వాడు, దు:ఖములో ఉన్న వాడు, హరయే నమ: అని అరిస్తే వాడి దు:ఖము పోతుంది. శ్రీహరి చరిత్రలను లీలలను చదివినా, వినినా, కీర్తించినా, వారి సకల దు:ఖములు తొలగి పోతాయి. శ్రీహరి గురించి చెప్పబడని కథలు కథలే కావు. భగవంతుని కీర్తించే వాక్కులే సత్యములు, మంగళ ప్రదములు.

ఏ శాస్త్రములలో, పురాణములలో శ్రీహరి కీర్తి యశస్సు, స్తుతింపబడుతుందో అవే మనసుకు ఆనందాన్ని కలుగజేస్తాయి. శోకసముద్రం నుండి బయటపడేస్తాయి. ఇలా కాకుండా ఇతర విషయములను ఎంత రమ్యంగా మనోహరంగా వర్ణించినా వాటి వలన ఎటువంటి ప్రయోజనము లేదు. సాధువులు అయిన వాళ్లు ఇతరులచేత కీర్తింపబడిన శ్రీహరి నామములను వినాలి, గానం చేయాలి. శ్రీహరి కథలు ఏ కావ్యములో ఉన్నా, ఏ ఇతిహాసములో ఉన్నా, శాస్త్రములో ఉన్నా అవి పుణ్యగ్రంథములే అవుతాయి.

మానవులు జ్ఞానము సంపాదించవచ్చు. కాని ఆ జ్ఞానములో విష్ణుభక్తి లేకపోతే ఆ జ్ఞానము వృథా. ఎందుకు పనికిరాదు. మానవులు ఏ కర్మచేసినా, దానిని ఈశ్వరుని పరంగా కాకుండా, ఈశ్వరునికి అర్పించకుండా ఉంటే ఆ కర్మ ఎంతటి మంచి కర్మ అయినా శోభించదు. మానవులు ఆచరించే వర్ణాశ్రమ ధర్మములు, తపస్సు, శాస్త్రములు చదవడం, వినడం, ఇవన్నీ మానవులకు కీర్తిని,

పేరు ప్రతిష్టలు, ఐశ్వర్యము తెచ్చిపెడతాయేమోగానీ, శ్రీహరి పాదముల మీద భక్తిని కలిగించలేవు. ఆ కార్యములే శ్రీహరి మీద భక్తి శ్రద్ధలతో చేస్తే అనంతమైన ఫలములను అందిస్తాయి. ఎల్లప్పుడు శ్రీకృష్ణుని పాదములను సేవించడం మానవుల దు:ఖములను పోగొడుతుంది. చిత్తశుద్ధిని, జ్ఞానమును, శ్రీహరి మీద భక్తిని, వైరాగ్యమును, సకల శు భములను కలుగజేస్తుంది.

కాబట్టి ఓ బ్రాహ్మణోత్తములారా! మీరు కూడా సర్వాంతర్యామి, సకల జనులు పూజించేవాడు, దేవతలకు అధిపతి, ఈ జగత్తునకే అధిపతి అయిన శ్రీహరిని మనసులో నిలుపుకొని, ఆయన మీద నిరంతర భక్తితో ఆరాధించండి. మీకు అనంతమైన పుణ్యం లభిస్తుంది.

ఓ మహామునులారా! పరీక్షిత్ మహారాజు ప్రాయోపవేశము చేసినపుడు, శుక మహర్షి పరీక్షిత్ మహారాజుకు భాగవత పురాణమును చెప్పినపుడు నేనుస్వయంగా అక్కడ ఉండి విన్నాను. దానిని నేను మరలా మననం చేసుకొని మీకు చెప్పాను. శ్రీకృష్ణుని లీలలు, చరిత్ర మీకు వివరించాను. ఈ భాగవతపురాణమును మానవులు ప్రతి దినము, ప్రతియామము, ప్రతిక్షణము చదివినా, వినినా, కనీసం ఇందులో ఒక శ్లోకము చదివినా, శ్లోకములో నాలుగవ భాగము చదివి అర్థం చేసుకున్నా, కనీసం శ్లోకంలో ఎనిమిదవ భాగము అనుక్షణం మననం చేసుకున్నా, అతడు పవిత్రుడౌతాడు.

మానవులు ఈ భాగవతపురాణమును ఏకాదశి నాడు కానీ, ద్వాదశి నాడు కానీ వింటే, ఎక్కువకాలం జీవిస్తారు. ఆ రోజులలో ఉపవాసం ఉండి ఏకాగ్రమైన మనసుతో చదివితే, సకల పాపముల నుండి విముక్తిపొందుతాడు. అటువంటి మానవుల కోర్కెలను దేవతలు, మునులు, సిద్ధులు,పితరులు, మనువులు, రాజ్యాధిపతులు తీరుస్తారు.

పుష్కరములలో కానీ, మధురానగరంలో కానీ, ద్వారకలో కానీ ఉపవాసం ఉండి, ఈ భాగవతమును చదివినవారికి సకల భయములు నశిస్తాయి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము ను అధ్యయనం చేసిన వారు ఎటువంటి ఫలితములను పొందుతారో, భాగవతమును చదివినవారు కూడా అటువంటి ఫలములను పొందుతారు.

ఏ బ్రాహ్మణుడైనా భాగవతపురాణమును భక్తి శ్రద్ధలతో పఠిస్తే, వారికి భగవంతుని పరమ పదము లభిస్తుంది. ఈ భాగవత పురాణమును అధ్యయనం చేస్తే బ్రాహ్మణునికి భక్తి, క్షత్రియునికి రాజ్యము, వైశ్యునికి ధనము, శూద్రునికి పాపముల నుండి విముక్తి లభిస్తాయి.

ఓ శౌనకాది మహామునులారా! ఏ శాస్త్రములో కానీ, పురాణములో కానీ శ్రీహరి లీలలు కీర్తింపబడలేదు. అది కేవలం భాగవతంలో మాత్రమే జరిగింది. భాగవతపురాణములో కీర్తింపబడిన ఆ శ్రీకృష్ణపరమాత్మకు నమస్కరిస్తున్నాను. ఎవని నుండి ఈ ప్రకృతి, పురుషుడు, మహత్తత్వము, అహంకారము, పంచతన్మాత్రలు, ఉ

ద్భవించాయో, ఈ చరాచర సృష్టి నిర్మించబడిందో, అట్టి విజ్ఞాన స్వరూపుడు, సనాతనుడు అయిన శ్రీహరికి నమస్కరిస్తున్నాను.

ఎల్లప్పుడూ ఆత్మానందాన్ని అనుభవించేవాడు, పరిపూర్ణమైన చిత్తము కలవాడు, ఇతర కోరికలు లేని వాడు, ఎల్లప్పుడు శ్రీకృష్ణుని లీలలను గానం చేసేవాడు, ఈ భాగవత పురాణమును లోకములో విస్తరింపజేసినవాడు, వ్యాసుని కుమారుడు అయిన శుకమహర్షికి భక్తితో నమస్కరిస్తున్నాను." అని సూతపౌరాణికుడు శౌనకాది మహామునులకు భాగవత సంహితలోని విషయములను, భాగవత మహాత్మ్యమును వివరించాడు.

శ్రీమద్భాగవతము
ద్వాదశ స్కంధము పన్నెండవ అధ్యాయము సంపూర్ణము
ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

## శ్రీమద్భాగవతము
## ద్వాదశ స్కంధము
## పదమూడవ అధ్యాయము.

నైమిశారణ్యంలో సత్త్రయాగ సందర్భంలో సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు వివిధ పురాణములను గురించి వివరిస్తున్నాడు.

“ఓ మహామునులారా! బ్రహ్మాది దేవతా గణములచేత, మునుల చేత, లోకపాలకుల చేత పూజింపబడే ఆ పరమాత్మకు నమస్కరిస్తున్నాను. కూర్మరూపంతో ఉద్భవించిన ఆ పరమాత్మ మీ అందరినీ రక్షించుగాక! కూర్మావతారములో, తాబేలు రూపంలో పరమాత్మ ఊపిరి తీసుకోవడం, విడవడం చేసాడు కదా! ఆ పరమాత్మ యొక్క ఉఛ్వాస నిశ్వాసములే నేడు సముద్ర తరంగములుగా రూపొంది నిరంతరము ఒడ్డును తాకుతూనే ఉన్నాయి. అవి ఎన్నటికీ అంతం కావు.

ఓ బ్రాహ్మణోత్తములారా! ఇప్పుడు మీకు నేను పురాణముల గురించి, వాటి శ్లోకముల సంఖ్యను గురించి వివరిస్తాను.

| పురాణము | శ్లోకములు |
|---|---|
| 1.బ్రహ్మపురాణము | 10,000 |
| 2.పద్మపురాణము | 55,000 |
| 3.విష్ణుపురాణము | 23,000 |
| 4.శివపురాణము | 24,000 |
| 5.శ్రీమద్భాగవతము | 18,000 |
| 6.నారదపురాణము | 25,000 |
| 7.మార్కండేయ పురాణము | 9,000 |
| 8.అగ్నిపురాణము | 15,400 |
| 9.భవిష్యపురాణము | 14,500 |
| 10.బ్రహ్మవైవర్తపురాణము | 18,000 |
| 11.లింగపురాణము | 11,000 |
| 12.వరాహ పురాణము | 24,000 |

| | |
|---|---|
| 13.స్కంధ పురాణము | 81,100 |
| 14.వామన పురాణము | 10,000 |
| 15.కూర్మపురాణము | 17,000 |
| 16.మత్స్యపురాణము | 14,000 |
| 17.గరుడ పురాణము | 19,000 |
| 18.బ్రహ్మాండ పురాణము | 12,000 |

ఈ ప్రకారంగాపురాణములు అన్నీ కలిసి నాలుగు లక్షల శ్లోకములు కలిగి ఉన్నాయి. ఇప్పుడు మనం చెప్పుకున్న భాగవత పురాణము లోని శ్లోకములసంఖ్య 18,000. ఈ భాగవత పురాణమును శ్రీమహావిష్ణువు తన నాభికమలము లోనుండి పుట్టిన బ్రహ్మకు చెప్పాడు. ఈ భాగవత పురాణములో మొట్ట మొదటి నుండి చివరి వరకు కేవలము వైరాగ్యము, భగవత్తత్వము ఉపదేశింపబడింది. శ్రీహరి లీలలు గురించి చెప్పబడింది.

ఈ భాగవతములో సకల వేదాంత సారము వర్ణింపబడింది. ఆత్మ స్వరూపము గురించి బ్రహ్మ తత్వము గురించి వివరింపబడింది. ఇది కైవల్యము పొందడానికి మార్గము.

భాద్రపదమాసంలో పౌర్ణమి నాడు భాగవత పురాణమును చదివి వినిపిస్తే, వాడు పరమగతిని పొందుతాడు. అమృత తుల్యమైన భాగవతము విననంత వరకే ఇతర పురాణముల గురించి

ఆలోచిస్తాడు. ఒకసారి భాగవతము గురించి వినిన తరువాత, ఎవరుకూడా ఇతరపురాణముల గురించి ఆలోచించరు. ఎందుకంటే సకల వేదముల సారము భాగవతములో ఉన్నప్పుడు ఇతర పురాణముల గురించి ఎవరు మాత్రం ఎందుకు ఆలోచిస్తారు.

నదులలో గంగ, దేవతలలో విష్ణువు, క్షేత్రములలో కాశీక్షేత్రము, పురాణములలో భాగవతము శ్రేష్టము. శ్రీమద్భాగవతము అందరికీ ప్రియమైనది. ఈ భాగవతములో జ్ఞానము గురించి చెప్పబడింది. జ్ఞానము, వైరాగ్యము, భక్తి తో కూడిన నిష్కామ కర్మ గురించి భాగవతంలో వివరంగా చెప్పబడింది. మానవులు ఈ భాగవతమును భక్తితో చదివినా, వినిపించినా, దీని గురించి ఆలోచించినా, ప్రాపంచిక బంధనముల నుండి విముక్తుడు అవుతాడు.

ఈ భాగవతమును కల్పము మొదట్లో విష్ణువు బ్రహ్మకు ఉపదేశించాడు. బ్రహ్మ తన మానస పుత్రుడు నారదునకు, నారదుడు వ్యాసమహర్షికి, వ్యాసుడు తనకుమారుడు శుకునికి, శుకమహర్షి పరీక్షిత్ మహారాజుకు ఉపదేశించాడు. శుద్ధము, మలినము లేనిది, శోకమును పోగొట్టేది, అమృతస్వరూపము అయిన భాగవత పురాణమును ఈ లోకానికి అందించిన శ్రీమన్నారాయణునికి, వాసుదేవునికి, నమస్కరిస్తున్నాను. కాలసర్పబాధితుడు అయిన పరీక్షిత్తుకు ఈ భాగవతమును ఉపదేశించిన బ్రహ్మస్వరూపుడు, యోగీంద్రుడు అయిన శుక మహర్షికి నమస్కరిస్తున్నాను.

ఓ దేవదేవా! శ్రీకృష్ణా! మాకు ప్రతి జన్మలోనూ నీ పాదపద్మముల యందు భక్తి కలుగునట్టు మమ్ములను కటాక్షించు. ఎవని నామ సంకీర్తనము సకల పాపములను నాశనం చేస్తుందో, ఎవనికి నమస్కరిస్తే సకల దు:ఖములు పోతాయో అట్టి పరమపురుషుడు అయిన శ్రీహరికి భక్తితో నమస్కరిస్తున్నాను.

శ్రీమద్భాగవతము

ద్వాదశ స్కంధము

పదమూడవ అధ్యాయము సంపూర్ణము

ఇంతటితో భాగవత పురాణము సర్వం సంపూర్ణం.

ఓం తత్సత్ ఓంతత్సత్ ఓం తత్సత్

# ఉపసంహారము.

నా ప్రియమైన భాగవతోత్తములారా! నేను గత పది సంవత్సరాలుగా ఈ వ్యవసాయము చేస్తున్నాను. కవిత్రయ విరచితమైన శ్రీమదాంధ్రమహాభారతమును సరళమైన తెలుగులోనూ, సరళమైన ఆంగ్లము లోనూ, వాల్మీకి రామాయణమును సరళమైన తెలుగులోనూ, వ్యాస భాగవతమును సరళమైన తెలుగులోనూ రచించాను.

ఈ నాటితో నా జన్మ సార్ధకమైంది అని అనుకుంటున్నాను. నిగూఢంగా ఉన్న వేదాంతరహస్యములను సామాన్య పాఠకులకు సులభ శైలిలో అందించాను అన్న తృప్తి మిగిలింది. నా 72 సంవత్సరముల జీవిత కాలంలో నేను నిజంగా జీవించింది, సార్ధకమైన జీవితం గడిపించి ఈ పది సంవత్సరాలే అని అనుకుంటున్నాను.

నా ఈ నిస్వార్థ సేవకు, నిరంతర కృషికి చేదోడు వాదోడుగా నిలిచిన శ్రీయుతులు రాఘవరావుగారికి, గోపీకృష్ణగారికి, విష్ణు ప్రసాద్ గారికి నా కృతజ్ఞతాభివందనములు తెలియజేసుకుంటున్నాను. శ్రీమన్నారాయణుడు వారికి ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించాలని మనసారా కోరుకుంటున్నాను. ఇన్నాళ్లు ఓపికగా చదివిన మీ అందరికీ శ్రీకృష్ణపరమాత్మ చిరాయువును ప్రసాదించి, నిరంతరము ప్రశాంత చిత్తంతో ఆ భగవంతుని సేవజేసుకునే భాగ్యాన్ని మీ అందరికీ కలుగ జేయాలని మనసా వాచా కర్మణా కోరుకుంటున్నాను.

చివరి మాట. ఈ భాగవతమును శ్రద్ధాభక్తులతో చదువుతున్న ఒక పాఠకు రాలు నాకు ఒక సూచన చేసింది. పద్మపురాణము ఉత్తరా ఖండములో భాగవత మహాత్మ్యము ఉంది దానిని కూడా రాయండి అని కోరింది. ఆమె కోరిక మేరకు పద్మపురాణములో ఉన్న భాగవత మహాత్మ్యమును కూడా మీకు కొద్దిరోజులలో అందిస్తాను.

ప్రస్తుతానికి మీ వద్దనుండి సెలవు తీసుకుంటున్న భగవత్సేవకుడు

మొదలి వెంకట సుబ్రహ్మణ్యం.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్